శ్రీ

# సూర్యరాయాంధ్రనిఘంటువు

చతుర్థసంపుటము.



తె - న్ర.

పండితసాహాయ్యమున

సాహిత్యవిశారద

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి

గారిచే రచింపఁబడి

కాకినాడ

ఆంధ్రసాహిత్యపరిషత్తు

వారిచేఁ బ్రకటింపఁబడినది.



కాకినాడ ముద్రాక్షరశాల,

కాకినాడ.

1944



*All Rights Reserved.*

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మ న వి.



విశ్వకళ్యాణకారణం బయినయేమహామహునియభ్యుదయమునఁ బ్రపంచము ప్రబోధచైతన్యముల నొంది వికాసభాసుర మగుచున్నదో, ఆజగద్బాంధవునిరంతరవసుప్రసారముచే శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటుచతుర్థసంపుటారవిందము ప్రకాశమును గాంచినదని తెలుపుట కెంతయు సంతసించుచున్నాఁడను.

ఈసంపుటము 'తె' అనునక్షరముతోఁ బ్రారంభమై 'న్రస్థిమాలి' అను పదముతో ముగింపఁబడినది. ఇదివఱకు ముద్రితము లైనమూఁడుసంపుటములందువలె ననుబంధ మిందుఁ జేర్చినచో గ్రంథము విస్తృత మగు నని భావించి యిందుఁ జేర్పవలసినపరిశిష్టము నైదవసంపుటమునఁ జేర్ప నెంచితిని.

ఈచతుర్థసంపుటము ముద్రించుటకును వెనుకటిసంపుటములఁ బ్రకటించుటకును నమితతారతమ్య మేర్పడినది. ప్రస్తుత మచ్చుకాగితము వెల వెనుకటికంటెఁ బదిరెట్లు పైఁగాఁ బెరిఁగినది. ఇంతియకాదు. ధన మిచ్చినను ముద్రణానుకూల మగుకాగితము వలసినంత లభింపకున్నది. ఇట్టిక్లిష్టస్థితిలో శ్రీ శ్రీ శ్రీ పీఠికాపురమహారాజవరేణ్యులఘనౌదార్యగరిమచేఁ గావలసినధనము పుష్కలముగ లభ్య మగుటవలన నీచతుర్థసంపుట మెట్టికొఱంతయు లేక పూర్తి చేయఁబడినది.

ఈక్రిందఁ బేర్కొనఁబడినపండితవరేణ్యులతోడ్పాటుచే నీచతుర్థసంపుటమును బ్రకటింపఁ గలిగితిని.

1. బ్రహ్మశ్రీ దర్భా సర్వేశ్వరశాస్త్రిగారు.
2. ,, ప్రయాగ వేంకటరామశాస్త్రిగారు.
3. ,, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.
4. ,, ఆకుండి వెంకటశాస్త్రిగారు.
5. ,, చిలుకూరి వీరభద్రశాస్త్రిగారు.
6. ,, ఓలేటి సూర్యనారాయణశాస్త్రిగారు.
7. ,, బులుసు వేంకటేశ్వర్లుగారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

8. ,, దుప్పూరి సూర్యనారాయణశాస్త్రిగారు.
9. ,, చెఱుకుపల్లి అప్పారాయశాస్త్రిగారు.
10. ,, ఇంద్రకంటి సూర్యనారాయణశాస్త్రిగారు.
11. ,, పాలెపు వెంకటరత్నముగారు.

సర్వేశ్వరానుగ్రహము పరిపూర్ణముగా నుండుచో శీఘ్రకాలముననే శేషించిననిఘంటుభాగమునుగూడఁ బ్రచురించుభాగ్యము సమకూరఁగలదని నమ్ముచున్నాఁడను.

ఓం తత్సత్.

ఇట్లు,

బుధవిధేయుఁడు,

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# సంజ్ఞావివరణపట్టిక.

| సంకేతములు. | వివరణము. |
|---|---|
| అ. | అకారాంతము-ఇట్లే:-అ,ఇ,ఈ,చ్,జ్. మొదలగునవి తత్తదంతములుగా గ్రహించునది. |
| అ ఆ. ఈ. అ. | పుంలింగవిశేషణమయినపుడు అకారాంతము. స్త్రీలింగవిశేషణ మయినపుడు ఆకారాంతము లేక ఈకారాంతము. నపుంసకలింగవిశేషణ మయినపుడు అకారాంతము. స్త్రీలింగములలో విశేషము లున్నపుడు అవి సూచింపఁబడినవి. చివరియచ్చులనుబట్టి యవి తత్తదంతములుగా గ్రహించునది. ఉదా:- (1) అంకకుఁడు. విణ. (అ. కికా. అ.) ఇట స్త్రీలింగరూపము ఆకారాంతమగు 'అంకికా'. (2) అంతర్రాత. విణ. (ఋ. త్రీ. ఋ). ఇట స్త్రీలింగరూపము ఈకారాంతమగు 'అంతర్రాత్రీ.' (3) అంకి. విణ. (న్. నీ. న్) ఇట స్త్రీలింగరూపము ఈకారాంతమగు 'అంకినీ'. (4) అపటువు. విణ. (ఉ.ఉ,ట్వీ.ఉ). ఇట ఉకారాంతమగు 'అపటువు'ను ఈకారాంతమగు 'అపట్వీ'యును స్త్రీలింగరూపములు. (5) అనామము. విణ. (న్. న్, మ్నీ, ఆ. న్). ఇట నకారాంతమగు 'అనామ'యును ఈకారాంతమగు 'అనామ్నీ'యును ఆకారాంతమగు 'అనామా'యును స్త్రీలింగరూపములుగా నెఱుఁగునది. |
| అ. క్రి. | అకర్తకక్రియ. |
| అనా. | అనాపవిభక్తికము. |
| అప. | అపదము. (ఆగమము మొదలగునవి) |
| అలం. | అలంకారశాస్త్రము. |
| అవ్య. | అవ్యయము. |
| ఆమ్రే. | ఆమ్రేడితము. |
| ఉదా. | ఉదాహరణము. |
| ఉప. | ఉపపదము. (చూ. ఆసి- తెలుఁగు) |
| ఉభ. | ఉభయము. (సంస్కృతమును తెనుఁగును) |
| ఏ. | ఏకవచనాంతము. |
| ఔ. | ఔపవిభక్తికము. |
| క. | కన్నడము. |
| కరాలపా. | కరాలపాటి రంగయ్యగారి భారతపాఠము. |
| కు. | కుయిభాష. |
| క్రి. | క్రియ. |
| క్రి. విణ. | క్రియావిశేషణము. |
| క్షేత్రగ. | క్షేత్రగణితము. |
| గణిత. | గణితశాస్త్రము. |
| చూ. | చూడుఁడు. |
| ఛంద. | ఛందశ్శాస్త్రము. |
| జ. | జన్యము. |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| సంకేతములు. | వివరణము. |
|---|---|
| జ్యోతి. | జ్యోతిశ్శాస్త్రము. |
| త. | తమిళము. |
| తంత్ర. | తంత్రశాస్త్రము. |
| తర్క. | తర్కశాస్త్రము. |
| తు. | తులుభాష. |
| దృ. | దృష్టాంతము. |
| ద్వి. | ద్వివచనాంతము. (తెనుఁగున బహువచనాంతములో అంతర్భూతము) |
| ధర్మ. | ధర్మశాస్త్రము. |
| న. | నపుంసకలింగము. |
| నాటక. | నాటకపరిభాష. |
| నాట్య. | నాట్యశాస్త్రము. |
| పా. | పాళీభాష. |
| పీఠి. | పీఠిక. |
| పుం. | పుంలింగము. |
| పుం. న. | పుంనపుంసకలింగము. |
| పుం. స్త్రీ. | పుంస్త్రీలింగము. |
| ప్ర. | ప్రత్యయము. |
| ప్రా. | ప్రాకృతము. |
| బ. | బహువచనాంతము. |
| బీజగ. | బీజగణితము. |
| భా. ల. వ్యా. | భారతము లక్ష్మీపతిశాస్త్రిగారి ఆంధ్రభారతవ్యాఖ్య. |
| మంత్ర. | మంత్రశాస్త్రము. |
| మ. | మళయాళము. |
| మహా. | మహారాష్ట్రము. |
| మి. | మిశ్రము–సంస్కృతపదము సంస్కృతేతరపదముతోఁగాని తెలుఁగుకృత్ప్రత్యయముతోఁగాని తెలుఁగుతద్ధితప్రత్యయముతోఁగాని కలిసినపదము. |
| పెం. | పెందలైనవి. |
| యోగ. | యోగశాస్త్రము. |
| రూ. | రూపాంతరము. |
| వా. | వాడుక. |
| వి. | విశేష్యము. |
| విశ. | విశేషణము. |
| వీరేశ. పా. | కందుకూరి వీరేశలింగముగారి పాఠము. |
| వేదము. పా. | వేదము వేంకటరాయశాస్త్రిగారి పాఠము. |
| వేదాంత. | వేదాంతశాస్త్రము. |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| సంకేతములు. | వివరణము. |
|---|---|
| వైద్య. | వైద్యశాస్త్రము. |
| వ్యతి. | వ్యతిరేకార్థకపదము. |
| వ్యవ. | వ్యవహారము. |
| వ్యాక. | వ్యాకరణశాస్త్రము. |
| శత్ర. | శత్రంతము (దీనికి తెనుఁగున స్వతంత్రప్రయోగము లేదు.) |
| శ. సం. | శకసంవత్సరములు. |
| శ్లో. | శ్లోకము. |
| స. | సర్వనామము. |
| సం. | సంస్కృతము. |
| సంగీ. | సంగీతశాస్త్రము. |
| స. క్రి. | సకర్మకక్రియ. |
| సా. | సామెత. |
| స్త్రీ. | స్త్రీలింగము. |
| హిం. | హిందూస్థానీభాష. |
| √ | (మూలచిహ్నము) ఇది జనకపదములకు ముం దుపయోగింపఁబడును. |
| = | (సామ్యచిహ్నము) ఇది రూపమందుఁగాని యర్థమందుఁ గాని సామ్యముగల పదములనడుమ నుపయోగింపఁబడును. |
| ⚘ | చెట్టు లతే మొదలగువానిగుర్తు. |
| ; | ఇది విభిన్నార్థమును దెలుపును. |
| , | సమానార్థమును దెలుపును. |

(తక్కినవి స్పష్టము.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తల నామములు. |
|---|---|---|---|---|
| 1 | అచలా. | అచలాత్మజాపరిణయము. | ఆ. ౩. | వేంకటాచార్యకవి. |
| 2 | అచ్చ. భా. | అచ్చతెలుఁగుభారవి. | ఆ. ౫. | శ్రీరామకవి. |
| 3 | అచ్చ. రా. | అచ్చతెనుఁగురామాయణము | | కూచిమంచితిమ్మకవి. |
| | | బాల. బాలకాండము. | | |
| | | అయో. అయోధ్యాకాండము. | | |
| | | అర. అరణ్యకాండము. | కాం. ౬. | |
| | | కిష్కిం. కిష్కింధాకాండము. | | |
| | | సుం. సుందరకాండము. | | |
| | | యు. యుద్ధకాండము. | | |
| 4 | అధ్యా. | అధ్యాత్మరామాయణము. | | కోటమరాజు నాగయామాత్యుఁడు. |
| | | (బాలకాండాదులు ఆఱును ఉత్తరకాండమును కలసి ఏడుకాండములు.) | కాం. ౭. | |
| | | ఉ. ఉత్తరకాండము. | | |
| 5 | అని. | అనిరుద్ధచరిత్రము. | ఆ. ౫. | కనుపర్తి అబ్బయామాత్యుఁడు |
| 6 | అప్ప. | అప్పకవీయము. (లక్షణగ్రంథము.) | ఆ. ౫. | కాకునూరి అప్పకవి. |
| 7 | అ. మ. క. | అష్టమహిషీకల్యాణము. (ద్విపద) | | తిరువేంగళనాథుఁడు. |
| 8 | అహ. | అహల్యాసంక్రందనము. | ఆ. ౩. | సముఖము వేంకటకృష్ణప్పనాయఁకుఁడు. |
| 9 | ఆం. చం. | ఆంధ్రచంద్రాలోకము. | | అడిదముసూరకవి. |
| 10 | ఆం. భా. | ఆంధ్రభాషార్ణవము (నిఘంటువు) | కాం. ౩. | నుదురుపాటి వేంకనార్యుఁడు. |
| 11 | ఆం. శే. | ఆంధ్రనామశేషము (నిఘంటువు) | | అడిదము సూరకవి. |
| 12 | ఆం. సం. | ఆంధ్రనామసంగ్రహము, (నిఘంటువు) | | పైడిపాటి లక్ష్మణకవి |
| | | దేవ. దేవవర్గు. | | |
| | | మాన. మానవవర్గు. | | |
| | | స్థా. స్థావరవర్గు. | | |
| | | తి. తిర్యగ్వర్గు. | వర్గులు. ౫. | |
| | | నా. నానార్థవర్గు. | | |
| 13 | ఆం. పద. | ఆంధ్రపదాకరము. | | |
| 14 | ఆము. | ఆముక్తమాల్యద. | ఆ. ౬. | శ్రీకృష్ణదేవరాయలు. |
| 15 | ఇందు. | ఇందుమతీపరిణయము. | ఆ. ౬. | కుమారధూర్జటి. |
| 16 | ఇందు. రా. | ఇందుమతీపరిణయము. | ఆ. ౪. | తెనాలిరామభద్రకవి. |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 17 | ఉ. రా. | ఉత్తరరామాయణము | ఆ. ౮. | కంకంటి పాపరాజు. |
| 18 | ఉ. హరి. | ఉత్తరహరివంశము. | ఆ. ౬. | నాచన సోమనాథుఁడు. |
| 19 | ఉ. హరిశ్చ. | ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము. | ఆ. ౪. | తక్కెళ్లపాటి లింగన. |
| 20 | కకు. | కకుత్స్థవిజయము. | ఆ. ౬. | మల్లె అనంతభూపాలుఁడు. |
| 21 | కలు. శ. | కలువాయిశతకము. | | డబ్బీరు నరసు. |
| 22 | కవిక. | కవికర్ణరసాయనము. | ఆ. ౫. | సంకుసాల నృసింహకవి. |
| 23 | కవిచౌ. శ. | కవిచౌడప్పశతకము. | | కవిచౌడప్ప. |
| 24 | కవిజ. | కవిజనరంజనము. | ఆ. ౩. | అడిదము సూరకవి. |
| 25 | కవిజనా. | కవిజనాశ్రయము. (లక్షణ గ్రంథము.) | అధికారములు. ౪. | వేములవాడ భీమకవి. |
| | | సంజ్ఞా. సంజ్ఞాధికారము. | | |
| | | వృత్తా. వృత్తాధికారము. | | |
| | | జాతి. జాత్యధికారము. | | |
| | | దోషా. దోషాధికారము. | | |
| 26 | కవిరా. | కవిరాజమనోరంజనము. | ఆ. ౬. | కనుపర్తి అబ్బయామాత్యుఁడు. |
| 27 | కవిస. | కవిసర్పగారుడము. (లక్షణ గ్రంథము.) | ఆ. ౨. | కాచన బసవన్న. |
| 28 | కళా. | కళాపూర్ణోదయము. | ఆ. ౮. | పింగళి సూరన్న. |
| 29 | కార్తిక. | కార్తికమాహాత్మ్యము. | | కుందుర్తి వేంకటాచలపతి. |
| 30 | కావ్యా. | కావ్యాలంకారచూడామణి. (లక్షణ గ్రంథము.) | ఉల్లాసములు. ౯. | విన్నకోట పెద్దన్న. |
| 31 | కాశీ. | కాశీఖండము. | ఆ. ౭. | శ్రీనాథుఁడు. |
| 32 | కాళ. | కాళహస్తిమాహాత్మ్యము. | ఆ. ౮. | ధూర్జటి. |
| 33 | కాళ. శ. | కాళహస్తీశ్వరశతకము. | | ధూర్జటి. |
| 34 | కిరా. | కిరాతార్జునీయము. | ఆ. ౬. | గోపాలుని సింగయ. |
| 35 | కుచేల. | కుచేలోపాఖ్యానము. | ఆ. ౩. | గట్టుప్రభువు. |
| 36 | కువల. | కువలయాశ్వచరిత్రము. | ఆ. ౬. | సవరము చినసారాయణకవి. |
| 37 | కు. సం. | కుమారసంభవము. | ఆ. ౧౨. | నన్నెచోడుఁడు. |
| 38 | కృ. క. | కృష్ణకర్ణామృతము. | ఆ. ౩. | వెలఁగపూడి వెంగన. |
| 39 | కృ. శకుం. | శకుంతలాపరిణయము. | ఆ. ౩. | కృష్ణకవి. |
| 40 | కృష్ణ. | కృష్ణరాయవిజయము. | ఆ. ౪. | కుమార ధూర్జటి. |
| 41 | కృష్ణ. శ. | కృష్ణశతకము. | | నృసింహకవి. |
| 42 | కృష్ణా. | కృష్ణాభ్యుదయము. | ఆ. ౬. | గోంతేటి సూరన్న. |
| 43 | కేయూర. | కేయూరబాహుచరిత్రము. | ఆ. ౪. | మంచన. |
| 44 | క్రీడా. | క్రీడాభిరామము. | ఆ. ౧. | వల్లభరాయకవి. |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 45 | గంధ. | గంధవహము. | ఆ. ౧. | పుంచర్ల వాసుదేవకవి. |
| 46 | గాథే. | గాథేయోపాఖ్యానము. | | చిత్రకవి అనంతామాత్యుఁడు |
| 47 | గోపీ. రా. | గోపీనాథరామాయణము. | | గోపీనాథ వెంకటకవి. |
| 48 | ఘటికా. | ఘటికాచలమాహాత్మ్యము. | ఆ. ౩. | తెనాలి రామకృష్ణుఁడు. |
| 49 | చంద్ర. | చంద్రభానుచరిత్రము. | ఆ. ౫. | తరిగొప్పుల మల్లన్న. |
| 50 | చంద్ర. వి. | చంద్రరేఖావిలాపము. | ఆ. ౩. | కూచిమంచి జగ్గకవి. |
| 51 | చంద్రా. | చంద్రాంగదచరిత్రము. | ఆ. ౬. | పైడిమఱ్ఱి వేంకటపతి. |
| 52 | చంద్రి. | చంద్రికాపరిణయము. | ఆ. ౬. | శ్రీసురభిమాధవరాయప్రభువు. |
| 53 | చం. రా. | చంపూరామాయణము. | ఆ. ౭. | ఋగ్వేదికవి వేంకటాచలపతి. |
| 54 | చమ. | చమత్కారమంజరి. | ఆ. ౩. | సింహాద్రి వేంకటాచార్యుఁడు |
| 55 | చిత్రభా. | చిత్రభారతము. | ఆ. ౭. | చరిగొండ ధర్మన్న. |
| 56 | చి. ని. | చిన్నయసూరినిఘంటువు. వ్రాఁతది | | పరవస్తు చిన్నయసూరి. |
| 57 | చెన్న. | చెన్నబసవపురాణము. | ఆ. ౫. | అత్తనూరి పాపకవి. |
| 58 | జాహ్నవీ. | జాహ్నవీమాహాత్మ్యము. | ఆ. ౪. | ఏఱుగు లక్ష్మణకవి. |
| 59 | జై. భా. | జైమినిభారతము. (అశ్వమేధపర్వము.) | ఆ. ౭. | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు. |
| 60 | తపతీ. | తపతీసంవరణోపాఖ్యానము. | ఆ. ౫. | అద్దంకి గంగాధరకవి. |
| 61 | దశకు. | దశకుమారచరిత్రము. | ఆ. ౧౨. | కేతన. |
| 62 | ద. శా. | దక్షిణహిందూస్థానశాసనము. | సంపుటములు ౨ | |
| 63 | దశా. | దశావతారచరిత్రము. | ఆ. ౧౦. | ధరణిదేవుల రామయామాత్యుఁడు. |
| 64 | దా. శ. | దాశరథిశతకము. | | కంచెర్ల గోపన్న. |
| 65 | దిలీప. | దిలీపచరిత్రము. | ఆ. ౪. | కొటికలపూడి వేంకటకృష్ణకవి |
| 66 | ద్వా. | (సింహాసన)ద్వాత్రింశిక. | ఆ. ౧౨. | కొఱవి గోపరాజు. |
| 67 | ద్వి. కో. భాగ. | ద్విపదభాగవతము. | స్కం. ౧౨. | కోనేరునాథుఁడు. |
| 68 | ద్వి. తి. సా. | ద్విపదసారంగధరచరిత్రము. | ఆ. ౨. | కూచిమంచి తిమ్మకవి. |
| 69 | ద్వి. నల. | ద్విపదనలచరిత్రము. | భా. ౫. | చక్రపురి రాఘవాచార్యులు |
| 70 | ద్వి. పరమ. | ద్విపదపరమయోగివిలాసము. | ఆ. ౭. | తాళ్లపాక తిరువేంగళనాథుఁడు. |
| 71 | ద్వి. భార. | ద్విపదభారతము. (విరాటపర్వము-వ్రాఁతప్రతి.) | ఆ. ౫. | తిమ్మన. |
| 72 | ద్వి. శ. సా. | ద్విపదసారంగధరచరిత్రము. | ఆ. ౩. | బాణాల శంభుదాసుఁడు. |
| 73 | ద్వి. భాగ. | ద్విపదభాగవతము. (దశమస్కంధము.) | స్కం. ౧. | మడికిసింగన్న. |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 74 | ద్వి. హరిశ్చ | ద్విపదహరిశ్చంద్ర చరిత్రము. | భా. ౨. | గౌరన. |
| 75 | ధనా. | ధనాభిరామము. (వ్రాతప్రతి) | ఆ. ౩. | నూరన. [డు. |
| 76 | ధర్మ. | ధర్మఖండము. | ఆ. ౯. | ఈందులపల్లి భవానీశంకరుఁ |
| 77 | ఆం. ధా. | ఆంధ్ర ధాతుమాల. | | పరవస్తు చిన్నయసూరి. |
| 78 | నరస. | నరసభూపాలీయము. (లక్షణగ్రంథము.) | ఆ. ౫. | మూర్తికవి. |
| 79 | నవ. (నాథ). | నవనాథచరిత్రము (ద్విపద_ వ్రాతప్రతి | భా. ౫. | గౌరన. |
| 80 | నా. పంచ. | పంచతంత్రము. | ఆ. ౫. | నారాయణకవి. |
| 81 | నార. | నారసింహపురాణము. (ఉత్తర భాగము.) | ఆ. ౫. | హరిభట్టు. |
| 82 | నిరం. | నిరంకుశోపాఖ్యానము. | ఆ. ౪. | కందుకూరి రుద్రయ. |
| 83 | నిర్వ. | నిర్వచనోత్తరరామాయణము. | ఆ. ౧౦. | తిక్కన సోమయాజి. |
| 84 | నీతి. | నీతిసీసపద్యశతకము. | | తాళ్లపాక తిమ్మయ. |
| 85 | నీలా. | నీలాసుందరీపరిణయము. | ఆ. ౩. | కూచిమంచి తిమ్మకవి. |
| 86 | నృసిం. | నృసింహపురాణము. | ఆ. ౫. | ఎఱ్ఱాప్రగడ. |
| 87 | నైష. | శృంగారనైషధము. | ఆ. ౮. | శ్రీనాథుఁడు. |
| 88 | పండితా. | పండితారాధ్యచరిత్రము (ద్విపద<br>దీక్షా. దీక్షాప్రకరణము.<br>పురా. పురాతనప్రకరణము.<br>వాద. వాదప్రకరణము.<br>మహిమ. మహిమప్రకరణము.<br>పర్వ. పర్వతప్రకరణము. | ప్రకరణము లు. ౫. | పాలకురికి సోమనాథుఁడు. |
| 89 | పద్మ. | పద్మపురాణము. (ఉత్తరఖండము.) | ఆ. ౧౦. | మడికి సింగన్న. |
| 90 | పరమ. | పరమయోగివిలాసము. | ఆ. ౫. | తిమ్మ నృపాలుఁడు. |
| 91 | పాంచా. | పాంచాలీపరిణయము. | ఆ. ౫. | కాకమాని మూర్తికవి. |
| 92 | పాండు. | పాండురంగమాహాత్మ్యము. | ఆ. ౫. | తెనాలి రామకృష్ణుఁడు. |
| 93 | పారి. | పారిజాతాపహరణము. | ఆ. ౫. | నంది తిమ్మన. |
| 94 | పార్వ. | పార్వతీపరిణయము. | ఆ. ౭. | కోటి శ్రీరాయరఘునాథ తొండమాన్ మహీపాలుఁడు. |
| 95 | పి. శకుం. | శకుంతలాపరిణయము. | ఆ. ౪. | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు. |
| 96 | పె. శకుం. | శకుంతలాపరిణయము. | ఆ. ౩. | పెద్దాడ నాగరాజు. |
| 97 | ప్రబంధ. | ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము. | ఆ. ౧. | గణపవరపు వేంకటకవి. |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 98 | ప్రబోధ. | ప్రబోధచంద్రోదయము. | ఆ. ౫. | నందిమల్లయ, ఘంటసింగయ. |
| 99 | ప్రభా. | ప్రభావతీప్రద్యుమ్నము. | ఆ. ౫. | పింగళి సూరన. |
| 100 | ప్రభు. (లిం) | ప్రభులింగలీల. (ద్విపద.) | ఆ. ౫. (ఒక్కొక్క ఆశ్వాసమునకుఅయిదైదుగతులు కలవు.) | పిడుపర్తి సోమయ. |
| 101 | ప్ర. మణి. | ప్రబంధమణిభూషణము. | | |
| 102 | బస. పు. | బసవపురాణము. (ద్విపద) | ఆ. ౭. | పాలకురికి సోమన. |
| 103 | బహు. | బహుళాశ్వచరిత్రము. | ఆ. ౫. | దామరలవేంగళనాయఁడు |
| 104 | బిల్హ. | బిల్హణీయము. | ఆ. ౩. | పండిపెద్ది కృష్ణస్వామి. |
| 105 | బ్రహ్మో. | బ్రహ్మోత్తరఖండము. | ఆ. ౫. | శ్రీధరమల్లెవేంకటరామకవి. |
| 106 | బ్రా. | బ్రాహ్మ్యనిఘంటువు. | | బ్రౌనుదొర. |
| 107 | భర్తృ. | భర్తృహరిసుభాషితము.<br>నీతి. నీతిశతకము.<br>శృం. శృంగారశతకము.<br>వై. వైరాగ్యశతకము. | శతకములు. ౩. | ఏనుఁగు లక్ష్మణకవి. |
| 108 | భల్లా. | భల్లాణచరిత్రము. | ఆ. ౫. | వాలేశ్వరుఁడు. |
| 109 | భాగ. | భాగవతము. | స్కం. ౧౨. | బమ్మెరపోతరాజు. |
| 110 | భాను. | భానుమతీపరిణయము. | ఆ. ౪. | కంటూరి రంగరాజు. |
| 111 | భార. | భారతము.<br>ఆది. ఆదిపర్వము. ఆ. ౮.<br>సభా. సభాపర్వము. ఆ. ౨.<br>అర. అరణ్యపర్వము. ఆ. ౭.<br>విరా. విరాటపర్వము. ఆ. ౩.<br>ఉద్యో. ఉద్యోగపర్వము. ఆ. ౪.<br>భీష్మ. భీష్మపర్వము. ఆ. ౫.<br>ద్రో. ద్రోణపర్వము. ఆ. ౫.<br>కర్ణ. కర్ణపర్వము. ఆ. ౩.<br>శల్య. శల్యపర్వము. ఆ. ౨.<br>సౌ. సౌప్తికపర్వము. ఆ. ౨.<br>స్త్రీ. స్త్రీపర్వము. ఆ. ౨.<br>శాం. శాంతిపర్వము. ఆ. ౬. | పర్వములు౧౮ | కవిత్రయము. (నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రెగడ.) |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| | | ఆను. ఆనుశాసనికపర్వము. ఆ.౫.<br>ఆశ్వ. ఆశ్వమేధికపర్వము. ఆ. ౮.<br>ఆశ్ర. ఆశ్రమవాసపర్వము. ఆ.౩.<br>మౌ. మౌసలపర్వము. ఆ. ౧.<br>మహా. మహాప్రస్థానికపర్వము. ఆ. ౧.<br>స్వ. స్వర్గారోహణపర్వము. ఆ.౧. | | |
| 111 | భా. రా. | భాస్కరరామాయణము. (అచ్చతెనుఁగు రామాయణముకడనున్నట్లు దీనికి కాండము లెఱుంగునది.) | కాం. ౬. | భాస్కరుఁడు లోనగువారు. |
| 112 | భా. శ. | భాస్కరశతకము. | | మారద వెంకయ్య. |
| 113 | భీమ. | భీమేశ్వరపురాణము. | ఆ. ౬. | శ్రీనాథుఁడు. |
| 114 | భేష. | భేషజకల్పము. | ఆ. ౮. | బహుపాద వేంకటాచార్యుఁడు. |
| 115 | భోజరా. | భోజరాజీయము. | ఆ. ౭. | అనంతామాత్యుఁడు. |
| 116 | భోజసుతా. | భోజసుతాపరిణయము. | ఆ. ౫. | కోటీశ్వరకవి. |
| 117 | మను చ. | మనుచరిత్రము. | ఆ. ౬. | అల్లసాని పెద్దన. |
| 118 | మల్ల. | మల్లభూపాలీయము. (భర్తృహరికడనున్నట్లే దీనికిశతకము లెఱుంగునది.) | శతకములు ౩. | ఎలకూచి బాలసరస్వతి. |
| 119 | మల్లుపు. | మల్లుపురాణము. (దేవమల్లచరిత్రము-వ్రాఁతప్రతి.) | ఆ. ౮. | నుదురుపాటి వేంకనార్యుఁడు |
| 120 | మల్హణ. | మల్హణచరిత్ర. | ఆ. ౩. | ఎడపాటి ఎర్రన. |
| 121 | మార్క. | మార్కండేయపురాణము. | ఆ. ౮. | మారన. |
| 122 | ముకుంద. | ముకుందవిలాసము. | ఆ. ౩. | కాణాచి పెద్దన. |
| 123 | మృ. వి. | మృత్యుంజయవిలాసము. | ఆ. ౩. | గోఁగులపాటి కూర్మదాసుఁడు |
| 124 | మై. | మైరావణచరిత్రము. | ఆ. ౩. | మాడయకవి. |
| 125 | మొ. రా. | మొల్లరామాయణము (అచ్చతెనుఁగు రామాయణముకడనున్నట్లు దీనికి కాండము లెఱుంగునది.) | కాం. ౬. | మొల్ల. |
| 126 | యయా. | యయాతిచరిత్రము. | ఆ. ౫. | పొన్నగంటి తెలగనార్యుఁడు |
| 127 | రంగా. | రంగారాయచరిత్రము. | ఆ. ౩. | దిట్టకవి నారాయణకవి. |
| 128 | రం. రా. | రంగనాథరామాయణము (ద్విపద) (అచ్చతెనుఁగు రామాయణముకడనున్నట్లు దీనికి కాండము లెఱుంగునది.) | కాం. ౬. | రంగనాథుఁడు. |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 129 | రం. రా. ఉ. | రంగనాథరామాయణము. ఉత్తరకాండము. (ద్విపద) | కాం. ౧. | కాచభూపతి, విట్ఠలరాజు. |
| 130 | రఘు. | రఘువంశము. | ఆ. ౧౦. | అవుధూరి కిచ్చయ్య. |
| 131 | రఘునా. | రఘునాథాభ్యుదయము. (వ్రాఁతప్రతి) | | విజయరాఘవకవి. |
| 132 | రత్న. | రత్నపరీక్ష. | | భైరవకవి. |
| 133 | రస. | రసమంజరి.(లక్షణగ్రంథము) | గుచ్ఛములు ౩. | సురతాని కోదండపతి. |
| 134 | రసా. | రసాభరణము (లక్షణగ్రంథము.) | ఆ. ౪. | అనంతామాత్యుఁడు. |
| 135 | రసిక. | రసికజనమనోభిరామము. | ఆ. ౩. | కూచిమంచితిమ్మకవి. |
| 136 | రాఘవ | రాఘవపాండవీయము. | ఆ. ౮. | పింగళి సూరన్న. |
| 137 | రాజగో. | రాజగోపాలవిలాసము. | ఆ. ౫. | కాళయ. |
| 138 | రాజ. చ. | రాజశేఖరచరిత్రము. | ఆ. ౩. | మాదయగారి మల్లన్న. |
| 139 | రాజ. వి. | రాజశేఖరవిలాసము. | ఆ. ౩. | కూచిమంచి తిమ్మకవి. |
| 140 | రాధా. | రాధామాధవము. | ఆ. ౫. | చింతలపూడి ఎల్లనార్యుఁడు. |
| 141 | రాధికా. | రాధికాసాంత్వనము. | ఆ. ౮. | ముద్దుపళని. |
| 142 | రామ. | రామరాజీయము. | ఆ. ౧. | వెంకయ్య. |
| 143 | రామలిం. | రామలింగేశ్వరశతకము. | | అడిదము సూరన్న. |
| 144 | రామా. | రామాభ్యుదయము. | ఆ. ౪. | అయ్యలరాజు రామభద్రుఁడు |
| 145 | రామే. | రామేశ్వరమాహాత్మ్యము. | ఆ. ౫. | ఏనుఁగు లక్ష్మణకవి. |
| 146 | రా. వి. | రాజవాహనవిజయము. | ఆ. ౫. | కాకమాని మూర్తికవి. |
| 147 | రుక్మా. | రుక్మాంగదచరిత్రము. | ఆ. ౫. | ప్రౌఢకవి మల్లన్న. |
| 148 | రుక్మి. | రుక్మిణీపరిణయము. | ఆ. ౫. | కూచిమంచి తిమ్మకవి. |
| 149 | లక్ష్మణ. | లక్ష్మణసారసంగ్రహము. | ఆ. ౩. | చిత్రకవి పెద్దన్న. |
| 150 | ల. వి. | లక్ష్మీవిలాసము. | ఆ. ౫. | రాయసము వేంకటపతి. |
| 151 | వన. వి. | వనమాలివిలాసము. | | నారన సూరన. |
| 152 | వరాహ. | వరాహపురాణము. | ఆ. ౧౨. | నందిమల్లయ్య, ఘంటసింగన్న |
| 153 | వసు. | వసుచరిత్రము. | ఆ. ౬. | రామరాజభూషణుఁడు. |
| 154 | వా. రా. | వాసిష్ఠరామాయణము. | ఆ. ౫. | మడికి సింగన. |
| 155 | వాల్మీ. | వాల్మీకిచరిత్రము. | ఆ. ౩. | రఘునాథభూపాలుఁడు. |
| 156 | విక్ర. | విక్రమార్కచరిత్రము. | ఆ. ౪. | జక్కన. |
| 157 | విజ. వి. | విజయవిలాసము. | ఆ. ౩. | చేమకూర వేంకటకవి. |
| 158 | విజ్ఞా. | విజ్ఞానేశ్వరీయము. | కాం. ౩. | కేతన. |
| 159 | వి. న. | విజయనందనవిలాసము. | ఆ. ౩. | మంగళగిరి ఆనందకవి. |
| 160 | వి. పు. | విష్ణుపురాణము. | ఆ. ౪. | వెన్నెలకంటి సూరన. |
| 161 | విష్ణుమా. | విష్ణుమాయానాటకము. | | చింతలపూడి ఎల్లనార్యుఁడు |
| 162 | విప్ర. | విప్రనారాయణచరిత్రము. | ఆ. ౫. | చదలవాడ మల్లయ్య. |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 163 | వీథి. | వీథినాటకము. | | శ్రీనాథుఁడు ? |
| 164 | వీర. | వీరభద్రవిజయము. | ఆ. ౪. | బమ్మెర పోతన్న. |
| 165 | వేంక. | వేంకటేశాంధ్రము. (నిఘంటువు) | వర్గులు. ౫. | గణపవరపు వేంకటకవి. |
| 166 | వేం. పంచ. | పంచతంత్రము. | ఆ. ౫. | వేంకటనాథుఁడు. |
| 167 | వేం. మా. | వేంకటాచలమహాత్మ్యము. | ఆ. ౬. | తరిగొండ వెంకమ్మ. |
| 168 | వేణు. | వేణుగోపాలశతకము. | | |
| 169 | వేమన. | వేమనశతకము. | భాగ. 3. | వేమనయోగి. |
| 170 | వైజ. | వైజయంతీవిలాసము. | ఆ. ౪. | సారంగు తమ్మయ్య. |
| 171 | శ. ర. | శబ్దరత్నాకరము. (నిఘంటువు.) | | బహుజనపల్లి సీతారామాచార్యులు. |
| 172 | శశాం. | శశాంకవిజయము. | ఆ. ౫. | శేషము వేంకటపతి. |
| 173 | శా. ప. మ. | శాసనపద్యమంజరి. | | |
| 174 | శివధ. | శివధర్మోత్తరము. | ఆ. ౭. | మల్లారెడ్డికవి. |
| 175 | శివర. | శివరహస్యఖండము. | ఆ. ౧౦. | కోడూరి వేంకటాచలపతి. |
| 176 | శివరా. | శివరాత్రిమాహాత్మ్యము. | ఆ. ౪. | శ్రీనాథుఁడు. |
| 177 | శివ. సా. | శివతత్త్వసారము. | | మల్లికార్జునపండితారాధ్యుఁడు. |
| 178 | శుక. | శుకసప్తతి. | ఆ. ౪. | కదిరీపతినాయకుఁడు. |
| 179 | శుక. చ. | శుకచరిత్రము. | ఆ. ౫. | పరశురామపంతుల రామమూర్తికవి. |
| 180 | శృంగా. | శృంగారరసమంజరి. | | సురతాని కోదండపతి. |
| 181 | శేష. | శేషధర్మము. | ఆ. ౫. | తామరపల్లి తిమ్మయ్య. |
| 182 | శ్రీరం. | శ్రీరంగమహత్త్వము. | ఆ. ౫. | భైరవకవి. |
| 183 | శ్రీరం. మా. | శ్రీరంగమాహాత్మ్యము. | ఆ. ౧౦. | కట్టా వరదరాజేంద్రుఁడు. |
| 184 | ష. చ. | షట్చక్రవర్తిచరిత్రము. | ఆ. ౭. | మల్లారెడ్డికవి. |
| 185 | షోడ. | షోడశకుమారచరిత్రము. | ఆ. ౭. | వెన్నెలకంటి అన్నయ్య. |
| 186 | సకల. స. | సకలనీతిసమ్మతము. | | మడికి సింగన్న. |
| 187 | సత్య. సాం. | సత్యభామాసాంత్వనము. | | లింగనమఖి, కామేశ్వరకవి. |
| 188 | సమీర. | సమీరకుమారవిజయము. | ఆ. ౬. | పుష్పగిరి తిమన. |
| 189 | సర్వ. సా. | సర్వలక్షణసారసంగ్రహము. | | కూచిమంచి తిమ్మకవి. |
| 190 | సస్యా. | సస్యానందము. | | |
| 191 | సాం. ని. | సాంబనిఘంటువు. | వర్గులు. ౫. | కస్తూరి రంగకవి. |
| 192 | సాంబో. | సాంబోపాఖ్యానము. | ఆ. ౫. | రంగప్పరాజు. |
| 193 | సానందో. | సానందోపాఖ్యానము. | ఆ. ౫. | శివరామకవి. |
| 194 | సారంగ. | సారంగధరచరిత్రము. | ఆ. 3. | చేమకూర వేంకటకవి. |
| 195 | సిం. నార. | సింహాద్రినారసింహశతకము. | | గోఁగులపాటికూర్మదాసుఁడు |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 196 | సీతారా. | సీతారామాంజనేయసంవాదము. | ఆ. ౩. | పరశురామపంతుల గురులింగమూర్తి. |
| 197 | సీతావి. | సీతావిజయము. (శతకంఠరామాయణము.) | ఆ. ౪. | మర్దనకవి. |
| 198 | సీమం. | సీమంతినీకల్యాణము. | ఆ. ౫. | వెనుమళ్ల సోమమంత్రి. |
| 199 | సుద. | సుదక్షిణాపరిణయము. | ఆ. ౫. | తెనాలి అయ్యన్న. |
| 200 | సుదంతా. | సుదంతాపరిణయము (వ్రాతప్రతి) | ఆ. ౪. | అళుఘురికవి. |
| 201 | సురా. | సురాభాండేశ్వరము. | ఆ. ౧. | గట్టు ప్రభువు. |
| 202 | సు. శ. | సుమతిశతకము. | | బద్దెనకవి. |
| 203 | సేతు. | సేతుఖండము. | ఆ. [illegible]. | వక్కలంక వీరభద్రకవి. |
| 204 | హంస. | హంసవింశతి. | ఆ. ౫. | అయ్యలరాజు నారాయణామాత్యుఁడు. |
| 205 | హ. న. | హరిశ్చంద్రనలోపాఖ్యానము. | ఆ. ౫. | రామరాజభూషణుఁడు. |
| 206 | హర. | హరవిలాసము. | ఆ. ౮. | శ్రీనాథుఁడు. |
| 207 | హర. వి. | హరభక్తవిలాసము. | | |
| 208 | హరి. | హరివంశము. | | ఎఱ్ఱాప్రగ్గడ. |
| | | పూ=పూర్వభాగము. | ఆ. ౯. | |
| | | ఉ=ఉత్తరభాగము. | ఆ. ౧౦. | |
| 209 | హరిశ్చ. | హరిశ్చంద్రోపాఖ్యానము. | ఆ. ౫. | శంకరకవి. |
| 210 | హ. వరాహ. | వరాహపురాణము. | ఆ. ౫. | హరిభట్టు. |

(కడమవి స్పష్టము.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథముల యందలి సర్గాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 1 | అమర. | అమరసుధ. | | భానుజి దీక్షితులు. |
| 2 | ఆ. ని. | ఆప్టేని సంస్కృతాంగ్లనిఘంటువు. | | వామనశివరామాప్టేడు. |
| 3 | ఉ. చ. | ఉత్తరరామచరితము. | అంకములు ౭. | భవభూతి. |
| 4 | కల్ప. | శబ్దకల్పద్రుమము. (నిఘంటువు) | | సర్. రాజారాధాకాంతదేవ బహదరు. |
| 5 | కాదం. | కాదంబరీకావ్యము. | భాగములు ౨. | బాణకవియు, తత్పుత్రుడు. |
| 6 | కావ్యాద. | కావ్యాదర్శము. | పరిచ్ఛేదములు ౩. | దండికవి. |
| 7 | కే. ని. | నానార్థార్ణవసంక్షేపనిఘంటువు. | కాండములు౬. | కేశవమిశ్రుడు. |
| 8 | గీత. | భగవద్గీత. | అధ్యాయములు ౧౮. | వ్యాసమహర్షి. |
| 9 | గీతగో. | గీతగోవిందము. | సర్గములు ౧౨. | జయదేవుడు. |
| 10 | త్రి.ని. | త్రికాండశేషము. (నిఘంటువు) | కాండములు ౩. | పురుషోత్తముడు. |
| 11 | పరా. | పరాశరస్మృతి. | కాండములు ౨. | పరాశరమహర్షి. |
| 12 | భట్టి. | భట్టికావ్యము. | సర్గములు ౨౨ | భట్టి. |
| 13 | భామినీ. | భామినీవిలాసము. | ఉల్లాసములు ౪. | జగన్నాథపండితరాయలు. |
| 14 | మను. | మనుస్మృతి. | అధ్యాయములు. ౧౨. | మనువు. |
| 15 | మహా. | మహావీరచరిత్రము. | అంకములు ౭. | భవభూతి. |
| 16 | మాలతీ. | మాలతీమాధవము. | అంకములు౧౦. | భవభూతి. |
| 17 | మాళవి. | మాళవికాగ్నిమిత్రము. | అంకములు ౫ | కాళిదాసుడు. |
| 18 | ముద్రా. | ముద్రారాక్షసము. | అంకములు ౭. | విశాఖదత్తుడు. |
| 19 | మురా. | అనర్ఘరాఘవము. | అంకములు ౭. | మురారి. |
| 20 | మృచ్ఛ. | మృచ్ఛకటికము. | అంకములు౧౦. | శూద్రకుడు. |
| 21 | మే. ని. | మేదినీనిఘంటువు. | | మేదినికరుడు. |
| 22 | మేఘ. | మేఘదూతము. | భాగములు ౨. | కాళిదాసుడు. |
| 23 | యాజ్ఞ. | యాజ్ఞవల్క్యస్మృతి.<br>ఆచా. ఆచారకాండము.<br>ప్రా. ప్రాయశ్చిత్తకాండము.<br>వ్యవ. వ్యవహారకాండము. | కాండములు ౩. | యాజ్ఞవల్క్యమహర్షి. |
| 24 | రత్నా. | రత్నావళి. | అంకములు ౪. | శ్రీహర్షదేవుడు. |
| 25 | రస. | రసగంగాధరము. | | జగన్నాథపండితరాయలు. |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథము లందలి సర్గాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 26 | రా. ని. | రాజనిఘంటువు. | వర్గములు ౨౧. | నరహరిపండితుఁడు. |
| 27 | వాచ. | వాచస్పత్యనిఘంటువు. | | తారానాథతర్కవాచస్పతి |
| 28 | విక్రమో. | విక్రమోర్వశీయము. | అంకములు ౫. | కాళిదాసుఁడు. |
| 29 | వి. ని. | విశ్వనిఘంటువు. | | మహేశ్వరసూరి. |
| 30 | విల్యమ్సు. | విల్యమ్సు సంస్కృతాంగ్ల నిఘంటువు. | | సర్. మోనియర్ విల్యమ్సు. |
| 31 | వేణీ. | వేణీసంహారము. | అంకములు ౬. | భట్టనారాయణుఁడు. |
| 32 | వై. ని. | వైజయంతినిఘంటువు. | కాండములు౮. | యాదవప్రకాశుఁడు. |
| 33 | శాకుం. | అభిజ్ఞానశాకుంతలము. | అంకములు ౭. | కాళిదాసుఁడు. |
| 34 | శా. ని. | శాశ్వతనిఘంటువు. | | శాశ్వతుఁడు. |
| 35 | శిశు. | శిశుపాలవధము. | సర్గములు ౨౦. | మాఘకవి. |
| 36 | సం. కిరా. | కిరాతార్జునీయము. | సర్గములు ౧౮. | భారవి. |
| 37 | సం. కు. సం. | కుమారసంభవము. | సర్గములు ౧౭. | కాళిదాసుఁడు. |
| 38 | సం. చం. రా. | చంపూరామాయణము. | కాండములు ౬. | భోజరాజు,లక్ష్మణసూరి. |
| 39 | సం. దశకు. | దశకుమారచరితము. | | దండికవి. |
| 40 | సం. నైష. | నైషధీయచరితము. | సర్గములు ౨౨. | శ్రీహర్షకవి. |
| 41 | సం. పంచ. | పంచతంత్రము. | తంత్రములు ౫ | విష్ణుశర్మ. |
| 42 | సం. ప్రబోధ. | ప్రబోధచంద్రోదయము. | అంకములు ౬. | కృష్ణమిశ్రకవి. |
| 43 | సం. భర్తృ. | భర్తృహరిసుభాషితము. | శతకములు ౩. | భర్తృహరి. |
| 44 | సం. భాగ. | భాగవతము. | స్కంధములు ౧౨. | వ్యాసమహర్షి. |
| 45 | సం. భార. | భారతము. | పర్వములు ౧౮. | వ్యాసమహర్షి. |
| 46 | సం. రఘు. | రఘువంశము. | సర్గములు ౧౯. | కాళిదాసుఁడు. |
| 47 | సం. రామా. | రామాయణము. | కాండములు ౬. | వాల్మీకిమహర్షి. |
| 48 | సా. ద. | సాహిత్యదర్పణము. | పరిచ్ఛేదములు ౧౦. | విశ్వనాథకవిరాజు. |
| 49 | హలా. ని. | అభిధానరత్నమాలానిఘంటువు. | కాండములు ౫. | హలాయుధుఁడు. |
| 50 | హితో. | హితోపదేశము. | భాగములు ౪. | నారాయణపండితుఁడు. |
| 51 | హేమ. ని. | అనేకార్థసంగ్రహము. (నిఘంటువు.) | కాండములు ౭. | హేమచంద్రుఁడు. |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# సూర్యరాయాంధ్రనిఘంటువు.

## తె.

తె. అప. 'ఒకఁడు, ఎవ్వఁడు' అనుసర్వనామములకు వచ్చుమహత్తివాచకప్రత్యయము.

ఉదా: ఒకతె, ఒక్కతె, ఎవతె, ఎవ్వతె, మొ.

తెంక = తేఁకువ. వి. (త. తేంకు.) శంక, భయము.

సీ. మనకులదైవ మన్నన్న లేదేని ద్రిభువనారాధ్యుఁ డన్తెంక లేక. కు. సం. ౪. ౪౧౭. (లెక్కలేక అని వ్రాఁతప్రతి పా.)

ఉ. తెం కగునోరచూపులను దేఁకువ తప్పిన యేసబాసలున్, అంకులబ్రహ్మ యీమసర రాజ్యము నెట్లు సృజించె నక్కటా. చాటుపద్యమణిమంజరి. ౨ భాగము. (తెంకగు=భయముగల.)

తెంకణము. సం=టెంకణము.

గీ. తెంకణాంధ్రకళింగాదిదేశములకు. నాచికేతూపాఖ్యానము. ౨. ౧౬౭.

తెంకాయ=టెంకాయ. వి. (క. తెంగినకాయ. త. తెంగాయ్.) నారికేళఫలము, కొబ్బరకాయ. (శ. ర.)

ఆ. తెల్లగలువవేరు తెంకాయలోఁ గ్రుక్కి, మన్నుమెత్తి పుటము మాడఁగుండ, నెత్తి గ్రాహిధైనినింగువతో నూరి, పోఁకలంత గొన్నఁ బొలియు గ్రహణి. చి. కి. (చి. ని.)

తెంకి= టెంకి. వి. స్థానము, నివాసస్థానము.

చ. మెకములఁ బట్టి కట్టవల వ్రీఁటి చనం జననీక యాఁగి తెం,కికిఁ జనఁజేయ బోనునకేఁగీల్కొలుపన్ ...

ఉ. తెంకులు వేదముల్ రఘుపతీ శరణాగతవజ్రపంజరా. వజ్రపంజరశతకము.

జః తెంకిపట్టు.

తెంకిపట్టు=టెంకిపట్టు. వి. (తెంకి + పట్టు.) ఉనికిపట్టు, స్థానము.

సీ. ఇవి గుబ్బపు మొగంబుచివురాకుఁబోఁడులఁ దెగి చెట్లఁ గట్టిన తెంకిపట్టులు... రామా. ౭. ౧౫౭.

తెంచు[1]=త్రెంచు, తెంపు, త్రెంపు. స. క్రి. (√తెగు) తెగఁజేయు, నఱకు, ఖండించు.

గీ... నేల, వ్రాలె వికలాంగియై తెంచివైవ నెండ, దాఁకి వందినతీఁగచందంబు దోఁప. భార. స్త్రీ. ౧. ౧౮౧.

శా... తలిరాకుఁగైదువులఁ దోడ్తోఁ దాల్తిలేఁ దీఁగలన్, వే తెంచె న్జగదేకవిక్రమకళావీరుండు మారుం డొగిన్. పి. శకుం. ౨. ౧. ౨౧.

రగడ. తెరవ యెచటనుండి పాలు తెంచి తెంచితే సరాలు. వరాహ. ౩. ౯౨.

తెంచు[2]. అ. క్రి. ౧. (ఇది గమనార్థక క్రియలతోఁగూడి శబ్దపల్లవమై ఆగమనార్థ మిచ్చును.)

ఉదా: అరుగుదెంచు, చనుదెంచు, మొ.

౨. కొన్ని క్రియలకు స్వార్థమున అనుప్రయుక్తమగును.

ఉదా: అగుదెంచు, పడుతెంచు, తో తెంచు[2], మొ.

౩. ఇది కొన్నిపదముల కనుప్రయుక్తమై అర్థవి... మిచ్చును. (చూ. తోతెంచు[1].)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(ఈశబ్దపల్లవము లన్నింటికి తెచ్చుధాతువునకు వలె "చనుదేన్, చనుదేరన్, తోతేన్, తోతేరక, తోతేక" మున్నగురూపములు సిద్ధించును.)

తెండు=తేఁడు. అ. క్రి. పరుండు, శయనించు.

గీ. అతివ పూర్ణేందుభీతిఁ దదశ్మశాలఁ, దెండి యతఁ డందు నినుమడితీండ్రఁ దోఁప. ఆము. ౫. ౧౪౬.

ఉ... నెమరువెట్టుచు నందినియట్టు నాకుచుం, బచ్చికఁ దెండి యున్నయది భామిని వేలుపు టావు చూచితే. పారి. ౨. ౯౫.

తెండెగ. అవ్య. ద్రు. (తెగ+తెగ) అతిశయముగా, మిక్కిలి.

క...వనితలు చెలి కింపొంద నెడ గంద మిడు తఱిఁ, దెండెగఁ బైపైని బూలతేనియ గురిసెన్. ప్రబంధ. ౫౩౦.

తెండెప్ప=తెండేప.

క. అందల మందల లేకిప్పుడం దలమంద లయి యున్న వయ్య మెకంబుల్, చెందామరకొల నివలెన్, దెండెప్ప లవేమి సెప్ప దేవుఁడె ఱుంగున్. సారంగ. ౧. ౬౮. (శ.ర. పా. 'తెండేపలు' ముద్రిపా.)

తెండేప=తెండెప్ప. విణ. (తేప+తేప) అపారము, అమితము.

ద్వి. ఆపూర్ణసదనాంబరాదులతోడ, దీపించు సిరులఁ దెండేపగా నొసఁగి. అ. మ. క. ౩. ౧౫౮ పా. ౨ పం.

గీ. అందుఁ దెండేపలుగ సిరుల్ గ్రందుకొనఁగఁ, బుడమి వెలసె హుమాయూపుడమిఱేఁడు. యయా. ౧. ౧౬.

తెంపు. వి. తుప్ప.

క. తెంపలు గలయడవులఁ దగిలింప నిలింపాహితుల్ స్ఫులింగము లెగయన్, దెం పెసఁ--

గఁ బావకుఁడు... దశా. ౨. ౫౪.

క...జంబుకవ్యాఘ్రంబుల్.

ఉ. తీరక పోయి పోయి బలుదెంపలఁ గంపల నేళ్ల బీళ్ల...చెట్ల గట్ల నాహారమతిం జరించి జఠరానల మాఱక వచ్చి క్రమ్మఱన్. వేం. పంచ. ౧. ౪౯౨, ౪౯౩.

తెంపరి. విణ. (తెంపు+అరి³) ౧. సాహసికుఁడు; సాహసముకలది; శూరుఁడు.

క. చంపినఁ జచ్చెద ననుచును, గంపింపక యోరిపలువ కఠినోక్తుల నన్, గుంపించెదు చావునకుం, దెంపరివై పదరువాని తెఱఁగునఁ గుమతీ. భాగ. ౮. ౨౮౦.

క. తెంపరిమాటలు పలికిని, నింపగునో తండ్రి నీకు నేటికి వల దీ లంపటము... రుక్మా. ౫. ౧౫౨.

క. కడుఁ దెంపరియై భూవరుఁ, డుడికెడు వెడ మడుఁగునడుమ నుఱికె న్మును గ్రాఁగెడునూనియకొప్పెరఁ దాఁ బడి వెడలినవాఁడు నీళ్లఁ బడు టరుదౌకొ. ద్వా. ౭. ౧౭౩.

సీ. చులుకరి యనఁగఁ దెంపరి యన శూరాభిధానంబు గాఁగను దనరుచుండు. ఆం.భా. ౨. ౧౭౫.

౨. క్రూరుఁడు; క్రూరము, కఠినము.

ఉ. తెంపరివై పొరింబొరిని దేవకిబిడ్డలఁ జిన్నికుఱ్ఱలం, జంపితివి... భాగ. ౧౦ పూ. ౧౫౪.

క... తెంపరినై కూడినపెండిలిఁ, జెఱిచితి నాకన్నఁ గష్టశీలుఁడు గలఁడే. వేం. పంచ. ౪. ౨౭౪.

తెంపాడు. స. క్రి. (తెంపు+ఆడు.) సాహసవాక్యములాడు; నిందించు, దూఱు.

మ. తగునే నన్నిటు లాడ నీకు ననవద్యంబైన సద్వర్తనాదిగుణౌఘంబుల శుద్ధ నా పెఱుఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గనే తెంపాడ యుక్తంబె... భా. రా. యు. ౨౩౪౭.

తెంపి. వి. వితంతువు, విధవ.

గీ. పఱచు తెంపికి నిత్యసౌభాగ్య మస్తు. క్రీడా. ౨౧౪.

విణ. ఛిన్నము, భిన్నము, తెగినది.

ద్వి. చింపిగొడ్డులును గ్రుస్సినశరీరములు, తెంపి జన్నిదములుఁ దెరలును జాల. పండితా. పర్వ. ౩౩౫ పు.

తెంపు=త్రెంపు, తెంచు, త్రెంచు. స. క్రి. (√తెగు) తెంచు, ఖండించు. (శ. ర. బ్రా.) వి. ౧. తెగుట (శ. ర.) ౨. త్రెంచుట, ఖండనము. (బ్రా.) ౩. తెగువ, సాహసము.

ఉ. తెం పెసలారఁగా మసల దీకొని యున్నది యొక్కలేమ... కాశీ. ౬. ౨౩౪.

గీ. అధిప నీతనయుండు గయ్యంబువోడుచు, తెంపు వదలక విభవంబుపెంపు మెఱసె. భార. భీష్మ. ౧. ౧౪౨.

ఆ. అకట తండ్రి సచ్చినంతనుండియు మము, నరసి ప్రోచినట్టియనుఁగుఁడాతఁ, జంప మదిఁ దలంచు తెంపు నూచితె రాజధర్మ మింత క్రూరకర్మ మగునె. భార. భీష్మ. ౩.౨౭౭.

౪. బలాత్కారము, బలవంతము.

ద్వి. పేద నే నని నోరఁ బ్రేవులుఁ జూపఁ, బోదురే ఋణముఁ దెంపునఁ గొనువారు. ద్వి. హరిశ్చ. ఉ. ౨౦౨ పం.

తెంపుంబడి. విణ. (√తెంపు) సాహసికుఁడు; మోటు, మూర్ఖుఁడు.

శా. చాతుర్యంబులచెంతఁ జెందఁడు కులాచారంబు గోరండు...రతితత్త్వప్రౌఢుఁడుం గాఁడు భామా తెంపుంబడి యైనయీవికటవర్గం జెప్పఁగాఁ గూడునే. దశకు. ౭. ౬౯. (తెంపుంబొడి అని వ్రాతప్రతిపా.)

తెంపుసేయు. అ. క్రి. (తెంపు+చేయు) సాహసించు.

వ...అని తెంపుసేసి యగ్నిప్రవేశంబున కాయితం బైయున్న సమయంబున...హర. ౩. ౯౫.

తెకతెక. వి. ౧. ఉడుకుట, క్రాఁగుట మున్నగు వానియం దగుధ్వని కనుకరణము.

సీ. ఉదకంబు తెకతెక నుడుక మీఁదికి రాక మడుఁగులమీనంబు లడుగు చేర. వరాహ. ౨. ౬౪.

చ. ఒకయెడఁ జక్రవాకము పయోరుహమిత్త్రుని నేఁడియెండచేఁ, దెకతెకఁ గ్రాఁగుతమ్మివిరితేనియ లెక్కలఁ జల్లనార్చి కాంతకుఁ దని వార నిచ్చె...పారి. ౪. ౨౨.

౨. కాలుట, ఎండకాయుట, పరితపించుటమున్నగువాని కనుకరణము.

సీ. సికతాతలాధ్వగు త్తెకతెక నడు గంట దుప్పట్లు ద్రొక్కి పాదుకలు దలఁప. రా. వి. ౫. ౧౦౦.

క. ఒకకొంతదవ్వు చనిచని, తెకతెక సెగ లెగయు నెండ తెరలం బొరలన్. రామా.౫.౩౦.

గీ. బోటుల నొకింత తనుఁ బాసిపోనికూర్మి, బోటుల మొఱంగి తెకతెకఁ బొక్కిపడెడు. చమ. ౩. ౪౭.

గీ. చిత్తము తెకతెక నుడికి మెత్తపడియె. పరమ. ౧. ౧౧౪.

౩. తాపము.

సీ. త్రిమట కోర్చును దెకతెక మోహించుఁ దమక మెన్నక నవ్వుఁ దగల దెచట. కళాశాస్త్రము. ౧. ౧౨.

తెకతేర. క్రి. విణ. (తేర+తేర) ౧. మిక్కిలి అనాయాసముగా, కడుసులభముగా.

క. మగఁ డాపట్టెంబునఁ దలఁ, దెగఁగొట్టినఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గొట్టుఁగాక తెకతేరఁగ నీ, కెగవిడిచి పోయె దనె...కళా. ౩. ౧౯౧. (తెకతేరఁగ అపముద్రి.)

సీ...తోడియిందిరను గౌస్తుభము నెవ్వఁ, డధిపుఁడై ధరియించె నతఁడె చేకొనుఁ గాక తెకతేర యిది యేమి యొకరిసొమ్మె. పారి. ౪. ౫౮.

౨. నిష్కారణముగా, నిర్హేతుకముగా; వ్యర్థముగా, వృథాగా.

గీ. ఇతని కెక్కుడిసామ్రాజ్య మేడ బ్రదుకు, చెడియెఁ దెకతేర యనుచుఁ గేరడము లాడె. వేం. పంచ. ౧. ౩౬౯.

గీ. ప్రాణ మేటికిఁ దెకతేర పాపికొనఁగ. వేం. పంచ. ౩. ౧౨౨. (శ. ర. పా.) ద్వి. పరమ. ౬. ౪౭౩ పా. ౨ పం.

తెక్కరము. వి. విలాసము, ఒయ్యారము.

సీ... తెక్కు తెక్కర మెమ్మె టెక్కు టీకు... హొయ లనఁగ విలాస మొప్పుచుండు. ఆం. భా. ౧. ౧౩౯. (శ. ర. బ్రా. తెక్కర ప్రాఁతప్రతి పా.)

తెక్కలి. విణ. (సం. తస్కరః) ౧. చోరుఁడు, దొంగ.

చ...ఆత్మవెం,దెవు లయిన నజ్జలం బయినఁ దెక్కలి యైన మృగాగ్నులైన...తీర్చు బే, లవు తను పూరకే చెడ కిల నృపు నొక్కనిఁ బ్రోచు టొప్పదే. ఆము. ౬. ౩౦.

౨. రహస్యము; రహస్యకృత్యము.

చ. అరుదుగఁ దమ్మభూవిభునియన్నిదాడికి నోడి శాత్రవుల్, దిరుగనిడొంకలం బడని తెక్కలి టెంకులు...లేవు భూస్థలిన్. వి. పు. పీఠి. ౪౪.

క. కలలోన నైనఁ బురుషునిఁ, దెలియం జూడని కళావతీతిలకము తెౕక్కలిగర్భము దాల్చె నెయని, నలుగురు విని నిందచేసి నవ్వఁగ వలసెన్. చెన్న. ౧. ౧౩౩.

౩. వంచకము, వంచకుఁడు, మాయావి.

క. తెక్కలిరావణబాంధవ, మెక్కుడఁ దోడయ్యె నీకు హృదయేశ్వర... మై. ౩. ౧౫౩.

ఉ. తెక్కలిచాడిమాటలె మదిం బదిలంబుగ నమ్మి మిత్తిచేఁ, జిక్కుతి నేమి సేయఁదగుఁ జెందినదుర్దశ మాన్ప వచ్చునే. చెన్న. ౩. ౩౦౯. (తెక్కుడి ముద్రిపా.)

మ. మలయం బెక్కుడఁ గాశి యెక్కుడె నసన్మార్గంబు పాటించి తెౕక్కలి దైవం బిటు నాకు నీయహితముం గావించునే...కాశీ. ౫. ౧౬౭.

౪. బాధకుఁడు, కష్టపెట్టువాఁడు; క్రూరుఁడు, క్రూరము.

ద్వి. అక్కట యక్రూరుఁ డనువాఁడు మనకుఁ, దెక్కలివలె నిటఁ దే శేల తెచ్చె, నక్రూరుఁ డగువీని జను లెల్లఁ గూడి, యక్రూరుఁ డని చీరు టణకంబు గాదె. ద్వి. భాగ. ౨. ౪౫.

క. అక్కట యుసురులవిం దగు,నిక్కొఁతుల మిన్న కిప్పు డిట్టిదొసంగుల్, దెక్కలిద య్యెం బింతయు, నక్కటికము లేక యిట్లు హత్తించెనొకో. అచ్చ. రా. సుం. ౧౬౮.

వి. ౧. దొంగతనము, చౌర్యము.

సీ. పరఁగుఁ దెక్కలి యన బందిపో టనఁగను ...దొంగతన మనంగఁ జౌర్యంబు చెల్లు... ఆం. భా. ౨. ౯౨.

సీ. అధ్వరాదికసత్క్రియ లప్రివర్తింపక తెక్కలిబంది యేదిక్కులందుఁ, దఱు చయ్యె... భార. శాం. ౨. ౮౯.

క. కొనిపోవరాదు తెరువునఁ, గనకము తెక్కలి ఘనంబు కాకున్నను మోవనురాదు పెద్దహేమం,బు... కేయూర. ౩. ౩౧౬.

౨. వంచన, మోసము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ...మహోన్నతపీఠ మలంకరించునిక్, దెక్క-
లిఁ దాఁకి ధాత యిలఁ ద్రెళ్లెడునట్లుగఁ
జేసె...భార. శల్య. ౨. ౪౦౨.

౩. ప్రమాదము, పొరపాటు.

క. అక్కట నాగురుపుత్త్రుం, దెక్కలిఁ గోల్ప
డితి పెద్ది తెలియఁగో విప్రుం, డెక్కడి కెక్క
డఁ దలఁచెను, దృక్కరణోన్మాద మింతతీ
వ్రం బగునే. భోజరా. ౪. ౨౩౦.

౪. బాధ, కష్టము.

ద్వి. నీసతితోఁ బొందు నీతోంటిపెంపుఁ, బడ
యు మీ వింక నీపదను దప్పిసను, గడపట
నీవు తెక్కలిఁ జత్తువు... ద్వి. హరిశ్చ.
ఉ. ౨౫౧౬ పం.

జ: తెక్కలికాఁడు, తెక్కలిగొను, తెక్కలిపా
టు, తెక్కలీఁడు.

తెక్కలికాఁడు= తెక్కలీఁడు. విణ. (తెక్కలి
+ కా[3]ఁడు- స్వార్థమున) ౧.అపహర్త, దొంగ.

తరువోజ. ధృతి దూలఁ జన నవి తిరిగె వెన్వె
నుకఁ, దెక్కలికాఱుఁ దోతెంచి రాతనికి.
భార. స్త్రీ. ౧. ౪౩.

సీ. కరుణారసంబు తెక్కలికాఁడు మదిచొక్క
పాతకంబులపాలిపట్టుగొమ్మ. గీ. కలశపాథో
ధిపుత్త్రికేఁగంటిమాడ్కి, గాని రాజులనేర
మి గాదుసువ్వె. రాజ. చ. ౨. ౨౧.

క. చదువుల తెక్కలికానిం, జిదిమి నలువకలఁక
దీఱిచితి వీవె కదా. అచ్చ. రా. బాల.
౧౫౧.

క. మ్రుచ్చులు తెక్కలికాండ్రుం, జొచ్చిలి యొ
ప్పింతు రెపుడు జూదపుసభలం,దు...విజ్ఞా.
ప్రా. ౪౦.

౨. వంచకుఁడు, మోసగాఁడు.

క. హితమొనరించెద నంచున్, ధృతరాష్ట్రిత
నూభవునకుఁ దెక్కలికాఁడై, మృతి యొన
రించెం దానను,మృతుఁ డయ్యెను భ్రాతృపు
త్త్ర మిత్త్రయుతముగన్. భార. స్త్రీ. ౨.
౧౩౭.

ఉ.అక్కట యిట్టు లాడఁ దగునమ్మ యనర్వాతఁ
గామచారి యౌ, తెక్కలికాని నాడుపగిదిన్
... చెన్న. ౨. ౩౩.

తెక్కలిగొ(కొ)ను. స. క్రి. (తెక్కలి+
కొను) ౧. అపహరించు, ఎత్తుకొనిపోవు.

క... ఒక్కరుఁడ యమృతముఁ దెక్కలిగొని
యాస్వాదింపక ... భార. ఆది. ౨. ౧౦౪.

సీ. కన్నంబువెట్టి తెక్కలిగొని యంకంబు పలు
వురతో నాడి బందివెట్టి. దశకు. ౬. ౯౫.

౨. సంహరించు, చంపు.

ఉ. నిక్కము మాకుఁ జిత్తములు నీ రగుచున్నవి
క్రూరసత్త్వము, ద్దెక్కలిగొన్నఁ బొక్కిపడ
దే మదిలో నిను గన్నతల్లియున్. ఉ.హరి.
౨. ౧౩౨.

తెక్కలిపాటు. వి. (√తెక్కలి) విపత్తు, ఆపద.

ఉ. ఎక్కడ నెల్లలోకముల నెవ్వరుఁ గోరని
కోర్కె నేఁడు మా, తెక్కలిపాటుకై తివిరి
దేహము వేఁడఁగ వచ్చినారము...భాగ.౬.
౩౪౯.

తెక్కలీఁడు= తెక్కలికాఁడు. (తెక్కలి +
ఈ[5]ఁడు—స్వార్థమున.)

సీ. లంకాధిపతితలలకు గండకత్తెర రేవతీహృద
యరాజీవహేళి. గీ. త్రిపురవనితలయాలువు
తెక్కలీఁడు. వరాహ. ౫. ౫౯.

తెక్కు= టెక్కు. వి. ఉబ్బు,పొంగు; గర్వము.

ఉ. చుక్కలరాణివాసములసోయగపుంజనుదో
యి తెక్కునం, జిక్కన యైనయక్కు యదు
సింహుఁడు బాణపరంపరాహతిన్, వ్రక్కలు
సేయఁగా... పారి. ౫. ౧౦. (త్రెక్కు.
ముద్రి.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జః తెక్కులకాఁడు.

తెక్కులకాఁడు. విణ. (తెక్కులు + కాఁడు) గర్వముకలవాఁడు.

ద్వి. ముక్కంటి కెన యైనమునియల్లమయ్య, తెక్కులకాఁడు మద్దెలయల్లముండు. ప్రభు. ౨. (చి. ని.)

తెగ = తెవ. వి. ౧. (ఎక్కుపెట్టిన) నారి, అల్లెత్రాడు, శింజిని.

క. అని తెగ నిండఁ దిగిచి యేసిన నయ్యస్త్రంబు రోదసీకుహరంబున్, దన మెఱుఁగుల నించుచు... భార. కర్ణ. ౩. ౩౬౦.

గీ. అధిప సర్వాస్త్రఘాతి యై యతిశయిల్లు, నస్త్రమునఁ జిత్రముగఁ దెగయంద తునిమె, నమ్మహాస్త్రంబు... భార. ద్రో. ౩. ౨౦౫.

క... దనుజుం డేసెన్, జగదేకనాథుమీఁదను, దెగ నిండఁగఁ దిగిచి యొక్క దివ్యశరంబున్. ఉ. హరి. ౧. ౧౫౨.

౨. జ్యాకర్షణము, బాణములు ప్రయోగించుటకై వింటినారిని లాగుట.

సీ. తెగయనఁగా గడిదేలును జ్యాకృష్టి... ఆం. భా. ౨. ౨౧౨.

క. ఇవి నీ తెగకోలఁదవి వీ, రవినోదమునప్పు డధికరభసము లగుమ, ద్వివిధాటోపములకుఁ జా, లవు విల్లది నాలు వేలలా వరయంగన్. భార. విరా. ౪. ౧౦౬.

ద్వి. నా తెగ కేల పినాకివి ల్లిలుచు, నాతతభుజసత్త్వ మట్టిదె నాకు. రం. రా. బాల. ౭౯ పా. ౧౧ పం.

ద్వి. తెగఁ గొన నిలువదు దీని నాయెదుటఁ, బాగడితి పలుమాఱు భూపాల యనుచు. రం. రా. బాల. ౬౬ పా. ౫ పం.

౩. నిడుపు, దైర్ఘ్యము.

రగడ. తెల్లనిజల్లులు విఁజామరములుఁ దెగ గల సవరా లేనికకొమ్ములు. కవిక. ౩. ౧౯౫.

క. పొగరెక్కినమూఁపురములు, దెగ గలవాలములు శైలదేహంబులు... వృషభగణము మెల్లన నడచెన్. భాగ. ౧౦పూ. ౮౯౭.

౪. విధము, పద్ధతి.

సీ. మగమీల నగఁ జాలు తెగఁ గీలుకొనువాలు కనుఁగవ కోకవింత కాంతి యొదవె. పారి. ౧. ౫౬.

౫. వెరవు, ఉపాయము.

ద్వి. అగలక మునినాథునప్పన కొక్క, తెగ సేయవలయు నో దేవి యెల్లైన. ద్వి. హరిశ్చ. ఉ. ౧౬ పం.

ద్వి. ఎడపక నను విక్రయించి చెల్లింపు, కడఁబడుఁ గొంతైనఁ గౌశికుబుణము, కడపకు నొక తెగ గల్గు నెల్లిటికి. ద్వి. హరిశ్చ. ఉ. ౨౧౧ పం.

౬. ఉద్ది, పక్షము.

క. మగపిండు మగువపిండును, దెగ లేర్పడి చల్లులాడ... కళా. ౨. ౮౬.

గీ. సీతతోఁ గూడి రఘువీరశేఖరుండు, బాలలు స్వపక్షమున సీతపక్షమునను, జల్లుపో రాడఁ గనుఁగొంచు సరసిఁ దేలె.

క. తన తెగ మగువలు రఘురా, ముని తెగ కామినుల మించి ముంచిన నగు న, జ్జనకజనగవులదీర్ఘిక, యనిమిషదీర్ఘి కవిలాస మయ్యెడఁ గాంచెన్. ఉ. రా. ౬. ౮౭, ౯౯.

౭. సమూహము, గుంపు.

చ... తనయానవాలు రఘునాయకుఁ డెవ్వరిచేతి కిచ్చెనో, మన తెగలోఁ దలంచికొనుమా యపు డన్నియుఁ గానవయ్యెడున్. రామా. ౬. ౮౦.

సీ. ప్రసవకోదండుండు పాశంబు తగిలింప నెగయుమిఱుంగుఱు తెగ లనంగ. రా. వి. ౩. ౭. అచ్చ. రా. యు. ౨౩౬.

౮. కులము, జాతి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. విను రక్కసులును వేల్పులు, ననియెడునీ
రెండుతెగల నాయకుఁడు నీవునుగద నడి
పెడువారు... యయా. ౩. ౧౦౭.

తెగబారెఁడు=అతిదీర్ఘము.

క. తెగబారెఁ డనఁటిమేలిమి,చిగురాకులు వైచి
జలము చిలికించుటయుఁన్. రా.వి. ౨. ౯౭.

క. నెఱు లనఁగ నెంత తేపే, పురిగొని తెగ
బారెఁడేసి పొడమెఱు మీరే, మురువుగ జడ
యల్లెదరు...శుక. ౨.౨౩౩.మనుచ.౩.౬.

జ: తెగగొను, తెగదీయు, తెగవాపు.

తెగఁగొట్టు. స. క్రి. (తెగన్+కొట్టు) ఖండించు, నఱుకు.

గీ...గట్టుతెగఁగొట్టువజ్రమునను, జంభసంభేద
మేమి యాశ్చర్య మనఁగ. దశా. ౨.౪౨౨.

క. మగఁ డాపట్టెంబునఁ దలఁ, దెగఁగొట్టినఁ
గొట్టుఁగాక... కళా. ౩.౧౯౧.

తెగఁగోయు. స. క్రి. (తెగన్+కోయు) ౧. నఱుకు, ఖండించు.

ఉ...మానిమానసము తద్ఘనధైర్యకఠోరశృంఖ
లా,సంతతి యెంతయుం గుసుమశస్త్రికలం
దెగఁగోసివైచుచున్. కళా. ౩. ౨౦.

ద్వి. ఒగి యతీశ్వరుపోల్కి నట్టులతోడఁ,దెగఁ
గోసికొన్నాఁడో తెగువతో మున్నె. ద్వి.
పరమ. ౪. ౨౮౧ పా. ౧౪ పం.

౨. అపనయించు, పోఁగొట్టు.

శా. ఆయిష్వాకుఁడు నిట్లు రంగపతి కత్యంతం
బు నిత్యోత్సవ,శ్రీయోగంబులు చేయుచుం
గుజనులన్ శిక్షించి వర్ణాశ్రమా, పాయం
బుల్ దెగఁగోయుచున్ ...కవు. ౪. ౨౩.

తెగఁజూచు. స. క్రి. (తెగన్+చూచు. ఇట చూచుధాతువు ప్రేరణార్థకము.) వధించు, చంపు.

గీ. వానిఁ దెగఁజూడ వైతేని వాయుపుత్ర,
నీవు గనుఁగొన నురి నైన నీర నైన...మేను
దొఱఁగుదు ...భార. విరా. ౨. ౨౯.

క...అ,వ్వైరి నిఁకం దెగఁజూచెద, సారథి మన
రథముఁ దెమ్ము చయ్యన ననఁగన్. ఉ. రా.
౩. ౩౪౩.

క. నీచమతి నన్ను నెవ్వఁడు, చూచిన నారా
త్రిలోనఁ జూతును తెగఁ దా, రాచపలు
...భార. విరా. ౧. ౩౨౪. (ఈప్రయోగ
మున ఈపదమునందలిభాగములు వ్యత్క్రమ
ముగా కనఁబడుచున్నవి.)

తెగఁబడు. అ. క్రి. (తెగన్+పడు-స్వార్థమున.) తెగు,సాహసించు.

క. మొగమున మీసము గల్గిన,మగవాఁడైతేఁ
గడిందిమగఁటిమి మీఱన్,దెగఁబడి పోట్లాడ
వలెన్, బిగు వేమిర రాచములుచ విడుతునె
నిన్నున్. అహ. ౧. ౮౮.

తెగఁబాటు. వి. (√తెగఁబడు.) సాహసము.

చ. పగతుని నాయితంపుఁదెగఁబాటునఁ బైపడి
గెల్వ నేర్చినన్, మగఁటిమి దూలుటే దొ
సఁగుమాలఁగ దానవుఁ జంపు మెమ్మెయిన్.
నిర్వ. ౧౦. ౧౯. (శ. ర. పా. 'అనాయ
తంపుటగపాటు'ముద్రి.)

తెగఁబాఱు=తెగించే.అ. క్రి.(తెగన్+పాఱు-స్వార్థమున.) తెగు, సాహసించు; విజృంభించు, ఉద్రేకించు.

చ. పలుకునె యిట్లు గొంతి విని బమ్మెరపోయితి
మింత బెట్టిదం,బు లగునె మాట లయ్యామ
యుఁ బుణ్యుఁడు గృష్ణుఁడుఁ గార్యవాద
ముల్, పలికెడువార లిట్లు దెగఁబాఱిరి...
భార. ఉద్యో. ౪. ౨౨.

క.తడవయ్యె నితఁడు మన క్కడిబంధుం డేల
కృప దెగంబాఱుము న్నా,వుకుఁ గీ లెడపిన
జంత్రము, వడువునఁ బడ నేసె నతని వాసవి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యధిపా. భార. ద్రో. ౩. ౭౯.

గీ. పన్నిదము సలు మని తెగఁబాఱి పలికె. భార. అను. ౧. ౧౯౦.

ఉ. పచ్చనివింటివాఁడు తెగఁబాఱక నిన్నిపు డింతదవ్వు ర్యానిచ్చునె ... రాజ. చ. ౩. ౭౫.

తెగగొను= తెగవాపు. అ. క్రి. (తెగ + కొను) బాణప్రయోగమునకై నారి లాగు,జ్యాకర్షణము సేయు.

గీ. అన్నరేంద్రుఁడు మఱియుఁ గెంపారుచూడ్కి, నిగుడ బ్రహ్మాస్త్ర మరిఁ బోసి తెగగొనఁగ. భా. రా. యు. ౨౨౦.

క...ఇది విష్ణుదేవు కార్ముక మీచాపము నెక్కువెట్టి పటువేగముతోఁ దెగగొనక పోవఁగా నీ వనుడున్. భా. రా. బాల. ౭౪౪.

స. క్రి. ౧. (బాణము) సంధించు, కూర్చు.

క. తెగగొని బ్రహ్మాస్త్రము యేఁ, దగ నేసిన నొకటి నొకటి దార్కొని రెండున్, గగనం బంతయుఁ దేజస్సగితముగాఁ జేసె... భార. ఉద్యో. ౪. ౩౪౬.

శా.ఆవేళన్ సురవల్లభుండు మృగయుం డై వెంబడిన్ రోయుచున్, దా వింటన్ దెగగొన్నకోల కరికర్ణవ్యస్తపింఛంబుసం,భావింపన్ ... వరాహ. ౧౨. ౩౪.

౨. ఎక్కువెట్టు.

వ...విల్లుం దెగగొని వాలంపవెల్లిం బెల్లుగాఁ బఱపిన... పి. శకుం. ౩. ౧౧౩.

తెగచు. అ. క్రి. కలఁగు, క్షోభపడు.

గీ. చెన్ను దఱిగినసొగసుతో విన్ననైన, దేవ యానఁ గనుంగొని తెగచి వగచి. యయా. ౩. ౮౨.

వ...వనచంద్రికావైభవంబును వనకేళీపలాశదోహదంబు నగుటకు వగచి వగచి తెగచి కడుపు చుమ్మలుచుట్టి కన్నీ రుట్టిపడం బొట్టుపార లగుచుండు నంత ...పాండు. ౩. ౨౪.

తెగటార్చు(ఉచు). స. క్రి. (√తెగటాఱు.)

౧. చంపు; నశింపఁజేయు, పోఁగొట్టు.

ఉ. మంటయుఁ బోనిశాత్రవసమాజము నించుక యేనిశంక లే, కంటఁగఁ దాఁకి వెండి తెగటార్చె మహాద్భుతశక్తిశాలి ...భార.విరా. ౩. ౨౨౮.

సీ...నులిమెను దెగటార్చెఁ జదిసెఁ జంపె...

గీ...చెండె ననంగఁ బొం దగు వధించె,ననుటకు సమాఖ్య లై...ఆం. భా. ౩. ౧౨౩.

మ. ప్రతిపక్షుం దెగటార్చు నంగుళిశిఖాప్రస్ఫోటమాత్రంబునన్. కాశీ. ౩. ౧౯౦.

క. తెగఁ దీర్పక తగ నార్పక, తెగటార్పక కడమ కొంత ద్రిక్కఁగ నున్నన్, జగతీశ యప్పు నగ్నియుఁ, బగయును గడుఁబెరుఁగుఁ గీడు వాటిల్లుఁ దుదిన్. భార. శాం. ౩. ౨౭౬.

౨. (ఋణము)తీర్చు, అపాకరించు.

ద్వి. మన కెవ్వ రందు సంబంధిబాంధవులు, మన యప్పు తెగటార్ప మది వేడువారు. ద్వి. హరిశ్చ. ఉ. ౯.

తెగటాఱు. అ. క్రి.(తెగటు + ఆఱు)౧. చచ్చు; నశించు.

సీ. బలము సాగాయుతప్రాణసమం బగునమ్మహారా జట్టె యడవిచిచ్చు. గీ. వలనఁ దెగటాఱె నే మనఁ గలదు...భార. ఆశ్ర. ౨. ౧౬౧.

సీ. అతుండు తెగ నశ్వత్థుండు తెగటాఱె రక్తరోముఁడు నీల్గె రణములోన. మొల్లరా. సుం. ౧౪౯. మనుచ. ౩. ౪౦.

క. లోకంబులు తెగటాఱఁగ, నేకార్ణవ మైన యిచట నిబ్బాలుఁడు...భార. ఆర. ౪. ౨౫౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. దీనితుమున్నంతము, క్రి. విశే. వలె పూర్తిగా, నిశ్శేషముగా, అనునర్థమున నుపయోగింపఁబడును.

సీ. మాకుఁ జూడంగ సొమ్మసిలి పడ్డది గాని తెగటాఱి చచ్చుట తెలియరాదు. వరాహ. ౧౦. ౪౫.

తెగటాఱుపు(ర్పు.) వి. (√తెగటార్చు) చంపుట, హింస.

గీ... తెగటార్ప పరిమార్ప, పొరిగొనుట పిల్కుమార్ప చంపుట తునుముట, యనఁగఁ దగు హింస...ఆం. భా. ౨. ౨౨౪.

తెగటు. వి. తృష్ణ, గర్వము. (శ.ర, చి.ని,బ్రౌ.)
జ: తెగటార్చు, తెగటాఱు, తెగటాఱుపు.

తెగడ. వి. (సం. త్రివృతా.) త్రివృత, ఒకానొక యోషధి.

సీ...త్రిపుట వెలయుఁ దెగడ యనిన. ఆం. భా. ౨. ౫౭.

తెగడిక=తెగడు. వి. (√తెగడు.)

సీ...ఈసడింపు తెగడు తెగడిక...రోఁత రొచ్చు...ఏవగింపు నా నపవాదసంజ్ఞ యై యలరుచుండు. ఆం. భా. ౧. ౧౧౫.

తెగడు=తెవడు. స. క్రి. ౧. నిందించు,దూషించు.

క. తగువార లూరులు దెగడుట, పొగడుట యగుపలువపొంతఁ బోవరు...భార. కర్ణ. ౧. ౩౧౩.

క. తనబుద్ధి యొక్కకన్నును, నొనరినహితమంత్రిబుద్ధి యొకకన్నును గాఁ, గని సంచరింపనేరని, జననాథుని జగము దెగడు జాత్యంధునిఁగాన్. విక్ర. ౩. ౩౨. భార. విరా. ౪. ౬౬.

౨. తిరస్కరించు, అధఃకరించు.

సీ. కరువలి సుడియమిఁ గదలక చెన్నొందు నెఱివిరితమ్ముల నుఱక తెగడి. గీ. తనవిలోచనములు...భార. విరా. ౨. ౭౩. (ఇట ఔపమ్యద్యోతకము.)

సీ. వనరాశిఁ దగుమెత్తఁదన మెఱ్ఱి యేఁచు టే బలమని బాడబానలముఁ దెగడు. కు. సం. ౧౦. ౫౭౬. ద్వి. హరిశ్చ. ఉ. ౩౩౭.

క. వల ఊని దెగడునాన్పపు,చెలువము నలువారఁ జూచి చెలి యొక్కతె క్రొం,జిలిబిలి వలపులఁ గులికెం, జిలజిల మరునిల్లు పెల్లు చెమ్మగిలంగన్. రసిక. ౧. ౯౦.

౩. అదలించు, బెదరించు.

క...చింతాజలనిధిఁ, దేలుచుఁ గైసేయుసఖులఁ దెగడుచుఁ గంటన్. వసు. ౩. ౧౩౧.

౪. ఆక్షేపించు; పరిహసించు.

గీ. కాంత యేకాంతవేళలఁ గాంతు నెదుట, నగుచుఁ దెగడుచు నుండుట తగవు సూవె. కాశీ. ౩. ౬౨.

సీ. ఇన్నాళ్లవలె మన సిచ్చి మాటాడవే యెందు దృష్టి యని కాళింది దెగడె. విజ. వి. ౩. ౨౭. అ. మ. క. ౪౨ పా ౧౨,౧౩ పం.

౫. ఉపేక్షించు.

ద్వి. తగవు మీఱఁగ నన్ను దయఁ జూడరయ్య, తెగడక నా కొక్కదిక్కు గారయ్య. ద్వి. హరిశ్చ. ఉ. ౪౦౨.

క. అల్లదె తాటక...వి ల్లెక్కిడి యొకచిల్కునఁ, ద్రెళ్లింపుము పొలఁతి యనుచుఁ దెగడక దానిన్. అచ్చ. రా. బాల. ౧౧౨.

౬. నిర్ణయించు, ఏర్పాటుచేయు.

క. జంభాహితుఁ డూర్వశిపై, రంభపయిం గరుణకలిమి రహిఁ దన్నటనా,జృంభణలతారతమ్యము, సంభావించుటయ కాని చాలఁడు తెగడన్. విక్ర. ౨. ౪౪.

అ. క్రి. ఉపేక్షింపఁబడు.

క. మిగులఁ గడఁగండ్లఁ బడియున్, దెగడక దాకెల్ల నిపుడు నీమేనల్లుం, డగుకటి వేలుపు కత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మున, నొగి నుసుఱులతోడ నిల్చియున్నా
రసుమీ. నీలా. ౧. ౬౬. (శ. ర. పా, తె
గకయు, ముద్రి.)

వి. (=తెగడిక) నింద, దూఱు.

క...హితకార్యగతులు సెప్పఁగఁ దెగ డగుఁ,
బొగ డగు నెడు రోర్వవలయు బుద్ధి గలిగి
నన్. భార. కర్ణ. ౧. ౩౧౩.

క. జగ మెఱుఁగఁగ దుశ్శీలుం, డగుభూనాథుం
డు వోయినట్టులె పోఁగాఁ, దెగడుం జేటుఁ
గలిగి వగ, మిగులను మది గలఁగదే యమిత్ర
ధ్వంసీ. భార. సౌ. ౧. ౩౯.

జ: తెగడిక.

తెగదీయు=తెగవాపు. అ. క్రి. (తెగ+తీయు)
బాణప్రయోగమునకై నారి లాగు, జ్యాకర్షణ
ము చేయు.

శా. చండాశీవిషఘోరసాయకము చంచజ్జ్యా
సమేతంబుగా, నిండారం దెగదీసి లోకము
లు ఘూర్ణిల్లంగ రామక్షితీశుం డాస్ఫోటన
సేసె... భా. రా. కిష్కిం. ౨౨౫.

తెగనాడు. స. క్రి. (తెగన్+ఆడు) నిష్కర్ష
ముగా పలుకు, ఖండితముగా పలుకు; కఠినము
గా పలుకు.

వ...తెగనాడకున్నఁ బోవ రని కన్నీరు దుడిచి
కొని... భార. ఆశ్ర. ౧. ౯౫.

గీ. చెలులఁ దెగనాడునీకు నీచేత నాడు,తలిరుఁ
బ్రాయంపుముద్దురాచిలుక తోడు. రసిక.
౩. ౯౫.

క. తెగనాడ వలదు సభలను, మగువకు మన
సియ్యవలదు మహిలో సుమతీ. సు.శ.౬౫.

౨. పోఁగొట్టు, నశింపఁజేయు.

మ. అగసంస్తంభనమౌనిగాలి కటు డాయం
గాక యార్యాగ్నికిం, దెగనాడన్ వసపోని
దుర్యశఃపుటభిన్ శక్యమా దాఁటఁగన్. చం.
రా. ౬. ౯౦.

తెగవాపు=తెగదీయు. అ. క్రి. (తెగ+పాపు

వ...అక్కర్ణుండు...కార్ముకగుణంబున సంధించి
తెగవాపినం గని... భార.కర్ణ. ౩.౪౧౯.

మ. వడిఁ దూణమ్మున నమ్ముఁ గైకొనుట తీవ్ర
స్ఫూర్తి సంధించు టేర్పడ లీలం దెగవా
పు టేయుట మదిన్ భావింపఁగా రాక వి,
ల్లుడు సై యుండుటయున్...భా.రా.ఆర.
౧. ౨౧౯.

తెగవ్రేటు. వి. (√తెగవ్రేయు) ఖండనము, నఱ
కుడు.

చ. పలుకువెలందికిన్ మనికిపట్టగుచాలుపుమో
ముదామరల్, గలిగియుఁ బ్రాఁతపల్కులు
చొకాటముగా నుడువంగ నేరకే, తలతెగ
వ్రేటులం బడియెఁ దా నొకనేరుపుకాఁడె
యంచు నన్నులువను మాటిమాటికిని నవ్వుదు
రచ్చటినేలవేలుపుల్. అచ్చ. రా. బాల.
౩౯.

తెగవ్రే(వే)యు. స. క్రి. (తెగన్+వ్రేయు(
ఖండించు, నఱకు.

క. ఆసంకులసమరంబున, వాసవుఁ డొ మే
లనంగ వసువుల్ తుషితుల్, డాసిరి యసి
ధారలఁ దెగవ్రేసిరి రోసమున నసురవీరుల
శిరముల్. ఉ. రా. ౪. ౩౩౦.

వ...రక్తవత్ప్రభృతుల మున్నుగా హతులం
గావించి పిదప రేణుకను దెగవ్రేయు మని
త్వరపెట్టిన... దశా. ౬. ౭౫.

(వ్యవ.) వానితల తెగవేసెను.

తెగి(యి)ంచు. అ. క్రి. (తెగు+ఇంచు-స్వార్థ
మున.) తెగు, సాహసించు.

గీ. ఇవ్విధంబున నపూర్ణి మేందువదన, యన్య
సంభోగసుఖలేశ మబ్బ నేని, యాకసం బైన
భేదించి యవలవోవు,నంతకుఁ దెగించి యు
న్నయవ్వసరమున. శుక. ౪. ౬౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. ఎంతను నేర రంత తెగియించినవా రది యున్నదే కదా. శుక. ౪. ౨౮.

తెగింపు. వి. (√తెగించు) సాహసము, తెగువ.
వ... తెగింపులు సగింపులు ... మెఱయన్... భీమ. ౪. ౬౦.

తెగిపోవు. అ. క్రి. (తెగి + పోవు - స్వార్థమున)
౧. ఛిన్న మగు, భిన్న మగు.
సీ. పలుఁదచన్నులహారవల్లికల్ దెగిపోవఁ బర్యెదల్ బలిమిమైఁ బట్టి తివిచి. ఉ. రా. ౪. ౯౩.
౨. విడిపోవు.
సీ. నగరు వెల్వడుదాఁకఁ దెగిపోయి మఱినిల్చి తోడివిద్వాంసులఁ గూడువారు. ఆము. ౪. ౭.
౩. సమాప్త మగు, ముగియు.
ఉ... ఆట తెగిపోవుతటిన్... దశకు. ౪. ౫౧.
౪. చాలించుకొని పోవు, మానుకొని పోవు.
వ... పగవాఁడు బలవంతుం డింతన తెగిపోయెడి వాఁడు గాఁ డీలోనన మగుడంబడి యెద్ది యేని కిల్బిషం బాపాదించు... హరి. ఉ. ౧. ౧౪౦.
౫. చచ్చు, నశించు.
క. తెగిపోయినవా రేడ్చిన, మగుడుదురే వెఱ్ఱులార మానుఁడు మీరుం, దెగుదురు దడసిన నావుడు... భార. శాం. ౩. ౩౬౯.

తెగు. అ. క్రి. ౧. ఖండిత మగు, భిన్న మగు, విదారిత మగు. (దీని తుమున్నంతరూప మగు 'తెగన్' అనునది 'క్రి. విశే.' గా "నిశ్శేషముగా, పూర్ణముగా, మిక్కిలి" మున్నగునర్థములందు వాడఁబడుచున్నది.
ఉదా:— తెగఁదిను, తెగఁద్రాగు, మొ.)
క. తెగఁదీర్పక తెగనార్పక, తెగటార్పక కడమ కొంత ద్రిక్కుఁగ నున్నన్, జగతీశ యప్పా నగ్నియుఁ, బ[illegible] గీడు వాటిల్లు దుదిన్. భార. శాం. ౩. ౨౭౬. ('తెగనార్పక' అని పాఠాంతరము.)
శా. క్రూరాసిం దెగ నేసెనో నఱికెనో... హర. ౭. ౬౯.
మ... శాతాసిచే వాఁడు జోడు దెగన్ వ్రేసిన మేను వ్రస్సి... ఉ. హరి. ౧. ౩౫.
మ. బలిమిం ద్రెంపఁగఁబోలెఁ బాయవడుచుం బర్యాయభంగంబునన్, గలనూ లెల్లను నంచు మోవఁ దెగి రాఁగా... ఆము. ౪. ౩, ౨౮౨.
౨. చచ్చు, మరణించు.
గీ. ఇంద్రు లెందఱు వో రింద్రు లేల బ్రహ్మ లుండుదురె తటితోఁ దెగుచున్నవారు. భార. శాం. ౪. ౪౩౬.
గీ. భరతుఁ డేతెంచుటయు ధాత్రివరుఁడు తెగుట. భా. రా. బాల. ౨౨.
గీ. తీర్థములయందు విధి మూఁడి తెగినపుణ్యు లనఘ యీలోకమున నుందురు... కాశీ. ౪. ౫౮. దశా. ౧. ౨౨౨.
౩. అంతరించు, పోవు, నశించు.
చ... పండితుల్, వగతురె యున్నవారికి నవశ్య విధేయతఁ జన్నవారికిం, దెగు వగ లెల్లఁ జిత్తము ప్రదీప్తవివేకమయత్వ మొందినన్. భార. భీష్మ. ౧. ౧౯౫.
సీ... నీకొడుకు నారి, వరియింప నని యున్న వాఁడు మీకుల మింకఁ దెగ నోపు... మార్క. ౮. ౧౪౮.
క. ఆపరముఁడు సంకర్షణ,రూపంబున నుండు నాదిరుద్రుం డైతాఁ, గోపించినపుడు ప్రళయము, దీపించు జగంబు లెల్లఁ దెగు నందఱతో. వి. పు. ౩. ౧౦౩. పార్శ్వ. ౩. ౪౯.
౪. ముగియు, సమాప్తమగు; పూర్ణమగు.
క. ఇంత యెఱుంగవు సైన్యము, లింత వడిం దలలు తీర తెలియఁగక మోహాక్రాంతంబు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లయ్యెఁ బని తెగుఁ, గాంతేయుఁడు సారఁడు
గానిక్రౌర్యంబునకున్. భార.విరా.౫.౨౧౫.

క. నరుఁ డాలవెనుక వచ్చినఁ, గురురా జదు
గంగ నీవు గురుఁడును గృపుఁడున్, గురు
సుతుఁడు వినఁగ వారల,చిరసమయము
దెగుట యేను జెప్పనె తెలియన్. భార.
ఉద్యో. ౧. ౨౫౪.

క. ఏమని చెప్పుదు ని ట్లను, నామాటయుఁ దె
గక మున్న హా పుత్రాయం,చామునిపత్నియు
నప్పుడు, భూమిం బడియుండె రిత్తబొంది
యపోలెన్. భా. రా. అయో. ౨౦౩.

గీ. కోటిజిహ్వాలు మోములు కోటి గలుగు, కోటి
నలువలు తా రాకకోటి యగుచుఁ, గోటి
కల్పాలు పొగడ నీగుణములోనఁ, గోటి కొక
పాలు దెగదు వైకుంఠనిలయ. వరాహ. ౧౦.
౮౮.

౫. ఆఁగు; విరమించు.

గీ. పట్టి యాతనిఁ జెఱఁ బెట్టి పాండవులకు,
దిగులు పుట్టింత మంతటఁ దెగక యెత్తి,
వచ్చిరేనియు నిర్జింపవచ్చు...భార.ఉద్యో.
౩. ౩౯౦.

౬. పరివృత్తమగు, వినిమయము నొందు, మాఱు.

మ. అని వారిన్ మగిడించి తాన చని యి న్నా
దీవి నె త్తొంటికిన్, గనకం బెత్తులు రెంటి
లెక్కఁ దెగినం గైకొంచు నాల్గోడలన్,
నిను పారంగ సువర్ణ మెత్తుకొని పూర్ణీభూత
సానందసం, జనితోద్గర్వమనస్కుఁడై మర
లి యాసాముద్రమధ్యంబునన్. కేయూర.
౩. ౧౭౧.

౭. సాహసించు, తెంపుతో ప్రవర్తించు.

చ. వినుము కిరీటి...పాండురాజునకు జనించి
తేనిఁ దెగి చూపుము శౌర్యము సత్త్వవీర్య
మున్. భార. ద్రో. ౩. ౧౯౫.

చ. తెగి యొకకొండతోఁ దగరు దీకొని తాఁ
కిన నేమి భాస్కరా. భా. శ. ౪౬.

క...పగవాఁడును దెగునె యిట్టిపాపము సే
యన్. దశకు. ౧౦. ౯౭.

క. క్రొమ్మించుసొమ్ము లెమ్మెం,దె మ్మంచును లాగు
లంజె తెగి విటుమీఁదన్. చంద్ర. వి. ౨.
౩౦. కాశీ. శ. ౧౦౯.

౮. తీర్పఁబడు, పరిష్కరింపఁబడు, నిర్ణీతమగు.

క. తెగ దిప్పుడు మూన్నెల్లకుఁ, దగ వడుగఁగ
రండు దీర్చెదను బొండు వృథా, జగడింపకుఁ
డన వారలు, నగరికె నిక్షేప మొప్పనము
చేసి చనన్. జై. భా. ౮. ౨౦౯.

౯. సాధ్యమగు.

చ. తనభుజశక్తియున్ రిపులదర్పము నేర్పడఁ
జూచి చూచి యెట్లును దెగ కున్నఁ బోక
యిది లోకముచక్కటి...భార. విరా. ౪.
౬౧.

౧౦. (గణిత) శేషములేకుండ భాగింపఁబడు;
విభక్తమగు.

(వా:) 3 చేత 23. తెగదు.

(వా:) అన్నదమ్ములకు భాగములు తెగలేదు.

తెగితెగని=కొంచెము వాఁడిగల దగు.

గీ. తెగితెగని చిలుక త్తికోఁతగ వధించు,టుచిత
మని యోలి ని ల్లేఁచుచున్నయవియె. ప్రభా.
౫. ౧౭౪.

జ: తెంచు[1], తెందెగన్, తెంపరి, తెంపాడు,
తెంపు, తెంపుంబడి, తెంపుసేయు, తెగఁగొట్టు,
తెగఁగోయు, తెగఁజూచు, తెగఁబడు, తెగఁ
బాటు, తెగఁబాఱు, తెగనాడు, తెగవ్రేటు,
తెగవ్రేయు, తెగించు, తెగింపు, తెగిపోవు,
తెగుడు, తెగుదల, తెగుదారి, తెగుదెంపు,
తెగుబడి, తెగువ, తెగువడు, తెగువరి.

తెగుడు. వి. (√తెగు.) తెగుట. (శ. ర, బ్రౌ).
(చూ. తెగువడు.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తెగుదల॰ వి. (√తెగు) అంతము, ముగియిక.

గీ. ఈమనోగ్లాని తెగుదల యెద్ది చెపుమ. నిర్వ. ౯. ౫3.

గీ. రాత్రి తెగుదల దిన మేల రాక యుండు, దినము తెగుదల రాత్రి యే తేరదన్న. భార. అర. ౫. 3౪౦.

తెగుదారి॰ విణ. (తెగువ+దారి- అంత్యవర్ణలోపము.)

౧. సాహసికుఁడు; సాహసికురాలు.

చ. ధను వెడఁబాసి వచ్చు తెగుదారికి నా కిఁక వంత యేల ... ఉ. రా. ౬. ౨౪౦.

౨. దాత, వదాన్యుఁడు; వదాన్యురాలు.

చ. తలఁపఁగ నిప్పు డింత తెగుదారుల మైతిమి భద్ర నావుడున్. ప్రభా. ౧. ౧౦౨.

లయగ్రాహి...సగరాన్వయమువారి కమృతం బ, వ్వారిగ నొసంగు తెగుదారి నిజభూరితరవారితరవారిముఖదారితబుధాంత, రైవరిన్ ... రామా. ౫. ౨౧.

తెగుదెంపు॰ వి. (తెగు+తెంపు) ౧. సాహసము, తెగువ.

ఉ...అత్తఱిఁ జిత్తిని చిత్తవీథిలో, ధీరతఁ బూని లేని తెగుదెంపు వహించుచుఁ బల్కె నల్కతో, నేరము లేనిదానికరణిన్...శుక. ౨. ౧3౦.

౨. తీర్పు, పరిష్కారము, నిర్ణయము.

మ. యమసూనుం డనుఁ గృష్ణుఁ జూచి బక దాల్భ్యవ్యాసకణ్వాదిసంయము లుండం దెగుదెంపు సేయ కిటు లేలా వారిఁ బొమ్మం టివి...జై. భా. ౮. ౨౧౦.

3. పర్యవసానము, ఫలము.

క. నాతో డని నన్నడుగుట, యీ తెగుదెంపునకు ముగిసె నిఁక నే మనుచున్, రాతిశొడు కతఁడు హాలసం,జాతకిణాశాలికతిన శయమునఁ జటిచెన్. వేం. పంచ. ౪-౪౨౭.

తెగుబడి॰ వి. (√తెగు). ౧. తెగుట. ౨. దుక్కి 3. అమ్మకము. (శ. ర, ప్రా.)

తెగువ॰ వి. (√తెగు). ౧. సాహసము.

క. వగవఁగ నేటికిఁ బార్థుఁడు, దెగువకుఁ జొరకున్న భీష్ముఁ దెగఁజూచి వెసం, బగ యడఁగించెద ...భార. భీష్మ. 3. ౨౫3.

గీ. తెగువ మీఱి ప్రతిజ్ఞ సాధింపఁడేని, జ్ఞాతి జయ మందఁడేని తజ్జనుఁడు జనుఁడె. కాశీ. ౧. ౧౦౭.

ఆ. జగతి నీమనంబు తెగువయే దేవేంద్రపదవి యనెడుసుద్దిఁ బొదలఁబోలు. శుక. ౧. ౭౨.

౨. ఔదార్యము, దాతృత్వము. (శ. ర.)

3. నిశ్చయము, నిర్ణయము, ఏర్పాటు.

గీ. ఇవ్విధంబునఁ దమతమరెఱుఁగు తెఱఁగు, లందఱును జెప్ప విని కురునందనుండు, దగ విచారించి కార్యంబు తెగువ గాంచి, యెలమి వారలఁ గనుఁగొని యిట్టు లనియె. భార. విరా. 3. ౧౧౨.

వ...యుధిష్ఠిరుండు దమ్ములతో నెట్టకేలకుం దెగువ సెప్పి ...భార. ఉద్యో. ౪. ౯౪.

౪. తెగెడుశక్తి, వాఁడి, పదను.

(చూ. తెగువరి.)

(వ్యవ.) ఆకత్తికి మంచి తెగువ కలదు.

తెగువడు॰ అ. క్రి. (తెగుడు+పడు- శ. ర.) వేఱుపడు, విడివడు.

క. మృగమును గాకము నెలుకయుఁ, దెగువడి కచ్ఛపముపోక తేటపడిన ... నా. పంచ. ౨. ౨౧3. (శ. ర. 'తెగపడి' ముద్రి.)

తెగువరి॰ విణ. (తెగువ+అరి3.) ౧. వాఁడిగలది.

౨. దానశీలము; దాత.

చ. తెగువరి వై చెలంగు భవదీయకృపాణము వైరి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కోటియం, దగణితదానకేళిరత మయ్యును జీవన మీ దటన్న లోభగుణము లేమికింబ లె విపక్షనృపాలుర కెల్ల జీవనం, బొగిఁ ద్రుణ వృత్తి నిచ్చు విజయోన్నత శ్రీనరసింహభూ వరా. నరస. ౨. ౮౮. (రెండర్థములకు నిదే యుదాహరణము.)

3. సాహసికుఁడు; సాహసికురాలు.

క. తగ వెఱుఁగ లేక యిటువలెఁ, దెగువరి వై ప లుక నీక తీరెనో...చంద్ర. ౧. ౧౪౨.

తెచ్చిపెట్టు. స.క్రి.(తెచ్చి+పెట్టు.) కావించు; కల్పించు.

వ...రుక్మిణ్యాదు లగుమహిషు లెనమండ్రకు వేర్వేఱ యనురూపగృహంబులమర్చి యన్ని టికిం ద్రిదివసదనంబునం గలయొప్పిదంబు లెల్లఁ దెచ్చిపెట్టి...హరి. ఉ. ౮. ౨౧౧.

క. ఉమసేవ యేను సలిపెదు, సమయంబునఁ గ ర్తృక ర్మసాధనవైగుణ్యము లేమి గలిగె నో యి, ట్లమితవ్యథఁ దెచ్చిపెట్టె నాయమ నాకున్. ప్రభా. 3. ౪3.

తెచ్చు. స. క్రి. ౧. తీసికొనివచ్చు; రప్పించు. (దీనికి 'తేమి, తేరమి, తేక, తేరక, తేన్, తేరన్, తెచ్చుచున్, తెచ్చుచుఁన్, తెత్తును, తే, తెమ్ము, తెండు, మున్నగురూపములు సిద్ధించును.)

ఉ...వ్వారిచ్చుటనుండి యీక్షణమ యేఁగిరి కానకుఁ బండ్లు దేర మీ,వచ్చు పెటెంగి కేని జనవల్లభ వారును వత్తు రింతకున్. భార. ఆది. ౮. ౨౭.

క. పొడువునఁ బ్రాయంబునఁ గడుఁ, గడిఁది బలం బునను జూడఁగా నసదృశు నీ,కొడు కని యీతని నెంతయు, నెడమడుఁగుగఁ జూపఁ దెత్తె యిందఱు నగఁగాన్. భార. ఆది. ౮. ౧౦౦.

ద్వి. తే నారచీరలు దేవి నా కనిన...రం. రా. అయో. ౧౧౧ పొ. ౧౪ పం.

గీ. ఒజ్జలగృహంబునకుఁ బోయి యుత్పలాక్షి, వడుగు సేయంగ వలెఁ బిన్నవానిఁ దెమ్ము. హర. ౨. ౧౦౨.

చ. కుసుమరసంబు దెండు వలిగొజ్జఁగి నీరము దెండు తెండు సా,రసబిసరాజి...కను. 3. ౧౧౧.

గీ. ఇంక నెదుటికిఁ దేకుఁడీ యింతులార. ఇందు 3. ౪౨.

ఆ. చిట్టి మేడికాయ చెంచలి వంకాయ, గాని మంచికూరఁ దేను...జై. భా. ౪. ౯౬.

ఉత్సాహ...ఈక్షణంబ యేఁగి పాం,చాలుఁ బట్టితెత్త మధికశౌర్యలీల మెఱయఁగా. భార. ఆది. ౬. ౬౨.

ఉ. పిచ్చుకగుంటుమీఁదఁ గృపపెంపున నామ రలోకవాహినిం, దెచ్చితి గా నగారి జగతిం గృతి నైతి భవత్ప్రసన్నతన్. వసు. ౨.౨౦.

౨. కలిగించు, కావించు; కల్పించు.

(కల్పించు అనునర్థమున 'కొను' ధాతు వను ప్రయుక్తమై యుండును.)

క...దు, ష్టాచరిత మైనజపవిధి, నాచెప్పినసుగ తిఁ దేదు నరకము దెచ్చున్. భార. శాం. ౪. ౧3౧.

ఉ. మెచ్చి యొకింత గౌరవము మెచ్చకయుండి లఘుత్వలేశమున్, దెచ్చుటకున్ సమర్థులె కృతిక్రియకున్ గుకవిత్వగర్వితుల్. కళా. ౧. ౪. శుక. 3. ౨౧.

గీ. చనిన నయ్యేలనాఁగయు సంభ్రమంబు, దె చ్చికొని తా నెఱుంగ నితెఱఁగు దాల్చి. భార. విరా. ౨. ౧౨౫.

సీ. ఇంతయుఁ దెలిసియు నే మీఁదు గానక తివిరి యూరక యింత దెచ్చుకొంటి. జా హ్నవీ. ౪. ౯౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

3. సంపాదించు, ఆర్జించు, గడించు.

క. తేరక యుండఁగ జేరుం, దేరంగాఁ బోలియు విధియధీనంబులు గా, కారయ విత్తంబులు పురు,పారంభాయ త్తములె మహాబుద్ధినిధీ. భార. శాం. ౪. ౩౭౩.

సీ. వండలేనక్కఱకు వగపులు బలుమెండు తేనే రనన్నకుఁ దిండి మెండు. రామలిం. ౧౭.

౪. తాల్చు, వహించు.

క. క్రోధము తపతపములకును, బాధక మగు టెఱేఁగి దివిజభామలపై న,మ్మేధా త్తకు లోకయింతయుఁ, గ్రోధము దే శైరి సత్వగుణ సంగతు లై. భాగ. ౨. ౧౩౦.

ఉ...ఓనిఖిలపావన యంచు నుతించుఁ గాని తాఁ, గన్నుల నీరు తేఁడు భయకంపసమేతుఁడు గాఁడు భూవరా. భాగ. ౭.౧౯౩.

శా...కంసుడు దొడిక హింసించె నీయన్నలం, గంటం గూరుకుఁ దేఁడు... భాగ.౧౦ పూ. ౧౨౪.

౫. చేర్చు, కూర్చు.

ద్వి. కూటువమూఁకలు పాటియై కూడ, చాటించి తెచ్చినసభలును సభలె. పండితా. వాద. ౧౭౬ పొ.

౬. చెల్లించు.

క. ర మ్మను మిచ్చటి కిదికా, ని మ్మని యనకున్న నగర మేలెడుదొర దా, నెమ్మదిఁ గనలుచు దండుగఁ, దె మ్మనినన్ సెట్టి యేడఁ దెచ్చు న్వేఱతుక. శుక. ౨. ౨౧౭.

(వ్యవ) దివ్యచి త్తమునకు తేవలెను.

వేదాంతబోధములు అనుభవములోనికి తెచ్చుకోవలెను.

వాని సెట్టులో కష్టపడి త్రోవకు తెచ్చినారు.

ముందైనను బుద్ధి తెచ్చుకొని బ్రతుకుము.

జః తెచ్చిపెట్టు, తెచ్చుకొను, తెచ్చుకోలు, తెప్పించు.

తెచ్చుకొను. స. క్రి. (తెచ్చు+కొను—స్వార్థమున) తాల్చు, వహించు.

ద్వి. అంత నాలలితాంగి యంతరంగమునఁ, గొంతధైర్యము దెచ్చుకొన్నది యగుచు. ద్వి. పరమ. ౫. ౪౦౩పొ.

తెచ్చు(చ్చి)కోలు. వి. (√తెచ్చుకొను) తెచ్చికొనుట, కలిగించుకొనుట.

చ...రెండుదెఱంగులందు నొప్పనియది లేదు డాఁగ నగుఁబాటును బ్రాణముచేటుఁ దెచ్చుకోల్. భార. శల్య. ౨. ౬౨.

విణ. (వృ త్తియందు చివరయచ్చునకు లోపము.)

తెచ్చిపెట్టుకొన్నది, సహజముకానిది,కల్పితము.

ద్వి. నొచ్చియు వాఁడు తనూర క్తధార, పిచ్చిలఁ దెచ్చుకోల్బీరంబు మిఱు. రం. రా. అర. ౧౬౬ పొ. ౨౭పం.

చ. వలిచనుగుబ్బ లూఁతగొని వా తెఱఁ గ్రోలుచు నెత్తి కౌఁగిటక, మెలపుచుఁ గొంతసేపు తమి మించఁగఁ గేళి ఘటించి తెచ్చికో,లల యిక నూరకొన్న జలజాక్షునిచి త్త మెఱింగి గోపికల్. దశా. ౯. ౩౩౩.

క. రమణీ యాధూ ర్తచకో,రముకథ యిఁకఁ గొంత గలదు రాజవియోగ,భ్రమ మడఁచి తెచ్చికోల్నై,య్యముతోడుత నైన విను మటంచుం బలికె. శుక. ౩. ౪౭.

తెట్ట. వి. తిట్ట, రాశి; సమూహము.

ద్వి. సెట్టనఁ గరవాలనిష్ఠురహతులఁ, దెట్టలై నడుములు తెగి పడ్డవారు. రం. రా. ఉ.౧౬ పొ. ౧౨ పం.

క. చుట్టును బసరపుటెమ్ముల,తెట్టలఁ జూచినను మదికి దిగు లయ్యెడు...వా ల్మీ. ౨.౯౬.

మ...పిట్టతెట్టరొద సన్నగ సుద్దు గావింపుచుక. చంద్రా. ౨. ౧౦౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తెట్టగిలఁబడు. అ. క్రి. (తెట్టగిలన్ + పడు - స్వార్థమున.) బడలు, అలయు, నిస్సత్త్వమగు.

వ...అత్తతి దత్తతిల్లి చిట్టాడినగుట్టున నెట్టనం దెట్టగిలంబడి వసుధేశుండు సుప్రలాపవిప్రలాపంబుల నిట్లనియె. సారంగ. ౨. ౧౬౯.

వ...వెండియు హృదయగుహామోహాంధతమసంబు బయలు మెఱసినట్టు గనుపట్టఁ బట్టరానిగుట్టున నెట్టనం దెట్టగిలంబడి యారాపట్టి...ఇందు. ౩. ౧౧. (దిట్టగిలంబడి. ముద్రి.)

తెట్టగిలు(ల్లు). అ. క్రి. ౧. బెసుకు, పైకి కనఁబడు.

వ...పరస్పరదర్శనోద్యోగవేగంబులం బుట్టి బెట్టు నిట్టూర్పుగాడ్పులం గొట్టుపడిన నెట్టకేలకుం దెట్టగిలిన నెట్టన మొగంబులు చూచుకొని...రాధికా. ౪. ౯౬.

సీ...యంచలు గొంత,సరి గడవఁగఁ బాఱి మరలి బోరలు తెట్టగిల నొక్కకడ వంచి మలపు దిరిగి. ప్రభా. ౨. ౪౨. బిల్హ. ౨. ౧౪౯.

౨. అలయు, బడలు, నిస్సత్త్వమగు.(చూ. తెట్టగిలఁబడు.)

జః తెట్టగిలఁబడు.

తెట్టతెన్ను=తెట్టతెరువు. (తెన్ను + తెన్ను.)

తెట్టతెరువు=తెట్టతెన్ను. వి. (తెరువు + తెరువు) నడివీథి. (శ. ర. బ్రౌ.)

తెట్టతెఱవామెకము.వి. (తెఱచు + తెఱచు + వాయి + మెకము) సింహము.

వ...అని వనిం జుట్టుకొని తెట్టతెఱవామెకంబులఁ గొట్టి తుట్టలుగాఁ బెట్టి ...రా. వి. ౩. ౬౫. (తెట్టతెరువుమెకంబుల. ముద్రి.)

తెట్టె. వి. ౧. లొట్టి, కల్లుదీయుటకు చెట్టునకు తగిల్చెడిబుడ్డి.

వ...మఱియు నుత్తాలంబు లగు తాలంబులం గిరాతజాలంబులు గీసి మోసులం గట్టిన తెట్ల కెగనుతికియందుల నుప్పతిల్లుకల్లు...చంద్రా. ౨. ౯౪.

౨. కలశాకారముగా నుండుబొగడ.

చ. చికిలికడానిజీనిపనిచిత్తరపుత్తడు లూడి కెంపుపొంది కలిడ మానికంపునునుఁదెట్టులపట్టెలు పట్టుపట్టెయున్, జెకడపుఁగోళ్ల మెప్పుజిగిచిప్పిలుచప్పర మొప్పుళయ్యయం,దొకట నసంతభోగగతి నొందఁగ నందు ముకుందుఁ డున్నెడన్. ముకుంద. ౩. ౩౧౪.

తెట్టియ(ట్టె) వి. (√తెట్టు. త. తిట్టె, తిట్టు) ౧. ఇసుకదిబ్బ, తిప్ప.

ఉ. దట్టముగా ధరాధరవితానము లొడ్డుచు మీఁద మ్రాఁకులున్, మట్టలు వైచి కప్పుచు సమస్థలి చేయుచు సూత్రమోజకుం, బట్టుచుఁ దెట్టియల్ దరులు బల్పుగఁ జేర్చుచుఁ గట్ట రాపడన్, మట్టుచు యోజనార్ధశతమాత్రము గట్టిరి నాఁడు వానరుల్. భా. రా. యు. ౨౭౨.

౨. తృణకాష్ఠాదిభారము. (శ. ర.) ౩. రాశి; సమూహము.(ఇది తఱచుగా బహువచనముగనే ప్రయోగములందు కనఁబడుచున్నది.

సీ...పిండు మొత్తము తెట్టె పైకము దాఁటె లొద్ద. గీ. తుటము మొల్లము మొల్లమి తుట్టె వర్గు, వనఁగ వర్గము తగు...ఆం.భా. ౨. ౧౦౦.

గీ. పుట్టములు దెట్టెలుగ నిచ్చి చుట్టములకు, బట్టులకుఁ బేదలకుఁ గోరినట్టు లొసఁగి. అచ్చ. రా. యు. ౫౭౨.

౪. తేనెపెర, తేనెపట్టు. (శ. ర, బ్రౌ.)

౫. పాలమీఁదిమీఁగడవలె కొన్నిద్రవ్యములపై నేర్పడి తేలియుండుపదార్థము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(వ్యవ) తెట్టె తీసినబెల్లముతో చేసినమిఠాయి తెల్లఁగా నుండును.

**తెట్టు.** అ. క్రి. ౧. గాలిచే తృణాదికము నీటిపై నొకచోటికి చేరు.

సీ. తరఁగల నానాఁటఁ దఱచుగా నొక్కెడఁ దెట్టినము త్తెంపుదెట్టు పనఁగ. వాల్మీ. ౧. ౬.

౨. చేరు.

చ. తరువులు చుట్టుచుం బుజము తట్టుచుఁ బూఁ బొదరిండ్లఁ దెట్టుచుక్. బహు. ౨. ౨౪.

వి. (= తెట్టు పు—తె. తెట్టు) ౧. ఏనుఁగులు దెబ్బ లాడకుండ నడుమ ఎత్తుగా కట్టినకట్టడము.

క. బిట్టురవడి నూతేనుఁగు, లిట్టలముగఁ బోర వరుణుఁ డెప్పుడు నడుమం, గట్టించినతెట్టన నీ,కట్ట సెలంగెడును బారికాంక్షిప్రవరా. వాల్మీ. ౨. ౯.

౨. ఆవరణము, కంచె, కంపకోట.

సీ. కంపతెట్టులును రాకట్టుముంగిలి మల్లెసాల దేవరయఱచవికె యొకటి. శుక. ౨. ౪౦౭.

ద్వి. తెట్టుపై మూతులు వెట్టి యన్నగరి,చుట్టు ను వాచర్చుశోకంబు లడర. బస. పు. ౪. ౭౨౦.

౩. రాశి, ప్రోగు, సమూహము.

ద్వి. మఱునాఁడు దాఁ జని మత్స్యనాథుండు, గుఱుకొని వసియించుగుహవాత సిండఁ,బెను రాళ్లు తెట్టుగాఁ బెట్టి చాలించి, చనక నిశ్చ లభక్తిఁ జనుదెంచి యరసి. నవ. ౨. ఆ. ౧౪౧ పా. ౧౫౦.

చ. గొడుగులు దప్పఁబట్టినను గోటగ సేనిక తెట్టు వెట్టినన్, బడుగులు మీరు చూడ హరి పాపటపై నడిదంబు వెట్టుదుక్. ఉ. హరి. ౪. ౨౦౭.

జః త్రెట్టియ, తెట్టువ, లెట్టువగట్టు, తెట్టువగొను. తెట్టువు, తెట్టెగట్టు, తెట్టెలుగొను, తెట్టె లు పెట్టు.

**తెట్టువ**= తెట్టియ, తెట్టు. వి. (√ తెట్టు) సమూహము.

లయగ్రాహి. పొట్టలును జట్టలును బిట్టు పగిలించి బలుజెట్టులను నొంచి జముపట్టునకుఁ బోవన్, బెట్టి కడు నేనుఁగులలొట్టియలతట్టు వలతెట్టువలఁ గొట్టుటయుఁగట్టలుకతోడన్. అచ్చ. రా. యు. ౧౬౯.

వ... మొగుళ్ల తెట్టువలలో మఱుఁగుపడి...ఉ. రా. ౩. ౪౭.

౨. (= తెట్టియ, తెట్టె ౫ అర్థము.) తెట్టె, నీటియందు గాలి కొకప్రక్కచేరినతృణాదులసమూహము.

గీ. అంచితోద్యానవాటికలందు నవవి,భాతి విదళితకుసుమవిభాతి యమరె, నప్పు డరయంగఁ జంద్రకరాబ్ధివెల్లి, డొంకి చనఁ దోఁచునురువు తెట్టువ లనంగ. నృసిం. ౩. ౧౧౦.

చ. ఇరువలఁ జంకలం దిటికి యే పెసలారగఁ బాహుపీడన, స్ఫురణ నొగిల్చి పెల్చఁ దెగఁ జూచి జలంబులలోన వైచినం, దరళతరంగ జాలములతాఁకునఁ దత్తనుయుగ్మకంబునం, దొరఁగుచుఁ జేర్చి క్రొమ్మెదడు తోరపుఁ దెట్టువ గట్టె నయ్యెడన్. హరి. పూ. ౫. ౨౬.

౩. స్థానము.

గీ. అంగజవ్యాధిఁ గడు పుబ్బినట్టివిటుల, యాత్మ జలపూరముల తెట్టు వల్లపట్టు, హేయభాజన మెన్నిట నెన్ని చూడ, వేశ్యజన్మంబు జన్మ మే విప్రవర్య. వైజ. ౨. ౪౫.

**తెట్టువ(లు)గట్టు.** అ. క్రి. (తెట్టువ + కట్టు). ౧. తెట్టెకట్టు, నీరు మొదలగువానియందు తృణాదికము గాలికొకప్రక్కకు చేరు.

సీ. క్ష్మాధరోత్తుంగశృంగవిఘట్టనమునఁ జుక్కలు రాలి తెట్టువగట్టె ననఁగ. వరాహ. ౪. ౬౧.

వ... చతురంగంబులయవయవంబులుఁ జామర చ్ఛత్రకేతుశకలంబులుఁ గోదండాదిహేతి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఖండంబులుం గీడ్చెరసి పాలు నెత్తురుటేఱు
లఁ దెట్టువలుగట్టె...భార. ద్రో. ౪. ౨౯౪.

చ. అమితసువీర్యవార్ధు లిల నప్పటి కప్పటి కుద్భ
వించుచుఁ... మేఘము లనయంబు దెట్టువ
లుగట్టి కెలంకులఁ జేరె...కు.సం. ౯. ౩౭౪.
(తెట్టువు. ముద్రి.)

సీ. మునివరదత్తార్ఘ్యములఁగు శాశ్వతములు తెట్టు
వల్ గట్టినతీరములను. హరి. పూ. ౭. ౬.

౨. పుంజీభవించు, ప్రోగుపడు, దట్టమగు.

సీ. బెట్టుగాఁ దెట్టువల్ గట్టి పైపై సెకల్ జల్లు
నిట్టూర్పులజాడఁ జూచి.రాజ.చ.౩.౧౪౬.

తెట్టువ(లు)గొను=తెట్టువగట్టు. అ. క్రి. (తె
ట్టువ+కొను) ౧. నీరు మొదలగువాని యందు
గాలికి తృణాదికము ఒకప్రక్కకుఁ జేరు.

వ...తెరలిపాఱురక్తంబులును దెట్టువలుగొన్న
మాంసంబులును దెట్టెలుగట్టినయసిశకలంబు
లును...కళా. ౮. ౧౨౩.

౨. తెట్టువలుకల దగు.

(వెన్నెలలు) వ...తనుకరువలిం గదలువిరులం
దొరఁగుపుష్పాడితిప్పలం బొరలి తెట్టువ
గొంచు...పారి. ౨. ౭౨.

తెట్టువు=తెట్టు. వి. (√తెట్టు) ఆవరణము, కంచె,
కంపకోట. (శ. ర. బ్రా.)

తెట్టె(లు)గట్టు=తెట్టువలుగట్టు. అ. క్రి. (తెట్టె
+కట్టు) ౧. రాశిపడు, ప్రోగుపడు.

వ... తెరలిపాఱురక్తంబులును దెట్టువలుగొన్న
మాంసంబులును దెట్టెలుగట్టినయసిశకలంబు
లును జూపఱకు నద్భుతభయానకబీభత్సర
సంబు లావహిల్లఁ జేసె...కళా. ౮. ౧౨౩.

౨. ద్రవద్రవ్యములపై తెట్టెగా నేర్పడు.
(వ్యవ) సిరా తెట్టెగట్టినది.

తెట్టెము=తెట్టె, తెట్టియ. వి. మొత్తము, సమూ
హము.

ఉ. క్రమ్మి నిశాచరుల్ సురనికాయములన్
వడిఁ దాఁకి వీఁక వ్యాలమ్ముల తెట్టెముల్ వ
ఱుప నడ్డమువచ్చి జయింతు నంద్రు...భాగ.
౧౦ పూ. ౧౦౫౬.

తెట్టెలుగొను=తెట్టెలుగట్టు. అ. క్రి. (తెట్టె
లు+కొను) రాశిపడు, ప్రోగుపడు.

వ...నెట్టుకొని సెలకట్టియల వైచిన నిట్టట్టు
గదలక తెట్టెలుగొనం గూలినకాలుబలంబు
లును ...ఉ. హరి. ౩. ౨౭.

తెట్టెలుపెట్టు. అ. క్రి. (తెట్టెలు+పెట్టు) తెట్టె
లవలె దట్టముగా నేర్పడు. చిక్కనగు, సాంద్ర
మగు.

చ. స్ఫురణ మొగిళ్లపై మొదలఁ బొల్చి జల
స్రుతి నాఁడునాఁటికిం, గరఁగుచుఁ బుట్టు
చుండుమణికార్ముకరక్తిమ యెల్ల వెల్లిఁ గె,
న్నురువులు గట్టినట్టులు గనుంగొన నయ్యె
సురేంద్రగోపముల్, గరఁగినవింటియప్పసరు
కైవడిఁ దెట్టెలుపెట్టుపచ్చికన్. ఆము. ౪.
౧౦౦.

తెడ్డు=త్రెడ్డు. వి. (సం. తర్దూః. త. తుడుప్పు.)
౧. కొయ్యగరిటె.

క. గేహముల కేఁగి భిక్షాం,దేహి యనన్ వీట
నొకపతివ్రతయైనన్,సౌహార్దంబునఁ దెడ్డెం,
డాహారము పెట్టదయ్యె నాదినములలోన్.
భీమ. ౨. ౯౩.

౨. పడవ నడపుట కుపయోగించు సాధనవిశే
షము, అరిత్రము.

సా: తెగించినవానికి తెడ్డే లింగము.
తెడ్డుండఁగా చేయి కాల్చుకొన్నట్లు.
తెడ్డునాకి ఉపవాసము చెఱుపుకొనినట్లు.

ఉ... నేఁ, డొచ్చెల శూద్రభామినికి నువ్విడు
లూరి పథంబు దప్పఁగా,వచ్చునె తెడ్డు నాకి
యుపవాసము మాన్పికొనంగ నేటికిన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విక్ర. ౧. ౧౫౦.
జః తెడ్డుమూతికొంగ.

తెడ్డుమూతికొంగ. వి. (√తెడ్డు)- తెడ్డువంటి మూతి గలకొంగ- జలపక్షివిశేషము, ఒకానొక నీటిపిట్ట. (శ. ర, బ్రా.)

తెత్తెర. వి. పానపాత్రము.
ద్వి. పూజకుండల నించి పూఁచినమధువు,రాజి లుకైపుసారాయితెత్తెరలు. రం. రా. సుం. (చి. ని.)

తెనమణు. అ. క్రి. శయనించు, పరుండు.
క. తత్తోకటియుఁ గొని తెనమణి, యుత్తర ముత్తర మటంచు నొకప్రొద్దుకడన్. ఆము. ౬. ౭౨. (చి. ని. శ. ర—"త్రేణిమతి" వేదమువారి పాఠము.)

తెని(లి)ఁగించు. స. క్రి. తెలుఁగుసేయు, ఆంధ్రీకరించు.
క. మును సంస్కృతములఁ జేటగఁ, దెనిఁగించెడి చోట నేమి దెలియకయుండన్, దనవిద్య మెఱయఁ గ్రమ్మఱ,ఘన మగుసంస్కృతముఁ జెప్పఁగా రుచి యగునే. రామా. పీఠి. ౧౬.
క. భారవిభట్టు రచించిన, భారవి యనుకావ్య మవనిఁ బ్రఖ్యాతిగ నే, నారూఢిని దెనిఁగించెద, ధారుణి నాచంద్రనిత్యతారార్కముగాన్. అచ్చ. భా. ౧. ౧౪.

తెనుఁగు(న్గు)=తెలుఁగు. (శ్రీశైలము, దక్షారామము, కాళేశ్వరము ఈమూఁడుశైవస్థలములకు నడుమనుండుదేశము. ఈదేశమున వ్యవహరింపఁబడుభాష.దీనిప్రకృతి 'త్రిలింగః'. ప్రాకృతము 'తెలింగో'. లాంగలి- నాఁగలి, తోల-తోన, అయినట్లు తెలుఁగుశబ్దమే వర్ణవికారముచే తెనుఁగైనది. కవిసంశయవిచ్ఛేదకర్త ప్రకృతులలోని 'ల'కారము వికృతులలో 'న' అగునని చూపుట కిచ్చినయుదాహరణములలో "త్రిలింగః, తెనుఁగు" అనునది ఒకటి. ఇది లక్షణగ్రంథకర్తలసిద్ధాంతము. బ్రౌను ఈసిద్ధాంతము నంగీకరింపక 'తెన్' అనుతమిళపదము మూలపదముగాఁ దీసికొని "తెన్=దక్షిణము, తెనుఁగు=దక్షిణదేశపుభాష" అని వ్యుత్పత్తి చెప్పినాఁడు.) ఆంధ్రభాష.
క. జననుతకృష్ణద్వైపా, యనమునివృషభాభిహితమహాభారతబం, ధనిరూపితార్థ మేర్పడఁ, దెనుఁగున రచియింపు మధికధీశక్తిమెయిన్. భార. ఆది. ౧. ౧౬.
ఉ. మున్ను తెనుంగుఁగబ్బముల ముజ్జగము ల్పొగడంగఁ గూర్చి...నీలా. ౧. ౯.
జః తెనిఁగించు, తెనుఁగుపడు, తెనుఁగుపఱుచు, తెనుఁగువాఁడు.

తెను(లు)ఁగుపడు. అ. క్రి. (√తెనుఁగు) తెనుఁగుభాషలోనికి మార్పఁబడు, ఆంధ్రీకృతమగు.

తెను(లు)ఁగుపఱుచు. స. క్రి. (√తెనుఁగుపడు.) తెనుఁగుభాషలోనికి మార్చు, ఆంధ్రీకరించు.
క. ఇది తత్త్వరహస్యార్థము, పదసంగతిఁ దెనుఁగుపఱుపఁ బ్రాజ్ఞులకును బెట్టిద మగు...వాసిష్ఠ. ౧. ౧౧.

తెను(లు)ఁగువాఁడు.వి(√తెనుఁగు)ఆంధ్రుఁడు.
సీ. ఆంధ్రుఁ డొఁ దెనుఁగువాఁ డనఁ దెల్గువాఁడన...ఆం. భా. ౨. ౧౦౩.

తెన్ను • వి. ఔ. అనా. ౧. దారి,మార్గము.
ఉ. తెన్నున కేను గా దనను దేవర మాయస మిజ్జగంబునం, దెన్నటికిం దిరం బగు...యయా. ౩. ౩౨.
ఆ... తెరవు ద్రోవ దారి తెన్ను సరవి. ఆం. భా. ౨. ౪.
౨. విధము, రీతి, ప్రకారము.
సీ. విసమును జేకొద్ది మెసవి త్రేఁచెడువాఁడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దీని కన్నంబు నేతెన్నఁ బెట్టు. పార్వ. ౪. ౯౭.

వా: ఎవరి తెన్ను వారు వెళ్లినారు.

జ: తెట్టతెన్ను.

తెన్ను [2]. వి. కుష్ఠరోగము.

సీ. మార్గకుష్ఠంబులు మనుచుండుదెన్నునా... ఆం. భా. ౩. ౫౫.

తెన్నుండు=తెండు, తేఁడు. అ. క్రి. పరుండు, శయనించు.

సీ... పన్నుండెఁ దెన్నుండెఁ బవ్వళించె. వేంక. మాన. ౪౫. (తొన్నుండు.ము ద్రి.)

వ... ఉదకంబులు నగక నిలుచుండక మాటలాడక వెలిఁజూడక వంగక తెన్నుండక వేగిర పడక... చప్పుడుగాకుండ ప్రాశించునది... కాశీ. ౫. ౨౦౧.

ఆ. నీరినడుము దెంప నేలఁ దెన్నుండి చే,వెల్వఁగలియుఁ ద్రచ్చి వెన్నగొనఁగ. కు.సం. ర. ౧౩౫.

తెప్ప [1]=తేప. వి. (క.త. తెప్ప) ౧ ఉడుపము, తేటిక; నాక.

చ. అన విని దేవకీతనయుఁ డాతని కిట్లనుఁ జెప్పినంతకం,బెను మిగులంగఁ జేయుదు గడిందిమగండవు నిన్నుఁ దెప్పగాఁ, గొని... భార. ఉద్యో. ౩.౬౮. (తేపగా - పాఠాంతరము.)

మ... అంజనాపుత్రుఁ డర్క,బలు తెప్పన్ గొని కాదె దాఁటితి విపత్పాథోధి... ఉ.రా.౫. ౭ర. సుద. ౫.ర౯.

సీ. తేప నాఁ దెప్ప నాఁ దేటిక యనఁగను బ్లవనామధేయంబు పరఁగుచుండు. ఆం. భా. ౧. ౧౫౭.

సా: ఏఱుదాఁటి తెప్ప తగులఁబెట్టినట్లు.

౨. రాశి, ప్రోవు.

సీ. తెప్పలై నెత్తావికుప్పలై పుప్పొళ్లురల గందవొడి ప్రోవఁ జిలుకవలదు.వసు.౧.౧౪౧.

సీ. కరువలి నెగసి యుప్పరముగ నొప్పుపుప్పొడితెప్ప యుల్లెడపాలుపు గాఁగ. ఘటికా. ౧. ౬౫.

౩. మెరక ప్రదేశము, మిట్ట నేల.

సీ. సెలయేఱులందలి తెలినీటఁ దనుపుసాంపెల సినగిరుల తెప్పలకుఁ జేర్చి. భార. శాం. ౩. ౩౩౨.

జ: తెందెప్ప, తెప్పగట్టు, తెప్పదెరలన్, తెప్పలఁదేలు, తెప్పలఁదేలుచు, తెప్పలుగ.

తెప్పగట్టు. అ. క్రి. (తెప్ప [1] + కట్టు) అతిశయించు, మిక్కుటమగు.

సీ. చప్పరింపఁగ జాతి తెప్పగట్టుక పచ్చువిమలఫేనము సుధాసముదయంబు. చంద్రా. ౧. ౭౫.

తెప్పదెరల(గాఁ). క్రి. విశే.ద్రు.(తెప్ప [1] + తెరలన్-క. తెరళు)౧. బహుళముగా,అధికముగా.

క... గురుం, డప్పాండవబలములపైఁ, దెప్పదెరలఁ గురిసె శరతతిం దీవ్రముగాన్. భార. భీష్మ. ౨. ౩ర౧.

క. చేయఁగలరథికులును రా,ధేయుఁడు బలయుతముగాఁగఁ దెప్పదెరలఁ బై, నేయుపయిఁ గవిసి బహువిధ, సాయకములు గురిసి రథికసంరంభమునన్. భార. ద్రో. ౫. ౧ర౦.

౨. అతివేగముగా.

క. బిందానుబిందు లేక,స్యందనగతులై కడంగి సైన్యంబులు దాఁ,రుం దెప్పదెరల నాసం, క్రందనసందనునిమీఁదఁ గవిసిరి గడిమిన్. భార. ద్రో. ౩. ౧౪౩.

గీ. తెప్పదెరలంగ బండు లేతెంచుచున్న, యవి మహాత్మ... భార. అను. ౪. ౩౧ర.

తెప్పఱు=తెప్పిఱు. (క. తెప్పఱు.)—మూర్ఛాదులనుండి— తేఱు, స్వస్థతనొందు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క...అనలుఁడు మైమఱచి పడియున్నసఖుఁ డె,
ప్పుడు నొయ్యన వీఁచె నపుడు పవనుఁడు
నెమ్మిజె. కు. సం. ౧౦. ౩౮౨.

తెప్పలఁదేలు. అ. క్రి. (తెప్పలజె[1] + తేలు)
౧ ఓలలాడు, ఈఁదులాడు.

ద్వి. కమలతో వెస సోఁగకమలంబు లెత్తఁ,
బ్రమదాబ్ధిలోనఁ దెప్పలఁదేలుచుండ. రం.
రా. ఉ. ౧౯ పొ. ౯ పం.

ఉ...పూఁ, దేనియసోనవెల్లువలఁ దెప్పలఁదేలె
డుమేలిపల్కులజె. పాండు. ౪. ౧౧౨.

ఉ...చంద్రగుప్తుఁ డానందమహాంబుధిజె దిన
దినంబును దెప్పలఁదేలుచుండె...విక్ర. ౧.
౧౯౩.

౨. ఆనందించు, సంతోషించు, సంతుష్టినొందు.

ఉ. ఇప్పుడ మేలుకాంచెఁ బరమేశుఁడు సాగ
రకన్యకాంతతోఁ, దెప్పలఁదేలుచున్నతన
తీయపుచూపులనేని నొందుమైఁ, ద్రిప్పడు
...నృసిం. ౧. ౮౪.

ఉ...మరుత్తభూపాలునిచే మహీసురు లపార
సుదక్షిణ లంది తెప్పలం, దేలి...జై. భా.
౧. ౬౬.

తెప్పలఁదేలుచు(ల్చు). స. క్రి. (√తెప్పలఁ
దేలు) ౧. ఓలలాడించు, తేలుచు.

క. చెప్పెడి దేమె లతాంగీ, యప్పురుషోత్తముఁ
డు నన్ను నట్లు రసాబ్ధిం, దెప్పలఁదేలిచి
నిను విడ నెప్పుడు నని యూరడించి యెందే
నరిగెజె. కళా. ౬. ౨౬౪.

క. ఆవార్త లమృతలహరీ, భావంబునఁ గర్ణవీథిఁ
బ్రవహించి తన్నుప్లావనముచేసి ధరణీ,దేవ
కులాగ్రణిమనంబుఁ దెప్పలఁదేల్చెజె.విక్ర.
౧. ౧౭౮.

గీ. కంచిఁ దెప్పలఁదేల్చె నకాలవృష్టి. హర.
౨. ౨౨.

తెప్పలుగ(గా,గాఁగ) క్రి. విశే. ద్రు. (సం.
తృప్తిః)సమృద్ధముగా, అధికముగా, పుష్కలము
ముగా.

క. తెప్పలుగఁ జెఱువు నిండినఁ, గప్పలు పది
వేలు చేరుగదరా సుమతీ. సు. శ. ౨౦.

ఉ...పిలిపించి యిచ్చెఁబో,తెప్పలుగాఁ గరుల్
హరులు ధేనువులు...రాజ. చ. ౧. ౭౯.

క. అప్పుడు పువ్వులవానలు, తెప్పలుగాఁ గురి
సె...దశా. ౭. ౨౬౪.

శా...మా, పల్లెజె గోరిన వెల్లనుం గలవు తెప్ప
ల్గాగ నీ కిచ్చెదజె. కాళ. ౩. ౭౦.

తెప్పించు. స. క్రి.(√తెచ్చు). తేఁజేయు,తెచ్చు
నట్లుచేయు.

ఆ. తేరుఁ బూన్పఁ బంపు తెప్పింపు దృఢతను,
త్రాణము...భార. విరా. ౪. ౬.

గీ. మందరాద్రిని మోయించి మాధవుండు, పట్టి
తెప్పించె నిగ్గరప్రతతిచేత. హర. ౬. ౪౯.

ద్వి. దీనత రప్పించి దిగులు దెప్పించి. ద్వి. హ
రిశ్చ. పూ.౧౬౧౩ పం. (ఇట కలిగించి అని
భావము.)

తెప్పిర్లు= తెప్పిటిలు. (√తెప్పిలు)
(మూర్ఛనుండి తేలు.)

మ...దశశస్త్రం దంత మూర్ఛిల్లి యం,తనె తె
ప్పిర్లి యుగాంతకంతుహరదుర్దాంతక్రుధా
వంతుఁడై. ఉ. రా. ౩. ౩౫౩.

తెప్పిటిలు(ల్లు)=తెప్పిర్లు, తెప్పిలు.(√తెప్పిలు)
(మూర్ఛనుండి తేలు)

క. అప్పుడు సాందీపని మనచూ ప్పరయుచు
వచ్చి వానసోఁకునను వణికె, దెప్పిటిలుటఁ
గని ఖేదం,బుప్పతిలం బలికె నకట యోపటు
లారా. భాగ. ౧౦ ఉ. ౧౦౦౩.

తెప్పిలు=తెప్పిర్లు,తెప్పిటిల్లు, తెప్పలు.అ.క్రి. ౧.
(మూర్ఛ ఆయాసము దుఃఖము మున్నగువాని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నుండి) తేలు, స్వస్థమగు.

క. మతికొంత సేపునకుఁ దె,ప్పితి లేచి ముకుందు మేను పెద్దయునుం బ్రొ, ద్దితియం గౌఁగిటఁ జేర్చెం, బటివోయినతా ల్మి నూష్మబొవ్వము లురులన్. భార. మౌ. ౧౬౩.

గీ. మూర్ఛఁ దెప్పితి యిట్లని మొఱలువెట్టె. దశా. ౪. ౫౩.

క...హరు లి, త్తతి నీళులు ద్రావక తె,ప్పిఱ వె ట్లాకొ శత్రుసైన్యభీకరమూర్తి. భార. ద్రో. ౩. ౧౬౦.

క. చెప్పిన సప్పలుకులు విని, తెప్పితి సమ్మోద వారిధిం జంద్రముఖుల్, తెప్పలఁదేలిరి సె చ్చెలు, లప్పుడు పల్లవితహృదయలై తమలోన్. వరాహ. ౪. ౪౪.

౨. ఆదమఱచు, నిశ్చింతము గానుండు.

ద్వి. అప్పుడు భయ మించుకైనను లేక, తెప్పితి నిద్రఁ జెందినచంద్రమతిని. ద్వి. హరిశ్చ. పూ. ౨౧౯౦ పం.

౩. మేల్కొను, నిద్రనుండి లేచు.

గీ. వినుము నిద్రించి తెప్పిలువేళలందుఁ, దొడ రి కల లేమియును లేక యడఁగినట్లు. వాసి ష. ౨. ౫.

జ: తెప్పిర్లు, తెప్పిఱిలు.

తెప్పు. వి. తేలుట క్రిందఁబడుట కబళించుట మున్నగువాని కనుకరణము.

సీ. నీయాజ్ఞచే గిరుల్ నీటఁ దెప్పునఁ దేలెఁ గడఁక సముద్రంబు గట్టువడియె. సిం. నార. ౬౬.

గీ. వచ్చి యాత్మీయమందిరద్వారసీమఁ, దెప్పు నను మోపు వైచినచప్పుడు విని. శుక. ౨. ౩౪౬.

శా. ఎండన్ నెత్తి తపింప బట్టతలవాఁ డెండే నిలన్ నీడఁ గూర్చుండన్ దాళఫలజంబు క్రింది కరుగన్ బ్రోక్కంపమై దానియ,ప్పం డవ్వేళ నె తెప్పునన్ బయిఁ బడెన్... మల్లభూ. నీతి. ౨౪.

వ...వా విప్పి తెప్పున కబళించి చప్పరింపుచు నొప్పుపాడదుప్పలును... ప్రబంధ. ౧౨౬.

జ: తెప్పున.

తెప్పున. క్రి. విశ. ద్రు. (√తెప్పు.) తటాలున, శీఘ్రముగా.

ద్వి. తెప్పున నిద్రఁ గౌండినయటమీఁద, సప్ప ద్దలోచన యల్లన లేచి. ద్వి. హరిశ్చ. ఉ. ౧౯౫౯ పం.

ఉ. కావున నన్ను నిప్పు డధికం బగుసత్కృప మీఱఁ బ్రోవు మిం,దీవరనేత్ర నీ వనుచుఁ దెప్పున నాచరణద్వయంబుపై, వావిరి వ్రా లియున్న నిజవల్లభుమస్తము బాయఁ ద్రోచి నే, నావిభుదోషముల్ దలఁచి యప్పుడు పల్కితి నాగ్రహంబునన్. రుక్మా. ౪. ౧౧౭.

సీ. తిండికిఁ జేటుగాఁ బండితు లేల తెప్పున సెల విమ్మని పోరుచుండు. వేణు. శ. ౬౫.

తెబక. వి. (సం. స్తబకః) మొత్తము, సమూహ ము. (శ. ర, బ్రౌ.)

తెమడ. వి. ౧. శ్లేష్మము, కఫము. (చి. ని, శ ర, బ్రౌ.) ౨. చిక్కు.

వ...నెట్టికొని దగలు తొట్టినం బట్టి యీకలం దెమడ వెడలించి...కుచేల. ౪. ౨౯.

తెమలించు=తెమలుచు. స. క్రి. (√తెమలు.) (కదల్చు.)

వ...ఒకించుకయుం దెమలింపఁ జాలక...దశా. ౨. ౧౬౨.

గీ...శూలి, కాలివెనువ్రేలు దెమలించి కరము లెత్తుకొన సమర్థత లేక రక్షోవిభుండు. ఉ. రా. ౩. ౨౪.

(పట్టిలాగు, లాగు, లాగివేయు)

ద్వి. తెగువ మత్తేభముల్ దెమలించి తుండ, మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గలించి పైజోదు నణఁచు మాస్టీలు. ద్వి. హరిశ్చ. పూ. ౧౭౯ పం.

సీ. పసిఁడిగాజులు పైకి వెసఁ ద్రోచి నునుఁదీఁగఁ దెమలించు నురిత్రాడు నెమకు కరణి. మనుచ. ౩. ౩౧.

సీ. సురసరిత్కనక తామరసమ్ము లుడివోక తెమలించి బారుగాఁ ద్రెంచువారు. రంగా. ౧. ౬౨.

ద్వి. కమలారిబింబరాగంబుమైపసలు, తెమలించునిండుచంద్రికదట్టి గట్టి. అ. మ. క. ౫. ౨౮౯ పా. ౧౭ పం.(ఔపమ్యద్యోతకము.)

(రేఁపు, రేఁగఁగొట్టు.)

సీ. తెమలించి గాలియెక్కమెకంబునైనను బలుగాలుపలఁ దీర్చి పట్టఁగలను. వరాహ. ౪. ౭౫.

తెమలు. అ. క్రి. ౧ తొట్రుపడు.

చ. నను మస దింతిచన్నులతేనప్పన ముందఱు గానరాదు మా,కడుగిడుచోటఁ గా దెమలినంతన కౌనుకు బిందమయ్యెడుఁజా. కు. సం. ౮. ౧౬.

౨. కదలు.

సీ. తిగిచిన నడుగులు దెమలక య్యో మ్మప్పళించి యవ్వలికిఁ జండించి దాఁటి. ఆము. ౬. ౨౨.

౩. చలించు; జంకు, భయపడు.

క. ఆతుములమునకుఁ దెమలక, భూతలము దలంక నలువపుత్త్రుం డెదురై, యాతెఱఁగున నసురులు నిర్ఘాతసదృశశరపరంపరలు వడిఁ గురియఁజా. కాశీ. ౨. ౪౬.

క. యమదూతవోలె నచటికి, సమదగతిఁజా వేఁటకాఁడు చనుదేరంగాఁ, దెమలక హిరణ్యకుం డురిఁ, దుమురుగఁ దెగఁ గొటికి బొక్కఁ దూఁటం బాఱెఁజా. నా. పంచ. ౨. ౨౯౯.

సీ. కనరానితనకౌను కంఠీరవమ్మె యంచు జలకరేణుకరీంద్రసమితి దెమల. ఉ. రా. ౬. ౭౯.

సీ. మిత్రపుత్త్రతఁ దాను మిత్త్రుండ నని యేమెయముఁ డాత్మపురమునఁ దెమల కునికి. కశా. పీఠి. ౩౧.

౪. అయథార్థమగు, అసత్యమగు.

చ...ఇదియేటిమాట నల్లనియెడఁ గానరాదె తెమలం బలుకం బనియేమి నావుడుఁజా. భార. అను. ౧. ౧౭౬. (మరలంబలుకఁజా. కరాలప్రతి.)

౫. తిరుగు, మరలు, నివృత్తమగు.

చ...అపరాధలేశమును దాల్పనినీ విపు డెంత మ్రొక్కినం, దెమలదు శాంతిఁ బొందదు మదీయమనం బికఁ జాలుఁ బ్రార్థనల్. నరస. ౨. ౩౬.

క. నటనల విలాసరేఖా,ఘటనల నీజటిఁ గరంపఁగల నని మున్నే, నటు సూచితి నటు గాదని, యిటు సూచితిఁ దెమలఁ డింక నే మనుదానఁజా. విప్ర. ౩. ౪౨.

౬. విరియు, విడిపోవు.

చ. తెమలనిచిమ్మచీకటిని దీపము లేమిని జూపుకెట్లు దీ,పము గొనితెమ్ము చూపెదను భద్రముగా నివి నీవె దాచిపెట్టుము...హంస. ౩. ౧౦౭.

సీ. తిమిరారి దోఁచిన దీనతపెంపునఁ దెమలిన చీకటిగము లనంగ. విక్ర. ౧. ౭౫.

౭. పట్టుదప్పు, జాఱు.

ఉ...వార్ధక్యాధీనశరీరతం దెమలి త్రెళ్లె నొకం డిదె నూతిలోపలఁజా. దశకు. ౧౧. ౭౫.

క. కమలజుశిర మీకైవడిఁ, దెమలి మహిం బడినవేళఁ ద్రినయనహస్తం, బమరె నపేతమరాళ్యాక్రమణం బగువికచరక్తకమలముభంగిఁజా. వరాహ. ౧౨. ౧౮.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౭. పోవు, నశించు.

చ. క్రమమునఁ గప్పె నల్గడ లగాధమహోద్ధతిఁ జిమ్మచీకటుల్, తెమలె దిశావివేకమును ధీర తయుఁ జెవ వెస నెల్లవారికిన్. హర. ౭. ౧౭౧.

సీ. కమలోదయఖ్యాతి తెమలెనే నానానదీ కాంతుఁ డైనరత్నాకరునకు.వసు.౨.౧౩౭.

సీ. కరమున నుదకంబు కడు జల్లుకొనకున్నఁ దెమలనిమిహిరదాహము దొలంగ. కాళ. ౨. ౧౨౪.

౯. పోవు,వెళ్లు.

చ. తెమలను నిన్నుఁ బాసి సుదతీ యని తీయని నీదుమోవి క్కాయమృతరసో ర్మియేని సమ మా ...హంస. ౧. ౨౪౩.

౧౦. నిర్గమించు, బయలువెడలు.

సీ. వెడఁదగూడులనుండి వెన్నెలపులుఁగులు తెమలెనా నేత్రాంచలములు బెళుక. ప్ర బంధ. ౨౯౦.

౧౧. కడముట్టు, ముగియు.

(వా) వానికి పని తెమలుట లేదు.

౧౨. పని తెలపిచేసికొను.

(వా) వాఁ డెంతసేపటికిని ఇంటినుండి తెమలి రాఁడు.

వి. ప్రవాహము, వెల్లువ.

సీ. తళుకొత్తుమిన్నేటితెలినీటితెమలున ముదు రుచెందొవచాలు మొలవఁబెట్టి. పాండు. ౪. ౨౫౦.

జ; తెమలించు, తెమలుచు.

తెమలుచే(ల్చే)=తెమలించే. స. క్రి. (√తె మలు.) ౧. కదల్చు.

చ. ప్రమదము పూని మౌని రఘురామ కనుం గొను మీళరాసముల్, దెమలుప నేర్తు వే యనిన ధీరుఁడు శ్రీరఘువీరుఁ డయ్యెడన్. దశా. ౭. ౨౦౦.

ఉ. వింటి నపూర్వ మర్వి నొకవింటి నరుండె జయించువాఁడు ము,క్కంటివిలం దెమల్చిన మగంటిమిజో దిడుతాణె మింక...చం.రా. ౫. ౫౬.

౨. చలింపఁజేయు, డీలుపఱుచు.

సీ. ద్రోణుని నిరువదిబాణంబులఁ దెమల్చి భీముని మున్నూట బెండుపఱిచి. చిత్రభా. ౭. ౧౦౯.

౩. సడలుచు, విప్పు; దువ్వు.

గీ. అనుచుఁ దగ బుజ్జగించి హస్తాంబుజమున, వలపుఁగీలు దెమల్చు భూవల్లభుండు. నైష. ౭. ౧౭౬.

గీ. బిగియఁ జనుదోయి యొత్తినపేరురంబు, నలరుమోవితీ పానినయాననంబుఁ, దనియఁ గురులు దెమల్చి యాడినకరంబుఁ, దరుణి మెచ్చుచు నెమ్మోముఁదమ్మి యలర. హరి. ఉ. ౭. ౧౨౭.

౪. పెఱుకు, ఊడఁదీయు.

సీ...గుండె,కాయ లాదట మెయిఁ గబళించు చును గ్రొవ్వు దెమలిచి నమలుచు నెముక యూట,చవిగొని యానుచు...భార. స్త్రీ. ౨. ౯.

౫. జాడించు.

గీ. బిసము లాదట నందఱుఁ బెటికి రొంపి, వోవ నీటఁ దెమల్చి మోపుగ నమర్చి. భార. అను. ౩. ౨౨౩.

౬. కోయు, ఖండించు; చీల్చు.

చ. చెలువలఁ గూడఁ బిల్చుగతిఁ జిల్కుదుఁ బార్శ్వలతాంచలంబులన్,ఫలము దెమల్చు రీతి నళిపంక్తికి మోము మలంచుకైవడిన్. వసు. ౩. ౭౭.

ఉ. గాలికిఁబోవువాహము నగంబులపత్త్రములం దెమల్పఁగా,జాలును వాలు...వేలుపు లేని గెల్చు టొకవిక్రమమే బలిదైత్యవల్లభా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దశా. ౨. ౪౨౩.

సీ. సింగంబు పఱతెంచె ముంగోఱలఁ దెమల్చి
నమలి కార్పోతుల నుమిసికొనుచు. కకు.
౪. ౧౦౫.

౭. పట్టుకొను.

చ. అని కలుషించి వేదవతి యచ్చటు వాసి
చనం దలంచినం, గని దశకంధరుం డడరి గ్ర
క్కున వేనలి పట్టికొన్న నం,గన యొకవ్రేల
వ్రేయ నది క త్తివిధంబునఁ దాఁకి క త్తిరిం,
చిన క్రియఁ ద్రెంచె వెండ్రుకలు చేతఁ దెమ
ల్చి నయంత కివ్వలన్. నిర్వ. ౫. ౧౭.

క. మురసంహరుఁడు కుచేలుని,కరము గరంబునఁ
దెమల్చి కడఁకన్ మన మా,గురుగృహమున
వ ర్తించిన, చరితము లని గొన్ని నొడివి...
భాగ. ౧౦ ఉ. ౯౫౯.

౮. పట్టుకొనిలాగు.

చ. అనినఁ జలించుచున్ నృపతి యంగనకే లొక
చేఁ దెమల్చి వ్రేచనఁ జన నేమిచెప్ప ముని
చంపము ...మార్క. ౧. ౧౮౩.

ఉ...అమ్మరో,రమ్మని బోటి కోమలికర మ్మనివా
ర్యగతిం దెమల్పఁగన్. వసు. ౩. ౧౩౦.

౯. ముగించు, సమా ప్తముచేయు.

(వా) వేగ పని తెమల్చుకొని రమ్ము.

ఆ. క్రి. (కడుపులో) త్రిప్పుపుట్టించు, డోఁకు
కలిగించు. (బ్రౌ)

(వ్యవ) ఆఔషధమునాకు తెమలుచుచున్నది.
జీడిపప్పు తిన్నప్పటినుండియు నాకు లోపల
తెమల్చుచున్నది.

తెమ్మ=తేమ. వి. (సం. తేమః. ప్రా. తేమ, తెమ్మ.)

౧. తడి, ఆర్ద్రత, చెమ్మ.

సీ. కలకంఠములు నోరు కాయక వడిఁ గుయ్యఁ
బమ్మినయిలమీఁది తెమ్మ దియ్య. చెన్న. ౪.
౧౬.

సీ. వరుణాంగనామనోపల్లవితానంబు పలుకుఁ
దెమ్మలచేతఁ బల్లవింప. విక్ర. ౨. ౫౨.

౨. కెల్ల, ఎండి పెల్లగిల్లినపలుచనిమంటిగడ్డ.

సీ... తెమ్మ నాఁ బెల్లయుఁ దేమ వెలయు. ఆం.
భా. ౩. ౪౫.

౩. (క. తెమ్మల్) రాశి, సమూహము, గుంపు.

చ. పొలఁతుకఁ జూడ రమ్మ గడివోవనిచక్క-
దనంబు తెమ్మ...చంద్ర. ౫. ౧౯౪.

విణ. తేమగలది, తడిగలది.

ఉ. కమ్మని తెమ్మ తెమ్మెరలు గ్రమ్మఁగ...నీలా.
౧. ౪.

గీ. నవసుధాసారముల తెమ్మ నాయఁడమ్మ. కృ.
శకుం. ౧. ౩౭.

తెమ్మలుగా=తెప్పలుగాఁగ.

ఉ. చూచి కిరాతులార బలుసొమ్ములు తెమ్మలు
గాఁగ నబ్బె నీ,రాచకుమారు దోఁచుఁడు...
వరాహ. ౮. ౬౮.

ఉ. అమ్మెయి వాజివారణభటావళిఁ గప్పినతూ
పు లేమనన్, దెమ్మలుగాఁ దటాకములనిండు
శరమ్ముల...ఎన్నిన నెన్న శక్యమే. విజ. వి.
౩. ౧౫౫.

ద్వి. కమ్మఁగాఁ గాఁచినగంగావునేయి, తెమ్మలు
గాఁ దెచ్చి దించువారలును. ప్రభు. ౫.
౧౫౧ పా. ౩ పం.

తెమ్మెర. వి. (క. తెమ్బరల్, తెమ్బు=దక్షిణము +
ఎరల్=గాలి. త. తెన్రల్=దక్షిణపుగాలి.)

౧. చల్లగాలి, మందమారుతము.

ఆ...స్వర్ణగండ్లయందుఁ జొచ్చి సుడిసి, తిరిగి
వేగుఁబోక తెమ్మెర లెలదీఁగ, కొనలవంక లొ
త్తు ననలఁ బ్రోచు. భార. ఉద్యో.౨.౧౧౨.

మ. చివురుంగైదువువేల్పు చైత్రమున నక్షీణధ్వ
జోత్తేపమై,భవుఁడై తెమ్మెర లేరిపైఁ గదలిరా
...వసు. ౧. ౧౩౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. తెమ్మెర నీ కేం తెమ్మెర, గమ్మనివిలుకాని దొరవు గ మ్మని నెలఁ బై, రమ్మని యలిఘ కపికనిక, ర మ్మని గా నిలిపి ముందరగ వచ్చి తివా. విజ. వి. ౩. ౪౭.

గీ. ఎసఁగుఁ దెమ్మెర యనఁగఁ బర్యెర యనం గ, మందమారుతసంజ్ఞలు...ఆం. భా. ౧. ౫౯.

౨. వాయువు, గాలి.

సీ. చెదరినమకరికాచిత్రపత్త్రికలతోఁ బరఁగె డునూర్పుఁదెమ్మెరలతోడ. విక్ర. ౫.౬౧.

సీ...కసరుచుఁ దెమ్మెరల్ విసరఁజొచ్చె. ఇం దు. ౩. ౧౦౬.

ద్వి. నెరయఁ దెమ్మెరదూది నించి చూపట్టు, ప ఱుపుపై నొసపరిబాగు లేర్పడఁగఁ, బవ ళించి...ద్వి. పరమ. ౨. ౧౨౨ పా. (తె మ్మెరదూది నించి చూపట్టుపఱుపు=శేషశయ నము)

జః తెమ్మెరకూన, తెమ్మెరచెలిచిల్కు.

తెమ్మెరకూన. వి. (√తెమ్మెర) ౧. గాడ్పుపట్టి హనుమంతుఁడు.

క. అని యరద మెక్కి యుక్కున, జని తెమ్మె రకూన నంపజడివానల ముంచిన...అచ్చ. రా. సుం. ౧౭౯.

౨. భీమసేనుఁడు.

తెమ్మెరచెలిచిల్కు(లుకు). వి. (తెమ్మెర + చెలి + చిల్కు) ఆగ్నేయాస్త్రము.

సీ. తెమ్మెరచెలిచిల్కు నెమ్మది నారేయుద్రి మ్మరిబొబ్బ మెకమ్ముపైఁ దిరమ్ముగా నేయ... అచ్చ. రా. యు. ౨౬౪.

తెర. వి. (సం. తిరః. క. తెరె. త. తిరై) ౧. వెనుకనున్నవారు కనఁబడకుండ వ్రేలాడగట్టు మఱుఁగుచీర, తిరస్కరిణి, యవనిక.

చ. తెరయును మేలుకట్లుఁ దగుదీవియలుం జె లువొందు మేటివప్పరమున...భార. సౌ. ౧. ౧౪౩.

క. లలితగగనరంగంబున, నలయక క్రొమ్మెఱుఁ గు గొండ్లిరై యాడెడుచోఁ, గలవడియె మొగులు తెరలును, బొలు పగువడగండ్లగముల పుష్పాంజలులున్. హరి. పూ. ౬. ౧౦౩.

సీ. చనుఁ దిరస్కరిణి తెర నా జవనిక యన... ఆం. భా. ౨. ౧౫౯. ఆను. ౪. ౧౫౦.

౨. వేఁటకు సాధనముగా నుపయోగించు నొక విధ మైనజవనిక, అడ్డువల (శ. ర); మత్స్య గ్రహణసాధనము.

సీ. వేఁటసాధనములు వీచియు యవనిక దేజ రిల్లుచునుండుఁ దెరయనంగ.ఆం.భా.౩.౬౪.

క. వెలివాఁలును గాలురులును, వలలుఁ దెరలు దీమములును వడిఁ దీరినదుక్కలు నారెగోల లును నుంచడలక్రోవులు వేఁట కారడంబుఁ బె నుపఁగన్. ఉ. హరి. ౪. ౨౨.

గీ. విమ్నమృగములఁ బట్టంగ వేసినట్టి చీర తెర లను సంస్మృతిఁ జిగురుకొల్చె.కాశీ. ౨. ౫౫.

సీ. తెరఁదూఱి వెఱఁబాఱుగురుపోతు పై నైనఁ బడి యెక్కి పొడుతు నీపాద మాన. మను చ. ౪. ౩౪. భాగ. ౧. ౪౫౪.

గీ...చల్లు డ్డూఁదు, లుంటగాలంబు తెరదీము లు సురుగాల, ము...ఎసఁగుచుండు. హంస. ౪. ౧౭౪.

౩. అల, తరంగము.

క. కట్టా తలమునుకలునై, దట్టపువిరహాబ్ధి తెరలు తరుణుల నేచన్. భాగ. ౧౦ పూ. ౧౦౦౦. సుద. ౨. ౧౦౯.

సీ... తెర యనంగను వీచి పరఁగును...ఆం.భా. ౧. ౧౫౪.

ఉ... తెలిచల్వ పైఠిణీ,చేలచెరంగులై యచటఁ జెల్వగు వేలుపుటేటి పెందెరల్.ఉ.రా.౬. ౯౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౪. పరంపర, వరుస.

క. పరిపరిధూపంబుల వర, విరుల తెరల రత్నదీప వితతుల నూర్ణా,స్తరణములఁ బొలుచుశా వులఁ, బరమబుభుషలు నృపులు వరుస బంతు లు సొఁగఁగ. జై. భా. ౭. ౨౧౧.

సీ. తనమహాభోగంబుల సెసంగుభోగినుల్ దె రలి నిట్టూరుపుఁదెరలు సెఱప. వసు. ౨. ౧౧౩.

౫. దిక్కు.

చ... విస్ఫులింగపటుకీలలు గ్రైదువు లీన సేనతో, వెలువడి రార్పులం దెరలు ప్రీలఁగఁ జేయు చు నన్ని శాచరుల్. భా. రా. యు. ౯౭౩.

౬. విధము.

ఉ. చేడియవల్ల నించుక ప్రసిద్ధివహించెను గాని నిల్చి మాటాడిన నాల్గుదెర్లు... చెన్న. ౧. ౭౪. (నాలుగు ముఖములనుండి వచ్చునుగ నుక)

౭. పెర, తేనెపట్టు.

రగడ. తెఱవ తెర వడిఁ బూని కదలిచి తేని తేనియసోనవానలు, నెఱయు... రసిక. ౪. ౬౪. (లెఱ. ముద్రి.)

(దీనియా మ్రేడిత రూపము తెర తెరలు.)

క. తెర తెరలై శిల లురులఁగ, దరతరకలు దేరి ననుపు దార్కొని శరధి, న్దటిమటి మంద రగిరి య,త్తతిఁ దరిత్రాడునను సౌఖ్యదంబై తిరుగఁగ. ల. వి. ౨. ౬. (తెరతెరలు=అధి కపరంపరలు)

(వ్యవ) కడుపునొప్పి తెరలుతెరలుగా వచ్చు చున్నది. (తెరలుతెరలుగా=తరంగములవలె ఆఁగిఆఁగి)

తెరచీర=తెర. ౧. తిరస్కరిణి.

క. తెరచీర వట్టి యిరువుర, నిరువంకల నిలువఁ బెట్టి యింపు దలిర్పఁగ, సురయక్షసిద్ధకిన్నర, నరకాంతలు తమ భజించి నలిఁ గీర్తింపఁగ. పద్మ. ౩. ౭౬.

ద్వి. హరుఁ డెంతఁ గాలెడి ననుచు నచ్చెలఁది, పరువడిఁ దననూలు తెరచీరభాతిఁ, దిరిగి వ చ్చి... బస. పు. ౬౪ పొ. ౨౨ పం.

౨. వేఁట సాధనముగా నుపయోగించు జవనిక, అడ్డువల.

వ... తెరచీర ప్రోఁగుచుట్టలు దొడ్డివల లేటివల కుంచేటివల... కాశీ. ౩. ౪౬.

జ. తెరచాఁప, తెరబొమ్మ, తెరమాయమగు, తెరయీఁగ, తెరయెత్తు, తెరవాలు, తెర వేఁట, తెరవేయు.

తెరచాఁప. వి. (√తెర) ఒకానొక నౌకాంగ ము, పడవనడుపు సాధనములలో నొకటి. (బ్రా.) (వ్యవ) ఆపడవకు తెరచాఁప ఎత్తిరి.

తెరబొమ్మ. వి. (తెర+బొమ్మ) తెరమీఁద నాడిం చుబొమ్మ, తోలుబొమ్మ.

శా... ఉడువీథిం గొండ్లియాడించె దైత్యవ్యా ధుల్ తెరబొమ్మలట్ల నిగుడం దా నాటకాఁ డుంబలెఁగ. పి. శకుం. ౩. ౧౨౪.

ద్వి. నుతి మన్మథునిసూత్రమహిమచేఁ దిరుగు, తెరబొమ్మయో యనఁ దిరిగెఁ బేరాస. రం. రా. అర. ౧౪౯ పొ. ౧౪ పం.

తెరమాయమగు. అ. క్రి. (√తెర) తెరవేసిన కనఁబడ కుండున ట్లగు, హఠాత్తుగా అదృశ్య మగు.

ద్వి. పరికింప నాదృష్టిపథమున నిలిచి, తెరమా యమై పోయితే సీత యనుచు. రం. రా. ఉ. ౧౭౯ పొ. ౧౧ పం.

తెరయీఁగ. వి. (తెర+ఈఁగ) పెరఈఁగ, తేనె టీఁగ.

క. తెరయీఁగలగతిఁ గవియుచుఁ, బోరిఁబోరిఁ గడుఁదురులపగిదిఁ బొదువుచు నెఱిపై, పెర వునఁ గాకులు పికములఁ, బరువడిఁ జీకాకుప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఱుచుభంగి దలంపఁగన్. భార. ద్రో. ౧. ౨౮౫.
(బ్రౌ. భా. ల. వ్యా. పా.)

తెర(యె)లెత్తు. అ. క్రి. (√తెర) తరంగితమగు, పొంగు; అతిశయించు.

సీ. తెరలెత్తి సప్తసాగరములుఁ బొరలంగ వసుఋండు గొండిలి పరిభవింప. ఉ. హరి. ౪. ౨౧౬.

శా. మైనిగ్గుల్ తెరయెత్తఁగా నమృతకుంభం బంది యేతెంచుమా,యానారాయణిలీలఁ ద క్రఘటదీవ్యన్నస్తయై...శుక. ౨. ౨౫౧.

తెరల. వి. కబళము, కవణము. (శ. ర. బ్రౌ.)

తెరలఁబడు. అ. క్రి.(తెరలన్ + పడు)-మనోవ్యాకులతనుండి వెడలు-తేఱుకొను, స్వస్థతనొందు.

చ...అవ్వనిత యొడంబడం దగినవాక్యము గాక కొంతసేపు మెల్లన వినయంబుఁజేసి తెరలంబడి యాసతితోడ నిట్లనున్. వి. పు. ౬. ౨౨౫.

తెరలఁబాఱు. అ. క్రి. (తెరలన్ + పాఱు-స్వార్థమున.) తొలఁగు, అపసరిల్లు.

మ. తెరలంబాఱెఁ గలంగి గోవులు కడున్ దీనంబులై లోలుచున్. హరి. పూ. ౬.౧౩౭.

తెరలించు=తెరలుచు. (√తెరలు).

(జయించు)

సీ.అనిలోన నీటిరాయని గాద్పుఁ దెరలించి వెతమాలుటెల్ల నీకతనఁ గాదె. యయా. ౩. ౯౩.

(క్షోభపెట్టు, కలఁచు.)

ద్వి. వివిధముఖంబుల వివిధాయుధములఁ, దివిరి రాక్షససేనఁ దెరలించి పఱప, నతిమి కొందఱు చచ్చి రాహవక్షోణి. రం. రా. ఉ. ౭౭ పా. ౧౧ పం.

(పోఁగొట్టు, నశింపఁజేయు.)

వ...కెరలి తెరలెత్తునిరులం దెరలించు నసేకరూపంబులం దీపించుత మోరిపుత్రయంబున్ ...వసు. ౬. ౯.

తెరలిక. వి. (√తెరలు) ౧. గుంపు, సమూహము. (శ. ర, చి. ని.) ౨. మెలఁకువ.

సీ. కడపపూఁదేనియఁ గడుపారఁ గొని మ్రోసి తిరుగులేఁదేఁటుల తెరలికయును. హరి. పూ. ౯. ౬౮.

సీ. దీమంబువేఁటలు దామెనవేఁటలు దెరవేఁటలును నేర్చు తెరలికలును. ద్వా. ౮. ౨౨.

తెరలు(ల్లు) అ. క్రి. (క. తెరళు. త. తిరళ్) ౧. నీళ్లు లోనగునవి సలసల కాఁగి పొంగు.

ద్వి. తెరలఁ గాఁచిననూనె దెచ్చి కర్ణములఁ, గర ముగ్రముగ వేయుఘటములు వోసి.రం. రా. యు. ౩౯౫ పా. ౧౧ పం.

(గ్రీష్మవర్ణన.) గీ. సరసిపై నీరు సలసల దెరలె విపిన, సకలవీథులు నిర్మగోచ్ఛయము లయ్యె. పాండు. ౧. ౧౩౬.

ద్వి. తెరలుబానలపాలు దింపఁగ మఱచి, సెరసిన మొదవులఁ బిదుకుట మాని. ద్వి. భాగ. ౧౦. (చి. ని.)

సీ. చిన్నిబాలకు లేడ్వఁ జన్నులిచ్చుట మాని తెర్లుబానలపాలు దించ మఱచి. పద్మ. ౯. ౨౦౭. శుక. ౨. ౩౮౨.

౨. వేఁగు, కాలు.

గీ. తెరలుచున్నవి తొంటిముత్తెములు తిగిచి, క్రొత్తలుగఁ దెచ్చి పాలిండ్లఁ గూర్పరమ్మ. యయా. ౫. ౧౧౫.

గీ. పదతలంబున నిగిడించు ప్రసవరజము, మంగలంబున వేఁచినమాడ్కిఁ దెరలె. పి. శకుం. ౩. ౧౭౭.

౩. ఉప్పొంగు, పొరలు.

సీ. సరసపుష్పపరాగ సైకతంబులు దీర్చి తేనియ కాలువల్ తెరలి పాఱ. విక్ర. ౧. ౮౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౪. పాఱు, ప్రసరించు.
క. గిరిజాలలితాంగము పొరిఁ, బొరిఁ గనుఁగొని సొగసి యిసుకబొమ్మ జలమ్ముల్, తెరలఁగ విరిసినగతిఁ బొద్దివిరిసి మహేశ్వరుమనంబు వికలం బయ్యెన్. కు. సం. ౫. ౫౧౬.
౫. అతిశయించు, మెండుకొను.
సీ. చాన నీకెమ్మోవిపానకం బానక తెరలెడు బలుదూప తీఱిపోదు. రసిక. ౬. ౭౯. మొ. రా. యు. ౩. ౪౩.
క. నరనుతు లర్యోదిక్కు,లు కరిగి మహీపతుల చేత నరిగొని ధనముల్, దెరలఁగఁ దెచ్చిన మార్గము...భార. సభా. ౧. ౨౭౬. (తెరలుగ, శ.ర. పా.)
సీ.పరశుపాతాంకుశకర వాలశూలముద్గరములు నీ మీఁదఁ దెరలఁ గురిసె. భార. అర. ౧. ౧౭౭. (తెరలన్=నిండుగా, పూర్ణముగా.)
ఆ. పరుషవిషమభూరిపాషాణభీషణ,గిరులు వచ్చి నన్నుఁ దెరలఁ గప్పె. భార. అర. ౧. ౧౯౫.
౬. బయలుదేఱు; వెడలు, పైకివచ్చు.
వ...శతశృంగనివాసు లగుమును లెల్లం దెరలి వచ్చి చూచి ...భార. ఆది. ౫. ౧౪౩.
సీ. ఉరవడి సేనలు దెరలఁ బైఁ దోతెంచునూళి పె ల్లడరినఁ దూలపోక. భార. విరా. ౪. ౬౨.
గీ. దరికొని వహించునక్కాఁకఁ దాళలేక,తెరలి మృగములు మృగతృష్ణ కరిగి సొరుగు. ఉ. రా. ౨. ౧౬౧.
౭. ప్రయాణముచేయు.
ఆ...ఆఱు,యోజనములపయన మొక్కనాఁడె, తెరలి చందనావతీపురి ముందటఁ, గాంచి యోధవర్గులఁ గలయఁ జూచి. జై. భా.౭. ౫౯.
౮. జంకు; సందేహించు.

ద్వి. పరికింప నిట్టిచో బడలినయబలఁ, దెరలక ఘోరాసిఁ దెగవ్రేయు మనుచు. ద్వి. హరిశ్చ. ఉ. ౨౪౬౪ పం.
చ. తెరలక కాశికానగరిదేవతరంగిణిఁ దీర్థమాటకై, యరుగుచు...కాశీ. ౫. ౪౭.
౯. (యుద్ధమున) తొలఁగు, అపసరిల్లు, వెనుకకుఁబోవు.
క. గురుసుత నీదుభుజావి,స్ఫురణము దివ్యాస్త్రవీర్యమును గురుధరణీ,వరుదెసఁ గూర్మియుఁ జూపితి,దెరలకుమీ యనును నతఁడు దీప్తాకృతియై. భార. ద్రో. ౫. ౩౯౯.
క...వారలయమ్ములఁ,దెరలక భీముండు పటుగతి స్యందనుఁడై. భార. భీష్మ. ౩. ౧౬౦.
సీ.పొరలుకౌతులు భీతిఁ దెరలుసూతులు వ్రస్సి యొఱగుబండ్లును బెట్టు విఱుగువిండ్లు. ఉ. రా. ౬. ౨౭౬.
౧౦. ఉడుగు, తగ్గు.
గీ... తెరలక కడవవంచి,నట్లు హోరని ధారాఘుమైక్య మొంది,విన్ను మన్నును నొకటిగా వృష్టి బలసె. ఆము. ౪. ౯౧.
చ. తెరలనిశక్తి నప్పొలసుదిండికొలంబులమేటి యిట్టు ల,త్తఱి విశిఖాళిఁ గప్ప...చంద్రి. ౩. ౧౨౭.
౧౧. ఊడిపోవు.
గీ. అలిగి పూవైన నలఁపలే దబల దాను,శోకబలమునఁ జోఁకినచోటఁ దోలు,తెరలి జర్జరమైపోవఁ గరతలములు, మీఁది కందంద రతి యెత్తి మోఁదుకొనియె. కు. సం. ౫. ౫౬౯.
౧౨. చెదరు.
మ. మదదంభోరుహనేత్ర లంబరధునీమధ్యంబున న్నిల్వ ని,ష్ఠురతీవ్రపయోధరాహతి జలస్తోమంబు నల్వంకలన్, దెరల న్నాభిచయంబు లోఁగొనియె...పారి. ౪. ౨౭.
వ...ఉడుగణంబులబెడంగు నడంగఁ ద్రొక్క

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేర్చుక్క దెరల...ఉ. రా. ౬. ౨౩౬.

౧౩. కలఁగు, క్షోభపడు.

క. అనిలోఁ దెరలుట తొలఁగుట, యనునివి చ నుఁ గాక...భార. కర్ణ. ౩. ౫౨.

౧౪. కదలు,చలించు.

సీ. తిగిచిన నడుగులు దెరలక యొండొరుఁ గ్రమ్మఱఁ దిగుచుచు ...భార. విరా. ౨. ౩౪౭.

వ...అప్పుడు రాధేయుం డజేయుండై కులశై లంబునుంబోలెఁ దెరలక నిలిచి...భార. ఆ ర.౫.౩౯౯. (చి.ని.పా. 'తరలక' ముద్రి.)

వి. నీళ్లు లోనగునవి సలసలకాఁగి పొంగుట, ఉ డుకు,తాపము.

గీ. ఉడుకు సెగ తెరలు నాఁగఁ జెన్నొందుఁ దాప, మునకు నామంబులై ...అం. భా. ౧. ౪౯.

జ: తెరలఁబడు, తెరలఁబాఱు, తెరలించు, తెర లిక, తెరలుచు, తెరలుడు, తెర్లిక.

తెరలుచు(ల్చు)=తెరలించు.స.క్రి. (√తెరలు) తెరలఁజేయు.

(చెదరించు)

క...చరాచరము లైనభూతజాలము లెల్లం,దర తరమ యడ్డపడినఁ, దెరలిచి పడవైతు సింధుదేశాధీశుఁ. భార. ద్రో. ౨. ౩౧౦.

(కదల్చు, చలింపఁజేయు.)

సీ. పొన్నలమకరందములు చల్లుపోరాడి తెలి మించుమల్లెమొగ్గలఁ దెరల్చి. విప్ర. ౨. ౫౬.

(ఊడఁదీయు, తీయు.)

ఉ...సివ్వంగులబండ్లు డించి తగ వానికిఁ గన్న ఱుగుల్ దెరల్చి యా,ముంగలఁ బాఱఁ జూపుటయు...యయా.౨.౧౬.

చ. పయఁటచెఱంగు శాఖ యనుపాణిఁ దెర ల్చుచు...కళా. ౧. ౩౭, ప్రభా. ౨.౨౦.

(పెల్లగించు, ఉన్మూలించు.)

చ. కరకరపండ్లు గీటుచు సెగంబడి ముట్టెను దుంగము స్థలం, దెరలిచి మేయుచుఁ... చెన్న. ౨. ౨౦.

(క్షోభపెట్టు, కలఁచు)

ఉ. ద్రోణునితో శిఖిం బడక ద్రోణకుటుంబిని యున్న దింట న,క్షీణతనూజశోకవివశీకృత నై విలపించుభంగి నీ,ద్రౌణిఁ దెరల్చి తెచ్చు టకు దైన్యమునొందుచు నెంత పొక్కునో. భాగ. ౧. ౧౬౫.

(పోఁగొట్టు, నశింపఁజేయు.)

గీ. అంబకై పూని వానిమహాబలంబు, జాపు దగ్న్యాండు దెరలుపఁజాల కరిగె. భార. అను. ౫. ౪౭౫.

(తరలించు, బయలుదేఱఁదీయు.)

క. పురజనుల నెల్ల ముందటఁ,దెరలుచుకొని... జై. భా. ౨. ౧౦౫.

తెరలుడు. వి. (√తెరలు) బయలుదేఱుట ప్రయాణము. (శ. ర.)

తెరవాఱు. అ. క్రి. (తెర+వాఱు) తరంగిత మగు, పొంగు.

చ. ద్రవిడకుటుంబినుల్ పసుపు రాచినరత్న పుఁదాపక్రింద నం,బువు తెరవాఱగా నిదు రవోయి గరుత్తతి పచ్చవాటిసఁ. ఆము. ౧. ౬౪.

తెరవేఁట. వి. (తెర+వేఁట) తెరలెత్తి ఆడెడు వేఁట.

సీ. ఒకనాఁడు తెరవేఁట నుగ్రసత్త్వంబులఁ బుడమిపైఁ బడఁ గాల్పడ వధించి. కాళ. ౩. ౪౭.

గీ. ఎచ్చరిక మించి తెరవేఁట యెద్దువేఁట, గం టవేఁటయు మొదలుగాఁ గలుగువేఁటలు ...రామా. ౨. ౨౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తెరవేయు=తెరయెత్తు. అ. క్రి. తరంగితమగు, పొంగు, అతిశయించు.

క. అని చాల భిన్నరాలై, మనమునఁ దెరవేయఁ బుత్రమమతాంబుధి ని, ల్చినచోట నిలువ నైఁపక, వనితామణి నగరు వెడలివచ్చుచుండెన్. సారంగ. ౩. ౭౮.

తెరువ(ర్వ)డుచు. అ. క్రి. (తెరువు+అడుచు.) దారికట్టి కొట్టు, అభిగ్రహముచేయు.

ద్వి. కలికంఠు గణనంది గలసెఁ దెర్వడిచి, బస. పు. ౫. ౩౮౪ పం.

తెరువ(ర్వ)రి. విణ. (తెరువు+అరి[3]) బాటసారి, పాంథుఁడు.

క. కను భ్రమసిన తెరువరి తన, కనపాయం బైన మార్గ మరసి తగ నెఱిం, గినవారు సెప్పఁగాఁ గై, కొనని కరణిఁ దగిన వెంటకుం జన వకటా. భార. ఉద్యో. ౨. ౨౫౦.

క ... పరిమళసంభారలోలబంభరమాలా, పరిషఝ్ఝంకారధ్వని, తెరువరులకు మన్మథప్రదీపన మొసఁగుకొ. కాశీ. ౧. ౯౨.

సీ. నిగిడి తెర్వరులగుండెలు ఝల్లురనఁ జేర్చి పెళపెళ నార్చుకో వెలకుఁ దోఁకు. యయా. ౫. ౮౧.

సీ. పథికుఁడు దగుఁ దెరువరి యన...ఆం. భా. ౨. ౧౮౯.

తెరువాటీఁడు. విణ. (తెరువాటు+ఈఁడు) తెరువాటుకాఁడు. (శ. ర.)

తెరువాటు. వి. (√తెరువడుచు)-దొంగలు-దారి కట్టికొట్టుట, అభిగ్రహము, దారిదోఁపుడు.

సీ. భోజనార్థులఁ దుష్టిఁ బొందించునతఁడును దెరువాటువలనఁ దస్కరులచేతఁ, జేటొంది ధనము వాంఛించునతండు...భార. అను. ౨. ౫౯.

గీ. ఇట్లు బాధించి శోధించి యెందు నొక్క, పచ్చపైకంబుఁ గాన కప్పచ్చిబోయ, నేఁటి తెరువాటు పసలేక దాఁటిపోయె, ననుచు వెస వారిపసమాని యవలికేఁగి. వాల్మీ. ౨. ౯౬.

గీ. వెలసి కోయలబోయ దొంగలను గూడి, పట్టి బందులఁ దెరువాట్లఁ బ్రజకునెల్ల, వగలు గావించి పాపముల్ మిగులఁ జేసి. శేష. ౪. ౩౧.

తెరువాటుకాఁడు. విణ. (తెరువాటు+కాఁడు) దారికట్టికొట్టి దోఁచుకొనువాఁడు.

గీ. పాపకర్మునిఁ గార్ముకబాణపాణిఁ, గ్రూరదృష్టులయెఱచేరుగ్రుడ్లవానిఁ, జెంచుతెరువాటుకాని వీక్షించి తపసి, తల్లడంబున శ్రీహరిఁ దలఁచి నిలిచె. వరాహ. ౭. ౭౩.

సీ. పిడుగుచందంబునఁ బడి మోఁదు తెరువాటు కానికైన నొకింతకరుణ పుట్టు. నిరం. ౨. ౪౧.

సీ. తెరువాటుకాఁడు చింతించునే కట్టినబట్ట డుల్చిన మానభంగ మనుచు. రామలిం. ౩౦

ఆం. భా. ౨. ౨౯౧.

తెరువాటు(లు)గొట్టు. స. క్రి. (తెరువాటు+కొట్టు.) దారికట్టికొట్టు, దారిదోఁపిడిచేయు.

గీ. ఇతఁడు కలుద్రాగె ఱంకాడె నెఱిచి తినియె, నిలిచి మూత్రించెఁ జండాలలలనఁ గూడెఁ, గూఁతు రమియించెఁ దెరువాటు గొట్టెఁ బ్రజలఁ, జెంచురాజుల సేవించెఁ జెఱిచెఁ గులము. శివరా. ౪. ౫౪.

సీ. తెరువాట్లుగొట్టి సత్తరువుఁ బెట్టుటకంటె న్యాయార్జితాన్న మింతైనఁ జాలు. రామలిం. ౩.

ఆ. నాకుఁ దేఁదలంచు లోకోత్తరపువీణఁ, దనకు నొసఁగఁ జేసికొనియె నారద, వరుని ప్రేమ నడువఁ దెరువాటుగొట్టె న్నిట్లుండవలదె జగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తి నువిదరైన. కశా. ౮. ౨౩.౭. మనుచ. ౧. ౯.

తెరువు(ర్వు). వి. (క. తెరవు. త. తెరువు) ౧. దారి, మార్గము, పద్ధతి.

క. తెరువున నూరక యరుగఁగ, నురగకరివ్యా ఘ్రతస్కరోద్భటభయముల్, దొరకొను ...మార్క. ౨. ౭౬.

క. తరుణీసంగమ మెక్కడ, యిరవగుయోగ దశ యెక్క డెయ్యారి కి నే, తెరువు... హరి. పూ. ౪. ౧౧౧.

ఆ...మార్గంబు, తెరువు త్రోవ దారి లెన్న... ఆం. భా. ౨. ౭.

౨. (యుక్తమార్గము) ధర్మము, న్యాయము.

గీ. చంద్రకిరణభవాప్సరోజాతిఁ బుట్టి, యట్టి పేరొంది వెలయునే నకట యిప్డు, తగ సతుల కెల్ల సామాన్యధర్మమైన, పతిమనోను కూలతకును బాయఁ దెరువె. కళా. ౮. ౫౫.

౩. సాధనము, ఉపాయము.

ద్వి. ఈకౌశికునిబుణం బీకాశిలోనఁ, దీర్కొని దీర్పఁగాఁ దెరువు గల్పింపు. ద్వి. హరిశ్చ. ఉ. ౧౨౦ పం.

క. వెడదెరువు లిచటఁ జెల్లవు, పుడమి నహహ దొంగ లానఁబొడిచినఁ గోకల్, విడుతురె గడింతునే యెక్కడిగతిమాలినపిశాచికవో నీమాటల్. కళా. ౩. ౧౯౩.

౪. గతి, స్థితి, అవస్థ. (చూ. తెరువిచ్చు.)

౫. జోలి, సంగతి, సంబంధము.

ఉ...మూల వడంకుచున్న శ్రీ,కాంతను భూమి నీళలను గన్గొని మీ తెరు వేను రాను మీ, కాంతుని జూపుఁ డన్న...దశా. ౪.౧౦౮.
(తెరువు=జోలికి అని భావము.)

క. నుతియు నమస్కృతియును లేక తిరిగి శుభ మశుభ మనువగం బొందక గోష్ఠి తెరువు పోరకుండుట సువ్రతము...భార. శాం. ౫. ౧౩౩.

తెరువిచ్చు=౧. త్రోవయిచ్చు, తొలఁగి మార్గము తెలిపిచేయు.

ఆ...అధికభక్తి, నెరఁగి ప్రియము వలికి తెరు విత్తు రిట్టిద, ధర్మ వీవు దీనిఁ దలఁప వెట్టు. భార. ఆది. ౮. ౧౧౧.

సీ. ఎదురుగాఁ జనుదెంచునిందీవరాక్షుల కొ య్యనఁ దెరువిచ్చి యోసరిల్లు. నైష. ౩. ౭౪.

౨. సందిచ్చు, ఎడమిచ్చు, అవకాశమిచ్చు.

సీ. కురువిందపేర్లకుం దెరు వీనిపాలిండ్లఁ బాలు టాకులు గూర్చి పైటఁ దీర్చి. కాళ. ౩. ౧౫.

తెరువువిడుచు=దారియిచ్చు, తొలఁ గిమార్గము తెలిపిచేయు.

వ...పొలుప వెల్లియైనజలపూరంబు పాయయి చ్చుచుఁ దెరువు విడువ...కళా. ౪. ౯౩.

తె(ర్వు)రువు(లు)గట్టు=(దోఁపుడుకాండ్రు మున్న గువారు) దారియరి కట్టు, త్రోవకట్టు,మార్గ నిరో ధముచేయు.

సీ. కదిసి తో మునిగాలు గలచి వెంబడిఁదీయు. దిగిచి తోడనె లేవఁ దెరువుగట్టు. చంద్రా ౨. ౯౧.

వ...మెకము లడరుజాడ లరసి తొత్తదుచితస్థలం బుల దెరలెత్తించి వలలు హత్తించి మాటులు పెట్టించి తెరువులుగట్టించి...ఇందు. ౨.౬౦. చంద్రా. ౬. ౬౫.

శా...పెనుం, గానం దెర్వులుగట్టి యేఁగుప్రజ లం గట్టిండియై దోఁచి...పాండు ౫. ౧౫.

తెరువాఁగు = దోఁపుడుకాండ్రు మున్నగువారు దారియరికట్టు, త్రోవకట్టు,మార్గనిరోధముచేయు

మ...వింటివే నేఁడు భూ, పతు లేమో తెరు వాఁగువారఁట సమిత్ప్రారంభ సంరబ్ధభుతై... చంద్రా. ౬- ౬౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జః తెట్టుతెరువు, తెరువడుచు, తెరువరి, తెరువాటీఁడు, తెరువాటు, తెరువాటుకాఁడు, తెరువాటుగొట్టు, తెరువుపెసర.

తెరువుపెసర. వి. (తెరువు + పెసర) నడచుదారిలో మొలచుపెసరకాయ. (ఇది త్రొక్కుడుచే శీఘ్రముగా నశించును.)

గీ. కాన నిక్కంపుఁగూరిమి గణికయందుఁ, బొరయ దిలఁ బొర్సునే నది తెరువుపెసర. కవిక. ౪. ౧౨౨. (ఇట అచిరస్థాయి, క్షణభంగురము అని భావము.)

తెర్లిక. వి. (√తెరలు) తాపము; మన్మథతాపము.

క. కొడుకుపంగుజ్జుఁ జనుఁబాలిడి నీతో రతులఁ బెనఁగ నేతెంచుచు నాకడకేలం దాఁకించితిఁ, గడుఁ దెర్లిక పుట్టి పొరలఁగా మారెడ్డిక్. వేం. పంచ. ౪. ౪౯౧. (తెరలిక అని చి. ని. పా.)

తెఱ=తెఱ్ఱ. (చూ. తెఱప.)

తెఱఁగు=తెఱవు. వి.(క. తెఱంగు.) ౧. విధము, ప్రకారము,పద్ధతి.

సీ...తెఱఁగు చందము పగిది విత మనంగను మీఱుచుండుఁ బ్రకారసంజ్ఞ. ఆం. భా. ౨. ౩౦౩.

సీ...పలుదెఱంగులమావిపండ్లతోడ. ఆము. ౨. ౭౩.

క. ఎఱిఁగియెఱిఁగి నీముందఱ,నఱగొడ్డెము చేసిపోయి రది గైకొన నీ,తెఱఁ గయినహంసడిభకులు, కొఱవిం దల బరికికొన్న కొఱఁడులు గారే. ఉ. హరి. ౪.౧౦౬.పారి. ౧.౭౫.

౨. స్థితి, దశ, అవస్థ.

క. అగ్గజగామిని కామిని,యగ్గలికపు బెగ్గడిల్లి... సిగ్గున నేకాంతసదనసీమకుఁ జనియెన్.

వ. అట్లుచనుటయు.

ఆ. సకియ లత్తెఱంగు సకలంబు నూహించి... విక్ర. ౧. ౧౨౬, ౧౨౭, ౧౨౮.

క...అప్పడఁతి వేఁడికన్నీ రొలుకం, దన తెఱఁ గెఱిఁగించిన విని, యనుఁగుంజెలు లెల్ల దానికని రిట్లనుచున్. నీలా. ౨. ౧౦౦.

౩. పక్షము, వైపు.

సీ. వరుసతో వాదించి యిరుదెఱంగులవారి వారించి...భీమ.౪.౧౪౯. హర.౬.౧౧౨.

ఉ. రెండుతెఱంగు మూఁకలును రిత్తరిత్త చలంబు పెంపునన్. కేయూర. ౨. ౧౧౬.

౪. చిహ్నము, లక్షణము; స్వభావము.

గీ. అందుఁ బువ్వులఁ బూజించినట్టి తెఱఁగు, నర్ధచంద్రప్రహారచిహ్నములు కలిమి. నైష. ౩. ౧౪౯.

క. ముగుద యెఱుంగక పంచినఁ, దగునే యిట్లేఁగుదేరఁ దమ్ముఁడ యోద్ధ,త్యాగరిష్ఠ యక్షరక్షో,విగాఢ మీయడవి యిది వివేకము తెఱఁగే. రాఘవ. ౩. ౯౬.

గీ. ఇట్లు వచ్చినఁ గనుఁగొని యేను మిగుల,నుల్లమున వెఱఁగందితి నొకటివెనుక, నొకటి రాఁ జొచ్చె మాయ లీయుర్విమహిమ, తెఱఁగు గాదుగదా యని ధృతి చలింప. కళా. ౩. ౨౪౨.

౫. పోలిక,సామ్యము.

క...అ,క్కఱచినబిసలవవిసరము, తెఱఁగున వడగండ్లు ధవళదీధితి రాలెన్. ఆము. ౪. ౧౨౧.

క. శ్రీవల్లభుండు లక్ష్మీ,దేవిని మును బెండ్లియైన తెఱఁగున...ఉ. రా. ౧. ౪౯.

౬. వృత్తాంతము, సమాచారము.

గీ. ఏను నారాక తెఱఁ గెల్ల నేర్పడంగఁ, జెప్ప విని యేమి సెప్పినఁ జేయువాఁడ. భార. ఉద్యో. ౩. ౨౩౬.

మ. కని యయ్యేటి తెఱం గెఱుంగుటకు నైష్ఠ్యావకుండు గాంక్షించినన్. చం. రా. ౩. ౨. ఉ. రా. ౨. ౨౪౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౭. చేయఁదగినపని, కర్తవ్యము; పని.

క. తెలుఁ గొట్టిదియో నామది, నెలుఁగ మదాత్తోపహార మిచ్చెద నీకున్. భార. సౌ. ౧. ౧౨౦.

క. విచ్చి చనకుండఁ బసులం, దెచ్చుట మును మున్న వలయు తెలుఁ గాపనికిం, జొచ్చి యది చక్కఁ బెట్టఁగ, నచ్చోటున దాయ మనకు నగపడెడు బలే. భార. విరా. ౪. ౨౪౮.

౮. సంధి; ఐకమత్యము.

ఉ. కౌరవపాండవుల్ తెలుఁగు గైకొని శాంతత బొంది యున్కి మేలు ... భార. ఉద్యో. 3. ౨౬౨.

సీ. కుశలివై యుండుదే కురువంశసత్తమ పౌరజనులు జానపదులుఁ దెలుఁగు, తో నిన్ను నను సరింతురె... భార. ఆశ్ర. ౨. ౪౭.

౯. క్షేమము.

క. అనురూపము లగుమాటో, డ్డనముల్ ప్రస్ఫురితములు దృఢంబులు గాఁ దీర్చినఁ గాక తెలుం గగునే... భార. భీష్మ. ౨. ౨౬.

౧౦. పొలుపు, అందము.

ద్వి. తిన్నఁగ నటుపోయి తెలుఁ గొప్పఁ గాంచి, మన్ననచే మానిమహిమ వీక్షించి. రం. రా. బాల. ౧౧ పొ. ౨౯ పం.

మ... మిగులఁ బంతం బేల నిం కంచునో, తెలుఁ గొప్పన్ రతిచేతి కిచ్చె మరుఁ డర్థిన్ దుం టవి ల్లంతటన్. ఉ. హరిశ్చ. ౧. ౫౧.

విణ. అనుకూలము, క్షేమంకరము.

క. ఏచి చలంబున నొంటికిఁ, జూచిన నప్పటికి మనకుఁ జూడం గార్యం, బేచందంబునఁ దెలుఁ గగు... భార. విరా. 3. ౧౧౦.

తెలుఁగుపోలె=పోలిక, సామ్యము.

ఆ. వరవిదూరభూమి వైదూర్య ముదయించు, తెలుఁగువోలె దిశలు తేజరిల్ల. కు. సం. 3. ౨౭౨.

జ: తెలుఁగుపఱుచు, తెలుఁగుమాలు, తెలుఁగువడు.

తెలుఁగుపఱుచు. స. క్రి. (√తెలుఁగుపడు)

౧. నెఱవేర్చు, తీర్చు.

గీ. మఱియు వలయుకృత్యంబులు తెలుఁగుపఱుప, వలసినన్నిదినంబులు నిలిచి... భార. అశ్వ. 3. ౨౦.

౨. చక్కఁబఱుచు, సవరించు.

క. ఎఱిఁగించి రాజ్యతంత్రము, తెలుఁగుపఱిచి నడపువెరవు తేటపడంగా. భార. మహా. ౮.

3. సిద్ధపఱుచు, ఆయత్తముచేయు.

క. రాఁ బనుపుఁడు పార్వతికులఁ, దేఁ బనుపుఁడు తెలుఁగుపఱిచి తేరు... కృ. శకుం. ౧. ౪౯.

౪. శాంతిపఱుచు.

గీ. తెలుఁగుపఱుపంగ మిగిలి యుద్రేకు లైన, వార చెడువారు విమలవిచారవిభవ. భార. ఉద్యో. ౧. ౪౪.

తెలుఁగుమాలు. అ. క్రి. (తెలుఁగు+మాలు)

౧. న్యాయముతప్పు.

సీ... వీరి నేవిచార, మించుకయును లేక యిట్టి కష్టపుటిడుమలఁ బెట్టెడిదె ధర్మమా తెలుం గు. గీ. మాని తే నీవు ... భార. స్వ. ౨౪.

౨. నీతిమాలు, దుష్టమగు.

ఉ. అక్కట తండ్రియేల మరునయ్యకుఁ బెండ్లియొనర్తు నంచుఁ బె, న్మక్కువ నుండుచోఁ దెలుఁగుమాలినటక్కరియాలపోతులి, ట్లెక్కడనుండి కల్గె... నీలా. ౨. ౭౨.

తెలుఁగు(ప)వడు. అ. క్రి. (తెలుఁగు+పడు) చక్కఁబడు, నెఱవేఱు, సిద్ధించు.

ఆ. మాటపొం దెఱింగి యోటమై నల్లనఁ, జేరి కౌరవేంద్రుచిత్తవృత్తి, కనుగుణంబు గాఁగ నానతుం డగుచుఁ బ్రార్థించి యడుగకుండఁ దెలుఁగుపడదు. భార. ఉద్యో. ౧. ౨౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క... తెఱఁగుపడదు వలయుకార్యము మనకుక్. దశకు. ౭. ౩౧.

తెఱకువ. వి. (√తెఱచు) ౧. వివేకము, తెలివి.

చ. ఎఱుఁగఁడు వీఁడు నాథటుఁ డొకించుక యైన మనంబులోపలం, దెఱకువ లేక నీజన కుఁ దెచ్చె...భాగ. ౧౦ పూ. ౯౫౭.

చ. ఎఱిఁగెడువాఁడు కర్తచయ మెల్లను మాని హరిస్వరూపము, స్నెఱయ నెఱుంగుఁ దాను నది నేరుపుఁజూపు గుణానురక్తుఁడై, తెఱ కువ లేక భ్రమరుచు దేహధనాద్యభిమాన యుక్తుఁడై, యెఱుఁగనివానికిం దెలియ నీశ్వ రలీల మునీంద్ర చెప్పుమా. భాగ. ౧. ౯౯.

౨. ఉపాయము, వెరవు.

క. కనుఁగొని యిది మునియాశ్రమ, మనుతహ తహ వొడమి యిచటి కరిగిన నాకుక్, గన నగు నొకతెఱకువ యని, మనమునఁ గలదిగు లు కొంత మట్టువడంగక్. మనుచ. ౨. ౨౦.

తెఱకొను. అ. క్రి. (తెఱలు + కొను-స్వార్థమున) బయలుపెడలు. (శ. ర.)

తెఱకొలుపు. స. క్రి. (√తెఱకొను) బయలు వెడలఁజేయు. (శ. ర.)

తెఱగంటి. వి. (తెఱప + కన్ను + ఇ³) ౧. వేల్పు.

క. సురలకు వేల్పులు జేజేల్, తెఱగంటులు బాసవాలుదిట్టలనం బ్బేళ్లిర వగు...ఆం. భా. ౧. ౬౯.

సీ. తెఱగంటిబోటు లందఱు పరిచారికల్ శై లేంద్రకన్యక మేలిచెలియ. జాహ్నవీ. ౧. ౬.

౨. అనిమిషము, చేఁప, మత్స్యము.

వ...గుండ్రవరుసలు దిరుగు తెఱగంటి తెఱగంటి కంటితో నద్వైతవాదంబులు సేయు... చంద్రి. ౬. ౪౮. తపతీ. ౨. ౧౬.

తెఱగంటియెకిమీఁడు=ఇంద్రుఁడు.

సీ. తెఱగంటియెకిమీని తేజిసాంపును గెల్పిపాఁ పరాయనిపస పొఱిఁదోలి. రామ. ౩౭౧.

ఇట్లే: తెఱగంటిదొర, మొ.

సీ. తెఱగంటిదొరవింటి నెఱివంటితెఱఁ గంటి సరిగెంటి నిడుతోఁక చదలఁ బొదల. సమీ ర. ౩. ౯౭.

తెఱగంటితపసి. వి. (√తెఱగంటి) దేవర్షి, నారదుఁడు.

గీ. అనుచుఁ దెఱగంటితపసి రామాయణంబు, నీళ్లరాయనిగాదిలినిసుఁగుతోడఁ, దెలిపె... అచ్చ. రా. యు. ౫౯౩.

గీ. వినుము కరువలి మేపరిమనికిపట్టు, కాన్పుజడదారి కత్తెఱగంటితపసి, యవలికతఁ దెల్పఁ బూని...అచ్చ. రా. అయో. ౨.

తెఱగంటిత్రోవ. వి. (√తెఱగంటి) సురవర్త్మము, ఆకాశము.

క... మెఱఁగెం దెఱగంటిత్రోవ మించుందుటుముల్. అచ్చ. రా. కిష్కిం. ౫౭.

తెఱగంటిపెద్ద. వి. (√తెఱగంటి) సురజ్యేష్ఠుఁడు, బ్రహ్మ.

వ...తెఱగంటిపెద్దతో...దశా. ౧. ౧౪.

తెఱగంటిమ్రాఁకు(ను). వి. (√తెఱగంటి) సురతరువు, కల్పవృక్షము.

సీ. ధేను లెల్లను గామధేనువు లయ్యెను మ్రాఁకులు తెఱగంటిమ్రాఁకు లయ్యె. దశా. ౧. ౫౭.

తెఱగంటిరారా. వి. (√తెఱగంటి) ఇంద్రనీలమణి.

సీ. తెఱగంటిరారాలఁ దీర్చినకంబాలజతఁగూడి యున్నవజ్రంపుబోది. చంద్రి. ౬. ౧౧౨.

తెఱచు. స. క్రి. (త. తిఱ. క. తెఱెు) ౧. వివృతముచేయు, తెఱపచేయు.

క. మే నెఱిఁగి తొంటియనుసంధానము చెడి కన్ను దెఱచి దారుణఫణితిక్. మనుచ. ౪. ౧౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. పెరుఁగునివ్వెఱతో నోరు తెఱచికొనుచుఁ,
దప్ప కీక్షించె దానిసౌందర్యమహిమ. శుక.
౨. ౨౫౨.

౨. (తెఱపచేయుటకై) తీయు, తొలఁగించు.

గీ. సప్తపాతాళభువనవిష్కంభములను, దెఱ
చి వెడలినజ్యోతిప్రదీప్తమూర్తి, శంభు
భీమేశ్వరేశ్వరస్వామిఁ గొలుచు, పరమమా
హేశ్వరున కేమి బ్రాంతి ముక్తి. భీమ. ౧.
౧౧౩.

ఉ...కవాటముల్...రతి డస్సి గాడ్పులకుఁ
గాఁ దెఱవక జను విచ్చి మేడలన్. ఆము.
౨. ౧౩.

౩. విరియఁజేయు, వికసింపఁజేయు.

సీ. కమలాగృహకవాటకలితకుంచిక నాఁగ జల
జకోరకరాజిఁ గలయఁ దెఱచి. విక్ర. ౧.
౯౭.

అ. క్రి. బయలుమెఱయు, బయలుపడు.

మ. వివిధామోదవిమిశ్రితానిల మొగి నీ్వచెన్
...నిధుల్ దెఱచె నుర్విన్ గౌరి జన్మించి
నన్. కు. సం. ౩. ౨౭౩.

జ: తెట్టతెఱవామెకము, తెఱకువ, తెఱకొను,
తెఱకొలుపు, తెఱఁగంటి, తెఱఁగంటితపసి,
తెఱఁగంటిత్రోవ, తెఱఁగంటిపెద్ద, తెఱఁగంటి
మ్రాఁకు, తెఱఁగంటిరారా, తెఱనోటిమెకము,
తెఱనోరు, తెఱప, తెఱపి, తెఱపిగొను, తె
ఱపు, తెఱపుమఱపు, తెఱపులుచేయు, తె
ఱవ, తెఱవామెకము.

తెఱనో(రి)టిమెక(గ)ము. వి. (√తెఱనోరు)
పంచాస్యము, సింహము.

గీ. పంచముఖసంజ్ఞ పార్వతీపతికిఁ గాక, హరి
యనుశుభాహ్వయంబు శ్రీహరికిఁ గాక,
యిట్టితెఱనోరి మెకముల కేల యనుచుఁ,గనలి
యుగ్రము లైనసింగములఁ గెడపె. రామా.
౨. ౫౬.

గీ. గొరు లాముస నోడ లెఱుంగమిని జూచి,
మేఁత లందిమ్చ తెఱనోటిమెకము లడరు.
యయా. ౨. ౪౯.

సీ. అదినిండుచలివెలుంగా కాదు మబ్బుటేనుఁ
గుఁ దోలు తెఱనోటిమెగము గాని, వేం. పం
చ. ౪. ౨౧౮. (శ. ర. పా.)

తెఱనోరు. వి.(తెఱప+నోరు)౧.విపృతాస్యము,
తెఱచికొనియుండునోరు.

సీ...తెఱనోరఁ ద్రేవుకు తీఁగసాఁగ. కాశీ.
౬. ౪౧.

సీ. నిరవలంబంబుగఁ దిరుగుచు తెఱనోరు తెఱ
చుచుఁ జనియెఁ గిన్నరకులంబు. దశా. ౨.
౬౦.

౨. (తెఱచుకొని యుండునోరు కలది)పంచాస్య
ము, సింహము.

సీ. ఏనుంగువేఁట కే నేర్చి తీర్చినయట్టితెరనో
టికం దిది ధీరహృదయ. చంద్రా. ౨. ౪౨.

సీ. కరముల శంఖచక్రములు దాల్చినవాని మురు
వైన తెఱనోటియొఱపువాని. ఘటికా. ౩.౭.

తెఱప. వి. (√తెఱచు) ౧. తెఱచుట. ౨. ఉప
శమనము. (శ. ర.)

విణ. (ఇది వృత్తియందు బహుళముగా అంత్య
వర్ణము లోపించుటచే తెఱ, తెఱ్ఱ యనురూపం
బులనొందును. ఉదా:—కందెఱ, తెఱఁగంటి, తె
ఱ్ఱనోరు. మొ.)

౧. మఱుఁగులేనిది, బయలయినది, అసంవృతము.

గీ.పసిఁడిగట్టున కొకవింతమిసిమి నించి,నెఱసెఁ
గడసావిముదుసలి తెఱపయెండ. పారి.౪.౪౩.

తెఱపి. వి. (√తెఱచు)-దేశకాలములందు-అవకా
శము, ఎడము, సందు.

ఉ. ఊఱక నరుండు ద్రోణసుతుయుగ్యములన్
వెస నొంచె నాతఁడున్, దెఱపి యొకింత
గాంచి ఘనతీవ్రశరంబున నారిఁద్రుంచి...
భార. విరా. ౫. ౧౪౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. ఈచందంబునఁ దెఱపులు, వేచియుఁ బయిఁ బూఁచి లాఁచి వ్రేసియుఁ బైపైఁ, ద్రోచురు ధిరమునఁ దడిసిరి, పూచినమోదుపులతోడఁ బుట్టువు లనఁగన్. ఉ. హరి. ౩. ౬౩.

క. బిఱుబిబ్బున తాలు వడెం, దెఱపియుఁ గన లేమి సాతు దిరుగుడువడియెన్. ఆము. ౬. ౭౮. నిర్వ. ౪. ౬౩.

తెఱపిగొను. అ. క్రి. (తెఱపి + కొను) సందుచేసికొను, అవకాశము కలిగించుకొను.

క. తెఱపిగొని నీవు సొచ్చినఁ, బిఱుదన చొచ్చెదము రిపులు వెల్లిగలఁగ... భార. ద్రో. ౨. ౭. (చూ. భార. ద్రో. ౨. ౫.)

క. మెఱుఁగు లగువాఁడిచూడ్కులు, నెఱకులు గాఁడఁగొన నగజ నెరవిడిఁ జూడన్, దెఱపి గొనుకతనఁగా కెదఁ, బెఱనాఁ డమ్మరుశరంబు భేదించు హరున్. కు. సం. ౫. ౫౧౭.

తెఱపు. వి. (√తెఱచు) ౧. మూర్ఛనుండి తేఱుట, తెలివినొందుట. (చూ. తెఱపుమఱపు.)

క. మఱియుఁ దముఁ బొదువుమూర్ఛల, తెఱపులఁ గైకొనుచు వారు దెగఁ బోరి... భా. రా. యు. ౭౧౨.

౨. చీలిక. (చూ. తెఱపులుచేయు.)

తెఱపుమఱపు. వి. (√తెఱపు) తెలివితోఁ గూడినమదిలబ్బిబ్బు, ఒకప్పుడు స్మృతితో నుండుట. (వ్యవ) వానికి పుట్టినసంధి తెఱపుమఱపుసంధి. (శ.ర.బ్రా. వా.)

తెఱపులుచేయు. స. క్రి. (తెఱపులు + చేయు) చీలికలు చేయు, చీల్చు.

చ...మార్గణవర్గములు...వచ్చి వక్షముల్, దెఱపులుచేయుచు న్నెడలు ద్రెంచుచుఁ బొట్టలు సించుచున్...భా. రా. యు. ౧౦౭౨.

తెఱలు. అ. క్రి. (వాసన)బయలువెడలు.(శ.ర.)

తెఱవ. వి. (త. తెరివై. తెఱ + వాయి=రహస్యము దాఁచ నేరనిది అని చి.ని.) ౧. ఆఁడుది; భార్య.

గీ. మెఱయ నాయాడుమాటలు తెఱవపిండు, నుల్లమునకు నింపారెడునురులు గావె. భార. విరా. ౨. ౩౩౫.

క. ఉఱవగు నారుగపంటలు, గొఱియలపాడియును దఱ చగుం బురుషులకుం, దెఱవల చుట్టము లయ్యెద,రు... భార. అర. ౪. ౨౯౫.

౨. బయలు, తెఱపి.

సీ... తెఱవ నా బయలును స్త్రీ దనర్చు. ఆం. భా. ౩. ౫౪.

(వ్యవ)-(చదరంగము) బంటును త్రోసినయెడల రాజు తెఱవలో నుండును, రాజునకు తెఱవగును.

తెఱవా(యి)మెకము. వి. (తెఱ + వాయి + మెకము) పంచాస్యము, సింహము.

క. మెకముల ఱేఁ డనఁ దెఱవా, మెక మన సింగ మన ... కరిరిపునామధేయములు ... ఆం. భా. ౨. ౯౧.

ఆ. మఱవ కందు జోగి తెఱవాయిమెక మున్న, చెంత కరిగి యతనిచేత విండ్లుఁ, గత్తులములు దూపుగములును దద్దయుఁ, గొంచు నంతఁ జనిరి పంచవటికి. అచ్చ. రా. అర. ౭.

ఇట్లే: తెఱమొగము మెకము.

సీ. నెఱసరి సింగంబు తెఱమొగము మెకంబు... అనఁగ సింహము పేళ్లు...సాం.ని.తిర్య.౭౧.

తెఱవు=తెఱఁగు. వి. (క. తెఱవు)

(మంచిమార్గము; న్యాయము, ధర్మము.)

క. పిఱుతివియక నాముందఱఁ, దెఱవా యిప్పగిది నాడఁ దెఱవా మేల్ మేల్. అచ్చ. రా. అయో. ౨౨. (శ. ర. పా. "తెరవా". అపముద్రి.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(స్థితి, అవస్థ.)

గీ. అమ్మ విను మింక నొకయించుకంతతడవు, నీ తెఱవుఁ జూడ నీపేరు నీతెఱంగు, నడిగి పరికింప మది యున్నది...కళా. 3. ౭౨.

తెఱ్ఱి=తెఱ. (వృత్తియందు తెఱపశబ్దమునకు అయిన రూపము. చూ. తెఱప.)

సీ. బొక్కిఱొమ్మును నూఁదబొడ్డును మిడిపండ్లుఁ దెఱ్ఱినోరును బాఁచి దేఱుమొగము. భల్లా. ౮ ఆ. (శ. ర.)

తెల=తెల్ల. (దీనిఆమ్రేడితరూపము తెలతెల.) వి. ధవళిమ, తెల్లకాంతి.

గీ. దండహతులాద వెనువెలతలిరుఁబోండ్ల, తల్లులకుఁ దూర్పు తెలతెలల్ దాయునపుడు. రా. వి. ౧. ౨౨. (తెలతెలలు=కొంచెముకొంచెము తెలుపులు.)

విణ. ధవళము, తెల్లనిది.

క. తలయుం జీరయు నొడలును, దెలతెలగాఁ బడ్డపిండి దిక్కులు గప్పన్, బలపలనివేడ్కతోఁ డుత, వెలవెలనై బ్రాహ్మణుండు విస్మితుఁడయ్యెన్. నా. పంచ. ౫. ౧౯.

ద్వి. అంత నిశాచరు లతిఖేదమొంద, వింతగ వాల్చుక్క వెడలి యావేళఁ, దెలతెలగాఁ దూర్పుదెస విస్తరిల్లె. ద్వి. శ. సా. 3. ౯౯ పా. 3 పం.

క్రి. విణ. (ఇది వేగు తోకలసియే కన్పట్టుచున్నది.) తెల్లగా.

చ. తెలతెల వేగ నప్డు...భార. మౌ. ౧౮౦. (శ. ర.)

క. తెలతెలవేగిన...మనుచ. ౪. ౧౨,౫. ౪౧.

జః తెలతెలఁబోవు, తెలతెలవాఱు, తెలన, తెలవాఱు, తెలి[1], తెలికడలి, తెలిగంటి, తెలిగాము, తెలిగిబ్బ, తెలిగొను, తెలిడాలుమెకము, తెలితేజి, తెలిదమ్మి, తెలిదీవి, తెలిదీవిదొర, తెలినువ్వు, తెలిపక్కము, తెలిపరిగె, తెలిపులుఁగు, తెలిమల, తెలిమావు, తెలిమిన్న, తెలిమెకము, తెలిమొదవు, తెలిమోముపక్కి, తెలిమ్రాను, తెలియేఱు, తెలిరా, తెలిఱెక్కపులుఁగు.

తెలగా. వి. (సం. త్రిలింగః) త్రిలింగదేశమునందలియొకశూద్రజాతి; ఆజాతివారు. (వృత్తియందు హ్రస్వాంతము. ఉదా:- తెలగబలిజెలు. శ. ర.)

తెలగాణము. విణ. (తెలుఁగు+ఆణెము.) తెలుఁగుదేశసంబంధమైనది.

సీ. తెలగాణభూములఁ గలమన్నెవారిచే ... వి. పు. ౧. ౪౧. (శాసనములలోఁ 'తెలుంగాణెము, అని కన్పట్టుచున్నది.)

తెలచు= తెలుచు.

(ప్రసన్నతనొందించు)

గీ...అప్పుడతనిఁ, దెలచి సోమ మాశ్వినులకుఁ గలుగఁజేసి, తరయ నెందును బ్రహ్మబలాతిశయముఁ, గడచినట్టి బలంబులు గలవె యనఘ. భార. అశ్వ. ౧. ౭౮.

గీ. దేవతలఁ జిత్రతపమునఁ దెలచి గంగఁ, బ్రచురపౌరుషుఁ డగుభగీరథుఁడు... తెచ్చె నిద్ధరణి కనఘ. భార. ఆను. ౨. ౨౧౨.

(భజించు, సేవించు.)

క. అతఁ డధికభక్తితో నాయతకీర్తిస్ఫూర్తి వర్తియై వెలసి జగత్పతి నుచితపూజనంబులఁ, బ్రతిఘస్రము దెలచు భక్తిపరతంత్రుండై. పాండు. ౫. ౯౬.

అ. క్రి, స. క్రి. మ్రొక్కు, నమస్కరించు.

మ. అసలుం డంజలిచేసె నంతకుఁడు సాష్టాంగగంబు గావించె మ్రొక్కె నిశాచారి ప్రచే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తనుండు తెలచెక్ గేల్మోడ్చి సారంగవా,
హనుఁడు...పారి. ౩. ౭.

(స్తుతించు, పొగడు.)

గీ. దేవమంత్రి యే తెంచి యా దేవపూజ్యు, నల ఘుఫణితుల ని ట్లని తెలచెఁ బ్రీతి. హరి.ఉ. ౧౦. ౧౫౯.

(ప్రార్థించు, వేఁడు.)

క. అసురపతి విప్రునలుక, గాసిబడఁడె తెలచి పడసెఁ గాదె నయనముల్. భార. అను.౫. ౬౮.

గీ. ఆదిదేవు జగన్నాథు నచలు విష్ణుఁ,గృష్ణు నతి భక్తిఁ దొలుతసంకీర్తనమునఁ,దెలచి నీవు నన్ను డిగిన తెఱఁగు దెలియ, వినుము సెప్పెద నవ ధానవృత్తితోడ. హరి. ఉ. ౫. ౧౯౦.

తెల తెలఁబోవు=తెల తెలవాఱు.(√తెల)(శ.ర.)

తెల తెలవాఱు. అ. క్రి. (√తెల) ౧. తెల్ల వాఱు, వేగు; బాగుగా తెల్లవాఱు; కొంచెము తెల్లవాఱు.

క. తెల తెలవాఱుటఁ గని ని,స్తులధృతి బేతాళ భటులు తొలుతటిమగనిం, జెలిప్రక్క నునిచి...శుక. ౧. ౨౧౮.

చ...వడకన్ను మొగిడ్చె లలిక్ కుముద్వతుల్, తెల తెలవాఱె జంభరిపుదిక్కునఁ దోఁచె ననూరుగాగముల్. భీమ. ౨. ౪౮.

క. తెల తెలవాఱెడువేళం, గలకల మని పలికెఁ బక్షిగణ మెల్లెడలన్. భాగ. ౧౦. ఉ. ౧౦౦౨.

చ. తెల తెలవాటినన్ దొరలదేవర తామరకం టివాతెఱన్, బలు మొన లొత్తి మేల్కొలుప...యయా. ౫. ౨౮.

౨. (భయాదులచే) వివర్ణమగు, తెల్లఁబోవు.

క. వేవినయంతకు నలువుర, జావంకెంబులును బోలె సైన్యము హాహా,రావములతోడఁ జూడఁగ, దీవన వడయంగఁ దూర్పు తెల తెలవాఱెన్. ఉ. హరి. ౩. ౧౪.

క. తొలివేల్పులమొగములు తెల,తెలవాఱఁగ. దెల్లవాఱెఁ దెఱవలమోముల్. అచ్చ. రా. బాల. ౧౭.

తెలన=తెల్లన. విశే.(√తెల) తెల్లనిది, ధవళము. (దీనియామ్రేడిత రూపము తెలతెలన.)

సీ. అడపంబుతొయ్యలి మడచి యిచ్చినతెల నాకుఁజీలిక చేతియంద యుండ. కళా. ౨. ౧౭. (తెలనాకు = తెల్లనిలేఁతతమలపాకు.)

క...ఇచ్చుక్, బలి యొకతెలనాకుమడుపు ప్రాణేశ్వరికిన్. రామా. ౪. ౧౬౯.

మ...అయ్యింతిచెక్కులఁ బోలుం దెలనాకులు ...పాండు. ౧. ౨౯.

క. తెల తెలనయ్యెను దిక్కులు, పలపల నుడుగణము మాయఁబాఱెను...హంస.౧.౧౩౮.

క. చెలిమికి నినుండు బలుకర,ములతోఁ జను దేర మిన్ను ముట్టినయుదయా,చలపతికి వేళ వీచిన,ధెలివీచోఁపుజిగిఁ దూర్పు తెలతెల నయ్యెన్. ఉ. రా. ౪. ౨౪౭.

తెలవాఱు=తెల్లవాఱు. అ. క్రి. (తెల+పాఱు) (వేగు, ఉదయమగు.)

క. తెలవాఱె నపుడు దీపపుఁ, గళికలతో వెల్లఁ బాఱెఁగాఁ దన మోముల్. హంస. ౨. ౬౮.

క. తెలవాఱుటయుఁ గిరాతుం, డలసతి మేల్కాంచి యాలయప్రాంగణభూ,తలమునఁ గిటిఁ గానక మదిఁ, గలవల మందుచును దుర్వికారాకృతులై. చెన్న. ౨. ౬౧.

(ఈ క్రింది ప్రయోగమున తెలాఱు అని కన్పట్టుచున్నది.)

గీ. ఆఁకటను బోవఁజాలవే యంగడింట, గంట తాకట్టుగా నుంచి కడుపు నిండఁ, గుడుపు మి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ్చుట నీడిలఁబడి తెలాఋ,దాఁక నొఁఅలినఁ గలుగదు తథ్య మనిన. చెన్న. ౨. ౪౨.

తెలి[1]=తెల్ల. విణ. (తెల+ఇ[3]) ౧. తెల్లనిది, ధవళము.

సీ. తెలిగన్నుఁగవకాంతి పొలుపార నించుక గనువిచ్చి చూచినఁ గాదె యబల. భార. విరా. ౨. ౪౫.

చ. తెలినులివెచ్చ యోగిరముఁ దియ్యనిచారులుఁ దిమ్మనంబులుక్. ఆము. ౧.౭౧.నీలా.౧.౨.

౨. నిర్మలము, స్వచ్ఛము; ప్రసన్నము.

సీ. సెలయేటి తెలినీటఁ జిఱుబంతిపసుపాడి సేస క్రొమ్మళ్లఁ బచ్చియలు తుఱిమి. హర. ౫. ౩౬.

గీ. తెలిమొగంబుతో నల్ల నేతెంచి యొక్క, పార్శ్వమునఁ బొడనూపి భూపతికి మ్రొక్కి, దేవదత్తంబు పూరించె...భార. ఉద్యో. ౪. ౧౨౫.

ద్వి. రామభూవరుఁడు వారక యుపవాసి, యై మూఁడుదివసంబు లటు శయనించి,తెలిడెంద మున జలదేవత నిలిపి, పలుమఱు నిమ్మతోఁ బ్రార్థనఁ జేసె. రం. రా. యు. ౩౦౭ పొ. ౫ పం. పాండు. ౨. ౫౫.

వి. ౧. తెలుపు, ధావళ్యము.

సీ...తెలి తెల్ల తెల్లన తెలుపు వెల్ల, వెల్లన వెలి నాఁగ వెలయును శుక్లంబు...ఆం.భా. ౧. ౧౦౭.

౨. వికాసము, తెలివి.

ఆ. ఉటికి మంటలోన నుల్లంబు తెలి వోక, యింతయేనిఁ గుంద కిద్ధమూర్తి,దేజరిల్లనున్న ధీర వర్యునకుఁ బ్రత్యక్షమయ్యె శివుఁడు దయ దలిర్ప. భార. సౌ. ౧. ౧౨౪.

తెలి[2]. వి. ౧. పక్వఘృతము, కాఁచిన నేయి.

సీ. తనరును బక్వఘృతంబు తెలి యనంగ... ఆం. భా. ౨. ౭౪౯.

౨. స్నేహము, చమురు.

సీ. గోర్వెచ్చ తెలి యంటికొనిరి మస్తకముల జలకమాడిరి నిశామిళితవారి. పాండు.౩.౭౪.

(చి. ని. పా. చమురు అని ముద్రి. పా.)

౫.జలవిషాదిదివ్యప్రమాణము.(చూ. తెలిగొను.)

తెలిక. వి. (సం. తిలకః) ౧. నువ్వుమొక్క. (చి. ని.) ౨. నువ్వులు ఆడి నూనెయు తెలకపిండియు అమ్ముకొని జీవించుజాతి.

చ. తెలికలమిండగీఁ డొకఁడు తియ్యనినూనెకు ...(శ్రీనాథుని చాటువు.)

౩. బ. తిలలు, నువ్వులు. (శ. ర.)

జః తెలికజోటి, తెలికపిండి, తెలికవాఁడు,తెలికి.

తెలికడలి. వి.(√తెలి[1])క్షీరాబ్ధి,పాలసముద్రము.

సీ. తెలికడలిని గరువలిసుడుపరిదొరపఱుపుపయి నిదురఁ గొఱలు నుత్రియ. అచ్చ. రా. అర. ౧౧౪.

తెలికజోటి. వి. (తెలిక+జోటి) గాండ్లది.

గీ. మలికినాఁటిది కాఁబోలు చెలి కిరాట,కలికి చిలుకలకొలికి యీ తెలికజోటి. క్రీడా. ౧౦౨.

తెలికపిండి. వి. (తెలికలు+పిండి. వృత్తియందు 'లు' వర్ణలోపము.) తిలపిణ్యాకము, తిలపిష్టము, గానుఁగపిండి.

ఆ. ఉల్లి తెలికపిండి ముల్లంగి నేబీఱ, పుచ్చ దొండకాయ పుట్టకొక్కు, లూరుఁబిండి మునుఁగ మారేడుగాయ ల, ట్లనుభవించు వారి ననఁగి పెనఁగి. పద్మ. ఽ. ౧౧౭.

సీ...తిలపిష్టమున కగుఁ దెలికపిండి. గీ. గాన్గ పిండి యనంగ...సాం. ని. మాన. ౪౭.

తెలికవాఁడు. వి. (తెలికలు+వాఁడు) తిలఘాతకుఁడు, గాండ్లవాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ...తిలఘాతకుం డొప్పుఁ దెలికవాఁడు, గా
నుఁగవాఁ డన...ఆం. భా. ౨. ౨౨౫.

తెలికి. వి. (తెలిక+ఇ³) తిలఘాతకుఁడు, గాండ్ల
వాఁడు.

వ...శ్రీ వెజవాడ శాసను లైన తెలుకులకొమ్మన
గడియనలు మూలస్థానమహాదేవరకు నఖండ
దీపంబున కిచ్చినగొఱియలు ౨౫...దా. శా.
౪. ౬౬౭.

వ...బెజవాడ మల్లేశ్వరదేవరగోపురము ముంద్ద
టి ముఖమండపము అఖిలదేశాల తెలికివేగురు
న్ను ఆచంద్రస్థాయిగాం జేయించ్చిన ధర్మ
ము. మంగళమహా శ్రీశ్రీశ్రీం జేయుఁగా.
దా. శా. ౪. ౭౯౬.

తెలిగంటి. వి. (తెలి+కన్ను+ఇ³) ధవళాక్షి;
ఆఁడుది.

సీ. దౌహృదశ్రీ నిల్చుధవళాంబుజముపోల్కిఁ
దెలిగంటి నెమ్మోము తెల్లనయ్యె. ఉ. రా.
౨. ౧౩౭.

గీ. కంటిమో వింటిమో యిటువంటివాలుఁ, గంటి
ధరయందె కాదు వేగంటినగరిఁ, గలుగు తెఱ
గంటితెలిగంటిగముల నైన, నెటుల సృజ
యించె ధాత యీయిందుముఖిని. దశా.
౭. ౨౧౨.

సీ. తెలిదమ్మివిరియింటి తెలిగంటి కెంపువా తెఱసాం
పె పవడంపుఁదీఁగెగుంపు. దశా. ౧. ౧౬౪.
శుక. ౨. ౩౨౩.

తెలిగాము. వి. (√తెలి) శ్వేతగ్రహము, శుక్రుఁ
డు, చుక్క. (శ. ర.)

తెలిగిబ్బ. వి. (√తెలి) శివవాహన మగువృష
భము; తెల్లయెద్దు.

క...తెలిగిబ్బ యనఁగఁ బరఁగుచు నుండుఁగా,
శూలధరుఁ డెక్కువృషభము...ఆం. భా.
౧. ౨౪.

తెలిగొను. అ. క్రి. (తెలి+కొను) ప్రమాణము
చేయించు.

క. మ్రుచ్చును బట్టినమాత్రన, చెచ్చెర దండింప
కతనిచేఁ దెలిగొని వాఁడ చ్చైన విడుపు
నిక్కపు, మ్రు చ్చైనం దగినదండమును గొన
వలయుఁగా. విజ్ఞా. ప్రా. ౯౧.(యాజ్ఞ.వ్యవ.
౨౭౨. వ్యాఖ్యమా)

క. ఇల విప్రులకును క్షత్త్రియ,కులజుల కనలంబు
జలము కోమట్లకు శూద్రులకును విష మిడి
తెలిగొన, వలయుం గోశ మది యొండువర్ణుల
కెల్లన్. విజ్ఞా. వ్యవ. ౧౧౪.

తెలిడాలు(ల్మె)మెకము. వి.(√తెలి) సింహము.

క. అమ్మేడచివర కెంతయు, నెమ్మదిలో నెక్కి
కడలు నెమకుచుఁ జెట్టుం,దిమ్మరి తెలిడాలు
మెకం, బిమ్మున నొకమ్రానిక్రింద నెనసినకడఁ
కన్. అచ్చ. రా. సుం. ౨౭.

తెలితేజి (జీ)=తెల్లతేజి. వి. (√తెలి) ఉచ్చై
శ్శ్రవము; తెల్లగుఱ్ఱము.

సీ...తెలితేజిఁ దెమ్మన్నఁ గానక తిరుగు సాది.
దశా. ౨. ౪౯.

తెలిదమ్మి. వి. (√తెలి)పుండరీకము, తెల్లదామర.

సీ. తెలిదమ్మివిరియింటి తెలిగంటి కెంపువా తెఱసాం
పె పవడంపుఁదీఁగెగుంపు. దశా. ౧౧౬౪.

గీ...తెలిదమ్మి వెలిదమ్మి వెల్లదమ్మి, తెల్లదమ్మి యనం
గను దేజరిల్లుఁ, బుండరీకంబు...ఆం. భా. ౧.
౧౬౪.

తెలిదమ్మికంటి=పుండరీకాక్షుఁడు, విష్ణువు.

చ. అని తెలిదమ్మికంటి మది నంటి పెనంగొనుకూర్మి
నాడినం, గనుఁగొని...నీలా ౨. ౪౦.

తెలిదమ్మిగద్దియఁగొలువుండురాయఁడు = తెల్లదా
మర అనుసింహాసనమున కొలు వున్నప్రభువు,
బ్రహ్మ.

సీ. తెలిదమ్మిగద్దియఁగొలు వుండురాయఁడు నిక్క

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భుజగ మేలునేర్పుకాఁడు. అ. తాత బమ్మ యన విధాతనామము లొప్పు. ఆం. సం. దేవ. ౮.

తెలిదీవి=తెల్లదీవి. వి. (√తెలి) శ్వేతద్వీపము.

సీ. తెఱఁగంటిదొరయింటితెలిమ్రాఁకు లెగఁబ్రాఁకి వల నొప్పఁ దెలిదీవికెలన మెలఁగి.నీలా.౧. ౪౫.

సీ. తెలిదీవిపుడమిముద్దులగుమ్మ నిజవలగ్నముఁగఁ బూనుసువర్ణఘంటి యనఁగ. ఉ. రా. ౧. ౩౧౬.

తెలిదీవిదొర. వి. (√తెలిదీవి) శ్వేతద్వీపాధిపతి, విష్ణువు.

సీ. సనకాదులకు లేనిచనవుతోఁ దెలిదీవిదొరచెంగట మెలంగుమురిపె మెల్ల.చం.రా.౨.౩౦.

ఇట్లే: తెలిదీవిమన్నీఁడు.

సీ. చిలువపానుపుదంట తెలిదీవిమన్నీఁడు బటువుఁగైదువుజోదు బమ్మతండ్రి. గీ...పసిఁడి, వలువతాల్పన హరిపేరు లలరు...సాం. ని. దేవ. ౪.

తెలినువ్వు. వి. (√తెలి) తెల్లజాతినువ్వు. ~~~~ I ~~~~

సీ. గోదుమ పెదనువ్వు కుఱునువ్వు తెలినువ్వు కుసుమ వెల్లగిసెయు గోఁగు జనుము.హంస. ౪. ౧౨౭.

(బ.) ధాన్యవిశేషము.

తెలిపక్కము. వి. (√తెలి) శుక్లపక్షము.(శ.ర.)

తెలిపరిగె. వి. (తెలి+పరిగె) మత్స్యాకారముగా నుండుభక్ష్యవిశేషము. హంస. ౧. ౧౦౫.

(తెలుపరిగె, తేలుపరిగె అని ముద్రిపా.)

తెలిపించు. స. క్రి. (తెలుపు+ఇంచు. స్వార్థమున.)

౧. తెలియఁబఱచు, ఎఱిఁగించు.

వ...అది తమకుమారులఁ బిలిచి తెలిపించిన వారలి ట్లనిరి...కళా. ౬. ౧౫౧.

౨. మేలుకొలుపు, లేపు.

ఉ. కొండలపాటునన్ మనము గుందినఁ గంటికి నిద్ర రాక సేనం దెలిపించి యప్డు పయనంబయి దైత్యవిభుండు వోవ...నిర్వ.౬.౫౦.

౩. తెలియఁబఱచు, ప్రకటించు.

ద్వి. లీలమైఁ దెలిపించులేజవ్వనముల, నోలి వినోదించుచున్నయంగనల. రం. రా. ఉ. ౭౭ పా. ౨౬ పం.

౪. (తెలుపు+ఇంచు. ప్రేరణమున) తెలుపునట్లుచేయు, ఎఱుకపఱిపించు.

(వ్యవ) వానిచే ఆతని కావార్త తెలిపించితిని.

తెలిపులుఁగు(గ్గు) వి. (√తెలి) హంస.

చ. బలుతెలిపుల్గువారువము బంగరుపీఁటయు మిన్కుటందెలున్...కల్గియొప్పు న, ప్పలుకుల చానజా నలరుపల్కు లొసంగెడుఁగాత నిచ్చలున్. నీలా.౧. ౬.

ఇట్లే: తెలిపిట్ట, మొ.

సీ. తెలిపిట్టగమిఁ జేరఁదీసి తద్దయు బుద్ది దెలిపి మెల్లన నడల్ దీర్పరాదె. నీలా. ౨. ౯౧. ఆం. సం. తిర్య. ౧౨.

తెలిమల. వి. (√తెలి) కైలాసము, వెండికొండ.

గీ. తెలిమల యనంగ రజతాద్రి తేజరిల్లు. సాం. ని. స్థా. ౫౫.

తెలిమావు. వి.(√తెలి) ఉచ్చైశ్శ్రవము, తెల్లనిగుఱ్ఱము.

సీ. ఇవి గదా తెలిమావురవుతుసంతుపిసాళిదొడసెజ్జఁ బవళించునొడయ లయ్యె. ముకుంద. ౧.౩౪ పా. (తెలిమావురవుతు=ఇంద్రుఁడు.)

తెలిమిన్న. వి. (√తెలి) తెల్లనిరత్నము, వజ్రము.

చ. అని జననేత తత్ప్రియసఖాగ్రణి కేల్ కయిదండఁ బూని చ, క్కని తెలిమిన్న మెట్టికలు గట్టినత్రోవ నగేంద్ర మెక్కె ... చంద్రి. ౨. ౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తెలిమొకము. వి. (√తెలి) సింహము. (శ. ర)

తెలిమొదవు=తెల్లమొదవు.వి. (√తెలి) కామధేనువు. (శ. ర)

తెలిమోముపక్కి. వి. (√తెలి) గరుడుఁడు. సాం. ని. దేవ. ౧౫.

తెలిమ్రాఁకు(ను)=తెల్లమ్రాను. వి. (√తెలి) తెల్లచెట్టు, కల్పవృక్షము.

సీ. తెలుఁగంటిదొరయింటితెలిమ్రాఁకు తెగఁబ్రాకి ...నీలా. ౧. ౮౫.

తెలియ=తెలె.

తెలియు. స. క్రి. (త. తెళి) ౧. ఎఱుఁగు, గ్రహించు; (అడిగి) తెలిసికొను.

ఉ...అట్లంతలు రాజు లెల్ల సమయంగని ద్రోణునిపాటు గాంచి యవ్వంతయు నాత్మలోనఁ దెలియందు సుయోధనుఁ డెంతమూర్ఖుఁడో. భార. శల్య. ౧. ౩౫౨.

సీ. తెలియఁడా తానేమి దేవలోకారోహణిశ్రేణి యగుగంగనిత్యమహిమ. కాశీ. ౩. ౧౦౧. భర్గ. ౧. ౮.

సీ. ఈప్రొద్దు నక్షత్ర మేమి లగ్నము మంచిదే యంచుఁ దగువారిఁ దెలియరమ్మ. కువల. ౨. ౨౬.

౨. ఎంచు, తలంచు.

వ...అదియును బ్రాణభయంబున నాదుకార్యవశంపుమాటగాఁ దెలియక...ఆము. ౬. ౩౧.

౩. యోజించు; అరయు, పరిశీలించు.

గీ. తెలియుచున్నాఁడు భూపాలకులఁ దదీయసోదరియు నీదుసౌందర్యశుభగుణప్రభావముల్ విని మోహవిభ్రాంతి నిటకు, రాయబారంబుఁ బంపె భూరమణతనయ. ఇందు. ౨. ౧౩౧.

చ. అలహరియాననాంబుజమునందు జనించుటఁ జేసి మేము ముఖ్యులము తదీయనాభికమలోద్భవుఁ డావిధి మాకు నెవ్విధిన్, దెలిసిన నీడు గాఁగలఁడె దిగ్గడు మా కనిశేణి సేయుచున్, బొలుతురు విప్రపుంగవులు ప్రోలున వేదరహస్యవేదులై. రామా. ౧. ౧౩౭.

సీ. అతిథుల బంధుల నత్తమామలఁ జిన్నిశిశువులఁ దెలిసి పోషించుటకును. దశా. ౩. ౩౮. సారంగ. ౩. ౧౦౦.

అ. క్రి. ౧. విదితమగు, ఎఱుకపడు.

వ...దేవతలకును దెలియనట్టివి యాతనికిం దెలియు...భార. ఉద్యో. ౨. ౧౦౨.

చ. తెలియఁగ వచ్చె నట్టితతిఁ దిగ్గకరుండు ధనాధిపాశకై, తొలఁగినకారణంబు... ఆము. ౫. ౯౭. దశా. ౨. ౯౭.

౨. విశదమగు, తేటపడు, స్పష్టమగు.

(ఈయర్థమునఁ బ్రయోగములం దిది ప్రాయికముగా తుమున్నంతముగానే కన్పట్టుచున్నది.)

క. తెలియంగా నెఱిఁగితి...భార. శల్య. ౧. ౩౫౧.

గీ. తెలియ నానతి యిమ్ము సందియము దీఱ. పారి. ౧. ౩౬.

గీ. అథవ నీకంఠమూలంబునందుఁ దెలిసి, కానరయ్యెడునిది యేమికప్పు సెప్పు. హర. ౬. ౫.

౩. తెలివికలిగియుండు; (నిద్రనుండి) లేచు.

సీ... దేవనదీసూనుఁడీయస్త్రమునకు మా ఱెఱుఁగుఁ గాన. ఆ. నతఁడు దెలిసియుండు నాతని దెస వోకు...భార. విరా. ౫. ౨౧౦.

గీ...ఆఱు, నెలల కొకనాఁడు భోజనాదులకుఁ దెలియు, నాఁడు వీఁ డజయ్యుఁడు రిత్తనాఁడు దెలుప, బలిమిఁ దెలియు నాఁ డీలనిబలము దూలు. భా. రా. యు. ౮౭౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అనిన సోఁకి మాయా,ధేనువు తానిద్రవోయి
తెలిసినపగిదిన్, మేను విదిలించికొంచును,
మానులు వెఱఁ గంది చూడ మగువ యగుత
ఱిన్. వరాహ. ౧౦. ౬౦.

౪. వికసించు; ప్రసన్నమగు; ప్రకాశించు.

గీ. వెరవుతోడ వేకువ యనువెజ్జు తూర్పు, ది
క్కు కెం పనుమందునఁ దీర్చి నొక్కొ,తిమి
రకాలాహివిష మూర్ఛనము సనంగఁ, దెలిసె
నెత్తమ్మి లొప్పులు దలకొనంగ. హరి. పూ.
౮. ౧౬౯.

సీ. ఆకాశవాణివాక్యంబుచే బ్రతికి నీ కెదురు
నూచిలిమి సు మ్మిన్ని నాళ్లు. గీ.అనుచు మొ
గములు దెలిసిదేహములు పొంగి,పలుమఱును
గౌఁగిలించుచు...సారంగ. ౩. ౧౬౪

క. ఒకకను దెలియదు రాత్రుల, నొకకను పగ
లింటఁ దెలివి నొందక యుండున్, ఒకకన్ను
బొగలుకమ్మిన, దిక నెవ్వతె శివునిఁ జెంద
నిచ్ఛించు మదిన్. పార్వ. ౪. ౯౩.

౫. (మూర్ఛాదుఃఖహర్ష పారవశ్యాదులనుండి) తే
ఱుకొను, తెప్పిఱు, స్వస్థతనొందు.

వ...ఇ ట్లత్తెంఁడు మూర్ఛిల్లిన మునిజనంబులును
నంబయు నధికశోకసమాకులత్వంబు నంది
హాహాకారంబులు సెలంగఁ బొదివి రంత.

ఆ. తెలిసి భార్గవుండు దృఢతీవ్రసారాచ,పంక్తి
గురిసి...భార. ఉద్యో. ౪. ౩౩౫.

క. తెలిసి కనుఁ దెఱచి వెండియు ... ఆము. ౫.
౭౮.

వ...ద్రుపదుం డతిహర్ష రసావేశపరవశుం డయి
పెద్దయుం బ్రొద్దునకుఁ దెలిసి యానందజల
భరితనయనుం డగుచు...భార.ఆది.౭.౨౩౭

౬. నమస్కరించు.

వ...కృతశౌచ మందలిపాపహరునకుఁ దెలియు
టశ్వేతగిరియందలిసింహాలోచనునకు వెన్నె
ల...ప్రబంధ. ౮౮౦.

జ: తెలిపించు, తెలివి, తెలివిఁగొను, తెలివికత్తె
తెలివికాఁడు, తెలివిడి, తెలివిపడు, తెలివి
పఱుచు, తెలివు, తెలుచు, తెలుపు, తెలు
పుడు, తెలుపుడుచేయు.

తెలియేఱు. వి. (√తెలి) ఆకాశగంగ.

క... తెలియే ఱన, వినువాఁ కన సొరగంగ...
ఆం. భా. ౧. ౫౫.

తెలిరా. వి. (తెలి+రాయి) చంద్రకాంతము.

వ... తెలిరాకట్టునెలవులం బవ్వళించి యున్న
నాయికానాయకులును...పారి. ౨. ౫౨.

తెలిఱెక్కపులుఁగు(గ్గు). వి. (√తెలి) శ్వేత
గరుత్తు, హంస.

ద్వి. తెలిఱెక్కపులుఁగులఁ దెగడెడునడలు.అ.
మ. క. ౫. ౨౪౭ పా. ౨౩ పం.

చ.అపుడు రణోత్సుకుం డగుసితాంబుజసాయకు
కంటిసన్నఁ గీ,రపటలి చల్లగాడ్పు తోవరా
యఁడు కోయిలపాఁజు చైత్రుఁ డ,చ్చపుఁదె
లిఱెక్కపుల్గు లని సల్పఁగఁ జాలుదు నేనె
నేనె యం,చపరిమితాగ్రహాస్ఫురణ నమ్మునిఁ
జుట్టిరి సత్వరంబుగన్. చంద్రి. ౨. ౭౭.

తెలివి(ల్వి). వి. (√తెలియు-క. తిళివు. త. తెళి
వు) ౧. జ్ఞానము, ఎఱుక; వివేకము.

క. భూతము లన్నియు నడఁగిన, యాతటఁ దనుఁ
దాన కనుచు నంజనరహిత,త్వాతిశయ
మెసఁగ వెలిఁగెడు,నా తెలి వాత త్త్వమునకు
నమరు మహేశా. భార. అను. ౪. ౧౯౪.

క. కల దది యూరక కానఁగ, నలవియె శ్రుతి
వాక్యసమితి యర్థంబులనై, నిలిచిన శబ్దం
క్రమమునన్,దెలి వొందినఁగాక యెట్టిధీమం
తులకున్. భార. అను. ౫. ౧౬౩.

చ...దీని కేల యధికం బగునెవ్వగ నింత నొవ్వ
ని,త్తెలివి మనంబునం జొనుపు ధీరత సొరలే
గూర్పు నేర్పునన్. భార. ద్రో. ౨. ౨౧౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. చెలువము విద్దెయుం గొనముఁ జేవయుఁ
బ్రోడతనంబుఁ దెల్వియున్. నీలా. ౧. ౯౨.

౨. గ్రహణశక్తి.

చ. కనుఁగవ లెస్సఁగాఁ దెలివి గల్గినవారికిఁ గాక
గ్రుడ్డికిన్, గనఁబడు నెట్లువెన్నెలలు గానఁగ
నం దొకరూపు భాస్కరా. భా. శ. ౪౯.

౩. (మూర్ఛాదులనుండి) తేఱుట, స్మృతి, జ్ఞప్తి.

సీ. పలుమాఱు మూర్ఛిల్లి పలుమాఱు దెలివొంది
తనకళత్రాదులతగులు మిగిలి. కవిక. ౫. ౧౧౧.

గీ. సందడింపుచు శైత్యోపచారవిధులు, సరగ
నొనరింపఁ దెలివొందె జనవరేణ్య. ఇందు.
౨. ౧౭౧.

సీ. పరిరంభణంబునఁ బరవశుఁ డగు నఖంబులు
నాటఁ జెనకినఁ దెలివి నొందు. కాశీ. ౨. ౨౦.

౪. (జలము) తేఱుట; తేట, నిర్మలత్వము.

క. కలఁగిన పెద్దమడువు విను, తెలివిఁ బొరయు
నెట్లు తాన ధీరుండట్లు, గలము లయినదురితం
బులఁ, గలఁగియుఁ దనయంతఁ దేఱు గౌర
వ మొప్పన్. భార. శాం. ౩. ౩౪.

ఆ. అనిన నాంబికేయుఁ డను నీదుపలుకులఁ, గలఁ
కదేఱి బుద్ధి తెలివి నొందె. భార. ఉద్యో.
౨. ౯౬.

క. వెలయఁగ సుజనులమనమును... నిర్ఝర, జల
ములతెలివెల్ల సర్వసామాన్యంబుల్. కు.
సం. ౭. ౧౫౭.

౫. ప్రసన్నత; ఉల్లాసము, సంతోషము.

వ... సకలభూతంబులమనంబులు దెలివిం బొందె
... కాశీ. ౪. ౧౦.

క. నెలపొడుపుల సురనది నిర్మలతరతదగార
వట్టిమ ప్రవదిందూ, పలతుందిలాపయగుచున్
దెలివొందుఁ బతివ్రతౌచితీసంపత్తిన్.
నైష. ౨. ౩౯.

ఉ. చిన్నటనాఁటనుండియును జెల్వయుఁ గూర్చి
నదాన పాటనే, డెన్నికకెక్కఁ దద్వ్యథకు

నీవును గుందితి గాన సద్గుణా, భ్యున్నతరత్న
మాలిక యయో నిను మచ్ఛరిమశీకరార్ద్ర
యో, షిన్నవగంధసారములచేఁ దెలివొం
దఁగఁ జేయు టెన్నఁడో. వసు. ౪. ౧౦౬.

౬. వికాసము.

క. పురహరుఁ డనుమతి సేయఁగ, శరము శరాసన
ము దివ్యసరసిన యిడి యన్నరుఁడు సనుదెం
చి యాశం, కరుముఖకమలంబు తెలివి గాంచి
ముదమునన్. భార. ద్రో. ౨. ౩౭౫.

చ... సువర్ణబంధమ్మృదుభావవిశేషము లొప్పు దె
ల్వులున్, సరియగు రత్నపుత్రికయు సత్క
వికావ్యము నొక్కరూపమై. కు. సం.
౧. ౩౭.

క. ఓసరనాయక భవదీ, యాననమునఁ దెలివి దోఁ
ప దాత్తయుఁ జింతా, ధీనం బైనది... విక్ర.
౬. ౫౬.

౭. కాంతి, శోభ; ప్రకాశము.

గీ. ఇనుఁడు తనదీప్తి తనచేత నిచ్చిపోయి. మఱి
వకేతెంచి నిజరుచి మగుడఁ గొనినఁ, దెలివి
చెడి తెల్లనయి రనుపలుకు జగతి, నిలుపుగతి
దీపకళికలు వెలరువాఱె. కు. సం. ౭. ౧౯౬.

సీ. వెళ్లఁబెట్టునొ పూర్ణవిధుకాంతి మొగమున
దిగఁబాఱునో పైఁడితెలివి మేన. నిరం. ౪.
౯౧.

మ. కుముదంబుల్ వికసింపఁ గోకములు సంకో
చింపఁ గామిప్రజా, లిమనంబుల్ దిలకింపన
తైసలుఁ దెల్విం జెంది రాణింప... బిల్హ.
౨. ౨౫.

చ... అబ్జిని నిద్రవోయెడిన్, దెలువులు మ్రింగు
చుం దమము దిక్కులఁ గప్పెడి నంతకంత
కున్. భా. రా. అయో. ౩౨౦.

౭. జాగ్రత్త, మెలఁకువ.

సీ. తెలివిమైఁ దనకన్నుఁ దెఱచి దృష్టింపఁడు
వామాక్షిరుచులు తీవ్రంబు లనుచు. దశా.
౨. ౮౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(వామాక్షి=ఎడమకన్నైనచంద్రుఁడు.)

౯. అనుమతి, అంగీకారము.

సీ. సాధుచరిత్రయు శాంతయు నైనయిగ్గాం
ధారియును నేను గాఢవినయ, మార మీ తె
లి విట్లు గోరుచునున్నారము...భార.ఆశ్ర.
౧.౯౬.

శ్లో.సోహంపునఃపునర్యాచేశిరసావనతో౽నఘాః,
గాంధార్యా సహితం త్వమాం సమనుజ్ఞాతుమ
ర్హథ. సం. భార. ఆశ్ర. ౧౧. ౫.

౧౦. నున్నఁదనము, స్నిగ్ధత.

సీ... తేట నున్నన నున్న తెలివి నునుపు.గీ.నిద్ద
మన స్నిగ్ధత కెసంగు...సాం. ని.స్థా.౬౦.

విణ. ౧.స్పష్టము, స్ఫుటము.

గీ. క్ష్మారమణ యైహికాముష్మికంబు లింత, సుల
భములె యైన వినిపింతుఁ దెలివిగాఁగ. దశా.
౧. ౧౦౪.

గీ. తెలివి యై మీఱునూగారుదీప్తి యొక్క.
కువల. ౫. ౧౦౯.

౨. కాంతిమంతము, ప్రకాశవంతము.

సీ. తెలివివెన్నెలవెండితీఁగలు నిగిడించుచదలు
కమ్మచ్చుబెజ్జము లనంగ. పారి. ౨. ౩౬.

తెలివిఁగొను. అ.క్రి. (√తెలివి) తెలివినొందు,
(మూర్ఛాదులనుండి) తేఱు,తెప్పిఱిల్లు.

క. అటువలె నృపనటులాఁతుఁడు, పటుతరవిరహం
బుఁ జెంది బాధ వడంగా, నటనమున హేల
యనియెడు, కుటిలాలక వచ్చెఁ దెలివిఁగొనఁ
జేయుటకున్. హంస. ౧. ౭౪.

తెలివికత్తె. విణ.(√తెలివి)ప్రాజ్ఞురాలు, వివేకవతి.

సీ... తెలివికత్తె యనంగఁ దేసుఁ బ్రాజ్ఞి. ఆం
భా. ౨. ౧౦౭.

తెలివికాఁడు. విణ. (√తెలివి) వివేకి, ప్రాజ్ఞుఁడు.

సీ. తెలివికాఁ డనఁగను వెలయుచుండు నభిజ్ఞుఁ
డు...ఆం. భా. ౩. ౩.

క. తెలివిగలవారిమేలిమి, వెలిఁగింపఁగ వెల్ల
పట్టువెలి నలనియం,చులువో౽లెఁ బల్కునొర
లుం,గలచో౽సందియపుఁదెలివికాండ్రును వల
దే. అచ్చ. భారవి. ౧. ౨. (సందియపుఁ
దెలివికాండ్రు= సంశయజ్ఞానముగలవారు.)

తెలివిడి. వి. (√తెలియు.) ౧. జ్ఞానము.

గీ. తెలివి యనఁగ నెఱుక యనఁ దెలివిడి యన,
బరఁగు జ్ఞానంబు...ఆం. భా. ౧. ౧౦౨.

౨. తెలియఁజేయుట. ౩. దృష్టాంతము. (శ.
ర. ప్రా.)

తెలివి(ల్వి)పడు. అ.క్రి.(√తెలివి)౧. తెలియు,
ఎఱుకపడు; విశదమగు, స్పష్టమగు.

వ...ఎఱుంగవలయునట్టివి యనేకార్థంబులును
దెలివిపడు విను మని సుప్రసాదభరితుండై.
భార. శాం. ౬. ౨.

గీ. రామమిశ్రుండు కృపతోడ యామునునకుఁ,
దెలివిపడునట్లుగా నుపదేశ మిచ్చె. పరమ.
౫. ౧౯౦.

సీ. ఏవిరోధము లేక యొసఁగుమదుక్తులఁ గల
బలాబలములు తెలివిపడఁగ.వాసిష్ఠ.౩.౬౧.

క...ఆశిసు వాత్మ నెఱుంగనియది లే దీ,యను
భావము చూడ నడుగు మది తెల్విపడన్.
కళా. ౫. ౮౨.

౨. తోఁచు, స్ఫురించు.

వ... వయోరాజ్యదుర్వారగర్వారంభశీలుం డ
గునమ్మహిపాలుండు సభ్యులం జూచి మీ
రీయిరువురకలహంబు లాకర్ణించితిరి నామ
నంబునం దెలివిపడినతెఱం గెఱింగించెద.
విప్ర. ౫. ౫౮.

౩. ప్రసన్నమగు, వికాసమందు.

రగడ. పొలిచె మధులక్ష్మి సురపొన్నలను బొన్న
లను,దెలివిపడి పుష్పాదులతిన్నెలను జిన్నె
లను. రాఘవ. ౨. ౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తెలివిపఱుచు. స. క్రి. (√తెలివిపడు) తెలియఁ జేయు, ఎఱుకపఱుచు, బోధించు.

వ...అంతేవాసులకుఁ దెలివిపఱుపక...ఆము. ౬. ౬౯.

తెలివు(ల్వు)=తెలివి.వి.(√తెలియు.త. తెలివు) కాంతి, ప్రకాశము, నైగనిగ్యము.

సీ. పలుకులముద్దునుగలికిక్రాల్గన్నుల తెలివును వలుఁదచన్నులబెడంగు. భార. ఆది. ౩. ౨౬.

చ...వా, తెలియును దీనియాననము తెల్వుఁగరంబు మనోహరంబు...భార. ఆది. ౬. ౬౩.

తెలుఁగు=తెనుఁగు. వి. ౧. ఆంధ్రభాష; ఆంధ్రదేశము.

క. తెలుఁగుకవిత్వముఁ జెప్పం, దలఁచినకవి... నిర్వ. ౧. ౬.

గీ. బలిమి వాటించి యేలించెఁ దెలుఁగుభూమి. భీమ. ౧. ౬౨.

ఆ. తెలుఁగదేల యన్న దేశంబు తెలుఁగేను, దెలుఁగువల్లభుండఁ దెలుఁగొకండ, యెల్లన్నృపులు గొలువ నెఱుఁగవే బాసాడి, దేశభాషలందుఁ దెలుఁగు లెస్స. ఆము. ౧. ౧౫.

౨. (బ.) ఆంధ్రులు, తెలుఁగువారు.

సీ. ఆరెలు కన్నడీ లఱవలుం దెలుఁగులు దనబిరుదందియం దగిలి కొలువ. ద్వా. ౧. ౪౨.

జ: తెలగా, తెలగాణము.

తెలుచు(ల్చు)=తెలచు, స. క్రి. (√తెలియు.) ౧. తేర్చు, తేటగాఁ జేయు; ప్రసన్నతనొందించు, శాంతిపఱుచు; సంతుష్టిపఱుచు.

సీ. రాగహీనత మనోగ్రంథిఁ ద్రెంపఁగ నీళ్ల కలఁక నిందువు రాచి తెలుచుభంగి, విజ్ఞానవశమున వెలయుస్వభావంబు నిత్యప్రసన్నమై నెగడుచుండు. వాసిష్ఠ. ౩. ౩౨.

క...ద్రోణులచి, త్తము శాంతి నొందఁజేయుట, మముఁ దెలుచుట...భార. విరా. ౪. ౨౨౬.

చ. అభిముఖతత్త్వశాలి సుకృతాఢ్యుఁడు నాచతురాస్యమానస, ప్రభవుఁడు...ధర్మజుఁగానఁ బోవ భూ, విభుఁ డతఁ డాతనిం దెలిచె వేయివిధంబుల సాధుపూజలన్. పాండు. ౫. ౩౫.

౨. స్తుతించు, పొగడు.

ఆ. అతఁడు పుణ్యలోకగతియును మానవత్వంబు ఘోరనరకవాసమును విధించి పుచ్చు వారిఁ దెలిచి మన్నించి భర్జించి వరుసతోడఁ జిగురుఁబోఁడి. భార. అను. ౫. ౧౬౬.

౩. ప్రార్థించు, వేఁడు.

క. కోకిలములఁ దెలిచినఁబలు, గాకులపొదిఁ బొదలునటికష్టపుఁబలుఁగుల్, నాకు నసహ్యములని యా, హా కూఁతలు మానఁ గలవె యవి ప్రార్థనలన్. కళా. ౬. ౨౬౦.

౪. భజించు, సేవించు.

క. దేహస్థు నదేహు నఖిల, దేహిసముక్ నిన్ను భక్తిఁ దెలుతురు దురిత, వ్యూహమ్ముఁ బుణ్యచయము న, మోహతనిరసించు యోగిముఖ్యులు కృష్ణా. భార. శాం. ౪. ౨౩౬.

౫. ఎఱుఁగు, తెలిసికొను. (స్వార్థమున 'చు' వర్ణము.)

రగడ. ఇప్ప యిప్పటి కింపు నింపెడు నిందు నిందునిభాస్య నిల్తమె, యప్ప యప్పరువంపు మొగ్గలయాస యాసతివల్లఁ దెల్తమె. వాల్మీ. ౩. ౧౧౪.

గీ. ఎట్లు నమ్మెడి దొర యీయింట దీని, కడమ నడతలు తెలుతము గాక యనుచు. శుక. ౨. ౫౨౩.

౬. తేలుచు, ఓలలార్చు, తేలునట్లు చేయు.

చ...గముల్ గములై చను దెంచి నెత్తుటం, దెలిచిరి తీవ్రసాయకహతిన్ రథవాజిభటద్విపంబులన్. వరాహ. ౩. ౪౮.

అ. క్రి. స. క్రి. మ్రొక్కు, నమస్కరించు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ...వసువులఁ జెక్కు విధంబులఁ బ్రియము
పుట్టఁ, దెలిచి ప్రార్థించిన నలుక వోవిడిచి...
భార. అశ్వ. ౪. ౯౯.

చ. విను పయిచీర లేక సురవిప్రుల నర్చన సేయఁ
దెల్ప భో, జన మొనరింపఁగాదు,..మార్క.
౩. ౨౩౧.

చ...శో, భనరసభవ్యకావ్యమయభారతికిన్ వస
తిస్థలంబు లై, తనరెడివామలూరుభవతాపసు
సాత్యవతేయుఁ దెల్చెదన్. కళా. ౧. ౫.

అ. క్రి. బయలుపడు, కనఁబడు.

వ...పురస్కృతతిరస్కరిణీపరిసరంబుల భాసి
ల్లులాస్యకీజనంబులసందుల నందందఁ దె
ల్పుచుఁ జెలికత్తియలఁ బిల్చుచు...విప్ర.
౨. ౬౪.

తెలుపా(ల్పా)రు. అ. క్రి. (తెలుపు[2] + ఆరు[1])
తెల్లనగు, ధవళమగు.

సీ. దిక్కు లన్నింటను దెలుపారుపూఁత గావిం
చె నుజ్జ్వలయశోవిభ్రమంబు. భార. విరా.
౫. ౩౨౦.

సీ. దుగ్ధార్ణవంబునందు విశాలరమణీయ మగునొ
క్కదీవి తెల్పారియుండు. భార. శాం.
౬. ౩౬౫.

ఉ. తోరము లయ్యెఁ జన్నుఁగవతోన తొడల్
తనుకాంతితోన తెల్పారె విలోకనంబులు...
కు. సం. ౩. ౨౬౭.

తెలుపు[1](ల్పు). స. క్రి. (√తెలియు) ౧. ఎఱిఁ
గించు, చెప్పు.

చ. తనదుప్రతిజ్ఞయుం దెలిపెఁ దార్ఢ్యన కెం
తయు నాదరంబునన్. పారి. ౨. ౭౩.

క...చతురాననుపైఁ, గృప దగ్గఱ వచ్చి రమా,
ధిపభటుఁడు సునందుఁ డతనిఁ దెలుపుచుఁ
బలికెన్. కవిక. పీఠి. ౧. ౩౬.

మ...కన్నకల సంతోషంబునన్ దెల్పినన్. ఉ.
రా. ౧. ౨౪.

౨. విశదీకరించు, స్పష్టముచేయు.

క. ఆరాజసుతులవిద్యాపారగపటుచేష్టితములఁ
బరువడి నగ్గాం, ధారీధృతరాష్ట్రుల కతి, ధీ
రుఁడు విదురుండు సెప్పి తెలుపుచు నుండెన్.
భార. ఆది. ౬. ౧౪.

చ. జననము చెప్పి యేఁ దెలుప సత్యము సుమ్మ ర
కుంతిభాషణం, బని తనుజత్వజాతకృప నం
బుజమిత్త్రుఁడువల్కె...భార. శాం. ౧. ౩౯.

౩. సూచించు; ప్రకటించు, చాటించు.

ఉ. ఒప్పెడు మేనుఁ బెంపు గలయుల్లము నాగర
కంపుఁజందముం, జెప్పక చూప కీలనివిశేష
ముఁ దెల్పెడు...భార. విరా. ౧. ౯౨.

చ. అటఁ దనగెల్పుఁ దెల్పుచు దశాస్యుఁడు
ద్రిమ్మరె భూమి యంతయున్. ఉ.రా. ౩.
౧౫౩.

చ. వెలవెలఁబాఱుదీవియలు వింతరుచిం గలిగిం
చుతమ్ముల, మ్ములు నతిశీతలమ్ము లగుమత్తెపుఁ
బేరు లఖర్వపద్మినీ, విలసితగంధవాతములు
నేకువఁ దెల్ప...విక్ర. ౨. ౧౦౬.

౪. బోధించు, కఱపు.

క. మతి యెఱిఁగి యెఱుఁగనొల్లని, కఱటిం దెలు
పంగఁ గమలగర్భునివశమే. భార. ఆది.
౪. ౭౧.

చ. కరుణ జనించి శాత్రవుల గాండివి సంపఁగ
నొల్లఁడయ్యె నేఁ, బరువడిఁ దెల్పి యైక్యపరి
భావనిరూఢము గాఁగఁ జేసినన్. భార.
శల్య. ౨. ౩౪౫.

మ...ఇద్ధరణిన్ మార్గులఁ దెల్పు నెవ్వఁడు
సుధాధారానుకారోక్తులన్. భర్తృ. ౧. ౬.

౫. తేర్చు, ప్రసన్నత నొందించు; ఊఱడించు,
ఓదార్చు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆ. తెలుపు మితని ననుడుఁ దేరి కోపంబు వో,
విడిచి నన్నుఁ దెలిచె మృడుఁడు పార్థ. భార.
శాం. ౬. ౪౫౦.

ఆ...ఎట్టు లున్నను నాకు నిఁక, దెలుప నేల
పలుకఁతియ్య మేల. భార. ఆర. ౬. ౧౭౪.
(తెలపనేలపలుకఁదియ్యమేల. శ. ర. పా.)

క. కొండొకవగపున కేనియు, నొండొరువులఁ
దెల్పనట్టియువిదలు చిత్తం, బొండొండ వన
ట మునుఁగఁగ, నొం డెవ్వరుఁ దెలుపలేక
యుండి రవశలై. భార. స్త్రీ. ౧. ౧౦౦.

ద్వి. నిర్వక్రముగ నేలు నీ కేల వెఱవ, నని తన్ను
దెలిపెడియాపువ్వుఁబోఁడి. ద్వి. హరిశ్చ.
పూ. ౭౪౫.

౬. నిద్రనుండి లేపు, మేలుకొలుపు.

చ...చప్పరమునఁ జాల హృద్య మగుపాన్పున
నూఱడి నిద్రవోవున, గ్గురువధకారిఁ గాంచి
కడుఁ గ్రోధము మోదము సందడింప సుస్థిర
తఁ బదప్రహారమునఁ దెల్పెఁ దృణీకరణాభి
రాముఁడై. భార. సౌ. ౧. ౧౪౮.

క. కలవా రెల్లనుమడిసిరి, కలిగియు లేఁ డయ్యెఁ
గుంభకర్ణుఁడు వీనిం, దెలుపుదునొ యేనుఁ గొ
డుకుం, జల మెడపక రిపులతోడ సరిఁ బెనఁ
గుదునో. భార. ఆర. ౮. ౯౩.

సీ. పల్లవంబులకంటె బాగైనకెంగేల లలితాంగి
యల్లన తెలిపి తెలిపి. గీ. తెలుపునంతట మే
ల్కని తెలివి నొంది. నా. పంచ. ౩. ౧౭౬.

వి. ౧. ఊఱట.

సీ. పొలయలుకలను దెల్పులు నటించుచుఁ గ్రా
లువిటకులటాళులవిలసనంబు. గీ. అర్థిఁ జూ
చుచు హలధరుం డల్లనల్ల, నేఁగి...మా
ర్క. ౧. ౧౩౪.

౨. మేహరోగవిశేషము. (శ.ర)

౩. నమస్కారము.

గీ. హరి యొకండె జగత్కర్త యఖిలభర్త, వి
శ్వసంహర్త భోక్త వివేకయోక్త, తలఁపుబ
లుపును గొలుపును దెలుపు నతని, దెసన కా
వింప నగు నొండుదిక్కు వోక. నృసిం. ౪.
౧౦౩.

తెలుపు[2](ల్పు). వి. (√తెల్ల) ౧. ధావళ్య
ము, తెల్లఁదనము.

సీ... తెలి తెల్ల తెల్లన తెలుపు వెల్ల, వెల్లన వెలి
నాఁగ వెలయును శుక్లంబు... ఆం. భా. ౧.
౧౦౭.

సీ. తెలుపును గప్పును వెలయంగ మెఱుఁ గ
క్కుతారకంబులఁ గల్కితనము దొడర.
భార. విరా. ౧. ౨౪౫.

చ. ఇనుఁ డొడఁగూడి ... తనుకాంతి మాసె
ననఁ దెల్పఱఁ జీకటి గప్పె...కు. సం. ౭.
౯౦.

౨. ధవళవస్త్రము, తెల్లబట్ట.

ఉ. ఇందునిభాస్యమైతొడవు లేల ధరింపవు
నున్నఁగావులీ, వెందును మానలేవు; తెలు
పేటికిఁ గట్టితి...పారి. ౧. ౧౧౫.

౩. పరిశుద్ధి, స్వచ్ఛత.

సీ. కడుపులో నొప్పారుకొడుకునిర్మలబుద్ధి తెలు
పు నాఁ గనుఁగవ తెలుపువాఱె. నృసిం.
౩. ౧౩౧.

ద్వి. మలుపు లీకన్నుల తెలుపు లనంగ. పండి
తా. మహిమ. ౨౮౦.

విణ. తెల్లనిది, ధవళము.

క. తెలుపు లగుచీరలను బూఁ, తలఁ బువ్వుల
నొప్పి రాజతనయానుగుణో, జ్వలమానవీ
యవేషము, లలవడఁ గూడుకొని నగరి కరి
గిరి ప్రీతిఁ. భార. విరా. ౫. ౩౧౫.

గీ. కలయ జగమునఁ గలయట్టినలుపు లెల్లఁ, దెలు
పులుగఁ జేసి నీడలు దెలుపుసేయఁ, గా వళి
ముగామి... మనుచ. ౩. ౨౮.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. జ్యోత్స్న నాఁగఁ దమిస్ర నా నుభయభార్య,
లుడుపతికి నందు నొకతె దెల్పోర్తు నలుపు,
తాను వారికి మెచ్చుగాఁ దాల్పఁబోలుఁ,
దెలుపు నలుపును నగుమేను నెలఁత యితఁ
డు. సైవ. ౪. ౧౪౮.

జ. తెలుపారు. తెలుపువాఱు. తెలుపెక్కు.

తెలుపు(ల్పు)డు. వి. (√తెలుపు[1].) తెలుపు
టు, ఎఱుక.

చ. శిలలను గుప్పుచప్పుడును జేతుల పేతులు
త్రిప్పుచప్పుడుం, దెలుపుడు దెల్పుచప్పుడు
ను...అజ్జగడంబు ముజ్జగం,బులు వినియెన్
నిశాచరచమూజితు లైరి ప్లవంగసైనికుల్.
రామా. ౪. ౧౪౭.

తెలుపుడుచే(సే)యు. స. క్రి. (తెలుపుడు+
చేయు) ఎఱుకపఱుచు, ఎఱిఁగించు.

క. తెలుపుడుచేయం గలనా, చెలియమనోవ్యథ
శుభస్యశీఘ్ర మ్మనున,ప్పలు కాదరింపఁగావలె
...కవిజ. ౨. ౬౭.

చ...రాజు నెడఁ దప్పక యిప్పని యొప్పు మీ
ఱఁగాఁ, దెలుపుడు సేసి...రుక్మి. ౧. ౧౦౩.

తెలుపువాఱు. అ. క్రి. (తెలుపు[2]+పాఱు)
తెలుపారు, తెల్లనగు.

సీ. కడుపులో నొప్పారు కొడుకుని ర్గలబుద్ధి తె
లుపు నాఁ గనుఁగవ తెలుపువాఱె. నృసిం
౩. ౧౩౧.

తెలుపెక్కు. అ. క్రి. (తెలుపు[2]+ఎక్కు) తెల్ల
నగు, ధవళమగు.

సీ. మగరాలచికిలికమ్మలు చాయఁ దెలుపెక్కఁ
జెక్కు లేమని యొత్తు చెలియ నడిగె. ఉ.
రా. ౧. ౧౭౪.

తెలె(లియ)=తలియ. వి. (సం. స్థాలీ. ప్రా.
థాలీ, దాలియ.) భోజనపాత్రము; కంచము.

క. ఇనుపతెలె న్నంటితెలెన్, బెనుచేతుల నారు
పెణఁకఁ బీఁటపయిన్ భో,జనమొనరించుట
తగ దని, మును చెప్పిరి జనుల కాదిమునివరు
లెల్లన్. విజ్ఞా. ఆచా. ౭౨.

శ్లో. మృణ్మయే పర్ణపృష్ఠే వా కార్పాసే తాం
తవే తథా, నాశ్నీయా న్నపిబేచ్చైవ న కరే
న తథాసనే. స్మృతిచంద్రిక. ౬౦౩ పా.

గీ. ప్రొద్దు గూఁకంగ నిలుఁజేరి పెద్దతెలెను, బెట్టు
సంకటి మెక్కుచుఁ బొట్టనిండ. ఉ. హరిశ్చ.
౪. ౧౩. అచ్చ. రా. యు. ౨౪౦. ఆం. భా.
౨. ౨౮౪.

తెల్గువాఁడు=తెనుఁగువాఁడు. వి. ఆంధ్రుఁడు.

సీ. ఆంధ్రుఁ డౌఁ దెనుఁగువాఁ డనఁ దెల్గువాఁ
డన...ఆం. భా. ౨. ౧౦౩.

తెల్ల=తెల. వి. తెలుపు, ధావళ్యము.

సీ...తెలి తెల్ల తెల్లన తెలుపు వెల్లన వెలి నాఁగ
వెలయును శుక్లంబు...ఆం. భా. ౧. ౧౦౪.

విణ. (క. బళి. త. వెళ్లె. కర్మధారయంబునఁ దీనికి
నిగాగమము బహుళము.) ౧. తెల్లనిది, ధవ
ళము.

సీ. ఉల్ల తెల్లనితురగోత్తమువాలంబు నల్ల సేసి
తిరేని నాకు దాసి, యగు మనవినత...
భార. ఆది. ౨. ౩౮.

మ. దివిజద్వేషి నుదారవారిచరమూర్తిం ద్రుం
చి చాతుర్య మొ,ప్ప వడిం జౌకపుఁదెల్లకా
చుగమిదంభం బొంద మైఁ దాల్చి...ఆము.
౪. ౧౭.

తరలము. మొలకుఁ దెల్లనిబట్ట లేకయు ముచ్చటం
గలు ద్రావుచున్, బొలము దున్నఁగ నోడి
నాఁగలి పూని త్రిమ్మరు నంచు నిచ్చలును
బల్కుచు నుందు రాకటిసామియన్నను...
నీలా. ౧. ౩౪.

౨. స్పష్టము, విశదము, నిస్సందేహము.

ఉ. విష్ణునిమూల తత్త్వమును వేమఱునయ్యయి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

JNANA SIMHASAN JNANAMANDIR
LIBRARY
Jangamawadi Math, Varanasi
Acc. No. 7407



జన్మకర్మవ, రిష్టత లాదరించుటలు దేవకికిఁ వసు దేవసూనుఁడై, గృష్ణుఁడనంగఁ బుట్టి శిశుఖే లన మాదిగఁ గల్గుభావముల్, ధృష్టత నిర్వ హించుటలు దెల్లగ వింటి నరేంద్రపుంగవా. హరి. ఉ. ౮. ౩౦౪.

ఉ. వ్యాసముని ప్రణీతపరమార్థము తెల్లగఁ జేసిన ట్టియ,బ్జాసనకల్పులం దలఁతు నాద్యుల నన్న యతిక్కనార్యులన్. నృ. సిం. పీఠి. ౯.

చ. అడలఁగ నేల యీాక్షణమ యర్థపతిం బిలి పించి తెల్లగా, నడిగెద...దశకు. ౬. ౭౨.

జ: తెలుపు, తెల్లఁబాఱు, తెల్లఁబ్రాలు, తెల్లకలి గొట్టు, తెల్లకలువ, తెల్లకాంచనము, తెల్ల కాకి, తెల్లకొక్కెర, తెల్లకోకబత్తుఁడు, తెల్లగగ్గెర, తెల్లగడ్డ, తెల్లగన్నేరు, తెల్ల గటి, తెల్లగటిక, తెల్లగలిజేరు, తెల్లగినియ, తెల్లగిసె, తెల్లగురిగింజ, తెల్లగురిజ, తెల్లగం టెన, తెల్లగెనుసు, తెల్లగోరంట, తెల్లచెన్నఁ గులు, తెల్లచెఱుకు, తెల్లజక్కి, తెల్లజనము, తెల్లజిలకట్టి, తెల్లజిల్లెడు, తెల్లడంగుఁబ్రాలు, తెల్లడాలుమెకము, తెల్లతుమ్మ, తెల్లతెగడ, తెల్లతేజి, తెల్లదమ్మి, తెల్లదామర, తెల్లదీవి, తెల్లన, తెల్లనగిర, తెల్లనాకు, తెల్లనార, తెల్లనిగట్టు, తెల్లనితల్లి, తెల్లనిదొర, తెల్లనేల గుమ్మడు, తెల్లపసు, తెల్లపులుగుడు, తెల్ల మానికము, తెల్లములక, తెల్లమెదంట, తెల్ల మొదవు, తెల్లమ్రాను, తెల్లయిరుగుడు, తెల్ల యుప్పి, తెల్లయేనుఁగు, తెల్లలొద్దుగు, తెల్ల వటివేరు, తెల్లవస, తెల్లవాఱు, తెల్లవాఱుచు, తెల్లవావిలి, తెల్లసవరము, తెల్లావలు, తెల్లుప్పి. మొ.

తెల్లంటి=తెల్లటి వి. (క. తెల్లంటి, తెల్లంటు.) బ హుమానము, పారితోషికము, సత్కారము.

గీ. నీర ముంచినసారకాయ నెగసినట్లు; పేరుకొ నివైచు తెల్లంటిచీరవోలె,నుందు చెండువిధంబు న నుత్తరించు,తములపాకు: నిక్కెడుక్రియ దాఁటె నిట్టి. ఉ. హరి. ౪. ౨౭. (వావిళ్ల ప్రతిపా. 'తెల్లంటుచీర. వీరేశ. పా. ప్రభు వులు బహుమానముగా నిచ్చినబట్టలను పగటి వేషగాండ్రు మొ. సంతోషముతో జయజ యధ్వనిచేయుచు పైకి ఎగురవేయుట ప్రసి ద్ధము.)

తెల్లఁబాఱు=తెల్లవాఱు. అ. క్రి. (తెల్లన్ + పాఱు.) తెల్లనగు, తెల్లపడు; (భయాదులచే) వివర్ణమగు; పాలిపోవు.

గీ. పలుకఁబాఱె నవం దెల్లఁబాఱె ననుట,కలరి యుండును...ఆం. భా. ౩. ౧౦౨.

గీ. తెల్లఁబాఱెడు నదె చూడు తెలివ విధుఁడు. నైష. ౮. ౧౬౭.

గీ. తనతనూజునిబిరుదగాథలు వినంగ, మొనపు వెలుపున సురరాజు మొగము తెల్లఁ,బాఱు నిఁక నని తెలిపెడుభంగి నాస,తీలలామంబువద నంబు తెల్లఁబాఱె. వరాహ. ౩. ౫.

సీ. రమణివేనలి యంచు రతికాంత నొడిసి హా తేఁటిమొత్తమె యంచుఁ దెల్లఁబాటి. ప్ర భా. ౩. ౨౧.

తెల్లఁబ్రాలు. వి. బ. (తెల్లన+ప్రాలు.) తెల్లని బి య్యము, తెల్లబియ్యము.

వ...శ్రీభీమేశ్వరమహాదేవరకుపల్లిఅ(ఱ)ననప్ప టి నివేద్యమునకుం దెల్లంబ్రాలకు ౮ నేమా ౧ నంజుడ్లురెణ్డును ఆచంద్రార్కము నడచునట్టు గా...దా. శా. ౧. ౧౦౧.

వ...శ్రీభీమేశ్వరమహాదేవరకు ఉపటిసంధ్య మం...[త్రి] బోనమునప్పటికిం బిట్టముదున కుం దెల్లంబ్రాలకుంచ్చములిరుకయేనును ఆము దుపడి...౧౦౩౬-దా. శా. ౧౭౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తెల్లకలిగొట్టు. వి. (√తెల్ల) కామ్రపాటలి*. (శ. ర.)

తెల్లకలువ(ల్వ). వి. (√తెల్ల) కైరవము, తెల్లని కలువ.

గీ. కైరవాభిధగాఁ దెల్లకల్వ యనఁగ, వెలయు ...ఆం. భా. ౧. ౧౬౪.

తెల్లకాంచనము. వి. (√తెల్ల) వృక్షవిశేషము, ఒకజాతికోవిదారము*.

సీ. తెల్లకాంచనము తుందిల మెట్టకాంచన ము ప్పి తెల్లుప్పి నీరుప్పి యిప్ప. హంస. ౪. ౧౧.

తెల్లకాకి. వి. (√తెల్ల) తెల్లని కాకి, శ్వేతవాయసము.

తెల్లకొక్కెర. వి. (√తెల్ల) బలాక. (శ. ర.)

తెల్లకోకబత్తుఁడు. వి. (తెల్ల+కోక+బత్తుఁడు) - తెల్లబట్టకట్టుకొను భక్తుఁడు-ఒకజాతిభిక్షుకుఁడు.

వ...జంగాలు బిద్దెమువాండ్రు తెల్లకోకబత్తులు సివసత్తులు బత్తులు...హంస. 3. ౭౯.

తెల్లగగ్గెర. వి. (√తెల్ల) అర్జకము*. (శ. ర.)

తెల్లగడ్డ. వి. (√తెల్ల) లశునము, వెల్లుల్లి*.

తెల్లగన్నేరు. వి. (√తెల్ల) శ్వేతకరవీరము*. (శ. ర.)

తెల్లగటి. వి. (తెల్ల+గటి)-శ్వేతగరుత్తు-హంస.

ఉ. బంగరుబొజ్జ పల్కుబడిపైదలి పచ్చని మేను తమ్మిపూ, సింగపుఁబీట తెల్లగటి చిన్నిప టాణి కడానివన్నెముం,గొంగులతండ్రి పా టబెళుకుం దొలుకానుపు చాలుమోము బె, క్కుం గలవేల్పు మాకు దనకుం గలయేం డ్లొదవించుఁగావుతన్. పాంచా. ౧. 3.

తెల్లగటిక. వి. (√తెల్ల) శతవీర్య*. (శ. ర.)

తెల్లగలిజేరు. వి. (√తెల్ల) దీర్ఘపత్రము, శ్వేత పునర్నవ*. (శ. ర.)

తెల్లగినియ. వి. (√తెల్ల) సునాభము*. (శ.ర.)

తెల్లగిలు. అ. క్రి. తొలఁగు, తూలు, చలించు.

ద్వి. బిగువుఁజన్నులజిగిబిగి శౌరిఁ జూచి, తెగ డి పయ్యెద లింత తెల్లగిలంగఁ,బదఁపడి చాఁ చినబాహుమూలముల, నుదిరిబంగరుపొడి యుదిరి మై రాల. అ. మ. క. ౨౭౨ పా. ౧3 పం.

తెల్లగిసె. వి. (√తెల్ల) ముశంగి*. (శ. ర.)

తెల్లగురిగింజె. వి. (√తెల్ల) శ్వేతపాకి*. (శ.ర.)

తెల్లగురిజె. వి. (√తెల్ల) మధుస్రవ*. (శ.ర.)

తెల్లగెంటెన. వి. (√తెల్ల) అశ్వఖుర, ఓషధీవిశేషము,*.

గీ. నల్లగెంటెన పూరి తెల్లగెంటెన యుత్త,రేణు గుబ్బిరి సంబరేణు...హంస. ౪. ౧౦. (తెల్ల దింటెన. అని. శ. ర.)

తెల్లగెనుసు. వి. (√తెల్ల) ఒకానొకజాతిదుంప, తెల్లచిరుగడము.

ఆ. చేమ కంద గెనుసు చిటిగోరు పెండ్లము, పొసఁగు తెల్లగెనుసు భూతగెనుసు,లల్లముల్లి పసుపు ముల్లంగి వెల్లుల్లి,గాఁజరయును మొ దలుగాఁగఁ గలవు. హంస. ౪. ౧3౧.

తెల్లగోరంట. వి. (√తెల్ల) సైరేయకము*. (శ.ర.)

తెల్లచెన్నఁగులు. వి.బ. (√తెల్ల) ఒకవిధమగు చెన్నంగిధాన్యము.

గీ. జిలితొగల రాజనములు నలవరులును, దెల్లన ల్లచెన్నంగులు దీవసరులు,నాదియగుపేర్ల గ లుగువ డ్లతనియింట,నుండు శతకోటిబారువు లొక్కదినుసు. హంస. ౪. ౧౨౭.

తెల్లచెఱకు. వి. (√తెల్ల) తేజనకము*. (శ.ర.)

తెల్లజక్కి. వి. (√తెల్ల) ఉచ్చైశ్శ్రవము.

గీ... తెల్లజక్కి నిక్కువీనులమావు చదలుతేజి, యనఁగ నుచ్చైశ్శ్రవముపేరు లమరు సాంబ. సాం. ని. దేవ. ౧౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తెల్లజేనము. వి. (√తెల్ల) వృత్తపర్ణి. (శ.ర.)

తెల్లజిలకఱ్ఱ. వి. (√తెల్ల) అజాజి, జీరకము.

తెల్లజిల్లేడు. వి. (√తెల్ల) అలర్కము. (శ.ర.)

తెల్లటి= తెల్లంటి వి. (క. తెల్లట్, తెల్లటు=బహుమానము.) బహుమానము, కట్నము; భోగ్య పదార్థము.

క. ఇటుమీఁదెవ్వరికిం దెల్లటిగా నీ విట్టు లునికి లలనా నన్నే,లుట మూఁడుజగంబుల నె, క్కటి యేలుట గాదె రాముకథ మఱి వింకఁ. భా. రా. యు. ౩౭౪.

తెల్లట్లు(చె)సెప్పు=కట్నములు చదివించు.

ద్వి. రసికులురసికులు నొసగులు వీడ,దిట్టలుదిట్టలు తెల్లట్లు సెప్ప.పండితా.పర్వ.౩౫౭పా.

తెల్లడంగుఁబ్రాలు. వి. బ. (తెల్ల + డంగు + ప్రాలు)- తెల్లగానలఁగుడుసొందిన బియ్యము- తెల్లగా దంచినబియ్యము, తెల్లబియ్యము.

వ...శ్రీభీమేశ్వరమహాదేవరకుం (౦) బల్లి అవిసానివేద్యమునకు ది ౧ ణికి నిత్యపడికొట్టరవు నంద్దికుంచ్చమునం [దె] ల్లడంగ్గుంబ్రాలకు రాను నేతిమా ౧ ను ఒలుప్పుంబప్పుమాన ౨ ణును పెరువుకుం ౧ ను ఆచంద్రార్కము నడచునట్టుగా...౧౦౨౫.దా.శా.౧౨౧౪.

తెల్లడాలుమె(ల్మె)కము= తెలిడాలుమెకము. వి. (తెల్ల + డాలు + మెకము.) సింహము.

క. ఓలిమెయిఁ దెల్లడాలుమె,కా లిఱ్ఱులమీఁద నడరుకైవడి...అచ్చరా. యు. ౨౫౫.

తెల్లడాల్మెకపుగద్దియ=సింహాసనము.

సీ. తెల్లడాల్మెకపుగద్దియఁ గూరుచుండఁబెట్టిన నిచ్చలపుదొరతనము పూని. అచ్చరా. యు. ౫౭౭.

తెల్లతు(దు)మ్మ. వి. (√తెల్ల) వెలితుమ్మ, విట్ఖదిరము.

తెల్లతెగడ. వి. (√తెల్ల) త్రివృతి. (శ. ర.)

సీ...తెల్లతుమ్మ యనంగ, విట్ఖదిరాఖ్యయై వెలయును...ఆం. భా. ౨. ౪౭.

సీ. చిటిగార సుందరి చీ కెఱ్ఱతుమ్మయుఁదెల్లదుమ్మ యులింద కల్లి తొట్టి. హంస. ౪. ౯.

సీ. కమలబాంధవునితోఁ గదురు మెర్వడుపుర్వ దేవతాపజముతోఁ దెల్లదుమ్మ. చెన్న. ౫. ౭౧.

తెల్లతేజి=తెలితేజి. వి. ఉచ్చైశ్శ్రవము.

గీ. దేవతాశ్వంబు వెలయును దెల్లతేజి, నిక్కవీనులజక్కి నా నీలకంఠ.ఆం. భా.౧.౫౬.

తెల్లద(త)మ్మి. వి. (√తెల్ల) వెలిదమ్మి, పుండరీకము.

గీ...తెలిదమ్మి వెలిదమ్మి వెల్లదమ్మి, తెల్లదమ్మి యనంగను దేజరిల్లుఁ, బుండరీకంబు...ఆం.భా. ౧. ౧౬౪.

తెల్లదామర. వి. (√తెల్ల) పుండరీకము. (శ.ర.)

తెల్లదీవి=తెలిదీవి. వి. (√తెల్ల) శ్వేతద్వీపము.

ఆ. దీవు లెల్లఁ దెల్లదీవులై రహిఁ గాంచె... ఉరా. ౫. ౧౭౫.

సీ. పాలవారాశిలోపలి తెల్లదీవిలో సతత మామోదించుపతగ మొక్కొ. ముకుంద. ౨.౯.

తెల్లన. వి. (√తెల్ల) శుక్లవర్ణము, తెలుపు. ఆం. భా. ౧. ౧౦౭.

విశ. ధవళము, తెల్లనిది. (ఆమ్రేడితమందు 'తెల్లతెల్లన' ఇది విధేయవిశేషణముగానే ఉపయోగింపఁబడును.)

సీ. దౌహృదశ్రీ నిల్చుధవళాంబుజముపోల్కిఁ దెలిగంటినెమ్మోము దెల్లనయ్యె. ఉ. రా. ౨.౧౩౭.

శా...అ దేమీ నీవు కాళిందివా, యీమే నేటికిఁ దెల్ల నాయె...దశా. ౧. ౨౬. అను. ౬. ౧౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ... తెల్లులసిల్లినచందంబునం దెల్లతెల్లనై... మనుచ. 3. ౨౮.

తెల్లనగిర. వి. (√తెల్ల) తెల్లనక్కెరచెట్టు.
సీ. దేవదా రుసిరికె తిలకము తెల్లనగిర వేప కరివేప తురకవేప. హంస. ౪. ౧౧.

తెల్లనాకు=తెలనాకు. వి. (తెల్లన+ఆకు.)
సీ. పొరుగూరిసంతకుఁ బోవువారలచేతఁ దెప్పించుఁ బోఁకలు తెల్లనాకు, లు...శుక. ౨. ౪౩౪.

తెల్లనార. వి.(√తెల్ల) మత్స్యవిశేషము. (శ.ర.)

తెల్లనిగట్టు. వి. (√తెల్ల) రజితగిరి, కైలాసపర్వతము.
క. అల్లదె కంటే పొనపొన, తెల్లనిగట్టుఱత మబ్బు దేటెడుపొలమం, దల్లెడఁ జూచిన ధరణీవల్లభ సీరాము సేనవాలు మెకంబుల్. మనుచ. ౪. ౧౬.

తెల్లనితల్లి. వి. (√తెల్ల) - తెల్లనిశరీరచ్ఛాయగల తల్లి- సరస్వతీదేవి.
చ... వేల్పులు బలుబంటు లాకమల పొల్తుక తెల్లనితల్లి పెద్దకోడ లనుచు నెల్లవారుఁ బొగడం దగు నల్లనివేల్పుఁ గొల్చెదన్. ద్వా. ౧. ౨.

తెల్లనిదొర. వి. (√తెల్ల) - తెల్లనిశరీరకాంతిగల దేవుఁడు- శివుఁడు.
క. వెల్లువెకఁ జల్లువిస మా, తెల్లనిదొర కుతుక మోవఁ దిని బ్రతుకుట నీ, చల్లఁదనంబునఁ గాదే, కల్లోలవతీమతల్లి గంగాతల్లీ. విజ. వి. ౧. ౫౦.
౨. బలరాముఁడు.

తెల్లనేలగుమ్ముడు. వి.(√తెల్ల) విదారి॥. (శ.ర.)

తెల్లపడు. అ. క్రి. (తెల్ల+పడు) తెల్లఁదనమును బొందు-తెల్లనగు, ధవళమగు.
(వ్యవ) వెల్లవేసినచో గోడలు తెల్లపడును.
దీర్ఘవ్యాధిచే అతనిముఖము తెల్లపడెను.

తెల్లపులుగుడు. వి. (√తెల్ల.) శ్వేతవాతంగిని॥. (శ. ర.)

తెల్లమానికము. వి. (√తెల్ల) వజ్రము,హీరము.
చ. కనఁ దగు తెల్లమానికపుఁగప్పుల నొప్పెడుచప్రాలలో. యయా. ౧. ౫.

తెల్లమి=తెల్లము. విణ. స్పష్టము, విశదము; నిస్సంశయము, యథార్థము.
ఉ. తొల్లి గురుండు దానవులతోఁడిరణంబున వజ్రపాణికిం, దెల్లమిగాఁగఁ జెప్పి... భార. భీష్మ. ౨. ౨౦.
గీ... అతని, తొడుకులం దెల్లమిగ లెక్కయిడఁగ రాదు. నీలా. ౧. ౫౦.
గీ... తనమనస్తాప మెల్లఁ, దెల్లమి యొనర్పఁ దగదంచుఁ దెలియనేర, కల్లనగరింట నొకదాది ననుసరించె. శుక. ౧. ౩౫౮.
క. ముసలి శపియించె నపు డ,య్యసితాక్షేక్షణలరాజయక్ష్మక్షోభం, బెసఁగ నశియింపనగు న,ద్దెసఁ బొఱుఁడు సుగుడి గామి తెల్లమియె కదా. మనుచ. ౪.౯౧.

తెల్లము=తెల్లమి. విణ. (త. తెళ్లిమై) స్పష్టము, విశదము; నిస్సందేహము.
గీ. వృక్షశాఖాగ్రమున నున్నపక్షిశిరము, తెల్లముగఁ జూచితే మహీవల్లభుండ. భార.ఆది. ౫. ౨౪౯.
క. ఇది యేమి తెఱఁగు దీనికి, మొద లెయ్యది నాకుఁ దెల్లముగఁ జెప్పఁడు... భార. ఆది. ౬. ౨౬౨.
ఉ. అల్లన నింతి యి ట్లనియె నారసి వాసవు కల్మి లేమియుం, దెల్లముగా నెఱింగికొని తేఁకువలే కిట వచ్చు టొప్పు... భార.ఉద్యో. ౧. ౧౬౫.

క్రి.విణ.స్పష్టముగా; తేటగా;నిస్సందేహముగా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క...ఏ,దేశమునసుండి యిటయే,దేశమునకు నరిగె
దీవు తెల్లము చెపుమా. దశకు. ౧౧. ౫౭.
ఉ. దీనికి నేల నవ్వితివి తెల్లము నా కెఱిఁగిం
పు...వి. పు. ౨. ౫౮౯.

తెల్లములక. వి. (√తెల్ల) శ్వేతబృహతి౹. (శ.ర.)

తెల్ల(ని)మైదంట. వి. (√తెల్ల.) బలరాముఁడు.
ఆ. నల్లవలువతాల్పు తెల్లనిమైదంట, వెన్నదొం
గయన్న వెట్టినీళ్ల,మేలువాఁడు దుక్కివాలు
దాలుపు తాటిపడగవాఁ డనంగ బలుఁడు
రుద్ర. ఆం. సం. దేవ. ౫౯.

తెల్లమొదవు= తెలిమొదవు. వి.(√తెల్ల) కామ
ధేనువు.
సీ.అడిగిన నొసఁగెడియావు జేజేగిడ్డి చదలుతో
డుకు తెల్లమొద వనంగ,సురగవి పేళ్లగు...
సాం. ని. దేవ. ౧౯.

తెల్లమ్రాను= తెలిమ్రాను. వి. (√తెల్ల) కల్పవృ
క్షము.
క...ఈ,వులమ్రాను తెల్లమ్రా ననఁ,జెలఁగును గల్ప
కసమాఖ్య చెవ్వందీశా. ఆం. భా. ౧.౫౯.

తెల్లయిరుగుడు. వి. (√తెల్ల) శ్వేతపత్త్రము౹.
(శ. ర.)

తెల్లయుప్పి. వి.(√తెల్ల) మౌక్తికఫల౹. (శ.ర.)

తెల్లయేనుఁగు. వి. (√తెల్ల) వెల్లయేనుఁగు, ఐరా
వతము.
సీ. తెల్లయేనుఁగు నెక్కి తిరిగెడుదొర...ఆం.
సం. దేవ. ౧౭.
గీ. దైవతమదావళంబు చౌదంతి యనఁగఁ, దెల్ల
యేనుఁగు నాఁగను దేజరిల్లు. ఆం. భా. ౧.
౫౬.

తెల్లలొద్దుగు. వి.(√తెల్ల)జీర్ణవృంతము౹.(శ.ర.)

తెల్లవట్టివేరు. వి.(√తెల్ల)లామజ్జకము౹. (శ.ర.)

తెల్లవస. వి. (√తెల్ల) హైమవతి౹. (శ. ర.)

తెల్లవాఱు= తెలవాఱు, తెల్లఁబాఱు. అ. క్రి.
(తెల్ల + పాఱు). ౧. తెల్లపడు, తెల్లనగు; (భ
యాదులచే) వివర్ణమగు, పాలిపోవు.
క. శిరసెల్లఁ దెల్లవాఱెను, దరిమాలినతృష్ణ
యొకఁడె తరుణతఁ బూనెన్.భర్తృ.౩.౮.
గీ. దిలికపోలతలంబులు తెల్లవాఱె. దశా. ౩.
౧౦౩.
గీ. విజయపాలుని నెమ్మోము విన్నఁబోయి, తెల్ల
వాటినకై వడిఁ దెల్లవాఱె. విక్ర.౩.౧౦౩.
సీ. అలమేఘుని వదాన్యుఁ డనుచుఁ బల్కిరి
గాక తాఁ దెల్లవాటిచ్చుత్యాగ మెంత.
శివధ. ౧. ౫౪.
౨. ఉదయమగు, వేగు.
గీ.తెల్లవాఱుటఁ గన్గొని యెల్లవారు,గొల్లవారింట
వేడ్కఁ గన్గొనఁగవలయు, నంచు మేల్కాం
చి...నీలా. ౩. ౪౬.
ఉ. అద్దమరేయి భూమి నళినార్థము గ్రుమ్మరి
తెల్లవాటినన్,నిద్దురఁ జెందవచ్చు...ఉ.రా.
౭. ౨౩౦.
ఉ. దయ్యమునెత్తికోలుతుదిఁదాఁకఁగఁ దూరు
పు తెల్లవాటి తెల్పయ్యెను...హర. ౨.౫౪.
( తెల్లవాటి=తెల్లవాఱుటచేత.)
౩. నిస్సారమగు, చెడిపోవు.
(వ్యవ) అతనిపని తెల్లవాటినది. (శ. ర. ప్రౌ.)

తెల్లవాఱుచు(ర్చు,టించు) స. క్రి. (√తెల్ల
వాఱు) తెల్లవాఱఁజేయు, ఉదయముకాఁజేయు.
(వ్యవ) ఈపనితో వాఁడు తెల్లవార్చును.
(మిక్కిలి ఆలస్యముచేయును అనితాత్పర్యము.)
ఈరాత్రి యీయాపద గడచి మే మెట్లు
తెల్లవాటింతుమో తెలియదు.

తెల్లవావిలి. వి. (√తెల్ల) శ్వేతసురస౹. (శ.ర.)

తెల్లసవరము. వి. (√తెల్ల) తెల్లనిచామరము, విం
జామర.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. మగు వొక తె సారె తెలనారుమడుపు లీయఁ, బొలఁ తొక తె తెల్లసవరంబుఁ బూని విసరఁ, జే డొక తె చక్రితో సెత్తమాడె నసఁ గు, సంధు లగు నిట్లు గలయనిసంధు లదుక. అప్ప. ౫. ౧౧.

తెల్లావలు. వి.బ. (√తెల్ల) సిద్ధార్థము*. (శ.ర.)

తెల్లు(ల్లయు)ప్పి. వి. (√తెల్ల) వృక్షవిశేషము, మౌక్తికఫల*.

సీ. తెల్లకాంచనము తుందిల మెట్టకాంచన ము ప్పి తెల్లుప్పి నీరుప్పి యిప్ప. హంస. ४. ౧౧.

తెవ=తెగ. వి. సమూహము.

సీ. సొంపారు తెలిము త్తియంపుజొంపపు పెల్లి తె వలు నిద్దంపునురువులు గాఁగ. అచ్చ. రా. బాల ౧౯౦. (శ. ర. పా. 'తెగలునిద్దంపు నురుఁగులు గాఁగ' ముద్రి.)

తెవడు=తెగడు. స. క్రి. తిరస్కరించు, అధఃక రించు.

సీ. నీలోత్పలచ్ఛాయఁ బోలుమైచాయయు నవ పద్మదళములఁ దెవడు మెఱుఁగుఁ, గనుదో యి...భార. ఆశ్ర. ౨. ४౨. (ఇట ఔప మ్యద్యోతకము.)

తెవు(గు)లు. వి. వ్యాధి, రోగము.

గీ. తెవులు గొనియున్న మృగములఁ దివిరి యేయ. భార. ఆది. ౫. ౫౩.

క. వాడక వ్రాలక తెవుళులఁ, గూడక తగ నెల్ల గెఱలుగొని నవకములై, చూడఁగ భద్రము లగుచును, వీడెఁ సస్యంబు నిడుమ వీడెం బ్రజకున్. భాగ. ౧౦ పూ. ౭౫౭.

గీ. తనర నేపెద్ద పుట్టువు లను కడింది, తెవులు నకు వెజ్జు తాఁడు...అచ్చ. రా. బాల. ౧౧. హరి. పూ. ౩. ౨౨౦.

జః తెవులుగొంటు, తెవులుగొట్టు, తెవులుగొను, తెవులువడు,

తెవు(గు)లు(ల్లు)గొంటు=తెవులుగొట్టు. విణ. (√తెవులు) వ్యాధిగ్రస్తుఁడు; వ్యాధిగ్రస్తురాలు, వ్యాధిగ్రస్తము.

సీ. తెవులుగొంటులనైనఁ దేర్చుసంకటమున... భార. విరా. ౧. ౧౦౧.

క. అంగజకేళికిఁ దివిరెదు, పుంగవులను మసరు కలిసి పోరాడకు వీఁ, కం గాలుద్రువ్వవృష భము, లం గదియకు తెవులుగొంటులం గూడ కుమీ. భోజరా. ౬. ౩౩.

ఉ. ప్రేఁకటియాడుమానిసికి వేఁదుఱు వానికిఁ దెవ్లుగొంటుకున్, దేఁకువతోఁ దొలంగునది తె ల్లముగా నెదు రేఁగు దెంచినన్. విజ్ఞా. ప్రా. ౧౬.

తెవు(గు)లుగొట్టు=తెవులుగొంటు. (√తెవులు)

సీ. తెవులుగొట్టో వయసుదీరిన మేనిదో యో జమాలినదియో బీజుగొట్టో. చెన్న. ४. ౩౯.

తెవు(గు)లుగొను. అ. క్రి. (తెవులు+కొను) వ్యాధిగ్రస్తమగు; వ్యాధితుఁడగు.

గీ. ఇంత యేమిటి కాజారుఁ డేలు పెంత, తెవు లుగొన నమ్మరా దంచుఁ దెలిసికొనరె, యకట తిమిరంపునిండుప్రాయంబు కతన, నెఱుఁగ రిం తియె కాక రాకేందుముఖులు. శుక. ౨. ౫౫౮.

తెవు(గు)లువడు. అ. క్రి. (తెవులు+పడు) వ్యాధి తుఁడగు, రోగపడు.

వ. కొందఱు కులటలు పతి దురవస్థఁ బొందినఁ దెవులువడిన శృంఖలాబద్ధుండైనను బరిత్య జింతురు...కాశీ. ౧. ౭౯.

గీ. విశ్వసించిన నీరుద్రావినను నిద్ర, పోయినను జూలుకొన్నను బొర్లుచున్నఁ, దెవులువడ్డను గుంటైన దిట్టచెడినఁ, జంపఁ డనుకంప నెట్టి హింస్రంబునైన. కాశీ. ४. ౬౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## తే

**తేఁకు**= టేఁకు. వి. (క. తేకు, తేంగు. త. మ. తేక్కు) శాకవృక్షము, క్రకచపత్త్రము*. (చి. ని. శ. ర.)

**తేఁకువ.** వి. (√తేఁగు) ౧. భయము, జంకు; సందేహము.

క. నరనాథుఁ గొలిచి యలవడఁ, దిరిగితి నా కేమి యనుచుఁ దేఁకువ లేమిన్, మరియాద దప్ప మెలఁగినఁ, బురుషార్థంబునకు హాని పుట్టకయున్నే. భార. విరా. ౧. ౧౨౨.

సీ...భుజబలవిక్రమంబుల ఘనుండు,గురుఁ డట్టి వానిఁ దేఁకువ లేక కదిసిరే పాంచాలుర... భార. ద్రో. ౧. ౮౦.

ఉ. అల్లన నింతి యిట్లనియె నారసి వాసవు కల్మి లేమియుం, దెల్లముగా నెఱింగికొని తేఁకువ లేకిట వచ్చు టొప్పు న్యాయుల్లము శంకితం బగుచు నుండఁగ వేగిరపాటు మేలె ...భార. ఉద్యో. ౧. ౧౬౫.

౨. ధైర్యము.

ఉ...అస్త్రసంపదం, దేఁకువఁ బెద్దయై యతఁడు దేవగణాదులతోడఁ బోరి ము,క్కాఁకలుఁ దేఱినాఁడు... భా. రా.యు. ౮౧౪.

ఉ. తేఁకువ దప్పి దప్పి పడదేరెడుఁ గన్నులు ...పి. శకుం. ౩. ౬౯. పార్వ. ౩. ౫౯.

౩. దర్పము, గర్వము.

ఉ...మున్నడిదైయె యనూరుఁడున్, ధీరత మీఱ నయ్యురుల తేఁకువ మాన్చె...కృ. శకుం. ౩. ౫౬.

౪. ఉత్సాహము; సంతోషము.

క. తేఁకువ యలరఁగ నీగతి, మూఁకల విడియించె రాజముఖ్యుం డంతన్. భోజరా.౪.౮౪

ఉ...విద్యలాగి సొంపు నీకు గపదేశమిచ్చెదం, దేఁకువ వారిపూరమున దిగ్గన శుద్ధి యొనర్చి ర మనన్. భా. రా. బాల ౨౧౨.

ఉ...శోణకిరణావళిగంటు రథాంగకేళికిన్,దేఁకువపెంట మింటఁ జనుదెంచె దినేంద్రుఁడు కాలఘుంటయై. కాశీ. ౪. ౯౪.

క. ఆఁకొన్నవారి రమ్మని, తేఁకువ నన్నమిడువాఁడె దేవుఁడు...ఉ. రా. ౪. ౩౦౨.

౫. దృఢసంకల్పము, గట్టియుద్దేశము.

క. దితిసూనుఁ దఱిమి మఱియును, దితిజులము పీఁచ మడఁచు తేఁకువ మదిఁ బూని,తి వేని మమ్మునేలుట,సత మగు...హరి.పూ.౪.౩౧.

౬. బింకము, బెట్టు.

చ. నయమున భీతి వాపి మది నవ్వునఁ దేఁకువ వాపి...చెయ్వుల లజ్జ వాపుచున్...గౌరి నీశ్వరుఁడు మేకొలిపెన్ రతికిం గ్రమంబునన్. కు. సం.౯. ౩౪౫.

సీ. పులకాంకురంబులు... గీ...తరుణిపొందు, వడయఁ గీడ్పడి తేఁకువ వాపఁ దలఁచు. కు. సం. ౫. ౫౨౪.

౭. వివేకము, ఉచితానుచితజ్ఞానము.

క. వీఁక మెయిఁ గ్రీడికొడుకుం, డాఁకఁగ నీకొడుకు తలఁచి తప్పిమి కవిసెఁ బేరాఁకలితో నున్నహరిం, దేఁకువ సెడి చేరుకరిగతిం గురుముఖ్యా. భార. ద్రో. ౨. ౧౯.

సీ. తేఁకువ లేక పుత్తెంచినయప్పాండవజ్యేష్ఠ నకుఁ దలవంపుగాఁగ. భార. ద్రో. ౪.౨౫౮.

౮. మర్యాద, గౌరవము.

ఉ. తిట్టులఁబోయి యక్కొలువు తేఁకువవారల లోని కింతిఁ ద్రా,నట్టులు దుస్ససేనుఁ డదయాకృతి ముందల వట్టి యీడ్వఁగా,నెట్టు సహించె మామ...భార. ఉద్యో.౧.౩౪౪.భార. శాం. ౨. ౧౮౧.

౯. హద్దు, మేర.

ఉ. దేవ భవన్నియోగమునఁ దేఁకువ దప్ప దొకండు నాపయిం,బోవఁగ లేఁడు కాల్నడ...

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. పారి. ౨. ౪౧.

క. ఆపాపలవిహరణములు, దీపులు పుట్టింప మ
 రగి తేఁకువ లే కా,గోపాలసతులు మఱచ్చు వ,
 నేపనులును మఱచి యుండి రీక్షణపరలై.
 భాగ. ౧౦ పూ. ౭౫౭.

౧౦. ఓర్పు, తాలిమి.

ఉ. తేరులయొప్పు ప్రౌఢువడెఁ దేఁకువ లేనిపదా
 తికోటి ను, గ్గై రుధిరంబులో మునిఁగె...
 భార. ద్రో. ౧. ౨౭౩. (వ్రాఁత ప్రతి పా.)

౧౧. (త. తేక్కు, తేంగు=నిండుట, పూర్ణమ
 గుట) పూర్ణత, సమగ్రత.

క. ఆఁకలి గాదో భ క్తిం,దేఁకువ గలవాఁడఁగా
 నో తిన వేల కృపకా. కాశీ. ౩. ౮౫.

౧౨. (క. తేంగు=సామ్యము) విధము, రీతి.

వ...గగనపదవిం దెగిపడినమిక్కుటంపుఁదోఁక
 చుక్క తేఁకువ మరకతంపుటుప్పరిగకొణిగ
 దప్పి యఱుకుబక దారిసారువామిటారితీరు
 న...చం. రా. ౩. ౨౧.

ద్వి...అఱచేతిగజనిమ్మపంటి, తేఁకువ నలరించి తి
 విరి యేప్రొద్దు, బ్రాణపదంబుగా భావించి
 మనుచు, క్షోణీశు వంచింపఁ జూచెద పకట.
 ద్వి. తి. సా. ౧ ఆ. ౧౪ పొ. ౬ పం.

తేఁగు. అ. క్రి. (త. తేంగు=భయచిహ్నములు
 కనఁబఱుచు, భయపడు.) వణఁకు.

ద్వి. నీఁగుచుఁ బూఁదేనెఁ దోఁగుచుఁ జలికిఁ,
 దేఁగుచు నెండలఁ గ్రాఁగుచుఁ బ్రియుల,కాఁ
 గుచు మదిఁ జెలరేఁగుచుఁ బ్రీతి. పండితా.
 పర్వ. ౩౫౨.

జః తేఁకువ.

తేఁజెట్టు. వి. నారికేళము,టెంకాయచెట్టు. (శ. ర.)

తేఁటి. వి. భ్రమరము, తుమ్మెద. (బ. తేఁటులు,
 తేంట్లు.)

చ. తనుఁ గనుబ్రామి యొండొకలతం బతి వే
 లొక తేఁటిబోఁటిపొ,త్తున విరిదేఁనె గ్రోలఁగ
 నెగుర్పడి...పారి. ౩. ౫౭.

సీ. ముడివిప్ప నడుగుఁదమ్ములపైనె వ్రాలుపెన్నె
 ఱులు దేం ట్లగుట సందియము గలదె.
 ఆము. ౨. ౩౦. ఆం.భా.౨.౯౫.

జః తేఁటియల్లివింటిదొర.

తేఁటియల్లెవింటిదొర. వి. (√తేఁటి)- తుమ్మెద
 లు నారిగాఁ గలవింటివాఁడు-మన్మథుఁడు.

గీ...వలరాజు తేఁటియల్లె,వింటిదొర...నాఁగ
 మరునాఖ్య లగు...ఆం.భా.౧.౪౫.

తేఁడు=తెండు. అ.క్రి. పండుకొను, శయనించు.

ఉ. వీఁడిదె తెల్లనాకులను వీడెము సేయుచు
 వీథి వచ్చుచు,న్నాఁడు మదించి తిండి తిని
 నాఁడుచువిూ యిటువిూఁద నేడకో,తేఁడఁ
 గఁ బోయెడిం గరణదేశపుజాణఁడు గాఁగఁ
 బోలు...క్రీడా. ౧౪౯.

చ...గాడ్పుకడ్పులో, గుసురులు గోఁడుచు న్వ
 రుణుగుండియఁ దేఁడుచు వాహనేంద్రునం,
 దినిఁ జన వేఁడుమకా నృపతి నేర్పులు దీడు
 చు వెండి వాఁడిగకా. కళ. ౫. ౧౨౩.

తేగ. వి.పాఁతిన తాటిటెంకనుండిబయలుదేటిభక్ష్య
 పదార్థముగా నుపయోగించుమొలక. (శ. ర.)

సాః తేగవంటిబిడ్డ యనఁగా తేగతె మ్మని యేడ్చి
 నట్లు.

తేగడ. విణ. (త. తేయ్గడై - తేయు+గడ.)

౧. అఱిగినది, తగ్గినది. (నాణెము. శ. ర)

౨. తరుణము, లేఁతది.

సీ. పులుదిండితాలసొంపులు నింపునెఱికురుల్
 తేగడనెలవంక దిద్దునుదురు. గీ...ఈనాటి
 కలరు. ఘటికా. ౨. ౭౯.

౩. నవకముకలది, ఏపుగలది.

(వ్యవ) ఆపిల్లవాఁడు మంచి తేగడగా నున్నాఁ
 డు. (బ్రౌ)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తేగము=చేగము. (సం. త్యాగః)

సీ...దానమాం జాగము పెట్టొసఁ గీగి యీవి.

గీ. పుడుకురింత పుడిగ తేగము పుడుకననఁగ. ఆం.భా. ౨. ౧౪౨.

తేగాకత్తి. వి. (హిం. తేఘా) చురకత్తి. (శ.ర)

తేగుడు. వి. ౧. అనుకుగా నుండుపదార్థము, జిగురుపదార్థము.

(వ్యవ).అన్నము పాసిపోయి తేగుడు అయినది.

౨. లాల, చొల్లు.

సీ. నోరు తేగుడుగాఱ నారివేరము మీఱ సారెఁ బయ్యెద జాటి యోరఁ జేర.చంద్ర. వి. ౩. ౧౪౭.

తేజన. సం. వి. ఆ. స్త్రీ. ౧. చెవిదాఁటించి అంగుళిమునర నారిని లాగుట. ౨. ఆకర్షింపఁబడిన ధనుస్సునందు శరమును సంధించుట.

తేజనకము. సం.వి.అ.పుం. కాకివెదురు.(శ. ర)

తేజనము. సం.వి.అ.పుం. ౧. వెదురు. ౨. శరము, ఎల్లు. న. ౧. సానఁబట్టుట, వాఁడిసేయుట,చికిలిసేయుట. ౨. దరికొలుపుట, రగుల్చుట. ౩.మెఱుఁగుపెట్టుట. ౪.చెవిదాఁటించి అంగుళిమునర నారిని లాగుట. ౫. ఆకర్షింపఁబడినధనుస్సునందు శరమును సంధించుట.

తేజని. సం.వి. ఈ. స్త్రీ. ౧. మూర్వ, చాఁగ. ౨. జ్యోతిష్మతి, మానేరు.

తేజపత్త్రము. సం. వి. అ. న. ఆకుపత్త్రి.

తేజరిలు(ల్లు). అ. క్రి. (√తేజో-ఇల్లు పరమగునపుడు రవర్ణాగమము. తేజరిల్లు=ప్రకాశే. చి. ధాతుమాల) ౧. ప్రకాశించు, వెలుఁగు.

క. భాణుఁడు సావిత్రునివిలు, భాణహతిం ద్రుంచి యతనిబలసాగరముఁ, బాణాంశులఁ గ్రోలి మహాప్రాణుండై తేజరిల్లె బ్రక్రియ రుక్మక్రియన్. హరి. ఉ. ౧౦. ౪౯.

౨. ప్రసిద్ధమగు,ఖ్యాతినొందు; ఒప్పు.

సీ. ప్రభవం బనంగ నవ్యయ మన శాంతినాఁ దేజంబు నా నెందుఁ దేజరిల్లి. భార. శాం. ౫. ౩౪౫.

శా...చతుర్వక్త్రీయనక్తంబునన్,నాశం బొందక తేజరిల్లె సకలొన్నత్యంబు సూచించుచున్: గాశీపట్టణవైభవంబు...దశా. ౧. ౧౯౩.

సీ. అధికపుణ్యప్రాప్య మైనగంధర్వజాతిని సముద్భవ మంది తేజరిలుట. కళా. ౫. ౧౨౪.

౩. అతిశయించు, అధికమగు.

క...పుత్త్రోత్సవ మిం,పొనరంగఁ జేసి సూతక, దినములు వెడలించె ముదము తేజరిలంగన్. సారంగ. ౧. ౪౧.

తేజలము. సం. వి. అ. పుం. కపింజలము, కౌఁజుపిట్ట. (రాజని.)

తేజస్కరము. సం. విశ. (అ. ఆ. అ) ౧. ప్రకాశము కలిగించునది. ౨. వీర్యము కలిగించునది, సత్తువ నిచ్చునది. (ఔషధము మొ.)

తేజస్వంతుఁడు. సం. విశ. (త్. స్వతీ. త్) తేజస్సుగలవాఁడు.

తేజస్వతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. గజపిప్పలి. ౨. చవ్యము, చవికె. ౩. మహాజ్యోతిష్మతి, పెద్దమానేరు, పెద్దయెక్కుడు.

తేజస్వి. సం. విశ. (న్. నీ. న్) తేజస్సుగలవాఁడు.

తేజస్విని. సం. వి. ఈ. స్త్రీ. ౧. జ్యోతిష్మతి, మానేరు, ఎక్కుడు. ౨. మహాజ్యోతిష్మతి, పెద్దయెక్కుడు.

తేజస్సు(ము). సం.వి.స్.న. ౧.ప్రకాశము, దీప్తి. ౨. ప్రభుశక్తి, ప్రభావము. ౩. ప్రతాపము,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పరాక్రమము. ౪. ఉక్రము, రేతస్సు. ౫. సారము, వీర్యము, బలము. ౬. మేనికాంతి. ౭. నవనీతము. ౮. అగ్ని. ౯. బంగారు. ౧౦. మజ్జ. ౧౧. పిత్తధాతువు. ౧౨. ప్రాగల్భ్యము, దిట్టతనము. ౧౩. నాయకగుణభేదము. (పరుల యధిక్షేపమునకుఁగాని యవమానమునకుఁ గాని సైఁపకుండుట) ౧౪. శక్తి. ౧౫. చైతన్యము. ౧౬. ఉదకము,నీరు. ౧౭. అన్నము. ౧౮. ధర్మము. అ. పుం. ౧. వాఁడిమి. ౨. కాంతి.

తేజి(జీ). వి. (క. తేజి. త. తేసి.) ౧. ఉత్తమాశ్వము, మంచిజాతిగుఱ్ఱము.

ఉ.కోమటు లెల్ల నరపులు గుఱ్ఱము లెల్లను దేజులప్పురిన్. విక్ర. ౧. ౯౯.

క. అల్లునికి నిచ్చె ధాత్రీ,వల్లభుఁ డనురక్తి నమరవల్లభుహరితో,నుల్లసమాడం జాలెడు,తెల్లని యొకకత్తలాని తేజీహయమున్. నైష. ౬. ౯౬.

ఉ...నృపకేసరి యల్లున కిచ్చె నొక్క తే,జీ నపరంజిబ్రాఁతపనిచిత్తరుపల్లము లుల్లసిల్లఁగన్. రాజ. చ. ౩. ౧౮౪.

౨. వర్తితవాజి, కవచము తొడిగినగుఱ్ఱము.

సీ. తేజి నా వర్తితవాజి యౌ...అం. భా. ౨. ౧౯౬.

౩. ఉన్నతవాజి, ఎత్తైనగుఱ్ఱము.

సీ. తేజి నా నున్నతవాజి యై విలసిల్లు...అం. భా. ౨. ౧౯౭.

౪. గుఱ్ఱము; వాహనము.

క. ఆపురి తేజులవేగ,వ్యాపారము గెలువ నోపమనుసిబ్బితిఁ బో,చాపలవిరహితసౌఖ్యం,బాపాదించుకొను మానవావళిమనముల్. కాళ. ౧. ౨౬.

సీ.సురకిరీటముల నంచుపదంబు దైతేయనాథు తేజీవెంట నడవ నేర్పు. దశా. ౨. ౧౧౨.

గీ... చెంతఁ జొక్కడపుదిండుమగఁడుగ్గడించుచక్కిఁ బోవ వెఱచి, ప్రొద్దుతేజీలు బలుపడిఁ బోవుఁ గడల. నీలా. ౧. ౩౨.

జేజేరాచ తేజి=ఇంద్రాశ్వము,ఉచ్చైశ్శ్రవము.

సీ. తవిలి యరదపులాయితమున జోడనఁ జూపునోజ జేజేరాచ తేజి డిగియె. వసు. ౫. ౬.

తేజితము. సం. విణ. (అ. ఆ. అ) ౧. శాణితము, సానఁబట్టఁబడినది, పదను పెట్టఁబడినది. ౨. ఉద్దీపితము, ప్రజ్వలింపఁజేయఁబడినది.

తేజిష్ఠము. సం. విణ. (అ.ఆ.అ) తేజస్వితమము అన్నిటిలోను ఎక్కువ తేజస్సు కలది.

గీ...అద్దనుజవరుని,తనువునం దుండి తేజిష్ఠతను విలాఘుఁ, డైనపురుషుండు వెడలిన నతఁడు నూచి. భార. శాం. ౩. ౧౪౧.

తేజీయము. సం. విణ. (స్. యసీ. స్) తేజస్వితరము, ఎక్కువ తేజస్సుగలది.

శ్లో.ధర్మవ్యతిక్రమోదృష్టమీశ్వరాణాం చ సాహసం, తేజీయసాం న దోషాయ వహ్నేస్సర్వభుజోయథా. సం.భాగ.౧౦.౩౩.౩౦. (ఇది ఆర్షమనఁదగును. కాని ఆంధ్రభారతమున తేజిష్ఠశబ్దప్రయోగ ముండుటచే ఇది యును గ్రహింపఁబడినది.)

తేజో. వి. (సం. తేజః) ౧. ప్రకాశము, కాంతి, శోభ. (శ. ర.)

క. జేజేరాచాచాబుజ,గాజిగి నొగిఁ దెగడి నెగడఁగాఁ జాలెడుమే,త్తే జూనెడురుత్తుకగల, జేజేరు న్గొగిలుదారిసిగ జేజేరున్. అచ్చ.రా. బాల. ౨౬.

గీ.నీల యను పేరఁ దేజున నివ్వటిల్లు,నింతి పెండిలి కత తెలిఁ గెట్టు లనిన. నీలా. ౧. ౨౩.

౨. ప్రతాపము, శౌర్యము.

గీ. వెలయ నిరుదచ్చిరాచజాబిలులలోన,మిక్కుటం బగు తేజున మెఱిసినాఁడ. అచ్చ. రా. బాల. ...

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri.

గీ. వేలుపులగొంగ సైదోడు వెనుకఁ దూఱి, కావుమని వేఁడుకొనెడిచోఁ గడఁక నితని, మనుపుటక్కాళపాలదిండిమ న్నెగాని, వెనుపుఁజేవయుఁ దేజుఁ గైకొనుట సుండి. అచ్చ. రా. యు. ౫౯.

౩. ప్రభావము, మహిమ, గొప్పతనము.

ఉ. ఆజని తేజు గల్గి యలరారెడునయ్యెకిమీఁడు ...అచ్చ. రా. బాల. ౧౯౬.

జ: తేజరిల్లు, తేజుమాలు సేయు, తేజులకొటారు.

తేజేమాలుసేయు. స. క్రి. (√తేజే. హిం. తేజ్ =వాఁడి, మాల్ =తుడుచునది.) తుడిచి శుభ్రముచేయు.

సీ. మధువశంబునఁ దేజుమాల్సేయ మఱఁడుంచు సవిరహాస్రార క్తశస్త్రచయ మొ. ఉ. రా. ౬. ౬.

తేజేలకొటారు. వి. (తేజులు + కొటారు.) కాంతులగని.

గీ. తేజులకొటారు వలుఁదముత్తియపుఁబేరు... పరువంపుఁబనసపండు, నాఁగఁ దగు నెన్న నన్న యన్నాతిమిన్న. అచ్చ. రా. బాల. ౧౩౬.

తేజోబీజము. సం. వి. అ. న. మజ్జ, అస్థిసారము, ఎముకలలోనిక్రొవ్వు.

తేజోమంథము. సం. వి. అ. పుం. క్షుద్రగణికారిక, చిఱునెల్లి.

తేజోమయము. సం. విశ. (అ. ఈ. అ) ౧. మిక్కిలి తేజస్సుగలది. ౨. తేజోవికారమైనది.

తేజోవృక్షము. సం. వి. అ. పుం. క్షుద్రాగ్నిమంథము, పిన్న నెల్లి.

తేజోహ్వా. సం. వి. ఆ. స్త్రీ.- తేజస్సుతోస్పర్థించునది- తేజస్విని.

తేట. వి. (√తేటు. క. తిళి. త. తేళ్ళై) ౧. తేటిన మజ్జిగ లోనగు ద్రవపదార్థములు పదార్థములందలి ప్రకాశాంశము, సారము.

సీ. అతివలిన్ననిమాట లమృతంపుతేటలు ... విక్ర. ౧. ౧౧౯. ఇట్లేమజ్జిగ తేట, తరవాణితేట మొ.

ఉ...ఇం, దిందిరవేణి మోవి యెలతేనియలో నిక రంపుఁదేట...విజ. వి. ౧. ౧౪౯.

ద్వి. వినయంబు తేట వివేకంబుకోట, యనురక్తి యిల్లు నుదాత్తత పెల్లు, తత్త్వంబుతీఁగ ... బస. పు. ౨. ౧౩౪పం.

౨. నిర్మలత్వము, స్వచ్ఛత.

సీ. అప్పుహాళైన శుభ్రాబ్జంబురుచి యెంత మాట మోచినయంచ తేట యెంత. నరస. ౧. ౬౫.

సీ. కలికిరాయంచ ఔక్కలమించు తెలిచాయ తెరలతేటయు గుఱు తెఱుఁగరాదు. ఉ. రా. ౫. ౨౦౪.

౩. ప్రసన్నత; వికాసము.

క. హరిభక్తులతో మాటలు, ధర నెన్నఁడుఁ జెడ నిపుణ్యధనములమాటల్, వరముక్తికాంత తేటలు, నరిషడ్వర్గంబు సారనియరు దగు కోటల్. భాగ. ౬. ౧౫౩.

చ. చనుఁగవయొప్పు నెన్నడుముసన్నఁదనంబు మెఱుంగులీను మోముగుఁ గలతేట నెన్నడల ముద్దును మాటలనేర్పు...శుక. ౨. ౫౫౧.

౪. సుషమ, ఉత్కృష్ట మగుకాంతి.

చ...మరునితూపులొ బల్ రతనంపుఁదేటలో, సొగసులదీవులో యనుచు...పొగడికఁ జెందిది యందములఁ బొల్తురు నీటుగ నాటచేడియల్. నీలా. ౧. ౪౦.

౫. తీరు, విధము.

ఉ...వీనుల కింపుగఁ బాడి రంగనల్, దేశివిధంబుమార్గమునఁ దేటయు నొక్కట సొళగింపఁ గాళ్. నైష. ౪. ౧౪౬.

సీ. అర్ధచంద్రుని తేట నవఘళించులలాటపట్టిఁ దీర్చిమెయిగమిపట్టిలోడ. మనుచ. ౩. ౪౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విణ. ౧. తేటినది, నిర్మలము, స్వచ్ఛము.

గీ. జలజదళములఁ దేటలుఁ జవులు నైన,యంబు కణములు వోలిచెఁ బద్మాకరముల. ఆము. ౪. ౧౪౬.

మ. కలయన్ నీలమయంపుఁదల్లియొఱ దాఁకం దేటనీ రొప్పు నర్థ్యలకూపంబుల... ఆము. ౧. ౫౮. మనుచ. ౪. ౬౦.

౨. విశదము, స్పష్టము.

శా...విశిష్టాద్వైతంబును దేటగాఁ దెలుప మాటాడన్ బ్రిమాణంబులన్. ఆము. ౩. ౯.

గీ...జన్నంపుఁగూటిదొరల, మాటకయి మేను పూనిన మేటివేల్పుఁ, దేటగాఁ జూచుకోర్కి నచ్చోటఁ జేరి. నీలా. ౩. ౫౧.

౩. ఇంపైనది, మనోజ్ఞమైనది.

గీ. తేనియలసోన వెదచల్లు తేటమాట, కలికి యమృతంబు కుండలో నడఁగియుండె, నేల యిటువంటి వెల్ల మా కేలతాంగి, యబ్బినను జాలు నని యెంచి రసురు లపుడు. దశా. ౨. ౩౦౨.

తేటగీతి. వి. (√తేట) పద్యభేదము.

ఆ. సూర్యుఁ డొకనిమీఁద సురరాజు లిద్దఱు, దినకరద్వయంబు తేటగీతి. కవిజనా. జాతి. ౨౩.

తేటగొను. అ. క్రి. (తేట+కొను) తేటపడు స్పష్టపడు, విశదమగు.

గీ. తేటగొనఁ జూడు మీశానుదిక్కునందు, బ్రాహ్మణోత్తమ రుద్రులు పారిపదులు. కాశీ. ౪. ౧౬౫.

తేటచేలములు. వి.(√తేట) బ.ధాన్యవిశేషము, ఒకజాతివరిధాన్యము.

వ...గుజ్జుపుతోఁకలు తేటచలములు ఊఁదుఘుటికలు గాజుకడియములు...ప్రబంధ. ౧౧౨.

తేటతెల్ల=తేటతెల్లమి, తేటతెల్లము.విణ.(తేట+తెల్ల) విస్పష్టము, ప్రస్ఫుటము.

సీ. అది తేటతెల్లగా నడుగంగఁ దలఁచి లజ్జాసాధ్వసంబులు సందడింప. కాశీ. ౩. ౬౨.

గీ...టీక వ్రాయవలసెఁ, దెనుఁగుమాటలఁ గడుఁ దేటతెల్ల గాఁగ. అప్ప. ౪. ౧౩౪.

ఉ...చెప్పితి పరాత్పరమంత్రము తేటతెల్లగన్. చెన్న. ౧. ౬౯.

తేటతెల్లమి=తేటతెల్ల. విణ.(√తేట)విస్పష్టము, ప్రస్ఫుటము.

ఆ. నిన్ను నొవ్వఁ బలికె నీచేఁ బ్రమాణంబు, గొనియెఁ గాని నమ్మకునికిఁ గాదు,తల్లి నీవు తేటతెల్లమి సేసితి, మనమునందు నతనిఁ గినియవలదు. భా.రా.యు. ౨౪౩౩.

మత్తకోకిల. తేటతెల్లమిగాఁగ నంతయుఁ దెల్పుమా యని యాదటన్. సారంగ. ౩. ౧౭౩.

గీ. తేటతెల్లమిగా మాకుఁ దెల్పవయ్య. దశా. ౧. ౨౮౪.

తేటతెల్లము= తేటతెల్ల. విణ. (తేట+తెల్లము) విస్పష్టము, ప్రస్ఫుటము.

గీ. దీనికొలఁది యేపాటియో దేవరకును, దెలియఁ బరికించితిరె తేటతెల్లముగను. కళా. ౮. ౧౯౮.

సీ. నామీఁదఁ జెదరక నాఁటినతమకూర్మి తేటతెల్లంబుఁగా దెలిపి చననొ. వరాహ. ౪. ౮.

తేటపడు. అ. క్రి. (తేట+పడు) తెల్లమగు, స్పష్టమగు, ఏర్పడు.

ఆ. ఆట్టిజెట్టి యనిలుపట్టిచే విరథుఁడై,పోయి పోయి నట్లు పోయెఁగాని, మరలి కయ్యమునకుఁ జోరఁ డెట్టు లాతని, తెఱఁగు సెప్పు నాకుఁ దేటపడఁగ. భార. ద్రో. ౪. ౧౮౪.

గీ. ఏటి కొయ్యన గర్భంబు తేటపడియె. వసు. ౩. ౮౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తేటపఱుచు. స. క్రి. (√తేటపడు) విశదము చేయు,స్పష్టముచేయు.

ఆ. పాపకర్ము లైనపాండుతనూజులు, సమరధర్మ మెడలి జయముగొనుట, గురుసుతునకుఁ గృ పునకుం గృతవర్మకుఁ, దేటపఱుపు నాదు మాటగాఁగ. భార. శల్య. ౨. ౩౯౫.

గీ. విష్ణుసంకీర్తనం బరవిందభవుఁడు, దివిజులకుఁ జెప్పె నది నీకుఁ దేటపఱుతు. భాగ. ౩. ౪౪౯. సైప. ౩. ౧౫౪.

తేటిక. వి. ప్లవము,తెప్ప.

సీ. తేప నాఁ దెప్ప నాఁ దేటిక యనఁగను బ్లవనామ ధేయంబు పరఁగుచుండు. ఆం. భా. ౧. ౧౫౭.

తేడా. వి. ౧. భేదము, తారతమ్యము.

(వ్యవ) వానికిని వీనికిని చాల తేడా కలదు.

౨. హెచ్చు. (శ. ర)

తే తెయ్యాలు. వి. బ. నాట్యమునం దగుధ్వని క నుకరణము; చిందు, నాట్యము.

మ...కాంతామణీ,రమణీయేక్షణముల్ పయిక్ బడినమాత్రన్ రోఁత లై పోదు రుల్లము తే తె య్యాలు సల్పఁగా సురభిమల్లా మానినీమన్మ థా. మల్లభూ. శృం. ౯౦.

తేది=తేదీ. వి. (సం. తిథిః) దినము(శ. ర. బ్రౌ.)

తేదీ=తేది.

తేనము. సం. వి. అ. పుం. గానాంగభేదము.(ఇం దు 'తేన' అనుశబ్దము వినఁబడును.)

తేనియ(నె) వి. (క. జేను. త. తేన్.)మధువు, జున్ను.

(కీచకుఁడు) ఆ...అగ్గలముగఁ, గురియు తేని య లకుఁ గొంకు లతాగుల్మ, తరుసమీపములకు నరి గి యరిగి. భార. విరా. ౨. ౩౦౪.

సీ. పిండివంటలతోడ ఖండశర్కరతోడ నేతు లతోడఁ దేనియలతోడ. పాండు. ౨.౧౦౭.

గీ. తివుటఁ దియ్యనితమ్మిపూఁదేనె గ్రోలు.సైప. ౨. ౫. పారి. ౧. ౧౧౭.

తేనియ(నె)పూసినకత్తి=తేనెయున్నదని నాకిన యెడల నాలుక కోసికొనిపోవును. (పైకి తీ యనిమాటలాడుచు లోపల ద్రోహచింతగల కపటి. ఇది "గోముఖవ్యాఘ్రము, పయో ముఖవిషకుంభము మొ. వానివంటిది.)

క. నిను నమ్మి యెుండువలనికిఁ, జనక జయద్రథుఁ డు నిలిచె సైన్యములోనా,తనిఁ జంపెడుదేని యపూ,సినకత్తివి గాక మానిసివె యూహిం పన్. భార. ద్రో. ౩. ౧౦౭.

గీ. తేనెపూసినకత్తి ధాత్రీసురుండు. పాండు. ౩. ౫౭.

మీసాలపైతేనియలు = మీసములపై నుండు తేనె ఒకమాఱు నాకినచో ఆమాధుర్యము పోవును.(అచిరములైనఅల్పభోగములు,క్షణ భంగురము లైన అల్పసుఖములు)

మ...నమ్మకు మిట్టితుచ్ఛసుఖముల్ మీసాలపై తేనియల్. మను చ. ౨. ౬౫.

జ. తేనియదిండి,తేనెకన్ను, తేనెగద్ద,తేనెగవ్వ, తేనెగాజు,తేనెటీఁగ, తేనెతల, తేనెతెట్టె, తేనెతొన, తేనెదానిమ్మ, తేనెనీరు, తేనె పట్టు, తేనెపనస, తేనెపానకము, తేనెపెర, తేనెమంచు, తేనెమావి, తేనెమురఁటి, తేనె రాయఁడు, తేనెసారాయి.

తేనియ(నె)దిండి. వి. (తేనియ+తిండి) మధు పము, తుమ్మెద.

సీ. ముఖ మంబురుహ మని ముమ్మరంబుగ నప్ప ళించు తేనియదిండిలెంక లనఁగ. పాండు. ౩. ౨౦౧.

క. ఇలఁ దనసంకేతంబున, నిలిపినపద మెంచి చూడ నేయార్థం బౌ, బలు తేనెదిండిగమి నగు, నలసాగరకర్ణయానయలక లనంగన్. నరస. ౪. ౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తేను. అ. క్రి. నిద్రించు.

ఉ. దేవునివామభాగమున దేహము నూడ్చినసా ర్వభౌముఁ డా, దేవునివెన్క మేల్కనని తేను టు గైకొనవాకవాసియా.పాండు.౨.౨౩౬. (చి. ని. పా.)

జ. తేనుకొను.

తేనుకొను. అ. క్రి. (√ తేను) ఘనీభవించు, గట్టి పడు.

ఆ. తేనుకొన్నక్రొవ్వు లోనున్న నీరుగాఁ, గన్ను లగ్గిమెఱుపుగములు గాఁగ, రొప్పు టుఱుము గాఁగఁ గప్పు చొప్పడఁ బంది, గాలిఁ బఱచు మొయిలుకిరణిఁ బఱచె. ద్వా. ౮. ౪౦. (తిన్నక్రొవ్వు అనిముద్రి).

తేనుపు. వి. ఉద్గారము.

ద్వి. తేనుపు వచ్చిన దివ్యగంధంబు, గానుపింపఁగ వారు గట్టినఁద్రేఁప. ప్రభు. ౧౫౫ పా. (చి. ని. పా- త్రేనుపు. ముద్రి. పా.)

తేనెకన్ను. వి. (√ తేనె) తేనెరంగు కలకన్ను. (వ్యవ) వానికండ్లు తేనెకండ్లు.

తేనెగద్ద. వి. (√ తేనె) ఒకజాతిపక్షి.(శ.ర.బ్రా.)

తేనెగవ్వ. (√ తేనె) వి. తేనెవలె నించుక పచ్చ రంగు గలగవ్వ (వా)

తేనెగాజు. వి. (√ తేనె) కాచవలయవిశేషము, తొడుగుకొను గాజులలో నొకవిధమైనది, తేనె రంగుగలగాజు. (శ.ర.)

తేనెటీఁగ, తేనెయీఁగ, తేనీఁగ. ఇది ఎదంత శబ్దమైనను ఉదంతములవలె దీనికి"టు" గాగ మము వచ్చినది.)-వి. (√ తేనె) మధుమక్షిక, సరఘ.

సీ... మధుమక్షిక లేనీఁగ జుంటీఁగనా నెసంగు. ఆం. భా. ౨. ౯౫.

తేనెతల. వి. (√ తేనె) సస్యవిశేషము.

గీ. తేనెతల వడఁ బండె ధాత్రీతలంబు, పొదలి ధారణ పోఁకమఁ బుట్టెఁ డయ్యె, నన్నివంకల దుర్భిక్ష మడఁగిపోయెఁ, బ్రస్తుతింపఁగఁ దగు రామరాజ్యమునను. జై. భా. ౬. ౯.

తేనెతెట్టె=తేనెపెర. (√ తేనె)

తేనెతొన(ల). వి. (√ తేనె) ౧. ఒకానొకపిండి వంట, మధుపూరిత మగుభక్ష్యము.

గీ. తోఁచు మధుపూరితము తేనెతొన యనంగ, భక్ష్యభేదాహ్వయంబులు పార్వతీశ. ఆం. భా. ౨. ౨౫౬.

సీ. కలవంటకములు బూరెలుఁ దేనెతొలలు చా పట్లు మండెంగ లొబ్బట్లు వడలు. కళా. ౭. ౮౧.

౨. బ. ఒకవిధ మైనవరిధాన్యము.

వ... కందర్పభోగులు గజపతిలాగీలు బొందడీలు పునుఁగుఁదావులు తేనెతొలలు మోసనాలు ... ప్రబంధ. ౧౧౨.

తేనెదానిమ్మ. వి. (√ తేనె) తియ్యదానిమ్మ. (శ. ర.)

తేనెనీరు. వి. (√ తేనె) పలుచని తేనె.

చ... పుష్పాఢముల్, ననలఁ బొసంగుక ప్రపుటనం టిరవ ల్గొని పూవుఁదేనెనీరునఁ బద నిచ్చి సన్నముగఁ గ్రొన్నెలనామముఁ దీర్చి మున్ను గాఁ. చమ. ౧. ౮౬.

తేనెపట్టు. వి. (√ తేనె) తేనెపెర, మధుకోశము.

తేనెపనస. వి.(√ తేనె) తేనెవలె మిక్కిలితియ్యని తొనలు గల ఒకజాతిపనస.

తేనెపానకము. వి. (√ తేనె) తేనెవలెనుండునట్లు కాఁచినచెఱకురసము.

తేనెపెర. వి. (√ తేనె) మధుకోశము.

చ. శిరసున నున్న తేనెపెర శీతమయూఖునిరేఖ గా నభం, గురతరదేహయష్టిఁ బెనఁగొన్న భు జంగకదంబకంబు లాభరణము లై దగఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శుకవిపాటిత చూతఫలస్రవన్మరం,దరసము
గంగ గాఁ దపము దైత్యుఁడొనర్చు మహో
గ్రవైఖరిన్. దశా. ౪. ౩౦.

గీ. దొరయుమధుమక్షికలవీఁకఁ బరులు దాఁకఁ,
దేనెపెరదారి మధువైరి గానిపించె. ఉ.
రా. ౨. ౫౦.

తేనెమంచు. వి. (√తేనె) తేనెవలె జిగురుగా
నుండుమంచు.

తేనెమావి(మిడి). వి. (√తేనె)తియ్యమామిడి,
సహకారము *.

సీ. కొనిపోవునా వేల్పుకూటికుండ సుపర్ణు
డీతేనెమావి యుం బెటెఁగనేని. రా. వి.
౩. ౭౨. (యొంబెటెఁగనేని. ముద్రి. పా)

తేనెమ్రాను. వి. (√తేనె) కేశముష్టి*. (శ.ర.)

తేనెయరఁటి. వి. (√తేనె) బూడిదరంగుపండ్లు
గలనల్లయరఁటి*. (శ. ర)

తేనెరాయఁడు. వి. (√తేనె) ౧. వసంతుఁడు.
౨. (మధువనాధిపతి) సుగ్రీవుఁడు.

గీ. తేనెరాయనిగర్వంబు గానుపింప, సమధిక
పలాశపరచక్రసమితి నొంచ,నమితకువలయ
పరిపాలనమున మెలఁగఁ, దూర్పుదెస రామ
చంద్రుఁడు దోఁచె నపుడు. కువల. ౪.౧౬.
(ఇటచంద్రునకును రామచంద్రునకును అభే
దాధ్యవసాయము.)

తేనెసారాయి. వి. (√తేనె) తేనెనుండి తీయు
సారాయి. (బ్రా).

తేప¹=తెప్ప. వి. ప్లవము, నదులు మున్నగువానిని
దాటుటకు తేలిక యైనకఱ్ఱలతో నిర్మించినసా
ధనము; తరణసాధనము; విమోచనసాధనము.

క. ఆపత్సముద్రమగ్నం, బై పోయెడునస్మదన్వ
యము పెంపెసఁగం, దేప యయి కడవఁబె
ట్టిన, నీపుణ్యచరిత్ర కీర్తనీయము తల్లీ. భార.
అర. ౭. ౨౭౩.

సీ. తేప నాఁ దెప్ప నాఁ దేటిక యనఁగను బ్లవ
నామధేయంబు పరఁగుచుండు. ఆం. భా.
౧. ౧౫౭.

ఉ. కోపము సంహరింపు యదుకుంజర పాండవ
కోటి కెల్లనుం,దేపవు గావె నీ విటు లధీరతఁ
బూనికి దప్పినన్...భార. భీష్మ. ౨.
౧౬౦.

ద్వి. రూపించి నీతోడఁ గోపించినట్టియాపాతక
మునకుఁ దేప తా నెద్ది. పండితా. పురా.
౧౪౨ పొ.

జః తెండేప.

తేప². వి. తడవ, మాఱు, పర్యాయము.

గీ. తేవ మీఱఁగఁ దల్పంబు డిగ్గి డిగ్గి, తేపతేప
కు ని ట్టటుఁ దివిరి తివిరి, పొలఁతిచెలువంబు
మాటికిఁ బొగడి పొగడి, వసుధ వ్రాయుచు
మో మఱ వాంచి వాంచి. కృ.శకుం.౩.౫.

క. ఒకమరి యొకపరి యొకమా, టొకసా రొక
తేపయనఁగ నొకపా రనఁగా.

గీ. ఏకవారంబనుట కొప్పు నిన్నిపేళ్లు. ఆం.
సం. మాన. ౬౨. ౬౩.

తేమ=తెమ్మ. వి. (సం. తేమః) ఆర్ద్రిత, తడి.

సీ. అధరామృతపుఁదేమ నడరుశృంగారాంకుర
ములు నా నూఁగుమీసములు వొడమె.
చంద్రా. ౨. ౧౧.

ఉ. ఇక్కడఁ గూరుచుండుటల కీరలె పెద్దలు
లేచి రండు మీ, రొక్కరు వంటశాల కడు
యోగ్యము మీ కది తేమ కేమి యీ,మ
క్కలిపీట మీఁది యది మార్గులచోటిట
మేలటంచు స,ద్వాక్కుల నక్కులాధికుల
వైదికులం దగుచోట నుంచినన్.పాంచాలీ.
౪. ౪౧.

విణ. ఆర్ద్రిము, తడిగలది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(వ్యవ) నేల మిక్కలి తేమగా నున్నది.

జ: తేమగిల్లు, తేమయెక్కు.

తేమగిల్లు. అ. క్రి. (√తేమ) తడిగలదియగు, ఆర్ద్రిమగు. (శ. ర).

తేమనము. సం. వి. అ. న. ౧. ఆర్ద్రీకరణము, తడుపుట. ౨. తడి. ౩. నంజుకొనుపదార్థము, తిమ్మనము. ౪. మజ్జిగపులుసు. (శ.ర.)

తేమని. సం. వి. ఈ. స్త్రీ. ప్రొయ్యి.

తేమము. సం. వి. అ. పుం. స్తేమము, తడియుట; తడి.

తేమయెక్కు. అ. క్రి. (తేమ + ఎక్కు) తేమగిల్లు, ఆర్ద్రిమగు.

ఉ. నీటను దేమయెక్కి పసి నిల్చి యొకించుక వాఁడుదేటి...విప్ర. ౨. ౨౩.

తేమానము. వి. (√తేయు- క. తేమాన. త. తేయ్మాన. మ. తేమానం) ౧. జాగు.

క. ఆమెయి నామోచిత మయి, తేమానము నడపి కొన్నిదివ్యాస్త్రంబుల్, సామర్థ్యాంతరసామ, గ్రీమగ్నసమస్తభువనకృత్యములయ్యెక్. కళు. ౫. ౧౭౭.

క. మామా యిన్నియుఁ దెచ్చితి, తేమాన మిదేల వేగు దీపము వలదా, యాముదము దెమ్ము పొమ్మన, నామందవిచారుఁ డప్పు డంగడి కరిగెక్. శుక. ౩. ౧౯౦.

౨. వడ్డి, వృద్ధి.

సీ...వడ్డి తేమాన మనఁగను వఱలు వృద్ధి. ఆం. భా. ౨. ౨౭.

తేమ్రాను= తేఁజెట్టు. వి. ఛెంకాయచెట్టు, నారికేళము శీ. (శ. ర.)

తేయు. అ. క్రి. (త. తేయ్.) అఱుగు; కృశించు; తగ్గు. (శ. ర.)

జ. తేఁగడ, తేమానము.

తేర. వి. ౧. దృష్టిపూర్ణత, పూర్ణత. (తేట. అని. శ. ర.)

విణ. ౧. సంబంధములేనిది, లాంతి, అన్యము.

చూ: తేరకత్తె, తేరకాఁడు, తెకతేర.

(ఇట తేర. వి. అని. శ. ర.)

౨. అనాయాసముగా లభించినది, ఊరక దొరకినది.

ఉదా:- తేరసొమ్ము, తేరకొంప. మొ.

క్రి. విణ. ౧. వృథాగా, నిష్ప్రయోజనముగా.

శా... నానాసుఖోపాంతం బైనవయోనిధాన మిది యయ్యా తేర యీవచ్చునే. భాగ. ౯. ౫౫౧.

సీ. పాట లన్నియు నాటపాటలై చెవిటికూది నసంకువిధమునఁ దేర సనఁగ. గీ. సిగ్గువో యిరి యచ్చరచెలువ లెల్ల. నృసిం. ౨. ౯౦.

ద్వి. కడపట బత్తెంబు గానకే తేర, నడుమఁ జావఁగ నీవు నాతలపుండ్లు, గడిగి రక్షించె దొ కఱవుకాలమున. ద్వి. హరిశ్చ. ఉ. ౧౨ ౫౪.

౨. చులుకనగా, అనాయాసముగా.

సీ. లక్ష్మణశత్రుఘ్నులకు సహాయుండ నై చని తేర తురగతస్కరులఁ బట్టి. జై. భా. ౬. ౨౦౩.

తేరగుఱ్ఱము తంగేటిబరికె = ఉచితముగావచ్చినగుఱ్ఱమును సవారిచేయునపుడు మోటుబరికెలతో కొట్టుటకు జంకరు.

తేరసొమ్ము బీరపీఁచు = అక్రమముగా వచ్చిన సొమ్మును నిర్లక్ష్యముగాఁ జూతురు.

జ. తెకతేర, తేరకత్తె, తేరకాఁడు, తేరకు, తేరకుఁదేర, తేరకొను, తేరదిండి, తేరమగఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తేరకత్తె(త్తియ). విణ. (√తేర.) సంబంధము లేనిది, అన్యురాలు.

ఉ...మఱి వారలు వశ్యులైననే దా, రెవ్వరి నొల్ల కొక్కటియి యింద్రుఁడు చంద్రుఁడ టం డ్రు బోఁటి దా, నివ్వలఁ దేరకత్తె యగు ...ఆము. ౫. ౫౬.

తేరకాఁడు. విణ. (√తేర.) ౧. సంబంధములేని వాఁడు, అన్యుఁడు.

క. ఉరుబాహుబలము కలిగియు, వెరవిడి నై తేరకానివిధమున సకటా,కరుణ యెదలోనఁ దలఁపక,దురమున జమువాత నిన్నుఁ ద్రోచి తిఁ బుత్రా. భా.రా.యు. ౧౩౯౫.

ద్వి. అనుచు వాసవపుత్రుఁ డరదంబుఁ బఱపఁ, దనుదానె బెదరి యుత్తరకుమారుండు, అగు తేరకాఁడ వే మైన ది క్కేఁది, తగువాఁడ వై చూడ దాయ వై తిపుడు. ద్వి. భార. విరా. ౨. ౩౫. పా.

ఆ. దేహసంకటమును దెగి తేరకాండ్రకు,మో హదృష్టి విడిచి మూల మెఱిఁగి, యూహ మొకటి బన్ని యుల్లంబు సంధించి, స్నేహ మెఱుఁగ యోగసిద్ధి వేమ. వేమన. ౧. ౩౭౪.

౨. క్రొత్తవాఁడు, అపరిచితుఁడు.

సీ. ఆతఁడు వేఁటకై యరిగినచో వజ్రి దిగ్భ్రాంతి పుట్టించి తేరకాఁడు,సనునట్లు సేయ...భార. ఆను. ౧. ౨౨౭.

౪. పరపురుషుఁడు, విటుఁడు.

చ...కటాక్షనీలమణిరోచు లొకానొక తేరకా నికిన్, మనసిజకేళి యొక్కయుపనాథునకుం గలిగించి...శుక. ౨. ౧౨౬.

ద్వి. ఇలుపుట్టుగొంతినో యింత నీ కెట్లు, బలువు సేయఁగ వచ్చు నిలఁ దేరకాఁడ, చను వేడ్క కాఁడు దోసం బెర్గ డెందు. పండి తా. పురా. ౧౧౫ పా.

తేరకు. అవ్య. క్రి. విణ. (√తేర) ౧. వృథాగా, వ్యర్థముగా. (శ.ర.)

క. క్రూరుం డై శమనుఁ డుఱక, తేరకు మద్వీర భటులఁ దెగటార్చినయ,వ్వైరి నికన్ దెగఁ జూచెద...ఉ.రా. ౩. ౩౪౩.

౨. అనాయాసముగా.

(చూ. తేరకుఁదేర.)

తేరకుఁదేర. క్రి. విణ. (తేరకున్ + తేర)

౧. వ్యర్థముగా, నిష్ప్రయోజనముగా.

మ...సమ్మాధుండు పంకేజనే,త్రలనైసర్గికవిభ్ర మంబులకుఁ జేతఃప్రీతిఁ గావించి దా, నల రున్ దేరకుఁదేరగా...మల్లభూ. శృం.౪౭.

శ్లో. తత్ర భ్రమత్యేవ వృథా షడంఘ్రిః.

౨. అనాయాసముగా.

మ. బళిరా తేరకుఁదేర దక్కె నిటు లీబంగారు కుం డంచుఁ జంకలు దాఁటించుచు...పాం డు. ౩. ౬౭. (చిక్కె, శ. ర. పా.)

తేరకొను. స.క్రి. (√తేర) ఱెప్పవేయకుండు, తదేకదృష్టి కలిగియుండు.

గీ. నంది మొగ మప్డు తేరకొనంగఁ జూచి.నిర్వ. ౪. ౭౫.

చ. తెలినునుసోఁగవెన్నెలలఁ దేరకొనన్ దన నీడఁ జూచి మ,త్తిలి...రామా. ౨. ౯౯. (ప్రాఁత, బ్రౌ. పా. తేఱికొనన్. ముద్రి.),

గీ. నన్నుఁ గనలునఁ దేరకొనంగఁ జూచి.దశకు. ౫. ౬౭. భాగ. ౧౦ ఉ. ౨౬౧. మనుచ. ౩. ౯౧.

తేరదిండి. వి.(√తేర)అశ్రమముగాలభించినభుక్తి; శ్రమలేకుండ లభించినభూమ్యాదులఅనుభవము.

మత్తకోకిల. ఓరి యెవ్వరిచేను దున్నెద పూర నింతటిదాఁక మా,వార లెవ్వరు లేమిఁ జేసి యవారితంబయి చెల్లె నీ, తేరదిండి...పరమ. ౫. ౩౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తేరమగఁడు. వి.(√తేర)ఉపపతి, ఱంకుమగఁడు.

ఆ. కాఁపురంబుచేసెఁ గలికి ముచ్చట దీఱ,మగని విడిచి తేరమగనియింట. కవిరా. ౨. ౩౭.

తేరసి. వి. (ప్రా. తేరహ) త్రయోదశి.

సీ...బహుళపక్ష మపరాహ్ణ మగ్గలి యమవస తేరసి నవమాద్యతిథులఁ దుష్టిఁ బిత్రుదేవతల కిచ్చు...భార. అను. ౫. ౨౦౨. (తేరసి=ద్వాదశి. భా.ల. వ్యా.)

శ్లో. అమావాస్యాం త్రయోదశ్యాం నవమ్యాం ప్రతిపత్సుచ, తిథిష్వేతాసు తుష్యంతిదత్తే నేహ పితామహాః. సం. భార. అను. ౨౩౮. ౮.

తేరు=తేఱు. అ. క్రి. ౧.కలుగు,పుట్టు, పొడము.

క...నేత్రములఁ జిఱునగవుల్, దేరఁగ నిట్లని...నైష. ౭. ౯౯.

సీ. తనరుచొక్కపురాణ మునిదంపతులు దమ కంబులు దేర నెయ్యంబు మీఱ, ననిచిన,...రాఘవ. ౧. ౨౦.

క. ఈరీతి నుండ మచ్చిక,తేరన్ వలసినవియెల్లఁ దెప్పించుటకై, వారసతుల్ బొజుఁగులతోఁ, బోరామి యొనర్పఁ బసులపొంగలి వచ్చెన్. శుక. ౨. ౫౬౨.

౨. (క్రోధదుఃఖాదులనుండి) ఉపశమిల్లు; ప్రసన్నతనొందు.

శా... రానూనుఁడున్, నారీరత్నము నెమ్మదిం దలఁచి ఖిన్నంబైనమో మొప్పఁగాఁ,దేరన్ మారుఁడు పూవుటంపరగముల్ తెం పొప్పఁబై గుప్పఁగన్. ఇందు. ౨. ౧౭౪.

వి. దే. అనా. (క.తేరు.త.తేర్.) ౧.రథము.

క. సారథియు రథియు నై యొక,తేరం గృష్ణు లతిఘోర తేజస్స్ఫార,స్ఫారతఁ దోఁచిన నైనను, ధీరత వాటించి చూచి తెలిసెదవుబలే. భార. ఉద్యో. ౨. ౧౫౨.

చ...అతఁడు ఫల్గునుచక్రదశుతేరి వెనుక సుగ్రశక్తి యడలించెఁ జలింపక భీముఁ డత్తతిన్. భార. ద్రో. ౪. ౨౩౩.

మ. మును పే చంద్రబలంబు గల్గి మలయంపుం గమ్మలేగాడ్పుఁ దేరున నే తెంచులతాంతబాణునకు సూర్యుండున్ మహిం గ్రొత్తగా, ననుకూలించె...ఆము. ౫. ౧౦౧.

౨. బండి, శకటము.

క. మిన్నున కూరక నెగయదు, తన్న సమర్థుండు గాఁడు తల్పగతుం డీ, చిన్నికుమారుఁడు తేరే,విన్నను వున నెగసె దీనివిధ మెట్టిది యో. భాగ. ౧౦. పూ. ౨౫౩.

తేరుక్రింది ప్రతిమ=రథమును మోయుచున్నట్లు దాని క్రిందభాగమున చెక్కినబొమ్మ. (సంసార కార్యభారమువహించియు దానినంటకుండువాని కి దీని నుపమానముగాఁ జెప్పుదురు.)

ఆ. తేరుక్రింది ప్రతిమ తెఱఁగున సంసార,భార మాని యుండుఁ బరవశుండు, గాక మానవుండు గల్మష విరహితుఁడై చరింపవలె మహామునీంద్ర. కుచేల. ౩. ౯౯.

జ. తేరుకాఁడు, తేరుపూన్పరి, తేరుమామిడి, తేరుముట్టు.

తేరుకాఁడు. విణ. (√తేరు) రథికుఁడు,రథముసందుండి యుద్ధముచేయువాఁడు. (వి. అని శ. ర)

తేరుపూన్పరి. వి.(తేరు + పూన్పు + అరి³)సారథి, రథము తోలువాఁడు.

చ...మావుతిట్టుకుం, గుదు రగు తేరుపూన్పరియు ...అచ్చ. రా. అయో. ౧౧౭.

తేరుమామిడి. వి. (తేరు + మామిడి)తేరువలె అడుగున గుబురుగాను పైని పొడుగుగాను పెరుఁగు నొకజాతిమామిడి చెట్టు.

సీ. తేరుమామిళ్లును నేరేళ్లుఁ గడుఁ జెల్వపై పండి...కు. సం. ౭. ౯౩౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తేరుముట్టు. వి. (√తేరు—త. తేర్ ముట్టి=దేవతారథ మంచుచోటు) రథాదుల నుంచుస్థలము; వాహనపుకొట్టు.

క. ఆరంగ విభునితిరుపం, దేరంబులు తేరుముట్లు తిన్నియ లలరుం, బేరులు తీర్థపుఁజెంబుల్, తోరము లగుగందవడియలుఁగని వారల్. విప్ర. ౫. ౮. ("తేరుబుట్టి" ముద్రి.)

తేఱి. వి. (√తేఱు) కాచి తేర్చిన నేయి. (శ.ర.బ్రా)

తేఱిచూచు. స. క్రి. (తేఱి+చూచు) తేరకొనఁ జూచు, పూర్తిగాచూచు, బాగుగాచూచు.

గీ. గగనమధ్యంబునకు వచ్చి ఖరకరుండు, దేఱి చూడంగరాక యుద్దీప్తుఁ డగుచు. భార. ద్రో. ౧. ౧౪౮.

క. గురుపుత్త్రుఁడు తేజోనిధి, సురాసురులకైనఁ దేఱిచూడ నరిది...భార. విరా. ౫.౮.

చ...ఈబలము నీదెసఁ దేఱియుఁ జూడదు... భార. విరా. ౪. ౬౧. (తేఱియుఁ జూడదు=తేఱిచూడ నైన చూడదు.)

తేఱిచూపు. వి. (√తేఱిచూచు) పాఱఁజూచుట, ఱెప్పవేయకచూచుట, స్థిరదృష్టి.

ఉ. జంకెలు తేఱిచూపు లెకసక్కెములుం ... భాగ. ౧౦ ఉ. ౨౬౫.

తేలు=తేఱు. అ. క్రి. (త. తేఱు) ౧. కలుగు, పుట్టు, పొడము.

ఉ...సోయగంబు పైఁ, దేలఁగఁ బ్రాఫచంపతులతీరునఁ బెంపెసలారి రిద్దఱుఁ. హరి. ఉ. ౭. ౧౨౨.

మ. గొనబై దండములందుఁ గ్రొంబసుపునిగ్గుల్ దేలుకాపీనబంధనముల్ ...విప్ర. ౧. ౭౦.

క...తెల్లనిగట్టులుత మబ్బు దేఱెడుపాలమం, దు...మనుచ. ౪. ౧౬.

౨. తోఁచు, కనఁబడు.

ఉ. ఊసరవెల్లిచందమున నొక్కట బీఱనరాలు దేలఁగా. మనుచ. ౪. ౭౯.

ఉ. నీడలు దేలుశక్రమణిని ర్మితలీల వెలుంగు మేడలుఁ. ఇందు. ౪. ౯.

౩. (క్రోధదుఃఖాదులనుండి) ఉపశమిల్లు; ప్రసన్నతనొందు.

క. అనిన సుదేష్ణయుఁ దత్పరిజనములు వెఱఁ బొంది యెన్ని సాంత్వనములు సెప్పినఁ దేఱదమజ్జనభోజనములకుం జొరద ద్రుపదసంభవ యెట్లుఁ. భార. విరా. ౨. ౧౬౨.

గీ. తలఁకి కురుపతి తాను జుట్టలును సాంబుఁ, దెఱవతోఁ దగఁ గొనివచ్చి తేర్చుటయును, దేఱె బలదేవుఁడు...హరి. ఉ. ౪. ౧౧.

ఉ...దైవమె యిట్లు సేసిన, న్విన్నదనంబుఁ జెందఁ దగు నే వగ పేటికిఁ బామరుండవే, యన్నఁ గలంకఁ దేఱె నతఁ డర్కకులేశ్వరవారిమాటలఁ. ఉ. రా. ౨. ౨౦౮.

౪. (నిద్రామూర్ఛాదులనుండి) లేచు, తెప్పిఱిల్లు.

ఆ...ప్రబోధించె మునియు నిద్రఁ దేఱి యలిగి. భార. ఆది. ౨. ౧౫౮.

ద్వి. పుత్త్రపుత్త్రా యంచుఁ బొగిలి కన్గొనుచుఁ, బుత్త్రుపైఁ బడి మూర్ఛఁ బొంది తేలుచును. రం. రా. ఉ. ౧౫౧ పా. ౨౩ పం.

సీ...ప్రయాణక్షోభమునఁ గృశత్వమును బొంది తేఱనిముద్దులపట్టని...కళా. ౫. ౩౨.

౫. తేటపడు, నిర్మలమగు.

క. తేఱెం గొలఁకులు వే తడి, యాఱె మహీతలము...కు. సం. ౬. ౭౭౧.

క...అంచపిండు కొలంకుల విహరించె నటు జలములు దేఱెఁ. ద్వా. ౭. ౮౯.

౬. తుష్టినొందు.

(కళ్యపుఁడు) గీ...వాతెఱచవులఁ దేఱి, విడువఁబోయిన నునుపోఁకముడికిఁగాను, కోమలి బెనంగ సిగ్గుచేఁ గొంతతడవు. దశా. ౩. ౯౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౭. కుశలుఁడగు, నిపుణుఁడగు.
ఉ...అస్త్రవిద్యలం, దేఱనిపిన్నపాపల వధించె నిశీథమునందుఁ గ్రూరుఁడై. భాగ.౧.౧౫౪.
౮. కృతార్థతనొందు, కార్యసిద్ధినొందు.
క.నీవును రార మ్మిప్పుడు, దేవసభం దేఱి యేఁగు దెంతము...కళా. ౩. ౨౩.
(వ్యవ) వాఁడు పెద్దపరీక్షలో తేఱినాఁడు.
౯. తీఱు, ఉడుగు.
సీ. చక్రవాళధరాధరక్రియాచాతురిఁ గొంకు దేఱినపాణిపంకజమున. కవిరా. ౧. ౫౮.
చ. తొడిఁబడ నమ్మ యక్క యని తూలుచు దీనత దోయి లొగ్గుచున్, వడ మఱి తేఱఁ దేఱ నలవాక్యము లెన్నక...ఆము.౨.౫౯.
సీ...కామినీకాంతులకలఁక దేఱె. మనుచ. ౩. ౨౩.
౧౦. ముగియు,సమాప్తమగు. (చూ. తేఱుగడ.)
౧. తేట, ప్రసన్నత.
సీ. తేఱనఁ దేటన మీఱుఁ బ్రసన్నత...ఆం. భా. ౧. ౮౦.
నిద్రదేఱు=మైకముతోనుండు, మత్తెక్కి యుం డు.
సీ. ఒండొంటఁ బెనఁగొని యున్నహారంబులు నిద్రదేఱెడునేత్రనీరజములు. గీ.కలిగి... రాజుముందర నిలిచె నంభోజవదన. కాళ. ౧. ౪౮.
చ. చిటిలినగంధముం...నిద్రదేఱుముఖపద్మము ...రహింప వచ్చె వరభద్రుఁడు నా విటుఁ డొక్కఁడత్తఱిన్. శుక. ౧. ౪౨౬.
జ. తేట, తేటగీతి, తేటగొను, తేటచలములు, తేటతెల్ల, తేటతెల్లమి, తేటతెల్లము, తేటపడు, తేటపఱుచు, తేటి, తేటిచూచు, తేటిచూపు, తేఱుకొను, తేఱుగడ, తేఱుచు.
తేఱుకొను. అ.క్రి.(తేఱు+కొను, స్వార్థమున-) రోగాదులనుండి తెప్పిఱిల్లు, స్వస్థతనొందు.

(వ్యవ)జబ్బుపడి వాఁడు ఆఱునెలలవఱకు తేఱుకొనలేకపోయినాఁడు.
తేఱుగడ=తీఱుగడ. వి.(√తేఱు)౧. ముగియిక, అస్తమయము.
ఉ...వివేకము లెల్లను వెచ్చఁబెట్టి వీ, రిచ్చట దొమ్మిగూడి కలహించినఁ దేఱుగ డేల పుట్టు...అహల్యా. ౧. ౧౦౫.
మ...చక్రవాళంపుఁగొం,డగడిన్ దేఱుగడైన పట్లఁ దనమున్ మందేహులన్ దోలి వా,సి గడల్కాన్తతియందు సత్త్వముఁ బ్రకాశింపన్...విజ. వి. పీఠి. ౫.
౨. నేర్పు,కౌశలము.
గీ. కన్నె యిందాఁక నే మెఱుంగదు సుమయ్య, తేఱుగడ గాఁగ మెల్లనె దిద్దుకొనుము. విజ. వి. ౩. ౨౧౧.
౩. (మూర్ఛాదులనుండి) తెప్పిఱిల్లుట, తెలివిడి. (పునస్స్మృతికివచ్చుట. శ. ర. బ్రౌ)
తేఱుచు(ర్చు). స. క్రి. (√తేఱు) ౧. (మూర్ఛనుండి) తేల్చు, స్మృతికి తెచ్చు.
ఉ...కూపికో, ధ్వాంతసతాళవృంతమృదువాత హిమాంబుకణాళిఁ దేర్చెనన్. ఆము. ౫. ౭౭. (వేదం. పా)
సీ. శోకాగ్ని దనికిన సొగయునీతమ్ముల నుపపన్నవాక్యామృతోపయుక్తిఁ, దేర్పుము ... భార. శాం. ౧. ౮౯.
మ. ఘనచాంపేయకవాసనావివశభృంగశ్రేణిఁ జేపట్టి చల్లనిపూఁదేనియఁ జల్లి తేర్చుమధుపేశాలక్ష్మియో నాఁ గ...వసు. ౫.౬౯.
౨. (రోష,భయలజ్జాశ్రమాదులనుండి) తెప్పిఱిల్లఁజేయు, ప్రసన్నముచేయు.
గీ. మది నొకానొకయెడ రోష మొదవెనేని, నేర్పు గలదూతి యొకరీతిఁ దేర్ప వలయు. శుక. ౧. ౫౫౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. ఒకరుఁడ తాను భీతి వెగడొందెదు రెండవ
నన్ను నెట్టకేలకుఁ దగఁ దేర్చునప్పుడు
...భార. విరా. ౫. ౩౩౬.

గీ. ఆతపగ్లాని బడలినయభ్రమువును, నిజకరాగ్ర
జలంబులు నెఱయఁ జల్లి, శ్రవణయుగతాల
వృంతసంజాతశీత,వాతములఁ దేర్చె గీర్వా
ణవారణంబు. పారి. ౪. ౨౩.

౩. దుఃఖవిముక్తునిచేయు, ఊఱడించు.

క...ధనంజయుఁ డప్పుడు, తనుఁ దాఁ దేర్చికొని
యెల్లతరుణుల నూరా,ర్చె ...భార. మా. ౧౦౪.

చ...యీ,జను లెడఁబాయలేని వెత జాలి వహిం
చిరి వీరిఁ దేర్పఁగాఁ, జను ...ఉ. రా. ౭. ౨౩౩.

౪. (రోగమునుండి) విముక్తముచేయు, బాగు పఱుచు.

సీ. తెవులుగొంటులనైన దేర్చు సంకటమున కో
పి ముందటియట్ల రూపుసేయ. భార. విరా. ౧. ౧౦౧.

౫. కలుషరహితముచేయు, నిర్మలముచేయు.

చ...తారక లంబువుఁ దేర్చునే యనన్. ఆము. ౪. ౧౪౬.

సీ. కలువపుప్పొళ్లచేఁ గస సైనవెన్నెల వలిప
వెన్నెలలోన వడిచి తేర్చె. పారి. ౨.౪౭.

౬. తుష్టినొందించు, సంతోషపెట్టు.

క...సతికిన్, మదనమహారాజ్యభోగమహిమం
దేర్చెన్. కళా. ౪. ౧౦౦.

౭. పోఁగొట్టు, తొలఁగించు.

చ...మనంబుకలంకలు దేర్చి జారకాంతల సమ
యస్థలంబులకుఁ దార్చిరి దూతిక లట్టివెన్నె
లన్. పారి. ౨. ౫౧.

చ...అయ్యలికచసేదఁ దేర్చె నపు డందపు
గందపుఁగొండతెమ్మెరల్. రా. వి. ౩. ౭౦.

౮. కడతేర్చు, చంపు, వధించు.

గీ. పాసఁగఁ దోఁబుట్టు వనుకూర్మి వోవ విడిచి,
బ్రతుకఁ జాలక మిక్కిలిబంటువోలె,దిరుగ
నరుదెంచుటకు వీనిఁ దేర్తు ననుచు, నొడలి
చూపులయెడయనికొడుకు వెడలి. అచ్చ. రా. కిష్కిం. ౪౧.

ఆ. ఖరునిఁ దేర్చె వాలిఁ గడవఁ బనిచె. అచ్చ. రా. యు. ౧౧౬.

౯. విభజించు.

వ...వాల్మీకి...రామాయణం బేడుకాండంబులు
నేనూఱుసర్గలు నిరువదినాలుగువేలశ్లోకంబు
లు గాఁ దేర్చి కావ్యంబుచేసె.వి.పు.౪.౭౧.

తేలఁజూచు. స. క్రి. (తేలన్ + చూచు) ౧. తేలి
చూచు, పాఱఁజూచు.

సీ. పలికించువారిమోములు దేలఁజూచుచో వా
లుఁజూపులు పూలవానఁ గురియ. కువల. ౨. ౩౦.

౨. ఉపేక్షాభావముతోఁ జూచు; ఉపేక్షించు.

గీ. చిన్నివయసుననుండియు నిన్నె కోరి,యున్న
నను బోయమరునికి నొప్పగించి, తేలఁజూ
చిన నిన్ను నే నేల విడుతు, కోర్కి దీరంగ
వీఁకఁ బైకొందుఁగాక. శశాం. ౩. ౭౭.

తేలఁబలుకు. అ. క్రి. (తేలన్ + పలుకు) నిర్దో
షుఁ డనిచెప్పు, నేరములేదనిపలుకు.

గీ. గడినృపులరాయబారులయెడఁ గొలువున,
సరససల్లాపములు రాజు సలుప వలయు, కా
ర్యఖడ్గము లనుచరు ల్గానఁ బలుక, వలయు
నవి మైత్రిఁ దాఁ దేలఁబలుక వలయు.ఆము.
౪. ౨౪౯.

౨. (ఒత్తకుండ) లఘువుగా నుచ్చరించు.

ఉదా:— తేలఁబలికినయెడల అప్పుడు అపుడగు
ను. (బ్రౌ.)

తేలగింపు. వి. (√తేలగించు) -మోహపారవశ్య
ముచే కన్నులు- తేలగిల్లఁజేయుట, తేలవైచుట;

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దృష్టి తిరుగుడువడఁజేయుట.

ఉ. మక్కువతీపు లుట్టిపడుమాటలఁ జొక్కుల తేలగింపులన్. విక్ర.3. ౭౯.

తేలగిలఁబడు. అ. క్రి. (తేలగిలన్ + పడు. స్వార్థమున) మదించు.

సీ. పరువంపుఁజినుకులపసఁ గ్రొవ్వుగొని తేలగిలఁ బడువానకోయిలలరొుప్పు. హరి. పూ. ౯. ౬౭.

తేలగిలు(ల్లు). అ. క్రి. (√తేలు[1]) ౧. (ఆయాసము నిద్రాభావముమున్నగువానిచే కన్నులు) పైకితేలు, తిరుగుడువడు, భ్రమణమునొందు.

క...గర్భభరము మెలఁకువఁ జెలికిన్, దేలగిలఁ జొచ్చెఁ గన్నులు, నీలకనీనికలఁ గలికినిగ్గులు బెళుకన్. సుద. ౨. ౯౪.

సీ. తెల్లగుడ్డులు తేలగిల్లి తీపులు వుట్టి దోవ మల్ పొందుగఁ దొట్టగిల్లి. కవిక.౫.౧౧౧.

వ...నిదురలేమిం దేలగిలుకడకన్నులం గనుపట్టు కట్టెఱ మఱుంగుపఱుచుటకు ఘుటియించిన చలువకలువవిరిబంతులు హత్తించినదత్తులును...ప్రబంధ. ౭౭.

౨. వివశత్వమొందు.

ద్వి. మీటినమదమున మెయి దేలగిల్ల. ద్వి. హరిశ్చ.ఉ. ౧౩౯౩. (తేలగిలగ.అని.శ.ర.పా)

3. గురిచేయు, లక్ష్యముచేయు.

చ...వచోవిలాసములకుం జెవి దేలఁగిలంగనీక య్యానన మర వాంచి...విప్ర. ౨. ౭౦.

తేలనాడు. అ. క్రి. (తేలన్ + ఆడు) నిర్దోషుఁడని చెప్పు, నేరములేదని పలుకు.

చ...అతఁ డేమియున్, దెలియఁడు సాదుబిడ్డఁడని నేరుపుమాటలఁ దేలనాడి గ్రాదిలిసుతు చేతఁ జక్కటులు దిద్దెద వెంతటినంగనాచివే. సారంగ. ౩. ౫౫.

తేలవైచు. స. క్రి. (తేలన్ + వైచు) తేలగిలఁజేయు, (ఆయాసము మున్నగువానిచే కన్నులు మొ.) తిరుగుడు వడఁజేయు.

మ. అనుచున్ ఱెప్పలు తేలవైచుచు విశుష్యత్కంఠరాయి రుక్మిణీతనయా మీఁదటనైన నీవ పతివై తద్ధర్మ మీడేర్పుమీ. ప్రభా. ౫. ౬.

క. అనునంతట నయ్యంగన, యనయముఁ బ్రబలమగునట్టియంగజతాపంబున నుస్సురస్సురనుచుం, గను ఱెప్పలు దేలవైచి కడు సొలయుటయున్. కళా. ౬. ౨౪౯.

ఇట్లే. తేలవేయు.

(వ్యవ) వాఁడుకన్నులు (గుడ్లు) తేలవేసినాఁడు.

తేలా(లియా)డు. అ. క్రి. (తేలి + ఆడు)

౧. (జలాదులపైని) తేలు.

ద్వి. బాలుఁడై యట వటపత్రముమీఁద,లోలతఁ దేలాడులోకరక్షకుఁడు. రం. రా. యు. ౩౨౩ పా. ౨౬ పం.

మహాస్రగ్ధర ...చటులగతి జగజ్జాలముల్ దేలియాడన్. నైష. ౫. ౧౬౧.

సీ. ఇల్లు మంచము లేక వెల్లిపైఁ దేలాడ శ్రీనాఁథుఁడొట వాసింప నేల. చంద్రా. ౧. ౨౩. ఉ. రా. ౧. ౭౦.

౨. (జలాదులయందు) క్రీడించు, ఓలలాడు.

వ...ధరాధీశ్వరుండు ధారావాహికజ్ఞానప్రవాహంబునం దేలియాడుచు నంతనంతఁ గాంతారత్నంబు గదియ నేతెంచె...నైష. ౩. ౧౧౭.

గీ. అంబికానాయకధ్యానహర్ష జలధి,మధ్యమునఁ దేలియాడెడుమనసు మనసు. భీమ. ౩. ౧౯౭.

తేలించు=తేలుచు. స. క్రి.(√తేలు[1]) (జలాదులలో మునుఁగక పైకిఁదేలునట్లుచేయు.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. అఘటనప్రఘటనోద్యముఁడ వాటరు వాలు
నీటిపైఁ దేలించునేర్పు సాక్షి. ఉ. రా. ౧.
౧౫౧.
(ఆనందింపఁజేయు,సంతోషింపఁజేయు.)
గీ...అంచును నవ్వుచుఁ బువ్వుఁబోణి, బలిని దే
లించెఁ బరిహాసభాషణములు. దశా. ౨.
౩౬౫.
(బెల్లించు, మోసపుచ్చు)
సీ. వెలయును దేలించె బెల్లించె నూరించె
ననఁగ నెక్కించె నం చనెడుమాట. ఆం.
భా. ౩. ౧౨౪.

తేలింపు. వి. (√తేలించే) -తాంబూలాదుల-
శోభ, వికాసము.
గీ. సొగసు తెలివాలుసునుసోగ సొంపుతళుకు, బె
ళుకుచికిలిమెయారంపుఁబేరె ముదుటు, సొ
లపువిడియంపుఁ దేలింపు చుఱుకు టోర,కలికి
బెడ రెచ్చుచూపులకలికిఁ జూచి. ప్రబంధ.
౧౦౬.
విశ. దీనమైనది.
ఉ. చంపకగంధి మోవి సరసం బగుబింబ మటంచు
వట్టితే,లింపు పెలుంగుతోఁ దమి దనిర్పఁగఁ
బల్కిన...విజ. వి. ౨. ౧౭౫.

తేలిక. వి. (√తేలు[1]) లఘుత్వము.
(వ్యవ)ఇనుమునకుబరువు దూదికి తేలిక సహజము.
తేలికపడు= లాఘవమునొందు.
తేలికపఱుచు=చులుకఁజేయు, లాఘవపఱుచు.
విశ. ౧. లఘువు, భారములేనిది.
(వ్యవ) ఇనుముకంటె కట్టె తేలిక.
౨. మనోహరము, ఇంపైనది.
చ...ముద్దుగారుపొం,దికజిగిపాలబుగ్గలును దే
లికచూపులుఁ గోమలంపుటం,గకములుఁ గల్గి
యుం పొదవుఁగా సుతుబాల్యము తండ్రికెంత
యుఁ౯. కవిరా. ౨. ౪౭.
౩. గౌరవములేనిది, గౌరవహీనము.
(వ్యవ) న న్నందఱవలెఁ జూడక తేలికచూపు
చూచుచున్నాఁడు.
ఇల్లటిక మున్న యల్లుని తేలికగాఁ జూతురు.
౪. రోగభారములేనిది, ఆరోగ్యవంతము.
(వ్యవ) ఆయౌషధము పుచ్చుకొన్నతరువాత
ఒడలు తేలికగా నున్నది.
౫. నీచము, అల్పము.
ఉదా: తేలికమాటలు, తేలికమనుష్యుఁడు. మొ.

తేలిపోవు. అ. క్రి. (తేలి+పోవు) ౧. (జలాదుల
లో మునుఁగక) పైని కొట్టుకొనిపోవు.
వ...నెత్తురుటేఱులపయి వడిం దేలిపోవుపీనుం
గులం దివిచికొని...భార. భీష్మ. ౩. ౬౫.
౨. హానిచేయక తొలఁగిపోవు, నిర్బాధకముగాఁ
గడచిపోవు.
(వ్యవ) వానికి వచ్చినయాపదలన్నియు దైవకృప
చే తేలిపోయినవి.
౩. తొలఁగిపోవు.
వ...అని మేలంబుసేసికొని తేలిపోఁ బలికి...
ఆము. ౫. ౬౬. (ప్రస్తుతసంభాషణవిషయ
మునుండి తొలఁగిపోవు. అని తాత్పర్యము.)
౪. తప్పిపోవు; దారి తప్పిపోవు.
ఉ. బెంగ విడంగ గెంటి యటఁ బెంటిని గానక
తేలిపోయి చి,త్రాంగివిచిత్రరత్నభవనాంగ
ణసీమను దేల వ్రాలె నా,బంగరుముద్దుఁబా
వురము...సారంగ. ౨. ౪.
౫. కార్యకారి కాకుండు, వ్యర్థమగు.
క. రౌద్రం బడరఁగ నేసెను,రుద్రాస్త్రం బతని
మీఁద రూఢిగ నతఁ డా,రుద్రునియంశం
బగుటను, రౌద్రాస్త్రము దేలిపోయె రభసం
బొప్పఁ౯. మొ. రా. సుం. ౧౭౪.
౬. ఓడిపోవు, పరాజితుఁడగు.
మత్తకోకిల...అసంఖ్య యాదవసేనకుఁ౯, తేలి
పోవక చక్కనయ్యెడుధీరు లెవ్వరు పోరు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లక్. భార. ఆది. ౮. ౨౦౫. (దీలపోవక అని ముద్రి. భా. ల. వ్యా.)

(వ్యవ) వాఁడు పరీక్షలో తేలిపోయినాఁడు.

**తేలు**[1]. అ. క్రి. (క. తేల్.) ౧. (జలాదులలో) మునుఁగక మీఁదికి వచ్చియుండు.

సీ. అడుగునఁ బడక రత్నాకరంబునఁ దేలి నడ తెంచుజీవరత్నంబు లనఁగ. దశా. ౨. ౨౩౮.

ఉ...తోరపు నెత్తురుటేఱులందుఁ బైఁ దేలెడు పీనుఁగుల్ గలిగె ధీరతఁ బోరెడు రెండుసేన లక్. ఉ. రా. ౩. ౧౨.

క. వ్రేల గిరెత్తినకృష్ణుఁడు, తేలఁడె మఱ్ఱాకు మీఁద తెలియుర వేమా. వేమన. ౩. ౨౭౯.

౨. స్నానముచేయు; జలములో క్రీడించు, ఓలలాడు.

ఉత్సాహ. లీల మనుజుఁ డెవ్వఁడేఁ బిలిప్పిలా తరంగిణిం, దేలి శ్రీత్రివిష్టపేశుఁ ద్రిపుర మథను శశికళా, మౌళిఁ బూజసేయు... కాశీ. ౬. ౨౭౮.

క. తల నీగంగాతీరము, చిలికినవాఁ డీశ్వరుండు చేరెఁడు లోఁ గోఁ, గలిగినఁ దరఁగలఁ దేలం, గలిగినఁ దద్మహిమ లెన్నఁగాఁ దర మగునే. విజ. ౫. ౧. ౫౪.

శా. సంసారార్ణవసారమన్మథ సుధాసారంబునం దేలఁగన్. ఉ. హరి. ౨. ౭౨.

౩. బేలుపడు, వంచితుఁడగు, మోసపోవు.

క. మానసమున రుబ్బు వగయుఁ, దే నోపుం బను లు బుధుఁడు దేలఁడు రెంటన్. భార. శాం. ౩. ౨౮.

౪. (ఆలసట, మైకము మున్నగువానిచే కన్నులు) తిరుగుడువడు, భ్రమణమునొందు.

మ...కన్నుఁగవ దేలన్ మోవి నిట్టూర్పులన్, గమలన్...పి. శకుం. ౨. ౧౯౨.

ఉ. తేలెడుకన్నుదోయి వడ దేరెడుముద్దు మొగంబు...పాండు. ౩. ౬౫.

౫. తృప్తినొందు; సుఖించు; ఆనందించు.

చ...బం, భరసభ వాసనాపవనపారణఁ దేల న లందెఁ గస్తురిన్. మనుచ. ౫. ౫౮.

క. నీపట్టు గలుగువాఁడై, చేపట్టుం గుంచ మైనచె లువుని నొకనిం, జేపట్టి రతులఁ దేలక...శుక. ౧. ౭౭.

గీ...అర్చనాదత్తచందనచర్చఁ దేలి. ఆము. ౨. ౭౩.

సీ. ఆత్మనిశ్శంకత నద్వైతి వై తేలి కృత్రిమ ద్వైతతఁ గ్రీడసలుపు. కవిరా. ౧. ౧౭౪.

౬. (త. తేలు.)- కష్టములనుండి- విడివడు, (చిక్కునుండి) తొలఁగు.

వా. ఆవ్యవహారమునుండి నేను తేలు ఉపాయ మేదో నాకు చెప్పుము.

౭. (పరీక్షాదులలో) విజయమునొందు.

వా. ఆపరీక్షలో ఎంతమంది తేలినారు ?

౮. పొడచూపు, కనఁబడు; ఏర్పడు, వ్యక్తపడు.

ఉ. బెంగ విడంగ గెంటి యటఁ బెంటిని గానక తేలిపోయి చిత్రాంగివిచిత్రరత్నభవనాంగణసీమను దేల వ్రాలె నా, బంగరుముద్దుఁబావురము...సారంగ. ౨. ౪.

చ...సెలవుల్ వెసనాకుచుఁ బోయె వృక్షమం, డలికయి తేలుచున్...ఆము. ౩. ౨౨. (తూలుచున్. వావిళ్ల. పా.)

(వ్యవ) కుఱుపునకు మొన తేలలేదు.

లెక్కలు పరీక్షించిచూఁడఁగా రెండువేల రూపాయలబాకీ తేలినది.

౯. పరిష్కృతమగు, తీర్పఁబడు.

(వ్యవ) వ్యవహారము తేలలేదు.

వారి కుభయులకు వ్యాజ్యెము తేలలేదు.

స. క్రి. వ్యక్తముచేయు, పైకి రానిచ్చు.

(వ్యవ) గంభీరచిత్తుఁడు గనుక ఈరహస్యము తెలిసినను అతఁడు మాట తేలఁడు.

జ. తేలఁజూచు, తేలఁబలుకు, తేలగింపు, తేల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గిలు, తేలనాడు, తేలవైచు, తేలాడు. తే
లించు, తేలింపు, తేలిక, తేలిపోవు, తేలుచు,
తేలువాఱు.

తేలు[2]. వి. వృశ్చికము, కొండితో కుట్టు ఒకానొ
కవిషజంతువు.

చ. బలితపుఁదేలు మైనమునఁ బన్ని...నైష.
౬. ౧౪౧.

సా. దొంగను తేలు కుట్టినట్లు (పైకి చెప్పుకొను
టకు వీలులేని విషయము నోరుమూసికొని
కప్పిపుచ్చవలసివచ్చినప్పుడు దీనిని వాడు
దురు.)

సీ.పట్టెఁబో దొంగఁ దేల్గుట్టిన ట్టివి డాఁచి కొం
చుఁబోవక మెఱయించు టెట్లు. కళా. ౨.
౭౯.

ఉ. అత్తటి నిప్పు ద్రొక్కినటు లౌదలఁ దేల్గొ
నినట్టు లావను, వ్రేత్తుగఁ ద్రావినట్లు...పాం
డు. ౫. ౧౮౯. (తేలుకొను=తేలుబాధనొం
దినట్లు అనిభావము.)

జ. తేలుకొండి, తేలుబాణము, తేలుమణి, తే
లుమీను, తేలుమొన, తేలురాశి.

తేలుకొండి.వి. (తేలు[2]+కొండి) ౧. తేలుతోఁక
కొన.

౨. వృశ్చికాలి. (శ. ర).

గీ. తేలుమొనచె ట్టనంగను దేలుకొండి, నాఁగ
మను వృశ్చికాళ్యాఖ్య...ఆం. భా.౨.౬౬.

తేలుచు(ల్చు)=తేలించు. స. క్రి. (√తేలు[1])

౧. నీటిమీఁద తేలునట్లు చేయు.

సీ. విస్తారసంసారవిషరాశి దాఁటించుధీరునకు
ను వార్ధిఁ దేల్చు టెంత. దశా. ౪. ౨౩౦.

౨. ముంచు; స్నానమాడించు; అభిషేకించు.

చ. తెరలక వారుఁ దద్రథముఁ దేల్చిరి తూపు
లవెల్లి... భార. ద్రో. ౨. ౪౨.

గీ. విధుఁడు విశ్వంబుCC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భీమ. ౨. ౪౨.

గీ. అవనిదివిజుండు మణికర్ణికాదిపుణ్య, తీర్థముల
యందు దేహంబు దేల్చితేల్చి. కాశీ. ౩.
౨౨౫.

క. చేగానఁగాడుచెఱకుం, దీగరసంబునఁ బు
రాగిఁ దేల్పక కుడువక. హర. ౧. ౧౮.

౩. (జలాదులయందు) విహరింపఁజేయు, క్రీడిం
పఁజేయు.

సీ. మనము మనంబునఁ బెనఁచి కేళికిఁ జొచ్చి
సతిఁ దేల్తు సౌఖ్యరసంపునిట్టు. భార. విరా.
౨. ౩౯౦.

శా. ఆడం జిత్రము వాడవాడ ఘనకుడ్యస్వర్ణ
రత్నద్యుతుల్, చూడంజూడఁగ మణ్మఖీ
కరణతేజోరూఢచిత్తేక్షణ, క్రీడాదుస్తరమా
ర్గసౌఖ్యరసవార్ధిం దేల్చుఁ దత్పట్టన, క్రోడ
క్షోణి నటన్న నున్నపురముల్ గొండాట
కర్హంబులే. కాళ. ౧. ౧౮.

క...ఇఁక మీసంగీ,తమ్మునకు నీడు లేదు జ,గ
మ్మున నని పలికి మోదగరిమం దేల్చెన్.
కళా. ౨. ౩౭.

౪. సంతోషపెట్టు, ఆనందింపఁజేయు.

మ...వలీముఖాగ్రణుల కెంతో వేడ్కఁ బు
ట్టించి...కాకుత్థ్సరత్నంబు మ,న్ననలన్ దే
లిచె వారు నుండి రమితానందాబ్ధి నోలా
డుచున్. ఉ. రా. ౫. ౨౭౮.

గీ. ఒకతె రతిఁ దేల్చి కాఁక నొండొకతెఁ
బ్రేల్చి. ఆము. ౫. ౫౪.

ఉ. నామొగమోటకై వలనినాటకముల్ ఘటి
యించి రుక్మిణీ, కామినిమీఁదటం గలుగు
గౌరవముం గృపయుం బ్రియంబుఁ దా, నేమి
యుఁ గాననీక యిట నిన్నిదినంబులు నన్నుఁ
దేల్చెనో, తామరసాక్షి మెచ్చవలదామర
దానవభేదికృత్యముల్. పారి. ౧. ౮౯.

౫. ప్రస్తావించు.

శా...సఖీ యెల్లియేఁ, గానీ నీనుడిఁ దన్తనోజ్ఞ గుణముల్ గానీ తదన్యాయముల్, గానీ డిం డిమచింత నీ కతని పైఁ గా కెవ్వరిం దేల్చెదే. ఆము. ౫. ౫౯.

౬. పరిష్కరించు, నిర్ణయించు.

(వ్యవ) వాఁడీవ్యవహారము శీఘ్రముగాఁ దేల్చి నాఁడు.

౭. పైకిఁ జెప్పు, వ్యక్తముచేయు.

(వ్యవ) తుద కీవిషయములో వాఁడు తన యభి ప్రాయము తేల్చినాఁడు.

౮. (వర్ణాదుల నుచ్చరించుటలో) ఊఁదకుండు, ఒత్తకుండు.

ఉదా: 'వాని బ్రదుకు' అనుదానిలో 'బ్ర' తే ల్చి పలుకవలయునుగాని ఒత్తి పలుక రాదు.

**తేలుబాణము.** వి.(√తేలు[2]) ఒకవిధ మైనబాణ సంచు.

వ...తాటిబాణంబులు దేలుబాణంబులు...మొ దలగు బాణవిద్యలవైఖరులు చిత్రవిచిత్రం బులుగాఁ జూపుబాణకారులును... హంస. ౩. ౭౯.

**తేలుమణి.** వి. (తేలు[2] + మణి.) తేలుకొండి' వృశ్చికాళి. (శ. ర.)

**తేలుమీను.** వి. (√తేలు[2]) మత్స్యవిశేషము, చిలిచిమము, కిక్కిసకసవునం దుండు తేలువంటి చేప. (శ. ర.)

ఉ...ముల్, తొల్లిక తేలుమీ నిసుక దొందును బిత్తడికాసు మల్లుమీ, నల్లెయు గండె రొ య్య పర కాదిగఁ జేపలఁ బట్టి బెట్టుగన్. ప్రబంధ. ౧౯౫.

సీ. మిసిక ల్లురజు తేలుమీను తొల్లిక జాతి గొరక మాపురమును గుంటముక్కు. హంస. ౪. ౧౨౨. (మేను. ముద్రి.)

**తేలుమొన** = తేలుకొండి. వి. (√తేలు[2]) వృశ్చి కాళి. ఆం. భా. ౨. ౬౬.

**తేలురాశి.** వి.(√తేలు[2])-జ్యోతి- వృశ్చికరాశి.

**తేలువాఱు.** (తేలు[1] + పాఱు) అ. క్రి. జనించు, పుట్టు, కలుగు. (శ. ర. బ్రా.)

చ...హృదయంబున సత్కృప తేలువాఱఁగాఁ గనుఁగొని...రుక్మా. ౧. ౩౩.

**తేవ.** వి. ఉత్సవవిశేషము.

గీ... పండు వనఁగ, నుత్సవము తద్విశేషంబు లొప్పుఁ దేవ, తంతు సాకము నంపు జాతర కొలుపన. ఆం. భా. ౧. ౧౪౩.

**తేవనము.** సం. వి. అ. న. ౧. క్రీడ. ౨. కేళీ వనము, ఉద్యానము, ఆటతోఁట. ౩. పాద చారణము, కాలినడక.

శ్లో. తేవనేన వనం గత్వా నదీ స్తీర్త్వా బహూ దకాః. సం. రామా. బాల ౧. ౩౦ (చూ.వ్యా. "తేవనం పాదచారణ మితి సంప్రదాయః")

ద్వి. తేవనంబునను నెంతే వనంబునను, బావన మునిచర్యఁ బరఁగుసంయములు. రం. రా. బాల. ౫పా. ౩౦. పం.

## తై

**తైంతిడీకము.** సం. విణ. (అ. ఈ. అ.) చింత పండుతోఁ జేయఁబడినది. (పులుసు. మొ.)

**తైక్ష్ణ్యము.** సం. వి. అ. న. తీక్ష్ణత్వము, తీక్ష్ణ మగుట.

**తైజసము.** సం. విణ. (అ. ఈ. అ) ౧. తేజస్సం బంధమైనది. ౨. తేజోవికారమైనది. ౩. సువ ర్ణాదిధాతు వికారమైనది. వి. అ. పుం. ౧. రాజ సగుణము. ౨. (వేదాంత) : తేజోమయాంతఃకరణ యుక్తాత్మ, చైతన్యభేదము.

న. ౧. వెండి బంగారు లోనగుధాతుద్రవ్యము. ౨. నేయి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తైజసావర్తని. సం. వి. ఈ. స్త్రీ. సువర్ణాది లోహములు కరఁగుమూస.

తైతిక్షుఁడు. సం. విణ. (అ. ఈ. అ) తితిక్షాశీలుఁడు, ఓర్పు గలవాఁడు.

తైతిలము. సం. వి. అ. పుం. ౧. గండకమృగము, ఖడ్గమృగము. ౨. మండెఁగ, భక్ష్యవిశేషము. న. (జ్యోతి) నాల్గవకరణము.

తైతిలుఁడు. సం. వి. అ. పుం. వేలుపు, దేవుఁడు.

తైత్తిరము. సం. వి. అ. పుం. తిత్తిరిపక్షి. న. తిత్తిరిపక్షులసమూహము.

తైత్తిరికుఁడు. సం. వి. అ. పుం. తిత్తిరిపక్షుల వేటకాఁడు.

తైత్తిరీయకుఁడు. సం. వి.=తైత్తిరీయుఁడు.

తైత్తిరీయము. సం. వి. అ. పుం. కృష్ణయజుర్వేదము.

తైత్తిరీయుఁడు. సం. వి. అ. పుం. తైత్తిరీయశాఖాధ్యేత, కృష్ణయజుర్వేదము చదివినవాఁడు.

తైమిరము. సం. విణ. (అ. ఈ. అ) తిమిర (చీకటి) సంబంధమైనది. వి. అ. పుం. కంటి తిమిరరోగము.

తైరు. (త. తైర్) దధి, పెరుఁగు.

ఉ. వడ్డనఁ జూపి రంతచెలువల్ ...లడ్డువా,లిడ్డెన లానవాలు చలియింపనితైరులు...పాంచాలీ. ౪. ౪౨.

గీ. పాలు ఫలములు నెడనీళ్లు పానకములు,నూరుబిం డ్లూరుఁగాయలు తైరు సాంటి, పాంశు లవణంబు...ఘటికా. ౨. ౧౬. (శ్రీంఠి. వ్రాతప్రతిపా.)

తైర్థము. సం. విణ. (అ. ఈ. అ) ౧. తీర్థమునకు సంబంధించినది. ౨. తీర్థమందు ఇయ్యఁదగినది. (దానాది) ౩. తీర్థరూప మగుఆయస్థానము నుండి వచ్చినద్రవ్యము ... ఆదాయముగా వచ్చుధనము మున్నగునది.

తైర్థికుఁడు. సం. విణ. (అ. ఈ. అ) తీర్థసేవ చేయువాఁడు.

తైలంపాత. సం. వి. ఆ. స్త్రీ- నువ్వులు పడుట కలది- ౧. స్వధ, పితృదేవతలకు చేయుహవిర్దానము. ౨. స్వధతో గూడినశ్రాద్ధము.

తైలకందము. సం. వి. అ. పుం. తిలచిత్రపత్రకము అనువృక్షము, ఒకజాతికంద ✝.

తైలకము. సం. వి. అ. న. స్వల్పతైలము.

తైలకల్కజము. సం. వి. అ. పుం. తెలికపిండి.

తైలకారుఁడు. సం. వి. అ. పుం. గాండ్లవాఁడు, తెలికవాఁడు.

తైలకిట్టము. సం. వి. అ. న. తెలికపిండి.

తైలచోరిక. సం. వి. ఆ. స్త్రీ- తైలమును దొంగిలించునది- ౧. బొద్దింక, బరిణెపురుగు. ౨. గబ్బిలము.

తైలద్రోణి. సం. వి. ఈ. స్త్రీ. నూనెతో నిండినతొట్టి.

తైలధాన్యము. సం. వి. అ. న. తైలము తీయుటకుపయుక్త మగుధాన్యము. (శ్లో. తిలోఽతసీ చ తోరీచ త్రివిధశ్చాపి.సర్షపః, ద్విధా రాజిక్షవక్షైవ బీజం కౌసుంభసంభవమ్, ఏతాని తైలధాన్యాని...వా.చ.)

తైలప. సం. వి. ఆ. స్త్రీ. -నూనెత్రాగునది- ౧. బొద్దింక. ౨. గబ్బిలము.

తైలపర్ణకము. సం. వి. అ. పుం. గ్రంథిపర్ణవృక్షము, గండివనము✝.

తైలపర్ణి. సం. వి.ఈ. స్త్రీ. ౧. చందనము; పీతచందనము (శ. ర.) ౨. సిహ్లకము, చిల్లమడ్డి. (ఇది దేవదారుబంకచే చేయఁబడి సరళద్రవమనుపేరు కలది.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తైలపాయిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. బొద్దీక. ౨. గబ్బిలము.

తైలపింజము. సం. వి. అ. పుం. అడవినువ్వులు. (వనౌషధినిఘంటువు.) తెల్లనువ్వులు(విల్యమ్సు)

తైలపిపీలిక. సం. వి. ఆ. స్త్రీ. చిన్నయెఱ్ఱచీమ.

తైలపీతుఁడు. సం. విణ. (అ. ఆ. అ) పీతతైలుఁడు, తైలము త్రాగినవాఁడు.

తైలఫలము. సం. వి. అ. పుం. ౧. ఇంగుది, గారచెట్టు. ౨. నువ్వు మొక్క చెట్టు.

తైలభావిని. సం. వి. ఈ. స్త్రీ. నూనెను పరిమళింపఁజేయునది, విరజాజిచెట్టు.

తైలము. సం. విణ. (అ. ఈ. అ)- తిలసంబంధమైనది. వి. అ. న. నూనె. (ఇది ఏరండాది శబ్దపూర్వక మైనపుడు తత్తద్బీజద్రవ్యమును తెలియఁజేయును. ఏరండతైలము. మొ.)

తైలయంత్రము. సం. వి. అ. న. నూనె తీయు యంత్రము, గానుఁగు.

తైలవల్లి. సం. వి. ఈ. స్త్రీ. లఘుశతావరి, పిల్లపీఁచర చెట్టు.

తైలసాధనము. సం. వి. అ. న. తైలమును పరిమళింపఁజేయునది, తక్కోలముచెట్టు.

తైలస్యంద. సం. వి. ఆ. స్త్రీ. ౧. శ్వేతగోకర్ణి, తెల్లచాఁగచెట్టు. ౨. కాకోలి, కారుకొల్లిచెట్టు.

తైలాంబుక. సం= తైలపాయిక.

తైలాగురువు. సం.వి. ఉ. పుం. దాహాగురు వను సుగంధిద్రవ్యవిశేషము.

తైలాటి. సం.వి.ఈ.స్త్రీ.— తైలము రాచుటచే దీనివిషముపోవును—వరట,కందురీఁగ.(వాచ).

తైలాభ్యంగము. సం. వి. అ. పుం. తైలము నొడలికిపూసికొనుట, నూనెతో తలఅంటుకొనుట.

తైలాభ్యంజనము. సం. వి. అ. న. = తైలాభ్యంగము.

తైలి. సం. వి. న్. పుం. గాండ్లవాఁడు, తెలికవాఁడు.

తైలిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. దీపపువత్తి. ౨. గాండ్లది, తెలికది. ౩. ఎఱ్ఱచిన్నచీమ, తైలపిపీలిక.

తైలీనము. సం. విణ. (అ. ఆ. అ) తిలలు పండునది. (పొలము)

తైషము. సం. వి. అ. పుం. (తిష్య- పుష్యనక్షత్రయుక్తపూర్ణిమ కలమాసము) పుష్యమాసము.

## త్రొ

తొంక=తోఁక. వి. (√తొంగు) వాలము, పుచ్ఛము.

సీ. తొంకతోఁ జుట్టి కడంక మింటికి వైచి నిడు నాల్క పొలదిండిఁ బుడమిఁ గెడపి. అచ్చ. రా. సుం. ౧౦౪. (శ. ర. పా.)

తొంగలి[1]. విణ. (√తొంగు- త. తొంకల్.) ౧. వాలునది, వ్రేలాడునది.

సీ. ధవళాక్షితొంగలితఱచు ఱెప్పలచెన్నుకప్పుచీకటి గవియుదేర. భార..విరా.౨.౩౭.

వ. మఱియు...పసిండియాయగంబున సుఱియసురంగంబుగాఁ దొంగలిపట్టియం గట్టి చెన్ను మిగులం గైసేసిన. కు. సం. ౯.౨౪.

సీ. తొంగలిమృదులశార్దూలచర్మము గట్టి బూతి మైఁ దగ నెఱపూఁత పూసి. కాశీ. ౪. ౧౪౯.

౨. స్రవించునది. (శ. ర.)

ఉ.తొంగలిపువ్వుఁదేనియలఁ దూఁకొని మత్తిలి తుమ్మెదల్ పయిన్, బొంగుచు వ్రాల... యయా. ౪. ౧౬.

తొంగలి[2].విణ.(త.తొంకల్)సాంద్రము,దట్టము.

వ...కప్పులు తొంగలులు నగుపక్ష్మకాలికల నొ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్పు...ఆము. ౬. ౯౭.
వి. ౧. దీప్తి, కాంతి.
సీ. మహనీయమణిమయమంజీరములు పూని ప
సిండితొంగలిపచ్చపట్టు గట్టి.పద్మ.౯.౨౦౧.
౨. గొడుగు; రాజచిహ్న మగుగొడుగు.
సీ. సతులనీలాలకద్యుతి దొంగలించె నాఁ గ
ప్పారి జల్లితొంగళ్లు గ్రాల. కు. సం. ౭.
౩౬. (జల్లితొంగళ్లు=కుచ్చులు గలగొడుగులు).
చ. పుడమి పదాతివాజిగజపూరిత మై తనరంగ
వాని పై, గొడుగులుఁ బీలితొంగళులుఁ గుం
చెలుఁ గ్రిక్కిఱియంగ...కు. సం. ౧౧.
౫౯౫. (పీలితొంగళులు = నెమలియీఁకల
తో చేసినరాజచిహ్న మగుగొడుగులు.)
౩. బ=తొంగిళ్లు.(బట్టపింజెలు.)
ద్వి. బంగారుజిగిమించు పట్టుతొంగళ్ల, నంగిక
మైనదిం డలవడఁ గట్టి. ద్వి. భాగ. ౧౦.
(చి. ని.)
తొంగలిఱెప్ప=ఘనపక్ష్మము,దట్టమగు ఱెండ్రు
కలుగలకంటిఱెప్ప.
సీ.ఘనపక్ష్మసంజ్ఞ దొంగలిఱెప్ప లన మీఱు...
ఆం. భా. ౨. ౧౪౪.
క. తొంగలిఱెప్పలమెఱుఁగులు, తొంగలిగొ
నుమేను వదనతోయరుహంబున్, రం గారఁ
దల్పమున న, య్యంగన నిద్రింపఁ జూచి...
హేడ. ౨. ౪౭. మనుచ. ౨. ౩౨.
జః తొంగలించు, తొంగలిగొను.

తొంగలించు. అ.క్రి. (√తొంగలి౨.) ౧.ప్రకాశించు; వ్యక్తమగు.
సీ. ధూళి పైఁ బొరసినఁ దొంగలించుట మాని
లావణ్య మెడలినలతికభంగి. భార. విరా.
౧. ౨౯౪.
చ. అనిన మురాంతకుండు దరహాసము మోము
నఁ దొంగలింప నో,వనజదళాక్షి నీవుఁ దగ
వా యిటు లాడుట...ఉ. హరి. ౨. ౭౯.
వ...సంగరకౌతుకంబు మొగంబులం దొంగలిం
ప నగిగిరి...భార. భీష్మ. ౧. ౯౫.
౨. (పువ్వును, మనసును మొ) వికసించు.
సీ. కామినీమాన మేఘశ్రేణి విరియంగఁ దొగ
లెల్లుగుంపులు దొంగలింప. పారి. ౨.౪౯.
గీ. తోఁచినను దనచిత్తము తొంగలింప,గాడ్పు
పట్టిని నిండారఁ గౌఁగిలించి. సీతావి. ౨.
౧౩౧.
౩. విజృంభించు, చెలరేఁగు.
వ,..ధృష్టద్యుమ్నుండు ద్రోణాచార్యుపయిం
గవిసిన నతండు.
గీ. సూతు నొక్కవాలమ్మున స్రుక్క నేసి,య
శ్వముల నాలుగింట ను బ్బడఁగఁ జేసి,సిడము
నడిమికి వెసఁద్రుంచె వెడఁదవాతి,దొడ్డతూ
పునఁ గురుసేన దొంగలింప. భార. భీష్మ.
౨. ౪౯.
౪. వర్ధిల్లు, పెరుఁగు.
ఉ. ధర్మమునన్ ధనంబు సతతంబు ప్రవృద్ధ
ము గా ధనంబునన్, ధర్మము తొంగలింప
ధనధర్మవిరోధులు గానికామభో,గోర్ముల నొ
ప్పుసంస్మృతిసుఖోదధిఁ దేలుచు...మార్క.
౩. ౨౭౬.
ద్వి. మట్టంపుఁజిగురుఱెమ్మలు తొంగలించి,దట్టం
పునన లొత్తి తళతళ మించు. నవ. ౧.
౧౧ పా. ౧౩ పం.
౫. అధికమగు, అతిశయించు.
క. అని యాశ్చర్యభయంబులు, దనమోమునఁ
దొంగలింప దనుజాధిపుఁడు...భాగ. ౩.
౬౪౦.
క...ఒడ లార్చరటపడఁగ నుండె నపు డచ్చట
మంగలి తొంగలించుసంత్రాసమునన్. వేం.
పంచ. ౧. ౨౭౪.
౬. నిక్కు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. అన్నువకానుదీఁగ యసియాడఁగఁ బయ్యెదఁ బిక్కటిల్లుచుం, జన్నులు తొంగలింప... మై ౧. ౧౩౪.
౭. పొంగిపొరలు.
చ. కని యతిభక్తిపూర్వకముగా ధరఁ జాఁగి నమస్కరించి లేచి నిలిచి ఫాలభాగమునఁ జేతులు సేరిచి సమ్మదాశ్రువుల్, కనుఁగవఁ దొంగలింపఁ బులకమ్ముల సంగము విస్తరింప న, త్యనుపమలీలతోడ గొనియాడెను భక్తి రసార్ద్రచిత్తుఁడై. విక్ర. ౨.౨౨౧.(జాబు. అని. ౪.౮.)
౮. పరవశమగు.
ఆ. నీముఖాంబుజాతనిర్మక్తహరికథా, మృతము ద్రావఁ ద్రావ మేను పొదలె, వంత మానె నీరు వట్టు నాఁకలియును, దూరమయ్యె మనము తొంగలించె. భాగ. ౧౦. పూ ౧౧.

తొంగలిగొను. అ. క్రి. (తొంగలి² + కొను) తొంగలించు, ప్రకాశించు.
షోడ. ౨. ౪౭.

తొంగలిపాట్లు. వి.బ. (√తొంగలి¹) నమస్కారము.
రగడ. కృష్ణకోటి యను క్షేత్రములోనిమధుద్విషునకు నిదె తొంగలిపాట్లని. హంస. ౪. ౨౧౩.

తొంగిళ్లు. వి. బ. (√తొంగు) ౧. పొత్తులు, మెత్తనిసన్నని. పాఁతగుడ్డలు.
ద్వి. తొంగిళ్లపై నిడి లింగమూర్తికిని, సంగసగావించు సభ్యంజనంబు. బ. స. పు. ౩.౩౩౪.
౨. బట్టపింజెలు.
ద్వి. అంగిటిమఱల్లొత్తు సందంద ప్రేలఁ, దొంగిళ్ఁ గార్నీరు దోసెత్తి పిడుచు. బస. పు. ౩. ౩౪౧ పం.

తొంగు. అ. క్రి. (క. త. తొంగు) వంగు, వాలు; అపసరిల్లు, తొలఁగు.
సీ. నడుముఁ బట్టుక నిల్వఁబడియుఁ గూర్చుండియుఁ దొంగి దోఁగియుఁ గొన్నిజంగ లరిగి. కాళ. ౩. ౧౮౩. (తొంగితొంగియు, చి. ని. పా.)
ఆ. గిరులదరులరెడల నురుగుహాగృహములఁ, దొంగితొంగి చూచుఁ దోయజాక్షి. భార. ఆర. ౨. ౯౪.
క. అంగన యిన్నాళ్లును ముని, చెంగటికిం బాటి పాటి సేవలు గావిం, పంగాఁ బోదువు నేఁడటు, తొంగియుఁ జూడ వతఁ డేమిదోసము సేసెం. విజ. వి. ౩. ౭౯.
ద్వి...తొత్తడిసంపద తొంగెఁ దక్షణము.బస. పు. ౪. ౧౧౧ పా. ౭౯౨ పం. (ప్రాఁతప్రతి పా. 'తొలఁగె' కొత్త. పా.)
తొంగియుండు=తొంగుండు. (శయనించు.)
గీ. ఇందఱకు నిట్టినీమర్మ మెఱుకపడఁగఁ, దొడరి బయ లేల పడితివే తొంగియున్న, సుంకరీ తలమాటకు సుంక మెంత, యనుట యిట్లమ్మచెల మోస మగుఁ గదమ్మ. చమ. ౩. ౫౨.
జః తొంక, తొంగలి¹, తొంగలిపాట్లు, తొంగిళ్లు, తొంగుండు.

తొంగుండు. (√తొంగు) అ. క్రి. శయనించు, పరుండు.
మ. తలపోయక్ దమపంచతిన్నియలమీఁదక్ జంగముల్ వోలె నిచ్చలుఁ దొంగుండెడు కన్నగాండ్రు విని...కాళ. ౪. ౫౨.
సీ. తొంగుండ మంచంబు దొర లే దని కృశింప బంటున కబ్బునే పట్టుపఱుపు.రామలిం. ౮౫.

తొంటు. వి. ౧. త్వక్కు; వృక్షచర్మము, చెట్టు పట్ట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆ...తొంట చెఱ్కు తడప యంట త్వగాఖ్య
యా. ఆం. భా. ౨. ౩౭.

౨. వామియొక్క మొదలు.

సీ. వామి యటంచన వఱలును దృణతతితొంట
యనంగఁ దన్ముఖము :దనరు. ఆం. భా. ౨.
౭౭.

౩. కసవువెంటి. (శ. ర. బ్రా.)

జః తొంటచేయి.

తొంటచేయి. వి. (తొంట + చేయి) ఈచవో
యినచేయి.

ద్వి. ప్రాఁకుపం డ్లూడి వెల్వడఁగ నేత్రములు,
చీకిలించుచుఁ దొంటచేతులు దాల్చి. అ.
మ. క. ౫. ౨౩౪ పా. ౨౦ పం.

(ఇట్లే తొంటకాలు మొ.)

తొంటచేతివాఁడు= ఈచవోయినచేయి కలవాఁ
డు.

గీ...కుకరుండు పరఁగుఁ దొంట,చేతివాఁ డన
శ్రీమాతృభూతలింగ. ఆం. భా. ౨.౧౨౧.

తొంటజొన్న = నిప్పుముట్టించిన కసవువెంటి.
(బ్రా.)

తొండ. వి. సరటము, కృకలాసము, ఒకజాతి సరీ
సృపము.

సీ. నమ్మి యున్నను గ్రమ్మి దొమ్మిసేయు నటంచు
నెమ్మిరూపు సురాధినేత దాల్చె, నొండు
చూడందు మూర్ఖుండు మందు నటంచుఁ దొం
డయై గండాజి యుండె ధనదుఁ,డు...ఉ.
రా. ౩. ౧౪౧.

సీ...తోఁచు నూసరవెల్లి తొండ యనఁగ,సగ
టంబు...ఆం. భా. ౨. ౮౭.

౨. దాసుఁడు, భర్తుఁడు.

ద్వి. తుదిని సంబాళిగతొండలై యుండి, బ్రదు
కంగఁ గోరునీపరిచారజనులు. ద్వి. పరమ.
కి. ౨౧౨ పా. ౫ పం. (చి. ని.)

తొండలువిడిపించు=తొందరపెట్టు.

(వ్యవ) వాఁడు సొమ్మిచ్చుదాఁక తొండలువిడి
పించినాఁడు.

జః తొండరూపురిక్క.

తొండపుఁద్రాడు. వి. (తొండము + త్రాడు) మో
టగూనతోఁకకు కట్టెడుత్రాడు. (దీనిని తొం
డాపుఁద్రా డందురు. శ. ర.)

తొండపుదోమ. వి. (తొండము + దోమ) నిడు
పుముక్కు గలయొకజాతిపెద్దదోమ, ఘోణిక,
ఏనికదోమ.

తొండము. వి. (సం.తుండమ్.) ౧. గజహస్తము.

ఉ...బాల్యాంకవిచేష్టఁ దొండమున నవ్వలిచ
న్గబళింపఁ బోయి...మనుచ. ౧. ౪.

గీ. తొండ మనఁగను దుండాఖ్య తోఁచు...
ఆం. భా. ౨. ౧౯౪.

౨. మోటగూనతోఁక,మోటగూనలోనినీరుసూ
టిగా బోదెలో పడుటకు అడుగున కుట్టిన ఏనుఁ
గుతొండమువంటితోలుగొట్టము.

జః తొండపుఁద్రాడు, తొండపుదోమ.

తొండరడిప్పొడి. వి.పన్నిద్దఱాళ్వారులలోనొకఁ
డు, విప్రనారాయణుఁడు. (భక్తాంఘ్రిరేణువు
అని సంస్కృతనామము.)

గీ.భక్తులకుఁ దొండ రంఘ్రి శబ్దమునఁ కడియు, రే
ణువకుఁ బొడి యనియు నీరీతి ద్రవిడ,భాషఁ
బరఁగుటఁజేసి తద్భావజనము, లతనిఁదొం
డరడిప్పొడి యండ్రు భువిని. వైజ. ౧.౭౫.

తొండరడిప్పొడియాళువారలు = తొండరడిప్పొ
డి. (పూజ్యార్థమున బహువచనము.)

తే. అనఘ తొండరడిప్పొడి యనఁగఁ బరఁగు,
నీకు నాళ్వారిపేరు నాఁగాక యనియె,నతఁ
డు తొండరడిప్పొడియాళువార, లనఁగఁ బ్ర
ఖ్యాతిఁ జెలువొందె నవనియందు. వైజ. ౪.
౧౩౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తొండరూపురికట్టె. వి. (√తొండ) పుష్యమీ నక్షత్రము. (శ. ర.)

తొండాడు. స. క్రి. త్వరపఱుచు.(చి.ని.శ.ర.)

తొండి=దొండి వి. రంధ్రము, తూటు. (చి. ని. శ. ర.)

తొండు[1]. వి. తృణవిశేషము‡.

గీ. వేరుతొణ్ణంగి తొండును మారువెల్లి, కదురు తుంగాకు తుంగలు కలయ విడిచి. హంస. ౫. ౪౭.

తొండు[2]. విణ. ప్రాలుమాలినవాఁడు, సోమరి. (శ. ర.)

సీ. మదట తొండొరు తొండు మదల మాలు గుఁబోతు చండి సోమరి నలితిండికాఁడు, దుండుబలి యనంగఁ దోఁచుఁ బ్రాల్మాలినవా నిపేరై...ఆం. భా. 3. ౬.

జః తొండొరు.

తొండొరు. విణ. (√తొండు[2]) ప్రాలుమాలిన వాఁడు, సోమరి. ఆం. భా. 3. ౬.

తొండ్లి. వి. వృక్షవిశేషము‡.

సీ. మట్టి విరిగి తొండ్లి మట్టితూ కిబ్బెడ...హంస. ౪. ౧౧.

తొంద=తొందు. విణ. (సం.తుందీ) బొజ్జకలవాఁడు, తుందిలుఁడు.

సీ. తొంద నాఁ దొందు నాఁ దొద్దు నా లంద నాఁ దుందిలనామమై తోఁచుచుండు.ఆం. భా. ౨. ౧౨౦.

తొందర. వి. (తొర+తొర-త. తొందరై. క. తొందరె. మ. తొందరమ్.)

౧. మిక్కిలి సంభ్రమము. ౨. సంభ్రమము. ౩. బాధ. (చి. ని. శ. ర.)

తొందరపడు. అ. క్రి. (తొందర+పడు) సంభ్రమించు. (శ. ర.)

తొందరపాటు. వి. (√తొందరపడు) తొందర పడుట. (శ. ర.)

తొందళము. వి. రెండుమూఁడు దినుసుల కూరలు చేరినదప్పలము. (శ. ర.)

తొందు=తొంద. ఆం. భా. ౨. ౧౨౦.

తొంబ. వి. గుంపు, మూఁక. (గ్రా.వి.అని.శ.ర.)

జః తొంబగిలు.

తొంబండ్రు. స. బ. తొంబదిమంది. (తొంబదికి మహన్మహత్వర్థకరూపము.)

తొంబగిలు. (√తొంబ) అ. క్రి. గుంపుగూడు. లయగ్రాహి.సంబరము గావలసి తొంబగిలి దానవకదంబము సహాయముగఁ బంబి త్రిదశుల్దుగ్ధాంబునిధిఁ ద్రచ్చి యమృతంబు గొనఁజాలు సమయంబు దొరకించితి ముదంబున ముకుందా. అప్ప. ౪. ౨౫౨.

తొంబది. స. (తొమ్మిది+పదులు)తొమ్మిదిపదులు.

సీ...మద్రపతి మేన నతఁడు తొంబదితూపు లడరించి యేసె...భార. కర్ణ. ౧. ౧౧౪.

క. గురుపుత్త్రుఁడు తొంబదిశిత,శరములఁ బావని రథంబు సంవృతముగఁ జేసె...భార. కర్ణ. ౧. ౧౦౨.

తొంబనూఱు. స. (తొమ్మిది+నూఱులు) తొమ్మిదివందలు.

గీ. తొంబనూఱును దొంబదితొమ్మిదియును, జలజములు పూజచేసెను శార్ఙ్గపాణి. భీమ. ౬. ౬౫.

తొకతొక[1]. విణ. ౧. తొక్కు,స్పష్టముకానిది. (పిల్లలమాట.)

చ. తొకతొకమాటలు న్మొసలఁ దుంపెసలాడెడునుంగరంపువెం,డ్రుకలును గల్గి యింపొదవుఁగా సుతుబాల్యము తండ్రి కెంతయుక్. కవిరా. ౨. ౪౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. తడఁబడునది. (మాట.)

క. ఒకలాగున మాటలు తొంక,తొంకలై వెడలం
గఁ జొచ్చె దుడిదుడి నెందే, నొకఁడ చనఁ
దొడఁగెఁ గన్నులు, పెకలించుక చూడ
సాఁగ భీతి దలిర్పన్. నిరం. ౪. ౬౬.

జః తొంకతొంకలాడు.

తొంకతొంక[2]. వి. నీళ్లు లోనగునవి ఉడుకునపుడు పుట్టుధ్వని కనుకరణము.

(సముద్రమథనవర్ణనము)వ...బాడబానలంబునం దొంకతొంక నుడుకు నీరునుం గలసి నఖంపచం బై...హర. ౬.౫౯.

తొంకుతొంకు(కుఁ)లాడు.(√తొంకుఁ)తొంకుఁలాడు, తొందరలో ఒకనినొకఁడు అతిక్రమించి పోవు.

క. అవ్విబుధవరులు గురిసిరి, పువ్వులజడివాన
తావి బుగులుకొనంగా, మవ్వంపుఁగమ్మఁదేని
య,తువ్వరతండమున కళులు తొంకుతొంకు
లాడన్. సుద. ౨. ౧౦౭.

ఉ. తెమ్మెరకమ్మఁదావులకుఁ దేఁటిగము ల్తొంకు
తొంకుఁలాడఁ బైఁ, గ్రమ్మెడు తేనియల్ చె
మరు గాఁగ...సుద. ౫. ౧౨౨.

తొంకుఁ. (సం. త్వక్. త. తొంకుఁ)౧. చెట్టులో నగువానితోలు, పట్ట. (చి. ని. శ. ర.)

౨. చర్మము, తోలు.

గీ. తొడవసంబు కశాసంబు తొంకుఁ తోలు,చ
ట్టనఁగ జర్మ మలరు...ఆం. పదా. నర.౭౦.

తొంకుఁట=తొంకుఁటము, త్రొంకుఁటము. వి. (√తొంకుఁ. త. తొంకుఁడై=లేమి) ఒత్తుడు, బాధ; లేమి, దారిద్ర్యము.

సీ. మది నున్నవనజారియెదకప్పు పైకి వెల్వడె
నాఁగఁ జన్మొన ల్నలుపు మీఱ, డొక్కఁరా
యనిఁ బాయఁ దొక్కుఁట గల్గిన ట్తొంకుఁట
మైకార్శ్య ముప్పతిల్ల. శశాం. ౫. ౧౨౧.

తొంకుఁటపడు=త్రొంకుఁటపడు. అ. క్రి. (తొంకుఁట+పడు) తొట్రుపడు; బాధపడు.

గీ. దైన్య మాకార మయినచందమున నున్న,
వానిఁ దమయన్నఁ గనుఁగొని వారు వెఱఁ
గు,పడి భయంపడి తొంకుఁటపడి కటకట,
పడి దిగుల్పడి వడఁకుచు భక్తిఁ జేరి. ఉ.
రా. ౬. ౨౦౫.

తొంకుఁటపాటు. వి. (తొంకుఁట+పాటు) తొట్రుపాటు; బాధ.

చ. వలఁదపిఱుందుభారమున వారనితొంకుఁట
పాటు మీఱఁగా, నిలపయి సాఁగి మ్రొక్కి
యిల యీశ్వరి నిట్లని యెంచె ధీరతన్.
ఉ. రా. ౭. ౪౩౪.

తొంకుఁటము=తొంకుఁట, త్రొంకుఁట. (√తొంకుఁ).

(ఒత్తుడు, మర్దనము.)

క. తామరసనేత్రవీనుల,తో మొనసి జయింప
లేక తొంకుఁటమున నెం,తో మలఁకలఁ బడి
స్రుక్కుఁచు, వేమఱు శష్కులులు క్రాఁగి
వేఁగుచు నుండెన్. రసిక. ౨. ౯౯. (శ.
ర. పా. 'త్రొంకుఁటము' ముద్రి. పా.)

తొంకిఁస. వి. ఇటునటు తిరుగుట, సంచరించుట.

జః తొంకిఁసలాడు.

తొంకిఁసలాడు. అ. క్రి. (తొంకిఁసలు+ఆడు) ఇటునటు సంచరించు.

చ. నిలిచినవానిఁ గాంచి తగునే యిదె కప్పెర
దీసి యిత్తు నం, చిలు వడిఁ జొచ్చి యింత
వడి యేమియొ రోయుచు నుండి పట్టిచే,తులఁ
జను దెంచినాఁడ విటు తొంకిఁసలాడఁగ
నేమి హేతువు. హరభక్తవిలాసము. ౧.
ఆ. (చి. ని.)

తొంకుఁ=త్రొంకుఁ. స. క్రి.

(అణఁచు.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. తొలితొలి యెల్లపాపములు దొక్కుచుఁ బ
ల్కెడునట్టితియ్యపుం,బలుకుల నచ్యుతాహ్వ
యముఁ బల్మరుఁ జేర్కొను... నృసిం. ౩.
౧౮౭.

వి. (క.త.తొక్కు.) ఉప్పును కారమును చేర్చి
తొట్టిలోనఁ గొట్టిన మామిడికాయముక్కలు
మున్నగువానిముద్ద.

వ...పచ్చ ళ్లూరుఁబిం డ్లూరుఁగాయలు మామి
డితొక్కులు...హంస. ౧. ౧౦౫.

సీ. ఫుక్కిళ్ల వీడెంపుఁదొక్కు మెండుగఁ జేసి
కంఠగ ర్తంబులఁ గాఁపుగట్టి. వైజ. ౩.౭౦.

విణ. ౧. అవ్యక్తమధురమైనది. (పలుకు)

గీ. బాలుఁ డొక్కండు కొండొకకోల సేతఁ,
బట్టుకొని యేను రక్కసుఁ గిట్టి చంపి,చులు
కఁ గా వత్తు మీ రేడ్వవలవ దనుచుఁ,గలయ
నూరార్చెఁ దనతొక్కుఁబలుకు లొప్ప.
భార. ఆది. ౬. ౨౬౦.

సీ. తాలిమి రససేవ సోలి ముద్దాడురాచిలుక
నా వెడదొక్కుఁబలుకు లొప్పె. కు.సం.
౩. ౩౧౭.

దీనియామ్రేడితరూపము తొక్కుతొక్కు.

వ...ఏ దేది యే మేమి యనుచు ననుచుమదము
మెక్కునఁ దొక్కుతొక్కుపలుకులఁ బలు
కుచు...ఘటికా. ౨.౧౮౬.

౨. త్రొక్కివేసినది, పనికిమాలినది.

ఉ. అక్కఱినాత్మకుండు గస వారసి తె మ్మని
కూఁతుచేతికిం, జెక్కుడుపాఱ యీయ...ది
నాంతమునందు వచ్చి బ,ల్తొక్కులు నామొ
గంబున విదుర్చును గొన్ని తృణాగ్రఖండ
ముల్. శుక. ౩. ౮౧౦.

జః తొకుతొకులాడు. తొక్కట, తొక్కటపడు,
తొక్కటపాటు, తొక్కటము, తొక్కుడు.

తొక్కుడు=త్రొక్కుడు. వి. (√తొక్కు, త.
తొక్కు) ఒత్తుడు, సమ్మర్దము.

ద్వి. తొక్కుడు ఘన మంచుఁ దొలఁగి నిల్చు
చును,నిక్కి చూచుచు మిఱ్ఱు లెక్కి చూ
చుచును. పండితా. మహిమా. ౨౮౨ పా.

తొగ[1]=తొవ. వి. ౧. కలువ; ఎఱ్ఱకలువ.

సీ. కటికిచీకటితిండికరములగిలిగింత నెవ్వాఁడు
తొగకన్నె నవ్వఁ జేసు. ఆము. ౧. ౧౯.

ద్వి. తొగలార యిఁకమీఁదఁ దొగ యెట్టి దను
చుఁ, దొగ లెల్లఁ జిదిమి వైతురు పెచ్చుపె
రిఁగి. రం. రా. యు. ౨౭౩ పా. ౩౦ పం.
రుక్మా. ౮. ౧౩౨.

జః తొగకంటి, తొగచెలి, తొగచెలికాయి,
తొగదాయ, తొగదొర, తొగనెచ్చెలి,
తొగపగదాయ, తొగమేలు, తొగరా,
తొగరాజు, తొగఱేఁడు, తొగలగాదిలి,
తొగలవిందు, తొగలసంగడికాఁడు, తొగ
నూడు, తొగనూడుటా.

తొగ[2]. వి. బాధ, కష్టము.

ద్వి. తొగలు వెట్టింతుము దుష్టారిసతులఁ, దొగ
లు జానకి యింక తొలఁగంగ వైచు. రం.
రా. యు. ౨౭౩ పా. ౨౯ పం. ('సతుల
తొగలు' ముద్రి.)

జః తొగలువెట్టు.

తొగ[3]. వి. (త. తొగై.) సమూహము.

చ...ఎ,మ్మెలచెలిమిన్నకన్నుఁగవ మీఱ దొగ
లఱ దొగలం గలంచు... ప్రబంధ. ౩౧౭.

తొగ[4]. వి.విధము.

గీ. తొగలగముల బ్రదుకుతొగలు రాజిల్లంగఁ,
గడలి మిన్నుముట్టి కడలుకొనఁగఁ, బొడిచె
శీతకరుఁడు ... భాగ. ౧౦ పూ. ౧౨౯౫.
(శ. ర. పా. 'తొగలు సంతసిల్ల దొంగలు
భీతిల్ల' ముద్రి. పా.)

క. నగరాట్కుచపలుసిరిజిగి, నగ రా మగరాల
జనులు నగరా మొగముం, దొగరావగరా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వా తెఱతొగ రాపొగ రానుచిగురుతో సరి
తొగరా. బహు. ౫. ౫౭.

తొగ[2]. వి. పక్షివిశేషము.

సీ. కైజు కక్కెర గువ్వ కల్లెడు కేరజ మాడెలు
తొగ గిజిగాఁడు కొరడు. సుద. ౩.౧౯౪.

తొగకంటి. వి. (తొగ[1]+కన్ను.) కలువలవంటి కన్నులుగల ఆఁడుది; ఆఁడుది.

క. జగములయెకిమీఁడ నినుఁ,బొగడఁగఁ బది
నూర్లనోళ్లప్రోడయుఁ బలుకుం, దొగకంటి
యుఁ జాలనిచోఁ, దగునే పెఱవార లెన్నఁ
దగువా రనఁగన్. అచ్చ. రా. బాల.
౬౪.

సీ. తొగకంటి కంటె యధ్వగమానలుంటాకకం
టకంబగునీకురంటకంబు. అచలా. ౨. ౭౩.

తొగచెలి. వి. (తొగ[1]+చెలి) కలువలచెలికాఁడు, చంద్రుఁడు.

చ. పగడఁపుఁధీఁగలో తళుకుబంగరు బొమ్మలో
...తొగచెలితున్కలో మరునితూపులో...
యందములఁ బోలురు నీటుగ నాటచేడియ
ల్. నీలా. ౧. ౪౦.

తొగచెలితాయి. వి. (తొగ[1]+చెలి+తాయి) చంద్రకాంతశిల.

చ.తొగచెలితాతిజోతి హిమతోయము జిల్కఁ
గిరీటిపచ్చతా,నిగనిగ లల్క ముత్తియపుని
గ్గులు ముగ్గులు పెట్ట...చం. రా.౩.౧౧౩.

తొగట. వి. ౧. ఎఱ్ఱనూలు. (చి. ని.) ౨. ఒక జాతినేతకాఁడు, తంతువాయభేదము.

సీ. తోఁచుఁ దద్భేదముల్ తొగటవాఁ డనఁగ
ను సాలీఁ డనంగను సాలె యనఁగ.ఆం.భా.
౨. ౨౮౩.

గీ. గొప్పకన్నులు చిఱునవ్వుఁ గులుకుమోము,
బవిరిగడ్డము చక్కనై పరఁగుముక్కు,నెగు
భుజంబులు విపులత్వ మెసఁగుఱొమ్ము, జిగి
మిగులఁలీలఁ గనుపట్టుఁ దొగటసెట్టి.హంస.
౨. ౧౨.

క. గడిదేఁటి జారవిద్యకు,...వడువున నల్తొగట
బోఁటి వ ర్తిలఁ దొడఁగెన్. హంస. ౨.౨౫,
౪౪.

తొగడు. వి. లోపలి కణఁగుట.

ద్వి. తొగ డించుకయు లేక తోరము గ్గాక,
మిగుల వట్రువలు నై మించుపెందొడలు.
రం. రా. యు. (శ. ర.)

తొగదాయ. వి. (తొగ[1]+దాయ) సూర్యుఁడు.

గీ. అనిన రతనాలబొజ్జప్రోయాలిముద్దు, పాపపె
నిమిటి తొగదాయపట్టి నపుడె, పలువయెను
పోతుపాలదిండి వడ్డచోటి, కెలమితోఁ దోడి
కొని చని బలిమి మెఱయ. అచ్చ. రా.
కిష్కిం. ౩౬.

తొగదొర. వి. (తొగ[1]+దొర) చంద్రుఁడు.

చ. తొగదొరచాయ తమ్మివలెఁ దూలి ముడుం
గఁగఁజేసె మూఁకలన్. అచ్చ. భా. ౪.
౭౨.

తొగనెచ్చెలి. వి.(తొగ[1]+నెచ్చెలి.)చంద్రుఁడు.

క. బలములు గెలుపుతలంపులు, నలుకలుఁ బంత
ములుఁ దలఁప నంతంతకు మిక్కిలిగాఁ బో
రఁ దొడంగిరి,తొలివేలుపు ఱేఁడు రాచతొగ
నెచ్చెలియున్. అచ్చ. రా. యు. ౫౦౮.

తొగపగదాయ. వి. (√తొగ[1].) సూర్యుఁడు.

చ. తొగపగదాయ యయ్యపరతోయధి మున్గె
ను గుంకుమచ్ఛవిన్. ఉ.హరిశ్చ. ౩.౧౦౨.

తొగమేలు. వి. (√తొగ[1].) కుముదబాంధవుఁడు, చంద్రుఁడు.

ఉ. కేలను బోటువాలు దులకింపఁ దలం దొగ
మేలు మేనిసా,బాలున నాలు...గల్గుసామి
కిన్. చెన్న. ౩. ౩౮.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**తొంగర=తొవర.** వి. (సం. తువరః) ఒగరు.

సీ. ఒగ రసం దొంగ రసం దగును గషాయంబు... ఆం. భా. ౧. ౧౦౪.

**తొంగరా.** వి. (√తొంగ¹.) కలువలకురాజు, చంద్రుడు.

క. నగరాట్కు—చపలుసిరిజిగి, నగ రా మగరాల జనులు నగరా మొగముం, దొంగరావగరా ...బహు. ౫. ౫౬.

**తొంగరాజు.** వి. (తొంగ¹ + రాజు)కలువల ఱేడు చంద్రుడు.

క. అగిసెవిరుల్ కరువలిచే, నెగయం దోం దేటిచాల్పు లేంగుం దఱుచై, తొంగరాచపదుపులన్ వెను,దగులుచు నెలదిండిపిండు దార్కొనుపగిదిన్. యయా. ౪. ౧౧.

**తొంగరి.** వి. (సం. తువరీ.) ౧. కందిచెట్టు. ౨. అడవికందితీంగె. ౩. సురాష్ట్రదేశపుమన్ను. (వాచ.)

**తొంగరించు.** అ. క్రి. (√తొంగరు.) రాగిల్లు, రాగమునొందు.

(తొంగరుశబ్దమునకు రాగశబ్దము పర్యాయమగుటచే నీయర్థమున నిది ప్రయోగింపంబడెను.)

క. నగుచుం దెఱవ నీ రిడ మదిం, దొంగరింపంగ మగండు కేల దోయిలి వట్టన్, దిగి కుచ్చిలి విడువలువన్, బిగిదడి మొలనూలుబోటి పెంపున బట్టెన్. అచ్చ. భా. ౩. ౪౩ పా.

**తొంగరు=తొవరు.** వి. ౧. ఎఱుపు, రాగము.

ఉ. ఇంగిలికంబునం దడిపి యెత్తు కసీసపుకెంపె మో యనన్, నింగి గరుత్పరంపరల నిగ్గున లేదొంగ రెక్క...ఆము. ౪. ౧౦.

౨. ఎఱ్ఱనూలు. (శ. ర.)

విణ. ఎఱ్ఱనిది.

సీ. తొంగరువన్నియశేతతొలుసంజకెంజాయకమనీయధాతురాగంబు గాంగ. కాశీ. ౧. ౧౨౩.

సీ. తొంగరువాతెఱవాండు తొంగలసంగడికానిం దెగడ నన్నద్దునెమ్మొగమువాండ. రసిక. ౩. ౫౨.

జ: తొంగరించు, తొంగరుకొను, తొంగరుకొల్పు.

**తొంగరుకొను.** అ. క్రి. (√తొంగరు.) ఎఱ్ఱనగు.

చ. నగకరయె యుండనిమ్ము వచనమ్ములు పల్కకయుండనిమ్ము క, న్దొంగరుకొనంగ నిమ్ము...గంధ. ౧౯౨.

**తొంగరుకొల్పు.** స. క్రి. (√తొంగరుకొను.) ఎఱ్ఱనిదిగాం జేయు, ఎఱుపును గూర్చు.

చ. గిఱికొనుగోపురాగ్రపరికీలితపంకజరాగరశ్మిగ, ట్టెఱ యగుచాయం బొల్చు దివసేంద్రుడు సక్కనిమింటం బోవుచో,మఱచి విధాత పాటలిమ మధ్యమసంధ్యకుం జేయలేనియా, కొఱంతయుం దీర్పకోం దొంగరుకొల్పినకైవడిం బట్టనంబునన్. ఆము. ౨. ౧౮.

**తొంగ(ల)ఱేడు.** వి. (తొంగ¹ + ఱేడు) చంద్రుడు.

సీ. తొంగఱేనిపరివార మగు తారసంఘంబు శంఖరింఖ న్మణిసరణిం జూప. చం. రా. ౩.౨౦.

గీ...ఉస్సురు మనుచుం బట్టపగలుగా వెన్నెలలు గాయం దొంగలఱేనినట్లె చూచుచు విరహార్తుం డగుచు...ఉ. రా. ౪. ౧౭౩.

**తొంగలగాదిలి.** వి. (√తొంగ¹) కలువలచెలి, చంద్రుడు.

సీ. పొగ డొందుమొగ మెందుం దొంగలగాదిలి విందు జిగిలేంగవునుందీవ మొగులుత్రోవ నీలా. ౧. ౫౬.

**తొంగలవిందు.** వి. (తొంగ¹లు + విందు.) చంద్రుడు.

సీ. నేలతాలుపురాచచూలిగాదిలికందు దోసం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గుచీకటిచాల్పుతొఁగలవిందు. అచ్చ. రా. బాల. ౭.

తొఁగలసంగడికాఁడు. వి. (√తొఁగ¹) చంద్రుఁడు.

సీ. మందర వెలుఁగొందుముక్తాలలామంబు తొఁగలసంగడికానితునుక గాఁగ. భాగ. ౧౦. (చి. ని.)

తొఁగలువెట్టు. స. క్రి. (√తొఁగ²) బాధపెట్టు.

ద్వి. తొఁగలువెట్టింతుము దుష్టారిసతులఁ, దొఁగలు జానకి యింకఁ దొలఁగఁగంగవైచు. రం. రా. యు. ౭౩. పా ౭౫ పం.

తొఁగసూఁడు. వి. (తొఁగ¹ + సూఁడు.) సూర్యుఁడు.

మ. తొఁగసూ డల్గినఁ దమ్మిముద్దియకుఁ జేతు ల్సాఁచి నిద్దంపుమేల్మిగి గన్పట్టుమడుంగు దువ్వాలువ లిచ్చెం గూర్మి...అచ్చ. రా. అయో. ౮౩.

తొఁగసూఁడురా. వి. (తొఁగ¹ + సూఁడు + రా) సూర్యకాంతశిల.

సీ. చిలువమేపరిపచ్చపలకలచేతను తొఁగసూఁడు రాజిగిదూలములను. ప్రబంధ. ౫౯౯.

తొచ్ఛియము= తొచ్చెము. (శ. ర.)

తొచ్చెము= తొచ్ఛియము.విశే. (సం.తుచ్ఛమ్) హీనము.

వ. అముక్తకేశియు నచ్చోట నచ్చవెన్నెలఁ దొచ్చెంబుచేసి యెసఁగునిసుకదిన్నెలపై నున్నయది యట్లగుటంజేసి ... పాండు.౭. ౧౫౩. (తొచ్చెముసేయు = హీనముగాఁజేయు, కీడ్పఱచు.)

వి. తుచ్ఛవచనము.

గీ. తొచ్చెము తుటారమనఁగను దుచ్ఛవచన, మొప్పు...ఆం. భా. ౧. ౧౧౭.

వ...రఘువరులసచ్చరితతొచ్ఛయంబుల నుచ్చరించుచుఁ దొచ్చెంబుల తొచ్చుసేయుచు... రామా. ౫. ౧౪౯. (శ. ర.)

తొటతొట. వి. నీరు పువ్వులు పండ్లు మున్నగునవి పడుటయందలిధ్వని కనుకరణము.

సీ. వానిపువ్వులు ఫలావళులు భేరీప్రమాణములమృతోపమానములు తొడిమ. గీ. లూడి తొటతొటఁ దఱుచుగా నుర్వి రాలి, పడఁగ ...వరాహ. ౧౦. ౧౭౫.

క. కటపెట తొటతొట రాలెదు, పొటపొట చినుకుల ధరిత్రి పొడ నట్టువడన్, సొటసొట నాఁకట సోలుచుఁ, దటతటపడుచాతకము లదైన్యము వాపెన్. వైజ. ౭. ౧౮౬.

తొటదొప్ప. విశే.(తొప్ప+తొప్ప) అధికము, పెల్లు.

క. గిటగిటమనుచును నెత్తుటఁ, దొటదొప్పగఁ దోఁగి యపుడు తొట్రుపడంగాఁ, గటకట యనుచును గుండెలు,తటతట నదరంగ వివిధదైన్యము లొదవన్. సీతా. ౩. ౧౦౩.

తొటుకుతొటుకు. వి. గుండెలు అదరుటయందగు ధ్వని కనుకరణము.

చ. తటుకున మంచె డిగ్గుదొర దట్టి బిగింపఁగఁ జూచురాజు దుప్పటి కటిఁ గట్టుపార్థివుఁడు ప్రజ్ఞలు వల్కుచుఁ గార్ముకమ్ము చెంగటి కరుదెంచి కాంచి విలు కైఁ గదలింపఁగ నోడి గుండియల్, తొటుకుతొటుక్కనన్ దిగులు దొట్టినభూభుజుఁ డయ్యెనయ్యెడన్.పాంచాలీ. ౨. ౮౨. ('తుటుకుతుటుక్కు' శ. ర. పా.)

తొట్ట¹. విశే. స్థూలము.

సీ. అత్యంత గాఢదంతాగ్రపీడనమునఁ దొట్టవాతెఱ నెత్తు రుట్టిపడఁగ. నైష. ౭. ౪౯.

తొట్ట²=తుంట². (సం. దుష్ట. ప్రా. దుట్ట, త. తొట్టన్.- చూ. తొట్టరి.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జః తొట్టరి.

**తొట్టగిలఁబడు.** అ. క్రి. (√తొట్టగిలు.) తత్తఱపడు.

క. పెట్టక పోనని యాఁకటఁ, దొట్టగిలంబడుచుఁ బడుచు దురదురఁ జని వే. నటింటఁ గూరుచుండిన, నెట్టు ననం జాల కస్మృగేక్షణ భీతిఁ. పాండు. ౪. ౧౬౫.

**తొట్టగిల్లు(లు).** అ. క్రి. అతిశయించు.

సీ. తెల్లగుడ్డులు తేలగిల్లి తీపులు పుట్టి దోషము ల్పొందుగఁ దొట్టగిల్లి. కవిక. ౫.౧౧౧.

చ...తా నెమ్మెయిం, దరలఁగఁ దీయ లేక వగదట్టముగా మదిఁ దొట్టగిల్ల...భాగ. ౧౦ ఉ. ౪౫౫. శ. ర. పా. (దగ...తుట్టగిల్లు, ముద్రి.పా.)

జః తొట్టగిలఁబడు.

**తొట్టరి**=తుంటరి, (తొట్టు² + అరి³) విశే. దుష్టుఁడు; దుష్టురాలు.

ద్వి. నెట్టన నింటిలోనికి నుఱ్ఱుకఁడనుచుఁ, దొట్టరులిరువురఁ బట్టి తెం డనుచు. పండితా. దీక్షా. ౪౩ పా.

ద్వి. దిట్టలు దిట్టలు తెల్లట్లు చెప్పఁ, దొట్టరుల్, దొట్టరుల్ దొలఁగి చనంగ. పండితా. పర్వ. ౩౫౭. పా.

**తొట్టి¹.** వి. (క.త. తొట్టి) ౧. నోరు వెడల్పును అడుగు సన్నమునైన గంపవంటిపాత్రము. (గంగాళము. బ్రా. కటాహము. చి. ని.)

చ...క్రొమ్మడుఁగున కేఁగుభద్రకరిమాడ్కి సుధన్వుఁడు చొచ్చె బిట్టుగా, నుడికెడినూనెతొట్టి బలియుర్ హరిదాసులు సత్యసంపదన్. జై. భా. ౪. ౧౩౩.

ద్వి. చిట్టులు నుట్టులుఁ జిక్కము ల్వెన్న, చట్టులుఁ దొట్టులుఁ జల్దిజాడియలు. (అమ. క. ౧. ౪౫ పా. ౨౦ పం.

౨. నీరునిలుచుటకు కట్టినకుండు.

గీ. గర్భమంటపిఁ గడిగినకలఁకజలము, లోని జాతొట్టి నిండి కాలువగఁ జాఁగి. ఆము. ౬.౭.

౩. చెట్టుతొఱ్ఱ.

గీ...తొట్టి, తొట్రు తొఱ్ఱ తొరట యనఁ దోఁచుఁ గోట, రమ్ము...ఆం. భా. ౨. ౩౭.

జః తొట్టించు, తొట్టికట్టు. తొట్టినోరు.

**తొట్టి²**=తొట్టు², తొట్టువ. వి. గాలిచే నీటియందుఁ గొట్టుకొనివచ్చెడు తృణాదిసముదాయము.

సీ. ఉత్ప్లుతయవసాదికోక్తి యై విలసిల్లుఁ దొట్టి నాఁ దొట్టు నాఁ దొట్టువ యన...ఆం. భా. ౧. ౧౫౮.

**తొట్టించు.** స. క్రి. (√తొట్టు¹) తొట్టఁజేయు. (స్రవింపజేయు.)

ద్వి. దట్టించి కట్టించి దర్పంబు బలము, వట్టించి రక్తంబు వాఁతఁ దొట్టించి. అ. మ. క. ౨. ౬౮ పా. ౧౯ పం.

**తొట్టికట్టు.** వి. (తొట్టి¹) కక్ష్య, ప్రాసాదమునకు ముందుండు శాలాంతరాళము, రాజగృహముల యొక్క అంతరువు.

సీ. దురములోఁ దెఱగంటిదొరను గెల్చిననాఁటి కతలు వ్రాసినతొట్టికట్లు దాఁటి. యయా. ౪. ౮౩.

ద్వి. చుట్టుకొల్లారము లొప్పరణగండ్లు, తొట్టికట్టులు సర్వతోభద్రకములు. రం. రా. సుం. (చి. ని.)

**తొట్టినోరు.** (√తొట్టి¹) వి. తొట్టివంటినోరు.

సీ. చెలువ నీజిగిగోము గలమోము మఱి వానితొట్టినోరను ముద్దు వెట్టఁ దగునె. హంస. ౧. ౬౧.

**తొట్టియ(ట్టె)** వి. నేయువాఁడు నూలుకండె యుంచుకొనుపనిముట్టు, సాడె.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. తొట్టె నాడె యనంగఁ దురిపేరు విలసిల్లు...
ఆం. భా. ౨. ౨౯౬.

తొట్టియల= తొట్టె, తొట్టెల, తొట్ల. వి. బిడ్డ
లను పరుండఁ బెట్టుతొట్టె.

వ...అపూర్వమై భవంబున నున్నయొక్క రాజును
నతని యగ్రభాగంబునఁ బసిండితొట్టియల
లోపలఁ బొత్తుల లోనున్నయొకచక్కనిబాలి
కనుం జూచి...కళా. ౫. ౨.

తొట్టిలు. అ. క్రి. (√తొట్టు[1]) వెలికిలు, పీపుక్రిం
దగు.

వ...నిప్పుఁ ద్రొక్కినచందంబున మిట్టిపడి తొట్టి
లంబడినపులుఁగువిధంబున నిట్టటు తరలిపోఁ
గూడక...సారంగ. ౩. ౨౯.

తొట్టు[1]. అ. క్రి. ౧. వ్యాపించు, ప్రసరించు.

గీ. జనము లానందమునఁ దేల జగము లెల్లఁ,
దొట్టి నిండారువెన్నెల నిట్టవోడిచె. నిర్వ.
౬. ౫౫.

మ. జిలుఁగుంజీకటి నీలకుట్టిమరుచిశ్రీ దొట్టి రె
ట్టింప జ్వాలలతాంగు ల్కుహనారతిం బతుల
నిద్రల్పుచ్చి ప్రాపింతురు ...రామా. ౧.
౧౩౬.

సీ. మిట్టగుబ్బడులమీఁదఁ దొట్టినకెంజాయ చరమ
సంధ్యారక్తిఁ జౌకళింప. చిత్రభా. ౩.
౧౨౫.

౨. స్రవించు, కాఱు.

శా...ఏలా వాడెఁ వదనంబు నేత్రముల నే
లా తొట్టె బాష్పంబు లేలా వైవర్ణ్యము
దోఁచె దేహమున...వరాహ. ౨. ౫౪.

క. అట్టియెడ నమ్మృగేక్షణ, బట్టి సఖీజనము వె
డఁగుఁబట్టీ తగవే, యిట్టితెగు వనుచుఁ జె
క్కులఁ, దొట్టినకన్నీరు వోవఁ దుడుచుచుఁ
బలికెఁ. మనుచ. ౩. ౩౨.

ఉ. నిట్టకనిల్వునం గలఁగి నేత్రయుగంబున
బాష్పపూరముల్, దొట్టఁగ ఘర్మతోయము
లతోఁ బులకాంకురజాల మెల్లెడం, బుట్టఁగ
...భోజరా. ౩. ౬౯.

౩. ప్రవహించు, పాఱు.

మహాస్రగ్ధర...శత్రువీరవ్రజంబుల్, దునుమం
దచ్ఛోణితంబుల్ దొరిఁగి మడుపులై తొట్టె
నయ్యుద్ధభూమిన్. భార. ఆర. ౫. ౪౨౧.

చ...నీదునునుఁబల్కు వినంబడఁ దల్పుఁ దీయఁ
గా, వెలువడి వచ్చితిన్ వలపువెల్లువ దొట్టఁగ
నంచు...హంస. ౨. ౬౪.

౪. ఎగఁదట్టు.

ఆ. వదనచంద్రికాప్రవాహంబు దిగ జాతి, సం
దులేనిఘనకుచములనడుమ, నరుగ రాక తొ
ట్టె నన మించు నాచకో, రాయతాక్షితార
హారతతులు. వరాహ. ౧౧. ౪౨.

క. రేవానదిలోపల సం, ధ్యావిధు లొనరించు
చున్న నది యెత్తెఁగి ధరి, త్రీ విభుఁడు వేయి
చేతుల, నావాహినినీరు దొట్టునట్టుగఁ జే
సెన్. వి. పు. ౬. ౧౯౭.

౫. నిండు; నిండియుండు.

వ...అనఘహిమసలిలములు సెలచలుపదొనలఁ
దొట్టి జలజలన జాలుగొని వెల్లువ లై...వసు.
౨. ౧౧.

వ...వీరావేశంబున రాజద్వారంబునం దొట్టిరి...
పారి. ౪. ౬౬.

౬. చేరు, కూడుకొను.

వ...ఒక్కొక్కపట్టునం దొట్టినతెట్టువలు విలయ
సలిలమధ్యంబునం దేలుసముద్దండఘట్టితమ
ధుకైటభనిశాటమస్తకమస్తిష్కపరంపర నను
కరింప...వరాహ. ౧౦. ౬౨.

౭. కలుగు, పుట్టు.

సీ. పది రెండు నంజలు పరువెత్తి చన లేక దగ
దొట్టి పెదవులు దడుపువారు. పి. శకు.
౩. ౧౦౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అట్టిమహాదారిద్ర్యము,దొట్టిన హరిశర్మ ధృతి
యుఁ దూలక తృష్ణం గొట్టుపడకుండఁగాఁ
దన,పట్టపుటిల్లాలిఁ గష్టపడి పోషించెన్.
హంస. ౨. ౧౫౧.

క. చుట్టాలకుఁ దెల్పడు మదిఁ,దొట్టినకినుకం
దలార్లతోఁ జెప్పదు...శుక. ౧. ౪౫౩.

౮. వ్రాలు, పడిపోవు.

సీ. కరములు దునిసిన మురువు దప్పినవారుఁ
బొట్టలు చీలినఁ దొట్టువారు. భా. రా.
యు. ౧౪౯౪.

౯. నాటు, గ్రుచ్చుకొను.

ఉ. తొట్టినబాణము ల్దొలఁగఁ ద్రోచి ప్రియం
బొదవంగ దోయిటం, బట్టికవోష్ణశోణితము
భ్రామలు దారును గ్రోలి క్రోలి...భా. రా.
యు. ౨౨౧౩.

౧౦. మునుఁగు.

చ. తొడరి చరాచర ప్రతతితో జగ మింతయు
వార్ధిఁ దొట్టిన,ప్పుడు లలితాబ్జపీఠమునఁ బొ
ల్చుచతుర్ముఖుఁ బద్మగర్భుఁ బెం, పడర భజిం
చె దీవు...భార. అర. ౪. ౨౩౮.

స. క్రి. ౧. అవలంబించు, పట్టుకొను; పూను,
వహించు.

గీ. క్రేపు వాపోవఁ బట్టి లంకియకుఁ దార్చి,తో
లవియఁ గొట్టి మెడ నొక్కతుండు గట్టి,
గిడ్డి వెడలించెఁ దలత్రాడు కేలఁ దొట్టి, మారి
వెడలించువసువున మాణవకుఁడు. పాండు.
౫. ౨౪౫.

క. అతులనిరాహారతపో,వ్రతదారుణనియతి నొ
డలు వట్టి నరము లున్నతమై తోఁపఁగ మర
ణే,ప్సితమతి నయ్యబల దొట్టి పెద్దయు నా
ర్తిన్. మార్క. ౮. ౧౩౯.

ఉ...దౌర్మదాంధ్యముం, దొట్టినరావణాసురుని
తో నెడఁబాసి విభీషణాఖ్యుఁ డా,పట్టున
రాముఁ జేరి చిరపటము గట్టికొనండె భా
--

స్కా. భా. ౬. ౨౭.

౨. త్రొక్కు.

చ. పరువులు వెట్టుచుం జిలుకఁ బట్టుచుఁ బు
ష్పాడితి నెన్నఁ దొట్టుచున్. బహు. ౨. ౨౭.

౩. ఎదిరించు, మార్కొను.

ఉ...మేరు వి,ట్టట్టుగ డొల్లు భూవలయ మల్ల
నాడు సురాసురాదులం, దొట్టి జయింపఁ జా
లునృపధూర్జటి కెక్కుడిచిక్కు గల్గు...భా.
రా. అర. ౨. ౭౨.

౪. మొదలుచేసికొను, మొదలుకొను. (ఈయర్థ
మున నిది"తొట్టి"అను క్త్వార్థకరూపముతో
నే యుండును.)

చ. హిమకరుఁ దొట్టి పూరుభరతేశకురు ప్రభృ
పాండుభూపతుల్, క్రమమున వంశక ర్త
లనఁగా మహి నొప్పినయ స్మదీయవం,శమున
...భార. ఆది. ౧. ౧౪.

ఉ. కావలివారిఁ దొట్టి పురిఁ గల్గుజనంబులలో
గాఢని,ద్రావివశత్వ మొందనివిధంబునవా
డొకరుండు లేఁడు...హరి. పూ. ౫. ౧౧౭.

చ. సురపతిఁ దొట్టి దేవతలు శుంభనిశుంభము
ఖోగ్రదానవే,శ్వరులకుఁ బాఱుచుండుదు
సంగరభూముల...మార్క. ౬. ౧౫౦.

జః తొట్టించు, తొట్టిలు, తొట్టుకొను, తొట్టు
తొట్టున.

తొట్టు[2]. వి. ౧. తెట్టువ.

సీ. ఉత్ప్లుతయవసాదికో త్రైమై విలసిల్లుఁ దొ
నాఁ దొట్టు నాఁ దొట్టువ యన. ఆం. భా
౧. ౧౫౭.

౨. తొడుసు, సంబంధము.

క. ఇట్టిగుణంబులు నీ కే,పట్టున సమకూరకుని
వార్థివ చను మీ,తొట్టునఁ బొరలకు
వుడు, దిట్టతనం బుడిగి వసుమతీపతి మ
డెన్. ద్వా. ౫. ౨౭౪. (వ్రాతప్రతి. పా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తొట్టు[3]. వి. మల్లబంధవిశేషము.

వ...కల్లంబును దొట్టును గిల్లియు...నృసింహం బును ననుముప్పదిరెండు విన్నాణంబులనా ణెంబు పరీక్షించి...హంస. ౧. ౨౦౬.

వ...కందనంబునఁ గల్లంబును దొట్టును గిల్లియు బరిపోటును...ప్రబంధ. ౭౮.

తొట్టు[4]. వి. చెఱువుక్రిందిపొలము.

సీ. తొట్టు నాఁ దీఁగ నాఁ దోఁచుచుండుఁ దటాకపూర్వదేశాభిధ...ఆం.భా.౧.౧౬౩

తొట్టుకొను. స. క్రి. (తొట్టు[1]+కొను-స్వార్థమున.) ౧. ఆక్రమించుకొను.

మ. హరివాక్యంబుఁ దలంచి సాత్యకి పురంబా త్మీయరక్షాస్థితిం, జరగక్ వైరులు దొట్టుకొన్నపిదపం జక్రాయుధుం డెన్నునే, వరవీరావలిలోనఁ దమ్ముఁ డను నేవాఁడ్రచ్చి నన్ను ...ఉ. హరి. ౩. ౩౭.

సీ. కురుమెకంబుల నట్లు కూల్చినకీడు దాఁ దొలఁగునె శిరసులఁ దొట్టుకొనక. కవిరా. ౨. ౧౨౧.

౨. ఒకదాని నొకటి యొరసికొను.

క. సురబలము నసురబలముక్..., నెరసి యెడ తొట్టుకొని కెడ్బెర సైపీనుఁగులు పసువుఁ బ్రేకయుఁ బడియెక్. కు. సం. ౧౧. ౬౯౪.

అ. క్రి. ౧. వ్యాపించు.

క. తొట్టుకొని సంజకెంపు ప్పట్టున రవిఁ బాసి సితగభస్తి నెదురుకో, నట్టెసిరివచ్చుటకునై, పట్టిన కెంబట్టుదిడ్డిపాలకిఁ బోలెక్. రామా. ౨. ౯౨.

౨. అధికమగు, ఎక్కువగు.

ఉ. గుట్టసియాడ గబ్బిచనుగుట్టలపైఁ బులకాంకురావళుల్, తెట్టువ గట్టఁ గోరికలు దేటలువెట్టఁగ వేడుక ల్మది, న్నొట్టికొనంగ ...విజ. వి. ౧. ౬౧.

గీ. ఒకవిధంబునఁ జతురాస్యునొద్ద కేఁగి,కడుఁ బ్రయత్నంబుతో మ్రొక్కి లిడి ప్రయాస, మునఁ గరంబులు ముకుళించుకొని మొగంబు, లెత్తి దగ దొట్టుకొన వార లిట్టు లనిరి. ఉ. రా. ౫. ౧౧౩.

తొట్టుతొట్టున. వి.(√తొట్టు[1])చుక్కలు మున్నగునవి రాలుటయం దగుధ్వని కనుకరణము.

గీ. తొట్టుతొట్టునఁ దారక ల్పిట్టు డుల్లఁ, బిట్ట దొరఁ శారికట్టడి కు ట్టిపడియె. బహు. ౩.౩

తొట్టున. అవ్య. ద్రు. ఆకస్మికముగా.

వ...అనుచున్నంతలో నొట్టుపెట్టినగతి వాన దొట్టున వెలిసిన...శుక. ౩.౨౬౧.

వి. పడుటయం దగునను కరణము.

క. ఆట్టిహరిపట్టికోలం, దొట్టున యంత్రంబుపడిన దొర లాత్మధరక్, మెట్టిరి...పాంచా. ౨. ౭౧.

తొట్టువ= తెట్టువ.

వ...తొండంబు లెత్తి తిరుగండ్లకరణి సురువడిం దిరుగుచు నొండొంటిం దాఁకుకరులపరిసర ప్రదేశంబునం దొట్టువ గట్టి పొల్లుతోడి యాఢకికణరాసులుం బోలెఁ గానుపించురు ధిరపలలకరంబితాస్తోకకీకసలేశకూటంబులచే ర్పున శూర్పంబులనేర్పున నేర్పరింపుచు ...కళా. ౮.౧౧౦.

సీ. ఉత్ప్లుతయవసాదికోత్తి యై విలసిల్లుఁ దొట్టి నాఁ దొట్టునాఁ దొట్టువ యన. ఆం. భా. ౧. ౧౫౩.

తొట్టె= తొట్టియల. వి. తొట్టియ, ఉయ్యాల.

ఉ. ఓగుణులార యెక్కుఁ డిదె యుయ్యెల తొట్టెల నింక నిత్తతిం, జా గొనరింప నేల యని సంతస మొప్పఁగఁ దల్లి నొక్కదీ వ్యాగమనూనదామమయ మై చెలువొందెడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తొట్టె నుండి వే,వేగమ వీరభద్రప్రభృతివీవ రులతో నొకతొట్టెలోపలన్. చెన్న. ౫. ౩౭౭.

తొట్టెల=తొట్టియల. వి. ఉయ్యాల, డోల.
చ...క్రొందరఁగల్ గదలించుకల్వతో, ట్టెలఁ గుమారుఁ గూఁతును ఘటించి భజించునదీ లలామ కో,మలకుముదాగతాళికులమంజుర వంబున జోల వాడుచున్. వసు. ౩. ౨౪.
('తొట్టిల' శ. ర. పా.)
ఉయ్యలతొట్టెల=ఉయ్యాల.
(చూ. ఉయ్యాలతొట్టె.)
ఉ. ఓగుణులార యెక్కుఁ డిదె యుయ్యెల తొట్టెల నింక నిత్తటిన్, జా గొనరింప నేల ...చెన్న. ౫. ౩౭౭.

తొట్రగిల్లు=తొట్రిల్లు. (√తొట్రు[1].)
సీ. తొట్రిలుట యనంగఁ దొట్రగిల్లుట యన స్థలనసమాఖ్యలై వెలయుచుండు. ఆం.భా. ౧. ౧౪౩.

తొట్రించు. స.క్రి.(√తొట్రు[1])తొట్రిల్లఁజేయు, తడఁబడఁజేయు.
సీ. తొట్రించి గోర్లలోఁ దోడేలు పొచ్చిన ట్లీగబ్బిలేళ్ల వట్టిట్టుసేయు. సారంగ. ౧. ౯౨.

తొట్రిలఁబడు. అ. క్రి. (తొట్రిలన్+పడు) తొట్రుపడు, సంభ్రమించు.
చ...మొగంబున నశ్రులు వెల్లిగొల్పఁ దొ, ట్రిలఁబడు జల్లనం జెదరుడెందము గూడఁ గఁ దెచ్చు నన్నుఁ గే,వలమును ముట్ట నెవ్వ రికి వచ్చు ననున్...భార. విరా.౨.౧౦౪.

తొట్రిలు(ల్లు). అ.క్రి. (√తొట్రు[1]) ౧. తొట్రు పడు, తడఁబడు.
సీ. ఎలుఁగు గద్దదికఁ దొట్రిల నేడ్చు విడు మని ప్రార్థించు మాటఁ గీడ్పాటు దోఁప. భార. విరా. ౪. ౭౦.
మ...ఆ,తనిపజ్జం దగఁ దాను నేఁగెఁ బదప ద్మంబుల్ పొరిం దొట్రిలన్. భార. అర. ౬. ౨౧౯.
మ...లో,చనపద్మంబుల బాష్పధార లెసఁగన్ సంభ్రాంతిఁ బాదద్వయం,బును దొట్రిల్లఁగఁ బాఱె గోపికలు నుద్భూతార్తలై లోఁ జనన్. హరి. పూ. ౫. ౨౪౬.
౨. వ్యాపించు.
ఉ. వట్రువగుబ్బలుం దొగరువాతెఱయుం జిఱు నవ్వువెన్నెలల్,దొట్రిలుముద్దుమోమును... విజ. వి. ౨. ౪౬.
౩. ఛేదిల్లు.
సీ. భగదత్తుగజముపై ఫల్గునుఁ డేసినపటుభల్ల మునఁజేసి పక్షివనిత,కడుపు తొట్రిల్లిన... మార్క. ౧. ౪౬. (శ. ర. పా.)

తొట్రు[1]. వి. స్థలనము.
సీ. జీరుకు నాఁగను జీరుకుపాటు నాఁ దొట్రుపా టనఁగను దొట్రునాఁగ,...స్థలనసమాఖ్యలై వెలయుచుండు. ఆం. భా. ౧. ౧౪౩.
జః తొట్రగిల్లు, తొట్రించు, తొట్రిలఁబడు, తొట్రిలు, తొట్రుకొను, తొట్రుకొల్పు, తొట్రుపడు, తొట్రుపాటు.

తొట్రు[2]. వి. ౧. చిన్నకంప.
(ఇది తొడుపు అనుపదము ననుసరించి కనఁబడు చున్నది.)
ద్వి. ఈతటి శిశువు లో లీడ్చిన వృత్తి, పాలం బుగలిగ నుత్పాతంబుగాదె, మడుపులు పసు లకాల్లడి కుప్పు చటిచె, దొడువుఁదొట్రుసు గడు దూరంబులయ్యె. అ.మ.క.౧.౪౪.౨౩ పం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. తొఱ్ఱి, కోటరము.

గీ...తొట్టి, తొట్రు తొఱ్ఱి తొఱట యనఁ దోఁచుఁ గోటరమ్ము...ఆం. భా. ౨. ౩౭.

తొట్రుకొను. అ. క్రి. (√తొట్రు[1]) ౧. తొట్రుపడు, తడఁబడు.

ద్వి. బాలవీక్షణములో పన్నినవలలొ, యిలఁ జోద్యమంచు నయ్యింతిదృగ్వీధి,తులఁ జిక్కులను బడి యిలఁ దొట్రుకొనుచు. పండితా. పురా. ౧౧౨ పా.

చ. మృదుమధురోక్తి తొట్రుకొన మేలు కనం బడ వెచ్చనూర్పున,మ్మదవతి నాదరించి వసుమంతుఁడు...శుక. ౧. ౯౯.

౨. కలిసియుండు.

గీ. వలపుగాడుపు లూర్పులఁ గలసి వెలయఁ, దుమ్మెదలు గుంతలమ్ములఁ దొట్రుకొనఁగ. పి. శకుం. ౨. ౧౩౪.

తొట్రుకొల్పు. స. క్రి. (√తొట్రుకొను) తడఁబడఁజేయు.

సీ. తొట్రుకొల్పెడుశైబ్యతోడిప్రేమంబున నన పత్యుఁ డయ్యును నన్యభార్యఁ, గైకొనక... భాగ. ౯. ౨౦౬.

తొట్రుప(వ)డు. అ. క్రి. (√తొట్రు[1])తడఁబడు; బాధపడు.

సీ. మాటలాడఁ దలంచి మఱచిపోయెడువారు నడవఁబోవుచుఁ దొట్రుపడెడువారు. కాశీ. ౩. ౮౧.

చ. పొరిఁబొరి మోము బాష్పజలపూరము గ్రమ్మఁగ నూర్ధ్వబాహుఁడై, చరణయుగం బు దొట్రువడ సంభృతశోకత రాజవీథి నె, వ్వరిఁ గని యైన హా మహిత వైభవ...అం చెలుఁగు గద్గదికన్ దగులంగ నేడ్చుచున్. భార. శల్య. ౧. ౬.

క...పాపపుయోగమునఁ దొట్రుపడి రుక్తము లున్. కాశీ. ౭. ౯౦.

చ. ఘనశరవేదనల్ బలియఁగా వనకుంభిని వ్రాలి యున్నయ,మ్మునియుగళంబు దొట్రుపడ ముంచితి నాతలిదండ్రులన్ మహా,ఘనదినిఁ కే మనన్...రాఘవ. ౧. ౨౭.

తొట్రుపాటు. వి.(తొట్రు[1]+పాటు) తడఁబాటు, తొందర.

సీ. బెగడంతకంతకు మిగిలిన నింతికిఁ బదముల నఁట దొట్రుపాటు బెరసె. భార. విరా. ౨. ౧౦౬.

సీ. అతివ భూధవునధరామృతం బానుచోఁ దొప్పవాటెఱ యంటు తొట్రుపాటు. నిర్వ. ౭. ౭౦.

తొట్ల[1]=తొట్టెల. వి. ఉయ్యాల, బిడ్డలు పండుకొనునుయ్యాలతొట్టి.

చ. అలఘుమణిప్రదీపనికరాకర మై తగుసూతికాగృహస్థలమున నూత్నరత్నఖచితం బగు నుయ్యెలతొట్లలోనఁ బొత్తుల వసియించి మించెను సుతుండు...విప్ర. ౧. ౭౪.

శా...బాలున్ వచో,లాలిత్యంబున నిద్ర వొమ్మనుచుఁ దొట్లం బెట్టి జోకొట్టుచున్, లాలోలాలి య టంచు నూఁపుదురు జోలల్పాడి లీలావతుల్. చంద్ర. ౧. ౧౦౬.

తొట్ల[2]. వి. ఓషధివిశేషము?.

సీ. ములుక వ్రాఁకుఁడు నీలి గలిజెరు పాడపత్ర దుస్టుపు పెన్నెరు తొట్ల ప్రుంగ. (చికి. చి. ని.)

తొట్లె(ట్లియ) వి. ఉయ్యాల.

శా. పాలోమీధవనీలఖండఖచితప్రాసాదసీమన్ సము,ద్వేల శ్రీల నుయాలతొట్లెనిడి...శుద్ధాంత వాటీనట,ద్బాలాజాలము జోల వాడు నచలాపాలాగ్రణీ బాలకున్. రా. వి. ౨. ౧౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(చి.ని.పా 'ఉయాలతొట్టైనిడి' ముద్రి.పా.)

తొడ. వి. (త. తొడై.) గజ్జను మోఁకాలికి నడిమిభాగము, ఊరువు, సక్థి.

గీ. తునిసి తొఱఁగినజోదులతొడలు సామ, జములకరములు నొండొంటిచందములు గ, నుంగొనఁగ వింత లగుటను సంగరాంగణం బు రమణీయమును భీషణంబు నయ్యె. భార. శల్య. ౧. ౧౭౬.

గీ. కుఱువు తొడ యన నూరువు పరఁగుచుండు. ఆం. భా. ౨. ౧౩౫.

జ: తొడకొడుకు, తొడపాసెము, తొడపుట్టువు, తొడబెల్లము.

తొడఁకు. అ. క్రి. తొనఁకు, (నీరు మొ.)ఒలుకు. (విష్ణుపాదము) గీ. నిగుడునాయువు తొడఁకని నిండుకుండ. చంద్రా. ౧. ౫౭.

ద్వి. కడుబండ ధూర్తనక్షత్రకునోరు, దొడఁకు ట పాపంబు దుర్మార్గుఁ డితఁడు. ద్వి. హరి శ్చ. ఉ. ౧౩౦౬ పం. (నోరుదొడఁకుట= మాటాడుట అని భావము)

తొడ(ణ)ఁగు. స. క్రి. (క. తొడగు. త. తొడంగు. తు. తొడగుని.) ౧. ప్రారంభించు, ఉపక్రమించు, పూను.

క...నా కేర్పడఁ జెప్పఁ డీ తపం బేఁ, దొడఁ గద ననవుడు...భార. ఆది. ౨. ౧౪౧.

క. కడుఁనుగ్రం బగువ్రత మిది, దొడఁగితి దివ సత్రయంబుతో నిది సెల్లెన్. భార. ఆర. ౭. ౨౦౪.

సీ. తొడఁగినపని చలం బెడపక యతిదుష్క రం బైనఁ గడతేర్చుప్రభువులార. భార. విరా. ౩. ౨౧.

౨. అభ్యసించు, కఱచు.

క. కుడిచినయప్పుడ యోగము, దొడఁగుటయును వలదు...భార. అను. ౪. ౨౦౨.

అ. క్రి. ౧. ప్రారంభము సేయు, మొదలు పెట్టు. (ఇయ్యది యీయర్థమున వేఱొకభావార్థకమున్యంతక్రియ కర్తగాఁ గలిగి దాని ననుసరించియే ప్రయుక్త మగును.)

చ. తడ వగుఁదెంచె జమ్మికిఁ బ్రదక్షిణవృత్తిగఁ దేరు వోవని, మ్మెడ గలుగంగఁ బోయెఁ బసు లిప్పుడ కూడుద మన్న నాతఁడున్, నడపఁ దొడంగుడున్...భార. విరా. ౪. ౧౭౧.

క. కొడుకుం ద్రిలోకవిజయుం, బడయుదు నని ఘోర మగుతపం బొనరింపం, దొడఁగె సుర రాజు...భార. ఆది. ౫. ౧౧౬.

వ...నైషధకావ్యంబు చెప్పం దొణంగితి. నైష. ౧. ౧౮.

గీ. మొనసి చీమలగమి గ్రుద్దు మోవఁ దొణఁగె. విక్ర. ౪. ౨౭, ౧. ౧౪౭.

౨. యత్నించు, పూనుకొను.

సీ. ఆత్మావలోకన మాచరించెద నని తొడఁగుదు నది యలవడదు నాకు. భార. శాం. ౬. ౫౧౦.

చ...కాలునికోఱ యూఁదఁగాఁ, దొడఁగుట గాదె నాకు భుజదుర్వ్యత సూపఁ గడంగు టె మ్మెయిన్. హరి. ఉ. ౨. ౧౭౬.

ఉ. లీలఁ బరిగ్రహించునొకొ లేక గ్రహింపక పోవునొక్కొ నేఁ, డాళఁగఁ జాల నింతి తనుఁదాన తొడంగినఁ జుల్కనాఁ గదా. బిల్హ. ౨. ౧౭౮.

౩. మొదలుకొను.

వ...పాడ్యమిం దొడంగి పదునాలుగుదివసంబు లొక్కొక్కగింజ గాఁ దూమెఁడుపడ్లు సమకూర్చి...భార. ఆర. ౬. ౧౧౫.

ఉ. ఆదరణీయసారవివిధార్థగతిస్ఫురణంబుగల్గి యష్టాదశపర్వనిర్వహణసంభృత మై పెను పొందియుండ నం, దాదిఁ దొడంగి మూఁడు కృతు లాంధ్రకవిత్వవిశారదుండు విద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భట్టు దక్షతక్. భార. విరా. ౧. ౬, శాం. ౧. ౮.

తొడఁగూడుఁబోతు. వి. ఒకవిధ మగుశివమత స్థుఁడు.

ద్వి. తొడఁగూడుఁబోతుల జడలతమ్మళ్ల... బస. పు.౧౩౪పా.౧౪పం.(ప్రాత ప్రతిపా.)

తొడకు. వి. పశువులకువచ్చువాతరోగవిశేషము.

ద్వి. తలయేరు తొడకు వాతము కల్లవాఁపు,నల దొబ్బ తెవులును నాదిగా నెన్న,గలపసరా లరోగములకు నెల్ల. నవనాథ. ౧. ౪౧ పా. ౫ పం.

తొడకొడుకు. వి. (తొడ + కొడుకు)-విష్ణునితొడనుండి పుట్టినవాఁడు- వైశ్యుఁడు, కోమటి.

సీ. తొడకొడుకు తిగవంగడపుఁబుట్టువు బచ్చు శెరి కోమటి యన నూరుజన్ముఁడు... వేంక. మాన. ౨౫.

ఇట్లే: నల్లనయ్యతొడబిడ్డ, మొ.

గీ...బచ్చు శెరి,మూఁడవకొలంబతఁడు నాఁడె కాఁడు నల్లనయ్యతొడబిడ్డ కోమటి నాఁ దనర్చు, వైశ్యనామంబులు ... సాం. ని. మాన. ౨.

తొడత్రొక్కుడు. వి. (తొక్కుడు + తొక్కుడు.) మిక్కిలిసమ్మర్దము; సమ్మర్దము.

(వ్యవ) మాధవస్వామిరథోత్సవమునకు జనము తొడతొక్కుడుగా వచ్చినారు.

ఆతొడతొక్కుడులో పిల్లలు తప్పిపోదురు.

తొడపాసెము. వి. (√తొడ.)-పరిహాసమునకు పాసె మని యూరించుచు పిల్లలను-తొడను నలుపుట.

(వ్యవ) అల్లరిచేసినచో తొడపాసెము పెట్టెదను.

తొడపుట్టువు. వి. (√తొడ) వైశ్యుఁడు,ఊరు జుఁడు. (శ. ర.)

తొడబెల్లము. వి. (√తొడ) తొడగిల్లుట. (శ. ర.)

తొడయు. స. క్రి. ౧. నిమురు, తడవు.

సీ. ఉత్తర యిక్కుమారోత్తమునురమున వ్రాలి ...పాణి. గీ. పల్లవంబున నానన మల్ల నల్లఁ, దొడయుచును నిన్నుఁ జూచుచుఁ దోడుతోడఁ, బొడము పెల్లునఁ గన్నీరు దుడిచికొనుచు, నలఁత పెను వెల్లిఁ దేలెడు నంబు జాక్షి. భార. స్త్రీ. ౨. ౪౪.

౨. కడుగు, ప్రక్షాళనముసేయు.

వ...పెండ్లిదొరలు సుగంధోదకంబులఁ జేతులు దొడసి వార్చి...నైష. ౬. ౧౪౦.

శా...హస్తి...,కేల నీరము దెచ్చి మై దొడసి భక్తిం బూజనల్ సేయఁగన్. కాశీ. ౪. ౧౪౩.

౩. (త. తొడై)తుడుచు.

సీ. ఆస్యంబు దొడసి నీ రంసుల శిరమునఁ బ్రోక్షించి యోష్ఠసంపుటము ముట్టి. భార. అను. ౩. ౨౮౪.

సీ. స్నాతుఁడై మెయినీరు చేతఁ దొడయఁ జీర నార్ప వెండ్రుకలు విదుర్పఁ గూడదు ...మార్క. ౩.౨౩౬.భార.విరా.౫. ౩౮౬

౪. (కడుగునపుడు)ప్రాము,తోము.

గీ. కసటు వోవఁ దొడసి కడిగినకనకంపుఁ,బ్రతిమవోలె నొప్పు నతివ మేను. కు. సం. ౪. ౧౧౨.

౫. నశింపఁజేయు.

స్రగ్ధర. తుంచెం జక్కాడెం మోఁదెం దొడసెఁ గెడపె నత్యుద్ధతిం గాశికాపూః,పంచక్రోశీధరిత్రీపరిధిఁ గరిసురప్రత్యనీకుండు హేలా, సంచారోదగ్రభంగిన్ జలముకొని వనీసౌధ వప్రాటవీథుల్. కాశీ. ౬. ౧౪౬.

తొడరాడు. స. క్రి. (√తొడరు) ధిక్కరించు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అతిశయించు, మించు.

చ. నిజవదనామితాసితమణీకచనీలవిభాతి వాహన,ద్విజవరబర్హి బర్హవితతిం దొడరాడి... కు.సం. ౧౨. ౯౮౩.(ఇట ఔపమ్యవాచకము.)

తొడరిక. వి. (√తొడరు) అనుసరణము. (శ.ర.)

తొడరు. స. క్రి. ౧. ఎదిరించు.

సీ. బకదైత్యుఁ దొడరి యాభంగి రూపఱఁ జేసి రక్షించె నేకచక్రాపురంబు. భార. విరా. ౧. ౭౪.

క. మనవీటన కా దయ్యర్జుననకు సరివింటివానిఁ జూడఁగ లోకం,బున నెందు లేమి తెల్లం బనుమానము లేదు దొడర నగునే వానిన్. భార. ఉద్యో. ౨. ౧౬౭.

౨. ధిక్కరించు, మించు.

చ...దేహరుచివైభవము ల్నవమల్లికారుచిం,దొడర నితంబచక్రములతో నెఱివాలు మెఱుంగుఁగొప్పుఁ బెన్జడ మెరయంగఁ దద్గగనశైవలినిం దగఁ జొచ్చి రందఱున్. పారి. ౪. ౨౮. (ఇట ఔపమ్యవాచకము.)

౩. అవలంబించు.

సీ...తోఁచిన యప్పుడవియు. గీ.దురితకరముల యనివానిఁ దొడరకుండ,వలదె లెస్సగ నెఱిఁగిన వచ్చుఁ దొలఁగ.భార. శాం.౫. ౬౦౦.

సీ...భరద్వాజమునీంద్రునితనయు లేమ్వ, రుత్తమయోగధర్మోపేతు లై యుండి దుశ్చరిత్రముకొంత దొడరుటయును,భ్రంశంబుఁ బొంది...హరి. పూ. ౨. ౧౫౨.

౪. పూను, ధరించు.

గీ. చక్రవర్తిరూపంబులఁ జక్రధరుఁడు, తొడరి త్రేతాయుగంబున దుష్టశిక్ష,ణంబు గావించి శిష్టలోకంబు నెల్ల, లీల ధర్మంబు మెఱయఁ బాలించు చుండు. వి. పు. ౪. ౬౧.

౫. పట్టుకొను.

ఆ...స్రుతులు, నపహరించె నొకహయగ్రీవుఁ డను దైత్య,భటుఁడు దొంగఁ దొడరఁ బరుల వశమె. భాగ. ౮. ౭౧౪.

౬. ప్రాపించు, పొందు.

వ. ఇప్పగిది ననిచి రాముఁడు కడ లేనిసిరులు దొడరి కడలికడగాఁ గలపుడమి తడ వేలె ...యయా. ౩. ౩౯.

క...అనిశము నామీఁదితలఁపునందును నవధా, ననిరూఢు లగుట మే లెం,దును నేదురిత ములు మిమ్ముఁ దొడరక యుండన్. హరి. ఉ. ౯. ౧౪౯.శివ. సా.౨౧౯.

౭. (రతియందు) పొందు, కూడు.

క. జననిం దొడరినపాపా,త్ముని గొబ్బునఁ బట్టి తెచ్చి తునిమింపఁ దగున్. సారంగ. ౨. ౨౪౧.

౮. అనుసరించు.

సీ. కడఁగి జన్నపుఁదిండ్లు దొడరఁ ద్రిమ్మరు ప్రోడ కుఱ్ఱలగమితోడఁ గూడి యాడు. నీలా. ౧. ౭౭.

గీ. చచ్చిపోయినవారికై చాల వగల, దుఃఖపడు దురు మఱునాఁడు దొడరి చనరొ,తాము... కువల. ౧. ౮౦.

అ. క్రి. ౧. ఎదిరించు, మార్కొను, ప్రతిఘటించు.

క. కడునధికుతోడఁ దొడరినఁ,బొడిచిన నొడిచినను బురుషపురుష.గుణం బేర్పడుఁ గాక హీను నొడుచుట,కడిఁదియె...భార.సభా. ౧. ౧౨౩.

గీ. దుర్ముఖుఁడు సహదేవునితోడఁ దొడరి,మెఱుఁగువాలమ్ము లేసిన నుఱక యాతఁ, డన్నియును మగిడించి...భార. భీష్మ. ౧.౨౫౪.

౨. లొట్రుపడు.

సీ. కడు నిద్రఁ గానక తొడరుచు వడిఁ గొని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నడపంగ నేరక తడయు చున్న, నెఱిఁగి...
భార. ఆది ౬. ౧౬౦.

చ. తడిసినయేకవస్త్రపరిధానముతోడ విముక్త
కేశి యై, తొడరుచు దుఃఖభావమున ద్రోవది
వోయె...భార. సభా. ౨. ౩౦౪.

3. ఉద్యమించు, పూను.

సీ. కురువృద్ధు నిర్మలచిత్తు గాంగేయుఁ జం
పి రాజ్యము సేయ సమ్మతించి, తొడరినపాం
డుపుత్రులకును దైవంబుఁ దో డయ్యె...
భార. భీష్మ. ౧. ౬౦.

గీ. కృష్ణసారథికం బగుజిష్ణురథము, దొడరి నీ
వెందుఁ జొచ్చినఁ దోన చొచ్చు. భార.
ఉద్యో. ౪. ౨౦౩. భా. రా. సుం. ౧౩.

౪. కలుగు, సంభవించు.

క. ఆలం గాచెద వక్కట, త్రైలోక్యముఁ జే
ర్చిఁ గావఁ దగువాఁడవు నీ,మూలం బెఱుఁ
గమి వెఱఁ గడుఁ, దూలెద మి ట్లేమితప్పు
దొడరునో యనుచుక్. హరి.పూ. ౪.౨౩౬.

చ. కడఁగి కుమారు పేరురము గబ్బును నుబ్బును
దొంగలింపఁగాఁ, బొడిచె...అమ్మహాపురుషు
డెందము గావున నం దొకింతయుక్, దొడర
దు నొప్పి గంటియును దోఁపదు తోలును
స్రగ్గ దేమియుక్. నృసిం. ౪. ౧౧౪. శివ.
సా. ౨౫౫.

౫. సక్తమగు, లగ్నమగు.

క. అరయఁగ విషయము లెంతయు, దురంతము
లు వానియందుఁ దొడరినఁ జేటుం, బొరయు
దురు దొడర కున్నం,బరమపదవి యమ్మహాను
భావులకు నగుక్. భార. శాం. ౪. ౩౧౦.

జః తొడరాడు, తొడరిక, తొడరుచు.

తొడరుచు. అ. క్రి. (√తొడరు) యత్నించు.

క. ఊరక యుండక పలువుర,తో రవ మెసఁగం
గఁ బలుకఁ దొడరుపక మదిం, జేరువ గలనా
గరకులుఁ, దారుఁ గలసి పలుక వలయు ధర
ణీశుకడక్. భార. విరా. ౧. ౧౨౪.

తొడరువు. విశ. మొదటి.

ద్వి. తొడలపై నున్నయాతొడరువుకొడుకుఁ,
దొడిఁబడఁ గడఁబడఁ ద్రోసి యగ్రమున.
ద్వి. భాగ. ౪ స్కం. (శ. ర. పా.)

వి. యత్నము.

క...నమ్మఁ గలుగుసత్పురుషుల నిడఁ దగుఁ గు
డుపు ని,దుర మొద లగులోనిపనులతొడరు
వు లరయక్. భార. ఆశ్ర. ౧. ౫౪.

ఆ. దైవ మిట్లు గలఁచునే వీరి మదిమది,నుండి
ఘోర మైనయుద్ధమునకుఁ, దొడర వలయు
నట్టితొడరువు కావించి,కొనిరి చీకురాజు
కొడుకు లేచి. భార. శల్య. ౧. ౩౪౯.
(శ. ర. పా.)

తొడవు=తొడుగు. వి. (√తొడు) ఆభరణము.

గీ. ధరణి నెత్తుటఁ దోఁగి యాభరణకాయ,
శస్త్రఖండజాలంబులఁ జాల నొప్పెఁ, బలుచ
గాకుండఁ గుంకుమ మలఁది పెక్కుఁ,దెఱఁ
గుతొడవులు దొడిగినతెఱవవోలె. భార.
భీష్మ. ౩. ౧౬౨.

సీ. కస్తూరి యలఁదవా కస్తూరికాగంధి తొడవు
లు తొడువవా తొడవు తొడవ. భాగ. ౧.
౨౬౭.

సీ. అడరు భూషణసంజ్ఞ తొడగు తొడవు మి
న్నసా మ్మనంగను...ఆం. భా. ౨. ౧౪౪.
భార. విరా. ౨. ౧౯౦.

తొడి[1]. వి. (√తొడు. త. తొడి=మురుగు; ఉం
గరము.) ౧. భూషణము.

క. విడువఁ దగు సతి చలించిన, విడువంగా రాదు
ప్రాణవిభుఁ గులసతికిక్, బడఁతికిఁ బతిభక్తి
కదా, తొడి వాయఁగఁ జన్నె వికచతోయజ
నేత్రా. రుక్మా. ౪. ౧౧౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. కట్టు, మొ. వానికి వేయునుంగరము,పొన్ను. (ప్రా.)

తొడి². వి. (త. తొడిప్పు) త్వర,సంభ్రమము. (దీనియామ్రేడితరూపము "తొడితొడి")

శా...కంసుఁడు దొడికా హింసించె నీయన్న లన్. భాగ. ౧౦ పూ. ౧౨౪.

ద్వి. చెడితిమి కరుణ రక్షింపవే యనియుఁ,దొడి వేఁడి వేదసూక్తులఁ బ్రస్తుతింప. పండితా. వాద.౨౩౨ పా.

క. తొడితొడిఁ గంసుఁడు దేవకి, కొడుకుల నార్వుర వధింప... భాగ. ౧౦ పూ. ౫౭.

క. కడ లెడల సురలు నసురలుఁ, దొడితొడి ఫణిఫణముమొదలుఁ దుదియును డిగువన్. భాగ. ౮. ౨౧౧.

విశే. తడఁబడునది.

ద్వి.తురగంబు గూలుచోఁ దొడికాళ్లు పడుచు, నరుగ నోపక దీను లైనరాహుతులు. ద్వి. భార. విరా. ౧. ౧౭ పా.

జః తొడిఁబడు.

తొడిఁబడు. అ. క్రి. (తొడి² + పడు.) ౧. తొట్రుపడు.

చ. నడు మసదు...అడు గిడుచోటఁ గా ౖలెమ లినంతన కానుకు బంద మయ్యెడుం, దొడిఁ బడఁజేయు మావలన దోసము లే దని చెప్ప డాసెనాఁ, గడుబెడఁగొందు గౌరి తెలిగన్ను లుఁబీనుల డాసి దేసియై. కు. సం. ౮. ౧౬.

చ...నీ,వదనసరోజసౌరభ మవారణ నన్నును గ్రోల నిమ్ము ౖబెట్టిదుఁ డగుకాముతూపులఁ దొడింబడ కుండఁగఁ గావు మి త్తఱిన్. భార.విరా. ౨. ౧౨౧.

౨. తొందరపడు.

వ. ఇతండ నిక్కపునలకూబరుం డనియు యుద్ధంబున జయాపజయంబు లెంచినట్లు రావు తొడింబడ నితని కొక్కటి యయ్యెనేని యే నేమి యగుదాన...కళా. 3. ౨౫౨.

క.రాసుతుఁ డని తొడిఁబడఁ దెగి,గాసిని బెట్ట కడిమిఁ గాచుక మన మీ,మోసాల నున్న నెక్కడ,మోసా లానో యటంచు మించినభీతిన్. సారంగ. 3. 3౪.

3. చలించు.

ఉ...వేఁడియూర్పుఁ దగఁ బుచ్చి తొడింబడి కొంతసేపు వే, ల్వెక్కునభంగి నుండి...భా. రా. అయో. ౯౯. (శ. ర. పా.)

క. నందనవనవాసము తన,డెందముఁ గుందింపఁ గాఁ దొడింబడి తానున్, నందనవనవాసము విభుఁ, డొందె రఘూత్తముని బాసి యుండం గలఁడే. రామా. ౫. ౮౧. (శ. ర. పా.)

౪. చిందు, చెదరు.

క. వడ్డింపఁగ నెంగిలి దొడిఁ,బడ్డ వెసన్ వంట కంబు పాయ నిడఁ దగున్. విజ్ఞా. ఆచా. ౭౮. (శ. ర. పా.)

ద్వి. దొరకినధన మెల్లఁ దొడిఁబడకుండ,నరవీస మాదిగా నప్పుడే కొనుచు. ద్వి. హరిశ్చ. పూ. ౧౬౮౯ పం.

౫. (ఇటునటు) పర్వు, వ్యాపించు.

క. తొడగినతొడవులదీప్తులు, తొడిఁబడి చీకట్లు దూలఁదూలఁగఁ దనమైఁ, దొడరిన హస్తము సోఁకినఁ, బడఁతుక మేల్కాంచి చూచి భయకంపిత యై. నా. పంచ. 3. ౧౮౪.

౬. శీఘ్రముగాపోవు.

క. వడి ప్రాను విఱిచి మీఁదికిఁ,బడఁ దివుచుకొనంగఁ దలఁచుపాలసుభంగిన్,కడుఁ బోరి రాముబారికిఁ, దొడిఁబడఁ జూచెద వి దేల దుర్గతి పుట్టెన్. మై. ౧. ౧౫౪.

క. పుడమిఁ గలద్విజుల నయ్యై,యెడ నదులం గ్రుంకఁ జూచి ధే ద్విజరాజున్, దొడిఁబడి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యధికతకై యు,క్కడలిం గ్రుంకెద నటన్న
గతి శశి గ్రుంకెఁ. ఇందు. ४. ౬౭.

తొడికించు. స. క్రి. (√తొడుకు¹) పట్టుకొను నట్లు చేయు.

ద్వి. దుష్టోరగమునఁ దొడికింత మనుచు. బస. పు. ౬. ४౨3 పం.

తొడికి(డ్కి)పట్టు. స. క్రి. (√తొడుకు¹) ఒడిసి పట్టు.

సీ. నడు మింత యని కేలఁ దొడికిపట్టిన ధాతయం
గుళిరేఖ లబ్జాస్యవళులు. నైష. ౨. ౧౫.

సీ. బలభేదికరి తొడ్కి పట్టఁ జే సాఁచుడు శివ
సూతి వెనఁచి చే సేతఁ బట్టి. కు. సం. ౧౦. ४3౧.

తొడికిలు. స. క్రి. (√తొడుకు¹. క. తుడి=దొం గిలించు) ఒడిసిపట్టుకొను, లాగుకొను; దొంగి లించు.

చ. తడయక మందు తైలపరితప్తకటాహము కేలు
దామరం, దొడికిలి పట్టి రాహువు విధుం గబ
ళించినరీతిఁ జూప...సుధన్వుఁడు సాచ్చె
బిట్టుగా, నుడికెడినూనెతొట్టి బలియుర్
హరిదాసులు సత్యసంపదన్. జై. భా. ४. ౧33.

ద్వి. పడుచు పాపము చేసి మృడునొగిరములు,
దొడికిలి తినె శివద్రోహి వీఁ డనుచు. బస. పు. ४. ४౭౯ పం.

తొడిగికొను. స. క్రి. (√తొడుగు¹) ధరించు.

చ...వెసఁ బాదుకల్ దొడిగికొంచు వియచ్చ
రవాహినీకన, త్కనకసరోజగంధవహకౌతుకుఁ
డై వినువీథి కేఁగుచున్. విక్ర. ౨. ౧౨.

తొడితెచ్చు = తోడితెచ్చు. స. క్రి. వెంటఁదీసికొని వచ్చు.

క. తడవం బోయినదైత్యులు, పొడగని యూ
ర్వశి తొలంగి పోనేల నినుం, దొడితెమ్మనె
మారా జదె, బడిబడి వచ్చెదరు వేగ పనివిను
మనినన్. ఉ. హరి. ౧. ౫౫.

ఉ...రాముఁడు...మహర్షులం గదియఁ బోయి
నమస్కృతు లాచరించి భ, క్తిం గరముల్
మొగిడ్చి తొడితెచ్చి సభాంతరరత్నవేది
కన్. ఉ. రా. ౧. ౧४౧.

తొడిమ. వి. ఆకు పూవు మొదలగువానితొల నుం డెడుకాఁడ, వృంతము.

ఆ...పక్వఫలము దొడిమఁ బాయు, పగిది గుణ
చయంబుఁ బాసి యక్ష, యంబు నచలమును
నిరామయంబును నగు, పదముఁ జెందు శుద్ధ
భావ మెసఁగ. భార. అను. 3. 3౧౨.

సీ. పువ్వులతొడిమలు పుచ్చు నయంబున...కు. సం. ౫. ౬౧౨.

సీ. తొడిమ నా వృంతంబు దోఁచు...ఆం. భా. ౨. 3౯.

తొడియు. స. క్రి. (క. తొడిసు) -బాణాదులు- గుచ్చుకొను, నాఁటు.

క. పుచ్చినకన్నులు గ్రమ్మఱ, వచ్చును దేహంబు
తొడిసి వ్రస్సినపుండుం, జెచ్చెరఁ దేఱును భ
క్తుల, కచ్చెరువుగ శివునిమహిమ నతిశీఘ్రము
నన్. శివ. సా. ౧౨౭.

తొడివెంద. వి. ఫలవృక్షవిశేషము.

సీ...కలివె, పంకులుఁ దొడివెందపండ్లుఁ దుమ్మికి
పండ్లు జానపండులు గంగరేనుపండ్లు. కాశీ. ౬. ౬౯.

తొడు=తొడుగు¹. స. క్రి. (త. తొడు.)
౧. (భూషణము, కవచము, చెప్పులు, మొ.) ధరించు.

చ. పొలుపుగఁ బూసి కట్టి తొడి భూరివిభూతి
ప్రకాశితంబుగాఁ, గలయఁగఁ దత్పురీజనులు
...భార. ఆది. ౭. ౧౭४.

క...దృష్టద్యుమ్నుని, మాయించియకాని తొ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డినములు వే నూడ్వక౯. భార.కర్ణ.౨. ౧౩.
గీ. ప్రీతి మంచంబుపై నుండి పీటనుండి,చెప్వ పావలు దొడి తలచీర చుట్టి, నవ్వు చును మా టలాడుచు నడిచి నడిచి, వంగి శయనించి నిలుచుండి వార్వఁ జనదు.విజ్ఞా.ఆచా.౫౩.
౨. (బాణము) సంధించు, కూర్చు.
చ...ఉజ్వలం, బగునొక నారసంబు దొడి యా తఁ డుదగ్రత ఫాలకుంభసం,ధిగతము గాఁగ నేయ...భార. భీష్మ. ౨. ౨౦౯.
ద్వి. పక్షికిఁ దొడ నేల పాశుపతంబు. బస. పు. ౪. ౨౦౩ పం.
౪. పట్ట.
సీ...తొడు పట్టు తోలం చెక్క...గీ. అంట త్వగాఖ్య యౌ...ఆం. భా. ౨. ౩౪.
జః తొడుకొను².

తోడుకు¹. స. క్రి. ౧. గ్రహించు, పట్టుకొను.
సీ. ప్రాణసఖీరత్న మరగొను గెంగేలఁ దొడికి యొయ్యొయ్యన నడువు మనఁగ. రాజ. చ. ౬. ౧౪౧.
ఉ.గండొకపందితోఁక దొడుకం గడకం బెఱ పంది గొట్టెన౯. కకు. ౪. ౭౧.
౨. ఆను, త్రావు.
సీ. అందంద పక్షోరుహములు దింపులువోవఁ దొడుక నిచ్చుట యెట్లు దుగ్ధరసము. కాశీ. ౪. ౧౭.
మ. బళిరా తేరకుఁ దేర దక్కె నిటు లీబంగా రకుం డంచుఁ జం,కలు దాటించుచుఁ గెం పుమోవి దొడుకంగా...తివురు మిత్రద్రోహి మోహాంధత౯. పాండు. ౩. ౬౪.
అ. క్రి. తెగు, సాహసించు.
ద్వి. తొడవులకై తెంపుతోఁ బ్రాణములకుఁ, దొడికి ముద్దులపట్టి దునుమ నేమిటికి. ద్వి. హరిశ్చ. ఉ. ౨౩౫౨ పం.
జః తొడికించు, తొడికిపట్టు, తొడికిలు.

తోడుకు². వి. ౧. గోమహిష్యాదులు, పశువులు.
సీ. గోమహిష్యాదులనామము ల్పసి తొట్టులొ డుకు పసరము నా నడరు...ఆం. భా. ౨. ౨౬౧.
౨. ఆవు.
గీ. అప్పు డెకిమీఁడు తఱిచెయ్వు లమరఁ దీర్చి, పేదలకు నేలనేలుపుఁ బెద్దలకును, బొసఁగ రొక్కఁబుఁ దొడవులుఁ బుట్టములును, దొ డుకులు నొసంగి పదిరేలు గడపి యంత. అచ్చ. రా. బాల. ౭౪.
గీ. పుడమి యీనిన తెఱఁగున నడరునతని, తొ డుకులం దెల్లమిగ లెక్కయిడఁగ రాదు. నీలా. ౧. ౫౦.
చ...నోరులేనియీ, తొడుకుల బంటుఁబైద వి డఁ ద్రోవక ప్రోవఁగ నెందు నీక హ్మాల్పడినది కర్ణునాదలనె భారతసంహిత నిల్చు చాడ్పు న౯. పాండు. ౩. ౩౭.
౩. వృషభము.
(నారాయణాస్త్రపాశుపతాస్త్రములు)
సీ. లేలిహానారి దువాళించె నొక్కటి తొడుకు బాబా నెక్కె తోలె నొకటి. వరాహ.౫. ౧౧౭.
సీ.తొడుకుబాబా రౌతు జడఁదాల్పుచావఁడనిపూ వేలతాంగులపుట్టినిల్లు. చంద్ర. ౨. ౧౪౪.
మ. పడవాలు౯ ఘటియింపు మంచు దివిజుల్ ప్రార్థింప నవ్వాహ్నియుం, దొడుకుంద త్తడిజో దుతేజము సుధాంధోవాహినీవారి న్నిల్పుడు ...చం. రా. ౩. ౬.
౪. దొంగ మేఁత.
క. తొడుకు దినఁ బోవుపసరము,బడిఁ బోకుమ ...భోజరా. ౬. ౩౪.

తోడుకొను¹=తొడుకొను. స. క్రి. తీసికొను వెంటఁబెట్టుకొను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. కడు వెర వేది నేఁ బ్రథమగర్భవతిన్ సతిఁ
బుట్టినింటికిన్, దోడుకొని వచ్చుచో నిచట
దుస్సహమైన ప్రసూతివేదనం, బడియెను...
విక్ర. ౭. ౩౫.

తోడుకొను². స. క్రి. (తోడు+కొను) తోడుగు
కొను.

క. పావలుఁ జెప్పులుఁ దోడుకొని, దేవ శివాల
యములోనఁ ద్రిమ్మరుపాపుల్. శివ. సా. ౯౯౧

తోడుగలు=తోడుగట్టు. వి. ముండ్లకంపమోపు.

క. తడి కంట నెపుడుఁ దలఁగక, కడి దలు
గఁగ వడియుఁ దటిఁగి గాసిన్ బుడమిన్,
బడినఁ గన రాక మంచపుఁ, దోడుగలు లైర
ట్టై రుజలతో నేమందున్. మనుచ. ౩.
౧౩౧.

తోడుగట్టు=తోడుగలు. వి. కంటకాదిభారము.

సీ...తోడుగట్టు యీడికె సుడుము కంప, యనఁ
దనర్చును గంటకాదిభారము...ఆం. భా.
౨. ౩౭.

తోడుగు¹(డ్గు)=తోడువు, తోడు. స. క్రి.
(త. తోడు.) ౧. (వింటబాణము) సంధించు,
కూర్చు.

వ...ఏడుబాణంబు లొక్కటఁ దొడిగి...భార.
ఆది. ౫. ౨౩౪.

క...విద్యుచ్చలచాపజ్యఁ దూపుఁ దొడుగుచుఁ
బలికెన్. ఆము. ౩. ౨౭.

క. తొడిగితి నేసెద నిఁక నీ,యడుగులు దెగి
పడ నమోఘ మస్మద్బాణం, బెడయ న్నేర
దు నావుడు, వడవడ జమదగ్నిసూతి వడఁకె
న్భీతిన్. రామా. ౪. ౧౪౧.

౨. ప్రయోగించు.

క...మారుతి గవియుటయు మెఱసి మార్కొని
కురుధా,త్రీరమణుఁ డర్ధచంద్రా,కారశరము
దొడిగి ధనువు గ్రక్కునఁ దునిమెన్. భార.
భీష్మ. ౩. ౧౨౫.

సీ. అక్కుమారుఁడు దరహాసాభిరాముఁ డై
భల్ల మొక్కటి దొడ్గి విల్లు దునిమి. భార.
భీష్మ. ౧. ౨౫౪.

క. వారుణవాయవ్యంబుల, నారాయణుమీఁదఁ
దొడిగె నరపతి శరముల్, ఘోరశిఖి వజ్ర
శరవి,స్ఫారతఁ దద్దీప్తి మాపెఁ బద్మేక్షణుఁ
డున్. హరి. ఉ. ౧. ౧౫౩.

౩. (భూషణము, కవచము, చెప్పులు, మొ.)
ధరించు.

సీ. గురుపత్ని నేఁడ యక్కుండలంబులు తొ
డ్గుదివస మీదివస మతిక్రమింప. భార.
ఆది. ౧. ౧౧౪.

గీ. పలుచ గాకుండఁ గుంకుమ మలఁది పెక్కుఁ,
దెఱఁగుతోడవులు దొడిగిన తెఱవవోలె. భా
ర. భీష్మ. ౩. ౧౩౨.

చ. తొడిగినజోడు వ్రయ్యలుగఁ దోరపునెత్తు
టఁ దోఁగి...ఉ. రా. ౨. ౧౦౧.

సీ. మొకరిమట్టెలమ్రోఁత ముద్దు చూపఁగ రంభ
కనకంపుగొడుగుపాగాలు దొడిగె. హర.
౮. ౧౩౮.

౪. (భూషణములు, మొ) ధరింపఁజేయు.

వ...ఒక్కకలకంఠకంఠి కంఠకందళికయందుఁగం
టసరి దొడిగె. నైష. ౩. ౪౪.

క...భామామణి యొర్తు పైఁడిపావలు దొడి
గెన్. పారి. ౨. ౮.

గీ. నీలకు మణీవిభూషణపాళిఁ దొడిగి. ఉ.
రా. ౧. ౪౪.

అ. క్రి. అంకురించు. (చూ. తోడువు. అ. క్రి.)

వి. (త. తొడై) ౧. ఆభరణము.

ఉ. కొం తని కాదు చాలఁ దొడుగుల్ మడుఁ
గుల్ గొడుగుల్ సువర్ణముల్, దొంతిగ
నుప్పుతోఁ గలుగుతొమ్మిదియుం గొని యేఁటి
కేఁటి కీ, వంతుగ నాపెచే మననివారలు లేరు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

...ఘటికా. ౧. ౪౩.

క. ఉడురాజముఖుల కెల్లను, దొడు గయ్యెడు నాకుఁ దొడఁగు దొడుగఁగ సేలా, తొడు గులు తొడిగినఁ గొఱఁ తని, యుడురాజో త్తంసుఁ జూడ నొక్కటె వచ్చెన్. వీర. ౩. ౧౪౭.

౨. కవచము.

సీ. తొడుగులు సడలి కుత్తుక లెండి మిక్కిలి వెడరూపు లై పడ్డవీరభటులు. జై. భా. ౨. ౭౫. (శ. ర. పా.)

౩. గవుసెన. (శ. ర.) విండ్లు మొ. వానికప్పు.

౪. చర్మము, పైపొర.

(వ్యవ) వానికి శరీరము కాలి తొడు గూడినది.

౫. బాణము. (శ. ర.)

జః తొడిగికొను, తొడుపు².

తొడుగు²(వు). వి. ముండ్లకంపమోపు.

గీ. కంపతొడు గీడ్చిన ట్లేదు కానఁ జన్న,తెరు వెఱుంగుచు...మనుచ. ౪. ౫౪.

ద్వి. ఈతటి శిశువు టో లీడ్చిన వృష,పాతంబు గలిగె నుత్పాతంబు గాదె,మడువులు పసుల కాల్నడి కుప్పుచఱచె, దొడువుఁ దొట్రును గడు దూరంబు లయ్యె. అ. మ. క. ౧. ౪౪ పా. ౨౩ పం.

తొడుపు¹. వి. ౧. గదాదండము లోనగువానికి వేసెడియినుముమున్నగువానికడియము; పొన్ను.

సీ. అను సనఁ దొడు పన నాందోళికాదిదండా గ్రసంధేయాఖ్య యలరు చుండు. ఆం. భా. ౨. ౨౦౨.

౨. కవచము. (శ. ర.)

౩. చెప్పినది మగల చెప్పుట (శ. ర.)

౪. ఒకానొకకత్తి.

గీ. పాలబుడిగలు వడిసెల ప్రాంతమెట్లు,మలప మందులపొడిబుఱ్ఱి మన్నెముల్లు, తొలుదు ల్లాయి తొడుపును దొడ్డికంప, చుట్టుచవిరె యుఁ గొమరొప్ప సాలయు నతఁడు. హంస. ౨. ౩౫.

జః తొడుపుఁగత్తి.

తొడుపు². స. క్రి. (√తొడుగు¹.త. తుడిసు.) ధరింపఁజేయు.

సీ. నవకుసుమంబుల నానావిధంబులతొడవులు రచియించి తొడిపివేడ్క. కు.సం.౪.౪౭౧.

తొడుపుఁగత్తి. వి. (√తొడుపు¹) చేతికి తగిలిం చికొనుఇనుపతొడుగు గల కత్తి.

సీ.ఎడమచే గొలుసును దొడుపుఁగత్తియుఁ బూ లబిరు దొందుకుడికేలఁ బెద్దకత్తి. శుక. ౩. ౧౫౭.

గీ. తొడుపుఁగత్తులు గుదెలును గడల నొంటి, పోఁకవీడెములమర...బంటరులుగొల్వఁ దల వరిమంటపమున, నధివసించినదండనాయకుని గాంచి. వైజ. ౪. ౬౭. (తొడవుఁగత్తులు. ముద్రి. పా.)

తొడువు¹=తొడుగు, తొడు. స. క్రి. (భూషణ ములు, చెప్పులు, మొ.) ధరించు.

క. కుడువను గట్టను బూయను,దొడువను బోఁ బనుచుఁగాక తొలుత మొన సొరం,గొడుకుం బనుచుట కెవ్వఁడుఁ,గడఁగునె నాయట్టిపాప కర్ముఁడు దక్కన్. భార. ద్రో. ౨. ౧౪౨.

సీ...పదివేవు రుత్తమభూసురులు ... కుడువను గట్టను దొడువఁ బూయ.

ఆ. అనుభవింపఁ గలుగు టది యేమిపురుషా ర్థ, మయ్యా...భార. సభా. ౨. ౧౨౧.

సీ. అడుగుఁదామరదోయిఁ దొడివినబంగారు రవలపావలు ముద్దురవముఁ గులుక. రాజ. చ. ౨. ౧౬౯.

తొడుసు. వి. ౧. బాధ, చిక్కు.

గీ. తండ్రితరమునఁ బెనిమిటితరమునందు, వీస

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మంతయుఁ బుణ్యంబుఁ జేసి యెఱుఁగ, వార్ధకంబున నిం కేల వటితొడఁసు, కృష్ణు దర్శింప కున్న నా కేమి చిక్కు. జై.భా.౨.౧౦౯.
క. మన కెయ్యది కార్యం బా,లని నెమ్మియి నెఱుఁగ వచ్చుఁ దగులంబున నె,మ్మన మరియుఁ జొచ్చె మరుచే, సినయీతొడుసులకు నేమి సేయుదు నింకన్. దశ.కు. ౬. ౧౭౬.
౨. దోషము; విసుగు.
చ...ఆ,సరసులఁ గూడి చారుగతి సద్విలతుల్ భజియింపఁ బాదవి,స్ఫురణ ఘటింపుచుం దొడుసు పుట్టక యుజ్జ్వలధారచే సుధా,హరణము చేయుచున్నకవి నారసి చూడు మరాళగామినీ. వేం. పంచ. ౪. ౧౧౩.
౩. సంబంధము.
ఆ. విష్ణుదేవుచేత వెస మాలి పస మాలి, కడు సుమాలి మొదలితొడుసు మాలి, పొలియ బలిని జేరెఁ బూర్వక్షితికి ముప్పు,లేమి మాల్యవంతుఁ డోమహాత్మ. రామా. ౭. ౭౩.
ఉ. అంచెలు గట్టి కాలితొడు సై చననీవుగదమ్మ ప్రోదిరా,యంచలు...మనుచ. ౫. ౬౧.
తొత్తడి. వి. (√తొత్తు) దాసి.
ద్వి. తొత్తడిసంపద తొలఁగెఁ దక్షణము. బస. పు. ౪. ౪౯౨ పం.
తొత్తటికము. వి. (తొత్తు+టికము) తొత్తుఁదనము. (శ. ర.)
తొత్తు. వి. (త. తొత్తు=బానిస)౧.దాసి, బానిస.
ఉ. తొత్తులువోలె దక్కుదురు దొప్పలు దోరలు ముక్తిభామినుల్. కాశీ. ౨. ౪౯.
గీ. నీవు కౌసల్యదాసివి నే నిఁకేల, వెలఁది తొత్తుకు బడితొత్తు గలదె యెందు. దశా.౭.౩.
౨. వేశ్య, లంజె.
సీ. తల్లిదండ్రులఁ జంపి ధన మెత్తికొనిపోయి చెలఁగి తొత్తులఁ బొత్తుగలయువారు. దశా. ౧౦. ౧౦౫.
క. నాసుద్ది యింత గని మది, దోస మనక తన దుసెట్టి తొత్తుల కేమో, బాస లఁట బండి కం డ్లఁట,చేస న్నఁట విన్నవారు చెప్పిరి నాతోన్. శుక. ౨. ౧౧౩.
సీ. తొత్తతపల్ని గా మత్తుఁ డై వరియించి కొడుకులఁ బదుగురఁ బడసి చాల. భాగ. ౬. ౬౦.
జ: తొత్తడి, తొత్తులమారి.
తొత్తులమారి. విణ.(√తొత్తు)లంజెలయిండ్లకుఁ బోవుస్వభావము గలవాఁడు.
ఉ...వాఁడు రో,తొత్తులమారి యై గృహము ద్రొక్కక యొక్కకదానిఁ బూనికన్,గుత్తకు నంచు నుంచుకొనెఁ గోకలు రూకలు జోక నీయఁగన్. నిరం.౨.౪౭.
తొన[1]=తొల. వి. (చి. ని. శ. ర.)
తొన[2]. విణ. (త-తుణై=రక్షకము) రక్షకము.
గీ. తోడు దొన యైనచుట్టంబు దొరకు బెట్లు. జై. భా. ౧. ౧౦౫.
తొనఁకు=తొలఁకు, తొడఁకు, తలఁకు[3]. అ. క్రి.
౧. (నీరు మొదలగునవి)చెదరు, చిందు;పొంగు.
చ.అని వనకేళి సల్పి లలితాంగు లతాంతలతాంతకోటిలో, వనపవనానుషంగమున వాసనవోవనివానిఁ దేనియల్, దొనఁకనివానిఁ బుప్పొడులు దూలనివాని మదాళిమాలికల్, చెనకనివాని భావభవుసేవకు నేర్పన నేర్పటించుచున్. వసు. ౩. ౧౫౦. (శ. ర. పా-తొనుకు. ముద్రి, చి. ని. పా.)
చ. కడలిగముల్ గడుం దొనఁకి కట్టడికట్టలు దాఁటి పాఱఁగా. అచ్చరా. యు. ౧౬౨.
౨. ఒప్పు.
సీ. జలజాక్షీ కావ్యంబుఁ జదువుచోఁ బాంచాలగతిచోట బాహాటక్రమము దొనఁకు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అని. ౨. ౩౬.

వి. తొట్రుపాటు.

క...ఉల్లంబుల బలు,తొనఁకు సారఁగ ననికిఁ దొలఁగఁ దోలిరి రథముల్. భార. కర్ణ. ౧. ౧౧౦. (శ.ర. పా.)

తొనికి(నికి)సలాడు=తొనఁకు. అ. క్రి. చలించు, తొలఁకు.

ఉ...కాంజడలపట్టునఁ దొన్కిసలాడుచుండు పెన్,జాలు పిఱుంద గబ్బిపాడచాఱలవన్నె మెకంబుతోలు డా,కాలున గండపెండెపు చొకారపుడాలును గల్గుసామికిన్. చెన్న. ౩. ౩౮.

తొన్నుండు=తెన్నుండు. అ. క్రి. శయనించు. (శ. ర. చి. ని.)

తొపారము=లోపారము.

క. దోరములు దీసి చెంచులు, మోరల వేసినదొపారములు వీడి ... భానుమద్విజయము. ౨ ఆ. (శ. ర.)

తొప్ప. విణ. ౧. అధికము,మిక్కిలి. (చూ. తొప్పలు దోరలు.)

౨. ఎఱుపురంగు గలది, ఎఱ్ఱనిది.

క. మానిత మగు గుడరసమున, నూనినతుండీరఫలమొ యొగిఁదేనెతలన్, నాని మృదు వైనపవడమొ,నా నద్రిజతొప్పమోవి నయ మైయొప్పున్. కు. సం. ౩. ౩౦౫.

గీ. మేనికుంకుమరాగంబు మెలఁత తొప్ప,మోవి తాంబూలరాగంబు మొగిన వాసి, చారుతర మయ్యె...కు. సం. ౬. ౭౪౧.

సీ. అతివ భూధవునధరామృతం బానుచోఁ దొప్పవా తెఱ యంటుతొట్రుపాటు. నిర్వ. ౮. ౮౦.

క్రి. విణ.(క. తొప్పనె)అధికము గా,మిక్కిలి. (చూ. తొప్పఁదొరుఁగు.)

జ: తొప్పఁదొరుఁగు, తొప్పఁదోఁగు, తొప్పఁదోఁచు, తొప్పనఁదోఁగు, తొప్పలుదోరలు.

తొప్పఁదొరుఁగు. అ. క్రి. (తొప్పన్+తొరుఁగు.) మిక్కిలితొరుఁగు.

వ...తొప్పఁదొరుఁగుపుప్పొడిం గదిసి యొప్పెడి విప్పుంగలసరోవరంపుటిసుకతిప్పలను... పి.శకుం. ౩. ౨౨౩.

తొప్పఁ(గఁ)దోఁగు. అ. క్రి. (తొప్పన్+తోఁగు. క. తొప్పనె=అధికము గా-తోఁగు+తోఁగు. శ. ర.) మిక్కిలిగా మునుఁగు, మిగుల మునుఁగు.

క. తనరునరుణాంబుధారల, ననవరతము దొప్పఁదోఁగి...కు. సం. ౧౧. ౭౭౨.

ఉత్సాహము...తుములబాణవృష్టిఁ దొప్పఁదోఁగి యిర్వురున్. భార. ఆర. ౭. ౭౬.

మ. చెమటం దొప్పఁగఁదోఁగ భస్మకణికాస్ఫీతోత్తమాంగంబులన్, సుమహన్నిశ్వసితాకులాననములన్ శోభిల్ల మేనుల్...హరి.పూ. ౬. ౯౭.

తొప్పఁ(గఁ)దోఁచు. అ. క్రి. (√తొప్పఁదోఁగు) మిక్కిలి తోఁగఁజేయు.

క. తనశరములఁ దచ్ఛరములఁ, దునుమాడి మురారి దొప్పఁదోఁచెఁ బెలుచఁ ద,త్తనువులు నిశితశరక్షత,జనితబహుళశోణితప్రసరణమున వెసన్. హరి. ఉ. ౮. ౨౪౪.

వ. బభ్రుం డనేకబాణంబులం గౌశికునంగంబు నొప్పించిన నయ్యాదువీరుని నాతండు సాంద్రశరవృష్టిం దొప్పఁదోఁచుటయు...హరి. ఉ. ౨. ౪౬.

ఉ...భవదీయవచోమృతవారిధారచేఁ, దొప్పఁగఁదోఁచి నన్నుఁ బరితోషితమానసుఁ గానొనర్పవే. భోజరా. ౩. ౮౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. కప్పుర మూఁది పూవిసనకట్టులు గొజ్జఁగినీట
మాటికిన్, దొప్పఁగఁదోఁచి వీచుచుఁ జనుం
గవపై...కళా. ౬. ౨౫౨.

తొప్పనఁదోఁగు= తొప్పఁదోఁగు. అ. క్రి.
(తొప్పన్ + తోఁగు) మునుఁగు.

ద్వి. హరభక్తనికరదయామృతవృష్టి, పరిగొని క
రియఁ దొప్పనఁదోఁగి తోఁగి. బస. పు.౨.
౧౬౮ పం.

తొప్పర. వి. తృణవిశేషము*.

గీ. తొప్ప రంట్రింత సాలువ యుప్పుగడ్డి...
మొదలుగాఁ బూరి రవులింపఁ జొదలు వెడ
లు. ప్రబంధ. ౨౦౧.

తొప్పఱ. వి. (త. తొప్పై=దుస్థితి.) సంక్షో
భము, కలఁత.

తోలితొప్పఱ(ల)బెట్టు = తతిమి బాధపెట్టు;
మిక్కిలిబాధించు.

మ. వెఱ నిట్లంబుధినాథనందనులు దోర్వీర్యంబు
సాలించి యం,దఱుఁ బాఱంగ నిశాచరేం
ద్రుఁడు జయోత్సాహంబున స్వైస్యండన్,
దఱుమంగాఁ బ్రజఁ జేయి వీచుచు సముద్య
ద్వేగుఁడై తోలితొ,ప్పఱఁబెట్టెన్ శర
జాలమున్ బిఱుఁదఁ గుప్పంగూర నాటిం
చుచున్. నిర్వ. ౫. ౭౮.

చ...తోలితొప్పఱలఁబెట్టె ననంగుఁడు పాంథ
లోకమున్. నృసిం. పు. ౨. ౭౪.

తోలితొప్పఱలాడు=తతిమి బాధపెట్టు.

సీ. చిక్కఁజీరుగఁ గూల్చు సింహపోతకములఁ
దోలితొప్పఱలాడుఁ గ్రోలుపులుల. పి.శకుం.
౨. ౧౨.

ద్వి. హరిహరబ్రహ్మాదు లడ్డమైశేని, బరువడిఁ
దోలితొప్పఱలాడువాఁడ. రం. రా. అయో
౧౦౦ పా. ౧౦ పం. (చి. ని. పా.)

తొప్పఱిలఁబండు. అ. క్రి. (తొప్పఱిలన్ +
పండు) లెట్టు విఱుఁగఁ బండు, ప్రక్కలొఱగున
ట్లు పండు.

గీ. తొప్పఱిలఁబండె నాఁగను దోఁచుఁ దట్టు,
విఱుఁగఁ బండె ననుటకును...ఆం. భా. ౩.
౧౧౧. (తొప్పరిలఁబండు, ముద్రి. పా.)

తొప్పఱిలు(ల్లు). అ. క్రి. (√తొప్పఱు) ఒ
ఱగు. (శ. ర.)

తొప్పఱు. అ. క్రి. ఒఱగు. (శ. ర.)
జ: తొప్పఱిలఁబండు, తొప్పఱిలు.

తొప్పలుదొరలు. వి.బ. (తొప్పలు + దొరలు-
తొప్పలు=అధికము, దొరలు=రాసులు.)కోటానఁ
గోట్లు.

ఉ...విశ్వనాథుఁ గరుణోదధిఁ గమ్మనిపూవు
గుత్తులన్, బత్తిరిఁ బూజ సేసి నుతిపాఠ
ములన్ రవణించువారికిం, దొత్తులువోలెఁ
దక్కుదురు తొప్పలుదొరలు ముక్తిభామి
నుల్. కాశీ. ౨. ౪౯.

తొప్పి= తోపి. వి. (త. తొప్పి) టోపి. (శ.ర.
తొప్పె. చి. ని.)

తొప్పు. వి. (క. తొప్పనె.) చేతులతో నోరు
బాఁదుకొనుటయం దగుధ్వని కనుకరణము.
(దీనిఆమ్రేడితరూపము తొప్పుతొప్పు.)

క. వ్రేలెడువెండ్రుక లిరుగడఁ, దూలఁగఁ దల
యూఁచుఁ దొప్పుతొప్పున నోరుం, గేల నడి
చికొను సెలవుల, లాలలు దొరుఁగంగ నన్న
లా యని యొఱలున్. ఉ. హరి. ౪.౩౦౨.

తొబక. విణ. విత్తులు రాలినది. (మిరెపకాయ లో
నగునది. శ.ర.)
వి. (పీతమున్నగువానియొక్క) గుల్ల.

ఆ. ఎండ్రికాయతొబక యిల రొయ్య యని
యొడి,మీనుతలయు నెమలిరేనిరెక్క, యొన
ర రజము చేసి యొగి నీటితోఁ ద్రావ, నక్క

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జముగ నిలుచు వెక్కు లెల్ల. (చి.కి.చి.ని.)

తొమ్మండ్రు. స. బ. తొమ్మిదిమంది. (తొమ్మిదికి మహత్త్వార్థకరూపము)

సీ. తొమ్మండ్రు కొడుకులఁ దొలివేలుపులఁ జేయఁ బొడమించు నేదేవుబొడ్డుఁదమ్మి. ఉ. హరి. ౨. ౧౪౪.

తొమ్మందుము. వి. (తొమ్మిది+తూము) తొమ్మిదితూములు.

సీ...తొమ్మందు మనంగ నవాఢకీనామ మొప్పు. ఆం. భా. ౨. ౨౭౧.

తొమ్మనూఱు=తొమ్మన్నూఱు. స. (√తొమ్మిది) తొమ్మిదివందలు.

ఆ. తొమ్మనూటిమీఁదఁ దొంబదితొమ్మిది, వర్షములకు...నిర్వ. ౮. ౮౪.

ఉ. పొచ్చెము నొంద దీనడుమఁ బోయినయేఁడులు తొమ్మనూటిపై, నచ్చుగ నేఁడు మీఁద నెల లాఱు దినంబులు మూఁడు నేఁటితోన్. వి. పు. ౨. ౨౩౯.

తొమ్మన్నూఱు= తొమ్మనూఱు. (√తొమ్మిది, శ. ర.)

తొమ్మాఁడు. వి. నాశము.

(వ్యవ) దానిని తొక్కి తొమ్మాడు చేసినారు. (శ. ర.)

తొమ్మిది. స. జా. (బ. తొమ్మిదులు) ఎనిమిదియు నొకటి.

క. అది నూతనందనుఁడు తొ,మ్మిదిశరములఁ దునుముటయు సమీరసుతుఁడు బెట్టిద మగు వాలుఁ బలకయుఁ, మదమునఁ గొన... భార. ద్రో. ౪. ౨౩౪.

గీ...తేజోమయం బైనవృద్ధి నట్టి, మేటిగర్భంబు నెలలు తొమ్మిదియు నిండె. మనుచ. ౪.౩.

సీ. మే లైనరెండుతొమ్మిదులువిద్యలలోన మహనీయ మగుచు మీమాంస వెలయు. కాశీ.

౩. ౧౭౧.

జ: తొంబది, తొంబనూఱు, తొమ్మందుము, తొమ్మనూఱు, తొమ్మన్నూఱు.

తొయ్యలి. వి. (త. తైయల్.) తోయలి, స్త్రీ.

సీ. అతివ తొయ్యలి కొమ యన్ను సకి తెఱవ... గీ...ముద్దుగుమ్మ యన స్త్రీస,మాఖ్యలు... ఆం. భా. ౨. ౧౦౪.

ఉ. తొయ్యలిఁ జూచి యెవ్వతెవు తోయజలోచన నీవు నావుడున్. దశకు. ౩. ౨౭.

ఉ. తూలు సమస్తధర్మములుఁ దొయ్యలి నేఁడిలు సేర కుండినన్. మనుచ. ౨. ౫౩.

(ఈక్రింది ప్రయోగమునందుమాత్రము ఎన్నధ్యము గా నున్నది.)

చ...తొ,య్యెలిపలుకుల్ వినంగఁ బొదరిండ్లకుఁ గోయిలపిందు చేరె...అహల్యా. ౨. ౯౦.

తొర. వి. (సం. త్వరా) ౧. వేగిరపాటు.

క. తమ్ములదొర కైరవబా,తమ్ముల చెలి చక్రసంయుతమ్ములకొఱ భూ,తమ్ములతొర యాగమ కుం, తమ్ములయొఱ కిరణధనుఁడు తపనుఁడు పొడమెన్. రా.వి.౧.౭౦. (భూతమ్ములతొర=ప్రాణిసమూహమున కుద్బోధకుఁడు.)

ఉ. అంతటిలోన నీతఁ డుదయాద్రిపయిం బొడ తెంచుపద్మినీ,కాంతు...కనుంగొని పం డటం చు వి,భ్రాంతి వహించి యాఁకటితొరన్ రవిపై కెగసెన్...ఉ. రా. ౫. ౯౭.

ద్వి. తో డెవ్వరును లేక తొరతోడ మీరు, విచ్చేయునపుడె...విష్ణు. పూ. ౩. (ఇట. క్రి. విణ. అని శ. ర.)

౨. ఆపద, ఇడుమ.

ఉ. పూనిక నేను వైకొని ప్రభుత్వము గానఁ బడంగ నిల్చి యె,వ్వానికిఁ లోఁగ కింతే తొర వచ్చినఁ గాచెద నిన్నుఁ గూరిమిన్. హరిశ్చ. ౪. ౧౦౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జః తొందర, తొందరపడు, తొందరపాటు, తొరపడు.

తొరఁగించు.(√తొరఁగు) స. క్రి. ౧. వైచు.

మ. నరకుం డొండుశరాసనంబు గొని యన్య స్యందనం బెక్కి వే,తొరఁగించె శరముల్ మురారిపయి సైదుక... ఉ. హరి. ౧. ౧౭౧.

క... తాలాంకుం డా,తరువును దునిమిన వెండి యుఁ,దొరఁగించెఁ గుజంబు లతఁడు దోడ్తోఁ దునుమక. భాగ. ౧౦. ఉ. ౫౫౩.

౨. పడఁగొట్టు.

క. శరములు బలువిడి నిగుడుచుఁ, బరువడి నయ్యాతుధానభటము క్తశిలా,తరుశస్త్రపరంపర వెడఁ, దొరఁగించుచు వారిఁ దోన తునుమాడు నెడక. భా. రా. ఆర. ౧. ౨౨౪.

౩. కురియునట్లు చేయు, వర్షింపఁజేయు.

చ. చిటిపొటిమబ్బు లాకసపుసీమ... తటిల్లతా, కుటిలతఁ గొంచెపాటిచినుకుల్ దొరఁగించె ధరాతలంబునక. శుక. ౨. ౩౪౦.

సీ. కుండాలములనుండి జోదులు దొరఁగించు వాలంపజాలంబు వానవడువు. భా. రా. యు. ౫౨౬.

తొరఁగు=తొరుఁగు. అ. క్రి. ౧. పడు.

క... అధికభయా, తుర లై కుండాగ్నులందుఁ దొరఁగిరి పెలుచక. భార. ఆది. ౨. ౨౧౧.

గీ. దివిజపతి నీకు నిచ్చినతీవ్రశక్తి,చేతఁ గవ్వడి వడు నని చూతువేని, వాసుదేవునిచే నది వ్యర్థ లయ్యెఁ, దునియ లయ్యెను బొడి యయ్యెఁ దొరఁగు ధరణి. భార. ఉద్యో. ౨. ౨౭౨. మనుచ. ౨. ౫౫.

౨. (పుష్పాదులు)రాలు.

క. ఘనపక్షానిలచలితా,వనిరుహములవలనఁ దొరఁగువరపుష్పచయం,బు... భార. ఆది. ౨. ౭౯.

క. వారలు నవ్విధమున నా,భూరమణునిమదికి నింపు పుట్టింపఁగ మం,దారకుసుమములు దొరఁగెను,బోరన దివి దేవదుందుభులు గర్జిల్లెక. నిర్వ. ౧౦. ౧౪౬.

౩. కాఱు, స్రవించు.

క. క్షతములఁ బెల్లు దొరఁగుశో,ణితధారలు మదముగా వినిర్గళకరియా,కృతిఁ గవిసి యతం డేసెను, శతమఖసుతుఫాలతలము శాతశరమునక. భార. విరా. ౫. ౧౯౯.

సీ. చిలుకపోటులచేతఁ జిరిగినసహకారఫలములఁ దొరఁగెడిపచ్చితేనె. పాండు. ౧. ౧౧౩.

౪. కురియు, వర్షించు.

ద్వి. ధారుణీపతి గాధితనయుహస్తమున, ధార వోసినజలధారకు మున్నె, తొరఁగెఁ బువ్వులవాన తోడనే మ్రోసె, సురదుందుభులు... ద్వి. హరిశ్చ. పూ. ౧౪౪౦ పం.

క. తొరఁగెడువానలఁ దడియుచు... చిత్రభా. ౨. ౨౪.

౫. ప్రవహించు, పాఱు.

సీ. కరుణారసము వొంగి తొరఁగెడుచాడ్పున శశిరేఖ నమృతంబు జాలువాఱ. భార. విరా. ౧. ౧౨.

చ. సురపతిదాడి నంబునిధిఁ జొచ్చినయద్రులు నిచ్చ లప్పురిక, దిరుగఁగ నాత్మఁ గోరి శరధిక పరిఖాకృతిఁ గాపువెట్టి తా, రరుదుగ భద్రసామజము లై సెలయేఱులు దానధార లై, తొరఁగుచు నున్నమాడ్కి నతిదుస్సహతం గరు లొప్పు నప్పురిక. విక్ర. ౧. ౭౬.

౬. లోఁబడు, వశమగు.

ఆ. దైవయోగమునను దట్టిన మేలుకీ, ళ్లనుభవింప కెట్టు లరుగ వచ్చుఁ, గాన నార్య లోక్కగతి నుండుదురు సుఖ,దుఃఖములకు మనము దొరఁగనీక. కుచేల. ౩. ౧౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స. క్రి. (=తొాఱఁగు) విడుచు.

ఉ...అలపూర్వముఁ బట్టునెపంబు వెట్టి సారం గధరుండు నేమము దొారంగుమదిం జనుదేర ...సారంగ. ౨. ౨౧౮.

ఉ...చంద్రమఃకలా, మౌళిపయి న్మదీయ మగు మానస మంతయుఁ జిక్కి నింక నేఁ, జాలు దునయ్య యెమ్మెయి భుజంగవిభూషణునిం దొారంగఁగన్. హరి. ౪. ౩౨.

తనివితొారఁగు=తనివితీఱు, తృప్తిపడు.

చ...తన్నుఁ గోరినమగవారలం దననిరీక్షలకుం బ్రియు లైనవారలం, దనివిదొారంగఁ గూడ నికతంబున నీగతిఁ బుట్టెఁ గుక్కయై.శుక. ౨. ౪౫.

జ: తొారఁగించు.

తొారపడ(ణ)ము. వి. వడ్రంగి బెజ్జములు కో యుసాధనము. (వా.)

తొారపడు. అ. క్రి. (√తొార) వేగిరపడు.

ద్వి...బంతిఁ, గూర్చున్నశశధరార్కుల కమ్ర తంబు, మార్చి తా నిట రాక మసలె నటం చుఁ, దొారపడు చున్నదైత్యులకు... విష్ణు. ఉ. ౪ ఆ. (శ. ర.)

తొారలి(ర్లి)ంచు. స. క్రి. (√తొారలు²) వేన్నీళ్లు (చన్నీళ్లు చేర్చి) చల్లార్చు. (శ. ర.)

తొారలివచ్చు. అ. క్రి. (√తొారలు¹) కలుగు, పుట్టు. (ఇది ఇతరపదవ్యవధానముతో కన్పట్టు చున్నది.)

సీ. తొల్లి పెట్టని మేలు తొారలి యిప్పుడు రాదు కావలసినపను ల్గాకపోవు. నీతి. ౮౭.

తొారలు¹. అ. క్రి. ౧. కలుగు.

వ...పయోధరంబుల నంటుచు విశదాంశుకాంత స్థితి దొారలంగ నతివిపులపులినజఘనారోహం బుల నుత్పలపత్త్రంబుల నెరపుచు...వసు. ౨. ౧౪౦.

గీ. దొారల నందఱ మన్ననల్ దొారల ననిచి. సారంగ. ౨. ౧౮౦.

ద్వి. తొారలెడుజనదృష్టిదోషంబు వాయ, నిరు మేల నారతు లిచ్చువ ట్లొలయి. ద్వి. భాగ. ౮. స్కం. (శ. ర)

౨. మాఱ్కొను, ఎదుర్కొను, తొడరు.

ద్వి. తర మెఱుంగక రాముధరణీశుతోడఁ,దొార లితే భస్మమై త్రుంగెదుగాక. రం. రా. సుం. ౨౧౧ పా. ౭ పం.

ద్వి. తొారలిన శివు నైన వెఱవక గెలువ...బస. పు. ౨. ౩౭౫ పం. (ప్రాఁతప్రతి. పా.)

జ: తొారలివచ్చు.

తొారలు². అ. క్రి.కలియు, చేరు. (చూ. తొారలించు.)

జ: తొారలించు.

తొారితొారి. అవ్య.క్రి.విణ.లెస్సగా. (శ.ర.బ్రా.)

తొారుఁగు=తొారఁగు. అ. క్రి. ౧.పడు, రాలు.

సీ. హరివాణములమీఁదఁ గరకంకణములదీప్తులు పదార్థంబులతోన తొారుఁగ. వరాహ. ౪. ౧౩౩. (ఇట వ్యాపించు అనితాత్పర్యము.)

క. వనలక్ష్మి మాధవాగతి,ననువుగఁ బూవీట జలకమాడుటకై ముం,దనువున నలుగిడఁగా న, ర్లినచిక్కను మనఁగ ధరఁ దొారిఁగెఁ గాతా కుల్. చంద్ర. ౩. ౧౦౨.

సీ. కరికరంబులు బాలకమఠముల్ మౌక్తికపాళికల్ నవ్యప్రవాళములును. గీ. గగనజల నిధిలోనుండి కలసి యొక్క,పరియ తొారిఁ గెనొ యనఁగఁ జూపఱుఁ దోఁచెఁ.వాల్మీ. ౩. ౯౩.

౨. జాఱు, గళితమగు.

వ...ఖలీనంబుల విలీనంబు లైనఫేనంబులు దొ రుఁగ నిరుగడలఁ గడలుకొనుకర్ణచామరంబు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లినుపడింప...ఉ. హరి. ౪. ౨౧౩.

౩. కురియు.

క...సుగంధము గలవిరిసోన సురపథంబునఁ
దొరుఁగఁగ. రాఘవ. ౧. ౭౫.

౪. ప్రవహించు, స్రవించు.

సీ.శృంగాగ్రదళితవైరించాండగళితావరణధార
లన నిర్ఝరములు దొరుఁగ. దశా. ౨.౨౦౦.

స. క్రి. (=తొఱఁగు) విడుచు, త్యజించు.

గీ. దుఃఖుఁడై యుండియును నొప్పు దొరుఁగ
కున్న,యున్న శేశ్వరుఁ గనుఁగొని యడలు నెద
ల,తోడ మేనులు దూలఁగఁ దొట్రుపడుచుఁ,
జేరి యాతనిచుట్టు నాసీను లైరి. భార.
శల్య. ౨. ౩౯౯.

తోరుపు. స. క్రి.తోర్లించు, వేన్నీళ్లు (చన్నీళ్లు)
చేర్చి చల్లార్చు.

సీ. తోరంపుఁబన్నీటఁ దొరిపించి జలకంబు
లార్చె నొక్క సరోరుహాయతాక్షి. రసిక.
౧. ౭౧. (చి. ని. పా.)

తోర్లుగట్టె=తోర్లుగోవి. వి. (√తోట్టు) గొల్లవా
నికడ నుండెడి పొడుగైనవెదురుకఱ్ఱ.(పశువులను
దోలుసాధనవిశేషము. బ్రా.)

సీ. తోర్లుగట్టెయుఁ జలదుబ్బ చిల్కుడుగుంజ
పూజెబిందెలు వెన్నపూసచట్టి. హంస. ౨.
౭౫.

తోర్లుగోవి=తోర్లుగట్టె. (√తోట్టు)

ఆ. తూఁటకొమ్ము చంక దోఁపినయెడ మెట్టి,
తోర్లుగోవి ధూళిధూసరితము, లైనకురులు
నమర నాకస్మికంబుగా, మందనుండి యింటి
మగఁడు వచ్చె. వేం. పంచ. ౧. ౫౭౭.

తోఱ=తొఱ్ఱ. వి. (క. తొఱె) ౧. కోటరము,
చెట్లయం దేర్పడెడుపెద్దరంధ్రము.

క. తోఱలోపల నొకెడ నొక,యఱగా నొన
రించి చిగురుటాకు లమగుసం, బఱచిన నది
గడు మెత్తని,పఱపుగ నవోఁచట నాఁడుఁ
బట్టిం గనిరొకఁ. భోజరా. ౪. ౧౭.

౨. (కఱ్ఱ కుండెడు) రంధ్రము,బోలు.

సీ. తో ల్గల్గి తొఱ లేక తోఁపంగ నను వైన
తరుకాష్ఠమున దంతధావనంబు, వదనసంశు
ద్ధికై పలయుఁ గావింపంగ...కాశీ. ౫.
౨౦౫.

జ. తొఱతేనె.

తొఱఁగించు. స. క్రి. (√తొఱఁగు) విడుచు,
త్యజించు.

క. అది యొండె భక్తి యెవతే, నెద విశ్లేషైక
భీరువృత్తిఁ బ్రియాలా,భదళ స్మెయి దొఱఁ
గించును, హృదనన యదిగాక యున్నయవిశై
శికముల్. ఆము. ౫. ౮౧.

తొఱఁగు. స. క్రి. (త. తుఱ) విడుచు, త్య
జించు.

క. చేయఁ డపాత్రవ్యయములు,సేయుం బాత్ర
వ్యయంబు సేయు న్నిజర,క్షాయత్నమెల్ల
తెఱఁగులఁ, బాయక ధర్మంబు సేయుఁ బా
పము దొఱఁగుఁగ. భార. ఆను. ౫. ౪౭.

క. తఱ చగుసెనుసందడిలో, నిఱుకటమునఁ
బడ్డనృపతి యీవగ్రహముం,దొఱఁగుట య
భీప్సితార్థం, బఱచేతికి వచ్చినట్ల యని వెత
కుడుచుఁగ. నైష. ౪. ౧౨౪.

చ. వఱపున...జీవముం,దొఱఁగి...నా. పంచ.
౨. ౧౪౪.

అ. క్రి. (=తొరఁగు) స్రవించు,కాఱు.

చ...చెక్కులం,దొఱఁగెడుఘర్మముల్ తనదు
దుప్పటిచేఁ దుడిచెఁగ నయంబుగఁగ. దశా.
౨. ౩౧౬.

ద్వి. నాకుమాయండ రా రా కుఱ్ఱ యనుచు,
చనుఁగవఁ దొఱఁగునాస్తన్యధారలను, గనుఁ
గవ హర్షాశ్రుకణపూరములను, చెన్నార

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సుతు నభిషిక్తుఁ గావించు, చున్నయ త్తటి...
పండితా. మహిమ. ౪౯౩ పా.

౨. (త. తుఱవు) విడివడుట.

గీ. ఏర్పుదాఁటులలోఁ దొఱఁ గెఱుఁగఁబడునె.
ఉ. హరి. ౪. ౩౦౭.

జ: తొఱఁగించు, తొఱఁగుచొచ్చు, తొఱఁగు
పోవు.

తొఱఁగుచొచ్చు=తొఱఁగుపోవు. (√తొఱఁ
గు)

క. పురిటిమొదవు లాఁబోతులు, సురతమునకు
విడిచి తొఱఁగుచొచ్చినయవియుం, బరిచి
చ్చున బెదరినయవి, సరిమేసిన బందెగొనుట
చన దధిపతికిన్. విజ్ఞా. ప్రా. ౧౩.

తొఱఁగుపోవు=తొఱఁగుచొచ్చు. అ. క్రి.
(తొఱఁగు + పోవు.)-పశువులు - తప్పించుకొని
పోవు.

గీ. తొఱఁగుపోకుండ మెకములు గఱవకుండఁ,
జాడి దఱుఁగకయుండ నాపాటిగొల్ల, లిచ్చ
మెచ్చ నీదృష్టికి నెక్కఁ గదుపు,నరయ
నేర్తు న న్నేలుము ధరణినాథ. భార.
విరా. ౧. ౨౭౭.

ద్వి. తొఱఁగుపోయినఁ దెత్తుఁ దోడనే తెలిసి,
తొఱఁగి వచ్చినవానిఁ ద్రోవనే వెదకి. నవ
౧. ౪౦ పా. ౨౩ పం.

తొఱట(ము). వి. తొఱ్ఱి,కోటరము.

చ. జరఠకపిత్థరంధ్రములు సాలబిలంబు లగాధ
నింబకోటరములు మఱ్ఱిమ్రానితొఱటల్ పెను
రావులతొఱ్ఱులు... వేం. పంచ. ౩. ౨౨౭.

గీ...తొట్టి, తొట్రు తొఱ్ఱి తొఱట యనఁ దో
చుఁ గోట, రమ్ము...ఆం. భా. ౨. ౩౭.

క. తిరుగాడుచుండఁగాఁ గని,కరము భయభ్రాం
త మగుచుఁ గరివరకర్ణాంతరవివరములోనికి
నొక, తొఱటముగతి సరటి మంత దురదురఁ
దూఱెన్. కేయూర. ౨. ౧౦౧.

జ: తొఱటలువాఱు.

తొఱటలువాఱు. అ. క్రి.(తొఱటలు + పాఱు)
రంధ్రములు పడు.

క... పెక్కులు చీమలు వెలువడి వడిఁ, దొలిచె
శరీరాస్థు లెల్లఁ దొఱటలువాఱన్. జై. భా.
౭. ౧౦౧.

తొఱతేనె= తొఱ్ఱితేనియ (√తొఱ) (శ. ర.)

తొఱుద్రొక్కు. వి. (త్రొక్కు + త్రొక్కు-
క. తుఱ=పరగత్తుట. త. తొఱు=సంఘము)గట్టి
త్రొక్కుడు.

వ... వెఱచఱచి పఱచునెడఁ దెఱపి నుఱికినతో
ఱుద్రొక్కునం గుక్కలచేఁ బఱిపఱి యైన
యుఱుములును...ఉ. హరి. ౪. ౨౯.

తొఱ్ఱి. వి. ౧. వృక్షవిశేషము.

గీ...సీకాయ మంద్ర తొఱ్ఱి, వెలఁగ...మొద
లుగా జగతిఁ గల్గు,కంప లన్నియు వేవేఁగఁ
గడచి కడచి. హంస. ౪. ౯.

౨. (=తొఱట-క. తొఱ్ఱె) కోటరము,చెట్టులో
నుండుపెద్దరంధ్రము.

గీ...తొట్టి,తొట్రు తొఱ్ఱి తొఱట యనఁ దో
చుఁ గోట,రమ్ము...ఆం. భా. ౨. ౩౭.

జ: తొఱ్ఱిఁబులుఁగు,తొఱ్ఱితేనియ,తొఱ్ఱిపిట్ట.

తొఱ్ఱిఁబులుఁగు. వి. (√తొఱ్ఱి)-తొఱ్ఱిలో నుం
డుపక్షి-గుడ్లగూబ.

సీ. నిరలు నొకధూర్తు నింపించుఁ గాకేమి
త్రోవలఁ గూయదే తొఱ్ఱిఁబులుఁగు. నీతి.
౬౫.

తొఱ్ఱికొప్పు=తొఱ్ఱివంటికొప్పు, పదులుకొప్పు.

సీ. పుత్రికానిర్మాల్యపుష్పదామంబులఁ దొఱ్ఱి
కొప్పులలోన దోఁపి తుఱిమి. వైజ. ౩. ౭౦.

ఆ. గొఱ్ఱెబొచ్చుకంటె నెఱ్ఱి నై చిఱ్ఱి లౌ,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కుఱ్ఱవెండ్రుకలను గూడదువ్వి, తొట్టికొప్పు వెట్టె...చంద్ర. వి. ౩. ౮౩.

తొట్టితేనియ. వి. (√తొట్టి) చెట్టుతొట్టలోఁ బట్టిన తేనెపట్టుయొక్క తేనె, తొట్టితేనె.

గీ. పుట్టతేనియ పెరతేనె పుట్టజున్ను, తొట్టి తేనియ గల వందుఁ దోఁచి తోఁచి. కాళ ౩. ౬౮.

తొట్టిపిట్ట. వి. (√తొట్టి) వడ్రంగిపిట్ట, దార్వాఘాటపక్షి (చి. ని)

తొట్టి. వి. రంధ్రము.

ఆ. తొత్తుతోడిపొందు తొట్టిపెసలమూట, ముచ్చుతోడిపొందు వచ్చు నింద, తలవరింతిపొందు తలతోడఁ దీఱురా...వేమ. ౨. ౩౪.

౨. ముందటిపండ్లు లేనినోరు.

తొట్టియక్కరము = పండ్లు లేనినోటితోఁ బలుకుఅక్షరము. (ఇది యస్థిరపదార్థమున కుపమానము.)

ఆ. ఊఁతనీరు చెలఁది నేఁతమూటాయిటి, దూది యెండపసుపు దొట్టియక్కరంబు మేను... ఆము. ౬. ౬౨. ('పుసుగు దొల్చిన యక్షరము' అని వ్రాత ప్రతి. వ్యాఖ్య.)

జః తొట్టివాఁడు.

తొట్టివాఁడు. విణ. (√తొట్టి) పతితదంతుఁడు, పండ్లూడినవాఁడు.

సీ...పతితదంతాభిధ తొట్టివాఁడన ... ఆం. భా. ౨. ౧౨౧.

తొట్టు. వి. పశువు, (గోమహిష్యాది.)

సీ. గోమహిష్యాదులనామము ల్పసి తొట్టు తొడుకు పసరము నా నడరు...ఆం. భా. ౨. ౨౬౧.

క. తొట్టులఁ గాచినసందుని, కుఱ్ఱనిచరితాంమృతంబు...భాగ. ౧౦. పూ. ౬౩౩.

జః తొర్లుగట్టె, తొర్లుగోవి, తొట్టుపట్టు.

తొట్టుపట్టు. వి. (తొట్టు+పట్టు) ౧. ఆవుల మంద; గొల్లపల్లె.

ఆ. ఘనభుజుండు నరుఁడు దనతొట్టుపట్టుల, విశ్రమించి...భార. ఆది. ౮. ౨౧౦.

శ్లో. క్రోశమాత్రే పురస్యాసీద్గోష్ఠం పార్థస్య శోభనం. సం. భార. ఆది. ౧. ౨౪౬.

వ. అనిన విని విభాండకుండు సంతసిల్లి ఋశ్యశృంగుతొట్టుపట్ల విశ్రమించుచు...భార. ఆర. ౩. ౧౧౮.

తోల[1]=తొన. వి. (క. తొళె)- పనసపండు లోనగువాని- తొన.

సీ...దళ మెక్కుపనసపెండొలలతోడ. ఆము. ౨. ౭౩.

వ...పిశాచంబులసందడిం బనసతొలలసరణిఁ జెటికి మిడిగ్రుడ్లు చప్పరించు బేతాళంబులును ...చంద్రా. ౬. ౯౦.

జః తొలతేనె.

తోల[2]. వి. ("తోలఁకు" యొక్క అంత్యవర్ణము లోపింపఁగా మిగిలిన రూపము) ప్రకాశము, కాంతి.

గీ...హిమవంతు నాలోకనమ్ముఁ జేసి, తొలయు నగవును మొగమునఁ దొంగలింప. వీర. ౧. ౧౬౭.

తోలఁకఁబాఱు. (తొలఁకక్ +పాఱు - స్వార్థమున.) చిందు.

సీ. చీరలు మురళింప నీరంబు లేలాకో యిలరాలనటు నిటుఁ దొలఁకఁబాఱె. శ్రీరం. మా. ౧౦. ౩౨

తోలఁకాడు. అ. క్రి. (తొలఁకు+ఆడు) ౧. తొనఁకు, ఒలుకు.

సీ. ముద్దులు తొలఁకాడుముద్దియపలుకు లయ్యె

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సమాస్త్రమంత్రబీజాక్షరములు. విక్ర. ౬. ౨౭.

సీ. ముద్దులు తొలఁకాడ మోఁకాలఁ గేలను దడవుచు నెందును దారి తారి. హరి. పూ. ౫. ౧౮౦.

౨. అతిశయించు.

ఉ...విహారగిరికూటములన్ దమకంబు త్రోపు త్రోపాడ మనోనురాగ మనయంబును లోఁ దొలఁకాడ మన్మథక్రీడలు సల్పుచుండె...రాజ. చ. ౩. ౨౩౩.

క...అరథప్రకరంబుల్, సునిశితశరప్రకరములఁ, దునుమాడెన్ రౌద్రరసము దొలఁకాడం గన్. భార. శల్య. ౧. ౩౩౬.

౩. ప్రకాశించు; వ్యాపించు.

ద్వి. వలనొప్ప దండెలవజ్రాలమించు, తొలఁకాడుచున్నయాందోళిక లేవి. ద్వి. హరిశ్చ. ఉ. ౨౨౩౦ పం.

సీ. తెలిమోముపై బర్వి తొలఁకాడుచాయలో మెలరారు కనుఁగవ మెఱుఁగు లడరు. కు. సం. ౮. ౯.

వ...నేత్రాంచలంబుల నలంతినవ్వు దొలంకాడ ని ట్లనియె. నైష. ౪. ౬౨.

తొలఁకించు. స. క్రి. (√తొలఁకు) తొలఁకఁజేయు, అతిశయింపఁజేయు.

క. లేయెండ వేఁడి యయ్యుం,దోయజషండమున కింపు దొలఁకించు క్రియన్,నీయలుక పరుస నయ్యును, నాయెడఁదకు వేడ్క సేయు నళినదళాక్షీ. నైష. ౮. ౪౬.

తొలఁకు=తొణఁకు. అ. క్రి. ౧. (లోపలనుండి) పై కుబుకు; పొర్లు; చెదరు, చిందు.

సీ.వికచనీరజపత్త్రమకరందరసభాతిఁ బసనిచూపులఁ గృపారసము దొలఁక. విక్ర. ౨.౫౭.

చ. కువలయనేత్ర తొంటితనకోపము గర్వము మత్సరంబు మాని వినయముం బ్రమోదము ను నిండి తొలంకెడు నెమ్మనంబునన్,సవతుల యిండ్లకెల్లఁ దొలునాఁడు క్రమంబున నేగి ...పారి. ౫. ౫౭.

లయహారి...తలమీఁదన్, వఱలుసురనది దొలఁకి నెటఁజినుకులను గురియ...కు.సం.౨.౩౫

౨. చలించు.

చ. తొలకరిమించుకందొగలతోఁ గలతోయజ తారహారకాంతులఁ దగునవ్వుక్రొన్ననలతో నలతోరపుగుబ్బచన్నులన్, దొలఁకెడికొను చంచలతతో లతతోఁ దగుమేనితావికిన్, దుల యగుకొప్పుగేదఁగులతోఁ గులతోయదవేణి మించినన్. ఉ. రా. ౬. ౧౧౭.

సీ. వాజివిభ్రమజితావర్తతఁ దొలఁకుదివ్యుల యేటిసాజ్జరేణువార్ము లనఁగ. ప్రభా.౨.౪౧. కువల. ౪. ౨౦౨.

౩. వ్యాపించు, ప్రసరించు.

గీ. వలువమీఁదికిఁ దొలఁకుసువర్ణపులిన,గురుని తంబప్రభాపరంపరలతోడ, మహితసర్వాంగలావణ్యమహిమతోడ, నమరుప్రాయంపు రూపు చిత్రముగఁ దాల్చె.కళా. ౩.౧౨౧.

క. క్రుంకె నెల మరుఁడు వేటకుఁ,గొంకె నుడూచ్చయము డొంకెఁ గుముదంబులడాలింకెఁ దిమిరోత్కరంబు త,లంకె రవిచ్ఛవియు దివిఁ దొలంకెఁ గడంకన్. బహు. ౧. ౧౦.

౪. ఉద్భవించు, బయలుదేఱు.

గీ. అని సునంద మరందబింద్వధికమాధురీధురీణ రసప్రౌఢిరీతి గులుకఁ, బలుకుపలుకుల కలికి యక్కలికి పలికె,బులకమొలకలు నెమ్మేనఁ దొలఁక నపుడు. ఇందు. ౨. ౯౬.

సీ. అలచెందొవలవిందుచెలు వెందు వెసఁ జిందు మొగమున కొకవింతజిగి దొలంకె. పారి. ౧. ౫౬.

౫. అతిశయించు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆ...మత్స్యరాజతనయుఁ డెలమి, దొలఁక
నొగలఁ బగ్గములు గట్టి చని వాని,నెల్లఁ దె
చ్చి యరద మెక్కుటయును. భార. విరా.
౫. ౨౧౦.

గీ. అని పలికి యందు నిలక భయంబు దొలఁకఁ,
గలఁకఁ బిల్లికిఁ దొలఁగురాచిలుకపగిది, నావ
లికిఁ బోవఁ దేఁటులయావళికిని, నతనునిశరా
వళికిఁ దాళక కసుర గదిసి. ఉ.రా. ౩.౧౨౧.
యయా. ౪. ౧౩౭.

౬. (క. తొళగు=ప్రకాశించు. త. తళుక్కు=
ప్రకాశించు) ప్రకాశించు, ఒప్పు; ప్రకట
మగు.

సీ. కుఱుమాపుతడిమంపుఁగోకలోఁ దొలఁకెడు
కంపమాననితంబకాంతిసొంపు. కళా. ౪.
౧౦౫.

చ...చికిలిచెంద్రికవన్నియపట్టుపట్టెతోఁ,దొలఁ
కుపసిండివ్రాఁతతెరతో నెఱతావులమేలు
కట్టుతోఁ, జలువలు చిందుముత్తియపుఁజప్ప
రమంచముపై మహోన్నతిన్.వసు.౪.౭౭.
వరాహ. ౪. ౭.

మ. తనక్రేఁగంట రహించుతుంటవిలుతున్ దం
డించె నేయుగ్రుఁ డా,యనవిల్ ద్రుంచితి
వెంతజోద వనుచున్ హర్షించి వైదేహి
రామునకచ్చోఁ దలఁబ్రాల్మెపంబు దొలఁక
స్మితాభిషేకం బొన,ర్చె నుదంచద్ధ్వనిఁ గంక
ణంబులు ప్రశంసింపన్ గృతజ్ఞత్వమున్.
చం. రా. ౩. ౧౨౭.

గీ. తొలఁకుసిగ్గున వాల్చూపు బెళుకుఁ జూప.
దశా. ౨. ౨౯౬.

వి. ౧. చలనము.

చ. కడుఁబెనుమంట లైనయుదకంబుతొలంకున
వారిబిందువుల్, మిడిసి సమీపభూజముల
మీఁద వెసం బడి మండుచుండ నెక్కుడు
రభసంబుతో దివియకోలలకై వడి భంగసంగ
తిన్, బొడమిన ఫేనముల్ మెఱసె బోరనఁ
జల్లిననిప్పులో యనన్. వి. పు. ౭. ౧౬౫.

౨. అల, తరంగము.

గీ. పాలమున్నీటితొలఁకులఁ దేలువాఁడు, బాల
వేంకటశౌరి నాప్రోల నిలిచె. ప్రబంధ.౨౭.

చ...వారిదేవతల్, తొలఁకులకేలఁ దాప నిడి
తోమఁ గలం కడఁగెన్...ఆము.౪.౧౪౬.

చ. తొలఁకులఁ దేలి పుప్పొడులఁ దూలి మరం
దముఁ గ్రోలి...చలిగాలి తగన్ హరిచూలి
మీఁదటన్, బొలసె...చంద్ర. ౨. ౯౫.

జ. తొల,[2] తొలఁకఁబాఱు, తొలఁకాఁడు,
తొలఁకించు.

తొలఁగఁద్రోయు. స. క్రి. (తొలఁగన్+త్రో
యు) ౧. పోఁగొట్టు.

ఆ. కీలియందుఁ బడినతూలమట్లగుఁ బాత,క
ములు త్రిపథగావగాహనమున, దురితములను
దొలఁగఁద్రోయుట కెన్నిభంగులను గంగ
సాటి గలదె యొండు. జాహ్నవీ. ౧. ౧౯.

సీ. తనువునఁ బైకొన్నతాప ముజ్జనచేసి తొరఁ
గెడికన్నీరు తొలఁగఁద్రోచి. విక్ర. ౧.
౧౫౭.

౨. పరిహరించు, పాఱవేయు.

క. సేవించి రొకటి దొలఁగం,ద్రోవక జంబీరరస
ముతో నూనియతో,నావం బెట్టినకిటిమ
ద్రావలయములమృతమధురరసఖండంబుల్.
నైష. ౬. ౧౨౭.

తొలఁగఁబాఱు=తొలఁగు. (తొలఁగన్+పా
ఱు-స్వార్థమున.)
(ఓసరిల్లు, ప్రక్కకు పోవు.)

క. బల మతి ధ్రువుఁ డహితునిదోర్బలవిభవము
సైఁపలేక పరిభవదైన్యా,కలనమున కోర్చి
శత్రులు,చెలఁగఁ దొలఁగఁబాఱె దేవసేనలు
గలఁగన్. హరి. ఉ. ౧౦. ౫౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తొలఁగఁబెట్టు. స. క్రి. (తొలఁగన్ + పెట్టు)
౧. తొలఁగించు, తీసివేయు.
గీ. తపము గావింప వెడలె వత్సరసహస్రములు
మహాదేవుఁ డంత నాభూమిధరకు, మారి
గౌరి నను గ్రహింపంగఁ దలఁచి, తొంటితన
లాంఛనంబులు తొలఁగఁబెట్టి. వరాహ.
౧. ౧౬.
౨. దూరముగా నుంచు, పరిహరించు.
ఆ. పంచదారఁ బొదిపి భక్షింపఁగా నెత్తి,భావ
దుష్ట మనుచు బావ నగినఁ,దొలఁగఁబెట్టె
రోషకిలికించితంబుతోఁ, గొమ్మనరఁటిపండ్లు
గూర్మి మఱఁది. నైష. ౬. ౧౩౯.

తొలఁగనైచు. స. క్రి. (తొలఁగన్ + వైచు)
తొలఁగఁద్రోయు, పోఁగొట్టు.
ఉ...నపుంసకజన్మ మవశ్యభోగ్య మై, వాఁడిమి
గల్గుశాపమున వచ్చెఁ బురాకృతకర్మభావ్య
మై,వ్వాఁడును నేర్చునే తొలఁగనైవఁగ
నోర్వక పోవ వచ్చునే. భార. విరా. ౧.
౨౩౭.

తొలఁగించు. స. క్రి. (√తొలఁగు) ౧. తొలఁ
గునట్లు చేయు, పోఁగొట్టు.
సీ. పారసీకునకు దుర్భరమానవత్వంబు తొలఁ
గించె మానవదుర్గసీమ. పారి. పీఠి. ౧౩.
చ. వదలినద్రిండు తొంటిగతి వాటముగా బిగి
యించి మోమునన్, జెదరినఘర్మవారిఁ గొన
చేలమునన్ దొలఁగించి వీఁపునన్,బొదు ల
మరించి మించి బలుముష్టిశరాసనమున్ ధరిం
చి...జై.భా. ౨. ౭౬. పారి. ౧. ౬౦.
౨. విసర్జించు, విడుచు.
సీ. రాగభేదముల వర్జ్యములఁ దొలంగించి లయ
తాళశుద్ధి నెంతయుఁ దలిర్ప.కళా.౨.౩౩.

తొలఁగు. అ. క్రి. (క. తొలంగు. త. తొలై.
దీనికి ప్రార్థనాద్యర్థకరూపము లగు 'తొలఁగుము,
తొలఁగుఁడు' అనువానికి ఆమ్రేడితము పర మగు
నపుడు 'తొలతొలము, తొలతొలఁడు' అను
రూపములు వికల్పముగా వచ్చును.) ౧. ఒత్తి
గిల్లు.
గీ...అయ్యువిదవలువు, దొలఁగ ననిలంబుచేత
విఘాత మగుచు. భార. ఆది. ౪. ౧౨౨.
సీ. పయ్యెద తొలఁగ గుబ్బలు చూడఁ బల్లం
టఁ గెమ్మోవి నొక్కి. జంకించుకొనుచు.
దశా. ౨. ౩౫౭.
౨. అపసరిల్లు, తప్పుకొను.
సీ. పాయు తొలంగు మం చాయతనేత్రహస్తు
లమొత్త మేలాకో త్రోడ రాదు. భార.
విరా. ౧. ౧౭౬.
సీ. అప్పరాకుఁడు పరాక్రమ్మగా రేతెంచుత్రోవ
కు దూరంబు తొలఁగి పోవు. నైష. ౭.
౧౩౦.
ద్వి. తొలతొలఁ డనుచు విప్రుల నదల్చుచును,
నలిఁ బ్రసాదమువీఁదివలువఁ బోనూకి.
బస. పు. ౭. ౨౦౬ పం.
౩. ఓసరిల్లు, ప్రక్కకు పోవు.
గీ. మలఁగి గజకంధరము ద్రుంచి తొలఁగ ను
ఱికి, కెంపు దళుకొత్త వాలుతోఁ గ్రేళ్లువా
ఱు,నావృకోదరుఁడై...భార. భీష్మ.౨.౭౦.
గీ. అదరి యమ్ముసలాయుధునరద మల్ప, కణ
ములుగ వడి నడిచి నేకదిసి యతని, ప్రేయ
టయు ప్రేటువడి నొచ్చి వివశుఁ డగుచు,
నలఘుగద చేతఁ గైకొని తొలఁగ నుఱికె.
హరి. ఉ. ౩. ౧౭౯. కళా. ౩. ౧౨౦.
౪. మరలు, నివర్తిల్లు.
గీ. దురితకరముల యని వానిఁ దొడర కుండె,
నలదె లెస్సగ నెటేగిన వచ్చుఁ దొలఁగి.
భార. శాం. ౫. ౬౦౦.
గీ. బవర మెల్లియ బిరుద వై బరవసంబు, గల
చావుము చావక తొలఁగ రాదు. భార.
ఉద్యో. ౪. ౨౦౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. సమరముఖంబునన్ సవనసైంధవమున్ గొని వత్తు బాహుగర్వమున విరోధి గెల్చికొని రాక తొలంగితి నేని బ్రాహ్మణీగమనము సేయఁ గోరినజఘన్యుఁడున్, ఋతువేళలం గుల ప్రమదఁ బరిత్యజించెడుదురాత్ముఁడుఁ బోయెడుత్రోవఁ బోవుదున్. జై. భా. ౩. ౧౦౦.

౫. దూరమగు, చెడు.

చ. భువనభయంకరంబు లగుపోరులఁ దమ్ములతోడఁ గూడ నీవు వెడలఁబాటు లెస్స యలవుం జలమున్ వెలయించుచోట ధర్మువున కొకింతయుం దొలఁగఁ ద్రొక్కమి యెంతయు మేలు...భార. శాం. ౧. ౪.

క...దురితము కావించి తొలఁగుదు నె పరమునకున్. ఆను. ౩. ౪౮.

గీ. అనుదినము నిట్లు ప్రాతికూల్యము భజింపఁ, జండికతమున ముని బ్రహ్మచర్యనియమమున ను గృహమేధివర్తనమునకుఁ దొలఁగి, రెంటికిని జెడ్డరేవనిరీతి యయ్యె. జై. భా. ౪. ౭౭.

౬. వెడలు.

క. దుర్వాసుఁ డిటుల శాపము, దుర్వారముగా నొసంగి తొలఁగిన...దశా. ౨. ౪౬.

క. కన్నియ కమండలూదక, మున్నది నీ వటు తొలంగకుండఁగ దండం, దిన్నఁదనంబున నుండుము...విప్ర. ౩. ౭౮.

౭. మాను,తప్పు.

క...తత్ఫల మిప్పు డనుభవించితి, తొలఁగునె హింసాపరులకు దుఃఖప్రాప్తుల్. భార. ఆది. ౪. ౨౭౦.

౮. పోవు, నశించు.

క. లలి గంగాస్నానంబునఁ, దొలఁగంగలపాతకము చతుర్దశభువనంబులుఁ గూడి చేయఁ జాలవు, కొలఁదియె గంగాతిశయము గుణరత్ననిధీ. జాహ్నవీ. ౩. ౭౨.

వ. అని యివ్విధంబున నెంతచెప్పిన విధాత్మమఘుమార్తులం జుట్టుకొన్నయజ్ఞానతిమిరంబు తొలంగదయ్యె...కాశీ. ౫. ౧౦౦.

స. క్రి. ౧. విడుచు. (చూ. డిగు.)

చ...వేదమెల్ల వేల పరమవైష్ణవంబును దొలంగితి వేమి నరేంద్రనందనా.వి.పు.౨.౧౧౦.

మ. అడియాసం దొలఁగంగఁ జాల మిటు ఘూరావస్థపా లైతిమి...హరి. ఉ. ౪. ౫౭.

విప్ర. ౩. ౭౭.

౨. నశింపఁజేయు, పోఁగొట్టు.

క...బలిదుష్టావష్టంభ మెల్లఁ దొలఁగింపు వెసన్. దశా. ౨. ౬౩.

జః తొలఁగఁద్రోయు, తొలఁగఁబాఱు, తొలఁగఁబెట్టు, తొలఁగవైచు, తొలఁగించు, తొలఁగుడు, తొలఁగుడుకన్ను, తొలఁగుబావ, తొలఁచు.

తొలఁగుడు. వి. (√తొలఁగు) తొలఁగుట, అపసరణము.

సీ. తొలఁగు డనంగను దలఁగు డనంగను నపసరణాఖ్య లై యలరుచుండు. ఆం. భా. ౨. ౨౨౪.

తొలఁగుడుకన్ను. వి. (తొలఁగుడు+కన్ను) స్వస్థానమునుండి తొలఁగినకన్ను.

ద్వి. తూఁటువోయెడుకన్ను దొలఁగుడుకన్ను. పండితా. మహిమ. ౨౭౩ పొ.

తొలఁగుబావ. వి. (తొలఁగు+బావ) దాయ, శత్రువు.

గీ. తామరసలక్ష్ము లాచందమామరాఁకఁ, గలఁగుచును గుముదాళి కై తొలఁగె నపుడు, తొలఁగుబావయెకాఁడె తమ్ముల వరించు,నట్టి సతులకు నతఁడు మన్నెట్టిఁడైన. ప్రభా. ౪. ౧౨౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. ..నవసారసలక్ష్మి దొలంగుభావ కో,కములకు గుండెతల్లడము కైరవమిత్త్రుఁడు తోఁచెఁ దూర్పునన్. పారి. ౨. ౪౦.

తొలఁచు. స. క్రి. (√తొలఁగు.) ౧. తొలఁగించు, పోఁగొట్టు, నశింపఁజేయు.

గీ. ..అలమేలుమంగామనోవిభుండు, దొలఁచు జన్మాంతరానంతదుష్కృతములు. రా. వి. ౧. ౩౪.

సీ. లాఁగడాఁగుడుతాఁగప్రోగు లిడెడుప్రోడ కొలలు దొసంగులుఁ దొలఁచు మేటి. అచ్చ. రా. బాల. ౭.

మ. అవడీనానిలవాసనాజనితహార్దా ప్తిన్ బురిన్ భర్తృహ,ర్మ్యవితానా,శ్రితయోషిదాస్యములఁ జేరం బోవుదివ్యాపగా,బ్జవసద్భంభరపాళి కుద్గమనజశ్రాంతిం దొలంచున్ విలా,సవనీసాలలతాంతగంధలహరీసారంబు మధ్యేస్పృతిన్. చంద్రి. ౧. ౬౯.

౨. కడుగు, ప్రక్షాళనముచేయు.

మ. నవలావణ్యరసంబు పళ్లెరములోనం బోసి యగ్రంబునన్, భవదీయాస్య మొనర్చి యార్చి పిదపం బ్రాలేయరుఙ్మండలం,బు విని ర్మించె విరించి యచ్చిలుమువో పూఁబోఁడి యీచిహ్న మం,బువులం దాతఁడు చేఁ దొలంచుమిసిమిం బుట్టెన్ సరోజాతముల్. నైష. ౭. ౧౯౩.

చ. ముదమున సోమకాసురుఁడు ముచ్చిలి యచ్చల మారఁ గొన్నప్రా,జదువులు తెచ్చి తజ్జఠరసాంద్రతరాంత్రము లంట నంటుబల్, గదురు తొలంగఁ గీర్తి యనుగంగఁ దొలంచి విధాత్రువిస్ఫురద్వదనసరోజగంధలలితంబులు చేసితి గా జగన్నిధీ. పాండు. ౨.౫౬.
శుక. ౩. ౫౫౧.

౩. తోము, రుద్దు.

క. కలుషలుఁ జెంగలువలు వి,చ్చలవిడి నొడినిండఁ గొసెఁ జయ్యన నొకకో,మలి మృగమదకుంకుమములఁ, దొలఁచినమరుసాయకములు దొన నిడ్డక్రియన్. భోజరా. ౩. ౧౪౦.

౪. కడిగి పవిత్రము చేయు.

సీ. మంగళతీర్థసంపర్కమానందించి యమృతవాటికను దేహమును దొలఁచి. వాల్మీ. ౨. ౩.

అ. క్రి. మజ్జనముచేయు, స్నానముచేయు.

గీ. శంఖపుష్కరిణిని గ్రుంకి చక్రపుష్కరిణి మునిఁగి దేవతాపుష్కరిణిఁ దొలంచి. హంస. ౪. ౨౦౭.

తొలకరి=తొలుకారు. (√తొలుత)

చ. పలికె లలాటలోచనుఁడు ప్రస్ఫుటభంగి మునివ్రజంబుతోఁ, దొలకరిమేఘఘోషములతోఁ బురణించుసమంచితధ్వనిన్. హర. ౪. ౪౬.

తొలకరితటియాటపులుఁగు=మయూరము.

సీ. తొలకరితటియాటపులుఁగుఁ దేజీరౌతు నడుగుదోదుమిపక్కి పడగవాని. చం. రా. ౩. ౭.

తొలకరించు=తొలుకరించు. అ. క్రి. (√తొలకరి) ౧. కురియు, వర్షించు. (చూ. తొలుకారు.)

గీ. సరసమకరందమత్తమత్సరణతరుణ,కలకలోన్నిద్ర మైనవకులకుజంబు,మాటున వసించి పల్కునమ్మంత్రిఁ జూచి,పలుకుపలుకున నమృతంబు దొలకరింప. సుద. ౫. ౪౨.

సీ. నీలాంబుదశ్యామనిబిడదేహచ్ఛాయఁ బ్రక్షయాంతకాలంబు దొలకరింప. శివరా. ౧. ౬౧.

౨. ఉద్భవించు, పుట్టు.

సీ. తొలకరించి నటించు మొలకసిగ్గులచేత సుడివడి కడ కొత్తచూపుతోడ. విక్ర. ౭. ౭౨.

౩. అతిశయించు.

సీ. అలఁతఁ బాపెడునవ్వుటమృతంపుఁ దేటఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చిలుకరింపులఁ బ్రేమ తొలకరింప. అని. ౩. ౯౫.

గీ. పరిమళ మెసంగుబంగారుప్రతిమవంటి,తొ గటువాల్గంటి జిగినీటు తొలకరింప, సొగసు కాండ్రకు మోహరాసులు జనింప...

గీ. నూలు దోఁడును వేడ్క సవ్వాలుగంటి. హం స. ౨. ౨౧, ౨౨.

౪. చిమ్ము, చల్లు.

గీ. తళుకుజాళ్వామెఱుంగులం దొలకరించు, తీఁగ ధరియించె గళమునఁ దీఁగఁబోఁడి. ఇందు. ౫. ౭౩.

తొలకరిదొరబిడ్డ. వి.(తొలకరి + దొర + బిడ్డ.) -వర్షాధిపతిపుత్త్రుఁడు- ఇంద్రతనయుఁడు, అరు నుఁడు.

క...సుభద్ర వచ్చె, నైలియలు వేయాఱులు నిరుచెంతలఁ గొలువఁగ, దొలకరి మెఱుపో యిది యని, తొలకరిదొరబిడ్డ వెఱఁగుతోఁడం జూడఁగ. విజ. వి. ౨. ౯౭.

తొలకరిమించు. వి. (√తొలకరి) వర్షకాలపు మెఱుపు.

చ. తొలకరిమించుకందొగలతోఁ గలతోయ జతారహారకాం,తులఁ దగునవ్వుక్రొన్నవల తో...కులతోయదవేణి మించినఁగ. ఉ. రా. ౬. ౧౧౭.

తొలకరిమెఱుపు[1]. వి. (√తొలకరి) తొలు కారునందలిమెఱుపు, వర్షకాలపుమెఱుపు.

తొలకరిమెఱుపు[2]. వి. మల్లయుద్ధగతిభేదము.

వ...విష్ణుచక్రంబును రామబాణంబును నాగ బంధంబును తొలకరి మెఱుపును సల్లిమత్తును ...సర్వాంకుశంబును మొదలుగాఁ గలపది రెండుగాయమానంబులును...ప్రబంధ.౭౭.

వ...విష్ణుచక్రంబును రామబాణంబును నాగ బంధంబును తొలకరిమెఱుపును...మల్లుపు. ౩. ౬౯.

తొలకరిసూడు. వి. (√తొలకరి)—వర్షాకాల మునకు విరోధి—హంస. (శ. ర.)

తొలకు. వి. ఉపరంధ్రము, మృగములవెనుకటి కాలిమొదటిభాగమునకును ప్రక్కకును నడిమి చోటు.

ద్వి. తొలకు జల్లియుఁ ద్రివేదులవారిపాలు. బస. పు. ౭. ౩౯ పం.

(లేడిరూపమునుధరించినమారీచునివర్ణనము)

ద్వి...ము త్తియములు, తొలకులు రత్నబిందు వులైనపొడలు. రం. రా. ఆర. ౧౭౨ పా. ౨౨ పం. (శ. ర. పా.)

తొలటు. వి. తొఁఅటు, తొఱ్ఱ.

ఆ. పూనుగాఁడియంతభుజగంబు లో నున్న, వెలఁగమ్రాని వెడఁదతొలటు నూపి, దీనఁ జేయి వెట్ట లోన నున్నది సవి,శేషహేమ మను చుఁ జిలుక చెప్పె. కేయూర. ౪. ౭౪.

తొలతేనె=తొలితేనె.వి.(√తొల[1]) పుట్టతేనె.

క. కుందనపురవలు గుప్పెడు,తుందిలపుజన్నుఁ గవయుఁ దొలతేనెలకుఁగ, విందు లొనరిం చుపలుకులుఁ, జందురుసిం బోలుమోము సకి యకె యమరుఁగ. హంస. ౨. ౧౭౨.

తొలసి. (చి. ని, 'తొళసి' అని.శ. ర.)

వి. (సం. తులసీ.) తులసిచెట్టు.

సీ. వక్షస్థలమునఁ బద్మాక్షమాలిక కర్ణబిలమున నులివాడుతొలసియెన్ను. శై. భా. ౭.౧౯౭.

సీ. రక్కసిగొంగ పేరక్కున వ్రాలునందుల కేమి నోఁచెనో తొలసిపేరు. నీలా. ౧. ౧౦౯.

తొళక. విణ. పలుచనిది. (శ. ర, చి. ని.)

తొలి[1]=తొల్లి[1]. వి. ఔ. మున్ను, పూర్వము. (దీనియామ్రేడిత రూపము 'తొలితొలి')

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. తొలుత తొల్లి మునుపు తొలి యనఁగను బురారము...ఆం. భా. 3. ౭3.

క. వా రొకతల యే నొకతల, యీరెండుదెఱంగులందు నెయ్యది ప్రియ మె,వ్వారికిఁ జెప్పుఁడు దొలితొలి, గోరికొనన్ బాలునికిఁ దగుం బాడిమెయిన్. భార. ఉద్యో. ౧. ౭౫, స్వర్గా. 3౯.

సీ. తొలితొలి సృష్టికిఁ దొడఁగి యంబుజనూతి దలపోయ నాతనితలఁపునందు, మునిదేవదానవమనుజాదిభూతంబు లొక్కట జనియించె నక్కజముగ. హరి. పూ. ౧. ౭౦,హరి. ఉ. ౪. ౧౬.

విణ. మొదటిది.

ఉదా: తొలివేల్పు, తొలిచదువులు.

జ: తొలికడరాయఁడు, తొలికూటమి, తొలిగట్టు, తొలిగొండ, తొలిచదువులు, తొలిచూలు, తొలిజాతివారు, తొలిజేజే, తొలిదిక్కు, తొలిదుక్కి, తొలిదెస ఱేఁడు, తొలిదేవర, తొలినాఁడు, తొలినుడి, మొ.

తొలి[2]=తొల్లి[2]. వి. ౧. రంధ్రము.

క. హంసము క్రౌంచముతొలి రా, మాంసలరుచి వచ్చెఁ దాను మలయముశిఖఁ బ్రా,ల్వాంస వియువ నీ ర్విడిచెను, హంసమున కగస్తి పరమహంసం బగుటన్. ఆము. ౪. ౧౭౭. భాగ. ౫. ౨౭౧.

౨. తొఱ్ఱ.

సీ. తొఱ తొలి తొఱ్ఱ నాఁ దరుకోటరం బొప్పు...సాం. ని. స్థా. ౫౯.

జ. తొలిక.

తొలిక. వి. (√తొలి[2]) రంధ్రము.

క. పలుచని నెత్తురుమడుఁగులఁ, బొలిచెన్ రథనేమివలయములు హతరణవీ,రులు దూఱఁగ రవిబింబము, తొలికై రుచి దూల నీడ దోఁచినమాడ్కిన్. కవిక. ౨. ౧౯౨. (శ. ర. పా.)

తొలికడరాయఁడు. వి. (√తొలి[1]) పూర్వదిగధిపతి, దేవేంద్రుఁడు.

చ. తొలికడరాయఁ డగ్గియును దుంతసిడంబు మగండు సోఁకుమూఁ, కలయొడయండు... అచ్చ. రా. అర. ౧౨౬.

తొలికూటమి. వి. (√తొలి[1]) ప్రథమసమాగమము.

గీ. అఱమరలు దీఱ లాలించి యాపతించి, కలికితొలికూటమి విభుండు తులకరించె. కృ. శకుం. 3. ౫౦.

తొలిగట్టు. వి. (√తొలి[1]) పూర్వాద్రి, ఉదయపర్వతము.

శా. ఆందోళింపఁగఁ జేసె ముందు రజతాహార్యంబు లంకేశ్వరుం, డెందున్ దుర్జయుఁ డింద్రుఁ డీ డొరయుచో నే మెంచునో వాఁడు స్వాం, పొందం గానుక లిత్తు నంచుఁ దొలిగట్టుత్కంఠతో నెత్తుమేల్,చందాకెంపుతెఱంగునం దనరె భాస్వద్బింబమున్ దూర్పునన్. ఉ. రా. ౪. ౨౫౨.

తొలిగొండ. వి. (√తొలి[1]) ఉదయపర్వతము.

సీ. తొలిగొండ నాకను దొలిగొండ యేలిక వలపుబల్లల నాదువలపు దేవ. చంద్రా. ౨. ౪౫.

తొలిచదువులు. వి. బ. (√తొలి[1]) పూర్వవిద్యలు, వేదములు.

రగడ. అచ్యుత నినుఁ దెలియవు తొలిచదువులు. ఉ. రా. 3. ౯౨. సాం. ని. మాన. ౨.

తొలిచూలు. వి. (√తొలి[1]) ప్రథమసంతతి మొదటి బిడ్డ.

లయవిభాతి: చిలువ మెడనూలు పనిమలపుతొలి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చూలు మొల నలరుననువాలు మెక మెలయు వలకేలుళ్. అచ్చ. రా. బాల. ౨౧౬.

తొలిజాతివారు. వి.బ.(√తొలి[1]) బ్రాహ్మణులు.

సీ... నేలవేల్పులు తొలిజాతివారు ... నాఁగ బ్రాహ్మణులను నామము లగు. సాం. ని. మాన. ౨.

తొలిజేజే. వి. (√తొలి[1]) పూర్వదేవుఁడు, రాక్షసుఁడు.

మ. శివపూజానియమంబు మాని తొలిజేజేపెద్ద మాహిష్మతీ,ధవుఁ డాతండు బళీ కనంబడెను...ఉ. రా. ౩. ౨౨౭.

క. కావున మా కప్పనముగఁ, గావింపుము చాల్పుకుత్తుకలతొలిజేజేఁ, జేవ దలిర్ప నడంచిన, యా వెరవరికతయుఁ బూని యచ్చతెలుఁగునళ్. అచ్చ. రా. బాల. ౧౭.

తొలిదిక్కు. వి. (√తొలి[1]) తూర్పు.

ద్వి. అక్కలింపులు వాయు వెక్క నూర్చుటలు, ముక్కు వట్టుట తొలిదిక్కు చూచుటలు.పండితా. దీక్షా. ౫౮.

తొలిదుక్కి. వి. (√తొలి[1]) ముందటియరక.

గీ. మున్నరక యనఁ దొలిదుక్కి పొదలుచుండు. ఆం. భా. ౨. ౨౩౩.

తొలిదెసఱేఁడు. వి. (√తొలి[1]) ఇంద్రుఁడు.

వ...తొలిదెస ఱేనిచానలకుఁ జేరియుఁ జేరరాక యుక్కివులచక్కి నెక్కొను తెక్కగలవారలఁ బోలుగందంపుమ్రాఁకులును... అచ్చ. భా. ౩. ౩౮ పా.

తొలిదేవర. వి. (√తొలి[1]) ౧. పూర్వదేవుఁడు, రాక్షసుఁడు.

చ. తెఱవను జూప కున్నఁ దొలిదేవరప్రేవులు ప్రోవు లై పడళ్, జెటికెద...అచ్చ. రా. కిష్కి౦. ౮౩.

౨ బ్రహ్మదేవుఁడు.

ఉ...భారతీ,దేవిముఖంబుఁ జూచెఁ దొలిదేవర సాదరవీక్షణంబునళ్. ఉ. రా. ౨. ౨౦౦.

తొలినాఁడు. వి. (√తొలి[1]) పూర్వదినము.

గీ...సాహిణులు మ్రొక్కి, తెచ్చి ముందఱ తొలినాఁటి తేజి నిల్ప. కువల. ౨. ౫౫.

ద్వి. తొలినాఁడు మఱునాఁడు దోఁచెను వ్రేళ్లు, మొలకలవలెఁ దోఁచె మృదు వైనగోళ్లు. ద్వి. శ. సా. ౩. ౧౧౪ పా. ౧౫ పం.

తొలినుడి. వి. (√తొలి[1]) మొదటిమాట.

గీ. అనుచుఁ దొలినుడి నభిలాష లెనయ మూఁగి, పలుకుతోడనె నర్మగర్భంబు గాఁగ, నుత్తరము పల్లవశ్రేణి కొసఁగు చలరు, లమ్మురు...ఆము. ౨. ౧౯.

తొలినెల. వి. (√తొలి[1]) చైత్రమాసము.

సీ. తొలినెల తొలిఱెక్క తొమ్మిదియవనాఁట నాఱునొండవటిక్క నలరునాలు, గవల గనంబున...అచ్చ. రా. బాల. ౮౪.

తొలినేలదాల్పు. వి. (√తొలి[1]) ఉదయపర్వతము.

సీ. తొలినేలదాల్పు రేదార విడియింప నిర్మించినమగతాలమేడ యనఁగ. ఉ. రా. ౪. ౧౬౦.

తొలిపన్నగము. వి. (√తొలి[1]) ఆదిశేషుఁడు.

సీ...పన్నగంబులు తొలిపన్నగంబు లయ్యె.

గీ...కీర్తిసాంద్రరుచులు, మించి లోకత్రయంబాక్రమించుకతన. దశా. ౧. ౫౮.

తొలిపలుకుఁగొనలు. వి. బ. (√తొలి[1]) వేదాంతములు, ఉపనిషత్తులు.

గీ...తొలిపలుకుఁగొనలు, గాంచి మించినజడదారిగముల కైన,గనఁబడగ రాక యుండునిన్గంటి నేఁడు. అచ్చ. రా. ఆర. ౧౧౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తొలిపుట్టువు. వి. (√తొలి[1]) పూర్వజన్మము.
వ...హరుఁ డేమిసేయుఁ దొలిపుట్టువుల నేమి పాపంబు సేసితిమో యది యనుభవింపక పోవు నే యనువారును...ఉ. రా. ౪. ౯౪.

తొలిపెద్ద. వి. (√తొలి[1]) తొల్లిటిపెద్దవాఁడు.
సీ. పలుకుఁగొమ్మకు ఁ ఉనికి గలిగించు తొలిపెద్ద ...ఉ. రా. ౧. ౮౦.

తొలిపోటు. వి. (√తొలి[1]) మొదటిదెబ్బ.
క. వల దింకఁ బెక్కుమాటలు, తొలిపో పై నిలిచినాఁడ దుర మొనరింపన్, దలపడుము... జై. భా. ౨. ౬౫.

తొలిమబ్బు. వి. (√తొలి[1]) తొలకరిమేఘము.
గీ. విల్లు దెఱఁగంటివి ల్గాఁగ వింటిమ్రోఁత, లుఱుములుగఁ గల్గు మెఱుఁగులు మెఱుఁగుఁదీవి, యలుగ నెఱరాచ తొలిమబ్బు పొలసుదిండి, కొండపై నంపజడివాన గురియుచుండె. అచ్చ. రా. యు. ౫౧౮.

తొలిమల. వి. (√తొలి[1]) పూర్వాద్రి, తూర్పుకొండ.
క. కలువలు కిలకిల నవ్వెను, దొలిమల సెలయేటి యవలితుహినాంశుకరం,బులు గని...సారంగ. ౨. ౧౬౨.
క. తొలిమలగుహ యనుకొలిమిని, గలితోదయ సమయలోహకారుఁడు రాగా,నలమునను గాఁచి యెత్తిన, బలులోహపుముద్ద యనఁగ భానుఁడు దోఁచెన్. ప్రబంధ. ౧౨౦. కరు. ౫. ౬౬.

తొలియికర. వి. (√తొలి[1]) పూర్వనివాసస్థలము.
మ. తొలియిక్కల్ పరికించుఁ గన్గొలుకులం దుఃన్ నీరు నించున్...ఉ. రా. ౪. ౧౫౮.

తొలివేలుపు(ల్పు). వి. (√తొలి[1]) ౧. పూర్వదేవుఁడు, రాక్షసుఁడు.
సీ. తొమ్మండ్రు కొడుకులఁ దొలివేలుపులఁ జేయఁ బొడమించు నేదేవుబొడ్డుఁదమ్మి. ఉ. హరి. ౨. ౧౪౪.
సీ. వేల్పుదాయలు తొలివేల్పులు నా దైత్య నామంబు లగు...సాం. ని. దేవ. ౧౯.
౨. ఆదిదేవుఁడు, విష్ణువు.
సీ. తొలివేల్పుఁజిందంపుఁదోరంపురవళిచేఁ గర్ణరంధ్రములందుఁ గవియుఁ జెవుడు. ఉ. రా. ౨. ౨౧౪.

తొలివేల్పుఁగొమ్మ. వి. (√తొలి[1]) పూర్వదేవస్త్రీ, రాక్షసస్త్రీ.
గీ. ...పెద్దకొండవలె వచ్చు తొలివేల్పుఁగొమ్మఁ జూపి, బాసవాల్మిన్న యారాచపట్టి కనియె. అచ్చ. రా. బాల. ౧౧౧.

తొలివేల్పుపగతురు. వి. బ. (√తొలి[1]) దేవతలు.
సీ. ...జేజేలు తొలివేల్పుపగతురు పలుకుటల్లు, నేటులు...ననఁగ సురాభిఖ్య లౌ...సాం. ని. దేవ. ౧౮.

తొలు. విశ. (వృత్తియందు తొలుతశబ్దమున కంత్యవర్ణము లోపింపఁగా మిగిలినరూపము.)
ఉదా: తొలుఁబలుకులు, తొలుకడ, మొ.

తొలుఁబలుకు(లుకు–)లు. వి. బ. (√తొలు) వేదములు.
వ...నలువనలుమోములందు వెడలునలుదొలుఁబలుకులు...దశా. ౫. ౧౧౫.
ఉ...పెన్, వాలుగ వై మహార్ణవమునం దొలుఁబల్కులదొంగరక్కసున్, వాలికవంకవాఁడిగతి వ్రచ్చి...పారి. ౩. ౭౮.

తొలుకడ. వి. (√తొలు) పూర్వదిక్కు, తూర్పుదెస.
సీ. తొలుకడరాతాపసలు గెబ్బున ర్తిఁఉఁ డెద్దడి గుబురుకా తీర్లప్రొద్దు. అచ్చ. రా. పీఠి. ౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తొలుకబ్బము. వి. (√తొలు) ఆదికావ్యము, రామాయణము.

సీ. తొలుకబ్బ మొకటఁ గోర్కు లొసంగ స త్క్రియ లొనరించి ప్రజ సేమ మొందు ...సమీర. ౭. ౭౯.

తొలుక(ల్క)రి=తొలకరి. (చూ. తొలుకారు.)

సీ. నటియించు నప్సరఃకుటిలాలకల మేని మెఱుఁ గులు తొలుకరి మెఱుఁగులుగను. దశా. ౭. ౧౫.

చ. తొలుకరివానకాలమున...విక్ర. ౮. ౧౨.

సీ. ప్రబలవజ్రోపలప్రాసాదభాస మై తొలుకరి నిధి కుతూహలము నిలుపు. వసు. ౩. ౧౫.

చ. తరుణులు చంచలాలతలు తత్కరభాండ నికాయ మంబుదో,త్కరములు పాలు తేనెలు ఘృతంబులు వాన లఖండఖండశ,ర్కరలును ద్రాక్షపండ్లు వడగండ్లును శోభనభుక్తివేళ దొ,ల్కరిసమయంబు పేరెలమిఁ గైకొన కుం డునె భోక్తృసస్యముల్. నైష. ౬. ౧౨౧.

సీ. కారు చిత్తడి తొలుకారు తొలుకరి వా వర్షర్తుసంజ్ఞ యై పరఁగు చుండు. ఆం. భా. ౧. ౮౬.

తొలుక(ల్క)రించు=తొలకరించు. అ. క్రి. (√తొలుకరి)

(కురియు, వర్షించు)

గీ. తళుకుఁదేనియ నుడువులఁ దొలుకరింపఁ, గలి కిచూపులు వీనులఁ బలుకరింప, సొలపునడపుల నందియల్ గిలుకరింప. చంద్రా. ౩. ౬౨.

చ. జలజజుపజ్జ నొజ్జ యయి సజ్జగ మోములఁ దొల్కరించుఁ దొ,ల్పలుకుల మాధురిక్ జిలు కఁ బాడి...శివధ. ౧. ౬.

తొలుకా(ల్కా)డు=తొలుకు. అ.క్రి. (తొలు కు+ఆడు. స్వార్థమున "తొలఁకి+ఆడు" శ. ర.) పొంగు; అతిశయించు;వ్యాపించు.

సీ. ప్రవహించు నెచ్చోటఁ బరిపూర్ణసంపదఁ దొలుకాడుచు నపారదుగ్ధనదులు. కాశీ. ౨. ౨౨౮.

సీ. సకలవైభవములు సమకూరఁ దనయంతఁ దొల్కాడుకోర్కులతోడఁ గూడి. భాగ. ౬. ౫౦౪.

ద్వి. చెలువు దొల్కాడ నర్చించి పూజించి,య లరుచు ధూపదీపాదు లొనర్చి. పండితా. పురా. ౧౦౬ పు.

ఆ. చిన్ననగవు లేఁతచెక్కులఁ దొలుకాడ... వీర. ౨. ౨౪౮.

తొలుకా(ల్కా)రు=తొలకరి, తొలుకరి. (√తొలుత—తొలుకు+కారు. అని. శ. ర. కాని 'మలుకారు' అనుపదమును బట్టి 'తొలుత + కారు' అనుటయే యుక్తము. మఱియు 'తొలు' శబ్దమునుత్వమునకు అత్వమును 'కారు' శబ్దము నకు'కరి'అనురూపమును వికల్పముగా వచ్చును. చూ. తొలుకరి, తొలకరి.) వర్షర్తువు, వానకారు.

మ...మణికోదండములు ... ఆశాంతరాళంబు ధా,రుణియుం గప్పుచుఁ ద్రోఁచి రోలిఁ దొ లుకారుంబోలె నాధోరణుల్. కు. సం. ౧౧. ౭౦౫.

ఉ. కన్నులు గండుమీలు దొలుకారుమెఱుం గులు గాముబాణముల్. విక్ర. ౩. ౪౯.

ఉ...తిరం బగురూపుఁ జెందుతొ,ల్కారుమె ఱుంగు జీవకళఁ గాంచినచిత్తరుబొమ్మ యాన శృం,గారిణి యాసుధాసరసిఁగా నుతిసేయఁ గ వచ్చు నెచ్చెలిక్. హంస. ౧.౬౪. ఆం. భా. ౧. ౮౬.

తొలుకు=తొలుకాడు.

(అతిశయించు.)

గీ. పులియు మొదలగు మెకములు కలఁక తొలు కఁ, జెదరి నలుదిక్కులకుఁ బాఱె నదరి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బెదరి. ఉ. రా. ౭. ౪౦౫. ౨. ౯౫.

గీ. నిక్కఁ(జనుగుబ్బలఁ బయంట చక్కఁ(జేర్చి, పలికెఁ గలకంఠి మోమునఁ దెలివి దొలుక, ముత్తియపుముంగఱ యొకింత మోవిఁ గదియ. విజ. వి. ౨. ౧౬౧.

చ. జిలిబిలిచెమ్మట ల్దొలుకుచెక్కులు ముద్దుల మోవినొక్కులున్. శశాం. ౪. ౭౨.

తోలుకుడుపు. వి. (√తోలుత) అన్నప్రాశనము. (చి. ని.)

తోలుకొను. అ. క్రి. (√తోలుత) మొదలుకొను ప్రారంభించు.

క. తోలుకొని కుక్కుటరవములు, చెలఁగుడు ...కు. సం. ౫. ౧౫౪.

తోలుకోడి. వి. (√తోలుత) తెల్లవాఱుజామున మొదట కూసెడికోడి.

ద్వి. తోలుకోడి కూయంగ బలువిడి నేఁగి. బస. పు. ౪. ౧౬౫ పం.

తోలుగట్టు. వి. (√తోలుత) తూర్పుకొండ, ఉదయపర్వతము.

ఉ...లేఁగన్నియ లేనిమేను తోలుగట్టుతుదం బొదలెం గ్రమంబునన్. వసు. ౬. ౬.

తోలుగొలము. వి. (తోలుత + కొలము) బ్రాహ్మణవంశము, అగ్రవర్ణము.

క. అత్తోలుగొల మలరులసర,మెత్తినక్రియ... ఉదాత్తం బయ్యెన్. పాండు. ౪. ౨౬౬.

తోలుగొరు. వి. (√తోలుత) ఐరావతము.

చ... తెల్లనితోలుఁగొరు నెక్కినయిలాధరవైరియె చుమ్ము...చంద్రి. ౨. ౯.

తోలుచే(ల్చ)దువులు. వి. బ. (√తోలుత) వేదములు.

చ...తొల్చదువుల్ తగువిన్నపంబులం, బలుమఱుచేయు చందమున బంగరుటందియ లుగ్గడింపఁగన్. పాండు. ౨. ౩౨.

తోలుచు(ల్చు) స. క్రి. ౧. రంధ్రము కలదానినిగాఁ జేయు; బోలుగాఁ జేయు.

సీ. ఇరుమెయిఁ దొలిచి బెట్టిలఁ దూఱునవియును నలువుర నేవుర నాటునవియు. భార. విరా. ౩. ౧౬౧.

క. పులుఁగులును మెకంబులునుం, దొలిచి తినిన నెలవు దప్పి తొలఁగియుఁ గంటే,తలనున్న కనకదామము,పొలుపు దెగం బాయ దీన్పుం గమలాక్షా. భార. స్త్రీ. ౨. ౧౦౯.

సీ. నెత్తురు చీము నిండినకూపముల వ్రాలి పురుగు లంగముఁ దొల్వఁ బొగులువారి.ఉ.రా. ౩. ౩౨౩.

ద్వి. ఎముకలు దక్క ము న్నిడి తొల్చితొల్చి, గ్రమ్మన భక్షింపఁగా లెక్కఁ గొనక. పండితా. దీక్షా. ౩౬ పా.

౨. ఖండించు.

వ...సాయకంబులు...నొసళ్లు గ్రుమ్మియుఁ జరణంబులు తొలిచియుఁ జత్రంబు లూలిచియు బాహుదండంబులు గత్తిరించియు ... ఉ. హరి. ౧. ౧౪౫.

క. పులు మేయఁ గానసాంతర,ములు డాయ నిజశిశుమోహమునఁ జనఁ బాల్గ్రొల్ల లొసఁగ నసిధేనువు విమ,తులతలలఁ దొలుచు ననంతదోస్తంభమునన్. కకు. ౧. ౧౯.

౩. నాటు.

గీ. కాఁడె గ్రుస్సెను దొలిచెను నాడె ననఁగ, నాఁటె ననుమాట కరమూ నాగభూష. ఆం. భా. ౩. ౧౨౨.

తోలుచూ(ల్చూ)లు. వి. (√తోలుత) మొదటిబిడ్డ.

గీ. కర్ణుఁ దొలుచూలుగా నేల కంటి తల్లి. భార. స్త్రీ. ౨. ౧౫౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. అరియు శీతాంశుసోదరియును నజుఁడును
వాలు నిల్లాలు దొల్చూలు నగుచును. వైజ.
౪. ౧౧౬.

తొలుచెక్క- వి. (√తొలుత) మ్రాను లోనగు వానిమీఁదిపలుచని వెల్లభాగము, (దీనిని 'పొరాటుచెక్క', అని వాడుదురు.)

సీ. మలయజం బేవీటఁ దొలుచెక్క డులిచి
పేదల కిడ్డమిగులు భూములకు డిగ్గు. ఆము.
౨. ౩.

తొలుత=తొల్త. వి. ఔ. అవా. మున్ను, మొదటికాలము. (సమాసమున దీనియంత్యాక్షరము కొన్నియెడల నిత్యముగాను కొన్నియెడల వికల్పముగాను లోపించును.)

గీ...ఏనికదిండివార్వమ్ము దొలుత,గాఁగఁ దా
నెక్కి నన్నుఁ దాఁకకయ దీని,కటివిభాగం
బు నెక్క రాఁగలవె యబల, వెనుక మర
గొమ్ము నూఁతగాఁ గొనుచు ననియె. కళా.
౩. ౬౨.

గీ. అందునది భూతిఁ దొలుత నీయనుఁగుభార్య.
హర. ౨. ౬౦.

విణ. ముందుది, పూర్వపుది.

వ. తొలుతటిపాలయులుకయెడలం జనించిన వి
యోగశిఖి...పారి. ౧. ౫౨.

క... బేతాళభటులు తొలుతటిమగనిం, జెలి
ప్రక్క నునిచి...శుక. ౧. ౧౨౫.

చ. తొలుతటనుండియుక్ వలదు దుర్జయవైర
ము మాను మంచు ని,చ్చలు చెవినిల్లుగట్టు
కొని చాటితి...రాఘవ. ౪. ౫౪.

జః తొలకరి, తొలుకడ, తొలుకబ్బము, తొలు
కాడు, తొలుకారు, తొలుపలుకులు, మొ.

తొలుతపట్టి. వి.(√తొలుత) ప్రథమసంతానము, మొదటిబిడ్డ.

క. శత్రునృపకాలకూటము, మిత్రామృతవృష్టి
బుధసమీహితసిద్ధి,క్షేత్రము సజ్జనసంస్తుతి,
పాత్రమితఁడు మాద్రితొలుతపట్టి నరేంద్రా.
భార. విరా. ౫. ౩౭౯.

క. ఆసమయంబున నరుణో,ద్భాసితగాత్రుండు
తొలుతపట్టి యరుణుఁ డు,ల్లాసి యగుచు
రవిపరిచ,ర్యాసుఖ మెదఁ గోరి చనియె నం
బరవీథిక్. భార. అను. ౧. ౧౭౫.

తొలుతాఁకు. వి. (√తొలుత) మొదటియుద్ధము.

క. మెఱయ వెలిమావులును గడు,మెఱుఁగారె
డునరదములును మింటను మంటల్,వఱపెడు
వాలమ్ములుఁ జూ,పఱ నత్తొలుతాఁకు వెఱఁ
గుపడఁ జేసె నృపా. భార. కర్ణ. ౩.౨౭౮.

గీ...రథగజహయభటాభీలచటుల,గతిఁ బరికు
ణసంగరక్షితితలము,వీక బెరసినయత్తొలు
తాఁకునపుడు. భార. భీష్మ. ౧. ౨౪౨.

తొలుదీవి. వి. (తొలు+దీవి) జంబూద్వీపము. (అధిష్ఠానపురము) సీ...కళ్యాణపరంపరలతొలు
దీవి. వసు. ౧. ౯౪.

తొలుదొలుత(ల్త). వి. ఔ. అవా.(తొలుత+తొలుత—తొలుతయొక్క ఆమ్రేడితరూపము.) మొట్టమొదలు.

చ. తొలుదొలుతక్ విలోలగతిఁ దొంగలిఱెప్పల నాని...వసు. ౩. ౪౯.

సీ. తా శుద్ధసత్త్వప్రధాన యై తొలుదొల్త
నాత్మ నీశ్వరుఁ జేసినట్టిజాణ. ఇందు. ౧. ౭.

సీ. తొలుదొల్త నుదయాద్రిశిలఁ దాఁకి తీం
డ్రించునసిలోహమున వెచ్చనై జనించె.
మనుచ. ౧. ౩౭.

తొలునా(ల్నా)ఁడు. వి. (√తొలుత) పూర్వదివసము, గతదినము.

గీ. చెలఁగి తొలునాఁడు తరవాయిఁ జెప్పినట్టి,
యెల్లపన్నంబు లేకరువిడి... రా.వి.౨.౭౫.

ద్వి. ఘనుఁడు సోమేశుఁ డాదినముదొల్నాఁ
డు. బస. పు. ౬. ౬౪౫ పం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తొలునీటిరిక్క. వి. (తొలుత + నీటిరిక్క) పూర్వాషాఢానక్షత్రము. (శ. ర.)

తొలుప(ల్ప)ంది. వి. (తొలుత + పంది) ఆది వరాహము.

గీ...తొల్పందిగున్న వై వానిఁ జీటి, కోఱకొన మన్ను దాల్పవే కోరి నీవు. అచ్చ. రా. బాల. ౧౫౩.

సీ. నిలువెల్ల వెండ్రుక ల్బలసి నేలయుఁ ద్రవ్వుకొని మనుతొల్పందిగున్న నెన్ని. అచ్చ. రా. బాల. ౪౬.

తొలుపక్కము. వి. (తొలుత + పక్కము) పూర్వపక్షము, శుక్లపక్షము. (శ. ర.)

తొలుప(ల్ప)ట్టి. వి. (√తొలుత) మొదటిబిడ్డ.

క. విను ప్రద్యుమ్నుఁడు రుక్మిణి, కనఘా తొలుపట్టి...హరి. ఉ. ౩. ౨౧౦.

ఉ...గౌరిదేవితొ,ల్పట్టి గణేశ్వరుండు...భీమ. ౫. ౧౧౬.

సీ...బిట్టేసె మాద్రితొల్పట్టి యైదు,తీవ్రాస్త్రముల...భార. శల్య. ౧. ౧౯౪.

తొలుపలుకులు. వి.బ.(√తొలుత-తొలుఁ బలుకులు అని. శ.ర.) వేదములు.

క. మలవిల్లుఁ జిలువనారియుఁ, బులుఁగుసిడము జోదుముల్కి పుడమియరదముగ్, దొలుపలుకువారువంబులుఁ, జెలఁగఁగఁ దిగఁబ్రోళ్లు గూలిచినబలియునరుగ్. అచ్చ. రా. బాల. ౨౨.

తొలుపాటికయ్యము. వి. (√తొలుత) ప్రథమయుద్ధము.

రగడ. తొలుపాటికయ్యమునఁ దొడరు నాసీరులును. పి. శకుం. ౩. ౨౨౫.

తొలుపుట్టువు. వి. (√తొలుత) పూర్వజన్మము.

క. తొలిపుట్టువునీనోముల,ఫల మెట్టిదయో... పి. శకుం. ౪. ౩౧.

తొలుప్రాఁకు. వి. (√తొలుత) తీఁగ యల్లుటకు సమీపమున నిడుకొయ్య లోనగునది, మొదటి యాశ్రయము, ఉపఘ్నము.

క. ఇంతకు మూలము దృష్ణా,తంతులతయ వత్స వినుము దానికి సదరం, గాంతాజనంబు దొలుప్రాఁకింత యెఱిఁగి తృష్ణ దొఱఁగు టిచ్చవిముక్తిక్...భార. శాం. ౪. ౨౯౩.

తొలుబాము. వి. (√తొలుత) పూర్వజన్మము.

సీ. దుఃఖంబుఁ బొమ్మని త్రోవ సుఖంబు రమ్మని తెచ్చికొన వశ మయ్య వానిఁ, దొలుబామునందలిదుష్కృతంబును సుకృతంబు హేతువులుగఁ దగిలి చేయు. భార. శాం. ౧. ౧౦౫.

తొలుబొ(ల్బొ)ట్టెఁడు. వి. (√తొలుత) పెద్దబిడ్డఁడు.

దండకము...గట్టిగాఁ గన్నతొల్బొట్టెనిం బట్టియిటటుగా బిటు దటించుచుగ్ ... అచ్చ. రా. యు. ౧౬౧.

తొలుమామ. వి. (√తొలుత) మొదటిభార్య తండ్రి.

సీ. తొలుమామ యగుదక్షు నెలదోఁటనడుచక్కి విహరణం బొనరించువేడ్క కాఁడు. భీమ. ౩. ౩౬.

తొలుమినుకులకడలు. వి. (√తొలుత) ఉపనిషత్తులు.

వ...తొలుమినుకులకడలం గనరానియాతనిం బలుదెఱంగులం బొగడె...యయా. ౩.౩౧.

తొలుమినుకులు. వి.బ.(√తొలుత) వేదములు.

క...తొలుమినుకులు ప్రామినుకులు దొలుపలుకులు ప్రాఁ,బలుకులు పెనుమినుకులు నా, వెలయుగ్ శ్రుతులకును పేళ్లు...ఆం. సం. దేవ. ౪౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తొలుముద్ద. వి. (√తొలుత) మొదటిముద్ద, ప్రథమకబళము.

క...దుర్ధర్షణుఁ డిదె యిం,దు నడపు మరదంబు వీఁడు దొలుముద్ద యగుక్. భార. ద్రో. ३. ३౯.

తొలుమేను. వి. (√తొలుత) పూర్వదేహము, పూర్వజన్మము.

సీ. తొలుమేనఁ జేసినదుష్కృతశక్తి యో... భార. అర. ౨. ౧౧३.

తొలుమొగులు. వి. (√తొలుత) వర్షించుచున్న మేఘము, ఘనాఘనము.

రగడ. తొలుమొగుత్తెగఁ దెగడునెమ్మెయి తో రపుంజిగి కడలఁ గప్పఁగ...అచ్చ. రా. యు. ౬౮.

తొలురిక్క. వి. (√తొలుత) అశ్వినీనక్షత్రము. (శ. ర.)

తొలురిక్కనెల. వి. (√తొలుత) ఆశ్వయుజమాసము. (శ. ర.)

తొలువేలుపు(ల్పు)=తొల్వేలుపు. వి. (√తొలుత) పూర్వదేవుఁడు, రాక్షసుఁడు.

సీ. తొలువేలుపుల వేలుపులపనుల్ గొనుఁడు...మనుచ. ౫. ౪౭.

తొలువేల్పురా. వి. (√తొలుత)రాక్షసరాజు.

సీ. తొలువేల్పురాప్రతిమలచెక్కడపుగండపెండెంబు ఠాకాల దండిఁ జూప. ఉ. రా. ౨. ౪౨.

తొలుసంజె. వి. (√తొలుత) ప్రాతస్సంధ్య.

సీ. ఒకదీవిఁ దొలుసంజ యుద్దేశమునఁ బొందు నుదయించు మఱుసంజ యొండుదీవి. కాశీ. ౧. ౧౭౯.

మ...పంకేరుహం,బుల నాడెం దొలుసంజఁ దేటివలయంబుల్...ఆము. ౪. ౧౫.

తొలుసమర్త. వి. (√తొలుత) ప్రథమర్తువు, మొదటిముట్టు. క్రీడా. ౬౦.

తొల్త=తొలుత.

మ...భారతికి గాదిలి ముర్వురతొల్తపేరు ని, త్యమ్ముగ నాయు వీవుతఁ గళాఢ్యుఁడు పోలయవేమశౌరికిన్. హరి. పూ. ౧. ३.

జః తొల్తచూలు.

తొల్తచూలు. వి. (తొల్త+చూలు) మొదటిబిడ్డ.

చ...కర్ణుఁడు గొంతితొల్తచూ,లని యుదకప్రదానసమయంబున నాయమచేత వింటి ...భార. శాం. ౧. ౭.

తొల్లి[1]=తొలి[1]. వి. ఔ. పూర్వము, మునుపు.

గీ. మూఁడుసంధ్యల నీచేత మ్రొక్కు గొందు, రెవ్వ రిటు తొల్లి యావేల్పు లెల్ల నీకు,నర్థిమ్రొక్కఁగ నునికి భాగ్యంబు గాదె, యేల సందేహ మమరేంద్రు నేలికొనుము. నైష. ३. ౧౨౯.

విణ. ముందటిది.

క. తొల్లిటిసచ్చారిత్రము, లెల్లను దిగ విడిచె ...భార. శాం. ౪. ౪౦౪.

క. వారును దొల్లిటికంటె నపారప్రారంభులై రపరిమితశక్తిన్. భార. శాం. ౨. ౧౪.

గీ. కఱపె నర్జునుఁ దొంటిభార్గవుఁడు వింటు, నిట్టిఁ డేయని పొగడంగ నెల్లజనులు. భార. ఆది. ౫. ౨३౦.

చ...తొంటిరా,జుల కెనవత్తు...భార. కర్ణ. ౧. ౨౫.

సీ...తొల్లింటియట్టులు పెల్లు రేఁగి, యనలంబు నార్పఁగ నార్చుచుఁ బఱతెంచి వనరక్షకులు పార్థునిశితాస్త్ర,ధారల నపగతదర్పులై యరిగిరి...భార. ఆది. ౮. ౨౬౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తొల్లి² = తొలి³. వి. (త. తొళ్ళై) రంధ్రము.

చ. వఱపున మేను లెండఁ దమవారియొడం బె
డఁబాసి జీవముల్, దొఱఁగి ధరిత్రి డింది
యతిదుర్దశఁ గాలము వేచి యుండఁగా,
నుఱ వగువానఁ బ్రాణములు నొయ్యన నూ
ల్కొన మన్నుదొల్లి నే,డ్తెఱఁ గనుపట్టుదర్దు
రతతిఁ గని యుద్యమ మొప్పఁ జేయఁగన్. నా. పంచ. ౨. ౧౪౪. (శ. ర. పా. "మన్నువోలె" అని ముద్రి. పా.)

జ. తొల్లిక.

తొల్లిక. వి. (తొల్లిక. చి. ని. √తొల్లి³) ౧. త్రవ్వుటకుపయోగించు చిన్నయినుపసాధనము.

చ. భయ మనుతొల్లికన్ విమలభావవసుంధరఁ
బెల్లగించి...కాళ. ౪. ౧౨౨.

౨. మత్స్యవిశేషము.

సీ. మిసిక ల్లురజు తేలుమీను తొల్లిక జాతిగొ
రక మాపురమును గుంటముక్కు. హంస. ౪. ౧౮౭.

తొల్వేలుపు(ల్పు)=తొలువేలుపు. వి. (√తొలుత)

గీ...తొల్వేల్పు లేని, తమ్ముఁడు విభీషణుఁడు
...అచ్చ. రా. యు. ౫౪.

సీ. కూళతొల్వేలుపుకూటువగాటంపుటడవుల
మేటిపయ్యరయనుంగ.అచ్చ.రా.బాల.౬౩.

తొళ్లి(ళ్ళ)క. విణ.మిక్కిలిపలుచనిది.(చి.ని,శ.ర.)

తోవ= తోగ. వి. కలువ.

మ. తోవకుం దూరపునంటు రేమగువపొందున్
బూర్వపక్షంబు...వసు. ౪. ౧౨౯.

క. తోవలా కన్నులు వలిజక్కవలా పాలిండ్లు
...అచ్చ. రా. బాల. ౧౩౩.

సీ. తోగ తోవ కలువ నాఁ దోఁచు నుత్పల
ము...ఆం. భా.౧. ౧౬౪.

జ. తోవకంటి, తోవరాయఁడు, తోవలరాయిడి కాఁడు, తోవలనూడు, తోవవిందు, తోవసామి, మొ.

తోవకంటి. వి. (√తోవ)-కలువకంటి- స్త్రీ.

సీ. తోవకంటి కుండలీంద్రుఁ డితండు గాఁ డైవ
నమరభోగినులమే లరయ కున్నె. చంద్రా. ౩. ౧౧౩.

క. ఈ లీల నన్నివిద్యలు, వేలుపుఁదోవకంటి
చూపి...చంద్రి. ౨. ౯౦.

తోవర= తోగర. విణ. (సం. తువరః) ఒగరు గలది, వెగటురుచి గలది.

సీ. చివు రెల్లఁ గసి నొత్తి తోవరాకు గుత్తుక
డెక్కొని కోయిల వెక్కుచుండు. కు. సం. ౫. ౬౪౧.

వి. ఒగరు. (శ. ర.)

తోవరాయఁడు. వి. (√తోవ) చంద్రుఁడు.

చ. అపుడు రణోత్సుకుం డగుసితాంబుజనాయ
కుకంటిసన్నఁ గీ,రపటలి చల్లగాడ్పు తోవ
రాయఁడు,..చంద్రి. ౨. ౭౭.

తోవరి=తోగరి. (శ. ర.)

తోవరిమ్రాను. వి. (√తోవరు) తువరిక, తొగరు.

గీ. తోవరిమ్రా ననఁ దువరిక దోఁపఁబడును. ఆం. భా. ౨. ౬౨.

తోవరు=తోగరు. వి. ఎఱుపు.

గీ. కావి జా జెఱ్ఱన రెఁఱుపు జేవురు తోవ,
రనఁగ రక్తాఖ్య వెలయు ... ఆం. భా. ౧. ౧౦౭.

సీ...తోవరు తొగరు, కెంజాయ యెఱు వెఱ్ఱ
కెం పన రక్తవర్ణ మగు...సాం.ని.సా.౬౦.

విణ. రక్తవర్ణము గలది,ఎఱ్ఱనిది.

సీ...తోవరుఁబుట్టములఁ గెంబువులఁ దాల్చి.
అచ్చ. రా. యు. ౩౨౩.

జ. తోవరిమ్రాను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తొవఱేఁడు. వి. (√తొవ) చంద్రుఁడు.

సీ. తులకించు తనకీర్తి తొవఱేని సువఱేనికవ మేనిచకచకచ్ఛవి హసింప. రఘు. ౧. ఆ. ౧౭ పా. ౫౩ పం.

తొవలరాయిడికాఁడు. వి. (√తొవ)-కలువలను బాధించువాడు-సూర్యుఁడు.

సీ. వెన్నునివలకన్ను వేఁడివేలుపు ప్రొద్దు తొవలరాయిడికాఁడు...ఆం. సం. దేవ. ౧౦.

తొవలసూడు. వి. (√తొవ) - కలువలకు విరోధి - సూర్యుఁడు.

గీ. పొడుపుమలనుండి పడమటికడలి కరుగఁ, బవలు నలుజాములును బట్టుఁ దొవలసూడు, తత్తడులకు...నీలా. ౧. ౩౮.

తొవవిందు. వి. (√తొవ) కుముదబాంధవుఁడు, చంద్రుఁడు.

లయగ్రాహి. కోరి తొవవిందు తనకోరిజిగి యాకచన కోరి యని చేరెడుచకోరియు...కళు. ౩. ౧౦౫.

తొవసామి. వి. (√తొవ) చంద్రుఁడు.

చ...ఈ,జలజశరోపమాను నెఱచక్కఁదనంబు జగంబు లెంచ ని,చ్చలు నెదఁ గుందఁ జేయుఁ దొవసామి...చంద్రి. ౫. ౧౧౮.

తొస్స. వి. ఉచ్చారణలోపము. (శ. ర, చి. ని.) ఉదా: తొస్సమాటలు.

తొస్సె. విణ. పండ్లులేనిది, బోసి. (శ.ర, చి.ని.)

## తో

తో. ప్ర. ధ్రు. (√తోడు[1]. 'తోడన్' అనుశ్రుతీయావిభక్తిప్రత్యయముయొక్క లుప్తశేషరూపము)=తోడ. ౧. సహార్థకము, కూడ అనునర్థమిచ్చును.

క. అమృతముతో నుద్భవమై, యమరేశ్వరయోగ్యమైనహయరత్నము...భార. ఆది. ౨. ౨౬.

సీ...జూదమునాఁడు వెడలి వారరిగెడునయ్యవసరముఁబోలె, భటసమేతముగ నప్పాండుతనూజులతోన యయుతుండు దానసరిగె. భార. మహా. ౨౦.

౨. "మాటలాడు" అనునర్థమిచ్చుధాతువుల అముఖ్యకర్మములకు అనుప్రయుక్తమగును.

శా. రక్షోరాజతనూజతో సుగుణతో నాతో సమం బాడెడిన్. భాగ. ౯. ౫౨౧.(సమం బాడెడిన్ = సమానముగా మాటలాడుచున్నది. అని భావము.)

వా: ఎందుచేత నీవు నాతో మాటాడవు. ఈమాట వానితోఁ జెప్పుటకు మన సొప్పకున్నది.

౩. (సంస్కృతమున అవ్యయీభావసమాసములందలియథాశబ్దమువలె) "కొలఁదిని, అనుసరించి'' అనునర్థమిచ్చును.

సీ. సవినయంబునఁ దనశక్తితో గురునకు దక్షిణయిచ్చి యాతండు వనుప. భార. శాం. ౫. ౧౩౯.

౪. తుల్యార్థయోగమునందు వచ్చును. (అనఁగా తుల్యార్థకశబ్దములు ప్రయోగించునపుడుఉపమానశబ్దముల కనుప్రయుక్తమగును.)

సీ. తారకామందారతారాచలంబులతో రాయునెవ్వనిచారుకీర్తి. క్రీడా. ౧౪.

(వ్యవ) పరాక్రమమున వాఁడు విక్రమార్కునితో సమానుఁడు.

౫. చేత,చే. కరణార్థకము. (అనఁగా దీనితో నున్న పదము కరణము - సాధనము - అని తెల్పును.)

ఉదా:- వాలిని రాముఁడు ఒక్కమ్ముతోఁ గూలనేసెను.

౬. వలన. (ఇది నియమపూర్వకవిద్యాస్వీకారమున గురువాచకపదముల కనుప్రయుక్తమగును.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(అభిమన్యుఁడు)మత్తకోకిల. ఆదిఁగోలెను గృష్ణు
చే దయ నావృతుండయి ధౌమ్యుతో, వేద
మంగయుతంబుగాఁ జదివెఁ ధనంజయుతో
ధను,ర్వేదమిమ్ముగ నభ్యసించె...భార.ఆది.
౮.౨౨౪.

ద్వి. కర మొప్ప విలువిద్యఁ గడిమిమై నేను,
హరునితోఁ దొల్లి యభ్యాసంబు సేయ. రం.
రా. బాల. ౪౯ పా. ౬ పం.

సీ. సాంగంబు లగుచుండ సకలవేదంబులు సది
వె వసిష్ఠుతో...భార. ఆది. ౪. ౧౬౮.

౪. "పైని,మీఁద," అనునర్థమిచ్చును.

వ. ఇవ్విధంబున విసరి నేలతో వ్రేసి వీపున
మండి వెట్టిన. భార. విరా. ౨. ౧౫. (నేల
తో=నేలమీఁద, నేలపైని. అని భావము.)

శ్లో. ప్రత్యపింష న్మహాబాహు స్తలం భువి
వృకోదరః. సం. భార. విరా. ౧౪. ౫౨.

౮. షష్ఠ్యర్థమున "క్రిందు" లను మాఱుగాఁ బ్ర
యోగింపఁబడును.

చ. మనమున నీవు గోరున్నృపమన్మథుతో నినుఁ
బెండ్లిసేయ నీ,జనకుఁడు సంభ్రమించె...కవి
క. ౩. ౯౯.

౯. ఇది 'తోడు'వలె ప్రకృతితోఁ గూడకయే
ప్రత్యేకముగాఁగూడఁ బ్రయోగింపఁబడును.

(క) కూడ, తోడుత, సహార్థకము.

క. అనుజులు ద్రుపదాత్మజయును, ననుచరము
ఖ్యులును ధౌమ్యుఁ డాదిగ విద్వ, జ్జనులును
దోఁ జనుదేరఁగ,నినసన్నిభతేజుఁ డరిగె నిభ
పురమునకుఁ. భార. సభా. ౨. ౧౪౮.

సీ. చెదరి తోఁ బఱతెంచు చెందమ్మిరేకులు గాడ
గొని మొగుపుఁగెంగేలు గాఁగ. కు. సం.
౯. ౨౮౧.

ఉ. అపరకాలుఁడు... చారుచతుర్విధ కావ్యక
ల్పనా,నైపుణియుఁ సమస్తరిపునాశనశక్తి
యుఁ దోన హెచ్చఁగాఁ.పరమ.౪.౧౪౯.

(చ) - దేశకాలములందు - అవ్యవహితముగా,
వెంబడి, వెనువెంట.

ఉ. ఎక్కడఁ బోవవచ్చు గిరులేనియుఁ గాన
నభూములైనఁ దో,నెక్కియుఁ జొచ్చియుం
బగతు రేడ్తెఱఁ గిట్టి చలంబునం దలల్,ద్రొ
క్కక తక్కరు...భార. శల్య. ౧. ౩౦౪.

క. ఉద్యతులై కవలును ధృష్టద్యుమ్నుఁడుఁ
గడఁగఁ దోన సౌభద్రుండుఁ,మాద్యద్గతిఁ
గవియుడు...భార. భీష్మ. ౧. ౨౩౮.

గీ. కృష్ణసారథికం బగుజిష్ణురథము, దొడరి నీ
వెందుఁ జొచ్చినఁ దోన చొచ్చు. భార.
ఉద్యో. ౪. ౨౦౩. హరి. పూ. ౧. ౧౨౧.

తోఁక=తొంక. వి. (క. తోకె. త. తోకై) పశు
పక్ష్యాదులపుచ్ఛము, వాలము.

క. వీఁక సెడి ఘనగదాహతిఁ,దోఁకయు గద
లింపలేక దుస్సహపీడఁ, మ్రోఁకరిలఁబడి
యె నేలను,సోఁ కోర్వక దిగ్గజంబు సుడి
సుడిగొంచుఁ. భాగ. ౮. ౩౬౧.

ఆ. తనువుఁ గొమ్ము గొరిజఁ గొనకుండ మలఁపు
చుఁ, జప్పు డెసఁగఁ దోఁక నప్పళించి.
ఆము. ౩. ౨౧.

సీ...తూఁగాడు వెంట్రుకతోఁకవాని. దశకు.
౫. ౪౦. (వెంట్రుకతోఁక=తోఁకవలె వ్రేలా
డుజుట్టు.)

తోఁకకచ్చడము = తోఁకవలె వ్రేలాడుకొసగల
గోఁచి.

ద్వి. తోఁకకచ్చడములు దాకపొట్టలును, నొడ్డు
ఱొమ్ములు దొడ్డయూరులు...పండితా.పర్వ.
౩౪౪ పా.

తోఁకద్రొక్కినమహాహి= ఇది కోపోద్రిక్తుఁడైన
వాని కుపమానముగా కవులు వాడుదురు.

చ. అనవుడుఁ దోఁకద్రొక్కినమహాహివిధంబునఁ
గోల బెట్టు దాఁకినపులిరీతి...రాజుఁ గాంచి
బ్బల్మిని తనుఁ బట్టునో యనుచు మీనవిలో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చన జంకె నెమ్మదిన్. చెన్న. ౫. ౧౩౩.
(ఇల్లే, తోఁక ద్రొక్కినత్రాఁచు. మొ.)
తోఁకద్రొక్కు=పరాభవించు.
సీ. వాసవాశ్వము నైన వడిఁ జూపి లంఘించి
తోఁకద్రొక్కఁగఁ జాలుతురగతతులు.
రంగా. ౧. ౧౮౮.
తోఁకముడుచు=వెనుకకు తగ్గు.
(వ్యవ) వాఁడు వానితో పోరాడలేక తోఁక ము
డిఁచినాఁడు.
జ: తోఁకగుంజ, తోఁకచాలు, తోఁకచిచ్చు,
తోఁకచుక్క, తోఁకపీఁకుడుగాఁడు, తోఁక
పీఁకుడువ్యవహారము, తోఁకపురువు, తోఁక
మిరెము.

తోఁకగుంజె. వి. (√తోఁక) ఆఁదోఁకగాఁ నేర్ప
డిన స్తంభము. (శ. ర. బ్రౌ.)

తోఁకచాలు. వి. (√తోఁక) తోఁకవలెనుండు
నాఁగటిచాలు. (చి. ని.)

తోఁకచిచ్చు. వి. (తోఁక + చిచ్చు)—తోఁక
వలె దీర్ఘముగా వ్యాపించియుండునిప్పు.
(నిప్పు రగిలించినపిడుకలవరుస. అని శ. ర.)
గీ. తోఁకచిచ్చన నౌర యుద్ధురతఁ గృష్ణరా
యబాహుప్రతాపజాగ్రన్మహాగ్ని. మనుచ.
౧. ౩౭.
వ...రంజకంబుదినుసున సురటిఁ ద్రిప్పినట్లు
తోఁకచిచ్చునాఁగ నెదిర్చినపగరగుండెలు
చిద్రుపలుగ విదుర్పవలె నిల యద్రువ నను
చు...ప్రబంధ. ౭౮౮.

తోఁకచుక్క. వి. (తోఁక + చుక్క) -జ్వాలా
మయ మైనతోఁక గలచుక్క- ధూమకేతువు.
క. అరచందురుడెందములోఁ,జొరఁబాఱి వణం
కుతోఁకచుక్కయపోలెన్, నరవుం దేసిన
బాణము, హరినిటలతటంబు నాఁటి యల్లల
నాడెన్. ఉ. హరి. ౧. ౧౫౩.
గీ. తోఁకచుక్కలఁ బోలు దిక్తోయజముల,వెలితి
లేకుండ మీబోఁటిచెలులఁ జూచుఁ, గాంత
వీక్షింప దరగంటఁగాని మమ్ము. నైష. ౮.
౬౦.
గీ. అంతఁ జంచలకుంభికుంభాగ్రనిహిత,పుష్ప
దామంబు దిగజారి భూమిఁ బడియె, దేవవి
భురాజ్యగర్వత మోవినాళె,సూచకం బయి
పడుతోఁకచుక్క యనఁగ. దశా. ౨. ౨౧.

తోఁకపీఁకుడుగాఁడు. విణ. (√తోఁక) వ్యవ
హారమును తెమలనీయక చిక్కులు పెట్టువాఁ
డు. (బ్రౌ.)

తోఁకపీఁకుడువ్యవహారము. వి. (√తోఁక) ఎ
ప్పటికి తెమలక చిక్కులు పెట్టుచుండువ్యా
పారము. (వా)

తోఁకపురువు(ర్వు). వి. (√తోఁక. త. తోం
గల్పుళు)పుచ్ఛము గలక్రిమివిశేషము. (ఇది ము
త్తికినీటిలోను వ్రణాదులలోను బయలుదేఱును.)
చ. హరిఁ బరమేశ్వరుం బ్రభు సమస్తజగత్పితి
యుఁ గీడువల్కుదు,ర్నరుఁడవు నీదుజిహ్వ
పలువ్రయ్యలు వాయదు నోరఁ బెల్లుగాఁ,
దొరఁగవు తోఁకపుర్వులు...హరి. ఉ. ౬.
౧౮౫.

తోఁకమిరె(రియ)ము. వి. (√తోఁక) తోఁక
వంటిముల్లు గలమిరియము, చలువమిరియము.
(శ. ర. బ్రౌ.)

తోఁగు. అ. క్రి. ౧. మునుఁగు, స్నానముచేయు.
ఉ. రేఁగి చకోరదంపతులఁ ద్రేల్చినకల్మష
పంక మిందులోఁ, దోఁగినఁగాని పాయ దని
తోయజబాంధవుఁ డిట్లు చేసెనో, నాఁగఁ
బ్రశాంతి నొంది...అపరాంబుధిఁ జొచ్చెఁ
జెచ్చెరన్. భోజరా. ౨. ౯౮.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క...రిత్తజ,లములం దోఁగిన శుచిత్వలాభము గలదే. భార. అను. ౪. ౨౪౨.

చ...ఈయమునాతటినీహ్రదంబులో, వదలక తోఁగి నన్ను నుపవాసముతోడఁ దలంచి కొల్చుచున్. భాగ. ౧౦ పూ. ౬౯౭.

౨. తడియు, ఆర్ద్రమగు.

సీ. ప్రస్వేదమునఁ దోఁగి ఫాలంబుతో నంటి యుగ్మలి నీకురు లొప్ప గండె. భార.విరా. ౨. ౧౫౬.

గీ. ఆపగానందనుండు మురారియురము, బాణవితతిని భేదింప శోణితమునఁ, దోఁగి యతఁ డొప్పెఁ దలిరాకు దుఱఁగలింప, మెఱయునవపారిజాతంబు తెఱఁగు దాల్చి. భార. భీష్మ. ౨. ౪౩.

క. మంచునఁ దోఁగినపల్లవ,సంచయము భవద్వియోగసంతాపరుద,చ్చంచలనయనాబాష్పక,ణాంచితబింబోష్ఠలీల నలరె నుపేంద్రా. పారి. ౨. ౬౨.

౩. స్రవించు,కాఱు.

గీ. జాఱుసిక దోఁగుచెమ్మట శ్రమముఁ జూప, వీరశృంగారరసములు వియ్య మంద. దశా. ౪. ౪౭.

౪. మిశ్రమగు, కూడు, కలియు.

క. ఊఁగెడుపల్లును విసమునఁ, దోఁగినవంటకముఁ గుత్సితుం డగుమంత్రిన్,లోఁగక యున్మూలించిన,చోఁ గలుగు నఖండ మైనసుఖ మెవ్వరికిన్. వేం. పంచ. ౧. ౩౪౩.

ఉ. కామినిఘర్మబిందువులు గస్తురిబొట్టునఁ దోఁగి రేఖలై, కోమలగండపాళికల కోణములం దిగజాఱి...నైష. ౮. ౮౩.

జః తోఁకువ, తోఁచు[2].

తోఁచే=తోటి. వి. మాలవాఁడు, చండాలుఁడు.

సీ. పనఁగుఁ జండాలుండు సురియాళు వనఁగను మాలఁ డనంగను మాల యనఁగఁ, దోటి యనంగను దోఁచ నా ...ఆం. భా. ౨.౨౮౯.

తోఁచిగాఁడు= తోనిగాఁడు. వి. శ్యేనవిశేషము, ఒకజాతిడేగ.

సీ. పొద దూరునొక మేటిపూరేటి వెలికిఁ బోఁ దోలి కైకొనె నొక్క-తోఁచిగాఁడు. మనుచ. ౪. ౫౮.

తోఁచు[1]. అ. క్రి. ౧. గోచరమగు.

(క) నేత్రగోచరమగు, కనఁబడు, అగపడు.

క. అచ్చట నంతర్హితుఁడై, యుచ్చఁ జనియెఁ దోఁచు నేఁటి యెల్లిటిలోనన్. భార. విరా. ౫. ౩౦౧.

గీ. ఇందులాంఛనసితి దలక్రిందు గాఁగఁ, దోఁచుచున్నది ప్రజ యెల్లఁ దృంగనున్నె. భార. భీష్మ. ౧. ౧౧.

గీ. కన్నులను దోఁచుచున్నది గాని చేతి,కబ్బదద్దంబులోఁ దోఁచులిబ్బిపగిది. శశాం. ౪. ౭౧. విక్ర. ౩. ౧౨౬.

(చ) (దేవతాదులు) ప్రత్యక్షమగు,సాక్షాత్కరించు.

గీ. ఎదురఁ బ్రత్యక్షమయ్యె లక్ష్మీశ్వరుండు.

క. ఈతెఱఁగునఁ దోఁచినహరి,కాతఁడు సాష్టాంగ మెరఁగి...మనుచ. ౬.౧౦౨, ౧౦౩.

గీ. తోఁచెఁ గమలేక్షణుండు చతుర్భుజుండు. ఆము. ౪. ౧౧.

(ట) శ్రవణగోచరమగు,వినఁబడు.

చ...చక్రఘోషమున నించుక యించుక గాని యంత యేర్పడ వినఁ గాని నీపనుచుఁ బల్కినచందము దోఁచె మానినీ. నైష. ౨.౫౯.

(త) మనోగోచరమగు, మనస్సునకుపొడగట్టు.

క. సౌమ్యు లసౌమ్యులభంగి న,సౌమ్యులు సౌమ్యులవిధమున జనవర చిత్తా,గమ్యతఁ దో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తురు వారిని,సమ్యఙ్నిశ్చయతఁ గాంచుఛందము సెపుమా. భార. శాం. ౩. ౫౨.

గీ. విక్రమంబున నాదిత్యువిధము దోఁప,సుప్రతాపానురూపతేజోవిశేష,కలితుఁ డగు నని తజ్జ్ఞ నఫల మెఱింగి. విక్ర. ౧. ౧౮౩.

చ...వాడినసెజ్జలమీఁదిప్రావిరుల్,వొలఁగఁ బ్రభాతవాయువులు దోఁచుఁ బురిం బరిచారికాకృతిన్. పాండు. ౧. ౧౧౯.

౨. (మనస్సునకు) తట్టు,స్ఫురించు;జ్ఞప్తికివచ్చు.

చ. ఘనతరశోకవేగమునఁ గన్నుల నీరులు నించియాసుయోధనునవినీతియుం బిదప ధర్తసూఁజుఁడు సంధి గోరి పల్కినతఁగవుం గడంగియనికిం దలకొన్ననిజోద్యమంబుఁ దోఁ,చినమదిఁ దిట్టుచున్ వినుతిసేయుచు రోయుచునుండె నర్యోధన్. భార. భీష్మ. ౩. ౧౫౬.

ఉ. ఆవిధి నుండునంతట నొకప్పుడు నిన్నుసుజూచుచో మణి,గ్రీవుని పేరు దోఁచె మదికిన్ మణికంధర మేకదేశసా,మ్యావగుణంబుచే...కళా. ౪. ౧౯.

క. తోఁచినవగ రచియించెదఁ, దోఁచనిచోఁ జెలువగట్టుదొర తోఁడై వా, యాఁచకయెయానతియ్యఁగఁ, దోఁచ దసాధ్యంబు కవనథోరణిపట్లన్. ప్రబంధ. ౨౫.

౩. పుట్టు, అవతరించు; కలుగు.

క. మీతండ్రికి నే మృత్యువ,నై తోఁచినవాఁడ నగుట యట్టుండె నినుం,జూత మటసనక డగ్గఱు,మా తలఁకక పలదు రిత్తమాటలు మనకున్. భార. ద్రో. ౫. ౧౭౮.

మ...శం,కరుఁడే శంకరుఁడై విభేదమతముల్ ఖండించి వేదాంతశా,స్త్రరహస్యస్థితిఁ దెల్పఁగా నతఁడె విద్యారణ్యమూర్తిన్ జగ,ద్గురుఁ డై తోఁచె...కృష్ణ. ౨. ౧౮.

సీ. వక్షస్థలంబున వైచినపకంపుఁదులసిదండకు వాడు దోఁపకుండ. హర. ౬. ౪౫.

క. కదియఁగ వచ్చివసంతుఁడు, హృదయమున భయంబు దోఁప నిట్లని పలికెన్. విక్ర. ౮. ౩౮.

౪. (గ్రహనక్షత్రాదులు) ఉదయించు,పొడుచు.

ఉ...నె,త్తామరసూడు రాగరసధాముఁడు సోముఁడు దోఁచెఁ దూర్పునన్. వరాహ. ౪. ౧౩.

గీ. తోఁచెఁ బ్రాచీమహీధరోత్తుంగసరణిఁ, బ్రాఁజదువుమానికంబులబరణి తరణి. పారి. ౪. ౪౯.

గీ. శబరవరసామిపలితకేశము లనంగ, విమలగతిఁ దోఁచె తారకాసముదయంబు. చంద్రా. ౫. ౫౧.

౫. ప్రకటితమగు, బయలుపడు.

క. గెలుపును నోటమియును ననిఁ, గలుగవె యెడపెట్టి యెట్టిఘనులకు నిమ్మైఁ,బలుకుదురే తగువారిం, దులువా నీకులము గుణముఁ దోఁచెం బ్రజకున్. భార. ద్రో. ౪.౨౪౯.

ఉ. శ్రీకమనీయహారమణిఁ జెన్నుగఁ దానును గౌస్తుభంబునం, దాకమలావధూటియు నుదారతఁ దోఁపఁ బరస్పరాత్మలం,దాకలితంబులైన తమయాకృతు లచ్చతఁ బైకిఁ దోఁపన,స్తోకత నందుఁ దోఁచె నన శోభిలువేంకటభర్తఁ గొల్చెదన్. ఆము. ౧. ౧.

ఉ...నెయ్యముఁ దియ్యముఁ దోఁప నిట్లనున్. పారి. ౧. ౧౩౪.

౬. వచ్చు. (చూ. తోతెంచు=వచ్చు.)

గీ. తొంటిచవి గని యిప్పుడుఁ దోఁచి పాండుసుతులు రాజ్యంబు నేయంగఁ జూచుకలుచ, నాకు నీఁ దీఱునే...భార. ఉద్యో. ౩. ౩౬౨.

క. దీప మణఁగఁ జీకటియును, గోప ముడుగ శాంతిగుణముఁ గోల్కొనుక్రియ నా,టోపోద్భట మగువేసవి,కైపు సడలఁ దోఁచెఁ గారుకాలము దళమై. పాండు. ౪. ౧౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జః తోఁపడఁగు, తోఁపించు, తోఁపిక, తోఁపు.

**తోఁచు**². స. క్రి. (√తోఁగు) తోఁగఁజేయు.

(ముంచు; స్నానముచేయించు.)

ఉ. వారిజనాభుఁ డుద్యదనివారితశోణితవారిధారలన్, వారలఁ దోఁచె వీరులగువారలకెల్ల నొకండ మేటియై. హరి.ఉ.౩.౧౪౪.

సీ. చంద్రబింబముఁ బాలసంద్రంబులోఁ దోఁచి కండెల్లఁ బోఁ బులు కడుగ కున్న.విక్ర. ౫. ౧౬౨.

చ. కనుఁగొని యారణీతటినిఁ గాయముఁ దోఁచి తదీయ సైకతా,పని నభవున్ భజించి ...కాళ. ౪. ౬౦.

(తడుపు, సిక్తముచేయు.)

ఉ. నైపుణిఁ జందనాద్రిగహనద్రుమసౌరభవీచిఁ దామ్ర పర్ణీ పరిలబ్ధమౌక్తికమణిప్రకరంబులు దోఁచి దక్షిణా,శాపవనుండు సల్లువెదఁ జల్లజనించెన కాక వాని కే,లా పొడమంగ నప్పాలప మప్పుడు నా వనిఁ దోఁచెఁ గ్రొన్ననల్. ఆము. ౫. ౧౧౪.

మ...వ్యాల్గనుదోయిం దడిఁ దోఁచి తేటజలముల్ గా దోయిటం దెచ్చి ద,ప్పి నివారించి యలంత దేర్చి యతనిం బెంపొందఁగాఁ జేయుచున్. సారంగ. ౩. ౧౯౪.

చ. వనరుహమిత్రబింబ మనువర్తులలాక్షికపట్టికం బయో,ధినడుమఁ దోఁచి సాంధ్యనవదీప్తిరసంబు హరించి పాటవై,చిన వెలిదూదియో యనఁగ శీతకరుం డుదయించె నత్తఱిన్. పారి. ౨. ౪౩.

(కలుపు, మిశ్రముచేయు.)

చ. ద్రవ మయియున్న క్రొత్తహరితాళమనశ్శిలలం గరంగి పల్లవమునఁ దోఁచి మేనక యలంకరణం బొనరించె గౌరికిన్. హర. ౪. ౯౪.

**తోఁట**=తోఁపు². వి. (క. తోట, త. తోట్టమ్)

౧. ఉపవనము, పెంపుడువనము.

క. పూఁబోణులకును విటులకు, వేఁబోఁకలఁ దలరుసొంపు వీడ్కొలుపుఁ బురిన్, వేఁబోకఁ బోఁకతోఁటల,పూఁబాళల కమ్మఁదావిఁ బొదలిన గాడ్పుల్. భీమ. ౧. ౯౫.

శా...తోఁట దొడ్డిగను లాప్తు ల్పొదఁ బంపం దగున్. ఆము. ౪. ౨౪౫.

గీ. నాఁటె మందారతరువులు తోఁటలందు. భీమ. ౫. ౮౬.

వ...డాకరేమి అయ్యపాలమున ఊరిదక్షిణదిశునగొల్లపల్లు తూర్పుననీలమదేవి...యిన పరెకాస్యతోఁట్టనేల ఒకపుట్టి...శత్రమునకునచాంద్రార్కముగాను నిచ్చిరి. దా. శా. ౧౦౧౬.

౨. ఉద్యానవనము.

చ...శం,బరరిపుఘంటికారవముభంగిఁ జెలంగె నశోకతాడన, స్ఫురితవిలాసినీచరణభూషణఘోషణ మెల్లతోఁటలన్. విక్ర. ౫. ౮.

గీ. తోఁటఁ బగ లుండి మల్లెలు దుఱిమి... ఆము. ౨. ౬౦.

౩. గృహారామము, నిష్కుటము, ఇంటినిచేరియుండుతోఁట.

వ...గృహారామంబున కరిగి యుండునంత.

గీ. అభ్రపదవి నేతెంచి యయ్యబల యున్న, తోఁటలోనికి డిగియె నద్భుతము గాఁగ. కళా. ౨. ౪౬, ౪౯.

సీ. తోఁట యం చనఁగను దోఁచు గృహారామము...ఆం. భా. ౨. ౩౪.

౪. తపోవనము, ఆశ్రమము.

గీ...ఒక్కతబిసితోఁట, గాంచి యబ్బురపడి కోర్కె గడలుకొనఁగ, రాచవేలుపు ఱేఁడు చేరంగ వచ్చి. యయా. ౨. ౫౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జ: తోఁటకాఁపు, తోఁటకూర, తోఁటగొల్లఁడు, తోఁటపాల, తోఁటపోఁక, తోఁటమాలి, తోఁటమాలియ, తోఁటమొల్ల, తోఁటవాఁడు, తోఁటీఁడు, తోమాలిక, మొ.

తోఁటకాఁపు. వి. (√తోఁట) తోఁటమాలి, వనపాలకుఁడు. (శ. ర.)

తోఁటకూర. వి. (తోఁట + కూర) -ఒక్కొక్క మొక్క గాకాక తోఁటవలె పెక్కుమొక్కలుగా పెరిగెడుశాకము- ఒకజాతి కూరమొక్క, మారిష ముళ్ళి.

మత్తకోకిలము. చాల యోర్చ్చి శాపవహ్నికిఁ బట్టున న్నదలించినం, జాలదే కట తోఁటకూరకుఁ జంద్రహాసముఁ దెత్తురే. పి. శకుం. ౪. ౪౫.

(దీనిభేదములు—ఎఱ్ఱతోఁటకూర, నల్లతోఁటకూర, ముండ్లతోఁటకూర, పెరుఁగుతోఁటకూర, కొయ్యతోఁటకూర, చిలుకతోఁటకూర. మొ.)

తోఁటగొల్లఁడు. వి. (√తోఁట) వనపాలకుఁడు, తోటమాలి.

గీ. తోఁటగొల్లఁడు వోయినతోఁటసమము, నేఁటియాటకు మృగములు గాట మనుచు, వేడ్కతో వచ్చి యున్నారు వేఁటకాండ్రు, వేగ విచ్చేయు మనినఁ బృథ్వీవిభుండు. పి. శకుం. 3. 3.

తోఁటపాల. వి. (√తోఁట) ఆరామజీవని. (చి. ని.) తోఁటలో పనిచేసి బ్రదికెడుస్త్రీ.

తోఁటపోఁక. వి. (√తోఁట) ఒకజాతిపోఁక, భూపూగముళ్ళి. (శ. ర.)

తోఁటమాలి. వి. (√తోఁట) తోఁటకాచువాఁడు, వనపాలకుఁడు.

తోఁటమాలియ(లె) = తోమాలియ. వి. (√తోఁట) ఆకులు పువ్వులు కూర్చి కట్టినదండ, వనమాల. (శ. ర.)

తోఁటమొల్ల. వి. (√తోఁట-త. తోట్టముల్లై.) కుందము. ళ్ళి. (శ. ర.)

తోఁటవాఁడు. వి. (√తోఁట- త. తోట్టక్కారన్) తోఁటమాలి, తోఁటకాచువాఁడు, వనపాలకుఁడు.

గీ. కోరి తోఁటవాఁడు కుసుమఫలంబులు, కోయునట్లు రాజు గొనఁగవలయు, నవ్వనంబు నఱికి యంగారములు సేయు,భంగి యైన భూమి పాడు గాదె. భార. శాం. ౨. 300.

తోఁటీఁడు. విణ. (√తోఁట-'వి'ఆని.శ.ర, ప్రా-) తోఁటకాఁచువాఁడు, వనపాలకుఁడు.

తోఁడి. వి. (√తోఁడు) చేఁదెడికుండ. (చి. ని.)

తోఁడు. స. క్రి. ౧. ఉద్ధరణముచేయు, (నీళ్లు) పైకితీయు, చేఁదు.

(వ్యవ) నూతినుండి నీవు నీళ్లు తోఁడుము.

౨. అన్నము, మొ॥ మఱియొకపాత్రలోనికి గరిఁటెతో నుంచు; పెఱుకు, ఉత్పాటనము చేయు.

(వ్యవ) ఆమె అన్నము పళ్లెములోనికి తోఁడినది.

గీ. వాఁడిగోర్గాండిఁ గన్నులు దోఁడి యైన, నడుగు లడిదంబుచేతఁ జక్కడఁచి యైన,నొండు కడ కేఁగుటలు మాని యుండవలయు, దక్కిమాటలు దఱువాటంబునందు. భీమ. ౬. ౯౯.

చ...దనుజుప్రేవులు దోఁడుచు గాడ్పుకడ్పులో, గునుకులుగోఁడుచు న్వరుణుగుండియఁ దేఁడుచు...నృపతి నేర్పులు దీడుచు వెండి వాఁడిగన్. కళా. ౫. ౧౨3.

వా:—నీవు నాప్రాణములు తోఁడివేయుచున్నావు.

,, ఆవాసన నాప్రాణములు తోఁడివేయుచున్నది.

3. (వడికిననూలు)పంటెకట్టమున్నగువానికిచుట్టు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. పింతవగకప్పు నెఱిఁగొప్పు పీడ నెఱయు, నిగనిగ ల్జాతినీలాలనింగి నింపఁ, గుచభరం బున నడుము కొంకుచు వడఁక, నూలు దోఁడును వేడ్క నవ్వాలుఁగఁటి. హంస. ౨. ౨౨.

జ: తోఁడి, తోఁడుఁబోతు, తోఁడుడు, తోఁడుపడుగు, తోఁడెలు, తోఁడేటికడుపుమేటి, తోఁడేలు, తోఁడేలువు.

**తోఁడుఁబోతు.** విణ. (√తోఁడు) :దయ్యాల పోతు, పంపుచేయువాఁడు, ఆభిచారికుఁడు; ఆభిచారికురాలు.

చ. కలువలవిందు నెన్నడిమికందు నెపంబున నేఁడు బూఁదిలోఁ, గలయుమనోజు మేనిరెము క ల్గలితువ్వర పేర నీ చలకా, గిలుబుచుఁ దోఁడుఁబోతుగతి గిట్టినవానిఁ బిసాసిఁ జేసి బా, లలపయిఁ బంపువెట్టె వెతలం బఱుపం దగు నా సమీరణా. చంద్రా. ౫. ౧౦౪.

చ. విరహులఁ జంప సాగితివి వే యన నేమిటి కూరు ముక్కుఁడికా, బరఁగినఁ దోఁడుఁబోతు లరపం బనుమాట నిజంబె పో శశీ. హంస. ౫. ౨౯౫.

సీ. సమయమ్ముగాం డ్రకుఁ జనవు చెల్లింపక తోఁడుఁబోతుల నిల్లు ద్రొక్కనీక. నీతి. ౪౯

సీ. కలిమి దండుగులకు గారడీవిద్యకుఁ దోఁడుఁబోతుల కాటదొమ్మరులకు. వేణు. ౯౯. (బోకు,ము,ద్రి.)

వి. తోఁడుఁబోతుఁదనము, దయ్యాలపెట్టుట, పంపుచేయుట, అభిచారక్రియ. (శ. ర.)

(వ్యవ) వానికి ఎవరో తోఁడుఁబోతు పెట్టినారఁట.)

**తోఁడుడు.** వి. (√తోఁడు) తోఁడుట, నూలు వెలిచిచుట్టుట, తంతునిస్సరణము.

గీ. తంతునిస్సరణంబు గఁ దనరుచుండు, వెలుపడనఁ దోఁడు డనఁగను ...ఆం. భా. ౨. ౨౯౬.

**తోఁడుపడుగు.** వి. (√తోఁడు) నిలువునేఁతకై ఆసు ప్రా నికి తోఁడినసూలు.

గీ. ఎన్నికలు పట్టి పుంజంబు లేర్పడించి, పంటె కట్టలు మఱి తోఁడుపడుగు లూఁచ, కండె లొనరించి చాలించి కాఁపుటింతు, లు...శుక. ౨. ౪౨౩. (తోఁడుపడగలు. అపముద్రి.)

**తోఁడెలు**= తోఁడేలు.

క...అధిపుకై పట్టిరి బె,బ్బులి మహిష మెలుఁగుఁ గిటిఁ దోఁ,డెలు మొదల గువానిఁ గొన్నిటిని వేఁటకరుల్. మనుచ. ౪. ౫౦.

**తోఁడేటికడుపుమేటి.** వి. (తోఁడేలు+కడుపు +మేటి) వృకోదరుఁడు, భీముఁడు (శ. ర. బ్రా.)

**తోఁడేలు**= తోఁడెలు. వి. జా. (√తోఁడు-త. తోండాన్-బ. తోఁడేళ్లు, తోఁడేళులు.) అడవికుక్క, ఈహామృగము.

క. ఇవి తోఁడేళులభంగిన్, గవియుఁ బురుషు ధైర్యహానిఁ గనికొని ధైర్యం, బవలంబించిన నరుఁ జే,రవు ...భార. శాం. ౩. ౪౨౩.

వ...పిఱుందం దిరుగుచిఱుగున్నలకు వెన్నాడు తోఁడేళ్ల సివంగులం దిరిగి తిరిగి మొత్తి... మనుచ. ౪. ౩౬.

**తోఁప.** వి. (త. తొప్పమ్) చిక్కగా కాఁచిన యంబలి, సంకటి.

సీ. కావడి యుట్లు చిక్కము సందికడియంబు నూకలతోఁప పో గాకుతిత్తి. హంస. ౨. ౬౫.

వ...చక్కెరలును నేతులుఁ దేనెతోలలు బిట్టును గట్టును దోఁపలుఁ బూపలు మోదకంబులు...కాశీ. ౬. ౧౯౫.

సీ. పిష్టము చెలఁగును బిట్టనఁ దద్విశేషము మీఱుఁ దోఁప నా సంకటి యన. ఆం. భా. ౨. ౨౫౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తోఁపడఁగు. అ. క్రి. (తోఁపు[1] + అడఁగు) రూపఱు, నశించు.

గీ. భూతజాలంబుతో మునిపుంగవులును, దోఁచి మును ప్రళయంబునఁ దోపడంగి, చనిన... సర్వవేదంబులు శాస్త్రములును, బడసి రద్దేవు దివ్యానుభావమునను. భార. శాం. ౪. ౨౬౬.

తోఁపించు. స. క్రి. (√తోఁచు[1]) తోఁపఁజేయు; గోచరింపఁజేయు.

మ...ఘనముక్తా హీనంబునుం గా గురు,త్వలఘుత్వంబుల నిశ్చితంబు లగు చక్రశ్రేణి దోఁపించుఁ జెం,పలరన్...మల్ల. నీతి. ౩౬.

తోఁపిక. వి. (√తోఁచు[1]) తోఁచుట (శ. ర.)

తోఁపు[1]=తోఁపిక. వి. (√తోఁచు[1]) ౧. పొడకట్టుట, వ్యక్తమగుట.

క. తనతోఁపు భవనిరాసం,బునకుం గారణము గాఁ దమునఁ బిహిత మగున్. భార. అను. ౧. ౩౧౨. (తన=మూలప్రకృతియొక్క.)

సీ. వేఱ్వేఱ యుండవు వినుఁడు గుణంబు లన్యోన్యసంకలితంబు లగుచుఁ బరఁగు, సంగతత్వమున న సంస్కారయాత్రా ప్రవర్తనంబొనరించు వానిలోన, నెయ్యది మిగులఁ దోఁపిచ్చెఁ ద జ్జన్యంబు లొలయుఁ బాయుటయు నొక్కొక్కమాటు. భార. అశ్వ. ౨. ౧౨౫. (తోపించె. కరాలప్రతి.)

౨. పుట్టుక, జననము.

క. అనఘ యనులోమమునఁ దోఁ,పును బ్రతిలోమమున లయము నొందుటయును గ,ల్గును... భార. అను. ౪. ౧౭౪.

సీ...అక్కమలనాభు. ఆ. నందు మును లయించినట్టిగుణంబులు, మాఁటఁ దొలుత సత్త్వమునకుఁ దోఁపు,కలిమి దాన నుండెఁ గమలోద్భవుఁడు రజ,స్తమము లసుర లయ్యె ధరణినాథ. భార. శాం. ౬. ౪౭౭.

౩. తలఁపు, సంకల్పము.

సీ...అడరి, తోఁచుతోఁపుల నెల్లఁ దోడ్తో నడంచి నిరాలంబనం బైనయతఁ డొకండు. భార. అశ్వ. ౧. ౨౦౨.

గీ. అనిలముఖదోషములను సత్త్వాదిగుణవికారముల జాగరంబునఁ గలుగునట్టి,తోఁపు చెరయంగఁ గల యయి తోఁచు... భార. శాం. ౪. ౩౨౫.

శ్లో...తతఃపశ్యంత్యసంబంధా న్వాతపిత్తకఫోత్తరాన్,రజస్తమోభవై ర్భావై స్తద ప్యాహుర్దురత్యయం, ప్రసన్నై రింద్రియై ర్యద్యత్సంకల్పయతి మానసం,తత్త త్స్వప్నే ప్యుపరతే మనోబుద్ధిర్నిరీక్షతే. సం. భార. శాం. ౨౧౭ అ. ౧౪. ౧౫

తోఁపు[2]=తోఁట. వి. (త. తోప్పు. క. తోఁపు. హిం. తోఫ్.)

౧. ఉపవనము, పెంపుడుతోఁట; తోఁట.

సీ. కూపంబుదరిఁ దోఁటలోపలఁ దోఁపుల మఠములపొంత గోమయమునొద్ద, గీ...మలము విడుచు టనుచితంబు. విజ్ఞా. ఆచా. ౩౬.

సీ. తోఁట యంచనఁగను దోఁచు గృహారామముపవనసంజ్ఞమై యుండుఁ దోఁపు,నాఁగను బ్రమదవనాభిధ యాను పింగారపుఁదోఁటన...ఆం. భా. ౨. ౩౪.

ఉ. మామిడితోఁపునం దనరుమల్లిని భిల్లుఁడు కల్లిఁ జేర్చినట్లు...అమఘువారి యాత్తపురి కాశ్రమధారణినుండి తెచ్చి దుష్కామత నిల్పినట్టిమహికన్యను జూచె నభూమణా కృతిన్. చం. రా. ౭. ౩౩.

క. అపుడు జడదారి తేఁ డుల్లపుఁ దామర నలరి వారలం దోడ్కొని వైళపునడకల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తోఁ దనజ,న్న పుటే ల్గలయలరుఁదోఁపునరుఁ బఱ తెంచెఁ. అచ్చ. రా. బాల. ౧౧౯.
౨. గుబురుగానుండు చెట్లగుంపు.
ద్వి. ఆడవికి వేఁటపై నరిగి యొక్కఁడను, దోఁడె బుసులుఁ దాను దోఁపున నుండి. బస. పు. ౬౨ పొ. ౧ పం.

తోఁపు³. విణ. (త. తోమ్బు) ఎఱ్ఱనిది, ముదురు ఎరుపుగలది.
సీ. కటినిండఁ దోఁపుదుప్పటి గట్టి యుత్తరీయము లూని కేలుకే లనరఁ బట్టి. రా.వి.౨.౬3.
సీ. చరమాద్రిశిఖరసంచరద భ్రచర వధూ శ్రేణి గట్టిన తోఁపుఁజీర లనఁగ. రసిక. ౪. ౯౪.
ద్వి. చారువైభవలీల సమకొనఁ జేరి, కోరిపట్టిన తోఁపుగోడు గన పజియు, శ్రీ సొంపుమీఱ శచీదేవిచెవిని, భాసిల్లు కెంపులపసిఁడియాకనఁగ. నవ. ౨. ౧౬ పొ. ౨3 పం.
వి. ౧. ఎఱుపు, రక్తిమ, ఎఱ్ఱరంగు.
సీ. ధ్వాంతజాలముమీఁద దండెత్తుభానుమంతు నివెలిగొల్లెనతోఁ పనంగ. గీ. మెఱసె నరుణోదయపుదీప్తి మింటికెలన. ప్రభా.౫.౫౯.
సీ. రాజుపై నెత్తినప్రత్యూషనృపుతోఁపుదళు కొత్తుదేరీజత్రాడు లనఁగ. ప్రబంధ. ౧౨౪. (దేరీజ=డేరా.)
౨. ఎఱ్ఱబట్ట.
వ...మాదళంబులు తోఁపులు మేఘవర్ణంబులు పచ్చపట్టులు ...చీనీలు శాలువలు కబ్బాయిలు ...తగటిపాగలు ...ప్రబంధ. ౬౦౫.
సీ. అరుణవస్త్రంబు తోఁ పనఁ దోఁచుచుండును ...ఆం. భా. ౨. ౧౫౪.

తోఁపు⁴. వి. నల్లతుమ్మచెక్క.
గీ. తోఁపు నాఁగను దగు నల్లతుమ్మచెట్టు,పట్టపేరును శృంగార వనము పేరు. ఆం. భా. 3. ౫౫.
సీ. తోఁ పనఁగా నల్లతుమ్మచెక్కరుఁ దోఁపుకోకిరుఁ దోఁపునరుఁ దగు...వేంక. నానా. ౧౧౫.

తోఁపు⁵. వి. (త. తోప్పమ్) బూరెలు మున్నగువానిమూఁతపిండి. (శ. ర.)
వా:—బూరెలపతోఁపుకలుపుము.

తోఁబుట్టినవాఁడు. వి. సోదరుఁడు.
క. విను వేల యెట్టికష్టుఁడు, తనపురుష గుణంబు సెడఁగఁ దల్లిని దోఁబుట్టినవారి విడిచి రాగం,బునఁ జపలస్త్రీసుఖంబుఁ బొందునె చెపుమా. భార. ఆది. ౬. ౧౯౬.
శా. తోడంబుట్టినవానిభంగమునకై దుఃఖించి మాకృష్ణు నెగ్గాడం జూడకు మమ్మ...భాగ. ౧౦ పూ. ౧౭౭౭.

తోఁబుట్టు=తోడఁబుట్టువు. వి.(తోఁడ + పుట్టు) సోదరుఁడు; సోదరి.(ఔపమ్యద్యోతకమై సమానార్థమిచ్చును.)
సీ. దుగతిగ మొగములజగజెట్టితోఁబుట్టు పొగడు వారలనట్టుఁ పుడుకు జెట్టు. అచ్చ. రా. బాల. ౭.
సీ. చిన్నివెన్నెలకందు వెన్ను దన్ని సుధాబ్ధిఁ బొడమిన చెలువ తోఁబుట్టుమాకు. మనుచ. ౨. ౪3.
వ...పొడచూప నేతెంచుచుక్కలచక్కఁదనంబునకుం దోఁబుట్టైన హాయలపనాపాణిపల్లవవిక్షిప్తంబులైన పచ్చకప్పురంబు పలుకులను...భీమ. ౫. ౧౨౦.

తోఁబుట్టుగు(వు)=తోడఁబుట్టువు.
గీ. గురుఁ బితామహుఁ దోఁబుట్టుగుల వధించి. జై. భా. ౭. ౧3౪.
ఆ. తోడఁగి యపుడు చానితోఁబుట్టు గురుతేర, సంగరసముదీర్ణసరణిఁ బరఁగ, వానినంత నె

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లిచి స్వగురుకథాదర, మమరఁ బ్రమద యుక్తి కనుపఠించె. రాఘవ. ౨.౪౨.

మ...ల,త్కలమాంసూరపుపంపు మేయు నెలజిం కక్ సారె వారించు వా,రలతోఁబుట్టువు గంగ పద్మముఖనిర్యద్భృంగనాదార్భటిక్. వసు. ౧. ౧౦౦.

మ...నాభియు న్నిర్వీవం,బును దోఁబుట్టువు లయ్యు వేర్పడ గుణంబుల్ సూపఁగా జూడ మే. అను. ౨. ౬౩.

తోకకము. సం. వి. అ. పుం. చాతకపక్షి.

తోకనము. వి. వందనమాలిక. (చి. ని.)

తోకము. సం. వి. అ. న. అపత్యము, బిడ్డ, స్త్రీపురుషరూపసంతానము.

తోకొను=తోడుకొను. స. క్రి. (√తోడు) వెంటఁగొను, కూడఁగొను. (దీని నొకకవి సానుస్వారముగా ప్రయోగించి యున్నాఁడు)

క. నాకారణమున బుత్విజుఁ, డేకాంతమ నరకగతికి నేఁగెను వానిం,దోకొని పోయెద నని శుభ,లోకంబున కరిగెఁ ద్రిదశలోకస్తుతుఁడై. భార. ఆర. ౩. ౨౨౦.

చ. అసురుల నిమ్మెయిం బ్రమువితాత్ములఁ జేసి పయోజనూతి సం,తోసమున నాకలోకపతిఁ దోకొని పోవు నెడం దదీయవ,క్త్రసరసిజంబు లజ్జయనురాత్రి గడుం జెడి యున్కిఁ కిక్ గృపా,రసపరుఁడై హితార్థమధురస్ఫుట సత్యపృదూక్తి ని ట్లనుక్. నిర్వ. ౭. ౧౪.

గి. ఎక్కుఁడగునట్టియరదంబు లిచ్చి వీరి,నరికిఁ దోకొనిపోవఁ గార్యంబు నాకు.భార.విరా. ౩. ౧౫౨.

ఉ. తోఁకొనిపోయె నంత నొకతొయ్యలి యయ్యెలనాగ నప్డు పే,రాఁకలిగొన్న బెబ్బులి రయంబునఁ గృష్ణమృగార్భకంబు నె, వీఁక

వెలర్పఁ బెల్లడరి ప్రేయుఁగతిక్ పరుఁడు గ్రుఁడై నసుం, దాఁకిన మూర్ఛ నొందితిని దద్దయు నీవల నిప్డు తేతితిక్. భోజరా. ౩. ౨౨౬.

క. తేఁకువ యలరఁగ నీగతిఁ, దోఁకొని చని చదల రత్నతోరణదీప్తుల్, ప్రాఁకెడు ఘనగృహముల న,మ్మూఁకలు విడియించె రాజముఖ్యం డెలమిక్. భోజరా. ౪. ౭౪.

తోక్మము. సం. విణ. (అ. ఆ. అ.) పచ్చనిది.

వి. అ. పుం. ౧. నవాంకురము, క్రొత్తమొలక. ౨. పచ్చయవలు. ౩. హరిద్వర్ణము, పచ్చన.

న. ౧. యవాంకురము, యవధాన్యపు మొలక. ౨. కర్ణమలము, గులిమి. ౩. అభ్రము, మేఘము. ౪. కర్ణమూలము, చెవిమొదటిభాగము. (మే. ని. కే. ని.)

తోచిడులు. వి. బ. బాలక్రీడావిశేషము.

సీ...తాటాకుచక్రాలు చక్రాలత్రిప్పుడు తోచిడులు ... హంస. ౩. ౧౪౬.

తోటి[1]=తోఁచే. వి. (త. తోట్టి) చండాలుఁడు, మాలవాఁడు.

సీ. పరఁగుఁ జండాలుండు సురియాళు వనఁగను మాలఁ డనంగను మాల యనఁగఁ, దోటి యనంగను దోఁచ నా...ఆం.భా. ౨. ౭౮౯.

క. నాఁటి కయిదేండ్లవాఁ డను,మాట విని కృతంబు దలఁచి మానసమున న,త్తోటులమీఁదను బందులు, గీఁటికొనుచు దుష్టబుద్ధి కృత్రిమబుద్ధిక్. జై. భా. ౮. ౬౧.

తోట్రి[2]. వి. శుభము, మేలు.

ఉ. ఆట జయంబుఁ జేకొనిన నర్థము చేకుటు దాన మేటిగా, నోటమిఁ జిక్కి ద్రవ్య మిడ నోపని పేదల కడ్డ మాచు మా,టాట భజింప ధర్మ మగు నంతన మోక్షము గల్గుఁ గావునం దోటికిఁ జూచువార లిది దుర్వ్యసనంబన నమ్మవచ్చునే. ద్వా. ౧౦. ౧౦౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తోడ=తో. ప్ర. ద్రు. (√తోడు) తృతీయా విభక్తిప్రత్యయము.

(సహార్థకము. ఈయర్థమున నిది కొన్ని ప్రయోగములందు సముచ్చయపూర్వకమై వ్యవహితముగాను కాన్పించుచున్నది.)

సీ... మెఱుఁగుఁజామనచాయ మేనితోడ. ఆము. ౧. ౧౨.

సీ... విచిత్రవీర్యుఁ. ఆ. డమరపురికిఁ జనిన నత నికిఁ బరలోకవిధుల శాస్త్రదృష్టి వెలయఁ జేసె, నాపగాతనూజుఁ డఖిలబాంధవులయు, బ్రాహ్మణులయుఁ దోడ భానునిభుఁడు. భార. ఆది. ౪. ౨౧౬.

క. నెమ్మిని ధర్మజునలువురు, దమ్ములుఁ దమయాయుధముల తమవర్మవరూ, థమ్ములయుఁ దోడ సకలహి, తమ్ముగఁ బాయంగవలయు దాస్యము వలనన్. భార. సభా. ౨. ౨౬౧.

(వలన, ఉండి- అపాదానపంచమ్యర్థకము.)

సీ. ప్రావృడ్జనితోడఁ బాసినబిడ్డలై పెం పేది నదులు శోషింపఁ జొచ్చె. కవిక. ౨.౬౦.

(నియమపూర్వకవిద్యాస్వీకారమున గురువాచక శబ్దముల కనుప్రయుక్తము.)

క. విలువిద్యఁ గఱచుచుండిరి, బలయుతులు కుమారకులు కృప ద్రోణాచార్యులతోడఁ గలసి యొక్కట,... భార. ఆది. ౫.౧౮౧.

(అలుక్సమాసమున 'తోడి' అను 'ఇ' వర్ణాంతపద మగును.)

క. హరికులిశతుతి యెఱుఁగని, గురుతరపక్షములతోడికులగిరివోలెన్. భార. ఆది. ౨.౪౧.

ద్వి. నా కేటితప మింక నాకు నీతోడి, లోకంబె కా కింక లోకైకవినుత. రం. రా. అయో. ౧౨౬ పా. ౯ పం. దశా. ౨. ౧౧౨.

(ఇది ప్రకృతిలో కూడకయే ప్రత్యేకముగాఁ గూడ ప్రయోగింపఁ బడును.)

(క) కూడ, తోడుత, సహార్థకము.

గీ. స్తంభగతరత్నపుత్రిక తనదుబోఁటి, యని విలోకించి తోడ మాటాడ కునికి. రామా. ౪. ౧౫౮.

క. వేయేల తోడఁ బలుకుదు, పాయక నినుఁ గొలుచున చలభక్తునిఁ గని యా, య్యా యని పిలిచినసంబికి, నోయని యెలుఁ గీవె తొల్లియురగాభరణా. శివ. సా. ౧౧౨.

(చ) -దేశకాలములందు- అవ్యవహితముగా, వెనువెంట; శీఘ్రముగా.

చ... మేఘమాలికల్, గనుకనిఁ దూలవై చెదశకంఠుఁడుఁ దోడన దానిఁ దప్తకాం, చనమణిచిత్రపుంఖశరసంఘమునం దునుమాడి వెండియున్. భా. రా. యు. ౮౧౦.

ఉ. ఈనయగారపుం బ్రియము లీపస లీమొగమిచ్చుమాట లే, లా నిను నమ్మియుండినఫలం బిది తోడనె కల్గె... పారి. ౧. ౧౨౫.

శా. శోనం దిమ్మయవీరరాఘవముఖుల్ దోఁబుట్టు లై వర్తిలన్. దశా. ౧. ౫౫. (ఇందు, 'తోనన్' అని ప్రయోగించినాఁడు.)

తోడంటు=తోడు. వి. (తోడు + అంటు) చేమిరి, కాఁగినపాలు పెరుఁగు అగుటకై అందు చేర్చిన మజ్జిగ.

క. సుగుణులు బాణోచ్ఛిష్టం, జగత్త్రయ మనఁగఁ గొంత చదువఁగఁ బ్రియమే, తగఁ దోడంటునఁ బాలిం, పుగ బెరుఁ గయి యున్నదియభోజ్యం బగునే. ద్వా. ౧. ౨౬.

సీ. మొదవుల నెన్నేనిఁ బిదికినపాల్గాఁచి యొనరఁ దోడంటుతో నుట్టిఁ బెట్టి. శుక. ౧. ౧౪౯. (శ. ర, వావిళ్లముద్రి.)

తోడఁబుట్టినది. వి. (తోడన్ + పుట్టినది) సోదరి.

సీ... తోడఁబుట్టిన దనఁ దోఁచు భగిని. ఆం. భా. ౨. ౧౧౩.

ఇట్లే: తోఁబుట్టినది.

తోడఁబుట్టు=తోడఁబుట్టువు. వి. (తోడన్ + పుట్టు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ...సరోజసౌధముల్,గలచెలితోడఁబుట్టు...
గనుపట్టె...రా. వి. ౩.౮.

తోడఁబుట్టువు(గు)=తోడఁబుట్టు, తోఁబుట్టు, తోఁబుట్టువు. వి. (తోడన్ + పుట్టువు) సోదరి; సోదరుఁడు.(కొన్ని యెడల ఔపమ్యద్యోతకమై సమానార్థము నిచ్చును.)

శా. తోడంబుట్టువుపాటు సూచి యలుకన్ దు
ర్వారశుంభద్గతిన్. భార. భీష్మ. ౩. ౧౦౭.

మత్తకోకిల. తోడఁబుట్టుగుకన్న నీ వొగిఁ దో
డునీ డయి ప్రోవఁగా. యయా. ౩. ౧౫.౧.

ఉ...వడి వైచెఁ దీవ్రని,ర్ఘాతముతోడఁబుట్టు
వనఁగాఁ దగు సుజ్జ్వలశక్తి దైత్యుపైన్.
భార. అర. ౫. ౨౮౩.

తోడనము. సం. వి. అ. న. ౧. ఛేదనము, విఱుచుట. ౨. దారణము,చీల్చుట. ౩. హింసనము, బాధించుట.

తోడము. సం. వి. అ. న. సశిఖవపనము, శిఖమాత్రము మిగులునట్లు క్షౌరము చేయించుకొనుట. (శ్లో. సశిఖం వపనం తోడం నిశ్శిఖం భిక్షుకోచకం. వై. ని.)

తోడా. వి. బిరుదుగా చేతికిగాని కాలికిగాని తొడుగుభూషావిశేషము. ('హస్తభూషావిశేషము' అని. శ. ర. బ్రా.)

తోడి. వి. (సంగీ.) ముప్పదిరెండునపుంసకరాగములలో నొకటి.

సీ...శంక,రాభరణము మేఘరంజి తోడి వరా
ళి నాదనామక్రియ నాట రీతి,గౌళ...
హంస. ౫. ౧౨౪.

తోడికోడలు. వి. (తోడు + కోడలు—వృత్తియందు 'ఇ' వర్ణము. తోడన్ + కోడలు.అని శ.ర.) మగనితోడఁబుట్టినవానిభార్య, యారాలు.

సీ.తోడికోడండ్రతోఁ గూడిమాడి చరింపు...
నైష. ౭. ౮.

ఉ...నాథుఁడు కోపధారి ని, న్నత్తినతోడికో
డలు మహాశని యేమిటు నెంచి చూచినన్,
గత్తులబోను కాఁపురము కామిని నీతలఁ దా
ప్ప దియ్యెడన్. చెన్న. ౪. ౨౭౭.

తోడిచూలు. వి. (తోడు + చూలు. తోడన్ + చూలు. అని శ. ర.) తోడఁబుట్టువు, సోదరుఁడు; సోదరి. (శ. ర.)

తోడిజోడు. విణ. (తోడు + జోడు) సమానుఁడు, జతకాఁడు.

గీ. అతనిపుత్రుండు గుణనిధి యనెడివాఁడు,
దర్పకునితోడిజోడు సౌందర్యరేఖ. కాశీ.
౪. ౭౮.

ఉ. భూధరరాజసన్నిభుఁడు పుష్పశరాసను
తోడిజోడు వి,ద్యాధరచక్రవర్తి...కాశీ.
౫. ౧౬౫.

తోడితె(త్తె)చ్చు = తోడితెచ్చు, తోతెంచు, తోతెచ్చు. స. క్రి. (తోడు + తెచ్చు) వెంటఁగొనివచ్చు; కొనివచ్చు. (పిలుచుకొనివచ్చు. అని. శ. ర.—దీనికి తోడితేరన్, తోడ్తేరన్, తోడ్తేన్, తోడితెమ్ము, తోడ్తెంను మొదలగు రూపములు సిద్ధించును.)

క. రామాజ్ఞ లేకయే నను, దీమసమున నిందుఁ
దోడితెచ్చితొ...ఉ. రా. ౬. ౨౬౨.

మ. నను సైరంధ్రి గడంగి పేర్కొనియె దా
నం బెంపుమైఁ బిల్చి తో, డని తోడ్తెచ్చితి
వీవు...భార. విరా. ౪. ౬౮.

సీ...పగవారియింటను బలిమిఁ బట్టి, యొకకన్యఁ
దేకమైనుని బి తోడ్తేరంగ...భాగ.౮.౭౦౬.

సీ. బలభద్రదేవునిఁ బిలువఁడు సాత్యకిఁ దో
డ్తెండు కృతవర్మఁ దోడుకొనుచు, రండు...
హరి. ఉ. ౫. ౧౧౭.

తోడితెప్పించు. స. క్రి. (√తోడితెచ్చు) వెంటఁ గొనివచ్చునట్లు చేయు; రప్పించు.

ఆ. దేవ యతనిఁ దోడితెప్పింపు మన్నింపు...
భాగ. ౧౦ ఉ. ౮౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తోడిది. విణ. (తోడు+అది. ఇట వృత్తిని 'ఇ' వర్ణము.)

౧. అవినాభావసంబంధము కలది, ఎల్లపుడు కూడ నుండునది.

సీ...కృపాగరిష్ఠుండ వై చేసితి ప్రతిన గాచెద నవశ్యమును నుత్తరాగర్భజనితు నే నని చాలు బ్రదుకుతోడిద నాదు బ్రదుకు...భార. అశ్వ. ౩. ౧౭౦.

గీ. వానితోడిద లోక మై యేను బోవ, నైతి ...భార. ద్రో. ౨. ౧౪౩.

౨. విడువకుండ నొకదానివెంట వచ్చునది.

సీ...సుఖము దుఃఖంబును దోడివ యవి మార్చి వచ్చుచు నరుగుచుండు. భార. అను. ౫. ౨౩౦. (కరాలప్రతిపా.)

౩. ఒకదాని కనుగుణముగా నుండునది, ఒక దానిఁ బట్టి వచ్చునది.

చ. ఘనభుజ యెల్లచందములుఁ గాలముతోడివ చుమ్ము...భార. శాం. ౫. ౩౯౬.

౪. సమమైనది.

క. నాయొడలు సేర్చినప్పుడ, నీయొడ లెట్లగు నో దాని నీ వెఱుఁగెదు న, న్నేయబలల తోడిదిగాఁ, జేయఁ దలంచితివి తప్పు సేసితి గంటే. భార. విరా. ౨. ౩౩౭.

౫. జోలి, ప్రసక్తి.

వ...వీరితోడి దేమి నీవు నాకుం బతివై ప్రాణంబు రక్షించుకొని నావలన నిష్టోపభోగంబు లందుము...భార. ఆది. ౬. ౧౯౫.

వ. ఏమిదోషంబు సేసియు బాహ్మణుండు వధ్యుండు గాఁడు ...కావున నవ్విప్రుతోడి దేమి యని ద్రుపదుపై నెత్తుదెంచిన...భార. ఆది. ౭. ౧౯౧. భార. ఆది. ౩.౧౪౭.

తోడిదొంగ. వి. (తోడు+దొంగ) సహతస్కరుఁడు, ఇతరులతోఁ గూడి దొంగతనము చేయువాఁడు.

గీ. త్రోవలోఁ దోడికోడలు పోవఁ జూచి, యే డకే యన్న నదియు నీ వేడ కన్నఁ, గూయకు మటంచు నిద్దఱుఁ గూడి తోడిదొంగ లై పోయి రాగోపధూర్తకడకు. దశా. ౭. ౨౩౭.

క. మునిముచ్చులార మీచేసినపని యటు గట్టిపెట్టి చేకొని యేలా, ననుఁ దఱిమితి రిఁకనేమియు, ననఘుఁడు నాతోడిదొంగ లైతిరి మీరుక్. ప్రభా. ౫. ౭౧.

తోడి(డు)నీడ. వి. (తోడు+నీడ) వస్తువులోఁ గూడ నుండుఛాయ.

వ...అద్దేవునితోడి నీడయుంబోని సగనామధేయుం డగుమహాపురుషునిం బ్రార్థించిన ...భార. భీష్మ. ౨. ౨౬౨.

వ...అద్దేవియు నతనితోడునీడలుంబోనికనకొడుకులఁ దలంచి...భార.ఉద్యో.౩. ౧౭౨.

విణ. ౧. అంటి ఎప్పుడును ఎడఁబాయకుండునది, సహచరురాలు; సహచరుఁడు; సహచరము.

సీ. నెఱి లేక నీతోడినీడ యై గెడఁగూడి పరఁగినన న్నింత యెరవుసేసి. కు.సం.౫.౬౦౨.

క. నీవెంటఁ దోడునీ డై, నే వచ్చెదఁ దొడుకపొమ్ము...వి. పు. ౬. ౩౨.

సీ. కెడఁదోడునీడ లై క్రీడించుసచ్ఛాత్రు లింతకు నెంత చింతింతురొక్కొ. మనుచ. ౨. ౧౭. (సహాయుఁడు. అని. శ. ర.)

సీ. తర్కించి చూచిన ధర్మసంపాదనక్రీడాని వేకంబు తోడునీడ. వరాహ. ౧. ౩౯.

౨. సహాయము,రక్షకము.

గీ. అఖిలకళలందుఁ దోడునీ డగుచు మెలఁగు నధిపునకుఁ బాలమున్నీటియాఁడుబిడ్డ, యటి మక్కువ టెక్కువ నవిరతంబు, నురము డీపక యతఁడు ద న్నుపచరింప. కళా. ౭. ౨౩౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మత్తకోకిల. తోడఁబుట్టుగుకన్న నీ వొగిఁ దో
డునీ డయి ప్రోవఁగా, నీడ నేకొద లేక యుం
డిలి...యయా. ౩. ౧౫౧.

క. అన విని డాయంజని విభుఁ, డొనరఁ భూ
జానుసరణ మొనరించెను దో,డనె నీడ య
గుచు నెందుఁ, వనితలకుం దోడునీడ వల్ల
భుఁడె కదా. రామా. ౫. ౩౫.

౩. ఈడు, సాటి, సమానము.

సీ. భవునితో నజతనూభవునితో రేవతీధవు
నితోఁ గుముదబాంధవునితోడఁ. గీ. దోడు
నీ డయి క్రీడించు నేను కలర,...కీర్తికాం
తా లలామ. దశా. ౧. ౪౪.

సీ. కలికాలమునకు డగ్గఱినచుట్టంబులు ధూమ
కేతువులకుఁ దోడునీడ. గీ. లంధకారంబు
నకు విందు లనఁగ గిరుల,యందు వర్తించు
చెంచుల నాశ్రయించి. శివరా. ౪. ౧౪.

తోడిముచ్చు. వి. (√తోడు.) తోడిదొంగ.

క...అజ్జన,వల్లభుఁ డను దూత లయ్యు వధ్యులు
మీరల్, ముల్లోకములకు డెందము, ముల్లగు
దశకంఠుతోడిముచ్చుల రగుటఁ. భా.రా.
యు. ౩౧౨.

తోడియ(డ)ల్లుఁడు. వి. (తోడు+అల్లుఁడు. తోడఁ +అల్లుఁడు. అని శ.ర.) పెండ్లాముఅప్ప యొక్కగాని చెల్లెలియొక్కగాని పెనిమిటి, జగిలెడు.

గీ. షడకుఁడు తోడియల్లుఁడు జగిలెఁ డనఁగ.
ఆం. శే. ౪౭.

తోడివాఁడు. విశ. (తోడు+వాఁడు. తోడఁ +వాఁడు. అని.శ.ర.) కూడ నుండువాఁడు.

గీ...రెడ్డి, తోడివారలతోఁ జేని ద్రోవఁ బట్టె.
శుక. ౨. ౪౨౭.

క...వేలుపులం దోడివారి వీక్షించిమహీ,పాలు
నితో ని ట్లనియెను, బాలామీవల్లభుండు
...నైష. ౩. ౬౭.

౨. తుల్యుఁడు, సమానుఁడు.

గీ. శీల మఖిలంబు నిది పిల్లిశీల మనుచుఁ, జదువు
లెల్లనుఁ జిల్కలచదువు లనుచుఁ, దోడివా
రలు నవ్వ నాతోడ యేల, బేల వైతివి
యీగుణం బేల నీకు. పాండు. ౩. ౩౬.

సీ. వేదశాస్త్రపురాణవిద్యానిరూఢు లై వాసి
కెక్కినతోడివారిఁ దలఁచి. కాశీ. ౪. ౯౧.

తోడుఁబోవు=సమానమగు.

క. తులువా నీయిల్లా ల,య్యలివేణికిఁ దోడుఁ
బోయినది దానిమృష్టో,క్తులకుఁ దెగఁ జూచి
తివి నీ,తల ద్రెవ్వను బొలిసిపోయెదవు తరు
వాతఁ. వేం. పంచ. ౪. ౫౧౬.

తోడు. వి. దే. ౧. సాహాయ్యము.

(దీనికి 'కొను, తెచ్చులు' పరంబు లగునప్రుడు హ్రస్వముగూడ నగును. చూ:- తొడుకొను[1], తొడితెచ్చు.)

వ...ఒక్కభటుని కుక్క తోడు దప్పి పఱచి
యొక్కెడ నేకతంబ యేయుచున్నయేకల
వ్యుసమీపంబున మొఱింగిన...భార. ఆది.
౫. ౨౩౪.

క. ఆతఁ డివి యేటిమాటలు,నీతో డగు టొల్లఁ
బొ మ్మనిన రుక్మి వృథా,యాతాయాసవి
షణ్ణుం,డై తనపురమునకు మగుడ నరిగెం
బెలుచఁ. భార. ఉద్యో. ౪. ౧౪౦.

౨. తోడఁబుట్టువు,సోదరుఁడు; సోదరి. (ఇది కొన్నియెడల వాత్సల్యద్యోతకముగా నుపయోగింపఁబడును.)

ఉ. ఏడువ నేల తండ్రి తను వేమఱుకుండుఁడు
తోడులార న్నే, ఋూ డిదె తీర్తు నంచు
...భాగ. ౯. ౪౭౩.

గీ. శీల మఖిలంబు నిది పిల్లిశీల మనుచుఁ, జదువు
లివి యెల్లఁ జిల్కలచదువు లనుచుఁ, దోడి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వారలు నవ్వ నాతోడ యేల,బేల వైతివి
యీగుణం బేల నీకు. పాండు. ౩. ౩౬.

క. సోదరుల మేను నలుపుర, నైదవతోడగుదు
వీవు...భా. రా. యు. ౧౬౦౨.

౩. ఆన. (ఒట్టుపెట్టుకొనుట యందుపయుక్తము.)

క. నాతోడ వెఱవవలదే, నాతోడనె కొనుచుఁ
బోయి నలినదళాక్షుక్, నీతోడుతఁ బలికింం
చెద, నీతోడిజనంబు మెచ్చ నీతోడు
సుమీ. భాగ. ౧౦ పూ. ౭౭౪.

ద్వి. ఎవ్వనిఁ జూడకు యే నుండఁజాల,నెవ్వఁడు
నను భక్తి నేప్రొద్దుఁ గొలుచు,నట్టిరాఘవుని
తోడతివ నీకోర్కి, నెట్టన గావింతు నే
నన్న నలరి. రం. రా. అయో. ౯౨ పా.
౨౪ పం. దశా. ౭. ౧౪౭.

౪. కాఁగినపాలు పెరుఁగు అగుటకై అందు
చేర్చుమజ్జిగ,చేమిరి.

గీ...తోడనఁ దగు దధికరణ మభవ.ఆం.భా.
౨. ౨౫౯.

(వ్యవ) తోడు ఎక్కువైనందున పెరుఁగు పుల్ల
గా నున్నది.

విశ. ౧. సహాయుఁడు; సహాయురాలు; సహా
యము.

ఉ...నా, రాయణభట్టు వాఙ్మయధురంధరుఁ
డుక్ దన కిష్టుఁడుక్ సహాధ్యాయుఁడు నై
నవాఁ డభిమతంబుగఁ దోడయి నిర్వహింం
పఁగక్. భార. ఆది. ౧. ౨౪.

క. నాతోడులార మీపతి,మీతోడే పనులరెు
డల మేలే యనుడుక్,నాతోడిదె నాతో
డిదె,తాతా మే లనుచు ననిరి తరుణులు
వరుసక్. భాగ. ౯. ౧౬౪. (నాతోడిదె
నాతోడిరు. అని అపముద్రి.)

క. తోడుదొన లేనియప్పటి, క్రీడికొలఁది యట్టి
దధిప కినియక విను మేఁ, దోడై రా నెదు
రుట గడుఁ,గీడు వలవ దుడుగవయ్యా గెలు
పరిది సుమీ. భార. ఉద్యో. ౩. ౩౪౦.

సీ...గాంగేయుఁ జంపి రాజ్యము సేయ సప్త
తించి, తొడరినపాండుపుత్రులకును దైవం
బుఁ దోడయ్యె ధర్మంబు గీడుపఱిచి, పరఁగి
యధర్మంబు పెరిఁగిన ట్లున్నది...భార.భీష్మ
౧. ౬౦.

౨. సమానము, సాటి.

చ...కేశవాఖ్యసం,విదితతదీయమూర్తు లయి వే
డుక కాం ద్రది తల్లితోడు గా, మది గణి
యించిరి...శుక. ౨. ౧౯౬.

సీ. తోటివా రని కొంచెపాటిగాఁ జూడక నవ
తులతో మైత్రి సలుపవమ్మ. ముకుంద. ౩.
౩౦౮.

క్రి. విశ. దు. సహాయముగా.

ఉ...ఏపని కైనను బోద్దువంప లే, దండుకుఁ తో
డు చీమ చిటు కన్నను వాదుకు వచ్చు
చుండు నీ,సుందరిలాగు లేవలనఁ జూచిన
లెస్సలు గావు తమ్ముఁడా. భోజరా. ౬.
౧౪౨.

క. వినవయ్య యేకపుత్రుఁడు, ననపత్యుఁడు
నొక్కరూప యని ధర్మవులక్, విని నీకుఁ
దోడు పుత్రుల, ననఘా పడయంగ నిష్ట మ
యినది నాకుక్. భార. ఆది. ౪. ౧౮౦.

ద్వి. తొలుతటిసామ్ముతోఁ దోడింకఁ గొంత,
గెలువఁ జూచెదవు...ద్వి. హరిశ్చ. ఉ.
౧౯౫.

జః తోఁ, తోఁబుట్టినవాఁడు, తోఁబుట్టు, తో
బుట్టుగు, తోకొను, తోడ,తోడంటు, మొ.

తోడుఁబాలు. వి. (తోడు + పాలు_పాలకు తో
డు-అని. బ్రా.) ౧. పాలు పిదుకునపుడు ముం
దు పాలముంతలోఁ బోసి యుంచుకొనెడు
నీళ్లు. (శ.ర)

౨. జున్నుచేయుటకై ముఱ్ఱుఁబాలకుఁ జేర్చు
సామాన్యపుపాలు. (వా)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**తోడుకొ(ట్కొ)ను**=తోడుకొను[1]. స. క్రి. (తోడు+కొను) కూడఁగొను, వెంటఁబెట్టుకొను. (పిలుచుకొను. శ. ర. ఈయర్థమున నిది అసమాపక క్రియగానే ప్రయోగములందుఁ గన్పట్టుచున్నది.)

ఉ...శ్రీభట్టరుఁ దోడుకొంచుఁ జని భక్తిరసంబు గడుఁజ మనంబులన్, నెట్టుకొనంగ... పరమ. ౫. ౩౬౯.

గీ...లనయను దోడ్కొనుచు వైష్ణవపరిషత్తు గొలువ నరిగి. అము. ౬. ౯౩.

మ. ఇనతేజుం డతిభక్తిఁ గాంచనరథం బెక్కించి యక్కన్యఁ దోడ్కొని తెచ్చెన్... భార. ఆది. ౮. ౧౯౧.

చ. అని వర మిచ్చి శూలి రజతాద్రికి నెచ్చెలి కాని వెంటఁ దోడ్కొని చనుదెంచె... ఉ. రా. ౨. ౩౧౭.

అ. క్రి. (తోడు=చేమిరి+కొను, పాలు. మొ) పేరుకొను, గడ్డకట్టు.

(వ్యవ) తోడుపెట్టుట ఆలస్య మైనందున పాలు తోడుకొనలేదు.

దంపచేను నీరు చాలక తోడుకొనిపోయినది.

**తోడుచేల్ల**. వి.(తోడు+చల్ల)చేమిరి పెట్టుమజ్జిగ. ఇట్లే: తోడుమజ్జిగ, మొ.

**తోడుత(డ్త)**. క్రి. విశ. ద్రు. (√తోడు) వెంబడి, వెంట.

శా. ఆరామామణికంఠభాగమున నాహా మించు ముక్తామణీహారంబుల్ దొలఁదొల్త నీలపుసరా లై యొప్పె నాపిమ్మటన్, హేరాళంపు మెఱుంగుఁ గెంపుసరు లై యింపారె నత్తోడుతన్, హీరాంచత్సరు లై తనర్చె విరహాగ్నిప్రాభవోద్రిక్తతన్. చంద్రా. ౮. ౧౭౧.

మ. అని శాకేవ.బుతు ప్రసేవితపురీంద్రారామపంక్తుల్ గళద్ఘనసూనాఘపరాగపూగములఁ దోడ్తన్ నేతుపుల్ దీర్చి కీరనికాయాస్యనికృత్తపక్వఫలనీరంబుల్ తగన్ నించు... చంద్రి. ౧. ౧౦౪.

ప్ర. ద్రు. తృతీయావిభక్తిప్రత్యయము, తోడ.

గీ. కారవాన్వయజాతు లై గారవమునఁ, బెరిగిన ట్టివిూ రొండొకనరునిఁ గొలిచి, మసలి వర్తిల్లి మానావమానములకు, నోర్చి యడఁకువ తోడుత నునికి యరిది. భార. విరా. ౧. ౧౧౭. ('తోడన' ముద్రి.)

ఉ...రాజ్యరమావిభూతి కౌద్ధత్యముతోడుతన్ సమరథ ర్మము వీసరపుచ్చి వంచనాకృత్యజమైనయీనిబిడకిల్బిష మేమిటఁ జక్కనయ్యెడున్. జై. భా. ౧. ౫౬.

ఉ...పర్యాయముతోడఁ బాటిపద నై యద నై నముదంబుతోడుతన్. విప్ర. ౨. ౨౦.

**తోడుతో(డ్తో)**. క్రి. విశ. ద్రు. (తోడు+తోన్) ౧. వెంబడి, వెనువెంట; శీఘ్రముగా.

క. ఘనఖడ్గంబున వానిం, దునుమ నలంబుసుఁడు దోడుతో నుజ్జ్వలయాకానరూపము గ్రొత్తఁగఁ గైకొని పెనఁగం బెనఁగఁ బార్థుకొడుకచలుం డై. భార. భీష్మ. ౩. ౧౦౩.

గీ. వ్రాసె నొక్కలతాంగి క్రొవ్వాఁడిగోర, వర్ణములు దోడుతో మషీవర్ణములుగఁ, బసిఁడిగేదంగిరేకునఁ బ్రస్ఫుటముగ, మదనలేఖంబు నర్మమర్మంబు మెఱయ. నైష. ౩. ౯౯.

మ...చెంతమంతుపలన్ బిల్చి ప్రవాహకారణము దోడ్తో నారయన్ బంచినన్. ఉ. రా. ౩. ౨౨౦.

౨. మొదట, తొల్త.

(వ్యవ) జ్వరముపడినవాఁడవు గనుక తోడుతో మజ్జిగ పోసికొనఁ గూడదు.

కూరలు ఉడుకుదాఁక నుండక తోడుతో మజ్జిగ పోసికొని తిని వెళ్లిపోయినాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**తోడుతో(త్తో)డ.** క్రి. విణ. ద్రు. (తోడన్ + తోడన్)

౧. వెనువెంట; శీఘ్రముగా.

గీ. అస్నరుఁడు దోడుతోడ నైదాలునిశిత, కాండములఁ ద్రుంచి పటుసాయకత్రయంబు, సానిపె...భార. శల్య. ౧. ౨౧౨.

క. నీకపటోత్తులె పట్టి మహీకాంతుం డలిగ నేని యీధారుణి య్యయ్యాకాశవాణి యెలుఁగరె,నీ కాకోల తోడతోడనే సిద్ధించున్. సారంగ. ౨. ౧౪౩.

సీ. తోడ్తోడ నెత్తావిఁ దొరయుపుప్పొడి రేఁచి కమ్మఁదేనియసోన గడలుకొలిపె. కృ. శకుం. ౧. ౭౧.

గీ. తనకుఁ దోడ్తోడ నగుపెండ్లి గనఁబడంగఁ, జేయునటువలె గారాబుఁజెలులఁ గూడి, వన విహారంబు గావించి చనెడుపాండ్య,రాజ సుతఁ జూచి యాపాండురాజసుతుఁడు. విజ. వి. ౧. ౧౨౯.

౨. క్రమక్రమముగా, వరుసగా.

ఆ. ఇవ్విధమున నేఁచి యిరువురుఁ బెద్దయుఁ, బ్రొద్దు పోర వాయుపుత్త్రబలము, దోడు తోడఁ బెరుఁగఁ దొడఁగె నాకీచకా,ధముని లావు పిదపఁ దఱుఁగఁ జొచ్చె. భార. విరా. ౨. ౩౪౯.

ఉ. చుక్కలు తోడఁతోడఁ దలచూపఁ దొడంగె...భార. విరా. ౨. ౩౧౯.

గీ. పరఁగ నశ్వత్థామఁడును బృహద్బలుఁడు మొదలుఁ, దుదయుఁ గాఁ గలరాజులఁ దోడు తోడ, నెఱుఁగఁ జెప్పితి...భాగ. ౯. ౩౬౫.

**తోడుతోడుత.** క్రి. విణ. ద్రు. (తోడుతన్ + తోడుతన్) వెనువెంట నే; అతిశీఘ్రముగా.

గీ... వెతిగి సేన, చంద్రుఁ డుదయింపఁ బెరిఁగినశరధియట్లు, దోడ తోడుతఁ బొంగారి చూడ నొప్పె. భార. భీష్మ. ౨. ౧౧౭.

**తోడుదొన.** వి. (తోడు + దొన=దొనదాల్పు, తూణి.) ౧-సహాయుఁడగు దొనదాల్పు- సహాయుఁడు, బాసట.

క. తోడుదొన లేనియప్పటి, క్రీడికోలఁది యట్టిదధిప కినియక విను మేఁ, దోడై రా నెదురట గడుఁ, గీడుసుమీ...భార. ఉద్యో. ౩. ౪౫౦.

గీ. చాలదుష్కర మైనయీజన్మమునకుఁ, దోడు దొన యైనచుట్టంబు దొరకు నెట్లు, దేవకీ నూతి త్రిభువనాధిపుఁడు తాన, యెఱిఁగి సాధింప కున్న నీదేలు నెట్లు. జై. భా. ౧. ౧౦౫.

**తోడుప(వ)డు, తోడ్పడు.** అ. క్రి. (తోడు + పడు) సహాయమగు, సాయపడు.

సీ...సుభద్రాసుతుండు.

గీ. భీష్మునకుఁ దోడుపడువారిఁ బెట్టు దాఁక. భార. భీష్మ. ౨. ౩౭.

ఆ...దుస్ససేనుఁ డాశని ప్రవీరుఁ డాఁకుటయును గౌరవపతి ద్రిగర్తుని బలంబుఁ బనిచెఁ దోడువడఁగ. భార. ద్రో. ౪. ౧౦౬.

ఉ...సింహనాదముల్, తోడ్పడ వే రసాతలము దూఁటిన...ఉ. హరి. ౪. ౧౬౮.

క. నిన్ననుఁ బాండుతనూజుల, నెన్నండును బోరఁ జూచి బెఱుఁగనివారిం, గన్నట్లు వలుక నేటికి, నిన్ను నెనఁటిరజ్జు లనికి నివి దోడ్పడునే. భార. ద్రో. ౫. ౧౦౧.

చ. దుర మొనరింపు మిప్పటికిఁ దోడ్పడి నీకుఁ దశుభం బొసంగెదన్. ఉ. రా. ౪. ౨౭౬.

**తోడుపా(డ్పా)టు.** వి. (√తోడుపడు) తోడుపడుట, సాయపడుట; సాహాయ్యము.

చ. నృపతులు సొచ్చి పోరునెడ నెయ్యురు బంధులుఁ దోడుపాటు నీ, నపుఁబనియే నినుం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బగలు సంపఁగఁ గావఁగలేనిమీబలాధిప
తుల దూఱు...భార. ద్రో. ౪. ౨౭౦.
క. శాసటయై భీముఁడు పై, గ్లేసెను మద్రపతి
నాతఁ డిరువురతోడం, జేసెం గయ్యము
గృపునుద్భాసితవిక్రమముతోడుపాటు గ
లుగఁగన్. భార. శల్య. ౧. ౨౫౭.
గీ. నీవు నాలావుతోడ్పాటు లేక యుండ, వల
యు నీతెగునంతకుఁ గలన నిలువ. భార.
ఉద్యో. ౨. ౨౮౯.

తోడుపె(వె)ట్టు. స. క్రి. (తోడు+పెట్టు.)
౧. సహాయముగా నిచ్చు, తోడుగాఁ జేయు.
వ...ఇద్దఱుశిష్యులం దోడువెట్టి శకుంతలం
దుష్యంతుపాలి కనుప సమకట్టి...పి. శకుం.
౫. ౭౩.
౨. చేమిరిపెట్టు.
(వ్యవ) పాలు ఇంకను తోడుపెట్టలేదు.

తోడువచ్చు. అ. క్రి. (తోడు+వచ్చు) సహా
యముగా వచ్చు, సాయపడు.
ఉ...నీవు రాక దుర్గ్రానముఁ బొందియున్న నభి
మానముఁ బ్రాణముఁ గొందుఁ జాల స్నాన
ము సేసి మెత్తు నవమానము సేయక తోడు
వచ్చినన్. భా. రా. అర. ౨. ౨౧.
సీ...విచక్షుఁ డనఁగ, దైత్యేంద్రుఁడు ...గీ.
ద్వారవతియందు నొంచె యాదవుల నెల్ల,
నట్టివీరుండు దోడురా యాతుధాన,ముఖ్యుఁ
డగునాహిడింబుండు మొనరు నడిచె. ఉ.
హరి. ౪. ౨౨౦.

తోడుపోవు. అ. క్రి. (తోడు+పోవు) ౧.
తోడుగా వెళ్లు, సాయపడు.
వ. కుత్సితరాజసంశ్రితుండ నగుట నే నాశకం
బునకుం దోడుపోయినవాఁడ మృత్యుముఖ
ప్రవిష్టులకు బ్రతుకు లేదు. వేం. పంచ.
౧. ౪౭౧.
౨. సమానమగు, సరియగు.

ఉ. రాతికిఁ దోడుపోయినది రాసుతు డెందము
మెత్త గాదు...సారంగ. ౨. ౮౭.
క. పిసుగులకుఁ దోడుపోయిన,కడిఁదిశరము లసు
రలొమ్ము గాఁడఁగ నేయన్. ఉ. రా. ౪.
౬౩.

తోడుసూపు. అ. క్రి. (తోడు+చూపు) సాయ
పడు, సహాయమగు.
క. కొడుకులుఁ దానును గుఱ్ఱపు,దడములఁ గరి
ఘటల భటరథవ్రాతములం, బుడమి చలింపఁగ
ద్రుపదుఁడు, గడువేడుకఁ దోడుసూపెఁ గొం
తేయులకున్. భార. ఉద్యో. ౧. ౨౨౦.
సీ. రంభోర్వశీముఖ్యజంభారివనితాళి తూర్య
త్రయంబునఁ దోడుసూపె. హర. ౪. ౯౨.
మ. చతురంగంబులఁ దోడుసూపె సమరోత్సా
హైకసన్నాహుఁడై. విక్ర. ౪. ౮౩.
స. క్రి. వ్యాపింపఁజేయు.
శా. వైదర్భీహృదయేశ మేలుకొని నిర్వర్తింపు
సంధ్యానవ,ప్రాదుర్భావవిధేయమున్ విధిక
లాపంబున్ ముహూర్తంబులో, నాదిత్యుం
డిటఁ దోడుసూపుఁ బటురంహఃపిష్టపిష్టీకృ
త,ధ్వాంతగోవ్యోమమహాతమోఘన్నము నమో
ఘంబున్ మయూఖౌఘమున్. నైష. ౮.
౧౫.

తోడెము[1]. వి.(త.తోడయమ్) గానరూప మగు
నాందీస్తుతి, మంగళగానవిశేషము.
ఉ. తోడెము మంగళంబు నటు తోడనె
విన్కికి యోగ్య మయ్యె నా,జాడఁ దలంపఁ
గూడ దలకక్షుఁడు మేళపురక్తి గుంపునన్,
గూడ దటంచు...మల్లుపు. ౪. ౬౩.

తోడెము[2]. విణ.(హిం. థోడా.)స్వల్ప మైనది.
సీ. సైకంబు కొంచెము సన్నంబు తోడెము
చిఱుకిము దసదు లేచిఱుత లేశ. గీ.కొద్ది
యన్నువ యనఁగను గొఱలు నల్ప,ము...
అం. భా. ౩. ౧౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వి. కొంచెము, లేశము. (శ. ర. బ్రౌ.)

తోణఁగి. వి. తృణవిశేషముఁ.

చ. పొని కెడ పీరి తోణఁగియు...వెనుతుప ప్రొల్ల బూదియును వీడలి పిచ్చుకబియ్య మెండ్రయుఁ. ప్రబంధ. ౨౦౦.

తోతెంచు[1]=తోడితెచ్చు. స. క్రి. (తోడు+తెంచు.[2]) వెంటఁ గొనివచ్చు.

గీ...వాగ్భామ యపుడు, మఱియు నాకమాన వేంద్రసమక్షమునకు, నిందుబింబాస్యఁ దో తెంచి యిట్టు లనియె. నైష. ౫. ౧౦౧.

శ్లో: భూయోఽపి భూపమపరం ప్రతి భారతీ తాం,త్రస్యచ్చమారుచలచక్షుషమాచచక్షే. సం. నైష. ౧౧. ౧౧౩.

సీ. అటుగాన ననుఁ గోరినట్టిచక్కనిచిన్నవానిఁ దోతెంచి నావాంఛ దీర్పు. శుక. ౨.౫౦.

తోతెంచు[2]=తోఁచు[1]. అ. క్రి. (తోఁచు[1]+తెంచు[2]-స్వార్థమున)

౧. నేత్రగోచరమగు, కనఁబడు.

సీ. నీలజీమూతంబులీల నాక్షేపించి నల్లనై తో తెంచునల్లగృహము, గలహిడింబుం డనుబలి తంపురక్కసుచెలిమల...భార. ఆది. ౬. ౨౧౧.

క. కేతనకపిభయదం బై, తోతేరఁగఁ జక్రధర చతురసారథ్యద్యోతితవల్గనచాతు, శ్వేతహ రులు మెఱయ వచ్చువీరునిఁ గంటే. భార. కర్ణ. ౩. ౧౭౪.

౨. శ్రవణగోచరమగు, వినఁబడు.

క. చూత మది యేమిక్రొత్తయొకో తా మిట యువతిసమితికోలాహలముల్, తోతెంచె నంచు భూపతి, చూతలతాగృహము వెడలి చూడం జూడన్. రాజ. చ. ౨.౧౬౮.

౩. పుట్టు, కలుగు.

ద్వి. సీత నీపురికిఁ దెచ్చిననాఁటనుండి,తోతెం చుచున్నవి దుర్నిమిత్తములు. రం. రా. యు. ౪౭౦ పం. ౩౧ పం.

క...పురుషుం, డాతతనాకసుఖము గనుఁ, దో తెంచును మగుడ సద్బుధులవంశమునన్. భార. శాం. ౫. ౬౨౭.

౪. (దేవతాదులు) ప్రత్యక్షమగు, సాక్షాత్క రించు.

వ. ఘోరవ్రతంబు నడపినం బ్రీతుం డై తో తెంచి పినాకధరుండు వరం బడుగు మనిన ...హరి. ఉ. ౨. ౧౧౧.

మ. మతి వైవస్వతుచేఁ దలంపఁబడి యమ్మ త్స్యంబు దోతెంచె...భార.ఆర.౪.౨౭౬.

౫. (గ్రహాదులు) ఉదయించు, పొడుచు.

సీ. ప్రథమాద్రిఁ దోతెంచుభానుబింబమునా నురమ్మునఁ గౌస్తుభరత్న మొప్పు. భార. విరా. ౧. ౧౨.

క. ఉడుపతి దోతెంచినఁ బొం,గెడుజలనిధికర ణి...నిర్వ.౬. ౧౬.

౬. వచ్చు.

గీ. పరఁగి తోతెంచుపాండవబలముమీఁదఁ, గవి యుటయు నంతనంతఁ గౌరవులమూఁక, మరలి యేర్పడఁ జూచి...భార. భీష్మ. ౩. ౧౪౨.

గీ. కటితటీకోటికింకిణికారవంబు, పార్శ్వఘంటా ద్వయీనాదపదవిఁ బొదువఁ, దరళలోచన గంధసింధురముపగిదిఁ, గొంతసేపునఁ దో తెంచెఁ గాంతకడకు. కళా. ౪. ౪౦.

క. తోయజనయనలు యమునా, తోయములం దుండు టెఱిఁగి దూరగుఁడయ్యున్,దోయజ నయనుఁడు హరి తన,తోయము గోపకులుఁ దానుఁ దోతెంచె నృపా. భాగ. ౧౦ పూ. ౭౧౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తోతెచ్చు=తోడితెచ్చు. స. క్రి. (√తోడు) వెంటఁ గొనివచ్చు, కొనివచ్చు (పిలుచుకొని వచ్చు. అని. శ. ర.)

ద్వి. ఈతఁడు మీకార్య మీడేర్పఁ దలఁచి, తోతేరఁ బనిచినదూతల వినుఁడు. రం. రా. కిష్కిం. (శ. ర.)

అ...నీవు, నతనిఁ బురుషునొద్ద కతివేగఁ దో తెమ్ము, లెత్తు నేను నుపనిషత్తు వెదకి. ప్రబోధ. ౫. ౬౫.

తోత్త్రము. సం. వి. అ. న. ౧. (ఏనుఁగును పొడిచెడు) బరిగోల.

౨. (పసులను దోలెడు) మునికోల, ములుకోల.

తోదనము. సం. విణ. (అ. ఆ. అ) నొప్పించునది. (అ. ఈ. అ.) నొప్పించుసాధనము- వి. అ. న. ౧. నొప్పించుట ౨. నొప్పి 3. మునికోల.

తోదము. సం. వి. అ. పుం. ౧. వ్యథ, నొవ్వు, నొప్పి. ౨. (గుఱ్ఱములు లోనగువానిని) పొడిచి తోలుట.

తోదు. వి. వరుస. (శ. ర, బ్రౌ.)

తోదుకత్తెర. వి.కంసాలికత్తెరలలోనొకటి. (వా)

తోదోపా(పులా)డు. స. క్రి. (తోపు+తోపు+ఆడు) మిక్కిలిగా నొకరి నొకరు తోసికొను.

మ. కనఁగాఁ జిత్రముగాఁగఁ జేయు రణరంగక్షోణియం దున్నశత్రునృపాలావళి యర్కమండలముఁ దోదోపాడుచుక్ దాఁటి వే,దనిరంభాది సిలింపవామనయనాసంఘంబుతో నెప్పుడుక్, ఘనదాంపత్యము నొంద రామమహీభృత్ఖడ్గాబ్జుజుం డెంతయుక్. రామ. ౪౨౩.

ద్వి. తెలియంగఁ దమతమదివ్యనామములు, తల పించి తముఁ బాడు తముఁ బాడు మనుచుఁ, దోదోపులాడుచుఁ దొలఁగక యంత. ద్వి. పరమ. 3. ౧౬౬ పా.

తోనికాఁడు=తోఁచికాఁడు. వి. శ్యేనవిశేషము. (శ. ర-పుంశ్యేనము, మగడేగ. అని. ఆం. భా. ౨. ౯౦.)

తోపాటు. క్రి. విణ. (√తోడు) సహార్థకము, తోడుత. (అవ్య. వలె, అని శ. ర.)

సీ. తనపుత్రుతోపాటు చనుఁబా లొసంగుచుఁ గూరిమితోఁ బెంచెఁ గొన్నినాళ్లు. బ్రహ్మో. ౨. ౫౫ పా.

తోపారము=తొపారము. వి. డేగకనుమలువు, డేగలముఖమునకుఁ గట్టెడుతోలుగంత.

(డేగ) గీ. వానికనుమరుఁ దనరుఁ దోపార మనఁగ. ఆం. భా. ౨. ౯౦.

తోపి=తొప్పి. వి. (హిం. టోపీ) టోపి, కుళ్లాయి. (శ. ర, బ్రౌ.)

తోపు=త్రోపు. (√తోయు) చూ. తోదోపాడు.

తోమకము=తోముడు.వి.(√తోము) తోముట, రుద్దుట.

వ...పిడుక గొఱపంబు తోమకంబునఁ బుటపుటనై...కొదమతట్టువగుంపు...ఆము.౪.3౫.

తోమరము. సం. వి. అ. పుం. న.౧. చిల్లకోల, సర్వల, చిన్నయీఁటె.౨.ఇనుపగుదియ.3.పాదమునకు తొమ్మిది అక్షరములు గలవృత్తవిశేషము.

తోమరిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఆఢకి, కంది. ౨. తొగరిమన్ను.

తోమాలిక=తోమాలియ.

గీ. రంగవిభునకు విప్రనారాయణుండు, చేయు తోమాలికలకుఁ జాంపేయకములు, వేసవియొసంగె... వైజ. ౨. ౧౪౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తోమా(లె)లియ=తోఁటమాలియ. వి.(తోఁట + మాలియ) వనమాల, ఆకులు పువ్వులు కూర్చి కట్టినదండ. (శ. ర- తోమాలె=మాలిక. అగ. ఆం.భా. ౨.౧౬౩.)

సీ. వైచుఁ దోమాలియ వైజయంతీకాంతివలయి తవక్షఃకవాటునకును. పాండు. ౨. ౨౦.

సీ. బాహుమధ్యంబునఁ బవడంపుఁజివుళులఁ బచ్చలఁ దోమాలె యచ్చుపఱిచి. నైష. ౮. ౧౧౨.

తోము. స. క్రి. మఱికి పోవునట్లు రుద్దు, నిర్మలము చేయు.

సీ. నిగనిగంగాఁ దోమి నిండుబోనముదొంతి భోజనశాలలోఁ బొసఁగఁ జేర్చి. హర. ౨. ౧౨౨.

సీ. మొనవాఁడిఁ ద్రిప్పి తోమినమునిపండ్లపైఁ దళుకుతళ్కునెడుకుందనపురవలు. రా. వి. ౨. ౫౭.

ఉ. తోయము లాడుచో నొడలు తోమెడు కూర్మికి...ఉ. రా. ౧. ౨౦౦.

సీ. కసటుఁ వోవఁగఁ దోమి కడిగి బోరగిలంగఁ బెట్టినతామ్రంపుబిండెవోలె. క్రీడా. ౮౦.

తోమనిపశ్యాలదొర=అగ్ని దేవుఁడు.

సీ. సమయునో యనక కాంచనశాటిఁ గట్టెఁ గా తోమనిపశ్యాలదొరలతాంగి. రా. వి. ౧. ౩౫. (స్రుక్స్రువాజ్యశరావములు అగ్నికార్యపరికరంబులు.అవి దారుమృద్వికారములగుటచేఁ దోమఁబడవు,అనివ్యాఖ్య. 'పశ్లేల' అనిముద్రి.)

జః తోమకము, తోముడు.

తోముడు=తోమకము. వి. (√తోము) తోముట, మార్జనము.

సీ. తోముడు ప్రాముడు తుడుపు రుద్దుడు పులుము డన మార్జనసంజ్ఞ పొలుచుచుండు. ఆం. భా. ౨. ౧౬౦.

తోయకామము. సం. విణ. (అ. ఆ. అ) ౧. నీరు కోరునది.౨. దప్పిగొన్నది. వి. అ. పుం. జలవేతసము, నీటిప్రబ్బలి.

తోయకుంభము. సం. వి. అ. పుం. ౧. శైవాలము, నాఁచు. ౨. జలకుంభము, నీటికుండ.

తోయకృచ్ఛ్రము. సం. వి. అ. పుం. న. జలమాత్రపానముచే నెలదినములు జరుపఁబడువ్రతము.

తోయగర్భము. సం. విణ. (అ. ఆ. అ)-లోపల నీరు గలది-వి. అ.పుం. నారికేళము, కొబ్బెర.

తోయగాఁడు. విణ. (తోయము + కాఁడు-వర్ణలోపము) విధము గలవాఁడు.

క. పలుతోయంబుల జగములఁ, బలుతోయములందు ముంచి భాసిల్లెడియా,పలుతోయగాఁడు వల్లవ,లలనాకరతోయములఁ జెలంగుచుఁ దడియుౘ్. భాగ. ౧౦ పూ. ౧౯౨. (పలుతోయగాఁడు=పెక్కు చందములఁ బ్రవర్తించువాఁడు.)

తోయజము. సం.వి.అ.న. నీటిపుట్టుగు, పద్మము.

తోయడింభము. సం. వి. అ.పుం.కరక,వడగల్లు.

తోయదము. సం. విణ. (అ. ఆ. అ) జలమును ఇచ్చునది. వి. అ.పుం.౧.మబ్బు, మేఘము. ౨. తుంగముస్తె. న. ఘృతము, నెయ్యి. (మే.ని.)

తోయధరము. సం. విణ. (అ. ఆ. అ) నీటిని ధరించునది. వి. అ.పుం. ౧. జలధరము, మబ్బు. ౨. తుంగముస్తె.

తోయధి. సం. వి. ఇ. పుం. ౧-నీరు దీనియందుండును- సముద్రము. ౨. నాలుగు అనుసంఖ్య.

తోయధిప్రియము. సం. వి. అ. న-సముద్రప్రాంతములయందు పెరుఁగునది-లవంగము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తోయనిధి. సం=తోయధి.

తోయపిప్పలి. సం. వి. ఈ. స్త్రీ. నీటిపిప్పలి, లాంగలి కీ.

తోయపుష్పి. సం. వి. ఈ. స్త్రీ-నీ రెక్కువగా పోయుటవలన పుష్పించునది- పాటల, కలిగొట్టు కీ.

తోయప్రసాదనము. సం. వి. అ. పుం-నీటిని తేటపఱచునది-కతకము, చిల్ల,ఇందుగుకీ. న. చిల్లగింజ.

తోయఫల. సం. వి. అ. స్త్రీ. కర్కటీభేదము, ఒకజాతిదోసకీ.

తోయమలము. సం. వి. అ. న. సముద్రపు నురుఁగు.

తోయము. వి. ౧. విధము, చందము, రీతి.

క. తోయజసంభవ నా కీ,తోయము వివరింపు చాలఁ దోఁచిన నే నా, తోయము వారికి న న్యుల,తోయములం జెందకుండ ధ్రువ మె ఱిఁగింతుర్. భాగ. ౨. ౭౮.

గీ. అనఁగ మఱియును బెక్కుతోయముల పేళ్ల, దారకులు దేర వచ్చె నుద్దండవృత్తి, వేఁట కుక్కలు మృగరాజవిగ్రహములు, పటుక నా థునివాహ్యాళివాహనములు. పి. శకుం. ౧. ౧౦౮.

క. తెగ దినుసు తోయ మనఁగను, నెగడుఁ బ్ర కారంబునకును నెఱి నామము లై.ఆం. శే. ౩౮.

వ. స్వస్తిశ్రీశకవర్షంబులు ౧౪౯౩ అగు నేంటి విరోధికృతుసంవత్సర జ్యేష్ఠ శు ౧౦ గు. నాండు కొండవీటిచదలువాడ శ్రీరాఘునే శ్వరులకు బృందావనముతోంటలోను కలనా నాతోయాలఫలవృక్షాలు సహితముగాను ...౧౪౯౩. గు. జి. అమినాబాదుశాసనము.చం. రా. ౨. ౪౫.

౨. మాఱు,తడవ,పర్యాయము.

ఉ...మున్ను మాగధుఁడు సేనలతోఁ బదియేడు తోయముల్, దిక్కులఁ బాఱఁడే మనకు దృష్టము వారలలావు వింతయే.భాగ. ౧౦ ఉ. ౭౬.

వ...నరనారాయణులవలనఁ ద్రివిష్టపంబునకుఁ బెక్కుతోయంబులు రాక్షసబాధలు శాం తిం బొందె...హర. ౭. ౧౦౭.

౩. (తె. తోయ్ = కలియుట) తెగ,గుంపు; పక్షము.

ద్వి. బసవయ్యతోయంపుభక్తులఁ జూచి, వసు ధఁ దారును లింగవంతుల మనుచు. బస. పు. ౭. ౫౩౪ పం.

క. చెలరేఁగి రెండుతోయం, బుల పేరంటాండ్రు చిత్తముల నెంతయు నేడ్కలు మీఱఁ జల్లు లాడిరి, తలఁకక యభినవకుభాక్షతవ్రాతము లన్. కళా. ౭. ౭౦. హరి. పూ. ౫. ౧౪౨.

౪. ఆప్తవర్గము. (బంధువులు, మిత్రులు.)

ఉ...మాయుపాధ్యాయులయాన పెండ్లి యగుఁ దప్పుడు జాడ్యము లేల నీవు నీ,తోయము వారిఁ గూడుకొని తోయదహానసఁ దెత్తు గాని వి,చ్చేయుము...భాగ. ౧౦ పూ. ౧౭౧౨.

క. మాయక్కల మాబావలఁ, దోయంబులవారి నెల్లఁ దోడ్తేరఁగ నే, నాయత్తపడఁగవలె జుం,డో యని నేటొకఁడు వల్కె నుత్సుక లీలన్. చెన్న. ౩. ౧౧౭. భాగ. ౧౦ పూ. ౮౧౫.

౫. పరివారము,పరిజనము.

క. తోయములు దెమ్ము మాకీ,తోయము వేఁటాడ వెరవు దొరకదు ఘనచే,తోయుత డప్పి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జనించెను, దోయమువారలును లేరు దుస్సహ
మనఘా. భాగ. ౧. ౪౫౯.

౬. సమయము, రీతి.

శా. దైతేయాంతక యొక్క చోట నిలువం దా
త్పర్య మిబ్బంగి నా, కేతోయంబున లేక
పోయెను సమిద్వీక్షాభిలాషంబునన్. నైష.
౩. ౩౧.

గీ. నీ ప్రతాపంబు లెన్నియెన్నికకు లేవు, తోడఁ
బడితి నాఁటవాన నీతోయమునను, నన్ను
మన్నింపు దుష్యంతునకు ఘటింపు,మయ్య
వెఱతును మదన జోహారు నీకు. పి. శకుం.
౩. ౧౮౯. భాగ. ౧. ౪౫౯.

తోయమగు=సంఘీభవించు, ఏకమగు.

దండకము...రుద్రుండు విశ్వాధికుం డంచు నా
మ్నాయసంఘాత మామ్రేడిత ప్రక్రియం దో
య మై యాతనిం జెప్ప...కాశీ. ౭. ౭౩.

జః తోయగాఁడు.

తోయము. సం. వి. అ. న. ౧. ఉదకము,నీరు.
౨. (జలదేవతాకమైననక్షత్రము) పూర్వాషాఢ.

తోయముచము. సం. వి. చ్. పుం. ౧. జలము
చము,మేఘము. ౨. ముస్తె. (రూ. తోయ
ముక్కు.)

తోయయంత్రము. సం. వి. అ. న. ౧. కాల
మును దెలుపుఘటీయంత్రభేదము, నీటిగడియా
రము. ౨. నీటి నెగఁజిమ్ముయంత్రవిశేషము.

తోయరాట్టు. సం. వి. జ్. పుం. ౧. సము
ద్రుఁడు. ౨. వరుణుఁడు.

తోయరాశి. సం. వి. ఇ. పుం. సముద్రుఁడు.

తోయలి=తొయ్యలి. వి. స్త్రీ, ఆఁడుది.

క. మాయా బలుండు...పట్టి తెచ్చునాఁడు...
ఉగ్రాకృతిఁ గని, తోయలి తనతనువు నెచటఁ
దాఁచఁగనో యకటా. మొ. రా.సుం.౩౨.

సీ. వేయుఁ గన్నుల వేల్పుతో యవిచేతను...
విక్ర. ౬. ౬౭. (చి. సి. షా.)

తోయవల్లి. సం. వి. ఈ. స్త్రీ-నీటిదగ్గఱ పె
రుఁగుతీఁగ-కారవేల్లము, కాఁకర తీ.

తోయశూకము. సం. వి. అ. పుం. శైవాలము,
నాఁచు తీ.

తోయసర్పిక. సం. వి. ఆ. స్త్రీ-నీటియందు
చరించునది-కప్ప. (విల్యమ్సు.)

తోయసూచకము. సం. వి. అ. పుం- వర్షమును
సూచించునది-కప్ప.

తోయాధివాసిని. సం. వి. ఈ. స్త్రీ-చెమ్మనేల
యం దుండునది-పాటల, కలిగొట్టు తీ.

తోయాశయము. సం. వి. అ. పుం. జలాశయ
ము,నీటిపట్టు. (ఇట్లే: తోయాధారము, మొ.)

తోయు=త్రోయు. (చూ. తోదోపాడు.)

తోసిరాజను=చదరంగములో బంటును రాజుపైకి
త్రోసి రాజుకు ప్రమాదమేర్పడిన దని తెలుపు.
(ఇట్లు తెలుపుట యెదిరివానికి పరాభవకార
ణము) తిరస్కరించు.

చ. కలికిముఖారవిందమలకల్వలరాయనిఁ దోసి
రాజనున్. విజ. వి. ౧. ౩౭.

జః తోదోపాడు,తోపు.

తోయేశము. సం. వి. అ. పుం. వరుణదేవతాక
మగుశతభిష మనునక్షత్రము. న. జలదేవతాక
మగుపూర్వాషాఢానక్షత్రము.

తోయేశుఁడు. సం. వి. అ. పుం. వరుణుఁడు.

తోరణకట్టు. మి. అ. క్రి. (తోరణము+కట్టు)
పిక్కటిల్లు, అతిశయించు.

సీ. కంధరపటలసంకాశంబు లగునంధకారము
లోరణకట్టె దిశల. హరిశ్చ. ౩. ౬౦.

స. క్రి. వశపఱుచుకొను, స్వాధీనముచేసికొను.

గీ. తలఁప కమృతంబు వైజయంతంబు నుఱవు,
విడువు వజ్రాయుధముతోడిగోడవ యింక,
నిచట నుండక వెడలిర మ్మిపుడు దేవ,పట్టణం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేసు దోరణకట్టినాఁడ. కువల. ౪. ౭౮.

సీ. కమల కోరకచక్రకనకకుంభములసౌష్ఠవము దోరణకట్టుచన్నుకట్టు. వరాహ. ౪. ౧౪౯.
(ఇట ఔపమ్యద్యోతకము.)

చ. దొరసెమునందు చుట్టుకొని తోరణకట్టె నురోవిభాగముల్,నిరుడు పయోజకోశరమ ణీయతఁ దాల్చెను వర్తమానవ,త్సరమున నొప్పె హేమకలశంబులభాగున ముంద టేఁ టికిం, గరినిభయాన చన్నుఁగవ కౌఁగిలిపట్టులు గాక యుండునే. క్రీడా. ౫౭౭.

తోరణకట్టుకొను. వి. అ. క్రి. (తోరణము +కట్టు+కొను) పొదుకొను, నెలకొను.

సీ. లేనప్రతాపము సముద్దండశాత్రవకోటిఁగడిసీమఁ దొరణకట్టికొనఁగ. దశా. ౧. ౧౧౯.

తోరణ(ము). సం. వి. అ. పుం. న. (ఇది చరిత్రాదులలోనిది.) ౧.బహిర్ద్వారము,వెలుపలిగుమ్మము, వాకిలి. ౨. మంగళార్థముగా. గుమ్మములకుఁ గట్టెడుమామిడాకు లోనగువానిదండ; రాజమార్గాదులం దలంకారార్థము కట్టుపత్త్రపుష్పాదుల దండ; దండ.

శ్లో. బుధైర్వందనమాలాతు తోరణం పరికీర్త్యతే. (హలా. ని.)

శ్లో. పౌరదృష్టికృతమార్గతోరణౌ. సం. రఘు. ౧౧. ౫.

ఉదా:- మఱ్ఱియాకులతోరణము, మోదుగాకుల తోరణము.

గీ. ఘనతరఫలానతాఖండకదళికలును, గీరరాజీకృతసజీవతోరణములుఁ, బొంగునెలమావికుఱుజులభంగనవఘ,లావళులుఁగాంచె నృపుఁడు వనాగ్రసీమ. వసు. ౧. ౧౫౧.

క. ఇలమీఁదికి డిగి వేలుపుఁ,బొలఁతులు మణికంధరునితపోవనమున కింపలరఁ జనిరి తమ చూడ్కులు, తొలుతఁగ నీలోత్పలములతోర ణకట్టుల్. కళా. ౩. ౭.

.న. కంధరము, మెడ.

తోరమల్లి. వి. (తోరమల్లె. ప్రా.) ఒకవిధ మైన తెల్లనిమణి,కృత్రిమవజ్రము. (చి. ని, శ. ర, ప్రా.)

తోరము. విశ. (సం. స్థూలమ్, ప్రా. థోరం)
౧. స్థూలము, లావైనది.

క. ద్వారవతి నొక్కనూతం, దోరపుఁదను వక్కజ మగుతొండ నొకటి న,చ్చేరువ మెలఁగుజనులు గని, నీ రిది గలఁగించు నిట్లు నిలిచినయేనిల్. భార. అను. ౨. ౪౧౭.

గీ...స్థూలముగుణ మెప్పఁ దోర మనఁగ. ఆం. భా. ౩. ౫౫.

మ...తోరం బైనచన్దోయిసం, దొలయ న్వేనలి జాఱ నిక్కి యరమే నొయ్యార మై ప్రాలఁగా, జలకం బార్చె...పారి. ౨. ౧౦.

౨. అధికము, గొప్పది, పెద్దది.

ఉ. తొంబదివేలు పద్మములు తోరపుసంఖ్యగ నొప్పునట్టి యబ్బంబులు దారుణం బగుతపం బొనరించిన...హరి. పూ. ౩. ౭.

క. మీరును మీమీ సేనలఁ, దోరముగాఁ గూర్చుకొనుచుఁ దోడ్తెం డనినన్. నా. పంచ. ౩. ౧౨.

ఉ. చేసినవారు మీరు గడుఁ జెట్టతనం బదియోర్వలేక దు,ర్వాసుఁడు వాసుదేవుఁ గని వైరము తోరము చేసినాఁడు...ఉ. హరి. ౪. ౭౫. విక్ర. ౨. ౨౩౦.

౩. దట్టము, సాంద్రము.

సీ. తోరంబుగాఁ బచ్చతోరణంబులు గట్టి దరిలేనిచలువపందిరులు వైచి. రసిక. ౬.౧౯౯.

క. తోరపులత్తుకచాయల,వాయవములు గట్టె మహిమవరకేతువు నె,ల్వారసమకట్టి తేరా, సారథి గొని తేర నెక్కె సంరంభమునన్.ఉ. రా. ౩. ౩౪౪, ౩. ౧౯౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౪. పొడుగైనది, దీర్ఘము.

క. ఈరసమునఁ గదిసి శరాసారము పైఁ గురి
యఁ నీవు సక్రోధుఁడ వై, పేరురమున వెస
నాఁటిన, తోరం బగు నారసమునఁ ద్రుళ్లి కెడ
సెనే. భార. కర్ణ. ౩. ౩౭.

వ...తీరక్షోణి నిలిపిన తోరంపుదివిదారికోలల
...ఆము. ౪. ౩౫.

౫. బలయుక్తము, బలముగలది, ఎదిరింపరానిది.

క. ఆరెండుబలములందును, దోరం బైయున్న
యట్లు తోఁచెం బాండు,క్ష్మారమణసుతుబల
ము నర,నారాయణు లునికిఁజేసి నాకుం
జూడఁగ. భార. భీష్మ. ౧. ౧౪౦.

శ్లో: అనంతరూపా ధ్వజినీ నరేంద్ర భీమా
త్వదీయా న తు పాండవానాం, తాం చైవ
మన్యే బృహతీం దుష్ప్రధర్షాం యస్యా
నేతా కేశవ శ్చార్జునశ్చ. సం. భార.భీష్మ.
౨౦. ౨౦.

౬. చక్కనిది, సుందరము.

క. తోరపుఁగన్నెల వేవుర, తో రహి శర్మిష్ఠ
కొలువఁ దులకింపుచు సిం,గారపుఁదోఁటకుఁ
జనియెఁగ,గారవమున దేవయాని కడు నాట
తమిఁగ. యయా. ౪. ౧౪.

వి. (సం. దోరః=రజ్జుభేదము. వాచ, అప్తే.)

౧. వ్రతసూత్రము.

సీ. పసిఁడితోరముతోడిబాహు వల్లన నెత్తి
సారెకుఁ బొదలపైఁ జాఁచిచాఁచి. మనుచ.
౩. ౭౭.

౨. (బ) కృపాణీరేఖలు.

సీ...కృపాణీరేఖ లొప్పును దోరము లన.ఆం.
భా. ౨. ౨౧౪.

జః తోరహత్తించు, తోరహత్తు.

తోరహత్తము. వి. మల్లబంధవిశేషము.

సీ. ఉపతాయిలోఁ దన కొదవినతోరహత్తము
నూపి ప్రేయక సమదవృత్తిఁ, బాసి క్రమ్మఱఁ
జేర బలువిడి వాఁడు పై నడరిన జరగక య
వనిఁ గ్రుంగి,నిలుచు...భార. విరా. ౨.
౧౫.

గీ. కళవరానకుఁ జొచ్చి డొక్కరము హత్తి,
జడికి మైఁ బెడగొని పట్టెసమునఁ దొడరి,
తోరహత్తంబునకుఁ బోఁతమారిబొబ్బ,ఱంబు
నను వింజవట్టి విన్నాణ మెసఁగ. ఉ. హరి.
౩. ౬౯. (శ. ర, చి. ని, పా.)

గీ. తోరహత్తంబునందుఁ బారుఁడు గడిమి,
సలిపె నూరులు పీడించె సరభసమున. హర.
౭. ౭౩.

తోరహత్తించు. స. క్రి. (√తోరహత్తు)నిండు
గావించు,సమృద్ధముగ నిచ్చు.

గీ. పుండరీకుండు క్షేత్రపాలుండు గొలిచి,యుం
డ నవ్యక్తముఖ్యసంయుక్తుఁ డగుచుఁ, బాండు
రంగండు భక్తకల్పద్రుమలీల, నిష్టఫలసిద్ధిఁ దో
రహత్తించు నింతి. పాండు. ౨. ౭౭.

తోరహత్తు. విశే. (√తోరము) సమృద్ధము,పు
ష్కరము.

ద్వి...కవిత, వినఁ గోరి యిప్పుడు విఖ్యాతి
గాఁగ, సిరి మించుసొమ్ములు చీనాంబరములు,
హరుల దంతులఁ దోరహత్తుగా నిత్తు. ద్వి.
పరమ. ౨. ౧౦౯. పా.

ద్వి. తొడవులు మాడలు దోరహత్తుగను, దడ
యక నీయన్నదమ్ముల కిత్తు. నవ. ౨ ఆ.
౭౭ పా. ౧౩ పం.

గీ. వెగ్గలపుఁబచ్చినంజుళ్లు వెట్టినీళ్లఁ, దోరహ
త్తుగ నిడఁ గడుపార మెసఁగి. అచ్చ. రా.
యు. ౨౩౧.

తోరి. సం. వి. ఈ. స్త్రీ. తైలము దీయునో
కానొకధాన్యము.

తోలకుఁడు. సం. విశే. (అ. లికా. అ.) ౧.
తూఁచువాఁడు. ౨. ఎత్తువాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తోలనము. సం. వి. అ. న. ౧. పయి కెత్తుట, ఎగఁబట్టుట. ౨. తూఁచుట. ౩. సరిపోల్చుట.

తోలనీయము. సం = తోలయితవ్యము.

తోలము. సం. వి. అ. పుం. న. ౧. తూనిక. ౨. పండ్రెండుమాషములకొలఁది, ఒకతులము. (వెండి, బంగారు మొ.)

తోలయత్. సం. (శత్ర) తూఁచుచున్న.

తోలయమానము. సం. విణ. (అ. ఆ. అ.) తూఁచుచున్నది.

తోలయితృ. సం. విణ. (ఋ. త్రీ. ఋ) తోలకుఁడు, తూఁచువాఁడు.

తోలయితవ్యము. సం. విణ. (అ. ఆ. అ) తూఁపఁదగినది.

తోలాడు. స. క్రి. (తోలు[1] + ఆడు-స్వార్థమున) తోలు, తఱుము.

సీ. గళనాళములఁ ద్రుంచెఁ గారుపోతులఁ గొన్ని తోలాడెఁ గొన్ని శార్దూలములను. పి. శకుం. ౨. ౧౫.

తోలు[1]=త్రోలు స. క్రి. (త. తోల్) ౧. (పసులను) ముందు నడిపించుకొని పోవు.

(వ్యవ) పసుల వాఁడు ఆవును తోలుకొని వెళ్లినాఁడు.

సంతలో ఆవును కొని తోలుకొని వచ్చితిని.

౨. (రథతురగాదులను) నడపించు.

చ...సామజముల్ వెస నేయుచుండంచు జో, దులకును జేయి వీచి మును దోలె నతండు రథంబు బల్విడిన్. భార. భీష్మ. ౨. ౨౫౦.

చ...బంతి యగ్రగా,మిగ వడిఁ బాఱవైచి పుడమిం బడనీకయె దాని మీఁటి చిత్రగతి హయంబుఁ దోలుచును గ్రమ్మఱ మీఁదికిఁ గొట్టియాడె...ప్రభా. ౨. ౩౧.

చ. అలికులవేణి...చక్కరఖాణపుఁదేజిఁ దోలు పూవిలుతువయాళికిన్...ఆళికి లోఁగి యాతలోన్. వసు. ౩. ౧౧౨.

౩. వెడలఁగొట్టు.

చ...ఆఁడువా,రల వధియింపఁ గాదని పురంబున నుండఁగనీక తోలి యా,వల నొకచోట నల్లునివివాహము చేసె రమాసమగ్రతన్. విక్ర. ౭. ౧౬౬.

ద్వి. వీనిఁ బట్టఁగ నెద్ది వెర వింక మనకుఁ, దలఁకక తోలఁగక తనరెడునేర్పుఁ, దోలఁగక ప్రా నెక్కి తోలుము నీవు. ద్వి. నల. ౧. ౩౩౫.

సీ. పొదఁ దూఱునొకమేటిపూరేటి వెలికిఁ బోఁ దోలి కైకొనె నొక్కతోఁచిగాఁడు. మను చ. ౪. ౫౫.

౪. తఱుము, పలాయితుఁగావించు.

క...అర్జునుండు దోర్బలలీలా,స్ఫూర్జితుఁ డై యొక్కెడసన్,గర్జారా ద్రముగఁ దోలెఁ గౌరవబలముల్. భార. భీష్మ. ౨. ౧౧౫.

శా. సుగ్రీవుం డనువానరేంద్రుఁడు రణక్షోణీ స్థలిం దన్ను న,త్యుగ్రప్రక్రియ వాలి దోలినఁ గడన్ దూరస్థుఁ డై... భా. రా. కిష్కిం. ౨౫.

శా...వృత్రారిం దోలినభోగి ధీరలలితుం డై పొల్చు నిశ్చింతతన్. నరస. ౨. ౪. (ఇట ఔపమ్యద్యోతకము.)

౫. వెంబడించు, వెన్నాడు.

గీ. దుష్టభుజగంబు లందందుఁ దోలి కఱచె. వి. పు. ౬. ౩౧౫.

గీ. కాలమృత్యువు వెసఁ దోలి కఱవ వెఱచు, భూమిదానం బొసఁగ్చినపుణ్యతముని. భీమ. ౫. ౬౭.

౬. విరియఁగొట్టు; పోఁగొట్టు.

క...మరు,తూన్నునుఁడు నింగి సెలంగ మ,హానిల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మంబుదముఁ దోలునగ్గతిఁ దోలెన్.భా.రా.
సుం. ౩౮౦.

శా. ఉష్ణాంశుండు దమంబుఁ దోలుక్రియ నీ
వుగ్రాహవక్షోణిలోఁ, గృష్ణా వైరులఁ దోలి
నాఁడవు...భాగ. ౧౦ ఉ. ౧౩౪.

గీ. బ్రహ్మహత్యాయుతేము...,ఆది యగుపాపము
లఁ దోలు నభవురాత్రి. శివరా. ౧. ౧౧౨.

గీ. బ్రహ్మహత్యాదు లైనపాపనిచయములఁ, బం
చబంగాళముగఁ దోలుఁ బంచజనుఁడు.భీమ.
౬. ౩౧, ౬. ౩౩.

౪. చంపు.

చ...ద్రోణులం, దునుముదు మద్ధు సూతసుతుఁ
దోలుదు మంతట నాస మాలెదన్. భార.
ఉద్యో. ౪. ౨౦౮.

౮. ఇది కొట్టుధాతువు వలె కొన్ని తుమున్నర్థ
కముల కనుప్రయుక్తమై ప్రేరణార్థము ని
చ్చును.

మ. అసు లేతద్వద నేందురాగమిళ నాప్రాదుర్భ
వతోత్కరకం,బుల తేనె లున్నధ లంచు రా
నొకతె నెమ్మో మెత్తఁ జైత్రంపుఁబు,వ్వుల
లోఁ దద్గుణు లయ్యె గంధఫలిఁ బువ్వు ల్వ
ట్టి పోఁదోలె నొ,చ్చెల చేఁ దై...ఆము. ౫.
౧౩౨.

క...పికశిశువు దాది వెడలందోలెన్. మనుచ.
౬. ౨౮.

సీ. మేలంపుమాటల మెచ్చులు పచరించి తో
రంపుసిగ్గును దొలఁగఁదోలి. విక్ర. ౪.
౨౨౩.

జః తోలాఁడు, తోలుచు, తోలుపు.

తోలు². వి. దే. అనా. (క. తొగలు) ౧. జం
తువులచర్మము, త్వక్కు.

క. అవిరళవిషఫణిదంష్ట్రిలు, పవనజువ జ్రమయ
తనువుపయితోలును నో,పవ ఛేదింపఁగ...
భార. ఆది. ౫. ౧౭౬.

మ...ఎల్లసామ్రాజ్యముల్, గొనియుం జాలక
తాటకేయపలభుక్కూటాకృతిం జింకతోఁ,
లున నాచ్ఛన్నుఁడ వై...ప్రాణంబులున్,
గొన నేతెంచితె...ఆము. ౩. ౭౯.

క. విని చెవుల మట్టి తోలం, గని కన్నుల నమలి
నాలుకను మూర్కొని ము,క్కునఁ బురుషుఁ
డెఱుఁగు మన మా,రను శబ్దస్పర్శరూపరస
గంధంబుల్. కు. సం. ౬. ౪౨౮.

౨. పాముకుబుసము, నిర్మోకము.

క. తోలు దిగవిడిచి నాగము, లీలఁ బోలుచుమా
ద్కిఁ గర్మలేపముఁ దనతోఁ,గీలుకొననీక వె
లుఁగు ని,రాలంబనబోధఘనుఁడు రాజవరే
ణ్యా. భార. శాం. ౪. ౩౫౮.

ఆ...తోలు డిగ్గ,నూడ్వ వెరవు గల్గునురగంబు
చాడ్పునఁ, గాన మేలు శ్రద్దధానుఁ డగుట.
భార. శాం. ౫. ౨౫౧.

౩. (వృక్షాదుల) త్వక్కు, పట్ట.

సీ. తొవపువ్వకామలతో లిమ్ముగాఁ బుచ్చు
పిక్కమూలంబులపెనఁగు వాపు. కు. సం.
౫. ౬౧౮.

సీ. తో ల్గల్గి తొఱ లేక తోమంగ నను వైన
తరుకాష్ఠమున దంతధావనంబు, వదనసంశు
ద్ధికై వలయుఁ గావింపంగ...కాశీ. ౫.
౨౦౫.

జః తోలుక, తోలుదాలుపు, తోలునిచ్చెన,
తోలువాయిదము.

తోలుక=తోలు². వి. (తోలు²+ఉక-స్వార్థము
న) చర్మము, చెట్లపట్ట.

సీ...తొడు పట్ట తోలుక తోలు చెక్క. ఆ.
తొంట చెక్కు తడప యంట త్వగాఖ్య
యా...ఆం. భా. ౨. ౩౪.

తోలుచే=త్రోలుచే. స. క్రి. (√తోలు¹) తో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లించు, తోలఁజేయు.

క...భగ్న,వ్రతుఁ దోలుపలేదు ముఁడ్లరాసుల మీఁదఁట. రుక్మా. ౨. ౧౬. (శ. ర. పా. "వ్రతుఁ దోయఁగలేదు"ముద్రి.)

తోలుదా(ల్పు)లుపు. వి.(తోలు² + తాల్పు²) కృత్తివాసుఁడు, శివుఁడు.

గీ. తోలుదాలుపు మున్నైనవాలుదాల్పు,నాఁగ భవదాఖ్య లొప్పు నంధకవిపక్ష. ఆం. సం. దేవ. ౬.

ఆ. తోలుదాల్పువిల్లు దునిమినయజ్ఞాణఁ,జూచి యబ్బ పేరిరాచగిబ్బ. అచ్చ. రా. బాల. ౧౭౭.

తోలునిచ్చెన. వి.(√తోలు²) తోలుతో చేసిన నిచ్చెన, చోరసాధనవిశేషము.

గీ. నల్లదట్టిసబిల్ల కన్నంపుఁగత్తి, బూది దివ్వా ర్పుఁబురు విసు మూఁడుఁగ్రోవి,తోలునిచ్చెన మొదలు ముందుగ ధరించి. ప్రబంధ. ౭౪౯.

తోలుపు. వి. (√తోలు¹) విద్రావణము, పాఱఁ ద్రోలుట; పరాజయము, ఓటమి.

ఉ. ఆలలితాంగిఁ జూచి నరకాసురుఁ డి ట్లనుఁ బాకశాసనుం, డాలములో ననుం గదిసి యం తకపాశికు బేరయుక్తుఁ డై,తోలుపులం బడెఁట ...ఉ. హరి. ౧. ౬౧.

తోలువాయిదము. వి. (తోలు² + వాయిదము) చర్మవాద్యము, డోలు, మొ. ఆనద్ధము. (శ.ర.)

తోల్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) తూఁపఁబడుచున్నది.

తోల్యము. సం. విణ. (అ. ఆ. అ.) తూఁపఁ దగినది. వి. అ. న. తూనిక,తూఁచుట.

తోవ= తొవ,తొఁగ. వి. కలువ ‡.

చ...చెం,గలువలుఁ దోవకామలునుఁ గంజదళం బులుఁ దెందు మీర లీ,చెలువకు శీతలక్రి యలు సేయుద మిం కెడసేయ నేటికిఁట. కు. సం. ౫. ౬౧౬.

రగడ. అప్ప మెప్పుగఁ దోవకల నీ వాడ వాడక యుండ లాగమె. ప్రబంధ. ౨౬౩. (తోవ కలను=కలువలతోఁ జేయుయుద్ధము.)

తోషకుఁడు. సం. విణ. (అ. షికా. అ) ౧. సం తోషపడువాఁడు. ౨. తృప్తి నొందువాఁడు. ౩. సంతోషపెట్టువాఁడు. ౪. తృప్తిపఱుచు వాఁడు.

తోషణము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. సం తోషపెట్టునది. ౨.తృప్తి కలిగించునది, తనుపు నది. (అ. ఈ. అ) సంతోషసాధన మైనది- వి. అ. న. ౧. సంతోషము. ౨. తృప్తి. ౩. సంతోషపెట్టుట. ౪. తృప్తి పఱుచుట.

తోషణీయము. సం=తోషయితవ్యము.

తోషము. సం. వి. అ. పుం. ౧. సంతోషము. ౨. తృప్తి, తనివి.

తోషయత్. సం. (శత్రు) ౧. సంతోషపెట్టుచు న్న. ౨. తృప్తిపఱుచుచున్న.

తోషయితృ. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) సంతో షపెట్టువాఁడు, తృప్తి నొందించువాఁడు.

తోషయితవ్యము. సం. విణ. (అ. ఆ. అ) ౧. సంతోషపెట్టఁదగినది. ౨. తృప్తిపఱుపఁ దగినది.

తోషలము. సం. వి. అ. పుం. (సంతోషమును తొలఁగించునది) ముసలాయుధము.

శ్లో. కృష్ణస్తోషలముద్యమ్య గిరికూటోపమం బలీ. సం. హరివంశము. (వాచ.)

తోషించు. సం. అ. క్రి. సంతసించు.

సీ. పరమపావని యంచు బంధువుల్ తోషింప నిత్యవ్రతాచారనియతిఁ బూని. కృ. శతం. పీఠి. ౭౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తోషితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. సంతోషపెట్టఁబడినవాఁడు. ౨. తృప్తిపఱుపఁబడినవాఁడు.

తోష్టృ. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ౧. సంతోషించువాఁడు. ౨. తృప్తి నొందువాఁడు.

తోష్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. సంతోషపెట్టఁబడుచున్నది. ౨. తృప్తిపఱుపఁబడుచున్నది.

తోష్యము. సం = తోషయితవ్యము.

తోస్తానము. వి. (చి. ని.) ౧. తుపాకీతూటాలుంచుకొనెడితోలుసంచి. ౨. తోలుపొరలతిత్తి, అఱలు గలతోలుసంచి.

వ...చొనిపినకఱు చపిడెమ్ములుఁ జంకల వ్రేలెడు తోస్తానంపుఁదిత్తులు... ప్రబంధ. ౬౦౫.

## తౌ

తౌ=తవుడు, తగు.

తౌటిపాము=తవుటిపాము. (√తౌడు) (శ. ర.)

తౌడు=తవుడు. వి. ఔ. బియ్యముమీఁది మెత్తని పొట్టు, కంబూకము. (శ. ర.)

జ: తౌటిపాము.

తౌతికము. సం. వి. అ. న. ముత్తెము. పుం. న. ముత్తెపుఁజిప్ప.

తౌర్యత్రికము. సం. వి. అ. న. నృత్తగీతవాద్యము.

తౌర్యము. సం. విణ. (అ. ఈ. అ.) తూర్యసంబంధమైనది-వి.అ.న. మృదంగాదివాద్యధ్వని.

తౌలము. సం. వి. అ. న. ౧. తుల, త్రాసు; ఉన్మానదండము, దడకొయ్య. పుం. తులారాశి.

తౌలి. సం. వి. న్. పుం. ౧. తూఁచువాఁడు. ౨. తులారాశి.

తౌలికికుఁడు. సం. వి. అ. పుం. (తూలికచేత జీవించువాఁడు.) చిత్రకారుఁడు; చిత్తరువు వ్రాయువాఁడు. (కల్ప.)

తౌలు=తవులు, తగులు. అ. క్రి. (పోవు; వెంబడించిపోవు.)

చ...సుస్థిరు నిను మావిభుం డనుమతిక వెనుదౌలెద మాదరంబునన్. రాఘవ. ౩. ౪౨.

తౌల్యము. సం. వి. అ. న. సామ్యము. (శ. ర.)

## త్య

త్యక్త. సం. విణ. (ఋ. త్రీ. ఋ) విడుచువాఁడు.

త్యక్తము. సం. విణ. (అ. ఆ. అ) ఉత్సృష్టము, విడువఁబడినది.

త్యక్తవ్యము. సం=త్యాజ్యము.

త్యజత్. సం. (శతృ) త్యజించుచున్న, విడుచుచున్న.

త్యజనము. సం. వి. అ. న. ౧. విడుచుట, విడుపు. ౨. ఈగి, ఇచ్చుట.

త్యజనీయము. సం=త్యాజ్యము.

త్యజి(యి)ంచు. సం. స. క్రి. విడుచు.

క. కాన సడి కోడి ప్రాణము, లైనను బ్రాణముల కెల్లఁ బ్రాణము లగుమి, మైనను ద్యజింతు ననఁగా, జానకి నెడఁబాయు టెంత చర్చింపంగన్. ఉ. రా. ౬. ౨౧౯.

చ. ఎలమి వహించి నన్నుఁ ద్యజియింపక యుండితి రేనిఁ బల్కు లక్, గలయు నసత్యము...ఉ. రా. ౭. ౨౨౦

త్యజ్యమానము. సం. విణ. (అ. ఆ. అ) విడువఁబడుచున్నది.

త్యాగము. సం. వి. అ. పుం. ౧. విడుచుట, వదలిపెట్టుట. ౨. ఈవి, దానము.

త్యాగి. సం. విణ. (న్. నీ. న్) ౧. వదలువాఁడు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విడుచువాఁడు. ౨. ఈవికాఁడు, దాత. ౩. శూరుఁడు. ౪. కర్మఫలమును త్యజించువాఁడు, ఫలాపేక్ష లేక కర్మము లనుష్ఠించువాఁడు.

త్యాగిగద్యలు. వి. బ. గుడివాడను పాలించిన త్యాగి (=సాగి)వారనురాజుల మొహరు గల గద్యాణకములు.

వ...నిత్యమానెండు (నెయి) బోయంగ్గలవాండు దీపమునకుం బెట్టినత్యాగిగద్యలు ౭ దీనికి విఘ్నము సేసినవాండు మహాపాతకము శేసినవాండు శ్రీ॥ శ్రీ. కొ. శా. ౯౨౦.

త్యాజకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.)=త్యక్త.

త్యాజితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) విడిపింపఁబడినవాఁడు.

త్యాజ్యము. సం. విణ. (అ. ఆ. అ) వర్జనీయము, విడువఁదగినది.

త్రంపి=తంపి. వి. దాలి. (నీళ్లు మొదలగువానిని కాఁచుటకు పేర్చినపిడుకలప్రోగు.)

ఉ. ఆసలత్రంపి వెట్టి హృదయం బను కాఁగున యోగవాసనా, భ్యాసపునీరు గాఁచుటకు నాగమపావకముం దగిల్చి...ఉ. హరి. ౪. ౮౬.

గీ. తరతరంబులఁ దఱుఁగని త్రంపి గాఁగఁ, దపనతపనీయ మాతపతాపవహ్నిఁ, గ్రాఁచుకాలకళాదుఫూత్కారచయమొ, నాఁగఁ దగెఁ బశ్చిమానిలోగ్రాగమంబు. కృ. శకుం. ౧. ౩౦.

వ...నెల్లికొయ్యలు ద్రచ్చి నుచ్చు లంటించినం బెచ్చుపెరుఁగుచిచ్చు లాత్రంపులం దవిలించి...మనుచ. ౪. ౬౦.

త్రచ్చన. వి. (√త్రచ్చు.) ౧. చిలుకుట. ౨. చెక్కుట. (శ. ర.)

త్రచ్చు=తరుచు. స. క్రి. చిలుకు, మథించు.

గీ. అతులవేదాంతశాస్త్రమహాంబురాశి, ద్రచ్చి పుచ్చిననవనీత మిచ్చితిని స,మాదరంబునఁ గైకొనుము...భార. శాం. ౫. ౧౬౮.

సీ. ఇంద్రాదిసురలు బలీంద్రాదిదనుజులు దర్పదుర్వారులై త్రచ్చువార,లు...గీ. ఈవిధంబున దుగ్ధాబ్ధి నేచి తరువ, వివిధసద్వస్తులుం బ్రభవింపఁగలవు. హర. ౬. ౪౦.

మ. విను ము న్నేటికిఁ ద్రచ్చెఁ బాలకడలిన్ ...భాగ. ౮. ౧౪౩. మార్క. ౭. ౧౯౯.

౨. తటిమెనఁబట్టు, సానఁబెట్టు.

చ. అనుటయు నవ్విధంబునకు నంబుజబాంధవుఁ డియ్యకొన్న నా,తనిపటుదీప్తిమండలి ముదంబున నొగ్గమునం దమర్చి వే, తునియఁగఁ ద్రచ్చె...సురేంద్రవర్ధకి...హరి. పూ. ౧. ౧౮౮.

౩. మేయు.

చ. శవదము లైనయమ్మునులశాసన మెట్టిదొ కాని కానలం, దమలెమయిచ్చఁ బచ్చికలు ద్రచ్చి వెసం జనుహోమధేనుసం,ఘములకు గోపబాలకులకై వడి నేరిమి వాల వాలదం, డముల నదల్చి తెచ్చు మగుడం బులు లచ్చట నిల్చి మచ్చికన్. వాల్మీ. ౧. ౩౪.

౪. (నిప్పుపుట్టుటకై కాష్ఠాదులను) రాచు, ఒరపెట్టు.

వ...నెల్లికొయ్యలు ద్రచ్చి నుచ్చు లంటించినం బెచ్చుపెరుఁగుచిచ్చులు...మనుచ. ౪. ౬౦.

౫. నఱుకు, ఖండించు.

చ. అనలము దోఁచునే తరువునందుఁ గుఠారముఖంబులైనసా, ధనములఁ ద్రవ్వ సజ్జనహితా తగఁ ద్రచ్చినఁ గాక...భార. శాం. ౪. ౧౭౯. (కరాల. పా. బ్రవ్వ. ముద్రి.)

జః త్రచ్చన.

త్రట్టు=తట్టు. వి. కొట్టునప్పుడు దద్దురువలె ఒడలిమీఁద ఏర్పడుచిహ్నము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్వి. త్రట్లంటి చూచుచుఁ దమకర్ష మనుచు. బస. పు. ౬. ౫౧౭ పం.

ద్వి. మసలిన తమకైనపసులను దాఁకఁ, ద్రట్లును గట్టి ముచ్చుట్లును జుట్టి, త్రేట్లతోడన తమ వీపుతో నొగయ. బస. పు. ౬. ౫౧౭ పం.

త్రప. సం. వి. ఆ. స్త్రీ. ౧. లజ్జ, సిగ్గు; బిడియము. ౨. అంకపటాలు, కులట. (మే. ని) ౩. కులము. ౪. కీర్తి. (వాచ. విల్యమ్సు.)

త్రపమాణుఁడు. సం. విణ. (అ. ఆ. అ) సిగ్గుపడుచున్న వాఁడు.

త్రపాకుఁడు సం. వి. అ. పుం. ౧. ఒకానొక మ్లేచ్ఛ జాతివాఁడు. (కల్ప)

త్రపిత. సం. విణ. (ఋ. స్త్రీ. ఋ) సిగ్గుపడువాఁడు.

త్రపితము. సం. విణ. (అ. ఆ. అ) సంజాతలజ్జము, సిగ్గుగలది.

త్రపిష్ఠుఁడు. సం. విణ. (అ. ఆ. అ) అత్యంతము తృప్తి గలవాఁడు.

త్రపీయు(యసు)ఁడు. సం. విణ. (స్. యసీ. స్.) మిక్కిలి తృప్తిగలవాఁడు.

త్రపుకర్కటి. సం. వి. ఈ. స్త్రీ. ములుదోసకాయ.

త్రపుటి. సం. వి. ఈ. స్త్రీ. చిట్టేలకికాయ.

త్రపులము. సం. వి. అ. న. తగరము. (వాచ.)

త్రపువు. సం. వి. ఉ. న. ౧. తగరము. ౨. సీసము. (శ్లో. త్రపు సీసకరంగయోః. హేమ. ని.)

త్రపుషము. సం. వి. అ. న. తగరము. (కల్ప.)

త్రపుషీ. సం. వి. ఈ. స్త్రీ. ౧. మహేంద్రవారుణి, పెద్దపాఁపరకాయ. ౨. ములుదోసకాయ.

త్రపుస. సం. వి. ఆ. స్త్రీ. చేఁదు గలదోసకాయ. (కల్ప)

త్రప్త. సం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) ౧=తర్పిత. తృప్తిపడువాఁడు; తృప్తి పొందించువాఁడు. ౨= త్రపిత. సిగ్గుపడువాఁడు.

త్రప్తవ్యయము. సం=తర్పితవ్యము.

త్రప్సం. సం. వి. ఆ. స్త్రీ. ఘనీభూత మగుశ్లేష్మము, గడ్డ కట్టినశ్లేష్మము, కఫ్ఫె. (వాచ.)

త్రమ్ము. వి. (క. తటెమ్ము.) దుమ్ము, ధూళి.

సీ. పితరులఋణము దీర్పెడ సూనుఁ డెందనిదౌర్భాగ్యశీలుగో త్రమ్ము త్రమ్ము. రాఘవ. ౧. ౪౬. (ఇట వ్యర్థము అని భావము.)

స. క్రి. ౧. ధూళిచే మాపు, దుమ్ముచేయు. (శ. ర. బ్రౌ)

త్రయఃపంచాశత్తమము. సం. విణ. (అ. ఈ. అ.) ఏఁబదిమూఁడవది.

త్రయఃపంచాశత్తు. సం. విణ. (ల్) ఏఁబది మూఁడుసంఖ్యగలది. వి. (ల్). స్త్రీ. ఏఁబదిమూఁడు. (తెనుఁగున ప్రాయికముగా సమాసపూర్వపదముగా నుండును.)

త్రయఃపంచాశము. సం. = త్రయఃపంచాశత్తమము.

త్రయము. సం. వి. అ. న. మూఁటిసమూహము. (లోకత్రయము, మొ.)

త్రయశ్చత్వారింశత్తమము. సం. విణ. (అ. ఈ. అ.) నలువదిమూఁడవది.

త్రయశ్చత్వారింశత్తు. సం. విణ. (ల్.) నలువది మూఁడు.

మూఁడుసంఖ్యగలది- వి. (ల్). స్త్రీ. నలువది

త్రయశ్చత్వారింశము. సం=త్రయశ్చత్వారింశత్తమము.

త్రయష్షష్టము. సం. విణ. (అ. ఈ. అ) అఱువది మూఁడవది.

త్రయష్షష్టి. సం. విణ. (ఇ) అఱువదిమూఁడవది. వి. (ఇ). స్త్రీ. అఱువదిమూఁడు.

త్రయష్షష్టితమము. సం= త్రయష్షష్టము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రయస్న్త్రతము. సం. విణ. (అ. ఈ. అ.) డెబ్బదిమూఁడవది.

త్రయస్న్తతి. సం. విణ. (ఇ) వి. ఇ. స్త్రీ. డెబ్బదిమూఁడు.

త్రయస్న్తతితమము. సం.= త్రయస్న్తతము.

త్రయస్త్రింశత్తమము. సం.విణ. (అ. ఈ. అ.) ముప్పదిమూఁడవది.

త్రయస్త్రింశత్తు సం. విణ. (త్) వి. త్. స్త్రీ. ముప్పదిమూఁడు.

త్రయస్త్రింశము. సం. విణ. (అ.ఈ.అ.)ముప్పదిమూఁడవది.

త్రయి. సం.వి. ఈ. స్త్రీ. ౧. మూఁడువేదములు. ౨. మూఁటిసమూహము. ౩. పురంధ్రి, కుటుంబము గలయాఁడుది, భర్త బిడ్డలు జీవించియున్నగృహిణి. ౪. మంచిమనస్సు గలయాఁడుది. ౫. సోమరాజి, కారుగచ్చకీ. ౬. త్రిపని, ఏనుఁగు కాలిసంకెల.

త్రయీతనుఁడు(నువు). సం. వి. ఉ.పుం.-వేద త్రయశరీరుఁడు- సూర్యుఁడు.

త్రయీధర్మము. సం. వి. అ. పుం. వేదవిహిత ధర్మము.

త్రయీమయుఁడు. సం.వి.అ.పుం.సూర్యుఁడు.

త్రయీముఖుఁడు. సం. వి. అ. పుం. వేదములు చదివినబ్రాహ్మణుఁడు.

త్రయోదశకము. సం. విణ. (అ. శికా. అ.) పదుమూఁడు పరిమాణముగలది. వి. అ. న. పదుమూఁడు.

త్రయోదశము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. పదుమూఁడవది. ౨. సమాసమున-పదుమూఁడు ఎక్కువగాఁ గలది. (త్రయోదశశతము=నూట పదుమూఁడు.)

త్రయోదశి. సం. వి. ఈ. స్త్రీ. పక్షమునందు పదుమూఁడవతిథి.

త్రయోనవతము. సం. విణ. (అ. ఈ. అ.) తొంబదిమూఁడవది.

త్రయోనవతితమము. సం=త్రయోనవతము.

త్రయోనవతి. సం. వి. ఇ. స్త్రీ. తొంబది మూఁడు.

త్రయోవింశతి. సం. వి. ఇ. స్త్రీ. ఇరువది మూఁడు.

త్రయోవింశము. సం. విణ. (అ. ఈ. అ.) ఇరువదిమూఁడవది.

త్రయోవింశతితమము. సం=త్రయోవింశము.

త్రవు=త్రవ్వు.

(భూమ్యాదులను చీరు.)

సీ. పెందూళిరొమెసఁగ నందంద కాల్ద్రవు నుదగ్రత మహీతలము గ్రక్కదలుచుండ.మార్క. ౬. ౧౦౭. (శ.ర. పా. కాల్ద్రవ్వ నుగ్రత. ముద్రి. పా.)

జః త్రవుగోల.

త్రవుకోల=త్రవ్వుకోల. (√త్రవు.) వి. గుద్దలి, కుద్దాలము.

త్రవ్వ=తవ్వ. (చి. ని.)

సీ...కుడవాభిధాన మై యడరు నవల, మాన నాముంత నా మానిక యనఁగను ద్రవ్వ నాఁబడి నాఁ దదర్థ మెసఁగు. ఆం. భా. ౨. ౨౭౦.

త్రవ్వటము. వి.(√త్రవ్వు.)త్రవ్వుట,గ్రొచ్చుట.

సీ. త్రవ్వటంబులతతేఁ ద్రవ్వటంబులు వెట్టుఁ దగినట్టికజ్జుగుద్దలి గడించి. కళా. ౪. ౭౮.

త్రవ్వటించు=త్రవ్వు. స. క్రి. (√త్రవ్వటము) త్రవ్వు,గ్రొచ్చు. (శ. ర. బ్రా.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రవ్వితండము(లు). విణ. (త్రవ్వి + తండము) అసంఖ్యాకము, అపరిమితము.

చ. కొడుకులు కూఁతులుం గలిగి కూఁతును బాఁడియుఁ ద్రవ్వితండ మై. క్రీడా. ౨౫౬.

గీ...అన్య,జాతులకు మ్లేచ్ఛులకును బ్రభూతధనముఁ, ద్రవ్వితండంబు లిచ్చె నాధరణివిభుఁడు. భార. అశ్వ. ౪. ౨౦౦.

సీ. సురపతివీ డెల్లఁ జూఱాడి సురతరుకోటి యున్మూలించికొని సుమేరు,రత్నంబు లన్నియుఁ ద్రవ్వితండమ్ములు గొని...హరి. ఉ. ౪. ౪౩. యయా. ౫. ౧౫౭.

త్రవ్వ=త్రవు. స. క్రి. (త. తోరువు.)

౧. (తటాకాదులు) ఖననముచేయు, గ్రొచ్చు.

సీ... చక్కఁ బ్రాఁక,రానితిప్పలుచొరఁ ద్రవ్వఁడీఱము లైనమ్రాఁకులుఁ బొదలును బ్రగ్గఁబొడువుఁ,డు...హరి. ఉ. ౧. ౮౩.

సీ. అగడిత లీఁత్రనీ రలవడఁ ద్రవ్వించి ...ఉ. హరి. ౨. ౯౭.

౨. కోరాడు,(భూమ్యాదులను) చీరు.

శా. కొండల్ ద్రవ్వినమన్ను కత్తులగతిన్ గొమ్ముంగొనల్ ముంప వే,దండంబుల్ చవుదంతు లౌటఁ దెలిపెన్ దండెత్త భూపాళికిన్. ఆము. ౪. ౧౫౪.

చ. అలమినచింతఁ ద్రవ్వికొను సంభ్రితుదంబురిలోనివాహముల్. ఆము.౨. ౨౭.

౩. ఉన్మూలించు, కెల్లగించు, పెల్లగించు.

సీ...అవ్వార్త వేగమ విని నగరంబు గంగలోనఁ, ద్రవ్వి వైచెద నని తనభూరిహలమున నెత్తి ...ఉ. హరి. ౧. ౯.

ఉ. అవ్వసుధేశ్వరుం డతివహస్తము వట్టినఁ బట్టి ధైర్యముం, ద్రవ్వెడుకన్నులం గొని యదల్చి వదల్చెఁ గరంబు చయ్యనన్. కేయూర. ౪. ౨౧.

౪. (వెనుకటిసంగతులను) ఎత్తిచెప్పు.

ఉ. వీరలు పెద్ద ద్రవ్వ కొకవెంట నొడంబడి తేటి శాంతులై, కౌరవకోటిఁ గూడి మనఁ గా మదిఁ గోరుట పెంపుఁ దాల్మియుం, గారుణికత్వముం దగవుఁ గాదె ... భార. ఉద్యో. ౧. ౩౪౧.

ఉ. గాసటబీసటే చదివి గాథలు త్రవ్వ తెనుంగువారికిన్, వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లగఁ జేసినట్టి యబ్జాసనకల్పులం దలఁతు...నృసిం.పీఠి. ౯.

వ. అని యివ్విధంబునఁ గృష్ణతోడఁ దనయుమ్మలికంబు లన్నియుఁ ద్రవ్వికొని...భార. ఉద్యో. ౩. ౧౯౧.

౫. బైటఁబెట్టు, ప్రకటించు.

గీ. ఓరి యవివేకి సన్యాసి యూర కేల,వెత్తిఁ ద్రవ్వెదు నీమంత్రవిలసనంబు,కొలఁదియును నాకొలందియుఁ దెలియ కెట్లు,నన్ను విడిపింతు నని వచ్చినాఁడ విపుడు. పరమ.౫. ౨౨౨.

౬. ప్రస్తావించు, ప్రసంగించు.

ఉ. అవ్వలిదిక్కు మోమయి ప్రియంబున నొండులతోడ ముచ్చటల్,ద్రవ్వుచు నొక్కకోమలి పరాకున నుండఁగ...నైష. ౬. ౧౧౩.

సీ. ఎవ్వరి నేసుద్ది త్రవ్వించి యచ్చట నేశాస్త్ర ఘనుకల్మి రెుటిఁగికొనునో. కళా. ౬.౧౫౬. హరి. ఉ. ౪. ౧౦౯.

౭. క్రొత్తగాఁజేయు.

గీ. మున్ను కాదె యాదవులకు మునివరేణ్య,కలిత దారుణశాపంబు గలదు నీకు, నేల చర్వితచర్వణ మిట్లు సేయ, దీన నీ వేమి త్రవ్వితి చానిఁ జెపుమ. భార. స్త్రీ. ౨. ౧౬౨.

జః త్రవ్వటము, త్రవ్వటించు, త్రవ్వితండము, త్రవ్వకోల.

త్రవ్వకోల= త్రవుకోల. వి. గుద్దలి, కుద్దాలము. (శ.ర.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రసనము. సం. విణ. (అ. ఆ. అ) భయపడునది. వి. అ. న. ౧. త్రాసము, దిగులు, భయము. ౨. ఉద్వేగము, మనస్స్వాస్థ్యము లేకుండుట.

త్రసము. సం. విణ. (అ. ఆ. అ) జంగమము, తిరుగునది. వి. అ. పుం. హృదయము, గుండె. (విల్యమ్సు) న. ౧. వనము, అడవి. ౨. జంగమ ప్రాణిసమూహము.

త్రసరము. సం. వి. అ. పుం. న. ౧. (నూలు చుట్టు) పంటెకఱ్ఱి. ౨. నూలుచుట్టుట. (కే.ని.)

త్రసరేణువు. సం. వి. ఉ. పుం. ౧. (వైద్య) ముప్పదిపరమాణువులకొలఁది. ౨. ఆఱుపరమాణువులకొలఁది, మూఁడు ద్వ్యణుకములకొలఁది. (గవాక్షములోనిసూర్యకిరణమునందు కదలుచుండురేణువు, ఆఱుపరమాణువులు కలది.) స్త్రీ. సంజ్ఞాదేవి, సూర్యునిభార్య.

త్రసితి. సం. విణ. (ఋ. స్త్రీ. ఋ) భయపడువాఁడు.

త్రసురుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) భయశీలుఁడు. (వాచ)

త్రస్తము. సం. విణ. (అ. ఆ. అ.) భీతము, భయపడినది, బెదరినది.

త్రస్తరి[1]. వి. ౧. పరిహాసము, మేలము.

సీ. వలపువాసన మించెఁ గలికి నీమొగ మంచుఁ ద్రస్తరి నెఱపె సుదంత కొంత. విజ. వి. ౩. ౨౭.

గీ. కేలి యన మేల మన మంటె మేల మనఁగ, నాట యనఁ ద్రస్తరి యనఁగ హోళి యనఁగఁ, బొలుచుఁ బరిహాసములు మాతృభూతలింగ. ఆం. భా. ౧. ౧౩౯. మనుచ. ౬. ౯.

జః త్రస్తరులాడు, త్రస్తరులుసేయు, త్రస్తరించు[1].

త్రస్తరి[2]. వి. ౧. క్రిందు, క్రిందుభాగము; వెనుక, వెనుకభాగము.

సీ. కర్ణడోలామౌక్తికచ్ఛాయ లెగఁబ్రాఁకుసురుహారరుచులఁ ద్రస్తరికిఁ దన్న. ఆము. ౨. ౭౫.

ఉ. తూకొని ముందరం దఱుముదుస్సహరాగభరంబుడంబునన్, జేకొని త్రస్తరిం దిగుచుసిగ్గున ముంగలికిం బిఱిందికిం, బోకడరాకడల్వాళముపోవక మన్మథుఁ డానవెట్టిన, ట్లాకలకంఠి నిల్చె నచలాకృతిఁ జిత్తరుబొమ్మకైవడిన్. కృ. శతం. ౨. ౫౮.

జః త్రస్తరించు[2].

త్రస్తరించు[1]. అ. క్రి. (√త్రస్తరి[1]) ౧. పరిహాసమాడు, మేలమాడు.

సీ. తాపింఛరుచిలోడఁ ద్రస్తరించెడుమేనఁ బసిఁడిముంజియుఁ దగుపట్టుగోడుగు. భాగ. ౧౦. ఉ. ౧౨౩.

గీ. దాసనపుఁబువ్వచాయతోఁ ద్రస్తరించుచుదయమయ్యెడు నదె చూడు మొదలిసంజ. క్రీడా. ౬౨.

౨. క్రమ్ముకొను, వ్యాపించు.

చ. అలుకనిజీబులోఁ గుసుమ మద్దినపావడ దోఁపఁ గొప్పుచెం, గలువలవల్వఁ జన్నుఁగవకస్తురితావియుఁ ద్రస్తరింప నం, దెలరొద మీఱ ...మనుచ. ౬. ౩౧.

త్రస్తరించు[2]. స. క్రి. (√త్రస్తరి[2]) ౧. క్రిందుపఱుచు, అధఃకరించు.

సీ. గిరిగరుత్ఖండనక్రీడాసమారంభదంభోళిరుచిత ముఁ ద్రస్తరించి. పి. శతం. ౩. ౯౩.

సీ. నూరెలఁ బఱలెంచుజులమతీ తేజీలు ధవళాశ్వములమస్తుఁ ద్రస్తరింప. రంగా. ౧. ౧౫౭.

గీ. అమ్మహామానిగోత్రాబ్ధి నవతరించి, తమ్ములను దాను నన్యోన్యతను దనర్చి, తమ్ములను బోరనని సోముఁ ద్రస్తరించు, నౌర సోమాహ్వయుఁడు కాకసూరిఘనుఁడు. అప్ప. ౧. ౩౧.

౨. ఏవగించు, రోయు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. ధననాయకత్వంబుఁ ద్రస్తరించునుగదా కా
శి లోపలఁ జావఁగలిగినతఁడు. రుక్మా. ౫.
౫౫. (త్రస్తరింపఁడుగదా. అపముద్రి)

౩. అభిఘరించు.

మ...పాత్రంబుల, స్సురథేన్వాజ్యము త్రస్తరిం
పఁ దొడఁగెన్ దూర్వాంకురాగ్రంబులన్.
హర. ౬. ౧౧౭.

త్రస్తరులాడు. స. క్రి. (√త్రస్తరి[1]) పరిహాసము
లాడు.

ఉ. వచ్చినపెద్దరెడ్డి సుగవాసివి మే లిపుడైన
నీడకున్, వచ్చితె యంచు బావ యనునావి
నిఁ ద్రస్తరులాడి...శుక. ౨. ౪౪౩.

త్రస్తరులుసే(చే)యు. స. క్రి. (√త్రస్తరి[1])
పరిహాసముచేయు.

గీ. రుక్మిణీసత్యభామ లిరువురు గదిసి, తాళ
వృంతంబు లిడుచుఁ ద్రస్తరులుసేయ. జై.
భా. ౩. ౫౧.

ఇట్లే: త్రస్తరు లొనర్చు.

సీ. తపనీయమేఖలాతళతళల్ గటితటిం దరు
ణార్కరుచులఁ ద్రస్తరులొనర్ప. ధర్మ.౧.
౧౭. (ఇట ఔపమ్యద్యోతకము.)

త్రస్నువు. సం. విణ. (ఉ) భయశీలుఁడు.

త్రస్యత్. సం. శత్రు. భయపడుచున్న.

త్రస్న. (చి.ని,శ.ర-సం.త్రప్సా.) వి. వేదాధ్య
యనముచేయునపుడు నోటినుండి రాలెడుతుంప
ర, బ్రహ్మబిందువు; వేదశాస్త్రవాదమున నోటి
నుండి రాలెడుతుంపర.

సీ. బ్రహ్మబిందువు మీఱుఁ ద్రస్న యనంగను
...ఆం. భా. ౨. ౧౭౫. (త్రప్స-వ్రాఁత
ప్రతి, బ్రా. పా.)

సీ. భ్రమరనాదముపేరఁ గొమరుఁ డధ్యయనిం
చుతతి రాలి నెఱసినత్రస్న లనఁగ. గీ. తరు
ణపద్మవిశాలపత్త్రములఁ బొలిచెఁ, దొలఁకు
నిర్మలసలిలబిందువ్రజంబు. చంద్రా. ౪.౩౬.
(శ. ర, చి.ని.పా.త్రప్స. ముద్రి. పా.)

మ. కురియన్ ద్రస్నలు కన్బొమల్ ముడివడం
గోలాహలం బొప్పఁగా ... తనువుల్ చెమ
ర్పఁ దమగ ల్పొప్పంగఁ బోరాడఁగన్. శ్రీ
రం. మా. ౬. ౨౪.

త్రాఁచు. వి. పడగగలయొకజాతిక్రూరసర్పము,నా
గుఁబాము.

సీ...నాగుఁబా మనఁ ద్రాఁచన ఫణి దనర్చు.
ఆం. భా. ౧. ౧౮౭.

గీ. నాఁటిమాట లుల్లంబున నాఁటి యుండ, నొ
వ్వుతోఁ దటి వేచి నేఁ డివ్విధమునఁ, బటిచె
భీముండు నొప్పింపఁబడినత్రాఁచు,పాము పగ
సాటి తెగటార్చుభంగిఁ గృష్ణ. భార. స్త్రీ.
౨. ౬౧.

సీ. స్ఫటలమణుల్ మీఱ కాంత మై శ్వేత మై
నట్టిత్రాఁ చొక్కటి చుట్టి యుండు. ఆము.
౪. ౧౯౯.

త్రాఁచుకూన=త్రాఁచుపాముపిల్ల.

సీ. అప్పసం బెడయనికుప్పసం బూడిచి కొఱ
తఁ ద్రోచినత్రాఁచుకూన యనఁగ. రా. వి.
౪. ౧౧౯.

త్రాగు(వు)=తాగు. స. క్రి. ౧. (జలాదులను)
పానముచేయు.

సీ. చక్రవాకములకుఁ జల్లఁగా మందు ద్రాగిం
చినచంద్రంపుగిన్నె యనఁగ. ఉ. హరి.
౩. ౮౬.

ఉ...సలిలంబు దప్పి వోఁ, ద్రాగినవారి కింపగు
నెతన్నును దియ్యఁదనంబు వాసనా,యోగ
ముఁ గల్గె నేని విహగోత్తమ నిర్మలవారిపూ
రముల్. సైమ. ౨. ౮౧.

౨. కబళించు,మ్రింగు;భక్షించు,తిను.

గీ...ఉగ్రుపైనటె వోయె దకట లగ్గ,మేలు మే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లైంత్లమీా లెంతమీాలఁ ద్రాగు. కు. సం. ౪. ౪౨.

సీ. గతి మ్రుచ్చిలఁగ వేచుగాలిఁ ద్రావఁగఁ బాము నిడినకైవడిఁ గాలికడియ మమర. పారి. ౪. ౭౬.

౩. పీల్చు.

క. గంజాయి త్రాగి తురకల,సంజాతులఁ గూడి కల్లు చవిగొన్నావా,లంజెలకొడుకా యెక్కడఁ, గుంజరయూథంబు దోమకుత్తుకఁ జొచ్చెన్. (చాటువు.)

(వ్యవ. వాఁడు చుట్ట త్రాగుచున్నాఁడు.

జః త్రాగుడు,త్రావించు.

త్రాగు(వు)డు. వి. (√త్రాగు) త్రాగుట,పానము.

చ...చిట్టకంపుఁద్రా,గుడుఁ గని సన్నలన్నగిరి కొండఱుపాంథుఁ బ్రపా ప్రపాలికల్ .ఆము. ౨. ౫౯.

చ. తనచెలులిండ్లయం దదవత్రావుడు త్రావుచు నింటి కెన్నఁడుం, జనక...పాండు. ౩.౧౯.

రెంటఁద్రావుడుదిండి=ఏనికతిండి,సింహము.

క. బలమునకంటెను బ్రజ్ఞా,బల మెక్కుడు గాదె బుద్ధిబలమునఁ జేర, చ్చలమునఁ గైదువు వెలిగాఁ, దల ద్రుంతుం జెండి రెంటఁద్రావుడు దిండిన్. వేం. పంచ. ౧. ౩౪౯.

త్రాటిమాల. వి. (త్రాడు+మాల) జందెములు ధరించినమాలఁడు. (శివభక్తిలేని ద్విజునిగూర్చి వాడఁబడినదూషణవచనము.)

ద్వి. చెరలుచు గోహత్య చేసినయూర,మాలల యీత్రాటిమాలలపచ్చి,మాలలమాటలు వోలునే వినఁగ.బస. పు. ౭. ౪౧ పం.

ద్వి. పురహరార్చితునకు ము న్నెత్తుకేలు, ధర నెత్తఁ గూడునే త్రాటిమాలలకు. బస. పు. ౭. ౭౭౨ పం.

త్రాడు=తాడు౧. వి. ఔ. ౧. రజ్జువు,పాశము.

క. వెడతలఁపు లుడిగి సంధికి, నొడఁబడు మిది లెస్స దీని కొడఁబడమి గడుం, జెడుతెరు విప్పటిపదనుకన్, గడవఁబడుట ద్రాటఁ దప్పకరణియుచుమ్మీ. భార. కర్ణ. ౩. ౨౩౩.
(త్రాటఁదప్పు=త్రాటినుండి దూడ తప్పుట.)

సీ. పసిఁడిగాజులు పైకి వెసఁ ద్రోచి నునుఁదీగఁ దెమలించు నురిత్రాడు నెమకుకరణి.మనుచ. ౩. ౩౧. ఆము. ౬. ౪౦.

ద్వి. త్రాడును బామును రజతంబు శుక్తి, చూడికిఁ గొరడును జోరుండు దెలియ, కున్న... పండితా. దీక్షా. ౫౨ పొ.

౨. దారము, తంతువు.

ఉ. సూదిపిత్రిందిత్రాటిక్రియఁ జొచ్చినచోటు లు సొచ్చు...విక్ర. ౨. ౭౨.

సీ. మందులముడిత్రాట మలఁచి వేసినసిగపొల్పు గానఁగనీనిబొమిడికంబు. దశా. ౧. ౨౬౦.

౩. యజ్ఞోపవీతము,జందెము.(చూ.త్రాటిమాల)

౪. మంగళసూత్రము, పుస్తెబొందు.

గీ. జోటి పోయినరేయిని శోభనంబు, వచ్చి వెండిలియాడితి విచ్చ మెచ్చి, నిన్నఁ గట్టిన నీత్రాడు నేలఁ బొరల, నిచటఁ బొరలంగఁ గారణ మేమి చెపుమ. కేయూర. ౨.౨౩.

గీ. నేఁటి కీపాటి నీవు నాత్రాటిమహిమ, నింటి కేతేరఁ జల్లఁగాఁ గంటి ... శుక. ౨. ౨౪.

సీ. భయపలాయితునకుఁ బ్రతిశుక్రభయ మేల త్రాడుఁ దెంపఁగ ముహూర్తంబు లేల. రామలిం. ౬౦.

గీ. పంచవదనునికను జేవురించె నేని,తత్క్షణమునంద తమయాండ్ర త్రాళ్లు తెగవె.కాశీ.౭.౬౦.

౫. కిరణము, రశ్మి.

గీ. నిడుపుఁద్రా ళ్లని బయల నెప్పుడుఁ దిరుగుచుఁ, బొసఁగ ముప్ప్రొద్దు మువ్వేసములఁ జెలఁగుచు, వెలుఁగు లెల్లెడఁ గాంచుచు నలరునిర్ల, వేఁటకాఁ డప్పు డెంతయుఁ దేట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మా౯ె. అచ్చ. రా. అయో. ౪౨. (సూ ర్యపక్షమున- కిరణములు. వేఁటకానిపక్షము న- రజ్జువులు.)

ముకుఁద్రాడు=పశువులు లొంగుటకై ముక్కు కు ట్టి గ్రుచ్చుత్రాడు.

ఆ...ముకుఁద్రాటఁ, గాలు గ్రువ్వనేలఁ గనుల నాథ. భార. ఉద్యో. ౩. ౨౨౦.

జః త్రాటిమాల, త్రాడుదాలుపు, త్రాడువడు.

త్రాడుదాలుపు. వి. (త్రాడు+తాలుపు) పాశ ధరుఁడు, వరుణుఁడు.

గీ. త్రాడుదాలుపుచెలి పైఁడిమేడమీఁద, గొండ్లి సలుపుచు నను(గులఁ గూడి చల్లులాడు బగ్గుండిపాడు లన నలరి యపుడు, చదలఁ గొదలేక సంజకెంజాయ లమరె. అచ్చ.రా. అయో. ౧౩.

సీ. త్రాడుదాలుపు మేలిరతనముల్ గొని తెచ్చు ...అచ్చ. రా. సుం. ౪౧.

త్రాడువడు. అ.క్రి. (త్రాడు+పడు) ౧. త్రాడగు, రజ్జుత్వము పొందు. ౨. నిస్సత్త్వమగు.

సీ. పాథోధివల్లభుపాశవల్లిమతల్లి దర్పంబు దిగఁ ద్రావి త్రాడువడియె. భీమ. ౪. ౧౦౭.
(రెంటికి నిదియే యుదాహరణము.)

త్రాణ. వి. (సం. ద్రవిణమ్) ౧. బలము, శక్తి.

శా. త్రాణ ల్దప్పి త్వగసిమాత్రు లగుచుఁ దై న్యంబు నొందఁ...వి. పు. ౨. ౧౫౬.

క. రాణింపఁ బల్కి తనపని, జాణై కొనుఁ గొ లుచు సంతసపుఁదటిఁ దొలఁగుం, ద్రాణ చెడఁ గవుడుమానిసి, నాణె మెఱుఁగ బచ్చు గాఁగ నరపతికిఁ దగుఁ. ఆము. ౪. ౨౬౯.

ఉ... మొలత్రాడని గట్టినట్టివా, రెత్తిరి త్రాణకొ ల్దిఁ బరు వెక్కుడి వేడుక లంచు... శుక. ౨. ౧౪.

౨. జాగరూకత, మెలఁకువ.

గీ. భువనసంమోహనాకాంతిఁ బుష్పధన్వి, పొ న్నమెట్టియ నెత్తమ్మిపూవునడుమఁ, బ్రాణమై డాఁచె ననఁగఁ గట్టాణిము త్తియంపుఁముంగర విలసిల్లె నబ్జముఖికి. సుద. ౫. ౧౪౪.

త్రాణము. సం. విణ. (అ. ఆ. అ) ౧. త్రాతము, రక్షితము, కావఁబడినది. ౨. రక్షించునది. (అ. ఈ. అ) రక్షణసాధనము. (తనుత్రాణము= మైమఱువు, దేహమును గాపాడుసాధనము. శిర స్త్రాణము=బొమిడికము. ఉదరత్రాణము=నాగో దరి. జంఘాత్రాణము=మంఖణము. బాహుత్రా ణము=బాహులము. అంగుళిత్రాణము=గోధ-ఇవి శరీరావయవరక్షకసాధనవిశేషములు.) వి. అ. న. ౧.రక్షణము, కాపు. ౨. త్రాయమాణాలత, కలుఁగానుగు ?.

త్రాణీయము. సం=త్రాతవ్యము.

త్రాత. సం. విణ. (బు. స్త్రీ. బు) రక్షకుఁడు, కాచువాఁడు.

త్రాతము. సం. విణ. (అ. ఆ. అ) రక్షితము, కా వఁబడినది. వి. అ. న. రక్షణము, కాపు.

త్రాతవ్యము. సం. విణ. (అ. ఆ. అ) రక్షింపఁద గినది.

త్రాపుషము. సం. విణ. (అ. ఆ. అ) త్రపువు చేత-సీసముచేతఁగాని తగరముచేతఁగాని-చేయఁ బడినది.

త్రాయంతి. సం. వి. ఈ. స్త్రీ. కలుఁగానుగు?.

త్రాయకుఁడు. సం. విణ. (అ. యికా.అ)=త్రాత.

త్రాయమాణ. సం. వి. ఆ.స్త్రీ. కలుఁగానుగు?.

త్రాయమాణము. సం. విణ. (అ. ఆ. అ) ౧. రక్షించుచున్నది. ౨. రక్షింపఁబడుచున్నది, కావఁబడుచుండునది.

త్రావి(గి)ంచు. స. క్రి. (√త్రావు) క్రోలించు, త్రాగఁజేయు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క...తడయక యబ్బాది శుద్రుఁ ద్రావించి రౌగిళ్ల, భార. ఆది. ౩. ౧౧౪.

త్రాసకుఁడు. సం. విశ. (అ. సికా. అ) ౧. భయపడువాఁడు. ౨. భయపెట్టువాఁడు.

త్రాసనము. సం. విశ. (అ. ఆ. అ) వెఱపించునది. (అ. ఈ. అ) భయపెట్టుటకు సాధనమైనది. వి. అ. న. వెఱపించుట.

త్రాసము. సం. వి. అ. పుం. ౧. భయము, వెఱపు. ౨. భయపెట్టుట. ౩. మణిదోషభేదము.
సీ. పగిలినగతి రేఖపై నున్నఁ ద్రాసంబు కలహమెప్పుడు దానఁ గలుగుచుండు. రత్న. ౧౪౫.

త్రాసయత్. సం. శత్రు. భయపెట్టుచున్న.

త్రాసితము. సం. విశ. (అ. ఆ. అ) వెఱపింపఁబడినది, భయపెట్టఁబడినది.

త్రాసు=తరాసు. వి. తూఁచెడుసాధనము, తుల.
సీ...అక్షీణసత్యులు ధర్మపరులును నైనభూసురులును నీవుఁ, ద్రాసులుంబోనిచి త్తంబులతోడుతఁ బ్రజవివాదములెడఁ బక్ష మడిగి. భార. శాం. ౨. ౩౬౫.
గీ...పుష్పశరుఁడు త్రాసునఁ దూఁచి, ప్రియముతోడఁ బంచిపెట్టినట్లు. విక్ర. ౪. ౧౭౩. ఆం. భా. ౨. ౩౦౦.
జ: త్రాసునాయము.

త్రాసునాయము. వి. (√త్రాసు) తూనికవలన వచ్చులాభము.
వ. స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర కాకతియ్యరుద్రదేవమహారాజులకు ధర్మార్థముగాను బచ్చునారెపసెట్టి ఈపూరిఅల్లాడనాథునికి అముదోపడికి త్రాసునాయమువల్లన ఇచ్చినది వెలకు ౧. ౧. ఈపూరిశాసనము. ౧౨౦౦.
వ. శ్రీమన్మహామండలేశ్వర కాకతియరుద్రదేవమహారాజులకు ధర్మార్థంబుగాను బచ్చునారపసెట్టిశ్రీకాళేశ్వరశ్రీమహాదేవరకు ఓగిరానకు త్రాసునాయమువల్ల వెలకు మాడలెఖ ౧ ౧ ఇచ్చె. ౧.౨౦౦. గు. జి. ఈపూరిశాసనము.

త్రాస్యమానము. సం. విశ. (అ. ఆ. అ) భయపెట్టఁబడుచున్నది.

## త్రి

త్రి. సం. విశ. (ఇ) మూఁడు. (ఇది తెనుఁగునవృత్తియందు పూర్వావయవముగానే యుపయుక్తమగును. ఉదా:- త్రితయము, త్రిజగము, మొ.)

త్రింశకము. సం. విశ. (అ. ఆ. అ) త్రింశత్క్రీతము, ముప్పదికి కొనఁబడినది.

త్రింశత్కము. సం. వి. అ. న. ముప్పదింటిసమూహము.

త్రింశత్తమము. సం. విశ. (అ. ఈ. అ) ముప్పదవది.

త్రింశత్తు. సం. విశ. (త్). ముప్పది. వి. త్. స్త్రీ. ముప్పదిసంఖ్య.

త్రింశత్పత్త్రము. సం. వి. అ. న- ముప్పదిరేకులు కలది-కుముదము, తెల్లకలువ.

త్రింశము. సం=త్రింశత్తమము.

త్రిక. సం. వి. ఆ. స్త్రీ. (మూఁడుకఱ్ఱలతో ఏర్పఱుపఁబడినది) నూతిగిరక.

త్రికంటకము. సం. విశ. (అ. ఆ. అ) మూఁడుముండ్లు కలది. వి. అ. పుం. ౧. ములుజెముడు. ౨. గోక్షురకము, పెద్దపల్లేరు. ౩. లఘుగర్గమనుమత్స్యవిశేషము.

త్రికకుత్తు. సం. వి. ద్. పుం - మూఁడుశిఖరములు కలది- త్రికూటపర్వతము.

(త్రి)కకుదము. సం. విశ. (అ. ఆ. అ) ౧. మూఁడుశిఖరములు కలది. (పర్వతము) ౨. మూఁడుమూఁపురములు కలది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రికటము. సం. వి. అ. పుం. గోక్షురవృక్షము, ఏనుఁగుపల్లేరు॰.

త్రికటుకము. సం. వి. అ. న. సొంటిపిప్పలిమిరియాలు.

త్రికటువు. సం. వి. ఉ. న.=త్రికటుకము.

త్రికము. సం. వి. అ. న. ౧. మూఁటిసమూహము. ౨. మూఁడుదారులు కలయుచోటు. ౩. పృష్ఠవంశాధోభాగము, ముడ్డిపూస. ౪. త్రిఫల, కరకతాడియుసిరికలు. ౫. త్రికటుకము. ౬. త్రిమదము, ముస్తాచిత్రకవిడంగములు. పుం. గోక్షురకము, పెద్దపల్లేరు॰.

త్రికరణములు. సం. వి. అ. న. బ. మనోవాక్కాయములు.

త్రికరణశుద్ధి. సం. వి. ఇ. స్త్రీ. మనోవాక్కాయములస్వచ్ఛత.

చ. త్రికరణశుద్ధి నచ్యుతునిశ్రీరఘునాథనృపాలు వైఖరిన్, సకలమహీసురావళికి సత్రము లెప్పుడుఁ బెట్ట లేఁడకా, యొకదొర...విజ. వి. పీఠి. ౨౪.

త్రికర్ముఁడు. సం.వి.న్. పుం- యజనాదిషట్కర్మములలో యజనము అధ్యయనము దానము అను మూఁడుముఖ్యకర్మములు ఆచరించువాఁడు- బ్రాహ్మణుఁడు, మొ.

త్రికాష్ఠి. సం. వి. ఇ. న.=త్రిక్కటి.

త్రికూటము. సం. వి. అ. పుం. లంకలోనియొకానొకపర్వతము.

త్రికూటలవణము. సం. వి. అ. న. ద్రోణీలవణము, ఒకవిధ మగుఉప్పు.

త్రికూర్చకము. సం. వి. అ. న. (వైద్య)మూఁడు వాదరలు గలకత్తి.(వాచ)

త్రికేతువు. సం. వి. ఉ. పుం. శుకము, చిలుక (కే. ని)

త్రికోణఫలము. సం. వి. అ. న. శృంగాటకము, పరికెగడ్డ॰.

త్రికోణము. సం. విణ. (అ. ఆ. అ) మూఁడు కోణములుగలది. వి. అ. న. ౧. (క్షేత్రగణితము) త్రిభుజక్షేత్రము. ౨. (జ్యోతి) లగ్నమునకు పంచమనవమస్థానములు. ౩. మోక్షము. ౪. (మంత్ర) యంత్రభేదము. ౫. ఆఁడుగుఱి. చంద్ర. వి. ౨. ౫౩, ౫౪. (ఈయర్థము తెనుఁగుననే కలదు.)

త్రిక్క[1]=తిక్క. వి. (త. తిరుహల్) ఉన్మాదము, పిచ్చి.

సీ...త్రిక్క యనంగ...వెఱ్ఱి యనంగ నున్మాద మనంగ నున్మాదసంజ్ఞ.ఆం. భా. ౧. ౧౩౬.

జః త్రిక్కతెవులు.

త్రిక్క[2]=తక్క. అవ్య. ద్రు. (√త్రిక్కు) వినా రకము.

గీ...త్రిక్కననఁ దక్క నన వినార్థ,ముగనురా జిల్లు...ఆం. భా. ౩. ౬౯.

త్రిక్కటి=తిక్కటి. వి.(సం. త్రికాష్ఠి) ఆయుధ విశేషము.(శ.ర).

౨. (బల్లలు పలకలు మొ. ఉంచుటకు అనువగునట్లు) మూఁడుకఱ్ఱలతో చేసినచట్టము.

గీ. కోలదాపునఁ ద్రిక్కటిఁ గూడియున్న, గచ్చు సేసినచిత్రంపుగద్దెపలక, వ్రాసినారదె చూడరా వైశ్యరాజ, శీలబ్రహ్మాదివీరనాసీర చరిత. క్రీడా. ౧౨౫.

త్రిక్కతెవులు. వి. (√త్రిక్క[1]) గోరోగవిశేషము. (చి. ని)

త్రిక్కు=తక్కు. అ. క్రి. ౧. మిగులు, శేషించు.

క. తెగఁ దీర్చక తగ నార్పక, తెగటార్పక కడమ గొంత ద్రిక్కఁగ నున్నన్, జగతీశ యప్పు నగ్నియుఁ, బగయును గడుఁ బెరుఁగుఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీడు వాటిల్లఁ దుదిన్. భార. శాం. 3. ౨౭౬.

ఉ...లక్ష్మణుండు సుగ్రీవుఁడు వాయునందనుఁ డుఁ ద్రిక్కినవారును గారవించిరి...భా. రా. యు. ౭౨3.

సీ. నిఖిలరాజ్యంబులు నీక యిచ్చినవాఁడ దేహ త్రయము నాకుఁ ద్రిక్కి యున్నది...మా ర్క. ౧. ౧౭౦. శివ. సా. ౯౯.

౨. చిక్కువెట్టు, బాధించు. (చూ. వి.)

వి. చిక్కు, బాధ.

ఉ. ఒక్కఁడు దెచ్చుకొండ తల నుండఁగ మీఁదన యెత్తికొంచు నొం,డొక్కఁడు నింగికి న్నెగసి యుర్వి చలింపఁగ దాఁటి క్రందునం, ద్రిక్కులు వెట్ట నొల్లఁ జనరే యని క్రమ్మఱఁ బాఱి వాఁడు వే, ఱొక్కనగంబు పూని...భా. రా. యు. ౨౬౬.

ఉ. గ్రక్కునఁ జల్లిదం డ్రులు నకల్మష చిత్తులఁ బెద్దలన్ మ తేఁ,దిక్కును లేనివారిఁ బలుత్రిక్కులఁ బెట్టుచుఁ బాఱఁద్రోలితిన్. భాగ. ౬. ౧3౭.

చ. చెఱిగొని పోయి యాత్మపురిఁ జేర్చి దశాననుఁ డేసరేఁగి గీ, డ్పఱచినసీతఁ దెచ్చుకొని భావజుత్రిక్కుల కొగ్గి యెగ్గు సి,గ్గెఱుఁగక కూడినాఁ డినకులేశ్వరుడు...ఉ. రా. ౬. ౨౧౦.

జః త్రిక్కు[2].

త్రిక్షారము. సం. వి. అ. న. సర్జకయవటంకణము లనుమూఁడుక్షారములు.

త్రిక్షురము. సం. వి. అ. పుం. కోకిలాక్షము, ములుగొలిమిడి.

త్రిఖట్వి. సం. వి. ఈ. స్త్రీ. ఖట్వాత్రయము, మూఁడుమంచములు.

త్రిగంభీరుఁడు. సం. వి. అ. పుం. స్వరము సత్త్వము నాభియును గంభీరముగా నున్నపురుషుఁడు. (అట్లుండుట శుభలక్షణము.)

త్రిగణము. సం. వి. అ. న. త్రివర్గము, ధర్మార్థకామము లనుమూఁటిసమూహము.

త్రిగర్త. సం. వి.ఆ. స్త్రీ.౧.—మూఁడు ద్వారములున్నయోని కలది— కాముకి. ౨. ఘుఘురిక. (మే.ని)

త్రిగర్తము. సం. వి. అ. పుం. జాలంధరదేశము.

త్రిగుణ. సం. వి. ఆ. స్త్రీ.(వేదాంత) ప్రకృతి మాయ.

త్రిగుణము. సం. విశ. (అ. ఆ. అ) ౧. మూఁడుగుణములు గలది.౨.మూఁడు దారములుగలది. 3. మూఁడు రెట్లు కలది. వి. అ. న. (సాంఖ్య) -సామ్యావస్థనుపొందిన సత్త్వరజస్తమోగుణములుకలది-ప్రధానము.

త్రిగుణాకృతము. సం. విశ. (అ. ఆ. అ) ముమ్మాఱు దున్నినది. (పొలము.)

త్రిగుణి. సం. వి. ఈ. స్త్రీ.బిల్వము, మారేడు. (వాచ.)

త్రిగుణితము. సం. విశ. (అ. ఆ. అ) మూఁడింతలు చేయఁబడినది, మూఁడు రెట్లు చేయఁబడినది; మూఁడుసంఖ్యచే గుణింపఁబడినది.

త్రిచతురములు. సం. విశ. (అ. ఆ. అ)మూఁడుగాని నాలుగుగాని.

ఉదా:-త్రిచతురదినములు=మూఁడు నాలుగుదినములు. త్రిచతురపదములు = మూఁడు నాలుగు అడుగులు.

త్రిచత్వారింశత్తమము. సం. విశ=త్రిచత్వారింశము.

త్రిచత్వారింశత్తు. సం. విశ.(త్)నలువది మూఁడవది. వి. త్. స్త్రీ. నలువదిమూఁడు. (ఇది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తెలుఁగున ప్రాయికముగా సమాసపూర్వపదముగా నుండును.)

త్రిచత్వారింశము. సం. విణ. (అ. ఈ. అ) నలువదిమూఁడవది.

త్రిజగత్తు. సం. వి. త్. న. మూఁడులోకములు, స్వర్గమర్త్యపాతాళములు.

త్రిజగము. సం. =త్రిజగత్తు-(సమాహారార్థవివక్షలేనపుడు 'దిక్సంఖ్యే సంజ్ఞాయాం, అనుసూత్రముచే కర్మధారయసమాసము.)

(గరుత్మంతుఁడు.) చ. త్రిజగములుఁ వెలుంగ నలిఁ దెచ్చె సుధారసపూర్ణభాండముఁ. భార. ఆను. ౧.౨౬౦.

త్రిజట. సం. వి. ఆ. స్త్రీ. సీతకు అశోకవనమందు కావలియున్న యొకరాక్షసి.(ఈమె విభీషణునికూఁతురు.)

త్రిజాతము. సం. వి. అ. న. దాల్చిని ఏలకి ఆకుపత్రి అను మూఁడు వస్తువులు సమభాగములుగా చేసినసుగంధిద్రవ్యము.

త్రిణత. సం. వి. ఆ. స్త్రీ. -మూఁడుచోట్ల వంపుగలది- ధనువు, విల్లు. (త్రి. ని).

త్రిణయనుఁడు. సం. వి. అ. పుం-మూఁడునేత్రములు కలవాఁడు- ఈశ్వరుఁడు, ముక్కంటి.

క. త్రిణయనునిరాణివాసము, నణిమాద్యైశ్వర్యవితరణామరతరువుఁ, మణికర్ణిక ముక్తివధూమణికర్ణికఁ దలఁచుఁ దపసి మానసవీథిఁ. కాశీ. ౨. ౧౫౦.

క. ఫణిభూషణుండు వాపీప్రణుతిశ్లాఘాపరంపరల నొనరింపఁ, త్రిణయనునిదక్షిణశ్రుతి, మణికర్ణిక మిట్టి సరసిమధ్యమునఁ బడెఁ. కాశీ. ౫. ౨౩.

త్రిణేత్రుఁడు=త్రినేత్రుఁడు (వాచ)

త్రితయము. సం. వి. అ. న. మూఁడింటిసమూహము.

త్రితయి. సం. వి. ఈ. స్త్రీ. త్రితయము, మూఁడింటిసమూహము.

త్రిదండము. సం. వి. అ. న. ౧. మూఁడుదండములు, మూఁడుకోలలు, సన్న్యాసి ధరించుటకై కలిపి కట్టినమూఁడుకఱ్ఱలు. ౨. మనోదండము వాగ్దండము కర్మదండములను మూఁడుదండములు. పుం. త్రిదండసన్న్యాసము; మనోదండము, వాగ్దండము కర్మదండము అను మూఁడుదండములుగల సన్న్యాసాశ్రమము.

త్రిదండి. సం. వి. న్. పుం. ౧. ముక్కోలను-ఏకదండముగా గట్టిన మూఁడుదండములను-తాల్చుసన్న్యాసి. ౨. మనోదండవాగ్దండకర్మదండము లనుమూఁడుదండములు గలసన్న్యాసి.

త్రిదళ. సం. వి. ఆ.స్త్రీ.గోధాపది, చెప్పుతట్టు. (వాచ.)

త్రిదళము. సం. విణ. (అ. ఆ. అ) మూఁడుదళములు కలది. వి. అ. పుం. బిల్వము, మారేడు.

త్రిదళిక. సం. వి.ఆ.స్త్రీ.చర్మకష. సంబరేను.

త్రిదశగోపము. సం. వి. అ. పుం. ఇంద్రగోపము, ఆరుద్రపురుగు.

త్రిదశమంజరి. సం. వి. ఈ. స్త్రీ.-దేవతాప్రియమగు వెన్ను కలది-తులసి.

త్రిదశాంకుశము. సం. వి. అ. పుం. వజ్రాయుధము.

త్రిదశాయుధము. సం. వి. అ. న. ౧. వజ్రాయుధము. ౨. ఇంద్రధనుస్సు.

త్రిదశాలయము. సం. వి. అ. పుం. ౧. స్వర్గము ౨. మేరువు.

ఇట్లే. త్రిదశావాసము, మొ.

త్రిదశాహారము. సం. వి. అ. పుం. వేల్పుబువ్వ, అమృతము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రిదశుఁడు. సం. వి. అ. పుం. త్రిదశపరిమాణ వయస్సు కలవాఁడు, ఎప్పుడును ముప్పదియేండ్ల వయస్సున నుండువాఁడు, బాల్యకౌమారయౌవన వార్ధకము లను నాలుగుదశలలో మూఁడవదశయందే యుండువాఁడు, వృద్ధిక్షయపరిణామావస్థలు లేక జన్మసత్తావినాశము లను మూఁడవస్థలుమాత్రమే గలవాఁడు-వేల్పు, దేవత.

త్రిదినస్పృక్కు. సం. వి. శ్. పుం. స్త్రీ. మూఁడుదినములను స్పృశించినతిథి.

త్రిదివ. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఒకానొకయేఱు. ౨. ఏలకి చెట్టు.

త్రిదివము. సం. వి. అ. పుం. ౧. (మూఁడవలోకము) స్వర్గము. ౨. ఆకాశము. ౩. సుఖము.

త్రిదివేశుఁడు. సం. వి. అ. పుం. త్రిదశుఁడు, వేల్పు.

త్రిదివోద్భవ. సం. వి. ఆ. స్త్రీ. ౧. గంగ. ౨. పెద్దఏలకి చెట్టు. (రా. ని.)

త్రిదివౌకసుఁడు. సం. వి. స్. పుం. వేల్పు, దేవత.

త్రిదోషము. సం. వి. అ. న. వాతపిత్తశ్లేష్మజము లగుమూఁడు దోషములు; ఆదోషములవలనఁ గలుగురోగవిశేషము.

త్రిద్యుస్పృక్కు. సం.=త్రిదినస్పృక్కు.

త్రిధాముఁడు. సం. వి. న్. పుం.—మూఁడుధామములు (భూరాదిలోకములుగాని సత్త్వాది తేజములుగాని) కలవాఁడు—౧. శివుఁడు. ౨. విష్ణువు. ౩. అగ్ని. ౪. వ్యాసుఁడు. ౫. యముఁడు. (విల్యమ్సు.)

త్రిధార. సం. వి. ఆ. స్త్రీ. గంగ.

త్రిధారస్నుహి. సం. వి. ఈ. స్త్రీ. స్నుహీభేదము, ఒకజాతిజెముడు చెట్టు. (రా. ని)

త్రినయనుఁడు. సం=త్రిణయనుఁడు. విణ. (అ. ఆ. అ.) మూఁడు నేత్రములు కలవాఁడు.

త్రినవతము. సం. విణ. (అ. ఈ. అ) తొంబదిమూఁడవది.

త్రినవతి. సం. విణ. (ఇ) తొంబదిమూఁడు పరిమాణము గలది. వి. ఇ. స్త్రీ. తొంబదిమూఁడు.

త్రినవతితమము. సం=త్రినవతము.

త్రినేత్రుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి, శివుఁడు.

(ఇప్లే: త్రిలోచనుఁడు, మొ.)

త్రిపంచాశత్తమము. సం=త్రిపంచాశము.

త్రిపంచాశత్తు. సం.వి.త్.స్త్రీ. ఏఁబదిమూఁడు.

త్రిపంచాశము. సం. విణ. (అ. ఈ. అ) ఏఁబది మూఁడవది.

త్రిపక్షి. సం. వి. ఈ. స్త్రీ. త్రైపక్షికశ్రాద్ధము. (మే. ని.)

త్రిపతాకము. సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము. (బొటనవ్రేలిని వంచి చూపుడువ్రేలి మొదటఁ గూర్చి యుంగరపువ్రేలిని వంచి కడమవ్రేళ్లను జాఁచి పట్టినది.) న. పతాకాకారముగలమూఁడువళులు గలనొసలు. (వాచ.)

త్రిపత్త్రకము. సం. వి. అ. పుం. పలాశము, మోదుగు చెట్టు. న. తులసీకుందబిల్వపత్త్రములుమూఁడు. (వాచ.)

త్రిపత్త్రము. సం.వి.అ.పుం.బిల్వము,మారేడు చెట్టు.

త్రిపథగ. సం. వి. ఆ. స్త్రీ. ముయ్యేఱు, గంగానది.

(ఇప్లే: త్రిమార్గగ, మొ.)

త్రిపథము. సం. వి. అ. న. ౧. మూఁడుమార్గములు. ౨. మూఁడుమార్గములు కలియుచోటు.

త్రిపద. సం. వి. ఆ. స్త్రీ. మూఁడుపాదములు గల బుఱ్ఱ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రిపదము. సం. విణ. (అ. ఈ. అ) మూఁడు కాళ్లు గలది.వి.అ.న.ముక్కాలిపీఁట. (ఆ. ని.)

త్రిపది. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఏనుఁగు కాలికిఁ గట్టుత్రాడు. (వై. ని.) ౨. గోధాపది, చెప్పు తట్టచెట్టు. ౩.మూఁడు పాదములు గలబుఱ్ఱ్కా.

త్రిపదిక. సం. వి. ఆ. స్త్రీ. ముక్కాలిపీఁట. (విల్యమ్సు.)

త్రిపరి. సం. అవ్య. ఇ న. అక్షక్రీడావిశేషము. (పంచిక యనుద్యూతమును ఐదుశలాకలతోఁగాని ఐదుపాచికలతోఁగాని ఆడుదురు. ఇం దైదింటిలోను రెండు బోరగిలఁగాను లేక వెల్లకిలఁగాను తక్కినవి తద్విపరీతముగాను పడును.)

త్రిపర్ణము. సం. వి. అ. పుం. కింశుకము, మోదుగు *.

త్రిపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. ౧. వనకార్పాసి, అడవిప్రత్తి*. ౨.సాలపర్ణి, ముయ్యాకుపొన్న*. ౩. మూఁడుఆకులమొత్తము.

త్రిపాఠి. సం.వి. న్. పుం. వేదమున పదక్రమసంహితారూపగ్రంథములు పఠించువాఁడు.(వాచ)

త్రిపాత్తు. సం. విణ. (ద్.ద్,పవీ.ద్) ౧. మూఁడుకాళ్లు గలది. ౨. మూఁడుపాళ్లు గలది, ముప్పాతికపాలు గలది. వి. ద్. పుం. ౧. పరమేశ్వరుఁడు. ౨. విష్ణువు, వామనమూర్తి.

త్రిపాదిక. సం. వి. ఆ. స్త్రీ. హంసపది *.

త్రిపుండ్రము. సం. వి. అ. న. నొసట బూదిలోనగువానితో అడ్డముగా పెట్టినమూఁడురేఖలు.

త్రిపుట. సం. వి. ఆ. స్త్రీ. ౧. త్రివృత్తు, తెగడ*. ౨. సన్నఏలకి *. ౩. మల్లె*. ౪. కర్ణస్ఫోటక*. (వాచ)

త్రిపుటము. సం. వి. అ. పుం. ౧. బాణము. ౨. ఒకవిధ మగుసెనగలు. ౩. (సంగీ) ఒక తాళము. (ఏడక్షరములకాలము కలది.)౪. తీరము, దరి. ౫. గోక్షురము, పల్లేరు *.

త్రిపుటి. సం. వి. ఈ. స్త్రీ. ౧.తెగడ*. ౨. ఆముదపుఁజెట్టు.

త్రిపుటీఫలము. సం. వి. అ. పుం. ఆముదపుఁజెట్టు.(కల్ప)

త్రిపురము. సం. వి. అ. న. ౧.పురత్రయము.౨. మయునిచేత నిర్మింపఁబడినమూఁడుపురములు.

త్రిపురాంతకుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు. (ఇతనికి త్రిపురాసురసంహారసమయమున తేరు భూమి. చక్రములు సూర్యచంద్రులు. గుఱ్ఱములువేదములు. చాపము మేరువు. నారి శేషుఁడు. బాణము విష్ణువు.)
(ఇట్లే: త్రిపురదహనుఁడు, త్రిపురహరుఁడు, మొ.)

త్రిపురుషము. సం. విణ. (అ.ఆ,ఈ.అ)-ముగ్గురు పురుషులపరిమాణము కలది, మూఁడునిలువుల యెత్తు కలది-గోడ నుయ్యి, మొ.వి.అ. న. ముగ్గురుపురుషులు, మూఁడుతరములవారు. (తండ్రి, తాత, ముత్తాత.)

త్రిపుష. సం. వి. ఆ. స్త్రీ. కృష్ణత్రివృత్తు,నల్లతెగడ*.

త్రిప్పట. (√త్రిప్పు.) వి. ౧. త్రిప్పుడు, తిరుగుడు.
గీ. పాఁపతరిత్రాటఁ ద్రచ్చునిర్బంధమునకు, నోర్చి త్రిప్పట నొందినయుత్తముండు. రాజ. చ. ౨. ౪౭.
౨. పర్యటనము, సంచారము, త్రిమ్మట.
క. ఇటువలె వెదకియుఁ దమత్రిప్పట గురువిరహితులమంత్రపఠనం బెటు ల, ట్లటమట మై పోఁజొచ్చినఁ, గటకటపడి యొక్కొక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పుడు కపు లడియాసక్. రామా. ౬. ౬౪.
సీ. త్రిమ్మట త్రిప్పట తిరుగుడు తిరుగు నాఁ బర్యటనాఖ్య యై పరఁగు చుండు. ఆం.భా. ౨. ౧౭౪.

త్రిప్పటపుబల్లి. వి. (త్రిప్పటము + బల్లి) బాల క్రీడావిశేషము.
వ...వినోదంబునకు బేతాలబాలికలు త్రిప్పు త్రిప్పటంపుబల్లలచందంబునఁదల్లగెడ వైరక్తాపగావర్తంబుల బిరబిరం దిరుగువిచిత్రాతపత్రంబుల...వరాహ. ౫. ౩౮.

త్రిప్పటము=త్రిప్పట.
(చూ. త్రిప్పటపుబల్లి.)
జః త్రిప్పటపుబల్లి.

త్రిప్పరి. విణ. (త. తిరిబవక్—త్రిప్ప+అరి³) త్రిమ్మరి, తిరిగెడుస్వభావము గలవాఁడు. (శ.ర)

త్రిప్పియాడు. స. క్రి. (త్రిప్పి+ఆడు-స్వార్థమున) త్రిప్పు.
ఆ. ఎత్తి త్రిప్పియాడి యిలతోడ వ్రేసి ప్రా, దములఁ జదుపఁ జూచి దారుణాస్త్ర,తతులు నిగుడఁ బవనతనయశిఖండిసా,త్యకులు సాల్వుఁ దాఁకి రతిరయమున. భార. శల్య. ౧. ౩౧౭.

త్రిప్పు. స. క్రి. (√తిరుగు) ౧. (రాట్నము గద, మొ.) తిరుగఁజేయు.
మ...ఉరుస్వనంబు లెసఁగఁగాఁ ద్రిప్పురాట్నంపుగుం,డ్రలు నా...ఆము. ౪. ౧౫౨.
సీ...గదాదండంబు బిరబిరఁ ద్రిప్పి యాసురవరేణ్యు,కరిని వైచిన ...దశా. ౨. ౪౨౭.
చ. శుచిముఖిమాట యొం దరసి చూడఁగ నెంతయు నాసపా టొన,ర్చుచు మదిఁ ద్రిప్పుచున్నయది...ప్రభా. ౩. ౪.
౨. కదల్చు, చలింపఁజేయు.
మ. ప్రతియింటం గలరమ్యకాంతలు సమీరాధూతనీలోత్పలా,కృతులం గన్నులు ద్రిప్ప నే ర్తురు...గంధ. ౧౩౮.
౩. సంచరింపఁజేయు, పర్యటనము చేయించు.
ఉ.వీఁ డిఁక నెన్ని దేశములవెంబడిఁ ద్రిప్పునో యేమి చేయను,న్నాఁడొకో ... శుక. ౩. ౫౭౭.
౪. విసరు, వీచు.
ఉ... త్రిప్పె లతాంగి యోర్తు లా,మజ్జకతాలవృంతము...నైష. ౨. ౧౪౦.
౫. ప్రక్కకు తిరుగఁజేయు, సాచీకరించు.
సీ. వడిఁ గుక్క లంటంగ వచ్చిన మెడఁ ద్రిప్పి ఘుర్ఘురించుచు బయల్ కొమ్ముఁ జిమ్ము. మను చ. ౪. ౪౨.
సీ.హరిగృహావసరశంఖాకర్ణనరుఁ ద్రిప్పుకడగం టిజిగి ప్రజఁ గాఁడిపాఱ. ఆము. ౧.౫౯.
౬. మరల్చు, నివృత్తముచేయు; పోఁగొట్టు.
ఉ. ముప్పిరిగొన్న వేడ్క నరమోహినిపై నెలకొన్నచూపులం, ద్రిప్పఁగ లేక యీమదవతీరమణీయతప్రాపున న్మరుం, డప్పరమేశపద్మనయనాంబుజగర్భులనైన వ్రేమ్మిడిం,ద్రిప్పులఁ బెట్టు నంచు వినుతించి మదిం దిలకించి వెండియుక్. విక్ర. ౫. ౧౮౨.
సీ...ఆత్మీయతనువును మగుడ నావింటిబల్మిఁ బరిభవించి త్రిప్పఁ. ఆ. గలఁడె భీముఁడైన బలభేదిసుతుఁడైన, నితరుఁడైన వీరుఁ డెవ్వఁడైన. రాఘవ. ౩. ౧౧౯.
వి. ౧. తిరుగుడుపఱుచుట; తిరుగుడు.
ద్వి. అప్పార్థివేంద్రుండు నమ్మాయమృగము, త్రిప్పుల నడవులఁ ద్రిమ్మరి యలసి. ద్వి. హరిశ్చ. పూ. ౭౨౦ పం.
క...ప్ర, జ్ఞానరహితుండు గామా,ధీనత మెయిఁ గర్మసమితిత్రిప్పునఁ జిక్కుక్. భార.శాం. ౫. ౩౨౬.
చ. అనితరతత్త్వశీలు రగునట్టిమహాత్ములు మాయచేయు త్రిప్పునఁ బడి పోక భక్తియుతభూత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దయాకలితాంతరంగు లై. నృసిం. ౫. ౧౮౨.

చ. నెలఁతలు కంఠదఘ్న మగునీర విహార మొ
నర్పనిల్చినం, గొలను తదాననస్ఫురణఁ గ్రొత్త
మెఱుంగు వహించెఁ బెక్కుత్రి, ప్పులఁ బడి
యొక్కచంద్రుని నపూర్వముగాఁ గను టెం
త యంచు నా, జలనిధి నెంచి లీల బహు
చంద్రులఁ దా నొనరించెనో యనన్. విక్ర.
౫. ౪౮.

౨. సుడి, జలావర్తము.

ఉ. ఆలలితస్మితాస్య...దృష్టిరసప్రవాహ మం,
దోలిన పర్వి వెల్లిగొని ... ముంచి...హరుఁ
ద్రిప్పులఁ బెట్టె మనోజుఁ డుబ్బఁగాన్. కు.
సం. ౫. ౫౧౩.

౩. సాచీకరణము, ప్రక్కకు త్రిప్పుట.

సీ. మోముత్రిప్పులు బొమ్మముడి బొమ్ముతాటిం
పు శానిజంకెన కావరంపుఁబోవరు. శుక.
౨. ౪౩౩.

ఉ. పాటలు మోముత్రిప్పులును బైఁ దిమిరించు
ట లోరచూపులున్, మాటలు ముద్దుజంకెన
లు మవ్వపునవ్వులు గోటిచిమ్ములున్. హంస.
౩. ౭౬.

౪. బాధ, కష్టము, శ్రమ; చిక్కు.

గీ. అంఘ్రితలములఁ గుచములు నాననంబుఁ,
గచభరంబును నిట్లున్న రుచిరమూర్తి, యను
పమానభోగములకు నాస్పదంబు, కాదె యీ
త్రిప్పు లేటికిఁ గమలవదన. భార. విరా.
౨. ౫౨.

క... వలపుత్రిప్పులఁ బడు టే, నెఱుఁగనె...
దశకు. ౩. ౧౩౬. విక్ర. ౫. ౧౮౨.

౫. నియోగము.

చ...నాకును మది వారి కెట్టటుల కుత్సిత
మయ్యె విధాత త్రిప్పునన్. భార. శల్య.
౧. ౩౬.

త్రిప్పుకొను. అ. క్రి. (త్రిప్పు+కొను.) శ్రమ
నొందు.

గీ. ఊర్ధ్వలోకనివాసులయుల్లములును, నధికభ
యమోహవివశంబు లయ్యె ననిన, నల్పధా
రుణినాథసైన్యములు గలఁగి, త్రిప్పుకొని
తల్లడిల్లుట సెప్ప నేల. హరి. ఉ. ౨. ౨౪.

త్రిప్పుకొలుపు(ల్పు). స. క్రి. (√ త్రిప్పుకొను)

౧. నివృత్తముచేయు, మరల్చు; పోఁగొట్టు.

సీ. కఱచినచెవిగూబగరు నూడి గం డెండి
బెళక పైఁ బడి త్రిప్పుకొలిపె గున్న. కళా.
౪. ౭౭.

సీ. అల్లన యూఁదెడునప్పు డక్కొమ్మవాతెఱ
తావి ధైర్యంబు ద్రిప్పుకొలుప. భార. అను.
౧. ౪౮.

౨. కలఁతపెట్టు, క్షోభపెట్టు.

చ. అనవుడు నక్కుమారుఁడు ప్రియాంగనఁ గ
న్గొనువేడ్క త్రిప్పు కొ, ల్పిన ధృతిపొందు
వాసి మదిఁ బేర్చినప్రేమము సిగ్గు నుత్తరిం, చి
న వినయావనమ్రుఁ డయి చేతులు మోడ్చుచు
మాయతన్వి, నైనను దయఁ జూపవే భుజగ
నాయక నాకు వెస న్సదాలసన్. మార్క.
౩. ౮౮.

చ...ఇత్తెఱంగు నా, హృదయముఁ ద్రిప్పుకొల్పె
నని యెల్లవిధంబుల నొత్తియాడినన్. దశ
కు. ౧౦. ౧౫౭.

త్రిప్పుడు=త్రిప్పు. వి. (√ త్రిప్పు) త్రిప్పుట.

సీ. ఒకచేత నెలుఁ గొంట నొకకొండగొటియ
గా నొకఁడు త్రిప్పెడి త్రిప్పు డొఱపు మిగి
లె. కళా. ౪. ౯౩.

క. మీసలు మెలివెట్టుచుఁ గడు, రోసమ్ములు
గ్రమ్ముకొనఁ బురోభాగము లం, దాస లద్రువ
కేక లిడుచు, దూసినకత్తులను ద్రిప్పుడులు
గుడుసువడన్. ప్రబంధ. ౭౮౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ...కొండబూరుగుమానిచేవకొఅడుల త్రిప్పుడు లను...ప్రబంధ. ౭౫.

త్రిప్పుడుగొను. అ. క్రి. (త్రిప్పుడు+కొను.) పరిభ్రమించు, తిరుగు.

ఉ. ఎప్పుడు చూతు శంకరుని నెప్పుడు గాంతు హరుణ్ జటాటవిన్, త్రిప్పుడుగొన్న నిర్ఝరనదీమణి నెప్పుడు మేనిచాయలం, గప్పిన చంద్రభూషణవికాసము లానుదుఁ జిత్తవృత్తిలో, నెప్పుడు నాతపంబు ఫలియించునొ కోరిక లెప్పు డబ్బునో. శేష. ౪. ౨౦౯.

త్రిప్పుడుత్రాడు=తిరుగుడుత్రాడు. వి. (త్రిప్పుడు+త్రాడు)పక్షులను బట్టుఒకానొక వేఁటసాధనము.

ద్వి. తెగనీలిమబ్బులు త్రిప్పుడుత్రాళ్లు. ద్వి. నల. ౩. ౧౨౩ పా.

త్రిప్పుడుపుడుక. వి.(√త్రిప్పుడు)-రాట్నమును త్రిప్పుటకు సాధనముగానుండెడిపుల్ల-రాట్నము యొక్క ఒకానొకఅవయవము.

క. వడిదారము చెవులుం ద్రొక్కుడుపలకయు దిండు కదురు గుంజలునుం ద్రొక్కుడుబొమ్మయునుం ద్రిప్పుడు,పుడుకయునుం గలుగు రాట్నములు గైకొనుచుణ్. శుక. ౨.౪౯.

త్రిప్పుత్రాడు. వి. (√త్రిప్పు) తరిత్రాడు, మంథరజ్జువు. (శ. ర)

త్రిప్పులాడు. అ. క్రి. (త్రిప్పులు+ఆడు) తిరుగులాడు, తిరుగు.

చ. గదిమిన నావధూటి కలఁగంబడ కాత్తభయంబు లేక భ్రూ,మిగిదివిజుఁ డీతఁ డీసవనమేషముఁ బట్టుకపోవఁ ద్రాడు చే,వదలిన వేగ వచ్చి మనవాసముఁ జొచ్చుక చిక్కకుండినణ్, బదపడి తల్పు మూసికొని పల్లఱు మేషము త్రిప్పులాడెడిణ్. హంస. ౫. ౨౪౩.

త్రిప్రస్రుతము. సం. వి. అ. పుం. -మేఢ్రకపోలనేత్రము లనుమూఁడుస్థానములనుండి స్రవించు మదము కలది- మదపుటేనుగు.

త్రిఫల. సం. వి. ఆ. స్త్రీ. - మూఁడుఫలములు- కరక తాడి యుసిరికలు.

శ్లో. ఏకా హరీతకీ యోజ్యా ద్వౌచ యోజ్యౌ విభీతకౌ, త్రీణి చామలకాన్యాహుస్త్రిఫలైషా ప్రకీర్తితా. (రా. ని.)

త్రిబీజము. సం. వి. అ. పుం. శ్యామాకము, చామకు.

త్రిభండి. సం. వి. ఈ. స్త్రీ. త్రివృత్తు, తెగడకు.

త్రిభద్రము. సం. వి. అ. న-దంతక్షతాలింగనమర్దనము లనుమూఁటియందును సుఖము కలది-సురతము, మరుకేళి. (త్రి. ని.)

త్రిభాగము. సం. వి. అ. పుం. తృతీయభాగము, మూఁడవభాగము. సం. క. సం. ౫. ౫౭.

త్రిభుజము. సం. వి. అ. న. (గణిత) -మూఁడు కొనలు గలది-(క్షేత్రవిశేషము.)

త్రిభువనము. సం. వి. అ. న. ముల్లోకములు.

త్రిభువనాంకుశము సం. వి. అ. న. అంకుశరూప మగుముద్ర గలకొలపాత్ర.

వ...నిత్యపడి త్రిభువనాంకుశమునం బోయంగలనే మా ౧. దా. శా. ౪. ౧౦౧౦.

త్రిమధురము. సం. వి. అ. న. పాలు తేనె చక్కెర అనెడిమూఁడుపదార్థములు. (చక్కెర తేనె నెయ్యి అని కొందఱు.)

త్రిమధువు. సం. వి. ఉ. న=త్రిమధురము.

త్రిమార్గ. సం. వి. ఆ. స్త్రీ. గంగ. (వై. ని.)

త్రిముని. సం. అవ్య.ఇ. న.౧. (వ్యాకరణప్రవర్తకులగు) ముగ్గురుమునులు, పాణినికాత్యాయన పతంజలులు. ౨-ప్రవర్తకు లగుముగ్గురు మునులు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కలది-వ్యాకరణము.

**త్రిమ్మట.** వి. (√త్రిమ్మరు) ౧. త్రిప్పట, పర్యటనము; తిరుగుడు, పరివర్తనము.

చ. వలవదు రోయఁ బాండవుల వారొకయూఱట లేనిత్రిమ్మటన్, బల మఱి వన్యసత్త్వములపాల్పడి చచ్చినచోటఁ బూరియు, న్నొలవదె...భార.విరా. ౩. ౯౨, మా.౧౬౭.

క. యుగములత్రిమ్మటఁ గాలం, బగణేయం బై చనంగ నఖిలజనంబున్, జగతీపర పరివృత్తం, బగుచుండు సముద్భవక్షయంబుల నోలిన్. హరి. ఉ. ౯. ౬౨.

౨. నడవడి, ప్రవర్తనము.

గీ. జ్ఞానవైరాగ్యనిర్మల స్వాంతలమున, వన్నెకెక్కినయోభక్తవర్య నీదు,తరుణి కొఱగానిత్రిమ్మటఁ దిరుగఁజొచ్చెఁ, జక్కఁగాఁ దీర్పు మనుటయుఁ జాఁగి మ్రొక్కి. చెన్న. ౩. ౩౭౪.

౩. కాయకష్టము.

ఉ. ఆలలి తాంగి చాలఁ దడవచ్చుట నప్పెయి నుండి సాహసో,ద్వేలత నంతఁ జేరి కడుఁ ద్రిమ్మటచే శ్రమ మొందినారు గాఁ,బోలును బోదునా నిదురఁబోయెదరే యని...కళా. ౪. ౧౦౯.

౪. విపత్తు,ఆపద.

క. బిగు వెడలి సీల యూడిన, నగచరుబీజంబు లిఱుక నానొప్పిఁ గడఁకన్,వెగ డొంది మొఱలు వెట్టుచుఁ, దెగియెన్ మర్కటము దాని త్రిమ్మట వింటే. నా. పంచ. ౧. ౯౨.

**త్రిమ్మటకాఁడు.** విణ. (త్రిమ్మట+కాఁడు)త్రిమ్మరి, మిక్కిలి తిరుగువాఁడు.

క...అర్ధరథుం డా,ధృతవర్ముఁడు పిన్నవాఁడు త్రిమ్మటకాఁడై, మతిహీనత శస్త్రాస్త్ర,ప్రతతి పరిశ్రమము లేక పాలసుఁ డగుటన్. భార. ఉద్యో. ౪. ౨౬౩.

**త్రిమ్మరి.** విణ. (√త్రిమ్మరు) ౧-మిక్కిలి తిరుగువాఁడు-త్రిమ్మరీఁడు; దుష్టుఁడు.

(క్షమమాటలు.) ఉ ... అధ్వరక్రియా,దేవతపప్రశ్నుతుల్ చెఱుపఁ ద్రిమ్మరుత్రిమ్మరిఁ గన్నులన్ వృథా,పావకకీలము ల్నిగుడఃపాతకి నే ననిఁ గిట్టి...వధింతుఁ గ్రోధునిన్. ప్రబోధ. ౪. ౨౪.

ఉ. తెల్లమి గాఁగ గంధవహ ద్రిమ్మరి పౌట రొఱుంగకె జనుల్. ఇందు. ౪. ౫౭.

౨. (యథేష్టముగా)ప్రవర్తించువాఁడు;ప్రవర్తించునది, తిరుగుఁబోతు.

పంచచామరము.ఇసీయిసీ మొగంబు నూడకిల్లు వెల్వరించినన్,వెస న్విసింగి పోవు సిగ్గు వీసమంత లేదు నీ,దెసం బసల్ ఘటించె దేర త్రిమ్మరీ... విప్ర. ౪. ౫౯.

ఉ. అమ్మకచెల్ల నేను వెలయాలనొ త్రిమ్మరి నై పురంబునం, ద్రిమ్మరఁ జూచెనో...శుక. ౨. ౨౧౭. ('దిమ్మరి' శ. ర. పా)

**త్రిమ్మరీఁడు.** విణ. (త్రిమ్మరి+ఈఁడు—స్వార్థమున) త్రిమ్మరి,తిరుగుఁబోతు.

ఉ. తుమ్మెద ద్రిమ్మరీఁడు పయిఁ దోఁచుపిశంగిమ పద్మినీనిశాం, కమ్ము...వసు. ౩. ౧౩౭.

**త్రిమ్మరు.** అ. క్రి. ౧. సంచరించు, తిరుగు, పర్యటించు.

ఉ. దేవమనుష్యలోకములఁ ద్రిమ్మరుచున్ విపుల ప్రతాపసం, భావితశక్తిశౌర్యులు... భార. ఆది. ౧. ౧౦౬.

చ. దినము దినంబుఁ దప్ప కిటు ద్రిమ్మరి చాలఁగ భిక్ష యెత్తి...కాశీ. ౭. ౧౭౬.

చ...కడువేడ్క యొనర్పఁగ బంతి యాడ నె, మ్మిని గనకంపుఁగోల నడిమింట నె త్రిమ్మరఁ దారి కొట్టుచున్. ప్రభా. ౨. ౭౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. మెలఁగు, ప్రవర్తించు.

ఉ. ఆనరనాథుఁ డిట్లనియె ... తురంగశాలల
నెల్లను ముఖ్యుఁడనై తదీయనా, నానియత
ప్రకారకరణంబులఁ ద్రిమ్మరుచున్నవారి ము,
న్నే నెటు లట్ల నీ వరసి యిచ్చు మెయిఁ
బనిగొమ్ము నెమ్మితోన్. భార. విరా. ౧.
౨౭౨.

ఉ. ఇన్ని దినంబులు న్నవతు లిందఱలోపల సత్య
భామకన్నన్నలఁ ద్రిమ్మరు న్వారివశంవదుఁడై
యన విందు...పారి. ౧. ౬౫.

౩. వర్తించు, ఉండు.

క...మనుజపతుల క్రాయక్కజ మగువిశ్వేశ్వ
ర, దృక్కిలలఁ గమరిపోక ద్రిమ్మర పశమే.
కావ్యా. ౧. ౧౦౦.

స. క్రి. చుట్టివచ్చు, వలగొను.

క. అనవరతము విధియోగం,బున నేఁ ద్రిమ్మరుదు
నమరభూధరము ...భార. ౩. ౨౩.

ఉ. దేవగణేశ యీక్షణమ త్రిమ్మరి వత్తుఁ ద్రివి
ష్టపంబులన్. భార. ఆది. ౨. ౧౧౮.

జః త్రిమ్మట, త్రిమ్మటకాఁడు, త్రిమ్మరి, త్రిమ్మ
రీఁడు.

త్రియామ. సం. వి. ఆ. స్త్రీ. ౧ -మూఁడు
యామములు గలది- రాత్రి. (రాత్రి మొదటి
జాములో సగమును కడపటిజాములో సగమును
చేష్టాకాలములుగాన పగటివంటివి యగుచున్నవి.
అందుచే రాత్రి మూఁడుజాములు గలదిగాఁ జె
ప్పఁబడెను.) ౨. పసుపుకొ. ౩. నీలికొ. ౪.యమ
నానది. (వాచ.)

త్రియామకము. సం. వి. అ. న. పాపము.
(కల్ప).

త్రియూహము. సం. వి. అ. పుం. కపిలవర్ణము
గలగుఱ్ఱము. (వై. ని).

త్రిరాత్రము. సం. వి. అ. పుం. (మూఁడురా
త్రులు జరుగు) యజ్ఞభేదము. న. ౧. మూఁడు
రాత్రులు. ౨. మూఁడురాత్రులతోఁ గూడిన
మూఁడుదినములు.

త్రిరేఖము. సం. వి. అ. పుం. శంఖము.

త్రిలవణము. సం. వి. అ. న. సైంధవబిడరుచ
కము లను మూఁడులవణములు.

త్రిలింగము. సం. విణ. (అ. ఆ. అ) (వ్యాక)
మూఁడులింగములు గలది. వి. అ. పుం. తెలుఁ
గుదేశము. (శ్రీశైలదక్షారామకాళేశ్వరము లను
మూఁడులింగస్థానములనడుమ నుండుదేశము.)

త్రిలింగి. సం. వి. ఈ. స్త్రీ. మూఁడులింగములు,
స్త్రీపుంనపుంసకలింగములు.

త్రిలోకములు. సం. వి. అ. న. బ. మూఁడులోక
ములు,స్వర్గమర్త్యపాతాళములు.('దిక్సంఖ్యేసం
జ్ఞాయామ్' అనుమాత్రముచే కర్మధారయ సమా
సము.)

క...నాక కాదీ, త్రిలోకముల కధిపుఁ జూచి
తిమి యొకయెలుఁగున్. భార.ఆది.౫.౨౩౯.

త్రిలోకి. సం. వి. ఈ. స్త్రీ. మూఁడులోకముల
సమూహము.

త్రిలోచనుఁడు. సం. వి. అ. పుం- మూఁడు
కన్నులు కలవాఁడు- ముక్కంటి, శివుఁడు.

త్రిలోహకము. సం. వి. అ. న. మూఁడులోహ
ములు. (బంగారు, వెండి, రాగి.)

త్రివటించు. సం. స. క్రి. మూఁడు సమభాగము
లుగాఁ జేయు.

వ. అంతం దనుసంతాపంబు వాప నోపక పరమే
శ్వరురూపు చిత్రించి చూచిననైన నూఱట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యగునో యని చిత్రసాధనంబులు గొని పలక ఘట్టించి మెఱుంగిడి త్రివటించి ...సలక్షణంబుగాఁ జిత్రించి...కు. సం. ౫. ౫౯౭.

త్రివత్సము. సం. వి. అ. పుం. మూఁడేండ్లవయస్సు గలగిత్త, మూఁడేండ్లకోడెదూడ. (వాచ.)

త్రివర్గము. సం. వి. అ. పుం. ౧. ధర్మార్థకామములు ౨. సత్త్వరజస్తమోగుణములు. ౩. స్థితివృద్ధిక్షయములు ౪. త్రికటుకము, సొంటిపిప్పలిమిరియాలు. ౫. త్రిఫల, కరక తాడి యుసిరికలు.

త్రివర్ణకము. సం. వి. అ. న. ౧. బ్రహ్మక్షత్త్ర వైశ్యవర్ణములు. ౨. శ్యామరక్తపీతము లనుమూఁడురంగులు. ౩. గోక్షురము, పల్లేరు. ౪. త్రిఫల. ౫. త్రికటువు.

త్రివిక్రముఁడు. సం. వి. అ. పుం. మూఁడులోకములను మూఁడడుగులచే ఆక్రమించినవామనరూపుఁ డగువిష్ణువు.

త్రివిష్టపము. సం. వి. అ. న -తృతీయలోకము-వేల్పుఁబ్రోలు, స్వర్గము.

త్రివృత. సం. వి. ఆ. స్త్రీ. తెగడ.

త్రివృత్త. సం. వి. ఆ. స్త్రీ. త్రివృత్తు, తెగడ.

త్రివృత్తము. సం. వి. అ. పుం. మౌక్తికమణిదోషము, ముత్యపుదోషము.

సీ. పొరలు పై మూఁడున్న నరయఁ ద్రివృత్తంబు ఘననీలవర్ణంబు కాకపాణి. రత్న. ౫౦.

త్రివృత్తు. సం. విణ. (త్) ౧. త్రిగుణితము, ముమ్మడి, మూఁడురెట్లయినది. వి. త్. పుం. ౧. యజ్ఞము. ౨. జన్నిదము. ౩. మూఁడుపేటల మొలనూలు. స్త్రీ. తెగడ.

త్రివృత్పర్ణి. సం. వి. ఈ. స్త్రీ. హిలమోచిక, నీలిరంగుపువ్వులు గలసరస్వతియాకు.

త్రివేణి. సం. వి. ఈ. స్త్రీ. ప్రయాగసమీపమున నున్నయొకపుణ్యక్షేత్రము. (ఇట గంగ యమునతోను అంతర్వాహిని యగుసరస్వతితోను గలియుచున్నది.)

త్రివేల. సం. వి. ఆ. స్త్రీ. త్రివృత్తు, తెగడ.

త్రిశంకువు. సం. వి. ఉ. పుం. ౧. ఒకానొక సూర్యవంశపురాజు, హరిశ్చంద్రునితండ్రి. ౨. చాతకము. ౩. పిల్లి. ౪. మిడుత. ౫. మిడుఁగురుఁబుర్వు. ౬. గరుత్మంతుఁడు (వైని. కే.ని.)

త్రిశతము. సం. విణ. (అ. ఆ. అ.) మున్నూఱు గలది. వి. అ. న. నూటమూఁడు.

త్రిశాఖపత్త్రము. సం. వి. అ. పుం - మూఁడు కొనలుగలఆకులు గలది-బిల్వము, మారేడు.

త్రిశిఖము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. మూఁడు శిఖలు కలది. ౨. మూఁడుకొనలు గలది. వి. అ. న. ౧. త్రిశూలము. ౨. కిరీటము. ౩. ఒకానొకశిరోభూషణము. (కే. ని.) పుం. బిల్వము, మారేడు.

త్రిశిరుఁడు. సం. వి. స్. పుం. ౧. రామాయణ కథయందలియొకరాక్షసుఁడు. ౨. కుబేరుఁడు. (వాచ)

త్రిశీర్షకము. సం= త్రిశూలము.

త్రిశుద్ధి. సం. వి. ఇ. స్త్రీ. త్రికరణశుద్ధి.

ఉ. హాటకగర్భరాణి నిను నాఁకటికిం గొనిపోయి యల్లకర్ణాటకిరాటకీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్ము భారతీ. (పోతన చాటువు.)

త్రిశూలము. సం. వి. అ.న. ఆయుధవిశేషము, ముమ్మొనవాలు.

త్రిశూలి. సం. వి. న్. పుం. ముమ్మొనవాలు దాల్పు, శివుఁడు.

త్రిశృంగము. సం. విణ. (అ. ఆ, ఈ. అ) మూఁడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శృంగములు గలది. వి. అ. పుం. త్రికూటపర్వతము.

త్రిశృంగి. సం. వి. న్. పుం. రోహితము, ఎఱ్ఱి చేప.

త్రిషవణము. సం. వి. అ. న. ౧. మూఁడు సవనములు. (ప్రాతస్సవనము, మాధ్యందినసవనము, సాయంసవనము.) ౨. మూఁడుకాలములు, ప్రాతర్మధ్యాహ్నసాయాహ్నములు. ఉదా: త్రిషవణస్నానము.

త్రిషష్టి. సం. విణ. (ఇ). అఱువదిమూఁడు. వి. ఇ. స్త్రీ. అఱువది మూఁటియందుండు సంఖ్య.

త్రిష్టుప్పు. సం. వి. భ్. స్త్రీ. పదునొకండవ ఛందస్సు.

త్రిసంధ్యము. సం. వి. అ. న. పూర్వాహ్ణమధ్యాహ్నసాయాహ్నములు, మూఁడుసంధ్యాకాలములు.

త్రిసప్తతము. సం. విణ. (అ. ఈ. అ) డెబ్బదిమూఁడవది.

త్రిసప్తతి. సం= త్రయస్సప్తతి.

త్రిసప్తతితమము. సం= త్రిసప్తతము.

త్రిసమము. సం. వి. అ. న. ౧. మూఁడుసంవత్సరములు. ౨. (వైద్య) సమభాగము లగుకరక సొంటిబెల్లములు కలిపినపదార్థము.

త్రిసరము. సం. వి. అ. పుం. కృశరము, మినుపపప్పు నువ్వుపప్పు బియ్యము కలిపి వండినపులగము.

త్రిసీత్యము. సం. విణ. (అ. ఆ. అ) మూఁడు సార్లు దున్నినది. (పొలము)

త్రిసుగంధి. సం. వి. ఇ. న= త్రిజాతము.

త్రిసూత్రము. సం. వి. అ. న. బ్రహ్మసూత్రము, యజ్ఞోపవీతము. పుం. వైదూర్యవిశేషము. (శ. ర.)

త్రిస్థలి. సం. వి. ఈ. స్త్రీ. ౧. మూఁడుస్థలములు. ౨. కాశీగయాప్రయాగములు.

త్రిస్రోతస్సు. సం. వి. స్. స్త్రీ. గంగానది.

త్రిహల్యము. సం= త్రిసీత్యము.

త్రిహాయణి. సం. వి. ఈ. స్త్రీ. మూఁడేండ్లపెయ్య.

త్రిహాయనము. సం. విణ. (అ. ఆ. అ) మూఁడేండ్లవయస్సుగలది. (శాల, మొ.)

## త్రు

త్రుంగు. అ. క్రి. (త. నొఱుంగు) ౧. తునుకలగు, ఖండములగు.

ద్వి. చనుదేర నుద్దండచండకాండములఁ, గనల కారాముఁ డాగదఁ ద్రుంగ నేసి. రం. రా. ఆర. ౧౯౯ పా. ౨౧ పం.

మ. తురగస్యందనవారణప్రకరముల్ ద్రుంగఁగ విజృంభించెదన్. భార. ద్రో. ౫. ౩౩౯.

చ. చినిఁగినచర్మముల్ దెగినచేతులు త్రుంగిన కాళ్లుతూలువ్రేళ్లును... కార్తిక. ౪. ౫౩ పా.

౨. పడు, రాలు.

క... సోమార్కప్రభ లడంగుఁ జుక్కలు ద్రుంగున్. పె. శకుం. ౧. ౨౪౦.

౩. ముగియు, సమాప్తమగు.

సీ. యుగము ద్రుంగెడునాఁడు జగములు వొలియించునంతకమూర్తిపై నింత యగుచు. భాగ. ౬. ౩౧౮.

౪. చచ్చు; నశించు.

శా. వానప్రస్థునిఁ జంపి యొక్కవడితో స్వర్నాథుఁడుం ద్రుంగు ధాత్రీనాథుం డన నెంతవాఁడు... భా. రా. అయో. ౨౦౯.

చ. తొడిగినవైష్ణవాస్త్రమునఁ ద్రుంగితి పొమ్మని హంసు నేసినం, బిడుగులపిండువో లెనతిభీకరతం జనుదేర... ఉ. హరి. ౪. ౨౯౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. పారపాచ్చెంబునఁ బలుమఱు, విరిఁబోఁడుల
నెల్ల మిగుల వెతవెట్టుదు నీ,దొరతనము
ద్రుంగిపోవను, మరుఁడా నీచేతివిల్లు మంటం
గలయక్. నీలా. 3. ౧౭.

జః త్రుంగుడు, త్రుంగుడువడు, త్రుంచు,
త్రుంపు, త్రుంపుడు.

**త్రుంగుడు.** వి. (√త్రుంగు) ౧. నాశము. (చూ. త్రుంగుడువడు.) ౨. ప్రళయము.

సీ...వెలయుఁ ద్రుంగు డనంగఁ బ్రళయసంజ్ఞ.
ఆం. భా. ౧. ౯౮.

**త్రుంగుడువడు.** అ. క్రి. (త్రుంగుడు + పడు) నశించు, పోవు.

సీ. తండ్రిసద్గుణసముదయము ద్రుంగుడువడ
మెలఁగు పుత్రుఁడు హీనుఁడు ... మార్క.
౨. ౩౪౦.

క. కామోపభోగసుఖములు, వేమాఱును బురు
షుఁ డనుభవించుచు నున్నం, గామంబు
శాంతిఁ బొందదు, ధూమధ్వజుఁ డాజ్యవృ
ష్టిఁ ద్రుంగుడువడునే. భాగ. ౯. ౫౮౦.

**త్రుంచు=తుంచు.** స. క్రి. (√త్రుంగు) ౧. నఱకు, ఖండించు, ముక్కలుచేయు.

సీ. బాడిస నఱకినభంగిఁ గొన్నింటిఁ దుత్తునియ
లుగా బిట్టు త్రుంచి త్రుంచి. భార. విరా.
౫. ౩౫.

మ. ఇది మీనం బగు నైన నేమి యసిచే నింతిం
తగాఁ ద్రుంతునో. దశా. ౧. ౨౯౩.

గీ. అనిమిషారాతి వి ల్లెత్త నగజ ద్రుంచె, శూల
మెత్తిన ఖండించె నీలవేణి. కాశీ. ౬. ౨౪౫.

౨. ఉత్తరించు, చించు.

గీ. అలవరించి చతుర్విధాహారములను, దుష్టిచేసి
దుకూలముల్ ద్రుంచి ద్రుంచి, కట్ట నిచ్చిన
...ఉ. హరి. ౪. ౧౧౫.

౩. భగ్నముచేయు, పోఁగొట్టు.

మ...హయంబు వెంట నీకఁ గూర్మిక్ హస్తినా
పట్టనంబునకుం బోవఁగఁగల్గె బంధువితతిక్
బూజింపఁగాఁ గల్గెనం,దు నిజేశుం గలయం
గఁగల్గెననఁ దోడ్తోఁ ద్రుంచి తయ్యాసలక్.
జై. భా. ౭. ౬౧.

౪. వధించు, చంపు; నశింపఁజేయు.

సీ...ఇతండు మహీశుల నుజ్జ్వలక్షత్త్రధర్మంబు
నఁగాదె త్రుంచె, నది పాప మే లగు...భా
ర. స్వ. ౧. ౭.

ద్వి. ఆయుధిష్ఠిరుఁ డంత నాత్మీయజనుల,రోయ
క యనిలోనఁ ద్రుంచినపనికి. ద్వి.భాగ. ౧.
స్కం. (శ. ర.)

(పాం డ్రుఁడు) మ. నారదా...శాపాస్త్రుఁడ
వైననీకు నవమానం బేను జేయంగ నొ,ల్ల
నిజేచ్ఛం జను మింక యాదవుల నెల్లం
ద్రుంచి మెచ్చించెదక్. ఉ.హరి. ౩. ౧౮.

**త్రుంపు.** వి. (√త్రుంచు) ౧. ఖండము, ముక్క.

గీ. త్రుంపు లైనచామరములుఁ దునుక లైన,తొడ
వులును గల్గి సమర మత్యుగ్ర మయ్యె. జై.
భా. ౫. ౧౯౨.

౨. శ్లేష్మవస్తువు.

క. త్రుంపులగని వగునీ వీ,సాం పెడలిన పేద
మానిసులవెంటఁ గటా, దుంపలుఁ గూరలు
నమలుచుఁ, గంపలఁ బడి తిరుగ నేల కైకొ
ను మమ్మున్. అచ్చ. రా. ఆర. ౬౦.

**త్రుంపుడు=త్రుంపు.** వి. ఖండము, తునుక. (శ. ర. బ్రౌ)

**త్రుక్కు**[1]. వి. త్రుళ్లు, గర్వము.

గీ. త్రుళ్లు క్రొవ్వు తిమురు త్రుక్కు మల్లరమ్ము,
పొతరం బేపు నా గర్వ మొప్పుచుండు. ఆం.
భా. ౧. ౧౩౩.

ఉ...చంపితి దొంగిలి ము న్మదీయులక్,రక్క
సుల న్నినుం బొదివి ప్రాణము గొందుఁ గడం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గి సాద వై, త్రుక్కిడి యున్నఁ బో విడు
వ...పాండు. ౫. ౧౦౭.

త్రుక్కు². వి. త్రుప్పు,చిలుము,లోహమలము.

సీ. లోహమలాభిధ ల్పొల్పారుచుండఁను ద్రు
ప్పన చిలు మనఁ ద్రుక్కనంగ. ఆం. భా.
౨. ౨౮౦.

త్రుటనము. సం. వి. అ. న. తెగుట.

త్రుటి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. తామరతేకు
నందు తీక్ష్ణ మగుసూది దిగునంతటికాలము,కాల
పరిమాణభేదము. (లఘ్వక్షరచతుర్థభాగోచ్చా
ణకాలము అని కొందఱు). ౨. లేశము, అల్పాం
శము. ౩. సంశయము. ౪. చిట్టేలకి.

త్రుటితము. సం. విశ. (అ. ఆ. అ) తెగినది.

త్రుట్టె(ట్టియ)=తుట్టె². వి. సమూహము,గుంపు.

సీ. కడుఁదుర్లనిడుత్రుట్టెగతిఁ జొంగతోఁ బాం
డురత మించుకపిలకూర్చంబువాని. ఆము.
౬. ౧౯. (వ్రాతప్రతిపా.)

జః త్రుట్టెలుగట్టు.

త్రుట్టెలుగట్టు. అ. క్రి. (త్రుట్టెలు+కట్టు.)
గుమిగూడు, చుట్టువాఱుకొను.

ఉ. పట్టిన బిట్టు మిట్టిపడి పాని సముత్థితుఁ
డయ్యె మేనిపైఁ, బెట్టినపుట్ట నెట్టవిసి బీఁట
లువాఱ శ్రవశ్శకుంతముల్, చట్టుప లెత్తి
ముందటికి సాగఁ దలంప జటాచ్ఛటాచ్ఛ
దిక్, ద్రుట్టెలుగట్టి నిద్రిలుమదుఘ్నగధీశకు
లంబు మేల్కనన్. పాండు. ౫. ౨౪౯.

త్రుప్పు. వి. ౧. అయోమలము, ఇనుపకిట్టము;
కాలుష్యము, మాలిన్యము. ఆం. భా. ౨.౨౮౦.

తే...త్రుప్పు వోఁ దోముసీలంపుఁదునుక యనఁగ.
పాండు. ౧. ౧౮౨.

గీ. అప్పటప్పటికిని జిహ్వాత్రుప్పు డుల్ల. మనుచ.
౨. ౧౧.

ఇట్లే; చెవిత్రుప్పు.

(వ్యవ) ఆగాయకుఁడు నాచెవిత్రుప్పు పోఁగొట్టి
నాఁడు.

౨. లేమి, దారిద్ర్యము.

తే. సత్కవులత్రుప్పు డుల్చు వసంతవేళ...నృ
సింహ, సార్వభౌమునిబిరు దైనసాళువంబు.
జై.భా. ౧. ౪౫. (చూ. ఉల్చు.)

జః త్రుప్పుడు.

త్రుప్పుడు=త్రుప్పు.

(మాలిన్యము)

వ...మాటిమాటికి మానిసికాటు మరగి తెరవులు
గాచి కాచి డగ్గుతికపడం దినుపెద్దపాలవ
లనం బుటపుటసై త్రుప్పుళ్లు డుల్లి త్రుళ్లిగం
తు లిడుగబ్బిబెబ్బులుల...మనుచ. ౪.౩౭.

(నిస్సారపదార్థము)

చ...యు,త్తరుఁ డిదె తాను సూతుఁడు నుదగ్ర
త వచ్చుచు నున్నవాఁడు త,త్తురగరథధ్వ
జాళి నొకత్రుప్పుడు రాలదు...భార. విరా.
౫. ౨౩౯.

(ఈఁక; రోమము, బొచ్చు.)

తే. సత్కవులత్రుప్పు డుల్చువసంతవేళ...నృ
సింహ, సార్వభౌమునిబిరు దైనసాళువంబు.
జై. భా. ౧. ౪౫. (చూ. ఉలుచు).

సీ. రోమము బొచ్చనఁ ద్రుప్పుడు నా మీఱు
...ఆం. భా. ౨. ౧౪౬.

త్రుమ్మికి=తుమ్మికి. వి. తిందుకము, ఒకానొకచెట్టు.

వ...గూడిన చింతమ్రానును సీమాఉత్తరతఃత్రు
మ్మికిపోలగిరుసు సీమా। ఐశాన్యాం దిశి త్రుమ్మికి
యుఖేణ్డపూడియు...ఫి. శా. శ. ౧౦౨౪.

త్రుమ్ము. వి. దుమ్ము, ధూళి.

గీ. దుమ్ము దువ్వ దుమారము త్రుమ్ము తుమురు,
దవ పదటు బుగ్గి నాఁగను దనరు ధూళి.
ఆం. భా. ౨. ౨౨౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రుళ్లగించు. అ. క్రి. (√త్రుళ్లు) త్రుళ్లు, ఎగిరి పడు.

గీ. దోర్లతామాలదీప్తులు త్రుళ్లగింప...ఒక్క తె సురఁటి విసరె. వరాహ. ౯. ౧౩౯.

త్రుళ్లగింత=త్రుళ్లింత. వి. (√త్రుళ్లగించు.) గంతు; ఎగసిపాటు, మిడిసిపాటు.

వ...ఉటజప్రఘాణంబుల నేణీడింభంబులు సంభ్రమంబున నక్కడక్కడ జాతి పరికొను కామధేనూధస్యధారాసారంబులు చవిగొని త్రుళ్లగింత లిడ వాని వెంబడిం బరువులిడుము నిబాలికల...వాల్మీ. ౨. ౬౪.

సీ. కుంతలములత్రుళ్లగింతలు సడలినఁ గెమ్మోవి చుంబనక్రీడ కెలయ. విక్ర. ౪. ౨౨౬. (త్రుళ్లుమింత-చి. ని. పా)

సీ. దోర్మూలరోచులు త్రుళ్లగింతలు వెట్టఁ దివుటమైఁ దుఱుములు దిద్దుకొనుచు. హరిశ్చ. ౨. ౧౨౨.

త్రుళ్లాట. వి. (√త్రుళ్లాడు) క్రీడ, ఆట.

సీ. త్రుళ్లాట గొండ్లి నాఁ దోఁచును గ్రీడాఖ్య యది మించఁ దగుఁ జెరలాట మనఁగ. ఆం. భా. ౧. ౧౪౦.

త్రుళ్లింత=త్రుళ్లగింత (√త్రుళ్లు.) గంతు.

సీ. తోరంపుఁజనుదోయి త్రుళ్లింతల నిడంగఁ దగుచోట్ల గుద్దంటఁ ద్రవ్వి త్రవ్వి. కళా. ౪. ౯౬. (త్రుళ్లుమింత-చి. ని, వ్రాఁతప్రతి పా.)

౨. గర్వము. (శ. ర)

త్రుళ్లిపడు. అ. క్రి. (త్రుళ్లి+పడు) ౧. (కోప భయగర్వాదులచే) ఎగిరిపడు.

క. నీమాటకు దుర్యోధనుఁ, డామెయిఁ దాఁ ద్రుళ్లిపడక యవ్వఁగా కని నాఁ, డేమేనిఁ గొంత యక్కట, భూమి యొసఁగెనేని యింతపుట్టదుసుమ్మీ. భార.శల్య. ౨.౩౭౧.

సీ. ఎటు దేలునో యని యేమఱుచెలి త్రుళ్లిపడఁ గ్రుంకి పాదంబు లాడియునదియు. ఉ. హరిశ్చ. ౩. ౩౯.

౨. మిక్కిలి కదలు.

సీ. బీదనరాలతోఁ బెరుఁగువాఁగడుపులో బల్ల నల్గడలందుఁ ద్రుళ్లిపడఁగ. శుక. 3.30.

త్రుళ్లియా(ళ్లా)డు. అ. క్రి. (త్రుళ్లి+ఆడు-స్వార్థమున) ౧. ఎగిరిపడు, ఎగసిపడు.

గీ. వెలుచఁ దమదాయి దైనసంపెంగవిరిని, గెలిచె నని ముక్కు నిరుగడఁ గొలిచియుండి, త్రుళ్లియాడెడుతుమ్మెదపిల్ల లనఁగఁ, బొలుచు నెలఁతుకచూపులు చెలువ మమర. యయా. ౪. ౩౭.

సీ. ఇరువంకలందున విరుల తేనియఁ గ్రోలుఁదొరలు మోదంబునఁ ద్రుళ్లియాడ. హరి. ఉ. ౬. ౫౮. (ఇట విజృంభించు అని భావము.)

౨. చిందులుత్రొక్కు, నర్తనముచేయు.

సీ. బవనీలజవనికపాటల నిల్లాంద్ర రమణఁ ద్రుళ్లాడించురంతుకత్తె. క్రీడా. ౧౨౯.

త్రుళ్లు. అ. క్రి. (త. తుళ్లు) ౧(ఉల్లాసాదులచే) గంతులువేయు, ఎగిరిపడు.

సీ. దుగ్ధపానంబులఁ ద్రుళ్లువెయ్యాలనోరినురవులు సితపుష్పవిరచనలుగ. హరి. ఉ. ౫.౧౬౪.

వ...తీఁగపస గలపూఁదేనె లాని పెల్లుగం ద్రుళ్లు గండుఁదుమ్మెదలును...నీలా. ౩. ౧౦.

సీ. బిగువుఁబయ్యెదలోనఁ బిక్కటిల్లుచుఁ జాలఁ ద్రుళ్లుచన్నుల నొప్పుముళ్లపేరు. కళా. ౪. ౧౦౫.

౨. గర్వించు,మదించు; మత్తతతోఁ బ్రవర్తించు.

క...తుది నీవును దుస్సనోదు త్రుళ్లుటుడుగుమీ. భార. శాం. ౪. ౩౯౭, ౩౯౯.

క. త్రుళ్లఁగ నేటికి నిలునిలు, మి ల్లలికినఁ బందు వగునె...కళా. ౩. ౧౯౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ...సౌఖ్యరసైకస్థితి నుండి కావరమునన్ గ
ర్వాన కాపత్వరం,పర రాఁ ద్రుళ్లెదవే లవో
విధిఁ దరింప నీ్నతకంబే మహిన్. సారంగ.
౨. ౧౧౨.

సీ. ఓరి మూఢా దుశ్చారిత్ర నీత్రుళ్లుటయె
కాని బుద్ధి నేమియు నెఱుఁగవు. రాఘవ.
౪. ౭.

3. విజృంభించు.

చ...కుంభజుఁడు,బాలుని...కడుఁ బెద్దఁ జేయు
చుఁ బొగడ్తకుఁ జొచ్చెనితండునొంపఁగాఁ,
దలఁపఁడు వీనిఁ బాధునకుఁ దాఁగడుఁ గూ
ర్చుట నెంత త్రుళ్లినన్.భార.ద్రో. ౨. ౪౫.

౪. ఉప్పొంగు, సంతోషించు.

చ. స్ఫురదురుకాంతి నీ మొగముఁ బోలఁగనో
పక వందుచున్న చం,దురుఁ డెదఁ బోలఁ
గంటి నని త్రుళ్లెదు నిప్పుడు నీమువక్త్రపం,
కరుహము వారితాస్రు జలకజ్జలసంగతి మైనఁ
జూచి సుం,దరి వల దేల యేడ్చె దని తత్సతి
నొక్కతి వల్కెఁ బెల్కుఱన్. కు. సం.
౭. ౧౪౯.

వి. ౧. ఎగిరిపడుట, ఎగసిపాటు.

క...తుమ్మెద నీత్రుళ్లు పెద్దతుప్పలఁ బట్టన్.
నీలా. 3. ౨౭. (త్రుళ్లు=గర్వము అని రెండవ
అర్థము.)

౨. గర్వము, మదము.

గీ...పాండుపాత్రుఁ,డలనిసారథిఁ బడనేసి యం
తఁ బోక, తురగములఁ జంపి యాతనిత్రుళ్లు
డంచె. భార. భీష్మ. 3. ౨3౧.

గీ. అట్టిరామునియందు నీయందుఁ గలుగు,దొడ్డు
కొంచెంబు లెంచుమా త్రుళ్లు సడలి. అచ్చ.
రా. సుం. ౧౫౭. ఆం. భా. ౧. ౧33.

జః త్రుళ్లగించు, త్రుళ్లగింత, త్రుళ్లాట, త్రుళ్లింత,
త్రుళ్లిపడు, త్రుళ్లియాడు, త్రుళ్లుఁబోతు, త్రుళ్లు
మింత.

త్రుళ్లుఁబోతు. విణ. (త్రుళ్లు+పోతు) త్రుళ్లునట్టి
స్వభావము గలవాఁడు, మిడిసిపడువాఁడు; గర్వ
శీలుఁడు.

ఆ. త్రుళ్లుఁబోత నీవు తూలిపోఁ బలికిన, సారమే
మి తెలుఁగుఁ జక్రమునకు.ఉ.హరి.3.౧౭.

త్రుళ్లుపిండి. వి. స్ఫోటకము కనిపించినపుడు పోలే
రమ్మను ఉద్దేశించి కొట్టెడుపిండి. (శ. ర. తుళ్లు
పిండి. బ్రా.)

త్రుళ్లుమింత=త్రుళ్లగింత. (√త్రుళ్లు. ఈపదము
చి. ని, శ. ర. లు గ్రహింపనివి. వ్రాతప్రతుల
లోఁగూడనీపదమే కలదు. దీనిసిద్ధివిచార్యము.)

సీ. త్రుళ్లుమింతలు వెట్టుతొడలదీప్తులతోన చను
దోయిమించులు చౌకళింప. విక్ర. ౭.3౯.

త్రుస్సు. వి. నీళ్లు చిమ్మఁ బడునపు డగుధ్వని కను
కరణము.

ఉ. ఘట్టితరూఢలిం గరిముఖంబునఁ బీలిచి గౌత
మీనదిం, బుట్టిన సత్త్వవాహజలపూరముఁ
ద్రుస్సన నూఁదుచున్...భీమ.౫.౧౧౬.

# త్రె

త్రెంచు=తెంచు, త్రెంపు. స.క్రి. (√త్రెగు)

౧. ఖండించు, నఱకు.

క. శిలఁ ద్రెంపఁ బోయి యినుమును, జలములఁ
గొని కాల్పఁ గడఁగి చని యనలంబున్,
బొలియును...భార. శాం. ౨. ౧౭౨.

క. కని రెండలుఁగులు దాఁకక,చనునో తాఁకి
యును ద్రెంపఁ జాలక చనునో.అచ్చ.రా.
యు. ౫౪౫.

సీ. మొఱలు వెట్టఁగ ఊంపసులఁ ద్రెంపఁబడు
వారు పుటపాకములకాఁకఁ బొక్కువారు.
కవిక. ౫. ౧౧3. మనుచ. ౪. ౧౦3.

౨. త్రుంచు, చంపు.

ఉ. ఏనికతోలుపచ్చడము నెమ్మలగుబ్బసరంబు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నంపపూఁ, దేనియతి య్యవిల్లుఁ గొని త్రెంచిన బొట్టు...ఉ. హరి. ౨. ౧౭౨. (భస్మమొనర్చిన అని భావము.)

త్రెంపు=త్రెంచే. స. క్రి. (√త్రెగు) ఖండించు, నఱకు, కోయు.

గీ. అంపమున వీనికంఠంబుఁ ద్రెంపి విడుఁడు. కాశీ. ౩. ౧౫౨.

ద్వి. తివిరి కే లెత్తినఁ ద్రెంపుజోదులును. ద్వి. హరిశ్చ. పూ. ౧౨౬ పం.

వి. తెంపు, సాహసము, తెగువ.

ఆ. అరయఁ గర్మరూప మగునవిద్యాజన్మ, మైన హృదయబంధ నాదిలతల, నప్రమత్తయోగ మసుమహోచ్ఛురికచేఁ, ద్రెంపవలయు నంతఁ ద్రెంపుతోడ. భాగ. ౫. ౧. ౭౦.

త్రెక్కొట్టు. అ. క్రి. (√త్రెగు) ఎగఁదట్టు.

క. ఇక్కరణి జోదు లేర్పడి, పెక్కడలం బోరఁ జెరుఁగుపెనుచివ్వలు మి, న్నెక్కి కలహాశికన్నులుఁ, ద్రెక్కొట్టిన విడక కఱవు దీర నెక్కెన్. రామా. ౮. ౩. (శ.ర.పా-తెక్కొట్టిన, అని ముద్రి. పా.)

త్రెక్కొను. స. క్రి. (√త్రెగు) ౧. కలఁచు, క్షోభపెట్టు.

ఉ...పాపవృత్తికిన్, స్రుక్కక వైర మెత్తి కడుఁ గ్రూరుఁడ వై యిటు సేఁత చూడఁగా, దిక్కులు గెల్వఁ గాదు ననుఁ ద్రెక్కొనఁ బోయితిగానియిమ్మెయిన్. నిర్వ. ౫. ౧౨౨.

క. అక్కట సద్విజజన్మము, నెక్కొనియును జేసికొనిన నేరమి నిన్నుం, ద్రెక్కొనఁ గష్టపుబాములఁ, బొక్కుచు నిన్నేఁడు లెట్లు పొరలితి తండ్రీ. పద్మ. ౩. ౯౨. జై. భా. ౫. ౧౧౯.

౨. చెఱచు, పాడుచేయు.

మ...పాండునందనులు నీమానంబు ప్రాణంబు నేపగిదిం గొందురుగాని పోవిడువ రీపాపంబు నిం ద్రెక్కొనున్. భార. అర. ౬. ౧౯౨.

౩. దోఁచుకొను.

సీ. మగ లాఁడువారికి మరగి మ్రుచ్చిలి బందిపట్టి కన్నంబులువెట్టి తెరువు, ద్రెక్కొని...కు. సం. ౭. ౮౬౭.

౪. చంపు.

ఉ. అక్కట దండ్రి లేనిమము నమ్మెయిఁ బెంచి నతాత నెమ్మెయిం, ద్రెక్కొనఁ గాదు... భార. భీష్మ. ౩. ౩౦౭.

గీ. దిక్కుమాలితి నింక నేదిక్కు సొత్తుఁ, గుటిలదైవంబు నిన్నుఁ ద్రెక్కొనియె నకట. భా.రా. కిష్కిం. ౩౩౯.

౫. పోఁగొట్టు, నశింపఁజేయు.

క. అక్కట దైవము రాజ్యము, ద్రెక్కొని యాలిం దనూజుఁ దెగ నమ్మంగా, నెక్కొలిపి హరిశ్చంద్రుని, నిక్కడఁ గాడ్పఱిచె నింక నేగతిఁ బోదున్. మార్క. ౧. ౨౪౮.

౬. మ్రింగు, కబళించు.

వ...ప్రతివీరులు ప్రయోగించువివిధాస్త్రశస్త్రవ్రాతంబులు నోరు తెఱచి త్రెక్కొనుచు ...మార్క. ౬. ౧౬౪.

౭. త్రాగు, పానముచేయు.

క. తేజోధనుఁ డగునరుఁ డు, దాభ్రజితగతి నడుమ మెఱసి బడబాగ్ని దళిం, పై జలనిధి ద్రెక్కొనియెడు, నోజం గురుబలము పేర్మి యుడిపెం దోడ్తోన్. భార. విరా. ౫. ౫౮.

౮. పూను, తాల్చు, వహించు.

చ. గళితమదప్రవాహములు... గజరూపకామగమనంబులు ద్రెక్కొని క్రాలురోహణా, చలగతిఁ బొల్చుభద్రకరి షణ్ముఖుఁ డెక్కె ...కు. సం. ౧౧. ౬౪౪.

అ. క్రి. ౧. కలఁగు, క్షోభపడు.

సీ. ఒగిఁ జుట్టి వైన తేయుఁడు భుజంగముఁ బట్టి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రిప్పు కైవడి వడిఁ ద్రిప్పి మింటఁ. గీ. బెక్కు మాఱులు వెస వీచి త్రెక్కొనంగ, వడ లి వారిధిలోపల వైవ ... భా. రా. యు. ౧౭౫౮.

౨. శేషించు, మిగులు.

క. అక్కడిబంధులఁ జంపుచు, నిక్కడిబాంధవులు సచ్చు టియ్యకొనుచు నిం,దెక్కడిపెం పొందెదఁ దుదిఁ, ద్రెక్కొనఁ బాపంబు రణము తెరువే నొల్లక్. భార. భీష్మ. ౧. ౧౮౪.

3. అతిశయించు; విజృంభించు.

ఉ. త్రెక్కొను కాక చే...ఆము. ౫. ౬౮.

క. ఎక్కడిచతురగనుం డిటు, ద్రెక్కొని యే తెంచెఁ బుండరీకాక్షునితో, నెక్కడిపోరా టము మన, కక్కట సమకూడె దైవమా యని మఱియుక్. చిత్రభా. ౬. ౬.

త్రెక్కోలు. వి.(√త్రెక్కొను.) త్రెక్కొనుట, చంపుట. (చూ. త్రెక్కోలుగొను.)

త్రెక్కోలుగొను. అ. క్రి. (త్రెక్కోలు+కొను.) హింసించు, చంపు.

గీ. దుష్టభుజగంబు లందంద తోలి కఱచెఁ, గ్రూరమృగచయ మెల్లఁ ద్రెక్కోలుగొని యె,జారచోరభయంబులుసంక్రమించె,ద్వారకానగరంబునఁ దఱుచుగాఁగ. వి.పు. ౬. 3౧౫.

త్రెగఁజూచు. స. క్రి. (త్రెక్+చూచు) చంపు.

క. జగతీశ యేమి చెప్పుదు, నగణితలయవారిధి యద మయి మూఁగినయ, మృగధేంద్రుబలము నెల్లను, ద్రెగఁజూచిరి హరియు హలియుఁ దీవ్రక్రీడక్. భాగ. ౧౦ పూ. ౧౫౭౦.

త్రెగు=తెగు. (శ. ర.)

జః త్రెంచు, త్రెంపు, త్రెక్కొట్టు, త్రెక్కొను, త్రెక్కోలు, త్రెక్కోలుగొను, త్రెగఁజూచు.

త్రెడ్డు=తెడ్డు. వి.౧.దర్వి,కొయ్యగరిఁటె; గరిఁటె.

గీ. శ్రీవిశాలాక్షి బంగారుత్రెడ్డునందు, నమృత పాయస మొసఁగు నభ్యాగతులకు. భీమ. ౨. ౧౧౫.

౨. పడవ నడుపుసాధనవిశేషము, అరిత్రము, కేనిపాతకము.

చ. కవి కవితాబ్ధిలోన ముఖగహ్వర మోడయు జిహ్వ త్రెడ్డు హృ,త్పవనుఁడు పీలికాఁడు మృదుభావలు రత్నములు ...శివరా. ౧. ౬.

త్రెయ్యు=త్రెవ్వు. అ. క్రి. తెగు, ఖండితమగు.

గీ. కామఁ బాసిన కమలంబుకరణిఁ బొలుచు, కర్ణతల యిలఁ బడియు నుదీర్ణకాంతి,నొప్పనట్టియుఁ జూచి శల్యుండు సిడము, ద్రెస్సి మోడైనయరదంబు ద్రిప్పె నధిప. భార. కర్ణ. 3. 3౭౧.

గీ. నీచకర్మదూషితయిప్పిశాచవీర, తనువు దైత్యారి నీచక్రధారఁ ద్రెస్సి,వెండియును బుట్టువుల నొంద కుండవలయు, బ్రహ్మభూయంబు నా కిమ్ము పరమపురుష. హరి. ఉ. ౫. ౨౦3.

గీ. నలినబిసనూత్రమును బురంధ్రులతలంపు, సమము త్రెయ్యును లవచాపలమునసైన. నైష. ౪. ౬౮.

త్రెళ్లించు. స. క్రి. (√త్రెళ్లు)౧.పడఁద్రోయు, కూల్చు.

శా. దీనిం జట్టలు చీరి యింగలమునక్ ద్రెళ్లించి పొర్లింపుచుక్. శ్రీరం. మా. ౫. 3౭.

౨. చంపు.

క. వి ల్లెక్కిడి యొకచిల్కునఁ, ద్రెళ్లింపుము పొలఁతి యనుచుఁ దెగడక దానిక్. అచ్చ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రా. బాల. ౧౧౨.

**త్రెళ్లు.** అ. క్రి. ౧. పడు, రాలు, కూలు.

ఉ...సర్వము లెల్ల నగ్నిలోఁ, ద్రెళ్లఁగ సర్వ
యాగ మతిధీయుత చేయుము...భార.ఆది.
౧. ౧౨౫. భర్త్స్వా. ౧. ౩౮.

ఉ.ఎల్లశరీరధారులకు నిల్లను-చీకటినూతిలోపలం,
ద్రెళ్లక వీరు నే మను మతిభ్రమణంబున
భిన్నులై ప్రన, ర్త్రిల్లక...భాగ. ౭.౧౪౨.

పంచచామరము. ధరంబు లొడ్డగిల్లెఁ ద్రెళ్లెఁ
దార లాకె నగ్ని...దశా. ౩. ౧౬౮.

౨. విఱుగు, ఖండితమగు.

సీ. బాహార్గళా స్తంభపరివర్తనంబుల దిక్చక్రవా
ళంబు ద్రెళ్లి పడఁగ. కాశీ. ౫. ౧౩౦.

ఉ. బెబ్బులి గొంతుక్రోల్ గఱచి పెల్లున మా
ర్మెడ ద్రెళ్ల దాఁటుచుఁ. ఆము. ౩. ౨౦.

౩. చచ్చు.

క. ధారాతీర్థం బనఁగాఁ, దారాధిపవదన ఖడ్గ
ధారాంచల మద్ధారాంచలమునఁ ద్రెళ్లిన,
వీరాగ్రేసరుఁడు ముక్తివిభవము గాంచుఁ.
కాశీ. ౩. ౭౦.

సీ. త్రెళ్లుట మడియుట తెగుట డీల్పడుట
నీల్గుట మొదలైదు టణఁగుట పొలియుట,
మిత్తి పెన్నిదుర నామీ అను మరణము
...ఆం. భా. ౨. ౨౨౫.

క. బహురక్షోభయసేనలు, విహితాజిని ద్రెళ్ల
నంత విలసిల్లె జగ, న్మహితాహవరుచిరక్షి,
ప్రహస్తకోదండగురుతరస్ఫూర్తి గడుఁ.
రాఘవ. ౪. ౧౪౧.

జః త్రెళ్లించు.

**త్రెవ్వ.** క్రి. విశ. ద్రు. పూర్ణముగా.

గీ. చొచ్చి చనఁ బట్టుటకు నొక్కమచ్చెకంటి,
మ్రొలఁ బఱచిన బేలదర్దురము దాఁటెఁ,
దొంటిపుట్టునఁ దనయంటుసంటువారి,మీఁది
మమకారనది ద్రెవ్వ నీఁదుకరణి. పాండు.
౫. ౩౦౫.

గడిద్రెవ్వి=మేఱమీఱి, అమితముగా, మిక్కిలి.

ఉ. చేసినవారు మీరు గడుజెట్టితనం బది యో
ర్వలేక దుర్వాసుఁడు వాసుదేవుఁ గని వై
రము ఘోరము చేసినాఁడు సన్న్యాసులఁ
గూడికొంచుఁ జని యంతకుము న్గడిద్రెవ్వి
మీఱెడుఁ, గాసిలి యుండు యాదవనికా
యము సైఁపదు రాజసూయముఁ.ఉ. హరి.
౪. ౧౨౮.

**త్రెవ్వన.** వి. చక్కన, సౌందర్యము. (శ.ర,చి.ని)

**త్రెవ్వ=త్రెగ్గు, త్రెగు.** అ.క్రి. ౧. తెగు, ఖండిత
మగు, తునియు.(దీని తుమున్నంతరూపము-క్రి.
విశ. వలె "నిశ్శేషముగా, పూర్ణముగా" అను
నర్థ మిచ్చును. చూ. త్రెవ్వ.)

క. ఇవి దుస్ససేనువ్రేళ్లం, దవిలి సగము ద్రెవ్వి
పోయి తక్కినయవి కౌరవులకడఁ దీఱుమా
టల,యవసరమునఁ దలఁపవలయు నచ్యుత వీ
నిఁ. భార. ఉద్యో. ౩. ౧౧౬.

సీ. విలు ద్రెవ్వ రథహయంబులు నొవ్వ సార
థి దలరఁ బ్రస్ఫుటశక్తి కలనఁ జూపి. హరి.
ఉ. ౨. ౫౧.

ద్వి. అవ్విథిఁ జనఁ జనఁ ద్రివ్వఁగఁ ద్రాడు, త్రె
వ్వుడు గొఱియ యద్దేవాలయంబు, పరతెం
చి చొచ్చుడు...బస. పు. ౫. ౨౫. పం.

గీ. చావు మని యొక్క పెట్టునఁ జక్రధార, ద
ళితలఁ ద్రెవ్వ వ్రేసె ఫాలాక్షసుతుఁడు.
కాశీ. ౭. ౬౪.

౨. విచ్ఛిన్నమగు, విడిపోవు.

ద్వి. ఎవ్వండు వీరమాహేశ్వరసమితిఁ, ద్రెవ్వ
కుండంగఁ బ్రతిష్ఠింప నోపు. పండితా. మ
హిమ. ౩౦౪ పా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౩. అంతమగు, నశించు.

ఉ. త్రెవ్వనిమాయలో మునిఁగి తేలెడువారలము
గామె యీశ్వరా. కవిక. ౬. ౧౭౨.

చ. పశుపతి మమ్ముఁ బోలిన ప్రపన్నులపైఁ గృప
చాలి యున్కి తా, దృశులకు నైజ మాట
వసుదేవతనూభవదత్తమంత్రముల్, విశదము
గాఁగ నా కొసఁగవే నిను వేఁడెద దానఁ
జేసి దుఃఖశరధి ద్రెవ్వ నీదయ నఖండసుఖ
స్ఫురణంబు నొందెదన్. పాండు. ౫. ౧౧౨.
(ఇట 'ఇంకు' అని భావము.)

త్రేఁచు=త్రేనుచు. అ. క్రి. ఉద్గారించు, తృప్తిగాఁ దిని కంఠమునుండి చప్పుడుతో వాయువును విడుచు, త్రేఁపువిడుచు.

ఆ. ఇల్వలుండు ననుజు నెప్పటి క్రియఁ బిల్వ, నె
ఱింగి దాని నమ్మునీశ్వరుండు, గడుపుఁ దడవి
కొనుచుఁ గ్రక్కునఁ ద్రేఁచిన, నసుర జీర్ణ మ
య్యె నాక్షణంబ. భార. అర. ౨. ౩౮౨.

శా... భోగినీరాజి ర్యాజిల్లెన్ హల్లకముల్ చ
కోరములు ద్రేఁచెన్ బిల్లలుం బిల్లగో, ర్పె
ల్లో యంచు బయల్లనుం జిడుగుడుల్ ప్రేరేఁ
చి రవ్వేళలన్. రా. వి. ౩. ౧౮. భా. రా.
అర. ౧. ౪౬.

జః త్రేఁపు.

త్రేఁపు. వి. (√త్రేఁచు) ఉద్గారము, త్రేన్చుట.

గీ. భుక్తి గొన్నట్టివారి త్రేఁపులు పొసంగె. కువల.
౨. ౧౦౪.

త్రేగు(వు)డు=తేగుడు.

(చొంగ, లాల)

చ. వడఁకుచు రోమకోటి నిలువంబడ మేనులు
దూలఁ గన్నులం, దుడుగక బాష్పముల్
వడియుచుండఁ దలల్ దిగవైచి నోరఁ
ద్రేగుడు దొరఁగంగ నెంతయును గ్రుస్సి
...హరి. పూ. ౬. ౪౩.

గీ. ఏవముగ లోమ్ముపై నిండఁ ద్రేవు డొలుక.
దశకు. ౬. ౧౫౯.

సీ... తెఱనోరఁ ద్రేవుకు తీఁగసాఁగ. కాశీ. ౬.
౪౧.

త్రేటగట్లు. వి. బ. కుమ్మరవాఁడు కుండలపై చెక్కు అలంకారవిశేషము.

గీ. తీర్రిపూదెలు కులుకులు త్రేటగట్లు, గరలమురు
వులు ... మొదలుగాఁగఁ, బనులు నిర్మించుఁ
గుండలపై నతండు. హంస. ౫. ౧౩. (తేట
గొట్లు-క్రొత్త ప్రతిపా.)

త్రేణి. విణ. సుందరము, చక్కనిది.

సీ. జడలుగట్టియు నింత సక్కనైనది వేణి దీర్చిన
నెఱు లెంతద్రేణి యగునో. కు. సం. ౪.
౭౩౭.

త్రేత. సం. వి. ఆ. స్త్రీ. ౧. గార్హపత్యము దక్షిణాగ్ని ఆహవనీయము అనుమూఁడగ్నులు. ౨. చతుర్యుగములలో రెండవయుగము. ౩. జూదమున పాచికలమూఁడు చుక్కలు గలభాగము పైకి ఉండునటులు పడుట; జూదమున మూఁడు గవ్వల వెలికిపాటు.

త్రేనుచు(న్చు)=త్రేఁచు.

ద్వి. త్రేన్పక పోదు నే దేవ యే ననుచుఁ, ద్రేన్పఁ
గనైనను దెలిపి లే దనుచు. బస. పు. ౪.
౬౭౩ పం.

సీ. గ్రహణవేళలయందు రాహు వాహారించి
తృప్తిమై గ్రక్కునఁ ద్రేన్చె నేని. నైష. ౨.
౧౨౩. (చి. ని. పా.)

జః త్రేనుపు.

త్రేనుపు(న్పు)=త్రేఁపు. (√త్రేనుచు.- శ. ర. బ్రా.)

## త్రై

త్రైకాలికము. సం. విణ. (అ. ఈ. అ) త్రికాలములందు ఉండునది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రైగుణికము. సం. విణ. (అ. ఈ. అ) ౧. త్రిగుణములవలన కలిగినది. ౨. త్రిగుణములయం దుండునది.

త్రైగుణికుఁడు. సం. వి. అ. పుం. ఇచ్చినసొమ్మునకు మూఁడురెట్లు అధికముగా పుచ్చుకొనుటకై అప్పిచ్చెడివాఁడు.

త్రైగుణ్యము. సం. వి. అ. న. ౧. మూఁడు గుణములు కలిగియుండుట. ౨. త్రిగుణధర్మము, త్రిగుణత్వము. ౩. మూఁడింతలు, ముమ్మడుఁగుగా నుండుట. ౪. సత్త్వరజస్తమోగుణములు. ౫. శైత్యసౌగంధ్యమాంద్యములు.

త్రైధాతుకము. సం. విణ. (అ. ఈ. అ) స్వర్ణరజతతామ్రము లనెడిధాతుత్రయముచే చేయఁబడినది. (అలంకారాది.)

త్రైపూ (పు) రుషము. సం. విణ. (అ.ఈ.అ) ముగ్గురుపురుషులవఱకు ఉండునది.

శ్లో. మా భూ త్త్రైపూరుషీ విద్యా, మాభూ త్త్రైపూరుషం ధనం, మా భూ త్త్రైపూరుషీ భక్తిః కాశ్యాం నివసతాం సదా. సం. భీమ. ౨. ౧౦౭.

త్రైమాతురుఁడు. సం. వి. అ. పుం. కౌసల్యాకైకేయీసుమిత్రలకు కొడుకు, లక్ష్మణుఁడు. భట్టి. ౧. ౨౫.

త్రైరాశికము. సం. వి. అ. న. (గణిత) ప్రమాణరాశి ఫలరాశి ఇచ్ఛారాశి అనుమూఁడురాసులను ఆధారముగా చేసికొని లెక్కించుగణితవిధానము. (ఎనిమిదిమామిడిపండ్ల వెల ఒకరూపాయ ఐనచో ౨౦ పండ్లు ఎంతకు వచ్చును? మొద లగుప్రశ్నలు వేయఁగా ఉత్తరములు తెలియుటకు గణితము చేయువిధానము.)

త్రైలోక్యము. సం. వి. అ. న. త్రిలోకముల సమాహారము.

త్రైలోక్యవిజయ. సం. వి. ఆ. స్త్రీ. గంజాయి[?]. (వాచ)

త్రైవర్ణికము. సం. విణ. (అ. ఈ. అ) త్రివర్ణములకు విహితమైనది. (ధర్మాది)

త్రైవర్ణికుఁడు. సం. వి. అ. పుం. మొదటిమూఁడువర్ణములలోనివాఁడు.

త్రైవిక్రమము. సం. విణ. (అ. ఈ. అ) త్రివిక్రమసంబంధమైనది.

త్రైవిద్యుఁడు. సం. వి. అ. పుం. మూఁడువేదములు తెలిసినవాఁడు. (వాచ.)

త్రైవిధ్యము సం. వి. అ. న. మూఁడువిధములు కలిగియుండుట, మూఁడు తెఱఁగులుగా నుండుట.

త్రైవిష్టపము. సం. విణ. (అ. ఈ. అ) త్రివిష్టపసంబంధమైనది, స్వర్గసంబంధమైనది.

త్రైవిష్టపుఁడు. సం. వి. అ. పుం. వేల్పు, దేవత.

త్రైశంకవుఁడు. సం. వి. అ. పుం. త్రిశంకుపుత్త్రుఁడు, హరిశ్చంద్రుఁడు.

## త్రొ

త్రొండి. విణ. లోఁతైనది.

సీ... నొక్కుఁబ్రక్కలు బొక్కిరొమ్ములు కఱకుఁద్రొండి, కడుపులు... కు. సం. ౬. ౬౯౪.

త్రొక్కట= తొక్కట (√త్రొక్కు)

౧. తొట్రుపాటు.

క. అటు లున్న నాతఁ డచ్చెలి, దిటముగఁ దను నమ్మకుంటఁ దెలిసి వడిన్ ద్రొక్కట లేక చెట్టు డిగి ముం, దట నిల్చి కడంక నెఱిగి తగ నిట్లనియెన్. అచ్చ. రా. సుం. ౩౧.

౨. ఆపద.

క. త్రొక్కటఁ జని యక్కట యని, మ్రొక్కుటఁ గని తపసినిసుఁగుఁ బ్రోచుతలఁపునన్, మిక్కుట మై యక్కటికము, పిక్కటిలన్

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వెఱపు మానిపినయొక్కటికిఁ. అచ్చ. రా. పీఠి. ౧. ౨౪.

త్రొక్కటపడు=తొక్కటపడు.

త్రొక్కటపాటు=తొక్కటపాటు.

త్రొక్కటము=తొక్కటము.

(ఒత్తుడు, సమ్మర్దము.)

చ...ఉ, త్కటమలమూత్రలిప్త మగు కాయము త్రిప్పఁగఁ జోటు లేనిత్రొక్కటమున మేను గుంచుకొని గర్భము వెల్వడరామిఁ బ్రాణి వేసటఁ బడు... శేష. ౩. (చి.ని.)

త్రొక్కటలాడు=తొక్కటపడు. (√త్రొక్కట)

ద్వి. ఎక్కడ నున్నవాఁ డేఁడి యేఁ డనుచుఁ, ద్రొక్కటలాడుచుఁ ద్రోయంగ రాక, కప్పి యుండిన ప్రజఁ గడకుఁ బోఁ దోలి, తప్పక రత్నాంగి తనయునిఁ జూచి. ద్వి. శ. సా. ౨. ౭౨ పా. ౫ పం.

త్రొక్కడ=త్రొక్కట. (√త్రొక్కు - చూ. త్రొక్కడపడు.)

త్రొక్కడపడు=త్రొక్కటపడు. అ. క్రి. (√త్రొక్కు)తొట్రుపాటునొందు; కష్టపడు.

చ. అడుగకమున్న నీకు నిఖిలావని తండ్రి యొసంగి యుండఁ ద్రొక్కడపడ నేటి కుర్వరకుఁగా దొర కాశ్రమవర్ణరక్షలం, బడయు పదంబు లెంతటితపంబున లేవు... చం. రా. ౪. ౪౨.

సీ. ఒక్కచోఁ దరొక్కత్తిఁ ద్రొక్కడపడు దీవు తెచ్చుకో నెమరున కిచ్చ వత్స. బహు. ౧. ౧౧౦. (చి. ని. పా.)

త్రొక్కిళ్లు. వి. బ. (√త్రొక్కు) బాలికాక్రీడావిశేషము.

సీ. పింపిళ్లు త్రొక్కిళ్లు బేడిసతిరుగుళ్లు నచ్చనగండ్లు... హంస. ౫. ౧౫౫.

త్రొక్కు. అ. క్రి. ౧. నడచు; ప్రవర్తించు.

గీ. మెదడు ముద్దలు గావించి మెసవి మెసవి, కుతిక మోయఁగ నెత్తురుల్ గ్రోలి కడుపు, నిమిరికొంచు నగ స్త్యమంత్రములు నొడివి, శతపదంబులు ద్రొక్కుఁ బిశాచగణము. దశా. ౨. ౪౩౫.

చ... అలవుం జలముఁ వెలయించుచోట ధర్మువున కొంకింతయుం దొలఁగఁ ద్రొక్కమి యెంతయు మేలు... భార. శాం. ౧. ౪.

౨. అడుగు పెట్టు.

సీ. త్రొక్కు లేంట్లకుఁ గాక లెక్కింపఁ జెరివిన గంధఫలీపంక్తిఁ గబరు లలర. ఆము. ౫. ౧౪౭.

స. క్రి. ౧. మెట్టు.

సీ. ఆళ నానాదివ్యదేశముల్ ద్రొక్కనీ మగనాలి సరిపోల్పఁ దగదు విధవ. కాశీ. ౨. ౮౩.

సీ. ఎరువు తిప్పలఁగొని యెల్లమందలు గొను జెక్కి మేపులచోటు ద్రొక్కఁబడియె. హరి. పూ. ౬. ౫.

౨. (అణఁగునట్లు కాలితో) నదుము; అణఁచు.

క. రక్కసిమగువలయాలువు, మొక్కపటిచె దీవ పాపములగమి కాలం, ద్రొక్కెదవు నీవ యింకిట, నిక్కముగా నిన్నుఁ బొగడ నేర్తునె కృష్ణా. పారి. ౧. ౫౦.

వ... నడుము త్రొక్కిన మహానాగంబులాగున... వరాహ. ౩. ౫౨.

రగడ. త్రొక్కినారు పదేసిమణుఁగులు తొలుత నీకుంకుమపుగోనెలు. శుక. ౧. ౧౩౩.

౩. ప్రసరించు, వ్యాపించు.

క... ధనువుం దూణీరయుగముఁ దాల్చి కటుజ్యానినదమున దెసలు వస మఱఁగనుగడ లెల్లెడలఁ ద్రొక్కఁగా నునఁ గెంపుల్. కకు. ౪. ౧౦౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర. (నీరు మొ.పోసి) దంచు; (మట్టినీరు,మొ. పోసి కాళ్లతో) మట్టు.

చ... కాఁపుఁగూఁతులు తెలియావనాళములు ద్రొక్కఁగ...హంస. ౧. ౧౯౫.

సీ. పెంపు మీఱినమగబీఁటాను గంపెఁడు సెను పమజ్జిఁ బోసి యెనయఁ ద్రొక్కి. (చి. కి- చి. ని.)

(వ్యవ) ఆమె వరగలు కాలితో త్రొక్కుచున్నది.

వి. ౧. త్రొక్కుట, (కాలితో) నడుముట.

సీ...చిలుకలత్రొక్కున డుల్లుకారాకులు విరియువేనలులఁ దగిలి. గీ. పుష్పమాలావిభూతి గా...కు. సం. ౯. ౩౭౧.

ద్వి. పరుసలత్రొక్కునఁ బడఁజాల కీవు, సిరిగిరి నుండక మరిఁగి వచ్చితివొ. బస. పు. ౩. ౭౪౬ పం.

సీ. తోరంపుగొరిజలత్రొక్కున నొడలెల్ల నలిగులి యై సర్పనాథుఁ డొదుఁగ. హరి.పూ. ౪. ౧౬.

౨. త్రొక్కటము, ఒత్తుడు.

సీ. దుఃఖపరంపరఁ ద్రొక్కునఁ బెట్టె నా చిత్తంబు ననిమిష సింధుతనయు,పడుటయు ద్రోణుండు పరలోకమున కేఁగుటయు...భార. కర్ణ. ౧. ౩౧.

క. వెల్లి యగువగలత్రొక్కున, నిల్లిగులు గాన వచ్చుహృదయములోనన్, మల్లామడి యగు మదనుఁడు, మెల్లన కూర్చుండెఁ దాల్మి నుమినుకనఁగన్. ఉ. హరి. ౫. ౧౬౬.

వ. ఇట్లు తీవ్రంబు లగుకోర్కులత్రొక్కునం జిక్కువడి యక్కన్య ...కవిక. ౩. ౭౧.

జః తొడత్రొక్కు, తొఱుద్రొక్కు, త్రొక్కట, త్రొక్కటపడు, త్రొక్కటపాటు, త్రొక్కటము, త్రొక్కటలాడు, త్రొక్కడ, త్రొక్కడపడు, త్రొక్కిడు, త్రొక్కుడు, త్రొక్కుడుఁగమ్మి, త్రొక్కుడుపట్టె, త్రొక్కుడుపలక, త్రొక్కుడుబిల్ల, త్రొక్కుడుబొమ్మ, త్రొక్కుడువడు, త్రొక్కులాడు, త్రొక్కువడు.

**త్రొక్కుడు.** వి. (√త్రొక్కు) ౧. త్రొక్కుట, మట్టుట.

సీ. వీని త్రొక్కుడు గారవించుప్రాగ్గిరికి సహింపఁ జాలుట భారమే దవాగ్ని.వరాహ.౪.౭౩.

౨. ఒత్తుడు, సంఘట్టన.

వ...చిక్కులచెయ్వులఁ ద్రొక్కుడు వడి... పారి. ౨. ౫౨.

౩. సమ్మర్దము.

సీ. కుముదినీవిభున కెక్కుడుచుక్కత్రొక్కుడు నిలకు నొండొక్క రేయెండపిండు. రామా. ౧. ౪౭. (ఎక్కుడుచుక్కత్రొక్కుడు=మఱియొకనక్షత్రసమ్మర్దము)

౪. పశుమృగములరతము.

గీ...పశుమృగరతము చె న్నలరఁ ద్రొక్కుడనఁగ...ఆం. భా. ౨. ౧౭౭.

౫. పక్షిరతము. (శ. ర.)

విణ. త్రొక్కఁబడునది. (పలక, మొ.)

చూ. త్రొక్కుడుఁగమ్మి, మొ.

**త్రొక్కుడుఁగమ్మి.** వి. (త్రొక్కుడు+కమ్మి) కడప క్రిందిపలక, శిల. (శ. ర)

**త్రొక్కుడుపట్టె.** వి. (√త్రొక్కుడు.) త్రొక్కుడుఁగమ్మి.

(బ.) సాలెవాఁడు నేయునప్పుడు త్రొక్కెడు చెక్కలు. (శ. ర)

**త్రొక్కుడుపలక.** వి. (√త్రొక్కుడు) ౧. నూలు వడకువాఁడు కాలిక్రింద త్రొక్కిపెట్టెడి రాట్నపుపలక.

CC-0. JangamWadi Math Collection. Digitized by eGangotri

క. వడిదారము చెవులుం ద్రొక్కుడుపలకయు ...శుక. ౨. ౪౨౦.

సీ. నెత్తమ్మి రేకులనీ టెక్కు త్రొక్కుడుపలకఁ దాఁచినపదాంగుళులు గదల. ఉ. హరిశ్చ. ౪. ౨౪.

౨. తొల్లపనివానికాళ్లక్రిందిపలక. (శ. ర.)

త్రొక్కుడుబిల్ల. వి. (√త్రొక్కుడు) బాలక్రీడావిశేషము. (శ. ర, బ్రౌ)

త్రొక్కుడుబొమ్మ. వి. (√త్రొక్కుడు) నూలు వడకురాట్నపుందలిత్రొక్కుడుసాధనము.

క...త్రొక్కుడుబొమ్మయునుం ద్రిప్పుడు,పుడక యునుం గలుగురాట్నములు గైకొనుచున్. శుక. ౨. ౪౨౦.

త్రొక్కుడువ(ప)డు. అ. క్రి. (త్రొక్కుడు + పడు) ఒత్తువడు, రాపిడిచెందు.

వ...రాష్ట్రంబును ద్రొక్కుడువడి చెడిపోవు ...హరి. ఉ. ౧. ౨౦.

క. జనియించుమొదలు బాయని,తనుజీవము ల క్కటా వితావిత ప్రియవ, స్తునిరూఢలాభ లోభం,బునఁ ద్రొక్కుడుపడి విభక్తములు గాఁ దలఁచున్. చంద్రా. ౪. ౧౮౧.

త్రొక్కులాడు. అ. క్రి. (త్రొక్కులు + ఆడు)

౧. పెనఁగొను.

క...అ, బ్బిబ్బోకవతి మనంబున, సబ్బురమును భయముఁ ద్రొక్కులాడఁగ నుండెన్. శుక. ౨. ౨౫౩.

౨. తొట్రువడు, కలవరపడు.

గీ...మీరలు చేసినకర్మఫలము, లనుభవింపుఁడు మఱి త్రొక్కులాడ నేల. శివధ. ౪. ౨౪.

త్రొక్కువడు. అ. క్రి. (త్రొక్కు + పడు) త్రొక్కుడువడు, కాలియదుముదునొందు.

వ...అప్పశువులచేతం ద్రొక్కువడియును నేటు వడియును ద్రొక్కువడియును జిక్కువడి యును...హరి. పూ. ౬. ౧౭౯.

మ. అలివేణీమణి ... జిలుఁగుంగుచ్చెల జారి త్రొక్కువడ డాచేఁ జెక్కుచో... దశా. ౨. ౩౪౯.

## త్రో

త్రోచిపుచ్చు. అ. క్రి. (త్రోచి + పుచ్చు. స్వార్థమున) నిరాకరించు; ఉపేక్షించు.

గీ. బలిమి ము న్నేల తెచ్చి తిప్పడఁతి మగుడఁ, ద్రోచిపుచ్చంగఁ దగునయ్య...భార. ఉద్యో. ౪. ౩౦౨.

క. పలుకకయె త్రోచిపుచ్చినఁ, బిలిచి పిలిచి నోరు నొచ్చి పెల్కురఁ గని వాఁ, డెలమి చెడి పోయె నంతట, నెలకొనియె విరక్తి నాకు నెమ్మదిలోనన్. జాహ్నవీ. ౪. ౪౨.

త్రోచు=త్రోయు. స. క్రి. ౧. గెంటు, నెట్టు.

క...మిన్ను నేలయు నిమ్మై, గాక తిరుగంగఁ బడినం, బో కే ముంజేతు లాడ్డి పోవఁగఁ ద్రోతున్. భార. ఉద్యో. ౩. ౬౦.

ద్వి. తన్ను యంతటఁ బోక తలఁ బట్టి యీడ్చి, నన్ను నుదతిఁ ద్రోచె నగరంబు వెడల. ద్వి. హరిశ్చ. పూ. ౮౫౬ పం.

సీ. మదహస్తి నయినను నెదిరి కొమ్ములు వట్టి చదికిలఁబడఁ ద్రోచుసత్త్వములును. విక్ర. ౧. ౭౭.

౨. పడవేయు.

ఆ. ఎట్టు నూచి చూచి యిది పాప మనక య, య్యసురవాతఁ ద్రోతు నదయవృత్తి. భార. ఆది. ౬. ౨౪౯.

ఉ...కృశానుకీలలన్, ద్రోవుఁడు వీని నంచుఁ గడు దుష్టమనస్కులఁ బంచెఁ బల్వురన్. నృసిం. ౪. ౨౦.

క. తను నిటుల నీటఁ ద్రోచినఁ, గని మానం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బనిరొ...దశా. ౧. ౧౩౨.
౩. నిరాకరించు, నిరసించు.
మ...నే, నినుఁ గామించితి నాదరింపు కలకంఠీ
కంఠి కామించినం, జనవుల్ చెల్లఁగనీక త్రో
చుటలు దోసం బండ్రు సుమ్మీ బుధుల్.
వరాహ. ౬. ౧౨౫.
క. ఇమ్మణిరత్నము కృష్ణుం, డిమ్మనినఁ బ్రియంబు
తోడ నీవలయును నీఁ, బొమ్మని త్రోచినఁ
గడువిరసమ్మగు బలవంతుతోడిచల మే
మిటికిన్. వి. పు. ౬. ౨౫౨. ఇందు. ౫.
౧౩౫.
౪. అతిక్రమించు, ఉల్లంఘించు.
గీ. దేవతారత్నగురుజనద్విజసమాజ, దూషకులు
ను మర్యాదలఁ ద్రోచి నడచు, వారు పరధన
మాశించుచోరకులు వి, లోహనరకాంతరము
నఁ గూలుదురున్నావె. వి. పు. ౩. ౧౧౭.
క. నామాటఁ ద్రోచి దానవ, భామను బొందితివి
ధరణిపాలక తగవే. భాగ. ౯. ౫౪౫.
మ. మును దుష్కర్మఫలంబు నొంది పిదపం
బుణ్యానుబంధంబులై, చనుసౌఖ్యంబులఁ
బొందుపద్మజునియాజ్ఞం ద్రోవఁగా వచ్చునే.
భాగ. ౧౦. ఉ. ౪౮౫.
౫. విడుచు, త్యజించు.
సీ. విను మధర్మం బహింసనమున నెడలు
ధర్మంబు సంకల్పవర్జనముచేత, నవ్యాప్తిఁ
బొందు సత్యాసత్యములు బుద్ధిఁ గొని త్రోవ
నగు నని మునివరుండు. భార. శాం. ౬.
౩౨౦.
ద్వి. నీచభామల నొల్ల నీరాజ్య మొల్లఁ, ద్రోచి
పోని మ్మింకఁ దుకతుక మాని. ద్వి. హరిశ్చ.
పూ. ౧౬౩౯ పం.
౬. దాఁటు, మీఱు, కడచిపోవు.
గీ. ఆచమూరువు యూథంబుఁ ద్రోచి పఱచె.
పాండు. ౫. ౧౫

సీ. కరదీపికలతోడఁ బురి రాజవీథుల వర్తించు
తలవరివారిఁ ద్రోచి. వి. పు. ౮. ౬౫.
౮. వెడలఁగొట్టు.
చ. కడుసుఖులైనవారలను గట్టెఁడి నై వెసఁ
గట్టి త్రోచితిన్. వి. పు. ౫. ౧౬౩.
మ. దశకంఠుం డనుఁ దాత నీనుడి యథార్థం
బైనచో నెంతబా, లిశుఁడైనన్ నయ మేది
యగ్రజుని బల్మిన్ ద్రోచి దుర్వృత్తిఁ ద, ద్వ
శ మౌని ల్లెటు లాక్రమించు...ఉ. రా.
౨. ౨౨౫.
౭. తీసివైచు, తొలఁగించు.
ఉ...ముసుంగుఁ ద్రోచి యు, క్కాంత గృహంబు
నల్గడలు నారసి...పారి. ౧. ౧౧౦.
ఉ...ఎడసాచ్చినవిఘ్నవిశేషముల్ ధృతిం,
ద్రోచుచు భక్తియుక్తి గురుండు ప్రమోద
మయుండు గాఁగఁ ద, ద్గోచరతం జరింపఁగ
నకుంఠితమోక్షసుఖంబు సొప్పడున్. భార.
అను. ౫. ౨౨౫.
౯. జరపు, కడపు, వెళ్లించు.
దండకము...చెయ్వు లేమైన నీ కప్పనం బంచుఁ
బూఁటలు వ్వడిం ద్రోచు నాబల్లిదుల్ నీకు విందు
ల్గదా...నీలా. ౨. ౪౨.
౧౦. చంపు, నశింపఁజేయు; పోఁగొట్టు.
సీ. సాధుసమ్మతముగా సామజంబు నితండు గా
చినాఁ డితండు ద్రోచినాఁడు. ఉ. హరి.
౨. ౧౭౦.
సీ. అతిపావనుఁడ పౌట కలయహల్యాదోషరాశిఁ
ద్రోచినపాదరజమె సాక్షి. ఉ. రా. ౧.
౧౫౧.
౧౧. ఊఁచు, నొక్కు.
ఉ...సహాయులై, యార్యులు ద్రోచి చెప్ప
నుభయప్రతిపన్నము లైనఁ గాక...నిర్వ.
౪. ౬౬.
౧౨. ఇది 'కొట్టు, చేయు' మున్నగుధాతువుల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వలె కొన్ని క్రియలకు మున్నంతరూపములతోఁ
గూడి ఆయా క్రియల ప్రేరణార్థము నిచ్చును.
క...ఏఁ, బోరెద నోపిన మెయిఁ దెగి,పోరఁగ
జయమైన దానిఁ బోద్రోచెదమే. భార.
భీష్మ. ౩. ౭౧.
సీ...కార్యంబునఁ బుడమిజనులఁ, బీడించి ధ
ర్మంబుఁ జెడవాయఁగాఁ ద్రోచి వేదవిరుద్ధ
దుర్వృత్తి వరగి. హరి. పూ. ౧. ౯౭.
చ. అచిరము లైన యన్యదుచు లన్నియు నావలఁ
బోవఁద్రోచి వా,జ్ఞ్నిచయమనోహరం బయిన
నేర్పు త్రికాలముఁ బ్రస్తుతింపఁగా. విక్ర.
౧. ౯.
అ. క్రి. ౧. ఉబుకు, ఉద్గతమగు.
క. ఈచందంబునఁ దెఱపులు, వేచియుఁ బైఁ
బూఁచి లాఁచి ప్రేసియుఁ బైపైఁ, ద్రోచు
రుధిరమునఁ దడిసిరి, పూచినమోదువుల
తోడఁబుట్టువు లనఁగన్. ఉ. హరి. ౩.
౬౩.
౨. ముసురు, కవియు, క్రమ్ము.
ఉ.ఈచలిమందు లేమిటికి నీవల నావలఁ దావలం
బులై, ద్రోచి మొగంబుపైఁ దిరుగుచు న్మెద
లూరదుఁగాక యింతటన్. కావ్యా. ౨.
౪౯.
ఉ...అకంపనుండు...నూతునితోడ నిట్లుగుం,
ద్రోచిరి వీఁక వానరులు దూలిరి రక్కసులిం
క నీవు వే,వే చననిమ్ము తేరు శరవృష్టిని ముం
చెద శత్రుసేనలన్. భా. రా. యు. ౬౫౪.
౩. అతిశయించు, ప్రబలమగు, మించు.
ఉ. త్రోచినశోకవేదనలతోడఁ గుమారక నీము
ఖాబ్జమున్, జూచినయప్పు డెల్ల మది చుఱ్ఱు
నఁ దీరనిలజ్జ వెంపునన్. జై. భా. ౧. ౭౯.
౪. నడచు. (శ. ర.)
క. ఆచీకటి నొక్కండును, ద్రోచి చనఁగరామి
కనతిదూరంబున వా, గ్గోచరము గానియు
న్నతి, నేచినవటవిటపినీడ నెలమి వసించెన్.
విక్ర. ౫. ౧౯౬.
చ...ద్విజుండు సత్కరుణ మాని మది న్వడిఁ
ద్రోచి యేఁగె...హ. న. ౫. ౨౫.
చక్కఁద్రోచు=సరిచేయు, సవరించు.
క. వలువాత లేచి నీదగు,కొఱగాములు చక్కఁ
ద్రోచికొనఁ బోయె దినం,బు...హరి. పూ.
౫. ౨౩౯.
పాయఁద్రోచు=ఊడఁదీయు, తొలఁగించు.
గీ. శిశిరభూమిధరోద్దామశిఖరమణులఁ, గదిసి
తారాగణంబులు గలసియున్న,మణిగణా
న్వేషణులు కీడుమణులు సావి, పాయఁద్రో
తు రందవి గనుపట్టుకున్న. కు. సం. ౩.
౨౧.
ఉ. పంకజపాణిశంఖపరిభావకకంధరఁ దల్లి యే
లోకో,సంకులు గట్టె నంచుఁ గులశైలసుతా
గ్రణి పాయఁద్రోచి ర,త్నాంకితహార ముంప
...వసు. ౩. ౩౧.
జః త్రోచిపుచ్చు, త్రోద్రోపు, త్రోద్రోపు
లాడు, త్రోపడు, త్రోపనంగొఱవి, త్రోపరి,
త్రోపాటు, త్రోపాడు, త్రోపించు,త్రోపు.
త్రోపుగుదియ, త్రోపుడు, త్రోపుడువెట్టు;
త్రోపుడువల,త్రోపుత్రోపాడు,త్రోపులాడు,
త్రోపువడు, త్రోపుసేయు, త్రోవ, త్రోవ
పెట్టు, త్రోవరి.

త్రోటకము. సం. విణ. (అ. టీకా. అ) భేదకము,
త్రుంచునది. వి. అ. న. ౧ (నాటక) గర్భసంధ్యంగ
ములలో నొకటి, కోపముతోఁ గూడినవాక్యము.
౨. దృశ్యకావ్యభేదము, రూపకములలో నొకటి.
(అయిదుగాని, ఏడుగాని, ఎనిమిదిగాని, తొమ్మి
దిగాని యంకములు గలిగి దివ్యమనుష్యనాయ
కులతోఁ గూడి ప్రత్యంకమును విదూషకప్రవే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శము గలరూపక భేదము. విక్రమోర్వశీయము, స్తంభితరంభము, మొ.) పుం. విషము గలయొక పురుగు. (విల్యమ్సు)

త్రోటనము. సం. వి. అ. న. త్రుంచుట.

త్రోటి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. చంచువు, పక్షిముక్కు. ౨. ఒకజాతిచేప. ౩. కట్ఫలము, పిన్నగుమ్ముడు, కేఁకసి. ౪. ఒకజాతిపక్షి. (మే. ని, హేమ. ని.)

త్రోతలుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) స్ఖలద్వాక్యుఁడు, మాట తడఁబడువాఁడు, నత్తివాఁడు.

త్రోత్రము. సం=తోత్రము.

త్రోద్రోపు. వి. (త్రోపు+త్రోపు) మిక్కుటమైన త్రోపు; సమర్దము, రారాపు.

సీ. కడఁగి త్రోద్రోపుల నడచుబల్లారలకు శశి కాంతపద మిమ్ము చాలదయ్యె. లక్ష్మీ. ౫. ౯౭. ('తోద్రోపు'—ముద్రి.)

త్రోద్రోపులాడు=త్రోపుత్రోపాడు. స. క్రి. (త్రోద్రోపులు+ఆడు) మిక్కిలి త్రోయు.

గీ. సిగ్గు వెనుకకుఁ దిగియంగ నగ్గలంపు, రాగ రజ్జువు ముంగల సాఁగఁ దివియ, నందులకుఁ దోడు త్రోద్రోపులాడఁ జెలులు, నడుమఁ బిరు వీఁకు లయ్యె నప్పడఁతి కపుడు. రామా. ౪. ౧౨౪. ('తన్ను' అనుకర్షపదము అధ్యాహార్యము)

అ. క్రి. స. క్రి. ౧. పెనఁగులాడు, ఒండొంటితో రాచికొను.

సీ. జిగి ధగద్ధగ యనుబిగువుఁజన్నులమీఁదఁ గ్రొమ్మించుసరులు త్రోద్రోపులాడ. విక్ర. ౭. ౧౦౧.

సీ. త్రోద్రోపులాడుచుఁ దొడరుసందడిలోన నిక్కి కృష్ణునికాలు ద్రొక్కువారు. పద్మ. ౯. ౨౧౩. (తోపుద్రోపులాడుచు. చి. ని. పా.)

గీ. క్రముకొని యొక్కచో నంబికాసమర్చ, నాషమద్భూతమైరేయవాసనలును, లంకెఁ ద్రోద్రోపులాడంగ లక్ష్మిదేవి, పండు గేలెంచెఁ గన్నులపండు వగుచు. వైజ. ౩. ౭౦. (తోదోపులాడ. ముద్రి.)

౨. అతిశయించు. (ప్రా.)

ద్వి. గమకించుముత్యాలగద్దెపై నుండి, దుమికి తత్తఱపాటు త్రోద్రోపులాడఁ, జనుదెంచి నిలుచున్న సారంగధరుని, వనిత తప్పక చూచి వర్ణింపఁ దొడఁగె. ద్వి. శ. సా. ౧. ౨౨ పొ. ౭. పం.

త్రోపడు=త్రోపువడు. అ. క్రి. (త్రోపు+పడు.) త్రోయఁబడు, గెంటఁబడు; తొలఁగింపఁబడు.

చ...వారిజంకెనల కచ్చటఁ ద్రోపడి వచ్చితి... ఉ. హరి. ౪. ౧౭౯. (జంకెనలన్=జంకెనలచేత.)

సీ. త్రోపడి యిరులు పటాపంచ లై పాఱె... మనుచ. ౩. ౨౩.

త్రోపనంగొఱువి. విణ. (త్రోపు) ఉభయభ్రష్టుఁడు; ఉభయభ్రష్టురాలు.

మ. వనితా నీపతితోడఁ గూడ వలతే వా శేల వీ శేల నీ, కని న న్నాయనిరుద్ధుఁ డున్నయెడ కెక్కైన న్వెలా శ్తేనిఁ బోయిన నాతండు కులాభిమానఘనుఁ డై యేయూరి క్షేత్రోవయం, చనుమానించినఁ ద్రోపనంగొఱువిఁ జేయం జూచితే క్రమ్మఱన్. ఉ. హరి. ౫. ౧౬౧. (చి. ని, శ. ర. పా. 'త్రోవనగొఱువి' ముద్రి. పా.)

త్రోపరి. విణ. (త్రోపు+అరి[3]) త్రోయువాఁడు.

సీ. మబ్బుత్రోపరికూన గొబ్బున వానిసింగాణి ముత్తునియలుగా నడంప. అచ్చ. రా. సుం. ౧౧౯.

సీ...త్రోయువాఁడు విలసిల్లుచుండుఁ ద్రోపరియనంగ. ఆం. భా. ౩. ౧౦.

త్రోపాటు. వి. (√త్రోపడు) త్రోపడుట. (శ.ర)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రోపాడు=త్రోపులాడు. స. క్రి. (త్రోపు+ఆడు) ౧. త్రోయు, గెంటు.

మ. మగుడం గీచకుఁ బట్టు వాఁడును బలోన్మాదంబునన్ బాహుగ,ర్వగరిష్ఠుం డగునా హిడింబరిపుఁ దీవ్రక్రోధుఁ డై పట్టి బెట్టుగఁ ద్రోపాడఁగ ...భార. విరా. ౨. ౩౪౩.

మ. ఘనసత్వంబున వ్వాలి వాలి కుహరాగారం బునం దున్నయ్యా,దనుజుం బట్టి వధించి తద్బిలమువాతన్ దాయి త్రోపాడి యే,పునఁ గిష్కింధకు వచ్చి ... భా. రా. కిష్కిం. ౧౨౭.

ఉ. వేడుక నీకె కాని మఱి వేఱొకయింతికి నైన లేదె త్రో,పాడెద వేల మచ్చర మొకప్పుడు మానకపోయి తీవు...పారి. ౩. ౧౫.

౨. వెన్నాడు, వెంబడించు.

క. మీపాడినహరి చందము, లేపాడిగఁ దలఁప వచ్చు నితఁ డేసతులం,గాపాడినవాఁ డనఁ గై, త్రోపాడినఁ దన్ను వలచి తొయ్యలు లారా. ఆము. ౫. ౪౦.

౩. రాచుకొను.

మ...ముత్యాలపేరులు వక్షోజతటిం బుటం బెగయఁగాఁ ద్రోపాడఁ జన్నుల్ కటి,స్థలిపై వేసలి మొగ్గవ్రాల...సారంగ. ౩. ౪౪.

అ. క్రి. పెనఁగులాడు, మల్లాడు.

మ...చూడ్కి యారఘువరాగారంబుపై వేడు కం, బఱచెం గ్రమ్మెడుసమ్మదాశ్రువులతోఁ బల్మాఱుఁ ద్రోపాడుచున్. నిర్వ. ౧౦. ౪౫.

క. లోపలికి నరుగ నులుకుచుఁ, బైపై మిథ్యా రహస్యభావలఁ గాల,క్షేపము సేయుచుఁ జెలితోఁ, ద్రోపాడుచు నుండె నబల తోరపులజ్జన్. విక్ర. ౪. ౨౧౭.

త్రోపించు. స. క్రి. (√త్రోచు). ౧. త్రోయించు, గెంటించు.

సీ. ఇంతిఁ దా విడువనియంతియ కాదు నన్ బెడతల వట్టి త్రోపించె వరుణుఁ,డు ... భార అను. ౫. ౩౪౫.

ద్వి. సీతాసమేతంబు శివునివి ల్లడుగ, దూతఁ బుత్తెంచినఁ ద్రోపించె వెడల. రం. రా. బాల. ౬౨ పా. ౧౧ పం.

వ. అని త్రోపించిన వారు త్రోపువడి...దశకు. ౪. ౨౯.

క. ద్వైపాయనముని వెడలం, ద్రోపించినకోపగాఁడు ధూర్జటి ...భీమ. ౪. ౧౩.

౨. (జలాదులలో) పడఁద్రోయించు.

క. ఆపవనజు నతిఘనలతి,కాపాశావలుల నంటఁ గట్టించి మహో,కోపమున గంగమడువునఁ, ద్రోపించె సుయోధనుండు దురితకరుండై. భార. ఆది. ౫. ౧౬౧.

త్రోపు. వి. (√త్రోచు. త. తుఱుప్పు.) ౧. త్రోయుట, గెంటుట.

(వరాహపోతములు) చ ... పండువెదు ళ్లవలీల మోరత్రో, పులఁ బడఁ జొప్పవంచుకొనుపోలిక వంచి తదగ్రధాన్యముల్...చప్పరించును... మనుచ. ౪. ౧౭.

క. ఆమాపు వలపుత్రోపున, భామాపుష్పాస్త్రి భూమిపతిఁ జేరుట కా,రామ యరుదేర... శుక. ౩. ౧౫౫.

౨. పడఁద్రోయుట, కూల్చుట.

సీ. పూతనాఘాతంబుఁ జేతనేతర మైనశకటం బు త్రోపును జరణనిహతి, వీఁకతోఁ గడుఁ బూచు మ్రాఁకుల విఱుపును...అనంగఁ, బఱ్మిన కృష్ణకీరమ్ములు వొగడుచు...భార. సభా. ౨. ౪౧.

౩. గెంటెడుశక్తి; శక్తి.

ఆ. యోగబలము లేనియొకభంగియోగి బల్, ద్రోపు లేనిమీను నేపు లేని,మృగము వలయు నురియుఁ దెగిపోవ నుఱుకంగ, లేనియట్లు భవములోన నడఁగు. భార. శాం. ౫. ౫౬౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౪. పోరు, యుద్ధము.

క. చెలిమియు సంభావనమును, బలిమి వివాహంబుఁ ద్రోపుఁ బాడియుఁ దమయం,తల వారితోన తగు సధి,కుల హీనులతోడ నైనఁ గొఱగా దధిపా. భార. ఉద్యో. ౨.౪౬.

౫. నిషేధము.

క. ఈమాటకుఁ జారుముఖీ, నామది ముద మందెఁ గాన నాతికి నిది యే,లా మేటితలం పను త్రో,పేమియు లే దోపి వినుము హిత వచనంబుల్. భార. అశ్వ. ౨. ౬.

౬. నిరాకరణము, త్యజనము.

క...దుర్జనుని నిలఁ, దడయక యెఱుక మెయిఁ ద్రోపు తగుమం దెందుల్. హరి. పూ. ౫. ౨౪౦.

**త్రోపుగుదియ.** వి. (త్రోపు+గుదియ) గుదిగఱ్ఱ.

క. పుడమి నీఁక లంజెతెల్లిల్, గడు మీఱినయట్టి కీడు గలదే యది యె,య్యెడఁ జూచినఁ గూఁతునకుల్, మెడకోణము త్రోపుగుదియ మిండల కెల్లల్. ద్వా. ౪. ౨౨౭. (వ్రాఁతప్రతి పా. దొడ్డగుదియ. ముద్రి.)

**త్రోపుడు.** వి.(√త్రోచే) ౧. త్రోపు, క్షేపణము. (శ.ర.) ౨. చిత్రిక, వడ్రంగిసాధనవిశేషము.

సీ. దారుని ర్మథనసాధనవిశేషము త్రోపు డనఁ దటిమెన యన నలరుచుండు. ఆం. భా. ౨. ౩౦౧.

**త్రోపుడుపెట్టు.** స. క్రి. (√త్రోపుడు) చిత్రికతోనునుపుచేయు. (శ. ర. బ్రా.)

**త్రోపుడువల.** వి. (√త్రోపుడు) జాలభేదము, ఒకవిధమైనవల.

క. మెడవల సన్నపువల త్రో,పుడువల...హంస. ౪. ౧౨౫.

**త్రోపుత్రోపాడు**=త్రోద్రోపులాడు. స. క్రి. (త్రోపు+త్రోపు+ఆడు.) ౧. (పరస్పరమును)మిక్కిలి త్రోయు, గెంటు; రాచుకొను.

వ. ప్రోడలగు నెచ్చెలులు జీరాడుసిగ్గుల నీడిగిలంబడ నెట్టకేలకుఁ ద్రోపుత్రోపాడుచుం దార్చి కూర్చి మరలుటయు...పారి. ౨. ౫౨.

సీ. భూపాలవర్గంబు త్రోపుత్రోపాడుచు గిరికొని రెండుపక్కియల నడవ. రాజ. చ. ౩. ౧౬౩.

వ...దుర్గాధిపతు లే మేము యని త్రోపుత్రోపాడుచు...మనుచ. ౫. ౮౧.

**త్రోపులాడు**=త్రోపాడు. స. క్రి. (త్రోపులు+ఆడు) గెంటుకొను, త్రోసికొను.

వ...తమఘాండసోకుల సేన మున్నాశ్రయించి నవాఁడ నింక నీ వడుగకు మనుచుం ద్రోపులాడంగ నెడ సొచ్చి...ద్వా. ౮. ౪౯. (వ్రాఁతప్రతి పా. త్రోపు త్రోపులాడంగ. ముద్రి.)

**త్రోపువడు**=త్రోపడు. అ. క్రి. (త్రోపు+పడు)

౧. త్రోయఁబడు, గెంటఁబడు; తొలఁగింపఁబడు.

గీ. తరుణిలజ్జాభరంబుచేఁ దన్నువడియుఁ, దోయజాననవెఱపుచేఁ ద్రోపువడియు, నుల్లమున భేద మందక యుండునట్టి,బాలుఁడా యేమి తలపోయఁ బంచశరుఁడు. నైష. ౭. ౧౭౦.

క. త్రోపువడి నిలిచి ఘనల,జ్జాపరవశ యగుచు...మనుచ. ౨. ౬౯.

చ...మహాత్మ యే,యనువునఁ దృష్ణ త్రోపువడునట్టిసమంచితచిత్తధర్మము, బనుపఱుపంగఁ జాలుకలభావనపంక్తి ననుగ్రహింపవే. భార. శాం. ౫. ౩౭౨.

౨. నిరసింపఁబడు, నిరాకృతమగు.

క...పలికిననప్పలుకు త్రోపువడ ముని పల్కెల్. భార. అను. ౨. ౨౭౦.

క. తనపూజ త్రోపువడుటకు, మనమునఁ గోపమును సిగ్గు మల్లడిగొనఁగా. హరి. పూ. ౭. ౧౫౬.

క. నలనాభాఖ్యతనూజుఁడ, నలఘుమతీ బ్రహ్మమిత్రు నాయుర్వేదం, బలవఱుపవలయు నా కని,పలుమఱు నే నడిగి త్రోపువడి వల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముమెయిన్. మార్క. ౫. ౪౧.

త్రోపుసే(చే)యు స. క్రి. (త్రోపు+చేయు) నిరాకరించు, నిరసించు.

క...ఎప్పురుసునం దగ నా,డిన నతఁడు ద్రోపు సేయక, ననుఁ గైకొను నెఱుఁగఁ జెప్ప నా కుం గరుణన్. భార. అశ్వ. ౧. ౪౩.

ఆ. మేలు గాక పొదఁడు మీమాట లేనాఁటఁ, ద్రోపుసేయఁజాల మీపురమున, కరుగు డెంతు ననిన నాఁగాక యని గంధ,సింధురాధిరూ ఢుఁ జేసె నతని. భోజరా. ౨. ౭౬.

త్రోము=తోము. స. క్రి. మురికి పోవునట్లు రుద్దు.

సీ. చంద్రబింబముకాంతి సవరించి యాలేమ మోమును నునుపు గాఁ ద్రోమిరొక్కొ. భోజరా. ౩. ౨౨౪. (చి. ని. పా. తోమి రొక్కొ ముద్రి.)

త్రోయించు. స.క్రి.(√త్రోయు)త్రోయఁజేయు.

మ. పవనాశ్వంబు హరింపఁగా మును జటాపా ళిం జగత్ప్రాణమూ,ర్తి విరోధించి తదశ్వముం గొనిరెు నీ రేప్రొద్దు దానిన్ మెడం,దవులం గట్టి ఖవీథిఁ ద్రిప్పి వడి నాతం డబ్ధి ద్రోయింప వీ,ని వెసన్ వచ్చెనొ కాక రా జెటులఁ దీండ్రించున్ మృగాంకంబునన్. చంద్రా. ౫. ౭౭.

సీ. ఫణులచేఁ గఱపించిఁ బావకశిఖలలోఁ బొరలఁద్రోయించి యంబుధుల ముంచి. ఘటికా. ౩. ౧౪.

త్రోయు=త్రోచు. స. క్రి. ౧. గెంటు, నెట్టు.

శా...పౌండ్రకవిభుం డాత్మీయులం జూచి చే, వీచెం ద్రోయుఁడు కోటమేడలు పడన్ బ్రేయుండు డాయుండు...ఉ.హరి. ౩. ౩౨.

వ...అట్లట్లు వడ మెడఁబట్టి త్రోయుట వెడవెడం బోవుపల్లవులం బండువుతలఁటులకు నింటికిం దెచ్చుపణ్యాంగనాభ్రాతలపరిహాసచే ష్టలయంద...ఆము. ౪. ౧౭౭.

చ. అలరులబంతి జృంభికకు నడ్డము సేయుచుఁ గర్ణపాళిపై, నలకలఁ ద్రోయుచుం దరఁగ లౌ ప్రమదాశ్రులు గోట మీటుచున్. మనుచ. ౫. ౬౭.

౨. పడవేయు, కూల్చు.

గీ. అసియుఁ బాత్రయుఁ దేఁ బంపి యాంత్ర వల్లి, గోలగగ్గెర ద్రోయఁ దత్కుజముతోడ, నొరగి...ఆము. ౬. ౨౭.

౪. ఉల్లంఘించు, అతిక్రమించు.

క. ఏ నేమి చెప్పి పంపినఁ, దా నేపని చేసె నని మదనుఁ బిలిచి దురా,త్మా నేఁటిదాఁకఁ ద్రోయవు,గా నాయానతి ని దేమి గావించి తనన్. జై. భా. ౭. ౭౭.

౫. త్యజించు, విడుచు, పరిహరించు.

ఉ. అంచితహారవల్లి వలయాభరణంబుల తక్కఁ ద్రోయుఁజి, ల్కంచుఁబసిండి...ఆము.౧.౧౬.

సీ. అయినను న న్నతఁ డడిగించినట్టియర్థములు చెప్పక త్రోయఁ దగవు గాదు. పరమ. ౫. ౨౫౩.

౬. (చీఁపురుమున్నగువానితో) తుడిచి పాఱవేయు; పాఱవేయు.

మ. గురుముక్తావళి చేటిక ల్విరులతోఁ గూడంగఁ ద్రోయన్...ఆము. ౨. ౧౧.

క...నేరుపునం బల్లేరు లీడ్చి త్రోయుచుఁ జనుచున్. ఆము. ౬. ౧౪.

౭. కడపు, దాఁటించు, జరపు.

మ. హరిఁ జింతింపక మత్తుఁడై విషయచింతాయత్తుఁడై చిక్కి వా,సరముల్ ద్రోసెడు వాఁడు...భాగ. ౨. ౨౪.

క. కావున నిచటన మీ రీ,దైవతవనిత లనుగుట్టు తప్పకయుండన్, ద్రోయుఁడు దివసము లే మొక,భూవరుఁ గని వైభవంబుఁ బొందెదు దాఁకన్. కళా. ౬. ౧౫౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౮. తొలఁగించు, పోఁగొట్టు.

మ. వరమృష్టాన్నసువస్త్రపీడితులమై వర్తింపఁ
గా నేల శ్రీహరి సేవించినవారికిం గలవె
త్రోయఁగ రానిదారిద్ర్యముల్. కుచేల. ౧.
౫౧.

౯. 'కొట్టు, చేయు' మున్నగు ధాతువులవలె
కొన్ని ధాతువులతుమున్నంతరూపములతోఁ
గూడి ఆయా క్రియలప్రేరణార్థమునిచ్చును.

ఉ. ఏసవిరి న్వీరించి నొకయేటునఁ దామరపా
న్పుపైఁ బడం ద్రోసినజోదు మన్మథుఁడు
...నైష. ౧. ౮౨.

**త్రోలు**=తోలు[1].

(తఱుము, వెన్నాడి పరుగెత్తఁజేయు.)

క. మొన్న నొకనిఁ ద్రోలితి వాఁ, డిన్నగ మి
ట్లెక్కె వాని నిది గరుణాసం, పన్నని క్రియ
లో నిడుకొని, నిన్న విఱిచి చంపె మంచినిజ
మఱివోలెన్. ద్వా. ౧. ౨౬౧. (వ్రాఁత
ప్రతి పా.)

గీ. తొలఁగ కెడసొచ్చు మానవాదుల సుశేర్మ,
యోధులను బాఱఁ ద్రోలి యి ట్లురుభుజావి,
భూతి నెదిరించు నాకపికేతను నతఁ, డాజి
నొప్పించి మడిసె వాహనముతోడ. రాఘవ.
౪. ౧౩౯.

(సంహరించు, చంపు.)

సీ. నరమృగాకృతి వై జనశ్లాఘ వ్రాలి ప్రహ్లాదు
నేలితి పలలాశిఁ ద్రోలి. వరాహ. ౧.౫౨.

గీ. లీలఁ బొలదిండిమూఁకలఁ ద్రోలువాఁడు...బా
లవేంకటశౌరి నామ్రోల నిలిచె. ప్రబంధ.
౨౮.

(ఇది 'కొట్టు' ధాతువవలె కొన్నితుము
న్నంత రూపముల కనుప్రయుక్తమై ప్రేర
ణార్థము నిచ్చును)

ఉ. దిట్టల నీఁతకాండ్ర జలధిం బడఁ ద్రోలియు[illegible]

దజ్జనుల్ గరం, బట్టిరెడన్ రయంబు మెఱ
యు స్వెదకించిరి వారిఁ బల్మఱున్. కళా.
౬. ౧౦౬.

**త్రోవ.** వి. (√త్రోచు) ౧. మార్గము, దారి; పద్ధతి.

ఆ...మార్గంబు, తెరువు త్రోవ దారి...అనంగ...
ఆం. భా. ౨. ౮.

క. ఇంద్రియముల గోచరముల, కుం ద్రోవలు చేసి
భక్తకోటులలో నెల్లం ద్రిమ్మరు నాత్మపు రవి,
చంద్రవిలోచన...ఉ. హరి. ౨. ౨౦౪.

క. కావున శుకస్థితికిం, గావించినయట్టిపుణ్యకర్మ
ము లగుస, త్సేవితయమనియమాదుల, త్రోవ
సారఁగ వలయు విషయదూరాత్మకుఁ దై. భా
ర. శాం. ౪. ౩౦౯.

చ...వచ్చినత్రోవయుఁ బోయినట్టిత్రో, వయు నొ
కటం గనంబడద ...కళా. ౮. ౬౨.

ఉ. నన్నయభట్టతిక్కకవినాథులు చూపినత్రోవ
పావనం, బు...హరి. పూ. ౧. ౪౦.

౨. ఉపాయము, సాధనము, వెరవు, విధము, రీతి.

గీ. జంతువులు దండధరుచేతఁ జచ్చి తీవ్ర, వేద
నలఁ గుందుచుందురు వీర లధిక, దుఃఖములఁ
బొందకుండెడుత్రోవ గలదె. వి. పు. ౪.
౧౦౪.

ఉత్సాహము. కానలో మృగంబు లోలగంబు
సేయ నుండు న, స్త్రానిమండలేశ్వరుండు మన
లఁ గూడుబాడలే, దైన నొక్కత్రోవద్రొక్క
కతని మానరాదు గా, పూని చూడు మెవ్వఁ
డెఱుఁగుఁ బుణ్య మున్న నయ్యెడున్.
రామా. ౨. ౭౬. (త్రోవద్రొక్కు=సాధన
మవలంబించు.) కళా. ౩. ౫౫.

శా. దేవా కయ్యముతోడివేడుక మదిం దీండ్రిం
చు మర్త్యుండు నే. త్రోవం జేతులతీఁట వుత్తు
నని కోరున్...ఉ. హరి. ౫. ౨౧.

సీ. [illegible] త్రోవ తాళం బొక్క త్రోవ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గా నేమేమొ ఢక్క వాయించుకొనుచు. శుక. ౨. ౧౧౪.

3. గతి, దిక్కు; అవస్థ.

ఉ. ఈవును నేనపోలెను మునీశ్వర భాగ్యము లేమిఁజేసి కాశీవిరహాగ్ని తాపమునఁ జేడ్పడినాఁడవు చెప్పవయ్య నా త్రోవ మహోత్తదక్షపురి ధూర్జటి శంభుఁడు భీమనాథుఁడా, ర్యావిభుఁడాశ్రయార్హుఁడగు నా నను నేలికొనం దలంచునా. భీమ. 3. ౫.

క. నీమేనల్లుఁడు గావునఁ, గాముఁడు నీకరణి దుండగము చేసి కదా, మామకఫాలాగ్ని శిఖా,స్తోమాహుతి యయ్యె వానిత్రోవయె నీకుఁ. శకాం. ౫. ౯౭.

౪. జోలి, సంబంధము.

ఆ. పద్మనయనుమీఁదిభక్తియోగం బెల్ల, ముక్తియోగ మనుచు మొదలెఱుంగు,నారి వారి వారి వారిఁ జేరినవారి త్రోవ దలఁప వలదు దూతలార. భాగ. ౬. ౧౯౧.

సీ...ఇటువంటిదుండగముల, నూని కాలప్రాప్తులైనవారల నిర్నిమిత్తంబు మిక్కిలి మీకు నెగ్గు,చేయువారలఁ గఱచి వధింపుఁడన్యుల త్రోవఁ బోవకుఁడు...వరాహ. ౬. ౭౫.

త్రోవపె(వె)ట్టు. అ. క్రి. (త్రోవ+పెట్టు) దారి చూపు.

ఉ...పోవలతేనియుఁ ద్రోవపెట్టెదఁ. కళ. ౨. ౫3.

సీ. పరువంపువిరిగొందు లరసి చాలై త్రోవ వెట్టి యీరము లీఁగుపిండు దగిలి. ఆము.౫. ౧౧౭.

త్రోవరి. విణ.(త్రోవ+అరి?)౧. మార్గము నెఱిఁగినవాఁడు. (శ. ర. బ్రౌ.) ౨. బాటసారి, త్రోవ నడచువాఁడు.

సీ...వేల్పులు మింటిత్రోవరులు నిద్దుర లేనిప్రోడలు ...సాం. ని. దేవ. ౧౮.

## త్ర్య

త్ర్యంకటము. సం. వి. అ. న. ౧. (మూఁడు చేర్లు గల) చిక్కము, ఉట్టి, మొ. ౨.ధాతాంజనము, ఒకరకము కాటుక. (మే. ని.)

త్ర్యంబక. సం. వి. ఆ. స్త్రీ. పార్వతి.(కల్ప.)

త్ర్యంబకసఖుఁడు. సం. వి. అ. పుం-ముక్కంటి చెలి-కుబేరుఁడు.

త్ర్యంబకుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి, శివుఁడు.

త్ర్యంశము. సం. వి. అ. పుం. ౧. త్రిగుణితాంశము, మూఁడుపాళ్లు ౨. తృతీయాంశము, మూఁడవపాలు.

త్ర్యక్షము. సం. విణ. (అ. ఈ. అ) మూఁడు కన్నులు గలది. వి. అ. పుం. నారికేళము, కొబ్బరకాయ.

త్ర్యక్షరము. సం. విణ. (అ. ఆ. అ) మూఁడు అక్షరములు కలది. వి. అ. పుం.-అకార ఉకార మకారము లనుమూఁడక్షరములు గలది-ప్రణవము.

త్ర్యక్షుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి, శివుఁడు.

త్ర్యబ్ద. సం. వి. ఆ. స్త్రీ. మూఁడేండ్లపెయ్య; మూఁడేండ్లబాలిక.

త్ర్యశీతము. సం. విణ. (అ. ఈ. అ) ఎనుబది మూఁడవది.

త్ర్యశీతి. సం. విణ. (ఇ) స్త్రీ. ఎనుబదిమూఁడు.

త్ర్యశీతితమము. సం-త్ర్యశీతము.

త్ర్యశ్రము. సం. విణ. (అ. ఆ. అ) త్రిభుజా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కారము కలది, మూఁడుకోణములు గలది. వి.అ. న. (క్షేత్రగ) త్రికోణము, త్రిభుజము.

త్ర్యస్రము. సం= త్ర్యశ్రము.

త్ర్యహము. సం. వి. అ. పుం. ౧. మూఁడుదినములసమాహారము. ౨. మూఁడుదినములు జరుపఁబడుపండుగు, మొ.

## త్ర్యా

త్ర్యాహణము. సం. వి. అ. పుం. - మూఁటిచేత (ముక్కుతోను కాళ్లతోను) కొట్టునది-విష్కిరము, పక్షి.

## త్రుూ

త్రుూషణము. సం= త్ర్యూషణము. (కల్ప)

## త్ర్యూ

త్ర్యూషణము. సం. వి. అ. పుం. ఊషణత్రయము, సొంటిపిప్పలిమిరియాలు.

## త్వ

త్వంకారము. సం. వి. అ. పుం. మైత్ర్యాదిసూచకముగా నుపయోగించు 'త్వమ్' అనుశబ్దము. (ఇది యుష్మచ్ఛబ్దైకవచనమాత్రమున కుపలక్షకము.)

త్వక్కు. సం. వి. చ్. స్త్రీ. ౧. తోలు, చర్మము. ౨. చెట్టుపట్ట; వల్కలము. ౩. లవంగపుపట్ట, దాల్చినిచెక్క. ౪. స్పర్శేంద్రియము.

త్వక్క్షీరి. సం. వి. ఈ. స్త్రీ. తవక్షీరి, వంశరోచనకు.

త్వక్తరంగకము. సం. వి. అ. పుం. చర్మము యొక్కముడుత. (విల్యమ్సు.)

త్వక్త్రము. సం. వి. అ. న. కవచము, బొందళము. (వై. ని.)

త్వక్పత్త్రము. సం. వి. అ. న. ౧. లవంగపుపట్ట, దాల్చినిచెక్క. ౨. ఇంగువఆకు. ౩. తేజపత్త్రము, ఆకుఁబత్రికు.

త్వక్పుష్పము. సం. వి. అ. పుం. గగుర్పాటు. (త్రి. ని.) న. కిలాసము, సిబ్బెము అను చర్మము మీఁదిపొడరోగము. (వాచ.)

త్వక్పుష్పిక. సం. వి. ఆ. స్త్రీ. సిబ్బెము అను చర్మముమీఁదిపొడరోగము. (త్రి. ని.)

త్వక్సార. సం. వి. ఆ. స్త్రీ. వంశరోచన, తవక్షీరికు.

త్వక్సారము. సం. వి. అ. పుం. ౧-గట్టిపట్టకలది-వెదురుకు. ౨. లవంగపుపట్ట, దాల్చినిచెక్క. ౩. శోణము, దుండిగముకు.

త్వక్స్వాద్వీ. సం. వి. ఈ. స్త్రీ. లవంగపుపట్ట, దాల్చినిచెక్క.

త్వక్సుగంధ. సం. వి. ఆ. స్త్రీ. ఏలావాలుకము, కూఁతురుబుడమకు.

త్వగంకురము. సం. వి. అ. పుం. రోమాంచకము, గగుర్పాటు. (త్రి. ని.)

త్వగాక్షీరి. సం. వి. ఈ. స్త్రీ. వంశరోచన, తవక్షీరికు. (వాచ.)

త్వగింద్రియము. సం. వి. అ. న. స్పర్శగ్రాహకేంద్రియము.

త్వగ్గంధము. సం. వి. అ. పుం. -సువాసనగల తొక్క గలది-నారంగము, నారింజకు. (వై.ని.)

త్వగ్జము. సం. విశే. (అ. ఆ. అ) త్వక్కునందు పుట్టినది. వి. అ. న. రక్తము, నెత్తురు. (రాజని.)

త్వగ్దోషము. సం. వి. అ. పుం. కుష్ఠము.

త్వగ్దోషాపహా. సం. వి. ఆ. స్త్రీ. వాకుచి, కారుగచ్చకు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్వగ్దోషారి. సం. వి. ఇ. పుం. హస్తికందము*.

త్వచము. సం. వి. అ. న. ౧. చెట్టుపట్ట. ౨. లవంగపుపట్ట.

త్వచాపత్త్రము. సం. వి. అ. న. త్వక్పత్త్రము, లవంగపుపట్ట, దాల్చినిచెక్క.

త్వచిసారము. సం. వి. అ. పుం. త్వక్సారము, వెదురు*.

త్వచిసుగంధ. సం. వి. ఆ. స్త్రీ. చిట్టేలకి*.

త్వచ్యము. సం. విణ. (అ. ఆ. అ) త్వక్కునకు హితమైనది, చర్మారోగ్యకరమైనది.

త్వద్. సం. సర్వ. నీయొక్క, మొ. (ఇది ప్రత్యయముగాని ఉత్తరపదముగాని పరమగునపుడు యుష్మచ్ఛబ్దమునకు ఏకవచనార్థమందు వచ్చు రూపము. (ఉదా: త్వదీయము, త్వత్కృతము, త్వద్దత్తము, త్వద్భయము, త్వత్సుతుఁడు, త్వదేకపుత్త్రుఁడు, త్వద్విధుఁడు మొ.)

త్వర. సం. వి. ఆ. స్త్రీ. వేగము, వేగిరపాటు.

త్వరణము సం. వి. అ. న. త్వరపడుట, వేగిరపడుట.

త్వరపడు. మి. అ. క్రి. తొందరపడు.

క... మంత్రులుఁ దావుక, జను లపుడు వసిష్ఠశాసనంబున నభిషేచనసంభారాహరణం, బునకుం ద్వరపడఁగ నృపతిపుంగవుఁ డంతట. చం. రా. ౪. ౧౪.

త్వరమాణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తొందరపడుచున్నవాఁడు.

త్వరి. సం. వి. ఇ, ఈ. స్త్రీ=త్వర. (వై. ని. అమరసుధ.)

త్వరితము. సం. విణ. (అ. ఆ. అ.) వడిగలది. వి. అ. న. త్వర, వేగము.

త్వష్ట. సం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) కఱ్ఱలు మొ. వానిని చెక్కువాఁడు. వి. ఋ. పుం. ౧. వడ్లవాఁడు. ౨. దేవశిల్పి, విశ్వకర్మ. ౩. ద్వాదశాదిత్యులలో నొకఁడు.

త్వష్టము. సం. విణ. (అ. ఆ. అ.) తష్టము, చెక్కఁబడినది.

## త్వా

త్వాచము. సం. విణ. (అ. ఈ. అ.) త్వక్కునకు సంబంధించినది.

త్వాదృక్కు. సం. విణ. (శ్) నీవంటివాఁడు. (రూ. త్వాదృశము.)

త్వాదృక్షుఁడు. సం. విణ (అ. ఆ. అ) త్వాదృశుఁడు.

త్వాదృశుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) నీవంటివాఁడు.

త్వాష్ట్రము. సం. విణ. (అ. ఈ. అ.) త్వష్టృసంబంధమైనది.

త్వాష్ట్రి. సం. వి. ఈ. స్త్రీ. ౧. చిత్రానక్షత్రము. ౨. చిన్నరథము. ౩. సంజ్ఞాదేవి, సూర్యపత్ని, యమునితల్లి (త్రి. ని.)

త్వాష్ట్రుఁడు. సం. వి. అ. పుం. వృత్రాసురుఁడు.

## త్వి

త్విట్టు. సం. వి. ష్. స్త్రీ. ౧. కాంతి, దీప్తి. ౨. కిరణము, వెలుఁగు. ౩. మంట. ౪. వాక్కు. ౫. జిగీష, జయేచ్ఛ. ౬. వ్యవసాయము, పూనిక. (హేమ. ని.)

త్విట్పతి. సం=త్విషాంపతి.

త్విషాంపతి. సం. వి. ఇ. పుం. వెలుఁగుఱేఁడు, సూర్యుఁడు.

త్విషి. సం. వి. ఇ. పుం. కిరణము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## త్స

త్సరుకుఁడు. సం. విణ. (అ. ఆ. అ) ఖడ్గయుద్ధనిపుణుఁడు, కత్తిపట్టుటయందు నేర్పరి.

త్సరువు. సం. వి. ఉ. పుం. ఖడ్గముష్టి, కత్తిపిడి.

## థ

థ. సం. ఒకానొకయక్షరము.

థ. సం. వి. అ. పుం. ౧. శిలోచ్చయము, కొండ. ౨. భయరక్షకుఁడు. న. ౧. రక్షణము, కాపాడుట. ౨. మంగళము. ౩. సాధ్వసము, భయము. (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

## థు

థుడనము. సం. వి. అ. న. ఆచ్ఛాదించుట, కప్పుట; మఱుఁగుపుచ్చుట.

థుత్కారము. సం. వి. అ. పుం. ఉమియునపుడు చేయు 'థుత్' అనుశబ్దము.

## థూ

థూత్కారము. సం=థుత్కారము.

థూత్కృతము. సం. వి. అ. న=థుత్కారము.

థూత్కృతి. సం. వి. ఇ. స్త్రీ. థుత్కారము.

## ద

ద. ఉభ. ఒకానొకయక్షరము.

దంగు=డంగు. అ. క్రి. (బియ్యము మొదలగునవి) పొట్టుపోవునట్లు శుభ్రముగా నలఁగు. (శ.ర.) విణ. శుభ్రముగా నలఁగినది, దంపఁబడినది.
జః దంగుడు, దంగుడులు, దంచు, దంపు, దంపుటిల్లు, దంపుడు, మొ.

దంగుడు. విణ. (√దంగు) దంచినది. (దంగుడు బియ్యము. శ. ర.)

దంగుళ్లు(డులు). వి. బ. (√దంగు) చేరుళ్లు, అక్షుణ్ణతండులములు, చేబియ్యము.

సీ. అక్షుణ్ణతండులాహ్వయము చేరుళ్లు నా దంగుళ్లు నాఁగను దనరు చుండు. ఆం. భా. ౨. ౨౮౪.

సీ. బోయకల్కికి భక్ష్యభోజ్యంబుల నొసంగి వెదురుదంగుళ్లఁ బో వీడఁ దీయు. పార్వ. ౨. ౨౩.

దంచేనపుఁజేయి. వి. (దంచనము + చేయి) ౧. శత్రువులు కోట నెక్కకుండ క్రిందకుఁ ద్రోయుటకు ఱాలను విసరుయంత్రవిశేషము, దంచనము.

సీ. ఎనసి మార్తురు లగ్గ నెక్కకుండంగఁ దార్చిన కాంచనంపుదంచనపుఁజేతు,లు... కువల. ౩. ౧౭.

౨. దుడ్డుకఱ్ఱ. (బ్రౌ.)

దంచేనము=డెంచేనము. వి. (దీనికి కొన్నియెడల వ్యుత్తియందు మువర్ణలోపము.) ౧. కోటలు ముట్టగునవి బద్దలుకొట్టుట కుపయోగించుఆయుధవిశేషము. (పెద్దపిరంగి అని.శ.ర.)

వ...పౌండ్రభూపాలుండు యదువీరునగరంబు కలుకోట వికటంబుగా వలఁదటంకంబుల నఱకించియు దంచనపుగుండ్లఁ బడవైచియు ...ఉ. హరి. ౩. ౩౬.

సీ...దంచనముల నొడిసెలలను, జాలంగ నెందును సవరించుట...గీ. ఓలిఁ గర్జంబుగా నెల్లయోధులకును, జెప్పి...హరి. ఉ. ౨. ౧౬.

౨. శత్రువులు కోట నెక్కకుండ క్రిందికి త్రోయుటకు ఱాలను విసరుయంత్రవిశేషము.

ద్వి. ముంచి కొండలు కరమ్ముల బెట్టు వట్టి, దంచనాలకు నివె దంచనా లనుచుఁ, గ్రచ్చఱ నట విఱుగంగ వైచుచును. రం. రా. యు. ౩౫౩ పొ. ౧౩ పం.

ద్వి. దంచనగుండ్లచేఁ దాఁకించి కడిమి, ముంచిన లగ్గ యిమ్ముల విడిపించి. రం. రా. యు. ౩౫౩ పొ. ౨౩ పం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. తెగు శిలాయంత్రంబు దంచన మనఁగను...
ఆం. భా. ౨. ౨౧౮.

జః దంచనపుఁజేయి.

దంచు=దంపు. స. క్రి. (√దంగు)దంగఁజేయు.

(క) ధాన్యము మున్నగువానిని నలఁగఁజేయు.

చ. హలమున వచ్చుధాన్యముల నప్పటికప్పుడు
దంచుకోఁగ రోఁకలిఁ గయికొంటి...దశా.
౮. ౫౭.

(చ) ధ్వంసముచేయు; చూర్ణముచేయు.

ఉ. దంచె నతం డనేకజననంబులఁ జేసినపాతకా
ఘముల్. కాశీ. 3. ౧౦౮.

ప్రఘర...విఘటించె దంచెన్, ద్రుంచెన్...కరి
సుర ప్రత్యనీకుండు హేలాసంచారోదగ్ర
భంగిన్ జలముకొని వనీసౌధవప్రాటవీథుల్.
కాశీ. ౬. ౧౭౬.

(ట) నలఁగఁద్రొక్కు; జయించు.

క. దంచున్ జరణాంచలములఁ, గించుఁదనం బం
చు మదలకించున్ ముంచున్, నొంచున్ విద
ళించుచుంచూ, దంచచ్చుంమాపుటస్ఫుటాఘా
తములన్. రామా. ౫.౧౯౮.

ఉ.దంచెదఁ గాలకింకరుల దాశరథీ కరుణాప
యోనిధీ. దా. శ. ౬౦.

దంట[1]. విణ. (సం. ధృష్టః. ప్రా. ధట్ఠో.) సమ
ర్థుఁడు, దిట్టతనము గలవాఁడు; జంత, ధూర్త
రాలు.

గీ. అచటిపొందమ్మికొలఁకులు నభవునింట, నైన
నాదంటబలువింట నైనఁ గలవె. వసు. ౨.౫.

సీ. మాయామృగమువెంట మగఁడు పోవఁగ
దంటమఱిది నంపిన నాఁటిమంకుతనము.కృ.
శతం. పీఠి. ౫౦.

సీ. దంట సాజాణ నాఁ దగు సమర్థుఁడు
...ఆం. భా. 3. 3.

శా. ఏజాతి న్నినువంటిదంట గలదే యిద్ధా
త్రిలోనంచు వి,భ్రాజన్మానధురంధరుండు నృ
పుఁ డుగ్రవ్యగ్రరోషాత్ముఁ డై. శుక. ౧.
౨౨౮.

దంటమాటలు=ప్రౌఢవాక్యములు, వక్రోక్తులు.

సీ. ఈదంటమాటలు నీటిభావంబులవిధము నే
నిచ్చినవిద్యల కద. కళా. ౫. 3౯.

సీ. దంటమాటలకు ధార్ష్ట్యమునకు నానతి పడి
పట్టినటిసత్ప్రాజ్ఞులార. ప్రభా. ౧. ౧౦౪.
కళా.౮.౧౯.

జః దంటతనము[1].

దంట[2]. విణ. జంటయైనది.

గీ.కలయ నాపాదమస్తకాంగములయందు, మిం
చి పటలీలఁ దరళితోదంచిత మగు,యువతి
లావణ్యమును గన్నుఁగవయు నతను,దంట
మీలకెక్కియ మనఁ దనరుఁ జూడ. ప్రభా.
౨. ౭౨.

వి. జంట, కవ, యుగ్మము.

సీ...దోయి జోడు, జంట జమళి కవ దంట య
మడ యన ద్వంద్వమై పరఁగును...ఆ.
భాం. ౨. ౧౦౦.

జః దంటగొను, దంటతనము[2], దంటపోరు, దం
టమెట్టెలు, దంటమోముల దేవర, దచ్చవుక,
దచ్చి, దచ్చికాళ్లమెకము.

దంటగొను. స. క్రి. (దంట[2] + కొను) కలియు.

గీ. దైత్యుమెఱుఁగుఁదూపులు దళితములు సేయఁ,
దత్తనూజచూపులు ఫలితములు సేయఁ, నుదు
టుఁదనమును వలపు నొండొంటితోడ, దంట
గొని క్రమ్మ నెమ్మదిఁ దాల్చె నతఁడు. ప్రభా.
౪. ౮౯.

దంటతనము. వి. (దంట[1] + తనము) ౧. సామ
ర్థ్యము, ప్రౌఢత్వము; చాతుర్యము.

సీ. సంగరంబున ధనంజయరథస్థాయి యై ధవ
ళాశ్వములఁ బట్టుదంటతనము. దశా. ౧.
౯౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. రమ్మ నా వెంటఁ గొంతదూరమున నుండి, దం
టతనమున నను వెన్ను నంటి చూడు. శుక.
౨. ౨౮౭.

లయగ్రాహి. అంట వడిఁ దాఁకి యదరంటఁ బడ
వ్రేసి పెను,మంట లెగయం జఱిచి దంట
తన మొప్పఁగ, వెంటఁబడి పట్టుకొని...భా.
రా. యు. ౧౪౩౦.

౨. ధార్త్యము, గయ్యాళితనము.

క. తొల తొలఁగు తొలఁగు మనుచుఁ,దల
తల తల మనుచు వట్టిదంటతనంబుల్,వలదు
వల దనుచుఁ బల్కఁగఁ, గలకంఠుల కపుడు
మిగులఁ గలహము ముదురన్. రాజ. చ.
౩. ౪౫.

ఉ. దంటతనంబె కాని యుచితజ్ఞత లేదు వనా
టుఁ డౌటనా, వంటిమహామహుండు తనవా
లముఁ బ్రాఁకఁగ నూరకున్నవాఁ, డొంటమి
యేల ముందరఁ బ్రియోక్తులఁ బిల్చెదఁ బ
ల్కఁడేని నా, బంటుతనంబుఁ జూపఁగ నె
పం బగుఁ గా కని నిశ్చితాత్ముఁడై.సమీర.
౬. ౧౬౫.

దంటపోరు. వి. (√దంట³) ద్వంద్వయుద్ధము.

సీ. దంటపో రనఁ దగు ద్వంద్వయుద్ధము...
ఆం. భా. ౨. ౨౨౨.

దంటమెట్టెలు. వి. బ. (√దంట²) కాలివ్రేలి
యందు ధరించెడుఆభరణవిశేషము.

ద్వి. దంటమెట్టెలు వింతతళుకొత్తుచుండ, జరి
బుటాచీరయు జాజిపూఁఱవికె. ద్వి. శ. సా.
౧. ౧౪ పా. ౧ పం.

దంటమోములదేవర. వి. (దంట² + మోములు
+ దేవర)-రెండుముఖములు గలదేవుఁడు-అగ్ని.

గీ. దంటమోములదేవర దనివి దీఱ, బుగులుకొని
మెక్కఁ దద్ద యబ్బురము గాఁగ. అచ్చ.
రా. యు. ౨౭౦.

ఇట్లే: దంటమోములసామి, మొ.

సీ. మలగొంగ యలరుపెత్తులు గట్టి యిడుచుం
డు దంటమోములసామి వంట సేయు.అచ్చ.
రా. సుం. ౪౧.

దంటు. వి. (సం. దండః. క. దంటు) జొన్న
లోనగువాని కాఁడ.

వ...విషవిస్ఫురద్భుజంగముల నల్లడన్ గబళించి
గెంటకుండ దంటు చప్పరించుగతిం జప్ప
రించుచు...మనుచ. ౪. ౩౬.

సీ. యావనాశాదిదండాఖ్య దంటన మీఱు...
ఆం. భా. ౨. ౬౬.

జః దంటుకొను.

దంటుకొను. అ. క్రి. (√దంటు) పూరికఱచు.

సీ. చేబల్మిచేఁ గ్రమ్మి చిమ్మివెతుముగదా నోట
దంటుకొనంగ నీఁటెమొనల. కృష్ణ.౩.౧౭.

దండ[1]. వి. ౧. వైపు, ప్రక్క, పార్శ్వము.

క. వేదండపురాధీశుఁడు, కోదండము సేతఁ బ
టుకొని గహనములో, వేదండాదుల నొక
నాఁ, డేదండలఁ బోవనీక యెగచెన్ బలి
మిన్. భాగ. ౧. ౪౫౩.

సీ. వెనుదండ నుద్దండవేదండకాండముల్ సమ
దమందరయానసరణి నడవ. దశా. ౨.౧౯.

సీ. పూరుషార్థములు తలోప్రిక్తంబు లందులో
మొదటిది నాల్గుకొమ్ముల వృషభము, రెండవ
దర్థ మాదండది కామ మీమూఁడును లయ
మైన మోక్ష మనఁగఁ, బరఁగె...వరాహ.
౯. ౨౧. (ఆదండది=దాని పిమ్మటిది యని
భావము.)

౨. స్థానము, చోటు.

గీ. వినుతసుకృతములకు దండ వెండికొండ.భాగ.
౪. ౧౩౪.

సీ. ఒకవంక సకలంకయోగివర్యసపర్య లొకదం
డ నఘుదండనోచితవిధ్యులు...హ. న. ౩.౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౩. సమీపము.

ఉ...తాంబూలముతావి బుగ్గ రని ముంచు కొనం జెవిదండఁ బక్కి నన్. కళా. ౪. ౧౦౯.

మ. అని ప్రద్యుమ్నుని మానిదండ నిడి చింతాయత్తచిత్తంబునన్. పారి. ౧. ౧౦౩.

౪. అందు, సప్తమీవిభక్త్యర్థకము.

క. ఆదండ జడలదండను, వే దండఁ జెలంగఁ జెరివి...వి. పు. ౧. ౧౩౬.

సీ. హురుముంజిముత్యాలరొంటుల చకచకల్ తళుకుఁజెక్కులదండఁ దాండవింప.చం.రా. ౨. ౬౧.

౫. ప్రాపు, ఆధారము.

వ...బారిసమరుటకు వలచుట్టునన్ జెట్టు దండ గొని నిలువ నలువు గలపుళిందులఁ గొందఱ నిలిపి...మనుచ. ౪. ౩౭.

సీ. తరిగుండు నేను నేతటి నుండుతల మయ్యు గొండకు నాలావు దండ యధిప. చంద్రా. ౨. ౪౫.

౬. ఎద్దుముడ్డిమీద ముల్లుకోలతో పొడువఁగా నేర్పడు బొరుసు. (శే. ర)

జః దండపడు, దండపాటు.

దండ². వి. (సం. దండః. క. దండె. త. తండి హై.) ౧. మాల, హారము.

గీ. ఇప్పుడుదండఁ గై సేసె నెలమి నోర్తు. హర. ౪. ౭౦.

ఉ...మున్ను గొంటి నేవ న్ననదండ యొక్క మగవాఁ డిడ...ఆము. ౧. ౧౪.

౨. బాహువు.

గీ. అతివచన్నులు జక్కవ లగుట కేమి,సంది యం బింక దండలచాయ నిగిడి, రెక్కలై యుండ సొంపునఁ బిక్కటిల్లి, వలిపెపయ్యెద యనుచిన్నివలను దగుల. యయా. ౪.౪౪.

గీ. చూచినప్పుడె విలు పాఱనైచి సరస,తామరసభీమతరగదాదండ మెత్తి, దండ హత్తి మనోజుండు దండపెట్టె, నమ్మహీదేవునెమ్మది రిమ్మ వొడమ. శుక. ౨. ౪౫౩.

౩. భుజబలము.

గీ. దండ గల్గినబుద్ధిమంతుండు దనకు, బలిమి కలిమియుఁ గొనసాగ వలసె నేని, శత్రువు బుణంబుఁ జిచ్చు నెచ్చరికతోడఁ, గడమ పెట్టక కడముట్ట నడఁపవలయు. ప్రబోధ. ౫. ౪.

౪. హస్తావలంబనము, కైదండ.

గీ. తమ్మికే లుండఁ బెఱకేల దండ యిచ్చు, లేము లుడిపెడులేఁజూపులేమతోడ. ఆము. ౧. ౧౨.

౫. ముష్టియుద్ధమున మొదటిగతి; మల్లయుద్ధవిశేషము, పదిరెండుదండలలో నొకటి.

గీ. దండ యనఁగను ముష్టియుద్ధాదిమగతి,మించు నందున మద్దెళ సంచు మొదలు, కొన్ని భేదంబులు చెలంగు...అం. భా. ౨.౨౧౭.

వ...పొదలికదండయడుగడుగుపొదలికదండ మద్దెళసంచు కుక్కుటపుదండ మొదలుగాఁగ లపదిరెండు దండలును ... ప్రబంధ. ౭౮.

౬. మల్లునిసాధనదండనము.

సీ. తగినట్టిమాస్టీనిదండపోల్కి మెఱుంగు మెఱయుక్కైవడిబిసమీటినగతి. ప్రబంధ.౧౭౧.

దండగోల=ఊఁత, అవలంబము.

ఉ...నినుఁ గొల్చి వచ్చి భద్రావతిలోన నుండెడు తురంగముఁ దెచ్చెదఁ గూయి వచ్చినన్, నీ వటు దండగో లగుచు నిల్చినఁ జాలు నగ స్త్వమూర్తి యై, యీవృషకేతనుం దరిమహీశబలాంబుధి నోరఁ బట్టెదన్. జై.భా. ౧. ౧౦౦.

జః దండకడెము, దండచేయి, దండచేరు, దండాట, దండాడింపు.

దండక. సం. వి. అ. స్త్రీ. దఁడకారణ్యము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో. క్వాయోధ్యాయాః పునరుపగమో దండ కాయాం వనే పః. ఉ. చ. ౨. ౧౩.

దండకడెము. వి. (దండ² + కడెము. క. దండె కడగ. త. తండైకడైయం) భుజవలయము, సందికడియము.

ద్వి. మొల నీలికాసెలు మోటకత్తులును, దల ముళ్లు బదనిక దండకడెంబు. ద్వి. హరిశ్చ. పూ. ౫౬౫. పం.

దండకము. సం. విణ. (అ. డికా. అ) దండించునది. వి. అ. పుం. న. ౧. (ఛంద) ఒకానొక వృత్తము. ౨. సమాసప్రాయవాక్యము. (కే. ని.) ౩. అరణ్యవిశేషము. (ఆ. ని.) ౪. మహారాష్ట్రదేశము. (కే.ని.)

దండకవిలె(లియ). వి. ప్రాతలెక్కలపుస్తకపుకట్ట. (శ. ర.)

దండకాకము. సం. వి. అ. పుం. బొంతకాకి, మాలకాకి.

దండకాష్ఠము. సం. వి. అ. న. దుడ్డుకఱ్ఱ.

వ. దండకాష్ఠమవలంబ్య స్థితః. సం. శాకుం. ౨.

దండగ్రహణము. సం. వి. అ. న. ౧. దండమును దాల్చుట. ౨. సన్న్యసియగుట.

దండచేయి. వి. (దండ² + చేయి) సందిలి, ప్రగండము.

గీ. దండచేలావు గలగట్టిపండు వెదురు, తండములఁ గొమ్ముపంగల మెండు చెట్టి, బెండు విఱిచి నకైవడిఁ బెనఁచి విఱుచుఁ, బోతరించినదు ప్పులపొ్వలములోన. చంద్రా. ౨. ౬౧.

దండచేరు. వి. (దండ² + చేరు) ఏనుఁగులు మున్నగువానిని స్వాధీనముచేసికొనుట కుపయోగించు తోరము.

సీ. అలుగు నేనుంగుకై యలుఁగుఁ బూనఁగ నేలయండ నీదండచే దండెనేని. చంద్రా. ౨. ౪౩.

దండఢక్క. సం. వి. ఆ. స్త్రీ. కాలపరిమితిని దెలుపుటకు జాముజామునకు వాయించుఢక్క. (త్రి. ని.)

దండదాసుఁడు. సం. వి. అ. పుం. దండుగు (జుల్మాన) చెల్లింపలేక దానికి బదులుగా దాసత్వమును అవలంబించువాఁడు. మను. ౮.౪౧౫.

దండధరుఁడు. సం. విణ. (అ. ఆ. అ) ౧. కఱ్ఱను దాల్చువాఁడు. ౨. దండనము చేయువాఁడు, దండనాధికారముగలవాఁడు. వి. అ. పుం. ౧. రాజు. ౨. యముఁడు.

దండన. సం. వి. ఆ. స్త్రీ.=దండనము.

దండనము. సం. వి. అ. న. ౧. దండించుట. ౨. దండుగు విధించుట.

దండనాయకుఁడు. సం. వి. అ. పుం. ౧. దళవాయి, సేనానాయకుఁడు. ౨. రాజు. (వాచ.) ౩. అపరాధికి శిక్ష విధించెడియధికారి.

దండనిల్కడ. వి. మల్లయుద్ధములోని మెలఁకువ.

వ. దండనిల్కడ కద లుదుటు కలయు మెలఁకువ వింగలింపు దిశాపదిశలు... మొదలగువితమ్ములెఱింగి... ప్రబంధ. ౭౮.

దండనీతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. శిక్ష విధించుట; న్యాయపరిపాలనము. ౨. నీతివిద్య, అర్థశాస్త్రము. (కామందకీయాది.)

దండనీయుఁడు. సం. విణ. (అ. ఆ. అ) దండింపఁదగినవాఁడు.

దండపడు. అ. క్రి. (√దండ¹) ౧. సమీపించు (శ. ర.) ౨. ఎద్దుముడ్డిమీఁద ముల్లుకోలతో పొడుచుటవలన బొరుసుగా నేర్పడు. (శ.ర.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దండపాటు. వి. (√దండపడు) దండపడుట, సమీపించుట.

చ. బలములపాటు దాయతలపాటును జూచెదు దండపాటు కోౘల్లల కొడఁబాటు లెస్స యని లక్ష్మణుఁ డన్నయనుజ్ఞ గాంచి...రా మా. ౮. ౯౭.

దండపాణి. సం. వి. ఇ. పుం. ౧. యముఁడు. ౨. కాశియందలిఒకానొక దేవత.

దండపాతనము. సం. వి. అ. న. దండనమును విధించుట.

దండపారుష్యము. సం. వి. అ. న. అతిక్రూరముగా దండించుట.

దండపాలకము. సం. వి. అ. పుం. శకుల మను మత్స్యము (కల్ప.)

దండపాలకుఁడు. సం. వి. అ. పుం. ౧. శిక్ష విధించెడి యధికారి. ౨. సేనానాయకుఁడు. (వై. ని.)

దండపాలము. సం. వి. అ. పుం. మత్స్యభేదము.

దండపాలుఁడు. సం=దండపాలకుఁడు.

దండపాశికుఁడు. సం. వి. అ. పుం. చోరోపద్రవము లేక పట్టణమును కాపాడెడియధికారి. (వై. ని.)

దండపెట్టు. మి. స. క్రి. కొట్టు, ప్రహరించు.

గీ. చూచినప్పుడె విలు పాఱవైచి సరస, తామరస భీమతనగదాదండ మెత్తి, దండ హత్తి మనోజుండు దండపెట్టె, నమ్మహీదేవు నెమ్మది రిమ్మ వొడమ. శుక. ౨. ౪౫౩.

దండప్రణామము. సం. వి. అ. పుం. సాష్టాంగ నమస్కారము, కఱ్ఱవలె నేలఁ జాఁగిలఁబడి మ్రొక్కుట.

దండభృత్తు. సం. విశ. (త్) దండముధరించువాఁడు. వి. త్. పుం. దండధరుఁడు, యముఁడు.

దండమత్స్యము. సం. వి. అ. పుం. (దండాకారమగు) శకుల మనుమత్స్యము, బేడిసమీను.

దండమార్గము. సం. వి. అ. పుం. - దండాకారముగా నుండుమార్గము - ప్రధానపథము, రాజమార్గము. (వాచ.)

దండము. వి. నమస్కారము.

సీ...మ్రొక్కి దండము కేలుమోడ్చెఁగుడు, నాఁగఁ జెన్నొందును నతి...ఆం. భా. ౨. ౧౭౫.

వ...శివా నీకు నవాంజలి భవా నీకు నభివాదనంబు పాండురాంగా నీకు దండంబు రాజశేఖరా నీకు జేజే...భీమ. ౩. ౨౧౧.

దండము. సం. వి. అ. పుం. న. ౧. లగుడము, కఱ్ఱ. ౨. ప్రకాండము, చెట్టుబోదె. ౩. వీణాదండము. ౪. మంథనదండము, కవ్వము. ౫. దమనము, అడఁచుట. (వాగ్దండము, మనోదండము, కాయదండము.) ౬. దండనము, రాజు ప్రజలకు చేయుశాసనము, రాజశిక్ష. ౭. దండుగు, అధికారి అపరాధివలన అపరాధమునకై పుచ్చుకొనుసొమ్ము. ౮. రాజు శత్రువులయెడఁ బ్రయోగించుచతురుపాయములలో నాల్గవది. (ఇది వధించుట, ధన మపహరించుట, పీడించుట యని మూఁడువిధములుగ నుండును.) ౯. సైన్యము, దండు. ౧౦. అడ్డముగా పన్నినవ్యూహము. ౧౧. భూమిని గొలుచునాలుగు హస్తములకొలఁది గలమానము, బార. ౧౨. మగగుఱ్ఱె. ౧౩. అభిమానము. ౧౪. దేహము. ౧౫. సూర్యకిరణములుగాని వాయువుగాని మేఘములుగాని దండాకారముగ ఆకాశమునఁ గనఁబడుట. (ఇది రాజాదులకు అశుభసూచకము.) ౧౬. వరుస; సమూహము. ౧౭. గుఱ్ఱము. ౧౮. ఘటిక, గడియ, అఱువదివిఘటికలు. ౧౯. కోణము, మూల. (సుధ.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దండముఖుఁడు. సం. వి. అ. పుం. సేనాని, దళవాయి. (విల్యమ్సు.)

దండయత్. సం. శత్ర. దండించుచున్న.

దండయమానుఁడు. సం. విణ. (అ. ఆ. అ) దండించుచున్నవాఁడు.

దండయాత్ర. సం. వి. ఆ. స్త్రీ. ౧. పెండ్లియందలియూరేఁగింపు. ౨. యుద్ధయాత్ర, రాజు మొదలగువారు శత్రువుపై దాడివెడలుట, దిగ్విజయయాత్ర. ౩. సమ్యగ్గమనము, సరిగాఁబోవుట, తిన్నగాఁబోవుట. (మే. ని.)

దండయామము. సం. వి. అ. పుం. దినము. (మే. ని.)

దండయాముఁడు. సం. వి. అ. పుం. ౧. యముఁడు. ౨. అగస్త్యుఁడు.

దండయితః. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) దండించువాఁడు.

దండయితవ్యుఁడు. సం=దండనీయుఁడు.

దండలాసకము. సం. వి. అ. పుం. నృత్యవిశేషము, కోలాటము.

సీ. కుండలీప్రేరణీదండలాసకముఖ్యనృత్యంబు లచ్చరల్ నెఱపుచుండ. కవిరా. ౧. ౧౪౪.

దండలాస్యము. సం. వి. అ. న. నాట్యభేదము.

సీ. జంభారిమ్రోల నచ్చరలట్లు గణికాంబుజాస్యలు దండలాస్యములు సలుప. ఉ. రా. ౩. ౨౫౬.

దండవాది. సం. వి. న్. పుం. ౧. ద్వారపాలుఁడు. ౨. దండనమును వచించువాఁడు, ప్రాడ్వివాకుఁడు.

దండవాలధి. సం. వి. ఇ. పుం. – దండమువలెనుండుతోఁక కలది-ఏనుఁగు. (విల్యమ్సు.)

దండవాహి. సం. వి. న్. పుం. తలారి, ఆరెకుఁడు, ఆరక్షకుఁడు. (విల్యమ్సు.)

దండవికల్పము. సం. వి. అ. పుం. శరీరదండన ధనదండనములు రెంటిలో అధికారికి తోఁచినట్లు విధించునొకశిక్ష.

దండవిధి. సం. వి. ఇ. పుం. దండనమున కేర్పఱచినశాసనము; శిక్షాస్మృతి.

దండవిష్కంభము. సం. వి. అ. పుం. తరిగంబము, కవ్వముగట్టురాడు. (విల్యమ్సు.)

దండవృక్షము. సం. వి. అ. పుం. స్నుహి, జెముడు.

దండవ్యూహము. సం. వి. అ. పుం. దండాకారముగ పన్నినవ్యూహము, పంక్తులుగాఁ దీర్చిన సైన్యము.

దండసి(లు)ల్లు. అ. క్రి. ౧. ఇఱుకుకొను.

చ. మగువకుచద్వయంబునడుమం బడి రాయిడి దండసిల్లి... నైష. ౩. ౧౪౯. (దండసిల్లు. ముద్రి. పా.)

గీ. వెనుకముందటి సమ్మర్దమునఁ గరంబు, దండసిలి మధ్యమున నున్నధరణివిభుఁడు. నైష. ౪. ౧౨౫.

౨. అడుముడుపడు, అణుఁగు.

సీ. దండశూకాధీరుతలలు దండసిలంగఁ దాటించునే కాల ధర మహేశ. కాశీ. ౭. ౭౯.

దండహస్తము. సం. వి. అ. పుం. తగరపువ్వుము, నందివర్ధనము.

దండహస్తుఁడు. సం. వి. అ. పుం. ౧. ద్వారపాలుఁడు. ౨. యముఁడు. ౩. బ్రహ్మచారి. ౪. సన్న్యాసి.

దండాజినము. సం. వి. అ. న. ౧. (బ్రహ్మచారి ధరింపఁదగిన) దండకృష్ణాజినములు. ౨. బాహ్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వేషముమాత్రము ధరించుట; దంభము; మోస ము. (వై. ని.)

దండాట=దండాడింపు.(దండ[2] + ఆట), డేగాట. (శ. ర.)

దండాడింపు=దండాట. పెండ్లిలో ఐదవనాఁడు వధూవరులను ఎత్తుకొని ఆడెడియాట. (వా.)

దండానండి. సం. అవ్య. పరస్పరము దండముల తోఁ గొట్టుకొనుచుఁ జేసినయుద్ధము.

దండారము. సం. విణ. (అ. ఆ. అ.) దండమును పొందునది. వి. అ. పుం. ౧. బండి మున్నగువా హనము. ౨. కులాలచక్రము, కుమ్మరిసారె. ౩. మదపుటేనుఁగు. ౪. శరయంత్రము, విల్లు. (మే. ని.)

దండావతానకము. సం. వి. అ. పుం. కొయ్య వాఱుట, వాతరోగభేదము.

దండాసనము. సం. వి. అ. న. (యోగ) ఆసన భేదము. పుం. ఒకవిధ మగుబాణము, మూఁడ వవంతు శల్యము గలబాణము. (వై. ని.)

దండాహతము. సం. వి. అ. న.-కవ్వముతో తరి చినతక్రము—కాలశేయము, మజ్జిగ.

దండి[1]. వి. ౧. ప్రతాపము.

ఉ. చండకరాన్వయాంబునిధిచంద్రుఁడు భూర మణుం డతండు...రాజ్యముసేయుపెట్టు లీ, దండికి మెచ్చినారము ప్రతాపవిహీనుఁడు భూమిపాలుఁడే. కాశీ. ౫. ౩౦౦.

౨. శౌర్యము, పరాక్రమము.

క. వెండిమలం బండి మొలం, దండి సెలఁగ వె లుఁగుతోలుదాల్పువలఁతికిఁ, మెండుగఁ బెనుపండుగుగను, గొండయనుఁగుఁగూఁతు గలిసి కులికెడుదొరకున్. అచ్చ. రా.బాల. ౨౩.

గీ. కడఁగి హస్తంబులను రెండుకడల నున్న, రెం డుతలలును వెసఁ బట్టి దండి మెఱయ, నడి మిశిర మెక్కి కడుఁ గఠినంబులైన, పాద ఘట్టనములచేతఁ బగులఁ దన్నె. వి. పు.౭. ౧౬౫. సమీర.౧.౬౧.

౩. ధైర్యము.

వ...అవ్వేల్పు రాకొమరుండు ... మే నెల్లచె య్యులఁ గొఱఁత దస్సినం గొండవడుపున దండి విడువఁడయ్యె...అచ్చ. భా. ౪.౪౯.

క. దండిం బితరులు వెస మే,పాండంబులు ద్రెం చి తెచ్చి హత్తించిన ... భా. రా. బాల. ౫౧౨.

విణ. ౧. ప్రతాపవంతుఁడు. (శ. ర.) ౨. శౌ ర్యవంతుఁడు, పరాక్రమవంతుఁడు.

గీ. తగునె యర్జున యీపెంటితనము నీకు, దండి వైలెమ్ము మనసు పేదతిమి విడిచి.భార.భీష్మ. ౧. ౧౯౨. ఉద్యో. ౪. ౨౩౩.

క. వెండియు మిడుఁగుఱు లుమియుచు, మం డెడువాల్తూపుగముల మానిసిఁ బోఁడున్,దండి పాలదిండిరాయఁడు, నండ గొనక పోరు చుండి రక్కజ మొదవన్. అచ్చ. రా. యు. ౩౭౩.

౩. సంపూర్ణము.

ద్వి. వామనత్వము దాల్చి వచ్చి యద్దనుజు, భూమి మూఁడడుగులు పొసఁగంగ నడిగి, రెండడుగుల నే ధరిత్రియు దివియు,దండి మైఁ గొలిచి యాధన్యు బంధించి. రం. రా. బాల. ౩౦ పొ. ౨౧ పం.

౪. (త. తండి) గొప్ప, పెద్ద.

ఉ...సైన్యపు లిద్దఱు భర్తఁ గూడి యొం,డొండ హరిన్ హలాయుధుని నొక్కట నేసిరి వారి ముప్పురన్, దండిమగండు పంకరు హనాభుఁడు నొంచె శరత్రయంబునన్. హరి. ఉ. ౨. ౩౨.

ద్వి. నిండుకొలంకులో నిండార విరిసి, దండి ...

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యా ర క్తసంధ్యకపుష్ప మనఁగ. విష్ణుమా. పూ. ౨ ఆ. (శ. ర)

ఉ. దాఁటక మాన రిక్కడలి దాశరథుల్ తమ దండిమూఁకతో. రామా. ౭. ౭౬.

జ. దండితనము, దండివాఁడు.

దండి[2]. వి. రీతి, విధము.

సీ. కొట్టివైచినతలల్ గుట్టలై కాటుకకొండల దండిని మెండు చూప. దశా. ౬. ౧౩౭.

దండి. సం. విణ. (న్. నీ. న్) ౧. దండము గల వాఁడు. ౨. దండించువాఁడు. వి. న్. పుం. ౧. సన్న్యాసి, భిక్షువు, ౨. ద్వారపాలకుఁడు. ౩. యముఁడు. ౪. ఒకానొకసంస్కృతకవి, కావ్యాదర్శదశకుమారచరిత్రాదిగ్రంథములను రచించినవాఁడు. ౫. దమనకము, దవనముశ్రీ. ౬. చిలుక. (కే. ని)

దండించు. సం. స. క్రి. శిక్షించు, దండన చేయు.

క...తా,దోషము లరసి ప్రియాప్రియులను, సముఁడై దండింపవలయు జనపతి పుత్రా... మార్క. ౩. ౧౩౭.

సీ...ఒకనాఁడు యతుల నుగ్రత దండించు... భాగ. ౭. ౯౯.

దండిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. దండము, దుడ్డుకఱ్ఱ. ౨. ఒకవిధ మగుహారము. ౩. రజ్జువు, త్రాడు. ౪. దండరూపమున నుండి అల్పకలధ్వని నిచ్చువాద్యభేదము. (వై. ని, కే. ని)

దండికము. సం. వి. అ. పుం. ఒకజాతిచేప.

దండితనము. వి. (√దండి[1]) ౧. శౌర్యము, పరాక్రమము.

క. వెండియు ధనార్జనంబులు, గొండల వలనన ఘటించికొన నగు నేర్పున్, దండితనంబు ను బాడియు, నొండొంటికి మిగులఁ గలిగి యున్నట్టియునన్. భార. భీష్మ. ౧. ౩౭.

ఉ. దండితనంబు నీయెడన తక్కెనె నాదెస మైత్రి పెన్పు మిం,కొండొకమాట దక్కు ము రణోత్సహనం బొనరింపు గ్రక్కునన్. భార. విరా. ౪. ౩౭.

౨. అతిశయము, గొప్పతనము.

వ...వేల్పుఁజెట్టుపూదండలదండితనంబున మెం డుకొని...ఉ. రా. ౪. ౧౬౩.

వ...నీలంపుదూలంబులదండితనంబు లెచ్చరించి ...ఉ. రా. ౧. ౧౩౮.

దండితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దండింపఁ బడినవాఁడు.

దండియ(డె). వి. (సం. దండికా.) ౧. దండాకారవాద్యవిశేషము.

ఉ. మేళము ఘుమ్మనన్ శ్రుతిసమేతమునన్ జతగూర్చి మద్దెలల్, దాళము లావజంబులును దండెలు జంగులు నొక్కమ్రోఁతగా. శ్రీరం. మా. ౪. ౧౫౩.

౨. వీణె; కిన్నెర.

సీ. దండియలును మీరు దడియంగఁబడక యంతక యటువొండు గంధర్వముఖ్యులు ... నృసిం. ౧. ౮౧.

గీ...పిదపఁ జేతిదండియ యటు వెట్టి కేలు, మొగిచి భక్తిరసం బాత్మ ముంచుకొనఁగ, కోరి కీర్తించెఁ బ్రభువు నన్నారదుండు. హరి. ఉ.౩.౩౩.(ప్రాఁతప్రతి. శ. ర.షా.)

వ...తంబుఱలు కిన్నెరలు రావణహస్తంబులు రబాబులు మీటుసురతానులు కామాక్షులు ముఖవీణెలు పిల్లఁగ్రోవులు దండెలు డక్కీలు ...ప్రబంధ. ౬౦౫.

(మాలదాసరి.)ఉ...త్రివర్ణేతరజాతి మెచ్చి ద య నిడ్డప్రసాదము దండె సాఁచి శ్రద్ధాతిశయంబునన్ వినతి నంది భుజించుఁ గొనుం ద దంబువున్. ఆము. ౬. ౯౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౩. తంబుఱ. (బ్రౌ.)

వ...మృదంగం బుపాంగం బావజంబు దండె తాళం బురుమ కిన్నెర సన్నగాళె వీణె ముఖవీణె వాసెగ్రోలు డోలు...ఆము. ౪. ౩౫.

౪. పల్లకీబొంగు.

సీ. వెలయింపఁ బన్నాగములఱఁ బై నిడినయ ట్బురపుదండెలుపోలె బొమలు దనర. కళా. ౬. ౧౪౪.

ద్వి. వల నొప్ప దండెలవజ్రాల మించు,దొలఁ కాడుచున్నయాందోళిక లేవి. ద్వి. హరిశ్చ. ఉ. ౨౨౪ పం.

౫. త్రాసుకోల,తక్కెడకఱ్ఱ. (శ. ర.)

౬. పడుగు నేల రాచుకొనకుండ మగ్గపుగుంత కెదుట అడ్డముగా పాఁతినకొయ్య.

సీ. పరిపరి యచ్చులు చరికుండ యూడిత చీడు దబ్బలు దండె నాడె క్రోవి. హంస. ౨.౧౧౧.

౭. ఏతపుకడవకు మీఁద నడ్డముగా నుంచి కట్టెడుకొయ్య. (శ. ర.)

౮. ఆయుధవిశేషము.

వ...భారతీదేవిముక్కు చిదిమి గాలి వధ్యంబు చేసి జమునిమెడ దండె దగిల్చి యదితియధరపల్లవంబు చక్కడఁచి...కాశీ. ౬. ౯౫.

దండియ(డె)ము. వి. (సం. దండికా) ౧. వస్త్రములు ఎండవేయుట మొదలగువానికై అడ్డముగా కట్టెడుకఱ్ఱ,మొ.

వ...పులుం గెతెంగి...పాండురంగాయతనంబు మధ్యరంగంబుఁ జొచ్చి యచ్చట నిచ్చం దనయిచ్చ నుండుదండియంబుపై వ్రాలక ...పాండు. ౪. ౨౩౬.

గీ.ఉదికినమడుంగుదోవతు లుంచినట్టిదండె మా పాసనము సేయకుండ మమర. హంస. ౧. ౧౫౧.

౨. గరిడిసాధనములలో నొకటి.

సీ. దండెము ల్దోసినకండెము లలభుజాకాండమ్ములను సానకత్తు లమర. శశాం. ౨. ౧౬.

జ: దండెపుఁబీటలు.

దండివాఁడు. విశే. (√దండి[1]) బలాఢ్యుఁడు.

సీ. బలువిడి యనఁగను బల్లిదుం డనఁగను దండివాఁ డన బలాఢ్యుండు చెలఁగు. ఆం. భా. ౩. ౧౧.

దండు[1]=తండు. స. క్రి. (ధనాదికమును) గ్రహించు, సంపాదించు.

మ...కానరే యీజపాకలనాతంద్రు మునీంద్రు నంచుఁ బొగ రెక్కక ఎక్క సామ్రాణిదం, టలివక బాఁటుచుఁ ద న్మనోధనము దండక దండ నేతేరఁగక. చంద్రా. ౩. ౯౭.

(వ్యవ.) వాఁడు ఊర నాలుగుడబ్బులు దండుకొన్నాఁడు.

దండు[2]. వి. (సం. దండః. క. దండు.) ౧. సేన.

సీ...దండు దడ మనంగఁ దనరు సేన. ఆం. భా. ౨. ౨౧౦.

చ. పొలుపుగఁ జంద్రశేఖరుతపోవన మంగజ చక్రవర్తి దోర్బలమున ముట్టి చూఱకొనఁ బంచినదండొకొ నాఁగ...కు. సం. ౩. ౩౫౦.

౨. దండయాత్ర.

వ...వారలు ప్రియంబునం బనిపూని వెడలి దండు సాటించి తగువారల కెల్ల నెఱింగించి పుచ్చిన...భార. ఉద్యో. ౪. ౧౩౬.

చ. మగువరో వీఁడె లక్ష్మణుఁడు మన్మథమన్మథుఁ డీశుభాంగుఁ డేతగులును లేక యీ యడవి దం డొసరింపఁగ వచ్చినాఁడు... చం. రా. ౫. ౩౪.

౩. సమూహము.

గీ. తాండవం బాడె మిన్నేటితరఁగదండు. హర. ౬. ౭౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. తివిరి జేజేలు మానిసిదిండికాం డ్ర,దండులును గూడి ప్రాలేఁబు ద్రచ్చుతతిని. అచ్చ.రా. బాల. ౧౫౨.

౪. దండము.

వ...శ్రీభీమేశ్వరమహాదేవరకుం గమ్మనాణ్టి త్రిభువనమల్లదేవరాజు పెగ్గడ అ(రి)యపె(గ్గడ) అఖణ్డవర్తిఁ లోహదణ్డు ౧ణికి నాచంద్రార్కర్కమునెయి సరియించ్చువారుగా... దా. శా. ౧౦౫౪. (దండాకారమైనకాఁగడా అని భావము.)

వ...శ్రీభీమేశ్వరమ...కు నుత్తరాయణసంక్రాంతినిమిత్తమునం బెట్టిన అఖణ్డవర్తిఁలో హదణ్డుదివియలు రెణ్టికి నాచంద్రార్కర్కము నిత్యపడి సారపచ్చకపూర్వరపు...దా. శా. ౧౦౪౯.

వ...శ్రీభీమేశ్వరదేవరకుంబెట్టిన అఖణ్డవర్తిఁ లోహరూపారదివియదణ్డు౧ణ్టికి బోలు నలువురుంబూణ్టిగా నాలవునడపున...దా. శా. ౧౧౪౬.

జః దండుకదలు, దండుచేయు, దండుడిగ్గు, దండుదివియ, దండునడచు, దండుబాట, దండులంజె, దండువచ్చు, దండువిడియు, దండువెట్టు, దండువెడలు, దండువోవు, దండెత్తు.

దండుఁడు. సం. వి. అ. పుం. ౧. యముఁడు. ౨. రాజు. ౩. సూర్యుని ప్రక్కనుండువారిలో నొకఁడు. (దండుఁడు, పింగళుఁడు, మాఠరుఁ డను మువ్వురు. సూర్యుఁడు దైత్యులకు వరమియ్యుండఁగ చూమటకు రుద్రాగ్నియములు క్రమముగా పయిమూఁడునామములతోవర్తింతురు.)

౪. ఇక్ష్వాకుపుత్రుఁ డగుసూర్యవంశపురాజు.

దండుక(గ)దలు=దండుచేయు. అ.క్రి. (దండు² +కదలు) దాడివెడలు, దండెత్తు.

సీ. గర్వించి సర్వసుపర్వసామ్రాజ్యంబు గైకొందు నని దండుకదలఁ దలఁచి. వరాహ. ౧౧. ౧౨౨.

క. కావున శూరుం డుత్సాహావేశం బైనయపుడె యహితులమీఁదఁ, వేవేగ దండుగదలం, గా వలయును...కళా. ౭. ౨౪౯.

దండుగు(గ)=దండువు. వి. (సం. దండః) ౧. (ధనాదుల) నష్టము.

(వ్యవ) నాకు ఆవ్యవహారములో పదిరూపాయల దండుగు వచ్చినది.

(వ్యవ) ఇది దండుగబేరము. దీనిలో లాభము లేదు.

౨. అధికారి అపరాధివలన అపరాధపరిహారము నకుగాను పుచ్చుకొనుధనము.

గీ. దండు వన దండు గనఁగను దండమనకు, బ్రతినిధిగఁ దీయుద్రవ్యంబు పరఁగు...ఆం. భా. ౨. ౧౯౦.

క...కొంకక యేనూఱు దండుగుం గొనవలయుఁ. విజ్ఞా. ప్రా. ౧౨౯.

క. నెమ్మదిఁగనలుచు దండుగఁ, దె మ్మనినఁ నెట్టి యేఁడఁ దెచ్చు...శుక. ౨. ౨౧౭.

౩. రాజు ధనవంతుని బలాత్కారముచేసి పుచ్చుకొనెడుధనము.

ద్వి. కలవారిఁ గని దండుగలు వెట్టె నృపుఁడు. విష్ణు. పూ. ౩. (శ. ర.)

దండుచే(సే)యు=దండుకదలు.అ. క్రి. (√దండు²) దండెత్తు.

గీ. ఒక్కొకదినంబు తమయింటియొద్దివారిఁ,దలఁచికొన్నప్పు డొదవుసంతాపభరము, పూనకుండుట యెట్లు భవానిపతియు,వాసిఁ బూని ధరం దండుచేసె నేని. రా. వి. ౨. ౬౯.

దండుడి(ది)గ్గు(గు)= దండువిడియు. అ. క్రి. (√దండు²) సేనలు బసచేయు.

చ...ఇల యెల్లను ముంచి రసాతలంబుపై, విడి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యఁగ దండుడిగ్గిన సవిద్యుదురు స్తన యిత్ను
లో యనఁ. ఆము. ౪. ౧౭౫.
గీ. దండుదిగినాఁడు ఖండనోద్దండుఁ డగుచు. దశా. ౫. ౧౯.

దండుదివియ. వి.(√దండు²)దీపపుసెమ్మె.(శ.ర.)

దండునడచు=దండుకదలు. అ.క్రి. (√దండు²) యుద్ధమునకు వెడలు.
ద్వి. కైకొని యింక నిక్ష్వాకువల్లభుఁడు, నాకా రిపై దండునడచుచున్నాఁడు. రం. రా. కిష్కిం. ౭౧౯ పా. ౫ పం.

దండుబాట.వి.(√దండు²)ఘంటాపథము.(శ.ర.) ఇట్లే: దండుదారి మొ.

దండులంజె= గుత్తలంజె. వి. (√దండు²) బజాతి, దండులోఁ బోవువ్యభిచారిణి.
సీ...తగు బజాతి యనంగ దండులంజె. ఆం. భా. ౨. ౧౧౪.

దండువ. వి. మత్స్యవిశేషము.
సీ. వెలిమొట్టలను దండువలఁ దలార్లకు నిచ్చెఁ గొడిసెల పరిహాసకులకు నిచ్చె. ద్వా. ౧. ౭౪౦. (దండువుల. ముద్రి. పా.)

దండువచ్చు. అ. క్రి.(√దండు²)జైత్రయాత్రకు వచ్చు.
ఉ. ఇంటికిఁ బొమ్ము క్రమ్మరఁ జెలీ నిలు నిన్నిలు సేర్చి వత్తునో, వెంటనె దండువచ్చెదవొ వేగమె రా మతి యేల యందువో. రా. వి. ౨. ౫౭.

దండువిడియు=దండుడిగ్గు. అ. క్రి. (√దండు²)
౧. సేనలు బసచేయు.
గీ. జిష్ణుతో మాటలాడ హేజీబు ననుతు,రార తిప్పనృపాలబాహాసినిహతు, లైనయలహిం దుఖానసేనాధిపతులు, నిండి సురపత్తనము చెంత దండువిడిసి. కువల. ౧. ౩౩.
గీ. దండువిడిసె బలీంద్రుఁ డక్కొండదండ. దశా. ౨. ౫౬.
౨. దండువెడలు.
గీ. అవధరింపుము కుంభసంభవమహర్షి,చంద్రుఁ డిట్లను శ్రీరామచంద్రుఁ జూచి, జానకీనాథ యిటు లద్దశాననుండు, విత్తవిభువీటిపై దండువిడిసె నపుడు. ఉ. రా. ౩. ౨.

దండువు(వ)=దండుగు.
(అధికారి అపరాధివలన అపరాధమునకుఁ గాను పుచ్చుకొను ధనము.)
క. కావఁ గొనిపోయి యేమతి, గోవులఁ దాఁ జేటిచెనేని గొల్లఁడు పతికిఁ, గోవులవెల యరువం దగు, భూవరునకుఁ గొంతదండువును బెట్టఁ దగుఁ. విజ్ఞా. ప్రా. ౧౧.
సీ...దండువులు దర్శనములు కోలాసఁగొన కూళ్లు గుత్తకీక. గీ. డాఁపవలయు విభుండు భండారమునను. పి. శకుం. ౪. ౧౪౫.
చ.వణిజులు తప్పుచేసినను వారల దండువఁ బెట్టఁ బంచి...దశకు. ౬. ౧౦౧.

దండువెట్టు. స. క్రి. (√దండు²) దండించు.
ద్వి. పెద్దనాగయగారి వెడఁగుపర్చితివొ, దస గణసింగయ్య దండువెట్టితివొ. పండితా. మహిమ. ౩౦౬ పా.

దండువెడలు=దండుకదలు. అ. క్రి.(√దండు²) దాడివెడలు, దండెత్తు.
ఆ. ప్రతిన వలదు వైరిపట్టున నృపతికి, దండు వెడలఁ దీరకుండుఁ దీరఁ,గాక...ఆము. ౪. ౨౬౩.
గీ...అలరువింట, గొనయ మెక్కించి వలరాజు కినుక మీఱ, విరహిజనములపై దండువెడలె నపుడు. పారి. ౨. ౪౯.

దండు(పో)వోవు=దండుకదలు. అ. క్రి.(√దండు²) దండువెడలు.
సీ. చేతఁ గైకొని యాళ్లు చెరిగాద సని పోవు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దండువో ష్మన్న సంతాప మందు. శుక. ౨. ౨౦౭.

ఉ. పంచశరుండు పాంథజనబంధనబంధురబుద్ధి దండువో, కెంచఁగ...సమీర. ౧. ౧౨౪.

సీ. కొనినబలంబులు కొమరారఁగాఁ గొల్వ భూతేశుపై దండుపోదుగాక. వీర. ౨. ౪౭.

దండెత్తు=దండుకదలు. అ. క్రి. (√దండు³) దాడివెడలు.

మ...ఉత్కటదర్పోద్ధతవృత్తి నొత్తి నడచెక్ దండెత్తి యుద్దండుఁడై.దశకు. ౧౧. ౧౧౯.

మ. తనలోఁ జొచ్చినశాంకరజ్వరముపై దండెత్తఁ గల్పించె నద్దనుజారాతి ప్రతిజ్వరంబు ...ఉ. హరి. ౬. ౯౭. ఆశ. ౧. ౧౧.

దండెపుఁబీఁటలు. వి. బ. (దండెము+పీఁటలు) గడచీల తగుల్చుటకు దండెనడుమ గ్రుచ్చినరంధ్రములు గలరెండుపీఁటలు. (శ. ర.)

దండోత్పలము. సం. వి. అ. న. తెల్లపువ్వుల సహదేవచెట్టు.(దీనిఆకులు టోపీ కుట్టి ధరించిన జ్వరము పోవును.)

దండ్యమానుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) దండింపఁబడుచున్నవాఁడు.

దండ్యుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) ౧. దండింపశక్య మైనవాఁడు. ౨. దండనార్హుఁడు.

దంతకము. సం. వి. అ. పుం. ౧. పల్లు. ౨. శిఖరము, కొండకొన. ౩. పర్వతమునుండి జాఱి పడినపెద్దఱాయి. (వాచ)

దంతకర్షణము. సం. వి. అ. పుం. జంబీరము, నిమ్మచెట్టు.

దంతకారుఁడు. సం. వి. అ. పుం. దంతపుఁబనివాఁడు.

దంతకాష్ఠకము. సం. వి. అ. న. తంగేడుచెట్టు. (దీనిపుడకలు దంతధావనమున నుపయోగపడును.)

దంతకాష్ఠము. సం. వి. అ. న. పలుదోముపుడుక.

దంతకుఁడు. సం. విశ. (అ. తికా. అ.) పండ్లు శుభ్రపఱుచుకొనుటయం దాసక్తి కలవాఁడు.

దంతకూరము. సం. వి. అ. పుం. (దీనియందు వీరులు పండ్లు కొఱుకుదురు.) యుద్ధము, పోరు.

శ్లో. మాద్రీపుత్రస్సహదేవః కలింగాన్ సమాగతానజయద్దంతకూరే. సం. భార. ఉద్యో. ౨౩. ౨౪. (దంతకూరే=సంగ్రామే. నీలకంఠవ్యాఖ్య.)

దంతక్షతము. సం. వి. అ. పుం. పలునొక్కు, పల్లొత్తు, కొఱుకుటవలనిగాయము.

దంతక్షతి. సం. వి. ఇ. స్త్రీ=దంతక్షతము.

దంతఘర్షము. సం. వి. అ. పుం. పండ్లు పెటపెట కొఱుకుట.

దంతఘాతము. సం. వి. అ. పుం. దంతక్షతము, పలుకాటు, పంటితో కొఱుకుట.

దంతచ్ఛదము. సం. వి. అ. పుం- దంతములను కప్పునది- ఓష్ఠము, వాతెర, పెదవి.

దంతచ్ఛదోపమ. సం. వి. ఆ. స్త్రీ- అధరమున కుపమాన మైనఫలము గలది- బింబి, దొండచెట్టు. (కల్ప)

దంతజాతుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) జాతదంతుఁడు, పండ్లు వచ్చినవాఁడు. (శిశువు.)

దంతజాహము. సం. వి. అ. న. దంతమూలము, పంటికుదురు.

దంతధావనము. సం. వి. అ. న. ౧. పలుదోముట. ౨. దంతకాష్ఠము, పలుదోముపుడుక. పుం. వకుళము, పొగడచెట్టు. ౨. ఖదిరము, చండ్రచెట్టు.

దంతన్యాసము. సం. వి. అ. పుం. దంతక్షతము, పలునొక్కు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దంతపత్త్రకము. సం. వి. అ. న. ౧. కర్ణభూషణము, చెవికమ్మ. ౨. కుందము, మొల్ల.

దంతపత్త్రము. సం. వి. అ. న.ఒకవిధ మగుకర్ణభూషణము, చెవికిఁ బెట్టుకొనెడియొకరీతినగ.

దంతపత్త్రిక. సం.వి. ఆ. స్త్రీ. దంతపత్త్రకము.

దంతపవనము. సం. వి. అ. న. ౧.-పండ్లను శుద్ధి చేయునది- పలుదోముపుడుక. ౨. దంతధావనము, పలుదోముట.

దంతపుప్పుటము. సం. వి. అ. పుం. ఇగుళ్లయందలి వ్రణము, పంటికురుపు.

దంతపుష్పము. సం. వి. అ. న. ౧. కుందము, మొల్ల. ౨. చిల్ల, కతకము, ఇందుగు.

దంతఫల. సం. వి. ఆ. స్త్రీ. పిప్పలి.

దంతఫలము. సం. వి. అ. పుం. వెలఁగ. న. చిల్లగింజ, ఇందుగుకాయ.

దంతబీజము. సం. వి. అ. పుం. (పండ్లవంటిగింజలు కలది) దానిమ్మ.

దంతభాగము. సం. వి. అ. పుం. ఏనుఁగుదేహమున ముందటిభాగము. (కల్ప.)

దంతము. సం. వి. అ. పుం. ౧. దశనము, పల్లు. ౨. ఏనుఁగుదంతము. ౩. పర్వతనితంబము, కొండనడిమిప్రదేశము ౪. కుంజము, పొదరిల్లు. ౫. ముప్పదిరెండు అనుసంఖ్య.

దంతమూలీయము. సం. వి. అ. పుం. దంత్యాక్షరము. (ౡ, త, థ, ద, ధ, న, ల, స) అనువర్ణములు.

దంతలేఖకుఁడు. సం. వి. అ. పుం. దంతములపై చిత్తరువులు వ్రాయువాఁడు; పండ్లపై పువ్వులు మొదలగునవి చెక్కువాఁడు.

దంతవల్కము. సం. వి. అ. న. పంటియిగురు, పలుకుదురు.

ఇట్లే: దంతమాంసము, దంతమూలము.

దంతవస్త్రము. సం. వి. అ. న. పెదవి. (వై. ని)

దంతవాసస్సు. సం. వి. స్. న. పెదవి.

దంతవేష్టము. సం. వి. అ. పుం. ౧. పంటియిగురు. ౨. ఏనుఁగుదంతములకు వేసినపొన్ను. ౩. పలుఁగురుపు.

దంతశంకువు. సం. వి. ఉ. పుం. పండ్ల నూడఁదీయుపట్టుకారు.

దంతశఠ. సం. వి.ఆ.స్త్రీ. చాంగేరి, పులిచింత.

దంతశఠము. సం. విశ. (అ. ఆ. అ) పుల్లనిది. వి. అ. పుం. ౧.-దంతములకు బాధ కలిగించునది-పుల్లన. ౨. జంబీరము, నిమ్మ. ౩. కపిత్థము, వెలఁగ. ౪. కర్మరంగము. ౫. నాగరంగము, నారింజ. ౬. అమ్లము,చింత. (కే. ని.)

దంతశర్కర. సం. వి. ఆ. స్త్రీ. దంతరోగభేదము, దంతములయందలిమలమును (పాఁచి) తాయిపలె ఘనీభవింపఁజేయురోగము.

దంతశాణము. సం. వి. అ. పుం. దంతచూర్ణభేదము, ఒకవిధ మగుపండ్లపొడి.

దంతహర్షకము. సం. వి. అ. పుం. జంబీరము, నిమ్మ.

దంతహర్షము. సం. వి. అ. పుం. దంతములు పులియుట.

దంతాఘాతము. సం. వి. అ. పుం. ౧. దంతక్షతము, పల్గాత్తు. ౨. దంతముయొక్కదెబ్బ. ౩. నిమ్మ.

దంతాదంతి. సం. అవ్య. ఒండొరులు పండ్లతో కఱచుచు చేయుయుద్ధము, కాట్లాట.

దంతాదము. సం. వి. అ. పుం. దంతములను భక్షించుక్రిములు గలరోగము.

దంతాయుధము. సం. వి. అ. పుం. - దంతము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లాయుధము గాఁ గలది_సూకరము,పంది.(త్రి.ని)

దంతార్బుదము. సం. వి. అ. పుం. న. పండ్లయి గురువాఁపు.

దంతాలయము. సం. వి. అ. న. నోరు, వాయి.

దంతాళి. సం. వి. ఈ. స్త్రీ. ౧. వల్గ, గుఱ్ఱముకళ్లెపుత్రాడు. (వై. ని.) ౨. పలువరుస.

దంతావళము. సం. వి. అ. పుం. - ప్రశస్తదంతములు కలది-ఏనుఁగు.

దంతి. సం. విణ. (న్. నీ. న్) ౧. దంతములు కలది. ౨. పెద్దదంతములు కలది. వి. న్. పుం. ౧. ఏనుఁగు. ౨. శిఖరి, కొండ. ఈ. స్త్రీ. ఉదుంబరపర్ణి, నేపాళము.

సీ...ఊడుగ దంతి వెట్టినిమ్మ. హంస. ౪. ౯.

దంతిజ. సం.వి. ఆ. స్త్రీ. నేపాళము.

దంతిని. సం. వి. ఈ. స్త్రీ. దంతి.

దంతిమూలిక. సం=దంతిజ.

దంతియ[1] (తె). వి. (సం. తండకః) ౧. ఇండ్లకు వేయుకమ్మి? మిద్దెటింటికి అడ్డముగా వేసెడు పట్టె-శ. ర.

మ. దల మానీలపుటాలదూలములఁ పై దార్కొ-
న్న నున్పంచదం, తెలఁ దాపించినకెంపుటిట్టిక
లసందిం బొంది రా వజ్రగా, రెలఁ జెన్నా
నొకగట్టిచప్పరములో చేరాచరాతిన్నె
పై౯. దశా. ౪. ౪౯.

౨. స్తంభముమీఁదిపీఁట.

సీ.పటికంపుగుండుఁగంబముతళ్ తళ్రుచుల్ దరిఁ
జేర్చుదంతంపుదంతెలు... రా. వి. ౫. ౭౫.

౩. కృషిసాధనవిశేషము, నేల చదునుచేసెడి అచ్చుకట్టు. (శ. ర.)

సీ. గుంటక నాఁగను గొఱ్ఱు నా దంతె నాఁ
బాపట మనఁగను బరఁగును గృషి,సాధనభే
దము... ఆం. భా. ౨. ౨౩౩. (ప్రాత
ప్రతిపా.)

దంతియ[2] (తె). వి. (సం. దంతీ) నేపాళము.

గీ...దంతె యనఁగ దంతి, మనును... ఆం. భా. ౨. ౬౭.

దంతీబీజము. సం. వి. అ. న. నేపాళపుగింజ.

దంతురచ్ఛదము. సం. వి. అ. పుం. మాదీఫలము, బీజపూరము.

దంతురము. సం. విణ. (అ. ఆ. అ) ౧. మిట్టపండ్లు కలది. (వై. ని.) ౨. విషమము, నిమ్నోన్నతము, మిట్టపల్లమైనది. (మే. ని.)

దంతురితము. సం. విణ. (అ. ఆ. అ) దంతురముగాఁ జేయఁబడినది, నిమ్నోన్నతముగాఁ జేయఁబడినది.

దంతూలము. సం. విణ. (అ. ఆ. అ) పండ్లు కలది; ప్రశస్తదంతములు కలది.

దంతోలూఖలి. సం. వి. న్. పుం. - దంతములే ఉలూఖలము(రోలు)గాఁ గలవాఁడు-దంతముల చేత వడ్లు మొదలగువాని పైపొట్టు తీసి తినెడు నియమము గలవానప్రస్థుఁడు. (విల్యమ్సు)

దంతోలూఖలికుఁడు. సం. వి. అ. పుం = దంతోలూఖలి. (విల్యమ్సు)

దంత్యము. సం. విణ. (అ. ఆ. అ) ౧. దంతమునందు పుట్టినది. (వర్ణాది.) ౨. దంతములకు హితమైనది. (దంతచూర్ణాది.)

దందడి. వి. (క. దందలె). ౧. సంకులరణము, దొమ్మి.

సీ. అలరు దందడి దొమ్మి యన సంకులరణాఖ్య
...ఆం. భా. ౨. ౨౨౨.

౨. సాంద్రత; ఆధిక్యము.

క. చని మదనాగ్ని జ్వాలలు, దనుకఁగ నిట్టూ
ర్పుగాడ్పు దందడి నిగుడన్. భార. విరా.
౨. ౬౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ... నేత్రములఁ బ్రమోదబాష్పములదందడి
గ్రందుకొనంగ నందఱుఁ. మార్క. ౭.
౧౬౧.

౩. సమ్మర్దము, రాయిడి.

చ. గిరిపహరసితంబు లగుకేసరులుఁ వడిఁ బే
ర్చునప్పయో,ధరపటుగర్జలం దలఁకి దందడి
నున్నవి యున్నచోన య, చ్చెరువుగ గుండి
య ల్వగిలి చేష్టిత మేమియు లేక యుం
డె...హరి. పూ. ౭. ౧౭౦.

విణ. అధికము; సాంద్రము, తఱచైనది.

సీ. కడఁగి ధర్మముతోడ నడచుచు నే మిట్లు
దందడిదుఃఖంబుఁ బొందుటయును, నేపున
నెప్పుడు పాపంబు సేయుచు ధృతరాష్ట్ర
జులు సుఖోన్నతు లగుటయు. భాగ. ఆర.
౪. ౧౬౯.

క్రి. విణ. ద్రు. అధికముగా.

క. శిరము లలాటంబును గం,ధరమును బాహు
వులు నురము దందడి వ్రయ్యఁ...దృఢ
దీప్తశాతభల్లము లేసెఁ. భార. విరా. ౫.
౧౦౭.

క. పంది వడిఁ బొఱు దెంచెఁ బు,రందరనందనని
శాకరధరులనడుమఁ, దందడి గౌరిజలతాఁ
కునఁ, గందుకములువోలె శిలలు గఱుపారం
గఁ. హర. ౭. ౪౫.

జః దందడించు, దందడిపడు, దందడివెట్టు.

దందడించు. అ. క్రి. (√దందడి) అధికమగు; సాంద్రమగు.

సీ.తలఁపులసందడి దందడించినతాల్మికదలు శిరః
కంపగతుల బెరయ. భార. ఆర. ౭. ౨౮.

గీ. దందడించుమనోరథోద్ధతవిహార,సరణిఁ జం
పకమాలినీతరుణిఁ గూడి,మానినులు గోసి
రవ్వనమంజరులను. జై. భా. ౮. ౭౩.

దందడిపడు. అ. క్రి. (√దందడి) సాంద్రమగు; రాయిడిపడు, కలఁతనొందు.

క. నందనవని నిన్నఁ సం,క్రందనుఁ గనుఁగొంటి
నతనిఁ గనినంతనె నా,డెందము గబీలుమని
యెఁ, దందడిపడువానిదీనదశ యే మం
దుఁ. అహ. ౩. ౮.

దందడివెట్టు. స. క్రి. (√దందడి). సమ్మర్దము కలిగించు.

ఉ. ముందర రాజుఁ బుచ్చి బలముల్ గలయం
బడి గోవ్రజంబులఁ, దందడివెట్టకుండఁ
బిఱుఁదఁ నడపింపఁగఁ బంచి...భార.
విరా. ౪. ౧౭౪.

దందన(ము). వి.మాయ; జాలము.(శ. ర.చి.ని.)

జః దందనకత్తె, దందనకాఁడు, దందనసేయు.

దందనకత్తె(త్తియ) విణ. (√దందన) మాయ చేయునది (శ. ర)

దందనకాఁడు. విణ. (√దందన) మాయకాఁడు. (శ. ర)

దందనసేయు. అ. క్రి. (√దందన) మాయ చేయు,మోసగించు.

క...కొందఱకుం గూరలొసఁగి కొందఱ కిడకే,
దందనసేయుచు గెంటుచుఁ,గొందఱఁ దిట్టు
చును వెళ్లఁగొట్టుచుఁ గడఁకఁ. చంద్ర.
వి. ౧. ౬౦.

దందశూకము. సం. వి. అ. పుం. సర్పము.

దందశూకుఁడు. సం. వి. అ. పుం. రాక్షసుఁడు.

శ్లో. ఇషుమతి రఘుసింహే దందశూకాన్ జి
ఘాంసౌ. భట్టి. ౧. ౨౬.

దందహ్యమానము. సం. విణ. (అ. ఆ. అ) మిగుల కాల్పఁబడుచున్నది.

దంధనము. సం. విణ. (అ. ఆ. అ) శాశ్వతము కానిది.

గీ. స్వప్నలబ్ధపదార్థంబుచందమునను, దలఁచి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చూడంగ వట్టిదంధనము ధనము. కవిరా. ౧. ౧౩౩.

దంధమాలు. వి. బ. పిరంగులవారు.

చ. బలముల నెచ్చరింపుచుఁ దుపాకులమూఁక లు దండమాలు నిట్టలముగ మోరిజా ల్బుసజు డాయఁ గిలార్పుచు...రంగా. ౩. ౭౭.

వి. మల్లవిద్యావిశేషము, చోరవనేర్పులలో నొకటి. మల్లుపు. ౩. ౬౯.

దంపకత్తి. వి. (దమ్ము + కత్తి) దంపనాఁగలి. (శ. ర)

దంపతులు. సం. వి. ఇ. పుం. ద్వి. జాయాపతులు, ఆలుమగలు.

దంపనాఁగలి. (దమ్ము + నాఁగలి) దమ్ముచేయుట కుపయోగించు నాఁగలి. (శ. ర)

దంపు=దంచే. స. క్రి. (√దంగు) నలఁగఁగొట్టు.

వ...సైంధవంబులదంపియు...భా. ౬. ౩౭౦.

గీ. వంపుగుడిసెల సామగ్రి దంపుటోళ్లు, కులుచరోఁకండ్లు చిన్నిదాఁగరలు మొదలు, గాఁ గలుఁగువస్తుజాతంబు గార్దభములు, మోచి తేవెంట నూకరములు చనంగ. చెన్న. ౨. ౨౦౪.

వి. దంచుట, దంపుడు, నలఁగఁగొట్టుట. (శ. ర.) (వ్యవ) వారు దంపునకు రారు.

దంపుటిల్లు. వి. (దంపు + ఇల్లు) దంచునట్టియిల్లు. (శ. ర.)

దంపుడు= దంపు. (శ. ర).

దంభకుఁడు. సం. విణ. (అ. భికా. అ) ప్రతారకుఁడు, మోసగాఁడు.

దంభనము. సం. వి. అ. న. మోసము; బడాయి.

దంభము. సం. వి. అ. పుం. ౧. కపటము, మోసము. ౨. డంబము, బడాయి. ౩. పాపము. (హే. ని)

దంభోళి. సం. వి. ఇ. పుం. ౧. -హింసించునది- ఇంద్రునివజ్రాయుధము. ౨. వజ్రమణి, మగటాయి.

దంశకము. సం. విణ. (అ. శికా. అ) కొఱుకునది, కఱచునది. వి. అ. పుం. ఒకజాతిఈఁగ.

దంశనము. సం. వి. అ. న. ౧. కాటు. ౨. కవచము. పుం. పల్లు.

దంశనీయము. సం. విణ. (అ. ఆ. అ) కఱవఁదగినది, కొఱుకఁదగినది.

దంశభీరువు. సం. వి. ఉ. పుం. దున్న, ఎనుపోతు.

దంశము. సం. విణ. (అ. ఆ. అ) కొఱుకునది, కఱచునది. వి. అ. పుం. ౧. కఱచుట, కొఱుకుట. ౨. ఈఁగ. ౩. రత్నదోషములలో నొకటి. ౪. దంతము, పల్లు. ౫. కవచము. ౬. అవయవసంధి, మర్మస్థానము. ౭. ఒకజాతిదోమ. (హేమ. ని, కే. ని.)

దంశి. సం. వి. ఈ. స్త్రీ. చిన్నఅడవియీఁగ.

దంశిక. సం. వి. ఆ. స్త్రీ. పటుకాలు. (శ. ర.)

దంశితుఁడు. సం. విణ. (అ. ఆ. అ) ౧. జాతదంశుఁడు, కాటుపడ్డవాఁడు. ౨. వర్మితుఁడు, కవచము తొడిగినవాఁడు.

దంశేరము. సం. విణ. (అ. ఆ. అ) ౧. కఱచునది, కాటు వైచునది. ౨. పీడ కలిగించునది, బాధకము.

దంశ్యము. సం=దంశనీయము.

దంష్ట. సం. విణ. (ఋ. ష్ట్రీ. ఋ) కఱచునది.

దంష్టవ్యము. సం=దంశనీయము.

దంష్ట్రి. సం. వి. ఆ. స్త్రీ. కోఱ, పల్లు.

దంష్ట్రాయుధము. సం=దంతాయుధము.

దంష్ట్రాలము. సం. విణ. (అ. ఆ. అ) ౧. దంష్ట్రి, కోఱలు కలది. ౨. పెద్దకోఱలు గలది.

దంష్ట్రాస్త్రము. సం. విణ. (అ. ఆ. అ) కోఱలు అస్త్రముగాకలది. వి. అ. పుం. అడవిపంది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దంష్ట్రి. సం. విణ. (న్. ఈ. న్) కోఱలు గలది. (మృగాది) వి. న్. పుం. ౧. అడవిపంది. ౨. పాము. ౩. దుమ్ములగొండి. (విల్యమ్సు.)

దంష్ట్రికము. సం. విణ. (అ.ఆ.అ) కోఱలుకలది.

దకము. సం. వి. అ. న. ఉదకము, నీరు.

శ్లో...'భువన మమృతం జీవనీయం దకం చ' హలా.ని.

శ్లో...కమలం నీరం నారా స్త్రియా మిరా, కం దకం జలమ్...త్రి. ని.

దకోదరము. సం. వి. అ. పుం. జలోదరరోగము.

దక్కఁగొను. స. క్రి. (దక్కన్ + కొను) దక్కించుకొను, వశముచేసికొను.

గీ. ఘోరతపముల హరు దక్కఁగొన్నవారు, కరటిదైతేయకుంభముక్తాలలామ, హారిభుజమధ్యములవా రుదారయశులు, ప్రమథవీరులు గొలిచి రాబాహులేయు.పాండు.౧.౧౬౫.

క. ఈలాగు వానితో నవ్వు,టాలకుఁ బన్నిద మిడి సొగటా లాడఁగ నో,టా లగు నీ కర్థేందుని,టాలా యని దక్కఁగొనుఁ గటా లలితాంగిక. ప్రబంధ. ౬౩౬.

దక్కించు. స. క్రి. (√దక్కు) దక్కఁజేయు; నిలుపు, నిలఁబెట్టు.

(వ్యవ) సాకు మాట దక్కింపుము.(నామర్యాద నిలుపు మనుట.)

సీ...సభలో సులూకునిఁ బంచి యాడించిన పరుసములును, గక్కించి బీరంబు దక్కించుకొన నీక తెగఁజూడఁ గాంచితి... భార. భీష్మ. ౨. ౩౯౭.

దక్కినదిక్కు. వి. (దక్కినము + దిక్కు)దక్షిణదిక్కు.

గీ. ఆక్కజంబుగ దక్కినదిక్కునందు, దివిజులకు నెల్లఁ దుల యయి తివిరి నిలిచె. భా. రా. ఆర. ౧. ౭౬.

దక్కినపురాయఁడు. వి. (√దక్కినము) దక్షిణదిగధిపతి, యముఁడు.

సీ...అడవి ద్రిమ్మ. గీ.రులు గడిందిగ శేద్రిమ్మరులను జుట్టు,ముట్టి పలుచందములఁ బడఁగొట్టి దక్కి,నంపురాయనివీడున కంపివైవ. అచ్చ. రా. యు. ౨౫౦.

ఇల్లే: దక్కినపు ఱేఁడు, మొ.

గీ. దక్కినపుఱేఁ డన యమాఖ్య దనరు సభవ. ఆం. భా. ౧. ౫౦.

దక్కినము. వి. (సం. దక్షిణా. క. దక్షిణవు.) దక్షిణపుదిక్కు. (దీనికి వృత్తియం దొకానొకచో నంత్యవర్ణలోపము. చూ. దక్కిన దిక్కు.)

సీ. తనరు దక్షిణసంజ్ఞ దక్కినం బన వలకడ యన...ఆం. భా. ౧. ౭౧.

జ: దక్కినదిక్కు, దక్కినపురాయఁడు.

దక్కు=దక్కు. అ. క్రి. ౧. లభించు, చేకూరు; లొంగు, వశమగు.

క. భుజబలదుర్జయుఁ డింద్రుం, డజయ్యుఁ డవు నీవు నీకు నతనికి మీలో, విజయము దక్కదు మీ రేచి జగంబులు నొవ్వ రణము సేయఁగ నేలా. భార. ఉద్యో. ౧. ౧౩౩.

ఉ...ఉదతి నేయుచుఁ బెక్కువిండు లు,ద్దండత నుగ్గుసేసి భుజదర్పధురంధరుఁ డీతఁ డింత ద,క్కం డని యర్ధచంద్రవిశిఖప్రహతిం దల డొల్ల నేసినక. భార. ద్రో. ౧. ౨౯౧.

ఉ. ప త్తిరిఁ బూజ సేసి నుతిపాఠములక్ దవణించువారికిక్, దొత్తులఁవోలె దక్కుదురు తొప్పలుదోరలు ముక్తిభామినుల్. కాశీ. ౨. ౭౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. అనుభవయోగ్యమగు.

చ... నాథ నాకు ని, స్ననుచితభంగి నిష్ఠురము లాడినపాపము దక్కెఁ జూచితే. భా. రా. అయో. ౨౨౬.

3. నిలుచు.

రగడ. నూనగంధి వెదకు తావిఁ జొక్కఁ జొక్క మైనదిక్కు, మానవతి గయాళిపొత్తు మాను మానుమంబె దక్కు. వరాహ. 3. ౭౨.

(వ్యవ) నేను చెప్పినట్లు విననిచో నీ కింక మాట దక్కదు. (మాటదక్కదు=మర్యాద నిలువదు.)

వి. (=దకో్కలు) వశము.

చ... దివిజాగ్రణి దీని నిచ్చె ద,క్కగ నిజ కాంత కాకుసుమకోమలియాజ్ఞ భయంబు నొందుఁ దేఁ,టిగములు దీనిచెంగట నటింపఁగ నిందులతావి గ్రోలఁగన్. పారి. ౪. ౫౬.

జః దక్కఁగొను, దక్కించు, దకొ్కను, దకో్కలు, దకో్కలుకొను, దకో్కలుచేయు, దకో్కలుపడు.

దకో్కను=దకొ్కను. అ. క్రి. (దక్కు+కొను) స్వతంత్రుఁడగు.

చ... నరుఁడు దకొ్కన నేర్చునె తన్ను మ్రొచ్చిలన్. భార. ఆది. ౪. ౭౬.

దకో్కలు=(దక్కు-). వి. (√దకొ్కను) వశము.

సీ. ధననాథునిధులను దకో్కలు గాఁ జేసి శూలిఁ గాఁడవులపాలు చేసి. భా. రా. యు. ౧3౯౧. (విణ. స్వాధీనము. అని. శ. ర.)

దకో్కలుకొను. స. క్రి. (దకో్కలు+కొను) లభింపఁజేసికొను, దక్కించుకొను, పొందు.

గీ. పచ్చకపురంబువంటిసుపర్వభోగి, నీలలామంబుచనువు దకో్కలుగొనియెఁ, బంతమున నాన్నపాలుఁడు... కవిరా. ౫. ౨౬౭.

దకో్కలుచేయు. స. క్రి. (√దకో్కలు) వశముచేయు, అప్పగించు.

సీ. అపరంజిపసిఁడిచాయలనీను మైమెఱుంగులకుఁ గస్తవలు దకో్కలుచేసి. కవిరా. 3. ౭౪.

దకో్కలుపడు. అ. క్రి. (√దకో్కలు), వశమగు. (శ. ర.)

దక్ష. సం. వి. ఆ. స్త్రీ. భూమి. (వై. ని.)

దక్షజాపతి. సం. వి. ఇ. పుం. ౧.-అశ్విన్యాది తారలవిభుఁడు-చంద్రుఁడు. ౨.- సతీపతి-శివుఁడు. 3. -అదిత్యాదులభర్త-కశ్యపుఁడు.

దక్షము. సం. వి. అ. పుం. ౧. నంది, శివునియెద్దు. ౨. కోడి.

దక్షసావర్ణి. సం. వి.ఇ.పుం. తొమ్మిదవమనువు.

దక్షాధ్వరధ్వంసి. సం. వి. న్. పుం. శివుఁడు.

దక్షాయ్యము. సం. వి. అ. పుం. గృధ్రము, గద్ద.

దక్షిణ. సం. వి. ఆ. స్త్రీ. ౧. యజ్ఞాదులలో ఋత్విజులులోనగువారి కిచ్చెడుధనము. ౨. దక్షిణదిక్కు. 3. యజ్ఞాభిమానిదేవత. (ప్రజాపతికూఁతురు) ౪. గుర్వాదుల కిచ్చుధనము.

దక్షిణదిక్పతి. సం. వి. ఇ. పుం. ౧. యముఁడు. ౨. అంగారకుఁడు.

దక్షిణపశ్చిమ. సం. వి. ఆ. స్త్రీ. నైరృతదిక్కు, దక్షిణదిక్కునకును పశ్చిమదిక్కునకును నడిమిమూల.

దక్షిణపార్శ్వభ్రుంగి. వి. మల్లవిద్యావిశేషము.

వ... గజదండభ్రుంగి దండవామపార్శ్వభ్రుంగి దక్షిణపార్శ్వభ్రుంగి పటలము...మల్లుపు. 3. ౬౯.

దక్షిణపూర్వ. సం. వి. ఆ. స్త్రీ. దక్షిణపూర్వదిక్కులనడిమిమూల, ఆగ్నేయదిక్కు.

దక్షిణప్రాచి. సం. వి. ఈ. స్త్రీ.=దక్షిణపూర్వ.

దక్షిణమధుర. సం. వి. ఆ. స్త్రీ. పాండ్యమండలములో నున్నయొకప్రాచీనపట్టనము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. తనరు దక్షిణమధుర సాంద్రద్రుమధుర. ఆము. ౨. ౩.

దక్షిణమార్గము. సం. వి. అ. పుం. ౧.దక్షిణాచారము. ౨. పితృయాణమార్గము, పితృదేవతలు పోవుమార్గము. ౩. దక్షిణదిక్కునకుఁ బోవు త్రోవ.

దక్షిణము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వలపలిది, కుడి;కుడిప్రక్క నున్నది. ౨.దక్షిణపుదిక్కుది.

దక్షిణస్థుఁడు. సం.వి. అ. పుం. సారథి, తేరు నడపువాఁడు.

దక్షిణాగ్ని. సం. వి. ఇ. పుం. దక్షిణాగ్ని గార్హపత్యాహవనీయము లనుమూఁడుశ్రౌతాగ్నులలో మొదటిది.

దక్షిణాచలము. సం. వి. అ. పుం. మలయపర్వతము, గందపుఁగొండ.

దక్షిణాచారము. సం. వి. అ. పుం. వేదవిరుద్ధముకానిశాస్త్రులయాచారము. (వ్యతి. వామాచారము.)

దక్షిణాపథము. సం. వి. అ. పుం. ౧. వింధ్యపర్వతము మొదలు సేతువువఱకును గలదేశము, దక్షిణదేశము. ౨. దక్షిణదిక్కునందలిమార్గము

శ్లో. భోజరాజేన భోక్తవ్య స్సగౌడో దక్షిణాపథః. భోజచరిత్రము.

వ. అస్తి దక్షిణాపథే పద్మపురంనామ నగరమ్. మాలతీ. ౧. అం.

దక్షిణాపర. సం=దక్షిణపశ్చిమ.

దక్షిణాభిముఖుఁడు. సం. విణ. (అ.ఆ, ఈ. అ) దక్షిణపువైపునకు తిరిగినవాఁడు.

దక్షిణామూర్తి. సం. వి. ఇ. పుం. ఋషులకు జ్ఞానోపదేశము చేయుటకవతరించినశివమూర్తి.

దక్షిణాయనము. సం. వి. అ. న. ౧. సూర్యుఁడు దక్షిణపువైపుగాఁ బోవుట. ౨. సూర్యుఁడు దక్షిణదిక్కునకుఁ బోవుఆఱుమాసములకాలము (వ్యతి. ఉత్తరాయణము.)

దక్షిణావర్తకి. సం. వి. ఈ. స్త్రీ. వృశ్చికాళీ.

దక్షిణావర్తము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కుడివైపుగాఁ దిరిగినవంక గలది. (శంఖము). ౨. దక్షిణదిక్కున నుండునది.

దక్షిణావహము. సం. వి. అ. పుం.-దక్షిణపువైపునుండి వీచునది-దక్షిణపుగాలి.

దక్షిణీయుఁడు. సం. విణ. (అ. ఆ.అ.) దక్షిణకు అర్హుఁడు, దక్షిణ ఈయఁ దగినవాఁడు. (ఋత్విజుఁడు.)

దక్షిణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. సమర్థుఁడు, నేర్పు గలవాఁడు. ౨. ఋజువైనవాఁడు, నిష్కపటుఁడు, చక్కనిమనసు కలవాఁడు; ఉదారుఁడు. ౩. పరులమనస్సునుబట్టి నడచుకొనువాఁడు, దాక్షిణ్యము గలవాఁడు. వి. అ.పుం. అనేకనాయికలయెడల:సమముగాఁ బ్రవర్తించునాయకుఁడు.

దక్షిణేతరము. సం. విణ. (అ. ఆ. అ) కుడిదికానిది, ఎడమది.

దక్షిణేర్మము. సం. వి. న్. పుం. కుడివైపున వేఁటకానిదెబ్బవలన గాయము పడినమృగము.

దక్షిణోత్తరవృత్తము. సం. వి. అ. న. (భూగోళ) దక్షిణపుదిక్కునుండి ఉత్తరపుదిక్కుగా వ్యాపించురేఖ.

దక్షిణ్యుఁడు. సం=దక్షిణీయుఁడు.

దక్షుఁడు. సం. విణ. (అ. ఆ. అ) ౧. సమర్థుఁడు, నేర్పరి. ౨. అభిజ్ఞుఁడు, తెలిసినవాఁడు. ౩. సోమరికానివాఁడు, చుఱుకైనవాఁడు. వి. అ.పుం.౧. ప్రజాపతులలో నొకఁడు. (ఇతఁడు బ్రహ్మమానసపుత్త్రుఁడు. చంద్రుని భార్యలగు అశ్వ్యాదులకును కశ్యపునిభార్యలుపదుముప్వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రకును, శివునిభార్యయగు సతీదేవికిని తండ్రి.౨.
వహ్ని. (విల్యమ్సు.)

దగ. వి. (సం. దావః. ప్రా. దాఘో. క. దగె)

౧. దప్పి, పిపాస.

చ...అగ్గురుభుజు లందఱుం గదిసి కో యని
యార్చుచు దాని నెమ్మెయిం, దరలఁగఁ
దీయ లేక దగ దట్టముగా మదిఁ దొట్టగిల్ల
నొం,డొరుఁ గడవంగ వేచని పయోరుహ
నాభుని కంతఁ జెప్పినన్. భాగ. ౧౦ ఉ.
౪౭౮.

గీ. హయలు దగ దొట్టి మెలఁగలే వనిన వాజి,
తృష్ణ వారించె నిపు డీయతిప్రతాపుఁ,
డద్భుతంబున నవని శాతాస్త్రనిహతి, గ్రొచ్చి
కీలాలములు వెలిగొన వెలార్చి. రాఘవ.
౪. ౧౭౩.

సీ...దగ దప్పి నీర్వట్టు దప్పి దూప. గీ. య
నఁ జనుఁ బిపాస ... ఆం. భా. ౨. ౨౬౦.
ఆ. సం. మాన. ౩౪.

౨. తాపము, బాధ.

క. దగ దొట్టి శౌరిమనుమఁడు, జగతిం బడి
మిగులఁ బరవశత నొంద దిశల్, వగులఁగ
నార్చి సుచిత్రుం, డగలిచెఁ బ్రద్యుమ్నవక్ష
మైదస్త్రములన్. జై. భా. ౭. ౧౬౫.

గీ...ప్రయాసమునఁ గరంబులు ముకుళించుకొని
మొగంబు, లెత్తి దగ దొట్టికొన వార లిట్టు
లనిరి. ఉ. రా. ౫. ౧౧౩.

సీ. కార్చిచ్చులోఁ జెమ్మఁ గన నేర్చుదగ నేర్చు
మలయానిలము వేఁడి నిలువరాదు. ఇందు.
౩. ౧౨.

౩. ఆయాసము, అలసట.

చ. అలమి త్రిలోకముల్ గెలుచునత్తఱిఁ దేరు
వహించుతోడిచి,ల్కలు దగ దొట్టి ముంద
రికి లాగక యుండిన...పాండు. ౪.౨౨౪.

క. కవి బిసరుహబాంధవసైం,ధవసంఘం బెంత
దవ్వు దగ లే కరుగున్. మనుచ. ౧.౩౬.

మ...భీతి వీ,డనిశీఘ్రంబున దూర మేఁగ దగ
దొట్టన్ వ్యాఘ్ర మాదండ నున్న నిగండో
పల మెక్కి...శుక. ౨. ౨౬౭.

జః దగలుకొట్టు.

దగదగ. వి. (క. దగ్గనె.) మెఱయుట, మండుట
లోనగువానియం దగునను కరణము.

చ. జగదుపకారి యీప్లవగచంద్రుఁ డటంచుఁ
దలంచి భానుఁడున్, దగదగ మండుచుండు
కిరణంబులవేఁడిమిఁ జూపఁ డయ్యె...ఉ.
రా. ౫. ౨౦౨.

క. బిసరుహరజమునఁ బైకం, బుసిమిన దగదగ
వెలుంగునుదురాజుక్రియన్, బిసరుహపాణి
ముఖాంబుజ, మసమాయుధసౌధకుంభ మై
జృంభించున్. పాండు. ౩. ౧౯౬.

జః దగదగమను, దగదగలాడు.

దగదగమను=దగదగలాడు. అ. క్రి. (√దగ
దగ) దగదగ యని ప్రకాశించు, మెఱయు.

చ. దగదగమంచుఁ గ్రొమ్మెఱుఁగుతండముకై వడి
గంట లాఱునుం, బగుల మనంబు చించు
కొని మానిని విద్య యనంగఁ బుట్టి...ప్రబో
ధ. ౫. ౧౦౭.

క. తెగి యపుడ నిగిడి మగుడన్, జిగిరించిన
పగటిపేరిచెట్టును బోలెన్, దగదగమని
యెడికెంపునఁ, దగి సంజ దనర్చె మిగులఁ
దార్కొను తెలివిన్. యయా. ౨. ౧౦౭.

దగదగలాడు=దగదగమను. (√దగదగ)

దగర=డగర. వి పిశాచము. (శ. ర.)

విణ. (పశు పక్ష్యాదులలో) మగది, గండు.

సీ. చిగురాకులే కత్తులగునేని నింతకు దగర
కోయిలనోరు దెగక యున్నె. రాజ. చ.
౩. ౧౧౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. దగరతేఁటులకప్పుపగటనీటులఁ గప్పువలుఁ దవెన్నెటికొప్పు వదలె నేల. చంద్ర. ४. ౫౮.

క...సరోజలక్ష్మి ధరించినవజ్రమణిమయభూషణంబులతఘుకులవిధంబున నెగురుదగరమీలం గనుంగొని...వరాహ. ౩. ౯౭.

కోయిలదగర=గండుకోయిల.

సీ. మేను గా దిది మధుశ్రీ నూనఁ గోయిలదగర గానని మ్రానిచిగురు గాని. కృ. శకుం ౩. ౧౨౨.

దగరము=డగరము. వి.కీడు. (శ. ర.)

దగరు వి. యుద్ధసాధనవిశేషము.

వ...దగరు మొదలుగాఁ గలసాధనంబులచేఁ జీకాకుపఱచియు...ఉ.హరి.౩. ౩౬.

దగలుకొట్టు. అ. క్రి. (దగలు+కొట్టు) దప్పికలుగు.

ఉ. పట్టెపుజుట్టు నిక్కమెడ బాగుగఁ జివ్వెన యారెపొంకముల్, శెట్టలబల్మి నెమ్మిఁ బురణించినయీఁ కలజోకలుల్ దగల్, కొట్టక యుండ మేపుపలుకోయపుమందులు గల్గు పుంజుఁ జే, పట్టి...కువల. ४.౨౦౬.

దగలుబాజి. వి. (హిం. దగల్ బాజ్) మోసగాఁడు, మాయావి, దొంగ.

సీ...విసపాలవిత్తు చిల్విసము దగలు,బాజి హరాంకోరు...హంస. ౫. ౧౧౩.

దగా. వి. (హిం. దగా.) మోసము. చూ. దగాకోరు.

(వ్యవ)ఈ వ్యవహారములో వాఁడు మమ్ము దగా చేసినాఁడు.

జః దగాకోరు.

దగాకోరు. వి. (√దగా. హిం. దగఖోర్.) దగా చేయువాఁడు, మోసగాఁడు.

సీ. దరిచేసి చెడుగొట్టు బెరికి దగాకోరు విసపాలవిత్తు చిల్విసము...హంస. ౫. ౧౧౩.

దగ్గఱ=డగ్గఱ. వి. (√దగ్గఱు) సమీపము.

గీ. దండ చేరువ చెంగట యండ సరస, ప్రాపు చక్కి కుఱంగలి పజ్జ చెంత, కెలను దాపంజ దగ్గఱ క్రేవ పొంత, యంచ యొద్ద నా నికటాఖ్య యగు మహేశ. ఆం. భా. ౩. ౨౧.

దగ్గఱదీయు=౧. వేశ్యాదులను భోగార్థ ముంచుకొను.

(వ్యవ.) వాఁ డొకవేశ్యను దగ్గఱదీసినాఁడు.

౨. బిడ్డలు లేనివారు ఒరుల పిల్లలను పెంచుకొను.

(వ్యవ.) వాఁడు పిల్లలు లేక అన్నకొడుకును దగ్గఱ దీసినాఁడు.

దగ్గఱించు=డగ్గఱించు. అ.క్రి.(√దగ్గఱు)ఇంచు స్వార్థమున)

(సమీపించు.)

గీ. తడవు సేసె ముహూర్తంబు దగ్గఱించె, నేమొకో యన్న రాఁ డని యెదురుసూడ,దనదు గారాబుఁ జెలియలిమన సెఱింగి, మాటలో పల వచ్చె న్మాధవుండు. విజ. వి.౩. ౯౬.

దగ్గఱిల్లు(లు)= డగ్గఱిల్లు అ. క్రి. స. క్రి. (√దగ్గఱు)

(సమీపించు.)

గీ. సర్వసంగంబు మిక్కిలి సంతఁ బెట్టి, తపసియై యున్నతనుఁ జంప దగ్గఱిల్లునీదురాచారవర్తనుఁ డెల్లవారి, హతులఁ గావించె విధి యెంతయధికుఁడొక్కొ. శేష. ४.४౨.

దగ్గఱు=డగ్గఱు. స.క్రి. అ. క్రి.

(సమీపించు.)

గీ. దగ్గఱె ముహూర్తవేళ యోదశరథేంద్ర, యేల యాలస్యము...రామా. ४. ౧౧४.

జః దగ్గఱ, దగ్గఱించు, దగ్గఱిల్లు.

దగ్గు=డగ్గు. అ. క్రి. కాసముచేయు. (శ. ర.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(వ్యవ)వాఁడు రాత్రియంతయు దగ్గుచునే యున్నాఁడు.

వి. కాసము.

ఆ. వగరు పుట్టె నంతఁ బెగలె దంతంబులు, నుక్కిసయును దగ్గుఁ బిక్కటిల్లె. భాగ. ౬. ౯౧.

సీ. పొడిదగ్గు కఠంబుఁ బొరిపుచ్చకయమున్న ...కాశీ. 3. ౭౪.

గీ...కాసంబుపేరు దనర్చుచుండు, నుబ్బస మనంగ దగ్గన నుక్కిస యన. ఆం. భా. ౨. ౧౨౬.

జ: దగ్గుత్తిక.

దగ్గుత్తిక=డగ్గుత్తిక. వి. (దగ్గు+ఉత్తిక) గద్గదస్వరము.

క.డగ్గటి పెనఁగొనుదురితపు,బగ్గంబులఁ ద్రెంచివైచి ప్రమదాశ్రుతతుల్, దృగ్గోళంబులఁ దొరఁగఁగ, దగ్గుత్తికతోడఁ దనదుదయితయుఁ దానుఁ. కాశీ. ౧. ౧౧౧.

దగ్ధ. సం. విణ. (ఋ. గీ్రి. ఋ.) కాల్చువాఁడు.

వి. ఆ. స్త్రీ. సూర్యాధిష్ఠిత మగుదిక్కు, సూర్యుఁ డున్నదిక్కు.

దగ్ధకాకము. సం. వి. అ. పుం. ద్రోణకాకము, మాలకాకి.

దగ్ధము. సం. విణ. (అ. ఆ. అ) ౧. కాల్పఁబడినది. ౨. భస్మీకృతము, బూడిదచేయఁబడినది. 3. (జ్యోతి) అశుభమైనది. (దగ్ధయోగము, దగ్ధతిథి, మొ.) ౪. తుచ్ఛము; పాడైనది, పనికిమాలినది.

శ్లో. అస్య దగ్ధోదరస్యార్థే కఃకుర్యాత్పాతకం మహత్. హితో. ౧. ౯౫.

వి. అ. న. కాల్చుట.

దగ్ధరుహము. సం.వి.అ.పుం.తిలకము,బొట్టుగుశ్శ.

దగ్ధవ్యము. సం=దాహ్యము.

దగ్ధిక. సం. వి. ఆ. స్త్రీ. మాఁడినయన్నము; మాఁడు.

దఘ్నము. సం. ప్ర. (ప్రమాణార్థమున వచ్చు తద్ధితప్రత్యయము. ఈ ప్రత్యయ మంతమందుఁ గలది విశేషణ మగును. స్త్రీలింగమున ఈకారాంత మగును.) బంటి.

ఉదా:—జానుదఘ్నము=మోఁకాలిబంటి (నదము, మొ.)—జానుదఘ్నీ. (నదీ. మొ.)

చూ. ఊరుదఘ్నము, కంఠదఘ్నము. మొ.

దచ్చేవు(చ్చే)క=దచ్చి. స. (దంట³ + చవుక-సం. ద్విచతుష్కం) ఇరునాలుగు, ఎనిమిది.

మ...చారుద్యూతగేహంబు క్రొత్తగ నీ వొక్కటిఁ జూపఁ దోడ్కొని చనం దచ్చాక చావంచ యిత్తిగ పారా దుగ యంచుఁ జిల్కరొాద లుద్దీపింపఁ దొడవ్వలక్. కళా. 3. ౧3౧.

క. అత్తీవంచ తిగ దుగ యు, సత్తా దచ్చాక వంచ చావం చీర్తై, దిత్తిక యిద్దుగ బద్రలు, చిత్తంబునఁ దలఁచినట్లు చేతికిఁ దెచ్చుక్. ఉ. హరి. 3. ౧౨౧.

దచ్చి=దచ్చేవుక. స. (దంట² + చాక) ఎనిమిది.

సీ. వడి దచ్చియేనుఁగుల్ కడభూమిఁ జేరుట మాడాక కటు నిల్వ నోడికాదె. సారంగ. ౧. ౭౪.

గీ...మాటలో దచ్చికడలఁ,బఱచి క్రష్ణ నచటిబాబాతుటుములు. నీలా. ౧. 3౪.

సీ. దచ్చి యంచ నఁగను దనరు నష్టకసంజ్ఞ... ఆం. భా. ౨. 3౦౬.

దచ్చికాళ్లమెకము. వి. (దచ్చి+కాలు+మెకము.) అష్టాపదము, శరభము.

సీ...ఎనుబోతులును రేచు లిర్లు దచ్చి,కాళ్లమెకంబులుఁ గడఁతులు దుప్పులుఁ గుందేళ్లు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నక్కలుఁ గొండముచ్చులు... అచ్చ. రా. అర. ౪.

వ...పదయుగనఖాంచలంబులఁ జంచచ్చంచూ పుటంబుల కెట్టిత్రావుడు బొబ్బ మెకము దచ్చి కాళ్ల మెకంబుల నిటికించి కఱచుక యుప్ప రంబున కుప్పరం బెగసి... ప్రబంధ.౧౮౬.

దట్ట=దట్టా. వి. కుతూముఖాచ్ఛాదనము, సిద్దెకు వేసెడుమంటిమూఁత.

గీ...కుతూముఖాచ్ఛాదనంబు, దట్ట యనఁ ద గు...అం. భా. ౨. ౨౪౩.

దట్టకెంపు. వి. (దట్టము + కెంపు—దీనికి వృత్తి యందు వికల్పముగా మువర్ణలోపము. శ.ర.) అ ధికరక్తిమ, ఎక్కువయెఱుపు.

క. ముంచుమహోద్ధతి యాలో,కించి తనదుచూ డ్కి దట్టకెం పెసఁగం గో,పించి శరనికర ములు గుప్పించుచు ధర్మజుఁడు గవిసె భీష ణభంగిన్. భార. కర్ణ. ౨. ౨౫౫.

గీ...నరకుండు నా నలిన నాభు,నంగకంబులఁ గీ లించె నాఱుతీవ్ర, సాయకంబులు నొచ్చి యా చక్రధరుఁడు, దట్టకెంపున లోచనాం తములు మెఱయ. హరి. ఉ. ౪.౧౪౫.

(సహదేవుఁడు) చ. కవిసిన దట్టకెం పడరుకన్ను లతోడఁ గృపాణపాణియై,యవనికి దాఁటి ...భార. శల్య.౧. ౧౬౪.

దట్టన. వి. (√దట్టించు) అదలుపు, అదలించుట.

గీ. పురుషసింహంబు లిమ్మెయిఁ బోరి ముష్టి, ఘట్టనంబుల నదలించుదట్టనలను, వెక్కసం బుగ నిర్జరుల్ వెఱచి యింత, వలదు వల దంచు నించుకవడిఁ దలంక.ఉ.హరి.౬.౯౨.

ఉ...అక్కపిసింహుఁడు సింహలీల నద్దంతికి దాఁటి బిట్టొరల దట్టనతో నఱచేత వ్రేసి ...భా. రా. యు. ౯౫.

దట్టము. విణ. ౧. తఱచైనది, సాంద్రము.

గీ. అలరు సాంద్రంబు నెగ్గడ మనఁగ దట్టమనఁ గ...అం. భా. ౩. ౧౬.

వ...వాహినీ, తరుణులు మేన దట్టముగఁ దా ల్చినముత్తెపుఁ బేరులోయనన్.ఆము.౨.౫౧.

చ. మదకలకుంభి కుంభనవమౌక్తికము ల్గనుపట్టు దట్టమై. మనుచ. ౧. ౪౧.

౨. అధికము, గొప్పది.

క. ఛెట్టిద మగుశాపమునకు, దట్టపుఁగ్రోధంబు గాదు ధరణీకాంతున్, గట్టా యేల శపిం చితి...భాగ. ౧. ౪౭౦.

వి. ౧. పావడ; వస్త్రము.

సీ. దట్టంబు నీకట్టినట్టిచెంగావికి బాగు గా దని కేలఁ బయఁట నిమిరె. మనుచ. ౬. ౮.

గీ. దట్టి కుళ్లాయి తగ జగాజెట్టిదట్ట, మ ట్టెటూ తొలంగఁ జటులాట్టహాస మెసఁగ, శంభు తాండవసంరంభ జృంభణమున, సాధన యొ నర్చురఘుమహీజానిసుతుఁడు.ఇందు.౨.౭౧

౨. (గుఱ్ఱము మొదలగువానిపొట్టకుఁ గట్టెడి) కాసె, దట్టి.

సీ. పొట్టపట్టెడ గాఁగఁ గట్టినపెనుఁబాఁపదట్టం బుతోడ...కళా. ౩. ౬౨.

-సుకదట్టము=వస్త్రవిశేషము.

రగడ. గింటెంబులు బతినీల్ దసలీలును... సుకదట్టములు. కవిక. ౩. ౧౯౫.

జః దట్టకెంపు.

దట్టా=దట్ట. వి. (హిం. దట్టా) ౧. సిద్దెకు వేసెడి మంటిమూఁత. (శ. ర.) ౨. బిరడా. (చి. ని)

దట్టి=దట్టీ. వి. (బ. దట్టులు, దట్లు—సం. ధటీ. క. దట్టి. త. తట్టి) కాసె, కాసెకోక.

చ. నివిడినబొజ్జపై మిగులునిద్దపుదోవతిదట్టి డొల్లి రాఁ, దివిచి...ఆము. ౬. ౭౧.

గీ. తిరిగి చూచుచు ద ట్లెగఁదీసికొనుచు. మనుచ.౪. ౧౦౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. మెఱుపుపచ్చనిదట్టి మొఱపుగాఁ గట్టిఁ గట్టి
యపరంజిపిడిపిడియఁబుఁ జెక్కి. వాల్మీ. ౧.
౧౮.

**దట్టించు.** స. క్రి. (త. తట్టు) ౧. తర్జించు, అదలించు; కేక వేసి అదల్చు.

ద్వి. మ్రొక్కిన దట్టించి మునినాథుఁ డతనిఁ,
దక్కక తలవట్టి తన్నె...ద్వి. హరిశ్చ.
పూ. ౧౧౩౫ పం.

గీ...అయ్యతివ నెచట, నడఁచి తని నన్ను ద
ట్టించి యడిగె నతఁడు. కళా. ౩. ౧౬౧.

శా. తల్లీ తల్లియు నన్ను నిన్నుఁ గినుకన్ దట్టిం
చి రం చాత్మఁ జిం,తిల్లం బోకు వివేకశాలి
యగువానిన్ వానరుం బెండ్లియై, ముల్లోకం
బులు నెంచ సర్వగుణధాముం బుత్రునిం
గాంచి రం,జిల్లంగాఁగలవు...సమీర. ౧.
౨౨౫.

శా...దట్టించన్ గెరలించు నవ్వు రథ ముద్దం
డాగ్రతుండంబునం, బట్టున్...భా. రా.
ఆర. ౨. ౧౨౯.

౨. (క. దట్రిసు, దట్టయిసు.) గట్టిగా కూరు.
(వ్యవ) తుపాకిలో మందు దట్టించినాఁడు.

౩. నశింపఁజేయు, పోఁగొట్టు.

సీ. ఖురధూతగురుధూళి శరధిలీనగాలిగుట్టు
దట్టించు నారట్టజములు. వసు. ౨. ౧౫౨.

మ...అల జగత్కంపప్రదాస్తోకభీ,కరదోషా
యతిశాలిఁ జుట్టుకొని లగ్గ ల్వట్టి దట్టింతు
నం, చరవిందాప్తుఁ డుదీచి కేఁగెఁ బ్రబలుండై
మాని దాక్షిణ్యమున్. వసు. ౧. ౧౩౧.

౪. జయించు.

సీ...శ్రోతక ర్తమును దక్షత వహించిన ప్రతిస్పర్థి
విఱుగ, దట్టించి నాల్గు వేదములు విభాళించి
బ్రహ్మార్థం జెక్కి...వరాహ. ౬. ౨౦.

సీ. దట్టించి నాఁడవు తస్కరకవిరాజుఁ గోలు
సింగనమంత్రి కొలువులోన. మై. ౧. ౧౮.

క. కట్టింతురు రుద్రునయిన, దట్టింతురు హరుల
నైనఁ దలఁగనికడిమిం, గొట్టింతురు యము
నైనను, బట్టింతురు రిపుల నెల్ల భటు లప్పౌరి
లోన్. బిల్హ. ౧. ౩౬.

౫. గ్రహించు, పూను.

మ. గద దట్టించి నిశుంభుమస్తకము నక్కా
లుండు వ్రేయన్...ఉ. హరి. ౧. ౩౫.

౬. క్రి. యత్నించు, పూను.

సీ. అల్లులు దట్టించి యంఘ్రులగజ్జెలు మొరయఁ
దన్నుదు రోలి ముమ్మరముగఁ, బన్నిదంబులు
వైచి ఫలమంజరులు గూల్చి వ్రేటులాడు
దురు ప్రావీణ్య మొప్ప,...గీ...ఆకుమారులు
బాల్యవిహారు లగుచు. భాగ. ౧౦ పూ. ౪౩౦.

సీ. మెఱుఁగుఁగోఱలు దుల్ల మృత్యుదేవత నోరు
దట్టించి యఱకాలఁ దన్నినాఁడు. భీమ.
౧. ౧౧౦. (దట్టించు. ముద్రి. పా.)

జః దట్టన.

**దట్టీ**= దట్టి.

సీ. కట్టాయితంబుగాఁ గటిమండలంబునఁ దీర్చి
దట్టీచేల దిండుగట్టి. కాశీ. ౪. ౧౨౧.

సీ. మొలల హొంబట్టు క్రొందళుకు దట్టీలపై
రతనంపు మొలత్రాళ్లు సంగులీన. అచ్చ. రా.
బాల. ౮౭.

సీ. పులితోలుకచ్చడంబులమీఁద బిగి మీఱఁ
గీలించునీలిదట్టీలవారు. సుద. ౩. ౨౬౬.

**దట్టుఁడు.** విణ. (సం. ధృష్టః. ప్రా. ధట్టో.) ధీరుఁడు.

ఉ. పుట్టినయాఱునాళ్లకున పొంపిరివోయి జగం
బు లన్నియుఁ, దట్టుఁడ వై జయించితి...
భార. ఆర. ౫. ౨౨౩.

క. సెట్టియమారయ గాంచెను, దట్టుల భీమయ్యఁ
బ్రోలధరణీధవునిన్, మట్టురగండని ముమ్మయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సె ట్టన విలసిల్లువీరశేఖరు నరిఁ. శివరా. ౧. ౫౪.

దడ[1]. వి. (క. దడ)-గుండె మొ. వాని-చలనము; అట్టిచలనమున కనుకరణము. (దీనియామ్రేడితరూపము 'దడదడ, దడదడదడ')

ద్వి. సమిధలు దల కెత్తి చను మన్న మొగము, చెమరింపఁ గూఁకటి చీకాకుపడఁగ, దడ వడంకులు గొంచుఁ దను వెల్లఁ గంద. ద్వి. హరిశ్చ. ఉ. ౧౪౯౭ పం.

క. గడగడ వడఁకుచు నడుపులు, దడబడ సిగ్గదర నెడఁద దడదడ మనఁగా. ఉ. రా. ౮. ౨౦౩.

క. అడుగులు తడఁబడఁ బెదవులు, దడుపుచు గుండియలు పగిలి దడదడ మన...దశా. ౩. ౧౮౩.

క. గడగడ నొడలు వడంకఁగ, దడదడదడ మంచు గుండె తల్లడ మందఁ. దశా. ౨. ౧౨౩.

క్రి. విశే. (క. దడదడనె. త. తడతడలెను) వడిగా, శీఘ్రముగా.

గీ...చుటు కన, జటుజ టన దడదడ దనఁగఁ జెటచెటి యనఁ, దీవరము సుళ్ళు వైళము తివురుతివుట, వేగిరము తుటు తన శీఘ్ర మా గిరీశ. ఆం. భా. ౧. ౬౫.

(వ్యవ) వాఁడు దడదడ వచ్చినాఁడు.

,, వాఁడు దడదడ చదువుచున్నాఁడు.

దడ.[2] వి. (సం. ఘటా.) ౧. కొయ్యత్రాసు, తక్కెడ, తుల.

సీ. కిసలయంబులతోడఁ గొంగేలు దడఁ బెట్టి వీరులపై నఖకాంతి విజ్జ రాల్చి. ఉ. హరి. ౫. ౫౦.

౨. దాశ. (శ. ర.)

ఇ: దడకట్టు.

దడకట్టు=దాశాకట్టు. స. క్రి. (√దడ.[2])-నెయ్యి నూనె మొదలగునవి తీయుపాత్రలనుగాని అవి యుంచియున్నపాత్రలనుగాని-సరియెత్తుతూలను దడతట్టునుంచి తూఁచు. (శ. ర.)

దడము= దళము. వి. ౧. సేన.

సీ...దండు దడ మనంగఁ దనరు సేన. ఆం. భా. ౨. ౨౧౦.

క. వడిఁ బురము వెడలి విడిసిన, దడములపై నడువ విఱిగి...కొందఱు బలములు రూ, పడఁగం జెడిపోయి రంత నదరినభీతిఁ. భా. రా. బాల. ౬౭౩.

౨. సమూహము.

క. కొడుకులుఁ దాసను గుఱ్ఱపు, దడములఁ గరిఘటల భటరథవ్రాతములం, బుడమి చలింపఁగ ద్రుపదుఁడు, గడువేడుకఁ దోడుసూ పెఁ గాంతేయులకుఁ. భార. ఉద్యో. ౧. ౨౨౦.

ఉ. ధారలు వట్టఁ బంపు...రత్నభాం,డారము తోడ గుఱ్ఱపుదడంబులు ముంగలి వంపు... కు. సం. ౧౧. ౫౭౫.

విశే. దట్టము.

ఉ. దడముగ మర్దళధ్వనులుఁ దాళరవంబులు దిక్కుటిల్ల...ఉ. రా. ౬. ౧౩౯.

దడవట. వి. కపటవ్యాపారము.

క. సటలు దడవటలు నటనలు, మటుమాయలు చాటువగలమాటలవింతల్, గుటిలతయుఁ దెలిసి పాటుఁడు, ఖిటవిద్యకు బిరుదు వేసి వికవిక నగుచుఁ. ప్రబంధ. ౬౧౮.

దడి. వి. (క. దడి. త. తట్టి. బ. దడులు, దళ్లు.) వెదురు మున్నగువానితో నేర్పఱచినతడిక.

సీ. బండ్ల మెట్టింపు పై బరువు లెక్కింపుమీ దళ్లను బూన్పు కావళ్ల నునుపు. హరి. పూ. ౬. ౨౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. కల్వరేకుల మిద్దె గావించి యాచుట్టు కురు
వేరుదడి గట్టి విరులదేనెఁ, బూసి...య
యా. ౫. ౯౭.

సీ...తళుకుగేదఁగి తేకుదళ్లుగట్టి. నీలా. ౩. ౩౬.

సా: దడిఁ గఱవఁ బోవు వేఁపి=ఫలము లేకయే కల
హించువాని కుపమానముగ వాడుదురు.

గీ. దడిఁ గఱవఁ బోవువేఁపిచందమునఁ బట్టి,
పరుస మెచ్చఁగ నూరుజప్రముఖుఁ బలికె.
శుక. ౩. ౩౨.

దడిగ. వి. ఖేటకము, పలక, డాలు.

మణిగణనికరము...పెం, దడిగలుఁ బడగలు దట
చు ముత్రియలై, పుడమిఁ గలయుటకుఁ బోగు
లాలయ మదిగ్. భార. స్త్రీ. ౨. ౩.

దడిపము. వి. దుప్పటి, మేలివస్త్రము,

ఉ. బంగరుపీఁటఁ బెట్టి దడిపం బిడి రాజకు
మారి దానిమీఁదం గదియించి తూర్యనిన
దంబుల రోదసి ఘూర్ణిలంగ...వేం. పంచ.
౪. ౩౩౬. (చి. ని. పా. దడివంబిడి. ముద్రి. పా.)

విణ. సన్ననిది, మృదువైనది.

ద్వి. నిడిసోఁగ చంద్రికనిగ్గు లల్లార్చు, దడిపంపుఁ
బావడఁ దడివాయ నొత్తి. ద్వి. పరమ. ౪.
౩౧౪ పా. ౧౭ పం.

దడిబము=దడిమము. వి. (సం. తలిమమ్. ప్రా.
తలిమ) పఱపు, శయ్య.

గీ...శయ్యాఖ్య చెల్లు సెజ్జ, పఱపు దడిమము
దడిబము పాన్పు మెత్త, యన...ఆం. భా.
౨. ౧౬౩. (ప్రాఁత ప్రతి పా.)

దడిమము=దడిబము, దలిమము. వి. పఱపు. ఆం.
భా. ౨. ౧౬౩.

విణ. సన్ననిది.

సీ. దడిమంపుఁ జేలలఁ దడి యొత్తి పసుపుకొం
గుల తెల్లపట్టుదువ్వలువ గట్టి. కళా. ౬. ౬౫.

సీ. కుఱుమాపుదడిమంపుఁగోకలోఁ దొలఁకెడు
కంపమాననితంబకాంతిసొంపు. కళా. ౪.
౧౦౫.

దడియ. వి. కొండచేరువనేల, ఉపత్యక.

ఆ. కర్షకులకు నెలవు గ్రామసీమావళి, యడవుల
నడవు లిండు లాటవికుల, కడవులందుఁ గొం
డదడియలు మనబోంట్ల, కింతపట్టు దెలియ
నెఱుఁగ వలయు. హరి. పూ. ౬. ౧౩౩.

దడియఁ(గఁ)బడు=దడియు. అ. క్రి. (దయకడి
+పడు. స్వార్థమున) క్రిక్కిఱిసియుండు.

సీ. దండియలును మీరు దడియంగఁబడకె యం
తక యటు వొండు గంధర్వముఖ్యులు ...
నృసిం. ౧. ౭౦.

దడియ(డె)ము[1]=దడ్డియము[1]. వి. (క. దడె,
దడియ.) రెండువీసెలు.

గీ. వీసె యనఁగను గన్పట్టు వింశతిపణి, దడియ
మన నల్వదిపలముల్ దగును శర్వ. ఆం. భా.
౨. ౨౬౯.

దడియ(డె)ము[2]=దడ్డియము[2].

దడియు=జెడియు. అ. క్రి. భయపడు, వణఁకు
జ: దడియఁబడు.

దడ్డియ(డ్డె)ము[1]=దడియము[1]. (శ. ర)

దడ్డియ(డ్డె)ము[2]=దడియము[2]. వి. శరావవిశేష
ము, ఒకవిధమైనమూఁకుడు.

సీ. సిబ్బి మూఁకు డనంగఁ జెలఁగు శరావంబు
పరఁగు దడ్డెము సావ బట్టె మల్ల, యనఁగను
దద్విశేషాభిధ...ఆం. భా. ౨. ౨౪౭.

దడ్డు. (వి. సం. దండః క. దడి.) శిశ్నము, మగగుఱి.

సీ. అచ్చినవానియి ల్లరికట్టఁ గాఁ జూచుఁ దొ
నీయమోచిన దడ్డుఁ జూపు. రామలిం. ౨౬.

చ. సడి గలవంటగుంటకులసంభవవేంకటభట్ల
యింటిలో, వడు గని చేరవత్తు రఁట వచ్చిన
విప్రుల కేమి పెట్టునో, పిడుకలఁ బెట్టునో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మఱియుఁ బీఁటలఁ బెట్టునో తాలఁ బెట్టు
నో, తడఁబడ లేవఁద్రోలి తనద డ్డొక టడ్డము
పెట్టి కొట్టునో. క్రీడా. పీఠి. ౬౫ పా.

దధ. వి. శస్త్రవిద్యాభేదము, పదునాల్గువిధము
లగువిసరులలో నొకటి.

వ...దారుధాణు దధ యుద్దడ యాంత్రటీక...
మొదలగుపదు నాలుగువిసరులు...ప్రబంధ.
౩౮.

వ...దధ ధారు ధాణు ఆంత్రటీక టీక... మొ
దలగు విసరులును...మల్లుపు. ౩. ౬౯.

దణా. వి. (సం. దళః) సేన. (చూ. దణాపెద్ద,
దణాయఁడు.)

జః దణాపెద్ద, దణాయఁడు, దణి.

దణాపెద్ద. వి. (దణా + పెద్ద) సేనానాయకుఁడు,
సేనాధిపతి.

భుజంగప్రయాతము. దణాపెద్దయాజ్ఞన్ సుధా
భుగ్విరోధ్యగ్రణీ సేనలన్ మించె గంభీరభే
రీ, ధణంధాణముల్ ...ఉ. రా. ౨. ౨౩.

దణాయఁడు. వి. (దణా + నాయఁడు) ౧. సే
నాని, కుమారస్వామి.

చ. పడమటిగాలివెట్ట నొకపారియుఁ గ్రోలమి
నీరసంబులై, జడిసినచిల్వగుంపు నొకసారి
యు మ్రింగమి సొమ్మసిల్లి మ్రాన్పడినగుఱ్ఱాని
నొల్లనిదణాయనికిం దనవాహనంబులన్, బడి
బడి యంపెనో యమరభర్త యనం దగె దా
వధూమముల్. శుక. ౩. ౪౪౮.

౨. పరాకు దెల్పువాఁడు, ప్రతిహారి.

పంచచామరము. దణాయలు న్దలారులుం ము
దంబునన్ గ్రమంబుగా, ఖణఖణంబునన్
బరాకు సారె సారెఁ దెల్పఁగా, రణాంగ
ణావధీరితారిరాజరాజియై శుభే,ఖణఖణా
ఖిలీక్ష్యరక్ష్యసత్కవీంద్రపాళియై. కృష్ణ.
౨. ౧౨. (సేనానాయకుఁడు అని. శ. ర.)

దణి. వి. (√దణా. సం. ధనీ. క. దణి) ౧. ప్ర
భువు, ఱేఁడు (శ. ర) ౨. సేనానాయకుఁడు.

సీ...దళపతినామము ల్గగుఁ బడాలు, దళవా
యి పడవాలు దణి యనంగను...ఆం. భా.
౨. ౧౭౪.

దత్తకుఁడు. సం. వి. అ. పుం. దత్తపుత్రుఁడు.

దత్తము. సం. విణ. (అ. ఆ. అ) ౧. ఇయ్యఁబడి
నది. ౨. ఉత్సృష్టము, విడువఁబడినది. వి. అ.
న. దానము, ఈవి.

దత్తశుల్క. సం. వి. ఆ. స్త్రీ. ఎవతెనిమిత్తము
శుల్క మీయఁబడెనో యట్టివధువు, ఓలి యి
చ్చి తెచ్చికొన్న స్త్రీ.

దత్తాత్రేయుఁడు. సం. వి. అ. పుం. ఒకముని.
(ఇతఁడు అత్రిమహామునికి అనసూయయందుఁ
బుట్టినవాఁడు.)

దత్తానపకర్మము. సం. వి. న్. న. దానము
చేసినతర్వాత అది అశాస్త్రీయ మని తెలిసి మ
రల దానిని పుచ్చుకొనుట. (ఇది అష్టాదశవివా
దములలోనిది).

దత్తాప్రదానికము. సం. వి. అ. న=దత్తానప
కర్మము.

దత్తి. వి. చెప్పినట్లు నడచుకొనువాఁడు, బంటు.

ద్వి. మీదత్తి మీపాత మీధర్మకవిలె, మీ
దాసు ననుఁ గావరే దయతోడ. బస. పు.
౪. ౧౦౨౨ పం.

దత్తి. సం. వి. ఇ. స్త్రీ. ఈవి, దానము.

దత్తు. వి. విధము, రీతి; ఒప్పు.

సీ. క్రమమునఁ బువ్వగుచ్ఛముమీఁద మగ
తేఁటిమొత్తంబు వ్రాలెడుదత్తు మీఱి. గీ. నీ
రజారాతిబింబము ... గ్రసించెనురాహువు
...హంస. ౫. ౩౧౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ...నిదురలేమిం దేలగిలుకడకన్నులం గనుపట్టు
కల్బెట్టు మఱుంగుపఱుచుటకు ఘటియించిన
చలువకలువవిరిబంతులు హత్తించుదత్తులును
...ప్రబంధ. ౩౭.

దత్తు². వి. (సం. దత్తం) స్వీకారము. (శ. ర.)

దత్తు. సం. వి. త్. పుం. దంతము, పల్లు.

దత్తుఁడు. సం. వి. అ. పుం. ౧. దత్తపుత్త్రుఁడు
పెంపుడుకొడుకు. ౨. దత్తాత్త్రేయుఁడు. ౩.
వైశ్యులనామాంతమున గుప్తశబ్దమునకు మాఱు
గాఁ జేర్పఁబడెడియుపాధి.

శ్లో: శర్మా దేవశ్చ విప్రస్య వర్మా త్రాతా చ భూ
భుజః,భూతి ర్దత్తశ్చ వైశ్యస్య దాసః శూద్ర
స్య కారయేత్.(ఉద్వాహతత్త్వము-కల్ప.)

దత్త్రిముఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దానము
చేత పొందఁబడినవాఁడు. (దాసుఁడు మొ.) వి.
అ. పుం. దత్తపుత్త్రుఁడు.

దదత్. సం. శత్రు. ఇచ్చుచున్న.

దదనము. సం. వి. అ. న. ఈవి, దానము.

దదము. సం. విణ. (అ. ఆ. అ.) ఇచ్చునది.

దద్దడము= దద్దళము. వి. బోడిమిద్దె, అల్పశిలా
కుటీరము; చిన్నగుడి, దేవాలయము.

గీ. అట్టిపెనువానలోన సరోభిధానుఁ, డొకనికిని
బ్రయాసంబున నొదిఁగియుండఁ,జాలునల్పాం
తరావకాశంబులోడి,కడప గలయొకరాతిదద్ద
డముఁ జేరి. పరమ. ౧. ౭౨.

చ. మెఱుఁగుఁగడానిదద్దడపుమెట్టుపయిన్ దళ
కంధరుండు క్రొం,దఱుచిగురాకుఁబోఁడు లిరు
దారుల రా నడఁ దూలియాడున,త్తతి ...
చం. రా. ౨. ౨౬.

ద్వి. కామారినగరోపకంఠదేశమున, దా మతియొ
క్కదద్దడ ముండు నందు,లో నొక్క క్షేత్ర
పాలునిస్వరూపంబు.పండిత.పర్వ.౩౭౫పా.

౨. ఫిరంగులు మున్నగుయుద్ధసాధనములు నిలి
పెడితావిమిద్దె.

సీ. వంకదారముఁ జేరి వాకిటిదద్దడంబులు పెర్చి
కొమ్మల మోపు వైచి. ఉ. హరి. ౩. ౩౪.
("వాకిటిబద్దకంబుల"అని వ్రాఁతప్రతి, వావిళ్ల
ప్రతి పా.)

సీ. దంచనంబులును దద్దడములు నెత్తించి పలు
గాఁడితలుపులు బలుపుచేసి. ఉ. హరి.
౨. ౯౨.

దద్దటిల్లు(లు)=తత్తటిల్లు, దద్దఱు,దద్దిర్లు. అ.క్రి.
(ఇందు శకటరేఫ మని చి. ని, శ. ర. ప్రయో
గములందు లఘురేఫము కూడ కన్పడుచున్నది.
నిర్ధారకము లేదు.)

౧. తబ్బిబ్బుపడు, వ్యత్యయమునొందు.

సీ...వాణి హాసంబుతోఁ గ్రక్కునఁ గ్రమ్మతి
కౌఁగిలించి, యింతలోనన యార యెన్ని
తబ్బిబ్బులు దద్దటిల్లకుఁ డంచు ధవునివీపు.
గీ. చఱిచి ...కళా. ౫. ౨౪.

సీ. కడపటఁ బ్రాణాంతకాలంబు రాఁ బైని శ్లేష్మ
రోగంబుల జీర్ణు లగుచు, దేహంబు లెఱుఁ
గక దీనభావంబులఁ గడు దద్దటిల్లంగఁ గాల
భటులు. సానందో. ౨. ౩.

౨. సంభ్రమమునొందు, కంగారుపడు; అదరి
పడు, త్రుళ్లిపడు; భయపడు.

ఉ. కాంత యనంతరంబ మణికంధరుఁ గన్గొని
నీ విఁకన్ విని,శ్చింతత దేవి కర్పణము సే
యుము కొంకక దద్దటిల్ల కొ,క్కింతయు శం
కలేక ...కళా. ౪. ౧౭౩.

గీ. వెనుక ముందఱ నిరుచక్కి వేటలోన, నెం
దఱెందఱుఁ ద్రోలిన నెచటనేని, తప్ప నెగ
సినఁ దాఁకినఁదద్దటిలక, పిట్టనేయుదు మదె
డేఁగఁ బట్టి యైన. చంద్రా. ౨. ౭౭.

గీ. దివమునను సంజకడ యంచు దివ్వె లెత్తు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దద్దఱిలినట్లు నడుశేయి ప్రొద్దు వొడిచె, నసె డుమతిఁ బాఁచిపనులు చేయంగఁ బూను, వలపువెట్టికిఁ జిక్కి యవ్వనజగంధి. శుక. ౨. ౫౬౧.

క. ఇద్దఱిలోపల నెవ్వతె, దద్దఱిలక యతనిధై ర్యధనముఁ గొనెడు నా,ముద్దియకే యీబి రుదుల, పద్దులు దగు నిది నిజంబు భామిను లారా. వాల్మీ. ౩. ౭౧.

ఆ. అంజె నళికె వెఱచె నదరె దద్దఱె దద్ద, ఱిల్లె జడిసె ననఁగఁ జెల్లు భయముఁ, జెందె ననుటకాఖ్యలు...అం. భా. ౩. ౯౨.

దద్దఱు= దద్దఱిల్లు.
(భయపడు)
ఆ...దద్దఱెదద్ద,ఱిల్లె...అనఁగఁ జెల్లు భయముఁ జెందె ననుట, కాఖ్య...అం. భా. ౩. ౯౨.
సీ. తల యెత్తి చూడఁ డెవ్వలనఁ బరస్త్రీల ధైర్యంబు విడఁ డెట్టిదద్దఱుటల. పాండు. ౨. ౬.

దద్దలిక. వి. ధైర్యము.
సీ. పులిమీస లాడిసి దద్దలిక నుయ్యల లూఁగు గండుమీఱినకోడెదండిమగలు. సానందో. ౩. ౫౩.

దద్దళము=దద్దడము. (శ. ర.)

దద్దిఱు=దద్దఱిల్లు.(శ.ర.)

దద్దు=దద్దురు. వి. (సం. దద్రుః. ప్రా. దద్దు. క. దద్దు.) ౧. చీమ మున్నగునవి కుట్టుటచేతను పైత్యముచేతను బెత్తము మొదలగువానితో కొట్టుట మున్నగువానిచేతను కలిగెడువాఁపు.
సీ. బలుకట్ల దద్దు లేర్పడుభుజార్గలలతో నలఁగినచలువదువ్వలువతోడ. ఉ. రా. ౫.౭౦.
సీ. జవరాలినునుకీలుజడవేటుదద్దు ముద్దులవెన్నునను కవదొనలు మెఱయ. శకాం. ౫. ౧౪.
౨. కణఁతి.
ద్వి. బరుసుమీసము చెక్కుపైఁ బులిపిరియు, నఱుకుబొడ్డును మేన నొదవినదద్దుఁ, బిల్లికన్నులు బల్ల పెరిఁగినకడుపు. నవ. ౩. ౧౦౩ పా. ౧౯ పం.
జ: దద్దుగంబళి.

దద్దుగంబళి. వి.(దద్దు+కంబళి)కంబళివిశేషము.
వ...రత్నకంబళములు దద్దుగంబళులు ... ప్రబంధ.౬౦౫.

దద్దురు=దద్దు.
సీ...దద్దురం చనఁగను దద్దనంగ, దద్రువు వెలయు...అం. భా. ౨. ౧౩౧.

దద్రుఘ్నము. సం. వి. అ. పుం. చక్రమర్దము, తంటెపుఁజెట్టు.

దద్రుణము. సం. విణ. (అ. ఆ. అ.) దద్దురులు గలది, దద్రురోగము గలది.

దద్రువు. సం. వి.ఉ.స్త్రీ.దద్దురు, రోగవిశేషము.

దధత్. సం. శత్రు. ౧. ధరించుచున్న. ౨. పోషించుచున్న.

దధము. సం. విణ. (అ. ఆ. అ) ౧. పోషించునది. ౨. ధరించునది.

దధానము. సం. విణ. (అ. అ. అ) ౧. ధరించుచున్నది. ౨. పోషించుచున్నది.

దధి. సం. వి. ఇ. పుం. సరళమనుధూపద్రవ్యము. (వై. ని.) న. ౧. పెరుఁగు. ౨. వస్త్రము. (వాచ.) ౩. మద్దికి. (శ. ర.)

దధికూర్చిక. సం. వి. ఆ. స్త్రీ. ఆమిక్ష, కూడు, కాఁచినపాలలో పెరుఁగు కలుపఁగాఁ గలుగు విఱుగు.

దధిచారము. సం. వి. అ. పుం. మంథానదండము, కవ్వము.

దధిజము. సం. వి. అ.న.-పెరుఁగువలన పుట్టినది-నవనీతము, వెన్న.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దధిత్థము. సం. వి. అ. పుం. కపిత్థము, వెలఁగ ౘె.

దధిత్థాఖ్యము. సం. వి. అ. పుం. సరళద్రవ్యము, ధూపద్రవ్యభేదము.

దధిపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. కోలశింబి, కంబళిచిక్కుడు ౘె.

దధిపుష్పిక. సం. వి. ఆ. స్త్రీ. తెల్లదింటెన, శ్వేతాపరాజిత ౘె.

దధిఫలము. సం=దధిత్థము.

దధిశోణము. సం. వి. అ. పుం. గోలాంగూలము, ఒకజాతికోఁతి. (త్రి. ని.)

దధిసారము. సం. వి. అ. పుం. నవనీతము, వెన్న.

దధిస్నేహము. సం. వి. అ. పుం. ౧.కద్వరము, మజ్జిగ తేట. (విల్యమ్సు) పెరుఁగుమీఁదిమీఁగడ? ౨. నవనీతము. (వాచ).

దధిస్వేదము. సం. వి. అ. పుం. తక్రము, మజ్జిగ.

దధీచాస్థి. సం. వి. ఇ. న. ౧. ఇంద్రునివజ్రాయుధము. ౨. వజ్రమణి, మగటాయి.
ఇప్లే: దధీచ్యస్థి.

దధీచి. సం.వి. ఇ. పుం. ఒకానొకముని. (దేవతలకాయుధములుగాఁ దనయెముకలొసంగి మహాదాత యని ప్రఖ్యాతి వడసినవాఁడు.)

దధీచుఁడు. సం. వి. అ. పుఁ=దధీచి.

దధ్యమ్లము. సం. వి. అ. పుం. ఉప్పు నెయ్యి నువ్వులు మినుములు వేసి ఉడికించినపెరుఁగు.
శ్లో: దధ్యమ్లోలవణస్నేహతిలమాషవిపాచితమ్. (వై. ని.)

దధ్యాకరము. సం. వి. అ. పుం. పెరుఁగుసముద్రము.

దధ్యాని. సం. వి. ఈ. స్త్రీ. సుదర్శనలత.

దధ్యుదకము. సం=దధ్యుదము.

దధ్యుదము. సం. వి.అ.పుం. పెరుఁగుసముద్రము.

దధ్యోదనము. సం. వి. అ. పుఁ.న. మిరియములు మున్నగువానితో పోగిచి పెరుఁగుతో కలిపిన అన్నము.

దనియాలు. వి. బ. (సం. ధనికః. ప్రా. ధనిఅ. క. దనియ. త. తనియా.) కొత్తిమిరివిత్తులు, ధాన్యాకము.

దనియు. స. క్రి. (త. తణి) కూడు, సంగమించు. (శ. ర.)
జ: దనివు.

దనివు. వి. (√దనియు. త. తణివు.) కూడిక, సంగమము.
గీ. దనివు మెుదలైనఁ జిగురొత్తుతమకమునకుఁ, బ్రాఁకువెట్టుచు మగుడఁ బైఁబడుచు నింతి, వింతభంగుల కెలయించి వెకలిఁ జేసి, యభిమతక్రీడనములకు నలవరించు. భార. విరా. ౨. ౩౧౦.

దనుక=దాఁక. అవ్య. ద్రు. (√దనుకు. క. తనక, ఇది దనుకుధాతువుయొక్క తుమున్నంతరూపమైనను ప్రయోగములయందు 'పర్యంతము' అను అర్థమున వాడఁబడుచున్నది. "దనుక" యే 'దాఁక'గా మాఱియుండును.) వఱకు, పర్యంతము.
గీ. ఇంక నొక్కటి వినుము పూర్ణేందువదన, వ్రతము చెడ సౌఖ్యమైనను వలయుఁ గలుగ, వాంఛితము దీఱ నను నీవు వదలఁ జెల్ల, దేను నిను సమ్మతిలఁ జేసి యేఁగుదనుక. మనుచ. ౩. ౧౦౩.
ఆ... తేఁటికదుపు లామనిఁ దలనూపెఁ, జూపు దనుక నెల్లచోటఁ దోఁట, యందుఁ దామ యగుచు...పారి. ౩. ౭౧. (చూపుదనుక=చూపానునంతవఱకు అని భావము.)

దనుకు(నుక-). స. క్రి. పొందు.
(క) ప్రాపించు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. నను బిగియారఁ గౌఁగిట మనం బలరారఁ గఁ జేర్చి మోదమును, దనుకఁగ నంచితాధర సుధారస మిచ్చి...భాగ. ౧౦. ఉ.౩౪౩.

ఉత్సా... వగలపోక యైనయట్టిదు, స్తరపుటు న్కు కొల్లఁబాటు దన్కుఁ డించుకేనియుఁ. భార. స్త్రీ. ౧. ౪౯. ('ఒల్లఁబాటుఁదన్కుఁ డు' ముద్రి. పా.)

సీ. జగ మెల్ల గెలువఁ గొంజిగురుటాకుజిరావ జీరున కిదిగదా జీవగఱ్ఱ. గీ. యనక కినుక శిఖాకృతి దనుకఁ దిట్టి, సమరపతి పంపఁ దనదు డెందము గలంప, వచ్చురుచిరోరురం భ యౌవనవిజృంభ,మానసంరంభ రంభ ని ష్ఠాని వరుఁడు. చం. రా. ౩. ౪౫.

(చ) సహించు.

క. ముందటియుత్సాతములను, డెందంబుల నో ర్చి యిప్పటికిఁ బాయఁగ లే,కిం దుండఁగ మన కిష్కాడ్కిం దనుకఁగరానికడఁదిడెప్పర మొందెన్. హరి. పూ. ౬. ౧౧.

(ట) అనుభవించు.

సీ. ఆత్మసాక్షాత్కార మై యున్నయతనికిఁ దమయౌవనంబులు దన్కు నిచ్చి. కవిరా. ౧. ౯౭.

జః దనుక, దాఁక.

దనుజద్విషుఁడు. సం. వి. ష. పుం. ౧. వేలుపు; దేవత. ౨. విష్ణువు.

దనుజారి. సం. వి. ఇ. పుం. ౧. వేల్పు, దేవత. ౨. విష్ణువు.

దనుజుఁడు. సం. వి. అ. పుం. -దనువుపుత్త్రుఁడు- అసురుఁడు, తొలివేల్పు.

ఇల్లే: దనుపుత్త్రుఁడు, దనుసంభవుఁడు, మొ.

దనువు. సం. వి. ఉ. స్త్రీ. దక్షునికూఁతులలో నొకతె. (కశ్యపునిభార్య, దానవులతల్లి.)

దప్పము. విశ. (క. దప్ప, దొప్ప.) దట్టము.

ఉ...ఎట్లు దాఁటితే, యీవిరిదేనెవాఁకగము లీ తెలిదప్పపుఁగప్పురంపుబ,ల్దీవులు...భాను. ౩. ౪౦. (శ. ర. పా. "దట్టపుఁగప్పురంపు" ముద్రి. పా)

దప్పర. విశ. (క. దప్పనే=మోపైనది) కఱకు, మోపైనది.

ద్వి. ములుగత్తి నుచ్చుఁగోకలుఁ జూడుఁగొడు పు, మొలతిత్తి నిడి దొడ్డమొలకచ్చ గట్టి, గాలి దప్పరవెండ్రుకల్ దూలి యాడ, నీల వెట్టుచు...బస. పు. ౩. ౧౧౯ పం. (దబ్బఱ అని క్రొత్త ప్రతి పా.)

దప్పళము. వి. రెండు మూఁడుకాయదినుసులు చేర్చి పలుచగాఁజేసిన వ్యంజనవిశేషము, పు లుసు.

ఉ. దప్పళ మెత్తి పంక్తులకుఁ దప్పక వడ్డన నీవు పూనుచో, గుప్పున రొయ్యగౌ లిచటఁ గొట్టె...పార్వ. ౫. ౧౭౮.

దప్పి=దప్పి, దప్పిక. వి. (√దయ్యు) ౧. గ్లాని, శ్రమ, బడలిక.

క. పాండవబల మల్పం బ్రై,యుండం గృష్ణుఁడు ధనంజయుండును దప్పిం, బెండువడఁగ... భార. శల్య. ౧. ౩౦౯.

చ. నిలుపఁగ రానియుక్కిసయు నెమ్మెయి నెక్కొనుదప్పి పెంపుఁ జే,వెలుఁగునఁ జూచు చూపుఁ గలవృద్ధమహీసురుఁ డమ్మహీశ్వ రున్. విక్ర. ౨. ౧౫౫ ఉ. రా.౩.౨౪౬.

క. పదములు తొట్రుపడంగా,వదనంబున లేని దప్పి వాతెఱ యెండం, గదియఁగ వచ్చి వసంతుఁడు, హృదయమున భయంబు దోఁప ని ట్లని పలికెన్. విక్ర. ౮. ౩౪.

౨. నీరువట్టు, పిపాస, దాహము.

ఉ...సలిలంబు దప్పి వోఁ, దాఁగినవారి కిం పగునె లేన్నును దియ్యఁదనంబు వాసన్కా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యోగముఁ గర్గినేని విహగోత్తమ నిర్మలవారి
పూరముల్. నైష. ౨. ౮౧.
సీ...వలకాఁక పెనుదప్పి వదలు పెట్లు. నీలా.
౨. ౩౬.

దప్పిక. వి. (దప్పి + ఇక-స్వార్థమున.) దాహము; పిపాస.

దప్పికిచ్చే=దప్పిపోవుటకునిచ్చు.

సీ. గ్రుడ్డులు మిడికించుకొని దప్పికి మ్రనుఁ దమ
వారి నొక్కచేతాళమాళి. కువల.౨.౧౫౦.

సీ. దప్పికి మ్రన మది దప్పినదా యనుఁ జెంబుఁ
దెమ్మనినఁ గుచంబె యనును. హంస.౫.౭౦.

దప్పిగొను= డప్పిగొను. అ. క్రి. (దప్పి + కొను) పిపాసితుఁడగు, నీరువట్టుగలవాఁడగు.

గీ. దప్పిగొన్నట్టివారి కాదప్పి దీఱ, సలిలపూ
రంబు హితవొ యాజ్యంబు హితవొ. నైష.
౪. ౫౨.

దబదబ. వి. తలుపుకొట్టుట, మొత్తుట మొదలగు వానియందగుధ్వని కనుకరణము.

(వ్యవ.) తలుపులు దబదబ ఎంతకొట్టినను ఎవ్వ
రును పలుకలేదు.

,, వాని నందఱు కలిసి దబదబమొత్తినారు.

దబ్బ[1]. వి. నారంగవిశేషము. (దీనిభేదములు:- నారదబ్బ, పుల్లదబ్బ, తియ్యదబ్బ, దూదిదబ్బ, మొ.)

గీ. పనసపండులు దబ్బపం డ్లనఁటిపండ్లు. నీలా.
౨. ౪౬.

దబ్బ[2]. వి. (త. తప్పై.) పెదురుబద్ద, వేత్రము. (చూ. దబ్బవాఁడు.)

వ...అప్పాపాత్ములు...మడమతాఁకులం బఱచి
యుం బెడచేతులం జఱచియుఁ బచ్చదబ్బల
నొ్దియు ... ఇట్లధికావస్థలం బెట్టుచు...
సానందో. ౧. ౨౪ పా.

మ. పలుమాఱుక్ సముఖా యటంచుఁ బలు
దబ్బ ల్వాని వేర్వేఱ ది, క్తలరాజన్యుల
నెల్లఁ గంచుకులు వక్కాణింప...చంద్ర.
౧. ౧౧౩.

జ: దబ్బవాఁడు.

దబ్బ[3]. వి. (సం. దర్భః, ప్రా. దబ్భో) కుశ.

గీ. కొన్ని దబ్బన దర్భ యగు న్మహేశ.ఆం.
భా. ౨. ౭౫.

జ: దబ్బపాన్పు, దబ్బయుంగరము,దబ్బవ్రేలు,
దబ్బసంబెల.

దబ్బడము. వి. మాఁయు. (శ. ర.)

జ: దబ్బడించు.

దబ్బడించు. స. క్రి. (√దబ్బడము) ౧. మాఁ కుటితో మాయు.౨.చేతులతోఁ జఱచు.(శ.ర.)

దబ్బనము. వి.పెద్దసూది, గోనెలు కుట్టెడుసూది.

సీ. సూది యం చనఁగను సూచి యో నది గొ
ప్ప యైన దబ్బన మన నలరుచుండు. ఆం.
భా. ౨. ౫౯౭.

దబ్బపాన్పు. వి. (√దబ్బ[3]) దర్భశయ్య.

సీ. చెంగల్వవిరిశయ్య నంగ మొత్తుట కుల్కు
బిబ్బోకరాశికా దబ్బపాన్పు. పాంచా.౩.
౨౩.

దబ్బయుంగరము. వి. (√దబ్బ[3]) పవిత్రపు ముడివలె బంగారముతోఁ జేసినయుంగరము.

ఉ...కమలాక్షునియంగుళిదబ్బయుంగరం,బప్ప
రకాలుఁ డెంతయును నారసి చూచి మనం
బులోపలక్. పరమ. ౪. ౨౦౭.

దబ్బఱ=డబ్బఱ. వి. ౧. బొంకు. అసత్యము.

మ. కడుఁ జోద్యం బిది పంచభూతపరిపాక ప్రా
ప్తచైతన్య మ్మో,మొదలే యాత్మనుసత్యవాదు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లఁట యోహో నాస్తిరుల్ దేహముం,బడఁ
గా నాత్తయు వేఱ యుండు నని దబ్బ
ఱ్లాడువా రాస్తికుల్, పుడమిం బూజ్యులు
నైనవార లఁట యీభొంకుల్ వినం బోలు
నే. ప్రబోధ. ౨. ౩౨.

ఉ...బేతాళుఁడు వచ్చి డగ్గఱిన దబ్బఱ గా
దొకదెబ్బదీయఁగాఁ, జాలుదు రేమి చెప్ప
...విజ. వి. ౧. ౧౦.

క...గొబ్బున నొకముద్దఁ జేసికొని మ్రింగుఁ
జుమీ, దబ్బఱలుగఁ జూడకు మోఁ,యబ్బా
...నీలా. ౨. ౫౫.

౨. మోసము.

గీ. విని పుడమిఱేఁడు లెంతయు వెఱఁగుపడు
చు, నద్దిరా కొండ కుద్దియై కొద్ది గాక,
యున్నవిలు దెచ్చి యందఱ బన్న మొందఁ,
జేసెఁ బోల్వఁడు దబ్బఱ చేసి నేఁడు.
అచ్చ. రా. బాల. ౧౭౩

౩. నిందావాక్యము.

గీ. తోడికోడ లటంచును దోడిచెలిని, దబ్బఱ
లె తిట్ట నొక్కతె దాని తనదు, కోడ లం
చును జెక్కిలి గొట్టె నొకతె, మదిరచా
క్షన గోపికామానవతులు. దశ. ౯.
౧౫౫.

సీ. ధర్మరాజు లటన్న దబ్బఱలే తిట్టుఁ గంబ
మయ్యె యటన్నఁ గ్రాసి యుమియు. శుక.
౩. ౪౯.

౪. తప్పు.

క. వనజభవుఁ డవయవములు, దనరార సృజించి
సావధానమతి న్నన్గొని కా నొక్కటె దబ్బ
ఱ, యని బుజ యిడుపగిది నాభి యంగన
కలరుక్. చంద్రా. ౪. ౧౩౨.

౫. విపత్తు.

ద్వి. పనసుఁ డెటేంగి దబ్బఱ వచ్చె ననుచు.
రం. శా. యు. (శ.ర.)

విణ. ౧. అసత్యమైనది, కల్ల; కృత్రిమము,తెచ్చి
పెట్టినది.

ద్వి. తగు నీకు దమయంతి దమయంతి కీవు,
దగుదువు నామాట దబ్బఱ గాదు. ద్వి.
నల. ౧. ౩౭౬.

ఉ. దబ్బఱ కానుమాట వనితామణి కాను మె
ఱుంగుజాళువా,గుబ్బలి తేనికోట వలిగుబ్బె
తచన్గవ...కువల. ౩. ౩౧.

చ...అలధూర్తచకోరశుకాగ్రగణ్యముం, దన
గృహసీమ నుంచుకొని దబ్బఱనెయ్యము
నిబ్బరంబుగన్. శుక. ౩. ౫౪.

మ...అస్త్రాదితో, పణమా దబ్బఱ సత్యమా
హుళి గణించక్ వాని కద్రిస్తనీ. హంస.
౫. ౧౧౧.

౨. బొంకువాఁడు, అసత్యమాడువాఁడు.(శ.ర.)

౩. మోసగాఁడు.

క. గుబ్బలిద్రిమ్మరిసింగమ, దబ్బఱరక్కసుఁడు
నన్గొదవ పల్కుటయుక్, దబ్బున వింటివి
గద యిది, గొబ్బున నీ వరిగి దొరకు గుఱు
తుగఁ జెపుమా. అచ్చ. రా. సుం. ౭౨.

క. నెఱయంగా నీఛందము,తెఱఁ గెఱుఁగక
కవిత చెప్పఁ దివురునతఁడు ద,బ్బఱ చీకు
చీకుగుఱ్ఱముఁ, బఱపినగతి నిఖిలహాస్యపద
నిరతుఁ డగుక్. కవిజనా. సంజ్ఞా. ౧. ౪.

౪. భయంకరము.

సీ. పటిచుంచుఁదలలును బఱుకులు దబ్బఱమిడి
సినగుడ్లులు బడఁకి చెవులు.కు.సం.౬.౯౪.

జః దబ్బఱకత్తియ,దబ్బఱ కాఁడు,దబ్బఱయాట,
దబ్బఱి.

దబ్బఱకత్తియ(త్తె.) విణ. (√దబ్బఱ) దబ్బఱ
లాడునది. (శ. ర.)

దబ్బఱకాఁడు. విణ.(దబ్బఱ + కాఁడు) ౧.దబ్బ
ఱలాడువాఁడు, అసత్యమాడువాఁడు.

శా...అహో సత్యవాక్యత్వ మ్మీడేఱం దబ్బఱ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాఁడ వైతిగద యిం కేరీతి సైరింపుదుక్. శుక. ౨. ౫౯.

క. కొఱఁతెవడుఁ దొంటినోములు, దఱిఁగుక్ మఱి బ్రతుకనేండ్లు తలఁగును సిరి ద,బ్బఱి కాండ్రకు ...అచ్చ. రా. అయో. ౩౨.

౨. మోసగాఁడు.

గీ. నిన్న నే నన్ను మొఱఁగి నాచిన్నదాని, న క్కటా యొడరేపున నమ్మికొందు, వేమి టికొ జాఱవిడిచితి విం తె కాని, యంతదబ్బ ఱకాఁడ వీ వాడొ కాదొ. శుక. ౩. ౩౭.

౩. విలాసవంతుఁడు.

గీ. చాఱపప్పును గసగసల్ జాజికాయ, సెనగ లనుములు పత్రియు మునగపువ్వు, కొబ్బె రయు మందపాలతోఁ గూర్చి త్రావి, యు బ్బుదబ్బఱకాఁడునీ కబ్బు టగు నె. ప్రబంధ. ౬౪౧.

దబ్బఱయాట. వి. (√దబ్బఱ) విలాసక్రీడ.

చ...పరిపంథుల నుద్ధతిఁ గూల్చి కూల్చి యు, గ్గడు వగునెత్తురుల్ బహుళగైరికధారలఁ బోల నారదుం, డుడుగక కుంచె వీచు చును బ్బున దబ్బఱయాట లాడఁగక్. హరి. ఉ. ౭. ౧౯౭.

దబ్బఱి. విశ. (దబ్బఱ+ఇ[3].) దబ్బఱకాఁడు, దబ్బఱకత్తె. (శ. ర.)

దబ్బవాఁడు. వి. (√దబ్బ[2]) మేదరవాఁడు. వెదురుబద్దలతో బుట్టలు మొ. అల్లుకొని జీవించు ఒకజాతివాఁడు.

దబ్బవ్రేలు. వి. (√దబ్బ[3]) పవిత్రపువ్రేలు,అనా మిక.

గీ. దబ్బవ్రేలియుంగరము మేదావిబొట్టు,మడుఁ గు పేలికపిరిచుట్టు బెడఁగు గాఁగ, వడుఁగు చందంబు...హరి. ఉ. ౧౦. ౨౩౩.

దబ్బసంబెళ. వి. (√దబ్బ[3]) దర్భలతోఁ జేసిన సజ్జవంటిపాత్రము; దబ్బసంచి. (శ.ర.)

గీ. జాఱుబొజ్జయు నునుదబ్బసంబెళయును, జె త్తగొడుగును జక్కఁ దాల్చి కుతుకమున. హర. ౭. ౧౨.

దబ్బాటు= డబ్బాటు.

దబ్బిచిప్ప. వి. తాటిచెట్టు బద్దలుచేయునపుడు పయోగించెడుసాధనవిశేషము. (శ. ర.)

దబ్బు=డబ్బు[1]. స. క్రి. ౧. చెప్పు.

ఉ. ఉల్లములోన నే మనుచు నుండువొ యే నొకదబ్బు దబ్బెదక్. సారంగ. ౧. ౭౧.

౨. బొంకు.

సీ. ఎంత సేసినది నేఁ డిది విన్నఁ గన్నఁ జో ద్యము గాదె మఱి దబ్బు దబ్బిన నిటు,వలె నుండవలె మెచ్చవలదె యిందులకు ...సా రంగ. ౩. ౨౦౮.

వి. ౧. మాట.

ఉ. ఉల్లములోన నే మనుచు నుండువొ యే నొకదబ్బు దబ్బెదక్. సారంగ. ౧. ౭౧.

౨. బొంకు.

సీ. ఎంత సేసినది నేఁ డిది విన్నఁ గన్నఁ జో ద్యము గాదె మఱి దబ్బు దబ్బిన నిటు,వలె నుండవలె మెచ్చవలదె యిందులకు ...సా రంగ. ౩. ౨౦౮.

౩. దబ్బడము, మూఁకుడు (శ.ర.); మూఁత.

సీ. అన్న మొప్పుగఁ గప్పి యటికదబ్బుగ మూసి, గడియవోయినయంత గవ్యఘృతము (చి. ని, చి. కి.)

జః దబ్బుడు, దబ్బువెట్టు.

దబ్బుడు. వి. (√దబ్బు)మూఁత,దబ్బడము. (చి. ని, శ. ర.)

దబ్బున. క్రి. విశ. ద్రు. (√దబ్బు) శీఘ్రముగ.

క. గుబ్బలిద్రిమ్మరిసింగము, దబ్బఱరక్కసుఁడు న గ్గొదవ పల్కుటయుక్, దబ్బున వింటివి గద యిది, గొబ్బున నీ వరిగి దొరకు గుఱు తుగఁ జెపుమా. అచ్చ. రా. సుం. ౮౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. గొబ్బున లేచి బుజంబులు, దబ్బునఁ జఱచు
కొని...నీలా. 3. ౬౨.

దబ్బుర = డబ్బుర. వి. గిన్నె.

చ. గరిత యొకర్తు హేమచషకంబునఁ జందురు
నీడఁ జూచి హా, వెఱవక గిన్నెలో నిటికి
వీఁడు హరింపఁగఁ జాగ నీధు వీ, నెఱి వగు
దొంగఁ బట్టుకొని నేఁడు మొదల్ పదియా
ఱు వ్రక్కలై, ధరఁ గృశియింపఁ జేతు నని
దబ్బురలోన మథించెఁ జేతులన్. రుక్మి.
3. ౯౨.

దబ్బువెట్టు. స. క్రి. (దబ్బు + పెట్టు) మాయు.
ఆ. మగనిరాక యెఱిఁగి మగువ యొయ్యన అంకు,
మగనిఁ దెచ్చి యింటిమఱుఁగునందుఁ, గల్లు
గోలెముసను గదియించి యామీఁద, గంప
దబ్బువెట్టెఁ గదలకుండ. భల్లా. ౧. ఆ. శ. ర.

దభ్రము. సం. విణ. (అ. ఆ. అ.) సూక్ష్మము,
అల్పమైనది, సన్నము. వి. అ. పుం. సముద్రము.

దమకర్త. సం. విణ. (ఋ. త్రీ. ఋ) శాసనము
చేయువాఁడు, ఏలిక.

దమకుఁడు. సం. విణ. (అ. మికా. అ.) ౧.
అడఁచువాఁడు. ౨. దండించువాఁడు, శిక్షించు
వాఁడు.

దమథము. సం. వి. అ. పుం. ౧. దండనము.
౨. క్లేశమును సైఁచుట. 3. ఇంద్రియనిగ్రహము.

దమనము. సం. విణ. (అ. ఆ. అ) అణఁచునది;
శాసించునది. (అ. ఈ. అ) అణఁచుటకు సాధన
మైనది. వి. అ. పుం. ౧. కుందము, మొల్లచెట్టు.
౨. దవనము, పుష్పచామరముచెట్టు. న. ౧. అణఁ
చుట. ౨. దండనము, శిక్షించుట. 3. బా
హ్యేంద్రియనిగ్రహము.

దమని. సం. వి. ఈ. స్త్రీ. అగ్నిదమని, అకుల
పై మాఁగు గలఒకజాతిదవనముచెట్టు.

దమనీయము. సం=దమితవ్యము.

దమనుఁడు. సం. వి. అ. పుం. ౧. వీరుఁడు,
శూరుఁడు. ౨. ఒకానొకముని. 3. దమయంతి
సోదరులలో నొకఁడు.

దమము. సం. వి. అ. పుం. ౧. అడఁచుట.
౨. దండనము, శిక్షించుట. 3. బాహ్యేంద్రి
యనిగ్రహము, బాహ్యేంద్రియములను విషయ
ములనుండి మరల్చుట. ౪. అంతరింద్రియనిగ్ర
హము, కుత్సితకర్మములనుండి మనస్సును నివా
రించుట. ౫. క్లేశమును సహించుట. ౬. కర్దమము,
అడుసు. (మే. ని.)

దమయంతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. విదర్భరా
జగుభీమునికూఁతురు, నలచక్రవర్తిభార్య. ౨.
బ్రహ్మచారి ధరించుపలాశదండము- (కే. ని.)

దమయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ) ౧. అణఁ
చువాఁడు. ౨. దండించువాఁడు.

దమి. సం. విణ. (న్. నీ. న్) ౧. అడఁచువాఁడు.
౨. శిక్షించువాఁడు, దండించువాఁడు. 3. బా
హ్యేంద్రియనిగ్రహము గలవాఁడు.

దమి(యి)ంచు. సం. స. క్రి. ౧. అణఁచు,
అణఁగఁద్రొక్కు.

సీ. యుగవిరామమున నుబ్బూఁతలూఁపఁగఁ జా
లుగాలి కొండ. దమింపఁ జాల దెట్లు. కాశీ.
౨. ౧౦౫.

సీ. సర్వలోకాంగనాసౌభాగ్యగరిమంబు దమి
యించుకతమున దానినామ. గీ. మభ్రభారతి
దమయంతి యంచు నొడివె. నైష. ౨. ౯.

౨. దండించు, శిక్షించు.

క. దమియింపఁ దగినవారల, సమయమున ద
మించి వారిసంపదలు మహీ, రమణుండు
దనదుభండారము గా సమకూర్చు జనము
రాగిల్లంగన్. భార. శాం. ౨. 3౯౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దమిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ) ౧. అణఁచువాఁడు.౨. శిక్షించువాఁడు, దండించువాఁడు.

దమితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అణఁపఁబడినది. ౨. దండింపఁబడినది, శిక్షింపఁబడినది. ౩. మచ్చిక చేయఁబడినది, మరపఁబడినది.(ఎద్దు మొ.) ౪. దమము గలది.

దమితవ్యము. సం. విణ. (అ.ఆ.అ) ౧. అణఁపఁదగినది. ౨. దండింపఁదగినది.

దము. సం. విణ. (అ. ఆ.అ)—ఉపపదసమాసాంతమునందే—౧. ఇచ్చునది. (జలదము, సుఖదము, దుఃఖదము, ధనదుఁడు మొ.) ౨. ఖండించునది.

దమునసుఁడు. సం. వి. స్. పుం. -శోషింపఁజేయువాఁడు-అగ్ని.

ఇట్లే: దమునుఁడు.

దమ్మఁడు. వి. (√దమ్మము². సం. ధార్మికః. ప్రా. ధమ్మిఅ.) ధార్మికుఁడు, కపటము లేనివాఁడు.

ఉ. ఎయ్యెడనుండి వచ్చితివె యియ్యెడకున్ హరిభక్తురాల పేరెయ్యది యార్తిఁ బొందఁగత మెయ్యది నీకును మే మొనర్పఁగా, నయ్యెడుకార్య మెయ్యెది భయంపడ కింకెఱిఁగింపు నావుడుం, దొయ్యలి చిక్కె దమ్మఁ డని దుర్భగహర్షనిమగ్నచిత్తయై. విప్ర. ౩. ౯.

గీ...అంగడికి వచ్చి మేదినీశు,మాట లాలించి మిగుల సమ్మదముఁ బొంది, దమ్మఁ డీఁక నేఁడు నాచేతఁ దగులువడియెఁ, గౌశికునిఁ బ్రీతి నొందింపఁ గలిగె నాకు. హరిశ్చ. ౪.౧౦౧.

దమ్మము¹. వి. (సం. ద్రమ్మః?) కాకణీచతుష్టయము, నాలుగుకాసులనాణెము.

సీ. దమ్మ మనంగను దార మనంగను దచ్చుతుష్టయసంజ్ఞ దనరుచుండు. ఆం.భా. ౨.౨౭౪.

దమ్మము². వి. (సం. ధర్మః. ప్రా. ధమ్మో. క. దమ్మ.) ధర్మము.

సీ. తమవారి గుమిగూడి దమ్మరాజులకతల్ నోటి కడ్డము లేక నొడివికొనుచు. కువల. ౨. ౧౧౪. దమ్మరాజులకత=ధార్మికు లగురాజులచరిత్రము.

జః దమ్మఁడు.

దమ్మిడి. వి. (హిం. దమ్డీ.) అయిదుకాసులనాణెము. రెండుకాసులనాణెము అని కొందఱు. (శ. ర.)

దమ్ము. వి. ౧. అడుసు, పంకము. (శ. ర) ౨. పొలము నీరుపెట్టి దున్నుట.

(వ్యవ) మాపొలము దమ్ము చేసినారు.

జః దంపకట్టు, దంపనాఁగలి, దమ్ముకొను.

దమ్ముఁడు. వి. అజ్ఞుఁడు, తెలివిలేనివాఁడు.

సీ...అజ్ఞుండు దగు దమ్ముఁ డంబ స్తనంగను... ఆం. భా. ౩. ౧౨.

దమ్ముకొను. అ. క్రి. (√దమ్ము) అడుసగు, పంకిలమగు, బురదయగు. (శ.ర.)

దమ్యమానము. సం.విణ. (అ. ఆ. అ) ౧. అణఁపఁబడుచున్నది. ౨. దండింపఁబడుచున్నది.

దమ్యము. సం.విణ. (అ. ఆ. అ) ౧. దండింపఁదగినది, దండనమునకుఁ దగినది. ౨. అడఁపఁదగినది. వి. అ.పుం. దున్నుటకుఁగాని బండి లాగుటకుఁగాని అలవాటు పఱుపఁదగినయీడు గలకోడెదూడ.

దయ. సం. వి. ఆ. స్త్రీ. కనికరము, కృప.

దయసే(చే)యు. స. క్రి. (క. దయెమాడు.) -కరుణించు-ఇచ్చు.

సీ. తనుఁ జూచి శిథిలబంధశిరోజయగుట నయ్యతివకు ముక్తకేశాహ్వయంబు, దయచేసి... వరములనొసఁగి...పాండు. ౫. ౧౪౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ...ఇద్దేవరకు నాచంద్రార్కమ్ముగ నమభవిం పంగలవారుగా దయసేసిరి. దా. శా. ౪. ౧౨౯.

౨. క్రి. ౧. వచ్చు.

(వ్యవ) తమరు ఇటకు దయచేయవలయును.

౨. పోవు.

(ఇది గొప్పవారిని గూర్చి ప్రయోగింపఁబడును. ఈ యర్థమం దిది తఱచు బహువచనమందే యుండును.)

(వ్యవ) తమరు దయచేయుఁడు, నాకుపని కలదు.

దయాకరుఁడు. సం. విణ. అ. పుం. దయానిధి, దయకు స్థానమైనవాఁడు,చాలదయ గలవాఁడు.

దయాదాక్షిణ్యములు. సం. వి. అ. న. కనికరము ఔదార్యమును.

శా. తల్లిం జంపినదుండగీనికి దయాదాక్షిణ్యము ల్గలుగునే. చం. రా. ౩. ౧౪౨.

దయాళువు. సం. విణ. (ఉ)కనికరముగలవాఁడు.

దయావీరము. సం. వి. అ. పుం. (అలం) వీరరసభేదము. (దీనికి దయయందుఁ జూపునుత్సాహము స్థాయిభావము)

దయావీరుఁడు. సం. వి. అ. పుం. దయావీరరసప్రధానుఁ డగు నాయకుఁడు. (నాగానందమందలిజీమూతవాహనుఁడు, మొ.)

దయిత. సం. వి. ఆ. స్త్రీ. ప్రియురాలు, భార్య.

దయితుఁడు. సం. విణ. (అ. ఆ. అ) ఇష్టుఁడు, ప్రియుఁడు. వి. అ. పుం. ప్రియుఁడు, పతి.

దయిష్ణువు. సం. విణ. (ఉ) దయగలవాఁడు.

దయివాఱు=దైవాఱు. అ. క్రి. (తె. తైవా) ౧. అతిశయించు.

ఉ. పైపయిఁ గొతుకంబు దయివాఱి యి టుండఁగ నంత మజ్జనంబై పువుఁజప్పరమ్మున నొయ్యారముగాఁ గయిసేసి...విజ. వి. ౧.౬౩.

క. చెయువులసాకిరిసద్దుఁడు, సెయిదోయి మొగిడ్చి రాచసింగముతోడన్, దయివాఱ వేడ్క నిట్టు లనియె...అచ్చ. రా. యు. ౨౭౩.

౨. పొంగిపొరలు; పొరలు.

సీ. ఆసుగుణాబ్ధిచర్యామృతం బెల్లచో దయివాఱఁదెరలె నాపయవిభూతి.వసు.౬.౯౯.

౩. ఈడేఱు.

ఉ. నోములు నోచినమ్మలు మనోరథముల్ దయివాఱ నిత్తఱిన్, దామరతంప రై ప్రియులు దారు విహారము సల్ప...మనుచ. ౩. ౫౯.

దయ్యపుతట్టుకాయ. వి. (√దయ్యము) లోపల కొబ్బెర లేనికొబ్బెరకాయ. (వా)

దయ్యము. వి. (సం. దైవమ్. ప్రా. దేవ్వం, దఇవ్వం, దఇవం.) ౧. దేవుఁడు.

క. దయ్యము నా కేల యిట్టిదెన్యము దెచ్చెన్. భార. భీష్మ. ౩. ౫౭౬.

ఉ. దయ్యమ యేమి సేతు నని తల్లడ మందుచుఁ జేరి యిట్లనున్. భోజరా. ౩.౫౧౭. వాల్మీ. ౩. ౧౨౭.

౨. వేలుపు, దేవత. (ఈయర్థమందు తఱచు బహువచనమం దుండును.)

చ...దయ్యపుమూఁకలు పైఁడికొండపై ననయముఁ గాపురంబులుగ నన్నియుఁ గాచుచు నుండు నెంతయున్. యయా. ౧. ౧౨.

౩. (క. దెవ్వ.) పిశాచము.

ఉ...భవత్తనూజ కేదయ్యము సోఁకెనో మిగులఁ దాపము నొందుచు నాఁడునాఁటికిన్, దయ్యఁ దొడంగె...భోజరా. ౫. ౨౩౩.

క...వసేచరు లేచినవెఱి, తవిలినమతి నద్దిరయ్య దయ్యం బనుచున్. మనుచ. ౪. ౧౦౨.

సీ. ఇరుగింటిదయ్యంబు పొరుగింటికిని గూబ దొ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దురింటివారల కెదురుచుక్క. శుక. 3.౨౦.

౪. విధి, అదృష్టము.

క. అయ్యైరు దెలుగున కప్పుడు, కయ్యమునకుఁ బరమసాధకంబుగఁ గలిగెన్, ముయ్యంచు తుంగ యచ్చట, దయ్యము నేర్పు విను సె ప్పెదం గురునాథా. భా ర. మా. ౫౪.

ఉ...ఈవు వెక్కసపడన్ గదపండువు సేయఁ గోరునా, దయ్యము నెత్తికోలు దుది దాఁకు టగాదె భుజంగభంజనా. భార. ఉద్యో. 3. ౬౭.

ఉ. ఒయ్యన వేల్పు నూపి జడి నుబ్బరవోయెడు ప్రాణికోటికిన్, దయ్యము నెత్తికోలు దుది దాఁకఁగఁ దూరుపు తెల్లవారి తెల్లవయ్యెను ...హర. ౨. ౨౪.

జః దయ్యపుతెట్టుకాయ.

దయ్యు=డయ్యు. అ. క్రి. ౧. బలహీనమగు, బడలు.

ఉ. శాపము నొంది సెవ్వగల దయ్యుచుఁ గ్రుయ్యుచు బిట్టు గూయుచున్. భాగ. ౧౦. ౨౬౭.

౨. అలయు, శ్రమనొందు; కృశించు.

ఆ. కడిఁదిమ్రోఁత మేషకంఠీరవంబులు, తాఁకి తాఁకి దస్సి తట్టువాఱె. క్రీడా. ౨3౦.

ఉ...భవత్తనూజ కేదయ్యము సోఁకెనో మిగులఁ దాపము నొందుచు నాఁడునాఁటికిన్, దయ్యఁ దొడంగె...భోజరా. ౫. ౨33.

జః దప్పి, దప్పిక, దప్పిగొను.

దర. (సం. ధారణ-క. దర.) వెల, మూల్యము, క్రయము.

గీ. కొనుట ధర దారణ యనంగ మనును గ్రయము. ఆం. భా. ౨. ౨౬౭.

దరణము. వి. ఎనిమిదిడబ్బులనాణెము. (శ. ర.)

దరత్తు. సం. వి. ద్. స్త్రీ. ౧. హృదయము. ౨. కూలము, గట్టు. 3. పర్వతము. ౪. ప్రపాత ము, చఱియ. (హిమవత్తటము అని కొందఱు). ౫. భయము. ౬. నది. ౭. పురీషము. (వై. ని, కే. ని)

దరదము. సం. వి. అ. పుం. న. ౧. హింగుళము, ఇంగిలీకము. ౨. కాశ్మీరప్రాంతమందలియొకా నొకదేశము. పుం. భయము.

దరదరకలు. వి. బ. నిగ్గులు.

క. తెరతెరలై శిల లురులన్, దరదరకలు దేరి నునుపు దార్కొన శరధిన్, మతిమతి మం దరగిరి య,త్తఱిఁ దరిత్రాడునను సౌఖ్యదం బై తిరిగెన్. ల. వి. ౨. ౬.

దరదుఁడు. సం.విణ. (అ. ఆ. అ) ౧. భయము కలిగించువాఁడు, వెఱపించువాఁడు. ౨. దరద దేశస్థుఁడు.

దరమము. వి. (సం. ధర్మః) ధనుసు.

సీ. దరమంపుటొజకుఁ దన ప్రేలొసంగినయే నాది మా కిత వైన కేఁడు. ప్రబంధ.౧౬౦. (దరమంపుటొజ=ధనురాచార్యుఁడు.)

దరము. సం.విణ. (అ.ఆ. అ) ౧. చీల్చునది, చిం చునది. ౨. అల్పము, ఇంచుకైనది. (దరహాస ము, మొ) వి.అ.పుం.న. ౧. గర్తము, గొయ్యి. ౨. శంఖము. 3. భయము.

దరవీడు. స. క్రి. చలింపఁజేయు.

క. వనరుహలోచనచక్కం,దనమునఁ దనమనము మరుఁడు దరవీడఁగ మజ్జనభోజనములు దీ రిచి, జనపతి చనుదెంచెఁ గేళిసదనంబు నకున్. కకు. ౪. ౯.

దరవు. వి. భక్ష్యవిశేషము.

ద్వి. వరుగు లప్పడములు వడియములన్ గంగను రుఁగులు దరవులు నుప్పట్లుండలును, వడలు మడ్డెంగ లడ్డ్వములు పేణీలు. ప్రభులిం. ౪. ౧౫౦ పొ. ౧౯ పం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దరాలు. వి. చలించుట ప్రకాశించుట మున్నగు వాని కనుకరణము.

చ. కలకల నవ్వునట్టు వమొగంబు దరా లను
చేరఁడేసికన్నులు పిడికెంటిలో మినుమిను
క్కనుకొనును ముద్దుగారుపప్పులుక్కలుఁ జెవి
కమ్మచేఁ దళుతళు క్కనుచెక్కులు పట్టెఁ
డేసిగుబ్బలుఁ గను మూపుమెఱపు గుభాలను
తావులు దీనికే తగుఁగా. కువల. 3. 3౨.

దరి. వి. (సం. తీరం) ౧. గట్టు, తీరము, ఒడ్డు.

క. తము విశసించుట కాభూవరమణుని వేఁడం
గ నతఁడు రాజీవాక్షీ, క్రమమున విశసిం
పఁగఁ జర్మములు దరులు గాఁగఁ బా ఱె
రక్తము నదియై. భార. అను. ౫. ౬౧.

క. ఉన్నట్లు యుండఁగా దరికి న్నరులను నావ
చేర్చుక్రియ... ఆము. ౨. ౭౯.

క. దరి యొక్క వారినీడలు, సరసిం గనుపట్టెఁ
గూడి సలిలక్రీడల్, జరపి తమపురికి సరు
గం, దిరిగినపాథోధిపతి సతీతతిభంగిన్.
వరాహ. 3. ౧౦౬.

౨. హద్దు, మేర, అంతము.

సీ... పశ్చాత్తాపమునఁ దత్ప్రసన్న గతియు. గీ.
తలఁచితలఁచి యెందును దరి దాఁక లేక,
కాలధర్మము నొంది నాకమున కరిగి. హరి.
పూ. ౨. ౧౫౨.

గీ. మఱియు దరి లేనిసొగసు లేమఱక చేసి,
పలుదెఱంగుల వాయిదమ్ములు సెలంగ. నీలా.
3. ౭౮.

౩. సమీపము.

గీ. బొబ్బ లిడుకొంచు నరిగిరి ప్రోలిదరికి. నీలా.
౨. ౬౬.

క. అనునంతలోన దరికిన్, జను దెంచినయత్తతిన్
... దశా. ౧. ౧౭3.

గీ. దరికిఁ జేరిన నరికోటి దరికిఁ జేరు, శరము
పూనిన నహితాళి శరము పూనుఁ, గొమరు
మీఱినయారాచకొమరుతోడ, సరియె శూ
రులు మనుజకేసరియు కాక. రసిక. ౧. ౫౭.

౪. సానువు, చఱియ.

ఆ. అధికదర్పయుక్తమై బలీవర్దంబు, నగముదరి
విదారణంబు సేయఁ, గాలుద్రవ్వినట్లు
... భార. సభా. ౨. ౧౭3.

క. సిరిగుబ్బచన్నుఁగొండల, దరులం గతిమొగు
లుపగిదిఁ దవిలి తిరుగున, మ్మరుతండ్రి మనుపు
నసముల, నెరయునమీఁక్ఖాన సింగిణీసుల్తా
నా. యయా. 3. ౧.

౫. దిక్కు, శరణము.

ఉ... బ్రతుకుత్రోవకు వచ్చితి లేకయున్న నా,
కుం దరి లేక యొంటి నిటుఁ గుందుదుఁ గాదె
యనుంగుపల్లవా. హంస. ౨. ౧౨౫.

జః దరిదాఁపు.

దరి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. గుహ.

దరికొను. అ. క్రి. ౧. (నిప్పు మొ.) మండు, జ్వలించు.

ఆ. కొడుకుచావుకంటెఁ గోడలియడలునఁ, బె
రిఁగి శోకవహ్ని దరికొనంగ, నంతరంగ మిప్పు
డగ్గల మెరియుంగఁ, దొడఁగెః... భార. స్త్రీ.
౨. ౪౪.

చ... బుభుక్షు పక్షిలో, దరికొన జీర్ణపర్ణములు
దా నొకనాఁడు దినంగఁ బోయునన్. వరా
హ. ౭. ౯౫.

సీ. దరికొను నిబ్బంగి దైత్యులహృదయంబు
లనుమాడ్కి నర్కోపలాలి మండె. రాజ.
చ. ౨. ౬౭.

౨. (నిప్పు, ఆఁకలి మొదలగువానిచే) దగ్ధమగు, కాలు.

వ... ప్రాణేశ్వరి యే చందంబున మద్విరహవేద
నాదవానలంబునం దరికొనియెదవు... నైష.
౧. ౧౦౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. తుక్షి దరికొన్నపట్టున, వీక్షించునె దేహి రుచులు వేళలు మునిహ,ర్యక్షము విశ్వామిత్రుఁడు భక్షింపఁడె సారమేయపలలముఁ దొలుతన్. వేం. పంచ. ౧. ౫౧౫.

మ... ఆశేషంబు బంగారుగు,బ్బలియం దొక్కెడఁ జిందినం దరికొనెన్ భస్త్రావశేషంబు గా. ఉ. హరి. ౬. ౭౫.

౩.(అడవి మొదలగువాయందు నిప్పు)అంటుకొను.

క. ఎండినయడవిన్ దరికొని, మండెడుకార్చిచ్చు మాడ్కి... భార. భీష్మ. ౧. ౨౯౪.

స. క్రి. దహించు, కాల్చు.

చ. ఉరవడి నుగ్రసేవణపయోనిధి బాడబవహ్నిచాడ్పునన్,దరికొని... దశమ. ౧.౭౯.

క.కడుఁ బెల్లగునాఁకలి నా,యొడ లెరియింపంగఁ దొడఁగె నొక్కట జగముల్, పాడిపాడిగా దరికొనియెద, నెడపక యించుక య నుజ్ఞ యిమ్ము మహాత్మా. హరి. పూ. ౪.౧౧౫.

జః దరికొల్పు.

దరికొల్పు(లుపు). స. క్రి. (√దరికొను). ౧. (క) మండించు, జ్వలింపఁజేయు.

వ... ఈకృష్ణచతుర్దశీనాఁటిరాత్రి పురోచనుండు లక్కయింట దహనంబు దరికొల్పుం గావున ... భార. ఆది. ౬. ౧౫౭.

సీ. కపటారివాహినీకాంతారములఁ గాని దరి కొల్పఁ డతులప్రతాపవహ్ని .వి.పు.౧.౪౦.

(చ) రగులుకొల్పు.

క. చని పెడ వికసిల్లెడునా,ననపద్మముతోడ ననిలనందనునకు ని, ట్లనియెఁ జతురో క్తి కిరీటి యతనిగూఢక్రోధవహ్ని దరికొల్పంగన్. భార. విరా. ౨. ౨౭౦.

ఉ...ధూర్తగో,పాలుఁడు తాలవృంత మొకభామిని సత్యపిఱుంద నుండి మం,దాలసలీలమై విసర నాదటఁ గైకొని వీఁచెఁ దద్వపుః, కీలితపంచసాయకశిఖిం దరికొల్పుచునున్న కైవడిన్. పారి. ౧. ౧౦౯.

౨. కాల్చు, దహించు.

వ...ఇట్లు కాశీపురంబు దరికొలిపి కృత్యాసంహరణంబునం గృతకృత్యుండై సుదర్శనంబు దామోదరదేవునకుం బొడసూపి సుఖంబుండె ...ఉ. హరి. ౩. ౧౫౬.

వ...అసహ్యవిషజిహ్వాలకలాపంబులు బ్రహ్మాండకర్పరంబు నప్పళింప నిప్పులు చెదరి చదలు దరికొల్పునుల్కాపాతంబులుంబోలె దిక్కులం జురజుర స్రుక్కి లా వెక్క... భీమ. ౪. ౬౦.

౩. సంభవింపఁజేయు, కలిగించు.

క. పాపంబులేనికులసతిఁ, గోపంబునఁ గుతిలపఱుచువత్సతునకుఁ ద,త్పాపంబులు బహుతరపరి,తాపం బిహపరములందు దరికొల్పు నృపా. హరి. ఉ. ౯. ౭౭.

దరితము. సం. విణ. (అ. ఆ. అ.) జాతదరము, భయముకలది; పిఱికి.

దరిదాపు. వి. (√దరి.) ౧. ఆశ్రయము, ఆధారము.

క. సురధాని యేల రక్కసి, సురధానీలీల నముచినూదనముఖ్యుల్, దరిదా పెఱుఁగక... దశా. ౪. ౧౨౨.

౨. సమీపము.

క... మేరువు,దరిదాపునఁ గూడి మిగులఁ దహతహపడుచున్. దశా. ౪. ౧౨౨.

ఆ. ధనములేమియ నెడిదావానలంబును, దన్నుఁ జెఱుచును దరిదాపుఁ జెఱుచు. వేమన. ౩. ౬౫. (చుట్టుపట్టులు. అని భావము.)

౩. హద్దు, మేర.

గీ. కుంది తలపోఁతలకు మదిఁ గొల్లవిడుచు, విడిచి దరిదాపు లేమిఁ బెన్వేతల మునుఁగు. ప్రభా. ౨. ౧౧౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దరిద్రత్. సం. శత్రు. దుర్గతి నొందుచున్న, పేద యగుచున్న.

దరిద్రాణము. సం. వి. అ. న. దారిద్ర్యము, బీద తనము.

దరిద్రాయకుఁడు. సం. విశే. (అ. యికా. అ) ౧. దుర్గతినొందువాఁడు. ౨. దరిద్రుఁడు, బీద.

దరిద్రిత. సం. విశే. (బు. త్రీ. బు)=దరిద్రాయకుఁడు.

దరిద్రితుఁడు. సం. విశే. (అ. ఆ. అ) ౧. దుర్గతి నొందినవాఁడు. ౨. దరిద్రుఁడు.

దరిద్రుఁడు. సం. విశే. (అ. ఆ. అ) ౧. నిర్ధనుఁడు, బీదవాఁడు. ౨. దుర్గతుఁడు, చెడ్డస్థితి యం దున్న వాఁడు.

దరిబేసి. వి. దీనుఁడు, దైన్యము కలవాఁడు; దేవురు గొట్టు; పిసినిగొట్టు.

సీ. భుజమునఁ గూబరంబు ధరించుకొని సోలు దరిబేసి యగుచు బేతాళుఁ డొకఁడు. జై. భా. ౫. ౧౯౬.

సీ. దరిబేసి చెడుగొట్టు బెరికి దగాకోరు విస పాలవిత్తు చిల్విసము...హంస. ౫. ౧౧౩.

సీ. ధర్మకార్యములలో దరిబేసి నుంచిన నిచ్చు నా తన్నుక చచ్చుఁ గాక. వేణు. ౩౪.

దరిసించు. స. క్రి. (సం. దృశ్. ప్రా. దరిసేఇ.) చూచు.

క...తత్పుత్రశోకమునఁ దనచిత్తం, బెరియఁగ దేవకి వారల, దరిసింపఁగఁ గోరి పనుపఁ దగ నసురేంద్రా. భాగ. ౧౦. ఉ. ౧౧౫౫.

క. పరిచితవిద్యానిధి సై, గురునాథునిచే ననుజ్ఞ గొని యిట విమ్ముక్,దరిసించునభిమతంబున, నరుదెంచుచు నుండి మండలాధిప యంతక్. విక్ర. ౫. ౧౬౭.

దరిసేనము. వి. (సం. దర్శనమ్. ప్రా.దరిసణం.) ౧. చూచుట.

క. ధరణీసురనందన నీ,దరిసెనమున మేను పావదలెఁ దనిసెను జిత్తం, బిరవుగ మన్మందిరములు, పరమపవిత్రంబు లయ్యె భాగ్యము లబ్బెన్. కుచేల. ౨. ౭౬.

౨. రాజాదులను జూడఁబోవునపుడు తీసికొని పోయి యిచ్చెడుకానుక.

క. గిరిరాజు తన్ను డగ్గఱి, నరుదెంచిన నమ్రుఁడగుచు నబ్జదళాక్షిన్, దరిసెనము వెట్టి నిలిచిన...వీర. ౧. ౧౯౬.

సీ. దరిసెనం బిచ్చె మతంగవీరన్నకుఁ గట్టాణి ముత్యాలకంఠమాల. నార. ౧. ౧౨౪.

దరుజు. వి. గచ్చుపూఁతతో రాళ్లను కలుపుట. (శ. ర.)

దరువు. వి.(సం.ధ్రువా.)౧.గీతివిశేషము,ధ్రువ.

సీ...చిందు నా దరు వనంగను ధ్రువ దనరు చుండు. ఆం. భా. ౧. ౧౩౧.

మ. పనివడి నిచ్చలుం బరమభాగవతేంద్రులు తానమాడి పోవునపుడు శౌరిమీఁదిదరువుల్ సరసంబుగఁ బాడ...వరాహ. ౯. ౧౪౫.

౨. తాళము. (శ. ర.)

జః దరువుచేయు, దరువులువెట్టు.

దరువుచేయు. అ. క్రి. (√దరువు) తాళముచేయు. (శ. ర.)

దరువులువెట్టు. వి. (దరువులు + పెట్టు) గీతికలు పాడు.

ద్వి. దాకొన్నగతులతో దరువులువెట్ట, వైకుంఠమునుండి వచ్చి శతారి, యతనికిఁ బ్రత్యక్షమయ్యె నావేళ. ద్వి.పరమ.౮. ౫౬౬పా.

దరోదరము. సం=దురోదరము.

శ్లో. ఆశ్రిత్య దుర్గం గిరికందరోదరం, క్రీడం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్ర్యముష్మిక్ సతతం దరోదరం. (వాచ.)

దరోదరుఁడు. సం=దురోదరుఁడు.

దర్దరము. సం. విణ. (అ. ఆ. అ) ఇంచుక పగిలినది. (పాత్రము, మొ.) వి. అ. పుం. ౧. ఇంచుకపగిలినకుండ. ౨. కొండ. (మే. ని.)

దర్దరీకము. సం. వి. అ. పుం. ౧. కప్ప. ౨. మబ్బు. ౩. వాద్యవిశేషము.

దర్దుర. సం. వి. ఆ. స్త్రీ. దుర్గాదేవి.

దర్దురచ్ఛద. సం. వి. ఆ. స్త్రీ. బ్రాహ్మి, సరస్వతి†.

దర్దురము. సం. వి. అ. పుం. ౧. కప్ప. ౨. మబ్బు. ౩. వాద్యవిశేషము. ౪. మలయపర్వతసమీపమున నున్నయొకానొకపర్వతము. ౫. ఏనుఁగు మెడయొక్క పార్శ్వము. (కే. ని.) ౬. గ్రామసమూహము. (మే. ని.)

దర్ద్రుఘ్నము. సం. వి. అ. పుం. చక్రమర్దకము, తగిరిస, తంటెము†.

దర్ద్రుణము. సం. విణ. (అ. ఆ. అ) దద్దురురోగము గలది.

దర్ద్రువు. సం. వి. ఉ, ఊ. స్త్రీ. దద్రువు, దద్దు.

దర్పకుఁడు. సం. విణ. (అ. ఆ. అ) దర్పము కలిగించువాఁడు. వి. అ. పుం. మన్మథుఁడు.

దర్పణము. సం. వి. అ. పుం. న. ౧. ముకురము, అద్దము. ౨. కుబేరునియునికిపట్టయినయొకానొకపర్వతము.

దర్పము. సం. వి. అ. పుం. ౧. అహంకారము, గర్వము, కావరము. ౨. మృగమదము, కస్తూరి. ౩. ఉచ్ఛృంఖలత్వము, కట్టునకు లోఁబడమి. ౪. ఉత్సాహము. (వాచ.) ౫. విధము, పోలిక.

మ...రభసోత్సాదక్రియఁ సంభ్రమప్రద మై
మందర మంబుధిం గలఁచుదర్పం బొప్ప
నొప్పించుచుఁ, దదనీకంబులు వాఱె...
భార. భీష్మ. ౩. ౧౫.

దర్పించు. సం. అ. క్రి. గర్వించు, త్రుళ్లు.

వ...తప్పించుకొను నేర్పునం దర్పించి పైఁబడం
గుప్పించుచు...ఉ. రా. ౩. ౨౪౬.

దర్పితుఁడు. సం. విణ. (అ. ఆ. అ) గర్వించినవాఁడు; దర్పము గలవాఁడు.

దర్భ. సం. వి. అ. పుం. కుశ, తృణవిశేషము†.

దర్భటము. సం. వి. అ. న. ఏకాంతగృహము, రహస్యపుగది. (త్రి. ని.)

దర్భపత్త్రము. సం. వి. అ. న. కాశము, ఱెల్లు†.

దర్భపోటు. మి. వి.-దర్భలపోటుగలది-శ్రాద్ధములయందు భోక్తలు తినునాహారము.

గీ. దర్భపోటుఁలఁ దిని లేనితఱుల మైత్రి, నంటి
పితృశేషము భుజించి...ఆము. ౬. ౬౯.

దర్భముద్రిక. సం. వి. ఆ. స్త్రీ. దబ్బయుంగరము, పవిత్రపు ముడివలె బంగారముతో చేసిన యుంగరము.

సీ. శోకించు వృద్ధభూసురుఁ డాత్మపితృదత్త
దర్భముద్రికకుఁ జిత్తంబు గలఁగి. పాండు.
౩. ౫౦.

దర్భాహ్వయము. సం. వి. అ. పుం. ముంజిగడ్డి†.

దర్వము. సం. వి. అ. పుం. పిశాచము.

దర్వరీకము. సం. వి. అ. పుం. ౧. వాద్యభేదము. ౨. గాలి.

దర్వరీకుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

దర్వి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. మిల్లి; గరిఁటె, త్రెడ్డు. ౨. పాముపడగ.

దర్వీకరము. సం. వి. అ. పుం.- చేతివంటిపడగ కలది- సర్పము, పాము.

దర్వుఁడు. సం. విణ. (అ. ఆ. అ) హింస్రుఁడు, ఘాతుకుఁడు, హింసించువాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దర్శకుఁడు. సం. విణ. (అ. ర్శికా. అ.) ౧. చూచువాఁడు. ౨. పరిశీలించువాఁడు. ౩. చూపువాఁడు. ౪. నేర్పరి, నిపుణుఁడు. వి. అ. పుం. ద్వారపాలకుఁడు.

దర్శన ప్రతిభువు. సం. వి. ఊ. పుం. అపరాధి మున్నగువానిని చూపుట కొప్పుకొన్న పూఁట కాఁపు.

దర్శనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చూచునది. ౨. చూపునది. ౩. బోధించునది. (అ.ఈ. అ.) ౧. చూచుటకు సాధనమైనది. ౨. చూపుటకు సాధనమైనది. వి. అ. న. ౧. చూచుట. ౨. చూపు, దృష్టి. ౩. చూపుట. ౪. పరిశీలించుట. ౫. కన్ను. ౬. బుద్ధి. ౭. జ్ఞానము, తెలివి. ౮. అధ్యాత్మవిషయక శాస్త్రభేదము. (బౌద్ధదర్శనము, సాంఖ్యదర్శనము, మొ.) ఆస్తికమతముల దర్శనము లాఱు- న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, మీమాంసా, వేదాంత దర్శనములు. (కొందఱు యోగమునకు మాఱుగా పాణినీయమును దర్శనముగా గ్రహించిరి.) శ్లో.పాణినే ర్జైమినేశ్చైవ వ్యాసస్య కపిలస్యచ, కణాదస్యాక్షపాదస్యదర్శనాని షడేవహి. ౯. ధర్మము. ౧౦. స్వప్నము, కల. ౧౧. రంగు. ౧౨. అద్దము.౧౩.యజ్ఞము.

దర్శని. సం. వి. ఈ. స్త్రీ. ఉపరథ్య, పుంత.

దర్శనీయము. సం. విణ. (అ. ఆ. అ) ౧. చూడఁదగినది; సుందరము. ౨. చూపఁదగినది.

దర్శము. సం. వి. అ. పుం. ౧. దర్శనము, చూచుట, చూపు. ౨. అమావాస్య. ౩. అమావాస్యనాఁడు చేయఁదగినయిష్టి.

దర్శయితృ. సం. విణ. (ఋ. త్రీ. ఋ) చూపువాఁడు. వి. ఋ. పుం. ద్వారపాలకుఁడు.

దర్శవిపత్తు. సం. వి. ద్. పుం-అమావాస్యనాఁడు కనఁబడనివాఁడు-చంద్రుఁడు. (కల్ప.)

దర్శి. సం. విణ. (న్.నీ.న్)-సమాసాంతములందే- ౧. చూచువాఁడు. ౨. ఎఱుఁగువాఁడు. ౩.పరిశీలించువాఁడు. ౪. చూపువాఁడు.

దర్శించు. సం. స. క్రి. వీక్షించు, చూచు.(గౌరవవిధేయతలతోఁ బెద్దలను చూచుట యందు తెలుఁగున ప్రాయికముగా నుపయుక్తము.)
గీ. నేను బనివడి దర్శింప నేఁగుదెంతుఁ, గాని నిచ్చలు వెదకియుఁ గాన లేను. వరాహ. ౯. ౮౧.
క. దేవర దర్శించుటకై, తా వచ్చుచు నున్న వాఁడు దపసుం డిదె...హరి.పూ.౩.౧౨౭.

దర్శింపించు. సం.స. క్రి. దర్శనముచేయించు.
ఆ...అచటిమంత్రివరుల, వాఁడు దోడికొనుచు వచ్చి దర్శింపించెఁ, గనకరత్నచయము ముసుము గాఁగ. ద్వా. ౧౧. ౧౭౧.

దర్శితము. సం. విణ. (అ. ఆ. అ) ౧. చూపఁబడినది. ౨. తెలుపఁబడినది.

దర్సెనము=దరిసెనము.
(కానుక)
సీ. సవరఁగాఁ గొంచు దండువులు దర్సెనములు కోలాసఁ గొన కూళ్లు గుత్తకీక.పి.శకుం. ౪. ౧౭౫.
సీ. దర్సెనం బిచ్చె నెద్దానిఁ గోమటి...కాశీ. ౪. ౯౯.

దలపము. సం.వి.అ.పుం. ముఖత్రాణము. (శ.ర.)

దలము=దళము. వి. ఆధిక్యము, గొప్పతనము.
సీ. తనుమధ్య లోప రీస్తనభార మని విధి దల మిచ్చె నాఁ గృశోదరము లెసఁగె. కు. సం. ౧౦. ౪౦౩.
విణ. (=దడము, దళము.) ౧. అధికము; దట్టము.
క. దనుజాధిపుఁ జంపించితి, తనిసితివే సంత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పంబు దల మయ్యె నయో, మనుజేశమిత్ర
నీ కిటు, గినియక్ దళకంఠుఁ డేమికీ డొనరిం
చెక్. భా. రా. యు. ౨౨౫౪.

క...రాగవుఁ డన్నెలఁ,తలతలమానికము జూచి
తల వంచి మదిక్, దలముగ వగపును నాన
యు, నలుకయుఁ బొడమంగ నిట్టు లని
వాక్రుచ్చెక్. అచ్చ. రా. యు. ౫౭౧.

చ. దలమగువానకాలము...పద్మ. ౯. ౭౯.

చ. దల మగుపచ్చకప్పురపుఁదావులు పైపయి
పోడు ముట్ట...విక్ర. ౧. ౧౩౬.

వ... జిలుఁగుకురుమదలంపుదసిలీకసీదురుమాలు
ముచ్చుంగులు బురుసాకుచ్చుల రింగులును
...ప్రబంధ. ౭౯.

దలి. సం. వి. ఇ. పుం. స్త్రీ. లోష్టము, మట్టి
బెడ్డ. (కల్ప.) ఈ. స్త్రీ. చిన్న ఆకు. (వై.ని.)

దలిమము= దడిమము. విణ.
(సన్ననిది.)

క. ఎలనాఁగ యొార్తు దలిమపు,వలిపంబులు గట్టి
నిచ్చె వడినడుగులఁ బా,వలు దొడిగె నొక
తె యొక్కతె, తలఁ బావడ యొత్తి తగిచి
తడి యార్చెఁ దగక్. యయా. ౪. ౧౯.

దల్భము. సం. వి. అ. పుం. ౧. చక్రము. ౨.
మోసము. ౩. పాపము. (కల్ప.)న.వల్కలము.
(కే. ని.)

దల్మి. సం.వి.ఇ. పుం. ౧. ఇంద్రునివజ్రాయుధము.
౨. ఇంద్రుఁడు.

దల్లు=జల్లు[1]. వి. వాన.

క. వెల్లుకొనఁ గురిసి రప్పడు, దల్లుగఁ దమ
చూడ్కులకును దల మిచ్చుచు భూవల్లభు
పైఁ బురభామలు, కొల్లలు గా లాజమిళిత
కుసుమాంజలులక్. కవిక. ౩. ౧౬౦.

దళకొను= దళముకొను. అ. క్రి. (√దళము.)
అధికమగు.

చ. దళకొని యున్న తొంటిసుకృతంబుకతంబు
న వచ్చి మీఁదటం, గలిగెడుఃశోభనంబులకుఁ
గారణమై మరి వర్తమానని,శ్చలదురితంబులం
దలఁగినసన్ముని నాథకులావతంస ని, ర్మలభవదీయ
దర్శనము మా కొనరించెఁ ద్రికాలయోగ్య
తక్. విక్ర. ౫. ౫. (శ. ర. పా.)

దళకోశము. సం. వి. అ. పుం. మొల్లకుందము⚘.

దళగించు. అ. క్రి. (√దళము.) దళముకొను,
దట్టమగు. (శ. ర.)

దళనము. సం. విణ. (అ. ఈ. అ.) భేదించుటకు
సాధనమైనది. వి. అ. న. భేదించుట.

దళని. సం. వి. ఈ. స్త్రీ. లోష్టము, మట్టిబెత్తిక.
(కల్ప.)

దళనిర్మోకము. సం. వి. అ. పుం. (కూసమువం
టిపైపట్ట గలది.) భూర్జము, బుజపత్తిరి⚘.

దళపము. సం. వి. అ. పుం. ౧. ఆయుధము,
ప్రహరణము. ౨. స్వర్ణము, బంగారు. (విల్య
ము.)

దళపుఁడు. సం. వి. అ. పుం. సేనానాయకుఁడు.
(కల్ప.)

దళపుష్ప. సం. వి. ఆ. స్త్రీ. మొగలి⚘.

దళము. వి. ౧. ఆధిక్యము; పరిమాణము.

సీ. దహనుండు వేఁడిమిదళము చూపఁగ లేఁడు
పద్మబంధుఁడు దపింపఁగ వెఱచు. భా. రా.
యు. ౧౫౭౯.

క. రెండును నాలుగుపణములు, దండు వగుక్
క్షుద్రపశువుఁ దగుపశువును నృద్దండత నడి
చిన నతనికి, దండువు దా నెక్కు నొప్పి
దళమున నెపుడుక్. విజ్ఞా. ప్రా. ౫౫.

క. కొలు చాదిగఁ గలబండముఁ, గొలుచు నెడం
దూఁచుచోటఁ గుటిలత దఱుఁగక్,గొలిచినఁ
దూఁచిన బండము,దళమున బేహారిమీఁద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దండువు దగులుటన్. విజ్ఞా. ప్రా. ౬౮.

౨=దడము. (సం. దళః. క. దళవు.) సేన.

(చూ. దళవాయి, మొ.)

3. సమూహము. (చూ. దళముకొను.)

విణ. ౧. దట్టము, దళసరియైనది, మందము.

సీ. బూఁజువట్టినదేహములపై దళంబుగా మల యజపంకంబు లలఁదినారు. నైష. ౭. ౬3.

గీ. అట్టికలధౌతశిఖరిఁ బుష్పాపచయము, సేయు వేడుకఁ బొదరిండ్లచాయలందుఁ,దిరుగుచుండి యొకానొకదెసఁ దృణంబు,దళముగా వాత మొలచినబిలమునందు. మనుచ. ౪. ౭౮.

గీ...నీలత్వమున సరిగావు తెలియ, నెటే గలిగి యొక్క మొత్తమై నిడుఁదలై ద,ళమ్ములై మె ఱుఁగులై కారుక్రమ్ముచున్న, వికచకమలాక్షి నునుసోగవెండ్రుకలను. విజ. ౨. ౧. 3౫.

౨. చిక్కనిది (మజ్జిగ, మొ.)

ద్వి. దళమైనమకరందధారలఁ దోఁగి, పాలు పారఁ బవనుండు పొలయుచున్నాఁడు. రం. రా. ఉ. ౪3 పా. ౨ పం.

చ...తూన్పఁ దోయముల్,పలుచనఁ దేలె మి న్నదుగుపట్టెఁ గడుం దళ మాటనోయనన్. ఆము. ౪. ౧౫౧.

3. నిబిడము, సాంద్రము, దట్టము.

ఉ...ధరాపరాగముల్,గప్పటనైనచీకటి దళం బయి చూడ్కులు గప్ప...భా. రా. యు. ౬౫౨.

౪. అధికము, హెచ్చయినది.

చ...నిక్కినయట్టులు తల్లడించుటల్, గనఁబడ నూరుపు ల్దళముగా నిగుడ న్వడఁ గుంది యూరెలుం,గునఁ దమవానిఁ బిల్చుచు శకుం తము లయ్యెడ నిల్చె ప్రాఁకులన్. పారి. ౪. ౨౧.

క. దళ మయ్యె వర్ష మంబుధిఁ, దలక్రిందుగఁ బట్టినట్లు ధారాశ్రేణీ,ఝుళఝుళలు నైఱపు లబ,లభధళలున్ స్తనితఘళఘళ ల్వ్యాలసి ల్లన్. శుక. 3. ౨౫౧. మనుచ. ౫. ౫౧.

౫. పూర్ణము,సమృద్ధము.

గీ. అతనికై ధారవోసితిఁ బ్రాణ మెల్ల, నట్టిప్రా ణేశ్వరునితోడఁ గలిగి యుంటిఁ, జేయఁగల దేమియో యమ్మచెల్ల నాకు, దళముగాఁజా ల దోయమ్మ దైవబలము. గంభ. ౧. ౧౧౨.

చ. చిగురుఁ బికాళికిన్ ఫలముఁ జిల్కలగుం పునకు న్మధూళిఁ దేఁటిగమికిఁ దావి గాలికి విటీవిటకోటికిఁ బువ్వులుం దళం,బుగఁ గృప నీనియు న్సురభి పుం స్త్వముఁబాంధులచోటఁ బూనె...ఆము. ౫. ౧౪౨, ఆము.3.౧౧.

జః దళకొను, దళముకొను, దళముకొలుపు,దళ మెక్కు, దళవరి, దళవాయి, దళసంచు, దళసరి.

దళము. సం. వి. అ. పుం. న. ౧. భాగము, పాలు. ౨. అర్ధము, సగము. 3. ఖండము,తును క. ౪. విదళనము, భేదించుట, త్రుంచుట. ౫. ఎత్తు, ఉన్నతత్వము. ౬. ఆకు,పత్త్రము. ౭. పుష్పదళము, రేకు. ౮. తమాలపత్త్రము,చీకటి మ్రానియాకు. ౯. సైన్యము.

మ...ఆత్మమూలబలముల్ జాఱన్ దళాడం బరం, బఱుగన్...వసు. ౧. ౪౫.

గీ. ఇటు చతుర్విధదళము లుద్భటము గాఁగ. ఉ. హరిశ్చ. 3. ౧3.

దళముకొను= దళకొను,దళగించు. అ. క్రి. (√దళము.) ౧. అధికమగు, బలముకలదియగు, ప్రబలమగు.

గీ. దర్శనప్రీతి వారికిఁ దగుల మాల,వలనియ క్తిలి మనమున దళముకొనఁగ. భార. అను. ౨. ౨౮3.

చ...నిబిడాంధకారముల్, దళముకొనంగ మూ ధుమదిలాగున నున్నగుహాంతరంబులో. ఉ. రా. ౫. ౫౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. ప్రొద్దువన్నెలకాక యుద్దియే తమ్మిమొగ్గలు
చక్రములఁ గూడి దళముకొనిన. వసు.
౨. ౪౨.

౨. గుంపుగూడు.

గీ. లలితకలకంఠకోలాహలంబు లెసఁగ, దళము
కొని రెండుగడలఁ గాదంబకోటి, గొల్వ
రాచిల్క సాంబ్రాణిగుట్ట మెక్కి, దర్పకుఁడు
పాంథజనులపై దండువెడలె. ఉ. రా. ౪.
౧౨౬.

దళముకొలుపు(ల్పు.) స. క్రి. (√దళము
కొను.) ౧. అధికముచేయు, పెంచు, హెచ్చించు.

సీ. అరుణాంబుజంబుల యంతర్దళంబుల తళతళ
యనుజిగి దళముకొల్పి. భార. ఉద్యో. ౨.
౧౧౪.

గీ. తనపెదవి సాంధ్యరాగంబు దళముకొలుప.
ఉ. రా. ౫. ౧౫౪.

౨. దట్టముచేయు, సాంద్రముగఁ జేయు.

సీ. పరమసౌఖ్యాయత్తపరిరంభణంబునఁ దను
వల్లిఁ బులకలు దళముకొలుప. విక్ర. ౪.
౨౨౩.

౩. పూరించు, నిండించు.

గీ. నవవిధం బైనహరిభక్తినలువు మెఱసి, దళ
దిశలఁ గీర్తివిస్ఫూర్తి దళముకొలిపి. పరమ.
౩. ౩౪.

దళమెక్కు. అ. క్రి. (√దళము)దళసరికలుగు.

సీ. భూమణానుపగత్తిఁ బొలఁతికపోలంబు దళ
మెక్కి...దళను. ౯.౯.

చ. కనుఁగవదోరగల్లులవికారపుఁ జూపులకోపు
లానుతో, డసె దళమెక్కనాలుగ తడంబ
డుమాటలపచ్చి...శుక. ౩.౧౯౯.

సీ...దళమెక్కుపనసపెండొలలతోడ. ఆము
౨. ౭౩.

దళవరి. వి. (దళము+వరి)౧. ధాన్యవిశేషము.

౨. సేనానాయకుఁడు. (శ. ర.)

దళవాయి. వి. (దళము+వాయి) ౧. సేనానా
యకుఁడు.

సీ...దళవాయి యై కొల్చుఁ జెలువతాల్పు.
అచ్చ. రా. సుం. ౪౧.

క. దళవాయి రాజయక్ష్మం, బిలిచి మనము చి
త్రపురికిఁ బెండ్లికిఁ బోవన్, వలె నీబలగము
నీవుఁ గ,దలి ర మ్మని పలుక నులికి తత్సభ
లోనన్. జై. భా. ౮. ౧౬.

ఉ. నావుడు వారు మంత్రివచనంబులఁ గార్య
ము నిశ్చయించి భా,సావరుపాలికిం జని నిశా
టవరేణ్యులబాధ చెప్పి దే,వా వలె మాకు
నొక్కదళవాయి ధరాధరవైరికిన్ మహా,దే
వచమూకదంబకపతిత్వము దాల్చుట బెట్టు
గావునన్. వరాహ. ౬. ౮౦.

౨. సుంకరికి సహాయుఁడైనయుద్యోగి. (శ.ర.)

దళసంచు. వి. (దళము+సంచు) దళముజాతి.
(శ. ర.)

దళసరి. వి. (దళము+సరి) గొప్పతనము, మహ
త్త్వము.

వ...గోపగోపికాజనంబులు హరిదళసరి యెఱుం
గక గోపాలగోగణపరివృతుం డైనకృష్ణుం
డెక్కడనైనం జిక్కనోపు నని...భాగ.
౧౦ పూ. ౭౪౯.

విణ. ౧. మందము, పలుచన కానిది.

రగడ. కడు దళసరికర్పూరము హస్తయుగళ
ములఁ దాల్చుచు గళములఁ దాల్చుచు.
చమ.౧. ౭౭.

౨. తఱచు.

(వ్యవ.) ఆబట్టనేత దళసరిగా నున్నది.

దళసూచి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ముల్లు.

దళస్నసు. సం. వి. అ. స్త్రీ. పత్త్రసిర, ఆకునం
దలియీనె.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**దళాఢకము.** సం. వి. అ. పుం. ౧. తనంతటఁ బుట్టినసువ్వుచెట్టు. ౨. పృశ్ని, నాఁచుమున్. ౩. గైరికము. ౪. సురఁగు. ౫. కందకము, అగడ్త. ౬. నాగకేసరముమున్. ౭. కుందము, మొల్లమున్. ౮. ఏనుఁగుచెవి. ౯. శిరీషము, దిరిసెనముమున్. ౧౦. వాత్య, సుడిగాలి.

**దళాఢకుఁడు.** సం. వి. అ. పుం. మహత్తరుఁడు, మిక్కిలిగొప్పవాఁడు. (విల్యమ్సు, మే. ని.)

**దళామలము.** సం. వి. అ. న. ౧. మరువకముమున్. ౨. దమనముమున్. (కల్ప.)

**దళారున.** విణ. హఠాత్తుగా.

ఉ...వా, ల్గంటిమెఱుంగుఁజూపులు దళారున వచ్చె మహాద్భుతంబు గాన్. కువల. ౨. ౯౧.

**దళించు.** సం. స. క్రి. ౧. విఱుచు.

సీ. భువనాధికుఁడ వౌట కవిరతోద్ధతి శూలివిలు దళించినబాహుబలమె సాక్షి. ఉ. రా. ౧. ౧౫౧.

౨. నఱకు.

గీ. ముసలముల మోఁది కరవాలముల దళించి. కవిక. ౨. ౧౫౪.

**దళికము.** సం. వి. అ. న కఱ్ఱ, కొయ్య. (కల్ప.)

**దళితము.** సం. విణ. (అ.ఆ.అ) ౧. ఖండింపఁబడినది, ఛేదింపఁబడినది, చీల్పఁబడినది. ౨. వికసించినది, విరిసినది. ౩. అర్ధీకృతము, సగముగాఁ జేయఁబడినది. ౪. విక్షిప్తము, ఇటునటు చిమ్మఁబడినది.

శ్లో. దళితే పలాలపుంజే వృషభం పరిభవతి హాలికే కుపితే, నిభృతనిభాలితవదనా హాలికవధూ దేవరౌ హసతః. ఆర్యాసప్తశతి. ౩౦౨.

**దళియించు.** సం. స. క్రి. దళించు.

క. బలుఁడు రథంబును దురగంబులఁ బాకుఁడు సూతు నముచి భూరిశరములన్, దళియించి యింద్రసంగక్రములు సించిరి మించి యతఁడు మూర్ఛ మునుంగన్. దశా. ౨. ౪౨౯.

**దవ.** వి. ౧. దుమ్ము. (శ. ర.)

౨. (=దవ్వ) ఇష్వగ్రము.

సీ. వాఁడె దవ యన నిష్వగ్ర మొప్పు. ఆం. భా. ౨. ౭౫.

గీ. పఱలు నిష్వగ్ర మిల దవ వాఁడె యనఁగ. ఆం. పదా. అచర. ౬౬. సాం. ని. స్థా. ౯.

౩. మ్రానినడిమి మెత్తనిభాగము; గెలవేసినఅరఁటిచెట్టు లోపల నుండుభాగము, దూఁట.

**దవంత్రి.** వి. అగడ్త, కందకము. (శ.ర.)

**దవతి.** వి.(హిం.దవాత్)సిరాబుడ్డి,మషీపాత్రము.

గీ. రసికుఁ డైనట్టి కాలంపురక్తవాను, తనరు బ్రహ్మాండమను పెద్దదవతిలోన, సాయి నిండారఁ బోసినచందమునను, గారుతిమిరంపుగుంపు సొంపారఁ బర్వె. హంస. ౧. ౧౪౧.

**దవథువు.** సం. వి. ఉ. పుం. పరితాపము,బాధ; చక్షురాదిదాహము, కన్నుమున్నగువానిమంట.

**దవనము.** వి. (సం.దమనః.) వాసనగలమూలికావిశేషముమున్.

సీ. వాట మౌ దవనంపుఁదోఁటకంపవెలుంగు తోలఁగి పో సెవ్వరో త్రోసినారు. శుక. ౧. ౨౮౭.

గీ. మాచిపత్రియుఁ గురువేరు మరువకంబు, దవనమును గగ్గెరయు బిల్వదళము లాదిగా నైన పూజార్హవస్తువు లపుడు దెచ్చి,వంతులకుఁ గొండపాడవుగా వచ్చుటయును. ఉ. రా. ౩. ౨౦౧.

**దవము.** సం. వి. అ. పుం. ౧. వనము, అడవి. ౨. కార్చిచ్చు; చిచ్చు. ౩. ఉపతాపము, రోగము.

**దవళము.** వి. (సం. ధవళః.) గీతివిశేషము,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్త్రీలు పాడెడుఒకవిధమగుపాట.

క. ఎడ లేదు లగన మనుచుఁ, బడిబడి బిలు వంగ నపుడ బలువాయిదముల్, గడలుకొ నంగా నచ్చర,పడఁతులదవళములు పెండ్లిపా టలు సెలఁగన్. యయా. ౪. ౧౦౧.

దవసము. వి. (క. దవసవు. త. తవసం.) ధాన్య ము, కొలుచు.

సీ. దవసంబు కొలుచు నా ధాన్యంబు రాజిల్లు ...ఆం. భా. ౨. ౨౩౬.

సీ. పాలుపొందు ఫాల్గునంబున నమావాస్యనాఁ డల తొంటిగుఱుతులే యలరె నేని, దవసం బు గొని మఱి దగ నాల్గునెల లున్న మీఁద నమ్మిన లాభ మినుమడి యగు. రెట్టమతము. ౩. ౩౮.

దవిష్ఠము. సం. విణ. (అ. ఆ. అ) మిక్కిలిదూర మైనది, దూరతమము.

దవీయము. సం. విణ. (స్. యసీ. స్) చాల దూరమైనది, దూరతరమైనది.

దవు=దవ్వు, దా. వి. (సం. దవీయః).

గీ...దకుధర్మపత్ని వచ్చి పురుమభైక్షంబు వేడుచుఁ, జాల దవుల నభవుప్రోలఁ బడి యె. కు. సం. ౨. ౨౧.

గీ. దవులజల్లని తూఱ నంతకు మునుపటి, జల్లునీ రాని...ఆము. ౪.౧౩౦.ఉ.హరి. ౧.౬౩.

దీనికి (యామ్రేడితమున దవుదవు, దాదవు, దాదా, దాదావు) అనియగును.

ఉ. నావుడు వాయునందనుఁడు నందన భామ చమూవధూటి నీ,కైవస మైన లెస్స యటు గాక నినుం దలమీఁ నేని దా, దావుల నిల్చి మద్భుజగదాపటువిభ్రమతాడనంబు లం, జేవ యడంతు...జై. భా. ౨. ౫౧.

దవుడ=దాడ. వి. (సం. దంష్ట్రి). ప్రా. దాఢా. క. దవడె. త. తవడై, తాడై)

వి. ౧. తాలువు.

సీ. తాలువు దాలువు దవుడ దాడ, యనంగ నల రును...ఆం. భా. ౨. ౧౪౩.

౨. చెక్కిలి; బుగ్గ.

దవ్వ=దవ.

దవ్వగు. అ. క్రి. (√దవ్వు) దూరమగు.

ఉ...ఈ,చివ్వకు నీవు నల్కమెయిఁ జేసినయా పని గూఢవృత్తికిన్, ద వ్వగు నేని యయ్యా భిమతం బొడఁగూడియు నిష్ఫలం బగున్. భార. విరా. ౨. ౨౭౬.

(గూఢవృత్తికి దవ్వగు=వెల్లడియగు.)

గీ. సంతతికి ద వ్వగుజనుండు...చం. రా. ౧. ౯౨.(సంతతికిదవ్వగు=సంతతిలేనివాఁడగు.)

దవ్వు. విణ. ౧. దూరము, దగ్గఱకానిది. (దేశకా లములు.)

క. ఎఱుఁగఁడొకో నన్ను నెఱిఁగియు, నెఱుఁ గనియ ట్లుండునొక్కొ యెడ ద వ్వగుటన్. మఱచెనొకొ...భార. ఆది. ౪. ౬౮.

శా...నీ, వెంతే దవ్వుగ నేఁగుదెంచితిగదే యేలమ్మ...నైష. ౨. ౪౭.

చ. పనివడియొండొరుం గడవఁ బాఱెడియా సను వారు దవ్వుగాఁ,జనుట యెఱింగి... విక్ర. ౨. ౧౨.

౨. దూరస్థము, దూరమం దున్నది.

క. దవ్వై దివమునఁ దిరిగెడు,నవ్విలసత్కనక మత్స్యయంత్రముఁ జేసెన్. భార. ఆది. ౭. ౨౧.

శా. తల్లీ ప్రాణముతోడిచావు మగఁడుం దవ్వైన నిల్లాలికిన్. దశకు. ౧౦. ౧౧౭.

క. నరసుతి నైమిశమునఁ బుష్కరముల మాఁ టను జగత్పవిత్రాశిత మై యిద్ధరణిఁ గురు క్షేత్రము దు,స్తరదురితౌఘముల కెల్ల ద వ్వగు చుండున్. భార. అర. ౨. ౨౫౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. ద్రోణకర్ణదివ్యాస్త్రముల్ క్రూరభంగిఁ, గవి యునప్పుడు మము నీవు గావకున్న, బ్రదు కు కెంతద వ్వధికశుభంబులకు భ,వత్ప్రసా దంబు గనికాదె వాసుదేవ. భార. శల్య. ౨. ౩౩౯. (ఎంతదవ్వు=అసంభవము, అని భావము.)

క్రి. విణ. దూరముగా.

గీ...పోయెద మన్న ద వ్వనిచి సిరికిఁ, దగిన సత్కృతిఁ జేసి ఖేదమున మగిడి. ఆము. ౧. ౭౬.

వి. దూరప్రదేశము.

సీ. ఎదురుగా వచ్చిన నెంతయేనియు దవ్వ గలుగ వేల్గొకత్రోవఁ దొలఁగువారు. భార. విరా. ౩. ౩౬.

సీ. తీర్థసంవాసు లేతెంచినా రని విన్న నెదు రుగా నేఁగు ద వ్వెంత యైన. మనుచ. ౧. ౫౭.

(దీనికి ఆమ్రేడితమునందు దవ్వుదవ్వు,దవుదవ్వు, దౌదవ్వు, దౌదౌదవ్వు, అని రూపము లగును.)

చ...ఆత్మయోగమునఁ జలింప కున్న శివుఁ గాంచె మనోజుఁడు దవ్వుదవ్వులన్. కు. సం. ౫. ౪౭౧.

గీ. అవసరము వేచి యున్న నానాపనిపులు, ద వ్వుదవ్వుల నిలిచి వందన మొనర్ప. నైష. ౭. ౯౩.

క. శివనింద సేయుపాతకు,దవుదవ్వులఁ జూచి తొలఁగఁదగు శైవులకున్. కాశీ. ౬.౨౭౬.

మ. తటికిం జొచ్చి కడంగి పోరువిజయున్ దౌ దవ్వులం జూచి...భార. భీష్మ. ౨. ౧౭౩.

శా. ఆపాముద్రయఁ దాను వచ్చుమని సాలో కించె దౌదవ్వులన్. భీమ. ౨. ౭౯.

క. కవ్వడి యెత్తెయి నేసిన,సవ్విధమున నాళ రంబు లన్నియుఁ దౌదౌ,దవ్వులన నిలువరిం పఁగ, వివ్వచ్చుఁడు గినిసి యేసె విలు విఱుఁ గంగన్. భార. విరా. ౫. ౧౩౨.

దవ్వులగు=దూరములగు.

ఉ. పలుకఁ దలంప దవ్వులగుభారతరామకథా రముల్ విభా,సిలఁగ నరంటిపం డొలిచి చే తికి నిచ్చినరీతి నాంధ్రవా,క్సులలితశక్తి నం దఱకు సుప్రథితంబులు చేసినట్టిధ,న్యుల... కళా. ౧. ౬. (దవ్వులగు = అశక్యములగు, అని భావము.)

దవ్వులది=దూరమం దున్నది.

సీ. ఆర్చుచు గోపాలు రందఱు నందంద బడి యల రాలను బడఁగ వైచి, కొన్ని దవ్వుల వానిఁ గొమరార వానిన కొని ధాత్రిఁ దొ రఁగించి...హరి. పూ. ౬. ౭౩.

దవ్వులవాఁడు=దూరమం దున్నవాఁడు.

చ...విహితోపదేశ మా,దరమున వీనులం జొను పు దవ్వులవాఁడవు గాకు నీతికిన్. వేం. పంచ. ౩. ౭౫.

జః దవ్వగు, దవ్వుపఱచు.

దవ్వుపఱచు. స. క్రి. (√దవ్వు) దూరస్థునిగాఁ జేయు.

క. చేయూఁక వాని మొనలకుఁ, బాయఁగ నెల యించి దవ్వుపఱచె నవధ్యో,పాయుఁడు హరి యడుగడుగుం, జే యందినయట్ల యా స సేయుచు వీఁకన్. హరి. ఉ. ౨. ౧౩౪.

దశ. సం. విణ. (న్) పది. (దీనికి తెలుఁగున వ్యస్త ప్రయోగము లేదు. వి. బ. అ. పుం, ఆ. స్త్రీ. ౧. వస్త్రపుచెఱఁగు, బట్టయంచు. (కే.ని,వై.ని.) ఆ. స్త్రీ. వర్తి, దీపపువత్తి. ౨. అవస్థ, స్థితి. ౩. (జ్యోతి) సూర్యాదిగ్రహములఫలదానకా లము. ౪. చిత్తము. ౫. పంక్తి, వరుస. (విల్స ను.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దశకంఠుఁడు. సం. వి. అ. పుం.-పదికంఠములవాఁడు-రావణుఁడు.
ఇట్లే: దశకంధరుఁడు, దశగ్రీవుఁడు. మొ.

దశకము. సం. విణ. (అ. శికా. అ) పదిపరిమాణము కలది. వి. అ. న. పదింటిసమూహము.

దశగ్రామి. సం. వి. న్. పుం. పదిగ్రామములయధికారి. ఈ. స్త్రీ. పదిగ్రామములసమూహము.

దశత్. సం. (శతృ) కఱచుచున్న.

దశతయము. సం. విణ. (అ. ఈ. అ) పదియవయవములు గలసముదాయము.

దశత్తు. సం. వి. త్. స్త్రీ=దశకము.

దశధా. సం. అవ్య. పదివిధములుగా. (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగములు కానరావు.)

దశనచ్ఛదము. సం. వి. అ. పుం. వాతెఱ, పెదవి.

దశనపదము. సం. వి. అ. న. దంతక్షతము, పలునొక్కు.

దశనబీజము. సం. వి. అ. పుం- దంతములవంటి బీజములు కలది- దానిమ్మ.

దశనము. సం. వి. అ. పుం. ౧.-కొఱుకునది-దంతము, పల్లు. ౨. పర్వతశిఖరము. న. ౧. కవచము. ౨. కఱచుట, కాటు.

దశనవాసస్సు. సం. వి. స్. న- పలువలువ-పెదవి.

దశనాంకము. సం. వి. అ. పుం. దంతక్షతము, పల్లొత్తు.

దశనాఢ్యా. సం. వి. ఆ. స్త్రీ. చుక్రిక, పులిచింత.

దశనోచ్ఛిష్టము. సం. వి. అ. పుం. ౧. (అధరాది) చుంబనము, ముద్దిడుట. ౨. నిశ్వాసము, నిట్టూర్పు, ౩. పెదవి. (శే. ని).

దశపాతకి. సం. విణ. (న్. నీ. న్.) (అయిదు) మహాపాతకములును (అయిదు) ఉపపాతకములును చేసినవాఁడు.
క. పశువధయు సేసె వీఁడుం, దశపాతకి యల్లవాఁడు దాక్షిణ్యకళా, విశదస్వహీనుఁ డీతఁడు, శిశుహత్య యొనర్చె వీఁడు సిద్ధప్రవరా. సానందో. ౪. ౪౦.

దశపురము. సం. వి. అ. న. ఒకానొకపట్టనము, రంతిదేవునిరాజధాని. మేఘ. ౧. ౪౭.

దశబలుఁడు. సం. వి. అ. పుం. (పదిబలములు= ౧. దానము ౨. శీలము ౩. క్షమ ౪. వీర్యము ౫. ధ్యానము ౬. ప్రజ్ఞ ౭. బలము ౮. ఉపాయము ౯. ఏకాగ్రచిత్తత. ౧౦. జ్ఞానము-కలవాఁడు.) బుద్ధుఁడు.

దశభుజ. సం. వి. ఆ. స్త్రీ. దుర్గ.

దశభూమిగుఁడు. సం=దశబలుఁడు. (కల్ప, విల్యము)- కృష్ణాదక్వాండుసంఖ్యాపూర్వాయాభూమే రజిష్యతే. కా. వా. ౫౦౪౬- అనుటవలన దశభూమగుఁ డనఁదగు.)

దశమము. సం. విణ. (అ. ఈ. అ.) పదియవది.

దశమి. సం. విణ. (న్. నీ. న్)- వయసున పదియవపది జరుగుచున్నవాఁడు- శతవృద్ధు, మిక్కిలివృద్ధు. వి. ఈ. స్త్రీ. ౧. పక్షమునందు పదియవతిథి. ౨. నూఱేండ్లలో పదియవపది.

దశమిస్థుఁడు. సం. విణ. (అ. ఆ. అ) ౧. తొంబదియేండ్లు గడచినవాఁడు, మిక్కిలి వృద్ధు. ౨. క్షీణరాగుఁడు. (అమరము.) నష్టబీజుఁడు. (మే. ని.)

దశములు. వి. బ. ధాన్యాదులపరిమాణవిశేషము(కుంచములు, తూములు మొదలగువానివలె.)
వ...ఆచేనం బండినధాన్యం కోరివల్నయెన్నిదశములయివచ్చును అన్నిదశములు సేయించువాండవు. ఆచేనిదశముల పుణ్యం అల్లాడ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సాధునిసన్నిధిని మాను ధారవోసియిస్తిరి. ఈపూరుశాసనము (గు. జి.)

దశమూలము. సం. వి.అ.న. ఔషధవిశేషము. (పల్లేరు, ముయ్యాకుపొన్న, ములక, వాఁకుడు, మారేడు, తక్కిలి, గుమ్ముడు, దుండిగము, కలిగొట్టు, నెల్లి. అనుదశమూలములతో చేసినయౌషధము.)

దశరథుఁడు. సం. వి. అ. పుం. సూర్యవంశ్యుఁడగునొకరాజు. (రామునితండ్రి.)

దశరశ్మిశతుఁడు. సం. వి. అ. పుం. –వేయికిరణములవాఁడు– సూర్యుఁడు, వేవెలుఁగు. రఘు. ౯. ౭౪.

దశరాత్రము. సం. వి. అ. న. పదిరాత్రులసమూహము.పుం. పదిదినములు జరుగుయజ్ఞవిశేషము.

దశరూపభృత్తు. సం. వి. త్. పుం.–దశావతారము లెత్తినవాఁడు– విష్ణువు.

దశవార్షికము. సం. విశ. (అ. ఈ. అ.) ౧. పదియేండ్లు ఉండునది.౨. పదియేండ్లకు ఒకమాఱు వచ్చునది.

దశవిధము. సం. విశ. (అ. ఆ. అ) పదివిధములు గలది.

దశశతము. సం. వి. అ. న. ౧. పదినూఱులు, వేయి. ౨. దశోత్తరశతము, నూటిపై పది.

దశశతాక్షుఁడు. సం. వి. అ. పుం. వేగన్నుల వేల్పు, ఇంద్రుఁడు.

ఇట్లే: దశశతనయనుఁడు, మొ.

దశశతి. సం. వి. ఈ. స్త్రీ. వేయి.

దశసహస్రము. సం. వి. అ. న. పదివేలు.

దశహర. సం. వి. ఆ. స్త్రీ. ౧.(సొంతకాఁడీయకుండఁ బరులసొత్తు పుచ్చుకొనుట, హింసయు, పరదారగమనము అనుకాయికదోషములను; వాక్పారుష్యము, అసత్యసంభాషణము, కొండెములుచెప్పుట, అసంబద్ధప్రలాపము, అనువాచాదోషములను; పరద్రవ్యాభిలాషము, ఒరులకుకీడుదలఁచుట, పనికిమాలినపట్టుదల అనుమానసికదోషములను; మొత్తము పదిదోషములను హరించునది.) గంగ. ౨.గంగోత్పత్తిదివస మగు జ్యేష్ఠశుద్ధదశమి. (ఆనాఁడు గంగోత్సవము చేయుదురు.)

దశాంగుళము సం. విశ. (అ. ఆ. అ) పదియంగుళములకొలఁది గలది.వి.అ.న.ఖర్బూజము, కరబూజాకాయ.

దశాకర్షము. సం. వి. అ. పుం– వత్తిచే నూనెను పీల్చునది–దీపము.

దశాకర్షి. సం. వి. న్. పుం. దీపము.

దశానికము. సం. వి. అ. పుం. నేపాళము, దంతికాయ.

దశారుహా. సం. వి. ఆ. స్త్రీ. కైవర్తీముస్తకము, కైవడిముస్తెకాయ.

దశార్ణము. సం. వి. అ. పుం. ఒకానొకదేశము.

దశార్ధము. సం. వి. అ. న. అయిదు.

దశార్హము. సం. వి. అ. పుం. దశార్హులదేశము, యదుదేశము.

దశార్హుఁడు. సం. వి. అ. పుం. ౧. బుద్ధుఁడు. ౨. దశార్హదేశస్థుఁడు.

దశావదిశ. వి. మల్లవిద్యావిశేషము.

వ...వింగళింపు...దశావదిశ... పాదవీక్షణము మొదలగువితంబులును...మల్లుపు. ౩. ౬౯.

దశాశ్వుఁడు. సం. వి. అ. పుం– (రథమునకు) పదిగుఱ్ఱములుగలవాఁడు–చంద్రుఁడు. (వై. ని.)

దశాహము. సం. వి. అ. పుం. ౧. మృతినొందినదినము మొదలు పదియవదినము, ౨. పది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దినములసమూహము.

దశేంధనము. సం. వి. అ. పుం. - వత్తియే కట్టెగాఁ గలది-దీపము. (త్రి. ని.)

దశేరము. సం. విణ. (అ. ఆ. అ) హింసించునది. వి. ౧. కుక్క. ౨. సర్పము. (కే.ని.)

దశైకాదశికుఁడు. సం. విణ. (అ. ఈ. అ)-పది యిచ్చి పదునొకండు పుచ్చుకొనువాఁడు-నూటికి పదివంతున వడ్డి కిచ్చువాఁడు.

దశ్యమానము. సం. విణ. (అ. ఆ. అ) కఱవఁబడుచున్నది.

దష్టము. సం. విణ. (అ. ఆ. అ) ౧. కఱవఁబడినది. ౨. కొఱుకఁబడినది.

దసరా. వి. (సం. దశరాత్రం. ప్రా. దసరాత్రి, దసరత్తి. హిం. దశహరా.) ఆశ్వయుజశుద్ధ ప్రతిపత్తు మొదలు విజయదశమివఱకుఁ గలదివసములు.

దసిలీ(లి). వి. ౧. ఒకవిధ మగుపట్టు.

సీ. రత్నంపుఁజిలుకలు రాయంచప్రతిమలు పసిఁడిపువ్వులవ్రాఁతపనులసొబగు, వివిధంబులగుచిత్రవిరచనములును దసిలీనూలుపట్టెయల్లికఛెడంగు. కళా. ౨.౧౫.

సీ. ఒక్కఁడు చెంపకై యొఱఁగుపువ్వులతోడిదసిలీరుమాలు సందముగఁ జుట్టి. కువల. ౪. ౨౧౨.

వ...కత్తెరవరుసపూవుచెత్తులపైని బొమ లఱినిక్కఁ గట్టినజిలుఁగుకురుమదలంపుదసిలికసీదురుమాలు ముచ్చుంగులబురుసాకుచ్చులరింగులును...ప్రబంధ. ౭౮.

౨. ఒకవిధ మగుపట్టుతో నేసినవస్త్రము.

సీ. శశికాంతిచెంగావిదసిలి మించినకేలిస్వర్ణత్సరువు వాఁడివాలు మెఱయ. ఆము. ౨.౭౫. (దళ మలంచినకేల. నేదము, పా.)

వి. వదలు. (శ. ర.)

దసువంది. వి. గ్రుద్దులాటకు జెట్టులను గూర్చువాఁడు.

సీ. గ్రుద్దులాటకు జెట్లఁ గూర్చువానికిఁ పేరు దసువంది యనఁగను దనరుచుండు. ఆం.భా. ౨. ౨౦౭.

(జెట్లు.) గీ. కడఁగి దిశలు ప్రతిధ్వనుల్ పొడమునటులు, గా మిగుల పల్లచఱచి సలాములిడుచు, ముందరను నిల్వఁగా దసువంది తత్కరమ్ము లిరుగేలఁ బూని పరాకటంచు. ప్రబంధ. ౭౩. (దసదంది. అపముద్రి.)

దసెన(నా). వి. ఆయుధవిశేషము. (శ.ర.)

క. తనువు జయంతునిపక్కక్, మన సాధనరాజవరకుమారునిచెంతం, జొనుపుడుఁ గోరక దశనా, ననదసెనాజోదుదురమునం బెనఁగునెడక్. కువల. ౫. ౩౪.

దస్సేరకము. సం. వి. అ. పుం. ౧. ఒకానొక దేశము. (త్రి. ని.) ౨. గాడిద. (విల్యమ్సు.)

దస్తము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. క్షీణించినది. ౨. త్రోసివేయఁబడినది.

దస్తరము. వి. కాగితములమూట.

సీ. నడికట్టులో మొల నిడినకలందాను హస్తాగ్రమున వ్రేలుదస్తరంబు. హంస. ౨. ౭౯.

దస్తూరి. వి. (హిం. దస్తకారీ) వ్రాఁత, చేవ్రాలు.

గీ. దట్టముగఁ బెట్టియలలోనఁ బెట్టియున్న, తళుకుబంగారుజిగికాగిదములలోన, సారముగ వ్రాసియున్న దస్తూరిఁ జూచి, చదువుకొనెనాత్మలోన విస్మయము గదుర. కృష్ణ. ౩. ౧౦౭.

దస్మఁడు. సం. విణ. (అ. ఆ. అ) దర్శనీయుఁడు, రూపసి. వి. అ. పుం. ౧. యజమానుఁడు. ౨. చోరుఁడు. ౩. హుతాశనుఁడు, అగ్ని. (విల్యమ్సు.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దస్యుఁడు. సం. వి. ఉ. పుం. ౧. చౌర్యాదులు చేసెడియొకానొక జాతివాఁడు. ౨. అసుర, రాక్షసుఁడు. ౩. దొంగ. ౪. శత్రువు.

దస్రదేవత. సం. వి. ఆ. స్త్రీ- అశ్వినీకుమారులు దేవతగాఁ గలనక్షత్రము-అశ్విని.

దస్రము. సం. విణ. (అ. ఆ. అ) హింస్రము. (వాచ). వి. అ. పుం. గాడిద. న. ౧. శిశిరము, శీతకాలము. ౨. అశ్వినీనక్షత్రము.

దస్రుఁడు. సం. వి. అ. పుం. దొంగ. ద్వి. ౧. అశ్వినీకుమారులు. (మే. ని.) ౨. రెండు అను సంఖ్యను తెలుపుటకు సంకేతము.

దహత్. సం. శత్ర. కాల్చుచున్న.

దహనకేతనము. సం. వి. అ. పుం- అగ్ని దేవుని ధ్వజము- ధూమము, పొగ. (విల్యమ్సు)

దహనప్రియ. సం. వి. ఆ. స్త్రీ. స్వాహాదేవి.

దహనము. సం. విణ. (అ. ఆ. అ) ౧. కాల్చునది. ౨. నాశముచేయునది. (అ. ఈ. అ) కాల్చుటకు సాధనమైనది. వి. అ. పుం. ౧. పావురము. ౨. మూఁడు అనుసంఖ్య. ౩. భల్లాతకము, నల్లజీడి¶. ౪. చిత్రమూలము¶. ౫. కృత్తికానక్షత్రము. న. ౧. కాల్చుట. ౨. (వైద్య) అగ్నికర్మము, కాల్చుట. ౩. పులికడుగు.

దహనరిపువు. సం. వి. ఉ. పుం=దహనారాతి.

దహనసహచరుఁడు. సం. వి. అ. పుం. గాలి, వాయువు.

దహనసారథి. సం వి. ఇ. పుం. గాలి.

దహనాగురువు. సం. వి. ఉ. న. దాహాగురువు, సుగంధద్రవ్యవిశేషము¶.

దహనారాతి. సం. వి. ఇ. పుం- అగ్నిశత్రువు- జలము.

దహనీయము. సం. విణ. (అ.ఆ. అ) దహింపఁదగినది, కాల్పఁదగినది.

దహనుఁడు. సం. వి. అ. పుం. ౧. అగ్ని, ౨. ఒకానొకరుద్రుఁడు. విణ. (అ.ఆ.అ.) దుష్టుఁడు. (మే. ని)

దహనోపలము సం. వి. అ. పుం. ౧. సూర్యకాంతమణి. ౨. అగ్గిఱాయి, చెకుముకిఱాయి.

దహరము. సం. విణ. (అ. ఆ. అ) ౧. స్వల్పము, సూక్ష్మము. ౨. చిన్నవయసుది. ౩. దుర్బోధము, తెలిసికొనుటకు కష్టమైనది. వి. అ. పుం. ౧. మూషికము, ఎలుక. ౨. నరకము.

దహరాకాశము. సం.వి.అ.పుం. చిదాకాశము, పరబ్రహ్మము.

దహరుఁడు. సం. వి. అ. పుం. ౧. బాలకుఁడు. ౨. తమ్ముఁడు. ౩. వరుణుఁడు.

దహి(యి)ంచు. సం. స. క్రి. కాల్చు.

వ...యోగికి మున్నాత్మజయంబు వలయు దానికి నుపాయంబు వినుము ప్రాణాయామంబున దేహదోషంబు దహించునది. మార్క. ౩. ౩౧౪.

మ...మహా,గహనంబుల్ దహియించుదావశిఖిరేఖల్ మిత్త్రభూభృత్తులల్,దహియించెన్ నిమిషంబులో భువన మత్యాశ్చర్యముల్ బొందఁగన్. ఉ. రా. ౩. ౩౩౯.

దహ్యమానము సం. విణ. (అ. ఆ. అ)కాల్పఁబడుచున్నది.

దస్రాము. సం. విణ. (అ. ఆ. అ) సూక్ష్మమైనది. వి. అ. పుం. ౧. అగ్ని. ౨. కార్చిచ్చు. ౩. జఠరము, కడుపు. (వాచ)

## దా

దా. (దాపలయొక్కలుప్తశేషరూపము.ఇది సమాసపూర్వావయవముగా నేకన్పట్టుచున్నది.)విణ. ఎడమ, సవ్యము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉదా: దాకాలు,దాకేలు, మొ.

దాండ. సం. వి. ఆ. స్త్రీ. కఱ్ఱలతో ఆడెడి యొకయాట. కాశికా. ౪. ౨. ౫౭.

దాండపాత. సం. వి. ఆ. స్త్రీ. ఫాల్గుని, ఫాల్గున మాసపూర్ణిమ, కామునిపున్నమ.

దాండము. సం. విణ. (అ. ఈ. అ.) దండము నకు సంబంధించినది. వి. అ. న. ౧. ఆయుధ జీవిసంఘము. ౨. కఱ్ఱలమోపు.

దాండాజినికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) కపటముచే ధనముగడించుటకై దండాజినములు ధరించినవాఁడు; మోసగాఁడు. (వాచ.)

దాంతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దమితము, అడఁపఁబడినది. ౨. శిక్షితము, అలవఱుపఁబడినది; మరపఁబడినది,సాధువుగాఁ జేయఁబడినది. (ఎద్దు మొ.) ౩. బహిరింద్రియముల నిగ్రహించినది. ౪. తపఃక్లేశాదులను సహించినది. (అ. ఈ. అ.) దంతములకు సంబంధించినది. వి. ఆ. పుం. దవనము.

దాంతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. బ్రహ్మచర్యాది తపఃక్లేశము నోర్చుట, ౨. కర్మేంద్రియనిగ్రహము, కర్మేంద్రియములను యోగ్యకర్మములయందుఁ బ్రవర్తింపఁజేయుట.

సీ. శాంతి బుద్ధీంద్రియసన్నివారణ దాంతి కర్మేంద్రియములయోగ్యప్రవృత్తి. భార. అను. ౫. ౧౮౧.

దాంపత్యము. సం. వి. అ. న. భార్యాభర్తృ భావము.

దాంభికము. సం. వి. అ. పుం. బకము, కొంగ.

దాంభికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) దంభము గలవాఁడు.

దాఁక= దనుక. అవ్య. ద్రు. వఱకు, పర్యంతము.

సీ...అవసరం బెఱిఁగి వాఁ డక్రమమున, దూష్యులఁ దుదిదాఁక దూషించు మసలను ...భార. ఆది. ౬. ౧౫౬.

ఉ. తేపులు భీమలింగముగుఱించి జపం బొనరించి నిచ్చలుక్, మాపటిదాఁకఁ దీర్థముల మజ్జన మాడుచు నుండువాని...భీమ.౨.౮౧.

ఆ.హదను వచ్చుదాఁక నపరాధిపై దోష,మాఁగి చెఱపవలయు హదను వేచి. ఆము.౪.౨౪౬. నీలా. ౨. ౫౨.

దాఁకొను=డాఁకొను. అ. క్రి. (దాఁగు+కొను-స్వార్థమున.)తిరోహితమగు, మఱుఁగుపడు.

ఉ. మించినయాము లేసుఁగులమీఁదికిఁ జంగున దాఁటి యాఁదలల్, చించిన గోళ్లలోఁ దవిలి చిందినముత్తెము లెల్లఁ జట్లపై, మంచునఁ జేరి దాఁకొనిన మాటికి నమ్మలఁ ద్రవ్వి త్రవ్వి యు,చ్చెంచు నెలంత లేఱుదురు సింగపుజాడ లెటెంగి యచ్చటక్. యయా. ౨. ౩౭.

దాఁగనమ్రుచ్చిళ్లు=డాఁగనమ్రుచ్చిళ్లు. (✓దాఁగు- శ. ర.)

దాఁగనమ్రుచ్చులు=డాఁగనమ్రుచ్చులు. వి. బ. (✓దాఁగు) దాఁగిలిమూఁతలు, బాలక్రీడావిశేషము. (శ. ర.)

దాఁగర. వి. వరుగులు మొదలగునవి ఎండఁబెట్టెడితట్ట, ప్రసేవకము.

గీ. వరుగుతో దాఁగరయు నెండవలసినట్లు. ఉ. హరి. ౪. ౫౪.

గీ. వంపుగుడిసెలసామగ్రి దంపురోళ్లు, కుఱుచ రోఁకండ్లు చిన్నిదాఁగరలు మొదలు, గాఁగలుగువస్తుజాతంబు గార్దభములు, మోచితే వెంట సూకరములు చనఁగ. చెన్న. ౨. ౨౦౪.

దాఁగిలిమూఁతలు=డాఁగిలిమూఁతలు. వి. బ. (దాఁగిలు+మూఁతలు) బాలక్రీడావిశేషము, గుప్తక్రీడ. (శ. ర.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. దాఁగిలిమూఁత లాడుతఱిఁ దా నొకకెంజి గురాకుజేబులే,దీఁగపొద న్నిల న్నెమకి తెచ్చెద నంచు...పార్వ. ౨. ౨౦.

సీ. పూరెమ్మ వంచుచో జాలుపయంట దాఁగిలి మూఁత లాడుగుబ్బలబెడంగు. విజ. వి. ౨. ౧౭౧. హంస. ౩. ౧౪౬.

దాఁగిలిమ్రుచ్చులు=డాఁగిలిమ్రుచ్చులు. వి. బ. (దాఁగిలు + మ్రుచ్చులు) దాఁగిలిమూఁతలు, బాల్యక్రీడావిశేషము.

గీ. గుజ్జ దాఁగిలిమ్రుచ్చులు గోడిపట్టె,లేలపాటలు సరిబేసు లీలకూఁత, లాదిగా శైశవక్రీడ లాడి రపుడు, రామకృష్ణులు గోపదారకులఁ గూడి. వి. పు. ౭. ౨౦౨.

గీ. గచ్చకాయలు దాఁగిలిమ్రుచ్చులాట, బంతి మెకమాట చిందఱపఱపులాట, ల నెడు శైశవ దుర్వృత్తి నధిగమించి. ప్రబంధ. ౬౧౩.

దాఁగిలు=దాఁగు.

క. బలవంతుతోడఁ బగయును, బలహీనునితోడఁ జేయుబంధుత్వము దాఁ,గిలి ధన మిచ్చియు నూరక, కలహమునకుఁ గాలుద్రవ్వఁగా రాదుసుమీ. వి. పు. ౪. ౨౪౩.

దాఁగు=డాఁగు, దాఁగిలు. అ. క్రి. (త. తాంగు.) తిరోహితమగు, మఱుఁగుపడియుండు.

ఉ...కల్లతెల్విలో,నే వలవంత దాఁగఁ జరియించిన డాఁగమి జూచి నెవ్వగన్. ఆము. ౫. ౧౫౫.

జః దాఁకొను, దాఁగనమ్రుచ్చిళ్లు, దాఁగనమ్రుచ్చులు, దాఁగిలిమూఁతలు, దాఁగిలిమ్రుచ్చులు, దాఁగుడుమూఁతలు, దాఁగురించు, దాఁగురింత, దాఁగురుమూఁతలు, దాఁగురుమ్రుచ్చులు, దాఁచు, దాఁపన, దాఁపరము, దాఁపరి, దాఁపరించు, దాఁపరీఁడు, దాఁపటికము, దాఁపించు, దాఁపు, దాఁపుడు, దాఁపురము.

దాఁగుడుమూఁతలు=డాఁగురుమూఁతలు. వి. బ. (√దాఁగు)దాఁగిలిమూఁతలు, బాల్యక్రీడావిశేషము.

సీ. పైఁడిమెట్టిక లెక్కి పైకేఁగి చేతఁగట్లందు దాఁగుడుమూఁత లాడియాడి. యయా. ౩. ౫౫.

దాఁగురించు=డాఁగురించు. స. క్రి. (√దాఁగు) ౧. దాఁచు. ౨. వంచించు. (శ. ర.)

దాఁగురింత= డాఁగురింత. వి. (√దాఁగు) దాఁగురించుట. (శ.ర.) వి.బ. దాఁగురుమూఁతలు.

చ...దాఁగురింతలన్, గలకల నవ్వుచుం జెలఁగుకల్లరివేలుపుసామిఁ గొల్చెదన్. అచ్చ. భా. ౧. ౧.

దాఁగురుమూఁతలు=డాఁగురుమూఁతలు. వి. బ. (√దాఁగు) దాఁగిలిమూఁతలు. (శ. ర.)

దాఁగురుమ్రుచ్చులు=దాఁగిలిమ్రుచ్చులు,దాఁగిలిమ్రుచ్చులు, దాఁగురుమూఁతలు. వి. బ. (√దాఁగు) దాఁగిలిమూఁతలు.

వ...కదిసి విశంకటకోటరకుటీరంబుల దాఁగురుమ్రుచ్చు లాడుకిన్నరకన్యకల ... వరాహ. ౧౨. ౪౫.

దాఁచు=డాఁచు. స. క్రి. (√దాఁగు) ౧. మఱుఁగుపఱుచు, కనుపడకుండఁజేయు.

గీ. అది గనుంగొని భూపాలుఁ డద్భుతమున, వేయు నేటికి నితఁడె నారాయణుండు, నిక్కువం బని చాఁగిలి మ్రొక్కి దేవ, చూపు నీరూపు నా కింక దాఁప కనిన. వరాహ. ౯. ౪౫.

శా...ఆగోపికావల్లభుం, డే మే మాడెను రుక్మిణీసతియు నీ విం కేటికిం దాఁచెదే, నీమోమోటలు మాని నీరజముఖీ. నిక్కం బెఱింగింపవే. పారి. ౧. ౭౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. భద్రపఱుచు, పదిలపఱుచు; నిక్షేపముగా నుంచు.

ఉ...రెండు పండ్లు నీవప్పరమేశుచేఁ బడసి యందొకఁ డిచ్చి యొకండు దాఁచుకో, నిప్పుడు కానవచ్చెఁ జనునే యిటు వంచన సేయ...విక్ర. ౩. ౨౧.

క. మఱఁ డరనెలకడ దాఁచిన,విరిదూపును నల్ల చెఱకువిల్లునుబలె వేఁ,మఱు నలరుచేరుచుక్కయు, నరు దగుకనుబొమలు మిగుల నతివకు నమరెన్. యయా. ౪. ౩౫.

తనువుదాఁచు=ఒడలియందలిశక్తిని దాఁచుకొను.

సీ...తనువుదాఁచు. గీ. సమయమే యిది సంభృతోత్సాహలీల, జయముఁ గీర్తియుఁ గోరి యస్ఖలితభంగిఁ, దేరు నడపుము చేతులతీఁట వోవ,నడలి రథికజనంబు వేఁటాడవలయు. భార.ద్రో. ౧. ౧౯౯.

దాఁటడుగుపరువడి. వి. (√దాఁటు[1]) పండ్రెండుపరువడులలో నొకటి. (పదునాల్గువిసరులలో నొకటి. అని హంస.)

వ. ఎడమడుగుపరువడి కుడియడుగుపరువడి కదలుపరువడి దాఁటడుగుపరువడి కోపుపరువడి ...మొదలుగాఁ గలపదిరెండు పరువడులును ...ప్రబంధ. ౭౮.

వ. ఎడమడుగుపరువడి కుడియడుగుపరువడి కదలుపరువడి దాఁటడుగుపరువడి...మొదలైన పదునాలుగువిసరులమర్మంబు జూపి...హంస. ౧. ౨౦౬.

దాఁటడుగుమొన. వి. (√దాఁటు[1]) మల్లవిద్యావిశేషము, పండ్రెండుమొనలలో నొకటి.

వ...చాటడుగుమొన దాఁటడుగుమొనయరమీటుమొన నెరమీటుమొన...ఆదిగాఁ గలపదిరెండుమొనలు...ప్రబంధ. ౭౮. హంస. ౧. ౨౦౬.

దాఁటరి. వి. (√దాఁటు[1]+అరి[3].) కప్ప.

సీ...దాఁటరి చలికాఁపు కప్ప యనఁగ భేక మొప్పు...సాం. ని. తిర్య. ౭౩.

దాఁటించు. స. క్రి. (√దాఁటు[1])దాఁటఁజేయు, ఎగిరించు.

మ. హరి దాఁటించెఁ బురోపకంఠమున...కాశీ. ౧. ౫౩.

దాఁటు[1]. స. క్రి. (క. దాణ్టు. త. దాండు) ౧. తరించు; లంఘించు.

చ...ప్రాయక చలదూర్మికానికరమైనమహోదధి దాఁట వచ్చు...భర్తృ. నీతి. ౪.

దండకము...ఉప్పుసంద్రంబుపూఁదోఁటకాల్వాం బలెం దాఁటి......నీలా. ౨. ౪౧.

ద్వి. మాట నీ కెత్తిఁగించి మదురనో డైన, దాఁటి పోరొద నింక దాఁపుర మేల. ద్వి. హరిశ్చ. ఉ. ౧. ౧౦౪౦.

౨. అతిక్రమించు, కడచు.

వ...వనంబులు గడచి శైలంబులు దాఁటినదులు లంఘించి చనిచని...నైష. ౨. ౩౫.

వ. ఇవ్విధంబున వసుదేవనందనుండును నేమను... మ్లేచ్ఛంబు మెట్టిదరదంబు దాఁటి కాశ్మీరంబు గడచి...ఉ. హరి. ౨. ౩౭.

౩. అతిక్రమించు, ఉల్లంఘించు, మీఱు.

వ. తనభార్యకుం గలశివభక్తివిశ్వాసంబులును జంగమారాధననిష్ఠయుఁ దనయానతి దాఁటమియు...ఎఱింగి...హర. ౨. ౬౫.

ద్వి. తనజనకునిమాట దాఁటినవాఁడు, తనయుఁడే తలపోయ దాయాది గాక. రం. రా. అయో. ౯౭ పొ. ౭ పం.

గీ. దైవగతి యెవ్వరికి దాఁటఁ దరముగాదు. దశా. ౨. ౧౧౮.

అ. క్రి. ౧. (కాలము) కడచు, అతిక్రమించు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ...పదునాలుగు సంవత్సరంబులు దాఁటునంత నీఁ బురుషుండు బాలుండు...భార. ఆది. ౪. ౨౭౧.

వ...తం(డ్రిగుఱించి తపంబుఁ జేయుచుండ... సంవత్సరంబు దాఁటె...హర. ౭.౧౧౧.

౨. లంఘించు, ఉఱుకు; ఎగురు.

క...కృతవర్మని తేరిపైకి లంఘించెను శల్యుఁడు గిరికి దాఁటుసింగముభంగిన్. భార. భీష్మ. ౧. ౨౧౫.

ఉ...అక్కపిసింహుఁడు సింహలీల నద్దంతికి దాఁటి బిట్టాఱల దట్టనతో నఱచేత (వ్రేసి ...భా. రా. యు. ౯౧౫.

గీ...చేతఁ గరవాలు వెలుఁగుచుండ, దాఁటి గజకుంభములఁ గాలఁ దన్ని...ఉ. హరి. ౧. ౪౬.

ఉ.తామరదోయిలోఁ దగిలి దాఁటెడు తేఁటులఁ బోలఁ బెన్నెరుల్. పారి. ౨. ౧౦.

౩. ప్లుతగతివిశేషముతో (గుఱ్ఱము) నడచు.

సీ. జోడన వీడి యచ్చో నిబ్బరపుఁబర్వునఁ దాఁటఁ దొడఁగె గంధర్వకులము. దశా. ౨. ౬౦.

వి. ౧. లంఘనము, ఉఱుకు.

ఉ...ముగ్ధనవమంజులసౌఖ్యరసంబు నిక్కలం, దాఱుచుఁ గోరికల్ గొఱలి దాఁటులు పైవఁగఁ సోయగంబు పైఁ, దేఱఁగఁ (బ్రౌఢదంపతులతీరునఁ జెంపెసులారి రిద్ధఱున్. హరి. ఉ. ౩. ౧౮౨.

౨. అశ్వగతిభేదము.

గీ...ప్లుతగతిభేదంబు జంగ గంతు, దాఁటు... సాఁదవరు నభవ. ఆం. భా. ౨. ౧౯౮.

జః దాటడుగుపరువడి, దాఁటడుగుమొన, దాఁటరి, దాఁటించు,దాఁటుకొను, దాఁటుడువల, దాఁట్రాయి, దాఁట్లమారి.

దాఁటు². వి. (సం. దండః.) సమూహము, గుంపు, మంద.

ఉ. భంగము లై నగంబులు గుభాలునఁ (దెళ్లఁ గరళ్లదాఁటుతో, నింగికిఁ బొంగువారిధి... వరాహ. ౮. ౧౬.

ఉ. కమ్మనికుందనంబు కసుగందనిమే నెలదేఁటిదాఁటులన్, బమ్మెరవోవఁ (దోలుఁ దెగబారెఁడువెం(డ్రుకలు...మనుచ. ౩. ౬. విక్ర. ౧. ౭౬. కవిక. ౩. ౨౮.

జః దాఁటుకట్టు, దాఁటువడు.

దాఁటుకట్టు=దాఁటువడు. అ. క్రి. (దాఁటు² + కట్టు.) గుంపుగూడు.

గీ. చినుకుతోఁ గూడుకొని గాలి చెలఁగఁ జూచి, దాఁటుకట్టుచు మృగములు దాఁటుచుండ. నా. పంచ. ౨. ౧౯౪.

దాఁటుకొ(గొ)ను,దాఁటులుగొను=దాఁటు¹ అ. క్రి. (దాఁటు¹ + కొను.) లంఘించు,ఎగురు; ఉఱుకు.

వ...అజ్జాలపాదంబును నబ్బాలతలం పెటింగి యెగసియుం దప్పఁ(గ్రుంకియు దాఁటుకొనియు...సైప. ౨. ౪౬.

క. ఉప్పర మెగసి యజాండము,చిప్పలు రాలంగ మేరుశిఖరంబులపైఁ, గుప్పించి దాఁటుకొందునొ...కాశీ. ౧. ౧౧౨.

క. గిరి (గ్రుంగఁ (దొక్కి చెంగున, హరి నింగికి దాఁటుగొనిన హరిహరి యపు డా,హరి యెగసినట్లు తోఁపక, గిరి యెగసినయట్లు దోఁచెఁ గెళవుల కల్లన్. రామా. ౬. ౯౪.

ద్వి. దాఁటులుగొని లతాంతంబులమీఁద, తేఁటులపరిగాళ్లఁ (దెవ్వనో యనుచు. పండితా. పురా. ౮౯౦.:

దాఁటుడువల. వి. (√దాఁటు¹.) జాలభేదము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. మెడవల సన్నపువల త్రో,పుడువల డొంక
వల మింటముక్కిడివల దాఁటుడువల సిం
గిలమనుకువ, లెడవల కుందెవల లాదు లెసఁ
గెడివలలుఁక్. హంస. ౪. ౧౭౫.

దాఁటువడు=దాఁటుకట్టు. అ. క్రి.(దాఁటు² + పడు.) ౧.గుంపుగూడు.

క. పదియును బదియేనును నిరువదియును ము
ప్పదియు దాఁటువడి నిత్యంబుక్, గొదగొని
తిరిగి వధింపఁగఁ, గదలఁగ రా దయ్యె గొల్ల
గమి కెచ్చోటక్. హరి. పూ. ౬. ౭.

౨. దూరమగు.

క. వేఁటమెయి వచ్చి నృప మా, బోఁటికిఁ జిట్టం
ట్ల నంటి పోయినపిదపక్, దాఁటువడుం గుల
మునకును, మాటయుఁ గణ్వునకు వచ్చు మా
నులచేతక్. పి. శకుం. ౩. ౭౭.

దాఁట్రాయి. వి. (√దాఁటు¹.) క్రీడావిశేషము.

సీ. దాయాలు సొగటాలు దాఁట్రాయి చదరం
గమును జోడురాళ్లును మూఁతిపాడుపు.
హంస. ౩. ౧౪౭. ('దాటురా' క్రొత్త
ప్రతి పా.)

దాఁట్లమారి. వి. (√దాఁటు¹.)వ్యభిచారిణి.

క. ఇది దాఁట్లమారి యగు నని, పదపడి మఱు
నాఁడె యొంటిపాటున మేకో,లాదవింపఁ
దాపియింటం, దుద గానని ప్రేమ దానితో
రమియించెక్. శుక. ౩. ౧౨౪.

దాఁపన. వి. (√దాఁగు.) దాఁచుట, గోపనము.
(శ. ర.)

దాఁపరము. వి. (√దాఁచు.) దొంగిలించుట.
(మా. దాఁపరి, దాఁపరించు, మొ.)

దాఁపరి=దాఁపరీఁడు. విశ. (దాఁపరము + ఇ³.)
వంచకుఁడు, మోసగాఁడు.

క. విరితేనె మేపగులకుక్, హరినీలపుసరుల కి
రుల కజ్జాక్షికురుల్, గురు లై వెడవిలుతుని
బెడ, గులు లై తగునెమ్మిపురుల కొకదాఁప
రు లై. చం.రా. ౩.౭౪.

దాఁపరించు. స.క్రి. (√దాఁపరము.) దొంగిలిం
చు, అపహరించు.

గీ. ముద్దులాఁ డయి త్రేతల మెఱిఁగి పాలు,
వెన్నలును దాఁపరింపంగఁ దన్ను బట్టి, తల్లి
జోలితో దామెనత్రాటఁ గట్ట, నితఁడ కాదె
ముద్దులఁ గూల్చి యేపు సూపె. హరి. ఉ.
౫. ౨౨౬.

దాఁపరీఁడు. విశ. (దాఁపరి + ఈఁడు³. స్వార్థము
న.) వంచకుఁడు, మోసగాఁడు. (వి. దొంగ.
శ. ర.)

సీ. వీఁడటే మందలో వెన్నలు దొంగిలి దర్పిం
చి మెక్కినదాఁపరీఁడు. భాగ. ౧౦ పూ.
౧౨౪౯.

దాఁపటికము. వి. (దాఁపన + టికము.) దాఁపు
రము, గోపనము. (శ. ర.)

దాఁపించు. స.క్రి.(√దాఁపు.)దాఁచునట్లు చేయు.

గీ. బొక్కసమువారిచేత నాభూషణంబు, లపు
డు దాఁపించి రతిరహస్యంబు గాఁగ, వైష్ణవు
లమీఁద ముచ్చు లన్వాదు మోపి. పరమ.
౩. ౫౫.

దాఁపు. వి. (√దాఁచు.) దాఁచుట, దాఁపరము.

వ...ఇంక దాఁ పేల కోడెగానితోఁ దక్కిరబి
క్కిరలాడుచుంటా కులుక నున్నావె ...
వృ. వి. ౨. ౪౫.

దాఁపుడు. వి. (√దాఁపు.)దాఁచుట, గోపనము.
(శ. ర.)

విశ. దాఁచుకొనఁబడునది.

సీ. ఇపుడు గా కిది యుండి దే మంచు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డెంపుచేఁ గట్టినదాఁపుడుపట్టుకోక, పార్వ. ౫.౨౧౪.

దాఁపురము. వి. (√దాఁచు).౧.గోపనము,దాఁచుట, మఱుఁగుపఱుచుట.

ఉ. ఏసును దాఁపురం బెఱుఁగ కేర్పడఁ జెప్పితి ...కళా. ౫. ౪౭.

ద్వి. మాట నీ కెఱిఁగించి మదురుగో డైన,దాఁటి పోయెద నింక దాఁపుర మేల. ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౪౦.

౨. రహస్యము.

చ. నరవరుఁ జూచి యప్పుడు సునందుఁ డనం దగుముఖ్యదాసుఁ డొక్కరుఁ డరుదెంచి నీకుఁ దనకల్గినదాఁపుర మీశ్వరుండు బాహిరముగఁ జేసెఁ జూడు...కను. ౧.౨౧.

౩. దాఁచుకొనుట, భద్రపఱుచుట; సంచయముచేయుట.

క. అతిసంచయఫల మిది పో, రతిబోఁటీ వలదు దాఁపురం బన నగుచుం, బతికి సతి వలికె దాఁపల, గత మేమీ ధాన్య మెదుగుగా లే దింటన్. వేం. పంచ. ౨. ౧౧౦.

౪. గోపనస్థానము, దాఁచుకొను తావు.

వ...బుధులకు నవనిధులదాఁపురంబును విపులవిజయలక్ష్మికిఁ గాఁపురంబును...అగునాపురంబున కధీశ్వరుండు. రామా. ౧. ౧౫౩.

౫. నిధి, నిక్షేపము; దాఁచినసొమ్ము. (శ. ర.)

సీ...ఇడుపు,లేక చిత్రము వ్రాయ నాకాశమున దాఁపురములిడ మంచుఁ గుంచమునఁ గొలువ. కు. సం. ౮. ౧౩౫.

మ...కావలయునేళ్ళన్ వచ్చి కొంపోదు నేఁ, డివి నీ పెట్టియ నాదుదాఁపురము గా నిం దుండని మ్మన్నియున్. సారంగ. ౨. ౮౫.

విశ. గుప్తము, దాఁచఁబడినది.

ఉ...ఎవ్వరికిన్, బజ్జఁ జేరనీక తనభావము లోపల దాఁపురంబు గా, సజ్జఁ జేరి యుండె నృపచంద్రుఁడు సాంద్రవియోగవేదనన్. పి. శకుం. ౨. ౧౬౪.

దాక[1]. వి. మూఁతివెడల్పు గలచిన్నకుండ,అటిక. (బ్రౌ.)

దాక[2]. వి. (సం. ద్రాక్షా. ప్రా. దక్ఖ.) ద్రాక్ష.

సీ. దాకతీవను బూవుదండ చేరిచి మెడయిఱియంగ నురి బిగియించుదాన. రసిక. ౪.౩౫.

సీ...దా కన ద్రాక్ష యగు ...ఆం. భా. ౨. ౫౭.

దాకరేమి=డాకరేమి. (చి. ని. సానుస్వారముగా గ్రహించెను.)

దాకలి=డాకలి, డాకల్లు[2], దాగలి. వి. దే. (దాయి+కలు[2]. శ. ర, 'దాఁకలి' అని చి. ని.)

౧. లోహసంతాడనాధారము,అగసాలి మున్నగువారు లోహములు సాగఁగొట్టుటకు ఆధారముగా నుంచుకొనెడియినుపదిమ్మ.

గీ. మేటిజమ్మేటియసటఁ గ్రమ్మించుమించుఁ, బొదివి మదనప్రతాపాగ్నిఁ బుటము వెట్టి, తమ్మిగద్దియదాకట గ్రమ్మి యట్టి,కొమ్మఁ గావింపఁ బోలు నె త్తమ్మిచూలి. వసు. ౨. ౩౨.

ఉ. దాకటిమీఁదఁ బెట్టి బెడిదంబుగ సమ్మెట వేయ భిన్న మై, పోక జలంబులో మునిఁగి పోవక నెప్పుడు లోహపత్త్రికన్, జేకొని వ్రాయ రేఖ విలసిల్లినవజ్రము శుద్ధ మిద్ధరన్. రత్న. ౨౬. వృ. వి. ౩. ౨.

౨. సమీపము. (చి. ని.)

ద్వి. ఊఁకర లిచ్చుచు నొగి బోరగిలుచు,దాకట నాఁకటం దడవియాడుచును. ద్వి. భాగ. ౧౦. స్కం. (చి. ని.)

దాకల్లు=డాకల్లు[1]. వి. (దాపు+కల్లు[3].) బండికంటి కడకమ్మి. (శ. ర.)

దాకొను. అ. క్రి. (దాపు+కొను.) ౧. సమీపించు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. దాకొని రతిసమయంబుల,జోక న్వలిగాడ్పు లీనుసురఁటివి నీవే, యాకాంత సేదదేర్పుదు, నీకుఁ బటాంతరము సవతు నేఁ గానఁ జుమీ. రామా. ౫. ౨౮౨.

క. తగువారిఁ బిలిచి యిదిగో,లగనము దాకొనియె నెల్లి లలిఁ బుడమికి తే,నిఁగఁ జేయ వలయు రక్కసి,మగువం బొరిగొన్నవాఁడి మగనిఁ గడంకన్. అచ్చ. రా. అయో. ౮.

౨. ఆవరించు, కవియు;కలియు.

ఉ...పురంబు సర్వముం, దాకొని కాచుచున్న కుముదప్రముఖుల్ సతతంబు గొల్వఁగాన్. పరమ. ౧. ౩౬.

ద్వి...అవనీశుబంట్లు,ఆకాశవాణికిన,...వనికాంతకును, దాకొని చేయెత్తి దండముల్ పెట్టి. ద్వి. శ. సా. ౨. ౮౨ పొ. ౧౦ పం.

స. క్రి. (త. తాక్కు.) అధిరోహించు,ఎక్కు; చేరు, పొందు.

ఉ. కుంకుమపంకశోణ యగుకొండలమండలనాథుపట్టివా,మాంకము దాకొనన్ ఘణఘణారవభూరికపాలమాలికా,లంకృతు లొంకృతుల్ నొడువులా గడరన్ ... పాండు. ౨. ౧౯౨.

ఉ. రా కలుషంబు లెల్ల బయలంబడఁ ద్రోచిన మా కవాటమై, దీకొని ప్రోచు నిక్క మని ధీయుతు లెన్నఁ దదీయవర్ణముల్,గైకొని భక్తిచే నుడువఁ గానరుగాక విపత్పరంపరల్,దాకొను నే జగజ్జనుల...దా. శ. ౨౬.

ఉ. అకుముదప్రియాన్వయునవాభ్యుదయంబున వర్ధమానలీ,లాకృతి నొప్పెఁ గీర్తులు మహార్ణవసప్తకలంఘనోద్ధతిన్, దాకొని చక్రపర్వతనితంబములం దదధీనభూమియుం, దాఁకనగుంజుమీ యని నిదానము ముందుగఁ దెల్పుకైవడిన్. కవిరా. ౩. ౧౧.

దాకొలుపు. స. క్రి.(దాపు+కొలుపు.)చేర్చు.

సీ. పైఁ బండ్లు గలిగి లోపలఁ బుచ్చుతరుశాఖ గొంగళిమూల దాకొలుపురాయి. రామలిం. ౩౧.

దాక్షము. సం. విణ. (అ. ఈ. అ.) దక్షసంబంధమైనది.

దాక్షాయణము. సం. వి. అ. న. బంగారము. (కే. ని.)

దాక్షాయణి. సం. వి. ఈ. స్త్రీ. ౧. అశ్విన్యాద్యన్యతమము, అశ్విన్యాదులలో నేదేనియు నొకటి. ౨. సతీదేవి. ౩. పార్వతి. ౪. కద్రువ, నాగమాత. ౫. వినత, గరుడమాత. ౬. అదితి, దేవమాత. ౭. దితి, రాక్షసమాత. ౮. భూమి. ౯. లక్ష్మి. (కే.ని.) ౧౦. దంతి, నేపాళముక్. (వాచ.)

దాక్షాయణీపతి. సం. వి. ఇ. పుం. ౧. ఈశ్వరుఁడు. ౨. చంద్రుఁడు. (వాచ.)

దాక్షాయణుఁడు. సం వి. అ. పుం. దక్షుని యువాపత్యము. (వాచ.)

దాక్షాయ్యము. సం. వి. అ. పుం.-శీఘ్రముగాఁ బోవునది-గ్రద్ద.

దాక్షి. సం. వి. ఇ. పుం. దక్షునియపత్యము,దక్షసంతతి. ఈ. స్త్రీ. ౧. దక్షునికూఁతురు. ౨. పాణినితల్లి. ౩. కపిలగోవు. (కే. ని.)

దాక్షిణాత్యము. సం. వి. అ. పుం. నారికేళము, కొబ్బరిక్. (రా. ని.)

దాక్షిణాత్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దక్షిణపుదిక్కువాఁడు, దక్షిణదేశపువాఁడు.

దాక్షిణికుఁడు. సం. వి. అ. పుం. ఇష్టాపూర్తాదికర్మములు చేసి దక్షిణమార్గమునుండి చంద్రలోకమున కేఁగువాఁడు. (వాచ.)

దాక్షిణ్యము. సం. వి. అ. న. ౧. కనికరము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. అనుకూల్యము, ఒద్దిక. 3. పటుత్వము. సామర్థ్యము; నైపుణ్యము. ౪. దక్షిణనాయకునిధర్మము. ౫. దక్షిణదిగ్భవత్వము, దక్షిణపు వైపుది యగుట.

దాక్షిణ్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దక్షిణీయుఁడు, దక్షిణకు తగినవాఁడు.

దాక్షేయుఁడు. సం. వి. అ. పుం-దాక్షీపుత్రుఁడు-పాణిని.

దాక్ష్యము. సం. వి. అ. న- దక్షత్వము-౧. కౌశలము, నేర్పు; పటిమ, సామర్థ్యము. ౨. ఆర్జవము, చక్కటి.

దాగలి=దాకలి. (శ.ర, 'దాఁగలి' అని చి.ని.)

దాఘము. సం=దాహము. (వాచ.)

దాడకము. సం. వి. అ. పుం. దంతము, కోఱ.

దాడి[1]. వి. (సం. ధాటీ. ప్రా. ధాడీ. క. దాడి.) ౧. దండయాత్ర, శత్రుజయార్థమై దండెత్తిపోవుట.

ఉ. కందువ సెప్పి యొక్కెడఁ ద్రిగర్తులు దాడికిఁ గూడువారు...భార. విరా. 3. ౧౨౬.

ఉ. ఆతనిదాడికిం దలఁకి యచ్చటివీడులరాజులెల్ల నత్యాతురులై...హరి. పూ. 3. ౧౨౬.

మహాస్రగ్ధర... ఇతనియశోమండలీపూర్ణరాకా, తుహినాంశుల్ దాడిమై వత్తురు వడిఁ దనపై దొమ్మిగా నంచు...నైష. ౫. ౧౬౦.

౨. ఔద్ధత్యము, ఉదుటు.

ఉ. అటిమెడన్ గడంగి జగమంతయు నాఁగెడుమంచుదాడి క్రిట్టటు చనంగ లేక శరణంచుఁ దమన్ భజియించువెట్టకున్, దట్టుపునుంగువాసనలతా వగులేజవరాండ్రచొక్కపున్, గట్టిమెఱుంగుచన్గవలు గట్టె నిజోపరిఁ బట్టబంధమున్. చం. రా. ౫. ౨౬.

చ. తలిరుజిరావజీరుబలుదాడికి నోడి కడంక దక్కి...నీలా. 3. ౧౪.

రగడ. వేసు వేసుక నిత్తు నీ కివ్వేళ వేలతికాంతవారము, దాడి దాడిమగమికిఁ జేరఁగఁ దగునె దగు నెడ కరిగెఁ గీరము. చంద్రి. ౪. ౬3.

జః దాడికాఁడు, దాడిగొను, దాడిచను, దాడిచేయు, దాడిపోవు, దాడియాడు, దాడివచ్చు, దాడివెట్టు.

దాడి[2]. వి. (సం. దాఢికా.) శ్మశ్రువు, గడ్డము.

దాడి. సం. వి. ఈ. స్త్రీ. ౧-బ్రద్దలగుపండ్లు గలది- దానిమ్మచెట్టు. ౨. దానిమ్మపండు. (వాచ, విల్యమ్సు.)

దాడింబ=దాడిమ.

సీ. దాడింబ యనఁగను దాడిమం బలరును... ఆం. భా. ౨. ౫౦.

దాడింబము. సం. వి. అ. పుం. దానిమ్మచెట్టు. (వాచ.)

దాడికాఁడు. వి. (√దాడి[1]) ౧. దండెత్తువాఁడు.

చ. తిమిరపుదాడికాఁడు చనుదేరఁ దొడంగెను నా కెదుర్పఁగా, సమయము కాదు...విప్ర 3. ౨3.

చ. జలజవనంబుకూర్మిచెలి జక్కవదోయిముదంబు నిక్కుచుఁ, గ్కలపయి దాడికాఁడు త్రిజగంబులమ్రొక్కులుయిక్క వేదముల్, మొలచినపాదు...ప్రాణికోటికిన్, వెలుఁగన నొప్పునవ్వెలుఁగు వేగమ తూర్పునఁ దోఁచె నత్తఱిన్. కేయూర. ౪. ౨౭.

౨. వేగులవాఁడు.

చ. ఇదె చనుదెంచెఁ జైత్రుఁ డని యెల్లవనంబులకున్ బ్రమోదముల్, పొదలఁగ మేలివార్తఁ గొని బోరన వచ్చినదాడికాఁ డన, న్మృదువన దేవతాముఖసమీర మెదుర్కొన నుల్లసిల్లె నిం, పొదవఁగ దక్షిణానిల మనూన మనోహర ఖేలనంబునన్. నృసిం. ౨. ౬౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దాడిగొను. అ. క్రి.(√దాడి[1].) ఒకదానివెంబడి నొకటి వచ్చు.

తన్వీవృత్తము. పాడి వినోదంబులు సలిపినగో పాలుఁ డటంచును భటనసభాస్యల్, దాడిగొ నక్ విశ్వవిరమణముతోఁ దన్విని( జెప్పఁగఁ దనరుఁ గవీంద్రుల్. అప్ప. ౪.౨౩౬ పా.

దాడిచేయు. అ. క్రి. (√దాడి[1]) దండెత్తు, యుద్ధ యాత్ర చేయు.

వ...పదునెనిమిదవమాఱు దాడిచేసి శత్రులం దోలి విజయంబు చేకొంటి...భాగ. ౧౦. పూ. ౧౪౫౯.

దాడినిమ్మ=దాడిమ.

మత్తకోకిల. పూచె నిమ్మలు దాడినిమ్మలు పొన్న లున్ సురపొన్నలున్. యయా. ౪. ౪.

దాడిపో(వో)వు. అ. క్రి. (√దాడి[1].)దండెత్తు.

ద్వి. ఖరదూషణాదులఁ గడికండములుగ, ధరణి పైఁ గూల్చెఁగదా యని మీరు, తలఁచెద రతనిపై దైత్యులపోక, తలఁపుచు వారిపై దాడిపోఁ దగునె. రం. రా. యు. ౨౮౯. పా. ౨౦ పం.

చ. వెడవెడ నిద్రవొంది కనువిచ్చినపాంథుల మీఁద దాడివోఁ, దడఁబడ నొండొరుం బి లుచుదర్పకుపంపుబలంబులోనియ, ల్కడు కరణిం జెలంగె శుకకోకిలభృంగతతుల్ వనం బునం, డెడ నెడఁ బల్కుఁ గూయ సొగియిం పఁగ మ్రోయఁగఁ దద్విరావముల్. భార. ఉద్యో. ౨. ౧౧౧.

దాడిమ=దాడింబ, దాడినిమ్మ, దాడిమ్మ, దానిమ్మ. వి. (సం. దాడిమః. క. దాడింబె.) దాడి మము✱.

రగడ. దాడి దాడిమగమికిఁ జేరఁగఁ దగునె దగునెడ కరిగెఁ గీరము. చంద్రి. ౪. ౬౩.

దాడిమపత్త్రకము. సం. వి. అ. పుం. రోహిత కము, ములుమోదుగు✱.

దాడిమపుష్పము. సం=దాడిమపత్త్రకము.

దాడిమప్రియము. సం. వి. అ. పుం. శుకము, చిలుక.

దాడిమము. సం. వి. అ. పుం. న. ౧. దానిమ్మ✱. ౨. ఏలకి✱. న. ౧. దానిమ్మపండు. ౨. ఏలకీ ఫలము. (శే. ని.)

దాడిమి. సం. వి. ఈ. స్త్రీ. ౧. దానిమ్మ✱. ౨. ఏలకి✱.

దాడిమీసారము. సం. వి. అ. పుం. దానిమ్మ✱.

దాడిమ్మ=దాడిమ. సాం. ని. స్థా. ౫౪.

దాడియాడు. స. క్రి. (√దాడి[1]). ముట్టడించు. (మార్కొను. శ. ర.)

ద్వి. ఈడఁబోవక యింద్రుఁ డీమనవీడు, దాడి యాడుచు వస్తుతతిఁ గొల్లవిడిచి. ద్వి.భాగ. ౪ స్కం. (శ. ర.)

దాడివచ్చు. అ. క్రి. (దాడి[1] + వచ్చు.)దండెత్తి వచ్చు, దాడివెడలివచ్చు.

శా. దేవా రక్కసుఁ డొక్కరుం డతిబలోద్రే కంబునన్ దాడిరా. వరాహ. ౧౧. ౧౨.

దాడివెట్టు. అ. క్రి. (దాడి[1] + పెట్టు.) దండువె డలు, దండెత్తు.

సీ. అమ్మహాత్ముల వెంట నడవికి ఘోషయాత్రా విధి నెపమున దాడివెట్టి. భార. కర్ణ. ౩. ౩౫౬.

ఉ...నేను నా, సేనయు దాడివెట్టెద విశ్శృంఖల తం బ్రతిపక్షువెంట...హరి. ఉ. ౩. ౯౯.

సీ. ఒకనాఁడు దనుజనాయకుఁ సేనతో దివ్యధా మంబుపై కటు దాడివెట్టి. ఉ.హరి.౧.౧౭.

దాఢ. సం. వి. ఆ. స్త్రీ. ౧. కోఱ, దంష్ట్ర. ౨. ప్రార్థన, కోరిక. ౩. సమూహము, గుంపు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దాఢిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. దాఢ. ౨. శ్మశ్రువు, దాడి.

శ్లో. కేశేషు గృహ్ణతో హస్తౌ ఛేదయేదవిచారయన్, పాదయో ర్దాఢికాయాం చ గ్రీవాయాం వృషణేషుచ. మను. ౮. ౨౮౩.

('దాఢికాయాం=శ్మశ్రుణి' కుల్లూకభట్టవ్యాఖ్య.)

దాణ. వి. (సం. ధాన్యమ్. హిం. దానా.) గుఱ్ఱము మొదలగువానికి పెట్టుఉలవలు లోనగుఆహారము.

చ...ఏ, తత్తేఁ గలలోని నుక్కు బడేఁడుదాణ యెఱుంగను...హంస. ౫. ౪౧.

దాణము. వి. సుంకము, శుల్కము. (శ. ర.)

దాణుధోడ. వి. మల్లవిద్యావిశేషము, పదునాల్గువిసరులలో నొకటి.

వ...అవ్వీరుండు...దాణుధోడ ఝూటునివిమొదలయినపదునాలుగువిసరులమర్మంబులుం జూచి...హంస. ౧. ౨౦౬.

దాత. సం. విణ. (ఋ. త్రి. ఋ.) ౧. దానశీలుఁడు, ఇచ్చువాఁడు. ౨. ఖండించువాఁడు, త్రుంచువాఁడు. ౩. శుద్ధిచేయువాఁడు.

దాతము. సం. విణ. (అ.ఆ.అ) ౧. భిన్నము, త్రుంపఁబడినది. ౨. శుద్ధమైనది.

దాతవ్యము. సం. విణ. (అ. ఆ. అ) ౧. ఇయ్యఁదగినది. ౨. కోయఁదగినది. ౩. శోధింపఁదగినది.

దాతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. ఛేదనము, ఖండించుట. ౨. శుద్ధి.

దాతికట్టు=దాదుంగ. వి. (దాయి+కట్టు.) ఊర్ధ్వనము, చెక్కుడుమ్రానికి ఊఁతగా క్రింద నుంచు కొనెడిబల్లలోనగునది. (శ. ర.)

దాతు. వి. (సం. ధాతుః.) గైరికాదిధాతువు. (చూ. దాతుబొట్టు.)

జః దాతుబొట్టు.

దాతుబొట్టు. వి. (దాతు+బొట్టు.) గైరికాదిధాతువిశేషముచేఁ జేయఁబడినతిలకము.

మత్తకోకిల. తమ్మిపూసలపేరు నెట్టినిదాతుబొట్టును జూడ నంగమ్మపైఁ దగుసొమ్ముగా...చెంచరుదెంచినన్. ద్వా. ౮.౯. ('ధాతుబొట్టు' ముద్రి.)

దాత్యూఁహము. సం. వి. అ. పుం. దాత, ఇచ్చువాఁడు. (కౌముది.)

దాత్యూహము. సం. వి. అ. పుం.౧. కూకురు, గుండఁగిపక్షి. ౨. చాతకము, వానకోయిల. ౩. నీరుకాకి. ౪. మేఘము, మబ్బు.

దాత్రము. సం. వి. అ. న.-ఖండించునది; కోయునది- లవిత్రము, కొడవలి.

దాదాపు. వి. (దాపు+దాపు.) మిక్కిలిసమీపము. (శ. ర.)

దాది=దాదిలి. వి. (సం. ధాత్రీ. ప్రా. ధాఈ, ధత్తీ. క. దాది. త. తాది.) పెంచినతల్లి, ఉపమాత.

గీ. పతి కళావతి యనుదానిఁ బద్మనయన, దమసహోదరి గారాపుదాదికూఁతు, నంతికమునకు రప్పించి యాదరించి,నర్మసాక్షిణిఁ గావించి నగుచుఁ బలికె. నైష. ౮. ౫౪.

సీ. పలుదాదు లగుచు బెబ్బులులబిడ్డల నిచ్చవిసువక పెంచు నాఁబసులపదుపు. యయా. ౨. ౪౯. దశా. ౪. ౧౩౭.

దాదిలి=దాది. వి. (సం. ధాత్రీ.) దాది, ఉపమాత.

క. తాదృశపురహర్మ్యములకు, దాదిలి యగును దినకరసుధాకరతేజః, ప్రాదుర్భావనిదానమ, హాదీధితి తెలియఁ దరమె యాసభమహిమల్. కరు. ౩. ౧౪.

దాదుంగ=దాతికట్టు. వి. (దాయి+దుంగ.)...

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉద్ఘనము, వడ్రంగి కఱ్ఱలు చెక్కునపుడు క్రింద
ఊఁతగా నుంచుకొనుదుక్క. (శ. ర.)

దాధికము. సం. విణ. (అ. ఈ. అ.) పెరుఁగు
లో వేయఁబడినది, పెరుఁగుతోఁ గలుపఁబడినది.
వి. అ. న. (పెరుఁగులోఁ జేయఁబడిన) గుల్మాది
నాళక మగుఔషధభేదము. (విల్యమ్సు.)

దాధికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ౧. పెరుఁ
గుతో భుజించువాఁడు. ౨- పెరుఁగుతోఁ దిరు
గువాఁడు-పెరుఁ గమ్మువాఁడు. (విల్యమ్సు.)

దానకము. సం. వి. అ. న. ౧. అల్పదానము.
౨. కుత్సితదానము.

దానపతి. సం. వి. ఇ. పుం. ౧. బహుప్రదుఁడు,
మహాదాత. ౨. అక్రూరుఁడు. (కృష్ణుని చెలి
కాఁడు. వాచ.)

దానపత్త్రము. సం. వి. అ. న. దానము చేసినట్లు
వ్రాసి యిచ్చినపట్టము.

దానము. సం. వి. అ. న. ౧. త్యాగము, ఈవి,
ఇచ్చుట. (దశదానములు—గోదానము, భూ
దానము, తిలదానము, హిరణ్యదానము, ఆజ్య
దానము, వస్త్రదానము, ధాన్యదానము, గుడ
దానము, రౌప్యదానము, లవణదానము;—షోడ
శమహాదానములు—గోదానము, భూదానము,
తిలదానము, హిరణ్యదానము, రత్నదానము,
విద్యాదానము, కన్యాదానము, దాసీదానము,
శయ్యాదానము, గృహదానము, అగ్రహారదాన
ము, రథదానము, గజదానము, అశ్వదానము,
ఛాగదానము, మహిషీదానము.) ౨. గజమద
ము. ౩. పాలనము, రక్షణము. ౪. భేదనము,
ఖండించుట. ౫. శుద్ధి. ౬. రాజ్యాంగచతురు
పాయములలో నొకటి. (ఇది పంచవిధములు-
తనకుఁ గలధనము నంతయు నిచ్చుట, ఎక్కడ
నైని ధనము తీసికొన్నచో దానికి తాను అనుకూ
లుఁడై యుండుట, అపూర్వవస్తువుల నిచ్చుట, అ
న్యులధనముఁ బుచ్చుకొనఁ బ్రవర్తింపఁజేయుట,
అప్పుతీర్చుట.)

దానవారి. సం. వి. ఇ. పుం - రాక్షసులశత్రువు-
౧. దేవుఁడు, వేలుపు. ౨. విష్ణువు. ౩. మదో
దకము, గజమదజలము.

దానవీరము. సం. వి. అ. పుం. దానముచేయు
టలో నుత్సాహము చూపుట, వీరరసభేదము.

దానవీరుఁడు. సం. వి. అ. పుం. దానముచేయు
టలో మహాశూరుఁ డగునాయకుఁడు, దానవీర
రసప్రధాననాయకుఁడు. (శిబికర్ణదధీచ్యాదులు.)

దానవుఁడు. సం. వి. అ. పుం- దనుసంతతివాఁ
డు- తొలివేల్పు, రాక్షసుఁడు.

దానవురాలు. మి. వి. రాక్షసస్త్రీ, రక్కసి.
క. అవివేక ముడిగి దైత్య ప్రవరునియంతిపురము
నకుఁ బద మనుచుఁ దానవురాండ్రు వ
లుకుపలుకుల్, చెవిఁ దాఁకి చులుక్కు మ
నినఁ జిత్తం బొఱలఁ. రామా. ౬. ౧౪౧.

దానవేయుఁడు. సం=దానవుఁడు.

దానశీలుఁడు. సం=దానశౌండుఁడు.

దానశూరుఁడు. సం. = దానశౌండుఁడు.

దానశౌండుఁడు. సం. విణ. (అ. ఆ. అ) బహు
ప్రదుఁడు, మిక్కిలి దాతయగువాఁడు.

దాని. సం. విణ. (న్. నీ. న్.) ౧. ఈవికాఁడు,
దాత. ౨. మదము గలది. (గజము.)

దానిమ్మ=దాడిమ్మ. సాం. ని. స్థా. ౫౩.

దానీయము. సం. విణ. (అ.ఆ. అ) ౧. ఇయ్యఁ
దగినది. (ధనాది.) ౨. దానపాత్త్రము, దాన
సంప్రదానము. వి. అ. న. దానము.

దానువు. సం. విణ. (ఉ.) ౧. పరాక్రమవంతుఁడు,
మగఁటిమి గలవాఁడు. ౨. దాత, ఈవికాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వి.ఉ.పుం. ౧. సుఖము. ౨. వాయువు. ౩. యజమానుఁడు. ౪. సూర్యుఁడు. (కే. ని, వాచ.)

దాపనము. సం. వి. అ. న. ఇప్పించుట.

దాపరము=దాపురము. వి. (√దాయు) ప్రాప్తి. (శ. ర.)

జః దాపరించు.

దాపరించు. అ. క్రి. (√దాపరము) ప్రాప్తించు. (శ. ర.)

(వ్యవ) వీఁడు మా కొక్కఁడ దాపరించినాఁడు. (ఇది నిందాద్యోతకము.)

స. క్రి. ప్రాప్తింపఁజేయు, లభింపఁజేయు, చేకూరఁజేయు.

కళిక. తతిని సద్గురుసుతుల దాపరించినసదయ, సెరిమె నాగపురంబు నెక్కలించినవిజయ. అప్ప. ౪. ౩౩౩.

దాపల=డాపల. వి.ఔ. ఎడమవైపు. (చూ. దా.)

వ...వలపటఁగృపాశ్వత్థామలును దాపటఁ గృతవర్మమద్రేశ్వరులును వెనుక బాహ్లికసోమదత్తభూరిశ్రవసులును...భార. భీష్మ. ౧. ౧౦౩.

చ. కటకట కాశికాపురి నొకానొకనిద్దురఁ గన్నుమోడ్చి యప్పటఁ గను విచ్చునప్డు కుడిభాగము గన్గొని చోద్య మందు దాపటి దెసఁ జూచి యచ్చెరువుపాటు వహించు మనస్సరోజసం, పుటమున నాఁడులాఁగు మగపోఁడిమియుం గలజంతుసంతతుల్. కాశీ. ౩. ౯౯.

గీ. కారణములేక దాపలికను ద్రవించు. భార. శాం. ౬. ౧౭౯.

ఉ. పచ్చలకంకణమ్ములను భాసిలుదాపలికేల జాళువా, కుచ్చెలకొంగు దాల్చి...ఉ. రా. ౪. ౯౨.

జః దాపలించు, మొ.

దాపలించు=డాపలించు. స. క్రి. (√దాపల) ఎడమవైపుగా నుంచు.

వ...బకవైరి దాపలించి తిరిగినం బెరిఁగినయీరసంబున నుల్లసితుండై యాభూవల్లభుండు ...భార. శల్య. ౨. ౨౬౭.

దాపించు. అ. క్రి. (√దాయు.) సమీపించు. (శ. ర.)

దాపితము. సం. విణ. (అ. ఆ. అ) ఇప్పింపఁబడినది. (ధనాది)

దాపితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దండితుఁడు, దండువుగొనఁబడినవాఁడు.

దాపు=డాపు. స. క్రి. (√దాయు.) చేర్చు.

క. తమవారిం బిలిచిన వైళమ చని వా రంద ఱుక్కొ బొలసు మేపరిక్కలు మొగన్ దాపిన సెనుతాయి మొగిం బడఁ దన్ని లోని కేఁగి కడంకన్. అచ్చ. రా. యు. ౪౪౬.

ఉ. వచ్చినకృష్ణునిన్ సుజనవత్సలుఁ గన్గొని ద్వారకాజనుల్, ముచ్చట లెల్ల దాపుకొని మ్రొక్కుచు సొక్కుచు సంతసంబునన్, మచ్చికలుం బ్రమోదములు మన్ననలుం గనిరి ...వి. పు. ౬. ౨౭౨.

(వ్యవ.) పెండ్లిలో అగ్ని దాపుదురు.

,, అగ్నిహోత్రమును చూచి కొంచెము దాపుము. (ఆరిపోకుండ సమిధలు చేర్చుము అని భావము.)

వి. ౧. ఆధారము, అండ, శరణము.

ఉ...మామనోగతులు నిర్భరహర్ష ము నొందె నింక నెప్పట్టున నేము ధన్యులము ప్రాపును దాపును నీవు గల్గుటన్. హరి. ఉ. ౧. ౧౪౫.

ఉ. స్థాణునిలోచనాంచలము దాపుగఁ దీవ్రతరార్చులన్ నిజ, ప్రాణము గొన్న నాటిపగ యాత్మఁ దలంచియొ...నైష. ౪. ౩౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మత్తకోకిల. ఆపదైనను రానిచుట్టము నాజ్ఞ
మీఱినపుత్త్రుఁడుం,దాపు లేనిరణంబు నే
టికి దానవోత్తమ చూడఁగాం. మై. ౧.
౯౧. (భయము అని. శ. ర.)

౨. అవలంబము, ఊఁత.

గీ. ఏడుపాతాళములక్రిందియిలుకుఁగొంది, కరిగి
తోయాత్తమైయున్నధరణిఁ జూచి,మొ
గము దాపుగ నిచ్చి నిర్మద్రశక్తి,గరిమ గడ
లొత్తగా నెత్తెఁ గరుణఁ బ్రభుఁడు. హరి.
పూ. ౪. ౧౬.

గీ. యమనియమవర్తనములతో నాసనాదు, ల
భ్యసింపఁగఁ దొడఁగె నత్యాదరమున,
దాను మును విన్నభంగులు దాపుగాఁగ,
నచటిశక్తిని గురువుగా నాత్మ నునిచి.
కళా. ౩. ౧౩౩.

౩. సమీపము,చేరువ.

సీ. డాకాలిగండపెండారంబుదాపున బొమ్మలై
వైరిభూభుజులు వ్రేల. కాశీ. ౧. ౭౫.

దాపుకొను. స. క్రి. (దాపు+కొను.) ఆశ్ర
యించు, అండగొను.

వ. ఇట్లరుగుదెంచి ప్రాంతరత్నస్తంభంబు దాపు
గొని సఖీజనంబులమరువున లజ్జావనతవదనా
రవింద యగుసుందరిం గడచి...కవిక. ౩.
౨౦౫.

దాపురమగు. అ. క్రి. (దాపురము+అగు)
ప్రాప్తమగు, దాపరించు.

గీ. కారణం బన్నిటికి నల్ల పారువమెక,దా య
దెక్కడ దాపురమాయెఁ దనకు. సారంగ.
౨. ౧౭౫.

దాపురము= డాపురము. వి.(√దాయు.)ప్రాప్తి.
(శ. ర.)

ద్వి. నీరఁజి చ్చెగయింప నేర్చినతల్లి,మెచ్చుట
నుండి నీ విట దాపురముగ,వచ్చితి చొచ్చి
తి వాస మీ ననుచు. ద్వి. హరిశ్చ. ఉ.
౧౨౦౧. పం. (దాపురముగ వచ్చితివి=దాప
రించితివి.)

దాప్యము. సం. విణ. (అ. ఆ. అ.) ఇప్పింపఁ
దగినది. (ధనాది.)

దాప్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దండుగ
గొనఁదగినవాఁడు, దండ్యుఁడు.

దామ. సం. వి. ఆ. స్త్రీ. దామము.

దామని. సం. వి. ఈ. స్త్రీ. ౧. పెక్కుపలుపు
లు గలనిడివిత్రాడు, దామెన. ౨. పలుపు.

దామము. సం. వి. న్. న. స్త్రీ. ౧.పాలుపితు
కునపుడు పసులకు కాలికిఁ గట్టెడుత్రాడు, బంద
ము. ౨. దామెనత్రాడు, పెక్కుపలుపులు గల
నిడివిత్రాడు. ౩. రజ్జువు, త్రాడు. ౪. మాల,
దండ, హారము. ౫. (పసులను గట్టెడు)తలుగు,
సందానము, పలుపు. ౬. (మెఱపులోనగువాని)
రేఖ, గీఱ. (విద్యుద్దామము, మొ.)

దామర. వి. ౧. ఉరిత్రాడు.

చ. ఎలమి మనోజలుబ్ధుఁ డెనయించినజక్కవ
దీము పెంటి పేరెలుఁగునఁ బిల్చి చూడ్కిఁ
గదియించి యెదుర్కొని మేనుమేను ని,
శ్చలగుణసంగతిం బెనఁచి చక్రము దామర
తెంకిఁ జేర్పఁ ద,త్కలకలశంకఁబోలె విహ
గంబులు వీడెఁ గులాయకూటముల్. వసు.
౪. ౧౩౨.

౨. మండలాకార మగుకుష్ఠము. (శ. ర.)

దామాంచలము. సం. వి. అ. న. అశ్వాదుల
కాళ్లకుఁ గట్టెడుత్రాడు.

దామాంజనము. సం = దామాంచలము. (విల్యా
ము.ని.)

దామెన. వి. (సం. దామనీ) పెక్కుపలుపులు
గలపెద్దత్రాడు; త్రాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. తలుగులపాది యొకదెసఁ బెయ్యలదామెన
యొక్కవలన ననువై యుండఁగ, మొల మోపి
పెక్కుచుట్లఁగ, బలుత్రాటం జుట్టి గోపభా
ళం భ్రమరక. భార. విరా. ౧. ౨౭౫.

సీ...విశ్వమెల్ల, నతిలీలమై మహోద్భుతసమగ్ర
స్ఫూర్తి నుండును గోక నూ లున్నభంగి,
దామెనఁ బశువులు దగిలి యుండెడుమాడ్కి
...భాగ. ౬. ౧౬౯.

గీ. దనుజుల్లుంద్ర మెడల సూత్రములు గట్టి,
యూపముల సూత్రములతోడ నుద్దిచేసి,
దామెనలు గూర్చి నడిపించెఁ దరతరంబ,
వీరభద్రుండు పశువుల వెల్చునట్లు. కాశీ.
౩. ౭౮.

దామెనత్రాడు=దామెన.

మ. చనుమా చూతము నీ తెఱం గనుచు నత్యా
హంబుతోఁ దల్లి దా,మెనత్రాటఁ బెనుటో
టితోన మును బల్మిఁ గట్టినఁ...హరి.ఉ.
౪. ౨౩౫.

సీ.చిక్కము ల్లాలలు మాసినచింపిబొంతలు దా
మెనత్రాళ్లు గోతములు వెండ్రు, కలమోపులు
ను...చెన్న. ౨. ౨౦౪. హంస. ౨. ౩౫.

దామెనపగ్గము=దామెన.

సీ. దామెనపగ్గముల్ తలత్రాళ్లు నురిత్రాళ్లు
చిక్కంబులును జల్దిచిక్కములును. శుక.
౨. ౫౪౫.

దామెనమోకు=దామెన.

సీ. దామెనమోకులు దగిలి యించుక మ్రొగ్గి
గడలు పగ్గము లూఁతగా నిలుచుచు. చెన్న.
౨. ౭౧౨.

జః దామెనకొయ్య, దామెనవేఁట.

దామెనకొయ్య. వి. (√దామెన.) దామెన కట్టు
స్తంభము.

గీ. తలుగు లూడ్చి పెయ్యల నెల్లఁ దల్లిచన్ను,
గుడువ విడుచుఁ గొన్నిటి నలుగడలఁ దోలు,
నుఱక దామెనకొయ్యలు పెఱికి పాఱి,పైచు
గావళ్లు నుట్లను వ్రచ్చి త్రెంచు. హరి. పూ.
౫. ౨౦౬.

దామెనవేఁట. వి. (√దామెన.) మృగయావిశే
షము, అచ్చటచ్చట దామెనలు గూర్చి చేయు
వేఁట.

సీ. దీమంబువేఁటలు దామెనవేఁటలు తెరవేఁ
టలును నేర్చుతెరలికలును. ద్వా. ౭. ౨౨.

దామోదరము. సం. వి. అ. పుం. ౧. వర్ధమాన
(బర్ద్వాన్) పురసమీపమున నుండెడియొకానొక
నదము. ౨. సాలగ్రామవిశేషము.

దామోదరుఁడు. సం.వి.అ.పుం. ౧. (దామ+
ఉత్+అర-దమాదులచే ఉత్కృష్టమగుబుద్ధికి
విషయ మగువాఁడు) విష్ణువు. ౨. (దామ+ఉ
దరుఁడు=యశోదచేతఁ గట్టఁ బడినత్రాఁడు ఉద
రమునఁ-నడుమున-గలవాఁడు) కృష్ణుఁడు.

దామ్యత్. సం. శత్రు. ౧. అణఁచుచున్న.
౨. దండించుచున్న.

దాయ. వి. (√దాయు- సం. దాయాదః. ప్రా.
దాయాదో. క. దాయ.) జ్ఞాతి, సగోత్రుఁడు;
శత్రువు.

ఆ. అనఘ పితృపితామహ ప్రపితామహ,పూజన
ములు శిష్టపూర్వకముగఁ, జేయవలయు నియ
తి దాయ దొడ్డినజన్ని,దంబుతోడ భక్తిధా
మ మగుచు. భార. అను. ౩. ౧౯౯.

గీ. దాయ యనఁగ సగోత్రాభిధాన మొప్పు.
ఆం. భా. ౧. ౧౧౨.

గీ. జలరుహములకుఁ దచ్ఛయచ్ఛాయ దాయ,
యనఁగ సతిఁ దొప్పె నవయౌవనాగమమున.
వైజ. ౧. ౫౮.

ఆ. చక్కఁ జలము పెనఁగఁ జన దింక నినుఁడు
పశ్చిమధరాధరంబు సేరఁ బోయె, దీని
కొకయుపాయ మేను గల్పించెద,దానఁజేసి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాని దాయ వడఁడు. భార. ద్రో. ౪. ౩౧౨.
ఉ. వాలిన దాయవారి దొరవారి నసేసులఁ గూ
ర్చుకొన్న(గా, కేల జయింప వచ్చు...కు.
సం. ౧౧. ౬౬౧.

దాయఁగట్టు. స. క్రి. (దాయఁ + కట్టు.) ౧. బం
ధము చేయు. (శ. ర.) ౨. పశువుల నొండొంటి
తో లంకెవేయు.
(వ్యవ) బంతిలో ఆయెద్దును దాయఁగట్టిన భాగు
గా నడచును.

దాయకాలము. సం. వి. అ. పుం. దాయవిభాగ
ము చేసికొనుకాలము.

దాయకుఁడు. సం. విణ. (అ. యికా. అ) ౧. ఇ
చ్చువాఁడు. ౨. ఖండించువాఁడు. ౩. శోధిం
చువాఁడు. వి. అ. పుం. దాయాదుఁడు, జ్ఞాతి.

దాయబంధువు. సం. వి. ఉ. పుం- దాయభాగ
ము పుచ్చుకొనుబంధువు- భ్రాత, తోఁడబుట్టిన
వాఁడు.

దాయభాగము. సం. వి. అ. పుం. ౧. దాయ
ములోనిభాగము. ౨. దాయవిభాగము, పిత్రాది
ధనమును పంచుకొనుట.

దాయము. వి. (క. దాయ. త. దాయం.) ౧.
(జూదము గవ్వలాట మొ. వానిలోని)పందెము.
సీ. కైయధికంబుగఁ గల్లసారెలు వైచి యొక్కుడా
యంబుల యెడలు గడపి. దశకు. ౫. ౬౪.
సీ. ఒకదాయ మాడిన నున్నదాయం బాడు వ
నక వాటులు రెండు గొని చెలంగి. ఉ. హరి.
౩. ౧౨౭.
ద్వి. వలవ దచ్చొకమాటలు నీకు ననుచు, నల
ఘుఁడు దచ్చొక మని దాయ మాడు. పండి
తా. పురా. ౧౨౫ పా.
౨. విపత్తు, ఇడుమ, ఆపద.
ద్వి. వడి నుక్కడాయము వచ్చుచో ధైర్య,
ముడిగిన దైన్యంబు నొందిన నగరె. ద్వి. హ
రిశ్చ. ఉ. ౫౯౫. పం. (గొప్పయిడుమ.
అని టీక.)
౩. క్రీడావిశేషము.
గీ. దాయముల నాడు వామనగాయ లాడు,
బాటలను బాడు...ఆసుశీల జగన్మోహనాం
గి యగుచు. బ్రహ్మో. ౩. ౩౦.
సీ. దాయాలు సొగటాలు దాఁట్లాయి చదరంగ
మును జోటురాళ్లను మూఁతబొడుపు. హంస.
౩. ౧౪౬.

దాయము. సం. వి. అ. పుం. ౧. దానము, ఈవి.
శ్లో. అస్వామినా కృతో యస్తు దాయో విక్ర
య ఏవ వా. మను. ౮. ౧౯౯.
౨. వివాహకాలమందు కన్యకిచ్చుధనము, అరణ
ము. ౩. కన్యాదానకాలమున అల్లున కిచ్చుకట్న
ము, అరణము. ౪. విభాగార్హ పిత్రాదిధనము, పం
చుకొనఁదగినతండ్రిలోనగువారిసొత్తు. ౫. లయ
ము, నాశము. ౬. ఖండనము, ఛేదించుట. ౭. సో
ల్లుంఠనభాషణము, ఉల్లిపట్టుమాట, ఎత్తిపొడు
పుమాట. ౮. ఈయఁదగినధనాదికము. ౯. స్థా
నము, తావు ౧౦. శుద్ధి, నైర్మల్యము. (వాచ.)

దాయాద. సం. వి. ఆ. స్త్రీ. ౧. దాయాధికా
రిణి, జ్ఞాతి. ౨. కూఁతురు.

దాయాది. సం. విణ. (న్. నీ. న్) దాయమును
అనుభవించువాఁడు. వి. న్. పుం. ౧. దాయా
దుఁడు, జ్ఞాతి. ౨. పుత్రుఁడు. ఈ. స్త్రీ.
౧. పుత్రిక. ౨. దాయాధికారిణి.

దాయాదుఁడు. సం. వి. అ. పుం- దాయమును
పుచ్చుకొనువాఁడు, దాయమును భుజించువాఁ
డు- ౧. దాయాధికారి, జ్ఞాతి. ౨. పుత్రుఁడు.
శ్లో. నమ స్తస్మై యశోదాయా దాయాదా
యాస్తు తేజసే, యద్ధి రాధాముఖాంభోజం
భోజంభోజం వ్యవర్ధత.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దాయాద్యము. సం. వి. అ. న. జ్ఞాతిత్వము,దాయాదత్వము.

దాయి[1]. వి. ఔ. (√దాయు) సమీపము.

ఉ. ఆతరళాక్షి డెందమున నారట మొందుచు నేమి సేయుదుక్, రాతికిఁ దోడు వోయి నది రాదుతుడెందము మెత్త గాదు దా,దాతికి వచ్చియుండ నీకెఁ దాలిమి చెల్లునె మారుఁ డఁటిమా, ఘాతకుఁ డోర్వరాదు పముఖంబున నేటికి రాయబారముల్. సారం గ. ౨. ౭౬.

దాయి[2]=డాయి వి. ౧. దాకలి, నిఘాతిక. (శ. ర.)

౨. ఉద్ఘనము, చెక్కడిమ్రాని క్రింద ఊఁతగా నుంచుకొనెడుదుక్క.

ద్వి. భామిని నప్పుడ పడఁగొట్టి రెండు,చేతులఁ గట్టి డాచేతఁ దాఁ బట్టి,దాతిపై నిడి బాడిత యు నెత్తి పూఁచి. పండితా. పురా. ౯౬ పా.

సీ...దాయి యనంగ నుద్ఘననామ మా...ఆం. భా. ౨. ౩౦౦. (ఉత్పతనాఖ్యయా. అప ముద్రి.) ప్రబంధ. ౪౪.

దాయి. సం. విణ. (న్. నీ. న్) ఇచ్చువాఁడు, దాత. (ఇది సమాసాంతమునందే యుండును. క్లేశదాయి=క్లేశము ఇచ్చునది, క్లేశము కలిగించునది.)

దాయించు=డాయించు. (√దాయు.)

దాయు=డాయు.అ. క్రి. ౧. అంటు, లగ్నమగు.

క. భూపాల మెఱుఁగుఁబోఁడుల,చూపులకుం దాయు నీదుసొబగ గ్లగుటక్, మాపిన్నది యునువింతల,చూపుల సరగంట వెఱచుచున్నినుఁ జూచుక్. నైష. ౭. ౬౧.

౨. కలుగు, పుట్టు.

ద్వి. తగవును ధర్మంబు తలపోసి మాని, పగదాయ నబ్బోయపై నల్క వోడమి. రం. రా. బాల. ౬ పా. ౧౩ పం.

స. క్రి. అ. క్రి. చేరు, సమీపించు.

గీ...తా నడుగడుగునకును, దడఁబడి పడుచుఁ బార్వతి దాయవచ్చి, యీరెలుంగున దీవించి యిట్టు లనియె. వరాహ. ౬. ౧౩.

ఉ. తక్కలయాలవాలములు దాయుదురే తరుణీజనంబులక్. విక్ర. ౩. ౭౯.

సీ. వచనామృతౌఘప్రవాహాభిషిక్తుఁ గాఁ జేయుచుఁ బరమేష్ఠి దాయఁ బిలిచె. కు. సం. ౭. ౯౯౦.

జః దాకలి, దాకల్లు, దాకొను, దాకొలుపు, దాగలి, దాతికట్టు, దాదాపు,దాదుంగ,దాపరము, దాపరించు, దాపించు, దాపు, దాపుకొను, దాపురమగు,దాపురము, దాయ,దాయి, దాయించు.

దార[1]. వి. (సం.ధారా.క. దారె.)౧. (నీరు మొదలగువాని)ధార, నీటిజాలు.

క. ఓరమణి నీమువిక్కలు,దారల నగు మోవి పంచదారల నగు స్వర్దారల నగుఁ జెలువమృతపు, దారల నగు నుడి నఖాళి దారల నవ్వుక్. ప్రబంధ. ౬౩౭.

రగడ. తమ్మిపువ్వులమీఁదిజలములదార దారక యుండఁ జలుము. పారి.౪.౧౬. (శ.ర.పా. "మీఁద జలములు తార, తారక యుండ." ముద్రి. పా.)

౨. (ధారాపూర్వకము గనీయఁబడిన) దానము,

ద్వి...విప్రులకవనివల్లభులు,దగినదానము లీరొ ధన మీయఁగొనరొ,పగఁగొని యీరీతిఁ బట్టి య బ్బిదిమి, దారలెక్కలకునై తరువులు వెట్టి, దారల నమ్మించి ధనములు గొనెడి, కఠినచిత్తులు లేరు...ద్వి. హరిశ్చ. ఉ. ౪౭౯ పం.

౩. (కవిత్వాదుల) ధార, అవిచ్ఛిన్నగతి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మత్తకోకిల. దార తప్పక చెప్ప నేర్తు పుదారవా
క్చతురత్వ మో, హోరి నాఁగఁ బ్రబంధ ము
క్కటి యొక్క నాఁట నె... సమీర. ౧. ౧౫.
౪. క్రమము, విధము.
గీ. తప్ప నాడక తొల్లింటిదార చెడక. ఉ. హరి.
౩. ౧౨౪. (శ. ర. పా.)
జః దారవోయు.

దార². వి. కాహళి, బాకా.
క. ఓరమణి నీదుపిక్కలు, దారల నగు మోవి
పంచదారల నగు... ప్రబంధ. ౬౩౭.
ద్వి. బేరి డమామీలు పిల్లగ్రోవులును, దారలు
గిడిగిల్లు తమ్మటధ్వనులు. (పల్నాటివీరచరి
త్ర. బ్రౌ.)
గీ. పాళెమున నక్కడక్కడఁ బదిలమునకు,
మ్రోయఁ జేసినతమకులమొదలిపోటు, దార
మ్రోఁతలపటహపుధణధణలకు, దొంతి గా
నిండ్ల నిటు లున్నయంతలోన. కవల. ౨.
౧౧౫.

దార. సం. వి. ఆ. స్త్రీ.-భర్తను సోదరులనుండి
విడఁదీయునది- భార్య, పెండ్లాము. ("క్రోడా
హారా తథా దారా త్రయ ఏతే యథాక్రమం,
క్రోడే హారేచ దారేషు శబ్దాః ప్రోక్తా మనీషి
భిః. ఇతి వ్యాడిశుభాంగా". అని సుధ.)
చ... తొలుసంజగబ్బిబో, యెత తటి వేచి విం
టఁ గదియించినవేగురుఁజుక్కయుంట ను,
ద్ధతగతిఁ దద్ద్విజాధిపతిదారఁ దమింగెడపక్
... హ. న. ౪. ౩౦.
చ... సద్గుణా, కనిధి నిజాగ్రదార హితకార్యభ
రాత్తత నుండఁ జూచి... రాఘవ ౧. ౪౩.
శా. ఆరూఢాప్రతిమానవిక్రమకళాహంకార తే
జోనిధిన్, శ్రీరామున్ సుగుణాభిరాముఁ
డెగడన్ జేకొన్నని న్నాజిలోదారన్, దొం
గిలి తంచు నిష్ఠురగతిన్ దండించి ఖండింప
ము, నీన్ని రెట్లైనను దాఁటి వచ్చు నలుకన్ నేఁ

డెల్లి శాంతింపుమా. మొ. రా. సుం. ౬౭.

దారకము. సం. వి. అ. పుం. ఊరఁబంది.

దారకర్మము. సం. వి. న్. న. వివాహము, పెండ్లి.

దారకుఁడు. సం. విణ. (అ. రి కా. అ) చీల్చువాఁడు.
వి. అ. పుం. ౧. పుత్రుఁడు. ౨. బాలకుఁడు.

దారక్రియ. సం. వి. ఆ. స్త్రీ. పెండ్లి.
శ్లో. దారక్రియాయోగ్యదశం చ పుత్రం, ప్ర
స్థాపయామాస ససైన్యమేనం... సం. రఘు.
౫. ౪౦.

దారగ్రహణము. సం. వి. అ. న. పెండ్లి.

దారణ. వి. (త. తారణై. క. దారణె. మహా.
ధారణ.) ౧. క్రయము, కొనుట.
గీ. కొనుట దర దారణ యనంగ మనును గ్ర
యము. ఆం. భా. ౨. ౨౬౭.
౨. (ధాన్యాదుల) వెల.
గీ. తేనెతల వడఁ బండె ధాత్రీతలంబు, పొద
లి దారణ పోఁకకుఁ బుట్టెఁ డయ్యె, నన్నివం
కల దుర్భిక్ష మడఁగిపోయె,... రామ రాజ్య
మునను. జై. భా. ౬. ౯.
క. ప్రా లేదుమానికెలకుం, దైలము నూనెఁడు
పురమ్ముదారణ గలుగన్, బ్రాలసరి తైల మడి
గిన, జాలియ యగుఁ గాని నీకుఁ జను శేల
బ్బున్. కేయూర. ౨. ౧౦.
జః దారణకొమ్ము.

దారణకొమ్ము. వి. (దారణ + కొమ్ము.) ధాన్యా
దులవెలను దెలియఁజేయు (చంద్రుని) శృంగము.
సీ. వర్షగర్భము నడపక పోయె విదియలఁ గుము
దాప్తుదారణకొమ్ము దటిగె. కాళ. ౩. ౧౪౯.
(చి. ని. పా. ధారణకొమ్ము. ముద్రి. పా.)

దారణము. సం. విణ. (అ. ఆ. అ) చీల్చునది.
(అ. ఈ. అ.) చీల్చుసాధన మైనది. వి. అ. న.
౧. చీల్చుట. ౨. -జలకాలువ్యమును విఱుచు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నది- కతకము, చిల్లగింజ. 3. ప్రణాదులను బ్రద్దలుచేసెడిఔషధవిశేషము. (వాచ)

దారదము. సం. వి. అ. పుం. పాదరసము. ౧. పుం. న. విషభేదము. ౨. సింధుదేశము. 3. హింగుళము, ఇంగిలీకము.

దారపరిగ్రహము. సం.వి.అ. పుం. దారోపసంగ్రహము, భార్యను గ్రహించుట.

దారబందము. వి. (√దారము³ సం. ద్వారబంధః. క. దారబందవు.) ద్వారబంధము.

వ...ఒగగం ద్రోచినదారబందములును...ఉ. హరి. ౧. ౫3.

సీ...దారబంద,మన ద్వారబంధ మొప్పను... ఆం. భా. ౨. ౨౧.

దారము[1]. వి. (క. దార.) ౧. నూలిత్రాడు సూత్రము.

సీ...తనరు సూత్రము త్రాడు దార మనఁగ. ఆం. భా. ౨. ౨౯౫.

౨. త్రాడు, చేత్రాడు.

ద్వి. పదపడి యాక్రియఁ బగ లెల్ల నడచి, వెద కుచు మాపటు వేలముల్ చేరి,-చనఁ జన ముందట వెనుకకు నోడి, జను లెల్ల దార మొసంగరా యనుచు. పండితా. పర్వ. 3౪౪ పొ.

ద్వి. తా మఱియొకఁడు లేఁడా మల్లినాథ, దార మొసంగరా ధర్మాత్ములార. పండితా. పర్వ. 3౪౫ పొ.

దారము[2]=దమ్మము[1]. వి. కాకణీచతుష్టయము, నాలుగుకాసులపరిమితి గలనాణెము.

సీ. కా సనఁగాను గాకణి పేరు విలసిల్లు...,దమ్మ మనంగను దార మనంగను దచ్చతుష్టయ సంజ్ఞ దనరుచుండు. ఆం. భా. ౨. ౨౭౪.

దారము[3]. (సం. ద్వారమ్. ప్రా. దారం.) ద్వారము. (చూ. దారబందము.)

జః దారబందము.

దారములు. సం.వి.అ.పుం. బ. భార్య. (చూ. అహోబలపండితీయము.)

క. పరదారములందును సఖి,గురువృద్ధనృపాల బాలకులబాంధవభూ, సురవైద్యభృత్యబుధ నా, గరకులసతు లాయువునకుఁ గడుఁ జేటసఘా. భార. అను. ౪. ౯3. (పరదారల యందును అని పాఠాంతరము.)

దారవో(పో)యు. స. క్రి. (దార[1] + పోయు.)

౧. దానము చేయు.

క...విప్రులకుఁ, ధేనువులం బదివేలను, మానసమున దారవోసె మఱి యిచ్చుటకుఁ. భాగ. ౧౦. పూ. ౧౧3.

గీ. అంచితాకృతి సాక్షాత్కరించినట్టి, రమకుఁ బ్రతివచ్చుసురమనోరమ మనోర,మ యను దాని ననుంగుజామాతఁ గైట,భారి సరిగాఁగ నర్చించి దారవోసె. మను వ. ౫. ౩౭.

క. అని కృతనిశ్చయుఁడై యు,ద్దనుజమణికి దారవోసెఁ దనపుత్రి మయుం,డనలునిసన్నిధి నతఁడుఁ, దనరుచుఁ బాణిగ్రహణము దగ నొనరించెఁ. ఉ. రా. ౨. ౨౧.

౨. అర్పించు.

గీ. శాంతి పుంభావ మొందినసౌమ్యవమున, బంతి నడిమికి నేతెంచి భవనభర్త, తపసులకు భక్తి నన్నంబు దారవోసె. కాశీ. ౭. ౧౭౬.

ఆ. ఈశ్వరుని దలంచి యేమపాళ్లుగఁ జేసి,తన దుమూర్తి సెల్ల దారపోసి, నిత్యకర్మములను నిలుచురా నెఱియోగి...వేమ. ౧. ౪౦3.

దారి[1]. వి. (సం. ద్వారమ్; ద్వార్. ప్రా.దారం. క. దారి.) ౧. మార్గము,త్రోవ.

ఆ...మార్గంబు, తెరువు త్రోవ దారి తెన్ను సరవి, చనుప నడవ చొప్పు జాడ డొంక యనంగఁ,బొలిచియుండు...ఆం.భా.౨.౭.

చ. గజపతి వచ్చె నంచు నొకగంధగజంబుగు ...

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టించి యొక్కఁ డక్కజపడి పల్కెనట వె
ఱచి కాననభూమికి వీటఁ బాటి దారి జడత
నిద్రలోఁ గలవరింప...నైష. ౫. ౧౩౩.

౨. విధము, రీతి, పద్ధతి.

సీ. ఎటువలె వ్యయ మొనర్చుటకును మర్యాద
యేదారి శత్రులయే పణంప.కృష్ణ.౨.౪౫.

సీ. తాళంబు తప్పక తనువుఁ గదల్పక బాగు
మీఱఁ బదంబుఁ బాడుదారి. కువల. ౪.
౧౧౧.

సీ. తలిరాకుగుములు దులకించువైఖరిఁ గెంపు
రాజిగిసొంపు గెరలుదారి. గీ ...కాననయ్యె,
సరగ సంధ్యారుణప్రభ జనుల కెల్ల. ఇందు.
౪. ౩౧.

౩. స్థానము, చోటు.

వ...ఒక్కయెడ జాతివిరోధం బైన వెలవెలం
బాఱుచు నొక్కచాయ రాశిమిత్రత్వంబు
చాలకుండిన బెండువడుచు నొక్కదారి గణ
వైపరీత్యం బయిన నత్యంతం బనుతాపించు
చు...శుక. ౨. ౧౬౦.

సీ. ఏదారి వీక్షింప మృగనాభికాసంకుమదపం
కనవకుంకుమవ్రజంబు, ఏవంక దర్శింప హే
రాళబహువిచిత్రాంశుకస్వర్ణపట్టాంబరములు.
ఇందు. ౪. ౭.

౪. పార్శ్వము, ప్రక్క, వైపు.

చ. చరణములందుఁ బావ లొకజవ్వని పూను
పఁ జామరంబు లిద్దఱు మరుచిక్కటారు
లిరుదారులయం దిడ నొక్కపాటలాధర
కయిదండ యీయఁగ మదావళమంధరుఁడై
మరుతన్నిభాగురు వగుకొల్వుకూటమునకుం
జనుదెంచి తదంతరంబునన్. చం. రా. ౨.
౫౫.

౫. సూత్రధారుఁడు.

సీ...దారి నాఁ దగు సూత్రధారకుండు.ఆం.
భా. ౨. ౨౮౭.

దారికిఁదెచ్చు=అలవఱుచు, అలవాటుచేయు.

సీ. దారికిఁదెచ్చుకొ మ్మారూఢిఁ బౌలోమి సైరం
ధ్రికాసదాచారమునను. కువల. ౪. ౬౮.

దారికివచ్చు=వశమగు, లొంగు.

సీ. రాచిల్క రాయబారమున దారికిరాక సడ్డిం
పఁ గోరమీసములు దువ్వి. కువల. ౪. ౫౧.

దారిలోఁబడు=మంచిత్రోవకు వచ్చు.

(వ్యవ.) మునుపటికంటె ఇపుడు మావాఁడు కొం
చెము దారిలోఁబడుచున్నాఁడు.

జః దారికట్టు.

దారి². విణ. (సం. ధారీ.) ధరించువాఁడు.
(ఇది కర్తృవాచక ముపపదముగా నుండఁగనే ప్ర
యోగములందు కానవచ్చుచున్నది. మఱియును,
సముదాయమునరూఢిశక్తి గలస్థలమున,వి.గా నుం
డును. ఉదా:-జడదారి.యోగశక్తి గలస్థలమున,
విణ. గా నుండును. ఉదా:-మాయదారి.)

దారి³. సం. విణ. (ఇ. ఈ. ఇ.) చీల్చువాఁడు, బ్ర
ద్దలుకొట్టువాఁడు. వి. ఈ. స్త్రీ. క్షుద్రరోగభే
దము, పాదములు పగులుట. (వాచ.)

దారించు. సం. స. క్రి. భేదించు, చీల్చు.

మ. తనదంభోళి హనుస్థలిం బెరసియున్ దా
రింపలే కుండుటన్, హనుమంతుం డనుపేర
మీఱు నని జంభారాతి వజ్రాయుధం,బున
నిర్భీతుఁడుగా వరం బొసఁగె ... సమీర.
౩. ౧౫౪.

దారిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. కూఁతురు. ౨. కుల
ట, ఱంకుటాలు. ౩. ఆఁడుపిల్ల.

దారికట్టు. వి. (దారి¹+కట్టు.) మార్గమును నిరో
ధించుమూలిక.

క. ఇది దారికట్టు మొనకట్టిది కాంతావశ్యకర
ణ మిది నీమది కిం,పాదవించు నోనరేశ్వర,
పదిలం బని తెల్పి కొన్ని బదనిక లొసఁగెన్.
శుక. ౧. ౧౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. చనువుతో దారికట్టును మొనకట్టును దెలు
పువారలమనవులు ఫలించె. కువల. ౫. ౫౬.

దారితము. సం. విశ. (అ. ఆ. అ.) చీల్పఁబడినది.

దారిద్ర్యము. సం. వి. అ. న. బీదతనము.

దారుక. సం. వి. ఆ. స్త్రీ. కఱ్ఱబొమ్మ.

దారుకదళి. సం. వి. ఈ. స్త్రీ. వనకదళి.*(కల్ప)

దారుక(గ)పాలు. వి. మల్లవిద్యావిశేషము, పదు నాల్గువిసరులలో నొకటి.

వ...ఉద్దడ నాట్య బారుధాణు దారుకపాలు
ధాణుధారు ఝాటు... మల్లుపు. ౩. ౬౯.

వ...ఝాటుధాణు కపాలు దారుగపాలు ధా
ణుధారు కధారు ధాణుదారు ఝాటు మొద
లగుపదునాలుగువిసరులు...ప్రబంధ. ౭౭.

దారుకము. సం. వి. అ. పుం. దేవదారువృ*.

దారుకర్మము సం. వి. న్. న. మ్రానిపని, కఱ్ఱపని.

దారుకీటము. సం. వి. అ. పుం. ఘుణము, కఱ్ఱను దొలుచుపురుగు.

దారుకుఁడు. సం.వి.అ.పుం. శ్రీకృష్ణునిసారథి.

దారుగర్భ. సం. వి. ఆ. స్త్రీ. ౧. కాష్ఠకదళి, అడవిఅరఁటి*. ౨. సాలభంజిక, కఱ్ఱబొమ్మ.

దారుజము. సం. విశ. (అ. ఆ. అ.) కఱ్ఱనుండి పుట్టినది. వి. అ. పుం. మర్దళము, మద్దెల.

దారుణము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. పరుషము, పరుసనిది. (మాట,మొ.) ౨. క్రూరము, నిర్దయము, కనికరము లేనిది. ౩. ఘోరము, భీషణము. ౪. ఉగ్రము, దుస్సహము. (దుఃఖాది) ౫.తీక్ష్ణము, వాఁడియైనది. (కత్తి, మొ.) వి. అ. పుం. ౧.భయానకరసము. ౨. చిత్రమూలము*. న. మూలార్ద్రాశ్లేషా జ్యేష్ఠా నక్షత్రములలో నేదేని యొకటి.

దారుధాణు. వి. మల్లవిద్యావిశేషము, పదునాల్గువిసరులలో నొకటి.

వ...ఉద్దడ నాట్య దారుధాణు దారుకపాలు
... మల్లుపు. ౩. ౬౯.

వ...దారుధాణు... దారుగపాలు ధాణుధారు
ఝాటు మొదలగుపదునాలుగువిసరులు...
ప్రబంధ. ౭౭.

దారున. క్రి. విశ. ద్రు. ౧. ఝటితిత్యర్థకము, శీఘ్రముగా.

వ... అంత నిక్కడ నాశ్రమపదంబున శకుం
తలయుం దారున వచ్చినవిప్రునివలన రాజు
తనజన్మప్రకారం బడిగినవిధంబును...పర్ణశా
లాభిముఖుం డై గమనించుటయు ... చెప్పి
నకా...పి. శకుం. ౨. ౧౭౯.

చ...పా,యనిపెనుచింతతోఁ గలఁగ నాంతర
మే నటు వాసి యీవినూ,తనమణిమండపో
త్తమము దారునఁ జేరి వసించి యున్నెడన్.
చంద్రి. ౨. ౧౩౬.

క...కొండతు,దల మిన్నే అనఁగఁ బాజు దారు
న డిగియెన్. అచ్చ. భా. ౩. ౩౭.

౨. ఆకస్మికముగ, హఠాత్తుగా.

సీ. తారసించినచోట దారునఁ జొరఁబాతి
యొకటి రెంటిని దొబ్బ లురల నడుచు.
మనుచ. ౪. ౪౨.

వ ... నాఁడు ఋతుధ్వజవసుంధరాపురందరు
దారునం జూచుటంజేసి డోలాయమానమాన
సనై...కువల. ౪.౪౩.

గీ. ఘనఘటానీలవేణియుఁ గలతరంగి,తీరమణి
నిత్యాని రలాకారకాంతి,ధార దారున నెదిరి
నంతనె నగేంద్రు,గాఢతరధైర్య మువ్వెత్తు
గా హరించె. వసు. ౨. ౧౧౦.

దారునిశ. సం. వి. ఆ. స్త్రీ. మ్రానిపసుపు*.

దారుపీత. సం=దారునిశ.

దారుపుత్రి. సం. వి. ఈ. స్త్రీ. కఱ్ఱబొమ్మ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దారుయంత్రము. సం. వి. అ. న. ౧. కీలు బొమ్మ. ౨. మ్రానియంత్రము.

దారువధువు. సం.వి.ఊ. స్త్రీ. ౧.కాష్ఠపుత్తళిక, కఱ్ఱబొమ్మ. ౨. కఱ్ఱతో చేయఁబడినస్త్రీప్రతిమ.

దారువు. సం. విణ. (ఉ) ౧. ఖండనశీలము, చీల్చునది. ౨. దాత, ఇచ్చువాఁడు. వి. ఉ.పుం. శిల్పి. పుం. న. కాష్ఠము, కఱ్ఱ, కొయ్య. న. ౧. దేవదారువు౹. ౨. ఇత్తడి. (కే.ని, మే.ని.)

దారుసారము. సం. వి. అ. పుం-కఱ్ఱలలో శ్రేష్ఠమైనది- చందనము, మంచిగంధపుచెట్టు.

దారుసిత. సం. వి. ఆ. స్త్రీ. గుడత్వక్కు, లవంగపుపట్ట, దాల్చిని.

దారుహరిద్ర. సం. వి. ఆ.స్త్రీ. మ్రానిపసుపు౹.

దారుహస్తకము. సం.వి.అ.పుం.చేతివలె నుండు కఱ్ఱతెడ్డు.

దార్ఢ్యము. సం. వి. అ. న. దృఢత్వము.

దార్దురము. సం. విణ. (అ. ఈ. అ.) దర్దురసంబంధమైనది. వి. అ. న. ౧. దక్షిణావర్తశంఖము. ౨. నీరు. ౩. లక్క. (కల్ప.)

దార్భము. సం. విణ. (అ. ఈ. అ) దర్భసంబంధమైనది.

దార్భ్యము. సం. విణ. (అ. ఆ. అ) దర్భయందుఁ బుట్టినది.

దార్వండము. సం. వి. అ. పుం-కఱ్ఱవలె గట్టిగా నుండు గ్రుడ్లు కలది- నెమలి.

దార్వాటము. సం. వి. అ. న. మంత్రగృహము, రహస్యగృహము.

దార్వాఘాటము. సం. వి.అ.పుం. వడ్రంగిపిట్ట, మ్రానిపోటుపులుఁగు.

దార్వి. సం. వి. ఈ. స్త్రీ. ౧. మ్రానిపసుపు౹. ౨. బెండ౹. ౩. దేవదారువు౹. ౪. పసుపు౹. (వి. ని.)

దార్వీక. సం. వి. ఆ. స్త్రీ.౧.గోజిహ్వ, బెండ౹. ౨. మ్రానిపసుపు౹. ౩. మ్రానిపసుపున వండినయంజనవిశేషము.

దార్వీపత్త్రిక. సం.వి.ఆ.స్త్రీ. గోజిహ్వ,బెండ౹.

దార్శనికుఁడు. సం. వి. అ. పుం. దర్శనములు తెలిసినవాఁడు, షడ్దర్శనములు తెలిసినవాఁడు.

దార్శము. సం. విణ. (అ. ఈ. అ) ౧. నేత్రభవము, కంటిలో పుట్టినది. ౨. దృక్సంబంధమైనది. ౩. దర్శ (=అమావాస్య)సంబంధమైనది.

దార్షదము. సం. విణ. (అ. ఈ. అ) ౧. దృషత్తునకు(=ఱాతికి)సంబంధించినది. ౨.ఱాతిమీఁద పొడిచేయఁబడినది. (సక్తువు, మొ.) ౩. సన్నెకంటిమీఁద నూఱఁబడినది.

దార్ష్టాంతము. సం. విణ. (అ. ఈ. అ.) ఉపమేయము, దృష్టాంతముతో వివరింపఁబడినది.

దార్ష్టాంతికము. సం=దార్ష్టాంతము.

దాల. సం. వి. ఆ.స్త్రీ. మహాకాలము, ముసిఁడి౹.

దాలనము. సం. వి. అ. పుం. ఒకానొకదంతరోగము.

దాలము. సం. వి. అ. న.చెట్టుతొఱ్ఱలో నుండు తేనె. పుం. కోద్రవధాన్యము.

దాలవము. సం. వి. అ. పుం. స్థావరవిషభేదము.

దాలి. వి. (క.దాలి) అగ్నికుండము, నిప్పులగుంట.

సీ...పిటకయంత్రాభిధ వెలయు దాలి. గీ. యనఁ గఁదంపి యనంగ...ఆం. భా. ౨. ౨౪౧.

గీ...దాలిఁ గాఁగిననీ రాడి నీలికమ్మిమడుఁగుఁ బైఁగప్పుగొని కాళ్లు ముడిచిపట్టి, మంచమునఁ గూలి నిదురించు మగని లేపి. వేం. పంచ. ౪. ౪౹౹౹.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ...ఉపరిప్రదేశంబులఁ గారెనుపపెంటపట్లనీ రాలునేలుఁబిడుకలదాళ్లిడి...మనుచ.४. ౬౦.

జః దాలిగుంట, దాలితోఁక.

దాలి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. దేవదాలీలత. ౨. శమీధాన్యము,పొట్టుతో కూడినధాన్యము. (మినుములు, పెసలు, మొ.)

దాలిగుంట(త). వి. (దాలి + గుంట)దాలివేయుట కుపయోగించుగుంట.

(వ్యవ) వాఁడు దాలిగుంటలోనికుక్క.

గీ...రుబ్బు,రోలు పిడుకలకుచ్చెల దాలిగుంత, తనర నిరతంబు వెలయు వాతనిగృహంబు. శుక. ౨. ४౦౭.

దాలితోఁక. వి. (√దాలి) నీళ్లు మొదలగునవి కాఁచుటకు ఆదోఁకగా నమర్చినపిడుకలప్రోగు.

చ. పెనిమిటి చేనిపాటు పడి పేర్చుశ్రమంబున నింటి కేఁగుదెం,చినతటి దాలితోఁకపయిఁ జేర్చినకాఁగులనీరు మజ్జనం,బున కమరించి ...శుక. ౨. ३३౫.

దాలిమము. సం=దాడిమము.

దాల్చిని. వి. (హిం. దాల్ చీనీ.) సుగంధద్రవ్య విశేషము, లవంగపుపట్ట. (శ. ర.)

దాశా. వి. ౧. తక్కెడలోని హెచ్చుతగ్గు.(పడియొక్క హెచ్చు తక్కువ. శ.ర.) ౨.(నెయ్యి నూనె మొదలగునవి తీయుపాత్రములను గాని అవియుంచియున్నపాత్రములనుగాని)సరియెత్తు రాలను దడతట్టనుంచి తూఁచుట. (శ. ర.)

దాళి. సం. వి. ఈ. స్త్రీ. ౧. దేవదాలీలత. (కల్ప.)౨. సెనగలు లోనగువానిపప్పు. (శ. ర.)

శ్లో. ముద్గదాళీ గదవ్యాళీ కవీంద్ర వితుషా కథమ్. (భోజచరిత్రము.)

దాళిమి. సం=దాడిమి.

దాళిమ్మ=దాడిమ. (శ. ర)

దాళీకుఁడు=తాళీకుఁడు. విణ. కార్యకర్త.(శ.ర.)

దాళు. వి. వర్ణలేశము.

ద్వి. రస మెక్కి యీనెలు రయమునఁ బలిసెఁ, బసుపుఁదాళెక్కి యేర్పడఁ బల్చ లగుచు. ద్వి. భాగ. ౧౦ స్కం. (శ. ర.)

దాళువా(ళ్వా). వి. ౧. సస్యవిశేషము.(శరదృతువు మొదలు నీటియాధారమున పండుపల్లపు పంట. శ. ర.)

(వ్యవ) దాళువా ఊడ్చి నారు. దాళువా కోసి నాడు.

౨. శాల్యంకురము.

సీ. ఒసపరి మొసలివాయొంట్లు దాళ్వా చెక్కు నిద్దంపుఁజెక్కుల నీడఁ జూప.దశా. ౯,౧३.

౩. ధాన్యవిశేషము.

సీ. రామబాణాలు రెక్కాములు వెన్నముద్దలు జిల్లబుడుతలు దాళువాలు. హంస. ४. ౧౨౯.

వ...కస్తూరినిగరాలు ముత్తెసరు లేనుఁగుకొమ్ములు గంగాజలములు కేసరులు చంద్రవంకలు వెన్నముద్దలు దాళువాలు నారళ్లు...ప్రబంధ. ౧౧౨.

దాళువాళించు. అ. క్రి. ఒప్పు, ప్రకాశించు.

వ...దాళువాళించుసన్నసున్నంబుచేత లేతవెన్నెలలు నెమ్మించుక్రొమ్మించులుం గలమేడలును...పి. శకుం. ౧. ౯౬.

దావ. వి. తగవు. (శ.ర.)

ద్వి...నీసకలరాజ్యంబు, గోడు గుడుఁవఁ బుచ్చుకొని యొకజిఙ్ఞుత్రాడుగా మరువనిఁజావలఁ బెనఁచి. ద్వి. హరిశ్చ. పూ. ౯౯ పా.౧౯३౬ పం.

దావంతము. వి. (త. దావందం) దుఃఖము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్వి. దైవమా యీదూఱు తప్పింపు మనుచు, డావంతమున మదిఁ దలపోయు చుండె. ద్వి. శి. సా. ౧. ౩౮౮పా. ౪ పం.

దావము. సం. వి. అ. పుం- పీడించునది- ౧. దవము, కార్చిచ్చు. ౨. అడవి. ౩. ఉపతాపము, రోగము. ౪. బాధ, నొవ్వు.

దావరడంగి=డావరడంగి. వి. దేవతాళము.̃(చి. ని, శ. ర.)

దావరము=దావా. వి. చౌర్యము.

సీ. దావర మనఁగను డావా యనంగను ముచ్చి మి యనఁగను ముచ్చిలి యన. గీ...చౌర్యంబు చెల్లు...ఆం. భా. ౨. ౯౯౬.

దావరి=దావరీఁడు. విణ. (తె. దావరి=యుద్ధము. విన్స్లో) వీరుఁడు.

క. దేవరఁ గొలిచెద ననవుడు, నీవిధమున జీత మడుగఁ డెవ్వఁడును గడుఁక, డావరి కాఁ బోలును వీఁ, డీవీరుఁడు మలయు ననుచు హృదయం బలరన్. పోడ. ౫ ఆ. (శ.ర.)

దావరీఁడు=దావరి. విణ. (దావరి+ఈఁడు-స్వార్థమున) దావరి,- వీరుఁడు.

ఇంద్రవజ్రము. కుఱంగటం గ్రచ్చెడుఁకుచ్చితంపున్, మెఱుంగుకోకల్ గొని మీఱు చాకిన్, వెఱుంగు వీ డొందఁగ ప్రేటులోనన్, దరిం బడం గొట్టిన దావరీఁడా. అచ్చ. భా. ౪. ౭౪ పా.

దావలచేయి. వి. ఔ. (దా+వలను+చేయి= దాపటివలనియందున్న చేయి) ఎడమచేయి,వామహస్తము.

ఉ. ద్రోవది బంధురం బయినకొమ్ముడి గ్రమ్మన విడ్చి వెండ్రుకల్, దావలచేతఁ బూని...భార. ఉద్యో. ౩. ౧౧౪.

శ్లో. కేశపక్షం వరారోహా గృహ్య వామేన పాణినా. సం. భార. ఉద్యో. ౮౧. ౩౪.

దావళి. వి. (క.డావళి) మడికి ధరించుకొనుకంబళివస్త్రము.

సీ. డావళి మడిపట్టుదోవతి దేవపూజాపేటి గల మూట...ఇందు. ౨. ౧౧౫.

దావా=దావరము. వి. ౧. చౌర్యము.

సీ. దావర మనఁగను డావా యనంగను ముచ్చిమి యనఁగను ముచ్చిలి యన ...చౌర్యంబు చెల్లు...ఆం. భా. ౨. ౯౯౨.

౨. తగవు, వ్యాజ్యము. (శ. ర, ప్రా.)

దావికము. సం. విణ. (అ. ఈ. అ.) దేవికానదియందు పుట్టినది.

దాశ(స)పు(పూ)రము. సం. వి. అ. న. కైవర్తీముస్తకము, కైవడిముస్తె.̃(వాచ)

దాశరథి. సం. వి. ఇ.పుం. ౧. దశరథాపత్యము, దశరథునికొడుకు. (రాముఁడు, భరతుఁడు, లక్ష్మణుఁడు, శత్రుఘ్నుఁడు.) ౨. రాముఁడు.

దాశరథుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) దశరథసంబంధి. (రాముఁడు, మొ.)

దాశరాత్రికము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. దశరాత్రసంబంధ మయినది. ౨. పదిరాత్రులు జరుగునది. (యజ్ఞాది.)

దాశార్హుఁడు. సం. వి. అ. పుం. ౧. దశార్హసంతతివాఁడు, యాదవుఁడు. ౨. కృష్ణుఁడు.

దాశుఁడు. సం. వి. అ. పుం. ౧-చేపలను హింసించువాఁడు - ధీవరుఁడు, బెస్తవాఁడు. ౨ - కూలి పుచ్చుకొనువాఁడు - భృత్యుఁడు,దాసుఁడు.

దాశేయి. సం. వి. ఈ. స్త్రీ. ౧. జాలరిదాని కూఁతురు. ౨. సత్యవతి.

దాశేయుఁడు. సం.వి.అ.పుం.జాలరిదానికొడుకు.

దాశేరకము. సం. వి. అ. పుం. మాళవదేశము. (కల్ప.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దాశేరకుఁడు. సం. వి. అ. పుం. ౧. మాళవ దేశపురాజు. ౨. మాళవదేశస్థుఁడు. ౩. దాశేరుఁడు, జాలరిదానికొడుకు. (వాచ)

దాశేరి. సం. వి. ఈ. స్త్రీ. జాలరిదానికూఁతురు.

దాశేరుఁడు. సం. వి. అ. పుం. జాలరిదానికొడుకు.

దాసనము. వి. (క. దాసివాళ.) ౧. జపావృక్షము. ౨. జపాపుష్పము.

చ...ఇంగిలికంబుచాయచేఁ, గమిసినదాసనం పుఁబువుకాంతికి డాసినకూర్మిచుట్ట మౌ,కొమరున సంజ యంబరముకొంగున నూన్చెఁ గుసుంభరాగముల్. భీమ. ౨. ౭౯.

సీ. తలపాగపారమీఁదఁ జెలఁగెడునాయుధార్చన సల్పినట్టిదాసనపుఁబూవు. శుక. ౩. ౧౫౭.

క. ఎఱసంజ దాసనంబుల, తెఱఁ గయ్యెను... ఉ. హరి. ౨. ౨౪.

దాసమయ్య. వి. (√దాసము) దాసుఁడు, సేవకుఁడు.

సీ. షణ్ణవతిశ్రాద్ధచయ మారఁ బెట్టు శంకరదాసమయ్య భక్తప్రతతికి. ఆము. ౪. ౪౩.

దాసము. వి. (సం. దాస్యమ్) సేవ, ఆరాధన, కొలువు. (చూ. దాసమయ్య.)

జః దాసమయ్య.

దాసరయ్య. వి. (దాసరి + అయ్య) ౧. విష్ణుభక్తుఁడు.

ఆ. అని తదీయదాస్య మంగీకరించె న,ద్దాసరయ్య యచట నాసరోజ,లోచనయును మ్రానిలోఁ జేవ చొచ్చిన,గతిఁ బ్రవేశ మంది ప్రతిదినంబు. వైజ. ౨. ౧౧౭.

౨. ముని.

క. అని చెన శౌదవఁగ నిటు ల,య్యనియొారె పుఁడిండిదాసరయ్య దెలిపినన్. అచ్చ. రా. అయో. ౧౧౯.

౩. తాఁబేలు, దాసరిగాఁడు.

క. వలఁ జిక్కక చనె మృగ మ,వ్వలఁ జిక్కెను దాసరయ్య వలవనిజాలిన్, దలఁకంగ నేల నేఁ డీ,కొలఁదికిఁ గూడయ్యె ననుచుఁ గొనిపోవుతటిన్. నా. పంచ. ౨. ౨౧౨.

దాసరి. వి. (సం.దాసేరః. క.దాసరి—బ. దాసరులు, దాసర్లు, దాసళ్లు.) వైష్ణవమతావలంబియగు నొకజాతిశూద్రుఁడు; విష్ణుభక్తుఁడు; బిచ్చగాఁడు.

సీ...పాలుపొందు శ్రీహరిదాసుఁడు దాహరి దాసరి యన. ఆం. భా. ౨. ౨౮౫.

గీ. వాద మే మాయె నన్న భూవరునిపక్ష,పాత మాదాసరికిఁ గల్గి బ్రతికె ననెడు,వారు... ఆము. ౪. ౭.

సీ. దాసర్లమిత్తి సన్న్యాసులతెరబొమ్మ జోగి జంగాలకు సొంటికొమ్ము. శుక. ౩. ౨౦.

వ...కొందఱు నోటిబీగములదాసళ్లపెల్లున నోరులఁ బూరులు గఱచువారును...ప్రబంధ. ౭౮౭.

తన్నీరుదాసళ్లు = దేవాలయములందు స్థలాదిశుద్ధికై జలమును దెచ్చుభక్తులగు సేవకులు.

వ...నిరాఘాటఝుంఝాగంధవహరభసంబునకు బెదరి చెదరి పలాయితంబులై పవనభుక్పరివృఢంబుల మఱుంగుసొచ్చినఘనాఘనంబులచందంబున భుజభుజంగంబులం బ్లవమానంబులగుతిరుణాపుతిత్తులం జెన్నారుతన్నీరుదాసళ్లును...విప్ర. ౨. ౯౪.

జః దాసరయ్య, దాసరికొయ్య, దాసరికొఱచేఁప, దాసరిగాఁడు, దాసరిపాము, దాసరిపిట్ట, దాసరిబుట్ట.

దాసరికొయ్య=దాసరికొఱచేఁప. వి.(√దాసరి) మత్స్యవిశేషము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. కొరద దాసరికొయ్య కొట్టమీ నులస ము
చ్చంగి బేడిస జెల్ల చాఱమీను. హంస. ౪.
౧౮౭.

దాసరికోలచేఁప= దాసరికొయ్య. (బ్రా.)

దాసరిగాఁడు. వి. (దాసరి + కాఁడు-స్వార్థమున) తాఁబేలు. (చి.ని-మెట్టతాఁబేలు-బ్రా.)

దాసరిపాము. వి.(√దాసరి)సర్పవిశేషము.(బ్రా)

దాసరిపిట్ట. వి. (√దాసరి) నామాలపిట్ట. (బ్రా.)

దాసరిబుట్ట. వి. (√దాసరి) భిక్షమెత్తుకొనెడు బుట్ట.

ఉ. వేసరి యే మటన్న నిలు వెల్వడఁ జాలఁడు
చేత నంటిమా, దాసరిబుట్టయుఁ గ్రమ్ముదుకదా
వలిదట్టియుఁ గాని కాన మో, కేసరిమధ్య
నీప్రతిన గెల్చె... వైజ. 3. ౯౪.

దాసానము వి. వృక్షవిశేషము.

సీ. తాండ్ర చందన మేపె దాసాన మెట్టదా
సానము చిందుగ చాఱ జొన్న. హంస.౪.
౧౧.

దాసాని. వి. దేశవిశేషము.

ఉ...హురుమంజిపల్ల మిం, పైనఖలీనముఁగ్రబిరు
దుటందియ గజ్జెలపేరుఁ బూని దా, సానిప
టానిఁ దెచ్చె మహీజానికి రాతెఱఁగంటితే
నికిఁగ్ర. రా. వి. ౨. ౪౬. (దాసానిపటాని=
దాసానిదేశపుగుఱ్ఱము.)

జః దాసానిపాడి.

దాసానిపోఁగి. వి.(√దాసాని) పండ్లకు వేసికొనె డినల్లపాడి, కప్పు. (బ్రా.):

దాసి. సం. వి. ఈ. స్త్రీ. ౧. కాకజంఘ, కాకి దొండతీఁగ. ౨. నీలఝుంటి, నల్లగోరంటతీఁగ. ౩.పీత ఝుంటి, పచ్చగోరంటతీఁగ. ౪. ఒకానొకనది. ౫. పరిచారిక, పనికత్తె; వెలకుఁ గొన్నపనికత్తె.
(శైవకవులు పురుషులకుఁగూడ ఈస్త్రీలింగరూపము నుపయోగించినారు.)

ద్వి. జంగమకోటికి నడిసన్నదాసి. బస. పు.
౧.౬ పం.

ద్వి. చెన్నారఁ గాళిదాసియు శివుచేతఁ, గొన్న
యా ముయ్యేఁకుగన్నులలోన. పండితా.
మహిమ. ౨౭౩ పా.

దాసీపుత్రుఁడు. సం. వి. అ. పుం. ౧. పరిచారికకొడుకు. ౨=దాస్యాఃపుత్రుఁడు.

దాసు. సం=దాసుఁడు. (ఇది వృద్ధాదులలోనిది.)
(భక్తుఁడు)

ఉ...విష్ణుదా, సెక్కడిభర్త గాఁగ సృజియించె
నజుండు ...హంస. ౧. ౮౯.

దాసుఁడు. సం. వి. అ. పుం. ౧. భృత్యుఁడు; వెలకుఁగొన్నపనివాఁడు, బానిసీఁడు. ౨. భక్తుఁడు. ౩. జ్ఞాని. ౪. శూద్రుఁడు. ౫. శూద్రుల నామముకడపట చేర్చుఉపాధి.

శ్లో. శర్మాంతం బ్రాహ్మణస్య స్యాద్వర్మాంతం క్ష
త్త్రియస్య చ, గుప్తదాసాంతకం నామ ప్ర
శస్యం వైశ్యశూద్రయోః. (వాచ.)

౬. దానపాత్రుఁడు. ౭. శాస్త్రవిహితసంస్కా
రము లేకయే పెంచుకొనఁబడినవాఁడు. ౮.
దాశుఁడు, జాలరి. (మే. ని.). ౯. వృత్రా
సురుఁడు. ౧౦. దస్యుఁడు. (వాచ)

దాసేయుఁడు. సం. విణ. (అ.ఈ. అ.) దాసికిఁ బుట్టినవాఁడు. వి. అ. పుం. ౧. దాసుఁడు, పనివాఁడు. ౨. కైవర్తుఁడు, జాలరివాఁడు.

దాసేర(క)ము. సం. వి. అ. పుం. లొట్టియ, ఉష్ట్రము.

దాసేరుఁడు. సం=దాసేయుఁడు.

దాస్టికము. వి. (క. ధాష్టిక.) అధికార మందలి దిట్టతనము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. వారు దివాణ మాట బలవంతుల రింతటి
కెన్నఁగా జమీం,దారులు మీర ల ట్లగుట
దాస్టిక మెల్లను వారిసొమ్ము ...రంగా. ౨.
౨3౧.

దాస్యమానము. సం. విణ. (అ. ఆ. అ) ౧. ఈయఁబడఁబోవునది. ౨. భవిష్యత్కాలమున ఇయ్యఁబడునది.

దాస్యము. సం. వి. అ. న. దాసత్వము.

దాస్యాఃపుత్త్రుఁడు. సం. వి. అ. పుం. తొత్తుకొడుకు. (ఇదియొకతిట్టు).

దాస్రము. సం. వి. అ. న. అశ్వినీనక్షత్రము.

దాహకము. సం. విణ. (అ. హికా. అ.) ౧. దహించునది, కాల్చునది. ౨. తాపము కలిగించునది. వి. అ. పుం. ౧. చిత్రమూలముకీ. ౨. అగ్ని.

దాహకాష్ఠము. సం. వి. అ. న. దాహాగురువు.

దాహజ్వరము. సం. వి. అ. పుం. దేహమున మంట పుట్టించుజ్వరము, తాపజ్వరము.

దాహనము. సం. వి. అ. న. కాల్పించుట.

దాహము. సం. వి. అ. పుం. ౧. కాల్చుట. ౨. కాఁక, వెట్ట. 3. దేహమునఁ గలుగుసంతాపము. ర. దప్పిక. (ఈయర్థము సంస్కృత నిఘంటువులలో కనఁబడదు.)

చ...దప్పిగొన్నమ,ర్త్యునకు మనోహరాంబువులు గ్రోలక మంచున దాహ మాఱునే. జై. భా. ౯. ౨33.

గీ. పెదవి పేఁటెత్తు నాలుక పిడుచగట్టు, గొంతు తడితీయు నెక్కటఁ గొంతతడవు, దాహమున నుదకము లేక దడసె నేని. దశా. ౨. ౧3౬.

దాహముగొను=దప్పిగొను.

సీ. పలుచనివెన్నెలపాలు దాహముగొని దండ డిఁగడుపారఁ ద్రావునవియు. (నిశ్శంకకొమ్మనశివలీలావిలాసము.)

దాహహరణము. సం. విణ. (అ. ఈ. అ.) దాహమును అణఁచునది. వి. అ. న. ఉశీరము, వట్టివేరుకీ.

దాహరి=దాసరి.

(విష్ణుభక్తుఁడగునొకజాతిశూద్రుఁడు.)

సీ...పాలుపొందు శ్రీహరిదాసుఁడు దాహరి దాసరి యన. ఆం. భా. ౨. ౨౫౪.

(విష్ణుభక్తుఁడు)

వ...కహకహ నవ్వి యద్దాహరికి సురద్రోహియి ట్లనియె. అము. ౬. 3౧. (శ. ర, బ్రా. పా.)

దాహసరము. సం. వి. అ. పుం- కాల్చుచోటు-శ్మశానము. (కల్ప.)

దాహస్థలము. సం. వి. అ. న. శ్మశానము, వల్లకాడు.

దాహాగురువు. సం. వి. ఉ. న. ఒకదినుసు అగురువు, గంధద్రవ్యభేదము. (ఇది కాలినపుడే వాసన నిచ్చును.)

దాహి. సం. విణ. (న్. నీ. న్.) ౧. దాహకము, కాల్చునది. ౨. తాపము కలిగించునది. 3. దాహము గలది, తాపము కలది.

దాహ్యము. సం. విణ. (అ. ఆ. అ) కాల్పఁదగినది.

# ది.

ది[1]. స. సంబంధమును తెలుపునపుడు అనుప్రయుక్తమగు 'అది' శబ్దముయొక్క ఆద్యక్షరము లోపింపగా మిగిలినరూపము. (చూ. అది.)

ఆ. ఘోరతపము చెఱిచి కోమలి నాదైన, దేవరాజ్యమహిమఁ దివిరి నీవు. భార. ఆది. ౪. 3౬. (నాది=నా+అది.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. తలఁచినయట్లు రెంతయు నుదాత్తతరంబగు
నాస్పదంబు పెం, పలరఁగ నిట్లు నాదగు
జనావళికిక్ సమకూరె నింక ...హరి. ఉ.
౨. ౧౬౫.

డి²=డీ,ఢీ,దీ. అవ్య. పందెకాండ్రు పొట్టేళ్లను పో
ట్లాటకై ప్రేరించునపు డుపయోగించుమాట.
(దీని ఆమ్రేడితరూపము-దిదిదీ.)

చ. ఉభయము భావవీథి జయ మొందినభంగి
భయం బొకింత లే,కభిముఖ మయ్యె వెస్వె
నుక కై యటఁ గొన్ని పదంబు లేఁగుచుక్,
రభసముతోఁదువాళిగొని భృగ్గునఁ దాఁకెడుఁ
జూడు సెట్టిట్,ట్టిథ దిదిదీ యనంగను గడేంది
యదభ్రము లీయురభ్రముల్. క్రీడా. ౨౨౫.

దించు=దింపు, దిగుచే. స. క్రి. (√దిగు.) ౧.
అవరోహింపఁజేయు, పోనిచ్చు, క్రిందికి రా
నిచ్చు.

గీ. ఈచెలువ నన్నుఁ జేరిన నింక నెపుడు,బొమ్మ
దించక,యుందు ముదమ్ము మీఱ. దశా.
౨. ౨౭౪.

గీ...మహారాజికులకుఁ,గలిగెఁ దలఁగంప దింపని
వలసపాటు, రాక్షసులు సేయురాయిడి
రఘువరేణ్య. ఉ. రా. ౧. ౨౭౫.

౨. భ్రష్టముచేయు, చెడఁగొట్టు.

చ. సడి కొడిగట్ట లేనికనుచాటుమెలంతవతీఁ
గఁబోండ్లకుక్, గడుపులు దించ నింతులకుఁ
గాంతవశీకరణార్థమంత్రముల్, నొడువఁగ
...శుక. ౨. ౨౪.

దండకము...భక్తియు న్దించి యేమంత్రసంసక్తి
యుక్లేక...చిత్రభా.౮.౧౨౦. ('విడిచి'
అని భావము.)

దింటెన. వి. గిరికర్ణిక.

సీ. తెల్లదింటెనపువ్వుఁ దెచ్చి తద్రస మిడి కలి
వెపువ్వులు గోసి నలిచి పిడిచి. కాళ. ౩.
౧౧౦.

సీ. గింటెన యనఁగను దింటెన యన గిరికర్ణిక
చెలువొందు...ఆం. భా. ౨. ౫౬.

సీ. కందర్పదేవుశృంగారంపుఁదోఁటలోఁ బొలు
పారుదింటెనపు వ్వనంగ. వైజ. ౩. ౩౫.

దిండడ. వి. (√దిండు.) తిర్యగారోపితదారువు,
నాఁగలి కడ్డుగా వేసెడికఱ్ఱ.

సీ. దిండడ నాఁగను దిర్యగారోపితదారువు
...ఆం. భా.౨. ౨౩౩.

దిండీఁడు. విణ. (దిండు+ఈఁడు.) కాసె కట్టిన
వాఁడు. (శ.ర)

దిండు=ద్రిండు. వి. ౧. తలగడ.

వ...క్రొమ్మావిపండ్లకై మలసి చుట్టు వ్రాలినరాచి
లుకలతెఱంగునఁ బచ్చతాలకెంపురవలచె
క్కడంబు రంగారుబంగారుచిలుకలదిండ్లు
ను... ప్రబంధ. ౬౦౫.

ఉ...పెద్దదిండుపై,సోలుచు నల్లడ ల్పైగడి చూ
చుచుఁ గ్రమ్మఱఁ గన్నుమూయుచుక్, గే
లెదఁ జేర్చుచుక్ జలువ క్రేవల కేఁగుచు
నీరు ద్రావుచుక్. చెన్న. ౫. ౧౩.

౨. దట్టి.

చ. నును పగుపచ్చపట్టునఁ గనుంగొన నొప్పగ
దిండు గట్టి నూ,తన మగుబర్హి బర్హకృతదా
మము నెట్టెము సుట్టె ... హరి. పూ. ౬.
౧౭౯.

సీ. కుడివంక గోణముకొంగు రింగులువాఱ నిం
డుచెంద్రికచేల దిండు గట్టి. వరాహ. ౩.
౧౦౯

ఉ. కట్టిననీలిదిండ్లు సెలకట్టియువిండ్లును విండ్లగా
సెనల్, చుట్టి నొసల్లపై నిడినజుంజుఱుఁ
బల్లసిగల్...మనుచ. ౪. ౩౩.

౩. చుట్ట.

సీ. నడునెత్తి మట్టిపా లిడి తాలిక లొనర్చి
కడలుకొల్పినగొప్పజడలదిండు. శుక. ౨.
౩౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౪. నూలువడుఁ దురాట్న పుకదురునడునూలుఁ మున్న గువానితో నేర్పఱచుపిడి.

క. వడి దారము చెవులుం ద్రొక్కుడుపలకయు దిండు కదురు గుంజలునుం ద్రొక్కుడుబొమ్మ యునుం ద్రిప్పుడు,పుడుకయును గలుగు రాట్నములు గైకొనుచుక్. శుక. ౨.౪౧౯.

౫. ఆధిక్యము, అతిశయము.

ద్వి. రాచముత్తముపెక్కు రాణువయుక్కు, గోచయంబులదిండు కోమట్లమెండు. ద్వి. తి. సా. ౧. ౩ పా. ౨ పం.

౬. భిత్తి, గోడ.

వ. మఱియు నిక్కొండ వెండిదిండురంగులఁ బొసంగుపేడివెలుంగు వెలుంగుపొడయెండలు దండిగలత్రుండు నాకులయెడలు...అచ్చ. భా. ౨. ౭౯ పా.

శ్లో. సమ్మార్చ్ఛ తాంరజతభిత్తిమయూఖజాలై,రా లోలపాదపలతాంతరనిర్గతానాం, ఘర్మద్యు తేరిహ ముహుః పటలాని ధామ్నా, మాద ర్శమండలనిభాని సముల్లసంతి. సం. కిరా. ౫. ౪౧.

౭. దీపము.

ఉ...ఆ,దారిని దానుఁ జేరసముఁ డాల్తు నటించుఁ దలంచి లంక నెం,తే రఘునాథు దూతసరణిక్ నెల కన్పడె దిండుకై వడిక్. చం. రా. ౭. ౨౭.

శ్లో...రఘునాథదూతసరణౌ చంద్రేణ దీపాయి తం. సం. చం. రా. సుంద. ౧౪.

౮. మెఱుఁగుబిల్ల లోనగునవి యంటించెడుఁబాళ్ల పనివానిసానతిరుగుడుఁకొయ్య. (శ. ర.)

జః దిండడు, దిండీఁడు.

దిందిమ్ము. వి. భేరీమృదంగాదివాద్యధ్వని విశే షము.

వ...నిస్సాణంబులధణంధణలు ధమామీలదింది మ్ములు విజయశంఖంబులఘుమంఘుమలు ... ప్రబంధ. ౭౨౨.

దింపు=దించు. స. క్రి. (√దిగు) అడఁచు,పోఁ గొట్టు.

వ... ముల్లలతావులఁ గొల్లలాడు భ్రమరదంపతు లయింపుసొంపులు దింపుసంపెంగలసంపదల ను...ఉ. రా. ౬. ౨౪.

వి. ౧. వ్రేలుట, లంబనము. (శ. ర.) ౨. చెట్ల నుండి కాయలు మొదలగునవి క్రిందికి తెచ్చుట. (వ్యవ) కొబ్బరితోఁటలో నాలుగుదింపులు దింపి తిమి.

దింపులకుఁదెచ్చు. స. క్రి. (దింపులకు + తెచ్చు) తిరస్కరించు.

వ ... ధనుర్లతలవంపు దింపులకుఁదెచ్చుకొమరు గలకనుబొమలును గమలదళవిదళనావహచ రిత్రంబు లగు నేత్రంబులును ... చం. రా. ౩. ౯౨. (ఇట ఔపమ్యవాచకము.)

దింపులువోవు. అ. క్రి. (దింపులు + పోవు) వ్రే లాడు.

సీ. అందంద వక్షోరుహములు దింపులువోవఁ దొడుక నిచ్చుట యెట్లు దుగ్ధరసము. కాశీ. ౪. ౧౭.

దికర్—ము. సం. వి. అ. పుం. కరభము,ఏనుఁగు గున్న.

దికర్—మొక(గ)ము=దిక్కుమొకము. విణ.కాం దిశీకుఁడు,భయాదులచే తోఁచినదిక్కుమొగమై పాఱిపోవువాఁడు.

ఉ... మేనిగాడ్పుచే,నక్కట నుగ్గు లయ్యె జల దాళివిమానము లింక నీనిచే,నెక్కడిపద్మ జాండ మని యేఁగిరి దిక్కుమొకంబులై సు రల్. సమీర. ౨. ౧౩౪.

ఆ. ఒక్కమొగము గాక యఁతికిరి సైనికుల్,ది క్కుమొగముఁ గాఁగఁ జిక్కుభటులు;మ్రొక్కి

రీఁటియలు దటుక్కునఁ బడవైచి, యక్కిరీ
టి యెదుట నాఁగఁ గలరె. విజ. వి. 3.
౧౫౭. (శ.ర.పా.)

ఉ. కంజవిరోధియందులది గా దది కందు దశా
స్యుచేతిభీ,తిం జరియింపుచుఁ బెదరి దిక్కు
మొగంబులువోలె నేతద, ద్రిం జెఱ నున్న
దిక్పతిసతీజనపంక్తులపక్ష్మలాక్షికో, జాంజన
బాష్పపాతముల నైనకళంకము గాని రాఘ
వా. రామా. ౭. ౧౮౮.

దిక్కరి. సం. వి. న్. పుం. దిగ్గజము.

దిక్కరిక. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకనది.

దిక్కామొక(గ)ము=దిక్కుమొకము.

సీ. కాందిశీకుఁ డగు దిక్కామొగం బనఁగను
...ఆం. భా. 3. ౯.

సీ. పోయినపోకలై పోయిరి సిద్ధులు దిక్కా
మొకము లైరి దిగధిపతులు. పారి. ౫. 3౭.

గీ. గబ్బిమెకములు దిక్కామొగంబు లయ్యె.
రా. వి. 3. 3౬.

దిక్కు. సం. వి. శ్. స్త్రీ- అవకాశమునిచ్చు
నది- ౧. దెస,కడ. (తూర్పు,మొ.) ౨. మార్గ
ము, పద్ధతి,రీతి. (దిక్ప్రదర్శనము,మొ.) 3. పది
యనుసంఖ్య. ౪. దంతక్షతము, పలునొక్కు.
(విల్యమ్సు.) ౫. రక్షకుఁడు; పుత్రాద్యాధారము.

సీ. అదియు వెన్నడి నస్త్రమై తోల నక్కాకి
త్రిజగంబు గ్రుమ్మతి దిక్కు లేక. ఆ. మ
గుడ నేఁగుదెంచి మనుజేంద్ర యపరాధిఁ,
గావు మనుచు...భా. రా. అయో. ౧౬౪.

ఆ. అరివిమర్ది యితనికై వగ పేటికిఁ, బుణ్యలో
కమునకుఁ బోయె ననుచు, నుండ నోపె నేని
నుల్లంబు ధృతరాష్ట్రి, దిక్కులేమిఁ దలఁచి
పొక్కు కున్నె. భార. స్త్రీ. ౨. 3౫.

౬. ఎడ, విషయము.

క. ఎక్కువతక్కువమాటలు, నుక్కివములు సెం
దుఁ గీడు లొందించుటలుం, బెక్కు దనయ
న్నదమ్ముల, దిక్కుల నన్నియును నైపఁ దేజ
ము సేయుఁ. భార. శాం. ౨. 3౪౯.

క...కుక్కలఁ జంపి తినుజనులఁ గూడి తిరుగు
నీ,దిక్కునఁ బుత్త్రిఁ డనుమమత, నెక్కొన
దేమియును నాకు నిజము దురాత్మా. హరి.
పూ. ౨. 3౭.

క. హరిదిక్కున నును గలమ,చ్చర మించుక
యాత్మ వదలి సంప్రీతిపుర,స్సరముగ నీ నొ
డఁబడియెను, హరిపౌత్త్రున కాత్మపౌత్త్రి
నన్నరపతియుఁ. హరి. ఉ. 3. ౨౨3.

౭. పక్షము; వైపు.

ఆ. ఇట్లు దటమె నేని యిప్పుడ యీతఁ డి, ద్ది
క్కువారి నెల్ల నొక్కయెత్తు,గాఁగఁ బిలు
కుమార్చు...భార. ద్రో. ౫. ౧౯౬.

గీ. తొంటిచవి గని యిప్పుడుఁ దోఁచి పాండు,
సుతులు రాజ్యంబు సేయంగఁ జూచుకలుచ,
నాకు నీఁ దీఱునే యింక నాఁటిచూఱ,
లెక్కడివి ద్రోణభీష్మ లీదిక్కుసుమ్ము. భార.
ఉద్యో. 3. 3౬౨. (ఈదిక్కు=ఈపక్షము
వారు.)

గీ. ధనముకలిమియు లేమియుఁ ద్రాసునందు,
నిలిపి యెత్తంగ ములునూపె నిర్ధనత్వ, మె
క్కుడై దానిదిక్కున...భార. శాం. ౪.
హరి. పూ. 3. ౧౨౪.

౮. నెలవు, స్థానము.

క. రక్కసులగురువు గురునకు,వెక్కస మగు
మతికి నిరవు వెరవుల కెల్లఁ,దిక్కు నుతి
కెక్కువేగురుఁ,జుక్క దివిఁ విటులు గడు
నుచు క్కనఁ బొడిచెఁ. విప్ర. 3. ౪౭.

గీ. అకట దిక్కుల కెల్ల ది క్కైనమాకు,నొక్క
దిక్కును లేదు కాలూఁదనైన,దిక్కుగావయ్య
నేఁడు మాదిక్కుఁ జూచి, దిక్కులే కున్న
వారలదిక్కు నీవ. భాగ. ౬. 33౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విణ. రక్షకుఁడు, శరణము.

గీ. దెసలు గలయంగఁ జూచుచు దిక్కుతనకు, నెవ్వరును లేమి నెగడందు...భార. స్త్రీ. ౧. ౪౬. భాగ. ౬. ౩౩౯.

దిక్కుమాలు. మి.అ.క్రి. గతిలేకుండు.

క...కాకం,బులు వఱవఁగ నిడుదనిదుర,నొలసి తెలుప దిక్కుమాలి యున్నాఁడుగ దే.భార. అశ్వ. ౨. ౧౬౨.

శా...ఇవ్వారిప్రచారోత్తముల్,వారింపం దగు వార లెవ్వ రఖిలవ్యాపారపారాయణుల్, లేరే మ్రొక్కెద దిక్కుమాలినమె పాలిం పఁగ బ్రపుణ్యాత్మకుల్. భాగ. ౮. ౭౧.

దిక్పతి. సం. వి. ఇ. పుం=దిక్పాలుఁడు.

దిక్పాలుఁడు. సం. వి. అ. పుం. ౧. దిక్కుల యేలిక. (ఇంద్రాది.)

శ్లో. ఇంద్రో వహ్నిః పితృపతిర్నైరృతో వరుణో మరుత్, కుబేర ఈశః పతయః పూర్వాదీనాం దిశాం క్రమాత్.

౨. సూర్యాది.

శ్లో. సూర్యశ్శుక్రః క్షమాపుత్రస్సైంహికేయశ్శనిశ్శశీ, సౌమ్యస్త్రిదశమంత్రీ చ ప్రాచ్యాది దిగధీశ్వరాః.

దిగ. వి. జూదమాడుట కుపయోగించు పాచికల మీఁదిముద్రావిశేషము.

సీ. మేటిజూదరి యన వాటమై తివుటమై నాడుచుండుదు నే నహర్నిశంబు,దృష్టి యేమఱక సందియు జాగరంబును దిగయును గర యు నాఁ దేటపడిన, యచ్చులలోన నేయ చైనఁగైకొని మాటలాడినయట్ల వేటు గలుగఁ. ద్వా. ౧౦. ౭౮.

దిగంబరము. సం. వి. అ. న. -వస్త్రమువలె దిక్కులను కప్పివేయునది- చీకటి. (వాచ)

దిగంబరుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) ౧. దిక్కులే వస్త్రములుగాఁ గలవాఁడు, నగ్నుఁడు, దిసమొలవాఁడు. ౨. దరిద్రుఁడు. వి. అ. పుం. ౧. శివుఁడు. ౨. క్షపణకుఁడు.

దిగఁగాఱు. అ. క్రి. (√దిగు) -క్రమముగా-కృశించు, దిగనాఱు.

క. మగువలు గరగర నై తగు, మగవానిం జూచి వీఁడు మగఁ డైనఁ గదా, తెగు దుఃఖం బను కొంచుం, దిగఁగాఱుదు రెపుడు నెమ్మది న్వగ మిగులన్. శుక. ౩. ౩౨౦.

దిగఁజూచు. స. క్రి. (√దిగు) తక్కువగాఁ జూచు.

సీ. హరతారధరహీరశరదగౌరదీప్తుల నగఁజూచు దిగఁజూచుఁ బొగడుఁ దెగడు. సేతుఖండము. ౧. ౭ పా.

దిగఁదన్ను=దిగఁదాచు. స. క్రి. (√దిగు) దిగవిడుచు.

చ. తగఁ గుసుమాస్త్రకేళి దిగఁదన్నినచీరలు గాఁగిలింతలం, బగఁగొని యడ్డగింపఁగఁ దెమల్చినహారములున్ ... వేం. పంచ. ౪. ౩౦౯.

దిగఁదాఁచు=దిగఁదన్ను. స. క్రి. (√దిగు) విడుచు, దిగవిడుచు.

చ...వినిర్జితా,తనుఁ దను నవ్వధూమణికిఁ దత్సమయంబునఁ జూప వేఁడి యొ,య్యన దిగఁదాఁచె భూపతి దిశాధిపకల్పిత మైనశాంబరిన్. నైష. ౩. ౭౫.

దిగఁదీయు. స. క్రి.(√దిగు) ౧. దిగఁదుడుచు. (శ. ర.) ౨. తగ్గించు, మానిపించు.

(వ్యవ) ఆపని చేయుచుండఁగా వీఁడు వానిని దిగఁదీసినాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దిగఁదుడుచు(డ్చు)=దిగమోపు స. క్రి. (√దిగు)-దృష్టిదోషము పోవుటకు ఉప్పులోనగువానిని-చుట్టు త్రిప్పు.

ద్వి. క్రమ్మన భసితంబుఁ గలయంగఁ జల్లి, ముష్టాఱు దిగఁదుడ్చి ముట్టె నంతటను.బస.పు. ౭. ౧౮౮ పం.

దిగఁదుడుపు. వి. (√దిగు) - దృష్టిదోషపరిహారార్థము ఉప్పు మిరెపకాయ మున్నగునవి-చుట్టు ద్రిప్పుట.

(వ్యవ) మిరెపకాయలు దిగఁదుడుపుపెట్టి నిప్పులో వేసినారు.

దిగఁద్రావు=దిగద్రోచు. స. క్రి. (√దిగు) ౧. పరిత్యజించు, విడుచు.

గీ. చింత దిగఁద్రావి పాలింపు శాంతవృత్తి.భార. అను. ౫. ౪౩౯.

ఉ. భూధరరాజకన్య మణిభూషణముల్ దిగఁద్రావి ...హర. ౪. ౬. విజ. వి. ౧. ౮౫.

౨. దిగు.

క. కన్నంతన తనయేనిక,దున్న దిగంద్రావి రభసదోలాయితహో, రోన్నతవక్షస్స్థలుఁ డై, యన్నలినాక్షునకు వంచె నాత్మశిరంబున్.హరి. పూ. ౮. ౧౯౪.

దిగఁద్రోచు=దిగఁద్రావు.స.క్రి.(√దిగు)విడుచు.

గీ. కలఁక యెంతయు దిగఁద్రోచి చెలువ మెసఁగఁ,జేర వచ్చినప్రియభామ గారవించి.పారి. ౨. ౧౫.

దిగఁబడు. అ. క్రి. (√దిగు.) ౧. (బురద మొ. వానిలో) కూరుకొను, గ్రుచ్చుకొను.

గీ. పంకము గొరిజ దిగఁబడఁ బఱవ లేవు,మన్నులిప్పేళ రేగటిమన్నులందు.మనుచ.౪.౨౦.

వ...ప్రాణంబులు పిడికిటం బట్టుకొని పోవుచు వివిధకేదారంబులం ద్రెళ్లి చట్టలు దిగంబడి వెడల రేకుండ ...ఆము. ౪. ౩౫.

౨. అడఁగు,క్రుంగు.

క...పాతా,ళమునకు డిగఁబడ నయ్యచ,లముఁ జరణాంగుష్ఠమున నలఘుగతి నదిమెన్. భా. రా. ఆర. ౧. ౯౪.

చ. గగనము మ్రోసె వీచె సుడిగాలి సముద్రము లింకె మేరువున్, దిగఁబడె భూమి చక్రము గతిన్ దిరిగెన్ ...ఉ. రా. ౨. ౧౮౩.

చ. జడధులు నింకఁ గూలుఁ గులశైలచయంబును ధాత్రియున్ దిగం,బడుఁ బెడబాయు భానుశశిభవ్యపదంబులు ...నృసిం. ౫. ౫౨.

(శ. ర. పా. డిగంబడును ద్రి. పా.)

౩. జాఱు.

అ. గొంతికడుపునందుఁ గొడుకుఁజాలై నీవు, దోఁప కుండ వైతి తోఁచినట్టి,పిండ మెడలియైనఁ బిదప దిగంబడ,దయ్యె నింత పుట్టదట్టు లైన. భార. కర్ణ. ౩. ౭౭.

౪. పోవు,నశించు;తగ్గు.

చ...ఇప్పు డద్దెస భయంబు దిగంబడ నీవు వోయి పార్థునిఁ గని సింహనాదమున రోదసి నింపుము మాకు నింపుగన్. భార.ద్రో. ౪. ౧౩౫.

ఉ. పావనశీల తైలపరిపక్వము లెన్నియుఁ దెమ్ము గా దనన్, లేవడి యైనభుక్తిఁగొని లేవ దిగంబడ దాఁక లింతయున్. పాండు. ౪.౧౮౮.

౫. వ్రేలాడు, (చూ. డిగఁబడు.)

౬. ఉండిపోవు,నిలుచు.

క. వెలఁదికటిపేర నిల నొక,పులినము దిగఁబడియె సింధుపులినపుఁబంక్తిన్,నలువ యది పడఁగఁ గాదే, తెలియుట కందంచపదము తిరముగ నిలిపెన్. ఆము. ౫. ౨౯.

ఉ. కారణ మైనకర్మములు కాక దిగంబడ వెన్నిగొందులం, దూరిన నెంతవారలకు...భా. ౯. ౩౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(వ్యవ.) మీరు జాగ్రత్తగ పొండు. నే నీపాటికి దిగఁబడెదను.

దిగఁబాఱమ్రింగు=దిగమ్రింగు. (√దిగు)
ద్వి. ఆమట్టిచేతాళుఁ డమరులనైన,దీమసం బడఁగించి దిగఁబాఱమ్రింగు. ద్వి. హరిశ్చ. పూ. ౧౭౪౯ పం.

దిగఁబాఱు. అ. క్రి. (√దిగు) ౧. దిగు. (చూ. దిగఁబాఱమ్రింగు.) ౨. క్షీణించు, తగ్గు.
గీ. కాంతి దిగఁబాఱఁ బ్రాచిముఖంబునందుఁ, బద్మినీముఖవికసనప్రౌఢి సడలె, భానుఁ డప్పుడు మధ్యస్థభావ ముడిగి,కాంతుఁ డపరాను షక్తి రాగము వహింప. కవిక. ౪. ౬౩.
౩. మీఁదినుండి క్రిందికి జాఱు, దిగజాఱు.
సీ. వెల్లఁబెట్టునో పూర్ణవిధుకాంతి మొగమున దిగఁబాఱునో పైఁడితెలివి మేన. నిరం. ౪. ౯౧.
(వ్యవ) ఆమె నెయ్యి దిగఁబాఱఁ గొలిచినది.

దిగఁబెట్టు. స. క్రి. (√దిగు) ౧. విడుచు.
(వ్యవ) న న్నొక్కదాని నిక్కడ దిగఁబెట్టి మావారు ఊరికి వెళ్లినారు.
౨. మిగుల్చు.
(వ్యవ) మామిడిపం డ్లన్నియు నీవే తినివేయక కొన్ని నాకు దిగఁబెట్టుము.

దిగఁబోఁత. వి. (√దిగు) దిగువకు వ్యాపించుట.
ఉదా. వానికి చెమట మొగఁబోఁతదిగఁబోఁతలు గా నున్నది. (శ. ర.)

దిగజాఱు=దిగు. అ. క్రి. (√దిగు) ౧. మీఁదినుండి క్రిందికిఁ బడు; చ్యుతమగు.
సీ. పాణిపంకజమునఁ బ్రభవించి మొండొండ దిగజాఱుతళుకుము త్తెపుసరి యన. దశా. ౨. ౧౨.

గీ. నీటుబెళుకున దిగజాఱు పైఁటచెఱఁగు, జగ్గు త్రోద్రోఁపుఁ గాటుకనిగ్గుకనుల, మిక్కుటపుఁజూపు మెఱుఁగు తళుక్కు మనఁగ, వెడలు నొకవేళ గృహము నవ్విప్రవనిత. హంస. ౨. ౧౪౬.
గీ. ధవళకిరణుండు చరమది క్తటము వెంట,నల్లనల్లన దిగజాఱె వెల్ల నగుచు. కవిక. ౪. ౧౮౩. మనుచ. ౩. ౮౪.
గీ. అంతఁ జంచలకుంభికుంభాగ్రనిహిత,పుష్పదామంబు దిగజాఱి భూమిఁ బడియె.దశా. ౨. ౨౦.
౨. స్రవించు, కాఱు.
వ...అశ్రుజలధారాప్రవాహంబులు...జాళువా మెఱుంగుఁబయ్యెదమీఁదికి దిగజాఱి...ఉ. రా. ౬. ౨౭౬.
ఆ. వదనచంద్రికాప్రవాహంబు దిగజాఱి,సందులేనిఘనకుచములనడుమ,నరుగ రాక తొట్టెనన మించు నాచకో,రాయతాక్షి తారహార తతులు. వరాహ. ౧౧. ౪౮.
౩. పోవు.
రగడ. ఇగురుఁబోం డ్లెన్నరై రీవులును గీవులును, దిగజాఱ విడిచి రటు శీవులును వావులును. రాఘవ. ౨. ౬.
౪. కుంగు, దిగఁబడు.
సీ. ఎలుకలు ద్రవ్వినయింటిచందంబున దిగజాఱి నీమేను మిగుల డస్సె. వాసిష్ఠ. ౧. ౭౬.

దిగదిగ. వి. ౧. విసరుట, మెఱయుట లోనగు వానియందు అగునుకరణము.
వ...దిగదిగన విసరి బగబగన మండుచిదుఁగు సొదమంటల కడ్డంబువట్టి...మనుచ. ౪. ౬౦.
గీ. అజ్జరుచిఁ దూర్పు దిగదిగ యంచు మెఱసె. (శ.ర.)
క. పగటిసెగ వదలి పడమర,డిగియె స్రవిమండలము వడి స్రష్టులు పై, నిగుడ నలవిష్ణుపద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మున, డిగడిగ యని ప్రేలుతూఁగుదీవియవో
లేన్. చంద్ర. ౪. ౬౪.

౨. నిక్కించుటయం దగుననుకరణము.

ద్వి. మృగములు బి ట్టుల్కి మెడ లెత్తిచెవులు,
డిగడిగ నిక్కించి దిశ లాలకించి. నవ. ౧.
౫౦ పా. ౧౫ పం.

క్రి. విశ. శీఘ్రముగా.

క...లేఁజిగురరఁటాకులు పెట్టిరి,డిగడిగ నద్దేవి
యాజ్ఞ దివ్యపురంధ్రుల్. భీమ. ౨. ౧౨౭.

గీ. వలభిరత్నాంశువులఁ గట్టుతెలుపు చిత్ర, మ
గుట కోర్వక డిగడిగనరిగి...ఆము.౬.౯౪.

డిగనాడు. స. క్రి. (√డిగు) ౧. విడిచిపెట్టు, త్యజించు.

సీ. రంభ విస్రంభంబు డిగనాడె...వైమ. ౩.
౩౬.

వ...అనిన విని లోపాముద్ర మానముద్ర డిగ
నాడి మునీంద్రున కిట్లనియె...కాశీ.౩.౬౩.

చ. నను డిగనాడి యిట్లు చనినన్ వెత నెట్లు
భరింతుఁ బ్రాణముల్. ఉ. రా. ౮. ౧౦౧.

౨. తిరస్కరించు.

సీ. చల మాని యలయేనుఁగులనూడు డిగనాడి
మగతాలజిగినేలఁ దగుచుఁ నెగడి. నీలా.
౧. ౪౫. (ఇట ఔపమ్యవాచకము.)

డిగనాఱు. అ. క్రి. (√డిగు) -క్రమముగా- కృశించు, క్షీణించు.

(వ్యవ)వాఁడు నానాఁటికిడిగనాఱుచున్నాఁడు.

డిగమోపు=డిగఁదుడుచు. (√డిగు)

చ...కోర్కిచేనురమునఁ నుంచు దుద్పుఁ గదు
నొప్ప మనోభవభూతశాంతికై, యరుదుగ
రతపూస యఖిలాంగములన్ డిగమోపు
చాదుపనన్. భోజరా. ౫. ౧౫౦.

డిగమ్రింగు=డిగఁబాఱమ్రింగు. స.క్రి.(√డిగు)
౧. (నమలకయే) గొంతు దిగునట్లు మ్రింగు.

ఉ...కడ తేఱఁగనిత్తునె యింక వారలన్,మిక్కి
లిశక్తి మీఱ డిగమ్రింగెద నంచుఁ బరిప్లవిం
పఁగన్. దశా. ౨. ౩౭౨.

చ. వననిధు లన్నియున్ గలఁచివైవ వసుంధరఁ
బెల్లగింప సూర్యుని డిగమ్రింగ ఘోరలయ
రుద్రునివైనను మార్కొనంగ నోపినఘను
లీమహాకపులు ...ఉ. రా. ౫. ౨౨౭.

చ...ఊరక యటు చేసినంతఁ దలప్రాణము
తోఁకకు వచ్చె లెక్కసేయక డిగమ్రింగె
నేని యకటా యలరాహువు మన్కి గాం
చునే. సారంగ. ౨. ౧౭౪.

౨. అపహరించు.

(వ్యవ)వాఁడు నాడబ్బంతయు డిగమ్రింగినాఁడు.

డిగరోఁజు.వి. (√డిగు) కట్టాపిరి.

(వ్యవ) వాఁడు ఎగరోఁజు డిగరోఁజులుగా పరు
గెత్తుచున్నాఁడు. (శ. ర.)

డిగవిడుచు. స. క్రి. (డిగన్+విడుచు) త్యజించు,విడిచిపెట్టు.

క. తగ నీలో నూహింపుము, డిగవిడువకు ధర్మ
తనయు దృఢమతి వై పొందగుచందము
గొడుకులకుం, బ్రెగడలకుం జెప్పి తీర్పు వెం
పేర్పడఁగన్. భార. ఉద్యో. ౨. ౯౫.

క. మగఁ డింక నన్ను సైఁచునె, డిగవిడుచుం
జంపుఁ గాక తెల్లము మది నమ్మిక పుట్టునె
యిది చెప్పిన ...హరి. పూ. ౫. ౨౨.

డిగవైచు=వైచు. స.క్రి.(√డిగు)

(పడవేయు.)

గీ. చచ్చినవి మున్న యని తాను జంపు టుడిగి,
వటముక్రింద నన్నిటి డిగవైచు వాఁడు. కే
యూర. ౩. ౭౦.

(విడుచు.)

క. చెప్పెడి దే మింక నొకచోఁ,దెప్పర మగును
కృకజీను డిగవైచిన వేఁ, నెప్పుకొని కదల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కుండెను, కప్పలితీరునను దేవు గదలక నిలి
చెన్. శుక. ౨. ౧౧. (పెన్నెప్పన. శ. ర. పా.)

దిగసన. విణ. (√దిగు) తక్కువ.

(వ్యవ) నీకు ఏం డ్లిగసన కాఁగా బుద్ధి దిగసన
యగుచున్నదేమి.

క్రి. విణ. ద్రు. దిగువగా. (చూ. ఎగసన.)

గీ. భూసురలఁ బ్రోవ వేమి మహాసురారి, యిప్పు
డేటికిఁ ద్రుంప నేం డ్లెగస సైన, బుద్ధి దిగసన
వచ్చెనో పో మ లేమి. సిం. నార. ౧౧౯.

దిగాలు. వి. వ్యాకులత. (చూ. దిగాల్పడు.)

దిగాల్ప(లుప)డు. అ. క్రి. వ్యాకులపడు, చిన్న
పోవు.

ఉ. భూసురవర్యునందనుఁడు బుద్ధికిఁదోఁచినయ
ట్లు వల్క దిగ్వాసుఁడు కానరామికి దిగా
ల్పడి దిక్కులు చూచి... చెన్న. ౩. ౧౪౯.

దిగు=డిగ్గు. స. క్రి. (క. దిగు.) అవరోహించు,
అవతరణముచేయు (చూ. డిగు.)

(వ్యవ) వాఁడు బండి దిగుచున్నాఁడు, నీవు చెట్టు
దిగుము.

అ. క్రి. ౧. పైనుండి క్రిందికివచ్చు, అవరోహించు.

క. బృందారకపథమున దిగి, యిందీవరపత్త్ర నేత్రయిరువంకలవా, రుం దమక తమక రా రా,
యిం దనఁగా రెండువీళ్ల యెడమున విడిసెన్.
హర. ౬. ౧౦౧.

మ. సరి నంతంతకుఁ గ్రుంకి క్రుంకి కనకస్తంభంబు చిత్రంబుగా, సరసీపూరసమస్థితం
బగుటయున్ సర్వంసహాధీశుఁడున్, వెర
వాఱం దిగి వచ్చి యప్పురిని దా విశ్రాంతచే
తస్కుఁడై. విక్ర. ౨. ౧౧౫.

వ... వివిధకేదారంబులం ద్రెళ్లి చట్టులు దిగంబడి
వెడల లేకుండం దాయ దిగ నిమ్ము లేక ...
ఆము. ౪. ౩౫.

౨. (క్రిందికి) వ్రేలు.

గీ. కట్టి తొడి పూసి కైసేసి కౌతుకమునఁ, గొస
దిగఁగ నీలిపుట్టంబు ముసుఁగు వెట్టి, గాజు
లెగఁద్రోసి చప్పుడు గాకయుండ, వచ్చె
నూర్వశి యర్జునావాసమునకు. హర. ౬.
౧౧౯.

౩. దిగఁబడు, జాఱు.

గీ. దేవకీదేవికడుపులోఁ దేజరిల్లు, దీప్తగర్భంబు
మెల్లన తిగిచి యోగనిద్ర రోహిణికడుపున
నిలిపి చనియెఁ, గడుపు దిగె నంచుఁ బౌరు
లు గలఁగఁ బడఁగ. భాగ. ౧౦పూ. ౬౨.

౪. (వేలుతావులనుండి) వచ్చు.

శా... వర్షంపునెవ్వాఁ రుజన్, హావర్లీన్ దిగు
నన్యభూప్రజల రా జాయాయిజాత్యోచి
తిన్, బ్రోవంగాఁ దగు... ఆము. ౪. ౨౪౫.

చ... సింహభూధర, ప్రభుతిరునాళ్లకుం దిగు సు
ర ప్రకరంబు... మనుచ. ౧. ౩౭.

క. మే లైనసరకు లాతని, కాలున దిగు మాట
నిజము గలవాఁ డగుటన్. శుక. ౧. ౭౩.

౫. ప్రవేశించు, చొచ్చు.

ఉ. అవ్వసుధాసుధాళనకులాభరణం బతిరమ్య
మైన యా, జవ్వన మాజవంజవవిశాలసుఖాను
భవైకయోగ్య మై, నివ్వటిలన్ విరక్తిసర
ణిం దిగె నిందుముఖుల్ రతిచ్ఛచే, నువ్విళు
లూరు డెందముల నోలిఁ జివుక్కు రటంచు
నుండఁగన్. విప్ర. ౧. ౭౧

చ. ఒదవెకుజవ్వనంబు వెలి కొత్తఁగఁ బర్యెద
సిగ్గుఁ గూడి బి, ట్టదుమఁగ లేఁత లోట దిగ
నాఁకరు మీఱను లేక... పొదలె నసంగఁ బి
క్కటిలెఁబొల్తుకచన్నులు... ఆము. ౫. ౨౧.

౬. (ప్రయాణమునందు దారిలో) విడియు.
(శ. ర.)

(వ్యవ) సేన లాచోట దిగినవి.

౭. (పనసచెట్టు మున్నగువానికి పిందెలు) ఉత్ప
న్నమగు, కలుగు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆ. పాత్రభూతు లెస్సఁ బరికించి యతఁడడు,
గకయు నొకఁడు సెప్పకయు మునుపుగఁ,
బనసపండ్లు దిగినపతిగ స్వప్నము గన్న, నెతి
గ నొసఁగి వెరఁగుపడుచు టొప్పు. ఆము.
౪. ౨౭౪.

(వ్యవ) కందకు వేళ్లు దిగినవి.

౮. తగ్గు.

క. ఇవ్విధమున రుక్మిణిమదిఁ, బువ్వుం బరిపుళి
ముఁ బోలెఁ బొలుపుగ నెత్తం, బువ్వాయి
గలిగ శౌరికి, మవ్వము దిగఁ దొడఁగె గెలు
పు మట్టం బయ్యెన్. ఉ. హరి. ౩. ౧౨౫.

సీ. సాంద్రచంద్రికలయుజ్జ్వలభావములు దిగ
నరుణోదయప్రభాస్ఫురణ లెదుగ. విక్ర.
౨. ౧౦౭.

ద్వి. అక్కడఁ బలుమాలు నరదంబు చన్న, ది
క్కుఁ గన్గొనుచును దిగనిశోకమున. రం.
రా. ఉ. ౧౨౨ పా. ౨౫ పం.

౯. వ్యయమగు.

క. వాసికిని వేళ్యఁ బొందినఁ, గాసులు చే దిగు
ను సుగతి కలుగక పోవున్. మల్హణ.
౨. ౧౭౫.

౧౦. గ్రుచ్చుకొను.

(వ్యవ.) కాలిలో ముల్లు దిగినది.

గుండెఁగూడుదిగు=నిర్బాధముగా నుండు, సుఖ
ముగా నుండు.

చ. నరులకు గుండెఁగూడుదిగె నాఁగలంబులు
నిద్రపోయె...కాశీ. ౨. ౬౧. (తిన్న య
న్నము ఒంటఁబట్టు- అని భావము.)

ఎగంగ దిగంగ = ఎగన్ దిగన్, ఎగాదిగన్.

ద్వి. అంగ మెగంగ దిగంగఁ జూచు చును. బస.
పు. ౪. ౭౨౪ పం.

జ: దించు, దింపు, దింపులకుఁ దెచ్చు, దింపులఁబోవు,
దిగఁగాలు, దిగఁజూచు, దిగఁదన్ను, దిగఁ
నాఁచు, దిగఁదీయు, దిగఁదుడుచు, దిగఁదుడు
పు, దిగఁద్రావు, దిగఁద్రోచు, దిగఁబడు, దిగఁ
బాఱ మ్రింగు, దిగఁబాఱు, దిగఁబెట్టు, దిగఁ
బోఁత, దిగజాఱు, దిగనాడు, దిగనాఱు, దిగ
మోపు, దిగమ్రింగు, దిగరోఁజు, దిగవిడుచు,
దిగవైచు, దిగసన, దిగుచు, దిగుజాతి, దిగుడు,
దిగుదల, దిగుమతి, దిగువ, దిగువాటు, ది
గువాయి, దిగువాఱు, మొ.

దిగుచు. స. క్రి. (√దిగు) దిగఁజేయు, దించు,
గ్రుచ్చు.

క. నెతి మాలి బందె వెట్టిన, నతిముతిఁ జంపి
నను గజము నశ్వము గ్రుచ్చె, పతిగొనిన
నట్టివారలఁ, గొఱల దిగిచి చంపు టొప్పుఁ
గువలయపతికిన్. విజ్ఞా. ప్రా. ౯౬.

దిగుజాతి. వి. (దిగుడు+జాతి) తక్కువజాతి,
నిమ్నజాతి.

తే. ఆలు పతిభక్తి స్త్రీపుంసపాళి వావి, యతి
వశిత్వము దిగుజాతు లగ్రజాతి, ననుసరిం
చుట...నృపదండభీతిఁ జుమ్మ. ఆము. ౪.
౨౭౭.

దిగుడు=డిగ్గుడు. విశ. (√దిగు) ౧. ఆనతము,
పల్లమైనది.

(వ్యవ.) నేల దిగుడుగా నున్నది.

౨. తక్కువది, హీన మగునది.

క. ఇటువంటివి యిట కెక్కుడు, విట దిగుడువి
యొంద నెన్నియే నిడియును నొక్కటి యొ
కనాటిద కా దొక, త్రుటిగీతఫలంబు నొ
సఁగుదు నె యిమ్మెయికిన్. ఆము. ౬. ౬౦.

దిగుడుబావి=వాపి, దిగి నీరు తెచ్చుకొనుటకు
వీలుగఁ ద్రవ్విన మెట్లు గలనుయ్యి.

దిగుదల. వి. (√దిగు) క్రిందిభాగము. (శ.ర.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దిగుభాగము. వి. (దిగు + భాగము) దిగువభాగము, క్రిందిభాగము.

వ... క్షేత్రముతూర్పుదిగుభాగమున ౫౮ ఎట్టికా (ర్య)గుంటన...గుం. శా. ౭౦౦.

దిగుమతి. వి. (√దిగు) ఓడలో నున్న సరకును రేవునందు దింపుట. (శే. ర.)

(ఓడ మొదలగువానిలోనిసరకును) దింపుట. (చూ. ఎగుమతి.)

దిగులు. వి. (క. దిగులు. త. తిగిర్.) ౧. భయము; అధైర్యము.

గీ. వారిసేనల గోపికావరుఁడు నరుఁడుఁ, దెగిరి తెగి రనుపలుకుల దిగులు పుట్ట. భార. ద్రో. ౧. ౩౪౯.

సీ. జక్కులరాయిక్కఁ జొక్కు సెక్కటియుద్ది కడిఁదిమక్కొటిక సోఁకుడులదిగులు. అచ్చ. రా. బాల. ౭.

సీ. పురిలోట జలదరింపు దిగులు వెఱ పఱ్కు వెఱ యుత్తలము బీతు బెదరు బెగ్గిలుట యంజిక యుదిల య టన నభృతి యగు... ఆం. భా. ౧. ౧౩౩.

౨. (గుండె) అదరు, దడ.

చ. దళముగఁ గల్వ తేఁకులతుదన్ దిగజారెడుమంచునట్లు కన్,గొలుకుల డిగ్గునీరుఁ గని గుండె దిగు ల్గనఁ దల్లి యి ట్లనున్.యయా. ౪. ౧౩౭.

ఉ. ఈసున నేకహేలన మహీసురుఁ డొక్కరుఁ డొక్కవార్ధి యా,పోసన మెత్తుచో దిగులు పుట్టి పయోనిధిపంచకంబు సం, త్రాసము నొందునప్పు... శైవ. ౫. ౬౭.

గుండెదిగులు=భయము.

గీ. కేరి నవ్విన మాబోఁటివారి కెల్ల, గుండెదిగులగు...ఉ.రా. ౨. ౧౯౬.

సీ. దిగ్గజంబులు గుండెదిగు లెత్తి మ్రొగ్గను శేషాహి బిట్టుల్కి చెవుడుపడియె. శై. ౨. ౩౭.

జ: దిగులుకొను, దిగులుపడు, దిగులుపాటు.

దిగులుకొ(ల్కొ)ను. అ. క్రి. (దిగులు + కొను) దిగులుపడు, భయపడు.

క. పొన్నలకుం దెలిజాబిలి, మిన్నలకుం దలఁకుఁ జిలుకమేలిమిపలుకుల్, విన్న నగున్ విన్ననగుం,:గొన్ననగుంపులకు దిగులుకొని మదిఁ బొగులున్. కువల. ౩.౭౩.

చ. తనసుతు లోఁగిటన్ వెదకి తల్లి దిగుల్కొని పల్లెకూటమం,దునఁ దిలకించి బాలకులతోఁ జని యాడుచునుండె నేమొ రాఁ,డని చని... చెన్న. ౩. ౧౬౭.

సీ. గొంతు మోచిన దిగుల్కొని నోర వ్రేలిడి క్రక్కు నొక్క పిశాచికావిభుండు. కువల. ౨. ౧౫౦.

దిగులుప(ల్ప)డు. అ. క్రి. (దిగులు + పడు) భయపడు.

క. దిగులుపడుబిడ్డ నచ్చో, డిగవిడిచి చనం గలంగుడెందముతో నే,పగిదిఁ జనువాఁడ దైవమ, పగవారికి నైన నాఁడుఁబడుచుల నీకే. వరాహ. ౨. ౧౨౭.

గీ. మొగులుచిఱుదాయయాతోఁట మొగలు దాఁట, దిగులుపడి చింత గుండియల్ వగులు కాంతఁ, బొగులునారాజుతోఁ గూర్చి నెగులు దీర్చి, తగులుసేయమిఁ బరుఁడు వెన్దగులు మరుఁడు. రా. వి. ౪. ౭౯.

గీ. అది దిగుల్పడి యెట్లు నో రాడె నౌర, పలుక నీరీతి నోవెట్టెబాఁపనయ్య. శుక. ౧. ౩౬౦.

దిగులుపాటు. వి. (√దిగులుపడు) భయము. (శే. ర.)

దిగుల్లు. వి. గుండె అదరుట కనుకరణము.

ఉ. కూరిమిపేష్టి గుండియ దిగు ల్లని తల్లడ మందునోసుమీ. శివరా. ౩. ౧౭౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. మనమున దయ పుట్టఁగ నీ,పనిపాటలు విన్న వించుఁ బ్రాణేశున కీ, యనఘుఁడ కారణబంధుం,డని తెలియం బలికి గుండియ దిగు ల్లనఁగన్. రాజ. చ. ౩.౨౧౪.

దిగువ. వి. (√దిగు) క్రిందిభాగము.

గీ. తగు నె గదపోర నాభికి దిగువ నొంచి,చంప నత్తెఱఁ గుల్లంబు నొంప కున్న. భార. స్త్రీ. ౧. ౧౫౪.

సీ. నీమీఁదు దిగువయు నీరజాహితుఁడు వాసుకియు రక్షింతురు ప్రకటకరుణ. హరి.పూ. ౫. ౧౬౦.

గీ. తిలలు పై నెత్తి చల్లిన దిగువఁ బడని,యంత సందడి పెంద్రోవలందుఁ గలిగె. నైష. ౪. ౧౨౩.

విణ. క్రిందిది.

వ...గదాయుద్ధంబున నాభికి దిగువ యగుశరీర భాగంబు నొప్పించుట ధర్మంబు గాదు... భార. శల్య. ౨. ౨౧౫.

వ...గాలి పరికించి దిగువదెస దొడ్డివల పన్ని... మనుచ. ౪. ౩౭.

దిగువాటు. వి. (√దిగు) దిగువ, క్రిందివైపు.

క. మినుకుమినుకనెడిమింటన్, బొనపొన నల తెల్లమబ్బుపొంతన దిగువా,టున నదె కలదో లేదో, యనుమాత్రము గాఁగఁ గంటివా నృపతనయా. సారంగ. ౧. ౧౨౪.

దిగువాయి. విణ. (√దిగు) న్యూనము,తక్కువది.

ఆ. దీను లయినవారి దిగువాయిగాఁ జూచి,పరము గనక నూతఁ బడును వేమ. వేమన. ౩. ౧౨౬.

దిగువాఱు. అ. క్రి. (√దిగు) ౧.జాఱు, కాఱు, ప్రవహించు.

ఉ...వెక్కస మగుమన్యువేగమునఁ గాటుక కన్నులనీరు సోనలై, యుసిరికకాయలంతలు పయోధరము ల్దిగువాఱునట్లుగన్. కాశీ. ౫. ౧౬౭.

వ...దృక్కోణంబులం దిగువాఱుకన్నీరు చెన్నారుకర్దవ్యాగోళంబులు నిండి ...మనుచ. ౩. ౯.

౨. మీఁదనుండి క్రిందికి పడు.

ఉ. రంగుగ నొక్కరొక్కరిశిరంబుపయిం దలఁబ్రాలు వోసి ర,య్యంగమరీచి నవ్యపటు లై దిగువాఱఁగ నవ్వధూవరుల్.అని.౧.౧౦౧.

౩. నిండు; నిండిపాఱు.

సీ. తగ వార్చి మూఁకుళ్ల దిగువాఱ నుంచిన కూటిబల్లావు లాగుబ్బుకొనియె. కువల. ౨. ౧౦౯.

క. ప్రా లొక్కటఁ గొని చానన, తైలము దిగువాఱఁ బోయుదానను నీకుం, బోలినప్రాలం గొలువుము,..కేయూర. ౨. ౧౩.

దిగ్గజము. సం. వి. అ. పుం. దిక్కునందలియేనుఁగు. (ఐరావతము, పుండరీకము, వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము, సుప్రతీకము. ఇవి యష్టదిగ్గజములు) ఇట్లే: దిగ్వారణము, మొ.

దిగ్గన. క్రి. విణ. ద్రు. (√దిగ్గు[2]) తటాలున.

ద్వి. కడు నొగ లలమి దిగ్గన నేలతోడ, నడఁచి యుఁ జఱచి యల్లంత వైచియును. రం. రా. యు. ౪౦౭ పా ౧౦ పం.

చ...తల్పము దిగ్గన దిగ్గిపోయి ... మార్క. ౨. ౨౯.

క. అని యానతిచ్చినను దిగ్గన మేల్కని యద్దిరయ్యా గలిగెఁగదా నేఁ, డనుకూలనాయకుఁడు మోహనమత్కృతి యనెడికన్న కని ముదమందన్. ప్రబంధ. ౪౦.

దిగ్గనాడు= దిగనాడు. స. క్రి.(దిగ్గన్[1] + ఆడు) విడుచు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. పయ్యెదఁ దివ నీక పట్టు నింతకు మున్న సిగ్గు
సేసంగతి దిగ్గనాడె. కవిక. ౪. ౧౬౮.

దిగ్గాలు. అ. క్రి. (దిగ్గన్¹ + కాలు) కృశించు.

క. గుగ్గిలపుఁబొల్లఁ గొని తా,మగ్గిని రగులుకొ
నురీతి నతివేగముగా, బగ్గుమన మరుఁడు
దిగులున, దిగ్గాతి గిరీంద్రకన్య తేఁకువ
దప్పన్. పార్వ. ౩. ౫౯.

దిగ్గ(గి)య= డిగియ, డిగ్గియ, వి. (√దిగ్గు¹. సం. దీర్ఘికా. ప్రా. దిఘిఆ.) నడబావి.

ఉ. దిగ్గియ నంచ తూఁడు గొని తీరవనేకువు
వంకమీఁదుగా, నగ్గెడ ఫుల్లకేసరమునందు
వసింపఁగ...ఆము. ౫. ౧౨౨.

గీ. దేవనిర్మిత మైనట్టిదిగ్గియఁ గని, దిగ్గి యగణిత
విభవముల్ దేజరిలఁగ. సారంగ. ౧.౧౧౨.

దిగ్గు¹= దిగు. అ. క్రి. (మీఁదనుండి క్రిందికి వచ్చు) అవరోహించు.

చ...తల్పము దిగ్గన దిగ్గి పోయి పద్మముఖి మ
నోజుఁ డార్వ సఖిమాటున నిల్చెఁ బ్రకంపి
తాంగియై. మార్క. ౨. ౯౬.

గీ. చేరి యరదంబు దద్గృహద్వారసీమ, దిగ్గి
యరుదెంచి ప్రణమిల్లి దేవ యిపుడు, నీకు
మారుల సౌభాగ్యనిధుల బుధుల, డించి వ
చ్చితి గంగాతటీవసతిని. రామా. ౫. ౬౩.

గీ. దేవనిర్మిత మైనట్టిదిగ్గియఁ గని,దిగ్గి యగణిత
విభవముల్ దేజరిలఁగ. సారంగ. ౧. ౧౧౨.

జః దిగ్గనాడు, దిగ్గాలు, దిగ్గియ, దిగ్గుడు.

దిగ్గు². వి. (క. డిగ్గనె. త. తిక్కెన.) భయముచే గుండె అదరుటకు అనుకరణము. (దీనికి అనుధాత్వనుప్రయోగమున 'దిగ్గుమను, దిగ్గురను' రూపములును గలుగును.)

ఆ. మూర్ఛవోక నిలిచి మూఁడుమొగంబుల,
శూల మెత్తికొని కరాళవృత్తి, నడఁచి నె
మ్మొగమునఁ బొడిచె నింద్రానుజు, దేవతల
మనంబు దిగ్గనంగ. నిర్వ. ౩.౩౦.

క. డగ్గఱిలి మైత్త్రి భామిని, డగ్గుత్తిక యిడుచు
నక్కటా ప్రాణసఖీ, బెగ్గిలి నన్ను నెఱుం
గవు, దిగ్గనె గుండె యని తన్నుఁ దెల్పిన
పిదపన్. ప్రబోధ. ౩. ౬౫.

క. భువనములు దలఁక మునులును, దివిజు లడల
ధనదుగుండె దిగ్గుమనఁగ రా,హువు శని మొ
దలగుదుర్గ్రహ,నివహము నికటస్థలమున నిలి
చినవేళన్. ఉ. రా. ౨. ౧౩౮.

చ...ఎం,దును గొద లేక నీకు నిదె దుస్సహక
ర్ణనిపాతసూచియై, వినఁబడు గుండె దిగ్గురన
వేగిర మేల దురంబు గోరినన్. రాఘవ.
౪. ౧౧౨. సమీర. ౪. ౪౪.

గీ. భాస్కరుఁడు మున్నె దేవునిపాలి కరిగెఁ,
గలియుగంబున నీఁక నుండఁ గష్ట మనుచు,
దివిజకవివరుగుండియల్ దిగ్గురనఁగ, నరుగు
చున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి. శ్రీనా
థునిచాటువు.

జః దిగ్గన, దిగ్గున.

దిగ్గుడు= డిగ్గుడు, దిగుడు. విణ. (√దిగ్గు¹) (న్యూనము, తక్కువది.)

చ. అలహరియాననాంబుజమునందు జనించుటఁ
జేసి మేము ముఖ్యులము తదీయనాభికమ
లోద్భవుఁ డావిధి మాకు నెవ్విధిన్, దెలి
సిన నీడు గాఁగలఁడె దిగ్గుడు మా కని గ్రే
ణి సేయుచున్, బొలుతురు విప్రపుంగవులు
ప్రోలున వేదరహస్యవేదులై. రామా. ౧.
౧౩౬.

మ. నిరతం బాత్తకరాంఘ్రిబాహు నఖకాంతి
స్ఫూర్తికిన్ దిగ్గుడై,శరణం బొందుప్రవాళ
పద్మబిసపుష్పశ్రేణికిన్ గ్రమ్మఱన్,శరణం
బందుట హీన మంచునో మదిన్ శైత్యోప
చారక్రియా,గరిమం బొల్లదు మానినీమణి
...నరస. ౩. ౧౩౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**దిగ్గన**=దిగ్గన. (√దిగ్గు²)
క. అగ్గజగామిని కాముని,యగ్గలికకు బెగ్గడిల్లి యాళిజనములకా, దిగ్గనఁ గనుమొఱఁగి కదఁకా, సిగ్గున నేకాంతసదనసీమఁ జనియెకా. విక్ర. ౧. ౧౨౬.

**దిగ్దర్శనము.** సం. వి. అ. న. ౧. పద్ధతిమాత్రము చూపుట. ౨. దిక్కులను చూపుయంత్రము.

**దిగ్దాహము.** సం. వి. అ. పుం. ఉత్పాతభేదము. (ఇందు దిక్కులు అస్వాభావికముగా అగ్న్యాది వర్ణములు గలిగి రాజాదులకు భయసూచకములై యుండును.)

**దిగ్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. లిప్తము, పూయఁబడినది. ౨. లిప్తకము,పూయఁబడినవిషముకలది. (అమ్మ.) వి. అ. పుం ౧. చమురు, స్నేహము. ౨. అగ్ని. ౩. ప్రబంధము. (కల్ప)

**దిగ్భ్రమము.** సం. వి. అ. పుం. దిగ్భ్రాంతి,ఒక దిక్కును మఱియొకదిక్కుగా గ్రహించుట. ఇశ్లే: దిఙ్మోహము, మొ.

**దిగ్విజయము.** సం. వి. అ. పుం. దిక్కులను (దిక్కులయందలిరాజులను) గెలుచుట.

**దిఙ్నాగుఁడు.** సం. వి. అ. పుం. కాళిదాసుకాలపువాఁడును కుందమాలాదినాటకకర్తయు నగు నొకకవి. (మేఘదూతలో ౧-౧౪ శ్లోకవ్యాఖ్య యందు మల్లినాథుఁడు ఇతఁడు కాళిదాససమకాలికుఁ డని చెప్పెను.)

**దిఙ్మ(గ్మ)ండలము.** సం. వి. అ. పుం. న. దిక్చక్రము,దిక్సమూహము.

**దిఙ్మ(గ్మ)ండలి.** సం. వి. ఈ. స్త్రీ=దిఙ్మండలము.

**దిఙ్మూ(గ్మూ)ఢుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) దిగ్భ్రమము నొందినవాఁడు.

**దిచ్చేరి.** వి. (√దిచ్చే. సం. దిక్చారిణీ.) వ్యభిచారిణి; మాయలాడి.
క. తెచ్చి కుసుమాలములోపలఁ, జొచ్చినభోజఁ గెగసి యెగసి మాడఁగ నవు డా,దిచ్చరి హెచ్చరికఁ బ్రియుం,గ్రుచ్చి రతిక్రియల సొంపుగులుకుచు నుండెకా. వేం. పంచ. ౧. ౫౯౬.
క. ఎచ్చరిక నెఱిఁగి వెంటన,వచ్చితి నీయిల్లు సొచ్చె వాఁ డులుకున నే,డిచ్చట లేఁ డెందరిగెకా,దిచ్చరి నిక్కువముఁ జెప్పితే మేల్గాదే. వేం. పంచ. ౧. ౬౦౪.
ద్వి. నీవు చెప్పెడిమాట నిక్కంబు చెప్పు;మా విప్ర యనుఁడు నమ్మానివల్లభుఁడు,దిచ్చరి యగునట్టిదీనిమాటలకు,వచ్చెనా నిలువెల్ల వఱుకులపుట్ట. ద్వి. పరమ. ౪. ౩౩౭ పా.

**దిచ్చరించు.** అ. క్రి. (√దిచ్చరి) బయలుపడు, పైకి వ్యాపించు.
సీ. మోము వంచిన నేమి మొలకనవ్వులకాంతి చెక్కుటద్దములపై జీరువాఱెఁ, జూడకుండిన నేమి సొబగురెప్పల మించి తేటవాల్మెఱుఁగులు దిచ్చరించె. క్రీడా. ౯౫.

**దిచ్చే.** విణ. జూదరి; మాయలాఁడు.
క. వచ్చి గుడి సొచ్చి యందఱు, దిచ్చులు తమతిండికొఱకుఁ దీపులు వెట్టకా,మెచ్చుచు వేడుకయాటల,నచ్చోటం బ్రొద్దు వుచ్చి యల్లన మగిడెకా. ద్వా. ౧౦. ౨౫౪.
ఉ...ఏ,యొచ్చెముఁ జూడ కాడుచును నోడుచు నిర్ధనుఁ డౌచు నున్నయా,దిచ్చున కెల్లకాలము నతిద్రవిణం బొసఁగం దలంపుమా. ద్వా. ౧౦. ౧౮౫.
జ: దిచ్చరి, దిచ్చరించు.

**దిచ్చేమొగము.** విణ. (√దిచ్చే) అదృశ్యము. (బ్రా, శ. ర.)

**దిట**=దిట్ట, దిటము,దిట్టము, దిటవు. వి. (క. దిట.) (శక్తి, దార్ఢ్యము.)
క. దిట చెడి లోఁబడె దైత్యుఁడు...భాగ. ౩. ౬౫౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(ధైర్యము.)

క. ఔనౌ నెచ్చెలి నామదిఁ, జేనుకొనుదు రాళికతనఁ జేరఁ గదే, నా;వీనుల సోఁకె నమంగళ,దీనికి మాతల్లి సవతు దిట చెడి పడితిన్. ప్రబోధ. ౩. ౧౮.

గీ. భ్రమసి దిట దప్పి నివ్వెఱపడియె ధాత. కాశీ. ౫. ౨౬౭.

జ; దిటదేరు.

దిటదేఱు అ. క్రి. (√దిట.) సమర్థమగు, గడిదేఱు.

చ. మొనసిన నెయ్యపున్ గలిమి ముద్దులమాటలఁ గోరునంతటన్,దిన మొకవింత గాఁగ దిటదేఱె వధూమణి కేళిచాతురిన్. సీమం. ౪. ౪.

దిటము. వి. (సం. దృఢమ్.) ౧. దార్ఢ్యము, శక్తి.

చ. దిటమున రెడ్డి పాటుపడి తెచ్చి యిడంగను గూటిప్రొద్దు సం,కటితతి వెన్నమజ్జిగలు... శుక. ౨. ౩౩౪.

౨. ధైర్యము.

గీ. తత్తటంబున దిటముతో దండు విడిసె. ఉ. రా. ౧. ౧౧౧.

సీ. దిటముచే భుజబలోత్కటముచే రణజయార్భటముచేఁ బెంపొందుపవనజుండు. అని. ౨. ౧౨౪.

ఉ... నీకు నే,నిగ్గురుభీతిహేతు విపు డింతయుఁ దెల్పెద నన్యు లెవ్వ రీ,డగ్గఱ లేరుగా మన దిటంబు కనుంగొన నంచు ...శు:. ౨. ౨౭౮. (ఇట వ్యతిరేకలక్షణచే పిఱికితనము అని యర్థము)

౩. అతిశయము.

గీ. బెట్టు నిబ్బరము దిటము బీటు గాట, మనఁగ నతిశయ మగును సూర్యావతంస. ఆం. భా. ౧. ౬౬.

సీ. రథచక్రనేమిఘర్ఘరరావములు కేతుపటపటాత్కృతులకు దిటము దెలుప. దశా. ౨. ౩౭౭.

విశే. ౧. దృఢము.

చ... మేన విభూతి యలంది పెన్నెఱుల్,జడలుగఁ దాల్చి డెందమునఁ జాల దిటం బగు భక్తిఁ బూని య,ప్పడఁతుక యబ్బురంబుగఁ దపం బొనరింపఁ దొడంగె నెంతయున్. రసిక. ౬. ౧౨౩.

౨. ధ్రువము, నిశ్చితము.

క. వేయేల నీవె దిక్కని, డాయం జనుదెంచి తిమి దిటంబుగ దనుజుం, డీయెడ వృతిఁ జెందుటకు ను,పాయంబు ఘటింపవయ్య పరమమునీంద్రా. ఉ. హరిశ్చ. ౪. ౯౬.

౩. స్ఫుటము, స్పష్టము.

క. కుమ్మెలు దాఁకినబంగరు, బొమ్మరములరెమ్మెఁ గడకుఁ బొమ్మను రేఖా, సమ్మిళిత స్తనకుంభతటమ్ము దిటమ్ముగను జూపి డగ్గుత్తికతోన్. సారంగ. ౨. ౨౩౦.

క. ఆచంద మెల్ల దిటముగ, నీచెవులకుఁ దనివి తీఱ నే నెఱిఁగింతున్. నీలా. ౧. ౬౫.

దిటవు=దిట, దిట. వి. దార్ఢ్యము. (శ.ర.)

విశే. దృఢము. (శ. ర.)

దిట్ట=దిట, దిటము, దిటవు, దిట్టము. వి.(సం. ధృష్టః. ప్రా. దిట్ఠో. క. దిట్ట.) ధైర్యము.

గీ. విశ్వసించిన నీరు ద్రావినను నిద్ర,పోయినను జాలుకొన్నను బొర్లుచున్న,దెవులువడ్డను గుంపైన దిట్ట చెడినఁ, జంపఁ డనుకంప నెట్టి హింస్రంబునైన. కాశీ. ౪. ౬౦.

విశే. ౧. చతురుఁడు, నేర్పరి.

క. వరవర్ణిని యగునీకుం, బురుషుఁడు బలుదిట్ట యతనిఁ బొందుము లీలన్. భా. రా. అర. ౧. ౧౪౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. ఆటిమొదఁ జెండ్లిపనులన్, దిట్ట లగుపురం
ధ్రులచట నిలిపిరి వహ్నిన్. మనుచ. ౫. ౯౬.

౨. శక్తిగలవాఁడు, సమర్థుఁడు.

వ. ఆఖండలా యఖండలాఘువాలాపములం గో
పంబు పుట్టించితి దిట్టవేని గట్టితనం జేర్పడ
నిపర్వతశిఖరంబుఁ బెఱుకు మన్న...పాం
చా. ౩. ౯౫.

గీ. దితిజు మెట్టినయాపాట్టిదిట్ట వీవ. పారి. ౧. ౪౯.

౩. ధీరురాలు; ధీరుఁడు, ధైర్యము కలవాఁడు.

వ. అజ్జోటి దిట్ట గావునఁ దలంకక...ఉ.పారి. ౧. ౫౬.

ఉ. దీనినిగారవుందొడలు దీనిమొగంబును దీని
కన్నులున్, దీనివిలాసముం గని మదిం గడు
సోలరె యెట్టిదిట్టలున్. రసిక. ౩. ౫౬.

౪. ధృష్టుఁడు, ఉద్ధతుఁడు, ఎదిరించుస్వభావము
కలవాఁడు.

గీ. చేరజపుగట్టిజంత పాడూరిసంత, చలము సా
ధించుదిట్ట రోసాలపుట్ట. శుక. ౩.౧౯.

ఉ. మానముచేత మాఁగయు సమంచితవక్త
ప్రలాపి చెంగటన్, బూని వసించ దిట్ట ద
మముండదట దవ్వుగ నుండెనేని శ్రీ,లీనుఁడు
...భర్తృ. ౧. ౪౭.

౫. శ్రేష్ఠుఁడు.

ఆ. పెట్టువార లెవరు పెట్ట కుండు రెవరు,పెట్టి
పుట్టినట్టిదిట్ట లెవరు, పట్టు దప్పకుండ భావిం
చి చూడరా... వేమన. ౩.౧౨౦.

జః దిట్టతనము, దిట్టపడు, దిట్టాడు.

దిట్టఁడు= దిట్ట. విణ. ౧. సమర్థుఁడు.

ఉ. గట్టుల మట్టుపెట్టుబలుకైదువుఁ బట్టినయట్టి
దిట్టఁడున్, దిట్టతనంబు వాసి పొలదిండికి
లోఁబడి గాసిఁ జెందఁగా. ఉ.రా.౫.౧౧.

౨. ధీరుఁడు, ధైర్యశాలి.

క. కట్టినకట్టులు దనువునఁ, దెట్టినవెనుకొండపొ
దలు దీటిచికొనుచున్, బిట్టు జలధి వెడలిన
య్యా,దిట్టని తెఱఁగు సురవిభుఁడు తెలియ
న్వినియెన్. నృసిం. ౫. ౩.

చ. పగ మరలింపఁ దండ్రి వనుపం బనిబూని
యవంతికోటపై, జగడము సేయఁ బూని య
టుసాయపురాక యరాబుకొమ్మచాల్, తె
గువను దేటిచూచుటకు దిట్టఁడు గాఁడఁట
రాజహంసికిన్, మగతన మేడదా యనియె
మాళవభృత్యుఁడు కొత్తపంబునన్. రా. వి.
౫. ౨౪.

౩. ధృష్టుఁడు, ఉద్ధతుఁడు, ఎదిరించుస్వభావ
ము కలవాఁడు.

గీ. పొదుగు దిగజాఱ విడచి పా ల్పొలుపు
గాను,బుట్ట నిండింపఁగాఁ జూచి దిట్టఁ డైన,
గోపఁ డప్పుడు తనచేతిగొడ్డ లెత్తి, గోవునడి
నెత్తిపై మించి కొట్టఁబోవ. వేం. మా. ౪.
౧౬౦.

దిట్టతనము. వి. (√దిట్ట.) ౧. శక్తి, సామర్థ్యము;
చాతుర్యము,నేర్పు.

క. ఈదుడుకుఁగోఁతిఁ గొని చని, మీదిట్టతనం
బు నెల్ల మెఱయఁగ నిపు డో,గా దనక
తోఁక గాలిచి,వీధుల వీధులను ద్రిప్పి విడు
వుఁడు కడఁకన్. అచ్చ. రా. సుం.౧౬౪.
(శర. పా.)

ఉ. దిట్టతనంబు మీఱ నుపదేశము సేయుచు
నుండు బ్రహ్మమున్. కాశీ. ౧. ౭౬.

క. నెట్టుకొని యాఁడువారల,దిట్టతనం బెఱుఁగ
బ్రహ్మదేవునివశమే. విక్ర. ౭. ౪౭.

౨. ధైర్యము.

ఉ. చుట్టతికంబునన్ మనసు సొచ్చి ననుం
గరఁగించి వేఁడినన్, దిట్టతనంబు వో విడిచి
తీవ్రరణంబుకడంక దక్కెనే, బట్టినయా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యుద్ధంబు పెడఁబాసినఁ గాని వధింపఁ బోల
దు. భార. భీష్మ. ౧. ౧౪౯.

ఉ ... ఇంద్ర శ్రీ, ద్రిమ్మరిదామ్మికయ్యమున దిట్టతే
నం బఱి పూరిమేసితో. దశా. ౨.౪౧౩.

౩. మహిమము, గొప్పతనము.

వ. అట్టిచుట్టుకెదువజగజెట్టికి విడిదిప ట్టయిన
పెట్టేఁబెట్టుదిట్టగట్టు కట్టుమట్టుదిట్టతనం బె
ట్టిదనిన. రా. వి. ౧. ౨౯.

దిట్టపడు. అ. క్రి. (దిట్ట + పడు.) అలముకొను.

ద్వి. జలజారినడుకప్పుచాయఁ గెంగేలఁ, బులుము
కాటుక మొగంబున దిట్టపడఁగ. అ. మ. క.
౧. ౨౫ పా. ౧౫ పం.

దిట్టము=దిటము. విశ. ౧. దృఢము, గట్టిది; స్థిర
ము, శాశ్వతము.

దండకము... సద్భోగినీపట్టముల్ దిట్ట మౌనట్టు
గా వే ప్రసాదించి తన్నాత రావించి... భో
గినీదండకము.

౨. నిర్ణీతము, నిశ్చితము.

సీ... దేహికి మరణంబు దిట్ట మగును. శివధ.
౫. ౭౩.

వి. ౧. ధైర్యము.

గీ. కొసర నెఱుఁగనికూరిమి కుదురుపా టై,
ఱుఁగనిదిట్టంబు నిలుక డెఱుఁగనిమనము, నై
పతికిఁ దమి రేఁచె నత్యధికలీల, నంగనామణి
నూతనసంగమంబు. చంద్రా. ౬. ౧౪౭.

౨. నిర్ణయము, నిశ్చయము.

సీ. దిట్ట మం చనఁగఁ గన్పట్టు నిర్ణయముగ...
ఆం. భా. ౧. ౧౦౩.

దిట్టాడు. అ. క్రి. (దిట్ట + ఆడు.) అతిశయించు.

శా. దేవా కయ్యముతోడివేడుక మదిన్ దిట్టాడు
మర్త్యుండు నే, త్రోవం జేతులతీఁట వుత్తు
నని కోరన్... ఉ. హరి. ౫. ౨౧.

దిడ్డి. వి. (క. దిడ్డి. త. తిట్టి.) పాలకీ మొదలగు
వానిద్వారము; చిన్నద్వారము.

ఉ... పైఁడిపాలకీ, నప్పువుఁబోఁడి నుంచి మెఱుఁ
గారెడుబంగరువ్రాతపచ్ఛదం, బొప్పఁగ దిడ్డి
వైచికొని యుబ్బు మెయిం గొనిపోయె నింటి
కిన్. పరమ. ౨. ౩౭.

సీ. తగువాహనముల నంతఃపురకాంతల నిడి దిడ్లు
వైపించు హెగ్గడులును. కళా. ౭. ౨౯.

చ... అంతటఁ బుట్టుగుగట్టుమీఁదటన్, దెలివి
దలిర్పఁ దామరలదేవర తోఁచిన తేఁడుఁ
గొమ్మయున్, సాలపులతోడుత న్నగరుఁ
జొచ్చిరి లోపలిదిడ్డిత్రోవచేన్. యయా.
౫. ౧౫౧.

ఏనుఁగు నెక్కియు దిడ్డిదూఱు =లేనిగొప్పతనము
నకు తగనిపని చేయు.

ఉ. ఇంతవిచార మేల తరళేక్షణ యెంతటివాని
నైన నీ, కాంతునిఁ జేయుదాన రతికాంతుని
పాదము లాన నీకు న్నా, యంతటిబోఁటి గల్గఁ
దగవా వగఁ జెందఁగ నీమనోరథం, బింత
యుఁ జెప్ప మేమిటికి నేనుఁగు నెక్కియు
దిడ్డిదూఱఁగన్. విక్ర. ౪. ౧౪౯. రుక్మా.
౫. ౧౦౫.

గీ. వైభవంబునఁ గొనిపోవ వలయుఁ గాని, తె
ఱవ యేనుంగు నెక్కియు దిడ్డిఁ దూఱ. పి.
శకుం. ౩. ౨౪౪.

ఉ. ఎన్నిక కెక్కు నవ్వరమదేభము నెక్కి
తదీయసాలసం, ఛన్నమరుత్పురిన్ వెడలి సం
దడి నేనుఁగు నెక్కి దిడ్డిదూఱ న్నను నవ్వ
రే యని పురందరుఁ డప్పురిపెద్దవాకిటన్,
జన్నపుఁగూటికై యరుగు సారె బహిస్థితయ
జ్ఞవాటికిన్. చంద్రా. ౧. ౬.

జః దిడ్డిగంత, దిడ్డివాకిలి.

దిడ్డిగంత. వి. (దిడ్డి + కంత) దిడ్డికన్నము.

గీ. ద్విపదకావ్యంబు ముదికాంత దిడ్డిగంత, యి
య్యానేరనిరండ నా శ్లేకరాశి. వేణు. ౫౫.

దిడ్డివాకిలి. వి. (√దిడ్డి- క. దిడ్డిబాకలు. త. తిట్టి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాయిల్.) చిన్నద్వారము.

ద్వి. తిర మగుచున్నట్టిదిడ్డివాకిళ్లే, నుపసత్త్వ లుండుదు రొక్కొక్కకోటి. రం.రా.యు. 303 పు. ౨౫ పం.

దితము. సం. విణ. (అ. ఆ. అ.) భేదింపఁబడినది, నఱకఁబడినది.

దితి. సం. వి. ఇ. స్త్రీ. ఖండనము, నఱకుట. ఇ, ఈ. స్త్రీ. దైత్యులతల్లి, కశ్యపునిభార్య.

దితిజుఁడు. సం. వి.అ. పుం. దితికొడుకు, దైత్యుఁడు. ఇట్లే: దితితనయుఁడు,మొ.

దిత్యుఁడు. సం. వి. అ. పుం. రాక్షసుఁడు. (వాచ, కల్ప.)

దిత్స. సం. వి. ఆ. స్త్రీ. ఈయవలయునను కోరికి, దానేచ్ఛ.

దిత్సువు. సం. విణ. (ఉ) ఈయఁగోరువాఁడు, దానేచ్ఛువు.

దిదృక్ష. సం. వి. ఆ. స్త్రీ. చూడవలయు నను కోరిక.

దిదృక్షువు. సం. విణ. (ఉ) చూడవలయు నను ఇచ్ఛగలవాఁడు.

దిద్దు. స. క్రి. (క. తిద్దు. త. తిరుత్తు) ౧.(విద్యాదులందు) తీర్చు, శిక్షించు.

ఉ. అంతఁ గ్రమంబునం బ్రియునియాజ్ఞను సత్యయు భోజకన్యయుఁ, సంతస మొప్ప నప్పరమసంయమి నొక్కొకయేఁడు దిద్దిర, త్యంతమనోజ్ఞగానపటిమాతిశయోన్నతుఁగాఁగ నవ్విభుం, డంతటఁ దాను దిద్దె నొకయబ్దము పూర్ణము గాఁగ నారదున్. కళా. ౨. ౩౫.

క. ఉద్దవిడిఁ గవియుకుక్కలు, గద్దఱిసివ్వంగు లిర్లు గడు నేచినమే, లెద్దులు మొదలుగ వేఁటకు, దిద్దినయవి ప్రోఁగుదాల్లు దెఱచీర గముల్. యయా. ౧. ౩౯.

౨. చక్కఁబఱచు, చక్కఁజేయు.

వ...తుఱుము దిద్దుచుఁ దద్వారణాభినయవత్ప్రాచీనకరాబ్జ లై...ఆము. ౪. ౩౫.

శా. ఆలీలన్ రతికేళిఁ దేలి తుదయం దాయిద్దఱున్ గేలిభి,న్నాలంకారములొక్కరొక్కరికి నిం పొనట్లుగా దిద్దుచున్. కళా. ౩. ౧౭౦.

౩. అలుకు.

క. నును పగుమ్రుగ్గమదపఙ్కం,బునఁ దీనియ దిద్దిక ప్రపుంబొడిముగ్గుల్, నినిచి లవలీదళము లమై, మనసిజరతిసతుల వ్రాసి మఱి యద్దరులన్. రసిక. ౪. ౭౪.

౪. విభూతి తిలకము,మొ.పెట్టుకొను;ధరించు.

సీ. తిగ రేక తేర్పడదిద్దిననొసలిను న్వెలిబూదిబొట్టురంగులు సెలంగ. నీలా.౧. ౬౦.

గీ. మణికిరీటంబు జాతించి మగుడ దిద్దు,దళుకుఁగొనగోర మీసలనులి యొడల్చు, నాచకోరాక్షి తనుఁ జూచు టరసి యరసి.కళా. ౫. ౧౧౩.

౫. నియమించు, నియోగించు.

గీ. అనఘ జాత్యభిమానదేహాభిమాన,లేశములు దాసురాలికి లేవు మాధు,కరము నలవాటె మీవంటిఘనులు దిద్దు,పనులు సేయుటకంటె శుభంబు గలదె. వైజ. ౨. ౧౧౦.

౬. త్రవ్వు.

మ. తనశృంగారవనంబులోన గిరిపాంతం జక్కగా దిద్ది తీ,ర్చినపూఁదేనియ యేటికాలువ దరిన్...పారి. ౧. ౭౧.

౭. (ఉపాయము) పన్ను.

క. తదుపాయము దిద్దుటకున్, మది నెన్నఁ బ్రభావఘనులు మఱి లేరు మహా,భ్యుదయానుభావగుణసం,పదఁ బొదలినమీర తక్కఁ బావనచరితా. కళా. ౩. ౫౬.

౮. చేయు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్వి.అట్టివారెనమండ్రు నఖిలకార్యములఁ, బట్టున దిద్దఁ దీర్పను జాలి కొలువ. రం.రా.బాల. ౧౦ పా. ౩ పం.

౯. సవరించు.

ఉ...ఆనృపతిపాలికిఁ బోయెద వేమొ పొమ్ము నీ, యిచ్చకు వచ్చినట్లు రమియింపు మొకా నొకమాట పుట్టినన్, నెచ్చెలి లేదుబంతి యను నేర్పున దిద్దుకొనంగఁ జాలినన్. శుక. ౨. ౯౭.

౧౦.వ్రాసి యిచ్చినయక్షరములపై మరలవ్రాయు.

సీ. గద్దించి వడిఁ దిట్టి దిద్దు మంచును వ్రేలు వెట్టింప నచట నేఁ బెట్టకుండు. హంస. ౩. ౧౪౨.

౧౧. మార్చు.

క...త ప్పొప్పు మదిన్, భావించి దిద్దకుండను, దేవానాంప్రియుల మ్రొక్కి తెలుతుఁ గుకవులన్. రాఘవ. పీఠి. ౫. (శ.ర.పా)

౧౨. (అప్పు) తీర్చు.

ఉ. ఏయెడ కేల పోవు నతఁ డెవ్వరికైనను జిక్కవాఁడె తా, నాయన మీకు నీవఱకు నచ్చినయ ప్పిట దిద్ది తా సుఖో,పాయత నున్నవాఁడు శ్రుతిపాఠము సేయుచుఁ దోఁట లోన నే,మాయయగా రటంచు నలమాయల మారి చనెం దటాలునన్. వైజ. ౪. ౧౬.

జః దిద్దుకొను, దిద్దుగడ, దిద్దుడు, దిద్దుపాటు, దిద్దుబడి, దిద్దువడు.

దిద్దుకొను. స. క్రి. (√దిద్దు.) చక్కఁబఱచుకొను.

క. విను వల్లభ క న్నుండెం, గనుఁబొపం దివియ నేర్పు గలముని మ్రుచ్చీ,వనిత తగ దిచట నుండక, వెనుకను దిద్దుకొన వచ్చునే యొకపైనన్. కళా. ౩. ౧౮౮.

దిద్దుగడ=దిద్దుడు. వి. (√దిద్దు) దిద్దుపాటు, అనుశాసనము.

మ. మిముబోం ట్లాఁడుది పల్కు దిద్దుగడకున్ మే లందురే... అచ్చ. భా. ౧. ౪౧.

దిద్దుడు=దిద్దుగడ. (√దిద్దు-శ.ర.)

దిద్దుపాటు. వి. (√దిద్దు) ౧. సవరించుట. ౨. శిక్షించుట. (శ. ర.)

దిద్దుబడి=దిద్దుపాటు. (దిద్దు + బడి-శ.ర)

దిద్దువడు. అ. క్రి.(దిద్దు + పడు)శిక్షణముపొందు.

గీ. నాట్యసంగీతకళల నెన్నంగ నన్ను, రంభ వోలుట యెంతదూరంబు దలఁప, దేవకుల నాథ నాయొద్ద దిద్దువడిన, పాలఁతి యెన్నఁటికిని నన్నుఁ బోలఁ గలదె. వాల్మీ. ౩. ౩౭.

దిధక్ష. సం. వి. ఆ.స్త్రీ. దహింపవలె ననుఇచ్ఛ.

క ... లంకాపురీదిధక్షాదీక్షా,రూక్షప్రతాపుఁ గంటే, సాక్షాల్లయసమయపవనసఖు సామీరిన్. రామా. ౭. ౧౯౭.

దిధక్షువు. సం.విణ.(ఉ)కాల్ప నిచ్ఛ గలవాఁడు, దహింపఁ దలఁపు గలవాఁడు.

దిధిషువు. సం. వి. ఉ, ఊ. పుం. మాఱుమనువుదానిమగఁడు, పునర్భూపతి. ఊ. స్త్రీ. ౧. మాఱుమనువు చేసికొనినస్త్రీ.౨.చెల్లెలికి పెండ్లియై తనకు పెండ్లి కానిస్త్రీ.

దిధిషూపతి. సం. వి. ఇ. పుం. ౧. మృతుఁడయినభ్రాతయొక్క భార్యను అనురాగముచే పొందినవాఁడు. (మను. ౩. ౧౭౩.) ౨. దిధిషువుయొక్క మగఁడు, మాఱుమనువుదానిమగఁడు.

దిధీర్ష. సం. వి. ఆ. స్త్రీ. ౧. ధరింపవలె నను నిచ్ఛ. ౨. పోషింపఁవలె నననిచ్ఛ.

దిధీర్షువు. సం.విణ. (ఉ) ౧. ధరింప నిచ్ఛగించువాఁడు. ౨. పోషింప నిచ్ఛగించువాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దినకరతనయ. సం. వి. ఆ. స్త్రీ. ౧. తపతీనది. ౨. యమునానది.

దినకరతనయుఁడు. సం. వి. అ. పుం. ౧. సుగ్రీవుఁడు. ౨. కర్ణుఁడు. ౩. శని. ౪. యముఁడు.

దినకరము. సం. వి. అ. పుం. జిల్లేడు.

దినకరుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

దినక్షయము. సం. వి. అ. పుం. ౧. తిథి తగ్గుట. ౨. సాయంకాలము, మాపు.

దినగో(కో)రు. మి. వి. (దినము + కోరు²) ౧. దినభాగము, దినమున కొక్కనివంతు.

సీ. తిపుటఁ జుక్కల తేని దినగోరు మెసఁగిర పండ్లుడుల్చిరి కల్పపాదపంబు. నైష. ౭. ౮౧.

౨. దినరోజు, దినభృతి, రోజుకూలి.

గీ...దినకో రనంగ, వెలయు దినరోజు...ఆం. భా. ౩. ౩౨.

దినచర్య. సం. వి. ఆ. స్త్రీ. దినకృత్యము, ప్రతిదినము చేయవలసినపని.

దినచేల్వాలు. మి. వి. బ. (దినము + చల్వలు) దినమునకు ఒక్కొక్కటిచొప్పున ఉపయోగించుచలువచేసినవస్త్రములు.

క. నిద్దంపు మేలిసొమ్ములు, దిద్దినకస్తూరిబొట్టు దినచల్వలు నై, ప్రొద్దోకసింగారముతో, ముద్దియ చనుదేర మిగుల మోహాతురుఁ డై. విజ. వి. ౨. ౧౪౪.

దినజ్యోతి. సం. వి. స. న. ఎండ, ఆతపము.

దినదుఃఖితము. సం. వి. అ. పుం-పొగలు దుఃఖముకలది-చక్రవాకము, జక్కవ.

దినపతి. సం. వి. ఇ. పుం. ౧. -పగటి ఱేఁడు-సూర్యుఁడు. ౨. వారాధిపతి, సూర్యచంద్రాంగారకబుధగురుశుక్రశనులలో ఒకఁడు. ౩. జిల్లేడు.

దినపాతము. సం=దినక్షయము.

దినపిండము. సం. వి. అ. న. (జ్యోతి) అహర్గణము, దినములసముదాయము.

దినపుఁడు. సం=దినాధీశుఁడు.

దినప్రణి. సం. వి. ఈ. పుం. ౧-దినమును చేయువాఁడు-సూర్యుఁడు. ౨. జిల్లేడు.

దినబంధువు. సం. వి. ఉ. పుం = దినపతి.

దినబత్తెము. మి. వి. (దినము + బత్తెము.) ప్రతిదినము ఇచ్చెడుబత్తెము.

ఉ. నావుడు భూమిపాలుఁడు మనంబునఁ గోపము సంభవింపఁగా, నావటుమూర్తిఁ జూచి వసుధామర యీగతి నిష్ఠురోక్తు లేలా వచియింప నీకు మొదలన్ జనబత్తెము నే నొడంబడన్, నీవు గురుప్రయోజనము నెమ్మనొనర్పఁగ వచ్చి తిమ్మెయిన్. హరిశ్చ. ౪. ౧౯౨.

దినమణి. సం=దివామణి.

దినమయూఖము. సం. వి. అ. పుం. జిల్లేడు.

దినమయూఖుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

దినము. సం. వి. అ. పుం. న - ౧. చీకటిని ఖండించునది - దివసము, పగలు. (దీనిభాగములు పదునేను. ౧. రౌద్రము. ౨. శ్వేతము. ౩. మైత్రము. ౪. కారభటము. ౫. సావిత్రము. ౬. విజయము. ౭. గాంధర్వము. ౮. కుతపము. ౯. రౌహిణేయము. ౧౦. విరించము. ౧౧. సోమము. ౧౨. నిర్ఋతి. ౧౩. మాహేంద్రము. ౧౪. వరుణము. ౧౫. భటము.)

౨. అఱువదిగడియలకాలము, అహోరాత్రము, రేయితోఁ గూడినపగలు. ౩. (చాంద్రమానమున) తిథి. ౪. ఒకచాంద్రమాసపుఁబరిమితి గలపితృదేవతలదినము, మనుష్యమానమున ౩౦ దినము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. ౫. సౌరసంవత్సరరూప మగు దేవతల దినము, మనుష్యమానమున ३౬౦ దినములు. ౬. 8,64,0000,000 మనుష్యసంవత్సరకాలపరి మితి గలకల్పము, బ్రహ్మదినము. ౭. ప్రతిదినము, దినదినము.

శా... హేరాళంబుగా నద్రిక,న్యాజానిం భజి యించు నిత్యనియతిం దత్కాలపూజాక్రి యా,భ్రాజిష్ణుత్వమునన్ జపించు దినముం బంచాక్షరీమంత్రమున్. విప్ర. ౧. ౨౦.

దినముఖము. సం. వి. అ. న. అహర్ముఖము, ప్రభాతము, వేకువ.

దినమూర్ధము. సం. వి. న్. పుం. ఉదయపర్వ తము, పొడుపుఁగొండ.

దినయావనము. సం. వి. అ. న.మధ్యాహ్నము.

దినరత్నము. సం. వి. అ. న. ౧. సూర్యుఁడు. ౨. జిల్లేడు.

దినరోజు. మి.వి.(దినము + రోజు) ఏరోజు చేసిన పనికి ఆరోజున ఇచ్చుకూలి, రోజుకూలి.

సీ. పగటిగాసంబు దప్పక యుండ దినరోజు మాదిరి నొంటరిజోదుమాఁక.రా.వి.౫.౧३.

వ. ఇట్టితెఱంగున బిట్టు వడి గుట్టు చెడి గట్టు వడిం జేరుటకై యగడతం బడి మునింగి దరిం జేరి సారి రోఁజుదినరోజురాహుత్తులును... రా. వి. ౫. ३౨.

దినవహి. వి. జమాఖర్చు.

చ...శో, భనతరచంద్రదీధితులపంక్తి జమాఖరు చుల్ గణించి యిం, తనుకొని కాల మన్ గణన్ దప్పదు తీర్చి లిఖించినట్టియా,దిన వహిలెక్కవ్రాలనఁగఁ దెల్విగఁ జుక్కలు పర్వె నత్తఱిన్. హంస. ౧. ౧౭౨.

దినవెచ్చము. మి. వి. (దినము + వెచ్చము) దిన దినమును జరిగెడివ్యయము.

సీ. కైలాసగిరిఁ బండె మైలారువిభుఁ డేఁగి దిన, వెచ్చ మేరాజు తీర్పఁగలఁడు. వీథి. ౭౯.

సీ.దినవెచ్చమునకు నై తనమేనఁ గలసొమ్ము కొదు కక బచ్చింటఁ గుదువవైచు.పాండు.३.౧౬.

దినసరి. వి. సస్యవిశేషము.

ద్వి. దినసరి సరి యయ్యెఁ దీఱె సంబావు. విష్ణు. పు. ३౭. (చి.ని. ౪.ర.)

బ. ధాన్యవిశేషము. (౪.ర)

దినసరులు. వి. బ. (సం. దినచర్యా) దినచర్య ప్రతిదిన కార్యక్రమము.

చ. వినఁడు ప్రమోదలీలఁ బృథివీవరు లంపిన రాజకార్యపుం, దినసరులన్ జను ల్మనవి దె ల్పుకొన న్మఱుమాటఁ బల్కఁడు...ఇందు. ౨. ౨౧౯.

౨. ప్రతిదినకార్యక్రమము వ్రాయుపుస్తకము; ఉత్తరము.

పాట. ఒఱపు మీఱ దినసరు లొడి నుంచి గం టంపు, టొఱ చల్వదుప్పటిపొరలోనఁ జె క్కి,,గరిమతో వచ్చిరి కైకానుకలు గొం చు,సరసు లైనరాయసమ్ములవారు. రఘునా. ౧౧౮.

సీ. ఒకచక్కి రాయసాల్ ప్రకటవాగ్వైఖరిఁ జదురులై దినసరుల్ చదువుచుండ. భోజ సుతా. ౧. ౧౦౪.

క.ఘనతరభేదోపాయం,బునకుం దగినట్టియుక్తిఁ బుట్టించి రయం, బొనరఁగ రాయలపేరిటి, దినసరు లాశత్రియులకుఁ దేటపడంగన్. కృష్ణ. ३. ౧౦౪.

దినాంతకము. సం. వి. అ. పుం. ౧. దినాంతము, సాయాహ్నము, మాపు.౨.చీకటి,అంధకారము.

దినాంతము. సం=దినాత్యయము.

దినాగమము. సం. వి. అ. పుం. ప్రాతఃకాలము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దినాత్యయము. సం. వి. అ. పుం. సాయంకాలము, మాపు.

దినాది. సం. వి. ఇ. పుం. ప్రాతఃకాలము.

దినాధీశుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

దినారంభము. సం. వి. అ. పుం=దినాది.

దినారి. వి. (సం. దీనారః) పైఁడి, బంగారము.

ఉ. పొందుగ దుష్టబుద్ధియు సుబుద్ధియు నాఁగ వణిక్కుమారు లానందముతోఁ జరింప నొకనాఁ డొకచోట సుబుద్ధి గాంచెఁ బెం, పొంద దినారిటంకముల నుంచినకాంచనకుంభ మట్టియా,సుందన మొక్కచోట నిడి కూర్చినకోమటిఁ జేరి చెప్పినన్. నా. పంచ. ౧. ౫౦. (శ. ర. పా.)

దినావసానము. సం=దినాత్యయము.

దినిక. సం. వి. ఆ. స్త్రీ. దినభృతి, దినబత్తెము.

దినుసు(స్సు). విణ. (త. తిణిచు. క. దినుసు) సమము, తుల్యము.

సీ. తాఁబేలు కడుపులోఁ దలఁ గ్రుక్కుకొని యొబ్బో తెలివమీఁగాల్లతో దినుసు గాక. అచ్చ. రా. ఆర. ౨౨.

చ. ఎన యగు పెట్లు కెంజిగి వహించినయంత నె కెంపు విద్రుమం,బును గఠినంబు లౌట మృదువుల్ గద దాసనముల్ గిసాలముల్, దినుసన దీటుగా వవియుఁ దియ్యఁదనంబును సౌరభంబునన్, గన్గమి లతాంగి మోవికి జగత్రయి దీటుగువస్తు వెద్దియో. ఇందు.౨.౧౫౪.

వి. (క.హిం. దినుసు=వస్తువు) ౧. వస్తువు.

చ. పయిఁబయిఁ బండుకొల్చు విరిపైఁడియు గట్టి దినుస్సు ... అన్నవితీర్ణికి వెచ్చపోవఁగా. కళా. ౬. ౭౫.

౨. విధము, ప్రకారము, రీతి.

సీ. పెనుగట్టులను బెట్టుకొనునట్టు కనుపట్టుచను కట్టు పుటముల దినుసు చూప. పార్వ. ౫. ౧౮౪.

3. రకము, జాతి.

ద్వి... పెంచు హేమంబును నొక్కదినుసుగాఁ గనుఁగొను దీనుండు గాఁడు. ప్రభు. ౨.

గీ. జిలితొగలరాజనములు నలవరులును, దెల్లనల్లచెన్నంగులు దీవసరులు,నాది యగు పేర్ల గలుగువ డ్లతనియింట, నుండు శతకోటిపుట్లు లొక్కొక్కదినుసు. హంస. ४. ౧౨౭.

బ. దినుసులు=అపరాలు.

సీ. కాయధాన్యంబులకణఁజము ల్బియ్యంపుగరిసెలు దినుసులు గలకొటార్లు. హంస. ౨. ౨౭౯.

జః దినుసుమీఱు, దినుసువచ్చు.

దినుసుమీఱు. అ. క్రి. (√దినుసు) సాటిలేనిదగు, నిరుపమాన మగు.

సీ. తెలిఁగంటిదొర లెల్ల దినుసుమీఱినలెంక లలరువిల్దాల్పు ముద్దులమఱంది. అచ్చ. రా. బాల. ౬.

దినుసువచ్చు. అ. క్రి. (√దినుసు.)సాటివచ్చు.

సీ. కంటి కింపగు రేఖ గల్గియుండుటఁ జేసి మినుకుఁగాటుక కొంత దినుసువచ్చు. గీ. వికచకమలాక్షి నునుసోగ వెండ్రుకలకు. విజ. వి. ౧. ౩౫.

దినేశము. సం. వి. అ. పుం. జిల్లేడు?.

దినేశుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

దినేశ్వరాత్మజ. సం. వి. ఆ. స్త్రీ. ౧. యమున. ౨. తపతి.

దినేశ్వరాత్మజుఁడు. సం. వి. అ. పుం. ౧. శని. ౨. కర్ణుఁడు. 3. సుగ్రీవుఁడు. ४. యముఁడు.

దినేశ్వరుఁడు. సం=దినేశుఁడు.

దిన్నె. వి.వృక్షవిశేషము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. సంపాతి తాఁడియు శరభుఁడు దిన్నెయు నలుఁడు మత్తియు...అచ్చ. రా. యు. ౩౩౨. ('దిన్న' శ.ర. పా.)

దిప్పకాయ. విణ. కొంటెవాఁడు.

ద్వి. తలపోయ నీతుమ్మెదలుకూడ గొట్లు, మల యమారుతము ద్రిమ్మరి దిప్పకాయ. ద్వి.పర మ. ౩. ౨౮౪ పా. ౧౩ పం.

దిబ్బ. వి. (సం. ద్వీపః. త. తిప్పై) ౧. ద్వీపము.

గీ. బల్లిదపుచేటియిల్లాండ్ర్రయల్లిబిల్లి, మేర ద ప్పక నిలిచిననీరు వెల్లి,నిట్ట నేరేడుదిబ్బకుఁ జుట్టువాఱు, తీరు చెన్నారుమున్నీరు తెఱ వ గాంచి. కవిరా. ౪. ౬౩.(నేరేడుదిబ్బ= జంబూద్వీపము.)

౨. ఉన్నతభూమి.

మ...పక్షీంద్రుండు చంచద్గతిం, జనియెణ్ దా నురగాభిధాన మగునాశైలంబుపెన్దిబ్బకున్. భార. అను. ౧. ౨౭౯. (చి. ని, ప్రాఁతప్ర తులపా.)

ఉదా: శ్మశానపుదిబ్బ, గోరీలదిబ్బ.

౩. మట్టి మొదలగువానికుప్ప.

ఉదా: పెంటదిబ్బ.

౪. హస్తినఖము, దుర్గద్వారమున వాటముగా నేర్పఱిచినమట్టిదిబ్బ.

గీ. తిన్నె దిబ్బ యనంగ హస్తినఖ మొప్పు. ఆం. భా. ౨. ౨౧.

౫. పర్వతము, కొండ.

సీ. గుబ్బలా యపరంజిలిబ్బులా రుచి మించు దిబ్బలా యనిపాంథధీరు లెన్న. హంస. ౩. ౨౦.

జః దిబ్బచూపు.

దిబ్బచూ(సూ)పు. అ. క్రి. (దిబ్బ + చూపు) దిబ్బగా ఏర్పడు.

వ...అస లడుగువడియె నెఱి నిసుక దిబ్బచూపె నిద్ర చవి యయ్యె...కాశీ. ౩. ౨౩.

దిబ్బడ. వి. శైత్యాదికముచేత ముక్కు చెవులందు కలిగెడిబాధావిశేషము. (చూ. దిబ్బడవేయు)

దిబ్బడము=దబ్బడము. వి. మూఁకుడు (శ. ర.)

దిబ్బడవేయు. అ.క్రి. (√దిబ్బడ) శైత్యాదికము చేత ముక్కుచెవులందు ఒకవిధ మగుబాధ కలుగు.

(వ్యవ) నాకు చెవులు దిబ్బడవేసినవి.

పడిసెముపట్టి ముక్కులు దిబ్బడవేసినవి.

దిబ్బె(బ్బియ)ము వి. (సం. దీపః.) దీపము. (చూ. దిబ్బెమెత్తు.)

జః దిబ్బెమెత్తు.

దిబ్బెమెత్తు. అ. క్రి. (దిబ్బెము + ఎత్తు.) దీప మెత్తి ప్రమాణముచేయు.

సీ. దిబ్బెమెత్తఁగ వచ్చు నబ్బురం బగుక ల్తిమేర మీఱినరీతి మెలఁగఁ డనుచు. పాండు. ౧. ౬౩. ('దిబ్బమెత్తు' చి. ని. పా.)

దిమికిట. వి. తుడుము మున్నగువాద్యములధ్వని క నుకరణము.

సీ. తటపెటదిమికిటధ్వను లోలిఁ బుట్టింపఁజాలు గుమ్మెట చంక వ్రేలుచుండ. క్రీడా.౨౬.

దిమిదిమి. వి. మద్దెలమ్రోఁత కనుకరణము.

ద్వి. దిమిదిమి యనుచు మద్దెల మ్రోయఁబాట, లమర నారీమణు లాడుచందమున, ఘుమ ఘుమ మనుచు మేఘుండు గర్జింప.రం. రా. కిష్కిం.౨౯౯ పా. ౧౭ పం. (శ:ర. పా.)

దిముకు. వి. మృదంగరవము, మద్దెలమ్రోఁత.

సీ...దిముకు నా మృదంగరవము వెలయు... ఆం. భా. ౧. ౧౨౧.

దిమ్మ[1]. వి. ౧. దిబ్బ; రాశి, ప్రోవు.

గీ.కమ్మవిల్కానిచేతిపూఁగొమ్మ ముద్దు, గుమ్మ రత నంపుఁబసిఁడికీల్బొమ్మ వలపు,గ్రమ్మ ని మ్మగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కపురంపుదిమ్మసుమ్ము. రసిక. ౨. ౩౮.

గీ. తమ్మికొలంకుల నోలాడి కమ్మపూవుఁ, గొమ్మలు గదల్చి కపురంపుదిమ్మ లెక్కి. అచ్చ. రా. బాల. ౧౭౧.

సీ...తెచ్చినాఁడ ధనంబు దిమ్మలుగను. కాశీ. ౩. ౨౪౪.

౨. స్తంభము మంచపుఁగోడు మున్నగువాని క్రింద నుంచుకొయ్య తాయి మున్నగువాని ఖండము.

(వ్యవ) గుంజక్రింద మంచిదిమ్మ వేయుము. మంచపుఁగోళ్ల క్రింద దిమ్మలు పెట్టినారు.

౩. బంగారు మున్నగువానిని పై నుంచి సాఁగఁ గొట్టుట కుపయోగించుఇనుపముక్క.

(వ్యవ) కమసాలి దిమ్మపై ఒడ్డాణపు రేకు సాఁగఁ గొట్టుచున్నాఁడు.

౪. మన్ను ఇటుక మున్నగువానితో కట్టు స్తంభము.

(వ్యవ) అపాక దిమ్మలమీఁద కట్టినారు.

జ. దిమ్మపడు.

దిమ్మ[2]. వి. వికారము.

ద్వి. జనకనందనతోడ సకలరాజ్యంబు, నెనయ రాముని కిమ్మ నీదిమ్మ తెలిసి. రంరా. యు. ౫౧౪ పా. ౧౧పం. (చి. ని. పా. రాఘవుని కు నిమ్మువేవేగ. ముద్రిపా.)

ఆ. వివిధమహిమ లనుభవించుచు నుండియుఁ, మందుఁజఠరవహ్ని మాన్ప రాని,దప్పితోడఁ గూడి నొప్పింపఁ గన్నులు,మేను దిమ్మఁ దిరిగి మిడికిపడుచు. వరాహ. ౧౨. ౬౪.

ఆ. ఇట్లు వైచి దాన నిలమీఁద దనుజుండు, దిమ్మఁ దిరిగి పడుటఁ దేటి చూచి,యనుభవింపు చేసినంతయు నని పొశ్చె,మునకు మరలి విభునిఁ గని భజించె. రామా. ౭. ౨౬౬.

దిమ్మడుచు. అక్రి. (దిమ్ము[1] + అడుచు)-చెవులు-దిమ్మపట్టు, దిబ్బడవేయు.

వ...గుంటలు వడినకన్నులు దిమ్మడుచుకర్ణంబులు గలిగి...దశా. ౨. ౫౩.

వ...దిమ్మడుచు చెవులును సొమ్మసిల్లిన తనువులు నుం గలిగి యప్పు డప్పాపాత్ములు...పానందో. ౨. ౨౫ పా.

దిమ్మపడు. అ. క్రి. (√దిమ్మ[1]) మొద్దువాఱు.

ద్వి.నదులు వేగము మాని నలి నట్టె నిలిఁచె,గదల వీవక సదాగతి దిమ్మపడియె, నిను తేరితురగంబు లేఁగక నిలిచె, ఘనుఁ డైనహరివాంఛితత్వంబుఁ జూచి. సిం. భాగ. ౨. ౭౯.

దిమ్మిస. వి. ౧. (నేల) చదును. (శ. ర.)

౨. నేల చదును చేసెడిసాధనవిశేషము.

(వ్యవ) ఆదిమ్మిసతో నేల చదునుచేయుము.

దిమ్ము[1]. వి. ౧. సమూహము, గుంపు.

వ.కోలలు గుప్పలుగూర నాఁటిన నిలువున గతాసులై యమ్ములదిమ్ములుంబోలె వ్రాలుదానవులును...భా. రా. అర. ౧. ౨౦౫.

గీ.తుమ్మెదలదిమ్ము రొద తలదిమ్మెసర్ప. ఇందు. ౩. ౧౨.

సీ. ఎలతుమ్మెదలదిమ్ము తలఁ గ్రమ్మ కరయెమున్నచిగురు చేపట్లకు డిగకమున్న. వసు. ౪. ౨౫.

౨. (త.తిమ్మై.క.దిమ్ము.) జడత్వము,మాంద్యము.

ద్వి. కన్నుల మిఱుమిట్లు గదిసి దిమ్మెసఁగి,నిలిచి నభూపాలుని వ్యాజపాటు, దెలియుటను...మంత్రి యి ట్లనియె,జగదీశ నీ వొకజడునిచందమున. ద్వి. హరిశ్చ. పూ. ౧౨౫౬. పం.

మ. అనినం గాలిసఘూలమున్ చెవులలో నటించిన లైన నూ,నినపెందిమ్ము సొమ్మసిల్లి మగుడ న్వే తేటి...సారంగ. ౨. ౯౯.

శా...అక్కపులగాకల్ మళ్లి వీక్షింపుచున్, దిమ్ముం జేకొని పిల్చినం బలుకఁ కెంతే ఖిన్నులై సారెకుం, దమ్ముం గావు మటంచు నిల్చిన...సీతావి. ౩. ౧౦౫.

౩. మదము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. పాడి దప్పిరి నృపతులు బలిసెఁ గొండె, మడఁగెఁ దాలిమి మాత్సర్య మతిశయిల్లె, జెల్లె దయ పాతకంబులు వెల్లివాఱెఁ, గ్ర మ్మె దుర్వ్యసనంబులు దిమ్ము రేఁగె. వరా హ. ౭. ౩౧.

౪. తల, మొ. వానియందలిబాధావిశేషము.

క... ఓ,చెలి జూమ్మని విరహులకుం, దల దిమ్ము ఘటించుఁ దుమ్మెదలది మ్మిచటన్. విజ. వి. ౨. ౧౯౭.

గీ. తుమ్మెదలదిమ్మురొద తల దిమ్మొనర్ప.ఇందు. ౩. ౧౨.

జః దిమ్మడుచు, దిమ్మువట్టు, దిమ్మువడు.

దిమ్ము[2]. వి. ౧. గొప్పధ్వని కనుకరణము.

చ. అరుదుగ వాద్యవిద్య బిరు దందినవాయిద కాఁ డు లత్తరిన్, గరములు రెండు నొక్క సరిగా మురజంబులు ముట్టి దిమ్మనన్, మెర యఁగఁ జేసి... వినిపించి రుత్తగతి జంపె ధ్రువాద్యటముఖ్యతాళముల్. వైజ. ౧. ౧౨౩.

౨. పెద్దవస్తువు భూమి, మొ. వానిమీఁదఁ బడి నపుడు కలిగెడుధ్వని కనుకరణము.

ఉ. ఆమఘవాత్మజన్ము నొకయమ్మున దిమ్మునఁ గూలనేసి... రామా. ౫. ౩౨౬.

వ. ఆనగరంబుదెసనుండి దిమ్ము రేఁగిన యట్లు తూఁగొమ్ములును... ద్వా. ౧౧. ౨౩.

దిమ్మువ(ప)ట్టు. అ. క్రి. ౧. బాధగొను.

క. ముక్కున నోరున నెత్తురు, గ్రక్కుచుఁ దల దిమ్మువట్టఁ గడు దీనతతో. విష్ణు. ౭.౧౮౨.

౨. మత్తు గలుగు.

(వ్యవ) వీనికి తల దిమ్ముపట్టినది. (శ. ర.)

సొమ్ముపోయి దిమ్ము వట్టినది.

(వానికి సొమ్మును పోయినది, దిమ్మును పట్టినది.)

దిమ్మువడు. అ. క్రి. డిందుపడు.

గీ... దిమ్మువడియె ననంగ డిందు, పడియె ననుట దోఁచు... ఆం. భా. ౩. ౧౧౬.

దిమ్మె. వి. ౧. తామరదుద్దు. (శ.ర.)

౨. రాళ్లు మొ. వాని చిన్నమిట్ట, దిప్ప.

గీ...వలపు, గ్రమ్మని మ్మగుకపురంపుదిమ్మెసుమ్మ. నీలా. ౨. ౩౨.

౩. మద్దెలయంచు.

ద్వి. సంధించి బంధించి సప్తతాళములు, బం ధురగతులు తప్పకయుండ శ్రుతులు,...పరి పాటిగా దిమ్మెపై రాతఁ బొడిచి,కరవేగమున వాద్యకౌశల్య మెసఁగ. ప్రభులిం. ౨. ౨౬ పా. ౧౭౩.

౪. కొయ్యబిరడా. (శ. ర.)

దిమ్మెస. వి. కాసెవానికొలిముట్టు, జాతిపనివాని పనిముట్టు. (శ.ర.)

దిరదిర=దిర్దిర. వి. ౧. తిరుగుటయం దగుధ్వని కనుకరణము.

గీ. ధరణి దిరదిరఁ దిరుగుచందమునఁ దోఁచె. ఉ. రా. ౬. ౨౩౫.

దిరిసెనము=దిరిసెము. వి. (సం. శిరీషః. ప్రా. సిరిసో.) శిరీషము.

సీ. దిరిసెనపూవంటితిన్ననిమై కేల నలమిన వాడుగా ననుచుఁ గొంకి. చంద్ర.౫.౭౫.

గీ...,సన్న, విరిగి సోమిందగున్నంగి దిరిసెనంబు, మొదలుగాఁ గల్గు బహువిధభూరుహములు. హంస. ౪. ౧౧.

దిరిసెము=దిరిసెనము. శిరీషము.

గీ. దిరిసెంపుఁబువ్వులఁ దెగడుదోర్వల్లికి,యుగమునఁ గాఁగిటి కొనరఁ జేర్ప. భా. రా. యు. ౧౬౬౯.

చ. దిరిసెపుఁబువ్వుకంటెను మతింపఁగ మెత్తన చాలఁ జిత్తముల్. పి. శకుం. ౨. ౩౮.

సీ...దిరిసెము గిరిసెము దిరిసెన మన, జనును శిరీషాఖ్య...ఆం. భా. ౨. ౪౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దిర్ది ర=దిరదిర. :వి. తిరుగుటయందలిధ్వనికనుకర ణము.

క. తరిగొండఁ దరువఁ దరుచగ్, దిరుగుచువడు నుదధిలోనఁ దీవ్రముగా దిర్దిరఁ దిరుగుచుఁ దరఁగలవడిఁ, దరతరమ సుపర్వసురభి దరి కిం జేరెన్. హర. ౬. ౮౯.

ద్వి... కారాకుసుడిగాలి గడువడిఁ, ద్రిప్పతీరు న వాని దిర్దిర మింటఁ ద్రిప్పి. రం.రా.సుం. ౨౬౨పా. ౧౫ పం.

దిలీపుఁడు. సం. వి. అ. పుం. ఒకసూర్యవంశపు రాజు.(అంశుమంతునికొడుకు.భగీరథునితండ్రి, షోడశమహారాజులలో నొకఁడు)

దిలీరము. సం.వి.అ.న.శిలీంధ్రము,పుట్టగొడుగు?.

దిల్ల(ము)=డిల్ల.వి.అధైర్యము, పిఱికితనము.(బ్రా) విణ. నిస్సత్త్వము, బలహీనము-(చూ.దిల్లవడు. జః దిల్లవడు.

దిల్లవడు. (√దిల్ల) అ. క్రి. శోకాదులచే దేహము బలహీనమగు.

క. ఉల్లము జల్లన దేహము, దిల్లవడఁగ ధృతి దలంక దెప్పర మొందన్. భా. రా. ఆర. ౨. ౨౫౬.

దివంగమము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. స్వర్గ గామి, ౨. ఆకాశగామి, ఆకాశమునకుఁ బోవు నది, స్వర్గమునకుఁ బోవునది.

దివటి(టీ)=దివ్వటి.

సీ. దీవటీ దివ్వటి దివటి పంజనఁగను గరదీపికాఖ్య మై పరఁగుచుండు. ఆం. భా. ౨. ౧౬౫.

దివము. సం.వి. అ. న-ఇందు ప్రకాశింతురు-౧. స్వర్గము.

చ. దివమునసుండి దేవతలు దివ్యము లైనని జాంశజన్మముల్,భువిఁ గలిగించి...ఉ.హరి. ౧౦. ౩౧౪.

౨. ఆకాశము. ౩. పగలు. ౪. వనము.

దివసకరము. సం. వి. అ. పుం. జిల్లేడు ?.

దివసకరుఁడు. సం. వి.అ.పుం.సూర్యుఁడు.

దివసము. సం. వి. అ. పుం. న. -ఇందు ప్రకాశించును-౧. పగలు. ౨. అహోరాత్రకాలము. (దీనికి శాసనములయందు మువర్ణలోపము గానఁ బడియెడి.)

దివసపడి=నిత్యపడి, ప్రతిదినము నీయవలసినపరి మాణవిశేషము.

వ...బోలవసముసం బెట్టిన ఎడ్లు 50 దివసపడి వోయంగలత్రిభువనాంకుశముస...దా. శా. ౧౦౧౨.

వ...ఇనుపఎడ్లు 50 దివసపడి వోయంగ్గల...దా. శా.౧౦౧౩.

దివసముఖము. సం=దినముఖము.

దివసముద్ర. సం=దినిక. (విల్యమ్సు.)

దివసవిగమము. సం.వి.అ.పుం.సాయంకాలము. మేఘ. ౨. ౧౬.

దివస్పతి. సం.వి.ఇ.పుం.స్వర్గాధిపతి,ఇంద్రుఁడు.

దివస్పృథివులు.సం.వి.ఈ.స్త్రీ.ద్వి. ౧.ఆకాశము ను భూమియును.౨. స్వర్గమును భూమియును.

దివా. సం.అవ్య. పగలు. (దీనికి తెలుఁగున వ్యస్త ప్రయోగము లేదు)

దివాంధ. సం. వి. ఆ. స్త్రీ-పగటియందు గ్రుడ్డి యైనది-౧. తైలపాయిక,గబ్బిలము. ౨. ఆఁడు గ్రుడ్లగూబ.

దివాంధకి. సం.వి.ఈ. స్త్రీ. చుచుందరి,చుంచు.

దివాంధము. సం. విణ. (అ. ఆ. అ.) పగటి గ్రుడ్డియైనది. వి.అ. పుం.ఉలూకము,గ్రుడ్లగూబ.

దివాంధిక. సం. వి. ఆ. స్త్రీ=దివాంధకి.

దివాకరము. సం. వి. అ. పుం. ౧. కాకి. ౨. జిల్లేడు ?. ౩. ప్రొద్దుతిరుగుడుపువ్వు.

దివాకరుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దివాకీర్తి. సం. వి. ఇ. పుం. ౧. చండాలుఁడు, మాలవాఁడు. ౨. నాపితుఁడు, మంగలి. ౩. ఉలూకము, గ్రుడ్లగూబ.

దివాచరము. సం. వి. అ. పుం. కోయిల.

దివాచరుఁడు. సం. వి. అ. పుం-పగటనే గ్రామమునఁ దిరుగఁ దగినవాఁడు-చండాలుఁడు, మాలవాఁడు.

దివాటనము. సం. వి. అ. పుం-పగటఁ దిమ్మరునది-కాకి.

దివాణము. వి. (సం. దేవాయనమ్. ప్రా. దేవాణ. క. మ. దివాణ. హిం. దీవాన్.)
౧. రాజభవనము.

క. కుంభోద్భవుపాశమున ని,కుంభుదివాణమున భృంగి కులపతి గాఁగా. హర. ౫. ౯.

ద్వి. అడపకత్తెయుఁ దెల్లనాకు లందియ్య,వడిగఁ జిత్రాంగిదివాణంబుఁ జొచ్చి. ద్వి. శ. సా. ౧. ౩౭ పా. ౭ పం.

చ. చదువులపుట్టినిండ్లు శమసంపదయిక్కలు పుణ్యలక్ష్మికిన్, మొదలిదివాణముల్ ...భూసురోత్తములభూరిపవిత్రశరీరవల్లరుల్ .పాండు. ౧. ౧౦౯.

౨. సభాస్థానము.

ఉ...పాండుఁడీడు దివాణము స్నేహయ నించినఁ జేలెడుదుర్మదాంధులన్, బోఁడిమి మాన్చి ... ఆము. ౨. ౮౮.

ఉ. వెన్నునికిన్ దివాణ మగువేంకటశైలముఁ జూచువేడుకన్. ఘటికా. ౨.౧౬౭.

దివాణపువారు=రాజుకొలువుకూటములోనివారు, రాజభృత్యులు.

చ. కొలుచు సమగ్రభంగి నొనఁగూడ దివాణపువారిచేతికాఁ,కలు హుసివోవఁగాఁ గటిఁ ఫుఁగాల మెలుంగక... శుక. ౨. ౪౦౬.

దివాతనము. సం. విణ. (అ. ఈ. అ.) దివాభవము పగటియందైనది.

దివానిశము. సం.వి.అ.న. రేయుంబవలు, అహోరాత్రము.

ఉ...తొయ్యలియున్ శశియున్ దివానిశం, బయ్యెడ నుండి రిట్లు మదనాహవమోహవశానురక్తులై. శశాం. ౩. ౧౧౪.

దివాభీతము. సం.వి. అ. పుం. ౧. కలువకొలను, కుముదాకరము. ౨. గ్రుడ్లగూబ.

దివాభీతి. సం.వి. ఇ. పుం-పగలు భయముకలది- ౧. ఘూకము, గ్రుడ్లగూబ. ౨. చోరుఁడు, దొంగ.

దివాభీతుఁడు. సం. వి. అ. పుం. చోరుఁడు దొంగ.

దివామణి. సం. వి. ఇ. పుం. సూర్యుఁడు.

దివామధ్యము. సం. వి. అ. న. మధ్యాహ్నము.

దివావసానము. సం. వి. అ. న. దినాంతము, సాయంకాలము.

దివావసువు. సం. వి. ఉ. పుం. ౧. సూర్యుఁడు ౨. జిల్లేడు.

దివాశయము. సం. విణ. (అ. ఆ. అ.) పగలు నిద్రించునది.

దివాస్వప్నము. సం. వి. అ. పుం. ౧. పగటినిద్ర. ౨. పగటికల.

దివాస్వాపము. సం. విణ. (అ. ఆ. అ.) పగలు నిద్రించునది. వి. అ. పుం. ౧. పగటినిద్ర. ౨. గ్రుడ్లగూబ.

దివి. సం. వి. వ్. స్త్రీ. (ఆంధ్రనామసంగ్రహమతమున తద్భవము.) ౧. స్వర్గము; ఆకాశము.

గీ. కృష్ణరాయలతో దివి కేఁగ లేక, బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబు నగుచు. పెద్దన చాటువు.

గీ...నింగి,దివి మొగులుదారి...గాడ్పుతెం డ్రెన నభ మొప్పు..ఆం. సం. దేవ. ౩౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(గరుత్మంతుఁడు) గీ. ఇది సునిశ్చిత మని దివి కేఁగె... హరి. ఉ. ౪. ౨౨౧.

౨. దినము, పగలు.ఇ.పుం.చాపము, పాలపిట్ట.

దివిజుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) స్వర్గమునఁ బుట్టినవాఁడు. వి. అ. పుం. దేవత, వేల్పు.

దివిదారికొ(ర్కొ-)మ్ము. వి. రెం డిఱ్ఱికొమ్ములు జతచేసి ఏర్పఱచినఆయుధవిశేషము, సింగోట.

సీ. జింకకొమ్ములు రెండు చేర్చి యగ్గు లమర్చి డాకేలఁ బూన నొడ్డగనఁ బొడువ, సంగతి గలయది సింగోట యనఁగను దివిదారికొమ్ము నాఁ దేజరిల్లు. ఆం. భా. ౨. ౨౦౬.

(చూ. ఒడ్డగ. ఇట్లే బ్రా, శ. ర.—కాని ఈపక్షమున పర్యాయపదమధ్యమున అర్థవివరణవాక్యము కలదు. ఇది కోశశైలీవిరుద్ధము. కావున "...డాకేలఁ బూని యొడ్డఁగను బొడువ,"అని వైభాషార్ణవపాఠము సవరించుట యుక్త మని తోఁచెడిని.ఒడ్డఁగను=ఒడ్డుటకును.ఇంకను విచార్యము.)

కం. చను సింగోట దివిదార్కొ-, మ్మన శృంగ యుగళికిసమాఖ్యలుగా...ఆం.పద.పరి.౫౭.

దివియ=దివ్వ, దివె, దివ్వియ,దివ్వె, దీవె,దీవియ. వి. (సం. దీపికా. ప్రా. దీవియా.) దీపము,

గీ. దివ్వె దివ్వియ దివె దీవె దివియ దీవి, యయన దీపాహ్వయంబు...ఆం. భా. ౨. ౧౬౪.

చ. నవవికచారవిందరుచి నవ్వెడుకన్నులచాయ చుక్కలన్, దివియల మాయఁజేయ నలు దిక్కుల మ్రొక్కులపేర మోడ్పుయ్యా,దవక రకైరవంబులకతంబునఁ గంటి మురారిభాస్కరున్. ఉ. హరి. ౪. ౧౫౦.

సీ. ఆకాశవీథియం దవతంసరత్నంబు నబ్జజాండ గృహంబునందు దివియ. గీ. యగుచు బాలాతపము జగం బాక్రమింప, భానుబింబంబు పొడిచె...కాశీ. ౩. ౨౩౮.

౫ః దివియకంబము, దివియకోల, దివియలవాఁడు

దివియకంబము=దివెకంబము, దివ్వెకంబము. వి. (దివియ+కంబము.) దీపస్తంభము.

గీ. సప్తపాతాళనాగేంద్రచంద్రముఖులు, ఫణమణిజ్యోత్స్న దివియకంబము లగుదురు. భీమ. ౩. ౬౨.

క. అని యిట్లు దివియకంబము, జనవినుతరసప్రసంగసంగతరచనా, జనితకథామధుధారల, మనుజేంద్రుని చెవులఁ జవులు మరగించెఁ దగన్. విక్ర. ౬. ౧౩౮.

దివియకోల=దివ్వెకోల. వి. (దివియ+కోల.) దివ్వటీ.

చ. కడుఁ బెనుమంట లైనయుదకంబులతో లంకున వారిబిందువుల్, మిడిసి సమీపభూజముల మీఁద వెసం బడి మండుచుండ నెక్కుడురభసంబులో దివియకోలలకైవడి భంగసంగతిన్, బొడమినఫేనముల్ మెఱసె... వి. పు. ౭. ౧౬౫.

దివియలవాఁడు. వి. (√దివియ) దీపము పట్టుకొన్నవాఁడు.

క. చవుదంతి వియన్నదిలో,నవగాహ మొనర్చి చల్లునలపమధులో నా,దివియలచుక్కలచేఁ దగ, దివియలవారిఁ గొని యపుడు తెగువఁ దలారుల్. సారంగ. ౩. ౨౭.

దివివెలయాలు. మి. వి. దేవవేశ్య.

సీ. దివివెలయాలికై దెగునన్న దమ్ములం దగ్రజుకా ల్దొక్కినట్టిజంత. చం.రా.౨.౭౪.

దివిషదుఁడు సం. వి. ద. పుం. దేవత, వేల్పు.

దివిష్ఠుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అంతరిక్షమం దుండువాఁడు.౨.స్వర్గమందుండువాఁడు.

దివిస్పృక్కు. సం. విణ. (శ్) ఆకాశమును తాఁకునది, మిన్నంటునది. ఆము. ౩. ౯౩.

దివు=దిగు. అ.క్రి. దిగు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. తగలయిలువరుసఁ గలపెను,దగవరు లాకఁ డొకఁ డొకొక్కతనయుఁరుచిరతా, ర్యగతి నతిఁ జెంద ఘనకీ, ర్తిగ నలరం గలరు ద్రోవ దివరక్రమతన్. రాఘవ. ౨. ౯౯.

దివె=దివియ.

ఉ. ఇక్కడఁ గ్రొమ్మెఱుంగుదివె లిక్కడఁ గేతకి గంధవైభవం, బిక్కడ భూరిగజ్జితములు... భర్తృ. ౨. ౯౩. ఆం. భా. ౨. ౧౬౪.

జః దివెకంబము, దివెగూడు, దివెదారికొమ్ము, దివెలు, దివెలపండుగ.

దివెకంబము=దివియకంబము. (√దివె)

వ...పైఁడికొప్పెరలు వెండికొప్పెరలు...వెండి దివెకంబంబులు...ప్రబంధ. ౬౦౫.

చ...కుఱంగటఁ బడిగంబుఁ గంచుదివెకంబము గల్గినపట్టెమంచ ముత్కటరుచి నించమించు రతిధామము...శుక. ౪. ౨౨.

దివెగూఁడు. వి. (దివె+గూఁడు.) దీపపుగూఁడు.

సీ. తెల్లజిల్లెడువేఱుపిల్లారి దివెగూఁడు గాజుటద్దము కావుకరవటంబు. బహు. ౫. ౧౨౯.

దివెదారికొమ్ము. వి. (దివె+దారి+కొమ్ము) దాసరులదీపస్తంభము. (శ. ర.) భజన మొ. వానిలో అనేకదీపము లుంచెడిదీపస్తంభము.

సీ. దివెదారికొమ్ము దోల్తిత్తియు జోడమ్ము మెడమీఁదిమొగలాకుగొడుగు దనర. ఆము. ౬. ౬.

దివెల=దివ్వెల.వి. (√దివె.) దీపావళ్యమావాస్య, దివెలపండుగ.

క. ఎడ లేదు దివెల నడుమ నెగడుచుఁ గా మీపురముఁ జేరఁగా లేము...చెన్న. ౩. ౧౬౪.

క. ఓయప్ప నీవు బావయుఁ, బాయక నాతోడ దివెలపండుగ కిటు రమ్మా ...చెన్న. ౩. ౧౫౧.

దివోకసము. సం. వి. స. పుం=దివౌకసము. (మే. ని.)

దివోకసుఁడు. సం=దివౌకసుఁడు. (మే. ని.)

దివోకుఁడు. సం=దివౌకసుఁడు.

దివోదాసుఁడు. సం. వి. అ. పుం. రిపుంజయుఁడను మనువంశపురాజు.

దివోద్భవ. సం. వి. ఆ. స్త్రీ. ఏలకి ౘ.

దివౌకసము. సం. వి. స. పుం. ౧. చాతకము, వానకోయిల. ౨. పక్షి.

దివౌకసుఁడు. సం. వి. స. పుం. -స్వర్గము నివాసముగాఁ గలవాఁడు- దేవత,వేల్పు.

దివౌకుఁడు. సం=దివౌకసుఁడు.

దివ్య=దివియ.

వ...ఇనుపయెడ్లు ౫౦ నాలవుదివ్యలు చేకొన్న వాణ్డుమ...దా. శా. ౧౧౮౦.

...దివ్య[తప్పి]న శ్రీభీమేశ్వరమహాదేవరయావ...దా. శా. ౧౧౮౪.

జః దివ్యాలుపుఁబ్రువ్వ, మొ.

దివ్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఆమలకి, ఉసిరికౘ. ౨. వంధ్యాకర్కోటకి, గొడ్డుకాఁకరౘ. ౩. శతావరి,పిల్లపీఁచరౘ. ౪. మహామేదౘ. ౫. బ్రాహ్మిౘ. ౬. స్థూలజీరకము,పెద్దజీలకఱ్ఱ. ౭. తెల్లగటికౘ. ౮. హరీతకి,కరకౘ. ౯. పురయనుగంధద్రవ్యము. (కల్ప.) ౧౦. నాయికాభేదము. ఉదా:-దివ్య=శచి, మొ. అదివ్య=వాసవదత్త, మొ. దివ్యాదివ్య=సీత, మొ.

దివ్యగంధ. సం. వి. ఆ. స్త్రీ. పెద్దయేలకిౘ.

దివ్యగంధము. సం. వి. అ. పుం. గంధకము. ౨. లవంగముౘ.

దివ్యగాయనుఁడు. సం.వి.అ.పుం.గంధర్వుఁడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**దివ్యచక్షువు.** సం. విణ. (స్) ౧. దివ్యదృష్టి గలవాఁడు. ౨. అంధుఁడు, గ్రుడ్డివాఁడు. ౩. మంచికన్నులు గలవాఁడు. వి. స్. పుం. ౧. మర్కటము, కోఁతి. ౨. సుగంధవిశేషము. న. అలౌకికవస్తుదర్శనసమర్థ మగుజ్ఞానము.

**దివ్యజ్ఞానము.** సం. వి. అ. న. అలౌకికవస్తుదర్శనసమర్థ మగు తెలివి; అతీంద్రియజ్ఞానము.

**దివ్యదర్శి.** సం. విణ. (న్. నీ. న్.) అతీంద్రియ మగువిషయములను దర్శించువాఁడు.

**దివ్యదృక్కు.** సం. విణ. (శ్) అతీంద్రియవిషయములను జూచువాఁడు, దివ్యదృష్టి కలవాఁడు. వి. శ్. పుం. దైవజ్ఞుఁడు, జోస్యుఁడు. (విల్యమ్సు.) శ్. స్త్రీ. దివ్యదృష్టి.

**దివ్యదోహదము.** సం. విణ. (అ. ఆ. అ.) ఉపయాచితకము, అభీష్టసిద్ధికై దేవతలకర్పింపఁబడునది. (పశ్వాది.)

శ్లో. యద్దీయతే తు దేవేభ్యో మనోరాజ్యస్య సిద్ధయే, ఉపయాచితకం దివ్యదోహదం తద్విదుర్బుధాః. హారావళి. (కల్ప.)

**దివ్యనది.** సం. వి. ఈ. స్త్రీ. ఆకాశగంగ.

**దివ్యపుష్ప.** సం. వి. ఆ. స్త్రీ. మహాద్రోణ !. (కల్ప.)

**దివ్యపుష్పము.** సం. వి. అ. పుం. కరవీరము, గన్నేరు!. (కల్ప.)

**దివ్యపుష్పిక.** సం. వి. ఆ. స్త్రీ. ఎఱ్ఱపువ్వుల జిల్లేడు!.

**దివ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. స్వర్గమునఁ బుట్టినది. ౨. స్వర్గమందయినది. ౩. ఆకాశమునఁ బుట్టినది. ౪. మనోజ్ఞము, ఇంపయినది. ౫. ప్రకాశించునది. ౬. లోకాతీతము, అమానుషము. (ఉదా: దివ్యదర్శి, దివ్యదృష్టి, మొ.) వి. అ. పుం. ౧. ఉత్పాతభేదము (చూ. ఉత్పాతము.) ౨. గుగ్గిలము!. ౩. యవలు!. న. ౧. లవంగము!. ౨. హరిచందనము!. ౩. గంగాజలాదులను స్పృశించి చేయుశపథభేదము, బాస. (వాచ.) ౪. (వ్యవహార) వాదిప్రతివాదులం దొకఁడును సాక్ష్యాదిప్రమాణములను చూపలేనప్పుడు తత్త్వనిర్ణయమునకై చేయవలసినతులాది పరీక్షారూపదివ్యప్రమాణము. (ఇది తులాదివ్యము, అగ్నిదివ్యము, జలదివ్యము, విషదివ్యము, కోశదివ్యము అని పంచవిధము.) ౫. ఆకాశమునుండి వచ్చుజలము. (ఇది ధారాజము, కరకాజము, తౌషారము, హైమము అని చతుర్విధము.) ౬. సాతపవర్ష స్నానము, ఎండకాయునపుడు కురియువర్షములో చేయుస్నానము.

**దివ్యరత్నము.** సం. వి. అ. న. చింతామణి.

**దివ్యరథము.** సం. వి. అ. పుం. వ్యోమయానము, విమానము.

**దివ్యరసము.** సం. వి. అ. పుం. పాదరసము.

**దివ్యసరిత్తు.** సం. వి. త్. స్త్రీ. ఆకాశగంగ.

**దివ్యసారము.** సం. వి. అ. పుం. సాలము, మద్ది!.

**దివ్యస్త్రీ.** సం. వి. ఈ. స్త్రీ. ౧. దేవతాస్త్రీ. ౨. అప్సరస, అచ్చర.

ఇట్లే: దివ్యనారి, మొ.

**దివ్యాంగన.** సం. వి. ఆ. స్త్రీ = దివ్యస్త్రీ.

**దివ్యాంశువు.** సం. వి. ఉ. పుం. సూర్యుఁడు.

**దివ్యాబుపుఁ (ర్పుఁ) బ్రువ్వ (బురువు).** వి. (√దివ్య.) దీప మార్పెడిఒకజాతిపురుగు; దీప మార్పుట కుపయోగించుచోరసాధనవిశేషము.

గీ. గ్రువ్వ గ్రద్ద దివ్యాబుపుఁబ్రువ్వ గూబ, యిల్లు సొచ్చిన శాంతి సేయింప వలయు. భార. అను. ౪. ౧౧౯.

గీ. నల్లదట్టిసబిల్ల కన్నంపుఁగత్తి, బూది దివ్యార్పుఁబురు విసు మూఁదుఁగ్రోవి, తోలునిచ్చెన

.CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మొదలు ముందుగ ధరించి. ప్రబంధ. ౭౪౯. (దివ్వార్పపురువు. ముద్రి.)

ద్వి. ఇరుమఁ గన్నపుఁగత్తి యొడదట్టిలోనఁ, బొసఁగినదివ్యార్పఁబ్రువ్వులక్రోవి. ద్వి. పర మ. ౬. ౪౮౫. (దివ్యార్పఁబ్రువ్వులక్రోవి= దీపమార్పెడిపురువు లుంచుగొట్టము.)

దివ్యాసనము. సం. వి. అ. న. (యోగ.) ఆసన భేదము.

దివ్యుఁడు. సం. వి. అ. పుం. ౧. దేవత, వేల్పు. ౨. యముఁడు. ౩. నాయకభేదము (నాయకుఁ డు-దివ్యుఁడు, అదివ్యుఁడు, దివ్యాదివ్యుఁడు అని ముత్తెఱఁగులు. ఉదా:- దివ్యుఁడు=ఇంద్రుఁడు, మొ. అదివ్యుఁడు=మాధవుఁడు, మొ. దివ్యాది వ్యుఁడు=రాముఁడు, మొ.)

దివ్యోపపాదుకుఁడు. స. వి. అ. పుం. -అయోని సంభవుఁడు- దేవత, వేల్పు.

దివ్యౌఘుఁడు. సం. వి.అ.పుం. గురువిశేషము.

శ్లో. మహాదేవో మహాకాలః త్రిపుర శ్చైవ భైరవః,దివ్యౌఘాగురవఃప్రోక్తాః...(కల్ప.)

దివ్యౌషధి. సం. వి. ఇ. స్త్రీ. ౧. మనశ్శిల. ౨. దివ్య మైనయోషధి.

దివ్వటి(టీ)=దివటి, దీవటి. వి. (సం. దీపయ ష్టిః. ప్రా. దీవఅట్టి, దీవట్ఠి. క. దీవటి.) కర దీపిక, ఇనుపసలాకకు గుడ్డలు చుట్టి ముట్టించెడి దీపము.

సీ. ఒడలిమేల్ప్రవణంపుటొరపుమానికములు మ లయుదివ్వటులతో మార్వెలుంగ. అచ్చ. రా. సుం. ౧౧. (దివ్వెలలతో. ముద్రి.)

సీ. నలువంకలను నిండి నవనభోమణి కాంతి నెడ లేక దివ్వటు లెసక మెసఁగ.ఉ.రా.౬.౪౪.

సీ. హాటకోన్నతకాంతపాటలద్యుతి మించుది వ్వటీ ళ్వేనవేల్ తేజరిల్ల. కృష్ణ. ౪.౧౧౬.

గీ. పటుపుటంగడివీథు లేర్పఱచి కొంచె,పాటి నడగని నెక్కి యాపాలె మెల్ల, విడియ నియమించి తిరిగె వేవేలుదివ్వ,టీలవెలుఁగున సంగీతమేల మమర. కువల. ౨. ౧౫.

దివ్వటీలవాఁడు=దివ్వెలవాఁడు.

చ. నరవర వింటివే బసవనాథుని యల్లునిసన్ని ధానమం, దిరువురు పూరుషోత్తము లహీన బలాఢ్యులు దివ్వటీలవా, రరుదుగ నున్న వారు...చెన్న. ౫. ౪.

జః దివ్వటీఁడు.

దివ్వటీఁడు. వి. (దివ్వటి+ఈఁడు+డు.) దీపము పట్టుకొనువాఁడు.

ద్వి. జాలవారిని దివ్వటీలను బల్ల,గోలలవారిని గుడిపూజరులను. బస. పు. ౩.౫౧౦ పం.

ద్వి. మడివాలు మడివాలు మాచదేవయ్య, కడ మలనంబి చొప్పడ దివ్వటీఁడు. బస. పు.౨. ౪౬౬ పం.

దివ్వియ=దివియ.

ఆం. భా. ౨. ౧౬౪.

జః దివ్వియకంబము, దివ్వియకోల.

దివ్వియకంబము=దివియకంబము. వి. (√దివ్వి య.) దీపస్తంభము.

క. అయ్య యవుఁగాక యంచును, దియ్య మె సఁగ రాజుఁ జూచి దివ్వియకంబం, బియ్యకొని...విక్ర. ౬. ౪౦.

దివ్వియకోల=దివ్వెకోల. వి. కాష్ఠదీపిక.

సీ. జుంజుము దుందురు సురుడు దివ్వియకోల యనఁ గాష్ఠదీపికాహ్వయము చెలఁగు. ఆం. భా. ౨.౧౬౫.(ప్రాతప్రతిపా.దివ్వెనకోల. చి. ని. బ్రౌ. ప్రాఁతప్రతులపా.)

దివ్వె=దివియ. వి. (సం.దీపః.ప్రా.దీవీ.) దీపము.

చ.రవి యనుదివ్వెఁ గేలువుచెఱంగున మూసి... ఆము. ౨. ౧౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క...దివ్వెలు నలుదిక్కులందుఁ దేజము లెసఁ గఁగ. బ్రహ్మో. ౪. ౧౩౨ పా.

దివ్వెలవాఁడు=దివ్వటీలవాఁడు.

చ...ఓ,యనఘ భవత్సమీపగతులై తగుదివ్వెల వారి నిద్దఱిఁ, ననుఁ గొలువంగఁ బంపుము ...చెన్న. ౫. ౬.

జః దివ్వెకంబము, దివ్వెకోల, దివ్వెల, దివ్వెలయమాస, దివ్వెలెత్తు, దివ్వెసుడి.

దివ్వెకంబము=దివియకంబము, దీవియకంబము. (√దివ్వె.) దీపస్తంభము.

గీ. గంట మాకులుఁ గొని దివ్వెకంబ మింత,యె నయఁ గూర్చుండి యాపూర్ణిమేందువదన. శుక. ౪. ౩౧. విక్ర. ౬. ౩౭.

దివ్వెకోల=దివియకోల, దివ్వియకోల. వి. (√దివ్వె) దివ్వటీ.

ద్వి. ఆలీల కొఁఅవిదయ్యంబుల దివ్వె,కోలలవారిఁ గాఁ గొని గస్తుదిరిగి. ద్వి. హరిశ్చ. ఉ. ౧౬౬౭ పం.

దివ్వెల=దివెల, దివ్వెలయమాస. వి. (√దివ్వె.) దీపావళ్యమావాస్య.

క. మాదాయాదులు బంధువు,లాదివ్వెల కాత్మసుతుల నల్లుండ్రను స,మ్మోదమునఁ దోడితెత్తురు...చెన్న. ౩. ౧౬౩.

దివ్వెలయమాస=దివ్వెల. వి. (√దివ్వె.) దీపావళ్యమావాస్య.

ఉ. మా సరివారు దివ్వెలయమాసకు సల్లుర నాఁడుబిడ్డలఁ, వాసి యెసంగఁ దోకొనుచు వచ్చుచు నుండిరి...చెన్న. ౩. ౧౪౪.

దివ్వెలెత్తు. అ. క్రి.(√దివ్వె.)దీపములు పెట్టు.

గీ. దివమునను సంజకడ యంచు దివ్వెలెత్తు. శుక. ౨. ౫౬౧.

దివ్వెసుడి. వి. (√దివ్వె.) గోడయందు దీపము పెట్టుఁగూడు. (శ.ర.) దీపము పెటుకొనుటకె కొయ్య, మొ.వానితో చేసినసాధనము. (బ్రౌ.) (నా.) ఈదీపము ఆదివ్వెసుడిమీఁద పెట్టుము. దివ్వెసుడి విఱిగి క్రిందపడినది.

దిశ. సం. వి. ఆ. స్త్రీ. దిక్కు, కడ.

దిశత్. సం. (శతృ) ౧. ఇచ్చుచున్న. ౨. ఉపదేశించుచున్న. ౩. నిర్దేశించుచున్న. ౪. ఆజ్ఞాపించుచున్న.

దిశాగజము సం=దిగ్గజము.

దిశాదిశి. సం. వి. ఇ. న? ఒకానొకరాగము.

ఉ. భైరవి నాట తోడి సిరిపాలి దిశాదిశి దేశి మారువా,గౌరి బిశాహులీ...చెన్న. ౨. ౨౩౬. (ఇది సంస్కృతనిఘంటువులలోఁ గానరాదు. ఇంకను విచార్యము.)

దిశాపట్టము. క్రి. విణ. (క. దిశాపట=పాఱిపోవుట.)దిక్కులకు పాఱునట్లుగా,చెల్లా చెదరగునట్లుగా.

శా. పాశిం బాఱఁగఁ దోలి యంతకు దిశాపట్టంబు గారించి పూ,ర్వాశాధీశ్వరు వెన్నడించని...ఉ. హరి. ౧. ౯౧. (దశాపట్టంబు గావించి. ప్రాఁత ప్రతిపా.)

క...అతఁ డేఁగె మును దిశాపట్టముగాఁగ. ఉ. హరి. ౧. ౯౭. (దశాపట్టముగాన్.ముద్రి.)

దిశాపాలుఁడు. సం=దిక్పాలుఁడు.

దిశ్యమానము. సం.విణ. (అ.ఆ.అ) ౧. ఇయ్యఁబడుచున్నది. ౨. నిర్దేశింపఁబడుచున్నది. ౩. ఆజ్ఞాపింపఁబడుచున్నది. ౪. ఉపదేశింపఁబడుచున్నది.

దిశ్యము సం. విణ. (అ. ఆ. అ) ౧. దిక్కునందు పుట్టినది. ౨. దిక్కునం దున్నది.

దిష్టము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కథితము, చెప్పఁబడినది; ఉపదేశింపఁబడినది. ౨. నిర్దిష్టము, నిర్దేశింపఁబడినది. ౩. ఇయ్యఁబడినది. ౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆజ్ఞాపింపఁబడినది. వి. అ. పుఁ. ౧. కాలము, సమయము. ౨. ప్రానిపసుపు. స. ౧. భాగ్యము. ౨. నిర్దేశము, ఏర్పాటు. ౩. ఆదిష్టము, ఆజ్ఞ.

శ్లో. వహామ సర్వే వివశా యస్య దిష్టం... భాగ. ౫. ౧. ౧౧.

దిష్టాంతము. సం. వి. అ. పుం. ౧. మరణము, చావు. ౨. భాగ్యనాశనము.

దిష్టి. సం. వి. ఇ. స్త్రీ. ౧. కథనము, చెప్పుట. ౨. ఉపదేశము. ౩. ఉత్సవము. ౪. భాగ్యము. ౫. హర్షము, సంతోషము. ౬. ఏర్పాటు. ౭. పరిమాణము, కొలఁత.

దిష్ణువు. సం. వి. ఉ. పుం. దాత, ఇచ్చువాఁడు.

దిసంత(తుల)డుచు. స. క్రి. (దిసంతు + అడుచు) నిందించు.

సీ. ఇచ్చకం బాడిన హితమౌను విభునికి మతి దిసంతడిచిన మనసు విఱుగు. నీతిసీ. ౭౨.

మ. అదిగో తల్లిఁ గడుం దిసంతడిచి...పరమ. ౩. ౨౭౧ (శ. ర. పా 'తల్లిని జాల దూరుచును' ముద్రి.)

శా. పంకేజాతములన్ దిసంతులడుచుచున్ బాలామణీపాదముల్. విజ. వి. ౨. ౧౬. (ఇట ఔపమ్యవాచకము.)

దిసంతు. వి. అపవాదము, నింద.

సీ... దిసంతు సడి రోయి రోఁత... అపవాద సంజ్ఞయై యలరుచుండు. ఆం. భా. ౧. ౧౧౫.

జః దిసంతడుచు, దిసంతుకొట్టు.

దిసంతు(లు)కొట్టు. స. క్రి. (దిసంతు + కొట్టు.) దూఱు, దూషించు, నిందించు.

ఉ. పట్టఁగలేమి కొండొరులఁ బల్మఱుఁ జాల దిసంతుకొట్టుచున్. కాశా. ౬. ౧౦౬.

సీ. చెలి నేఁచి తని దిసంతులుకొట్టె మేనక ...మనుచ. ౩. ౧౦౯.

వ. అని యవ్విటకంటకి యిబ్బాధంబునం గూఁతిమి పట్టిఁ గిట్టి దిసంతులుకొట్టె...విప్ర. ౪. ౨౪.

దిసమొల=దెసమొల, దిస్సమొల. వి. (√దిస.) వస్త్రవిహీన మైన మొల.

(వ్యవ) ఆయోగి దిసమొలతో నున్నాఁడు.

విణ. నగ్నుఁడు, దిగంబరుఁడు.

వ. రుద్రా నీవు భద్రదేవద్రుమాటవీవాటియందు దిసమొల దూఁబఱదిండి మిండజంగంబవై...భిక్షాటనక్రీడను నటించితి...భీమ. ౩. ౨౧౦.

సీ. పాల వెక్కసుఁ బోక పక్కి పై రొప్పక పొసఁగుపడినయగ్గి బొగ్గులు దిస. గీ. మొలనరు...ఎదురుగాఁ గానఁబడక. ప్రబంధ. ౭౬౦.

గీ. వెలయు నగ్నుండు దిసమొల బిత్తలి యన. ఆం. భా. ౩. ౧౨. దశా. ౧౦. ౭౮.

దిసమొలవాఁడు= దిస్సమొలవాఁడు. విణ. (√దిసమొల.) వస్త్రవిహీన మైనమొల గలవాఁడు, దిగంబరుఁడు. (శ. ర.)

దిసమొలవేల్పు=దిస్సమొలవేల్పు, దెసమొలవేల్పు. వి. (√దిసమొల.) ౧. శివుఁడు. ౨. కాలభైరవుఁడు.

చ. దిసమొలవేల్పుసాహిణపుఁదేజులు పోషకగేహరక్షకుల్. కవిరా. ౨.౭౨. (శ.ర.పా. దెసమొలవేల్పు. ముద్రి.)

దిసించు. అ. క్రి. కనఁబడు, గోచరమగు.

చ. ఉరుకుచదెంద మెంతమృదువో మతి తియ్యనితుంటవింట...కంటికి దిసింపనివాఁ డపు డేసి యార్చె...సారంగ. ౨. ౩౭.

చ. తెరువరు లైనయట్టిపరదేశమహీసురు లర్థవాంఛఁ దత్పురమున కేఁగుదేర వెడదోస్యములం బచరించి వారి ని, ర్భరగతి నోడఁగూయుఁ దమబాపఁడె గెల్చె నటంచుఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గాపు ల,చ్చెకువడ నాదుకంటికి దిసింతుర
వీ రని యాతఁ డుబ్బునన్. శుక. ౨.౪౩౭.
స. క్రి. మీఱు, మించు.
గీ. కులుకుఁజెక్కులు పసిఁడియాకుల దిసింపఁ, జిన్నికుచములు పోఁకలచెన్ను మీఱ.ముకుంద. ౧. ౨౯ పా. ౨ పం. (ఇట ఔపమ్య ద్యోతకము.)

దిష్టి. వి. (సం.దృష్టిః.క.దిష్టి.) ౧. దృష్టి,చూపు.
సీ...చూడ్కి, పొరువ దిష్టిచూ పన వీక్షణము లొప్పు...సాం. ని. మాన. ౧౫.
౨. దృష్టిదోషము, కసరు. (బ్రా.)
(వ్యవ) మాపిల్లవానికి దిష్టి తగిలినది.
జః దిష్టికొట్టు, దిష్టితీయు, దిష్టిపిడుత, దిష్టిబొమ్మ.

దిష్టికొట్టు. అ. క్రి. (దిష్టి+కొట్టు) దృష్టిదోషము కలుగఁజేయు.
(వ్యవ.) నిన్న వచ్చినఅమ్మలక్కలు మాపిల్లవానికి దిష్టికొట్టిరి.

దిష్టితీయు. అ. క్రి.(దిష్టి+తీయు.) దృష్టిదోషము పోవుటకై మిరెపకాయలు, మొ. దిగదుడుచు.
(వ్యవ.) వానికి దిష్టితీయఁగనే జ్వరము తగ్గినది.

దిష్టిపిడుత. వి. (√దిష్టి.) సస్యాదులకు దృష్టిదోషము తగులకుండుటకై సున్నపుబొట్లుపెట్టిన పిడుత.
(వ్యవ.) ఆకాఁకరపాదుకు దిష్టిపిడుత పెట్టినారు.

దిష్టిబొమ్మ. వి. (దిష్టి+బొమ్మ.) సస్యాదులకు దృష్టిదోషము తగులకుండుటకై గడ్డి, మొ. వానితో మనుష్యరూపముగ చేసి వ్రేలాడఁదీసినబొమ్మ.
(వ్యవ.) మాపొగతోఁటలో రెండుదిష్టిబొమ్మలున్నవి.

దిస్స. (స). వి.(సం. దిశా. ప్రా. దిసా.) దిక్కు. దీనికి వ్యస్తముగా ప్రయోగము కానరాదు. (చూ, దిస్సమొల.)
జః దిసమొలవాఁడు, దిసమొలవేల్పు, దిస్సమొలదేవుఁడు, దిస్సమొలయ్యవారు, దిస్సమొలవాఁడు,దిస్సమొలవేల్పు.

దిస్సమొల=దిసమొల, దెసమొల. వి.(√దిస్స.) వస్త్రవిహీన మైనమొల.
సీ. వ్రేతలవలపుఁ గొల్లెపుదుదిస్సమొలహత్తి గచ్చకాయలతిత్తి రచ్చసేయ.ఘటికా. ౧.౧౨౭.
విణ. నగ్నుఁడు.
గీ. దిస్సమొలవేల్పుఁ బార్వతీదేవిపట్టిఁ, గాలభైరవుఁగురుక్కరగణపరివృఢుఁ.కాశీ.౨.౩౭.

దిస్సమొలదేవుఁడు. వి. (√దిస్సమొల.) ఈశ్వరుఁడు.
చ. దివిజవిరోధి దోఁచుకొన దీనత నాతఁడు భైక్షవృత్తికిన్, దివురుచుఁ గాదె దిస్సమొలదేవునితో నొనరించె సఖ్యమున్. ధరాత్మజాపరిణయము. ౨.౫౫.

దిస్సమొలయ్యవారు. వి. (√దిస్సమొల.)కాలభైరవుఁడు.
ఉ. నిస్సమసింహకేసరవినిర్మితరజ్జులఁ బూన్చి తెచ్చి రా,దిస్సమొలయ్యవారిబలు తేజులరాజులు మెచ్చ వేటకున్. సుద. ౩. ౧౬౭.

దిస్సమొలవాఁడు.విణ.(√దిస్సమొల.) బట్ట లేనిమొల కలవాఁడు.
గీ. దిస్సమొలవానిఁ బసిఁ గానఁ ద్రిప్పువాని, మురళి గలవాని మువ్వంకమురువువాని. పాండు. ౧. ౨౧౩.

దిస్సమొలవేల్పు. వి. (√దిస్సమొల.)-వస్త్రవిహీనమైనమొల గలవాఁడు - ౧.శివుఁడు.(చూ. దిసమొల.) ౨. కాలభైరవుఁడు.
మ...పొల్పు గడల్కొల్పుచుఁ బోవు దిస్సమొలవేల్పుందత్తడుల్ మొత్తమై. రామా. ౨. ౨౧. (దిస్సమొలవేల్పుందత్తడులు=శునకములు)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దిస్సు. వి. నవ్వుట పాము బుసకొట్టుట మున్నగు వానియం దగుధ్వని కనుకరణము.

సీ. పయ్యెద దిగజార్చి పాలిండ్లు పచరించు, దిస్సువాఱఁగనవ్వుఁదీఁగెనవ్వు. క్రీడా. ౬౮.

గీ. ఉగ్రతిమిశిరోరంధ్రనిష్ఠ్యూత మగుచు, నె గయుసలిలౌఘు మది యెందు మిగుల నొప్పు, నభిపేరిటికుండలితాంగభోగి,దిస్సునన్ దన పడగ యెత్తెనొ యనంగ.కళా. ౪. ౧౯౫.

(శ. ర. పా.)

దిహత్. సం. శత్ర. పూయుచున్న.

దిహ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) పూయఁబడుచున్నది.

## దీ

దీ=డీ. అవ్య.పందెకాండ్రు పొట్టేళ్లను పోట్లాటకై ప్రేరించుమాట.

చ. ఉభయము భావవీథి జయ మొందినభంగి భయం బొకింత లేక,యభిముఖ మయ్యె వెన్వె నుకకై యటఁ గొన్నిపదంబు లేఁగుచున్, రభసముతో దువాళిగొని బగ్గునఁ దాఁకెడుఁ జూడు సెట్టిటి,టిభ దిదిదీ యనంగను గడింది నదభ్రము లీయురభ్రముల్. క్రీడా. ౨౨౮.

జః దీకు,దీకొను,దీకొలుపు,దీకోలు.

దీకు=డీకు. వి. (√దీ.) ౧. ప్రేరణ,పురికొల్పుట. (శ. ర.)

క. ఏ నపుడు ధర్మపాశా,ధీనుఁడ నై కోపము నకు దీకొనరింపం,గా నేరకున్న మెయి మెయిఁ,బో నయ్యెంగాక యింకఁ బొమ్మా యిచటన్. భార. విరా. ౫. ౯౧.

౨. (శ. దీంకు) చిక్కు, కష్టము.

ఉ. లోకము లెల్ల నిండి తనలోనుగ సర్వముఁ జేసి ప్రాణులన్, దీకులఁ బెట్టి యెల్లెడలఁ దీపులు నూపెడివిష్ణుమాయ నేఁ, డేకమతిం దరించి తిదియేల మహాసురరూపు మానిసు, శ్లోకపురాణపూరుషునిశోభనమూర్తి ధరింపు మింపునన్. భాగ. ౬. ౪౨౧.(వ్రాఁతప్రతిపా.)

శ్లో. భవా నతార్షి న్మాయాం వై వైష్ణవీం జన మోహినీం. సం. భాగ. ౬. ౧౨. ౨౦.

దీకొను=డీకొను. అ. క్రి. సక్రి. (√దీ.) ౧. (పొట్టేళ్లు పోరిలో) ఒండొంటిని తాఁకు.

గీ. తిరుగఁబడి కురుమతగరుల్ దీకొనుగతి, నుఱిది తలఁదలఁ దాఁకించు నొకరి కొకరు. ప్రబంధ. ౭౬.

౨. ఎదిరించు,మార్కొను.

ఉ. తెం పెసలారఁగా మనల దీకొని యున్నది గొంక్క లేమ...కాశి. ౬. ౨౩౩.

క. ఒకమొగము గాక దివిజులు, తికమకగొని వైరు లెల్ల దీకొనఁ దమ్ముం,బికపికలై నకనక లై,లుకలుకఁ బగు వెత్తి రోడి లోఁగొను భీతిన్. భాగ. ౬. ౨౬౫.

చ. తెగి యొకకొండతోఁ దగరు దీకొని తాఁ కిన నేమి భాస్కరా. భా.శ. ౪౬.

ఉ. రాకసుధాంశుమండలమురాకకు మాఱు మొగంబు సేయుచో,దీకొని వచ్చుదండధర దిక్పవమాన మదక్షిణం బవున్. నైమ. ౨. ౧౩౬.

అ. క్రి. ఉత్సహించు; పూనుకొను, సిద్ధపడు.

ఉ. ఆఁకలిగొన్న క్రేపులు రయంబున నీఁకలు రా నిపశులున్, దీకొని తల్లికిన్ మఱి విదేశగ తుం డగుభర్త కంగజ,వ్యాకులచిత్త యైన జవరాలును దత్తఱ పందుభంగి నో,శ్రీకర పంకజాక్ష నినుఁ జేరఁగ నామది గోరెడుం గదే. భాగ. ౬. ౪౦౦.

క. దాకొని ఖడ్గాఖడ్గినో,కాక కచాకచినో బా ణకౌశలమునవో,నీ కద్ది యిష్ట మనికిన్ దీకొనుమా యొకట మెచ్చితిమి నృపతన యా. రామా. ౫. ౧౪౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్వి. ఈకొశిరునిబుణం బీకాశిలోన, దీకొని తీర్పఁగాఁ దెరువు గల్పింపు. ద్వి.హరిశ్చ.ఉ. ౧౨౦ పం.

స. క్రి. చేయఁబూను.

ఉ. ఈకొలఁగానికార్య మిటు లెవ్వఁ డొకో యనుకూలశత్రుఁడై, నీకుఁ బ్రియంబుగాఁ బలికె నీవును నిత్తెఱఁ గాచరింపఁగా,రాక తలంచి చూడ నిది రాక్షసవంశవినాశకాల మో,కా కిటుగాను దీకొనునె కాదన కీదృశ మెవ్వఁ డేనియుక్. భా. రా. అర.౨.౧౪.

దీకొలుపు(ల్పు)=డీకొలుపు. స. క్రి. (√దీకొను.) దీకొనఁజేయు.

(పురికొలుపు)

క. నగుఁ డన్నపాటు గనుఁగొని, దిగిభనిభద్విపము నలుక దీకొలుపుచు బెట్టుగుశక్తి వైవఁ గుశుఁ డర,నగుచుఁ దునిమి దాని మూఁడు నారాచములక్. జై. భా. ౬. ౧౪౨.

(ఎదుర్కొనఁజేయు.)

గీ. ఎదురు లేక రణంబులో నేపు చూపె,భట్టి జగజెట్టి దీకొల్ప భద్రగజము. విక్ర. ౪. ౧౧౧.

క. ఆవేళ మూర్ఛఁ దేఱి శ,చీవనితావిభుఁడు రాజసింహముపై నై,రావణకరి నెక్కి ధరి,త్రీవలయము సంచలింప దీకొలుపుటయుక్. వరాహ. ౩. ౫౪.

క...వారణతిలకంబు నెక్కి వడి బువభునిపై, ఘోరగతిఁ గాలదంష్ట్రిఁడు, ధీరాటోపంబు తోడ దీకొలుపుటయుక్. భా. రా. యు. ౬౮౩.

దీకోలు=డీకోలు. వి.(√దీకొను)డీకొనుట.(శ.ర)

దీక్ష. సం. వి. ఆ. స్త్రీ. ౧. యజ్ఞవివాహాదికర్మములయందు అవలంబించునియమము;నియమము. ౨. దృఢాభినివేశము, గట్టిపట్టుదల. ౩. మంత్రోపదేశము. ౪. మంత్రోపదేశమునొందుట. ౫. ఉపనయనసంస్కారము.

దీక్షణము. సం. వి. అ. న. ౧. దీక్ష. ౨. దీక్ష పట్టుట, దీక్షపూనుట.

దీక్షణీయ. సం. వి. ఆ. స్త్రీ. ఇష్టిభేదము.

దీక్షణీయము. సం. వి.అ. న. దీక్షకు సాధనమైన హావిర్భేదము.

దీక్షాంతము. సం. వి. అ. పుం.౧.దీక్షాసమాప్తి. ౨. యజ్ఞదీక్షాసమాప్తి, అవభృథము.

దీక్షించు. సం. అ.క్రి.దీక్షవహించు, దీక్షపూను.

వ. ఇట్లు ఫాల్గునశుక్లపక్షంబున దీక్షించి...అనుష్ఠానంబులదెస నతిగరిష్ఠ యగునిష్ఠ నవలంబించి...హరి. ఉ. ౬. ౨౦.

క. వేయేఁడుల వ్రతమునకై, ధీయోగము సిద్ధినొంద దీక్షించి మనః, కాయవచోనియమము నిర,పాయంబుగఁ దొడఁగి రురుతపస్సాధనముక్. హరి. ఉ. ౧౦. ౧౭౭.

దీక్షితః. సం. వి. బు. పుం. దీక్షపూనువాఁడు.

దీక్షితాయని. సం. వి. ఈ.స్త్రీ.దీక్షితునిపత్ని.

శ్లో. ఇతి శ్రుత్వాథ తద్వాక్యం భీతా సా దీక్షితాయనీ. సం. కాశీ. ౧౩. ౭౯.

దీక్షితుఁడు. సం. విణ. (అ. ఆ. అ) ౧. వివాహోపనయనాదివిహితకర్మములందు దీక్ష వహించినవాఁడు. ౨. తలఁచినపని నిర్వర్తించుటకై గట్టిపట్టు పట్టినవాఁడు. ౩. పట్టాభిషిక్తుఁడు. ౪. హావిర్యాగములు మున్నగు శ్రౌతకర్మముల నాచరించినవాఁడు.

దీక్షిష్యమాణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దీక్షపొందఁగలవాఁడు, దీక్షపొందనై యున్న వాఁడు.

గీ. ఈవు దీక్షిష్యమాణుండ విద్ధమహిమ.కాశీ. ౭. ౫౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దీటు=తీడు స. క్రి. ౧. సరిచేయు, సవరించు, చక్కఁబఱచు; ఆకర్షించు. (ఉదాహరణములలో సందర్భానుసారముగా భిన్నార్థము లగపడుచున్నవి.)

చ. తిలకము దీర్చుచున్ గురులు దీటుచు... నద్దముఁ జూచె నొకర్తు వేడుకన్. నృసిం. ౨. ౮౬.

ఉ. చంచువు దీటి పక్షములు జల్లున విచ్చి పదంబు లెత్తి కుప్పించి నభంబుపై కెగసి... భాగ. ౧౦పూ. ౪౪౫.

చ. కలకల నవ్వు మోవిపలుగంటుల దీటుఁ గుచంబు లోరగా, వెలువడఁ బైఁట వేయు ...హంస. ౧. ౨౧౩.

గీ. మొగముపైఁ జిమ్మచీకటి ముడివడంగ, మాటిమాటికి మీసాలు దీటుకొనుచుఁ, జనిరొ సంబళిసంబళి యనుచుఁ బంక, జాప్తకులపుంగవుఁడు వచ్చునంగడికిని. హరిశ్చ. ౪. ౨౧౫.

సీ. మొలఁ గట్టుపాఱుటాకులు జాఱకుండఁగ దీటి కట్టినబలుతీవకట్టు. చంద్రా. ౨. ౩౭.

మ. అతిశీఘ్రంబుగ శార్ఙ్గ మెక్కిడి గుణం బాభీలతన్ దీటుచున్. ఉ. రా. ౨. ౫౬.

౨. కఱచు, (కోపాదులచే పెదవి, మొ. పండ్లతోఁ)గొఱుకు. (ఈయర్థమున నిది ఔడు,రదము, కోఱ మొదలగు పదములలో కలసియే కనఁబడుచున్నది.)

ద్వి. అదె గవాక్షం బనునతఁ డాలమునకుఁ, ద్రిదశారి యోడులు దీటుచున్నాఁడు. రం. రా. యు. ౩౩౦ పా. ౨౫ పం.

మ. పదవిక్షేపములన్ సవృక్షధరణీభాగంబు కంపింపఁగా, రదముల్ దీటుచుఁ గత్తిరించి నచెవుల్ రాజిల్ల...భాగ. ౧౦ పూ. ౬౧౩.

వ...వేడిమిడుంగుఱులు వొడమ నిడుదక్రొవ్వాఁడికోఱలు దీటుచు...దశా. ౩. ౧౯౩.

మ...అప్పీరుఁడున్,దశనాగ్రంబులు దీటుచున్ వయిచె నుత్తాలాద్రికూటంబునన్. భా.రా. యు. ౧౦౦౪. ('దీకుచు' ముద్రి.)

చ. ఘనతరఫాలపట్టికల ఘర్మకణంబులు గ్రమ్మ భీకరాననములు జేవుటింపఁగ ఘనభ్రుకుటిస్ఫుటకోపదీప్తుఁడై, కనదురువిస్ఫులింగములు కన్నుల రాలఁగ నౌడు దీటికొం,చెనుబదివేల రక్కసుల నెక్కుడుశౌర్యము గల్గువారలన్. భా. రా. సుం. ౩౪౪.

సీ. వాలంబు నేలతో వడి వ్రేయుచును లంక దృష్టించి యోడులు దీటుకొనుచు. భా. రా. యు. ౩౨౬.

౩. ఊఁపు, చలింపఁజేయు.

పంచచామరము. ఛటచ్ఛటాతరంగపంక్తి సారెఁ బేటి దీటఁగా, నెటో యెటో కటా మునుంగు నేది దిక్కటంచుఁ దాఁ, దటాతటాన గుండెసారెఁ దల్లడింపు చుండఁగాఁ, బోటాపోటాన నక్ర లాటుఁ బోటు నై దొరంగఁగాన్. ఉ.హరిశ్చ. ౨. ౧౨౭.

విశే. (క. దీటు) ౧. సరి, సమానము.

ఉ...నీ,కేసురలైన దీటగుదురే భవదుక్తులు నన్నుఁ బ్రీతునిన్, జేసె... ఉ. రా. ౨. ౧౯౨.

గీ. అవుర వీనికి దీటైనయతఁడు గలఁడె, వసుధఁ బరికింప...బిల్హ. ౧.౧౦౪.

గీ. పాలమీఁగడ శర్కర పానకంబు, పూవుఁదేనియ యైన నీమోవియందుఁ,దనరుమాధుర్యమునకు దీటనఁగరాదు. ఇందు. ౬. ౧౩౬.

౨. అర్హము, తగినది.

చ. ఎన యగు నెట్లు కెంజిగి వహించినయంతనె కెంపు విద్రుమం,బును గఠినంబు లౌట మృదువుల్ గద దాసనముల్ కిసాలముల్, దిను సన దీటు గా వవియుఁ దియ్యఁదనంబును సౌరభంబునున్, గనమి లతాంగిమోవికి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జగత్త్రయి దీటగువస్తు వెద్దియో. ఇందు ౨. ౧౨౪.

౨. విధము, రీతి.

ఆ. పొన్నపువ్వుదీటు పోల్చులోకులమాట, నో టు చేసి వేల్పులోటినాళ్లి, విస్తరిల్లె నపుడు వెడఁదబావిని బోల్చు, నేర్పుకాంద్రమాట నేటుచేసి. రసిక. ౬. ౧౦౦.

క్రి. విణ. తిన్నగా, సూటిగా.

క...దిట మింతయు విడక యతఁడు దీటుగఁ గడు సుంౘదటికిఁ జని... నీలా. ౩. ౬౪.

జ: దీటుకట్టు, దీటుకొను, దీటుకొలుపు, దీటు వచ్చు.

దీటుకట్టు=దీటుకొను. అ. క్రి. (దీటు+కట్టు) నిండు.

వ...దేవదుందుభిధ్వానంబు రోదసీకుహరంబు నం దీటుకట్టె... నైష. ౬. ౨౯.

దీటుకొను=దీటుకట్టు. అ. క్రి. (దీటు+కొను)

౧. నిండు; వ్యాపించు.

గీ. జనులు విహ్వలు లగునట్టిఘనరవంబు, దికల యందు నాకసమున దీటుకొనఁగఁ, గర్ణ డట్లు భేదించె... భార. కర్ణ. ౩. ౩౨౨.

ఉ. గర్భముఁ దాల్చి మైఁ గలయఁ గన్గొని వె క్కసపాటు మున్నుగా, దుర్భర మైనసం భ్రమముతోడ విషాదభయానుతాపముల్, నిర్భరభంగిఁ బుట్టి తననెమ్మది దీటుకొనంగ ...నిర్వ. ౨. ౨౨.

మ...అస్త్రశస్త్రచయశుంభద్దీప్తిజాలంబు సర్వ దిశాభాగములందు దీటుకొన... దశకు. ౧౨. ౬౨.

౨. కలుగు, పుట్టు.

క...విధి,త్రిప్పుల కచ్చెరువుపాటు దీటుకొనం గన్. దశకు. ౨. ౯౪.

వ...కల్యాణంపుఁబాటలన్ దీటుకొనుతిన్ననిర వంబులున్..., మనుచ, ౫. ౪౧.

౩. అతిశయించు.

మ. అసిసన్ బార్వతిఁ జూచి నవ్వుచు శివుం డామూర్ధమున్ గొంచు న, మ్మని శైలాదికి నాసతిచ్చిన నతం డట్లేఁగి పక్షీంద్రునిన్, గని రోషస్ఫురణంబు దీటుకొన హుంకారంబు గావింపఁ దద్ఘనవాతాహతిఁ దూలె నాతఁడు త్రిలోకవ్యాప్తి సంధిల్లఁగన్. హై. భా. ౫. ౭౬.

దీటుకొలుపు. స. క్రి. (√దీటుకొను.) దీటు కొనఁజేయు.

(నిండఁజేయు; వ్యాపింపఁజేయు.)

గీ. దేవదుందుభు లుడువీథి దీటుకొలుప,నమరు లందంద పుష్పవర్షములు గురియ, దక్ష వాటంబు చొచ్చె గౌతమతనూజ.భీష్మ.౪. ౧౯౩.

సీ. అఖిలైకనందకం బగునందకము వ్రాల దీప్తి పరంపర దీటుకొలిపె. నృసిం. ౧. ౪౫.

(పరఁగఁజేయు)

సీ...సచరాచరం బైనజగము లెల్ల. గీ. నొక్క మొగమై కడంగినఁ జిక్కువఱుచు, దివ్య బాణజాలంబుల దీటుకొలిపి, ప్రాణములఁడాఁ పఁ డీతనిపాటిదొరలఁ, గాన మేరాజ్యముల యందుఁ గౌరవేంద్ర. భార. ఉద్యో. ౪. ౨౯.

గీ. తెఱపి లేకుండ శరములు దీటుకొలిపి,ప్లవగ చక్రము నంతయుఁ బడలుపఱిచి. భా.రా. యు. ౧౨౪౧.

(పుట్టించు, కలిగించు.)

వ...హాసకుందంబులు సాంద్రతరచంద్రికాకం దంబులం దీటుకొలుప. ఆము. ౪. ౩౫.

దీటువచ్చు. స. క్రి. (దీటు+వచ్చు.) పోలు.

చ. అనఘుఁడు పిన్నశౌరి సుజనావనదక్షత రూపరేఖలన్, వినుతపరాక్రమంబునను విశ్రుత దానగుణంబు పెంపునన్,వనజదళాక్షుఁ దత్త

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నయు వానివిరోధిని వానిమిత్త్రుఁ డా, నెన
యగు దీటువచ్చు మఱి యెంతయు సా
టగుఁ జూడ జోడగుఁగా. రామ. ౧౯౬.

౭. క్రి. సమమగు.

సీ. లచ్చికోడలికన్నులకు దీటువచ్చునీలోత్పల
శరపంక్తు లానరఁ డాల్చి. ఉ.రా.౪.౧౫౬.

సీ. కుడు రేఁదుపడి పొదుకొనుకుచాంకూరముల్
పోఁకలతో దీటురాకమున్న. ముకుంద.
౨. ౩౩.

దీదివి. సం. వి. ఇ. పుం. స్త్రీ. న. అన్నము. పుం. ౧. భక్ష్యము. ౨. స్వర్గము. ౩. అగ్ని. ౪. బృహస్పతి. (వై. ని, కే. ని.)

దీధితి. సం. వి. ఇ. స్త్రీ. ౧. కిరణము. ౨. కాంతి,జిగి. ౩. అంగుళి,వ్రేలు. ౪. రఘునాథ శిరోమణిచే రచింపఁబడినయొకతర్క గ్రంథము.

దీధితిమంతుఁడు. సం. విణ. (త్. మతీ. త్.)వెలుఁగు గలవాఁడు,ప్రకాశము కలవాఁడు. వి. త్. పుం. సూర్యుఁడు.

దీన. సం. వి. ఆ. స్త్రీ. మూషిక,ఆఁడెలుక. (మే. ని.)

దీనము. సం. వి. అ. న. పుం. ౧. పున్నాగము, సురపొన్న ♣. ౨. కేతకి,మొఁగలి ♣. ౩. తగరము,నందివర్ధనము♣.

దీనారము. సం. వి. అ. పుం. ౧. ఒకవిధమైన బంగారునాణెము. ౨. స్వర్ణభూషణము,బంగారునగ. ౩. రెండుకర్షములబంగారు. ౪. నిష్క పరిమాణము. ౫. ముప్పదిరెండు రతులయెత్తుబంగారు. ౬. ముద్ర.

దీను. వి. మనోజ్ఞత,చక్కఁదనము.

గీ. బ్రహ్మతీరంబునకు దండపాణియాశఁ,గులశిఖ
రిపుత్రి దీపించుఁ గలశతీర్థ, మేనుబారలనిడు
పున దీను మిగిలి,యదియ యమృతామహాదే
వి కాస్పదంబు. పాండు. ౨.౧౪౪.

దీనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దరిద్రుఁడు, బీద. ౨. దుఃఖితుఁడు. ౩. దర్ప ముడిగినవాఁడు. ౪. భయపడినవాఁడు. ౫. జాలిగొలుపువాఁడు, శోచనీయుఁడు.

దీపకము. సం. విణ. (అ. పికా. అ.) ౧. రగుల్పునది,దరికొల్పునది. ౨. ప్రకాశింపఁ జేయునది. ౩. వివరించునది, స్పష్టపఱచునది.౪. ఉద్దీపకము,ప్రేరేఁచునది. ౫.దీపనకారి, జఠరాగ్నిని వరిలఁజేయునది. ౬. దీపము వెలిఁగించుటయందు నేర్పరి. వి.అ.పుం. ౧. దీపము. ౨. ధీమము, పక్షిమృగాదులను పట్టుటకై వేఁటకాఁడు పెంచిన పక్షి మృగము లోనగునది. ౩. ఓమము. ౪. లోచమస్తకము, నెమ్మిజుట్టుచెట్టు. ౫. (సంగీ) రాగభేదము. న. ౧. కుంకుమము. ౨. దీపకాలంకారము.

క. ప్రకృతము లప్రకృతంబులుఁ, బ్రకటంబుగఁ
గూడి తుల్యభావముఁ జెందన్, సుకవీంద్రుల
మతమున దీపక మగు నిది గమ్యసామ్య
పర మెట్లన్నన్.

క. ధారణి సదాళిసన్నుత,సారస్యం బగుచు
విమలజలజము రాకా,నీరేజవైరిబింబము,నీర
మ్యాయశంబుఁ బొల్చు నెమ్మి నృసింహా.నరస.
౫. ౧౫౧,౧౫౨.

దీపకళిక. సం.వి. ఆ.స్త్రీ. ౧. దీపశిఖ.౨.యాజ్ఞవల్క్యసంహితకు శూలపాణి రచించినటీక.

దీపకిట్టము. సం.వి. అ. న. కజ్జలము,దీపపుమసి. (వాచ.)

దీపకూపి. సం. వి. ఈ. స్త్రీ. దీపవర్తిక, దీపపువత్తి. (వాచ.)

దీపఖోరి. సం=దీపకూపి.

దీపగంబము. మి. వి. దీపస్తంభము.

వ. శ్రీభీమేశ్వరమహాదేవరకు శ్రీమతు సకలసే
నాధిపతి యైన రేసెల్లిపెద్దగణపతిరడ్డివారు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తమకు ధర్మార్థముగాం బెట్టిన లోహపుదీ
పగంబ్బము ఒక్కటిపలములు ౧౫ ... దా.
శా.౪. ౧౨౭౭.

ద్వి. ఆ పరంజ్యోతిస్వరూపంబునకును, దీపగం
బంబు లెత్తించినయట్లు. బస. పు. ౧.
౧౨౩ పం.

దీపధ్వజము. సం.వి.అ.పుం.దీపపుమసి, కాటుక.

దీపనము. సం. విణ. (అ. ఈ. అ.)-దీపసాధన
మయినది-౧. రగుల్చునది, దరికొల్పునది. ౨.
దీపనకారి, జఠరాగ్నిని వర్ధిల్లఁ జేయునది. ౩.
ప్రేరేచునది, ఉద్దీపకము. వి. అ. న. ౧. రగు
ల్చుట, దరికొల్పుట. ౨.ప్రకాశింపఁ జేయుట.
౩. జఠరాగ్నిని వృద్ధిచేయుట. ౪.కుంకుమము.
పుం. ౧. మయూరశిఖ, నెమ్మిజుట్టుచెట్టు.
౨. కాసమర్దము, కసిందకూర. ౩. పలాండువు,
నీరుల్లి. ౪. పాఠ, చిఱుబొద్ది. ౫. మెంతి
కూర. ౬. ఓమము.

దీపనీయము. సం. విణ. (అ. ఆ. అ) ౧. దీపిం
పఁజేయఁదగినది, అగ్నిదీప్తిని కలుగఁ జేయఁదగి
నది. ౨. జ్వాలనీయము, మండింపఁ దగినది.:వి.
అ. పుం. ఓమము. ౨. ఔషధవర్గభేదము.

శ్లో. పిప్పలీ పిప్పలీమూలం చవ్యచిత్రకనాగరం,
దీపనీయస్స్మృతో వర్గః కఫానిలగదాపహః.
(వాచ.)

దీపపాదపము. సం. వి. అ. పుం. వృక్షాకారము
గ నుండుదీపస్తంభము.

ఇజ్లే: దీపవృక్షము, మొ.

దీపపుష్పము. సం. వి. అ. పుం-దీపశిఖవంటి
పువ్వులు గలది-చంపకము, సంపెంగ.

దీపభాజనము. సం. వి. అ. న. దీపము పెట్టు
పాత్రము. (ప్రమిద, మొ.)

దీపము. సం. వి. అ. పుం- దీపింపఁ జేయునది-
౧. దీపిక, దివ్వె. ౨. మయూరశిఖ, నెమ్మి
జుట్టుచెట్టు.

దీపశత్రువు. సం.వి. ఉ.పుం.శలభము, మిడుత.

దీపశిఖ. సం. వి. ఆ. స్త్రీ. ౧. దీపపుకొన. ౨.
కజ్జలము, కాటుక.

దీపశృంఖల. సం. వి. ఆ. స్త్రీ. దీపములవరుస.

దీపాన్వితః. సం. వి. ఆ. స్త్రీ.దీపావళ్యమావాస్య,
ఆశ్వయుజమాసమందలియమావాస్య.

దీపారాధనము. సం. వి. అ. న. దీపము వెలి
గించి భగవంతుని సేవించుట.

దీపావళి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. దీపములవ
రుస. ౨. ఆశ్వయుజమాసమందలియమావాస్య
పండుగ.

దీపి. సం. విణ. (న్. నీ. న్) ౧. రగుల్చునది,
దరికొల్పునది. ౨. ప్రకాశించునది. ౩. దీపన
ము కలిగించునది.

దీపించు. సం.అ.క్రి.౧.ప్రకాశించు,ప్రజ్వలించు.

క. స్త్రీపున్నపుంసకత్వము, లాపరతత్త్వమున
లేమి నది విను తత్తద్వ్యాపారాపేతం బయి,
దీపించుచు నుండు బోధదేహత్వమునన్.
భార. శాం. ౪. ౧౭౫.

సీ. నాసీర మై వచ్చునలినబాంధవు పెక్కుయం
బుపై దీపించునద్ద మనఁగ. గీ ... వేగుఁ
జుక్క వొడిచె. మనుచ. ౩. ౫౪. పాండు.
౨. ౧౪౪.

౨. అతిశయించు, హెచ్చు.

మ. త్రిశిరుం డాతనిపాటు నూచి మదిలో
దీపించుకోపంబుతో.భా.రా.యు.౧౦౦౪.

మ. చని యింద్రాదిసుపర్వులం గని మనస్తాపం
బు దీపింప ని, ట్లనె...మార్క. ౧.౧౨౨.

స. క్రి. (కాంతిని) కలుగఁజేయు, పుట్టించు.

ద్వి. దిక్కుల కెల్లను దెలివి దీపించు, చుక్కల
గమికాఁడు చూపట్టె మింట. రం. రా.సుం.
౨౪౩ పా. ౧౪ పం.

దీపిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. దీపము, దివ్వె. ౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చిన్నదీపము. 3. దీపమువలె నీత్యాదివిషయములను స్పష్టపఱుచు గ్రంథము.
ఉదా: నీతిదీపిక, న్యాయదీపిక, ముహూర్తదీపిక, మొ.

దీపితము. సం.విణ.(అ. ఆ.అ.) ౧.రగుల్పఁబడినది. ౨.కాల్పఁబడినది. 3.ప్రకాశింపఁజేయఁబడినది. ౪. ప్రకటింపఁబడినది. ౫.రేఁపఁబడినది.

దీపిలు. సం. అ. క్రి. ప్రకాశించు.
శా. పైపై దీపిలునాతపంబు లనుసోపానంబులే ప్రాపుగా, భూపోత్తంసమ మేనితోడ దివికిక్ బోపో వడిక్ నాఁ దదీ,యాపూర్ణప్రథిత ప్రభావగమితుండై గోపురిం జేర నీ, పాపాత్ముం డిట కర్హుఁడే యనుచు జంభద్వేషి రోషంబునక్. గాథే. ౪. ౭౭ పా.

దీపురము. విణ.(సం.దీప్రమ్.) ప్రకాశించునది.
క. ఆపురమున నొక డుండును, గాఁపురముగ బలిజెసెట్టి గణదాసుఁ డనక్, దీపురముగాఁగ నయ్యెల,కాపురమున ధనదుఁ డుండు గతిఁ గడువేడ్కక్. హంస. ౫. ౯3.

దీపోత్సవము. సం.వి.అ.పుం.౧.దీపావళ్యమావాస్య. ౨. దీపములు వెలిగించెడియుత్సవము.

దీప్త. సం. వి. ఆ. స్త్రీ. ౧. జ్యోతిష్మతి, మానేరు. ౨. నీరుపిప్పలి.

దీప్తకము. సం.వి. అ.పుం. న. ముక్కులోమంట గలిగించురోగము. న. బంగారు. (విల్యమ్సు.)

దీప్తకిరణుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

దీప్తజిహ్వ. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఉల్కాముఖి యగుఆఁడునక్క.(వాచ.) ౨. గయాళి,గట్టివా. (ఆ.ని.)

దీప్తపింగళము. సం. వి. అ. పుం- బంగారువలె పచ్చనిసటలుకలది_సింహము.

దీప్తము. సం. విణ. (అ. ఆ. అ) ౧. వెలిఁగినది, ప్రకాశించినది. ౨. కాలినది. 3. మండినది. ౪. రేఁగినది. వి. అ. పుం. ౧. సింహము. ౨. నిమ్మ. న. ౧. బంగారు. ౨. ఇంగువ.

దీప్తరసము. సం. వి. అ. పుం. మహీలత, ఎఱ్ఱ.

దీప్తలోచనము. సం. విణ. (అ. ఆ. అ) ప్రకాశించునేత్రములు కలది. వి. అ. పుం. పిల్లి.

దీప్తలోహము. సం. వి. అ. న. ౧. కంచు. ౨. ప్రకాశించులోహము.

దీప్తాంగము. సం. విణ. (అ.ఆ, ఈ. అ.) ప్రకాశించుఅవయవములు కలది. వి. అ.పుం. నెమిలి.

దీప్తాంశువు. సం. వి. ఉ. పుం. ౧. సూర్యుఁడు. ౨. జిల్లేడు.

దీప్తాక్షము. సం. విణ. (అ. ఈ. అ) ప్రకాశించు నేత్రములు కలది. వి. అ. పుం. పిల్లి.

దీప్తాత్ముఁడు. సం. విణ. (న్. ఆ, న్. న్.) ౧. ప్రకాశించు ఆత్మకలవాఁడు.౨.మండిపడుస్వభావము గలవాఁడు.

దీప్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. ప్రకాశము, వెలుఁగు. ౨. (స్త్రీదేహాదుల) కాంతి. 3. అభివ్యక్తి, బయలుపడుట. ౪. లక్క. ౫. లత్తుక, లాక్షారసము. ౬. కంచు.

దీప్తోపలము. సం.వి.అ.పుం. సూర్యకాంతమణి.

దీప్యకము. సం. వి. అ. పుం. ౧. ఓమము. ౨. యవసస్యము. 3. నెమిలిజుట్టుచెట్టు.

దీప్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దీపమున కనుకూల మయినది. ౨. జఠరాగ్నిదీపమున కనుకూల మయినది. వి. అ. న. ౧. ఓమము. ౨. జీలకఱ్ఱ. 3. రుద్రజట.

దీప్రము. సం. విణ. (అ. ఆ. అ.) - దీపించునది- ౧. ప్రకాశించునది. ౨. మండునది. వి. అ. పుం. అగ్ని.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దీమము=దీము. వి. (సం. దీపకః.) ౧. పశుపక్ష్యాదులను వశముచేసికొనుటకై యేర్పఱచిన పశుపక్ష్యాదికము.

క. బలవద్రిపులు ప్రయోజనములకై లోఁబడుట గల్గుఁ బొలముల నేనుఁగులు దీమంబులపజ్జఁ దగిలి నెట్టన పట్టువడినక్రియఁ జతురమతీ. భార. శాం. ౩. ౨౨౯.

ఉ...మోహితుఁ జేసి నేర్పుతోఁ, దెచ్చిరి దీమముల్ మృగముఁ దెచ్చినకైవడి ముగ్ధ సంయమిన్. భా. రా. బాల. ౮౩.

చ...పురిం జెలంగుదురు కామునిదీమములట్లు కామినుల్. విక్ర. ౧.౪౯.

౨. ఎఱయుంచినబోను.

సీ. ఒకమరి దీమంబు లొడ్డి పాదులు దీర్చి బహువిహంగంబులఁ బట్టి తెచ్చి. కాళ. ౩. ౪౭.

సీ. దీమంబువేఁటలు దామెనవేఁటలు దెరవేఁటలును నేర్చు తెరలికలను, బందె మాడినభంగిఁ బందుల నొప్పింపఁ బూఁటకాం డ్రనఁ దగు వేఁటకాండ్రు. ద్వా. ౮. ౨౨. పి. శకం. ౧. ౧౧౬.

౩. (సం. ధామ) గృహము.

సీ...భాసిల్లు గృహసంజ్ఞ దీము వీమం బిల్లు గీమనంగ. ఆం. భా. ౨. ౧౩.

దీమసము=దీవసము. వి. ౧. ధైర్యము.

గీ. ఎట్టిలా వెట్టిదీమసు మెట్టితెగువ, యెట్టికడిమి కృష్ణుఁడు జగదేకవీరుఁ, డగుచుఁ గూడియున్నధరాధిపతుల,భంగపఱిచె నిం కేమని పలుకఁ గలదు. హరి. ఉ. ౩. ౯౭.

చ...మత్స్యనాథుఁ డనునట్టిమహాత్మునిదండ నీదు గా,దిలికుతుఁ డున్నవాఁడు కడు దీమసమేది తలంక నేటికిన్. సారంగ. ౩.౨౫౦.

ద్వి. ఏపార నింగితం బెఱిఁగెడియట్టి,చదురాలు గాన సంశయలేశ మయిన, మది లేక వల్కె దీమసముపెంపునను. ద్వి. హరిశ్చ. ఉ. ౧౮౪ పం.

౨. పూనిక, యత్నము.

ద్వి. సామదండోపాయసాధనంబులను, దీమసంబున జాడఁ దీయకపోరు. ద్వి. శి. సా. ౨. ౫౧ పా.

క. వే మింటిదాఁకఁ బెరిఁగిన, దీమసమున నతలమునకు దిగఁబడి చనినన్, భూమి గలయంతఁ దిరిగినఁ, దా మును పెట్టనిది రిత్త దన కేలబ్బున్. విక్ర. ౨. ౧౮౨.

౩. (పనులందు)ఉత్సాహము, కార్యోద్యోగము.

చ...మనోగతుల్, దెలిసి మెలంగ నేర్చుటకు దీమసమున్ వినయంబుఁ దాల్మియున్, గలుగుట కుబ్బి తాపసుఁ డొకానొక నాఁ డల కన్యతో ననున్. ఉ. రా. ౧. ౨౦౧.

౪. ఉపాయము; నేర్పు.

ఉ...అందుఁ బో,నొల్ల ననంగ రా దచటి కూరక పోవను రాదు నేర్పు సం,ధిల్లఁగ దీనిఁ బాపికొనుదీమస మెట్టిది యొక్కొ దైవమా. భార. విరా. ౨. ౯౧.

సీ. నొసలిలోపలిచిక్కి నెసఁగుచంద్రుఁడు దిద్దినో మింట వ్రేలెడుదీమసంబు. పాండు. ౩. ౧౩౮.

దీము=దీమము. వి. ౧. పశుపక్ష్యాదులను వశముచేసికొనుటకై యేర్పఱచినపశుపక్ష్యాదికము; తత్ప్రతిరూపము.

గీ...ఎట్టివారి కైన, నొరుల నొక వ్రేలిమిడిఁ దిరుల్ మరులు గొలిపి, దివియమే దేవి నీయట్టిదీము గలుగ. కు. సం. ౬. ౬౭౪.

గీ. రాజశుద్ధాంతభామినీరత్నరాజి, దీము గావించి వలరా జధీశు నేసె. నైష. ౩. ౯౨.

మ. తరుణు ల్దల్లిరొయుఱ స్నుచంబు లునుపం దచ్ఛైత్యము ల్దీములై, పెరశేఁపం జనుదెంచెఁ గాక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రవిదీప్తిం గ్రుంకి పాతాళగహ్వరముం దూ
జినవాని నీయదుకుత్రాల్లా తెచ్చు నా దీర్ఘ
త, చ్చిరకృష్టిం గనునట్టిశైత్య మలరించెక్
నూతులం దత్తతిక్. ఆము. ౨.౬౬.

గీ. చలము లాదవ ముండ్లు గలమ్రాఁకుదీములఁ,
గొరలి తాఁకి కొమ్ము లురులఁ దగిలి, వాని లేవ
నీడ్చి కానకే కొనిపోవుఁ, బోతరించి యిట్టి
పోతు లచట. మనుచ. ౪. ౨౨. (మ్రాఁకుదీ
ములు=కట్టెతోఁజేసిన యిఱ్ఱులు.)

౨. మత్స్యగ్రహణసాధనవిశేషము.

గీ...చల్లు డూఁదు, లుంటుగాలంబు తెరదీము
లుసురుగాల్మము...హంస.౪. ౧౦౪.

౩. గృహము. ఆం. భా. ౨. ౧౩.

౪. స్థానము, నెలవు.

ఉ. తామరతూఁడు పట్టుకొని ధాత యధో
ముఖుఁడై చనం జనక్, సోమరిపాటు భీతి
యును జూచెనె కాని సరోజమూల మి్మా,
దీమున నున్నదంచుఁ గను తేఁకువ జాలకనాళ
మాఁతిగాఁ, దా మొదలింటియట్లు నిజధామ
సరోజముఁ జేరెఁ జింతతోక్. శ్రీరం. ౩.
౧౩౦.

జః దీముకొను, దీముకొల్పు.

దీముకొను. అ. క్రి. (దీము+కొను.) నెలవు
కొను. (చూ. దీముకొల్పు.)

దీముకొల్పు(లుపు.) స. క్రి. (దీము+కొల్పు)
నెలకొల్పు.

సీ. శాత్రవోత్కర జయోత్సాహసాహసమున
భీమార్జునులపోల్కి దీముకొల్పి. రంగా. ౧.
౩౧.

దీర్ఘ. సం. వి. ఆ. స్త్రీ. పృశ్నిపర్ణి, కోలపొన్నచెట్టు.

దీర్ఘకంటకము. సం. వి. అ. పుం. బర్బురము,
తుమ్మచెట్టు.

దీర్ఘకంఠము. సం. వి. అ. పుం. ౧. కొంగ, బక
ము. ౨. దీర్ఘమైనకంఠము.

ఇట్లే: దీర్ఘగళము.

దీర్ఘకందము. సం. వి. అ. న. ౧. మూలకము,
ముల్లంగిచెట్టు. ౨. నేలతాడిచెట్టు. (వాచ.)

దీర్ఘకణ. సం. వి. ఆ. స్త్రీ. శ్వేతజీరకము, తెల్ల
జీలకఱ్ఱచెట్టు. (వాచ, విల్యమ్సు.)

దీర్ఘకాండ. సం. వి. ఆ. స్త్రీ. పాతాళగరుడీలత.

దీర్ఘకీలము. సం. వి. అ. పుం. అంకోలము, ఊ
డుగుచెట్టు.

దీర్ఘకూరము. సం. వి. అ. న. ఆంధ్రదేశమున
పండు రాజనపువడ్లు, రాజాన్న మనుధాన్యవిశే
షము. (వాచ.)

దీర్ఘకేశము. సం. వి. అ. పుం- పొడువైనవెం
డ్రుకలు కలది-భల్లూకము, ఎలుఁగుబంటి.

దీర్ఘకోశ. సం. వి. ఆ. స్త్రీ. దుర్నామ, ఏనుఁగు
జలగ.

దీర్ఘకోశిక. సం=దీర్ఘకోశ.

దీర్ఘగతి. సం. వి. ఇ. పుం- దూరదేశగమనము
కలది- లొట్టియ, ఉష్ట్రము.

దీర్ఘగ్రంథి. సం. వి. ఇ. పుం- పొడువైనకను
పులు కలది- గజపిప్పలిచెట్టు.

దీర్ఘగ్రీవము సం. వి. అ. పుం- పొడువైన
మెడ కలది- ౧. ఉష్ట్రము, లొట్టియ. ౨. ఒక
జాతికొంగ.

దీర్ఘఘాటికము. సం. వి. అ. పుం- పొడువైన
మెడతల కలది- ఉష్ట్రము, లొట్టియ.

దీర్ఘచ్ఛదము. సం. వి. అ. పుం- నిడుద యైన
యాకులు కలది-చెఱకుచెట్టు.

దీర్ఘజంఘము. సం. వి. అ. పుం- నిడుపాటి
పిక్కలు గలది-౧. ఉష్ట్రము, ఒంటె. ౨. బక
ము, కొంగ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దీర్ఘజిహ్వము. సం. వి. అ. పుం- నిడుపైన నాలుక కలది- సర్పము, పాము.

దీర్ఘతరువు. సం. వి. ఉ. పుం. తాటిచెట్టు.

దీర్ఘతిమిష. సం. వి. ఆ. స్త్రీ. కర్కటి, దోసతీఁగ.

దీర్ఘతుండ. సం. వి. ఆ. స్త్రీ. చుచుందరి, చుంచు.

దీర్ఘదండము. సం. వి. అ. పుం- నిడుపయిన దండము కలది-౧. తాటిచెట్టు. ౨. ఆముదము, ఏరండముచెట్టు. ౩. పదిహస్తములకొలఁది, ౨౪౦ అంగుళములకొలఁది. (వై. ని.)

దీర్ఘదర్శి. సం. విణ. (న్. నీ. న్.) ౧. దూరాలోచన కలవాఁడు; భావికార్యజ్ఞుఁడు, రాఁగలకార్యముల నెఱింగినవాఁడు. ౨. దూరమందున్న దానిని చూచునది. వి. న్. పుం. ౧. పండితుఁడు. ౨. గ్రద్ద. ౩. ఎలుఁగుబంటి.

దీర్ఘదృష్టి. సం. విణ.(ఇ)-దూరాలోచన కలవాఁడు- వి. ఇ. పుం. ౧. పండితుఁడు. ౨. దూరమున నున్నదానిని చూచుటకు సాధనమయిన యంత్రభేదము, దుర్బిణి.

దీర్ఘదేహి. సం. వి. ఈ. స్త్రీ. పందికొక్కు, మూషిక.

దీర్ఘనాదము. సం. విణ. (అ. ఆ. అ) ౧. దూరముగా వ్యాపించుధ్వని కలది. ౨. దీర్ఘకాలముండుధ్వని కలది. వి. అ. పుం. ౧. కుక్క. ౨. కోడి. ౩. శంఖము ౪. ఘంట.

దీర్ఘనాళము. సం. వి. అ. పుం. యావనాళము, జొన్నచెట్టు.న. దీర్ఘశాఖిపత్రకము, కామంచిగడ్డి.

దీర్ఘనిద్ర. సం. వి. ఆ. స్త్రీ. ౧. దీర్ఘకాలము పోవునిద్ర. ౨. పెద్దనిద్దుర, చావు.

దీర్ఘపక్షము. సం. వి. అ.పుం-పొడుగైన ఱెక్కలు కలది- కళింగపక్షి, కూఁకటిమూఁగ.

దీర్ఘపత్ర. సం. వి. ఆ. స్త్రీ. ౧. చిత్రపర్ణిక, కోలపొన్నచెట్టు. ౨. హ్రస్వజంబువు, పొట్టినేరేడుచెట్టు. ౩. కూరనెల్లిచెట్టు. ౪. కేతకి, మొగలిచెట్టు.

దీర్ఘపత్రకము సం. వి. అ. పుం. ౧. ఉల్లిః నీరుల్లిచెట్టు. ౨. ఆముదపుచెట్టు. ౩. హిజ్జలము, ఎఱ్ఱగన్నేరుచెట్టు. ౪. వేతసము, ప్రబ్బచెట్టు. ౫. కరీరము, వెణుతురుచెట్టు.

దీర్ఘపత్రము. సం. వి. అ. పుం. ౧. రాజపలాండువు, పెద్దనీరుల్లిచెట్టు. ౨. విష్ణుకందము అనుదుంపచెట్టు. ౩. ఒక దినుసుదర్భచెట్టు. ౪. కుందరము అనుతృణముచెట్టు. ౫. తాటిచెట్టు. ౬. కుపీలువు, నల్లతుమికిచెట్టు. ౭. తెల్లగలిజేరుచెట్టు. ౮. ఒకజాతి చెఱకుచెట్టు (విల్యమ్సు.)

దీర్ఘపత్రి. సం. వి. ఈ. స్త్రీ. ౧. పలాశీలతచెట్టు. ౨. మహాచంచశాకముచెట్టు. (వాచ.)

దీర్ఘపత్రిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. శ్వేతవచ, తెల్లవసచెట్టు. ౨. శాలపర్ణి, ముయ్యాకుపొన్నచెట్టు. ౩. కలబందచెట్టు.

దీర్ఘపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. పృశ్నిపర్ణి, కోలపొన్నచెట్టు.

దీర్ఘపర్వము. సం. వి. న్. పుం. -దూరముగా నుండుకనుపులు కలది- చెఱకుచెట్టు.

దీర్ఘపల్లవము. సం. వి. అ. పుం. శణము, జనపమొక్క. (వాచ.)

దీర్ఘపవనము. సం. వి. అ. పుం. ఏనుఁగు. (విల్యమ్సు.)

దీర్ఘపాత్తు. సం. వి. ద్. పుం. రాపులుఁగు.

దీర్ఘపాదపము. సం. వి. అ. పుం. ౧. పోఁకచెట్టు. ౨. తాటిచెట్టు. ౩. నారికేళము, కొబ్బెరచెట్టు.

దీర్ఘపాదము. సం. వి. అ. పుం. కంకపక్షి, రాపులుఁగు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దీర్ఘపృష్ఠము. సం. విణ. (అ.ఆ.అ.) నిడు పగు వీఁపు గలది. వి. అ. పుం. సర్పము, పాము.

దీర్ఘప్రజ్ఞుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దూర దర్శి, దూరాలోచన కలవాఁడు.

దీర్ఘఫలకము. సం. వి. అ. పుం. అగిసె❦.

దీర్ఘఫలము. సం. వి. అ. పుం. ఆరగ్వధము, రేల❦.

దీర్ఘఫలిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. నల్లద్రాక్ష❦. ౨. జని, కోరింద❦.

దీర్ఘమారుతము. సం. వి. అ. పుం. ఏనుఁగు. (త్రి. ని.)

దీర్ఘము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నిడుద యైనది. ౨.దూర మైనది. (ఉదా: దీర్ఘదర్శి, మొ.) ౩. ఎత్తైనది; పొడు గైనది.౪. (వ్యాక) రెండు మాత్రలకాల ముచ్చరింపఁ దగినయచ్చు. (ఆ, ఈ, మొ.) వి. అ. పుం. ౧. ఉష్ట్రము, లొట్టియ. ౨. రామశరము, ఒకజాతి రెల్లు❦. ౩. (జ్యోతి) సింహకన్యాతులావృశ్చికరాసులలో ఏదే నొకటి.

దీర్ఘముఖి. సం. వి. ఈ. స్త్రీ. చుంచు.

దీర్ఘమూల. సం. వి. ఆ. స్త్రీ. ౧. శ్యామ, ప్రేంకణము❦. ౨. దురాలభ, తీఁటకసింద❦. ౩. తీఁగతుమడి❦.

దీర్ఘమూలకము. సం. వి. అ. పుం. మూలకము, ముల్లంగి❦.

దీర్ఘమూలము. సం. వి. అ. పుం. ౧. మోరటు, చాఁగ❦. ౨. ఒకజాతిమారేడు❦. ౩. లామజ్జకము, వట్టివేరు.

దీర్ఘరంగ. సం. వి. ఆ. స్త్రీ. పసుపు❦. (విల్యమ్సు.)

దీర్ఘరదము. సం. విణ.(అ. ఆ, ఈ. అ.) నిడు పైనకోఱలు కలది. వి. అ. పుం. పంది.

దీర్ఘరసనము. సం.విణ. (అ. ఆ. అ.) నిడు పైన నాలుక కలది. వి. అ. పుం. సర్పము, పాము.

దీర్ఘరాగ. సం=దీర్ఘరంగ.

దీర్ఘరోమము. సం.వి. న్. పుం. ఎలుఁగుబంటి.

దీర్ఘరోహిషకము. సం. వి. అ. న. కత్తృణము, కామంచిగడ్డి❦.

దీర్ఘలోహితయష్టిక. సం. వి. ఆ. స్త్రీ. ఎఱ్ఱ చెఱకు❦. (విల్యమ్సు.)

దీర్ఘవంశము. సం.వి. అ. పుం. ౧. నలతృణము, కిక్కసకసవు❦. ౨. పొడు గైనవెదురు. ౩.చిరకాల ముండువంశము.

దీర్ఘవక్త్రము. సం. విణ. (అ. ఆ. అ.) నిడివి యైనముఖము కలది. వి.అ. పుం. ఏనుఁగు. ఇట్లే: దీర్ఘాస్యము మొ.

దీర్ఘవచ్ఛిక. సం. వి. ఆ. స్త్రీ. కుంభీరము, మొసలి.

దీర్ఘవర్షాభువు. సం. వి. ఊ. పుం. స్త్రీ. శ్వేతపునర్నవ, తెల్లగలిజేరు❦.

దీర్ఘవల్లి. సం. వి. ఈ. స్త్రీ. ౧. పలాశి,లాక్ష, లక్క. ౨. పాతాళగరుడీలత. ౩. మహేంద్రవారుణి, పెద్దపాఁపర❦. (వాచ.)

దీర్ఘవాలము. సం. వి. అ. పుం- పొడు గైన తోఁకగలది-చమరమృగము, సవరపుమెకము.

దీర్ఘవాలి. సం. వి. ఈ. స్త్రీ. చమరి, ఆడుసవరపుమెకము.

దీర్ఘవృంతము. సం వి. అ. పుం-నిడు పైనతొడిమకలది-శ్యోనాకము, దుండిగము❦.

దీర్ఘవృంతిక. సం.వి. ఆ.స్త్రీ. ఏలాపర్ణి,రాస్న, సన్నరాస్టము❦.

దీర్ఘవృక్షము. సం. వి. అ. పుం. ౧. సాలము,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మద్ది కీ. ౨. తాటిచెట్టు. ౩. పోఁకకీ.

దీర్ఘశరము. సం. వి. అ. పుం-పొడు గైనదంటు కలది-యావనాళము, జొన్నకీ.

దీర్ఘశాఖము. సం. వి. అ. పుం. సాలము, మద్దికీ

దీర్ఘశాఖిక. సం. వి. ఆ. స్త్రీ. ఏలాపర్ణి, రాస్న, సన్నరాష్ట్రముకీ.

దీర్ఘశింబిక. సం. వి. ఆ. స్త్రీ. శివము, నల్లాపకీ.

దీర్ఘశూకము. సం. వి. అ. పుం. రాజాన్నము, రాజనపుధాన్యము.

దీర్ఘసురతము. సం. వి. అ. పుం- దీర్ఘకాలరతి కలది-కుక్క. (త్రి. ని.)

దీర్ఘసూత్రి. సం. వి. న్. పుం=దీర్ఘసూత్రుఁడు.

దీర్ఘసూత్రుఁడు. సం. వి. అ. పుం. చిరక్రియుఁడు, పూనినపని చిరకాలమునకుఁగాని చేయనివాఁడు, మిక్కిలి మందముగా పని చేయువాఁడు.

దీర్ఘస్కంధము. సం. వి. అ. పుం. తాటిచెట్టు.

దీర్ఘాధ్వగుఁడు. సం. వి. అ. పుం. కాలరి, పత్త్ర వాహకభేదము, జాబులు మొదలగువానిని కడు దూరము కొనిపోవుదూత. ౨. ఒంటె, లొట్టియ.

దీర్ఘాయుధము. సం. విఱ. (అ. ఆ. అ.) పొడు గైనఆయుధము కలది. వి. అ. పుం. ౧. కుంత ము, ఈఁటె. ౨. నిడుద యైనఆయుధము. ౩. సూకరము, పంది.

దీర్ఘాయువు. సం. విఱ. (స్) చిరకాలజీవి, దీర్ఘ కాలము బ్రదుకువాఁడు. వి. స్. పుం. ౧. చిర జీవి, కాకి. ౨. మార్కండేయుఁడు. ౩. బూ రుగుకీ. ౪. జీవకముకీ. ౫. అశ్వత్థామాది. (అశ్వత్థామ, బలి, వ్యాసుఁడు, హనుమంతుఁడు, విభీషణుఁడు, కృపుఁడు, పరశురాముఁడు.)

దీర్ఘాయుష్యము. సం. వి. అ. పుం. ౧. కాకి. ౨. బూరుగుకీ. ౩. జీవకముకీ. ౪. శ్వేతమం దారముకీ. న. దీర్ఘమైనఆయుస్సు.

దీర్ఘాయుష్యుఁడు. సం. విఱ. (అ. ఆ. అ)= దీర్ఘాయువు. వి. అ. పుం. ౧. మార్కండే యుఁడు. ౨. అశ్వత్థామాది.

దీర్ఘాలర్కము. సం. వి. అ. పుం. ఒకజాతి జిల్లే డిచెట్టు.

దీర్ఘాహము. సం. విఱ. (న్. హ్నీ, న్, ఆ. న్.) పొడు గైనపగలు గలది. వి. అ. పుం. పొడు గైనపగలు.

దీర్ఘిక. సం. వి. ఆ. స్త్రీ. డిగ్గియ, నడబావి, నా లుగువందలధనువులుపరిమాణముగలజలాశయము.

దీర్ఘేర్వారువు. సం. వి. ఉ. పుం. డంగరి, దీర్ఘ కర్కటి, నిడివిదోసకీ.

ఇట్లే: దీర్ఘోర్వారువు.

దీర్ణము. సం. విఱ. (అ. ఆ. అ) ౧. విదారిత ము, చీల్చఁబడినది. ౨. భీతము, భయపడినది. వి. అ. న. ౧. విదారము, చీలిక. ౨. భయము.

దీల. వి. (√దీలు) డిల్లపడుట, సత్వహీనమగుట. (చూ. దీలపోవు.)

దీలపోవు. అ. క్రి. (దీల+పోవు) డిల్లపడు, సత్వ హీనమగు, దుర్బలమగు.

మత్తకోకిల... వాతధూతదవానల, జ్వాలకుఁ వన రాశివేల కసంఖ్యయాదవసేనకుఁ, దీలపోవక చక్క నయ్యెడుధీరు లెవ్వరు పోరిలోఁ. భార. ఆది. ౮. ౨౦౫.

దీలు=డీలు. అ. క్రి.

(డిల్లపడు, బలహీనమగు.)

సీ. అతివ మిక్కిలి దీలె నాలసింపగ నేల చల్లఁ గాఁ బన్నీరు చల్లరమ్మ. యయా. ౫. ౧౧౫. (శ. ర. పా. తూలె. ముద్రి. పా.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(ఊడు, ఊడిపడు.)

మ. చదిసెం దేరులు పాఱె వారణము లశ్వ
ము లరం గూలెఁ గం, జెదరెన్ సైన్యము
వ్రాలె బాహువులు ద్రెస్సె స్కాంసము
ల్వ్రాలె నం,గదము ల్దీలెఁ గిరీటముల్ పఱచె
రక్తశ్రేణి కయ్యంపుఁజొక్కు దనర్పన్
భుజదర్ప మొప్ప నిరువాగుం జేరి పోరాడఁ
గన్. కువల. ౨. ౧౪౬.

విణ. డిల్లము, బలహీనము. (శ.ర.)

జః దీల, దీలపోవు, దీలుపడు, దీలుపాటు.

దీలుపడు=డీలుపడు. అ. క్రి. (దీలు+పడు) బలహీనమగు, దుర్బలమగు;కృశించు.

సీ. భీమేశ్వరేశ్వర స్వామి మహాదేవ త్రిపుర
దైత్యులబాధ దీలుపడితి. భీమ. ౪. ౧౦౯.

ఉ...అనికి న్బల నూదనుఁ డెత్తి వచ్చినన్, దీలు
పడంగఁ దోలి యిటఁ దెచ్చెద నిచ్చెదఁ
బారిజాతమున్. పారి. ౧. ౧౩౫.

గీ. చిన్నిపదముల హాలరేఖచేత సీత,దీలుపడు
కానుచేత విదేహజాత. అహ. ౨. ౬౪.

దీలుపాటు. వి. (దీలు+పాటు) దౌర్బల్యము.

గీ...పం డ్లిగుల్చుచు దీలుపాటుఁ, బ్రకటదై
న్యంబుఁ దోఁప లోభంబు వచ్చె. నైష. ౭.
౫౨.

దీవటి(టీ)=దివ్వటి. వి. కరదీపిక.

సీ. పవమానసూనుండు పగలు దీవటిఁ బూని
స్వప్రతాపంబు సాక్షాత్కరింప. దశా.
౭. ౨. ౧౭౩.

సీ. దీవటీ దివ్వటి దివటి పం జనఁగను గరదీపి
కాఖ్య యై పరఁగుచుండు. ఆం. భా. ౨.
౧౬౫.

దీవన=దీవెన. వి. (√దీవించు) ఆశీర్వాదము, ఆశీ
ర్వచనము.

క. అనుజులుఁ దానును మునిశాసనమున నవ్వేది
యొక్కసమధికవీర్యం,బున నొప్పె బ్రాహ్మ
ణులదీ,వన లెసఁగఁగ ధర్మసుతుఁడు వాసవ
లీలన్. భార. ఆర. ౩. ౧౨౩.

క. ఆవసుదేవునిపిమ్మట, నీ వొకఁడవు సకల
మేదినీతలమున సం, భావనయోగ్యుఁడ వను
చున్, దీవన లిచ్చెన్ దయార్ద్రదృష్టిం
గనుచున్. దశకు. ౧౨. ౯౧.

క. అని యుభయారంబుగ దీ,వనతోఁ డెంకాయ
యొసఁగ వామనుచేఁ గై,కొని...దశా. ౫.
౯౧. భార. విరా. ౧. ౧౪౪.

దీవనఁబ్రాలు వి. బ. (దీవన+ప్రాలు.) ఆశీర్వచ
నాక్షతలు.

గీ. జగము గెల్వంగ దండెత్తుమగనిమీఁద,లీల
రతి చల్లుదీవనఁబ్రా లనంగ. పారి. ౨. ౩౬.

దీవసము=దీమసము. వి. (సం. ధీవశః అని భా.
ల. వ్యా.) ౧. ఆలోచనము, అభిప్రాయము.

క. గోవులకు వెనుక యై వెసఁ,బోవుచు నున్నా
రు గడవఁ బోవకయుండం,బో వలయు నడ్డ
పడియెదు, దీవస మెదఁ గలిగె నేని దేవర
కడఁకన్. భార. విరా. ౩. ౧౩౭.

౨. ఉపాయము.

క...తడయక యింకన్, గావింపు కొఱఁతకార్య
ము, దీవసమున నాతలంపు దీర్చెద నేనున్.
దశకు. ౬. ౧౨౭.

దీవి. వి. (సం. ద్వీపః. ప్రా. దీవో.)౧. నీటినడిమి
దిబ్బ, ద్వీపము; స్థానము.

ఉ. ఓవనితాలలామ లవణోదధిచక్రపరీత మైన
యా,దీవికి రాజజంబువు ప్రదీపితలాంఛనము
...నైష. ౫. ౭౯.

ఉ. నా విని పంక్తికంధరుఁడు నారదు వీడ్కొని
వేడ్క మీఱ న,ద్దీవిఁ గనుంగొనన్ దలఁచి
తీవ్రముగాఁ జను చుండి వార్ధులన్, దీవులు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పర్వతంబులు నదీప్రతతుల్ విపినాంతరం బులున్, ద్రోవను జూచుచున్ గడచి దుగ్ధ పముద్రముఁ గాంచె ముందటన్. ఉ. రా. ౫. ౨౦౫. పారి. ౫. ౬౫.

సీ. తావిగంబూరంపుదీవి నీమొగ మొక్కపలు కింత వాపైని జిలుకరాదె. వసు. ౬. ౮౪.

(సీతావర్ణనము) సీ...వలపులదీవిచెంగలువబావి. అచ్చ. రా. బాల. ౧౩౬.

౨. లంక, రావణునిపట్టణము.

ఆ. అనుచు దానిచంద మంతయు నెఱిఁగించి, కుక్కరుండు పనుప సోఁకుఱేఁడు, మరల దీవి కరిగి మఱి మీఱి కోటలు,గట్టి సేసి మూఁకఁ గాపు వెట్టె. అచ్చ. రా. యు. ౪౩౩.

జః దీవిచక్కెర, దీవిపుట్టువు, దీవిరాయఁడు, దీవిఱేఁడు.

దీవించు. స. క్రి. ఆశీర్వదించు.

వ...కుంభసంభవుఁ డతని దీవించి...కాశీ. ౨. ౧౬౪.

సీ. తమసేగిఁ జెప్ప లో దయ మీఱ విని చీరఁ జించిచ్చువారి దీవించువారు. ఆము. ౬. ౮౫.

క. క్రూరుఁ డగుకుంభకర్ణుని,బారిఁ బడి విభీష ణో క్తి బ్రదికి మునులు త,త్కారుణికుని దీవింపుదు, రారవితారకముగ బ్రదుకు మ న్నా యనుచున్. ఉ. రా. ౨. ౧౫౧.

జః దీవన, దీవనఁబ్రాలు, దీవెన, దీవెనకోలు.

దీవిచక్కెర. వి. (√దీవి.) జావామొద లగునిత రద్వీపములనుండి వచ్చుపంచదార.

సీ. రణదళిఝంకారమణితముల్ ఘటియించి దీవిచక్కెర లాఱుమోవి యాని. వేం. పం చ. ౩. ౧౩౪.

దీవిపుట్టువు. వి. (√దీవి. ద్వైపాయనుఁడు, వ్యా సుఁడు.

వ...కవ్వడియనుమనుమనికి దీవిపుట్టువుకడఁ జదు వరి యి ట్లనియె...అచ్చ. భా. ౩. ౩౬పా.

దీవియ=దివియ. వి. దీపము; కరదీపిక.

చ. చెలులు నృసింహుగీతమును జేరికగా నపరంజి వీణలో,పలఁ బలికింప నూర్చుచును బాలిక యూర్పులచేత దీపికా,కలిక చలింప నెచ్చె లులు గంటిరె మీమృదుగానలక్ష్మి కిం, దెలి యఁగ మెచ్చుచున్నయది దీవియ యంచు హసించు నెంతయున్. నరస. ౩. ౧౧౨.

చ. వెలవెలఁబాఱుదీవియలు...అఖర్వపద్మినీ,వి లసితగంధవాతములువేసవఁ దెల్ప...విక్ర. ౨. ౧౦౬.

క...తమతమయావా,సములకు నరిగి రుభయసై, న్యములజనంబులును దీవియలు వెలుఁగం గాన్. భార. భీష్మ. ౨. ౩౪౨.

జః దీవియకంబము.

దీవియకంబము=దివ్వెకంబము. వి. (దీవియ + కంబము.) దీపస్తంభము.

క. దీవియకంబంబునకును, జీవము గల్పించి క థలు చెప్పింపంగాఁ, బ్రావీణ్యము గల్గియు నీ, వీవిధమునఁ దప్పఁ జెప్ప టిది నిపుణతయే. విక్ర. ౬. ౧౪౧.

దీవిరాయఁడు. వి. (√దీవి) - లంకేశుఁడు- రా వణుఁడు.

గీ. తమ్ముఁడును దాను నెమ్మితోఁ గొమ్మమెకపు, మొత్తములఁ గూడి పోరికి మొనయుచుండె, నంత నత్తెఱఁ గంతయు నాలకించి, దీవిరా యఁడు తద్దయు దిగులు పూని. అచ్చ. రా. యు. ౪౩౩, ౧౫.

దీవిఱేఁడు. వి. (√దీవి) - లంకానాయకుఁడు - రావణుఁడు.

ఆ. అటులు జంబుమాలి దిట మంతయును దూలి పరగఁ బోరఁ గూలి జమునిప్రోలి, కేఁగినట్టి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జోలి యెఱచి మేపరు లోలిఁ, దెలుప నవుడు గఱచి దీవి కోఁడు. అచ్చ. రా. సుం. ౧౧౬.

ఆ. దీవికోఁడ మయ్యెఁడు సావును మదిమియు, గలుగ కుండునట్లుగా నొసర్చె. అచ్చ.రా. యు. ౪౭౦.

దీవె=దివ్వె. వి. దీపము.

ఆం. భా. ౨. ౧౬౪.

జః దీవెలవాఁడు, దీవెసుడి.

దీవెన=దీవన. వి. (√దీవించు) ఆశీర్వాదము.

క. విను మనుమఁడ వినుమనుమఁడ,వనఁ దనరిన నీకు నెందు నడ్డము గలదే, యని కౌఁగిట నిడుకొని దీ,వెన లెన్నేనియు నొసంగి వీడ్కొలుపుటయుఁన్. అచ్చ. రా. యు. ౪౦౬.

గీ. బ్రాహ్మణులచేత దీవెనల్ వడసి పుణ్య,భామ లిచ్చుహేమాక్షత ప్రతతిఁ దాల్చి. నైష. ౩. ౧౦౭.

ద్వి. వినుతించి వారిదీవెనలు గైకొనుచు, మన మునఁ దత్పద స్మరణంబు సేయ. ప్రభులిం.౨. (చి. ని.)

దీవెనకోలు•వి.(√దీవెన.)నమస్కారవిశేషము. ౪గడ. వృషపురస్థలిని విడియువృషాశ్రయదేవుని కిదుగో దీవెనకో లని. హంస. ౪. ౨౧౩.

దీవెలవాఁడు• వి. (√దీవె.) దీపముపట్టువాఁడు. సీ...పగలు దీవెలవారు పంజులెత్త. మనుచ. ౫. ౪౪.

దీవెసుడి. వి. (√దీవె.) దీపముంచు సాధన విశేషము.

సీ. విను మేము ప్రాలుమాలినదీవెసుడి గాక కినిసిన రెండుగుగ్గిళ్లు గాక. విప్ర. ౫. ౧౯.

దీవ్యత్• సం. (శత్రు.) ౧. ప్రకాశించుచున్న. ౨. జూదమాడుచున్న; క్రీడించుచున్న.

# దు

దు. అప. ౧. యుష్మదస్మదాత్మార్థకశబ్దములకు షష్ఠీ సమాసమున ఉత్తరపదము పరమగునపుడు వైకల్పికముగా నగుఆగమము.

క. నీదుకులమునకుఁ దగఁగఁ బ్ర,త్యోదముఁ గొని రథముఁ గడపఁ దొడఁగుము...భార. ఆది. ౬. ౫౪.

చ. సదయమనీష పంచశిఖసంయమి మోక్షముఁ దెల్పె నంటి నీ,హృదయము నాదుచొచ్చుటకు నెంతయు రోసితి...భార. శాం. ౬. ౨౦౨.

క.దక్షునకు నెఱింగించిన,దక్షుఁడు బోధించెఁ ద నదుదౌహిత్రు జగ,చ్చక్షుని...భార. శాం. ౩. ౪౯౬.

గీ. వ్యాసుచేఁ బాండవులు కాళిదాసుచేత భోజుఁడు ప్రసిద్ధి నొందిరి భువినిఁ దమదు నడకలెల్లను...అప్ప. ౧. ౧౪౫.

౨. వ్యతిరేకార్థమున అమహత్కర్తృకము లగు ధాతువులకు వచ్చుప్రథమపురుషైకవచన ప్రత్యయము.

క. ఆలివచఃకార్పణ్యం, బాలేమలచెవుల సోఁకదు...అము. ౧. ౬౩.

౩. తదర్థాద్యర్థమున "వు,రు" మొదలగు ప్రత్యయములు పరమగునపుడు ధాతువుమీఁద వచ్చెడి యాగమము.

ఉదా: వండుదువు, వండుదురు మొ.

దుఃఖగ్రామము. సం. వి. అ. పుం. - దుఃఖభూయిష్ఠమైనది - ౧. సంసారము, ఐహికయాత్ర. ౨. దుఃఖసముదాయము.

దుఃఖజాతము• సం. విణ. (అ. ఆ. అ) జాతదుఃఖము; దుఃఖి, దుఃఖముకలది. వి. అ. న. దుఃఖసముదాయము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుఃఖత్రయము సం. వి. అ. న=తాపత్రయము. (వాచ.)

దుఃఖదోహ్య సం. వి. ఆ. స్త్రీ. కష్టముతోఁ బిదుకఁ దగినయావు.

దుఃఖపడు. మి. అ. క్రి. (దుఃఖము + పడు.) నొగులు. (ప్రే. దుఃఖపఱుచు. శ. ర.)

దుఃఖపాటు. మి. వి. దుఃఖపడుట.

చ...ఈవు బం,ధురభుజశక్తితో మహిజఁ దోకొని వచ్చిన సీత నీకడం,జిరతరకాల మింపుగ వసింపక నీ వతిదుఃఖపాటుతో, నెరియుచు నుండ భూమిఁ జొరని మ్మనుచున్ శపియించెఁ గిన్కతోన్. భా.రా. కిష్కి.౦.౩౦౩.

ఆ. దుఃఖపాటు గలిగి తొడరంగ వచ్చిన,వారు గాన యలఁతిఁ బోరు...భార. ఉద్యో. ౪. ౨౫౪.

దుఃఖపెట్టు. మి. స. క్రి. (దుఃఖము + పెట్టు.) దుఃఖపఱుచు. (శ. ర.)

దుఃఖప్రాయము. సం.విశ.(అ.ఆ.అ) ౧.మిక్కిలి దుఃఖముకలది. ౨. దుఃఖముతో సమానమైనది.

దుఃఖబహుళము. సం. విశ. (అ. ఆ. అ) మిక్కిలిదుఃఖముకలది, అనేకదుఃఖములుకలది.

దుఃఖభాక్కు. సం. విశ. జ్. దుఃఖమును పొందినవాఁడు, దుఃఖవంతుఁడు.

దుఃఖభోగము. సం. వి. అ. పుం. దుఃఖమును అనుభవించుట, కష్టానుభవము.

దుఃఖము. సం. విశ. (అ. ఆ. అ) ౧. దుఃఖకరమైనది, బాధించునది.

శ్లో. సింహానాం నినదా దుఃఖాః శ్రోతుం దుఃఖమతో వనం. సం. రామా. అయో.

౨. కష్టమైనది, సుకరముకానిది. వి. అ. న. బాధ, వ్యథ.

దుఃఖశీలుఁడు సం. విశ. (ఆ. ఆ. అ) దుఃఖానుభవస్వభావముకలవాఁడు, కష్టము లనుభవించువాఁడు.

దుఃఖాంతము. సం. విశ. (అ. ఆ. అ) దుఃఖము అంతమందుకలది, దుఃఖముతో ముగియునది. వి.అ.పుం. ౧. కష్టములముగియుట. ౨. ముక్తి.

దుఃఖి. సం. విశ. (న్.నీ.న్) దుఃఖముకలవాఁడు.

దుఃఖించు. సం. అ. క్రి. నొగులు, దుఃఖపడు.

మ. అని దుఃఖింపఁగఁ గౌశికుం డచటఁ గుద్యద్వేగుఁడై వచ్చినన్. మార్క. ౧. ౨౭౦.

శా. దుఃఖింపం బని లేదు పొమ్ము బలసందోహములం దెమ్ము చేతఃఖేద మ్మెడలంగ రమ్ము... భాగ. ౧౦ పూ. ౧౫౪౬.

దుఃఖితము. సం. విశ. (అ. ఆ. అ) దుఃఖము నొందినది. వి. అ. న. బాధ, దుఃఖము.(కల్ప.)

దుంకము వి. రంధ్రము.

గీ. బడలి యన దుంక మన రంధ్ర మడరు... ఆం. భా. ౧. ౧౪౫.

దుంగ. వి. స్థూలదారుఖండము, మ్రానిమొద్దు.

సీ...దుంగ యనంగను స్థూలదారు,ఖండంబు వెలయు... ఆం. భా. ౨. ౩౭.

దుండగము. వి. (సం. దుండుకః. త. తుండరిక్కం.) ౧. దౌష్ట్యము, దుర్మార్గత; ధార్ష్ట్యము.

సీ. దుండగంబునఁ బూల గుండాడ వికలితవృత్తిఁ గల్పకవాటి వీటిఁబోదె. వరాహ. ౧౦. ౧౫.

వ. అని పొగడిన నవ్వి యవ్వటువులు దుండగంబున. ప్రభా. ౧. ౧౦౫.

గీ. దుర్ణయులు మీఁ దెఱుంగక దుండగమునఁ, గార్యములు మించఁ జేసి తత్కార్యఫలము, లనుభవింపుదు రాయాయియవసరముల. పౌమలిం. ౭౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. కొండొకసేపు నిన్ను మదిఁ గూర్చినమాధవు నంతవానికిం, బండె వధూవధప్రబలపాతక జాతకళంక మింక నీ,దుండగ మేమి చెప్పఁ దగుఁ దోయజవైరి శిఖండవీథి నీ,ఖండము పూనుశంకరుఁ డఖండజగన్మథనుండు గాఁ డొకో. వసు. ౪. ౩౩.

౨. దుష్టకృత్యము, చెడుపని.

సీ...ఇటువంటిదుండగముల, మాని కాలప్రాప్తులైనవారల నిర్నిమిత్తంబు మిక్కిలి మీకు నెగ్గు,చేయువారలఁ గలఁచి వధింపుఁ డన్యుల త్రోవఁ బోవకుఁడు... వరాహ. ౬. ౭౫.

౩. కీడు, ఆపద.

ఆ. ద్రుపదువీటిలోన ధార్మికయ్యము లేఁచెఁ, బసులఁ బట్టె విరటుపట్టణమున, మఱియు నెన్ని లేవు మార్తాండతనయుండు, దొడరి మనకుఁ జేయుదుండగములు. జై. భా. ౧. ౯౨.

క...ఆ,ఖండల నీవచ్చినట్టికత మెట్టిది యే,దుండగము లేక నాక మ,ఖండితమహిమానుభూతిఁ గర మొప్పఁగదా. శ్రీరం. మా. ౪.౧౦౫.

౪. ధూర్తకృత్యము.

ఉ...ఇ,న్నేలపడంతిదుండగ మనీతియుఁ జూచితిరే కదా యిఁకన్. ఉ. రా. ౮. ౧౦౯.

ఆ. పెద్దతోలితోడ బిగువుదామెనతోడఁ, బడి నమద్దిచెట్లనడుమ ముద్దులైనతొక్కులుఁబలుకు లాడుచు నిలుచున్న,కపటబాలుదుండగము లు చూచి. వి. పు. ౭. ౧౪౦.

౫. అపరాధము, తప్పు.

ద్వి. కలయంగ నిఖిలాంగకంబులు నొచ్చెఁ, దులువ నీచేసినదుండగంబులకు.ద్వి.హరిశ్చ. పూ. ౧౧౯౦. పం.

గీ...తప్పిదం బాగడంబు, దుడుకు నేరము నేరమి దుండగంబు, తప్పనఁగ నపరాధము తనదు నభవ. ఆం. భా. ౨. ౧౯౧.

జ: దుండగీఁడు, దుండతికము.

దుండగీఁడు. విణ. (దుండగము + ఈఁడు.) దుర్మార్గుఁడు, ధూర్తుఁడు.

ఉ. లాఁతితనంబు చేసి యబలా యెఱిఁగింపక నిల్వ నోపుదే, లేఁతలు గాక గుండె లగలించెడుకోయిలదుండగీలపెన్గూఁతలు గండుఁదుమ్మెదలగుంపులమ్రోఁతలు...పి. శకుం. ౩. ౫౮.

శా. తల్లిం జంపినదుండగీనికి దయాదాక్షిణ్యము లల్లునే. చం. రా. ౩. ౧౪౨.

సీ. లేఁదీఁగఁ బులికిఁ గల్లెముఁ బెట్టి వయ్యాళిఁ దోలఁ గారడవి నీదుండగీఁడు. ఉ. రా. ౭. ౩౯౨. వి. పు. ౭. ౧౨౭.

దుండటికము. వి. (√దుండగము.) దుండగము.

వ...పెద్దలు గన్న నేమందురో యనక యిటువలె దుండట్రికమ్ములు సేతురే యనుచు... చంద్రా. ౫. ౬౩ (చి. ని. పా.)

దుండి. వి. ౧. దొరసాని. (శ. ర.)

౨. కాంత, ప్రేయసి; ఆఁడుది, స్త్రీ.

గీ. జంత యిటు లల్గియుండ రా జంత నచట, సరసిచెంత బిసాగ్రంబు సరసి కొంత, మగని కందిచ్చుకోకి ప్రేమ గని తనదు,దుండియెడఁ దగు లెంచి యం దుండి యపుడు.సారంగ. ౨. ౧౫౨.

గీ. కానఁ దరకటబురకట గాదు మేలు,చేరఁ బురకనితో డిదే తారకాణ, యొండు రెండేదివాలనో దుండి నాదు,మాట మఱవకు మని పోయె మఱచినావె. ప్రబంధ. ౬౨౬.

సీ.వనధిఁ గ్రోలినవానికినుకచేఁ దనయుండుఁ దానును బొలదిండి యైనదుండి.చం.రా.౨.౭౪.

విణ. తుందిలము, పెద్దపొట్టగలది. (బ్రా.)

దుండిక(గ)ము=దుండిలము, దుండుగ.

వి. (సం. దుండుకః.) శ్యేనాకము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ...దుండిల మనఁగను దుండిక మనఁ దగు దుం
డుకంబు. ఆం. భా. ౨. ౪౯.
గీ. దుండిగము దుండిక మనంగ దుండుకంబు.
ఆం. పదా. అచర. ౩౭.(దుండుగము.అప
ముద్రి.)

దుండిలము=దుండికము.
క. దుండిలపాఁకులు గానఁగుఁ, బిండియు శేపక
డఁ బొరఁటి ప్రేమం దినఁగా, రెం డైదుదిన
ములకుఁ దా, ముండుట లే దనుచుఁ బోవును
గ్రపుబల్లల్. (చికి. చి. ని.)
సీ. దుట్టుగు వ్రాఁకుడు దుండిలం బగ్నియు గాం
ధారి మిరియపుఁగాండ్ర నీలి. (చికి.చి.ని.)

దుండుకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దుష్టచి
త్తుఁడు. (వాచ.)

దుండుగ=దుండికము.
గీ... పొలంబు,దుండుగలమళ్లయారులఁ దూలి
రాడు,చిక్కనేతాలపాడలుసీమఁ జనుచు.
ఆము. ౬. ౧౩.
సీ. తంగేడు మెట్టబందారి దుండుగ బ్రహ్మదండి
భూతుల సెట్టిదొండి...హంస. ౪. ౧౦.

దుండుబలి. విణ. సోమరి.
సీ...చండి సోమరి నలితిండికాఁడు, దుండుబలి
యనంగఁ దోఁచుఁ బ్రాల్మాలినవానిపే రై...
ఆం. భా. ౩. ౬.

దుండుభము. సం=డుండుభము.

దుంత. వి. దున్న, మహిషము.
సీ. కోయిల రొద సేయఁ గూయదే కాకంబు
దంతి వచ్చినబాట దుంత రాదె. రామలిం.
౩౫, ౬౩.
సీ. దుగ్గమ్మ కాలుపోతుల లోను సేయుమీ తొ
లిముద్దగా నిత్తు దుంత నొకటి. యయా.
౨. ౩.

సీ...మహిషవాచకముగా మనుచు నుండు. గీ.
దున్న యన నెనుపో తన దుంత యనఁగ.
ఆం. భా. ౨. ౨౬౪. ఆ. సం. తిర్య. ౧౦.
జః దుంతబాబావజీరుఁడు, దుంతరాతు, దుంత
వయాళికాఁడు, దుంతహుమాయివజీరుఁడు.

దుంతబాబావజీరుఁడు. వి.(√దుంత)యముఁడు.
దండకము...ఆవీఁదటందుంతబాబావజీరుండు
గాతింప...నీలా. ౨. ౪౧.

దుంతరాతు. వి. (√దుంత) యముఁడు.
గీ. తూర్పుదొర వేఁడివేలుపు దుంతరాతు,రేయి
నడకరి సంద్రంపుటేఁడు గాడ్పు. భోజ
సుతా. ౧. ౨౫.

దుంతవయాళికాఁడు. వి. (√దుంత)యముఁడు.
ఉ...శీఘ్రముగాఁ బరవీరరాజులకా, దుంతవ
యాళికానిపురిఁ ద్రోచెదఁ జండపరాక్రమో
న్నతిక. కృష్ణ. ౩. ౩౧.

దుంతహుమాయివజీరుఁడు. వి. (√దుంత)య
ముఁడు.
ఉ. ఉల్లమునందు నీవు వెఱ పూనఁగ నేటికిఁ
దమ్మిచూలిబల్, తుళ్లడఁగింతుఁ బంతమున
దుంతహుమాయివజీరుఁ బట్టి యే, పెల్ల నడం
తు...అచ్చ. రా. అర. ౧౦౫.

దుందమము. సం. వి. అ. పుం. వాద్యవిశేషము.
(విల్యమ్సు.)

దుందిలము=దుండికము.
క. అత్తఱిఁ దనచిత్తంబునఁ, దత్తరపా టొండు
లేక ధరణీరమణుం, డత్తలము వైవఁ గని
యది, తుత్తుమురుగఁ బొడిచె లేఁతదుందిలము
క్రియక. ద్వా. ౭. ౩౭.

దుందుడుకు=తుందుడుకు.వి.(దుడుకు+దుడుకు)
(ఔద్ధత్యము, గర్వము.)
ఉ. దుందుడుకు కాఱ శాత్రవులదోర్బలసంపదఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జక్కు చేసి ఖా, త్రిం దనబాహుపీఠమునఁ
దిన్నఁదనంబుగ నిల్పి...నిరం. ౪. ౮౦.
(మిక్కిలితొందర.)
క. పడఁతుక నతఁ డీగతి లోఁ,బడఁ జేసుక మరి
పె ముట్టిపడఁ గడుఁ దమి దుం,దుడు కొనరిం
పఁగఁ గోరిక, లడరఁగ రతిసేన రతుల కాయ
త్తం బై. హంస. ౨. ౧౩౮.
(మిక్కిలిదుడుకు, మిక్కిలితొట్రుపాటు.)
క. నిను గడచినఁ దలిదండ్రులు, విని నాదుందు
డుకుఁ దుడిచి విడువం గలరే,యని యే నేరి
కిఁ జెప్పక,చను దెంచితి నన,గ వచ్చె శబరబ
లమ్ములా. కవి. ౪. ౨౮.
(కష్టము, ఆపద.)
సీ. తండ్రి దఱుండు చిత్తంబున ననుఁ గలకా
లంబు రిపుభార్యగాఁ దలంచి, గారవింపక
మానునో రమణుండు రుద్రుండును శాత్ర
వదుహిత గాఁగ, భావించి విశ్వసింపక మాను
నో నాకుఁ గడవంగ రానిదుందుడుకు పుట్టె.
వరాహ. ౬. ౩.
దుందుభి. సం. వి. ఇ. పుం. ౧. భేరి. ౨. విష
భేదము. ౩. ఒకానొకరాక్షసుఁడు. (వీఁడు వా
లిచే హతుఁ డయ్యెను.) ౪. వరుణుఁడు. ౫.
ఒకసంవత్సరము. ఇ. స్త్రీ. ఇత్తిగ, పాచికయం
దలిబిందుత్రికద్వయము; అట్టిపాచిక.
దుందుము. వి. గాఢదీపిక. (చక్రాకారపుదివిటీ.
శ. ర.)
చ. వడిఁ దనుఁ బాఱఁగాఁ దఱుము వాసరకర్ష
కుచేతి భానుఁడ,స్పడిదపుదుందు మార్చి
...కళా. ౭. ౧౦.
సీ. జుంజము దుందుము సురుడు దివ్వియకోల
యనఁ గాఢదీపికాహ్వయము చెలఁగు. ఆం.
భా. ౨. ౧౬౫. (ప్రాతప్రతిపా.)
దుందుఱు=జుంజుఱు. వి. జుంజురుకట్ట. (శ.ర.)

దుందువు. సం. వి. ఉ. పుం. ౧. వసుదేవుఁడు.
౨. దుందుభివాద్యము.(వాచ.కల్ప.విల్యమ్స్.)
దుంప. వి. ౧. మూలము, కందము.
దండకము...కారాకులున్ దుంపలున్ మెక్కి
...నీలా. ౨. ౪౧.
సీ...ఆరణ్య మింపార విని తనిపండ్లును మేలి
దుంపలును శీత,జలకుంభములు గలసర్వకామ
సమృద్ధి గలిగించునన్న మిం పొలయ నొసఁ
గఁ. గీ. దగు...హరి.ఉ. ౧౦. ౩౦౦.
౨. గెనుసుగడ్డ. (ఇది వ్యవహారసిద్ధము.)
౩. వేరు, మూలము.
సీ...వే రన దుం పన వెలయు మూల,ము...
ఆం. భా. ౨. ౩౭.
౪. నాఁగేటిగొడగ, కూటకము.(శ.ర.)
జః దుంపనాగులు, దుంపబచ్చలి,దుంపరాష్ట్రము.
దుంపనాగులు. వి. బ. (√దుంప.) సర్పవిశే
షము, నాగుపాములలో నొకజాతివి.
సీ. కూఁకవేటులు చిల్లుగులియలు త్రాఁచులు పె
రజులు గుఱ్ఱపుఁబెరజు లచటఁ. గీ. గలవు
తక్కినజెఱ్ఱిపోతులును దుంప,నాగులును...
ద్వా. ౮. ౧౦౦.
దుంపబచ్చలి. వి. (√దుంప.) ఉపోదక, ఉపో
దకి, మట్టుబచ్చలి.
సీ...దుంప. గీ. బచ్చలి యన నుపోదకి పరఁగు
చుండు. ఆం. భా. ౨. ౭౨.
దుంపరాష్ట్రము. వి. (√దుంప.క. దుంపరాష్ట్ర.)
రాస్నావిశేషము. (శ. ర.)
దుంబొడి. వి. (దుమ్ము[1] + పొడి) మెంతిజీలకఱ్ఱ,
మొ. చేర్చి చేసినమెత్తనికూరపిండి. (శ.ర.)
క. క్రొంబొగపుఁ గూరవగ తిరు,గంబోఁతల
మెంతిజీలకఱ్ఱలవలపుం, దుంబొళ్లతావి...
రా. వి. ౨. ౧౧౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**దుకాణము.** వి. (క. తు. దుకాను. హిం. దూకాన్.) ఆపణము, అంగడి.

చ. తొలకరిమించుఁదీవగతి దోఁప దుకాణము మీఁద నున్న యయ్యలికులవేణితోఁ దముల పాకులబేరము లాడఁ బోయి...శ్రీనాథుని చాటువు.

**దుకూలము.** సం. వి. అ. న. ౧. క్షౌమము, పట్టుబట్ట. (నారవస్త్రము అని కొందఱు.) ౨. సన్ననివస్త్రము. ౩. తెల్లబట్ట.

**దుక్కి.** వి. ౧. దున్నుట, కృషి.

సీ. కందకంబులు ద్రవ్వి గట్టిగా ళ్లల్లించి దుక్కులు దున్నింపఁ దోఁట లవును. రామలిం. ౯౪.

గీ. గానుఁగలఁ ద్రిప్పి...రెండుదుక్కులు వెళ్లదున్ని, యట్టు గడిగి పోఁదోల ని బైతి సుమ్మి. హంస. ౨. ౩౨.

౨. నాఁగేటిచాలు.

గీ. దుక్కిలోనుండి మనజాచతిక్కి ఊని,యక్కఱకుఁ బుట్టినట్టియాయనుఁగుఁబట్టి,బెండ్లియాడఁగ నేలెంచుపిన్న యితఁడు,చూడఁ గదరమ్మ కన్నులవాడు దీఱ. బహు. ౪. ౮౨.

ఆ. దుక్కిమన్ను పురుగు చెక్కినమన్నును,శౌచమునకుఁ గాదు సంగ్రహింప. వి. పు. ౪. ౧౭౩.

౩. దుక్కిమునుఁగుటకుఁ దగినవర్షము.

(వ్యవ.) మొన్నరాత్రి రెండుదుక్కులవర్షము కురిసినది.

జః దుక్కికైదువు, దుక్కిచాలు, దుక్కిటెద్దు, దుక్కిముచ్చు, దుక్కియెనుపోతు, దుక్కివాలు, దుక్కివాలుతాలుపు, దుక్కెద్దు.

**దుక్కికైదువు.** వి. (√దుక్కి.) నాఁగలి,హలము.

సీ. ఇవి గదా దుక్కికైదువు సంకు రవ తమ్మికంటివా లైరలుబొక్కసము లయ్యె. ముకుంద. ౧. ౩౪ పా. ౧ పం.

**దుక్కిచాలు.** వి. (√దుక్కి.) నాఁగటిచేదున్నగా నేర్పడినరేఖ.

సీ. రెండవదుంత లేకుండఁ గా కినకూతి రొంపి లోదుక్కిచాల్నింపినాఁడె. రా. వి. ౧. ౨౪.

**దుక్కిటెద్దు=దుక్కెద్దు.** వి. (దుక్కి+ఎద్దు.) దున్నుట కేర్పఱచినవృషభము.

సీ...కోరినయన్ని దుక్కిటెద్దుల బల్షితోడ నిచ్చు. నీలా. ౧. ౪౯.

చ. గొజియలమంద యాఁబసులగుంపు కృషిక్రియదుక్కిటెడ్లదొ, డ్డితికిటిపెల్లుకంప బలియించినలోఁగిలి... వేం. పంచ. ౧. ౨౭౭.

**దుక్కిముచ్చు.** వి. (√దుక్కి.)కర్షకుఁడు, హాలికుఁడు.

గీ. ప్రోడ లోకవేళఁ బోరాడఁ బోలఁతి వాని, పక్కఁ జేరఁగ వచ్చు నాదుక్కిముచ్చు, గుటగుటలు దొట్టఁ బులిఁబోలె గుఱకఁ బెట్టి, నిదురవోవఁగఁ గని వెళ్లె బెదరి యిల్లు. ఉ. హరిశ్చ. ౪. ౧౨.

సీ...దుక్కిము చ్చనఁగను దోఁచుచుండు. గీ. హాళికాభిధ...ఆం. భా. ౨. ౨౦౯.

**దుక్కియెనుపోతు.** వి. (√దుక్కి.) దున్నుట కేర్పడినదున్న.

క. త్రిమ్మరి మాపటికై తన,యిమ్మున కేతేర దుక్కియెనుపోతులు రెం,డిమ్ములఁ గొమ్ములఁ జిమ్మం,గ్రమ్మిననిర్దయతఁబసులగాఁడింగట్టక్. శుక. ౩. ౪౦౯.

**దుక్కివాలు.** వి. (√దుక్కి.) హలము, నాఁగలి.

దండకము ... దుక్కివాల్వాని పేరుక్కునక్ రేఁగవా...నీలా. ౨. ౪౧.

**దుక్కివాలుదాలుపు.** వి. (√దుక్కి.) హలాయుధుఁడు, బలరాముఁడు.

ఆ...దుక్కివాలుదాలుపుతాటి,పడగవాఁడనంగ బలుఁడు రుద్ర. ఆం. సం. దేవ. ౭౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుక్కొద్దు=దుక్కి-పెద్దు. (√దుక్కి-)
సీ. ప్రాణాంత కావస్థఁ బడినయప్పుడు కాని కలు
గదు సిద్ధి యీ కాశియందు, నంత చేయఁగఁ
గల్గునవి తోలుచీరలుఁ బుసుక పేరులు జటా
భూతిధారణంబులు భిక్షాటనముఁ గపాల
ఘోర భూతసంగతి ప్రేతభూమియునికి,
యివి యేల నాకు దుక్కొద్దు దేశాంతర మ
రిగిన ట్లగును...భోజరా. ౨. ౧౬.

దుగ=దుగా, దుగుణము, దువ. స. (సం. ద్వికం. ప్రా. దుకం, క. దుగ.) రెండు.
గీ. దుగ యనఁగ రేచ యనఁగను దోఁచు ద్వి
కము. ఆం. భా. ౨. ౩౦౫.
మ...ద్యూతగేహంబు క్రొత్తగ నీ వొక్కటిఁ
జూపఁ దోడ్కొని చనం దచ్చొక చావంచ
యి,త్తిగ బారా దుగ యంచుఁ జిక్కరాద
లుద్దీపింపఁ దా దవ్వులన్. కళా. ౩.౧౩౧.
గీ. బార దుగ దచ్చి యని వచఃప్రౌఢి దనర,
నెత్తె మాడఁ దొడంగెడినృపకుమారు,లు...
ఇందు. ౫. ౧౧౬.
జః దుగతిగ, దుగ మొగములపుల్గు,దుగ మొగము
లవేల్పు, దుగమోములయ్య, దుగ్గాని, దుబా
సి,దుబాసికుఁడు.

దుగతిగ. స. (√దుగ.)ఆఱు.
సీ. దుగతిగ మొగములజగ జెట్టితోఁబుట్టు పొగ
డువారలనట్టుపుడుకుఁ జెట్టు. అచ్చ. రా.
బాల. ౭. (దుగతిగ మొగములజగ జెట్టితోఁ
బుట్టు=షణ్ముఖునిసోదరుఁడు, విఘ్నేశ్వ
రుఁడు.)

దుగమొగములపుల్గు. వి. (√దుగ.)రెండు మొ
గములు గలపక్షి, గండభేరుండము.
సీ. కులుకుచుఁ బలికింపఁ జిలుకబారులు గావు
దుగ మొగంబులపుల్గు తెగలు గాని. అచ్చ.
రా. అయో. ౩౭.

దుగమొగములవేల్పు. వి. (√దుగ.) అగ్ని
దేవుఁడు.
క. పొగయును మంటలు సదలున, కెగయఁగ
మిడుఁగుఱులు సెదర నేడ్తెఱ నపు డా
దుగ మొగములవే ల్పాగు,బ్బగ దరికొని
కాల్పఁ దొడఁగెఁ బ్రొ లెల్లెడలన్. అచ్చ.
రా.యు.౨౭౯.

దుగమోములయ్య. వి. (√దుగ.) అగ్నిదే
వుఁడు.
క. దుగ మోములయ్య వేల్పుల,మొగ మంటని
వేల్పు మబ్బువూనిసు పనఁగాఁ, దగు నగ్ని
దేవతాఖ్యలు...ఆం. భా. ౧. ౮౭.

దుగ(గు)లము. వి. రెండు బేడలు, వరహాలో
పదాఱవపాలు.(శ. ర. ప్రా.)
సీ. దీనారమందు ద్వాత్రింశదంశం బైన బేడ
యం చనఁగను వెలయుచుండు. సీ. దుగల
మం చనఁగఁ దద్యుగళంబు విలసిల్లు...
ఆం. భా. ౨. ౨౭౩.

దుగా=దుగ. స. రెండు.
సీ. కంకణంబులు మ్రోయఁగా దుగా...అంచుఁ
బందెముల్ వైచువారు. చమ. ౧. ౧౦౨.
ఉ...మిద్దియలందు నక్షవి,ద్యాపటిమంబు నూ
పువెలయాండ్రను దాను వినోదలీల బా,రా
పది దచ్చి యిత్తిగ దుగా యని పన్నిద
ముగ్గడించుచున్. నిరం. ౨. ౨౨.

దుగినుఁడు. వి. (సం. ద్రుహిణః. ప్రా. దుహిణ.)
బ్రహ్మ.
ఆ. పలుకువెలఁదిమగఁడు బంగారుకడుపువాఁ,
డంచతేజి నెక్కునట్టిరాతు,బమ్మ తాత నలు
వ తమ్మిచూలి దుగినుఁ,డనఁగ బ్రహ్మపేరు లబ్జ
మాళి. ఆం. భా. ౧. ౩౯.

దుగుణము=దుగ. విణ. (సం. ద్విగుణమ్. ప్రా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దిగుణో.) రెండురెట్లు గలది, రెండింతలు. (శ. ర.)
ప. రెండు.
సీ. దుగుణంబు సేసినతోడనే మూఁడని వా
రించి లే దని వలుమసేసి. ఉ. హరి. 3.
౧౨౨.

దుగ్గ=దుగ్గి. వి. (సం. దుర్గా. ప్రా. దుగ్గా. క. దుగ్గె.) పార్వతి, శక్తి.
ఆ. సత్తి సామితల్లి చండి యమ్మిక దుగ్గ, య
వఁగ నీసెలంత యలరు నభవ. ఆం. భా.
౧. ౪౦.
సీ. దుగ్గమ్మ కాఁబుపోతుల లోను సేయుమీ తొ
లుముద్దగా నిత్తు దుంత నొకటి. యయా.
౨. 3.

దుగ్గాని. వి. (దుగ + కాని.) ఒకానొకనిష్క విశేషము.
సీ...టంక మనఁగ నిష్కాహ్వయంబు. గీ. ద
ద్విశేషాభిధలు గాను దగును డబ్బు, లనఁగ
దుగ్గాను లనఁగ దుడ్లనఁగ జగతి. ఆం. భా.
౨. ౨౩౯. (రెండుదమ్మళ్లు. శ. ర.)

దుగ్గి=దుగ్గ. వి. పార్వతి. (శ. ర.)

దుగ్గు. వి. చూర్ణశాకము, తొక్కు.
సీ. చూర్ణశాకాభిధ శోభిల్లు దుగ్గు నా... ఆం.
భా. ౨. ౨౪౭. (వ్రాతప్రతి పా. 'తొక్కు
డు' ప్రాతప్రతి పా.)
విశ. రూపము చెడినది- తృణము-అని శ. ర.)

దుగ్ధతాలీయము. సం. వి. అ. న. ౧. దుగ్ధామ్రము, పాలను మామిడిపండ్లరసమును కలిపి వండినఆహారపదార్థము. ౨. చక్కెర కలిపిన పాలమీఁగడ. 3. క్షీరఫేనము.

దుగ్ధద. సం. వి. ఆ. స్త్రీ. పాఁడియావు.

దుగ్ధపాచనము. సం. వి. అ. న. పాలు కాఁచెడి పాత్రము.

దుగ్ధఫేనము. సం. వి. అ. పుం. ౧. పాలనురుఁగు. ౨. చక్కెర కలిపినపాలమీఁగడ.

దుగ్ధబంధము. సం. వి. అ. పుం. పాలు పిదుకునపుడు ఆవునకు కట్టుబంధము.

దుగ్ధము. సం. విశ. (అ. ఆ. అ.) పిదుకఁబడినది, పిండఁబడినది. ౨. నింపఁబడినది, ప్రపూరితము. వి. అ. న. ౧. పాలు. ౨. చెట్టు మొదలగు వానిపాలవంటిరసము. 3. దోహనము, పాలు పిదుకుట.

దుగ్ధసముద్రము. సం. వి. అ. పుం. పాలసముద్రము.

దుగ్ధాబ్ధి. సం. వి. ఇ. పుం. పాలసముద్రము.
ఇట్లే: దుగ్ధాంబుధి, మొ.

దుగ్ధామ్రము. సం = దుగ్ధతాలీయము. (వాచ.)

దుగ్ధి. సం. వి. ఈ. స్త్రీ. దుగ్ధిక, చిఱుపాలకూర.

దుగ్ధిక. సం. వి. ఆ. స్త్రీ. రక్తాపామార్గము, ఎఱ్ఱ ఉత్తరేను.

దుఘము. సం. విశ. (అ. ఆ. అ. ఇది ఉపపదసమాసాంతమునందే యుండును) ౧. పూరించునది, ౨. ఇచ్చునది.
ఉదా:-కామదుఘము, మొ.

దుట్టుపు(గు, వు.)=జుట్టుపు. వి. అజశృంగి.
సీ. దుట్టుపు దుట్టువు జుట్టు పనంగను ద్వంద్వ
ఫలాఖ్యయై తనరుచుండు. ఆం. భా. ౨.
౬౧. (బ్రా, వ్రాత, ప్రాతప్రతులపాఠము)
సీ. దుట్టుగు వ్రాఁకుడు దుండిలం బగ్నియు గాం
ధారి మిరియపుఁగాండ్ర నీలి. (చికి. చి. ని.)

దుడదుడ. వి. మంచము మొదలగువానిని వేగముగా నెక్కుటయం దగుధ్వని కనుకరణము.
చ. దుడదుడ మంచె యెక్కి నొకదొడ్డమిటా
రపుఁగమ్మకూఁతురుక్, దొడదొడ మంచమె
క్కి నొకదొడ్డమిటారపు రెడ్డికూఁతురుక్.
వీథి. 30.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుడిదుడి. వి. ఏనుఁగులు మున్నగు జంతువులు జనులు వేగముగా నడుచుటయందగు ధ్వనికను కరణము.

ద్వి. అడవియేనుఁగులు నీరాస నీనదికి, దుడిదుడి వచ్చి తత్తోయంబు దొడరి. రం. రా. ఆర. ౧౬౩ పా. ౨౦ పం.

క. ఒకలాగున మాటలు తొక, తొకలై వెడలంగఁ జొచ్చె దుడిదుడి సెందే, నొకఁడ చనఁ దొడఁగెఁ గన్నులు, సెకలించుక చూడ సాఁగెఁ బ్రీతి దలిర్పన్. నిరం. ౪. ౬౬.

దుడుకఁడు. వి. బాలుఁడు, పిల్లవాఁడు.

సీ...బాలక సంజ్ఞ నప్ప నవ్వ, పాప పాపఁడు దుడ్డె పడుచఁడు దుడుకఁడు...గీ...చెలఁగు ...ఆం. భా. ౨. ౧౧౫. (ప్రాఁత, తాళ ప్రతి. పా.)

క. ఉడుగఁడు మధురిపుకథనము, విడివడి జడుపగిదిఁ దిరుగు వికసనమున నే, నొడివిననొడువులు నొడువఁడు, దుడుకనిఁ జదివింప మాకు దుర్లభ మధిపా. భాగ. ౭. ౨౩.

క...తాఁ, బొడగనిన సెంపు దలఁచుచు, దుడుకనిమహిమాబ్ధి నజుఁడు దుడుకడిచె నృపా. భాగ. ౧౦. పూ. ౫౪౬.

దుడుకడుచు. అ. క్రి. (√దుడుకు) మునుఁగు.

క. అడుగులపైఁ బడు లేచుం, బడుఁ గ్రమ్మఱ లేచు నిట్లు భక్తిక్ మునుతాఁ, బొడఁగనిన సెంపుఁ దలఁచుచు, దుడుకనిమహిమాబ్ధి నజుఁడు దుడుకడిచె నృపా. భాగ. ౧౦. పూ. ౫౪౬.

వ...మిఱ్ఱుపల్లంబులు సమతలంబు లయి యేకార్ణవంబున దుడుకడుచుచు...(భాగ. చి. ని.)

దుడుకు. వి. (త. తుటుక్కు. క. దుడుకు.) ౧. దౌష్ట్యము.

ఉ. అందఱుఁ జూచి యింతదుడుకా యని దూఱఁగ...వి. పు. ౭. ౯.

క. ఏ నెఱుఁగకుండ నాసుత, తో నెనయుట యెట్టు లిట్టిదుడుకులు గలవే, కానీ రొక్కం బీయక, పోనీ చూచెదము తన ప్రభుత్వం బనుచున్. శుక. ౩. ౨౯.

౨. ఔద్ధత్యము.

ద్వి. మనుజేంద్రసుత యొక్క మనవిఁ గావింతు, వినఁ దగు దుడుకు గావింపఁగ రాదు. ద్వి. శ. సా. ౨. భా. (శ. ర.)

సీ...అలక్రేపులతోఁక లలమిపట్టి, విడువ నేరక వానివెనువెంట జరగుదు రప్పంకముల దుడుకిడరఁ జొత్తురు...భాగ. ౧౦. పూ. ౨౪౯.

౩. దుష్కార్యము, చెడ్డపని.

ఉ...సరోజనేత్రు, ని, చ్చోట వసింపనీక యొకచోటికిఁ బో విధియించి పిన్నబి, డ్డాటలు సేసె నీదుడుకు లక్కట భారతికైనఁ జెప్పరే. భాగ. ౧౦. పూ. ౧౨౧౨.

క. ఆవార్త లెల్ల నారదు, చే విని వీఁ డెంత దుడుకు చేసె నటంచున్. దశా. ౧. ౨౪౯.

౪. తొందర, వేగము.

ఉ...పంతము దీఱెనోటు కై, కా యను నేర యిట్లు దుడుకా యనుఁ బాయఁగఁ గోరికా యనున్. అచ్చ. రా. అయో. ౯౦.

(వ్యవ.) నీనోటిదుడుకు అడఁచికొని మాటలాడుము.

విశ. ౧. దుష్టుఁడు, దుష్టము.

క. ఈదుడుకుఁగోఁతిఁ గొని చని, మీదిట్టతనంబు లెల్ల మెఱయఁగ నిపుడొ, గా దనక తోఁకఁ గాలిచి...అచ్చ. రా. సుం. ౧౬౪.

౨. వేగవంతము, సత్వరము.

గీ...వడినేయు కటివేల్పుకొడుకు దుడుకు, టంపజడివానసోనలయలజడికిని, మిగుల నెద నొడి యాడు నమించుఁబోఁడి. నీలా. ౩. ౧౫.

సీ. భర్తకుఁ బ్రాతరాపాసనాగ్ని యొసంగి దుడుకుగాముంగిటఁ దొంగిచూచు. శుక. ౩. ౪౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జః దుందుడుకు, దుడుకడుచు, దుడుకుచేయు, దుడుకునడక, దుడుకుమెకము.

దుడుకుచేయు. అ.క్రి. (√దుడుకు.) త్వరపడు.
తే. అటుల నిజనాయకుం డేఁగి యన్యరాజ,పుర వరముఁ జేరె నంతటఁ బొలఁతి యలరి,తొడు సు మా సెఁ గదా యంచు దుడుకుచేసి,విటుల నలరించె నిచ్ఛానువృత్తి మీఱి. హంస. ౩.౭౪.

దుడుకునడక. వి. (√దుడుకు) దుష్టప్రవర్తనము, చెడునడత.
వ...కడలిరాముద్దుకొడుకుమేనల్లునిదుడుకునడక లమిడుకులకు నెగులుపడి...ఇందు.౪.౩౭.

దుడుకుమెకము. వి. (√దుడుకు) దుష్టజంతువు.
గీ. పుడమి యీనిఁచందానఁ గడలఁ దిరుగు, దుడుకుమెకములు మాచేతఁ బొడవడఁగు నె. పె. శకుం. ౧. ౧౦౪.

దుడ్డు[1]. వి. (క. దుడ్డు. త. తుట్టు) ౧. రెండుదుగ్గానులయెత్తురాగినాణెము. (చి. ని.)
సీ...టంక మనఁగ నిష్కాహ్వయంబు.గీ.తద్విశేషాభిధలు గాను దగును డబ్బు,లనఁగ దుగ్గాను లనఁగ దు డ్లనఁగ జగతి. ఆం.భా.౨.౨౭.
గీ...తమమునిచెలఁగులందుఁ,గాసు దుడ్డును బంగారుపూస వెండి,తునుక మొదలింటిచిఱువాడు కనిన దెల్లఁ, గొనుచు మగనాండ్రు తమకల్లగుట్టు మెఱియ. శుక. ౩. ౧౧౭.
౨. దుగ్గాని. (చి. ని.)
౩. డబ్బు, ద్రవ్యము.
(వ్యవ.) వాఁడు దుడ్డు లేక చాల బాధపడుచున్నాఁడు.

దుడ్డు[2]=ద్రుడ్డు. వి. (సం. దండః. త. తుట్టుత్తడి) ౧. దృఢ మగుకట్టి; లావుకట్టి.
ద్వి. దుడ్డున వీఁపు కంతులు గట్ట మోఁది. ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౦౩ పం.

కం. తిండికతంబునఁ గండలు,మెండుగఁ దాఁ బెంచి మగఁడు మెదలఁ డనుచు నుద్దండత నది మిండనికిఁ, వండినకుడు మనఁగ దుడ్డు వైఖరి మెలఁగుఁ. శుక. ౨. ౧౦౨.
౨. ముద్గరము, ఇనుపగుదియ.
గీ. గుదె గుదియ దుడ్డు గునుపము గుదుప యనఁగ, ముద్గరము .. ఆం. భా. ౨. ౨౧౬.
౩. గద.
గీ. గుదె యనఁగ దు డ్డనంగను గదకుఁ బేళ్లు. ఆం. శే. ౧౭.
విశే. ౧. మోటుకాఁడు. (శ. ర.)
క. దుడ్డునకుఁ బోయున ట్లొక,త్రె డ్డుడుకుంబాయసంబుఁ దెచ్చి యతనిచే,నిడ్డ నడిచిపడి కన లెడి,గుద్రుడులు తెలియంగఁ దెలచికొని కనుఁగొనుచుఁ. భోజరా. ౩. ౭౨. (శ.ర.పా)
౨. స్థూలము, లావయినది. (చూ. దుడ్డుఁగట్టి.)
జః దుడ్డుఁగట్టి, దుడ్డుఁగోల, దుడ్డుమంగ.

దుడ్డుఁగట్టి. వి. (దుడ్డు[2] + కట్టి) లావుకట్టి. (శ.ర.)

దుడ్డుఁగోల. వి. (దుడ్డు[2] + కోల) లావగుకట్టి, స్థూలదండము. (శ.ర.)

దుడ్డుమంగ. వి. (√దుడ్డు[2]) వృక్షవిశేషము.
సీ. కలివిరి గుండ్రయు గచ్చపెన్నంగయు దుడ్డుమంగయు భూతతొట్రుకొలె. హంస.౪.౯.

దుడ్డె. ౧. వి. బాలకుఁడు. (విశే. అని శ. ర.)
క. దుడ్డెలు రా కటు మసలిరి, జడ్డున నున్నా రటంచుఁ జను దెంచి గురుం,డొడ్డెన యడవినిఁ బొడఁగని, దొడ్డున మన్నించు టెఱుఁ గుదువుగద మనలఁ. కుచేల. ౨. ౯౧.
సీ...బాలకసంజ్ఞ నప్ప నవ్వ, పాప పాపఁడు దుడ్డె పడుచఁడు... గీ...చెలఁగు ... ఆం. భా. ౨. ౧౧౭.
౨. (సం. ధూర్తః.) విటుఁడు; విటి.
(చూ. దుడ్డెకాఁడు, దుడ్డెతనము.)
జః దుడ్డెకాఁడు, దుడ్డెతనము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుడ్డకాఁడు. వి. (దుడ్డె + కాఁడు- స్వార్థమున.) విటుఁడు.

చ. అటువలె నేఁగుచుండి మఱఁ దత్తయు మా మయు నింట లేమి వెల్పటికి హుశారుసం జని గుబాదెబ వీథులవెంట జంట లై,చిటిలి నపూఁతగంధముల సి స్తగుపాగల నిండు చ ల్వదు,ప్పటుల విభూషణావళుల శాగుగ నేఁగెడు దుడ్డెకాం డ్ర లోఁక. హంస. ౨. ౧౬౦.

దుడ్డెతనము. వి. (√దుడ్డె.) విటీత్వము. (ధూ ర్త త్వము అని శ. ర.)

గీ. పసిమిఁ జిల్కొ-ఁడుముంజేతిపచ్చ లమర, దు డ్డెతనమునఁ దిరుగు నారెడ్డిసాని. హంస. ౪. ౧౩౮.

దుత్త[1]. వి.౧.చిన్నమూతి గలచిన్నకుండ.

గీ. కడవ ముంత గరిగ దుత్త పిడుత గురిగి. హంస. ౨. ౧౧.

౨. పాలకుండ.

సీ. దుత్త యనంగను దుగ్ధభాండం బొప్ప... ఆం. భా. ౨. ౨౪౭.

ఆ. అధిక మైనయజ్ఞ మల్పుఁడు తాఁ జేసి, కొనసి శాస్త్రము విడి మురువు దక్కు-, ద్రొబ్బ నేర్చుకుక్క- దుత్తలు మోయునా... వేమన. ౨. ౯౭.

దుత్త[2]=జొట్ట, జొట్టిలి, జొత్త, జొత్తిలి. వి. చాఁపఁ బడినబొటన వ్రేలిచూపుడు వ్రేలినడిమికొలఁత,ప్రా దేశము,

చ...లేటివెంటఁ బడి దుత్తెడుమేరన పట్టు వేగ వం,తులఁగని మెచ్చి లేనగవుతోడ నభీష్టము లెల్ల నిచ్చుచుఁక. వరాహ. ౪.౮౬.

దుత్తాయి. వి. చిన్నచొక్కా-.

సీ...కూర్పాసాఖ్య యలరును దుత్తాయి యర చట్ట కుప్పసం బంగి కుబుసు, మనఁగ...ఆం. భా. ౨. ౧౫౬.

దుత్తూరము. వి. కపటము. (శ.ర.బ్రౌ.)

దత్తూరము. సం. వి. అ. పుం. ఉన్మత్తకము.

దుద్దు[1]. వి. (క. దుద్దు.) ౧. తామరపువ్వులోని దిమ్మె, కర్ణిక; మూలస్థానము.

గీ. పొలుచుఁ గర్ణిక దుద్దు నా ముద్దె యనఁగ. ఆం. భా. ౧. ౧౬౬.

ద్వి. జపసమాధుల ప్రొద్దు తపములదుద్దు ... శివ భ క్తిశిఖరంబు శ్రీనగేంద్రంబు. పండితా. పర్వ. ౩౧౩. పొ.

౨. కర్ణిక, చెవికమ్మ.

సీ. కర్ణిక దు ద్దనఁగాఁజెలఁగు ... ఆం. భా. ౨. ౧౪౭.

౩. తాటియాకుజాబుమీఁదిచెంద్రిక. (శ. ర.)

౪. జాబులు మున్నగునవి వ్రాయుటకై చివ్వి చ క్కఁబఱిచినతాటాకులకట్ట.

చ...రాయసపుటార్యులగంటము లాకుదుద్దులు న్వదలక మోసి చూచె నొకపట్టునఁ బొట్ట కు లేక తక్కునఁక. హంస.౪. ౩౦.

౫. (త. తుత్తు.) అసత్యము.

ఆ. తసుకు నసుకు దుద్దు తటవట తవతవ, సట హుళిక్కి నా నసత్య మభవ.ఆం. భా. ౧. ౧౧౯.

విణ. ముదుక, దళ మైనది. (చూ. దుద్దుకంబళి.)

జః దుద్దుకంబళి, దుద్దెక్కు.

దుద్దు[2]. ౧. వి. మత్తు. (చి. ని.) ౨. మోసము. (చూ. దుద్దువెట్టు.)

జః దుద్దువెట్టు.

దుద్దుకంబడి(ళి). వి.(√దుద్దు[1].)దళమైనకంబళి.

గీ. సన్నజాదపు నేఁతమంచంబుమీఁద, దుద్దు కంబడిఁ బఱచి నిదురకుఁ దూలు,మగనిఁ గూర్కు-కు మనుచు నమ్మాయలాఁడి. వేం. పంచ.౪. ౪౨౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రగడ. దుద్దుకంబళ్లు చందువతివాచీలు,పద్దులకుఁ గైకొన్న బలుజంబుఖానాలు. హంస. ౫. ౩౫౬.

ఇట్లే: దుద్దుగొంగడి.

ఆ. కోళ్లు మూయ దుద్దుగొంగడిఁ బఱచిన, మంచమునకుఁ గ్రొత్తమగనిఁ గొనుచుఁ, గులుకు నడల నరిగి కూర్చుండె దానిక్రిం, దింటిమగఁడు డాఁగు టెఱుఁగలేక. వేం. పంచ. ౩. ౨౪౩.

దుద్దువెట్టు. స. క్రి. (దుద్దు² + పెట్టు.) మోసపుచ్చు, కను మొఱఁగు.

ఉ...ఇప్పుడు దోసము పెద్దచేసి యా,దున్నవయాళికానిఁ గడు దొడ్డగఁ జెప్పి భయంబు నూపి చ,క్కన్నను దుద్దువెట్టి యుఱుకంగఁ దలంచెదు మాను మీవగన్. సారంగ. ౨. ౧౧౪.

ఉ. అత్తల మామలన్ మగల నన్నలఁ దమ్ములఁ దల్లిదండ్రులన్, జిత్తుల దుద్దువెట్టుచును జీటికి మాటికి నన్నె చేరఁగా, వత్తురు...దశా. ౯. ౩౫౫.

చ. మగనిఁ దృణీకరించితిని మామకు నత్తకు దుద్దువెట్టితిన్. రస. ౩. ౫. (దుద్దుబట్టితిన్ అని ముద్రి.)

దుద్దెక్కు. అ. క్రి. (√దుద్దు¹.) అతిశయించు, దళమగు.

ద్వి. పెద్ద యా ప్రమదంబు భీతియు భక్తి, దుద్దెక్కితనలోనఁ దొట్రిల్లఁ గొనంగ. బస. పు. ౧. ౫౭౬ పం.

దుద్రుమము. సం. వి. అ. పుం. పచ్చనీరుల్లి.

దునేఁడు. వి. (దునె + ఏఁడు.) ౧. ప్రభువు, ఏఁడు.

సీ. వినువాఁక మోపరి వెండికొండదునేఁడు ... సాం. ని. దేవ. ౩.

సీ. కరిబంతములనేలఁ గలవేలుపుదునీలు సమయము లేక మోసలను గాయ. పార్వ. ౧. ౧౭.

శా. ఆమూఁడిండ్లదునీలు నేక మగుసౌహార్దంబులోఁ దావకీ, నామేయస్థిరకార్యనిర్వహణశౌర్యార్యారూఢి విన్నంత నే, సీమన్ దుర్గములందుఁ గోటలను విస్తీర్ణ సిత్ ధాన్యపున్, సామగ్రుల్ సమకూర్చ నెంచిరి నితాంతస్వాంతచాంచల్యులై. కృష్ణ. ౨. ౧౨౧.

దును=దున్ను. స. క్రి. దుక్కిచేయు,కృషిచేయు.

క. ధర్మంబు పెరుఁగు వైదిక,కర్మఫలము లెసఁగు బుతునికాయము ప్రజకున్, శర్మం బొనర్చునాయువు,పేర్మిఁ బొరయు దునక పెద్దపృథివి ఫలించున్. భార. శాం. ౨. ౭౯౦.

క. దునకయుఁ బెదపెట్టకయున్, దనరె నఖిలసస్యములును...హరి.పూ. ౧. ౧౧౭.

క. దున నీయకున్నకృషికుఁడు, దునకయ యున్నెని యొకని దున్నింపఁ దగున్,దునక దున నీక యాఁగినఁ, గొనఁగా నగుఁ జేనియరియుఁ గోరునతనిచేన్. విజ్ఞా. వ్యవ. ౧౫౧.

దునుకు. వి. (త.తునుక్కు.) భయము; కంపము, వణఁకు. (బాధ. అని శ.ర.)

క. అనిలజుసారథియును గురు,తనయునిరథచోదకుఁడు నతని నాతనినిం, గొని యుల్లంబుల బలితపు,దునుకు సొరఁగ ననికిఁ దొలఁగఁదోలిరి రథముల్. భార. కర్ణ. ౧. ౧౧౦.

మ. తనఘోరధ్వనికిం గలంగఁబడుతత్సైన్యంబు దైన్యంబునన్,దును కొందం బరిఘంబు పై విసరుచున్ దుర్వారుఁడై...ఉ. హరి. ౫. ౨౨౪.

దునె(నే). వి. (సం. ధనుః?)ఆయుధము?(హిం. దునియా?) రాజ్యము? (చూ. దునెదారి.)

జః దునేఁడు, దునెదారి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దునె(నే)దారి. వి. (√దునె.) ప్రభువు; కూరుఁడు.

చ. కొలువున కేఁగి వేత్రధరకోటి నిజాయతదృష్టి వారుచోఁ, బలసి తటాలునం బగిలి పాఱ బరాబరిసేయ మన్నెవా,రలు దునెదారులున్ దొరలు రాజులు మంత్రులు నిష్టబాంధవా,వళులు పురోహితు ల్పనులవార లనేకులు నిండియుండఁగన్. సారంగ. ౩.౧౫౪.

గీ. కోఱకైదువదునెదారిగుఱుతుగట్టు,సామి సంతోషమున నున్నసమయమునను. ప్రబంధ. ౨౧౦.

మ ... గండుఁ తేఁ, టిదునేదారులవెండిగిండిగమినూటి న్నించుఁ బూఁదేనెసం,పద నొక్కించుక విచ్చుక్రొమ్మొగడజొంపంబు ల్వనీవీథులన్. చంద్రా. ౪. ౭౬.

వ. కంటి విన్కలిదంట పేరిఁటి,కుంటియెకిమీఁడయీరైదుతూపుల నెసఁగుదునేదారీ తెల్లదీవిరాజ... ప్రబంధ. ౨౧౬.

విరిలకోరిదునేదారి = పుష్పబాణుఁడు, మన్మథుఁడు.

గీ. విరిలకోరిదునేదారిదురముఁ గోరి,మీఱి పోరాడుసుకుమారమిథునలతుల,వైభవముఁ గాంచి హా యంచు వడిఁ దపించు, సంగమవిహీనయైనయాజలజనయన. హంస. ౩. ౨౧౫.

తలిరుకైదువు(ల)దునేదారి = పుష్పాయుధుఁడు, మన్మథుఁడు.

క. ఈరీతి నుండునాతని,గారాబుమిటారి తలిరుకైదువులదునే,దారికటారి సులక్షణ, షేరింటివధూటి లేమిఁ బిమ్మటఁ గొనుచున్. శుక. ౨. ౩౬౪.

పచ్చవింటిదునేదారి = ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు.

గీ. అయ్యలరుఁబోఁడి సిగ్గరి యయ్యు నిచ్చఁ, బచ్చవింటిదునేదారి హెచ్చరింపఁ, బఱికివిడెమిచ్చి యడుగుల బత్తి నొత్త, బాళి గనుపింపఁ దమి హెచ్చి పలికె బుధుఁడు. ఉ. రా. ౭. ౪౭౩.

దున్న. వి. (√దున్న-త. తున్న.) ౧. మహిషము.

ఉ. కాలునిదున్న నంది నయి గంటలు దున్నకమంటి నా మహా,కాలునినంది దున్న నయి కర్దమమగ్నత లేక మంటి నా,హాలికు లెన్నఁడుం దెగనియారులచేలును జొడుమళ్లునుం,గా లలి నేరుసాఁగి రిలఁ గల్గుపసిం గొని పేద మున్నుగన్. ఆము. ౪. ౧౨౪.

క. నెల వెడలియు నెతి సడలియుఁ, జల ముడిగియు నిదుర చెడియు జంట లెడసియున్, గలహము లడఁగియుఁ బఱచెన్, బులి కిరి కరి మన్ను దున్న మొదలగుమెకముల్. మనుచ. ౪. ౩౯.

గీ.దుంత యెనుపోతు జము నెక్కిరింత దున్న, అనఁగ మహిషసమాహ్వయము లమరు. ఆం. సం. తిర్య. ౧౦.

ద్వి. కా దన కేతెంచి కరతలం బార్చి, చాదున్న నిలు మని జంకింపఁ దడవ. బస.పు. ౪. ౧౭౭. పం. (ఇట నిందానూచకము)

౨. పశుజాతిలో మగది. (చూ. ఏనికదున్న.)

ఏనికదున్న=మగయేనుఁగు.

క. కన్నంతన తనయేనిక,దున్న దిగం ద్రావి రభసదోలాయితహా,రోన్నతవక్షస్థలుఁ డై, యన్నలినాక్షునకు వంచె నాత్మశిరంబున్. హరి. పూ. ౭. ౧౯౪.

ద్వి. ఏనికదున్నకు నేల శంకించు. బస. పు. ౪. ౯౧ పం.

దున్నపోతు=దున్న. (√దున్న.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. చదువుచుండెడివేళ సభలోనఁ గూర్చుండి దున్నపోతులకొడు కెన్నుఁ దప్పు. వేణు. ౩౬. (ఇట నిందాద్యోతకము.)

సా:-దున్నపోతు ఈనిన దనిన దూడను కట్టివే యు మన్నట్లు.

దున్నవయాళికాఁడు. వి.(√దున్న.) - మహిష వాహనుఁడు - యముఁడు.

ఉ...దోసము పెద్ద చేసి యా,దున్నవయాళి కానిఁ గడుఁ దొడ్డగఁ జెప్పి భయంబు నూపి చ,క్కన్నను దుద్దువెట్టి యుఱుకంగఁ దలం చెదు మాను మీవగల్. సారంగ.౨.౧౧౪.

దున్నించు. స. క్రి. (√దున్ను.) దున్నఁజేయు.

గీ. జనకజననాయకుఁడు యాగశాలఁ గట్టు,చోట దున్నింప నాఁగటిసీదను దోఁచి,సీత యను పేరు వహియించి చెలువు గాంచి, ప్రేమ శ్రీహరి వగునిన్నుఁ బెండ్లియాడె. ఉ.రా. ౩. ౧౩౦.

దున్ను=దును. స. క్రి. దుక్కిచేయు, కృషి చేయు.

మ. అలుకన్ ఘోటకధట్టికాఖురపుటీహల్యన్ ఖురాసానిపు,చ్చలు వో దున్ని చలచ్చమూ గజమదాసారప్లుతిన్ గీర్తిపు,ష్కలసస్యం బిడి...ఆము. ౧. ౪౨.

జః దున్న, దున్నపోతు, దున్నవయాళికాఁడు, దున్నించు.

దున్వత్. సం. శత్ర. ౧. తపించుచున్న. ౨. తపింపఁజేయుచున్న.

దుపటము=దుప్పటము, దుప్పటి.

క. శిరసుతడి యొత్తి దుపటపు,నెతెసెల్లా గట్టి వారినిలయము వెడలెన్. ల. వి. ౫. ౩౬.

దుప్పటము=దుప్పటి.

(కోక, చీర.)

వ...దుప్పటంబు ధరియించి చిఱుతొడనంబి నిజగృహంబు వెలువడి యక్కాంచీనగరమ్ము నందు. హర. ౨. ౪౨.

(ఉత్తరీయము)

ఉ. బంగరు దుప్పటంబువలెవాటుగఁనొప్ప... చమ. ౩. ౭౭. ౧.౫౨౦.

శా. అంగంబుల్ హిమవారిచేఁ గడిగి రమ్యం బైనకూటంబులో,బంగారంపుఁజెఱంగుదుప్ప టములం బాటీరజంబాలచ,ర్చం గల్పప్రస వంబులన్ మణివిభూషారాజి నందంబుగా, శృంగారించిరి సంభ్రమంబున సుకేశిన్ మి త్రకేశిన్ సఖుల్. వరాహ. ౪. ౪౬.

(తుడుచుకొనుబట్ట)

గీ.ఒక చకోరాక్షి నిజకరద్యుతులు మీఁదఁ,గప్పి చెంద్రికవన్నియ గాఁగ దుప్పటమునఁ దడి యొత్తె నొకహంసగమన సురటి,విసరుచు నఖాగ్రమున నాఱ విప్పెఁగురులు.వరాహ. ౪. ౧౨౪.

(కవచము.)

గీ.తనరు పేళ్లు తనుత్రాణమునకుఁ గత్త,ళంబు జో డు జిరా దుప్పటంబు బొంద,ళం బనఁగ... ఆం. సం. సా. ౨౬. సాం. ని.మాన.౪౫.

దుప్పటి(టీ)=దుపటము, దుప్పటము. వి. (సం.ద్వి పటీ. ప్రా. క. దుప్పటి.) వస్త్రము.

(క) వెలగల సన్నపాటివెడల్పు వస్త్రము.శ.ర.

గీ...విష్ణుండు వచ్చెఁ,బక్షిపతి నెక్కి పైఁడిదు ప్పటిచెఱంగు, దూలఁగా బిట్టు వాగెలఁ దో లుకొనుచు. వరాహ. ౬. ౧౧౪.

సీ. జీరాడుదుప్పటిచెఱఁగు చేఁ బూని వెంబడి గిండి కొని వచ్చుబుడుతఁ డొదుఁగ.ఉ.రా ౬. ౧౯౦.

గీ. మిసిమిబంగారుతళుకుల మేలిదుప్ప, టీచెఱం గులు లలితాంజనాచలమున, నలరు నరుణా తపచ్ఛాయ నవలఁ దోయ,రాముఁ డఖిలై కనయనాభిరాముఁ డయ్యె.ఉ.రా.౬.౨౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(చ) ఉత్తరీయము.

గీ. తమ్మిదోదుమ్మిజోదు సాదనలహరువు, వ్రాత
పని దుప్పటీ వలెవాటు వైచి. కుచల. ౨. ౪.

(ట) పక్కపయి పఱచుబట్ట.

చ. బటువులు తాపితాపఱుపు పట్టుతలాడము
మీఁదఁ జల్వదుప్పటిపయిఁ జప్పరంపుజిగి
బంగరువ్రాతకురాళముల్... శుక. ౪. ౨౨.

(ఠ) కప్పుకొనుమలకబట్ట, నిచోళము.

శ... చెవులసంకులు లోవంకభుజంబులు కోరికిసి
గలు కావిదుప్పటులు నొప్ప ... ఆము. ౪.
౩౫.

సీ. పిల్లఁగ్రోవులు నెక్కువెట్టినవిండ్లు కంబళ్లు
దుప్పట్లును వల్లెత్రాళ్లు. శుక. ౨. ౫౪౫.

దుప్పి. వి. ౧. పృషతము, మచ్చలు గలహరిణము.

సీ... పృషతాఖ్య యడరు దుప్పి యనంగ ...
ఆం. భా. ౨. ౬౫.

వ... మఱియు నప్పటప్పటికిం జొప్పరులవలన
నుప్పతిల్లినచప్పుళ్లకు దెప్పరం బైనతుప్పలం
దూఱుదుప్పులును... ఉ. హరి. ౪. ౭౯.

క. పొడ చెదరి బూది చఱచిన,యొడళ్లతో
నాల్గు రెండు నొకటియుఁ బ్రంగల్, వెడలిన
కొమ్ముల బరువున,నడుగిడఁగా లేవు బలిసి
యందలిదుప్పుల్. మనుచ. ౪. ౨౧.

౨. రామము, పెద్దదుప్పి.

సీ... దుప్పి. గీ. యనఁగ రామంబు చను... ఆం.
భా. ౨. ౬౫.

మృగవిశేషవాచకములు మృగసామాన్య వాచ
కములై కవుల వ్యవహారమునఁ గలవు.

చ. అడవికి వేటమై నరిగి యాతఁడు... బీదక
న్నువడి బూడిదపండును బోలె బూదుపా,
రెడు నొకదుప్పికిం గవియఁ బ్రేలి భయజ్వర
తప్తచిత్తమై.

గీ. ఆచమూరువు యూథంబుఁ ద్రోఁచి-పఱచె.

ఉ. అరుదు పీఁగతిం బఱచి...
పాండు. ౫. ౧౪, ౧౫, ౧౬.

వ... అప్పు డప్పడమికేఁ డయ్యేటినీటిలోఁ నీఁ
దుచు నొక్కపిడిదుప్పి చేరిన దానితోఁక
పట్టుకొనిరె... అమ్మృగితపఃకృశుండును మ
హాభాగుండు నగుఁనతనిఁ దిగిచికొని చను
నప్పుడు... మార్క. ౫. ౨౩౧. పిడిదుప్పి=
ఆఁడుదుప్పి.

దుబాసి=దుబాసీ. (శ. ర.)

దుబాసికుఁడు=దుబాసి. (√దుగ.)

క. ఆరాయబారి వచ్చిన, దూరాగమనంబుఁ
జూచి దోడ్తో నడిగెన్, నీరాక కేమి కత
మని, గోరుందొర తనదుబాసికులమూలముఁ
గాన్. రంగా. ౨. ౧౧౬.

దుబాసీ=దుబాసికుఁడు. వి. (√దుగ. సం. ద్విభా
షీ. ప్రా. దుభాసి. హిం. దుభాషీ.) రెండుభాష
లు వచ్చినవాఁడు, భాషాంతరము చేయువాఁడు.

క. మూసాబూసీవారిదు, బాసీ లక్ష్మణసమాఖ్యుఁ
బరఁగు నతఁడు... రంగా. ౨. ౬౧.

దుబ్బ. వి. (క. దుబ్బి.) ౧. కూజా, పాత్రవిశేషము.

సీ. తొర్లఁగట్టెయుఁ జలదుబ్బ చిల్కుడుగుంజ
పూజెబిందెలు వెన్నపూసచట్టి. హంస. ౨.
౭౫.

౨. ఆఁడుగుజ్జు.

సీ... పాపలఁ గనుతావు పత్తబుయ్యా, మరునిల్లు
దుబ్బన మదనమందిరమొప్పు... సాం. ని.
మాన. ౧౯.

దుబ్బు. వి. తృణమూలము.

సీ... నలు సన నలరు శుష్క. గీ. తృణము దు
బ్బనఁగా మూల మెసఁగు... ఆం. భా. ౨.
౭౬.

సీ. దుబ్బు నిబ్బరముగఁ దొడిగి కన్నులు గట్టి
కటిదఘ్నముగను ప్రేకంబుఁ జూపి. శివ
ధ. ౫. ౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుమగతికేతు. వి. (సం. ధూమకేతుః.) ధూమకేతువు, అరిష్టకసూచక మగునక్షత్రవిశేషము, తోఁకచుక్క.

సీ. దుమగతికేతు నా ధూమకేతువు నోఁచు... ఆం. భా. ౧. ౯౭.

దుమదుమ. వి. తడియునప్పు డగుధ్వని కనుకరణము.

క. సమదగజదానధారల, దుమదుమ లైయున్న పెద్దత్రోవలతోడన్, రమణీయ మయ్యె నప్పురి... భాగ. ౯. ౩౨౨.

క. తమపాటఁ జినుకు చినుకుల, దుమదుమ నాఁ దడిసినట్టి దువ్వాలువలతోఁ, ఘుమఘుమ యనుపరిమళబృందముతో నప్పు డొకయింపొనర్చిరి వారల్. కళా. ౩. ౬౭.

విశే. కలిసినది, మేళగించినది.

చ. అమృతరసంబు లుట్టిపడ నాలతిఁ జేసినవీణ లోపలన్, దుమదుమగా వచోమహిమ దోఁపఁగ గీతముఁ బాడుచున్న... నిరం. ౨. ౭౯.

దుమాదూళి. వి. (దూళి + దూళి.) అధిక మగు దుమ్ము.

మ. మడిసెన్ గారెనుపోతు లేదు లిలిగన్ మ్రగ్గెన్ వృకవ్రాతముల్, గదుఁతు ల్చిక్కెగజాళి చొక్కె నపు డక్కానన్ దుమాదూళిగన్. సారంగ. ౧. ౧౦౪.

దుమారము=దుమ్మరము. వి. (ఆకాశమందు వ్యాపించు) పెంధూళి, పెద్దదుమ్ము.

ఉ. మన్ననఁ గాంచి కప్రపుదుమారము రేఁచు సమీరడింభముల్. వసు. ౧. ౧౧౨.

చ... అప్పుడు సుడిగాలిఁ బట్టుక నభోగతిఁ బాఱె దుమార మెంతయున్. చంద్రా. ౨. ౭౭.

గీ. మతియుఁ గపురంపుకమ్మదుమార మెగయ, వీఁకఁ బైకొను చిఱుగాడ్పు పోఁడుములును, నలముకొనఁగ... రసిక. ౩. ౧౭౪.

౨. దుమ్ము. (శ. ర.)

దుమారము రేఁగు=దుమారము రేఁగునట్లు రేఁగు.

సీ. మలయానిలముచే దుమారంబు రేఁగుసౌగంధికంబురజంబు కఱకుదుమ్ము. మను చ. ౫. ౩౭.

దుమారము రేఁచు=దుమారమువలె రేఁగఁజేయు.

గీ. అనుచు నిందించి వలవంత యినుమడింప, నవ్వరారోహ విదళితహల్లకముల, కమ్మపుప్పొడి పై దుమారమ్ము రేఁచు, మలయమందరపవను పై నలుక వొడమి. మనుచ. ౩. ౪౯.

దుమాలు. విశే. బ. సమూలము. (శ. ర. ఇంకను విచార్యము.)

ద్వి. కొండొకసేపులోఁ గొట్టె దుమాలు, బెండుగా నాశూద్రబృందంబుతలలు. ద్వి. భాగ. ౬ స్కం. (శ. ర.)

దుమికించు=దూఁకించు. స. క్రి. (√దుముకు.) (గుఱ్ఱము మొ.) ఉఱికించుచు నడిపించు.

సీ. గంధర్వు లగ్రభాగమున జోడన మించు ఘోటుల దుమికించుకొనుచు నడవ. దశా. ౨. ౧౯.

ఉ. తీరినతత్తడిన్ జవగతిన్ బుటముల్ దుమికించుచాడ్పునన్, దీరనితత్తడిన్ జవగతిన్ బుటముల్ దుమికించు వాగెఁ బెంపార బిగించి... చంద్రా. ౨. ౧౯.

దుమికియాడు. అ. క్రి. (√దుముకు.)-గుఱ్ఱము-వల్గిత మనుగతితో పోవు.

సీ. గండఁబానిగ్గుచొకాటంపు మోముట్టు తొగరీఁకలపటాణి దుమికియాడ. ఉ. హరిశ్చ. ౩. ౧౩౧.

దుము=దుమ్ము[1]. (శ. ర.)

జః దుముదుము, దుముదారు, దుముదారుదొర.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుముకు=దూఁకు. అ. క్రి. (క. డుముకు.) ౧. ఉఱుకు, గంతు.

మ...కరిణీఫాలంబుపై సింహ మర్భక మయ్యెఁ దుముకుఁ స్వభావ మిది శూర శ్రేణికిఁ... మల్లభూ. నీతి. ౩౦.

చ. ఉరుతిమిరేభభేదనచణోగ్రకనత్కరజాత శాలి యా,హరి యనివారితాస్తకుధరాధిప శృంగముఁ జేరి యత్తఱిఁ, హరి యని వారి తాత్తతనుహార్యనుబింబముఁ గాంచి రాగ వై,ఖరి వడి గుప్పునం దుముకుకై వడిఁ గ్రుంకెఁ బయోనిధిస్థలిఁ. చంద్రి. ౪. ౯౪.

౨. పడు.

చ. చెమటలు దొప్పఁదోఁగుజిగిచెక్కులు పువ్వులు రాల మూపులం, దుమికెడికొప్పులు న్నొసటఁదుం పెసలాడెడుచేరుచుక్కలుఁ. రా. వి. ౩. ౭౭.

౩. ఉట్టిపడు, ఉట్టు.

గీ. దూదిపాటలఁ దేనియల్ దుముకుచుండఁ, జిఱుతొడల నంటఁగాఁ గోకనెఱికక్రిక్కి, తియ నడంచుచుఁ గూర్చుండి రెడ్డిపడుచు, టింగుటింగున రాట్నంబు ద్రిప్పుచుండె. ఉ. హరిశ్చ. ౪. ౨౪.

వి. ౧. గంతు, ఉఱుకు.

క. దుముకులు వైచుచు నాయా,సమయంబుల జలము లెత్తి చల్లుచు వల ల,క్రమలీల వైవ...వేం. పంచ. ౧. ౬౧౭.

౨. మల్లవిద్యావిశేషము.

క. మొన చేసినచోటన దుముకును దుముకును జేయుతఱిని గొంచెపుమొనయుఁ, మొన దుముకు దుముకుమొనయును, గనుపింపకచేసి యంతఁ గాంతాళమునఁ. ప్రబంధ. ౭౭౪.

జః దుమికించు, దుమికియాడు, దుముకులాడు.

దుముకులాడు. అ. క్రి. (√దుముకు.) గంతులు వేయు, ఉఱుకులువేయు. (శ.ర.)

దుముక్కు. వి. ఉఱుకుటయం దగుధ్వని కనుకరణము, వేగానుకరణము.

ఆ. అసురభటులయార్పు లడఁగుపట్టి చనంగ, నతని చెవులు గూబ లంటఁ బెఱికి, ముక్కు గొఱికికొని దుముక్కునఁ దనసేన, సరస కుఱికి రామచంద్రుఁ గాంచె. రామా. ౬. ౧౪౭.

దుముదారు[1]. వి. (హిం.దుముదార్.) ముందటిసైన్యమునకు కాపుగా వెనుకనుండు సేనానాయకుఁడు సేన మున్నగునది. (దుము+తారు-దండు. అని శ. ర.)

గీ. సరస మన్నీలు దుముదార్లు చతురవితత,సకలసేనాసమేతులై సందడింప, రమణఁ జెలువొందురాజమార్గమున వచ్చె, రమ్యగుణశాలి శ్రీకృష్ణరాయమౌళి. కృష్ణ. ౨. ౧౪౯.

గీ...దుముదారుగా హయాళిఁ, జేరువకు నూకి ...దశా. ౨. ౩౭౭.

దుముదారు[2]. వి. గుఱ్ఱములోనగువానిగతివిశేషము.

సీ. మూపురంపుగతికి మేపరి ముకుమచ్చుతత్తడి వడి దుముదారుఁ జూప. ఉ. హరిశ్చ. ౩. ౧౩౧.

దుముదారుదొర. వి. (√దుముదారు[1].) సేనానాయకుఁడు; రాజునకు వెనుకకాపుదలకైయుండు సేనానాయకుఁడు.

సీ. సకుటుంబముగ వీఁగి చరమశైలముఁ జేరు తుహినాంశుదుముదారుదొర యనంగ. మను చ. ౩. ౫౪.

దుముదుము. వి. (√దుము.) దుమున కామ్రేడితరూపము.

క. తల్లీ నిను వెఱపించుదు, విల్లె రెత్తించుకొని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డుచెఱిబొమ్మల నీ, కల్లరికక్కసిజంతల,త్రు
ళ్లడఁతునె వనము వెలుకుదుర్ దుముదుము
గాక్. రామా.౬.౧౯౯.(శ. ర. పా. 'త్రు
ళ్లడతునె వనము పెరుకుదునె ముదలగదా'.
ముద్రి. పా.)

దుమ్మరము=దుమారము.

(దుమ్ము.)

సీ. ఒసపరి మైఁ గ్రమ్ముకుసుమపరాగము మైఁ జ
ల్లుకొన్నదుమ్మరము గాఁగ. సుదంతా. ౨.
౧౨౬.

దుమ్మాడు. అ. క్రి.(దుమ్ము[1] + ఆడు.) ధూళిచల్లు
కొను.

గీ. కొమ్మ లందఱు రతనంపుసొమ్ము లూడ్చి, నూ
నరజములు సోఁకినసాలపుమేను, లమర గం
టలు దీసి దుమ్మాడినట్టి,మరునిమద మేనుఁగుల
రీతి సరసిఁ జొరఁగ. కృ. శకుం. ౨.౧౬౨.

దుమ్ము[1]=దుము. వి. ధూళి, పరాగము.

గీ. ఇలకు డిగి చుట్టిచుట్టి దు మ్మెత్తి యెగసి,పోయి
తము ముంచుసుడిగాలి పుష్కరముల, కడ
లినీ రభ్రకలభముల్ గ్రాసె...ఆము.౪.౭౧.

సీ. పువ్వుఁబుప్పొడిదుమ్ము పొదలె నిప్పొదలలో
సిద్ధాలు లెపుడు వసించునేమొ. ఉ. రా.
3. ౬౫.

సీ. శిరము కప్రపుదుమ్ము మరువంపుపాదుల కెర
వాటు వైచినయింపుసొంపు.రా.వి.3.౭౧.

సీ. క్రుంకుమెట్టున వేల్పుఁగొమ్మ లాడుచుఁ జల్లఁ
దులకించు చంద్రపుదు మ్మనంగ. యయా.
౨. ౭౦. మనుచ. ౧. ౪౨.

దుమ్మెత్తి,పోయు = మిక్కిలిగా తిట్టు.
(వ్యవ.) ఆమె వానిని దుమ్మెత్తిపోసినది.

పూదుమ్ము=పుప్పొడి, పరాగము.

ఉ. కమ్మనిపువ్వుఁ దేనియలఁ గాఁక లడంచుఁ
బ్రవాళితాళవృం, తమ్ముల సేదఁదేర్చు విరి
తావులఁ జల్వలు గ్రుమ్మరించుఁ బూదుమ్ములఁ
బూజ సల్పు వ్రతతుల్ వరమంజు లతాది
రాజ్యయోగమ్మునఁ బొల్చు నాసుగుణకల్పక
వల్లి వనిం జరింపఁగన్. హ. న. 3. 3౫.

జః దుంబొడి,దుమ్మాడు,దుమ్ముదూళి,దుమ్మసేయు.

దుమ్ము[2]. వి. ఎమ్ము, ఎముక.

సీ. పొట్టలు చట్టలు బొమ్మలు దుమ్ములు మోవు
లు ప్రేవులు పొలలు దలలు.అచ్చ.రా.యు.
౧3౫.

జః దుమ్ములగొండి.

దుమ్ముదూళి. వి. (√దుమ్ము[1].) పిండిపిండి.

ఉ. కొన్నిటిహస్తము లదియఁ గొన్నిటికొమ్ములు
దుమ్ముదూళి గాఁ, గొన్నిటికుంభము ల్వగుల
...భార. భీష్మ. ౨. ౨౧౧.

దుమ్ములగొండి వి.(√దుమ్ము[2].) మృగవిశేషము,
కొర్నవగండు. (ఇది వాసనచూచినచో ఎముక
లు మెత్తపడు నందురు.) ఇది ఎముకలఁ దినును.
(బ్రౌ.)

దుయ(య్యి)ముడి= దూముడి, దూయుముడి.
(√దుయ్యు.) సులభముగా నూడఁదీయుటకై
వేయుముడి, జాఱుముడి.

సీ. జాగిలాలపసిండిసరిపెణల్ సడలించి పట్టె
డల్ దుయుముడిఁ గట్టువారు. చంద్ర. ౨.
3౫.

దుయ్యు=డుయ్యు, దూయు, దూయు. స. క్రి.
౧. (ఒఱనుండి కత్తి మొ,) తీయు, లాగు.

క. అని మరుబాములఁ బడ లే,నని కైదువు దుస్సి
దాఁటునాయితము బలెక్, బెనఁగునలయుతి
యచే సురి,య నులిమి బలిమి విడిపించి యను
ననురక్తిక్. సారంగ. ౨. ౨3౫.

గీ.తన్ని యంతటఁ బోక యద్దనుజవరుని, ద్రొక్కి
యున్నతలాటంబు దుస్సి తివిచి, యేపునను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గొని యెప్పటిరూపుతోడ, నచట వీడ్కొని
రఘుపతి నాత్మ( దలఁచె. సీతావి. ౩.౭౭.

౨. త్రెంచు.

గీ. పూసప్రాడు దుయ్యను లేదు పొలఁతి మెడకుఁ, బెరుపు పొలింట నేడ్చిన బిడ్డకైన, మిడువ లే దెల్లదానను జెడితి మెల్లఁ,బోయితిమి ప్రాలుగలపట్టి పుట్టఁ బట్టి. హరి. పూ. ౫. ౨౧౯.

అ. క్రి. ౧. వెడలు.

వ...నిన్ను శపియింప నే నెంతవార మని యుపచారోక్తులు పలుకుచు దుస్సిపోయిరి...భోజరా. ౪. ౯౪.

౨. (బాణము, మొ.) రంధ్రముచేసికొని పోవు.

క. వీరుద్ధ్రిమిథున మేళన,కై రతిపతి యేయ దుస్సి హరితద్యుతిఁ బై,నా రెగయఁ బొటమరించిన,నారసముల మొన లనంగ నన లవిమించెన్. ఆము. ౫. ౧౧౫.

దుయ్యఁబట్టుకొను=(సమాధానము చెప్పు మని) నిర్బంధించు.

(వ్యవ.) అప్పులవా రందఱు వానిని దుయ్యఁబట్టుకొనినారు.

(వ్యవ.)అపాడుపని చేసి వాఁడు వచ్చునప్పటికి వీథిలో వానిని అందఱు దుయ్యఁబట్టుకొన్నారు.

దుర్. సం. అవ్య. (ఇది ప్రాదులలోనిది. సమాస పూర్వపదముగా నుపయుక్తమగు.)౧.దుష్టము. (దుర్జనుఁడు, మొ) ౨. కష్టము. (దుర్జయము, మొ) ౩. నిషిద్ధము. (దుర్దానము, మొ) ౪. అల్పము. (దుర్బలుఁడు, మొ) ౫. అభావము, లేమి. (దుర్భిక్షము, మొ.)

దురంతము. సం. విణ. (అ.ఆ.అ.)-దుర్లభ మగు అంతము కలది- ౧. అనంతము, తుదిలేనిది. ౨. దుఃఖముతో అంత మొందునది. (వ్యసనాది) ౩. దురతిక్రమము, అతిక్రమింపరానిది.:౪.అ.పుం. దుష్ట మగుఅంతము, దుఃఖకరమగు పర్యవసానము.

దురక్షము. సం. వి. అ. న. ౧. చెడ్డయింద్రియము. అ.పుం.౧. దుష్టపాశకము, మోసగించు పాచిక. ౨. దుష్టద్యూతము, కపటపుజూదము.

దురక్షుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ౧. చెడ్డకన్నులు గలవాఁడు. ౨.వికృత మయినకన్నులు కలవాఁడు. (అ. ఆ. అ.) చెడ్డయింద్రియములు గలవాఁడు.

దురటిల్లు=దురపిల్లు. అ.క్రి. (ఈరూపమును గ్రహింపక చి. ని. శ. ర. లు దురపిల్లు అనియే గ్రహించినవి. ప్రతులయందు ఉభయవిధము లగు రూపములు గానవచ్చుచున్నవి. దీనికినిర్ధారకము లేదు. ఇంకను విచార్యము.) ౧. శోకించు, దుఃఖించు.

ఉ...అ,త్యావిలచిత్తుఁ డయ్యె సుహృదాప్తప్రవృత్తిం దురటిల్లు నవ్వగం, బోవఁగఁ ద్రోవు నీద యిన పుణ్యశమస్ఫుటవాక్యపద్ధతిన్. భార శాం. ౨. ౧౯౯.(భాలవ్యాకరాల ప్రతిపా)

క. చిరకారి యెట్లునుం దన,చిరకారితఁ జూపుఁ గాక శీఘ్రపుఁజేతం,దురటిల్లఁజేయు నే నను, వెరవరి వాఁ డిట్టిపనికి వేగిరపడు నే. భార. శాం. ౫. ౨౭౩.

వ...పెక్కుచందంబుల నందఱున్ దురటిల్ల న య్యాస్థానంబు శోకదైన్యనిదానం బై యుండె. ఉ. రా. ౭. ౯౪.

౨. పరితపించు.

ఉ. వారలు శౌరిఁ గానమికి వందురుచున్ దురటిల్లి యక్కటా,శ్రీరమణీమనోహరుఁడు... మా,కోరిక నీ యఁడయ్యె ... ఘటికా. ౨. ౨౩౯. రాఘవ. ౪. ౨౩౭.

దురతిక్రమము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. అతిక్రమింపరానిది. ౨. దుర్లంఘము, దాఁటరానిది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౩. గెలువరానిది. ౪. దుర్వారము, నివారింప రానిది.

దురత్యయము. సం. విణ. (అ. ఆ. అ.) దురతిక్రమము, దాఁటరానిది. ౨. దుర్లభ మగుఅత్యయము కలది, నాశము లేనిది. వి. అ.పుం.దుష్టమగుఅత్యయము.

దురద. వి. (సం. దద్రుః.) ౧. కండూతి, జిల,

గీ. దూల జిల నవ నస గాఁడు దురద యనఁగ, బరఁగుఁ గండూతి...ఆం. భా.౨. ౧౨౫.

౨. కసరు. (శ. ర.)

జ: దురదకంద, దురదగొండి, దురదగోవెల, దురదవేయు.

దురదకంద. వి.(√దురద.)మహాకందము, కసరు గలకంద*. (శ.ర.)

దురదగొండి=దురదగోవెల. వి. (√దురద) కండూర, దూలగొండి*.

సీ. దూలగొండి యనఁగ దురదగొండి యనఁగఁ దీఁటకోవెల యనఁ దేజరిల్లుఁ, గండూర... ఆం. భా. ౨.౫౪.

దురదగోవెల=దురదగొండి, వి. (√దురద) కండూర, తీఁటకోవెల, దూలగొండి*. (శ.ర)

దురదపెట్టు, దురదవేయు. అ.క్రి. (√దురద) దురద కలదియగు.

(వ్యవ) కాలు దురదపెట్టుచున్నది. నావీపు దురదవేయుచున్నది.

దురదుర. వి. గమనాదులశైఘ్ర్యానుకరణము.

ద్రు. క్రి. విణ. శీఘ్రముగా. (శ. ర.)

చ...దు, స్తరతరమూర్తియై వృషభదైత్యుఁడు గన్నుల నిప్పు లొల్కఁగా, దురదుర వచ్చి తాఁకె రిపుదుర్దమోచనుఁ బద్మలోచనుకా. భాగ. ౧౦ పూ. ౧౧౪౨.

క. పెట్టక పో నని యాఁకట్టఁ, దొట్టిగిలం బడుచుఁ బడుచు దురదురఁ జని వే, నట్టింటఁ గూరుచుండిన, నెట్టు ననం జాల కష్ట్రగేహిణ భీతికా. పాండు. ౪. ౧౬౫.

క. దురదురఁ బరువిడి బిరుసున, హరిహరి నిలు నిలువు మనుచు నసురయుఁ గదిసెకా. భాగ. ౧౦. ఉ. ౧౬౧.

దురదృష్టము. సం. వి. అ. న. చెడ్డయదృష్టము, దౌర్భాగ్యము.

దురధిగమము. సం.విణ. (అ.ఆ.అ.)౧.దుష్ప్రాపము, పొందరానిది. ౨. కష్టముచేత చదువఁదగినది. ౩. కష్టముచేత గ్రహింపఁదగినది. ౪. కష్టముచేత అతిక్రమింపఁదగినది, అతిక్రమింపరానిది.

దురధిగమము. సం=దురధిగమము.

దురధీతము. సం. విణ. (అ.ఆ.అ.) దుష్టముగాఁ జదువఁబడినది. వి.అ.న. దుష్ట మగు అధ్యయనము, వర్ణములను యథాస్థానముగను యథాస్వరముగను ఉచ్చరింపక చదువుట.

దురధ్యయము. సం. విణ. (అ.ఆ. అ.) ౧.చదువుటకు కష్టమైనది. ౨.పొందుటకు కష్టమైనది.

దురధ్యవసాయము. సం. విణ. (అ. ఆ. అ.) చెడ్డపూనికకలది. వి. అ. పుం. చెడ్డపూనిక.

దురధ్వము. సం. వి. అ. పుం. కదధ్వము, చెడ్డత్రోవ.

దురన్వయము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. కష్టముచేత అనుగమింపఁదగినది, అనుసరించుటకుఁ గష్టమైనది. ౨. దుర్బోధము, గ్రహించుటకుఁ గష్ట మైనది. ౩. దుష్ట మగుఅన్వయము కలది. (పద్యాది) ౪.దుష్ట మగువంశము గలది. ౫. అననురూపము, తగనిది. వి.అ.పుం. ౧. దుష్ట మగు అన్వయము. ౨. దుష్టవంశము.

దురపిల్లు(లు)=దురటిల్లు. అ.క్రి.(చూ.దురటిల్లు) ౧. శోకించు, దుఃఖించు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ...ఎవ్వరుగా, ధర్మజుపాటి గా రసఁగ ధా
త్రిఁ బ్రసిద్ధుఁడ వైనయట్టినీ, పేర్మికి నీడై
దుర్దశలవెల్లునగా దురపిల్లు టారయగా.
భార. విరా. ౧. ౫౧.

క. గురుసుతుఁడు పాండవులకుగా,గర మల్గును
వారిఁ బొదువఁగా నతఁ డీప్రా,దురవడిఁ గది
యును భోయెద, దురపిల్లకుమయ్యా మది వి
ధూతకళంకా. భార. శల్య. ౨. ౩౭౫.

క. దురపిల్లుచుఁ గన్నీళులు, దొరఁగఁగంగా వెడలి
...దశకు. ౧౦. ౧౬౭.

౨. పరితపించు.

గీ. ద్రుపదనందనపరిభవదుఃఖమునకు, నుల్లమున
దురపిల్లుచు నున్న సరసి,వేఁడినిట్టూరుపో య
న వెడలెఁ గ్రొత్త,తావి మూతులువిచ్చు నెత్త
మ్మివిరుల. భార. విరా. ౨. ౨౩౬.

క. పరిభవకరుఁ డగుకీచకుఁ, బరిమార్చుట యి
పుడు గడవఁబడియె నె యిస్మై, దురపిల్లనేల
ప్రేల్మిడిఁ, బొరిగొని నీమనముకలఁక పుత్త్ర
లతాంగీ. భార. విరా. ౨. ౧౭౩.

ఆ. అనుచు నుత్తలంబు పెనఁగొని దురపిల్లు,నె
డల నింద్రజితుఁడు నేఁగుదెంచి.అచ్చ.రా.
సుం. ౧౨౬. యయా. ౩.౧౭.

క. నరునిశరీరమున జరా,తరుణి ప్రవేశించి ప్ర
జ్ఞఁ దరలించుఁజుమీ,పరకాంత గృహముఁజే
కొని, దురపిలునిల్లాలి వెడలఁద్రోచినభంగిన్.
వా. రా. ౧. ౧౨౩.

౩. కలఁగు, కలఁతనొందు.

ఉ...నామనంబు చేఁపెట్టి కలంచినట్లు దురపి
ల్లెడు...జై. భా. ౬. ౫౫.

వ...అబ్బాహువు మహాభుజంగంబు చందంబున
శోభిల్లె; నిచ్చటిసేన లెల్లదురపిల్లె.భార.ద్రో.
౪. ౨౬౭.

వి. వ్యథ, దుఃఖము.

సీ...వందురు దురపిల్లు కొందలంబు,సలుపు నోవి
యనంగ చను వ్యథ...ఆం. భా. ౧.౧౫౦.

దురభిగ్రహ. సం. వి. ఆ. స్త్రీ. ౧. దురాలభ, తీఁటకసిందకీ. ౨. కపికచ్ఛువు, దూలగొండికీ.

దురభిగ్రహము. సం. విణ. (అ. ఆ. అ.) పట్టుకొనుటకుఁ గష్ట మైనది, గ్రహింపఁ గష్ట మయినది. వి. అ.పుం. ౧. దుష్ట మగుఅభిగ్రహము. ౨. అపామార్గము, ఉత్తరేనుకీ.

దురభిమానము. సం. వి. ఐ. (అ. ఆ. అ.) దుర్గర్వము కలది. వి.అ.పుం. దుష్టమైన అభిమానము, దుర్గర్వము.

దురభిమాని. సం. విణ. (న్. నీ. న్.) దుర్గర్వము గలవాఁడు, దురభిమానము గలవాఁడు.

దురము. వి. (సం.ఉదరమ్.) ౧. యుద్ధము.

క. అరివీరుల ఘోరం బగు, దురమున వధియిం
చు పేల దోసం బర్యేన్. భార. శాం.
౧. ౧౧౨.

క. సురవీరుఁ డొకఁడు సతిచే,దురమునకు ననుజ్ఞ
వేఁడి తొల్లిటియలుకం,బిరకాలదుర్లభం బగు,
పరిరంభముఁ గాంచి వెడలెఁ బ్రమదం బెసఁ
గగా. పారి. ౪. ౭౩. ఉ. రా. ౧. ౧౫౫.

౨. నృత్తగీతవాద్యములందలివేగము; వేగము.

క. లయ కోపు దృష్టియును నభినయ ముదుటు
దురమ్ము మోడి నయ మున్నతి రేకయును
బ్రమాణము హరువుగా...ప్రబంధ. ౧౦౭.

చ. రమణి క్రమక్రమంబున దురంపువగల్ నటి
యించె వింతగా. శశాం.౩. ౧౧౦.

దురవగమము. సం. విణ. (అ. ఆ. అ.) తెలియఁ గష్ట మయినది, గ్రహింపఁ గష్ట మయినది.

దురవగ్రహము. సం. విణ. (అ. ఆ. అ.)ని గ్రహించుటకుఁ గష్ట మైనది, అడఁపరానిది. వి. అ. పుం. దుష్ట మగుఅవగ్రహము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దురవబోధము. సం. విణ. (అ. ఆ. అ.) దుర్జ్ఞేయము, తెలిసికొన శక్యము కానిది.

దురవస్థ. సం. వి.ఆ.స్త్రీ. చెడ్డస్థితి (దారిద్ర్యాది.)

దురవస్థము. సం. విణ. (అ. ఆ. అ.) చెడ్డస్థితి గలది.

దురవాపము. సం. విణ. (అ. ఆ. అ.) పొందరానిది.

దురవేక్షితము. సం. విణ. (అ. ఆ. అ.) కష్టముచేత చూడఁబడినది. వి. అ. న. దుష్టదృష్టి, చెడ్డచూపు.

దురా=దురాయి. వి. ఆజ్ఞ. (చి. ని. శ. ర.) జః దురావెట్టు.

దురాకృతము. సం. వి. అ. న. అకృత్యము.

దురాకృతి. సం. విణ. ఇ. వికృతరూపము గలది. వి. ఇ. స్త్రీ. చెడ్డరూపు, వికృతాకారము.

దురాక్రమణము. సం. వి. అ. న. ౧. అధర్మముగా పయిఁబడుట. ౨. కష్టమయినఆక్రమణము. ౩. దుష్టమయినఆక్రమణము.

దురాక్రమము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అక్రమించుటకుఁ గష్టమయినది. ౨. దాఁటరానిది. వి. అ.పుం. ౧. దుష్టమగుఆక్రమణము. ౨. కష్టమగుఆక్రమణము.

దురాగమము. సం. వి. అ. పుం. ౧. అక్రమముగా పొందుట, అన్యాయమగుప్రాప్తి. ౨. దుష్టమగుఆగమము.

దురాగ్రహము. సం. విణ. (అ. ఆ. అ.) దుష్టమగుఆగ్రహము గలది, చెడ్డపట్టుదల గలది. వి. అ.పుం. దుష్టమగుఆగ్రహము, చలపాదితనము.

దురాచరము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఆచరించుటకుఁ గష్టమైనది. ౨. కుదుర్పరానిది. వ్యాధి, మొ. (అ. ఈ. అ.) దుష్టముగా ఆచరించునది.

దురాచారము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చెడ్డనడవడి కలది, చెడ్డయలవాటు గలది. వి. అ. పుం. ౧. చెడ్డనడవడి, చెడ్డయలవాటు.

దురాత్ముఁడు. సం. విణ. (న్. ఆ,న్. న్) దుష్టాంతఃకరణము గలవాఁడు, చెడ్డమనసు గలవాఁడు.

దురాధర్షము. సం. వి. అ. పుం. తెల్లావశ.

దురాధర్షుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఎదిరింపరానివాఁడు, చెనకరానివాఁడు. ౨. ఉద్ధతుఁడు, అడఁకువ లేనివాఁడు.

దురానమము. సం. విణ. (అ. ఆ. అ.) వంపరానిది. (విల్లు మొ.)

దురాపము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దుష్ప్రాపము, పొందరానిది. ౨. చేరరానిది.

దురాబాధము. సం. విణ. (అ. ఆ. అ.) బాధింపరానిది.

దురాయి=దురా. వి. ఆజ్ఞ, శాసనము. (చి.ని.శ.ర.)

సీ. జగదధిష్ఠానభాస్వజ్జ్యోతి యగువాఁడు బ్రహ్మదు లదరుదురాయివాఁడు. కృష్ణ. ౧. ౨.

జః దురాయిత్రాడు.

దురాయిత్రాడు. వి. (√దురాయి) ఆజ్ఞ చేయుత్రాడు, శాసన మగుత్రాడు, ఇది దాఁటి రాఁగూడదని హద్దు పెట్టుత్రాడు.

సీ. అరిశౌర్యలీలకు నాఁ పొదురాయిత్రా డనుదీటిఁ దోరణం బలవరిఁచి. ఇందు. ౫. ౧౯.

దురారుహ. సం. వి. ఆ. స్త్రీ. ఖర్జూరిశ.

దురారుహము. సం. వి. అ. పుం. ౧. బిల్వముశ. ౨. కొబ్బెరశ.

దురారోహ. సం. వి. ఆ. స్త్రీ. ౧. శాల్మలి, బూరుగుశ. ౨. శ్రీవల్లిశ. (వాచ.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దురారోహము. సం. విణ. (అ. ఆ. అ) ఆరోహింపరానిది, ఎక్క శక్యము కానిది. వి. అ. పుం. ౧. కష్టముచే నెక్కుట, దుఃఖముతో ఎక్కుట ౨. కొబ్బెరచెట్టు. ౩. తాటిచెట్టు ౪. ఖర్జూరము. ౫. తొండ,సరటము.:

దురాలభ. సం.వి. ఆ. స్త్రీ. తీఁటకసింద.

దురాలభము సం. విణ. (అ.ఆ. అ) దుర్లభము, పొందరానిది.

దురాలాపము. సం. వి. అ. పుం. ౧. తిట్టు. ౨. చెడ్డమాట.

దురాలోకము. సం. విణ. (అ. ఆ. అ.) దుర్దర్శము, చూడశక్యముకానిది (కాంతి మొ.)

దురావారము. సం. విణ. (అ. ఆ. అ.) ఆవరింపరానిది. ౨. నివారింపరానిది, ఆఁపరానిది.

దురావెట్టు. అ. క్రి. (దురా + పెట్టు) శాసించు, ఆనవెట్టు.

క. నుదు రాజిగిక్రొన్నెలచే,న్ను దురాగత మనను దేంట్లను దురావెట్టు న్నదురా యని ముంగురులె న్నదురా నెఱివేణి జీవనదురాజసముల్. శశాం. ౩. ౪౮.

దురాశ. సం. వి. ఆ. స్త్రీ. ౧. దుష్టమైన ఆశ, పేరాస.

దురాశయము. సం.విణ. (అ.ఆ. అ.) ౧. చెడ్డ మనస్సు గలది, దురభిప్రాయముకలది. ౨. చెడ్డ ఆశ్రయము గలది. వి. అ. పుం. ౧. చెడ్డమనస్సు, చెడ్డ అభిప్రాయము. ౨.చెడ్డఆశ్రయము

దురాసదము. సం. విణ. (అ.ఆ. అ.) ౧.పొందరానిది, దుష్ప్రాపము. ౨. దుర్ధర్షము, మార్కొనరానిది. ౩.దుర్గమము,పోరానిది.(అడవి మొ.)

దురితదమనము. సం. విణ. (అ. ఆ. అ) పాపములను పోఁగొట్టునది. (అ. ఈ. అ) పాపములను పోఁగొట్టుటకు సాధనమైనది.

దురితదమని. సం. వి. ఈ. స్త్రీ. శమి, జమ్మి.

దురితము. సం. విణ. (అ. ఆ. అ.) దుర్గతిని ప్రాపింపఁజేయునది; పాపముతోఁ గూడినది. వి. అ. న. ౧. పాపము. ౨. కష్టము, ఆపద.

క. పరహితచరితులకు శుభం,బరుదే యనుబుధులపలుకు లనృతంబులు గా,వరయఁగ దైవము మత్సఖు, దురితమ్ములఁ బెట్టె ననుచు దురపిల్లి మదిన్. దశకు. ౨. ౭౬.

దురిష్టము. సం. వి. అ. న.౧. అభిచారక్రతువు, ఒకనికి కీడు గావించుతలఁపుతో చేయుక్రతువు ౨. చెడ్డకోరిక, శాపము.

దురీన. ద్రు. క్రి. విణ. తటాలున.

పంచచామరము...పొల్తుకల్ దలిర్తు ర,చ్చరల్ మలం గలంచ మించుసంద్రు నందుఁబుట్టుచు, న్దురీన లేచునట్టిజాడ దోఁపఁ జూప కెన్నఁగన్. యయా. ౩. ౭౧.

దురుక్తము. సం. విణ. (అ. ఆ. అ) పరుషముగా పలుకఁబడినది. వి. అ. న. దుష్టవచనము, చెడ్డమాట.

దురుక్తి. సం. వి. ఇ. స్త్రీ. చెడ్డమాట.

దురుచ్ఛేదము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఛేదింపరానిది; పెకలింపరానిది ౨. నశింపఁజేయరానిది.

దురుత్తరము సం. విణ. (అ.ఆ. అ.) ౧. బదులుచెప్ప శక్యము గానిది. ౨. దుస్తరము, దాఁటరానిది. వి. అ. న. ౧. చెడ్డయుత్తరము. ౨. కష్టముతో దాఁటుట.

దురుదాహరము. సం. విణ. (అ. ఆ. అ.) ఉదాహరింపరానిది, చెప్పుటకు శక్యము కానిది. వి. అ. పుం. దుష్టమైనయుదాహరణము.

దురుద్వాహము. సం. విణ. (అ. ఆ. అ.) భరింపరానిది; మోచుటకు శక్యము కానిది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దురుపదములు. వి. బ. (దురుసు + పదములు.)
త్వరగా వేయుపాదవిన్యాసములు.
గీ. దురుపదంబులు సొక్కు మైసిరులు వొసఁగ,
సరిగ నిరుఁగేలఁ గుంచియల్ సవదరించి,
వెక్కువగ జక్కిణీ కొప్పు ద్రొక్కి నొక్కి,
చక్కనిమిటారి ... దశా. ౭. ౧. ౨౫౭.

దురువరము. వి. నీచజాతి.
సీ. పొసఁగినఘనవిధంబులవా రటుండఁగా దు
రువరంబులవారిమురువు హెచ్చె. కువల. ౧. ౪౦.

దురుసు. విణ. ౧. కఠినము.
(క) గట్టిది, అభేద్యము.
సీ. దారుశిలాయంత్రతతి కొమ్మకొమ్మలఁ దోరం
బు గావించి దురుసు సేయ. ఉ. రా. ౪. ౨౭౫. ౬. ౧౯౫.
క. అడుసుదుక్కులను మ శ్లెడలఁగాఁ బాఱల
దురు సైనగనిమలు నతికినతికి. ఉ. హరిశ్చ. ౪. ౧౩.
(చ) క్రూరము, నిర్దయము.
గీ. అనుచుఁ జెల్వపుఁ జెంగల్వయరిదికిరుసు, దు
రుసుమాస్టీని బదరి యయ్యరుసుపట్టి, గురు
సుమద్యోతనుని దూఱి గరుసు మీఱి, పే
శెములు వాఱెదుమరుత్కుమారు ననియె. కువల. ౪. ౩౧.
గీ. దురుసుదండనలతో ధర యేలుదొరఁ గన్న
హింసాపరుం డని యెంచ రతని. ఉ. రా. ౬. ౧౯౫.
(ట) సడలనిది.
సీ. దురుసుగాఁ బై కెగఁద్రోసి కట్టినవాలుచను
దోయి బిగి చూపుజంటఱవికె. దశా. ౫. ౩౭౫.
౨. హెచ్చైనది, అధికము.
క. పరహితుఁడు మిన్నుఁ గనుఁగొని, దురు సొ
సెకమీఁద వానతూర ల్నిజసుం,దరు లెదు
రెదురే చూతురు, మరుబారికిఁ జిక్కకొన
మగుడ న్వలయుఁగా. శుక. ౨. ౩౪౫.
సీ. తొలిచూలుకా న్పాట దురు సౌనొ ప్రస
వార్తి యిలువేల్పులకును మీఁ దెత్తి రారె.
ఇందు. ౨. ౫.
వి. ౧. వేగము, తొందర.
సీ. దురుసుగా వెడలెడివిరుసులపూవులు భూ
నభోంతరములఁ బొదివికొనఁగ. దశా. ౭. ౧.
౨౫౩.
చ...కరపాటవ మొప్ప నలుండు సేతు వ,చ్చెరు
వుగఁ సంఘటించె నది సీతకు భూమి యభీ
తిహ స్తమున్, దురుసుగఁ జాచెనోయనఁగ
దోఁచె వనేచరవీరకోటికిన్. చం. రా. ౫.
౪౬.
చ...వేఁటకుం, దురుసుగ మారుఁ డస్త్రములు
నూఱె... ఉ. రా. ౫. ౨౩౯.
౨. కాఠిన్యము.
ద్వి...ఇంత, దురుసు గైకొనుట నీదోషంబు
గాదు. విష్ణు. పూ. ౨ ఆ. (శే. ర.)
చ. దురుసున నామదిన్ గినుక దోఁపకముంద
ర సీతఁ దెచ్చి యు,ద్ధరణి యొసంగినన్
బ్రతుకును...ఉ. రా. ౫. ౧౧౧.
౩. విధము.
వ...చట్టంబున నెగయునాకాశబాణంబుల బు
రుసున...ప్రబంధ. ౭౫౫...
జః దురుపదములు.

దురూహము. సం. విణ. (అ. ఆ. అ.) వితర్కిం
ప నలవి గానిది, ఊహింపరానిది. వి. అ. పుం.
చెడ్డయూహ.

దురేషణ. సం. వి. ఆ. స్త్రీ. ౧. చెడ్డకోరిక.
౨. శాపము, తిట్టు.

దురోదరము. సం. వి. అ. న. ౧. జూదము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. పందెము. ౩. అక్షము, పాచిక.

దురోదరుఁడు. సం. వి. అ. పుం. జూదరి.

దుర్గ. సం. వి. ఆ. స్త్రీ. ౧. దుర్గాదేవి. ౨. నల్ల పిచ్చుక. ౩. నీలిచెట్టు.

దుర్గంధము. సం. విణ. (అ. ఆ. అ.) చెడ్డకంపు గలది. వి. అ. పుం. ౧. చెడ్డకంపు, గబ్బు. ౨. ఉల్లి[illegible]. న. సౌవర్చలవణము.

దుర్గంధి. సం. విణ. (న్. నీ. న్.) చెడ్డకంపు గలది, గబ్బు కలది.

దుర్గతి. సం. విణ. (ఇ) దుష్టమైనగతి కలవాఁడు. వి. ఇ. స్త్రీ. ౧. దౌర్భాగ్యము, దుస్థితి. ౨. దారిద్ర్యము, పేదఱికము. ౩. విపత్తు. ౪. నరకము. ౫. చెడ్డత్రోవ.

దుర్గతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దీనుఁడు, దైన్యము నొందినవాఁడు. ౨. దరిద్రుఁడు, బీద. ౩. విపన్నుఁడు, ఇడుమ నొందినవాఁడు.

దుర్గపతి. సం. వి. ఇ. పుం. దుర్గాధ్యక్షుఁడు.

దుర్గపాలుఁడు. సం. వి. అ. పుం. ౧. ఆపదలందు రక్షించువాఁడు. ౨. దుర్గరక్షకుఁడు, కోటకాపరి.

దుర్గమము. సం. విణ=దుర్గము.

దుర్గము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పోవుటకు కష్టమైనది. ౨. పొందుటకు కష్టమైనది. ౩. తెలిసికొనుటకు కష్టమైనది. వి. అ.పుం.న. ౧. వనపర్వతప్రవాహాదులందు కష్టముగా నుండుత్రోవ. ౨. కోట. (దుర్గము లాఱువిధములు. ౧. ధన్వదుర్గము, నలుప్రక్కలను అయిదామడలమరుభూమిగలకోట. ౨. మహీదుర్గము, చుట్టును మట్టిదిబ్బలు గలకోట. ౩. వార్క్షదుర్గము, చుట్టును వృక్షములుగలకోట. ౪. జలదుర్గము, చుట్టును నీరుగలకోట. ౫. నరదుర్గము, చుట్టును చతురంగబలములుగలకోట. ౬. గిరిదుర్గము, చుట్టును కొండలు గలకోట.) ౩. ఒడుదొడుకు భూమి. ౪. కష్టము, విపత్తు.

శ్లో. విద్యాతపః సమృద్ధేషు హుతం విప్రముఖాగ్నిషు, నిస్తారయతి దుర్గాచ్ఛ...మను. ౩.౯౪.

క. వినుఁ డెల్లవారు దుర్గం,బును గడచి శుభంబు
నొంది పురుషార్థములం, గనువార కాక య
నియెడు, ననుగ్రహము వలదె యిట్లు లనఁ
దగ వగునే. భార. శాం. ౬. [illegible].

గీ...తన్నుఁ దాన, కనుచు నుండెడుయోగి దుర్గం
పుఁజోటు, వెడల నరిగి సుఖస్థానవిభవ మొం
దు. భార. శాం. ౫.౪౯౨.

దుర్గలంఘనము. సం. వి. అ. న. -దుర్గములను దాఁటుట- కష్టములను దాఁటుట. వి. అ. పుం. లొట్టియ, ఉష్ట్రము.

దుర్గసంచరము. సం. వి. అ. పుం. దుర్గము లగు ప్రవాహాదులు దాఁటుటకు కట్టినవంతెన మొ. ౨. దుర్గమందు సంచరించుట.

(ఇట్లే: దుర్గసంచారము.)

దుర్గాధ్యక్షుఁడు. సం. వి. అ. పుం. ౧. దుర్గమునకు ఒడయఁడు; ౨. దుర్గరక్షకుఁడు.

దుర్గ్రహ. సం. వి. ఆ. స్త్రీ. అపామార్గము, ఉత్తరేణు[illegible].

దుర్గ్రహము. సం. విణ. (అ. ఆ. అ.) పట్టుకొనరానిది. ౨. తెలిసికొనరానిది. ౩. దురాసదము, పొందరానిది.

దుర్ఘటము. సం. విణ. (అ. ఆ. అ.) ఘటింపరానిది, కూర్ప శక్యము గానిది.

దుర్ఘోషము. సం. విణ. (అ.ఆ.అ.) దుష్టమైన ధ్వని కలది. వి. అ. పుం. ౧. దుష్టధ్వని. ౨. ఎలుఁగుబంటి. (వాచ.)

దుర్జనుఁడు. సం. వి. అ. పుం. దుష్టజనుఁడు, ఖలుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుర్జయుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) గెలువ రానివాఁడు, జయింపరానివాఁడు.

దుర్జరము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ముదియనిది. ౨. దుష్టమైనజరకలది. ౩. జీర్ణముకానిది. (ఆహారాది.)

దుర్జాతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చెడ్డ పుట్టుకగలది. ౨. సమంజసముకానిది, అనుచితము. వి. అ. న. ౧. కష్టము, విపత్తు. ౨. అయుక్తత.

దుర్జాతి. సం. విణ. (ఇ) ౧. దుష్టుఁడు. ౨. నిందితవంశపువాఁడు. ౩. నిందిత మగుపుట్టుక గలవాఁడు. వి. ఇ. స్త్రీ. ౧. దుష్టమగుజాతి. ౨. దుష్ట మగుపుట్టుక.

దుర్జ్ఞానము. సం. విణ. (అ. ఆ. అ.) తెలిసికొనరానిది. వి. అ. న. చెడ్డజ్ఞానము.

దుర్జ్ఞేయము. సం. విణ. (అ. ఆ. అ.) తెలిసికొనరానిది.

దుర్ణయము. సం. వి. అ. పుం. దుర్నయము, దుర్నీతి.

క. కర్ణుండు లేఁచి పెట్టఁగ, దుర్ణయపరులై నళకు నిదుశ్శాసను లీనిర్ణయమె మేమే లనఁగ నీ, కర్ణములకు నించు నెట్లు కార్యవచనముల్. భార. ఉద్యో. ౨. ౨౮౨.

దుర్దమనము. సం = దుర్దమము.

దుర్దమము. సం. విణ. (అ. ఆ. అ.) అడఁపరానిది.

దుర్దర్శనము. సం. విణ = దుర్దర్శము. వి. అ.న. దుష్టమగుదర్శనము.

దుర్దర్శము. సం. విణ. (అ. ఆ. అ.) చూడ శక్యముకానిది.

దుర్దశ. సం. వి. ఆ. స్త్రీ. దుస్థితి, దురవస్థ కష్టదశ.

దుర్దాంతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అడఁపరానిది, నిగ్రహింపరానిది. ౨. ఉద్ధతమైనది, గర్వించినది, వి. అ. పుం. ౧. వత్సతరము, దూడ. ౨. కలహము. (వాచ.)

దుర్దినము. సం. విణ. (అ. ఆ. అ.) దుష్ట మగు దినము కలది. వి.అ.న. ౧. మబ్బుక్రమ్మినదినము. ౨. చెడ్డదినము. (వ్యతి. సుదినము.) ౩. అంధకారము, కటికిచీకటి.

దుర్దివసము. సం. విణ = దుర్దినము. వి. అ. పుం. దుర్దినము.

శ్లో. దుర్దివసే ఘనతిమిరే దుస్సంచారాసు నగరవీథీషు, పత్యుర్విదేశగమనే పరమసుఖం జఘనచపలాయాః. హితోప.మిత్రభేదము. ౧౨౪.

దుర్దురూటుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నాస్తికుఁడు. (ఇది కర్మధారయసమాసమున ఉత్తరపదముగానే యుండును.)

ఉదా: మీమాంసకదుర్దురూటుఁడు = నాస్తిక మీమాంసకుఁడు.

దుర్దృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చెడ్డ దృష్టితోఁ జూడఁబడినది. ౨. (వ్యవహారమున) రాగాదిదోషములచే అన్యాయముగా తీర్పు చేయఁబడినది. (వ్యాజ్యము మొ.)

దుర్దైవము. సం. వి. అ. న. దౌర్భాగ్యము, దురదృష్టము.

దుర్ధరము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ధరింపరానిది. ౨. దుర్భరము, భరింపరానిది. వి. అ. పుం. ౧. పాదరసము. ౨. నరకవిశేషము. ౩. ఋషభము†. ౪. భల్లాతకము, నల్లజీడి†.

దుర్ధర్షు. సం. వి. ఆ. స్త్రీ. నల్లయుప్పి†.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుర్ధర్షుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఎదిరింప రానివాఁడు, తిరస్కరింపరానివాఁడు. ౨. దరి చేరరానివాఁడు, భయంకరుఁడు.

దుర్ధీ. సం. విణ. (ఈ) దుష్టబుద్ధి కలవాఁడు. (వ్యతి. సుధీ.)

దుర్ధీకుఁడు. సం. విణ.(అ.ఆ.అ.)=దుర్ధీ.

దుర్నయము. సం. విణ. (అ. ఆ. అ.) దుర్నీతి కలది, చెడ్డనడవడి కలది. వి. అ. పుం=దుర్నీతి.

దుర్నామ. సం. వి. ఆ. స్త్రీ. ఏనుఁగుజలగ.

దుర్నామకము. సం. వి.అ.పుం. మూలరోగము.

దుర్నామము. సం.విణ. (న్.న్,ఆ,మ్నా. న్.) చెడ్డపేరు కలది. వి. న్. న. ౧. చెడ్డపేరు. ౨. అర్శోరోగము,మూలవ్యాధి.

దుర్నామారి. సం. వి. ఇ. పుం. అర్శోఘ్నము; సూరణము, కందగడ్డ.

దుర్నిగ్రహము. సం. విణ. (అ. ఆ. అ.) నిగ్రహింపరానిది; అడఁపరానిది.

దుర్నిమితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కష్టముచే ఉంపఁబడినది. ౨. తొందరతో ఉంపఁబడినది. (పాదము మొ.)

శ్లో...పదేపదే దుర్నిమితే గళంతీ, కస్యాశ్చి దాసీద్రశనా తదానీ, మంగుష్ఠమూలార్పిత సూత్రశేషా. సం. రఘు. ౭. ౧౦.

దుర్నిమిత్తము. సం. వి. అ. న. ౧. అపశకునము. ౨. కుచ్చితపుసెపము, దుష్టహేతువు.

దుర్నీతి. సం. విణ. (ఇ) ౧.చెడ్డనడవడి కలవాఁడు, దుష్టనీతి కలవాఁడు. వి. ఇ. స్త్రీ. ౧.చెడ్డనీతి; దుష్టపరిపాలనము. ౨. చెడ్డనడవడి.

దుర్నీతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దుర్నీతి కలవాఁడు, చెడ్డనడవడి కలవాఁడు.

దుర్బలము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. స్వల్ప బలము కలది. ౨. కృశము, బక్క. ౩. శిథిలము; బిగి లేనిది.

దుర్బుద్ధి. సం.విణ. (ఇ) ౧. దుష్టబుద్ధి కలవాఁడు. ౨. మూఢుఁడు. వి. ఇ. స్త్రీ.దుష్టమగుబుద్ధి.

దుర్బోధము. సం. విణ. (అ. ఆ. అ.) తెలిసికొన శక్యముకానిది, తెలియరానిది, గ్రహింపరానిది. ౨. దుష్టమగుబోధము కలది. వి. అ. పుం. దుష్టమగుబోధము.

దుర్భగ. సం.వి.ఆ. స్త్రీ. ౧. మగఁడు ఒల్లనియాఁడుది. ౨. గయాళి, ధూర్తస్త్రీ.

దుర్భగుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దురదృష్టవంతుఁడు; అదృష్టహీనుఁడు. ౨. అందము లేనివాఁడు, వికృతాకారము కలవాఁడు.

దుర్భరము. సం. విణ. (అ. ఆ. అ.) భరింపరానిది, సహింపరానిది.

దుర్భాగ్యము. సం. విణ. (అ. ఆ. అ.) దురదృష్టవంతము. వి. అ. న. దురదృష్టము.

దుర్భావన. సం. వి. ఆ. స్త్రీ. చెడ్డతలంపు.

దుర్భిక్షము. సం. వి. అ. న. ౧. క్షామము, కఱవు. ౨. లేమిడి. అవ్య. భిక్షాభావము, భిక్షలేమి.

దుర్భిషజ్యము. సం. విణ. (అ. ఆ. అ.) చికిత్స చేయరానిది, కుదుర్పరానిది. (రోగము మొ.) వి. అ. న. ౧. దుష్టమైనచికిత్స. ౨.కష్టమైన చికిత్స.

దుర్భేదము. సం. విణ. (అ. ఆ. అ.) భేదింప శక్యముకానిది, భేదింపరానిది.

దుర్మంత్రణ. సం. వి. ఆ. స్త్రీ. చెడ్డయాలోచన.

దుర్మంత్రణము. సం=దుర్మంత్రణ.

దుర్మంత్రము. సం. వి. అ. పుం. ౧.చెడ్డయాలోచన. ౨. చెడ్డమంత్రము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుర్మతి. సం.విణ. (ఇ) ౧. దుష్టబుద్ధి కలవాఁడు. ౨. మూఢబుద్ధి కలవాఁడు. వి. ఇ. పుం.ఒకసంవత్సరము. స్త్రీ. చెడ్డబుద్ధి, దుర్బుద్ధి.

దుర్మదము. సం. విణ. (అ. ఆ. అ.)-దుష్టమైనమదము కలది-మత్తుగొన్నది, ఉన్మత్తము. వి. అ. పుం. దుష్ట మగుమదము.

దుర్మను(నసు)ఁడు. సం. విణ. (స్) వ్యాకులమైనమనస్సు కలవాఁడు, కలఁగినమనసు కలవాఁడు. ౨. చెడ్డమనస్సుకలవాఁడు, దుష్టమనసుకలవాఁడు.

దుర్మర. సం. వి. ఆ. స్త్రీ. ౧. దూర్వ. ౨. శ్వేతదూర్వ.

దుర్మరణము. సం. వి. అ. న. (విషభక్షణాదులచేతఁ గలుగు) చెడ్డచావు.

దుర్మరము. సం=దుర్మరణము.

దుర్మర్యాదుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మరియాద లేనివాఁడు, మేర మీఱినవాఁడు.

దుర్మర్షణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సహింపశక్యముకానివాఁడు, సహింప రానివాఁడు.

దుర్మర్షుఁడు. సం=దుర్మర్షణుఁడు.

దుర్మల్లిక. సం. వి. ఆ. స్త్రీ. ఉపరూపక భేదము, నీచనాయకప్రధానమును కైశికీభారతీవృత్తులు కలదియు నగునాలుగంకములయుపరూపకము. సా. ద. ౬. ౨౨౩.

దుర్మిత్త్రుఁడు. సం. వి. అ. పుం. ౧. కుచ్ఛితపు చెలికాఁడు. ౨. అమిత్రుఁడు,శత్త్రువు.

దుర్ముఖము. సం. విణ. (అ.ఆ,ఈ.అ.)౧.వికృతమగుముఖము కలది. ౨. అప్రియము పలుకునది, ప్రేలరి. వి. అ. న. దుష్ట మగుముఖము. పుం. ౧. అశ్వము, గుఱ్ఱము. (కల్ప.) ౨. ఒకానొక సంవత్సరము. (దుర్ముఖి అని వాడుక.)

దుర్ముఖుఁడు. సం. వి. అ. పుం. ఒకరాక్షసుఁడు.

దుర్మూల్యము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి విలువ గలది,న్యాయ్య మగువెలకంటె నెక్కువ వెల గలది. వి. అ. న. అన్యాయ్యమగువెల.

దుర్మేధు(ధసు)ఁడు. సం. విణ. (స్). ౧.మూఢబుద్ధిఁగలవాఁడు, మందమతివాఁడు. ౨. దుష్ట మగుబుద్ధి కలవాఁడు.

దుర్యశము. సం. విణ. (స్.)చెడ్డయశస్సు కలది. వి. స్. న. దుష్కీర్తి,అపకీర్తి.

దుర్యోగము. సం. వి. అ. పుం. ౧. చెడ్డపన్నగడ,దుష్టోపాయము. ౨. (జ్యోతి) దౌర్భాగ్య సూచక మగుగ్రహయోగము; అట్టిగ్రహయోగముచే సూచిత మగుదురవస్థ. ౩. దుస్సాంగత్యము.

దుర్యోధనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) యుద్ధము చేయశక్యము కానివాఁడు. వి.అ.పుం. ౧. ధృతరాష్ట్రునిపెద్దకొడుకు. ౨. మనువంశస్థుఁడగునొకానొకరాజు.

> మ. మనువంశంబునఁ బుట్టి సర్వజనతామందారమై నేల యెల్లను బాలించి జగత్త్రయీప్రణుతలీలం బొల్చె దుర్యోధనుం, డను రాజు...భార. అను. ౧. ౪౪.

దుర్యోని. సం. విణ. (ఇ) నీచపుఁబుట్టుక కలది. వి. ఇ. పుం. స్త్రీ. దుష్ట మైనయోని.

దుర్లక్షము. సం. విణ. (అ. ఆ. అ.) చూడశక్యము గానిది.

దుర్లభ. సం. వి. ఆ. స్త్రీ. ౧.దురాలభ,తీఁటకసింద. ౨. శ్వేతకంటకారి,తెల్లవాఁకుడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుర్లభము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పొంద శక్యముకానిది. ౨. అతిప్రశస్తము. ౩. ప్రియము. వి. అ. పుం. ౧. కచోరముక్కి. ౨. గంట్లకచోరముక్కి.

దుర్లలితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అమితముగా లాలనచేయఁబడినది,అతిమాత్రము బుజ్జగింపఁ బడినది.

వ. హా వత్స దుశ్శాసన హా విక్రమైకరస హా మదంకదుర్లలిత క్వాసి...సం. వేణీ. ౪.

౨. దుశ్చేష్టలు కలది. ౩. చపల మైనది. ౪. దుష్టేచ్ఛ కలది. వి. అ. న. ౧. దుష్ట మగు ఇచ్ఛ; దుర్లభవస్తువులందలివాంఛ. ౨. దుశ్చేష్టితము,దుష్కృత్యము. ౩. చాపల్యము.

దుర్లసితము. సం. వి. అ. న. దుశ్చేష్ట,చెడ్డపని.

దుర్లేఖము. సం. విణ. (అ. ఆ. అ.) వ్రాయుటకు శక్యము కానిది.

దుర్వచము. సం. విణ. (అ. ఆ. అ.) చెప్పశక్యము కానిది.

దుర్వర్ణము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చెడ్డరంగు కలది. ౨. చెడ్డయక్షరములు కలది. వి.అ. న. ౧. వెండి. ౨. నూఁగుదోసక్కి. ౩. కుష్ఠభేదము. పుం. న. దుష్ట మైనయక్షరము. పుం. చెడ్డరంగు.

దుర్వసతి. సం. వి. ఇ. స్త్రీ. ౧.కష్టము కలిగించుగృహము. ౨. దుఃఖముతో నుండుట, కష్టమైనయునికి.

దుర్వసము. సం.విణ. (అ.ఆ.అ.) వసింపరానిది.

దుర్వహము. సం. విణ. (అ. ఆ. అ.) వహింపరానిది, మోయ శక్యము కానిది.

దుర్వ్యసనము. సం. వి. అ. న. ౧. చెడ్డవ్యసనము (ద్యూతాది.) ౨. కూడనియాసక్తి.

దుర్వాక్కు. సం. విణ. (చ్.) ౧. చెడ్డమాటలు కలవాఁడు; నింద్యవచనము లాడువాఁడు. ౨. అప్రియములు పలుకువాఁడు. వి. చ్. స్త్రీ. ౧. నింద్య మగువాక్కు, చెడ్డమాట. ౨. అప్రియ మగుమాట.

దుర్వాదము. సం. వి. ఆ. స్త్రీ. ౧. అపకీర్తి ౨. అప్రియము లాడుట. ౩. అపవాదము,సడి. నింద. ౪. చెడ్డవాదము,అశాస్త్రీయవాదము.

దుర్వారణము. సం=దుర్వారము.

దుర్వారము. సం. విణ. (అ. ఆ. అ.) నివారింప శక్యముకానిది.

దుర్వార్త. సం. వి. ఆ. స్త్రీ. ౧.అప్రియ మగు వార్త. ౨. చెడ్డవృత్తాంతము.

దుర్వాసన. సం.వి.ఆ.స్త్రీ ౧.దుష్ట మగువాసన, దుర్గంధము, చెడ్డకంపు. ౨. దుష్ట మగు సంస్కారము, దుష్ట మగుజన్మాంతరవాసన. ౩. పూరింప రానికోరిక, గొంతెమకోరిక.

దుర్వాసు(సను)ఁడు. సం. విణ. (స్) దుష్ట మగువస్త్రము కలవాఁడు. వి. స్. పుం. ఒకానొక ముని.(అత్రికి అనసూయయందుఁబుట్టినవాఁడు. ఇతఁడు ముంగోపి.)

దుర్వాసితము. సం. విణ. (అ. ఆ. అ.) దుర్వాసన కలదిగాఁ జేయబడినది. (వ్యతి. సువాసితము.)

దుర్విచింత్యము. సం. విణ. (అ. ఆ. అ.) చింతింపరానిది, తలపోయ శక్యముకానిది.

దుర్విదగ్ధుఁడు. సం.విణ. (అ. ఆ. అ.) ౧. నేర్పరి కానివాఁడు. ౨. మూర్ఖుఁడు. ౩.గర్వితుఁడు, విఱ్ఱవీఁగువాఁడు.

దుర్విద్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దుష్ట మగువిద్య కలవాఁడు. ౨. విద్య లేనివాఁడు. (విల్యమ్స్.)

దుర్విధుఁడు. సం.విణ. (అ.ఆ.అ.) ౧.దరిద్రుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. ఖలుఁడు, దుర్జనుఁడు. ౩. మూర్ఖుఁడు, మొ ఱకు. ౪. నీచుఁడు, అధముఁడు.

దుర్వినయము. సం. విణ. (అ. ఆ. అ.). ౧. దుష్టవినయము, దొంగవినయము. ౨. అడఁకువ లేమి. ౩. చెడ్డనడవడి.

దుర్వినీతము. సం.విణ. (అ. ఆ. అ.) శిక్షితము గానిది (గుఱ్ఱము మొ.)

దుర్వినీతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వినయము లేనివాఁడు. ౨. విద్యలందు శిక్షితుఁడు కానివాఁడు. ౩. చెడ్డనడవడి కలవాఁడు.

దుర్విపాకము. సం. విణ. (అ. ఆ. అ.) చెడ్డఫలము కలది; దుష్టమగుపర్యవసానము కలది. వి. అ. పుం. చెడ్డఫలము, ఈజన్మముననో పూర్వజన్మముననో చేసినకర్మములయొక్క చెడ్డఫలము.

దుర్విమోచనము. సం. విణ. (అ. ఆ. అ.) విడిపింపరానిది. వి. అ. న. కష్టమగువిమోచనము.

దుర్విలసితము. సం. వి.అ.న. ౧. దుశ్చేష్టితము, చెడ్డపని. ౨. దుష్టవిలాసము, దుష్టమగులీల.

దుర్విలాసము. సం. వి. అ.పుం. ౧. దుష్టమగులీల. ౨. దుష్టచేష్ట, చెడ్డపని.

దుర్వృత్తము. సం. విణ. (అ. ఆ. అ.) చెడ్డనడవడి కలది. వి. అ. న. చెడ్డనడత.

దుర్వృత్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. చెడ్డనడవడి. ౨. చెడ్డవ్యాపారము.

దుర్వేదము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. తెలిసికొన రానిది. ౨. పొంద రానిది.

దుర్హితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అహితుఁడు, హితుఁడు కానివాఁడు.

దుర్హృదయుఁడు. సం. విణ. (ఆ. ఆ. అ.) చెడ్డహృదయము గలవాఁడు.

దుర్హృదుఁడు. సం. విణ. (ద్) చెడ్డమనసు కలవాఁడు. వి. పుం. పగవాఁడు, శత్రువు. (వ్యతి. సుహృదుఁడు.)

దులదుల. వి. ౧. వెడలుట మొ. వానియందలి శైఘ్ర్యానుకరణము. (సంభ్రమము అని శ. ర.)

క. తెలతెల నయ్యెను దిక్కులు, పలపల నుడు గణము మాయఁబా ఱెను బతూల్, కలకలఁ గూయఁ జొచ్చెను, దులదులఁ దుమ్మెదలు తమ్మితుటుముల వెడలెన్. హంస. ౧. ౧౩౯.

క. చెలి తీవయుయ్య లూఁగఁగ, నలరున్ జడయు న్మోగంబు నలుక మెయిన్ జా, బిలిదిండి దగుల నెలయున్, దులదుల వెనుకకును గదిమి ద్రోపాడురహిన్. యయా. ౪. ౨౨.

వ...కొండలు దులదులఁ బఱతెంచి దడదడ గుండెలు దల్లడము లందఁ గన్నులు చీకట్లు గ్రమ్మ... డప్పి డప్పి యనువారును. ప్రబంధ. ౪౯౩, ౧౯౬.

౨. పొడి. (చూ. దులదులనగు.)

జ: దులదులనగు.

దులదులనగు. అ. క్రి. (√దులదుల.) పొడియగు.

గీ. కాలి దులదులనై పిండిపోలె రాలి, నట్టియిం జేట్లు గలవు నీ వారగింప. కాశీ. ౩. ౬౮.

సీ. అవనిపంకము పొంక మఱి దులదులనయ్యె నెల్లురెల్లలఁ బువ్వు మొల్లమయ్యె. పద్మ. ౫. ౨౨౬.

దులి. సం. వి. ఇ. పుం. ముని. ఇ, ఈ. స్త్రీ. ఆఁడుతాఁబేలు. (కల్ప.)

దులు(ల్లు)=దుల్లు. అ. క్రి. రాలు, పడు. (చూ. దులుపు.)

జ: దులుపు.

దులుపు. స. క్రి. (√దుల్లు.) ౧. రాల్చు, పడఁజేయు; (ప్రక్కల నంటు కొన్న గింజలు మొ.) రాల్చు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. అగదాదండ ముద్దండ మగుచుఁ దాఁకి,
లోఁకవెంద్రుక యైనను దులుప దయ్యె.
దశా. ౧. ౨౯౯.

గీ. గాదె తెఱచి చూచి కలదియ్యమన్నియుఁ,
దెగిన నందుఁ జొచ్చి తిరుగువాఱిఁ, దుడిచి
దులిపి యొక్కదోసెఁ డుండినఁ దెచ్చి, వారి
జాక్షి వండి వార మోపె. భోజరా. ౬.
౧౭౫. (శ. ర.పా.)

క. తల గోఁతిగి విడిచిపెట్టిన, దులుపుకొనుచు
వెల్లఁదనము దుఃఖము సిగ్గుల్, గలఁపఁగ బీర
ము లావును, బొలివోయి విదర్భరాజపుత్త్రుఁ
డు మరలెన్. పద్మ. ౧౦. ౩౮.

౨. జాడించు, విదిలించు.

సీ. జడముడు లీడ్చిన సవరగా ముడుఁచుచు జి
లుఁగువన్నియలబొంతలు దులుపుచు. చెన్న.
౫. ౩౨౭.

క. ప్రాతఃకాలమునం దర, శేతిరి యేతెంచి వేఁడ
లే దనక కడున్,భీ తైకలంత యొసఁగితిఁ,
జేతులు దులుపుకొని యుంట శివుఁడే యె
ఱుఁగున్. శేష. ౨. ౫౩. (చేతులు దులు
పుకొని యుండు=చేత ద్రవ్యము లేకుండు.)

౩. మేలొ్కనఁజేయు.

శా. మూలం గూర్కెడుపాఁపకన్నె దులుపన్
మూర్ధాభిషేకంబునన్. పి. శకుం. ౨.౧౧౮.

దులిపివేయు = జాడించు, నిందావాక్యములు ప
లుకు.

(వ్యవ.) వాఁడు వానిని నడువీధిలోఁ పెట్టి దులిపి
వేసినాఁడు.

దువ=దుగ. వి. (సం. ద్వా. ప్రా. దువే.) రెండు.
(శ. ర.)
జః దువ్వలువ.

దువారము. వి. (సం. ద్వారమ్. ప్రా.దుఆరమ్.)
వాకిలి, ద్వారము.

సీ. కదళికా స్తంభముల్ కనకకుంభంబులు దల
దువారంబులఁ దగులుపఱచి.రసిక.౬.౧౭౯

సీ. తలదువారంపుఁబొంతల నంటిబోదియలును
నిండుఁగుండలు నొనర నిలిపి. అచ్చ. రా.
అయో. ౧౦.

దువాళము=దువాళి. వి. వేగమున అంతమేర
యు సమముగా పాఱెడిఅశ్వధార, ప్లుతము.

ఉ. చూపులు వారకామినులచొక్కపుగుబ్బ
లపై దువాళపుం,గోపులు నూప రూపమునఁ
గోయిలమూఁకలఁ బచ్చవిల్లుఁ బూఁ,దూపు
లు దాఁచి దేహలతతో విహరించెడుమారుఁ
డో యనన్, మాపులు గాఁగ భూసురకుమా
రుఁడు నిచ్చలు వచ్చు వీథికిన్.నిరం.౨.౧౯.
ఆం. భా. ౨. ౧౯౭.

దువాళి=దువాళము, దువ్వాళి. వి.౧. అశ్వధారా
విశేషము, అశ్వప్లుతము; పరుగు, గంతు.

సీ...దువాళ మన దు. గీ. వాళి యనఁగను ప్లు
తముగా వఱలుచుండు. ఆం. భా.౨.౧౯౭.

శా. స్వచ్ఛాయన్ సుముఖిన్ సహస్రకరుఁ
గొల్వం బెట్టి హేలావిహా,రేచ్ఛన్ గోడిగ
యై దువాళిఁ జనియెన్...వరాహ. ౫.౯౦.

ఉ. ఉక్కళ మైనమంచిమనువొప్పెడునాహ
యరత్న మెక్కినన్, గక్కస మేమి లేక
రవగాలును జోడన యడ్డవేడెమున్, లుక్క
దువాళి జంగనడలుం గనిపించుచుఁ బోయి
పోయి రా,జక్కడ వన్నె సోఁక నటు హా
యనిరన్ గదలెన్ జరీలునన్. సారంగ.౧.
౭౨. (బ్రౌ. పా.) జై. భా. ౫. ౧౯౬.

క. హలికుఁడు నీవా యనుచుం, జలి విడిచి ప్ర
హాస మెసఁగ శయములఁ గాల్లం, బిలపిల
నెదురుగఁ బఱచిన, నలగాడిదయున్ దువా
ళి నటితికి వచ్చెన్. వేం. పంచ. ౩. ౫౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రగడ. వనిత రాదురా దువాళి వలదు వల దుప
వనసీమ. చంద్ర. ౪. ౨౧.

౩. పాలకీబోయలు పలుకు మాటలలో నొకటి.
వ...బెస్తలు... పదిలము మించదుగు దువాళి
...అన విని సంతసిల్లి కంసారి...ప్రబంధ.
౬౦౫.

జః దువాళించు, దువాళిదోలు, దువాళిచేయు.

దువాళి(డి)ంచు=దువాళిదోలు. స.క్రి. (√దు
వాళి. క.దువాళిసు.)౧.-అశ్వాదులను-దువాళ
ము చేయించు, ఏకధాటిని పరుగెత్తించు, ప్లుత
గతివిశేషముతో నడిపించు.

సీ. కౌస్తుభరత్న మొక్కటి పూనె గాలిమేఁ
తలకడియంబును దాల్చె నొకటి, లేలిహానా
రి దువాళించె నొక్కటి తొడుకుబాబా నె
క్కె తోలె నొకటి. వరాహ. ౫. ౧౧౮.

ఉ...ఝమ్మయించిన నేల గ్రక్కదల నిట్టటు
గా వడిఁ ద్రొక్కుచుఁ దువాళించిన గట్టు
గు ట్టనక లెక్కకు మిక్కిలి దవ్వు వాఱు
చుఁ. యయా. ౧. ౭౨.

సీ. ఇది గాడ్పుబాబాల నెక్కి క్రొవ్విరితావి
యబిసీల్ దువాళించుసట్టిబయలు. చంద్రా.
౪. ౧౯౨. నిరం. ౩. ౧౨.

౨. ప్రసరింపఁజేయు, వ్యాపింపఁజేయు.

మ. చెఱఁగు ల్పాఁతపసిండిప్రాఁతమిసిమిం జి
త్రాతిచిత్రంబులై, మెఱయఁ రత్నపుఁగు
చ్చులంచులబడి న్నించుల్ దువాళించుక్రొ,
మ్మెఱుఁగుంజెంద్రికకావిపట్టు సురభూమిజా
శ్రితం బిచ్చె న్పాతలుచుంగన్నులవేల్పుపట్టి
వసుగోత్రామండలస్వామికిఁ.వసు.౫.౯౪.

మ...మానికపుఁగెంజాయల్ దువాళించుపావ
లు పాదంబుల మెట్టి ప్రాణవిభుఁ గొల్వం
కొల్వమో సాలకుఁ. కాశీ. ౨. ౬.

అ. క్రి. ౧. ప్రసరించు.

సీ. వెలిక్రొత్తము త్తియంబులడా ల్దువాళింప వె
లుఁగురాతాహారంగులు వెలుంగ. నీలా.
౨. ౪౭.

మ...హారాలంకృతిస్తోమముల్, సరసత్వంబున
నిచ్చి పంచి కొలువుం జాలించి తాఁ బో
యె భూపరతీశుండు మనంబు హేమవతి
పై బాలిం దువాళింపగఁ. హంస. ౧.౬౩.

౨. (అశ్వాదులు) ప్లుతగతివిశేషముతో నడుచు.

ద్వి. బకమురూపమున డంబకము నూపుచును,
జంచు వాడించి పక్షములు జాడించి, వంచి
గోడించి తీవ్రత దువాడించి, జలజాక్షుఁ
గబళింప శాలియై యసుర. అ. మ. క. ౧.
౫౧ పా. ౭ పం.

దువాళిఁదోలు= దువాళించు. స. క్రి. (√దు
వాళి.) అశ్వాదులను ప్లుతగతితోనడిపించు;
పరుగెత్తించు.

సీ. నలువుగాఁ బులుఁగురాబలుగుతానిదువాళిఁ
దోలువాఁ డభయంబు కేలువాఁడు. చంద్రా.
౧. ౭౦.

ఉ. తేజము మీఱఁగా మరుఁడు థే యని వన్ని
య మీఱ జిల్కరా,తేజిఁ దువాళిఁదోలి...
దశా. ౨. ౩౦౦.

దువాళిగాఁగఁదోలు = దువాళిఁదోలు.

గీ. నాతి యెఱుఁగుదునా యల్లనాఁడు డేఁగఁ,
జేత వహియించి చిన్నతేజీ దువాళి,గాఁగఁ
దోలుచు నీత్రోవగానె చనియె, నామనసు
వానిమీఁదనె నాఁటెనమ్మ.శుచల.౩.౧౧౧.

దువాళిసే(చే)యు. స.క్రి. (√దువాళి.)పరుగె
త్తించు, తఱుము.

శా. ప్రాలేయంబు దువాళిసేసిన భయభ్రాంతం
బులై యూష్మముల్, వాలాయంబుగఁ
బ్రాఁకె సంధ్రవనితావక్షోజశైలాగ్రముల్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్రీడా. ౪౮.
డిండిమవృత్తయుక్తకర్ణాటచాపది. విరివిగా నె
ల పండువెన్నెలలు గాయ, పురి విచ్చి నె
మ్మిగుంపు తటాన డాయ, మరు పౌచిలుక
వార్వము దువాళి సేయ, తటిగాడు మనుపు
మందఅను రతిరాయ. ప్రబంధ. ౨౪౨.
చ. వలపు దువాళిసేయఁ బికవాణి కదంబపుఁగ
మ్మవాసనల్, గులుకుపయోధరంపు మెఱుఁ
గుల్ హృదయంబున నాఁటునంబకం,బుల బె
డిదంపువాఁడిఘనముం గనుపింపఁగ...సారం
గ. ౨. ౪౬.

దువ్వ. వి. దుమ్ము, ధూళి; పరాగము.
శా. ప్రవ్వుల్ గాఱుచు నీచుకంపుతఱచుక్
రోఁతైతత్రిం బాసి పెక్, దువ్వక్ బ్రుం
గినగర్దభాస్థిఁ దినుచుక్ సుప్రీతమై జాగిలం,
బవ్వేల్పుందొరఁ జూచి కొంకదు... మల్ల
భూ. నీతి. ౯. ఆం.భా. ౨.౨౨౦.
చ...వచ్చెఁగ్రొవ్విరిరవదువ్వచాల్ గొని దివిక్
మలయాచలవాతపోతముల్. చంద్రా. ౪.
౭౦.
సీ.చందురులో మైల జలజంబులో దువ్వ యూ
డ్చి పోఁద్రోచి రెం డొకటిఁ జేసి. అహల్యా.
౨. ౧౧.

దువ్వంట=దుగలము.
ద్వి. పాలుపార దువ్వంటఁ బురుడు పుణ్యాహ,
ములు దీర్చి యుత్సవాంబుధి నోలలాడి.
ద్వి. భా. ౧౦ స్కం. (చి. ని.)

దువ్వటము=దుప్పటము, దువ్వలువ. వి. (సం.
ద్విపటీ.) విలువగలసన్నని వస్త్రము.
క. ఎవ్వరు దెచ్చిరో కస్తురి, దువ్వట మీఱవికె
సెలవతులు సవరం బీ,జవ్వాది యన్న నవ్వెల,
జవ్వని యూరవ్వు నయనసంజ్ఞం జూపెక్.
బహు. ౫. ౧౧౯.

సీ. బంగారుసరిగంచు రంగుసుగ్గడితంపుఁ దెలి
దువ్వటము బెళబెళల నీన.ఘటికా. ౨.౧౬.
ద్వి. దువ్వటంబులమీఁదఁ దోయజనేత్ర, యె
వ్వియుఁ బనికిరా విచ్చలోఁ దెలియు,ము...
ద్వి. భాగ. ౧ స్కం. (శ. ర.)

దువ్వలువ(ల్వ)=దుప్పటము, దుప్పటి, దుప్పటీ,
దువ్వటము. వి.(దువ+వలువ.) విలువ గలసన్న
నివస్త్రము; వస్త్రము.
సీ...దువ్వల్వ వీణము దుప్పట మన. ఆం.భా.
౨. ౧౫౬.
సీ. కుదురు నిండినమించుగుబ్బచన్నులమీఁద
జిలుఁగుదువ్వలువకంచెలయుఁదొడిగి.వైష.
౬. ౨౨.
సీ. జిలుఁగుఁబైఠాణిదువ్వలువలోఁ జిఱుతొడ
లెంగావి పావడరంగు లీన.దశా. ౨.౩౫౨.
గీ. కడిసి చెంగావిదువ్వల్వఁ గట్టె నొకతె. య
యా. ౪. ౭౯.
సీ. చెంద్రికపూవన్నెజిలుఁగుదువ్వలువను దడి
యొత్తె నొక్కకాంతాలలామ. పారి. ౨.
౧౨.

పసిఁడిదువ్వలువతాల్పు=పీతాంబరధరుఁడు,విష్ణు
వు ; కృష్ణుఁడు.
గీ. వలపు గులుకంగఁ బసిఁడిదువ్వలువతాల్పు,
మేన...కలప మలఁదఁగ వెన్నుఁడు గలుగు
నొక్క. నీలా. ౧. ౧౦౫.

తోలుదువ్వలువ=చర్మాంబరము.
సీ...వైష్ణవి తోలుదువ్వలువ మడిఁచె. హర.
౪. ౭౩.

దువ్వాళి=దువాళి.
(పరుగు.)
ద్వి. బారుగా నిలిచినపారసీకముల,వారణంబు
లును దువ్వాళి సేతేర. ప్రభు. ౫. ౧౪౩
పా. ౧౦ పం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దువ్వి=దువ్వు[1]. వి. (సం. ద్వీపీ.) ౧. పెద్దపులి. (శ. ర.) ౨. చిఱుతపులి.

సీ. దువ్వులు శేఁచులు చివ్వంగు లడిదపుమెక మలు సవరపుమెకము లిర్లు. రసిక. ౧.౬౬.

దువ్వు[1]= దువ్వి. వి. ౧. పెద్దపులి, వ్యాఘ్రము.

ఆ. ఈశువరముచేత నెవ్వఁడే నిప్పాట, శూరుఁ డైన దువ్వుఁ జూచి నక్క,యొడలు గాల్చి కొన్నవడువున మీ రంత,లావు మాట లాడ లజ్జ గాదె. ఉ. హరి. ౪. ౧౬౫.

౨. చిఱుతపులి.

సీ...ఒకదువ్వ వైర మెత్తి. గీ. కఱవ వచ్చిన నమ్మునికడకుఁ బాఱు,తెంచె నాఁడుక్క ... భార. శాం. ౩. ౯౨.

దువ్వు[2]. స. క్రి. ౧. (తల) చిక్కుదీయు; చక్కఁజేయు.

చ. తెఱవకు వల్లభుండు పరదేశము వోయిన... కుఱుమఱుఁ గైనపుట్టమును గూడఁగ దువ్వని మైలకొప్పు నైˇమఱుగిడి యింటిలోఁ బతిస మాగమము స్మతియింపుటొప్పగుఁ ౯.పి.శకుం. ౪. ౭౧.

సీ...అలకలు దువ్వి...ఆము. ౫. ౩౭.

సీ. చెదరినముంగురుల్ చెమటచే నుదురంటఁ గొనగోళ్లచే దువ్వుకొనుబెడంగు.దశా. ౨. ౩౬౦. మనుచ. ౩. ౨౭.

౨.వాత్సల్యమున స్పృశించు,నిమురు;బుజ్జగించు.

క. కవ్వముఁ బట్టిన ప్రియసుతు, నవ్వనరుహనేత్ర దిగిచి యంకతలమునఁ ౯, నవ్వుచు నిడుకొని కూఁకటి, దువ్వుచుఁ జన్నిచ్చె నతఁడు దూఁటుచుఁ గుడిచెఁ ౯. భాగ. ౧౦ పూ. ౩౫౭.

క. అన సార మెఱుఁగ నేర్చితె, తనయా యని చుంచు దువ్వి తద్దయుఁ బ్రేమం,బున ... దశా. ౪. ౧౫౬.

(వ్యవ.) తనకార్యము సాధించుకొనుటకై అతఁడు వానిని దువ్వుచున్నాఁడు.

జ: దువ్వెన.

దువ్వెన. వి.(√దువ్వు[2].)దువ్వుటకుపయుక్తమైన సాధనము, కంకతిక.

క. అంతటఁ బ్రాచి నిశాపతి, యంతికగతుఁ డౌట విని ముఖాలంబితమః,కుంతలములు దీర్పఁగఁగొను,దంతపుదువ్వెన యనంగ ధవళిమ దోఁచెఁ ౯. మనుచ. ౩. ౨.

సీ...పెండ్రు,కలమోపులును దువ్వెనలు గేదె కొమ్ములు పాఁతకుండలు చిన్నిబాడితలును. చెన్న. ౨. ౨౦౪.

చ...విడు లద్దముల్ సురఁటులుం దెలిదంతపు దువ్వెనల్ ముదం, బడర ధరించి...కువల. ౪. ౧౩౭.

దుశ్చరము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఆచరింప రానిది. ౨. దుష్టముగా చరించునది. ౩. దుర్గమము. (వనాది.) వి. అ. పుం. ౧. ఎలుఁగుబంటి. ౨. శంబూక,కప్పచిప్ప.

దుశ్చరితము. సం. విణ. (అ. ఆ. అ.) చెడ్డనడత కలది. వి. అ. న. చెడ్డనడత.

దుశ్చర్మము. సం. వి. న్. పుం. ౧. కోఁశరోగము, మండలాకారకుష్ఠరోగము. ౨. పుట్టుకలోనే శిశ్నమునకు ముందోలు లేకపోవుట.

దుశ్చర్ముఁడు. సం. విణ. (న్) దుష్టమగుచర్మము కలవాఁడు, చర్మరోగము కలవాఁడు.వి.న్. పుం. స్వభావముచే శిశ్నమునకు ముందోలులేనివాఁడు.

దుశ్చికిత్స్యము. సం. విణ. (అ. ఆ. అ.) చికిత్సచేయ శక్యముకానిది.

దుశ్చేష్టితము. సం. విణ. (అ. ఆ. అ.) దుష్ట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మగుచేష్ట కలది. వి. అ. న. చెడ్డపని, దుండగము, తప్పుపని.

దుశ్చ్యవనుఁడు. సం.వి.అ. పుం- యుద్ధమునుండి తొలగింపరానివాఁడు; దుస్సహుఁడైన చ్యవనుఁడు కలవాఁడు- ఇంద్రుఁడు. (ఇది అప్రయుక్తమని యాలంకారికమతము. శ్లో. విముఖా దైవతాస్సర్వేతే నో దుశ్చ్యవనాదయః, అరణ్యగృహమేధినోర్యైర్వ్యయం హంత కల్పితాః. అత్ర ... దుశ్చ్యవన ఇతిచేంద్రపరత్వేనకవిభిర్నప్రయుక్తః. ప్రతాపరుద్రీయము. దోష.ప్రకరణము.)
సీ. పొమ్ము దుశ్చ్యవన నీపోయెడుతెరు వన్న నాతండు నవ్వుచు నతనిఁ జూచి. భార. శాం. ౪. ౩౯౨.

దుశ్శకము. సం. విశ. (అ. ఆ. అ.) అశక్యము.

దుశ్శకునము. సం. వి. అ. న. దుష్టశకునము, అపశకునము.

దుశ్శాసనుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) ౧. శాసింపశక్యముకానివాఁడు, శాసింపరానివాఁడు. ౨. దుష్ట మగుశాసనము కలవాఁడు. వి.అ.పుం. దుర్యోధనునితమ్ములలో నొకఁడు.

దుశ్శీలుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) చెడ్డస్వభావము కలవాఁడు; చెడ్డనడవడి కలవాఁడు.

దుశ్శృంగి. సం. వి. ఈ. స్త్రీ - దుష్టమగుమన్మథోద్రేకము కలది- చెడిపె యగు పెండ్లము, దుష్టభార్య.

దుష్కరము. సం. విశ. (అ. ఆ. అ.) చేయుటకు శక్యము కానిది. (వ్యతి. సుకరము.)

దుష్కర్మము. సం. వి. న్. న. ౧. చెడ్డపని. ౨. పాపము.

దుష్కర్ముఁడు. సం. విశ. (న్) ౧. చెడ్డపని చేయువాఁడు. ౨. పాపి, పాపము చేయువాఁడు.

దుష్కాలము. సం. వి. అ. పుం. ౧. చెడ్డకాలము. ౨. ప్రళయము.

దుష్కులము. సం. విశ. (అ. ఆ. అ.) చెడ్డకులము కలది, దుష్కులీనము. వి.అ.న. చెడ్డకులము.

దుష్కులీనుఁడు. సం. విశ.(అ.ఆ.అ.) చెడ్డకులమునందుఁ బుట్టినవాఁడు.

దుష్కృతము. సం. విశ. (అ. ఆ. అ.) దుష్టముగా చేయఁబడినది. వి. అ. న. ౧. చెడ్డపని. ౨. పాపము.

దుష్కృతి. సం. విశ. (ఇ) దుష్టకర్మములు కలవాఁడు; చెడ్డపని చేయువాఁడు. వి. ఇ. స్త్రీ. ౧. చెడ్డపని. ౨. పాపము. (వ్యతి. సుకృతి.)

దుష్కృత్తు. సం. విశ. (త్) ౧. చెడ్డపని చేయువాఁడు. ౨. దుష్టుఁడు. (వ్యతి. సుకృత్తు.)

దుష్క్రమము. సం. విశ. (అ. ఆ. అ.) దుష్టమగుక్రమము కలది, తప్పుపద్ధతి కలది. వి. అ. పుం. తప్పుపద్ధతి, చెడ్డక్రమము.

దుష్క్రియ. సం. వి. ఆ. స్త్రీ. దుష్టకార్యము; చెడ్డపని.

దుష్క్రీతము. సం. విశ. (అ. ఆ. అ.) రూపసంఖ్యాదులను పరీక్షింపక కొనఁబడినది, పరిశీలనము చేయక కొనఁబడినది.

దుష్ట. సం. వి. ఆ. స్త్రీ. ౧. దుష్టస్త్రీ. ౨. లంజె.

దుష్టగజము. సం. వి. అ. పుం. ౧. చెడ్డయేనుఁగు. ౨. గంభీరవేది, ఒడలెఱుఁగనంతమత్తెక్కినయేనుఁగు.

దుష్టచారి. సం. విశ. (న్. ణీ. న్.) దుష్కార్యములు చేయువాఁడు; దుష్టముగా సంచరించువాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుష్టము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. చెడ్డది, చెడినది. ౨. అధమము, తక్కువైనది. ౩. దుండగము కలది, దుడుకైనది. (దుష్టవృషభము మొ.) ౪. దోషయుక్తము, దోషము కలది, తప్పుగలది. వి. అ. న. ౧. దోషము. ౨. ఒక జాతికుష్ఠము.

దుష్టవ్రణము. సం. వి. అ. పుం. చికిత్సచేయఁగష్టమగు వ్రణము.

దుష్టాత్ముఁడు. సం. విశ. (న్.ఆ,న్.న్.) చెడ్డ మనస్సు కలవాఁడు.

దుష్టి. సం. వి. ఇ. స్త్రీ. దోషము; చెడుట.

దుష్ఠు. సం. అవ్య దుష్టము. (దీనికి తెలుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

దుష్పచము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. వండ శక్యము కానిది. ౨. జీర్ణముచేయ శక్యము కానిది.

దుష్పత్త్రము. సం. విశ. (అ. ఆ. అ.) చెడ్డ యాకులు కలది. వి. అ. పుం. ౧. దుష్టమగు పత్త్రము. ౨. నల్లకచోరము చె. (బలుఁగక్కసి. అని కొందఱు.)

దుష్పరిగ్రహము. సం. విశ. (అ. ఆ. అ.) పరిగ్రహింపశక్యము కానిది. వి. ఆ. స్త్రీ. చెడ్డ భార్య. అ. పుం. దుష్టమగు ప్రతిగ్రహము, చెడ్డ దానము పుచ్చుకొనుట.

దుష్పానము. సం. విశ. (అ. ఆ. అ.) త్రాగుటకు కష్టమయినది. వి. అ. న. దుష్టమగు పానము.

దుష్పారము. సం. విశ. (అ.ఆ.అ.) ౧. దాఁట శక్యము కానిది. ౨. నెఱవేర్ప శక్యము కానిది.

దుష్పూరము. సం. విశ. (అ.ఆ.అ.) ౧.పూరింప శక్యముకానిది. ౨. పూర్తిగావింప శక్యము కానిది, తీర్పరానిది (ఆశ, ఆఁకలి, మొ.)

దుష్ప్రకృతి. సం. విశ. (ఇ) దుష్టస్వభావము కలది. వి. ఇ. స్త్రీ. దుష్టమగుస్వభావము.

దుష్ప్రజము. సం.విశ. (స్) దుష్టజనము కలది. (దేశము మొ.) ౨. దుష్టసంతతి కలది. (వంశము మొ.)

దుష్ప్రజసము. సం= దుష్ప్రజము.

దుష్ప్రజ్ఞానము సం=దుర్జ్ఞానము.

దుష్ప్రజ్ఞుఁడు. సం. విశ. (అ.ఆ.అ.) ౧. దుష్టమగు ప్రజ్ఞ కలవాఁడు. ౨. మందప్రజ్ఞుఁడు; ప్రజ్ఞ లేనివాఁడు.

దుష్ప్రధర్ష. సం. వి. ఆ. స్త్రీ. ౧. దురాలభ, తీఁటకసిందచె. ౨. ఖర్జూరిచె.

దుష్ప్రధర్షణము. సం.విశ. (అ.ఆ.అ.) ౧. ఎదిరింప శక్యముకానిది. ౨. తాఁక శక్యముకానిది.

దుష్ప్రధర్షణి. సం.వి.ఈ.స్త్రీ.వార్తాకి,ములకచె.

దుష్ప్రధర్షము. సం=దుష్ప్రధర్షణము.

దుష్ప్రధర్షిణి. సం. వి.ఈ. స్త్రీ. కంటకారి,వాఁకుడుచె.

దుష్ప్రమేయము. సం. విశ. (అ. ఆ. అ.) అపరిచ్ఛేద్యము, కొలఁది యిడ శక్యము కానిది, ఇంత యని చెప్ప శక్యము కానిది.

దుష్ప్రవాదము. సం. వి. అ. పుం. అపవాదము, సడి, దూఱు.

దుష్ప్రవృత్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. చెడ్డనడత. ౨. చెడ్డవార్త.

దుష్ప్రవేశ. సం. వి. ఆ. స్త్రీ. కంథారి, ఒకానొకముండ్లచెట్టు.

దుష్ప్రవేశము. సం. విశ. (అ. ఆ. అ.) ప్రవేశింప శక్యము కానిది, చొరరానిది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుష్ప్రసహము. సం.విశే.(అ.ఆ.అ.)౧.సహింప శక్యము కానిది. ౨. క్రూర మైనది, బెట్టిద మైనది.

దుష్ప్రాపము. సం. విశే. (అ.ఆ.అ.) ప్రాపింప శక్యము కానిది.

దుష్ప్రీతి. సం.వి.ఇ.స్త్రీ. ౧. దుష్ట మగు ప్రేమ, కూడని ప్రేమ. ౨. అసంతుష్టి.

దుష్యంతుఁడు. సం. వి. అ. పుం. ఒకచంద్రవంశపురాజు. (శకుంతలభర్త, భరతునితండ్రి.)

దుష్యత్. సం. (శత్ర) దుష్ట మగుచున్న, చెడుచున్న.

దుష్షమము. సం. అవ్య. ౧. విషమము, పొసఁగనిది; అసంగతము. ౨. ప్రతికూలము. ౩. దుష్టము, అసమంజసము. ౪. నింద్యము. (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము కనఁబడలేదు.)

దుసరులువాఱు. అ. క్రి. క్రేళ్లుఱుకు.
ద్వి. మిసిమిసిలంపులు మేసి తాఁ గ్రొవ్వి, దుసరులువాఱి గంతులుగొనులేళ్లు. నవ. ౧.౪౭ పా. ౧ పం.

దుసికిలఁబడు= దుసికిలు. (దుసికిలన్ + పడు.) (జాఱు.)
క. కలకంఠకమ్రగాత్రలు, గలవంటకుఁ జవులు తెలుపఁ గలకంఠమునన్, బెలు కంటఁ జెలఁగఁ జెలి బం, తులవెంటఁ బయంట చెఱఁగు దుసికిలఁబడియెన్. బహు. ౪. ౩౨.

దుసికిలఁబాఱు=దుసికిలు. (దుసికిలన్ + పాఱు.) (జాఱు.)
చ. దుసికిలఁబాఱుకోరసిగ దుప్పటినీటు లలాటపట్టికం, బొసఁగువిభూతిపైఁ బసుపుబొట్టు ను దొట్టినకల్లుచొక్కు వెక్కసముగ నెట్టవాటినవికారపుఁజూపులు గాఁ గనంబడన్, వెసఁ జనుదెంచె నొక్కబవినీఁడు తదీయసమీపభూమికిన్. శుక. ౨. ౪౧౩. (దుసికిల జాఱు. ముద్రి. పా.)
చ. దుసికిలఁబాఱుచీకటులఁ దూకొనుచుండెడు కీలుగంటుపైఁ, బసు పొసరించునిగ్గు గలఫాలతలంబునఁ జాఁదుబొట్టు...హంస. ౪.౪౦. (దుసికలజాఱు. ముద్రి. పా.)

దుసికిలు(ల్లు) అ. క్రి. (√దుసుకు) ౧. జాఱు.
గీ. అట్టివేసవి బెడిదంపువెట్టకతన, హస్తము సెమర్చ సారెకు లస్తకంబు, దుసికిలఁగఁ గాదె సవరింప వసము గాక, పుష్పబాణునిచెఱకువి ల్లూడమిఁ బడియె. ఆము. ౨. ౭౫.
గీ. కనుఁగొని భయాన నెమ్మేను గడగడమని, చెమటలు గ్రమ్మఁగెంగేలఁ జెఱకువిల్లుఁ, బూవుటమ్ములు దుసికిలి భూమిఁ బడిన, మగుడఁ జెంపునఁ గైకొనుమారుఁజూచి. పార్వ. ౩. ౩౭
సీ. జాతినవెండ్రుకల్ సవరించి కట్టినపసిఁడిప్రాఁతకుమాలు దుసికిలంగ. నిరం. ౨. ౨౧.
౨. తప్పుకొను, తొలఁగు.
చ...వీరవినోదచాతురీ, రసికుల రామలక్ష్మణుల రాజకుమారుల మోసపుచ్చె నే, దుసికిలి డాఁగి పోయి యొకతుచ్ఛుఁడు నేఁ డని చింత నొందుచున్. రామా. ౭. ౨౦.

దుసుకు=దుసికిలు. అ. క్రి. జాఱు.
చ. ఒసపరి గబ్బిగుబ్బగవయుబ్బునఁ గొ నసియాడఁ గ్రొమ్ముడిన్, దుసికి పిఱుందుపై సరులు తుంపెసలాడ బిరాన సిగ్గుతో, ముసిముసినవ్వు మోముపయి ముచ్చటలాడ రవందెమ్రోఁతతో, గుసగుసలాడ నంచగమి గూడఁ జనెన్ జెలి శౌరిమ్రోలకున్. ముకుంద. ౩. ౨౪౩.
జః దుసికిలఁబడు, దుసికిలఁబాఱు, దుసికిలు.

దుస్తరము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. తరింపశక్యముగానిది, దాఁటరానిది. ౨.మీఱరానిది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుస్తర్కము. సం. వి. అ. పుం. కుతర్కము, చెడ్డతర్కము.

దుస్తు. వి. (క. దుస్తు.) ౧. వస్త్రము, బట్ట.
సీ. శుభశోభనముల దుస్తులొసంగ వెక్కముం దులకు నట్టెలు సేయఁగలరుగాక. చంద్రా. ౩. ౪౨.
౨. అందము. (శ. ర.)
విణ. అధికము.
శా. అస్తోకక్రతుహోమధూమములచాయల్ తీర్థకుండంబులన్, దుస్తై తోఁపఁగఁ జూచి ... చంద్రా. ౩. ౪౮.

దుస్త్యజము. సం. విణ. (అ. ఆ. అ.) విడువ కూడనిది.

దుస్పర్శ. సం. వి. ఆ. స్త్రీ. వాఁకుడుచెట్టు.

దుస్సంచారము. సం. విణ. (అ. ఆ. అ.) సంచరింపశక్యముగానిది. వి. అ. పుం. చెడ్డసంచారము.

దుస్సంధానము. సం. విణ=దుస్సంధేయము. వి. అ. న. ౧. దుష్ట మగుసంధానము. ౨. కష్ట మగుసంధానము.

దుస్సంధేయము. సం. విణ. (అ. ఆ. అ.) సంధింప శక్యము కానిది, కూర్పరానిది.

దుస్సర=దూసర. వి. ౧. సుదర్శనలత.
సీ...దుస్సర యనఁగ సుదర్శనలత పేరు దనరుచుండు. ఆం. భా. ౨. ౬౨.
౨. వత్సాదనిచెట్టు.
చ...చెంచలియుఁ గుచ్చలి చిట్టి తగిరస తుమ్మి దుస్సర...హంస. ౪. ౧౩౨.

దుస్ససేనుఁడు. వి. (సం. దుశ్శాసనః) దుర్యోధనునితమ్ముఁడు, దుశ్శాసనుఁడు.
ఆ. కర్ణునగవు లోకగర్హితుం డగుదుస్ససేనుచెయ్యికంటె శిఖియపోలె, నడరి నామనంబు నతిదారుణక్రియ, నేర్చుచున్నయది మహీధరుండ. భార. అర. ౧. ౧౩౯.

దుస్సహము. సం. విణ. (అ. ఆ. అ.) సహింపరానిది.

దుస్సాధము. సం. విణ. (అ. ఆ. అ.) సాధింప శక్యము గానిది.

దుస్థ(స్థ)ము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చెడ్డస్థితిలో నుండునది; కష్టములో నుండునది. ౨. అస్వస్థము, ఆరోగ్యము లేనిది. ౩. నిలుకడలేనిది, కుదురుపాటు లేనిది. వి. అ. పుం. ౧. కోడి. ౨. కుక్క.

దుస్థి(స్థి)తము. సం. విణ = దుస్థము.

దుస్థి(స్థి)తి. సం. విణ.(ఇ.)దుష్టస్థితి గలది. ౨. నిలుకడ లేనిది. వి. ఇ. స్త్రీ. ౧. చెడ్డస్థితి. ౨. నిలుకడలేమి.

దుస్స్ప(స్ప)ర్శము. సం. విణ. (అ. ఆ. అ.) స్పృశింప శక్యము కానిది. వి. అ. పుం. ౧. దుష్ట మగుస్పర్శము. ౨. తీఁటకసిందచెట్టు.

దుస్స్మరము. సం. విణ. (అ. ఆ. అ.) స్మరింప శక్యము కానిది.

దుస్స్వప్నము. సం. వి. అ. పుం. చెడ్డకల.

దుహిత. సం. వి. ఋ. స్త్రీ - తల్లిదండ్రులయొద్ద ధనమును పాలు పిదికినట్లు అరణముగా తీసికొనిపోవునది-కూఁతురు, పుత్రిక.

దుహిలీ. వి. హస్తాభరణవిశేషము.
ద్వి. తోరంపువజ్రాలదుహిలీలడాలు, పేరెంపుఁ గెంపులపిడి మీఁదఁ దిరుగఁ, గరపద్మమున మించు గమకించుగచ్చు, సురటి వట్రువగాలి సుడియంగఁ ద్రిప్పి. నవనాథ. ౧. ౬౩ పా. ౧౯ పం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## దూ

దూఁకలి. వి. ఘా. (సం. దుఃఖమ్. ప్రా. దుక్ఖో.) బాధ.

క. ఆఁకొంటి రిన్ని దినములు, పోఁకంతయు భిక్ష మీటఁ బుట్టకయునికిఁ, ఆఁకటిదూఁకట నలిఁగితి, శేఁకఁటు వాయంగ భిక్ష లిడియెద రండీ. భీమ. ౨. ౧౨౮.

ద్వి. పెద్దమాటలెకాని వేల్పులకన్న, దొడ్డవాఁడవుర నాదూఁకలి దీర్పు. ద్వి. శ. సా. ౧. ౩౦ పా. ౧ పం.

దూఁకు= దుముకు,

(ఉఱుకు, గంతువేయు.)

చ...రవి దూఁక లేదుతో, యమునను జిందు బిందువులయట్లు నభంబున భంబు లేర్పడెన్. ముకుంద. ౩. ౪౩.

దండకము...నింగికై చంగునన్ దాఁటుచుం గ్రిందికిన్ దూఁకుచున్...దశా. ౪.౨౩౨.

చ...జెట్టి వగ దూఁకొని మింటికిఁ దూఁకె దూఁకినన్, గెలువు కష్టత్సు యీయసుర గెల్వకమున్న...కవి. ౫. ౧౫౦.

సీ. అనిలంబురీతి జివ్వున దూఁకి ధరణిపైఁ బదములు నిలుపక పఱచి పఱచి. అని. ౪. ౩౨. (శ. ర. పా. దూఁగి. ముద్రి. పా.)

జః దూఁకుడు.

దూఁకుడు. వి. (√దూఁకు.) ౧. వల్గితము, అశ్వగతివిశేషము.

సీ. చాకలిం పనఁగను దూఁకు డనంగను వల్గితమ్మగును...ఆం. భా. ౨. ౧౯౫.

౨. వేగము, త్వర.

(వ్యవ.) నీదూఁకు డణఁచెదను. నీ కింత దూఁకుడు పనికిరాదు.

విణ. ఎగుడుదిగుడు (శ. ర.)

దూఁకొను. స. క్రి. (దూఁటు + కొను.) పొందు.

(క) ప్రాపించు.

ఉ. తొమ్మిదివెన్నిధానములు దూఁకొని యర్థవిభుం డనం బ్రశస్తమగు పేర్మి నిందుధరు సఖ్యముఁ గాంచినమేటి యొందు చో, టిమ్మెయి మెచ్చ కివ్వరమహీధరపాదము నాశ్రయించి సౌఖ్యమ్మున మూరిఁబోయె...హరి. ఉ. ౬. ౧౦.

ఉ. నేత్రమ నేను జీరయును నేత్రమ చీరకు నాశ్రయింపఁగాఁ, బాత్రత గద్దె నాకు నిటఁ బాత్రత లే దని నామసామ్యమై, చిత్రికతంబునన్ బలిమిఁ జేకొనినట్టులు రాజదృష్టి యా, క్షత్రియకన్యచారుకటిచక్రము నూరుయుగంబు దూఁకొనెన్. నైష. ౩. ౧౩౨.

క. ఆయుంగరంబుఁ గనుఁగొని, తోయజముఖి మోహమూర్ఛ దూఁకొని యుండెన్. రామా. ౬. ౧౪౪.

(చ) స్వీకరించు.

చ. అహిమరుచిప్రతాపుఁ డగు నాకుశనాభుఁడు బ్రహ్మదత్తుకై, దుహితృశతంబు నీ నతఁడు దూఁకొని వారిఁ గ్రమంబునన్ గరగ్రహణము సేయ నావిభుకరం బటు మోపినయంతలోన నమ్మహిళలు కుబ్జరూపములు మానఁగ నొప్పిరి చారుమూర్తులై. భా. రా. బాల. ౩౨.

(ట) ఆస్వాదించు, త్రావు.

ఉ. తొంగలిపువ్వుఁ దేనియల దూఁకొని మత్తిలి తుమ్మెదల్...యయా. ౪. ౪౫.

అ. క్రి. అతిశయించు.

క...రమా, వరుఁ డంబుదగంభీరమ, ధురభావములఁ బల్కెఁ బ్రియము దూఁకొను చుండన్. భాగ. ౪. ౯౦౪.

మానిని...జని పొందెను వైష్ణవపూజితధ, ర్మైషి మనస్కుఁ నన కాసురకేళవుఁ డ స్నహిదేవకులా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గ్రణికీక్, దోషవిదూరత దూఁకొనుచైత్ర కధూర్జటితారవిధుం డెసఁగన్. పరమ. ౫. ౨౦౬.

దూఁట. వి. అరఁటియూఁచ, గెలవేసినయరఁటి చెట్టులోపల నుండుభాగము, దవ్వ. (శ. ర.)

దూఁటిపుచ్చు. స. క్రి. (√దూఁటు.) తిరస్కరించు.

సీ. తేఁటిమొత్తము నేపు దూఁటిపుచ్చఁగ నోపు కమనీయనీలాలకములు చూచి. పి. శకుం. ౨. ౧౪౦.

దూఁటు. స. క్రి. ౧. పొడుచు, కుమ్ము; (పక్షులు మొ.) ముక్కుతో పొడుచు.

ఉ. ఆదివరాహ మప్పు డమరాహితుఁ గూలఁగ దూఁటి తీక్ష్ణదంష్ట్రాదళితాంగుఁ జేసి... హ. వరాహ. ౩. ౪౧.

సీ. ఎండ్రి కాలితికిన నెగసి యొక్కించుక దొలఁగి శితత్రోటి దూఁటి తినుచు. ఆము. ౨. ౫౩.

సీ. ఇగు రంచు గండుఁగోయిల దూఁటు నంచునో తరళాక్షి పెదవి గదల్ప వేమి. దశా. ౨. ౩౨౪.

౨. (క)- దూడ పాలు త్రాగునపుడు ముట్టెతో తల్లిపొదుగు- పొడుచు.

ఉ. తల్లులచన్నుఁబాలు మును ద్రావుతఱిం దమ కర్ణవీథులన్; వల్లభ మైనమాధవునివంశరవామృతధార సొచ్చినన్, ద్రుళ్లక పాలు రాఁదివక దూఁటక మానక కృష్ణుమీఁద దృగ్వల్లులు సేర్చి నిల్చె నదె వత్సము లంగనలార గంటిరే. భాగ. ౧౦. పూ. ౭౮౫.

(చ) -పిల్లలు పాలు త్రాగునపుడు తల్లులపొమ్ము ను మూతితో- పొడుచు.

సీ. ఎత్తి చన్నిచ్చుచో నిరుదెసఁ బాలిండ్లు చేతులఁ బుడుకుచుఁ జేఁపు గలుగ. గీ. దూఁటుదురు గ్రుక్కగ్రుక్కకు...భాగ. ౧౦. పూ. ౫౪౯.

౩. (క. దూటు, దూంటు) లంఘించు, దాఁటు, దుముకు.

(వ్యవ.) వాఁడు గోడ దూఁటి పోయినాఁడు.

గీ. ఏడుపాతాళములు దాఁటి యిలయు దూఁటి, యంబరము దాఁకె నవ్వారణాంబుధార. కాశీ. ౫. ౧౩౭.

అ. క్రి. పాఱిపోవు, పోవు.

శా. తానే దొంగిలి గిన్నె శిష్యవరు చేతం బంపి చార్యంబు పైపై నం దూఁటి చనంగ నేరమిని... విప్ర. ౫. ౬౨.

క. వాలమ్ముల దంష్ట్రికర,వాలమ్ముల నెత్తి వైచి వాలమ్ముల వే,జాలమ్ములఁ దగిలించి,జాలమ్ములు దూఁటె నింద్రజాల మ్మనఁగన్. సారంగ. ౧. ౧౦౨.

సీ. కెంగేల జలపాత్ర గీలించి యెలదోఁట త్రోవగా నవ్వల దూఁటె నొకతె. దశా. ౭. ౨౩౭.

౨. చొచ్చు, ప్రవేశించు.

చ. జలనిధిలోన దూఁటి కులశైలము మీఁటి... దా. శ. ౩౩.

వి. పొడుపు.

సీ. పొదుగుదూఁటులు మాని యొదిగి క్రేపుల గుంపు జననీనికాయంబుచాటుఁ జేర. శుక. ౨. ౩౪౨.

జః దూఁకొను, దూఁటిపుచ్చు, దూఁటుకట్టు, దూఁటుకొను.

దూఁటుకట్టు. అ. క్రి. (దూఁటు+కట్టు.)నిండు, నిండుకొను.(తూటుకట్టు. అని బ్రా.)

సీ. కంఖాణఖురగరింఖాపూజితక్ష్మాధూళి నభ్రపథంబు దూఁటుకట్టె. వరాహ. ౫.౨౩.

గీ. గుహునిపై నిట్ల యత్యుగ్ర కోపభాతిఁ, దారకాసురుఁ డేసినఁ దత్క్షణంబ, నెఱయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రహ్మాండకుహరంబు దెఱపి యెల్ల, దానవిధం బున సమ్మల దూఁటుకట్టె. కు. సం. ౧౨. ౯౨౦.

దూఁటుకొను. అ. క్రి. (దూఁటు + కొను.) ఎగురు.

వ...వానివదననిశ్వాసపవనంబు... భూనభోంత రంబెల్లను నిరంతరసికతారజఃపటలంబు దూఁటు కొనం జేయు...భార. అర. ౪. ౩౭౪.

దూఁబిడి. వి. (దూయు + పిడి.) నూలు తోడును పుకు చీకు తగిలించుటకు నిలిపెడిపీఠ మమర్చిన కొయ్య. (శ. ర.)

దూగలి.[1] వి. (దూపము + కలి.) కలిదూపము. (శ. ర.)

దూగలి.[2] వి. ధాన్యములోని నుండుధూళి.

(వ్యవ.) ధాన్యము కొలిచినప్పుడు దూగలి మీఁదఁ బడుటచే శరీర మంతయు దురదపెట్టు చున్నది.

దూగిలాట. వి. బాలక్రీడావిశేషము.

సీ. గోటదొర్లుడుకాయ గొబ్బిళ్లు మోపిళ్లు నీగ పోగిస బంతి దూగిలాట. హంస. ౩. ౧౪౬.

దూచి. వి. బాలక్రీడావిశేషము.

సీ. దూచియు జాబిల్లి బూచి కన్నులకచ్చి గుడు గుడుగుంచాలు కుందెనగిలె. హంస. ౩. ౧౪౬.

దూడ. వి. ౧. పశుజాతిశిశువు, లేఁగ, క్రేపు.

క. కాంచి హర్షించి శబలీ, యంచుఁ బిలుచు టయు నొడయఁ డరుదెంచినవాఁ, డంచు నది దూడతోఁ జను, దెంచి తనువు మూర్కొనం గ...ఉ. రా. ౬. ౩౪౯.

చ. కలి వరుదెంచినకఁ ఘటముగర్భమునం గల సత్త్వంతయుఁ, దలిఁగక యమ్మి మేఁకఁ గొన దానికిఁ బిల్లలు రెండు గల్గు న్నమ్మలికలు రెంటికిం గలుగు మానుగ దూడలు నాల్గు... నా. పంచ. ౫. ౧౧.

చ. అలయక లేడిదూడగుమి...ఉ రా. ౭. ౪౧౭.

౨. ఇది నిందయందు మనుష్యశిశువులకుఁ బ్రయుక్తమగు.

సీ. పసుచుదూడలచేత పనియాను వీరేల యన నూయఁ దోతేరఁ బనుపరమ్మ. కువల. ౨. ౨౬.

౩. పశువులు.

(వ్యవ.) దూడలుత్రొక్కిన దారి యగుటచే ధూళి యధికముగ నున్నది.

(,,) వాఁడు సంతకు వెళ్లి నాలుగు కాఁడులదూడ లనుకొన్నాఁడు.

క. తలిదండ్రులయనుమతి దూ, డలఁ గాయఁగఁ బూని గొఱుపడము చల్లడముం, దలచీర కోల కిఱుచెప్పులు బిల్లనగ్రోవి యమరఁ బాలము దిరుగుచుఁ. చెన్న. ౩. ౩౧.

సా. దూడలతరమా దంటులు కొఱుకఁ.- అల్పులు గొప్పపని చేయఁజాల రనుట కుపమాన ముగా గ్రహింపఁ బడును.

క. నాదుమనోరథ మాల, క్ష్మీదయితుని చేతఁ గాని మిముబోఁటులచేఁ, గాదు చనుఁడు దూడ లతర, మాదంటులు కొఱుక ననిన మానివతం సుల్. వరాహ. ౮. ౮౧.

౫. దూడపాల.

దూడపాల. వి. (√దూడ) గోపిక, సుగంధిపాల.

సీ...దూడ, పాల యన గోపికాఖ్య యై పరఁగు ...ఆం. భా. ౨. ౫౭.

దూత(తుఁడు.) సం. వి. అ. పుం. ౧. రాయబారి.

క. తనకడకు వచ్చి మొగమోడనివాఁ డగు దూత వల్కుటకుఁ గోపింపం, జనదు జననాథునకు దూ, తునిఁ జంపిన నరక మగుట ధ్రువ మని రార్యుల్. భార. శాం. ౨. ౩౭౮.

ఉ. ఓరి దురాత్మ నీకుఁ దెగనొల్లక యుండుటకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీపరాక్రమం,బారసి కాదురా వెఱవ కా
డుము దూతుఁ డవధ్యుఁ డెంచు నీ,వీపల
నిన్ను సమ్మెటనె ప్రేయుదు డాయుదుఁ
బోర శౌరికి,సీరికి బాహుసార మెడసే
యుదుఁ జేయుదు రాజనూయముల్. ఉ.
హరి. ౪. ౨౦౫.

౨. కుంటెనవాఁడు.

గీ. అనిలుఁ డనుదూత వోయి తోడ్కొనియుఁ
దెచ్చె... అతిపరిశ్రాంతుఁ డైనయయాతి
నంత. భార. ఆది. ౩. ౧౫౬.

దూతఘ్ని. సం. వి. ఈ. స్త్రీ. - పరితాపమును
బోఁగొట్టునది - కదంబపుష్పి, పెద్దబోడసర
ము.

దూతము. సం. వి. అ. న. పరితాపము.

దూతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. రాయబారము
చేసెడియాఁడుది. ౨. కుంటెనకత్తె.

దూత్యము. సం. వి. అ. న. ౧. దూతధర్మము.
౨. దూతకృత్యము, రాయబారము.

దూది. వి. (క. దూది.) విత్తు దీసినప్రత్తి, తూ
లము.

ఉ. నూదులు ద్రిప్పుచంద మగుచుల్ వెతవెట్ట
కయుండ నెచ్చెలుల్, దూదులు వెట్టరే
చెవులలోపల సంతతపాంథలోకహృ, ద్భే
దులు మత్తరాజశుకభీషణభాషలు బాల
పల్లవా, స్వాదకషాయకంఠవిలసత్కలకంఠక
టుస్వనంబులుల్. పి. శకుం. ౩. ౧౫౪.

ఉ...దూది రాశిగాఁ,జేసినరీతి నున్నయొకజీర్ణ
మునిం గని కౌతుకంబునన్.మనుచ.౪.౭౯.

జః దూదిదబ్బ, దూదినిమ్మ, దూదిపింజె, దూద
మడుఁగు.

దూదిదబ్బ. వి. (√దూది.) ఒకజాతిదబ్బ,తోలు
పలుచగా నుండుదబ్బ. (శ. ర.)

దూదినిమ్మ. వి. (√దూది.) ఒకజాతినిమ్మ.(దూది
దబ్బ అని చి. ని.)

దూదిపింజె. వి. (దూది + పింజె.) దారము తీయు
టకు అను వగునట్లు చక్కగా చేసినదూదిముద్ద.
(వ్యవ.) ఆమెశరీరము దూదిపింజెవలె అతిమృ
దువుగా నున్నది.

దూదిమడు(ఱు)ఁగు. వి. (√దూది.) భక్ష్యవిశే
షము.

సీ. అప్పడాలకొటారు లమృతఫలాదులు వడల
కుప్పలు దూదిమడుఁగుగిరులు. శ్రీరం. మా.
౬. ౧౧౦.

దూదేకు. వి. (√దూది.) తురకలలో నొకజాతి;
ఆజాతివాఁడు.

గీ. ఎనఁగుఁ బింజారి నాఁగ దూదేకువాఁడు.
ఆం. భా. ౨. ౨౭౪.

సీ. దూదేకులహుశేను దొమ్మరిగోపాలు...
వేణు. ౬౧. చంద్ర. వి. ౨. ౫౬.

దూనము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఉప
తప్తము, సంతాపము నొందినది.౨. దుఃఖితము,
దుఃఖము నొందినది. ౩. పరిశ్రాంతము, బడలినది.

దూప. వి. ౧. పిపాస, దప్పి.

సీ. చాన నీకెమ్మోవిపానకం బానక తెరలెడు
బలుదూప దీటిపోదు. రసిక. ౬. ౯౯.

క. అదె కొలను దూప్పదెసఁ జెన్నొందవెడు నట
కేఁగి దూప యుడుగఁగఁ దెలినీరు దగన్
గ్రోలిటు రమ్మా,పదపడి కర్జంబు లెల్ల బాగగు
ననుడున్. అచ్చ. రా. యు. ౪౧౫. కవి.
౪. ౫౧. ఆం. భా. ౨. ౨౬౦.

౨. శ్రమము, అలసట; తాపము.

సీ.తోరంపుటూర్పులఁ దొడరి పాతాళము దాఁ
కంగ సాగరఘోషములు గలఁగ, వికటంపుటెఱ
కలవిసరున నుప్పొంగుతుప్పర డెందంబుదూ
పడంగ. హరి. ఉ. ౫. ౧౬౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. తనయను(గు(గూన చెఱ నుంట దల(చి వెత
ల(,దూలు నేలపాలంతుక దూప యడ(ప, మొ
గిలుకడవల జేజేలు ముంచి నించు, వలిచదలు
వా(కనీ రన వాన లెస(గె. అచ్చ. రా.
కిష్కిం. ౬౨. ప్రబంధ. ౭౮౮.

జః దూపటిలు, దూపట్టు, దూపించు[1], దూపిడు,
దూపిలు.

దూపటిలు(ల్లు.)=దూపించు, దూపిలు. అ. క్రి.
(దూప+ఇలు.) ౧. దగగొను, దప్పిగొను.

గీ. అలసి బడలిక( గడు దూపటిలి ప్రభాత,
సమయరతితాంతకాంతాకుచప్రరోహ, కలి
తకర్పూరశీతలఘర్మవారి(, గ్రోలి మెల(గు
మరుద్బాలజాల మచట. చంద్రా. ౧. ౪౧.
(చి. ని. పా.)

ద్వి. కడు దూపటిలి యుదకంబులు గ్రోల(,దడ
యక యయ్యేటిదరి కే(గుదెంచి. నవనాథ.
౩. ౨౦౮ పా. ౧౫ పం.

౨. అలయు, శ్రమపడు.

వ...పతులప్రార్థనంబులం బుంభావసురతాడంబ
రంబునకుం దోడునూపిదూపటిలి...మనుచ.
౩. ౨౮.

చ. అదియునుగాక గంధకరియాకృతి రేపటి(
బట్టి యెక్కుటం, గద కపిరాట్చమూకదళికా
వనవాటి( బెకల్చి యాడి యిం,తదడవుదా(క
దూపటిలినా(డవు కయ్యముసేయ నెల్లి వ,
చ్చెద విపు డేమి దప్పె నిలు చేరి సుఖంబున
నుండు నే(టికిన్. రామా. ౮. ౧౩౫. భీమ.
౨. ౧౦౧.

దూపట్టు. అ. క్రి. (దూప+పట్టు.) అలయు,
శ్రమపడు.

సీ. దూరంబు వచ్చినవా రిట సైన్యంబు ప్రజలె
ల్ల( జాల దూపట్టినారు. పి. శకుం. ౧. ౧౨౩.

దూపము. వి. (సం. ధూపః.) సుగంధ ద్రవ్యము.
(వాసన గలపొగ అని శ. ర.)

సీ. తఱచుగా( బెట్టినతావిదూపపు(బొగల్ గుం
పులై మెల(గు మొగుళ్లుగా(గ. యయా. ౪.
౧౫౩.

జః దూగలి, దూపార్తి, దూపించు[2].

దూపార్తి. వి. (దూపము+ఆరతి.) దూపము వే
సెడుపాదము పెట్టినతట్ట, దూపము వేయుపాత్ర
విశేషము. (శ. ర.)

దూపించు[1]=దూపటిలు. (√దూప.)
(శ్రమనొందు, అలయు.)

క. క్రేపు( దల(చి పసి మేయుచు(, జేపినపా
ల్గలయ నెండచే( బాంథజనుల్, దూపింపమి
కజు( డంపిన, యూపాగా యన(గ నదుల
నంచలు మెఱసెన్. ఆము. ౪. ౧౬౮.

శా. ఏపై చీకటి నూది మోప నెడయీ కేర్పడ్డ
వేళ న్ఘనుల్, చూపట్టున్ జిటిపొట్టిచిన్కుల
ఘనాళుల్ మింట వర్తిల్ల(గా, దూపించున్
జెల(గున్ దళుక్కున( దటిత్తుల్ దో(చిన
ట్లెల్ల వెల్లాపుంగత్తె చరించుచున్...మల్ల
భూ. శృం. ౯౪.

ధూపించు[2]. అ. క్రి. (√దూపము.) ధూపము
వేయు.

ద్వి. అగలు దూపించిన నలరులు దుఱిమి,మృగ
మదపంకంబు మెయినిండ నల(ది. నవనాథ.
౨. ౭౪ పా. ౪ పం.

దూపిడు. స. క్రి. (దూప+ఇడు.) అలయించు,
శ్రమపెట్టు.

ద్వి. తొమ్మిదియమ్ముల దూపిడ్డవాని(,గొ మ్మని
గిరి యెత్తికొని వైచె నత(డు. రం. రా.
యు. ౩౫౫ పా. ౮ పం.

దూపిలు(ల్లు)=దూపటిలు. అ. క్రి. (√దూప.)
౧. దప్పిగొను, దగగొను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ...తాపసపుత్రుఁ డాత్మవిద్యాసముద్రగు
లైనతలిదండ్రులు దూపిలియుండ వారలకు,
గాసిల కుండఁ గుండ నుదకంబుల ముంపఁగ
...రామా. ౨. ౩౬.

సీ. శివుఁడైన దూపిలి చిక్కఁడే జాహ్నవి
నెలమితో శిరసావహింపఁడేని. చమ. ౩.
౧౭౫.

౨. పరితపించు.

గీ. బెదరుఁ గన్నీరు నించు దూపిలుఁ గృశించుఁ,
బంచశరఘోరశితచూతభల్లభగ్న, మానసాం
భోజ యగుచు నమ్మంజువాణి. రసిక. ౪. ౮.

వ...పార్వతీవల్లభుండు దనకుఁ జేసినయవమా
నంబునకు దూపిల్లుచుండెను...భీమ. ౨.
౩౩. (శ.ర. పా. దురపిల్లుచుండె. ముద్రి.)

దూబ. వి. ౧. పండుఁడు, నపుంసకుఁడు.

సీ. పంద యనంగ దూబ యనంగఁ బేడి నా
మండనామంబుగా జనును...ఆం. భా. ౨.
౧౧౭.

౨. అవలక్షణము.

సీ. అవలక్షణభగాఖ్య లలరు దూబ యనంగ...
ఆం. భా. ౩. ౪౫.

౩. భగము, ఆఁడుగుఱి.
ఆం. భా. ౩. ౪౫.

౪. దిబ్బ, ఎత్తైన ప్రదేశము.

సీ. ఎలమావిజొంపముల్ బలసినచెత్తమికొలని
లోపలిదూబ నెలమిఁ బొదలి. కు. సం.
౫. ౯౭.

విణ. ౧. అధముఁడు; అధమురాలు.

సీ. భృతికి వేదంబు సెప్పెడిదూబ వేదనిందకుఁ
డు విమోహపాతంబు గనుట. గీ.చూచి దశ
కంధరుఁడు తల లూచి మఱియు.ఉ.రా.౩.
౩౨౫.

గీ. కొంటె కుసుమాలమును దూబ కొంపచెఱు
పు. హంస. ౫. ౧౧౩.

౨. లజ్జితుఁడు; లజ్జితురాలు.

సీ. నిర్జరాంగన లెల్ల నీఱుంకు వెలిపుచ్చ దూబ
వై యిచ్చోట దూఱితొక్కఁ. (అడిదము
సూరకవిచాటువు.)

దూబఱ. విణ. నిష్ఫలము, పనికిమాలినది.

(వ్యవ.) వానికి యింట దూబఱఖర్చు ఎక్కువ
గుటచే ఎంతధనము సంపాదించినను నిల
చుట లేదు.

జః దూబఱదిండి.

దూబఱదిండి. విణ. (√దూబఱ. త. తూపిర
తంటి- 'దూబఱఁదిండి' చి. ని. 'దూఁబఱదిండి.
దూయు + పఱ + తిండి = మిగులఁబెట్టక ఎంత
ఉన్నను అంతయు వెచ్చించి తినువాఁడు' అని
శ. ర.) ౧. దుష్టుఁడు; దుష్టురాలు.

సీ. నక్కచిక్కులమారి పెక్కుకురూపి దూ
బఱదిండి బొంకులబాన మొండి. చెన్న.
౨. ౨౪.

సీ. ఓగు దూబఱదిండి యోచవాఁ డవలక్షణ
ములాఁడు గోల వ్రాత్యము బజారి. హంస.
౫.౧౧౩.

౨. తేరదిండికాఁడు, అక్రమముగా లభించిన
కూడు తిని జీవించువాఁడు.

వ...రుద్రా! నీవు భద్రదేవరు మాటవీవాటి
యందు దిసమొలదూబఱదిండిమిండజంగం
బవై ఋషులపుణ్యాంగనలయాలువు లపాం
గరంగస్థలీలాస్యలంపటంబు లగుకటాక్షవీక్ష
ణంబుల హరింపుచు భిక్షాటనక్రీడను నటిం
చితి...భీమ. ౩. ౨౧౧.

దూబూచి. వి. (దూయు + బూచి- దోబూచి.
గ్రా.వా.) బాలుర నాడించుటయందు ఆనెడు
మాటకు అనుకరణము.

గీ. కను మొఱుంగి చెలుల్ మఱుంగున నడంగి,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తొంగిచూచి దూబూచి యన్నం గికాకి, కన్నగఁ గుమారుఁ గాంగిట గారవించి. సారంగ. ౧. ౪౯.

౨. బాలక్రీడావిశేషము. (శ. ర.)

పి. పచ్చతాజినుఁగుఁగ్రొంబనులసోరణగండ్ల బుడిబుడిఁ బొదలి దూబూచు లాడి. చంద్రా. ౧. ౪౨.

దూముడి=దూయుముడి. వి. (దూయు + ముడి.) జాఱుముడి.

ఉ. కంగులడాల్ చెలంగుఅవికజ సడలించి చెఱంగుబంగరుల్, రంగు లెసంగువల్వలు తెరల్చుచుఁ బావడదూముడిజ గళల్, సింగపుఁజిన్నికొనులను జిక్కు గదించి బిగించి కాంతులు,ప్వాంగెడుమేనులం దుడుటు భూషలు గొన్ని దొలంగఁ జేసినజ. ఉ. హరిశ్చ. ౩. ౩౪.

దూయమానము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. తపించుచున్నది. ౨. తపింపఁజేయఁబడుచున్నది.

దూయు=దుయ్యు, డూయు, దుయ్యు. స. క్రి. ౧. (ఒఱనుండి కత్తి) లాగు, పైకి తీయు.

గీ. అసి జరీలున దూసి దైత్యాధినేత. దశా. ౪. ౧౪౯.

చ...నృపశిఖామణి...కటారి జరీన దూసి... ఉ. రా. ౭. ౨౧౧.

౨. పుచ్చుకొను; లాగుకొను, బలవంతముగాఁ దీసికొను.

ఉ...కోమటివారిఁ జేరి శం,కాసమవాప్తి నొల్ల మనఁగాఁ దనుమర్దన మాచరించుచుం, గాసును గీసు దూసికొని గాని విడం డతఁడేమి చెప్పదుజ. శుక. ౨. ౩౬౨.

౩. (చింత మొ. చెట్లఆకులను) గుప్పిటిపట్టులో ఒక్కసారిగా కోయు.

శా. దూయం జొచ్చె మరుండు శేఁజిగురుగుత్తుల్ జంక నిర్కింపుచుజ,గూయంజొచ్చెఁ ద్వితీయయామకృకవాకుల్ కొక్కొరోకో ధ్వనిజ. నిరం ౨. ౧౦౩.

ఆ. వెలఁదిచేతివిడెము విభునకు నిప్పించి, విభునిచేతివిడెము వెలఁది కొసఁగఁ, జేసి కల్లపనులు చెప్పక యొండొరుల్,దూసి రిండ్ల కాదు దూసినట్లు. రుక్మి. ౫. ౧౧౧.

౪. (అప్పు అధికముగా) తీసికొను, చేయు.

సీ. తాతతండ్రులనాఁటిధన మెల్లఁ బోకార్చి, తులువ యై యప్పులు దూయఁ జొచ్చె. శేష. ౪ ఆ. (శ. ర.)

వ్యవహారములోని ప్రయోగవిశేషములు:

నేఁడే ఈచాఁప దూసితిని. (చాపను పార వేసితి నని భావము.)

ఆగ్రామమువా రందఱును ఆకపటసన్న్యాసిని దూయఁబట్టుకొనిరి. (వారిమాటలకు సమాధానము చెప్పలేనట్లు చేసి బాధించి రని భావము.)

ఊరందఱును వానిని దూసివేసిరి. (నిందించి రని భావము.)

అ. క్రి. ౧. చిల్లిపడు.

ఆ. షణ్ముఖుండు దివ్యశరమున ఘననితం,బంబు దూయనేయఁ బాలవెల్లి,గరిమఁ దడుపుచుండు వరుణుండు రక్షింప...భాగ. ౫. ౨౬౫.

౨. చొచ్చు, తటాకించు.

గీ. తూకొనెను జొచ్చెఁ జొరఁబాఱెఁ దూఱెదూసె, ననఁ దటాకించె ననుమాట కర్థ మగును. ఆం. భా. ౩. ౧౨౨.

౩. వెళ్లు. (పాఱు అని శ. ర.)

ఆ...కల్లపనులు చెప్పక యొండొరుల్, దూసి రిండ్ల కాదు దూసినట్లు. రుక్మి. ౫. ౧౧౧.

౪. (నాఁటి) వెడలు; రాచుకొనిపోవు.

చ. చతురులలోన నెంతయును జాణ పటంచును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సేను గౌఁగిలించి తిని టు మాఱుమో మిడఁ
గఁ జెల్లునె యొరసికాగ్రగణ్య యద్భుత
మగునట్టి బంగరపుబొంగరపుంగవఁ బోలునీ
కుచద్వితయము బొమ్మ నాఁటి యల పీపున
దూసె నటంచుఁ జూచితిక్. (కూచిమంచి
తిమ్మకవిచాటువు.)

సీ. మందేహదైతేయసందోహదేహముల్ దూసి
పాఱెడువాఁడితూపు లనఁగ. గీ... తనరా
రెఁ గ్రమముతో నరుణకిరణ, బాలభానువు
లాకాశభాగమునను. భాను. 3. రఙ. (చి.
ని. పా.)

(వ్యవ.) ఆబాయి వాని ప్రక్కనుండి దూసికొని
పోయినది.

జః దూఁబిడి, దూబూచి, దూముడి, దూయుతీఁ
గ, దూయుముడి.

దూయుతీఁగ= దూసర, దుస్సర. వి. (√దూ
యు.) సుదర్శనలత.

సీ...దూసర యనంగ; దూయుతీఁగ యనంగ
దుస్సర యనఁగ సుదర్శనలతపేరు దనరు
చుండు. ఆం. భా. ౨. ౬౫.

దూయుముడి= దుయ్యుముడి, దూముడి. వి.
(√దూయు.) జాఱుముడి, సులభముగా నూడఁ
దీయునట్లు మొన మడిచి వేసినముడి.

సీ. బ్రహ్మాస్త్రబంధంబు పట్టుఁదోరపుదూయు
ముడియె యనాయాసమునను విడువ.
రామా. ౭. ౭.

దూరగతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దూ
రముగా పోయినది. ౨. మిక్కిలి హెచ్చినది,
మిక్కుటమైనది.

వ...దూరగతమన్మథా తిమేయం కాలహరణ
స్య...శాకుం. 3.

దూరగ్రహణము. సం. వి. అ. న. దూరమం
దున్నవానిని గ్రహించుట.

దూరదర్శనము. సం. విణ. (అ. ఈ. అ.) దూ
రవస్తువులను చూడ సాధనమైనది.(యంత్రాది.)
వి. అ. న. దూరమందలివస్తువులను చూచుట.
౨. దూరాలోచన. పుం. గ్రద్ధ.

దూరదర్శనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧.
దూరస్థవస్తువులను చూచువాఁడు. ౨. దూరా
లోచన కలవాఁడు. వి. అ. పుం. పండితుఁడు.

దూరదర్శి. సం. విణ. (న్. నీ. న్.) ౧. దూర
మందలివానిని చూచువాఁడు. ౨. దూరస్థవస్తు
వును చూపునది. వి. న్. పుం. ౧. గ్రద్ధ. ౨.
పండితుఁడు. 3. ఋషి. (విల్యమ్సు.)

దూరదృక్కు. సం. విణ. (శ్)=దూరదర్శనుఁ
డు. వి. శ్. స్త్రీ= దూరదృష్టి. శ్. పుం. ౧.
పండితుఁడు. ౨. గ్రద్ధ.

దూరదృష్టి. సం. విణ. (ఇ) దూరదృష్టి కల
వాఁడు. వి. ఇ. స్త్రీ. ౧. దూరముగా వ్యా
పించుచూపు. ౨. దూరాలోచన.

దూరపాత్రము. సం. విణ. (అ. ఆ. అ.) దూర
మైనతటాంతరము కలది, రెండుఒడ్లకు నడుమ
విశాలమైన ప్రదేశము కలది. (నద్యాది.)

దూరపార. సం. వి. ఆ. స్త్రీ. గంగానది.

దూరపారము. సం. విణ. (అ. ఆ. అ.) దవ్వుల
నున్న యవ్వలిగట్టు కలది, మిక్కిలి వెడలుపు
కలది. (నది మొ.) వి. అ. పుం. వెడలుపు కల
నది.

దూరబంధువు. సం. విణ.(ఉ)దూరమం దున్న
బంధువులు కలవాఁడు, బంధువులకు దూరమం
దున్నవాఁడు. వి. ఉ. పుం. ౧. దూరదేశమం
దున్న బంధువు. ౨. అసన్నిహితబంధువు, దూర
పుచుట్టము.

దూరము. సం. విణ. (అ. ఆ. అ.) విప్రకృష్ట
ము, దవ్వున నున్నది. వి. అ. న. విప్రకర్షము,
దవ్వు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దూరవర్తి. సం. విణ. (న్. నీ. న్.) దూరమందున్నవాఁడు.

దూరవిలంబి. సం.విణ.(న్. నీ. న్.) చాలక్రిందికి వ్రేలునది.
శ్లో. నవాంబుభిర్దూరవిలంబినో ఘనాః. శాకుం. ౫. ౧౨.

దూరవేధి. సం. విణ. (న్. నీ. న్.) దూరమునుండి వేధించునది. (బాణము మొ.)

దూరసంస్థము. సం. విణ. (అ. ఆ. అ.) దూరమం దున్నది, దవ్వులది.

దూరస్థితుఁడు. సం = దూరస్థుఁడు.

దూరస్థుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దూరమందున్నవాఁడు.

దూరారూఢము. సం. విణ. (అ. ఆ. అ.) దూరముగా నెక్కినది, మిక్కిలి పై కెక్కినది; మిక్కిలి యుత్కటమైనది.

దూరారోహి. సం. విణ. (న్. ణీ. న్.)=దూరారూఢము.

దూరించు. సం. స. క్రి.(సం. దూరమ్.) దూరముగా చేయు.
క. పంచాననుసేవకు దూ,రించితి రతితంత్రములకు రిత్తకు రిత్తే, వంచనఁ బొందితి నిన్నువ, రించుట రెంటికిని జెడ్డరేవనికరణిౘ. రుక్మా. ౪. ౭౩.
సీ. అఖిలేష్టదాయకుం డగువాఁ డొసంగఁడే దూరింపక స్వస్వనోరథంబు. ల.వి.౪.౧౦౬.

దూరీకృతము. సం. విణ. (అ. ఆ. అ.) దూరముగా చేయఁబడినది.

దూరీభూతము. సం. విణ. (అ. ఆ. అ.) దూరమైనది.

దూరేత్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దూరమ్ముం దున్నవాఁడు.

దూరేరితేక్షణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దూరముగా ప్రసరింపఁజేయఁబడినకన్నులు కలవాఁడు. ౨. కేకరుఁడు, మెల్లకంటివాఁడు.

దూర్యము. సం. వి. అ. న. -దూరముగా విసర్జింపఁ దగినది- ౧. విష్ఠ, మలము. ౨. శట్కి గంట్లకచోరము ౹.

దూర్వ. సం. వి. ఆ. స్త్రీ. గఱిక ౹.

దూర్వాష్టమి సం. వి. ఈ. స్త్రీ. భాద్రపద శుక్లాష్టమి.

దూఱగు. అ. క్రి. (√దూఱు.) నింద్యమగు.
ఉ...దూఱగునాఁడిచావు మాన్పఁగాఁ,జూచుట మేలు...దశకు. ౩. ౧౪౦.

దూఱనాడు. స. క్రి.(దూఱు + ఆడు- స్వార్థము.) నిందించు, దూషించు; తిట్టు.
క. ఈకరణి దూఱనాడిన, యాకృష్ణమృగంబు పల్కు,లు...తనమనంబు నెఱియంజేయఁగ. మనుచ. ౬. ౮౨.
సీ. అతని నెవ్వరు దూఱనాడినవారితోఁ జలపట్టి వట్టివాదులకుఁ బోదు.కువల. ౪.౧౮౦.

దూఱు. స. క్రి. (త. తూఱు. క. మ. దూఱు-చూ. సర్వ. సా. ఇది లఘురేఫక మని చి. ని. లఘురేఫప్రకరణమున, సీ. దూరులు వలుకుట నారచీరలు వింటినారి విన్నారు కన్నారుచ్చ మనఁగ. అప్ప. ౨. ౧౯౬ ను, సీ. ఆఱడి యవసడి యగడాఱు దూఱు దూరు దిసంతు సడి రోయి రోఁత రొచ్చు. ఆం. భా. ౧. ౧౧౫_ ఇట్లు పఠించి ఆఱు దూఱు భిన్నపదములు అని కొందఱు. ఆము. ౬. ౧౧౩.)
౧. నిందించు, దూషించు; తిట్టు.
క. వీఱిఁడితనంబు వెట్టుచు,దూఱం బని లేదు నిన్నుఁ దొల్లిటిచెయువుల్, దీఱ వవి యనుభవింపక, వేఱుండునె పూర్వజన్మ వివిధకృతంబుల్. భా. రా. యు. ౨౨౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. ఇంతకీ డొనరించె నే రాజు కూడ నీదుష్టాత్త
కుం డని దూఱువారు. భార. విరా. ౨.
౧౪౬.

సీ. ప్రాభవంబులు మాలి బాహుశక్తులు దూలి
పాఱువారును విధి దూఱువారు. వరాహ.
౩. ౪౩. మనుచ. ౩. ౧౦౯.

వి. నింద,అపకీర్తి; తిట్టు.

గీ. అనుజతనుజులుఁ జెలులు వియ్యములు నడు
గు,మాలి పోదురు నీకుఁగా మనుజనాథ,
దొరకుఁ గులనాశనుం డనుదూఱు మేలె.
భార. ఉద్యో. ౩. ౩౪౧.

చ...దశానన దుష్టచరిత్ర మింకనైనను నిది
మాని సత్పథమునం జను దూఱు లడంగు
నంతలోన్. నిర్వ. ౪. ౭౯.

క. మన మెంతలావు సేసినఁ,బని దీఱదు సేకు
అండు పగతుఁడు లోకం,బున దూఱు రాదె
యితరుల,ననిఁ జంపినఁ గాన వలవ దాహవ
మింకన్. హరి. ఉ. ౬. ౧౭౬.

గీ. వెలఁది దూటినదూఱులు వినఁగదయ్య. వసు.
౪. ౧౦౮.

వెడదూఱు=వట్టిదూఱు, అపదూఱు.

చ. ముది మదిఁ దిప్పితోయి మునిముఖ్య భవత్త
నయన్ గృహంబునన్, బదిలము చేసి వచ్చి
మఱి బట్టబయల్ వెడదూరు దూరె ద్వాస
దన మిఁ కొక్కమా టరసి చంచలలోచనఁ
గానకున్న దూ,ఱెదు మఱి కాని బుద్ధి విప
రీతతఁ బొందక పోయి చూడుమా. ఆము.
౬. ౧౧౩.

జః దూఱగు, దూఱనాడు, దూఱుచెప్పు, దూ
ఱువడు, దూఱెక్కు.

దూఱుచెప్పు. అ. క్రి.(√దూఱు.) తగవుపెట్టు.

గీ. అమరపతికొల్వునకు వచ్చె సుమశరుఁడు,
గులుకుఁ బాలిండ్లగయ్యాళితలిరుబోఁడ్ల, యా
రజపుబేరజపుఁజేఁత లపుడు జూపి, కచ్చు
కొని దూఱు చెప్పంగ వచ్చుకరణి. చంద్రా.
౩. ౨౩.

దూఱుదుంకములు=దూఱుదుంకెనలు. వి. బ.
బాలక్రీడావిశేషము.

సీ. వత్సోజములు జాటి వ్రాలిపో మీఁగాళ్లకడ
దాఁక దూఱుదుంకంబు లాడ. విప్ర. ౪. ౧౯.

దూఱుదుంకెనలు=దూఱుదుంకములు. (శ. ర.
వి. బ. తూరనతుంకములు, తూరనగోలలు. చి.
ని.) బాలక్రీడావిశేషము.

సీ. తొంగలి ఱెప్పల దూఱుదుంకెన లాడు
సోలుఁజూపులు మరు మేలుకొల్పు. విక్ర.
౮. ౧౦౧.

దూఱువడు. అ. క్రి. (దూఱు+పడు.) నిందిం
పఁబడు. (శ. ర.)

దూఱెక్కు. అ. క్రి. (√దూఱు.) నింద పొందు,
అపకీర్తి నొందు.

ఉ...బంధుసుహృజ్జనంబు లా,దిక్కున నున్న
వారు గణుతింపక సంపదకై వధించి దూ,
ఱెక్కుట దోషమందు టనునీదురవస్థ
కోర్వవచ్చునే. భార. ఉద్యో. ౩. ౧౩.

దూల. వి. కండూతి, దురద, నవ.

గీ. దూల జిల నవ నస గాఁదు దురద యనఁగఁ,
బరఁగుఁ గండూతి...ఆం. భా. ౨. ౧౭౯.

జః దూలగొండి, దూలగోవెల, దూలపోతు,
దూలాలు.

దూలగొండి=దూలగోవెల. (√దూల.)

సీ. దూలగొండి యనంగ దురదగొండి యనఁగఁ
దీఁటకోవెల యనఁ దేజరిల్లుఁ, గండూర...
ఆం. భా. ౨. ౫౪.

దూలగోవెల. వి. (√దూల.) కండూర, దురద
గొండి ¶.

సీ. మామెనయును నేలమామెన యటికమా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మిడి దూలగోవెల మేఁక మేయు. గీ.నాకు ...హంస. ४. ౧౦.

దూలపోతు. వి. (√దూల.) ౧. ఎప్పుడును దూల గలవాఁడు. (శ. ర.) ౨. పామనుఁడు, గజ్జి కలవాఁడు.

గీ...పామసుండు, దూలపో తన విలసిల్లు దురిత దూర. ఆం. భా. ౨. ౧౨౨.

దూలము. వి. (సం. స్థూలమ్. ప్రా. థూలమ్. క. దూల.) ౧. ఇంటిగోడలపై అడ్డుగా వేయు పెద్దకఱ్ఱ.

క. విమలమణిమయము లగుదూ,లములం గంబ ముల గోడలను వేదులఁ గు,ట్టిమములఁ జుట్టి నప్రాకా,రములను గర మొప్పుచుండ రచి యించె సభక్.భార. సభా. ౧. ౧౧.

౨. తనాబి, గృహస్థూలతిర్యగ్దారువు.

మ. కలుకుందంతపుబొమ్మచెక్కడపుబల్కుంబం పుమేల్బోదెలం,దళ మానీలపుటాలదూల ములపై దార్కొన్నసున్నంచదం,తెలఁ దా పించినకెంపుటిట్టికలసందిం బొంది...దశా. ४. ४౯.

వ...గట్టురాయనిపట్టి నెమ్మేనిచాయలం దొట్టిన గట్టినీలంపుదూలంబులదండితనంబు లెచ్చరిం చి...ఉ. శా. ౧. ౧३౭.

దూలాలు. వి. (దూల+ఆలు.) వ్యభిచారిణి యగుస్త్రీ.

క. దూలాలు పెంకి నుండిన,వాలాయము చేటు వచ్చు వసుమతిలోనక్, లోలాక్షి విడిచి పెట్టిన, మేలిమిగా బ్రతుకవచ్చు మేదిని వేమా. వేమన. ३. ౨४౭.

దూలి. సం. వి. ఈ. స్త్రీ. నీలి ?.

దూళి. వి. (సం. ధూళిః. క. దూళి.) రేణువు.

క. ఆదూళితోడఁ గుడిచిన, నీదుర్జన్మంబు వచ్చె నిది యెఱిఁగెదుసం,వేదనము పూర్వపుణ్యఫ,లోదయమునఁ గలిగె...భార.అను.४.౫౦.

పెందూళి=పెద్దదూళి.

సీ. పెందూళి యెసఁగ నందంద కాల్ద్రొవ్వను గ్రత మహీతలము గ్రక్కదలుచుండ. మార్క. ౬. ౧౦౭.

దూశ్యము. సం. వి. అ. న. దూష్యము, గుడా రము. (వాచ.)

దూషకుఁడు. సం. విశ. (అ. షికా. అ.) ౧. చెఱుపువాఁడు, దోషయుక్తముగాఁ జేయువాఁ డు. ౨. తప్పు చేయువాఁడు, నేరము కావించు వాఁడు, అపరాధి. ३. నిందించువాఁడు. ४. దుష్టుఁడు.

దూషణ. సం. వి. ఆ. స్త్రీ. దూషణము, దూషిం చుట.

దూషణము. సం. విశ. (అ. ఆ. అ) ౧. చెఱు పునది, దోషము కలిగించునది. ౨. అవమాన పఱచునది, భంగపఱచునది. ३. నిందించునది. ४. నేరము చేయునది, తప్పు చేయునది. వి. అ. న. ౧. చెఱుపుట, దోషము కలదిగాఁ జేయుట. ౨. (స్త్రీ లోనగువారిని) భంగపఱ చుట. ३. (ఒడంబడిక లోనగువానిని) అతిక్ర మించుట. ४. నిందించుట, దూఱుట. ౫. ప్రతివాదముచేయుట, ఆక్షేపించుట. ౬. (యుక్తిలోనగువానిచే) ఖండించుట. ౭. దోష ము, తప్పు. ౮.పాపము.

దూషణీయము. సం. విశ. (అ. ఆ. అ) దూషిం పఁ దగినది.

దూషయత్. సం. (శత్రు.)౧.దూషించుచున్న. ౨. చెఱుపుచున్న.

దూషయమానము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. దూషించుచున్నది. ౨. చెఱుపుచున్నది.

దూషయిత. సం. విశ. (ఋ. త్రీ. ఋ.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧ దూషించువాఁడు. ౨. చెఱుచువాఁడు.

దూషి. సం. విణ. (న్. ణీ. న్.) దూషించువాఁడు. వి. ఇ, ఈ. స్త్రీ. నేత్రమలము, కంటిపుసి.

దూషించు. సం. స. క్రి. ౧. నిందించు, దూఱు.
మ. తల లింగంబులు మేన బూడిదలు గంతల్ బొంతలుం దాల్చి శాస్త్రుల వేదజ్ఞుల సర్వదైవతములన్ దూషించుపాషండులై.
క. పోవుదురు గాక...వరాహ. ౧౦. ౬౬, ౬౭.
౨. త్యజించు, విసర్జించు, వీడు.
క. కులమునకు నఖిలలోకంబులకు నపాయంబు సేయుపురుషాధము న్నిమ్ముల దూషించి జగంబును, గులమును రక్షించు టుఱదె కువలయనాథా. భార. ఆది. ౫. ౧౧౧.
వ...ఒక్కనికారణంబునఁ గులంబున కెగ్గగు నేని వాని దూషించి కులంబు రక్షించుట ధర్మంబు...భార. సభా. ౨. ౧౯౯.

దూషిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. కంటిపుసి. ౨. తూలిక, కుంచె. ౩. సాలెపురుగు. ౪. కోపిష్ఠియగుకన్య. ౫. వర్తి, వత్తి. ౬. వీణ. (కే. ని.)

దూషికము. సం. విణ. (అ. ఆ.అ.) దూషించునది. వి. అ. న. కర్ణమలము, గులిమి. (కే. ని.)

దూషిత. సం. వి. ఆ. స్త్రీ. కన్యాత్వము చెడినస్త్రీ, చెఱుపఁబడినకన్య.

దూషితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చెఱుపఁబడినది. ౨. భంగపఱుపఁబడినది. ౩. నిందితము, దూఱఁబడినది. ౪. అభిశస్తము, మైథునాపవాదము నొందినది, అంకు మోపఁబడినది.
వి. అ. న. దోషము, తప్పు.
శ్లో. యదస్యాః పత్యుర్వా రహసి పరమం దూషితమభూత్. ఉ. చ. ౪. ౧౪.

దూషితవ్యము. సం=దూషణీయము.

దూషుఁడు. సం. విణ. (అ. ఆ. అ.)- సమాసాంతములందే- చెఱుపువాఁడు. (పంక్తిదూషుఁడు మొ.)

దూష్య. సం. వి. ఆ. స్త్రీ. ఏనుఁగునడుమునఁ గట్టెడుతోలుమోకు.

దూష్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) దూషింపఁబడుచున్నది, చెఱుపఁబడుచున్నది.

దూష్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చెఱుపఁదగినది, దూషింపఁదగినది. ౨. నిందింపఁదగినది, దూఱఁదగినది. వి. అ. న. ౧. గుడారము, డేరా. ౨. వస్త్రము. ౩. విషము. ౪. పూయము, చీము.

దూష్యుఁడు. సం. వి. అ. పుం. రాజోపఘాతకుఁడు, రాజద్రోహి.

దూసర=దుస్సర. వి. ౧. సుదర్శనలత.
సీ...దూసర యనంగ, దూయుతీఁగ యనంగ దుస్సర యనఁగ సుదర్శనలత పేరు దనరుచుండు. ఆం. భా. ౨. ౬౫.
౨. వత్సాదనిశీ. (శ.ర.)

దూసరి[1]. వి. తృణవిశేషముశీ. (శ.ర.)
బ. తృణధాన్యవిశేషము, ఒకదినుసువడ్లు.
సీ...తృణధాన్యములు చెలంగు, గునుకలు దూసరుల్ గొలివె లనంగను...ఆం.భా.౨.౨౩౯.
చ. పిడికెడుదూసరొడ్లు కడుఁబేర్మి దినంబును నేతి తెచ్చి యా, పడఁతికిఁ దద్విభుం డొసఁగ ... కుచేల. ౧. ౩౪. (ఇట యీకవి వడ్లు అనుదానికి అపరూపము 'ఒడ్లు' అని ప్రయోగించినాఁడు.)
జః దూసరిబియ్యము.

దూసరి[2]. వి. అపవాదము.
(చూ. దూసరి కాఁడు.)

దూసరికాఁడు. విణ. (దూసరి[2] + కాఁడు.) అప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాదము వేయునాఁడు.

ఆ. దోసకారి యైన దూసరికాఁ డైనఁ, బగతుఁ డైన వేదబాహ్యుఁ డైన, వట్టిలేనిపేదవానికిఁ దగు నీవి, ధనికునకు నొసంగఁదగదు వేమ. వేమన. 3. ౨౦౬.

దూసరిబియ్యము. వి. (√దూసరి¹.) అడవిలో పండెడిధాన్యవిశేషము.

వ...ఒడిసెప్రాలు దూసరిబియ్యంబు నివ్వరివడ్లు గునుకు లూద లాదిగాఁ గలుగువన్యధాన్యం బులు...పి. శకుం. 3. ౧౨.

దూసలు. వి.బ.ధాన్యవిశేషము.

వ...తేటచలములు నూఁదుఘుటికలు గాజుకడియ ములు జాజికుసుమలు దూసలు భీమగుదెలు నేడాకుమొలకలు గుజ్జరులు...ప్రబంధ. ౧౧౨. (దూసరులు?)

# దృ

దృంఫువు. సం=దృన్ఫువు.

దృంభువు సం. వి. ఊ. పుం. ౧. వజ్రాయుధము. ౨. సూర్యుఁడు. 3. రాజు. ౪. అంతకుఁడు, యముఁడు. స్త్రీ. సర్పము, పాము.

దృంహితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రవృద్ధము; ప్రవర్ధితము. ౨. దృఢము, దృఢీకృతము.

దృకము. సం. వి. అ. న. రంధ్రము, బొక్క. (వాచ.)

దృకర్ణము. సం. వి. అ. పుం. చక్షుశ్శ్రవము, పాము.

దృకు. సం. విణ. (శ్) ౧. చూచువాఁడు. ౨. కనుఁగొనువాఁడు, తెలియువాఁడు. వి. శ్. స్త్రీ. ౧. దృష్టి, చూపు. ౨. కన్ను. 3. (గణిత.) రెండు అనుసంఖ్య. ౪. బుద్ధి.

దృక్పథము. సం. వి. అ. పుం. ౧. దృష్టిమార్గము. ౨. చూపుమేర.

దృక్ప్రసాద. సం. వి. ఆ. స్త్రీ. -కన్నులకు తేట తెచ్చునది - ౧. కులుత్థము, ఉలవలు. ౨. కులుత్థాంజనము.

దృక్ప్రియ. సం. వి. ఆ. స్త్రీ. - కంటికిం బైనది- శోభ. (రాజ. ని.)

దృక్శ్రుతి. సం. వి. ఇ. పుం. చక్షుశ్శ్రవము, కనువినికి, పాము.

దృగధ్యక్షుఁడు. సం.వి. అ. పుం. సూర్యుఁడు.

దృగ్గోచరము. సం. విణ. (అ. ఆ. అ.) కంటికి అగపడునది. వి. అ. పుం. కనుచూపుమేర.

దృగ్గోళనము. సం. వి. అ.న. ౧. ఖగోళాంతర్గత మగుగోళభేదము. ౨. కనుగ్రుడ్డు.

దృగ్జ్యా. సం.వి. ఆ. స్త్రీ. (జ్యోతి.) దినమానాదులు తెలియుటకై శంకుచ్ఛాయ కుపయోగించునదియు దృష్టియోగ్యయు నగుదృగ్వృత్తక్షేత్రమందలిమహాజ్యారూపసరళరేఖ.

దృగ్లంబనము. సం.వి. అ. న. (జ్యోతి.) గ్రహణదర్శనమున కుపయోగించునదై దృక్క్షేత్రమందున్న లంబరేఖ.

దృగ్వృత్తము. సం. వి.అ.న. (జ్యోతి.) వృత్తాకార మగుదృక్పరిచారస్థలము.

దృఙ్నతి. సం. వి. ఇ. స్త్రీ. (జ్యోతి.) గ్రహణదర్శనమున కుపయోగించుటకై దర్శిత మగుదృక్పరిచారముయొక్కనతివిశేషము.

దృఢకాండము. సం. విణ. (అ. ఆ. అ.) గట్టిబోదె కలది. వి.అ.పుం.౧. వెదురు. ౨. కత్తృణము.

దృఢగాత్రిక. సం.వి.ఆ. స్త్రీ. ౧. ఫాణితము, కండచక్కెర, పటికబెల్లము. ౨. దృఢశరీరము కలస్త్రీ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దృఢగ్రంథి. సం. విశే. (ఇ) గట్టికణుపులు కలది వి. ఇ. పుం. వెదురు॥.

దృఢతరువు. సం. వి. ఉ. పుం. నారింజ ॥. (చంద్ర॥ అని కొందఱు.)

దృఢతృణము. సం. వి. అ. పుం. ముంజికసవు॥.

దృఢత్వక్కు. సం.విశే.(చ్) దృఢ మగుత్వక్కు కలది. వి. చ్. పుం.యావనాళశరము, ఒకజాతి రెల్లు॥.

దృఢదంశకము. సం. వి. అ. పుం- దృఢముగా కఱచి పట్టుకొనునది-నక్రము, మొసలి.

దృఢధన్వుఁడు. సం.విశే. (న్.ఆన్.న్.) దృఢ మగుధనుస్సు కలవాఁడు.

దృఢనీరము. సం.వి. అ. పుం- క్రమముగా గట్టిపడి కొబ్బెరగా మాఱునీరు కలది- కొబ్బెర॥.

దృఢపత్త్రము. సం. వి. అ. పుం - గట్టిఆకులు కలది- వెదురు॥.

దృఢపాది. సం. వి. ఈ. స్త్రీ. నేలయుసిరిక॥.

దృఢప్రతిజ్ఞుఁడు. సం.విశే. (అ.ఆ. అ.) ప్రతిజ్ఞ తప్పనివాఁడు, ఆడి తప్పనివాఁడు.

దృఢప్రత్యయము. సం.విశే.(అ. ఆ. అ.) గట్టి నమ్మకము కలది. వి. అ. పుం. గట్టినమ్మకము.

దృఢప్రరోహము. సం. విశే. (అ.ఆ.అ.) గట్టి మొలక కలది. వి. అ. పుం. వటము, మఱ్ఱి॥.

దృఢఫలము. సం. వి. అ. పుం. కొబ్బెర॥.

దృఢబంధిని. సం. వి. ఈ. స్త్రీ. శ్యామ,ప్రేంకణపుఁదీఁగ.

దృఢబీజము. సం. వి. అ. పుం. ౧. బదరము, రేఁగు॥. ౨. చక్రమర్దము, తగిరిస॥.

దృఢభూమి. సం. వి. ఇ. పుం. ౧. (యోగ.) మనస్థైర్యము కలిగించుఅభ్యాసభేదము. ౨. గట్టినేల.

దృఢమతి. సం. విశే. (ఇ) దృఢబుద్ధి కలవాఁడు, దృఢనిశ్చయము కలవాఁడు. వి. ఇ. స్త్రీ. దృఢ మగుమతి.

దృఢము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. కఠినము, గట్టిది. ౨. పట్టుగలది, పూనిక విడువనిది. ౩. అశిథిలము, గుత్తమైనది. ౪. బలము కలది. ౫. స్థూలము, లావైనది. వి. అ. న. ౧. ఇనుము. ౨. అతిశయము, పెల్లిదము.

దృఢముష్టి. సం. విశే. (ఇ) ౧. గట్టిగా పట్టినపిడికిలి కలవాఁడు. ౨. పిసినిగొట్టు, కృపణుఁడు. (త్రి.ని.) వి.ఇ.పుం. ౧. -పిడి కలది- ఖడ్గాద్యాయుధము. ౨. గట్టిపిడికిలి.

దృఢమూలము. సం. విశే. (అ. ఆ. అ.) గట్టి వేరు కలది. వి. అ. పుం. ౧. కొబ్బెర॥. ౨. ముంజిగడ్డి॥.

దృఢరంగము. సం. వి. అ. పుం. -దీనికూడికవలన రంగు నిలఁబడును- పటిక, పటికారము.

దృఢలత. సం. వి. ఆ. స్త్రీ. పాతాళగరుడీలత.

దృఢలోమము. సం. విశే. (న్. న్, ఆ, మ్నా. న్.) గట్టిరోమములు కలది. వి. న్. పుం. అడవి పంది. న. గట్టిరోమము.

దృఢవల్క. సం=దృఢవల్కలు.

దృఢవల్కలు. సం. వి. ఆ. స్త్రీ. చిఱుబొద్ది, అంబష్ఠ॥.

దృఢవల్కలము. సం. విశే. (అ. ఆ. అ.) గట్టి పట్ట కలది. వి. అ. పుం. పూగము, పోఁక॥.

దృఢవైరి. సం. విశే. (న్. ణీ. న్.) గట్టిపగ వాఁడు, బద్ధవైరము కలవాఁడు.

దృఢవ్రతుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) విఘ్నములచేత చలింపనిసంకల్పము కలవాఁడు, గట్టి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంకల్పముతో కూడినవాఁడు; గట్టిపట్టుదల కలవాఁడు.

దృఢసంధి. సం. విణ. (ఇ) గట్టిగా సంధింపఁబడినది, గుత్తముగా కూర్పఁబడినది. వి. ఇ. పుం. దృఢ మగుసంధి.

దృఢసూత్రిక. సం.వి.ఆ.స్త్రీ.మూర్వ,చాగశీ.

దృఢస్కంధము. సం. విణ. (అ. ఆ. అ.) గట్టి బోదె కలది. వి. అ. పుం. క్షీరవృక్షము, పాల చెట్టు.

దృఢహస్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) గట్టి చేయి కలవాఁడు; ఖడ్గాదిధారణమందు ఆరి తేఱినచేతులు కలవాఁడు.

దృఢాంగము. సం. విణ. (అ. ఆ, ఈ. అ.) దృఢ మైనఅవయవయములు కలది. వి. అ. న. వజ్రము, మగఱాయి.

దృఢీకరణము. సం. వి. అ. న. దృఢపఱుచుట; స్థిరపఱుచుట.

దృఢీకరించు. సం. స. క్రి. దృఢపఱుచు.

వ...నారాయణుండు సమస్తపరిపూర్ణుం డని భావంబున దృఢీకరించి నానావిధోపచారం బుల...ఆరాధింపుము...వరాహ.౧.౧౮౭.

దృఢీకారము. సం = దృఢీకరణము.

దృఢీకృతము. సం. విణ. (అ. ఆ. అ.) దృఢముగా చేయఁబడినది.

దృత. సం. వి. ఆ. స్త్రీ. జీలకఱ్ఱశీ. (వాచ.)

దృతము. సం. విణ. (అ. ఆ. అ.) ఆదృతము, ఆదరింపఁబడినది.

దృతి. సం. వి. ఇ. పుం. స్త్రీ. ౧. నీళ్లు మోపోయుతోలుతిత్తి. ౨. కొలిమితిత్తి. ౩. తోలు, చర్మము. ౪. చేప. ౫. గళకంబళము, గంగడోలు. ౬. మేఘము.

దృతిహారి. సం. వి. ఇ. పుం - తోలితిత్తిని హరించువది - కుక్క.

దృతిహారుఁడు. సం. వి. అ. పుం. తిత్తితో నీరు తెచ్చువాఁడు.

దృన్ఫువు. సం.వి.ఊ.స్త్రీ.౧.సర్పము. ౨. వజ్రాయుధము. ౩. చక్రము. పుం. సూర్యుఁడు.

దృన్భువు. సం = దృంభువు.

దృప్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దర్పించినవాఁడు. ౨. హర్షించినవాఁడు, ఉబ్బు కలవాఁడు.

దృప్రుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. బలయుక్తుఁడు. ౨. గర్వించినవాఁడు.

దృబ్ధము. సం. విణ. (అ. ఆ. అ.) గ్రథితము, గ్రువ్వఁబడినది. ౨. భీతము, భయపడినది. వి. అ.న. ౧. గ్రథనము,గ్రుచ్చుట. ౨. భయము.

దృబ్ధి. సం. వి. ఇ. స్త్రీ. గ్రథనము, గ్రుచ్చుట.

దృశ. సం. వి. ఆ. స్త్రీ. కన్ను. (వాచ.)

దృశత్తు. సం = దృషత్తు.

దృశాకాంక్ష్యము. సం. వి. అ. న. - కంటికి కోరఁదగినది - తామర, పద్మము.

దృశానము. సం. వి. అ. న. జ్యోతి, తేజస్సు.

దృశానుఁడు. సం. వి. అ. పుం. - చూచువాఁడు, కనుపెట్టి చూచువాఁడు - ౧. ఆచార్యుఁడు; ఉపాధ్యాయుఁడు. ౨. బ్రాహ్మణుఁడు. ౩. లోకపాలుఁడు. ౪. సూర్యుఁడు.

దృశి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. కన్ను. ౨. శాస్త్రము. ౩. ప్రకాశము. ౪. దృష్టి,చూపు; చూచుట.

దృశించు. సం. అ. క్రి. కనఁబడు, ప్రత్యక్షమగు.

ఉ.ఆతప మిచ్చ మెచ్చి శివుఁడు...జగదద్భుత భంగి దృశింప సమ్మదుం, డాతతభక్తియుక్తి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నతుఁడై నుతియించె ననేకరీతులన్. ఉ. రా. ౭. ౩౬.

దృశోపమము. సం. వి. అ. న. తెల్లతామర పువ్వు. (వాచ.)

దృశ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) చూడఁబడుచున్నది.

దృశ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దర్శనీయము, చూడఁదగినది. ౨. కంటికింపయినది. ౩. జ్ఞేయము, తెలిసికొనఁ దగినది. వి. అ. న. ౧. కనఁబడువస్తువు. ౨. మౌక్తికభేదము.

సీ. మూఁడుమూలలు గలముత్యంబు దృశ్యంబు ప్రక్క గుంతలదియె పార్శ్వకృశము. రత్న. ౫౦.

దృశ్వుఁడు. సం. విణ. (న్. శ్వరీ. న్.) -సమాసాంతములందు- ౧. చూచినవాఁడు. ౨. తెలిసినవాఁడు. (ఉదా:- బ్రహ్మవిద్యాపారదృశ్వుఁడు మొ.)

దృషత్తు. సం. వి. త్. స్త్రీ. ౧. ఱాయి. ౨. సన్నెకల్లు.

దృషత్పుత్రి. సం. వి. ఈ. స్త్రీ. కల్వపుగుండు, నూఱెడుఱాయి.

దృషదిమాషకము. సం. వి. అ. పుం. పిండి విసరుట మొదలగువ్యాపారము చేయువాఁడు రాజునకీయఁదగినమాషపరిమితి గలపన్ను.

దృషద్వతి. సం. వి. ఈ. స్త్రీ. ఒకనది. (ఇది సరస్వతీనదిలోఁ గలియునొకయుపనది.)

దృష్టకూటము. సం. వి. అ. న. - గూఢమైన యర్థము కలది-ప్రహేళిక.

దృష్టపృష్ఠుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) - యుద్ధాదులందు శత్రువులచేఁ జూడఁబడినవెన్ను కలవాఁడు - పలాయితుఁడు, వెన్నిచ్చి పాఱిపోయినవాఁడు.

దృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చూడఁబడినది, విలోకితము. ౨. జ్ఞాతము, తెలియఁబడినది. ౩. అనుభవింపఁబడినది. (ఉదా:-దృష్టకష్టుఁడు, దృష్టదుఃఖుఁడు మొ.) వి. అ. న. ౧. దర్శనము, చూపు. ౨. రాజునకుఁ దనరాష్ట్రమండలిజనులవలనఁ గాని పరరాష్ట్రజనులవలనఁ గాని కలుగుభయము. ౩. సాక్షాత్కారము, ప్రత్యక్షత. ౪. దృష్టాంతము. (ఈయర్థమున నాంధ్రగ్రంథములందు మాత్రమే ప్రయోగము కనఁబట్టుచున్నది.)

చ. సదయుఁ డహోబిలేశుఁడు...మున్, జదివిన భార్గవాదులకు సన్నిధిఁ జేసెనె దైత్యజాతుఁ డ,య్యాదన సమస్తమందుఁ గలఁ డంటకు దృష్టము చూపినట్లుగన్. భోజరా. ౧.౭౨.

చ...మీ రెఱుంగరె యనంతఫలప్రద మన్నదానమే, తెలుపఁగ నేల నేఁటె యొకదృష్టము చెప్పెదఁ జిత్తగింపుఁడా. భోజరా. ౩. ౨౫౭.

దృష్టరజ. సం. వి. స్. స్త్రీ. రజస్వలయైనస్త్రీ, సమర్తాడినపడుచు.

దృష్టాంతము. సం. వి. అ. పుం. ౧. ఉదాహరణము. ౨. ఒకయర్థాలంకారము.

క. బింబప్రతిబింబత్వము,నం బరఁగినవాక్యయుగమునం గలసాధ,ర్మ్యంబు చెలంగిన దృష్టాం,తం బగు నది కృతులయందు ధర నెట్లన్నన్.

క. అసదసురవిసరవిశసన, రసవిస్ఫురసాహసుండు రాముఁడె ధరలో,నసమసమరతలసమద్వా,రిసమూహవిభేది వీవె శ్రీనరసింహా. నరస. ౫. ౧౫౫, ౧౫౬.

౩. శాస్త్రము. ౪. దిష్టాంతము, చావు. (మే.ని.)

దృష్టాంతీకరించు. సం. స. క్రి. ఉదాహరించు.

వ. ఓరాజవదన రాజపాణిగ్రహణంబు దృష్టాం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీకరించి పలికిననీసుభాషితంబులకు సర్వం బెయ్యది యంతిమవర్ణంబునకు వేదవర్ణంబు నుంబోలె నయ్యర్థంబు నావీనులు ప్రవే శింప నర్హంబుగాదె... సైవ. ౨. ౯౫.

దృష్టార్థము. సం. విణ. (అ. ఆ. అ.) చూడఁ బడినయర్థము కలది, కనుఁగొనఁబడినయర్థము కలది. ౨. చూడఁబడినప్రయోజనము కలది, స్పష్టమైనప్రయోజనము కలది.

దృష్టి. సం. వి. ఇ. స్త్రీ. (బ.దృష్టులు, దృష్ట్లు.) ౧. చూపు,చూచుట, దర్శనము. ౨. కన్ను. ౩. అభిప్రాయము. ౪. ఎఱుక, జ్ఞానము. ౫. ప్రకాశము. ౬. కనుఁబాటు, దృష్టిదోషము.

సీ. తెలియఁ జూచినయెడ దృష్టి తాఁకునో యని వేడ్కఁదీఱఁగఁ జూడ వెఱతు నిన్ను. సారంగ. ౩. ౧౦౦.

మ...కీర్తిపుష్కలసస్యం బిడి యేకధాటి బళి రా కట్టించి తా దృష్టి కేదులఖానోగ్రక పాలమరపహరిద్బాభజాంగలశ్రేణికన్. ఆము. ౧. ౪౨.

క ... రా, గమ్మున నన్యోన్యస్నేహమ్ములు నెడి దృష్ట్లు నిలిపి రయ్యువతిపయిన్. భార. ఆది. ౭. ౧౦౬.

దృష్టించు. సం.స.క్రి. చూచు.

శా...నలుగడన్ దృష్టించుచున్ స్రుక్కఁగన్. ఉ. రా. ౨. ౫౯.

ద్వి...వగలఁ, బొగులుచుఁ గళలచేఁ బున్నమ చంద్రుఁ, దెగడురామునిమోము దృష్టించి మఱియు. రం. రా. అయో. ౧౧౧ పా. ౧౪ పం.

అ. క్రి. దృష్టినిలుపు, ఏకాగ్రత కలిగియుండు.

ద్వి. దృష్టికి దాఁటినతేజంబువాఁను, దృష్టించి చూచినఁ దెలు పగువాఁడు. బస. పు. ౧౪౫ పా. ౧౫ పం.

ద్వి. దృష్టించి బ్రహ్మాదిదేవత లెఱుఁగ, సృష్టికిఁ బ్రతిసృష్టి చేసినయట్టియే నుండ ... ద్వి. హరిశ్చ. పూ. ౩౦౭ పం.

దృష్టిక్షేపము. సం. వి. అ. పుం. ౧. దృష్టిపాతము; దృష్టిప్రసరించుట. ౨. దృష్టి ప్రసరింపఁజేయుట.

దృష్టిగోచరము. సం.విణ. (అ. ఆ. అ.) కంటి కగపడునది, కనఁబడునది. వి. అ. పుం. చూపుమేర.

దృష్టిదండ. మి. వి. దృష్టిదోషము తగులకుండు టకు వేయుదండ.

ఉ...పూదెలగొల్సును బెద్దగంట సింగారపు దృష్టిదండ మెడ గజ్జెలపేరులు నందె లొ ప్ప...హంస. ౫. ౯౬.

దృష్టిపట్టు. మి. అ. క్రి. (దృష్టి+పట్టు.) కను పట్టు, చూపట్టు.

క. ఒకనరునివిక్రమము మాటికి బాగడెద వింత కడుఁగడిందిగ మనయేలికకుఁ గలయోధవీర, ప్రకరము నీ కేల దృష్టిపట్టదు చెపుమా. రాఘవ. ౪. ౫౭.

దృష్టిపథము. సం.వి.అ. పుం. ౧. చూపుమేర. ౨. చూపు ప్రసరించుమార్గము.

దృష్టిపాతము. సం=దృష్టిక్షేపము.

దృష్టిపిడుత. మి.వి. సస్యాదులకు దృష్టిదోషము తగులకుండుటకు సున్నముతోను మసితోను బొట్లు పొడిచి తగిలించుపిడుత.

సీ. నగలపేరింటిసున్నపుబొట్లతో దృష్టిపిడుతల చంచాన వీను లొప్ప. చంద్ర. వి. ౧.౯౮.

దృష్టిపూతము. సం. విణ. (అ.ఆ.అ.) దృష్టిచే పరిశోధింపఁబడినది. (నేల మొ.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దృష్టిబంధువు. సం.వి. ఉ. పుం. మిదుఁగురుఁ బుర్వు.

దృష్టిబొట్టు. మి.వి. దృష్టిదోషనివారణకై పెట్టుకొనుబొట్టు.

మ. తొలుగెం పన్నలఁ గింపుమై నలఁది తోడ్తో బ్రాగ్దిశాతన్వి గ్రొన్నెల యక్షాపాపని దాన మార్చ మను గన్నీ రుబ్బెనా నూత్నరత్నులు మించెక్ పిదపక్ నిరుద్ధసలిలంబు ల్పర్వెనా వెన్నెలల్, నలువొందెం బయి దృష్టిబొట్ట నఁగఁ జిహ్నం బొప్పె నీలద్యుతిక్.చంద్ర. ౪. ౭౩.

దృష్టివిక్షేపము. సం. వి. అ. పుం. ఓరచూపు, కడకంటిచూపు.

దృష్టివిద్య. సం.వి.ఆ.స్త్రీ. నేత్రవిద్య,చూపును గుఱించినవిద్య, దానిగుణదోషాదులను దెలుపు శాస్త్రము.

దృష్టివిభ్రమము.సం.వి.అ.పుం.దృష్టివిలాసము.

## దె

దెంగ. వి. భూమిపరిమితివిశేషము.

వ...ఉత్తరదక్షిణములవెనిమిదిదెంగ్గలు లోఁపు గా...దా. శా. ౧౩౦౩.

దెంగు. స. క్రి. (క. దెంగు.) సంభోగించు, రమించు.

చంద్ర. వి. ౨. ౪౯.

వి. సంభోగము.

క్రీడా.పీఠి.౫౩ పా.

దెంచేనము=దంచేనము.

(కోటలు మున్నగునవి బ్రద్దలుకొట్టుట కుపయోగించుఆయుధవిశేషము.)

సీ. క్వథితతైలములఁ బక్వముసేయఁబడువారు దెంచనంబుల ద్రేయఁ ద్రెళ్లువారు. కవిక. ౫. ౧౧౩.

దెంచిక. వి. దూలముమీఁద నడ్డముగా నుంపఁబడుగృహావయవవిశేషము.

చ. పగడపుఁగంబముల్ తళుకుబంగరుబోదెలు కెంపుదూలముల్, జగమగజాలదెంచికలు చక్కనినీలపుఁబల్కచాల్ మెఱుం, గగు తెలిమిన్నలోవయును నచ్చపుబంగరుపేర రంగునం, దగఁ గనుపట్టు నొక్కవికసన్మణి మండప మప్డు దోఁపఁగక్. చంద్రి.౨.౭౩.

దెందము=డెందము.

(హృదయము, మనసు.)

ఉ...విప్రమిత్రుఁగా, దెందమునం దలంచి తివొ దెప్పర మప్పగి... దశా. ౨.౭౯.

దెపగుప. వి. (బాణములు) తాఁకుటయం దగు ధ్వని కనుకరణము.

చ. అపుడు యుగంధరోజ్జ్వలశరాసనముక్తశర ప్రతానముల్, దెపగుపఁ దాఁకి వక్షములఁ ద్రెంచి దొనల్ దెగటార్ప... చంద్రా. ౬. ౧౦౬.

దెప్పము. వి. బాణాదుల కెదుట నిలిపినకృత్రిమ లక్ష్యము, కూటలక్ష్యము; లక్ష్యము.

చ. అలికులవేణి అప్పయిడ శానరపాలుఁడు నూచుచుండె నిశ్చలమతిఁ గాముతూపులకు జానుఁగ నిల్పినదెప్పమో యనన్. షోడ. ౭. ౪౫.

సీ...అయ్యతిపరూప, మచ్చొత్తినట్లు నాయంతరంగంబునఁ బాయ కున్నది మరుబాణములకు. ఆ. దెప్ప మైతి...భోజరా.౭. ౭౦.

దెప్పరము=డెప్పరము. వి. ౧. ఆపద.

క. దెప్పర మప్పురుషాగ్రణి,కెప్పాటను గలుగ నేర దెందును...భా. రా. ఆర. ౨. ౭౧.

క...రామునప్రహతుం డై, దెప్పర మొందిన వాలినిఁ, దప్పక వీక్షించి రచటికిఁగచరు లెల్లక్. భా. రా. కిష్కిం. ౨౬౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. అతిశయము, ఆధిక్యము.

గీ. దినదినంబును గసికాటు చెనకువలన,దప్పి తీఱ నితమకంబు దెప్పరంబుఁ,బాపసమకట్టి జాఱఁ డప్పాలుఁ డసతి, నెత్తుగొనిపోవ నిందందు నెడరు వేచె. పాండు. ౩.౬౨.

౩. విధము, రీతి, ప్రకారము.

వ...ఊఁతలు గ్రమ్మినలీలను పొంగు పాటినచాయను వలలు వేసినపొందికను సుడిగాలి వీచుదెప్పరంబునఁ గొంగలకుఁ దూఱుబైరి డేగలగతిని...ప్రబంధ. ౬౮౮.

౪. దుష్టవచనము.

చ. పరమపతివ్రతన్ సభఁ దపస్వినిఁ బాండవ ధర్మపత్ని ధర్మరత నయోనిజం బ్రకృతి మానవభామినిఁ గాఁ దలంచి దె,ప్పరములు వల్కఁగాఁ దగునె... భార. సభా. ౨. ౨౫౫.

విణ. ౧. అధికము, గొప్పది.

ఉ. దిగ్గన వచ్చె శంకరుఁడు దెప్పర మైనవడిం జెమర్చుచున్. హర. ౧. ౨౧.

క. తెప్పిరి లేచి బిరాలున, ముప్పిరి గొనుకినుక విత్తు మోసులు సూపన్, దెప్పరపుదిటముఁ దాల్చుచు, కప్పెరశివసత్తిపోల్కి ఖానుం డంతన్. రంగా. ౩. ౧౩౧.శుక.౨. ౧౧.

౨. విషమము.

క. దెప్పరపుఁజోట నీ కీ,యొప్పనివిధ మెచట నుండి యొదవెను విను మీ,చొప్పవివేకుల యది యిది, దప్పించును సద్గతియు నుదాత్తయశంబున్. భాగ. భీష్మ. ౧.౧౯౦.

శ్లో. కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితం, అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున. సం. భార. భీష్మ. ౨౬. ౨.

శ...అరులతెఱం, గరయుచు వా రెదురునడచునట్టి దయిన దె,ప్పరపుందెరువున డప్పిం, బొరసినయెడ విడియుచోటఁ బొకుచు టురవగున్. భార. శాం. ౩. ౪. భోజరా.౫. ౯౮.

౩. ఆపత్కరము, కష్టదాయకము.

సీ.ఎదిరివా ఖండించు టిది దెప్పరము సుమ్మి... హర. ౨. ౫౧.

ఉ...ఓరి సం,క్రందన నన్ను నెవ్వనిఁగఁ గాంచితి విప్పుడు విప్రమాత్రుఁగా, దెందమునం దలంచితివొ దెప్పర మప్పని నన్ను విన్న గో,విందధృతాబ్జరో.చిరరవిందభవాదులు దల్లడింపరే. దశా. ౨. ౨౯.

వ...చెవులసంకులు లోవంకభుజంబులు కొంకిసిగలు గావిదుప్పటులు నొప్ప నిమ్ము దెప్పరం బై ముప్పున నప్పురంబు సేరి...ఆము. ౪. ౩౫.

జః దెప్పరించు, దెప్పరిలు, దెప్పటికము.

దెప్పరించు. స. క్రి. (√దెప్పరము.) ఆపదనొందించు, సంహరించు.

చ...చంద్రిణి నేక్రియ వాంఛ దీర నే,పరిణయ మాదు నాకుటిలభావుని నేక్రియ దెప్పరింతు నే,సరణి ఘటించునో శరభసాళువమూర్తి...చెన్న. ౫. ౧౪౨.

దెప్పరిలు(ల్లు) అ. క్రి. (√దెప్పరించు.) కష్టమునొందు, బాధచెందు.

క. అప్పుడు సాందీపని మన,చొప్పరయుచు వచ్చి వానసోఁకునను వలిం,దెప్పరిలుటఁ గని ఖేదం, బుప్పతిలం బలికె...భాగ.౧౦.ఉ. ౧౦౦౩. (తెప్పిటిలుట అపముద్రి.)

శ్లో. ఏతద్విదిత్వా ఉదితే రవౌ సాందీపనిర్గురుః, అన్వేషమాణోనశ్శిష్యా నాచార్యోపశ్యదాతురాన్. సం. భాగ. ౧౦. ౮౦. ౩౯.

దెప్పటికము=డెప్పటికము.వి. (దెప్పరము+టికము.) బాధ, కష్టము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. పఱతెంచి కరి మదము సే, డ్తెఱఁ దొండం
బెత్తి వ్రేయ దెప్పతికనుసఁ, గొఱసంది
దాఁకి నేలకు,నొఱఁగినసింగంపుఁగోదమరెు
ప్పమరంగన్. నిర్వ. ౧౦. ౨౯.

దెప్పిచెప్పు. అ. క్రి. (√దెప్పు.) ఎత్తిపొడుచు, (ఒకఁడు చేసినదుష్కార్యమును) ఉటంకించి పలుకు.

వ...మోమోటము లేక చుల్లరపువాకుల దెప్పి
చెప్పి సరబసఃలన్ చేరువారును ...ప్రబం
ధ. ౭౮౮.

ఇట్లే: దెప్పిపలుకు.

సీ. పాతకం బని దెప్పిపలికె దండధరుండు
దౌరాత్మ్య మనియెను దానవుండు. కాశీ.
౪. ౨౧౫.

దెప్పు=డెప్పు. స. క్రి. ౧. దూఱు, నిందించు, తిట్టు. (ఒకఁడు చేసినకీడును తాను చేసినమేలును ఎదుట చెప్పు అని శ. ర.)

ఆ. వాలుఁగన్నుఁగవయు వలిచన్నుఁగవయు నే,
కాని యొండురూపు గానరాక, యిగురుఁ
బోఁడి యుండె నిఁకఁ జిక్కినయవస్థ,చెప్ప
నేల విధిని దెప్ప నేల. రామా. ౬. ౧౩౬.

వ...మమత నెడిగి పొదువుజలదమాలికాకృతి
కిం బ్రకృతియై యొప్పి విప్పునీలంపులప్పల
దెప్పి తప్పులవట్టు గొప్పనెఱికప్పుఁ గొప్పు
చెదరి గుప్పునం గప్పుకొన... చంద్రా. ౪.
౧౮౯. (ఇట ఔపమ్యవాచకము.)

వ...అమృతంబుపై నాశ మఱలం ద్రిప్పుచు
బెబ్బులులరీతి రొప్పుచు నొండొరులం దె
ప్పుచు...ల. వి. ౨. ౭౩.

౨. చేసిన ఉపకారమును పలుమాఱు చెప్పు; ఎత్తిపొడుచు.

(వ్యవ.) ఒకనికి ఉపకారము చేసి యెన్నఁడు దెప్పరాదు.

(వ్యవ) ఆమె యెంతదెప్పినను అతఁ డొక్క మాటయైన నాడఁడు.

జః దెప్పిచెప్పు, దెప్పుడు.

దెప్పుడు. వి. (√దెప్పు.) దెప్పుట.

(వ్యవ.) ఇఁక నీదెప్పుడులు కట్టిపెట్టుము, నీదెప్పుడు కేమి లెమ్ము.

దెబ్బ. వి. ౧. అడుపు; పెట్టు, వేటు.

క... నే నొక,దెబ్బం బరిమార్తు ధరణి నొబ్బునఁ
గూలన్. దశా. ౨. ౪౨౪.

౨. (క. దెబ్బె.) గాయము, గంటు.

(వ్యవ)ఆతని దెబ్బ ఎన్నికట్టులు కట్టినను ఇంకను మానలేదు.

౩. -దెబ్బవంటిది- నష్టము; కష్టము.

(వ్యవ.) ఆవర్తకమున వానికి దెబ్బ తగిలినది.

(వ్యవ.) ఈసమయమున ఆతనిభార్యపోవుట ఆతనికి పెద్దదెబ్బ.

౪. దెబ్బకొట్టునంతకాలము; అల్పకాలము.

(వ్యవ.) వాఁ డొక్కదెబ్బను పాఠము అప్పగించఁ గలఁడు, ఈపని నే నొకదెబ్బను చేయఁగలను.

సా: దెబ్బకు దయ్యమైన భయపడును, దెబ్బ దేవేంద్రలోకము చూపును.

జః దెబ్బగొను, దెబ్బదీయు, దెప్పపడు, దెబ్బలాడు, దెబ్బాటు.

దెబ్బగొను అ. క్రి. (దెబ్బ+కొను.) కొట్టు, అడఁచు.

క. గబ్బున నెదిరించిన నొక, దెబ్బగొనుచు...
నెదురఁ ద్రిజగముల నొరుల్, తబ్బిబ్బుగ
జంగములకుఁ, బబ్బంబులు వెట్టు ముష్టిపరి
ఘట్టనలన్. శివరా. ౪. ౮౧.

దెబ్బదీయు. స. క్రి. (దెబ్బ+తీయు.) ౧. కొట్టు, అడఁచు; సంహరించు. (ఈయర్థములోనిది ఒకశబ్దపూర్వకముగాఁ గన్పట్టుచున్నది.)

గీ. అందునందున మెకముల నబ్బురముగ, నేసి
యన్నింటి నొకదెబ్బ దీసినార,మైన బలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జంతువుల నెక్కు డైనదొడ్డ,కానఁ గలదొ క్క జాడ రాకలువకేఁడ. ఇందు. ౨.౫౦.

ఉ. గాళకు లాపురీభటశిఖామణులు... బే, తాళుఁడు వచ్చి డగ్గఱిన దబ్బరగా దొక దెబ్బదీయఁగాఁ, జాలుదురు... విజ. వి. ౧. ౧౦. సిం. నార. ౪.

౨. (స్త్రీలను) పొందు, కూడు.

ఉ...ఈ,వారవధూశిఖామణిని పంతులు వేసుక దెబ్బదీయుఁడీ. (తెనాలి రామలింగకవి చాటువు.)

దెబ్బలాడు. అ. క్రి. (దెబ్బలు + ఆడు.) పోరు, యుద్ధముచేయు; కలహించు.

సీ. సరి దెబ్బలాడుచో జాంబవంతుని గ్రుద్దు కోరెక్కలోఁ గుట్లు పోరె నొక్కొ. సిం. నార. ౩౩.

(వ్యవ.) వారింటిలో అత్తకోడం డ్రెప్పుడును దెబ్బలాడుకొను చుందురు.

దెబ్బసలు. వి. బ. ధాన్యవిశేషము.

సీ. నివ్వరుల్ దెబ్బసల్ నీరుకావులు గాజు కప్పెరల్ కురువడాల్ కంటసరులు. హంస. ౪. ౧౨౫.

దెబ్బాటు. వి. బలిష్ఠమైనవాన. (శ.ర.)

దెబ్బు. వి. శీఘ్రము.

సీ. కటినూత్ర మేపాటిగట్టి బాపఁడ యని దెబ్బున మొలత్రాడు డ్రెంచె నొకతె.మృ. వి. ౨. ౭౨.

దెస[1]. వి. (సం. దిశా. ప్రా. దిసా. క. దెసె.)

౧. దిక్కు.

సీ. పణవవీణావేణురణితానుసారమై రసగీత రవ మెల్ల దెసల నెసఁగె. భార. ఆది. ౭. ౧౭౨.

క. తలవెండ్రుక లెగఁగట్టెడు,కొలఁదిని నా నృపకుమారకుఁడు కడిమి మెయిన్,నలుదెసల కరులగండ,స్థలఫలకములన్ లిఖించె జయశాసనముల్. నైష. ౧. ౬౨.

౨. వంక, వైపు, పార్శ్వము.

క. తెరు విమ్మని యటు లడుగుము, సరభసగతి నుదక మిరుదెసలఁ జాయఁ గడున్, బరువునఁ బోవఁగ నయ్యెడుఁ, దరుణీ యరుగు మఱికాలు లడి గాకుండన్. భోజరా. ౩. ౨౩.

సీ. ఉడివోనిమిన్కు లీనెడుపేరు లిరుదెస నిరు దెసఁ గమలబంధురకరంబు. వసు. ౧. ౬.

గీ. ప్రమద మెసలార పాంచాలరాజసుతకు, వలచి చేసితివో సత్యవాక్ప్రతిజ్ఞ, యన్య కాంతలదెసఁ బోవ ననుచు నీవు, భామలకుఁ జేయుసత్యంబు పాడి గాదు.హార.౭.౧౩౦. భార. ఉద్యో. ౪. ౧౯.

౩. గతి, శరణము, ఆశ్రయము.

సీ...మునీంద్ర యేము, గలుగంగ దెస లేని పులుమానిసికిఁబోలె నక్కురువృద్ధు కట్టి చావు, పాటిల్లె...భార. ఆశ్ర. ౨.౧౬౧.

క...పాపకు దెస లేమి నేడ్పు పాటిలెఁ గొడుకా. దశకు. ౨. ౧౧౨.

౪. పక్షము, తెగ.

క. విఱుగుట నొచ్చుట మనదెసఁ, దఱచుగ నాఁడెదవు పాండుతనయులబల మే,త్తెఱ దఱుఁగక పెనఁగుట పలు,మఱుఁ జెప్పెద వకట యేమి మాయయొ తలఁపన్. భార. భీష్మ. ౩. ౩౧. హరి. ఉ. ౧. ౮.

క...ఇది కళ్యాణాభ్యుదయనిధానము మా కని, హృదయంబులఁ దలఁచుచుండి రిరు దెసవారల్.హర. ౬. ౧౦౭.

౫. చోటు, ప్రదేశము.

క. సురదూత మగుడఁ జని...తా, నరిగినదెస కార్యము వి,స్తరముగ నెఱిగించుచున్న తఱి వసరమునన్. కు. సం. ౧౦. ౫౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. అట్టికలధౌతశిఖరిఁ బుష్పాపచయము, సేయు వేడుకఁ బొదరిండ్లచాయలందుఁ, దిరుగుచుం డి యొకానొకదెసఁ దృణంబు, దళముగా వాత మొలచినబిలమునందు. మనుచ. ౪. ౭౮.

౬. సప్తమీవిభక్త్యర్థకము. (దీనికి సందర్భాను సారముగ అందు, మీఁద, విషయము, ఎడ, మొ. అర్థములు వచ్చును.)

చ. అలకలపొల్పు తేఁటిగములందు మదాలస యానలీల హంసలకడ వక్త్రభాతి జలజం బులపైఁ దనుకోమలంబుఁ దీఁగలదెస దృ గ్విలాసము మృగంబులచే నగజాత యిల్ల డల్ గలయఁగఁ బెట్టె...కు.సం.౬.౭౪౮.

ఉ. ఎక్కుడిమాట గొల్లతన మించుక యేనియు లేదు నీదెసన్. భార. విరా. ౧. ౨౮౧.

క. నీదెసఁ గోపింతురె కుల భేదముగాఁ బలు కుటయును బిడ్డలఁ జెఱుపం గా దని కినియు దు...భార. భీష్మ. ౩. ౪౪౨.

క. అభిముఖులై యేలొకొ నా సభ కిప్పుడు రారు నృపతిసత్తము లనఘా, యభిశాప మొ నర్పరుగా, త్రిభువనసంస్తుత్య నాదుదెస నర నాథుల్. నైష. ౩. ౧౨.

క. కొడుకులదెస నెవ్వగఁ జేడ్పడి వందురి యు న్నయానృపాలునడుగులం బడి భీష్మపాటు సెప్పుచు, నడలి కరుణనాద మెసఁగ నాక్రం దించెన్.భార. భీష్మ. ౧. ౪౫.

వ. పార్థుదెసఁ బలుకు పుట్టినన్ క్రోధంబున నూ ర్పులు సందడింపఁ గర్ణుండు... భార. కర్ణ. ౧. ౨౧౪.

తే. ఏలయో పుట్టె నాదెస నిట్టికొఱఁత, దీని సైరింపఁదగు నీకు దివిజవంద్య. హరి. పూ. ౭. ౨౦౧.

౭. పంచమీవిభక్త్యర్థకము.

(వలన)

తే. రాజవర రాజుదెసఁ బ్రతిగ్రహము విష ము. భార.అను.౩. ౨౧౫.

గీ. పాండుపుత్రుల కేను దప్పనిమనంబు,గలుగు దాననయేని గోకమలమిత్ర, కీచకునిదెస న న్నొకకీడు తెరవు, వొరయకుండఁగ రక్షిం పు కరుణతోడ. భార. విరా. ౨. ౧౦౮.

క. నరసఖుఁడ నీవు సఖుఁడును, నరలోకము నన్ జనించి నానాదైతే, శ్వరులదెసఁ బీడ లుడుపుము, ధరణీభారంబు వాయఁ జాల్ప ర్యమునన్. భార. భీష్మ. ౨. ౨౬౮.

౮. దగ్గఱ, సమీపము.

చ. నలినదళాక్షురాజసగుణంబునఁ బుట్టినతమ్మి చూలికిన్,దలవరివాఁడ నై తగినదండనముల్ గడుఁ జేయు నాకు నుజ్జ్వలమహిమాఢ్యులై వెలయువైష్ణవు లెల్ల నజేయులట్టివారలదెసఁ బోకుమీ బ్రదుకు బ్రాణములు న్వలతేని కింకరా. వి. పు. ౪. ౧౧౨.

పంచచామరము.ఇసీ యిసీ మొగంబు నూడ కిల్లు వెల్వరించినన్, వెసన్ విసింగి పోవు సిగ్గు వీసమంతలేదు నీ,దెసం బసల్ ఘటించె దేర త్రిమ్మరీకు త్రిట్లు వచ్చి...పొ మ్మికన్. విప్ర. ౪. ౫౯. జాహ్నవీ. ౩.౮౧.

దెసలదొరలు=దిక్పాలురు.

గీ. జలధి సొఱఁబాఱు హరియును జడధి యగు చు, గట్టు మెట్టును బులితోలుగట్టుదంట, దెసలదొరలకు నిటువంటిదెసలు దొరయఁ గలరె పరు లింక నతనితోఁ గలని కెదుర. దశా. ౧. ౨౩౮.

జః దెసకట్టు, దెసచెడు, దెసమొల.

దెస[2]. వి. (సం. దశా. ప్రా.దసా.) ౧.అవస్థ,స్థితి.

క. కీచకుఁడు ప్రేటువడి తన నీచపుదెస యొరు లెరుంగ నేరక యుండన్, లేచి వెనుకఁ జని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విస్మయు, గోచరుఁడై యసురకతనఁ గుంఱితుఁ
డగుచుఁ. భార. విరా. ౨. ౧౩౦.

గీ. కొసర కాఁబోతు నాఁబోతుఁ గ్రమ్ములాడ,
నడిమి లేఁ బెయ్య దెస వచ్చె నాకు నిపుడు.
కాశీ. ౨. ౧౧౪. (శ.ర. పాఁగతి ముద్రి.)

౨. దురవస్థ, కష్టదశ.

వ. అనుచు ననుజులదెసకుఁ దూర వగచి డగ్గు
త్తికవెట్టి మఱియును...భార. విరా. ౧.
౧౮౨.

క. ఈదుఃఖము సుఖ మయ్యెడు, నాదుఃఖముల
కును నగ్గ మైతిమి విధిచే, నీదుస్స్వప్నము
నెపమున, నీదుర్దశకంటె నింక నేదెస య
గునో. మార్క. ౧. ౨౪౦.

చ. ఇనుదెసఁ జూడ నోడి తల లెత్తక నీటఁ
దదీయబింబముం, గని వగ జక్కవల్ మొగ
మొగంబులు సూచుచుఁ గుంది మూర్ఛ జెం,
దినదెసఁ జూడలేక వనదేవత హా యని కన్ను
మోడ్చెనా, వనరుహముల్ ముడింగె సహ
వాసులదుఃఖము నెయ్యు రోర్తురే. పారి.
౨. ౩౧.

౩. విధము, రీతి.

క. తాదృశమీనంబులు న, న్నే దెస వసియింప
నిచ్చు నిట దిగవిడువం, గా దెసఁ గినకారు
ణ్యము, నాదెస సుంపంగదయ్య నరనాథ
మణీ. దశా. ౧. ౧౨౪.

క. పేదతిక ముదుపునవలా, గాదిలి సైదోడుతో
డఁ గనుఁగొన నెపుడుఁ, మాదిరి యగు
నీనెమ్మొగ, మీదెస సాం పెడలి యుంట
కెటు లోర్వనగుఁ. అచ్చ. రా. యు. ౩౯౫.
రం. రా. అర. ౧౭౬ పా. ౨౬ పం.

జః దెసపడు.

దెసకట్టు. వి. (√దెస[1].) చోరసాధనవిశేషము.

సీ. ములుదోరణముబట్ట మొలత్రాటికుఱువాఁడి
కైదువు దెసకట్టు కావుబొట్టు. వేం. పంచ.
౩. ౧౯౯.

దెసచెడు. అ. క్రి. (√దెస[1].) దిక్కుమాలు.

వ...వరనారాయణు లపారపరాక్రములై యసు
రవీరులఁ బెక్కండ్రం జంపిన నుక్కడంగి
దెసచెడి యసురులు...సముద్రంబు సొచ్చిన
...భార. ఆది. ౨.౭౫.

సీ. దీనులై గరుడులు దెసచెడి పాఱిరి...ఉ.
రా. ౧. ౭౭౫.

దెసపడు. అ. క్రి. (√దెస[3].) దురవస్థ నొందు.

క. వడి నొడిసి పట్టుకొని దెస,పడ నొడలుం దొ
డలు బడలుపడ నొక్కి ముదం, బడర దిగ
మ్రింగి వలసిన,కడ కరిగెఁ...వేం. పంచ.
౩. ౩౪౫

దెసమొల=దిసమొల.వి. (√దెస[1].)వస్త్రశూన్య
మగుమొల. (బ్రా.)

## దే

దేండ్ర=జేండ్ర. వి. తంతువాయభేదము,సాలీ
లలో నొకతెగవాఁడు.

సీ. తంతువాయాభిధ దనరు మగ్గరి యన నేత
కాఁడనఁగను నేఁతరి యనఁ, దోఁచుఁ దద్భేద
ముల్...దేండ్ర యనంగను జేండ్ర యనఁగ.
ఆం. భా. ౨. ౭౭౩.

దేఁకు=డేఁకు. అ. క్రి. పిఱ్ఱలతో జరుగు. (చి.ని,
శ.ర.)

దేగ్ధ. సం. విణ. (ఋ. గ్రీ. ఋ.) పూయువాఁడు.

దేగ్ధవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) పూయఁ
దగినది.

దేదీప్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) మి
క్కిలి ప్రకాశించునది.

దేనము. వి. (సం. ధ్యానమ్.) ధ్యానము.

ఆ. దాన మొసఁగుకన్న దేనంబు మఱి హెచ్చు,
దేన మొసఁగుకన్న దెలివి హెచ్చు, తెలివి
కన్న నాస దెగనేసినది హెచ్చు...వేమన.
౧. ౭౮.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేబె=ద్రాబ.
విణ. (మూర్ఖుఁడు, అధముఁడు.)
సీ. పక్షినీరతివేడ్క పాంచాలునకుఁ గాక దేబైనమండుండు తెలియఁగలఁడె. వేణు.౨౧.
(వికృతము.)
ద్వి...వయసు, దిగిపోయి పల్లికదేబెరూపమున, వగమాలి బ్రతికి యెవ్వరి నుద్ధరింప. ద్వి.శే. సా. ౨. ౬౯ పా. ౨ పం.

దేయము. సం. విణ. (అ. ఆ. అ.) ఇయ్యఁదగినది.

దేరి(రీ)జే. వి. ఒకవిధ మైనగుడారము.
క. ఈరీతి సైన్య మంతయుఁ,జేరిన నొకబయట రాజసింహము భటులన్, దేరిజ వేయం బనిచి గుడారము లెత్తించి యంతటన్ రవి గ్రుంకన్. కువల. ౨. ౭౪.
సీ. రాజుపై నెత్తినప్రత్యూషనృపులోఁపు దళుకొత్తుదేరిజత్రాడు లనఁగ. గీ. నవ్యఖద్యోతకాంతులు నభముఁ బ్రాఁకె. ప్రబంధ.౧౨౪. కృష్ణ. ౩. ౩౧.
మ. చల మొప్పన్ మరుపాదుసాహి జగముల్ సాధింప దండెత్తి మత్తిలి బ్రహ్మాండపుఁగొం పుఁదఘ్నబురుకాదేరీజ లెత్తింప నందలి యస్తాచలపూర్వశైలశిఖరస్తం భాగ్రభాగంబులం, గలమాణిక్యపుబిళ్లలో యనఁ దగెం గంజాప్తచంద్రాకృతుల్. భాను. ౪. ౨౪. (దేరీజు అని ముద్రి.)

దేవ. సం. వి. ఆ. స్త్రీ. ౧. పద్మచారిణి,మెట్టతామరచెట్టు. ౨. అసనపర్ణి. వి. బు. పుం. దేవరుఁడు, మగనిసోదరుఁడు.

దేవబుషి. సం=దేవర్షి.

దేవకన్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. అప్సరస. ౨. దేవతాకన్య.

దేవకర్మము. సం. వి. న్. న. దేవకార్యము.

దేవకార్యము. సం.వి.అ.న. ౧. దేవప్రియ మగు కార్యము. (పూజాది.) ౨. దేవతలు చేయుపని.

దేవకాష్ఠము. సం. వి. అ. న. దేవదారువృక్షము.

దేవకి. సం. వి. ఈ. స్త్రీ. వసుదేవునిభార్య.

దేవకీనందనుఁడు. సం. వి. అ. పుం. కృష్ణుఁడు. (ఇట్లే: దేవకీపుత్త్రుఁడు మొ.)

దేవకీయము. సం. విణ. (అ. ఆ. అ.) దేవసంబంధ మైనది, దివ్యము.

దేవకుండము. సం. వి. అ. న. తనంతటఁ గలిగిన ఊటనీటిపట్టు, దేవఖాతకము.

దేవకుఁడు. సం. విణ. (అ. వికా. అ.) ౧. ప్రకాశించువాఁడు. ౨. జూదమాడువాఁడు; క్రీడించువాఁడు. ౩. దేవతాతుల్యుఁడు. వి. అ. పుం. యదువంశమునందు పుట్టినఒకానొకరాజు, శ్రీకృష్ణునకు మాతామహుఁడు.

దేవకురుంబ. సం. వి. ఆ. స్త్రీ. మహాద్రోణి, పెద్దతుమ్మిచెట్టు.

దేవకులము. సం. వి. అ. న. ౧. దేవవంశము. ౨. దేవసమూహము. ౩. అల్పముఖము కల గుడి, దేవళము.

దేవకుల్య. సం. వి. ఆ. స్త్రీ. గంగానది.

దేవకుసుమము. సం.వి. అ. న.-దేవతలకు ప్రియ మగుకుసుమముకలది-లవంగముచెట్టు.

దేవక్రియ. సం. వి. ఆ. స్త్రీ. (సంగీ.) ఇరువదినాలుగుశ్రీరాగములలో నొకటి.
సీ. దేవక్రియాందోళి దేవగాంధారియు గౌళ గుండక్రి యాహిరి...హంస. ౨. ౧౨౩.

దేవఖాతము. సం. విణ. (అ. ఆ. అ.) దేవతలచే త్రవ్వఁబడినది, మనుష్యకృతము కానిది, అకృత్రిమము. వి. అ. న. ౧. గుహ. ౨. అఖాతము, అకృత్రిమ మైనమడుఁగు. ౩. గుడికి చేరు వైనకొలను, కోనేఱు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేవగంధ. సం. వి. ఆ. స్త్రీ. మహామేదకీ.

దేవగంధర్వుఁడు. సం. వి. అ. పుం. ౧. నారదుఁడు. ౨. దేవసమీపమున గానము సేయు గంధర్వభేదము.

దేవగణిక. సం.వి.ఆ.స్త్రీ. స్వర్వేశ్య, అప్సరస.

దేవగర్భుఁడు. సం. వి. అ. పుం. దేవతలవలన దేవతేతరస్త్రీలగర్భమున పుట్టినవాఁడు, దేవపుత్త్రుఁడు. (మనుష్యాది.)

దేవగాంధారి. సం. వి. ఈ. స్త్రీ. (సంగీ.)రాగిణీభేదము.

సీ...దేవగాంధారియు గౌళ గుండక్రి యాహిరి...హంస. ౫. ౧౨౩.

దేవగాయనుఁడు. సం. వి.అ.పుం.గంధర్వుఁడు.

దేవగిరి. సం. వి. ఇ. పుం. పర్వతభేదము.

దేవగురువు. సం. వి. ఉ. పుం. ౧-దేవతల ఆచార్యుఁడు-బృహస్పతి. ౨-దేవతలతండ్రి-కశ్యపుఁడు.

దేవగుహ్యము. సం. వి. అ. న.-దేవతలకు మాత్రము తెలిసినరహస్యము; ప్రాణులకు వైరాగ్యము కలుగకుండుటకై దేవతలచే దాఁపఁబడినది-మరణము.

దేవగృహము. సం. వి. అ. న. ౧. గుడి. ౨. రాచనగరు.

దేవచర్య. సం. వి.ఆ. స్త్రీ. ౧. దేవకృత మగు కృత్యము. ౨. దేవార్థము చేయఁబడినక్రియ. (హోమాది.)

దేవచికిత్సకులు. సం. వి. అ. పుం. ద్వి. ౧. అశ్వినీపుత్త్రులు, వేల్పువెజ్జులు. ౨. (గణిత.) రెండు అనుసంఖ్య.

దేవచ్ఛందము. సం. వి. అ. పుం. -దేవతలచే ప్రార్థింపఁబడునది- హారభేదము. (వాచ. దీనికి నూఱుపేట లుండు నని అమరము. నూటయెనిమిది పేట లుండు నని వైజయంతి. నూటమూఁడు కాని ఎనుబదియొకటి కాని పేట లుండు నని విశ్వము.)

దేవజగ్ధము. సం. విశే. (అ. ఆ. అ.) దేవతల చేత భక్షింపఁబడినది. వి. అ. న. కత్తృణము, కామంచిగడ్డి.

దేవటుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) శిల్పి.

దేవత. సం. వి. ఆ. స్త్రీ. ౧. దేవత్వము,దేవభావము. ౨. వేలుపు. ౩. (గణిత.) ముప్పదిమూఁడు అనుసంఖ్య. ౪. జ్ఞానేంద్రియము.

దేవతలపుట్టము. మి. వి. పట్టుబట్ట,మడుఁగు దోవతి ?

చ...కాఁగులనీరు మజ్జనం,బున కమరించి దేవతలపుట్ట మొసంగుచు బొడ్డుగిన్నెలో,నును తురు రాగిసంకటిఁ దలోదరు లద్భుతభక్తిఁ జూపుచుకా. శుక. ౨. ౩౩౫.

దేవతరువు. సం. వి. ఉ. పుం. ౧. అశ్వత్థము, రావిచెట్టు. ౨. చైత్యము,రచ్చమ్రాను. ౩. కల్పవృక్షము.

దేవతాగృహము. సం=దేవగృహము.

(ఇట్లే: దేవతాగారము మొ.)

దేవతాళ(డ)ము. సం.వి.అ.పుం. దేవతాడి,డావరడంగిచెట్టు.

దేవతాడి. మి.వి.(సం.దేవతాళః.) దేవతాళము.

సీ. డావరడంగినా దేవతా డన...దేవ. గీ.తాళనామంబు,...ఆం. భా. ౨. ౫౧.

దేవతాడుఁడు. సం. వి. అ. పుం. ౧. అగ్ని. ౨. రాహువు.

దేవతాప్రతిమ. సం. వి. అ. స్త్రీ. దేవతావిగ్రహము, అర్చావిగ్రహము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేవతార్చన. సం. వి. ఆ. స్త్రీ. దేవతార్చనము, దేవతను పూజించుట.

దేవతార్చనము. సం. వి. అ. న.=దేవతార్చన.

దేవతీర్థము. సం. వి. అ. న. ౧. దేవతలపుణ్యస్థలాదికము. ౨. అంగుళ్యగ్రభాగము.

దేవత్యము. సం. విణ. (అ. ఆ. అ.)-సమాసాంతమునందే-దేవతకై యుద్దేశింపఁబడినది.(ఉదా: అగ్నిదేవత్యము.)

దేవదండ. సం. వి. ఆ. స్త్రీ. నాగబల,బీజవిశేషము.

దేవదత్తము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దేవతలచేత నియ్యఁబడినది. (వరాది.) ౨. దేవతలకు అర్పింపఁబడినది. (గ్రామాది.) వి. అ. పుం. ౧. అర్జునునిశంఖము. ౨. ఆవులింతను గలిగించునొకఉపవాయువు. ౩. వాహీకదేశములోని ఒకగ్రామము. (కాశికావృత్తి.)

దేవదత్తుఁడు. సం. వి. అ. పుం. ౧. బుద్ధునితమ్ముఁడు. (త్రి. ని.) ౨. శాస్త్రములలో ఉదాహరణము చెప్పుటకై ఉపయోగించుపదము. (ఉదా: దేవదత్తః పచతి.)

దేవదారి. మి.వి.(సం. దేవదారు. క. దేవదారు.) దేవదారువృక్షము.

గీ. దేవదారి యనం జను దేవదారు. ఆం. భా. ౨. ౪౭.

దేవదారు(వు). సం. వి. ఉ. పుం. న. ఒకానొకవృక్షము, దేవదారివృక్షము.

దేవదాసి. సం. వి. ఈ. స్త్రీ. ౧. దేవతలపరిచారిక. ౨. వేశ్య. ౩. వనబీజపూరకము, అడవిమాదీఫలవృక్షము.

దేవదాసుఁడు సం. వి. అ. పుం. దేవునకు దాసుఁడు, దేవపరిచారకుఁడు.

దేవదీపము. సం. వి. అ. పుం. - ఇంద్రియములలో దీపమువంటిది-౧. కన్ను. ౨. దేవనిమిత్తమగుదీపము.

దేవదుందుభి. సం. వి. ఇ. పుం. ౧. దేవతలధక్కావాద్యము. ౨. ఎఱ్ఱతులసివిశేషము.

దేవదూత. సం. వి. అ. పుం. దేవతలరాయబారి.

దేవదూతి. సం. వి. ఈ. స్త్రీ. వనబీజపూరము, అడవిమాదీఫలవృక్షము. (వాచ.)

దేవదేవుఁడు. సం. వి. అ. పుం - దేవతలకు దేవుఁడు - ౧. బ్రహ్మ. ౨. విష్ణువు. ౩. శివుఁడు.

దేవద్రోణి. సం. వి. ఈ. స్త్రీ. ౧. సేవయాత్ర, దేవతావిగ్రహముల నూరేఁగించుట. ౨. స్వయంభూలింగాదులఅవస్థానగహ్వరము, స్వయంభూలింగాదు లుండుగుహ.

దేవధనము. సం. వి. అ. న. దేవతలకు సమర్పించినధనము.

దేవధాని. సం. వి. ఈ. స్త్రీ. ఇంద్రపురి, అమరావతి.

దేవధాన్యము. సం. వి. అ. న. ధాన్యభేదము.

దేవధూపము. సం. వి. అ. పుం. గుగ్గిలము.

దేవన. సం. వి. ఆ. స్త్రీ. ౧. జూదము. ౨. క్రీడ. ౩. పరిదేవనము, విలాపము. ౪. సేవ, కొలువు.

దేవనది. సం.వి. ఈ.స్త్రీ.౧.గంగ. ౨. పుణ్యనది.

దేవనము. సం. వి. అ. పుం. పాశకము, పాచిక. వి. అ. న. ౧. దీప్తి, జిగి. ౨. క్రీడ. ౩. వ్యవహారము. ౪. జిగీష, గెలువ నిచ్ఛ. ౫. స్తుతి, పొగడిక. ౬. జూదము. ౭. లీలోద్యానము, ఆటతోఁట. ౮. పద్మము, తామరపువ్వు.౯.గతి, పోక. ౧౦. పరిదేవనము, విలాపము.

దేవనలము. సం. వి. అ. పుం. నలతృణభేదము, ఒకజాతికిక్కసకసవువిశేషము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేవనాగరి. సం. వి. ఈ. స్త్రీ. దేవభాషాలిపి.

దేవనాళము. సం. వి. అ. పుం. అడవికిక్కసకసవు కీ. (వాచ.)

దేవనిందకుఁడు. సం. వి. అ. పుం. దేవతాదూషకుఁడు; నాస్తికుఁడు.

దేవనికాయము. సం. వి. అ. పుం. ౧- దేవతలయునికిపట్టు-స్వర్గము. ౨. దేవతాసమూహము.

దేవనిర్మిత. సం. వి. ఆ. స్త్రీ. గుడూచి, తిప్పతీఁగ.

దేవనిర్మితము సం. విశ. (అ. ఆ. అ.) దేవతలచే నిర్మింపఁబడినది; మనుష్యకృతము కానిది, అకృత్రిమము.

దేవపతి. సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు.

దేవపత్ని. సం. వి. ఈ. స్త్రీ. ౧. దేవభార్య. ౨. మధ్వాలుకము, ఒకానొకతియ్యనిదుంప.

దేవపథము. సం. వి. అ. పుం. ౧. ఆకాశమందలిఛాయాపథము. ౨. దేవయానము, అర్చిరాదిమార్గము. ౩. దేవస్థానమునకు పోవుట కైనమార్గము.

దేవపరుఁడు. సం. విశ. (అ.ఆ. అ.) ౧. దేవునే నమ్మి యున్నవాఁడు. ౨. దేవునియందాసక్తుఁడు.

దేవపర్ణము. సం. వి. అ. న. సురపర్ణము, మాచిపత్త్రి కీ.

దేవపశువు. సం. వి. ఉ. పుం. (యజ్ఞాదులయందు) దేవతల కీయఁబడినపశువు.

దేవపురము. సం. వి. అ. న. దేవధాని.

దేవపూజ్యుఁడు. సం. వి. అ. పుం. బృహస్పతి.

దేవప్రతికృతి. సం. వి. ఇ. స్త్రీ. దేవతావిగ్రహము, అర్చావిగ్రహము.

దేవప్రతిమ. సం. దేవతాప్రతిమ.

దేవప్రశ్నము. సం. వి. అ. పుం. ౧. జోస్యము. ౨. దేవతలను గూర్చి శుభాశుభవిషయమై చేయుప్రశ్నము, ఉపశ్రుతి. (సోదె అనికొందఱు.)

దేవప్రియము. సం. విశ. (అ. ఆ. అ.) దేవతలకిష్టమైనది. వి. అ. పుం. ౧. పీతభృంగరాజము, పచ్చగుంటగలగర కీ. ౨. ఒకవృక్షము, ఒకానొకపూలచెట్టు.

దేవబల. సం. వి. ఆ. స్త్రీ. ౧. సహదేవి, పెద్దముత్తవపులగము కీ. ౨. త్రాయమాణ, కలుఁగానుఁగు కీ.

దేవబ్రాహ్మణుఁడు. సం. వి. అ. పుం. దేవలుఁడు, దేవపూజవలన జీవించువాఁడు, పూజారి.

దేవభవనము. సం. వి. అ. న. ౧. స్వర్గము. ౨. దేవాలయము, గుడి. ౩. అశ్వత్థము, రావి కీ.

దేవభూతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. గంగ. ౨. దేవతలయైశ్వర్యము.

దేవభూమి. సం. వి. ఇ. స్త్రీ. ౧. స్వర్గము ౨. దేవతలకు ప్రియమగుభూమి.

దేవభూయము. సం. వి.అ. న. దేవత్వము, దేవసాయుజ్యము, దేవుఁడగుట.

దేవభోజనము. సం. వి.అ.న. అమృతము, వేల్పుబువ్వ. (ఇట్లే: దేవభోజ్యము మొ.)

దేవమణి. సం. వి. ఇ. పుం. కౌస్తుభమణి, విష్ణువక్షమందలిమాణిక్యము. ౨. సూర్యుఁడు. ౩. గుఱ్ఱము మెడయందలిసుడి. ౪. దేవతలలో శ్రేష్ఠుఁడు. ౫. శివుఁడు. ౬. చింతామణి.

దేవమాత. సం.వి.ఋ. స్త్రీ. దేవతలతల్లి-అదితి.

దేవమాతృకము. సం.విశ. (అ. ఆ. అ)-మేఘమే మాతగా కలది-వాననీళ్లచేత పండెడుసస్యము గలదేశము. (వర్షాధారకము. వ్యతి: నదీమాతృకము.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేవమానకము. సం. వి. అ. పుం - దేవతలయందు మానము (గౌరవము) కలది-కౌస్తుభమణి.

దేవమానము. సం. వి. అ. న. దివ్యమానము, దేవతలయొక్క దినాదిపరిమాణము.

దేవమాయ. సం.వి.ఆ.స్త్రీ. ౧. దేవతలమాయ. ౨. (వేదాంత.) అవిద్య.

దేవమార్గము. సం. వి. అ. పుం. ౧. దేవతలు పోవుమార్గము ౨. అర్చిరాదిమార్గము. ౩. గుదము, మూఁడి.

శ్లో. పాణిభిర్నిహతాః కేచిత్ కేచి జ్జానుభిరాహతాః, ప్రకృష్టాశ్చ యథాకామం దేవమార్గం చ దర్శితాః. సం.రామా.సుం. ౬. ౩౬.

దేవమాసము. సం. వి. అ. పుం. గర్భాష్టమమాసము, గర్భము కలిగినదిమొదలు ఎనిమిదవ మాసము (త్రి.ని.) ౨. దేవతామానము ననుసరించినమాసము, మనుష్యమాన ప్రకారము ముప్పదిసంవత్సరములకాలము.

దేవము. సం. వి. అ. పుం. ౧. పాదరసము. ౨. క్రీడ, ఆట. (ఆ. ని.) న. ఇంద్రియము. (మేని-పుం. అని కే. ని.)

దేవముని. సం.వి.ఇ. పుం. దేవర్షి. (నారదాది.)

దేవయజనము. సం. వి. అ. న. ౧. యాగము చేయుస్థానము, వేది. ౨. దేవతల నుద్దేశించి యాగము చేయుట.

దేవయజి. సం. విణ. (ఇ) దేవయాజకుఁడు, దేవత నుద్దేశించి యాగము చేయువాఁడు.

దేవయజ్ఞము. సం. వి. అ. పుం. గృహస్థులు నిత్యము చేయవలసినహోమరూపయజ్ఞము. (ఇది పంచమహాయజ్ఞములలో నొకటి.)

దేవయాజి. సం.విణ. (న్.నీ.న్.) దేవతల నుద్దేశించి యాగము చేయువాఁడు.

దేవయాత్ర. సం. వి. ఆ. స్త్రీ. దేవోత్సవాదులయందు దేవుని ప్రతిమలను స్థానాంతరమునకు తీసికొని వెళ్ళుట ౨. దేవుని దర్శింపఁ బోవుట.

దేవయానము. సం. వి. అ. న. విమానము.పుం. అర్చిరాదిమార్గము.

దేవయాని. సం. వి. ఈ. స్త్రీ. శుక్రాచార్యుని కూఁతురు, యయాతిభార్య.

దేవయుగము. సం.వి.అ. న. ౧. కృతయుగము ౨. నాలుగుమనుష్యయుగములపరిమితి కల కాలము, మనుష్యమానమున 43,20,000 సంవత్సరములకాలము, మహాయుగము. (విష్ణుపు.)

దేవయోని. సం.వి.ఇ. పుం. విద్యాధరాది.

శ్లో. విద్యాధరోప్సరో యక్షరక్షోగంధర్వకిన్నరాః, పిశాచో గుహ్యకస్సిద్ధో భూతోఽమీ దేవయోనయః. (అమరము.)

దేవయోష. సం.వి.ఆ.స్త్రీ. దేవతాస్త్రీ, అప్సరస.

దేవర. వి. (సం.దేవః.ప్రా. దేవో-బ. దేవళ్ళు.)

౧. దేవుఁడు.

వ...శ్రీహరి హరేశ్వర దేవరకు... దా. శా. ౧౦౫౬.

సీ. కన్నులు చల్లఁగాఁ గనుఁగొందు నేను మిమ్మురువుర దేవి దేవరను బోలె. నైష. ౨.౭౬.

గీ. ఇన్ని దేవళ్లఁ గొలిచి నే నేమి గంటిఁ,బోయి పచ్చనిపులుకానిపులుఁగుచేత,మోసపోయితి నని కుందు...శుక. ౩. ౪౯.

౨. ప్రభువు, రాజు.

క. కైవడి మెకములఁ గ్రుమ్మెడి,కైవడి మాయా వచేవ కనఁబోయెదుగా,దేవర మాదేవరవలె, వేవేగమె సామి వేఁట విచ్చేయవయా. సారంగ. ౧. ౭౯.

క. సిరిరాచవేల్పు కడు నీవరితనమున నీటిదాల్పు వలమురిసుడివాల్, దొరవంటిమెప్పు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గలదే,వరజాణ యమీనుఖాన వలపుల కేఁ
డా. యయా. ౨. ౧.

౩. 'నీవు' అనునర్థ మిచ్చును. (ఇది గొప్పవారి యెడ 'నీవు' అనుటకు బదులుగా నుండును. దీనిక్రియ తఱుచు బహువచనమందే కనఁబడుచున్నది.)

ఉ. దేవర పంపఁగాఁ జని యుధిష్ఠిరునిం గని వచ్చినాఁడ నా,భూవిభుఁ డప్రమేయగుణ పూజ్యుఁడు మీకు నమస్కరించె...భార. ఉద్యో. ౨. ౩.

మ. మొదలం దేవర యానతిచ్చితిర యేముం జిత్తమం దెంతుము...హర. ౨. ౧౩౧.

గీ... దేవరానతి దప్పకున్నఁ,జాలు...ఆము.౪. ౬౪.

విణ. శ్రేష్ఠుఁడు. (ఇది పురుషులవిషయమున నే ప్రయుక్తము.)

ఉ. రాజశశాంకశేఖరుఁడు రాజకిరీటవతంస మ ష్టది,గ్రాజమనోభయంకరుఁడు రాజులదేవర రాజరాజు...కాశీ. ౧. ౪౨.

గీ. పతితు లారాధ్యదేవళ్లై ప్రాప్యు లనుచు,ను పనిషత్తులు వారిచే నుబ్బి వినుచు. ఆము.౪. ౪౩. (ఆరాధ్యదేవళ్లు. మిశ్రసమాసము.)

దేవరవారు(రలు)=దేవర.

ఉ. దేవరవారు మున్ను వసుదేవకుమారకభక్త వృత్తముల్, పావనసూక్తులం దెలియఁ బల్కితిరి...కులశేఖరమహీపాలచరిత్రము. చి.ని)

ఉ. నా విని హావభావపరిణామవిదుండు విశారదుం డనుక్, దేవరవార లిందు నరుదే శకునములు మంచి వయ్యె వే,రావలె శోభనోత్సవపరంపరలు...విజ. వి. ౧. ౧౪౦.

జః దేవరమిద్దె, దేవళ్లగుడి, దేవళ్లపెట్టె.

**దేవరథము.** సం. వి. అ. పుం. విమానము.

**దేవరమిద్దె.** వి. (దేవర + మిద్దె) దేవతాగృహము, దేవునిగది.

సీ. నిండుసున్నపుఁబూఁత నెఱచాఁదుబోదెలు దిద్దినదేవరమిద్దె తనర. హంస. ౧. ౧౫౧.

**దేవరహస్యము.** సం.విణ.(అ.ఆ.అ.)-దేవతలకు కూడరహస్య మైనది-అతిగోప్యము.

**దేవరాజు.** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

**దేవరాట్టు.** సం. వి. జ్. పుం. దేవరాజు.

**దేవరాతుఁడు.** సం.వి. అ.పుం. - దేవునిచే రక్షింపఁబడినవాఁడు- ౧. పరిక్షితుఁడు. (అర్జుననిమనుమఁడు, అభిమన్యునిపుత్త్రుఁడు.) ౨. విశ్వామిత్త్రునిచే రక్షింపఁబడినశునశ్శేపునిరెండవపేరు.

**దేవరాయఁడు.** మి. వి. (సం. దేవరాజః) ఉత్తమదేవుఁడు.

ద్వి. దేవరాయఁడు రమాదేవితో భక్త,సేవితుండై...ద్వి. పరమ. ౧. ౩౬. పా. (ఇట వరదరాజస్వామి అని భావము.)

**దేవరుఁడు.** సం. వి. అ. పుం. మగనితోఁబుట్టినవాఁడు.

**దేవర్షి.** సం=దేవఋషి.

**దేవలకుఁడు.** సం=దేవలుఁడు.

**దేవలత.** సం. వి. ఆ. స్త్రీ. నవమల్లిక,విరజాజి.

**దేవలాంగులిక.** సం. వి. ఆ. స్త్రీ. వృశ్చికాలిక, తేలుకొండిచెట్టు. (వాచ.)

**దేవలింగము.** సం. వి. అ. న. ౧. దేవతాప్రతిమ. ౨. దేవతాచిహ్నము. (విల్యమ్సు.)

**దేవలుఁడు.** సం. వి. అ. పుం. ౧. దేవార్చనమువలన జీవించువాఁడు, పూజారి. ౨. దేవతాప్రతిమలను గ్రహించి ఇంటింట బిచ్చమెత్తుకొనెడి యొకజాతి. (జీవికార్థేచాపణ్యే నూత్ర తత్త్వబోధిని.) ౩. ధార్మికుఁడు. ౪. నారదుఁడు. ౫. దేవరుఁడు, మగనితోఁ బుట్టినవాఁడు. ౬. ఒకానొకధర్మశాస్త్రకర్త.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేవలోకము. సం. వి. అ. పుం. స్వర్గము.

దేవళము. వి. (సం. దేవాలయః. ప్రా. దేవలం.) కోవెల, గుడి.

క. కాలేయక మి ట్లనియెను, గాలాంజన మనెడి గిరినిఁ గలదేవళముం, బాలింప నితనిఁ బనుపుము, చాలు నదియె దండ మనిన జనపతి నగుచున్. ఉ. రా. ౭. ౨౧.

చ. బలమునఁ గాకినాడశలపాకమహీస్థలరాజ్యభారని,శ్చలుఁ డయి దేవళంబులును సద్వనము ల్నిరతాన్నసత్త్రముల్, జలవిలసత్తటాకములు సత్కృతిముఖ్యసమస్తకర్మముల్, పొలుపుగ నాచరించెఁ బరిపూర్ణుఁడు సండురి తిమ్మఁ డన్నిటన్. జాహ్నవీ. ౧. ౬౨.

(ఈపదము శాసనములందు దేవుళము అనురూపముతోఁ గానవచ్చుచున్నది.)

వ...గుంటూరితెలువు పడమటను క్షేత్రం ఖ౧ వీరేశ్వరునిదేవుళం సేసినకాశవారు...కా. శా. ౪. ౭౦౨.

వ...గాన యిధర్మము తెలుంగురాయలదేవుళం గలకాలం సాగి...శ్రీ. శా. ౪.౯౨౨.

దేవళ్ల(ర)గుడి. వి. (√దేవర.) దేవాలయము.

సీ. నీవు గల్గుటకుఁ గా దేవళ్లగుళ్లఁ బ్రాణాచారవిధు లెల్ల నలవరించి. ప్రబంధ. ౬౪౫.

సీ. ఇరవులు రోసి దేవరగుళ్లు వెమకి యుప్పరిగలు వెదకి చప్పరములరసి.అచ్చ.రా.సుం. ౮.

దేవళ్లపెట్టె. వి. (√దేవర.) దేవతార్చనపుఁబెట్టె. దేవవిగ్రహము లుంచుపెట్టె.

సీ. నట్టింట దేవళ్లపెట్టెఁ బెట్టినతిన్నెఁ గొట్టించి వేసెఁ బందిగూఁడు సేసె. శుక. ౩. ౫౦.

దేవవక్త్రము. సం. వి. అ. న. ౧. దేవతలముఖము. ౨-దేవతలకు ముఖమువంటివాఁడు-అగ్ని.

దేవవర్ధకి. సం. వి. ఇ. పుం. దేవతలవండ్రంగి, విశ్వకర్మ.

దేవవర్త్మము. సం. వి. న్. న. ౧. దేవతల మార్గము. ౨. ఆకాశము.

దేవవల్లభము. సం. వి. అ. పుం. సురపున్నాగము,సురపొన్న*.

దేవవాణి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆకాశవాణి, ఆకాశాదులనుండి వినఁబడుదేవతలవాక్కు. ౨. సంస్కృతభాష.

దేవవాహనుఁడు. సం. వి. అ. పుం. -దేవతలకు హవిస్సును దీసికొని పోవువాఁడు- అగ్ని.

దేవవృక్షము. సం. వి. అ. పుం. ౧. దేవతల చెట్టు, కల్పవృక్షము. ౨. గుగ్గిలపుఁజెట్టు. ౩. ఏడాకులఅరఁటి*.

దేవవ్రతము. సం. వి. అ. న. ౧. దేవత్వము పొందుటకై చేయువ్రతము. ౨. దేవతల కిష్టమగువ్రతము. ౩. దేవతలఆహారము.

దేవవ్రతుఁడు. సం. వి. అ. పుం. - ఇంద్రియనిగ్రహమే వ్రతముగాఁ గలవాఁడు - భీష్ముఁడు.

దేవశిల్పి. సం. వి. న్. పుం. విశ్వకర్మ.

దేవశుని. సం.వి.ఈ. స్త్రీ.దేవప్రభావము గలశునకమాత,సరమ.

దేవశేఖరము. సం. వి. అ. పుం. న. ౧. -ప్రకాశించుఅగ్రభాగము కలది. - దమనకము, దవనము*. ౨. దేవతల శిరోభూషణము. (వాచ.)

దేవశ్రుతము. సం.వి.అ.పుం. శాస్త్రము.(వాచ.)

దేవశ్రుతుఁడు. సం. వి. అ. పుం. ౧. - దేవతలలోఁ బ్రసిద్ధుఁడైనవాఁడు - ఈశ్వరుఁడు. ౨. నారదుఁడు. ౩. జైనులలో నొకఁడు. (వాచ.)

దేవశ్రేణి. సం. వి. ఈ. స్త్రీ. ౧. మూర్వ, చాఁగ*. ౨. దేవతలపంక్తి.

దేవసభ. సం.వి. ఆ. స్త్రీ. ౧. సుధర్మ, దేవతల సభ. ౨. రాజసభ. ౩. జూదమాడెడుచోటు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేవసభ్యుఁడు. సం.విశే.(అ. ఆ.అ)-౧. క్రీడార్థ మగుసభకు వచ్చినసభికుఁడు-జూదరి.౨. దేవసభలో నున్నవాఁడు. (వాచ.)

దేవసర్షపము. సం. వి. అ. పుం. ఎఱ్ఱనివేళ్లును చిన్నయాకులును గలసర్షపవృక్షవిశేషము, ఒక జాతి ఆవాలు.

దేవసహా. సం. వి. ఆ. స్త్రీ. సహదేవి,పెద్దము త్తవపులగము చెట్టు.

దేవసాయుజ్యము. సం. వి. అ. న. దేవభావము, దేవుఁడగుట.

దేవసృష్టా. సం. వి. ఆ. స్త్రీ. మదిర,మద్యము.

దేవసేన. సం. వి. ఆ. స్త్రీ. ౧. దేవతలదండు. ౨. కుమారస్వామిభార్య.

దేవస్వము. సం. వి. అ. న. ౧. దేవధనము,దేవతలసొమ్ము. ౨. దేవతల కర్పించినసొమ్ము. ౩. యజ్ఞము చేయువారిధనము. (వాచ.)

దేవహూతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. దేవతలను పిలుచుట. ౨. కర్దమప్రజాపతిభార్య. (స్వాయంభువమనువుకూఁతురు, కపిలమహర్షి తల్లి.)

దేవాంగన. సం. వి. ఆ. స్త్రీ. ౧. అప్సరస, అచ్చర. ౨. దేవతాస్త్రీ.

దేవాంగి. వి. (చి. ని, బ్రౌ. సం. వి. న్. పుం. బ అని శ. ర) ౧. జేంద్రవాఁడు. బట్టలు నేసి జీవించు నొకజాతివాఁడు. ౨. ఒకజాతికోఁతి. (బ్రౌ)

దేవాజీవి. సం. వి. న్. పుం - దేవార్చనమువలన జీవించువాఁడు-దేవలుఁడు, పూజారి.

దేవాజీవుఁడు. సం. వి. అ. పుం = దేవాజీవి.

దేవాటము. సం. వి. అ. పుం. - దేవతలు సంచరించుస్థలము. - హరిహరక్షేత్రము. (పాటలిపుత్రమునకు త్తరదిక్కున గంగాద్వారమునసున్న దివ్యక్షేత్రము.)

దేవాత్మము. సం. వి. న్. పుం. ౧. దివ్యాత్మ, పరమాత్మ. ౨. అశ్వత్థము, రావి చెట్టు.

దేవాత్ముఁడు. సం. విశే.(న్.ఆ,న్.న్.) ౧. దేవస్వభావము కలవాఁడు. ౨. దివ్యస్వరూపము కలవాఁడు.

దేవాధిపుఁడు. సం. వి. అ. పుం. ౧. ఇంద్రుఁడు. ౨. దేవోత్తముఁడు, దేవశ్రేష్ఠుఁడు.

దేవానాంప్రియము. సం. వి. అ. పుం. మేఁక. (త్రి. ని.)

దేవానాంప్రియుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) (దేవులకు-క్రీడాసక్తులకు-ప్రియుఁడు; యాగములయందు దేవతలకు ప్రియ మగుపశువువంటి వాఁడు; బ్రహ్మజ్ఞానరహితుఁ డయి యాగము చేసి దేవతలకుఁ బ్రియము చేయువాఁడు.)మూర్ఖుఁడు.
క. ఈవిధి నభీష్టసిద్ధికి, దైవతకవినుతి యొనర్చి తప్పొప్పు మదిఁ, భావించి దిద్దకుండఁగ, దేవానాంప్రియుల మ్రొక్కి తెలుతుఁ గుకవులఁ. రాఘవ. ౧. ౫.

దేవాన్నము. సం. వి. అ. న. ౧. అమృతము, వేల్పుబువ్వ. ౨. దేవతావిగ్రహమునకు నివేదనము చేసినయన్నము.

దేవాభీష్టా. సం. వి. ఆ. స్త్రీ. తాంబూలి,తమలపాకుతీఁగచెట్టు.

దేవాయతనము. సం. వి. అ. న. గుడి,దేవళము.

దేవాయుధము. సం. వి. అ. న. ౧. దేవతల ఆయుధము.౨. ఇంద్రధనుస్సు.

దేవార్చన(ము) సం. వి. ఆ. స్త్రీ. దేవతాపూజనము.

దేవాలయము. సం. వి. అ. పుం. ౧. స్వర్గము. ౨. గుడి,దేవళము.

దేవావాసము. సం. వి. అ. పుం. ౧. స్వర్గము. ౨. గుడి,౩. అశ్వత్థము చెట్టు. ౪. మేరుపర్వతము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**దేవి.** సం. విణ. (న్. నీ. న్.) ౧. ప్రకాశించువాఁడు. ౨. జూదమాడువాఁడు; క్రీడించువాఁడు. వి. ఈ. స్త్రీ. ౧. దేవతాస్త్రీ, ౨. దేవపత్ని. ౩. పార్వతి. ౪. సరస్వతి. ౫. (నాట్య) రాజుపట్టపురాణి, పట్టాభిషిక్తయగుభార్య. ౬. చటక, ఆఁడుఊరఁబిచ్చుక. ౭. మూర్వ, చాఁగ ⚘. ౮. పిక్క, స్పృక్క. ౯. పూజ్యస్త్రీలనామాంతమునఁ జేర్చుపదము. (ఉదా: సీతాదేవి మొ.) ౧౦. చిఱుబొద్ది, పాఠ ⚘. ౧౧. భూతుంబి, నేలానఁగు ⚘. ౧౨. ప్రొద్దుతిరుగుడు ⚘. ౧౩. లింగిని ⚘. ౧౪. వంధ్యాకర్కోటకి, గొడ్డుకాఁకర ⚘. ౧౫. సాలపర్ణి, ముయ్యాకుపొన్న ⚘. ౧౬. మహాద్రోణి, పెద్దతుమ్మి ⚘. ౧౭. నాఁగముస్త ⚘. ౧౮. మృగేర్వారుక, పెద్దపాఁపర ⚘. ౧౯. హరీతకి, కరక ⚘. ౨౦. అతసి, అగిసె ⚘. ౨౧. సంక్రాంతి, సూర్యుఁడు మేషాదులయందు ప్రవేశించుట.

**దేవిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఒకానొకనది. ౨. ఉమ్మెత్త ⚘.

**దేవిత.** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ౧. ప్రకాశించువాఁడు. ౨. జూద మాడువాఁడు; క్రీడించువాఁడు.

**దేవిలి.** వి. (సం. దేవలకః.) దేవలకుఁడు, పూజారి. వ... శ్రీభీమేశ్వరమహాదేవరగుడి యఖణ్డవర్త్తిదివియలు... డాకరేమిదొణ్డవ అయ్నవణ్డిననేలకు పుట్టి ౧ ణ్టికిచి ౫ దేవిలి ౧ ణ్టికిచి ౫ కొఱ్ఱ ఆరువువరువుపుట్టి ౧ ణ్టికిచి ౬... దా. శా. ౧౩౭౪.

**దేవీగృహము.** సం. వి. అ. న. ౧. అమ్మవారిగుడి. ౨. రాణినగరు, అంతఃపురము.

**దేవు.** స. క్రి. ౧. నీళ్లు పాలు మొదలగువానిలోనుండి తడవి తీయు; తడవు; కలఁచు.

శా. ఆరం గాఁగినపాలమీఁగడల హస్తాబ్జంబులం దేవి లీలారమ్యంబుగఁ దోడిబాలురకు నెల్లం బెట్టి తానుం గొనున్. హరి. పూ. ౫. ౨౦౪.

క. దేవా యీకసుమాలము, దేవెదు కేల్దోయి నీదుదేహం బంటం, గా వెఱ పయ్యెడు... కాళ. ౩. ౯౭.

ద్వి. తడయక పదపదార్థంబులు దేవి, కొని వచ్చి జంగమకోటికి వరవుఁ, బను లాచరించుచు ...బస. పు. ౫. ౩౪౫ పం.

(వ్యవ.) నాకేలనోకడుపులో దేవుచున్నట్లున్నది.

౨. సంగ్రహించు, దొంగిలించు.

ద్వి. ఎల్లయర్థము దేవి యిహపరంబులకు, దూరమైనట్టిలుబ్ధులయిండ్లు సొచ్చి. బస. పు. ౫. ౩౯౨ పం. (ప్రాఁతప్రతి పా. 'తెచ్చు' క్రొత్తప్రతి పా.) ౩. వెదకు.

సీ. మందసంబులు దేవి మాడఁవు ల్వాడఁగని కొత్తడంబులు చూచి...అచ్చ. రా. సుం. ౮.

**దేవుఁడు.** సం. వి. అ. పుం. ౧.- ప్రకాశించువాఁడు- దేవత, వేల్పు. (ఈయర్థమున బహువచనము లేదు) ౨. వర్షాధిదేవత, ఇంద్రుఁడు; మేఘుఁడు. ౩. బ్రాహ్మణులయుపాధిభేదము. (గోవిందదేవుఁడు, పురుషోత్తమదేవుఁడు, మొ.) ౪. (నాట్య) రాజు. (యదాజ్ఞాపయతిదేవః - శాకుం.) ౫. పరమాత్మ. ౬. క్రీడాసక్తి కలమనుజుఁడు.

**దేవురించు.** అ. క్రి. (√దేవుర.) దైన్యపడు, దీనత్వమునొందు.

సీ. దేవురించుచు వాజదేఱెడు మొగమును బడఁబాఱుచుండెడుబడుగుటొడలు. హరిశ్చ. ౪. ౧౦౩.

**దేవురింపు.** వి. (√దేవురించు.) ౧. దేవురించుట, దీనుఁడగుట. ౨. పరిదేవనము, విలపించుట.

సీ... దేవురింపనఁగను దేవు రనఁగఁ. గీ. బరఁగుఁ బరిదేవనము... ఆం. భా. ౧. ౧౧౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేవురు. వి. దైన్యము.

క. ఈవఱదనుకను రోఁతల, దేవుళ్లం బడితి... వేం. పంచ. ౪.౩౯౫. ఆం.భా. ౧.౧౧౬.

జ. దేవురించు, దేవురింపు, దేవురుగొట్టు, దేవుళ్లాడు.

దేవురుగొట్టు. విణ. (√దేవురు.) దేబె,దీనుఁడు. (శ. ర.)

దేవుళ్లాడు. అ. క్రి. (దేవుళ్ళు+ఆడు.) ౧.చింతించు, విచారించు.

(వ్యవ.) వాఁడు డబ్బు పోవుటచే దేవుళ్లాడుచున్నాఁడు.

౨. కాలము గడపు.

(వ్యవ.) అతఁడు ఆకొలఁదిజీతముతో నెట్లో దేవుళ్లాడుచున్నాఁడు.

దేవెరి=దేవేరి.

రగడ... సౌరుల,తిట్ట యగుచాళ్వేరినాడెపు దేవెరిం గొని... అచ్చ. రా. యు. ౬౪. (శ. ర. పా. తెలివఁగైకొని ముద్రి.)

దేవేంద్రుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

దేవేజ్యుఁడు. సం. వి. అ. పుం. దేవపూజ్యుఁడు, బృహస్పతి.

దేవేట్టు. సం.విణ.(జ్)దేవతలనుపూజించువాఁడు

దేవేరి=దేవెరి. వి. మహిషి, రాజుభార్య; భార్య.

గీ. మహిషి దేవేరి యనఁగను మనును... ఆం. భా. ౨. ౧౦౫.

సీ.వీరె సప్తర్షులు వారె యశ్విన్యాదు లిరువాడ దేవేరు లిందుభార్యలు... హర.౭.౧౧౩.

క. దేవేరి వైతి వా వసు,ధావల్లభమణికిఁ గేళితత్పరమతివై.శుక.౨.౪౬.చం.రా.౫. ౨.

క. ఆవిభు ననంతరంబ ధ,రావలయముఁ దాల్చెఁ గృష్ణరాయఁడు చిన్నా,దేవియు శుభమతి తిరుమల,దేవియునుం దనకుఁ గూర్చు దేవేరులు గాఁ. మనుచ. ౧. ౩౩.

శా...కావేరి దేవేరిగా, నంగీకార మొనర్చు నే ...ఆరత్నాకరేంద్రుఁడు నీ,యంగం బంటి సుఖించు నేని గుణభద్రా తుంగభద్రానదీ. పాండు. ౧. ౧౩౯.

దేవేరిపట్టము=మహిషీత్వము,పట్టపురాణితనము.

గీ. ఇట్టిభాగ్యంబునకుఁ దలకట్టు గాఁగ, రాక్షసేంద్ర శుభస్య శీఘ్రం బనంగఁ, గట్టు దేవేరిపట్ట మాకమలవదన, కంచు నెగఁబోసి నారదుం డరుగుటయును. వరాహ. ౧౧.౫౪.

చందమామదేవేరి=తారక, నక్షత్రము.

క. చెఱఁబట్టెను దశముఖుఁ డే,ద్దెఱ నిచ్చటఁ చందమామదేవేరుల నం,దఱ ననఁ గను మిగ్గిరి తన, చఱులఁ దగుల్పడినచుక్కఁ జాలునఁ బొల్చెక్. రామా. ౭. ౧౪౪.

దేవేశి. సం.వి.ఈ. స్త్రీ. పరమేశ్వరి.

దేవేశుఁడు. సం. వి. అ. పుం. దేతలకు ప్రభువు; పరమేశ్వరుఁడు.

దేవేష్ట. సం.వి.ఆ. స్త్రీ.౧.మహామేదకు.(వాచ.)

దేవేష్టము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దేవతలకుఁ బ్రియ మయినది. వి. అ. పుం. గుగ్గిలముకు. అ. న. దేవతలయిచ్చ.

దేవోద్యానము. సం.వి.అ.న. ౧. నందనవనము. ౨. దేవునితోఁట.

దేశకాలజ్ఞుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దేశమును కాలమును దెలిసినవాఁడు.

దేశకుఁడు. సం. విణ.(అ.ఇకా.అ.)౧. శాసించువాఁడు, ఆజ్ఞాపించువాఁడు. ౨. ఉపదేష్ట, ఉపదేశించువాఁడు.

దేశజము. సం. విణ. (అ. ఆ. అ.) దేశమునఁ బుట్టినది, విదేశీయము కానిది.

దేశధర్మము. సం. వి.అ.పుం.దేశమందలిధర్మము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేశభాష. సం. వి. ఆ. స్త్రీ. దేశమున వాడఁబడు భాష.

దేశము. సం. వి. అ. పుం. ౧. ప్రదేశము, చోటు. ౨. అనేకపట్టనములు గలభూభాగము, విలాతి.

(దేశములు ౫౬:—అంగము, వంగము, కళింగము, కర్ణాటము, కేరళము, కామరూపము, గౌడము, వనవాసము, కుంతలము, కొంకణము, మగధము, సురాష్ట్రము, మాళవము, లాటము, భోటము, వరాటము, శబరము, కుకురము, కురువు, అవంతి, పాండ్యము, మద్రము, సింహళము, ఘూర్జరము, పారశికము, మిథిలము, పాంచాలము, శూరసేని, గాంధారము, బాహ్లికము, హైహయము, తౌళవము, సాల్వము, పుండ్రకము, ప్రాగ్జ్యోతిషము, మత్స్యము, చేది, బర్బరము, నేపాళము, గౌళము, కాశ్మీరము, కన్యాకుబ్జము, విదర్భము, ఖురసాణము, మహారాష్ట్రము, కోసలము, కేకయము, అహిచ్ఛత్త్రము, త్రిలింగము, ప్రయాగము, కరహాటకము, కాంభోజము, భోజము, చోళము, హూణము, కాశి-దేశములు మఱియు అనేకములు కలవు. అందు ఇవి ముఖ్యములు అని శ.ర.) ౩. ఏఁబదియాఱు అనుసంఖ్య ౪. భాగము, ఏకదేశము.

దేశరూపము. సం. వి. అ. న. ౧. న్యాయము, సమంజసము. ౨. ప్రశస్తదేశము.

దేశాంతరము. సం. వి. అ. న. ౧. అన్యదేశము, మఱియొకదేశము. ౨. మఱియొకప్రదేశము. (భావ. వేఱుగాఁ గలదిగాని పర్వతముచేతనో మహానదిచేతనో వేఱుపఱుపఁబడినదిగాని యగు దేశము దేశాంతరము అని మనువు.)

దేశాంతరి. సం. విణ. (న్. ణీ. న్.) పరదేశపువాఁడు.

దేశి. సం. విణ. (న్. నీ. న్.) ౧. దేశకుఁడు ౨. దేశము కలవాఁడు, వి. ఈ. స్త్రీ. ౧. సంగీతవిశేషము; ఆయాదేశజనులకు హృదయరంజకముగా నుండుప్రత్యేకసంగీతము. (సంగీతములో వేఱొకభేదము మార్గము.)

శ్లో. తతద్దేశస్థయా రీత్యా యత్స్యాల్లోకానురంజనం, దేశేదేశే తు సంగీతం తద్దేశీత్యభిధీయతే. (కల్ప.)

ద్వి. లాలితశుద్ధసాళగములు బెరయఁ, గ్రాలుచు దేశిమార్గంబులు వెలయ. బస. పు. ౩. ౯౩ పం. హర. ౨. ౧౧౧.

౨. ఇరువదినాల్గుస్త్రీరాగములలో నొకటి.

సీ... దేశాక్షి ఘూర్జరి దేశి తోడి. గీ. వెలయు నారాయణియుఁ జతుర్వింశతివిధ, ములను దనరారుస్త్రీరాగములును మఱియు. హంస. ౫. ౧౨౩.

౩. దేశభాషాకవిత్వము.

క. మార్గకుమార్గము దేశియ, మార్గము వదలంగఁ దవకు మది వదలక దు, ర్మార్గపదవర్తు లనఁ దగు, మార్గవులం దలఁప నలఁతి మహి సుకవులకున్. కు. సం. ౧. ౨౫.

క. మును మార్గకవిత లోకం, బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం, గు నిలిపి... కు. సం. ౧. ౨౩.

౪. నాట్యవిశేషము.

ఉ. దేశివిధంబురట్టణము దివ్యకలాసియు... లేకయున్... నాట్యకలనం బ్రకటించెను హావభావముల్. శ్రీరం. మా. ౪.౧౬౨.

సీ. శివుఁ డొక్కనాఁడు దేశికి మెచ్చి నాకిచ్చెఁ బెద్దవజ్రపుఁగుచ్చు బిరుదుతవిణ. వా౯ర్మీ. ౩. ౩౬.

౫. తెనుఁగుదేశమున వాడఁబడునొకభాష.

గీ. వెలఁది చిగు రెల్లి నేనలి వేనవేలు, నాఁగఁ జనుశబ్దములు దేశినామకములు; వీనఁ జెప్పి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నకవితల వినుచు మెచ్చు. కావ్య. ౯.౧౭.

చ. తెనుఁగునఁ దేటగాఁ గథలు దెల్పినఁ గావ్యము పొందు లేదు మె, త్తనపస చాల దండ్రు విశదంబుగ సంస్కృతశబ్ద మూఁదఁ జెప్పిన నవి దర్భముం డ్లనుచుఁ బెట్టరు వీనులఁ గావునన్ రుచుల్, దనరఁ దెనుంగు దేశియును దద్భవమున్ గలయంగఁ జెప్పెదన్. ద్వా. ౧. ౩౨. (తెనుంగుదేశి = దేశి తెనుఁగుఅని భావము.)

దేశికారు. సం. వి.ఉ.పుం.ఒకానొకస్వరస్థాయి.

ద్వి. గాథంబు లలిరాగకారును బొచ్చ,గాథంబు మఱిదేశికారును సింధు,నలిఁగరు రాకారునఖ కర్తరియును.బస.పు.౩.౯౦ పా.౯౪౦ పం.

దేశికుఁడు. సం. వి. అ. పుం. ౧. గురువు. ౨. పథికుఁడు, బాటసారి.

దేశిని. సం. వి. ఈ. స్త్రీ. తర్జని, చూపుడువ్రేలు.

దేశీయము సం. విణ. (అ. ఆ.అ.) -దేశభవము- ౧.దేశమునఁ బుట్టినది, దేశమం దైనది. ౨.(ఒకానొక తద్ధిత ప్రత్యయము. ఇంచుక తక్కువయైనది అనునర్థము కలది. ఉదా: అష్టాదశవర్ష దేశీయుఁడు=కొంచెము తక్కువగా పదునెనిమిదిసంవత్సరములవయసువాఁడు - పటుదేశీయుఁడు=కొంచెము తక్కువగా సమర్థుఁడు.)

దేశీయవరాడి(ళి). సం. వి. ఈ. స్త్రీ. (సంగీ) రాగిణీభేదము. (వాచ.)

దేశ్యము సం. విణ. (అ. ఆ. అ.) -దేశభవము- ౧. దేశమునఁ బుట్టినది, దేశమునం దున్నది.౨.దేశమునకుఁ దగినది. ౩. ఉపదేశింపఁ దగినది. ౪. (ఒకానొక తద్ధితప్రత్యయము. కొంచెముతక్కువయైనది అనునర్థము కలది. ఉదా: అష్టవర్షదేశ్యుఁడు=కొంచెము తక్కువగా ఎనిమిదిసంవత్సరములవయసువాఁడు- విద్వద్దేశ్యుఁడు=కొంచెము తక్కువగా విద్వాంసుఁడు.)

వి. అ. న. (వాదమున) పూర్వపక్షము.(వాచ.)

దేష్ణువు. సం. విణ. (ఉ.) ౧. దాత, ఇచ్చువాఁడు. ౨. శుద్ధిచేయువాఁడు. ౩. దుర్గమము, లొంగనిది. (ఆ. ని.) వి. అ. పుం. - వస్త్రాదులు శుద్ధిచేయువాఁడు - చాకలి. (విల్యమ్సు.)

దేసము. వి. (సం. ద్వేషః.) వైరము, పగ.

గీ. నూడు పగ దేస మనఁగఁ బొల్చును విరోధ,నామములు... సాం.ని. మాన. ౩౧.

దేసి. విణ. మనోహరము, అందమైనది.

సీ. అనులేపనములు మండనములు లేకయు భాసురాంగము లింతదేసి యగునె. కు. సం. ౬. ౭౦౯.

ఉ. వాసనగా శివాగమము వర్ణన కెక్కఁ ద్రయీసదర్థముల్, దేసిగ నాత్తశిష్యులకుఁ దెల్పుచు... కు. సం. ౮. ౧౬.

ద్వి. ప్రాస మైనను యతిపై వడి యైన, దేసిగా నిలిపి యాదిప్రాసనియతి, దప్పకుండఁగ ద్విపదలు రచియింతు.పండితా.దీక్షా.౬౭ పా.

జః దేసిక.

దేసిక. వి. (సం. దేశి - దేసి + క. - స్వార్థమున.) సంగీతభేదములలో నొకటి.

ఉ. దేసిక గానిమార్గములఁ దిన్ననిరీతులఁ బాడి పాడి యూ,శ్వాసమునొంది...హర.౩.౬౨.

దేహకరుఁడు. సం. వి. అ. పుం. తండ్రి.

దేహకర్త. సం. వి. ఋ. పుం. జనకుఁడు, తండ్రి.

దేహకుఁడు. సం. విణ. (అ. హికా. అ.) పూయువాఁడు.

దేహకృత్తు. సం. వి. త్. పుం. తండ్రి.

దేహకోశము. సం. వి. అ. పుం. - దేహమునకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆచ్ఛాదకము - ౧. పక్షము, ఱెక్క. ౨. తోలు, త్వక్కు.

దేహక్షయము. సం. వి. అ. పుం. ౧. దేహము నశించుట. ౨. - దేహమును క్షీణింపఁజేయునది - రోగము, తెగులు.

దేహజ. సం. వి. ఆ. స్త్రీ. కూఁతురు, పుత్రి.

దేహజుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దేహమువలనఁ బుట్టినవాఁడు. ౨. దేహమునఁ బుట్టినవాఁడు. వి. అ. పుం. పుత్త్రుఁడు, కొడుకు.

దేహత్యాగము. సం. వి. అ. పుం - దేహమును విడుచుట-మరణము, చావు.

దేహదము. సం. విణ. (అ. ఆ. అ.) దేహము నిచ్చునది. వి. అ. పుం. - దేహమును వృద్ధిచేయునది, దేహమునకు పుష్టి నిచ్చునది. - పాదరసము.

దేహదీపము. సం. వి. అ. పుం - దేహమునకు దీపమువంటిది - కన్ను.

దేహధర్మము. సం. వి. అ. పుం. దేహముయొక్క స్వాభావికవ్యాపారము.

దేహధారకము. సం. విణ. (అ. రికా. అ.)౧. దేహము ధరించునది. ౨. దేహమును నిలఁబెట్టునది. వి. అ. న. అస్థి, ఎముక.

దేహధారణము. సం. వి. అ. న. ౧. దేహము దాల్చుట. ౨. జీవిక, జీవనోపాయము. ౩. మనుగడ, బ్రదుకు.

దేహధారి. సం. విణ. (న్. ణీ. న్.) శరీరి, దేహము ధరించినవాఁడు, ప్రాణి.

దేహధి. సం. వి. ఇ. పుం. - దేహమున కాధారమైనది - పక్షము, ఱెక్క.

దేహధృక్కు. సం.విణ.(జ్.) దేహధారకుఁడు. (మనుష్యుఁడు, మొ.) వి. జ్. పుం. ప్రాణవాయువు. (వాచ.)

దేహనీయము. సం=దేగ్ధవ్యము.

దేహబంధము. సం. వి. అ. పుం. ౧. మేనికట్టు, బొంది. ౨. దేహముయొక్కబంధము.

దేహబద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దేహముచే కట్టఁబడినది. ౨. దేహమునందు బద్ధమైనది. ౩. దేహము దాల్చినది, మూర్తిమత్తు. శ్లో. దేహబద్ధమివేంద్రస్య చిరకాలార్జితం యశః. సం. కు. సం. ౨. ౪౭.

దేహభాక్కు. సం. విణ. (జ్.) దేహమును పొందినది, దేహముతో కూడినది. -వి. జ్.పుం. దేహధారి,ప్రాణి. (మనుష్యుఁడు, మొ.)

దేహభుక్కు. సం. వి. జ్. పుం. - దేహమందు కర్మఫలము లనుభవించునది - ఆత్మ.

దేహభృత్తు. సం. వి. త్. పుం. జీవుఁడు, ప్రాణి. (మనుష్యుఁడు, మొ.)

దేహము. సం. వి. అ. పుం. న. - వృద్ధి పొందునది - శరీరము, మేను. పుం. ౧. పూయుట. ౨. (జ్యోతి) తనుభావము, జన్మలగ్నము.

దేహయాత్ర. సం. వి. ఆ. స్త్రీ. ౧. -దేహస్థితిని సాఁగించునది - జీవనోపాయము. ౨. -దేహమునుండి యమపుర్యాదులకుఁ బోవుట.- మరణము, చావు.

దేహల. సం. వి. ఆ. స్త్రీ. మద్యము. (వాచ.)

దేహళి. సం. వి.ఇ, ఈ. స్త్రీ. (దేహము-పసుపు మున్నగువానిపూఁత-కలది.) ఇంటిగడప, గృహావగ్రహణి.

దేహళీదీపము. సం. వి. అ. పుం. గడపమీఁద నుంచిన దీపము.(ఇది రెండు ప్రయోజనముల నేకవేర్చెడియేకకార్యమున కుపమానముగా నుపయుక్తము.)

దేహవంతుఁడు. సం. విణ. (త్. తీ.త్.) దేహ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ము కలవాఁడు. వి. త్. పుం.౧. మనుష్యుఁడు. ౨. జీవాత్మ.

దేహసారము. సం.వి. అ. పుం. ౧. మజ్జ, ఎముకలలోనిక్రొవ్వు. ౨. శరీరబలము.

దేహాంతరము. సం. వి. అ. న. ౧. మఱియొకదేహము. ౨. జన్మాంతరము.

దేహాత్మజ్ఞానము. సం. వి. అ. న. దేహమే ఆత్మయని అనుకొనుట.

దేహాత్మవాదము. సం. వి. అ. పుం. దేహమే ఆత్మగాని వేఱగుఆత్మ లేదు అనువాదము. (చార్వాకులు మొదలగువా రీవాదము నాశ్రయింతురు.)

దేహాత్మవాది. సం. వి. న్. పుం. నాస్తికుఁడు, చార్వాకుఁడు మొ.

దేహాధ్యాసము. సం. వి.అ.పుం. దేహమే ఆత్మయనుభ్రాంతి, దేహధర్మములే ఆత్మధర్మము లనుభ్రాంతి.

దేహావరణము. సం. వి. అ. న. - దేహమును కప్పునది - ౧. కవచము. ౨. చొక్కా మొ.

దేహి. సం. విశ. (న్. నీ.న్.) ౧. దేహము కలవాఁడు. ౨. పూయువాఁడు. వి. న్. పుం. ౧. ప్రాణి. (మనుష్యాది.) ౨. జీవుఁడు.

దేహిక. సం.వి. ఆ. స్త్రీ. ఒకజాతిచీమ. (కల్ప.)

దేహిని. సం. వి. ఈ. స్త్రీ. భూమి. (విల్యమ్సు.)

దేహ్యము. సం. విశ. (అ. ఆ. అ.) ౧.పూయఁదగినది. ౨. శరీరమునకు హిత మైనది.

## దై

దైతేయమేదజ. సం. వి. ఆ. స్త్రీ. (ప్రపంచమంతయు జలమయ మైనపుడు విష్ణువు మధుకైటభులను చంపఁగా వారిమెదడు భూరూపమయ్యెను అని పురాణప్రసిద్ధి.) మేదిని, భూమి. (ఇట్లే: దైత్యమేదజ మొ.)

దైతేయుఁడు. సం. వి. అ. పుం. - దితిసంతతివాఁడు- రాక్షసుఁడు.

దైత్యా. సం.వి.ఆ. స్త్రీ. ౧. సుర, కల్లు. ౨. మురయనుగంధద్రవ్యము.

దైత్యగురువు. సం.వి. ఉ. పుం-రాక్షసగురువు - శుక్రుఁడు. (ఇట్లే: దైతేయగురువు మొ.)

దైత్యదేవుఁడు. సం.వి.అ.పుం. ౧. వరుణుఁడు. ౨. వాయువు. (విల్యమ్సు.)

దైత్యనిషూ(సూ)దనుఁడు. సం. వి. అ. పుం- దైత్యులను చంపినవాఁడు- విష్ణువు.

దైత్యమదనము. సం. వి. అ. పుం. కంద.

దైత్యమేదజము. సం.వి. అ. పుం. గుగ్గిలము.

దైత్యయుగము. సం. వి. అ. న. దేవయుగమునకువలెనే దేవమానమున పండ్రెండువేలసంవత్సరములపరిమితి కలకాలము, రాక్షసయుగము.

దైత్యారి. సం. వి. ఇ.పుం.-దైత్యులకు శత్రువు - ౧. విష్ణువు. ౨. వేలుపు.

దైత్యాహోరాత్రము. సం. వి. అ. పుం. దైత్యులపవలు రాత్రియు.(ఇది మనుష్యమానముచే సంవత్సరము పరిమితి కలది.)

దైత్యుఁడు. సం. విశ. (అ. ఆ. అ.)౧. దితిసంబంధ మైనవాఁడు. ౨. దితిసంతతివాఁడు. వి. అ. పుం. తొలివేల్పు, రాక్షసుఁడు, అసుర.

దైత్యేజ్యుఁడు. సం. వి. అ. పుం. దైత్యగురువు, శుక్రాచార్యుఁడు. (వాచ.)

దైనందినప్రళయము. సం.వి. అ.పుం. బ్రహ్మయొక్క ప్రతిదినముతుదను లోకములకు కలుగు ప్రళయము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దైనందినము. సం.విణ. (అ.ఈ.అ.) ప్రతిదినము కలుగునది; ప్రతిదినము నుండునది.

దైనము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. దినమందుండునది. ౨.దినసంబంధమైనది. ౩. దీనసంబంధమైనది.

దైనిక. సం. వి. ఆ. స్త్రీ. దినభృతి, దినబత్తెము.

దైనికము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. దినమున నుండునది. ౨. దినమందలిది.

దైన్యము. సం.వి. అ. న. ౧. దారిద్ర్యాదులచేతఁ గలుగుదురవస్థ, దీనత్వము, ౨. పేదఱికము. ౩. దుర్బలత్వము. ౪. నీచత్వము, హైన్యము.

దైర్ఘ్యము. సం. వి. అ. న. దీర్ఘత్వము, నిడుపు.

దైలువాఱు=దైవాఱు.

(అతిశయించు, అధికమగు)

ఉ. ఏమితపం బొనర్చితిమొ యేసుకృతం బొనరించినామొ యే,నోములు నోచినారమొ మనోరథముల్ మది దైలువాఱఁగా ... వేంకటాచల,స్వామినిఁ జూడఁ గంటిమి... ఘటికా. ౨. ౧౯౦.

దైవకృతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దైవముచే చేయఁబడినది. ౨. మనుష్యకల్పితము కానిది,స్వాభావికము.

దైవకోవిద. సం. వి. ఆ. స్త్రీ. దైవజ్ఞ,సోదె చెప్పునాఁడుది.

దైవకోవిదుఁడు. సం. వి. అ. పుం. దైవజ్ఞుఁడు, జోస్యుఁడు.

దైవగతి. సం. వి. ఇ. స్త్రీ. దైవముయొక్క పోక,అదృష్టము వర్తించుమార్గము; శుభాశుభ ఫలములు కలుగువిధము.

దైవజ్ఞ. సం. వి. ఆ. స్త్రీ. ౧. సోదెకత్తె,సోదె చెప్పునది. ౨. గృహగోధిక, బల్లి. (శ. ర.)

దైవజ్ఞుఁడు. సం.వి.అ.పుం.౧. జోస్యుఁడు, జ్యోతిశ్శాస్త్రము తెలిసినవాఁడు. ౨. త్రికాలవేది, భూతభవిష్యద్వర్తమానములు ఎఱిఁగినవాఁడు.

దైవతంత్రము. సం. విణ. (అ. ఆ. అ.) దైవమునకు లోనయినది, దైవాధీనము. వి. అ. న. దైవముయొక్క తంత్రము.

దైవతము. సం. వి. అ. న. ౧. దేవత,వేలుపు. ౨. దేవతాసమూహము.

దైవతాయతనము. సం. వి. అ. న. కోవెల, దేవాలయము.

సీ. ఉపవాస ముండి సముత్సుకం బై దైవతాయతనమున నాఁకేయి గడపి.ద్వా.౭.౧౨౩.

దైవత్యము. సం. విణ. (అ. ఆ. అ.) దేవతనిమిత్తము ఉద్దేశింపఁబడినది. (ఇది అగ్ని మొ. పదములు పూర్వమందుఁ గలిగియే యుండును.)

వ...గోపాలదేవుండు దేవేంద్రదైవత్యం బగు సాయకం బేసిన. హరి. ఉ. ౮. ౧౮౦.

వి. అ. న. దేవత.

దైవదీపము. సం=దేవదీపము.

దైవదుర్విపాకము. సం. వి. అ. పుం. దైవము దుష్టముగా పరిణమించుట, దౌర్భాగ్యము, దురదృష్టము.

దైవపరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అన్నియు అదృష్టముచేతనే కలుగు నని తలఁచి యత్నింపక యుండువాఁడు.

దైవప్రశ్నము. సం. వి. అ. పుం. ౧. శుభాశుభకర్తఫలము తెలియఁ గోరుట. ౨. జోస్యము. ౩. ఆకాశవాణి; ఉపశ్రుతి. (సోదె అని కొందఱు.)

దైవము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. దేవసంబంధమైనది. ౨. దేవునినుండి వచ్చినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౩. ఆకాశమునఁ బుట్టినది. వి. అ. పుం. జ్యోతిష్టోమాదియజ్ఞమునందు యథావిధిగాఁ దక్షిణమిచ్చి కర్మము నడపినఋత్విజుని అలంకరించి కన్య నిచ్చి చేయువివాహము. న. ౧. భాగ్యము, అదృష్టము. ౨. దేవత, వేలుపు.

గీ. ఆరమాసతిరూపరేఖాతిశయము,వర్ణనము సేయఁ దరమె యెవ్వారికైనఁ, గాంచినప్పుడె చిత్రతఁ గాంచె సకల,దైవదానవరాజి చిత్రంబు గాఁగ. దశా. ౨. ౨౮౫.

శ్లో: అపిస్విద స్యేచ నిజాత్మదైవమనన్యవృత్త్యా సమనువ్రతా యే. సం.భాగ. ౩.౧. ౩౪. (ఆత్మనః దైవం=శ్రీకృష్ణం.వ్యాఖ్య.)

౩. దైవతీర్థ మగుఅంగుళ్యగ్రస్థానము, దైవతర్పణస్థానము.

దైవయుగము. సం=దేవయుగము.

దైవయోగము. సం. వి. అ. పుం. ౧. జన్మాంతరకర్మఫలము కూడుట, శుభాశుభకర్మఫలించుట. ౨. దైవమువలన కలిగినయోగము.

దైవలేఖకుఁడు. సం. వి. అ. పుం-జాతకమ ననుసరించి త్రికాలఫలమ వ్రాయువాఁడు - జ్యోతిష్యుఁడు, దైవజ్ఞుఁడు.

దైవవశము. సం. విణ. (అ. ఆ. అ.) దైవాధీనము. వి. అ. పుం. న. ౧. దైవశక్తి. ౨. దైవాధీన మగుట.

దైవవాణి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆకాశవాణి, ౨. సంస్కృతభాష.

దైవవిదుఁడు. సం. వి. ద్. పుం. దైవజ్ఞుఁడు.

దైవహతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అదృష్టముచే వంచితుఁడు,దురదృష్టవంతుఁడు. ఇట్లే: దైవహతకుఁడు.

శ్లో: ప్రాయో గచ్ఛతి యత్ర దైవహతకస్తత్రైవ యాంత్యాపదః. సం.భర్తృ. నీతి.౯౫.

దైవహీనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అభాగ్యుఁడు, దురదృష్టవంతుఁడు.

దైవాకరి. సం. వి. ఇ. పుం-దివాకరపుత్రుఁడు - ౧. శని. ౨. యముఁడు. ౩. సుగ్రీవుఁడు. ౪. కర్ణుఁడు. ఈ. స్త్రీ. యమునానది.

దైవాత్యయము. సం. వి. అ. పుం. ౧. ఉల్కాద్యుత్పాతములవలనఁ గలుగునాశము. ౨. అదృష్టముయొక్క నాశము. ౩. దైవము నతిక్రమించుట.

దైవాధీనము. సం. విణ. (అ. ఆ. అ.) దైవమునకు లో నయినది, దైవవశ మైనది.

దైవాయత్తము. సం=దైవాధీనము.

దైవాఱించు. స. క్రి. (√దైవాఱు.) పొంగిపొరలునట్లు చేయు.

క. అవమానవైరు లనియెడి, యవనిజములఁ బెటికివైచి యభిమానమునం,దివిరితి దైవాఱించితి, భువనముల ననింద్యకీర్తిభూమామృతముల్. భా. రా. యు. ౨౩౩౬.

దైవాఱు=దయివాఱు, దైలువాఱు.అ. క్రి. ౧. అతిశయించు, అధికమగు.

ఉ...కింక దై,వాఱఁగఁ బట్టె బిట్టు దితిపట్టి నృసింహుఁ డసహ్యతీవ్రతన్. నృసిం. ౫.౯౫.

ఉ. జోఱున వర్షము ల్గురియ సువ్రతుఁ డాచిఱుతొండనంబి దై, వాఱెడుభక్తిఁ బెట్టు శివభక్తుల కర్థిఁ జతుర్విధాన్నముల్. హర. ౨. ౩౧.

క...కొమ్మమెకపుఁబోటరి యత్తా,వునఁ దరలి మెల్లమెల్లనఁ, జని యొకచోఁ మిగుల సంతసము దైవాఱన్. అచ్చ. రా.సుం. ౨౪.

౨. పొంగిపొరలు, పొరలు.

గీ. సాటితూమున రసము దైవాఱఁ గొలిచి,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొమరుజంగంబునకు నిచ్చెఁ గోర్కి దీఱ. హర. ౧. ౨౩.

మ...ఏసామ్ము(గ్రైకొనఁ దేకానుక లిచ్చినం గొనఁడు గోర్కుల్నిండి దైవాఱఁగన్. వసు. ౩. ౯౫.

ఉ. మీఁటినయన్నశైలములమీఁద సమగ్రఘృతప్రవాహముల్, పాఱఁగ యానపాత్రముల భంగి నపూపము లొప్పె నెవ్వరున్,మా టిడ నీకకన్నదియఱమాత్రగఁ బాత్రలయందు నిండి దైవాఱెఁ బదార్థసంఘములు భాతిగ నవ్విభువెండ్లియామతిన్. భోజరా. ౪. ౧౦౨.

౩. ఒప్పు.

మ...భూవరసేనాజన మాయితం బగుచు దైవాఱన్ రణోత్సాహలన్. చంద్రి. ౩.౧౦౭.

జః దైవాఱించు.

దైవాహోరాత్రము. సం. వి. అ. పుం. దేవతలయొక్క రేయును పగలును, మానుష సంవత్సరము.

దైవి. సం. వి. ఈ. స్త్రీ. దైవవివాహపద్ధతిని పెండ్లిసేయఁబడినస్త్రీ. వి. న్. పుం. దైవజ్ఞుఁడు, జోస్యుఁడు.

దైవికము. సం. విణ. (అ.ఈ.అ.) ౧. దేవతలకు సంబంధించినది. ౨. దేవునివలన కలిగినది; దైవవశమున కలిగినది.

దైవోపహతుఁడు. సం= దైవహతుఁడు.

దైవ్యము. సం. విణ. (అ. ఈ. అ.) దివ్యము, దేవసంబంధ మైనది.

దైశికము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. దేశసంబంధ మైనది. ౨. ప్రదేశసంబంధ మైనది,స్థానికము.

దైశికుఁడు. సం. వి. అ. పుం. దేశికుఁడు, ఉపదేశించువాఁడు.

దైష్టికము. సం = దైవికము.

దైష్టికుఁడు. సం. వి. అ.పుం. ౧. దైవపరుఁడు, దైవమే కార్యసిద్ధికి హేతు వని తలఁచువాఁడు. ౨. దైవము కల దనుబుద్ధి కలవాఁడు.

దైహికము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. దేహభవము, దేహమున పుట్టినది; దేహమం దున్నది. ౨. దేహసంబంధ మైనది. వి. అ. పుం. ప్రాణిద్యూతము, కోడి పొట్టేలు మొద లగుజంతువులతో నాడుజూదము.

## దొ

దొంకు=డొంకు. (చూ. దొంకెన.)

జః దొంకెన.

దొంకెన=డొంకెన. వి. (√దొంకు.) ఆయుధ విశేషము.

ద్వి. వడిగొని యడిదాన వైచి కందానఁ, దుకుచు రాతులు గ త్తిదొంకెనఁ బొడిచి, పోటు గంట్లనె తూటిపోవుసద్భటులు. ద్వి. హరిశ్చ. పూ. ౧౩౪ పం.

దొంగ. వి. (√దొంగు. త. తొంగన్.) ౧. చోరుఁడు.

రగడ. గురివెంద నదె గిలుబుకొనియెఁ బయ్యెరదొంగ, విరులఁ గరికుంభకుచ వెరఁజు మైయర గ్రుంగ. మనుచ. ౩. ౭౪.

సీ. ప్రామినుకులదొంగఁ బాతాళకుహరంబుఁ జొఱఁబాతి చీఁటినచోఱ వీవ. పారి. ౧. ౪౯.

౨. అరఁటిపువ్వులలోపల నుండుగట్టికాఁడ.(శ. ర.-దీనిని 'దొంగవాఁడు' అని వాడుదురు.)

విణ. వంచకము, మోసపుచ్చునది.

ఉదా: దొంగనిద్ర:—ఇతరులను మోసపుచ్చుటకై నిద్రించుచున్నట్లు పండుకొనుట. ఇట్లే: దొంగభక్తి.

సా. దొంగపడినఆఱునెలలకు కుక్క మొఱఁగినట్లు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇది కొన్నిపట్ల విశేషార్థముల నిచ్చును.

ఉదా: దొంగకూడు=తన్నారు తెలియకుండఁ బోయి తుడుచుకూడు.

దొంగగొడ్డు=దొంగమేఁత మేయుపసరము.

దొంగనేల = మోసము చేసి యపహరించిన నేల.

దొంగబీగము=మాఱుతాళము.

దొంగయూబి=క్రిందిలోఁతు తెలియకుండ మీఁద వ్యాపించియుండెడుబురద.

(ఇట్లే: దొంగయిసుక.)

దొంగప్రొద్దు=దొంగలు దొంగిలించుటకు అనుకూల మైనసమయము,అర్ధరాత్రము.

ఇట్లే: దొంగకేయి. (శ.ర.)

దొంగతనము. వి. (√దొంగ.) చోరత్వము, చౌర్యము, దొంగిలించుట.

గీ...విను మెంతవానికైన, దొంగతన మున్నయప్పుడె దొడరు భయము. దశా. ౧. ౨౩౨.

దొంగపని. వి. (√దొంగ.) చోరకృత్యము, దొంగతనము.

సీ. తడకద్రోపరి ముడివిడఁపులు మఱి దొంగపని చుక్కవా లైనఁ బస్తుపొరల. వేం. పంచ. ౪. ౨౪౦. (తాళపత్త్రప్రతిపా.)

దొంగమేపు. వి. (√దొంగ.) లంపు.

గీ. లంపు నా దొంగమేపు చెలంగు నభవ. ఆం. భా. ౩. ౩౫.

దొంగటికము, దొంగఱికము. వి.(√దొంగ.) దొంగతనము, చౌర్యము.

గీ. ద్రోహబుద్ధి నైన దొంగటికమునైన, సటల నైన సాహసమున నైన్నసంపదధికుచేత సాధించి ధనమును, బడుగు కిచ్చి బాగుపడును వేమ. వేమన. ౩.౧౩౬.

క. రంగప్పసొమ్ము మేము తి,నంగను సుతుల మయి పుట్టినారము నిజ మ్మైనం గలదే మా కలనను, దొంగటికంబులును వింతద్రోహము లెందుకా. విప్ర. ౫. ౧౭.

మ. దురము స్వర్గము రాయబారము మఱిన్ దొంగఱికము వైద్యముల్, నరనాధాశ్రయి మోడచేరమును బెస్తంత్రంబు సిద్ధించిన్, అరయన్ దొడ్డఫలంబు గల్గు ...కాశ. శ. ౧౧౧.

దొంగలవైరి= వేఁటకుక్క కిడినపేరు.

చ...బెబ్బులులగండఁడు దొంగలవైరి...నాఁగఁబే, ర్లలరెడిసారమేయముల నత్తఱిఁ దెచ్చి రి కొంద ఱుద్ధతిన్. ఇందు. ౨. ౫౯.

సా:-దొంగను తేలు కుట్టినట్లు. దొంగలతల్లికి యేడ్పువ భయము.

దొంగసొమ్ము. వి. (√దొంగ.) దొంగ తెచ్చిన సొమ్ము.

శా...దొంగసొమ్ములకునై యిట్లేల ప్రాల్మాలితే. విప్ర. ౫. ౩౫.

దొంగిలించు= దొంగిలు, దొంగు. స. క్రి. (√దొంగిలు.) మ్రుచ్చిలు, అపహరించు.

క. మరకతమయవజ్రమహా,స్ఫురణ మెయిం దొంగిలించి పొదలినభంగిన్. కు. సం. ౭. ౯౩౭.

సీ. సీధుపానక్రీడఁ జెంగల్వపూచాయ దొంగిలించెకుకన్నుదోయివాఁడు. పి.శకుం.౧.౫. (ఇట ఔపమ్యవాచకము.)

దొంగిలు=దొంగు. స. క్రి. (√దొంగు - త. తొంగు.) దొంగిలించు, అపహరించు.

మ. జలజారాతి సఖీముఖామితకళాసౌభాగ్యలేశంబు దొం,గిలి పాలీక పెనంగ నబ్జము తదంఘ్రిద్వంద్వముం దా సముజ్జ్వలరేఖాకృతిఁ జేరి యాత్తరుచి లంచం బిచ్చి తాఁ పింపఁగా, నెలనిగ్గుల్ గనుపట్టె...చంద్రా. ౪. ౧౩౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తనీవ్వవృత్తము. దూడలతోఁ గాపరులను గుహ
లో దొంగిలి దాఁచిన విధి నదలింపక.
అప్ప. ౪. ౨౩౬ పా.

క. వెంగలి వై రాపొలఁతిక,దొంగిలి తెచ్చితివి
చేటుత్రోవ నయో నీ,వంగడ మద్దొరములు
కుల,యింగలమునఁ బడకము న్నె యిదు మీక
సైనక. అచ్చ. రా. యు. ౧౧౪. రా. వి.
౩. ౧౧.

౨. వంచించు, మోసగించు.

ఉ. ఎక్కడి కేఁగు దెంచితి వహీనవిహార చికిత్స
నీకు నేఁ,జక్క నొనర్చెదం బెలుఁచఁ జంపితి
దొంగిలి ము ష్టదీయులక, రక్కసులక...
పాండు. ౫. ౧౦౭.

దొంగిళ్లు. వి. బ. ఒకవిధ మగునేత్రరోగము.

గీ. రెండుతు త్తంబులు...ఇట్టికపొడిఁ గూర్చిచాఁ
గనీట, నిమ్మపండ్లను వెన్నను నీరొనర్చి, యి
డిన దొంగిళ్ళుఁ బురుగుకా టుడిగిపోవు.
(చికి. చి. ని.)

గీ. బరణి నిడి కన్నులను బెట్టఁ బ్రబల మైన,
పురుగుకాటును దుర్మాంసపూరితములు, నీరు
పాటును దొంగిళ్లు నిశ్చయముగఁ, దీఱు ననిరి
భిషగ్వరు ల్కూరి మలరి. (చికి. చి. ని.)

దొంగు=దొంగిలు, దొంగిలించు. స. క్రి. అపహ
రించు,మ్రుచ్చిలు. అ. క్రి.(త. ఒదుంగు=డొంగు,
డాఁగు, దాఁగు. మఱుగుపడు. అని శ.ర.)

జః దొంగ, దొంగతనము, దొంగపని, దొంగ
మేపు, దొంగటికము, దొంగసొమ్ము, దొంగి
లించు, దొంగిలు.

దొండ. వి. (సం. తుండీ. ప్రా. తుండీర.) బింబిక,
ఒకదినుసుతీఁగ.

సీ...అలరును దొండ యం చనఁగఁ దుండి.
ఆం. భా. ౨. ౭౦.

గీ. సకలదిశలను శాఖోపశాఖ లిడుచుఁ, బొదలి
ఫలియించు దొండయుఁ బోలి ప్రబలి,యాత్మ
సంతతి పుత్రపౌత్రాదిబహుపరంపరల నొప్ప
వెలసె భర్తయును దాను. ప్రభా. ౧. ౧౬.

ఉ. సంతతి లేకము న్నతనిజాయ సభక్తిని సూ
ర్య సేవ య,శ్రాంతముఁ జేయఁగా నతఁడు
సద్ద్విజుఁడై కలవచ్చి దొండచెట్టింతికినిచ్చి
చాల ఫలియించును నీకిది ప్రోదిచేసికో,మ్మెం
తయునంచుఁ బల్కె ... ప్రభా. ౧. ౧౫.

జః దొండపండు, దొండముక్కువడు.

దొండపండు. వి. (√దొండ.) బింబఫలము.

సీ. నేరేడుపండులు నెలయూటిపండులుఁ గొం
డ మామిడిపండ్లు దొండపండ్లు. కాశీ. ౩.
౭౯.

గీ. పండి వాడినయలదొండపంటిపగిది, మొనసి
వరవట్లు వట్టి కెమ్మోవి దనరఁ, జెన్ను దఱిగిన
సొగసుతో విన్న నైన,దేశయానఁ గనుం
గొని తెగిచి వగచి. యయా. ౩. ౭౨.

క. పగడము మంకెనవిరియును, జిగురాకును
దొండపండు చెందిరమును ...నీలా. ౨. ౨౨.

సా:-కాకిముక్కునకు దొండపండు కట్టినట్లు.

దొండముక్కువడు. అ. క్రి. (√దొండ.) దొం
డపండువలె గింజలకొన లెఱ్ఱఁబడు.

మ. బలుసుల్ పండెను దొండముక్కువడియెం
బ్రాసంగుఁజేల్ పోఁకమో,కల పూఁబాళల
తావిఁ గ్రోలి పొరలెక గొబ్బేరదిగ్వాయు
వుల్. శివరా. ౪. ౧౯.

దొండి=తొండి. వి. ౧. చిల్లి, రంధ్రము.

సీ. జలజాతభవశివాదులు గూడ బ్రమయుట
దుర్గంధ మగును చ్చదొండికొరకు. వేణు.౭౬.

సీ. తూ మనఁ దూఁ టనఁ దూపర మనఁగను
దొండి నాఁ జిల్లి నాఁ దొలి యనంగ. ఆం.
భా. ౧. ౧౪౫.

౨. భగము, ఆఁడుగుఱి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. చినిఁగినదొండి బల్సేఁతకు వెఱచు నా వెస
నూత్న బాలిక వెఱచుఁ గాక. వేణు. ౨౪.
జః దొండివోవు.

దొండివోవు. అ. క్రి. (√దొండి.) చిల్లిపడు, తూఁటువడు.

సీ. పోర మాయుడు శేల పోసికొ నెదవురా తో
రంపునీ మేను దొండివోను. బిల్హ. ౨. ౬౪.

దొండు. వి. ఒకవిధ మగు చేఁప, మత్స్యవిశేషము.

గీ. మోర పక్కెర దొండును గూరముక్కు,
పుల్లరుజు గెచ్చె గండెయు బొమ్మడాయ. హంస. ౪. ౧౭౩.

దొంతర=దొంతి. వి. (దొంతి + తరఁగ.) ౧. ఒక దానిపై నొకటిఁగ నుంచినవస్తువులవరుస.

గీ. దోర యన దొంతి యనఁగను దొంతర యన,
దనరు నుత్పంక్తి...ఆం. భా. ౨. ౩౪.

క. వెస లలనామణి బంగరు,వెసలలదొంతరలు డించి వినయము పదికిం, పొసఁగఁగఁ గంకణరవములు, పొసఁగఁగ నారసి రసాన్నములు వడ్డింపన్. విజ. వి. ౨. ౧౫౨.

౨. పరంపర, వరుస.

క. సంతోషబాష్పధారలు, దొంతరగాఁ జూచి మ్రొక్కి తోయధివరసీ,మంతినినాత్రి జగద్దీ,వ్యంతిని భాగీరథీస్రవంతినిఁ బొగడన్. విజ. వి. ౧. ౪౭.

గీ. సంతసంబునఁ బంటవలంతివేల్పు, దొంతరగ నన్నకటివేల్పువింత లెల్ల, మంతనంబునఁ దలఁచుచు నంతఁ బొగిలి. నీలా. ౧.౧౦౧.

దొంతర(లు)గొను. అ. క్రి.(దొంతర + కొను.) దొంతులగు; సాంద్రమగు, దట్టముగా వ్యాపించు.

వ. (చంద్రికావర్ణనము.)...పదతాడనంబు గా వించుకించు వెలయాండ్ర చరణనఖకాంతుల పై దొంతరలుగొని...ఉ. రా. ౪. ౧౬౩.

దొంతరముద్దు. వి. (దొంతర + ముద్దు.) చుంబన భేదము.

గీ. ముద్దునాగను జుంబనం బొప్పుచుండుఁ, బొల్చుచుండును దొంతరముద్దనంగఁ, దద్విశేషంబు... ఆం. భా. ౨. ౧౪౦.

దొంతి=దొంతర. వి. (త. తొందిప్పు.) ౧. ఒక దానిపై నొకటిగా నుంచినవస్తువులవరుస, ఎత్తువరుస.

గీ. కుకవికృతులందు దోషంబు గుణము సేయు, నేరఁ డది యట్ల దొంతులు సేరి నాయి, దోర్ప సేర్చుఁ గాకది యేమి సేర్ప సేర్చు. కు. సం. ౧. ౭౯.

గీ. దోర యన దొంతి యనఁగను దొంతర యనఁ, దనరు నుత్పంక్తి...ఆం. భా. ౨. ౩౪.

గీ. దొంతిబుజ్జులచిక్కంబు పొంతఁ బెట్టి, వగలఁ బొగిలెడువాని నిర్వాణి నెక్క, తరుణతాపసిఁ గాంచితి ధరణినాథ. దశకు. ౫. ౪౦.

గీ. అమ్మహాశక్తి రత్నపుబొమ్మరిండ్లఁ, బేర్చుఁ బన్నారుదొంతులఁ బిసరుహాస, నాండభాండంబు లీరీతి నుండ దొంతి, పేర్తు నని లోకమునఁ దుఁ జూపెడువడువున. వరాహ. ౬. ౭. భా. రా. సుం. ౫౩౬.

౨. పరంపర.

ఉ. మాయలు డాయనీక యసమానత నత్యుపమానమై ముని,ధ్యేయత భక్తితత్పరవిధేయమనం దగువిష్ణుతత్త్వముల్, ఛాయనిచూడ్కి సర్వసమభావనఁ గ్రాలెడుబాలు బాలిశుం, జేయ నతండు నూఁ వెఁ దనచెన్నఁటిమాయలదొంతు లన్నియున్. నృసిం. ౪. ౧౪౧.

విణ. ౧. ఒకదానిపై నొకటిగా నున్నది,దొంతరయైనది.

క. కరసరసిరుహంబున నొక,సరసిరుహం బమర వదనసరసిరుహమునన్,బరిమళివళమున మో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పిన,ధరణీధరతనయదొంతితామరఁజూపెన్.
ఉ. హరి. ౫. ౭౦.

౨. అధికము.

ఉ. (లక్ష్మీదేవివర్ణనము.) కొంతని కాదు చాలఁ దొడుగుల్ మకుఁగుల్ గొడుగుల్ సువర్ణముల్, దొంతిగనుప్పతోఁ గలుగుతో మ్మిదియుం గొని యేటికేఁటి కీ,వంతుగ నా పెచే మననివారలు లేరు... ఘటికా.౧.౪౩.

క. మొదలఁ గుల మెల్లఁ ద్రుంచుట, యదయత గురులయెడఁ గల్లలాడుట యది గా, కిదియును జేయఁ దలంచినఁ,గొద లే దీవేళ దొంతి కొల సిద్ధించున్. జై. భా. ౧. ౬౯.

సింగారపుదొంతి = శృంగారములపరంపరకుస్థానము.

ఉ...అందముల కన్నిటికిం దగుపట్టుఁ గొమ్మ సిం,గారపుదొంతి యైనకులకాంత నయో యెడఁబాయ నేర్తునే. శుక. ౧. ౬౪.

సొగసులదొంతి=సొగసులగని.

సీ. ముగుదలమేల్బంతి సొగసులదొంతి క్రొంబొగడపూబంతి యబ్బురపుటింతి. అచ్చ. రా. బాల. ౧౩౬.

క. ఇంతయుఁ గనికర మూనక, వంతల నిడి చనఁగఁ దగునె వలిగొజ్జెఁగపూ,బంతీ యింతీ సొగసుల,దొంతీ క్రొందుంటవింటిదొరమదదంతీ. రసిక. ౬. ౫౦. అచ్చ. రా. అర. ౯౯.

జః దొంతర, దొంతరగొను, దొంతరముద్దు,దొంతిమన్నెవిభాళుఁడు.

దొంతిమన్నెవిభాళుఁడు. వి.(√దొంతి.)ఒకానొకబిరుదము.

వ...గజగంధవారణ గండగోపాల చలమర్తిగండరాయగజకేసరి దొంతిమన్నెవిభాళాదినానాబిరుదవిఖ్యాతుల...వాసిష్ఠ.౧.౧౦.

దొంద=దొందు[2], దొద్దు. విణ. (సం. తుందీ.) తుందిలుఁడు, స్థూలకాయుఁడు.

సీ. దొం దన దొందు నా దొద్దునా లంద నాఁ దుందిలనామ మై తోఁచుచుండు.ఆం.భా. ౨. ౧౭౦.

దొందడి. వి. (దొందు[1]+దడి - సమ్మర్దము, సందడి అని శ.ర.) ౧. సంఘర్షము, రాయిడి.

ఉ...ఇద్దఱుఁ, దుర్జయశత్రుసైన్యములదొందడి నే మయిరొక్కొ...భార. ద్రో. ౪.౧౭౯.

క. వడిఁ బొదివి భీముఁ డార్చినఁ, జెడ విఱిగిన సేన నేమి సెప్పుదుఁ దనదొం,దడిఁ దాన చదిసె వెనుకొను,కడిఁదిమగలచేత గాసిగా దె నరేంద్రా. భార. కర్ణ. ౨. ౩౫౪.

క. ఎందఱు గంధర్వులు వడి, రెందఱు గుహ్యకులు మడిసి రెందఱు నృపసం,క్రందను లీల్గిరి యపు డా,దొందడి మితి మీఱి వారి తూపులు దొరయన్.కవి. ౫. ౯౭. హరి. ఉ. ౩. ౧౩౦.

౨. త్వర, వేగము.

ఆ. రాజుకొడుకుఁ జూచె రాజీవదళనేత్ర,రాజవదనఁ జూచె రాజుపట్టి, దొంగ కాముఁ డంత దొందడిఁ జిగురాకు,వాలు వెఱికి యుఱికి వారి మొత్తె. భాగ. ౯. ౨౬.

వ...తమకంబుల గమకించుచు హుంకుమత్తున తూరి యంపఱలపరంపరల వెంపరలాడిన హుసి యని దొందడినిఁ బళిందులు కఱకు మీఱిచుఱుకుఁజూపులు చూచి... ప్రబంధ. ౭౭౭.

విణ. సంకులము.

క. ఇందాఁక నీ వొనర్చిన,దొందడిపని మెచ్చ నేను దొడరి తిపుడు లా,వుం దాల్మియుఁ జూపిగదా యెందుఁ బొగడుగనుట నిలువు మించుక యాజిన్. హరి. ఉ. ౭. ౧౯౬.

దొందడించు. అ. క్రి. (√దొందు[1].)కలియు.

సీ. కరతాడనములఁ జన్గవలపై లత్తుకచట్టలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చటిచినచాడ్పు దోఁపఁ, డెగి రాలుహార మౌక్తికములు నక్షత్రబిందువు లేర్పఱుపరాక దొందడింప. హరి. పూ. ౯. ౧౩౯.

దొందము. వి. (సం. ద్వంద్వమ్. ప్రా. దొంద.) ద్వంద్వరోగము, వాతపిత్తశ్లేష్మములలో నేరెండి టివల్లనైనను గలిగినరోగము.

సీ. ద్వంద్వరోగంబు నివ్వటిలు దొంద మనంగ ...ఆం. భా. ౨. ౧౨౪.

దొందు[1]. వి. (సం. ద్వంద్వమ్.) జత. (శ. ర.)

జః దొందడి, దొందడించు, దొంబులిగొట్టు.

దొందు[2]=దొంద.

ఆం. భా. ౨. ౧౨౦.

జః దొందుమేను.

దొందుమేను. వి. (√దొందు[2].) మిక్కిలి స్థూలమగుశరీరము.

వ...కొందఱు దొందుమేనుల నిటునటు కదల లేక చీనిపందులపొందికను రక్తార్ద్రవస్త్రంబులతోఁ బ్రాణాచారంబుల మెలఁకువ నొదిఁగి ...ప్రబంధ. ౪౮౮.

దొంపు. వి. ౧. చేను. (మళ్లవరుస అని శ. ర.)

సీ. లేఁతనివ్వరిదొంపు లేటిపిల్లల కింపు కాచియుం డెద నంచుఁ గదలెనోర్తు.కృ.శకుం.3.33.

౨. వేరుపురుగు కొఱుకుటవలన మోవు లెండుట. (శ. ర.)

దొంబర=దొమ్మర. (చూ. దొంబరి.)

జః దొంబరి.

దొంబరి=దొమ్మరి. వి.(దొంబర+ఇ-త.దొంపమ్. క. దొంబమ్=గడకట్టి చేయునాట్యము.) దొమ్మరవాఁడు,గడకట్టియాడి జీవించుజాతివాఁడు.

వ...శంబరారి యనుదొంబరి విడంబంబునం దూఱ నంబరంబునం బన్నినవలయంబు లనం బొలుచునవలగ్నంబుల విలగ్నంబు లగునొడ్డియాణంబుల...వరాహ. ౧౧. ౭౯.

దొంబులిగొట్టు. వి. (దొందు[1] + పులి + కొట్టు.) - వ్యతిరేక లక్షణచే - పిఱికి, భీరువు. (రెండుపులులను కొట్టువాఁడు అని శబ్దార్థము - శ. ర. - "దొంబులగొట్టు" చి. ని. ప్రా.)

గీ...పంద కోఁచ, పిఱికి దొంబులిగొట్టన భీతుఁడభవ. ఆం. భా. ౨. ౨౨౧. (వావిళ్లప్రతిపా. "బొబ్బలగొట్టు" ప్రాఁతప్రతిపా. "దొబ్బలకొట్టు" వ్రాఁతప్రతిపా. సీ...సమరభీరువునకుఁ బేళ్లగుఁ బాఱుఁబోతుపిఱికి.

గీ. కోఁచ పందయు దెబ్బలుగొట్టన ... వేంక. మాన. ౫౪. "దొ(బ్బ)లగొట్టు" వ్రాఁతప్రతి, బ్రౌ. పా. - "దొబ్బల = పిఱికి, గొట్టు = పిఱికి. అని పర్యాయపదములుగా బ్రౌ. క. చను భీతుఁడు కోఁ చనఁ బం, దన దెబ్బలగొట్టు పిఱికి యనఁ బార్శ్వోత, న్నను ...ఆంధ్రపదాకరము. నరవర్గము. ౪౦. ఇంకను విచార్యము.)

దొగ్గలి. వి. రక్తబాష్ప మనునొకమొక్క. (బ. దొగ్గలులు, దొగ్గళులు, దొగ్గళ్లు.)

చ...దొగ్గలి పొన్నగంటి దేదరి...హంస. ౪. ౧౩౨.

...దొగ్గలి యన రక్తబాష్పాఖ్యమై ప్రబలుచుండు. ఆం. భా. ౨. ౭౩.

గీ. పెంటదొగ్గళ్లలోఁ గడు పంటి శక్రచలనములఁగ్రక్కుజీర్ణోతువుల...ఆము.౬.౧౩.

దొగ్గుడుకొను. అ. క్రి. వ్యాపించు.

వ...మంటల గొంటించి యగ్గి దొగ్గుడుకొన మొదలంటఁ బొదివి మొదవ నీకున్నయగ్గికోలజగ్గు బొగ్గయ్యె నంత. అచ్చ.భా.౫.౨౬.

వ... గుజ్జంపుడెక్కల నెక్కొను మిక్కిలిబుగ్గిమింట దొగ్గుడుకొని...అచ్చ. భా.౫.౨౬.

దొటదొట=తొటతొట, దొదదొద. వి. (నిష్ప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లు మొ.) రాలుటయం దగుధ్వని కనుకరణము.

చ. దాటదాట రాలు మి న్నవిసి తోరపునిప్పు లవాన లొక్కటక్. సానందో. ౨.౫.

ద్వి...కన్నులను,దాటదాట నిప్పులు దొఱఁగ హు మ్మనుచు. ద్వి. నల. ౨. ౬౩౮.

దాడదాడ. వి. (త.తొడతొడ.) ౧.(నీరుమొ.) కాఱుటయం దగుధ్వని కనుకరణము.

ద్వి. దాడదాడ నోట నెత్తురు గ్రక్కుకొనుచు. రం. రా. యు. ౩౭౫పొ. ౨పం.

౨=దుడదుడ.

చ. దుడదుడ మంచె యెక్కి నొకదొడ్డమిటారపుఁ గమ్మకూఁతురుక్, దొడదొడ మంచ మెక్కి నొకదొడ్డమిటారపురెడ్డికూఁతురుక్. వీథి.౩౦.

విశ. దాడదాడయనుధ్వని కలది.

క. ఉడువీథిఁ గొండశిలపైఁ, బిడు గెగసినవడువు దోఁప బి ట్టెగసి వడిక్, బెడతల గుప్పునఁ దన్ననఁ, బడియెం దాడదాడలు గాఁగఁ బది మకుటంబుల్. రామా. ౭. ౨౭౩.

దాడవ. విశ.(త.తొడుప్పై=కొండీఁడు.)నీచుఁడు.

క. మగఁ ప్రోఁతి యైనదాడవరుఁ,దగునే కన్నియ నొసంగ ధరణీశునకుక్. షోడ. ౭. ౯౦.

దాడిదాడి=దుడిదుడి. వి. ౧. జనులు వేగముగా నడచుటయం దగుధ్వని కనుకరణము.

క. దాడిదాడి వెడలెదుమీ రెక్కడ పోయెద రెవ్వ రేమికార్యం బని నేనడిగిన నూరక దురదుర, నడిచిరి నామాట విని విననిచంద మునక్. వరాహ. ౧౦. ౮౧.

చ. బడలినమోము గువ్వగుమిపట్టులఁ బాఱెడు చూపు మించఁగా, దాడిదాడి నూడిగంపుఁ దెగతోఁ జనియెక్ మముఁ జూడఁ డేమి యుక్. కువల. ౩. ౭౫.

౨. (పిడుగు మొ.) పడుటయం దగుధ్వని కనుకరణము.

సీ. పెల్లుగాఁ బెటిలు పెళిల్లున మ్రోయుచుఁ బిడుగులు దాడిదాడిఁ బడియెఁ జదల. ద్వా. ౧౦. ౪౫.

దొడ్డ=దొడ్డు. విశ. (క. దొడ్డ.) ౧. పృథువు, గొప్పది.

ఆ...పెను పేరు బలు దొడ్డు, దొడ్డ వలుఁద నాఁగఁ దోఁచుఁ బృథువు.ఆం.భా.౩.౧౬.

గీ. సిడము నడిమికి వెసఁ ద్రుంచె వెడఁదవాలిఁ దొడ్డతూపునఁ గురుసేన దొంగలింప.భార. భీష్మ. ౨. ౪౯. (నిశితమైన అని భావము.)

ఆ. పాప రానిదొడ్డపగ పుట్టె నిఁక నెట్టు, లిం దుముఖికిఁ జక్రి యెపుడు పుట్టు. భాగ.౧౦ పూ. ౮౩.

గీ...కడు దొడ్డ లగుచుఁ,బొడమె మొగ్గలగము లగ్గిబొబ్బ లట్లు. ఆము. ౨. ౫౬.

౨. శ్రేష్ఠము; శ్రేష్ఠుఁడు.

సీ...సాత్యకి వానిగుణము బాణాసనంబుఁ,దుని మె నంతట వాఁడు దొడ్డకోదండంబుఁ గొని శరంబుల నొంచె శినిమనుమని. ఉ. హరి. ౩. ౫౭.

గీ. సోమపిశరులు తమలోన మేమ మేమ,దొడ్డవార మటంచు వాదునకుఁ జొచ్చి,రొదలు చేయంగ...వరాహ. ౫. ౭౯.

గీ. అంబికయును నితం డెవ్వఁ డనుచు నడిగి, యధిపుఁ డశ్వతరుండు గాఁడా యటన్న, నీతఁడా యశ్వతరుఁడుసంగీతవిద్య,దొడ్డవాఁ డఁట యనిన రుద్రుండు చెలఁగి. కువల.౪. ౧౦౬. దశా. ౨. ౪౦౯.

౩. దుష్కరము, చేయరానిది; కష్టము.

చ. చలనవిహీనవృత్తి నడిసన్నపరాశరుఁ డాదియైనయ,య్యలయలరాయివంటిహృదయంబులు నీరుగఁ జేయుబోయపూ,విలుతున కెంతదొడ్డపని వెన్నెల బిట్టునఁ గాసినంతలో, పలన కరంగి పొంగుపసిబాలురచిత్తము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మెత్తచేయఁగలెన్. పాండు. ౫. ౨౧౨.

వ...ఇప్పరమపావనితపోవనంబులు డాసి గాసి గోర్చి ప్రాణంబులు భరించుట దొడ్డనువారును...ఉ. రా. ౮. ౭౧.

౪. మహిమకలది; మనోహరమైనది.

చ...ఇన్నైలవు దొడ్డది మేనులు కంప మొందెడిన్, నిలిచెద మేము పుష్పకము నిల్పినచో ససురేంద్ర నావుడున్. ఉ. రా. ౫. ౨౧౧.

గీ. అట్టియజుపట్టి కెదురుగా నరిగి పురికిఁ దోడుకొనితెచ్చి రతనపుదొడ్డనగ రొకటి విడిది చేసి తలఁప శక్యంబు గాని,యులుప వట్టించి నిమివంశతిలకుఁ డంత. చం. రా. ౩. ౧౦౫.

దొడ్డకొంచెము=ఎక్కువతక్కువలు.

సీ. దొడ్డకొంచెము లేక తుద నెట్టివర మైన ననువున నిచ్చు...చిత్రభా. ౪.౧౨౦.

క. ఎక్కడిమగఁ డెక్కడిసఖు, లెక్కడినీయత్తమామ లెక్కడిచుట్టా, లిక్కాలఁది దొడ్డకొంచెము, లెక్కింపకు మరునిహావళిం బడువేళన్. హంస. ౧. ౧౦౧.

దొడ్డవయసు = ప్రౌఢవయస్సు.

గీ. దొడ్డవయసున శీతాంశుఁ డొడ్డగిల్లెఁ, దఱపి చంద్రాతపము నేల చఱచి కాయ. భీమ. ౨. ౪౬.

జః దొడ్డతనము.

దొడ్డతనము. వి.(√దొడ్డ.) గొప్పతనము.

క. మృగములు పదివే లుండఁగ, మృగయారతి సొంపుఁ దెంపుమెయి నొకశాఖా,మృగవనితమీఁదఁ జూపుట, తగవే దీన నగుదొడ్డతన మేమి యొకో. భోజరా. ౫. ౯౦.

క. అంబుజభవాదివిబుధగ,ణంబులదొడ్డతనమెల్ల వాని వెనుక త,థ్యం బని చూపె ననంగా, బింబాధర దొడ్డతనము పిఱుఁదునఁ దాల్చెన్. వరాహ. ౬. ౧౦.

దొడ్డి. వి.(సం.ద్రోణీ.) ౧. పసులు మేయుబీడు.

వ...నలుదెసలం బొడువుగా నమర్చినబలితంపుములువెలుంగులం గరంబు జతనంబు లై యొప్పు పెనుదొడ్లం గ్రమంబునం బ్రమోదంబున వేఁకువం బోఁకు మేసి వచ్చి... హరి. పూ. ౫. ౧౪౨.

౨. (త. తొట్టి.) పెరడు; పసులకొట్టము, పసులసాల.

(వ్యవ.) మాదొడ్డిలో చాలపాఁడులు పెట్టినాము.

శా...తోఁట దొడ్డి గను లాప్త ల్పాడుఁ బంపం దగున్. ఆము. ౪. ౨౪౫.

చ. కడఁక యెలర్ప దొడ్లకును గ్రంపలు వైచియు నొక్కనాఁటిలో, నడరఁగఁ బ్రాతకాఁపు లయి రక్కడ గోపకుటుంబు లందఱున్. హరి. పూ. ౬. ౨౫.

సీ. పండినపెరటికల్పకము వా స్తవ్యుండు దొడ్డిఁ బెట్టినవేల్పుగిడ్డి కాఁపు. మనుచ. ౧. ౬౬.

సా: దొడ్డెఁదుగేదెలను దొంగలు తోలుకొనిపోవఁగా గొడ్డుగేదె శ్రీమహాలక్ష్మి యైనట్లు.

౩. ఇల్లు. (చూ. దొడ్డివేల్పు.)

జః దొడ్డికట్టు, దొడ్డికాళ్లు, దొడ్డికొను, దొడ్డిపట్టు, దొడ్డివల, దొడ్డివేల్పు.

దొడ్డికట్టు. వి. (√దొడ్డి-త.తొట్టిక్కట్టు.)నడుమ బయలును చుట్టును కట్టడములును గల యిల్లు, చుట్టుకొలారము.

సీ. దొడ్డికట్టుగ నాఁగి తొలఁగి పోవఁగ నీక యచ్ఛభల్లములఁ బె ల్లార్చి తెచ్చి.పి.శకుం. ౪. ౬౯.

సీ. దొడ్డికట్టై యున్నతోఁగంపుటీరంబుఁ జొరఁ జొపి వెనువెంటఁ దిరిగి తిరిగి. భా. రా. అర. ౨. ౫౧.

గీ. అపు డసల్లకు డిగక మేఘాళి పొదువు,నచలములపైనె దొడ్డిక ట్టగుమృగాళి, జాడ చూపట్టె మీఁదిపర్జన్యధన్వి,నృపున కగుతెర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వేట యాయిత మనంగ. ఆము. ౪.౧౧౭.

దొడ్డికాళ్లు. వి. బ. (√దొడ్డి.) పంగటికాళ్లు, ఎడముగా నున్నకాళ్లు.

గీ. దొడ్డికాళ్లును నల్లనిచెడ్డయొడలు, గలిగి యత్యంతనీరసాకార యైన,కలహకంటకి నవ్విప్రకాంతఁ జూచి, భయము జనియింప ధారణీపాలుదేవి. హరిశ్చ. ౪. ౧౬౮.

దొడ్డికాళ్లవాఁడు=పంగటికాళ్లవాఁడు, ప్రజ్ఞుపు.
సీ...తోఁచును బ్రజ్ఞుండు దొడ్డికాళ్ల,వాఁ డన ...ఆం. భా. ౨. ౧౨౨.

దొడ్డికొను. అ. క్రి.(√దొడ్డి.) నెలవుకొను,నిండు.
ఆ. కోరికొమ్ము నీదుకోరిక యీడేఱ, నర్థి నిత్తు వలయునర్థ మనిన, విని విరించునకును వినతుఁడై ధర్మవ్రతుండు పలికె ముదము దొడ్డికొనఁగ. శేష. ౪. ౨౦.

దొడ్డిపట్టు. వి. (√దొడ్డి.) గోష్ఠస్థానము.
గీ. దొడ్డిపట్టుల నిల్వాక త్రోవ నెవరి, నెదిరి కొమ్ములఁ గ్రుమ్ముచుఁ గదిసి కోడె, తలుపులను బొడ్చుచును వడిఁ దవిలి ఱంకె, లిడుచుఁ బొగ రెక్కు యుఱ్కున నడరి శెలమి. నీలా. ౨. ౪౩.

దొడ్డివల. వి. (√దొడ్డి.) వేఁట కుపయోగించు నొకవిధ మైనవల, జాలవిశేషము.
వ...గాలిఁ బరికించి దిగువదెస దొడ్డివల పన్ని ...మనుచ.౪.౩౭.
గీ. లేటివలలును...సవదండవలలు దొడ్డివలలుఁ బందిటివలలును...యయా ౧.౩౮.కాళ.౩. ౪౬.

దొడ్డివేల్పు. వి.(√దొడ్డి.)ఇలువేల్పు,కుల దైవము.
సీ. గెలుపు పేరువజీరుఁ గినిసినకప్పు పైదువరాచ సెంచు మాదొడ్డివేల్పు. ప్రబంధ. ౧౬౦.

దొడ్డు=దొడ్డ. విణ. ౧. పెద్దది, అధికము.
తరలము...ఆద్య సన్నము దొడ్డునై,అడఁగి కారణకార్యరూపము నైన యీసకలంబు నీ, కడుపులోనిది గాదె పాపఁడఁగాక నేమఱి యెవ్వఁడక్. భాగ. ౧౦. పూ. ౫౫౮.

౨. శ్రేష్ఠము, ప్రశస్తము; శ్రేష్ఠరాలు.
చ...క్షణభంగుర మై చనుమేటిభాగ్యముం, దలఁతురె దొడ్డుగా జగతిఁ దావకభక్తులు మానసంబులన్. చెన్న.౪. ౧౦౧.
వ. అనిన విభుండు లోకాపవాదంబునఁ గళత్రాభిమానంబు విడుచుట దొడ్డు గా దని మాట జవదాఁటక యిప్పరమపావని తపోవనంబులు డాసి... ఉ. రా. ౮.౮౧.
శా. నన్నే పాయఁడు రాత్రులం దివములన్ నన్నేకృంపం జెందెడిన్, నన్నే దొడ్డుగఁ జూచు వల్లభలలో నాథుండు ... భాగ. ౧౦ ఉ. ౨౨౪.

౩. దుష్కరము, అసాధ్యము; కష్టము.
గీ. గోపసూనులఁగ్రేపుల గోధనములఁ, గమలజుఁడు గాఁచి సత్యలోకమున నున్న, నపుడె ప్రతిసృష్టి యొనరించె నాప్తుఁడైన, క్రీడి బ్రతికించు టేదొడ్డు కేశవునకు. జై. భా. ౭. ౮౫.
మ. దుడుకుల్ మీయెడ నిన్ని సల్పెడుపలాదుం గైదువుం బంపి యిప్పుడె దండించుట దొడ్డు గా దయినచోఁ బొల్పోవు నీయంచల, తడిరాహుత్తునిమాటచెల్లుబడి ... చం.రా. ౨. ౩౫.
మ. పడఁతీ తల్లిని దండ్రిఁ జంపుట తృణప్రాయంబు తోఁబుట్టులన్, మడియం జూచుట లెక్క గా దనిన జన్మక్షాత్రకీటంబులన్, గడపం బూనుట నాకు దొడ్డె ... ప్రబోధ. ౨. ౬౭. రాజశే. ౩. ౨.

వి. ౧. మాలిన్యము, మఱికి.
ఆ. మోదమునను గురునిముఖ్యకరుణచేత, లొమ్మిదిస్థలముల దొడ్డు వాయ...వేమన. ౧. ౨౭౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. ఆధిక్యము.

మత్త. మీర లున్నెడ కేఁగుదెంచితి మేలు మీ
కొకఁ డెద్దియేని, గోరి చేసెద నందు దొడ్డు
ను గొంచెముం దలపోయకుం, డేరి కిందు న
సాధ్యమైనది యిత్తు నుత్తములార ... నా.
పంచ. ౧. ౪౬౫.

దొడ్డుకొంచెములు=హెచ్చులొచ్చులు.

గీ. దొడ్డుకొంచెంబు లున్నవే దొరవు నీక్క,టా
క్షమున కెవ్వఁ డైనచో నాశ్రయింపఁ,గదిసి
రక్షించుటరయె నీకుఁ గలగుణంబు, రఘుకుల
క్షీరనిధిచంద్ర రామచంద్ర. ఉ. రా. ౭.
౧౫.

వ. మఱియు ననేకవిధంబు లగుదురితంబు లాచ
రించినపురుషాధములదొడ్డుకొంచెము లరసి
మద్వాక్యోల్లంఘనంబు గాకుండ...సాసం
దో. ౨. ౩౪ పా.

జ: దొడ్డుకట్టు, దొడ్డువాఱు.

దొడ్డుకట్టు. వి. (√దొడ్డు.) పెద్దచాఱ.

ద్వి. అడ్డంపుముక్కార యసియాడునడుము, దొ
డ్డుకట్టులచీర తూఁగుఁబయ్యెదయు. పండి
తా. దీక్షా. ౪౫ పా.

దొడ్డువాఱు. అ. క్రి. (√దొడ్డు.) అధికమగు.
(శ.ర.)

దొత్త. విణ. ప్రేలాడునది. (శ.ర.)

దొత్తు. స. క్రి. తన్ను.

ద్వి. భోరునఁ దూఱి తెప్పున నెత్తి దొత్తి, క్రూ
రత మెదడు ముక్కల గ్రుచ్చి మ్రింగ. అ.
మ. క. ౫. ౨౭౩ పా. ౨ పం.

దొద్ద. వి. కొల్ల, దోఁపిడి.

సీ. తొలఁగి పొం డడియాస దొద్దకుఁ జొచ్చినఁ
దల లేటి యుర్వికి బలి యొనర్తు. భార. మా.
౧౭౫.

ద్వి. అద్దిరా మేలు వో హరహర యిదియ, దొద్ద
వో తనకు నీతోడికూటంబు. పండితా.
పురా. ౧౧౪ పా.

జ: దొద్దకత్తె, దొద్దకాఁడు, దొద్దగొను, దొద్ద
యిచ్చు, దొద్దలాడు, దొద్దలువుచ్చు, దొద్ద
లుసేయు, దొద్దవోవు.

దొద్దకత్తె. విణ. (√దొద్ద.) కొల్లపెట్టునది. (శ. ర.)

దొద్దకాఁడు. విణ. (√దొద్ద.) కొల్లపెట్టువాఁడు.

గీ. అచ్చెరువు నొంద మేడలు సొచ్చి యార్చు,
దొద్దకార్లచేఁ బడిపోయెఁ దూర్పుదిక్కు.
ఉ. హరి. ౩. ౩౪.

దొద్ద(లు)గొను. స. క్రి. (దొద్ద+కొను.) కొ
ల్లగొను, దోఁచు.

గీ. తక్కుఁగలయింతిగముల నాదక్కు లడరి,
పట్టుకొని యేచి వీ డెల్ల బన్నపడఁగ, దొ
ద్దగొని...భార. మా. ౧౭౭.

సీ. చనుదోయి యలకలు జక్కవకవపొందుఁ
దుమ్మెదచాయలఁ దొద్దగొనఁగ. కేయూర.
౪. ౧౩౪. (ఇట ఔపమ్యవాచకము.)

ద్వి. అలరుచు భూమీశుఁ డందఱ నొక్క,యి
లు సొర నడిపించి యీశు గాదియల, దొద్దలు
గొన్న యాద్రోహుల కింత, పెద్దగా దనిపొంగి
తద్దఁ గోపించి. పండితా. పురా. ౯౭ పా.

దొద్దయిచ్చు. స. క్రి. (√దొద్ద.) కొల్లగానిచ్చు,
అంతయు నిచ్చు.

సీ. శశిరవిగ్రహజపస్నానాదికము లెల్ల దొరల
వాకిండ్లకే దొద్దయిచ్చి. ఆము. ౬. ౬౯.

దొద్దలాడు. స. క్రి. (దొద్దలు+ఆడు.) కొల్ల
గొట్టు, కొల్లలాడు.

మ. కరమూలంబున మించుఁ బొంచు లిడి కాం
తుం గ్రోలుఁ గప్పూరముం, గురు లఖిం గఖ
ళించు వా తెఱ మెఱుంగుల్ దొద్దలాడుం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఖరో, ధరకుంభంబుల నెక్కి డిగ్గు మెలు
పొందం నీవి కల్గుం దలో, దరినాభీనవదీ
ర్ఘికం బొలుచు నద్ధాత్రీశుచూడఁకల్ వె
సన్. కేయూర. ౮. ౧౭.

దొద్దలువుచ్చు. స. క్రి. (√దొద్దలువోవు.) కొల్లపుచ్చు.

ఉ. నిద్దము లైనభూషణమణిప్రకరద్యుతు ల
న్నిదిక్కులం, దొద్దలువుచ్చి తల్లిచనుదో
యి నడిం దలక్కట్టు మించఁగా, ముద్దులు
చూపుచుం బసిఁడిముద్దగతిం దొడమీఁద
నాడునా,ముద్దుగణేశునిం దలఁచి మ్రొక్కె
ద నీకృతికార్యసిద్ధికిన్. ద్వా. ౧. ౫.

దొద్దలుసేయు. స. క్రి. (దొద్దలు+చేయు.) కొల్లగా నిచ్చు, అంతయు నిచ్చు.

ఉ. పెద్దల నర్థులన్ హితులఁ బెద్దగ నందఱిఁ
గూర్చి యర్థమున్, దొద్దలుసేసె దానిర
తుండనఁ బైకము సిక్కకుండఁగన్. ద్వా.
౩. ౯౬.

దొద్ద(లు)వోవు. అ. క్రి. (√దొద్ద.) కొల్లపోవు. (శ. ర.)

దొద్దు=దొంద. ఆం. భా. ౨. ౧౨౦.

దొన[1]. వి. (సం. తూణం. ప్రా. తోణో.) అమ్ముల పొది, తూణీరము.

గీ. గుహునిపై ... నెఱయ బ్రహ్మాండకుహరం
బు తెఱపి యెల్ల, దొనవిధమ్మున నమ్ముల
తూఁటుకట్టె. కు. సం. ౧౨. ౯౨౦.

గీ. ఇట్టియేఁ దేరు గడపంగ నేఁడు నుతికి, నె
క్కుగాండీవ మేడ్తెఱ నెక్కువెట్టి, రెండు
దొనలును బూని కిరీటి యనికి, వచ్చు నేఁ
డెల్లి యెందుఁ బోవచ్చు మీకు. భార. ఉ
ద్యో. ౨. ౧౩౦.

గీ. తాళ్లు దెగ రావణాదిశాత్రవులయాంద్ర,
త్రాళ్లు తెగు నిట్టు లనెడుచందమున నంత,
మరలి దొన చొచ్చె రఘువీరవరశరంబు,శర
ము దొన చేరు టెందు నైజంబు గాదె.
రామా. ౫. ౨౯౯. భాను. ౩. ౨౯.

దొన[2]. (సం. ద్రోణీ. ప్రా. దోనీ.) ౧. కొండ మీఁదిగుంట, నీటితోఁ గూడిన కొండమీఁది పల్లము.

ఆ. దుర్గమంపుఁజోటు దొనదొన గుహగుహ,
యాదిగాఁగ నెందు నరసియరసి. భార. విరా.
౩. ౭౨.

సీ. గొజ్జంగిపూఁబొదల్ గుబ్బియంగఁ బటికంపు
దొనల నిండినయట్టిశుహినజలము. మను చ.
౨. ౫౫.

మ. అని యూరార్చి కుమారుఁ గొంచుఁ జని
నే యమ్మౌననాథుండు చల్లనిచెంగల్వదొనం
దనూరుధిర మెల్లం దోమి నీరార్చి... సా
రంగ. ౩. ౧౯౮.

౨. (సం. ద్రోణః.) చెఱువు; మడుఁగు.

ద్వి. పనివడి మబ్బులోపలినీళ్లు నమ్మి,దొననీళ్లు
తెగఁ గొట్టుదురె వెఱ్ఱులైన. ద్వి. సారంగ.
౧. ౨౯ పా. ౧౦ పం.

చ. చలువవెలుంగు వేల్పులరసాయనపుందొన
పాలవెల్లిలో, మొలచినముద్దుపాపఁడు కుము
ద్వతివేఁడుకకాఁడు తమ్మిలోఁ,గిలిగలచంద్ర
బింబముఖికిన్ సయిదోడు చకోరభోజనం,
బులనెఱచాత చందురుఁడు పూర్వదిశాస్థలి
నొప్పె నయ్యెడన్. కవిరా. ౫. ౧౭౦.

౩. ఈంద్రవాఁడు కత్తు లుంచుకొనెడు పొది, తోలుసంచి.

క. మోకను నిచ్చెనయును దా, టాకులబందం
బు మెత్త నగువడదోలున్,జో కగుకత్తుల
దొనయును, దూఁకంబునఁ బూని నిల్చెఁ దొ
య్యలియెదుటన్. సురా. ౫౭. (ఈంద్రవా
నికత్తిపిడి అని శ. ర.)

జః దొనయుప్పు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దొనదొన. వి. (త. తొణతొణ.) ఈఁగలు ము సురుటయం దగుధ్వని కనుకరణము.

ఆ. మురిసి మురిసి రాలె మునివ్రేళ్ల నడుముక్క, చదుకఁబడిరొ చీము జాలుకొనిరొ, దనువు మీఁద ముసరె దొనదొన నీఁగలు, వేగిరంబె పెద్దరోగమునను. వరాహ. ౯. ౭౯.

సీ. దొనదొన మనునీఁగతుట్టెలరూ పేఱుప డక క్రంపలను ప్రేలెడుఁగురుసులు. ఆము. ౬. ౧౭.

దొనయుప్పు. వి. (దొన² + ఉప్పు.) సంభరిదేశ మందలి 'రుమ' అనుగనియందు కట్టెలవలనఁ గ లుగు ఉప్పు, రౌమకము. చవుటియుప్పు అని కొందఱు. (శే. ర.)

దొన్నియ=దొన్నె. (త. తొన్నై.)

సీ. చేపట్టుఁ జేసి ప్రేల్చివర గల్గినచిగురరఁటి యాకులదొన్నియల ఘటించి. ఘటికా. ౨. ౧౫.

దొన్నె=దొన్నియ. వి. (సం. ద్రోణీ.క. దొన్నె.) పత్త్రచషకము; నీళ్లుమొ. త్రాగుట కుపయో గించుదొప్ప.

గీ. పత్త్రచషకంబు దొన్నె దొప్పన మను భవ. ఆం. భా. ౨.౨౮౪.

దొప్ప=డొప్ప. వి. ఆకులు మొదలగువానితోఁ గట్టినదొన్నె,పత్త్రచషకము.

సీ. నునుఁబోఁకపొత్తిఁ గుట్టినదొప్పగమితోడ రంభావిశాలపర్ణము పఱచి.ఆము. ౧. ౭౬.

మ.కులదైవం బని యల్కి పూసి గుడి ముగ్గుల్ వెట్టి కైసేయ లోఁపలికి ప్లెంగిలిమంగలంబు లగుదొప్పల్ రాఁ గతం బేమి ... కాశీ. ౩. ౯౬.

సీ. ఆస నిడ్డన నేతి నద్దిని ల్పినదొప్ప పైచప్ప రింతలపనసతొనలు. పాంచాలీ. ౪. ౫౯.

జః దొప్పలుగట్టు.

దొప్పలుగట్టు. అ.క్రి.(దొప్పలు+కట్టు.)మడుఁ గులుకట్టు.

క. తిరుగక విఱుగక యాభీ,కరమేఘము లాహ వంబు గావింపంగా,సరి రెంటినడుమ నెత్తు రు, దొరఁగెం బ్రవహించి నిండె దొప్పలు గట్టక్. వేం. పంచ. ౧. ౨౩౩.

దొప్పు. వి. (క. దొప్పు.) పడుట కొట్టుట మొ. వానియం దగుధ్వని కనుకరణము.

ద్వి. విని రుద్రుఁ డతికోపవివశాత్ముఁ డగుచుఁ, దప్పక చూచుడుఁ దరణియు ధరణి, దొప్పు నఁ బడి శివస్తుతులు సేయుచును. పండితా. దీక్షా. ౩౯ పా.

జః దొప్పుదొప్పు.

దొప్పుదొప్పు. వి. (√దొప్పు. త. తొప్పు తొప్పు.) నోరు అడిచికొనుటయం దగుధ్వని కనుకరణము.

క. ప్రేలెడువెంద్రుక లిరుగడఁ, దూలఁగఁ దల యూఁచు దొప్పుదొప్పున నోరుం,గేల నడిచికొను సెలవుల, లాలలు దొరఁగంగ నన్నలా యని యొఱలుక్. ఉ. హరి. ౪. ౩౦౨.

దొబ్బ. వి. (త. తొప్పై.) ౧. మాంసఖండము, మాంసపుతునుక.

సీ. తారసించినచోట దారునఁ జొరఁబాఱి, యొకటి రెంటిని దొబ్బ లురల నడుచు. మ నుచ. ౪. ౪౨.

ద్వి. బల్లిదుచేతిలోఁ బడినధనంబు, పిల్లివట్టిన దొబ్బ ప్రిదులక పోయె. ద్వి. హరిశ్చ. ఉ. ౧౩౦౭ పం.

౨. ఘనీభూతరక్తము, గడ్డకట్టిననెత్తురు.

సీ:...దొబ్బ నాఘనీభూతరక్తంబు...ఆం.భా. ౨. ౧౩౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దండకము...కండలుఁ దొబ్బలుఁ మాంసముం
గ్రొవ్వు నొండొంటి రాఁ దీయుచుఁ...
దశా. ౪. ౨౩౨.

సీ. పొలసుదొబ్బల నుబ్బుపులుల పెన్బొబ్బలఁగ
డలియుఁ బలుమాలు గలఁగి పొరల.యయా.
౪. ౨౨౩.

దొబ్బు=ద్రొబ్బు. స. క్రి. ౧. అపహరించు,దొం
గిలించు.

(వ్యవ.) నాచేతిసంచి రైలులో నెవరో దొబ్బి
వేసినారు.

౨. రమించు, సంభోగించు.

(వ్యవ.) అది వానిచేత దొబ్బించుకొనినది.(గ్రా.)

వి. బ. (ప్రా. దొబ్బొల్లో.) ఉపాలంభనము,
నింద. ("దుబ్బొల్లో ఉపాలంభః" అని దేశీయ
నామమాల.)

దొబ్బులుపెట్టు = నిందించి బుద్ధిచెప్పు.

(వ్యవ.) పెద్దవారు చిన్నవారిని దొబ్బులుపెట్టు
టలో దోషము లేదు.

దొమ్మ. వి. పశురోగవిశేషము.

క. ఘేఁ తుడుగు నెమరువెట్టదు, చేఁత యుడు
గు ...ఈ తెఱఁగున నుండు దొమ్మ లెఱుఁగుడు
పశులకు. (చికి. చి.ని.)

దొమ్మడోలు. వి. అశ్వగంధ, పెన్నేరు.

సీ. పెన్నే రనంగను బెన్నె రనంగను దొమ్మడో
లనఁగను దోఁచు నశ్వ,గంధ...ఆం. భా.
౨. ౬౩.

దొమ్మర=దొంబర. వి. (తు. దొమ్మరె = స్తంభము
మీఁదను త్రాటిపైనను ఆడువాఁడు.)గడకట్టియా
డి జీవనముచేయుజాతి.

ఉదా: దొమ్మరవాఁడు, దొమ్మరది. (శ.ర.)

జః దొమ్మరి, దొమ్మరికొమ్మ, దొమ్మరీఁడు.

దొమ్మరి=దొంబరి. వి. (దొమ్మర+ఇ.) దొమ్మర
వాఁడు, లఘువిద్యవాఁడు.

గీ. వెలయు దొమ్మరి యన లఘువిద్యవాఁడు.
ఆం. భా. ౨. ౨౭౪.

వ...కొందఱుదొమ్మరులగుటతున నహహో యని
బడిఁ దీఁగెలవెంబడి నెగఁబ్రాకువారును...
ప్రబంధ. ౪౭౭.

దొమ్మరికొమ్మ. వి. (√దొమ్మరి.) దొమ్మరిసాని.

క. దొమ్మరికొమ్మఁ దగుల్కొని, ద్రిమ్మరె నను
లోకనిందఁ ద్రెళ్లకు మిదె శీఘ్ర మ్మేను
మరలి వత్తు ని,జమ్ముగ నామాట నమ్మి చను
ము...చెన్న. ౨. ౩౦౩.

దొమ్మరీఁడు. వి. (దొమ్మర+ఈఁడు.) దొమ్మరి.

సీ. అంతట చామయ్య యనుదొమ్మరీలమేఁటరి తన
వీడును దాను గదలి. చెన్న. ౨. ౨౦౩.

ఆ. దొమ్మరీనిలంజతోఁ గూడ దోసంబు, పాపి
యైన మనసు పట్టరాదు. వేమన. ౨. ౨౪౧.

దొమ్మి. వి. (సం. తుములమ్.) ౧. అందఱు కలి
యఁబడి చేయుయుద్ధము, సంకులయుద్ధము.

ఉ. అంతులు మీఱి మిక్కిలిగ నాఁగతనంబున
దొమ్మి చేసి దు,ర్దాంతపరాక్రమోన్నతులు
దానవదైత్యులు వేల్పువెజ్జు ధ,న్వంతరి చేతి
దుగ్ధమయవార్ధి సుధారసపూర్ణ కుంభముఁ,
సంతసకట్టి పుచ్చుకొని చయ్యన నేఁగిరి నిర్వి
శంకతఁ. భీమ. ౪.౯౬.

ఉ. అంధకకాలకేయమహిషాదులు దైత్యులు
బాహుశైలద,ర్పాంధులు గూడి యొక్క
మొగమై పడి దొమ్మి యొనర్చి...హర. ౬.
౯౫.

౨. యుద్ధము, జగడము.

క. ఆయతభుజైకచక్రం, డాయదుపతి దొమ్మిఁ
గెలువ నడరుమరుని క్ష్మాలాయసచక్రపరం
పర,లో యన నుంగరపుఁగురులు యువతికి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నలరుల్. ఆము. ౫. ౯.
ద్వి. మితితోడ నొసఁగుము మేకొన్న గాధి,సు
తునిబుణం బెల్లఁ జొప్పడఁ దీర్చి, పా మ్మన్న
దీవించి పోదు నీతోడ, దొమ్ములు రేఁపక దొ
సఁగొల్ల నుడిగి. ద్వి.హరిశ్చ. ఉ.౧౨౩౫౦.
సీ. నమ్మియున్నను గ్రమ్మి దొమ్మి సేయు నటంచు
నెమ్మిరూపు సురాధినేత దాల్చె. ఉ. రా.
౩. ౧౭౧. కిరా. ౩. ౨౦.
౩. సమ్మర్దము, రాయిడి.
సీ. అలరుపుప్పొడిదుమ్ము కెలనఁ జల్లుచుఁ గ్రమ్మ
చలువ తెమ్మెరదొమ్మి సొలసి సొలసి. సమీర.
౩. ౧౯.
సీ. వడిఁ జల్లులాడుచు జడియక నిలుచుచు దొ
మ్మిఁ బల్వు రొకర్తుఁ గ్రమ్ముకొనుచు. పరమ.
౪. ౧౦౭.
౪. సమూహము, గుంపు.
క. నెమ్మిగఁ బా నడ తుమ్మెద, దొమ్మిగదా బెడఁ
గుఁగురులు తొలకరిమించుం,గమ్మికదా మె
యి మరుదో, దుమ్మిగదా తగినచూపు తొ
య్యలికి భళీ. కువల. ౩. ౭౯.
విణ. సంకులము.
సీ. వలకారిదొమ్మితేఁటుల నల్గడల రేఁపు మరున
కందిచ్చు ముత్తెరముతూపు. ప్రబంధ. ౨౨.
సీ. గ్రుచ్చి చేతుల మేను ముచ్చుట్టు రాఁ జు
ట్టి దొమ్మియూర్పులతావి గ్రుమ్మరించి. కవిక.
౪. ౧౬౬.
జః దొమ్మికయ్యము,దొమ్మిగూడు, దొమ్మిజగడము,
దొమ్మిరేఁగు, దొమ్ములాడు.
దొమ్మికయ్యము=దొమ్మిజగడము. వి. (దొమ్మి+
కయ్యము.) తుములయుద్ధము, సంకులసమరము.
ఉ...శ్శేద్రిమ్మరి దొమ్మికయ్యమున దిట్టతనం బతి
పూరి మేసితో. దశా. ౨. ౪౧౩.
ఆ. ద్రుపదుపీటిలోన దొమ్మికయ్యము రేఁచెఁ, బ
సులఁ బట్టె విరటుపట్టణమున,...మార్తాండ
తనయుండు...జై.భా. ౧. ౯౨. ప్రబంధ.
౭౮౮.
దొమ్మిగూడు. అ. క్రి. (దొమ్మి+కూడు.) గుంప
గు, కలియు.
గీ. తమ్మిపూమిద్దెగద్దెపైఁ గమ్మవిల్తు,నిమ్ముగా నిల్పి
యెమ్మెను గొమ్మ లెల్లఁ, గ్రమ్ముకొని వెక్క
లాగుల దొమ్మిగూడి, పూజ లొనరించి యి
ట్లని పొగడి రపుడు. నీలా. ౩. ౩౭.
దొమ్మిజగడము=దొమ్మికయ్యము. వి. (దొమ్మి+
జగడము.) తుములము, అందఱు కలియఁబడి చే
యుయుద్ధము.
వ...అనేకప్రకారంబులదొమ్మిజగడంబులఁ జిమ్మి
రేఁగి యహర్నిశంబులు వింశతిదినంబు లెడ
తెగక...ఉ. హరిశ్చ. ౪. ౯౮.
దొమ్మిరేఁగు. అ. క్రి. (√దొమ్మి.) అందఱు నొక
మాఱు పైఁ బడు.
ఉ. అంతటఁ దర్కవిద్యలు పృథాతిశయంబున
దొమ్మిరేఁగి యీ,జంత జగల్లయంబున విశంక
టము క్తి ఘటించు నంచు న,త్యంతముఁ బ్రే
లుచున్నయది నాస్తికురా లిటఁ బట్టి కట్టి
తా,ధింత మటంచు నందఱు నతిత్వరితంబున
వెంటఁ బట్టినన్. ప్రబోధ. ౫. ౯౬.
దొమ్ములాడు. అ. క్రి. (దొమ్ములు+ఆడు.) ౧.
దొమ్మియుద్ధముచేయు (శ.ర.)౨. పెనఁగులాడు.
ఉ...రోషముక్త ప్రణయసంభ్రమము న్మది
దొమ్ములాడ...నరస. ౩. ౧౧౮.
దొయి=దోయి.వి.(సం.ద్వయి.)జంట,యుగ్మము.
క. ఇదె నీరాయనిఁ దెచ్చెద,నెద నుమ్మలికంబు
మాని యెలనాఁగరొ నెమ్మది నుండు మింక
నని చేయిదొయిన్ మొగిడిచి జొహారులిడి
చను నెడలన్. అచ్చ. రా. సుం. ౧౭౩.
దొర. వి. (క. దొరె. త. తురై. దీనికి చివర
పోతు, అయ్య, అనుపదములు కొన్ని ప్రయో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గములందు గాన్పించుచున్నవి.) ౧. ప్రభువు, రాజు; సామంతరాజు.

ద్వి. దొర మేలుకొనఁ డంచు దొరకొన్న చింతఁ। బరిచారకులు వచ్చి పతి సెజ్జ డాసి. రం. రా. అయో. ౧౨౭ పా. ౧౮ పం.

చ. తిరిసినకూడు దెచ్చి నలుదిక్కుల బోడ్డలు తిండి పెట్టఁగాఁ బెరిఁగినపొట్టతోడ నొక పీఁటపయిం దొరవోలె నెవ్వరిన్, సరకుగొనండు... ఉ. హరి. ౪. ౪౬.

క. కురుపతి పడవాళ్లం దగు,దొరలకడకు సత్వరముగ దురమునకు భటో,త్కరము నను పు సేయుటకై, బరవసము దలిర్పఁ బనిచెఁ బార్థివముఖ్యా. భార. శల్య. ౧. ౯౮.

వ... నిశ్చేష్టితులై పడి యేమఱించి చనుతోడు చూపరిసోమరిదొరపోతులును ... రా. వి. ౫. ౩౨.

సీ. సామిసామి పరాకు చక్కనిరాచదొరయ్య దండాలు నీయడుగులకును. ఇందు. ౨. ౪౯.

౨. సేనాధిపతి, మొనగాఁడు, నాయకుఁడు.

ఆ. దొరలు వడిన సేన దూలక యవ్వీరుఁ,జుట్టుముట్టుటయును... భార. ద్రో. ౩. ౧౪౯.

క. కురుపాండవసైన్యంబుల,దొర లడియాలముల నొప్పుతో మెఱయ... భార. భీష్మ. ౧. ౨౪౬.

సీ. బలములు గెడసినఁ గలగుండువడుదొరల్ దొరలు ద్రెళ్లినఁ బొద లూఱుబలము. చంద్రా. ౬. ౧౧౩.

౩. విధము, ప్రకారము.

చ. తులువలు గాక యిట్టిదొరదుర్ణయవృత్తికిఁ జొత్తురయ్య పుత్రులు ననుజన్ములుం జెలులు దుష్పథంబునఁ బోవకుండఁ జుట్టలు దగు వారు దండ్రియు నొడంబడఁ జేయుము కార్యము... భార. ఉద్యో. ౩. ౩౩౧.

౪. సాదృశ్యము, సామ్యము.

క. దొర యెఱిఁగి కోరవలదే, స్మరహరునకు నీకుహస్తిమశకాం,తరము... కు. సం. ౬. ౬౬.

విణ. ౧. సమానుఁడు, సాటియైనవాఁడు.

మ... ఇద్ధతేజంబునన్,దొర సప్తార్చికి లావునం బవనుతోఁ దుల్యుం డగణ్యుండు సం,గరసంక్రీడలయందు... భార. కర్ణ. ౩. ౭౯.

క. సురపురి మధురకు నెక్కుడె, సురకాంతలు మాకు దొరయె సురభంజన నీ, వరుగుట యొప్పనిపని... హరి. పూ. ౯. ౧౪౯.

క. మీలుం దామరపూలున్, మే లగునమ్ముద్దరాలిమినుకుఁగనుఁగవన్, బోలక నీట మునింగెన్, మూలకు దొర గాక యిట్లు మూలకుఁ జేరెన్. అచ్చ. రా. బాల. ౧౩౧. విజ. వి. ౨. ౭౮.

౨. శ్రేష్ఠుఁడు, ఉత్తముఁడు.

వ. అంతఁ దెఱఁగంటిదొరలు నేమకరక్కసులం గూడుకొని కలశజలనిధి మథియించుసమయంబున. దశా. ౨. ౨౮౭.

సీ. తేజునఁ బడగ లెత్తియు నిరుబుట్టువుదొరలఁ గన్గొని మూల దూఱుకొనుచు. అచ్చ. రా. బాల. ౧౦౬.

క... గొల్లదొర యొకఁడు పేర్మిఁ జెలంగున్. నీలా. ౧. ౪౭.

౩. (వయోవిద్యాదులచే) పెద్దవాఁడు, గొప్పవాఁడు.

క... ఇంక జననాయకుఁ డె,ప్పరుసున నానతి యిచ్చెను, దొర లేమని రట్లు చేయఁ దుదిఁ గార్య మగున్. భార. విరా. ౩. ౧౨౨. (యోధవరుఁడు అని శ. ర.)

గీ. ఏఁగు నెడ దుర్నిమిత్తంబు లెన్నియేనిఁ, గనియు వినియు నిశ్శంకతఁ జనకు మనుచు, దొరలు నిల్పిన నిల్వక ... విక్ర. ౩. ౭౩.

సీ. శశరవిగ్రహజపస్నానాదికము లెల్ల దొరల వాకిండ్లకే దొద్దయిచ్చి. ఆము. ౬. ౯౯.

దొరవచ్చు=సమానమగు, సరియగు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. దొరవచ్చె ననవచ్చుఁ దోయజాక్షునిమూ ర్తి
కభిరామలక్ష్మీసమగ్రమహిమ. భీమ. ౧. ౧౦౬.

సీ. చంద్రాస్యయారుతో సారుతో దొరరావు
నీలముల్ చంచలాజాలములును. భోజసుతా. ౨. ౩౪.

దొరవాఁడు=రాజసంబంధి.

ఉ. వాలినదాయవారి దొరవారి నవేకులఁ గూ
ర్చుకొన్నఁగా, కేలజయింపవచ్చు...కు.సం. ౧౧. ౬౬౧.

పెండిలిదొర=పెండ్లిపెద్ద.

సీ. సమరసంక్రీడనసందర్శనాగతసురకోటి పెం
డిలిదొరలు గాఁగ. విక్ర. ౪. ౧౨౩.

వేవెలుంగులదొర=సూర్యుఁడు.

గీ. వేవెలుంగులదొరజోడు శవెలుంగు. ఆము. ౧. ౧౯.

జః దొరసాని.

దొరఁకొను. స. క్రి. ౧. ఉపక్రమించు, ప్రారంభించు.

క. దొరఁకొని పుణ్యము పాపము,నరుఁ డర్థిం
జేయుచుండ నడుమ నొకట న,వ్వెర వెడలి
తప్పినను ద,త్పరిణతిఫల మొందు సంద్రు
ధ ర్మవిధిజ్ఞుల్. భార. ఉద్యో. ౩. ౨౪౦.

ఆ. సురతనాటకంబు దొరఁకొన రాతిరి,కరపు
టమునఁ జల్లువిరు లనంగ, నెఱసె నంబర
మున నెటేఁ దారకలు వియ,జ్జలధిఁ బెరుఁగు
ఫేనసమితి యనఁగ. భా. రా. యు. ౨౬౪౨.

క. దొరఁకొన్నకొలఁది విడువక, చరణపదార్థ
ములనడక సరిసాగెడు వి,స్ఫురణ యది
సమత యనఁ జను ...కావ్యా. ౪. ౭౫.
మనుచ. ౫. ౨౬.

౨. ప్రాపించు, పొందు.

ద్వి. జననాథ నీచేత సమరంబులోన, దునియ
లై పడి ముక్తి దొరఁకొందు ననుచు, ఘనబా
హుఁ డగుపంక్తికంఠుండు సీతఁ, గొనిపోయె
...రం. రా. ఉ. ౧౦౪ పా. ౨౨పం.

అ. క్రి. ౧. యత్నించు, పూను.

క. తను నూరార్పఁగ సఖి దొరఁ,కొనమికి వెనుఁ
బడుచుఁ గీచకుం డాసతితోన్. భార.
విరా. ౨. ౬౦.

సీ...క్రమఱ జీవుండు దేహసంబంధంబు దివిరి
తాల్ప,దొరఁకొని పురుష రేతోబిందుసంబం
ధి యై వధూగర్భంబునందుఁ జొచ్చి. భాగ.
౩. ౯౯౧. విక్ర. ౧. ౭౧.

౨. సిద్ధపడు. (యత్నించు శ. ర.)

శా. పుట్టం బుట్ట శరంబునన్ మొలవ నంభో
యానపాత్రంబునన్, నెట్టం గల్గను గాలిఁ
గొల్వను బురాణింపన్ దొరంకొంటి మీఁ,
దె ట్టేవెంటఁ జరింతు ...భాగ. ౧. ౭.

క. ఉరి ద్రెవ్వఁ గొటికి యిప్పుడ,వెర వారఁగ
నీకు నేను విడుగర సేయం, దొరఁకొనుట
నీదుభాగ్యం, బరిత్వము దొఱంగి మైత్రి
యలవఱపు మదిన్. భార. శాం. ౩.౨౦౫.
నీలా. ౧. ౭౪.

దొరకించు. స. క్రి. (√దొరకు.) ౧. లభించు
నట్లుచేయు, చిక్కునట్లుచేయు.

ఉ...నిన్ను న,ల్లంతన చూచి దైవ మకటా
దొరకించెనె యిట్టినిర్దయ, స్వాంతునిచేతి కీ
భువనసారము నంచుఁ గడుం గలంగితిన్.
కళా. ౩. ౭౫.

క. ధనహీనుఁ డైననాకుం, దనుశక్తియుఁ దొరు
వంబుఁ దటిగినకతనన్, విను మాహారము
మాత్రం,బును దొరకించుటకు వెరవు పుట్టక
యున్నన్. నా. పంచ. ౨. ౧౦౧.

౨. కలుగఁజేయు, సంభవింపఁజేయు.

ఉ. క్రొందలిరాకుబాకుదొరకున్ దొరకించు భ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వంబు చెల్లరే, చందనగంధిచన్నుంగవ చంద్రుండో యింద్రుండో యాయుపేంద్రుండో. కృ. శకుం. ౨. ౧౨.

దొరకించుకొను. స. క్రి. (√దొరకు.) చిక్కునట్లుచేసికొను, పట్టుకొను.

సీ. దుర్యోధనాదులు దొరకించుకొనువేళ విశ్వరూపముఁ జూపువింత యేల. సిం. నార. ౩౩.

గీ. అనఁగఁ బరఁగి నద్దెఁగుల సలరమందు, లరసి దొరకించుకొని తమ్మియ నుఁగు దూర్పు, మలను బొడమక త్తొత్తసె మరలి వచ్చి, లక్ష్మణుని మన్చి యసముఁ దెల్లముగఁ గను ము. అచ్చ. రా. యు. ౪౦౩.

ద్వి. నీలకంఠుండు పాణిగ్రహణంబు, గావించె నించువిల్కాఁడు ... మావిలేఁజిగురు జొంపముతరవారి, దొరకించుకొన్నట్లు తొయ్యలి కంత, శిరమున నిడె గుడజీరంబు మదనుఁ, డలిబలంబుల కిడునాహార మనఁగ. మృ. వి. ౩. ౫౦.

దొరకు=దొరకొను. అ. క్రి. (క. దొరకు.) ౧. లభించు, చిక్కు.

సీ. హలజీవిసందోహములకు బలాకికావిసరంబులకు మంచివెదలు దొరకె. ఆము. ౪. ౧౨౩.

గీ. పెక్కు లేటికి నిం దొక్కటక్కలాఁడి, యిపుడు దొరకినఁగడ యిన్ని యిం పొనర్చు. ఉ. రా. ౪. ౧౭౨. వరాహ. ౫. ౫౪.

౨. సంభవించు, కలుగు.

క. అకలంకత నిట్లనుఁ గొం,చక యేమీ మనము సమరసముదారక్రీడకు నొండొరు మార్కొనుట దొ,రకు నని వచ్చితి నెఱుంగరావాకిను కల్. రాఘవ. ౨. ౭౧.

గీ... నీతోడ నడరి పోర, సిగ్గు గదిరెడు నైన నిస్సీమవృత్తి, దొరయవలసెను దలపాటు దొరకుకతన. భా. రా. యు. ౨౦౪౬.

క. పతిరతిఁ దీఱదు తమి పర, పతిరతి యేరీతి దొరకు...హంస. ౫. ౨౭౦.

౩. శక్యమగు, వీలగు.

క...పాతాళమహో, లోకముకంటెను లో తెం, తో కల దాపరిఖ యెఱుఁగ దొరక దొకరికిఁ. భాగ. ౧౦ పూ. ౧౪౯౩.

గీ. ఆబలీంద్రునితోడి సెయ్యంబు గోరి, తేనియీ రీతి సేవకవృత్తి గాని, దొరతనంబులు మెఱయింప దొరక వింక. దశా. ౨. ౧౧౨.

౪. గృహీతమగు, పట్టుపడు.

ఆ. చిక్కుపడియె దొరకెఁ జేపడె నగపడెఁ, దవిలె పట్టువడియె దగులువడియె, నబ్బెనన గృహీత మయ్యె ననం దగు...ఆం. భా. ౩. ౧౧౫.

జః దొరకించు, దొరకించుకొను, దొరకుపడు, దొరకుసన్నాసి, దొరకొను, దొరకొల్పు, దొరకోలు, దొరకోలుసన్నాసి.

దొరకుపడు. అ. క్రి. (దొరకు + పడు-స్వార్థమున.) లభించు, చిక్కు.

క. అరుదెం దన నికటంబున, కరిగిన దధికర్ణుఁ డంఘ్రిహతి నారెంటిఁ, దొరకుపడఁ బట్టుకొని కంధర విరియం గొటికి చంపి తగ భక్షించెఁ. వేం. పంచ. ౩. ౧౩౩.

ఈక్రిందిప్రయోగమునందుమాత్రము శకటరేఫము గానవచ్చుచున్నది.

గీ. వీర లిందఱకంటెను వెరవు మిగుల, నెఱుఁక నీ కిప్పు డెందుండి దొఱకిపడియె. కు. సం. ౨. ౧౬౪.

దొరకుసన్నాసి = దొరకోలుసన్నాసి. వి. (√దొరకు.) నమ్మించి మోసపుచ్చి దొంగిలించుకొనిపోయెడుదొంగ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. యతి నను చు వేషభాషల నటమటించి,
పొంచి తతి వేచి కన్నియఁ గొంచు నరిగె,
దొరకునవ్వాని యనుమాట తిరము గాఁగ,
నర్జునుం డద్దిరా యెంతదుర్జనుండు. విజ. వి.
౩. ౧౬౧.

దొరకొను=దొరకు. అ. క్రి. (దొరకు+కొను-స్వార్థమున.) ౧. లభించు, చిక్కు.

క. దొరకొన్న ననుభవించుచు, దొరకొనమికిఁ జింత నొంది దురపిల్లక... భార. శాం. ౫. ౩౪౬.

చ...ఉత్తరుఁ డిట వచ్చుచుండి యరదంబు దగం గడపంగ నెవ్వరుం, దొరకొన కున్నఁ దా నితనిఁ దోడ్కొని వచ్చినవాఁడు సూడఁగన్. భార. విరా. ౪. ౪౪.

౨. సంభవించు, కలుగు.

ఉ. పుత్త్రుల కేల ఖేద మగు భూనుత యేనును నీవు జాహ్నవీ,పుత్త్రుఁడు నుండఁగా నహిత మున్ భయమున్ దొరకొన్నె ...భార. సభా. ౨. ౧౩౩.

ద్వి. దొర మేలుకొనఁ డంచు దొరకొన్నచింతఁ, బరిచారకులు వచ్చి పతిసెజ్జ డాసి. రం. రా. అయో. ౧౨౪ పొ. ౧౭ పం. కాశీ. ౪. ౧౩౯.

౩. శక్తమగు, సమర్థమగు.

చ. ఒరులకు నందరానిపద మూర్జితపుణ్యుని రూఢిఁ బొందఁగా, దొరకొని యున్కి నీవికృతదూరమనస్కతఁ గాదె ...భార. మహా. ౪౩.

౪. స్ఫురించు, తోఁచు.

క. కురువంశము ద్రుంచుటకుం, జొరఁ జాలక నామనంబు సుడివడియెడు నే,వెరవును దొరకొనదుగదే, సరసీరుహనాభ పొందు సంపాదింపన్. భార. ఉద్యో. ౪. ౭౬.

౫. సిద్ధించు, నెఱవేఱు.

క. దొరకొను ధర్మము గామమ్ముఁ, బరమగతి యు నర్థమునన పౌరవముఖ్యా. భార. శాం. ౧. ౫౦.

క. తనవగచినకార్యము దొరకొనుటకు ధృతరాష్ట్రపుత్త్రకుఁడు పొంగి పురోచనుఁ బిలిపించి... నెయ్యమున నిట్లనియెన్. భార. ఆది. ౬. ౧౩౩.

౬. చెల్లు, శక్యమగు.

క. నీ వఖిలధర్మవిదుఁడవు,గావున నీ కిట్లు చేయఁగా దొరకొనియెన్. భార. ఆది. ౪. ౧౭౭.

క. క్రతుఫలములు వడయఁగ దుర్గతులకు దొరకొనదు...భార. అర. ౨. ౨౪౨.

శ్లో. న తే శక్యా దరిద్రేణ యజ్ఞాః ప్రాప్తుం మహీపతే. సం. భార. అర. ౭౦.౧౪.భార. ఉద్యో. ౪. ౩౬౬.

దొరకొల్పు. స. క్రి. (√దొరకొను.) ౧. దొరకొనఁజేయు ౨. లభింపఁజేయు.

సీ. తల్లికిఁ దండ్రికిఁ దద్దయు భక్తుఁడై ఫలమూలమధుమాంసములను మేలి, కూడుగూరలు దొరకొల్పి వారికిఁ దృప్తి యావహించుచు...భార. శాం. ౩. ౧౪౪.

మ. పరదారాభినివేశబుద్ధి దలఁపఁ బాపంబు ధర్మార్థముల్, దొరకొల్పంగ నుపాయ మైన నది నిర్దోషంబు...దశకు. ౪. ౯౪.

దొరకోలు. వి. (√దొరకొను.) లభించుట, చిక్కుట; సంభవించుట.

మ...నీయాజ్ఞం బ్రవర్తిల్లఁగా, దొరకో లల్పమె యెల్లకార్యముల సంతోషంబ మాబుద్ధులన్, శరణం బాపదలందు నీవ యనువిశ్వాసంబు భాసిల్లఁగన్. హరి. పూ. ౪.౧౪౦.

మ. వెరవే సంపదఁ గోరి గాండివగుణావిర్భూతబాణాళి కి, ప్లైరమై వచ్చుట యిమ్మహీపతి కితం డేలొక్కొ యత్యంతనిష్ఠుర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శౌర్యోన్నతి నిన్నుఁ దాఁకఁ దలపం జో
ద్యంబు వీఁ డగ్గమై,దొర కోలర్జున నీకు తొం
టిసుకృతస్తోమంబుక ల్మిఁజుమీ. భార. ద్రో.
౩. ౧౭౫.

దొరకోలుసన్నాసి. వి. (√దొరకు.) నమ్మించి
మోసపుచ్చుదొంగ.

గీ. వేసములు వేసి నమ్మించి వెనుక నాఁచు,కొ
నిన దొరకోలుసన్నాసి యనఁగ వెలయు.
ఆం. భా. ౨. ౨౯౧.

గీ. కొదమసింగమనాయక గూఁటికురుజ, ము
చ్చ దొరకోలుసన్నాసి చిచ్చుపిడుగ.
ప్రబంధ. ౬౯౮.

దొరపు. స.క్రి. (√దొరయు.)౧.కలుగఁజేయు.

సీ. నెరసినచో నెల్ల దొరపు దేవత్వ మీయరి
భేదిమాట నవ్యామృతంబొ. చంద్రి. ౫.
౧౦౮.

౨. ఉంచు.

వ...మంజీరశింజారవంబులు కర్ణగాని మాన్ప
నొరదొరపిన వలదొరపరువంపుఁ గైదువు తెఱఁ
గున నిండార దువ్వలువఁ గప్పి...చంద్రి.
౮. ౧౦౬.

దొరయించు. స. క్రి. (√దొరయు.) ౧. కలి
గించు.

సీ. చికిలిచూపులవాని సిరిమించుదొరయించు
దొరయించుకాంచనాంబరమువాని. వసు.
౩. ౮౬.

౨. ఉంచు.

క. భరతాగమపర్యంతము, ధరణీపాలకుని మేను
తైలద్రోణిన్, దొరయింపఁ దత్పరిధానుల, న
రుంధతీప్రాణబంధుఁ డాజ్ఞాపించెన్. చం.
రా. ౮. ౭౬.

దొరయు. స. క్రి. (క. దొరె.) ౧. పోలు.

క. అరయఁగ నాలుగువిధములఁ, బరఁగుఁ జతు
ష్పాదవృత్తిఁ బరఁగినగోవున్, దొరయుచు
నం దొకఁ డెడలిన, వరవర సద్ధర్మ వర్తనము
గుంటువడున్. భార. అను. ౮. ౨౭౫.

శా...లోకైకాపకారిన్ మహా,కోపుం గంసు
వధించి యీతఁడు లసత్కుంభీంద్రనిర్భేదన,
వ్యాపారోగ్రమృగాధిపున్ దొరసె నుద్య
ద్వీర్యధారేయతన్. హరి. ఉ. ౩. ౭౭.

క. కేదొర మొగమున కెన చిగు,రే దొర పల్ల
వ్యతోడ నిజెగుబ్బ లయా,రే దొరయున్
జక్కవకవఁ, బైదలి నలు వెన్న నలువపడఁ
తికిఁ దరమే. అచ్చ. రా. బాల. ౧౩౫.

౨. చేరు, సమీపించు.

మ ... రఘువంశాంభోధిచంద్రుండు త,మ్ముని నె
మ్మోము ప్రసన్నదృష్టిఁ గని సమ్మోదంబు వా
టిల్లె నీ,యనవద్యోక్తి హజారమున్ దొరసి
యన్నా నాల్గునా ళ్లయ్యె...ఉ. రా. ౬.
౩౫౧.

సీ.అన్యరాజన్యరాజ్యస్థితుం డగు వేళ సరిదొరల్
సంధింప దొరయు వేళ. శుక. ౧. ౨౮౬.

౩. స్పృశించు, తాఁకు.

శా. శ్రీరాధాధరబింబముం దొరయురాచిల్కన్
నిజోరస్స్థలీ, రారాజన్మణికాంతి రాఁ బిలిచి
...ఉ. రా. ౧. ౧.

వ...మరందధారాబృందంబు వాఁకలం గలసి
ప్రవహించు సెలయేటిసీటితుంపరలన్ దొరసి
మందగతులం దిరుగు మందపవనంబులన్ దా
ర్కొని...ఉ. రా. ౩. ౧౯౧.

అ. క్రి. ౧. తగులు, అంటుకొను.

చ. అలరుమొగంబుతోడఁ గడు నమ్రిలి నా
కెదు రేల రావు చే,తులు పచరించుచుం
దనువుధూళి మెయిం దొరయంగ నేల త,
న్నెలమిని గౌఁగిలించుకొనవు ...మార్క.
౧. ౨౫౧.

౨. చిక్కుకొను, సక్తమగు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. మరుఁ డనుమేటికిరాతుఁడు, సరభసముగ
ముగ్ధమతుల జనవిహగములన్, దొరసి పడ
నడఁప నొగ్గిన,యురులుసుమీ సంయమీంద్ర
యువిదలు తలఁపక. వాసిష్ఠ. ౧. ౧౧౯.

౩. సాటియగు,సమానమగు.

చ...నూతతనూజుఁడు షోడశాంశమున్, దొర
యఁడు నాకు వాసవసుతున్ మురమర్దనుఁ
జీరికిం గొనన్. భార. కర్ణ. ౧. ౨౫౧.

గీ. కూరగాయ కట్టియ విల్చికొనఁగ వలసి,
యునికి ప్రేపల్లె నీటిపట్టునకు దొరసె. హరి.
పూ. ౬. ౫.

మ...రాజీవపత్రాక్షుతో, దొరయంగా నరుఁ
డెట్టివాఁడును సముద్ధండే మహేంద్రాదిని,
ర్జరు లాదేవునిపాదసేవకులు గారా మీరె
చర్చింపుఁడీ. వరాహ. ౧. ౧౩౯. హర,
౬. ౬౭.

౪. తగు, యుక్తమగు.

చ. నరసుతు నిమ్మహేంద్రగిరినాథు వరింపుము
రూపసంపదన్, దొరయు నితండు నీకు...
నైష. ౫. ౧౩౨.

గీ. తాము మాదేవదేవియుఁ దమకములను, గర
గరికలందు నొక్క రొకరికి దొరసి, జోడు
వాయక మెలఁగంగఁజూచునప్పు, డనఘ సం
తోష మాత్మ నింతంత గాదు. విప్ర. ౪. ౬౪.

క. తెరలక మనము సుభద్రా, కరనాళీకగ్రహే
చ్ఛఁ గప్పఁగఁ జనునా, దొరయదు పురిఁ
జేరి జనవి,సరముల కెఱుకపడ నీ కశార్యతను
ఘృణన్. రాఘవ. ౨. ౯౫.

౫. కలుగు, జనించు.

చ. కరియుఁ గరేణువున్ బెనఁగుకొ్వడి నిచ్చ
లు హెచ్చుమచ్చికల్, దొరసి సుఖించువా
రలకుఁ దోడనె పుట్టిరి...మువ్వు రాత్మజుల్.
ఉ. రా. ౧. ౨౩౨.

గీ. అన్నపానాదు లొకయింత యధికమైన,తతి
నజీర్ణంబ యైనఁ దో దొరయు శ్లేష్మపైత్యవా
తాదికజ్వరబాధలు...దశా. ౨. ౧౩౪.

గీ. దెసలదొరలకు నిటువంటిదెసలు దొరయఁ,
గలరె పరు లింక నతనితోఁ గలని కెదుర.
దశా. ౧. ౨౩౭. ఉ. రా. ౨. ౩౦౬.

౬. ప్రవర్తిల్లు, జరగు.

మ. బెరసెన్ జందనశైలమారుతము గంభీరా
ప్సరోనృత్యముల్, దొరసెం గన్నులపండు
వై జనులు సంతోషించి ఘోషింపఁగన్.
విక్ర. ౧. ౧౭౦.

క. కురిసె విరిసోనవానలు, దొరసె సుధాంధో
వధూమధురగానంబుల్, మొరసె దివిఁ దూ
ర్యరవములు, పిరిసెన్ మునిమానసారవింద
ము లంతన్. రామా. ౩. ౧౧౪. దశా. ౫. ౭౦.

౭. శోభిల్లు, ప్రకాశించు.

బంధురవృత్తము... మే, గరగరికలు సిరి గలనగు
మొగములు కల్కిమెఱుంగుఁగనుంగవలున్,
దొరయఁగ వెలపడఁతులు విటధనముల దోఁ
తురు చొప్పడ నప్పురిలోన్. కళా. ౧. ౧౭.

చ...హరి కిరుగేలుఁదామరలయందును జక్రము
పాంచజన్యమున్,దొరయుఁగతిన్...రామా.
౧. ౭౨.

ద్వి. దొరసి కోనాన్వయదుగ్ధాంబురాశిఁ, బరి
పూర్ణచంద్రుఁ డై భాసిల్లువాఁడు. రం. రా.
బాల. ౩పా. ౧౫పం.

౮. ఉండు, వర్తిల్లు.

సీ. పులకలు నిండారఁ బొడమినదేహంబు ధూళి
ధూసరితమై దొరయువీపు. హంస. ౨.
౧౦౭.

క. అరదం బరదము హరి హరి, కరి కరియున్
భటుఁడు భటుఁడు గాఢచ్ఛలనం, జొరఁబా
తి పోరుతతి బంధురమై తరమెన్న రానిదుర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మై దొరసెన్. రా. వి. ౫. ౯.

దొరయఁగనిచ్చు = చేరనిచ్చు.

చ. మరునకుఁ జైత్రమంత్రి వనమండలరాజ్య ఫలైక కాంచనోత్కరము కరం బొసంగుట యుఁ దావులబచ్చులు చేసి తచ్ఛదావరణ ముఁ బాయ విప్పి పరువంబుగ నెన్నిక క క్కఁజేయుచున్, దొరయఁగనీవు గంటె చెలి ధూర్తవతంసమలీమసాళులన్. వసు. ౩. ౧౩౮.

జ: దొరపు, దొరయించు.

దొరల(ంగ)నాడు. స. క్రి. (దొరలన్[1] + కన్ + ఆడు.) తిరస్కరించు, నిరాకరించు.

సీ. ఉదయార్కబింబంబునొఱపు విడంబంబు దొరలంగనాడుకౌస్తుభముతోడ. ఆము. ౧. ౧౨.

దొరలించు=దొరల్చు, దొలుచు, దొలుపు, దొల్చు దొల్పు. స. క్రి. (√దొరలు[2].) దొరలఁజేయు, కలుపు.

గీ. ఇట్లు తలయంటి యటకలి యిడి సులక్ష,ణా సరోజాక్షి యిఁక నెట్లు నాథ జలము, తె రలి యున్నది దొరలింపఁ దెచ్చికొనఁగ, బా గుగా దూరియవ్వలిబావినీళ్లు. శుక. ౨. ౩౮౨.

దొరలు[1](ర్లు)=తొరలు[1]. అ. క్రి. పరిభ్రమించు, తిరుగు.

క. మరలన్ గర్భము జన్మము, మరణము నిర యమును మఱియు మఱియు నటు నిరంతర సంసృతిచక్రంబున, దొరలి నరుం డొందు సర్వతోదుఃఖములన్. కవిక. ౫. ౧౧౬.

సీ. పొలసు దొర్లఁగఁ జూచుకలికిచూపులమీలు తెలిగన్ను లగుట సందియమని గలదె. ఆము. ౨. ౩౦.

గీ. కప్పడం బెల్ల గాలిచేఁ గదిలి యురియు, నిం ట దొర్లెడుకుండలు నినుపకట్లు, మానిముం తలు నిలిచె నమ్మల్లపతికి, వారికన్యాకటాక్ష మవ్వలికిఁ జనిన. శుక. ౨. ౩౬౦.

౨. రాలు, పడు.

సీ. భానూష్మభీతి ముక్ పడినచుక్కలభంగి దొ రలె పేఁకువగాలిఁ దరుల మంచు. మనుచ. ౫. ౮౦.

ఆ. గణికవలని దెంతఘనమైనసుఖమేని, దాని తల్లివలనఁ దప్పిపోవు, మదిఁ దలంప నెట్టి మధురాన్న మేనియు, నీఁగ దొరలె నేని నిం దు బెట్లు. కవిక. ౮. ౧౧౧.

(వ్యవ.) కుఱ్ఱవాఁడు అరుఁగుమీఁదనుండి క్రిందికి దొర్లినాఁడు.

౩. కలుగు, సంభవించు.

గీ. రక్కసుల ఱేఁడ నీ కిటుల్ ప్రుక్క నేల, దురములోపల మార్తురఁ దొడరి గెలుచు, జాడ లెన్నేని గల వెద జంపు మాలి, చెఱు పు దొరలని ప్రేలిమి సేయు మొకటి. అచ్చ. రా. యు. ౮౩౫.

సీ. వెఱ వెఱుంగఁడు వైరివీరులఁ బొడగన్న వెఱచు బొం కేయెడ దొరలునొయని. మొ. రా. బాల. ౨౦.

౮. అతిశయించు.

మ. మదనమనోహరాంగ మణిమండన నీగురు వాన యంచుఁ బ్రేమ దొరల విన్నవించి నృపుమన్ననఁ గాంచి... శుక. ౧. ౨౫౧.

గీ. అనుచుఁ బరిభావనోల్లేఁ దమ్మాస దొరల, నాడ...ఆము. ౨. ౨౧.

౫. యత్నించు. (స. క్రి. అనుభవించు అని శ. ర.)

క. ఇరువదియేఁడులు తనపాల, మొసఁడు గు డుచు చునికి యెఱిఁగి యున్నే నియుఁ దా,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దొరలక యున్నేనియుఁ ద,త్పరిభోగము
గుడిచినతనిపాలై పోవుక్.విజ్ఞా.వ్యవ.౪౬.
శ్లో. పత్న్యతోఽబ్రువతో భూమేః స్థాని ర్వింశతి
వార్షికీ. యాజ్ఞ. వ్యవ. ౨౪.
జః దొరలనాము.

దొరలు²=తొరలు². అ. క్రి. కలియు, కూడు.
గీ. ద్రోహు లగువేలుపులలోన దొరలియున్న,
పదియునొక్కండురుద్రులఁ బాఱవిడిచె.
కాశీ. ౭. ౭౫.
ద్వి. తొల్లింటిధనముతో దొరలినరాజ్య, మెల్ల
నిచ్చితిని మీ కిది నిక్కువంబు. ద్వి.హరిశ్చ.
పూ. ౧౫౬౪ పం.
(కందర్పస్యందనము.)వ...అంతరిక్షమహాప్లక్షం
బునకు నక్షామచంచుపుటప్రవాళఖండప్ర
భాహిండనంబున దొరలుఫలవిటపలక్ష్మి నావ
హించుచు...పాండు. ౪. ౨౩౭.

దొరల్చు=దొరలించు. స. క్రి. (√దొరలు²)
౧. కలుపు.
(చకోరవిషయము) సీ. నిగరంపుమోవి తేనియల
తోన దొరల్చి చెలువ లిచ్చిన సంతసించుఁ
గొన్ని. వేం. పంచ. ౪. ౨౪౧.
౨. ఒకదానికి మాఱుగా కైకొను, మార్చు.
ఉ. ఆయతికాని కీడు మమరాలయముఖ్యము
లాతఁ డర్థత్వ,స్థాయుతుఁడై నిజోర్వి నగు
నష్టికిఁదద్ధనముం దొరల్చి రా,జాయతనంబుఁ
జేర్చు...ఆము. ౪. ౨౧౫.

దొరవి=దొరువు.
(కొలను.)
క. క్రీడి వెఱ గంది కనుఁగొనఁ, గేడించుచు
నొండుదొరవికిం జని యచటం,జూడ భయం
కర మగుచును, గోడిగ తద్రూప ముడిఁగి
కొల్పులి యయ్యెక్ః జై. భా. ౫. ౯౭.

దొరసాని. వి. (√దొర.) రాజ్ఞి, రాణి.
సీ. దొరసాని రాణి నాఁ దోఁచుచుండును
రాజ్ఞి...ఆం. భా. ౨. ౧౦౭.
సీ. దొడ్డిపట్టుల దొడ్డదొరసానులయొడళ్లసొమ్ము
లు సొమ్ములు సొంపు నెఱప. అచ్చ. రా.
బాల. ౩౩.

దొరసెము. వి.నిరుటికి వెనుకసంవత్సరము,పూర్వ
తరవత్సరము.
చ. దొరసెమునందు చుట్టుకొని తోరణకట్టె
నురోవిభాగముక్, నిరుడు పయోజకోశర
నుణీయతఁ దాల్చెను వర్తమానవ,త్సరమున
నొస్పె హేమకలశంబులబాగున ముందటేఁ
టికిక్, గరినిభయానచన్నుఁగవ కౌఁగిలిపట్టు
లు గాక యుండునే. క్రీడా. ౨౫.
శ్లో. పరారి సందర్శితసన్నివేశౌ, పరుత్ పరా
భూతసరోజకోశౌ, ఇహైవమస్తాళఫలో
పమేయౌ, కుచౌ కియంతౌ పురతో భవే
తామ్. (చాటువు.)

దొరుగండి. వి. (గొరువు+గండి.) నిండినపుడు
నీళ్లు వెలుపటికి పోవుటకై యేర్పఱిచినదొరువు
తూము.
సీ. మడువులు పసులకాల్మడిఁబ్రచ్చె దొరుగం
డివ్రంతలు పెనురొంపివ్రంత లయ్యె. హరి.
పూ. ౬. ౫.

దొరువు(ర్వ)=దొరవి.వి. ౧. నడబావి, ఒకవిధ
మైన చెలమ.
క. తిరుకొళము నూయి లోటయుఁ,జెఱువు
మడువు లొంపు కుంట చెలమ పడియ కో,
నెఱు బుగ్గ వాఁగు దొన తల,పరి గుండము
కాల్వ డిగియ బావి దొరువు లక్. హంస.
౪. ౨౧౦.
౨. చెఱువు, కొలను.
గీ. తోఁచె హరిణాంకబింబంబు నాఁచుతోడి,
దొరువుగతి సంబరము మడికరణి నుండె.
వరాహ. ౪. ౧౪౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ...తమ్ములపొత్తుమొత్తంబుతోఁ దగుదొరువు
ను...అచ్చ. భా. ౨. ౧౩ పా.
శ్లో. వికచవారిరుహం దధతం సరః ... సం.
కిరా. ౫. ౧౩.
గీ. ఎండకాఁకలఁ బొరలాడు నేకలముల,చములు
దేఱెడుదొరువుల జలముఁ గ్రోలి. చంద్రా.
౨. ౬౫.
జః దొరుగండి, దొరువుపట్టెడ.

దొరువుపట్టెడ. వి.(దొరువు+పట్టెడ.) ఎద్దుము
డ్డికి తగిలించెడుపట్టిక.(బ్రా.)గంతయెద్దులతోఁక
క్రింద తగిలించెడుపట్టెడ. (శ. ర)

దొఱయు. స. క్రి. ౧. పొందు, ప్రాపించు.
చ...మనోభవు మెంతయున్, మెఱయఁగ సం
తకన్న మను మించె శ్రమోదకవృష్టి చిత్ర
తన్, దొఱయఁగ మున్నె క్షేత్రమునఁ దో
రముగాఁ బులకాఖ్యసస్యముల్. చంద్రి.
౩. ౪౫.
రగడ. కుఱుచ లైనను నిచ్చ మదమునఁ గొఱ
లు నీయేనుంగుగున్నలు, దొఱయ నొకపరి
పాటిదొరలకు చౌరక వీవిడికెంపుమిన్నలు.
శుక. ౧. ౧౩౩.
ఉ. చఱచి కలంగఁ జేసియును జంపఁగ నొల్లక
గోస్వరూపతన్, దొఱసినరాక్షసాంగనలఁ
దోలె నతండు నిమేషమాత్రలోన్. హరి.
పూ. ౬. ౭౭. కాశీ. ౫. ౨౬౧.
౨. పొందు, కూడు, రమించు.
క. గొఱకై బ్రాహ్మణకన్యక, దొఱసినశూద్రుం
డు ప్రీతితో నొక్కటియై, వెఱవక పుట్టిం
చినయా, జఱభికిఁ బుట్టినయతండు చండా
లుఁ డగున్. విజ్ఞా. ఆచా. ౧౩౯.
అ. క్రి. కలియు, కూడు.
చ. ఎదురుగ వచ్చి పాండ్యధరణీశ్వరుఁ డర్జునుఁ
గాంచి నేఁడుగా, సుదినము మీరు రాఁ
గలుగుశోభన మెన్నఁడు గల్గుఁ బ్రోలికిం,
బదఁ డని యిద్దఱుం దొఱసి భద్రగజం
బుల నెక్కి వచ్చిరి...విజ. వి. ౧. ౧౫౫.
సీ. గళదసృగ్ఛళఘృర్కణపరంపరలతో నఱుతము
తైపుసరుల్ దొఱసి యాడ. శుక. ౧.
౩౯౭.

దొలుక=డొలుక. వి. (√దొలుచు.) అంతస్సా
రహీన పుగుకాయ మొదలగుపదార్థము, లోపల
సారము లేనివస్తువు.
క. పలుచని నెత్తురుపడుఁగులఁ, బొలిచెన్ రథ
నేమికలయములు రణహతవీరులు దూఱఁగ
రవిబింబము, దొలుకై రుచి మాలి నీడఁ
దోఁచినమాడ్కిన్. కవిక. ౨. ౧౯౩.

దొలుచు(ల్చు.)=దొరలించు.స.క్రి.౧.దొరలఁ
జేయు.
సీ...అన్యోన్యసంఘట్టనారవంబు, లెసఁగఁగ
సంగ్రామ మేర్పడఁ జేయక యక్షముల్
దొలిచి యే నక్షమమున. భార. సభా.
౨. ౧౪౭.
శ్లో... అక్షాన్ క్షిపన్. సం. భార. సభా.
౭౨. ౩.
గీ. అభిమతాక్షముల్ దొల్చి మాయావిదుండు,
సుబలరాజాత్మజుఁడు ధర్మసుతు జయించె.
భార. సభా. ౨. ౧౭౬.
ద్వి. మద్దియ యాతండె మొగి బోలు దొలిపి,
మద్దులఁ గెడపినమహితశౌర్యుండు. ద్వి.భా
గ. ౩. ౪౯ పా.
౨. రంధ్రముచేయు, ఛేదించు.
సీ. తమ్మిఁ దాల్చినవాని తమ్మి దొల్చినవానిఁ
దమ్మి మొల్చినవానిఁ దారసించు. నరస.
౧. ౬౪.
చ. వడిఁ దలఁ ద్రొక్కి మ్రుక్కిన నవారణఁ
గన్నులు దొల్వఁ బొల్పుబ,ల్విడఁ దమకించు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాయసములీల మదీయసమీపవర్తియై, యుడుగక కీడు నాకుఁ గడు నుగ్రముగా నొనరించె ...హరి. పూ. ౭. ౬౩.

జః దొలుక, దొలుపు.

దొలుపు(ల్పు.)=దొరలించు. స. క్రి. (√దొలుచు.) దొరలఁజేయు.

ఉ. కష్టనియూర్పు గాడ్పు చలకమ్రకుచమ్ముల పూఁత యూఁతఁ గా, నెమ్మెయి ఘర్మముల్ దొలుప...పాంచా. ౫. ౭౮.

సీ...పరికరద్రవ్య మెల్ల. గీ. మఱచి పదిలంబు సేయ నేమఱి తదీయశాల నిద్రింప శునక మచ్చాయ నొకటి, యిచ్చఁ జొచ్చి పురోడాశ మెల్ల మెసవి, యాజ్యపాత్రలు దొలిపి తనంతఁ జనియె. శ్రీరంగ. ౬. ౭౩.

వి. ఇరుసు పెట్టుటకు ఉపయోగపడునట్లు దొలిచి చేసినదారుమయశకటావయవము.

(వ్యవ.) ఈబండిదొలుపుపట్టె గట్టిగా నున్నది.

దొల్లు=డొల్లు. అ. క్రి. దొరలు.

ద్వి. లాలాసుధారసోల్లసిలమై చంద్రుపోలిక ముఖబింబమును దేజరిలఁగ, దొల్లుబండి యను దైత్యుని స్రుక్కి నేల, డొల్లంగఁ దన్ని... అ. మ. క. ౧. ౭౮ పా. ౨౩ పం.

జః దొల్లుపుచ్చకాయ.

దొల్లుపుచ్చకాయ. వి. (√దొల్లు.) పిల్లలఆటలయందు కొంతసే పాకపక్షమునను మఱికొంతసే పాకపక్షమునను ఉండువాఁడు, పుచ్చకాయ దొర్లినట్లు దొల్లువాఁడు.

(వ్యవ.) ఆటలో ఆపిల్లవాఁడు దొల్లుపుచ్చకాయగా నున్నాఁడు.

దొసఁగు=దొసవు. వి. ౧. ఆపద, చిక్కు.

చ. దొసఁగులు వచ్చువేళ గుణధుర్యులధైర్యగుణంబు సర్వమున్, బసచెడు నంచుఁ జూచెదవు పాపపుదైవమ ...భర్తృ. ౧. ౯౦.

క. అసురుల కమృతము పోయుట, పొసఁగదు పాములకుఁ బాలు పోసినమాడ్కిన్, దొసఁగగు నంచును వే ఱొక, దెసఁ గూర్చుండంగఁ బెట్టె దేవహితులన్. భాగ. ౮. ౩౧౬.

౨. కష్టము, పీడ, బాధ.

గీ. అన్ని వడియును బంధుక్షయంబు సేయ, నొల్ల కెల్లవిధంబుల నుపశమంబ, కోరి రప్పాండవేయులు వారి కట్టి, దొసఁగు వచ్చెనె...భార. ఉద్యో. ౪. ౫౫.

ఆ. కొఱఁత తీఱె నెల్లకోర్కులు సమకూరెఁ, దుట్టు వాసె నింక దొసఁగు లేదు. భా. రా. యు. ౨౨౫౨.

దండకము...దుంతబాబావజీరుండు గాటింప మీఱన్ దొసంగు ల్వెసం బొంది ...నీలా. ౨. ౪౧. భార. ద్రో. ౧. ౧౧౧.

౩. కీడు, అపకారము.

ద్వి. సొలపు దీఱఁగ వసిష్ఠునియింటఁ గుడిచి, తొలఁగి పోవుచు నెన్ని దొసఁగులు సేసె. ద్వి. హరిశ్చ. ఉ. ౪౪౬ పం.

౪. విఘ్నము.

సీ. నేలతాలుపురాచచూలిగాదిలికందు దొసఁగుఁజీకటిచాల్పుతొగలవిందు. అచ్చ. రా. పీఠి. ౭.

గీ. కవదొనలు పూని వెంట లక్ష్మణుఁడు నడవ, రామభద్రుండు నావెంట రా నియోగ, మొసఁగితివయేని రాకాసిదొసఁగు మాని, యవభృథస్నాత నగుదు నోయధిప యనుఁడు. చం. రా. ౨. ౬౧.

౫. (కావ్య) దోషము, తప్పు.

(వ్యవ.) నాకవితయందలిదొసఁగులు విడిచి గుణంబున్న గ్రహియింప వేఁడుకోలు.

౬. పాపము.

సీ. దోస మనంగను దొసఁగు దొసంగు నాఁగ సటు నాఁ బాపంబుఁ గాఁ దనర్చు. ఆం. భా. ౧. ౯౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౩. సంబంధము, సాంగత్యము.

సీ. చదువులతోడిదొసంగు చాలించె మును
మున్న తీర్థ మాడెద నన్న తెరువు వదలె. రుక్మా. ౪. ౧౦౨.

జః దొసఁగులఁబెట్టు.

దొసఁగులఁబెట్టు. స. క్రి. (దొసఁగులన్ + పెట్టు.) పీడించు, బాధించు.

చ...శరాళి రుద్రులన్, దొసఁగులఁబెట్టి చార
ణులదోహాళముల్ సడలించి యమ్మరు,ద్విస
రము నొంచి భాస్కరుల బీరముమాన్చి
పరాక్రమించినన్. ఉ. రా. ౪. ౨౯౨.

దొసవు=దొసఁగు. (శ. ర.)

## దో

దో. సం. వి. స్. పుం. న. బాహువు.

ఉ...తదీయదంతములు దోల నమర్చినఁ జూడ
నొప్పి రా,చెంగటఁ గాలదండములు చేకొని
యున్నయమద్వయం బనన్. వి. పు. ౩.౪౦౩.

దోఁకిస. వి. దోఁకుట. (శ. ర.)

దోఁకు[1]=డొంకు. అ. క్రి. ఇంకు; అడఁగు.

సీ. ఉద్వేల మగుచుఁ బె ల్లుబ్బెడురాగవా
ర్ధులు లేశమైనను దోఁక వయ్యె. పి. శకుం. ౩. ౨౧౯.

దోఁకు[2]=డోఁకు[2]. స. క్రి. నేలను ఎదురుగా చెక్కు. (శ. ర, వా.)

జః దోఁకిస, దోఁకుడు, దోఁకుడుపాఱ.

దోఁకుడు. వి. (√దోఁకు[2].) దోఁకిస, దోఁకుట. (శ. ర.)

దోఁకుడుపాఱ. వి. (√ దోఁకు[2]. త. తోండు పాఱై.) దోఁకునట్టిపాఱ, చెక్కుడుపాఱ.

గీ. పరఁగుఁ దవుగోల దోఁకుడుపాఱ నాఁగ. ఆం. భా. ౨. ౨౩౦.

దోఁకుడుబారి. వి. బాలక్రీడావిశేషము,గూఢ మణి. (శ. ర.)

దోఁగాడు, దోఁగియాడు=డోఁగాడు.అ.క్రి. (√దోఁగు[2].) బిడ్డ నేలపైని జేతు లూఁది మోకాళ్లతో నడచు, ప్రాఁకు.

క. బోరగిలి పొట్టజీరలు, నేరిచి దోఁగాడి
లేచి నిలుచుచుఁ బడుచున్, నేరమివలెనే
మేనక,కోరిక చిచ్చుక్కి కొంత కొనసాఁగిం
చెన్. పార్వ. ౨. ౧౩.

సీ. కొమరొప్పఁ దనుదాన కూర్చుండఁగా
నేర్చె నాడకాడకు దోఁగియాడ నేర్చె. చంద్రా. ౨. ౪.

ద్వి. అంత నొయ్యన దోఁగియాడంగ నేర్చె. ద్వి. పరమ. ౫. ౩౩౩ పా (చి.ని. పా.)

దోఁగు[1]=డోఁగు[1]. చర్మముఊడు, తోలుఒలియు.

సీ...చెక్కుఁ బోయినవాఁడుఁ బ్రక్కయెముక,
మురిసినవాఁడును మొగము దోఁగినవాఁడు
నై నొచ్చి...రామా. ౮. ౧౩౩.

దోఁగు[2]=డోఁగు[2]. అ. క్రి. ప్రాఁకు.

వ...నొచ్చియుఁ జొచ్చియుఁ దెరలియుఁ బొర
లియు దోఁగియు డాఁగియు...కృతాంతు
సన్నిధికిం బోయిరి. శివరా.౪. ౮౩.

జః దోఁగాడు.

దోఁగు[3]. అ. క్రి. (క. దోగె.) కన్నముపేయు; చొచ్చు. (చూ. దోఁగురు.)

జః దోఁగురు, దోఁచు, దోఁపరి, దోఁపిడి, దోఁపి
డికాఁడు, దోఁపిడియాటలు, దోఁపు, దోఁపు
కాఁడు, దోఁపుచూఱు, దోఁపుడు, దోఁపుడు
కాఁడు, దోఁపుపడు, దోఁపుపోవు, దోయిడి.

దోఁగురు. వి. (√దోఁగు[3].) చౌర్యము, దొంగతనము.

సీ. దోఁగురు నాఁగను దోఁపడ మనఁగను దోఁపు
డు నాఁగను దోఁపు నాఁగ, దొంగటిక మనం
గ దొంగతన మనంగఁ జౌర్యంబు చెల్లు...
ఆం. భా. ౨. ౨౯౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దోఁచు. స. క్రి. (√దోఁగు³.) ౧. కొల్లగొను, కొల్లగొట్టు.

సీ...కుశస్థలి యుగ్రులైన. గీ. రాక్షసులు దోఁచికొనుటయు రాజనూను, లఖిలదిశలఁ జెల్లాచెద రైరి భీతి. హరి. పూ. ౨. ౧౭.

సీ. మునులభార్యల దోఁచుకొని పురోడాశంబు మెక్కి వేదులు గొఱచక్కులాడి. వరాహ. ౫. ౧౧౫.

క. ఈనియమం బీడేఱుట,కై నిశ్శంకతను ద్రోవ లరికట్టి ప్రజం,బోనీక దోఁచియును నిం,పూనంగాఁ గన్న వెట్టియు ధనము గూర్చున్. పరమ. ౪. ౨౦౦.

౨. అపహరించు.

(క) దొంగిలించు.

ఉ...నేఁ డిదె ప్రొద్దు దోఁచుకో,నిక్కడ వాట మంచు మది నెంచఁగ వారికి నక్కడక్కడన్. కాళ. ౪. ౬౬.

ఆ. దోఁపు నిచ్చువాఁడు తోడసె నెఱదాత, దోఁచుకొన్నవాఁడు ద్రోహియయ్యె. వేమన. ౩. ౬౯.

చ. కరువలిరక్కసుల్ కినుక గ్రమ్మి వడంకఁగ మ్రాఁకువేల్పులన్, దొరకొని యాకురెంబెములు దోఁచఁగఁ గోవెల కూఁతఁ జెప్పఁగా, నరయుచు వారలం గడిమి నామనివెన్నుఁడు నొంపఁ జిందునెత్తురుబలె లేఁజిగు ళ్లలరెఁ దోఁపులఁ జూపఱచూడ్కిపండువై. యయా. ౪. ౩.

(చ) బలత్కారముగా తీసికొనిపోవు.

క. ప్రాణముల కెక్కుఁ డగు నా,ప్రాణేశ్వరి దోఁచికొనియె...భా. రా. కిష్కిం.౧౦౭.

(ట) బలాత్కారమున లాగు.

సీ...కృష్ణ సారప్రేక్ష ప్రబలోగ్రతను స్వకపటము దోఁప, మలయుదుశ్శాసనమత్సరంబు న శంకితత్వంబు నొంది సత్వరిత యగుచు. రాఘవ. ౩. ౨౦.

గీ. వల్కలంబులు దోఁచిన వంగువారుఁ,జెఱలు వోయినవారలఁ జీరువారు. ఉ. హరి. ౧. ౧౦౨.

(త) మోసముచే గ్రహించు.

సీ. అన్నదాతల మంచు యాయజూకుల మంచు దొరలచే రూకలు దోఁచువారు.దశా.౧౦. ౧౦౫.

బంధురవృత్తము. గరగరికలు సిరి గలనగు మొగముల్ కల్కిమెఱుంగుఁగనుంగవలున్, దొరయఁగ వెలపడఁతులు విటధనముల దోఁతురు చొప్పడ నప్పురిలోన్. కళా. ౧. ౧౮. ప్రబంధ. ౨౧.

దోఁటమ్ము. వి. (దోఁటి + అమ్ము-త. తొఱట్టంబు.) దోఁటివలె వంపైనఅలుఁగు గలబాణము, కర్ణిశరము. (శ. ర.)

దోఁటి. వి. (క. దోఁటి.త. తొఱట్టి.) ౧.డొంకెన,అందనిపండ్లు మొ. వానిని కోయుట కుపయుక్తముగా వంకరచిల్ల దోఁపినకోల.

రగడ. గుమగుమనివాసనలగేదఁగికొమ్మ కొమ్మకు నందె దోఁటికి. పారి. ౪. ౧౬.

చ...సిరి గలవాఁడు లభ్య మగుఁ జిత్తమునందుఁ దలంచినంతనే, నరులకు నెట్టికార్యమ యినన్ జతకాదు బహుప్రయత్నముల్,జరిపిననైన లేమిరొడ సత్యముసుమ్మది చేతికందు పండరయఁగ దోఁటి కందదుగదా యనుసామ్యముపోల్కి భాస్కరా.భా. శ. ౧౦౫.

జః దోఁటమ్ము, దోఁటిముక్కర.

దోఁటిముక్కర. వి. (√దోఁటి.)దోఁటివంటిముంగర, డొంకెనవలె వంపయిననాసాభరణము. (శ. ర.)

దోఁటు. స.క్రి.ఇచ్చు.(ఇదివాడుకలోనిది.శ.ర.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దోఁపరి. విణ. (దోఁపు+అరి[3].) ౧. దొంగ.

సీ. దొంగ తెక్కలికాఁడు దోఁపరి ముచ్చు జా
జరకాఁ డనంగఁ దస్కరుఁడు వెలయు. ఆం.
భా. ౨. ౨౯౧.

౨. కొల్లగాఁడు. (శ. ర.)

దోఁపిడి. వి. (దోఁపు+ఇడి.) ౧. దోఁచుకొను
ట, అపహరించుట. ౨. కొల్ల (శ. ర.)

బ. బాలక్రీడావిశేషము.

సీ. పెంచులబేరి దోఁపిళ్లు గాలిపటంబు సరిబేసి
పుటచెండు చాకిమూట. హంస. ౩. ౧౪౬.

దోఁపిడికాఁడు. విణ. (దోఁపిడి+కాఁడు.) ౧.
దొంగ. ౨. కొల్లకాఁడు (శ. ర.)

దోఁపిడియాటలు. వి. బ. (√దోఁపిడి.) బాల
క్రీడావిశేషము.

సీ. తూరన తుంకముల్ దోఁపిడియాటలు...ప్ర
బంధ. ౬౧౩.

దోఁపు. స. క్రి. (√దోఁగు[3].) చొప్పించు, చొ
నుపు, (పువ్వులు మొ. తల మున్నగువానిలోఁ)
పెట్టుకొను.

ద్వి. తెలిమోము లరదోఁపఁ దిగిచినకావి, జిలుఁ
గుముసుంగులోఁ జెంగల్వరేకు,లొసపరిగా
దోఁపియున్నకహ్లార, కుసుమగంధంబు లా
గుబ్బగా నొలయ. ద్వి. హరిశ్చ. పూ.
౯౨౭ పం.

సీ. శిరమున దోఁపినసురమహీరుహపుష్పముల
తావి దిక్కులఁ గలయఁ బొలయ. చిత్రభా.
౫. ౬౯.

చ. ...మట్టికాసెలన్, బిడియము లంట దోఁపి పృ
థుభీషణబాహుల సాళువంబులన్, దడవి
కెరల్చుచున్ జనిరి నాథునిమ్రోల నృపాల
నందనుల్. మనుచ. ౪. ౩౦.

౧. వి. కొల్ల, దోఁపిడి.

గీ. కలవి మామాఁక నిప్పింతుఁ దొలఁగుఁ డొ
కటి, యాఁడుదానిఁ జేసఁటుకుఁ డనుచుఁ బెద్ద,
తనము నభిమానమును దెంపు గనఁగఁ బలికి,
నిలిపి దోఁ పిచ్చువారు నై తొలఁగి రపుడు.
ఆము. ౬. ౭౭.

ఉ. ఇం కిట దోఁపె కాక పుర మెయ్యది నీకు
నిశాచరేంద్ర...దశా. ౨. ౪౧౦.

ఆ. దోఁపునిచ్చువాఁడు తోడనె నెఱదాత,
దోఁచుకొన్నవాఁడు ద్రోహి యయ్యె. వే
మన. ౩. ౬౯.

౨. పూర్ణానకము, ఉత్సవాదులందు సర్వస్వము
నిచ్చుట.

గీ. లాస్య మొనరించె నక్కమలాస్య యపుడు,
కోపుకోపున దొర లెల్ల దోఁపు లొసఁగ.
వైజ. ౧. ౧౨౯.

గీ. దోఁ పొసంగక పోదువే దొడ్డదొరవు. దశా.
౨. ౪౦౯.

నిలువుదోఁపు = సంతోషములో దేవున కిచ్చు
దేహమునందలిసర్వాభరణములమొత్తము.

దోఁపుకాఁడు. విణ. (దోఁపు+కాఁడు.) ౧.
దొంగ. ౨. కొల్లగాఁడు. (శ. ర.)

దోఁపుచూరు. వి. (దోఁపు+చూరు.) అంతశ్ఛది,
అరుఁగులు మున్నగువానికి జల్లు కొట్టకుండుటకై
తాటియాకులు మొదలగునవి చెరివి పెంచిన
చూరు.

సీ. దోఁపుచూ రనఁగను దోఁచు నంతశ్ఛది...
ఆం. భా. ౨. ౨౧. ('దోఁపుదూల్పు' ప్రాఁ
తప్రతిపా.)

దోఁపుడు. వి. (√దోఁగు[3].) ౧. దోఁచుట. ౨.
కొల్ల. (శ.ర.)

దోఁపుడుకాఁడు. వి. (దోఁపుడు+కాఁడు.) ౧.
దొంగ. ౨. కొల్లగాఁడు. (శ. ర.)

దోఁపుపడు. అ. క్రి. (దోఁపు+పడు.) కొల్ల
నొందు, దొంగిలింపఁబడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. భవదూరసంభవబహువైశ్యకోటికా తురక లచే నిట్లు దోఁపుపడుట. సిం. నార. ౪౫.

**దోఁపుపోవు.** (దోఁపు + పోవు.) నులివడు.

ఆ. దోఁపుపోయె ననుట దోఁచు నులివడెన, నంగ...ఆం. భా. ౩. ౧౧౯.

**దోగ్ధ.** సం.విణ. (ఋ. గ్ధ్రీ. ఋ.) పాలు పిదుకు వాఁడు.వి. ఋ. పుం.౧. గొల్లఁడు.౨. దూడ. ౩. అర్థోపజీవి, ధనమునకై యెవరికేని యేపని యేని చేసి బ్రదుకువాఁడు. ౪. ధనమున స్తుతిం చుచు కవిత్వము చెప్పి జీవించెడుకవి.

**దోగ్ధ్రి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఈనినఆవు, పాఁడియావు. ౨. పాలిచ్చుదాది. ౩. గొల్లది.

**దోణ(ణా)ము=ద్రోణము.** వి. (క. దోణవు.) ౧. భుజములకు బలము వచ్చుటకై త్రిప్పెడు జెట్టివానియుపకరణవిశేషము. ౨. మ్రాను సుక రముగాఁ జీల్చుటకై యక్కడక్కడఁ జెక్కిన కొయ్యమేఁకులను దిగఁగొట్టుఉపకరణవిశేష ము. (శ. ర.)

**దోతి.** వి. (హిం. ధోతీ.)=దోవతి.

ఉ...తడిదోతులు మూఁపులఁ దాల్చి స్తోత్రపా, ఠావలితాస్యులై నిజశయంబులఁ జెంబులు బూని యేఁగునీ, కేవలపుణ్యమూర్తుల నకించ నవృత్తుల రంగనాధస, ప్తావరణ ప్రదక్షిణ బరాయణులం గనుఁగొంటె మన్మథా. చంద్రభా. ౨. ౧౧౪. (చి. ని. పా. తడి దోవతి, ముద్రి.)

**దోదసి.** (సం. ద్వాదశీ. ప్రా. దాదసి, దోదసి. క. దోదసి.)పక్షములో వచ్చుపండ్రెండవతిథి, ద్వాదశి. (శ. ర.)

**దోదుమ్మి(మి,మ్ము,ము).** వి.ఖడ్గవిశేషము;ఖడ్గము. (ఆయుధవిశేషము. అని శ. ర.)

సీ. తేనియబాప్పంబు నూనియజిగిఁ జిమ్ముతమ్మి పూఱెమ్మదోదుమ్మికత్తి. ఘటికా. ౨. ౨౫.

గీ. మోదమున నైదుతూపులఁ బాదుసాహి,తమ్మి దోఁగుమ్మిఁ గొంది డెందమ్ము గ్రుమ్మి,క్రమ్ము కొని దొమ్మి సేసిన సామ్మసిల్లి, యమ్మహా మహుఁ డిట్లను నెమ్మనమున. ఉ. రా. ౩. ౪౫౯.

ద్వి. దుమ్ములచేత దోదుమ్ములచేత...,కత్తులచేతఁ జీకాకుసేయించి. రఘునా. ౧౨ పా. (బ్రాహ్మణవసిష్ఠన్యాయమున 'దోదుమ్ములచేత కత్తులచేత' అని యుభయమును గ్రహింపఁ బడినది.)

గీ. నెమ్మి దోదుమ్మి బంగారునీటుకమ్మి, చమర వాలమ్ము వాలమ్ముసాటి యౌను, గతియు నూఁగారు నెమ్మేను కచము చూపు, బాలికా మణి కెపుడు భూపాలతిలక. కృష్ణ.౪.౫౫.

ఉ. తమ్మి గదా మొగంబు నెఱతావులకీవుల నీనుజాళువా,కమ్మి గదా మెఱుంగుమెయి కల్వకటారిమిటారికమ్మదో, దుమ్మి గదా మదాళితతిఁ దోలెడుకీల్జడ ముద్దుగుమ్మచెల్వ మ్మున కెంతయైన విలువా చెలువా మఱియు న్జగంబునన్. రా. వి. ౪. ౧౦.

జ: దోదుమ్మిదారి.

**దోదుమ్మి(ము)దారి.** వి. (దోదుమ్మి + దారి.) ఖడ్గ విశేషము; ఖడ్గము.

గీ. తిమ్మనరపాలుచికిలిదోదుమ్మిదారి, బలిమిఁ దెగ టారి సురపురప్రాంగణమున, వఱలెడుకటారి రాహుత్తవరులచేతఁ, గీడుసేయుదె మడియల తోడిచెలిమి. కువల. ౧. ౩౯.

సీ. కలువనెచ్చెలికానిబలిమిఁ దామర కెఱుచికిలి దోదుముదారి చెడఁగఁ జూచి. చంద్రా. ౩. ౧౧౩.(ప్రతులయందు దుముదారి యని సో కారముగనే కానవచ్చుచున్నది. నిర్ధారకము లేదు. సేకారమనుట యుక్తము. ఇంకను వి చార్యము.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**దోదుల్యమానము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి యూఁగులాడుచున్నది. ౨. మాటిమాటికి ఊఁగులాడుచున్నది.

**దోదూయమానము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి తపించుచున్నది. ౨. మాటిమాటికి తపించుచున్నది. ౩. మిక్కిలి తపింపఁజేయుచున్నది. ౪. మాటిమాటికి తపింపఁజేయుచున్నది.

**దోదూయ్యమానము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి తపింపఁజేయఁబడుచున్నది. ౨. మాటిమాటికి తపింపఁజేయఁబడుచున్నది.

**దోధకము.** సం. వి. అ. పుం. ఛందోవిశేషము.

శ్లో. దోధకవృత్త మిదంభభభాగౌ. వృత్తరత్నాకరము. ౩. ౬.

దోధకము. తోరపువేడుక దోధక మెందుల్, భూరివిరామము భూధరసంఙ్ఞం, బారుచు భాభగగాన్వితమై లక్ష్మీరమణా విరచింపనెసంగుల్. అప్ప. ౪. ౨౧౪ పా.

**దోధూయమానము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మిక్కిలికదలుచున్నది. ౨. మాటిమాటికి కదలుచున్నది. ౩. మిక్కిలి కదల్చుచున్నది. ౪. మాటిమాటికి కదల్చుచున్నది.

**దోధూయ్యమానము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మిక్కిలికదల్పఁబడుచున్నది. ౨. మాటిమాటికి కదల్పఁబడుచున్నది.

**దోనమ్ము.** వి. (దోని + అమ్ము.) అల్పశరము, చిన్నబాణము.

సీ. దోనమ్ము లం చన నౌ నల్పశరములు...ఆం. భా. ౨. ౨౧౩.

**దోని=దోనె.** వి. (సం. ద్రోణీ. ప్రా. దోనీ.) ౧. దొన, నీరు నిలుచుట కేర్పఱచినపల్లము.

సీ. పటికంపుదోనులఁ బరఁగుగోజ్జెంగపూనీటిబజ్జక్కఱ ల్దాఁటిదాఁటి. రసిక. ౨. ౭౧.

ద్వి. కలువరారాదోనిగముల జాల్వాఱు, చలువక్రొవ్విరితేనెజక్కఱల్ దాఁటి. ద్వి. ౪. సా. ౧. ౯ పా. ౧౮ పం.

౨. అరిణ, ఎత్తుడునీరు పోయుటకై తొలిచి కాలువమొదట నుంచెడుతాటిమ్రాను లోనగునది, ద్రోణి.

వ...ఆయ్యేతంబు ముంగిసమ్రానికి వెదురునకు నంటఁగట్టినవాఱుపరిమళం బాఘ్రాణించి దోనింబడి చని...హంస. ౧. ౧౯౨.

౩. నీరు పాఱుటకు ఏర్పఱచినచిన్నకాలువ. (కాలువతూము అని శ. ర.)

గీ. కైరవములకు వెన్నెలనీరు వఱపఁ, బూనిచేర్చినపటికంపుదోను లనఁగ. పారి. ౨. ౩౮.

సీ. పచ్చఱాపలకలబవిరిదోనులఁబడి ఘుమఘుమస్వనముల దుముకుచున్న. భాను. ౩. ౪౬.

విణ. చిన్న. (చూ. దోనమ్ము.)

దోనివిల్లు=అరిణెవలె నుండువిల్లు.

చ. అలకలు నాసికామణియు నన్నవకానుఁగుచద్వయంబుఁ గుండలములుఁ జంచలింప జతనంబున హస్తము లూఁది జీర్కొబం, డలదిగజాతి రొండొరుకడం దరశాఖులు దోనివింటఁ బింజలుగొన నేయుపుష్పశరుసంపెఁగవాలికతూపులో యనన్. పారి. ౪. ౩౮.

జః దోనమ్ము.

**దోనె=దోని.** వి. (సం. ద్రోణీ, ప్రా. దోనీ.) ౧. చిన్నపడవ, ద్రోణి. (శ. ర.) ౨. కాంస్యాబువాహిని.

గీ. ద్రోణి యగు దోనె యనఁగను...ఆం. భా. ౧. ౧౫౭.

౩. జలగడుగువానిసాధనము. (శ. ర.)

౪. సాలెవాఁడుచాఁపు చుట్టెడుమ్రాను.

సీ. కుంచె మగ్గపుగుంత గూటంబు పగ్గంబు పరఁటె ద్రొక్కుడుపట్టె పలక దోనె. హంస. ౨. ౧౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జః దోనెడొగ్గు.

దోనెడొగ్గు. అ. క్రి. (√దోనె.) క్రిందికి మోఁకఱించుకొను.

సీ. కరఘాతపతదబ్దఘుటఁ గొమ్ముకొనఁ జిమ్ముతమి దోనెడొగ్గి చాదంతి డిగిరియె. వసు. ౫. ౬.

దోమ. వి. (క. దోమె.) మశకము.

సీ. నే శుకకీటంబ నేఁ బుండరీకంబ నే ఖంజరీటంబ నేను దోమ. గీ. నేను మానిసి మున్నంచు నేకతమున, నొండొరులతోడఁ తను జెప్పుకొందు రుబుసుఁ, దారకబ్రహ్మమణి పేటికపవాటి, సంభవించిన ప్రత్యగ్రచంద్ర ధరులు. భీమ. ౪. ౩౩.

క. సామజరాజము దోమల,తో మార్కొని పోరునటుల తోఁచెక్...ఉ.రా. ౩.౩౦౪.

క. రామునకు నీవు హస్తికి, దోమకుఁ గలవాసి యతని దుర్వారశర, స్తోమమునఁ బొలియఁ దలఁచి త్రొక్కో...భా. రా. అర.౨.౧౦౦.

జః దోమతెర.

దోమటి. వి. అన్నము. (చి.ని.శ.ర. ఈ క్రింది ప్రయోగములను బట్టి ఔపవిభక్తికముగాఁ దోచుచున్నది. కాని ప్రథమాంతరూపమునకుఁ బ్రయోగములు కానరావు.)

సీ. దోమటిఁ దొడుకునే ప్రేమఁ గోకిలములు పాటలసహకారపల్లవముల. చంద్ర. ౩.౧౧౩.

సీ. కడుసిగ్గుదేరుతొల్పడుపుదోమటఁ జొక్కి యానందమునఁ జిందులాడుఁ గొన్ని. వేం. పంచ. ౪. ౨౪౧.

దోమతెర. వి. (√దోమ.) దోమలు లోనికి చొరకుండ మంచమునకు నల్వంకలను మూయువలగుడ్డ, చతుష్కి.

ఉ ... క్రమంబున ఘర్మశంకమై, నుప్పతిలంగ దోమతెర లుప్పర మెత్తిరి ... ఆము. ౫. ౧౦౪.

దోము. వి. (ఆహారము దేహమున పట్టక పిల్లలు పశువులు మొ.) పాఱుకొనుట.

(వ్యవ.) పిల్లవానికి దోముగా విరేచనమైనది.

౨. కడుపువాఁపు, ఉదరశోఫ.

సీ...ఔదరశోఫయై యలరు దోము. ఆం. భా. ౨. ౧౨౬.

దోయము=దాయము.

(బాలికాక్రీడావిశేషము.)

గీ. దోయముల్ సరిబేసులు దొరయునాల్గు, గంబములయాట లచ్చనగండ్లు మొదలు, గాఁగ శైశవగరిమ శృంగారమలర, బాలికలతోడ నాడు భూపాలపుత్రి. ఇందు. ౨. ౧౪౩.

సీ. అచ్చనగండ్లు దోయాలును దాఁగిలిమూఁతలు నాలుగుమూలలాఁట. దశా. ౮. ౮౧.

దోయి. వి. (సం.ద్వయీ. ప్రా. దఈ.) ౧. జత, జోడు. (దీనిబహువచనము 'దోయులు, దోలు' చూ. కుత్రచిన్నలోపశ్చసూత్రాహోబలపండితీయము.)

సీ. మంకి నాఁ బరఁగుబ్రాహ్మణుఁడు ధనేచ్ఛమై వర్తించు శిక్షింపవలయునట్టి, గుజ్జుదోయిని జట్టిగొని ప్రీతి లంకించి యుండ లంకియతోన గండుమీటి, పాటె నకొక్కిడియల్...భార. శాం. ౪. ౪౦. (గుజ్జుదోయి = పొట్టికోడెలజత.)

క. నీయుపదేశముఁ దనచే, దోయిబలువుఁ దోఁడుఁ గాఁగ ద్రోణుఁ గడచి...సైన్యము...పఱవఁగఁజేసెక్. భార. ద్రో. ౨. ౨౭౧.

ఉ. వేలుపుటిల్లు విల్లు వెడవీఁకలపోకలనారి రెండుచే, దోల వెలుంగుతూ పెచటఁ దోలినఁ బాఱని తేరు మాటలై, గ్రాలెడుతేజు లెవ్వనికిఁ గల్గు నతండు చళుక్యవిశ్వభూ, పాలుమనంబునం బరవిభంజనుఁడై విహరించుచుండెడుఁక్. కావ్యా. ౪. ౯౮.

సీ...దోయి జోడు, జఁట జమళి కవ దంట య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మడ యన ద్వంద్వమై పరఁగు ...ఆం.భా. ౨. ౧౦౦.

౨. పాటి, సామ్యము.

ఉ. ఎక్కడిదోయి పో యలమృగేక్షణ మేనికి నక్కడానికిన్. విజ. వి. ౩. ౧౪.

విణ. సహాయము, తోడు.

సీ. యమునాజలానీల మాచిమ్మచీకటిపెల్లున జగమెల్ల నల్ల నైన, నీదెస మతి గానరా దని హరి లక్ష్మి దోయి గా నమృతాబ్ధి బాయకుండ. ద్వా. ౪. ౧౦౨.

జః దోయికట్టు, దోయిలి, దోయిలించు, దోయిలి తీర్చు.

**దోయికట్టు.** అ. క్రి. (√దోయి.) రెండుభాగము లగు.

వ...అందఱు హరిణక్రీడనం బను నాటకుం దొడంగి రెండుసంగడంబు లై కృష్ణుండును శ్రీదాముండును బెన్నుద్దులు గాఁ దక్కిన వారునుం దమలోన దొరయుభంగి దోయి గట్టిరి. హరి.పూ.౭.౯౨. (జతగూడుకొ.ర.)

**దోయిడి.** విణ. (√దోఁచు.) రిక్తము, శూన్యము.

గీ. అనిన వృషకేతుఁ గనుగొని యనిలసుతుఁడు, పలికినారము తురగసంబంధ మైన, ప్రతినలెన్నేని ధర్మసంభవునియెదుర, మనముదోయిడిచేతుల మగుడు బెట్లు. జై.భా.౨.౧౫.

చ. నలుఁ డనురాజు మున్ను కలి నష్టముచేసిన రాజ్యసంపదల్, దొలఁగి పదాతి యై యటకు దోయిడిచేతుల వచ్చి...పంపలో,జలక మొనర్చి యిందుధరు శంకరు నద్రిసుతామనోవిభుం, గొలిచి నుతింప నవ్విభుఁ డకుంఠదయన్ దివి నిల్చి యి ట్లనున్. శేష. ౫.౩౧.

**దోయిలి=దోసిలి.** వి.పౌ.(√దోయి.) ౧. దోసిలి, అంజలి. (బ.దోయిలులు,దోయిళులు,దోయిళ్లు.)

ఉ. అర్తితి భద్రయున్ హరియు నార్తపరస్పరసమ్మదంబులున్, బొత్తు లొనర్చుచుండ మునుమున్నుగ నొండొరు మీఁటి దోయి లై, తెత్తి యియంగడన్ జెలువ లెత్తినపాత్రల నించినించి వేనుత్తెపుఁబ్రాలు పోసిరి సముస్నతి నొండొరుమౌళిసీమలన్. ముకుంద. ౩. ౭౯౩.

చ. అలికులవేణి యో ర్తొకనిహస్తముల న్సుఖమజ్జనాంబువుల్, గలఁతియ యెత్తి పోయనవి గార్చుచునుండె నతండు దోయిటన్. నైష. ౬. ౧౧౨.

లయగ్రాహి. కుత్తుకలబంటి యగునెత్తురులు దోయిళుల, నెత్తి చవి గ్రోలుచును ... భార. స్త్రీ. ౨. ౭.

క. పలుమఱుఁ దలయంటి తగన్, నలుఁ గిడి దోయిళ్ల జలమునన్ బోర్కాడించి ... కళా. ౬. ౧౯౩. రాజ. చ. ౩. ౧౪౫.

౨. నతివిశేషము.

వ...అయోధ్యయందలిరఘూద్వహునకు దోయిలి మధుర నున్నబాలకృష్ణునకు సాఁగిలి...ప్రబంధ. ౭౭౦.

అలరుదోయిలి=పుష్పాంజలి.

సీ. అలరుదోయిళ్లు పువ్వులవింటిదొరకు గంధము గంధగిరిమరుద్బాంధవునకు. వసు.౩.౧౪౦.

సీ. వరతనూమిత్త్రతావాప్తిఁ జెన్నగుతీవ లలరు దోయి ళ్లుపాయనముఁ బట్ట. పె. శకుం. ౩. ౧౯౩.

పువ్వుదోయిలి, పూవుదోయిలి=పుష్పాంజలి.

సీ. కూలినదలితేభకుంభమౌక్తికతతు లిచ్చినపువ్వుదోయిళ్లు గాఁగ. భా. రా.యు.౫౪౦.

గీ. ఖండపరశుతనుప్రభాఖండదుగ్ధ,జలధిజలశీకరము లనఁ బొలుచు వేల్పు,టేలికలు చల్లుపూవుదోయిళ్లు గలుగు, నగము మునిముఖ్యునకు దృగానంద మొసఁగె. పాండు. ౨. ౧౮౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వీనుదోయిలి = శ్రోత్రాంజలి, చెవు లనెడుదోసిలి.
సీ. శారికథాసుధాసారంబు తోరంబుగా వీను
దోయిళ్లఁ ద్రావువారి. ఘటికా. ౧. ౧౪౨.

దోయిలించు=దోసిలించు. స. క్రి. (√దోయిలి.)
౧. దోయిటఁ బట్టు, దోసిలితో గ్రహించు.
చ. పసఁటులవాఁత మూతి యిడి పాలును నేతు
లుఁ బుక్కిలించి యెం,దు నుమియు దోయి
లించి కరతోయరుహంబులఁ జల్లి...హరి.
పూ. ౫. ౨౦౨.
ఉ. పంకజనేత్ర గౌతమునిపంపున లాజలు దో
యిలించి ధూ,మాంకునియందు వేల్చె...
నైష. ౬. ౧౦౨.
చ. ముడివడుకంకణప్రభలము త్తెపుసేసలు దోయి
లించి యె,త్తెడుతఱి...మనుచ. ౫. ౧౫.
౨. (చేతులను) చేర్చు, అంజలిగాఁ గూర్చు.
వ...అద్దేవికి దండప్రణామంబు లాచరించి కర
కమలంబులు దోయిలించి యి ట్లనియె...
భాగ. ౬. ౪౧౫.
ఉ...కేలుఁగెం,దమ్ముల దోయిలించుకొని ...అ
చ్చ. రా. యు. ౫౩.
చ. చిలుక పురోహితుం డగుచుఁ జెంగట నుం
డఁగ సిగ్గుపెండెరల్, దొలఁగఁగఁ ద్రోచి బం
ధుగతిఁ దోరపుఁగోర్కులు సందడింపఁగాఁ,
దలఁపు లతాంగికన్న మను తాన కనుంగవ
దోయిలించి చూ,పులఁ దలఁబ్రాలు పోసె
నృపపుత్రునిపై విరహాగ్ని సాక్షి గాన్.
రాజ. చ. ౩. ౧౩౧. (దోయిలించి = దో
యిలిగాఁ జేసి అని భావము.)

దోయిలితీర్చు. అ. క్రి. (√దోయిలి.) నమస్క
రించు.
రగడ. ఒప్పుగ నుండుయథోక్తసలము యథోక్త
కారుసను దోయిలిదీర్చుచు. హంస. ౪. ౨౧౩.

దోర[1]. వి. ౧. రాశి. (శ. ర.)
౨. ఉత్పంక్తి, దొంతర.
గీ. దోర యన దొంతి యనఁగను దొంతర యనఁ,
దనరు నుత్పంక్తి...ఆం. భా. ౨. ౩౪.
శా. ఓర న్బెట్టినయప్పళాలు కడలం దొప్పారు
నేదొప్పలున్, దోరన్బెట్టిన చంద్రఖండము
లు దొంతు ల్గన్న వెన్నప్పముల్. పాంచా.
౪. ౫౪.
ఉ. ఆరయ నొక్కభంగిగ రహస్యపుఁజోటను
రాజసన్నిధిన్, మూరిసభాంతరంబులను జొ
ప్పడి తప్పక గద్యపద్యముల్, దోరలు పేర్చి
నట్లు మదిఁ దోఁపఁగఁ జేయుట సంతతంబు
నా,భారమ కాదె వీని కనుభారతి మాకుఁ
బ్రసన్న యయ్యెడున్. మార్క. పీఠి. ౫.
౩. పండఁబాఱినకాయ.
ద్వి. పూపలఁ బిందెలఁ బులుసుదోరలను, దీపా
రుఫలముల దీపించుతరుల. నవనాథ. ౫.
౨౦౨ పు. ౮ పం.
విణ. (పాకోన్ముఖమగుట, వేఁగుట మొదలగు
వానిచే) ఎఱ్ఱఁబాఱినది.
ద్వి. ఈపండు కడుదోర యిది సార మనుచు,
నేపున నయ్యింద్రునిభమున కొసఁగి. రం. రా.
ఉ. ౯౩ పు. ౨౬ పం.
(వ్యవ.) దోరగా వేఁగినగారెలు నా కిష్టము.
ఉ. కన్నుల దోరచాయ లలికంబున లేఁజెమరు
...గలునట్టుగాఁ, గన్నియ నిన్నెఁ గూడి
రతికాంతులు మీఱ సుఖించు పెన్నుఁడో,
చంద్ర. ౪. ౧౧౧.
జ: దోరగాయ, దోరగించు, దోరగిలఁబాఱు,
దోరగిలు, దోరపండు, దోరవాఱు.

దోర[2]. విణ. ఒఱిగినది. (చూ. దోరగల్లు, దోర
పాక, మొ.)
జ: దోరగలువడు, దోరగల్లు, దోరపాక.

దోరగలు(ల్లు)వడు. అ. క్రి. (దోరగలు + పడు.)
ఒడ్డగెడవగు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. తగులువడి యపుడు వడి సెడి,గగనమణిరథం
బు దోరగలువడి నిలిచెన్. కాశీ. ౧.౧౩౩.

ఆ. సాంధ్యనటనచండచండీశపదహతిఁ, ధరణి
చక్ర మొఱగి శరధిఁ గ్రుంగ, దోరగల్లువడి
యె భూరథేతరభాగ,చక్ర మనఁగ నపుడు
శశియుఁ దోఁచె. మనుచ. ౫. ౩౫.

వ...అందాక నొక్కక్షణంబు లేకుండిన నాజ్ఞా
చక్రంబుదోరగల్లువడు...పి.శకుం.౩.౨౮౬.

దోరగల్లు(లు). విణ. (దోర[3]+కల్లు. త. ఉదిర
ల్=అవనతమగు.)ఒడ్డగెడ వైనది,ఒక ప్రక్క క్రిం
ది కొఱగి మఱియొక ప్రక్క పైకి లేచియున్నది.

సీ. ఒకదిక్కు దోరగ ల్లొఱగి పైఁ బడఁదునో
తొలఁగి కమ్మలు మ్రొయ నిల చలింప. హరి.
పూ. ౫. ౧౩౨.

వి. ఒడ్డగెడవు.

చ. కనుఁగవదోరగల్లుల వికారపుఁజూపులఁ గోపు
లానుతోఁ,డనె దళమెక్కు నాలుక తడం
బడుమాటల...శుక. ౩. ౧౧౯.

దోరగాయ. వి. (√దోర[1].) పండఁబాఱినకాయ.

వ...పిందె పూఁప కాయ దోరగాయ పండు...
భాగ. ౮. ౪౪౩.

దోరగించు. స.క్రి. (√దోర[1].)దోరగిల్లఁజేయు.
(శ.ర.)

దోరగిలఁబాఱు.అ.క్రి.(√దోరగిలు.)దోరగిలు.

వ...దోస దోరగిలంబాఱె. కాశీ. ౩. ౨౩౩.

దోరగిలు(ల్లు). అ. క్రి. (√దోర[1].) ౧. ఎఱ్ఱఁ
బాఱు; పండఁబాఱు.

క. అని విన్నపంబు చేసిన,తనయల నూరార్చి
వచ్చి దక్షుఁడు తాఁ జెప్పినబుద్ధి వినని శశి
పైఁ, గినిసి కనుంగొనలు దోరగిల నిర్దయుఁ
డై. వరాహ. ౩. ౪౯.

సీ. వెలయ రెండుపలాలు వెల్లుల్లి పాయలు రా
జిల్లఁ దఱిగి దోరగిల వేఁచి. (చి.కి. చి. ని.)

చ. తొలినుడిమానికంపుగని దోరగిలె న్నొగి
లెన్ రథాంగముల్. హ. స. ౪. ౪.

(వ్యవ.) ఆచెట్టుకాయలు దోరగిల్లినవి.

దోరణపుఁగమ్మి. వి.(దోరణము+కమ్మి.)తోరణ
ముకట్టెడికమ్మి,ద్వారముమీఁదియడ్డుకమ్మి.(శ.ర.)

దోరణపుఁబట్టె. వి. (దోరణము+పట్టె.) కపిలె
బిల్లక్రిందియడ్డపట్టె. (శ. ర.)

దోరణపుసాటిరిక్క. వి. (దోరణము+సాటి+
రిక్క.) అనూరాధానక్షత్రము. (శ. ర.)

దోరణము. వి. (సం. తోరణమ్. ప్రా. తోరణ.
క. తోరణవు.) మంగళార్థము ద్వారములు మొ
దలగువానికి కట్టుమామిడాకులు లోనగువాని
దండ, తోరణము.

సీ. తలిరులు దొగలు చెంగలువలు గూర్చి యం
దముగ నించినదోరణములవలన.అచ్చ.రా.
బాల. ౧౬౬.

సీ. తోరంపుముత్యాలదోరణంబులకాంతి చొ
క్కు మాచుక్కలపెక్కు నూప. దశా.
౧. ౨౬౨.

సీ. ఎడ లేక యుండంగ నిడినదోరణములు పె
ల్లు పైఁబడెడుకరళ్లు గాఁగ. యయా. ౪.
౧౫౪, ౮౦.

౨. బహిర్ద్వారము.

సీ...దోరణ మనంగ నవు బహిర్ద్వారము...ఆం.
భా. ౨. ౨౧.

జ: దోరణపుఁగమ్మి, దోరణపుఁబట్టె, దోరణపు
సాటిరిక్క.

దోరపండు. వి. (దోర[1]+పండు.) పండఁబాఱిన
కాయ.

చ. క్రమమునఁ బిందెలుం బసరుఁగాయలుఁ
గాయలు దోరపండులుం, గమిసినపండులుం
గెలలు గట్టి తదున్నతశాఖ లన్నియున్.
హరి. పూ. ౬. ౮౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. ప్రబలంపుగాడ్పుచే రాలినయెలమావిదోర
పం డ్లెవ్వరో యేఱినారు. శుక. ౧.౨౫౭.

దోరపాక. వి. (√దోర².) ఓరపాక.

సీ. దోరపా కనఁగను నోరపా కనఁగను బాదలి
యుంచనఁ బరఁగుచుండు, భిత్త్యర్థకృత
గృహాభిధ...ఆం. భా. ౨. ౧౬.

దోరము=దువారము. వి. (సం. ద్వారమ్, ప్రా. దోరం. క. దోర.) ద్వారము. (శ. ర.)

దోరము. సం. వి. అ. పుం. ౧. తోరము, వ్ర తాదులందు చేతికి కట్టుకొనెడిదారము.

దోరవాఱు. అ. క్రి. (దోర¹ + వాఱు.) ఎఱ్ఱవాఱు, ఎఱ్ఱపడు.

ద్వి. పరిపక్వ మై దోరవాఱి కన్నులకు, నరు
దైనవరుఁగులు నప్పడంబులును. అ. మ. క.
౫. ౨౪౭ పా. ౭ పం.

దోరు. అ. క్రి. ౧. చచ్చు.

మ...సింగముల్, కడగొట్టెఱ్ఱ మనుబిళ్లు గం
తుగొనె జింకల్ బిద్దె దోరెం గిటుల్,
మడిసెఱ్ఱ గాఅనుపోతులు... సారంగ.
౧. ౧౦౭.

సీ...దుర్వ్యాధితద్విరదవైరిఁ, జేరి తద్దంష్ట్రిల
దోరినఖరము గాఁ దలఁపకు న న్నని బలిము
ఖుండు. గీ.పలుక...వేం.పంచ. ౪. ౫౮౦.

ఆ. పెద్దనిదురవోయె బిద్దె దోరెను గంతు, గొని
యె ననుట పే ళ్లగును మృతునకు. ఆం.
సం. మాన. ౫౩.

౨. (తలమొ.) తిరుగు. (చూ.దోర్చు.) ౩.వ్రా
లు. (శ. ర.)

జః దోర్చు.

దోరు(వ)వా. వి. పక్షివిశేషము. (బ్రౌ. శ. ర.)

సీ. కాఁజులు పూరేళ్ళు కన్నెలేళ్ళు నెమళ్ళు
లావుక ల్దోరువా ల్లకుముకులును. రసిక.
౧. ౬౭.

దోరెము. వి. (క. దోర = త్రాడు. ఇది త్రాడు శబ్దముతో కలిసియే యుండును.) దేగలకు కట్టెడుత్రాడు.

వ...బర్రి బగ నిబద్ధాగ్రంబులై కొమరారుదో
రెపుఁద్రాళ్లతోడఁ దిరుగుడుల వెడంగువడి
...మనుచ. ౪. ౭౭.

గీ. అఱుత దోరెపుఁద్రాడుచే నత్తె మమరఁ, ద
ళుకుచేఁ దొ ల్త వానకోయిలలఁ దునిమి,
బైరిచే వెక్కుఁ గొంగలబాఱుఁ గొట్టి, సాళు
వముచేతఁ గుంబేళ్లఁ జీరె నంత. ప్రబంధ.
౨౩౩.

చ. జిలుగు మెఱుంగు బంగరువిచిత్రపుదోరెపు
త్రాటిగజ్జియల్, ఘులు ఘులు ఘుల్లు ఘుల్లు ర
నఁగా... డేగ యూర్ధ్వముగఁ జయ్యనఁ బ
క్షులపైఁ గడంగినన్. ఇందు. ౨. ౬౯.

దోర్గంతువు. సం=దోర్గడువు. (వాచ.)

దోర్గడువు. సం. విణ. (ఉ) కుంఠితహస్తుఁడు, ఈఁచఁబోయినచేయి గలవాఁడు.

దోర్గ్రిహము. సం. విణ. (అ.ఆ.అ.) ౧.బాహువులతో పట్టుకొనునది. ౨. బలిమి కలది. వి. అ. పుం.౧. బాహువును పట్టుకొనుట. ౨. బాహువులను స్తంభింపఁ జేయునొకానొకరోగము.

దోర్చు(రుచు). స.క్రి. (√దోరు.) ౧. (తల) త్రిప్పు, ఇటునటు కదల్చు.

క. విపులార్తిఁ గూరి మనుజాధిప యాభూవల్ల
భుండు ధృతి లేమిం జండపవనపతితం బగు
పాదపంబు చందంబు దోఁప ధరణిం బడి
యెన్.

వ. పడియుండి తల దోర్చుకొను చు ని ట్లనియె.
భార. స్త్రీ. ౧. ౭, ౯.

క. ఇలఁ జదికిలఁబడి పలుమఱుఁ దల దోర్చుచు
వికృత మగువదనమున లాలాజలములు తీఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గెలుసాఁగఁగఁ బలుకు నతం డాలిగుత్రిచి పరి
చితరక్తికి. పాండు. ౩. ౯౨.

౨. పడఁగొట్టు, పడఁద్రోయు.

గీ. చెనసి గుణమైన దోసఁబు సేయ నేర్చుఁ,
గుకవి కృతులందు దోసంబు గుణము సేయ,
నేరఁ డది యట్ల దొంతులు సేరి నాయి,
దోర్వ నేర్చుఁగా కది యేమి సేర్వ నేర్చు.
కు. సం. ౧. ౨౯.

దోర్దండము. సం. వి. అ. పుం. దండమువంటి బాహువు.

దోర్మధ్యము. సం. వి. అ. న. ౧. బాహువుల మధ్యభాగము. ౨. మోచేయి.

దోర్మూలము. సం. వి. అ. న. బాహుమూలము, కక్షము, చంక.

దోర్యుద్ధము. సం. వి. అ. న. బాహుయుద్ధము, మల్లయుద్ధము.

దోల=డోల. సం. వి. ఆ. స్త్రీ. ౧. డోలి, ఉయ్యాలవంటి యానము. ౨. తొట్ల, ఉయ్యాలతొట్టి. ౩. ఆందోళిక, అందలము. ౪. ఉయ్యాల, ఉద్యానములందుఁ గ్రీడార్థ మగుదోలనయంత్రము. ౫. నీలిచెట్టు. ౬. ఊఁగుట, ఉరియాట; సందేహము. (విల్యమ్సు.)

దోలము. సం. వి. అ. పుం. ౧. ఊఁగులాడుట, ఊఁగుట. ౨. శిబిక, పల్లకి. ౩. తొట్ల. ౪. బాలకృష్ణునియుత్సవవిశేషము. (ఇది ఫాల్గున పూర్ణిమనాఁడు జరుగును.)

దోలాయమానము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఊఁగులాడుచున్నది, ఉరియాడుచున్నది. ౨. కుదురు లేనిది, కొందలపడునది, సందేహపడునది. (మనసు.)

దోలాయితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఊఁగులాడినది. ౨. సందిగ్ధమైనది, కుదురు లేనిది. (మనసు.)

దోలాయుద్ధము. సం. వి. అ. న. జయాపజయములనిశ్చయము తెలియనియుద్ధము.

దోలి. సం. వి. ఈ. స్త్రీ. ౧. డోలి. ౨. ఉయ్యాల, తొట్ల.

దోలిక=డోలిక.

దోలితము. సం=దోలాయితము.

దోవతి=దోతి. వి. (క. దోతర. త. తోవత్తి. హిం. ధోతీ.) మగవారికట్టుబట్ట, పరిధానము. (ఆఁడుదానికట్టుకోకను జేబు అందురు.

క. మది రోష మొదవ దోవతి, వదలిన బిగియించుకొనుచు... భాగ. ౧౦. ఉ. ౪౬౯.

క. వెడ వీడెడుదోవతియును, బెడతలచేతులు వడంకు పెదవులు తూఁగా, డెడువెండ్రుకలును... ఉ. హరి. ౨. ౭.

సీ. గడితంపు నీర్కావిమడుఁగుదోవతి కటీర స్ఫురత్పీతాంబరంబుగాఁగ. వరాహ. ౯. ౪౬.

కావిదోవతి=కాషాయవస్త్రము, ఎఱ్ఱబట్ట.

సీ. కావిదోవతియును గంతోత్తరీయంబు నిష్టికోలయుఁ జంక నిఱ్ఱితోలు. హర. ౭. ౧౨.

దోవి. వి. ఎఱ్ఱనిబట్ట.

సీ. కటితటీహాటకపటముతోఁ బచ్చచెఱఁగు వల్వపుదోవి రంగు నిల్వ. రా. వి. ౫. ౭౯.

దోశ్శాలి. సం. విణ. (న్. నీ. న్.) ప్రశస్తబాహువులచే ప్రకాశించువాఁడు, బలవంతుఁడు.

దోశ్శిఖరము. సం. వి. అ. న. భుజాగ్రము, మూఁపు.

దోష. సం. వి. ఆ. స్త్రీ. ౧. రాత్రి. ౨. భుజము.
వ ... ఘుర్మకాలదివసఇవ క్షయితదోషః ...
కాదంబరి.

దోషకము. సం. వి. అ. పుం. గోవత్సము,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆవుదూడ. (కల్ప.)

దోషకారి. సం. విణ. (న్. ణీ. న్.) దోషము చేయువాఁడు.

దోషగ్రాహి. సం. విణ. (న్. ణీ. న్.) దోషములనే గ్రహించువాఁడు, తప్పులెన్నువాఁడు, ఖలుఁడు.

దోషజ్ఞుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దోషముల నెఱుఁగువాఁడు. వి. అ. పుం. ౧. పండితుఁడు. ౨ - వాతాదిదోషముల నెఱిఁగిన వాఁడు - వైద్యుఁడు.

దోషదృష్టి. సం.విణ. (ఇ) దోషములందే చూపు కలవాఁడు. వి. ఇ. స్త్రీ. తప్పులెన్నుటయందు దృష్టి.

దోషభాక్కు. సం. విణ. (జ్) దోషి, దోషము కలవాఁడు.

దోషము. సం.వి.అ.పుం.౧.తప్పు,పొరపాటు.౨.దుష్టత్వము.(ఆహారదోషము మొ.)౩.(న్యాయ.) లక్షణదోషము. ఇది అవ్యాప్తి,అతివ్యాప్తి,అసంభవము అని మూఁడువిధములు.౪. (మీమాంస.) ప్రత్యవాయము, విధ్యతిక్రమమువలనఁ గలుగు అదృష్టభేదము, పాపము. ౫. వాతపిత్తకఫములలో నొకటి. ౬. వాతపిత్తకఫములవికారము. ౭. రాగద్వేషమోహాదికము. ౮. కావ్యదోషము. (ఇది పదదోషము, వాక్యదోషము, అర్థదోషము అనిమూఁడువిధములు. అందు పదదోషములు ౧౭. అప్రయుక్తము, అపుష్టార్థము,అసమర్థము, నిరర్థకము, నేయార్థము, చ్యుతసంస్కారము,సందిగ్ధము,అప్రయోజకము, క్లిష్టము, గూఢార్థకము, గ్రామ్యము, అన్యార్థము, అప్రతీతికము, అవిమృష్టవిధేయాంశము, విరుద్ధమతికరము, అశ్లీలము, పరుషము. వాక్యదోషములు ౨౪. శబ్దహీనము, క్రమభ్రష్టము, విసంధి, పునరుక్తి, వ్యాకీర్ణము, వాక్యసంకీర్ణము, అపూర్ణము, వాక్యగర్భితము, భిన్నలింగము, భిన్నవచనము, న్యూనోపమము, అధికోపమము, భగ్నచ్ఛందము, యతిభ్రష్టము, అశరీరము, అరీతికము, విసర్గలుప్తము, అస్థానసమాసము, వాచ్యవర్జితము, సమాప్తపునరాత్తము, సంబంధవర్జితము, పతత్ప్రకర్షము, అధికపదము, ప్రక్రమభంగము. అర్థదోషములు ౧౮. అపార్థము, వ్యర్థము, ఏకార్థము, ససంశయము, అపక్రమము, భిన్నము, అతిమాత్రము, పరుషము, విరసము, హీనోపమము, అధికోపమము, అసమోపమము, అప్రసిద్ధోపమము, హేతుశూన్యము, నిరలంకృతి, అశ్లీలము, విరుద్ధము, సహచరచ్యుతము.) ౯. గోవత్సము, ఆవుదూడ. ౧౦. దూషణము,ఖండనము. వి. స్. పుం. న. భుజము, చేయి. (తెలుఁగున దోర్యుగము మొదలగుసమాసములయందు పూర్వపదముగా నుండును. అహోబలపండితీయోక్తరీతిని ప్రథమావిభక్తియందు దోశ్శబ్దమునకు దోషము అనురూపము గ్రహింపఁబడినది.)

దోషలుఁడు. సం.విణ. (అ. ఆ. అ.) దోషయుక్తుఁడు.

దోషాకరుఁడు. సం. వి. అ.పుం. ౧. - రాత్రిని కలిగించువాఁడు-చంద్రుఁడు. ౨. -దోషములకు స్థానమైనవాఁడు- దుష్టుఁడు.

దోషాచరుఁడు. సం.వి.అ.పుం. - రాత్రియందు సంచరించువాఁడు- ౧. చంద్రుఁడు. ౨. రాక్షసుఁడు.

దోషాతనము. సం. విణ. (అ. ఈ. అ.) మాపటిది, రాత్రిది.

దోషాతిలకము. సం. వి. అ. పుం. - రాత్రికి తిలకమువంటిది - దీపము.

దోషారోపణము. సం. వి.అ.న. దోషారోపము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దోషారోపము. సం. వి. అ. పుం. దోషమును మోపుట.

దోషాస్యము. సం. వి. అ. పుం. ౧. రజనీముఖము, ప్రదోషము. ౨.-రాత్రికి ఆస్యమువంటిది - దీపము.

దోషి. సం. విణ. (న్. ఈ. న్.) దోషయుక్తము, దోషము కలది.

దోషించు. సం. అ. క్రి. దోషమును పుట్టించు.

దోషికము. సం. విణ. (అ. ఆ. అ.) దోషము కలది. వి. అ. పుం. - వాతాదిదోషములు కలది - రోగము.

దోషైకదృక్కు. సం. విణ. (శ్) దోషమందే కన్ను కలవాఁడు, దోషములనే వెదకువాఁడు, తప్పు లెన్నువాఁడు.

దోషైకదృశుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) = దోషైకదృక్కు.

దోస. వి. కర్కటి, ఉర్వారువు.

వ...కాసర గాచె దోస దోరగిలంబా అె... కాశీ. ౩. ౨౩.

ఆ. దోసముల్లువంటి తుర్వమం దాత్మను, జూచి యాసల నటు గోసివేసి, వాసనలు దెలిసిన వాఁడెపో బ్రహ్మంబు...వేమన. ౧. ౨౩౦.

(దీని భేదములు: — చేఁదిదోస, నక్కదోస, ములుదోస మొ.)

జః దోసకాయ, దోసతోఁట.

దోసకాయ. వి. (√దోస.) కర్కటిఫలాటువు.

ఉ. చూడఁగ దోసకాయలె విశుద్ధయశోధన యన్యచిత్తముల్. హర. ౨. ౬౪.

దోసకారి=దోసి. విణ. (దోసము + కారి.)- దోసముచేయువాఁడు - దుష్టుఁడు; పాపాత్ముఁడు.

సీ. ఆదోసకారి సన్న్యాసి దవ్వులఁ గాంచి యొాలంబునకు దారి యొదిగియుండు. నైష. ౭. ౧౩౦.

శా. ఆహా దైవము దోసకారులకె తోడై వచ్చు నెప్పట్టునన్. మనుచ. ౩. ౪౭.

గీ. నిర్మలుం డట్టివానికి నిందమోవఁ, జేసెఁ గా విధి కటకటా దోసకారి, దయ్యమున కేల సత్యంబు దలఁచి చూడ. సారంగ. ౨. ౨౬౩. నీలా. ౩. ౨౦.

దోసతోఁట. వి.(√దోస.)దోసపాదులతోఁగూడినచేను. (బిడ్డపాపలతో నిండిన యింటిని దీని తోఁ బోల్తురు.)

(వ్యవ.) వారియిల్లు దోసతోఁటవలె చూడ ముచ్చటగా నున్నది.

దోసము. వి. (సం. దోషః. ప్రా. దోసో. క. దోస.) ౧. దోషము, పాపము.

ఉ...పే రడుగం దలంచెదవొ భీమతనూభవ యావిచారముల్, దూరము సేయు మెవ్వరికి దోసము తాఁ దనపేరు సెప్పుట...నైష. ౪. ౫౬.

క. ఎదఁ గుదు రగుబత్తిని గొ,ల్చెదఁ బలుపుట్టువులఁ గూరిచినదోసంబుల్, చిదుమంగ... నీలా. ౧. ౧౭.

గీ. దోసమును నపకీర్తియుఁ దొలఁగఁ బెట్టి, నాఁడు గురుఁ గాచుకొంటివి నేఁడు నన్ను, సుతునిఁ గాచితి త్రిస్థానశుద్ధి గాను.విక్ర. ౩. ౧౨౯.

౨. నేరము, అపరాధము.

క. చేసినదానికి మాఱుగఁ, జేసినఁ బగ యంత తోడఁ జెడుఁ గాక గుణుల్, డాసినయప్పులు విడిచి, దోసముఁ బట్టుదురె యెట్టి తుచ్ఛులుఁ జతురా. భార. శాం. ౩. ౨౫౪.

ఉ. దోసము పెద్ద లే దనక ధూర్జటి నిష్ఠురకంఠహుంక్రియా,భ్యాసముమై నదల్చి యదయస్థితిఁ గాశి వెలార్చె... భీమ. ౩. ౧౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క...విలాసవతి తన,చేసినదోసమునఁ గాదెశిఖిఁ బడి వీరల్, వాసవుపురికిం జని రని,వాసిగఁ దనమేను నిచ్చె వహ్నికి నంతన్.విక్ర. ౬. ౧౨౯.

౩. కీడు, హాని.

క. ఆసాప్రాణికిఁ జూపుల,దోసము పాయఁగ నగరుధూపంబు మహోల్లాసంబుగ నిడి పూజలు, చేసి జయధ్వనులు నిగుడ శ్రీకర లీలన్. చిత్రభా. ౪. ౨౦. (చూపులదోసము=దృష్టిదోషము.)

౪. కొఱఁత, లోపము.

ఉ. ఆమదిరాక్షిఁ జూచి పరిహాసము మీఱ బలీంద్రుఁ డిప్పు డో, కోమలి నీవు చే నమృతకుంభము పూనినఁ జూచి గోపబా,లామణి వంచుఁ బాల్గొనఁ దలంచెద మన్నను నవ్వుచు న్మృగా,క్షీమణి బావ నీవు దధిఁ జిల్కఁగ గోపిక నైన దోసమే. దశా. ౨. ౩౫౩.

జ: దోసకారి.

దోసి=దోసకారి. విణ.(సం.దోషీ.)పాపాత్ముఁడు.

ఉ. ఏటికి జాలిఁ బొంద నరు లీక్రియఁ గృష్ణుని కీర్తనంబు పాపాటవులన్ దహింపఁగల దాటకు సందియ మేల యిప్పు డీ,తూఁటరి దోసకారి పెనుదోసి యజామిళుఁ డంత మొందుచుం, బాటిగ విష్ణునామసుతుఁ బల్కుచుఁ గేవలముక్తి కేఁగఁడే. భాగ. ౬. ౧౭౨.

దోసియ(సె). వి. (క. దోసె.) భక్ష్యవిశేషము, అట్టు.

వ...అపూపంబులు ... జిల్లేడుకాయలు దోసియలు సేవియలు... కాశీ. ౭. ౧౭౨.

సీ...జున్ను కండచక్కెరలు దోసెలు వడల్సేవె పాసెములతోడ. భీమ. ౧. ౬౦.

ఉ. మంచముఁ జేరి శంభుఁడు కుమారునిఁ దోట్లను బెట్టి నీవు చే,లాంచల మేల పట్టుకొనె దవ్వకడం జను మన్న భక్ష్య మిమ్మం చని పోరఁ జంద్రకళ నక్కఱఁ గై నిడఁ గేలఁ ద్రోయుచున్, ద్రుంచినదోసె యంచ నెడుతోరపుబొజ్జ గలానిఁ గొల్చెదన్. పార్వ. ౧. ౩.

దోసిలి=దోయిలి. వి. ౧. అంజలి.

సీ. అమృతంబు వెల్లువ యని నిలింపాదులు మునుకొని దోసిళ్ల ముంచి క్రోల.విక్ర. ౬.౬౯.

౨. నతివిశేషము.

గీ. అల్లొనేశేళ్లు నీకు మహానుభావ, మ్రొక్కులివె నీకు నూనసమ్యక్కృపాణ, యిదిగొ దోసిలి నీకు లోకైకవీర,యోమురారికుమార ప్రణామ మయ్య. ఇందు. ౩. ౭౭.

దోసిలిప్రాలముద్దుగుమ్మ=తలఁబ్రాలుపోసినభార్య, పాణిగృహీతి.

గీ. అందుఁ దనరారు వీరాఖ్యుఁ డైనయొక్క, రాతు వానికి దోసిలిప్రాలముద్దు,గుమ్మ మదవతి యన నొక్కకొమ్మ గలదు, కమ్మపూవులరెమ్మ బంగారుబొమ్మ. శుక. ౨. ౫౦౩.

జ: దోసిలించు.

దోసిలించు=దోయిలించు. (శ. ర. √దోసిలి.)

దోస్తి. వి. (హిం.దోస్తీ.) సఖ్యము, ఎక్కువపరిచయము.

వ...తమతమముస్తీదులతో సిస్తుగా దోస్తిని జుట్టుముట్టి కోపాటోపంబున. ప్రబంధ. ౭౭.

దోస్యము. వి. ప్రసంగము.

చ. తెరువరు లైనయట్టిపరదేశమహీసురు లర్థవాంఛఁ దత్పురమున కేఁగుదేర వెడదోస్యములం బచరించి వారి న్నిర్భరగతి నోడఁ గూయు...శుక. ౨. ౪౩౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దోష్ణము. సం.వి.అ.పుం. ౧. క్రీడ. ౨. సేవ.

దోష్ణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) బాహువు నందుండువాఁడు. వి. అ. పుం. - బాహువ్యాపారమున నుండువాఁడు, పార్శ్వస్థుఁడు-౧. భృత్యుఁడు, సేవకుఁడు. ౨. క్రీడకుఁడు, ఆటకాఁడు.

దోహజము. సం. విణ. (అ. ఆ. అ.) పిదుకుట వలన పుట్టినది. వి. అ. న. పాలు.

దోహదము. సం. వి. అ. పుం. న. ౧.గర్భిణ్యభిలాష, వేవిళ్లు. ౨. తరుగుల్మలతాదులకు అకాలమందు . పుష్పాదులను పుట్టించు స్త్రీల పాదతాడనాదిక్రియ. (అశోకమునకు దోహదము పాదతాడనము, పొగడకు ముఖసీధువు, గోరంటకు ఆలింగనము, బొట్టుగునకు వీక్షణము, మామిడికి కరస్పర్శము, సంపెఁగకు ముఖరాగము, కొండగోఁగునకు సల్లాపము, వావిలికిఊర్పు, మోరటికి పాట, సురపొన్నకు నవ్వు అని శ. ర.- ప్రేంక్షణమునకు కరస్పర్శము, పొగడకు మద్యగండూషము, అశోకమునకు పాదతాడనము, బొట్టుగునకు వీక్షణము,గోరంటకు ఆలింగనము, మందారమునకు నర్మవాక్యము, చంపకమునకు మందహాసము, చూతమునకు వక్త్రవాతము- ఊర్పు-, సురపొన్నకు గానము, కొండగోఁగునకు పురోనర్తనము అని మేఘదూత. ౨. ౧౩. మల్లినాథవ్యాఖ్య.) ౩. అకాలపత్రపుష్పోత్పాదకద్రవ్యము. (ఎరువు మొ.) ౪. గర్భము, చూలు. ౫. గర్భలక్షణము. ౬. ఇచ్ఛ. ౭. లాలస, తీవ్రేచ్ఛ.

దోహదలక్షణము. సం. వి. అ. న. ౧. గర్భచిహ్నము. ౨. యౌవనసంధి.

దోహదవతి. సం. వి.ఈ. స్త్రీ. శ్రద్ధాళువు, వేవిళ్లు కలయాఁడుది.

దోహనము. సం. వి. అ. న. ౧. పిదుకుట. ౨. కోరికల నిచ్చుట. ౩. పాలుపిదుకుపాత్రము.

దోహని. సం.వి.ఈ.స్త్రీ. పాలుపిదుకుపాత్రము.

దోహము. సం.వి. అ. పుం. ౧. దోహనము, పాలుపిదుకుట. ౨. దుగ్ధము, పాలు. ౩. పాలుపిదుకుపాత్రము. ౪. (కోరికలు మొదలగువానిని) పూర్తిచేయుట; ఇచ్చుట.

దోహరి. వి. చండాలుఁడు.

సీ. దీవింప నున్నాఁడు తెలిసి దోహరిబంటుఁ జెవి నక్షమాలికఁ జెరివి ద్విజుఁడు. కాశీ.౭. ౨౪౦.

దోహలము. సం. వి. అ. పుం. ౧. ఇచ్ఛ. ౨.దోహదము. ౩. ఉత్సాహము.

గీ. అధిప సాలకటంకటు లనఁగఁ జనిన,నాఁటి వారుఁ బౌలస్త్యులు నాఁగ బరఁగు, నేఁటి వారు సమానులు నిక్క మరయ, బాహుబలమున సాహవదోహలమున. నిర్వ. ౩.౩౮.

దోహలవతి. సం=దోహదవతి.

దోహలి. సం. విణ. (న్. నీ.న్.) ౧. దోహదము కలది. ౨. ఇచ్ఛకలవాఁడు. ౩. ఉత్సాహము కలవాఁడు.

ఉ. శ్రీరమణీగృహాంగణము చెన్ను వహింప నలంకరింపఁగా, దోరణముం బ్రదీపమును దోహలియై యొడఁగూర్చె నాఁ దగం,జేరి యురంబునందుఁ దులసీవనమాలయుఁ గౌస్తుభంబు నొప్పారఁగ నుల్లసిల్లుహరి యన్నమతిక్కని ధన్యుఁ జేయుతక్. దశకు. ౧. ౧. వి. ఈ. స్త్రీ. అశోకము.

దోహాపనయము. సం. వి. అ. పుం. -పిదుకుట వలన పొదుఁగును తగ్గించునది- దుగ్ధము, పాలు.

దోహి. సం. విణ. (న్. నీ. న్.) ౧. దోహనశీలుఁడు, పిదుకువాఁడు. ౨. (కోరిక మొదలగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వానిని) పూర్తిచేయువాఁడు; ఇచ్చువాఁడు.

దోహితము. సం. విణ. (అ. ఆ. అ.) పాలుపిదుకఁబడినది. (ఆవు మొ.)

దోహ్యా. సం. వి. ఆ. స్త్రీ. -పిదుకఁదగినది-ఆవు.

దోహ్యాము. సం. విణ. (అ. ఆ. అ.) పిదుకఁదగినది. వి. అ. న. పాలు.

## దా

దా=దవు. వి. ౧. దూరప్రదేశము.

సీ. తమరాక ప్రియుల కెంతయు జాల వినరాఁబిసాళించుకజ్జుఁబాగాలు మెట్టి. వైజ. ౨. ౪౫.

శా. అప్పు ల్వారిధిచేతఁ బుచ్చికొని కార్యం బైన మున్గొన్నయ,య్యప్పుల్ దా చనియుక్ సవృద్ధికముగా నవ్వారిధికే తీర్పఁగా, నప్పుణ్యాతివిశుద్ధజీవుఁడు...ఒప్పారెక్...ఆము. ౪. ౧౫౭.

క్రి. విణ. దూరముగా. విణ. దూరము. అని (శ.ర.)

శా. మేయుం బచ్చిక మచ్చికం గదిసి నమ్మించుం దనుం బట్టఁ బోఁ, బాయుక్ బిట్టలయించు దా దిగుచు నప్పాటక్ మృగం బీగతిక్. రామా. ౫. ౧౬౩.

(దీనియామ్రేడితరూపము దాదా.)

శా...అద్దోషాచరుం డల్కన్నా,తామ్రాక్షుండయి దానిఁ ద్రుంచె నడుమం దాదాలభల్లంబునక్. భా. రా. యు. ౬౪౯.

దాకూలము. సం. విణ. (అ. ఈ. అ.)దుకూలసంబంధమైనది. వి. అ. పుం. దుకూలముచేత కప్పఁబడినరథము. న. దుకూలము, సన్నబట్ట.

దాడ=దవుడ.

(చెక్కిలి,చెంప.)

సీ. ఆరేయిఁ గల నెల్లవారను గోరదాడలును నల్లనిమేనుఁ గలనెలంత, యొక్కత యిలుపొచ్చి యువిదల నీడిచికొని పోవ...కనిరి. భార. మా. ౨౫.

సీ. వికృతాననంబులు విరళదంతంబులు నిడుపైనదాడలునిక్కు మెడలు.ఉ.హరి. ౨.౧౨౨.

గీ. ఉమిసెఁ దుప్పున మొగముపై నొక్కరుండు, జెట్టు నవ్వుచు దాడలఁ గొట్టె నొకఁడు. హరిశ్చ. ౪. ౧౬౨.

(చెక్కిలి లోపలిభాగము.)

సీ. దాడ లొండొంటితోఁ దాటించి సెలవుల జిహ్వ యార్చుచు నగ్నిశిఖలు సెదర.హరి. ఉ. ౯. ౨౨౫.

దా(దవు)డు. వి. ౧. జోడన, అశ్వగతివిశేషము. ౨. దండయాత్ర. ౩. పరుగు. (శ.ర.)

దాత్యము. సం. వి. అ. న=దూత్యము.

దారాత్మ్యము. సం. వి. అ. న-దురాత్మభావము-చెడ్డతనము, దుండగము.

దా(దవు)రు. వి. ౧. కాంతిగల హారము.

క. హారులు జయవెట్టఁగఁ బరి,చారకు లరచట్టదారు సవరింపఁగఁ దు,ఖ్ఖారతురంగము నెక్కి యొ,యారంబులఁ జొక్కి చైత్రయాత్రోన్ముఖుఁడై. రా. వి. ౨. ౪౭.

౨. రుచి.

ఆ. చిగురుఁజెట్టుమీఁదఁ జింతపూవులు పూసి,నిమ్మపండ్లు పండునిమిడమునను, దారు చెడకయుండ దానిని దినవలె...వేమనచాటువు.

౩. కాంతి.

సీ. తళుకొంద నడుదట్టిదవురుఁ దన్నెడియింద్రగోపంపుపాపోసు లేపు చూప.రా. వి. ౫. ౩౫. (శ. ర. పా. దౌరు. ముద్రి. పా.)

దార్గత్యము. సం. వి. అ. న. ౧. దారిద్ర్యము. ౨. దుఃఖిత్వము, దుఃఖము కలిగి యుండుట.

దార్గము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. దుర్గసం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బంధ మైనది. ౨. దుర్గాసంబంధ మైనది.

దౌర్జన్యము. సం. వి. అ. న. దుర్జనభావము, చెడ్డ తనము.

దౌర్బలము. సం=దౌర్బల్యము.

దౌర్బల్యము. సం. వి. అ. న. దుర్బలత్వము, అల్ప బలము కలిగియుండుట.

దౌర్భాగినేయుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ౧. దురదృష్టవంతురాలికొడుకు. ౨. మగఁ డొల్లనిదానికొడుకు.

దౌర్భాగ్యము. సం. వి. అ. న. ౧. దుర్భగభావము, దురదృష్టము. ౨. దుర్భగాభావము, మగఁ డొల్లనిదానిధర్మము, దుర్భగగా నుండుట.

దౌర్భ్రాత్రము. సం. వి. అ. న. దుర్భ్రాతృభావము, సోదరుల అన్యోన్యకలహము. (వ్యతి. సౌభ్రాత్రము.)

దౌర్మంత్ర్యము. సం. వి. అ. న. చెడ్డబోధనము, చెడుకలుపు; దురాలోచనము.

దౌర్మనస్యము. సం. వి. అ. న. ౧. ఖేదాదుల వలన మనస్సు దిటము తప్పి యుండుట, మనస్సు చెడుట. ౨. దుష్టమనస్సు కలిగియుండుట.

దౌర్లభ్యము. సం. వి. అ. న. దుర్లభత, దుర్లభముగా నుండుట.

దౌర్వ్యణము. సం. వి. అ. న. ౧. దూర్వయొక్క రసము. ౨. పృష్టపర్ణము, పరిశుద్ధ మైనఆకు.

దౌర్హార్దము. సం. వి. అ. న. దుర్హృద్ధర్మము, దుష్టహృదయము కలిగి యుండుట; శత్రుత్వము. (వ్యతి. సౌహార్దము.)

దౌర్హృదము. సం. వి. అ. న. చెడ్డహృదయము కలిగి యుండుట; విరోధము.

దౌర్హృదయము. సం. వి. అ. న. దుర్హృదయత్వము, చెడ్డమనస్సు కలిగి యుండుట.

దౌవారికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ద్వారపాలకుఁడు.

దౌశ్చర్యము. సం. వి. అ. న. ౧. దుశ్చరత్వము, చెడ్డనడవడి. ౨. చెడ్డకార్యము.

దౌశ్శీల్యము. సం. వి. అ. న. దుశ్శీలత, చెడ్డ నడవడి.

దౌష్కుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ౧. దోశ్చరుఁడు, బాహువులతో సంచరించువాఁడు. ౨. (నీట) బాహువులతో చరించువాఁడు, ఈఁదువాఁడు.

దౌష్కులుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) చెడ్డ కులమున పుట్టినవాఁడు.

దౌష్కులేయుఁడు. సం=దౌష్కులుఁడు.

దౌష్ట్యము. సం. వి. అ. న. దుష్టత్వము, చెడ్డ తనము.

దౌష్ఠవము. సం. వి. అ. న. దుష్ఠుత్వము, చెడ్డతనము; అడఁకువలేమి. (వ్యతి. సౌష్ఠవము.)

దౌష్యంతి. సం. వి. ఇ. పుం. దుష్యంతునికొడుకు, భరతుఁడు.

దౌస్సాధికుఁడు. సం. వి. అ. పుం. -దుష్టులను సాధించుటయందు నియుక్తుఁడు-౧. ద్వారపాలకుఁడు. ౨. గ్రామాధ్యక్షుఁడు.

దౌహిత్రము. సం. విణ. (అ. ఈ. అ.) దుహితృసంబంధ మైనది. వి. అ. న. ౧. దుహిత్రపత్యము, కూఁతుయొక్క సంతతి. ౨. తిలలు. ౩. కపిలగోవునెయ్యి. ౪. ఖడ్గమృగము. (కల్ప.)

దౌహిత్రాయణుఁడు. సం. వి. అ. పుం. దౌహిత్రునికొడుకు.

దౌహిత్రి. సం. వి. ఈ. స్త్రీ. దుహితకూఁతురు, మనుమరాలు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డౌహిత్రుఁడు. సం. వి. అ. పుం. దుహితకొడుకు,మనుమఁడు.

డౌహృదము. సం. వి. అ. న. గర్భిణీలక్షణము, వేవిళ్లు. ("స్వహృదయేన గర్భహృదయేన చ ద్విహృదయేన చద్విహృదయాగర్భిణీ. రఘు. ౩. ౧. శ్లో. చూమల్లి. వ్యా. ద్విహృదయాంచనారీం డౌహృదిన మాచక్షతే. శ్లో. సా ప్రాప్తదౌహృదా పుత్రం జనయేతగుణాన్వితమ్,అలబ్ధదౌహృదాగర్భే లభేతాత్మని వాభయమ్." శుశ్రుతము. శరీరస్థానము. ౧౫. ౨౦.

డౌహృదిని. సం. వి. ఈ. స్త్రీ. – రెండుహృదయములు కలది – గర్భిణి, చూలాలు.

"ద్విహృదయాంనారీం డౌహృదినీమాచక్షతే." సంగ్రహము.(చూ.సం.రఘు.౩.౧.మల్లి.వ్యా.)

## ద్యా.

ద్యావాక్షమలు. సం. వి. ఆ. స్త్రీ. ద్వి. మిన్నుమన్నులు,ఆకాశమును భూమియును.

ద్యావాపృథివులు. సం. వి. ఈ. స్త్రీ. ద్వి. మిన్నుమన్నులు, ఆకాశమును భూమియును.

## ద్యు.

ద్యు. సం. దివ్ శబ్దము సమాసపూర్వపద మగునపుడు వచ్చెడిరూపము. (ద్యుమణి మొ.)

ద్యుగణము. సం. వి. అ. పుం. అహర్గణము,దినసముదాయము.

ద్యుగము. సం. వి. అ. పుం. ఖగము,పక్షి.

ద్యుచరము. సం. వి. అ. పుం. – ఆకాశమున సంచరించునది– ౧. గ్రహము. ౨. పక్షి.

ద్యుతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. దీప్తి,కాంతి,తేజస్సు. ౨. వెలుఁగు,కిరణము. ౩. శోభ,రూపయౌవనాదిప్రయుక్త మగుదేహకాంతి.

ద్యుతికరుఁడు. సం. విశ. (అ. ఈ. అ.) కాంతిని కలిగించువాఁడు. వి. అ. పుం. ధ్రువుఁడు. (కల్ప.)

ద్యుతితము. సం=ద్యోతితము.

ద్యుదళము. సం. వి. అ. పుం. మధ్యాహ్నము, దినమధ్యము. (అ. ని.)

ద్యుధుని. సం=ద్యునది.

ద్యునది. సం. వి. ఈ. స్త్రీ. ఆకాశగంగ, మందాకిని.

ద్యుపతి. సం. వి. అ. పుం. ౧. ఆకాశపతి, సూర్యుఁడు. ౨. స్వర్గపతి,ఇంద్రుఁడు.

ద్యుమణి. సం. వి. ఇ. పుం. –దివికి మణివంటివాఁడు– చదలుమానికము, సూర్యుఁడు.

ద్యుమ్నము. సం. వి. అ. న. – దీప్తిని ఇచ్చునది– ౧. ధనము. ౨. బలము. ౩. పరాక్రమము.

ద్యుయోషిత్తు. సం. వి. త్. స్త్రీ. ౧. దేవతాస్త్రీ. ౨. అప్సరస.

ద్యులోకము. సం. వి. అ. పుం. దేవలోకము, స్వర్గము.

ద్యువు. సం. విశ. (ఉ.) దేవరుఁడు, జూదరి. (అక్షద్యువు మొ.) వి. ఉ. న. ౧. దినము. ౨. ఆకాశము. ౩. స్వర్గము. ౪. ప్రకాశము; కాంతి. పుం. అగ్ని. (మే. ని.)

ద్యుసత్తు. సం=ద్యుసదుఁడు.

ద్యుసదుఁడు. సం. వి. త్. పుం. ౧. దివిషదుఁడు,వేల్పు. ౨. ఆకాశమున నుండుగ్రహము. (సూర్యాది.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్యుసరిత్తు. సం. వి. త్. స్త్రీ. ఆకాశగంగ, మిన్నేఱు.

## ద్యూ.

ద్యూతకరుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) జూదరి, జూద మాడువాఁడు.

ద్యూతకారకుఁడు. సం. విణ. (అ. రికా. అ.) ౧. జూదమాడువాఁడు. ౨. జూదమాడించువాఁడు.

ద్యూతకారుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) =ద్యూతకారకుఁడు.

ద్యూతకృత్తు. సం. విణ. (త్. తీ. త్.)=ద్యూతకరుఁడు.

ద్యూతపూర్ణిమ. సం. వి. ఆ. స్త్రీ. కోజాగరపూర్ణిమ, ఆశ్వయుజపూర్ణిమ.

ద్యూతప్రతిపత్తు. సం. వి. ద్. స్త్రీ. కార్తిక శుక్లప్రతిపత్తు. (నాఁడు ప్రజలు జూదముతో కాలక్షేపము చేయుదురు.)

ద్యూతబీజము. సం. వి. అ. న. జూద మాడు గవ్వ.

ద్యూతము. సం. వి. అ. పుం. న. జూదము.

ద్యూతసభ. సం. వి. ఆ. స్త్రీ. ౧. జూదపుటిల్లు. ౨. జూద మాడుసభ.

ద్యూతి. సం. వి. ఇ. స్త్రీ. జూదము.

ద్యూనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. క్రీడించినది. ౨. స్తుతింపఁబడినది. ౩. సంతోషించినది. ౪. నిద్రించినది. ౫. మదించినది. వి. అ. న. ౧. (జ్యోతి.) లగ్నమునుండి ఏడవరాశి. ౨. క్రీడించుట. ౩. స్తుతించుట. ౪. సంతోషించుట. ౫. నిద్రించుట. ౬. మదించుట.

## ద్యో.

ద్యో. సం. వి. ఓ. స్త్రీ. (దీనికి తెలుఁగున వ్యస్తప్రయోగము లేదు.) ౧. స్వర్గము. ౨. ఆకాశము.

ద్యోతకము. సం. విణ. (అ. తికా. అ.) ౧. ప్రకాశించునది. ౨. ప్రకాశింపఁజేయునది. ౩. తెలుపునది; స్ఫురింపఁజేయునది.

ద్యోతనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రకాశించునది. ౨. ప్రకాశింపఁజేయునది. ౩. తెలుపునది; స్ఫురింపఁజేయునది. (అ. ఈ. అ.) ప్రకాశింపఁజేయు సాధనము. వి. అ. పుం. దీపము. న. ౧. ప్రకాశించుట. ౨. ప్రకాశింపఁ జేయుట. ౩. తెలుపుట; స్ఫురింపఁజేయుట. ౪. వెలుఁతురు.

ద్యోతనిక. సం. వి. ఆ. స్త్రీ. - గ్రంథభావమును తెలుపునది- వివరణము, వ్యాఖ్య. (విల్యమ్సు.)

ద్యోతమానము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రకాశించుచున్నది. ౨. స్ఫురించుచున్నది.

ద్యోతము. సం. వి. అ. పుం. ౧. ప్రకాశము; కాంతి. ౨. ఆతపము, ఎండ.

ద్యోతించు. సం. అ. క్రి. ప్రకాశించు.
క. ఆతతమణిరుచిరసభము, ద్యోతింపఁగ...కు. సం. ౨. ౧౪౯.

ద్యోతితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రకాశించినది; ప్రకాశముకలిగినది. ౨. స్ఫురించినది, తోఁచినది. ౩. ప్రకాశింపఁజేయఁబడినది. ౪. స్ఫురింపఁజేయఁబడినది; తెలుపఁబడినది.

ద్యోతిరింగణము. సం=జ్యోతిరింగణము.

ద్యోభూమి. సం. వి. ఇ. పుం. - ఆకాశమే గమనస్థానముగా కలది - పక్షి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్యోభూములు. సం=ద్యావాభూములు.

ద్యోసత్తు. సం. వి. ద్. పుం ౧.- ఆకాశమున నుం డునది - గ్రహము. ౨. - స్వర్గమున నుండు వాఁడు- దేవత, వేల్పు. (రూ. ద్యోసదుఁడు.)

## ద్యా

ద్యాత్రము. సం. వి. అ. న. = జ్యోతి. (వాచ.)

## ద్ర

ద్రంక్షణము. సం. వి. అ. న. తోలము,తులము, పండ్రెండుమాషములయెత్తు. (వాచ.)

ద్రగడము. సం. వి. అ. పుం. నిదురపోవువారిని లేపుటకు వాయించువాద్యము (త్రి. ని.)

ద్రఢిమ(ము).సం. వి. న్. పుం. దార్ఢ్యము, దిట్ట తనము.

ద్రప్సము. సం. వి. అ. పుం. జలబిందువు, నీటి బొట్టు. న. తోడుపెట్టినకుండలోనియడుగు పెరుఁగు. (తోడుపెట్టినకుండలోని పైపెరుఁగు అని కొందఱు నీళ్లు కలిసిన పెరుఁగు, ఘనేతరదధి. అనికొందఱు.)

ద్రబ్బ=బ్రద్ద. వి.(ఇది బ్రద్దకు వ్యత్యస్తరూపము.) బద్ద, శకలము.

ఉ. దబ్బఱ కానుమాట వనితామణి కొను మె ఱుంగుజాళువా, గుబ్బలి కేనికోట వలిగుబ్బె తచన్దవ వేల్పురాచరా,ద్రబ్బల మేలి తేట య లరాజముఖీమణి వేణికారుచుల్, లిబ్బిపడంతి పట్టి కవలీల జయం బగు దీనిప్రాపునన్. కువ ల. ౩. ౩౧. (ద్రబ్బు. ముద్రి.)

ద్రబ్బెడ. వి. ౧. భక్ష్యవిశేషము.

సీ. ఒకకొన్ని ద్రబ్బెడ లొకకొన్ని తాలింపు లొ కకొన్ని విధముల యొఱ్ఱచేరు,లు...పాండు. ౪. ౧౮౪.

వ...చలిమిడియును ద్రబ్బెడయు వడయు ను క్కెరలుఁ జక్కెరలును...కాశీ. ౬.౧౫౫. (ద్రెబ్బెడ. ముద్రి.)

౨. అడుగంటి మాఁడిన అన్నము.

(జడభరతుఁడు.) వ...ఊఁక తవుడు తెలికపిండి పొట్టు మాఁడు ద్రబ్బెడ యాదిగాఁగల ద్ర వ్యంబులయందు నమృతంబు పగిది రుచిచేసి భక్షించుచు...భాగ. ౫. ౧. ౧౭౭.

వ...కణపిణ్యాకఫలీకరణకుల్మాష స్థాలీపురీషాదీ నమృతవదభ్యవహరతి. సం. భాగ. ౫. ౯. ౧౧. ('స్థాలీపురీషం=స్థాలీలగ్నందగ్ధాన్నం' అని వ్యాఖ్య.)

ద్రమిళము. సం.వి. అ. పుం. ఒకానొకదేశము. (వాచ.)

ద్రమ్మము. సం. వి. అ. పుం. పదియాఱుపణ ములు, నిష్కమున పదియాఱవవంతు.

శ్లో. వరాటకానాం దశకద్వయం యత్సా కా కిణీ తాశ్చ పణశ్చతస్రః, తే షోడశ ద్ర మ్మ ఇహావగమ్యో, ద్రమ్మైస్తథా షోడశభిశ్చ నిష్కః. లీలావతి. ౨.

ద్రవంతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. స్రవంతి, నది. ౨. మూషికపర్ణి, ఎలుకజీడి?.

ద్రవజము. సం. వి. అ. పుం. - ద్రవమునుండి పుట్టినది- గుడము, బెల్లము.

ద్రవత్. సం. (శతృ) ౧. కాఱుచున్న. ౨. కరఁగుచున్న. ౩. పరుగెత్తుచున్న.

ద్రవద్రవ్యము. సం. వి. అ. న. నీటివలె పలు చగా నుండుపదార్థము.

ద్రవపోతము. సం. వి. అ. పుం. గంభారి, గుమ్ముడు?.

ద్రవము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. పరుగె త్తునది. (అశ్వాది.) ౨. స్రవించునది, కాఱునది. ౩. కరఁగునది. ౪. ద్రవరూపముగా నుండు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నది, నీటివలె పలుచ నైనది. (వ్యతి. ఘనము.)
వి. అ. పుం. ౧. గమనము, పోక. ౨. పరుగెత్తుట. ౩. కరఁగుట. ౪. కాఱుట. ౫. వేగము. ౬. పరిహాసము; స్త్రీపురుషులపరిహాసము. ౭. తడి. ౮. రసము. ౯. కషాయము. ౧౦ (నాటక.)విమర్శసంధ్యంగములలోనొకటి, శోకవేగాదులవలన కలుగుగురుతిరస్కారము. సా. ద.౬. ౧౦౩. ౧౧. తోడుపెట్టినకుండలోని యఱుగు పెరుఁగు.

ద్రవరస. సం. వి. ఆ. స్త్రీ. ౧. లాక్ష,లక్క. ౨. బంక.

ద్రవాధారము. సం. వి. అ. పుం. ౧. చుళుకము,పుడిసిలి. ౨. ద్రవద్రవ్య ముంచుపాత్రము. (కల్ప.)

ద్రవించు. సం. అ. క్రి. కాఱు; నీఱుకాఱు.
గీ. కారణము లేక దాపలికను ద్రవించు. భా. ర. శాం. ౬. ౧౨౯.

ద్రవిడము. సం. వి. అ. పుం. ౧. అఱవదేశము. ౨. ఆంధ్రకర్ణాటద్రావిడఘూర్జరమహారాష్ట్రిలు నివసించు దేశము.

ద్రవిడి. సం. వి. ఇ. స్త్రీ. స్త్రీలింగరాగములలో నొకటి. (కల్ప.)

ద్రవిడుఁడు. సం. వి. అ. పుం. సంకరజాతి విశేషము, వ్రాత్యక్షత్రియునకు క్షత్రియస్త్రీ యందుఁ బుట్టినవాఁడు. (వాచ.)

ద్రవిణనాశనము. సం. వి. అ. న. ౧. ధనము యొక్కనాశనము. ౨. శోభాంజనము, మునగ. (దీనిని సేవించుటవలన ధనము నశించును. కావున నే స్మృతినిషిద్ధ మని వాచ.)

ద్రవిణము. సం. వి. అ. న. ౧. ధనము, సొమ్ము. ౨. బంగారము. ౩. శరీరబలము. ౪. పరాక్రమము. ౫. వాంఛ, కోరిక. (వాచ.)

ద్రవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ద్రువికారము, వృక్షవికార మైనది. ౨. ద్రుతుల్యము, ఫలపుష్పాదులతో నిండినవృక్షమువలె శుభప్రాప్తికి తగినది, భవ్యము, యోగ్యము.
(ఈయర్థమున నిత్యనపుంసకము.)
శ్లో. ద్రవ్యంజిగీషు మధిగమ్య జడాత్మనోపి నేతుర్యశస్విని పదే నియతా ప్రతిష్ఠా. ముద్రా. ౭. ౧౪.
వి. అ. న. ౧. విత్తము, ధనము. ౨. వస్తువు, పదార్థము; (న్యాయ.)పృథివ్యాది.(ఇవితొమ్మిది. పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు.) ౩. పిత్తలము, ఇత్తడి. ౪. విలేపనవస్తువు. ౫. విలేపనము, పూఁత. ౬. ఔషధము, మందు. ౭. వినయము, అడఁకువ. ౮. జతువు, లక్క. ౯. మద్యము. ౧౦. నిర్యాసము, బంక.

ద్రవ్యవంతుఁడు. సం. విణ. (త్. వత్. త్.) ద్రవ్యము కలవాఁడు.

ద్రవ్యవాచకము. సం. విణ. (అ. చికా. అ.) పదార్థమును తెలుపునది. వి. అ. న. నామము, విశేష్యము.

ద్రష్ట. సం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) ౧. చూచువాఁడు. ౨. మనస్సుచే కనుఁగొనువాఁడు. (ఋషులు మంత్రద్రష్టలు.) ౩. గుణదోషములను కనుఁగొనువాఁడు; నిర్ణయకర్త, న్యాయాన్యాయములు పరిశీలించువాఁడు.

ద్రష్టవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చూడఁదగినది. ౨. దర్శనీయము, చూచుట కింపైనది. ౩. మనస్సుచే కనుఁగొనఁ దగినది, గ్రహింపఁ దగినది.

ద్రహము. సం. వి. అ. పుం.(వర్ణవ్యత్యయము.) హ్రదము, లోఁతైనమడుఁగు. (వాచ.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ద్రా

ద్రాక్. సం.అవ్య.(తెలుఁగున దీనికి వ్యస్తప్రయోగములు లేవు.) తోడనే, వెంటనే.

గీ. ద్రాగ్విదాహచ్ఛిదావినిద్రాణమదవ, దంజనాలానమూలశయ్యావిధాన, వారణాధోరణాకల్పితోరుశోణ, వృత్తికారాశియో యన మెఱసె సంధ్య. మనుచ. ౩. ౧౭.

ద్రాక్ష. సం. వి. ఆ. స్త్రీ. మృద్వీక, దాక్ష.

ద్రాక్షారసము. సం. వి. అ. పుం. ౧. ద్రాక్షపండ్లరసము. ౨. ద్రాక్షసారాయి.

ద్రాఘిమ(ము). సం. వి. న్. పుం. దైర్ఘ్యము, నిడివి.

ద్రాఘిష్ఠము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి దీర్ఘము, అన్నిటికంటె పొడు వయినది.

ద్రాఘీయము. సం. విణ. (స్. యసీ. స్.) దీర్ఘతరము, ఒకదానికంటె పొడు వైనది.

ద్రాణము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పలాయితము, పాటిపోయినది. ౨. సుప్తము, నిద్రించినది. వి. అ. న. ౧. పాటిపోవుట. ౨. నిద్ర.

ద్రాప. వి. కవిత్వదోషములలో నొకటి.

ద్వి. ద్రాప ఛందోవిరుద్ధం బాదియగున,లాపప్రలాపోక్తి లాఘవం బనక, వసిఁ గూర్చ కృతులు నావడ్లను బెరుఁగుఁ, బిసుకుచందపుబిలిబిలికృతుల్ గృతులె. పండితా.దీక్షా.౭ప.

ద్రాపము. సం. వి. అ.పుం. ౧. పంకము, అడుసు. ౨. ఆకాశము, మిన్ను.

ద్రాపుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మూర్ఖుఁడు. వి. అ. పుం. శివుఁడు.

ద్రాబ. వి. (సం. ద్రాపః.) అసారోక్తి.

గీ. ద్రాబ యనఁగ నసారోక్తి దనరుచుండు. ఆం. భా. ౧.౧౧౭.

చ...దు,వ్కవితలు లక్షణం బెఱుఁగఁ జాలకి ద్రాబలు గూర్చి యల్లుచుక్. కవిసర్ప. ౧. (శ. ర.)

విణ=దేబె. మూర్ఖుఁడు, అధముఁడు; చేతఁగానివాఁడు.

క. మీబుద్ధిబలముప్రాపున, నాబాహుపరాక్రమమున నడచితిమి తుదిక్, గూబలచే నిలైతిమి, ద్రాబలమై మీఁదికార్యతంత్రము చెప్పుఁడీ. నా. పంచ. ౩. ౨౧.

చ. ద్రవిణము నొవ్వఁ గొంట నొర ద్రాబలతో నిడుచుంట భూమి గొం, తవలికి నిచ్చుచుంట...భూధవుఁడు...తనయం దివి మాన్పుకొఁ దగుక్. ఆము. ౪. ౨౪౫.

ద్రామిళుఁడు. సం. వి. అ. పుం. ౧. ద్రమిళదేశపువాఁడు. ౨. చాణక్యుఁడు. (ఇతని పూర్వులు ద్రమిళదేశమున నుండిరి.)

ద్రావకకందము. సం. వి. అ. పుం. తైలకందము, ఒకానొకదుంప.

ద్రావకము. సం. విణ. (అ. వికా. అ.) ౧. కరఁగునది. ౨. కరఁగించునది. ౩. మనస్సును హరించునది. ౪. పరుగెత్తించునది. వి. అ. పుం. ౧. వెలిగారము, టంకణము. ౨. చంద్రకాంతమణి. ౩.రసగంధకపాషాణాదులనుండి తీసెడి రసవిశేషము. న. ౧. సిక్థకము, మైనము. ౨. ప్లీహాదుల కుపయోగించు ఔషధవిశేషము. పుం. న. అయస్కాంతము, సూదంటుఱాయి.

ద్రావకరము. సం. వి. అ. న. శ్వేతటంకణము, తెల్లవెలిగారము.

ద్రావకుఁడు. సం. విణ. (అ. వికా. అ.) ౧. దొంగ. ౨. మోసగాఁడు. ౩. విదగ్ధుఁడు, నేర్పరి. ౪. జారుఁడు.

ద్రావణము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పాఱఁ దోలునది. ౨. కరఁగించునది. వి. అ. న.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧. తఱుమఁగొట్టుట, పాఱఁదోలుట. ౨. కరఁగించుట. ౩. చిల్లగింజ, ఇందుగుకాయ.

ద్రావణీయము. సం = ద్రావ్యము.

ద్రావము. సం. వి. అ. పుం. ౧. గతి, పోవుట. ౨. వడిగా పోవుట, పరుగెత్తుట. ౩. కాఱుట. ౪. కరఁగుట. ౫. పశ్చాత్తాపము.

ద్రావయితవ్యము. సం=ద్రావ్యము.

ద్రావిక. సం. వి. ఆ. స్త్రీ - స్రవించునది- లాల, చొంగ.

ద్రావిడకము. సం. వి. అ. పుం. కచోరము?. న. బిడలవణము, ఒకదినుసు ఉప్పు.

ద్రావిడము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. ద్రవిడదేశసంబంధమైనది. ౨. ద్రవిడదేశమున పుట్టినది. వి. అ. పుం. కచోరము?. న. ద్రవిడదేశస్థులభాష.

ద్రావిడి. సం. వి. ఈ. స్త్రీ. ౧. చిట్టేలకి?. ౨. ద్రవిడదేశస్త్రీ.

ద్రావిడుఁడు. సం.వి.అ.పుం.౧.ద్రవిడదేశస్థుఁడు, అఱవదేశపుజనుఁడు. ౨. ఆంధ్రకర్ణాటఘూర్జరద్రావిడ మహారాష్ట్రులలో నొకఁడు.

ద్రావితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. తఱుమఁగొట్టఁబడినది, పాఱఁదోలఁబడినది. ౨. కరఁగింపఁబడినది.

ద్రావ్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కరఁగింపఁబడుచున్నది. ౨. పరుగెత్తింపఁబడుచున్నది.

ద్రావ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పాఱఁదోలఁ దగినది, పరుగెత్తింపఁ దగినది. ౨. కరఁగింపఁ దగినది.

## ద్రి

ద్రిండు=దిండు.

(దట్టీ.)

సీ. చట్టువం బొకచేతఁ బట్టి ఖడ్గము సంకఁ దగిలించి సురియతోఁ బిగియ ద్రిండు, గట్టిన నునుఁజేల కప్పెంతయును జెన్ను సేయఁగ ...భార. విరా. ౧. ౨౧౧.

సీ. బాలారుణప్రభ పసిమి నూనినభంగి నిండు గెంజిగిచేల ద్రిండు గట్టి. హరి.ఉ.౭.౫౧.

సీ. కుండబొజ్జలక్రింద ద్రిండుగా బిగియించి గడితంపు మడుఁగులుగట్టినారు. సైప. ౪. ౬౩.

(చుట్ట.)

సీ. ముసలాగ్రములు సొన్పి మొదలిపాఁ తగలించి దీర్ఘపాశంబుల ద్రిండు సుట్టి, పెకలించి...భాగ. ౮. ౧౮౩.

ద్రిమ్మరించు. స. క్రి. (కడవలతో) క్రుమ్మరించు.

సీ. అంటె మాచెలి తాన మాడు మంచు ఘటంబు వంచి నీర్తల ద్రిమ్మరించె నొకతె. మృ. వి. ౨. ౪౨. (దిమ్మరించు. బ్రౌ.వా.)

## ద్రు

ద్రుకిలిమము. సం.వి.అ.న. దేవదారువృక్షము.

ద్రుగ్ధము. సం. విణ. (అ. ఆ. అ.) ద్రోహము చేయఁబడినది. వి. అ. న. ద్రోహము.

ద్రుఘణము. సం. వి. అ. పుం. ౧. లోహముద్గరము, ఇనుపగుదియ. ౨. పరశువు, గండగొడ్డలి. ౩. భూమిచంపకము, నేలసంపెఁగ?.

ద్రుఘణుఁడు. సం=ద్రుహిణుఁడు.

ద్రుడ్డు=దుడ్డు.

(ముద్గరము.)

గీ... ఆరెంక లినుపద్రుడ్ల గుదియలఁ బిడికిళ్ల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రోకళులను, మొత్తి...అచ్చ. రా. యు. ౨౨౪, ౪౫౫.

ద్రుణా. సం. వి. ఆ. స్త్రీ. అల్లెత్రాడు, వింటినారి.

ద్రుణము. సం. వి. అ. పుం. ౧. తేలు. ౨. తుమ్మెద. న. ౧. విల్లు. ౨. కత్తి.

ద్రుణసుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) -కట్టవంటిముక్కు కలవాఁడు-పొడు వైనముక్కు కలవాఁడు.

ద్రుణహము. సం. వి. అ. పుం- కత్తితో కూర్పఁబడినది- కత్తిఱెుఱ.

ద్రుణి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. ద్రోణి, కట్టతొట్టి, కట్టబొక్కెన. ౨. కర్ణజలూక, జెఱ్ఱి. ౩. కచ్ఛపి, ఆఁడుతాఁబేలు.

ద్రుణుఁడు. సం. వి. అ. పుం. కొండెగాఁడు; దుష్టుఁడు.

ద్రుతప్రకృతికము. సం. వి. అ. న. (ఆంధ్ర వ్యాక.) ద్రుతము అంతమందు కలపదము. (ప్రథమాకయిపట్టియొక్కేతరము లయిన విభక్తులు ఉత్తమపురుషైకవచనములు భూతతద్ధర్మాద్యర్థక ప్రథమపురుషైకవచనములు ఆశీరాద్యర్థకము లైనయెడుతవర్ణకములు శత్రుతుమానంతర్యచేదాద్యర్థకములు నేనుతానుపదములును వలెప్రభృతులును ద్రుతప్రకృతికములు. ఉదా:- నన్నుఁ, నాచేతఁ, నాతోడఁ, నాకొఱకుఁ, నావలనఁ, నాకంటెఁ, నాకుఁ, మాలోపలఁ, మాయందుఁ, వత్తుఁ, వచ్చెదఁ, వచ్చెఁ, వచ్చుఁ, వచ్చెడుఁ, ప్రసన్నులయ్యెడుఁ, కావుతఁ, కొట్టుచుఁ, కొట్టఁ, కొట్టుడుఁ, కొట్టినఁ, వలెఁ, ఎంతయుఁ, పోలెఁ, అయ్యుఁ మొ.)

ద్రుతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వడికలది. ౨. పాఱిపోయినది. ౩. కరఁగినది. క్రి. విణ. త్వరితము, వేగ. వి. అ. పుం. ౧. తేలు. ౨. ద్రుమము, చెట్టు. ౩. బిడాలము, పిల్లి. ౪. (ఆంధ్రవ్యాక.) ప్రత్యయాగమాత్మక మగునువర్ణము. (దీనియుకారమునకు లోపము బహుళము. ఉదా: వచ్చును, వచ్చుఁ. వచ్చెను, వచ్చెఁ. నాచేతను, నాచేతఁ మొ.)

ద్రుతవిలంబితము. సం. విణ. (అ. ఆ. అ.) వడియును విలంబమును కలది. వి. అ. న. (ఛంద.) వృత్తభేదము.

ద్రుత. ద్రుతవిలంబితరూప మగుఁ శుభ్ర,ద్యుతిన
భారయుతంబుగఁజెప్పినఁ. అప్ప. ౨౧౪ పా.

ద్రుతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. ద్రవణము, కరఁగుట. ౨. ద్రవము. (గంధకద్రుతి మొ.) ౩. గతి, పోక. ౪. పరుగు, పలాయనము.

ద్రుపదము. సం. వి. అ. న. ౧. కొయ్యతో చేసిన పాదుక, పావకోడు. ౨. బొండకొయ్య.

ద్రుపదాత్మజ. సం. వి. ఆ. స్త్రీ.-ద్రుపదుని కూఁతురు - ద్రౌపది. (పాండవులభార్య.)

ద్రుపది. సం. వి. ఈ. స్త్రీ. చెట్టువలె దీర్ఘముగా నుండుకాళ్లు కలస్త్రీ.

ద్రుపదుఁడు. సం. వి. అ. పుం. పాంచాలదేశపు రాజు. (ద్రౌపదితండ్రి.)

ద్రుమనఖము. సం. వి. అ. పుం - చెట్టునకు గోరువంటిది - కంటకము, ముల్లు. (ఇట్లే: ద్రునఖము.)

ద్రుమ(మ)రము. సం. వి. అ. పుం. కంటకము, ముల్లు.

ద్రుమము. సం. వి. అ. పుం - కొమ్మలు కలది - ౧. వృక్షము. ౨. పారిజాతవృక్షము. (మే.ని.)

ద్రుమశ్లేష్మము. సం. వి. అ. పుం. తాడి[illegible].

ద్రుమామయము. సం. వి. అ. పుం. ౧ - చెట్టునకు వ్యాధివంటిది-లాక్ష, లక్క. ౨. వృక్షరోగము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్రుమారి. సం. వి. ఇ. పుం. ఏనుఁగు.

ద్రుమాశ్రయము. సం. విణ. (అ. ఆ. అ.) చెట్టును ఆశ్రయించికొని ఉండునది. వి. అ. పుం. సరటము, తొండ. (రా. ని.)

ద్రుముఁడు. సం. వి. అ. పుం. ౧. కుబేరుఁడు. ౨. ఒకానొక కింపురుషాధీశ్వరుఁడు.

ద్రుమేశ్వరుఁడు. సం. వి. అ. పుం.-చెట్లకు ప్రభువు-చంద్రుఁడు.

ద్రుమోత్పలము. సం. వి. అ. పుం. కర్ణికారము, కొండగోఁగు.

ద్రువయము. సం. వి. అ. న.-కఱ్ఱతో చేసినది-మానము, పరిమాణమును తెలుపుసాధనము. (వాచ.)

ద్రువు. సం. వి. ఊ. పుం.-కరఁగునది- బంగారు. ఉ. పుం. ౧. కఱ్ఱ, మ్రాను. ౨. వృక్షము, చెట్టు. ౩. శాఖ, కొమ్మ.

ద్రుసల్లకము. సం. వి. అ. పుం. ప్రియాలవృక్షము, మోరటి. (ఇట్లే: ద్రుమసల్లకము.)

ద్రుహణుఁడు. సం. వి. అ. పుం. బ్రహ్మ.

ద్రుహి. సం. వి. ఈ. స్త్రీ. కూఁతురు. (కల్ప.)

ద్రుహిణము. సం. వి. అ. పుం. ముద్గరము, కుఱుచయినుపదుడ్డు.

ద్రుహిణుఁడు. సం. వి. అ. పుం - దుష్టులకు హానిచేయువాఁడు - ౧. బ్రహ్మ. ౨. విష్ణువు. ౩. శివుఁడు.

ద్రుహుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ద్రోహము చేయువాఁడు, హానిచేయువాఁడు. వి. అ. పుం. -ధనాళిచేత తండ్రికి ద్రోహము చేయువాఁడు-కొడుకు. (వాచ.)

## ద్రూ

ద్రూఘణము. సం. వి. అ. పుం. ద్రుఘణము, ముద్గరము, గుదియ.

ద్రూణము. సం. వి. అ. పుం - హింసించునది - వృశ్చికము, తేలు. (వాచ.)

## ద్రే

ద్రేకాణము. సం = ద్రేక్కాణము. (వాచ.)

ద్రేక్కాణము. సం. వి. అ. పుం. (జ్యోతి.) రాశిలో మూఁడవభాగము.

## ద్రొ

ద్రొబ్బించు. స. క్రి. (√ద్రొబ్బు.) పడఁద్రోయించు.

సీ. కట్టించి కొట్టించి కాంచినదారులఁ బట్టించి థట్టించి గట్టుచఱుల, ద్రొబ్బించి నరకాగ్నిఁ దూలించి...ఘటికా. ౩. ౧౪.

ఉ. ముంచితి వార్ధులం గదల మొత్తితి శైలతటంబులందుద్రొబ్బించితి...భాగ. ౭. ౨౦౧.

సీ. శర్కర వాఁగ నీచాన నన్నలనాఁడు నీట ద్రొబ్బించిన నెలఁత గాదె. యయా. ౪. ౫౬.

ద్రొబ్బిలు. స. క్రి. (√ద్రొబ్బించు.) పగులఁగొట్టు.

ద్వి. నిబ్బరంబుగ డాసి నెరసి గుండియలు, ద్రొబ్బిలు నుఱుకంగఁ ద్రొక్కఁ బాదముల. రం. రా. యు. (చి. ని.)

ద్రొబ్బు. స. క్రి. ౧. త్రోయు, గెంటు; త్రోసివేయు.

ఉ...అప్పచక్రంబు నయోమయంబును ధరాధరమాత్రియుఁ గాల మేఘతుల్యంబును నైన మందస బలంబున నందఱు ద్రొబ్బి తెచ్చి ...భా. రా. బాల. ౬౭౬.

క. మెడఁ బట్టి వెడల ద్రొబ్బినఁ, గడు నతఁ డీడి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గిలఁబడఁగఁ గ్రమ్మఱఁ దపసింబుడిసిటిపట్టు
గఁ బట్టుచు, వడి నొకజరఠయును వాను
వాకిట వైచెక్. విప్ర. ౪. ౩౦.

శా. కందర్పత్వరఁ గానలే వనుచు నాకంజాక్షిఁ
బో ద్రొబ్బె...కళా. ౩. ౨౩౫.

౨. పడఁగొట్టు,పడఁద్రోయు.

మ. పరిఖల్ పూడిచి యంత్రముల్ దునిమి
వప్రవ్రాతముల్ ద్రొబ్బి...భాగ. ౧౦. ఉ.
౩౯౭.

ఉ...ఎం,తేరువ ద్రొబ్బ నంతలును నింతలు నై
పడుతన్న భస్మ్యతాం,గారశిఖ ప్రతానముల
కైవడి రాలె సురేంద్రగోపముల్. ఆము.
౪. ౧౦౭.

౩. వెడలఁద్రోయు,వెడలఁగొట్టు.

క. తరుణుఁ డగుశీతకరునిక్,మరగి వియల్లక్ష్మి
దన్ను మాని ముదుకఁడుక్,ఖరకరుఁడు నను
చు ద్రొబ్బిన,కరణిక్ రవి పశ్చిమాద్రి కడఁ
గ్రుంకె నృపా. భాగ. ౧౦. పూ. ౧౭౭.

ఉ...ఒం,డాడఁగ వద్దు వీనిఁ గపటాత్ముని నిచ్చ
ట నుండనీక పం,ట్లూడఁగ వేసి ద్రొబ్బుఁ డని
యుగ్రతఁ బల్కినఁ గాంత లందఱుక్.
వీర. ౨. ౨౭౪. కవిక. ౪. ౯౬.

వి.౧. త్రోయుట,త్రోపు.(చూ.ద్రొబ్బులాడు.)

పోద్రొబ్బు = పోగొట్టు; అడఁచు, నశింపఁజేయు.

ఉ...పాతకంబుపో,ద్రొబ్బెడులీలఁ జాత్తియపతు
ల్గనుగొంటిని నుందు రందులక్,సిబ్బెపునిబ్బ
రంపుబిగిఁ జిక్కనిచక్కనిగుబ్బగుబ్బెతల్.
హంస. ౧. ౫౨.

జః ద్రొబ్బించు, ద్రొబ్బిలు, ద్రొబ్బుడుపటము, ద్రొ
బ్బులాడు.

ద్రొబ్బుడుపటము. వి. (√ద్రొబ్బు.) మత్స్యగ్ర
హణసాధనవిశేషము, చేఁపలను పట్టుకొనుసా
ధనములలో నొకటి.

గీ. కొడమ తి ఱడ్డక్కొడమ ద్రొబ్బుడుపటంబు,
చాఁప యెత్తైల గూడయు ... హంస. ౪.
౧౮౪.

ద్రొబ్బులాడు. అ. క్రి. (ద్రొబ్బులు + ఆడు.) త్రో
పులాడు.

సీ. పరఁటెఁ ద్రిప్పఁగ జాఱుపైఁటలోఁ గస్పట్టు
గుబ్బలమిసమిస ల్ద్రొబ్బులాడ.హంస. ౨.
౨౨.

## ద్రో

ద్రోగ్ధ. సం.విణ. (బు.గ్ధి.బు.)ద్రోహము చేయు
వాఁడు.

ద్రోణా. సం. వి. ఆ. స్త్రీ. ద్రోణపుష్పి, తుమ్మి.

ద్రోణంపచుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ద్రోణ
ముకొలఁది ఆహారపదార్థములను పచనము చే
యువాఁడు.

ద్రోణక. సం. వి. ఆ. స్త్రీ. శ్వేతసురస, తెల్ల
వావిలి.

ద్రోణకాకము. సం. వి. అ. పుం. మాలకాకి.

ద్రోణక్షీర. సం. వి. ఆ. స్త్రీ. తూమెఁడుపా
లిచ్చెడియావు.

ద్రోణగంధిక. సం. వి. ఆ. స్త్రీ - ద్రోణపుష్ప
మువంటివాసన కలది_ రాస్న, సన్నరాస్టము.

ద్రోణదుగ్ధ. సం = ద్రోణక్షీర.

ద్రోణదుఘ. సం = ద్రోణక్షీర.

ద్రోణపది. సం.వి. ఈ. స్త్రీ- ద్రోణమువంటి పా
దములు కలది - వికృతముగ నుండు పెద్దపాద
ములు కలస్త్రీ.

ద్రోణపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. భూమికదళి.

ద్రోణపుష్పి. సం. వి. ఈ. స్త్రీ.ఏనుఁగుతుమ్మి.

ద్రోణ(ణా)ము= దోణము. వి. ౧. భుజములకు
బలమువచ్చుటకై, త్రిప్పెడు జెట్టివానిడుపకరణ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విశేషము.

మ...ద్రోణముల్ దివియఁదో ర్దండంబులం జేది యే,సిరి బోయల్...మనుచ. ౪. ౧౧౧.

౨. చాపకర్షణబలసాధనము.

సీ...చాపకర్షణబలసాధనంబు, ద్రోణ మనంగ ను దోఁచు...ఆం. భా. ౨.౨౧౨.

౩. తాడిచెట్టు మొ. చీల్చుటకై అక్కడక్కడ కొట్టినచీలలను దిగఁగొట్టు సాధనవిశేషము. (శ. ర.)

ద్రోణము. సం. వి. అ. పుం. ౧. నాలుగువందల విండ్లకొలఁది కలజలాశయము; మడుఁగు. ౨. బొంతకాకి, మాలకాకి, ౩. తేలు; ఎఱ్ఱతేలు. ౪. ఒకానొకకొండ. ౫.-సస్యములకు ద్రోణముల నుండి కుమ్మరించినట్లు వర్షము కురియునది - మేఘభేదము. ౬. చెట్టు. ౭. తుమ్మికూ. పుం.న. ౧. ఆఢకము; తూము. ౨. నాలుగుతూములు. న. ౧. కలశము, కుండ. ౨. కఱ్ఱతొట్టి. ౩. బొక్కెన.

ద్రోణముఖము. సం. వి. అ. న. నాలుగువందల గ్రామములలో మనోహరమును ముఖ్యము నగు గ్రామము.

ద్రోణి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. దోనె, అరిటె.(ఎత్తుడునీరు పోయుటకై తొలిచి కాలువ మొదట నుంచెడుతాటిమ్రాను లోనగునది.) ౨. ఆకు లోనగువానితో చేసినదొప్ప, దొన్నె. ౩. జలాధారము. ౪. కఱ్ఱబొక్కెన. ౫. రెండుపర్వతములనడిమిపల్లపుప్రదేశము. ౬. కదళి, అరటికూ. ౭. నీలికూ. ౮. పసులు మేయుభూమి, బీడు. ౯. ద్రోణీజలవణము. ౧౦. చిన్నయోడ. ౧౧. రెండుచేటలకొలఁది,౧౨ర శేర్లు.(ఆ.ని.)౧౨. నదీభేదము. ౧౩. జలగడఁగువానిసాధనము. ౧౪. దేశవిశేషము. ఈ. స్త్రీ. ద్రోణునిభార్య, కృపి. ఇ. స్త్రీ. కర్ణజలూక, చెవిదూఱుపాము.

ద్రోణీదళము. సం. వి. అ. పుం - దోనెలవంటి ఆకులు కలది - కేతకి, మొగలికూ.

ద్రోణీముఖము. సం = ద్రోణముఖము.

ద్రోణీలవణము. సం. వి. అ.న. ద్రోణజలవణము, ఉపకర్ణాటదేశమున పుట్టులవణవిశేషము.

ద్రోణుఁడు. సం. వి. అ. పుం. - భరద్వాజుఁడు ఘృతాచి యనునప్సరసను జూచి మోహమున తనరేతస్సును ద్రోణమందు విడువఁగా దానియందు పుట్టినవాఁడు - ద్రోణాచార్యుఁడు.

ద్రోవది. వి. (సం. ద్రౌపదీ. ప్రా.ద్రావది.) ద్రౌపది, పాండవులభార్య.

సీ. ఏవురయందును ద్రోవది ప్రీతితో నొక్కొక్కయింటఁ దా నొక్కయేఁడు, క్రమమున నుండంగ...భార. ఆది. ౮. ౧౧౫.

ఉ. ద్రోవది బంధురం బయినక్రొమ్ముడి గ్రమ్మన విచ్చి వెండ్రుకల్, దా వలచేతఁ బూని... భార. ఉద్యో. ౩. ౧౧౪.

క. భూవరు లెల్లను నొక్కట, ద్రోవదికై తొడరి యతనితోఁ బెనఁగి కడుం, జేవ సెడి పోవునప్పుడు, నీ వచ్చటఁ గలవొ లేవొ నిక్కము సెపుమా. భార. విరా. ౪.౨౧౧. రాఘవ. ౨. ౯౯.

ద్రోహము. సం. వి. అ. పుం. ౧. అనిష్టచింతనము, కీడు చేయుతలఁపు. ౨. జిఘాంస, హింసించునిచ్ఛ. ౩. ఛద్మవధము, కపటముచే చంపుట. ౪. హింస.

ద్రోహాటుఁడు. సం. వి. అ. పుం. ౧. బైడాలవ్రతికుఁడు, పరులహింసించుటకై కపటవ్రతధారి యగువాఁడు, మోసగాఁడు. ౨. మృగలుబ్ధకుఁడు, మృగములవేఁటకాఁడు.

ద్రోహి. సం. విణ. (న్. ణీ. న్.) ద్రోహము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేయువాఁడు.

**ద్రోహితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ద్రోహబుద్ధి కలవాఁడు, కీడుతలఁపు కలవాఁడు.

## ద్రౌ

**ద్రౌణి.** సం. వి. ఇ. పుం. అశ్వత్థామ. ఈ. స్త్రీ. ద్రోణి, దోనె; తొట్టి.

**ద్రౌణికము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. ద్రోణ పరిమితి కలధాన్యము చల్లుటకుఁ దగినది. (పొలము.) ౨. ద్రోణముపరిమితి కలధాన్యాదిపదార్థములచే కొనఁబడినది.

**ద్రౌపది.** సం. వి. ఈ. స్త్రీ-ద్రుపదునికూఁతురు-ద్రోవది. (పాండవులభార్య.)

**ద్రౌపదీస్వయంవరములు.** సం. వి. అ. న. బ. వస్త్రవిశేషము.

వ... నాగబంధంబులును బూజాబంధంబులును జలపంజరంబులును గామవరంబులును ద్రౌపదీస్వయంవరంబులును వసంతవిలాసంబులును ...అనుపేళ్లు గలపుట్టంబులు గట్టుకొని ... ద్వా. ౩. ౨౦౬.

**ద్రౌపదేయుఁడు.** సం. వి. అ. పుం. ద్రౌపది కొడుకు.

## ద్వ

**ద్వంద్వచరము.** సం. వి. అ. పుం — కవలుగా సంచరించునది – చక్రవాకము, జక్కవ.

**ద్వంద్వచారి.** సం. వి. న్. పుం. = ద్వంద్వచరము.

**ద్వంద్వజము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. వాతపిత్తశ్లేష్మములలో రెండుదోషములవలన పుట్టినది. (రోగము.) ౨. కలహమువలన పుట్టినది. ౩. కవలవలన పుట్టినది; రెంటివలన పుట్టినది; ఇద్దఱివలన పుట్టినది.

**ద్వంద్వభావము.** సం. వి. అ. పుం. ౧. విరోధము. ౨. జత యగుట. ౩. దాంపత్యము.

**ద్వంద్వభూతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కవ యైనది. ౨. సందిగ్ధ మైనది.

**ద్వంద్వము.** సం. వి. అ. న. ౧. స్త్రీపురుషుల జత. ౨. కవ, జత. ౩. పరస్పరవిరుద్ధము లగు రెంటికవ. (శీతోష్ణాది.) ౪. రహస్యము. ౫. ఇద్దఱికలహము; కలహము, వివాదము. ౬. సందేహము, అనిశ్చయము. ౭. దుర్గము, కోట. పుం. ౧. ఒకానొకసమాసము. (ఇది ఉభయపదార్థప్రధానము. ఉదా: రామలక్ష్మణులు, తల్లిదండ్రులు మొ.) ౨. రోగవిశేషము. (వాతపిత్తశ్లేష్మములలో రెంటివలన పుట్టినది.) ౩. మిథునరాశి.

**ద్వంద్వయుద్ధము.** సం. వి. అ. న. ఇద్దఱకు పరస్పరము జరుగుయుద్ధము.

**ద్వయము.** సం. వి. అ. న - రెం డవయవములు కలది - జత, యుగ్మము.

**ద్వయవాది.** సం. విణ. (న్. నీ. న్.) రెండుమాట లాడువాఁడు, రెండుపక్షములు పలుకువాఁడు, రెండునాలుకలు కలవాఁడు.

**ద్వయసము.** సం. ప్ర. (ప్రమాణార్థమునవచ్చు తద్ధిత ప్రత్యయము. ఈప్రత్యయ మంతమందు కలది విశేషణ మగును. స్త్రీలింగమున ఈకారాంతమగును.) బంటి.(ఉదా:-సరస్సు కటిద్వయసము, నది కటిద్వయసి.)

**ద్వయాతిగుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) రజస్తమస్సులను కడచినమనస్సు కలవాఁడు, రజస్తమోగుణములు వీడి సత్త్వప్రధానుఁ డగు పురుషుఁడు.

**ద్వయి.** సం. వి. ఈ. స్త్రీ. జత, కవ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ద్వా

ద్వాఃస్థితుఁడు. సం. వి. అ. పుం. ద్వారపాలకుఁడు.

ద్వాఃస్థుఁడు. సం.వి.అ.పుం. ద్వారపాలకుఁడు.

ద్వాచత్వారింశత్తమము. సం=ద్వాచత్వారింశము.

ద్వాచత్వారింశత్తు. సం. విణ. (త్) నలువది రెండింటియం దుండుసంఖ్య కలది. వి.త్.స్త్రీ. నలువదిరెండింటియం దుండుసంఖ్య.

ద్వాచత్వారింశము. సం. విణ. (అ.ఈ.అ.) నలువదిరెండవది.

ద్వాత్రింశత్తమము. సం=ద్వాత్రింశము.

ద్వాత్రింశత్తు. సం. విణ. (త్) ముప్పదిరెండింటియందుండుసంఖ్య కలది. వి. త్. స్త్రీ. ముప్పది రెండింటియం దుండుసంఖ్య.

ద్వాత్రింశము. సం. విణ. (అ. ఈ. అ.) ముప్పదిరెండవది.

ద్వాదశ. సం. విణ. (న్)పండ్రెండు. (తెనుఁగున 'దశ' శబ్దమువలె సమాసపూర్వపదముగానే యుండును. ద్వాదశవర్షములు=పండ్రెండువత్సరములు.)

ద్వాదశకము. సం. విణ. (అ.శికా.అ.)-పండ్రెండుపరిమాణము కలది - ద్వాదశకదమము = పండ్రెండుపణములశిక్ష. వి. అ. న. పండ్రెండు.

ద్వాదశము. సం.విణ.(అ.ఈ.అ.)పండ్రెండవది.

ద్వాదశవార్షికము. సం.విణ. (అ. ఈ. అ.)౧. పండ్రెండేండ్లవయస్సు కలది. ౨. పండ్రెండేండ్లు జరిగినది. ౩. పండ్రెండేండ్లకు జరుగఁబోవునది; పండ్రెండేండ్ల కొకమారు వచ్చునది.

ద్వాదశసాహస్రము. సం. విణ. (అ. ఈ.అ.) పండ్రెండువేలుపరిమాణము కలది; పండ్రెండు వేలు. (వాచ.)

ద్వాదశాంగుళము. సం. వి. అ. న. పండ్రెండు అంగుళములకొలఁది, వితస్తి, జేన.

ద్వాదశాంశువు. సం. వి. ఉ. పుం. బృహస్పతి గ్రహము.

ద్వాదశాక్షుఁడు. సం. వి. అ.పుం - పండ్రెండు కన్నులు కలవాఁడు- కార్తికేయుఁడు, కుమారస్వామి. (ఇట్లే: ద్వాదశలోచనుఁడు.)

ద్వాదశాత్ముఁడు. సం. వి.న్.పుం.సూర్యుఁడు.

శ్లో. ధాతా మిత్రోఽర్యమా రుద్రో వరుణస్సూర్య ఏవచ, భగో వివస్వాన్ పూషాచ సవితా దశమస్స్మృతః, ఏకాదశ స్తథా త్వష్టా విష్ణుర్ద్వాదశ ఉచ్యతే, అరుణోమాఘమాసేతుసూర్యోవై ఫాల్గునేతథా, చైత్రేమాసిచ వేదజ్ఞో వైశాఖే తపనస్స్మృతః,జ్యేష్ఠే మాసి తపేదిన్ద్రి ఆషాఢే తపతే రవిః, గభస్తిశ్శ్రావణే మాసి యమోభాద్రపదే తథా, ఇషే హిరణ్యరేతాశ్చకార్తికేచ దివాకరః, మార్గశీర్షే తపేచ్చిత్రః పౌషే విష్ణుస్సనాతనః,ఇత్యేతే ద్వాదశాదిత్యాః కాశ్యపేయాః ప్రకీర్తితాః. (వాచ.)

ద్వాదశాదిత్యులు. సం.వి. అ. పుం. బ. పన్నిద్దఱుఆదిత్యులు. (చూ. ద్వాదశాత్ముఁడు.)

ద్వాదశాధ్యాయి. సం. వి. ఈ. స్త్రీ - పండ్రెండు అధ్యాయములు కలది - జైమిని రచించినపూర్వమీమాంస.

ద్వాదశాయతనుఁడు. సం. వి. అ. పుం. -జ్ఞానేంద్రియములు ఐదు కర్మేంద్రియములు ఐదు మనోబుద్ధులు రెండు మొత్తము పండ్రెండును పూజాస్థానములుగా కలవాఁడు- బుద్ధుఁడు.

ద్వాదశాయువు. సం. విణ. (స్)-పండ్రెండేండ్లవయస్సు కలది - వి. స్. పుం. కుక్క.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్వాదశాహము. సం. వి. అ. పుం. పండ్రెండవదినము.

ద్వాదశి. సం. వి. ఈ. స్త్రీ. పండ్రెండవతిథి.

ద్వానవతము. సం. విణ. (అ. ఈ. అ.) తొంబదిరెండవది.

ద్వానవతి. సం. విణ. (ఇ) స్త్రీ. తొంబదిరెండింటియందుండు సంఖ్యకలది. వి. ఇ. స్త్రీ. తొంబదిరెండింటియందుండు సంఖ్య.

ద్వానవతితమము. సం=ద్వానవతము.

ద్వాపంచాశత్తమము. సం=ద్వాపంచాశము.

ద్వాపంచాశత్తు. సం. విణ. (త్) ఏఁబదిరెండిటియందుండుసంఖ్య కలది. వి.త్. స్త్రీ. ఏఁబదిరెండింటియందుండుసంఖ్య.

ద్వాపంచాశము. సం. విణ. (అ. ఈ. అ.) ఏఁబదిరెండవది.

ద్వాపరము. సం. వి. అ. పుం, న. సందేహము, సంశయము; -వేదప్రామాణ్యాదులయందు సంశయమును కలిగించునది - కృతత్రేతాద్వాపరకలియుగములలో మూఁడవయుగము.

ఉ. కోప మొకింత లేదు బుధకోటికిఁ గొంగుఁ బసిండి సత్యమా, రూపము తారతమ్యము లెఱుంగుస్వతంత్రుఁడు నూతనప్రియా, టోపము లేనినిళ్చలుఁ డిటుల్ కృతలక్షణుఁడై చెలంగఁగా, ద్వాపరలక్షణుం డనఁగ వచ్చునొకో యలధర్మనందనుః. విజ. వి. ౧. ౨౩.

ద్వారక. సం. వి. ఆ. స్త్రీ. -ప్రశస్తద్వారములతో ప్రకాశించునది - గుజరాతిదేశమందలి యొకపట్టనము, శ్రీకృష్ణునిరాజధాని.

ద్వారకంటకము. సం. వి. అ. పుం. ౧. తలుపు, కవాటము. (త్రి. ని.) ౨ - తలుపునకు ముల్లువంటిది - తలుపుగడియ. (ఆ. ని.)

ద్వారదర్శి. సం. వి. న్. పుం. - వాకిటనుండి చూచుచుండువాఁడు - ద్వారపాలకుఁడు.

ద్వారదారువు. సం. వి. ఉ. పుం. టేఁకు.

ద్వారపట్టము. సం. వి. అ. పుం. ౧. కవాటము, తలుపు. ౨. కవాటపుతెర.

ద్వారపాలకుఁడు. సం. వి. అ. పుం. వాకిటికావలివాఁడు, పణిహారి.

ఇట్లే: ద్వారగోపుఁడు, ద్వారనాయకుఁడు, ద్వారపాలుఁడు, ద్వారపుఁడు మొ.

ద్వారపిండి. సం. వి. ఈ. స్త్రీ. దేహళి, గడప. (వాచ.)

ద్వారబంధము. సం. వి. అ. పుం. ద్వారమునకు అమర్చినమ్రానిచట్టము.

ద్వారబలిభుక్కు. సం. వి. జ్. పుం. ౧. కాకి. ౨. పిచ్చుక. (ఆ. ని.)

ద్వారబాహువు. సం. వి. ఉ. పుం. ద్వారబంధపునిడుపుకమ్మి.

ద్వారము. సం. వి. అ. న. ర్. స్త్రీ. ౧. వాకిలి. ౨. ప్రవేశము. ౩. ఉపాయము. ౪. దేహమందలిరంధ్రము. (చెవి, ముక్కు, నోరు మొ.)

ద్వారయంత్రము. సం. వి. అ. న. ౧. తాళము. ౨. తలుపుగడియ.

ద్వారవతి. సం=ద్వారావతి.

ద్వారశాఖ. సం.వి. ఆ. స్త్రీ=ద్వారబాహువు.

ద్వారస్తంభము. సం. వి. అ. పుం. ద్వారబంధపునిడుపుకమ్మి.

ద్వారస్థుఁడు. సం. వి. అ. పుం. ద్వారపాలకుఁడు, ద్వాస్థుఁడు.

ద్వారావతి. సం. వి. ఈ. స్త్రీ. ద్వారక, శ్రీకృష్ణునిరాజధాని.(ఇది మోక్షప్రదములగు సప్త

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పురములలో నొకటి.)

ద్వారి. సం. వి. న్. పుం=ద్వారపాలకుఁడు.

ద్వారికుఁడు. సం. = ద్వారపాలకుఁడు.(వాచ.)

ద్వావింశతి. సం. విణ. (ఇ) స్త్రీ. ఇరువదిరెండింటియందుండుసంఖ్య కలది. వి.ఇ.స్త్రీ. ఇరువదిరెండింటియందుండుసంఖ్య.

ద్వావింశతితమము. సం. విణ. (అ. ఈ. అ.) ఇరువదిరెండవది.

ద్వావింశము. సం=ద్వావింశతితమము.

ద్వాషష్టము. సం. విణ. (అ. ఈ. అ.) అఱువదిరెండవది.

ద్వాషష్టి. సం. విణ. (ఇ) స్త్రీ. అఱువదిరెండింటియందుండుసంఖ్య కలది.వి.ఇ.స్త్రీ. అఱువదిరెండింటియందుండుసంఖ్య.

ద్వాషష్టితమము. సం=ద్వాషష్టము.

ద్వాసప్తతము. సం. విణ. (అ. ఈ. అ.) డెబ్బదిరెండవది.

ద్వాసప్తతి. సం. విణ. (ఇ) స్త్రీ. డెబ్బదిరెండింటియందుండుసంఖ్య కలది. వి. ఇ.స్త్రీ.డెబ్బదిరెండింటియందుండుసంఖ్య.

ద్వాసప్తతితమము. సం=ద్వాసప్తతము.

ద్వాస్థితుఁడు. సం=ద్వాఃస్థితుఁడు.

ద్వాస్థుఁడు. సం=ద్వాఃస్థుఁడు.

## ద్వి

ద్వి. సం. విణ. (ఇ) రెండు. (ఇది తెనుఁగున వృత్తియందు పూర్వావయవముగానే యుపయుక్తము. ఉదా: ద్విగుణము, ద్వికము మొ. దీనికి "దశ, వింశతి, త్రింశత్" శబ్దములు పరమగునపుడు నిత్యముగా ఆకార మంతాదేశమగును.ఉదా: ద్వాదశ,ద్వావింశతి, ద్వాత్రింశత్."చత్వారింశత్,పంచాశత్,షష్టి, సప్తతి, నవతి" శబ్దములు పరమగునపుడు వికల్పముగా ఆకారము అంతాదేశమగును.ఉదా: ద్విచత్వారింశత్, ద్వాచత్వారింశత్ మొ. అశీత్యాది శబ్దములు పర మగునపుడుఆకారమురాదు.ఉదా: ద్వ్యశీతి మొ.)

ద్వికకుత్తు. సం. వి. ద్. పుం. - రెండుమూఁపురములు కలది-లొట్టియ, ఒంటె.

ద్వికకుదము. సం. విణ. (అ. ఆ. అ.) రెండు మూఁపురములు కలది.

ద్వికము. సం.వి.అ.న. ద్వయము. పుం. - రెండు కకారములు కలది - ౧. కాకము, కాకి. ౨. కోకము, జక్కవ.

ద్విగుణము. సం. విణ. (అ. ఆ. అ.) ఇనుమడియైనది, రెండురెట్లు కలది.

ద్విగుణాకృతము. సం. విణ. (అ. ఆ. అ.) రెండుచాళ్లు దున్నఁబడినది. (నేల.)

ద్విగుణితము. సం. విణ. (అ. ఆ. అ.) రెట్టింపఁబడినది, ఇనుమడిగా చేయఁబడినది; (గణిత.) రెంటితో గుణింపఁబడినది.

ద్విగుణీకృతము. సం. విణ. (అ. ఆ. అ.) రెండురెట్లు చేయఁబడినది. (ఉత్సాహము మొ.)

ద్విగువు. సం.విణ.(ఉ)రెండుగోవులు కలవాఁడు. వి. ఉ. పుం. (వ్యాక.) తత్పురుషసమాసభేదము. (ఇదిసంఖ్యాపూర్వకము. త్రిలోకి మొ.)

ద్విచత్వారింశత్తమము. సం = ద్వాచత్వారింశము.

ద్విచత్వారింశత్తు. సం=ద్వాచత్వారింశత్తు.

ద్విచత్వారింశము. సం = ద్వాచత్వారింశము.

ద్విజ. సం. వి. ఆ. స్త్రీ. ౧. భార్గి, బారంగి. ౨. రేణుక యనుగంధద్రవ్యము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్విజన్మము. సం. విణ. (న్. న్, ఆ. న్.) రెండుపుట్టుకలు కలది, రెండుమాఱులు పుట్టినది. వి. న్. పుం. ౧- మొదట గ్రుడ్డుగా జన్మించి పిదప రూపాంతరము నొందునది- పక్షి, పాము, చేఁప మొ. ౨- మొదట పుట్టుటయు ఊడి మరల పుట్టుటయు అనురెండుజన్మములు కలది- దంతము, పల్లు.

ద్విజన్ముఁడు. సం. వి. న్. పుం. - మాతృగర్భమున జన్మించుటయు ఉపనయనసంస్కారమున శుద్ధజన్మము నందుటయు ననురెండుజన్మములు కలవాఁడు - ౧. బ్రాహ్మణుఁడు. ౨. క్షత్త్రియుఁడు. ౩. వైశ్యుఁడు.

ద్విజపతి. సం. వి. ఇ. పుం ౧. - బ్రాహ్మణుల కు రాజు - చంద్రుఁడు. ౨. గరుడుఁడు. ౩. శేషాహి, పాఁపఱేఁడు. ౪. కర్పూరము. ౫. ఉత్తమద్విజుఁడు.

ద్విజప్రప. సం. వి. ఆ. స్త్రీ. ౧- పక్షులు నీరు త్రాగుటకు ఏర్పడినచలిపందిరి వంటిది - ఆలవాలము, పాదు. ౨. ద్విజులకై యేర్పఱిచిన చలిపందిరి.

ద్విజప్రియ. సం. వి. ఆ. స్త్రీ - సోమయాగసాధన మగుటచే ద్విజులకు ప్రియ మైనది- సోమలత.

ద్విజబంధువు. సం. వి. ఉ. పుం. అపకృష్టబ్రాహ్మణుఁడు. (పుట్టుకచే తప్ప బ్రాహ్మణధర్మములు లేనివాఁడు, జాతిమాత్రబ్రాహ్మణుఁడు.)

ద్విజబ్రువుఁడు. సం. వి. అ. పుం. అపకృష్టబ్రాహ్మణుఁడు.

ద్విజము. సం. వి. అ. పుం. ౧.- రెండుపుట్టుకలు కలది, మొదట గర్భమునుండియు రెండవమాఱు గ్రుడ్డునుండియు పుట్టునది - పక్షి, పాము, చేఁప మొ. ౨- ఒకమాఱు ఊడి మరలపుట్టునది - దంతము, పల్లు.

ద్విజముఖ్యుఁడు. సం. వి. అ. పుం. - బ్రాహ్మణక్షత్త్రియవైశ్యులలో ముఖ్యుఁడు - బ్రాహ్మణుఁడు. (ఇట్లే: ద్విజాగ్ర్యుఁడు మొ.)

ద్విజరాజము. సం. వి. అ. పుం. కర్పూరము. (వాచ.)

ద్విజరాజు. సం. వి.అ. పుం. ౧ - బ్రాహ్మణులకు ప్రభువు-చంద్రుఁడు. ౨. గరుడుఁడు. ౩. శేషాహి. ౪. ఉత్తమద్విజుఁడు.

ద్విజలింగి. సం. విణ. (న్. నీ. న్.) బ్రాహ్మణవేషధారి.వి.న్.పుం.క్షత్త్రియుఁడు. (త్రి.ని.)

ద్విజవాహనుఁడు. సం. వి. అ. పుం. గరుడవాహనుఁడు, విష్ణువు.

ద్విజశప్తము. సం. వి. అ. పుం. - ద్విజులచే శ్రాద్ధాదులందు నిషేధింపఁబడినది - రాజమాషము, బొబ్బర కీ.

ద్విజాంగి. సం. వి. ఈ. స్త్రీ.- పక్షియాకవంటి వేరు కలది- కటుకరోహిణి కీ.

ద్విజాగ్ర్యుఁడు. సం=ద్విజముఖ్యుఁడు.

ద్విజాతి. సం. విణ. (ఇ) రెండుజన్మములు కలది. వి. ఇ. పుం. ౧= ద్విజన్ముఁడు. ౨= ద్విజన్మము.

ద్విజాతీయము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ద్విజసంబంధ మైనది. ౨. రెండుజాతులకు సంబంధించినది. ౩. రెండువిధములు కలది.

ద్విజాయని. సం. వి. ఈ. స్త్రీ. - దీనిచేత ద్విజుఁడని తెలిసికొనఁబడును - యజ్ఞోపవీతము, జందెము. (త్రి. ని.)

ద్విజిహ్వము. సం. విణ. (అ. ఆ. అ.) రెండు నాలుకలు కలది వి. అ. పుం. పాము.

ద్విజిహ్వుఁడు. సం. వి. అ. పుం. ౧- రెండు నాలుకలు కలవాఁడు - సూచకుఁడు, కొండె

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గాఁడు. ౨. -సర్పతుల్యుఁడు- దొంగ; ఖలుఁడు, దుష్టుఁడు.

ద్విజుఁడు. సం. వి. అ. పుం = ద్విజన్ముఁడు.

ద్విజేంద్రుఁడు. సం=ద్విజరాజు.

ఇట్లే: ద్విజేశుఁడు.

ద్విట్టు. సం. వి. ష్. పుం. శత్రువు. (రూ. ద్విషుఁడు.)

ద్విట్సేవ. సం. వి. ఆ. స్త్రీ. ౧. ద్రోహము. ౨. శత్రుసేవ.

ద్విఠము. సం.వి. అ. పుం. ౧- రెండుఠకారముల యాకారము కలది- విసర్గము. ౨ - విసర్గశబ్దవాచ్యమగు త్యాగార్థము కలది - స్వాహాకారము. (వాచ.)

ద్వితయము. సం. వి. అ. న. జోడు, ద్వయము.

ద్వితయి. సం. వి. ఈ. స్త్రీ = ద్వితయము.

ద్వితీయ. సం. వి. ఆ. స్త్రీ. ౧. రెండవతిథి, విదియ. ౨. (వ్యాక.) రెండవవిభక్తి. ౩. పత్ని, భార్య.

(ఉలూచి.) ఉ...అంగభూపతా, కాయలెయం త్రమత్స్య మిపు డల్లనఁ ద్రెళ్లఁగ నేసి యేలుకో, తీయఁగఁ బంచదార వెనుదీయఁగఁ బల్కినను ద్వితీయగా. ౭జ. వి. ౧. ౯౮.

ద్వితీయకము. సం. విణ. (అ. యకా, యికా. అ.) ౧. రెండవది. ౨. రెండవదినమున వచ్చునది, దినము విడిచి దినము వచ్చునది. (జ్వరాది.)

ద్వితీయాకృతము. సం. విణ. (అ. ఆ. అ.) రెండుచాళ్లు దున్నినది, ఇనుమాఱు దున్నినది. (పొలము.)

ద్వితీయాభ. సం. వి. ఆ. స్త్రీ-పసుపునకు రెండవ రూపముగా ప్రకాశించునది - మ్రానిపసుపు.

ద్వితీయాశ్రమము. సం. వి. అ. పుం - బ్రహ్మచర్యగార్హస్థ్యవానప్రస్థసన్న్యాసము లనువాశ్రమములలో రెండవది - గృహస్థాశ్రమము.

ద్వితీయికము. సం. విణ. (అ. ఆ. అ.)- రెండవదిగా ఈయఁబడినది - మూలధనమునకు అదనముగా నీయఁబడినది. (వడ్డి లాభము మొ.)

ద్వితీయుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. రెండవవాఁడు. ౨. సహాయుఁడు.

ఉదా: కృష్ణద్వితీయుఁడు=అర్జునుఁడు. కర్ణద్వితీయుఁడు=దుర్యోధనుఁడు.

ద్విత్రములు. సం. విణ. బ. (అ. ఆ. అ.) రెండు కాని మూఁడుకాని.

ఉదా: ద్విత్రఘటికలు = రెండుమూఁడు గడియలు, ద్విత్రదినములు = రెండుమూఁడుదినములు.

ద్విత్వము. సం. వి. అ. న. ౧. రెంటిధర్మము, సంఖ్యావిశేషము. ౨. (వ్యాక.) ద్విరుచ్చారణము, ఒకదానిని రెండుమాఱులు పలుకుట.

ద్విదండి. సం. అవ్య. ఇ. న. రెండుదండములతో కొట్టుకొనుచు చేసినది. (యుద్ధాది.)

ద్విదళము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. రెండు శాఖలు కలది. (దర్భపవిత్రాది.) ౨. రెండుదళములు కలది. వి. అ. పుం. కందిగింజ మొ.

ద్విదశము. సం. విణ. (అ. ఆ. అ.) - రెండు పదులు కలది - ఇరువది.

ద్విదామ్ని. సం.వి.ఈ. స్త్రీ. రెండుత్రాళ్లచే కట్టఁదగినదుష్టగోవు, పెంకెయావు.

ద్విదేహుఁడు. సం. వి. అ. పుం - రెండువిధము లగుదేహము కలవాఁడు - గజముఖుఁడు, విఘ్నేశ్వరుఁడు.

ద్విదైవతము. సం. విణ. (అ. ఆ. అ.) ఇద్దఱు దేవతలు కలది. వి. అ. న. విశాఖానక్షత్రము.

ద్విధాకులి. సం. వి. ఈ. స్త్రీ. తంగేడు.

ద్విధాగతి. సం. విణ. (ఇ) రెండువిధము లగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గతి కలది, నీటను నేలనుగూడ చరించునది. (జంతువు.) వి. ఇ. పుం. ౧. మొసలి. ౨. కర్కాటకము, ఎండ్రి. (వై. ని.)

ద్విధాతువు. సం. విణ. (ఉ)-రెండు ధాతువులతో - లోహములతో - చేయఁబడినది- కంచు, ఇత్తడి మొ. వి. ఉ. పుం. - దేవగజరూప మగు రెండువిధములు కలదేహము కలవాఁడు - గణేశుఁడు మొ.

ద్విధాత్మకము. సం. విణ. (అ. త్మికా. అ.) రెండువిధము లైనస్వరూపములు కలది. వి. అ. పుం. న. జాతికోశము, జాజికాయ.

ద్విధాలేఖ్యము. సం. విణ. (అ. ఆ. అ.) రెండు విధములుగా వ్రాయఁదగినది. వి. అ. పుం. హింతాలము, గిఱకతాడు.

ద్వినగ్నకుఁడు. సం. వి. అ. పుం. స్వభావము చేతనే అనావృతమగు (తోలుకప్పులేని) మగగుఱి కలజనుఁడు; దుశ్చర్మరోగము కలవాఁడు.

ద్వినవతము. సం=ద్వానవతము.

ద్వినవతితమము. సం=ద్వానవతము.

ద్వినవతి. సం= ద్వానవతి.

ద్విపంచాశత్తమము. సం=ద్వాపంచాశము.

ద్విపంచాశత్తు. సం= ద్వాపంచాశత్తు.

ద్విపంచాశము. సం= ద్వాపంచాశము.

ద్విపక్షము. సం. వి. అ. పుం - రెండుపక్షములు కలది - ౧. పక్షి. ౨. నెల, మాసము.

ద్విపటి. సం. వి. ఈ. స్త్రీ. ౧. దుప్పటము, వెలగలసన్ననివస్త్రము.

శ్లో. పట్టసూత్రమయీసాపి ద్విపటీ క్వ నృపార్పితా. సం. కాశీ. ౧౩. ౭౫.

౨. నిచోళము, దుప్పటి.

ద్విపత్త్రకము. సం. వి. అ. పుం. ౧. చండాలకందము, ఒకానొకదుంప. ౨ = ద్విదళము.

ద్విపథము. సం. వి.అ.న. రెండుదారులు కలియుచోటు.

ద్విపద. సం. వి. ఆ. స్త్రీ. రెండుపాదములు కలబుఱ్ఱ. అ.న. తెనుఁగున రెండుపాదములు కలపద్యభేదము. (ఈయర్థమున ఇది దర్భాదులలోనిది.)

క. చిన్నన్న ద్విపద కెఱఁగును, బన్నుగఁ బెదతిరుమలయ్య పదమున కెఱఁగున్, మిన్నందిమొరసె నరసింగన్నకవిత్వంబు పద్యగద్యశ్రేణిన్. అప్ప. ౨. ౨౭౫.

క. వెలయంగఁ దెనుఁగుబాసను, దలమద్యోడు సీసములును దర్వోజలు గీతులు నక్కఱలును ద్విపదలు...కవిజనా. ౩. ౧౦.

ద్విపదము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. రెండుపాదములు కలది. (మనుష్యపక్ష్యాది.)

ద్విపదరాశి. సం. వి. ఇ. పుం. ౧. మిథునము. ౨. తుల. ౩. కుంభము. ౪. కన్య. ౫. ధనుస్సులోని మొదటిసగము. (వాచ.)

ద్విపమదము. సం. వి. అ. పుం. ౧. గంధద్రవ్యభేదము. ౨. గజమదము.

ద్విపము. సం.వి.అ. పుం.౧-రెంటితో త్రాగునది, తుండముతో పైకి తీసికొని నోటిలో పోసికొని త్రాగునది - రెంటఁద్రావుడుమెకము, ఏనుఁగు. ౨. నాగకేసరము.

ద్విపరి. సం. అవ్య. ఇ. న. అక్షక్రీడావిశేషము. (పంచిక యనుద్యూతమును ఐదుశలాకలతోఁగాని ఐదుపాచికలతోఁగాని ఆడుదురు. ఇందు ద్వైదింటిలోను మూఁడు బోరగిలఁగాను లేక వెల్లకిలఁగాను తక్కినవి తద్విపరీతముగానుపడుట.)

ద్విపర్ణి. సం.వి.ఈ.స్త్రీ. వనకోలి, అడవిరేఁగు.

ద్విపాత్తు. సం. వి. ద్. పుం - రెండుకాళ్లు కల జంతువు - ౧. మనుష్యుఁడు. ౨. పక్షి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్విపాద్యము. సం.వి.అ.పుం.న. ద్విగుణదండము, ఇనుమడిశిక్ష.

ద్విపాయి. సం.వి.న్.పుం. ద్విపము,ఏనుఁగు.

ద్విపాస్యుఁడు. సం. వి. అ. పుం. గజముఖుఁడు, వినాయకుఁడు.

ద్విపుట. సం.వి.ఆ.స్త్రీ. మాలతి, జాజి.

ద్విపుటము. సం.వి.అ.పుం. ౧. చణకము, సెనగ. ౨. పరిమళముతో కూడిన తెల్లనిపువ్వులు కలయొకానొక చెట్టు. (వాచ.)

ద్విబిందువు. సం. వి. ఉ.పుం - రెండుసున్నలు కలది - విసర్గము.

ద్విభాషి. సం. విణ. (న్. ణీ.న్.) రెండుభాషలు తెలిసినవాఁడు, దుబాసి.

ద్విభూమము. సం. విణ. (అ. ఆ. అ.) రెండంతస్తులుకలది, రెండునిలువులు కలది.(మేడ మొ.)

ద్విమాతృకుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) ఇద్దఱు తల్లులు కలవాఁడు. వి. అ. పుం. ౧. గణేశుఁడు. ౨. జరాసంధుఁడు.

ఇప్లే: ద్విమాతృజుఁడు.

ద్విమాత్రము. సం. విణ. (అ. ఆ. అ.) రెండు మాత్రలు కలది. వి. అ. పుం. దీర్ఘాచ్చు.

ద్విమాష్యము. సం. విణ. (అ. ఆ. అ.) రెండు మాషములపరిమాణము కలది. (బంగారు మొ.)

ద్విముఖ. సం. వి. ఆ. స్త్రీ. జలగ. (వాచ.)

ద్విముఖము. సం. విణ. (అ. ఆ, ఈ. అ.) రెండుముఖములు కలది. వి. అ. పుం. ౧. రాజసర్పము, రెండుతలలపాము. ౨. ఒకానొక కృమిరోగము.

ద్విముఖి. సం. వి. ఈ. స్త్రీ. ౧. విషవంతము లగురెండుశిరస్సులు కలసర్పము. ౨. ఉభయతోముఖి యగుగోవు, ఈనుచున్నయావు.

ద్విమూర్ధము. సం. విణ. (అ.ఈ.అ.) రెండుతలలు కలది.

ద్విరదము. సం. వి. అ. పుం. ౧ - రెండుదంతములు కలది - ఏనుఁగు. ౨. నాగకేసరము. (వాచ.)

ద్విరదాంతకము. సం. వి. అ. పుం. ఏనుఁగుగొంగ, సింహము. (ఇప్లే: ద్విరదాశనము మొ.)

ద్విరశనము. సం. వి. అ. న. దినమునకు రెండుపూఁటలు తినుట.

ద్విరసనము. సం. వి. అ. పుం. ద్విజిహ్వము, పాము.

ద్విరుక్తము. సం. విణ. (అ. ఆ. అ.) రెండుమాఱులు చెప్పఁబడినది. వి. అ. న. పునరుక్తి, రెండుమాఱులు చెప్పుట.

ద్విరుక్తి. సం. వి. ఇ. స్త్రీ. పునరుక్తి, రెండుమాఱులు చెప్పుట.

ద్విరేఫము. సం. వి. అ. పుం- రెండురేఫములు కలది-భ్రమరము,తుమ్మెద.

ద్విరేఫారి. సం. వి. ఇ. పుం. -తుమ్మెదకు శత్రువు - చంపకము, సంపెఁగ.

ద్విర్భావము. సం. వి. అ. పుం=ద్విత్వము.

ద్విర్వచనము. సం. వి. అ. న. రెండుమాఱులు చెప్పుట.

ద్వివచనము. సం. వి. అ. న. (వ్యాక.) రెండింటిని తెలుపుప్రత్యయము.

ద్వివజ్రకము. సం. వి. అ. పుం. (వజ్రమునకు ఎనిమిదికోణము లుండును గాన ఎనిమిది అను సంఖ్యకు సంకేతము) - పదియాఱుకోణములు గలది- ఒకజాతిగృహము. (వాచ.)

ద్వివర్షము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. రెండు సంవత్సరములవయస్సు కలది. (దూడ మొ.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. రెండుఏండ్లు నియోగింపఁబడినది. 3. రెండు ఏండ్లు పోషింపఁబడినది. ४. రెండుసంవత్సరములు ఉన్నది; రెండుఏండ్లు నిలిచి యున్నది. ౫. రెండుసంవత్సరములు జరిగినది.

ద్వివర్షిక. సం. వి. ఆ. స్త్రీ. రెండేండ్లయీడు కలపెయ్య.

ద్వివింశతి. సం=ద్వావింశతి.

ద్వివింశము. సం=ద్వావింశము.

ద్వివేశర. సం. వి. ఆ. స్త్రీ. రెండువేసడములు పూన్చినచిన్నబండి, లఘురథము.

ద్విశలిక. సం. వి. ఆ. స్త్రీ. రెండేసినూర్లు, రెండేసివందలు.

ద్విశత్యము. సం. విణ. (అ. ఆ. అ.) రెండువందలకు కొనఁబడినది.

ద్విశఫము. సం. విణ. (అ.ఆ.అ.) రెండుడెక్కలు కలకాళ్లు కలది, రెండుగా చీలినడెక్కలు కలది. (ఆవు, మేఁక మొ.)

ద్విశీర్షుఁడు. సం. వి. అ. పుం -రెండుశిరస్సులు కలవాఁడు- అగ్ని.

ద్విషంతపుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పరంతపుఁడు, శత్రువులను తపింపఁజేయువాఁడు.

ద్విషత్. సం. శత్రు. ౧. ఏవగించుచున్న, అనిష్టముగా తలఁచుచున్న. ౨. విరోధించుచున్న.

ద్విషత్తు. సం. వి. త్. పుం. - ద్వేషించువాఁడు - శత్రువు, పగవాఁడు.

ద్విషష్టము. సం=ద్వాషష్టము.

ద్విషష్టి. సం=ద్వాషష్టి.

ద్విషష్టితమము. సం = ద్వాషష్టము.

ద్విష్టాణము. సం. విణ. (అ. ఆ. అ.) ద్వేషించునది.

ద్విష్టము. సం. విణ. (అ. ఆ. అ.) ద్వేషింపఁబడినది. వి. అ. న. తామ్రము, రాగి.(వాచ.)

ద్విష్ఠుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఉభయస్థుఁడు, రెండుపక్షములందును ఉండువాఁడు.

ద్విష్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) ఏవగింపఁబడుచున్నది, అనిష్టముగా తలఁపఁబడుచున్నది.

ద్విస్. సం. అవ్య. రెండుమార్లు. (తెలుఁగున దీనికి వ్యస్తప్రయోగము లేదు.)

ఉదా: ద్విరుక్తము, ద్విరాగమనము, ద్విఃప్రోక్షణము మొ.

ద్విసప్తతము. సం = ద్వాసప్తతము.

ద్విసప్తతి. సం = ద్వాసప్తతి.

ద్విసప్తతితమము. సం = ద్వాసప్తతము.

ద్విసమత్రిభుజము. సం.వి.అ.పుం. (క్షేత్రగ.) రెండు సమభుజములు కల త్రిభుజము.

ద్విసహస్రాక్షుఁడు. సం. వి. అ. పుం. - రెండు వేలకన్నులు కలవాఁడు - ఆదిశేషుఁడు.

ద్విసీత్యము. సం. విణ. (అ. ఆ. అ.) రెండు చాళ్ళు దున్నినది. (పొలము.)

ద్విస్విన్నాన్నము. సం. వి. అ. న. ద్వివారపక్వతండులము, ఉప్పుడుబియ్యముతో వండిన యన్నము. (కల్ప.)

ద్విహల్యము. సం = ద్విసీత్యము.

ద్విహాయనము. సం. విణ. (అ. ఈ. అ.) రెండేండ్లయీడు కలది. (దూడ మొ.)

ద్విహృదయ. సం. వి. ఆ. స్త్రీ - రెండుహృదయములు - తనహృదయమును శిశుహృదయమును కలది- గర్భిణి, చూలాలు.

## ద్వీ

ద్వీపజము. సం. విణ. (అ. ఆ. అ.) ద్వీపమున పుట్టినది. వి. అ. న- ద్వీపాంతరమున పుట్టినది-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈడచెట్టు, ఒకజాతిఎఱ్ఱకి త్తిలికీ.

ద్వీపము. సం. వి. అ. పుం. న. (ద్వి+అప్.) -రెండుదిక్కులనీళ్లు కలది-౧. దీవి, నీళ్లనడిమి స్థలము, చుట్టును నీరు కలదిబ్బ. ౨. భూభాగ విశేషము.(ఇవి పదునెనిమిది. అందుముఖ్యములు ఏడు:- జంబువు, ప్లక్షము, కుశము, క్రౌంచము, శాకము, శాల్మలము, పుష్కరము. ౩. వ్యాఘ్రము, పులి. న - రెండురంగులు కలది - పులితోలు. (వాచ.)

ద్వీపవంతము. సం.వి.త్.పుం-ద్వీపములు కలది- ౧. సముద్రము. ౨. నదము.

ద్వీపవతి. సం. వి. ఈ. స్త్రీ. - ద్వీపములు కలది - ౧. నది. ౨. భూమి.

ద్వీపశత్రువు. సం. వి. ఉ. పుం. - వ్యాఘ్రవిరోధి - శతావరి, పిల్లపీచరకీ. (వాచ.)

ద్వీపి. సం. వి. న్. పుం. ౧. పులి. ౨. చిఱుతపులి. ౩. సముద్రము. ౪. నదము.

ద్వీపిక. సం. వి. ఆ. స్త్రీ. ద్వీపిశత్రువు, పిల్లపీచర, శతావరికీ.

ద్వీపిచిత్రము. సం. వి. అ. పుం. చిఱుతపులి.

ద్వీపినఖము. సం. వి.అ.పుం. న. ౧. పులిగోరు. ౨. వ్యాఘ్రనఖ మనుగంధద్రవ్యముకీ.

ద్వీపిని. సం= ద్వీపవతి.

ద్వీపిశత్రువు. సం = ద్వీపశత్రువు.

## ద్వే

ద్వేషకుఁడు. సం. విణ. (అ. షికా. అ.) ౧. ఏవగించువాఁడు, అనిష్టముగా తలఁచువాఁడు. ౨. విరోధించువాఁడు.

ద్వేషణము. సం. వి. అ. న. ౧. ద్వేషించుట. ౨. పగ, విరోధము. ౩. ఏవ.

ద్వేషణీయము. సం = ద్వేష్యము.

ద్వేషణుఁడు. సం. వి. అ. పుం. శత్రువు.

ద్వేషము. సం. వి. అ. పుం. ౧. శత్రుత్వము, పగ. ౨. ఏవ, రోఁత. (అన్నద్వేషము, బ్రహ్మద్వేషము మొ.)

ద్వేషి. సం. విణ. (న్. ణీ. న్.) ద్వేషించువాఁడు. వి. న్. పుం. శత్రువు, పగవాఁడు.

ద్వేషించు. సం. స. క్రి. అనిష్టముగాఁ దలఁచు, ఏవగించు. అ. క్రి. విరోధించు, పగగొను.

ద్వేష్ట. సం. విణ. (ఋ. ష్ట్రీ. ఋ.) ద్వేషించువాఁడు. వి. ఋ. పుం. శత్రువు, పగవాఁడు.

ద్వేష్టవ్యము. సం =ద్వేష్యము.

ద్వేష్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ద్వేషింపఁదగినది. ౨. ఏవగింపఁదగినది, అసహ్యించుకొనఁదగినది.

ద్వేష్యుఁడు. సం. వి. అ. పుం. శత్రువు.

## ద్వై

ద్వైగుణికుఁడు. సం. విణ. (అ. ఈ. అ). వృద్ధ్యాజీవుఁడు; నూటికి నూఱువంతున వడ్డి పుచ్చుకొనువాఁడు.

ద్వైగుణ్యము. సం. వి. అ. న. ౧. ద్విగుణభావము, రెండురెట్లగుట. ౨.సత్త్వాదిత్రిగుణములలో రెండుగుణములు గలిగి యుండుట.

ద్వైతము. సం. వి. అ. న. ౧. రెండుగా నుండుట, రెండువిధములుగా నుండుట. ౨. జీవాత్మపరమాత్మలకు భేదము చెప్పెడిమతము. ౩. ఒకవనము.

ద్వైతవాది. సం. విణ. (న్. నీ. న్.) జీవాత్మపరమాత్మలకు భేదమును చెప్పువాఁడు.

ద్వైతి. సం. విణ. (న్. నీ. న్.) ద్వైతమతావలంబి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్వైధము. సం. విణ. (అ. ఈ. అ.) ద్విప్రకారము, రెండువిధములు కలది. వి. అ. న. ౧. రెండువిధములు. ౨. భేదము. ౩. సందేహము. (శ్లో. ఛిన్నద్వైధా యతాత్మానః...గీత. ౨. అ. ఛిన్నద్వైధాః = ఛిన్నసంశయాః అని శ్రీశంకరభాష్యము.) ౪. రాజులసంధ్యాదిషడ్గుణములలో నొకటి, శత్రువులయెడల లోపల నొకవిధముగాను వెలుపల నొకవిధముగాను నుండుట. (ఈద్వైధము చతుర్విధము - ౧. బలాఢ్యు లగునిరువురుశత్రువులనడుమ నుండువాఁడై ఒండొరు లెఱుఁగకుండ ప్రత్యేకము నీవాఁడనని ఇరువురతోడను చెప్పుట. ౨. అధికబలునితో సంధించి దుర్బలునితో విరోధించుట. ౩. శత్రువుయొక్క మంత్రిసామంతాదులతో సంధిచేసికొని యాతనితో కలహించుట. ౪. శత్రువుతో సంధివిగ్రహముల నొనర్చుట కనువగుదుర్గము నాశ్రయించుట. అమరసుధ.) అవ్య. రెండుభాగములుగ, రెండువిధములుగ.

ద్వైధీకృతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. రెండువిధములుగా చేయఁబడినది. ౨. ఎట్లును తోఁపకుండునట్లు చేయఁబడినది. (మనస్సు.)

ద్వైధీభావము. సం. వి. అ. పుం. ౧. రాజుల షడ్గుణములలో నొకటి, ద్వైధము. (శత్రువుల యెడల లోపల నొకవిధముగాను వెలుపల మఱియొకవిధముగాను నుండుట.) ౨. రెండువిధములుగా నుండుట. ౩. భేదము. ౪. సందేహము.

ద్వైధ్యము. సం. వి. అ. న. ౧. రెండువిధములుగా నుండుట. ౨. పైకొకవిధముగాను లోపల మఱియొకవిధముగాను ఉండుట; కపటము. ౩. భేదము. (వివ్యము.)

ద్వైపము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. ద్వీపమునకు సంబంధించినది, ద్వీపమందలిది. ౨. ద్వీపికి -పులికి- సంబంధించినది. వి. అ. పుం. పులితోలు కప్పినరథము. న. పులితోలు.

ద్వైపాయనుఁడు. సం. వి. అ. పుం - ద్వీపము ఉత్పత్తిస్థానముగా కలవాఁడు - వ్యాసమహర్షి.

ద్వైప్యము. సం. విణ. (అ. ఆ. అ.) ద్వీపమందలిది.

ద్వైమాతురుఁడు. సం. వి. అ. పుం. - ఇద్దఱు తల్లులబిడ్డఁడు - ౧. వినాయకుఁడు. ౨. జరాసంధుఁడు.

ద్వైమాతృకము. సం. విణ. (అ. ఈ. అ.) వర్షజలముచేతను నదీజలముచేతను పండునది. (దేశము.)

ద్వ్యైయహ్నికము. సం. విణ. (అ. ఈ. అ.) రెండహములం దగునది. (ఉత్సవము మొ.)

ద్వైవర్షికము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. రెండుసంవత్సరములకు జరుగునది. ౨. రెండుసంవత్సరములవఱకు నుండునది, రెండేండ్లకు సరిపడునది. (ధాన్యము మొ.)

ద్వైవిధ్యము. సం. వి. అ. న. ౧. రెండువిధములగుట, రెండువిధములుగా నుండుట. ౨. భేదము.

ద్వైసమికము. సం. విణ. (అ. ఈ. అ.) రెండేండ్లయీడు కలది. (దూడ మొ.)

# ద్వ్య

ద్వ్యంగుళము. సం. విణ. (అ. ఆ. అ.) రెండంగుళములపరిమితి కలది. (దారువు.)

ద్వ్యణుకము. సం. వి. అ. న. రెండుపరమాణువులు కారణముగా కలపదార్థము, రెండుపరమాణువులు కలియఁగా నేర్పడినపదార్థము.

ద్వ్యర్థము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. రెండర్థములు కలది. (శబ్దాది.) ౨. రెండుప్రయోజనములు కలది. (కార్యము.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్వ్యర్థి. సం. విణ. (న్. నీ. న్.) రెండర్థములు కలది. (కావ్యాది.)

ద్వ్యశీతము. సం. విణ. (అ.ఈ.అ.) ఎనుబదిరెండవది.

ద్వ్యశీతి. సం. విణ. (ఇ) ఎనుబదిరెండింటియందుండుసంఖ్య కలది. వి. ఇ. స్త్రీ. ఎనుబదిరెండింటియందుండుసంఖ్య.

ద్వ్యశీతితమము. సం = ద్వ్యశీతము.

ద్వ్యష్టము. సం. వి. అ. న. - వెండిబంగారములను పొందునది - తామ్రము, రాగి.

ద్వ్యహము. సం. వి. అ. పుం. రెండుదినముల సమాహారము, రెండుదినములు.

ద్వ్యహీనము. సం. విణ. (అ. ఆ. అ.) రెండు దినములచేత సాధింపఁదగినది. (క్రతువు.)

## ద్యా

ద్వ్యాముష్యాయణుఁడు. సం. వి. అ. పుం. కన్నతండ్రికిని స్వీకారముచేసికొన్నతండ్రికిని ఇద్దఱకును పుత్త్రుఁడై యుండువాఁడు.

ద్వ్యాయుషము. సం. వి. అ. న. ద్విగుణిత మయినఆయుష్కాలము.

ద్వ్యాహికము. సం. విణ. (అ.ఈ.అ.) రెండు దినము లుండునది. (జ్వరాది.)

## ధ

ధ. సం. ఒకానొకయక్షరము. వి. అ. పుం. ౧. ధర్మము. ౨.కుబేరుఁడు. ౩.బ్రహ్మ. ౪. ధనము. (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

ధంధంధణా. వి. భేరీధ్వని కనుకరణము.

దండకము ... భేరిధంధంధణారావముల్ ... దశా. ౪. ౨౩౨.

ధగధగ. వి. ప్రకాశించుట మున్నగువానియం దగునను కరణము.

క. తొలుకారుమెఱుఁగుకైవడిఁ, దళతళమని మేను మెఱవ ధగధగమనుచున్, గలుముల నీనెడిచూపులఁ, జెలువంబులమొదలి టెంకి సిరి పుట్టె నృపా. భాగ. ౮. ౨౬౫.

క. ధగధగయను పదకంబున, నిగనిగ యనుక్రొ మ్మెఱుంగు నేత్రపటమునన్, భుగభుగ యను మేపూఁతన్, భగభగ యనిపించె నతఁడు నాహృదయంబున్. కళా. ౨. ౭౬.

విణ. ధగధగ యనుకాంతి కలది. (కర్మధారయమున నిగాగమము.)

వ. ...సెలయేటిచిలుపచిలుపనీరు పగలు గగనమణిధగధగనికిరణముల మిగుల సెగ లెగయురవికాంతశిలాతలంబులం దెకతెక నుక్కి జాలువాఱ...పారి. ౨. ౬౭.

వ. ...తిరువడికోలలరంధ్రగోళంబుల నుత్కీలంబులై మంచుధగధగనిజగజ్జ్యోతిదీపజాలంబుల...ఆము. ౪. ౩౫.

లయవిభాతి. ధగధగనిదేహరుచి నిగనిగనిపొందనపుఁదగడు దెగడన్ జిగురుజిగి సెగచు మోవిన్. మనుచ. ౪. ౧౧౭.

ధగధగద్ధగలు. వి. ధగధగమని మెఱయు కాంతి.

(మునులు.) గీ. ధవళతరదేహధగధగద్ధగలు మెఱయఁ, గదియ నేతెంచునొకభుజంగంబుఁ గనిరి. దశా. ౧. ౨౦౬.

ధగధగాయమానము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి ప్రకాశించునది.

ధగిడి(డీ). వి.(హిం. ధగడా=ఱంకుమగఁడు.) నీచపురుషుఁడు, దుష్టపురుషుఁడు. (నీచస్త్రీ అని శ. ర.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ...ఖరాబు కూళ బందెలమారి ముందటిపాపా
లముద్ద ధగిడి. హంస. ౫. ౧౧౩.

చ. చెనఁటి గరాస యీసభను జెప్పినటుల్
మతి నీవు సేయకుం,డిన విడ రాచకోచ
ధగిడీ యని దిగ్గున లేచె వీఁకతోఁ. అహ.
౧. ౯౫. వేణు. ౩౬.

ధటకము. సం. వి. అ. పుం. ౧. నలువదిరెండు
గురిగింజలయెత్తు. ౨. త్రాసు.

ధటము. సం. వి. అ. పుం. ౧. త్రాసు; తక్కెడ.
౨. త్రాసుతో చేయునొకదివ్యపరీక్ష. ౩.
(జ్యోతి.) తులారాశి. (శ. ర. యందును ఈ
క్రిందిప్రయోగమునను స్త్రీలింగరూపము కన్ప
ట్టుచున్నది.)

శ్లో. అహో మే సౌభాగ్యం మమచ భవభూ
తేశ్చ పణితా,ధటాయా మారోప్య ప్రతిఫ
లతి తస్యాం లఘిమని. (చాటువు.)

ధటి. సం. వి. ఈ. స్త్రీ ౧. దట్టి. ౨. గోఁచి;
వస్త్రఖండము. (మే. ని. ప్రాఁతవస్త్ర మని
కొందఱు.) ౩. గర్భాధానానంతరమున స్త్రీకి
ఈయఁదగువస్త్రము. (వాచ.) న్. పుం. ౧.
(జ్యోతి.) తులారాశి. ౨. తులాధారకుఁడు,
వర్తకుఁడు.

ధటికము. సం. వి. అ. పుం. న. పదితులములు.
(వై. ని.)

ధటిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. నూలిమొలత్రా
డు. ౨. ధటి.

ధట్టము. సం. వి. అ. పుం. సమూహము. (శ.ర.)

సీ. తురగధట్టఖలీనధుతఫేనతారకావళి శరత్తా
లంబువరుసఁ జూప. ఉ. హరి. ౪. ౨౨౩.

ధణంధణ=ధణధణంధణ. వి. శంఖభేర్యాదిధ్వ
నుల కనుకరణము.

వ ... శంఖమర్దళపటహభేరీధణంధణధ్వనులకు
...దశా. ౨. ౧౬౨.

వ...నిస్సాణంబులధణంధణలు ధమామీలదింది
మ్ములు విజయశంఖంబులఘుమఘుమలు పిరం
గులధింధిమ్ములు... ప్రబంధ. ౭౪౪.

గీ. అందు భేరీధణంధణల్ క్రందుకొనియె.
ఉ. రా. ౪. ౧౬౫.

ధణధణంధణ=ధణంధణ.

(బలిచక్రవర్తి దండయాత్ర.) గీ. కడమకిన్నర
గంధర్వఖచరసిద్ధ,సాధ్య విద్యాధరాంగనల్
చకిత లగుచు, నేమియైరొకో తెలియ దుద్దా
మభీమ,రణరణద్భేరిధణధణంధణల నపుడు.
దశా. ౨. ౫౫.

ధత్తూరము. సం. వి. అ. పుం. ఉమ్మెత్త.

ధత్ర. సం.వి.ఆ.స్త్రీ. దివి, స్వర్గము. (కే. ని.)

ధత్రము. సం. వి. అ. పుం. జిల్లేడుచెట్టు. న.
౧. గృహము. ౨. ఆకాశము. ౩. త్రాడు, సూ
త్రము. (కే. ని.)

ధత్రుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.(కే.ని.)

ధనంజయము. సం. వి. అ. పుం. ౧. శరీరమం
దలివాయువులలో నొకానొక ఉపవాయువు.
(ఇది మృతకళేబరమును కూడ విడువక వ్యా
పించియుండును.) ౨. సర్వవిశేషము. ౩. అర్జు
నము, మద్ది. ౪. చిత్రమూలము.

ధనంజయుఁడు. సం. వి. అ. పుం. ౧- సకలజన
పదములను జయించి ధనమును తెచ్చినవాఁడు-
అర్జునుఁడు. ౨- సేవించుటవలన ధనము ఇచ్చు
వాఁడు-అగ్ని. ౩. ఇంద్రుఁడు. (వై. ని.)

ధనకాముఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ధన
ము కోరువాఁడు.

ధనకామ్య. సం.వి.ఆ.స్త్రీ. ధనమునందలికోరిక.

ధనకేళి. సం. వి. ఇ. పుం - ధనముతో క్రీడిం
చువాఁడు- కుబేరుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధనదండము. సం. వి.అ.న.రొక్కపుదండుగు, ధనరూప మగుదండనము.

ధనదాక్షి. సం. వి. ఈ. స్త్రీ. కుబేరాక్షి అను లత.

ధనదాయి. సం. విణ. (న్. నీ. న్.) ధనమును ఇచ్చువాఁడు, దాత. వి. న్. పుం. - ఉపాసించినవారికి ధనము ఇచ్చువాఁడు - అగ్ని.

ధనదుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ధనమును ఇచ్చువాఁడు. వి. అ. పుం. ౧. కుబేరుఁడు. ౨. అగ్ని.

ధనధాని. సం. వి. ఈ. స్త్రీ. ధనస్థానము, భాండాగారము, బొక్కసము.

ధనధారణము. సం. వి. అ. న. ౧. ధనమును ధరించుట. ౨. జమాఖర్చుపుస్తకము. (కే. ని.)

ధనపతి. సం. వి. ఇ. పుం. ౧. కుబేరుఁడు. ౨. కోశాధ్యక్షుఁడు, బొక్కసముపై అధికారి.

ధనపాలుఁడు. సం. వి. అ. పుం=ధనపతి.

ధనపిశాచి. సం. వి. ఈ. స్త్రీ. పిశాచివలె విడువకుండుధనాశ, ధనమందలియత్యాశ.

ధనప్రయోగము సం. వి. అ. పుం. కుసీదము, ధనము వడ్డికిచ్చి బ్రతుకుట. (వాచ.)

ధనప్రియ. సం. వి. ఆ. స్త్రీ. కాకజంబువు, కాకినేరేడు*.

ధనము. సం. వి. అ. న. ౧. విత్తము, సొమ్ము. ౨. గోరూపధనము, ఆలమంద. (కే. ని-పూర్వమొకప్పుడు గోవులు నాణెములకు బదులుగా క్రయవిక్రయసాధనములు గానుండుటచే వానికి ధనమని పేరు కలిగెను.)

గీ. అరయ దెస లేక నీధనం బడవిలోనఁ, జెల్లచెదరయ్యె నీ వింతసేపు కుఱ్ఱ,యిట్టు లేమఱిఁ బాఁడితె యీక్షణంబ, వెడలి చనుదెంచి ననుఁ బ్రోవవే కుమార. హరి. పూ. ౭. ౩౯. (ప్రాఁతప్రతులపా. గోధనము అని క్రొత్త ప్రతి పా.)

౩. మూలద్రవ్యము, సంచిమొదలు. ౪. (జ్యోతి.) ధనిష్ఠానక్షత్రము. ౫. (జ్యోతి.) ధనస్థానము, లగ్నమునుండి రెండవస్థానము. ౬.(బీజగ.) కలియఁ గూర్పఁదగినసంఖ్య. (వ్యతి=ఋణము. తీసివేయఁ దగినసంఖ్య.) ౭. ధాన్యాకము, దనియాలు.

ధనవతి. సం. వి. ఈ. స్త్రీ. ధనిష్ఠానక్షత్రము.

ధనస్యకము సం.వి.అ.పుం.గోక్షురము,పల్లేరు*.

ధనహరి. సం. వి. ఈ. స్త్రీ. ౧. చోరనామకగంధద్రవ్యము*. ౨. బలురక్కసి*. ౩. నల్లకచోరము*. (శ. ర.)

ధనహార్యము. సం. విణ. (అ. ఆ. అ.) ధనముచే వశపఱచుకొనఁ దగినది.

ధనాధిపుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు.

ధనాశ్రీ. సం. వి. ఈ. స్త్రీ. (సంగీ.) రాగిణీభేదము. (వాచ.)

ధనాసరి. వి. (సం. ధనాశ్రీ.) ౧. ఒకానొకరాగము. (చూ. కిట్టిల్.)

ఉ...వరాళి కన్నడ ధనాసరి ఘూర్జరి పూరి బేగడా, యారభి...తగురాగము లింపుమీఱఁగ౯. చెన్న. ౨. ౨౩౬.

౨. గోఁగులో నొకభేదము. (వా.)

ధని. సం. విణ. (న్. నీ. న్.) ౧. ధనము కలవాఁడు. ౨.ఉత్తమర్ణుఁడు,ధనము వడ్డికిచ్చువాఁడు. వి. న్. పుం. కుబేరుఁడు. ఈ. స్త్రీ. యువతి. జవరాలు.

ధనిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. యువతి, యౌవనము కలఆఁడుది. ౨.వర్తకునిభార్య. ౩. ప్రియంగువు, ప్రేంకణము*.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధనికము. సం. వి. అ. పుం. న. ధాన్యాకము,దని యాలు.

ధనికుఁడు. సం. విణ.(అ. ఆ. అ.) ౧. మిక్కిలి ధనము కలవాఁడు. ౨. ధనస్వామి, కుబేరుఁడు. ౩. ధనము వడ్డి కిచ్చువాఁడు, ఉత్తమర్ణుఁడు. ౪. వణిక్కు, వర్తకుఁడు.

ధనిష్ఠ. సం.వి.ఆ. స్త్రీ. ఒకానొకనక్షత్రము.

ధనిష్ఠుఁడు. సం. విణ.(అ. ఆ. అ.)ధనవంతులలో శ్రేష్ఠుఁడు.

ధనీయ. సం.వి.ఆ. స్త్రీ. ధనము కావలె నని కోరుట, అర్హమైనధనాశ.

ధనీయకము. సం. వి. అ. న = ధనికము.

ధనీయకుఁడు. సం.విణ. (అ.యకా, యికా.అ.) కావలసినధనముమాత్రము కోరువాఁడు.

ధనుర్గుణ. సం. వి. ఆ. స్త్రీ. మూర్వ, చాఁగ చెట్టు.

ధనుర్దండము. సం. వి. అ. పుం. తొంబదియాఱంగుళములకొలఁది.

ధనుర్ద్రుమము. సం. వి. అ. పుం. వెదురు చెట్టు.

ధనుర్ధరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ధనుస్సు ధరించినవాఁడు, విలుకాఁడు. వి. అ. పుం. దుర్యోధనునిసోదరులలో నొకఁడు.

ధనుర్మాల. సం= ధనుర్గుణ.

ధనుర్మాసము. సం. వి. అ. పుం. సూర్యుఁడు ధనూరాశియం దుండు నెల.

ధనుర్యాగము. సం. వి. అ. పుం. ఒకానొక యాగము.

వ...ధనుర్యాగంబు పేరు సెప్పి పుత్తెంచిన ప్రకారంబును నెఱింగించిన...భాగ. ౧౦పూ. ౧౨౦౪.

ఇట్లే: ధనుర్మఖము.

ధనుర్యాసము. సం.వి.అ. పుం. దురాలభ, తీఁట కసింద చెట్టు.

ధనుర్లత. సం.వి.ఆ. స్త్రీ. సోమవల్లి, తిప్పతీఁగ.

ధనుర్వృక్షము. సం.వి. అ. పుం. ౧. వెదురు చెట్టు. ౨. రావి చెట్టు. ౩. భల్లాతకము, నల్లజీడి చెట్టు. ౪. తడ చెట్టు. (వాచ.)

ధనుర్వేదము. సం. వి. అ. పుం. విలువిద్యను బోధించు ఒకానొక ఉపవేదము.

ధనువు. సం. వి. ఉ. పుం. ౧. విల్లు. ౨. ప్రియంగువు, మోరటి చెట్టు. ౩. నాలుగుమూరలకొలఁది. ౪. (జ్యోతి.) ఒకరాశి. ౫. వింటినారి. స్త్రీ. ౧. విల్లు. ౨. ఉత్తమస్త్రీ. ౩. వింటినారి. (వై. ని.) ఊ. స్త్రీ.౧. విల్లు. ౨. వింటినారి. (కే.ని.)

ధనుశ్శాఖ. సం.వి. ఆ. స్త్రీ. మూర్వ, చాఁగ చెట్టు.

ధనుశ్శ్రేణి. సం.వి. ఇ, ఈ. స్త్రీ. ౧. మూర్వ, చాఁగ చెట్టు. ౨. మహేంద్రవారుణి,పెద్దపాఁపర చెట్టు.

ధనుష్కారుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) చేత విల్లు కలవాఁడు. (అ. ఈ. అ.) వింటిని చేయువాఁడు.

ధనుష్పటము. సం. వి. అ. పుం. ప్రియాలము, మోరటి చెట్టు.

ధనుష్పాణి. సం.విణ. (ఇ)విల్లు చేతపట్టినవాఁడు. వి. ఇ.పుం.రాముఁడు. (వై.ని.)

ధనుష్మంతుఁడు. సం.విణ. (త్. ష్మతీ. త్.)ధనుస్సు కలవాఁడు, విలుకాఁడు.

ధనుస్తంభము. సం. వి. అ. పుం. (వైద్య.) ధనుర్వాతము, వింటివలె దేహమును వంగునట్లు చేయువాతరోగము.

ధనుస్సు. సం. వి. స్. పుం. న. ౧. విల్లు. (బహువ్రీహిసమాసాంతముల నిధి 'ధన్వ' అగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉదా:-పుష్పధన్వుఁడు, అధిజ్యధన్వుఁడు మొ.) ౨. చతుర్హస్తప్రమాణము, నాలుగుమూరల కొలఁది. 3. (జ్యోతి.) ఒకరాశి. పుం. ప్రియాళువు, మోరటిచెట్టు.

ధనేయకము. సం. వి. అ. న. ధాన్యాకము, దనియాలు.

ధన్యా. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఆమలకి, ఉసిరికచెట్టు. ౨. దాది, ఉపమాత. 3. దనియపుమొక్క.

ధన్యము. సం. విణ. (అ. ఆ. అ.) ధనహేతుకమయినది, ధనలాభమును కలుగఁజేయునది; ధనానుకూలమయినది. వి.అ. పుం. ౧. అశ్వకర్ణము, ఇనుమద్దిచెట్టు. ౨. దనియపుమొక్క.

ధన్యవాదము. సం. వి. అ. పుం. ఉపకారము చేసినవారితో ధన్యోస్మి - ధన్యుఁడనైతిని - అనుట; కృతజ్ఞతను సూచించుచు పలుకుట; కృతజ్ఞతను సూచించుమాట.

ధన్యాకము. సం. వి. అ. న. దనియపుమొక్క, కొత్తిమిరిచెట్టు.

ధన్యాసి. సం. వి. ఇరువదినాలుగు స్త్రీరాగములలో నొకటి. (కిట్టిల్.కాని సంస్కృతనిఘంటులలో కానరాదు.)

సీ...బిలాహరి కురంజి ధన్యాసి పూర్వగౌళ
వరాళి నాట భల్లాతకి...హంస. ౫.౧౨3.

సీ. దేవక్రియ కురంజి దేశాక్షి రామక్రియాంధాళి నాట ధన్యాసి పూర్వ,గౌళ ... ప్రబంధ. ౯౫. మత్స్యపు. ౫. ౫౪.

ధన్యుఁడు. సం.విణ. (అ. ఆ. అ.) ౧. శ్లాఘ్యుఁడు. ౨.సుఖము కలవాఁడు. 3. సుకృతి, పుణ్యము చేసికొన్నవాఁడు, అదృష్టవంతుఁడు. ౪. ధనమును పొందినవాఁడు. ౫. ఇష్టకార్యము నెఱవేర్చుకొనినవాఁడు, కృతార్థుఁడు. ౬. ఔదార్యము కలవాఁడు. (వై. ని.)

ధన్వేయము. సం = ధన్యాకము. (వై. ని.)

ధన్వంతరము. సం. వి. అ. న. నాలుగుమూరల కొలఁది కలపరిమాణవిశేషము. (వాచ.)

ధన్వంతరి. సం. వి. ఇ. పుం. ౧. దేవవైద్యుఁడు నేల్పువెజ్జు. (ఆయుర్వేదము రచించినవాఁడు.) ౨. సూర్యుఁడు. (వై. ని.)

ధన్వంతరిగ్రస్తా. సం. వి. ఆ. స్త్రీ. కటుకరోహిణి చెట్టు.

ధన్వదుర్గము. సం. వి. అ. న. నలుప్రక్కల ఐదుయోజనములమరుభూమి కలకోట.

ధన్వధి. సం. వి. ఇ. పుం. వింటిగవుసెన, విల్లు ఉంచుసంచి.

ధన్వనము. సం = ధనుర్వృక్షము.

ధన్వము. సం. వి. న్. పుం. న. ౧. నిర్జలభూమి, మరుదేశము, ఎడారి. ౨. విల్లు; ఎనిమిదిహస్తములపొడువు కలవిల్లు. (వై. ని.)

ధన్వయాసము. సం. వి. అ. పుం. దురాలభ, తీఁటకసింద చెట్టు.

ధన్వి. సం. విణ. (న్. నీ. న్.) ౧. దనుర్ధరుఁడు, విలుకాఁడు. ౨. విదగ్ధుఁడు, నేర్పరి. వి. న్. పుం. ౧. అర్జునుఁడు. ౨.(జ్యోతి.) ధనూరాశి. 3. అర్జునము, మద్దిచెట్టు.

ధమనము. సం. వి. అ. పుం. నలము, కిక్కసకసవుచెట్టు. పుం. న. నాసానాళము, ముక్కుగ్రోవి.

ధమని. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧ - గొట్టమువలెనుండునది - బోలునరము, నాడి. ౨. (అగసాలెవాని) ఊఁదుగొట్టము; కొలిమితిత్తి. 3. కంఠము. ౪. నాడిక, ఒకగినుసుకూరాకు చెట్టు. ౫. నలి, గువ్వగుత్తిక అనుగంధద్రవ్యము చెట్టు. ౬. హట్టవిలాసిని, నఖమనుగంధద్రవ్యము చెట్టు. ౭. హ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రిద్ర, పసుపుకీ. ౫. పృశ్నిపర్ణి, కోలపొన్నకీ.

ధమనుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ౧. కొలిమితిత్తి నూఁదువాఁడు. ౨. క్రూరుఁడు. వి. అ. పుం. అగ్ని. (మే. ని, కే. ని.)

ధమామీ. వి. వాద్యవిశేషము.

వ...నిస్సాణంబులధణంధణలు ధమామీలడిందిమ్ములు విజయశంఖంబులఘుమంఘుమలు పిరంగులధింధిమ్మలు... ప్రబంధ. ౭౫౫.

ధమ్మిల్లము. సం. వి. అ. పుం. కొప్పు, సంయతకేశములు; లోపల పువ్వులు తుఱిమి పైని ముత్తెములు లోనగువానిచే నలంకరించి ముడిచిన కేశకలాపము.

ధయనము. సం. వి. అ. న. పానము, త్రాగుట. (వై. ని.)

ధర. సం. వి. ఆ. స్త్రీ. ౧- సమస్తమును ధరించునది- భూమి. ౨. స్త్రీలగర్భాశయము. ౩. మేదస్సు, ఎముకలలోనిక్రొవ్వు. ౪. రక్తనాళము.

ధరణము. సం. విణ. (అ. ఆ. అ.) ధరించునది, తాల్చునది. (అ. ఈ. అ.) ధరించుసాధనమైనది. వి. అ. పుం. ౧. హిమాలయపర్వతము. ౨. లోకము. ౩. స్థలము. ౪. సేతువు. ౫. ధాన్యము. ౬. అర్కుఁడు, జిల్లేడుకీ. ౭. స్తనము, చన్ను. న. ౧. ధరించుట, ధారణము, తాల్చుట. ౨. పలువదియెనిమిదియవలయెత్తు.

శ్లో. తుల్యా యవాభ్యాం కథితాత్ర గుంజా వల్లస్త్రిగుంజో ధరణంచ తేఽష్టౌ.లీలావతీ గణితము.

౩. ఆధారము, ఆదరువు; ఆశ్రయము. ౪. పదునాఱుమాషములవెండియెత్తు. (వై. ని.)

ధరణి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. భూమి, నేల. ౨. రక్తనాళము, నాడి. ౩. శాల్మలి,బూరుగుకీ. ౪. ఒకదినుసుకందకీ.

ధరణి(ణీ)కందము. సం. వి. అ. పుం. కందాళువు, ఒకదినుసుకందకీ.

ధరణి(ణీ)కీలకము. సం. వి. అ. పుం. - భూమికి కీలకము-మేకు- వంటిది - పర్వతము. (వాచ.)

ధరణి(ణీ)జ. సం. వి. ఆ. స్త్రీ. భూపుత్రి, సీత. (ఇప్లే: ధరణిసుత మొ.)

ధరణి(ణీ)జాని. సం. వి. ఇ.పుం- ధరణి జాయగా కలవాఁడు - భూపతి, రాజు.

క. దాని కహింసయ మూలము, దానన హరిప్రీతుఁ డగు నతం డన ధరణీజానీ క్షేత్రజ్ఞుం డవఁగా నొక్కఁడ యగుట దెలియఁగా వలయుఁ గడుఁక. భార. శాం.౬.౪౯౫.

ధరణి(ణీ)జుఁడు. సం. వి. అ. పుం.- భూపుత్రుఁడు _౧. అంగారకుఁడు. ౨. నరకాసురుఁడు.

ఇప్లే : ధరణిపుత్రుఁడు, ధరణీపుత్రుఁడు, ధరణిసుతుఁడు, ధరణీసుతుఁడు మొ.

ధరణి(ణీ)ధరము. సం. వి. అ. పుం. ౧. పర్వతము, కొండ. ౨. ఆదికూర్మము. ౩. దిగ్గజము.

ధరణి(ణీ)ధరుఁడు. సం. వి. అ. పుం. ౧. ఆదిశేషుఁడు. ౨. విష్ణువు. ౩. శివుఁడు. ౪. రాజు.

ధరణి(ణీ)పతి. సం. వి. ఇ. పుం. భూపతి,రాజు.

ధరణి(ణీ)పూరము. సం. వి. అ. పుం. సముద్రము. (ఆ. ని.)

ధరణి(ణీ)ప్లవము. సం=ధరణీపూరము. (త్రి.ని.)

ధరణి(ణీ)భృతము. సం.వి.అ. పుం. పర్వతము.

ధరణి(ణీ)భృతుఁడు. సం.వి.త్. పుం. ౧.రాజు. ౨. విష్ణువు. ౩. శేషుఁడు.

ధరణి(ణీ)భృత్తు. సం. వి. త్. పుం. ౧. కొండ ౨. రాజు. ౩. విష్ణువు ౪. శేషుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధరణి(ణీ)రుహము. సం. వి. అ. పుం. చెట్టు.

ధరణి(ణీ)సురుఁడు. సం. వి. భూదేవుఁడు,బ్రాహ్మణుఁడు.

ధరణీయము. సం. విణ. (అ. ఆ. అ.) ధరింపఁదగినది.

ధరణుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

ధరత్. సం. శత్రు. ధరించుచున్న.

ధరమాణము. సం. విణ. (అ. ఆ. అ.) ధరించుచున్నది.

ధరము. సం. విణ. (అ. ఆ. అ.) ధరించునది, తాల్చునది. వి. అ. పుం. ౧.పర్వతము,కొండ. ౨. కార్పాసతూలకము, ప్రత్తి. ౩. వెల. (ఈ యర్థమున నిది దర్భాదులలోనిది.దీనికి ప్రయోగములు లేవు. కాని బ్రౌను, వాడుకలయందు కలదు.)

ధరయండు. వి. బిరుదనామము.

వ... వీరరాజేంద్రచోడియధరయణ్డు మదయన్న యుత్త(మచో)డణ్డైన రాజేంద్రచోడచేడియధరయనికి...దా. శా. ౪. ౧౨౬౨.

ధరాభుక్కు. సం. వి. జ్. పుం. రాజు.

ధరాభృత్తు. సం. వి. త్. పుం. ౧. నేలతాలుపు, కొండ. ౨. రాజు.

ధరామరుఁడు. సం=ధరణిసురుఁడు.

ఇట్లే: ధరాదేవుఁడు, ధరాసురుఁడు మొ.

ధరి(యి)ంచు. సం. స. క్రి. ౧. తాల్చు.

వ. ఇట్లు వర్జితాశేషవిభూషణుండై తరువల్కలంబులు ధరించి యన్నరేంద్రుండు...మార్క. ౧. ౧౬౮.

వ...వరాహ నరసింహవామనాదిరూపంబులు గైకొని ధరణి ధరియించి హిరణ్యాక్షు సంహరించి హిరణ్యకశిపు హరించి బలి నణంచి జగంబులయలజడి యడంచు ... మార్క. ౧. ౧౧౬.

౨. భరించు.

ద్వి. ధరియింపరాని వేదనలతో రామ,ధరణివల్లభుఁడు గౌతమి చేరఁబోయి. రం.రా.ఆర. ౧౫౭ పా. ౨౭ పం.

ద్వి...వారు, తనయునిపైఁ గూర్మి ధరియింపలేక, పోయెదమే మిదె పుత్రశోకమున, మా యట్ల నీవును మరణంబు నొందు, మని ఘోర మగు శాప మలిగి నాకిచ్చి, తనువులు విడిచిరి...రం.రా.అయో.౧౨౭ పా. ౩ పం.

ద్వి. చిఱుతొండ చూచితే చిత్ర మివ్వనితఁ, దఱుసంటియాఁకలి ధరియింపలేక, క్రమమెర్గఁ డొకబూరె గ్రక్కున డిగిచి,నమలెనో నమలఁడో నాతి వీక్షించి...నిజాత్మజుఁ జంపి, :జఱజఱ నీడ్చి యా చక్కటివైచె.బస.పు.౪.౪౫౪పం.దశా. ౩. ౪౯.

ధరిత్రి. సం. వి. ఈ. స్త్రీ. భూమి, నేల.

ధరుఁడు. సం. వి. అ. పుం. ౧. కూర్మరాజు; విష్ణువు. ౨. వసువులలో నొకఁడు.

ధరుణము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ధరించునది. ౨. సమ్మతము. (మే. ని.) వి. అ. పుం. ౧. స్వర్గము. ౨. అగ్ని. ౩. లోకము. ౪. స్తనము. (వై. ని.) ౫. ఉదకము. (వై. ని.)

ధరుణుఁడు. సం. వి. అ. పుం. ౧. బ్రహ్మ. ౨. సూర్యుఁడు. (వై. ని.)

ధర్త. సం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) ధరించువాఁడు.

ధర్తవ్యము. సం = ధరణీయము.

ధర్తూరము. సం. వి. అ. పుం. దుత్తూరము, ఉమ్మెత్త.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధర్మకవిలె. మి.వి. (ధర్మము+కవిలె.) ధర్మముల పుస్తకములోనిదానముల ననుభవించువాఁడు.

ద్వి. మీదత్తి మీప్రాఁత మీధర్మకవిలె, మీదాసు ననుఁ గావరే దయతోడ. బస. పు. ౪. ౧౦౨౨ పం.

ద్వి. అవుదలల్ వందుచు నయ్య మీధర్మ, కవిలెల మనుచును గడు దైన్యపడుచు. బస. పు. ౭. ౩౯౭ పం.

ధర్మకాముఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ధర్మమునందాసక్తి కలవాఁడు. ౨. ఫలాపేక్ష లేక విహితధర్మ మాచరించువాఁడు.

ధర్మకార్యము. సం. వి. అ. న. ధర్మానుకూల కర్మము, సత్కర్మము. (ఇట్లే: ధర్మకృత్యము.)

ధర్మకీలకము. సం. వి. అ. పుం - ధర్మమును కీలమువలె నిబంధించునది - బ్రహ్మశాసనము, బ్రహ్మయొక్క ఆజ్ఞ. (వాచ.)

ధర్మకీలము. సం. వి. అ. పుం. - ధర్మమును నిబంధించునది - రాజశాసనము, రాజాజ్ఞ. (త్రి.ని.)

ధర్మకేతువు. సం. వి. ఉ. పుం. అహింసాధర్మమే జెండాగా కలవాఁడు; అహింసా ధర్మమే ప్రధానముగా కలవాఁడు - బుద్ధుఁడు.

ధర్మఘటము. సం. వి. అ. పుం. వైశాఖమాసమందు ప్రతిదినము ధర్మార్థముగా దానము చేయఁబడుగంధోదకభోజ్యాదిసహితమగుఘటము. ఇట్లే: ధర్మకుంభము మొ.

ధర్మచక్రుఁడు. సం.వి.అ.పుం-ధర్మసమూహము కలవాఁడు- బుద్ధుఁడు. (త్రి. ని.)

ధర్మచరణము. సం. వి. అ. న=ధర్మచర్య.

ధర్మచర్య. సం. వి. ఆ. స్త్రీ. ధర్మములను - విహితకృత్యములను - ఆచరించుట, ధర్మములను చేయుట.

ధర్మచారి. సం. విణ. (న్. ణీ. న్.) ధర్మ మాచరించువాఁడు, ధర్మప్రకారము సంచరించువాఁడు.

ధర్మచారిణి. సం. వి. ఈ. స్త్రీ. ధర్మ మాచరించుస్త్రీ. ౨. భర్తృసహచారిణి, పతివ్రత యగు భార్య.

ధర్మచింత. సం. వి. ఆ. స్త్రీ - ధర్మములను గురించి యాలోచించుట - ధర్మవిచారణము.

ధర్మజుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ధర్మప్రకారము పుట్టినవాఁడు. వి. అ. పుం. ౧. ఔరసపుత్రులలో మొదటివాఁడు. ౨. యమధర్మరాజుకొడుకు, యుధిష్ఠిరుఁడు. ౩. బుద్ధుఁడు. (వాచ.)

ధర్మజ్ఞుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ధర్మములు తెలిసినవాఁడు.

ధర్మణము. సం. వి. అ. పుం.౧.తడ[illegible]. (వాచ.) ౨. సర్పవిశేషము. (మే. ని.)

ధర్మ(పు)దార. మి. వి. (ధర్మము+దార.)యుద్ధము పూర్తియైనదని సూచించుటకు ఊదు బాకా.

ద్వి. అని వేఁడికొనిన దయాదృష్టిఁ జూచి, తన రువేడ్కల ధర్మదార వట్టించి, సమరంబు చాలించి చయ్యన మరలి.(సౌగంధికాపహరణము. కృత్యవతరణిక.)

ద్వి. జయలక్ష్మి సేకొని స్వామివా రపుడు,దయ మీఱఁగా ధర్మదార వట్టించి. రఘునాథాభ్యుదయము. ౧౨ పొ.

ఉ. మంచన వింటివో వినవొ మన్మథుఁ డేకశిలాపురంబులోఁ, జంచలనేత్రలం బతుల శయ్యలపై రతికేళి రాత్రి ప్పోరించి ప్రభాతకాలము పరిస్ఫుట మైనను ధర్మదార వట్టించుచు నున్నవాఁ డవె కుటీగతకుక్కుటకంఠనాదముల్. క్రీడా. ౨౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అనవుఁడు నేటికి భ్రమసెదు, విన వృద్ధశ్రవుఁడ పాట వినవో యేలా, వినవైతి కోడ గూసెం, దనరప మై మరునిధర్మదార య నంగన్. దశా. ౩. ౧. ౧౮౪.

చ. కుముదసరస్తటస్ఫటికకూలనవోత్పలశయ్యప్రాల పూర్ణిమలఁ బికాళిగుట్టుసురుత్రిక్కఁగ ధర్మప్రదార వట్టు శ్వేతము రెయి మల్లికాశిరుతి చక్కఁగఁ జేయకయుండ నిల్పు నా, యమ మఱునాఁటికిం గలుగ నాంతగళచ్ఛురితిగుంభితాశ్రువుల్. ఆము. ౫. ౧౫౦.

ధర్మద్రవి. సం. వి. ఈ. స్త్రీ. పుణ్యతరంగిణి, గంగానది.

ధర్మద్రోహి. సం. వి. న్. పుం - ధర్మములను పాడుచేయువాఁడు _ రాక్షసుఁడు.

ధర్మధ్వజి. సం. వి. న్. పుం = ధర్మధ్వజుఁడు.

ధర్మధ్వజుఁడు. సం. వి. అ. పుం. ధార్మికవేష ధారి, కపటధార్మికుఁడు.

ధర్మనందనుఁడు. సం. వి. అ. పుం. - యమధర్మరాజుకొడుకు _ యుధిష్ఠిరుఁడు.

ధర్మనిబంధి. సం. విశే. (న్. నీ. న్.) ధర్మనిబంధమును అనుసరించువాఁడు, ధార్మికుఁడు.

ధర్మనివేశము. సం. వి. అ. పుం. ధర్మమందలి అభినివేశము, ధర్మమందలిఆస్థ.

ధర్మపత్త్రము. సం. వి. అ. పుం. యజ్ఞోదుంబరము, మేడి?.

ధర్మపాలము. సం. వి. అ. పుం. కత్తి. (కే.ని.)

ధర్మప్రతిరూపకము. సం. వి. అ. పుం. ధర్మాభాసము, అవశ్యము పోషింపఁదగినతల్లిదండ్రులు లోనగువారు గతిలేక దుఃఖించుచుండఁగా కీర్తికొఱకు ఇతరులకు దానము చేయుట.

ధర్మప్రవచనము. సం. వి. అ. న. ౧. ధర్మశాస్త్రము. ౨. ధర్మములను నిర్ణయించి చెప్పుట.

ధర్మభాగిని. సం. వి. ఈ. స్త్రీ - భర్త చేసినధర్మములలో భాగము పొందునది - భార్య; ధార్మికురా లగుభార్య.

ధర్మభ్రాత. సం. వి. ఋ. పుం. ౧. గురుపుత్రాది. ౨. సమానధర్మము కలిగియుండుటచేత సోదరుఁడుగా భావింపఁబడువాఁడు. ౩. సతీర్థ్యుఁడు. (వై. ని.)

ధర్మము. సం. వి. అ. పుం. న. -లోకమును ధరించునది; లోకమును మంచిస్థితియందు నిలఁబెట్టునది - ౧. శ్రుతిస్మృత్యాదులందు విహితమగు కృత్యము. (ఇది పదివిధములు. శ్లో. ధృతిః క్షమా దమో ఽస్తేయం శౌచ మింద్రియనిగ్రహః, ధీ ర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మలక్షణం. మను. ౬-౯౨.) ౨. సుకర్మములు చేయుటచేత కలుగుఅదృష్టము, పుణ్యము. ౩. న్యాయము. ౪. ఆచారము. ౫. స్వభావము; గుణము. ౬. అహింస. ౭. యజ్ఞము. ౮. ఉపనిషత్తు, వేదాంతము. ౯. దానాది. ౧౦. ఉపమ, సామ్యము. పుం. ౧. విల్లు. ౨. కత్తి. (వై.ని.) ౩. సత్సంగము. ౪. (జ్యోతి.) భాగ్యస్థానము, లగ్నమునకు కాని చంద్రునకు కాని నవమస్థానము. (ఒకపదముమాత్రము పూర్వపదముగాకలబహువ్రీహిసమాసమున 'ధర్మన్' అని నకారాంతమగును. ఉదా: గృహీతధర్మా, ఆదృతధర్మా, నివృత్తిధర్మా.)

ధర్మమూలము. సం. వి. అ. న.-ధర్మమునకు ప్రధానప్రమాణము- వేదము; వేదావిరుద్ధమగు స్మృత్యాదికము.

ధర్మమేఘము. సం. వి. అ. పుం. - ధర్మములను వర్షించునది - (పాతంజలయోగశాస్త్రమున) అసంప్రజ్ఞాతసమాధి, నిర్వికల్పసమాధి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధర్మయుగము. సం. వి. అ. న. ధర్మప్రధానమగు యుగము, కృతయుగము.

ధర్మరాజు. సం. వి. అ. పుం. ౧. యముఁడు. ౨. యుధిష్ఠిరుఁడు. ౩. ధర్మపాలనము చేయురాజు. ౪. బుద్ధుఁడు.

ధర్మరాట్టు. సం. విశ. (జ్) ధర్మముచే ప్రకాశించువాఁడు, ధార్మికుఁడు. వి. జ్. పుం. యముఁడు.

ధర్మవాణిజకుఁడు. సం. వి. అ. పుం. ధర్మకార్యమువలన వణిజునివలె లాభమును పొంద చూచువాఁడు, ధర్మకార్యములను వణిజునివలె లాభార్థము చేయువాఁడు.(ఇట్లే: ధర్మవాణిజ్యకుఁడు.)

ధర్మవాసరము. సం. వి. అ. పుం. - ధర్మ మాచరింపఁ దగినదినము - పున్నమ. (త్రి. ని.)

ధర్మవాహనుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు. (త్రి. ని.)

ధర్మవిదుఁడు. సం. విశ. (ద్) ధర్మము తెలిసినవాఁడు.

ధర్మవీరము. సం. వి. అ. పుం. (అలం.) ధర్మమందలిమహోత్సాహమే స్థాయిభావముగా కల వీరరసము.

ధర్మవీరుఁడు. సం. వి. అ. పుం. (అలం.) ధర్మవీరరసము ప్రధానముగా కలనాయకుఁడు.

ధర్మవృద్ధు(ఁడు). సం. విశ. (అ. ఆ. అ.) ధర్మాచరణముచే పెద్దవాఁడు, ఎక్కువధర్మ మాచరించువాఁడు.

ధర్మవైతంశికుఁడు. సం. వి. అ. పుం. ధార్మికుఁ డను పేరు సంపాదించుకొనుటకై దానము చేయువాఁడు, లోకమునకు తనయందు ధార్మికుఁ డను విశ్వాసము కలుగుటకై ధర్మకార్యములు చేయు పాపాత్ముఁడు; లోకమును మోసము చేయుటకై ధర్మ మాచరించువాఁడు.

ధర్మశాల. సం. వి. ఆ. స్త్రీ. ధర్మమునిమిత్తము అన్నాదిదానములకొఱకు కట్టఁబడినఇల్లు, ధర్మసత్త్రము.

ధర్మశాస్త్రము. సం. వి. అ. న. ధర్మములను చెప్పునట్టిశాస్త్రము.

ధర్మసంహిత. సం. వి. ఆ. స్త్రీ = ధర్మశాస్త్రము.

ధర్మసావర్ణి. సం. వి. ఇ. పుం. చతుర్దశమనువులలో పదునొకండవమనువు.

ధర్మసువు. సం. వి. ఊ. పుం. ధూమ్యాటపక్షి, కూఁకటిమూఁగ. (వాచ.)

ధర్మాంగము. సం. వి. అ. పుం. ధర్మమువలె తెల్లనైనదేహము కలది- బకము, కొంగ. ఈ. స్త్రీ. ఆఁడుకొంగ. (వాచ.)

ధర్మాత్ముఁడు. సం. విశ. (న్) పుణ్యాత్ముఁడు.

ధర్మారణ్యము. సం. వి. అ. న. ఋష్యాదులు వసించెడియరణ్యము, తపోవనము.

ధర్మాలీకుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) ధర్మము ఆచరించువానివలె నటించువాఁడు, కపటధార్మికుఁడు.

ధర్మాసనము. సం. వి. అ. న. ధర్మనిర్ణయార్థము ధర్మాధికారి కూర్చుండుపీఠము.

ధర్మి. సం. విశ. (న్. ణీ. న్.) ధర్మము కలది. వి. న్. పుం. విష్ణువు. (వాచ.)

ధర్మిష్ఠుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) ధార్మికతముఁడు, మిక్కిలి ధర్మాత్ముఁడు.

ధర్ముఁడు. సం. వి. అ. పుం. ౧. యముఁడు. ౨. సోమయాజి. (మే. ని.) ౩. బుద్ధుఁడు. (హేమ. ని.)

ధర్మువు. సం. వి. ఉ. పుం. న = ధర్మము.

చ. భువనభయంకరంబు లగుపోరులఁ దమ్ముల
తోడఁ గూడ నీవు వెడలఁబాటు లెస్స

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యలవుం జలమునకా వెలయించుచోట ధర్మి
వున కొక్కింతయుం దొలఁగఁ ద్రొక్కమి యెం
తయు మేలు దీనఁ గౌరవకులముఖ్య యు
ష్మలిక గ్రాఁచితె చిత్తము ప్రీతిఁ బొందెనే.
భార. శాం. ౧. ౪.
౪. ఇవి మూఁడు తెఱంగులు ధర్మవునూక్ష్మత ని
శ్చయింప ముఖ్యపదంబుల్, దివిరికొని యివి
య చూచుట, యవనీశ్వర పూర్వమునుల
యందుఁ గలుగుటకా. భార.అను.౫.౪౯.
ఉత్సాహ...ఈ, వేళ నిట్లు సేయ ధర్మవే నిశా
చరాధిపో,ద్వేలమాయ లీ వెఱుంగవే యహో
సహోదరా. రామా. ౫. ౨౧౬.

ధర్మేంద్రుఁడు. సం. వి. అ. పుం. ౧. యముఁడు.
౨. యుధిష్ఠిరుఁడు, ధర్మరాజు.
ఇట్లే: ధర్మేశుఁడు.

ధర్మోపదేశము. సం. వి. అ. పుం. ౧. ధర్మముల
యొక్క ఉపదేశము. ౨. మనుస్మృత్యాదిధర్మ
శాస్త్రము.

ధర్మ్యము. సం.విణ.(అ.ఆ.అ.) ౧. ధర్మానపేత
ము, ధర్మమునుండి తొలఁగనిది, ధర్మయుక్తము.
౨. ధర్మముచేత పొందఁ దగినది. ౩. న్యాయ్య
ము, న్యాయమునుండి తొలఁగనిది.

ధర్షకారి. సం. విణ. (న్. ణీ. న్.) ౧. పరిభ
వించువాఁడు, తిరస్కరించువాఁడు. ౨. ప్రాగ
ల్భ్యము చూపువాఁడు.

ధర్షకారిణి. సం. వి. ఈ. స్త్రీ. అసతి, దుష్టురా
లు, ఱంకుటాలు.

ధర్షకుఁడు. సం. విణ. (అ.షి కా.అ.) ౧. ధర్షిం
చువాఁడు, తిరస్కరించువాఁడు. ౨. ప్రగ
ల్భుఁడు. ౩. ఓర్పు లేనివాఁడు. ౪. నటుఁడు.
౫. దూషకుఁడు, స్త్రీలను చెఱుపువాఁడు.

ధర్షణ. సం. వి. ఆ. స్త్రీ = ధర్షణము.వి.

ధర్షణము. సం. విణ. (అ. ఆ. అ.) ధర్షణముచే
యునది. వి. అ. న. ౧. ప్రాగల్భ్యము. ౨. తి
రస్కారము, అవమానము. ౩. అసహనము,
ఓర్వలేమి. ౪.సురతము. ౫. దూషణము,చెఱు
పుట. (ఉదా: నారీధర్షణము మొ.) ౬. కావ
రము, పోతరము.

ధర్షణి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. కులట, ఱంకు
టాలు.

ధర్షణీయము. సం.విణ. (అ. ఆ. అ.) ధర్షింపఁ
దగినది.

ధర్షము. సం. వి. అ. పుం. ౧. ప్రాగల్భ్యము.
౨. తిరస్కారము,అవమానము. ౩. అమర్షము,
సహనము లేమి. ౪. నిర్బంధము చేయుట, బలి
మిచే స్త్రీ లోనగువారిని చెఱఁబట్టుట, చెఱు
పుట. ౫. హింస.

ధర్షించు. సం. స. క్రి. ౧. తిరస్కరించు. ౨.
ధర్షణము చేయు. (శ. ర.)

ధరిణి. సం=ధర్షణి.

ధర్షిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ధర్షణము
చేయువాఁడు. వి. ఆ. స్త్రీ. కులట, ఱంకు
టాలు.

ధర్షితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పరాభూ
తము, అవమానింపఁబడినది; తిరస్కృతము. ౨.
దూషితము, చెఱుపఁబడినది. (స్త్రీ మొ.)
వి. అ. న. = ధర్షణము.

ధర్షితవ్యము. సం = ధర్షణీయము.

ధర్షుఁడు. సం. వి. అ. పుం. కంచుకి, అంతిపుర
పుకావలివాఁడు.

ధళ. వి. ప్రకాశము, కాంతివిశేషము; దానియను
కరణము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ... నా,థునిమౌళిక్ దలఁబ్రాలువోసె నవలా
దోర్మూలకూలంకష, స్తనవిస్ఫూర్తికి సంది
దండలధళల్ సాహానినాదం బిడక్.
మను చ. ౫. ౮౪.

(దీనియామ్రేడితరూపము "ధళధళ")

చ. ధళధళ లీనుచొక్కటపుఁ దావికదంబపు
పావిపువ్వుబె,త్తులవరుసల్ బయ ల్నిగిడి
తోఁచఁగ... చంద్రా. ౬.౧౦. హంస. ౨.౨౨.

ద్వి. మెఱపులు ధళధళ మెఱయక మున్నె.
ద్వి. హరిశ్చ. పూ. ౨౧౪౩ పం.

చ. ధళధళ నాయుధద్యుతివితానము గ్రమ్మఁ
గఁ జాల నొప్పుచున్, కళా. ౮. ౩౬.

ధళుధళుక్కు. వి. మెఱపు మొదిలగునవి మెఱయుట.కనుకరణము; మెఱపు మొదలగు వాని కాంతివిశేషము.

సీ. బకములు లోఁగఁ జాతకసంఘములు మూఁ
గఁ దనుకాంతి ధళుధళుక్కనుచు మెఱయ.
చంద్రా. ౪. ౨౦౧.

సీ. ధళుధళుక్కున నింగిఁ దాటించెఁ బలుమాఱు
నీరాళ్లగొందిఁ గన్నియ మెఱుంగు. పాండు.
౪. ౨౧.

ధవము. సం. వి. అ. పుం. ౧. కంపనము, కదల్చుట. ౨. కదలుట. ౩. వృక్షవిశేషము. (దీని ఆకులు జామిఆకులవలె నుండును. దీనిపట్ట తెల్లగానుండును. పండ్లు మిక్కిలి చిన్నవి. దీని కఱ్ఱతో రోఁకళ్లు ఎడ్లకాడులు చేయుదురు. దీనిని వెలమచెట్టని కొందఱు అందురు.)

ధవళ. సం. వి. ఆ. స్త్రీ. ౧. తెల్లనిచాయ కలస్త్రీ. ౨. తెల్లయావు.

ధవళగిరి. సం. వి. ఇ. పుం. హిమాలయముయొక్క శిఖరవిశేషము.

ధవళపక్షము. సం. వి. అ. పుం. ౧. హంస. ౨. శుక్లపక్షము.

ధవళము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. తెల్లనిది. ౨. అందమైనది. ౩. తేటయైనది, నిర్మలమైనది.
వి. అ. పుం. ౧. తెలుపు. ౨. చీనకర్పూరము. ౩. ధవవృక్షము. ౪. శ్రేష్ఠవృషభము.

ద్వి. ఏను ధర్మజునకు నీరాజ్య మిచ్చి, యే
నున్నపుర మిచ్చి యిభకోటి నిచ్చి, ధనధా
న్యముల నిచ్చి ధవళంబు లిచ్చి, నను వచ్చి
సేవించునాథుల నిచ్చి. ద్వి. భార. విరా.
౪. ౯౫ పా.

న. ౧. తెల్లమిరియము?. ౨. స్త్రీలు వివాహాదులందు పాడెడియొకవిధ మగుపాట.

మ. ధవళాంశూజ్జ్వలపీఠిపై నునిచి యంతర్
జోడుగాఁ గూడుచున్, ధవళం బింపుగఁ
బాడుచున్... రా. వి. ౫. ౫౧.

గీ. కంచుగీసిన తెఱఁగున ఖంగు రనఁగఁ, జేడి
యలు గూడి ధవళముల్ పాడుచుండ.
చమ. ౩. ౯౦.

క. ఆలలనామణి కాగ,య్యాళి యొకానొక్క
వేళ నక్కఱతో సు,వ్వాలున్ శోభనములు
ధవ,ళాలున్ మొదలైనపాటలందగ నేర్పున్.
శుక. ౧. ౪౩౪. పాంచా. ౪. ౨౪.

ధవళాంగి. సం. వి. ఈ. స్త్రీ - తెల్లనిశరీరము కలది- సరస్వతి.

ధవళితము. సం. విణ. (అ. ఆ. అ.) తెల్లగా చేయఁబడినది.

ధవళిమ(ము). సం. వి. న్. పుం. తెలుపు, తెల్లఁదనము.

ధవళోత్పలము. సం. వి. అ. న. కుముదము, తెల్లకలువ.

ధవాణకము. సం. వి. అ. పుం - చెట్లను కదల్చునది - గాలి. (వాచ.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధవిత్రము. సం. వి. అ. న. ఇఱ్ఱితోలుతో చేసిన వీవన, కృష్ణాజినముతో చేసినవిసనకఱ్ఱ.

ధవుఁడు. సం. వి. అ. పుం. ౧. మనుష్యుఁడు. ౨. భర్త, మగఁడు. ౩. ఒడయఁడు, అధిపతి. ౪. వంచకుఁడు, మోసగాఁడు.

## ధా

ధా. ప్ర. ఇది సంఖ్యావాచకములపై వచ్చి క్రియా ప్రకారరూపార్థము నిచ్చును. ఉదా:-ఏకధా, ద్విధా, త్రిధా, చతుర్ధా, శతధా మొ. (దీనికి తెలుఁగున వ్యస్త ప్రయోగము లేదు.)

ధాంధ. సం. వి. ఆ. స్త్రీ. ఏలకి.

ధాంధ్యము. సం. వి. అ. న. అపాటవము, అళక్తత. (త్రి. ని.)

ధాకము. సం. వి. అ. పుం._ధారకమైనది, ఆధారమైనది_ ౧. ఎద్దు. ౨. అన్నము. (కే.ని.) ౩. ఆశ్రయము. ౪. స్తంభము, కంబము. (వాచ.)

ధాటి. సం. వి. ఈ. స్త్రీ. దండయాత్ర, దాడి.

ధాణకము. సం. వి. అ. పుం. దీనారమం దొక భాగము, ఒకానొక నాణెము.

ధాణు. వి. మల్లవిద్యావిశేష. మగుపదునాలుగు విసరులలో నొకటి.

వ...దఢ ధారు ధాణు ఆంత్రటీక టీక ఉద్దడ నాట్య దారుధాణు దారుకపాలు...మల్లు పు. ౩. ౬౯.

వ...అవ్వీరుండు...ధాణు...ఝూటు నివి మొదలయినపదునాలుగువిసరులమర్మంబులుం జూచి...హంస. ౧. ౨౦౬.

ధాణుధారు. వి. మల్లవిద్యావిశేష మగుపదునాలుగువిసరులలో నొకటి.

వ...ధాణుధారు కధారు ధాణుదారు ఝూటు మొదలగుపదునాలుగువిసరులు... ప్రబంధ. ౩౮.

వ...ఉద్దడ...ధారుధాణు...ధాణుధారు... మల్లుపు. ౩. ౬౯.

వ...అవ్వీరుండు...ధాణుధారు ఝూటు నివి మొదలయినపదునాలుగువిసరులమర్మంబులుం జూచి...హంస. ౧. ౨౦౬.

ధాత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ౧. ధరించువాఁడు. ౨. పోషించువాఁడు. ౩. సృజించువాఁడు. ౪. త్రాగువాఁడు. (కే. ని.) వి. ఋ. పుం. ౧. బ్రహ్మ. ౨. ఆత్మ. ౩. ఒకానొక ఆదిత్యుఁడు. ౪. ఒకానొకసంవత్సరము.

ధాతకి. సం. వి. ఈ. స్త్రీ. ఆరె, ఏఱుబాజి.

ధాతవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ధరింపఁదగినది. ౨. పోషింపఁదగినది. ౩. త్రాగఁదగినది. ౪. సృజింపఁదగినది; చేయఁదగినది.

ధాతుకాసీసము. సం = కాసీసము.

ధాతుక్రియ. సం. వి. ఆ. స్త్రీ. లోహశోధన విద్య.

ధాతుక్షయము. సం. వి. అ. పుం. ౧. ధాతువులక్షీణావస్థ. ౨. కాసరోగభేదము.

ధాతుఘ్నము. సం. విణ. (అ. ఆ. అ.) - పాదరసము మున్నగువానిని మారణము చేయునది - ధాతువులను నాశనము చేయునది. వి. అ. న. కాంజికము, కలి, కడుగు.

ఇట్లే: ధాతునాశనము.

ధాతుజము. సం. విణ. (అ. ఆ. అ.) ధాతువువలన పుట్టినది. వి. అ. న. సిలాజిత్తు.

ధాతుద్రావకము. సం. విణ. (అ. వికా. అ.) ధాతువులను ద్రవింపఁజేయునది. వి. అ. పుం. వెలిగారము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధాతుపము. సం. వి. అ. పుం. - దేహధాతువులను పోషించునది - దేహమందలిరసరూపమగు ప్రథమధాతువు. (ఇది వసాదు లేడింటికి మూలమైనది.)

ధాతుపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. ధాతకి, ఆరెచెట్టు.

ధాతుభృత్తు. సం. విణ. (త్) ౧. ధాతువులను ధరించునది. ౨. ధాతువులను పోషించునది. వి. త్. పుం. కొండ.

ధాతుమంతము. సం. విణ. (త్. మతీ. త్.) ప్రశస్తమగుధాతువులు కలది.

ధాతుమలము. సం. వి. అ. న. ౧. దేహధాతువులమలము. (స్వేదాది.) ౨. లోహములమలము. (కిట్టము.) ౩. సీసము.

ధాతుమాక్షికము. సం. వి. అ. న. ఒకానొక ఉపధాతువు.

ధాతుమారిణి. సం. వి. ఈ. స్త్రీ. సర్జిక, సజ్జకారము.

ధాతురాజకము. సం. వి. అ. పుం. న. -దేహధాతువులలో ఉత్తమము- శుక్రము, రేతస్సు.

ధాతువల్లభము. సం. వి. అ. న. -బంగారు మున్నగుధాతువులకు ప్రియమైనది- టంకణము, వెలిగారము.

ధాతువాది. సం. వి. న్. పుం. రసవాది, రసాయనాదులచేత బంగారు వెండిలోనగునవి చేయువాఁడు.

ధాతువిట్టు. సం. వి. ష్. స్త్రీ. -ధాతుమలము- సీసము.

ధాతువు. సం. వి. ఉ. పుం. ౧-ఆధారమైనది- దేహమునకు ఆరంభకమైనవస లోనగునది. (వస, అసృక్కు, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రము అని ఇవి ఏడు. పక్షాంతరమున రోమ, త్వక్, మాంస, అస్థి, స్నాయు మజ్జా, ప్రాణములు.) ౨. వాతము లోనగునది. (వాతము, పిత్తము, శ్లేష్మము.) ౩. మణిశిల లోనగుశిలావికారము, గైరికాదిధాతువు. ౪. పృథివి లోనగునది. (భూతము.) ౫. శబ్దము లోనగునది. (గుణము.) ౬. త్వక్కు లోనగునది. (ఇంద్రియము.) ౭. (వ్యాక.) క్రియావాచకమగు భూధాతువు లోనగునది. ౮. లోహము. (బంగారు, వెండి, యినుము లోనైనది.) ౯. ఏడు అనుసంఖ్య. ౧౦. ఆత్మ; పరమాత్మ. ౧౧. ఎముక. ౧౨. ధనము. ౧౩. రేతస్సు. ౧౪. స్వభావము. ౧౫. ఆకారము. (కే. ని.)

ధాతువైరి. సం. వి. న్. పుం. గంధకము.

ధాతుశేఖరము. సం. వి. అ. న. కాసీసము, అన్నభేది.

ధాతుశోధనము. సం. వి. అ. న. సీసము.

ధాతుసంభవము. సం. వి. అ. న. సీసము.

ధాతూపలము. సం. వి. అ. పుం. పలకమీఁద వ్రాయుసాధనము, బలపము.

ధాతృపుష్పి. సం=ధాతుపుష్పి.

ధాత్రి. సం. వి. ఈ. స్త్రీ. ౧. భూమి. ౨. దాది, ఉపమాత. ౩. తల్లి. ౪. ఉసిరికచెట్టు.

ధాత్రీపత్త్రము. సం. వి. అ. న. తాళిసపత్తిరిచెట్టు.

ధాత్రుఁడు. సం. వి. అ. పుం. కితవుఁడు, జూదరి. (కే. ని.)

ధాత్రేయి. సం. వి. ఈ. స్త్రీ. ౧. దాదికూఁతురు. ౨. భూమి.

ధాన. సం. వి. ఆ. స్త్రీ. ౧. మొగ్గ. ౨. దనియము, కొత్తిమిరిచెట్టు. ౩. సక్తుచూర్ణము, యవాదులపిండి. ౪. అభినవాంకురము,క్రొత్తమొలక. ౫. వేఁపుడుయవలు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో. ధానా స్త్రీ భూరుహాం బీజే కుస్తుంబురు ణిచాప్యసౌ, భృష్టే యవే భూమని చ హగ్న సం దీత్వవోచత. (కే. ని.)

ధానకము. సం. వి. అ. న. ౧. దనియము, కొత్తిమిరి. ౨. మానభేదము, అలురతులయెత్తు.

ధానము. సం. వి. అ. న. ౧. ఉండుటకు ఆధారము; స్థానము. ౨. ధారణము, ధరించుట. ౩. పోషణము, పోషించుట.

ధానాక. సం = ధాన.

ధాని. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆధారము, స్థానము; వాసస్థానము.
ఉదా: రాజధాని = రాజస్థానము; యమధాని= యమపురి; మషిధాని = సిరాబుడ్డి; మత్స్యధాని=చేఁపలబుట్ట.
౨. దనియము, కొత్తిమిరి. ౩. పీలువృక్షము, గోఁగు.

ధానీయము. సం=ధాతవ్యము.

ధానుర్దండికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) వింటిచే జీవించువాఁడు, విలుకాఁడు.

ధానుష్కుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ధనుస్సు ఆయుధముగా కలవాఁడు, విలుకాఁడు.

ధానుష్యము. సం. వి. అ. పుం. - వింటికి ఉపయోగించునది- వెదురు.

ధానేయము. సం. వి. అ. న. దనియము, కొత్తిమిరి.

ధాన్య. సం. వి. ఆ. స్త్రీ. దనియము, కొత్తిమిరి.

ధాన్యచమసము. సం. వి. అ. పుం. చిపిటములు, అడుకులు. (త్రి. ని.)

ధాన్యత్వక్కు. సం. వి. చ్. స్త్రీ. ధాన్యపుపొట్టు, ఊఁక.

ధాన్యబీజము. సం. వి. అ. న. దనియాలు.

ధాన్యము. సం. వి. అ. న. ౧. - ధానముకు (పోషించుటకు) అనుకూలమయినది - కొలుచు. ౨. దనియాలు. ౩. నాలుగునూవుగింజల కొలఁది.

ధాన్యవీరము. సం. వి. అ. పుం - బలకర మగుటచే ధాన్యములలో వీరునివంటిది - మాషము, మినుములు.

ధాన్యశీర్షకము. సం. వి. అ. న. సస్యమంజరి, ధాన్యపుకంకి, ఎన్ను.

ధాన్యసారము. సం. వి. అ. పుం. తండులము, బియ్యము.

ధాన్యాకము. సం. వి. అ. న. దనియాలు.

ధాన్యామ్లము. సం. వి. అ. న. కాంజికము, కలి; పులికడుగు.

ధాన్యోత్తమము. సం. వి. అ. పుం. శాలిధాన్యము, వరి.

ధాన్వనము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. మరుదేశమందలిది. ౨. ధనుస్సంబంధమైనది.

ధామకము. సం.వి.అ. పుం. ఒకమాషము ఎత్తు.

ధామకేశి. సం. వి. న్. పుం. - కిరణములు కేశములుగా కలవాఁడు - సూర్యుఁడు.

ధామనిధి. సం. వి. ఇ. పుం. - కిరణములకు స్థానము - సూర్యుఁడు.

ధామము. సం. వి. న్. న. ౧. ఇల్లు. ౨. స్థానము, చోటు. ౩. వెలుఁగు, కిరణము; కాంతి. ౪. ప్రభావము, శక్తి. ౫. దేహము. ౬. జన్మము, పుట్టువు. ౭. ప్రతాపము. ౮. అస్త్రము. ౯. ఆకాశము. ౧౦. భోజనము, తినుట. (వై. ని.) ౧౧. సారము. ౧౨. ధనము. ౧౩. చిహ్నము. ౧౪. బృందము, సమూహము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. చండాలీవ్రజగీతరావముల కుత్సాహంబు
 శో నొక్క వేదదండస్వామి మదంబు సే
 సెఁ గరిణీధామంబు లట్టాడఁగాఁ. కు.సం.
 ౧. ౭౬.

అ. న. ౧. తిలకము. ౨. తేజస్సు. (కే. ని.)

ధామార్గవము. సం. వి. అ. పుం. ౧. అపామా
 ర్గము, ఉత్తరేను. ౨. ఆవడ, చేఁతిబీఱ.

ధాయకము. సం. విణ. (అ. యికా. అ.) ౧.
 ధరించునది. ౨. పోషించునది.

ధాయము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ధరిం
 చునది. ౨. పోషించునది. ౩. త్రాగునది.

ధాయ్యా. సం. వి. ఆ. స్త్రీ. సామిధేనిఋక్కు,
 యాగమునం దగ్నిని ప్రజ్వలింపఁజేయునపుడు
 పఠించుమంత్రము.

ధాయ్యుఁడు. సం.వి. అ. పుం. పురోహితుఁడు.
 (కల్ప.)

ధార. సం. వి. ఆ. స్త్రీ. ౧. పైనుండి పడునీరు
 లోనగువానిచాలు. ౨. కత్తి లోనగువానివా
 దర. ౩. కుండ లోనగువానిచిల్లి. ౪. పరంపర,
 ఎడతెగనివరుస. ౫. జడివాన, ముసురు. ౬.
 సేనాగ్రభాగము, దండుముందటిభాగము. ౭.
 అంచు, కొన. ౮. రథచక్రము, బండికన్ను.
 ౯. ఉత్కర్షము, మేలిమి. ౧౦. సమూహము.
 ౧౧. కీర్తి. ౧౨. వాక్కు. ౧౩. జనప్రవాద
 ము, కింవదంతి. ౧౪. ఒకానొకపట్టనము.
 ౧౫. అశ్వగతివిశేషము. (అశ్వధారలు అయిదు:
 ఆస్కందితము, ధౌరితకము, రేచితము, వల్గిత
 ము, ప్లుతము.) ౧౬. పోలిక, రీతి.

మ. నటదీశానశిరస్తటత్రుటితరత్నచ్ఛాయఁ గ
 ల్లోలినీ, విటమధ్యంబున వ్రాలె నభ్రమణి
 తద్వేగాభిపాతోన్నమత్పటుపాథోలవధా
 రఁ దార లెగసెం దద్బిందుసంధానితో,
 త్కటసంధ్యానలధూమకందళము లైకన్ప
 ట్టెఁ గ్రొంజీకటుల్. వసు. ౪. ౧౦.

ధారకము. సం. వి.అ.పుం. పాత్రము, కలశము.

ధారకుఁడు. సం. విణ. (అ. రికా. అ.) ౧. ధ
 రించువాఁడు. ౨. పోషించువాఁడు. ౩. అధ
 మర్ణుఁడు, అప్పు పుచ్చుకొన్నవాఁడు.

ధారగొను. మి.స. క్రి. (ధార+కొను.) ధారా
 పూర్వకముగా దానము పట్టు, పుచ్చుకొను.

చ. అనవుడు నాతఁ డిట్లనియె నాతనితో ని
 పు డేను దీని నీ,జనపతిచేత ధారగొని సా
 ధుగతిం జన నీది యంట యె,ట్లనిన నతండు
 నేనును ధరాధిపుచే మను ధారగొన్నయా,
 వని వినిపింప నిద్దఱకు నయ్యె నపారవివాద
 మచ్చటన్. భాగ. ౧౦. ఉ. ౪౭౯.

ధారణ. సం. వి. ఆ. స్త్రీ. ౧. ధరించుట. ౨.
 పోషించుట. ౩. జ్ఞప్తియం దుంచుకొనుట. ౪.
 జ్ఞాపకశక్తి, స్మరణపటుత్వము. ౫. కుంభక మ
 నెడిప్రాణాయామభేదము, గాలిని పీల్చి లోప
 ల నిలఁబెట్టుట. ౬. అధమర్ణత్వము, అప్పుప
 డుట. ౭. స్థైర్యము, నిలుకడ. ౮. రాజులన్యా
 య్యమార్గస్థితి, మర్యాద.

శ్లో. సంస్థాతుమర్యాదాధారణాస్థితిః.అమరము.

౯. భగవంతునితప్ప మఱియొకటి ఎఱుఁగమి.
(ఇది యోగాష్టాంగములలో నొకటి.)

శ్లో. మూర్తం భగవతోరూపం సర్వోపాశ్ర
 యనిస్పృహం. ఏషా వై ధారణా జ్ఞేయా
 యచ్చిత్తం తత్ర ధార్యతే,తచ్చ మూర్తం
 హరే రూపం తద్విచింత్య నరాధిప,తచ్ఛ్రూ
 యతామనాధారా ధారణా నోపపద్యతే.
 ప్రసన్నవదనం చారుపద్మపత్రనిభేక్షణం,
 సుకపోలం సువిస్తీర్ణలలాటఫలకోజ్జ్వలం,
 చింతయేద్భూష్మాభూతం తం పీతనిర్మలవాస
 సం. (వాచ.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధారణకుఁడు. సం. విణ. (అ. ణికా. అ.) అధమర్ణుఁడు, అప్పుపడినవాఁడు.

శ్లో. వినా ధారణకా ద్వాపి విక్రీణీత ససాక్షికం. యాజ్ఞ. ౨. ౬౩.

ధారణము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ధరించునది, తాల్చునది. ౨. పోషించునది. (అ.ఈ. అ.)౧. ధరింప సాధన మయినది. ౨. పోషింప సాధన మయినది. వి. అ. న. ౧. = ధారణ. ౨.ఉదకము. పుం. ౧. స్తనము. ౨. లోకము. (కే. ని.)

ధారణి. సం. వి. ఈ. స్త్రీ. ౧. వరుస, బంతి. ౨. నాడి, నరము. ౩. నిలుకడ; ఏకాగ్రత.౪. ధరణి, భూమి.

ద్వి. అమర వేవేగ చిత్రాంగి నంటఁ గనె, రక్కసివలెనె ధారణి పిక్కటిల్ల, మొక్కలంబుగఁ గుమో మొట్టో యనంగ, బిగువుపగ్గంబుల బిరబిరఁ దెచ్చి, తేగ నంటఁ గట్టి రాస్థానంబునందు. ద్వి.శ.సా.౧౦౬పొ.౭పం.

ధారణుఁడు. సం. వి. అ. పుం. ౧. బ్రహ్మ. ౨. సూర్యుఁడు. (కే. ని.)

ధారము. సం. విణ. (అ. ఆ. అ.) ధరించునది. వి. అ. పుం. ౧. వడగల్లు, వర్షోపలము. ౨. ఋణము, అప్పు. ౩. గ్రామాంతరము, ఒకదినుసుతాయి. (పర్వత విశేష మని కొందఱు.) ౪. గంభీరప్రదేశము, లోఁతైనచోటు. ౫. వర్షమువలన పుట్టినజలము, వర్షపునీరు.

ధారయితం. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ధరింపఁ జేయువాఁడు.

ధారయిత్రి. సం. వి. ఈ. స్త్రీ. - ధరించునది- భూమి.

ధారవో(పో)యు=దారవోయు. మి. స. క్రి. (ధార + పోయు.)ధారాపూర్వకముగా నిచ్చు.

గీ. నీవు తెచ్చినకడవలో నీళ్లు దెమ్ము, ధార వోసెద నావిప్రధర్మ మెల్ల.శుక.౨.౪౭౬.

క. క్షమ మూఁడడుగులు బలి యు,త్తమభక్తి సదక్షిణం సతాంబూలం తుభ్య మహం సంప్రదద యిదం, న మమ యనుచు ధార వోసె సలినాక్షునకున్. దశ. ౫. ౧౦౯.

క. దేవబ్రాహ్మణభూములు, భూవరునకుఁ జెప్పి ధారవోయించె బళీ. భీమ. ౧. ౬౩. వరాహ. ౧౦.౪౭.

ధారాంకురము. సం. వి. అ. పుం. ౧. శీకరము, వానతుంపర. ౨. వడగల్లు. ౩. నాసీరము, ముందుగా పోవుసేన. (మే. ని.)

ధారాంగము. సం. వి. అ. పుం. ౧. ఖడ్గము. ౨. తీర్థము. (కే. ని.)

ధారాకదంబము. సం.వి.అ.పుం. నీరుకడిమి॰.

ధారాగృహము. సం. వి. అ. పుం. ధారాయంత్రాదులు కలగృహము, స్నానపుగది.

ధారాటము. సం. వి. అ. పుం. ౧.-వర్షధారలకై తిరుగునది - చాతకము, వానకోయిల. ౨. -ఆస్కందితాదిపంచధారలతో సంచరించునది- గుఱ్ఱము. ౩. - వర్షధారలతో సంచరించునది- మేఘము. ౪- మదధారలతో సంచరించునది- మదపుటేనుఁగు.

ధారాదత్తము. సం. విణ. (అ. ఆ. అ.) ధారాపూర్వకముగా నీయఁబడినది. (భూమి, కన్యమొ.)

ధారాధరము. సం. వి. అ. పుం. ౧.-వర్షధారలను ధరించునది - మేఘము. ౨. - వాదర ధరించునది - ఖడ్గము, కత్తి.

ధారాఫలము. సం. వి. అ. పుం. - వాఁడి ముండ్లు కలఫలము కలది - ఉమ్మెత్త॰.

ధారాయంత్రము. సం. వి. అ. న. నీళ్ల ధా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రలుగ పడుటకై గొట్టములతో చేర్పబడిన యంత్రము.

శ్లో. ధారాయంత్రవిముక్తసంతతపయఃపూరప్లు తే స్సర్వతః. రత్నా. ౧. ౧౧.

ధారాళము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ధార కలది; ప్రశస్తమైనధార కలది. ౨. అడ్డుపాటు లేనిది.

గీ. కనకకర్ణికాధారాళకాంతు లదికి, బాహుల తికలు బిరుదుసంపంగిదండ, లిరుగడల వ్రే లవైచినకరణిఁ బరఁగఁ, గంబువిజయము ప చరించుఁ గాంతగళము. ప్రభా. ౨. ౭౭.

క. ధారాళమైననీతులు, నోరూరఁగఁ జవులు పుట్ట నుడివెద సుమతీ. సు. శ. ౧.

(వ్యవ.) వాఁడు ధారాళముగా ఉపన్యసించెను. వాఁడు ధారాళమైనహృదయము గలవాఁ డు. ఈపనిని ధారాళముగా చేయఁగలను. ధారాళమైనవర్షము కురిసెను.

ధారావర్షము. సం = ధారాసంపాతము.

ధారావాహి. సం. విణ. (న్.నీ.న్.) ౧. ఎడ తెగక ప్రవహించునది. ౨. ఎడతెగక యుం డునది; తెంపు లేక కలుగుచుండునది.

ధారావిషము. సం. వి. అ. పుం. - వాదరయే విషముగా కలది - ఖడ్గము, కత్తి. (త్రి. ని.)

ధారాసంపాతము. సం. వి. అ. పుం. ఆసార ము, జడివాన, ముసురు.

ధారాస్నుహి. సం. వి. ఈ. స్త్రీ. త్రిధార యగుస్నుహి, మూఁడుఅంచులు కలజెముడు.

ధారి. సం. వి. న్. పుం. పీలువృక్షము, గోఁగు.

ధారిక. సం. వి. ఆ. స్త్రీ. ముహూర్తము, రెండు గడియలకాలము. (వై. ని.)

ధారిణి. సం. వి. ఈ. స్త్రీ. ౧. భూమి. ౨. బూరుగు.

ధారితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ధరింపఁ జేయఁబడినది. ౨. అప్పుగా పుచ్చుకొనఁబడినది. (ద్రవ్యాది.)

ధారు. వి. మల్లవిద్యాసంబంధ మగుపదునాల్గువి సరులలో నొకటి.

వ...అవ్వీరుండు...ధారు...ఝూటు నివి మొ ద లయినపదునాలుగువిసరులమర్మంబులుం జూచి... హంస. ౧. ౨౦౬.

వ...ధారు ధాణు అంత్రటీక ... మల్లుపు. ౩. ౬౯.

ధారుణి. సం. వి. ఈ. స్త్రీ. ధారిణి, భూమి. (ధరుణము = జలము. "ధరుణస్సమ్మతే నీశే స్వ ర్లోకేపరమేష్ఠిని" అని మే.ని. దానినుండి పుట్టి నది. ధారుణి. "అద్భ్యః పృథివీ"అనుశ్రుతి భూ మి జలమువలన పుట్టుటను బోధించుచున్నది.)

చ. గుణముల నొప్పి బ్రాహ్మణులకుం గడుభక్తుఁ డవై సమస్తధారుణిప్రజ గూర్పఁగా విగత రోషుఁడవై సుఖ ముండు మింక బ్రాహ్మణు ల కవజ్ఞ సేయక శమత్వము సేకొను మిందుఁ డైన బ్రాహ్మణుల కవజ్ఞ సేసి యవమానముఁ బొందుఁ బ్రతాపహీనుఁ డై. భార.ఆది.౭. ౧౨౭.

మ. మణికోదండము లింద్రచాపములుగా మ త్తిల్లి గర్జిల్లవా, రణముల్ లీల ఘనాఘనం బులుగ వీరవ్రాతముల్ గార్చుమార్గణవర్షం బతివర్షమై కురియ నాకాశాంతరాళంబు ధారుణియుం గప్పుచుఁ ద్రోచి రోలి దొలు కారుం బోలె నాధోరణుల్. కు.సం.౧౧. ౭౦౫.

ధారుధాణు. వి. మల్లవిద్యాసంబంధ మగుపదు నాల్గువిసరులలో నొకటి.

వ...ధారుధాణు... మొదలగు పదునాలుగు విసరులు ...ప్రబంధ. ౭౭.మల్లుపు. ౩. ౬౯. హంస. ౧. ౨౦౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధారోష్ణము. సం. వి. అ. న. అప్పుడే పిదికిన పాలు, వేఁడితగ్గనిపాలు, గుమ్మపాలు. (వాచ.)

ధార్తరాష్ట్రపది. సం. వి. ఈ. స్త్రీ. హంసపదీ లత. (రా. ని.)

ధార్తరాష్ట్రము. సం. వి. అ. పుం. నల్లనిముక్కును కాళ్లును కలతెల్లనిహంస.

ధార్తరాష్ట్రుఁడు. సం. వి. అ. పుం. ౧. ధృతరాష్ట్రునికొడుకు. (దుర్యోధనాది.) ౨. ధృతరాష్ట్ర నామకసర్పవిశేషముయొక్క వంశమందు పుట్టినసర్పము.

ధార్మపత్తనము. సం. వి. అ. న - ధర్మపట్టనమున పుట్టినది-మిరియము.

ధార్మము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. ధర్మసంబంధి. ౨. ధర్మమయము, అధికధర్మము కలది. ౩. వింటికి సంబంధించినది.

ధార్మికుఁడు. సం. విణ. (అ.ఈ.అ.) ౧. ధర్మశాస్త్రము చదివినవాఁడు. ౨. ధర్మ మాచరించువాఁడు. ౩. సుకృతి, పుణ్యాత్ముఁడు. ౪. ధానుష్కుఁడు, విలుకాఁడు.

ధార్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. ధాయ్య. ౨. కోరిందక.

ధార్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ధరింపఁదగినది, తాల్పఁ దగినది. (వస్త్రాదిి.) ౨. జ్ఞప్తియందుంచుకొనఁ దగినది.

ధార్ష్ట్యము. సం. వి. అ. న. పొగరుఁబోతుఁదనము, వైయాత్యము.

ధాలు=డాలు³.

శా. ...అబ్జాక్షరే లీనము చాఁగురే స్ఫురితముక్తా సొబాసు ధా లంచు న,త్యారూఢప్రమదోన్నతి స్మరహరుం డాలించి వర్ణించుచుక్. చంద్ర. ౧. ౧౨౪.

ధాళధళ్యము. సం. వి. అ. న. ధళధళ మనుకాంతి.

సీ. ముఖచంద్రునకు దృగంబుజధాళధళ్యంబు సరిగాఁగ నుభయచామరలు వైవ. దశా. ౨. ౨౬౩.

ధావకుఁడు. సం. విణ. (అ. వికా. అ.) ౧. పరుగెత్తువాఁడు. ౨. వేగముగా పోవువాఁడు. ౩. వస్త్రాదికము శుద్ధి చేయువాఁడు. వి. అ. పుం. రజకుఁడు, చాకలి.

ధావత్. సం. (శత్రు.) ౧. పరుగెత్తుచున్న. ౨. శుద్ధిచేయుచున్న.

ధావన(ము). సం. వి. అ. న. (ఇది చరిత్రాదులలోనిది.) ౧. శుద్ధము చేయుట; కడుగుట; తోముట; తొలఁచుట. ౨. పోవుట; వడిగా పోవుట; పరుగెత్తుట.

(కల్క్యవతారవర్ణనము.) శా. ధారాపంచకధావనం జెలఁగుగంధర్వంబుఁ ద్రొక్కించుచు,లీప్రరంపున్నైఅరాతు...నిర్గొల్చెదక్. ఆము. ౪. ౩౧.

ధావని. సం. వి. ఈ. స్త్రీ. ౧. పృశ్నిపర్ణి,కోలపొన్న. ౨. కంటకారి, వాఁకుడు. ౩. ధాతకి, ఆరె. ౪. రజకి, చాకిత. ౫. ఉతికినవస్త్రముయొక్క అంచు, ధాతాంచలము. (వై. ని.)

ధావనీయము. సం. విణ. (అ. ఆ. అ.) శుద్ధిచేయఁదగినది.

ధావమానము. సం. విణ. (అ. ఆ. అ.) పరుగెత్తుచున్నది.

ధావము. సం. విణ. (అ. ఈ. అ.)-కర్మవాచకముపపదముగా నున్నపుడు సమాసాంతములందుండును. ఉదా:-శివధావము=శివునిగూర్చిపోవునది. మనస్సు మొ- ౧. పోవునది; వడిగా పోవునది; పరుగెత్తునది. ౨. శుద్ధిచేయునది;

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉదుకునది; కడుఁగునది; తొలఁచునది.

ధావళి. వి. (హిం. ధావళి.) వస్త్రవిశేషము.

గీ. ధాతశాటియుఁ బరిపాటిధావళియును, వఱల వేదాంతశాస్త్రంబు వ్రాసినట్టి, తాళదళపుస్తకము చంకఁ దనరఁ బూని, చనియె గడిదేఁటి యా బ్రహ్మచారి మీఁటి. హంస. ౧. ౧౫౭.

సీ. అల్లిఁ గీల్కొన్న ముత్తరములధావళి యంసాగ్రమున గోనెయసిమిసంచి. శుక. ౨. ౪౪౭. (ముత్తరములధావళి=మూడుతరముల నుండియున్న ధావళి.)

ధావళ్యము. సం. వి. అ. న. ధవళత్వము, తెలుపు.

ధావించు. సం. అ. క్రి. పరుగెత్తు.

శా... వెళ్, వెంటఁజ్ దివ్యకరేణు వభ్రముపు ధావింపంగ దర్పోద్ధతిజ్. కాశీ. ౩. ౧౯౫.

ధావిత. సం. విణ. (ఋ. త్రి. ఋ.) = ధావకుఁడు.

ధావితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. శుద్ధము చేయఁబడినది; కడుగఁబడినది; ఉదుకఁబడినది; తోమఁబడినది. ౨. పోయినది; వేగముగా పోయినది; పరుగెత్తినది.

ధావితవ్యము. సం = ధావనీయము.

ధావ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) శుద్ధి చేయఁబడుచున్నది.

ధావ్యము. సం=ధావనీయము.

## ధి

ధి. సం. వి. ఇ. పుం. (ఇది ఉపపదసమాసాంతములందే యుండును.) స్థానము, ఆధారము, పట్టు. ఉదా: జలధి, వారిధి, శరధి మొ.

ధింధిం. వి. వాద్యవిశేషమున కనుకరణము.

శా... వాద్యముల్, ధింధిం ధిక్క ధిమిక్క... యంచు మ్రోసె న్వెసజ్. ద్వా. ౧. ౧౭౯ కళా. ౧. ౨౧౯.

ధింధిమి. సం. వి. ఇ. పుం. మద్దెలధ్వని కనుకరణము.

దండకము ... తోద్ధో మృదంగావళీధింధిమి ధ్వానముల్ ... దశ. ౪. ౨౩౨.

సీ. బంధురమురజాదిధింధిమిధ్వానంబు బహుళగర్జావిజృంభణము సెఱప. దశా. ౧. ౨౬౫.

ధిక్. సం. అవ్య. ౧. నింద. ౨. భర్త్సనము. (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

ఉదా:- ధిక్కృతుఁడు, ధిక్కారము మొ.

ధిక్కరించు. సం. స. క్రి. ౧. తిరస్కరించు.

గీ. మ్రొక్కి వేఁడెద నను మీరు ధిక్కరింప, కాదరింపుఁడు మునిసమూహానుమతుఁడ, నై వినిశ్చయపరికలితాంతరంగ, వర్తనముతోడ నిచటికి వచ్చినాఁడ. భార. శాం. ౧. ౩౬౫.

వ... మనుష్యపక్షపాతంబున నన్ను ధిక్కరించి తిరి మనుష్యులు గం డని శపియించి ... మార్క. ౧. ౧౭౬.

౨. బెదరించు; ధిక్కారించు.

ధిక్కారము. సం. వి. అ. పుం. ౧. తిరస్కారము, తెగడిక. ౨. బెదరింపు, భయపెట్టుట.

ధిక్కారించు. సం. స. క్రి. ౧. తిరస్కరించు ౨. బెదరించు.

మ... భక్తులం, గని చక్రాయుధుఁ డేఁడి చూపుఁడని ధిక్కారించిరో దుర్జనుల్. భాగ. ౮. ౧౦౦.

ధిక్కృతము. సం. విణ. (అ. ఆ. అ.) తిరస్కరింపఁబడినది. వి. అ. న. తిరస్కారము, నింద.

ధిక్కృతి. సం. వి. ఇ. స్త్రీ=ధిక్కారము.

ధిక్పారుష్యము. సం. వి. అ. న. చీ యనుట, చీకొట్టుట, చీవాట్లుపెట్టుట.

ధిక్క్రియ. సం. వి. ఆ. స్త్రీ=ధిక్కారము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధిగధిగ=ధిగద్ధిగ. వి. కస్తురిబొట్టు మొదలగువాని కాంతివిశేషమున కనుకరణము.

చ. మొగమున వ్రేలుముంగురులు మొల్లపుబొట్టెడలించి యింతికిన్, ధిగధిగ లీనుబొట్టొకతె దిద్దె బళీ యనఁ బచ్చికస్తురిన్. చమ. ౩. ౪౩.

క. గగనపథంబున రాఁగా, ధిగధిగ మనునొక్కదివ్యతేజంబు నభో,లగనంబై పొడకట్టిన, బెగడి దివాకరులు చనిరి భీతిం గడలన్. శ్రీరం. మా. ౪. ౬౯.

ధిగద్ధిగ= ధిగధిగ.

సీ... దివ్యతేజము ధిగద్ధిగవెలింగె. వసు.౫.౩.

ధిగ్దండము. సం. వి. అ. పుం. చీయనుట, చీకొట్టుట,చీవాట్లుపెట్టుట. (ఇది దండనవిశేషము.)

ధిగుల్లు. వి. గుండె యదరుట కనుకరణము.

క...ప్రసాదము...వేగ భుజించితి నన విని, తా గుండె ధిగుల్లు మనఁగఁ దలపోసె మదిన్. చెన్న. ౧.౧౨౩.

క. వనితామణి కౌఁగిటఁ జేర్చిన గుండె ధిగుల్లు రనఁగ శ్రీగురుఁ డనియెన్. చెన్న. ౨. ౩౦౨.

ధిగ్వణుఁడు. సం. వి. అ. పుం. బ్రాహ్మణునికి ఆయోగవస్త్రీయందు పుట్టినసంకీర్ణజాతివాఁడు. (వీనివృత్తి చర్మకార్యము.)

ధితి. సం. వి. ఇ. స్త్రీ. ధారణము. (వాచ.)

ధిప్స. సం. వి. ఆ. స్త్రీ. మోసము చేయ నిచ్ఛ.

ధిప్సువు. సం. విణ. (ఉ) మోసము చేయ నిచ్ఛ కలవాఁడు.

ధిమిధిమి. వి. భేరి మొదలగువాని ధ్వనికనుకరణము.

క...విరులసోన గురిసెన్ స్మరసెన్, ధిమిధిమిని దివ్యదుందుభు, లమరమనోహర్షహేతు వగునవ్వేళన్. విప్ర. ౧. ౭౪.

వ...తిరువడికోలలరంధ్రగోళంబుల నత్తికలంబులై మండుధగధగని జగజ్జ్యోతిదీపజాలంబులమధ్య ధూపకుండికాంగారంబుల నీరాజఁ గ్రాచి నాదుఁ బరికింప వాయించు ధిమిధిమిధ్వానంబులకు...ఆము. ౪. ౩౫.

ధిమ్ము. వి. ౧. మద్దెలధ్వని కనుకరణము. (ఆమ్రేడితమున "ధింధిమ్ము")

గీ. ధి మ్మనెడి మద్దెలలమ్రోత గ్రమ్ముకొనియె. కువల. ౨. ౧౦౯.

౨. పిరంగులధ్వని కనుకరణము.

వ...విజయశంఖంబులఘుమంఘుమలు పిరంగుల ధింధిమ్ములు జబురుజంగులఖంగురింగులు... ప్రబంధ. ౭౭౭.

ధిషణ. సం. వి. ఆ. స్త్రీ. ౧. బుద్ధి, మనీష. ౨. వాక్కు. ౩. స్తోత్రము. ౪. గౌరి. ౫. భూమి. ౬. స్త్రీచిహ్నము. ద్వి. భూమ్యాకాశములు. (కే.ని.)

ధిషణము. సం. వి. అ. న. వాసస్థానము; స్థానము.

ధిషణాధిపుఁడు. సం. వి. అ.పుం. - వాచస్పతి-బృహస్పతి.

ధిషణుఁడు. సం. వి. అ. పుం. బుద్ధికలవాఁడు-బృహస్పతి.

ధిష్ణ్యము. సం. వి. అ. న. ౧. స్థానము. ౨. గృహము. ౩. నక్షత్రము. ౪. శక్తి. ౫. బలము. (వై. ని.)

ధిష్ణ్యుఁడు. సం. వి. అ. పుం. ౧. శుక్రాచార్యుఁడు. ౨. ప్రాణాభిమానిదేవత. ౩. అగ్ని.(వై.ని.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ధీ

ధీ. సం. వి. ఈ. స్త్రీ. ౧. బుద్ధి, జ్ఞానము; తెలివి. ౨. భావన, ఊహ. ౩. ఆలోచన.

ఉదా:- ధీసచివుఁడు, ధీగుణములు.

శ్లో. శుశ్రూషా శ్రవణం చైవ గ్రహణం ధారణం తథా, ఊహాపోహార్థవిజ్ఞానం తత్త్వజ్ఞానంచ ధీగుణాః.

౪. కర్మము.(కే. ని.)

ధీంద్రియము. సం. వి. అ. న. జ్ఞానేంద్రియము.

ధీత. సం. వి. ఆ. స్త్రీ. ౧. కూఁతురు. ౨. మనస్సు. (వై. ని.) ౩. కన్య. (కే. ని.)

ధీతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. త్రాగఁబడినది, పీల్వఁబడినది, జుఱ్ఱఁబడినది. ౨. అనాదృతము, అనాదరముచేయఁబడినది. ౩. ఆరాధింపఁబడినది. (వాచ.)

ధీతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. పీల్చుట, త్రాగుట. ౨. అనాదరము. ౩. వ్రేలు. ౪. ఆధారము. ౫. వ్యవస్థ. (కే. ని.)

ధీద. సం. వి. ఆ. స్త్రీ. ౧. బుద్ధి. ౨. కన్య. (వాచ.)

ధీప్స. సం=ధిప్స.

ధీప్సువు. సం=ధిప్సువు.

ధీమంతుఁడు. సం. విణ. (త్. మతీ. త్.) ప్రశస్తబుద్ధి కలవాఁడు. వి. త్. పుం. ౧. బృహస్పతి. ౨. విద్వాంసుఁడు.

ధీమకము. సం. వి. అ. న. ఇనుము. (వై.ని.)

ధీయమానము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. ధరింపఁబడుచున్నది. ౨. పోషింపఁబడుచున్నది.

ధీర. సం. వి. ఆ. స్త్రీ. ౧. ధీరురాలు. ౨. (అలం.) మానముతో కూడిననాయిక. (వ్యంగ్యముగా భర్తయందలికోపము ప్రకటించునాయిక. చూ. ధీరాధీర.) ౩. కాకోలి, కారుకొల్లి†. ౪. మహాజ్యోతిష్మతి, పెద్దమానేరు†.

ధీరపత్త్రి. సం. వి. ఈ. స్త్రీ. ధరణీకందము, ఒకదినుసుకంద†.

ధీరము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. గంభీరము. (ధ్వని మొ.) ౨. మందము. (గాలి మొ.) "ధీరసమీరే యమునాతీరే"...గీతగో. ౫. ౧. వి. అ. న. కుంకుమపువ్వు†.

ధీరలలితుఁడు. సం. వి. అ. పుం. ధీరుఁడును కళాసక్తుఁడును అగునాయకుఁడు, చతుర్విధనాయకులలో నొకఁడు, మృదుచిత్తము కళాసక్తియు కలిగి సమస్తభోగములు అనుభవించుచు నిశ్చింతుఁడై యుండునాయకుఁడు. (ఉదా:- రత్నావళిలోని వత్సరాజు మొ.)

శ్లో. నిశ్చింతో మృదు రనిశం కలాపరో ధీరలలిత స్స్యాత్. సా. ద.

ధీరశాంతుఁడు. సం. వి. అ. పుం. ధీరుఁడును శాంతుఁడును అగునాయకుఁడు, చతుర్విధనాయకుల లోనొకఁడు. (ఉదా:- చారుదత్తుఁడు మొ.)

శ్లో. సామాన్యగుణై ర్భూయాన్ ద్విజాతికో ధీరప్రశాంత స్స్యాత్. సా. ద.

ధీరాధీర. సం. వి. ఆ. స్త్రీ. (అలం.) తప్పుచేసిన నాయకునియందలికోపమును వ్యంగ్యముగాను అవ్యంగ్యముగాను ప్రకటించునాయిక, ధీరాలక్షణమును అధీరాలక్షణమును కల నాయిక. మధ్యధీరాధీర = తప్పుచేసినభర్తయెదుట నిలిచి కంటఁ దడిపెట్టుకొనుచు కుటిలవాక్యము లాడునది. ప్రగల్భధీరాధీర= తప్పుచేసిన భర్తయందలి కోపమును సురతమందలియౌదాసీన్యముచేతను తర్జనతాడనాదులచేతను ప్రకటించునది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ...వ్యంగ్యావ్యంగ్యంబుగఁ గోపప్రకాశంబు సేయునది ధీరాధీర యగు. అందు మధ్యధీరకు కోపవచనంబు వ్యంగ్యంబు మధ్యాధీరకు పరుషవచనంబు మధ్యధీరాధీరకు వచనరుదితంబులుం గలిగియుండు. ప్రౌఢధీరకు రతిసంభ్రమ మెంచకుండుటయు ప్రౌఢాధీరకు తర్జనతాడనంబులఁ గోపప్రకాశంబును ప్రౌఢధీరాధీరకు సురతౌదాస్యతర్జనతాడనంబులఁ గోపప్రకాశంబునుం గలిగియుండును... రస. ౧.౧౬.

ధీరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ధైర్యము కలవాఁడు, జంకనివాఁడు. ౨. నిలుకడ కలవాఁడు, చలింపనివాఁడు. ౩. దృఢచిత్తము కలవాఁడు, గట్టిపూనిక కలవాఁడు. ౪. గంభీరుఁడు, నిర్వికారచిత్తుఁడు. ౫. పండితుఁడు. ౬. స్వైరుఁడు, స్వతంత్రుఁడు. ౭. బలము కలవాఁడు. ౮. వినీతుఁడు, వినయవంతుఁడు, సుశిక్షితుఁడు. ౯. మందుఁడు, మూర్ఖుఁడు. ౧౦. తెగువారి, సాహసికుఁడు. వి. అ. పుం. ౧. బుద్ధుఁడు. ౨. చిదాత్ముఁడు, ౩. బలిచక్రవర్తి. ౪. సముద్రుఁడు.

ధీరోత్తమగండ(ఁడు). ధీరోత్తముల కెల్ల ధీరుఁడు. (ఇది బిరుద నామము.)

సీ. దర్పితాహితనృపోత్తములు ని న్నెదిరింపఁ గలరె ధీరోత్తమగండబిరుద. నరస. ౫.౨౦.

ధీరోదాత్తుఁడు. సం. వి. అ. పుం. -ధీరుఁడును ఉదాత్తుఁడు నైననాయకుఁడు- చతుర్విధ నాయకులలో నొకఁడు. (ఉదా:- శ్రీరాముఁడు.)

శ్లో. అవికత్థనః క్షమావా నతిగంభీరో మహాసత్వః, స్థేయాన్ నిగూఢమానో ధీరోదాత్తో దృఢవ్రతః కథితః. సా. ద.

క. ధీరుఁడు గంభీరుఁడు సత్కారుణ్యుఁడు న స్వయంకృతస్తుతినిరహంకారుఁడు నగు నాయకుఁ డిల, ధీరోదాత్తుండు నాఁగ ధృతిఁ బెంపారుఁ. కావ్యా. ౩. ౫.

ధీరోద్ధతుఁడు. సం. వి. అ. పుం. -ధీరుఁడును ఉద్ధతుఁడు నైననాయకుఁడు- చతుర్విధ నాయకులలో నొకఁడు. (ఉదా:- భీమసేనుఁడు.)

శ్లో. మాయాపరః ప్రచండ శ్చపలో హంకారభూయిష్ఠః, ఆత్మశ్లాఘానిరతో ధీరై ర్ధీరోద్ధతః కథితః. సా. ద. కావ్యా. ౩. ౭.

ధీలటి. సం. వి. ఇ.ఈ. స్త్రీ. దుహిత, కూఁతురు. (వాచ.)

ధీవము. సం. వి. న్. పుం. ౧. చేప. (కే. ని.) ౨. వ్యాధి, రోగము. (కే. ని.)

ధీవరము. సం. వి. అ. న. ఇనుము. (వై. ని.)

ధీవరుఁడు. సం. వి. అ. పుం. ౧. కైవర్తుఁడు, జాలరి. ౨. ఘంటాపథములను సంరక్షించుమాగధుఁడు. (వై. ని.)

ధీవుఁడు. సం. విణ. (న్. వరి. న్) ఆలోచన కలవాఁడు, ధ్యానయుక్తుఁడు; నిపుణుఁడు. వి. న్. పుం. ౧. శిల్పి. ౨. జాలరి. ౩. దేవుఁడు. (కే. ని.)

ధీసచివుఁడు. సం. వి. అ. పుం. ౧. ఆలోచనము చెప్పుమంత్రి. ౨. మంచి ఆలోచనము చెప్పువాఁడు. (వ్యతి. కర్మసచివుఁడు = కార్యము చేయుమంత్రి. ఉదా:- ఇంద్రునకు బృహస్పతి ధీసచివుఁడు. ఉపేంద్రుఁడు కర్మసచివుఁడు.)

## ధు

ధుంధుమారము. సం. వి. అ. పుం. ౧. ఇంద్రగోపము, ఆరుద్రపురుగు. ౨. పట్టుపురుగు. ౩. గృహధూమము, ఇంటిపొగ; కఱదూపము.

ధుంధుమారుఁడు. సం. వి. అ. పుం. - ధుంధు వనురాక్షసుని చంపినవాఁడు- కువలయాశ్వుఁ డనురాజు, బృహదశ్వునిపుత్రుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధుక్షిమము. సం. వి. అ. న. వెన్న తీసి కాఁచిన పాలు తోఁడుపెట్టిన పెరుఁగు. (వై. ని.)

ధుతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. విధూతము, ఎగురఁ గొట్టఁబడినది ; కదలింపఁబడినది. ౨. త్యక్తము, విడువఁబడినది.

ధుత్తూరము. సం. వి. అ. పుం. ఉమ్మెత్త.

ధుని. సం. వి. ఇ. ఈ. స్త్రీ.-వాయువుచే కదలునది- నది.

ధున్వత్. సం.(శత్రు.)౧. కదలుచున్న. ౨. కదలించుచున్న.

ధుర్. సం. వి. ర్. స్త్రీ. (ఇది తెనుఁగున సమాసావయవముగానే యుండును.ఉత్తరపదము పరమగునపుడు "ధూర్" అనురూపము నొందును. ఉదా:- ధూర్వహుఁడు. తానుత్తరపదమైనపుడు తత్పురుషాదులయందు "ధురా" యని ఆకారాన్త మగును. ఉదా:- రాజధురా. అక్షమునకు సంబంధించినదానిని చెప్పునపుడుమాత్రము ఆకారాన్తము కాదు. ఉదా:- అక్షధూః. దృఢధూ రక్షః.) ౧. బండి లోనగువానియగ్రభాగము, నొగ. ౨. నొగచివర. ౩. ఇరుసు బండికంటినుండి వీడకుండునట్లు దానిరంధ్రములయందు వైచుచీల. ౪. భారము, బరువు; కార్యభారము. ౫. అగ్రస్థానము.

శ్లో. అపాంసులానాం ధురి కీర్తనీయా. సం. రఘు. ౨. ౨.

౬. పీడ. ౭. అంగుళి, వ్రేలు. ౮. వికృతగానము.౯.గాయత్రీనామకసామము. (కే.ని.)

ధుర. సం. వి. ఆ. స్త్రీ. భారము, బరువు.(కల్ప.)

ధురంధరము. సం.విణ. (అ. ఆ. అ.) ౧. కాఁడిని మోయునది.౨.బరువు మోయునది. (ఎద్దు, గుఱ్ఱము మొ.) పుం. ధవవృక్షము, ఒకానొకచెట్టు. (మే. ని.)

ధురంధరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కార్యభారము వహించువాఁడు, కార్యనిర్వాహకుఁడు. ౨. అగ్రేసరుఁడు, ముఖ్యుఁడు, శ్రేష్ఠుఁడు.

ధురీణము. సం.వి. అ. పుం.-బరువు మోయునది- ౧. వృషభము, ఎద్దు. ౨. గుఱ్ఱము.

ధురీణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. బరువు మోయువాఁడు. ౨. కార్యభారము వహించువాఁడు. ౩. అగ్రేసరుఁడు, ముఖ్యుఁడు.

ధుర్యము. సం. వి. అ. పుం. = ధురీణము.

ధుర్యావకర్తిక. సం. వి. అ. పుం. అధోముఖుఁడై ధూమపానము చేయువ్రతి.

శ్లో. పిబ త్వధోముఖో ధూమం య స్స ధుర్యావకర్తికః. (వై.ని.)

ధుర్యుఁడు. సం = ధురీణుఁడు.

ధువనము. సం. విణ. (అ. ఆ. అ.) కదల్చునది.

శ్లో. అయ మంచతి పంచశరానుచరో నవనీపవనీధువనః పవనః. సా. ద.

వి. అ. న. కదల్చుట. పుం. అగ్ని.

## ధూ

ధూంక్ష్ణ. సం. వి. ఆ. స్త్రీ. తెల్లకాకి. (వై. ని.)

ధూక. సం. వి. ఆ. స్త్రీ. వ్యాధి, రోగము ; కామిలారోగము. (కే.ని.)

ధూకము. సం. వి. అ. పుం. ౧. వాయువు. ౨. కాలము. ౩. వ్యాధి; కామిలారోగము.

ధూకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ధూర్తుఁడు. (వాచ.)

ధూతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కంపితము, కదల్పఁబడినది; వడకింపఁబడినది. ౨. త్యక్తము, విడువఁబడినది. ౩. భర్త్సితము, అదల్పఁబడినది. ౪. వీవనతో విసరఁబడినది. ౫. తిరస్కరింపఁబడినది. ౬. తర్కింపఁబడినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధూతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. కదల్చుట; వడఁకించుట. ౨. వీవనతో విసరుట.

ధూనకము. సం. విణ. (అ. నికా. అ.) చాలకము, కదలించునది. వి. అ. పుం. యక్షధూపము, సర్జరస మనుధూపద్రవ్యము. (త్రి. ని.)

ధూననము. సం. విణ. (అ.ఆ.అ.) కదలించునది. వి.అ.న.చాలనము, కదలించుట.పుం.వాయువు.

ధూనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కంపితము, కదల్పఁబడినది. ౨. (ఎండదప్పి లోనగువానిచే) పీడింపఁబడినది.

ధూని. సం. వి. ఇ. స్త్రీ. కంపనము, కదలించుట. (వాచ.)

ధూపకుఁడు. సం. విణ. (అ. పికా. అ.) ౧. ధూపము వేయువాఁడు. ౨. సంతాపము కలిగించువాఁడు, తపింపఁ జేయువాఁడు.

ధూపనము. సం. వి. అ. న. ౧. ధూపమువేయుట, పొగ వేయుట. ౨. సంతాపము కలిగించుట, తపింపఁ జేయుట. ౩. సర్జరస మను ధూపద్రవ్యము.

ధూపము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పొగవేయునది. ౨. సంతాపము కలిగించునది. వి. అ. పుం. ౧. ధూపము, సుగంధిద్రవ్యములనుండి వచ్చుపొగ. ౨. పొగకు సాధన మైనసుగంధిద్రవ్యము.

ధూపవాసము. సం. వి. అ. పుం. స్నానానంతరము తడి పోఁగొట్టుటకును శిరోజములను పరిమళింపఁజేయుటకును సుగంధిద్రవ్యములతో పొగ వేసికొనుట.

ధూపవృక్షము. సం. వి. అ. పుం. - ధూపద్రవ్యమున కాధార మగువృక్షము - సరళము అను వృక్షభేదము.

ధూపాంగము సం. వి. అ. పుం.-ధూపమున కుపయోగించుఅవయవములు కలది - ధూపవృక్షము.

ధూపాయితము సం = ధూపితము.

ధూపార్హము సం. విణ. (అ. ఆ. అ.) - ధూపమునకు తగినది – వి. అ. న. కృష్ణాగరువు, నల్లఅగలు్ి.

ధూపితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ధూపము వేయఁబడినది, కర్పూరాదికముచేత వాసన కలదిగా చేయఁబడినది. ౨. (ఎండ దప్పి లో నగువానిచే) తపింపఁ జేయబడినది.

ధూమకము. సం. వి. అ. పుం. స = ధూమిక.

ధూమకేతనము. స. వి. అ. పుం. ౧. -పొగ చిహ్నముగా కలది- అగ్ని. ౨. ఉత్పాతవిశేషము, తోఁకచుక్క.

ధూమకేతువు. సం. వి.ఉ.పుం.=ధూమకేతనము.

ధూమగంధి. సం. విణ. (ఇ) పొగకంపు కలది. వి. ఇ. న. కామంచిగడ్డి్ి.

ధూమగ్రహము. సం. వి. అ. పుం. రాహువు.

ధూమజము. సం. వి. అ. పుం - ధూమమువలన పుట్టినది - ౧. మేఘము. ౨. ముస్తకము, తుంగముస్తె్ి.

ధూమజాంగజము. సం.వి.అ.న. వజ్రక్షారము, నవాసారము. (వాచ.)

ధూమధ్వజుఁడు. సం. వి. అ. పుం. - పొగచిహ్నముగా కలవాఁడు - అగ్ని.

ధూమపథము. సం. వి. అ. పుం. ౧. పితృయానము, కర్మప్రాప్యమార్గము. (వ్యతి. అర్చిరాది మార్గము.) ౨. పొగ వెలువడుమార్గము. (గవాక్షాది.)

ధూమమహిషి. సం. వి. ఈ. స్త్రీ. - ధూమమునకు భార్యవంటిది - కుజ్ఝటి, పొగమంచు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధూమము. సం. వి. అ. పుం. ౧. పొగ. ౨. ఆవిరి. (ఆ. ని.) ౩. ధూమకేతువు, తోఁకచుక్క. ౪. (వైద్య.) ధూమపానము, పొగనుపీల్చుట. ౫. అజీర్ణపుత్రేనుపు. ౬. ఆగ్నేయదిక్కున నున్నయిల్లు.

శ్లో. ధ్వజధూమమృగేంద్రాణాం శ్వోక్షరాసభహస్తినాం, వాయసస్య చ పర్యాయాః క్రమాత్ పూర్వాదివేశ్మని. (వై. ని.)

ధూమయోని. సం. వి. ఇ. పుం. ౧. -ధూమము కారణముగా కలది- మబ్బు, మేఘము. ౨. ముస్తకము, తుంగముస్తె.

ధూమలము. సం. విణ. (అ. ఆ. అ.) ధూమ్రము, నలుపుకలసినయెఱుపు కలది, పొగవన్నె కలది. వి. అ. పుం. నలుపుకలసినయెఱుపు, పొగవన్నె. పుం. న. దేవతాపూజలయందు వాయించుమద్దెల. (వై. ని.)

ధూమవేధి. సం. వి. న్. పుం. లోహాదులను సువర్ణముగా చేయు ఔషధవిశేషము.

వ... పంచలోహమయంబై యొప్పునప్పుడమి ఱేనికొలువు చవికెం దనచేతిధూమవేధి యను నౌషధంబుచేత శుద్ధసువర్ణంబు గావించి... భోజరా. ౧. ౮౭.

ధూమాయితము. సం. విణ. (అ.ఆ.అ.) ధూమముకలదిగా అయినది, ధూమము కలది.

ధూమి. సం. విణ. (న్.నీ.న్.) ధూమము కలది.

ధూమిక. సం. వి. ఆ. స్త్రీ. కుజ్ఝటి, పొగమంచు.

ధూమిని. సం. వి. ఈ. స్త్రీ. అగ్నిజిహ్వలలో నొకటి. -

ధూమోత్థము. సం. వి. అ. న. వజ్రక్షారము, నవాసారము.

ధూమోద్గారము. సం. వి. అ. పుం. ౧. పొగ వెలువడుట. ౨. త్రేఁచుట, త్రేఁపు.

ధూమోర్ణ. సం. వి. ఆ. స్త్రీ. యమునిభార్య. (త్రి. ని.)

ధూమ్యా. సం. వి. ఆ. స్త్రీ. ధూమసమూహము, దట్టమైనపొగ.

ధూమ్యాటము. సం. వి.అ. పుం. కూఁకటిమూఁగపక్షి.

ధూమ్రకము. సం. వి. అ. పుం - ధూమ్ర వర్ణము కలది - ఉష్ట్రము, లొట్టియ.

ధూమ్రకర్ణము. సం. వి. అ. పుం. గాడిద.

ధూమ్రపత్త్రి. సం. వి. ఆ. స్త్రీ - ధూమ్రవర్ణముకలఆకులు కలది _ పొగాకు.

ధూమ్రము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నలుపు కలసినయెఱుపు కలది, పొగవన్నె కలది. ౨. వేఁడియైనది. వి. అ. పుం. ౧. నలుపు కలసిన యెఱుపు, పొగవన్నె. ౨. సిహ్లకము, చిల్లమడ్డి. ౩. కళింగము, కూఁకటిమూఁగపిట్ట. ౪. వేఁడిమి. (వై. ని.)

ధూమ్రమూలిక. సం.వి.ఆ. స్త్రీ. శూలీతృణము.

ధూమ్రలోచనము. సం. వి. అ. పుం - ధూమ్రవర్ణము కలకన్నులు కలది-కపోతము, పావురాయి.

ధూమ్రవర్ణకము. సం. వి. అ. పుం. నక్క.

ధూమ్రవర్ణము. సం. విణ. (అ. ఆ. అ.) ధూమ్రవర్ణము కలది, పొగవన్నె కలది. వి.అ.పుం.౧. నలుపు కలసినయెఱుపు, పొగవన్నె. ౨. తురుష్కము, చిల్లమడ్డి.

ధూమ్రశూకము. సం. వి. అ. పుం - ధూమ్రవర్ణరోమములు కలది- లొట్టిపిట్ట.

ధూమ్రాంకము. సం. వి. అ. పుం. మౌక్తికమణిదోషము.

సీ. అతిరక్తమనుదోష మది విద్రుమచ్ఛాయ ధూమ్రాంకమనునదిధూమకాంతి. రత్న. ౫౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధూమ్రాక్షి. సం. వి. ఇ. పుం. ౧. దోషవిశేషము కలముత్యము. (దీనినే "ధూమాక్షి" అని కొందఱు.) ౨. ధూమ్రవర్ణనేత్రములు కలస్త్రీ.

ధూమ్రాటము. సం=ధూమ్యాటము.

ధూమ్రాహ్వ. సం. వి. ఆ. స్త్రీ. పొగాకు.

ధూమ్రిక. సం. వి. ఆ. స్త్రీ. కృష్ణశింశుప, నల్లయిరుగుడు.

ధూయమానము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కదల్పఁబడుచున్నది. ౨. వడఁకింపఁబడుచున్నది.

ధూర్గతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కాఁడిమీఁద నున్నవాఁడు. ౨. అందఱకు ముందఱ నున్నవాఁడు- ముఖ్యుఁడు, అగ్రేసరుఁడు.

ధూర్జటి. సం. వి. ఇ. పుం_బరువైనజటలు కలవాఁడు_శివుఁడు.

ధూర్తకము. సం. వి. అ. పుం. వంచకము, నక్క.

ధూర్తమానుష. సం. వి. ఆ. స్త్రీ. రాస్న, సన్నరాష్టము.

ధూర్తము. సం. వి. అ. పుం. ౧. ఉమ్మెత్త. ౨. చోరకము, కచ్చోరము. ౩. రక్తచందనము. (వై.ని.)న. ౧. బిడలవణము. ౨. లోహకిట్టము, ఇనుపత్రుప్పు.

ధూర్తు. సం=ధూర్తుఁడు. (ఇది గృహస్థువంటిది.)
 ద్వి. వేవేగ నాలోనివెఱ పెల్ల మాన్పు,మని వేఁడుకొనుటయు నవ్వటుధూర్తు, మనసులో వేఱొక్కమతము చింతించి. ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౨౩ పం.

ధూర్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. మోసకాఁడు, వంచకుఁడు; మాయావి. ౨. జూదరి. ౩. హింసకుఁడు, పీడించువాఁడు. వి. అ. పుం. ౧. (అలం.) వంచకుఁడగు నాయకుఁడు, శఠనాయకుఁడు. ౨. శివుఁడు, మహాదేవుఁడు.(కే.ని.)

ధూర్వహము. సం = ధురంధరము.

ధూర్వహుఁడు. సం = ధురంధరుఁడు.

ధూర్వి. సం. వి. ఈ. స్త్రీ. రథాదులముందటి భాగము.

ధూర్వోఢ. సం. విణ. (ఋ. ఢ్రీ. ఋ.) ౧. = ధురంధురుఁడు. ౨. = ధురంధరము.

ధూలకము. సం. వి. అ. న. విషము.

ధూళి. సం. వి. ఇ. ఈ. స్త్రీ.దుమ్ము, పరాగము,

ధూళిఁగల(లు)పు. మి. స. క్రి. (ధూళిక్ + కలుపు.) దుమ్ములోకలుపు; నశింపఁజేయు.
 గీ. దొరతనము నీతి నియమంబు ధూళిఁగలపు, నంగనాజనలోలుఁ డైనట్టివరుఁడు. దక్షా.౫. ౧౪౭. (ఇట విడుచు అని భావము.)

ధూళిఁగల(లి)యు. మి. అ. క్రి. (ధూళిక్ + కలయు.) దుమ్మునఁ గలయు; నశించు.
 సీ. ఊరక విరఁబడు మారనారాచంబు దుండగంబునఁ దన్ను ధూళిఁగలయ.వరాహ.౪.౨౧.

ధూళిక. సం. వి.ఆ. స్త్రీ. కుజ్ఝటి, పొగమంచు.

ధూళికేదారము. సం. వి. అ. పుం. దున్నిన వరిమడి.

ధూళిగుచ్ఛకము సం. వి. అ. పుం. పటవాసకము, బుక్కా.

ధూళిజంఘము. సం. వి. అ. పుం - బూడిదవన్నెపిక్కలు కలది-వాయసము, కాకి. (వై.ని.)

ధూళిధ్వజుఁడు. సం. వి.అ. పుం - ధూళి జెండాగా కలవాఁడు - వాయువు, గాలి.

ధూళిపటలము. సం.వి. అ. పుం. పైకెగసి కప్పువలె ఏర్పడినదుమ్ము. న. ధూళిచయము. (కల్ప.)

ధూళిపుష్పి. సం. వి. ఈ. స్త్రీ - పరాగమధికముగా కలపూవులు కలది - కేతకి, మొగలి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధూళిభక్తము. సం. వి. అ. న. వివాహభోజనము, పెండ్లివిందు. (వై. ని.)

ధూళీకదంబము. సం.వి.అ.పుం.౧-పరాగసమూహము కలది - నీపము, కడిమిచెట్టు. ౨. వరుణము, ఉలిమిరిచెట్టు. ౩. తినిశము, నెమ్మిచెట్టు. ౪. ధూళిపటలము.

ధూళీగుచ్ఛము. సం. వి. అ. పుం. కర్పూరకుంకుమమిశ్రచందనచూర్ణము, ఫల్గుచూర్ణము, ఒకదినుసుబుక్కా.

ధూసర. సం. వి. ఆ. స్త్రీ. పాండుఫలి అను మొక్క.

ధూసరచ్ఛద. సం. వి. ఆ. స్త్రీ. పాత, చిఱుబొద్దిచెట్టు.

ధూసరపత్త్రిక. సం. వి. ఆ. స్త్రీ. హస్తిశుండిచెట్టు.

ధూసరము. సం. విణ. (అ. ఆ. అ.) బూడిదవర్ణము కలది. వి. అ. పుం. ౧. బూడిదవర్ణము. ౨. గాడిద. ౩. లొట్టియ. ౪. పావురము.

ధూసరితము. సం. విణ. (అ. ఆ. అ.) ధూసరవర్ణము కలదిగా చేయఁబడినది, బూడిదరంగు కలదిగా చేయఁబడినది.

ధూసరుఁడు. సం. వి. అ. పుం. తైలకారుఁడు, గాండ్లవాఁడు, తెలికవాఁడు.

## ధృ

ధృక్కు. సం. విణ. (జ్) పొందువాఁడు. (ఇది తెలుచు సమాసాంతమునందే ఉండును.)
ఉదా:- కాలరూపధృక్కు, శక్తిధృక్కు మొ.

ధృతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ధరింపఁబడినది, తాల్పఁబడినది. ౨. గృహీతము, పట్టుకొనఁబడినది. వి. అ. న. ౧. పతనము, పాటు. ౨. స్థితి, ఉనికి. ౩. ధారణము, తాల్చుట. ౪. గ్రహణము, పట్టుకొనుట.

ధృతరాష్ట్రము. సం. వి. అ. పుం. మంచిరాజు కలదేశము.

ధృతరాష్ట్రి. సం. వి. ఈ. స్త్రీ. ధార్తరాష్ట్రములనుహంసలజాతికి ఆదిమాత.

ధృతరాష్ట్రుఁడు. సం. వి. అ. పుం. ౧. దుర్యోధనాదికౌరవులకు తండ్రి, పాండురాజునకు అన్న. ౨. సర్పవిశేషము. ౩. ఒకానొక గంధర్వుఁడు. ౪. రాజు.

ధృతాత్ముఁడు. సం.విణ. (న్. ఆ,న్. న్.) ధైర్యముతో కూడినచిత్తము కలవాఁడు.

ధృతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. ధరించుట, తాల్చుట. ౨. గ్రహించుట, పట్టుకొనుట. ౩. ధైర్యము. ౪. స్థిరత. ౫. సంతోషము. ౬. సుఖము. ౭. (జ్యోతి.) విష్కంభాదియోగములలో నొకటి. ౮. ఒకానొకఛందస్సు. ౯. మాతృకాభేదము. పుం. యజ్ఞము.

ధృతిమంతుఁడు. సం. విణ. (త్. మతీ. త్.) ౧. ధైర్యము కలవాఁడు. ౨. సంతోషము కలవాఁడు.

ధృతిముషము. సం. విణ. (ష్) ౧. ధైర్యమును అపహరించునది. ౨. సంతోషమును హరించునది. (రూ. ధృతిముట్టు.)

ధృత్తు. సం. విణ. (త్) ధరించువాఁడు. (ఇది తెలుచు సమాసాంతములందే ఉండును.)
ఉదా:- రూపధృత్తు, అవతారధృత్తు మొ.

ధృత్వము. సం. వి. న్. పుం. ౧. ధర్మము. ౨. ఆకాశము. ౩. సముద్రము. (వాచ.) ౪. పర్వతము. (కే. ని.)

ధృత్వరి. సం. వి. ఈ. స్త్రీ. ధాత్రి, భూమి.

ధృత్వుఁడు. సం. విణ. (న్. వరీ. న్.) ౧. బుద్ధిమంతుఁడు. ౨. ధరించువాఁడు. వి. న్. పుం. ౧. విష్ణువు. ౨. బ్రాహ్మణుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధృవ. సం. వి. ఆ. స్త్రీ. ముయ్యాకుపొన్న చెట్టు.

ధృషువు. సం. విణ. (ఉ) ౧. దిట్ట, ప్రగల్భుఁడు. ౨. దక్షుఁడు, సమర్థుఁడు; నేర్పరి. వి. ఉ. పుం. సంఘాతము, గుంపు.

ధృష్ట. సం. వి. ఆ. స్త్రీ. అసతి, ఱంకుటాలు.

ధృష్టద్యుమ్నుఁడు. సం. వి. అ. పుం. ద్రుపద రాజుపుత్త్రుఁడు, ద్రౌపదియన్న.

ధృష్టి. సం.వి. ఇ. స్త్రీ. ధృష్టత్వము, దిట్టతనము.

ధృష్టుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దిట్టఁడు, ప్రగల్భుఁడు. ౨. నిర్లజ్జుఁడు, సిగ్గు లేనివాఁడు. ౩. నిర్దయుఁడు, కనికరములేనివాఁడు. ౪. గర్వి, అహంకారము కలవాఁడు. వి. అ. పుం. (అలం.) శృంగారనాయకులలో నొకఁడు, తప్పుచేసియు జంకనివాఁడును బెదరింపఁబడియు సిగ్గు నొందని వాఁడును, చేసినతప్పు ప్రత్యక్షముగా కనఁబడు చున్నను అసత్యమాడువాఁడు నగునాయకుఁడు.
శ్లో. కృతాగా అపి నిశ్శంకస్తర్జితోఽపి నలజ్జితః, దృష్టదోషోఽపి మిథ్యావాక్ కథితో ధృష్ట నాయకః. సా. ద. ౩. ౩౭.

ధృష్ణజుఁడు. సం. విణ. (జ్)=ధృష్టుఁడు.

ధృష్ణి. సం. వి. ఇ. పుం. ఘృష్టి, కిరణము.

ధృష్ణువు. సం. విణ. (ఉ) ౧=ధృష్టుఁడు. ౨. కంచుకి.

ధృష్యము. సం=ధర్షణీయము.

## ధే

ధే. వి. గుఱ్ఱము మొదలగుజంతువులను తోలుట యందలిధ్వని కనుకరణము.
(సైనికులు.) చ... మహోపలంబులో, నదికినరీతి నున్నసవనాశ్వము ధే యని కక్కసంబులన్, పదసదగాఁగ ప్రేసియును... కదలుపలేక... జై. భా. ౪. ౭౭.
క. నింగికి ధే యని కదలిం, చెం గడు వడిగలు గులినదుసింగముఁ బలుమాఱున్ ...కళా. ౩. ౬౫.

ధేన. సం. వి. ఆ. స్త్రీ. ౧. నది. ౨. కొత్తిమిరిచెట్టు.

ధేనము. సం. వి. అ. పుం. ౧. సముద్రము. ౨. నదము.

ధేనుంభవ్య. సం. వి. ఆ. స్త్రీ. భావుకధేనువు, శుభప్రద మగుగోవు.

ధేనుక. సం. వి. ఆ. స్త్రీ. ౧. లేఁగటియావు. ౨. కొత్తిమిరిచెట్టు. (మే. ని.) ౩. ఆఁడేనుఁగు. (కొన్నియెడల సమాసాంతమందుఅల్పార్థకమున కానవచ్చుచున్నది. ఉదా:- అసిధేనుక = చిన్న కత్తి.)

ధేనుకము. సం. వి. అ. పుం. ౧. చీరపేను. ౨. రతిబంధవిశేషము.

ధేనుకుఁడు. సం. వి. అ. పుం. ఒకరాక్షసుఁడు. (వీఁడు బలరామునిచే హతుఁ డయ్యెను.)

ధేనుదుగ్ధకరము. సం. వి. అ. పుం- ఆవులకు పాలు వృద్ధిచేయునది- గర్జరము అనుదుంపచెట్టు.

ధేనుదుగ్ధము. సం. వి. అ. న. ౧. చిర్భటము, నక్కదోసచెట్టు. ౨. ఆవుపాలు.

ధేనువు. సం. వి. ఉ. స్త్రీ. - దూడలను త్రాగించునది - లేఁగటియావు; ఆవు. (ఇదిమృగజాతివాచకములతో ఉత్తరపదముగా సమసించునపుడు స్త్రీవాచక మగును. ఉదా:- అశ్వధేనువు = ఆఁడుగుఱ్ఱము. ఖడ్గధేనువు= ఆఁడుఖడ్గమృగము.)

ధేనుష్య. సం. వి. ఆ. స్త్రీ. తాకట్టుపెట్టిన పాఁడియావు; తాకట్టుపెట్టినపాఁడిబఱ్ఱె. (క్షీరస్వామి,టీకాసర్వస్వము.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధేయము. సం. విణ = ధాతవ్యము. వి. అ. న. ౧. పోషణము. ౨. త్రాగుట. ౩. ధరించుట. ౪. భాగరూపనామశబ్దములకు స్వార్థమున వచ్చు ప్రత్యయము. (ఉదా: భాగధేయము, రూపధేయము, నామధేయము.)

# ధై

ధైనవము. సం. విణ. (అ. ఈ. అ.) ధేనుసంబంధమైనది.

ధైనుకము. సం. విణ. (ఆ. ఈ. అ.) ధేనుకాసంబంధమైనది. వి. అ.న. ౧. ధేనుకలసమూహము. ౨. ధేనుకము, రతిబంధవిశేషము.

ధైర్యము. సం. వి. అ. న. ౧. ధీరత్వము. ౨. మనస్సు కలఁగమి, నిర్వికారచిత్తత. ౩. గంభీరత. ౪. అవిధేయత, ధృష్టత్వము.

శ్లో... అర్హాసి త్వం న ధైర్యా, న్మోఘీకర్తుం చటులశఫరోద్వర్తనప్రేక్షితాని. మేఘు.౧.౪౦.

ధైవతము. సం. వి. అ. పుం. (సంగీ.) సప్తస్వరములలో ధ అను ఆఱవస్వరము.

ధైవత్యము. సం. వి. అ. న.-ధీవునిభావము-దక్షత, నేర్పు.

# ధో

ధోఢము. సం. వి. అ. పుం. డుండుభము,ఇరుదల పాము.

ధోతుఁడు. సం. విణ. (అ.ఆ. అ.) శతుఁడు. వి. అ. పుం. వాయువు.

ధోరణము. సం. వి. అ. న. ౧. ఎక్కఁదగిన యేనుఁగు లోనైనవాహనము.(గజరథతురగాది-త్రి. ని.) ౨. (అశ్వాదుల) గతి. పుం.హంస. (కే. ని.)

ధోరణి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. పరంపర, పంక్తి. ౨. రీతి, పద్ధతి. (వాచ.)

ధోరితము. సం. వి. అ. న. ౧. వధము, చంపుట. ౨. గతి.

# ధౌ

ధౌతకోశజము. సం. వి. అ. న. చలువ చేసిన పట్టుబట్ట.

ధౌతకౌశేయము. సం = ధౌతకోశజము.

ధౌతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రక్షాళితము, కడుగఁబడినది. ౨. మార్జితము, తుడువఁబడినది. ౩. శోధితము, పరిశుద్ధముచేయఁబడినది. ౪. స్వచ్ఛముగా చేయఁబడినది, తెల్లగా చేయఁబడినది. వి. అ. న. ౧. ప్రక్షాళనము, కడుగుట. ౨. శుద్ధిచేయుట. ౩. కలధౌతము, వెండి.

ధౌతశిలము. సం.వి.అ.న. స్ఫటికము. (త్రి.ని.)

ధౌతి. సం. వి. ఈ. స్త్రీ. హఠయోగ ప్రకారము తడిపిన సన్నని వస్త్రము మ్రింగి మరల వెలికి తీయుట. (దీనివలన శ్లేష్మాదులు ఊర్ధ్వముఖముగా పోవును.)

ధౌతేయము. సం. వి. అ. పుం. న. సైంధవలవణము, ఇందుప్పు.

ధౌరంధర్యము. సం.వి.అ. న. ధురంధరత్వము.

ధౌరితకము. సం. వి. అ. న. అశ్వగతిభేదము, జోడన, ఆస్కందితముకంటె నధికమై చతురమైనయొకయశ్వధార.

ధౌరితము. సం = ధౌరితకము.

ధౌరేయము. సం = ధురీణము.

ధౌరేయుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) = ధురీణుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధార్తకము. సం = ధార్త్యము.

ధార్తిక. సం. వి. ఆ. స్త్రీ. ధార్త్యము, వంచన.

ధార్త్యము. సం.వి.అ.న. ధూర్తత్వము, వంచన.

ధార్యము సం. విణ. (అ. ఈ. అ.) ధుర్యసంబంధమైనది. వి = ధారితకము.

## ధ్మా

ధ్మాకారుఁడు. సం. వి. అ. పుం - కొలిమిగొట్టమూఁదువాఁడు - కమ్మరి.

ధ్మాత. సం.విణ. (ఋ.త్రీ.ఋ.) = ధ్మాయకుఁడు.

ధ్మాతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఊఁదఁబడినది. (అగ్ని మొ.) ౨. ఊఁది వాయింపఁబడినది, శబ్దితము. (శంఖము, సన్నాయి మొ.) ౩. ఉబ్బినది, ఉబికినది. ౪. దగ్ధము, కాల్పఁబడినది.

ధ్మాతవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఊఁదఁదగినది. (అగ్ని, శంఖము మొ.) ౨. గాలిచే ఉబ్బింపఁదగినది.

ధ్మానము. సం. వి. అ. న. ౧. (అగ్ని శంఖము మొ.) ఊఁదుట. ౨. కాల్చుట. ౩. ఉబ్బుట.

ధ్మానీయము. సం = ధ్మాతవ్యము.

ధ్మాపనము. సం. వి. అ.న. ౧. గాలి ఊఁది యుబ్బించుట. ౨. కాల్పించుట.

ధ్మాపితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఊఁదింపఁబడినది. (అగ్ని, శంఖము మొ.) ౨. ఉబ్బింపఁబడినది. ౩. దాహితము, కాల్పింపఁబడినది.

ధ్మాయకుఁడు. సం. విణ. (అ. యీ. అ.) అగ్ని, శంఖము మొదలగువానిని ఊఁదువాఁడు. ౨. ఉబ్బించువాఁడు.

ధ్మాయమానము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఊఁదఁబడుచున్నది. (అగ్ని, శంఖము మొ.) ౨. ఉబ్బింపఁబడుచున్నది.

## ధ్యా

ధ్యాత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ౧. ధ్యానించువాఁడు. ౨. చింతించువాఁడు.

ధ్యాతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ధ్యానింపఁబడినది. ౨. చింతింపఁబడినది.

ధ్యాతవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ధ్యానింపఁదగినది. ౨. చింతింపఁదగినది.

ధ్యానము. సం. వి. అ. న. ౧. చింతనము, చింతించుట. ౨. పరమాత్మను చింతించుట; అద్వితీయవస్తువునందు అవిచ్ఛిన్న మగునంతరింద్రియవృత్తిప్రవాహము; నేను బ్రహ్మస్వరూపుఁడను అని సత్స్వరూపవృత్తితో నిరాలంబముగా నుండుట; (విశిష్టాద్వైతమున) చిత్తచాంచల్యము లేక ఏకాగ్రముగా తలంచుట; ధారణానిరుద్ధుఁడగుఈశ్వరునిపుండరీకాక్షత్వాద్యాకారముతో చింతించుట. (విషయములందలిరాగము నశించుట అని సాంఖ్యులు.)

ధ్యానయోగము. సం. వి. అ. పుం. ధ్యానరూప మగుయోగవిశేషము. (ఇది కర్మజ్ఞానాది యోగములలో నొకటి.)

ధ్యానస్థుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ధ్యాననిష్ఠుఁడు, ధ్యానమం దున్నవాఁడు.

ధ్యానించు. సం. స. క్రి. ధ్యానముచేయు, చింతించు.

(రావణుఁడు.) సీ. తనహృదయాకాశమునఁ బితామహు నుంచి ధ్యానించి...గీ. పీరహోమంబుఁ గావించె విస్మయముగ. ఉ. రా. ౨. ౧౮౩.

ధ్యానికము. సం. విణ. (అ. ఈ. అ.) ధ్యాన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముచే కలుగునది. మను. ౬. ౮౨.

ధ్యానీయము. సం = ధ్యాతవ్యము.

ధ్యామము. సం. వి. అ. న. ౧. కామంచిగడ్డి. ౨. దవనము.

ధ్యాయకుఁడు. సం. విణ. (అ. ణ్వుకా. అ.)= ధ్యాత.

ధ్యాయత్. సం. (శతృ.) ధ్యానించుచున్న.

ధ్యాయమానము. సం. విణ. (అ. ఆ. అ.) ధ్యానింపఁబడుచున్నది.

## ధ్యే

ధ్యేయము. సం=ధ్యాతవ్యము.

## ధ్రా

ధ్రాజి. సం. వి.ఇ. స్త్రీ. ౧. ఒకజాతిపాక్కురోగము, బొబ్బ. ౨. వాయుసమూహము. (కే. ని.)

ధ్రాడి. సం. వి. ఇ. పుం. పుష్పాపచయము, పూలుకోయుట. (వాచ.)

## ధ్రి

ధ్రియమాణము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ధరింపఁబడుచున్నది. ౨. ధరించుచున్నది.

## ధ్రు

ధ్రుట్టు. సం. విణ. (హ్) ద్రోహము చేయువాఁడు. (రూ. ధృక్కు.)

ధ్రువ. సం. వి. ఆ. స్త్రీ. ౧. స్రుగ్భేదము, యజ్ఞపాత్రభేదము. (ఇది ఒకరీతిమ్రానితెడ్డు.) ౨. సాధ్వి, మంచియాఁడుది. ౩. గీతివిశేషము. ౪. పిదుకునప్పుడు సాధువుగా నుండుఆవు. ౫. మూర్వ, చాఁగ. ౬. సాలపర్ణి,మయ్యాకుపొన్న. ౭. గుబ్బపుసుడి. ౮. గుబ్బపుసుడి ఉండుచోటు. ౯. భూమి. (కే. ని.)

ధ్రువక. సం. వి. ఆ. స్త్రీ. తాళప్రాణక్రియావిశేషము.

ధ్రువము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. స్థిరము, నిలుకడ కలది; అచంచలము, కదలనిది. ౨. శాశ్వతము, ఎప్పుడును ఉండునది. ౩. సంతతము, ఎడతెగనిది. ౪. నిశ్చితము. వి. అ. పుం. ౧. ధ్రువనక్షత్రము, ఉత్తరధ్రువము దక్షిణధ్రువము అనఁబడు ఆకాశమందున్న రెండుతారలలో నొకటి. ౨. (జ్యోతి.)విష్కంభాదియోగములలో నొకటి. ౩. స్థాణువు, మ్రోడు. ౪. శంకువు, గసిక. ౫. పదునాలుగుఅక్షరములకాలము కల తాళము. ౬. శరారి, బాతు. ౭. నాసాగ్రము, ముక్కుకొన. ౮. అశ్వరోమావర్తభేదము, ఒకజాతిగుబ్బపుసుడి. ౯. మట్టి. ౧౦. యజ్ఞపాత్రభేదము. ౧౧.(జ్యోతి.) ఉత్తరోత్తరాషాఢోత్తరాభాద్రారోహిణులలో ఏదేని ఒకటి. ౧౨. (జ్యోతి.) గ్రహనక్షత్రాద్యానయనమున కుపయుక్త మగుఅంకె. న. ౧. ఆకాశము. ౨. తర్కము. ౩. నిశ్చయము.

ధ్రువుఁడు. సం. వి. అ. పుం. ౧. బ్రహ్మ. ౨. విష్ణువు. ౩. శివుఁడు. ౪. ఉత్తానపాదునికొడుకు. (ధ్రువనక్షత్రాధిష్ఠాత.) ౫. అష్టవసువులలో నొకఁడు.

## ధ్రౌ

ధ్రౌవ్యము. సం. వి. అ. న. -ధ్రువత్వము- ౧. స్థిరత్వము. ౨. నిశ్చయము.

## ధ్వ

ధ్వంసకుఁడు. సం. విణ. (అ. సికా. అ.) ౧. ధ్వంస మగువాఁడు, నశించువాఁడు. ౨. భ్రష్టు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అధఃపతితుఁడు. 3. ధ్వంసము చేయువాఁడు, నశింపఁజేయువాఁడు.

ధ్వంసనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నాశము చేయునది, ధ్వంసము చేయునది. ౨. భ్రంశము చేయునది. (అ. ఈ. అ.) ధ్వంసము చేయు సాధనము. వి. అ. న. ౧. నాశము. ౨. నాశము చేయుట, నశింపఁజేయుట. 3. భ్రంశము, జాఱుట. ౪. అధఃపతనము, క్రిందపడుట.

ధ్వంసనీయము. సం=ధ్వంసయితవ్యము.

ధ్వంసమానము. సం. విణ. (అ. ఆ. అ.) నశించుచున్నది.

ధ్వంసము. సం. విణ. (అ. ఆ. అ.) ధ్వంసము చేయునది. వి. అ. పుం. ౧. నాశము. ౨. క్రింద పడుట, కూలుట. 3. జాఱుట.

ధ్వంసయత్. సం. (శత్రు.) ధ్వంసము చేయుచున్న.

ధ్వంసయమానము. సం. విణ. (అ. ఆ. అ.) ధ్వంసము చేయుచున్నది.

ధ్వంసయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నశింపఁజేయువాఁడు.

ధ్వంసయితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ధ్వంసము చేయఁదగినది.

ధ్వంసిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ౧. నశించువాఁడు. ౨. భ్రంశము నొందువాఁడు.

ధ్వంసితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ధ్వంసముచేయఁబడినది, నశింపఁజేయఁబడినది. ౨. భ్రంశము చేయఁబడినది.

ధ్వంస్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) ధ్వంసము చేయఁబడుచున్నది, నశింపఁజేయఁబడుచున్నది.

ధ్వంస్యము. సం=ధ్వంసయితవ్యము.

ధ్వజద్రుమము. సం. వి. అ. పుం. తాటిచెట్టు.

ధ్వజభంగము. సం. వి. అ. పుం. నపుంసకత్వమును కలిగించురోగభేదము. (వాచ.)

ధ్వజము. సం. వి. అ. పుం. న. ౧. పతాక, టెక్కెము. ౨. ధ్వజస్తంభము, టెక్కెపుకంబము. 3. చిహ్నము, గుఱుతు. ౪. గర్వము, దర్పము. ౫. ఖట్వాంగము, మంచముకోడు. ౬. మగగుఱి. ౭. తూర్పున ఉండుగృహము. ౮. కల్లంగడియొక్క చిహ్నము. పుం. ౧. చెట్టు. ౨. తాడిచెట్టు. (కే. ని.)

ధ్వజవంతుఁడు. సం. విణ. (త్. వతీ. త్.) ౧. ధ్వజము కలవాఁడు. ౨. గుఱుతు కలవాఁడు. వి. త్. పుం. ౧. టెక్కెమును కొనిపోవువాఁడు. ౨. కల్లుఅమ్మువాఁడు, శౌండికుఁడు.

ధ్వజారోపణము. సం=ధ్వజారోహణము.

ధ్వజారోహణము. సం. వి. అ. న. దేవోత్సవాదులందు ధ్వజమును ఎత్తుట. (ఇది ఉత్సవప్రారంభమును తెలుపును.)

ధ్వజాహృతము. సం. వి. అ. న. యుద్ధమున కొల్లఁగొనఁబడినధనము. (వాచ.)

ధ్వజాహృతుఁడు. సం. వి. అ. పుం. యుద్ధరంగమున పట్టుకొనఁబడి దాసుఁడుగా చేసికొనఁబడినజనుఁడు. (వాచ.)

ధ్వజి. సం. విణ. (న్. నీ. న్.) ౧. ధ్వజము కొనిపోవువాఁడు, జెండా పట్టుకొనిపోవువాఁడు. ౨. గుఱుతు కలవాఁడు. 3. సురాభాజనచిహ్నుఁడు, కల్లుఅమ్మువాఁడు. వి. న్. పుం. ౧. రథము, తేరు. ౨. కొండ. 3. పాము. ౪. నెమిలి. ౫. గుఱ్ఱము. ౬. బ్రాహ్మణుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధ్వజిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. సేన, దండు. ౨. సీమాభేదము, ఒకవిధ మగుఎల్ల.

ధ్వజీకరణము. సం. వి. అ. న. ౧. ధ్వజముగా చేయుట. ౨. నెపముగా చేసికొనుట; కారణముగా చేసికొనుట.

శ్లో. ఉపకర్త్రాధికారస్థః స్వాపరాధం న మన్యతే, ఉపకారం ధ్వజీకృత్య సర్వ మేవావలుంపతి. హితో. ౨. ౯౯.

ధ్వజుఁడు. సం. వి. అ. పుం. ౧. శౌండికుఁడు, కల్లు అమ్మెడివాఁడు. ౨. శ్రేష్ఠుఁడు, ఉత్తముఁడు. (ఇది ఈయర్థమున తఱచుగా సమాసాంతమం దుండును. ఉదా:- కులధ్వజుఁడు = కులశ్రేష్ఠుఁడు.)

ధ్వజోత్థానము. సం. వి. అ. న. ఇంద్రధ్వజము నెత్తుఉత్సవవిశేషము. (త్రి. ని.)

ధ్వసత్. సం. (శత్రు.) ధ్వనిచేయుచున్న.

ధ్వననము. సం. వి. అ. న. ౧. శబ్దించుట, ధ్వని చేయుట. ౨. ఝుంకారాదిధ్వని, రవళి. ౩. (అలం.) వ్యంగ్యము, ధ్వని.

ధ్వనము. సం. వి. అ. పుం. ౧. శబ్దము. ౨. అవ్యక్తధ్వని, తుమ్మెదలు లోనగువానిరవళి.

ధ్వనమోది. సం. వి. న్. పుం - అవ్యక్తధ్వనిచే సంతోషపెట్టునది- తుమ్మెద.

ధ్వని. సం. వి. ఇ. పుం. ౧. శబ్దము, చప్పుడు; వాద్యము; మేఘము మున్నగువానిశబ్దము. ౨. (అలం.)వ్యంజనావృత్తిచే తోఁచెడియర్థము. ౩. వ్యంగ్యప్రధానకావ్యము, ఉత్తమకావ్యము.

ధ్వనించు. సం. అ. క్రి. శబ్దించు, మ్రోయు. (శ. ర.)

ధ్వనిగ్రహము. సం. వి. అ. పుం. ౧. ధ్వనిని గ్రహించునది, చెవి. (త్రి.ని.) ౨. ధ్వనిని గ్రహించుట, వినుట.

ధ్వనిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) = ధ్వానకుఁడు.

ధ్వనితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. మ్రోసినది, ధ్వని చేసినది. (భేర్యాది.) ౨. (అలం.) వ్యంజితము, సూచితము. (అర్థాది.) వి. అ. న. ౧. శబ్దము. ౨. ఉఱుము, మేఘగర్జనము.

ధ్వనినాళ. సం. వి. ఆ. స్త్రీ. ౧. వీణ. ౨. వేణువు. ౩. కాహళివాద్యము.

ధ్వనిబోధకము. సం. వి. అ. పుం. రోహిషతృణము, కామంచిగడ్డి.

ధ్వన్యమానము. సం.విణ. (అ. ఆ. అ.) ధ్వనిచే తెలుపఁబడుచున్నది, సూచింపఁబడుచున్నది.

ధ్వస్తము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నాశమునొందినది, నష్టమైనది. ౨. క్రిందఁబడినది. ౩. జాఱినది. ౪. గ్రాసీకృతము, కబళముగా చేయఁబడినది. ౫. నీతిహీనము. (కే.ని.)

ధ్వస్తి. సం. వి. ఇ. స్త్రీ = ధ్వంసము.

## ధ్వా

ధ్వాంక్షుజంఘ. సం. వి. ఆ. స్త్రీ. ౧. కాకజంఘ, కాకిదొండ. ౨. వెలమసంది.

ధ్వాంక్షుజంబువు. సం. వి. ఊ. స్త్రీ. కాకినేరేడు.

ధ్వాంక్షుతుండి. సం. వి. ఈ. స్త్రీ. కాకనాస, కాకిదొండ.

ధ్వాంక్షుదంతి. సం. వి.ఈ.స్త్రీ. కాకిదొండ.

ధ్వాంక్షునఖి. సం. వి. ఈ. స్త్రీ. కాకిదొండ.

ధ్వాంక్షునామ్ని. సం. వి. ఈ. స్త్రీ. కాకోదుంబరిక, కాకిమేడి.

ధ్వాంక్షునాశిని. సం.వి.ఈ.స్త్రీ.బోడతరము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధ్వాంక్షనాస. సం. వి. ఆ. స్త్రీ. కాకనాస, కాకిదొండ**.

ధ్వాంక్షపుష్టము. సం. వి. అ. పుం. పరభృతము, కోకిల.

ధ్వాంక్షమాచి. సం = కాకమాచి**.

ధ్వాంక్షము. సం. వి. అ. పుం. ౧. కాకి. ౨. బకము, కొంగ.

ధ్వాంక్షవల్లి. సం. వి. ఈ. స్త్రీ. కాకనాస**.

ధ్వాంక్షాదని. సం.వి. ఈ. స్త్రీ. కాకిదొండ**.

ధ్వాంక్షారాతి. సం. వి. ఇ. పుం. గుడ్లగూబ. ఇల్లే : ధ్వాంక్షారి ము.

ధ్వాంక్షి. సం. వి. ఈ. స్త్రీ. ౧. కాకోలి, కారుకొల్లి**. ౨. ఆఁడుకాకి.

ధ్వాంక్షుఁడు. సం. వి. అ. పుం. ౧.భిక్షుకుఁడు. ౨. తక్షకుఁడు, వడ్రంగి.

ధ్వాంక్షోలి. సం. వి. ఈ. స్త్రీ. కాకోలి, కారుకొల్లి**.

ధ్వాంతమణి. సం. వి. ఇ. పుం. స్త్రీ. ఖద్యోతము, మిణుఁగురుపురుగు. (వై. ని.)

ధ్వాంతము. సం. వి. అ. న. అంధకారము,చీకటి.

ధ్వాంతారాతి. సం. వి. ఇ. పుం. ౧. సూర్యుఁడు. ౨. చంద్రుఁడు. ౩. అగ్ని. ౪. తెలుపు. ఇల్లే : ధ్వాంతారి ము.

ధ్వాంతోన్మేషము. సం. వి. అ. పుం - చీకటిలో ప్రకాశించునది - ఖద్యోతము, మిడుఁగురుపురుగు.

ధ్వానకుఁడు. సం. విణ. (అ. నికా. అ.) ధ్వని చేయువాఁడు.

ధ్వానము. సం. వి. అ. పుం. ధ్వని.

# న

న్[1] = ను[1].

న్[2] = ను[2].

న. ఉభ. ఒకానొకయక్షరము.

న[1]. అవ. ౧. ఉదంతములకును ఋకారాంతములకును ఏకత్వమున కు కై కయి ప్రత్యయములు పరమగునపుడు ఆగమముగా వచ్చును.

క. నీ విజయోత్సాహమునకు, లావునకు జవంబునకు నకౌల్యమునకు సద్భావమునకు మెచ్చి వరం, బీ వచ్చితి వేఁడు మెద్ది యిష్టము నీకుక్. భార. ఆది. ౨. ౧౦౪.

చ. అమలినతారకాసముదయంబుల నెన్నను సర్వవేదశా, స్త్రములయశేషసారము ముదంబునఁ బొందను బుద్ధిబాహువి,క్రమమున దుర్గమార్థజలగౌరవభారతభారతీసము,ద్రముఁ దతియంగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే. భార. ఆది. ౧.౧౯.

చ...ఏమిటఁక్, గొనకొన నేరఁ డయ్యె నినుఁ గూడ సుయోధనుఁ బట్టి యట్టిక్,రునకయి నీకు నేటికి మనోవ్యథ...భార.శాం.౧.౩౭.

౨. కంటె అందు వర్ణకములు ద్వితీయైకవచనమును పరమగునపుడు ఉదంతజడవాచకములకు ఆగమముగా వచ్చును.

చ...ఒక్కసత్క్రతు వది మేలు తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు ... భార. ఆది. ౪. ౯౩.

చ. అనఘ గృహస్థధర్మమునయందుఁ జరించి నరుండు మృత్యుసం,జనితభయంబు వాపికొనఁ జాలునొ...భార. అను. ౧. ౪౩.

క. వినుఁ పిండదానసమయం,బునయందును ... హరి. పూ. ౨. ౧౪౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ.అనురాగంబునఁ బొందుచుండె నొకఁ డేకాంతప్రదేశంబునన్. దశకు. ౧౦. ౧౦.

౩. షష్ఠీ సప్తమీ తత్పురుషములందు ఉదంతజడవాచకములకు వచ్చు ఆగమము.

క...సత్యము,వలనన ములునూపు గౌరవంబున పేర్మిన్. భార. ఆది. ౪. ౭౪.

ఉ.భానునిభుండు పాండుజనపాలుఁడు...ధ, ర్మానిలవాసవాశ్వినులదైనవరంబునశక్తి పేర్మితో, నీనరనాథనందనుల నేవుర ... పడసె... భార. ఆది. ౫. ౧౫౩.

క... ప్రమత్తుసంపదయు ధర్మబాహ్యప్రభురా, జ్యము భిన్నకుంభమునతో, యములట్టుల య ధ్రువంబు లగు...భార. ఆది. ౨. ౧౬౪.

గీ...నీదుగర్భమునవాఁ డఖిలభువన,వహనమహనీయుఁ డగుచక్రవర్తి సుమ్ము. భార. ఆది. ౪. ౬౧.

న.² ప్ర. ౧. గుణవాచకము లగు నల్ల ఎఱ్ఱ మొదలగుశబ్దములకు భావార్థమున వచ్చుతద్ధితప్రత్యయము.

ఉదా: -నల్లన, ఎఱ్ఱన మొ.

౨. కొన్నిధాతువులమీఁద వచ్చుకృత్ప్రత్యయము.

ఉదా :- గడన, దీవన, గట్టన మొ.

౩. భూతకాలక్రియకు విశేషణవివక్షయందు వచ్చుప్రత్యయము. (ఇది పర మగునపుడు తుది ఉకారమునకు ఇకారము ఆ దేశమగును.)

ఉ. పంచినకోపముల్ సమయభంగభయంబున నగ్గలించి యుల్లంబు పెనంగొనన్...భార. విరా. ౨. ౧౩౯.

క. ...నిద్రితుఁ డైనప్రభం, జనసుతుసర్వాంగమర్మసంధుల నెల్లన్. భార. ఆది. ౫.౧౯౫.

ప్ర. ద్రు. ౧. ఉదంతము లగుజడవాచకములకు వచ్చుసప్తమీవిభక్త్యేకవచనము.

వ...అంబురుహానన యగ్నిసాక్షికం,బునఁ బరిణీత యైనసతిఁ బొల్పుగ నొక్కతెఁ గాని యన్యలన్, మనమున నేనియుం దలఁప ... భార. ఆది. ౪. ౧౩౬.

వ. ఋతుమతి వయినయష్టమదివసంబున నేని చతుర్దశదివసంబున నేని శుచి వైశయనంబునను౦డి నన్నుఁ దలంపుము...భార.ఆది.౫.౭౪.

౨. ఉదంతజడవాచకములకు వచ్చుతృతీయైకవచనము. (ఒక్కొకచో అజడవాచకమునకును కనఁబడుచున్నది.)

సీ. గమనవేగంబున ద్రుమలతాజాలసంచాలనసేయుచు ... భార. ఆర. ౩. ౩౧౨.

ఉ. ఏపున గిట్టి యేనుఁగున నేనుఁగు వైచుచు వాజి వాజిచే, రూపడఁగంగ మోఁదుచును ... భా. రా. యు. ౯౭౦.

౩. క్రియలకు చేదాద్యర్థమునందు వచ్చును. (ఇది పరమగునపుడు తుది ఉకారమునకు ఇకారమా దేశముగా వచ్చును.)

చ. తెగ మొద లెత్తిపోవఁ బగఁ దీర్పఁగ వచ్చినఁ గ్రౌర్య మొందు నే, మిగతిఁ దలంచినం బగకు మేలిమిలేమి ధ్రువంబు కేశవా. భార. ఉద్యో. ౩. ౨౧.

౪. క్రియావిశేషణత్వవివక్షయందు కొన్నియెడల ఉదంతముల కనుప్రయుక్త మగును.

వ...కుంతిని బ్రియపూర్వకంబున సంభావించి... భార. ఆది. ౫. ౧౫౨.

న³. అప. తూమెఁడు(భూమి)అనుటకు గుఱుతు.

వ. తాల్లూరిచన్న కేశవపెరుమాళ్లు ప్రతిష్ఠ కాలమైనప్పుడు... చింతగుంటపట్టను బందుం వరిచేను న ౧౦. బాదుమాక్షుడికొడుకు ... ఈ పొలానను బందుముచేను న. ౧౦. ౧౨౨౬. నే. శా. ౧౩౯౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. శ్రీ భీమేశ్వరమహాదేవరకుం బెట్టిన... యి లుపట్టులోపుగాం బెట్టిన భూమి ఖ. ౨. న ౧౫...దా. శా. ౧౧౭౬.

న. సం. వి. అ. పుం. ౧. మౌక్తికము. ౨. విఘ్నేశ్వరుఁడు. ౩. ధనము. ౪. బంధము. ౫. యుద్ధము. ౬. బుద్ధుఁడు. ౭. ఈయఁబడినవస్తువు.

విణ. (అ. ఆ. అ.) ౧. పలుచనిది. ౨. పట్టిది, శూన్యము. ౩. అలయనిది. ౪. విభజింపఁబడినది. (ఆ. ని.)

అవ్య. = అ. సం. అవ్య. (దీనికి తెలుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

(భిన్నము, వేఱైనది.)

ఉదా:- నాత్యుష్ణము, నాతికఠినము.

(అభావము, లేమి.)

శా...రాజ్యము గీజ్యముల్ సతతమే కాయంబు నాపాయమే. భాగ. ౧. ౫౧౨.

నంకు. వి. (త. నంకు.) పరిహాసము, నవ్వులాట.

క. జంకెలు బుజ్జవములునుం, గింకలు దళుకొత్త నోర్తు గీరంబులకున్, నంకులుఁ జదుల్లు కరములు, యంకనములఁ జదువు గఱపె హాసితోక్తులచేన్. నృసిం. ౨. ౧౧౪. (కరములు నంకణములు సదువు అని అపముద్రి.)

స. క్రి. నేలను కోరాడు. (శ.ర.)

నంగ=విణ. నంగనాచి. (శ. ర.)

నంగనాచి. వి. (క. నంగనాచి.) వడ్లచిలుక. (శ. ర.) విణ. ఎంతసాహసపుఁబనియైనను చేసి ఏమియు తెలియనిదానివలె నటించువాఁడుది; చతురురాలు.

రగడ. రం గలర సారంగముల నారంగములఁ జేరంగఁ దలఁచితి, నంగనాచి యనంగవైరమునం గడంగి మనంగఁ దలఁచితి. చంద్రా. ౪. ౨౩౪.

చ...నిక్కము గాఁగను నాతఁ డేమియున్, దెలియఁడు సాదుబిడఁ డని నేరుపుమాటలఁ దేలనాడి గా,దిలిసుతుచేతఁ జక్కటులు దిద్దద వెంతటినంగనాచివే. సారంగ. ౩. ౫౫.

వ...పాదరిండ్లకుం పార్చి కాంతులం గవయు నంగనాచు లగునంగనల...మనుచ. ౩. ౨౭.

వ... అయ్యంగనారత్నంబునకు నంగనాచి యగురాజదూతిక మఱియు మఱియు బోధించి ...శుక. ౧. ౫౭. శువల. ౫. ౫౭.

సా:- నంగనాచి వంగముల్లు.

నంగి. విణ. (√నంగు.) ౧. ముక్కుతో పలుకబడునది. (మాట. శ. ర.) ౨. స్పష్టముకానిది. (మాట.) (వ్యవ.) నాదగ్గఱ ఇట్టినంగినంగిమాటలు పనికి రావు.

నంగు. అ. క్రి. (త. నంగు.) ముక్కుతో మాటలాడు. (శ. ర.)

జ: నంగి.

నంగుఁడు. సం. వి. అ. పుం. జారుఁడు.

నంచు=నంజు. (చూ. నంచుకొను.)

జ: నంచుకొను.

నంచుకొను=నంజికొను. (√నంచు.)

(కూరలు లోనగువ్యంజనములు తిను.)

గీ. జంభరసగుంభితార్ద్రకశకలములను, సర్షపామ్రాదికోపదంశకశతంబు, నంచుకొంచు నొకించుక దించఁబోక, లోపలికి దించెఁ దాపసద్వీపిచయము. బహు. ౪. ౫౦.

నంజు[1]. వి. (√నంజు.) ౧. నంజుకొనువస్తువు, ఉపదంశము. (శ. ర, చి. ని.)

వ...కెంజిగురాకుమోవినంజలం జవిగొనుచుఁ గ్రోలి సోలి పూఁజవికలఁ బొంపిరివోవు కామినీకాముకులును... పారి. ౨. ౫౨.

నంజు[2]. వి. (త. నంజై.) మాగాణిభూమి. (శ. ర, బ్రౌ.)

నంజి(జు)కొను. స. క్రి. (క. నంజు. √నంజు.) ౧. తిను, భక్షించు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. బాహ్లీకదేశమనవారు గోమాంసంబు నంజికొని మద్యపానంబు సేసి ...భార. కర్ణ. ౨. ౧౮౯.

౨. కూరలు లోనగువ్యంజనములను తిను; ఆస్వాదించు.

ఉ. వెన్నెలగుజ్జు నంజుకొని వెన్నెలప్రోవు భుజించి...చకోరదంపతుల్, మిన్నులు ముట్టి వెన్నెలలు మేపుచుఁ బిల్లలుఁ దాము నాడఁగన్. కాళ. ౪. ౯౩.

వ...గుజ్జువెన్నెలల నంజికొన నచ్చికల బుజ్జగింపుచుఁ గూరిమి మీఱఁ జేరి ...ఘటికా. ౨. ౧౪౬.

ఉ. గ్రుక్కెఁడు గ్రుక్కెఁడే మధువు గ్రోలుచు మోవులు నంజుకొంచు వా,రెక్కుడుగాఁగఁ దన్నిరి నిజేంద్రియపంచకదైవతంబులన్. కళా. ౬. ౧౨౭.

నంజిలి. వి. సంకోచము. (చూ. నంజిలిపడు.)
జ: నంజిలిపడు.

నంజిలిపడు. అ. క్రి. (√నంజిలి.) సంకోచపడు.
క. రంజిలి తా మునుమున్నగ, నంజిలిపడకిచ్చెనేని నయముగ వారుం, గొంజక యిత్తురు క్రమ్మఱ, ముంజేయియు నాడె నేని మోఁచే యాడున్. కుచేల. ౧. ౧౦౮.

నంజే=నంచు. స. క్రి. (కూర లోనగువ్యంజనములను) తిను.(కూర లోనగువానిని) నంజుకొను; భక్షించు.

సీ. కార్తెఁ బాయస మబ్జగర్భనితార మాషములు మాంసంబు నంజంగఁ గలుగు, నన్నంబు...భార. అను. ౨. ౩౭౮.

శ్లో. రోహిణ్యాం ప్రసృతైర్మాషై(ర్గై)ర్మాంసైరన్నేవసర్పిషా,పయోఽన్నపానందాతవ్యమన్నాద్యం ద్విజాతయే.సం.భార.అను.౯౯.౬.

స్రగ్ధర...శోణితంబుల్,గ్రోలు మ్మాంసంబు నంజుం గొఱుదు నెముకల నుగ్గుంపు లై సోలుచున్నే,తాళక్రవ్యాదభూతోత్కరములు ... భాగ. ౧౦. ఉ. ౮౭౩.

గీ. మునుపు మధురాన్నములు చవిగొనియె నేని, నడుమ లవణాన్నతిక్తముల్ నంజె నేని, పిదప కటుకార్ద్రిభోజనం బొదవె నేని, బలము నారోగ్యమును జాలఁ గలిగియుండు. వి. పు. ౪. ౨౧౧.

వి. ౧. (కూర, పచ్చడి మొ.) వ్యంజనము.
ఉ. కప్పురబోగివంటకము కమ్మనిగోదుమపిండివంటయున్, గుప్పెఁడుపంచదారయును గ్రొత్తగఁ గాఁచినయాలనే పెసర్పప్పును గొమ్మునల్లనఁటిపండ్లును నాలుగు నైదునంజులున్, లప్పలతోడఁ గ్రొంబెరుఁగు లక్ష్మణవజ్ఝులయింట రూకకున్. క్రీడా. ౧౬౪.

౨. (క. త. నంజు.) విషము.
(శేషాహి.) ఉ. నాలుకబంతి వ్రేలఁబడి నంజానఁ దోఁగి...పగ్గ మయినట్టియవస్థఁ దలంతు నెప్పుడున్. మనుచ. ౫. ౫౦.

౩. (ఒడలు) నీరుపట్టుట, ఉబ్బుట. (వా.)
జ: నంజ, నంజికొను, నంజుడు, నంజుడుదిండి, నంజుడుమేపరి.

నంజేడు. వి. (√నంజే.) ౧. మాంసము.
క. శతవర్షదుష్కరతప, స్కృతి నంజుడుదినమి నగుసుకృత మివి రెండున్, మతిఁ దలఁప నొక్కరూప...భార. అను. ౪. ౪౯౯.

క...కొడుకున్ ... చంపి నంజుడుఁ, గుడుపుల జోగులకుఁ బెట్టుక్రూరులు గలరే. హర. ౨. ౭౫. వరాహ. ౪. ౧౩౬.

క...దేగా యిదె నం,జుడుఁ గొమ్మని యొకరొలమా,మిడిచిగు రటు చూపుచుండె మెలఁతుక యంలెక్. భోజరా. ౩. ౨౦౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. వ్యంజనము, పచ్చడి ; కూర.

వ... దంగ్గుంబ్రాల కుంచ ౪౦ ది పప్పుకుంచ్చా ౩ నేతికు ౧ నంజుడ్లు ౪ మిరియముల అరసోల ౧ ... దా. శా. ౧౦౧౫.

వ... నివేద్యమునకుం దెల్లఁబ్రాలకు ౭ నేమా ౧ నంజుడ్లు రెణ్డును ఆచంద్రార్కము నడచునట్టుగా... దా. శా. ౧౧౦౧.

నంజోడుదిండి. వి. (నంజుడు + తిండి.) మాంసాశనుఁడు, రాక్షసుఁడు.

క. కడరొుడయలఁ దతిమెదునం,జుడుదిండులు మిమ్ము మనుపఁ, జూతురె ... అచ్చ.రా. సుం. ౧౫౫.

ఉ. వెన్నుని నీఁ జూపు మంచుఁ బదివేలవితంబులఁ గన్నబిడ్డనిన్, మిన్నక స్రుక్కఁజేయు మిడిమేలపునంజుడుదిండిరాచబ, ల్మన్నియఁ జెండవే...అచ్చ. రా. బాల. ౧౫౪.

విణ. మాంసము తినువాఁడు. (శ.ర.)

నంజోడుమేపరి. వి. (నంజుడు + మేపరి.) రాక్షసుఁడు.

క. ఒడయనిదరిఁ జేరిన నతఁ, డడరెడునెయ్యమున వారియలు కుడుపుచు నెవ్వడి విలుగైకొని యానం, జుడుమేపరికొలపుమేటిజోదు నెదిర్చెన్. అచ్చ. రా. యు. ౩౭౨.

నంజోవాఱు. అ. క్రి. (నంజు + పాఱు.) నీరుపట్టు, ఉబ్బు. (వా.)

నంటు. వి. (క.నంటు.త.నంటు.) ౧. స్నేహము.

గీ. తొలుదొలుతఁ గృష్ణవర్త్మకుఁ గళ యొసంగి, నంటుగావించు టెల్ల ననాథయువతి, జనతనూదాహసాహాయ్యమునకుఁ గాక, కావవా వారి నెవ్వారిఁ గమలవైరి. వసు. ౪. ౩౬.

ఉ. అనిలకుమారుఁ డిట్లు హారి యై సమవర్తియు నైనభానునం,దనునకు రామచంద్రునకు నంటిఁక మీఁదట బ్రహ్మ గాదు నే, ననుమహిమన్ ఘటింప హారి యై సమవర్తియు నైన భానునం, దనునకు వాలికి న్నలువ నంటొనరింపఁ దలంచు ట బ్రహ్మా. చం. రా. ౬. ౧౯.

ఉ. నంటున రాజదూతిక దినంబును నొక్కెనె పంబుఁబూని వా,రింటికి రాకపోక ఘటియింపుచు... ఉ. హరిశ్చ ౪. ౪౫.

౨. సంపర్కము, తాఁకుడు.

సీ. రే లెల్ల నమృతమరీచినంటున నంటఁ గరఁగి నిర్మలపయోర్ఝురులఁ దొరఁగి.వసు.౨.౨౧.

౩. ఆసక్తి.

గీ. కడునొయారంబు లైననీనడలకరణి, నడువఁగ నెఱుంగ వంచునో నంటుతోడ, నంచబోదల నడిపించి పెంచ వేల. సారంగ. ౨. ౨౦౦.

౪. (త. నట్టోన్.) బంధువు.

మ. తొవకుం దూరపునంటు రేమగువపొందుం బూర్వపక్షంబు ... వసు. ౪. ౧౨౯.

కలువకన్నియనంటు = కుముదినీప్రియుఁడు,చంద్రుఁడు.

సీ. తెలికీర్తిరిచే నంటుఁగలువకన్నియనంటు పటుదత్తి నెరసూను భానుసూను.శశాం.పీఠి.౩౩.

తమ్మినంటు = పద్మబాంధవుఁడు, సూర్యుఁడు.

గీ. ... గాడుపుకుఱ్ఱవాఁ డవ్వాలు నడుమఁ, బట్టుకొని కిన్క మోఁకాలఁ బెట్టి విఱిచె, నందులకుఁ జాల రక్కసుఁ డలిగి తమ్మినంటుకొమరుని సొమ్మ గొనంగ నడఁచె. అచ్చ. రా. యు. ౨౫౨.

జః నంటుకత్తె, నంటుకాఁడు.

నంటుకత్తె. విణ. (నంటు + కత్తె.) ప్రియురాలు.

గీ. నంటుకత్తెలు తమపయనంబు సమ్మతించ కాడినవుఁ జెప్పుకొంచు మించి, రక్కసిపు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నల్లమందులరొుంటికాండ్రు. కువల. ౨. ౧౧౪.

నంటుకాఁడు. విశ. (నంటు + కాఁడు.) ప్రియుఁడు, వలపుకాఁడు.

సీ. మేనకాంగననంటుకాని మెత్తుర దేమొ సృష్టికిఁ బ్రతిసృష్టి సేయు టరుదె. శుక. 3. ౨3.

నండుఁడు. సం. వి. అ. పుం. నటుఁడు. (వై.ని.)

నండ్రకాయ. వి.(త.నండు.)ఎండ్రకాయ.(బ్రా.)

నంత. సం. విశ. (బు. త్రీ. బు.) ౧. నమస్కరించువాఁడు. ౨. వంగువాఁడు.

నంతవ్యుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) ౧. నమస్కరింపఁదగినవాఁడు. ౨. పూజింపఁదగినవాఁడు.

నంద. సం. వి. ఆ. స్త్రీ. ౧. అలింజరము, మృణ్మయపాత్రము. (కుండ మొ. కాఁగు మొ. అని కొందఱు.) ౨. సంపద, కలిమి. 3. పాడ్యమి, షష్ఠి ఏకాదశి అనుతిథులలో ఏదేని ఒకటి. (ఇవి ఆనందకర మగుతిథులు.) ౪. ననాంద, మగని సోదరి, ఆఁడుబిడ్డ. ౫. దుర్గామూర్తిభేదము. ౬. ఆనందము.

నందంతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. కూఁతురు. (విల్యమ్సు.) ౨. సఖీజనము. (కే. ని.)

నందంతుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) సంతోషపెట్టువాఁడు, ఆనందింపఁజేయువాఁడు. వి. అ. పుం. ౧. కొడుకు. ౨. స్నేహితుఁడు. 3. రాజు. (విల్యమ్సు.)

నందకము. సం. విశ. (అ. దికా. అ.) ౧. సంతోషించునది, ఆనందించునది. ౨. సంతోషపెట్టునది, ఆనందింపఁజేయునది. వి. అ. పుం. ౧. విష్ణుఖడ్గము. ౨. కప్ప. 3. ఖడ్గము, కత్తి. ౪. ఆనందము.

నందకి. సం. వి. ఇ. పుం. పిప్పలి ?. న్. పుం. విష్ణువు.

నందగోపిత. సం. వి. ఆ. స్త్రీ. రాస్న, సన్నరాష్ట్రము ?.

నందన. సం. వి. ఆ. స్త్రీ. కూఁతురు. అ. పుం. ఒకానొకసంవత్సరము.

నందనజము. సం. వి. అ. న - నందనవనమున పుట్టినది - హరిచందనము ?.

నందనమాల. సం. వి. ఆ. స్త్రీ. కృష్ణప్రీతికర మగుమాలాభేదము.

నందనము. సం. విశ. (అ. ఆ. అ.) - హర్షకము - ౧. సంతోషపెట్టునది. ౨. సంతోషించునది. (అ. ఈ. అ.) సంతోషసాధన మైనది. వి. అ. న. ౧. ఇంద్రునియుద్యానవనము. ౨. ఉద్యానవనము. 3. ఆనందించుట, సంతోషించుట; ఆనందము. పుం. ౧. కప్ప. ౨. యజ్ఞములఁదు హవిస్సును కలియఁబెట్టుటకు ఉపయోగించెడుకత్తివలెనుండుసాధనవిశేషము.(వై.ని.)

నందనుఁడు. సం. వి. అ. పుం -సంతోషమును కలిగించువాఁడు - కొడుకు.

నందపాలుఁడు. సం. వి. అ. పుం. వరుణుఁడు.

నందము. సం. వి. అ. పుం. ౧. ఆనందము, హర్షము. ౨. తొమ్మిది అనుసంఖ్య. 3. పదునొకండంగుళములకొలఁది కలవేణువిశేషము, ఒకవిధ మైనపిల్లఁగ్రోవి. ౪. కప్ప. ౫. కుబేరుని నవనిధులలో నొకటి. (కల్ప.) ౬. ఒకానొక మృదంగము. ౭. క్రౌంచద్వీపమున కలఒకానొక వర్షపర్వతము.

నందయంతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. పార్వతీదేవి. ౨. బంగారము. 3. సుఖము. (కే. ని.)

నందయంతుఁడు. సం. వి. అ. పుం. ౧. పుత్త్రుఁడు, కొడుకు. ౨. రాజు. (కే. ని.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నంది. సం. విణ. (న్. నీ. న్.) ౧. ఆనందించువాఁడు. ౨. ఆనందింపఁజేయువాఁడు. వి. న్. పుం. ౧. కొడుకు. ౨. (నాటక.) నాందీశ్లోకములను చదువువాఁడు. ౩. నందికేశ్వరుఁడు. ౪. శివునివృషభము. ౫. మఱ్ఱి. ౬. గర్దభాండము, కలుజువ్వి. ౭. పుం. స్త్రీ. ఆనందము. పుం. ౧. నందికేశ్వరుఁడు. ౨. మాషము, మినుము. పుం. న. ద్యూతాంగము. ఈ. స్త్రీ. సుగంధివృక్షభేదము, నందివృక్షము.

నందించు. సం.అ.క్రి.ఆనందించు, సంతోషించు.
క. అందఱు హరిదెసఁ బ్రణయు, స్యందిమనోజ్ఞులను లబ్ధసంతానలు నై, నందించిరి హరి మహిమల, చందము నజునకును బొగడ శక్యమె బుద్ధిన్. హరి. ఉ. ౪. ౨౫.
మ...తోడిసపత్నులం గని మదిన్ నందింప కాసక్తితోన్. భా. రా. కిష్కిం. ౭౩.

నందిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఇంద్రుని క్రీడావనము. ౨. మణికము, ముంత. ౩. ననాంద, మగనిసోదరి, ఆఁడుబిడ్డ. ౪. పాడ్యమి షష్ఠి ఏకాదశి తిథులలో నొకటి.

నందికము. సం. వి. అ. పుం. ౧. ఆనందము. ౨. అలింజరము, ముంత. ౩. నంది.

నందికుఁడు. సం.వి.అ.పుం. శివపార్శ్వచరుఁ డగు సేవకుఁడు.

నందికేశ్వరుఁడు. సం. వి. అ.పుం. శివునిపార్శ్వచరుఁ డగు సేవకుఁడు, నంది.
ఇశ్లో: నందికేశుఁడు.

నందిగ్రామము. సం. వి. అ. పుం. రాముఁడు వనవాసమునఁ కేగియున్నపుడు భరతుఁడు వసించి యుండిన గ్రామము.

నందిఘోషము. సం. వి. అ. పుం-ఆనందదాయక మగుధ్వని కలది - అర్జునునిరథము. (త్రి. ని.)

నందితరువు. సం. వి. ఉ. పుం. ధవవృక్షము.

నందితూర్యము. సం. వి. అ. పుం. ఒకానొక మంగళవాద్యము.

నందిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. కూఁతురు. ౨. ననాంద, ఆఁడుబిడ్డ. ౩. వ్యాడి యనువ్యాకరణకర్తయొక్కతల్లి. ౪. కామధేనువుకూఁతురు. ౫. రేణుక యనుగంధద్రవ్యము. ౬. గంగ. ౭. దుర్గ. ౮. కరకి. ౯. సన్నయేలకి. ౧౦. వాస్తుభూతలము, నివేశనస్థలము. (కే. ని.)

నందివర్ధనము. సం. వి. అ. పుం. ౧. పక్షాంతము. (అమావాస్య, పూర్ణిమ.) ౨. స్వర్గము. ౩. నంద్యావర్తము, ఒకానొకపూలచెట్టు. (దీని పూవులు శివప్రీతికరములు.)
సీ. బొండుమల్లె లశోకములు మంకెనలు నందివర్ధనములు విరవాదివిరులు.ఉ.రా.౩.౨౦౧.
మ...కల్గుం గదా నందివర్ధనముల్ గల్గుశివాలయంబునను... అటంచుఁ బల్కు... పుష్పలీలావధూజనముల్ వేడుకకాంద్రతో ... సానందో. ౩. ౫౬.

నందివర్ధనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సంతోషమును వృద్ధిపఱచువాఁడు. వి. అ. పుం. ౧. శివుఁడు. ౨. మిత్రుఁడు. ౩. పుత్రుఁడు.

నందివృక్షము. సం. వి. అ. పుం. ౧. కోంకణదేశప్రసిద్ధ మగువృక్షవిశేషము, అశ్వత్థాకారము కలిగి పాలు కాఱునొకానొకచెట్టు. ౨. అజశృంగీవృక్షము, జుట్టుపు.

నందీముఖి. సం.వి.ఈ.స్త్రీ.గాఢనిద్ర. (వై.ని.)

నందీసరస్సు. సం. వి. స్. న. ఇంద్రునిసరస్సు. (కల్ప.)

నందుఁడు. సం. వి. అ. పుం. ౧. విష్ణువు, పరమేశ్వరుఁడు. ౨. కృష్ణుని పెంచినతండ్రి. ౩. పాటలీపుత్రమును పాలించినప్రభువులలో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నొకఁడు, నందవంశమునకు కూటస్థుఁడు.

**నంద్యావర్తము.** సం. వి. అ. పుం, న. పడమటఁ దక్క తక్కినమూఁడుదిక్కులను వాకిళ్లు కలగృహము. పుం. నందివర్ధనము, తగరముకో.

**నంబి.** వి. (క. త. నంబి.) ౧. భగవంతుఁడు.

చ. ఇతరులు నీకు నీడె మఱి యీధృతి నీస్మృతి నీబు తేరిత,స్థితగతి నీమురారిపద సేవనజీవనవర్తనిక్ సమా,దృతకలగానసింధులహరీప్లవనప్లవభావభాగురు, శ్రుతితతబద్ధతుంబికిఁ గురుంగుడినంబికృపావలంబికిక్. ఆము. ౬. ౪౯.

౨. (దేవుని) భక్తుఁడు, దాసుఁడు.

ఉ. నంబి శివార్థము స్తనసునమిక శంక యొకింతయేని చి,త్తంబునయందు లేక వనితామణి యూరువు దాపుఁజేసి తీక్ష్ణం బగుకత్తిమోప మెడఁగ్రక్కునఁ ద్రెవ్వినమశ్శివాయమం,త్రంబుఁ బఠించుచుండెను సిరాలుశిరంబు వసుంధరాస్థలిక్. హర. ౨. ౧౧౭.

౩. విష్ణుపూజకుఁడు; వైఖానసుఁడు, వైఖానససూత్రానుసారముగ విష్ణ్వాలయమున పూజ చేయువాఁడు.

ఆ. పద్మనయనుఁ డతనిపయనంబుఁ దూఁగింపు, మనుచు నంబితోడ నానతిచ్చె. ఆము. ౨. ౮౪.

ద్వి. నంబి దగ్గఱఁ బిల్చి నాదుభక్తుండు, పంచిన యాఁకట బడలి యున్నాఁడు. ద్వి. పరమ. ౭. ౫౩౪ పా.

క. అని నంబి నారసింహుం, డను వొప్పఁగ నిట్లు చెప్ప నాతంబలిపీ,ఠన యావలికథ లెస్సఁగ, వినయంబునఁ జెప్పు మనుచు వెస వేఁడుటయుక్. చంద్ర. ౨. ౧. ౧౦౦.

౪. శివార్చకుఁడు, దేవలుఁడు.

గీ. నీరుపందిరిచెంత గన్నేరుతోఁట, నమ్మి పూజించుక్రొత్తకాణాచినంబి, పాంత నించిన దారువిభూతిపాత్ర, మమరఁ గనుపట్టె నచట విఘ్నాధినేత. శుక. ౩. ౪౪౨.

గీ... తమ్మలి యనఁ, దంబలి యనంగ నంబి నాఁదనరుచుండు, దేవలునిపేరు ...ఆం. భా. ౨. ౨౮౪.

సా: నంబిపెట్టినదే ప్రసాదము.

జ: నంబెరుమాళ్లు.

**నంబెరుమాళ్లు.** వి. బ. (నంబి + పెరుమాళ్లు - నమ్ + పెరుమాళ్లు అని శ. ర.) శ్రీరంగనాయకులు.

ఉ. నంబెరుమాళ్లు చిత్తమొకనాఁడు ప్రసన్నతఁ జేసి...మాయతిచంద్రుఁ బోల లోకమ్ములలోఁ గలండె యుపకారుఁ డటంచుఁ దలంచి వేడ్కతోక్. చమ. ౧. ౧౩. (భక్తరక్షకుఁడు అని భావము.)

**నంష్ట.** సం = నశిత.

**నకనక.** వి. ౧. ఆఁకలితో నున్నపుడు కడుపులో కలుగుబాధ కనుకరణము. (చూ. నకనకఁబడు.)

౨. కృశత్వము, కార్శ్యము.

వ... ఇప్పపూమొగ్గలం బోనిబుగ్గలం దగ్గలిక నూపుకమ్మపంజుల వజ్రపుంజకచకలనకనకలు వీడుకొని...మనుచ. ౩. ౨౭.

౩. అలయిక, బడలిక.

గీ. ఉదరగతపద్మనాభతల్పోరగేంద్ర,జనితపూత్క్రియలోఁ నాఁగ నినుమడించె, నొడలియలసత నకనక లొదవఁ బొదలు, బెట్టునిట్టూర్పు లాచంద్రబింబముఖికి. రామా. ౩. ౯౦.

విణ. ౧. కృశము, సన్నమైనది.

చ. ఒకయెడు గెత్తి జంగ యిడ నూరురుచుల్ దలచూపఁ దీవ యం,దుకొన నిగుడ్చుట న్వికచదోర్లతమూలము చూడ్కి చూఱగా,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నకనకకాను సాఁగి నతనాభి బయల్పడ నీవి జాఱ...సుదతీమణి చేరువఁ గోసెఁ గ్రొవ్విరుల్. కవిక. ౬. ౧౪.

సీ. ఒకవిలాసిని నకనక నైనకాను గంపించుఁగ నంటె సంపెంగనూనె. వరాహ. ౪. ౧౨౪.

క. నకనకనినడుము నక్కుల, చకచకల వెలార్చు తొడలచక్కన తొగలన్, వికవిక నగు తెలిగన్నులు, వికచకమలవదన కొనరె వేడుక మీఱన్. ప్రబంధ. ౪౯౦.

౨. కలఁతనొందినది, వ్యాకులపడినది.

క. ఒకమొగము గాక దివిజులు, తికమకగొని వైరు లెల్ల దీకొనఁ దమ్ముం, బికపిక లై నకనక లై, లుకలుకఁ బరువెత్తి రోడి లోఁగొను భీతిన్. భాగ. ౬. ౨౩౫.

౩. బడలినది, అలసినది.

వ. ... పువ్వుల రువ్వుచుఁ గ్రొవ్వుల నవ్వుచు వికవిక నగుచు నకనక నగుచుఁ తలతల మసుచుఁ గొలకొల మనుచు ... విహరించిరి ...రా. వి. ౩. ౧౧౪.

౪. మంద మైనది.

సీ. నకనక లైననెన్నడలయొక్కలతాంగి చాక్కపుఁజెంగల్వసురటి విసరె. ప్రబోధ. ౫. ౫౯.

జః నకనకఁబడు, నకనకలాడు, నకనకలుగుడుచు.

నకనకఁబడుః అ. క్రి. (√నకనక.) ఆఁకలిచే బాధపడు, వాడు, కృశించు.

క. ... దుక్కపదుపు వెనుకకున్, జడిసెఁ గబళింప నొల్లక, కడుపులు నకనకఁబడంగఁ గారవముఖ్యా. భార. శాం. ౩. ౫౦౭.

చ. కడుపు మహాక్షుధ న్నకనకం బడ ... ఆము. ౬. ౫౨.

వ...పద నగ్గలించి కూయుచుం గడుపు నకనకంబడం గనుకట్టుత్రోడ మోములు మలంచుచు...మనుచ. ౪. ౨౩.

నకనకలాడుః అ. క్రి. (నకనకలు + ఆడు.) ౧. ఆఁకలిచే బాధపడు.

(వ్యవ.) ఆపేదవానికడుపు నకనకలాడుచున్నది.

౨. కృశమగు.

ద్వి. నకనకలాడు నెన్నడుముపైఁ జికిలి, పికిలి పూదండ తుంపెసలాడుచుండ. అ.మ.క. ౧. ౪౩ పా. ౨ పం.

నకనకలుగుడుచుః అ. క్రి. (నకనకలు + కుడుచు.) నలఁగు ; అలయు.

సీ. నడుము లేఁదీవియ నకనకల్గుడువ నింపువఁ దగు మోపులు మోసి మోసి. కళా. ౪. ౭౬.

నకాసి(సీ)ః విణ. (హిం. నకాశీ.) నకిషీపని చేసినది.

చ. సకిసెలపట్టిమంచమునఁ జాయనకాసితివాసి పై...హంస. ౧. ౬౯.

మ...బాలారత్నముం దాను గొల్వునకు న్వచ్చి కడాని రేకుపని బెళ్కుల్గుల్కు ప్రాఁగం పుత్తళ్కునకాసీపనిపీటపైఁ జెలువుతోఁ గూర్చుండి పిల్పించఁగన్. సత్య. సాం. ౪. ౯.

నకిషీః వి. (హిం. నక్‌శీ.) చెక్కడపుఁబని.

చ... బలరిపురత్న పుంబెళుకు భాసిలు మేలుకడానిబంగరున్, దళుకులకోలపట్టియలఁ దార్కొను క్రొంజిగిపట్టుపట్టె సం, ధిలుసెటి నేత వింతనకిషీ గలమంచము మించుమంచిచెంగలువలపాన్పుపై నృపశిఖామణినందనుఁ డుండునంతటన్. ఇందు. ౬. ౧౨౬.

నకీబుః వి. వేత్రధరుఁడు, చోపుదారుఁడు.

సీ. మిన్నుముట్టినప్రాఁతమినుకునకీబులహుంకృతి దిగ్భిత్తు లురలి పడఁగ. వరాహ. ౧౦. ౫.

ఉ...రథంబు చాఁగు బలి యంచు నకీబులు మ్రొయ నెక్కెనన్. మనుచ. ౫. ౪౨.

క. పరత త్త్వరాజుముందట, మొరయునకీబుల విధాన మ్రొయుచు నుండెన్. వరాహ. ౯. ౧౧౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నకుట(క)ము. సం. వి. అ. న. నాసిక,ముక్కు. (వై. ని.)

నకులము. సం. వి. అ. పుం. ముంగి.

నకులాంధత. సం. వి. ఆ. స్త్రీ. దృష్టివికారము, నేత్రరోగభేదము.

నకులాఢ్య. సం. వి. ఆ. స్త్రీ. గంధనాకులి, సర్పాక్షి.

నకులి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆఁడుముంగి. ౨. కుక్కుటి, కోడిపెట్ట. ౩. జటామాంసి. ౪. శంఖిని. ౫. కుంకుమపువ్వు.

నకులుఁడు. సం. వి. అ. పుం. ౧. పాండురాజు నకు మాద్రియందు అశ్వినీదేవతలవలన పుట్టినకవలలో నొకఁడు, పాండవులలో నాల్గవవాఁడు. ౨. కొడుకు. ౩. శివుఁడు.

నకులేష్ట. సం. వి. ఆ. స్త్రీ. సర్పాక్షి.

నకూబారుఁడు. సం. వి. అ. పుం. దేవరుఁడు, భర్తృసోదరుఁడు, మగనితోఁబుట్టినవాఁడు.

విణ. (అ. ఆ. అ.) నిరాశ్రయుఁడు. (కే. ని.)

నకెర=నక్కెర. వి. రక్తోర్వారువు, ఎఱ్ఱదోస. (దీనిపండ్లు జేనెఁడుపొడుగున ఎఱ్ఱగ నుండును.)

సీ. నకెరపండులవన్నెఁ బకపకనగుచును దాడింబకాంతిని దాగడించి. రత్న. (చి.ని.)

నక్క. వి. (√నక్కు. -క. నక్కె.త.నక్కణ్.) జంబుకము.

సీ. నేను బకంబను నేను గర్కటకంబ నే నచ్ఛభల్లంబ నేను నక్క. భీమ. ౪. ౩౩.

సీ.సుడిగాడ్పు తేరినల్చుట్టుఁ జుట్టులువెట్ట గడిఁదిమంటలు వెళ్లఁగ్రక్కె నక్క. ఉ. రా. ౬. ౨౩౫.

విణ. చిన్నది.

ఉదా:-నక్కదోస, నక్కవిరిగి మొ. (శ. ర.)

కలనినక్క = యుద్ధరంగమున నున్నజంబుకము. (ఇది ఎల్లప్పుడు మనుష్యులచావే కోరుచుండును.)

గీ. కలనినక్కనయధికారి గలనృపతికి, నేడు దీవులు గొన్న సమృద్ధి లేదు. ఆము. ౪. ౨౩౪. (అశుభమును గోరువాఁడు అని భావము.)

కొంకనక్క = క్షుద్రజంబుకము.

గీ...కొంకనక్క యనఁగ,క్షుద్రజంబుక మంచు నెంచు కొనఁ దగును. ఆం. భా. ౨. ౭౩.

ముడి దిన్ననక్క = తుదివఱకు విడువక బాధించువాఁడు.

ద్వి. గడుసు తుంటరి జోగి గ్రక్కినముడును, ముడిదిన్ననక్క ముష్టాటు పిసాళి. ద్వి. హరిశ్చ. ఉ. ౬౫౦ పం.

నక్కను ద్రొక్కి వచ్చినవాఁడు = అప్రయత్నముగ ఎక్కువలాభమును పొందినవాఁడు.

సా. నక్క ఒకచోట ఊల వేసి మఱియొకచోట గారీకల్యాణము పాడునా = నీచుఁడొకచోట అకార్యమును మఱియొకచోట సుకార్యమును జేయఁడు.

నక్కను గన్నవాఁడెల్ల వేఁటకాఁ డనునట్లు.

ఆ. ఒక్కనక్క వల గతుక్కనఁ గొఱికి తా, నవలఁ జనఁగ వెంటఁ దవిలె బలము, వసుధ నక్కఁ గన్నవాఁ డెల్ల వేఁటకాఁ, డనెడు వార్త నిక్క మయ్యె ననఁగ. శుక.౧.౧౪౪.

నక్క ముదిరి వర డయినట్లు.

నక్క పుట్టి నాల్గువారములు కాలేదు, నే నెన్నఁడు నింత గాలివాన యెఱుఁగ నన్నది.

నక్క యెక్కడ నాకలోక మెక్కడ.(అలభ్యమైనవస్తువు నాసించునపు డీలోకోక్తిని వాడుదురు.) నక్క రేలకాయ తినునట్లు. (రేలకాయ తినుటచే నక్కకు కడుపునొప్పివచ్చును. ఐనను నొప్పి తగ్గగనే నక్క మరల దానినే తినునట్లు.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నక్క వినయము = కపటవినయము.

నక్క-కొమ్ము. వి. ఒకవిధమైన వన మూలిక. (నక్క + కొమ్ము.)

ఆ. ఒక్క యెఱుకు లేఁడు నక్కకొమ్మును నిచ్చి, గోరజంబు జున్నుఁ జాఱపప్పు...కాను కిచ్చి కరయుగంబు మొగిచి. మనుచ. ౪. ౧౪.

నక్క-చిక్కు-లమారి. విశ.(√నక్క.)-నక్కచిక్కులు కలవాఁడు - దుష్టుఁడు; దుష్టురాలు.

సీ. నక్కచిక్కులమారి పెక్కుకురూపి దూబర దిండి బొంకులబాన మొండి. చెన్నబ. ౨. ౨౪.

నక్క-జిత్తులు. వి. బ. (√నక్క.) మోసములు. (ప్రా.)

నక్క-తోఁక. వి.(√నక్క.) ౧.జంబుకపుచ్ఛము. ౨.నక్కతోఁకవలె నుండుతృణవిశేషము,క్రోష్టువిన్న †.

చ. గుసుకుసు సొంటి బిప్పరయు గోఁగడ యూదర నక్కతోఁకయు౯. ప్రబంధ. ౨౦౦.

గీ. జంబు నూదర తుంగ పె౯జంబు పెద్ద, తుంగ భోజవతీ నక్కతోఁకవిటిచి.హంస.౫.౪౪.

నక్క-తోఁకకసవు. వి. (√నక్క.)సింహపుచ్ఛి. (దీనిని కొందఱు నక్కతోఁకపొన్న అందురు. అని శ. ర.)

నక్క-తోఁకపొన్న. వి.(√నక్క.)నేలపొన్న †.

సీ. ... నేలపొన్న, నా నక్కతోఁకపొన్న ... రూఢి కెక్కు. ఆం. భా. ౨. ౫౫.

నక్క-తోఁకబియ్యము. వి. (√నక్క.) ధాన్యవిశేషము. (శ. ర.)

నక్క-దోస. వి. (√నక్క.) క్షుద్రోర్వారుకము, చిన్నదోస †.

సీ. ... నక్క, దోస యనంగ క్షుద్రోర్వారుకము మీఱు...ఆం. భా. ౨. ౭౧.

నక్క-నరము. వి. (√నక్క.) ఒకదినుసు వేరు. (శ. ర.)

నక్క-నేరేడు. వి. (√నక్క.) కాకినేరేడు †. (శ. ర.)

నక్క-పోతు. వి. (√నక్క.) మగనక్క.

క. కొలఁది యెఱుంగక కృష్ణులఁ, గలన గెలుతు ననియె దీవు గంటిమె సింగంబుల నెత్తటి నైనను నే, పొలమున నేనియును నక్కపోతు గెలువఁగ౯. భార. కర్ణ. ౨. ౩౫.
(చి.ని, కరాళప్రతిపా. నక్కపోరి అనిముద్రి.)

నక్క-మోరు. వి. (√నక్క.) కుదురనికంతి.

సీ. మందుమాఁకిడి గండమాల మాన్పఁ గలండె చక్కఁజేయఁ గలండె నక్కమోరు. రామలిం. ౭౩.

(వ్యవ.) పశువులకు నక్కమోరు దిగినది.

నక్క-రేను. వి. (√నక్క.)లకుచము, గజనిమ్మ †.

గీ...లకుచాఖ్య కమ్మరే నన౯ నక్క, రే నన౯ వెలయును...ఆం. భా. ౨. ౪౫.

నక్క-విరిగి. వి. (√నక్క.) శేలుభేదము, క్షుద్రశేలువు †.

సీ. క్షుద్రశేల్వాఖ్య యగును నక్కవిరిగి నా ... ఆం. భా. ౨. ౪౫.

నక్కి-ళ్లు. వి. (త.నక్కల్-నక్క + కీళ్ళు.) ప్రక్కపండ్లకీళ్ళు. (శ. ర.) అంకిళ్లు, దాడకీళ్లు. (చూ. నక్కిళ్లుపడు.)

నక్కి-ళ్లువ(ప)డు. అ.క్రి.(నక్కిళ్లు + పడు.) దౌడకీళ్లు కదలకుండు; నిరుత్తరుఁడగు.

ద్వి. ఉక్కటి స్రుక్కి యయ్యారపు లుడిగి, నక్కిళ్లు వడి గ్రుక్కమిక్కనలేక. బస. పు. ౬. ౯౭౫. పం.

సీ...ధరణీశ రాజులో ధరణిసురులో.

ఆ. యెక్కు డనిన వినియు నక్కిళ్లుపడి యున్న, నతనితోడ...భార. అను. ౫. ౩౪౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నక్కు. అ. క్రి. (క. నక్కు. త. నక్కు.) ఒదుఁగు, డాఁగు.

ఉ. నాలితనంబు నేర్చుకొని నక్కుచు నక్కుచు వాడవాడ వేఁలాలవలీలతావలికెలంకుల నుండిటు వచ్చి వచ్చి దం, భోళియుఁ బోలె మీఁదఁ బడిపోయెను... రామా. ౬. ౪౬.

శా. మైనాకాద్రికిఁ జెల్లునే యకట యాత్మప్రాణసంరక్షయేఁ, లా నక్కన్ జలరాశిలోఁ ...మల్ల. నీతి. ౨౭.

ఆ. అంతఁ బ్రొద్దు వుచ్చి యంధకారంబులోఁ, బొన్న యెక్కి నక్కి పొంచి మించ. ద్వా. ౧౧. ౫౧. శివధ. ౫.౧౨.

వి. ౧. కట్టిమొ. వానియతుకు.

(వ్యవ.) ఇది నక్కుదూలము. (శ. ర.)

౨. (బంగారపు) బిళ్ల; ఖండము, ముక్క.

ద్వి. వేడుక మదిఁ దులుకాడ వేయేసి, మాడల యెత్తుగాఁ గూడ ఖండించి, యున్న జంగమకోటి కొక్కొక్క నక్కు, చెన్నుగా నర్పణ సేసి మ్రొక్కుడును. బస. పు. ౫. ౩౦౩ పం.

(స్తనవర్ణనము.) సీ. తలచూపి మోసులై త్రాసులై తళుకెక్కి నిక్కి నక్కులవలె నెరసి బెరసి. నరస. ౫. ౧౧౩.

గీ. చొక్కపుఁబసిండినక్కులఁ జెక్కుఁజెక్కు, లక్కలికికొప్పు నీలాంబుముక్కు ముక్కు, కనకగంధఫలీసారకంబు కంబు, కలితరేఖావిలాసమంగళము గళము. రామా. ౪. ౬౯. ప్రబంధ. ౪౯౦.

౩. బంగారు నఱుకఁగా నడుమ కనుపట్టెడినిగ్గు.

గీ. వన్నె హెచ్చినయట్టి క్రొంబసిఁడికడ్డి, కత్తిరించినతావునఁ గానిపించు, నిగ్గునకుఁ బేరు నక్కు నా నెగడుచుండు. ఆం. భా. ౩. ౪౨.

ఆ. విన్ను చెన్ను దన్నుఁ గన్నియలేఁగొను, సోముగోము దోము భామమోము, నక్కు జెక్కుఁ జెక్కు నాఁతుకచెక్కులు, మించు సంచు మించు మెలఁత మేను. చంద్రా. ౪. ౧౪౫.

ద్వి. అక్కజం బంద నందంద కడాని, నక్కులై వెడలంగ నక్కజం బంది. బస. పు. ౪. ౩౫౪ పం.

౪. నాఁగటికఱ్ఱు. (శ. ర.)

జః నక్క, నక్కకొమ్ము, నక్కచిక్కులమారి, నక్కజిత్తులు, నక్కతోఁక, నక్కతోఁకకసవు, నక్కతోఁకపొన్న, నక్కతోఁకబియ్యము, నక్కదోస, నక్కనరము, నక్కనేరెడు, నక్కపోతు, నక్కమోరు, నక్కరేను, నక్కవిరిగి, నక్కిళ్లు, నక్కిళ్లువడు, నక్కెఱ.

నక్కెర[1] = నకెర. వి. ఎఱ్ఱదోస. (చి. ని.)

నక్కెర[2]. వి. కంది, తొగరి ✝. (శ. ర.)

నక్కెఱ. వి. (నక్క + ఏఱు.) ఒకానొకచెట్టు. (శ. ర.)

నక్తంచరము. సం. విణ. (అ. ఈ. అ.) రాత్రియందు తిరుగునది. వి. అ. పుం. ౧. గ్రుడ్లగూబ. ౨. గుగ్గిలము ✝.

నక్తంచరుఁడు. సం. వి. అ. పుం. ౧. రాత్రించరుఁడు, రేద్రిమ్మరి, రాక్షసుఁడు. ౨. దొంగ.

నక్తంచారి. సం. వి. న్. పుం. = నక్తచారి.

నక్తంతనము. సం. విణ. (అ. ఈ. అ.) రాత్రియందలిది, రాత్రిది.

నక్తందినము. సం. వి. అ. న. రేయునుబవలును.

నక్తందివము. సం. అవ్య. రేయుంబవలు. (బ. నక్తందివములు = రేయుంబగళ్లు.)

దండ. ... సురూపప్రశస్తుల్ మహాశక్తి నక్తందివంబుల్ బ్రవేశించి యున్నారు ... భోగినీదండకము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నక్తకము. సం. వి. అ. పుం. ౧. చినిఁగినగుడ్డ. ౨. తుండుగుడ్డ. ౩. నల్లగుడ్లగూబ. (వై. ని.)

నక్తచారి. సం. విణ. (న్.ణీ. న్.) రాత్రి తిరుగువాఁడు. వి. న్. పుం. ౧. గుడ్లగూబ. ౨. పిల్లి. ౩. దొంగ. ౪. రాక్షసుఁడు.

నక్తభోజి. సం. విణ. (న్. నీ. న్.) రాత్రిభుజించువాఁడు; వ్రతార్థము పగలు తినక రాత్రులుమాత్రము తినువాఁడు.

నక్తమాలము. సం. వి. అ. పుం. కానుగు ౘె.

నక్తము. సం. వి. అ. న. ౧. రాత్రి. ౨. వ్రతభేదము, రాత్రిమాత్రము భోజనముచేయునొక వ్రతము.

సీ. భానువారంబునఁ బ్రారంభ మొనరించి క్రమమున భానువారంబు లేడు, నక్తంబు నియాతితో నడపి యేడవవారమున యథాశక్తి జాంబూనదమున, రవిఁ జేసి రక్తవస్త్రద్వయంబును జుట్టి ... వరాహ. ౧౨. ౫౫.

నక్తముఖము. సం.వి. అ. న. రజనీముఖము, సాయంకాలము.

నక్తవ్రతము. సం. వి. అ. న. ౧. రాత్రులు మాత్రమే భుజించువ్రతవిశేషము. ౨. రాత్రియం దాచరింపఁబడువ్రతము.

నక్రము. సం. వి. అ. పుం - భూమిమీఁద చరింపనిది - ౧. కుంభీరము, మొసలి. ౨. మకరరాశి. ౩. తేలుమణిచెట్టు. న. ౧. ద్వారబంధమునకు పైనుండు అడ్డుఁగమ్మి. ౨. నాసిక, ముక్కు.

నక్షత్రకంటకి. సం. వి. ఈ. స్త్రీ. అనాస ౘె.

నక్షత్రకాంతివిస్తారము. సం. వి. అ పుం. ౧. నక్షత్రములకాంతియొక్క ఆధిక్యము. ౨. తెల్లయావనాళము, తెల్లజొన్న ౘె.

నక్షత్రదర్శుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నక్షత్రములు చూచువాఁడు. వి. అ. పుం - నక్షత్రఫలమును సూచించువాఁడు - గణకుఁడు.

నక్షత్రనేమి. సం. వి. ఇ. పుం. ౧ - నక్షత్రములకు నేమివంటివాఁడు - చంద్రుఁడు. ౨. ధ్రువనక్షత్రము. ౩. విష్ణువు. స్త్రీ. రేవతీనక్షత్రము. (వై. ని.)

నక్షత్రపంక్తి. సం. వి. ఇ. స్త్రీ. = నక్షత్రమాల. (ఇరువదియేడు పద్యములతో నేర్పఱచిన క్షుద్రప్రబంధవిశేషము.)

సీ. ... నక్షత్రపంక్తి యిరువదియు నేడు ... అప్ప. ౧. ౧౩౪.

నక్షత్రపథము. సం. వి. అ. పుం. నక్షత్రమార్గము, ఆకాశము.

నక్షత్రపాఠకుఁడు. సం. వి. అ. పుం. జ్యోతిషికుఁడు, జోస్యుఁడు.

నక్షత్రమాల. సం. వి. ఆ. స్త్రీ. ౧. చుక్కల వరుస; అశ్విన్యాది నక్షత్రములపంక్తి. ౨. ఇరువదియేడుముత్యములు గ్రుచ్చినయొంటిపేటహారము. ౩. ఏనుఁగులకు వైచునొకవిధ మగుమాలిక. ౪. నక్షత్రపంక్తి, ఇరువదియేడు పద్యములతో నేర్పఱచినక్షుద్రప్రబంధవిశేషము.

నక్షత్రము. సం. వి. అ. న - నశింపనిది - ౧. అశ్విని మొ. రిక్క. (ఇవి ఇరువదియేడు. అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఘ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్ఠ, శతభిషము, పూర్వభాద్రపద, ఉత్తరభాద్రపద, రేవతి. అభిజిత్తు అనువేఱొకనక్షత్రము కలదు. చూ. అభిజిత్తు.) ౨. తార, చుక్క. ౩. ముత్యము. ౪. నక్షత్రమాల, ఇరువదియేడుముత్యముల హారము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నక్షత్రయాజకుఁడు. సం. వి. అ. పుం. నక్షత్ర దోషములకు శాంతి చేయించి దానివలన జీవించుబ్రాహ్మణుఁడు.

నక్షత్రయోని. సం. వి.ఇ.స్త్రీ. (జ్యోతి.)వధూవరుల నక్షత్రముల ననుసరించి వివాహాదులయానుకూల్యము తెలిపెడుయోనికూటము.

నక్షత్రవిద్య. సం. వి. ఆ. స్త్రీ. జ్యోతిషము.

నక్షత్రవీథి. సం. వి. ఇ. స్త్రీ. (జ్యోతి.) ఆకాశమున నక్షత్రవిశేషములచేత ఏర్పడినవీథి, ఛాయాపథము. (చూ. ఐరావతము.)

నక్షత్రశూలము. సం. వి. అ. పుం. -శూలతుల్య మగునక్షత్రము-పూర్వాదిదిక్కుల నుద్దేశించి ప్రయాణమందు నిషేధింపఁబడిననక్షత్రము.

నక్షత్రసూచకుఁడు. సం. వి. అ. పుం. శాస్త్ర మెఱుఁగకయే జ్యోతిష్కుఁడ నని చెప్పుకొనువాఁడు.

శ్లో. తిథ్యుత్పత్తిం నజానంతి గ్రహాణాం నైవ సాధనం, పరవాక్యేనవర్తంతే తేవై నక్షత్ర సూచకాః. అవిదిత్వైవ యశ్శాస్త్రం దైవజ్ఞత్వం ప్రపద్యతే, స పంక్తిదూషకః పాపః జ్ఞేయో నక్షత్రసూచకః. (వాచ.)

నక్షత్రసూచి. సం. వి. న్. పుం = నక్షత్రసూచకుఁడు.

నక్షత్రాకృతి. సం. వి. ఇ. పుం. తారతండులము, తెల్లజొన్న ?. స్త్రీ. నక్షత్రములయాకారము.

నక్షత్రేశుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

నఖంపచము. సం. విశే. (అ. ఆ. అ.) గోరువెచ్చనిది.

నఖకర్తరి. సం. వి. ఈ. స్త్రీ. ఒకస్వరస్థాయి. ద్వి...మతి దేశికాఖ్యను సింధు, నలిగరుణాకారు నఖకర్తరియును, ...ఆది గా సొగయుతాయములు...బస. పు. 3. ౯౮౧ పం.

నఖకుట్టుఁడు. సం. వి. అ. పుం - గోళ్లుతీయువాఁడు - మంగలి.

నఖక్షతము. సం. వి. అ. న. గోరొత్తు, గోటినొక్కు.

నఖగుచ్ఛఫల. సం. వి. ఆ. స్త్రీ. నిష్పావభేదము, ఒకదినుసుఅనుము ?.

నఖజాహము. సం. వి. అ. న. నఖమూలము,గోటిమొదలు.

నఖదారణము. సం. వి. అ.పుం-గోళ్లతో చీల్చునది- డేగ. న. ౧. గోళ్లను కత్తిరించుట. ౨. గోళ్లు కత్తిరించుమంగలిపనిముట్టు, గోరుగల్లు.

నఖనికృంతనము. సం. వి. అ. న. ౧. గోళ్లు కత్తిరించుమంగలిసాధనము, గోరుగల్లు. ౨. గోళ్లు కత్తిరించుట.

నఖనిష్పావము. సం. వి. అ. పుం. నఖఫలిని, ఒకదినుసుఅనుము ?.

నఖన్యాసము. సం. వి. అ. పుం. నఖక్షతము, గోటినొక్కు.

శ్లో. 'అతిశస్త్రనఖన్యాసః'సం.రఘు.౧౨.౭౩.

నఖపదము. సం = నఖక్షతము.

నఖపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. వృశ్చికాలి, తేలుమణి ?.

నఖపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. స్పృక్క, పిక్కఅనుగంధద్రవ్యము?.

నఖఫలిని. సం. వి. ఈ. స్త్రీ. నఖనిష్పావము, ఒకజాతిఅనుము?.

నఖము. సం. వి. అ. పుం. న. ౧. -ఛిద్రములేనిది- గోరు. ౨. ఇరువది అనుసంఖ్య. పుం. భాగము, అంశము. న. ౧. గోటిచిప్ప. ౨. నఖమనుగంధద్రవ్యము?.

నఖముఖము. సం. వి. అ. న. నఖాగ్రము,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొనగోరు.

నఖముఖములు = ఎల్లదిక్కులు. (బ్రౌ, వా.)

(వ్యవ.) ఈయేఁడు తీర్థమునకు ప్రజలు నఖముఖములనుండియు వచ్చిరి.

,, శత్రువులు నఖముఖముల చెదరిపోయిరి.

నఖరంజని. సం.వి. ఈ. స్త్రీ. ౧- గోళ్లను రంజింపఁజేయునది - గోళ్లను కత్తిరించుపనిముట్టు, గోరుగల్లు. ౨. - గోళ్లను ఎఱ్ఱగా చేయునది - గోరంట †.

నఖరజని. సం. వి. ఈ. స్త్రీ. నఖరంజని, గోరంట †.

నఖరము. సం. వి. అ. పుం. న. ౧. నఖము, గోరు. ౨. ఆయుధవిశేషము.

నఖరాయుధము. సం. వి. అ. పుం. -నఖములే ఆయుధములుగా కలది-౧. పులి. ౨. సింహము. ౩. కోడి. (రా. ని.)

నఖరాహ్వము. సం. వి. అ. పుం. కరవీరము, గన్నేరు †.

నఖలేఖ. సం. వి. ఆ. స్త్రీ. ౧. గోటితో గీసిన గీఁత. ౨. గోటిమీఁద చిత్రించినచిత్తరువు.

నఖలేఖకుఁడు. సం. విశే. (అ. ఖికా. అ.) గోళ్లమీఁద చిత్రించుట వృత్తిగా కలవాఁడు.

నఖవిష్కిరము. సం. వి. అ. పుం. -నఖములతో చీల్చునది- మాంసాహారి యగుపక్షి. (డేగ మొ.)

నఖవృక్షము. సం. వి. అ. పుం. నీలి †.

నఖవ్రణము. సం. అ. పుం. న. నఖక్షతము.

నఖశంఖము. సం. వి. అ. పుం. చిన్నకప్పచిప్ప, నత్తగుల్ల.

నఖాంకము. సం. వి. అ. పుం. ౧. నఖక్షతము, గోటినొక్కు. ౨. పులిగోరు †.

నఖాంగము. సం. వి. అ. పుం. నఖి యనుగంధద్రవ్యము †.

నఖాఘాతము. సం. వి. అ. పుం. నఖక్షతము.

నఖానఖి. సం. అవ్య. ఒకరి నొకరు గోళ్లతో గిల్లికొని చేయునట్టిపోరు.

నఖాలువు. సం. వి. ఉ. పుం. నీలి †.

నఖాళి. సం. వి. ఇ. పుం. ౧. క్షుద్రశంఖము, నత్తగుల్ల. ౨. నఖపంక్తి, గోటివరుస.

నఖాశి. సం. విశే. (న్. నీ. న్.) నఖములు తినునది. (కల్ప.) వి. న్. పుం. గ్రుడ్లగూబ.

నఖి. సం. విశే. (న్. నీ. న్.) ౧. పెద్దనఖములు కలది. ౨. ముండ్లు కలది. (చెట్టు మొ.) వి. న్. పుం. ౧. సింహము. ౨. పులి. ఈ. స్త్రీ. నఖమనుగంధద్రవ్యము †.

నఖోత్పాటని. సం. వి. ఈ. స్త్రీ. గోళ్లుతీయు సాధనము, గోరుగల్లు.

నగ. వి. (త. నగై.) ౧. భూషణము.

సీ. నారదుం డెన్నిచ్చె నగలు రత్నంబు లహల్య నీ కేయగ్రహార మిచ్చె. నృసింహకతకము. ౭౧.

సీ. నగ లేల మెయి నిండునగ లేల విభుఁ డిట్లు దూరీకరించి హా తొలఁగినపుడు. కలు. శ. ౩౬.

౨. లోహపాత్రము. (శ. ర.) ౩. పొగాకు దూది మొదలగువానికంట్లపుమూట. (శ. ర.) ౪. సిద్దెలజోడు. (శ. ర.) ౫. బంగారు వెండి మొదలగువాని పరిమితివిశేషము. (ఇది కర్షము మాషము వంటిది.)

వ. (నా) గనబోయుండు సేఇంచిన కిరీటము ౧. దీనిమొత్తునగ ౨౨ వన్నె ౧౫. బె. శా. ౭౬౫.

౬. అంగీ. ౭. ఎద్దుమీఁదిబరువు. (చి. ని.)

౮. నగలు. గుళ్లు మండపములు మొ. కట్టడములకై తీర్చిన రాళ్లు. (బ్రౌ.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నగజ. సం. వి. ఆ. స్త్రీ. పార్వతి.

నగజము. సం. విణ. (అ. ఆ. అ.) కొండలయందు పుట్టినది. వి. అ. పుం. ఏనుఁగు.

నగధరుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు, గట్టుతాలుపు.

నగనందిని. సం. వి. ఈ. స్త్రీ. పర్వతపుత్రి, పార్వతి.

నగపతి. సం. వి. ఇ. పుం. ౧ - పర్వతరాజు - హిమవంతుఁడు. ౨ - ఓషధులకురాజు - చంద్రుఁడు.

నగభిత్తు. సం. విణ. (ద్) పర్వతములను బ్రద్దలుకొట్టువాఁడు. (రా. ని.) వి. పుం. ౧. ఇంద్రుఁడు. ౨. పర్వతములను పగులఁగొట్టుపనిముట్టు.

నగభూషణము. సం. వి. అ. పుం. హరితాళము, అరిదళము. (కే. ని.)

నగము. సం. వి. అ. పుం. - గమనము లేనిది- ౧. కొండ. ౨. ఏడు అనుసంఖ్య. ౩. చెట్టు. ౪-పన్నగము-పాదములతో నడువనిది- పాము. (ఆ. ని.) ౫. కస్తురి. (వై. ని.)

నగరంధ్రకరుఁడు. సం. వి. అ. పుం. క్రౌంచదారణుఁడు, కుమారస్వామి.

నగరకీర్తనము. సం. వి. అ. న. నగరమందు తిరుగుచు చేయుభగవన్నామసంకీర్తనము.
ఇట్లే: నగరసంకీర్తనము.

నగరఘాతము. సం. వి. అ. పుం- పట్టనమును నశింపఁజేయునది- ఏనుఁగు.

నగరమార్గము. సం. వి. అ. పుం. రాజమార్గము, నగరమున రథాదులు పోవుటకుఁ దగిన పెద్దబాట.

నగరము. సం. వి. అ. న. - కొండలవలె నుండు పెద్దమేడలు కలది - పట్టనము, పురము. (వ్యతి. గ్రామము.)

నగరస్థుఁడు. సం. వి. అ. పుం. పట్టనవాసి, పౌరుఁడు, నాగరుఁడు. (వ్యతి. గ్రామస్థుఁడు.)

నగరాధ్యక్షుఁడు. సం. వి. అ. పుం. ౧. నగరరక్షణకొఱకు రాజనియుక్తుఁడగుఅధికారి. ౨. పెద్దతలారి.
ఇట్లే: నగరాధికృతుఁడు, నగరాధిపుఁడు.

నగరాలు. వి. బ. (√నగరు.) ౧. పౌరులు.
ఉ... దొంగబేరానకుఁ బాలుపడ్డ నగరా నగరాలు దురాత్మ నావుడుక్. వేం. పంచ. ౧. ౪౧౧.
౨. ఆంధ్రదేశమందలిశూద్రులలో నొకతెగవారు. (వా.)

నగరి. సం. వి. ఈ. స్త్రీ. నగరము.

నగరీబకము. సం. వి. అ. పుం. కాకి.

నగరు=నవరు. వి. డా. (బ. నగరులు, నగర్లు, నగళులు, నగళ్లు.) ౧. అంతఃపురము; రాజభవనము.
గీ. కమలనాభుండు కక్ష్యాంతరములు గడచి, యలబలము లేనినగ రెల్ల నరసి చూచి. పారి. ౧. ౧౦౫.
గీ. నీనగరు పోతుటేఁగకు నిలువ రాని, దయ్యు వెల్లాటకత్తె వీ పాట యరిది. శుక. ౧. ౨౨౪.
గీ. నట్టువొజ్జ నై మెలఁగుదు నగళులందు, నిపుణనైపథ్యవిధులకు నేర్తు నధిప. భార. విరా. ౧. ౧౪౨.
(చంద్రుఁడు.) క. ముల్లోకంబుల జనములు, లోళ్లకె రోఁకండ్లఁబాద రోయక మతియుక్, వెల్లివిరిగాఁగఁ దిరిగి న, గళ్లకు నయగారి సెలఁతుకింగొనిపోయెక్. వరాహ. ౪. ౨౨.
ద్వి. నగరివాకిట సమున్నతి రథంబు డిగి, మొగి చెడి తాను దమ్ముఁడు శూన్య మైన, యంతఃపురమ్మున కరుగ... రం. రా. అయో. ౧౨౨ పం. ౧౬ పం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. మంతుల బాంధవభటసా,మంతుల నాశ్రి
తుల నిలిపి మహీకాంతు నిశా,కాంతమణి
కాంతికందళ,కాంతం బగునొక్క దొరనగర
విడియించెక్. మనుచ. ౫. ౫౪.

౨. సభాగృహము, కొలువుకూటము.

క. తెలుపు లగుచీరలును బూం,తలం బువ్వుల
నొప్పి రాజతనయానుగుణో,జ్జ్వలమాననీయ
వేషము, లలవడం గూడుకొని నగరి కరిగిరి
ప్రీతిన్. భార. విరా. ౫. ౩౧౫.

క. నీనడకలు గంటిం గదే, కానీవే నగరం జెప్పి
కారించెద ని, స్నే సంచు...శుక. ౩. ౩౫౬.

౩. గుడి, దేవగృహము.

గీ. నగరితోం గూడ నేకామ్రనాథు ముంచె,
గంచిం దెప్పలం దేల్చె నకాలవృష్టి. హర.
౨. ౨౨.

వ...అత్తిరుపతి సొచ్చి యచ్చక్రధరునగరిమో
సల నిలుచుటయు...ఆము. ౪. ౩౫.

నగరివారు=ప్రభువువారు.

ఉ...నా,పిన్నతనం బాకళ్లచెవిం బెట్టకు పెట్టిన
సిగ్గువోవు నా, వన్నియ సన్నమా నగరివా
రికి దండుగం బెట్ట నిమ్మగుక్. వేం. పంచ.
౪. ౫౧౧.

గీ. జంగమార్చనలకును ... నగరివారి, ప్రాంపుం
గలిగినవారికి...కొదువ వడకుండ కుండ లా
కుమ్మ రిచ్చు. హంస. ౫. ౧౪. (బ్రా.పా.)

లోపలినగరు = అంతఃపురము, అభ్యంతరగృ
హము.

క. తగవే కులకన్యకలకు, మగవారలతోడ రూ
పమహనీయులతో, మిగులంగం దడవు లో
పలి,నగరులలో మాటలాడ నయతత్త్వనిధీ.
నైష. ౪. ౬౧.

జః నగరాలు.

నగరోత్థ. సం. వి. ఆ. స్త్రీ. నాగరముస్తె.

నగరౌకసుండు. సం. వి. స్. పుం. నగరవాసి,
నాగరకుండు, పౌరుండు.

నగరౌషధి. సం. వి. ఇ. ఈ. స్త్రీ - నగరమం
దలియోషధి- కదలి, అరంటి.

నగవరి. విణ. (నగవు+అరి౩.) ౧. నవ్వు కల
వాండు. (శ. ర.) ౨. పరిహాసకుండు.

క. నగవుల నవిద్యపోండిమి, నగుంబాటుగం జే
యనేర్చునగవరి యంతక్, నగుమొగము
తోడ మెల్లన, నగుమొగములసతులం జూచి
నగ నేర్చె నృపా. భాగ. ౧౦ పూ.౮౯౩.

నగవు=నవ్వు. వి. (√నగు.) నవ్వు, హాసము.

మ.జగతీనాథునిముందట న్నిలిచె...శారద...
నగవుం దేటయు దివ్యదేహరుచియుక్ స
మ్మేళన మ్మొంది చె, ల్వగుచుండక్...నైష.
౪. ౧౪౦.

గీ. తెగువ లోలోననే నవ్వునగవు తెలుప.
ఆము. ౫. ౬౦.

సీ. నగవులు నురువులు నడలు రాయంచలు...
నీలా. ౨. ౧౭.

౨. నర్మవచనము, పరియాచకము.

క. ఏ నెఱుంగమి నిట్లడిగితి, నానేరమి నైపవ
లయు నగవుగం గొనుమీ, మానిని నాపలు
కులు...భార. ఆర. ౫. ౩౧౧.

క. నగ వవు కెఱుంగక యది యురి, తగులున
సౌమిత్రిం జేరి దానవి దనకుక్, మగండ
వగు మనిన నాతండు, నగ వొదవిన నగక
శూర్పణఖ కిట్లనియెక్. భా. రా. ఆర.
౧. ౧౪౬.

క. తదనంతరంబ బోటులు, చదురుల నగవు
లను బ్రొద్దు జరిగినం గేళీ,సదనము...వెడలు
టయు...మనుచ. ౬. ౭.

౩. వింత, ఆశ్చర్యము.

క. ఈజలముపట్టె చూడ మ, హాజగ మటు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కప్ప ప్రభ్వ లఁట యఁదుఁ బ్రజల్, పూజిం పవాని కెల్లన్, రా జఁట యొకకప్ప యట్టి నగవులు గలవే. కేయూర. ౩. ౨౪౮.

విశ. హాస్యాస్పదము, పరిహాసపాత్రము.

ఆ... నాదుసతులఁ, బుణ్యశీలయుతలఁ బోకార్చుకొన్నట్టి, నాకుఁ బుత్రులనుట నగవు కాదె. కళా. ౬. ౭౫.

మొలకనగవు=మందహాసము.

గీ. మొలకనగ వొప్ప శ్రీదేవిమోము చూచి. ఆము. ౨. ౯౨.

ఇట్లే: అలఁతినగవు.

సీ. పాశపాణికిఁ గుచప్రాంతోరుదర్శనం బంధకాసురునకు నలఁతినగవు. హర. ౬. ౧౦౩.

నగవుటీగి. వి. (నగవు + ఈగి.) పరిహాసమున కిచ్చినధనము.

సీ. మఱపునఁ గొన్నసొమ్ముఱఁగొన్నలంచంబు తగనివాఁ డిచ్చిన నగవుటీగి. గీ. మగుడ నీకుంట యింతయుఁ దగవు గాదు. విజ్ఞా. ప్రా. ౨౮.

నగవులాడు=నవ్వు. అ. క్రి. (నగవులు + ఆడు.) నవ్వు.

ఉ. అప్పచు లాడుచున్ నగవులాడుచు బారలు చాఁచి చాఁచి...చంద్రా. ౨. ౬.

నగవైరి. సం. వి. న్. పుం. ఇంద్రుఁడు, గట్టుదాయి.

నగాటనము. సం. వి. అ. పుం. ౧. -చెట్లమీఁద తిరుగునది- కోఁతి. ౨. పర్వతములమీఁద తిరుగుట. ౩. చెట్లపై తిరుగుట.

నగాధార. సం. వి. ఆ. స్త్రీ. భూమి. (వై.ని.)

నగాధిరాజము. సం. వి. అ. పుం. ౧. శ్రేష్ఠపర్వతము. ౨. హిమవత్పర్వతము. ౩. సుమేరువు. ౪. కైలాసము. (ఇట్లే: నగాధిపము మొ.)

నగారా. (హిం. నగారా.) వి. పెద్దఢంకా.

సీ. కదలికరళ్లచప్పుడుల నాఱడిసేయు గొప్పనగారాలకుంజరములు. రంగా. ౧. ౧౫౬.

నగావాసము. సం. వి. అ. పుం. - పర్వతములమీఁద నివసించునది - నెమలి. ౨. నగములమీఁదినివాసము.

నగాశ్రయము. సం. విశ. (అ. ఆ. అ.) నగముమీఁద నివాసము కలది. వి. అ. పుం. హస్తికందము, ఒకజాతికందము.

నగి(యి)ంచు. స. క్రి. (√నగు.) ౧. నవ్వించు.

చ. వెలికిలి సెజ్జమీఁదఁ గడు విప్పగుకన్నులచాయ లొప్పఁ జెక్కిలి గిలిగించి ప్రేతలు నగింపఁగ నుండుట యాదిగాఁగ ... హరి. పూ. ౮. ౧౩౪.

చ. దరహసితాస్యుఁ డై తనులతన్ వెడ వాల్చి నగించి వేడుకల్, గెరలఁగఁ జేసి...వరాహ. ౪. ౧౬౧.

౨. సంతసింపఁజేయు.

ఉ...విపంచి వాయించి తనున్ నగించి మొలయించినప్రేయసి నల్ల దించి మోదించి ... మించినవిరించి మముం గరుణించిప్రోవుతన్. వాల్మీ. ౧. ౭.

౩. అపహసింపఁజేయు, ఎగతాళిచేయించు.

చ. ఘనతరఘూర్జరీకుచయుగక్రియ గూఢముగాక ద్రావిడీస్తనగతిఁ దేట గాక యరచాటుగు నాంధ్రవధూటిచొక్కపుంజనుఁగవఁ బోలి తేటయును జాటుఁదవంబును లేకయుండఁ జెప్పినయది పో కవిత్వ మనిపించు నగించటు గాక యుండినన్. వేం.పంచ.౧.౧౮.

నగింపు. వి. (√నగించు.) నవ్వించుట.

వ... తెగింపులు నగింపులు నింపులు సొంపులు... భీమ. ౪. ౬౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నగి(గు)పించు. స. క్రి. (√. నగు.) నవ్వించు.

మ...నాలుకతుదన్ ముక్కుఁటికొమ్మా విలా,
సిని రేయే నమ్మెద నంచు బ్రహ్మ నగిపించెన్
మేలుమాటన్ సతిన్. కళా. ౫. ౫౯.

క. తెప్పించి తొడుగు మీ వని,యొప్పించిన ని
ట్టు నట్టు నొఱవలు గా మైఁ, గప్పికొని యా
బృహన్నల, యప్పుడు నగుపించె నచటి య
బలాజనమున్. భార. విరా. ౪. ౩౯.

చ...ఒండొకచందముమాట లాడితిన్, నిను
నగుపింపఁగా వలసి నీదగుమన్ననశంక వా
సినన్. భార. శాం. ౬. ౨౧౮.

నగిర=నక్కెర. వి. వృక్షవిశేషము. (చూ. తెల్ల నగిర.)

నగు. అ. క్రి. (క. నగు. త. నకు.) ౧. నవ్వు, హసించు.

వ...రాచూలిం జూచి చెలులు గలకలం జే
చఱచి నగిరి. నైష. ౨. ౪౬.

చ. వెడవెడఁ గన్ను మూయుఁ గను విచ్చు
నగుం దల యూఁచు...పారి. ౧. ౧౦౧.

౨. ఆనందించు.

గీ...సౌధ, శిఖరవాతాయనాగతాచిరరుగంశు,
నతదృగవరోధములతోడ నగిరి నృపులు.
ఆము. ౪. ౧౩౫.

క. అని పంటవలఁతిజేజే, వినిపించిన నాలకించి
వ్రేఁతలమేల్వాఁ, డెన లేనికోర్కు లెదలో,
నన లొత్తఁగ నతనిఁ జూచి నగుచుం బలి
కెన్. నీలా. ౨. ౩౩.

స. క్రి. ౧. అపహసించు, గేలిసేయు; తిరస్కరించు.

ఆ. ఏను మొదలుగా మహీపతు లెల్లను, దీప్తి
దఱిగి యుండఁ దివిరి మమ్ము, నగిరి కృష్ణ
పాండునందనద్రౌపదీ,సాత్యకులుఁ గరంబు
సంతసమున. భార. సభా. ౨. ౧౧౯.

గీ. నన్ను నాతోడిసవతులు నగకమున్న, పంత
మలరంగ నిన్ను మెప్పింతుఁగాన. పారి.
౧. ౧౩౧.

క. భృగునారదకపిలాదులు, నిగమాంతజ్ఞులును
యోగనిర్ణయనిపుణుల్, త్రిగుణాతీతు మ
హేశ్వరు, నగ రెన్నఁడు వారు ధర్మనయ
మెఱుఁగరొకో. భాగ. ౬. ౪౯౫.

రగడ. పద్మరాగమాణిక్యంబుల నగుపలువరుసలు
గలయది మణికర్ణిక. కాశీ. ౬. ౧౨౬.
(ఇట ఔపమ్యవాచకము.)

చ. పగడపుఁజాయ చెందిరముఁ బ్రామినపాండ్య
వధూకుచంబులన్, నగునరుణంపుబొండ్లము
లనారికెడంబులు...ఆము. ౧. ౫౪.

నగుమొగము=నవ్వుతో కలకలలాడుమొగము.

చ. నగుమొగమున్ సుమధ్యమును నల్లనిమేను
ను లక్ష్మికాటపట్టగునురమున్...కల్గువెన్నుఁ
డి,మ్ముగఁ బొడసూపుఁగాక కనుమూసిన య
ప్పుడు విచ్చినప్పుడున్. భాగ. ౯. ౮౩౨.

ఇట్లే: నగుముద్దుమోము.

సీ. నగుముద్దుమోమున మృగనాభితిలకంబు గు
లుకుడాల్సిరులు ముంగురుల నొరయ. దశా.
౧. ౮౧.

జః నగవరి, నగవు, నగవుటీగి, నగించు, నగింపు,
నగిపించు, నగుఁబాటు, నగుఁబాట్లుపని.

నగుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

నగుఁబాటు. వి. (√నగు.) అపహాసము. (శ.ర.) అపహాస్యత; దూఱు.

చ. అని మము నొర్చినం బృథివి యంతయు
నేలఁగ వచ్చు లేక చ, చ్చిన సురసద్మసౌ
ఖ్యములు చేకుఱు రెండుదెఱంగులందు నొ,
ప్పనియది లేదు డాఁగ నగుఁబాటును బ్రాణ
ముచేటుఁ దెచ్చికోల్. భార.శల్య.౨.౬౨.

గీ. వచ్చె నగుఁబాట్లు నాకు మీవలన నాథ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కళా. ౫. ౫౭.

వ...నీవు లోకంబుచేత నగుఁబాటును బొందెద వింతియ...భార. అర. ౬. ౩౦.

విణ. అపహాస్యము, ఎగతాళిచేయఁదగినది.

ఉ... ఇట్లసంభావితుఁ డైనవానితలపా టరయక నగుఁబాటు గాదె రా, మావనినాథు తమ్ములకు...నిర్వ. ౧౦. ౧౧.

ఉ...కడువటిప్రజ్ఞచే, నిచ్చకు వచ్చినట్లు చరియించును దుష్కవి తచ్చరిత్ర మే, యచ్చున నెన్ని చూచిన నహా నగుఁబాటు గదా గణింపఁగన్. విప్ర. ౧. ౧౪.

ఆ. జననమరణములకు సరి స్వతంత్రుఁడు గాఁడు, మొదల కర్త గాఁడు తుదను గాఁడు, నడుమకర్త ననుట నగుఁబాటు కాదొకో, విశ్వ...వేమన. ౧. ౧౭౭.

నగుఁబాట్లపని = హాస్యాస్పద మయినపని.

ద్వి. నగుబాట్లపని యిది నమ్ము నామాట, తగదు నీ కతనికిఁ దరళాయతాక్షి. మృ. వి. ౨. ౬౭.

సా : నగుఁబాటు పెండ్లికి నాఁడే నాగవల్లి.

నగౌకము. సం. వి. స్. పుం. ౧. పక్షి. ౨.కాకి. ౩. సింహము. ౪. శరభమృగము.

నగౌకసము సం = నగౌకము.

నగ్గు. అ. క్రి. (క. నగ్గు.) నలినలి యగు, ముక్కలుముక్క లగు, చూర్ణ మగు. (ఈపదమునకుఁ బ్రయోగాంతరము కానరాదు.)

ద్వి. దిక్కరీంద్రులు మ్రగ్గ దిక్కులు మ్రొగ్గ, నక్కులాద్రులు నగ్గ నహిపతి సుగ్గ. బస. పు. ౧. ౨౦౯.(చి. ని. పా.దిక్కరీంద్రులు ద్రుంగ దిక్కులు గ్రుంగ, నక్కులాద్రులు స్రగ్గ నహిపతి మ్రొగ్గ. ముద్రి. పా.)

నగ్న. సం. వి.ఆ.స్త్రీ. ౧. దిసమొలయాఁడుది. ౨. రజస్వలకానిపడుచు. (పది పండ్రెండు సంవత్సరములవయసు కలది.)

నగ్నంకరణము. సం.విణ. (అ.ఈ,ఆ.అ.) దిసమొలవానినిగా చేయుటకు సాధన మైనది.

నగ్నంభవిష్ణువు. సం. విణ. (ఉ.) దిసమొల వాఁడుగా అగువాఁడు.

నగ్నంభావుకుఁడు. సం. విణ. (అ.వికా.అ.)= నగ్నంభవిష్ణువు.

నగ్నచ్ఛద. సం. వి. ఆ. స్త్రీ. విష్ణుక్రాంతము.

నగ్నముషితుఁడు. సం.విణ.(అ.ఆ.అ.)వస్త్రాదులపహరింపఁబడుటచే దిసమొలవాఁ డైనవాఁడు.

నగ్నహువు. సం. వి. ఉ. పుం. (ఉ.న.అని కొందఱు.)_సేవించుటవలన నగ్నునిగాఁ జేయునది- కిణ్వము, నానాద్రవ్యములతో చేయఁబడినసురాబీజము.

నగ్నాటుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దిసమొలతో తిరుగువాఁడు.వి.పుం.దిగంబరబౌద్ధుఁడు. (వై. ని.)

నగ్నిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. దిసమొలయాఁడుది, దిగంబరస్త్రీ. ౨. కన్యక, సమర్తాడనిపడుచు.

నగ్నీకృతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నగ్నుఁడుగా చేయఁబడినవాఁడు.

నగ్నుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వివస్త్రుఁడు, దిసమొలవాఁడు, దిగంబరుఁడు. వి. అ. పుం. ౧. దిగంబరసన్న్యాసి. ౨. దిగంబరబౌద్ధుఁడు. ౩. బట్టువాఁడు. ౪. వేదదూషకుఁడు; వేదమభ్యసించియు వేదమార్గమును విడిచి యపమార్గమున వర్తించువాఁడు.

ఉ. ధీమతిఁ జిన్ననాఁ డఖిలదేవతలన్ భజియించి ఋగ్యజు, స్సామము లభ్యసించి బహుశాస్త్రపరాయణుఁడై మహీసురుం, డేమి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యు బుద్ధి లేక ధ్రుతు లెంతయు నింద యొ నర్చువానిఁ బో, పామరుఁ డైన నగ్నుఁ డని పల్కి రి వేదవిదుల్ మునీశ్వరా.వి. పు. ౪. ౨౭౦.

ఆ. వేద మభ్యసించి వేదమార్గంబులు, విడిచి పెట్టి దుర్వివేకబుద్ధి, బహుమతముల నడుచు పామండుఁడే నగ్నుఁ,డు...వి.పు.౪.౨౭౧.

౫. అవైదికకులోత్పన్నుఁడు.

శ్లో. యేషాం కులే న వేదోస్తి న శాస్త్రం నైవ చవ్రతమ్,తే నగ్నాః కీర్తితా స్సద్భిః తేషా మన్నం విగర్హితమ్. మార్కండేయపురాణ ము. (వాచ.)

నచకము. సం. వి. అ. పుం. రాత్రి మూఁడవ జాముసం దైనస్వప్నము. (వై. ని.)

నచికేతసుఁడు. సం. = నచికేతుఁడు.

నచికేతుఁడు. సం. వి. స్. పుం. ౧. ఒకానొక ఋషి, నాచికేతుఁడు, ఉద్దాలకునికొడుకు. ౨. ఒకానొకఅగ్నిహోత్రుఁడు.

నచిరము. సం = అచిరము.

నచ్చిక(గ). వి. (√నచ్చు[1]. క. నచ్చిగె, నచ్చి కె. త. నచ్చు.) నమ్మిక.

క. నిను గీతిసాహితీమో,హనవాణులు చెవులు వట్టి యాడింపంగాఁ, గనియుండి కాముకుఁ డఁ గా, నని వల్కిన నాకు నచ్చి కానె నృపాలా. విజ. వి. ౧. ౯౦.

క. ఈరీతిఁ బొదల మెదలుచు, నారీతిలకంబు మేనినచ్చిక యిచ్చం, గోరక నవసహకా రక, కోరక మూరుకొని వడి నిగుడ గమకిం చెక్. వసు. ౩. ౧౧౯.

నచ్చికము= అచ్చికము. వి. (తె. నచ్చిక.) కొ ఱఁత, లోపము.

క. అకటా న న్నితఁ డేలిన, నొకటా నచ్చికము లేక యుండఁగ వచ్చుక్. విజ. వి. ౧.౬౩.

క. సకలజనంబులు సిరులం, దొకటను నచ్చిక ము లేక యుండ...రామ. ౧౩౭.

నచ్చు[1]. అ. క్రి. హితమగు, ఆప్తమగు;రుచించు.

చ...ఆలలితాంగి నాకు న,చ్చినచెలి...మార్క. ౫. ౨౯.

ఉ. కైటభదైత్యవైరిపదకంజమునం దుదయంబు నొందె మి,న్నేటికి భూతధాత్రికిని నెంత యు నచ్చినతోడఁబుట్టు వై, హాటకగర్భ ముఖ్యనిఖిలామరమౌళిమహామణి ప్రభా,పా టలవర్ణమైనయొకపావనవర్ణముదీర్ణసంపదక్. భీమ. ౧. ౩౦.

క. వల్లభునకుఁ గడు నచ్చిన,యిల్లాలవె యేను లాఁతినే పోఁ దోలక్. కళా. ౩. ౧౭౦.

౨. నమ్మకము కలుగు, విశ్వాసయుక్తమగు.

క. నీ వింక నేఁటినుండియు, నావచనము లాద రించి నచ్చినమదిలో, దేవతలకైన దొరకని, యావారుణిసేవ సేయు మతులితభక్తిక్. వి. పు. ౭. ౩౯.

చ. అలవి యెఱుంగ నేరక దశాస్యుఁడు లో కముతోడివానిఁ గాఁ, దలఁచి జితాఖిలా ధ్యుఁడఁ గదా యని నచ్చి కడంగి వచ్చి సం,కలియకుఁ జొచ్చె...నిర్వ. ౭. ౬౫.

౩. సక్తమగు, లగ్నమగు.

గీ. అట్టినీయందు నాచిత్త మనవరతము, నచ్చి యున్నది నీయాన నాన లేదు,కరుణఁ జూడు ము కంసారి ఖలవిదారి. భాగ. ౧౦. పూ. ౧౩౦౨.

శ్లో. రూపం దృశాం దృశిమతా మఖిలార్థలా భం,త్వయ్యచ్యు తావిశతి చిత్త మపత్రపం మే. సం. భాగ. ౧౦. ౫౨౩౯.

స. క్రి. (క.తె.నచ్చు.) నమ్ము.

ఆ. కొఱత నుఱుకుఁ గాని కొడుకు కన్నఁడును గార్య, తంత్రమునకుఁ జొరఁడు దాని నీవు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాన్ప నొల్ల వలనిమగటిమియును లావు,
నచ్చి లోభ మెదఁ బెనంగొనంగ. భార.
స్త్రీ. ౧. ౧౭.

క. మెచ్చితి నేవర మైనను, నిచ్చెద నను వేఁడు
మనిన నీశ్వర నిన్నుఁ జే, నచ్చిన రక్షింతువు
హార, హొచ్చెము సేయక మహేశ పురహర
యభవా. భాగ. ౧౦ ఉ. ౫౨౯. భార.
విరా. ౨. ౩౫౪.

సీ ... నచ్చె ననం దగు నమ్మె ననుట. ఆం.
భా. ౩. ౧౩౩.

నచ్చు.[2] స. క్రి. బాధించు, పీడించు.

గీ. కాననము చొచ్చి శార్దూలఖడ్గనూక,రప్ర
ముఖజంతుసంతతి వ్రచ్చి నచ్చు,నారసం
బున మృగవేష ధారి యైన,యతికులస్వామిఁ
గూల నేసితివి నీవు. వరాహ. ౨. ౪౮.

వి. ౧. మాంద్యము, ఆలస్యము.

క. జడకుచ్చును మెడహెచ్చును, నడనచ్చును
గచ్చు లేనినలు పగుమేనుఁ జే. చంద్ర. వి.
౧. ౭౧.

౨. బాధ. (శ. ర.)

జః నచ్చుకాఁడు, నచ్చుకుప్ప, నచ్చుగొట్టు,
నచ్చుపెట్టు.

నచ్చుకాఁడు. విణ. (√నచ్చు[2].) ౧. అలసుఁ
డు, మందుఁడు. ౨. బాధకుఁడు, పీడించు
వాఁడు. (శ. ర.)

నచ్చుకుప్ప. విణ. (నచ్చు[2] + కుప్ప.) నచ్చుగొ
ట్టు, బాధకుఁడు. (శ. ర, చి. ని.)

నచ్చుగొట్టు. విణ. (నచ్చు[2] + గొట్టు[2].) నచ్చు
పెట్టువాఁడు, బాధించు స్వభావము కలవాఁ
డు. (శ. ర.)

నచ్చుపెట్టు. స. క్రి.(√నచ్చు[2].)తొందరపెట్టు,
బాధించు. (శ. ర.)

నజరు. వి. (హిం. నజర్.) కానుక.

చ. కడువడి పిన్నపెద్ద లగుఖానులకుఁ జే నజరు
ల్నయించుచుఁ జే, బొడగనియెఁ జే...హైదరు
జంగు నొయ్యనఁ జే. రంగా. ౨. ౮౪.

గీ...హైదరుజంగుఁ గాంచి, నజరు గుజరాను
పఱచె సొన్నాకడాని, జాలెము... రంగా.
౨. ౮౫.

నజీబు. విణ. (హిం. నజీబు = కులీనుఁడు, ఉత్తమ
కులుఁడు.) మంచిది.

వ...చాయలం గ్రుక్కునుక్కుపని పెంపెక్కు
నజీబుసైబుపట్టా నటిట్టు ఝళిపించుచుఁ దెం
పుసొంపు దీపింప రయంబున ...మల్లుపు.
౨. ౪౮.

నజ్జు= నలుజో. వి. (క. నజ్జు.) నలి, చిన్నముక్క,
అల్పఖండము.

చ. ఒకపెనుఁబాఁపఱేఁడు చల మొప్ప రసా
తలసీమకుఁ జే జకో,రకములు భూతధాత్రికి
సురల్ దివికిఁ జే బగ దీఱునట్లుగా, మెక
మెకపాటుతోడ నిను మ్రింగకపో రెపుడుఁ జే
ద్రిలోకకం,టకుఁడవు గాన నీయొడలు నజ్జు
గఁ జేసి కురంగలాంఛనా. మనుచ. ౩. ౩౮.

వ...పదయుగనఖాంచలంబులఁ జంచచ్చంచూ
పుటంబుల రెట్టిత్రావుడుబొబ్బ మెకము ద
చ్చికాళ్ల మెకంబుల నిరికించి కఱచుక యు
ప్పరంబున కుప్పరం బెగసి మలలసెలయేళ్ల
పులినతలంబుల నజ్జుగా నజ్జుగాఁ జెండుగండ
భేరుండకాండంబులును...ప్రబంధ. ౧౮౬.

విణ. మిక్కిలి నలఁగినది.

ఉ. వాడినమేను నజ్జయినవాతెఱయుఁ జే గడు
విన్నఁబాటుతోఁ, గూడిననెమ్మొగంబు...స
మీర. ౩. ౨౪౭.

(దీనిఆమ్రేడితరూపము నజ్జునజ్జు.)

చ. నలినలి యయ్యెఁ గౌను జఘనస్థల మెల్లను
నజ్జునజ్జు నై, గులగుల లయ్యె గబ్బినను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గుబ్బలు...శుక. ౧. ౨౧౫.

చ. మెలఁతలు వల్లభుల్ మొదల మెచ్చఁగ నుండిరి నాకతంబునన్, నిలువునఁ గత్తిఁకోఁత లయి నిద్దపుమోవులు నజ్జునజ్జులై, యలజడి వాడివత్తలయి రక్కటు యే నీక నున్న నేమి గాఁ, గలరో యి దేల వోదు ననుకై వడిఁ దో నిసి యేఁగె నేఁగినన్. కవిక. ౪. ౧౭౧. రా. వి. ౪. ౩౫.

జః నజ్జుచేయు.

నజ్జుచే(సే)యు. స. క్రి. (నజ్జు + చేయు.) ౧. నలఁగఁగొట్టు, ముక్కముక్కలు చేయు,

(రాజు.) చ. అల వెనయం గజారులహృదంతర ముల్ నలినజ్జుచేసె సంధిలుతమి బుజ్జుసం ఘములతేజముఁ దూలిచె ... సారంగ. ౧. ౧౦౧. (ఇట కలఁతనొందించె నని భావము.)

సీ. రథ్యసారథికేతురథికాంగనిర్దళనప్రౌఢిఁ దేరలు నజ్జుసేసి. మార్క. ౭.౧౦౪. (నగ్గుచేసి అని శ. ర. పా.)

నటరుఁడు. సం = నటుఁడు.

నటత్. సం. (శత్రు.) నాట్యము చేయుచున్న.

నటన. సం. వి. ఆ. స్త్రీ. నటనము, విలాసము.

క. అటు లున్నకొమరుఁబ్రాయఁపు, గుటిలాలకఁ జూచి మదనగుంఫితమాయా,నటనంబో య ది గంగా,ఘటనంబో యని విచారఘటనా శయుఁ డై. విజ. వి. ౧. ౩౩.

ద్వి. బొట్టు మిక్కిలి నొఱపుగ సవరించి, నట నగాఁ జిన్నారినామంబుఁ దీర్చి. ద్వి. పర మ. ౨. ౫౪ పా.

నటనము. సం. వి. అ. న. ౧. నాట్యము. ౨. అభినయించుట, నర్తనము. ౩.కపటప్రవర్తనము.

నటనారాయణము. సం. వి. అ. పుం. రాగవి శేషము. (వా చ.)

నటనీయము. సం = నటితవ్యము.

నటపలికి. వి.తల రుద్దునప్పటిసంస్కారవిశేషము?

క. అటఁ గలికి యొకతె గంధపుఁటటకలికిఁ బసిం డిగిన్నియలఁ బన్నీరం,తటఁ జిలికి యలకవిక లత,నటపలికి వసుంధరాధినాథున కిడియెన్. రా. వి. ౫. ౫౩.

నటభూషణము. సం. వి. అ. న. హరితాళము, అరిదళము.

నటమండనము. సం = నటభూషణము.

నటము. సం. వి. అ. పుం. ౧. శ్యోనాకము,దుం డిగము*. ౨. అశోకము*. ౩. నలతృణము, కిక్కస*.

నటరంగము. సం. వి. అ. పుం. నాటకమాడు స్థానము.

నటవరుఁడు. సం. వి. అ. పుం. ౧.నటశ్రేష్ఠుఁడు. ౨. సూత్రధారుఁడు.

నటవాలు= నట్వాలు. వి. అశ్వగతివిశేషము. (శ. ర, చి. ని, బ్రౌ.)

నటసంజ్ఞకము. సం. వి. అ. న. గోదంత మను హరిదళము. (త్రి. ని.)

నటసూత్రము. సం. వి. అ. న. శిలాలి అను వానిచే రచింపఁబడి నటులకృత్యములను తెలుపు గ్రంథభేదము, నాట్యశాస్త్రము.

నటాంతిక. సం. వి. ఆ. స్త్రీ. - నటకృత్యము యొక్క అంతము దేనివలన కలుగునో అది, నటకృత్యమును మాన్పించునది- లజ్జ, సిగ్గు.

నటి. సం. వి. ఈ. స్త్రీ. ౧. నట్టువరాలు, ఆట కత్తె. ౨. (నాటక.) సూత్రధారునిభార్య యగు నర్తకి. ౩. వేశ్య. ౪. దీపకరాగముయొక్క భార్య యగురాగిణీభేదము. ౫. నలి అనుగంధ ద్రవ్యము*. ౬. శాకిదొండ*.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నటించు=నటియించు. సం. స. క్రి. ౧. అభినయించు, (నిజముగా లేనిసిగ్గు మొ. ఉన్నట్లు) కనఁబఱుచు.

(శ్రీకృష్ణుఁడు.)మ. యదువంశంబున లోకరక్షణపరుం డై పుట్టి వ్రేపల్లెను, స్నదబాల్యంబు నటించి కంసముఖ నానాదైత్యులం ద్రుంచి ...భార. ద్రో. ౧. ౯౩.

చ...ప్పల్లఱు పొరుగిండ్ల కేఁగు నొకమట్టున నిల్వదు చంటిమీఁద ముంజెఱఁ గడలించు వైశికఁపుసిగ్గు నటించుచు జార ధారుణిన్. జై. భా. ౩. ౨౮.

ఉ. చేరి నృపాలుఁ డర్పణముచేసినచక్కెర లుప్పతిల్లుపంచేరము లారగించుచు నటింపఁ దొడంగె మహేశుఁ డింపునన్, సారెకుఁ గుత్తుకన్ విషము నాలుక శెల్లము వెట్టియాడుటల్, మేర లటయ్య సామి యని మేలము లాడుచు గౌరి నవ్వఁగన్. సారంగ. ౧. ౨౩. (శ. ర, ప్రాఁతప్రతి. పా. "పం, చేరము...నుతింపఁదొడంగె..." ముద్రి.)

౨. అనుసరించు.

మ. మును తన్ గూడిననీళ్లకున్ నిజగుణంబుల్ పాలిడున్ పాలు గ్రాఁగుచెడన్ వాని నటించి యజ్జలము గ్రాఁగున్ దానె తన్మిత్రనాశనముం గన్గొని వహ్నిఁ గూలఁ జనుఁ బాల్ శాంతం బొనర్చున్ జలం, బనయం బట్టివి సఖ్యముల్...మల్లభూ. నీతి. ౬౬.

అ. క్రి. ౧. నాట్యముచేయు, నర్తించు; ఆడు.

క...దివి దివిజ జలజముఖులు దెలిసి నటింపన్. మనుచ. ౪. ౧౧౮.

ఉ. చిట్టుము లంకురించె జిగిచెక్కులఁ దెల్పు నటించెఁ గోరిక, ల్మట్టు దొరంగె నెన్నడల మాంద్యవిధంబు చెలంగె...నేవిళుల్, దట్టము లై జనించె...ఇందు. ౨. ౧౩౫. (ఇట వ్యాపించె నని భావము.)

౨. నటనచేయు, కపటముగా ప్రవర్తించు.

సీ. పతిసమ్ముఖమ్మునఁ బలుమాటల నటించుసరసిజాసనురాణి సాటి యగునె. ఇందు. ౧. ౧౧౨. (నాట్యము చేయుట అని అర్థాంతరము.)

౩. వర్తించు, ఉండు.

శా. ఏకవ్యాపకమై సమస్తగతమై హేవాకమై శ్రీకరం,బై కల్యాణవిహారమై నిబిడమాయాతీతమై నిర్గుణం,బై కైవల్యవిహారమై జననసాశాతీతమై యుత్తమ, శ్లోకంబై పరమార్థతత్త్వము నటించున్ నిత్యశుద్ధస్థితిన్. వి. పు. ౩. ౩౩౭.

౪. తోఁచు.

క. పతయాళుతురగనిభృతో,న్నతకరద్వయము నందునం గెంపులమే,ల్పతక మమరె రవికిరణం, బతిరయమున ననుప వచ్చునను వు నటింపన్. కువల. ౨. ౪౦.

నటిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నటించువాఁడు, నర్తనముచేయువాఁడు.

నటితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నటింపఁబడినది, అభినయింపఁబడినది. ౨. నటించినది. వి. అ. న. నటించుట ; నటనము.

నటితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నటింపఁ దగినది.

నటితి. సం. వి. ఇ. స్త్రీ. నాట్యము. (వై.ని.)

నటియించు. సం=నటించు. అ. క్రి. ఆడు.

క. నిటలంబునఁ గుటిలభ్రూ,కుటి నటియింపంగ మొగ మిగుర్పఁగ మేనం, జొటచొటఁ జెమటలు గాఱఁగఁ, గటమర లదరంగ నాడు గఱచుచుఁ బలికెన్. వరాహ. ౨. ౧౮౭.

నటుఁడు. సం. వి. అ. పుం. ౧. నర్తకుఁడు, నాట్యము చేయువాఁడు. ౨. దృశ్యకావ్యార్థములను అభినయించువాఁడు. ౩. శౌచికియందు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాండికునివలన పుట్టినసంకీర్ణజాతివాఁడు. ४. వ్రాత్యస్త్రీయందు క్షత్రియునివలన పుట్టిన కొడుకు.

నటేశ్వరుఁడు. సం. వి. అ. పుం. నటరాజు, శివుఁడు.

ఇట్లే: నటేశుఁడు మొ.

నట్ట. వి. పాచిక, సారె, ద్యూతమండలికాయ.

ఉ. నట్టలు రెండుఁ దాన జతనంబునఁ జేకొని యున్నయిండులం, గట్టి నృపాలుసారెలకుఁ గా లిడ నెందునుఁ జోటు లేక యున్నట్టుగఁ జేసి యెట్టిసమయంబున నొడ్డినసారె దిక్కు గ, న్నెట్టి దృఢాగ్రవేదిగతిఁ జెక్కుగఁ దాఁకఁగ వైచె వైచినన్. భోజరా. ౭. ౧౩౦.

నట్టకనడుము= నట్టనడుము. వి. (√నడుము.) సరినడుము. (చూ. నట్టకనడురేయి.)

నట్టకనడురేయి= నట్టనడురేయి. వి. (√నట్టకనడుము.) సరియైనఅర్ధరాత్రము.

క. కట్టి తనమాఱుగా నీ, దిట్ట గృహస్తంభమునఁ బ్రతిష్ఠించి నరుల్, మిట్టాడనియాబెడిదఁపు, నట్టకనడురేయి మబ్బునం జెలి చనియెన్. వేం. పంచ. ౧. ౨౪౯.

నట్టకోఁతి. వి. బాలక్రీడావిశేషము.

సీ...నాల్గుకంబాలాట నట్టకోఁతి. హంస. ౩. ౧౪౬.

నట్టడవి. వి.(నడుము + అడవి.) అరణ్యమధ్యము.

క. కట్టా మన్మథుకోలలు, నెట్టన నోనాఁటు శెగడి నీపాదంబుల్, వట్టికొనఁగ వచ్చినమము, నట్టడవిని డించి పోవ నాయమె కృష్ణా. భాగ. ౧౦ పూ. ౧౦౫౪.

ఆ. మృగసమాజములకు మేపు నీ శ్లెవ్వఁడు, వెట్టి ప్రోచు నెలమి నట్టడవుల. కుచేల. ౧. ౫౫.

ఉ. పెట్టెడుసొమ్ముచే సొగసువెట్టెడునిట్టిమిటారికత్తెలో, నట్టడవిం జరించెదరు నాయపదానము లాలకింపరో. చం. రా. ౫. ౬.

నట్టనడుము= నట్టకనడుము. వి. దౌ. (నడుము + నడుము.) సరియైనమధ్యము.

గీ. పాల్కడలినట్టనడుమ సంప్రభవమైన, యమృతలింగంబవైనని న్నాశ్రయింతు.భీమ. ४. ౧౧౦.

గీ...వారుఁబుట్టి యెక్కి పోఁగా వేరినట్టనడుమ.

క. పరకాలనియుక్తం డగు, పురుషుం డది ముంచి నేరుపున నీఁది వెసన్, దరి చేరె...పరమ. ౫. ४౯, ౫౦.

చ. కలఁక దొలంగ వేదవతి గ్రక్కున బెత్తిలి యెత్తి త్రేయుడున్, మలచపువేణి నట్టనడుమన్ దెగి చేతికిఁ దున్క చిక్క ... ఉ. రా. ౩. ౧౨౩. ఉ. రా. ४. ౨౯౧.

నట్టనడితెరువు = మధ్యేమార్గము,మార్గమధ్యము.

వ. ... రచ్చపట్టుకొట్టంబున నట్టనడితెరువుం బట్టుకొని ... ఉ. రా. ౩. ౨౨.

నట్టనడురేయి= నట్టకనడురేయి.(√నట్టనడుము.)

గీ. ఉనిచి కడుగారవంబున ననఘచరిత, నట్టనడురేయి చెప్పుచున్నాను మమ్ము, నరమరలు లేక మీయుపాధ్యాయువలెను, నడుపుకొనువార లెవ్వ రున్నారు గనుక.విప్ర.४.౬౫.

నట్టాడు. అ.క్రి. (√నట్టు³.) ౧.నర్తించు,నాట్యముచేయు. (శ.ర.) ౨. చలించు.

క ... మిఱుమిఱుచూడ్కుల్ , నట్టాడునడుముఁ దేనియ, లుట్టెడుమోవియును మనము నూరింపంగన్. భాగ. ౯. ౬౦౨.

౩. త్రోఁచక తిరుగు.

(వ్యవ.) వాఁడు ఊరకే నట్టాడుచున్నాఁడు.

నట్టించు. అ. క్రి. (√నట్టు³.) నటించు, క్రీడించు, ఆడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. ... దారకులునుం బోలె నట్టించి పనిఁ దిరుగువెరవరులునుం బోలె మసల కలవడి ... ఉ. హరి. ౪. ౨౫౬.

నట్టిల్లు. వి. ఔ. (నడుము+ఇల్లు.) గృహమధ్యభాగము.

క. నెట్టక పోనని యాఁకట, దొట్టగిలం బడుచుఁ బడుచు దురదురఁ జని వే, నట్టింటఁ గూరుచుండిన, నెట్టు ననం జాల కమ్మ గేషుణ భీతిక్. పాండు. ౪. ౧౬౫.

సీ. ఎలగోలుజల్లు ముక్ వెళ వెళ నేటవాల్ పడి గాలి నట్టిండ్లఁ దడిపి చనఁగ. ఆము. ౪. ౯౧.

నట్టింటిశత్రువు = గృహమధ్యమందలిశత్రువు, నిత్యశత్రువు ; సమీపశత్రువు.

గీ. పాలనము సేయఁ జేపట్టి ప్రజలఁ బాపు, సకలజనులకు నట్టింటిశత్రుఁ జేయు, నయము కడ యీక యెల్లవెంటలను జెఱచు, మాట పరుసదనంబు ... పి. శకుం. ౪. ౧౬౭.

నట్టు[1]. అ. క్రి. ౧. అడ్డు, ఆఁగు.

(వ్యవ.) వాఁడు చదువుచు నట్టుచున్నాఁడు.
,, నీవు నట్టి నట్టి చదువకుము.

వి. ౧. ఆలస్యము. (చూ. నట్టుకొట్టు.)

(వ్యవ.) నట్టు చేయక వేఁగిరము పొమ్ము.

౨. ఆటంకము, అడ్డు. (చూ. నట్టుపడు.)

(వ్యవ.) నేను తలఁచినపనికి దైవికము గా నట్టు వచ్చినది.

జ : నట్టుకొట్టు, నట్టుపడు.

నట్టు[2]. ౧. నివాసస్థానము, గృహము.

గీ. నెట్టుకొని యెల్లవేతలనట్టులందు, గుట్టులర యుచు మెలఁగునప్పట్టి...నీలా. ౧. ౭౫.

వ... అమ్మహేశ్వరి నీకుం బట్టి యై వెండి గట్టు నట్టు గాఁ బరఁగుజగ జెట్టిని వరియించి మనకుం బరమానందంబు నేయు ... జాహ్నవీ. ౧. ౩౫. ఆం. భా. ౩. ౪౫.

ఆ. అపుడు గొల్లనాయఁ డందముగాఁ దన,నట్టులలరఁ జేయునట్టుగాను. నీలా. ౩. ౪౬.

౨. స్థానము, ప్రదేశము.

సీ. పాటలం బగుజటాజూటంబునడునట్టు పూఁపచుక్కలగాజు పాడవుచూపు. భీమ. ౩. ౧౯.

సీ. పొదరింటిపట్టులఁ జదరంపునట్టులఁ బంతుగా గోరంట బంతులాడు. ఉ. హరిశ్చ. ౩. ౧౫. చంద్రా. ౩. ౬౪.

౩. పొలము, క్షేత్రము.

ఉ. పూని వసంతహాళికుఁడు పాంగెడురాగరసంబుచేఁ గడుక్, నానుజనాళిమానసపునట్టులు దున్ని మనోజకందళిం, గానఁగఁ జేసి ... చంద్ర. ౯. ౧౦౩.

౪. దేశము, విలాతి.

గీ. అతఁడు దిరుగనియూరును నతనిచేత, నడుగఁ బడనిమానవుఁడును నతఁడు చొరని, తోఁట యును జూడ లేదు మందునకునైన, నగవుగా దిది నిక్క మానట్టునందు. భోజరా. ౨. ౫.

౫. గృహప్రదేశము, ఇంటిపట్టు.

గీ. నట్టు నా గేహాతద్దేశనామ మెసఁగు. ఆం. భా. ౩. ౪౫.

మున్నీటినడిమివీటినట్టురాకాసి = సముద్రముయొక్క నడుమ నున్నపట్టనము నివాసస్థానము గా కలరాక్షసుఁడు, రావణాసురుఁడు.

గీ. అహమికను బోలె నచ్యుతోహం శివోహ, మనుపలుకుతోడ నిజతుంగఘనశతాంగ, ముడుపదవి మాటి మున్నీటినడిమివీటినట్టురాకాసి దొరకుసన్నాసి యగుచు. చం.రా. ౫. ౬౯.

జ : నట్టుకొను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నట్టు[3]= నట్టుగుఁడు, నట్టువ. వి. (సం. నటః. త. నట్టు.) ౧. నర్తకుఁడు, నటుఁడు.

వ. అనుచుఁ దలంగి పోక యిట్టు నట్టుం జుట్టుమెట్టాడుచిట్టివడుగుల నానట్టు నగవునుం గోపంబుఁ గదుర నదలించుచు...ప్రభా. ౧. ౧౦౪.

సీ. నటుఁ డొప్ప నట్టన నట్టువుం డనఁగను ...ఆం. భా. ౨. ౧౭౭.

౨. నాట్యము. (చూ.నట్టాడు, నట్టుపులుఁగు.)

౩. నాట్యోపాధ్యాయత్వము, నాట్యము నేర్పుట. (చూ. నట్టుసేయు.)

జః నట్టాడు, నట్టించు, నట్టుఁగుడు, నట్టుపులుఁగు, నట్టువ, నట్టువకాఁడు, నట్టువచావడి, నట్టువపక్కి, నట్టువము, నట్టువముట్టుకాఁడు, నట్టువాఁడు, నట్టువుఁడు, నట్టువొజ్జ, నట్టుసేయుము.

నట్టు[4]. వి. (క. నట్టు.) ౧. తృణవిశేషము, దూర్వ, గఱికగడ్డి.

ఉదా : కుందుఱునట్టు, గఱికనట్టు. (బ్రా.)

౨. గఱికవలె నిస్సారమగుట, శుష్కించుట.

గీ. ఇట్టి బెట్టగువెట్టకు నట్టుఁ జెంది, జడలఁ జదలేఱుఁ దాలిచెఁ జంద్రమౌళి. ధర్మ. ౨. ౪౬.

౩. వికృతి, మార్పు. (చూ. నట్టువడు.)

౪. సస్యరోగవిశేషము. (శ. ర.)

జ : నట్టువడు.

నట్టు. సం. వి. ట్. పుం. నర్తకుఁడు. శ్. స్త్రీ. నాళము.

నట్టుకొట్టు. అ. క్రి.(నట్టు[1]+కొట్టు.) ౧.ఆలస్యముచేయు. (శ. ర.) ౨. సంకోచించు, సందేహించు, వెనుదీయు.

క. పలికిన నినుఁ గాదన భీతిలి యిటు నటు నట్టుకొట్టు తెఱవ తెఱఁగు భూ, తలవిభుఁడు చూచి యిది యే, మలికుంతల తెలుపు మను చు నడిగెఁ బోరిఁ బోరిన్. కళా. ౪.౧౪౦.

వ...తమవిన్నపంబులకుం దటి యఱియుచు నింతనంతఁ గొంత డగ్గఱి యిట్టట్టు నట్టుకొట్టుచున్నం జూచి. పరమ. ౩. ౨౭.

స. క్రి. అడ్డుకొను, నిరోధించు.

రగడ. తగిలి పట్టు మనుచుఁ దిట్టులన్నిఁ దుట్టుపెట్టె నొకతె, మగుడి పెట్టుకానియొట్టుమాన్ప నట్టుకొట్టె నొకతె.రా.వి.౩.౧౨౧.

నట్టుకొను= నెట్టుకొను.అ.క్రి.(నట్టు[2]+కొను.) (నివసించు, నెలకొను.)

చ. పడితిమి కుక్కలుం బడనిపాటులు దుర్భరమైనవృత్తి వెన్బడితిమి గర్భయాచకులభంగి దరిద్రత నట్టుకొంచు లోఁ,బడితిమి...హర. ౩. ౧౫.

ద్వి. కొఱవిదయ్యము నట్టుకొనియున్న కరణి, నున్న భేతాళవటోర్వీరుహంబు. ద్వి. హరిశ్చ. పూ. ౨౦౦౭ పం.

నట్టుగుఁడు=నట్టువ, నట్టువకాఁడు, నట్టు౩, నట్టువుఁడు. (శ. ర.)

నట్టుపడు. అ. క్రి. (నట్టు[1]+పడు.) నిరుద్ధమగు. (చూ. నట్టుపఱుచు.)

నట్టుపఱుచు. స. క్రి. (నట్టు[1]+పఱుచు.) అడ్డుకొను, నిరోధించు.

గీ. నట్టడవిలోన నన్నిట్టు నట్టుపఱిచి, గొట్టుమిట్టాడ నేటికిఁ బట్టభద్ర, పుట్టునకు మున్న లేమకు బొట్టు గట్టి, చెట్టపట్టుట కొకరుండు పుట్టెఁ జూవె. కృ. శకుం. ౨. ౪౭.

నట్టుపులుఁగు= నట్టువపక్కి. వి. (నట్టు[3]+పులుఁగు.)నాట్యముచేయుపక్షి, నెమిలి.(శ.ర.)

నట్టువ= నట్టు౩, నట్టుగుఁడు. వి. (√నట్టు[3]. క. నట్టువ.త.నట్టువన్.హిం. నటువా.) ౧. నాట్యము నేర్పెడువాఁడు, నాట్యోపాధ్యాయుఁడు.

ఉ. ఆనన తేఁటిమ్రోఁతయె యుపాంగము గాఁగఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఛికాగ్రనాదమే, గానము గాఁగ నాప్ర
గళుకస్ఫుటపత్త్రరవంబు మర్దళ,ధ్వానము
గాఁగ లేఁజివురుబాహులు ద్రిప్పులతాంగనా
ళి నెం,తేనియ నాడఁజేయుఁ బురిఁ దెమ్మెరన
ట్టువ పూవుఁదోఁటలన్. ప్రబంధ. ౪౭.

ఉ. చిత్తరుచిత్తరుల్ నడ భజించి రసన్ జిగి
నీలికాసె ద,ళ్కొత్తెకుపాత్రకత్తియల కొ
జ్జరికంబు వహించి కోహళం, దత్తిలునైనఁ
గా దనెడునైపుణి మార్గవిధంబు దేశియున్,
బెత్తము కేలఁ బూని వినిపింపఁగ నోపుదు రిం
దు నట్టువల్. చం. రా. ౩.౭౪.

౨. నటుఁడు; నటి.

గీ. పాతకులకొట్టు నట్టువపాలియుదురుఁ,గ్రోవి భర
తంపుటయగారిగుం డెదివులు. శుక. ౩.౨౦.

(సోమకాసురుఁడు.) గీ. తానవరుసలు పెంచు
గంధర్వగాయ, కులనుజతగూడు నట్టువకుల
మువారి,...చూచుచు...దశా. ౧. ౨౭౪.

క. ఇరువురు నేసినబాణము, లిరుబరులును దాఁకి
తిరిగ నిరుదెసలకు నక్కొరి యిరు మొగముల
నట్టువ, తిరుపుఁగొనెడుక్రమముతో నతిత్వ
రితగతిన్. కాళ. ౪. ౧౮౧.

౩. నాట్యము.

వ. మఱియు విరితేనియ లాని పూని మత్తిలి
తత్తరంబునం దిరుగు తేఁటిమొత్తంబులరొఱ
కలసన్నం గరువలిగట్టిననట్టువ గఱప నామ
నిరాతేనికడ నాడుతీవపాతరలముందఱ...
యయా. ౪. ౧౩.

నట్టువ(వల్ )ద్రొక్కు=నాట్యముచేయు; చలించు.

చ. నొసలను ముంగురుల్ చెదర నూల్కొని
ముక్కెరడాలు మోవిపై, వెసఁ గొనసాఁగఁ
జన్నుఁగవ నిక్కుచు నట్టువద్రొక్కి హార
ముల్, ముసరి పెనంగులాడ నగుమోము
చెమర్ప నొకర్తు చంపక,ప్రసవసుగంధితైల
మున భర్గునకుం దలయంటె నేర్పునన్. జా
హ్నవీ. ౧. ౧౪౬.

సీ. నట్టువల్ ద్రొక్కుఁగా నవయామునీ మహాలం
బుగాదు రణస్థలంబు గాని. సిం.నార.౧౫.

నట్టువకాఁడు=నట్టుగుఁడు.వి.(నట్టువ+కాఁడు.)
ఆటకాఁడు, నర్తకుఁడు.

సీ. పంచాంగమయ్యకుఁ బాగ సమర్పించు నట్టు
వకానికిఁ బెట్టు మురువు. హంస. ౫. ౧౩౪.

నట్టువచావడి. వి.(√నట్టువ.)నాట్యశాల. (ప్రా.)

నట్టువడు. అ. క్రి.(నట్టు +పడు.)వికృతినొందు.

క. కటపెట తొటతొట రాలెడు,పాటపాటచి
నుకుల ధరిత్రిపాడ నట్టువడన్, సాటసాట
నాఁకట సోలుచుఁ, దటతటపడుచాతకముల
దైన్యము వాసెన్. వైజ. ౨.౧౪౬.

వ... వెన్నెలచేత నట్టువడినమణికుట్టిమంబులు
తుడిచి...ఉ. హరి. ౩. ౧౩౫.

నట్టువపక్కి=నట్టుపులుఁగు.వి.(నట్టువ+పక్కి.)
-నాట్యముచేయుపక్షి- నెమిలి, మయూరము.

క. కొక్కును నట్టువపక్కియు, నెక్కుడులు
గ నమరుకొమరు లిరువురు మ్రోలన్,నిక్కు
చు నాడఁగ నెలమిన్, జొక్కుడు వేలుపు
లరాయ సోఁకుడురాయా. అచ్చ. రా.
యు. ౫౭౭.

ఇళ్లే : నట్టువపిట్ట, నట్టువపులుఁగు.

సీ. కొదమనట్టువపిట్టరొదలు తాలిమిఁ ద్రోయ
వెలిలావుపులుఁగుచా ల్విసము గ్రాయ.రసిక.
౩. ౯౪.

సీ. పురి విచ్చి నట్టువపుల్గు లాడెడుచోటఁ బడఁ
తి వేనలి యంచుఁ బరువువెట్టు. అచ్చ.రా.
అర. ౭౫.

నట్టువము. వి. (√నట్టు³. సం. నాట్యమ్. ప్రా.
నట్టం.) నాట్యము. (చి. ని.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నట్టువముట్టుకాఁడు. వి.(నట్టువ+ముట్టు+కాఁడు.) నాట్యపరికరములు కలవాఁడు.

ఉ. నట్టువముట్టుకాండ్రు కెలనం బొరిఁ గుండలు పువ్వుదండలున్, బట్టినబూదిగిన్నియలు పళ్లెరముల్ పయిఁగంట మగ్గపుం,బట్టురువార మట్టు శివబాఁపనతండము దండఁ గోడెకాం, డ్రట్టునిటున్ బరాబరుల నగ్రమునం దతకారు లేఁగఁగన్. పాంచా. ౧. ౭౯.

నట్టువాఁడు. వి. (నట్టు³+వాఁడు.) నట్టువుఁడు, నటుఁడు.

సీ. బండలు బూతులు పరిహాసకులు నట్టువారాదిగాఁ గలవారు దక్కఁ, బెఱవారియాలు తాఁ బ్రియుఁడు వారింపంగఁ బరుఁపోడఁ బల్కినఁ బణశతంబు. విజ్ఞా. ప్రా. ౧౧౬.

నట్టువుఁడు=నట్టుగుఁడు. వి. (√నట్టు³.సం. నర్తకః. ప్రా.నాట్టఓ.) నాట్యముచేయువాఁడు,నటుఁడు. (వేశ్యల కాటగఱపునటుఁడు అని శ. ర.)

సీ. నట్టు నట్టువుఁ డన నటుఁ డగు...ఆం. పదా. నర. ౭౯.

వ...గోండ్లి పరిఢవించునట్టువులునుం బోలెఁ జాలెలు చూపి...పోరునవసరమున...ఉ.హరి. ౪. ౨౫౬.

మ... నాలిగ్యాద్పులపేరం గలనట్టువుల్ గఱపఁ గోపుల్ చూపులేఁదీవపాత్రల కయ్యామని పూవుము త్తెపుసరుల్ దాల్పంగ నిచ్చెం గడున్. యయా. ౪. ౧౨.

నట్టువొజ్జ. వి. (నట్టువ+ఒజ్జ.) నాట్యోపాధ్యాయుఁడు, నృత్యము నేర్పువాఁడు.

గీ. ఇన్ని తెఱఁగుల శ్రమము సేయింతుఁ జతురతావిహీనము లైనపాత్రములనైన, నట్టువొజ్జ నై మెలఁగుదు నగళులందు. భార. విరా. ౧. ౨౪౨.

నట్టుసేయు. అ.క్రి. (నట్టు³+చేయు.) నాట్యోపాధ్యాయత్వముచేయు.

సీ. వజ్రకుట్టిమశోభ వరమౌక్తికస్యందనచ్ఛాయ కేప్రొద్దు నట్టుసేయు. నిరం. ౧.౪౩. (వెంపొందించు అని భావము.)

నట్టె. వి. ౧. సంతోషముచే చేయునాట్యము.

సీ. శుభశోభనముల దుస్తులాసంగ వెన్కముందులకు నట్టెలు సేయఁగలరుగాక. చంద్రా. ౩. ౪౩. (తాళపత్రప్రతులు, ముద్రి. పా. నద్దెలు. శ. ర. పా. చూ. దుస్తు.)

నట్టెండ. వి. (నడుము+ఎండ.) తీక్ష్ణాతపము, తీక్ష్ణముగా కాసినఎండ.

మ. ఇవముం గందువలం జలంబునను నట్టెండల్ వెసం గాయువేసవులం బంచమహాగ్నిమధ్యమున...నిల్చి చేసెఁ దపముం దాత్పర్యధైర్యంబునన్. పి. శకుం. ౨. ౧౧౨.

నట్టెము. వి. భిక్షాపాత్రము.

ద్వి. కప్పెరనట్టెంబుఁ గక్షపాలయును, నొప్పుగా బిగిసినయోగపట్టెయును. ద్వి. పరమ. ౨. ౭౨ పా.

నట్టేఱు. వి. ఔ.(నడుము+ఏఱు².) ఏటిమధ్యము, నదీమధ్యము.

సీ. నట్టేట దాశకన్యకకు నువ్విళులూరి జాలిఁ బొందినపరాశరువిరాళి. నైష. ౭. ౧౫౧.

సీ. నెఱసు వెట్టితి పరాశరులంతవాని నట్టేటఁ బామరకన్యగాటు మఱపి. పి. శకుం. ౩. ౧౪౯.

సీ. పాఱుఁడ నని పట్టపగలు నట్టేటిలోఁ బలువ చేతలకుఁ బాల్పడినవాని. విప్ర. ౪. ౪౪.

నట్టేటికెదురీఁదు = మిక్కిలి కష్టమునొందు.

క. మాటికి నీకసంసారం, బేటికి ననుబుద్ధి పుట్టఁ బృథ్వీశ్వర న,ట్టేటికి నెదు రీఁదినగతి, పీటికి వచ్చితి విమరలివిన్నఁదనముతోన్.వరాహ. ౨. ౫౩.

నట్టేటఁద్రోయు = పరిత్యజించు, విడిచిపెట్టు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. ...చను నే నట్టేటఁ ద్రోయ శరణాగతులన్.
దశా. ౧. ౧౩౨.

నట్య. సం. వి. అ. స్త్రీ. నటులసమూహము.

నట్లొట్లు. వి. బ. జలధార లోనగునవి నిరంతర ముగా పడి ఉడిగినవెనుక అచ్చోట నిలిచి నిలిచి పడెడుబొట్లు; చూరునుండి పడిన నీటి బొట్లు.
సీ. నవమాలికలతేనె నట్లొట్లు పడుచోట మాణిక్యదీపముల్ మలయుచోట. మనుచ. ౩. ౧౧౧. ("తేనె నట్టొట్లుపడుచోట" శ. ర. పా, "తీవె నట్టుట్టిపడుచోట" ముద్రి.పా.)
గీ. వాన వెలిసియుఁ జూరునఁ బడిననీరు, బొట్లు వంగుళ్లు నాఁగ నట్లొట్లు నాఁగఁ, బేరులు వహించు...ఆం. భా. ౧. ౪౫.

నట్వాలు=నటవాలు. (శ. ర, బ్రా, చి. ని.)

నడ=నడక, నడత. వి. (√నడచు. క. నడె. త. నడై. మ. నట.) ౧. నడక, గమనము.
సీ. కొలఁకులకొలఁకులఁ గూడి క్రీడించుచుండెడునంచతండంబునడబెడంగు. భార. అను. ౧. ౧౮౧.
క. భువి నంతదవ్వు నేమును, తవతవ లే కరుగుదుము హుటాహుటినడలన్.మనుచ.౧.౪౬.
ఆ. వీరసేనసుతుఁడు వీరుండు హంసల, నడబెడంగుఁ జూచి నగుచు వాని, నెగచి యెగచి యందు నెగయకుండఁగ నొక్క,హంసఁ బట్టుకొనియె నతిరయమున. భార. ఆర. ౨. ౧౨. రా. వి. ౨. ౫౯.
౨. అశ్వగతివిశేషము.
చ. జవమున భంజళిన్ మురళిఁ జౌకమునన్ నడనైదుధారలన్...రూఢి కెక్కి యా,హావజయశీలముల్ గలుగునశ్వము లెన్నఁగఁ బెక్కులప్పురిన్. భా. రా. బాల. ౩౦.
విశ. నడచునది. (చూ. నడగొండ మొ.)

నడక=నడ, నడత. వి. (√నడచు.) ౧. గమనము.
గీ. ఇపుడు ఘటికాద్వయం బయ్యె నినుఁడు పొడిచి, దవ్వు చాల దిచ్చోటికి దక్షవాటి, కేవలము మంచినడ కైనఁ గీస వెల్తి,రెండుజాములు నిట నూర కుండ నేల. భీమ.౪.౪౬.
౨. ప్రవర్తనము.
క. ననుఁ దేటిచూడఁ జెల్లదు,నినుఁ జేసినబ్రహ్మకైన నిక్కువ మిది యీ,యనుచితపునడకనాయువు, కొనసాగమి నెందు నీకుఁ గొఱగా దంటిన్. రామా. ౬. ౧౬౧.
చ. శివుఁ డిటు ర మ్మటంచు దయ చేసినచోఁ దల కెక్కి తుగ్రవై,భవమునఁ జూచుచో నడుగు వట్టితి వే మన వచ్చు నీగుణం,బవునవు నందినన్ సిగయు నందకయున్నను గాఘ్లుపట్టుకొం,దువు హరిణాంక వేలకొలఁదుల్ గద నీనడకల్ దలంపఁగన్.విజ.వి.౩.౫౧.
౩. వృత్తి, జీవనోపాయము.
సీ. నడక యనంగను నడత యనంగను నడవడి యనఁగను నడరు వృత్తి. ఆం. భా. ౨. ౨౨౮.

నడకము. సం.వి.అ.న. మూఁపులనడుమ కిక్కసకసవువలె నుండునొ కానొకయెముక.(వాచ.)

నడకీయము. సం. విణ. (అ. ఆ.అ.) కిక్కసగడ్డి కలది. (దేశాది.)

నడకొలఁకు= నడబావి. వి. (నడ+కొలఁకు.) దిగుడుబావి.
క. ఒడికపుఁదనసొబగున క్రొక్కడు చెన్నులు గలుగఁ జూచి కొల నాయన్నుల్, నడకొలఁకు లంచు వారికిఁ, గడువేడుకఁ దమ్మితావి కానుకఁ జేసెన్. యయా. ౩. ౫౪.

నడగఁడు. వి. (√నడ.) అశ్వవిశేషము, ఒకజాతి గుఱ్ఱము; గుఱ్ఱము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. ఒసరించిననీలని నడ,గని బొల్లనిఁ గత్తలానిఁ
గైరని సారం, గని జారని జన్నని నిమ,వని
మొదలుగఁ దెచ్చి నిలిపె వాహకుఁ డెదు
రక్. ద్వా. ౩. ౧౪౧.

వ...మందరును దూరంబు గా వచ్చితిమి నడగఁ
డు నడ తెగె...పి. శరుం. ౨. ౭.

గీ. పటుపుటంగడివీథు లేర్పఱచి కొంచె,పాటి
నడగని నెక్కి యాపాళె మెల్ల,విడియ నియ
మించి తిరిగె...కువల. ౨. ౭౫.

గీ. తత్తడిరవాలు నడఁగఁడు కత్తలాని, తురికి ఖా
ఖా యనఁగ నొప్పుఁ దురగమునకు. సాం.ని.
తిర్య. ౭౧.

నడకొ(గొ)ండ. వి. (నడ+కొండ.) నడక కల
కొండ.

వ...నడుచునడకొండగమియునుం బోనిగజరా
జితో రాజు రథారూఢుండై...భార.భీష్మ.
౧. ౧౩౦.

చ. తనువున నెల్ల రక్తజలధారలు గ్రమ్మఁగ
వారణేంద్రుఁ డే,పున నెలయేఱు లొక్క
మొగి బోరనఁ బెక్కడరంగ లీలఁ గై,
కొని ఘనకేళి సల్పునడకొండగతిక్ సము
దగ్రమూర్తియై. భార. భీష్మ. ౨. ౨౪౦.

గీ. క్రొవ్వి నడగొండకైవడి గునుకునొక్క,యొం
టిగాని మహీనాథుఁ డొదిఁగి యేయ. మను
చ. ౪. ౪౩.

నడగొట్టు. అ. క్రి. (నడ+కొట్టు.) నిలుచు,
ఆఁగు, ఉండు.

క. పోక నడగొట్టి తేనియు, రాకింతుఁజుమీ
మొగంబు రాచట్టుపయిం, శ్రీకాశిక నిందిం
చిన, నీ కింతట నేల పోవు నీచచరిత్రా.
భీమ. ౨. ౧౫౩. (ప్రయోగాంతరము మృ
గ్యము.)

నడగోట. వి. (నడ+కోట.) నడక కలకోట.

సీ. రంగదుత్తుంగతరంగసంఘాతంబు నడగోటల
తెఱంగు నడుపుచుండ. ప్రభా. ౧. ౬౪.

నడచియాడు=నడచు. (√నడచు.)
(ప్రవర్తించు.)

సీ. ధర్మంబు కాశికాస్థానమధ్యంబున నాల్గుపా
దంబుల నడచియాడు. కాశీ. ౨. ౫౦.

నడచు=నడిచియాడు, నడయాడు, నడుచు.అ.క్రి.
(త.నడక.క.నడె. మ. నటక్క. తు.నడపుణి.)

౧. గమనముచేయు, చరించు.

వ...మార్తాండుండు కొండప్రక్కం జిక్కి క
డలిమొగయక్కలిం దగులువడినజోగునుం
బోలె నెదురు నడవ మఱలం బఱవ లేక చీ
కాకుపడి యున్నవాఁడు...కాశీ. ౨. ౯౭.

ద్వి. కడఁగి దుశ్శకునముల్ గనిపింప నిటకు, న
డచితి నటుగాన నావివాహమున, కేకీడు పు
ట్టునో యెఱుఁగంగ రాదు. ద్వి. నల. ౨.
౬౦౭. (ఇట వచ్చు అని భావము.)

౨. పోవు, వెడలు.

క. సేనమొగ మీతఁ డైనం, బూని మహీశ్వ
రులు నీకుఁ బొడిచెదరే, దుర్మాని యని కాదె
యీతని,తో నడచుట కొల్లనైతి దురమున
కధిపా. భార. ఉద్యో. ౪. ౨౪౪.

గీ. నడచెఁ దుండీరదేశంబునడిమిచాయ,గగన
ఘంటాపథంబునఁ గమలహితుఁడు. కాశీ.
౧. ౧౨౬.

క. విడిపించుకొని మఱుంగున, నిడినతనదుభూ
షణంబు లెల్లను బ్రేమక్, దొడిగి గృహం
బున కల్లన, నడచెఁ బతిచరిత్రభావనల మన
మలరక్. కళా. ౪. ౧౦౨.

౩. ప్రవర్తించు, నడచుకొను.

ఆ. యోగ్యతృష్ణదారు లుచితంపుఁగోలఁదిమై,
నడచినట్టివారు బెడిదములకు, నంత సొత్తు
రెట్టు...భార. ఉద్యో. ౧. ౩౦౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. ఇది చెప్పినట్లు చేయుదు, మిది పంచినయట్ల
నడతుమిది కల్యాణా,భ్యుదయనిధానము మా
కని, హృదయంబులఁ దలఁచుచుండి రిరుదెస
వారల్. హర. ౬. ౧౦౪.

క...తాళే దిక్కుగ నడతు రళంక నల్లికొని దు
స్సచిపుల్. ఆము. ౪. ౨౨౭.

౪. జరుగు.

గీ. శాముఖంబునఁ గార్యంబు నడవ దేమి,సేయు
వాఁడ నొం డెద్దియుఁ జెప్పలేదు. భార.
ఉద్యో. ౩. ౩౨౬.

క. ము న్నొక్కపట్టనంబున, సొన్నారిమిటారి
నేర్పు శూరత్వము నైకొన్నది యై నడచిన
కథ, చెన్నుగ విని పొమ్ము కడువిచిత్రము
కొమ్మా. హంస. ౨. ౧౪౪.

౫. చెల్లు.

క. దేవా క్రమక్రమంబునఁ, బావనులై సృష్టిఁ
గలుగుప్రజ లీకరణిఁ, గైవల్యంబున కేఁగె
డు, హావళిచే మాకు నడవ వధికారంబుల్.
వరాహ. ౧౦. ౧౪.

౬. (గ్రాసము) కడచు.

గీ. తగినవేషంబు దనుఁ దాన పొగడుకొనమి,
నొచ్చియును గీడు వలుకమి యిచ్చి వగవ,
కునికి దన కెంత నడవకయున్నఁ బథము, ద
ప్ప కుండుట నడవడి కొప్పు సేయు. భార.
ఉద్యో. ౨. ౪౫.

సీ. గతి లేక దాస్యంబు గైకొని దానిచే గ్రాసం
బు నడవక కడుఁ గృశించి. కవిక. ౫.౧౪.

౭. ఉండు.

సీ. ఇఁకఁ గావు మఱింతు నే నోయఖండదయా
సముద్రుండ నాయందుఁ గరుణ, నడవఁ గట్టి
పగఱ నడగించి తే నేమి చెప్ప నమోఘ
వాంఛితుఁడ నగుదు. రాఘవ. ౪. ౭౧.

౮. కవియు.

ఆ.స్వశ్శ్రీలనికురంబవనశిఖి మేఘనా,దాభిధా
నుఁ డాబలాఢ్యుమీఁద,నడచి దురమొనర్చె
నభమున నుండి నిర్జరులు బెగడ నిగుడుసాయ
కముల. రాఘవ. ౪. ౨౧౬.

నడనిచ్చు=నడువనిచ్చు.

సీ. అడుగైన నడనీక యాఁకవెట్టినసిగ్గు సంపూ
ర్ణమదధారసరణిఁ బొదల. కళా. ౫.౧౦.

జః నడ, నడక, నడకొండ, నడకోలఁకు, నడగఁడు,
నడగొట్టు, నడగోట, నడచియాడు మొ.

నడజోదు. వి.(నడ+జోదు.)పదాతి,కాలిబంటు.

వ...అడిదంబులఁ బొడి పొడి గా నడుచునడ
జోదుభటులును ...ఉ. హరి. ౪. ౨౯.

నడత=నడ, నడక, నడితి. (√నడచు.)
(నడవడి, ప్రవర్తనము.)

సీ. కామపాలాఖ్యుఁ డై గరిమ సర్వజ్ఞుఁ డై నర
వరోచిత మైననడత యెఱిఁగి.నరస.౧.౭౦.

శా... బలిమి యెవ్వాఁ డొందు వాఁడేకదా,
త్రైలోక్యంబున మేటి యానడతయే ధర్మం
బు యత్నేశుపై, నేలా యీమొగమోట
యాతనిపురంబే లంక శంకింపఁగఁ. ఉ.
రా. ౨. ౨౭౪.

గీ. ఇట్టిమీవారినడతలు గట్టిపెట్టి.శశాం.౩.౮౧.
(వృత్తి, జీవనోపాయము.)

సీ. నడక యనంగను నడత యనంగను నడవడి
యనఁగను నడరు వృత్తి. ఆం.భా.౨.౨౨౭.

నడతాడి. వి. (నడ+తాడి.) నడక కలతాడి.

క. పొడువును బోడియు నై యిల, నడతాడిం
బోలి కరమునం బుస్తకపుం,దడక ధరియిం
చి కటిఁ జిం, పుడువల్కము దూల బుద్ధము
ని శిష్యునిలోఁ. ప్రబోధ. ౩. ౭౦.

నడతెంచు. అ. క్రి. (√ నడచు.) ౧. వచ్చు.

ఉ. దంతిఘటల్ మహోగ్రసముదగ్రతతో నడ
తేర...భార. కర్ణ. ౧. ౪౫.

ఉ. ఆవసుధేశు లింక మకరాలయ మేఁగతిసైన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దాఁటి సు, గ్రీవపురస్సరంబుగ నొగిన్ నడ
తెంతురు తప్ప దాహవం,బెవెర వాచరించి
న జయింతుము చెప్పఁడు...భా. రా.యు.
౫౦.

ఉ. అన్న కుమారచంద్ర తగునయ్యె నిరంతర
దుఃఖవార్ధిలో,న న్నిటు ముంచి యీవిధము
నన్ భయదాటవులం దపంబు సే,య న్నడ
తెంచి తిట్టు ...వి. పు. ౨. ౫౦.

౨. పోవు.

వ...నాకంబు వెడలి యాకసంబున నడతెంచు
చున్న సమయంబున...ప్రభా. ౧. ౫౩.

ఉ. పాండవకోటిచూడ్కు,లకుఁ బండువు గాఁ
జనుదెంచె ధృష్టకే,తుండు సహోదరుండు
తనతో నడతేరఁ బరాక్రమోద్ధతిన్.భార.
భీష్మ. ౧. ౧౧౪.

చ...దిగంతభా,గములు వగుల్పఁగా నెదురుగా
నడతెంచిరి వైరికోటికిన్.హరి.ఉ.౯.౧౬౪.

నడతెగు. అ. క్రి. (నడ + తెగు.) నడక తెగిన
దగు, శ్రాంతమగు, డయ్యు.

వ...మందకును దూరఁబుగా వచ్చితిమి నడగఁ
డు నడతెగె మానిసి మట్ర చిట్టాడనియాచి
ట్టడవి నెట్లు చన నేర్తు ... పి.శకుం.౨.౮.

నడత్రోవ. వి. (నడ + త్రోవ.) నడుచుట కుపయో
గించుమార్గము.

(విష్ణుపాదవర్ణనము.) చ. బలికి మణీకిరీటము సు
పర్వులకున్ నడత్రోవ ఘూలికిన్, జలకము
బిందె మానిజనాధునికాంతకు జీవనావ.థం,
బు...చంద్రా. ౧. ౫౬.

నడది(దీ)వియ. వి. (నడ + దివియ.) కరదీపిక,
దివటీ, కాఁగడా.

సీ. నడదివియలు సేసె నగరికి మాణిక్యమకుట
ముల్ పూనినమనుజపతుల. భార. విరా.
౫. ౩౨౦.

వ...నడదివియ లై మకుటారవిందరాగంబులు
వెలుంగ నలుగడల సామంతసందోహంబు
క్రందుకొన ...మనుచ. ౫. ౩౧.

వ...ముందఱం జనుమూర్ధాభిషిక్తుల మణికిరీటం
బు లనునడదీవియలతోడం గూడి ...నైష.
౬. ౭౦.

నడదీఁగె. వి. (నడ + తీఁగె.) నడక కలతీఁగె.

ద్వి. నడదీఁగెలో యన నవకంపుఁగాంతి, కడు
నొప్పుమేనులు ఘననితంబములు, చిఱుతన
వ్వులు తీయచెయ్యులు గల్గు,తెఱవలు వల
రాజుదీమంబు లనఁగ. రం. రా. ఉ. ౧౧౦
పా. ౧౦ పం.

నడపందిరి. వి. (నడ + పందిరి.)-నడక కలపందిరి-
ప్రయాణకాలములందు రాజాదులయుపచారము
నకై పరిచారకులు మోసికొనిపోవుపందిరి.

ద్వి. ఉడువీథి గప్పి సమున్నతలీల,నడపందిరులు
వెలిగొడుగులుదనర.బస.పు. ౨. ౧౬౨ పం.

నడపాడు=నడుపాడు. అ. క్రి. (నడపు + ఆడు.)
నడచు, సంచరించు.

(పార్వతి.) సీ. కలహంసకులమందగమనంబున
య మిట్టిదని చూపుగతి నడపాడఁ దొడఁగె.
కు. సం. ౩. ౨౩౫.

సీ. నడపాడ నేర్చిననవకంపులత లనఁ బొలు
పొందువెన్నెలబొమ్మ లనఁగ. ధనా. ౨.
౨౩. కు. సం. ౫. ౬౦౦.

నడపించు=నడపు.

(గమనింపఁజేయు, చరింపఁజేయు.)

సీ. పూరియుఁ గట్టి మల్ నీరును గలపథంబున
సేన నడపించుభూరిశక్తి. ఉ.రా.౪.౧౪౬.

గీ...నీయడుగుఁదమ్ము, లెంతదూరము నడపింప
నిచ్చగించె. నైష. ౪. ౩.

(ప్రవర్తిల్లఁజేయు.)

గీ...నీయభ్యనుజ్ఞ, ననుమతింపుము...రాజు నడ
పింప కెట్లు ధర్మంబు నడచు.కాశీ. ౬. ౩౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నడపీనుఁగు. వి. (నడ+పీనుఁగు.) నడచునట్టి శవము.

ఆ...అర్థంబు సువ్వె సకలధర్మకారి, యొడమె లేనివాఁడు నడపీనుఁగనునహు,ప్తోక్తి వినమె దాని నూఁద వలదె. భార. శాం. ౧. ౪౯.

క. గడ నుడుగుమగనిఁ జూచిన, నడపీనుఁగు వచ్చె ననుచు నగుదురు సుమతీ.సు.శ.౪౩.

నడపు= నడపించు, నడిపించు, నడుపు. స. క్రి. (√నడచు.) ౧. గమనింపఁజేయు.

ఆ. మూలబలముతోడ మోహరంబుగఁ దీర్చి, సుమతిసుతుఁడు సైన్యసమితి నడపె. విక్ర. ౫. ౭౪.

క...ప్రహస్తుఁడు ముంగలి, యై రాక్షససేన నడపె నపుడు నృపాలా. ఉ. రా. ౨. ౩౨౯.

౨. ప్రవర్తింపఁజేయు.

క. నానావిధభూతమయము, మే నతిచంచలము మనము మెయికొని నిక్కం, బేనరునకుఁ జెల్లింపం,గా నగు సత్యంబు నడపుక్రమ మట్లుండెక్. భార. విరా. ౧. ౧౯౩.

గీ. క్షత్త్రియునిఁ దెచ్చి తొలితొలి గద్దియనిడి,పట్టబద్ధుఁ గావించుచోఁ బ్రజలు దమ్ముఁ, గావ ధర్మంబు నడపను గాదె సమయ,మర్థిఁ బలుకుదు రీ వది యరయ వలదె. హరి. పూ. ౧. ౧౦౩.

౩. జరుపు.

సీ. వెలివెలివస్తువుల్ విడిచెఁబో నరుఁడు కర్షితం గాదె శరీరయాత్ర, నడపువాఁ డది మోక్షణంబు కానేరదు...భార.శాం. ౧.౭౪.

గీ. ఇట్లు తనుయాత్ర నడపు ము న్నిలనితాల. ఆము. ౪. ౧౯౦.

ఆ. తా నెఱిఁగినకొలఁది నానారివృత్తాభి,ధాన కథ లొకింతతడవు నడపె. రాఘవ.౪. ౩౭. (చెప్పె నని భావము.)

౪. ఆచరించు.

క...అద్దనుజునిఁ, బొడ వడఁగింపఁ దలంచి భూరి వ్రతముక్.

చ. నడప మదాత్మయగ్ని యయి నావదనంబున నిర్గమించి...భార. అను. ౪. ౪౦౭,౪౦౭.

గీ. వరుస నడపిరి వీరశైవవ్రతంబు. హర. ౨. ౧౧౯.

౫. పోషించు.

చ. పడసితి నిమ్మహాత్ముల నపాయము నొందక యుండఁ బెంచుచుక్, నడపు మటంచు నన్ను మునినాథుఁడు మీజననుండు పంచి ...భార. ఆది. ౭. ౩౦౫.

ఉ...ఆత్మతురగంబుల కెల్లను నన్న యుత్తుఁగా, నర్మిలి నిల్పి యీఁగియుఁ బ్రియంబును నాయెడ నాఁడునాఁటికిం, బేర్మి వహించుచుండ నడపెం దనతమ్ములలోనివానిగాక్. భార. విరా. ౧. ౨౬౭.

సీ. పడఁతి నే నడపినబాలసారంగంబు ఋషినివాసముల కర్పింపు మమ్మ. చంద్ర.౪.౧౬.

౬. సమకూర్చు.

క. ఆకోడండ్రకు సొమ్ములు, కోకలు ననులేపనములు కొదయించుకయుఁక్, లేక ప్రవర్తిల నడపెన, నాకులతం గొమరుడెంద మలరారుటకై. కళా. ౬. ౭౧.

౭. పొందు.

సీ. రాజుగ్రసేనుఁడై రాజిల్లఁ దాను దీర్ఘరితవం బెంతయుఁ బ్రభుతతోడ, నడపువాఁ డయ్యెసన్మాన్యుఁ గాశ్యపుఁ డనువిప్రుఁ బురోధ గావించె...హరి. ఉ. ౨. ౧౬౭.

౮. ఇచ్చు.

వ...త్రిభువనాంక్ష్మాళెమానిత్య మానెండునె ఇ నడపం గ్గలాండు ఆచంద్రార్కము గాను. దా. శా. ౧౧౯౧.

౯. గమనము, నడక.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆ... పాదతలముఁ జనుకట్టుఁ గచము న్వానన
ము నడపు నద్రితనయ కమరు. కు. సం. ౭. ౧౨.

సీ. అల్లఁదవంబున యనువు మైకొనఁ జూచు న
డపు కాంతికి వింతతోడవు గాఁగ. భార. విరా. ౧. ౨౪౫.

చ. నడపుతెఱుంగు మాటజతనంబు నపాంగవిలా
సముల్ ముకుం, గిడినబెడంగు ముద్దుమొగ
మించుక వంచినసిగ్గుఁ బార్వతిం,దడ మఱు
పంగ నొప్పెసఁగె దర్పకవైరికి...ఉ.హరి. ౫. ౫౭.

నడపుకొను= నడుపుకొను. స. క్రి. (నడపు+కొను.) పోషించుకొను.

గీ. ఉనిచి కడుగారవంబున ననఘచరిత, నట్ట
నడురేయి చెప్పచున్నాను మమ్ము, నరమ
రలు లేక మీయుపాధ్యాయువలెను, నడపు
కొనువార లెవ్వ రున్నారు గనుక. విప్ర. ౪. ౬౫.

నడప్రాయము. సం. విణ. (అ. ఆ. అ.) కిక్కసకసవు అధికముగా కలది. (దేశాది.)

నడబావి. వి. (నడ + బావి.) నడచిపోవుటకు మెట్లేర్పఱచినబావి, దిగుడుబావి, దీర్ఘిక.

ఉ. ఆనడబావిదండఁ గలయం జిగిరించినదేవ
దారుశాఖానికరంబుక్రిందట నొకానొక
చో... ధరాధిపుఁ డొంటిసమాధినిష్ఠుఁడై.
తపతీ. ౩. ౯.

సీ. విమలంబు లైనకూపములు నూటికిం బెఁ
బరికింప నొకనడబావి మేలు. కృ. శకు. ౩. ౧౧౭.

సీ. కడ లేనియమృతంపునడబావి సంసారి...
మనుచ. ౧. ౬౬.

నడభక్తము. సం. విణ = నడప్రాయము.

నడమామిడి. వి. (నడ+మామిడి.) నడక కల మామిడిచెట్టు.

క. కలయఁగఁ గరములఁ జరణం,బుల నురమున
శోణితంబు బోరనఁ దొరఁగం, దలి రెసఁ
గిననడమామిడి,చెలువునఁ బఱతెంచె భీమసే
నుఁ డచటికిన్. భార. భీష్మ. ౩. ౨౨౩.

నడమీనము. సం. వి. అ. పుం. కిక్కసకసవు నడుమనుండుచేప, చిలిచిమము, తేలుమీను.

నడమము. సం. వి. అ. పుం. కిక్కసకసవు.

నడయాడు= నడచు. అ. క్రి. (√నడ.)
(నడచు; సంచరించు; విహరించు.)

సీ... ఇవ్వామనయన, నడయాడఁ గఱచిననాఁ
డ చిత్తంబునఁ గాంతిమతీకన్యక్రమముఁ ద
లఁచి. దశకు. ౭.౭౫.

గీ. ఇందు రావయ్య విందులు విందు లనుచు,న
రిఁ దనుఁ బిలువఁగ నడయాడి యాడి,యుల్ల
సిల్లెఁ గృష్ణుఁడు శైశవోత్సవముల.హరి.పూ.
౫. ౧౯౦.

సీ. ఘులుఘులు మని యందియలు మ్రోయ నడ
యాడునడుగులా యివి ప్రోదియనుఁగుఁజూల.
సారంగ. ౩. ౨౪౬.

(వీచు, వీతెంచు.)

క. వాడెం బయిరులు కాఁకలు, గూడెం గొలఁ
కులు దవాగ్నిఁ గుజనిచయంబుల్, మాడెం
బ్రాణులపై నడ, యాడెం బలుసెకలగాడు
పక్కాలమునన్. సమీర. ౨. ౯౩.

శా. త్వంగద్వాహఖురాగ్రభిన్నధరణీతత్వంబు
రేణ్వాకృతిన్,మ్రింగె న్వారిధులన్ గ్రసిం
చె హిమరశ్మిత్రాదులం బుష్కరం,బుం గ
ప్పెన్ నడయాడ దయ్యెఁ బవనంబున్ ...
దశా. ౨. ౩౪౯.

(ఉండు, నివసించు.)

క. వచ్చెఁ గద బెడఁద మన కిఁక, నిచ్చట నడ
యాడఁ గూడ దెటకేనియు నే, వచ్చెద ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మటు లైన, న్విచ్చలవిడి నడువవచ్చు వెఱవరు
మదిలోన్. శుక. ౩. ౫౦౨.

నడలింగమూర్తి. వి. (√నడ.) నడక కలలింగ
మూర్తి, చరలింగము.

సీ. నాకు మీపాదార్చనము సేయ నడలింగ
మూర్తి చేకుఱె ... కాళ. ౧. ౩౫.

నడ(డు)వ. వి. (√నడచు. క. నడవ. త. నడై.)
౧. అళిందము, తలవాకిటికిని నడిమివాకిటికిని
నడిమిచోటు.

(వ్యవ.) నీవు మాయింటినడవలో కూర్చుండుము.

౨. సేతువు.

క. ఆచేఁప లిపుడు మీరలు, వైచినమల లెల్ల
మ్రింగివైచె జుమీ యో, రాచల్వ కేఁడ
పదిలుఁడ, వై చెచ్చెర నడవఁ గట్ట నంపుము
నలునిన్. అచ్చ. రా. యు. ౭౪, ౭౭.

గీ. నడవ గావించుమన్న యన్నలుని సేతు,కర్మకా
శల మీక్షించుగగనచరుల, కనిమిషత్వంబు
చరితార్థమయ్యె నపుడు. భా. రా. యు. ౨౫౨

౩. (త. నడవై.) మార్గము; సోపానము.

ఆ... మార్గంబు, తెరువు త్రోవ దారి తెన్ను సర
వి, చనుప నడవ చొప్పు జాడ డొంక యనం
గఁ, బొలుచుచుండు... ఆం. భా. ౨. ౭.

వ... కూలినబావి తెఱంగున నడవ లేక ... కవిక.
౪. ౧౧౩.

నడవడి. వి. (√నడ.) ౧. గమనము, నడక.

సీ. నడవడి గలదివ్యనాగదంతము లట్లు ...గీ...
వెలసి రన్నలువురంత. చం. రా. ౨. ౫౩.

సీ. హిమరౌప్యగిరులఁ బేరెదబల్మి నదలించి
నడవడిఁ జౌదంతిఁ గడకుఁ ద్రోచి. పె.
శకుం. ౧. ౪౩.

క. కుడియెడమనాడులందున్, నడచున్ వాయు
వులు వానినడవడి వెలి లోఁ, బొడగనుచు
నెపుడు మెలఁగున్, నడిమినడక నంటి నె
మ్మనంబు కుమారా. సీతారా. ౧. ౧౮౦.

౨. ప్రవర్తనము, నడవడిక.

క. నడవడి యనుమున్నీటిం, గడవం బెట్టంగ
నోడకరణిం దగి... భార. ఉద్యో. ౨. ౩౯.

చ. నడవడి మంచి దైనను జనంబులు పెద్దఁగఁ
జూతు రాతనిన్, నడవడి చక్కఁగానినరు
నచ్చినచుట్టము లైనఁ జేరనీ, కెడ గలుగంగఁ
దోలుదురు... నా. పంచ. ౧. ౧౦౬.

క. తెలిపితివి సోమసూర్యుల, కులవిస్తారంబు
వారికులము ధరిత్రీ, కులనడవళ్లను వింటిమి
... భాగ. ౧౦ పూ. ౩.

౩. ధర్మము, న్యాయము.

సీ... తమకు, నధిపతియుఁగ నొరు నాసపడక
యుండి నడవడి బహుకారణములఁ జిక్కి,
వడిన విషణ్ణు లై బ్రహ్మఁ గానఁగఁ బోయి
మాకు రక్షకుఁడుగ మహిపుఁ డొకఁడు. గీ.
వలయు రూపింపుము ... భార. శాం. ౨.
౨౫౭.

ఆ. ఎమ్మెకాఁడ యగ్గి యెలగాఁగఁ బెండిల్లి,యైన
చెలిని డించి యకట యొంటి, నేఁగ దగునె
మీర తెఱుఁగనినడవకు, లింకఁ బుడమిఁ గ
లవె యేర్పఱింప. అచ్చ. రా. అయో. ౪౦.

౪. జీవిక, వృత్తి.

సీ. నడక యనంగను నడత యనంగను నడవడి
యనఁగను నడరు వృత్తి. ఆం. భా. ౨. ౨౨౭.

నడవడిక. వి. (√నడవడి. త. నడవడిక్కై.) ప్రవ
ర్తనము. (శ. ర, చి. ని.)

నడవడికాఁడు. విశ. (√నడవడి.) ప్రవర్తనము క
లవాఁడు.

చ. అడిగినఁ దెచ్చువాఁడొ గడు నందమునన్
గన నైనవాఁడొ మే, ల్నడవడికాఁడొ వీటఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దగునాయకమై చరియించువాఁడో ...ప్రబంధ.౬౩౪.

నడశేము. సం. విణ. (అ. ఆ. అ.) నడముతో కూడినది.

నడసంహతి. సం. వి. ఇ. స్త్రీ. కిక్కసగడ్డిమేటి.

నడి. సం. విణ. (న్. నీ. న్.) నడతృణము అధికముగా కలది. (కొండ మొ.)

నడిఁకించు=నడుఁకఁజేయు. స. క్రి.(√నడుఁకు.) వడఁకించు.

సీ... తురగచయము. ఆ. నాల్గుసాయకముల నడిఁకించి సారధి, నొక్కమార్గణమున నుబ్బణంచి, యార్చుటయును ద్రోణుఁ డలిగి ...భార. ద్రో. ౪. ౭.

నడికట్టు. వి. (నడుము+కట్టు.) కాసె, దట్టీ.

సీ.అరచట్ట మయిఁ గుంకుమాఁబువు నడికట్టుచెంగావి మైజిగిఁ జికిలిసేయ. రా.వి.౩.౧౨౫.

(కలికిమూర్తి.) సీ. కడవన్నె జిగిపట్టునడికట్టు పడుదలపట్టంబు నేజాయు బాగుదేర. గీ.వెడలు దిగ్విజయార్థియై...దశా. ౧౦. ౧౧౨.

రగడ. నడికట్లు మేఘవర్ణంబులును ద్రోపులును మొకమాలులును...హంస. ౫. ౩౫౬.

నడికట్టుత్రాడు. వి. (√నడుము.) ఏనుఁగు మొదలగువానినడుమునకు కట్టెడుత్రాడు.

(కళాపూర్ణుడు.) క...తద్వే,దండము నడికట్టుత్రాళ్లఁ దగ బంధించెన్. కళా. ౮. ౮౬.

నడికలను. వి. (√నడుము.) యుద్ధరంగముయొక్క మధ్యభాగము.

వ...నడికలన నింటివారిం దలంచుకొని కేడించి వచ్చి యచ్చటచ్చట మచ్చరంబుల నెదిరి బలంబుల సొచ్చి వ్రచ్చి నొచ్చువారిం జచ్చువారిం జూచి...ఉ.రా. ౪. ౨౮౧.

నడికిరే(యి)=నడిరేయి. వి.(√నడుము.) అర్ధరాత్రము.

సీ. అతఁడును దద్భావ మరయంగ మదిఁ గోరి రూపించి యొకమరి రేప వత్తునని పోయి నడికిరే యర్థితోఁ జనుదెంచు...భార.అర. ౭. ౩౨.

ఉ...త్రెక్కొనుకాఁకచే నడికిరే లరుదెంచిన గోపికావళిన్, బొక్కుఁగఁ జేసి...ఆము. ౫. ౬౮.

గీ. ఈనడికిరేయి నొంటిమై యింతదూర,మేమి కార్యంబు మదిఁ గోరి యేఁగుదెంచి,తి... హర. ౭. ౧౨౩.

గీ. వండ నలయదు వేవురు వచ్చిరేని, అన్నపూర్ణ నుద్ది యా నతనిగృహిణి, యతిథు లేతేర నడికిరే యైనఁ బెట్టు,వలయుభోజ్యంబు లింట నవ్వారి గాఁగ. మనుచ .౧. ౫౬.

నడిగండి. వి. (√నడుము.) యోని,ఆఁడుగుఱి.

సీ. తొడపల్చ నగునింతినడిగండి కడుఁ బెద్ద రిత్తునిమనసుకోరికలు పెద్ద. వేణు. ౨౦.

నడితల. వి. (√నడుము.) శిరోమధ్యము.

(భీమజరాసంధులు.) చ. నడితల లూరుజానుజఘనప్రకరంబులు బిట్టు వ్రయ్యఁగాఁ,బిడుగులఁ బోలు పెన్నదలఁ బెట్టుగవ్రేయుచుఁ బాయుచున్ వెసన్. భాగ. ౧౦. ఉ. ౭౩౬.

వ...అంత నెగసి పగతునడితల బెడిదంపుఁగడంక నడువ...కూలినఁ బ్రతిభటుండు పాలిసె ననుచు...హరి. ఉ. ౨. ౬౧.

నడితి=నడత. (త. నడతై.) ప్రవర్తనము. (బ్రౌ. శ. ర.)

నడిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. నడతృణసమూహము. ౨. నడతృణ మధికముగా కలనది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నడిపించు=నడపు. (√నడుచు.)

(గమనింపఁజేయు.)

గీ. ఘల్లుఘల్లునఁ బెండెంబుగండుమీలు,గదల నల్లన నడిపించి పాదివి తెచ్చె,నెచ్చెలులపించు యువతి నాన్నపతికడకు. మనుచ. ౬.౫.

క. నలకూబరమణికంఠులు, బలముల నడిపింప నర్థపతి తురగముపై, ధళధళితచంద్రహాసో,జ్జ్వలితభుజుం డగుచు నడచె వాసవుమ్రోలన్. పారి. ౪. ౭౩.

(జరుపు, జరిగించు.)

గీ.అనినఁ జెలువవ్వు నవ్వి యజ్జనవరాగ్ర,గణ్యుఁ డతనికిఁ గట్టువర్గంబు లొసఁగి, మంచి దటువలెనే నడిపించుకొంద,మంచు వీడ్కొల్ప నాదై త్యుఁడగుటయును. కువల. ౨.౧౦౪.

(రథము మొ. కడపు, తోలు.)

క. అరదము దశముఖుమీఁదం, బరువడి నడిపింపు వేగ మాతలి యనుచున్. ఉ. రా. ౪. ౩౩౪.

నడిమికట్టు. వి. (√నడుము.) నడుమునకు కట్టుకొనెడుకట్టు.

సీ. కటిమండలంబునఁ గరకంచుపుట్టంబు మడఁచి కట్టినమేలినడిమికట్టు. హర. ౨. ౯౩.

నడిమిన్ను. వి. (నడుము + మిన్ను.) ఆకాశమధ్యము.

చ...కడువేడ్క యొనర్పఁగ బంతి యాడ నెమ్మిని గనకంపుఁగోల నడిమింట నె త్రిమ్మరఁ బారి కొట్టుచున్. ప్రభా. ౨. ౩౦.

క. నడిమింటఁ దపసి డెందపు,నడిమింటం జెలఁగుతమ్మినంటు వెలుంగన్. ఘటికా.౨.౧౧౭.

నడిమిలోకము. వి. (నడుము + లోకము.) భూలోకము.

గీ. కారణం బేమి నడిమిలోకముననుండి,నరపతులు రారు మునుపోలె నాకమునకు. నైష. ౩. ౭.

నడిమివాఁడు. విశ. (√నడుము.) మధ్యముఁడు.

సీ. కూడు లే కాతనిచేడియ ముప్వురకొడుకులలోపల నడిమివాని, మెడఁ ద్రాడు వోసి యమ్మెద నూఱుగోవుల కెవ్వరేఁ గొనుఁడను నెడ...హరి. పూ. ౨. ౪౦.

నడిరాతిరి=నడిరేయి. (త. నడురా.) నిశీథము.

సీ...నడిరాతిరి యన, నడిరేయి యనఁగఁ గాందారిమాందారిప్రా ద్దన...నిశీథాఖ్య దగు... ఆం. భా. ౧.౭౪. ("అపరాతిరి యన నడిరేయి యనఁగ." ప్రాంతవ్రాత ప్రతులపా.)

నడిరేయి=నడికిరేయి, నడిరాతిరి. వి.(√నడుము. త. నడు ఇరవు.) అర్ధరాత్రము.

సీ. నరవర మనవీడు నడిరేయి కృతవర్మయును గృపాచార్యుండుఁ దనకుఁ దోడుగా వచ్చి ...భార. సౌ. ౨. ౩.

ఉ...కొక్కరోకో యని కూయఁడే యతఁడు గుక్కుటమై నడిరేయి గౌతమ,ప్రేయసిఁ బొందఁ గోరి...నైష. ౭. ౭౯. ఆం. భా. ౧. ౯౪.

నడిలము. సం. విశ. (అ. ఆ. అ.) కిక్కిసకసవు కలది. (నేల మొ.)

నడివంక. వి. (√నడుము.) మధ్యభాగము.

సీ. బెట్టుగా నడివంకఁ జుట్టివచ్చినమబ్బు వెలయునేనికతోలు వలువ గాఁగ. యయా. ౨. ౩౬.

నడివీథి. మి. వి. (√నడుము.) వీథియొక్క మధ్యభాగము.

గీ. పెద్దనడివీథి నిలుచుండి భిక్ష యడుగు, నాశ్రమంబునయందుఖట్వాంగపాణి.హర.౫.౫౫.

నడివీపు. వి. (√నడుము.) వీపునడిమిభాగము.

క. ఉలుకుచునె కఠినముష్టిన్, నెటి చెడ నడివీపు వొడిచి నిజభుజముల నేస్తెఱ మెఱయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వానిసందులు, బిఱుసున వెనుకకుఁ గుదించి వెఱికే ల్పట్టెన్. కళా. ౮. ౮౫.

నడివ్రేలు. వి. (√నడుము.) మధ్యమ, నడిమి వ్రేలు.

గీ...నడివ్రే లన మధ్యమ నెగడు...ఆం. భా. ౨. ౧౩౯.

నడుఁకఁబడు. అ. క్రి. (నడుఁకు+పడు. స్వార్థమున.) నశించు.

వ...నిజదాసజనపాపతాపత్రయచయమ్ముల నడుగక నడుఁకఁబడఁ జేయునడుగుతండంబులును ...ఘటికా. ౨. ౬౫.

నడుఁకు(గు). అ. క్రి. (త.నడుంకు. క. నడుగు. మ. నడుంగు. తు. నడుంగుణి.) ౧. చలించు; వడఁకు.

చ. నడుఁకక బాల్యచాపలమునన్ దనపిమ్మటివ్రేలఁ జొక్కపుం,గడియపుటట్టు టంచుఁ ద్రిజగజ్జను లచ్చెరువంది చూడ న,క్కడపటి కొండసాంపు లెఱుఁగం దవిలించి నటించుశూలి పెన్గొడుకు ...వేం. పంచ. ౧. ౪.

ద్వి. కనుఁగొని యిది యేమి కాంత నీచంద, మనవుడు నాలేమ హస్తముల్ మొగిచి, నడుఁకుచుఁ బలుకను నాలుక రాక. రం. రా. ఉ. ౪౨పా ౪. పం. (నడకు ముద్రి.)

గీ. అమరబృంహితహేషితఘుమఘుమితభు,జాసమాస్ఫాలితంబులజడికి నడిఁకి, కులకుధరమండలము కలగుండుపడియె. వసు. ౨. ౧౫౨.

౨. ఒదుఁగు, సంకుచితావయవుఁ డగు.

గీ. వామనుం డైనకైటభవైరివిధము, నభినయించుక్రమంబున నధిపసుతుఁడు, నడిఁకి నడిఁకి యల్లల్లన నడిచి పట్టెఁ, బాణిపద్మద్వయంబునఁ బసిఁడియంచ. నైష. ౧. ౧౦౨.

క. ప్రబ్బికొనినవెంజీకటి, నిబ్బరముగ నడిఁకి నడిఁకి నింగికి వడితో, గొబ్బున నెగసి తటాలున, బెబ్బులి మందావుఁ బట్టెఁ బెలుకుటి యటన్. భాగ. ౬. ౩౫.

ఉ...వాఁడఁం దగఁ బోయి యల్లన నడుంకుచు భూవిభుఁ జేరి నమ్రుఁడై. నిర్వ. ౨. ౫.

౩. నమ్రుఁ డగు.

గీ. బ్రతుకఁ దలఁతేని వినుము నాపనుపు సేసి, చక్ర మాదిగ విడిచి మత్సంజ్ఞ యుడిగి, నడిఁకి చనుదెమ్ము నాశరణమ్ము సొరఁగ.హరి. ఉ. ౬. ౧౯౦.

౪. భయపడు, జంకు; వెనుదీయు.

క. వెఱవార లధికభీతిన్, విఱిగి చనిరి భీష్ముఁ జేచి వీరరథికు లం,దఱుఁ జూచి రాచకొడుకుల, నఱుమాడెడు భీముఁ డిట్లు నడుఁకం దగునే. భార. భీష్మ. ౨. ౨౩౪.

చ. నడిఁకెడువాఁడు గాఁడు గురునందనుఁ డక్కట తండ్రిచావున,ప్పుడు మొగ తప్పి యొండుగడఁ బోరుచు నుండెనో ...భార. ద్రో. ౧. ౯౨.

క. యాదవులు కృష్ణప్రాపున, నాదగువేఁడిమికి నోర్చి నడుఁకక యెదురై, యేదియు నెఱుఁగరు శౌర్యో,న్మాదంబున నున్నవారు మహీమోద్ధతు లై. హరి. ఉ. ౬. ౮౯.

గీ. ఉడుము నడిఁకిన నడుఁకునే బడియపెట్టు. కాశీ. ౨. ౧౪౪.

౫. ఆపదనొందు, ఇక్కట్లుపడు.

చ. అడవులఁ గందమూలముల నాఁకలి దీర్చి తపంబు సేయుచున్, బడలినవృద్ధతాపసుని బాలికలన్ సుకుమారమూర్తులన్,గడుసుఖులైనవారలను గట్టిఁడివై వెసఁ గట్టి త్రోచితిన్, నడుఁకుచు వార లెవ్విధమునన్ దుర పిల్లుచు నున్నవారొకో. వి. పు. ౫. ౧౬౩.

౬. నశించు. (చూ. నడుఁకఁబడు.)

వి. కంపము, చలనము; భయము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(వ్యవ.) నన్నుచూడఁగ నే వానికి నడుఁకు పుట్టి నది. (శ.ర.)
(నడుఁగు ప్రయోగములకు చూ. నడునడు.)
జః నడుఁకఁబడు, నడుఁకొత్తు.

నడుఁకొత్తు. అ. క్రి. (నడుఁకు + ఒత్తు.) నిర్భయుఁడగు.

ఉ. దేవకి మున్నుగాఁ గలసతీనివహంబులకెల్లఁ జూప న,ద్దేవునియాజ్ఞ వాహకులు దెచ్చనె డక్ నడుఁకొత్తి యొంటిమైఁ, జావున కోహటింప కనుసాళ్వుఁడు సాళ్వము దూఱినట్లు యో,ధావలిఁ గిట్టి పట్టె సవనాశ్వము విశ్వభయంకరంబు గక్. జై. భా. 3. ౯౦.

సీ. దేవర మువ్వు రేతెంచిరి వారిలో నడుఁకొత్తి కొంతసైన్యము వధించి. గీ. సవన హరిఁ గొంచు నెగసె నద్దివికి నొక్కఁడు ... జై. భా. ౨. ౪౧.

నడుగడ్డ. వి. (నడుము + గడ్డ. క. నడుగడ్డ.) ద్వీపము, నలుదిక్కుల జలము కలభూభాగము.

క. నడుగడ్డ లిసుకతిప్పలు, మడలు దరులు వాఁకలును గ్రమంబున నొకఁడుక్, గడవఁబడకుండఁ గృష్ణుఁడు, పడఁతులకును యమున యాటపట్టుగఁ జేసెక్. హరి. పూ. ౮. ౩౭. (క్రొత్తప్రతి. పా. నడకట్ట ప్రాతప్రతిపా, నడుకట్ట. శ. ర. పా.)

నడుగాలు. వి. (√నడుము.) గుఱ్ఱములకు శరీర లాఘవమునకై వెనుకకాళ్లకునుముందుకాళ్లకును కట్టెడుసాధనము.

గీ. కట్టుఁగొయ్యలతో నడుగాళ్లతోడ, రక్షణారమయూరమరాళమేష, బలిముఖప్రముఖములతోఁ బంచవర్ణరజ్జువులతోడ బహుమందురలు జనించె. వరాహ. ౪. ౧౧౪.

నడుగుంట. వి. (√నడుము.) తలనడిమిపల్లము, బ్రహ్మరంధ్రము.

సీ. చము రూర నడుగుంట నిమురుచుఁ దలయంటి యంగంబు లెల్లఁ జక్కఁగ దీటి. చంద్రా. ౨. 3.

నడుచక్కి. వి. (నడుము + చక్కి.) మధ్యప్రదేశము.

వ...అయ్యాశ్రమంబునడుచక్కి నుండి యమ్మునీద్రుండు హరిణవత్సంబులకుం జేయువాత్సల్యంబునకు నద్భుతంపడి...హర. ౧. ౩.

క. చందురుఁ గనునరవిందము,చందంబున మోము వంచి సంయమికులసం,క్రందనుఁ డారామద్రుమ,బృందమునడుచక్కి నపు డుపేక్షించుడుక్. వైజ. ౨. ౮.

గీ. ప్రోలిపల్గోటకొమ్మలఁ బులుఁగుతాలు, గతిక యని డాసి చెంతఁ జెక్కడపుసింగములను గన్గొని నడుచక్కిఁ బోవ వెఱచి, ప్రొద్దుతేజీలు బలువడిఁ బోవుఁ గడల. నీలా. ౧. ౩౨.

నడుచు=నడచు. అ. క్రి. గమనముచేయు, సంచరించు.

చ. అడిగితి నొక్కనాఁడు గమలాసను తేరికి వారువంబ నై, నడుచుచు...నైష. ౨. ౫౮.

మ...ద్రవిడాంగనల్ నడుతు రుద్యానంపులోఁ ద్రోవలక్. ఆము. ౧. ౫౬.

క. ఇట నవ్వరూథినియు నొ,క్కటఁ గలిపయ సఖులు దన్నుఁ గొలిచి నడువఁగా, ఝటుల ఝుణంఝుణరవపద, కటకసమాకృష్టకేళికలహంసిక యై. మనుచ. 3. ౭౨. (వచ్చు అని భావము.) దశా. 3. ౧౭౧.

౨. వెడలు, పోవు.

వ...లేదు నడువుండు పాండు కూడ దనునిషేధవాక్యంబులు చెవులు నిండకొన...భీమ. ౨. ౧౦౧.

సీ. నగజామనోనాథునగరికి నడుచువా రెడ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పక క్రొన్నెల ముడుచువారు. భల్లా. ౨. ఆ. (శ. ర.)

౩. ప్రవర్తించు, నడచుకొను.

వ...ఇంత విచారించి రచించినట్లు నడువుము ...ఆము. ౬. ౩౧.

౪. జరుగు, ప్రవర్తిల్లు.

ఉ. ఆగమమంత్రతంత్రములు సాంగము లై నడువంగ...భోగివిభూషణుం గొలుచు పుణ్యుల కబ్బును భోగమోక్షముల్. భీమ. ౩. ౧౦౫.

వ...గురులకుఁ బూజ నడువ దనియు... ఆము. ౪. ౫౩. వి. పు. ౪. ౪.

౫. పుట్టు, కలుగు.

క. కామం బనుపురుషార్థము, నామము వినియు నిదిదక్కనళినాసన యే, నేమియు నెఱుంగఁ జెపుమా, యేమిట నది నడుచు సిద్ధి యెమ్మెయిఁ బొందున్. దశకు. ౫. ౨౬.

౬. ఉండు.

క. వచ్చెఁగద బెడఁద మన కిఁక, నిచ్చట నడయాడఁ గూడ దెటకేనియు నే, వచ్చెద ర మ్మటులైనన్, విచ్చలవిడి నడువవచ్చు వెఱవకు మదిలోన్. శుక. ౩. ౫౦౨.

క...సత్యం, బనఁగా దైవం బనఁగా, జనులకు లేకున్న నెట్లు జగములు నడుచున్. కళా. ౩. ౧౮౨.

౭. అనుభూత మగు, భుక్త మగు.

క...మన్నెవజీర్లకు, నడుచు ముఖాసాలుగాక ...ఉ. హరిశ్చ. ౧. ౬౬.

౮. సరిపడు, అనుకూలమగు.

(వ్యవ.)ఈమందు వేడితత్త్వముమీఁద నడువదు.

౯. అందు, చేరు.

సీ. పని గల్గి యుండినఁ దనరు మంత్రులకు లేఁ జిగురుఁబోఁడులచేతఁ జీట్లు నడుచు. కువల. ౪. ౧౦౧.

జ: నడిపించు, నడుపాడు, నడుపు, నడుపుకొను.

నడుజాము. వి. (√నడుము.) అర్ధరాత్రము.

ద్వి. వారక నడుజాము వచ్చి వేఁడినను, కోరిన ధనములు కొండు కొం డనుచు. ద్వి. హరిశ్చ. ఉ. ౪౭౫ పం.

నడుత(ద)ల. వి. (నడుము + తల.) నడునెత్తి.

సీ. నడుతల యందంద పిడికిట మెదళులు గలఁగఁగఁ బొడిచి మోఁకాల నురము, దాఁకింప ...హరి. పూ. ౯. ౧౩౭.

గీ...గువ్వ...గ్రద్ద వాయస మాదిగాఁ గలుగు పులుఁగు, లడరి నడుతల వ్రేసిన నమ్మనుష్యుఁ, డాఱునెలలుగాని మనఁ డుదాత్తపుణ్య. మార్క. ౩. ౩౪౮.

సీ. చేతులు నడుదల సేర్చు టుత్కటశోక మాకారములు దాల్చినట్టు లుండ. భార. స్త్రీ. ౧. ౯౮.

నడుదింపు. వి. మాంసవిశేషము. (శ. ర.)

వ... మృగంబులనడుదింపునఁజూడు నపులినయతం డంధుండును బంగుండును నై యావిర్భవించు...మార్క. ౨. ౧౧౫. (శ.ర.పా. మృగముల నడిచి వీపునంజూడు అని ముద్రి.)

నడుదీవి. వి. (నడుము + దీవి.) మధ్యద్వీపము.

సీ. పుష్పకేతనువలపులయేటినడుదీవి శంబరారాతియార్జవపుఠీవి. వైజ. ౧. ౧౦౨.

నడుదెస. వి. (నడుము + దెస.)మధ్యప్రదేశము.

క. వెలయుఁ బెనుబైలు నిషధాచలకూటము నందు నడుదెసన్...వరాహ. ౧౦. ౧౩౫.

నడునట్టు. వి. (నడుము + నట్టు.) మధ్యస్థానము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. పాటలం బగుజటాజూటంబునడునట్టుపూప
చుక్కలరాజు పొడవుచూపు. భీమ. 3. ౧౯.

నడునడు. వి. నడఁకుటయం దగుననుకరణము.
సీ...భండనమున, వారిహేతిచ్ఛత్రవాహనధ్వ
జములు నఱకిన నడునడు నడఁకి వార, లభ
యంబు వేఁడిన నందఱఁ గృపఁ గాచి...
భార. ద్రో. ౨. ౨౦౬.
క. వాలుపయి నడచున ట్లు,బ్బాలిక నడునడు
నడింగి భయమున...భార. ఆది. ౨. ౧౫౫.
వ. అక్కన్యకయు నట్టితేజోరూపంబు నూచి
విస్మయంబునను భయంబునను గడు సంభ్ర
మించి నడునడు నడుంగుచున్న దాని నోడ
కుండు మని సూర్యుండు ప్రసన్నుండై...
భార. ఆది. ౫. ౨౧. (వ్రాతప్రతి. పా. నడున్నడనడుంగు ముద్రి. పా.)
(సతీదేవి.) వ... భయంబున నడునడు నడుంగు
చు...కు. సం. ౨. ౧౭౪.వ్రాతప్రతిపా.

నడునీరు. వి. ఔ. అనా. (నడుము + నీరు.) నీటి
నడుము, జలమధ్యము.
క. వననిధినడునీటఁ గలము, మునిఁగిన బెగడందు
చిత్తములు గలిగినత,జ్జనులక్రియ నున్న సే
నలు... భార. ద్రో. ౧. ౨౬.

నడునె(డ్నె)త్తి. వి. (నడుము + నెత్తి.) శిరో
మధ్యము.
ద్వి. హనుమంతువద నాజ్ఞ మర్ధచంద్రాస్త్రమున
నొంచి పదిబాణముల బాహుయుగము,
నాఁటించి యొకశక్తి నడునెత్తి పగుల, మే
టియై యేసిన మిగుల రోషించి. రం. రా.
సుం. ౨౬౩ పా. ౨౩ పం.
క. అత్తోరణంబె కొని నడు,నెత్తి పగుల సూ
ర్యభానునిన్ మొత్తినచోఁ, దుత్తుము రై
వాఁ డిలఁ బడె... ఉ. రా. 3. ౨౭.

ద్వి. ఇవురఁ బోలెడికేల నెత్తి నడ్నెత్తి, నివు
రంగ నంటి మై నింపుగా నిమిరి.అ.మ.క.
౧. ౨౪ పా. ౧౯ పం.

నడుపాడు=నడపాడు. అ. క్రి. (నడుపు + ఆడు.)
నడుచు, సంచరించు.
ద్వి. పట్టి మెల్లన నెత్తి పాదంబు లుర్వి, మె
ట్టింప ధైర్యంబు మిగుల రాసుతుఁడు, లా
గుగా నూఁది మెల్లనె నడుపాడ. నవనాథ.
౨. ౧3౨ పా. ౧3 పం.
సీ.నడుపాడ నేర్చిననవకంపునునుఁదీఁగ మరిపెం
బుఁ బూనినవిరులయెత్తు.కేయూర.౪.3౦.

నడుపు=నడిపించు, నడపు. స. క్రి.(√నడుచు.)
(ప్రవర్తింపఁజేయు.)
క. పెక్కండ్రు గూడి సమయం, బొక్కటి క
ల్పించి నడుపుచుండుదు రేనిన్, నిక్కముగా
నాసమయము, దక్కొని చెల్లించుటయును
ధర్మము పతికిన్. విజ్ఞా. ప్రా. 3౭.
(జరుపు, జరిగించు.)
క. ఎప్పుడును మీవచస్స్థితిఁ, దప్పక యే నడు
పుచున్నదాన నిపుడు న్నా,తప్పొప్పులు మీ
రరయుట, యొప్పున్... కళా. ౨. 3౧.
(ఆచరించు, చేయు.)
సీ. నైజంబు లగునిత్యనైమిత్తికంబులు నడుపు
చో బ్రహ్మార్పణంబు సేసి. కాళ. ౧.౨3.
గీ. దివిజు లరు దందఁగా జయంతీవ్రతంబు, నడి
పి చంద్రప్రభుం డనుకొండురఁ గాంచి.
శేష. ౪. ౨౬.
(పోషించు.)
క. ఇడ నని విడువం జెల్లునె, నడుపవలయు
నేర్చినట్లు సమ్మకయె కృపన్. ఆము. ౪.
౨33.
(రథము మొ. నడిపించు, తోలు.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. అమరవిభుతేరు మాతలి యపుడు నడిపె. ఉ. రా. ౮. ౩౭౧.

వి. (గమనము, నడక.)

గీ. మురిపముల నుజ్జగించిన ముగుదనడుపు, కలికి చూపుల వీడ్కొన్నకన్ను. (గవయు.ఉ.హరి. ౧.౫౪.

మణిగణనికరము. పడఁతులు చిడిముడి పడియె డుమనితో, నడుగులు తడఁబడ నడరెడు నడుపుం, గడఁకలనడుములు గడగడవడఁకం, బడిబడిఁ బొడమఁగ బడలికఁ జెమటల్. కళా. ౬. ౨౫౦.

నడుపుకొను. స. క్రి. (నడుపు+కొను.) పోషించు.

శా. మాభోగంబులె యాత్మభోగములు గా మామాటయే మాట గా, నోభవ్యాత్మక మమ్ముఁదా నడుపుకొంచున్నాఁ డితండు... కళా. ౫. ౨౧౫.

నడుభూమి. వి. (నడుము+భూమి.) మధ్యభాగమున నున్నభూమి.

క. కడపటిభూములు నడు మగు, నడుభూములు కడప లగు వినమ్రస్థలి న్నిల్లడ గొండ్రు జనులు సెలుపం,బడుఁ జేనులు చిత్రవృష్టిఁ బండవు మిట్టుల్. హరి. ఉ. ౮. ౪౦.

నడుమంతరము=నడుమంత్రము. (నడుము+అంతరము. శ. ర. నడుము+మంతరము?) వి. నడుము, అవలగ్నము.

విణ. మధ్యకాలమున కలిగినది.

గీ. చక్రభావనచేఁ గాంచి శక్తి దనకుఁ, బ్రాపు గలుగుటనో లేమిఁ బాపుకొనియె, వెలఁది నడు మంతమాత్రనే విఱ్ఱవీఁగె, నహహ నడుమంతరపుఁగల్మి కది నిజంబు. అని. ౩. ౧౦౦. (వి. విణ. లకు ఇదియే యుదాహరణము.)

నడుమంత్రము=నడుమంతరము. వి.(నడుము+మంత్రము?) ౧. కౌను.

క. నడుమంత్రము కుచభారము, నడుమంత్రము పైఁపడు... శృంగారరసాలవాలము. ౨. ఆ. (శ. ర.)

౨. మధ్యకాలము.

మ. నడుమంత్రంబున బల్మిఁ దెచ్చుకొని యన్యాయంబునన్ మూర్ఖుఁ డెవ్వడువారిన్ దొడరంగఁ బోయి మడియున్...ఉ. రా. ౨. ౮.

విణ. మధ్యకాలమున కలిగినది.

చ. వఱలు మరాళికాగమనవాతెఱతియ్యఁదనంపుసొంపులోఁ, గుఱువఁదనంబుఁ దాల్చి మఱి కుంభినిలోపల వ్రేటుఁబడ్డది, న్మఱి వరేకుపంక్తి నడుమంత్రపు సంపదచేతఁ గ్రిందుమీఁ, దెఱుఁగక సాటివత్తు నని హెచ్చిన నాటకుఁ బెట్టకుందురే. భానుమతి. ౨ ఆ. (చి. ని.)

చ. అతివకుచంబులున్ మెఱుఁగుటారును వేనలియున్ ధరాధిపోన్నతియు నహీనభూతి కలనంబు ఘనాభ్యుదయంబు నిప్పుడోం, దితి మని మాటిమాటికిని నిక్కెడు నీల్గెడు విఱ్ఱవీఁగెడున్, క్షితి నటు గాదె యొక్కొకరికిన్ నడుమంత్రపుఁగల్మి కల్గినన్. విజ. వి. ౧. ౩౮.

సీ. నడుమంత్రమా యిది నరులయీాకర్మంబు నేఁటిదా జగము వర్ణించి చూడ. నీతి.౪౦. వి. పు. ౪. ౧౫౬.

నడుము(ద్మ). వి. ఔ.(క. త. నడు.వృత్తియందు వికల్పముగా 'నడి, నడు'అగును.) ౧. మధ్యము, కౌను.

చ. నడు మస దింతి చన్నులతనర్పున ముందఱు గానరాదు... కు. సం. ౮. ౧౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. ఘన మైనరారాపుచనుదోయిరాయిడి నిలు పేదనడిమికి వెఱపుఁ జూప. కాశీ. ౧. ౯౦.

సీ. పిడికిలింపఁగ వచ్చు నడిమి యొప్పిదముతో నురమువిస్తారంబు సిరి వహింప. పి. శేషం. ౨. ౮౦.

చ. తురగరథంబు లాశ్వికులతోడన నడ్మలు ద్రెవ్వి ధారుణిన్, దొరుఁగ... ఉ. సం. ౧౧. ౭౧౨.

౨. మధ్యభాగము.

చ...ఎదిర్చినదుస్సనసేనువిల్, నడిమికిఁ ద్రుంచి గాండివగుణధ్వని దిక్కులు పిక్కటిల్ల ... భార. కర్ణ. ౧. ౨౦౨.

చ. కడువడి వీరధన్వుఁడు త్రిగర్తులు వొంగఁగ ధృష్టకేతువిల్, నడిమికిఁ ద్రుంచినన్ మొగ మునం దళుకొత్తెనుకంపుసొంపుతో. భార. ద్రో. ౩. ౨౫౦.

ద్వి...లోకకంటకుఁడు, మెఱసి పోవుచు నడ్మ మేరుశృంగమున, నొఱపుగా విడిసి యం దొకరాత్రి పుచ్చి. రం. రా. ఉ. ౬౦ పా. ౨ పం. ఉ. హరి. ౫. ౧౪౯.

౩. మధ్యప్రదేశము, అంతరము.

క. కడు నలిగి వాని నన్నియు, నడుమన తుని యంగ నేసె నరుఁ డస్త్రములన్. భార. ఆది. ౬. ౮౧.

౪. మధ్యకాలము.

క. అనఘా యీయజ్ఞము విధి,సనాథబుత్విక్ప్ర యోగసంపూర్ణం బయ్యును గడచన నేరదు నడుమన యుడుగును భూసురోత్తమనిమిత్త మునన్. భార. ఆది. ౨. ౨౦౯.

ఆ. మీఁదమీఁద సుఖనిమిత్తంబు లొదవుచో, నడుమఁ జెందు నిజజనంబుపీడ. కశా. ౫. ౩౨.

విణ. మధ్యనుండువాఁడు,మధ్యనుండినది.

ఆ. పూర్వదత్తమైనభూమి నెవ్వఁడు పుచ్చి, కొనియె నతఁడు తనదుకులమువారి, నిరువ దొక్కలరము నరకవాసులఁ జేయు, దాను నడుము గాఁగ ధర్మనిరత. భార. అను. ౨. ౩౬౫.

క. మగఁడును మాఱుమగఁడును, దగ నిరుదెసఁ బవ్వళింపఁ దా నడు మై యొప్పుగ శయ నించె... విక్ర. ౮. ౯౫.

జ: నట్టకనడుము, నట్టకనడురేయి, నట్టడవి, నట్టు నడుము,నట్టనడురేయి, నట్టిల్లు, నట్టెండ మొ.

నడుముకట్టు. అ. క్రి. (నడుము+కట్టు.) ౧. సిద్ధపడు.

(వ్యవ.) దేవుని కల్యాణమున కందఱు నడుముకట్టి పనిచేసిరి.

౨. సంభోగమును విడుచు.

(వ్యవ.) వాఁడు నడుముకట్టినాఁడు కనుకనే అం తబలము కలిగియున్నాఁడు.

నడుముకట్టుకొను. అ. క్రి. (√నడుము.) సిద్ధ పడు.

(వ్యవ.) ఏమి జరిగినను ఈపని మాన నని వాఁడు నడుముకట్టుకొని వచ్చినాఁడు.

నడుముకొను. అ. క్రి.(నడుము+కొను.)సన్నద్ధ మగు.

లయవిభాతి. కడలుకొనుకౌద్రమునఁ గడఁగి సమరోత్సవము వెడపడక యుండ నొగి నడుముకొని శక్తిం, దడఁబడక పేర్చి వడి నడుగు లిడువేగమున...భా. రా. యు. ౧౫౪౩.

నడుముముక్కు. వి. (నడుము+ముక్కు.) ముక్కు యొక్క మధ్యభాగము, నాసామధ్యము.

ఆ. మురిసి మురిసి రాలె మునివ్రేళ్లు నడుము ముక్కు, చదుకఁబడియెఁ జీము జాలుకొనియెఁ, దనువుమీఁద ముసరెదొనదొన నీఁగలు, వే గిరంబె పెద్దరోగమునను.వరాహ. ౯. ౭౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నడుముదాఁకు. స. క్రి. (నడుము + తాఁకు.) ఎదుర్కొను, ఎదిరించు.

సీ. నల్లచీమలబారు నడుము దాఁకినవీఁక నున్న
దీచెలువంపుఁగన్నెయారు. విజ. వి. ౨. ౧౦౬. (ఇట ఔపమ్యవాచకము.)

నడుమువిఱుగు. అ. క్రి. (నడుము + విఱుగు.) దుఃఖాదులవార్త వినుటచే వివశుఁడగు.

(వ్యవ.) ఈదుఃఖవార్త వినఁగానే నాకు నడుము విఱిగినది.

ఇల్లే: నడుముజాఱు మొ.

నడురాతిరి=నడురే. వి. (√నడుము.) రాత్రి యొక్క నడిమిభాగము, అర్ధరాత్రము.

ఉ. ఆతరళాక్షి యొక్కతెయ యానడురాతిరి
పెక్కుమోసలల్, వే తఱియంగఁ దూఱి... వా.రా. ౨. ౧౭౪.

నడురే(యి)=నడురాతిరి. వి. (నడుము + రేయి.) అర్ధరాత్రము.

క. అవ్వృష్ణివరుం డాత్మజు, నావిర్భావం బెఱిం
గి యంతర్గృహమున్, వేవేగఁ జొచ్చి నడు
రే, యా వనజాప్తుండు పొడిచి నల్లై యుం
డన్. హరి. పూ. ౫. ౧౧౭.

క. నడురేయి సంధ్యలందును, నడవఁగ నోడుదు
రశక్తనరులు... భార. ఆది. ౪. ౩౯.

నడులేఁత. విణ. (నడుము + లేఁత.) మిక్కిలి లేఁత ముదురుకానిది.

ద్వి. పరిపూరితం బైన బంధురం బైన, నడులేఁత
యై సువర్ణప్రాప్తమైన. పండితా. పురా. ౧౨౪ పా.

నడువానకాలము. మి. వి. (√నడుము.) వానకాలముయొక్క మధ్యము.

వ... ఉభయవ్యూహంబులును... నడువానకా
లంబునం బొంగినగంగాయమునలుంబోలె
నొండొంటిం దార్కొనుసమయంబున...
భార. ద్రో. ౧. ౨౩౧.

నడువీపు. వి. (√నడుము.) వీపుయొక్క మధ్యభాగము.

ఆ. ఖంగు రనఁగ నాదికమఠంబు నడువీపు,
దాఁకెఁ ద్రవ్వి త్రవ్వి... వరాహ. ౭. ౧౮౪.

నడుసొ(-చొ)చ్చు. అ. క్రి. (నడుము + చొచ్చు.) నడుమఁ బ్రవేశించు, మధ్యభాగముచేరు.

ద్వి. ఎనసి సుగ్రీవుతో నేను బోరాడ, నను నే
యఁ దగునయ్య నడుసొచ్చి నీవు. రం.రా. కిష్కి. ౨౧౧ పా. ౨౦ పం. (చి.ని.పా.)

నడ్డి. వి. ౧. నడుము.

గీ. పెటికరయే చాలు నానడ్డి విఱుఁగఁ జేయ,
దానిపైఁ దాను నెక్కు నింతయును గాక. శుక. ౩. ౮౦౬.

క. నెఱి సరిగ దానిపైఁ బడి, కటువన్ లాఘవ
ము లేమిఁ గా ళ్లీడ్చుచు న, డ్డివిఱువం గది
సిన నత్తెఱఁ, గెఱిఁగి ఖరం బదరి తిరిగి యేఁ
గుచు నుండెన్. వేం. పంచ. ౪. ౫౭౦.

౨. పూర్వకాయము వెనుకకు వంగియుండుట. (పూర్వకాయము ముందఱికి వంగియుండుట, గూనుఅని శ. ర.)

విణ. చప్పట.

ద్వి. నరసినగడ్డంబు నడ్డినాసికయు. నళ. ౩. భా. (శ. ర.)

జః నడ్డిగుంట, నడ్డిముక్కువాఁడు.

నడ్డిగుంట. వి. (√నడ్డి.) కుకుందరము, నడ్డిక్రింది గుంట. (శ. ర.)

నడ్డిముక్కువాఁడు. విణ. (√నడ్డి.) అవటీటుఁడు, చప్పటముక్కు కలవాఁడు.

సీ... నడ్డిముక్కుగలాఁ డన నతనాసుఁ డగు...
ఆం. భా. ౨. ౧౨౧.

నడ్తి=నడితి. (శ. ర.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నద్య. సం. వి. ఆ. స్త్రీ. కిక్కిసగడ్డిమేటి.

నడ్వంతము. సం. విణ. (త్. ద్వతీ. త్.) కిక్కిసకసవు అధికముగా కలది. (నేల మొ.)

నడ్వలము. సం. విణ. (అ. ఆ. అ.) కిక్కిసకసవు అధికముగా కలది (దేశము మొ.)

నతనాసికుఁడు. సం. విణ. (అ. ఆ, ఈ. అ.) చప్పటముక్కు కలవాఁడు.

నతభ్రువు. సం. వి. ఊ. స్త్రీ. వంకరకనుబొమలు కలస్త్రీ.

నతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నమ్రీభూతము, వంగినది. ౨. నమస్కరించునది. ౩. కుటిలము, వంకరైనది. అణఁగినది; లోఁతైనది.

మ. అతఁడా వాతపరంపరాపరిమళవ్యాపారలీలన్ జన్మాన్వితమిచ్చొటని చేరఁబోయి కనియెన్ విద్యుల్లతావిగ్రహన్, శతపత్రేక్షణఁ జంచరీకచికురన్ జంద్రాస్యఁ జక్రస్తనిన్, నతనాభిన్నవలా నొకానొక మరున్నారీశిరోరత్నమున్. మనుచ. ౨. ౨౪.

వి. తగరము, నందివర్ధనము?.

నతాంగము. సం. విణ. (అ. ఆ, ఈ. అ.) వంగినదేహము కలది, వంగినది.

నతాంగి. సం. వి. ఈ. స్త్రీ. వంగినదేహము కలస్త్రీ; నారి, ఆఁడుది. (రూ. నతాంగ.)

నతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. వంగుట. ౨. వంపు, వంకర. ౩. నమస్కారము, మ్రొక్కు.

నతోన్నతము. సం. విణ. (అ. ఆ. అ.) నిమ్నోన్నతము, మెరకపల్లములుగా నుండునది.

నత్త. వి. క్షుద్రశంఖకీటకము, క్షుద్రశంఖపుగుల్లయందుండు పురుగు.

గీ...నత్తనాఁ జెలఁగు క్షుద్ర, శంఖకీటంబు... ఆం. భా. ౨. ౭౨.

జః నత్తగుల్ల.

నత్తగుల్ల. వి. (నత్త+గుల్ల.) క్షుద్రశంఖము.

సీ...నత్తగుల్ల చుట్టుడుగుల్ల కురిమింద...గీ.ఆదికొఁ ఇగానిజంతువులు...హంస. ౪. ౧౭౬.

చ. అనయము సత్కవుల్ భగవదర్పితకావ్యరసంబు మెత్తురొ, య్యనఁ గుకవుల్వసన్ నెరసు లారయుచుండుదు రేమి చిత్రమో, ఘనసరసీలసత్కమలకైరవసౌరభమేవగింపుచున్, మనుకొని నత్తగుల్లలకు ముక్కులు సాఁచుబకంబులున్న వలెన్. కులశేఖరమహీపాలచరిత్రము. ౧. ఆ. (చి. ని.)

నత్తి. వి. (√నత్తు[1].) మాటలాడునపుడు మొదటియక్షరము పలుమాఱు లుచ్చరించుటయు ఆఁగి యాఁగి కష్టముమీఁద మాటలాడుటయు మొదలగులక్షణములు కలజిహ్వాదోషము.

(వ్యవ.) వానికి నత్తి యుండుటచే అట్లు మాట్లాడుచున్నాఁడు.

నత్తివాఁడు. విణ. (√నత్తు[1].) నత్తికలవాఁడు, లోహలుఁడు.

సీ...నత్తివాఁడన లోహలవాచక మగు. ఆం. భా. ౩. ౧౨.

నత్తు[1]. అ. క్రి. (క. నత్తు.) తడఁబడుచు మాటలాడు. (శ. ర.)

జః నత్తి, నత్తివాఁడు.

నత్తు[2]. వి. (త. క. నత్తు.) ముక్కుపోఁగు, స్త్రీల నాసాలంకారవిశేషము.

ఉ. కెంపులఁ జేసె మోవి నునుఁగెంపుచొకాటపునత్తుముత్తెపుం, గుంపులఁ జెక్కుటద్దములఁ గూర్చినకస్తురివ్రాఁతగంబురా, సాంపానరించె బెళుకు తెలిచూపులు కుంకుమచిత్రకంబు ఫాలంపుఁగురుల్ మృగీమదవిలాసపుశేఖ నొనర్చె నింతికిన్. ముకుంద. ౨. ౧౮౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. అధరంబునకు నడ్డ మగునత్తుముత్తెంబు నోర
గావించెడుహొయలు దలఁచి. కటివేల్పు
శతకము. ౪౩. (చి. ని.)

నదనువు. సం. వి. ఉ. పుం- గర్జించునది- ౧. సింహము. ౨. మేఘము. (వై. ని.) ౩. యుద్ధము. (కే. ని.)

నదపతి. సం. వి. ఇ. పుం. సముద్రము.

నదము. సం. వి. అ. పుం- శబ్దించునది- ౧. పడమరగా పాఱెడియేఱు. (సింధువు, శోణము, భిద్యము, బ్రహ్మపుత్రము, భైరవము, దామోదరము మొ. నదములు. తూర్పుగా పాఱెడివి నదులు; పడమరగా పాఱెడివానిలో నర్మదానది తప్ప తక్కినవి నదములు.) ౨. (నీటి)మడుఁగు. ౩. సముద్రము. ౪. ధ్వని, మ్రోఁత.

నదరు=నజరు. వి. (హిం. నజర్.) కానుక.
సీ. వాహనరాజముల్ వానికి నద రుంచి యిడు
మలకును లోకమెల్లఁ జుట్టి. మల్లుపు. ౩. ౭౩.

నది. సం. వి. ఈ. స్త్రీ. ఏఱు; ఆమడకు మీఱి పాఱెడియేఱు.

నదీకదంబము. సం. వి. అ. పుం. మహాశ్రావణిక, పెద్దబోడసరము‡. న. నదీసమూహము.

నదీకాంత. సం. వి. ఆ. స్త్రీ. ౧. జంబువు, నేరేడు‡. ౨. కాకజంఘ, కాకిదొండ‡.

నదీకాంతము. సం. వి. అ. పుం. ౧. హిజ్జలము, ఎఱ్ఱగన్నేరు‡. ౨. సిందువారము, వావిలి‡. ౩. నిచులము, ప్రబ్బ‡.

నదీకాంతుఁడు. సం.వి.అ.పుం. ౧. సముద్రుఁడు. ౨. గంగాధరుఁడు, శివుఁడు.

నదీకూలప్రియము. సం.విణ. (అ. ఆ. అ.) నదీతీరమం దిష్టము కలది. వి. అ. పుం. జలవేతసము, నీటిప్రబ్బ‡.

నదీజ సం. వి. ఆ. స్త్రీ. అగ్నిమంథము, నెల్లి‡.

నదీజము. సం. విణ. (అ. ఆ. అ.) నదియందు పుట్టినది. వి.అ.పుం. ౧. అర్జునము, ఏఱుమద్ది‡. ౨. యావనాళసరము, ఒకజాతి జొల్లు‡. ౩. హిజ్జలము, ఎఱ్ఱగన్నేరు‡. న. ౧. స్రోతోంజనము. ౨. ఒకజాతిఅనుము, ఎఱ్ఱఅనుము‡.

నదీజుఁడు. సం. వి. అ. పుం. భీష్ముఁడు, గంగాపుత్రుఁడు.

నదీదోహదము. సం.వి.అ.పుం. ఏఱు దాఁటుటకై పడవవాని కిచ్చుపాలు, తరపణ్యము, ఓడకేవు.

నదీభవము. సం. విణ=నదీజము. వి. అ. న. సైంధవలవణము, ఇందుప్పు.

నదీమాతృకము. సం. విణ. (అ. ఆ. అ.) ఏటినీళ్లచేత పండెడుపైరు కలది. (వ్యతి. దేవమాతృకము.)

నదీముఖము. సం. వి. అ. న. ఏటినీరు సముద్రములోనికి పోవుద్వారము, ఏఱు సముద్రములో కలియుచోటు.

నదీశుఁడు. సం. వి. అ. పుం. ౧. సముద్రుఁడు. ౨. వరుణుఁడు.

నదీష్ణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నదీస్నానమునందు కుశలుఁడు, నదిలో మునుఁగుట ఈఁదుటలలో నేర్పరి.
శ్లో. తతస్సమాజ్ఞాపయదాశు సర్వానానాయిన
స్తద్విచయే నదీష్ణాన్. సం. రఘు. ౧౬. ౭౫.
౨. కుశలుఁడు, నేర్పరి. (కే. ని.)

నదీసర్జము. సం. వి. అ. పుం. వీరతరువు, ఏఱుమద్ది‡.

నద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. బద్ధము, కట్టఁబడినది. ౨. కూర్పఁబడినది. ౩. ఖచితము, తాపఁబడినది. ౪. ఉద్వృత్తము, పైకెత్తఁబడినది. (నిక్కినది అని కొందఱు.) వి. అ. న. బంధము, కట్టు, ముడి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నద్ధి. సం. వి. ఇ. స్త్రీ. బంధించుట, కట్టుట.

నద్ధ్రి. సం. వి. ఈ. స్త్రీ. వరత్ర, టంగువాఱు, గుఱ్ఱమునకు కట్టెడువాఱు.

నద్వ్యామ్రము. సం. వి. అ. పుం. సమష్ఠిల, ఏఱువంగ, గండీరమశ్లే.

నన=అనె³. వి. (√ననుచు. క. ననె. త. నసై.)

౧. పువ్వు, పుష్పము.

ఆ... వేగుఁబోక తెమ్మెర లెలదీఁగ,కొనలవంక లొత్తు ననలఁ బ్రోచు. భార. ఉద్యో. ౨. ౧౧౨.

రగడ. ననలు వేఁడిన మొఱఁగి తప్పడు నాలి నా లికుచంబు ముట్టదు. పారి. ౪. ౧౬. విక్ర. ౫. ౬.

౨. పల్లవము, చిగురు. (చూ. ననలెత్తు.)

౩. మొగ్గ, కోరకము.

చ. కుసుమము లెల్లఁ గామినులకొప్పుల నుండ నటుండ లేమి స్నిగ్గసఁగఁగ వంగినట్లు జని యించె ననల్...ఆము. ౫. ౧౧౩.

క. గురివెందఁ జైత్రుఁ డొందఁగఁ, గర మలుక న్నావి యవుమగఱచిననునువా, తెరమీఁదఁ గాన నగుపలు,వరుస యన న్ననలు పల్లవము పై మొనసెన్. పారి. ౩. ౪౭.

ననంద. సం=ననాంద.

ననందిని. సం. వి. ఈ. స్త్రీ.=ననాంద.

ననఁబోణి(ఁడి). వి.(√నన.)పుష్పమువలె మనోజ్ఞురా లగుస్త్రీ.

సీ. నుడువుల ననఁబోణి జడియకు మని వెన్ను సఱచుప్రాణేశు టిచ్చవడి చూచె. దశా. ౨. ౫౫.

క...ఆ, ననఁబోఁడి వెంట రాఁగా, ధనవంతుఁడు గంగగుడి కుదగ్రత నరిగెన్. శుక. ౨. ౭౫.

చ...ఇపు డీననఁబోఁడి కందమా,పెనిమిటిఁ గూర్చి సొం పలరఁ బెండ్లి యొనర్ప మదిం దలంచెదన్. నీలా. ౧. ౭౯.

పల్కు_ననఁబోఁడి = సరస్వతి.

గీ. పల్కు_ననఁబోఁడి జానగు పల్కు_ లిడుచుఁ, గనికరం బెచ్చ మము నిచ్చఁ గాచుఁగాత. అచ్చ. రా. బాల. ౬.

ననకారు. వి.(√నన.)వసంతకాలము.(చి.ని,శ.ర.)

నన తేనియ. వి.(√నన.) మకరందము,పూఁదేనె.

సీ. నునుఁగావిజిగిమోవి ననతేనియలబావి...

గీ...అమ్మించుఁబోఁడి కరయ. నీలా. ౧. ౫౬.

ననదండ. వి. (√నన.) పుష్పమాల.

ఉ...మున్ను గొంటి మేఁ,వ న్ననదండ యొక్క_ మగవాఁ డిడ... ఆము. ౧. ౧౪.

క. అన దండ మిడి తదాజ్ఞన్, ననదండగరిన్ శిరంబునం దాల్చి ధరా,వనమునకై రఘువీరుఁడు, వనమునకై చనుకడంక వర్తిలె నంతన్. చం. రా. ౪. ౩౭.

నననీరు. వి. ఔ (√నన.) మధువు, పూఁదేనె.

సీ. నననీట గుప్పలించెను గళావతి యోర్తు జిగిమోవి బీటిక లెగయకుండ. భాను. ౨. ౭౪.

ననయు. అ. క్రి. (√నన. క.ననె.) ౧. పూచు.

౨. చిగిరించు. (శ. ర. అప్ర. అని శ. ర.)

ననలెత్తు=ననుచు. అ. క్రి. (ననలు+ఎత్తు.) ౧. మొలకలెత్తు.

గీ. పడినగింజల ననలెత్తి పండె ధరణి, రఘుకులోత్తంస మీరేలు రాజ్యమునను. ఉ. రా. ౫. ౩౧౭.

౨. పల్లవించు, చిగుర్చు.

సీ. తొలుదొల్తఁ బండుటాకులు రాలి ననలెత్తి యొండుఠెండివురుల నొఱపుమీఱె. కృ. శకు. ౧. ౭౧.

సీ. గంధర్వకలకంఠకంఠకుఁఠులు స్థాణువుల్ ననలెత్త

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మధురగానంబు సేయ. దశా. ౨. ౨౯౮.

ననలొత్తు=ననుచు. అ. క్రి. (ననలు+ఒత్తు.) మొలకలెత్తు; కలుగు, పుట్టు.

చ...రోమకుండు తత్ప్రియుతికి లేఁతనవ్వు ముఖపద్మమునఁ ననలొత్త...హ. వరాహ. ౧. ౩ పా.

ననవింటిజోదు=ననవింటిదంట, ననవింటిదొర, ననవింటిమన్నెవాఁడు. వి.(నన+విల్లు+జోదు.) పుష్పధన్వుఁడు, మన్మథుఁడు.

సీ. జటినిటులానలోత్కటపీడితుఁడు గాక సాంపారుననవింటిజో దనంగ. విక్ర. ౪. ౫౪.

ననవింటిదంట=ననవింటిజోదు. వి. (నన+విల్లు+దంట.) పుష్పధన్వుఁడు, మన్మథుఁడు.

సీ. ననవింటిదంట నెట్టన బూదిఁ గలిపినకడిఁది చిచ్చుఁటికన్ను గలుగువాఁడు. పె. శశం. ౧. ౧౩.

సీ. ననవింటిదంటఁ గన్నమిటారినూఁగారుఁతీరులా యీనాఁచుతీవెచాలు. దశా. ౧. ౧౬౪.

ద్వి. మనవి చేకొను మని మదవతి మ్రొక్క, ననవింటిదంట యాననఁబోఁడి కనియె. వృ. వి. ౧. ౪౩.

ననవింటిదొర=ననవింటిజోదు. వి.(నన+విల్లు+దొర.) పుష్పధన్వుఁడు, మన్మథుఁడు.

ద్వి. ననవింటిదొర ఫాలనయను జయింపఁ, దనమేనమామ చెంతను దాఁచుకొన్న, విలు నమ్ములనఁగ భ్రూవిలసదపాంగ, ములు వొల్చె... వృ. వి. ౧. ౧౧.

ననవింటిమన్నెవాఁడు=ననవింటిజోదు. వి. (నన+విల్లు+మన్నెము+వాఁడు.) మన్మథుఁడు.

వ...ననవింటిమన్నెవానికీర్తి మూర్తిభవించి భువనంబుల వ్యాపించె ...ఉ. రా. ౪. ౧౬౩.

నన(ల)విలుకా(ల్కా)ఁడు= ననవిల్తుఁడు. వి. (నన+విలు+కాఁడు.) పూవిలుకాఁడు, మన్మథుఁడు.

చ...శపథంబు చేసెఁ, ననవిలుకానిపాదనలినంబుల పైరతిచన్నదోయి పై. నైష. ౨. ౩౮.

చ. ననవిలుకాఁడు సంతసమునన్ దనపూనికయాట కుబ్బఁగన్. యయా. ౫. ౨౫.

గీ. తనకుఁ జెయి మించినట్టిఁడు ధరణి లేని,ఘనుఁడు వాళంబుతోడిపంకజముఁ గేల, నిరవుగాఁ బట్టి సురలు వర్ణింప నపుడు, ననలవిల్కాఁడు యుద్ధసన్నద్ధుఁ డయ్యె. చిత్రభా. ౨. ౧౦౪.

ననవిలుకానిపోరు. వి. ఔ. అనా. (నన+విలు+కాఁడు+పోరు.)-మదనకదనము- సురతము, మైథునము.

చ...ఇద్దఱు నేక కాంక్షతో, ననవిలుకానిపోరునఁ బెనంగెడువేళ నిజేశ్వరుం డొగిన్. హంస. ౩. ౧౦౩.

ననవిల్తుఁడు=ననవిలుకాఁడు. వి.(నన+విల్తుఁడు.) పుష్పధన్వుఁడు, మన్మథుఁడు.

వ...ననవిల్తునకుఁ బసగలపసిండి మెఱుంగుములుకు లనం గలికిచిలుకలకొలుకు లగుబిసరుహదళనయనలు...భీమ. ౩. ౨౧౧.

సీ. ననవిల్తుశాస్త్రంపుమినుకు లావర్తించుపని వెన్నతోఁడఁ బెట్టినది మాకు. మనుచ. ౨. ౪౩.

ననసానాగడకెంచెపుమాస్టీఁడు. వి. (నన+సానా+గడ+కెంచము+మాస్టీఁడు.) మన్మథుఁడు.

క. కాంచిన ననసానాగడ,కెంచపుమాస్టీఁడు బెట్టు గెరలుచుఁ జెలిఁ బైఁ,కొంచు నెదఁ దటాయించన్, గొంచించక మొగలిఱేకు గుమ్మితిఁ జిమ్మెన్. ఉ. హరిశ్చ. ౪. ౧౧౪.

ననాందా. సం. వి. ఋ. స్త్రీ- ఎంత సేవ చేసినను సంతోషపడనిది- మగనితోఁడఁబుట్టువు, ఆఁడుఁబడుచు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ననుఁబ్రా(బ్రా)యి. వి. (నాను¹+ప్రాయి.)
చక్కఁగా నుడుకనిబియ్యము, ఉడికియు నుడుక
నిబియ్యము.
సీ. రాగిలోహండి నబ్రాయి లే కుండఁగ వండి
దించిన యిపుర్వంటకంబు. కాశీ. 3.౧౨౧.

ననుఁబ్రాయిపడు. అ. క్రి. (ననుఁబ్రాయి+పడు.)
ననుఁబ్రాయి యగు.
క. బిరు సింత గాక నడిమికి, మురియక ననుఁ
బ్రాయిపడి చిముడఁబాఱక యే, జెరికియును
లేక మిక్కిలి, గరగర నగు నేఁబుప్రాలకలమా
న్నంబుల్. జై. భా. ౭. ౧౯౭.

ననుచు=ననలెత్తు, ననలొత్తు. అ. క్రి. ౧. పూచు.
గీ. ప్రావృషేణ్యపయోధర ప్రభవమైన, గాలి నని
చిననీపవృక్షంబువోలె. నైష. 3. ౪౭.
మ. విను మింతు ల్తిలకంబుఁ జంపకముఁ గ్రోవిన్
సిందువారంబుఁ బ్రేంకసమున్ మామిడి గోఁ
గుఁ బొన్నఁ బొగడన్ గంకేళి నూహించి
కన్గొన మో మెత్తఁగఁ గౌఁగిలించుకొవ
మూర్కొఁ బాడఁ జే నంటఁ బల్కనగం
గ ల్లమియంగఁ దన్న ననుచుం గల్పాగ
మాయావిరుల్. పారి. ౪. ౯.
చ. తరుణులకౌఁగిటన్ ననుచు తమ్మి వృథా
విరు లెత్తి చేసెమో,పరులుగఁ జైత్రుఁడు...
ఆము. ౫. ౧౨౬.
౨. చిగుర్చు, చిగిరించు.
ఆ. ఏచి ననిచి పూచి కాచి పండినయమ్మి,న్ప
రము మేలితోఁట లరసి కాంచు,ముసలివారి
కైనఁ బసిబిడ్డలకునైనఁ, బండ్లు వచ్చు నలరుఁ
బ్రాయ మెదవి. యయా. ౧. ౩౭.
3. మొగ్గయెత్తు,కోరకితమగు.
గీ...కోరకితం బొప్పు ననిచిన దన. ఆం. భా.
౨. ౩౫.
౪. వికసించు.
సీ. ననిచె నాఁగఁ జిగిర్చె ననుటయు వికసించె
ననుటయు నర్థమై యలరుచుండు. ఆం.భా.
3. ౧౦౧.
చ. అనిన మహాప్రసాద మిపు డానతియిచ్చి
తి కే కదా యిఁకం, గనఁబడఁ దెల్ప నేమి
టికిఁ గార్యముఖంబున స్వామిచిత్తమే, నను
చు న దేల కావలసినన్ దనుజున్ వధియింపఁ
జాలరే, ననుఁ గరుణావలోకనమునన్ ఘనుఁ
జేయఁగఁ గాక వచ్చుటల్. కువల. ౨.౪౪.
౫. అనురాగమొందు, అనురక్తుఁడగు; ఇష్టపడు.
సీ. పీతాంబచెలి యోగపీఠి హుంకృతిదుర్గ ననిచి
కాపుండు నేనగరికెలన. భీమ. ౨. ౫౨.
క. ననిచిన ప్రియుఁడవు భర్తవు, ననుపమబంధుఁ
డవు నాకు ...భా. రా. కిష్కిం. ౩౪౦.
ద్వి. అని యూరడించిన నర్కనందనుఁడు,నని
చినబంటుగా నన్ను గైకొంటి. రం. రా.
కిష్కిం. ౨౦౧ పా. ౩౦ పం.
క. చాళుక్యవిశ్వవిభుఁడు మహీలలనాపాలన
మున నెసక మెసఁగుచో, నోలి యతీంద్రులు
మనముల, నాలవపురుషార్థసరణి ననిచిరి మి
గులన్. కావ్యా. ౧. ౧౩౫.
౬. అతిశయించు.
ద్వి. ననిత రాముఁడు వచ్చి వనధి బంధించి,ననిచి
నకడిమిమై నన్ను సాధించి, గొనకొని వేడ్క
తోఁ గొనిపోవు నిన్ను, నని విచారించెద వా
త్తలో నీవు.రం.రా.సుం.౨౪౯.పా.౨౨పం.
(క్రొత్తప్రతి. పా. పనిచిన ప్రాఁతప్రతిపా.)
వ. అని యమ్మంజులాలాప కెంజిగు రంటినచం
దంబునఁ గేలుఁగెందమ్మి నగ్రజహస్తంబునం
బన్నిదం బని చరచి యనుచరనిచయంబు
తోడం గూడ నిజనగరంబున కనిచి ననిచినకు
తుకంబునం గపటనటన పరిచయంబునం గాని
పీనిఁజొక్కింప రా దనివితర్కించి...విప్ర.
౨. ౭౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. అనుచు ననిచినప్రేమడి నాఁడ నచటు, గదలి వదలనివేడ్కలఁ బొదలి వార, లరిగిరిమ్ములకిమ్ముల...అచ్చ. రా. బాల. ౭౩.

౭. ఇంపగు. (శ. ర.)

౮. కలుగు, పుట్టు.

సీ. కావు కా వనుట రక్కసులమూఁకనె కాని ననిచె నీయెడ సింహనాదవివృతి. పాండు. ౧. ౧౭౫.

చ. అనఘుఁడు యాజ్ఞవల్క్యగురునంఘ్రులకుం బ్రణమిల్లి నామదిన్, ననిచినభక్తితోఁ బలికినాఁడను గర్వము లేదు దుష్టు గా, ననుటయు...వి. పు. ౪. ౮౭.

జః నన, ననఁబోణి, ననకారు, ననతేనియ, ననదండ, ననసీరు, ననయు, ననలెత్తు, ననలొత్తు, ననవింటిజోదు, ననవింటిదంట, ననవింటిదొర, ననవింటిమన్నె వాఁడు, ననవిలుకాఁడు, ననవిలుకానిపోరు, ననవిల్తుఁడు, ననసానాగడకెంచపుమాస్టీఁడు, ననుపు, ననుపుకత్తె, ననుపుకాఁడు, ననుపువాఁడు, నన్పు.

ననుపు=నన్పు. స. క్రి. (√ననుచు.) వికసింపఁ జేయు.

సీ. కళ లూను నెలకూన కాదేని యాచాన నయనోత్పలంబుల ననుపు బెట్టు. దశా. ౨. ౩౦౬.

విణ. ౧. అనురాగము కలవాఁడు.

వ...బహువల్లభ నైననాకు నిదుర గలదే బహువల్లభ నైత్లెతి నంటేని మొదల మహామోహుండు ననుపువిటుండు కామక్రోధలోభులు మచ్చికబొజుంగులు ...ప్రబోధ. ౨. ౬౯.

మ. ననుపుంజుట్టము లెంద ఱని గల రింటన్ వారు నాకై చలం,బునఁ బోరాడుదురు... చంద్రా. ౩.౧౦౮. (ననుపు ముద్రి.)

క. అని యొడఁబడుటయు నమ్ముని, యనురాగము చెంగలింప నంబురుహానిభా, ననతోడిసురత సుఖముల, నను పై పెక్కడులు నటనంబులు చేసెన్. వి. పు. ౨. ౨౨౦.

౨. అధికము, అతిశయము కలది.

గీ. స్వప్నసంభోగశతసహస్రములు పోయె,భ్రమసమీక్షావినోదార్బుదములు సనియె, మనములో నిండి యున్నది ననుపుఁగూర్మి, యింక లజ్జాభయంబుల కడమ గలదె. నైష. ౭. ౧౯౧.

గీ. పురము మేడల నుండి యంభోజముఖులు,కమ్మకస్తురి వేలుపుఁగొమ్మమూఁక, కర్పణము సేసి వారిచే నందికొండ్రు, ననుపుఁదావులహారిచందనద్రవంబు. ఘటికా. ౨. ౨౦౧.

వి. ౧. అనురాగము, ప్రేమ; జీవనోపాధి.

ఆ...వనితమనముఁ జొచ్చి క్రీడకుఁ జొచ్చి, యిచ్చ మెఱసి ననుపు నిచ్చ క్రొత్త, చేసికొనుచు ... దశ. దు. ౬. ౧౮౦.

ఉ. కావున నెన్నఁడున్ దెగనికాంక్ష నెపంబుకఁ డెన్ని రోసి నేఁ, బోవఁ దలంతు నేని వలపున్ ననుపున్ దగవున్ బ్రియంబునున్, నీవలనన్ సమగ్రములు...మనుచ.౩.౧౩౪.

సీ. తనవాసుల సమస్తవనవాసులకుఁ దానవనవాసుల హరించి ననుపు లిచ్చె. రా. వి. ౨. ౭౬.

౨. ఇంపు, ఒప్పు; ననుపు.

ఉ. చామని మేనులున్ ననుపుఁ జల్లెడుమోములలోనఁ గల్గుబల్, గోములు మానవుం బొడవులుం బిడికింట నడంగుకొనులున్. శుక. ౨. ౩౩౧.

ననుపుకత్తె. విణ. (ననుపు+కత్తె.) ౧. ప్రియురాలు. (శ. ర.) ౨. విటురాలు. (శ. ర.)

ననుపు(న్పు)కాఁడు. విణ. (ననుపు+కాఁడు.) విటుఁడు, వలపుకాఁడు.

సీ. ననుపుకాఁడై వేల్పునాగవాసముఁ గూడి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మహిమఁ గోల్పడియెనే మాండకర్ణి. మను
చ. ౨. ౭౩.

వ... పెందలకడనె వచ్చెద మని వాఁడ్రచ్చి
ప్రొద్దు పోయి వచ్చిన ననుపుకాండ్రఁ గటా
క్షింపక... ఉ. రా. ౪. ౧౬౩.

సీ. చని చూడఁ గల్గినఁ జాలుఁ జేయును నన్ప
కాని గాఁ బూవిలుకాని సైన. యయా.
౧. ౧౩.

చ. అలికముఁ జూమక్రొన్నెఱులు నందపుమో
మును గల్గి నన్పగాం, డ్రెలమి వహింప
బాల్యమున నెంతయుఁ బొల్చితి నూత్నసం
పదన్. జాహ్నవీ. ౪. ౩౪.

లోననుపుకాఁడు=అంతరంగికవిటుఁడు.

చ. చలువవెలుంగు రేమగఁడు జక్కవనెచ్చెలి
జోడుకోడె చుక్కలజవరాండ్రలోననుపు
కాఁడు... చందమామ కడు నింగిఁ జెలంగి
వెలింగె నెంతయున్. రామా. ౨. ౯౫.

ననుపువడు. అ. క్రి. (ననుపు + పడు.) అనురక్త
మగు, ప్రియపడు.

వ... మార్గాంతరంబులు వెదకుచుం బెక్క
దినంబులు ననుపువడియును నెడను గలిగిన
నొండొక్కనిం గూడుకొనునది స్వభావ
గుణంబు... కవిక. ౪. ౧౨౦.

ననుపు వి. ౧. అందము.

ద్వి. ననుపుమిటారుల నాలిచేష్టలకు, మన సొగ్గి
వలచు దుమారంబుసేయు. రం. రా. సుం.
(చి. ని.)

గీ. అంతకంతకుఁ దనుకాంతి యతిశయించి,నవక
మెక్కిన పూఁదీఁగననువు దోఁప.పద్మ.౨.ఆ.
(చి. ని.)

౨. ఒప్పు, ఇంపు, ననుపు.

సీ. మొగలివాకిలిఁ దాటి దిగువ శాక్వరరాజు
నగరిపై వెన్నునిననువుఁ జూచి. భీమ.
౧. ౧౧౩.

చ. ననుపుగ వీనిలక్షణ మొనర్తు ధృతిన్
దిరుఁ డన్న ధృష్టుఁ డన్,ధ్వని...నరస.
౨. ౯౯.

౩. నర్మవచనము.

చ. ననుపులు మందెమేలములు నారులపెన్వొల
యక్కునేళలన్, బెనఁగి కవుంగిలించు నెడ
పేరులయొత్తులు గోరుటొత్తులుం, దనువున
మీఱఁగా... చిత్రభా. ౨. ౬౫.

చ... నెచ్చెలుల్, ననుపులు వల్కఁ గన్గొనల
నప్పృథరాసుత మమ్ముఁ బ్రోవుతన్. వైజ.
౧. ౨.

నన్న. విణ. (హిం. నన్హా.) కుఱుచ. (శ. ర, చి. ని,
బ్రా.)

నన్నడుము. వి. ఔ. (నడుము + నడుము.) మి
క్కిలి మధ్యభాగము.

గీ. నడచురవితేరు మింటినన్నడిమిచక్కి, బ్రగ్గ
నఁగఁ దాఁకె వింధ్యపర్వతముచరుల. కాశీ.
౧. ౧౩౨.

నన్ని. విణ. (క. నన్ని. త. నన్దు.) ౧. ప్రియము.
౨. సుందరము. ఉదా:-నన్ని నారాయణాయ.
నందంపూడిశాసనము. నన్నిమార్తండ. ద. శా.
౪. ౯౩౬. (ప్రాచీనశాసనములందు నామాంత
ములవచ్చు 'అయ్య' శబ్దమునకు బదులుగా 'ఇ
య' కానవచ్చుచున్నది. చూ. ఇయ.) ఉదా:-
నన్నియ, నన్నయ, నన్నియచోడుఁడు నన్నచో
డుఁడు మొ.

నన్ప=ననుపు. విణ. (√ననుచు.)
(అనురక్తుఁడు.)

చ... తమి దీటినన్ నిదురవోయిరి నన్పబోటుం
గు లత్తటిన్. కువల. ౨. ౧౧౦.

వి. (అనురాగము.)

చ. నయమున భీతి వాపి మది నన్పునఁ దేలుప
వాపి... కు. సం. ౯. ౩౪౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(స్నేహము, మైత్రి, పరిచయము.)

చ. తన కఁటె యిల్లు కల్గె నఁటె తా దొర
నా కఁటె యిల్లు లేదు స,న్నువఁ గదుఁ గ్రొ
వ్వె నీవులుఁగు పుచ్చెద దీనిమదం బటం
చుఁ బెల్లనఁ దరుశాఖ విర్చి కపి యప్పటి
చేరువఁ బల్వలోదకంబునఁ బడవైచె నంత
వెఱ పుట్టి ఖగాంగన గూయుచుండఁగన్.
కేయూర. ౩. ౨౭౦.

**నపాత్.** సం. (శత్రు.) రక్షింపని.

**నపాత్తు.** సం. వి. త్. పుం. సర్పము, పాము. (కే. ని.)

**నపుంసకము.** సం. వి. అ. న. ౧. నపుంసకలింగము. ౨. నపుంసకలింగశబ్దము.

**నపుంసకుఁడు.** సం. వి. అ. పుం.న- పురుషుఁడు స్త్రీ కానివాఁడు - షండుఁడు.

**నప్త.** సం. వి. ఋ. పుం. - పితృదేవతలు అధోగతిని పొందకుండ చేయువాఁడు - ౧. మనుమఁడు, కొడుకుకొడుకు; కూఁతుకొడుకు. ౨. ప్రపౌత్రుఁడు, మునిమనుమఁడు. (కే. ని.)

శ్లో. "వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషం, పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్."

**నప్తృక.** సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతిపక్షి.

**నప్త్రి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కొడుకుకూఁతురు. ౨. కూఁతుకూఁతురు.

**నప్ప.** వి. బాలుఁడు.

సీ...బాలకసంజ్ఞ నప్ప నవ్వ, పాప పాపఁడు... ఆం. భా. ౨. ౧౧౯. (ప్రాఁత తాళపత్ర ప్రతి, బ్రౌ. పాఠములు.)

**నప్రుఁడు.** సం. వి. అ. పుం. నటుఁడు. (వై. ని.)

**నఫిరి.** వి. (హిం.నఫీరీ - బాకాఊఁదువాఁడు.) ఒకవిధ మగుఊఁదెడివాద్యము. (మి. బ్రౌ.)

క. నూనయుతనాళి మానస, మానం గ్రేంకార
మొక్క హంస మొనర్చెన్, మానిను లట
రా జలఖగ, సేనల కెలిఁగింప నఫిరి సేసె న
నంగన్. చంద్ర. ౪. ౨౭.

**నబాబు.** వి. (హిం. నవాబ్.) మహమ్మదీయప్రభువు.

చ. అపుడు శ్రీగామశాఖ్యపురమందు వసించు
నబాబుగారు... రంగా. ౧. ౧౧౭.

**నభఃకేతనుఁడు.** సం. వి. అ. పుం. ఆకాశమునకు జెండావంటివాఁడు - సూర్యుఁడు.

**నభఃక్రాంతి.** సం. వి. న్. పుం. సింహము.

**నభఃపాంథుఁడు.** సం. వి. అ. పుం. _ ఆకాశమునందు ప్రయాణము చేయువాఁడు - సూర్యుఁడు.

**నభఃప్రాణము.** సం. వి. అ. పుం. వాయువు.

**నభము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. కాంతి లేనిది. ౨. నక్షత్రములు లేనిది. ౩. హింసకము, హింసించునది. వి. స్, అ. పుం. -వర్షముచే కీటాదులను హింసించునది - మేఘావృతమగుటచే కాంతిలేనిది- శ్రావణమాసము. స్. పుం. ౧. వర్షాకాలము. ౨. ఘ్రాణము, ముక్కు. ౩. తమ్మపడిగము, పతద్గ్రహము. ౪. తామరతూఁటిదారము, బిసతంతువు. ౫. పలితశీర్షము, నరసినతల. ౬.(జ్యోతి.) లగ్నమునకు దశమస్థానము. ౭. స్. న. ౧. ఆకాశము. ౨. మేఘము.

**నభశ్చక్షువు.** సం. వి. స్. పుం. - ఆకాశమునకు కంటివంటివాఁడు- సూర్యుఁడు.

**నభశ్చమసము.** సం. వి. అ. పుం. ౧. ఆకాశమందలిదేవతాపానపాత్రము, చంద్రుఁడు. (దేవతలు అమృతరూప మగుచంద్రకళలు త్రావుదురని ప్రసిద్ధి.) ౨. చిత్రాపూపము, ఒకవిధమైనభక్ష్యము. ౩. ఇంద్రజాలము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నభశ్చరము. సం. విణ. (అ. ఈ. అ.) ఆకాశమున సంచరించునది. వి. అ. పుం. ౧. పక్షి. ౨. సూర్యాదిగ్రహము.

నభశ్చరుఁడు. సం. వి. అ. పుం. ౧. దేవత, వేల్పు. ౨. విద్యాధరుఁడు.

నభసంగమము. సం. వి. అ. పుం- ఆకాశమున సంచరించునది- పక్షి, పిట్ట.

నభసము. సం. వి. అ. పుం. ౧. ఆకాశము. ౨. సముద్రము. (వై. ని.)

నభస్యము. సం. వి. అ. పుం- మేఘములకు అనుకూల మైనది- భాద్రపదమాసము.

నభస్వంతుఁడు. సం. వి. త్. పుం- ఆకాశము గమనస్థానముగా కలవాఁడు - వాయువు, గాలి.

నభస్సదము. సం. వి. ద్. పుం- ఆకాశమున తిరుగునది- ౧. పక్షి. ౨. నక్షత్రము.

నభస్సదుఁడు. సం. వి. ద్. పుం. దేవత, వేల్పు.

నభస్స్పృక్కు. సం. విణ. (శ్)-ఆకాశమును తాఁకునది- మిక్కిలి ఉన్నతమైనది.

నభస్స్పృశము. సం. విణ. (అ. ఆ. అ.)-నభస్స్పృక్కు.

నభాక. సం. వి. ఆ. స్త్రీ. ౧. చక్రవాక మను పక్షిజాతి. ౨. ఆఁడుకాకి. (కే.ని.)

నభాకము. సం. వి. అ. పుం. న- కాంతిలేనిది- ౧. తమస్సు, చీకటి. ౨. తమోగ్రహము, రాహుగ్రహము. (వాచ.) పుం. కాకి. (కే. ని.)

నభోంబుపము. సం. వి. అ. పుం- ఆకాశమునందలినీరు త్రాగునది- చాతకము, వానకోయిల.

నభోగజము. సం.వి.అ.పుం. మేఘము. (త్రి.ని.)

నభోగతి. సం. విణ. (ఇ) ఆకాశమునందు గమనము కలది. (పక్షి మొ.) వి. ఇ. స్త్రీ. ఎగురుట, ఆకాశమున పోవుట.

నభోగము. సం. విణ. (అ. ఆ. అ.) ఆకాశమున పోవునది. (పక్షిదేవగ్రహాది.)

నభోదుహము. సం. వి. అ. పుం- ఆకాశమునుండి ఉదకము ఇచ్చునది - మేఘము.

నభోద్వీపము. సం. వి. అ. పుం. మేఘము.

నభోధూమము. సం. వి. అ. పుం. మేఘము.

నభోనది. సం.వి.ఈ.స్త్రీ.ఆకాశగంగ,మిన్నేఱు.

నభోమండలదీపము. సం. వి. అ. పుం. చంద్రుఁడు. (కల్ప.)

నభోమణి. సం. వి. ఇ. పుం. చదలుమానికము, సూర్యుఁడు.

నభోరజస్సు. సం.వి.స్.న. చీకటి. (వాచ.)

నభోరేణువు. సం.వి.ఉ.స్త్రీ. దట్టమైనమంచు.

నభోలయము. సం. వి. అ. పుం - ఆకాశమున లయ మగునది - ధూమము.

నభోలిహము. సం. విణ. (హ్) - ఆకాశమును నాకునది- అభ్రంలిహము, ఆకాశము నొరయునది, మిక్కిలి యెత్తయినది.

నభ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నాభికి- బండికంటినడిమితూమునకు - హిత మైనది. (తైలాది.) ౨. నాభికి తగినది. వి. అ. పుం. అక్షము, ఇరుసు. న. ౧.(రథచక్రమునకు అనుగుణమైన) కందెన, మసి. ౨. బండిచక్రమునడిమిభాగము, బండికుంచము. (వాచ. మాత్రము.)

నభ్రాట్టు. సం. విణ. (జ్) ప్రకాశింపనిది. వి. జ్. పుం. నల్లని మేఘము, కారుమబ్బు.

నమత్. సం. (శత్రు.) ౧. వంగుచున్న. ౨. నమస్కరించుచున్న, పూజించుచున్న.

నమతము. సం.విణ. (అ. ఆ. అ.) ౧. నమ్రము, వంగినది; కుటిలము, వంకరైనది. ౨. హ్రస్వము, పొట్టిది. (కే. ని.) వి. అ. పుం. ౧. ధూమము,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పొగ. ౨. కంబళి. (వై. ని.)

నమతుఁడు. సం. వి. అ. పుం. ౧. నటుఁడు. ౨. ప్రభువు. ౩. సూర్యుఁడు. (వై. ని.)

నమనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వంగు నది. ౨. వంచునది. ౩. మ్రొక్కునది. ౪. మ్రొక్కించునది. వి. అ. న. ౧. వంగుట, నమ్రమగుట. ౨. మ్రొక్కు.

నమనీయుఁడు. సం= నమ్యుఁడు.

నమయత్. సం. (శతృ.) ౧. వంచుచున్న. ౨. నమస్కరింపఁజేయుచున్న.

నమయమానము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వంచుచున్నది. ౨. నమస్కరింపఁజేయుచున్నది.

నమలఁబెట్టు. స. క్రి. (√నమలు.) ౧. నమలించు.

సీ. భూపాలనందన పుత్తెంచె నీ కని నాతమ్మ యింపార నమలఁబెట్టి. దశకు. ౬. ౧౨౫.

౨. స్తన్య మొసఁగు, పాలిచ్చు.

(వ్యవ.) పిల్లవాఁ డేడువకుండ నమలఁబెట్టుము.

నమలి= నమిలి. వి. (త. ఇమలి. క. నవల్.) కేకి, మయూరము.

ద్వి. నాకాధినాథుండు నమలియై జముఁడు, కాకరూపం బైనఁ గడు భీతి నొంది. రం. రా. ఉ. ౩౦ పా. ౧౪ పం.

ద్వి. నాకాధినాథుండు నమలి నీక్షించి. రం. రా. ఉ. ౩౯ పా. ౧౬ పం.

గీ. నమలిపింఛంబుతోఁడ నీరమణివేణి, చెలిమి సేయుట బగగొంటఁ దెలియ నరిది, యందుఁ బువ్వులఁ బూజించునట్టి తెఱఁగు, నర్ధచంద్ర ప్రహారచిహ్నముల కలిమి. నైష. ౩. ౧౫౯. (చి. ని. పా. నెమిలి ముద్రి. పా.)

నమలు. స. క్రి. (త. నమై.) ౧. (తినెడిపదార్థము నలఁగునట్లు) దంతములతోఁ బలుమాఱు ఖండించు.

చ. గుములు గట్టి యీఁకెలు గుట్టి ప్రవాళము వట్టి కింకతోఁ, నమలక మ్రింగి ... అమనిని రేయుఁ బగల్ వడిఁ గూయుఁ గోయిలల్. కు. సం. ౪. ౪౬౩.

ఆ. నమలి మ్రింగఁ గేలఁ జపరి మొగంబునఁ, బూసికొనఁగ ... కు. సం. ౧౦. ౫౩౪.

౨. భక్షించు, తిను.

గీ. ... మహాదాదిమత్స్యకూర్మములఁ దిగిచి, హరులలాటాగ్ని లోపల నెరియఁబెట్టి, నమలు నిజభుజఘూరివిక్రమము మెఱయ. కు. సం. ౧౦. ౫౩౫.

గీ. ... అధిప యాషాఢముఖ్యంబు లైన నెలలు, నాలుగింటను మాంసంబు నమల కుడుగు. భార. అను. ౪. ౩౦౧.

౩. ఆస్వాదించు, అనుభవించు.

క. విని చెవుల ముట్టి తోలం, గని కన్నుల నమలి నాలుకను మూర్కొని ముక్కున... కు. సం. ౬. ౪౨౪.

క. అమృతరుచు లారఁ బాకము, లమరించిన మోదకంబు లాదిగ బహుభక్ష్యము లొగి నిచ్చిన నానందముతో నందుకొని నమలి తనిసినమదితోఁ గ్రీ. భా. రా. బాల. ౪౦.

నీళ్లునమలు = సమాధానము చెప్పలేక అస్పష్టముగా మాటాడు.

(వ్యవ.) నీళ్లు నమలక నే నడిగిన దానికి సమాధానము చెప్పుము.

సా : నమల వశము కాని నారికేళము.

ద్వి. నమల వశము కానినారికేళంబుఁ, దెమలక మ్రింగ దంతికి జీర్ణ మైనవడువున... ప్రభులిం. (చి. ని.)

జ : నమలఁబెట్టు.

నమసము. సం. వి. అ. పుం. ౧. వేత్రము, బెత్తము. ౨. ప్రణామము, నమస్కారము. (కే. ని.)

నమసితుఁడు. సం= నమస్యితుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నమసుఁడు. సం.విణ. (అ.ఆ.అ.) అనుకూలుఁడు.

నమస్కరణము. సం. వి. అ. న. వందనము, చేమోడ్పు.

నమస్కరించు. సం. అ. క్రి. ఎఱఁగు, వందనము చేయు.

గీ. విష్ణుఁ బ్రభవిష్ణు నచ్యుతు విగుణు సగుణు, హరిఁ జతుర్వ్యూహు నవ్యయు నభవుఁ బర ము, సెలమిఁ దమచిత్తముల నావహించి హర్షమగ్నులగుచు నందంద నమస్కరించి. మార్క. ౧. ౧౦౪.

నమస్కారము. సం. వి. అ. పుం. ౧. వందనము, చేమోడ్పు. ౨. విషభేదము. (వాచ.)

నమస్కారి. సం. విణ. (న్. ణీ. న్.) నమస్క రించువాఁడు. వి.ఈ.స్త్రీ. ముడుఁగుఁదామరకు.

నమస్కృతి. సం. వి. ఇ. స్త్రీ. నమస్కారము.

నమస్కృతుఁడు. సం.విణ. (అ.ఆ.అ.) ౧. నమ స్కరింపఁబడినవాఁడు. ౨. పూజింపఁబడిన వాఁడు.

నమస్యా. సం. వి. ఆ. స్త్రీ. ౧. నమస్కారము. ౨. పూజ.

నమస్యితుఁడు. సం. విణ. (అ. ఆ.అ.) ౧. నమ స్కరింపఁబడినవాఁడు. ౨. అర్చితుఁడు, పూజి తుఁడు.

నమస్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నమ స్కరింపఁ దగినవాఁడు. ౨. పూజింపఁ దగిన వాఁడు. ౩. నమస్కరించువాఁడు. ౪. పూజిం చువాఁడు.

నమస్సు. సం. అవ్య. వి. స్. న. నమస్కారము, వందనము.

గీ. విధిగృహీతయవిత్తసేవధికి శరణు,నతమృడా దికసుమనస్సునకు నమస్సు. ఆము.౬, ౯౯.

నమాజు. వి. (హిం. నమాజ్.) మహమ్మదీయుల దైవప్రార్థనము.

సీ. పాశ్చాత్యులనమాజుపై బుద్ధి పుట్టెనో మా నులజపముపై మనసు రోసి. సిం.నార. ౮.

సా:- నమాజు చేయఁబోయిన మసీదు విఱిగి మీఁదఁ బడ్డట్లు.

నమించు. సం. స. క్రి. నమస్కరించు.

ఉ...వాల్మీకిఁ దలంతు వ్యాసుని నమింతు ను తింతును గాళిదాసునిన్. శశాం. ౧. ౧౮.

నమిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ౧. వంచు వాఁడు. ౨. నమస్కరింపఁజేయువాఁడు.

నమితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వంపఁ బడినది. ౨. నమ్రమైనది, వంగినది. ౩. నమ స్కరింపఁబడినది.

నమిలి=నమలి, నమ్మి, నమ్మిలి, సెమలి, సెమిలి, సె మ్మి, సెమ్మిలి. వి. (క.నవిల్.) కేకి, మయూరము.

ఆ. వేటకాఱు ముట్టి వెనుకొనఁగా శ్వేత,నగ ముచటికిఁ దాఱునమిలివోలె. కు. సం. ౨. ౨౦౫.

సీ. ప్రణవాక్షరాభ్యాసపరిపాటిఁ బాటించునా నావిధంబుల నమిలిపిండు. భీమ. ౩.౨౮.

ద్వి. నక్కల నుదుతల నమిళులఁ బంది,కొక్కుల ...పండితా. పర్వ. ౩౪౩ పా.

నముచి. సం. వి. ఇ. పుం. ౧. ఒకఅసురుఁడు. (ఇంద్రహతుఁడు.) ౨. మన్మథుఁడు.

నముచిసూదనుఁడు. సం.వి.అ.పుం.ఇంద్రుఁడు.

నమురు. వి. ఆము, మదము.

వ ... జలగ్రహంబు లొండొండ నంటునంటుగ నొరసి...కలహంబునమఁ దిమురుచు నమురు గవిసి యప్పటప్పటికి జిఱజిఱం ద్రిప్పివేయు చటులవాలఘాతంబుల...శ్రీరం.౧.౧౩౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నమేరువు. సం. వి. ఉ. పుం. ౧. సురపొన్న చె.
(దీనికి దోహదము స్త్రీహసితము.) ౨. రుద్రాక్ష చె.

నమోగురువు. సం. వి. ఉ. పుం - నమస్సునకు తగినపూజ్యుఁడు - బ్రాహ్మణుఁడు. (వాచ.)

నమోవాకము. సం. వి. అ. పుం. ౧. నమో అని పలుకుట, వాగ్రూపముగా నమస్కరించుట. ౨. నమస్కారము, వందనము.

క. వాకిటికి వచ్చుసతులకున్, గైకొని వినయావలోకగతి నలరించుచున్, శ్రీకార్యపరులకు నమో,వాకం బొనరించి వికచవదనాంబుజయై. ఘటికా. ౨. ౨౨.

నమ్మకము=నమ్మిక. వి. విశ్వాసము.
(వ్యవ.) వానిమాటమీఁద నాకు నమ్మకము లేదు.

నమ్మదుంప. వి. గోట్టిగడ్డ, కశేరుకము చె. (శ. ర.)

నమ్మి=నమిలి.

లయగ్రాహి. నమ్ము లలకొప్పులు ఘనమ్ము లని నైజసదనమ్ములను బొంగి నటనమ్ములఁ దగన్ యా, నమ్ములకు లోఁగి పులినమ్ములను హంసమిథునమ్ము లతిమందగమనమ్ములను రా ... చంద్రా. ౩. ౯౬.

గీ. శీతగిరిమీఁద మదకరుల్ సీత్కరించు, నెలుఁగు నవఘనారవ మని యెసఁగి యాడు, నమ్మిపదుపులు గడు నొప్పు నగవిభునకు, బలసి పట్టినపింఛాతపత్రభాతి. కు. సం. ౩. ౨౧౦.

సీ. రాయంచ దే నమ్మి రా యం చమర్షియై సాదితో వాదించె షణ్ముఖుండు. దశా. ౧. ౨౨.

నమ్మించు. స. క్రి. (√నమ్ము.) విశ్వసింపఁజేయు.

గీ... నమ్మించి చంపఁ,జనదు మాయాబలంబునఁ జనదు చంప. భార. ఆది. ౫. ౫౬.

నమ్మిక= నమ్మకము, నమ్మిగ. వి. (√నమ్ము. క. నంబికె. త. నంబిక్కై.) ౧. విశ్వాసము.

గీ. ప్రజకు నమ్మికగా నిన్నుఁ బట్టఁబద్ధుఁ, జేసె ...దశకు. ౭. ౫౧.

మ... మీ తేజంబునం దొల్లి యీ,జగమే శోర్చితి నాదునమ్మిక వృథాసంకల్ప మయ్యెం దుదిన్. హరి. ఉ. ౭. ౧౭౭.

౨. నమ్ముటకు ఆధారమగువాక్యము, ప్రమాణము.

ఉ. నాకు మనంబు నిండ నొకనమ్మిక సేయుము ... శివరా. ౩. ౭౯.

సీ. నాదు సేయ నటంచు నమ్మి కిచ్చినఁ గాని మినుకుఁజెక్కిలి ముద్దుగొనఁగనీయ. దశా. ౭. ౧. ౧౩౭. శుక. ౨. ౭౯౯.

నమ్మికకాఁడు. విణ. (√నమ్ము.) నమ్మకముతో కాచువాఁడు.

చ. జలరుహమిత్త్రుఁ డాత్మరుచిసంపదఁ జీకటి బందెకానికిం, గలఁగుచు వీనిలోన నిడి కైకొనె నమ్మికకాఁపులంచు... పారి. ౨. ౫౯.

నమ్మిగ=నమ్మిక. వి. (√నమ్ము.) నమ్మకము, విశ్వాసము.

క. తగుమాట లాంబికేయుం, డగు నని కైకొను నె యెన్నఁడైనను గొడుకున్, మగఁటిమి గలఁ డనియెడునమ్మిగఁ జూచుచు నుండు విషము మ్రింగనయేనిన్. భార. ఉద్యో. ౧. ౩౧౫.

క. మగఁ డింక నన్ను సైఁచునె, దిగవిడుచుం జంపుఁ గాక తెల్లము మది న్నమ్మిగ పుట్టునె యిది చెప్పిన, మొగమోటన మనుపు చుండి మూసితి వబలా. హరి. పూ. ౫. ౨౨.

నమ్మినకాఁపు. విణ. (√నమ్ము.) విడువక కనిపెట్టుకొనియుండువాఁడు. (బంటు.)

ఉ... కీ,నాళనివేశనమునకు నమ్మినకాఁపగుపంక్తికంఠుఁడున్, నీళరవృష్టి నీల్గు... భా. రా. యు. ౧౩౦౩.

నమ్మినవాఁడు. విణ. (√నమ్ము.) ౧. ఆప్తుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. నమ్మినవాఁ డన నచ్చినవాఁ డనఁ జనవరి య
నఁగను దనరు నాప్తుఁడు... ఆం. భా. ౨.
౧౮౩.

౨. విశ్వసించినవాఁడు.

ఉ...హరిం బతి సేయుమమ్మ నిక్, నమ్మినవారి
కెన్నఁడును నాశము లేదు గదమ్మ యీశ్వరీ.
భాగ. ౧౦ పూ. ౧౩౪౨.

ఉ...ఇమ్మగ నమ్మినవారిఁ మేల్పనుల్, చక్కఁ
గఁ జేయుదేవరకు...నీలా. ౧. ౩.

ఇష్టే: నమ్మినబంటు.

క. అన విని ధృతరాష్ట్రుం డి, ట్లను నమ్మినబం
టు పిఱికి యై యిటు పఱవం, గని మంద
బుద్ధి దుర్యోధనుఁ డే మని తలఁచెనొక్కొ
తనచిత్తమునన్. భార. ద్రో. ౪. ౧౩౮.

నమ్ము. స. క్రి. ౧. విశ్వసించు.

(దుష్యంతుఁడు.) చ. ఇది మునికన్య యేని మతి
యేలొకొ యీలలితాంగియందు నా, హృద
యము దద్దయుం దవిలె నిప్పలు కింకను నమ్మ
నేరన, య్యెద...భార. ఆది. ౪. ౩౦.

చ...అత్త నమ్మినం, జెఱుపఁ దలంతురే ఘనులు
చిత్తమునం బగవారి సేనియున్. నైష. ౧.
౧౦౪.

సీ...ఇతనిమాటలు నమ్మ బెట్టు లనక. ఉ.రా.
౧. ౩౦౬. ఆము. ౪. ౨౩౫.

౨. ఆశ్రయించు.

సీ. నమ్మితి మన్న నెంతటిదరిద్రులనైన శ్రీలచేఁ
జెల్వొందఁ జేయుకరుణ. దశా. ౧. ౪౧.

జః నమ్మించు, నమ్మిక, నమ్మికకాఁపు, నమ్మిగ, నమ్మి
నకాఁపు, నమ్మినవాఁడు.

నమ్యమానము. సం. విశ. (అ. ఆ. ఆ.) ౧. వం
పఁబడుచున్నది. ౨. నమస్కరింపఁబడుచున్న
ది; పూజింపఁబడుచున్నది.

నమ్యుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) ౧. నమస్క
రింపఁదగినవాఁడు; పూజనీయుఁడు. ౨. వంపఁద
గినవాఁడు.

నమ్రకము. సం. విశ. (అ. మ్రకా. అ.) నతము,
వంగినది. వి. అ. పుం. వేతసము, ప్రబ్బలి.

నమ్రము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. నతము,
వంగినది. ౨. లోఁతయినది, లోపలికి అడఁగినది.
౩. అడఁకువ కలది, వినయాన్వితము. ౪. మ్రొ
క్కినది.

నమ్రితము. సం. విశ.(అ. ఆ. అ.) నమ్రముగా
చేయఁబడినది, వంపఁబడినది.

నయ=నయము. వి. (క. నయ=మృదుత్వము.) అం
దము, మనోజ్ఞత.

సీ. నయకల్రవేళ్ల మట్టియలుఁ బిల్లాం డ్లిడి పా
యపట్టముఁ బెట్టెఁ బై నొకర్తు. ఆము. ౬.
౧౨౫.

గీ. జాఱునలరులతేనియ గార యిచ్చి, గాడ్పు
సంధించు నయ కాని యూడ్పవెఱచు, నెం
దునయ్యాఁకవిరితోఁట నిందుముఖుల,నగవు
నునుమంచుసోనవోలె నయము దఱిగె. పాం
డు. ౫. ౨౯౪. (గాడ్పుసంధించు నయ
కాని యూర్పువెఱచు. అని ముద్రి. ఇట
యతి భ్రంశము. అర్థము విచార్యము.)

నయకోవిదుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) నీతి
చక్కఁగా తెలిసినవాఁడు.

నయగారము. వి.(నయము + కారము[3].) మనోజ్ఞ
త,ఒప్పు, అందము. (మృదుత్వము అని శ. ర.)

క. ప్రియ మై రమణీయమణీ,మయ మై యతి
చిత్రభిత్తిమంజిమనయ మై, నయ మైనచిలు
కపలుకుల, నయగారమునం జెలంగినయగార
మునన్. సారంగ. ౧. ౧౩౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. చెలిమాటనయగారముల నెన్నికొనియెడే
గొణిఁగె దేల తపస్వికులవతంస. చంద్రా.
౩. ౧౦౩.

౨. విలాసము.

సీ. పలుకుఁదీయములకు వెలిగొడుగులు గావె
నయగారములలోనినగవుపసలు. రామా. ౨.
౭౮. (మృదువచనము అని శ. ర.)

౩. ప్రియవాక్యము.

ఆ. నక్కవినయములును నయగారములఁ బ
ల్కి, కుడువ కెల్లధనము కూడఁబెట్టు. వేమ
న. ౧. ౪౮.

సీ. నర్మగర్భోక్తులు నక్కటక్కులు వింతనయ
గారములు బహునాటకములు. పాండు. ౩.
౪౩.

౪. అలంకారము.

చ... ఆనృపాలునిం, గలయఁ దలంచి మేన న
యగారము గీల్కొనఁ జేసి చేరె ని, ర్మలగు
ణశాలి యైనశుకమండలమాళిసమీపభూమి
కిన్. శుక. ౧. ౨౫౪.

విణ. కపట మైనది.

క. ఈశేయి నన్ను నిలువున, నీరుగఁ గరఁగింప
వలయు నేఁ డున్నవి నీ, నేరుపు లన్నియు
నని నయ,గారపువగలాడి యనుపఁగా నతఁ
డరిగెన్. శుక. ౨. ౧౭౬.

ఉ. ఈనయగారపుం బ్రియము లీపస లీమొగమి
చ్చుమాట లే,లా...పారి. ౧. ౧౨౫.

క. నయగారపుఁదమిఁ గపటు, ప్రియముల మెఱ
మెచ్చుఁబల్కు రింతను మిథ్యా,చయఃసులను
ఔపచారపు,నయమున మునిఁ గూడి కొన్ని
నాళ్లు రమింపక్. విప్ర. ౪. ౧౩.

నయగారి. విణ. (నయగారము + ఇ౩.)మనోహ
రము, ప్రియము.

ద్వి. నయగారిమాటల నటనచూపులను, బ్రియ
ముల నయముల జెల్లించి పొంచి. అ.పు.క.
౩. ౧౭౯ పా. ౧౯ పం.

నయగారితనము. వి. (నయగారి + తనము.)మృ
దువాచాలత, మనోహరముగ మాటలాడుట.

సీ. నయగారితనమున నాథుఁ డాశ్లేషింప లోఁ
గక యెదు రొత్తి కౌఁగిలించు. చంద్రా. ౬.
౧౫౦.

నయచక్షువు. సం. వి.ఉ. పుం - నీతిశాస్త్రమే
కన్నుగా -ప్రమాణముగా- కలవాఁడు-రాజనీతి
నిపుణుఁడు.

నయజ్ఞుఁడు. సం= నయకోవిదుఁడు.

నయత్. సం. (శతృ.) ౧. కొనిపోవుచున్న. ౨.
నడపించుచున్న. ౩. పొందించుచున్న.

నయనగోచరము. సం. విణ. (అ. ఆ. అ.) కం
టికి కనఁబడునది, చూపు మేరలోనిది.

నయనచ్ఛదము. సం. వి. అ. పుం- నేత్రగోళ
మును కప్పునది- కంటిఱెప్ప.

నయనజలము. సం. వి. అ. న. బాష్పజలము,
కన్నీరు.

ఇట్లే : నయనసలిలము మొ.

నయనపా(పుపా)రువ. వి. మల్లబంధవిశేషము.

వ. ... ఆవీరుండు ... దండనిల్కడ కదలు
నయనపారువ ... కరలాఘవంబు లాది యా
షోడశోపవిత్తంబులరీతులు నేర్చి... హంస.
౧. ౨౦౬.

వ...హస్తపుపారువ దేహపుపారువ నయనపుపా
రువ ... మొదలగువితంబు లెఱిఁగి ... ప్ర
బంధ. ౭౮.

నయనపుటము. సం. వి. అ.న. ౧. పుటమువంటి
కన్ను; కన్ను. ౨. కను ఱెప్ప.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నయనము. సం. వి. అ. న. ౧. కొనిపోవుట, తోడ్కొనిపోవుట. ౨. యాపనము, జరపుట, పుచ్చుట. (కాలము కడపుట.) ౩. ప్రాపణము, పొందించుట. ౪. ఏలుట,పాలించుట. ౫- బుద్ధి విషయమును పొందునట్లు చేయునది- కన్ను.

నయని. సం. వి. ఈ. స్త్రీ. కంటినల్లగ్రుడ్డు.

నయనీయము. సం= నేతవ్యము.

నయనోత్సవము. సం. విణ. (అ.ఆ.అ.) నేత్రములకు ఉత్సవము కలిగించునది. వి.అ.పుం.౧. నేత్రోత్సవము, కన్నులపండువు. ౨. దీపము.

నయనోపాంతము. సం. వి. అ. పుం. అపాంగము, కడకన్ను.

నయనౌషధము. సం. వి. అ. న. పుష్పకాసీసము,కొంచెము తెలుపువన్నె కలపచ్చనిఅన్నభేది.

నయపీఠి. సం. వి. ఈ. స్త్రీ. నెత్తపలక, జూదమాడుపలక.

నయమానము. సం. విణ. (ఆ.ఆ.అ.) పొందించుచున్నది.

నయము=నయ. వి. ౧. మనోహరత్వము, పొలుపు, అందము.

మ. మును సౌరభ్యము నివ్వటిల్లఁగ మనోమోదంబునం దేఁటు లల్లన యోలిన్ వెడలంగ రేకులు సముల్లాసంబునన్ బింక మెక్కన నయం బెక్కుచు గద్దెపాం దెడలి వీఁకం గేసరంబుల్ గడల్కొనఁ దోడ్తో మధు వుచ్చి పేరెలమిఁ బొల్పెం జెందె నంభోజముల్. భార.ఉద్యో.౨.౧౧౦.(నునుపు అని శ.ర.)

గీ. సొలపు వలపును గొలుపునిచ్చలపుఁ దెలుపు, నగవు మల్లెల కొకవింతనయము దెలుప. యయా. ౧. ౭౪.

గీ. ఈడవిడిచిన మేఁదీఁగ యింతనయము, గలిగియున్నది. ... కు.సం. ౭. ౭౩౮.

ఉ. తమ్మి నయమ్ము దప్పఁ గుముదమ్ము ముదమ్మున నొప్పఁ జక్రవాకమ్ములు జోడు విప్ప ... భాస్కరుం, డమ్మెయి నస్తమించె... కవిరా. ౫. ౧౭౩.

౨. రీతి, విధము.

సీ. అలపాలవెల్లి జాబిలిరేక యుదయించి నానాఁట రహిగుల్కు నయము గాంచి. ఇందు. ౨. ౧౩౭.

గీ. ... శిబిసంగతి మాంధాతనయమునను య, యాతికరణి దిలీపునియట్లు...హంస.౧.౪౨.

క. ఈనయమునఁ గడు నెయ్యము, గా నడువఁగ విశ్వసించె ఖచరాధీశున్.దశా. ౨. ౧౩౦. మనుచ. ౨. ౧౦.

౩. నేర్పు.

క. విను మధిప యిట్లు గొనిపోయి నయంబున నొక్క నావ యెక్కించె...కళా.౬.౧౦౦.

చ. అరవిరి వెండిచెంబులనయంబునఁ దేనియపానకంబు లేఁ,బరు వగుగుజ్జుమావిచలిపందిరులన్ లతకూన లియ్యఁగా. కువల.౩.౧౨౨.

చ. తనమృదుగీతికాపరిణతధ్వనివైఖరిఁ బల్కుమంచు మిం,చినరహిఁ జేతివీణియయుఁ జెక్కులు గీటుచు నేర్పుచున్నదో, యన నఖరాంకురంబులనయమ్మునఁ దంత్రులు మీటి గానమిం, పొనరఁగఁ జేయువాణి...పారి.పీఠి.౫.

౪. ఆసక్తి.

చ... ముగ్ధ యొక్కతె వికాసినియై నవకంపు దీఁగఁ బ్రా,సినయెలగొమ్మగుత్తిసవి చేరి నయంబునఁ బట్టి కోయఁ జూ,చిన ... నిర్వ. ౭. ౩౬.

గీ. నయము మీఱంగఁ బెనుప నానాఁటఁ బెరిఁగి. మనుచ. ౬. ౪౧.

మ. నిను మున్నెంతయు నమ్మి పాండవులయుస్నేహంబు నేఁ జీరికిం, గొన నీపోరెడుచందముల్ దెలియఁ బెక్కు ల్పాచితిం జేరి చే,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రినయం బిచ్చు చునోంప నూల్కొనక వారిం
బట్టి పొలార్చెదు...భార.భీష్మ.౩.౧౭౦.
౫. లాభము.
గీ. నయము పేదకు వరిఁ గోయనను నొసంగి,
ప్రబలఁజేసిన నర్థధర్మములు పెరుఁగు.ఆము.
౪. ౨౩౬.
౬. స్వాస్థ్యము.
గీ. నయ మొకించుకయైనఁ గానంగ రాదు,
చలువమందుల శైత్యంబు సంభవిలక, నినుఁ
డు గుడిచిన నీ రయ్యె నింతి మేన,నంతకంత
కు సంతాప మగ్గలించె. పి. శకు. ౩.౪౪.
విశ. ౧. రమ్యము, అందమైనది.
క. ప్రియ మై రమణీయమణీ, మయ మై య
తిచిత్రభిత్తిమంజిమనయ మై, నయ మైన
చిలుకపలుకుల,నయగారమునం జెలంగినయ
గారమునన్. సారంగ. ౧. ౧౩౫. (అతి
చిత్రమంజుమంజీరములన్ అని శ.ర. పా.)
మధురగతిరగడ. నవరత్నంబుల నయ మగు మే
డలు కవగూడిన పటికంబులగోడలు. కుచేల.
౧. ౨౩.
క. మానిత మగుగుడరసమున, నూనినతుండీర
ఫలమొ యొగిఁ దేనెతల,న్నాని మృదు వైన
పవడమొ, నా నద్రిజతొప్పమోవి నయమై
యొప్పున్. కు. సం. ౩. ౩౦౫.
౨. సుకుమారము, మృదువు.
చ...చెక్కులం, దొఱఁగెడుఘర్మముల్ దనదు
దుప్పటిచేఁ దుడిచెన్ నయంబుగన్. దశా.
౨. ౩౧౬.
౩. చౌక. (శ.ర.) ౪. సను పైనది, సన్ననిది.
(శ.ర.) ౫. మేలైనది.
ద్వి. కల్లిబోటియాట నయం బయి ...వి. పు.
౨. ఆ. (శ. ర.)
వ...శకుఅకారనిర్ణయమ్ములకు నయమ్మును యమ
కమ్ములకు గమకమ్మును...ప్రబంధ. ౬౨.
నయముచూపు=వృద్ధిపొందు.
సీ. శివపూజనాసక్తిఁ జిన్నిచన్నుల పెక్కువయు
బ్రత్యహంబును నయముచూప. కాశీ. ౪.
౨౩.
నయమెక్కు=వృద్ధిపొందు.
ద్వి. గుమురులు నయ మెక్కి క్రొమ్మోసు లొ
దవి, కొమరరార...నవనాథ. ౧. ౧౧ పా.
౧౦. పం.
జ: నయగారము, నయగారి, నయగారితనము.
నయము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. నడపు
నది. ౨. కొనిపోవునది. ౩. పొందించునది.
౪. న్యాయ్యము, న్యాయమునుండి తప్పనిది.
వి. అ. పుం. ౧. కొనిపోవుట. ౨. నడపుట.
౩. పొందించుట. ౪. నీతి. ౫. న్యాయము,
ధర్మము, పాడి.౬.(న్యాయవైశేషికసాంఖ్యాది)
దర్శనము; శాస్త్రము. ౭. ద్యూతవిశేషము;
జూదమాడుట కుపయోగించుపాచిక. ౮. అను
నయము, సాంత్వనము.
క. నయమునఁ బాలుం ద్రావగు, భయమునను
విషమ్ము నైన భక్షింతురు గా, నయ మెంత
దోసకారియొ, భయమే చూపంగవలయు
బాగుగ సుమతీ. సు. శ. ౬౩.
క. నయ మన్నఁ బాలు ద్రావరు, భయ మన్న
నమేధ్య మైన భక్షింతురు నా, నయము
భయంబులలోపల, భయమే నయ మండ్రు
బుధులు బద్దెనరేంద్రా. బద్దెన నీతిశాస్త్రము
క్తావళి. ౧౧౨.
సా. నయము నష్టము, భయము భాగ్యము.
నయవాది. సం. వి. న్. పుం. రాజనీతి చెప్పు
వాఁడు, నీతిశాస్త్రవేత్త.
నయవిదుఁడు సం. వి. ద్. పుం. నీతిశాస్త్ర
జ్ఞుఁడు.
నయశాలి. సం. విశ. (న్. నీ. న్.) నీతిచే
ఒప్పువాఁడు, న్యాయశీలుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నయశాస్త్రము. సం. వి. అ. న. నీతిశాస్త్రము.

నయించు. సం. స. క్రి. ౧. ప్రవర్తిల్లఁజేయు, నడుపు.

చ...ఋత్విజుల్, సవనము లుత్తమార్గము ప్రశంసకు నెక్క నయించి వేదవాక్యవిహితవృత్తిమె నభినవాభ్యుదయం బొనరించిరి... భార. అశ్వ. ౪. ౧౭౪.

వ...అద్దండదేవుని నతులధర్మంబున నయించు భూపాలుం డైహికాముష్మికసిద్ధులం బొందు. భార. శాం. ౩. ౧౨౦.

సీ. దమఁడై భూపతి దండనీతి నయింప కున్న సన్న్యాసులు సుత్పథప్రవర్తను లగుదురు ...భార. శాం. ౧. ౧౦౭.

౨. పొందించు. (శ. ర.)

నర=నరపు. వి. (√నరయు. క. నరె.త.నరై.)౧. పలితము, ముదిమిచే వెండ్రుకలు తెల్లనగుట.

ఉ. చన్నులనిక్క దప్పెఁగచసంతతిపై నర నూపెఁ జెక్కులం, జెన్ను దొలంగె ... జాహ్నవీ. ౪. ౫౫. (నెర. అపముద్రి.)

సీ. స్నేహార్ద్రిఁ డగుచు నశేషంబుఁ బోషించి నర వర్ణములతప్పు సరణు లుడిపి. గీ...ఎసఁగవలయు...నృపతి...ఆము. ౪. ౨౭౦.

౨. ముదిమిచే తెల్లఁబాటినవెండ్రుక.

క. నరలు గలకాముకైనను, దరుణులు రోయుదురు...భార. ఆది. ౩. ౧౯౪.

ఆ. కలయ నరలు వచ్చి తల తెల్ల నైనంతఁ, జేసి యెట్లు నీకుఁ జేరు నెఱుక. భార. అర. ౪. ౨౦౧.

సీ. దేవి నాలీలఁ బ్రార్థించుచుండఁగ వచ్చె నరలు నా కప్పుడె నాథుసేవ, యెక్కడిది... కళా. ౪. ౧౪౨. వేం. పంచ. ౪. ౩౩౯.

నరవెండ్రుక=పలితకేశము, నరసినవెండ్రుక.

ఉ. వేసలి పాటపాట నరవెండ్రుకతోఁ దిలదండులాన్వయశ్రీనటియింప...ఒకమంజులభాషిణివచ్చె వీథికిన్. కాశీ. ౭. ౧౫౯.

సీ. పసిమి పో నెండినకసవుబుట్టయుఁ బోలె నరవెండ్రుకలు పర్యుశిరమువలన. కళా. ౩. ౭౩.

సీ. నరవెండ్రుకన రాదు నాఁడెల్ల జగడించు వాటుఁగాలన రాదు చేటుఁదెచ్చు. గీ... అయ్యెద్దుమొద్దు. శుక. ౩. ౨౧.

నరంగము. సం. వి. అ. న. ౧. మగగుఱి. ౨. మొగమున లేచుబొటిమ. (వాచ.)

నరకఁడు. వి. ౧. మోటువాఁడు, మొద్దు.

గీ. కటకటా పద్మగర్భుఁ డెక్కడిరసజ్ఞుఁడీండ్ర నరకుని కిటువంటితీండ్రవయసుటోఱచూపులనెఱహొంతకారిఁ దెచ్చియాలుగాఁ గూర్చి పాపాత్ముఁడాయె నహహ. సురా. ౫౯.

గీ. నరకఁ డదె వచ్చె ననుచు నొండొరులతోడ, గుసగుసలువోయి రాతనికూర్మిసతులు.శుక. ౨. ౩౪౭.

౨. క్రూరుఁడు, దుష్టుఁడు.

క. మరుకేళిఁ గవయ కవ్వలి, కరుగవె చీ ఱంకులాడి యని నను నిచ్చల్,నిరసింతువు యోగివి గన, నరకా నీవాకె తాఁకె నాకుం జూడన్. హంస. ౩. ౨౩౪.

ద్వి. చుట్టంబువలెనె కృష్ణుని నలయింపఁగట్టిఁడి నరకఁ డెక్కడ నుండి వచ్చె.అ.మ.క.౧౭౯ పొ. ౧౦౦.

నరకకుండము. సం. వి. అ. న. నరకమందలి యాతనాస్థానవిశేషము. (ఈకుండములు ౮౬.)

నరకము. సం. వి. అ. పుం. న. నిరయము, పాపఫలము లనుభవించులోకము.

(నరకములు ౨౧. తామిస్రము, లోహశంకువు, మహానిరయము, శాల్మలి, రౌరవము, కుంభలము,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పూతిమృత్తికము, కాలసూత్రము, సంఘాతము, లోహితోదము, సవిషము, సంప్రపాతనము, మహానరకము, కాకోలము, సంజీవనము, మహాపథము, అవీచి, అంధతామిస్రము, కుంభీపాకము, అసిపత్త్రవనము, తాపనము.)

నరకాంతకుఁడు. సం.వి.అ. పుం. శ్రీకృష్ణుఁడు.

నరకీలకుఁడు. సం. వి. అ. పుం - మనుష్యులలో మేకువంటివాఁడు - హింసకుఁడు-గురుఘ్నుఁడు, గురువును చంపినవాఁడు.

నరకుఁడు. సం. వి. అ. పుం. ఒకయసురుఁడు. (ప్రాగ్జ్యోతిషపురరాజు, శ్రీకృష్ణునిచే హతుఁడయినవాఁడు.)

నరకేసరి. సం. వి. న్. పుం. ౧. నరసింహుఁడు, విష్ణునినాల్గవయవతారము. ౨. మనుష్యులలో శ్రేష్ఠుఁడు.

నరగ=నరగజేము. వి. (హిం. నగారా.) వాద్యవిశేషము, భేరి. (శ. ర.)

నరగజేము=నరగ.

గీ. తుకు మనంగను దముకు సాగిడియ యనఁగ, నరగజం బనఁ దద్భేదనామము లగు. ఆం. భా. ౧. ౧౨౩.

ద్వి. మురువుతో ఘోటుకములమీఁద వచ్చు,నరగజంబులు మాఱు నన్నాఱుకోట్లు.రం.రా. యు. (చి. ని.)

నరద. వి. పగులు, బీఁట.

(వ్యవ.) ఈయెండలకు నేల నరదలు తీసినది.

నరదము. సం. వి. అ. న. నళదము, వట్టివేరు.

నరద్విషుఁడు. సం. వి. ష్. పుం. రాక్షసుఁడు.

నరనారాయణులు. సం.వి.అ. పుం. ద్వి. ధర్మునిపుత్త్రు లగునిద్దఱుఋషులు. (వీరిలో నరుఁ డర్జునుఁడుగాను నారాయణుఁడు శ్రీకృష్ణుఁడుగాను అవతరించి రని పురాణప్రసిద్ధి.)

నరపు=నర, నరుపు. వి. (క. నెరహు.) పలితము.

ఆ. అవనిరాజ్యసుఖము లనుభవించుచుఁ బెద్ద, కాల మున్నఁ జెంపకడలనుండి, కలయ నరపు వచ్చి గడ్డంబు మీసలు, గప్పఁగోరుబాగు కానవచ్చె. కకు. ౪. ౨౪.

సీ. నర పన నర యనఁ బరఁగును బలితము... ఆం. భా. ౨. ౧౧౫.

నరపమీసము=నరపు కలమీసము.

ఆ. గూనివీపు లదుర గొణఁగి తిట్టుచు నేకు, గఱచికట్టికుక్కగం డ్లనంగ, మూతినరపమీసములబోయముదుసళ్లు, పందిపలలు మోచి పఱచి రపుడు. మనుచ. ౪. ౩౬.

ఇట్లే: నరపవెండ్రుకలు.

సీ. అపగతకేశోత్తమాంగంబుకెలఁకులం దూఁగాడునరపవెండ్రుకలతోడ. విక్ర. ౨. ౧౧౩.

నరపుంగవుఁడు. సం. వి. అ. పుం. మనుష్యశ్రేష్ఠుఁడు.

నరప్రియము. సం. విశ. (అ. ఆ. అ.) మనుజుల కిష్టమైనది. వి. అ. పుం. నీలి,నీలవృక్షము.

నరబలి. సం. వి. ఇ. పుం. దేవతలకు వేయుమనుష్యరూప మగుబలి.

నరభుజుఁడు. సం. వి. జ్. పుం - మనుష్యభక్షకుఁడు- రాక్షసుఁడు.

నరమానిక. సం. వి. ఆ. స్త్రీ = నరమానిని.

నరమానిని. సం. వి. ఈ. స్త్రీ- తన్ను పురుషునిగా తలఁచుకొనుస్త్రీ, మగవానివలె మొగమున మీసలు గడ్డము లోనగునవి కలస్త్రీ-పోటు, మాచకమ్మ.

నరమాలిని. సం. వి. ఈ. స్త్రీ. - మగవానివలె ముఖమున రోమమాల కలది-పోటు, మాచకమ్మ.

నరము. వి. (సం. నాలమ్. ప్రా. నాలమ్. త. మ. నరమ్పు. క. నర.) నాడి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(శల్యభీమసేనులు.) క. ఇరువురును సందు నూడక, వెర వెడలిన యాగ్రహముల వ్రేసినగదలొం, డొరుల మెడలకెలఁకుల బ,ల్నరములు దాఁకుటయు వా రిలం బడి రధిపా. భార. శల్య. ౧. ౧౮౦.

శ్లో. భృశం మర్మస్వభిహతావుభావాస్తాంసువిహ్వలౌ. సం. భార. శల్య. ౧౧. ౨౫.

ఉ. అంపెలు గట్టి చేత నొకయష్టి ధరింపుచు నెత్తివెండ్రుకల్, చెంపల వ్రేలఁగా ముదిమిఁ జిక్కి నరంబులె తక్కి స్రుక్కి...కుందు విప్రునిన్. ద్వా. ౧౦. ౪౦.

గీ...నర మన నాడి నివ్వటిల్లు. ఆం. భా. ౨. ౧౩౨. ఉ. రా. ౨. ౬౧.

బీఱనరము = ౧. పెద్దనరము.

ఉ. ఊసరవెల్లి చందమున నొక్కట బీఱనరాలు దేరఁగా...దూది రాశిగాఁ, జేసినరీతి నున్న యొకజీర్ణమునిం గని కౌతుకంబునన్. మనుచ. ౪. ౪౯.

౨. పీతనాడి.

గీ...బీఱ,నరము నాఁగను దగుఁ బీతనాడి... ఆం. భా. ౨. ౧౩౨.

నరపవాఁలు=నరములతో ఏర్పఱిచినత్రాడు, నరపుఁబటకా.

సీ. మొలఁగా సెఁ బోసినమురికిపాఁతయు నందు నడుము బిగించిననరపవాఁలు. హరిశ్చ. ౪. ౨౧౩.

నరము. సం. వి. అ. పుం- బరువుమో. తీసికొని పోవునది-గుఱ్ఱము. న. ౧. రామకర్పూర మను తృణము*. ౨. నరయంత్రము. (మే. ని.) ౩. ఉదకము, నీరు. (కే. ని.)

నరమేధము. సం. వి.అ. పుం. మనుష్యుని యజ్ఞపశువుగా చేసి జరుపుయాగవిశేషము.

నరయంత్రము. సం. వి. అ. న. ఛాయచేత కాలమును తెలియుటకై ఉపయోగించుచ్వాదశాంగుళపరిమాణము కలశంకుయంత్రము.

నరయు=నరియు. అ. క్రి. ముదిమిచే వెండ్రుకలు తెలుపగు.

ద్వి. నరసినబొమలును నరసినశిరము, గర మొప్పఁ బెద్దయు గౌరవం బొప్ప. రం. రా. యు. ౨౯౨ పం. ౩౦ పం.

చ. నరసినవెండ్రుకల్ జనపనార తెఱంగున విప్రమౌళికిన్. శేష. ౧. ౭. (శ. ర.)

గీ. నరసి వ్రాలినబొమ లెత్తి పరమవృద్ధు, శివుని కారుణ్య మనుచు నాశీర్వదించె. హర. ౨. ౪౮. వరాహ. ౬. ౨౪.

జః నర, నరపు.

నరవ. వి. కొండత్రోవ.

వ...మురువు లై సింగపుజంగిలి కిరవు లై విరువు లగునరవలం గరువలి మేపుడు దొరపడగలరంగులు తొంగలించి మీఁదికిం బచరించె నన మించుతలిరుమ్రాఁకులును...యయా. ౨. ౪౦.

సీ...గిర్యయన మొప్పు నరవ నా...ఆం. భా. ౨. ౯.

నరవండు. వి. ఓషధివిశేషము*.

సీ. కుప్పి సూర్యక్రాంత ముప్పుడు నరవండు గాడిదగడపర కన్నెకొమర. హంస. ౪. ౧౦. (నరవంజి అని బ్రౌ.)

నరవాహనుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు.

నరవిష్వణుఁడు. సం. వి. అ. పుం. ౧. మనుష్యభక్షకుఁడు, రాక్షసుఁడు. ౨. నరహింసకుఁడు. (వాచ, కల్ప.)

నరశార్దూలుఁడు. సం. వి. అ. పుం. మనుష్యశ్రేష్ఠుఁడు.

నరసింగము. మి. వి. మల్లవిద్యావిశేషము, ముప్పదిరెండువిన్నాణములలో నొకటి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ... నరసింగము సరి బి త్తరము కిల్లి...గీ...నాఁ గఁ జెన్నలరుచుండు, ముప్పదియురెండువి ద్యాణములకుఁ జేళ్లు. ఆం. భా. ౨.౨౧౯.

నరసింహుఁడు. సం. వి. అ. పుం. ౧. నరసింహ మూర్తి యగువిష్ణువు. ౨. నరశ్రేష్ఠుఁడు.

నరహరి. సం. వి. ఇ. పుం = నరసింహుఁడు.

నరాంగము. సం = నరంగము.

నరాజి(జీ)=నారాజి. వి. కత్తి, ఖడ్గము.

సీ ... తరవలి నరాజి పిరంగి యడిద, మన ఖడ్గ నామ మై యలరుచు నుండును...ఆం.భా. ౨.౨౧౪.

చ. కలువకటారి యీచెలువ గా దలసంపఁగి తూపు గాదుగా, తళుకులబిత్తరంపుఁదమిఁ దమ్మిమెఱుంగులనేజ కాదు క్రొం,దలిరునరా జి కాదు జిగిఁ దార్కొను గేఁదఁగిచిక్క టారు కా, దలరులవింటివానికిఁ బ్రియం బగుమోహనబాణ మెన్నఁగన్. ఘటికా. ౨. ౮౮.

సీ. ఒక్కొక్కకెందలి రుదయించెఁ దరురాజిఁ దోరమై తనరెఁ గంతునినరాజి. కృష్ణ. ౪. ౪౨.

సీ. తననరాజీచిల్వకును మార్తురా తెండ్లయుసు రుగాడుపు లింపు లొసఁగుచుండ. యయా. ౧. ౫౭. (పరంజీ అని అపముద్రి.)

నరాధిపుఁడు. సం. వి. అ. పుం. రాజు.

ఇట్లే: నరేశుఁడు,నరేశ్వరుఁడు,నరదేవుఁడు మొ.

నరాశంస. సం.వి.అ.పుం.౧. యజ్ఞము. ౨.అగ్ని.

నరాశుఁడు. సం. వి. అ. పుం.-మనుష్యులను తిను వాఁడు - రాక్షసుఁడు.

నరి. వి. మర్యాద, హద్దు.

ద్వి. పెరిమెఁ బోని మ్మని ప్రియము గావింప,నరి మీఱి పల్కె దు స్సత్తుచందమున.ద్వి.పరమ. ౩. ౧౧౨ పా. ౬ పం.

ద్వి. పరమబాంధవుఁ డైనపంకజోదరుని, నరి మీఱి యేము నిందనుక దూఱితిమి. ద్వి. పరమ. ౩. ౧౫౬ పా. ౧౦ పం.

నరి. సం. వి. ఈ. స్త్రీ. నరునిభార్య.

నరిడి. వి. పశువులకు వచ్చుగుండెయుబ్బరపురోగ విశేషము.

ఆ. నరిడి పుప్పు కప్పనావురు కడుపూఁద, య దురు ద్రిక్క యనఁగ నడరి మఱియుఁ, దెవు ళు లెన్నియేని... హరి. పూ. ౬. ౪౫.

నరియఁడు=నరియకొక్కు. వి.సర్పవిశేషము.

సీ. నరియఁడు దెరు వాఁగె గరుడియుఁ బాలయు నెడమనుండియు వచ్చి కుడిని నిలిచె. ఉ. రా. ౬. ౨౩౫. (నక్క అని శ. ర.)

నరియకొక్కు=నరియఁడు. వి. సర్పవిశేషము.

గీ. కలవు తక్కినజెట్టిపోతులును దుంప,నాగులు ను గొంటెగాఁడులు నరియకొక్కులు... ద్వా. ౮. ౯౮.

నరియు=నరయు.

క. సురకుంజరములకొమ్ములు, మురిసెన్ దొండ ములు విరిసె మోములు నరిసెన్. నృసింహ. ౪. ౪౮. (శ.ర.పా. విరిసెన్. ముద్రి.పా.)

జః నరుపు.

నరుఁడు. సం. వి. అ. పుం. ౧. మనుష్యుఁడు. ౨. మగవాఁడు. ౩. అర్జునుఁడు. ౪.ఒకఋషి. (నరనారాయణ ఋషులలో మొదటివాఁడు.) ౫. బ్రహ్మదేవుఁడు. (త్రి. ని, మే. ని.) ౬. పదాతులు, కాల్బలము.

మ. కరులం గూల్చుచుఁ దేరులన్ నఱకుచున్ గర్జిల్లి ఘోటమ్ములన్, నరులన్ నెత్తుటఁ దే ల్చుచున్ దొరల నానారూపఖండంబులై, తొరఁగం జేయుచు...భార.ద్రో.౫.౩౦౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నరుడకన్ను. వి.(పశువుల) నేత్రరోగవిశేషము.
ద్వి. నరుడకన్నును నీరు వాలుకచేర్లు, గురుసు దెవులు...నవనాథ. ౧.ఆ.౪౧పా.౨౫పం.

నరుపు=నరపు. (శ. ర. √నరియు.)

నరేంద్రమార్గము. సం. వి. అ. పుం.రాజవీథి, పెద్దవీథి.

నరేంద్రము. సం. వి. అ. పుం. వృత్తభేదము. (వాచ.)

నరేంద్రాభము. సం. వి. అ.పుం. పచ్చరంగు కల అగురువు౹.

నరేంద్రుఁడు. సం. వి.అ.పుం.౧. నరశ్రేష్ఠుఁడు, ౨. రాజు. ౩. విషవైద్యుఁడు, పాములవాఁడు. ౪. భూతవైద్యుఁడు, పిశాచములను పోఁగొట్టు వాఁడు. (వాచ.)

నరోత్తముఁడు. సం. వి. అ. పుం. ౧. నరశ్రేష్ఠుఁడు. ౨. పురుషోత్తముఁడు, నారాయణుఁడు. ౩. బుద్ధుఁడు.

నర్తిలి=అర్తిలి.
సీ. దేహంబు నివురు మోడించుఁ గాఁగిటఁ జేర్చు నర్తిలితో నిట్లు నన్ను మనుప. భాగ. ౧. ౧౧౬. (చి. ని, ప్రాఁతప్రతుల, పా.)
ఉ...నీసుతఁ బెండ్లియాడఁగా, నాయము నాకు మారునకు నర్తిలి హత్తఁగ ... విజ. వి. ౩. ౧౨౬.

నరుకు=నఱుకు, నఱుకు. స. క్రి. ౧. ఖండించు.
ద్వి. ఏఁగుబెంచిన కాళ్ల నిల నర్కి వైచి, కాఁగిలింపఁగఁ గోరుకరములు దునిమి. పండితా. పురా. ౧౪౪ పా. ౧౦ పం.
౨. చంపు, సంహరించు.
ఉ. జోడనలుక్ రవల్ ములుకుజుట్లును దాడులు నాగబంధముల్, వేడెము లాది యాగతుల వేమఱు వాజుల మీఁటి నర్కుచుక్. మల్లుపు. ౨. ౩౧.

నర్కుటకము. సం. వి. అ. న. ముక్కు.(వాచ.)

నర్తకము. సం. వి. అ. పుం. ౧. ఏనుఁగు. ౨. నలతృణము, కిక్కసకసవు౹. ౩. మయూరము, నెమిలి.

నర్తకి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆటకత్తె. ౨. ఆఁడేనుఁగు. ౩. నళి అను గంధద్రవ్యము, గువ్వగుత్తిక౹. ౪. ఆఁడునెమిలి.

నర్తకుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నాట్యమాడువాఁడు. ౨. ఆలోచించునపుడు సందేహాదులచే ప్రశ్నలు తల మొ. ఆడించువాఁడు. వి. అ. పుం. ౧. నటుఁడు. ౨. (రంజకునికి - రంగులువేయువానికి - వేశ్యయందు పుట్టిన) సంకీర్ణజాతివాఁడు. ౩. చారణుఁడు, కీర్తిసంచారకుఁ డగునటుఁడు. ౪. కేలకుఁడు, కత్తివాదర మున్నగు వానిపై నాట్యము చేయువాఁడు. ౫. శివుఁడు. ౬. నృపుఁడు, రాజు.

నర్తనప్రియము. సం. వి. అ. పుం. నట్టువపులుఁగు, నెమిలి. (వై. ని.)

నర్తనప్రియుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నాట్యమందు ఇష్టము కలవాఁడు. వి. అ. పుం. శివుఁడు.

నర్తనము. సం. వి. అ. న. ౧. నృత్యము. ౨. ఆలోచనాదులయందు సందేహాదులచే ప్రశ్నలు తల మున్నగునవి ఆడించుట.

నర్తనశాల. సం. వి. ఆ. స్త్రీ. నర్తనము చేయు సాల, నాట్యశాల.

నర్తనశాలము. సం. వి. అ. న = నర్తనశాల.

నర్తనుఁడు. సం. వి. అ. పుం = నర్తకుఁడు.

నర్తము. సం. విణ. (అ. ఆ. అ.) నర్తించునది, ఆడునది. వి. అ. పుం. నృత్యము, ఆట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నర్తయితృ. సం. విశ. (ఋ. త్రీ. ఋ.) నర్తింపఁ జేయువాఁడు, ఆడించువాఁడు. వి. ఋ. పుం. నాట్యము నేర్పువాఁడు, నట్టువయొజ్జ.

నర్తించు=నర్తిలు. సం. అ. క్రి. ౧. నర్తిల్లు, నర్తనముచేయు. (శ. ర.) ౨. ఎగురు.

మ. నలువంకన్ మలయానిలాంచలముచే నర్తించుపుష్పధూళితో...సుఖకరంబుల్ కేలికాంతారముల్. వరాహ. ౪. ౧౧౬.

నర్తితము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. ఆడింపఁబడినది, నృత్యము చేయింపఁబడినది. ౨. నర్తించునది, ఆడునది.

నర్తిలు(ల్లు)=నర్తించు. సం. అ. క్రి. (నర్తనముచేయు, నటించు.)

ఉ. అంగదముల్ వెలుంగ మణిహారము లక్కున నర్తిలంగ మేల్పొంగరురావిశేక నొసలన్ మసలంగ...సారసలోచన క్రీడ సేయుచున్. రుక్మి. ౧. ౨౫.

(శ్రీకృష్ణుఁడు.) మ...వక్షస్స్థలిన్, నవలీలన్ వనమాల యుజ్జ్వలరుచిన్ నర్తిల్ల ... హరి. పూ. ౨. ౧౧౨.

నర్తువు. సం. వి. ఊ. స్త్రీ. నటి. (త్రి. ని.)

నర్దనము. సం. విశ. (అ. ఆ.అ.) ధ్వనిచేయునది, అఱచునది. వి. అ. న. ౧. ఆర్చుట, బొబ్బరించుట. ౨. శబ్దము, రవళి, కూఁత.

నర్దము. సం. విశ. (అ. అ. అ.) ౧. శబ్దించునది, మ్రోఁగునది. ౨. ఆర్చునది, బొబ్బరించునది.

నర్దితము. సం. విశ. (అ.ఆ.అ.) ఘోషించినది. మ్రోఁగినది. వి. అ. పుం. పాచికలు వేయువిధములలో నొకటి.

శ్లో. నర్దితదర్శితమార్గః...మృచ్ఛ. ౨. ౮.

న. ౧. శబ్దము, మ్రోఁత. ౨. ఆర్పు,బొబ్బ.

నర్మకీలుఁడు. సం. వి. అ. పుం - పరిహాసమునకు బంధనస్థానము- భర్త, మగఁడు. (త్రి. ని.)

నర్మగర్భము. సం. విశ. (అ. ఆ. అ.) పరిహాసము లోపల కలది. (మాట మొ.)

నర్మఠము. సం. వి. అ. పుం. ౧. చిబుకము, గడ్డము. ౨. చూచుకము, చనుమొన.

నర్మఠుఁడు. సం. వి. అ.పుం. ౧. పరిహాసకుఁడు, మేలమాడువాఁడు. ౨. కాముకుఁడు. (కల్ప.)

నర్మద. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఒకనది. (వింధ్యపర్వతమున పుట్టి పశ్చిమ - అరేబియా - సముద్రములో పడుచున్నది.) ౨. పురుకుత్సునిభార్య. ౩. పృక్క- అనుగంధద్రవ్యము.

నర్మదుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) ౧. పరిహాసము చేయువాఁడు. ౨. వినోదము నిచ్చువాఁడు. వి.అ.పుం. నర్మసఖుఁడు, కేళీసఖుఁడు.

నర్మము. సం. వి. న్. న. ౧. వినోదము, క్రీడ. ౨. పరియాచకము, మేలము; స్త్రీపురుషులపరస్పరపరిహాసము.

నర్మర. సం. వి. ఆ. స్త్రీ. ౧. దరి,గుహ. ౨. భస్త్ర, కొలిమితిత్తి. ౩. సరళ, తెల్లతెగడ. ౪. నిష్కళ, ముట్లుడిగిన ఆఁడుది.

నర్మవంతము. సం. విశ. (త్. వతీ. త్.) ౧. వినోదము కలది. ౨. నవ్వులాటలతో కూడినది.

నర్మసచివుఁడు. సం. వి.అ.పుం. ఆటచెలికాఁడు, కేళీసఖుఁడు.

నర్మసుహృత్తు. సం. వి. ద్. పుం = నర్మసచివుఁడు.

నర్యము. సం. విశ. (అ. ఆ. అ.) నరునకు హితమైనది.

నళికించు. స. క్రి. (√నళుకు.) నళుకఁజేయు, తెగఁగొట్టించు.

వ...పౌండ్రభూపాలుండు యదువీరునగరంబు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కలుకోట వికటంబుగా వలుఁదటంకంబుల నఱకించియు...ఉ. హరి. ౩. ౩౬. (బ్రద్దలుకొట్టించి అని భావము.)

నఱకు = నర్కు, నఱుకు. స. క్రి. (త.నఱుక్కు.క. నరకు.) ౧. ఖండించు, తెగఁగొట్టు.

గీ. అతివ యతఁ డొంటుకోదండ మందికొన్న, నఱకె వేవేఱ వి ల్లెత్తిన విఱుగ నేసె. ఉ. హరి. ౧. ౧౬౫.

మ. పతియుం గోటులసంఖ్య లై ధవళసద్మంబుల్ విచిత్రంబుగా, నెఱి చూపె న్నరుదంబువహ్నిపియదన్వీతంబు లాయిండ్లలో, మెఱుఁగుంబోడి వసించె నోర్తు బహుకుంభీబింబితార్కాకృతిన్, నఱకెం దద్గృహమస్తకంబులు మహీనాథుండు శీఘ్రంబునన్. వరాహ. ౯. ౧౪.

(రావణుఁడు.) మ. ప్రహతిన్ సేనలఁ జెక్కుచున్ నఱకుచున్ భంజించుచున్ ద్రుంచుచున్ ... మ్రగ్గంజేసె నొక్కొక్కమ్మడిన్. ఉ. రా. ౩. ౨౩౪. విక్ర. ౬. ౪౯.

౨. చంపు,సంహరించు.

క. పెఱవారి నెల్లఁ దరమిడి, నఱకుదుఁ బాండుక్షితీశనందనులను రూపఱ నేయుం జేయాడదు ...భార. ఉద్యో. ౪. ౧౫౦.

క. పఱపి రథికులను సూతుల, నఱకిన మ్రోడు వడి యుండె నానారథముల్. భార. భీష్మ. ౨. ౩౯.

౩. తొలఁగించు, పోఁగొట్టు.

మ...దైత్యాంతకుం డుద్ధతిన్, నఱకెం దత్తిమిరంబు...ఉ. హరి. ౨. ౪౯.

౪. క్షతము, కత్తిదెబ్బ. (చూ. నఱకువడు.)

జః నఱకించు, నఱకుకువడు, నఱకువడు.

నఱకుడువడు=నఱకువడు, నఱుకుకువడు. అ. క్రి. (√నఱకు.) ఖండితమగు, తెగు; భిన్నమగు.

ద్వి. నరనాథ మొదలంటు నఱకుడువడిన, తరువున ట్లొరగినదశకంఠుఁ జూచి. రం. రా. ఉ. ౮౮ పా. ౧౫ పం.

నఱకువడు=నఱకుకువడు, నఱుకుడువడు.

గీ...ఫలకాలంబె నఱకువడుట, సరసులకువార లొక్కించు కెఱుఁగలేక. సురా. ౩౨.

గీ. సాగరమునీరు పేరుట శైలకులము, తెఱపి యిచ్చుట చీకటి నఱకువడుట, దివ్యతేజంబు దోఁచు టద్దీప్తి నీవు, సొచ్చుట కుమారులం గొనివచ్చు టేమి. ఉ. హరి. ౨. ౫౬.

నఱమ. విణ. కృత్రిమమైన, కపటముగల.

గీ. ఇంక నెన్నండు దయఁ బరమేశ్వరుండు, గన్ను దెఱచునొ యని తన కున్నరూపు, నెఱయఁ జెప్పిన విని కేలు చఱచికొనుచు, నఱమపాఱుండు ప్రక్కలు విఱుగ నగుచు. కు. సం. ౭. ౭౫౦.

నఱిముఱి. వి. విలాసము.

ద్వి. నందనవనతరుల్ నఱిముఱి విఱిచి, తందండ బాధించి తఖిలసంయములు. రం. రా. ఉ. ౩౦౦ పా. ౨౬ పం.

నఱుకాడు=నఱుకులాడు. స. క్రి. (√నఱుకు.) (శత్రువులను) సంహరించు.

సీ. రాజుల మంచు బొట్టులు తివిరినఁ గాద యని మొనలో నఱుకాడవలయు. వేణు. ౫౭.

నఱుకులాడు=నఱుకాడు. స. క్రి. ఒకరి నొకరు నఱుకుకొను. (శ.ర.)

నఱుకు=నర్కు, నఱకు స. క్రి. (త. నఱుక్కు.) (ఖండించు.)

(దేవాసురులు.) వ...వాజుల కుత్తుకలయు వాలంబుల నఱికియుఁ దొడలు తుండించియుఁ దొండంబులు ఖండించియు ... అతిఘోరభంగిం బెనంగిరప్పుడు. భాగ. ౬. ౩౭౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(ఇంద్రుఁడు.) క... పార్శ్వ,గ్రావంబుల నెల్ల న
ఱికి కవ్వముచేసెన్. దశా. ౨. ౧౮౨.

(చంపు, సంహరించు.)

క. ఎఱిఁగిన జేరఁడు చేరుట, యెఱుకె మెయిన్
మనకు దైవ మిచ్చినసిరి యిట్లఱిమిన యీ
లోఁ గ్రక్కున, నఱుకు మితఁడు దెగిన
మనమనఃపీడ తెగున్. భార.ద్రో. ౩.౧౮౪.
(చి. ని, కరాలప్రతుల. పా.)

వి. (కత్తిదెబ్బ.)

సీ. కొంగవాల్నఱుకు లంగుళులఁ బట్టుకె జబ్బ
లంటఁ గుట్టిన వెజ్జు నరయువారు. ఆము.
౬. ౮౫.

(శస్త్రవిద్యావిశేషము.)

వ...గజ్జదుముకు నఱుకు లనునఱుకులును...
మల్లుపు. ౩. ౬౯.

(పాదన.) గీ. నఱుకు పరువడి గాయమానంబు
విసరు,మొన లనంగను...చెలంగు.ఆం.భా.
౨. ౨౦౫.

వ...లోవెలి గజ్జదుముకు చూరణ నఱుకు మొ
ద లగునఱుకులఁ దగులుం గనుంగొని...
హంస. ౧. ౨౦౬.

జః నఱుక్కు, నఱుకాఁడు, నఱుకుడువడు, నఱుకు
బియ్యము, నఱుకులాడు.

నఱుకుడువడు=నఱకుడువడు, నఱుకువడు.అ.క్రి.
(√నఱుకు.) ఖండితమగు, కోఁతపడు.

క. పడుతలలు తెఱచు నఱుకుడువడుచేతులు
జడిసి బెండువడుగుండెలు చేడ్పడు మేనులు
గడుఁ ద్రొక్కుడు, వడునడుగులు పంక్తిము
ఖునిభటులకుఁ గలిగెన్. ఉ.రా.౪. ౭౯౨.

నఱుకుబియ్యము. వి. (√నఱుకు.) ననుఁబ్రాయి,
ఉడికియు నుడుకనిబియ్యము. (శ. ర.)

నఱుకుఱు. వి. గుండె యదరుట కనుకరణము.
(దిగులుపడుటయం దగుననుకరణము అని శ.ర.)

క. అప్పుడు సురనాయకుఁడు కకుప్పతియుతుఁ
డగుచు హరుని గొలువఁగఁ జనుచున్,ముప్పి
రిగొనియెడువగతో, నప్పాఱునిఁ జూచె గుం
డియ నఱుక్కనఁగన్. చంద్రా. ౩. ౨౫.

నఱుజే. విశే. అణువు, చిన్నది.

క. నఱుజుమెయి పూని యాద,బ్బఱపాలఁతుక
లోనఁ దూఱి పరువడి వెలికిన్, బఱచి తటా
లునదానిం,బఱియలు గావించి యెలమి పరఁ
గం జనియెన్. అచ్చ. రా. కిష్కిం.౧౦౪.

వి. అల్పత్వము.

క. ఉల్లమున నఱుజుఁ జూపని,తల్లడమున నడు
గుఁదోయి తడఁబడ విల్లున్, బల్లెపుఁగోలలు
గైకొని, యల్లనఁ బఱతెంచె నన్న యరిగిన
త్రోవన్. అచ్చ. రా. అర. ౫౧.

నఱుమాడు=నుఱుమాడు. స. క్రి. (నఱుము+
ఆడు.)

(పొడిచేయు.)

క. పెఱవార లధికభీతిన్, విఱిగి చనిరి భీష్ముఁ
డేచి వీరరథికు లం, దఱఁ జూచి రాచకొ
డుకుల, నఱుమాడెను భీముఁ డిట్లు నడుఁకం
దగునే. భార. భీష్మ. ౨. ౨౩౭.

నఱుము=నుఱుము. స.క్రి. పీడించు, బాధించు.

కళిక. మఱియుఁ బెఱయ నెఱయ నుఱియుమధు
నిఁ గూల్చినట్టిహరికి, నఱిమి తఱిమి చఱిమి
నుఱుమునక్రుగెల్చినవితకరికి.అవ్వ.౪.౩౨౭

వి. నలి; పొడి.

చ. అఱిమఱిఁ ద్రెళ్లెఁ దేరులు గజావళి గూలెఁ
దురంగమాంగముల్, గిఱికొనియెన్ మహిన్
భటులు లెక్కకు మిక్కిలి సేన పాడుగా,
నఱు మయి రప్డ కృష్ణుఁడు నినాదము భూ
గగనాంతరంబునన్, దఱచుగ నొత్తె నిర్థ
ితదానవసైన్యముఁబాంచజన్యమున్. భార.
ద్రో. ౩. ౨౧౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ...అస్త్రఘట్టనన్, నఱు మగురూపులుం బృథుగణంబున నగ్గల మయ్యె నయ్యెడన్. కు. సం. ౧౧. ౮౦౦.

(ఇంద్రజిత్తు రెండవయుద్ధమున.) చ. అఱువదియేడుకోటు లరయన్ సురసంభవు లైనయూథపుల్, నఱు మయిరి ... భా. రా. యు. ౧౦౭౨.

క. తరువులు నఱుముగఁ బుష్పోత్కరములు రాలంగ ధరణిధరశిఖరంబుల్, చరణప్రహతుల విఱుఁగఁగ...భా. రా. కిష్కిం. ౫.

క...కృతయుగాది నెఱకలతోడం, బఱతెంచి జనపదంబులు, నఱుముగఁ బడుచుండు నెల్ల నగములు ధరణిన్. భా. రా. సుం. ౩౩.

జః నఱుమాడు.

నఱువు=నఱుము. వి. (పాడి.)

వ...విఱిగి పడినకుఱుగడలును విటతాటంబు లైనఖేటంబులును దుండెంబు లైనకండెంబులును దుత్తుము ళ్లైనయుత్తళంబులును నఱువు లైనమైమఱువులును నందంబు చెడినచిందంబులును... సగరకుమారులపై బహుముఖంబులం బ్రవహించుభాగీరథి విడంబించె... జై. భా. ౫. ౨౦. (ప్రయోగాంతరము కానరాదు.)

నట్టి=అట్టి[1]. వి. ౧. పాలు పిదుకనీయనియావు.

సీ. నట్టిలనైనను నలు వైనవెరవున ముట్టె యంటఁగఁ బట్టి కట్టి విడువ.గీ... నేర్తు...భార. విరా. ౧. ౧౧౧.

౨. బండి మొ. వానికి పూన్పఁదగినయెద్దు; వెంక యెద్దు.

క. గుట్టిములపరువు మెచ్చని, నట్టిలఁ గట్టినరథముల నందప్రముఖుల్, గుట్టిలయార్పులు నెలఁగఁగ, దొట్టిలగమివెంట నంటఁ దోలిరిలేశా. భాగ. ౧౦. పూ. ౯౯౪.

ద్వి. నట్టినైనను నొంటి నడిపించి యొంటి, నట్టిఁ గట్టంగ నే నలవరింపుదును. నవనాథ. ౧. ౩౦ పా. ౯ పం.

నల. సం. వి.అ.పుం. ఒకానొకసంవత్సరము.

నలఁక. వి. (√నలఁగు.) ౧. నలఁకువ. (శ. ర.)

౨. రేణువు, చిన్నముక్క.

(వ్యవ.) నాకంటిలో నలఁక పడినది.

నలఁకన. విణ. (√నలఁగు.) సూక్ష్మము.

సీ. నలఁక నై తోఁచు నెన్నడు మించునూగారుమాటున నొక్కింత మఱుఁగుపడఁగ. కావ్యా. ౩. ౩౮.

నలఁకువ=అలఁకువ, నలఁగుడు. వి. (√నలఁగు).

౧. ఆపద, కష్టము.

ద్వి.కలలోన నైనను గలవరింతలను,నలఁకువ వచ్చిన నవ్వులకైనఁ, గులసతిఁ బాసినఁ గోడుకు వోయినను. ద్వి. హరిశ్చ. పూ. ౩౬౯. పం.

వ. కావున నలుక నలఁకువలకు నిలుకడ యగుట దాని విడువవలయు...యయా. ౩. ౭౭.

౨. శ్రమము; బాధ.

వ...పశుశిశుదాసదాసీజనంబులఁ దనవారిం గా మెలంగించి నలంకువలఁ దొలంగించుచు... పాండు. ౩. ౨౪.

సీ. ననుఁ దా వలచి పడ్డనలఁకువల్ దీరంగఁ గైసేయ నెన్నఁడు గలుగునొక్కొ. విజ. వి. ౩. ౨౩.

గీ. నెమ్మిఁ దత్కరములు మృణాళమ్ము లనుచుఁ, బొడిచి పొడిచి నోరికిఁ దగుల్పఁడకయున్న, విడిచి విడిచి నలంకువ నడలునట్టి,బడుగుటంచలఁ గాంచి యప్పార్థివుండు. చంద్రా. ౪. ౫౭.

నలఁగించు= నలఁచు, నలఁపు, నలుచు, నలుపు, నులుచు, నులుపు, నుల్పు. స.క్రి. (√నలఁగు.) నలఁగఁజేయు, పీడించు, బాధించు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ... ప్రతాపోదగ్రోజ్జ్వలసంయద్రభసంబు
రుద్రుమఖసంచారక్రియన్ మీఱఁగా, నలఁ
గించెం బ్రతివీరు...రాఘవ. ౪. ౨౧౯.
సీ. విమలసంధ్యారాగసముదితనవచంద్రు నలఁ
గించురాహుమండల మనంగ. భాను. ౩.౭.

నలఁగు=అలఁగు, నలుఁగు. అ.క్రి. (త. నలంకు.)
౧. నలియగు, ముక్కలగు.
ఉ. ఆవనజాక్షి కాఁకఁ బొరలాడ నలంగిన సొ
మ్ముఁ జీరలున్, వేవిన నూడ్చి యూడ్చి...
ఆము. ౫. ౧౫౫.
౨. పీడితమగు, పీడనొందు, మృదితమగు.
చ. పొదివి నభోవిహారమునఁ బువ్వునుబోలె
నలంగకుండ న్మదనసమానుఁ బట్టికొని...
ఉ. హరి. ౫. ౧౯౦.
సీ. బలుకట్లుదద్దు లేర్పడుభుజార్గలలతో నలఁ
గినచలువదువ్వలువతోడ. ఉ. రా.౫.౨౦.
౩. నశించు; చెడు, పాడగు.
సీ. ధూమంబు వొదివినఁ దుఱఁగలి మెఱుఁగులు
నలఁగి మాసినదీపకళికపగిది...భార. విరా.
౧. ౨౯౪.
సీ. రూపు గంటఁ జెలంగఁ జూపుమంటు నలంగఁ
బంచబాణుఁడు వీరిపాలఁ గనియె. ఉ.హరి.
౨. ౧౮౧.
సీ...మావసియించుదేశ మనగ్రహమున, నలఁ
గిన నాహారములు లేక యిందఱుఁ బండిన
భూముల కొండుకడకు, నరిగెదము...కే
యూర. ౩. ౮౮.
౪. శ్రమపడు; బాధపడు.
గీ. శీతవాతోష్ణబాధలచేత నరులు, నలఁగకుం
డంగ నుపకరణములు దగిన,భంగి సృజియిం
చి భూషణాంబరవిలేప,నాదులెల్లను గల్పిం
చె నవ్విధాత. వి. పు. ౧. ౧౦౧.
క. తలపోయుచుఁ దనతలఁ ప్రాయెలనాగం
బాయు కునికి నితరవిచారం,బులు విడిచి
తాపమునఁ గడు, నలఁగుచు నేకాంతగృహ
మునన్ వర్తిలుచున్. కళా. ౭.౪.
గీ. పొందుపట్టుల నప్పులు పొడిచి పొడిచి, దొ
రతనంబునఁ జుట్టాలఁ దిరిసి తిరిసి, నలఁగి
శిశ్నోదరపరాయణత్వమునకుఁ, బార మె
ఱుఁగక తిరుగు నాబ్రాహ్మణుఁడు. పాండు.
౩. ౨౮. రాఘవ. ౪. ౧౪౨.
జః నలఁక, నలఁకన, నలఁకువ, నలఁగించు, నలఁ
గుడు, నలఁగుడువడు, నలఁగుడువెట్టు, నలఁ
చు, నలఁపు, నలఁలె, నలవడు.

నలఁగుడు= నలఁకువ. వి. (√నలఁగు.) బాధ,
కష్టము.
వ...గంతు లిడుగబ్బిబెబ్బులులనలఁగుడుల...
మనుచ. ౪. ౩౭.

నలఁగుడువ(ప)డు=నలుఁగుడుపడు.అ.క్రి. (√న
లఁగుడు.) శ్రమపడు; బాధపడు.
క. ఆయిందుముఖులచేఁ బడి, రాయిడిఁ బడి నలఁ
గుడువడి రావణుఁడు వడిన్,గాయము నొ
చ్చినఁ దొలఁగును,పాయము మఱి లేక యొక
తెపాణిఁ గఱచినన్. ఉ. రా. ౫. ౨౨౧.
(వ్యవ.) ఈపిల్లపెండ్లిలో మావాఁడు చాల నలఁగు
డుపడినాఁడు.

నలఁగుడువె(పె)ట్టు. స. క్రి. (√నలఁగుడు.)
శ్రమపెట్టు, బాధపెట్టు.
చ. అలయక యిట్లు భ్రమరుచు నద్దశకంధరుఁ
డూర్ధ్వలోకముల్, నలఁగుడువెట్ట నెంచి...
ఉ. రా. ౫. ౨౮౭. (శ.ర. పా. నలఁకువఁ
బెట్టు. ముద్రి.)

నలఁచు=అలఁచు,నలఁగించు.స.క్రి. (√నలఁగు.)
౧. మృదితముచేయు, నలఁపు.
ఆ. మందు నలఁచి కన్నులం దిడి ముక్కునఁ,
బిడిచి చెవులఁ బోసి...దశకు. ౫. ౯౯.
౨. శ్రమపెట్టు; బాధించు, పీడించు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ. గెలిచెం బూర్వనకేంద్రులం బఱపె నాగ్నే
యావనీనాథులన్, నలఁచెన్ దక్షిణరాజ
పంక్తి ...ఉ. హరి. ౫. ౧౬.

౩. మెదుపు, కలియఁగలుపు.

గీ. అనుచుఁ దనపాదమున నున్నయట్టిమన్ను,
నలఁచి యుండఁగఁజేసి...పరమ. ౧.౧౮౫.

౪. నశింపఁజేయు,చంపు.

ఉ. ఓడక వచ్చి నాయెదుర నూరక ప్రేలెడు
దీని మత్ర్కుధా,బాడబకీలలన్ నలఁచి పా
ఱఁగవైచెద నంచు నుగ్రుఁడై. రాజ. చ.
౩. ౫౬.

నలఁత=అలఁత. విణ. (√నలఁగు.) అల్పరోగము
కలవాఁడు.

(వ్యవ.) ఈవేళ నేను కొంచెము నలఁతగా ను
న్నాను.

వి. ౧. పురాణించినరోగము. (బ్రా.)

౨. అల్పరోగము.

(వ్యవ.) ఈపాటినలఁతకు పెద్దవైద్యము అనవ
సరము.

నలఁపు=నలఁగించు, నలఁచు, నలుపు.
(మృదితముచేయు.)

గీ. అలిగి పూవైన నలఁప లే దబల దాను. కు.
సం. ౫. ౫౯౯.

గీ. నలఁపఁ దీపు వలచి పరిమళసుకాంతి,భరిత
ములు నగుపువ్వులు నరులమెచ్చు. భార.
అను. ౪. ౮.

శ్లో. మనోహృదయనందిన్యో విమర్దే మధురా
శ్చ యాః, చారురూపా స్సుమనసో మాను
షాణాం స్మృతా విభో.సం. భార. అను.
౧౫౫. ౩౨.

(బాధించు, పీడించు.)

ఉత్సాహము. ఎన్న నే వరించువరసమిన్నహావ
నంబులో, నన్న గారిఁ గినిసి నను ఘనాతిచం
డకాండవృష్టి న్నలంప వచ్చు జగదజేయ
దండ నుండుమా, యన్న బ్రాహ్మణునకు విరచి
తాంజలి యగు భక్తితోన్. రాఘవ. ౨.
౧౦౫.

గీ. నన్ను నదవద పణఁకించి నలఁప వలసి, వర్ష
మిదె యీఁదయును దాను వచ్చె ననుచు.
విప్ర. ౩. ౫౬.

నలకము. సం.వి. అ. న. ౧. మోఁకాలియెముక.
౨. ధనుస్సు మొదలగువానికవచము. (వై. ని.)

నలకిని. సం. వి. ఈ. స్త్రీ. జంఘ, పిక్క.

నలకీలము. సం. వి. అ. పుం. మోఁకాలు.

నలకూబరుఁడు. సం. వి. అ. పుం. కుబేరుని
కొడుకు.

నలదము. సం. వి. అ. న. ౧. ఉశీరము,వట్టి
వేరు. ౨. మకరందము, పూఁదేనె. ౩. జటా
మాంసి ?. (మే. ని.)

నలపట్టిక. సం. వి. ఆ. స్త్రీ. కిక్కసకసవుతో
అల్లినచాప.

నలమీనము. సం. = నడమీనము.

నలము. సం.వి.అ.పుం.నడము, కిక్కసకసవు?.
న. తామరపువ్వు, పద్మము.

నలవడు. అ. క్రి. (నలఁగు + పడు.) నలఁగుటను
పొందు.

చ. మలహార నేఁడు దక్షుఁడు రమావరదిగ్వర
వాగ్వరాదులం, బిలిచి హిమాద్రిపై మనలఁ
బిల్వక యాగముఁ జేయుచున్నవాఁ, డల
వున మీరు వేగఁ జని యచ్చటి శూరుల వా
నితోడుతన్,నలవడఁ జెండి పీచము లణంచి
ననుం బ్రమదాత్ముఁ జేయరే. వీర. ౪.౮౫.

నలి. వి. (త. నలి. √నలియు.) ౧. బాధ.(చూ.
నలిపెట్టు. రోగము అని శ. ర.)
౨. పొడి, తుమురు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్వి. నలి యైనమాంసఖండములు మొండెములు, గలిగి లోకైకభీకర మయ్యె రణము. రం. రా. అర. ౧౬౩ పా. ౧౩ పం.

సీ. మఱి కొండవీ డెక్కి మార్కొన నలి యైన యలకసవాపాత్రు నంటి రాఁజె. ఆము. ౧. ౩౬. బస. పు. ౩. ౫౩౨ పం.

౩. ఎండుగడ్డి, శుష్కతృణము.

సీ...నలి యన నలు సన నలరు శుష్క. గీ. తృణము ...ఆం. భా. ౨. ౭౬.

౪. ఇంచిమించి, చిఱుదిండి.

సీ...నలితిండి యొప్పును నలి యనఁ దగు... ఆం. భా. ౩. ౪౫.

౫. ఒప్పు, అందము. ఆం. భా. ౩. ౪౫.

౬. ప్రేమము, అనురాగము.

సీ. మావిమ్రాఁకల నెలదీవలఁ జెన్నొందుతోఁట లకడ నలితోడఁ జెంది. గీ... కేలిసలిపెడు నీదగులీల మఱవ, నావశంబె ... భార. శాం. ౩. ౩౩౨. నిర్వ. ౧. ౭౩.

గీ...పురుషులుఁ గాంతలుఁగామహర్ష,లీల లెసఁ గఁ గ్రోధాదులు లేక రుజయు,జరయు నెఱుఁ గక నలిఁ జరింతురు దివంబు,నందు సంతత నిర్భరానంద మొంద. భార. అను. ౫. ౨౧౭. (యోగ్యముగా అని శ. ర.)

౭. ఉత్సాహము.

మ. విను నేఁ డర్జునుఁ డన్యసైన్యముల నుర్విం గూల్చుచుఁ బ్రేతభూ,తనికాయంబులు మాం సభక్షణము రక్తస్వైరపానంబుఁ జేసి నలిం గ్రాలఁగఁ గ్రీడ సల్పు ...భార.ద్రో.౩.౧౫.

చ. నలిఁ గమలాననల్ మృదునినాదములన్ వె డదొక్కుఁ బల్కులన్, సొలవక చిల్కలన్ వెడలఁ జోఁపునెలుంగులు దమ్ము డాయ రాఁ, బిలుచుట గాఁగ...వ. సం. ౭. ౯౨.

౮. లాఘవము; శక్తి, సామర్థ్యము.

క. ఉరగాంగన నలిఁ బట్టెడు, గరుఁడుని క్రియ శక్తి వట్టి క్రమ్మఱ వైచెన్, నరసుతుఁడు శ ల్యసూతుని...భార. ద్రో. ౧. ౧౩౬.

శ్లో. వైనతేయో యథా కార్ష్ణి ః పతంతమురగోత్తమమ్, తస్య లాఘవ మాజ్ఞాయ సత్త్వం చామితతేజసః, సహితాస్సర్వరాజానస్సిం హనాదమథానదన్. సం. భార. ద్రో. ౧౪. ౭౯. ౧౦.

ద్వి. నా కేల రాముఁడు నా కేల సంధి, నా కేమిటికి వేఁడ నలి దూలి యొకని. రం.రా. కిష్కిం. ౨౧౦ పా. ౨౭ పం.

విణ. సన్ననిది.

గీ. వళులలావున నలికౌను బలిసి నిలువఁ, జూచు వారిచూడ్కికి నొప్పు చూఱలిడుచు,లీలఁ బాడుచుఁ దీఁగయుయ్యాల నెక్కి, పోయి యూపఁగ నొప్పారెఁ బోలఁతి యొర్తు. నృసిం. ౨. ౧౫.

కవిరాజవిరాజితము. కరములఁ గంకణముల్ మొ రయన్ నలికౌ ననియాడ...భాగ.౧౦. ఉ. ౪౧౧.

(దీనియామ్రేడితరూపము 'నలినలి')

ఆ. నలినలీలసంచు నలినలి గావించు, నించుమిం చు లాడు నించుమించు, లేమనగవుఁ జూపు లేమన నగు...విజ. వి. ౧. ౩౬.

చ. పులిపులి యయ్యె నంగలత పొక్కె సుధా ధరబింబ మింతికిన్, నలినలి యయ్యెఁ గౌను జఘనస్థల మెల్లను నజ్జునజ్జు నై,...కెం,దలి రుకటారివాని బెడిదంపుదురంబు విభుం డొన ర్పఁగన్. శుక. ౧. ౨౧౫.

క్రి. విణ. దృ. ౧. క్రమముగా; అత్యంతము. (సంశప్తకులు.) క. సరి నై దై దేయఁగ సన్న రుఁ డందఱ కెంటకెంట నలి నొప్పించెన్. భార. ద్రో. ౧. ౨౪౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్వి. సిద్ధవీరవ్రతశీలాన్వితుండ, నలిఁ బాల్కురికిసోమనాథుఁ డనంగ, వెలయువాఁడను ...పండితా. దీక్షా. ౫ పా.

సీ. వలుఁదశూలముతోడ నలి నుబ్బు నలమబ్బు వెలి ద్రొబ్బుగరళభృద్గళముతోడ. ఉ. రా. ౧. ౨౭౦.

౨. అర్హముగా, తగునట్లుగా.

ఆ. నాదుప్రశ్నములకు నలి నుత్తరము లిచ్చి, వారిఁ గొనుము నీకు వలసినట్లు. భార. ఆర. ౭. ౩౯౩.

౩. నిశ్చలముగా.

ద్వి. నదులు వేగము మాని నలి నట్టె నిలిచెఁ, గదల వీవక సదాగతి దిమ్మపడియె. సిం. భాగ. ౨. ౭౯.

నలి. సం. వి. ఈ. స్త్రీ. ౧. మణిసిల. ౨. సుగంధద్రవ్యభేదము, గువ్వగుత్తికకీ.

నలిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. నలి యనుసుగంధిద్రవ్యము, గువ్వగుత్తికకీ. ౨. సాలెవానిఒకానొకకొఱముట్టు. ౩. ఆకొఱముట్టువంటిఅస్త్రము.

నలికండ్లపాము. వి.(నలి+కండ్లు+పాము.)రక్తపుచ్ఛిక, నలికీఁచు. (చి. ని, శ. ర, బ్రా.)

నలికము. వి. (√నలియు.) సన్నఁదనము, తేనుత్వము.

ద్వి. పొడ వైనయట్టిమూఁపులును జానువులు, గడచుచేతులు నలికము కలనడుము. నవనాథ. ౨. ౧౦౩ పా. ౩ పం.

విణ. సన్ననిది; చిన్నది.

క. మారుమఖవేదిమధ్యమొ, యారతియద్దంబుపిడియొ యన నెంతేయుఁ బొల్పారుఁ గడు నలికమై సుకు, మారికి మధ్యంబు సింహమధ్యమునోలెక్. కు. సం. ౩. ౭౯౪.

ద్వి. నలికంపుఁబూప లై నలి నొగ రెక్కి, కాయ లై పులుసునఁ గలి కట్టఁ గలిగి, పాయక ఫలము లై ... నవనాథ. ౧. ౧౧ పా. ౧౭ పం.

నలికము. సం. వి. అ. న. ధనుస్సు మొ. వాని కవచము.

నలికిరి. వి.(√నలి.)నలికండ్లపాము. (చి.ని,శ.ర.)

నలికీఁచు. వి. (√నలి.) నలికండ్లపాము. (శ.ర.)

నలిగులి. విణ. (√నలి.) ౧. మిక్కిలి నలఁగినది, అత్యంతమృదితము.

సీ. తోరంపుగోరిజలత్రొక్కన నొడ లెల్ల నలిగులి యై సర్పనాథుఁ డొదుఁగ. హరి.పూ. ౮. ౧౬.

౨. బద్దలైనది, బీటలువాఱినది.

క. నిలిచి మహాస్త్రం బెఱమం,టలు గ్రమ్మఁగఁ బెలుచ నేయుటయు నడుమన చెక్కలుగాఁగ నేసి దిక్కులు, నలిగులి గా నతఁడు సింహనాదము సేసెక్. భార. భీష్మ. ౩. ౧౧౭.

౩. క్షీణించినది, తఱిగిపోయినది.

క. కలియుగమున ధర్మంబును, నలిగులి యగు నని సుధీజనంబులవాక్యం,బుల విందుఁ దత్ప్రకారం, బలఘువచోవిభవ నాకు నానతియావే. హరి. ఉ. ౯. ౩౧.

నలిగొట్టు. విణ. (√నలి.) సన్న మైనది, హీనస్వరమైనది.

ద్వి. అడవికి నీ వేఁగునపుడు గన్నీరు, వెడలెడు నీవాలువెడఁదకన్నులును, విన్న నై పెదవులు విఱిచి దైన్యమున, నన్ను ర మ్మనిపిల్చు నలిగొట్టుపలుకు.ద్వి.హరిశ్చ.ఉ.౧౨౭౬.పం.

నలిగొను. అ.క్రి.(నలి+కొను.) ఉత్సాహపడు.

ద్వి. వలపటిదెస నుమావరభక్తరాజి, నలిగొన సింహాసనసులఁ జేసి. పండితా. వాద. ౧౭౬ పా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నలితిండి. వి.(√నలి.) చిఱుదిండి, నలి.(చూ. నలితిండికాఁడు.)

నలితిండికాఁడు. విశే. (నలితిండి + కాఁడు.) సోమరి.

సీ... సోమరి నలితిండికాఁడు, దుండుబలి యనంగఁ దోఁచుఁ బ్రాల్మాలినవానిపై... ఆం. భా. ౩. ౬.

నలి(ళి)నము. సం. వి. అ.పుం. ౧. సారసపక్షి. ౨. కృష్ణపాకఫలము, కలివె*. న. ౧. పద్మము, తామరపువ్వు. ౨. నీరు. ౩. నీలిక, నీలిచెట్టు.

నలి(ళి)ని. సం. వి. ఈ. స్త్రీ. ౧. పద్మిని, తామరతీఁగ. ౨. తామరకొలను. ౩. పద్మసమూహము, తామరతంపర. ౪. నది. ౫. కొబ్బెరకు*. ౬. నలిక, నలి అనుగంధద్రవ్యము*. ౭. పాదమునకు పదునైదుఅక్షరములు కలవృత్తభేదము.

నలి(ళి)నీరుహము. సం. వి. అ.న. మృణాళము, తామరతూఁడు.

నలిపెట్టు. స.క్రి. (నలి + పెట్టు.) బాధపెట్టు,బాధించు.

సీ...పుష్పోద్భవుధనము లెల్లఁ, గొని వాని నలి పెట్టి...దశకు. ౪. ౭౨.

క. భూపాల యిపుడు రొక్కము, చేపడినధనంబు విడిచి సీమాంతరముల్, నీపజ్జఁ దిరుగుచుండఁగ, నాపాపమె యింత యేల నలిపెట్టంగన్. హరిశ్చ. ౪. ౧౯౭.

నలిబిలి. విశే. (√నలి.) కొఱుకఁబడినది.

సీ.ఈమోవి యిఁకమీఁద నామోము మునిపంటి ఘాతచే నలిబిలి గాక యున్నె. కువల. ౩. ౫౪.

నలియు= నులియు. అ. క్రి. ౧. నలఁగు, పొడియగు.

ఉ. కొన్నిటిఁ బార్శ్వముల్ నలియఁ గొన్నిటి వీపులు పిండుపీఁచు గా, నన్నిటి భీముఁ డద్భుతగదాహతి నేనిక వేఁట లాడఁగన్. భార. భీష్మ. ౨. ౨౧౧.

క. తొరఁగుచుఁ దునియుచు నలియుచు, ధరణీభాగమునఁ బడిరి తఱచై యుండన్. దశకు. ౨. ౧౩.

ఉ. ... కార్ముకముక్తబాణముల్, పైఁ దొరగించి కూల్చుచును పాదహతిన్ నలియంగ ద్రొక్కుచున్. హరి. ఉ. ౧. ౧౦౧.

౨. ముక్కలగు, విఱుగు.

వ. ... ఎమ్ములు నలియఁ బొడిచియు ... ఉ. హరి. ౩. ౭౦.

సీ. ఆపాపజాతి మాసోపవాసి నినీడ లంఘింపఁ బోయి కాల్నలియఁ గూలు. నైష. ౭. ౧౩౦.

౩. మృదితమగు.

క. వలుఁదకుచంబుల నఖములు, నలియఁగ ననుఁ గౌఁగిలించి నాతొడమీఁదన్, జెలువా కూర్చుండుము ... ప్రబోధ. ౨. ౭౨. (నఖములు=నఖక్షతములు అని భావము.)

మ ... శిరోజాతముల్, బలిమిం బట్టి వెసం బడం దిగిచి లీలన్ వక్షమున్ మస్తమున్, నలియం బెట్టుగఁ గుప్పిగంతుగొని విన్నాణంబు గావించినన్. వి. పు. ౭. ౪౧౪.

౪. చచ్చు. (చూ. నలిసిపోవు.)

౫. చిదుకు.

సీ. క్రతురక్షకులఁ దాఁకి ...బలిమి సదస్యుల నలియ మోఁది. కు. సం. ౨. ౨౦౦.

జ: నలి, నలికండ్లపాము, నలికము, నలికిరి, నలికీఁచు, నలిగులి,. నలిగొట్టు, నలిగొను, నలితిండి, నలితిండికాఁడు,నలినలి, నలిపెట్టుమొ.

నలిరేఁగు. అ. క్రి. (నలి + రేఁగు.) విజృంభించు.

క... కాంపిల్యనగరమున జను లెల్లన్, నలిరేఁగి యార్చి కౌరవ, బలసుభటులఁ బొడిచి రాజి బడలువడంగన్. భార. ఆది. ౬. ౭౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. అట్టియెడ వేల్పు వచ్చినయట్లు మేను,వొంగ నలిరేఁగి పాండవపుంగవుండు, మత్స్యనృప నందనునిబలుమాటతోడి,యేపుసెవికినిఁ జూడ్కికి సింపు నొసఁగ. భార. విరా. ౫. ౪౦. ద్వి. సారంగ. ౨. ౪౭౪.

నలివాహుఁడు. సం. వి. అ. న. గుఱ్ఱమునకు గడ్డి తీసికొనివచ్చువాఁడు. (వై. ని.)

నలిసిపోవు. అ. క్రి. (√నలియు.) చనిపోవు, చచ్చు.

సీ. ఈఁగలు వడి మూఁగు నీడేఱ వెంటైన నల్లులు జనియించి నలిసిపోవు. నీతిసీ. ౫౮.

నలుఁగిడు. అ. క్రి. (నలుఁగు+ఇడు.) ఉద్వర్తనముచేయు,నుతికి పోవుటకై దేహమున పిండి రాచి నలుచు.

సీ. చెలి యొద్ద కుంకుమ నలుఁగిడె భసితావలి ప్తదేహము హైమదీప్తి మెఱయ.దశా. ౬. ౨౭.

క. పసుపుల నలుఁ గిడి రైదువ,బిసరుహలోచనలు పెండ్లిపెద్దలయాజ్ఞన్. మనుచ. ౫.౫౬.

నలుఁగు= నలఁగు. అ. క్రి. (త. నలుంకు.) నలియగు; కృశించు, తగ్గు.

క. అని తలఁచి కదలి కతిపయ,దినముల ననుజపురి చేరు తెరువున డస్సెన్, దనువు మును పేద యై నలిఁ,గినమానముకంటె మిగులఁ గృశమై యుండన్. కేయూర. ౩. ౩౧౧.

వి. ౧. (తలంటుకొనునప్పుడు నూనె మొ. పోవుటకు దేహమునకు.రాచు) పిండి.

సీ. అలఁదు నలుంగు దేహమున వేణ్ణి శ్చ్యర్చుఁ దడియొత్తు సెత్తనిథవళవస్త్ర,మున...కాళ. ౪. ౧౧.

౨. ఉద్వర్తనము, తలంటుకొనునప్పుడు నూనె మొ. పోవుటకు పిండి రాచుకొనుసంస్కారవిశేషము.

సీ. కమనీయలోధ్రకల్కంబునలుంగున నభ్యంగతైలంబు నపనయించి. హర. ౪. ౭౮.

సీ. నలుఁగన నుద్వర్తనంబు రాజిలు...ఆం. భా. ౨. ౧౬౦.

ద్వి. నలుగురి కొక్కట నలుఁగులు పెట్టి, కల మృదుధ్వనులఁ గంకణములు మొఱయ.రం. రా. బాల. ౭౪ పొ. ౨౬ పం.

౩. మైపూఁత కుపయోగించుకుంకుమచందనము మొదలైనది.

ఉ. కుంకుమపంక మిచ్చునలుఁగుల్ మణుఁగుల్ నునుఁగీలుగంటులుం, బొంకముఁజూపఁ దాపసునిపుత్రిక లుజ్జ్వలహేమపాత్రికల్, కంకణనిక్వణాంకకరకంజములన్ ధరియించి రత్నతాటంకరుచుల్ దటిల్లతల డాపఁగ బంతులవెంబడిన్ వడిన్. రా. వి. ౨.౯౯.

జ: నలుఁగిడు, నలుఁగుపు,నలుగుఁడుపడు, నలుఁగువెట్టు.

నలుఁగు(ల్గు)డు=నలఁకువ. వి. (√నలుఁగు.) శ్రమము; బాధ, కష్టము.

(వ్యవ.) ఈ నలుఁగుడు నే పడలేను.

ఆ. తా వసించుచోటఁ దగ నల్గు డాయెనా, సౌఖ్యభూమి కపుడు జరుగవలయు, కొలఁకు లింకె నేని కొంగ లందుండునా ... వేమన. ౧. ౬౭.

నలుఁగుడుపడు=నలఁగుడువడు. అ. క్రి. (√నలుఁగుడు.) బాధపడు.

క. నీమగని నంధుఁ జేసెద,నామాటన్ విను మతండు నలుఁగుడుపడరా, దోమగువ యతని కన్నము, ప్రేమంబునఁ గంచ మరసి పెట్టుము దినమున్. శుక. ౩. ౩౬౩.

నలుఁగు(ల్గు)వె(పె)ట్టు. స. క్రి. (√నలుఁగు.) నలుచు, (కుంకుమ పసుపు మొ.వానితో) ఉద్వర్తనముచేయు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. పసుపుతోఁ గూడఁ గప్రము చాల మేదిం
చి నలుఁగువెట్టెను గూర్మి మెలఁత యోర్తు.
యయా. ౪. ౭౭.

గీ. కలపములతోడినవయతుకగ్దమమున, నలుఁగు
వెట్టించుకొని రాజనందనుండు, మహితమృ
గనాభిపంకంబు మాళిఁ దాల్చి, జలజలోచన
లార్పంగ జలకమాడె. నైష. ౭. ౯౬.

శా. హారిద్రద్యుతిభాసితాంగి యగునయ్యబ్జాక్షి
నెమ్మేనఁ గర్పూరంబుల్ మదకుంకుమంబు
నెద నేర్పల్ మీఱఁగా నల్గువెట్టారూ
ఢిల్ దలయంటె నొక్కచెలి నృత్యత్కంక
ణారావముల్, మీఱల్ సంపఁగితావినూని
యల...ఇందు. ౫. ౨౨.

(వ్యవ.) ఆమె బిడ్డకు నలుఁగుపెట్టినది.

నలుఁడు. సం. వి. అ. పుం. ౧. షట్చక్రవర్తు
లలో నొకఁడు. (నిషధదేశాధీశుఁడు.) ౨. ఒక
వానరుఁడు. (విశ్వకర్మకొడుకు, సముద్రమున
కు సేతువు కట్టినవాఁడు.)

నలుకా(గా)లు. వి. (నాలుగు+కాలు.) నాల్గు
కాళ్లు, పాదచతుష్టయము.

క...ధర్మము పాదలి చరించుఁ గాత మహి న
లుకాలన్. హరి. పూ. ౪. ౧౭౫.

వ...ధర్మంబును బ్రబలంబై నలుకాళ్లును మో
పి నడచె...హరి. పూ. ౪. ౧3౫.

క. ధరణివరాహం బగుపతి, ధరణి వరాహంబ
వోలెఁ దాల్చిన నేకా, తురచరణ మైనధర్మ
ము, కరిగతి నలుగాల నిలిచెఁ గలియుగవే
ళన్. కావ్య. ౫.30.

నలుగాలియది=నాలుగుకాళ్లు కలజంతువు.

గీ. అనిన నలుగాలివాన గోవును నశేష,శబ్దముల
మంత్రమును లోహజాతిఁ గాంచ,నమును
మనుజుల విప్రుండు సమధికత్వ, భాజనము
లండ్రు వేదప్రపంచవిదులు. భార.శాం.౧.౨౧.

శ్లో. చతుష్పదాం గౌః ప్రవరా లోహానాం
కాంచనం వరం, శబ్దానాం ప్రవరో మంత్రో
బ్రాహ్మణో ద్విపదాం వరః. సం.భార.శాం.
౧౧. ౧౧.

క. నలుగాలివానిఁ బక్షుల, జలచరముల విధియు
తముగ సంయోజింపం, బోలిచెన్ బశువులు
మునూ్న, అలఘుయశోమహిత యమ్మహాయ
జనమునన్. భార. అశ్వ. ౪. ౧౭౧.

నలుకు. వి. (√నలియు.) ముక్క.

గీ. లలిత మగునొక్కవిజనస్థలంబునందు, నెల్ల
మనుజులు దుష్కరం బిది యటంచుఁ, బలు
కఁ గలబందనలుకులభక్షణమునఁ, బ్రాణము
లు నిల్పికొనుచుఁ దపంబుఁ జేసె.సీమం. ౧.
౨౨.

నలుగంబాలాట=నాల్గుగంబాలాట. వి. (√నా
లుగు.) నాలుగు స్తంభములఆట, బాలికాక్రీడా
విశేషము.

మ...బొమ్మపెండ్లిండ్లు గుజ్జెనగూండ్లవ్వనగండ్లు
పింపిళులు కుచ్చి గ్గీరసంగింజ లో,మనగుం
టల్ కనుమూసిగంత నలుగంబాలాట లోనై
నఖేలనముల్ మీఱఁగ బోట్లతో నలరు బా
లారత్న మెల్లప్పుడున్. కళా. ౬. ౨౦౨.

నలుగడ(లు). వి. (నాలుగు+కడలు.) నాలుగు
దిక్కులు.

క. ఛటఛటఁ బేలుచు నలుగడఁ, బటుతరశిఖిశి
ఖలు నెగయ...కు. సం. ౬. ౭౦౦.

గీ. బలము లిది యేమి నలుగడఁ బాఱఁ జొచ్చె.
భార. ద్రో. ౫. 3౨౯.

క. పసిపాప యొండకొనలును, మసమసకని యి
రులు కలిసి మన మలరించెన్, దెసల నలుగ
డల గుంజా, విసరంబులసరులు ప్రేలవిడిచిన
భంగిన్. నైష. ౭. ౧౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. ఇత్తెఱంగున నత్తురంగగ్రీవుండు...నలుగడ లం గడలి విలోకించుచు...దశా.౧.౨౬౧.

నలుగురు=నలువురు.

(అందఱు.)

(వ్యవ.) నీవు చేసినపనికి నలుగురును నవ్వుచున్నారు.

నలుగేలు. వి. (√నాలుగు.) నాలుగుచేతులు.

చ. సరసపుటల్కఁ దీర్చుతతి శార్ఙ్గసుదర్శనశంఖకాబ్జసం,భరణగుణాప్తి నెన్నడుముపైఁ గటిపై జడపై గళంబుపై, హరినలుగేలుఁ బైకొన సుఖాంబుధి నిచ్చలు నోలలాడునిం,దిర కృపఁ జూచుఁ గాత...పారి. పీఠి. ౮.

నలుచు(ల్చు)=నలుపు. స. క్రి. (√నలియు.) మృదితముచేయు, మర్దించు.

క. ఎవ్వరికిని గనఁబడకయె, యవ్వీరుల నరయుచుండ నపు డొకకపి తాఁ, గ్రొవ్వున నార్చుచు నొకగిరిఁ, జువ్వనఁ గబళించి నలిచెఁ జూర్ణము గాఁగన్. సీతావి. ౨.౧౪౫.

(ఇంద్రజిత్తు.) గీ. కోఁతిఁ దెచ్చితి నసఁ బోయి కొఱవిఁ దెచ్చి, నాఁడ నవపుడు ముక్కులు నలుచుకొనిరి, కొలువువా రెల్ల నపుడు పక్కుననగుచు.దశా. ౭. ౨. ౯౮.

నలుజాము(లు.) వి. (√నాలుగు.) నాల్గుజాములు.

గీ.పొడుపుమలనుండి పడమటికడలి కరుగఁ,బవలు నలుజాములును బట్టుఁ దొవలనూడు,తత్తడుల కని మాటలో దచ్చికడలఁ,బఱచి క్రమ్మఱు నచటిబాబాతుటుములు. నీలా. ౧. ౩౮.

నలుతు(ల్తు)ము. వి. (√నాలుగు.) నాలుగుతూములు.

సీ. చతురాఢకీసంజ్ఞ చనును నల్తు మనంగ...ఆం. భా. ౨. ౨౭౧.

నలుది(ల్ది)క్కు-(లు)= నలుదెస. వి. (√నాలుగు.)

గీ.కన్నెక్రొక్కాఱు మెఱుఁగుఁదీఁగయును బోలె, బొలిచి యప్పుడ యడఁగుపూఁబోణిమూర్తి, నక్కుమారుండు నలుదిక్కులందుఁ గాంచు. నైష. ౩. ౧౭.

క...శివుడును...నల్దిక్కుఁ దిరిగి నిలిచి యావులించుచు నుండెన్. ఉ. హరి. ౬. ౧౬౭.

నలుదెస(లు)=నల్దెస. (√నాలుగు.)

వ...తారు దిగ నిమ్ము లేక బిమ్మిటిగొని నలుదెసలుం జూడ...ఆము. ౪.౩౫.

నలుపలము. వి.(√నాలుగు.) నాలుగుపలములు.

సీ...నలుపలం బనఁ జతుఃపలము దనరు. ఆం. భా. ౨. ౨౬౭.

నలుపు[1]=నలుచు.స.క్రి.(√నలియు.) మర్దించు.

రగడ. నలిపివైవకే నవకలికావలి యలినీలాలక యది మాకావలి. రాజ. చ. ౨. ౧౪౭.

నలుపు[2](ల్పు). వి. ౧. నీలవర్ణము.

గీ. దాసి చేసినయప్పరిహాసమునకు, హాసపరిపాండురం బైనయక్కలువున, నాన్పుపాలు ముఖగ్లాని కానఁబడియె, నలుపు గానఁగఁబడుఁగదా తెలుపులోన. నైష. ౫. ౧౭.

సీ.పాలుపారునాకులనలుపుతోడనుగూడ నలుపు చన్మొనలందు నాఁటుకొనఁగ. గీ.గర్భసంపద నొప్పి రక్కమలముఖము. విక్ర.౧.౧౬౬.

ఉ. మునుమున్ దెల్పును దూఱఁ దూఱ వటీకెంపున్ వెండియున్ దూఱఁగం,దనగాయం గలనల్పు దోఁప...ఆము. ౪. ౨౩.

౨. కళంకము.

గీ. ఇంతనాఁడు కరగ్రహవంతురాలిఁ, జేసి తోడ్కొనివచ్చితి చెప్పినట్లు, చేయుచుంటిని గోత్రంబు మీయనుజ్ఞ, నలుపు నా కేమెడల నైనఁ దెలుపఁ గలరె. నిరం. ౨. ౫౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విణ. నల్లనిది, కృష్ణము.

గీ. జ్యోత్స్న నాఁగఁ దమిస్ర నా నుభయభార్య, లుడుపతికి నందు నొకతె దెల్పొర్తు నలుపు, తాను వారికి మెచ్చుగాఁ దాల్పఁబోలుఁ, దెలుపు నలుపును నగుమేను నెలఁత యితఁడు. నైష. ౮. ౧౭౪.

గీ. అనతిమ్ము మహాదేవ యభవ నీదు,కంఠమూలంబు నలు పైనకారణంబు. హర. ౩. ౩.

చ. మృగమదపంకిలాంగు లొకమే నొకమే ఘనసారచందనస్థగితలు నైనకామినులు సాటిగ నొండొరుఁ జల్లి యాడుచో, సగమున నల్పు దెల్పు లగుచాయలు నెందఁ గళిందకన్యకా,గగననదీసమాగమముకై వడిఁ బద్దిని యొప్పె నత్తటిన్. విక్ర. ౨. ౪౭.

జః నలుపెక్కు.

నలుపెక్కు. అ. క్రి. (నలుపు² + ఎక్కు.) నల్లవాఱు, నల్లపడు.

గీ. రోమరాజి తమాలవల్లీమతల్లి,పగిది నలుపెక్కి మెఱసె నా పడఁతినడుమ, నింద్రసామ్రాజ్యహానికి హేతు వైన,ధూమకేతువు నభమునఁ దోఁచె ననఁగ. వరాహ. ౩. ౩.

క. అలివేణికిఁ జనుముక్కులు, నలుపెక్కె విలాసవతికి నవనవలవలీ,దళములగతిఁ బాండురరుచి, నలరెం జెలు వమరుచెక్కుటద్దములంతన్. జాహ్నవీ. ౧. ౭౭.

నలుమడి. వి. (√నాలుగు.) నాలుగురెట్లు.(చూ. నలుమడించు.)

నలుమడించు. అ. క్రి. (√నాలుగు.) నాలుగంత లగు, నాలుగురెట్లధిక మగు.

ఆ. ప్రీతి నలుమడింప భీమునిఁ గవల నా,లింగనంబు సేసి... భార. విరా. ౨. ౩౪౧.

వ...అని యాదేశింపం బ్రమోదంబు నలుమడింపఁ జతుర్ముఖుండును...కవిక. పీఠి. ౩౯.

స. క్రి. చతుర్గుణించు, నాలుగు రెట్లు చేయు, (చూ. నలుమడించుకొను.)

నలుమడించుకొను. స. క్రి. (నలుమడించు + కొను. స్వార్థమున.) నాలుగురెట్లు చేయు.

ఆ. అస్థి గలిగి హీన మగుజంతువైనఁ ద,ద్ద్విగుణవృత్తి వలయుఁ బ్రగుణజంతు,వుఁ గుఱ నలుమడించుకొనునది...పరమాత్ర, హింస యష్టగుణకృతిహఁ బాయు. భార. అను. ౩. ౨౯౩.

నలుమాఱు. వి. (నాలుగు + మాఱులు.) నాలుగుపర్యాయములు.

క. కలయఁగ సంబుద్ధ్యంతర,ముల నునుపఁగ వలయు నందముగ జయజీవో,జ్జ్వలదేవాదిపదంబులు, నలి నిడుచతురుత్తరంబు నలుమాఱైనన్. కావ్యా. ౪. ౩౭.

నలుమొ(మ్మో)గంబులప్రోడ. వి. (√నాలుగు.) చతుర్ముఖుఁడు, బ్రహ్మ.

క...తద్దయుఁ బొగడెద వేలుపు, బెద్ద యనన్ జగము లెల్ల బెంచుచుఁ బల్కు, న్నుద్దియతో నెఱతామర, గద్దియఁ గొలువుండునల్మొగంబులప్రోడన్. నీలా. ౧. ౧౨.

ఇప్లే : నలుమొగంబులయన్న, నలుమొగంబులవేల్పు.

వ... కాంచనగిరిశిఖరంబుపై నిండోలగం బున్నయన్నలుమొగంబులయన్న విన్నాణంబు వహించి... ఉ. రా. ౨. ౨౪౭.

సీ. పెనుటాఁగ యై మ్రోఁగుచును మోసలకు నేఁగునలుమొగంబులవేల్పుచెలువ దొరయె. నీలా. ౧. ౨౨.

నలుమోమయ్య. వి. (√నాలుగు.) చతుర్ముఖుఁడు, బ్రహ్మ.

మ. ఎలమిం బంగరుటెక్కపక్కెరహుమాయీ తేజి దాఁటించుచున్, నలుమోమయ్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హుటాహుటిం గదలె...దశా. ౨. ౬౭.

నలువ=నల్వ.వి. (నాలుగు + వా.) చతుర్ముఖుఁడు, బ్రహ్మ.

సీ. నలువ నెమ్మోముఁదమ్ములు కేళిగృహములు తళుకుటద్దంబు సత్కవుల మనసు. గీ. ఎపుడు నేదేవి కాదేవి...మామకస్వాంతవీథి, నిండు వేడుక విహరించుచుండుఁ గాత. నైష. ౧.౫.

ద్వి. నలువచే వరము లున్నతిఁ గాంచినాఁడు, చెలఁగి దిగ్విజయంబు చేసినవాఁడు.రం.రా. ఆర. ౧౯౨ పొ. ౨ పం. కాశీ. ౨. ౧౨౩.

ఆ. పలుకువెలఁదిమగఁడు బంగారుకడుపువా, డంచతేజి నెక్కునట్టిరాతు, బమ్మ తాత నలువ తమ్మిచూలి దుగినుఁ, డనఁగ బ్రహ్మపేరు లబ్జమాళి. ఆం. భా. ౧. ౩౯.

నలువచూలి = నారదుఁడు.

క. శుక్రాంతేవాసివనీ, శుక్రుఁడు శక్రుండు నలువచూలికి ననియెశా. దశా. ౪. ౬౦.

నలువతమ్ముఁడు=మన్మథుఁడు.

గీ. నలువతమ్ముఁడు ముక్కంటి గెలువ నెంచి. ప్రబంధ. ౪౮౩.

నలువతూపు=బ్రహ్మాస్త్రము.

(రాముతమ్ముఁడు.) సీ. నలువతూపు పరివోసి బలిమిమై నద్దోసకారిరక్కసు మేలిగానిమీఁద, నేసిన...అచ్చ. రా. యు. ౨౬౭.

నలువతేజి = హంస, అంచ.

సీ. పాలలో నునుమగజాలతో నలువతేజీలతో వేడిసమీలతోడ. అచ్చ. రా. ఆర. ౨౬.

నలువపట్టి = నారదుఁడు.

గీ...అని వేఁడుకొనిన నన్నలువపట్టి, చిలువపట్టునఁ బుట్టినబలియుఁ గాంచి. అచ్చ. రా. బాల. ౨౧.

వ...రావణునకు రసాతలజయోద్యోగంబునందు బుద్ధి పుట్టించి యన్నలువపట్టి యంత నిలువక ...ఉ. రా. ౩. ౩౦౬.

నలువపాగా=హంససమూహము.

(కుమారస్వామివర్ణన.) సీ. నలువపాగాబాట యలవరించిన మేటి రాకాసిముక్కఁకడాకవాని. చం. రా. ౩. ౮.

నలువప్రోలు=సత్యలోకము.

గీ. లలి నిరాబారులే యుండునలువప్రోలు, బలసి విసదారు లుండుపెంజిలువప్రోలు,...అమ్మేటి వీటి కెనయె. అచ్చ. రా. బాల. ౩౧.

నలువబాబా=హంస.

సీ. పాలసంద్రము లయ్యె నోలి నేర్లన్నియు నలువబాబా లయ్యెఁ బులుఁగు లెల్ల. అచ్చ. రా. అయో. ౨౦.

సీ. నలువబాబాపిండునులివు లెంతయు హెచ్చెఁ బొలముపొంతల నెల్లు పూయఁ జొచ్చె. అచ్చ. రా. కిష్కిం. ౬౯.

నలువరాణి=సరస్వతి, వాణి.

గీ. నలువరాణి మదాత్మలో వెలయుఁగాత. మనుచ. ౧. ౫.

క. నీకొలఁది నలువరాణికిఁ, గా కొరులకు నెట్లు తెలియఁగా వలయు ననక్, లోకమున నెవ్వియైనను, నీకు నసాధ్యములు గలవె నిర్మలహృదయా. రాజ. చ. ౩. ౯౨.

నలువ(ల్వ)౦క. వి. (నాలుగు + వంకలు.) నాలుగుదిక్కులు.

మ. నలువంకన్ మలయానిలాంచలముచే నర్తించుపుష్పధూళితోఁ, గొలఁదుల్ మీఱ ఫలావళుల్ మెసఁగుచున్ గ్రొమ్మావులం బల్కుచిల్కలతో... వరాహ. ౪. ౧౧౬.

వనమయూరము ...ఉద్యత్పంకజహితాయుతసబాంధవరుచుల్ నల్వంక వెదచల్లు కమలావిభుఁడు దోఁపక్. వరాహ. ౧౦. ౨౨.

సీ. ఆదరింప నల్వంక బెదరు నేనలతోడ సరిగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విష్వక్సేనుఁ డదటు నూని. దశా. ౪. ౧౦౧.

నలువండ్రు. స. బ.(√నాలుగు-నలువదికి మహ న్మహత్త్యర్థకరూపము.) నలువదిమంది.

వ...కేశిదుర్జయాదు లైనదానవులు నలువండ్రు పుట్టిరి...భార. ఆది. ౩. ౬౩.

నలువందు=నలువమరు. అ. క్రి. (√నలువు.) ఒప్పు.

సీ. నాలుగువాకిళ్ల నలువంద వేదుకల్ సవరించుముత్యాలచవిక యైన. రామా.౬.౧౨౮.

నలువ(ల్వ)ది. స.ఔ. (నాలుగు+పది.) నాలుగుపదులు.

(రావణుఁడు.) సీ. వెసఁ జేర్చి నలువదివేలయక్షౌహిణుల్ నడచువేగంబునఁ బుడమి వడఁక. గీ... మధునిపట్టణముమీఁద విడిసె... ఉ. రా. ౪. ౧౩౩.

మ ...సారథిశిరఃపాతంబురథ్యధ్వజచ్ఛిదనుక్ నల్వదిసాయకంబుల నొనర్చెన్ వేల్పు లుప్పొంగఁగన్. ఉ. రా. ౪. ౩౦౨.

నలువదుగురు. వి. (√నాలుగు.) నలువదిమంది' నలువండ్రు.(నలువదికిమహ న్మహత్త్యర్థకరూపము.

సీ...భద్రమతి యనువిప్రోత్తముఁ డొకండు... ఆతనికిభార్య లాఱ్వురు నందను లిన్నూట నలువదుగురు, గలరు... దశా. ౫. ౧౦౪.

నలువమరు=నలువొందు. (√నలువు.)

సీ...గాయక సంగీతగాంధర్వగానముల్ ద్విజవరాశీర్వాద వేదఘోష.గీ.నలువమర వజ్రసింహాసనప్రదీప్త, శారదాసక్తుఁడై ... ఉ. హరిశ్చ. ౧. ౬౦.

నలువా(ల్వా)రు. అ. క్రి. (√నలువు.) ఒప్పు.

సీ. వరియించు బెన్నుఁడో వరమనోమోదంబు నలువార రాజకన్యాలలామ. చంద్రి.౪.౩.

క. కనమే బిరాన నల్వా, రినపచ్చనియొడలు జే గురించినజడలుఁన్, బెనువంక పెడలు గలయ, మునిజడులన్ సొంపు వెడల మల్లోకములన్. వాల్మీకి. ౩. ౧౨౦.

నలువు(ల్వు). విశ. (క.నలువు.) ౧. చక్కనిది; ఒప్పుకలది.

సీ. నఱ్ఱులనైనను నలు వైనవెఱవున ముట్టె యంటఁగఁ బట్టికట్టి విడువ. గీ...నేర్తు...భార. విరా. ౧.౧౦౧.

ఉ. కొందఱు తమ్మిపు వ్వనఁగ...కోమలసౌరభముల్ మనోద్భవగా,నందకశాస్థితుల్ బెరయన ల్వగుతళ్కులు గుల్కనట్టియా, చందనగంధిముద్దునగుచక్కనిమోము చెలంగు భూవరా. ఇందు. ౨. ౧౬౨.

౨. సమర్థము, శక్తికలది.

చ. ... నరపాల నిజంబు సమిత్ప్రియుండ నై, నలువుగ నర్జునచ్ఛిద యొనర్పఁగ వచ్చితి నంచు రాముఁడున్. దశా. ౬. ౧౧౧.

వి. సౌందర్యము, అందము.

గీ. చిఱుతనవ్వున నిండారుజిగి యుదార,లలితనేత్రాంచలంబులనలువు లెడల, వెన్నుఁ డఖిలైకమూర్తి దా వేణునాద,ఘనసుధాంభోధి యొండొండఁ గడలుకొలిపె. హరి. పూ. ౮. ౩.

సీ. ఎలతుమ్మెదలదిమ్మ వెలిఁ జిమ్మచెలువమ్ము గలవేణి కొకవింతనలువు మీఱె. పారి.౧. ౫౬.

ద్వి. చెన్నును నన్నును చెలువును నలువు, నున్నతి సన్నుతి యొప్పును మెప్పు. పండితా. దీక్షా. ౬౦ పా.

౨. ప్రేమము, అనురాగము.

సీ. చూర్ణాలకంబుల స్రుక్కుఁ జక్కఁగఁ దీర్చి నలువు నెమ్మనములో మొలవఁ బెట్టు.శైవ. ౪. ౧౪౨.

౩. శక్తి, సామర్థ్యము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. నలువు మెఱయంగఁ బెద్దలనాఁటనుండి, ము
న్ను దమయింట డాఁకొనియున్నవిన్ను,
మూలదేవరవి ల్లెత్తఁ జాలుమేటి, కిత్తుఁ దన
కన్నె నంచు నొట్టిడుక యతఁడు. అచ్చ.
రా. బాల. ౧౭౫.

ద్వి. నిలువుము నీ వన్న నిలువక తోన, నలు
వున న మ్మేఘునాదుండు నడువ. రం. రా.
ఉ. ౩౬ పా. ౨౩ పం. మార్క. ౨.౧౨.

౪. రీతి, విధము.

చ. నలువమొగంబు లెట్లు సృజన ప్రథమాహ
మునం దలిర్చు న,న్నలువున సిద్ధసాధ్యనర
నాగమరుద్వరయోగిమండలీ,కలకలగుంఫితం
బు లయి కాంచనచారువు లైననాల్గువా,కిట
లవెలుంగుచున్న తనికేతనరాజమునం బ్రసన్నుఁ
డై. పాండు. ౨. ౩౩.

వ...నలువనలు మోములందు వెడలునలుతొలుఁ
బలుకులనలువున...దశా.౫. ౧౧౫.

జ: నలువందు, నలువమరు, నలువారు, నలువు
మిగులు, నలువొందు.

నలువుమిగులు. అ. క్రి. (√నలువు.) ఒప్పు.

గీ. బ్రహ్మసంవేద్య మాదిగాఁ బట్టిసాంత, మతిన
గోదావరీనదీహారమునకు, నడుమ నాయక
రత్న మై నలువుమిగులుఁ, బంచలింగాశ్ర
యము వీరభద్రశిఖరి. కాశీ. ౩. ౩౪.

నలువు(ల్వు)రు= నలుగురు.స.బ. (√నాలుగు.
త. నాల్వర్. నాలుగుశబ్దముయొక్క మహన్మ
హత్యర్థకరూపము.) ౧. నాలుగుమంది.

చ. అనుజులు నల్వురుం దనకు నత్యనురాగము
నన్ విధేయులై, తనరుచు నుండ... భార.
ఆది. ౮. ౮౧.

ఉ. అంబరవర్తి వైనఁ గని యమునిచే నగపడ్డ
వీరిప్రాణంబులు మున్ను ని న్నడిగి నల్వుర
కున్ నయవిక్రమప్రభా,వంబుల వేఁడికొ
న్న నతివత్సలభావముఁ బొంది యాదరా,
ర్ద్రింబగుచూడ్కితోఁ బ్రియహితస్థిరభావ
ల నూఱడింపవే. భార. విరా. ౧. ౧౮౩.

గీ. ఆసపడి వీరినలువురయందు నొకని, వేడు
మా చూచెదను నీవివేకశక్తి.నైష.౪.౭౮.

౨. అందము.

చ. చెలువముఁ దాల్చి ద న్గవయఁ జేరినదానిని
రావణస్వసన్, నలువురు నవ్వ నత్తెఱఁగొన
ర్చక యేలిన వియ్యమై యతం, డలుగఁడే...
ఆము. ౫. ౪౯.

నలువొందు. అ. క్రి. (√నలువు.) ఒప్పారు, శో
భిల్లు.

తోటకము. ఇలపై లవణాసురుఁడి ట్లొరుఁగన్
కలకాలము వానియగారమునన్, వలనొప్పె
డుఁమున్మొనవాల్ శివుచే, నలువొందెడుశూ
లమునన్ గలసెన్. ఉ. రా. ౩. ౧౪౩.

సీ. నలువదనంబుల నలువొందుశివుఁ డెందుఁ
గలిగె నంచు విరించిఁ గనిరి మునులు. దశా.
౧. ౨౨. ఉ. రా. ౧. ౨.

నలుసాల. వి. (√నాలుగు.) చతుశ్శాల, చుట్టు
కొల్లారు, నాలుగిండ్లబవంతి.

సీ...చుట్టుకొల్లారు నలుసాల యనఁ జతుశ్శాల
మూ...ఆం. భా. ౨. ౧౪.

నలుసు=నలి.వి.(√నలుఁగు.) ౧.శుష్కతృణము.

సీ... నలి యన నలు సన నలరు శుష్క. గీ.
తృణము...ఆం. భా. ౨. ౩౬.

౨. తృణము మున్నగువానిలేశము; రేణువు.

ఆ. సంతనగ వియోగిసంతతిపై నలు, సంతయు
దయ లేక సంతసమున, సంతపింపఁ జేయు
...రసిక. ౬.౬౬.

(రావణుఁడు). చ. సురలకు గుండెతల్లడము
శూరుల డెందము లోనికొల్లు ఫే,చరతతికం
టిలో నలుసు...భా. రా. యు. ౨౪౧౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నల్గడ(లు)=నలుగడ.

మ...వారిద,ప్రతతుల్ సొల్పడి నల్గడం జెద
రంగా బాఱెన్ మనోవేగుఁడై, పతగేం
ద్రుం డమృతాంతికంబునకుఁ దత్పాలు రభ
యం బందఁగన్. భార. ఆది. ౨. ౯౧.

ఉ. వేల్లోకచాప మెత్తి యదువీరుఁడు డెబ్బది
రెండుబాణముల్, మీఱినపౌండ్రభూవిభుని
మేను కలంతట నాఁటి నల్గడం, బాఱఁగ నేసి
...ఉ. హరి. ౩. ౫౭.

గీ...నల్గడలఁ దిరుగుఁ, గుంభకర్ణుండు నడయాడు
కొండకరణి. ఉ. రా. ౨. ౧౪౭.

ద్వి. గగన మొక్కింతయుఁ గాన రాకుండ, మొ
గులు గ్రాక్కమ్ముచు ముంచె నల్గడల.
ద్వి. పరమ. ౪. ౭౯౦ పా.

నల్దెస= నలుదెస. వి. (√నాలుఁగు.) నలుగడ.

ఉ. క్రన్నన సేన యన్నియును గైకొని యే
లెద నీసహాయు లై, చెన్నెసలారువీరు
గతచేష్టత నల్దెసఁ దూలి పాఱఁగన్. హరి.
ఉ. ౨. ౧౨౭.

నల్పు(లుపు)దేఱు. అ.క్రి. (నలుపు+తేఱు.)
నల్లనగు.

(చెంచుదొరలు.) ఉ. మిక్కిలి నల్పుదేఱుబలు
మేనులు జుంజుఱుగడ్డముల్ ... వన్నెలు
చూప నెంతయున్. ఇందు. ౨. ౪౬.

నల్ల[1]. వి. ౧. నెత్తురు, రక్తము.

ఆ. నల్లఁ గ్రోల నిచ్చి మెల్లనె చిప్ప గి, నోరి
జింకఁ దివియు నేరు పొదవు, వేఁటకాఁడు వో
లె...ఆము. ౪. ౧౯౩.

సీ. బలుపచ్చిపాలనుండి సెలవుల దిగజాఱునల్ల
నాలుక సాఁచి నాకికొనుచు. ఉ. రా. ౭.
౧౨౦.

౨. రక్తవిశేషము, గట్టిపడిననెత్తురు.

సీ. రక్తవిశేషంబు రాజిల్లు నల్ల నా...ఆం.
భా. ౨. ౧౩౨.

జః నల్లద్రావరి, నల్లద్రావుడు, నల్లాసకప్పెర, నల్లి,
నల్లిక, నల్లిపాడ.

నల్ల[2]=నల. వి. (సం. నైల్యం. ప్రా. నేల్లం. త.
నల్లం.) ౧. నలుపు.

గీ. అమ్మహాశ్వంబుధవళదేహంబునందు, నల్ల గలి
గిన నీ విప్డు నాకు దాసి, వగుము మఱి
యందు నల్ల లేదయ్యెనేని, నీకు నే దాసి
నగుదుఁ బన్నిదము సుమ్ము. భార. ఆది.
౨. ౩౨.

చ. కొడుకులఁ బంచి తెల్పెసఁగుగుఱ్ఱమువాల
మునందు నల్ల గ,ల్గెడు క్రియఁ దీర్చి...భార.
అను. ౧. ౨౬౬.

౨. కళంకము.

వ. కని కద్రువ వినతం జూచి చూడవె యల్ల
యతిధవళం బైనయశ్వంబునందుఁ బూర్ణ
చంద్రునందు నల్లయుం బోలె వాలప్రదేశం
బునందు నల్ల రై యున్నది...భార. ఆది.
౨. ౩౧.

౩. తప్పు.

గీ. అహహ యలచంద్రుఁ డనువాఁ డహంకరించి,
రోహిణీదేవి నొల్లక రోసి యుండె, శాపి
నతని క్షయవ్యాధిబాధితునిగఁ, గినిసి శపి
యింప నే నల్లఁ గనిన నోర్వ. కాశీ. ౭.౫౧.

౪. బొగ్గు.

సీ. అలిసమూహంబు నల్లలు మందపవనుఁడు చ
క్రభ్రమిక మావిచయము తలిరు, టాకుజొం
పములు తీవ్రానలజ్వాలలు ...ప్రబంధ.౪౪.

గీ...బొగ్గు, న ల్లనంగను గాళికానామ మగు.
ఆం. భా. ౨. ౨౪౨.

౫ణ. నల్లనిది. (దీనికి వృత్తియందు వికల్పముగా
నిగామము.)

సీ. ఉల్లతెల్లనితురగోత్తమువాలంబు నల్ల నేసితి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రేని నాను దాసి, యగు మన వినత...భార. ఆది. ౨. ౩౮.

సీ. పాలసినగబ్బుకంపులు సోడుముట్టెడునీనల్ల తిరునామ మెచట దొరకె. జై. భా. ౩. ౭౮.

ఉ. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపా రసంబుఁ బైఁ, జల్లెడువాఁడు...మల్లియలార మీపొదలమాటున లేఁడుగదమ్మ చెప్పరే. భాగ. ౧౦ పూ. ౧౦౨౦.

జ: నలుపు, నలుపెక్కు, నల్పు దేలు, నల్లఁబాఱు, నల్లకచోరము, నల్లకలువ, నల్లకాఁచి మొ.

నల్లఁబాఱు=నల్లవడు. అ. క్రి. (నల్ల² + పాఱు.) నల్లనగు.

గీ. భావిపురుహూతకుంభికుంభములు మీఁద, న ల్లఁబాఱునిజాత్మజభల్లహతుల, నని యొఱంగిం చువిధమున నామరాళి, గమనపాలిండ్లకొనలు నీలిమ వహించె. వరాహ. ౩. ౮.

గీ. చన్నుగుబ్బలపోరాటఁ జక్కఁ బెట్టి, బోయి మధ్యస్థభావంబు పొందలేని, కతన లజ్జించె ననఁగ మొగాలు నల్లఁబాఱుగురువిందపూ సలపేరు వైచు. వరాహ. ౨. ౧౧౫.

నల్లకచోరము. వి. (√నల్ల².) చోరము. (శ. ర.)

నల్లకాఁచి. వి. (√నల్ల².) ఒకదినుసు మొక్క.

సీ. కామజీలుగు మెట్టదామర వెఱ్ఱిసెనగ జంబి రముకాఁచి నల్లకాఁచి. హంస. ౪. ౧౦.

నల్లగగ్గెర. వి. (√నల్ల².) కఠింజరము. (శ. ర.)

నల్లగఱిక. వి. (√నల్ల².) బాలతృణము. (శ. ర.)

నల్లగల్వ(లువ). వి. (√నల్ల².) ఇందీవరము, నీలోత్పలము.

చ. అవనిజచూపులున్ రవికులాగ్రణి మైజిగి నల్ల గల్వలున్, గువలయనేత్రనవ్వులు రఘుప్ర భుచూపులుఁ దెల్లగల్వ లెక్కువ యయి నిం డె నీట మును గోసినపువ్వులకంటె రెట్టిగా. ఉ. రా. ౬. ౧౧౦.

గీ...నల్లగల్వపూదండఁ జేఁ బూని కస్తురి చెలువ. దశా. ౨. ౨౬౧.

సీ. నల్లగల్వ యనంగఁ జెల్లు నీలోత్పలంబు... ఆం. భా. ౧. ౧౬౫.

నల్లగింటెన. వి. (√నల్ల².) నీలపుష్పి. 

సీ. నల్లగింటెన పూలి తెల్లగింటెన యుత్తరేణు గుబ్బిరి సంబరేణు... హంస. ౪. ౧౦. (శ. ర. పా.)

నల్లగినియ. వి. (√నల్ల².) గినియ. (శ. ర.)

నల్లగిసియ. వి. (√నల్ల²) అతసి. (శ. ర.)

నల్లగురిగింజె. వి. (√నల్ల².) కృష్ణపాకి. (శ. ర.)

నల్లగురిజె. వి. (√నల్ల².) కృష్ణగుంజే. (శ. ర.)

నల్లగూబ. వి. (√నల్ల².) కృతమాలకము. (శ. ర.)

నల్లగెనుసు. వి. (√నల్ల².) కృష్ణాలువు, ఒకజాతి గెనుసు. (శ. ర.)

నల్లగొలిమిడి. వి. (√నల్ల².) నీలదూర్వ. (శ. ర.)

నల్లగోరఁట. వి. (√నల్ల².) ఆర్తగళము. (శ. ర.)

నల్లగ్రుడ్డు. వి. (√నల్ల².) కనీనిక, కంటిలోని గ్రుడ్డులోనినల్లనిభాగము. (శ. ర.)

నల్లచీమ. వి. (√నల్ల².) మర్కటపిపీలిక. (శ. ర.)

నల్లచెన్నఁగులు. వి. బ. (√నల్ల².) ధాన్యవిశే షము.

గీ. జిలిబొగలరాజనములు నలవరులును, దెల్ల నల్లచెన్నంగులు దీవసరులు, నాది యగుపేరు గలవడ్లు...హంస. ౪. ౧౨౫.

నల్లచెఱకు. వి. (√నల్ల².) అనిక్షువు, నిజమయిన చెఱకుగాక దానివలె మధురరసము కలఒకజాతి తెల్లు. (శ. ర.)

నల్లచేమ. వి. (√నల్ల².) కృష్ణాలుకము, ఒకజాతి చేమ. (శ. ర.)

నల్లచ్చిఁకాడు. వి. (నల్ల² + లచ్ఛనము + కాఁడు.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పక్షివిశేషము. (భరద్వాజము అని శ. ర.)

సీ...నల్లచ్చికాఁడును జల్లపిట్ట. గీ. యనఁగ ని ట్లని పక్షిభేదాఖ్య లలరు. ఆం. భా. ౨. ౯౭.

నల్లజీలకఱ(ఱ్ఱ). వి. (√నల్ల².) సుషవిక, జీల కఱ్ఱలో నొకభేదము.

సీ. నల్లజీలకఱ నాఁ కెల్లను సుషవిక...ఆం. భా. ౨. ౨౪౯.

నల్లతీఁగె(గ). వి. (√నల్ల².) సర్పాక్షి.

గీ...సర్పాక్షి ప్రబలు నల్ల, తీఁగె నాఁ...ఆం. భా. ౨. ౫౯.

సి...చల్ల, పిల్లిమాడఁపు చారపిల్లఁదు చిత్ర మూలము నల్లతీఁగె కోలాకుపొన్న. గీ... మొదలు, గాఁ గలుగు నట్టిచిఱుచెట్లఁ గాం చి యంత. హంస. ౪. ౧౦.

గీ. నల్లతీఁగ గోడమల్లంగి వెలఁగాకు, చిత్తి వేళ్లరసము సేవసేయ, నొడల నలఁద రస సముద్భూతవేదనల్, నిలుచు నంగపండ్ల నీళ్లు గనిన. (చి.కి. చి.ని.)

నల్లతుమికి. వి. (√నల్ల².) కాకతిందుకము, ఒక జాతితిందుకము. (శ. ర.)

నల్లతెగడ. వి. (√నల్ల².) ఓషధివిశేషము, కాల మేషిక. (శ. ర.)

నల్లతొగ. వి. (√నల్ల².) నల్లకలువ.

సీ. కస్తూరి వ్రాసినకరణి మీసల నల్లతొగ రేకుల జయించుమొగము మెఱయ. గీ. చాలనద్భు త మొసఁగె దుష్యంతమూర్తి. పి. శకుం. ౨. ౭౦.

నల్లదట్టెసబిల్ల. వి. (√నల్ల².) చోరసాధనవిశే షము.

గీ. కావు మలుబంతి సికముల్లు గద్దగోరు, నల్ల దట్టెసబిల్ల కన్నంపుఁగత్తి బూది దివ్వార్పు పురు విసుమూఁడుఁగ్రోవి, తోలునిచ్చెన మొ దలు ముందుగ ధరించి. ప్రబంధ. ౩౫౯.

నల్లదాసరిగాఁడు. వి. (√నల్ల² + దాసరి + కాఁ డు.) తాఁబేలు. (నల్లనితాఁబేలు అని ప్రా.)

సీ. తామే లనంగను ద్రాఁబే లనఁగ నల్లదాసరి గాఁడనఁదగుఁగమఠము.ఆం.భా.౧.౧౬౧.

గీ. తాను సురమాని నృపతనుల్ దాల్చి య కట, కామినీతతి నుడికించుకంటె నట్టె, గం డెమును నల్లదాసరిగాఁడు కిరియు,హరియు నై పోవుటయమంచి దనుయుగంబు. ఆము. ౫. ౪౧.

నల్లదేవర. వి. (√నల్ల².) కటివేల్పు, విష్ణువు.

సీ. ఇట నల్లదేవరయింట నంటిననీళ్లజోటిఁ బా యనికొండఁ జూచినాఁడ. నరస. ౫. ౨౨. (తెల్లజోటివాయన ముద్రి. పా.)

క. అటు పసిఁడిసరులయమ్మల, దిట మగుపక్కి దొర నల్లదేవర పోలెన్. అచ్చ. భా. ౨. ఆ. ౧౫ పా.

నల్లద్రావరి=నల్లద్రావుడు. (√నల్ల¹.)

శా...వ్రేపల్లెలోఁ, గాలం గోడియనల్లద్రావరి న డంగం జేయుమేవ్రేటరీ. అచ్చ. భా. ౩. ౧౧౧.

నల్లద్రావుడు=నల్లద్రావరి. వి. (√నల్ల¹.) రక్తపా నము చేయువాఁడు, రాక్షసుఁడు.

(రాగవుఁడు.) గీ...కడిమి, నెదురుకొనిపెక్కు నెఱదూపు లేసి యెల్ల, నల్లద్రావుడు మూఁక లఁద్రెళ్లఁ జేసి, యగ్గరాసులపైని బిట్టార్చు కొనుచు. అచ్చ. రా. ఆర. ౧౨.

గీ. అత్తెఱంగునఁ బెనుచుచున్నంత నొక్క,యె డను బూతన యనుపేర నడరుబెరసు, నల్ల ద్రావుడుఁబడఁతి మత్తిల్లి చేరి, విసపుఁబా లిడఁ గని దానియుసురు గొనియె. నీలా. ౧. ౩౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నల్లన. వి. (√నల్ల².) కృష్ణవర్ణము.
సీ...నల్లన నల్పు కప్పు కం దనఁగను నొప్పుఁ
గృష్ణవర్ణంబు...ఆం. భా. ౧. ౧౦౮.
విణ. నల్లనిది.
గీ...శ్రీహరి తద్విషంబు, ధీరుఁడై యారగిం
చిన దేహ మెల్ల, నల్ల నయ్యెను వ్యాపించి శాఁ
టనుండి. దశా. ౨. ౨౨౦.
సీ. మేరుశృంగములపై మేఘముల్ దిగురీతి
నాతిచూచుకములు నల్ల నయ్యె. ఉ. రా.
౨. ౧౩౭.

నల్లనయ్య. వి. (√నల్ల².) కటివేల్పు, కృష్ణుఁడు,
విష్ణుమూర్తి.
(మన్మథోపాలంభనము.) సీ. మాయచే నిన్నుఁ
గ్రమ్మఱ నుండఁ జేసెనో నలువొందుమీయ
య్య నల్లనయ్య. ఇందు. ౮. ౮౨.

నల్లనాగు. వి.(√నల్ల².)కృష్ణసర్పము,నల్లత్రాఁచు.
సీ. కన్నులు మిణుఁగుఱుల్ గ్రమ్మఁగా మ్రోఁగు
చు బు స్సనుచో వేఁడిపొగలు నిగుడఁ, బ్రల్ల
దంబునఁ ద్రుళ్లునల్లనాగులు నాగ పెంజెరలు
ను బొట్టపెంజెరలును. ద్వా. ౨. ౧౦౦.

నల్లపజే=నల్లప్రజే. వి. (√నల్ల².) ౧. కిరాతసం
ఘము, ఆటవికసంఘము. ౨. కోకిలమూఁక.
చ. కలరవ మూన్చు నల్లపజ కప్పుక రా శెను
వెంట రాజమండలి నడతేరఁ జైత్రబలనా
థునిఁ గూడి...చంద్రి. ౮. ౨౫. (ఉభ
యార్థములకు నిదియే యుదాహరణము.)

నల్లపాము. వి. (√నల్ల².) నల్లత్రాఁచు.
సీ. హరినీలసోపానసరణి కాఁబోలును బగటు
చున్నది నల్లపాఁపపేరు. ప్రభా. ౧. ౬౩.

నల్లపూస. వి.(√నల్ల².) నల్లనిగాజుపూస.(వివా
హములో నాగవల్లిసమయమున వరుఁడు వధువు
మెడలో సౌభాగ్యమునకై ఈ నల్లపూసలపేరు
కట్టును. దీనినే నాగవల్లిమతుకంటు అందురు.)
గీ. నేఁటి కీపాటి నీవు నాత్రాటిమహిమ, నింటి
కేతేరఁ జల్లగాఁ గంటి నింక, నిదియ పదివే
లు వైభవం బెల్లనాఁడు, నల్లపూసలు చెవి
యాకు నాకుఁ జాలు. శుక. ౨. ౨౮.
గీ. తమ్మివిందు కరగ్రహణ మ్మొనర్పఁ, బొలుచు
పద్దినికిని నల్లపూసదండ, గట్టినాఁడన సె
లఁ దేటిగములు పొదలె. రాజ.చ. ౨.౬౯.

నల్లపేటితాటికాయ=నల్లపేటిపండు.వి.(√నల్ల²)
నల్లని పేడు- చర్మము- కలతాటికాయ.
గీ. హస్తిపురరాజశరశతహతిని ద్రెళ్లి, రాసులై
యుండె సంగ్రామరంగమునను, నరిది ప్రోవు
లు చేసినవల్లపేటి, తాటికాయలగతి దైత్య
తతులతలలు. పి. శకుం. ౩. ౧౨౮.

నల్లపేటిపండు=నల్లపేటితాటికాయ. (√నల్ల².)
సీ. తాళీవనము మించుఁ దఱచు మున్నతమునై
పెరిఁగి యందలినల్లపేటిపండ్లు, కస్తూరికా
లిప్తఖచరాంగనాఘనస్తనకుంభసఖ్యంబు స
లుపు నెపుఁడు. వరాహ. ౧౦. ౧౨౮.

నల్లప్రజే=నల్లపజే. మి. వి. (√నల్ల².) కిరాత
సంఘము, ఆటవికజనము.
వ. ఇట్లు వెడలి విండ్లు వంచుకొని ముంచుకొను
నన్నల్లప్రజం జూచి... ఆము. ౬. ౩౬.
క. ఏలలఁ బాడుచుఁ దగ విలు,గోలలఁ గొని
నల్లప్రజలు గుములై నడువఁగ, నీలాంబరుఁ
డై విభుఁ డు,ద్వేలాళుకశావిరాజితేజి నె
క్కెఁ గా. వేం. పంచ. ౨. ౧౯౫.

నల్లబలుసు. వి. (√నల్ల².) వృక్షవిశేషము.
సీ. బండచింతయు నల్లబలుసు సురభి చీకిరేను
కూఁకుడు నెమ్మి ప్రేంకణమ్ము.హంస.౪.౧౧.

నల్లబల్లెడ. వి. (√నల్ల².) వృక్షవిశేషము.
రగడ. నల్లబల్లెడలతో నడగారడవిభంగి...పి.
శకుం. ౩. ౨౨౫.

నల్లమందు. వి. (√నల్ల².) అభిని.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. నల్లమఁదును గఁజాయిఁ గల్లుఁ బోతుఁ, బిచ్చు
కల మెక్కి... చంద్ర. వి. ౨. ౬౩.

**నల్లమడుఁగు.** వి. (√నల్ల³.) మిక్కిలిలోఁ తైన మడుఁగు. (శ. ర.)

**నల్లముసురు.** వి. (√నల్ల³.) మేఘములచే చీకటి యైననాఁటిముసురు.

ద్వి. మొగులు గాఱ్ఱుకమ్మచు ముంచె నల్లడల, ముంచి నల్లడ నల్లముసురుగాఁ బట్టి. ద్వి. పరమ. ౪. ౨౫౦ పా.

**నల్లమేఁకతప్పు.** వి. (√నల్ల³.) జారత్వము.

సీ. బలభేది గౌతముభార్య నహల్యఁ గామించి చేయఁడె నల్లమేఁకతప్పు. ప్రబోధ. ౧. ౧౫౦.

(నల్లమేఁక=చింబోతు. దీనికి కామ మెక్కువ.)

**నల్లలుదీయు.** అ. క్రి. (నల్ల³లు + తీయు.) బొగ్గులు మొ. దిగఁదుడుచు.

ఉ. పట్టెపుజుట్టు నిక్కి మెడ బాగుగఁ జివ్విన యారెపొంక మెక్క, రెట్టలబల్మి నెమ్మిఁ బురణించినయీఁకలజోకులుక్కఁ దగల్, గొట్టకయుండ మేపుపలుకోయపుమందులు గల్గుపుంజుఁ జే, పట్టి గ్రహంబు వెన్కఁ గనుపట్టఁగ నల్లలు దీసి యంతటన్. కువల. ౪. ౨౧౩.

**నల్లవ(ఁబ,ప)డు.** అ. క్రి. (నల్ల² + పడు.) నల్లనగు.

(వరూథినికి.) క ... చను మొనలు నల్లవడియెన్ ...మనుచ. ౩. ౧౧౯.

సీ. తులుకుమించులయంచు గులుకుమించులసంచు బెడఁగు నెమ్మె నల్లఁబడఁగ నేలె. చంద్రా. ౪. ౧౫౯.

(వ్యవ.) మీవాఁడీనడుమ చాలా నల్లపడిపోయినాఁడు.

**నల్లవలువదాల్పు.** వి. (√నల్ల².) నీలాంబరధరుఁడు, బలరాముఁడు.

సీ. నల్లవలువదాల్పుఁ దెల్లనిబలుదీవిఁ గన్నులు చెవులుగాఁ గలుగుతేని. రామ. ౨౧౩.

**నల్లవేల్పు.** వి. (√నల్ల³.) కఱివేల్పు, కృష్ణుఁడు, విష్ణువు.

చ. పొలుపుగ నల్లవేల్పునను బొక్కిటితామరపువ్వుమద్దుఁగోఁడలిచెలువంబుఁ జూచి పొగడక ముఖపంకజ మొక్కటె యెట్లు నా, కలవడు నంచు మోములు రయంబున నాలుగు దాల్చి మెచ్చునా, నలినజుఁ డిచ్చుగాఁత... చిరాయురున్నతిన్. చిత్రభా. ౧. ౪.

**నల్లవో(వో).** అవ్య. (త. నల్ల=మంచిది, పో=లే) ప్రశంసనార్థకము. (ఔర అని శ. ర, చి. ని. అయ్యో అని బ్రౌ.)

ఉ. నల్లవో నిక్క మాడె నృపనందనుఁడుందట ద్రోణుఁ డొక్కఁడున్. భార. విరా. ౩. ౯౫.

గీ. ఇంతప్రొద్దు కిరీటికిఁ బ్రెదుర నిలువ, వెఱవక సన్నద్ధు ద్రోణుండ వింటివాఁడు, నల్లవో తన యున్న సేనకు నొకండ, బలిమిఁ దలమీఱు నే యిట్లు నిలువవలదె. భార. విరా. ౫. ౧౩౬.

ద్వి. నల్లవో పండిత నతపండితౌఘ, నల్లవో పండిత నందితకీర్తి. పండితా. దీక్షా. ౭౦ పా.

ద్వి. అల్లమప్రభురాయ యస్తత్సహాయ, నల్లవో యల్లమ ననుఁ గన్నతండ్రి. ప్రభులిం. ౨. (చి. ని.)

**నల్లసేనము.** వి. (√నల్ల².) ఒకజాతిపాము.

గీ. నల్లసేనపుగుండులు నడచినట్లు, మంపుగొని మేఁ యొఱుంగక మలసిమలసి, ... మన్నుఁ, బోతు లెడచొచ్చె...ఉ. హరి. ౪. ౨౬.

ద్వి. నలుపారునల్లసేనపుజంగటాల, నలఘువైభవమున నటు రెండుసాల, ములును...ద్వి. పరమ. ౭. ౫౧౪ పా.

**నల్లి.** వి. (నల్ల¹ + ఇ³.) మత్కుణము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. తేనెతెట్టెకుఁ జుట్టు రానీఁగ లున్నట్లు పట్టె కంకటి నల్లి పట్టినట్లు. వైజ. 3. ౧౨౫.

సీ... నల్లినాఁ, గాను మత్కుణ మొప్పు ... ఆం. భా. ౨. ౪౪.

నల్లింద. వి. వృక్షవిశేషము, ఒకానొకచెట్టు.

వ...మఱియునుం బెదపిచ్చి పిఃపిచ్చి నల్లింద నుల్లింద యిప్ప కప్పూర మద్ది...మొదలగు పెక్కు తెఱంగుల మ్రాకులు...పి. శకుం. ౨. ౧౮.

నల్లిక. వి. (√నల్ల[2].) రక్తపుచ్ఛిక, నలికండ్లపాము,

సీ...నల్లికం చన నలికిరి యన మిండ యం చనఁగ ను మీఱు రక్త, పుచ్ఛి...ఆం. భా. ౨. ౪౭.

నల్లిపోడ. వి. (√నల్ల[2].) పికిలిపిట్టలశరీరమందలి వన్నె, మచ్చ.

సీ. మెడతెరువులు నల్లిపోడలు కాలీఁకలు సోఁగ లాగులునిక్కు రాగి కాళ్ళు. ప్రబంధ. ౧౩౦.

నల్లిల్లు. వి. (నల్ల+ఇల్లు. శ. ర. త. నల్లార్=పవిత్రమైన.) హోమధూమముచే పవిత్రమైనగృహము లు కలది, అగ్రహారము.

ఆ. నందనుండు వనమ్ము నల్లిల్లు నిధి సుర, గృహము చెఱువు మేలుకృతి యనంగ, జగతి వెల యు సప్తసంతానములు... కేయూర. ౧. ౪.

క. జనులు కవిత్వైవవిద్యా, యని చదువుటఁ గావ్య మధిక మదియును నల్లిల్లును గుడియుఁ జెఱువు నిధియును, వనము సుతుఁడు సంతతము భవస్థితిగతికిన్. ద్వా. ౧. ౨౮. (చి. ని. పా.)

సీ. అనఘుఁడై యెనుబదియొనిమిది వేవురు బ్రాహ్మణప్రవరుల బ్రహ్మవిదుల, వెలయంగ నల్లిండ్ల నిలిపి ప్రత్యేకంబ ముప్పండ్రుదాసుల నొప్ప నిచ్చె. భార. సభా. ౨. ౧౨౧.

సీ. కొమరారచెఱువులు గుళ్లు ప్రతిష్ఠించి లోక సంభావ్యంబులుగ నొనర్చె, నిఘులు నల్లిండ్లు ను నిలిపె...హరి. పూ. ౧. ౧౯. కేయూర. ౧. ౪౨.

నల్లె(ల్లియ). వి. చతురంగుళపరిమాణము.

క. నేలకు నల్లెఁడుపొడువునఁ, గ్రాలుచు మును మెఱయుగురునిరథచక్రము ల, క్కాలంబున సమరజయ, శ్రీలోపము దెలియ నంటసిలఁ బడియె నృపా. భార. ద్రో. ౫. ౩౧౭.

శ్లో. తస్య పూర్వం రథః పృథ్వ్యా శ్చతురంగుళ ముచ్ఛ్రితః, బభూ వైవంచ తేనో క్తే తస్య వాహాః స్పృశ న్మహీమ్. సం. భార. ద్రో. ౧౯౧. ౫౫.

ద్వి. నల్లెంట నొక్కొక్క నవలత గలదు. పండితా. పర్వ. ౩౪౮ పు.

క. వ్రేలెఁడు నల్లెఁడు జుత్తెఁడు, నేల లెడల్గాగ నిలిచి నిర్జరమనుజ, వ్యాళవరులు...కకు. ౫. ౪౧. హరి. ఉ. ౬. ౧౧౨.

నల్లెరు= నల్లేరు. (చి. ని, శ. ర.)

నల్లేరు. వి. వజ్రవల్లికి.

సీ. వజ్రవల్లాఖ్య యై వఱలు నల్లే రన ... ఆం. భా. ౨. ౭౦.

గీ. ... నల్లేరు నులిజెము డాకుజెముడు, నేలతీఁట కసిందెయుఁ గోలజెముడు ... మొదలు, గాఁగలుగునట్టిచిలు చెట్లు...హంస. ౪. ౧౦.

నల్లేరుపైబండివలె=నిరాతంకముగా.

(వ్యవ.) వీఁడు వానిమీఁదికి నల్లేరుపై బండివలె పోవుచున్నాఁడు.

నల్వ=నలువ.

చ. అమలమరాళయానచతురానన భావసువర్ణ దేహవి, భ్రమముల నిద్దఱుం దొరసి బ్రహ్మయు శక్తియు నైనతా రభేదమున నటించు లీల విశదంబుగఁ దెల్పుచు నల్వయుఁన్ వచో, రమణియు నిత్తు రీప్సితవరంబులు... ప్రబోధ. ౧. ౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. వేలుపుఱేఁడు నల్వయును వెన్నుఁడుఁ గొల్వఁగ మించుఁగొండరా,చూలిని గూడి వేడుకలఁ జొక్కెడులే నెలతాల్పుఁ గొల్చెదన్. శీలా. ౯. ౧.

నల్వకొమరుఁడు=జాంబవంతుఁడు.

సీ...గాలి, కొడుకు కంగదుఁడు నల్వకొమరుఁడు మొదలగుదొరలును దమ్ముఁడు జెరసి కొల్వ. అచ్చ. రా. యు. ౨౮౨.

నల్వగ్రుడ్డు=బ్రహ్మాండము.

చ. పగలిరు లెల్లెడన్ గలియఁ బర్వవె సంద్రము లింకఁ బాఱవే, రగులదె నల్వగ్రుడ్డుగమి రాముని కించుక కీడు గల్గినన్. అచ్చ. రా. అర. ౪౭.

నల్వము. సం. వి. అ. పుం. నాలుగువందలమూరలపరిమాణము.

నవ. వి. (√నవయు. క. నవె.) దురద, కండూతి.

గీ. దూల జిల నవ నస గాఁడు దురద యనఁగఁ, బరఁగుఁ గండూతి...ఆం. భా. ౨. ౧౭౯.

నవ. సం. వి. ఆ. స్త్రీ. ప్రత్తిచెట్టు. (కే.ని.)విణ. బ. (న్.) తొమ్మిది. (తెలుఁగున సమాసపూర్వపదముగానే యుండును. ఉదా:- నవగ్రహములు, నవధాన్యములు మొ.)

నవఁత. వి. (√నవయు.) కష్టము, శ్రమ. (దుఃఖము అని శ. ర.)

ద్వి. పట్టంబు సామీఁదిభక్తిమై మాని, నారచీరలు జడల్ నవఁత మైఁ దాల్చి, నాశాఁక గోరుచున్న మహామహుండు. రం. రా. అర. ౧౫౩ పా. ౨౩ పం.

ద్వి. తెవులు నొప్పులు లేవు తిరిపెంబు లేదు, నవఁతఁ బొందుట లేదు నరకంబు లేదు. రం. రా. ఉ. ౧౩౩ పా. ౨౪ పం.

౨. క్షయరోగము.

సీ...క్షయము నవఁత నాఁగ విలసిల్లు...ఆం. భా. ౨. ౧౨౩.

నవకము. వి.౧.అత్యంతమార్దవము; మృదుత్వము.

సీ. నవకంబు మీఱుక్రొన్ననదండ సవరించి వలిచన్నుఁగవపైఁ జెన్నొలయఁ జేసి. హరి. ఉ. ౪. ౨౫౦.

గీ. నవశిరీషసుమంబుల నవకమునకు, నన్నదమ్ములు వోనినీయడుగుఁదమ్ము,లెంతదూరము నడిపింప నిచ్చగించె,నొక్కొ నిర్దయమైననీయుల్ల మిపుడు. నైష. ౪. ౭.

౨. అందము, ఒప్పు.

సీ. అళికులంబులకప్పు గలయంతయును బుచ్చి నాఱుపోసినభంగి నవక మెక్కి. భార. విరా. ౨. ౫౨.

సీ. నన లంపురము నొంది నవకంబుతోఁగూడ బలసి లేఁదావులకలిక లయ్యె. పి. శకుం. ౨. ౧౨౬.

విణ. ౧. మృదులము, కోమలము.

క. ముల్లు తలకొననినవకపుఁ,బల్లవములతోడ...పువు,లుల్లసిలు నలర్కొ శాక మొదుగఁగఁ గొనుచున్. ఆము. ౪. ౧౯౫.

గీ. శ్యామలోపరినిబిడపత్త్రాభ్రములపఁ, గాండషండంబు దిగువాన కాల్లు-కాఁగఁ, బంకరుహనేత్ర వర్షర్తుశంక నొసఁగు,పోఁక బోదియనవకంపుమోకఁ గంటె. మను చ.౩.౭౯.

సీ.నడపాడ నేర్చినవకంపులత లనఁ బొలుపొందు వెన్నెలబొమ్మ లనఁగ. ధనా. ౨. ౨౩.

౨. అందమైనది.

చ.నవకపుమావిమోకలఁ జెనంగిననీవలు వేడ్కఁ జెంపఁ బల్లవముల సెజ్జ లుల్లముల లజ్జ లడంపఁగ...నిర్వ ర. ౩౨.

క. వాడక వాలక తెవుళులఁ,గూడక తగనల్ల గొరలుగొని నవకము లై,చూడఁగ భద్రములగుచును, వీడన్ సస్యంబు లిడుమ వీడం బ్రజకున్. భాగ. ౧౦. పూ. ౭౫౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. ధవళతరచ్ఛాయ నవకంబు లైనపచ్చసరా
లు విపులవక్షమున వైచి. వరాహ.౬.౪౦.

నవకము. సం. వి. అ. న. తొమ్మిదింటిసమూహ
ము, తొమ్మిది.

నవకారిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. నవోఢ, క్రొత్త
పెండ్లికూఁతురు. ౨. నూతన మగుకారిక. ౩.
నూతన మగుకృత్యము.

నవగోజే. వి. గొప్పగుడారము.

సీ...నవగోజ యనఁగను గొప్పగుడార మై
యొప్పు చుండు. ఆం. భా. ౨. ౧౪౯.

నవగ్రహములు. సం. వి. అ. పుం. బ.సూర్య
చంద్రాంగారకబుధబృహస్పతిశుక్రశనిరాహుకే
తువు లనుతొమ్మిదిగ్రహములు.

నవచత్వారింశత్తమము= సం. నవచత్వారిం
శము.

నవచత్వారింశత్తు. సం. విణ. (త్) స్త్రీ. నలు
వదితొమ్మిదింటియం దుండుసంఖ్య కలది. వి.త్.
స్త్రీ. నలువది తొమ్మిదింటియం దుండుసంఖ్య.
(వాచ.)

నవచత్వారింశము. సం. విణ. (అ. ఈ. అ.)
నలువదితొమ్మిదవది.

నవతము. సం. విణ. (అ. ఈ. అ.) తొంబదియ
వది. వి. అ. పుం. ౧. కుథము, ఏనుఁగుపైని ప
఼చుకంబళి. ౨. కంబళము.

నవతి. సం. విణ. (ఇ) స్త్రీ. తొంబదింటియం
దుండుసంఖ్య కలది. వి. ఇ. స్త్రీ. తొంబదింట
నుండుసంఖ్య.

నవతిక. సం. వి.ఆ.స్త్రీ. ౧=నవతి. ౨-తొంబది
వెండ్రుకలు కలది - క్రొత్తదిగా చేయునది - ము
చ్చెవానికుంచె, వాగఱ.

నవతితమము. సం=నవతము.

నవత్రింశత్తమము. సం = నవత్రింశము.

నవత్రింశత్తు. సం. విణ. త్. స్త్రీ. ముప్పదితొ
మ్మిదింటియం దుండుసంఖ్య కలది. వి. త్.స్త్రీ.
ముప్పదితొమ్మిదింట నుండుసంఖ్య.

నవత్రింశము. సం. విణ. (అ. ఈ. అ.) ముప్ప
దితొమ్మిదవది.

నవత్వము. సం. వి. అ. న. ౧. క్రొత్తఁదనము.
౨. తొమ్మిదింటిధర్మము, నవత్వసంఖ్య.

నవదశ. సం. వి. న్, న. బ. ఏకోనవింశతి, పం
దొమ్మిది.

నవదశము. సం. విణ. (అ. ఈ. అ.) పందొమ్మి
దవది, ఏకోనవింశము.

నవదీధితి. సం. విణ. (ఇ) ౧. క్రొత్తకాంతి కల
వాఁడు. ౨. తొమ్మిదికిరణములు కలవాఁడు. వి.
ఇ. స్త్రీ. ౧. క్రొత్తకాంతి. ౨. క్రొత్తకిరణము.
ఇ. పుం. అంగారకుఁడు.

నవదుర్గలు. సం. వి. ఆ. స్త్రీ. బ. తొమ్మిదిమూ
ర్తులుగ కూడినదుర్గలు.

శ్లో. ప్రథమం శైలపుత్రీచ ద్వితీయం బ్రహ్మ
చారిణీ, తృతీయం చంద్రఘంటేతి కూశ్మాం
డీతి చతుర్థకం, పంచమం స్కందమాతేతి
షష్ఠం కాత్యాయనీతిచ, సప్తమం కాళరా
త్రిశ్చ మహాగౌరీతి చాష్టమం, నవమం సి
ద్ధిదా ప్రోక్తా నవదుర్గాః ప్రకీర్తితాః. బ్రహ్మ
కైవర్తపురాణము.

(కుమారిక, త్రిమూర్తి, కళ్యాణి,రోహిణి,కాళి,
చండిక, శాంభవి, దుర్గ, భద్ర అని కొందఱు.)

నవద్వారము. సం. విణ. (అ. ఆ. అ.) తొమ్మిది
ద్వారములు కలది. వి. అ. న. దేహము.
ఇష్లే: నవరంధ్రము, నవచ్ఛిద్రము.

నవధాతువులు. సం. వి. ఉ. పుం. బ. తొమ్మిది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విధము లగుధాతువులు.

శ్లో. హేమతారారనాగాశ్చ తామ్రరంగేచ తీక్ష్ణకం, కాంస్యకం కాంతలోహంచ ధాతవో నవకీర్తితాః. (బంగారు, వెండి, ఇత్తడి, సీసము, రాగి, తగరము, ఇనుము. కంచు, కాంతలోహము.)

నవధాన్యములు. సం. వి. అ. న. బ. తొమ్మిది విధము లగుధాన్యములు. (గోదుమలు, యవలు, కందులు, పెసలు, సెనగలు, బొబ్బరలు, నువ్వులు, మినుములు, ఉలవలు.)

నవనము. సం. వి. అ. న. స్తోత్రము చేయుట.

నవనవతము. సం. విణ. (అ. ఈ. అ.) తొంబది తొమ్మిదవది.

నవనవతితమము=సం. నవనవతమ.

నవనవమను=నవనవలాడు. అ. క్రి. (నవనవ+అను.) మృదువగు, కోమలమగు.

క. నవనవమను నెమ్మేనులు, రివరివమను మధ్యములు ద్విరేఫశ్రేణుల్, జవజవమనువేణికి మది,రవరవమను మరుఁడువారిరంగులు గనినన్. చమ. 3. ౧౦౮.

నవనవలాడు=నవనవమను.

(పార్వతి)ద్వి. మాటలఁ దేటల మహిఁ జేసుకొన్న, విద్దెల బుద్ధుల వెల లేనిపనుల, ముద్దులయద్దులమురి పెంపుగతుల, మేటియై నూటియై మించినలీల, నాఁటికి నాఁటికి నవనవలాడు, తనువున కొకవింత తళుకుప్పతిల్ల, వనిత కంతంత జవ్వన మంకురించె. వృ. వి. ౧. ౭.

(వ్యవ.) ఈనీటివంకాయలు నవనవలాడుచున్నవి.

నవని. సం. వి. ఈ. స్త్రీ - క్రొత్తగా తీయఁబడినది- నవనీతము, వెన్న.

నవనిధులు. సం. వి. ఇ. పుం. బ. కుబేరునితొమ్మిదినిధులు. (మహాపద్మము, పద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, ఖర్వము. వరము అని కొందఱు.)

నవనీతంపుఘుటికలు. వి. బ. భక్ష్యవిశేషము.

వ...తిరువీసంబు పరమాన్నం బానవాలు జున్నులు మీఁగడతెరలు నవనీతంపుఘుటికలు... ప్రబంధ. ౧౧౨.

నవనీతకము. సం. వి. అ. న. ౧. నెయ్యి. ౨. వెన్న. (వాచ.)

నవనీతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. క్రొత్తగా పొందింపఁబడినది. ౨. క్రొత్తఁగా తీయఁబడినది. వి. అ. న. వెన్న.

నవనీయము=నోతవ్యము. సం. విణ. (అ.ఆ.అ.) నుతింపఁదగినది.

నవపంచాశత్తమము. సం=నవపంచాశము.

నవపంచాశత్తు. సం. విణ. త్. స్త్రీ. ఏఁబది తొమ్మిదింట నుండుసంఖ్య కలది. వి. త్. స్త్రీ. ఏఁబదితొమ్మిదింట నుండుసంఖ్య.

నవపంచాశము. సం. విణ. (అ. ఈ. అ.) ఏఁబదితొమ్మిదవది.

నవపాణిగ్రహణ. సం=నవోఢ.

నవప్రసూత. సం. వి. ఆ. స్త్రీ. క్రొత్తఁగా ప్రసవించినస్త్రీ, పురుటాలు.

నవప్రసూతి. సం. వి. ఇ. స్త్రీ. క్రొత్తగా ప్రసవించినయాఁడుది, పురుటాలు.

నవఫలిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. క్రొత్తగా రజస్వల యైనపడుచు. ౨. నవోఢ, క్రొత్తగా పెండ్లియైనబాలిక. (విల్యమ్సు.)

నవమము. సం. విణ. (అ.ఈ.అ.) తొమ్మిదవది.

నవమల్లిక. సం. వి. ఆ. స్త్రీ. విరజాజి.

నవమాలిక. సం=నవమల్లిక.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నవమి. సం. వి. ఈ. స్త్రీ. పక్షమునందు తొమ్మి దవతిథి.

నవము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. క్రొత్తది, లేఁతది. ౨. ఆధునికము, ఇప్పటిది. వి.అ.పుం. ౧. స్తోత్రము. ౨. ఎఱ్ఱగలిజేరు, రక్తపునర్నవ.

నవయించు=నవయఁజేయు. స.క్రి.(√నవయు.) కష్టపెట్టు, బాధపెట్టు.

చ. ఎలపొరవోని మేని నవయించియు ...తుదిఁ దపంబున నయ్యెడి దేమిసెప్పుమా. కు.సం. ౪. ౭౪౨.

నవయు. అ. క్రి. (క. నవె.) ౧.(రోగాదులచే) కృశించు, చిక్కు, ఎండిపోవు.

క. నాగాయుతసత్త్వుఁడు ది,జ్నాగాయతహస్తుఁ డనిలనందనుఁడు మహో, ద్వేగాత్ముఁ డగుచు డస్సిన, నాగముక్రియ నుండకున్నె నవసి వనమునన్. భార. ఆర. ౫. ౩౩౦.

గీ. పవనపర్ణాంబుభక్షు లై నవసి యినుప,కచ్చడాల్ గట్టుకొనుమునిముచ్చు లెల్లఁ, దామరసనేత్ర లిండ్ల బందాలు గారె. మనుచ. ౨. ౭౩.

గీ. సవనకృత్యంబు లడఁగిన నవసినవసి, వాసవాదిసుపర్వులు వరుగు లైరి. వరాహ. ౪. ౫౨.

౨. క్షీణించు, తగ్గు.

క. మండలము నవయ నరి కొది,గుండినసింహాసనంబు లుర్విన్ వినమే. ఆము. ౪. ౨౧౬.

౩. శ్రమపడు, కష్టపడు.

సీ. వసుమతీరాజ్యంబువలన నిరస్తు లై మునివృత్తి నత్యుగ్రవనములోన, నవయుచుఁ బాండుభూనాథనందను లున్నవా రని విని ...భార. ఆర. ౧. ౧౨౨.

శ్లో...శృత్వా ...పాండవాన్ దుఃఖసంతప్తాన్ సమాజగ్ము ర్మహావనే.సం.భార.వన.౧౨.౧.

ఆ. అలఁబిడ్డ లొఱటు లై లేమిఁ గుందుచుఁ, దెవులుచేతఁ బడుచు నవయుజనులు, మున్ను క్రోధలోభముల నాస్తికతఁ బర, పీడనంబు సేసి పేర్చినారు. భార. అను. ౫. ౯౭. ?

ఆ. మునివరేణ్యుశాపమునఁ జేసి యిప్పాట,నవయుచున్నవాఁడ నాఁటఁగోలె. భార. ఆర. ౪. ౧౯౯.

శ్లో. సోహం శాపా దగస్త్యస్య బ్రాహ్మణా నవ మత్య చ, ఇమా మవస్థా మాపన్నః పశ్య దైవ మిదం మమ. సం. భార. వన. ౧౮౧.౧౪.

జ: నవ, నవఁత, నవయించు.

నవరత్నములు. సం.వి.అ.న. బ.౧. మౌక్తికము, మాణిక్యము, వైడూర్యము, గోమేదకము, వజ్రము, విద్రుమము, పుష్యరాగము, మరకతము,నీలము అనుతొమ్మిదివిధముల రత్నములు. ౨.ధన్వంతరి, క్షపణకుఁడు, అమరసింహుఁడు, శంకువు, బేతాళభట్టు, ఘటకర్పరుఁడు, కాళిదాసుఁడు, వరాహమిహిరుఁడు, వరరుచి అను విక్రమాదిత్యుని యాస్థానపండితులు. (వాచ.)

నవరసములు. సం. వి. అ. పుం. బ. (అలం.) శృంగారవీరకరుణాద్భుతహాస్యభయానకభీభత్సరౌద్రశాంతములు అనుతొమ్మిదిరసములు.

నవరసు=నవరను. వి. ఒకవిధ మగు బంగారునాణెము, కాసు.

క. కేళిక కెవ్వ తె నవరసా, యాలేమం బిలువు మనిన యధికార్యర్థో,త్తాలబిలోన సరసో, న్మీలఝుళంఝుళితకింకిణీనిక్వణ యై. బహు. ౫. ౬౨.(నవరసు=శ్రేష్ఠురాలుఅనిభావము.)

నవరాత్రములు. సం. వి. అ. న. బ. తొమ్మిది రాత్రులు. (౧.వసంతనవరాత్రములు. చైత్రశుద్ధప్రతిపత్తుమొదలు తొమ్మిదిరాత్రులు. ౨. గణపతినవరాత్రములు. భాద్రపద శుద్ధ చతుర్థి మొదలు తొమ్మిదిరాత్రులు. ౩. దేవీనవరాత్రములు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆశ్వయుజశుద్ధప్రతిపత్తు. మొదలు తొమ్మిదిరాత్రులు.)

నవరు= నగరు. వి. రాజగృహము. బ. నవళులు నవళ్లు.

క. వివిధోత్పాతంబులకున్,నవళులలోఁ దోఁచు కీడునకుఁ దోడ్తో శాంతివిధానంబున నిరసన,మవును బురోహితునిచేతననవద్యముగన్. భార. శాం. ౨. ౩౦౮.

నవశతము. సం. వి. అ. న. నవోత్తరశతము, నూటతొమ్మిది.

నవశాయకుఁడు. సం. వి. అ. పుం. ఆయాయి నిమ్నజాతివాఁడు. (వీరు తొమ్మండ్రు.)

శ్లో. గోపో మాలీ తథా తైలీ తంత్రీ మోదకవారుజీ,కులాలః కర్మకారశ్చ నాపితో నవశాయకాః. పరా. (వాచ.)

నవశ్రాద్ధము. సం. వి. అ. న. మరణదినము మొదలుకొని బేసిదినములందు చేయఁదగినశ్రాద్ధభేదము.

నవషష్టము. సం. విణ. (అ. ఈ. అ.) అఱువది తొమ్మిదవది.

నవషష్టి. సం. విణ. ఇ. స్త్రీ. అఱువదితొమ్మిదింటియం దుండుసంఖ్య కలది. వి.ఇ.స్త్రీ.అఱువదితొమ్మిదింట నుండుసంఖ్య.

నవషష్టితమము. సం=నవషష్టము.

నవసప్తతము. సం. విణ. (అ. ఈ. అ.) డెబ్బదితొమ్మిదవది.

నవసప్తతి. సం. విణ. ఇ. స్త్రీ. డెబ్బది తొమ్మిదింట నుండుసంఖ్య కలది. వి.ఇ. స్త్రీ. డెబ్బది తొమ్మిదింట నుండుసంఖ్య.

నవసప్తతితమము. సం=నవసప్తతము.

నవాతు. వి. (హి. నవాత్.) శర్కరాభేదము.

సీ. శర్కరాభేదసంజ్ఞలు నవాతు జుహెజుపుల కండ మనఁగను బొలుపు కాంచు. ఆం. భా. ౨. ౨౪౧.

సీ. పూతనచనుఁబాలఁ బొడముచేఁ దడఁగనో ప్రేఁతవాతెఱమేల్నవాతు గొనుట. బలిర కటివేల్పుశతకము. ౬. ప. (చి.ని.)

క. కొమ్మపయి పతఁపాతము,నెమ్మెయి నెఱపుదువి దేల యేఁచెద వకటా,కమ్మఁగ నవాతుచక్కెర,క్రమ్మఁగ మాటాడు రవర కలకంఠవరా. విజ. వి. ౩. ౫౬.

నవారు. వి. (హిం. నవార్.) చిత్రాలపట్టిక,పట్టెడ,పట్టెమంచమునకు నేసెడుపట్టెడ.

సీ. చిత్రాలపట్టిక చెలఁగు నవారన...ఆం.భా. ౨. ౧౬౪.

పీ. తగటిరుమ్మితాపుతానవారు కసీదుసిస్తుబందరుచీటిలసరీలు. హంస. ౫. ౩౫౦.

నవాశీతము. సం. విణ. (అ. ఈ. అ.) ఎనుబదితొమ్మిదవది.

నవాశీతి. సం. విణ. ఇ. స్త్రీ. ఎనుబదితొమ్మిదింటియందుండుసంఖ్య కలది. వి. ఇ. స్త్రీ. ఎనుబదితొమ్మిదింటియం దుండుసంఖ్య.

నవాశీతితమము. సం=నవాశీతము.

నవాసారము. (సం. నవక్షారః.) ఒకదినుసు ఉప్పు. (శ. ర. నవాసాగర మని వ్యవహారము.)

(వ్యవ.)గిన్నెలు కళాయి చేయుటకు నవాసారము పయోగించును.

నవి. వి. ౧. కరగోడ పెట్టుటకు నిడుపున త్రవ్వి యెత్తిన మట్టిపల్లము. (శ.ర.) ౨. తోఁట మొ. వానికట్టనకు పెట్టుచిన్నగోడకై దానిప్రక్కనే త్రవ్వినకాలువ.

శాసనము...దూర్పున నాగుమురితోణ్ణ నవియును...దా. శా. ౧౦౧౬.

జః నవుకు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నవిత. సం.విణ. (ఋ. త్రీ.ఋ.) నుతించువాఁడు.

నవితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నుతింపఁ దగినది.

నవిష్ఠము. సం. విణ. (అ. ఆ. అ.) నవతమము, మిక్కిలి క్రొత్తది, పెక్కింటిలోఁ క్రొత్తది.

నవీనము. సం. విణ. (అ. ఆ. అ.) క్రొత్తది, ఆధునికము, ఇప్పటిది.

నవీయము. సం. విణ. (స్. యసీ. స్.) నవతరము, రెండింటిలోఁ క్రొత్తది.

నవుకు=నాకు. విణ. (√నవి.) పల్లము, నిమ్నము.

సీ...పల్లము నవుకుఁ బల్లనఁగ నిమ్నంబు దనరు. ఆం. భా. ౧. ౧౫౮.

వి. మొత్తి. (చూ. నాకు.)

నవుడుకొట్టు=నాడుకొట్టు. అ. క్రి. మిణకరించు.

ద్వి. అని యిట్లు దేవేంద్రుఁ డాడినమాట,విని యును విననట్లు విస్మయం బంది, వ్యసనుఁ డూరకయుండె నాగరవుండు, నవుడుకొట్టెను నీళ్లునమలెఁ గళ్యపుఁడు.ద్వి.హరిశ్చ.పూ. ౨౧౬ పం.

నవుబత్తు=నౌబత్తు. వి. చర్మవాద్యవిశేషము.

సీ...రాజాబహదరు, మొదలైనబిరుదులు ముఖ్యమౌ తెల్లజెండా నవుబత్తును ఢక్క యాది, గలిగినరాజచిహ్న లొసంగఁబడె...రంగా. ౧. ౧౧౬.

నవురు=నారు. విణ. (క. నవురు.) మృదువు, మెత్తనిది. (శ. ర.)

నవోఢ. సం. వి. ఆ. స్త్రీ. క్రొత్తగా పెండ్లియైనది,నూతనవివాహిత.

నవోద్ధృతము. సం.విణ. (అ.ఆ.అ.) క్రొత్తగా ఎత్తఁబడినది. వి. అ. న. నవనీతము, వెన్న. (వాచ.)

నవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. క్రొత్తది, ఆధునికము, ఇప్పటిది. ౨. నుతింపఁదగినది. వి. అ. న. స్తుతి. పుం.రక్తపునర్నవ,ఎఱ్ఱగలిజేరుకీ.

నవ్వ. వి. బాలకుఁడు.

సీ...బాలకసంజ్ఞ నప్ప నవ్వ,పాఁప పాఁపడు... ఆం.భా. ౨. ౧౫౯. (ప్రాతవ్రాతప్రతులు, బ్రా. పా.)

నవ్వారు. అ. క్రి. (నవ్వు+ఆరు¹.) నవ్వుతోనొప్పు.

ఉ. జాలెడుపైటతోఁ గులుకుజక్కవగుబ్బలతోఁ మిటారిన,వ్వారెడుమోముతోఁ గిలుకుటందెలతోఁ నసియాడుకానుతోఁ, సారసగంధి...ఒ,య్యారము మీఱ వచ్చునోకో... దశా. ౨. ౩౫౦.

నవ్వించు=నగించు. స. క్రి. (√నవ్వు.) నవ్వఁజేయు, హసింపఁజేయు.

గీ. విభుఁడు పరిహాస మాడి నవ్వించుఁగాని,పడయలేఁడయ్యె నెన్నియుపాయములను,రాజబింబాస్యతాంబూలరాగసుభగ, దంతరుచిందమాలికాదర్శనంబు. నైష. ౭. ౧౭౩.

క. కడు నవ్వించుచుఁ జెలఁగులు,ముడివెట్టక చేరటాండ్రు ముదిత కనుబొమల్, ముడివెట్టె నాలి సిగ్గున,ముడివెట్టెక్ నారి చెఱఁగుమోమున మరుఁడుక్. మను.చ. ౫. ౯౪.

సీ. అతివపదాహతి కనువయ్యెఁ గంకేళి పడఁతి నవ్వింపఁ బొల్పడియెఁ బొన్న. చం. రా. ఉ. ర. ఉ. రా. ౩. ౨౧౫.

నవ్వు(వు)=నగు,నా. స. క్రి. ౧. అపహసించు, గేలిసేయు.

గీ. మిగుల సామనిఁ బచ్చచాంపేయకముల,నమ్మి కడపల్లిఁ దమ పైచినాఁడు మగుడ, నాసపడువారి నవ్వినట్లల విచ్చెఁ, గలయమూతులుకేతకీగహనతతులు. ఆము. ౪. ౯౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. ఇంకఁ దాఁ గాక న న్నెవ్వరు నవ్వెద రా
హవంబున నోడి యరుగుచుండ. దశా. ౨.
౪౧౭.

చ. వనిత యొకర్తు ... హరిఁ జూచెఁ గేకిసలు
కొట్టుచు బోటులు దాని నవ్వఁగన్. పారి.
౩. ౧౨. విక్ర. ౧. ౪౯.

౨. పోలు.

సీ... నెలతాల్పుబలువేల్పుచెలువు నవ్వి.గీ...
వెలుఁగొందు నారానవేల్పు ఱేఁడు. నీలా.
౧. ౪౫.

గీ. విద్యకై వడి ముక్తికి విడిది యగుచు, నాత్మ
విధమున నానంద మైనయిచట, నున్న సర్వే
శునాదలపిన్న చంద్రు, నవ్వుచున్నది గంగ
ఫేనములచేత. ప్రబోధ. ౪. ౪౫.

శా. ఆదివ్యౌషధరాజిచేఁ దమమహావ్యాధివ్య
థల్ దీఱినన్, మోదం బంది లతాంగు లం
బుజకులంబుల్ నవ్వుకందోయితో... చెలం
గి సురనారీనూనుఁ గీర్తించుచున్. మనుచ.
౬. ౧౪. కళా. పీఠి. ౮౬.

అ. క్రి. ౧. హసించు, హాసముచేయు.

చ. అనవుడు బ్రాహ్మణప్రవరుఁ డల్లన నవ్వుచు
నిన్ను నారయన్, మనమున వేడ్క పుట్టి
నరనాయక వచ్చితి నేను ధర్మజున్.భార.
అశ్వ. ౨. ౯౫.

శ్లో. తతః ప్రహస్య జనకం బ్రాహ్మణః పునర
బ్రవీత్. సం. భార. అశ్వ. ౩౩. ౨౫.

చ...నిమురు మావి నవ్వ సురపొన్న ముఖాం
బుజ మెత్తఁ జంపకం,బు...పూచు...పారి.
౪. ౧౦.

గీ. పౌర మధుమద మమరఁ బుష్పాసవంబుఁ,
గ్రోలిన సుమాళి మపుడు తత్కోకిలకుఁ,
జాతపున్నాగకురవకాశోకతరులు, నవ్వె
నవ్వులు పువ్వు లై నిష్పటిల్ల. రామా. ౨.
౧౦౦.

౨. ఆనందించు, సంతోషించు.

క. అని కుంభజుఁ డెఱిఁగించిన, విని నవ్వుచు
రాముఁ డవల వింశతిభుజుఁడున్, ధనవిభుఁ
డును బోరినవిధ, మనఘా వినవలతుఁ దెల్పు
మని యడుగుటయున్. ఉ. రా. ౨. ౩౩౨.

౩. అపహసించు, మేలమాడు.

ఉ. నామది నొండు లేదు విను నవ్వితి సీతని
తోడ...భార. ఆశ్ర. ౧. ౧౮౦.

ఉ.ఇవ్విధి మున్న యే నెఱిఁగి యెంతయుఁ జెప్ప
ననాదరంబుతో, నవ్వితిగాని పట్టదు మనం
బున మీఁదటిహాని ధీనిధీ. నా. పంచ. ౧.
౪౬౧.

వి. ౧. హాసము, నగవు.

క. నగవు నగు నవ్వు నవు నా,నగు నాఖ్యలు హా
సమునకు నగజాధీశా. ఆం. సం. మాన. ౩౪.

చ. సరసులనర్త మింపుల నొసంగఁ గదంబపు
దండఁ గట్టుచోఁ, గరఁగుటఁ దెల్పుదృక్త
రళికాంతులు నుత్తర మిచ్చునంతరాం,తర
ముల నవ్వులున్ గలువతండము మొల్లలు
నంచు మిన్ను గ్రు,చ్చి రహిని రిత్తనూ లొ
సఁగి సిగ్గు వహింతురు పుష్పలావికల్. ఆ
ము. ౨. ౨౦. విక్ర. ౧. ౧౧౯.

౨. పరిహాసము.

క. అనృతము పాతక మగు నైనను వనితలయొ
డను బెండ్లి నవ్వున మృతి వచ్చిన సర్వధన
ముఁ జెడుచో, విను మది పాపంబు గాదు వి
మలచరిత్రా. భార. శాం. ౩. ౪౩౭.

ఉ...ఎల్లరు దెంచితివయ్య నీవు నే, నవ్వులు
గావు నీతలఁపునం గలమే లొనరింతు ధీమ
మణీ. భాగ. ౧౦ పూ. ౧౮౦౦.

౩. వింత, ఆశ్చర్యము.

౪. ఒకటి గలదు వత్తురు వేల్పులోకగర్భంబునకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మృతులు నుక్కివ మౌనక్కఁడు నేటి బుద్ధి
పీనుఁగు,నకు బ్రదు కఁటె గలుగు నిట్టినవ్వ
లు గలవే. భార. శాం. ౩. ౩౪౭.

నవ్వ దేఱు=నవ్వ తేటపడు.

క. నావుడు జాహ్నవిఁ బేర్కొని, నీ వద్భుత
ధన్యభావనిరుపమ వంటివ్, నావాక్యమున
కుఁ గృప న,ద్దేవియుఁ బొడసూపె నవ్వదే
ఱెడుచూడ్కిన్. హరి.ఉ.౫.౨౨.|(ప్రస
న్న మగు అని భావము.)

నవ్వులఁబెట్టు=పరిహసించు.

ఉ. ఇవ్విధ మెల్ల నెచ్చెలుల కేర్పడఁ జెప్పిన
దిట్టకూళ వై, నవ్వులఁబెట్టి యందఱు విన౦
గడు నామునఁ ద్రుళ్ళుకొంచుఁ దా,రవ్వల ఱ
వ్వలం బఱపి యంకిలి సేయక మాననేర్తురే.
రసిక. ౮. ౧౧.

సా: నవ్వినయూళ్లే పట్టనము లగును:-ఒకప్పుడు
హీనస్థితియం దున్నవారే కాలాంతరమున
నున్నతస్థితియం దుందురు.

జ: నవ్వారు, నవ్వించు, నవ్వఁబాటు, నవ్వ
కొను, నవ్వచేయు, నవ్వటాల, నవ్వదేఱు,
నవ్వపడు, నవ్వపఱుచు, నవ్వలబండి, నవ్వ
లాట.

నవ్వఁబాటు=నగుఁబాటు. వి. (√నవ్వ.) అప
హాస్యత, దూఱు.

గీ. నాకతంబున వచ్చిననవ్వఁబాటు, మాటువ
డఁజేసి నీకూర్తిమగనిఁ దెత్తు. ఉ. హరి.
౫. ౧౮౧.

గీ...గతజలసేతుబంధ,నంబు చేసిన రాదటె న
వ్వఁబాటు. ఉ. హరి. ౧. ౧౭౪.

విణ. అపహాస్యము, నవ్వఁదగినది.

గీ. నాఁడు గోమంతనగమున నన్ను నాజిఁ, గదిసి
చూచినవాఁడవు గావె నీవు, నాఁటివాఁడన
నేనును నవ్వఁబాటు,గాదె యిట్లంట యీవి
తర్కంబు వలదు. హరి. ఉ. ౨. ౨౮.

నవ్వకొను. అ.క్రి.(నవ్వ+కొను. స్వార్థమున.)
నవ్వ.

చ...మాటమాట జగడంబులు చూపి యతండు
పోయినన్,గలకల నవ్వకొంద్రు తమకాశల
మాతఁ డెఱుంగలేమికిన్. శుక. ౨. ౩౩౪.

నవ్వచేయు. స. క్రి. (√నవ్వ.) చిన్నఁబుచ్చు.

ద్వి. నురియచాడయగారిఁ జొక్కువెట్టితివొ,
నాచిదేవయగారి నవ్వచెసితివొ. పండితా.
మహిమ. ౩౦౭ పొ.

నవ్వ(వు)టాల=నవ్వలాట. వి. (√నవ్వ. ఇట
వర్ణవ్యత్యయము.)౧.పరిహాసము,పరియాచకము.

ఉ. నావుడు నవ్వటాల కనినన్ బవనాత్మజ
యింత యేటికిన్. భార. ఉద్యో. ౩. ౬౧.

గీ...వరశక్తికలన రాజు,శిల్పముల నవ్వటాలకుఁ
జేయుచుండఁ, దరుణి కుతుకత్రపాద్భుతా
తంకభార, సంకటస్థాయివై సారిణాంక య
య్యె. నైష. ౪. ౧౬౯.

సీ. తపము సేయుచు నున్నధన్యుఁ గణ్వుని
గాంచి యక్కుమారులు నవ్వటాల కందు,
సాంబుని స్త్రీరూపసంపన్నుఁ గావించి...
పద్మ. ౧౦. ౨౬౯.

చ. ననలు జనించె నిందు నదనంబుగఁ గామిను
లెవ్వరేనియున్, గనఁగలరే యటంచు నొక
కంజవిలోచన నవ్వటాలకై, యనఁగ ...
సీమం.౮.౧౪. (నవ్వతాలకై.అపముద్రి.)

క. ఈలాగువానితో నవ్వటాలకుఁ బన్నిద మిడి
సాగటా లాడఁగ నోటా లగు నీ కర్థం
దున్నటాలా యని దక్కఁగొను కటా లలి
తాంగీ. ప్రబంధ. ౬౩౭.

౨. లీల, అలవోక.

మ...రామస్వామి తా నవ్వటా,లటు లొక్క
మ్మున తక్కరద్వయము ప్రయ్యం జేసె...

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆధ్యా. ౭౮. ౬౮౯. (నవ్వుటాలటు=నవ్వు టాలవలె అని భావము.)

నవ్వుపఱుచు. స. క్రి. (√నవ్వు.) నవ్వుఁబాటు కలుగఁజేయు.

ఉ...అయ్యుత్తర్వదృష్టమున నిన్ను నవ్వుపఱుపన్ సమకట్టె నితండు విప్రవంశమ్మున వారినెల్ల... భార. ఆది. ౪. ౧౪౯.

నవ్వులబండి. విణ. (√నవ్వు.) నవ్వేడుస్వభావము కలది. (చి. ని, శ. ర.)

నవ్వులాట=నవ్వుటాల.

(పరిహాసము, పరియాచకము.)

మ. తనకుం గూర్చువధూమణుల్ చనవుచేతన్ మందెమేలంబువంకను వేసారియు నవ్వులాటలకుఁ బల్కం బల్కువాక్యంబు లెల్లను నిక్కంబులుగాఁ దలంచి తగ దల్గన్... విప్ర. ౮. ౪౧.

నవ్వులుపడు. అ. క్రి. (√నవ్వు.) అపహాసము నందు, నవ్వులపాలగు.

సీ, దీని దగ్గఱ నేల దీని కోడఁగ నేల పరులచే నవ్వులుపడఁగ నేల. మొ. శా. బాల. ౪౫.

నశము. సం. విణ. (అ. ఆ. అ.) నశించునది.

నశి(యి)ంచు. సం. అ. క్రి. నాశమొందు.

దండకము ...లోకముల్ లోకబీజంబులున్ నిత్యసందోహమై నీమహాదేహమం దుల్లసించున్ వసించున్ నశించున్...భాగ. ౧౦. పూ. ౧౨౩౩.

వ...అమ్మహీకాంతుండు మంత్రిరహితుండు విగతపరివారుండునై నశించు... మార్క. ౧. ౮౯.

వ...కర్మనాశనంబునం ద్రివిష్టపవాసులకుం బుష్టిహీనతయు దాన ననావృష్టియు నగు ననావృష్టిదోషంబున జగంబు నశియించు... మార్క. ౨. ౧౮౬.

నశికుఁడు. సం. వి. అ. పుం. సోదరీభర్త. (వై. ని.)

నశిత. సం. విణ. (ఋ. త్రి. ఋ.) నశించువాఁడు.

నశ్యత్. సం. (శతృ.) నశించుచున్న.

నశ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నాశార్హము, నశింపఁదగినది. (ఉదా: యజ్జన్యం తన్నశ్యమ్.')

నశ్వరము. సం. విణ. (అ. ఈ. అ.) నశించునది. నాశశీలము, నశించుస్వభావము కలది; శాశ్వతము కానిది.

నష్ట. సం. వి. ఆ. స్త్రీ. సంస్పృష్టమైథున యగు స్త్రీ. (వై. ని.)

నష్టచేతనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తెలివి తప్పినవాఁడు, మూర్ఛిల్లినవాఁడు.

ఇట్లే: నష్టచేష్టుఁడు, నష్టసంజ్ఞుఁడు మొ.

నష్టజాతకము. సం. వి. అ. న. జన్మకాలము తెలియనపుడు ప్రశ్నలగ్నాదులచే జన్మకాలమును తెలిసికొని గణింపఁబడుజాతకము.

నష్టము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నశించినది. ౨. తిరోహితము, మఱుఁగుపడినది. ౩. దూషితము, చెడినది. వి. అ. న. ౧. నాశము. ౨. అదర్శనము, మఱుఁగుపడుట. ౩. చెడుట.

నష్టస్మృతి. సం. విణ. (ఇ) చెడినస్మృతి కలది, మఱపు కలది. వి. ఇ. స్త్రీ. నష్టమగుస్మృతి, మఱపు.

నష్టాప్తిసూత్రము. సం. వి. అ. న- పోయిన ద్రవ్యమును పొందుటకు సాధనమైనది - లౌకికదేశము, దొంగిలించినసొమ్ములో కొంత భాగము. (వాచ.)

నష్టి. సం. వి. ఇ. స్త్రీ. ౧. నాశము. ౨. కనఁబడకపోవుట. ౩. చెడుట, దూషిత మగుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౪. సప్తము, లోటు.

ఉ. ఆయతికాని కీడు మమరాలయముఖ్యము లాతఁ డర్థతృష్ణాయుతుఁడై నిజోర్వి నగు నష్టికిఁ దద్ధనముం దొరల్చి రాజాయతనం బుఁ జేర్చు...ఆము. ౪. ౨౧౭.

నస. వి. (క. నస.) ౧. దురద, కండూతి.

సీ...తీంట్రము కపి తీఁట తీవరము. గీ. దూల జిల నవ నస గాఁడు దురద యనఁగఁ, బరఁగుఁ గండూతి...ఆం. భా. ౨. ౧౨౭.

౨. కామము.

గీ. అనుచు విప్రుండు తమకించి యంటుకొనియె, సమ్మతించియ యుండె నాచంద్రవదన,శూక లాళ్యంబు నస రేఁపఁ జొచ్చినప్డు, డనుమతింపదె యత్తఱి వైనబడబ. శివరా. ౩. ౬౯.

వ... మెడసాఁచి కూఁతదృక్కోణంబులతోడ వదనంబు గదియించి నస చేసిన బిసరుహాపుని గా నెఱింగి...వరాహ. ౫. ౯౪.

౩. (త. నసల్.) ఉపద్రవము.

ఉదా: ప్రొద్దున లేచిన నీనస నాకుఁ బెద్దదిగా నున్నది. (శ. ర.)

జ: నసకించు, నసగూఁటి, నసగూఁటితనము, నసగూఁడు, నసగొంటు, నసగొట్టు.

నస. సం. వి. ఆ. స్త్రీ. నాసిక, ముక్కు.

నసకించు. స. క్రి. (√నస.) మోహింపఁజేయు.

ద్వి. ముసిముసినగవులు మురిపెంపునడలు, నసకించు నేర్పులు నాగరకములు, కల్లమోహంబులు కపటకృత్యములు. ప్రభులిం. ౪. ౧౪౩ పా. ౨౪ పం.

నసగూఁటి. విణ. (నసగూఁడు + ఇ³.) కామోద్రేకము కలవాఁడు; కామోద్రేకము కలది.

సీ. పిసవెఱ్ఱి కసరెత్తి యెసరేఁగునసగూఁటిపూఁ బోండ్లు తమయిండ్లపొంత కరుగ.హంస. ౧. ౧౩౪.

ఉ. పెక్కువఁ బ్రాంతపక్కణకుటీశిఖరంబుల కెక్కు లార్చుచుం, గుక్కుటకోటి ప్రాసె నస గూఁటిమిటారులపుట్టినిల్లు గ,ల్పెక్కినమబ్బు శైలగుహ లీఁగ దళల్ వెలుగొందె ... వేం. పంచ. ౩.౧౦౪. (చి. ని. పా. నెసగూరు. అపముద్రి.)

నసగూఁటితనము. వి. (√నసగూఁటి.) కామోద్రేకము.

ఉ... నా,కూరిమిపట్టి నిట్టినసగూఁటితనంబున చేలువెట్టి తా, రార గణింప నన్ను వినవా మఱి యిప్పురిలోనితక్కరిణ్.విప్ర.౪.౨౪.

నసగూఁడు. వి. ఔ. (√నస.) కామోద్రేకము.

ఉ. ఓరి దురాత్మ నీవును బ్రియుండవె నాహృదయేశు కాలికైౖ,గోరును బోల వీవు నసగూఁటఁ గడున్ జపలస్వభావ లై, నారులు రూపయౌవనమునన్ నిలుపోపక యివ్వలవ్వలన్, జారహితంబు సేయ విభుచక్కటి మోహముమాన నేర్తురే. నా.పంచ.౩.౨౩౭.

నసగొంటు=నసగొట్టు.వి.(√నస.)కామోద్రిక్తుఁడు; విటుఁడు.

గీ. కుచ్చితం బింత యెఱుఁగ దమ్మచ్చెకంటి, కంటి విఖ్యాతి నాతిఁ గైకొంటి వనుచు, నచటిజాఁటలు నసగొంటు లతని వేఁడి, వేఁడి మీఁదనె దోఁచిరి వెట్టి రేఁచి.బహు. ౫. ౧౦౭.

నసగొట్టు= నసగొంటు. విణ. (నస+కొట్టు.) కామోద్రేకము కలవాఁడు; విటుఁడు.

క. నసగొట్టుబాపన య్యా,పిసవెఱ్ఱికిఁ దగులువడి తపింపఁగ నేలా,బసవెద్దు గదలకుండెడు, వసతికి రమ్మచటి కేను వచ్చెదఁ బొమ్మా. శుక. ౨. ౪౪౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నసనస. వి. (రక్తముమున్నగువానితో) తడిసినచ
ర్మముమొ. వానిధ్వనికనుకరణము.
క. విసమును మెసవుచు విసువక, నసనస యను
కళవసంబునం దాలుచు న,మ్మసనంపురుద్రు
తోడుత, వసియింపఁగ నీమె న్మతిర్వాఁతా
బోటీ. పార్వ. ౪. ౯౫.

నసిమిరి=నస. వి. ౧. దురద, కండూతి. (శ.ర.)
౨. జలజంతువిశేషము.
సీ. గులకరింతయు నీరుగుట్టు శంఖనఖంబు పులుఁ
కాసి నసిమిరి బుంగపురువు. హంస. ౪.
౧౧౯.

నసుకు. వి. అసత్యము.
ఆ. జల్లి బురుడ బొంకు పొల్లు దబ్బఱ కల్ల...,
తనుకు నసుకు...నా నసత్య మభవ. ఆం.
భా. ౧. ౧౧౯.
విణ. అసత్యమైనది. (శ. ర.)

నసుగు. అ. క్రి. స. క్రి. అస్పష్టముగా చెప్పు.
(వ్యవ.) ఏమాట చెప్పినను వానికి నసుగుట అల
వా టైనది.
వి. అస్పష్టముగా చెప్పెడిమాట.
(వ్యవ.) నీనసుగులు మాని నీయుద్దేశము తెలు
పుము.

నసెము. వి. (సం. నస్యమ్.) ముక్కులో వేయు
రసాదులు మొదలయినది.(చూ.నసెముచేయు.)
జః నసెముచేయు.

నసెముచేయు. అ.క్రి. (√నసెము., రోగనివృ
త్తికై ముక్కురంధ్రములలో రసాదుల నుంచు.
గీ. పరఁగ నామదంబుపలుకులు సోఁటియు,గో
రిమత్కుణముల గుంటగలగ,రాకరసము
చేత రాచి నాసికయందు, నసెముచేయ
వెట్టిపస యడంగు. (చింతామణి. చి.ని.)

నస్తః. సం. వి. ఆ. స్త్రీ. ౧. వృషభాదులకు
కుట్టినముక్కురంధ్రము. ౨.ఆభరణాదు లుంచు
టకు కుట్టిననాసికాచ్ఛిద్రము.

నస్తము. సం. వి. అ. పుం. నాసము,ముక్కు.
వ. నస్యము, ముక్కుపొడి.

నస్తితము. సం. వి. అ. పుం. ముకుద్రాళ్లు పో
యుటకై ముక్కు కుట్టినయెద్దు.

నస్తోతము. సం. వి.అ. పుం. - కుట్టఁబడిన ము
క్కు కలది.- ౧. ముకుద్రాళ్లతో నడుపఁబడె
డియెద్దు; ముకుద్రాళ్లు పోసినయెద్దు.

నస్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. ముక్కు. ౨. పశ్వా
దులముకుద్రాడు. (విల్యమ్సు.)

నస్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నాసి
కకు హిత మైనది. ౨. నాసికయందు పుట్టినది.
౩. నాసికయం దున్నది. వి. అ. న. ౧. ము
క్కునందలివెండ్రుక. ౨. ముక్కుపొడి, ము
క్కుపొడుము.(విల్యమ్సు.)

నస్యోతము. సం. విణ. (అ. ఆ. అ.)=నస్తోతము.

నస్రము. సం. వి. అ. పుం. నాసాపుటము.(కే.ని.)

నహి. సం. అవ్య. (అభావము తెలుపును.) లేదు,
లేవు, లేదు, లేరు.
క. వలపు సట వావులా నహి,యల సత్యము
సున్న తలఁపు లభ్రచ్ఛాయల్, తలఁ దడవి
బాస చేసిన, జలజాక్షుల నమ్మరాదు సారంగ
ధరా. సారంగ. ౨. ౯.
ఉ. ఓచతురాగ్రగణ్య భువి నున్ననరేంద్రులలో
భవన్నిభుం, డీచతురబ్ధివేష్టితమహి న్నహి
యంచు జనుల్ నుతింప...శుక. ౧. ౨౮౬.

నహుషుఁడు. సం. వి. అ. పుం. ౧. చంద్రవం
శపురాజులలోనొకఁడు, యయాతితండ్రి. (ఇతఁ
డు స్వర్గరాజ్యమును పాలించి అగస్త్యమహాము
నిశాపమున సర్పజన్మ మెత్తి యుధిష్ఠిరునివలన
శాపవిముక్తి నొందినాఁడు.) ౨. మనుష్యుఁడు.
(కే. ని.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నా.

నా[1]. స. అస్మదర్థకము. (దీనికి ప్రథమాదివిభక్త్యేకవచనముల 'నేను, నేన్, నన్ను, నను, నన్, నాచేత,' మొ. రూపములును, బహువచనమున 'మేము, నేము, ఏము, మమ్ము, మము, మాచేత, మొ. రూపములును అగును.)

వ. నావిన్నవింపం బూనునాముక్తమాల్యదామహాప్రబంధమునకుఁ గథాక్రమం బెట్టిదనిన. ఆము. ౧. ౫౦.

చ...సర్వమునను నేన నిల్తు సుఖవాసత నన్ దగఁ జెంది నిల్చు సర్వము...భార. అశ్వ. ౩. ౩౭.

క. నానీసంవాదము...భార. అను. ౫. ౩౦౭.

క. క్రతుపరులు నన్న తగ సంస్తుతించి ఫలమందఁ గంద్రు...భార. అశ్వ. ౩. ౮౦.

క. ననుబోఁటిజోదునుం గాదని పలుకఁగ నేర్తు నీవు నంత గలదె యట్లును గాక వినుము కర్ణుం, డినుమా ఱోకశరము దొడుగు నేపరులు నగన్. భార. కర్ణ. ౩. ౩౧౭.

మ...వారు నన్ బ్రహ్మహా, లవరిష్ఠావ్యయసౌఖ్యమొందు మని లీలం జెప్పినన్ వచ్చితిన్. భార.అను. ౮. ౬౩.

వ...త్రివేదమయురావించినయీయపరాధంబు నాకు సహింపవలయు. భార. ఆది. ౫.౨౧.

ఉ. నేము భవన్నియోగసరణిం జరియించుచు నొక్కశూద్రు నుద్దాముని...శ్రీరం. ౩. ౫౯౧.

గీ. కృతి విన్నిర్మింపు మిఁక మాకుఁ బ్రియము కాఁగ. ఆము. ౧. ౧౩.

జః నాయన.

నా[2]=అన[3]. అవ్య. ద్రు. "అను"ధాతువునకు తుమున్నాద్యర్థకము.

శా. శ్రీలోలుండు వడాలుకాటనికి రాజీవాక్షి నూకాంబ నాం,గా లీలం జనియించె... శా. ప. మ. ౧౮. ౧.

ఉ. మేరుగుణావతారుం డగు మేడనికిం గలుహారగన్ధి అం,భోరుహనేత్రి :అన్వయవిభూషణి నాం దగు మేడమాంబకును...శా.ప. మ. ౧౫. ౩.

సీ. దక్షిణగంగ నాఁ దద్దయు నొప్పినగోదావరియు జగదాది యైన,భీమేశ్వరంబును... భార. ఆది. ౬. ౧౩౯.

మ...సౌభాగ్యప్రభానిత్యల,క్ష్మికి సంకేతనివాసమై మదనని,స్త్రింశంబు నా భీమక,న్యక నాఁగా దమయంతి నాఁ బరఁగు...నైష. ౩. ౧౭, ౬. ౧౬౮.

నాంచేరు=నాఁచేరు. (త. నాచ్చియార్.)

౧. దేవత, అమ్మవారు.

గీ. తోడుశ్రీరంగనాంచారుతోడఁ గూర్చి,లీల నొరయూరునాంచారు నేలె సరణి. శ్రీరం. మా. ౧౦. ౧౧౬.

సీ. నెచ్చెలుల్ గొల్వఁగా హెచ్చి నాంచారు దేవిని గనుఁగొని... ప్రబంధ. ౨౬౫.

౨. స్త్రీ, ఆఁడుది.

గీ. పాలు వోయించుకొని యాకృపాళుమూర్తి, శూలినాంచారుపాలిండ్లచూచుకములు,పాల చేఁపున గిలిగింత వారుటయును. హర. ౨. ౯౫. (నాంచారి. ముద్రి.)

సా: నాంచారమ్మవంటు నక్షత్రదర్శనము ఒకమాటె.

నాంతము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. అనంతము, అంతము లేనిది. ౨. నకారము అంతమందు కలది. (శబ్దము.) వి. అ. న. ౧. శౌమ్య. ౨. వైచిత్ర్యము. (కే. ని.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాంతరీయకము. సం. విణ. (అ. ఆ. అ.) అవినాభూతము, వేరుపడియుండనిది, వీడనిసంబంధము కలది.

నాంత్రము. సం. వి. అ. న. స్తోత్రము.

నాంది. సం. వి. ఈ. స్త్రీ. (దీనివలన దేవత లానందింతురు.) ౧. ఆనందము, సంతోషము. ౨. సమృద్ధి, పెంపు. ౩. కర్మారంభమందు చేయు దేవతాస్తోత్రము; నాటకముతొలుత మంగళార్థము పఠింపఁబడుపద్యాది. ౪. దేవతలు బ్రాహ్మణులు లోనగువారు చేయునట్టియాశీర్వాదము. ౫. భేరి. (శ. ర.)

నాందీకము. సం. వి. అ. పుం. ౧. తోరణస్తంభము, మంగళార్థము తోరణములు కట్టుటకు పాఁతిన స్తంభము. ౨. నాందీముఖశ్రాద్ధము, వివాహాదిశుభకర్మములందు కర్మారంభమున పితృదేవతాతృప్తికై చేయుశ్రాద్ధము.

నాందీకరుఁడు. సం. వి. అ. పుం. ౧. నాందీశ్లోకాదులను పఠించువాఁడు, సూత్రధారుఁడు. ౨. నాందీవాది, భేరిమొదలగువానిని మంగళార్థము వాయించువాఁడు.

నాందీపటము. సం. వి. అ. పుం. కూపముఖబంధనము, నూతిపైకప్పు.

నాందీముఖము. సం. వి. అ. న. వివాహాదులకు పూర్వము పిత్రాదులను గూర్చి చేయఁబడువృద్ధిశ్రాద్ధము.

నాందీముఖుఁడు. సం. విణ. (అ.ఈ.అ.) నాందీముఖశ్రాద్ధమును అనుభవించువాఁడు. (పితృమాత్రాది.)

నాందీవాది. సం. వి. న్. పుం=నాందీకరుఁడు.

నాందీశ్రాద్ధము. సం=నాందీముఖము.

నాఁగటిచాలుకూఁర. వి. (√నాఁగలి) తటిగొట్టి, లాంగలి ?. (శ. ర.)

నాఁగటిచాలుపేరియతివ. వి. (√నాఁగలి) సీత, జానకి.

క. కన్నియతలమానిక మగు, వన్నాఁగటిచాలు పేరియతివను సిరికిం, బెన్నుద్ది నెత్తుకొని చని, యన్నీచుఁడు రథముమీఁద నపు డిడుకొనియెన్. రామా. ౫. ౧౪౯.

నాఁగటిచిప్ప. వి. (నాఁగలి + చిప్ప.) నాఁగటిపణత, నాఁగటిగొడగ. (శ. ర.)

నాఁగటిజోదు. వి. (నాఁగలి + జోదు.) హలాయుధుఁడు, బలరాముఁడు.

ఉ. లాలసరీగజాంకుశుఁడు లావున నాఁగటిజోదునైనఁ గెం, గేలనె గీటడంచి బలుగెల్పుఁ బయిండినెలంత నేలుకోఁ, జాలినవాఁడు... యయా. ౧. ౪౯.

నాఁగటిదుంప. వి. (నాఁగలి + దుంప.) నాఁగటిచిప్ప. (శ. ర.)

నాఁగలి= నాఁగెలు. వి. ఔ. (సం. లాంగలః. ప్రా. ణాంగలో. క. నేగిల్, నేగిలు.) హలము, దున్నెడుసాధనము.

ఉ... రోఁకట, న్మోఁదుచు నాఁగటం దిగిచి నొంచుచుఁ గార్ముకముక్తబాణముల్, పైఁ దొరగించి కూల్చుచును... హరి. ఉ. ౧. ౧౧౧.

గీ. అతఁడు నాఁగట నెత్తినయంతనుండి, యేటిదిక్కున కంతయు నెగసి యుండు, హస్తినాపురి... ఉ. హరి. ౧. ౧౦.

సీ. తొడరి రావణుతలద్రుంచినయలఁతియో యమున నాఁగట గ్రుచ్చినట్టి యలఁతియో. పరమ. ౨. ౧౦౪.

జ: నాఁగటిచాలుకూర, నాఁగటిచాలుపేరియతివ, నాఁగటిచిప్ప, నాఁగటిజోదు, నాఁగటిదుంప.

నాఁగు. వి. ధాన్యమునకు వడ్డిగా నిచ్చుధాన్యము.

సీ. అచటి రెడ్డికొమాళ్లు నలహాలాయుధపాణి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాఁగున కడుగు ధాన్యంబు కొంత. పాం
చా. ౧. ౩౯.

నాఁగురు=నావురు. (చి. ని.) ఆం. భా. ౨.౬౨.

నాఁగె(గే)లు=నాఁగలి. వి. ప్రా.

గీ. అన్యముల డించి ముఖవర్ణ మభిలషించి, కూడె
నాఁగెలు సంపంగి కోమలాంగి,నాస యన
మించెఁ గాకున్న నాతిముక్కు, వానివలె
నున్న దన నెట్లు వాసికెక్కు. చంద్రా.
౪. ౧౧౯.

క. ఆయనయాజ్ఞానుసృతిక్, డాయుచు నాగర
మణుల్ జడతఁ దొలఁగఁగా, నాయతనవ
సుధ నాఁగెటి,చాయను బుధభమ్ము లమర
సవరించుతతిక్. అచలా. ౨. ౫.

సీ...ఓపి దున్న, నాఁగేటి మొనఁ జచ్చునానావి
ధప్రాణు లన్నరుఁ బొఁదునే యఘము...
భార. అను. ౫. ౫౭.

ద్వి. ఏల యీనాఁగేలు హృదయంబు చీర,
నేల యీగుద్దలి యిటుఁ బాఱవైచి, రము
... రం. రా. అయో. ౧౦౭ పా. ౨౩ పం.

సీ...నాఁగేలు నాఁగలి యనఁగాను లాంగలస
మాఖ్య, పరఁగు...ఆం. భా. ౨. ౨౩౨.

నాఁచారు=నాంచారు.

(స్త్రీ, ఆఁడుది.)

క. ఆచూతము చెంగటఁ గని, నాఁచారును దొ
డుక చెలులు నయమార్గాతి, ప్రాచుర్యప్రౌఢో
క్తి,శ్రీచాతురి మనముఁ బొదలఁ జేయుచు
డాయక్. ప్రబంధ. ౨౭౭.

నాఁచికొను=నాఁచు[1], ఆఁచికొను.స.క్రి.(నాఁ
చు[1]+కొను. స్వార్థమున.) ౧. అపహరించు;
లాగుకొను.

గీ. సౌకుమారుని దైవంబు నాఁచికొనక,యున్న
వీనిప్రాయంబున నుండకున్నె. వి.పు.౭.౭౧.

క. కొమరారునీకుమారుడు, కుమారరూపంబెగా
దు గురుధైర్యము శౌర్యమును బరాక్రమ
మును నొక్కుమొగి న్నామనసు నాఁచి
కొనియెం దండ్రీ. మార్క. ౭. ౧౭౯.

శా...దురాచారాగ్రేసరుఁ డాధరాసురుఁడు
కాంక్ష న్నల్లపూసాదిగా, సారామామణిసా
మ్ము నాఁచికొని వేశ్యావాటి కేఁగెక్ నృపా.
నిరం. ౨. ౧౦౬. భార. విరా. ౨. ౭౩.

చ. ప్రకటబలాఢ్యు లొక్కటఁ దిరం బయి
పల్వురు వీఁక భూమిపాలకునకు నడ్డమైనఁ
దవులంబడి హుమ్మని నోరికండ నాఁచికొనిన
మ్రోఁగు బెబ్బులివిశేషము దోఁపఁగ ...
భార. ద్రో. ౨. ౨౫.

క. పతిమనసు నాఁచికొనియెడు, చతురోపా
యంబు నీకుఁ జపలాక్షి సునిశ్చితమతిఁ
జెప్పెద విను...భార. అర. ౫. ౩౧౩.

శ్లో: ఇమం తు తే మార్గ మపేతమోహం,
వక్ష్యామి చిత్తగ్రహణాయ భర్తుః. సం.
భార. ౨౩౩. ౧.

౨. వశపఱుచుకొను; ఆక్రమించుకొను.

ఉ. రంగదుదారకీర్తి యగురక్కసగంగనఁ బెం
జలంబుమై,భంగ మొనర్చి మన్నజనపాలుఁడు
బల్విడి నాఁచికొన్న రాజ్యాంగము లెల్ల
నిచ్చి తనయాశ్రితవత్సలవృత్తి యేర్పడక్,
గంగ యసాహిణిం బదము గైకొనఁ బంచెఁ
బరాక్రమోన్నతిక్. నిర్వ. ౧. ౪౧.

క. ము న్నేను మేన నలఁదిన,ప్రసన్నినిభసితంబు
నణఁచి శ్రమవారి కడఁక్, జె న్నెసఁగె
మంచుమలసంచు న్నాఁచికొని ప్రవహిం
చుసురనదిపగిదిక్. పాండు. ౫. ౧౩౧.

నాఁచికోలు. వి. (√నాఁచికొను.) అపహరిం
చుట.

ఉ...పల్గునుఁ డడఁదఱ మీఱి సైంధవ, ప్రాణము
నాఁచికోలుఁ నరపాల తలంపఁగ మర్త్యకృత్య
మే. భార. శల్య. ౧. ౪౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**నాఁచు**[1] = నాఁచికొను. స. క్రి. అపహరించు; లాగుకొను.

రగడ. కోరకోరసిజ రతి నది నేఁ గోర గోరఁ టు లజ్జ నాఁచెను. చంద్రి. ౪. ౬౩.

సీ. ద్విరసనాళికి వేల్పువెను నూఁడి సుధ నాఁచి యిల్లులో నట పాఱఁజల్లినాఁడు. రా. వి. ౧. ౮.

సీ. పినుఁ గీక పెనఁగినఁ బెద్ద నొంపక యొఱ్ఱఁబాటించి చేఁగలపాటి నాఁచి. ఆము. ౬. ౩౮.

ఉ...శూలము పూని జక్కి యా, పక్కిని వ్రక్కలింపఁ గని పక్కన శూలము నాఁచి త్రుంచె నా, చక్కనికాలనేమితల...దశా. ౨. ౪౦౧.

వి. దొంగ.

సీ...సాఁచు నా దొంగయుఁ బ్రాఁచి దనరు. ఆం. భా. ౩. ౪౫.

జః నాఁచికొను, నాఁచికోలు.

**నాఁచు**[2]. వి. శైవాలము, నీటిలోఁ బుట్టెడితీఁగ, ప్రాఁచి.

సీ...నాఁ చన శైవాల నామ మెసఁగు. ఆం. భా. ౧.౧౬౫, ౩.౪౫.

సీ. నాడెంపుజడ పెంపు నాఁచుతీవలగుంపు కలికి కన్నవడాలు గండుమీలు. నీలా. ౧. ౫౬.

గీ...మనోహరవాసనల్ గలయునాఁచు, నాఁచుజలదంతికరములయతిశయమున, యమునరహిఁ గాంచునత్తోయజాకరమునఁ, గరము నయ మొప్పఁ దీర్చితిఁ గాల్యవిధులు. ఉ. రా. ౭. ౨౮౩, ౨. ౫౩.

సా: మాటకు మాట తెగులు నీటికి నాఁచు తెగులు.

జః నాఁచుఁదీఁగ, నాఁచుఁద్రాఁచు, నాఁచుడు, నాఁచువన్నె.

**నాఁచుఁదీఁగ(గె)**. వి. (√నాఁచు[2].) శైవాలలత.

సీ. సడలిననిడుద కెంజడలును ముదురఁ బండిననాచుఁదీఁగలు బెనఁగొనఁగ. హరి. ఉ. ౭. ౭౪.

(హంసము.) గీ. ప్రమదమున నాఁచుఁదీఁగె జొంపములఁ దూఱు. నైష. ౨. ౫.

**నాఁచుఁద్రాఁచు**. వి. (√నాఁచు[2].) నాఁచులో నుండుసర్పవిశేషము.

వ...సరీసృపనారీవారంబులతో మసకముల దనివిసనక సంచరించు నాఁచుఁద్రాఁచులఁ గాంచి మేను లుప్పొంగ ... ప్రబంధ. ౧౮౬.

**నాఁచుడు**. వి. (√నాఁచు[2].) క్షుద్రజలజంతు విశేషము, నీటిలోనుండుఒకానొకచిన్నజంతువు.

సీ...నత్తగుల్ల చుట్టుపుగుల్ల కురుమింద నాఁచుడు...హంస. ౪. ౧౮౯.

**నాఁచువన్నె**. వి. (√నాఁచు[2].) నాఁచురంగు కలవస్త్రవిశేషము.

సీ. ముత్తెలపందిళ్లు నుత్తరగోగ్రహణంబులు కరకంచు నాఁచువన్నె, నిండువన్నెలు... గీ. మొదలుగా వల్వలుధరించి ముదిత లపుడు. ప్రబంధ. ౨౭౨.

**నాఁటించు** = నాఁటు. స. క్రి. (√నాఁటు.)

(గుచ్చు.)

క. అందఱమేనుల గంగానందనుఁడు శరత్రయములు నాఁటించెను శల్యుం దాఁకె నుత్తరుఁడు...భార. భీష్మ. ౧. ౨౮౧.

క. వడి నొక్కపెట్ట లక్ష్మణుఁ, డడరించె నిశాతశరము లారక్కసుపైఁ, గడఁగి యతఁడు నాతనిపై, నెడపక నాఁటించెఁ గలయ నెనిమిదియమ్ముల్. భార. అర. ౭.౧౩౨.

(పాఁతించు.)

(పారిజాతమును.) గీ. పెరటిచెట్టుగ నాఁటింతుఁ బెంపు గనుము. పారి. ౧. ౧౩౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. మఱియుఁ గలదివ్యసరసులు నెఱయఁ జెఱచి, తనదు కేలిదీర్ఘికలందుఁ గనకనలినజాతు లెల్ల నాఁటించినాఁ డాతఁ డింద్రు, యటు చనక మేఁత నడుచునే హంసములకు. ప్రభా. ౧. ౧౨౦.

నాఁటు=నాఁటించే. స. క్రి. (ఇది నిర్బిందుకము అని చి. ని, శ. ర. కాని యీ క్రిందినిర్ధారకప్రయోగములఁబట్టి సబిందుకముగా గ్రహింపఁబడినది.) ౧. గ్రుచ్చు.

సీ...ఆతఁ డతని,ఘనశరాసనముఁ ద్రిఖండంబుగాఁ జేసి నారాచ మొక్కటి నాఁటె మేన. భార. భీష్మ. ౧. ౨౫౬.

ఆ. సత్యజిత్తుమేన సాయకదశకంబు, నాఁటి కుంభజుండు నగుచు విల్లు,దునుమ...భార. ద్రో. ౧. ౨౮౭. నీలా. ౨. ౨౩.

౨. (భూమిలో మొక్కలు మొ.) పాఁతు.

గీ. నాఁటె మందారతరువులు తోఁటలందు... ఇంద్రుఁడు దక్షిణకాశియందు. భీమ. ౫. ౮౭.

గీ. కొమ్మ నాఁటంగఁ దగినచోఁ గొమ్మ నాఁటు ...హెచ్చు, పాళితోడను శాలీనుఁ డవిరతంబు. కళా. ౪. ౭౮. వసు. ౫. ౬౪.

౩. పాఁతుకొనఁజేయు.

ఉ...అనంతకేవలా,నందము దానియందు మది నాఁటుము మానుము నీచభోగముల్. భర్తృ. ౩. ౪౦.

గీ. వెలఁది నామీఁదఁ గడుఁ గృపావిలసనంబు, నాఁటి చూచినచూపుమన్ననయ చాలు. నైష. ౪. ౬౩.

౪. భేదించు, చీల్చు.

సీ. ఇరుమెయిఁ దొలిచి బెట్టిలఁ దూఱునవియును నలువుర నేపుర నాఁటునవియు. భార. విరా. ౩. ౧౬౧.

గీ. ఆత్రిశూలాయుధంబు తీవ్రాంశుకోటి,భాశ్ఛటాభాసురము గుంభపదము నాఁటి, రక్తధారలతోన యారాక్షసేంద్రు,కలుషములు గార్చియే తెంచెఁ గ్రమ్మఱంగ. కాశీ. ౬. ౧౭౧.

౫. కలిగించు. చంద్రా. ౧. ౩౩.

అ. క్రి. (=నాడు.) ౧. గ్రుచ్చుకొను.

ఉ. దాఁటక మాన రిక్కడలి దాశరథుల్ తమ దండిమూఁకతో, దాఁటినఁదాఁకఁ జూడక కదా కని కావు మటంటివేని న్యాపూఁటయ కాచుఁ గాంచుటకుఁ బొమ్మిది మంచిది పోనినాఁటికిన్, నాఁటక పోవు నీయురమునన్ రఘువీరకఠోరబాణముల్. రామా. ౩. ౩౬.

ఆ. వాఁడితూపు లాడల వడి నాఁటుటయు నొచ్చి, ఘోర కలుషరోషధూమకేతుఁ, డతిశయిల్ల...భార. ఆర. ౭. ౧౩౩. కళా. ౫. ౧౬.

౨. పాదుకొను, స్థిరపడు.

క. మనమున నాఁటినమాటలు, విను మెన్నియు పాయములను వెడలునె యధిపా. భార. ఉద్యో. ౨. ౬౨.

క. నీనగవులు నీచూడ్కులు, నీనానావిహరణములు నీధ్యానంబుల్, నీనర్మాలాపంబులు, మానసముల నాఁటి నేఁడు మగుడవు కృష్ణా. భాగ. ౧౦ పూ. ౧౦౪౫.

గీ. నామనసు వానిమీఁదనె నాఁటె నమ్మ. కువల. ౩. ౧౧౧. ఆము. ౪. ౨౫.

౩. అంటు, తగులు.

ఉ...వాని కన్నిజన్మంబుల నైనఁ బాపములు నాఁటవు పుణ్యపరుండు గావునన్. వి. పు. ౩. ౧౩౭.

ఉ...పార్థివకదంబముఁ గూల్చినమేటి రామ నాఁతలఁపున నాఁటి రాఁగదవె దాశరథీ కరు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తాపయోనిధీ. దా. శ. ౩౩.

సీ. అనుమాట చెవి నాట నాగ్రహవ్యగ్రుఁడై యసురనాయకుఁడు శుక్రాత్మజులను, గనుఁ గొని...దశా. ౪. ౧౫౯.

౪. కలుగు, పుట్టు.

చ...వెక్కసమగు నెవ్వగల్ వొడమెఁ గంపము పుట్టెఁ జెమర్చె మేను మా,నసమున విన్నఁబాఁటొదవె నాఁటెఁ గడుం బరితాప వేదనల్. పారి. ౧. ౧౦౦.

క. విను మట్లాడఁగఁ బెద్దలు, ననుఁ గని పనిసేయు మనుచు నాఁటినకోపం,బున నేవ లాడ వినలే,కను దేశభ్రమణవృత్తిఁ గైకొని మఱియుక్. హంస. ౩. ౧౪౭.

వి. ౧. క్షతి, దెబ్బ; రంధ్రము, గండి.

సీ. పలుమొననాఁటు లేర్పడినకెమ్మోవితోఁ జిఱుచెమ టంటుముంగురులతోడ. మృ. వి. ౩. ౯౧.

చ. కడలి మునుంగ నప్పుడమి గ్రక్కునఁ గొమ్మున నెత్త నందు మ్ము,న్పడినయహార్యకూటములు నాఁటిననాఁటుల వెంబడిం బడిం,బడిఁ బడునీరధారలు సుపర్వులు నించినపువ్వువృష్టికై,వడి వెలయించుదంభకిటివర్య నిను న్మది నాశ్రయించెదక్. చంద్రా. ౧. ౭౭.

౨. కుదురు,భూమిలో దిగినపర్వతము మొదలగువానియడుగుభాగము.

గీ. నడుమ చతురశ్రవృత్తమౌ నాఁటు గలిగి, ధగధగాయితకనకరత్నప్రతాన,కిరణములు నాలుకలు గ్రోయుకీలములుగ, సురనగంబు విధూమాగ్నికరణి మెఱయు.వరాహ.౧౦. ౧౦౭.

౩. నాట్నము, మొక్కలు మొదలగునవి పాఁతుట.

(వ్యవ.) ఆచేనియందు నాఁటు ముగిసినదా.

నోనాఁటు = నొచ్చునట్లుగా నాఁటు.

క. ఒకమొగి నలువదియమ్ములఁ, బ్రకటబలుం డైనపరశురాముఁడు నాయం,గకములు దాఁకఁగ నశ్వ,ప్రకరము నోనాఁట నూతువైఁ బడ నేసెక్. భార. ఉద్యో. ౪. ౩౧౭.

సీ. బ్రహ్మదండంబులపాటివై మర్మంబు లిట్టు నోనాఁటునే యితనిచేత. భార. భీష్మ. ౩. ౪౦౫.

వాడుకలోని ప్రయోగవిశేషములు:—

౧. వాని కింకను సంసారము నాఁటలేదు.

౨. వానికి నీవు చెప్పినమాట నాఁటలేదు.

౩. ఎవరికైనను కష్టసుఖములు నాఁటినఁగాని మంచియుద్దేశములు కలుగవు.

జః నాఁటించు, నాఁటుకొను, నాఁటుకొలుపు, నాఁటుదీఱు, నాఁటువడు.

నాఁటుకొను. అ. క్రి. (నాఁటు + కొను.)

౧. పాదుకొను, స్థిరపడు.

సీ. పాపంబు లోకభంగిఁ బ్రశ్రయం బొందిన నామీఁద దృఢభక్తి నాఁటుకొనును, నామీఁద దృఢభక్తి నాఁటుకొన్నప్పుడు ధర్మంబు వర్తించుఁ దరతరంబు. భీమ. ౫. ౧౫౭.

గీ. నాఁటనుండియుఁ గంసుండు నాఁటుకొన్న, దిగులు పెంపున వసుదేవదేవకులను. వి. పు. ౭. ౩౪. ఆము. ౫. ౫౫.

౨. కలుగు, సంభవించు.

గీ. నాకవల్లభ నీమీఁద నాఁటుకొన్న,మానికొ పాగ్ని దివిజసంపదలమీఁదఁ, బోయె నంతియ చాలు నీపుణ్యమునను, వేయు నేటికిఁ బులి నాకి విడిచినట్లు. వి. పు. ౧. ౧౫౬.

గీ...ఈక్షణంబున నాఁటుకొనిన,పాటు మదిఁ జిత్తగింపవే పార్థివేంద్ర. వసు. ౨. ౧౪౫. పారి. ౫. ౧౮.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౩. పాఁతుకొను, వేళ్లుపాఱు.

(వ్యవ.) మొన్న పాఁతినవంగ మొక్క నాఁటుకొన్నది.

నాఁటుకొలుపు(ల్పు)= నాఁటించు. స. క్రి. (√నాఁటుకొను.) ౧. గ్రుచ్చు, గ్రుచ్చుకొనఁజేయు.

వ...నూటిగ నీఁటెలు నాఁటుకొల్పి యసురులెడల మీఁటుచు...అచ్చ. రా. యు. ౩౬౪.

౨. అతుకుకొనఁజేయు, అతికించు.

గీ. తెగువ దక్షునికంఠంబుఁ ద్రెవ్వ నేసి, వ్రేల్చెఁ దల నధ్వరాగ్నిని వీరభద్రుఁ, డాప్రజాపతి మెడపైని నాక్షణంబ, నగుచుఁ బోఁతు తలఁదెచ్చి నాఁటుకొలిపె. భీమ. ౬. ౫౯.

౩. పుట్టించు, కలిగించు.

సీ. అయ్యింతికడ నిల్చి యనువునఁ గాంతుకు నకు మది రాగంబు నాఁటుకొలిపి. దశకు. ౬. ౧౨౧.

నాఁటుదీఱు. అ. క్రి. (నాఁటు+తీఱు[1].) మొక్క మొ. పాఁతుకొని చక్కఁగా వ్యాపించు.

చ. కరిశిర మాడ షణ్ముఖుఁడు గైఁపున వ్రేయుడుఁ గుంభమౌక్తికో,త్కర మసిధారఁ బొల్పెసఁగెఁ దారకుఖంగము నూచి నవ్వసం, గరజయకాంత కాంతరద కాంతియొ కా దని నాఁటుదీఱె వి,స్ఫురదవదాతఖడ్గలత పూచెనొ నా జయచైత్రసంపదన్. కు. సం. ౧౨. ౯౬౧.

నాఁటువడు. అ. క్రి. (√నాఁటు.) నఱుకుడువడు, తెగు.

చ. చిరముగ నొల్వ్వడ్డనరసింహునికంఠెను బెద్దవే శిరం, బురలఁగ నాఁటు వడ్డజలజోద్భవుకంఠెను బెద్దవే...కు. సం. ౪. ౪౩౨.

నాఁడిక=నాఁడు. వి. (నాఁడు+ఇక. స్వార్థమున.) దేశము.

క. అన్నాతియు నొడయఁడు నటు, లన్నారని నీవు కోన కరుదెంచినచో, నన్నా యన్నాఁడిక యన్నన్నా యాఁగుకొనఁ జాలునట్టిదె చెపుమా. అచ్చ. రా. అయో. ౧౧౦.

నాఁడు. వి. ఔ. (బ. నాళులు, నాళ్లు.) ౧. దినము, దివసము. (ఈపదము ఈ క్రిందినిర్ధారక ప్రయోగములననుసరించియు చి. ని. ననుసరించియు కాలవాచక మగునపుడు నబిందుకమనుట నిర్వివాదాంశము. ఇఁక దేశవాచకమైనపుడునైతము ముద్రితప్రతులందు సబిందుకమే యయి యుండుటచేతను దేశకాలార్థములకుసన్నిహితసంబంధ ముండుటవలనను నిర్బిందుకమునకు నిర్ధారక ప్రయోగములు లేకపోవుటచేతను శాసనముల ననుసరించియు నీరూపమే యెల్లెడల గ్రాహ్యమనుట యుక్తము.)

క. మీఁటు గలరాజరథికుల, నాఁటికి వేవుర వధింతు నరుశరములు నో,నాఁటి పడవైచు నంతకు, వేఁటాడెదఁ బ్రతిబలంబువీరుల నెల్లన్. భార. ఉద్యో. ౪. ౪౦౭.

క. పూఁట నగు కార్యగతు లొక, నాఁటన్ మతి నాఁటఁ గనెడునయకార్యము లొ,క్కోఁటం జేయుట మే లగు...రా. వి. ౨. ౩౬.

గీ. ఉత్తమక్షత్రియుల నెల్ల నుగ్రవృత్తి, నేఁడు పదినాళులేని నానిశితశరచ,యములఁ గూల్చితి వేసరినట్టు లయ్యె. భార. భీష్మ. ౩. ౩౬౪. (పదినాళులేని=పదిదినములును.)

క. బలవిక్రమములు వినుతెం,బులు గా మన మొనలఁ బాండుపుత్రానీకం,బులు రెండు నాళ్లు వోఁదట, వెలియంగాఁ జూచి వచ్చితిం గురునాథా. భార. కర్ణ. ౧. ౩.

౨. ఆదినము.

గీ. నాఁడు నభ నాడినంతయు నేఁడు చేయు, నట్టు లున్నాఁడు మొనలోల ననిలసుతుఁడు. భార. భీష్మ. ౩. ౨౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. వేఁడిన వేఁడిమాట నృపవీరుఁడు సైఁపక కర్ణరంధ్రముల్, నూఁడినభంగిఁ దాఁకుట యు స్రుక్కి మనంబున నొచ్చి నిన్ను నే, నాఁడు నృపాలపుత్త్రి వని నమ్మి వరించితిఁ గాక యిమ్మెయిన్, నేఁ డొకకాలసర్ప మయి నీ విటు సేయుట నారుఁ దోఁచెనే. భా. రా. అయో. ౧౯.

క. నాఁడు మొదలుకొని యాపూఁ, బోఁడి య నారతముఁ దెచ్చి భోజన మిడఁగా, నేఁ డొక్కటి చనునంతకు, వాఁ డక్కడ నుండు నుచితవర్తనలమెయిన్. భోజరా. ౨. ౧౪౭. కాశీ. ౪. ౯౯.

౩. సమయము, కాలము.

ఉ. నేఁ డలతోఁటలో నపుడు నిబ్బర మైన మదీయభాగ్యముల్, బోఁడిమి యేమిపాక మునఁ బొందెనొ మీకృప యట్లు గాంచి వె, న్నాఁడి దనర్చునాచనవునన్ మిము నె మ్మెయి నంటిఁ గాని యే, నాఁడును బుణ్య సాధ్వికి గుణం బిది గా దని నే నెఱుంగుదున్. కళా. ౪. ౧౧౩.

ఉ. సత్యవతీవధూటి మును శంతను పెండ్లము కానినాఁడు సాం, గత్యమునం బరాశరుఁడు గర్భము చేసిన... భాగ. ౯. ౬౬౯. కాశీ. ౧. ౪.

౪. అకాలము, అసమయము.

గీ. స్వాస్థ్య మెయ్యది జలజాక్ష శక్తి మెఱసి, నాఁడె స్వర్గంబు గైకొనినాఁడు బలియె. దశా. ౨. ౪౭.

ఉ...పరమేశ్వర యావరణాంబురాశి లేఁకుండిన నాఁడె పొక్కి వడకుండునె పద్మభ వాండభాండముల్. కాశీ. ౧. ౧౨౩.

ఉ. నాఁటికి నెట్టిదై వఘటనంబుననో నిను నొల్ల కంతయుం, గాటపుఁగోపముల్ బెనుపఁగాఁ దను నెమ్మెయి నంటిఁ గాక పూఁ, దోఁటకు జీతగాఁడ్రు మనతోల్లిటివారలు లేరె నీవి ఘం, డేఁటికిఁ బోవఁగా వలయు నీ వటు పోవఁగ నేల కూఁతురా. కళా. ౪. ౧౩౨. హర. ౬. ౪౭.

౫. పక్షమున, ఎడల.

గీ. అఖిలలావణ్యపుంజంబు నబ్జభవుఁడు, మొలఁ తగా దీనియందు నిర్మించె నొక్కొ, కాని నాఁ డిట్టికాంతి యేకాంతలందు, నేల లే దని సామర్షహృదయ లయిరి. భార. సభా. ౨. ౧౬౦.

క. తారకు నోర్వఁగ వేఱ కుమారకుఁ బడయంగ సంగమము సేయను ముక్, వారలపైఁ బంపనినాఁ, డారిపుపైఁ బంపు మాతఁ డధికుఁడె నాకున్. కు. సం. ౪. ౪౦౭.

క. ధనధాన్యపశుసమగ్రుం, డనఁ బరఁగెడునట్టి వైశ్యుఁ డధ్వరముం జేయనినాఁడు బ్రాహ్మణాధ్వర, మునకు నతనిసొమ్ము రాజు పుచ్చియుడఁ దగున్. భార. శాం. ౩. ౪౩౧. నైష. ౫. ౯౧.

౬. (క. త. నాడు)=నాఁడిక, దేశము; ప్రదేశము.

చ. అరినరపాలమౌళిదళితాంఘ్రియుగుం డయి పాఁకనాఁటియం, దిరువదియొక్క వేయిటి కధీశుఁడు నాఁ జనుచోడబల్లికిన్. కు. సం. ౧. ౫౩.

సీ. మూఁడుగ్రామగ్రాసములతోడఁ గూడంగ మోపూరు పాలించె ముల్కినాఁట. క్రీడా. ౨౨.

ద్వి. నాఁ డెల్ల నేలెదునాఁడు నాపిన్న, నాఁడొక్కనాఁ డేను నడురేయిఁ బోయి. రం. రా. అయో. ౧౨౩ పం. ౧ పం.

ద్వి. పురములు దేశముల్ పుణ్యతీర్థములు, నరనుతం బగునాళ్లు నాళ్లను గడచి. ద్వి. హరిశ్చం. పూ. ౨౨౧౬ పం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. దినకరకులుం డైన త్రిభువనమల్లండు కమ్మనాం
డును గుండికట్టు మెట్టి,వాడియుం జేకొని
రూఢిగా నేలంగ...శా. ప. మ.౧.౩౦.
చ. ఇల వెలనాంటిచోడిన్నృపునిచ్చినదత్తము...
శా. ప. మ. ౧. ౪౨. నైష. ౧. ౧౦.
౩. జనపదము, గ్రామము, పల్లె.
వ...ఇవ్విశ్వంభర నేద్వీపంబున నేదేశంబున
నేనాంట నేవీట నేత్రోవ నేక్రేవ నేవేళ
నెవ్వండేమి సేయం దలంచె...ఆము. ౪.
౨౫౫. (శ. ర. పా.)
సీ. నాండు నా జనపదనామధేయం బగు...
ఆం. భా. ౨. ౩.
అనాండున్కి = అనాండు మొదలుకొని, అప్పటి
నుండి.
సీ...నాండు మొదలు నాంటంబట్టి యానాండున్కి
యిదిమొదల్ నాంటంగోలె, యనంగం దదా
రభ్య యనుట...సాం. ని. మాన. ౩౩.
తలనాండు=నాంటంగోలె.
సాం. ని. మాన. ౩౩.
నాంటం(టం)గో(గొ)లె=ఆసమయము మొదలు.
మత్తకోకిల. నాంటంగోలెను నామనంబున నాం
టుకో వెఱనావు నిం,కేంటిజీవన మంచు నీ
తప మిట్లు వన్నితి...భా. రా. ఆర.౨.౮.
సాం. ని. మాన. ౩౩.
(అయ్యురగులు.) వ...నాలుకలు రెండుగా వ్ర
య్యుటం జేసి నాంటంగోలె ద్విజిహ్వులు నాం
బరంగిరి... భార. ఆది. ౨. ౧౨౨.
శా. ఆగంధర్వుండు వచ్చి నాంటంగొలె నత్యా
నందసంయుక్తుం డై,రాగప్రౌఢిమ మీఱు గీతి
ములు నేర్పన్...చంద్ర. ౨. ౧౩౫.
నాంటంబట్టి=నాంటంగోలె.
గీ. నాంటిసుత నాంటినుండియు నాంటంగోలె,
నాంటంబట్టి నాండు మొదలు నాంగ నాహ్వ,
యమ్ము లయ్యెం దదారభ్య యనుట కవని.
ఆం. సం. మాన. ౪౬.
నాంటిసుత=నాంటంగోలె.
గీ. నాంటిసుత నాంటినుండియు నాంటంగోలె.
ఆం. సం. మాన. ౪౬.
నానాండు=౧. క్రమక్రమముగా,కాలక్రమమున.
గీ...నానాంటి కీర్తి నాంటిప్రియము, చవుక
యైనట్టి యిచ్చటం జనదు నిలువ.ఆము.౫.౩.
గీ...పసరుకప్పు, పూంటపూంటకు నెక్కుం గప్పు
నకుం దగిన,మెఱుంగు నానాంటికిని మీంద
గితికొనంగ. మను చ. ౬. ౨౩.
శా. ఖద్యోతద్యుతి వృద్ధిం బొందెం బిల్వరక్షం
జేసి నానాంటికిన్. ఉ. రా. ౧. ౨౫౨.
౨. దినదినము, ప్రతిదినము.
శా. ఈయైశ్వర్యముం జూడంబోలుదునె నే
నెప్పాట నానాంటికిన్. కాశీ. ౧. ౧౧౫.
క. భూనాయక యీదివ్యవిమానం బసమాన
దివ్యమణికలశలా,కానీకనిర్మితం బిది, నా
నాంటి కనంతకాంచనంబులు గురియున్.
వసు. ౩. ౧౨. విక్ర. ౧. ౫౫.
నాండునాండు = ౧. క్రమక్రమముగా, కాల
క్రమమున.
ఉ...అత్తతురగంబుల కెల్లను నన్నుయుక్తుంగా,
నర్తిలి నిల్పి యాంగియుం బ్రియంబును
నాయెడ నాండునాంటికిం, బేర్మి వహించు
చుండ నడపెం దనతమ్ములలోనివానిం గాన్.
భార. విరా. ౧. ౨౬౩.
గీ. ఉత్తరోత్తర మభివృద్ధి నొందుచుండుం,గాళి
ధరార్థకామమోక్షములు నాల్గు, చంద్రకళ
యట్లు శుక్లపక్షంబు రేలు, నాండునాంటికి నభి
వర్ధనంబు నొందు. కాశీ. ౨. ౫౨.
౨. ప్రతిదినము, దినదినము.
చ. అలయక నాండునాంటికి లతాంగి యపూ
ర్వము లైనభోజనం,బులు గడుభక్తిం బెట్టు
చు...భార. ఆది. ౮. ౧౮౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ...నాఁడునాఁటికిన్ బాటించి వేఁటకాండ్రద
నెటెంగి మేపుమేపులచమత్కారంబుల ని
రాకరించి వీరున్ దిరిగి తిరిగి యాఁక దీ
ర్చుకొనుచనపియును...మనుచ. ౪. ౨౮.

పిన్న(టి)నాఁడు=చిన్నతనము,బాల్యము.

ద్వి. నాఁ డెల్ల నేలెడునాఁడు నాపిన్న,నాఁ
డొక్కనాఁ డేను నడురేయిఁ బోయి,యరు
దైనవేఁటల నాసక్తిఁ బొంది. రం. రా.
అయో. ౧౨౩ పా. ౧౫౦.

ఉ. పిన్నటినాఁడు సత్కరుణఁ బిల్లలమఱ్ఱిమహా
ప్రధాని పెద్దన్న గురూత్తముండు తగ నక్ష
రశిక్షయు దైవమార్గసం,పన్నతయు న్వివేక
పరిపాటియునుం గృపసేసె...హర. పీఠి.
౧౨౭.

జః నాఁడిక.

నాఁపచేను. వి. ఔ. (నాము[1] + చేను.) నాము
కలపొలము.

వ...నాఁపచేనికిం దలపడునాఁబసరంబులపస
మూరుకొని మెక్కి యా మెక్కిన లెక్కిం
చి మిక్కిలిం జొక్కిపసుజక్కవపడంతులు
ను...బహు. ౩. ౬౦.

నాఁపరాయి. వి. (నాము[2] + రాయి.) నాము
వలె నున్నగ నుండురాయి. (విషశిల. దీనినిత్రొ
క్కినను ఆచోటు నొప్పి కలుగును అని శ. ర.)
(వ్యవ.)మాయరుఁగుమీఁద నాఁపరాయి పఱచి
నాము.

నాక. స. క్రి. (√అను. అనుధాతువుయొక్కవ్య
తిరేకక్త్వార్థకరూపము.) అనక.

చ. కొలఁది యెఱుంగ కిట్టిపలుకుల్ వలుకం
దగు నాక...భార. ఆది. ౫. ౨౦౩.

గీ...నలువపట్టి, యొండ నాక యొక్కింతసే
పూరకుండి. కాశీ. ౧. ౧౦౧.

నాకబలి. సం. వి. ఇ. పుం. నాగవల్లి, వివాహాం
గముగ అయిదవనాఁడు చేయుసంస్కారవిశే
షము.(నాగబలి=నాగపూజ. వివాహసంస్కా
రవిశేషము. ఆపస్తంబ. గృహ్య. ౨. ౧౫
సూ. అని విల్యమ్సు.)

సీ. పాలుపు మీఱఁగ నాకబలికృత్యములు సల్పి
...కళా. ౮. ౪౩.

నాకము. సం. వి. అ. పుం. ౧. - అకము-దుః
ఖము-లేనిది - స్వర్గము. ౨. ఆకాశము.

నాకవనిత. సం. వి. ఆ. స్త్రీ. దేవతాస్త్రీ; అప్స
రస, అచ్చర.

నాకసదుఁడు. సం. వి. ద్. పుం. - స్వర్గము నివా
సముగా కలవాఁడు - వేలుపు.

నాకి. సం. వి. న్. పుం. - స్వర్గము నివాసముగా
కలవాఁడు - దేవత, వేలుపు.

నాకిని. సం. వి. ఈ. స్త్రీ. దేవతాస్త్రీ.

నాకు. స. క్రి.(త. నక్కు.) ౧. లేహనముచేయు,
నాలుకతో రాఁచి లోఁగొను.

సీ.సనకాదిదివిజమస్కరిఫాలగోపినందనపుండ్ర
వల్లికల్ నాకి నాకి. ఆము. ౧. ౪౧.

వ...బోరన గాఱుధారాళరుధిరాసారపూ
రంబు నాకి నాకి...మనుచ. ౪. ౬౦. వే
మన. ౨. ౭౧.

౨. స్పృశించు, తాఁకు.

క...ధగధగ లర్చి, స్తంగణ నింగులు నాకెడు,
నింగలములు నాల్గుదెసల నిడుకొని కడఁకన్.
మనుచ. ౬. ౨౧.

సీ. అరుణచోదితరథం బట్టుగాఁ బట్టి నలినా
ప్తుబింబంబు నాకి విడుచు.ఉ.రా.౨.౧౪౮.

సా: పులినాకి విడిచినట్లు.

గీ. నాకవల్లభ నీమీఁద నాఁటుకొన్న, మాని
కోపాగ్ని దివిజసంపదలమీఁదఁ, బోఁయె
నఁటియ చాలు నీపుణ్యమునను, వేయు
నేటికిఁ బులినాకి విడిచినట్లు.వి.పు.౧.౧౫౬.
(గొప్పయాపద తప్పినది అని భావము.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(కాలకౌశికుఁడు.) ద్వి. వెడగొడ్డుఁ బులి నాకి వి
డిచిన ట్లుఁ—న, జడిసి తొల్లిటితనజంజాటు మె
ల్ల, నుడిగి...ద్వి. హరిశ్చ. ఉ. ౯౪౪ పం.
సా: అఱచేతిలో తేనె వేసికొని మోచేతిదాఁక
నాకించినట్లు.

నాకుఁడు. సం. వి. అ. పుం. ౧. సూర్యుఁడు.
౨. కొడుకు, పుత్త్రుఁడు. (కే. ని.)

నాకుము. స. క్రి. (√అను. అనుధాతువుయొ
క్క— వ్యతిరేకప్రార్థనావ్యర్థకమధ్యమపురుషైకవ
చనరూపము.) అనకుము.

చ. అనుటయుఁ గంకుఁ డిట్లనియె నక్కడ
వచ్చి సుశర్మ యోడెఁ గా,వున నిట వీరికిన్
జయ మవున్ వెఱ పేటికి నీకు నుత్తరుం,డని
నొకరుండ నాకుము బృహన్నల సారథి
గాన గెల్చు న,య్యనిమిష.కోటినైన నతఁ
డద్భుతవిక్రమజృంభణంబునన్.భార.విరా.
౫. ౨౩౫.

నాకులము. సం. విణ. (అ. ఈ. అ.) నకుల
సంబంధమైనది.

నాకులి. సం. వి. ఈ. స్త్రీ. ౧. సురస, సర్పా
క్షి†. ౨. యవతిక్త†. ౩. శ్వేతకంటకారి, తెల్ల
వాఁకుడు†.

నాకువు. సం. వి. ఉ. పుం. ౧. వల్మీకము, పుట్ట.
౨. పర్వతము, కొండ. ౩. వనస్పతి. (కే. ని.)

నాకేశుఁడు. సం. వి. అ. పుం. స్వర్గాధిపతి,
ఇంద్రుఁడు. (ఇట్లే: నాకేశ్వరుఁడు మొ.)

నాకౌకసుఁడు. సం. వి. స్. పుం - స్వర్గము నివా
సముగా కలవాఁడు - దేవత, వేలుపు.

నాక్రము. సం. విణ. (అ.ఈ.అ.) నక్రసంబంధ
మైనది. వి. అ. పుం. మొసలిమూతినక్క—.

నాక్షత్రము. సం. విణ. (అ. ఈ. అ.) నక్షత్ర
సంబంధమైనది. వి. అ. న. ౧. నక్షత్రమాన
మున అఱువదిగడియలఅహోరాత్రము. ౨. అట్టి
అహోరాత్రములు ముప్పది కలమాసము.

నాక్షత్రికము. సం. విణ. (అ. ఈ. అ.) నక్ష
త్రమువలన కగినది; నక్షత్రము నిమిత్తముగా
కలది. వి. అ. పుం. చంద్రుఁ డశ్విన్యాదులందు
చరించునిరువదియేడుదినములమాసభేదము.

నాగ. విణ. (సం. నాగః.) ౧. పూజ్యము. (చూ.
నాగబెత్తము.) ౨. పెద్దది. (శ. ర.)
జ: నాగగన్నేరు, నాగజెముడు, మొ.

నాగఁడు. వి. (సం. నాగః.) శేషుఁడు. (శ. ర.)
మొ.

నాగకందము. సం. వి.అ. పుం. హస్తికందము†.

నాగకన్యక. సం. వి. ఆ. స్త్రీ. నాగజాతికన్య;
సర్పజాతిస్త్రీ, భోగిని.

నాగకర్ణము. సం. వి. అ. పుం-ఏనుఁగుచెవివంటి
ఆకులు కలది - ౧. ఏరండము, ఆముదపుచెట్టు.
౨. ఏనుఁగుచెవి.

నాగకింజల్క—ము.సం.వి.అ.పుం.నాగకేసరము†.

నాగకుమారిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. గుడూ
చి, తిప్పతీఁగ. ౨. మంజిష్ఠ, మంజిడి†.

నాగకేసరము. సం.వి. అ. పుం. పుష్పప్రధాన
మైనఒక మొక్క—.

నాగకేసరులు. వి. బ. (సం. నాగకేసరాః.) ధా
న్యవిశేషము.

సీ. నాగకేసరులు చెన్నంగులు కురువులు భోజ
నప్రియములు రాజనములు...శాలి. గీ. ధా
న్య మెసఁగును...సాం. ని. మాన. ౫౨.

నాగగంధ. సం. వి. ఆ. స్త్రీ. సర్పాక్షి†.

నాగగన్నేరు. వి. (√నాగ.) పెద్దగన్నేరు, ఒక
జాతిగన్నేరు†.

సీ...నాగగన్నేరులు మూనాళ్లసొబగు. భల్లా.
౩ ఆ. (శ. ర.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాగగర్భము. సం. వి. అ. న - సీసము గర్భమందు కలది - సిందూరము.

నాగచూడుఁడు. సం. వి. అ.పుం-పాములు తలయందు భూషణములుగా కలవాఁడు-శివుఁడు.

నాగచ్ఛత్త్రి. సం. వి. ఆ. స్త్రీ. గురుగు, శ్రీహస్తిని.

నాగజము. సం. వి. అ. న - సీసమునుండి పుట్టునది - ౧. సిందూరము. ౨. వంగము, తగరము.

నాగజిహ్వా. సం. వి. ఆ. స్త్రీ - పాము నాలుక వలె ఉండునది - శారిబ, మామెన.

నాగజిహ్వక. సం. వి. ఆ. స్త్రీ - ఏనుఁగునాలుకవలె ఎఱ్ఱిగా ఉండునది - మణిసిల.

నాగజీవనము. సం. వి. అ. న.వంగము,తగరము.

నాగజెముడు. వి. (√నాగ.) బొమ్మజెముడు,ఒక జాతినుండ్లచెట్టు.

నాగతుంబి. సం. వి. ఈ. స్త్రీ. భూతుంబి, సేలానుగు.

నాగదంతము. సం. వి. అ. పుం. ౧. ఏనుఁగు దంతము. ౨. బట్టలు మున్నగునవి తగుల్చుకొనుటకై ఏనుఁగుదంతమువలెగోడకు అమర్చెడి కొయ్య, చిలుకకొయ్య.

నాగదంతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. శ్రీహస్తిని, గురుగు. ౨. కుంభము, ఏనుఁగుతుమ్మి.

నాగదంతిక. సం. వి. ఆ. స్త్రీ. వృశ్చికాళి, తేలుమణి.

నాగదమని. సం. వి. ఈ. స్త్రీ - సర్పములను అణఁచునది - ౧. ఈశ్వరి. ౨. గొడ్డుఆఁగాఁకర.

నాగదాళి. వి. (క. నాగదాళి.) ఒకజాతిముండ్లచెట్టు. (శ. ర.)

నాగద్రువు. సం. వి. ఉ.పుం.స్నుహి, జెముడ.

నాగనక్షత్త్రము. సం. వి. అ. న - సర్పదేవతాకనక్షత్త్రము - ఆశ్లేషానక్షత్త్రము.

నాగనామము. సం. వి. న్. పుం. తులసి.

నాగనాస. సం. వి. ఆ. స్త్రీ.ఏనుఁగుతొండము.

నాగనిర్య్యూహము. సం. వి. అ. పుం. నాగదంతము, ఏనుఁగుదంతమువలె గోడకు అమర్చిన కొయ్య; చిలుకకొయ్య.

నాగనేరెడు. వి. (√నాగ.) పెద్దనేరెడు, ఒక జాతినేరేడు. (శ. ర.)

నాగప=నాగప్ప, నాప. వి. నాగవల్లి. (చూ. నాగపసాని.)

జ: నాగపసాని.

నాగపంచమి సం. వి. ఈ. స్త్రీ. ౧. శ్రావణ శుక్లపంచమి. ౨. (దేవీపురాణానుసారముగ) ఆషాఢకృష్ణపంచమి.

నాగపడగలదండ. వి.(నాగ + పడగలు + దండ.) స్త్రీకంఠభూషావిశేషము.

ద్వి. భాసురం బగునాగపడగలదండ,యాసలఁ జేరె నయ్యతివ నీదండ. ద్వి. భాగ. ౧౦. (శ. ర.)

నాగపడగలు=నాగుపడిగప్రోగులు, నాగులపడగలు. వి. బ. (నాగ + పడగలు.) పాముపడగలవలె నుండుకర్ణభూషావిశేషము. (శ. ర.)

నాగపడిగకోల=నాగబెత్తము. వి. (నాగ + పడిగ + కోల.)పాముపడగవంటిపడగకలబెత్తము.

సీ. ఎడమచేఁ బల్లిక నిడినబండా రన్యపాణిఁ బట్టిననాగపడిగకోల. శుక. ౨. ౪౨౧.

నాగపత్త్ర సం. వి. ఆ. స్త్రీ. నాగదమని, ఈశ్వరి.

నాగపదము. సం. వి. అ. పుం. ౧. రతిబంధవిశేషము. ౨. నాగముయొక్కపాదము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాగపసాని=నాగమసాని. (√నాగప. శ. ర.)

నాగపాశకము. సం. వి. అ. పుం. రతిబంధవిశేషము.

నాగపాశము. సం. వి. అ. పుం. ౧. పామువలె చుట్టుకొనెడిఅస్త్రవిశేషము. ౨. పాశము, వరుణునిప్రధానాస్త్రము.

నాగపురము. సం. వి. అ. న. ౧.(కౌరవనివాసమగు) హస్తిపురము. ౨. పాతాళము. ౩. భరతఖండమున మధ్యరాష్ట్రమం దున్నయొక ప్రసిద్ధపట్టనము.

నాగపుష్పము. సం. వి. అ. పుం - ఏనుఁగుమదమువంటివాసన కలపువ్వులు కలది-౧. పున్నాగము, పొన్న 🌳. ౨. చంపకము, సంపెఁగ 🌳. ౩. నాగకేసరము 🌳.

నాగపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. నాగదమని, ఈశ్వరి 🌳.

నాగపుష్పిక. సం. వి. ఆ. స్త్రీ. స్వర్ణయూథిక, పచ్చపూలగోరఁట 🌳.

నాగపెంజెర. వి. (నాగ + పెంజెర.) ఒకజాతి పెంజెర, సర్పజాతివిశేషము.

సీ. ప్రల్లదంబునఁ దుప్పల్లనల్లనాగులు నాగపెంజెరలును బొట్టపెంజెరలును. ద్వా. ౮.౧౦౦.

నాగప్ప= నాగప, నాప. (చూ. నాగప్పసాని.) జః నాగప్పసాని.

నాగప్పసాని= నాగమసాని. వి. (నాగప్ప + సాని. క. నాగమసాని.) నాకబలిచిరంటి, నాగవల్లి నడపెడుముత్తైదువ.

సీ. నాగప్పసాని నా నాపసాని యనంగ నాకబలిచిరంటినామ మెసఁగు. ఆం. భా. ౨. ౧౦౮.

నాగఫలము. సం. వి. అ. పుం - పాములవంటి కాయలు కలది - పటోలము, పొట్ల 🌳.

నాగబంధము. సం. వి. అ. పుం. ౧. అభినయహస్తవిశేషము. ౨. చిత్రకవిత్వమందలి సర్పాకారబంధము. ౩. మల్లబంధవిశేషము.

వ... రామబాణంబును నాగబంధంబును లోలకరిమెఱపును...మల్లుపు. ౩. ౬౯.

౪. వస్త్రవిశేషము.

వ...నాగబంధంబులు బూజాబంధంబులును... అనుపేళ్లుగలపుట్టంబులు గట్టుకొని...ద్వా. ౩. ౨౦౬.

నాగబంధువు. సం. వి. ఉ. పుం - ఏనుఁగులు రావిరొట్టను సంతోషముతో తినును గాన ఏనుఁగులకు ఇది బంధువువంటిది- రావిచెట్టు.

నాగబల. సం. వి. ఆ. స్త్రీ. బీఱ 🌳.

నాగబలాకార. సం=నాగబల.

నాగబెత్తము= నాగపడిగకోల. వి. (నాగ + బెత్తము.) యోగవేత్రము, పాన్ను వేసినమంత్రపూత మైనచిన్నపేము.

క. జననాథ యేమి చెప్పుదుఁ, గనలుచు నవ్వఁగుదపసి కటము లదరఁగాఁ, దనచేతినాగబెత్తముఁ, గొని పసరముఁ గొట్టినట్టు గొట్టె నదయుఁడై. మనుచ. ౪. ౭౫.

గీ. భసితభస్త్రిక పులితోలుపచ్చడంబు, నాగబెత్తము దంతపుయోగవాగ, లమరఁ జెట్టున డిగినటు లవనినాథుఁ, జేర నరుదెంచె నొకమహాసిద్ధుఁ డపుడు. వేం. పంచ. ౪. ౧౦౧. కళా. ౨. ౪౮.

నాగభగిని. సం. వి. ఈ. స్త్రీ. వాసుకిభగిని, జరత్కారువు.

నాగభూషణుఁడు. సం. వి. అ. పుం - సర్పములు అలంకారముగా కలవాఁడు-శివుఁడు.

నాగమండలికుఁడు. సం. వి. అ. పుం. పాములవాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాగమల్లము. సం. వి. అ. పుం - ఏనుఁగులలో మల్లునివంటిది-ఐరావతము.

నాగమల్లె. వి. (క. నాగమల్లిగె.) ఒకజాతిమల్లె, అష్టపత్త్రిక†.

సీ. నాగమల్లె యనంగ నాగమల్లిక మీఱు ... ఆం. భా. ౨. ౫౨.

(బం.) ధాన్యవిశేషము.

సీ. మందిగండ్రలు నాగమల్లెలు తీఁగెమల్లెలు కృష్ణనీలాలు వెలువడాలు. గీ. ఆది యగు పేర్లు గలుగువ డ్లతనియింట, నుండు శతకోటిపుట్లు లొక్కొక్కదినుసు. హంస. ౪. ౧౨౮.

వ... సీతాభోగాలు గౌరీకుంకుమలు నాగమల్లెలు... ప్రబంధ. ౧౧౨.

నాగమసాని= నాగపసాని, నాగప్పసాని. వి. (నాగమ + సాని.) నాకబలిచిరంటి.

మ. నరలం గూర్చినకొప్పుతోఁ బసుపుమిన్నల్ డేలునెమ్మోముతోఁ, గరిమ౯ నాగమసాని ప్రోలు దిరుగంగా నంతులై తూర్యముల్, మొరయంగాఁ గడు నొప్పె నాకబలి ... వేం. పంచ. ౪. ౩౭౦.

నాగమాత. సం. వి. ఋ. స్త్రీ. ౧. సర్పమాత, కద్రువ. ౨ - ఏనుఁగులను తల్లివలె అలంకరించునది - మణిశిల.

నాగమారము. సం. వి. అ. పుం- ఏనుఁగులను చంపునది - భృంగరాజము, గుంటకలగర†.

నాగము. సం. విణ (అ. ఈ. అ.) ౧. కొండలకు సంబంధించినది. ౨. క్రూరమైనది. ౩. (సమాసమం దుత్తరపద మైనపుడు) శ్రేష్ఠుఁడు. (ఉదా: పున్నాగము,పున్నాగుఁడు మొ.) ౪.ఏనుఁగువలె స్థూల మైనది. (అ. ఆ. అ.) పామువలె పొడుగైనది. వి. అ. పుం. -అగము-పోవనిది-కానిది-౧. పాము, త్రాఁచు. ౨. పాతాళమున వసించుదివ్యసర్పజాతివిశేషము. (అష్టనాగములు:-అనంతుఁడు, వాసుకి,తక్షకుఁడు, శంఖపాలుఁడు, కుళికుఁడు, పద్ముఁడు, మహాపద్ముఁడు, కర్కోటకుఁడు.) ౩.గజము, ఏనుఁగు.౪. కొండ. ౫. మేఘము. ౬.నాగదంతము,చిలుకకొయ్య. ౭. తమలపాకుతీఁగ,తాంబూలి†. ౮. దేహమందలిఉపవాయువులలో వాగ్ద్వారమం దుండుఉపవాయువు. ౯. గ్రహము. ౧౦. నాగకేసరము†. ౧౧. పున్నాగము, పొన్న†. ౧౨. ముస్తె†. ౧౩. దేశభేదము. ౧౪. జలజంతువిశేషము. (వై. ని.) న. ౧. తగరము. ౨. సీసము. ౩. (జ్యోతి.)ఒకానొకకరణము. (దీనికి నాగవ మని వాడుక.) ౪. ఆశ్లేషానక్షత్రము.

నాగముస్తె. వి. భద్రముస్తకము†. (శ.ర.)

నాగయష్టి. సం. వి. ఇ. స్త్రీ. ౧. ఉలిమిరిలో నగుకట్టలతో చేసి తటాకాదులయందు అనంతవాసుక్యాదినాగులలో నొకనికి అధిష్ఠానముగా నాఁటిన స్తంభవిశేషము. ౨. క్రొత్తగా త్రవ్విన చెఱువు లోనగువానియందు నీటిలోఁతు తెలియుటకై నాఁటినకొలత స్తంభము. ౩. నేలలో లఁచుకట్టె.

నాగరంగము. సం. వి. అ. పుం. నారంగము, నారింజ†.

నాగరకుఁడు. సం. విణ. (అ. రికా. అ.) ౧. నగరమందు పుట్టినవాఁడు. ౨. ప్రవీణుఁడు, నేర్పరి. ౩.నగరదురభ్యాసములు అలవడ్డవాఁడు. ౪. దొంగ. ౫. శిల్పి.

నాగరక్తము. సం. వి. అ. న. సిందూరము.

నాగరఘనము. సం. వి. అ. పుం. నాగముస్తె†.

నాగరము. వి. (క. నాగరు.) స్త్రీశిరోభూషావిశేషము.

(వ్యవ.) మాపిల్లకు నాగరము చేయించితిని.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాగరము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నగరమున పుట్టినది. ౨. నగరమున ఉన్నది. ౩. నగరమునకు సంబంధించినది. వి. అ. పుం. ౧. (జ్యోతి.) పౌరము అను గ్రహయుద్ధవిశేషము. ౨. నారింజ. ౩. కపటము, మోసము. ౪. దేశభేదము. ౫. గోరంట. న. ౧. సొంటి. ౨. ఒకజాతిముస్తె. ౩. ఒకానొకలిపి. ౪. రతిబంధవిశేషము.

నాగరముస్త. సం. వి. ఆ. స్త్రీ. నాగముస్తె.

నాగరి. సం. వి. ఈ. స్త్రీ. ౧. లిపివిశేషము, దేవనాగరి. ౨. పట్టనవాసపుస్త్రీ. ౩. స్నుహి, జెముడు.

నాగరికము. సం. వి. అ. న. నగరమునుండి వచ్చుసుంకము.

నాగరికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నగరరక్షణమందు నియుక్తుఁడు. ౨. నగరము రక్షించువాఁడు.

నాగరుఁడు. సం. వి. అ. పుం. ౧. నగరవాసి, పౌరుఁడు. ౨. దేవరుఁడు, మగనిసోదరుఁడు. (వాచ.)

నాగరుకము. సం. వి. అ. పుం. నాగరంగము, నారింజ.

నాగరేణువు. సం. వి. ఉ. పుం. సిందూరము.

నాగరేయకము. సం. విణ. (అ. ఈ. అ.) నగరియందు పుట్టినది. ౨. నగరియందున్నది.

నాగరోత్థ. సం. వి. ఆ. స్త్రీ. నాగముస్తె.

నాగర్యము. సం. వి. అ. న. నాగరకత, వైదగ్ధ్యము. (వాచ.)

నాగలత. సం.వి.ఆ.స్త్రీ. ౧.మగగుటె.(త్రి.ని.) ౨. తమలపాకుతీఁగ, నాగవల్లి. (వాచ.)

నాగలోకము. సం. వి. అ. పుం. పాతాళము.

నాగవ(ప)డిగలు= నాగపడగలు. వి. బ. కర్ణభూషావిశేషము.

సీ. మొనపాటిముత్తె ముంచిననాగవడిగలు బిగువొప్పఁ దొడిగినబిళ్లచెప్పు.గీ.లొనర...రా. వి. ౨. ౪౪.

నాగవల్లరి. సం=నాగవల్లి.

నాగవల్లి(లి)= నాగవ్రేలిమి. వి. (సం. నాకబలిః. ప్రా. నాగవెల్లీ. క. నాగవలి.) పెండ్లిలో కడపటినాఁడుచేయుసంస్కారవిశేషము.(దీనిని కొందఱు పెండ్లినాలవనాఁడును కొందఱు అయిదవనాఁడును జరిగింతురు.)

గీ. అట్లు వైవాహికార్యకృత్యములు నెఱపి, నాలుగవనాఁడు సకలబాంధవులుఁ జెలఁగ, నరవరాగ్రణి లోచనానంద మొదవ, నాగవల్లి యొనర్పుటకై గుతింప. రాజ. చ. ౩. ౧౨౪.

క. తగఁ బ్రాకెనయును దీటిచి, నగవులపను లైన వెనుక నాలవనాఁ డొప్పుగ నాగవల్లి సేయఁగఁ, బగడపుటుప్పరిగెలోనఁ బడఁతుక లెల్లన్. యయా. ౪. ౧౧౪. రా. వి.౫.౭౦.

ఆ. అటుల దినచతుష్టయం బైన యంత నా, గవలియును నొనర్చె క్ష్మావరుండు. ఇందు. ౬. ౬౩.

క. విలసిలబహువైభవముల, నలరుచు నాగవలిఁ జేసి యఖిలార్థిజనంబులకు వరహాలు మాళ్వి,చ్చలవిడి పచ్చడము లిచ్చె జనవరుఁ డంతన్. కృష్ణ. ౪. ౧౨౩.

సీ. వడుగు పెండ్లిండ్లలోపలఁ దృతీయదినంబు ప్రాకెన్న యనఁగను బరఁగుచుండు, నారెంటికిని వేఱె యగుచు నంత్యదినంబు లవునుగం బవలి నాగవలి యనఁగ. ఆం. భా. ౨.౧౩౭.

నాగవలిలోపలనిష్ఠురము = పెండ్లి యంత్యయు నైనపిమ్మట నాగవల్లినాఁడు పెండ్లివా రొండొరులతో కఠినముగ మాటలాడుట. (పని నెఱవేఱిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తర్వాత ఒండొరులు కలహించుటవలన మన
స్సులు చెడుటయే కాని కలసివచ్చునది లేదు
అని భావము.)

ఉ. మాలిమి లేదు గాన ననుమానము నామదిఁ
దోఁచె నప్పుడే, బాలిక సేవసేయఁ బనుపక
వల దంటిని గాదె దాని కేమీ,మాలువు కల్గు మేన
మఱఁ దింతయె యాతఁడు నైన నైన దేలోలత
నింక నాగవలిలోపల నిష్ఠుర మేల పల్కెఁగటా.
విజ. వి. ౩. ౧౭౦.

ఇట్లే : నాగవల్లినిష్ఠురము.

(వ్యవ.) ఎంతజాగ్రత్తగా నున్నను మాయింట
పెండ్లిలో నాగవల్లినిష్ఠురము తప్పినదికాదు.

నాగవల్లి. సం. వి. ఈ. స్త్రీ. తాంబూలి, తమ
లపాకుతీఁగ.

నాగవారికము. సం. వి. అ. పుం. ౧ - ఏనుఁగు
లను వారించునది - రాజకుంజరము, పట్టపు టే
నుఁగు. ౨. ఏనుఁగుగుంపులో పెద్దయేనుఁగు.
౩-పాములను వారించునది-నెమిలి.

నాగవారికుఁడు. సం. వి. అ. పుం. ౧ - ఏనుఁ
గులను వారించువాఁడు- హస్తిపాలకుఁడు, మావ
టివాఁడు. ౨- పాములను వారించువాఁడు-గరు
డుఁడు. ౩.గణస్థుఁడు, ముఖ్యసభ్యుఁడు.(వై.ని.)

నాగవాసమ(పుట)లరుఁబోఁడి. వి. (నాగవా
సము² + అలరుఁబోఁడి.) వారాంగన, వేశ్య.

ఆ. కలితభోగవతులు ఘనభుజంగాన్విత,రతులు
కంచుకాభిరామ్యయుతలు, నగుట నాగవా
సమలరుఁబోఁడులు నాగ,వాసయుక్తులట్ల
వఱలి రచట. ఇందు. ౧. ౧౫౫.

(అయోధ్యాపురము.)వ...రత్నస్యందనద్వారం
బుల ననురాగంబొనరం గూర్చుండి లీలార్థం
బుగ నాగవాసపుటలరుఁ బోఁడు లనురాగం
బులు చిగిరించినతదీయ స్తంభములఁ గలచిగు
రుటాకు లన ... ఒప్పుచుండు. ఇందు. ౧.
౧౫౭.

నాగవాసము[1]. వి. ౧. ఘంటాప్రతీకము, గం
టలోనిచీల.

సీ. నాగవాస మన ఘంటాప్రతీకమునకు వేశ్య
లకును బేరు విశ్వనాథ.ఆం.సం.నానా. ౨౪.

౨. గొండ్లెము మొ. వానిని తగిలించుటకు ద్వా
రబంధము మొ. వానికి రెండుకొనలు వంచి
బిగించినయినుపకమ్మి.

చ. కులుకు మెఱుంగుఁ గెంపుతతిగోళ్ల సమర్చిన
నాగవాసపుం,గొలుకుల జాళువాగొలుసుగో
ళ్లఁ దగుల్కొని స్రేలుపచ్చతా,చిలుకల
తూఁగుమంచమున శ్రీరమణుండు వసించున
త్తటిక్. చంద్ర. ౧. ౯౧.

(వ్యవ.) ద్వారబంధమునకు నాగవాసము విఱిగి
పోయినది.

నాగవాసము[2]. వి. ౧. వేశ్యాసమూహము.

సీ. ననుపుకాఁ డై వేల్పునాగవాసముఁ గూడి
మహిమ గోల్పడియె నే మాండకర్ణి.మనుచ.
౨. ౭౩. ఆం. సం. నానా. ౨౪.

౨. భోగముమేళము.

క. ... పురము కై సేసి ప్రజల్,తో నరుగ నా
గవాసము,తో నెదురుగ నేఁగి రంత తూ
ర్యము లులియక. ఆము. ౪. ౩౪.

ఆ. నాగవాస మనఁగ నామ మా వేశ్యాజ,నంబు
మేళమునకు నంబికేశ. ఆం. సం. మాన. ౯.
ఆం. భా.౧.౧౩౦. హంస. ౧. ౬౩.

జ: నాగవాసమలరుఁబోఁడి.

నాగవాసము. సం. వి. అ. పుం. నాగలోకము.

నాగవీథి. సం. వి. ఈ. స్త్రీ. ఆకాశమండలమం
దు ఉత్తరదిక్కున అశ్విని భరణి కృత్తిక యను
మూఁడునక్షత్రములు కలఆకాశవీథీభాగము.
(చూ, ఐరావతము.)

నాగప్రేలిమి= నాగవల్లి.

క. నాలుగుదినాలు విప్రజ,నాలు విధానాలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భోజనాలును మేలిక్,వ్రేలిమి గలుగఁగ ము
దముల,వ్రేలి మిగుల నవల నాగవ్రేలి మె
సర్పక్. ముకుంద. 3. ౭౯౬.

నాగశుండి. సం. వి. ఈ. స్త్రీ. కోలదోసకీ.

నాగసంభవము. సం. వి. అ. న - సీసమువలన కలిగినది- సిందూరము.

ఇష్లే: నాగసంభూతము.

నాగసరము. వి. (సం. నాగస్వరః. ప్రా. నాగసరో.) ౧. పాములవాఁ డూఁదెడిబుఱ్ఱ.

గీ. నాగసింధు ప్రభేద నానావరాట, రాగగంధర్వ
లహరికారంభణముల, మిహిపదంబుగఁ బా
ములమెంగఁ డూఁదె, భోగిరాజులు నర్తింప
శాగసరము. క్రీడా. ౨౨౪.

౨. పాములకుఆనందము కలిగించుస్వరవిశేషము.

గీ... ఆలకించి చనియె, నాగసరములమ్రోఁత య
న్నాగరికుఁడు. క్రీడా. ౭౧౧.

సీ... నాగస్వరం బగు నాగసర మన... ఆం.
భా. ౧. ౧౭౯.

3. సన్నాయి.

క. సంగీతపుమేళపుజత, సంగతితాళములు నా
గసరములు ఢక్కిల్, చెంగులు ముఖవీణి
యలు న,పాంగము తప్పెటలు గజ్జె లందుక
చేరక్. ప్రబంధ. ౯3.

క. అంతట నాగసరంబుల, నింతులు తానములు
మిగుల హెచ్చించుచు సా,మంతముపరవక్
బువులు వ,సంతము లోనుగనుఁ గొనుచుఁ
జనుదే మఱియుక్. యయా. ౪. ౧౫౨.

నాగసాహ్వయము. సం. వి. అ. న - ఏనుఁగు తో సమాన మగుపేరు కలది- కౌరవవాసస్థాన మగుహస్తిపురము. (వాచ.)

నాగసుగంధ. సం.వి.ఆ.స్త్రీ.నాకులి,సర్పాక్షీకీ.

నాగస్తోకము. సం. వి. అ. న - సర్పవిషలేశము కలది - వత్సనాభము, వసనాభికీ.

నాగస్ఫోత. సం.వి.ఆ.స్త్రీ. నేపాళము, దంతికీ.

నాగస్వరము. సం. వి. అ. పుం. ౧. పాములకు ఆనందమును కలుగఁజేయుగానవిశేషము. ౨. పాములవాఁ డూఁదెడిబుఱ్ఱ.

క. నాగస్వరసుషిరసర, న్నాగవరాశ్యాదివివిధ
నానారాగ,ప్రాగల్భ్య ప్రకటఫణా,భోగము
లై యాడఁజొచ్చె భోగీంద్రంబుల్. క్రీడా.
౨౨౦.

నాగహంత్రి. సం. వి. ఈ. స్త్రీ - సర్పవిష మును పోఁగొట్టునది - వంధ్యాకర్కోటి, గొడ్డు ఆఁగాఁకరకీ.

నాగహనువు. సం. వి. ఉ. పుం. నఖ మనుగంధద్రవ్యముకీ.

నాగాంచల. సం. వి. ఆ. స్త్రీ=నాగయష్టి.

నాగాంజన. సం. వి. ఆ. స్త్రీ. ౧=నాగయష్టి. ౨. హస్తిని, ఆఁడేనుఁగు.

నాగాంతకము. సం. వి. అ. పుం. - పాములను చంపునది - ౧. గరుడపక్షి. ౨. నెమిలి. 3 - ఏనుఁగులను చంపునది - సింహము.

నాగాఖ్యము. సం. వి. అ. పుం. నాగకేసరముకీ. (త్రి.ని.)

నాగారి. సం. వి. ఇ. పుం -పాములకు శత్రువు- ౧. గరుడపక్షి. ౨. నెమిలి. 3 - ఏనుఁగులకు శత్రువు_సింహము. (ఇష్లే : నాగారాతి మొ.)

నాగాశనము. సం. వి. అ. పుం - పాములను తినునది _ ౧. గరుడపక్షి. ౨. నెమిలి.

నాగి. సం.విణ.(న్.నీ.న్.)పాములు కలది.(పుట్ట. మొ.) వి. ఈ. స్త్రీ. ౧. ఆఁడుపాము. ౨. ఆఁడేనుఁగు. 3. పాతాళలోకము. (వై. ని.) న్. పుం. పాములుఆభరణముగాకలవాఁడు,శివుఁడు.

నాగిని. వి. (సం. నాకినీ.) లోకాంతరగత యై

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేవత యైనముత్తైదువ. (శ. ర.)

నాగిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. గొల్లజిడ్డు.

గీ... నాగినియగు, గొల్లజిడ్డన... ఆం. భా. ౨. ౬౬.

౨. నాఁగురు, నావురు.

గీ... నాగిని నావురు నాఁగు రనఁగ. ఆం. భా. ౨. ౬౨. (ఈపదము సం. ని. లలో కన్పడలేదు.)

నాగు(వు). వి. (సం. నాగ.) పాము.

గీ. నాగముల పేరు వెలయును నాగు లనఁగ. ఆం. భా. ౧. ౧౪౬.

ఆ. నంది యెక్కి గిత్త నాగులు సొమ్ములు, చేఁదు మెడను బునుకచేరు బూది, నుదుట సరలు గొన్నరుదురాక లెదఁ గల్గు, నయ్యయొరపు దెలుప నలవి యగునె. చెన్న. ౩. ౩౯.

చ. తలఁ బ్రతిబింబభానుమణిఁ దాల్చి విహార వనాంతరంబునన్, మలఁగి మలంగి పెంజి లుము నాగువుభంగి... నైష. ౭. ౧౫౪.

గీ. కుబుస మూడ్చెడి మేటినాగువునుబోలె. భీమ. ౫. ౭౦.

జః నాగుఁబాము, నాగుపడిగెప్రోగులు, నాగుల చవుతి, నాగులపడగలు.

నాగుఁబాము. వి. (నాగు + పాము.) నాగము, త్రాఁచు.

గీ. కినుక నిగుడంగ నొడుపు దప్పినపిసాళి, నాగుఁబామును బోలుచు నవుడుగఱచి. అచ్చ. రా. సుం. ౫౫.

సీ... నాగుఁబా మనఁ ద్రాఁచన ఫణి దవర్చు. ఆం. భా. ౧. ౧౪౭.

నాగుపడిగెప్రోగులు = నాగపడగలు. వి. బ. (√నాగు.) పాముపడగపోలికి కలకర్ణాభరణ విశేషము.

గీ ... చెవులనాగు, పడిగెప్రోగులు మెలిగొన్న పచ్చడములు, నమర గుమిగూడి బాలరు లరుగుదెంచి, రలరుమొగములతోఁ ద్రాటి వలలుగొనుచు. వేం. పంచ. ౧. ౬౧౪.

నాగులచవుతి. వి. (√నాగు.) నాగచతుర్థి. (వ్యవ.) నాగులచవుతినాఁడు పుట్టలో పాలు పోయుదురు.

నాగులపడగలు = నాగపడగలు.

చ... వెన్నునం, దొలకెసునెత్తిజుట్టు తెలిదుప్పటి వీనుల మానికంపునా, గులపడగల్ రహిం దగ నొకొం డగునొంటరిబోయఁ డుద్ధతిన్. కువల. ౪. ౨౦౨.

నాగేంద్రము. సం. వి. అ. పుం. ౧. సర్పరాజము. ౨. శేషాహి. ౩. గజశ్రేష్ఠము. ౪. ఐరావతము.

నాగోదము. సం. వి. అ. న. ఉదరత్రాణము.

నాగోదరము. సం. వి. అ. న. ౧. ఉదరత్రాణము. ౨. గర్భిణి యొక్క గర్భోపద్రవభేదము,

నాగోదరి. సం. వి. ఈ. స్త్రీ. ఉదరత్రాణము. పొట్టకు తొడుగుకొనుకవచము.

నాచి. వి. (త. నాచ్చి.) స్త్రీ.

(ఏకవీర.) గీ. కలికి పల్లిక దేబెలఁ గన్నతల్లి, వాసి కెక్కినయట్టిపోలాసయిల్లు, చక్కమెప్పులమాహురమ్మక్క నాచి. క్రీడా. ౧౭౯.

నాట. సం. వి. అ. పుం. రాగవిశేషము.

శా. వాలారుంగొనగోళ్ల నీ వలసతన్ వాయించుచో నాటనున్, మేళం బైనవిపంచి నిన్న మొదలున్ నీ వంటమిం జేసి యా, యాలాపం బె యవేళఁ బల్కెడుఁ బ్రభాతాయాత వాతాహతా, లోలతంత్రుల మేళవింపఁగ దవే లోలాక్షి దేశాక్షికిన్. మనుచ. ౩. ౫౭.

సీ... శంక, రాభరణము మేఘరంజి తోడి వరాళి నాదనామక్రియ నాట... హంస. ౫. ౧౨౪.

ఉ... తుంబురుండు తా, గౌళ వరాళి నాటలను గాయనరూఢికి నాటి చూపినన్. శ్రీరం. మా. ౪. ౧౫౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాటకము. సం. వి. అ. న. ౧. శృంగారవీరరసములలో నొకరసము ప్రధానముగా నుండి ప్రఖ్యాతచరిత్రమును తెలుపుచు అయిదు మొదలు పదివఱకు అంకము లుండుదృశ్యప్రబంధము.

౨. నర్తనము.

దండకము... గోవర్ధనక్షోణిభృత్కందరక్షోణిఁ గ్రీడించువిన్నాణి పెన్నాటకం బైనక్రాల్గన్నులన్ గల్గుపెన్దళ్కులన్ నల్గడన్ జిల్కునెమ్మోముజాబిల్లి శోభిల్ల...పాండు.౪.౭౪.

౩. చరిత్రము.

గీ. పుండరీకాక్షునకు శూలి పూజ లిచ్చె,సంయములు చూడ బదరికాశ్రమమునందు,నాఁగ విందు మయ్యిరువురనాటకంబుఁ, జెప్పి చెవులకుఁ బండువు సేయు మనఘు. ఉ. హరి. ౨. ౭౦.

౪. కపటోపాయము.

ఉ. నా మొగమోటకై వలనినాటకముల్ ఘటియించి రుక్మిణీ,కామినిమీఁదటం గలుగు గౌరవముం గృపయుం బ్రియంబుఁ దా, నేమియుఁ గాననీక యిట నిన్నిదినంబులు నన్నుఁ దేల్చె...పారి. ౧. ౭౯.

(వ్యవ.) నీనాటకములు నాదగ్గఱ సాఁగవు.

నాటకీయము. సం. విణ. (అ. ఆ. అ.) నాటకసంబంధ మైనది.

నాటకుఁడు. సం. విణ. (అ.టికా.అ.) నటుఁడు, ఆటకాఁడు.

నాటనము. సం. వి. అ. న. ౧. నటింపఁజేయుట.

౨. నటనము.

సీ. శ్రీకరోదయవధూలోకానన ప్రభా నాటితబహుచంద్ర నాటనంబు. గీ. దీపితం బగుఁ శ్రీశాశికాపురంబు. పాండు. ౧. ౧౦౩.

నాటము. సం. వి. అ. పుం. ౧. నృత్యము. ౨. కర్ణాటదేశము. (వాచ.)

నాటామ్రము. సం. వి. అ. పుం. - నటులకు ప్రియమైనరసము కలది - కరబూజాళీ.

నాటారుఁడు. సం. వి. అ. పుం. నటియొక్క కొడుకు. (కల్ప.)

నాటి. సం. విణ. (న్. నీ. న్.) నటించువాఁడు, నర్తనము చేయువాఁడు.

నాటిక. సం. వి. ఆ. స్త్రీ. ఉపరూపకసు లనెడి దృశ్యకావ్యములలో నొకటి. (ఇది నాలు గంకములు కలిగి స్త్రీపాత్రబహుళముగా నుండును. ఇందలికథ కల్పిత మై యుండవలెను. నాయకుఁడు ధీరలలితుఁ డగురాజు. నాయిక అంతఃపురసంబంధగాని సంగీతవ్యాపృతగాని అయి నవానురాగ యగురాజకన్యక. ప్రౌఢయు నృపవంశమందు పుట్టినదియు నగుపెద్దభార్య యుండవలెను. ఇందు వృత్తి కైశికి.)

నాటితము. సం. విణ. (అ. ఆ. అ.) కృతాభినయము, అభినయింపఁబడినది; అనుకరింపఁబడినది.

నాటేయుఁడు. సం=నాటారుఁడు.

నాట్య(ము.) వి. మల్లవిద్యాసంబంధ మగుపదునాల్గువిసరులలో నొకటి.

వ...దఢ ధారు ధాణు అంత్రటీక టీక ఉద్దడ నాట్య దారుధాణు దారుకపాలు... మల్లుపు. ౩. ౬౯.

వ...అంత్రటీక టీక నాట్యము... మొదలగు పదునాలుగువిసరులు... ప్రబంధ. ౩౭.

నాట్యధర్మిక. సం. వి. ఆ. స్త్రీ. నాట్యవిధులు తెలుపువిద్య.

నాట్యపుష్పకము. సం. వి. అ. న. మూఁడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పాల్లు కుంకుమపువ్వు కలసినగంధపొడి, ఒకది నుసుబుక్కా.

**నాట్యభాష.** సం. వి. ఆ. స్త్రీ. నాట్యమందా యాపాత్రములకు తగునట్లు ప్రయోగించుభాష.

**నాట్యము.** సం. వి. అ. న. -నటునికృత్యము - ౧=నృత్తము. ౨. నృత్తగీతవాద్యాత్మక మగులాస్యము, తౌర్యత్రికము. ౩. నాటకాదిదశరూపకాభినయము.

**నాట్యరాసకము.** సం. వి. అ. న. రూపకభేదము, దృశ్యకావ్యవిశేషము.(దీనికి అంక మొక్కటియే. నాయకుఁడు ధీరోదాత్తుఁడు. పీఠమర్దుఁడుపనాయకుఁడు. హాస్యరసము అంగి. శృంగారము అంగము. నాయిక వాసకసజ్జిక. వాచ.)

**నాట్యాంగము.** సం. వి. అ. న. నాట్యముయొక్క అంగము. (ఇది "గేయపదము, స్థితపాద్యము, ఆసీనము, పుష్పగండిక, ప్రచ్ఛేదనము, త్రిగూఢము, సైంధవము, ద్విగూఢకము, ఉత్తమోత్తమకము, ఉక్తప్రత్యుక్తము" అని పదివిధములు.)

**నాట్యాలంకారము.** సం. వి. అ. పుం. ౧. నాట్యమునకు అలంకారము, ఆశీస్సు ఆక్రందము కపటము క్షమ గర్వము ఉద్యమము పశ్చాత్తాపము మొద లగుముప్పదియాఱింటిలో నొకటి.

**నాట్యోక్తి.** సం. వి. ఇ. స్త్రీ. నాట్యమందలి పరిభాష, నాటకపరిభాష.

**నాడము.** సం=నాళము.

**నాడా.** వి. (హిం. నాడా.)నూలు మొదలగువానితో నేసినపట్టె.

వ...అల్లనఁ గనుపట్టుపెనుపట్టునాడాలబిగిని దగిననిగనిగనిజిగి... మల్లుపు. ౪. ౬౭.

**నాడి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. నాళము, కాఁడ. ౨. బోలుగా నుండుకాఁడ; (తామరలోనగువాని) కాఁడ. ౩. (ఆకులోనగువాని) ఈనె. ౪. శరీరమందలిబోలునరము, రక్తనాళము. ౫. క్రోవి, గొట్టము. ౬. నారికుళుపు. ౭. గడియకాలము. ౮. గండదూర్వ, ఒకజాతిగఱిక⚘. ౯. కుహకచర్య, మోసకానినడక, మాయ. ౧౦. వాతపిత్తశ్లేష్మనాడులలో నొకటి.౧౧.(జ్యోతి.) వధూవరులపొంతనములు చూచుటకై నక్షత్రవిశేషములతో నాడ్యాకారముగా గీసినరేఖ. ౧౨. (యోగ.) ఇడ, పింగళ, సుషుమ్న అను మూఁడునాడులలో నొకటి.

**నాడింధమము.** సం. విశే. (అ. ఆ. అ.) నాడులను చలింపఁజేయునది; శ్వాసమును అధికముగా కలిగించునది. (భయాది.)

**నాడింధముఁడు.** సం. వి. అ. పుం- గొట్టము ఊఁదువాఁడు - స్వర్ణకారుఁడు, కంసాలి.

**నాడింధయుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) గొట్టముతో పాలు లోనగునవి త్రాగువాఁడు.

**నాడికేలము.** సం=నారికేళము. (వాచ.)

**నాడిచీరము.** సం. వి. అ. పుం. ౧. నలి యను గంధద్రవ్యము, గువ్వగుత్తిక⚘. ౨. సూత్రవేష్టనసలిక, నూలు చుట్టెడుచిన్నక్రోవి, సాలెవానియొకానొకపనిముట్టు.

**నాడిపత్త్రము.** సం. వి. అ. న. నాడీచము అనుశాకము⚘.

**నాడీకము.** సం. వి. అ. పుం. కాఁడలు ప్రధానముగా కలయొకదినుసుశాకము⚘.

**నాడీకలాపకము.** సం. వి. అ. పుం. సర్పాక్షి⚘.

**నాడీకూటము.** సం.వి.అ. న. (జ్యోతి.) వివాహమున వధూవరులపొంతనములు చూచుటకై నాడీరూపముగా గీసినరేఖలయందు జ్యోతిశ్శాస్త్రప్రకారముఏర్పఱచిననక్షత్రసముదాయము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాడీచక్రము. సం. వి. అ. న. ౧. నాభిస్థానమందు నాడు లుండుచక్రవిశేషము. (దీనినుండి నాడులు వెలువడును.) ౨. (జ్యోతి.) నాడీకూటము లిఖించుటకై గీసినరేఖలు.

నాడీచము. సం. వి. అ. పుం. శాకవృక్షవిశేషము, ఒకదినుసుకూరాకు ?.

నాడీచరణము. సం. వి. అ. పుం. - కాఁడవంటి కాళ్లు కలది - పక్షి. (త్రి. ని.)

నాడీజంఘము. సం. వి. అ. పుం. - కాఁడవంటి పిక్కలు కలది - కాకి. (వై. ని.)

నాడీజంఘుఁడు. సం. వి. అ. పుం. రాజధర్ముఁడనుసామాంతరము కలయొకబకము. (చూ. భార. శాం. 3. ४౭ర.)

నాడీతరంగము. సం. వి. అ. పుం. కాకోలము. (మే. ని.)

నాడీతరంగుఁడు. సం. వి. అ. పుం. రతహిండకుఁడు, వ్యభిచరించువాఁడు. (కల్ప.)

నాడీతిక్తము. సం. వి. అ. పుం. నేపాళనింబము, నేపాళదేశపువేము ?.

నాడీదేహుఁడు. సం. వి. అ. పుం - రక్తమాంసములు లేక నాడులు మాత్రము కలదేహము కలవాఁడు, శుష్కించినవాఁడు - భృంగి. (శివుని ద్వారపాలకులలో నొకఁడు.)

నాడీనక్షత్రము. సం. వి. అ. న. ౧. జన్మనక్షత్రము. ౨. జన్మనక్షత్రమునకు పది, పదియాఱు, పదునెనిమిది, యిరువదిమూఁడు, యిరువదియేడు అగునక్షత్రములలో నొకటి. 3. (జ్యోతి.) నాడీరేఖలయందలి నక్షత్రము. (చూ. నాడీకూటము.)

నాడీపరీక్ష. సం. వి. ఆ. స్త్రీ. హస్తాదులందలి వాతాదినాడులను పరీక్షించుట.

నాడీయంత్రము. సం. వి. అ. న. (వైద్య.) శల్యమునుతీయుట కైనయంత్రవిశేషము. (ఇది ఇరువదివిధములు కలది.)

నాడీవలయము. సం. వి. అ. న. నాడులను -గడియలను- తెలుపువలయాకారము కలయంత్రవిశేషము, గడియారము. (వాచ.)

నాడీవిగ్రహుఁడు. సం=నాడీదేహుఁడు.

నాడీవ్రణము. సం. వి. అ. పుం. నారికురుపు, సెల వేయుకురుపు.

నాడీహింగువు. సం. వి. ఉ. పుం. ఒకవిధమైన ఇంగువు.

నాడు=నాఁటు. అ. క్రి. నాఁటు, గ్రుచ్చుకొను; ఖండితమగు.

గీ. కాఁడె గ్రుస్సెను దొలిచెను నాడె నవఁగ, నాఁటె ననుమాట కర్థమా నాగభూష. ఆం. భా. 3. ౧౨౨.

చ. జనపతివేఁడితూపుల భుజంబులు వ్రచ్చి యురంబు లుచ్చి యా, ననములు వాఁడి చాపములు నాడి శతాంగము లాడి యుగ్రకే, తనములు నూడినక్...కరు. ౨. ౧౦౦.

స. క్రి. బాధించు, పీడించు.

చ. అనలునిఁ గాఁడుచుం జముని నాడుచు రాక్షసు నాడుచుం గప్పర్దినొసలు చూఁడుచుం ధనదుప్రేవులు దోఁడుచు...కరు. ౪. ౧౨౩.

మ. తననీటుల్ మెఱయించు జేనపాడవుందాలింటియందంపుఁగుం, దనపుందల్కులు గ్రుచ్చరించుచిఱుసానాకత్తి చిమ్మక్...మీసంబులు దిద్ది నాడికొను జగ్గుల్ మీఱ నావీథులక్. కువల. ౪. ४. (ఇట మెలిపెట్టు అని భావము.)

నాడె. వి. నడుమ నూలుకండె నుంచి నేసెడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సాలెవానిసాధనము, తురి.
సీ. పరిపరి యచ్చులు చరిపుండ యూడిత చీడు దబ్బలు దండె నాడె క్రోవి. హంస. ౨. ౧౧.

**నాడెకత్తె**=నాణెకత్తె. విణ. (నాడెము+కత్తె.) నాడెము కలది. (శ.ర.)

**నాడెకాఁడు**=నాణెకాఁడు. విణ. (నాడెము+కాఁడు.) నాడెము కలవాఁడు. (శ. ర.)
వి. కోమటి, వైశ్యుఁడు.
గీ. మూఁడవకొలంబతఁడు నాడెకాఁడు...కోమటి నాఁదనర్చు. సాం. ని. మాన. ౨.

**నాడెము**=నాణెము.(ఇది సబిందుకము అని శ.ర.)
విణ. (మేలైనది, శ్రేష్ఠము.)
చ. నిగనిగలాడు కుందనపు నిద్దపుగోడల నాడెమైనము, త్తిగరతనంపు జిల్గుపనితిన్నియలం౯ ...కడు నైఱియుఁ జెన్ను దలిర్పఁగఁ బ్రోల నెల్లెడ౯. నీలా. ౧. ౩౦.
గీ. అఖిలవాంఛాప్రదంబు నైనట్టిపుణ్యతీర్థ మెయ్యది నాడెంపుదేశ మెద్ది. రసిక. ౬.౧౪౧.
సీ. జడదారిరాయ యుజ్జగమున నాడెంపుగొనమును వాఁడియుఁ గనికరమును. గీ. కలుగు మానిసి యెవ్వఁడు ... అచ్చ. రా. బాల. ౫౭. ప్రబంధ. ౩౩.
జః నాడెకత్తె, నాడెకాఁడు.

**నాణకము.** సం. వి. అ. న. రూపాయ లోనగు నాణెము.

**నాణెకత్తె**=నాడెకత్తె. విణ. (నాణెము+కత్తె.) నాణెముకలది. (శ. ర.)

**నాణెకా(గా)ఁడు**=నాడెకాఁడు. విణ.(నాణెము+కాఁడు.) నాణెము కలవాఁడు.
సీ. చేరెఁడుబియ్యాలయోరెముల్ దినువానిఁ గోణంగి సేవలనాణెగాని. ఘటికా. ౨. ౧౪౬.

**నాణెము**=నాడెము,నాణ్యము. వి.(సం. నాణకం. క. నాణ్య. త. నాణయం. మ. నాణియమ్.)
౧. కుదదీనారము. (ముద్రింపఁబడినరాగి వెండి బంగారములబిల్ల అని శ.ర.)
గీ. నాణె మనఁగను కుదదీనార మొప్పు. ఆం. భా. ౨. ౨౪౩.
ఉ...నా,నానగరోద్భవంబు లగునాణెము లుండెడుసంచిఁ గొంచు బేరానకు వచ్చునన్న యధురంధరుఁ డంగడికిం గణింపఁగ౯. శుక. ౧. ౪౨౧. కృష్ణ. ౩. ౬.
౨. శ్రేష్ఠత్వము; మంజులత, మనోహరత్వము.
చ. అడలుచుఁ దాళరానివిరహార్తిమెయిం దురపిల్లు దాని ... అంచరా,నడుపులు దానిమోవిరుచినాణెము దానిమెఱుంగు దానిను, నైపుడఁగును...చూడమి౯. శుక. ౧. ౧౧౧.
౩. (వస్తువుల) మంచిచెడ్డలు.
క...నాణె మెఱుఁగ బచ్చు గాఁగ నరపతికిఁ దగుఁ౯. ఆము. ౪. ౨౬౯.
౪. ద్రవ్యము, ధనము.
చ. నడవడి గల్గువాఁడు కడునాణెము చేఁ గలవాఁడు...చెడుగులబ్రహ్మదీనిని నిసీ మగనాలుఁగఁ జేసె నంచు లో,మిడుకుచు దానియింటికడ మీసలు దీడుచు నుందు రెప్పుడు౯. హంస. ౫. ౨౧౬.
౫.ఇచ్చిపుచ్చుకొనుటయందలియోగ్యత.(శ.ర.)
౬. నాగరకత. (శ. ర.)
విణ. ౧. మంజులము, మనోహరము.
సీ ... నాణెము చొక. గీ. గొనబు తియ్యంబు జాను తిన్ననిది బాగు, చొక్కటంబన వెలయు మంజులసమాఖ్య. ఆం. భా. ౩. ౧౪.
౨. శ్రేష్ఠము.
గీ. కంచిలో నేడువాడలఁ గలిగినట్టి, నాణెపుం గోమటులతోడ నంబిసెట్టి, భాసురస్ఫూర్తి నేఁగెఁ గైలాసమునకు. హర. ౨. ౧౪౧.
ఆ. నాణె మైనచెడిపె నయ మెఱింగి తిరుఁగు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వేమన. 3. ౨౫౦.

జః నాణెకత్తె, నాణెకాఁడు.

నాణ్య(ణియ)ము=నాణెము. (చి.ని. బ్రా.వా.)

నాతము. వి. బత్తెము.

ఉ...కొల్చినపేదసాదలకౌ, దప్పనిజీతనాతము లఁ దన్పుట భూషణ మయ్యెఁ బుత్రకా. శా. వి. ౨. ౩౪.

నాతి=నాతుక. వి. (క. నాతి. త. నాటి.) స్త్రీ, ఆఁడుది.

క. ఇమ్ముగఁ దద్గూమాఘ్రాణమ్మున గర్భములు దాల్చి నాతులు నవమా,సమ్ములు నిండుడుఁ గనిరి మ్మదమ్మున జంతుప్రముఖసుతప్రకర మ్ముల్. భార. అర. ౩. ౨౧౬.

క. జ్ఞాతుఁ బోరితమును గో,వ్రాతము నాక్రమము విప్రవర్గముచనవుకౌ, నాతులకారించుటయును, బ్రీతిం జననిచ్చునతనిపెం పొప్పు నృపా. భార. ఉద్యో. ౨. ౭౬.

శ్లో. బ్రాహ్మణేషు చ యే శూరా స్త్రీషు జ్ఞాతిషు గోషు చ, వృంతాదివ ఫలం పక్వం ధృతరాష్ట్ర పతంతి తే. సం.భార.ఉద్యో. ౩౬. ౬౧.

క. అతనువుల లేరు గదా, నాతులు మటికాక కలిగినకౌ వగఁ దిర్య,గ్జాతికి నీజాతికిఁ గల, యీతీవ్రత గలదె యెఱుఁగ కిట్లే లంటికౌ. ఆము. ౫. ౭౨.

జః నాతుక.

నాతికఠినము. సం. విణ. (అ. ఆ. అ.) అనతి కఠినము, మిక్కిలి గట్టిది కానిది.

నాతిచిరము. సం. విణ. (అ.ఆ. అ.) ౧. అనతి చిరము, అతిచిరము కానిది. ౨. దీర్ఘకాలపుది కానిది, స్వల్పకాలపుది.

నాతిదూరము. సం.విణ. (అ. ఆ. అ.) మిక్కిలిదూరము కానిది, ఇంచుకదూర మైనది. వి. అ. న. అనతిదూరము, కొంచెముదూరము.

నాతివాదము. సం. విణ. (అ. ఆ. అ.) పరుష భాషణము లేనిది. వి. అ. పుం. పరుషభాషణ ములేమి.

నాతుక=నాతి. వి. (నాతి+ఉక. స్వార్థమున.)

ఉ. జాతర పేరు చెప్పి రథసంబునఁ దల్లియుఁ దానుగూడి యా,నాతుక త్రోవ చూపఁగ వసంబునకుం జని...అవశీకృతమానసయై వడంకుచుకౌ. భోజరా. ౫. ౨౨౭, ౨. ౯౩.

క. వినలే నిట్టివి మానుడ్య, నను మన్ననఁజేసి యనుచు నాతుక మ్రొక్కెకౌ.కళా.౧.౬౧.

సీ. నవలా మగువ నాతి నాతుక యాఁడుది లేమ గోల యువిద చామ చాన.ఆం.భా. ౨. ౧౦౪.

నాథము. సం. వి. అ. పుం.(ఎద్దుమొదలగువాని) ముకుఁద్రాడు.

నాథవంతుఁడు. సం. విణ. (త్. వతీ. త్.) ౧. నాథుఁడు కలవాడు. ౨. పరాధీనుఁడు.

నాథహారి. సం. వి. ఇ. పుం. ముకుఁద్రాడు పోసిన పశువు; పశువు.

నాథాతము. సం.వి.అ.పుం. ఆహారము. (కే.ని.)

నాథాతుఁడు సం.వి.అ.పుం. ప్రజాపతి,బ్రహ్మ. (కే. ని.)

నాథుఁడు. సం. వి. అ. పుం. ౧. స్వామి, యజమానుఁడు. ౨. పెనిమిటి, భర్త. ౩. ఏలిక, ప్రభువు. ౪. ఇంద్రుఁడు. (కే. ని.)

నాదనామక్రియ. సం. వి. ఆ. స్త్రీ. (సంగీ.) ఒకానొక రాగము.

సీ...శంక,రాభరణము మేఘరంజి తోడి వరాళి నాదనామక్రియ నాట..హంస. ౫. ౧౨౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**నాదము.** సం. వి. అ. పుం. ౧. ధ్వని, మ్రోత. ౨. (యోగ.) అనుస్వారమువలె నుచ్చరింపఁదగు '◡' వర్ణభేదము. ౩. ప్రాణవాయువు నాడులయందు సంచరించుటవలన కలిగినధ్వని, ప్రణవనాదము.

క. ప్రతనుప్రాణమనోగ్ర, స్థితబుద్ధియె బిందు వందుఁ జెలఁగడియాత్మ, ప్రతిబింబమె కళ పవనోన్నతఘోషమె సుమ్ము ప్రణవనాదము వత్సా.

క. ఆనాదబిందుకళలన్, గానంబను చుండువాని... సీతారా. ౧. ౧౬౪, ౧౬౫.

౪. (వ్యాక.) వర్ణోచ్చారణమందలిబాహ్యప్రయత్న భేదము.

**నాదారు.** విణ. (హిం. నాదార్.) బీద, దరిద్రుఁడు; చిక్కినవాఁడు, కృశించినవాఁడు.

(వ్యవ.) ఇప్పుడు నాదారురయితులు మిక్కిలి చిక్కుపడుచున్నారు.

,, ఆపిల్లవాఁడు చాల నాదారుగా నున్నాఁడు.

**నాదాలాబువు.** సం. వి. ఊ. స్త్రీ.- గోరక్షతుంబి, ఘంటానుగు‡.

**నాదించు.** సం. అ. క్రి. నాదముచేయు, మ్రోఁగు.

గీ. ఘంట నాదించినవితాన గండుఁదేఁటి, మొఱయుచందాన జలధర ముఱుమురీతి, యురుమగీచినభాతి నై యుత్పలాప్తు, నారి రణమున మ్రోసె నా దాఱి కపుడు. శశాం. ౫. ౫౩.

**నాదు.** వి. (సం. నాదః.) ౧. ధ్వని, చప్పుడు.

మ... చట్టి చుం, యనునా దాఱనినూరగుంపు ... చిఱుపాలవెల్లువుగ నాహారఁ బిడఁజ సీతునన్. ఆము. ౧. ౧౨.

గీ. నాదుమొలనూలిగంటలనాదు వినక, చంట నీయుర మానక చంట దగునె. సారంగ. ౨. ౯౨.

ఉ... నూతుఁడుం బదనుచేసినరథ్యము లామొగంబుగాఁ, జేసి బళీ యనం దరటుచేసిననాదును బర్వ... కకు. ౫. ౧౩౦.

౨. (గానరూపమగు) ధ్వని.

ఆ. శ్రోత్రభావ మొంది సొలయక శబ్దంబు, నాలకించి యంతకంత కుబ్బి, వేఁటకానినాదు విన నాసచేసి లోఁబడినమృగమువోలెఁ జెడకు మనస. వా. రా. ౪. ౧౪౪.

జ: నాదుకొను, నాదుకొల్పు.

**నాదుకొను.** అ. క్రి. (√నాదు.) ధ్వనిచేయు. (చూ. నాదుకొల్పు.)

**నాదుకొల్పు.** స. క్రి. (√నాదుకొను.) ౧. (పిరంగులు మొదలగువానిని.) ప్రేలించు, ధ్వనింపఁజేయు.

మ. జినిసీ దీర్చి ఫిరంగుదారులు సముత్క్షిప్తాంశుకస్తోములై, యనలజ్వాలలు కోలల న్గమిచి హాహారావ ముప్పొంగఁ ద.ద్ఘ నవప్రోరుకవాట పాటనకళాగాఢోద్యము ల్లక్ష్యదృష్టిని యొక్కుమ్మడి నాదుకొల్పిరి దిశాశ్రేణుల్ కడుం బెగ్గిలన్. రంగా. ౩. ౫౩.

**నాదేయము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. నదీసంబంధమైనది. ౨. నదీభవము. (నదియందు పుట్టినది - నదియం దున్నది.) ౩. గ్రహింపఁదగనిది. ౪. అదేయము కానిది, ఇయ్యఁదగినది. వి. అ. పుం. ౧. కాశము, రెల్లు‡. ౨. వానీరము, ప్రబ్బ‡. ౩. కైవడిముస్తె‡. న. ౧. సైంధవలవణము. ౨. సౌవీరాంజనము.

**నాదేయి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. జలవేతసము, నీరుప్రబ్బ‡. ౨. భూమిజంబుక, నేలనేరేడు‡. ౩. వైజయంతిక, తక్కిలి‡. ౪. నాగరంగము, నారింజ‡. ౫. జప, దాసనము‡. ౬. కాకజంబువు, కాకినేరేడు‡.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాథము. సం.వి.అ. పుం. ముకుంద్రాడు. (శ.ర.)

నాథవంతుఁడు. సం=నాథవంతుఁడు.

నాథుఁడు. సం=నాథుఁడు.

నాన. వి. (సం. జ్ఞానం. ప్రా. జాణం, నాణం. క. త. నాణ్.) ౧. సిగ్గు, లజ్జ.

ఉ...నలినానన గోలతనాన నేల లో, నానఁ జలంబు నీకు మరునాన సుమీ విడు నాన యిం కిటఁన్. విజ. వి. ౨. ౨౭.

క. నాన యిటు లేమిటికి నలి,నానన కెమ్మోవి పంటనానఁగ నిడి న,న్నానవవిల్తుని చెయువుల, నానందింపఁగ నొనర్చి యలరింపఁగదే. రసిక. ౫. ౧౬౯.

గీ. నాన యింతయు మదిలోన నానఁబోక. నీలా. ౨. ౯౪.

గీ. నాన యనఁ బుచ్చడీ కనఁగాను లజ్జ. ఆం. భా. ౧. ౧౩౨.

౨. (తగనిపనిచేసినవారికి పరులను జూచునపుడు గాని పరులతో మాటాడునపుడుగాని మనస్సున కలిగెడి) సంకోచము; సంకోచము, వెనుదీయుట.

క. మాయయ్యకుఁ బాయక పని,సేయుచు దీవించి ప్రియము సేయుచు నుండుదున్, మీయయ్య వెండిమహిమలు, నాయొద్దన పలుక నీకు నానయు లేదే. భార. ఆది. ౩.౧౩౭.

ఉ. వలలుఁ డనన్ విరాటుకడ వంటలవాఁ డయి భీముఁడున్ బృహన్నల యన నాఁడు పేడి వయి నాన యొకింతయు లేక నీవు న,గ్గల మగుదైన్య మొంది కడుఁ గాఁజియ వొందితిరి... భార. ఉద్యో. ౪. ౨౦౦.

మత్తకోకిల. నాకనూభవుఁ డీశఁ డంచును నానయించుక లేక యో,మాత నీ విది యేమి నేఁ డిటు మాతృభావము మాని సం,ప్రీతిఁ గామినిభంగిఁ జేసెదు...భాగ.౧౦ఉ.౧౨.

ఉ. సైనికు లెల్ల నంత రణసన్నహనం బెడలించి పాఱినన్, నానయు నచ్చలంబు మది నాఁటుకొనంగ...ఇంద్రుఁ డుపేంద్రునిఁ దాఁకె సుదర్శనన్. పారి. ౫. ౧౭.

౩. అవమానము.

చ. హితుఁ డని నమ్మఁగాఁ దగునె యీతనిఁ గాఁ గ్యపుమాట లిట్టివే, పతిదెస కూర్మి వాపుటకుఁ బట్టుగ నెక్కువ తక్కువ వంచు నున్నతు లగుమేదినీశులకు నాన గదఁ బల్కుటగాక... భార. ఉద్యో. ౪. ౨౪౦.

ఆ. పట్టువడమ్ముచ్చుపగిదిఁ బాంచాలభూ,నాయకుండు దనకు నాన చేటు, రాక కుమ్మలించి యేకాంతమునఁ బత్ని, యొక్క తెయును గొల్వ నూరకుండె. భార. ఉద్యో. ౪. ౩౭౨.

జ: నానగండ.

నానఁబ్రాలు[1]. వి.(√నాను[1].)౧.నానబియ్యము.

గీ...ఆర్ద్రితండుల మ్మమరు నానఁబ్రాలు నాఁగ ...ఆం. భా. ౨. ౨౫౩.

౨. భక్ష్యవిశేషము.

వ...గంధతోయంబులు సుండ్రాలు నానఁబ్రాలు ననుములు మినుములు...కాశీ. ౭. ౧౭౫.

చ...కొబ్బెరపప్పు నానఁబ్రా, లడుకులు దేనె పండు లొడియంబులు పానక మూరఁగాయ లప్పడములు ... నీ కొసంగెదన్. చెన్న. ౩. ౭౩.

నానఁబ్రాలు[2]. వి. పచ్చిబియ్యము అనుచెట్టు. (చి. ని.)

నానగండ. విణ. (నాన+గండ[1].) సిగ్గుమాలినవాఁడు, సంకోచము లేనివాఁడు.

ఉ. మచ్చటులాప్రఘట్టన మనంబున నెంచక నానగండ య్యైవచ్చినవాఁడు చూచితి శె

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాసవునింగ మలాయతేక్షణా. పారి. ౫. ౨౦.

చ. చిలుకలు గమ్మఁదెమ్మెరలు శీతమయూఖుఁ డు దేఁటు లాదిగా, గలనవిల్తుసాధనని కా యము వేలముపట్టు లంగనా,ళిల మటుగాన దాని విడఁగొట్టక త్రుట్టికఁదొట్ట వీతరా,గుల మని విఱ్ఱవీఁగెదరు కొందఱు జోడలు నాన గండ లై. పాండు. ౫. ౧౮౨.

నాననై చేయు=నానుచే. స. క్రి. (√నాను[1].) నీళ్లతో చిరకాలము తడియఁబెట్టు, నానఁబెట్టు.

సీ. హిమజలంబులకంటె హిమజలంబుల నాన వై చినబిసపల్లవములకంటె. పి. శకుం. ౪. ౧౪౬.

నానా. సం.అవ్య. (తెలుఁగున సిద్ధసమాసపూర్వప దముగానే యుండును.) ౧. అనేకము.

క. నానావిధపాకములు గ, నానాలుగఁ జేసి సాలు గై దట్టికలన్, బోనాముదొంతిఁ జేర్చిరి, సూనాస్త్రసమానుఁ డైనసుతు సిరి యాలున్. హర. ౨. ౧౨౨.

౨. వివిధము, పెక్కువిధములు కలది. ౩. వినా రకము. (మే. ని. ఈయర్థమున తెనుఁగున ప్రయోగము లేదు.) వి. ఆ. స్త్రీ. ౧. సరస్వతి. ౨. జనని, తల్లి. ౩. కూఁతురు. (కే. ని.)

నానాంద్రము. సం.విణ. (అ. ఈ. అ.) ననాం దృసంబంధమైనది, ఆఁడుబిడ్డకు సంబంధించినది.

నానాంద్రుఁడు. సం. వి. అ. పుం. ననాందకొడు కు, ఆఁడుబిడ్డకొడుకు.

నాను[1]. అ. క్రి. (త. ననై.) ౧. తడియు, ఆర్ద్రి మగు.

క. నాని శిఖి వంటచెఱకుల,చే నఱ నవి వెండి వంటచెఱకులె యగుటం,బోనంబు ప్రజకు జక్కుల,బోనంబులె యయ్యెఁ బ్రొయ్యి పాగ యమి వృష్టిన్. ఆము. ౪. ౧౨౬.

ఆ. తడిసె నానె ననఁగఁ దనరు నార్ద్రిం బయ్యె, ననుట కాఖ్య...ఆం. భా. ౩. ౯౧.

౨. చిరకాలము తడియు, చాలసేపు తడియు.

శా. దానత్యాగపత్త్ర మై తొలుపత్త్రం బంబు ధారన్ సదా, నానం దత్సితకీర్తిహంసి చను మింటన్...ఆము. ౨. ౭౨.

క. ఏ నిపుడు రాజ్యహీనుఁడ, నై నా ప్రియపత్నిఁ బాసి యత్నలు దొరఁగన్, నానుచు ను న్నాఁడఁ గడున్, దీనత లోఁ గొన్నవాహినీ తీరగతిన్. భా. రా. కిష్కిం. ౩౯౩. చెన్న. ౫. ౯౨.

౩. ఇంకు, ఇగురు.

సీ. చిట్టాముదమ్మున శిర సంటి నును మేన నాన నూనియ నించి నలుఁగు పెట్టి. ఇందు. ౨. ౧౫.

నాలుక నువుగింజ నానదు=నోట రహస్యము దాఁగదు.

ద్వి. కడఁగి చెప్పినఁ గాని కడుపుబ్బు దిగదు, నాలుక నువుగింజ నానదు నాకు. ద్వి. హరి శ్చ. ఉ. ౧౦౩౪ పం.

ఇట్లే: నోటిలో నువ్వుగింజ నానదు.

(వ్యవ.) ఆఁడువారినోటిలో నువ్వుగింజ నానదు.

జః నసుఁబ్రాయి, నసుఁబ్రాయివడు, నానఁబ్రాలు[1], నానవైచు, నానుచు, నానుడి, నానుడు వాన, నానుపుఁగొండ, నానొడి, నాన్పు.

నాను[2]. వి. స్త్రీకంఠాభరణవిశేషము.

సీ...కంఠభూషావిశేష. గీ. మాను గుతికంటు మెడనూలు నాను తీఁగె, కంటసరి కంటె యం చనఁ గాను...ఆం. భా. ౨. ౧౪౮.

జః నానుకోళ్లు, నానుక్రోవి, నానుచుట్టు.

నానుకోళ్లు. వి. బ. (√నాను[2].) స్త్రీకంఠా భరణవిశేషము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(వ్యవ.) ఈదినములలో నానుకోళ్లు ధరించుటే మోటయినది.

నానుక్రోవి=నానుచేట్టు. వి.(√నాను².) కంఠాభరణవిశేషము. (శ.ర.)

నానుచే(న్చే)=నాన్చు, నానవైచే. స. క్రి. (√నాను¹.) ౧. నానఁజేయు, ఆర్ద్రముచేయు, తడుపు.

ఉ. జ్ఞానము దెల్పి విష్ణుపదసారసవారికణాలి సంగముల్, నానిచి పాతకౌఘము లణంచి వికుంఠపురీపదంబు కై, కానుకఁ జేసి కాచితివి... శేష. ౪. ౫౩.

౨. చాలకాలము కడచునట్లు చేయు.

(వ్యవ.) వాఁడావ్యవహారమునాన్చుచున్నాఁడు.

౩. ఎక్కువగా తడుపు.

చ. గొడుగుల గాలిఁ దూల్చి మటి కోలలతోడన పాఱ నాన్చె చేఁద్పడ జడి మేఘుఁడు ...ఆము. ౪. ౧౨౯.

నానుచేట్టు=నానుక్రోవి. (√నాను².)

సీ...సన్నకాటుకరేకలు నాభినామంబులు నానుచుట్లు. శుక. ౨. ౩౩౨.

నానుడి=నానోడి. వి. (నాను¹+నుడి.) -అందఱినోటను నానెడివాక్యము-౧.జనశ్రుతి,కింవదంతి.

సీ. నానోడి నాఁగను నానుడి నాఁగను సుబ్బసాఁగను జనశ్రుతి దనర్చు. ఆం. భా. ౧. ౧౧౨.

౨. లోకోక్తి, సామెత.

క. వినుతయశా తగవునకుం, జని నోడిననరుఁడు ముదిసి చచ్చిన వగవం, బనిలేదు బుద్ధిమంతుల, కనునానుడి వినమె యింత యననేమిటికిన్. భోజరా. ౭. ౮౩.

చ...వింట లేదె యుం,ట గెలిచి రచ్చ గెల్వ మనునానుడి నానుడి నానుఁడీ చెవిన్. సారంగ. ౨. ౨౫౯.

నానుడు. విణ. (√నాను¹.) తడిసినది.

ఉదా:-నానుడునేల. (శ. ర.)

నానుడువాన. వి.(√నానుడు.)విడువక కురియు పొడిపొడిచినుకులవర్షము. (శ. ర.)

నానుపుఁగొండ. వి. (√నాను¹.) హిమవత్పర్వతము.

వ...నానుపుఁగొండరాచూలివాలికచూపునివాళికలు దనరె...కాశీ. ౪. ౧౨౪.

నానుపుడు. వి. (√నాను¹.) నాన్చుట.

(వ్యవ.) నీనానుపుడు మాని త్వరగా చెప్పుము.

విణ. తెమలకుండఁగ నుండునది.

(వ్యవ.) వానినానుపుడుపని చూడుము.

నానుబోర. వి.మాంసము కలఱొమ్ము. (శ. ర.)

నానోడి=నానుడి. (√నాను¹.)

ఆం. భా. ౧. ౧౧౨.

నాత్తె. వి. జంతికలు ఒత్తుచున్నపుడు జాఱెడు పిండికాఁడ. (భక్ష్యవిశేషము అని శ. ర.)

మ. పొలఁతీ చూచితె తేఁటిఱెక్కరవగాడ్పుం బోదలేఁదాఁకుజో, కలచే జాఱుమెఱుంగుఁ బుప్పొడులరేకల్ మీఱె గుత్తంబులై, యలరుం బెజ్జపుమ్రానిజంతికలఁ జెన్నారన్ వనీదేవతా, కలకంఠీమణు లొత్తునాత్తెలగతిన్ గన్పొందు గావింపుచున్. చంద్రా. ౪. ౨౦౯.

నా(నుపు)న్పు=నానుచే. స. క్రి. (√నాను¹.)

౧. నానఁజేయు, తడుపు.

క. నినుఁ బాసి నిముసమైనను, విను జీవము పట్టఁజాల విప్రోత్తమ నే, నసృతంబు పలుక నిజమిది, ననుఁ బ్రీతి వరింపు కరుణ నాన్పు మనంబున్. మార్క. ౪. ౨౪౭.

గీ...మోవిఁ జెఱం గిడి యాఁగునవ్వు,కంట నిగుడ విరు ల్నాన్పుకరణిఁ జల్లు,సరసపుజలంబె జాణల మరులుకొల్పు. ఆము. ౨.౨౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. క్రొత్తబట్టలు చలువచేయు. (బ్రా.)
(వ్యవ.) నానుపుటకు వేసినబట్టలు చాఁకలి యింకను తీసికొని రాలేదు.

నాప=నాగప,నాగప్ప. వి. నాగవల్లి.(చూ. నాపసాని.)
జః నాపసాని.

నాపసాని=నాగపసాని. వి. (√నాప.) నాగవల్లి నడపెడుము త్తైదువ.(వృద్ధసువాసిని అని చి.ని.)
సీ. వెలయ పియ్యా లంది వీడుకోళ్లు గుడిచి నరఁబువుల్ ముడిచిననాపసాని. కళా. ౪.౮౩.
ఉ. అప్పుడు నాపసాని చతురశ్రికమండలి హేమకుంభికల్, ముప్పదిమూఁటఁ జుట్టునిడి ముత్తియముల్ ఘటియించి తంతు లం, దొప్పుగఁ జుట్టి దేవతతి నుత్కటభక్తిని బాడుకొంచుఁ దాఁ, జెప్పినరీతి దంపతులఁ జేయఁగఁ జేసెఁ దదర్హ కృత్యముల్. భల్లా. ౪. ౭. (చి.ని,శ.ర.)

నాపితశాల. సం. వి. ఆ. స్త్రీ. క్షౌరగృహము, మంగలవానియిల్లు.

నాపితాయని. సం. వి. ఇ. పుం. మంగలవాని కొడుకు.

నాపితుఁడు. సం. వి. అ. పుం. మంగలవాఁడు.

నాపిత్యము. సం. వి. అ. న. మంగలవృత్తి.

నాపిత్యుఁడు. సం.వి.అ.పుం.మంగలవానికొడుకు.

నాభకము. సం. వి. అ. పుం. పాత,చిలుబొద్దికి.

నాభజావళి. వి. గీతవిశేషము.
క. క్రమ మొంద నాభజావళి, గమకముగా శుద్ధసాళగములునుసంకీర్ణము లొగిఁ బుంభింపఁగ మంద్రము మధ్యము తార మత్యుదారత మీఱక. సమీర. ౬. ౨౦౫.

నాభి. సం. వి. ఇ. పుం; ఇ, ఈ. స్త్రీ. బొడ్డు.
౨. స్త్రీ. మృగనాభి, కస్తూరి.(దీనికి సమాసాంతమున కొన్నిచోట్ల 'అచ్' ప్రత్యయమువచ్చును. ఉదా: అరవిందనాభుఁడు, పద్మనాభుఁడు, కురంగనాభము మొ.)
ఇ. పుం. ౧. రథచక్రమధ్యరంధ్రము, బండి కంటినడిమితూము. ౨. -వత్సములనుహింసించునది- వత్సనాభము, ఒకానొకవృక్షవిషము. ౩. తిలకము, బొట్టు.
ఉ. ఆనవలా యలంతిపసుపాడి దుకూలముఁ దాల్చి గుబ్బచక్, గోనలఁ దావు లుప్పతిలఁ గుంకుమ తేటలనిగ్గు దేఱఁగ, ప్రానన నాభిఁ దీర్చి...ఆము. ౫. ౩౯.
౪. మధ్యభాగము, నడిమిచోటు. ౫. క్షత్రియుఁడు. ౬.శ్రేష్ఠుఁ డగురాజు, చక్రవర్తి.
విణ. ముఖ్యుఁడు,శ్రేష్ఠుఁడు.సం.రఘు.౧౮.౨౦.

నాభిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. కటభి, మానేరుకి. ౨. బొడ్డువలె నుండురంధ్రము.

నాభికంటకము. సం. వి. అ. పుం. స్ఫీతనాభి, ఉబుకుబొడ్డు, ఎత్తైనబొడ్డు.

నాభిగుడకము. సం=నాభికంటకము. (త్రి. ని.)

నాభిగోళకము. సం=నాభికంటకము.

నాభిజుఁడు. సం. వి. అ. పుం - విష్ణునాభియందు పుట్టినవాఁడు - బ్రహ్మ.

నాభినాడి. సం. వి. ఈ. స్త్రీ=నాభినాళము.

నాభినాళము. సం. వి. అ. న. పుట్టినశిశువునకు త్రాడువలె బొడ్డు నంటియుండుసిర.

నాభిమూలము. సం. వి. అ. న. నాభిక్రిందిభాగము, పొత్తికడుపు.

నాభిలుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పెద్దబొడ్డు కలవాఁడు, ఉబుకుబొడ్డువాఁడు.

నాభివర్ధనము. సం. వి. అ. న. ౧. బొడ్డు పెరుఁగుట. ౨. శిశువులకు బొడ్డునాడిని ఛేదించుట. ౩. నాభికంటకము, ఉబుకుబొడ్డు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాభీదము. సం.వి.అ.న.భారతవర్షము. (వై.ని.)

నాభీలము. సం. వి. అ. న. ౧. కష్టము. ౨. నాభికంటకము, ఉఱుఁబొడ్డు. ౩. వారస్త్రీవంక్షణము, వెలయాలిగజ్జ. ౪. కస్తూరీపరిమళము. (వై. ని.)

నామకరణము. సం. వి. అ. న. ౧. పేరుపెట్టుట. ౨. బిడ్డలకు పేరు పెట్టుటకు చేయు నొకసంస్కారవిశేషము.

నామకర్మము. సం. వి. న్. న=నామకరణము.

నామకుఁడు. సం. విణ. (అ. మికా. అ.) ౧. వంగువాఁడు. ౨. వంచువాఁడు. ౩. నమస్కరించువాఁడు.

నామగుంట. వి. (నామము+గుంట.) గళగర్తము. (శ.ర.)

నామధాతువు. సం. వి. ఉ. పుం. (వ్యాక.) నామవాచకములనుండి పుట్టినధాతువు. (ఉదా: పుత్రకామ్య, పల్లవించు, కరుణించు మొ.)

నామధారకుఁడు. సం. విణ. (అ. రికా. అ.) ౧. పేరు ధరించువాఁడు. ౨. పేరుమాత్రము కలవాఁడు, సార్థకత లేనివాఁడు.

నామధారి. సం. విణ. (న్. ణీ. న్.)=నామధారకుఁడు.

నామధేయము. సం. వి. అ. న. నామము, పేరు.

నామనిర్దేశము. సం. వి. అ. పుం. ౧. పేరుపెట్టుట. ౨. పేరితో చెప్పుట.

నామనీయుఁడు. సం=నమ్యుఁడు.

నామమడఁచు. మి. స. క్రి. పేరుమాపు, చంపు; నశింపఁజేయు.

ఆ... వేఱ యొక్క దొడ్డవిల్లు రయము, మెఱయఁగొని యతండు । మెఱుఁగులు గిఱికొను, నారసమున వాని నామమడఁచె. భార. ద్రో. ౪. ౧౨౪. సౌప్తి. ౨. ౩౨.

గీ. ఏడునూఱురథంబుల నేపుమాపె, నరులఁ డప్పుడు మున్నూటి నామమడఁచె, నతనియనుజుండు... భార. విరా. ౩. ౨౧౩.

నామమణ(డ)ఁగు. మి. అ. క్రి. చచ్చు, మరణించు.

గీ. నీసహోదరి నని చెప్ప నీకులోడ, నుఱకన న్నొకఁ డిమ్మెయిఁ బఱచి నామ,మణఁగ కున్నాఁడు నేఁడు... భా. రా. అర. ౧. ౨౫౩.

నామమాత్రము. సం. విణ. (అ. ఆ. అ.) సంజ్ఞామాత్రధారి, పేరుమాత్రము కలది.

శ్లో. యథా కాకయవాః ప్రోక్తాః యథారణ్యభవా స్తిలాః, నామమాత్రా న సిద్ధ్యై హి ధనహీనా స్తథా నరాః. సం. పంచ. ౨. ౮౩.

వి. అ. న. వట్టిపేరు, పేరుమాత్రము.

నామమాల. సం. వి. ఆ. స్త్రీ. పేర్లపట్టిక, పదములపట్టిక.

నామము. వి. (క.నామ.త. నామం.) తిలకము, లలాటమున పెట్టుకొనుబొట్టు.

గీ. బవిరలును గొప్పువలయును బడఁతి యొత్తు, దిద్దెఁ గస్తురినామంబు దీర్చె నోర్తు. యయా. ౪. ౮౦.

గీ. మంచికపురంపుగీఱునామములు దీర్చి, యలఘుతర మైనమణిభూష లలవరించి. చంద్రా. ౪. ౨౫౨. శుక. ౧. ౧౩.

సీ. నిటలభాగమునందు నిడుసోఁగతీరుగా మల్లెపూమొగ్గనామంబు దీర్చి. వైజ. ౨. ౪౪.

జ: నామగుంట, నామాలకేతఁడు.

నామము. సం. వి. న్. న. -వస్తువును తెలుపునది- ౧. నామధేయము, పెట్టినపేరు. (రామకృష్ణాది.) ౨. వాచకము, ఒకవస్తువునకు జనులు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాడుకొను పేరు. ౩. (వ్యాక.) ప్రాతిపదికము. ౪. జలము, నీరు. (కే. ని.)

నామముద్ర. సం. వి. ఆ. స్త్రీ. పేరుచెక్కిన యుంగరము, ముద్దుటుంగరము.

నామయత్. సం=నమయత్.

నామరులు. వి. (నాము² + మరులు.) పాచికలు.

చ. బలితపుఁబద్మజాండ మనుపాళి ఘటించి చట మీఁదఁ బడ్డజీవు లనెడుసారె లుంచి రహి పుట్టఁగ నమ్మిహిరేందునామముల్, కలిగిన నామరు ల్గాని యలౌకికచిత్రదురోదరంబుగా, నల రమతోడ నాడుకమలాక్షుఁడు మైకొనెఁ గంటె జూదముల్. చమ. ౧.౯౪.

నామవాచకము. సం. విణ. (అ. చికా. అ.) (వ్యాక.) నామమును చెప్పునది. (శబ్దము.) వి.అ.న. సంజ్ఞావాచకము, ఒకదానిపేరుచెప్పు శబ్దము.

నామశేషము. సం. విణ. (అ. ఆ. అ.) - పేరు మాత్రము మిగిలినది - మృతము, చచ్చినది.

నామసంగ్రహము. సం. వి. అ. పుం. పేర్ల పట్టిక, పదములపట్టిక; పదసమూహము.

నామాంకము. సం. విణ. (అ. ఆ. అ.) నామము గుఱుతుగా కలది, గుఱుతుగా పేరు వేయఁబడినది. (పాత్రాది.)
ఇట్లే: నామాంకితము.

నామాపరాధము. సం. వి. అ. పుం. భగవదాదులనామములను దూషించుట అనునపరాధము.

నామానుశాసనము. సం. వి. అ. న - శబ్దములను నిర్ణయించునది - నిఘంటువు.

నామాలకేతఁడు. వి. (√నామము.) పక్షివిశేషము.

సీ. నామాలకేతఁడు నల్లాసకప్పెట కాకి యంబటిజోరిగాఁడు మూఁగ. ఆ. ఆది రైన పక్షు లతఁడు దీర్చు. హంస. ౩. ౧౨౪.

నామిత. సం=నమిత.

నామితము. సం=నమితము.

నాము¹. వి.(దీనికి వ్యుత్పత్తియందు 'నాఁప' అనురూప మేర్పడును. - త. నాంబు.) ౧. జొన్నలోనగు వానికొయ్యగాలున చిగురించిన మొలక. (దీనిని పశువులు మేసినచో మృతి నొందును అని శ. ర. లేతగా నుండుజొన్నపైరు. దీనిని మేసిన పశువులకు ఉంగిడిరోగము తగులును అని బ్రౌ.)

ద్వి. కుమతులై కర్మశాస్త్రములవెంబడిని, బ్రమసియో యిలఁ గుక్కపాలు ద్రాగుటనో, మఱి నాము మేసియో మతిమాలినట్టియ అవపాఱులమాట లవనీశ వినరు. బస. పు. ౫. ౪౫౫ పం.

క. సన్నపుఁదలయేఱున మయి, యన్న కొనుచు నాము దిన్నయట్లై రాఁగా, ఖిన్నుఁడనై పురి కేఁగితిఁ, దిన్నఁదనం బుడిగి కొన్నిదివియలు వెలుఁగన్. మనుచ. ౫. ౨౨. (నాముదిన్నయట్లై- అనగా నాము మేసినపసరమువలెనై అని భావము.)

౨. గింజ లేనివరిమొ. వానిఎన్ను. (బ్రౌ.)
జ: నాఁపచేను.

నాము². వి. వడ్రంగి కత్తికాసుతో కఱ్ఱపై నూటిగా తీర్చురేఖ. (చూ. నాములుతీయు.)
జ: నాఁపటాయి, నామరులు, నాములుతీయు.

నాములుతీయు. స. క్రి. (నాము² + తీయు.) వడ్రంగి బల్ల మొ. వానిపై గీఁత లేర్పఱచు. (జవకట్టు అని బ్రౌ.)
(వ్యవ.) నాములు తీసినకమ్మ లందముగా నుండును.

నామ్యమానము. సం=నమ్యమానము.

నామ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వంపఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దగినది. ౨. నమస్కారింపఁజేయఁదగినది.

**నాయంకరము.** వి. ౧. దానవిక్రయాద్యధికారములతోఁడియనుభవము.

వ...కృష్ణరాయదేవమహారాయలు పృథివి రాజ్యం సేస్తుండి [మాకును] యంకరానకు పాలి[ం]చిన గుత్తిసీమలోని...లపాడు ఇ[గు]డూరిపాలమే[ర]ను... ద. శా. ౪.౮౦౦.

వ ... శ్రీమన్మహారాజాధిరాజరాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీ అచ్యుతదేవరాయమహారాయలు మాకు నాయంకరానకు పాలింస్తేను చెల్లివచ్చె...ద. శా. ౪.౮౦౧.

౨. ఆధిపత్యము.

గీ. నీవు తలమావి వీడనినిసువువయసు,నాఁడె జేజేలదళవాయినాయఁకరపుఁ,బట్టమున నిల్చి తారకుఁ గిట్టి ప్రౌఢ,లరరణక్రీడ యొనరించుతతి మహత్త. పాండు. ౨. ౧౪౫.

**నాయఁకవా(డి)డీ.** వి. (√నాయఁకుఁడు.) సేనాధ్యక్షుఁడు.

వ...రాహుత్తులును రాహుత్తులకుం దోడు తుపాకివేట్లకు నిలుపోపక గుభులుగుభుల్లుసంబరిఖాక్రోడంబునం బడి...ఒడ్డునకుం దేలిన మెండొడ్డునాయఁకవాడీలును...రా. వి.౫.౩౨.

**నాయఁకవాళి**=నాయఁకవాడీ. (శ. ర.)

**నాయఁకుఁడు.** వి. (సం. నాయకః, ప్రా. ణాఅఓ, ణాఅక్కో. క.నాయక.) ౧. ఉద్యోగి, మణియగాఁడు.

వ...ద్వారవతినామకం బగుపురం బతిమనోహరంబుగా నిర్మించి పురవాస్తవ్యులు బంధుమిత్రులు సేనాపతులు నాయంకులుం దగునెలవుల నిలువం దాను నభినవం బగురాజమందిరంబున వసియించె...హరి. ఉ. ౨. ౧౦౭.

౨. అధిపతి.

గీ. అలరఁ గఱకునా నెఱుకునాయంకుఁ డొకఁడు, పొడగనఁగ వచ్చెఁ గొలువున్న పుడమిఱేని. చంద్రా. ౨. ౩౮.

గీ...ముత్తియపుఁబేరుఁ, గలిగి యెఱుకునాయంకుఁ డొక్కండు వచ్చి, పుడమిరావేల్పురాయనికడను నిల్చి. చంద్రా. ౨. ౪౦. ప్రబంధ. ౧౬౨.

౩. స్వల్పసేనకు అధిపతి. (పన్నిద్దఱుభటుల కధిపతి అని శ. ర.)

చ. వికలరథప్రయత్నుఁ బృథివీపతిఁ గన్గొని ద్రోణపుత్రక,ర్ణకృపులుఁ దక్కనుంగలుగు నాయఁకులుఁ రయమార వచ్చి...భార. కర్ణ. ౧. ౧౮౫.

ద్వి...అనిపిలువఁ,బుచ్చె నాయఁకులనప్పుడు పడవాళ్ల.రం.రా. యు. ౭౯౧ పా. ౨౨ పం.

జ: నాయఁకురాలు, నాయుఁకవాడీ.

**నాయఁకురాలు.** వి. (నాయంకుఁడు + ఆలు.) శ్రేష్ఠురాలు.

ద్వి. నాతల్లినాయక్క నాయంకురాల, యేతపం బొనరించి యీపుత్రుఁ గంటి. ద్వి. సిం. భాగ. ౧. ౯ పా.

**నాయఁడు**=నాయుండు. వి. (సం. నాయకః. ౧. ప్రభువు.

వ... పులుఁగుసాహేబుబాబారాయఁడ మొసలివాయెంటులనాయఁడ...ప్రబంధ.౭౧౬.

గీ. వినుము నాయఁడ నామాట వీను లలర.నీలా. ౧. ౯౩.

౨. శూద్రులలో కొందఱనామాంతమున నుండు బిరుదు. (బలిజెలు లోనగువారిపట్టపుఁబేరు అని శ. ర.)

ఉదా: వెంకయ్యనాయఁడు మొ.

విణ. శ్రేష్ఠుఁడు, గొప్పవాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. నీపాదముఁ దల మోచిన, నాపే రిల నుంచు
చెంచునాయఁ డటంచుక్, నాపల్లె మృగని
దానం,బాపక్కణ వెలరఁ గొండయడవుల
దండక్. రా. వి. ౩. ౩౪.

ఉ. గొల్లలనాయఁ డై పరఁగుకుంభకుమంద న
దేమి వింతయో, కల్లరిగిబ్బ లేదు పొడగట్టి
పజంగడు గాసిఁబెట్టుచుక్. నీలా. ౨. ౫౪.

నాయకము. సం. వి. అ. పుం. హారమునడిమి రత్నము, పతకము.

నాయకుఁడు. సం. విణ. (అ. యిక. అ.) ౧. ప్రాపకుఁడు,పొందించువాఁడు. ౨. నడపువాఁడు. ౩. ప్రధానుఁడు, ముఖ్యుఁడు. ౪. శ్రేష్ఠుఁడు. వి. అ. పుం. ౧. భర్త, ప్రియుఁడు. ౨. ప్రభువు, అధిపతి. ౩. (అలం.) సాధారణనాయకుఁడు. (వీరు నలువురు. ధీరోదాత్తుఁడు, ధీరోద్ధతుఁడు, ధీరలలితుఁడు, ధీరశాంతుఁడు.) ౪. శృంగారరసాలంబనపురుషుఁడు. (వీరు ముప్పురు. పతి, ఉపపతి, వైశికుఁడు. అందు పతి అనుకూలుఁడు, దక్షిణుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు అని నలుతెఱఁగులవాఁడు.) ౫. సేనాధిపతి.

నాయన. వి. (నా[1] + అన[1].) ౧. జనకుఁడు, తండ్రి.

సీ. అబ్బ నాయన యయ్య యనఁ దండ్రి యన
నప్ప యన జనకాఖ్య లౌ నగనివేళ. ఆం. సం.
మాన. ౩.

౨. ఇది వాత్సల్యసంబోధనమునందును సంబోధ్యశబ్దమునకు మాఱుగాను ప్రయోగింపఁబడును. (శ. ర.)

నాయము. విణ. (సం. న్యాయః. ప్రా. నాఓ. క. నాయ.) న్యాయయుక్తమైనది; యుక్తము. (వ్యవ.) వానిమాట నాయము కాదు.

వి. ధర్మము, పాడి.

గీ. మారు నాయంబె నీతోడ మాటలాడ. సైవ. ౪. ౫౯.

గీ. అమరపతి నేఁడు నీదునెయ్యంబుఁ గోరి,
నన్నుఁ బంపిన వచ్చితి నాయ మగుట, నన్ను
దమ్ములకేల వృథాహవంబు. దశా. ౨. ౧౦౪.
రసిక. ౬. ౧౦౯.

నాయము. సం. వి. అ. పుం. ౧. నడపుట. ౨. పొందించుట. ౩. నయము, నీతి. ౪. ఉపాయము.

నాయి. వి. (క. నాయి. త. నాయ్.) కుక్క.

గీ...దొంతులు సేరి నాయి, దోర్వ నేర్చుఁగా
కది యేమి సేర్ప నేర్చు. కు. సం. ౧.
౨౯. (ప్రయోగాంతరము కానరాలేదు.)

నాయి. సం. వి. ఈ. స్త్రీ. దిక్కు. (కే. ని.)

నాయి(యు)ండు=నాయఁడు.

(శూద్రులనామాంతమున నుండుబిరుదు.)

వ... ఎఱ్ఱంగొంమి నాయిండును వారిమఱంది
సూరపనాయిండును...ద. శా. ౪. ౯౩౩.

వ...భాస్కరదేవని ప్రధాని(పె)న్నమనా యుం
డు...ద. శా. ౪. ౯౪౭.

వ...గజసాహిణిభాస్కరదేవని ప్రధానిపేరు
(మా)ండినాయుండు...ద. శా. ౪. ౯౪౯.

నాయిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. భార్య. ౨. రాణి, ప్రభ్వి. ౩. శృంగారరసాలంబనస్త్రీ. (ఈమె స్వీయ, పరకీయ, సామాన్య అని ముత్తెఱఁగులది. అష్టవిధనాయికలు: స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారిక.) ౪. ఒక దినుసుకస్తూరి.

నార. వి. (క. నారు. త. నార్. తు. నారు.) ౧. (జనుము మొ. వాని) తడప.

క. ఆరయఁ బువ్వులకతమున, నారలు తల
కెక్కునట్లు నానావిధసం, సారులు శివభక్తి
మెయిక్,వారక యెప్పుడుఁ ద్రిలోకవంద్యు
లు గారే. శివ. సా. ౧౯౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. నేలయు నింగియుఁ దాలము ల్వాయింప...
రా నారఁ గొన...కు. సం. ర. ౧౩౪.
క...పసికిఁ దలుగు లమరించుటకై, నారలు
గావలె నని...శుక. ౨. ౩౩౮.
౨. చెట్ల పైచర్మము.
క. వీరుద్రుమిథునమేళన,కై రతిపతి యేయ
దుస్సి హరితద్యుతిఁ బైనా రెగయఁ బొటమ
రించిన,నారసములమెన లనంగ నన లవి
మించెక్. ఆము. ౪. ౧౧౪.
క. నారలె చీరలు తులసీ,హారంబులె భూషణ
ములు ననవరతసదా,చారమె జప మూర్వీ
బృం,దారకులకుఁ గాక రిత్తదంభము లేలా.
కుచేల. ౨. ౪౩.
౩. వల్కలము, చెట్ల తడపలతో నేయఁబడిన
వస్త్రము.
ఆ. పరఁగు నార యనిన వల్కలసంజ్ఞ యై...
ఆం. భా. ౧. ౩౧.
ఉ. నారలు గట్టి కూర లశనంబుగ నుగ్రవనం
బులోఁ దపో, భారమునం గృశుం డయిన
బ్రాహ్మణుఁడు...భార. ఆర. ౨.౩౭౬.
ఉ. నారలు పట్టు లాకులు జనంబులు తాపసు
లట్లు కట్టుదుర్. హరి. ఉ. ౭. ౬౪.
జనుపనార=జనుమునుండి తీసినతడపలు.
మ. మొగ మెల్లక్ వలిపూర్ణ మైనయపుడుక్
మూర్ధంబునక్ జన్పనా,రగతిం బాండిమ
యల్లుకొన్నపుడు...మల్లభూ. వై. ర.
జః నారచీర, నారజెల్ల,నారదబ్బ, నారపాచు,
నారమడి.

నారంగక్షీరిణి. సం. వి. ఈ. స్త్రీ. క్షీరికా
భేదము. (నారింజతొనలు గ్రాఁగిననేతిలో వేచి
దానిలో పటికపంచదార వేసి పక్వమయినతరు
వాత దింపి సగముకాఁగినపాలు కొంచెము పోసి
సుగంధద్రవ్యములతో పరిమళింపఁజేయబడినది.
ఇది వాతపిత్తహరము, విష్టంభనకరము. వాచ.)

నారంగము. సం. వి. అ. పుం. నారింజ్. న.
౧. గర్జరము, ముల్లంగి్. ౨. పిప్పలీరసము.
౩. నారింజపండు.

నారంగుఁడు. సం. వి. అ. పుం. ౧. విటుఁడు.
౨. కవలపిల్లలలో నొకఁడు.

నారకము. సం. విణ. (అ.ఈ.అ) నరకసంబంధ
మైనది. వి. అ. పుం. నరకము.

నారకి. సం. విణ. (న్. ణీ. న్)=నారకికుఁడు.

నారకికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నరకము
నం దుండువాఁడు, నరక మనుభవించువాఁడు.

నారకీటుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మొదట
ఆశ కలిగించి తుదకు ఆశాభంగము చేయువాఁ
డు, మోసగాఁడు.

నారకీయము. సం. విణ. (అ. ఆ. అ.) నరక
సంబంధి.

నారకుఁడు. సం. వి. అ. పుం. నరకవాసి.

నారచీర. వి.(నార+చీర.) నారతో నేసినబట్ట.
సీ. రంగారుబంగారుచెంగావులు ధరించుక్రొం
గారవతి నారచీర లూనె. ఉ. రా. ౬.
౩౨౦.

నారజీవనము. సం. వి. అ. న. - మనుష్యులకు
జీవనాధారము- బంగారు. (విల్యమ్సు.)

నారజెల్ల. వి.(√నార.) మత్స్యభేదము.
ఆ. చీరచింపు జెల్ల నారజెల్ల...బంటువారి కెల్లఁ
బంచి యిచ్చె. ద్వా. ౧. ౨౪౦.

నారట్టము. సం. వి.అ.పుం. బీటికనేల. (శ.ర.)

నారణపక్కి. వి. (సం. నారాయణపక్షి.) పక్షి
విశేషము. (శ. ర.)

నారదబ్బ. వి. (√నార) నారంగము్. (ఒక
దినుసుదబ్బ అని శ.ర.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ...నారద బ్బనఁగ నారంగాభిధాన మై ప్రబ
లుచుండు. ఆం. భా. ౨. ౪౬.

నారదము. సం. వి. అ. పుం. ౧. నారంగము, నారింజ.

రగడ. తనుమధ్య దగ౯ నారదమున నీనఖగము
లు, ఘనకురంటకకంటకములు చాన ఖరము
లు. ఉ. రా. ౬. ౬౧.

ద్వి...మొల్లలు నారదంబులు గొజ్జగులును.
ద్వి. పరమ. ౪. ౨౬౫.

ద్వి. నల్లనియరఁటులు నారికేళములు, నారద
పాటలినాగతింత్రిణులు. ద్వి. నల.౧.౧౭.

౨. సైంధవహిమాలయములనడిమికొండ.

వ. ఇవ్విధంబున వసుదేవనందనుండు నేమును
...నారదంబు పరిభ్రమించి...హిమాచలం
బెక్కి హేమకూటంబు ద్రొక్కి నిషధం బ
తిక్రమించి నిమిషంబున. ఉ. హరి.౨.౩౭.

నారదీయము. సం.వి.అ.న. అష్టాదశపురాణము
లలో నొకటి, నారదునకు సనకాదు లుపదే
శించినట్లు వ్యాసుఁడురచించినమహాపురాణము.

నారదుఁడు. సం. వి. అ. పుం. -జ్ఞానము నిచ్చు
వాఁడు- ఒకానొకదేవర్షి.

నారపాచు. అ. క్రి. (√నార.) -భయాదులచే-
కట్టుబట్ట తొలఁగు.

పంచచామరము. అలంతులయ్య కూర్మమస్త
కాదు లైనజోదు ల,బ్బలారి వెన్నుచూపి
నారపాచినాఁడ కాని నేఁ,డలంఘ్యబాహు
శక్తిఁ దావకాజిలోన నంచుఁ బి,చ్చలించి
తెల్పెఁ దత్కథల్ వచఃప్రయోగచాతు
రిన్. కవు. ౨. ౧౨౬.

నారమడి. వి. (√నార.) నారతో నేసినబట్ట.
(శ. ర.)

ఇట్లే: నారగుడ్డ, నారబట్ట మొ.

నారము. సం. విణ. (అ. ఈ. అ.) నరసంబంధ
మైనది. వి. అ. పుం. ౧. జలము. ౨. అప్పు
డు పుట్టినదూడ, తర్ణకము. (మే. ని.) న. ౧.
నరులసమూహము. ౨. జ్ఞానము.

నారళ్లు. వి. బ. ధాన్యభేదము.

వ...వెన్నముద్దలు దాళువాలు నారళ్లు రామ
బాణాలు...ప్రబంధ. ౧౧౨.

నారసము. వి.(సం. నారాచః. ప్రా.నారాచో.)
౧. బాణము, శరము.

సీ. రారాజు సైదునారసముల నొప్పించె...
భార. భీష్మ. ౨. ౩౭.

గీ. పాళెము ల్వెట్టి క్రొంకులు బ్రద్దపరులుఁ,గత్తి
గొంతంబు లాడిసెల్లుఁ గత్తళములు, నారస
ములును విండులు నగరిలోనఁ, బెట్టి...ఉ.
హరి. ౨. ౯౨.

క. మండెడుబలునారసమున, గుండియ వగు
లంగ నేసి గూల్చితి దీనిన్.హర. ౭.౭౩.

౨. బాణవిశేషము. (అచ్చయినుపబాణము అని
శ. ర.)

వ...శరంబుల శిరంబులు ద్రుంచియు...నార
సంబుల నీరసంబులు సేసియు...విక్ర.
౪. ౯౮.

చ...,అ,య్యమరవిరోధియాతనిహాయంబులనూ
తుని నాలు గేనుబా,ణములఁ గలంచి వేయి
బలునారసముల్ మెయి నాఁట నేసి...
ఉ. రా. ౩. ౩౭౪.

సీ...నారాచ మొప్పును నారస మన. ఆం.
భా. ౨. ౨౧౩.

౩. ఇనుపయూఁచ.

(వ్యవ.) ఈకిటికీకి పది నారసము లున్నవి.

౪. చోరసాధనవిశేషము.

చ...క్రొంకి నారసము నాదిగఁ గల్గినసాధనంబు
ల,న్నియు సమకూరఁజేసికొని నేర్పున నే
గిరి మ్రుచ్చుప్రొద్దునన్. దశకు. ౯. ౭౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నారసింహము. సం. విణ. (అ. ఈ. అ.) నరసింహసంబంధ మైనది. వి. అ. పుం. నరసింహావతారమును గుఱించినపురాణము.

నారసింహుఁడు. సం. వి. అ. పుం. నరసింహావతారము ధరించినవిష్ణువు.

నారాచము. సం. వి. అ. పుం- నరసమూహమును ఆచమించునది- ౧. బాణము. ౨. ఇనుపబాణము. ౩. -తాటియాకులమీఁద వ్రాయుటకు సాధన మయి బాణమువలె నుండునది-గంటము. ౪. నీటియేనుఁగు. ౫. దుర్దినము.

నారాచి. సం. వి. ఈ. స్త్రీ. ఏషణి, అగసాలెవానియినుపత్రాసు.

నారాజి=నరాజి. వి. (సం. నారాచః.) ఖడ్గము, కత్తి.

శా. ఘోరాజిం దనతేజిఁ దోలి విమతక్షోణీతలాధీశులకా, నారాజిం దెగటార్చి వీరభటసన్నాహంబుతోఁ జేరు...బహు. ౧.౫౧.

గీ. తళుకుఁబైతాణిసింగిణుల్ తరకసములు, రకపుఁజికిలిసిరాజినారాజిఁ బన్ని, పతియెదుట నిల్పె సాహిణి...చంద్రా. ౨. ౬౯.

శా...నేజాలు న్నారాజుల్ గైకొని కోటలోఁ గొలుచునారాజుల్ తదంగంబు లుగ్రాజిం జెక్కులు సేయుచో మరలె గంధానేకపంబార్భటిక్. రా. వి. ౫. ౨౧.

నారాటకావుళంబు. వి. (క. నారాట.)సంగీతమందలిధ్వనివిశేషము.

ద్వి. ఘనతరనారాటకావుళం బనెడు,ధ్వని గూడ...బస. పు. ౩. ౯౩౦.

నారాయణగౌళ. సం. వి. ఆ. స్త్రీ. ముప్పదిరెండువపుంసకరాగములలో నొకటి.

సీ.గౌళ నారాయణగౌళ వసంతవరాళి పున్నాగవరాళి శంకరాభరణమును ... ప్రబంధ. ౯౪. హంస. ౫. ౧౨౪.

నారాయణపక్షి. సం. వి. న్. పుం. పక్షివిశేషము.

నారాయణప్రియము. సం. వి. అ. న. హరిచందనము, పచ్చచందనము.

నారాయణబలి. సం. వి. ఇ. పుం. దుర్మరణము నొందినవారిని ఉత్తరక్రియలకు యోగ్యులుగా చేయుటకై నారాయణాదిపంచదేవతల నుద్దేశించి యిచ్చుబలిభేదము.

నారాయణము. సం. వి. అ. న. ౧. ఒకానొకతైలము. ౨. తైత్తిరీయోపనిషత్తు లైదింటిలో కడపటిది.

నారాయణి. సం. వి. ఈ. స్త్రీ. ౧. లక్ష్మి. ౨. దుర్గ. ౩. శక్తి. ౪. బుఱ్ఱపొట్ట, చల్లగడ్డ. ౫. ఒకానొకస్త్రీరాగము.

గీ. కన్నడయు జాయయును గౌళ కడు నపూర్వమైనభల్లాతకియును నారాయణియును, గ్రనుత నిరువదినాల్గుస్త్రీరాగములును. ప్రబంధ. ౯౫. హంస. ౫. ౧౨౩.

నారాయణీయము. సం. విణ. (అ. ఈ. అ.) నారాయణసంబంధ మైనది.

నారాయణుఁడు. సం. వి. అ. పుం. -నారములు -జలములు- అయనముగా కలవాఁడు; నార-జ్ఞానమునకు- అయనము-౧. విష్ణువు.

క. నారము లనఁగా జలములు,పే రయనం బనఁగ నెలవు ప్రీతిగ నాకున్, నారము లయనం బగుటను, నారాయణుఁ డండ్రు జనులు నన్నుఁ గిరీటీ. భార. శాం. ౬. ౪౨౧.

౨. నారాయణఋషి.(నరనారాయణులలో నొకఁడు.)

నారాశంసము. సం. వి. ఆ. పుం. ౧. పితృదేవతలసోమపానార్థ మగుచమసపాత్రము. ౨-మనుష్యులను స్తుతించునది- మంత్రభేదము. ౩. అగ్ని, నిప్పు. (కే. ని.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నారాశంసులు. సం. వి. అ. పుం. బ. పితృదేవతలు.

నారి. వి. (సం. నాడీ. ప్రా. నాళీ, నాడీ. క. త. నారి.) ౧. వింటియల్లెత్రాడు, మౌర్వి.

గీ. వింటికిని నారి యై పెక్కువిధములందు, భూతభర్త భజించు నీభుజగవిభుఁడు. నైష. ౫. ౨౬.

గీ. అపుడు వి ల్లెక్కు పెట్టి వాలారుదూపు, నారిఁ గూర్చి నిశాచరనారిఁ గూర్చి, కాఁడ నేసె తదీయవక్షస్స్థలంబు, రాఘవుఁ డమోఘతరశరలాఘవుండు. రామా. ౪. ౩౩.

గీ. కడలిదొన పాఁపనారియుఁ బుడమి తేరు... పూని కడిమి, మెఱయఁ దిగప్రోల్ల గూల్చిన మేటివేల్ప. నీలా. ౨. ౧౨౦.

గీ. అల్లె యరి నారి గొనయ మం చనఁగ వెలయు, మౌర్వి... ఆం. భా. ౨. ౨౧౧.

౨. నరము. (చూ. నారిపుఱుపు.)

జ: నారికాయ, నారిపుఱుపు, నారిపుండు.

నారి. సం. వి. ఈ. స్త్రీ. ౧. మనుష్యస్త్రీ, మానుషి, ఆఁడుది. ౨. భార్య.

సీ. తా నారి యై యుండఁగా నజుం డాత్మజఁ గవిసె భారతి నేర్పుకలిమి యెంత. కు. సం. ౭. ౬౫౭.

నారింజే(జో.) వి. (సం. నారంగః. ప్రా. ణారింగ.) ౧. నారంగము. (శ. ర.) ౨. కిచ్చలి, ఒకనాతి నారింజేకి. (చి. ని.)

నారికడము=నారికెడము, నాల్కడము. వి. (సం. నారికేళ.) కొబ్బరచెట్టు; కొబ్బరకాయ.

ద్వి. కడు నొప్పనుర్వారుకఫలము ల్నారి, కడపుఁగాయలు మున్నుగాఁ గలయట్టి. ప్రభు లిం. (చి. ని.)

రగడ. నారి నారికడంపుఁబాలెలు నాకు నాకు లవృత్తి నొసఁగవు. వసు. ౩. ౧౪౯.

సీ. కాంస్యపాత్రను నారికడపునీరును గాజురాగులయందుఁ దక్రంబు భగ్నపూగఫలంబులు... భల్లా. ౩ ఆ. (చి. ని.)

నారికాయ. వి. (నారి+కాయ.) అల్లెత్రాటితాఁకుడువలన చేతులయందు కలిగెడుకాయ, కిణము. (శ. ర.)

నారిపుఱుపు. వి. (√నారి.) నాడీవ్రణము, నరముమీఁద వేసెడిపుఱుపు. (శ. ర, చి. ని.)

నారికెడము=నారికడము.

(కొబ్బరచెట్టు.)

చ... అరుణంపుబొండ్లములనారికెడంబులు వజ్రకుట్టిమం, బగుపథమును జెలంగు భవనాహృతశేషితరత్నరక్షక, భ్రగతరుసంతతిం బ్రథమభార్యఁ బురిం గిర వుంచె వార్ధి నాక్. ఆము. ౧. ౫౪.

సీ. కలిగొట్లు పొన్నలు కదుములు వెలఁగలు గోరంట లుసిరిక ల్నారికెడము,లు...అచ్చ. రా. సుం. ౨౫.

రగడ. నారికెడంబులు నారి కెడంబులు... ప్రబంధ. ౨౫౩.

నారికేళక్షీరి. సం. వి. ఈ. స్త్రీ. ఒకవిధ మగు క్షీరిక. (ఆవుపాలలో కోరినకొబ్బెర పంచదార ఆవునెయ్యి వేసి మందాగ్నితో పక్వము చేసి భుజించినచో పుష్టిని ఇంద్రియవృద్ధిని కలిగించును. రక్తపిత్తవాతములను హరించును. కొంచెము గురుత్వము చేయును-వాచ.)

నారికేళము. సం. వి. అ. పుం. కొబ్బరచెట్టు.

నారిపుండు. వి. ఔ. (నారి+పుండు.) నారిపుఱుపు.

గీ... నారిపుంటిపుఱుని బదిదినములు కట్ట వడిఁ దొలంగు. (చి. కి. చి. ని.)

నారీతరంగకుఁడు. సం. వి. అ. పుం. జారుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నారీదూషణము. సం. వి. అ. న. ౧. స్త్రీలను దూషించుట. ౨. స్త్రీలకుదోష హేతువు.
(శ్లో. పానం దుర్జనసంసర్గః పత్యాచ విరహోఽ టనమ్, స్వప్నోఽ న్యగృహవాసశ్చ నారీ ణాం దూషణాని షట్. మను.)

నారీష్ట. సం. వి. ఆ. స్త్రీ. మల్లిక, మల్లెతీఁగె.

నారు. స. క్రి. (√అను. అనుధాతువుయొక్క వ్యతిరేక ప్రథమమధ్యమపురుష బహువచనరూపము.) అనరు.
క. విదురుం డొక్కఁడు దక్కఁగ, సదస్యు లెవ్వరును ధర్మసంక్షయ మిది గ్యాఁడదు నార యతనిశీలమ, కుదు రీలోకమున కింత కుక్ దలఁపంగక్. భార.ఉద్యో.౩.౧౯౦.
వసంతతిలక. ఈబాలు నెత్తికొని యింటికిఁ జన్న నన్నుక్, నాబంధు లందఱు మనంబున నేమి నా రెట్లు...భార. ఆది. ౫. ౭౯.

నారుచు(ర్చు). స. క్రి. నాఁడఁజేయు.(శ.ర.)
గీ...మరుఁడు, వెడవెడన నార్వ నొగిలి కజ్జని గృహులు. ఆము. ౪. ౧౨౩. (శ. ర. పా. 'వెడవెడనె యార్వ' అని వావిళ్ల ప్రతి.పా. 'వెడవెడనె యార్ప' అని వేదం. పా.)

నారువ. వి. వృక్షవిశేషము.
సీ. నారువ సురపొన్న వారిజమును బొన్న నెల్లి మూఁలుగుబిల్లు నెమిలియడుగు. హంస. ౪. ౧౧.

నాఱు. వి. (త. నాఱు.) ౧. (మొక్కలు మొలచుటకు చల్లు) విత్తులు.
(వ్యవ.) వంగనాఱు చల్లిరి, బంతినాఱు పోసిరి.
౨. (నాఁటుటకై విత్తనములు ప్రత్యేకస్థలమున ఒత్తుగా చల్లి మొలపించు) మొలకలు.
సీ. అతికులంబులకప్పు గలయంతయును బుచ్చి నాఱు వోసినభంగి నవక మెక్కె. భార. విరా. ౨. ౫౨.
ఉ...తత్తనూవల్లికతోన మైఁ బులకవర్గము కా ముఁడు నాఱు వోయఁగక్. నిర్వ. ౬.౩౧.
సీ. నా ఱటంచనఁగను మీఱు వాప్యాంతరావళి...ఆం. భా. ౨. ౩౫.
సా: నాఱుపోసినవాఁడు నీరుపోయకమానఁడు. (పుట్టించినదేవుఁడుఁ పోషింపక మానఁడు.)

నార్పత్యము. సం. విణ. (అ. ఆ. అ.) నృపతి సంబంధ మైనది. వి. అ. న. నృపతిధర్మము, రాజత్వము.

నార్యంగము. సం. వి. అ. పుం. నారంగము, నారింజచెట్టు.

నాలంబి. సం. వి. ఈ. స్త్రీ. శివునివీణ.(వాచ.)

నాలవకొలము. వి. (√నాలుగు.) చతుర్థకులము, శూద్రజాతి.
సీ. కోయిల నాలవకొలముదాయాదుల కేలుకోఁ జిగురాకు నేల యొసఁగు. కువల. ౩. ౯౬.
నాలవకొలమువాఁడు=శూద్రుఁడు.
సీ. శూద్రనామంబులు శోభిలు నాలవకొలము వార లని గాఁపు లని పల్కె. ఆం.భా. ౨. ౭౭౨.
ఇట్లే: నాలవజాతివాఁడు.
శా. దేవా నాలవజాతివాఁడ నిను నర్థిం గొల్వఁ గా వచ్చితిక్. భార. విరా. ౧. ౭౧౭.

నాలవతొలిపలుకు. వి. (√నాలుగు.) అథర్వణవేదము.
సీ.ఆవాలు పాలు మే లగుతాడిపుడుకలు నెలమి నాలవతొలిపలుకునుడువు, లోలిమై గొడఁ గుచు ... వేలుచుటయు నందుఁ గల్లరిసత్తి యొకర్తు వొడమి. అచ్చ. రా. యు.౩.౨౩.

నాలవవాఁడు. విణ. (√నాలుగు.) ౧. నాల్గవవాఁడు, చతుర్థుఁడు.
ఉ. పాలితసత్యధర్మ మగు బ్రహ్మకులంబునఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బుట్టినట్టినఁ, నాలవవానిఁ జేయఁ దగునా
యనఁబోకు దిగీశ్వరాళిలో, నాలవవాఁడవై
బహుధనస్థుఁడవై మను మంచు మన్ననిఁ,
లాలన చేసి ధాత యొకనవ్యవిమాన మొసం
గి పెండియుఁ. ఉ. రా. ౧. ౨౭౮.

౨. నాలుగవతరమువాఁడు.

ద్వి. బ్రహ్మనాలవవాఁడు పరమసాహసుఁడు,బ్ర
హ్మచే వరములు వడసినవాఁడు. రం. రా.
బాల. ౨౩ పా. ౮ పం. (బ్రహ్మకొడుకు
పులస్త్యుఁడు. పులస్త్యునికొడుకు విశ్రవసుఁడు.
విశ్రవసునికొడుకు రావణుఁడు.)

౩. శూద్రుఁడు.

సీ... కాఁపువాండ్రు నా నాలవవాండ్రు నా
బలిజెవాం డ్రనఁ జనుశూద్రసమాహ్వయము
లు. ఆం. సం. మాన. ౨.

నాలి[1]. వి. ౧. అల్పకృత్యము; నీచకృత్యము.

ఆ. కూలి నాలిఁ జేసి గుల్లాపుఁబని చేసి, తెచ్చి
పెట్ట నాలు మెచ్చ నేర్చు, లేమిఁ జిక్కువి
భుని వేమాఱు దిట్టును... వేమన. ౧. ౬౩.

ఉ... కాఁకలం, దూలెదులేఁత మేను నయి తొ
ట్రిలు నమ్మగనాలినాలిచా, గాలఘువ ర్తనం
దరసి యంగజబాధితగాఁ దలంచుమఁ.
పాండు. ౩. ౬౫.

౨. కపటము.

రగడ. ననలు వేడిన మొఱఁగి తప్పదు నాలి నా
లికపుచంబు ముట్టకు. పారి. ౮. ౧౬.

౩. (=ఆలి.) పరిహాసము, వేళాకోళము.

సీ. సతిమోమునకుఁ దమ్మి సరి యంటిమా భువనం
బులో మిగులంగ నాలియయ్యె. చమ. ౨. ౮౯.

విణ. ౧. కుత్సితము; అల్పము.

క. నాలుకలు రెండు నిన్నుం, గ్రోలనె కల్పించె
నలువ ఘోరాహికి న, న్నాలిగ్రహ మపుడుఁ
దెగఁదినఁ, జాలద మృదుపవన విరహిజనదురి
తమునఁ. మనుచ. ౩. ౫.

శా. చెప్పం జిత్రముగాఁ జలంబు గొని వచ్చె
న్నాలి పెన్వాన యే, సెప్పాటం దరియింతు
... విప్ర. ౩. ౬౮.

క. ఆలాగునఁ గొనిపోయి నృపాలప్రియపా
న్పుక్రిందఁ బాదుక లిడి య, ప్పాలూలామాల
పునాలిగ,యాలి తనుం గానిదానియటువలె
నుండెఁ. సారంగ. ౩. ౧౩౬.

క... కడు నవ్వించుచుఁ జెఱఁగులు, ముడివెట్టఁ
జేరఁట్టాం డ్రు ముదితకను బొమల్, ముడివెట్టె
నాలిసిగ్గున... మనుచ. ౫. ౯౮.

౨. అసత్యమైనది, కల్లయైనది.

గీ. నాలిమాటలు నీపట్టైనామములును, శపథ
ములుఁ జూచి నిక్కంబు సాధు వనుచు,
నమ్మితినిగాక యి ట్లల్లనాఁడె నీదు,గుణ మె
ఱింగిన వెడలంగఁ గొట్టి విడుతు. విప్ర. ౫.
౫౫.

వ... రొద లేని నాలియేడ్పు లేడ్చుప్రియల నను
నయింప... చెక్కుటద్దంబులు నొక్కి ...
మనుచ. ౩. ౭౭.

క్రి. విణ. తేలికగా.

సీ. బ్రహ్మాండ మనుచిప్పఁ బ్రాణికందుకముల
నాలి యాడుదు నొంటిప్రేలఁ బట్టి. ప్రబోధ.
౩. ౩౭.

జః నాలితనము, నాలిబూతము, నాలిముచ్చు.

నాలి[2]=నారి. వి. నరము. (చూ. నాలిగుఱుపు.)

జః నాలిగుఱుపు.

నాలిక=నాలుక. వి. జిహ్వ.

ద్వి. లే దంచు నేద్వ నాలిక చూపు మన్న,
నాదరంబున వక్త్ర మల్లనఁ దెఱచె. ద్వి.
భాగ. (చి. ని.)

వ... నాలికలు పేలికలవిధంబునం దూలందూ
లుట గనుంగొని... జై. భా. ౪. ౧౦౦.

గీ. అబల చూడు శివద్రోహి యనుచుఁ గెరలి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యతనికంకణశేషాహి యావలించి, నాలికలు
గ్రోయుపగిది వనాలిచలిత, లాలితైలాలతాగ్ర
పల్లవము లమరె. రాజ. చ. ౨. ౧౪౫.

జః నాలికచేలు.

**నాలికచేలు.** వి.(√నాలిక.) ౧. తృణవిశేషము. (శ. ర.) ౨. (పశువుల)జిహ్వారోగవిశేషము.

ద్వి. నరుదకన్నును నీరు నాలికచేట్ల...ఆదిగా
నెన్నఁ, గలపసరాలరోగమునకు...నవ. ౧.౩౦
పొ.౧౯ పం.

**నాలికులుపు**=నారికులుపు. వి.(√నాలి[2].చి.ని.)

**నాలిగాలి.** వి.(√నాలి[1].)అల్పమైనగాలి, మందమారుతము.

క. అని వనిత నాలిగాలిం, గనలుచుఁ బోనాడి
తుహినకరకిరణఝరికిన్, మునుగఁ జనఁ జెలు
లు గని హా, యని వనరుచు...వసు.౪.౫౧.

ఇట్లే: నాలిగాడ్పు, నాలితెమ్మెర.

సీ. వలినాలిగాడ్పుబోదలహెచ్చరికలకుఁ జలివె
ల్గునుదుటువెన్నెలలసెగకు. నీలా. ౩. ౧౫.

చ. పొలుపుగ నందుఁ బెండ్లినడుపుల్ నడుపున్
వలినాలితెమ్మెరల్. విజ. వి. ౧. ౧౩.

**నాలితనము.** వి. (√నాలి[1].) ౧. అల్పత్వము, నైచ్యము.

ఆ. ఇదియ నాకు నాకు నితరేతరద్వేష, హేతు
వనుచుఁ దోఁచె నేకత న్వి, భూతి నెరపు
నేను బుంవ్యక్తులకు నాలి, తనముతో సమా
ఖ్య మనుచు బెట్టు. రాఘవ. ౨. ౭౩.

౨. కపటము; వంచకకృత్యము, కుత్సితపుపని.

(చల్లగాలి.)ఉ. నాలితనంబు నేర్చుకొని నక్కు
చు నక్కుచు వాడవాడ వ్రేలాలకలీలతావలి
కెలంకులనుం డిటు వచ్చి వచ్చి దం, భోళి
యుఁబోలె మీఁదఁబడిపోయెడు...రామా.
౮. ౪౮.

(నారదుఁడు.)ద్వి.తన నాలితనము చిందఁగఁ జెవిఁ
జేరి, సరసిసాక్షుఁడు నిన్నుఁ జంప నిలింప,
వరుతోడ యాదవాన్వయమునఁ బుట్టె...అ
నుచు నరిగె...అ.మ.క.౧.౧౮పొ.౧౬పం.

గీ. నాలితనములు మానవే నాతి యేల, యేల
వాడుఁదు చూడు మా యేలలీల. రాజ. చ.
౨. ౧౪౩.

**నాలిబూతము.** విణ. (√నాలి[1].) కుత్సితుఁడు; కుత్సితుగాలు.

గీ...కుచ్చితుఁడు దోసకారి చెనఁటి, పాలసుఁడు
నాలిబూతంబు పలువ తులువ, కూళ గడు
సన వర్తిల్లుఁ గుజను పేళ్లు. ఆం. సం.మాన.
౧౧.

**నాలిముచ్చు.** విణ. (√నాలి[1].) కుత్సితము; మందము.

ఆ. తగినమాట యొకటి మొగ మెఱ్ఱసేయక,
యంచలార యాలకించి వినుఁడు, తెలివి
గలుగువారికెలన నుండెడుమీకు, నాలిము
చ్చునడక నడక గాదు. చంద్రా. ౪. ౫౯.
(ఉభయార్థములకు నిదే యుదాహరణము.)

**నాలుక**=నాలిక, నాల్క. వి. (క. నాలిగె. త. నాక్కు.) ౧. జిహ్వ.

సీ. భానుబింబము నంటఁబట్ట నుంకించుపొల్పున
నహిధ్వజము నాలుకలు గ్రోయ. భా. రా.
యు. ౮౪౨.

మత్తకోకిల. నావునున్ మఱుమాట లాడఁగ నా
లు కాడక యుండి...భార. స్త్రీ.౧.౧౮౫.

ద్వి. ఆలోనఁ బవనజుఁ డసమానవిజయు, లోలుఁ
డై వానినాలుక పీకి చంపె. రం. రా. సుం.
౨౬౨ పొ.

౨. అగ్నిజ్వాల, మంట.

సీ. అజగవాదులకును బ్రజలైనధనువులుఁ బొది
నాలుకలు గ్రోయుప్రదరములును. కవి. ౨.
౯౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. వైరివినాశనక్రియకు వాసవుఁ డిచ్చిన డాఁచియున్న యా ఘోరపుశక్తి నాలుకలు గ్రోయ మెఱుంగులు ప్రజ్వరిల్ల...తగఁ గేల సమర్చి పేర్చి...భార. ద్రో. ౫. ౨౯.

(కృష్ణుఁడు కుంతితో నన్నమాట.) గీ. నాలుకలు గ్రోయునర్జునానలము దఱిసి, యెరగొనం గని సంతృప్తి యెసక మెసఁగు. భార. ఉద్యో. ౪. ౧౨.

(బ.) సర్పజిహ్వికలు.

గీ. అప్రమత్తుండ వగుచుఁ బద్మాక్ష నీవు, మ్రింగుదువుచాల నాఁకట వ్రేఁగుచుండి, నాలుకలు గ్రోయుభూరిపన్నగమువాతఁ, బడినయెలుకను భక్షించుపగిది ననఘ. భాగ. ౪. ౭౨౯.

ఉ. నాలుక లోలిఁ గ్రోయుచు ఘనస్ఫుటనిశ్వసితానిలంబులం, దూలిచె దేవయానములఁ దోరము లైనభుజంగసంఘముల్. భా. రా. యు. ౧౩౬౭.

నాలుకపయి నువుగింజ నానదు=నాలుక నువుగింజ నానదు.

ఉ. ఎక్కడివాఁడవోయి యొకయింత యెఱుంగవు బుద్ధికౌశలం, బెక్కడ కేఁగె నాలుకపయి న్నువుగింజయు నాననట్టిబల్, తక్కరి నారదుం డతఁడు ద్వైవతమార్గమునందు నేఁగఁగా, నక్కట నన్నుఁ బేర్కొనితి వాఁతడు విన్న ననర్థ మొందదే. నిరం. ౪. ౧౭.

నాలుకబెల్లము=వాఙ్మాధుర్యము, మాటలతీపి.

క. వికచముఖుఁ డగుచు శాత్రవు, లకు హితు లగునట్టివారలం గని భూపా, లకుఁ డెడ్డ కత్తెరయు నా, లుకబెల్లము నై మనఁబులుం గనవలయున్. భార. శాం. ౩. ౨౬౭.

నాలుక ముల్లు విఱుగు=మాటలాడలేకపోవు; అవమానము కలుగు.

గీ. అకట మోమోట లేక తా రంత చేసి, బ్రదికిపోయిరె పులి పేదవడినఁ బసుల, వాఁడ్రెం యొక్కొడి రసుకత వచ్చె నాకు, మునుల లోపల నాలుక ముల్లు విఱిగె. ఉ. హరి. ౪. ౧౦౨.

గీ. ప్రాంతభూరుహముల గల్గుపండ్లు దఱిచి, త్రుళ్లుచిలుకల నాల్కల ముల్లు విఱుతు. కవిక. ౩. ౧౧౦.

నాలుగు=నాలువు, నాల్గు. స. ఔ. బ. (క. త. నాలు, నాల్.) మూఁడునొకటి. (దీనికి వృత్తియందు 'నాలు, నాల్, నలు, నల్' అనురూపము లగును.)

చ...పది మేనియందుఁ గ్రి, క్కిఱియఁగఁ జేసి నాలుగిటు నేసె దురంగములన్... భార. విరా. ౩. ౨౧౫.

చ...పెట్టుఁ గలమాన్నము నొల్చినపప్పు నాలుగే, నొ్వగపినకూరలున్...ఆము. ౧. ౭౦.

సీ. గర్వించి నట్లుండు ఘస్రంబు నాల్గాలు నెదిరిఁ దన్నునఁగాంచు నెఱుక లేమి. కాశీ. ౬. ౧౯.

చ. అని తనకూఁతుఁ దోడ్కొనుచు నల్లుని యింటికి నేఁగ మామఁ జూ, చనలములోన నె య్యొలికినట్టుల మండుచు నిల్లువెళ్లి నాల్దినములుం నేఁడు నాకడకుఁ దెచ్చితి వే నలరాఘవుండనే, దనుజగృహీత సీతఁ దనదా, రని క్రమ్మఱఁ దెచ్చి యేలఁగన్. జై. భా. ౬. ౨౯.

విశ. కొంచెము, అల్పము.

గీ. ఎఱిఁగినవి నాల్గు నొడువ నెట్లేని లెస్స. ఆము. ౪. ౬౭.

నాలుగవలగనము=కర్కటలగ్నము.

సీ...నలుసునాలు, గవలగనంబుననన్ని గాములును మేల్చూచుక్కులఁ దనరార వేడ్కఁ బొడలి, మొదలివెలంది రామునిఁగాంచె... అచ్చ. రా. బాల. ౭౪.

వాడుకలోని ప్రయోగవిశేషములు :

అమ్మ పెట్టవలసినవి నాలుగును పెట్టినఁ గాని అబ్బాయి ఊరకుండఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాఁడు నన్ను అనవలసెనవినాలుగును అన్నాఁడు.
వాఁడు చదివినవి నాలుగుముక్కలైనను గర్వ
ముమాత్రము ఎక్కువగా నున్నది.

జ: నలుకాలు, నలుగంబాలాట, నలుగడ, నలు
గురు, నలుగేలు, నలుజాలు, నలుతును, నలు
దిక్కులు, నలుదెసలు,నలుపలము, నలుమడి,
నలుమడించు, నలుమాఱు, నలుమొగంబుల
ప్రోడ, నలుమొగంబులయన్న, నలుమొగం
బులవేల్పుచెలువ, నలుమోమయ్య, నలువ,
నలువంక, నలువండ్రు, నలువది, నలువదుగు
రు,నలువురు, నలుసాల, నల్గడ, నల్దెస, నల్వ,
నల్వగ్రుడ్డు, నల్వది, నాలవకోలము, నాలవ
తొలిపలుకు, నాలవవాఁడు, నాలుగుమూల
లాట, నాల్వాఁడు.

నాలుగుమూలలాట. వి. (√నాలుగు.) బాలి
కాక్రీడావిశేషము.

సీ. అచ్చనగండ్లు దోయాలును దాఁగిలిమూఁత
లు నాలుగుమూలలాట. దశా. ౨. ౨౧.

నాలువు=నాలుగు, నాల్గు.

క. ధ్రువమండల మాదలగా, రవిమండల మదు
గుగాఁగ రాజిలుపదునా,లువులక్షల యోజన
ముల,భువనము త్రిదివ మిది భోగభూమి
నృపాలా. కవి. ౩. ౬.

ఉ. ఆదినవంతసంఖ్యఁ దనరారుచు నేరి కగమ్య
మైనయా,వేదము లెల్లవిప్రులుఁ బ్రవీణత
తోఁ బఠియించునట్లుగా, శ్రీదనరార నా
లువుగఁ జేసినపుణ్యుఁ బరాశరాత్మజున్,
మోదముతో నుతింతు... విక్ర. ౧. ౧౦.

నాల్క=నాలుక, నాలిక. వి. జిహ్వ.

గీ. నాసికాగ్రంబు వంగుట నాల్క నల్లనగుట
వదనంబు గడు నెఱ్ఱనగుట యుష్ట్రి,రాసభ
ములు పూనినరథము నెక్కి, యమునిదెసఁ
జనఁ గలఁ గంట యాయు వడఁచు. మార్క.
౩. ౩౫౩.

చ. ఫణఫలకంబు విచ్చి...మణిమయపీఠమధ్య
మునవాల్కలు గ్రోయుచు నున్నవాసుకిన్,
ఫణికులసార్వభౌముఁ గని...నైష. ౫. ౨౯.

గీ. వేనవేలుమస్తకములు వేనవేలు, కన్నులును
వేనవేలునాల్కలును గలుగు,మూర్తివి ...
హరి. పూ. ౪. ౧౦౧. ఆం.భా.౨.౧౮౩.

నాల్క-(ర్క-)డము=నారికడము.
(కొబ్బెరకాయ.)

ఉ. అల్లనఁ జేర వచ్చి ధవళాన్నముఁ గమ్మని
యాలనేతితో, బెల్లముతోడ నాల్కడపుఁ
బేసెముతోడను నిమ్మపండ్లతో, వల్లభుకూర్మి
నెచ్చెలికి వారణవైరికి మంచుకొండరా,
యల్లునికిం బినాకికిఁ బ్రియంబున నూర్వశి
పెట్టె భిక్షమున్. హర. ౫. ౪౬.

నాల్గు=నాలుగు, నాలువు.

క. నారాయణపరములు నిజ,మారయ బ్రహ్మంబుఁ
బరము నంచితసత్యో, దారతపంబులు గా
వున, నారాయణపరత వీనినాల్గిటి నిచ్చున్.
భార. శాం. ౨. ౫౨.

శా. నాల్గుం జెల్లెడి బ్రహ్మచారిగృహివానప్రస్థ
యత్యాశ్రమం, బు ల్గైవల్యవివక్షు లుత్తమ
పదంబుం జేరువారిట్టివీ, ర ల్గోపించిన నంత
కుండుఁ జెడు మీరా యోర్చువా రిమ్మెయిన్.
ఉ. హరి. ౪. ౫౩.

నాల్గుకన్నులవేల్పు=అగ్నిదేవుఁడు.

సీ. నాల్గుకన్నులవేల్పునకు బ్రేల్మి లెన్నేనిఁ
జేసి మే లేమియుఁ జెందకున్న. అచ్చ.
రా. బాల. ౫౪.

జః నాల్గుగంబములయాట.

నాల్గుగంబములయాట= నలుగంబాలాట.

గీ. దోయములు సరిబేసులు దొరయునాల్గు,గం
బములయాట లచ్చనగండ్లు మొదలు,గాఁ
గ శైశవగరిమ శృంగార మలర, బాలికల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తోడ నాడు భూపాలపుత్రి. ఇందు. ౨. ౧౮౩.

నాల్నాఁడు. వి. (నాలుగు + నాఁడు.) ౧. చతుర్థదివసకృత్యము, నాల్గవదినమున చేసెడిపని. (ఋతుస్నానము.)

ఆ. కలితకీర్తిశాలి కశ్యపుఁ డొకనాఁడు, మానవతియుఁ జెఱఁగుమాసి యనల,నామతీర్థవారి నాల్నాఁడు చేసిన,యతివఁ గాంచి ప్రముదితాత్ముఁ డగుచు. హ. వరాహ. ౪. ౬౧.

౨. చతుర్థదివసము, నాలుగవదినము.

గీ. సవిత్రుఁ డుదయింప నాల్నాళ్ల జలకమాడి, జూడ వెవ్వారిఁ బురుషునిఁ జూచికాని. కాశీ. ౨. ౭౨.

నాళము. వి. లాడము. (శ. ర.)

(వ్యవ.) ఎద్దునకు నాళములు వేసినారు.

నాళము. సం. విణ. (అ. ఈ. అ.) నడతృణసంబంధమైనది. వి. అ. పుం. న. ౧. గడిలోనగు వానికాఁడ; పద్మాదిదండము, తామర లోనగువానికాఁడ. అ. న. ౧. గ్రోవి, గొట్టము. ౨. బోలునరము; రక్తనాళము. ౩. కత్తిపిడి. ౪. రంధ్రము. ౫. మగగుటి. (కే.ని.) అ. పుం. ౧. జలనిర్గమము, నీరుపోవుటకై యేర్పఱచినగొట్టము. (తూముకాలువ లోనగునది.) ౨. నడము, కిక్కసకసవు.

నాళవంశము. సం. వి. అ. పుం. ౧. బొంగు వెదురు. ౨. -వెదురువంటికాఁడ కలది- నడము, కిక్కసకసవు.

నాళి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. నాడి, తామరలోనగువానికాఁడ. ౨. దేహమందలిబోలునరము. ౩. వాతాదినాడి. ౪. నాడీశాకము. ఈ. స్త్రీ. ౧. శాకకలంబము, గోఁగు మొ. వానినార. ౨. గడియకాలము, ఇరువదినాలుగునిమిషములు. ౩. గజకర్ణవేధని, ఏనుఁగుచెవి కుట్టుసాధనము. ౪. తామర. ౫. తామరకాఁడ. ౬. ప్రణాళి, నీళ్లు పోవుతూములోనగునది. ౭. కాలమును తెలుపుటకై చేతితో కొట్టుఘటీయంత్రము.

నాళిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. నాళము, తామరలోనగువానికాఁడ. ౨. నాలితాశాకము, పెద్దతూఁటికూర. ౩. చర్మకష, సంబరేను. ౪. హస్తికర్ణవేధని, ఏనుఁగుచెవి కుట్టుసాధనము. ౫. శ్వేతకలంబి, తెల్లతీఁగబచ్చలి. ౬. గ్రోవి, గొట్టము; వెదురుగొట్టము. ౭. ఘుల్లీరంధ్రము, ప్రొయ్యిసందు. ౮. గడియకాలము. ౯. రంధ్రము. (కే. ని.) ౧౦. ఒకజాతివెదురుగంప. (కే. ని.)

నాళికము. సం. వి. అ. పుం. ౧. తామర. ౨. దున్న, మహిషము. న. ౧. తామరపూవు. ౨. వేణువు, పిల్లఁగ్రోవి. ౩. సంబరేను.

నాళీకము. సం. వి. అ. పుం. ౧. ఇనుపనాళము కలఆయుధము. (తుపాకి మొ.) ౨. బాణము; బాణపుములికి. ౩. కొబ్బెరచిప్పతో చేసినకమండలువు, నారికేళకమండలువు. న. ౧. తామరపువ్వు. ౨. తామరతంపర, పద్మసమూహము.

నాళీకాసనుఁడు. సం. వి. అ. పుం -పద్మాసనుఁడు - బ్రహ్మ.

నాళీకిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. తామరతంపర, పద్మసమూహము. ౨. తామరకొలను.

నావ. (సం. నౌః. ప్రా. నావా. క. నావె. త. నావాయ్.) ఓడ, కలము.

సీ. ఓడ నావ యనంగ నొప్పుచుండుఁ దరణి... ఆం. భా. ౧. ౧౫౭.

మ. ఘనసౌధాళి వియద్ధునీజలధి వీక న్నావలై నీడ దోఁప... ఆము. ౨. ౧౨.

ఉ. నావెడుమద్దనంబుఁ గొని నా కిడనొల్లక శాఠ్యబుద్ధియై. కేయూర. ౩. ౧౫౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నావ. సం. వి. ఔ. స్త్రీ. తరణి, ఓడ.

నావకుఁడు. సం. విణ. (అ. వికా. అ.) నుతించువాఁడు.

నావనీతము. సం. విణ. (అ. ఈ. అ.) నవనీతసంబంధమైనది.

నావారోహుఁడు. సం. వి. అ. పుం. ౧. నావమీఁద ప్రయాణము చేయువాఁడు. ౨ - పడవమీఁద ఎక్కించుకొనువాఁడు - నావికుఁడు, ఓడవాఁడు.

నావి. వి. సస్యరోగవిశేషము. (శ. ర.)

నావికుఁడు. సం. వి. అ. పుం. ౧. కర్ణధారుఁడు, ఓడ నడపువాఁడు. ౨. నౌకాయాత్ర చేయువాఁడు, ఓడమీఁద పోవువాఁడు.

నావుడు=అనవుడు. అవ్య. ద్రు. (√అను.) అనినపిమ్మట.

ఉ. నావుడు నవ్వులాట కనినం బవనాత్మజ యింత యేటికిౙ. భార. ఉద్యో. ౩. ౬౧.

వ...పద్మాక్షుఁడు, ధురతం దోడ్కొని పొమ్ము ...పురం,దరపుత్రా మనవీటిలోనఁ గలయోధవ్రాతముౙ నావుడుౙ. ఉ.హరి.౨. ౨౨.

క. ఉడురాజ నీవు పొడిచిన, జడనిధి యుడుకెక్కి వెక్కసంబునఁ బొంగుౙ, బడబాగ్ని నీఱి నావుడుఁ, బడఁతుక నీవేఁడిఁ జిమిడి పడ కెట్లుండుౙ. ద్వా. ౫. ౧౪౨. (ఇట 'అనఁగా, కాఁగా' అని భావము.)

నావురు=నాఁగురు. వి. నాగిని,ఒకజాతివృక్షము.

గీ...నాగిని నావురు నాఁగు రనఁగఁ, గేరు... ఆం. భా. ౨. ౬౨.

వ...కమ్మతావులు కలనావురాకులు వఱచి... మనుచ. ౪. ౬౦.

నావ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నావచే దాఁటఁదగినది. (దేశము, నది మొ.) వి. అ. న. నవత్వము, నూతనత్వము, క్రొత్తఁదనము.

నాశకుఁడు. సం. విణ. (అ. శకా. అ.) ౧. నాశము చేయువాఁడు, నశింపఁజేయువాఁడు. ౨. నశించువాఁడు.

నాశనము. సం. విణ. (అ. ఆ. అ.) నాశము చేయునది. (అ. ఈ. అ.) నశింపఁజేయ సాధనమైనది. వి. అ. న. ౧. నశింపఁజేయుట. ౨. కనఁబడకుండ చేయుట.

నాశము. సం. వి. అ. పుం. ౧. చేటు. ౨. మరణము, చావు. ౩. అదర్శనము, కనఁబడమి. ౪. పలాయనము, పాఱిపోవుట. ౫. అనుపలంభము, గోచరముకాకపోవుట.

నాశయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నశింపఁజేయువాఁడు.

నాశితము. సం. విణ. (అ. ఆ. అ.) నాశము చేయఁబడినది, నశింపఁజేయఁబడినది.

నాశ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నాశము చేయఁదగినది, నశింపఁజేయఁదగినది.

నాష్ట్రికుఁడు. సం. విణ. (ఋ. ఈ. అ.) నష్టద్రవ్యమునకు స్వామి, పోయినసొమ్మునకు అధికారి.

నాస. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఘ్రాణేంద్రియము, ముక్కు. ౨. ఏనుఁగుతొండముయొక్క అగ్రము, పుష్కరము. ౩. ద్వారముపై నుండుఅడ్డకమ్మి. ౪. శబ్దము, ధ్వని. ౫. వాసకము, అడ్డసరము.

నాసత్యులు. సం. వి. అ. పుం. ద్వి - అసత్యము లేనివారు- అశ్వినీకుమారులు, దేవవైద్యులు.

నాసరజేంగు. వి. గలిజేరువంటియొక నేలచెట్టు. (చి. ని.)

నాసానాహము. సం. వి. అ. పుం. శ్వాసనిరోధము కలిగించు నాసికారోగవిశేషము.

నాసాపుటము. సం. వి. అ. పుం. న. ముక్కుచెరమ, ముకుపుటము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాసామణి. సం. వి. ఇ. పుం. ముక్కఱ.(శ.ర.)

నాసారంధ్రము. సం. వి. అ. న. ముక్కురంధ్రము, ముక్కుఁగ్రోళ్లలో నొకటి. (ఇట్లే: నాసావివరము, నాసాచ్ఛిద్రము.)

నాసాలువు. సం. వి. ఉ. పుం. కట్ఫలము, పినగుమ్ముడు ?.

నాసావంశము. సం. వి. అ. పుం - ముక్కునడుమ వెదురువలె నుండునది - ముక్కుదూలము.

నాసాస్రావము. సం. వి. అ. పుం. జలుబుచేత ముక్కునందు చీమిడి కాఱుట, పడిసెము.

నాసి. వి.పిల్లి,మార్జాలము.(శ.ర.) విశ.నికృష్టము. (వ్యవ.) ఇది నాసిరకపుగుడ్డ.

నాసిక. సం=౧. నాస. ౨. ఒకానొకపట్టనము.

నాసికంధముఁడు. సం. విశ. (అ. ఆ. అ.) ౧. ముక్కుతో ఊఁదువాఁడు. ౨. ముక్కుతో ధ్వని చేయువాఁడు.

నాసికంధయుఁడు. సం. విశ. (అ. ఈ. అ.) ముక్కుతో త్రాగువాఁడు, ముక్కుతో ఎగఁబీల్చువాఁడు.

నాసిక్యము. సం. విశ. (అ.ఆ.అ.) ౧. నాసికయందు పుట్టినది. ౨. నాసికయం దున్నది. వి. అ. పుం. ౧. అనునాసికధ్వని. న. నాసిక, ముక్కు.

నాసిక్యులు. సం. వి. అ. పుం. ద్వి. అశ్వినీటుమారులు. (వై. ని.)

నాసిరిల్లు. అ. క్రి. ౧. నశించు. (శ.ర.) ౨. కృశించు. (చి. ని.)

నాసిలు. అ. క్రి. నవయు,కృశించు,క్షీణించు.
క. ఈసరణిఁ గామతంత్రా, భ్యాసపరిశ్రాంతి మిగులఁ బరవశ మైనన్, నాసిలి ధాతుక్షయమై, మాసములోపలన వాఁడు మరణమునొందున్. జై. భా. ౫. ౧౦౭.
సీ. శీతాంశు నొకఁడు నాసిలుచుండఁ గోపించె భానుని నొకఁ డుర్విఁ బడ నదల్చె.పి.శకుం. ౨. ౩౭.
ద్వి. వాసి వన్నెయుఁ దప్పి వర్తించురాజు,నాసిల్లి సమయు నెన్నఁగ సభలందు. ద్వి. శి. సా. ౧. ४३ పా. ౭ పం.

నాసీరము. సం. విశ. (అ. ఆ. అ.) అగ్రేసరము, ముందు పోవునది. వి. అ. పుం. ౧. ముందు పోవుసేన. ౨. సేనాముఖము,అనిమొన.

నాసీరుఁడు. సం. వి. అ. పుం. సేనకు ముందు నడచుయోధుఁడు.

నాస్తికత. సం. వి. అ. స్త్రీ. దేవుఁడు లేఁ డనియు పరలోకము లే దనియు నమ్మికట.

నాస్తికుఁడు. సం. విశ. (అ. ఈ. అ.) ౧. పరలోకము లేదు అనునమ్మకము కలవాఁడు. ౨. దేవుఁడు లేఁ డనునమ్మకము కలవాఁడు; వేదములయందు నమ్మకము లేనివాఁడు.

నాస్తిక్యము. సం. వి. అ. న. = నాస్తికత.

నాస్తిదము. సం. వి. అ. పుం. మామిడిచెట్టు. (వాచ, కల్ప.)

నాస్యము. సం. వి. అ. న. (ఎద్దుమున్నగువాని) ముక్కుఁద్రాడు.

నాహము. సం. వి. అ. పుం. ౧. బంధము,కట్టు. ౨. బోను, కూటము.

నాహారిగడలు. వి. బ. వాద్యవిశేషములు.
(నలకూబరుఁడు.) ఉ. ముందఱ నాహారిగడలు మ్రోయ భటావళి వెంట నంటి రా, వందిజనంబు గ్రమ్మి కయివారముఁ జేయఁగఁ గుందనంపుమేలందల మెక్కి వేడ్కఁ దను నచ్చరలందఱు మెచ్చి చూడ సంక్రందనుకొల్వు కేఁగ...ఉ. హరిశ్చ. ४. ౧౧౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాహలుఁడు. సం. వి. అ. పుం. ఒకజాతిమ్లే చ్ఛుఁడు.

నాహుషి. సం. వి. ఇ. పుం- నహుషునికొడుకు - యయాతి.

## ని

ని[1]. అప. ౧. ద్వితీయావిభక్తిప్రత్యయము. (చూ. ఇ[1]. ఉదా:- కృష్ణుని గంటిని.) ౨. భూతార్థకోత్తమపురుషైకవచనప్రత్యయము. (చూ. ఇ[1]. ఉదా:-చూచితిని గృష్ణుని.)

ని[2]. అప. వ్యతిరేకత్వవర్ణకార్థమునవచ్చుప్రత్యయము ఉదా:-చేయనికృష్ణుఁడు, పెట్టని కాముఁడు మొ.

ని[3]. అప. ౧.కొన్నిశబ్దములకు ద్వితీయాదివిభక్తులు పరమగునపుడు వచ్చుఆగమము.
ఉదా:-రామునిచేత, రామునికి మొ.
౨. గుణవాచకములకు కర్మధారయసమాసమందు వచ్చెడియాగమము.
ఉదా:-నల్లనిగుఱ్ఱము, తెల్లనిగోడ మొ.

ని. సం. అవ్య. ౧. నితాంతము, అధికము, అతిశయము.
ఉదా:-నికామము, నిపీతము మొ.
౨. అభావము.
ఉదా:-నివృత్తి, నిధనుఁడు, నిమూలము, నికర్షణము మొ.

నిఃక్షత్త్రము. సం. విణ. (అ. ఆ. అ.) క్షత్త్రియశూన్యము. (దేశాది.)
ఇట్టే : నిఃక్షత్త్రియము.

నిఁకెఱ. అవ్య. క్రి. విణ. శీఘ్రముగా. (చి. ని, శ. ర, బ్రౌ.)

నింగి. వి. ౧. ఆకాశము, అంతరిక్షము.
ఆ. అలిగి యాడుగఱచి యాఁకటిపెలుచన, నిలువలేక యసుర నింగి దాఁకఁ, బెరిఁగి...భార. ఆది. ౬. ౨౯౧.
గీ. నింగి నేలయుఁ దాటింప నంగలిఁచు,పగిది సేతెంచెఁ గ్రోధంబు గగనవీథి. నైష. ౭.౪౬.
క. పొంగుచు నరదముపైఁ బొలఁ,తిం గూరిమి నునిచి నేల్పుతెరువునఁ బఱచెం, బంగరుపిచ్చిక గొంచుఁగ్, నింగికి సాళువపుఁబులుఁగు నెగయుతెఱఁగునన్. అచ్చ. రా. ఆర. ౬౨. భార. విరా. ౧. ౧౬౨. ఆం. భా. ౧. ౬౯.
౨. స్వర్గము. (చూ. నింగిమ్రాను.)
జః నింగిచూలి, నింగిముట్టు, నింగిమ్రాను, నింగివడు, నింగిసిగ.

నింగిచూలి. వి. (√నింగి.) నభస్వంతుఁడు, వాయువు, గాలి.
గీ...నింగి,చూలి మబ్బులపగదాయ గాలి... అన మారుతాఖ్య లగు...సాం.ని. దే. ౧౩.

నింగిప(వ)డు. అ. క్రి.(నింగి + పడు.) సూర్యుఁడు మొ. అస్తమించు.
ఆ. సీత నట్లుపేక్ష సేసి మిన్నక యున్కి, నఖిలభూతములకు నధిపునల్కఁ, బట్టపగలు నింగిపడియె నా సేనార, జొంధకార మడర నపుడు కపులు. భా. రా. యు. ౨౪.
క. వీ రేమి కాచెదరు తా, నేరూపున బ్రతుకు వీర లేల సురలు జం,భారియుఁ గాచినఁ దన్నును,బారిసమరిగాక నింగివడనిచ్చెదమే. భార. ద్రో. ౩. ౧౪౨. (నింగిఁబడు అని అపముద్రి.)
శా. ఆవైతేయతనూజ నింగివడఁగా హర్మ్యంబుపై నొక్కనాఁ, డేదిక్కుం జెలిపిందు మెండుకొనఁగా నేకాంతనిద్రారతిన్, మోదింపక...ఉ. హరి. ౫. ౨౪.

నింగిమిరి. వి. సువర్చల †. (శ. ర, బ్రౌ.)

నింగిముట్టు. అ. క్రి. (√నింగి.) ఆకాశమునంటు, ఉన్నతమగు; మిక్కిలి యధిక మగు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆ. నింగిముట్టి యున్న జంగమమల్లయ,వరమునం
దుఁ గనినవస్తుకవితఁ,దగిలి...కు.సం.౧.౪౯.

వ...వెన్నెలలు గాయఁదొడంగినఁగడంగి నింగి
ముట్టినసంతసంపుటగ్గలికల ... చెన్నారువె
న్నెలపులుఁగులమొత్తంబులును ... నీలా.
౩. ౧౦.

నింగిమ్రాను. వి. (√నింగి.) స్వర్భూజము, కల్ప
వృక్షము.

మ. కురిసెన్ జల్లున నింగిమ్రానివిరిచిన్కుల్ దే
వతాదుందుభుల్,మొరసెన్...ఆజిజయప్పృ
థ్వీనాథునభ్యున్నతిన్. ఉ.హరిశ్చ.౪.౯౯.

నింగిసిగ. వి. (√నింగి.) వ్యోమకేశుఁడు, శివుఁడు.

ఉ. క్రొన్నెలతాల్చునింగిసిగకున్ గనుఁగందని
పూలదండయున్. రామా. ౫. ౧౯. (శ.
ర. పా.)

నించు=నినుచు. స. క్రి. (√నిండు.) ౧. (తటా
కాదులను జలాదులచే) పూర్ణముచేయు, నిండఁ
జేయు.

సీ. నీహారసలిలంబు నించి గాంచనకలశముల
మజ్జనమార్పఁ జనవు లేదు. వరాహ.౭.౪౮.

చ...కవీంద్రులు కొందఱు శేముషీమషీ,రసము
మనఃకటాహకుహరంబుల నించి కలంచి జి
హ్వికా, కిసలయతూలికం గొని లిఖింతురు
కబ్బములు...భీమ. ౧. ౧౨.

(భీముఁడు.) చ...ము,స్తకమును బీనదీర్ఘభుజశా
ఖలుఁ బాదయుగంబు మేనిలో,నికిఁ జొర
మగ్గుగాఁ దుటిమి నించిన ... భార. విరా.
౨. ౩౫౩. వసు. ౫. ౧౨౩.

౨. నెఱవేర్చు, సఫలముచేయు.

ఉ. నింతువు నాదుకోర్కె గమనింతువు కేళి
కహర్నిశంబు నా,నింతువు బొమ్మ గుబ్బలఁ
దనింతువుపౌరుష కేళిచేత...శశాం.౪.౮౦.

౩. వ్యాపింపఁజేయు, ప్రసరింపఁజేయు.

ఉ. నించితి సజ్జనసుతుల నిర్మల మైనయశంబు
దిక్కులన్. భార. ఆది. ౨. ౨౦౨.

చ...విదేహరా, జతులితచాపహస్తుఁ డయి య
వ్విభుపై శరవృష్టినించినన్.విక్ర.౩.౧౦౧.

(హరి.) క. కొంచెపునగవుల సంభా, వించుచు
వివిధాయుధాంశువితతుల్ దిశలన్, నిం
చుచు దనుజతమముఁ దూ,లించుచు రణకేళి
లోలలీలం జనుచోన్. నిర్వ. ౧. ౪.

౪. కలిగించు.

మ...తటిద్దేహను సవ్యపత్త్రలతికాశ్రీ నించి రా
శీజనుల్. వసు. ౫. ౧౨౦.

మ. జవవద్ఘోటకపాటితక్షితిరజస్సంక్రాంతిచే నిం
కుసింధువులం గ్రమ్మఱ సుర్వికిన్ దివికిఁ
దోడ్తో నించెఁ దన్నాగముల్, నవనిర్యన్మద
నిర్ఝరౌఘమున శుండాశీకరోర్ధ్వప్రవర్ష వి
ధిం దానను జేసి సింధురములన్ బ్రఖ్యాతిఁ
గాంచెన్ గరుల్. రాఘవ. ౧. ౧౧.

౫. ఉంచు, పెట్టు.

శా...చెలి నేత్రాబ్జంబులన్ వశ్య ల,క్ష్మీమూలం
బగుకావు నించె నన నుంచెం గజ్జలం బింతి
కిన్. వసు. ౫. ౧౧౮.

గీ. రౌహిణేయుఁడు భుజబలోత్సాహ మెసఁ
గఁ, జటులరథమున శస్త్రాస్త్రసమితి నించి.
ఉ. హరి. ౩. ౩౯.

గీ. కమ్మకస్తురిగులికలు తమ్మిలేమ, నిదురమంపునఁ
బుక్కిట నించి మేలు,కాంచి వేకువ నుమి
సె నాఁ గమలముకుళ,కోటరంబుల నెల
దేఁటికొదమ లెసఁగె. పారి. ౨. ౬౩.

౬. పోయు.

ఉ...ఇం,కెన్నఁడు విందు వీనుఁగవ కింపుగ వె
న్ననిముద్దుఁబల్కు లా,వన్నెలప్రోకయాద
లను వావిరిఁ బత్తెలిముత్తియంపుఁబ్రా, లెన్నఁ
డు నింతు... నీలా. ౧. ౧౯౨.

ఉ...ఆలతకూన వక్త్రపూ,ర్ణేందుకళల్ జెలం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గఁగ రహిన్ వరమాళిసుపాణిముత్తియం,పుం
దలఁబ్రాలు నించెఁ గరభూషణఘోషణ
ముల్ చెలంగఁగన్. ఇందు. ౬. ౫౩.

౭. ఏయు, ప్రయోగించు; నాఁటు, గ్రుచ్చు.

ఉ...సం,క్రందనుపై నిశాతవిశిఖంబులు నించె
సురల్ దలంకఁగన్. నిర్వ. ౬. ౧౩౫.

క. మెఱుఁగారు నారసమ్ములు, దఱుచుగ నించితిఁ
గడంగి తద్గాత్రమునన్. భార. ఉద్యో. ౪.
౩౨౦.

క. ఇంచుకయు నీడఁబోవక, కాంచనపుంఖప్ర
కాండకాంతిస్ఫాయ,త్పంచాశద్బాణంబులు,
నించె నతఁడు మత్స్యమేదినీపతిమేనన్.
భార. విరా. ౩. ౧౯౦.

౮. (ఊర్పులు) నిగిడించు, వెలువఱచు.

గీ. ధరణిపుఁడు దీర్ఘనిశ్వాసభరము నించు, న
ద్భుతము గాదె మీ చంద మరసి చూడ.
నైష. ౨. ౮౭.

ఉ. మచ్చిక శెట్టిగాఁగఁ దనమందిర మొంది
యభీష్టవస్తువుల్, నెచ్చెలు లెల్లఁ బొంది
సుఖలీలఁ జరింపఁగఁ జేయలేమికిన్, వెచ్చని
యూర్పు నించికొని విన్నఁదంబును బొంది
నెవ్వఁగ, న్వచ్చినయట్లు సజ్జనుఁడు వేఱొక
దుర్దశచేత నొచ్చునే. కేయూర. ౩. ౨౭౪.

౯. ఉద్గమింపఁజేయు, చిప్పిలఁజేయు.

క. శౌరి యిదె పారిజాతముఁ, గోరికఁ గొని చ
నుచు మనలఁ గొనిపోఁ డని లోఁ,గూరిన
నెవ్వఁగఁ దక్కి,న,భూరుహములు మధుర
సాశ్రుపూరము నించెన్. పారి. ౪. ౫౨.

ఉ...నీమదిలోఁ గలమర్మ మిప్డు ని,క్కమ్ముగఁ
జెప్పు నీకలికికన్నుల నీ రిటు నించ నేఁటికే.
వేం. మా. ౫. ౩౯.

౧౦. (పువ్వులు మొ.) చల్లు.

క. అసమభయభక్తు లలరఁగఁ, గుసుమంబులు
దోయిలించి కోమలి నించెన్, గిసలయభం
గంబులతో, నసదునడుము వణఁక మృడుని
యడుగులమీఁదన్. హర. ౩. ౭౪.

సీ. హరిపదంబును నీశుశిరము నైనసభంబున
నభోగతులు నించునన లసంగ. గీ...నవతా
రకాని కాయంబు లడరె. వసు. ౪. ౧౫.

మ. తనశృంగారవనంబులోన గిరిపాంతం జక్కఁ
గా దిద్ది తీ,ర్చినపూఁదేనియయేటికాలువదరిం
జెంగల్వపుప్పొళ్లు నిం,చినచంద్రోపలవేదిపై
సరసగోష్ఠి న్బోటియుం దాను న,వ్వనజాతా
యతనేత్ర శౌరిగుణముల్ వర్ణించి వాక్రుచ్చు
చున్. పారి. ౧. ౭౧.

౧౧. చేర్చు, కలుపు.

సీ. ప్రత్యూషహృతనూత్నభాండశీతాంబువు లే
లారజము నించి క్రోలువారు. ఇందు. ౩. ౯౬.

క. లలిఁ బంచదారలోపలఁ, దిలకింపఁగ నించి
జుంటితేనియలు కడున్, జిలుకఁగఁ బెరిఁగిన
పగడపుఁ,దలి రసఁగా సతివపెదవి తగుఁ
గొనియాడన్. యయా. ౪. ౪౦.

౧౨. పొందు.

మ. బలభిన్నీలకచామణి యిదియుఁ దప్పా
కాంతులం గోరి కాం,తలు చింతింపరా కం
తుకుంతముల వంత ల్నింపరో లేక నీ,తలనే
పుట్టెనె... కువల. ౩. ౧౦౮.

సీ. జేవురించినకఁటిచిగురుచాయలతీరు సిందూ
రతిలకంబు చెలువు నించె. హర. ౪. ౮౮.

౧౩. వీక్షించు, చూచు.

ఉ. పంచశరుండు తత్పరత బాణవిమోక్షణ
కాలముం బ్రతీ,క్షించుచు గౌరి శంకరునిఁ
జేరినయప్పటినుండి యెప్పుడున్, నించునో
కో హరుండు తరుణీమణి నంచును వింట
నారి సా,గించుచు నుండెఁ జెంత...హర.
౩. ౭౭.

౧౪. పాఁతించు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ... మెకములజాడ లరసి... వలలు హత్తించి మాటులు పెట్టించి తెరవులు గట్టించి పోటు కోలలు నించి... ఇందు. ౨. ౬౦.

౧౫. ఆవరించు, ముంచు.

మ... తాదాత్వికమోదఖేదగుణశీతాశీతనేత్రాంబు ల్యాననము న్నింప గుహుండు రాఘవునకు స్వందారుఁడై యి ట్లనుక్. చం.రా. ౪. ౬౪.

నింట=నిట్ట. వి.(√నిండు.)౧.జలపూరము,వెల్లువ.

క. కంటిమి కన్నులపండువు, మంటి మనుచుఁ దద్గుణౌఘమధువాహినివెన్నింటం దేలుచు సమ్మద,కంటకితాంగు లయి యేఁగి కాంచిరి వరుసన్. హరి. ఉ. ౬. ౨౭.

౨. పొంగు; అతిశయము.

(చంద్రోదయవర్ణనము.)ద్వి. విరహులబలుమంట విబుధులపంట,సురతంబులకు నింట సొబగులవెంట. నవ. ౨. ౧౧ పొ. ౨౭ పం.(ఉద్దీపనహేతువు అని భావము.)

నిండఁబడు=నిఁడు. అ.క్రి. (నిండు + పడు. స్వార్థమున.)

(వ్యాపించు.)

ఆ. ఎన్నఁ బెక్కు లగుచు నెక్కడఁ జూచిన, నడచువారు నడువఁ గడఁగువారు, విడియువారు మఱియు వీడెత్తువారునై, నేల యీనినట్లు నిండఁబడిరి. భా. రా. యు. ౨౧౪.

నిండారు=నిండు. అ.క్రి. (నిండు + ఆరు[1]. స్వార్థమున.)

(పూర్ణమగు.)

సీ.నిండారుచందురునినుపారునునుఁగాంతిఁ జెలువగా మరుఁడు సృజించినట్లు. మార్క. ౩. ౯౧.

క. నిండార జలము గ్రావియు, వెండియు వెండియును గడుపు వెలితిగఁ బైపై, నొండొండఁ గ్రోలి జలరుహ,షండంబులతోడఁ గ్రీడసల్పుచు నుండన్. వా. లీ. ౧. ౯౬.

సీ. నిండార విరిసినపుండరీకశ్రేణి యామినీరమణ రేఖాళిగాఁగ. నైష. ౧. ౯౬.

(కడచు, అతిక్రమించు.)

క.లలిఁ జాలింతతనంబులఁ, దలరెడునమ్ముద్దునేల దాలుపునవలా,తలమానికముల కటుల,న్నెలలేర్పడఁ దొమ్మిదియును నిండారుటయున్. అచ్చ. రా. బాల. ౧౩.

(అతిశయించు, అధికమగు.)

క. అనిన విని సింహబలమర్దను నవలోకించి ద్రుపదరాజతనయ యి,ట్లనుఁ దనమనమున నిండా,రినసమ్మోదంబు వెలివిరిసి బెరయంగన్. భార. విరా. ౨. ౩౪౯.

క... మోదము ధృతరాష్ట్రుని నెమ్మనమున నిండారె నఖిలజనచిత్తములను బ్రియము దలిర్చెన్.భార.ఆశ్ర.౨.౧౦. విక్ర. ౨.౫౪.

(నిండు, వ్యాపించు.)

వ...ఏకదండి త్రిదండిబ్రహ్మచారులయున్నమితదండంబుల నిండారుకషాయకద్రువస్త్రకాపీనపరంపరలం గ్రమ్మి...ఆము. ౪. ౫౩.

వ...వ్రేలునంసంబులు దూలుమాంసంబులు జీరువ్రేవులు జాలుమోవులు తోరంబులై పుడమికి భారంబులై పడి నిండారుచుండ... చంద్రా. ౬. ౯౧.

(లోఁతు కలదగు, గంభీరమగు.)

సీ...నిండారునీటిలో బాలునితో నన్ను బట్టి త్రోచె. దశకు. ౨. ౧౧౦.

మహాస్రగ్ధర. అనినన్ వడ్డింపఁజొచ్చెన్ హరిణనయన నిండారుడెందంబుతో...పాండు. ౪. ౧౭౭.

నిండించు. స. క్రి. (√నిండు.) ౧. నెఱవేర్చు, సిద్ధింపఁజేయు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. కుండలములుఁ గవచము నట్టుండఁగ నిమ్మ
నఘ వేఁడు మెయిందుధనంబుల్, నిండింతు
నీమనోరథ,మెం డేమి యు నసకు మింక
నూర్జితచరితా. భార. అర. ౭. ౩౬౧.

౨. వ్యాపింపఁజేయు.

శా. ఆకాశంబు వెలుంగఁ దోఁచె ... రాకాచం
ద్రదివాకరానలశిఖారత్నప్రభాజాలరే,ఖా
కాంతిం బురుషుం డొకం డవట లోకం
బెల్ల నిండించినఁ, మాకన్నుంగవ లిట్టిరూప
మని నమ్మంజాల వయ్యెఁ నృపా. ఉ. హరి.
౨. ౫౦.

నిండిక. సం. వి. ఆ. స్త్రీ. కలాయభేదము, ఒక
దినుసుగుండ్రని సెనగలు, బటానీ. (కల్ప.)

నిండు=నిండఁబడు, నిండారు, నిండుకొను. అ. క్రి.
౧. (క) జలాదులచే పూర్ణమగు.

గీ. తనువున హిమానితాశ్లేషజనితపులక, రాజకై
తవమున రాగరసము నిండి, ధైర్య మనుకట్ట
నగలింపఁ దాళలేక, వల్లభునిపొందుఁ గోర
నవ్వారిజాక్షి. దశా. ౩. ౧౫.

శా...కప్పారుపూఁదేని యఁ, నీశెల్లప్పుడు నిం
డి యుండు...విక్ర. ౧. ౯౦.

(చ) నెఱవేఱు, సిద్ధించు, సఫలమగు.

క. భరితతపస్కులు కాశ్యప,వరమునియును
నదితియును ధృవంబుగ నే ని,య్యిరువుర
కోర్కియు నిండఁగ,హరిహయసోదరసుఖం
బు నందెదఁ బ్రీతిఁ. హరి.ఉ.౧౦.౧౨౦.

గీ. ఆరగించెఁ జతుర్విధాహారములను, మనసు
కోరిక నిండంగ మునిగణంబు. కాశీ. ౭.
౧౮౭.

ద్వి. నినుఁ జూడఁ గంటిమి నిండె మాతపము,
అనఘాత్మ ధన్యుల మైతి మే మనిన. రం.
రా. ఉ. ౫ పా. ౨౩ పం.

(ట) సర్వాంగసంపూర్ణమగు.

గీ. వలపు గలిగిననిండుజవ్వనిని వనినిఁ,గలయు
కంటెను సౌఖ్యంబు గలదె వేఱె. దశా.
౩. ౨౪.

క. కాని తెఱఁగైన నింతటి,మానిసిఁగా నేల చే
యు మనుజేంద్రుఁడు న,న్నీ నెఱిదప్పినమా
టలు, నీనోరఁ వెడలఁ దగు నె నిండినసభ
లోఁ. భార. ఉద్యో. ౨. ౧౫౯.

శా. మాహాత్మ్యంబులు తేజముల్ విభపసం
పత్తుల్ విమర్శింపఁగా,సోహంభేదము లేదు
నిండు సభలో నొక్కింతమాత్రంబు ...
పరాహ. ౧౦. ౮.

౨. పూర్ణమగు, సమాప్తమగు.

మ. నవమాసంబులు నిండఁగా గురుఁడు కేంద్ర
స్థాయియై యుండఁగా,శివలగ్నంబున నుద్భ
వించె సుతుఁడర్చిష్మంతు నంశంబునఁ...
కాశీ. ౪. ౯. కవిరా. ౧. ౯౧.

౩. సంతోషించు. (చూ. నిండుకొను.)

౪. అతిశయించు, అధికమగు.

క. కొండవడ డాఁకి వాడి యొ,కండును దెస
లేక యేన్చుకోమలతను నా,ఖండలసమానుని
శిశువు, నిండినకృపఁ గోరి చేరె నెఱి నంబు
దముల్.

వ. ఆత్మీయతోయకణంబుల నొయ్యన సంతర్పి
తుంజేయు నెడ...హరి. ఉ. ౯. ౧౦, ౧౧.

క. నిండినమూర్ఛల ధృతకో,దండనమత్కోటి
భూషితశిరోధులతో, నుండు నెడ బభ్రువా
హుఁడు, గాండివగుణరావబోధకరనుతిఁ దె
లిసెఁ. జై. భా. ౫. ౨౦౧.

గీ. శారదాదేవి మామకస్వాంతవీథి, నిండువేడు
క విహరించు చుండుఁగాత. నైష. ౧. ౫.

౫. వ్యాపించు, ప్రసరించు.

ఉ... దిక్కులం, జిచ్చఱతూపుతండములు సిం
హరవంబులు నిండెనొక్కటఁ.పారి.౫.౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా...ఘూర్ణితో, ద్యత్తీ రాంబుధి జంతుఘోష ములు మెం డై నిండె బ్రహ్మాండముక్. దశా. ౨. ౨౦౩.

సీ. నిండదే పండువెన్నెలతేట చల్లఁగా నీ వింత నవ్విన నీలవేణి. కవిరా. ౨. ౧౬౧.

౭. (ఆయువుమొ.) ముగియు.

సీ. తగ ధనుర్గుణ మీవు తెగ నిండఁ దీసిన దివిజారివరుల కాయువులు నిండు. ఉ.రా.౧. ౩౨౪.

సీ. మనుపఁడే యాయుః ప్రమాణంబు నిండినఁ గారుణ్యబుద్ధి మృకండుతనయు. గీ. ఇందు మౌళికి నినుఁ గాచు టెంతభరము. కాశీ. ౪. ౪౦.

౮. పూర్ణత.

(వ్యవ.) పిల్లలు లేనిచో ఇంటికి నిం డుండదు.

,, ఆతనిరాకవలన సభకు నిండు వచ్చినది.

విణ. పూర్ణమయినది. (శ. ర.)

క్రి. విణ. ద్రు. అధికముగా, పూర్ణముగా.

మ. ధరణీనాథ యతండు శాతశర ముద్యద్వృత్తి సంధించి యుద్ధురభంగిఁ దెగ నిండగాఁ దిగిచి...భార. మౌ. ౭౩.

సీ. తగ ధనుర్గుణ మీవు తెగ నిండఁ దీసిన దివిజారివరుల కాయువులునిండు. ఉ. రా. ౧. ౩౨౫.

సీ...నెల మూఁడువానలు నిండఁ గురిసె.ఆము. ౧. ౩౪.

కడుపునిండు=ఆఁకలితీఱు.

గీ. నీవు మఱి యింటిలోన గుండ్రించుచున్నఁ, గడుపునిండుసె దొరఁ జేరి గాస మడుగు, పొమ్ము... శుక. ౨. ౩౭౧.

నిండుమనము=నెమ్మనము.

ఉ. నిండుమనంబు నవ్యనవనీతసమానము పల్కు దారుణా, ఖండలశస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు...భార. ఆది. ౧. ౧౦౦.

గీ. పొగరుచూపులు చపలంబు లగును నైన, నిండుమనములు మిక్కిలి నిశ్చలములు.పాండు. ౫. ౧౮౦.

ఉ. నిండుమనంబుతోడ ధరణీధరకన్యయుఁ దాను గాశిఁ గాఁపుండి... కాశీ. ౫.౧౪.

మనంబునిండఁగ=హృదయపూర్వకముగా.

ఉ. నాకు మనంబునిండ నొకనమ్మిక సేయుము ...శివరాత్రి. ౩. ౭౯.

సా: నిండుకుండ తొణఁకదు.

,, కడుపునిండినబేరము.

,, కడుపునిండనా కాలునిండనా.

జ: నించు, నింట, నిండఁబడు, నిండారు, నిండించు, నిండుకొను, నిండువెన్నెలు, నింపాది, నింపారు, నింపు, నిక్కాఁక, నిట్ట, నిట్టగ్రమ్ము, నిట్టదొట్టి, నిట్టద్రోచు, నిట్టపాడుచు, నిట్టులుద్రోచు, నివ్వెర, నివ్వెరఁగు, నివ్వెరపడు, నివ్వెఱ, నివ్వెఱఁగు, నివ్వెఱపడు, నివ్వెఱపఱచు, నివ్వెఱపాటు.

నిండుకొను=నిండు. స. క్రి. (నిండు+కొను. స్వార్థమున.)

(అతిశయించు.)

క. గుండియ జల్లన మదిలో, నిండుకొనినభీతి నావినిర్మలచిత్తం, బుండక నలుగడలకు న, య్యండ విడిచి పఱవఁ దలఁచు నాసమయమునక్. శేష. ౨. (శ. ర.)

(వ్యాపించు.)

(వ్యాసుఁడు.) వ...లేదు నడువుండు పొం డను నిషేధవాక్యంబులు చెవులు నిండుకొన విప్రవాటంబులఁ బ్రతిగేహంబును బరిభ్రమించి ...భీమ. ౨. ౧౦౧.

సీ. ప్రేతవనాయాతవాతశీతవిభూతినికరంబు నెమ్మేన నిండుకొనఁగ. గీ. రుద్రుఁడీవేళ మెలఁగెడు రౌద్రముగను. దశా. ౩. ౫౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(అయిపోవు, వ్యయమగు.)

(వ్యవ.) ఇంటిలో బియ్యము నిండుకొన్నవి.

(ఇట వ్యతిరేకలక్షణముచే 'అయిపోయినవి' అని భావము.)

(సంతోషించు.)

క...నిన్నుం, గనుఁగొంటిం బందు వయ్యెఁ గన్నులకును నా, మన మిపుడు నిండుకొనియెన్... కరు. ౨. ౫౦.

వ...భుజగాండకాండంబు లని నిండుకొను గ్రహమయూరికల...ఉ. రా. ౧. ౧౩౭.

నిండువన్నెలు. వి. బ. (√నిండు.) వస్త్రవిశేషములు.

సీ.నిండువన్నెలు మంచినిగమగోచరులు సామంతవీఘులు ప్రతిమలును బొగడ, పచ్చలు... ప్రబంధ. ౨౭౨.

నిందం సం. వి. ఆ. స్త్రీ. ౧. నిందించుట, గర్హణము. ౨. అపవాదము.

నిందకుఁడు. సం. విణ. (అ. దిశా. అ.) నిందించువాఁడు.

నిందత్. సం. (శత్రు.) నిందించుచున్న.

నిందనము. సం.వి.అ.న. దూఱుట, నిందించుట.

నిందనీయము. సం=నింద్యము.

నిందాస్తుతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. నిందారూపమగుస్తుతి, పైకి నిందవలె కనఁబడునది. ౨. (అలం.) వ్యాజస్తుత్యలంకారభేదము.

నిందించు. సం. స. క్రి. దూషించు, దూఱు.

మ. నిను నిందించినదట్టునా దొగవో వాణీనాథు శాసింపవో. కాళ. ౪. ౧౦౯.

మ...సిరులన్ నిందించి నిస్సాత్మ ని,ష్క్రియతన్ గానఁగరాదు పండితునకున్ శ్రీకాళహస్తీశ్వరా. కాళ. ౪. ౭౩.

సీ. నిందించినను నభినందించినను మేలుఁ జెందించినను...గీ. ఎందుఁ దగులక విందుగా నందుకొనుచు. సీతారా. ౨. ౧౫౦.

నిందితః సం. విణ. (బు. త్రి. బు.)=నిందకుఁడు.

నిందితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. గర్హితము, నిందింపఁబడినది. ౨. నిషేధింపఁబడినది. ౩. అధమము, నీచము. ౪. ధిక్కృతము, తిరస్కరింపఁబడినది.

నిందితవ్యము. సం=నింద్యము.

నిందువు. సం. వి. ఉ. స్త్రీ. మృతప్రసూత, చచ్చినబిడ్డను కన్నస్త్రీ. (విల్యమ్సు.)

నింద్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిందింపఁబడుచున్నది.

నింద్యము. సం. విణ. (అ. ఆ. అ.) నిందింపఁదగినది, దూఱఁదగినది, గర్హ్యము.

నింపాది. విణ. (నింపు + ఆది.) ౧. సమృద్ధము.

ఉదా :- కొలనిలో నీళ్లు నింపాదిగా నున్నవి. (శ. ర.)

౨. సుఖితము.

(వ్యవ.) మనవారందఱు నింపాదిగానున్నారు.

,, నేను నింపాదిగా నున్నాను.

నింపారు= నినుపారు. (శ.ర.√నిండు.)

నింపిరి. వి. మలము.

సీ. మలవాచకం బగు మసటు నింపిరి మస్టు... ఆం. భా. ౨. ౧౩౪.

నింపు=నించు, నిండించు. స. క్రి. (√నిండు.) ౧. నిండఁజేయు.

(క) పూరించు, పూర్ణముచేయు.

ఆ. అంబకళము ద్రావి యది మొద లాపంది, రొచటి కరుగఁబోక రొఱుకనీటు, గంజి కడుఁగుచేతఁ గడుపు నింపుచుఁ గొంత, కాల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముండె జాతిగతుల నంత. చెన్న. ౨. ౨౪.

క. అనినఁ దలంపున నింపిన, యనుకంప నిలింప చంపకామోదసుతుం, డనునయ మొప్పఁగ నోడకు, మని నిజవృత్తాంత మడుగ నది యిట్లనియెన్. మనుచ. ౪. ౪౨.

(చ) -మామిడికాయ మొ. వానిలో కారము మొ - కూరు.

ఉ. వీండె ఖలుండు దక్షుఁ డనువీఁటిఁడిపాలుఁడు...శివదూషకు నాలుకకోసి యుప్పునిం, పుండు...కు. సం. ౨. ౨౧౪.

౨. వ్యాపింపఁజేయు, ప్రసరింపఁజేయు.

చ...న్నలడలఁ బ్రసూనకోరకనికాయము నింపిన సొంపు మెంపునన్. వసు. ౧. ౧౪౪.

౩. సిద్ధింపఁజేయు, నెఱవేర్చు.

శా...ముగ్ధాకుచద్వంద్వసం, సక్తిం దాదృశభూతి తావకకృపాసంసిద్ధి లేకబ్బునే, ముక్తాహారత నున్నయంతనె తలంపు ల్నింపు నాకింపుగాన్. వసు. ౪. ౧౦౫.

౪. కలిగించు.

మ...చిల్కరాపల్కుసొం, పులు నెంతే విపరీతభావమున నింపుల్ నింపమిం బొక్కుచున్. చంద్రా. ౨. ౧౪౪.

వ ... పొడవుకెంపుసొంపు నింపువిడికెంపురవచెక్కడంపుఁబసిఁడిగద్దియ నధివసించి ... దశా. ౧. ౧౪.

వి. బలుపు. (సమృద్ధము అని శ.ర.)

(ప్రగల్భ.) సీ. పయ్యెదకొంగులోపలఁ బిక్కటిల్లెడునెవ్వఁగుఁజన్నులనింపుసొంపు. గీ. కలిగి...కావ్యా. ౩. ౪౧.

విణ. ౧. సమృద్ధము, పూర్ణము; అధికము.

ద్వి. కెంపులై సొంపులై కెందమ్మిచాయ, నింపులై యింపులై నిగుడుహస్తములు. ద్వి. పరమ. ౩. ౧౮౩ పొ. ౪ పం.

ఉ. నిద్దపుఁజెక్కుటద్దముల నింపులుగాఁ బులకల్ జనింప నమ్ముద్దియ బోటిమూఁపుపయి మోమరదోఁపఁగ నిల్పి యత్తతిం, దద్దయుఁ బ్రేమఁ జూచె నిజనాథు...కళా. ౬. ౨౩౪.

౨. మనోహరము.

మ. కలయం గిన్నరగీతిఁ గూడ మృదురేఖం బాడుమత్తాళిసం, కులము ల్గింపురుసాంగనాతతి యెలుంగు ల్వించు భావించుమా, యెలుఁగు ల్నింపుగనిచ్చుకో వెలలు...కు. సం. ౩. ౨౬౦.

నింబతరువు. సం. వి. ఉ. పుం. ౧. వేము ***.**

౨. మందారము***.**

నింబబీజము. సం. వి. అ. పుం - వేఁపగింజలు వంటి గింజలు కలది - రాజాదనము, పాలచెట్టు. న. వేఁపగింజ.

నింబము. సం. వి. అ. పుం. వేము ***.**

నింబువు. సం. వి. ఊ. స్త్రీ. జంబీరభేదము, ఒకజాతినిమ్మ***.** (వాచ.)

నింసనము. సం. వి. అ. న. చుంబనము. (వై. ని.)

నికటము. వి. (క. నికటము.) నిర్బంధము. (శ. ర.)

విణ. అవిచ్ఛిన్నము, ఎడలేనిది.

గీ. పానలేపనములు నిమ్మపండ్లనైన, నామలకసారములనైన నహరహంబు, కట్టడఁగఁ జేయ సాయాహ్నకాలమునను, నికటముగ నీళ్లు పోయంగ నీఁగు వెట్టి. (చికి. చి. ని.)

చ. త్రికటుకము ల్లవంగములు దెచ్చి సమంబుగఁ జల్లతోడుతన్, నికటము గాఁగ నూఱి ...(చికి. చి. ని.)

నికటము. సం. విణ. (అ. ఆ. అ.) దేశకాలములచే సన్నిహితమైనది, ఆసన్నము. వి. అ. పుం. న. సామీప్యము.

నికము=నిక్కము. క్రి. విణ. యథార్థముగా, సత్యముగా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్వి. సకలంబు నడుపుచు సకలంబునందు, నికము దా నడువనినిర్గుణి యతఁడు. బస. పు. ౧౮౫ పా. ౩౯౫ పం. (నిజవరి అనిప్రాఁత ప్రతిపా.)

గీ క్షీణసంకల్పజాలుఁ డౌ జీవుఁ డొందు, నికము బ్రహ్మత్వమును...అధ్యా. ఉ. ౨౪౬ పా. ౧౨ పం.

నికరము= నిగరము. విణ. శ్రేష్ఠము, సారభూతము.

సీ. పతిఁ గూడి యామినీసతి మజ్జనం బాడు నికరంపుఁబన్నీరు నెఱసె ననఁగ. గీ...పండువెన్నెల సెలంగె. రా. వి. ౩. ౧౧.

సీ. నికరంపుఁబాపోసులరు మ్రొక్కు మనుచు దేవేంద్రనందనుఁ బట్టి యీడ్చి రనుచు. కువల. ౧. ౪౧.

సీ...మేల్బంతి నికరము మేటి మేలు, తరమాణి యం చనఁ దనరు శ్రేష్ఠము... ఆం. భా. ౩. ౧౫.

నికరము. సం. వి. అ. పుం. ౧. ప్రోగు, రాశి; సమూహము, మొత్తము. ౨. సారము. ౩. న్యాయదత్తధనము, న్యాయముగా ఇచ్చినధనము. ౪. నిధి.

నికర్తనము. సం.వి.అ.న.కత్తిరించుట,త్రుంచుట.

నికర్షణము. సం.వి. అ. న ౧. (నిర్గతకర్షణము= దున్నుటలేనిది) దున్నని నేల. ౨. నివేశనస్థలము, ఇల్లు మొదలగునవి యావరించి యున్నప్రదేశము. ౩. సన్నివేశము, పట్టనము పల్లె లోనగువానికి బయటనుండువిహారభూమి. (పురోపకంఠము, గ్రామకంఠము.)

నికష. సం. వి. ఆ. స్త్రీ. రాక్షసమాత యగు నొకానొకస్త్రీ.

నికషము. సం. వి. అ. పుం. ౧. కషణము, ఒరయిక, రాపు. ౨. ఒరగల్లు, గీటుఱాయి. ౩. ఒరగంటివంటిపరీక్షాసాధనము.

శ్లో. నన్వేవ దర్పనికష స్తవ చంద్రకేతుః.ఉ. రా. చ. ౫. ౧౦.

౪. శాణము, కత్తులు మొదలగునవి సానఁబట్టు సాధనము. ౫. ఒరగంటిమీఁద రాచినబంగారు మున్నగువానిగీఁత.

శ్లో. అయమపి పటు ర్ధారాసారో న బాణపరంపరా కనకనికషస్నిగ్ధా విద్యుత్ ప్రియా న మ మోర్వశీ. విక్రమో. ౪. ౨.

౬. పరీక్షార్థము ఒరగంటిపై గీచుబంగారులోనగునది.

శ్లో. యదా నిర్గుణ మాప్నోతి ధ్యానం మనసి పూర్వజం, తదా ప్రజ్ఞాయతే బ్రహ్మ నికషం నికషే యథా. సం.భార.శాం.౨౦౩. ౧౨.

నికషాత్మజుఁడు. సం.వి. అ. పుం. నైరృతుఁడను రాక్షసుఁడు.

నికషోపలము. సం. వి. అ. పుం. ఒరగల్లు, గీటుఱాయి.

నికామనము. సం. వి. అ. న. కోరుట; మిగులఁ గోరుట, తీవ్రేచ్ఛ.

నికామము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అధికమైనది. ౨. అధిక మగుకోరిక కలది. వి. అ. పుం. న. మిక్కిలి కోరిక, తీవ్రేచ్ఛ. క్రి. విణ. ౧. యథేచ్ఛము, ఇష్టముచొప్పున. ౨.పర్యాప్తము, చాలినంత. ౩. మిక్కిలి, అధికముగా.

నికాయము. సం. వి. అ. పుం. ౧. సజాతీయప్రాణులసంఘము; వర్గము, తెగ. ౨. సమూహము, ప్రోగు. ౩. నివాసము. ౪. లక్ష్యము, గుఱి. ౫. పరమాత్మ.

నికాయ్యము. సం. వి. అ. పుం. గృహము, ఇల్లు.

నికారణము. సం.వి.అ.న. మారణము, చంపుట.

నికారము. సం.విణ. (అ.ఆ.అ.) శఠము,దుష్టము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. కోయిల నోరసోఁకనిచిగుల్లు నికారపుఁ
జిల్క భిన్నముల్, సేయనిపండ్లు కాలఁవడి
లేవడితెమ్మెరకూన రాశిగా, వేయనికమ్మ
పుప్పొడి... వేం. పంచ. ౪. ౧౨౫.

వి. అ. పుం. ౧. పరిభవము, అవమానము.
౨. మారణము, చంపుట. ౩. భర్త్సనము, బెద
రింపు. ౪. ఖలీకారము, అపనిందచే దోషిఁగా
చేయుట. ౫. అపకారము, కీడుచేయుట. ౬.
(ధాన్యాదులను)తూర్పెత్తుట,ఎగురఁబోయుట.
౭. ధాన్యము ప్రోగుచేయుటకై ఎగఁద్రోయుట.
౮. కోపముచే పండ్లుకొఱుకుట మొదలగుమ
ఖవికారము.

నికార్యము. సం=నికాయ్యము. (వై. ని.)

నికాశము. సం. విణ. (అ. ఆ. అ.) నీకాశము,
తుల్యము. (దీనికి తఱుచు వ్యస్తప్రయోగము
లేదు.)

శ్లో. విద్యుత్పుంజనికాశ కేశనయనభ్రూశ్మశ్రుజా
లైర్నభః. మాలతీ. ౪. ౧౩.

వి. అ. పుం. ౧. ప్రకాశము. ౨. సమీపము.

నికాషము. సం. వి. అ. పుం. కషణము, ఒరపిడి.

నికుంచకము. సం. వి. అ. పుం. ౧. సోల. ౨.
జలవేతసము, నీటిప్రబ్బలి.

నికుంజము. సం. వి. అ. పుం. న. ౧. పొదరిల్లు.
౨. గుహ, గవి. ౩. గుహవలె నుండుగది మొ.

శ్లో. దధాన స్సాంద్రానా మలఘుషు నికుంజేషు
ఘనతా, మసౌ సంధ్యాశంఖధ్వని రనిభృతః
ఖే విచరతి. మాలతీ. ౨. ౧౨.

నికుంభము. సం. వి. అ.పుం.దంతి, నేపాలము.

నికుంభితము. సం. వి. అ. న. నృత్యవిశేషము.

నికుంభిల. సం. వి. ఆ. స్త్రీ. ౧. లంకపశ్చిమ
ద్వారమందలియొకగుహ. ౨. అందలిదేవి, భ
ద్రకాళి.

నికుంభుఁడు. సం. వి. అ. పుం. ౧. శివానుచరు
లలో నొకఁడు. ౨. కుంభకర్ణునికొడుకు. ౩.
ప్రహ్లాదునికొడుకు. ౪.సుందోపసుందులతండ్రి.

నికురంబము. సం. వి. అ. న. సమూహము.

నికురుంబము. సం=నికురంబము.

నికృంతనము. సం. విణ. (అ. ఈ. అ.) త్రుం
చునది; కత్తిరించునది. (కత్తెర మొ.) వి. అ.
న. ఛేదనము, త్రుంచుట; కత్తిరించుట.

నికృతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పరా
భూతము, భంగపఱుపఁబడినది, అవమానింపఁ
బడినది. ౨. దూరీకృతము, త్రోసివేయఁబడినది.
౩. దూఱఁబడినది, నిందింపఁబడినది. ౪. వం
చింపఁబడినది. ౫. శఠము, కపటహృదయము
కలది. ౬. పతితము, పాపి. ౭. నీచము. వి.
అ. న. నికృతి, వంచన.

నికృతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. భర్త్సనము, బెద
రింపు. ౨. క్షేపము, నిరసించుట, త్రోసివేయు
ట. ౩. శాఠ్యము, వంచన. ౪. దీనత. ౫. భూ
మి. ౬. నిందనము, నిందించుట. పుం. అష్ట
వసువులలో ఎనిమిదవవాఁడు. (ధర్మునికి సాధ్య
యందు పుట్టినవాఁడు.)

నికృత్తము. సం. విణ. (అ.ఆ.అ.) నఱుకఁబడినది.

నికృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అధ
మము. ౨. జాతివృత్తిహీనము, జాత్యాచారా
దులచే నిందితమైనది.

నికేచాయము. సం. వి. అ. పుం. (గోమయాదు
లను) మాటిమాటికి ప్రోగుసేయుట.

నికేతనము. సం. వి. అ. పుం. -రోగము పోఁగొ
ట్టునది- పలాండువు, నీరుల్లి. న. -జనులు దీని
యందు వసింతురు- గృహము, ఇల్లు.(వాచ.)

నికేతము. సం. వి. అ. పుం. గృహము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నికేసరము. సం. వి. అ. పుం. కుబ్జకము, గొజ్జంగిచెట్టు.

నికోచకము. సం. వి. అ. పుం. అంకోలము, ఊడుగుచెట్టు.

నికోచనము. సం. వి. అ. న. ముకుళిత మగుట, ముడుఁగుట.

నిక్కచ్చి. వి. ౧. నిర్బంధము.

(వ్యవ.) వాఁడా యప్పునకై నన్ను నిక్కచ్చి చేయుచున్నాఁడు. (శ. ర.)

౨. నిగ్గు, సారము.

ఆ. పాఱుఁ డొక్కఁ డొకఁడు పడుచువాఁ డిట వచ్చి, పోయి యొకఁడ చిక్కఁ బోటుబం టు, కలను వోడువ నుప్పుఁగలువోలె నిక్క చ్చి, తేరువాని కోడువారె మీరు. కకు. ౨. ౧౧౨.

నిక్కపుజగము. వి. (నిక్కము + జగము.) సత్యలోకము.

గీ. పుడమి వీరికిఁ జోరరానియెడలు లేవు, మీఁటి నిక్కపుజగమైనఁ దూఱి వాలుఁ, గంటిచం దంబు దెలిసి రాఁగలరు మీరు, సెలవొసం గిన నంచుఁ జెచ్చెర నతండు. అచ్చ. రా. కిష్కిం. ౮౬.

నిక్కపుటాలు. వి. (నిక్కము + ఆలు.) ధర్మపత్ని, పాణిగృహీతి.

క. ఎక్కువకులం బతనికిని, నిక్కపుటా లైనదాని నీచకులుం డు, క్కెక్కఁగ బలిమిం గలిసినఁ, దక్కని చంపుటయె రాజధర్మం బెందుక్. విజ్ఞా. ప్రా. ౧౦౮.

నిక్కము. వి. (క. నిజ్కవ.) ౧. యాథార్థ్యము, వాస్తవము.

ఉ. నిక్కము దాఁప నేల ధరణీసురనందన నాకు నీపయిం, జిక్కె మనంబు... మనుచ. ౨. ౫౧.

చ. సమరము వెంపు సెప్పెదవు సంజయ... ఘగుడం బుఱికొంట లేదె ని,క్కము సెపు

మా తనూజుభుజగర్వవిహీనత నొంచెఁ జిత్తముక్. భార. కర్ణ. ౧. ౧౭౨.

క. మేనుల కెల్లను జీవుఁడు, తానే గోవిందుఁ డొకఁడు తండ్రియున్నాఁ, డా నిక్కముతన కబ్బెను... నృసిం. ౪. ౧౫౮. నైష. ౩. ౧౪.

౨. సత్యము.

(క) త్రికాలాబాధ్యత, శాశ్వతత్వము.

క. అమృతమయు ఋగ్యజుస్సా,మముల యుపనిషద్వచస్సమాజములకు వా,చ్య మయిన పురుషోత్తము ని,క్కమురూ పగువాని భక్తి గమ్యుఁ దలంతుక్. భార. శాం. ౨. ౨.

(చ) సత్యవాక్యము.

మ. నిజదారైకపరత్వముక్ గరుణయుక్ నిక్కంబునుక్ దాల్మియుక్ ... పం, కజగర్భుండు గృహస్థధర్మములుగాఁ గల్పించె సుర్వీశ్వరా. భార. శాం. ౨. ౨౩౧.

సీ... అహింస నిక్కము దాల్మి మత్సరవర్జ మిని వనవాసజనుల, కాగమవిహితంబులు ...భార. శాం. ౧. ౪౫.

గీ. మంచినిక్కము గలవానిమాట నమ్మి. దశకు. ౬. ౧౧౭. ఆం. భా. ౧. ౧౧౯.

విణ. యథార్థము.

(క) సత్యమైనది.

సీ. అవ్యయుం డైన వేదవ్యాసువచనంబు నిక్కం బు గా కుండునొక్క వేల్పు,లార... భార. ఆది. ౮. ౨౦౮.

చ. కృపణు మునిప్రియుక్ మనుజకీశకుశాశ్రయు రామచంద్రు ని,క్కపుదొరగాఁగఁ బల్కెదవు... అధ్యా. యు. ౧౮౧ పా. ౨ పం.

క... ఓ,హో యిది నిక్కము నృప నా,రాయణుఁడె పరంబు... ఆము. ౪. ౮౪. (వి అని శ. ర.) ప్రభా. ౧. ౧౨౬.

(చ) అసందిగ్ధము.

గీ. చావు నిక్కంబు బ్రదుకుట సంశయంబు. కాశీ. ౨. ౧౨౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ...ముం,దఱ నీక శౌరి భర్తఁ డని నందను
బాధలఁ బెట్టినప్పు డే, నఱిమితి దైత్యవల్ల
భుని నంతరఁ జేర్చెద నిక్కము...దశా.
౪. ౧౨౫.

(ట) అన్వర్థము, సార్థకము.

వ...అతనికిఁ బరజి త్తనునిక్కంపుఁ బేరివాఁడు
పుట్టె...హరి. పూ. ౩. ౧౨౩.

క్రి. విణ. నిజముగా, నిశ్చయముగా.

మ. నిను సుద్దామరసతూహలోత్తరునిగా నిక్కం
బెదం గాంచి చ,య్యనఁ బుత్తెంచెఁ బురం
దరుండు...హరి. ఉ. ౨. ౧౫౪.

జః నిక్కపుజగము, నిక్కపుటాలు, నిక్కము
చేయు, నిక్కల.

నిక్కముచేయు. స. క్రి. (నిక్కము + చేయు.)
నిశ్చయముచేయు, దృఢపఱుచు.

క. జక్కవలకు రవి యిఁకఁ బ్రా,గ్దిక్కుధరం
బెక్క ననుచుఁ దెలియఁ ద్రివాచకన్,నిక్క
ము చేసిన తెఱఁగునఁ, గొక్కొక్కొ రతులఁ
గోడి కూయఁదొడంగెన్. వరాహ. ౪.
౧౬౪.

నిక్కల. వి. (నిక్కము + కల.) సత్యస్వప్నము,
నిజమగుకల.

క. నాకల నిక్కల యయ్యెడు,శోకింపకు మమ్మ
నీవు సుందరి పుణ్య,శ్లోకు జితశోకు నతు
లవి,వేకుం బ్రియుఁ బొందఁ గలుగు వేగమ
నీకున్. భార. అర. ౬. ౪౦౧. ('నిక్కల
యయ్యెడున్' అనఁగా యథార్థదృష్టఫలక
మగునని భావము.)

క. నాకల యెన్నఁడు నిక్కల,గాకుండఁగ నిటు
పరాకు గాఁ బని గలదే. విప్ర. ౩. ౪౫.

సీ...నిక్కల యన నిశ్చయస్వప్నంబు నివ్వ
టిల్లు. ఆం. భా. ౧. ౧౪౨. నిరం. ౧.౮౦.

నిక్కవుడు. వి. (సం. నిష్కపటః.) నిష్కాప
ట్యము.

సీ...నిష్కపటాభిధ నిక్కవు డంచన నెగడు
చుండు. ఆం. భా. ౧. ౧౩౭.

నిక్కవొడుచు. అ. క్రి. (నిక్కు + అ + పొ
డుచు.) నిక్కన నిల్చు.

(వ్యవ.) మేన వెండ్రుకలు నిక్కవొడిచెను.
(శ. ర.)

నిక్కాఁక. వి. (నిండు + కాఁక.) మిక్కిలికాఁక.

(వ్యవ.) అతఁడు నిక్కాఁకచే చిక్కిపోయి
నాఁడు.

విణ. నిండుకాఁక కలది. (శ. ర.)

(వ్యవ.) ఆతనిది నిక్కాఁకశరీరము.

నిక్కించు. స. క్రి. (√నిక్కు.) నిగుడఁజేయు,
పైకి లేవఁజేయు.

వ...గవ్వారిఁ గాలు ద్రవ్వుచు లాంగూలచలనం
బుతోఁ జెవులు నిక్కించి మోర యెత్తి యా
వులించి...రా. వి. ౪. ౬౫.

క. పిక్కలతొడలనడుములం, దొక్కటఁ బద
తలము నిడి సమున్నతి నొడలిన్, నిక్కించిన
నీయాసన, మక్కజముగ స్వస్తికాహ్వయం
బగు జగతిన్. సీతారా. ౧. ౯౭.

నిక్కిచూచు. అ. క్రి. (√నిక్కు.) తేఱిచూచు,
చక్కఁగా చూచు.

సీ. నిక్కిచూడఁగఁ జాలెనే యంబరీషుని దు
ర్వాసుఁ డొనరించుదుర్నయములు. విప్ర.
౪. ౪౯.

నిక్కు=నిగుడు, నివుడు. అ. క్రి. ౧. నిగుడు; పైకి
లేచు.

సీ. నిక్కి వెళ్లని కొమ్మ లుక్కన విఱుఁగఁగఁ
దిగిచి ధారుణిఁ ద్రోచి పగులఁద్రొక్కి.హరి.
పూ. ౬. ౮౩.

మ. సకలాంగంబులు నిక్కి దీపకలికాస్తంభం
బులై యుండ్రు ప్రా,యక చూడామణు
లొప్ప రాక్షసునిశుద్ధాంతంబులన్ శేష

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వా, సుకికర్కోటకతక్షక ప్రముఖచక్షుశ్శ్రోత్ర బృందారకుల్. హర. ౩. ౫.

సీ. తొండము ల్సాఁచి యందుగుఁజిగుళ్లకు నిక్కు కరులదంతచ్ఛాయ గడలుకొనఁగ. మనుచ. ౨. ౪.

చ. అన విని మానినీతిలక మప్పుడు మే యుఱ దోఁప నిక్కి...పారి. ౧. ౧౨౪.

సీ. ఒకయిక్క నిది వితర్దిక నిక్క మని పవా గ్రము నిక్క రహి నెక్కఁగాఁ దలంతు. వసు. ౪. ౪౩. చంద్ర. వి. ౨. ౧౩౭.

౨. ఉన్నతమగు, ఎత్తగు.

సీ. నిక్కి వీనులతోడ నెక్కసక్కెము లాడు కరణి నున్నవి వీనిఘనభుజములు. మనుచ. ౨. ౩౬.

౩. వర్ధిల్లు, హెచ్చు.

ఆ. మించి వృశ్చికాదిపంచమాసముల నొక్కొక్కగడియ రాత్రి నిక్కి నపదు, దివములందు నెల్ల దిగజాఱు నొక్కొక్క,గడియ నెలఁదఁ దత్ప్రకారమునను. భాగ. ౫. ౨. ౪౭.

౪. ఉబుకు, ఉబ్బు.

సీ. ఘనరుచంబులు నిక్క గంధర్వకామినుల్ ధవళాతపత్రముల్ దాల్చి నడువ. భా. రా. సుం. ౧౪౪.

గీ... పైటలో మదనిబటువు, బిల్లక్రియఁ బట్టుకంచెలఁ బిగువుఁజన్ను, నిక్కి... ఆము. ౧. ౫౯. విక్ర. ౪. ౧౪.

౫. అతిశయించు, అధికమగు.

వ. అనుటయుం గనుంగవం గినుక నిక్క నక్కుమారయుగళంబు...ఉ. హరి. ౪. ౨౦౪.

చ. అని యిటు లామునిప్రభుపు లందఱు మోదము నిక్క నొక్కతీరున...వినుతి యొనర్ప ...వాల్మీ. ౧. ౪౭.

దండకము... ప్రాజ్యసామ్రాజ్యసంపత్తిచే నిక్కవే కీర్తిఁ బెంపెక్కవే పెక్కవే శేఁడు లంచుక్... దశా. ౪. ౨౩౨.

౬. సాఁగు, దీర్ఘమగు.

సీ. నిగిడి నిక్కిన జాఱునీవి గన్గొను నాస వెలఁది కందనితీఁగవిరులఁ జూపుఁ. ఉ. రా. ౬. ౫౫.

సీ. కమ్మనూకిననూత్నకలధౌతమును బోలెఁ జక్కఁగ నిక్కి మై సొక్కి మానె. భీమ. ౪. ౧౩౦.

౭. వ్యాపించు.

సీ. శ్రీగంధవాసనల్ చిక్కఁగ నిక్కఁగ సారంగధరుఁ డని చేరఁబోవు. సారంగ. ౩. ౨౩౭.

సీ. నిఖిలలోకంబుల నిక్కుచీకటిమిత్తి విలసిల్లుషోడశకళలగుత్తి. గీ. లోకహితకారి యీ చక్రవాకవైరి. చిత్రభా. ౪. ౧౧౦.

౮. కలుగు, పుట్టు; ఉదయించు.

చ... ధరణీజసంతతికిఁ గోరకదంతము లించుకంత నిక్కిన యది యాదిగాఁ జెలఁగెక్ వనలక్ష్మి...ఆము. ౫. ౧౧౬.

సీ. పోలిరెడ్డికి మగపోఁడిమి లేదుగా గాది కేలాగునఁ గడుపు నిక్కె. శుక. ౨. ౪౨౨.

ఉ. కాంచినఁ బొంగి వా రొసఁగుకానుక లర్థిఁ బరిగ్రహించి మ, న్నించి పురప్రయాణరతి నిక్క నరేంద్రుఁడు... మనుచ. ౫. ౪౨.

గీ. సున్నపుంగుండ యన నిక్కెఁజుక్క తేఁడు. రా. వి. ౩. ౯.

౯. సంతోషించు.

గీ. ధూళిధూసరుఁబరికించి యేల నిక్కఁ, బావనస్నానవిధిమృదాభవ్యుఁ డాత్మఁడు...నైష. ౪. ౧౨౫.

శ్లో. శ్రుత్వా జనం రజోజుష్టం తుష్టిం ప్రాప్నోజ్ఝటి త్యసౌ. సం. నైష. ౧౪. ౧౯౯.

సీ. అందతిండ్లకు నాస యై యుండు నిత్తఁ దని నిక్కుబందుగు లెంత పొక్కవలయు. నిరం. ౨. ౧౨౭. భీమ. ౨. ౪౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧౦. గర్వించు.

శా. నాసామర్థ్యము నీ వెఱుంగ వనిలో నక్తం
చరశ్రేణి నుల్లాసం బొందఁగఁ గూల్చి ని
క్కదవు వేల్లచ్చాపనిప్రాక్కాంతబాణాసా
రంబున నీప్రతాపదహనవ్యాసంబు నే నా
ర్చెదన్. భా. రా. యు. ౧౯౯౬.

ఆ.తోలుదాల్పువనుఁగు తొమ్మిదిపాఁతఱల్,రొ
క్క మున్న దనుచు నిక్కఁ గాని, లెక్క
కెక్కఁ డైనరొక్కంబుఁ దఱఁగని,కొలు
చుఁ గలదు ప్రోలికోమటులకు.నీలా.౧.౩౭.

ఉ. చక్కనిదాన నంచు నెలజవ్వని నంచు జగం
బులోనఁ జే,రెక్కసదాన నంచుఁ బతి యెం
తయు నా కనురక్తుఁ డంచుఁ దా,నిక్కుచు
విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల సత్య ...
పారి. ౧. ౬౬.

వి. ౧. ఉన్నతి, ఔన్నత్యము.

చ... అందు నేనుఁగుల్, దనరుచు నుండు నా
కసము దాఁకెడునిక్కున...యయా.౧.౮౩.

(మర్కటంబులు.) వ... పిల్లల నక్కునందు
నెక్కొన నిల్పి నిక్కుగలకొమ్మల నెక్కి...
ప్రబంధ. ౧౮౬.

౨. పొటకరింపు.

సీ. కెంగేలఁ బైఁటచెఱంగు బిగించుచో నిద్దంపుఁ
జనుదోయినిక్కు దోఁప. కువల. ౨. ౩౦.

౩. బింకము, పటుత్వము.

ఉ. చన్నులు నిక్కు దప్పెఁ గచసంతతిపై న
ర మూపెఁ జెక్కులం, జెన్ను దొలంగె...
జాహ్నవీ. ౪. ౫౫.

౪. అందము, ఒప్పు; విలాసము.

సీ. అసురీముఖోజ్వలహాసంబుకైవడి నిండారు
వెన్నెలనిక్కు దక్కు. భా. రా. యు.
౧౪౩౧.

గీ. ఒక్కరక్కసి వెక్క సై సొక్కు దాని, ము
క్కుచెవులకుఁ గలనిక్కు చక్కచేసి.
సీతావి. ౧. ౧౦.

సీ...నిక్కు మిటారింపు నీటు...అనఁగ విలాస
మొప్పుచుండు. ఆం. భా. ౧. ౧౩౯.

ఉ. నిక్కగఁ జూడు చిత్ర మిది నెమ్మది వేడుక
నోలలాడున,మ్మక్కలగుట్టు బట్టబయ లై
గనుపింపఁగ శౌరి పొన్నపై, నెక్కి రమించు
చున్కి...సారంగ. ౨. ౮౦.

నిక్కుచెవి(వుల)నీలఁడు=ఉచ్చైశ్శ్రవము.

ఉ... నెఱసాహసపుంగొమరుండు మ్రొక్కఁ
గా, నక్కునఁ జేరి మే నివిరి యాదల మూ
ర్కొని చొక్కుచుండె లో, నెక్కొను
వేడ్క నిక్కుచెవినీలని నెక్కువజీరుఁ డ
య్యెడన్. విజ. వి. ౩. ౯౯.

సీ. వింటితెర్వరిమేటి వెల్లగొరును నిక్కుచెవు
లనీలని నెక్కి చెలఁగు పెల్ల. ఉ. రా. ౫.
౨౧౮.

ఇట్లే: నిక్కువీనులజక్కి.

గీ. దేవతాశ్వంబు వెలయును దెల్లతేజి,నిక్కువీ
నులజక్కి నా నీలకంఠ.ఆం.భా. ౧. ౫౬.

ద్వి. తలఁపుమిన్నయుఁ గామితము లిచ్చుమొద
వు,వెలిగొరు నల నిక్కువీనులజక్కి. విష్ణు.
౪. (శ. ర.)

జః నిక్కవొడుచు, నిక్కించు, నిక్కిచూచు,
నిక్కఁబోతు, నిక్కుడు, నిక్కులించు.

నిక్కఁబోతు. విశే. (నిక్కు+పోతు.) గర్వస్వ
భావము కలవాఁడు. (శ. ర.)

నిక్కుడు=నిక్కు. వి. (√నిక్కు.) ఉన్నతి.
(శ. ర.)

నిక్కులించు స.క్రి.(√నిక్కు.)నిగుడఁజేసికొను.

క.వలసిన మేపులు గొని క్రాళ్లు లావులును నిక్కు
లించి..., పులుగులు చట్టుప లార్చుచుఁ,
గొలకొల మని కూఁత లిడుచు గూడులు
సేరెన్. ప్రబంధ. ౬౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిక్కవము= నిక్కము. వి. సత్యవాక్యము.

ఉ...ఎట్టిచో, బాయనినిక్కవంబులకుఁ బట్టు ధరిత్రిఁ జతుర్విశ్వధృ,నాయకుఁడు ... కావ్యా. ౩. ౬.

విణ. యథార్థము.

(క) సత్యమైనది.

గీ. నిక్కవం బింత నమ్ము నీరజాక్షి. భార. విరా. ౨. ౫౬.

సీ. అపరాధశంక యావంతయైనను లేదు నీచిత్తమున కెక్క నిక్కవంబు. హర. ౧. ౨౪.

ఉ. అత్తనుమధ్యరూపు గడు నందముగాఁ గుసుమాయుధుండు నా,చిత్తమునందు రేఖగొని చిత్రము వ్రాసెనో... మదనుమాయయో నిక్కవమో తలంపఁగన్. కు. సం. ౬. ౧౨౫. ఆం. భా. ౧. ౧౧౧.

(చ) అసందిగ్ధము, స్పష్టము.

ఆ. అనఘ నమ్మునీంద్రుఁ డైన వేదవ్యాసు,వలన దీని నిక్కవముగ వింటి. భార. ఆది. ౬. ౨౧౩.

(అన్నము.)ఆ... పెట్టునతనిఁ జే యొడ్డెడు, వానిఁ దలఁప నందు వరుఁడు పెట్టు,వాఁడ యగుట నిక్కవంబు ... భార. శాం. ౧. ౧౩౩. విక్ర. ౫. ౧౪౦.

క్రి. విణ. నిజముగా.

చ. జననుత సర్వధర్మములు సర్వజగత్ప్రవర్తన క్రమం,బును మఱి సర్వవంశములుఁ బుట్టిన మార్గము నీవ నిక్కవం, బనఘ యెఱుంగుదు...భార. ఆది. ౪. ౨౧౯.

గీ. నీవు మామగఁటిమి గని నిక్కవముగ, మెచ్చుతఱియును వచ్చెడు మీఁద నింక,నిప్పు డూరక వాగ్వాద మించుకయును,సెలవు లేదు విచ్చేయుము సిద్ధవర్య. హరి. ఉ. ౬. ౧౧౧.

ఉ. నిక్కవ మీవు సూర్యశశినిర్మలవంశజు లైన రాజులం, దొక్క మహానుభావుతనయుండవు గావలయున్ నరోత్తమా. భార. విరా. ౧. ౧౫౧.

నిక్తము. సం. విణ. (అ. ఆ. అ.) కడుఁగఁబడినది, శుద్ధము చేయఁబడినది.

నిక్వణము. సం. వి. అ. పుం. ౧. ధ్వని, శబ్దము. ౨. వీణాధ్వని.

నిక్వాణము. సం=నిక్వణము.

నిక్ష. సం. వి. ఆ. స్త్రీ. లీఖ, ఈరు. (వాచ.)

నిక్షణము. సం. వి. అ. న.చుంబనము,ముద్దిడుట.

నిక్షిప్తము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. త్యక్తము, విడువఁబడినది. ౨. ఇల్లడ పెట్టఁబడినది, తాకట్టుగా ఉంపఁబడినది. (భూషణాది.) ౩. ఉంపఁబడినది. ౪. పాఁతఁబడినది, పూడ్వఁబడినది.

నిక్షుభ. సం. వి. ఆ. స్త్రీ. ౧. సూర్యునిభార్య. ౨. బ్రాహ్మణస్త్రీ. (వాచ.)

నిక్షేపకుఁడు. సం. విణ. (అ. పికా. అ.) నిక్షేపించువాఁడు.

నిక్షేపణము. సం. వి. అ. న. ౧. అడుగులు మొదలగువానిని ఉంచుట. ౨. అట్టివానిని ఉంచుటకు సాధన మైనది.

నిక్షేపణీయము. సం.విణ. (అ.ఆ. అ.) ౧. ఉంపఁదగినది. ౨.విడువఁదగినది. ౩.పాఁతఁదగినది.

నిక్షేపము. సం. వి. అ. పుం. ౧. చెప్పి చూపి ఉంచినయిల్లడ; గణనాపూర్వకోపనిధి, లెక్కపెట్టి దాఁప నిచ్చినసొమ్ము. ౨. తాకట్టు,కుదువ. ౩. నిధి, నిధానము, పాఁతిపెట్టినసొమ్ము. ౪. వైచుట. (కటాక్షనిక్షేపము మొ.) ౫. ఉంచుట, పెట్టుట. ౬.త్యజించుట, విడుచుట.

నిక్షేపించు. సం. స. క్రి. ౧. పాఁతు, పూడ్చు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. వినిపించిన వాఁడు నా,కసురత్వనిపగిది నని
యె ననఘా యేతద్ధన మూరియొద్ద నేఁటికి,
నిను వేఁడెద వలయు నిచట నిక్షేపింపన్.
వేం. పంచ. ౧. ౩౦౧.

వ...తద్దోషపరిహారార్థం బక్షిచయంబు గంధ
మాదనంబున రామనాథక్షేత్రంబున నిక్షే
పించి యచట...సేతు. ౬. ౧౮౧ పొ.

౨. ఉంచు, పెట్టు.

శా. చాపంబుం బటుబాణతూణయుగముల్ శా
తాసియుల్ వర్మముల్, భూపాలుండు విమా
నరత్నముపయిం బూజాసమేతంబు ని,క్షేపిం
పం దగువారిఁ బుచ్చి...నిర్వ. ౧౦. ౬౬.

౩. దాఁచు. మఱుఁగుపఱుచు.

వ. మఱియు విరాటనగరంబునకుఁ జనుచుండి
లెత్సమీపశమీవృక్షంబునఁ బాండవులు తమ
యాయుధంబులు నిక్షేపించి తత్తెవరు నె
ఱుంగకుండ విరాటుం గొలిచి యునికియు
...భార. ఆది. ౧. ౪౦.

నిక్షేపితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఇల్లడ
పెట్టింపఁబడినది. ౨.వ్రాయింపఁబడినది, చెక్కిం
పఁబడినది. (అక్షరములు మొ.)

నిక్షేప్త. సం. విణ. (ఋ. ప్త్రీ. ఋ.) నిక్షేపిం
చువాఁడు.

నిక్షేప్తవ్యము. సం=నిక్షేపణీయము.

నిఖనకుఁడు. సం. విణ. (అ.నికా.అ.) ౧. త్రవ్వు
వాఁడు. ౨. పాఁతిపెట్టువాఁడు.

నిఖననము. సం. వి. అ. న. ౧. త్రవ్వుట. ౨.
పాఁతిపెట్టుట.

నిఖర్వము. సం. వి. అ.పుం.న. సంఖ్యావిశేషము,
అయుతకోటిసంఖ్య, పదివేలకోట్లు.

నిఖర్వుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అతివామ
నుఁడు, మిక్కిలి పొట్టివాఁడు.

నిఖాతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. త్రవ్వఁ
బడినది. ౨. పాఁతఁబడినది, నాటఁబడినది.
(శల్యము మొ.)

నిఖిలము. సం. విణ. (అ. ఆ. అ.) సర్వము, అం
తయు.

గీ. యోగధర్మంబునకు నెక్కుడొక్కటియును,
నిఖిలమందును లేదిది నిశ్చయంబు. హరి.
పూ. ౨. ౧౫౫.

నిగణము. సం. వి. అ. పుం. హోమధూమము.
(త్రి. ని, వై. ని.)

నిగదనము. సం. వి. అ. న. నిగదము, స్పష్టము
గా చెప్పుట; చెప్పుట.

నిగదము. సం. వి. అ. పుం. ౧. స్పష్టముగా
చెప్పుట, తెలియఁ బల్కుట. ౨. చెప్పుట.
౩. అర్థము తెలియకయే మంత్రాదులు చదువుట.
౪. శబ్దము.

నిగదించు. సం.స.క్రి. స్పష్టముగా చెప్పు.

క. మానుషజన్మము నొందిన, మానవులకు లభ్య
మానమరణులకు మహా,జ్ఞానులకుఁ జేయవల
యువి,ధానము నిగదింపఁబడియె ధరణీ
నాథా. భాగ. ౨. ౩౫.

నిగదితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చెప్పఁ
బడినది. ౨. స్పష్టముగా చెప్పఁబడినది. వి.
అ. న. భాషణము, చెప్పుట.

నిగనిగ. వి. (క. నిగనిగ.) ౧. కాంతివిశేషము.

వ...తారకల నీరికలెత్తుపాగ రన నిగనిగ లీను
మడి నిగుడ...మనుచ. ౩. ౯.

క. అల చుక్కలనిగనిగ యొప్పా పాలఁతీ నీకాలి
గోరుఁ బోలదు సుమ్మీ.సారంగ. ౨.౨౨౨.

౨. వెలుఁగుట మెఱయుట మొదలగువానియం
దగుఅనుకరణము.

వ...మెఱుంగులు వెను వెంటి ఖింటిద్రాక జరిగి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధగద్ధగ నిగనిగ వెలుఁగుటంజేసి ...భీమ. ౫. ౯.

క. ధగధగ యనుపదకంబున, నిగనిగ యనుక్రొ
మ్మెఱుంగునేత్రపటమునను, భుగభుగ యను
మేపూఁతను, ధగధగ యనిపించె నతఁడు
నాహృదయంబునను. కళా. ౨. ౪౯.

విణ. నిగనిగ యనుకాంతి కలది, నిగనిగలాడునది.

సీ.నిగనిగంగాఁ దోమి నిండుబోనముదొంతి భోజ
నశాలలోఁ బొసఁగఁ జేర్చి. హర. ౨.౧౨౨.

గీ. నిగనిగనిసంజకెంజాయపొగడు దెగడు, మో
విమానిక మాని సంపూర్ణరుచిస,మగ్రత వ
హింతు నే నింతి మామకాభి,రామవనునా
మ ముచితగౌరవము దాల్ప. వసు.౬.౯౫.

నిగనిగలాడు=నిగనిగ యని ప్రకాశించు.

చ. పగడపుఁగంబముల్ నిలిపి పన్నినముత్యపుఁ
జప్పరంబులను, నిగనిగలాడుకుందనపునిద్దపు
గోడలు... నీలా. ౧. ౩౦.

నిగనిగన్నిగ=నిగనిగ, నిగన్నిగ.
(కాంతివిశేషము.)

సీ. కొదమగుబ్బలదానిఁ గ్రొమ్మించుఁ గ్రమ్మించు
నెమ్మేనినిగనిగన్నిగలదాని. దశా. ౨. ౧౦.

సీ. జిగి దొట్టి మిట్టలై బిగువులై బుగడలై
మొగడలై నిగనిగన్నిగల నెగడి. నరస. ౫. ౧౧౩.

నిగన్నిగ=నిగనిగ, నిగనిగన్నిగ.
(కాంతివిశేషము.)

ఉ... అత్తఱి బిత్తరి చూచె మోముక్రొన్ని
గ్గునిగన్నిగల్ తళుకునిద్దపుటద్దపుసొంపునిం
పఁగను. కవిరా. ౫. ౯౯.

నిగమగోచరులు. సం.వి. బ. వస్త్రవిశేషములు.

సీ. నిండువన్నెలు మంచినిగమగోచరులు సా
మంతవీథులు ప్రతిమలును బొగడ,పచ్చలు
...గీ.మొదలుగా వల్వలు ధరించి ముదిత
లపుడు. ప్రబంధ. ౨౪౨.

నిగమనము. సం. వి. అ. న. ౧. (న్యాయ.)ప్రతిజ్ఞాహేతూదాహరణోపనయనిగమనము లను పంచావయవములలో కడపటియవయవము. ౨. వేదమునుండి పదము నెత్తి చెప్పుట; అట్లెత్తి చెప్పినపదము. ౩. లోనికి చొచ్చుట.

నిగమము. సం. వి. అ. పుం. ౧. వేదము. ౨. వేదమునుండి ఉద్ధృత మగు(ఎత్తి చెప్పఁబడు) వాక్యపదాది. ౩. పర్యాయకథనముచే వేదార్థమును బోధించువ్యాఖ్యాగ్రంథభేదము. ౪. తంత్రభేదము. ౫.దేవఋష్యాదిప్రోక్తశాస్త్రము. ౬. (న్యాయ.)నిగమనము.౭. న్యాయశాస్త్రము, తర్కశాస్త్రము. ౮. నిశ్చయము. ౯. పట్టనము. ౧౦. హట్టము, బజాఱు. ౧౧. వాణిజ్యము, వర్తకము. ౧౨. సార్థము, వర్తకులసంఘము. ౧౩. మార్గము, దారి.

నిగమి. సం. విణ. (న్. నీ. న్.) వేదమును ఎఱిఁగినవాఁడు.

నిగముఁడు. సం. వి. అ. పుం. వణిజుఁడు,బేహారి.

నిగరణము. సం. వి. అ. పుం. ౧. కంఠము. ౨. హోమధూమము. న. ౧. కబళించుట, మ్రింగుట. ౨. పూర్ణముగా లోఁగొనుట. ౩. తినుట, భక్షణము. ౪. (అలం.)శబ్దానుపాత్తత్వము, శబ్దముచే చెప్పకుండుట; అధఃకరణము, అసత్యత్వప్రతిపాదనము. (ఉదా:- విషయనిగరణము, విషయినిగరణము.)

నిగరణీయము. సం. విణ.(అ. ఆ. అ.) ౧. తినఁదగినది. ౨. మ్రింగఁదగినది.

నిగరము=నిగారము. వి. ౧. కాంతివిశేషము.

వ... నిగరాలమగరాలనిగరాలఁ గనునితాంత
కాంతదంతంబులును...ప్రబంధ. ౪౦.

౨. పెల్లిక, బిల్ల.

గీ. వలచుఁ గస్తూరినిగరాలతలుపుఁ దెఱువ, గాజు
టోవరిలోధూపగంధలహరి. శైవ.౪.౧౫౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. కస్తూరిమెకంబులమదభరంబులం దొరఁగు
నాభీరక్తంబు లిగిరి గనిగట్టిననిగరములఁ గఱ
చికొని... వసు. ౨. ౧౧.

విణ=నికరము. ౧. శ్రేష్ఠము, సారభూతము.

సీ. నిగరంపుమోవి తేనియలతోన దొరల్చి చె
లువ లిచ్చిన సంతసించుఁ గొన్ని. వేం.
పంచ. ౪. ౨౪౧.

చ. పగడపుఁగ్రొత్తడంబుజిగి పాకవిరోధిశరాస
నంబుగా, నిగరపుఁగెంపుగొమ్మనునునిగ్గుమె
ఱుంగు మెఱుంగుచాలుగాఁ, దగు... చం
ద్రా. ౧. ౯. ప్రబంధ. ౪౦.

౨. పెద్దది, గొప్పది.

సీ. నిగరంపుఁజనుకట్టు నగరంబురవిక మేల్ సరి
గదుట్టులమెట్టుసడలనిక్క...రా. వి. ౩. ౧౨౪.

౩. నీచము, అల్పము.

క. నిగరా లగుమగఠాలను, నిగరాలుగఁ జేయు
నార సెలంతరదనముల్, పగడంబులఁజగడం
బుల జగడంబు, లిడున్ మిటారిచవిమోవి
రుచుల్. ప్రబంధ. ౪౦౩.

నిగరము. సం. వి. అ. పుం. ౧. కబళనము,
మ్రింగుట. ౨. భక్షణము, తినుట.

నిగరి(రీ)త. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ౧. తిను
వాఁడు. ౨. మ్రింగువాఁడు.

నిగరితవ్యము. సం= నిగరణీయము.

నిగళ(డ)నము. సం. వి. అ. న. సంకెలలు వేయుట.

నిగళ(డ)ము. సం. వి. అ. పుం. న. ౧. ఏనుఁ
గుకాలిసంకెల; సంకెల. ౨. కబళనము, మ్రింగుట.

నిగళి(డి)తము. సం. విణ. (అ. ఆ. అ.) సంకెల
వేయఁబడినది.

నిగాదము. సం= నిగదము.

నిగారకము. సం. విణ. (అ. రికా. అ.) ౧. మ్రిం
గునది. ౨. భక్షించునది.

నిగారకుఁడు సం. విణ. (అ. రికా. అ.) ౧. తిను
వాఁడు. ౨. మ్రింగువాఁడు.

నిగారము=నిగరము.

(మెఱుఁగు, కాంతివిశేషము.)

ఉ. చన్నులు పొన్నకాయలకుఁ జక్కఁదనంబు
లొసంగుఁ గక్కవా, ల్గన్నులు గందమీలకు
నిగారము లిచ్చు నొయారి దీని కే, యన్నులు
సాటి రాఁగలరు... మృ. వి. ౨. ౬౦.

విణ. (శ్రేష్ఠము.)

ఉ. కుందన మెందునున్ దొరయె కొమ్మనిగా
రపుమేనిచాయకున్. నీలా. ౧. ౫౪.

క. ఇట్టినిగారపుగొనముల, తిట్టులఁ గనికరము మాని
తెం పొదవంగాఁ, గట్టడవులకుం బనుపఁగఁ,
గట్టా యమ్మదుకఁ డెంతకట్టిఁడి చెపుమా.
అచ్చ. రా. అయో. ౭౩.

నిగారము. సం= నిగరము.

నిగారి. సం. విణ. (న్. ణీ. న్.) ౧. తినువాఁడు.
౨. మ్రింగువాఁడు.

నిగార్యము. సం=నిగరణీయము.

నిగాళము. సం. వి. అ. పుం. అశ్వగళోద్దేశము,
గుఱ్ఱపుమెడసమీపపుచోటు.

నిగాళవంతము. సం. వి. త్. పుం. అశ్వము,
గుఱ్ఱము. (వాచ.)

నిగి(గు)డించు= నిగుడుచు. స. క్రి. (√నిగుడు.)
౧. నిగుడఁజేయు, వ్యాపింపజేయు.

వ... ఏము నిదిధ్యాసనిశ్వాసనిరోధంబు సేసినం
దాఁ దద్ధ్యానదశ వెలికి నిగుడించుచు...
ఆము. ౫. ౧౫౪.

౨. సాఁగఁజేయు, చాఁచు.

క. మొగిచినచేతులు ముందల, నిగిడించి నితాం
తవినయనిరతిన్ జారుల్, దగ విన్నవించి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రిట్లని, జగతీశ్వరునకు నిజప్రచారం బెల్లన్.
భార. విరా. ౩. ౪౯.

సీ. తెలివివెన్నెల వెండితీఁగెలు నిగిడించుచద
లుకమ్మచ్చుబెజ్జము లనంగ. పారి. ౨. ౩౬.

౩. వెలువఱుచు.

వ... హెచ్చు కుం దాడ నేరక నిట్టూర్పు నిగి
డించితి ... కాశీ. ౧. ౧౦౫.

వ... ఏఁటికిం బల్లవపాటలం బైనయధరంబుబీఁట
లెగయ వేఁడినిట్టూర్పు గాడ్పు నిగిడించెదు
... నైష. ౪. ౯౧.

౪. (బాణాదులు) పఱచు, ప్రయోగించు.

గీ. వైచుటయు నొక్క తెఁగ గత్తివాతియమ్ము,
లతఁడు పదునాల్గు నిగిడించి యద్భుతముగఁ,
దునిమెఁ బదునాల్గుశూలమ్ములను మహోగ్రు,
లగుచు వా రంతఁ బోక పై నడరుటయును.
భా. రా. ఆర. ౧౬౫.

సీ. సాత్యకి డిభకుపై సాయకదశకంబు నిగు
డింప నని వానిమొగమునందుఁ, జనుమొన
మీఁద వక్షంబుపై నాఁటిన ... ఉ. హరి.
౪. ౨౫౦.

౫. కలిగించు.

మ. ... వజ్రకుంభలసచ్ఛాయ సితాంశుదీప్తి
నిగిడింపన్ ... చంద్రి. ౬. ౬.

నిగిడికొను. స. క్రి. (√నిగుడు.) తడవుకొను,
నిమురుకొను.

వ ... గండంబులు గడచితి మని గుండియలు
నిగిడికొనుచుం జనిరి. హర. ౨. ౨౪.

నిగితము. వి. (సంగీతములోని) ఒకస్వరస్థాయి,
తానములలో నొకటి.

ద్వి. నిగితి కుధాయిన న్నిగితంబు ... ఆదిగా
సాగయుతానములు బస. పు. ౩. ౯౩౯ పం.

నిగితి. వి. (సంగీతములోని) ఒకస్వరస్థాయి.
బస. పు. ౩. ౯౩౯ పం.

నిగిరత్. సం. (శతృ.) ౧. తినుచున్న. ౨. మ్రిం
గుచున్న.

నిగీర్ణము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. కబళితము,
మ్రింగఁబడినది. ౨. భక్షింపఁబడినది. ౩. అంత
ర్భావితము, లోపల ఇమిడింపఁ బడినది.

నిగీర్ణి. సం.వి.ఇ.స్త్రీ. ౧.తినుట. ౨. మ్రింగుట.

నిగీర్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) ౧.
తినఁబడుచున్నది. ౨. మ్రింగఁబడుచున్నది.

నిగుడఁజేయు=నిగిడించు. స. క్రి. (√నిగుడు.)

౧. వ్యాపింపఁజేయు, ప్రసరింపఁజేయు; ఏయు.

సీ. విరివిగా నొకవేళఁ బెరిఁగి వీటికి నెల్ల నిజ
శీతలచ్ఛాయ నిగుడఁజేయ. పారి. ౫. ౫౨.

గీ. రక్తధారలు వెడలంగ రశ్మి వెలుఁగఁ, బొలు
చుబాలార్కు చాడ్పునఁ జెలువు మిగిలి, ఫల్గు
నుండు ప్రతాపసంభరితమూర్తి, యగుచు
శరకిరణంబులు నిగుడఁజేసె. భార. విరా.
౫. ౧౯౦.

౨. వర్ధిల్లఁజేయు.

క. నావుడు సంజయుఁ డిట్లను, దేవా పాండ
వులయలుక ధృష్టద్యుమ్నుం, డేవెగవు మాట
నైనను, నే వోసినయగ్ని భంగి నిగుడం జే
యున్. భార. ఉద్యో. ౨. ౨౪౩.

నిగుడము. వి. అశ్వశిక్షాభేదము.

సీ. వరసంబు నొందించి పల్లంబు కల్పించి నిగు
డంబు సమకొల్పి నెఱసు నెఱపి.పి. శకుం.
౧. ౧౧౨.

నిగుడారు. అ. క్రి. (నిగుడు + ఆరు[1]. స్వార్థమున.)
వ్యాపించు.

ఉ. నవ్వక నవ్వు నెమ్మొగమున న్నిగుడారెడువిం
తకాంతియుక్, జివ్వలు చేసి చేసి యిటు చి
క్కనె వెన్నెలవెల్లివేఁడికిన్. ఉ. హరి. ౫.
౧౩౪. (నిగిడారెడు అని శ. ర. పా.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిగుడు=నివుడు. అ. క్రి. ౧. వ్యాపించు, ప్రసరించు; పడు.

ఆ. అంపపొదుల నిగుడునంశువితానంబు, దీప్ర మరకతములదీధితులుగ. భార. భీష్మ. ౧. ౧౦౬.

గీ. వారిముఖమండలములతో వారిజములు, మొగిడె శోకతమంబుతో నిగిడెఁ దిమిర, పటలి ... భార. సౌ. ౧. ౧౩.

గీ. అనఘ యింద్రియముల విషయములమీఁద, నిగుడనీక మనంబుతో మగుడఁ దిగిచి. భార. శాం. ౫. ౬౭.

శా. ...కామమోఘాస్త్రపరంపరల్ నిగిడి చిత్తాంభోజముల్ దూఱి... దశా. ౨. ౨౮౯.

౨. నిక్కు, (పైకి) లేచు.

వ. ...తో లూడ్చు మహానాగంబునుం బోలెఁ గరవాలంబుఁ దాన యొఱవెలికి నిగుడుచున్నయది గావున మా కవశ్యంబును సంగరంబు సంభవిఁచు... భార. ఉద్యో. ౨. ౧౪౬.

ద్వి. ఎగసి మిన్నులఁ జాఱునిఱ్ఱులనయిన, నిగిడి కూడఁగఁ బట్టి నేలకు వైతు. ద్వి. హరిశ్చ. పూ. ౫౭౫ పం.

౩. బయలుదేఱు.

వ. అనుచు సభార్యుం డయి వింధ్యాహార్యస్తంభయితసంభృతానురాగంబున నిగిడిచని ...పాండు. ౧. ౧౩౭.

౪. (యుద్ధాదులందు) కవియు, మార్కొను.

గీ... కౌరవయోధులయుబ్బు మెఱసె, నృపులనేకులు నామీఁద నిగిడి రేను, జిక్కువఱిచెదఁ జూడుమీ యుక్కు మడఁచి. భార. భీష్మ. ౩. ౧౧.

క... భీముఁడు, నీవును నరుతోడఁ గూడి నిగుడుఁడు పెలుచన్. భార. భీష్మ. ౩. ౩౬౯.

౫. ఉద్ధతమగు, వెలువడు.

క. చని మదనాగ్ని జ్వాలలు, దనుకఁగ నిట్టూర్పుగాడ్పు దందడి నిగుడఁగ. భార. విరా. ౨. ౬౦. ఆము. ౨. ౨౧.

గీ. వేఁడియశ్రులు నిగుడంగ వెక్కివెక్కి, యేడ్వఁ దొడఁగె లతాంగి పృథ్వీశుమ్రోల. నైష. ౪. ౮౭.

౬. (బాణాదులు) పఱగు, మీఁదికి వచ్చు.

చ. ఘనరభసమ్మునన్ నిగుడుకైదువులన్ నఱుమాడి... భా. రా. అర. ౧. ౨౦౧.

గీ. జలరుహోదరసవ్యాపసవ్యముక్త, నిష్ఠురాస్త్రంబు లొండొండ నిగుడునపుడు. పారి. ౫. ౧౨.

౭. (యుద్ధాదులందు) విజృంభించు.

సీ. నెత్తుటఁ దోఁగియు నిగిడి పోరెడివీరు లలరినడమోదుగుల విధంబు. గీ...వింత లగుటను సంగరాంగణంబు రమణీయమును భీషణంబు నయ్యె. భార. శల్య. ౧. ౧౨౯.

ఉ. గరుఁడుని డిగ్గి వీడ్కొలిపి కంసవిరోధి... నిష్ఠురరవపాంచజన్యుఁ డగుచున్ నిగుడంగని పౌండ్రుఁ డత్తఱిన్. ఉ. హరి. ౩. ౯౧. (త్వరపడు, వేగిరపడు అని శ. ర.)

ద్వి. అప్పుడు కాశికుఁ డంతరంగమునఁ, గప్పిన చలమునఁ గరుణఁ బో విడిచి, నిగిడి ప్రేరేచిననీలమేఘములు, గగనమండల మెల్లఁ గప్పి యొప్పారె. ద్వి. హరిశ్చ. పూ. ౨౧౯పం.

౮. కలుగు, పుట్టు.

ఉ. మైలవలిన్ ననల్ నిగుడునైఁ బులకల్ పొడమన్ శ్లథాంగి యై. ఆము. ౫. ౭౬.

చ... ఊరుపుల్ దళముగా నిగుడన్ వడఁ గుంది యారెలుం, గునఁ దమవానిఁ బిల్చుచు శకుంతము లయ్యెడనిల్చె మ్రాఁకులన్. పారి. ౪. ౨౧.

౯. యత్నించు.

క. భీముని నర్జును విడిచియు, నీమది నకులు బ్రదికింప నిగుడుట పుత్త్రా, నామనమ్మునఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బాయదు ని,న్నే చునవచ్చు నఖిలంబు నిం
దు్రఁ డెఱుంగుమ. భార. మహా. ౬౪.

౧౦. చక్క(బడు.

క. బెడిదముగఁ గత్తి గొడ్డటఁ, బొడువఁ దెగిన
మ్రానఁ జిగురు వొడముఁ బలుకులం, జెడఁ
దునిసినకార్యంబు ని,గుడ సేరదు పిడప
నెట్టుఁ గురువంశనిధీ. భార. ఉద్యో. ౨. ౬౧.

౧౧. ఒప్పు.

సీ. బొమలవెన్నడిమిపద్మముదళంబులరేఖ రహిఁ
జూపునూర్ధ్వపుండ్రంబు నిగుడ. విప్ర. ౨.
౬౫.

౧౨. అంతమునొందు, చచ్చు.

క. ఈరీతిఁ బొదల మెదలుచు, నారీతిలకంబు
మేనిసచ్చిక యిచ్చం, గోరక నవసహకారక,
కోరక మూరుకొని వడి నిగుడ గమకించెన్.
వసు. ౩. ౧౧౯.

౧౩. అతిశయించు.

వ...ఒడళ్లు జడియ జడిమ నిగుడ బడలి యు
న్నవారలం గనుంగొని. దశా. ౨. ౧౬౨.

క. పరలోకావాససుఖా,దరపరతం జననితల్లి
దండ్రుల కొసఁగెన్, గురుభక్తి నిగుడఁకొ
డు కతి,కరుణామతి గంగ నస్థిగయఁ బిం
డంబుల్. పాండు. ౨. ౨౬.

౧౪. ప్రవహించు.

క. తరణియు భైమియును బర, స్పర మచ్చటఁ
గూడి నిగుడఁ బావన మగుచో, త్సరిదంబువు
నం దాడిన, నరునకు నవ్వారి చరణనఖమున
వెడలుల్. పాండు. ౫. ౨౬.

౧౫. స్వస్థత నొందు.

క. కావున నేత్రద్దానము, నీవును గావింపు మన
సు నిగుడుదు వన... వరాహ. ౧౨. ౬౯.

౧౬. పఱుగెత్తు.

క. మాయాహరిణము మిగులుచు, వాయువు దెగఁ
బఱతు ధరణీవలయము గడతుం, దోయధి
దాఁటుదు ననుక్రియఁ, గాయద్యుతు లడర
నొక్క(గతిఁ దెగి నిగిడెన్. భారా. అర.
౨. ౫౭.

క. నిగిడి కడు నలసి యట యొక, మృగయూ
థముఁ జొరఁగఁ బోవు పెయిఁ దోడనె వెం,
దగిలి యగపాటు గని యొఱ, పగు వెఱవున
నిల్చి రాముఁ డయ్యేణంబున్. భా. రా.
అర. ౨. ౫౭.

గీ. కినుకతో వచ్చి యచ్చట జనులఁ జూచి,
నిగుడఁ జాలక గుంపుగా నిలుచుఁ గొన్ని.
చిత్రభా. ౩. ౧౩౯.

౧౭. చాఁగు, దీర్ఘమగు.

సీ. నిగిడి పూతేకుబాగుగఁ గత్తిరించిన గడ్డం
బుకొన రాముఁ గమ్మిరింప. నైష. ౪. ౯౧.

జ: నిగిడించు, నిగిడికొను, నిగుడఁజేయు, నిగు
డారు, నిగుడుచు, నిగుడుడెంచు.

నిగుడుచు(డ్చు)= నిగిడించు. స.క్రి. (√నిగు
డు.) ౧. నిగుడఁజేయు, వ్యాపింపఁజేయు.

ఉ. ... జం,భారి ని,గుడ్చు భ్రాంతి నుదయావ
సరంబుల నొద్ద నుండి రో,సారుణ మైనలో
చనసహస్రము బాలసహస్రభానుపై. నైష.
౪. ౨౨.

క. అనుటయు నతఁ డమ్మనిదెసఁ, దనదృష్టి
నిగిడ్చి నగుచు... కళా. ౩. ౪౩.

౨. వెలువఱచు.

గీ. పోవలయుఁ జూడ ననుచు నూర్పులు నిగు
డ్చు. మను చ. ౧. ౫౭.

౩. (బాణాదులు) పడఁజేయు, ప్రయోగించు.

చ. పలపలఁ దొత్తులొత్తుల నొకపాటిగ మాటికి
నేటవాలుగా, జలకణముల్ నిగుడ్చుచు వె
సన్ జడిపై జడి సందడింపఁగా. ఇందు. ౩.
౧౦౭.

సీ...కనలి యవ్వీరుఁడు ... గొడుగును దును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాడఁగా భవత్పుత్త్రిఁ దేపు, గుండఁగ శక్తి నిగుడ్పఁగఁ ద్రుంచె నేఁడైతిఁ గృపాణము గొన నుఱుముసేసె. భార. కర్ణ. ౨. ౨౬౯.

౪. కలిగించు.

ఆ. అతఁడు తనయవరజయాకర్ణనాసాస్త్రములు నిజాకుల నఘువిలసనమ్ము,గడు నిగుడ్చ నడిగి యడిగి తత్కథితస, భార్యరామవృత్తకా ర్యుఁడగుచు. రాఘవ. ౩. ౮౨.

౫. తూర్చు, పెట్టు.

చ. పొగడలు బొండుమల్లియలు పొన్నలు పావడ చొల్లియంబునన్,నిగిడిచి వీరభద్రుఁడు సనెన్ శశిమౌళిసమీపభూమికిన్. భీమ. ౫. ౧౧౦.

గీ...గనపరాకులు నిగిడ్చి,చెప్పుటట్టులు శోధించి సిగలు విప్పి. ఆము. ౬. ౭౮.

నిగుడుదెంచు=నిగుడు. అ. క్రి. (నిగుడు+ తెంచు. స్వార్థమున.) పుట్టు, కలుగు.

గీ. పెక్కుడలఁ జూచి యెఱుగుదు నిక్కమనిన, నగవుమొలక మొగంబున నిగుడు దేర,మాతలికిఁ బ్రత్యయకరంబు నాతనికి దు,రత్యయతరంబుగాఁ గార్ముకారవంబు. రామా. ౮. ౨౦౭.

నిగులు=నివులు, నీఱు. వి. భస్మము, బూడిద.

గీ. నిగులులో నిప్పతీఱున నీచరిత్ర,మెఱుగఁ బడదు...ఉ. రా. ౫. ౫౮.

గీ...అత్యుగ్రదృష్టి,నిగుడుచో నెల్ల నిగులులై యెగయు...దశా. ౩. ౧౭౧.

సీ...నిగులు,నీఱు బూడిద యన నెగడును భస్మాఖ్య...ఆం. భా. ౨. ౨౪౨.

నిగులుగప్పిననిప్పు = డాంబికము లేనిధీరుఁడు; ఉన్నశక్తిని ప్రకటింపనివాఁడు.

(వ్యవ.) ఆపండితుఁడు నిగులుగప్పిననిప్పు.

నిగువు. సం. విణ. (ఉ) మనోజ్ఞము. వి.ఉ.పుం. ౧. మనస్సు. ౨. మలము. ౩. మూలము, వేరు. ౪. చిత్రకర్మము, చిత్తరువు వ్రాయుట.

నిగూఢము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. గుప్తము, దాఁపఁబడినది; రహస్యమైనది. ౨. దురవగాహము, తెలియనిది. వి. అ. పుం. వనముద్గము, అడవిపెసరు.

నిగూహనము. సం. వి. అ. న. దాఁచుట.

నిగూహించు. సం. స. క్రి. దాఁచు, మఱుఁగుపుచ్చు.

మ. మనువంశాగ్రణి జాగ్రదగ్రసుతసామ్రాజ్యాగమప్రాజ్యమ, జ్జనసంమర్దజభూరజఃపరిజిహీర్షాచుంచుర్లోమాంచకా, యనికాయప్రకృతివ్రజద్విగుణజాతానందముల్ డెందమం,ద నిగూహించుచుఁ బల్కె నాప్తసచివోత్తంసాళితో నత్తరిన్. చం. రా. ౪. ౧౧.

నిగృహీతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. ఆఁక, నిరోధము. ౨. నిగ్రహము, అడఁచుట.

నిగృహీతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పట్టుకొనఁబడినవాఁడు. ౨. అడ్డగింపఁబడినవాఁడు, నిరోధింపఁబడినవాఁడు. ౩. ఎదిరింపఁబడినవాఁడు. ౪. (వాదాదులందు) ఓడింపఁబడినవాఁడు.

నిగృహ్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) నిగ్రహింపఁబడుచున్నది.

నిగ్గఁడి. విణ.(క.నిగ్గడి.త.నిక్కలమ్.)౧.కఠినము.

సీ...ఇట్టికొడుకును మనుమండు బుడమి నిట్లు, పడియుండఁ జూచెడుపాపజాతికి నిప్పు డవియక నిగ్గఁడి యైనయునుప. గీ. గుండియకుఁ జేటుపాటింకఁ బుండరీక,నయన యెన్నఁడు లేమి నిర్ణయము గాదె. భార. స్త్రీ. ౨. ౪౭. ('నిగ్గడి' ముద్రి. పా. 'ఈ గట్టియైన' కరాలప్రతిపా.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. మూర్ఖుఁడు.

ద్వి. సెన్నిధి యుండంగ మన్ను గద్దుదురె, ని న్నొండు వేఁడెడినిగ్గండి గలఁడే. బస. పు. ౧. ౨ ౩౮ పం. (చి. ని. పా. 'నిర్గుణి' ముద్రి. పా.)

నిగ్గారు. అ. క్రి. (√నిగ్గు.) ౧. ఉత్కృష్టకాంతితో నిండు.

ద్వి. నిగ్గారుపంచవన్నియలతోఁ గూర్చి, ముగ్గులు వెట్టి...పండితా. దీక్షా. ౫౭ పా.

౨. సువాసన కలుగు.

ద్వి. ముగ్గు చాలదొ పద్మములు సెదరినవొ, నిగ్గారుగందంబు సెరసు దోఁచినదొ. పండితా. పురా. ౧౫౮ పా.

నిగ్గించు. స. క్రి. (√నిగ్గు.) సెఱవేర్చు, నిర్వహించు.

మ. ...ధాత్రీకాంత నీ వొప్ప మ్మా,నికులశ్రేష్ఠులతో నిరీతి మఘముల్ నిగ్గించుచున్ మేము వేడుక వర్తిల్లుదు మాశ్రమాళి సురకోటుల్ నిచ్చ హర్షింపఁగన్. చంద్రి. ౧. ౧౩౩.

నిగ్గు. వి. ౧. కాంతి.

సీ. పసుపునిగ్గులు దేఱుపాఁపజన్నిద మొప్పఁ బ్రమథాధిపతి యింటిప ట్టైతేంగె. మనుచ. ౨. ౧౧.

చ. సెరసినసోఁగవెన్నెలలసిగ్గున నొక్కెడ భానుకన్యయై...నభశ్చరనది యొప్పె దివ్యజలజాతముఖుల్ జలకేళి సల్పఁగన్. పారి. ౪. ౩౪.

చ. పలుకులఁ దేనె లూరు మెయి బంగరునిగ్గులు దేఱుఁ జూపులం, దళుకులు మీఱుఁ జెక్కులను దద్దయు ముద్దులు గాఱు...నీలా. ౨. ౧౮.

౨. జిడ్డు.

మ. ...సోఁగసెఱుల్ సంపఁగినూ నెనిగ్గు సడలంగాఁ బైపయిన్ దువ్వి నేర్పున గంధామలకంబు వెట్టె నొకయంభోజాక్షి భూజానికిన్. వసు. ౫. ౪౯.

౩. కిరణము.

సీ. మినుకు తళుకు నిగ్గు మించు కళు కనంగఁ గిరణనామంబులై క్రాలుచుండు. ఆం. భా. ౧. ౭౨.

౪. పరిమళాతిశయము.

ఉ. మజ్జన మాడె రాజు కృశమధ్యమ లింపున వంప గుంపులై, గొజ్జఁగనీటివెల్లువలు గోవజవాజులనిగ్గుఁ జూప...మనుచ. ౫. ౫౭.

౫. సారము.

(వ్యవ.) ఉపనిషత్తులలోనినిగ్గెల్ల భగవద్గీత యందును పురాణములలోనిని గ్గెల్ల భారత మందును కలదు.

విణ. త్రోపుడు పోఁగా మిగిలినది. (శ. ర.)

అ. క్రి. నిర్వహిల్లు.

ఉదా:-నాతో వాఁడు సరిగా నిగ్గలేఁడు.(శ.ర.)

జః నిగ్గారు, నిగ్గించు, నిగ్గులాఁడి.

నిగ్గులాఁడి. వి. (నిగ్గులు+ఆఁడి.) నిగ్గు కలఆఁడుది, కాంతి కలస్త్రీ; ఆఁడుది.

ఉ. చెక్కుల నిగ్గులాఁడి యని చిల్కలు వల్కు నృసింహ పూర్వపున్,మక్కువ నీవిరోధి నృపమందిరచిత్రవధూపరంపరన్. నరస. ౫. ౧౪౭.

నిగ్రంథనము. సం. వి. అ. న. మారణము, చంపుట.

నిగ్రహణము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అడ్డగించునది, ఆఁకఁబెట్టునది. ౨. అడఁచునది. వి. అ. న. ౧. అడ్డగించుట, నిరోధించుట. ౨. అడఁచుట. ౩. బంధించుట, చెఱఁబెట్టుట. ౪. దండించుట, శిక్షించుట. ౫. ఓడించుట.

నిగ్రహపడు. మి. అ. క్రి. ఇబ్బందిపడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. వెలి వెడలనిజను లిటు దమ, నెలవు లుడిగి
వచ్చి యిచట నిగ్రహపడఁగా, దలఁపునను
మున్న యిండులు, దలకొనఁగా వలదె యను
చుఁ దలపోసి తగన్. హరి.ఉ. ౨. ౧౫౧.

నిగ్రహము. సం. వి. అ. పుం. ౧. అడ్డగించుట, ఆఁకపెట్టుట. ౨. అడఁచుట. ౩. ఓడించుట. ౪. పట్టుకొనుట; బాధించుట. ౫. చెఱ. ౬. భర్త్సనము, బెదరింపు. ౭. దండనము, శిక్ష. (వ్యతి. అనుగ్రహము.) ౮. నింద, దూఱు. ౯. పిడి. ౧౦. సీమ, మేర. ౧౧. చికిత్స. ౧౨. నిరసనము, తెగడిక. ౧౩. మారణము, చంపుట. (వాచ.)

నిగ్రహస్థానము. సం. వి. అ. న. జల్పకథయందలిపరాజయహేతుశబ్దప్రయోగము. (ఇవి ఇరువదిరెండు.)

నిగ్రహించు. సం. స. క్రి. ౧. నిరసించు, తిరస్కరించు.

క...తన్ను నెదిరిని, మది నెఱుఁగక నిగ్రహించి
మద మెత్తుట యొప్ప దహంకారం బొనరిం,
పదె పౌరుషహానిఁ దొల్లి పక్షీంద్రునకున్.
భార. ఉద్యో. ౩. ౨౪౯.

౨. అడఁచు, నిరోధించు.

వ...నిఖిలేంద్రియంబుల నిగ్రహించి ... మార్క. ౮. ౩౬.

౩. త్రోపాడు. (శ. ర.)

నిగ్రాహము. సం. వి. అ. పుం. ౧. దండనము, శిక్ష. ౨. శాపము; తిట్టు.

నిఘంటువు. సం. వి. ఉ. పుం. పదములను వాని యర్థములను తెలియఁజేయుగ్రంథము.

నిఘము. సం. విశ. (అ. ఆ. అ.) నిడుపు వెడల్పు ఎత్తు సమానముగా కలది. (వేదికాది.)

నిఘర్షణము. సం. వి. అ.న=నిఘర్షము.

నిఘర్షము. సం. వి. అ. పుం. ౧. రుద్దుట, తోముట. ౨. రాచుట, రాపిడి. ౩. నూఱుట. ౪. (పిండి మున్నగునవి) విసరుట.

నిఘసము. సం. వి. అ. పుం. భోజనము, కుడుపు.

నిఘాతకుఁడు. సం. విశ. (అ. తికా. అ.) ౧. కొట్టువాఁడు. ౨. హింసించువాఁడు.

నిఘాతము. సం. వి. అ. పుం. ౧. ఆహననము, కొట్టుట. ౨. దెబ్బ. ౩. అనుదాత్తస్వరము.

నిఘాతి. సం. వి. ఇ. స్త్రీ. లోహఘాతిని, ఇనుపసుత్తె.

నిఘానక. సం. వి. ఆ. స్త్రీ. కమ్మరి యినుపపని చేయుదాయి. (వై. ని.)

నిఘుష్టము. సం. వి. అ. న. ధ్వని, శబ్దము.

నిఘృష్టి. సం. వి. ఆ. స్త్రీ. అంగవైకల్యము కల స్త్రీ. (వై. ని.)

నిఘృష్టము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. రాపిడి పెట్టఁబడినది, చిత్రిక మున్నగుసాధనములతో రాయఁబడినది. ౨. రుద్దఁబడినది. ౩. నూఱఁబడినది. ౪. అఱుగఁదీయఁబడినది. (గంధపుచెక్క మొ.)

నిఘృష్యము. సం. విశ. (అ. ఆ. అ.) ఘర్షింపఁదగినది, ఒరపెట్టఁదగినది.

నిఘృష్వము. సం. వి. అ. పుం. ౧. ఖురము, డెక్క. ౨. వాయువు. ౩. గాడిద. ౪. మార్గము. ౫. వరాహము, పంది. (కల్ప.)

నిఘ్నము. సం. విశ. (అ. ఆ. అ.) ౧.లోనైనది, అధీనము.(భృత్యాది.)౨. (గణిత.) పూరితము, ఆహతము, గుణింపఁబడినది. (సంఖ్య.)

నిచయము. సం. వి. అ. పుం. ౧. సమూహము; రాశి. ౨. నిశ్చయము. (వాచ.)

నిచాయము. సం.వి.అ.పుం. ధాన్యాదులరాశి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిచి. సం. వి. ఇ. పుం. గోవుయొక్క కర్ణశిరో దేశము, ఆవుచెవికొన. (వాచ.)

నిచికి. సం. వి. ఈ. స్త్రీ. నైచికి, ఉత్తమగోవు, మంచియావు.

నిచితము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. వ్యాప్తము, వ్యాపించినది.

శ్లో. సకుంకుమై రవిరళ మంబుబిందుభిః... బభౌ చిరం నిచిత ఇవాసృజాం లవైః. శిశు. ౧౭. ౧౪.

౨. పూరితము, నింపఁబడినది. ౩. సంకీర్ణము,ఒక టితోనొకటి కలిసినది. ౪. నిర్మితము. ౫. ప్రోగు చేయఁబడినది.

నిచులకము. సం. వి. అ. న. ౧. నిచోళకము పొట్టిచొక్కావంటియోధాదులకవచము. ౨. గవుసెన. ౩. మత్స్యవిశేషము.

నిచులము. సం. వి. అ. పుం. ౧. హిజ్జలము, ఎఱ్ఱ గన్నేరు. ౨. వేతసము, ప్రబ్బలి. ౩. గవుసెన.

నిచోటము. సం. వి. అ. పుం. నలువది నాలుగం గుళములబాణము. (వై. ని.)

నిచోళకము. సం. వి. అ. పుం. ౧. అరచొక్కా వంటియోధులకవచము. ౨. అవిక.

నిచోళము. సం. వి. అ. పుం. ౧. (డోలి, పల్లకి లోనగువాని) గవుసెన, బురకా. ౨. ప్రచ్ఛద పటము, (పఱుపులోనగువానిపై పఱచు) దుప్ప టి, కప్పుడుదుప్పటి. ౩. అవగుంఠనము, స్త్రీల మేలుముసుఁగు.

నిచ్చ(లు). అవ్య. (సం. నిత్యం. ప్రా. నిచ్చం. క. నిచ్చ. దీనియామ్రేడితరూపము నిచ్చనిచ్చ, నిచ్చ నిచ్చలు.) ౧. సదా, ఎల్లప్పుడు.

మ...ప్రాజ్ఞు ల్నిచ్చ లోచూపులన్, గనునానం దము నీవె కావె విను రమశ్చర్య లామీఁద టన్. ఉ. రా. ౩. ౧౩౫.

క. నెలకొని వేసవిఁ జలువయుఁ,జలినేళ్ల నుష్ణ గుణము సమఁచితభంగిన్,గలిగించునీలతాం తము,కొలఁదులు చెప్పంగ నిచ్చ క్రొత్తలు సుమ్మీ. పారి. ౧. ౬౩.

ఉ. నెప్పలు వాల్ప కప్పుడమి కేనిమనోహ రమూర్తి నిచ్చలున్,దప్పక చూచి చూచి విబుధప్రమదల్...నైష. ౧. ౬౫.

చ. సురపతిదాడి నంబునిధిఁ జొచ్చినయద్రులు నిచ్చ లప్పరిం,దిరుగఁగ...విక్ర. ౧. ౭౩.

౨. ప్రత్యహము, ప్రతిదినము.

సీ. నిచ్చ యొక్కమృగంబు నీకుఁ గట్టడ గాఁ గఁ బ్రీతి నాహారంబుఁ బెట్టఁ గలము. నా. పంచ. ౧. ౨౪౫.

ద్వి. నిచ్చ కుంచెఁడుపాలు నిన్నుఁ ద్రావింప, మెచ్చి యాగొడగూచి మ్రింగినయట్లు. పండి తా. మహిమ. ౩౦౬ పొ.

గీ. ఇంక నొకవింత యాదానవేంద్రు కడిఁది, మే నఁ బుట్టినపుట్టఁ గ్రొమ్మెఱుఁగుగోళ్ల, గ్రుచ్చి తేనియఁ గైకొను నిచ్చనిచ్చ, నచ్ఛభల్లంబు లచ్చట నచ్చుపడఁగ. దశా. ౪. ౨౯.

ఆ. నిచ్చనిచ్చవడ్డి నెలనెలవడ్డొడఁ,బాటువడ్డి వడ్డిపైని వడ్డి, యనఁగ నాల్గుతెఱఁగు లయ్యె ... విజ్ఞా. వ్యవ. ౬౬.

ఉ...గోవుల మిల్లిలు దప్పకుండ ల, క్ష్మీపతి గ్రు మ్మరుం గడియనేపున రేపున నిచ్చనిచ్చలున్. హరి. పూ. ౫. ౨౦౦.

క్రి. విణ. నిశ్చయముగా.

సీ...నీకు. గీ. చేయలంతిగా నిచ్చలు చెలియ యిత్తు. హరి. ఉ. ౩. ౧౩౨.

నిచ్చచావు=నిత్యమరణము.

క. విను దుర్యోధనదుశ్శా, సనులఁ బలికి పలికి ని చ్చచావుగ నప్పాండవని యలఁచు... భార. శల్య. ౧. ౩౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జ: నిచ్చమల్లె.

నిచ్చమల్లె=నిత్తెమల్లె. వి. (√నిచ్చ. సం. నిత్య మల్లికా. ప్రా. నిచ్చమల్లిఆ.) ఒకజాతిపూల మొక్క.

గీ...నిచ్చ, మల్లెనా నిత్యమల్లి యా...ఆం. భా. ౨. ౫౧. (ప్రాతవ్రాతప్రతులపా.)

నిచ్చయము. వి. (సం. నిశ్చయః. ప్రా. నిచ్చఓ.) నిశ్చయము.

క. మెచ్చగుసె సాహసానకు, వచ్చినతటి సంధి మనలవారలకొలఁదుల్, నిచ్చయము చేసి యిటువలెఁ, జొచ్చితి మన కింక నొం డుచొప్పులు గలవే. భా. రా. యు. ౪౩౭.

నిచ్చలము[1]. విణ. (సం. నిశ్చలః. ప్రా. నిచ్చలో. క. నిచ్చళవు.) ౧. నిష్కపటము.

క. వచ్చినఁ గని నీ వెచటికి, విచ్చేసెద వెవ్వ రిపుడు వెడలినపురుషుల్, నిచ్చలపుఁగరుణ సామది, ముచ్చట దీఱంగఁ జెప్పు ముద మున నన్నున్. వరాహ. ౧౦. ౭౩.

క. వచ్చినఁ గుబేరసూనుఁడు, నచ్చెలువలు నె దురు గాఁగ నరిగి యతనికిన్, నిచ్చల మగు తాత్పర్యం, బచ్చుపడఁగ మ్రొక్కి రతఁడు నల్లన నగుచున్. కళా. ౩. ౧౯౭.

మ...నీయచ్చపుం,దెమ్మఁగుంగబ్బను నిమ్మనిచ్చ లపుబత్తిన్ ముత్తియున్ బుత్తియున్, సెన రొప్పన్... నీలా. ౧. ౧౬.

౨. నిశ్చితము, యథార్థము.

చ...నీపలుకులచంద మారయఁ బ్రభావతికిం బతి గాఁగలాఁడు నిచ్చలముగ రుక్మిణీసు తుఁడు చంపు నవశ్యము వజ్రనాభునిన్. ప్రభా. ౨. ౨౫.

ఉ...ఖరాంశుమూర్తిపై, వెచ్చనివేళఁ బ్రత్య హము విచ్చి తనర్చుటగాని మోడ్పమిన్, నిచ్చల మమ్మహామహుని నేత్రము లబ్జము లాట వాసవా. కవిక. ౬. ౩౪. (ప్రాత ప్రతిపా. 'నిచ్చయ.' ముద్రి. పా.)

౩. నిర్మలము, నిర్దోషము.

ఉ. నీలపుఠాలమేడలకు నిచ్చలపుంబటికంపు మెట్టులం, బోలుమెఱుంగుగోపురపుముత్తె పువాకిటికీలుజాలువా, మేలిపసిండిబొమ్మచను మిట్టలకుం దెలిచల్వపైరిణీ, చేలచెఱంగులై యచటఁ జెల్వగు వేలుపుఁబోటిపెందెరల్. ఉ. రా. ౧. ౫౭.

ఉ. నిచ్చల మైనకెంపులును నీలమణుల్ వర మౌక్తికంబులున్. శశాం. ౨. ౧౭. రా.వి. ౫. ౬౬.

నిచ్చలము[2]. విణ. (సం. నిశ్చలం. ప్రా. నిచ్చలో.) ౧. స్థిరమైనది, చలింపనిది.

క. వచ్చినయక్కాళికునకు, మెచ్చుగఁ బూజ లిడి బత్తి మీఱఁగ మగఁడాల్, గ్రుచ్చినసింగపుఁబీఁటన్, నిచ్చలముగ నిల్పి పల్కె నే ర్పు దలిర్పన్. అచ్చ. రా. బాల. ౭౯.

క. ఇచ్చటఁ దప మొనరించిన, నచ్చపునియమ మున వాంఛితార్థము నొందన్, వచ్చును సంశయ మే లని, నిచ్చలపున్ మనసుచేత నిర్ణయయుతుఁడై. సీమం. ౧. ౨౬.

౨. నిరంతరము, ఎడతెగనిది.

సీ. నిచ్చలం బైనతేనియవానజడిసొంపు లాలిత దానధారాళి గాఁగ. రాఘవ. ౨. ౫.

మ. తళుకున్నిద్దపుఁబైఁడిబొమ్మవలె సీతాకాంత పెంజిచ్చు నిచ్చలపుంగాఁకలవన్నె వాసిగ ని మించం గాంచి...దశా. ౪. ౧౬౨.

౩. ధైర్యము; స్థైర్యము.

గీ. జిగిని మాటలలోఁతున మగతనమున, నిచ్చ లంబునఁ గడలఁ దా నెచ్చు గాంచి. నీలా. ౧. ౪౨.

సీ. కలిమియు బలిమియుఁ గడిఁదినిచ్చలమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గొలమును దిటమును వలఁతితనము. అచ్చ. రా. బాల. ౭౮.

నిచ్చెన. వి. (సం. నిశ్రేణిః. ప్రా. నిస్సేణి. క. నిచ్చణిగె.) ఆటుకమెు. ఎక్కుటకు ఉపయుక్తమగు మెట్లు కలసాధనవిశేషము, నిశ్శ్రేణి.

చ...శాంతభావనరతి నుండువారిఁ గని వారలచెప్పెడుధర్మవృత్తి నిచ్చెనయుఁగ నూఁదిసత్పదముఁ జెందుట కెక్కుము ...భార. శాం. ౬. ౨౨౪.

క. సత్యాత్మాదమంబులు, నిత్యపదంబునకు నెక్కునిచ్చెన... భార. శాం. ౫. ౫౫౬.

సీ...నిశ్శ్రేణికాఖ్య యా నిచ్చెన యన. ఆం. భా. ౨. ౨౨.

జః నిచ్చెనదివ్వెపంజులు, నిచ్చెనపంజులు.

నిచ్చెనదివ్వెపంజేలు=నిచ్చెనపంజేలు. వి. బ. (√నిచ్చెన.) నిచ్చెనవంటి దీపములపంక్తులు.

ఉ. అచ్చపుఁబ్రేమ మీఱ ధవళాంశుఁడు యామవతి న్వరింపఁగా, వచ్చు నటంచు మున్నవలువంకలఁ దత్సమయాధికారి దా, నెచ్చెలికిం బహుప్రభల నింపులు గుల్కఁగఁ దీర్చిపట్టియా, నిచ్చెనదివ్వెపంజు లన నిండె దవానలశిఖ లద్రులన్. భాను. ౩. ౯. (శ. ర. పా. 'నిచ్చెనదివ్వెపాఁజులు' అని ముద్రి.)

నిచ్చెనపంజేలు=నిచ్చెనదివ్వెపంజేలు. వి. బ. (√నిచ్చెన.) నిచ్చెనవలె నుండు దీపములపంక్తులు. (దివటీలకమ్ము లమర్చిననిచ్చెనవంటిసాధనము అని శ. ర.)

సీ. నిజవాహాఫణిఫణానిర్యన్మణిద్యుతు లనఁగ నిచ్చెనపంజు లతిశయిల్ల. ప్రబంధ. ౪౮.

మ...నిచ్చెనపంజు లారతులు నగ్నిజ్యోతులున్ వెల్గఁగన్. హంస. ౩. ౭౮.

నిచ్ఛివి. సం. వి. ఇ. పుం. వ్రాత్యక్షత్రియునకు సవర్ణస్త్రీయందు పుట్టినవాఁడు.

నిజ. సం. వి. ఆ. స్త్రీ. మిత్త్రురాలు, నెచ్చెలి. (వై. ని.)

నిజేపట్టు. స. క్రి. (నిజము+పట్టు. క. నిజవెరు.) నిజముగా తలఁచు.

చ. అలికులవేణి నవ్వులకు నాడినమాటల కింత నీమదింగలఁగఁగ నేల...భవదీయచిత్తమున్, దెలియఁగఁ గోరి యేఁ బలికితిన్ మదిలో నిజపట్టనేటికిన్. భాగ. ౧౦ఉ. ౨౬౩. (చి. ని. పా.)

నిజేమరి. విణ. (నిజము+అరి³.) సత్యవంతుఁడు.

క. తా నొకనిజమరిపోలెం, బూని పలికెఁ బెక్కుశపథములు...భోజరా. ౬. ౫౬.

క. మొన్న నొకనిఁ ద్రోలితి వాఁ, డిన్నఁగ మెల్లెక్క వాని నిది గరుణాసం, పన్నునిక్రియఁ దో నిడుకొని, నిన్న విటిచి చంపె మంచినిజమరివో లెన్. ద్వా. ౧. ౭౮౩.

క. పలికినపలుకులువలుకఁడు, కలయన్ నవకాంతఁ జూచి కడు సంచలుఁడై, నిలిచినచోటన్ నిలువఁడు, నిలు వెల్లను గల్ల కామి నిజమరి గలఁడే. భాగ. ౯. ౫౪౧.

నిజేమరితనము. వి. (నిజమరి+తనము.) ౧. సత్యశీలత.

క. దయ్యా మెఱుంగును వారల, నెయ్యంబులు మక్కువలును నిజమరితనముల్, వియ్యములును నెడసందిని, బయ్యెదకొం గడ్డమైనఁ బ్రాణము వెడలున్. భాగ. ౯. ౪౦౧.

౨. పాతివ్రత్యము.

వ. వార లాపతివ్రతనిజమరితనంబునకు మెచ్చి వయోరూపసంపన్నుం డైనచ్యవనుం జూచి. భాగ. ౯. ౬౧.

శ్లో...పాతివ్రత్యేన తోషితా. సం. భాగ. ౯. ౩. ౧౪.

నిజేము=నిక్కము. వి. (క. నిజ.) ౧. యాథార్థ్యము, సత్యము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. నీకు నేనాఁటితల్లిని నిజము సెపుమ, యమ
 రలోకంబు వేళ్యల మైనమాకు, నిట్టితగవులు
 నడవవు...భార. ఆర. ౧. ౩౬౨.

గీ.పాండుపుత్రులయద్దెసదండిమగల,కలనిజం బే
 ను జెప్పినఁ గర్ణుమనసు, నొచ్చు ... భార.
 ఉద్యో. ౪. ౨౫౨.

గీ. నిజము చెప్పిన నీకు నేనెగులు లేదు.కాశీ.
 ౪. ౨౨౮.

౨. సూనృతము, సత్యవచనము.

క. నిజము పలికె హలధరుఁ డితఁ, డజితుఁడు
 వైదర్భమాట యాహతము...హరి. ఉ.
 ౩. ౨౩౯.

క. ఆపాలకూటనే నిజ,మేపాటియుఁ దప్పరు
 ...ఆము. ౪. ౨౨౪.

౩. రీతి, విధము.

క. ఇలఁ బుట్టదు పుట్టియుఁ దా,నిలువదు నిలిచి
 యును నొక్క నిజమునఁ దిర మైకలదాఁక
 నెయిద నేరదు,వెలయాండ్రకలుపు మగల
 విడుపును సతులకౕ. కు. సం. ౭. ౧౬౫.

వ...కొందఱు తిరునాళ్ల ప్రజనిజమున నో వెంక
 టేశా శరణు శరణు కావు కావు మని గో
 విందలిడువారును...ప్రబంధ. ౮౭౭.

విణ. ౧. యథార్థము, సత్య మైనది.

జలధరవృత్తము. చేసినబాసకై పెదవిఁ జేర్చితి
 దు, శ్శాసనుశోణితం బది నిజం బరయన్.
 భార. స్త్రీ. ౧. ౧౬౪.

ఉ. గౌరవలాఘవంబులకుఁ గారణ మిందఱి
 కుం దపస్సమా,చారముతారతమ్యము నిజం
 బిది జన్మగురుత్వహీనతల్, గోరి గణింపరు
 ...హరి. పూ. ౧. ౬౯.

గీ. పరునికొకనికి నిన్నియు...నిజము లై పెంపు
 సొంపారి నెగడు నెట్టు. దశకు. ౧. ౯౩.

౨. స్పష్టము, అసందిగ్ధము.

ఉ. కావున వీరికిన్ జయము గల్గుట నిశ్చయ
 మెల్లభంగులం, జావు నిజంబు వారికి ...
 భార. ఉద్యో. ౪. ౧౮౧.

చ...ఆమెఱుంగుఁబోఁడియ కావలయున్ నిజం
 బుగన్. కళా. ౧. ౬౪.

క్రి. విణ. యథార్థముగా, సత్యముగా.

మ...భీష్ముండు పోరినయన్నాళ్లును బరిపాత
 మున వారిం బట్టిపాలార్చెఁ గా,క నిజం బ
 ల్గ నతండు ధీరు లగు టింకం జెల్లునేవారికిన్.
 భార. ద్రో. ౧. ౧౩౦.

క. అజగరచరితము దనకును, నిజముగ నలవఱు
 ప నేర్చుని ర్మలమతికిన్, వృజినభయ మస్య
 శోకము, లజేయములు గావు మోక్ష మా
 యత్త మగున్. భార. శాం. ౪. ౬౬.

క. పురుహూతముఖ్యదిక్పా,లురు సేవింపంగ స
 కలలోకేశ్వరుఁ డం,బురుహాసనుఁడు గని న
 మ,స్కరించి వినుతించె నిజము గైవారము
 గాన్. ఉ. హరి. ౪. ౧౪౬.

నిజముచేయు = ప్రమాణముచేయు, ఒట్టుపెట్టు
 కొను.

క. నిను నంపినవారికి నీ,కును హితమె యొనర్తుఁ
 బ్రాతికూల్యం బొకప,ట్టునఁ జేయ ననుచు
 నిది నా,కు నిజము చేసినది మీరు కొంకకుఁ
 డు మదిన్. ప్రభా. ౪. ౩౦.

జ: నిజమరి, నిజమరితనము.

నిజము. సం. విణ. (అ. ఆ. అ.) - ఎప్పుడును
 కలుగునది - ౧. సహజము, స్వభావముచే కలిగి
 నది, స్వాభావికము. ౨. స్వకీయము, తనది. ౩.
 నిత్యము, శాశ్వతము.

నిజేవణి. వి. సంగీతములోనిఒకస్వరస్థాయి.
 ద్వి. నిజవణి నివళేంబు నీచవైధసము ... ఆది
 గా సొగయుతాయములు. బస. పు. ౮౧
 పొ. ౧౦ పం.

నిజాము. వి. ఒకానొకమహమ్మదీయప్రభువు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. అనుచు శిరములఁ దాల్తు రెవ్వనిసమగ్ర,సైన్య
ధుతధూళిఁ జకితులై చనుసపాద,కుతపశా
హినిజామాదికుతలపతులు. వసు. ౧. ౪౬.
(ఇది మొదట సంజ్ఞాచక మయ్యును క్రమము
గా హైదరాబాదుమహమ్మదీయ ప్రభుసామాన్య
వాచక మైనది.)

నిజావళి. వి. సంగీతములోని స్వరస్థాయిభేదము.
ద్వి. వరుస లేర్పడ నిజావళి భజావళియు, నరసి
సాళగము లాయము లేర్పఱించి. అ. మ.క.
౨. ౧౯౯ పొ. ౧౦ పం.

నిజుఁడు. సం. వి. అ. పుం. స్నేహితుఁడు, చెలి
కాఁడు. (వై. ని.)

నిజ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) శుద్ధి
చేయఁబడుచున్నది, ఉడుకఁబడుచున్నది.

నిటక్క-నిలుచు=నిట్ట(క)నిలుచు.
వ... బాసటకాసటలు సముత్కటనిటలతటం
బున నిటక్కనిలిచి యంపకట్టైలనటన ఘటి
యింప... రా. వి. ౩. ౬౫.

నిటనిటనగు. అ. క్రి. (మదాదులచే) కన్నులు
తేలగిలు.
చ. కిటకిటనయ్యె నెన్నడుము కేసరిమధ్యకు
నాఁడునాఁటికిక్, నిటనిటనయ్యె సోలము
జనించి విశాలవిలోచనంబులుక్. పి. శకుం.
౪. ౫౪.

నిటలము. సం. వి. అ. న. ఫాలము, నుదురు.

నిటలాక్షుఁడు. సం. వి. అ. పుం- నుదుట కన్ను
కలవాఁడు- త్రినేత్రుఁడు, శివుఁడు.

నిటాలము. సం=నిటలము.
క. కోలం గొట్టినబెబ్బులి,పోలిక నతఁ డతనిఁ
దునిమి పొరిఁబొరి రోష,జ్వాలాభీషణ
దృష్టిని, టాలస్థలవిస్ఫురన్నటద్భ్రూకుటియై.
చంద్రా. ౬. ౯౩.

క. ఈలాగు వానితో నవు,టాలకుఁ బన్నిద
మిడి సాగటా లాడఁగ నో,టా లగు నీ
కరేందుని, టాలా యని దక్కఁగొనుఁ గటా
లలితాంగి. ప్రబంధ. ౬౩౬.

నిట్ట=నిఁట. వి. (√నిండు.) ౧. జలపూరము,
ప్రవాహము.
సీ. మనము మనంబునఁ బెనఁచి కేళికిఁ జొచ్చి
సతిఁ దేల్తు సౌఖ్యరసంపునిట్ట. భార.విరా.
౨. ౧౩౦.
ఆ. అవనిపాలుఁ గొల్వ నవసరం బైనచోఁ,జాలు
నింతవడి విచార మేల, యైదుమానికంబు
లందు నా కిచ్చిన, నిట్టయవలిదరిని బెట్టు
వాఁడ. ద్వా. ౩.౧౦౪.
౨. పొంగుట, పోటు.
ద్వి. నెఱయ దైవమె నీరు నిట్టపాటులను, వఱ
లునె యణఁగునే యరచేతియంద. బస.పు.
౬. ౯౯ పం.
౩. స్తంభము.
ఉ. ఈరపుమోకమావిగమియిక్కువ గొజ్జెఁగ
లందు జాలుపన్నీరులయేట నయ్యనఁటినిట్టల
పైఁ బోర లాడి రాలుక,ర్పూరపుదీవిఁ జెం
గలువపువ్వులు గప్పినచప్పరంబులో, సార
పుఁదమ్మిపుప్పొడులశయ్యకుఁ గన్నియఁ దె
చ్చి నెచ్చెలుల్. కవిక. ౩. ౧౧౬. (అనఁటి
నిట్ట అనఁగా రంభాస్తంభము, అరఁటిబోదె
అని భావము.)
౪. నిక్కు, నిగుడుట.
గీ. భక్తిసంయుక్తి యనుపోఁతపాల నొయ్యఁ,
జెట్టుకట్టుచు మునిశాఖి నిట్ట చూప, నిజమ
నోమార్గసంవసన్నీలవర్ణ,కైతవంబున లోఁ జే
గ గలయ నూ టె. పాండు. ౩. ౧౩౯.
౫. స్థానము.
సీ... టెంకి నిట్ట యనఁగ. గీ. స్థాన మగు...
ఆం. భా. ౨. ౧౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్వి. మూఁడుమూర్తులనిట్ట మ్రొక్కులగుట్ట, నేఁడివేలుపు ప్రభవించెఁ దూర్పునను. ద్వి. హరిశ్చ. పూ. ౨౨౦౩ పం.

విశే. (త. నెట్టం, నీట్టం.) ౧. నిడుపైనది, పొడువు కలది, ఉన్నతమైనవి.

గీ. కరులు గాచినమద్దులుగా హయంబు, లొదరు నేదులకదుపుగా నుగ్రభటులు, నిట్టవెదురులకదుపుగా నిట్టమేసె, నమరబలము నమోఘబాణములు నాఁటి. కు.సం. ౧౨.౯౦౨.

చ... ముసలిక బెదనిట్టతాడువం, టతివ రమించెఁ దా ముసలియయ్యు... ఆము. ౫.౫౩.

గీ. నిట్టతాడనఁ బొడువుచే నిక్కునాఁడు. మను. చ. ౪. ౭౩.

౨. నిక్కినది; నూటిగా పైకి లేచినది.

ఆ. నిట్టరోమములకుఁ బట్టగు చానంద, బాష్పనేత్రుఁ డగుచుఁ బ్రణుతి సేసె. భాగ. ౬. ౪౬౭.

వ... నిట్టసిగ మిట్టిపడ లలాటపట్టికలఁ బెట్టినపట్టివరనంబులు... శుక. ౨. ౧౦.

౩. స్థిరము, చలింపనిది.

(పుండరీకుఁడు.) చ... హృజ్జలజమానససౌరభమట్పదంబు నృజ్జవరథభూమణంబు వెలిఁజూడనినిద్దపునిట్ట చూపునక, మునుకొని చొక్కు... పాండు. ౨. ౯.

నిట్టకనిలుచు=నిటక్కనిలుచు. అ. క్రి. (నిట్ట + నిలుచు.) స్తంభమువలె నిలుచు, పొడువుగా నిలుచు.

క. ఇలు కాలి కూల నిట్టక, నిలిచిననిట్రాడువోలె నిజరథ మటులక, బొలియ న్నిలఁ బడి రాక్షసులఁ జేఁ డుండుటకు నగుచుఁ జూచి రి వేల్పుల్. రామా. ౭. ౧౩౨.

నిట్టకనిలువు(ల్వు). వి. (√నిట్ట.) సరినిలువు.

ఉ. నిట్టకనిల్వునం గలఁగి నేత్రయుగంబున బాష్పపూరముల్, దొట్టఁగ ఘర్మతోయములతోఁ బులకాంకురజాల మెల్లెడం, బుట్టఁగఁ దొల్లి యిల్లలుకఁ బూని యొనర్చినమంటి ముద్ద దాఁ, బెట్టెఁ దదీయపాత్ర నది భిక్షయకాఁ గొనిపోయె సిద్ధుఁడుక. భోజరా. ౩. ౬౬. (శ.ర. షా. 'నిట్టకనిట్ట'. చి. ని. షా. నిట్టకనిల్వునక అనఁగానిలుచున్నది నిలుచున్నట్లుగానే అని భావము.)

తరళము. పుడమి నిట్టకనిల్వునం బడిపొక్కుచుంగడు దీనయై, యడఁకు నేమియు లేనివాక్కులనావు రంచు విలాపమం, దెడరు దోఁప భృశాతురోన్నతి నేడ్చునక విని భీతితో. భాగ. ౬. ౪౪౯.

నిట్టగ్రమ్ము. అ. క్రి. (నిట్ట + క్రమ్ము. త. నట్టణల్.) నిట్టవొడచు; ఉప్పొంగు, పై కుబుకు.

సీ. చామలనగు మోముఁజందురుపొడుపున రాగాంబుధులు నిట్టగ్రమ్మ నసుట. నృసిం. ౨. ౫౦.

సీ. వదనేందుదీప్తుల వరులమనోగతస్నేహరసాబ్ధులు నిట్టగ్రమ్మ. కు. సం. ౧౧. ౫౯౭.

నిట్టదొట్టు. అ. క్రి. (నిట్ట + తొట్టు.) వెల్లివిరియు, ఉప్పొంగు.

చ. పిడుగులు బిట్టు ప్రేలి పడఁ బిమ్మటఁ బొందిసమస్తజీవులుక, వడఁకఁగ నంత్యకాలమునవారిధు లన్నియు నిట్టదొట్టిన, ట్లుడుగకయేఁ డురాత్ములు మహోద్ధతి వానలు గుర్య ... పద్మ. ౯. ౨౩౧.

నిట్టలుద్రోచు, నిట్టద్రోచు=నిట్టలుద్రోయు. అ. క్రి. (నిట్టలు + త్రోచు.) ఉప్పొంగు, పైకుబుకు; ఉద్ధతమగు, పర్వు, వ్యాపించు.

సీ. నిట్టలుద్రోచుచు నెలవులకలమేర లెల్లను బిగియొక్కియేర్పడంగ. గీ... చన్నులు... భార. విరా. ౧. ౨౪౫. భార. శాం. ౧. ౨౪౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. దుగ్ధాంబునిధి నిట్టద్రోచెనో యని శేషుఁ బాన్పుగా హరి నీటఁ బవ్వడింప. కు. సం. ౮. ౧౧౮.

సీ. హ్రాసోన్నతసమాయతాంగవిస్ఫూర్తిపై నిబిడలావణ్యంబు నిట్టద్రోవ. కావ్యా. ౩. ౩౯.

నిట్ట(క)నిలుచు=నిటక్కనిలుచు. అ. క్రి. (నిట్ట + నిలుచు.) - స్తంభమువలె - నిలువుగనిలుచు, పొడువుగా నిలుచు.

గీ. మేదినీధర మిబ్భంగి మిన్నుముట్టి, నిట్టనిలుచుండి చూచె నిర్నిమిషదృష్టి. కాశీ. ౧. ౧౧౯.

గీ. భవనఘటనకు మొదలికంబమునుబోలె, భువనముల కెల్ల నీ వాదిభూతుఁ డగుట, నిట్టనిలుచున్కి చేఁ గాదె నెట్టుకొనియె, గెంటుఁ గుంటును లేక లక్ష్మీకళత్ర. పాండు. ౨. ౫౫.

క. ఇలు కాలి కూల నిట్టక, నిలిచిననిట్రాడువోలె నిజరథ మటులం, బొలియ న్నిలఁబడి రాక్షసులతోఁ డుండుటకు నగుచుఁ జూచిరి వేల్పుల్. రామా. ౮. ౧౩౨.

నిట్ట(లు)పొ(వొ)డుచు. అ. క్రి. (√నిట్ట.) ౧. పైకుబుకు,ఉప్పొంగు;వెల్లివిరియు,ప్రవహించు.

క. జలనిధులు నిట్టవొడువం, బ్రళయాంతకుఁ డవనిజనులపై నేచినయ, ట్లలఘు ప్రకటచతుర్విధ,బలయుతుఁడై మానసారుపై వడి నడిచెన్. దశకు. ౨. ౮.

వ. తన్ను విస్మయంబునం గొనియాడు వైమానికులకోలాహలంబు లాలకించువడువున నిట్టలు పొడుచుచు నేనదులుఁ దనకు సరిరావని నవ్వునురవున నురువులు చూపుచు... వరాహ. ౧౦. ౬౨.

సీ. యమునామహానది యన్నిచోటుల ముంచి యుడుమార్గమున నిట్టవొడిచె నొక్క. భోజరా. ౨. ౧౦౧.

క. అయ్యువిదలనెమ్మనముల, నెయ్యంపురసంబు లుబ్బి నిట్టలువొడువం, జెయ్యాడ కతనిఁ డగ్గఱి, రొయ్యనఁ గనుఁగొనలఁ గలికియలు కులు చిలుకన్. పద్మ. ౩. ౧౬౪.

౨. రోమాంచిత మగు. (శ. ర.)

౩. విజృంభించు; వ్యాపించు.

గీ. జనము లానందమునఁ దేల జగము లెల్లఁ, దొట్టి నిండారువెన్నెల నిట్టవొడిచె. నిర్వ. ౬. ౫౫.

గీ. భూనభోంతరదిక్పరిపూర్ణ మైన,నిఖిలరూపులఁ దెల్లనై నివ్వటిల్ల, నిండి తండోపతండమై నిట్టవొడిచెఁ, బండువెన్నెల కన్నుల పండు వగుచు. భాను. ౩. ౧౮.

నిట్టరాడు=నిట్రాడు. (నిట్ట + రాడు.)

సీ...ఆలయాధారవీర్య స్తంభసంజ్ఞ నిట్రాడు నిట్టరా డనఁ దగు...ఆం. భా. ౨. ౨౦.

ద్వి. నిట్టరాడును బోలె నిలుచున్నవాని,బేతాళు నొక్కనిఁ బిలిచి... ద్వి. హరిశ్చ. ఉ. ౧౬౩౫.

నిట్టలము. విణ. (=ఇట్టలము. త. నీట్టల్.) అధికము.

చ...బలఘుస్తరు నమ్ముల నోడునేసి ని,ట్టల మగుడప్పి సోలుటయు డాసి దశాననుండు వి,చ్చలవిడిఁ బట్టి కట్టి జయశంఖము బట్టఁగఁ బంచి యార్చెన్. నిర్వ. ౬. ౧౮౪.

ఉ. నింగికి నేలకుం బొడవు నిట్టల మై శిఖలందుఁ బర్వును,త్తుంగతరాగ్నిజాలములఁ దొట్రిలుచున్...భాగ. ౬. ౩౯౯. (శ. ర. పా. 'నిచ్చలమై' అని ముద్రి.)

౨. నిలుకడ.

సీ...నిలుకడ తనరును నిట్టల మన. ఆం. భా. ౩. ౨౯.

నిట్టలుద్రోయు= నిట్టలుద్రోచు. అ. క్రి. (నిట్టలు + త్రోయు.) అతిశయించు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. ఆరమణీలలామ హృదయంబున నాదట
లంతకంతకుం, జేరఁగ నింపు సంతసముఁ
బెంపు వహింపఁగ నొప్ప నెట్టఁగా, నేరుపు
లేక వేడుకలు నిట్టలుద్రోసెడువాలుఁగన్ను
లన్,వారణ లేక క్రోలె జనవల్లభసుందరు
మేనిచెల్వమున్. కేయూర. ౪. ౫.

నిట్టు=నిట్రు. వి. ౧. ఉపవాసము, పస్తు.
సీ. వంటగుడారు క్రిం దంటివెల్లువనీరు ప్రాయి
వీఁగఁ దొట్టినపూఁట నిట్టు. రా. వి. ౨.
౭౯. (చి.ని,శ.ర.పా.'నిట్రు' అని ముద్రి.)
౨. క్షామము.
క. దున్నక వెదవెట్టక యుత్పన్నము లైనట్టి
విపులబహుసస్యంబుల్, సన్నసనఁ బండుఁ
బ్రాణుల,కు న్ని ట్టనుమాట లేదు గోరం
తైనన్. మార్క. ౪. ౪౧. (శ. ర. పా.)
విణ. శుష్కము. (చూ. నిట్టుపాసము.)
జః నిట్టుపాసము.

నిట్టుకిక్క. వి. బాలికాక్రీడావిశేషము.
సీ. బొమ్మలపెండ్లిండ్లు బువ్వంపుబంతులు పుణి
కిళ్లు నిట్టుకిక్క బొమ్మరిండ్లు. హంస.౫.౧౫౫.

నిట్టుపవాసము. మి. వి. శుష్కోపవాసము.
ద్వి. నిట్టుపవాస మేన్దినము లుండంగ, నెట్టకేలకు
బియ్య మిరుస గల్గినను. బస. పు. ౪.
౯౦౦ పం.

నిట్టుపాసము=నిట్రుపాసము. వి. (నిట్టు+ఉపా
సము.) శుష్కోపవాసము.
ఉ. నిన్నటినుండి యేము నిఱునీఁగియు నుంటిమి
నిట్టుపాసముల్. కాశీ. ౩. ౧౪౯.
గీ. ఛాత్రులును నేను నిట్టుపాసంబు వడిత్రి, మి
...భీమ. ౨. ౧౦౦. (చి. ని. పా.)

నిట్టూరుచు(ర్చు). అ. క్రి. (నిడు+ఊరుచు.)
నిట్టూర్పువిడుచు. (చి. ని, శ. ర.)

నిట్టూరుపు(ర్పు). వి. (√నిట్టూరుచు. క. నిట్టి
సు. త. నెట్టియిర్పు.) దీర్ఘనిశ్వాసము; నిశ్వా
సము.
గీ. ద్రుపదనందనపరిభవదుఃఖమునకు, నుల్లమునదు
రపిల్లుచు నున్నసరసి,వేఁడినిట్టూరుపో యన
వెడలెఁ గ్రొత్త,తావి మూతులు విచ్చునెత్త
మ్మివిరుల. భార. విరా. ౨. ౨౩౬.
గీ...నలువపట్టి, యొండు నాక యొక్కింతసే
పూరకుండి, యుస్సు రనుచును వేఁడినిట్టూ
ర్పువుచ్చె. కాశీ. ౧. ౧౦౧.
గీ. నీదునిట్టూర్పుగాడ్పులు నిగమపంక్తి. హర.
౩. ౧౧.
మ...మై బడలఁగా గాటంపునిట్టూరుపుల్,
పొలయన్ నిద్రితుఁ డైనపద్మభవు నాలో
కించి యాలోపలన్. దశా. ౧. ౨౭౯.

నిట్టూర్పులిచ్చు. అ. క్రి.(నిట్టూర్పులు+ఇచ్చు.)
నిశ్వసించు, నిశ్వాసము విడుచు.
గీ. అలసి నిట్టూర్పులిచ్చునొయ్యారము...కలు
గుమోహిని దలఁప మైఁ బులక లొదవె.
దశా. ౨. ౩౬౦.

నిట్టెము. వి. (నిడుద+ఎమ్ము. క. నిట్టెల్వు, నెట్టె
లుపు.) వెన్నెముక, పొడు గైనయెముక.
ద్వి. అట్టిత్రివిక్రమునిట్టెము గాదె,పట్టె ఖట్వాం
గము భాతి శంకరుఁడు.బస.పు.౬.౨౨౨పం.
ద్వి. అట్టిత్రివిక్రమునిట్టెమ్ము విఱిచి, పట్టె నీశ్వ
రుఁడని ప్రతిభ సెప్పండు. బస. పు. ౪.
౩౩౧ పం. ('నెట్టెమ్ము' అని ముద్రి.)

నిట్ర(ము). వి. నిలువు.
ఉదా:-కలము అంతనిట్రముగా పట్టుకొనకుము.
(శ. ర.)
విణ.సూటిగా మీఁదికుండునది.(చూ.నిట్రాడు.)
జః నిట్రపాటు, నిట్రపొడుచు, నిట్రాడు, నిట్రా
యి, నిట్రించు, నిట్రిల్లు.

నిట్రపాటు. వి.(√నిట్ర.) నిలుచుట, నిక్కుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ...నిడుదరోమంబులు బహిర్నిర్గతంబు లైన యాంతరకోపానలజ్వాలలమాడ్కి నిట్రుపాటునం దనర...చంద్రా. ౨. ౮౪.

నిట్రపొడుచు. అ. క్రి. (√నిట్ర.) పొడువగు, నిక్కు.

వ...తటాలున నేదుఁబందులచాడ్పున నెఱకలు నిట్రపొడువ నొడళ్లు జాడించుచు...ప్రబంధ. ౪౮౮.

నిట్రాడు= నిట్టరాడు. వి. ఔ. (నిట్ర + రాడు.) దూలము లేకయే కట్టెడుగృహమునకు పాఁతు స్తంభము.

క. ఇలు కాలి కూల నిట్టక, నిలిచిననిట్రాడువోలె... రామా. ౮. ౧౩౨.

వ. అని రోషపరుషవచనంబులం గినియుచు గృహంబునకుం గొనిపోయి యయ్యవదగాకి ఱంకుటాలిం గాలం గేలం బొడిచి పెడమఱలం దిగిచి నిట్రాట నేఁతపగ్గంబున బంధించి కాలికుండు నిద్రించె ... వేం. పంచ. ౧. ౨౫౪.

క. ఆ నేఁత కాని చెలిగృహ, మానిసనిట్రాట నంటి యటునిటు త్రాటఁ, దా నిఱుచేతు లమర్చియ, థానియతిం గూయకుండె... వేం. పంచ. ౧.౨౬౪. (చి. ని. పా. 'నిట్రాతఁ' అని శ. ర, ముద్రి.)

సీ...ఆలయాధారదీర్ఘస్తంభసంజ్ఞ నిట్రాడు నిట్టరా డనఁ దగు... ఆం. భా. ౨. ౨౦.

నిట్రాయి. వి. (నిట్ర + తాయి.) పొడువుతాయి. (శ. ర, బ్రౌ.)

నిట్రించు. అ. క్రి. (√నిట్ర.) -అవయవములు- నిక్కపెట్టు, నిక్కించు.

ద్వి. అం దుండి యూఁకించి యవనికి నుఱికి, నిలిచి నిట్రించి ఘణిల్ ఘణి ల్లనఁగ. బస. పు. ౫. ౪౪౪ పం.

ద్వి. వలపటికి నెపంబు వ్రాలి కుంభకము, నెల కొల్పి భుజములు నిట్రించి కంఠ,మొరగించి ...పండితా. మహిమ. ౨౫౦ పా.

నిట్రిల్లు. అ. క్రి. (√నిట్రు.) ఉపవాస ముండు. (చి. ని, శ. ర.)

నిట్రు=నిట్టు.

(ఉపవాసము.)

సీ. దశమి నాఁ డేకభుక్తము చేసి యవలినాఁ డోర్చి జాగరముతో నుండు నిట్రు. ఆము. ౪. ౫౦.

క. పొలు పొంద రాజసూయం,బులు నూఱును వాజిమేధములు నూ ఱైనం, దులగా వొక యేకాదశి, నలరుచు నిట్రున్నఁ గలుగునా ఫలమునకుఁ. జాహ్నవీ. ౩. ౯౨.

సీ. పస్త్రిల్లి నుంకు నిప్పస్తు నిట్రునఁగను నుపవాసనసంజ్ఞయై యొప్పుచుండు. ఆం. భా. ౨. ౧౪౫.

విణ. శుష్కము. (చూ. నిట్రుపాసము.)

జ : నిట్రిల్లు, నిట్రుపాసము.

నిట్రుపాసము=నిట్టుపాసము. (√నిట్రు.)

(శుష్కోపవాసము.)

సీ. సతతంబు నిట్రుపాసములతో నత్యుగ్రతపము గావించుచుఁ దాన మాడ. వరాహ. ౪.౪౩.

గీ. తెల్లవాఱిన గుండఁగికొళ్లలీల, నీళ్ల మునుఁగుచు నొడ లెల్లఁ దెల్లఁబాఱి, నిట్రుపాసంబులను గూడి నెవ్వఁ దొడరు,వెడఁగుబాఁపనతగులునఁ బడితి వేల. వాల్మీ. ౨.౧౩౦.

నిడి. విణ. (నిడివిశబ్దమునకు వృత్తియందు అంత్యవర్ణలోపము.) దీర్ఘము.

క. జడిగొన్న వాన నేసుం, దడిసితి నాలో నొకింత తడవున కానె,వ్వడి సడలె నడఁగెనుఱుముల్, నిడిమించులు మాసె వెలుఁగు నిలిచెఁ వెలిచెఁ. వేం. పంచ. ౩.౧౦౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**నిడివి.** విణ. (క. నిడుపు.) దీర్ఘము.

గీ. ఇట్టివేసవికతేఁ బగ లిట్టి నిడివి, యైన గయి
రించునే దివిజారి యనుచు, వెఱచి తోఁ
గడు తెఱఁగున వేఁడివెలుఁగు, వరుణుఁ డేలె
డిదెస నొక్కవలన నొదిగె. హరి. పూ.
౪. ౧౬.

క. తొల్లియుఁగసంధి నొకతటి, నెల్లెడఁ బొడవం
గఁ దాప మెక్కుడుగా సంధిల్లె నొకవఱపు
ప్రాణులు, తల్లడిలఁగ నిడివి యగుచు ధరణి
తలంకన్. కేయూర. ౩. ౧౨.

ఆ. అధికభక్తితోడ నమృతేశ్వరీదేవి, సిద్ధలక్ష్మి
సంభజించి నరుఁడు, నిడివి గాఁగ బ్రతుకు
విడువంగ ముడువంగ, ప్రేఁకనైనకలిమి వృద్ధిఁ
బొందు. కాశీ. ౬. ౧౯౯.

వి. ౧. పొడువు, దైర్ఘ్యము.

క. ఆమడనర వెడలుపు మూఁ, డామడ నిడివి
యును గలిగి యతిరమ్యంబై,...నిద్రామందిర
మలరు మృదులతల్పతతులతోన్.ఉ.రా.౨.
౨౯౩.

గీ. ఇందులో నిష్ట మెద్ది మీయిందుముఖికి, నడు
గుఁ డెడమాటలకుఁ బ్రొద్దునిడివి లేదు. పి.శ.
కుం. ౩. ౭౩.

౨. గుఱ్ఱపుపఱుగు, అశ్వగతిభేదము.

సీ.నిజకీర్తిచంద్రికల్ నిగిడియంబుధులెల్లఁ గడచె
నన్నవిధాన నిడివిఁ బోలి. ప్రబంధ. ౧౭౫.

**నిడీనము.** సం. వి. అ. న. పక్షులఅధఃపతనము,
పక్షులు పైనుండి క్రిందికి దిగుట.

**నిడు.** విణ. (నిడుద శబ్దమునకు లుప్తశేషరూపము.
ఇది సమాసపూర్వావయవముగానే కన్పట్టుచు
న్నది.) దీర్ఘము, పొడువైనది.

సీ. కొంగమెడయును నిడుగూనివీపు నొఱగు పో
యిన రొండియును బొక్కిరొమ్ము. హరిశ్చ.౪.
౧౬౭.

సీ. మును మించి నిడుమోర ముంచి దూఁటిన మ
హాజడధిపూరము దలకడవు గాఁగ. హరి.
పూ. ౪. ౧౬.

సీ. తొలుమొగుల్ నిడుచిన్కు లెలమిఁ గ్రోల్వా
నకో,యిల బలుమంచుసోనలకుఁ జనువె.
నీలా. ౨. ౪౬.

నిడుజడి=విడువక కురియువాన.

చ. నిడుజడి దాఁకి యెండుఁ జననేరక యాఁక
టఁ గ్రుస్సి చెట్టుపల్, సడలఁ గులాయ
మధ్యముల శాఖలసందుల నిల్వలేక...హరి.
పూ. ౭. ౧౬౯.

నిడువాలిక=మిక్కిలిదీర్ఘము.

(సత్య.) ఉ. వాసెనకట్టు గట్టి నిడువాలికకస్తురి
పట్టు వెట్టి ... పొరలె గాఢమనోజవిషాద
వేదనన్. పారి. ౧. ౯౯.

**నిడుఁగేలు.** వి. (నిడు+కేలు.) దీర్ఘహస్తము,
పొడుగైనచేయి.

క. నిడుఁగేలున్ బలుతొడలున్, వెడఁదయుర
ము నైరణావనిం గర్ణునొడల్, పడి యున్న
...భార. కర్ణ. ౩. ౩౬౭.

**నిడుఁద్రాడు.** వి. జా. (నిడు+త్రాడు.) పొడుగు
త్రాడు.

ఆ. కుడువనిచ్చుతతియుఁ గురువర క్రిక్కించు,
నవసరంబు నెఱఁగి యరినృపాలు,నీవు ధీర
వృత్తి నిడుఁద్రాటఁ బోనిమ్ము...భార.ఆశ్ర.
౧. ౪౨.

**నిడుచేను.** అ. క్రి. (నిడు+చను.) చాఁగు.

క. వడి నాడు గఱచి వలకేల్,నిడుచన గనయ
మునఁ బెనఁచి నీల్గి బలం బేర్పడ...భార.
ఆది. ౪. ౧౪౫.

**నిడుద.** విణ. (త. నెడిదు.) నిడుపు, దీర్ఘము.

క. వడముడిఁ దలమిగిలి రయం,బడరఁగ సహ
దేవుఁ డత్యుదగ్రత మెఱయం,దొడరి భవ
త్సుతు మార్కొని,నిడుదవెడఁదతూపు లేసి
నెఱిఁ దూలించెన్. భార. శల్య.౧.౩౭౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ...ఊర్ధ్వ లోకమ్మునైనిడుదలు గాఁగఁ బ్రా
  ణములు నిల్వక తల్లడిలంగ సంగరం, బుడిగి
  కృతాంతుఁ డేఁగె...హరి. ఉ. ౪. ౨౮.

సీ. నిడుదపెన్నెఱిగుంపు జడగట్ట సగరుమ్మ
  నుమందు తపము గైకొనినచోటు. మనుచ.
  ౨. ౯. ఆం. భా. ౩. ౧౮.

వి. దీర్ఘము, ద్విమాత్ర స్వరమునకు సంజ్ఞ.

క. గురువులు నిడుదలు...కవిజనా.౧.౧౩.

సీ...నిడు దన దీర్ఘంబు నెగడుచుండు. ఆం.
  భా. ౨. ౧౮౮.

జః నిట్టూర్చు, నిట్టూర్పు, నిట్టూర్పులిచ్చు,
  నిడ్పెము, నిడుఁగేలు, నిడుఁద్రాడు, నిడుచను,
  నిడుదగనుపు, నిడుదనిదుర, నిడుదపయనము,
  నిడుపడు, నిడుబాట, నిడుముసుఁగు, నిడు
  ముస్తె, నిడువెండ్రుక, నిడువెండ్రుకవెట్టు,
  నిడువేంద్రము, నిడూర్పు.

నిడుదగనుపు. వి. (నిడుద + కనుపు.) అందలపు
  బొంగుయొక్క దోషవిశేషము. (కనుపు లెడ
  ముగా నుండుట.)

వ...నిడుదగనుపు లేఁతయు ముదురు సన్నము
  గమకము నీలధవళరక్తహరిద్వర్ణంబులు మొ
  దలుగాఁ గలదుర్గుణంబులు ... ప్రబంధ.
  ౬౦౫.

నిడుదనిదుర. వి. (నిడుద + నిదుర.) దీర్ఘనిద్ర,
  మరణము.

క...కాకంబులు నఱవఁగ నిడుదనిదుర నొలసి
  తెలుపదిక్కుమాలి యున్నాఁడు గదే.భార.
  ఆశ్ర. ౨. ౧౬౨.

నిడుదపయనము. వి. (నిడుద + పయనము.)
  దీర్ఘప్రయాణము.

క. వడి గలవా రని భటులను, బడలింపకు మన
  ఘు నిడుదపయనంబుల మం, డెడువేసవినిక్
  విడిసిన,యెడలన్ బ్రజడప్పినొప్పు లెఱుఁ
  గుము కరుణన్. ఉ. రా. ౭. ౬౮.

నిడుపకమ్ములు. వి.బ. (నిడుపు + కమ్ములు.) కడప
  కిరుప్రక్కల నుండునిలువులు. (శ. ర.)

నిడుపాఁడు. వి. (త. నెడువన్ - నిడుపు + ఆఁడు
  అని శ. ర.) - దైర్ఘ్యముకలిగిన - పాము.
  (చంద్రికావర్ణనము.) సీ. శశిమౌళి తిరుపుచే జ
  డఁ జుట్టు నిడుపాఁడు ద్రావినపాలెరఁ గ్రాచె
  ననఁగ. రా. వి. ౩. ౧౧.

నిడుపు. వి. ౧. ఆయామము, దైర్ఘ్యము, నిడివి.
  (ఇంద్రసభావర్ణనము.) వ...అదియును నూఱు
  యోజనంబులవెడల్పును నూటయేఁబదియోజనం
  బులనిడుపును నేనుయోజనంబులతనర్పును గలిగి
  ...భార. సభా. ౧. ౬౨.

సీ. నిడుపునఁ దూర్పును బడమర నై రెండుగ
  డలు నంభోనిధిఁ గదిసి యుండు. భార.
  భీష్మ. ౧. ౨౧.

గీ. యమునానిడు పెల్ల విడిదలయై తలిర్చ, బలము
  విడియించి మగధభూపాలకుండు. హరి. ఉ.
  ౨. ౧౩. ఆం. భా. ౨. ౧౫౨.

౨. నిలువు.

గీ. అడ్డ మేర్పడ వళియు రోమాళి నిడుపుఁ, బ
  డఁగ రేఖయుఁగలి హంసపాది వ్రాసె, లేనిన
  డుమున కొకశంక గా నజుండు, జనము లెం
  దున్నదో యని సంశయింప. ముకుంద. ౨.
  ౧౦౧.

విణ. పొడువైనది, దీర్ఘము.

క. అచ్చటనచ్చట నిడుపుగ,విచ్చినఁ గుసుమా
  స్త్రశాస్త్రవేదులమనముల్, మెచ్చించుఁ
  దెరలమంజిడి,పచ్చడములు చతురశీతిబంధం
  బులతోన్. వైమ. ౪. ౧౫౫.

క్రి. విణ. నిలువుగా.

సీ. అడ్డంబు నిడుపు నాపడ్డలగతి మనుబిల్లు
  డొంకలనుండి క్రేణ్ణుదాఁటు. మనుచ. ౨. ౪.

జః నిడుపకమ్ములు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిడుచాటు. వి. (నిడు+చాటు.) పెద్దత్రోవ.
ఆ. నూఱుగతుల నీవు వాఱుదే నన్నియు, నె
ఱుఁగఁ బలుఁగు తెల్ల నెట్లు వాఱు, నడరి
యాకసముననిడుచాటు నట్ల ప్రాఁఱుదము
రమ్ము జలధిఁ జదల ననిన. భార.కర్ణ.౨.౬౩.

నిడుమునుఁగు. వి. (√నిడు.) నిండుమునుఁగు.
సీ. కాళ్లు కుప్పవడంగఁ గదలఁ జాలక యట్టె
నిడుమునుం గిడి శయనించు చెలువ. దశా.
౪. ౪౫.

నిడుముస్తె. వి.(నిడు+ముస్తె.) తుంగ. (శ. ర.)

నిడువెండ్రుక. వి. (√నిడు.) నిక్కవొడిచినవెం
డ్రుక. (చూ. నిడువెండ్రుకవెట్టు.)
జః నిడువెండ్రుకవెట్టు.

నిడువెండ్రుకవెట్టు. అ. క్రి. (నిడువెండ్రుక+పె
ట్టు.)-భయాదులచే - ఒడలు రోమాంచితమగు.
చ. సరసిజనాభ బంధుజనసంతతిఁ గయ్యపు
నేలఁ జూడఁగా,విరవిర వోయి మేను నిడు
వెండ్రుకవెట్టుచుఁ గంప మొందె...భార.
భీష్మ. ౧. ౧౭౧.
శ్లో. వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చజాయ
తే. సం. భార. భీష్మ. ౨౫. ౨౯.
చ ... ఆ, సరసిజనాభనందనువిశాలభుజాంతర
ముం బగిల్చినన్, విరవిరవోయి మేను నిడు
వెండ్రుకవెట్టఁగ...భాగ. ౧౦. ఉ. ౭౪౨.
చ. వివశత నొంది మేను నిడువెండ్రుకవెట్టఁ
గ...పొరిఁ గంపము నొందుచు నిశ్వసించు
చున్. హరి. ఉ. ౭. ౧౧౦.

నిడువేండ్రము. వి. (నిడు+వేండ్రము.) అత్యు
ష్ణత, మిక్కిలివేఁడిమి.
క. జడనుం దాపము నిద్రయు, నిడువేండ్రము
తోడ నెగయునిట్టూర్పులు సందడిగొని
వడిగొని మదిలోఁ, జిడిముడిపడి కన్నుఁగవ
యుఁ జిడిముడివడఁగాన్. ఉ.హరి.౬.౪౭.
(వ్రాఁతప్రతి. పా.)

నిడుసు. వి. (క. నిడుసూళు.)- చదువుటలో దీర్ఘ
ములతో కూడిన- పెద్దధ్వని.
సీ. నిడుసునఁ బెట్టక నిప్పోటమునఁ బోక తరు
వాయి తప్పక తడవికొనక. సకల.స.౩౦౪.

నిడూర్పు= నిట్టూర్పు. వి. (నిడు+ఊర్పు.)
ఉ. ఆవచనంబు వేడ్క విని యాదలయూఁచి
నిడూర్పు పుచ్చి హేమావతి పల్కె ...
హంస. ౪. ౧౬౫.
చ... లేఁతకా, న్బలిసె మెఱుంగుటారు గను
పట్టె నిడూర్పులు వుట్టె నోకిలింతలు పొడ
సూపె వెల్లిడి దినన్ మన సయ్యెఁ బయోజ
గంధికిన్. పె. శకుం. ౩. ౫౪.

నితంబము. సం. వి. అ. పుం. - కాముకులచే
ఏకాంతమున కాంక్షింపఁబడునది - సురతమర్ద
నముచే బడలునది- ౧.పిఱుఁదు. ౨.కటి,మొల.
౩. స్కంధము, మూఁపు. ౪. కూలము, ఒడ్డు.
౫. అద్రికటకము, కొండనడుము.

నితంబవతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. గొప్పపిఱుఁ
దులు కలస్త్రీ. ౨. నితంబిని,స్త్రీ.

నితంబిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. ప్రశస్తమైన
పిఱుదులు కలస్త్రీ, గొప్పపిఱుఁదులు కలయాఁ
డుది. ౨. స్త్రీ, ఆఁడుది.

నితమామ్. సం. అవ్య. అత్యంతము, మిక్కిలి.
(దీనికి తెనుఁగున ప్రయోగములు కానరావు.)

నితరామ్. సం. అవ్య. అత్యంతము, మిక్కిలి.
(దీనికి తెనుఁగున ప్రయోగములు కానరావు.)

నితలము. సం.వి.అ.న. అధోలోకములలో మూఁ
డవది. (వాచ.)

నితాంతము. సం. విణ. (అ.ఆ.ఆ.) అధికము.
క్రి. విణ. అత్యంతము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**నిత్తెమల్లె.** వి. (√నిత్తెము. సం. నిత్యమల్లికా.) మల్లికావిశేషము.

సీ. నీలాంబరంబులు నిత్తెమల్లెలు కొండగోఁగులు మల్లెలు గోరంటలును. భల్లా 3. ఆ. (శ.ర.)

**నిత్తెము.** విణ. (సం. నిత్యమ్.) శాశ్వతము.

క. స త్తైన దెల్ల క్షణికము, నిత్తెము గా దంచు వాహానివహము వలెనే. దశా. ౧౦. ౫౫.

జః నిత్తెమల్లె.

**నిత్యక.** సం. వి. ఆ. స్త్రీ. విషముష్టి, ముసిఁడి.

**నిత్యకర్మము.** సం. వి. న్. న. ౧. చేయనియెడల ప్రత్యవాయజనక మగుశాస్త్రవిహితకర్మము. (స్నానసంధ్యాది.) ౨. ఎప్పుడును చేయవలసినపని.

**నిత్యకల్యాణము.** సం. వి. అ. పుం. ఎడతెగని శుభము, ఎల్లప్పుడును కలుగుశుభము.

ఉ. ఆణిమెఱుంగుముత్తెపుటొయారపుముగ్గులు రత్నదీపికా, శ్రేణులు ధూపవాసనలు హృద్యనిరంతరవాద్యఘోషనల్, శాణఁ బొసంగఁ బ్రోలు మిగులం గనువిం దొనరించు నిత్యక,ల్యాణముఁ బచ్చతోరణము నై జను లందఱు నుల్లసిల్లఁగన్. విజ. ౨. ౧. ౭౩.

ఉ. పాణితవాణి పంకరుహపాణి రమాఘనవేణి నిత్యక,ల్యాణము పచ్చతోరణములం దగితామరతంప రై కవి, ప్రాణపదంబు నామగదలాన్వయకృష్ణసుధీంద్రచంద్రక,ల్యాణమణీగృహంబున నిరంతరమున్ వసియించుఁగావుతన్. దశా. ౧. ౨.

**నిత్యగతి.** సం. వి. ఇ. పుం. - నిత్యగమనము కలది - సదాగతి, వాయువు.

**నిత్యనియమము.** సం. వి. అ. పుం. ఎప్పటికిని ఏకరూపముగా నుండునియమము, మాఱనినియమము.

**నిత్యపడి.** మి.వి. దివసపడి, నిత్యము నియమముగా చేయవలసినది.

ద్వి. మ్రొక్కఁక కరములు మోడ్చ కందంద, చిక్కఁక స్రుక్కఁక చక్కన వచ్చి, గుడిసొచ్చి తననిత్యపడి వేఁడుకొనఁగ, మిడ మిడ మిడుకుచు మిఱుమిండఁ డనియె. బస. పు. ౪. ౧౨౭ పొ. ౮౨౭ పం.

వ... బెరసినబోలవసమునం బెట్టినఎడ్లు ౫౦ నిత్యపడి వోయంగల... ద.శా. ౪. ౧౦౦౬.

వ... మెంది- యబోయునెటియమవసమునం బెట్టిన ఎడ్లు ౫౦ నిత్యపడి ఓయంగల... ద.శా. ౪. ౧౦౦౯.

ఇట్లే: నిత్యనిబన్ధము. (చూ. దశా. ౬. ౧౦౪౭.

**నిత్యప్రళయము.** సం. వి. అ. పుం. దైనందిన ప్రళయము, సుషుప్తి,నిద్ర.

**నిత్యము.** సం. విణ. (అ.ఇ.అ.) - నియతముగా నుండునది, ఏర్పాటుగా కలుగునది- ౧. ఎడతెగనిది, సతతము. ౨. చేయనియెడల ప్రత్యవాయజనక మగుచు విధివాక్యముచేత బోధింపఁబడునది. (కర్మము, మొ. వ్యతి: కామ్యము.) 3. ఉత్పత్తివినాశములు లేనిది, శాశ్వతము,కాలత్రయమునందు నుండునది. ౪.ఆవశ్యకమైనది. వి. అ. పుం. సముద్రము. క్రి. విణ. ౧. ప్రతిదినము. ౨. ఎల్లప్పుడు, శాశ్వతముగా.

(దీనికి కొన్నిచోటల మువర్ణలోపము.)

ద్వి. కడు నర్థితోడ నఖండదీపంబు, లెడపక నిత్య వెయ్యేసి ముట్టింప.బస.పు.౪.౭౮౪పం.

ద్వి. వెన్నుండు దా నిత్య వేయుపువ్వులు. బస. పు. ౬. ౯౨౯ పం.

**నిత్యముక్తుఁడు.** సం. వి. అ. పుం. - కాలత్రయమునందును బంధశూన్యుఁడు - పరమాత్మ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిత్యయౌవన. సం. వి. ఆ. స్త్రీ. శాశ్వత మైన యౌవనము కలస్త్రీ. (ద్రౌపది మొ.)

నిత్యశంకి. సం.వి.న్. పుం. -ఎల్లపుడు బెదరునది- లేడి. (వై. ని.)

నిత్యశంకితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఎప్పుడును జంకుగలిగి యుండువాఁడు. ౨. ఎల్ల ప్పుడును సందేహము కలిగి యుండువాఁడు.

నిత్యసమాసము. సం. వి. అ. పుం. లౌకికవి గ్రహములేనిది కాని, స్వపదముతో కాక అన్య పదముతో లౌకికవిగ్రహము కలది యగుసమా సము. (కుంభకారుఁడు, వ్యాఘ్రము మొ.)

నిదగ్రువు. సం. విణ. (ఉ) దద్దురులు లేనివాఁడు. వి. ఉ. పుం. మనుష్యుఁడు.

నిదము. సం. వి. అ. న. విషము. (వాచ.)

నిదర్శకుఁడు. సం. విణ. (అ. ర్శికా. అ.) ౧. చూచువాఁడు. ౨. కనుఁగొనువాఁడు,కనుపెట్టు వాఁడు. ౩. చూపువాఁడు, తెలుపువాఁడు; ని రూపించువాఁడు.

నిదర్శన. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకయర్థాలం కారము.

క. ధర నన్వయంబు గూడక, గరిమన్ సామ్యం బు నెచట గమ్యముఁ జేయం,బరఁగు నది నిదర్శన యన, నిరవొందును కృతులయందు నిది యెట్లన్నన్.

క. బలవదరిరాజసేనా,జలధిన్ జీవనము గ్రోలి జలధరశోభా,విలసనము దాల్చె నీయసి,య లఘురణోత్సాహనరస యాబళనరసా. నర స. ౫. ౧౫౪, ౧౫౫.

నిదర్శనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చూ పునది. ౨. తెలుపునది, వెల్లడించునది. ౩. బో ధించునది, కఱపునది. వి. అ. న. ౧. చూపు, దృష్టి. ౨. చూపుట, నిరూపించుట. ౩. ఉదా హరణము, దృష్టాంతము. ౪. ప్రమాణము, ని రూపణము.

నిదర్శించు. సం. స. క్రి. చక్కఁగ ఆలోచించు. వ...కార్యంబు నిదర్శించి బృహస్పతి యింద్రా దిదేవతల కిట్లనియె. కాశీ. ౫. ౭౫.

నిదాఘకరము. సం. వి. అ. పుం. జిల్లేడు.

నిదాఘకరుఁడు. సం. వి. అ. పుం. - వేఁడివె లుఁగువాఁడు - సూర్యుఁడు.

నిదాఘము. సం. వి. అ. పుం. - మిగుల తపిం పఁజేయునది. - ౧. ఉష్ణము, వేఁడిమి. ౨. గ్రీష్మము, వేసఁగి. ౩. ఘర్మజలము, చెమట.

నిదానము. వి. (సం. నిర్ధారణమ్. క.నిదానవు.) ౧. ఆత్రపడక విచారించుట. (శ. ర.)

(వ్యవ.) వానియోగ్యత నిదానముమీఁద తెలి యును.

౨. చక్కఁగా విచారించుట.

(వ్యవ.) వానినిదానమే వానిని కాపాడుచు న్నది.

జ : నిదానించు.

నిదానము. సం. వి. అ. న. ౧. ఆదికారణము, మూలకారణము; కారణము. ౨. వత్సదామ ము, దూడనుకట్టుపలుపు. ౩. శుద్ధి. ౪. రోగ నిర్ణయము. ౫. రోగహేతువు.

నిదానించు. అ. క్రి. (√నిదానము. క. నిదాని సు.) చక్కఁగా విచారించు. (ఆత్రపడక విచారించు అని శ. ర.)

(వ్యవ.) నిదానించనిదే వాని గుణాగుణములు తెలియవు.

ద్వి. చీకు దర్పణము వీక్షించినయట్లు, నాకల రూపు మిన్నక నిదానించి, తేటగా నెవ్వ రుఁ దెలియలే రనిన. నవనాథ. ౫. ౧౨౬ పా. ౧ పం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిదిగ్ధ. సం. వి. ఆ. స్త్రీ. చిట్టేలకి.

నిదిగ్ధము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఉపచితము, వృద్ధి నొందింపఁబడినది. ౨. దిగ్ధము, పూయఁబడినది.

నిదిగ్ధిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. జలూక, జలగ. ౨. కంటకారిక, వాఁకుడు.

నిదిధ్యాసకుఁడు. సం. విణ. (అ. సికా. అ.) తిరిగితిరిగి స్మరణచేయువాఁడు, నిరంతరధ్యానము చేయువాఁడు.

నిదిధ్యాసనము. సం. వి. అ. న=నిదిధ్యాసము.

నిదిధ్యాసము. సం.వి. అ. పుం. శ్రవణమననములచే తెలియఁబడినవిషయమును ఏకాగ్రమగు మనస్సుతో నిరంతరము చింతనము చేయుట, పునఃపునః స్మరణము.

నిదిధ్యాసితము. సం. విణ. (అ. ఆ. అ.) మరలమరల స్మరింపఁబడినది,నిరంతరధ్యానము చేయఁబడినది.

నిదిశత్. సం. (శత్రు.) ౧. చూపుచున్న. ౨. ఆజ్ఞాపించుచున్న. ౩. విధించుచున్న.

నిదిశ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఆజ్ఞాపింపఁబడుచున్నది. ౨. విధింపఁబడుచున్నది. ౩. చూపఁబడుచున్నది.

నిదిష్టము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దర్శితము, చూపఁబడినది. ౨. ఆజ్ఞాపింపఁబడినది. ౩. విధింపఁబడినది, శాసింపఁబడినది.

నిదుర=నిద్దుర. వి. (సం. నిద్రా.) నిద్ర.

క. పురరక్షణము దృఢంబుగ, నరవర చేయంగ వలయు నమ్మఁ గలుగుసత్పురుషుల నిడఁ దగుఁ గుడుపు నిదుర మొదలగు లోనిపనులలోఁ డరువు లరయక. భార.ఆశ్ర.౧.౫౪.

(వర్షర్తువర్ణనము.) గీ. మంటిమిద్దెలవారికి మరుపనులకు, నెలఁత వాసినవారికి నిదుర చెడియె.ఆము.౪.౧౨౩.వసు. ౪. ౭౫.

నిదురకుఁబడు=నిద్రించుటకు మొదలుపెట్టు.

సీ. నిదురకుఁబడఁ జొచ్చె నెత్తమ్ము లొకరెండు తెలిఁ గిది యెట్లొకో మెలఁగుఁబోఁడి. గీ...అనుచు...నేరుపున నెచ్చరింతు రన్నెలఁత నగఁగ. కకు. ౪. ౩౦.

నిదుర తెలియు=మేలుకాంచు.

ఆ. సాంధ్యరాగలహరి సామిరంజితములై,తిరిగ మింట నిదుర తెలిసినట్టి, యిందిరాధిపతికి నెత్తుకర్పూరనీ,రాజనంబు లన శరద్ఘనములు. ఆము. ౪. ౧౩౯.

నిదురపుట్టు=నిదురవచ్చు.

చ. పొలుపుగ నత్తను న్నిదురపుట్టఁగఁ జేయును గూండ్లదీపముల్, మలఁపును భారువంబులకు మక్కువముద్దులు చూపురీతులన్,బలుకుచు సంజ్ఞ సేయు నిరుపార్శ్వముఁ గన్గొనుఁ గేలిశయ్యపై, నెలఁతుక పట్టి చూచుఁ గరనీరరుహంబుల సారెసారెకున్. గంధ. ౧. ౧౩౦.

జః నిదురపుచ్చు, నిదురపోతు, నిదురించు.

నిదురపుచ్చు=నిద్దురపుచ్చు. స. క్రి. (√నిదురపోవు.) నిద్రింపఁజేయు.

సీ. అత్తమామలు సుఖాయత్తులై పవళింపమృదుపదంబుల నొత్తి నిదురపుచ్చి. శుక. ౧. ౭౫.

నిదురపోతు=నిద్దురపోతు. విణ. (√నిదుర.)నిద్రాళువు, ఎల్లపుడును నిదురపోవు స్వభావము కలవాఁడు.

క. వినియు వినవు రణభీరువు, మనుజాధము నిదురపోతు మందుని నకటా, నినుఁ జక్రవర్తిఁ జేసిన,వనజాసనుకంటె వెఱ్ఱివాఁడును గలఁడే. భాగ. ౯. ౪౧౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిదుర(పో)వోవు=నిద్దురవోవు అ. క్రి. (నిదుర + పోవు.) నిద్రించు.

ఆ...నాదుతొడలపై నెమ్మది,నిదురవోదు రమ్ము నృపకుమార. విక్ర. ౩. ౭౭.

చ. ద్రవిడకుటుంబినుల్ పసుపు రాచినరత్న పుఁదాపక్రింద నం,బువు తెరవాఱఁగా నిదురవోయి గరుత్తతి పచ్చవాఱెనన్, భవనసరోమరాళములు భ్రమయచ్ఛదగుచ్ఛవిస్ఫురద్దివిజధునీమరాళవితతిభ్రమఁ బూన్చుఁబురి న్భ్రమించుచున్.ఆము. ౧. ౬౪.

ఆ. బడలి పగలు నాక పవళించి నిమి యంతి,పురమునందు నిదురవోవు చున్కి, నెఱుఁగఁ దవ్వస్త్రిషుఁ డేతెంచి కాచుట...ఉ.రా.౬.౩౮౫ భార. శల్య. ౨. ౩౯౩.

నిదు(ది)రించు. అ.క్రి.(√నిదుర.) నిద్రచెందు.

క. నిదురించినశిశు వాఁకొని, కిదుకుచుఁ జనుగోరి కెరలి కిసలయవిలస, న్మృదుచక్రచాపరేఖా,స్పదపదమునఁ దన్నె నొక్కబండిన్ దండిన్. భాగ. ౧౦ పూ. ౨౫౦.

(కృష్ణుఁడు.) సీ. మగలతో నిదురించుమగువల మఱపించి మగచెయ్వు లొనరింప మదిఁ దలంచు. నీలా. ౧. ౮౬.

ద్వి. నిదిరించునందుమానిని సెజ్జఁ బెట్టి, పదిలుఁడై దట్టి యాపడఁతుకపట్టెఁ,జేకొని...అ. మ.క. ౧. ౨౨ పా. ౧౫ పం.

నిదేగ్ధ. సం.విణ. (ఋ. గ్రీ. ఋ.)పూయువాఁడు.

నిదేగ్ధవ్యము. సం=దేగ్ధవ్యము, పూయఁదగినది.

నిదేశకుఁడు. సం.విణ. (అ. శికా. అ.) ౧. చూపువాఁడు. ౨. ఆజ్ఞాపించువాఁడు. ౩. విధించువాఁడు.

నిదేశనీయము. సం=నిదేష్టవ్యము.

నిదేశము సం. వి. అ. పుం. ౧. శాసనము, విధించుట. ౨. ఆజ్ఞ, పనుపు. ౩. కథనము, చెప్పుట. ౪. నికటము, దాఁపు.

నిదేశి. సం.విణ. (న్.నీ.న్.) ౧. చూపువాఁడు. ౨. ఆజ్ఞాపించువాఁడు. ౩. విధించువాఁడు.

నిదేశించు. సం. స. క్రి. ఆజ్ఞాపించు, పనుచు.

మ. జనిసాహస్రతపఃఫలం బితనిసాక్షాత్కారమీస్వామి కైక నిదేశింప వనిం జరింప జనుటాకర్ణింప శక్యంబె...చం. రా. ౪. ౬౪.

నిదేశిని. సం. వి. ఈ. స్త్రీ. దిక్కు.

నిదేశ్యము. సం=నిదేష్టవ్యము.

నిదేష్ట. సం. విణ. (ఋ. ష్టీ. ఋ.) ౧. ఆజ్ఞాపించువాఁడు. ౨. విధించువాఁడు. ౩. చూపువాఁడు.

నిదేష్టవ్యము. సం. విణ. (అ.ఆ.అ.) నిదేశింపఁదగినది, ఆజ్ఞాపింపఁదగినది.

నిద్దము=నిద్దా. విణ. (సం. స్నిగ్ధం. ప్రా. ణిద్దో.) ౧. స్నిగ్ధము, నున్ననిది.

గీ. ఉవిదనిద్దంపుజంఘులసవతుఁ గోరి, కలమగర్భంబు లడఁచు లోఁ గంటకములు. ఆము. ౫. ౩౩.

చ...తన్మృదులపాణిసరోరుహదత్తభూతి నిద్దపునుదుటన్ ధరించి ప్రమదామణి యిట్లనియెం బ్రియంబునన్. కాళ. ౧. ౩౪.

౨. సాంద్రము, దట్టము.

సీ.నిద్దమైనమడుంగునీరాక్రిదోవతి కనకమేఖలతోడఁ గటి ఘటించి. కాశీ. ౧. ౩౯.

చ...నివిడిన బొజ్జపై మిగులు నిద్దపుదోవతిదట్టి డొల్లిరాఁ, దివిచి పెనంగ వల్లువముఁ ద్రెంచి ...ఆము. ౬. ౭౧.

సీ. నిద్దంపుఁగీర్తులఁ దద్దయు విలసిల్లునట్టిపెద్దయహోబలాధిపతిని. కళా. పీఠి. ౪౪.

౩. మనోజ్ఞము, మనోహరము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ...అమ్ముద్దియ విశ్వనాథుపయి ముచ్చట చేసి
నయంతనుండి యిక్కడ్డిదెతెంగి చందురునిఁ
గానఁగనీరు పికంబు గూయ నన్నిద్దపు
మ్రోఁత మాన్పుదురు నెచ్చెలు లిచ్చ యె
తెంగి నిచ్చలుక్. కావ్యా. ౧. ౩౭.

సీ. ఎండచే వాడినయెలదీఁగెయును బోలె
నిద్దంపుఁ దనువల్లినిగ్గు సడల. విక్ర. ౪. ౧౦౨.

వ...చంచలాక్షులనిద్దంపుఁదనూలతలం బుట్టి...
మనుచ. ౩. ౭౭.

౪. ప్రేమగలది, స్నేహయుక్తము.

సీ. బ్రహ్మాండకోటులపొరుపత్తైము లెల్లఁ గని
యున్కి నిద్దంపుమనసుతోడ. పాండు.
౧. ౪.

౫. అధికము.

సీ. తల్లిదండ్రులకు నిద్దపుభక్తి రవణిల్ల శుశ్రూష
చేసినశుద్ధమతులు. కాశీ. ౨. ౧౧. (స్నేహ
ముగలది అని శ. ర.)

ఉ. నిద్దపువేడ్క నందఱను నిర్వైరపాటున
మంచె నత్తఱిక్. దశా. ౬. ౭౭.

నిద్దా=నిద్దము. విశ.
(స్నేహయుక్తము, ప్రేమగలది.)

క. మద్దుల నిడి పడకిండ్లక్, ముద్దియ లాత్మీయ
లెనసి మురియుచు నిద్దా, సుద్దుల నెత్తుచు
నం దొగి, విద్దెము విద్దె మని కాళివిద్దెం బను
చుక్. రా. వి. ౨. ౨౦.

(అధికము.)

ఉ. రాతిరియుం బవల్ మఱపు రానిహొయల్
చెలియారజంపుని,ద్దాతరితీపులంబలెను దా
రసిల న్వలె లోఁ దలంచినక్. (పెద్దన
చాటువు.)

(ప్రశస్తము, శ్రేష్ఠము.)

సీ. మెఱసి నిల్కడ చూపు మెఱపులోయె
ఱపు బిత్తరములోతరము నిద్దాపసిండి, పసి
మిలోమిసిమి...గీ... గూర్చి ... సుదతిఁ
జేసె. ఘటికా. ౨. ౭౪.

సీ. జిలుఁగుచీనాపట్టుచెంగావిచెఱఁగులనిద్దా జ
రీనిశానీలకరులు. రంగా. ౧. ౧౫౬.

మ. తళుకున్బ్రద్దువెలుంగుక్రొంబసిఁడినిద్దాచో
పుడుం గట్టియక్, గొలఁకున్దామరమొగ్గ కట్టు
వలు చిక్కు ల్వాపి వే లేపి మేల్వలపుం
బిట్టల వేటలాడుఁ గడు శేవం దత్పురారామ
రేఖల లేఁగాడుపుబోయ తేఁటిబలుడేఁగ
స్బట్టి తా వేసుపక్. చంద్రా. ౧. ౪౦.
(నునుపుగలది అని శ. ర.)

(సాంద్రము, దట్టము.)

మ. తళుకుంజాయకడాని మైపొడలు నిద్దామీస
లుక్...గల్గు నిన్ను భజియింతుక్ దంభ
మీనాధిపా. దశా. ౧. ౨౧౧.

నిద్దుర=నిదుర. వి. (సం. నిద్రా. ప్రా. నిద్దా. క.
నిద్దె.) నిద్ర.

ఉ. నిద్దుర మేలుకొమ్ము రజనీకరవంశవతంస...
నైష. ౭. ౧౪.

చ...మననాయకుఁ డేమి చెప్ప నిద్దుర మును
మున్న గాఁ దెలిపి తోఁడుఁగ ని న్నెటులై
నఁ దేక యిట్లరికృతభీష్మహాని ననయంబును
దుర్బలుఁ డయ్యె నక్కటా. రాఘవ. ౪.
౧౯౨.

చ. కటకట కాశికాపురి నొకానొక నిద్దురఁ గన్ను
మోడ్చి యప్పటఁ గనువిచ్చునప్డు కుడిభా
గముఁ గన్గొని చోద్య మందు... కాశీ. ౩.
౯౯. (ఒకానొకనిద్దుర=అసామాన్యపునిద్దుర,
పెద్దనిద్దుర.)

నిద్దురలేనిప్రోడలు=దేవతలు.

సీ...మంటిత్రోవరులు నిద్దురలేనిప్రోడలు నరలు
గనని, పెద్ద లనఁగ సురాభిఖ్య లౌ...సాం.
ని. దేవ. ౧౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జ: నిద్దురగొను, నిద్దురపుచ్చు, నిద్దురపోతు, నిద్దురవోవు.

నిద్దురగొను. అ. క్రి. (√నిద్దుర.) నిద్రించు, కూర్కు-డు.

సీ...నిద్దురగొనియె గుడాక,గొనియె నిద్దురవో యె గూర్కు-డె నన నిద్రితుల కొప్పు... సాం. ని. మాన. ౨౩.

నిద్దురపుచ్చు. స. క్రి. (√నిద్దుర.) నిద్దుర పోవఁ జేయు, నిద్రింపఁజేయు.

చ. వదినెలపోరు మాన్ప నిజవల్లభు నిద్దురపుచ్చ మామహో, రదుమఁగ నత్తగారికి భయంబొనరింప...తోడికోడలి కొకానొకనింద ఘటింప వచ్చుఁ బో,కదిసిన నేర్పుచేత బెళుకన్వెరవొందిన జారకాంతలన్. శుక. ౨. ౯౭.

నిద్దురపోతు. విణ. (√నిద్దుర.) నిద్దురపోవుస్వభావము గలవాఁడు, నిద్రాళువు.

సీ. అతిధనాపేక్షచే నలరక నిద్దురపోతును గాక పెంపుడును గాక. భల్లా. ౪. ఆ. (౪.౭.)

౨. అలసుఁడు, సోమరి.

(వ్యవ.) వాఁడు పట్టినిద్దురపోతు.

నిద్దుర(పో)వోవు=నిదురవోవు, అ. క్రి. (√నిద్దుర.) నిద్రించు, నిద్రపోవు.

ఉ.నావుడు శాంబరీశఫరనాయకుఁ డిట్లను మానులార వ్రాణీవిభుఁ డిప్డు మై మఱచి.నిద్దుర వోవఁగ జూచి యాహయగ్రీవుఁడు చోరవృత్తిని హరించి తమం గొనిపోవుచుండఁగాఁ, గావఁగ దిక్కు-లేమిఁ గడఁక న్మొఱవెట్టఁ దొడంగె వేదముల్. దశా. ౧.౨౩౫.

నిద్ర. సం. వి. ఆ. స్త్రీ. ౧. నిదుర, కూర్కు-.

గీ. పల్లవామూల వలిపిరి చల్లు నిచట; నుతియు నీచాయ నిద్రమై నుందు నచట, మహితరామానుజోదీర్యమాణభాష్య, ముఖబహుగ్రంథసామిప్యమునఁ జనదు. విప్ర. ౩. ౪౪.

క. పటహధమాధమికావళి,పటురవములు నిద్ర లేపి పయనము తెలుపన్. కువల. ౨. ౫౧.

౨. తూఁగు, కునికిపాటు. ౩. తత్త్వాప్రతిబోధము, కలరూపు తెలియమి. ౪.తమోగుణాలంబన మగువృత్తి. ౫. ముకుళనము, మొగుడుట.

నిద్రతెలియు. మి. అ.క్రి. (నిద్ర+తెలియు.) మేల్కొను, నిద్రలేచు.

గీ. నీరజేక్షణుఁ డవ్వేళ నిద్ర తెలిసి. ఆము. ౪. ౧౪౪.

నిద్రపుచ్చు=నిదురపుచ్చు, నిద్దురపుచ్చు. మి.స. క్రి.౧. నిద్రపోవునట్లుచేయు, నిద్రింపఁజేయు.

ఉ. పాపని నిద్రపుచ్చి తగుపాన్పునఁ దచ్ఛకటంబుక్రిందఁ దాఁ,దీ పెసలార నుంచి సుదతీతిలకంబు యశోద...హరి.పూ.౫.౧౮౭.

౨. లయముపొందఁజేయు, లయముపొందించు.

గీ. సకలమును నిద్రపుచ్చుకేశవుని నిద్రపుచ్చు ఘనునకు నిట్టి దద్భుతమె తలఁప. ఆము. ౪. ౧౦౯. (ఇది మొదటియర్థమునకుఁగూడ నుదాహరణము.)

నిద్ర(పో)వోవు=నిదురవోవు, నిద్దురపోవు. మి. అ. క్రి. నిద్రించు.

క...బ్రొమ్మునఁ జే యిడి నిద్రవోయె ముదితాత్ముండై. భార. ఆది. ౬. ౬౨.

గీ. కన్నొకటి నిద్రవోఁ బెఱుకంట జాగరంబు గావించు భూరుహాగ్రంబుమీఁది,యచ్ఛభల్లంబుగతి... ఆము. ౪. ౨౪౧.

నిద్రసే(చే)యు. మి. అ. క్రి. నిద్రించు.

మ...విష్ణుండు తద్బాహుభీ,కరదండాహతి దీర్ఘ నిద్ర సనియెం గా కింతకాలంబు సాగరమధ్యంబున నిద్రసేయునె...కు. సం. ౪. ౩౭౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ... చారుతల్పంబుమీఁద నిద్ర,సేయు నా
చంద మగుటయుఁ జిత్త మలరి. దశకు.౯.
౪౨.

నిద్రాణము. సం.విణ. (అ. ఆ. అ.) ౧. నిదురించునది. ౨. ముకుళించునది.

శా... దిశాస్తోమంబు శోభాదరి,ద్రాణం బయ్యె
సరోజషండములు నిద్రాణంబు లయ్యెం గ
డున్. మనుచ. ౩.౧౨.

నిద్రాళువు. సం. విణ. (ఉ) నిద్రాశీలుఁడు, నిదురపోతు.

నిద్రాసంజననము. సం. వి. అ. న. - నిద్రను గలిగించునది - కఫము, శ్లేష్మధాతువు.

నిద్రించు. సం. అ. క్రి. నిదురపోవు, నిదురించు.

క. తరుణులకుచములపై రతి,పరవశులై యొఱ
గు పతులపగిది సమరసం,భరితశ్రమమున
నిద్రిం,చిరి కరికుంభములఁ జెంది చెన్నుగ
జోదుల్. భార. ద్రో. ౫. ౨౪౩.

మ...అజుఁడు...నిద్రించుచున్, గుఱువెట్టం
దొడఁగెన్ గలల్ గనుచు నిర్ఘోషంబుతో
భూవరా. భాగ. ౮. ౪౧౩. మార్క. ౧.
౨౩౮.

నిద్రితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నిద్రించినది. ౨. ముకుళించినది, మొగిడినది. (మొగ్గ, పువ్వు మొ.)

నిద్రిలు(ల్లు). సం. అ. క్రి. నిద్రించు.

ఉ. మట్టిన బిట్టు మిట్టిపడి మాని సముత్థితుఁ డ
య్యె మేనిసైఁ,బెట్టినపుట్ట నెట్టవిసి బీటలు
వాఱ శ్రవశ్శకుంతముల్,చట్టుప లెత్తి ముం
దతికి సాగఁ దలంప జటాచ్ఛటాచ్ఛదిన్,
ద్రుట్టెలుగట్టి నిద్రిలుమరుద్భుగధీశకులంబు
మేల్కనన్. పాండు. ౫. ౨౪౯.

నిధనము. సం. వి. అ. పుం. న. ౧. మరణము, చావు. ౨. నాశము, చేటు. ౩. ముగియిక, సమాప్తి. ౪. పంచావయవముగాని సప్తావయవముగాని యగుసామమునొక్క కడపటి యవయవము. ౫. (సంగీ.) ముక్తాయింపు. ౬. (జ్యోతి.) లగ్నమునకు అష్టమస్థానము. ౭. నైధనతార, జన్మనక్షత్రము మొదలు ఏడవదియు పదియాఱవదియు ఇరువదియైదవదియు నగు నక్షత్రము. ౮. కులము. (కే. ని.)

నిధనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.)-నిర్గతధనుఁడు-నిర్ధనుఁడు, బీద.

శ్లో...అహో నిధనతా సర్వాపదా మాస్పదమ్.
మృచ్ఛ. ౧. ౧౪.

నిధానము. సం. వి. అ. న. ౧. స్థాపనము,ఉంచుట. ౨. పదిలపఱుచుట. ౩.ఆధారము, ఆశ్రయము. ౪. పాఁతిపెట్టినసొమ్ము, నిధి.

నిధి. సం. వి. ఇ. పుం. ౧. ఆధారము, ఆశ్రయము, (ఉదా: గుణనిధి, జలనిధి మొ.) ౨. పాఁతఱ, శేవధి. ౩. తొమ్మిది యనుసంఖ్య. ౪. కోశాగారము, బొక్కసము. ౫. నలికయనుగంధద్రవ్యము కే.

నిధినాథుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు.

(ఇట్లే నిధీశుఁడు, మొ.)

నిధువనము. సం. వి. అ. న. - హస్తపాదాదిచాలనము గలది- ౧. మైథునము, స్త్రీపురుషులకలయిక. ౨. కేళి, క్రీడ. ౩. అత్యధికకంపము, మిక్కిలివడఁకు.

నిధ్యాతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ధ్యానింపఁబడినది. ౨. చూడఁబడినది.

నిధ్యానము. సం. వి. అ. న. నిర్వర్ణనము, దర్శనము, చూపు.

నిధ్యానించు. సం. స. క్రి. చూచు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. ఫలితసహకారంబు నిధ్వానించురాజకీరంబు వడువునఁ బ్రియనందనసందర్శనానందకంద లతుందిలహృదయారవిందుం డై...నిరం. ౧. ౮౭.

నిధ్వానము. సం. వి. అ. పుం. ధ్వానము, శబ్దము.

నినంక్షువు. సం. విణ. (ఉ) ౧. నశింపఁగోరు వాఁడు. ౨. కనఁబడకుండ నుండఁగోరువాఁడు. (వాచ.)

నినదము. సం. వి. అ. పుం. ధ్వని, మ్రోఁత, శబ్దము.

నినదించు. సం. అ. క్రి. శబ్దించు, ధ్వనిచేయు.

క. అనిఁ దృణము గఱచి జేయని, నినదించుచుఁ బొరలువిమతనికరముఁ గరుణన్, గనుఁగొని కాచుట నైజము,గొనకొని యరిరాయగండ గోపాలునకున్. కావ్యా. ౫. ౬౨.

నినయనము. సం. వి. అ. న. ౧. పొందించుట. ౨. నిష్పాదనము, సిద్ధింపఁజేయుట. ౩. చేయుట. ౪. కుమ్మరించుట. ౫. (కాలము) కడపుట.

నినర్తిష. సం. వి. ఆ. స్త్రీ. నృత్యముచేయునిచ్ఛ.

నినర్తిషువు. సం. విణ. (ఉ) నృత్యముచేయ నిచ్ఛగించువాఁడు.

నినాదము. సం=నినదము.

నినాది. సం. విణ. (న్. నీ. న్.) ౧. శబ్దించునది, మ్రోఁగునది; ధ్వనికలది. ౨. మొరయించునది, వాయించునది.

నినాదితము. సం. విణ. (అ. ఆ. అ.) శబ్దితము, మ్రోఁగింపఁబడినది, మొరయింపఁబడినది. వి. అ. న. ధ్వని.

నినాహ్యము. సం. వి. అ. పుం. ౧. భూమియందు పాఁతియుంచఁ దగినపాత్రము. ౨. మహాఘటము, పెద్దకుండ.

నినిందిషువు. సం. విణ. (ఉ) నిందింప నిచ్ఛగలవాఁడు.

నినీష. సం. వి. ఆ. స్త్రీ. పొందింప నిచ్ఛ.

నినీషువు. సం. విణ. (ఉ) పొందింప నిచ్ఛగించువాఁడు.

నినుచు=నించు. స. క్రి. ౧. వ్యాపింపఁజేయు, ప్రసరింపఁజేయు.

క. మనిచెద నామానాంగము, నినిచెద భువనములఁ గీర్తి నిష్ఠురగతితో,ననిచెద నిను జము ప్రోలికి...భా. రా. యు. ౧౨౩౯.

౨. కలిగించు, కలుగఁజేయు.

చ. కనుఁగవఁ దన్నుఁ గల్వఁగ మృగం బల నూడఁన కిందు రేతు సే,నని రుచి దక్కఁ దత్పరిమళాఢ్యత లేమి నతండు గొంకఁ దా, నినుపఁ జవన్...ఆము. ౫. ౧౨.

౩. ఉంచు, పెట్టు.

క. నును పగుమృగమదపంకం,బునఁ దీనియ దిద్దక ప్రపుంబొడి మ్రుగ్గుల్, నినిచి లవలిదళములపై, మనసిజరతిసతుల వ్రాసి మతి యద్దరులన్. రసిక. ౪. ౮౪.

క. అనుటయు రసలింగము నిడు,తనవట్రువ ప్రేపసజ్జదంతపుబరణిన్, నినిచిన యొకపస రిది యది,యని చెప్పక పూసెఁ దత్పదాంబుజయుగళిన్. మనుచ. ౧. ౭౮.

౪. చిప్పిలఁజేయు.

మ. అసి చింతించు మనోభవజ్వరముచే నశ్రాంతమున్ వేఁగు హు, మ్మని నిట్టూర్పు నిగుడ్చుఁ గన్నుఁగవ బాష్పాంభఃకణంబుల్ గడున్,నినుచు న్నాలిని లోనుగాఁ గలుగునాసెయ్యంపుఁబూఁబోండ్లు దన్,గని భీతిల్లఁగ ...భోజరా. ౪. ౩.

౫. ఏయు, ప్రయోగించు; నాఁటు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. అంత నీలునిపైఁ బడియర్జునోఁడు, తేరు వోని
చ్చి బలువాలునారసములు, నినుప నవి యొ
డ్డుకొని వానినె త్తితోఁడవు, మానికము లూడ
నవ్వాఁడిమగఁడు దాఁచె. అప్ప. రా. యు.
౨౧౪.

చ. కినుక మనంబునం గదిరి క్రీడి పితామహు
విల్లు ప్రేల్చిడిం, దునిమి నితాంతగాఢరయ
దోర్విభవంబున నొండువిల్లు స్రైకొనియెడు
సందునఁ నినిచెఁ గ్రూరశరంబు లురంబు
నందు... భార. విరా. ౫. ౧౭౬.

చ. నినిచెఁ దురంగదేహముల నీరజనాభుని మేనఁ
బాండునం, దనునొడలం బ్రదీప్తఘనదారుణ
మార్గణపుంజముల్ వడిన్. భార. భీష్మ. ౨.
౧౪౦.

౬. నిండించు, నించు.

క. అని పలికి సముద్ధతిఁ బటు, ధనువు రయం
బెసఁగఁ గొని శితప్రదరంబుల్, నినిచిన
నిషంగయుగ్మం, బనువుగ ధరియించి కవచి
తాంగం బమరన్. హరి. ఉ. ౧. ౧౦.

మ. వనితారత్నము వీరసేనతనయున్ వర్ణింపఁ
గానున్నత, స్తనభారంబు కెలంకుల న్నినుచుఁ
జంచల్లీల రోమాంచముల్. నైష. ౧. ౭౨

చ. అని ప్రణమిల్లినన్ ఫణికులాధిపుఁ డయ్యు
మృతంబు కుండలో, నినిచి ప్రియంబుతో
నొసఁగి... ద్వా. ౯. ౧౨౭.

౭. వీక్షించు.

క. నిను నెఱుఁగక నృపనందనుఁ, డని యుద్ధతిఁ
బెక్కుమాట లాడితి నవి నీ, మనమునఁ ద
లఁపక ననుఁ గృప, నినుపుము నీచరిత నెఱుఁ
గనేర్తునె శార్ఙీ. పద్మ. ౮. ౯౫. (చి.ని.పా.)

అ. క్రి. అతిశయించు.

సీ. దైత్యారివశ మైనతనచిత్త మంతయు నినుచు
గౌరవమున నివ్వటించి. పాండు. ౧. ౯.

చ. జను లరు దంద నాథునుఁడు చాపలతం ద
రియంగఁ జూచి లో, నినిచినకూర్మినీడలను
నెమ్మి రహిం బురి విప్ప నయ్యెడం, గనుఁగొ
నువారికిన్ గలిగెఁ గన్నులపండు వటంచు
నెచ్చెలుల్, ననువులు పల్కఁ గన్గొనలనవ్వు
ధరాసుత మమ్ముఁ బ్రోవుతన్. వైజ. ౧. ౨.

జః నినుపారు, నినుపు.

నినుపారు=నింపారు. అ. క్రి. (నినుపు + ఆరు[1]).

౧. పూర్ణమగు, నిండు.

ద్వి. సరసిజరిపుఁ డైనచంద్రుఁడు వొడిచె, నిను
పారి కలశాంబునిధి వెల్లివిరిసె, ననఁగ వెన్నె
ల పర్వె... రం. రా. యు. ౩౧౩పా. ౧౫పం.

మ. అని వానిన్ మగిడించి తాన చని యి న్నా
దీవి నె త్తొంటికిన్, గనకం బెత్తులు కంటి
లెక్కఁ దెగినం గైకొంచు నాల్గోడలన్,
నినుపారంగ సువర్ణ మె త్తికొని పూర్ణీభూత
సానందసంజనితోద్గర్వమనస్కుఁడై మరలి
యాసాముద్రమధ్యంబునన్. కేయూర. ౩.
౧౭౧.

౨. అధికమగు, అతిశయించు.

సీ. నిడువాలుకనుదోయినినుపారుకాంతికిఁ గలి
కి క్రేఁగన్నుల నలువు విడువ. నిర్వ. ౧.
౫౫.

సీ. నిండారుచందురునినుపారునును గాంతిఁ జెలువ
గా మరుఁడు సృజించినట్లు. మార్క. ౩. ౯౩.

ద్వి. వనములఁ దమ వెంట వచ్చువా రనుచు, నిను
పారుదప్పితో నిద్రింపఁ జూచి. రం. రా.
అయో. ౧౧౭ పా. ౧ పం.

౩. వ్యాపించు.

ఉ. చిల్లులచిల్కులం జిలికి చిల్కలకొల్కులు
చల్లులాడ సం, పల్లలితాంగి చూచి కడుఁ బై
కొను వేడుక వారిపూరముల్, చల్లెఁ దదంగ
నాంగలతలన్ నినుపార ననంగ నప్పు డు,
త్ఫుల్లపయోరుహాంతరమధూళిఁ జివుక్కనఁ
జిమ్మెఁ దెమ్మెరల్. రాజ. చ. ౨. ౧౫౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౪. చిప్పిలు, పైకుబుకు.

చ...పాల్కడలి మద్దులపట్టి...కరుణారసంబు నినుపారెడు చూపులం జూడం గావుతన్. పారి. పీఠి. ౬.

నినుపు=నింపు. వి. (√నినుచు.) ౧. జలపూరము, వెల్లువ.

చ. కనుఁగొని మేన నెల్లఁ బులకంబులు జాదుకొనంగఁ గన్నులన్,నినుపులు గాఁగ బాష్పములు నివ్వటిలంగ బహుప్రయాణముల్, గొనకొని చేసి భక్తిరసగుంఫన మొప్పఁ బ్రహృష్టగద్గద,స్వనమున వంజరుం డిపుడు సంస్తుతిసేయఁ దొడంగె శంభునిన్. భోజరా. ౩. ౧౦.

ద్వి. అనుచు డెందముల నంతంతకుఁ బ్రేమ,నినుపులై దైవాఱి నీరధుల్ గాఁగ. అ.మ.క. ౨. ౭౨ పా. ౯ పం.

విణ. ౧. మనోహరము.

ద్వి. నినుపు గా స్ఫాటికనిర్మలలింగ, మనఁగ నాస్ఫాటికాయతలింగమూర్తి, వరుణుండు ధరియించి...పండితా. దీక్షా. ౧౮ పా.

౨. సమృద్ధము.

చ. నినుపు లొకర్తుచేతఁ గమనీయలతాంతములున్న నొక్కెడన్,గనుఁగొని ముగ్ధ యొక్కతె వికాసినియై నవకంపుఁదీఁగెఁ బా,సినయెలగొమ్మగుత్తిసవి చేరి నయంబునఁ బట్టి కోయఁ జూ,చిన నది యల్ల నవ్వ నది సిగ్గువడంగని యార్చి రందఱున్. నిర్వ. ౮. ౩౬.

నిన్న. వి. ఔ. (క.నిన్న. తి. నిన్నల్.) ౧. కడచిన దినము, గతదినము.

సీ. జననుత దానివత్సంబు నిన్నటఁగోలె నుడుగక యఱచుచు నున్నయదియు. భార. ఆది. ౮. ౧౧౮.

ఉ. నిన్నటిమాపు మాపురమణీరమణీయసభావిభాగభా,గున్నతరత్నపీఠిఁ గొలువుండి సురాంగన లాడ...వసు. ౫. ౫౮.

ఉ. ఎన్నఁడుఁ జూడమున్ వినము నిట్టి మహాద్భుతమేమి చెప్పుదున్,గిన్నరకంఠి...నిజంబుగ విన్నవించెదన్, నిన్నటనుండి యేము నిఱునీఁగియు నుంటిమినిట్రుపాసముల్. కాశీ. ౮. ౧౭౯.

౨. అచిరభూతకాలము, కొలఁదికాలమునకు ముందు.

మ. పని యే మేనియుఁ గల్గెనేని సుమనఃపాలుండు దా వచ్చి యొ,య్యన నాముందట నిల్చి విన్నపము సేయంబోయి కంపించుని,న్న నిలింపాధిపుఁ డింతవేళక సమానస్కంధుఁడున్ బోలెనై, తనకార్యస్థితి సెప్పి నాకడకు దూతం బూన్పి పుత్తెంచెనే. కు. సం. ౧౦. ౫౦౧.

ఉ. నిన్నటిబాల వింతె తరుణీమణి యెన్నఁడు నేర్చినావె యీ,చిన్నెలు వన్నెలాఁడి...ఇందు. ౩. ౫.

ఉ...వనిం దెరువాటులు గొట్టి కొట్టి మే,న్వెంచి విరక్తి దాసరివి నిన్నఁ గదా యయినాఁడవు...ఆము. ౬. ౪౦.

నిపఠనము. సం. వి. అ. న=నిపఠము.

నిపఠము. సం. వి. అ. పుం. పాఠము చదువుట.

నిపఠితము. సం. విణ. (అ. ఆ. అ.) పఠింపఁబడినది. వి. అ. న. పాఠము చదువుట.

నిపఠితి. సం. విణ. (న్. నీ. న్.) కృతపాఠుఁడు, పఠించినవాఁడు. వి. ఇ. స్త్రీ=నిపఠము.

నిపతనము. సం. వి. అ. న. క్రిందఁబడుట. ౨. క్రిందికి వచ్చుట, దిగుట; (పక్ష్యాదులు)క్రిందికి వ్రాలుట.

నిపతించు. సం. స. క్రి. ౧. పడఁద్రోయు, పడఁగొట్టు. (వ్యాక.) నిపాతముచేయు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిపత్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. పిచ్ఛిలభూమి, జాఱు నేల. ౨. యుద్ధభూమి.

నిపము. సం. వి. అ. పుం. న- నీరుత్రాగుసాధనము - కలశము. పుం. నీపము, కడిమిచెట్టు.

నిపాకము. సం. వి. అ. పుం. అతిశయపాకము, మిక్కిలి పక్వమగుట.

నిపారము. సం=నిపరము.

నిపాతకము. సం. విణ. (అ. తికా. అ.) పడవేయునది, క్రిందికి త్రోయునది. వి. అ. పుం. న. పాతకము, పాపము.

నిపాతన. సం. వి. ఆ. స్త్రీ=నిపాతము. (పతనము.)

ఉ... ఉగ్రగదం గైకొని వైచినం దన్నిపాతనన్, సూతతురంగకేతువులు చూర్ణములై యెడలెన్...హరి. ఉ. ౧౦. ౪౧.

నిపాతనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పడంద్రోయునది, పడంగొట్టునది, క్రిందికి త్రోయునది. ౨. చంపునది. వి. అ. న. ౧. పడంద్రోయుట, పడంగొట్టుట. ౨. క్రిందికి త్రోయుట. ౩. మారణము, చంపుట. ౪. (వ్యాక.) సూత్రమునకు వ్యతిరేకముగా శబ్దరూపమును విధించుట. ౫. నిపతనము, క్రిందంబడుట; పక్షులు మొదలగునవి క్రిందికి వ్రాలుట.

నిపాతము. సం. వి. అ. పుం. ౧. పతనము, పడుట; బాణాదులు పడుట.

శ్లో. క్వ చ నిశితనిపాతా స్సారపుంఖాశ్శరా స్తే. శాకుం. ౧. ౧౦.

౨. అధఃపతనము, క్రిందంబడుట; క్రిందికి వ్రాలుట. ౩. పైని పడుట, మీఁదికి దూఁకుట.

శ్లో. ఉత్పశ్యత స్సింహనిపాత ముగ్రమ్. సం. రఘు. ౨. ౬౦.

౪. బాణాదులు విసరి వైచుట, ఏయుట. ౫. మృతి, చావు. ౬. యదృచ్ఛ, అప్రయత్నము. ౭. (వ్యాక.) సూత్రములకు వ్యతిరేకముగా విధించినశబ్దము. ౮. అవ్యయము.

నిపాతి. సం. విణ. (న్. నీ. న్.) ౧. పడునది. ౨. క్రిందికి పడంద్రోయునది. ౩. క్రిందికి వ్రాలునది. ౪. నశించునది. ౫. నాశము చేయునది. ౬. నిపాతము కలది.

నిపాతించు. సం. స. క్రి. ౧. పడంగొట్టు; పడంద్రోయు.

క. ఆతోయధి నీచేతం, బీతం బగుడుం గడంగి భీమాసురసంఘాతంబుం దత్క్షణంబ నిపాతింతుము దివ్యశస్త్రపటుఘాతములన్. భార. ఆర. ౩. ౩౬.

౨. (వ్యాక.) నిపాతముచేయు.

నిపాతితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పడంద్రోయంబడినది, కూల్పంబడినది. ౨. చంపంబడినది. ౩. (వ్యాక.) సూత్రమునకు వ్యతిరేకముగా నిరూపింపంబడినది, నిపాతముగా చేయంబడినది.

నిపానము. సం. వి. అ. న. ౧. నిశ్శేషముగా త్రాగుట. ౨. ఆహావము, పసువులు నీళ్లుత్రావుటకై నూయి మొదలగువాని చెంత రాయి మొదలగువానితో కట్టినతొట్టి. ౩. జలాశయము, నూయిలోనగునీటిపట్టు. ౪. పాలు పితుకుకుండ. (త్రి.ని.)

నిపీడన. సం. వి. ఆ. స్త్రీ=నిపీడనము.

నిపీడనము. సం.వి.అ.న. ౧. గట్టిగా పిడుచుట, పిండుట. ౨. నలంచుట; గట్టిగా అదుముట. ౩. మిక్కిలి బాధించుట, నొప్పించుట.

నిపీడితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పిండంబడినది. ౨. నలపంబడినది, గట్టిగా అదుమంబడినది. ౩. బాధింపంబడినది, నొప్పింపంబడినది.

నిపీతము. సం. విణ. (అ.ఆ.అ.) త్రాగంబడినది, పానముచేయంబడినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిపీతి. సం. వి. ఇ. స్త్రీ. పానము, త్రాగుట.

నిపుణుఁడు. సం. విణ.(అ. ఆ. అ.) ప్రవీణుఁడు, నేర్పరి.

నిప్పచ్చ=నిప్పచ్చరము. విణ. (నిఱు + పచ్చ.) మిక్కిలి పసిమి కలది.
(ఇది వ్యతిరేకలక్షణచే శూన్యము, రిక్తము మొ. అర్థముల నిచ్చును.)
(వ్యవ.) వాఁ డెక్కడకు వెళ్లినను నిప్పచ్చయే.
వి. నాశము. (చి. ని, శ. ర.)

నిప్పచ్చరము=నిప్పచ్చ.వి.(నిఱు + పచ్చరము.) రిక్తత, దారిద్ర్యము.
గీ. పరఁగుఁ బేదతికంబు నిప్పచ్చరమ్ము, నెవ్వ రొద్దడి లేమి నా నివ్వటిల్లు, రిక్తతయు నామ ధేయము ల్బక్తవరద. ఆం. భా. ౨.౨౧౦.
గీ. మెలఁతుకలమిన్న నిద్దంపుమేల్పసిండి, గలు గఱుండిన మదిలోన గాటమగుచు, నిచ్చలు ను హెచ్చుకలఁకనిప్పచ్చరంబు, విడుచు టె ట్టు లింకఁ బరికింపఁ బుడమివేల్ప. నీలా.౨. ౩౬.
క. అలజడి గలారు కలుషము, గలారు నిప్పచ్చ రంబు గలవారు రుజల్, గలవా రనభిజ్ఞ త్వము, గలారు పురి నెందు లేరు...కవిజ. ౧. ౨౬.
విణ. శూన్యము, రిక్తము.
గీ. బోధ మల్పంబు గర్వ మభ్యున్నతంబు,శాం తి నిప్పచ్చరంబు మచ్చరము ఘనము, కూప మండూకములు పోలెఁ గొంచె మెఱిఁగి, పం డితంమన్యు లైనవైతండికులకు.భీమ.౧.౧౩.
గీ. ఏమి సేయుదు నెక్కడి కేఁగువాఁడ,ధన ము నిప్పచ్చరంబు విద్యయు హుళిక్కి.కాశీ. ౪. ౧౧౧. ౫. ౩౦౨.
వాఁడునిచందమున నీటితాటిచూపు, పాం సవేయునిపైఁ దార్చి బ్రాహ్మణుండు, పలికె నిప్పచ్చరం బైనభావణముల. హర. ४. ౧౪. (సారహీనమైన అని భావము.)

నిప్పటి=నిప్పట్టు. వి. (√నిప్పు.) అడుసులు కప్పి నిప్పులో వేసి కాల్చెడిరొట్టు, భక్ష్యవిశేషము.
ఉ. ఎండలఁ జుట్టుముట్టుకొని యేర్చుచు భూరి భుజాసిదీధితుల్, మండఁగ భానుమండలము మాఁడిననిప్పటివోలె నుండ నుద్దండహలా హలార్చులుగదా జగదాహుతి కప్పళించు నట్లొండొరు మీఱుచుక్ వెలిఁగి రుగ్రప లాశిపదాతు లెల్లెడక్. రామా. ౮. ౬౩.
గీ. రొట్టె నీరొట్టు నిప్పటి యట్టు దోసె, యిడ్డె న యనంగ నిటు కొన్ని యెసఁగుచుండు,భ క్ష్యభేదాహ్వయంబులు పార్వతీశ.ఆం.భా. ౨. ౨౫౬.

నిప్పట్టు=నిప్పటి. (√నిప్పు.)
వ...ఉండ్రంబులు కుడుములు దోసెలు నిప్ప ట్లు రొట్టెలు వడ లతిరసంబులు సప్పంబులు వెన్నప్పంబులు...ప్రబంధ. ౧౧౨.

నిప్పస్తు. వి. (నిఱు + పస్తు.) పూర్ణ మగుఉపవా సము; ఉపవాసము.
క. తిరుగఁ గలదిక్కు లన్నియుఁ, దిరిగితి మిఁ క నేమి యలసితిమి మాపల్కు,త్తరు వాహా యాహారము, దొరకదు నిప్పస్తు లుండుదు మె నీమ్రోలక్. వేం. పంచ. ౧.౪౯౫.
సీ. ప స్తిల్లి నుంటు నిప్పస్తు నిద్రనఁగను నుప వాససంజ్ఞయై యొప్పుచుండు. ఆం. భా. ౨. ౧౭౫.

నిప్పు=నిప్పుక. వి. (క. నిప్, నిప్పురి. త. నె ఱుప్పు.) అగ్ని; అంగారము.
క. అనవుడు జనపతి యడుగం, బనివిన నేమా యె దోసమా ని ప్పనినం,త నె నోరు పొక్కు దుగదా, యనిపి యటుం దెలిసి చూత మని కడువేగక్. సారంగ. ౨. ౨౬౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. నిప్పింగలము మల్లె నిప్పుక వైరాలు వైర
వు లనఁగ నంగార మొప్పు. ఆం. భా. ౨. ౨౪౨.

క. అప్పుడు వేగపుఁజారులు,సెప్పిన నంతయు
నెఱింగి సింధువిభుఁడు దక్క, గప్పెడుసెవ్వ
గ వెల్లున, నిప్పులఁ బడినట్లు కాలు నిలువఁ
గ లేమిక్. భార. ద్రో. ౨. ౭౮౬.

బ. అగ్నికణములు, స్ఫులింగములు.

క.అప్పుడు క్రోధము గన్నుల, నిప్పులు రాల్పంగ
...భార. భీష్మ. ౩. ౩౫౦.

మ. అనినం గన్నుల నిప్పు లుప్పతిల...భా.రా.
ఆర. ౧. ౨౪౭. కాశీ. ౬. ౨౨౭.

నిప్పు(న)ఁ జెదలంటు=మంచిదానికి చెడుగుణములు కలుగు.

క. దెప్పర మప్పురుషాగ్రణి,కెప్పాటను గలు
గనేర దెందును నోహో, నిప్పుఁ జెద లంటు
నేర్చునె, తప్పఁ దలఁచి తీవి తేల దలఁ
కెద వకటా. భా. రా. ఆర. ౨. ౭౧.

క. అది యట్ల కాదె నిప్పునఁ, జెదలంటునె దే
వదేవు శ్రీరమణీశుక్, మది నునిచినను త్త
మమునిఁ, బాదవునె యాపదలు నూర్యుఁ
బొందునె తమముల్. నృసిం. ౪. ౩౨.

నిప్పాడిఁగట్టుట=స్వయముగా కీడు తెచ్చికొనుట.

ఉ. అప్పులపోతుఁ జిచ్చయినయట్టిగృహంబున
నున్నవాఁడు దాఁ,జెప్పఁగ దుర్విపాన్నము
భుజించునతండును గాంచుపాట్లికక్,దప్ప
వుసుర్వె నీకు సహితం బిటు లెవ్వరు చె
ప్పి రేమొకో, నిప్పాడిఁగట్టితే విడువనేరవె
యింతట నైన నావుడుక్.రామా.౬.౨౩౬.

నివుఱుగవిసిననిప్పు=నిగురుకప్పిననిప్పు.

గీ. వికృతవేషావృతంబులై వెలయ కిఠఁడు, నివు
ఱు గవిసిన మెఱయనినిప్పుఁ బోలె. భార.
విరా. ౪. ౭౫.

సా: నిప్పుద్రొక్కుకోఁతిచందము.

గీ. లీలఁ బవళించు దిగ్గన లేచి పోవు, నిలుచు
చోటను నిలువక నిప్పుద్రొక్కు,కోఁతిచం
దానఁ జతురాఖ్యుఁడుండు దిరుగు, వెలఁదిపై
మోహ మెద హత్తు వెట్టి యెత్తి.హంస.౩.
౧౫౮.

జ: నిప్పటి, నిప్పట్టు, నిప్పుఁదిండి, నిప్పుక, నిప్పు
వన్నెగుత్తులకానుగు.

నిప్పుఁదిండి. వి. (నిప్పు+తిండి.)చకోరము. (చి. ని. పక్షివిశేషము అని శ. ర.)

నిప్పుక=నిప్పు. వి.(నిప్పు+ఉక.) అగ్ని; అంగారము.

ద్వి. ఎఱుఁగ రా దీతని సెసఁగు తేజంబు, మఱి
పడ్డనిప్పుకమాడ్కి నున్నాఁడు.ద్వి.హరిశ్చ.
ఉ. ౧౩౭ పా. ౩౩౪ పం.

క. అకటా బెడిదపువలపుల,సెకలం బడి వ్రేఁగు
దానిఁ జేపట్టఁగ నొల్లక యిటువలె నెంతు
రె నిప్పుకలపయి న్నేయి చల్లుపోలిక మీ
ఱక్. నీలా. ౨. ౧౧౨.

సీ. నిప్పింగలము మల్లె నిప్పుక వైరాలు వైరవు
లనఁగ నంగార మొప్పు.ఆం.భా.౨.౨౪౨.

చ...ఎవ్వఁడో మకుటము దన్ని నాశిరమమా
నికముం గొనిపోయె నంచు నిప్పుకలఁ బొర
ల్చినట్లు మది బొక్కుఁడు నెక్కుడుభంగపా
టునక్. ఉ.హరి.౫.౨౭౪.నీలా.౨.౧౧౨.

బ. అగ్నికణములు, స్ఫులింగములు.

గీ. గగనరంగస్థలంబున మిగులఁ బ్రౌఢి,మమునఁ
గాళిక నీలికోలము నటింపఁ, బొరి మొగంబున
రాలునిప్పుక లనంగ, గుంపులై రాలె మహి
నింద్రగోపతతులు. ఆము. ౪. ౫౦.

నిప్పువన్నెగుత్తులకానుగు. వి. (√నిప్పు.) అంగారవల్లరి, ఒకజాతికానుగుచెట్టు. (శ. ర.)

నిప్పోటము. వి. (చదువుటలో) అతిత్వర.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. నిడుసునఁ జెట్టక నిష్ఫటమునఁ బోక తరువాయి తప్పక తడవికొనక. సకల. స. ౩౫ పా. ౩౦౭.

నిఫల. సం. వి. ఆ. స్త్రీ - ఫలములు లేనిది- జ్యోతిష్మతి, మానేరుళ్ళ.

నిబంధ. సం. విణ. (బు. ద్రీ. బు.)- నిబంధించువాఁడు - ౧. గ్రంథము రచించువాఁడు, గ్రంథకర్త. ౨. కట్టువాఁడు, బంధించువాఁడు.

నిబంధకుఁడు. సం. విణ.(అ.ధికా.అ.)=నిబంధ.

నిబంధనము. సం. విణ. (అ. ఈ. అ.) బంధించుటకు సాధన మైనది. వి. అ. న - ౧. బంధించుట,కట్టుట; గృహకూపాదులు నిర్మించుట. ౨. కట్టు. ౩. అడ్డగించుట, ప్రతిబంధించుట. ౪. సంకెల. ౫. ఊఁత, ప్రాపు. ౬. స్థానము.

శ్లో...సహజవిలాసనిబంధనమ్ శరీరమ్. మాలతీ. ౨. ౬.

౭. ఏర్పాటు. ౮. హేతువు. ౯. గ్రంథము. ౧౦. రచన, కూర్పు. ౧౧. సంబంధము.

శ్లో. న వినా పార్థివో భృత్యైః న భృత్యాః పార్థివం వినా,తేషాం చ వ్యవహారోఽయం పరస్పరనిబంధనః. సం. పంచ. ౧. ౮౩.

౧౨. వర్షాశనము, శాశ్వతపారితోషికము.(మాన్యము లోనగునది.) ౧౩. ఉపనాహము, వీణాదులతంతులు చుట్టెడుబిరడ. ౧౪. వ్యాఖ్యానము, వివరణగ్రంథము.

నిబంధని. సం. వి. ఈ. స్త్రీ. సంకెల; గొలుసు లోనగుబంధించుసాధనము.

నిబంధము. సం. వి. అ. పుం. ౧. కట్టు. ౨.బంధించుట,కట్టుట; గృహకూపాదులు నిర్మించుట. ౩. (గ్రంథమును) రచించుట. ౪. కృతి, గ్రంథము. ౫. మూత్రబంధము, నీరుకట్టు. ౬. అడ్డగించుట, ప్రతిబంధము. ౭. సంకెల. ౮. ఏర్పాటు, నిర్ణయము. ౯. ఆధారము, ఆశ్రయము. ౧౦. హేతువు, కారణము. ౧౧. మలబంధనకరము, నింబము, వేముళ్ళ.

నిబంధి. సం. విణ. (న్. నీ. న్.) ౧. బంధించునది, కట్టునది. ౨. సంబంధించునది. ౩. మూలమైనది, కలిగించునది. ౪. నిబంధము కలది.

నిబంధించు. సం. స. క్రి. ౧. బంధించు. ౨. అడ్డగించు. (శ. ర.)

నిబద్ది=నిబ్బద్ది. విణ. (క. త. నిబద్ది.) సత్యము, నిజము.

గీ. కామసఖుఁ డైనధర్ముండు గలయ మాట,లాడె వైరాగ్యముఖ్యులతోడ నిది ని,బద్ది తప్పదు దేవరపాద మాన. ప్రబోధ. ౨. ౫౩.

ఉ. పో రడుపంగ నేఁ బలుకుబూటక మెల్ల నిబద్దిఁ జేసి యే,దారిని బోయెనో...చెన్న. ౩. ౧౭౦. (నిబద్ధి అని ముద్రి.)

ఉ. హా యనుఁ దమ్ముఁడా యను గృహంబున కేఁటికి రా వయో ననుఁ, బాయఁగఁ బాడి యే యను నిబద్దిగ నమ్మితి నీదుప్రాపు నే,నే యెడ కేఁగుదాన...అనుఁ. సానందో.౫. ౮౮పా. భా. ౪. ౬౪.

జ : నిబద్దించు, నిబద్దిలించు.

నిబద్దించు=నిబద్దిలించు. స. క్రి. (√నిబద్ది.) నిజపఱుచు.

క. ముద్దిచ్చును గోపాలుఁడు, వద్దను నడయాడుచున్నవార్తను విన్నఁ, గద్దించును లేదన్న ని,బద్దించును జూడకున్నఁ బరితాపించుఁ. రాధామాధవసంవాదము. ౧.౨౫.

(శ.ర. పా. 'లేదన్నను బద్దించును'ముద్రి.)

నిబద్దిలించు=నిబద్దించు. (√నిబద్ది.) (నిజపఱుచు.)

మ. నగరం బెల్ల నెఱింగి గొల్లు మనఁగా నానాఁటికిఁ సాటివా,రు గణింపం దలవంపులై స్వజను లేప్రొద్దుం గృశింపంగఁ బొం,దుగ నీసుద్ది నిబద్దిలించు జవభద్రుం డాగ్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హం బందుచో౯. ఉ. హరిశ్చ. ౪. ౫౧.
(శ.ర.పా. 'సుద్ది నిబుద్దిలించు'ముద్రి.పా.)

నిబద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. బంధింపఁబడినది, కట్టఁబడినది. ౨. అడ్డగింపఁబడినది. ౩. రచింపఁబడినది, కూర్పఁబడినది. (గ్రంథము.) ౪. ఖచితము, చెక్కఁబడినది; తాపఁబడినది. ౫. సంబంధించినది.

నిబర్హణము. సం. విణ. (అ. ఆ. అ.) చంపునది. వి. అ. న. వధము, చంపుట.

నిబర్హితము. సం. విణ. (అ. ఆ. అ.) చంపఁబడినది.

నిబిడము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. సాంద్రము, దట్టము. ౨. దృఢము, గట్టిది.

నిబిడీకరించు. సం. అ. క్రి. దట్టముగా చేయు, దృఢముగా చేయు. (శ. ర.)

నిబిడీకృతము. సం. విణ. (అ. ఆ. అ.) నిబిడముగా చేయఁబడినది.

నిబిరీసము. సం. విణ=నిబిడము.

నిబోధకుఁడు. సం. విణ. (అ. ధి కా. అ.) ౧. గ్రహించువాఁడు. ౨. బోధించువాఁడు.

నిబోధనము. సం. వి. అ. న. ౧. గ్రహించుట, తెలియుట. ౨. తెలుపుట, బోధించుట.

నిబోధము. సం. వి. అ. పుం=నిబోధనము.

నిబ్బడుగు. వి. పాలకీబెస్తలు మిట్ట పల్లము మొ. తెలుపుట కుపయోగించు హెచ్చరికపదము.
వ...బెస్తలు సిస్తుగా మోచి నిబ్బడుగు...నిబ్బరము...అన విని...ప్రబంధ. ౬౦౫.

నిబ్బద్ది=నిబద్ది.
సీ...సత్యంబు దనరు నిజము నిబ్బద్ది నిక్కము నిక్కువ మన. వేంక. మాన. ౬౪.
సీ...నిబ్బద్ది నిక్కము నిలువరంబు, నిజము నిక్కువ మన నెగడు సత్యముపేళ్లు... సాం. ని. మాన. ౫౧.

నిబ్బరము=నిబ్బరికము. విణ. (సం. నిర్భరమ్. ప్రా. నిబ్బరం. క. నిబ్బర.)
౧. అధికము, గాటము.
ఉ. అంటీనఁ గందుమేనుఁ బస నారెకుజవ్వన ముఖ రసంబు పెన్నిండలఁ గూర్చుకామ మును నిబ్బర మైనమదంబు నై మనం, బొంటికిఁ బోక భర్తృరతి నువ్విళులూర... హరి. ఉ. ౭. ౭౧.
వ. కంకాలతావితానం బనేకనలావలంబి యగుచుం బ్రబ్బినం గదునిబ్బరం బగువిభ్రమంబున నావిదర్భసుతాసుభ్రూలలామంబు నెమ్మనంబున నిట్లని వితర్కించు. నైష. ౫. ౧౮౮.
౨. దృఢము; నిశితము.
గీ. నిబ్బరఁపుగబ్బిగుబ్బలయుబ్బుకతన, నోరగాఁ బాణికంజంబు లూఁది మ్రొక్కె.వను. ౨. ౭౫.
క. హరి చూచి వెఱఁగువడ నప్పరుషప్రహరణము వచ్చి పక్షీంద్రుని నిబ్బరముగఁ దాఁకిన వడఁకెం, బొరి నాతఁడు వజ్రనిహతభూధరముక్రియ౯. హరి. పూ. ౪. ౧౮౦.
గీ...అయ్యవనిపతియు, డెబ్బదేను దొమ్మిదియును నిబ్బరంపుటమ్ము లతనిపైఁ బరఁగించె నలుక మిగుల. హరి. ఉ. ౨. ౩౩.
౩. జట్టరి, సాహసి.
క. నిబ్బరపుబాలహంతయు, గొబ్బునఁ దేజంబు మణియుఁ గోల్పడి నతుఁడై, ప్రబ్బినవగ చే విప్రుఁడు, సిబ్బితితో నొడలిగబ్బ నెడి వడిఁ జనియె౯. భాగ. ౧. ౧౮౩.
౪. సాంద్రము, దట్టము.
వ...మబ్బుకొనువయసుగుబ్బల నిబ్బరంబుగ నివుడుతివుటలం బెచ్చుపెరుఁగుమచ్చరంబుల నొక రొకరి మెచ్చక పచ్చవిలుతుండు విచ్చలవిడిం దనకెదువులు ముప్పదిరెంటం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దోడుసూపె నన... యువతీయువజనంబు
లును... పారి. ౨. ౫౨.

౫. యథార్థము, నిశ్చయము.

క. ఈకన్నియకుం దగునొక, రాకొమరుని నరసి
నిబ్బరంబుగ నిపుడే, మా కెఱిఁగింపుము...
నీలా. ౧. ౯౦.

ద్వి. గొబ్బూరిలోపల నిబ్బరంబుగను, బిబ్బబా
చయగారిపృథుమహత్త్వంబు, వర్ణింప శివు
నకు వశము గాదనిన. బస. పు. ౪. ౨౧౩పా.
౧౪౧ పం.

౬. ౧. అశ్వగతివిశేషము.

చ. పతి యలతేజి నెక్కి నరపాలురు గొల్వ
హయాధిరోహపాం, డితి సరిదాట్లు జోడ
నలు నిబ్బరముల్ రవగాలు వేడెముల్, జ
తురతఁ జూపి... చంద్రా. ౨. ౪౦.

క. జోడనలు నిబ్బరంబులు, వేడెంబులు మెఱ
య రాజు వేడుకతోడన్, గోడా దుమికింప
పఁగ జన, గూడిరి దొర లెల్ల భటులగుమి
వెనుకొనియెన్. ఉ. రా. ౪. ౩౯౯.
దశా. ౨. ౭౦.

౭. అతిశయము, ఆధిక్యము.

గీ. ... మిక్కిలి మిక్కుటం బగ్గలంబు, బెట్టు
నిబ్బరము దిటము బిట్టు గాటు, మనఁగఁ నతి
శయ మగును... ఆం. భా. ౧. ౭౭.

చ. కురులసిరుల్ మెఱుంగుఁజనుగుబ్బలనిబ్బర
ముల్ మొగంబువి, స్ఫురణము లింద్రనీల
మణిభూధరశృంగకురంగలాంఛనా, దరవశ
దృష్టిఁ జూచెదవు తాపసవంశవతంస తజ్జ
రా, భరమున వచ్చు తెల్పుఁ బడ పాటు వలీ
వలనంబు నుండఁగన్. పాండు. ౫. ౨౭.
(ఇట ఔన్నత్యము అని భావము.)

౩. బెస్తలు సవారి మోయునపుడు మిట్ట పల్లము
ను. సూచించుహెచ్చరికపదము.

వ... బెస్తలు నిస్తుగా మోచి నిబ్బడుగు... నిబ్బ
రము... అన విని... ప్రబంధ. ౭౦౫.

౪. ఋజుత, సూటి.

ఉ. బిట్టుగఁ గేక వేసి విసఁ బిల్చిన వెండి గరంగి
ముద్దయైన ట్టిరు ఔక్కలున్ ముడిచి య
బ్బురపుంబలు నిబ్బరంబుగన్. గీ... పారావ
తంబు, రాఁదొడఁగె... సారంగ. ౧. ౧౨౭,
౧౨౪.

౫. దిట్టతనము, ధైర్యము.

క. ఆమాట విని తలారు లిదే మని గద్దింప నా
మృగేక్షణ రొదగా, నామగఁ డితఁ డని య
య్యభి, రాముని వెసఁ జూపి నిబ్బరంబునఁ
బలికెన్. శుక. ౩. ౫౮౫.

౭. తదేకాగ్రత.

క. అబ్బావికిఁ జేయేతం, బుబ్బుచుఁ దంబళి యొ
నర్చి యుత్సాహంబుల్, గుబ్బతిలఁ గొన్ని
చెట్లకు, నిబ్బరమున జలము లెత్తి నిస్త్రాణుం
డై. హంస. ౧. ౧౮౭.

౮. పారవశ్యము.

చ. ఒకమతి విష్ణుభక్తి గలయుత్తములం గొని
యాడు మెచ్చు వే, యొకమతి విష్ణునిం గొ
లువ నొల్లనిమాధులఁ జూచి నవ్వు నొం,
డొకమతి విష్ణుభక్తి మది నుబ్బిన నిబ్బర
మందుచుండు నా, ప్రకటగుణాభిరాముఁ డ
గుభాగవతోత్తముఁ డాత్మఁ జొక్కుచున్.
వి. పు. ౨. ౩౦౦.

జః నిబ్బరించు, నిబ్బరిక, నిబ్బరికించు.

నిబ్బరించు. అ. క్రి. (√నిబ్బరము.) ౧. అతిశ
యించు.

ఉ. గుప్పున నప్పు డప్పుడఁతిగుబ్బలు మించె
గగుర్పుపూర్వునన్, గుప్పెలతోడిజక్కవల
కుం బ్రతియై సరిగంచుపూవుపుం, గుప్పస
పుంగులాయపుదగుల్ విడనాడి ముఖాం
బుజంబునన్, గప్పున వ్రాలఁగాఁ దివురు కై

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వడి నుబ్బున నిబ్బరింపుచుక్. చంద్రా. ౬. ౧౪౨.

౨. నిదానించు. (శ. ర.)

**నిబ్బరికము**=నిబ్బరము. వి.౧. బుజుత్వము, నూటి.

వ... నిబ్బరిక నుబ్బి గొబ్బున గుబ్బటిల్లు గబ్బిగుబ్బల... నిరం. ౩. ౬౧. (చి. ని. పా.)

గీ. నిబ్బరిక మేది యను మేదినీవరేణ్య, నీ వరణ్యమునకు వేఁటపోవఁ బ్రొద్దు, గడపలే కెండఁ జేతఁ జిల్కఁ గొని దాని,చేత గొంతయు బుసుపోయి చెలఁగునంత. సారంగ. ౨. ౨౧౬.

౨. కారుణ్యము, దయ.

సీ. ... అక్కటికం బన నక్కస మన, నిబ్బరిక మనఁ గనికరం బనంగను గారుణ్యసంజ్ఞ యై మీఱుచుండు. ఆం. భా. ౧. ౧౩౧.

**నిబ్బరికించు.** అ. క్రి.(√నిబ్బరము.) ౧. కరుణించు. (శ.ర.) ౨. ఆలోచించు, నిదానించు.

ఉ. వెన్నలు పాలు దొంగిలవొ ప్రేఁతలచీరలు మ్రుచ్చిలింపవో, నిన్ను నె నమ్మి యున్న యెడ నిబ్బరికింపక చోరవృత్తి న్నాకన్నియఁ దెచ్చు టింతయును గాని విధం బని కాక దూఱుటల్. పరమ. ౪. ౧౧౧.

౩. ఉప్పొంగు.

వ... అగ్గుబ్బలిసోయగంపుటుబ్బునకు మై నిబ్బరికింప నబ్బురపడి యబ్బలియుండు తనలోన. యయా. ౨. ౪౦.

**నిభము.** సం. విణ. (అ. ఆ. అ. ఇది తఱుచు సమాసాంతములందే కానవచ్చుచున్నది.) ౧. సదృశము; సమానము. ౨. మిక్కిలి భాసిల్లునది. వి. అ. పుం. న. ౧. ప్రకాశము. ౨. నెపము, వ్యాజము. (శ. ర.)

**నిభాలనము** సం. వి. అ. న. చూచుట, దర్శనము; చూపు.

**నిభూతము** సం. విణ. (అ. ఆ. అ.) ౧. (భయముచే) కొయ్యవాటినది, మ్రాన్పడినది. ౨. అతీతము, కడచినది.

**నిభృతము.** సం. విణ. (అ.ఆ.అ.) ౧. నిశ్చలము, కదలనిది, స్థిరము. ౨. పూర్ణము. (ఉదా: చింతానిభృతుఁడు.) ౩. గుప్తము, కనఁబడనిది. ౪. గూఢము, స్పష్టము కానిది. ౫. రహస్యమైనది, ఏకాంత మైనది. ౬. వినీతము, అడఁకువ కలది. వి. అ. న. వినయము, అడఁకువ.

**నిభృతాత్ముఁడు.** సం. విణ. (న్.ఆన్.న్.) స్థిరచిత్తుఁడు, దృఢచిత్తుఁడు.

**నిమంత్రకుఁడు.** సం.విణ. (అ. త్రికా.అ.) నిమంత్రించువాఁడు, నిమంత్రణము చేయువాఁడు.

**నిమంత్రణము** సం. వి. అ.న. ౧. యజ్ఞాదులకు పిలుచుట. ౨. ఆవశ్యక మైన శ్రాద్ధభోజనాదులకు దౌహిత్రాదులను పిలుచుట. ౩. వ్యవహారనిర్ణయార్థము రాజు వాదిప్రతివాదిసాక్షులనుపిలుచుట. (దేనిని చేయనియెడల ప్రత్యవాయము గలుగునో అది నిమంత్రణము. అట్లు ప్రత్యవాయము కలుగనిది ఆమంత్రణము.)

**నిమంత్రణీయుఁడు.** సం= నిమంత్ర్యుఁడు.

**నిమంత్రయత్.** సం.(శత్రం.) నిమంత్రించుచున్న.

**నిమంత్రయమాణము.** సం. విణ.(అ.ఆ.అ.) నిమంత్రించుచున్నది.

**నిమంత్రయితవ్యుఁడు.** సం= నిమంత్ర్యుఁడు.

**నిమంత్రించు.** సం. స. క్రి.౧. ఆవశ్యక మైనశ్రాద్ధభోజనాదులందు తగువారిని పిలుచు. ౨. రాజు వ్యవహారనిర్ణయార్థము పిలుచు. ౩. (యజ్ఞాదులకు) పిలుచు, ఆహ్వానముచేయు.

**నిమంత్రిత.** సం.విణ. (ఋ.త్రీ.ఋ.) నిమంత్రించువాఁడు.

**నిమంత్రితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) నిమంత్రింపఁబడినవాఁడు.

**నిమంత్ర్యమాణము.** సం. విణ. (అ. ఆ. అ.) మంత్రింపఁబడుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**నిమంత్ర్యుఁడు.** సం. విణ.(అ.ఆ.అ.) నిమంత్రింపఁదగినవాఁడు, నిమంత్రణముచేయఁదగినవాఁడు.

**నిమగ్నుఁడు.** సం. విణ. (అ.ఆ.అ.) ౧.(జలాదులందును చింతాదులందును) మునిఁగినవాఁడు. ౨. లీనుఁడు, అణఁగినవాఁడు.

**నిమజ్జకుఁడు.** సం. విణ. (అ. జ్జికా.అ.)మునుఁగువాఁడు.(నిమజ్జనీయము మొ. మజ్జనీయము మొ. వానివలె గ్రహించునది.)

**నిమజ్జథువు.** సం. వి. ఉ. పుం. ౧. నిమజ్జనము, మునుఁగుట, మునుక. ౨.శయనించుట,శయనము.

శ్లో. తల్పే కాంతాంతరైస్సార్థం మన్యేహం ధిజ్నిమజ్జథుం. భట్టి. ౫. ౨౦.

**నిమజ్జనము.** సం. వి. అ. న. ౧. (జలాదులందు దుఃఖాదులందు) మునుఁగుట. ౨. లీనమగుట, అణఁగుట.

**నిమటాయి.** వి. ఒకానొకతీఁగ. (శ. ర.)

**నిమయము.** సం. వి. అ. పుం. వినిమయము, ఒక ద్రవ్యమునిచ్చి దానికిబదులు మఱియొకద్రవ్యము పుచ్చుకొనుట.

**నిమవఁడు.** వి. ఆశ్వవిశేషము.

క. ఒనరించిననీలని నడ,గని బొల్లనిఁ గత్తలానిఁ గైరని సారం,గని జారని జన్నని నిమ, వని మొదలుగఁ దెచ్చి నిలిపె వాహరుఁ డెదురన్. ద్వా. ౩. ౧౪౧.

**నిమానము.** సం. వి. అ. న. ౧.మానము,కొలత. ౨. వెల, మూల్యము.

**నిమి.** సం. వి. ఇ. పుం. ఇక్ష్వాకువంశపురాజులలో నొకఁడు. (వసిష్ఠశాపమున దేహశూన్యుఁ డగునితఁడు దేవతలవలన సర్వదేహులనేత్రములయందు వాయురూపమున సంచరింప వరము పొంది నిమేషరూపమున నుండె ననియు దాననే ఱెప్పపాటునకు నిమేష మను పేరు వచ్చె ననియు పురాణప్రసిద్ధి.

శ్లో. నితోఽ్యత్సవం నతత్పుపుః దృశిభిః పిబంతోఽ్య,నార్యో నరాశ్చ ముదితాః కుపితా నిమేశ్చ. సం. భాగ. ౯. ౨౪. ౬౪.)

**నిమితకాఁడు.** విణ. (√నిమితము.) నియమితుఁడు, ఉద్యోగి, సేవకుఁడు.

(క) బాణశాలవలన జీవించువాఁడు.

గీ. మందుపట్టడపేరు చెన్నొందు బాణ,శాల యనఁగను దజ్జీవిజనము వెలయు, నిమితకాండ్ర నఁగా సుగంధికబరీశ. ఆం.భా. ౨. ౨౫.

(చ) యోధుఁడు.

మ. అనిసన్ మంత్రులు నాప్తులున్ దొరలు దేవామ్రేఁకులన్ రాలఁ దే,రనె యెంతే సలవడ్డయానిమితకాండ్రన్ భానుపుత్రాదులన్, వినుమీ చంపక పట్టి తెచ్చి దినమున్ నీ యింటికామాటపుం,బనికిన్ జొచ్చెద మన్నదాఁక నిదె చెంపల్ వ్రేతు మత్యుద్ధతిన్. రామా. ౭. ౧౭౫.

(ట) మోఁతకాఁడు.

క...ప్రాయందలమున్, స్థానికుఁ డొసంగి పనుపం,గా నానతిఁ బడిననిమితకాండ్రు గహింపన్. ఆము. ౨. ౯౫.

**నిమితము.** వి. (సం. నియమితః. ప్రా. నిఅమిత.) నియమనము. (శ. ర.)

జః నిమితకాఁడు.

**నిమితము.** సం. విణ. (అ.ఆ. అ.) సమదీర్ఘవిస్తారపరిమాణము కలది, చదరమైనది, నిఘము.

**నిమిత్తకారణము.** సం.వి.అ.న.కారణవిశేషము. (సమవాయి, అసమవాయి, నిమిత్తము అని కారణము త్రివిధము - ఘటాదులకు ఘటస్వరూపముగా మాఱుమృత్తికాదికము సమవాయికారణము. ఇదే ఉపాదానకారణము. కపాలద్వయసంయోగాదికము అసమవాయికారణము. కులాలచక్రదండసలిలసూత్రాదికము నిమిత్తకారణము)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిమిత్తకృత్తు. సం. వి. త్. పుం. - శకునమును (ధ్వనిచే) సూచించునది-కాకి.

నిమిత్తము. సం. వి. అ.న. ౧.కారణము, హేతువు. ౨. కారణభేదము. (చూ.నిమిత్తకారణము.) ౩. నామమాత్రకారణము, పేరునకు మాత్రము కారణము.

శ్లో. మయైవైతే నిహతాః పూర్వమేవ, నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్. గీత.౧౧. ౩౪.

౪. చిహ్నము, గుఱుతు. ౫. గుఱి, లక్ష్యము, శరవ్యము.

శ్లో. నిమిత్తాదపరాద్ధేషో ర్ధానుష్కస్యేవ వల్గితమ్. శిశు. ౨. ౨౭.

౬. (శుభాశుభసూచకమగు) శకునము. ౭. ఉద్దేశము. ౮. చెవులయందు చేయుచుంబనము.

సీ. చెవుల నిమిత్తంబు చెక్కుల స్ఫుటితంబు నధరోష్ఠమున భ్రాంతము...హంస.౫.౧౪౮

నిమిత్తవిదుఁడు. సం. విణ. (ద్) ౧. కారణము తెలిసినవాఁడు. ౨. శుభాశుభశకునముల నెఱిఁగినవాఁడు. వి. ద్. అ. పుం. జోస్యుఁడు.

నిమిత్తి. సం. విణ. (న్. నీ.న్.) నిమిత్తము కలది.

నిమిషము. సం. వి. అ. పుం. ౧. ఱెప్పవేయుట, ఱెప్పపాటు. ౨. ఱెప్పవేయునంత కాలము. ౩. (పువ్వులు) ముకుళించుట, ముకుళనము. ౪. రోగభేదము.

నిమిషాంతరము. సం. వి. అ. న. నిమిషమంత వ్యవధానము, ఱెప్పపాటంత కాలవ్యవధి.

నిమీల. సం. వి. ఆ. స్త్రీ. ౧. కనుమూయుట. ౨. కనుగీటుట. ౩. నిద్ర; కునికిపాటు, ౪. కపటము, వ్యాజము. (వాచ.)

నిమీలకము. సం. విణ. (అ. లికా. అ.) ౧. మూయునది. ౨. ముకుళించునది.

నిమీలత్. సం. శత్ర. ౧. మూయుచున్న. ౨. ముకుళించుచున్న, ముడుఁగుచున్న.

నిమీలనము. సం. వి. అ. న. ౧. కనుమూయుట; ఱెప్పవేయుట. ౨. మరణము. ౩. (జ్యోతి.) పూర్ణగ్రహణము. ౪. (పుష్పాదులు) ముకుళించుట, మొగుడుట. ౫. మఱుఁగుపడుట.

నిమీలనీయము. సం=నిమీలితవ్యము.

నిమీలిక. సం=నిమీల.

నిమీలిత. సం. విణ. (బు. త్రీ. బు.)=నిమీలకము.

నిమీలితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. మూయఁబడినది. (కన్ను.) ౨. ఆవృతము, కప్పఁబడినది.

శ్లో.అపథే పద మర్పయంతి హి శ్రుతవంతోఽపి రజోనిమీలితాః. సం. రఘు. ౯. ౭౪.

౩. ముకుళితము, ముకుళించినది, మొగిడినది. (పుష్పాది.) ౪. మఱుఁగుపడినది; అస్తమించినది.

నిమీలితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) మూసికొనఁదగినది. (కన్ను.) ౨.ఆవరింపఁదగినది.

నిమీల్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) మూయఁబడుచున్నది. (కన్ను.) ౨. ఆవరింపఁబడుచున్నది.

నిమీల్యము. సం=నిమీలితవ్యము.

నిముకళా. వి. (నిమురు+కళము.) ౧. కైలు చేసిన కళ్లమునందలి యడుగుధాన్యము. (శ. ర.) ౨. కొఱత. (శ. ర. చి. ని.)

నిముకు. స. క్రి. కుడుచు, పానము చేయు.

ద్వి. అంతంత డగ్గఱి యాపారసతులు, గమిగూడి చూచి యక్కట దాదిచన్ను,నిముకి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నోరవిచ్చిన్ని నెత్తురుఁగందు. ద్వి. పారిజా. ఉ. ౨౩౭౭.

**నిమురు**=నివురు. స. క్రి. ౧. వాత్సల్యముచే చేతితో రాచు; సవరించుకొను; స్పృశించు, తాఁకు.

చ...అతి ప్రమదర సైకమగ్నమతిఁ బాణితలంబున నక్కుమారుమై, నిమిరి శిరంబు మూర్కొని మునిప్రభుఁ డక్కునఁ జేర్చి యిట్లనుఁ. రామా. ౪. ౫౧.

వ...భక్తవత్సలుం డైనహరి దనకరంబున నతని మేను నిమిరి మేఘగంభీరభాషణంబుల నిట్లనియె. భాగ. ౧౦. ఉ. ౬౯.

క. దనుజేంద్రుఁ డాతలోదరిఁ, గనుఁగొని చొళ్లెంబు నిమురు...ఉ. హరి. ౧. ౫౭.

చ. కనఁ దిలకంబుఁ గేసరము గల్లుమియఁగ్ రహిఁ బాడఁ బ్రేంకనం,బు నిముర మావి నవ్వ సురపొన్న...పారి. ౪. ౯.

౨. ఆవరించు, అలము. (చూ. నిమురుకొను.)

జః నిముకిలా, నిమురుకొను.

**నిమురుకొను.** స. క్రి. (√నిమురు) సవరించుకొను, తడవుకొను; ఆవరించు, అలముకొను.

గీ. కుతిక మోవఁగ నెత్తురుల్ గ్రోలి కడుపు, నిమిరికొంచు నగస్త్యమంత్రములు నొడివి. దశా. ౨. ౪౩౫. ఆం. భా. ౩. ౧౩౩.

క. కని గుండె నిమిరికొనుచును, ననురాగము తోడ నంతనంతఁ దనకుటుం,బిని నిది యేమి శకట మి,ట్లనయంబును విషమవృత్తమైనది యిచటఁ. హరి. పూ. ౫. ౧౭౨. (దిట్ట పఱచుకొను. అని భావము.)

గీ. హిమముచే నంబరం బెల్ల నిమురుకొనఁగ, నుష్ణకరుఁడును గరము లొయ్యొయ్య సాఁచి, తాను ననలాంశ ధరియింపఁ బూనె ననఁగ, గెంతయున వచ్చు నింక హేమంతమహిమ. శ్రీరం. ౨. ౨౪౧. (హిమముచే వ్యాప్తము కాఁగా అని భావము.)

**నిముసము.** వి. (సం. నిమిషః. ప్రా. నిమిస, నిముస.)

౧. ఱెప్పపాటు. (ఱెప్పవేయుట. శ. ర)

౨. ఱెప్పపాటుకాలము; అల్పకాలము, కొంచెము సేపు.

సీ. నను నిముసంబు గానక యున్న నూ రెల్ల నరయుమజ్జనకుఁ డెం తడలు నొక్కొ. వసు చ. ౨. ౧౪.

ఉ...నీ,చక్కఁదనంబుఁ గన్న నిముసం బయిన న్నిలు పోప శక్యమే, యక్కునఁ జేర్పకంచు...విజ. వి. ౧. ౧౦౪.

**నిమేయము.** సం. విణ. (అ.ఆ.అ.) మార్చుకొనఁ దగినది, పరివర్తనీయము. (పదార్థాది.) వి. అ. పుం. వినిమయము, వస్తువులమాఱుపు.

**నిమేషకృత్తు.** సం. విణ. (త్) ఱెప్పపాటు కలిగించునది, వి. త్. స్త్రీ. విద్యుత్తు, మెఱపు.

**నిమేషము.** సం=నిమిషము. (చూ. నిమి.)

**నిమేషరుక్కు.** సం. వి. చ్. పుం. - నిమిషకాలము కాంతి గలది- మిణుఁగుఱుఁబుర్వు.

**నిమేషిణి.** సం. వి. ఈ. స్త్రీ. ఱెప్పవేయుటకు సాధన మైనయొకానొక నరము.

**నిమ్నగ.** సం. వి. ఆ. స్త్రీ-పల్లమునకు పాఱునది-నది, ఏఱు.

**నిమ్నము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. గభీరము, లోఁతు. ౨. తక్కువది, నీచము. వి. అ. న. పల్లము.

**నిమ్మ.** వి. (సం. నింబః, క. నింబె.) జంబీరము జంభలము.

రగడ. అలివేణి చెంగటనె యలరి కాచెను నిమ్మ, యలమొల్ల లమరఁగ నియ్యనె కాని కానిమ్మ. ఉ. రా. ౬. ౬౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. నిమ్మ యం చనఁగా జంభలమ్మ దోఁచు. ఆం. భా. ౨. ౪౨.

ద్వి. ఇమ్మల గిరు లంది యిరుచేతులందు, నిమ్మ పండులమాడ్కి నెగుర వైచుచును. రం. రా. యు. ౩౧౨ పా. ౨౪ పం.

రాజులచేతినిమ్మపండు=గొప్పవారి యాదరణ కలవాఁడు.

సీ. చుట్టాలసురభి రాజులచేతినిమ్మపండే రాజు వీఁడె బంగార మయ్యా. బహు. ౫. ౧౨౦.

సా. నిమ్మకు నీరు పోసిన ట్లుండు=సుఖదుఃఖముల చే కలఁతనొందక గంభీరుఁడుగా నుండు.

(వ్యవ) వాఁ డెన్ని చిక్కులు వచ్చినను నిమ్మకు నీరు పోసిన ట్లుండును.

నిమ్మ కెరువు వేసినచందము=నిమ్మచెట్టున కేమాత్రము ఎరువు వేసినను విరివిగా కాచును.

వ... అయత్న శిశిరకృత్యంబులు ఘటియించుచుండ నిమ్మ కెరువు వేసిన చందంబున నందు నంత కంతకుఁ బరితాపం బగ్గలంబై... సారంగ ౨. ౧౬౫.

నిమ్మటాయ. వి. గడ్డగల తృణవిశేషము. (ఇది నిమ్మకాయంత యొంటిగడ్డ గలిగి నేల నంటి పెత్తేడు గంట (స్తంబము) గలిగి యుండును. చి. ని.)

నిమ్మళము. విణ. (సం. నిర్మలమ్. ప్రా. నిమ్మల. క. నిమ్మళవు.)

౧. స్వస్థము; తగ్గినది, ఉపశాంతము.

(వ్యవ) మీశరీరము నిమ్మళముగా నున్నదా?
,, నీజబ్బు నిమ్మళముగా నున్నదా?

౨. మందము.

(వ్యవ) గబగబ చదువకుము, నిమ్మళముగా చదువుము.

౩. అల్పధ్వని కలది.

(వ్యవ) గట్టిగా మాటాడకుము. నిమ్మళముగా మాటాడుము.

వి. ౧. నిష్కళంకత.

సీ. నిమ్మళం బనఁగను నిష్కళంకత యొప్పు... ఆం. భా. ౨. ౧౯౧.

౨. స్వాస్థ్యము.

(వ్యవ) నామనసునకు నిమ్మళము లేదు.

నిమ్మళమగు=అతిశయించు, హెచ్చు.

ఉ. సూనృతవాది రా జనెడుసుద్దులు నిమ్మళ మాయెఁ గైకసంస్థాన మటంచుఁ దిట్లు రుదితంబులు కానక రాఘవుండు పోఁగా నిపుడింత పుట్టె... చం. రా. ౪. ౭౫.

గద్య. అథ దశరథప్రశంసామాంసలైః కైకేయీ నిందాకందలితైః...పరిదేవనారవైః...సం. చం. రా. అయో. ౬౦. (మాంసలైః=ప్రచురైః. తద్భూయిష్ఠైరిత్యర్థః. వ్యాఖ్య.)

జః నిమ్మళించు.

నిమ్మళించు. అ.క్రి. (√నిమ్మళము) స్వస్థుఁడగు.

గీ. మరలఁచును బొర్లుచును మేను మఱచి మిగులఁ జెమటలఁ దొప్పఁదోఁగుచు నిమ్మళించి నిబిడతామససుఖ మిచ్చునిద్రఁ గలిసె, కాలము గ్రమించె నక్కుంభకర్ణుఁ డధిప. ఉ. రా. ౨. ౨౧౫. (ప్రాఁతప్రతిపా.)

నిమ్ము. వి. కొమ్ము మొదలగువానిధ్వనివిశేషము.

వ... గుమ్మెటలచటులరవమును గొమ్ములనిమ్మును జెలంగె నయ్యవసరంబున. కాశీ. ౩. ౩౭.

నిమ్రుక్తి. సం.వి.ఇ.స్త్రీ. అస్తమయము, క్రుంకుట.

నిమ్లోచము. సం. వి. అ. పుం. అస్తమయము, క్రుంకుట.

నియంత. సం. విణ. (ఋ.త్రి. ఋ.)-నియమించువాఁడు- ౧. శాసించువాఁడు, విధించువాఁడు; ఏర్పఱచువాఁడు. ౨. దండించువాఁడు, శిక్షించువాఁడు. ౩. రక్షకుఁడు. వి. ఋ. పుం. ౧. అశ్వములను నియమించువాఁడు, సారథి. ౨. లోకనియామకుఁడు, పరమేశ్వరుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నియంతవ్యము. సం=నియమ్యము.

నియంత్రణ. సం. వి. ఆ. స్త్రీ. ౧. అడ్డగింత. ౨. నియమించుట. ౩. నిర్వచించుట, అర్థము నిరూపించుట.

నియంత్రణము. సం. వి. అ. న=నియంత్రణ.

నియంత్రితము. సం. విణ. (అ. ఆ. అ) ౧. అడ్డగింపఁబడినది, వారింపఁబడినది. ౨. నియమింపఁబడినది.

నియచ్ఛత్. సం. శత్రు. ౧. నియమించుచున్న. ౨. ఇచ్చుచున్న.

నియతము. సం. విణ. (అ. ఆ. అ) ౧. సంయతము, కట్టఁబడినది. ౨. నియమయుతము, నియమము గలది. ౩. నియమము చేయునది, నియమకారి. ౪. నియమింపఁబడినది, ఏర్పఱుపఁబడినది, కట్టుపాటు చేయఁబడినది. ౫. నిగ్రహింపఁబడినది (ఉదా. నియతేంద్రియుఁడు మొ.) ౬. నిత్యమైనది, ఎప్పుడు నుండునది. ౭. స్థిరమైనది. ౮. అనివార్యము, ఆవశ్యకము.

నియతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. నియమము. ౨. భాగ్యము, పూర్వజన్మార్జితమైన సుకృతదుష్కృతరూపకర్మము. ౩. ఇంద్రియనిగ్రహము. ౪. స్త్రీ. దుర్గాదేవి.

నియమనము. సం. వి. అ. న. ౧. నియమము. ౨. నియమించుట, ఏర్పఱుచుట. ౩. బంధించుట. ౪. నిగ్రహించుట, అడఁచుట. ౫. శిక్షించుట, శాసించుట.

నియమనీయము. సం=నియమ్యము.

నియమపత్త్రము. సం. వి. అ. న. ఒడంబడిక పత్త్రము.

నియమము. సం. వి. అ. పుం. ౧. ఏర్పాటు, వ్యవస్థ, కట్టుపాటు. ౨. కట్టు, బంధము. ౩. అడఁచుట, నిగ్రహము. ౪. ఆజ్ఞ, పసుపు. ౫. ప్రతిజ్ఞ. ౬. నియంత్రణ, నిర్దేశించుట. ౭. నిశ్చయము, నిర్ణయము. ౮. వ్రతనిష్ఠ; వ్రతము, ఉపవాససంధ్యోపాసనాది. ౯. విధిభేదము. (చూ. నియమవిధి) ౧౦. అష్టాంగయోగములలో రెండవది. (ఇది బాహ్యాభ్యంతరశౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము అని పంచవిధము. వాచ.కల్ప.)

నియమవిధి. సం. వి. ఇ.పుం. ౧. పాక్షికముగా ప్రాప్తించెడియర్థమును నియమముగా విధించు విధి. ("వ్రీహీనవహంతి=వడ్లను దంచుచున్నాఁడు"అనుచో లోకమున వడ్లపొట్టును పోఁగొట్టుటకు దంపుటయే కాక గోళ్లును సాధన మగును. కాన దంపుట పాక్షికసాధన మగుచున్నది. గోళ్లచేతఁ గాక దంపుటచేతనే పొట్టు పోఁగొట్టవలయు నని యీవిధి నియమించును.) ౨. నిత్యకర్మానుష్ఠానము (శ్లో. నియమవిధిజలానాం బర్హిషాం చోపనేత్రీ. సం. శా. సం. ౧. ౬౦)

నియమస్థితి. సం. వి. ఇ. స్త్రీ. ౧. శాస్త్రోక్తవిధులందు తప్పక ప్రవర్తించుట; వానిని తప్పకయనుష్ఠించుట. ౨. తపస్య; వ్రతము.

నియమస్థుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తపోవ్రతాదినియమమం దుండువాఁడు, తపోవ్రతాదు లాచరించువాఁడు.

నియమించు. సం. స. క్రి. ౧. ఆజ్ఞాపించు.

వ...ధనమునందు నాకు మూఁడు పాళ్లునుం బెట్టి నీవు రెం డంశంబులు గొని బ్రతుకు మని నియమించి పంచిన...మార్క. ౧. ౨౩౪.

౨. అడ్డపెట్టు, నిరోధించు.

వ...నేను దైవాధీనతకతంబున బిడ్డల నొత్తి చెప్పను నియమింపనుం జాలను... భార. ఉద్యో. ౨. ౧౯౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౩. ఏర్పఱుచు, నిర్ణయించు.

ఉ. ఉత్తమమధ్యమాధమనియోగ్యత బుద్ధి నె ఱింగి వారి న,య్యుత్తమమధ్యమాధమ నియోగములం నియమించితే నరేం,ద్రోత్త మ...భార. సభా. ౧. ౩౭.

చ. వనిత మనోహరంబు లగువస్తువు లెల్లను వేడ్క నేటి నీ,కని నియమించి తెచ్చితిం బ్రియంబునం గైకొనుము...భార. విరా. ౨. ౩౩౪.

నియమితము. సం. విణ. (అ. ఆ. అ.) - నియ మింపఁబడినది - ౧. ఏర్పాటుచేయఁ బడినది, నిర్ణయింపఁబడినది. ౨. కట్టఁబడినది. ౩. నిగ్ర హింపఁబడినది. (ఇంద్రియాది.) ౪. విధింపఁబడి నది, విహితము. ౫. శిక్షింపఁబడినది. ౬. అడ్డ గింపఁబడినది.

నియమ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నియమింపఁబడుచున్నది.

నియమ్యము. సం. విణ. (అ.ఆ.అ.) నియమింపఁ దగినది.

నియాతనము. సం. వి. అ. న. నిపాతనము, క్రిం దికిఁ ద్రోయుట.

నియామకుఁడు. సం. విణ. (అ. మకా. అ.)- నియమించువాఁడు- ౧. ఆజ్ఞాపించువాఁడు. ౨. శిక్షించువాఁడు. ౩. నిరోధించువాఁడు, అడ్డ గించువాఁడు. ౪. నిగ్రహించువాఁడు. ౫. నిర్ణ యించువాఁడు. ౬. నిర్దేశించువాఁడు. వి. అ. పుం. ౧. ప్రభువు, పాలకుఁడు. ౨. అశ్వనియం త, సారథి. ౩. నౌకానియంత, తండేలు.

నియామము. సం=నియమము.

నియామి. సం. విణ. (న్. నీ.న్.) నియమించు వాఁడు.

నియుంజత్. సం. శత్ర. నియోగించుచున్న.

నియుంజానము. సం. విణ. (అ. ఆ. అ.) నియో గించుచున్నది.

నియుక్తి. సం.వి.ఇ.స్త్రీ. ౧. పనియందు నియో గించుట, అధికారమునందు పెట్టుట. ౨. ఆజ్ఞ, పనుపు.

నియుక్తుఁడు. సం.విణ. (అ. ఆ.అ.)-నియోగింపఁ బడినవాఁడు- ౧.ఆజ్ఞప్తుఁడు,పనుపఁబడినవాఁడు. ౨. అధికృతుఁడు, రాజాదులచే అధికారమున నియమింపఁ బడినవాఁడు. ౩. ప్రేరితుఁడు, ప్రే రింపఁబడినవాఁడు, ౪. సంబద్ధుఁడు, సంబంధిం చినవాఁడు. ౫.(సంతతిలేని వితంతువునకు దేవర న్యాయమున సంతతి గలిగింప) నియోగింపఁ బడినవాఁడు.

నియుజ్యమానము. సం. విణ.(అ.ఆ.అ.)నియో గింపఁ బడుచున్నది.

నియుతము. సం.విణ. (అ. ఆ. అ) ౧.లక్షసం ఖ్యావిశిష్టము, లక్ష. శ్లో. శతం సహస్ర మయు తంనియుతం ప్రయుతం మతం, త్రీ కోటి రర్బుద మితి క్రమా ద్దశగుణోత్తరమ్. (రత్నకోశము.) ౨. దశలక్షసంఖ్యావిశిష్టము, పదిలక్షలు.

శ్లో. ఏకం దశ శతం చైవ సహస్ర మయుతం తథా,లక్షం చ నియుతం చైవ కోటి రర్బుద ఏవ చ,బృందః ఖర్వో నిఖర్వశ్చ శంఖపద్మౌ చ సాగరః,అంత్యం మధ్యం పరార్థం చ దశ వృద్ధ్యా యథోత్తరమ్. (వాచ.)

వి. ౧. లక్షసంఖ్య. ౨. దశలక్షసంఖ్య.

నియుద్ధము. సం.వి.అ.న. శస్త్రాస్త్రములు పట్టఁగూడ దను నియమము గలయుద్ధము, బాహుయుద్ధము, జెట్టిపట్లు పట్టుట.

నియోక్త. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నియో గించువాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**నియోక్తవ్యుఁడు.** సం.విణ. (అ.ఆ.అ.) నియోగింపఁ దగినవాఁడు.

**నియోగజనుఁడు.** సం.వి.అ.పుం. భృత్యుఁడు.

సీ...అవని, సురులను వైశ్యుల శూద్రుల నాత్మీయ బంధుసువృద్ధవీరభటనియోగ, జనులను వేదల సాదుల నిత్యంబుఁ దాన పరీక్షించి... భార. సభా. ౧. ౧౧౬.

**నియోగము.** సం. వి. అ. పుం. ౧. పనికై ఏర్పఱుచుట, అధికారమునఁ బెట్టుట. ౨. ప్రేరణము, ప్రేరించుట. ౩. ఆజ్ఞ, పనుపు. ౪. ఏర్పఱిచినపని; పని. ౫. (పుత్త్రులు లేనివిధవను దేవరుని వలననో సపిండునివలననో పుత్త్రుని పడయుటకై) నియోగించుట. ౬. కూర్చుట, తగుల్చుట. ౭. అవధారణము, నిశ్చయము. ౮. పరివారము, పరిజనము. (ఈయర్థము తెనుఁగుననే కనఁబడుచున్నది.)

ద్వి. వినయపూర్వకముగా వినుతి సేయుచును, నుండంగ నఖిలనియోగంబు గొలువ. బస. పు. ౫. ౧౧౫ పం.

ద్వి. కావున నీదు సకలనియోగంబు, మావారలై యుండ మన్ననోరమణ. బస. పు. ౨. ౫౦౨ పం.

ద్వి. బసవన్నఁ దోడ్తేరఁ బంచి సంప్రీతి,నసమ సకలనియోగాధ్యక్షుఁ జేయ. పండితా. దీక్షా. ౭౨ పా.

**నియోగి.** సం. విణ. (న్. నీ. న్.) - నియోగము గలవాఁడు- ౧. అధికారము గలవాఁడు, అధికృతుఁడు. ౨. రాజాదులచే నొకపనియందు నియుక్తుఁ డైనవాఁడు. ౩. ఒక తెగ బ్రాహ్మణుఁడు. (వ్యవ.) వీరు వైదికులు, వారు నియోగులు. (వీరిలో భేదములు, ఆఱువేలనియోగులు, తెలఁగాణపునియోగులు, నందవరీకనియోగులు మొ.)

**నియోగించు.** సం. స. క్రి. ౧. ఏర్పఱుచు.

వ...నాతపంబునకు విఘ్నం బొనరించునక్తంచరు సమయించుటకై కుమారుని నియోగించి ధర్మరక్షణం బాచరింపు మనవుడు నన్నరేంద్రుం డమ్మునివచనం బాచరించి... మార్క. ౨. ౨౨౪.

౨. ఆజ్ఞాపించు, పనుచు.

వ...గీతవాద్యనృత్తంబులును నాదిగాఁ గలవివిధశుభాచారంబులం బ్రవర్తింప నియోగింపవలయు. భార. విరా. ౩. ౨౩౬.

ద్వి. పరమార్థ మగుపరాత్పరుఁ డని నన్ను, నరయంగఁ జేయుఁడా యని నియోగింప. ద్వి. పరమ. ౧. ౨౬ పా.

ద్వి...శాలాకూపమునసలిలములు, ముదమున నర్చనంబున కొకబిందెఁ, డొదవఁ దెమ్మనుచు నియోగించుటయును. ద్వి. పరమ. ౮. ౫౯౮ పా.

**నియోగ్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) నియోగించుటకు అర్హుఁడు, ప్రభువు.

**నియోజకుఁడు.** సం. విణ. (అ. జికా. అ.) నియోగించువాఁడు.

**నియోజనము.** సం. వి.అ. న. ౧. ఆజ్ఞాపించుట. ౨. ప్రేరించుట; ప్రవర్తింపఁజేయుట. ౩. పనియందు నియమించుట. ౪. (ఒకదానితో) కూర్చుట. విణ. (అ. ఆ. అ.) నియోజనము చేయునది. (అ. ఈ. అ.) నియోజనము చేయుటకు సాధనమైనది.

**నియోజనీయుఁడు.** సఁ=నియోక్తవ్యుఁడు.

**నియోజించు.** సం. స. క్రి. లగ్నముచేయు, కూర్చు.

గీ. సుమహితధ్యానమునఁ బరంజ్యోతియందు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనముఁ జాల నియోజించి మహిమఁ దనరు. భాగ. ౩. ౯౪౨.

నియోజితుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) ౧. ఆజ్ఞాపింపఁ బడినవాఁడు. ౨. ప్రేరింపఁ బడినవాఁడు, ప్రవర్తింపఁ జేయఁ బడినవాఁడు. ౩. పనియందు నియమింపఁ బడినవాఁడు. ౪. కూర్పఁ బడినవాఁడు, అనుసంధానము చేయఁబడినవాఁడు.

నియోజ్యుఁడు. సం. విణ. (అ. ఆ.అ.) ౧. ప్రేరింప శక్యమైనవాఁడు, ప్రవర్తింపఁజేయ శక్యమైనవాఁడు. ౨.నియోగింప శక్యమైనవాఁడు. (భృత్యుఁడు.)

శ్లో. సిధ్యంతి కర్మసు మహత్స్వపి య న్నియోజ్యాః, సంభావనాగుణ మవేహి త మీశ్వరాణామ్. శాకుం. ౭. ౪.

నియోధకుఁడు. సం. వి. అ. పుం. బాహుయుద్ధము చేయువాఁడు, మల్లుఁడు.

నియోద్ధ. సం. విణ. (ఋ.ద్ధ్రీ.ఋ.) బాహుయుద్ధము చేయువాఁడు, జెట్టిపట్లు పట్టువాఁడు. వి. ఋ. పుం. కుక్కుటము, కోడి.

నియ్యోగి. వి. (సం.నియోగీ.) ౧. ఒక తెలుఁగు భృత్యుఁడు ?

గీ. కటికవారును దగుమాడిగములవార,లవసరంబున నియ్యోగు లాడనాడఁ,బొడఁగని యథోచితాకృతుల్ వొరసి కొలువ. ఉ.రా. ౭. ౧౯౦.

౨. మంత్రి. ౩.ఒక తెగబ్రాహ్మణుఁడు. (శ. ర.)

నిర్. సం.అవ్య.ఇది సమాసపూర్వపదముగా నుండి తఱచుగా నీ క్రింది యర్థములనిచ్చును.

౧. నిష్క్రాంతము, బయలువెడలినది.

(ఉదా: నిష్కౌశాంబి = కౌశాంబీపురమునుండి బయలువెడలినది.) ౨. అతిక్రాంతము, మీఱినది, దాఁటినది. (ఉదా: నిస్త్రింశము=ముప్పది అంగుళములు దాఁటినది. నిర్నాభి=నాభి దాఁటినది, నాభిక్రిందికి వచ్చినది.) ౩. నిర్గతము, పోయినది. (ఉదా: నిర్ధనుఁడు మొ.) ౪. అభావము. (ఉదా: నిర్మక్షికము=మక్షికాభావము. నిరామయము = ఆమయాభావము.) ౫. అతిశయము. (ఉదా: నిష్కృష్టము,నిర్ణిక్తము,నిర్ఘోషము మొ.)

నిరంకుశము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అంకుశములేనిది. ౨. అడ్డులేనిది, నిరర్గళము. ౩. వారింపరానిది, అనివార్యము. (వాచ.)

నిరంగము. సం. విణ. (అ. ఈ, ఆ.అ.) ౧. అవయవములు లేనిది. ౨. శరీరము లేనిది. ౩. ఉపాయము లేనిది.

నిరంగుళము. సం. విణ. (అ. ఆ. అ.) అంగుళులనుండి నిర్గతము, వ్రేళ్లనుండి జాఱినది.

నిరంగుళి. సం. విణ. (ఇ) అంగుళులు లేనివాఁడు, వ్రేళ్లులేనివాఁడు.

నిరంజనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కాటుక లేనిది. (కన్ను.) ౨. నిర్మలము, డాగు లేనిది. (వస్త్రాది.) ౩. (కాపట్యాది) దోషము లేనిది, శుద్ధము. వి. అ. పుం. చిత్రవర్ణమై యజ్ఞార్హ మగుహరిణము.

నిరంజనుఁడు. సం. వి. అ. పుం. ౧. పరమాత్మ. ౨. శివుఁడు.

నిరంతరము. సం. విణ. (అ. ఆ. అ.)-అంతరము లేనిది- ౧. కాలమునందు ఎడతెంపు లేనిది,సంతతము; దేశమునందు ఎడము లేనిది,మిక్కిలి దగ్గఱగా నున్నది,వ్యవధానము లేనిది. ౨. సందులు లేనిది, సాంద్రము, దట్టమైనది. ౩. మఱుఁగు లేనిది. ౪. భేదము లేనిది, అభిన్నము.

శ్లో. సుహృది నిరంతరచిత్తే, గుణవతి భృత్యేఽనువర్తిని కళత్రే, స్వామిని శక్తిసమేతే,నివేద్య దుఃఖం సుఖీ భవతి.సం.పంచ.౧.౩౩౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిరంబరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వస్త్రము లేనివాఁడు, దిసమొలవాఁడు.

నిరంశము. సం. విణ. (అ. ఆ. అ.)- అంశము లేనిది- ౧. భాగము లేనిది, పాలు లేనిది. ౨. దాయభాగము లేనిది. ౩. అఖండము, పూర్ణమైనది.

నిరక్షదేశము. సం. వి. అ. పుం. అక్షాంశములు లేనిదేశము, దక్షిణధ్రువోత్తరధ్రువములు క్షితిజవృత్తమునఁ గలిసిన దేశము.

నిరతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧ మిక్కిలి యాసక్తి గలది. ౨. స్థిరము, చంచలము కానిది.

చ. సరసిజనాభ బంధుజనసంతతిఁ గయ్యపు నేలఁ
జూడఁగా, విరవిరవోయి మేను నిడువెం
ద్రుక వెట్టుచుఁ గంప మొందెఁ జే,నిరతము
గాదు గాండివము నిల్వఁగ నోర్వవు గాళ్లు
నేను నిష్ఠురతరుఁ జాల నొల్ల నొకఁడున్
మహి యేలుట యేటిసౌఖ్యముల్. భార. భీష్మ. ౧. ౧౭౧.

౩. అవిచ్ఛిన్నము.

కం. నిరతముగఁ దీర్ఘసేవా,పరులకు శాంతాత్ము
లకుఁ దపస్వులకును దు,ష్కర మెద్దియు లే
దని చెచ్చెర ధర్మజుఁ దీర్ఘసేవ సేయింపు
మొగిన్. భార. ఆర. ౨. ౨౯౫.

(వ్యవ) ఆతఁడు నిరతాన్నప్రదాత.

క్రి. విణ. ఎల్లపుడు, అనవరతము. (ఈయర్థము సంస్కృతగ్రంథములందుఁ గనఁబడలేదు.)

కం. కిరణములభంగిఁ జతురపుఁ, బరిజనముల
కెందుఁ జొనిపి పరకృత్యంబుల్, నిరతంబు
ను గనుఁగొనుచును, దరణికరణి వెలుఁగు
టొప్పు ధరణీశునకున్. భార. శాం. ౩.
౧౦౬.

నిరతి. సం. వి. ఇ. స్త్రీ. అత్యంతరతి, మిక్కిలి యాసక్తి.

నిరతిశయము. సం. విణ. (అ. ఆ. అ.) దేనికంటె అతిశయించినది లేదో అది, అత్యధికము.

నిరత్యయము సం. విణ. (అ. ఆ. అ.)- అత్యయము లేనిది- ౧. అపాయము లేనిది, నాశము లేనిది. ౨. నిర్బాధము, బాధ లేనిది. ౩. దోషము లేనిది.

నిరనుక్రోశుఁడు. సం. విణ. (అ. ఆ. అ.)-అనుక్రోశరహితుఁడు - జాలి లేనివాఁడు, కఠినహృదయుఁడు.

నిరనుగుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అనుచరులు లేనివాఁడు.

నిరనునాసికము. సం. విణ. (అ. ఆ. అ.) అననునాసికము, అనునాసికము కానిది. (వర్ణము.)

నిరనురోధుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అనువర్తనము లేనివాఁడు, అనుకూలుఁడు గానివాఁడు, ప్రతికూలుఁడు.

నిరన్వయము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వంశము లేనిది, సంతతి లేనిది. ౨. సంబంధము లేనిది, పొసఁగనిది; ప్రకరణమునకు సంబంధింపనిది. (వాక్యమందలి పదము.)

నిరపత్రపుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నిర్లజ్జుఁడు, సిగ్గు లేనివాఁడు. ౨. దిట్టఁడు, జంకుగొంకులు లేనివాఁడు. (ధృష్టుఁడు.)

నిరపరాధుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అపరాధము లేనివాఁడు, నేరము లేనివాఁడు.

నిరపాయము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అపాయము లేనిది. ౨. నాశము లేనిది.

నిరపేక్ష. సం. వి. ఆ. స్త్రీ. అనపేక్ష, కోరిక లేమి.

నిరపేక్షము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అపేక్ష లేనిది, ఆశ లేనిది, కోరిక లేనిది. ౨. అం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బోధనాదులం దన్యాపేక్ష లేనిది, స్వతంత్ర మైనది. (వేదాది.) 3. ప్రయోజనము లేనిది; ఉద్దేశము లేనిది.

నిరపేక్షి. సం. విణ. (న్. ణీ. న్.) అపేక్షింపని వాఁడు, కోరనివాఁడు.

నిరప్పణ. విణ. (సం. నిరర్పణమ్.) నిరభ్యంతరము, అనర్గళము.

వ. అని నిరప్పణగాఁ గప్పలఱేఁడు సెలవిచ్చిన ... వేం. పంచ. ౨. ౩౭౦.(అడ్డులేక అని భావము.)

నిరభిభవము. సం. విణ. (అ. ఆ. అ.) అవమానము లేనిది, తిరస్కారము లేనిది.

నిరభిమానము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. గర్వము లేనిది, అహంభావము లేనిది. ౨. ఆత్మగౌరవము లేనిది.

నిరభిలాషుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అభిలాష లేనివాఁడు, కోరిక లేనివాఁడు.

నిరయము. సం. వి. అ. పుం. నరకము.

నిరర్గళము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. గడియ లేనిది. ౨. అడ్డము లేనిది. క్రి. విణ. యథేచ్ఛముగా, విచ్చలవిడిగా.

నిరర్థకము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అర్థము లేనిది. (పదాది.) ౨. ప్రయోజనము లేనిది, నిష్ఫలము. వి. అ. న. ఒకానొక పదదోషము.
శ్లో. పాదపూరణమాత్రం య త్తన్నిరర్థక ముచ్యతే. (ప్రతాపరుద్రీయము. దోష.)

నిరర్థము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ధనము లేనిది, బీద. ౨. అర్థము లేనిది. (పదము, వాక్యము.) 3. ప్రయోజనము లేనిది, వ్యర్థము, నిష్ఫలము.

నిరవకాశము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఎడము లేనిది. ౨. తెఱపి లేనిది, తీఱుబడి లేనిది.

నిరవగ్రహము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అడ్డు లేనిది. ౨. స్వచ్ఛందము, స్వతంత్రము, ఒకరియిచ్చకు లోఁబడక ప్రవర్తించునది. 3. వఱపు లేనిది, అనావృష్టి లేనిది.

నిరవద్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఉత్కృష్టుఁడు, దోషము లేనివాఁడు. ౨. నింద లేనివాఁడు.

నిరవధి. సం. విణ. (ఇ.) ౧. అవధి లేనిది, మేర లేనిది. ౨. ఎడతెగనిది.

నిరవధికము. సం. విణ. (అ. ఆ. అ.) అవధి లేనిది, మేర లేనిది.

నిరవము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నివృత్తరవము, ధ్వని లేనిది.

నిరవయవము. సం. విణ. (అ. ఆ. అ.)-అవయవములు=భాగములు - లేనిది. (పరమాణువు, ఆకాశము, బ్రహ్మము మొ.)

నిరవలంబము. సం. విణ. (అ. ఆ. అ.) - అవలంబము లేనిది- ౧. ఆశ్రయము లేనిది, ప్రాపు లేనిది, నిరాధారము. ౨. ఆశ్రయించుట లేనిది, స్వతంత్రము. 3. వ్రేలాడుట లేనిది.

నిరవశేషము. సం. విణ. (అ. ఆ. అ.) నిశ్శేషము, సమగ్రము.

నిరవసితుఁడు. సం. విణ. (అ. ఆ.అ.) పాత్రమునుండి బహిష్కృతుఁడు, ఎవఁడు తిన్నపాత్రము భస్మాదిసంస్కారముచేత శుద్ధము కా నేరదో అట్టివాఁడు. (చండాలాది.)

నిరవహానిక. సం=నిరవహాలిక.

నిరవహాలిక. సం. వి. ఆ. స్త్రీ. ప్రాచీనము, వెలుఁగు, కంచె.

నిరశనము. సం. విణ. (అ.ఆ.అ.) అశనము లేనిది, భోజనము చేయనిది. వి. అ. న. ఉపవాసము, నిట్రు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**నిరసనము**, సం. విణ. (అ. ఆ. అ.) ౧. తొలఁగించునది. ౨. తఱుమునది, వెడలఁగొట్టునది, ౩. ఉమియునది. వి.అ.న. ౧. త్రోసివేయుట. ౨. వెడలఁగొట్టుట. ౩. ప్రత్యాఖ్యానము, (వాదాదులను) నిరాకరించుట, ఖండించుట. ౪. తిరస్కారము. ౫. వధము. ౬. నిష్ఠీవనము, ఉమియుట.

**నిరసనీయము**. సం. విణ. (అ.ఆ.అ.) నిరసింపఁదగినది.

**నిరసము**. సం. విణ. (అ.ఆ.అ.)- నివృత్తరసము- ౧. శృంగారాదిరసశూన్యము. (పద్యము మొ.) ౨. చప్పిడి. ౩. సారహీనము, ఎండినది. (పండు మొ.)

**నిరసించు**. సం. స. క్రి. ౧. తొలఁగించు, పోఁగొట్టు.

వ...మదీయమనఃక్లేశంబు నిరసింప నీవ యర్హుండ వనుటయు... భార. శాం. ౬. ౫౯౪.

౨. తిరస్కరించు.

శా...నీలాంబుదో,త్సేకంబుల్ నిరసింపఁ జాలు తనుకాంతిశ్రీలు దిగ్భాగములన్, భూషింపం గ...వరాహ. ౧. ౧౪౧.

౩. విడుచు, పరిహరించు. (శ. ర.)

**నిరసిత**. సం. విణ. (బు. త్రీ. బు.) నిరసించువాఁడు.

**నిరసితవ్యము**. సం=నిరసనీయము.

**నిరస్తము**. సం. విణ. (అ.ఆ.అ.) ౧. తొలఁగింపఁబడినది, త్రోసివేయఁ బడినది. ౨. వెడలఁగొట్టఁబడినది. ౩. ఏయఁ బడినది, ప్రయోగింపఁబడినది. (అమ్ము.) ౪. త్యక్తము, విడువఁబడినది. (రాగాది.)

శ్లో. త్వం పుండరీకముఖ బంధుతయా నిరస్తమేకో నివాపసలిలం పిబసీ త్యయుక్తం. మాలతీ ౯. ౪౦.

౫. ప్రత్యాఖ్యాతము, నిరాకరింపఁబడినది, ఖండింపఁబడినది. (వాదము మొ.) ౬. తిరస్కరింపఁబడినది. ౭. నిష్ఠ్యూతము, ఉమియఁబడినది. ౮. త్వరితముగా ఉచ్చరింపఁబడినది. (మాట.) ౯. ప్రతిహతము, భంగమునొందినది. (వ్రతము, ఒడంబడిక మొ.) ౧౦. (గుఱ్ఱము లోనగువానిమీఁదనుండి) పడఁద్రోయఁబడినది. వి.అ.న. ౧. తొలఁగించుట, త్రోసివేయుట. ౨. నిష్ఠీవనము, ఉమియుట. ౩. చిమ్ముట, విసరుట; ఏయుట. ౪. త్వరితముగా ఉచ్చరించినమాట.

**నిరస్థి**. సం. విణ. (ఇ.) ఎముకలేనిది.

**నిరస్యత్**. సం. శత్ర. నిరసించుచున్న.

**నిరస్యమానము**. సం. విణ. (అ.ఆ.అ.) నిరసింపఁబడుచున్నది.

**నిరస్యము**. సం=నిరసనీయము.

**నిరహంకారుఁడు**. సం. విణ. (అ.ఆ.అ.) ౧. దేహేంద్రియాదులందు నేను అనెడి అభిమానము లేనివాఁడు. ౨. ధనవిద్యాదులవలని గర్వము లేనివాఁడు. ౩. క్రోధము లేనివాఁడు.

**నిరహంకృతి**. సం. విణ. (ఇ.)=నిరహంకారుఁడు.

**నిరహంకృతుఁడు**. సం=నిరహంకారుఁడు.

**నిరాకరణము**. సం. వి. అ. న. ౧. తొలఁగించుట, త్రోసివేయుట. ౨. తిరస్కరించుట. ౩. అనాదరముచేయుట, నిర్లక్ష్యముచేయుట. ౪. ప్రత్యాఖ్యానము, (వాదాదికమును) ఖండించుట.

**నిరాకరణీయము**. సం. విణ. (అ.ఆ.అ.) నిరాకరింపఁ దగినది.

**నిరాకరించు**. సం. స. క్రి. ౧. అనాదరముచేయు, నిర్లక్ష్యముచేయు.

శా. ఆవ్వాక్యంబు నిరాకరించి దిశ లల్లాడం గఠోరంబుగా, నన్వేల్...వరాహ. ౨.౧౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిరాకరిష్ణువు. సం. విణ. (ఉ.) నిరాకరించుస్వభావము కలవాఁడు.

నిరాకరిష్యమాణము. సం. విణ. (అ.ఆ.అ.) నిరాకరింపఁబడనున్నది, నిరాకరింపఁబడఁబోవునది.

నిరాకర్త. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నిరాకరించువాఁడు.

నిరాకర్తవ్యము. సం=నిరాకరణీయము.

నిరాకాంక్షము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఇచ్ఛాశూన్యము, కోరిక లేనిది. ౨. (వ్యాక.) ఆకాంక్ష (=పదాంతరాపేక్ష) లేనిది. (పదము.)

నిరాకారకుఁడు. సం. విణ. (అ. రి కా. అ.) నిరాకరించువాఁడు.

నిరాకారము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. రూపము లేనిది. (ఆకాశము, బ్రహ్మము మొ.) ౨. వికృత రూపము గలది. ౩. ఆహ్వానము లేనిది, పిలుపు లేనిది. వి. అ. పుం. నిరాకరణము, తిరస్కారము.

నిరాకారి. సం. విణ. (న్. ణీ. న్.) నిరాకరించువాఁడు.

నిరాకార్యము. సం=నిరాకరణీయము.

నిరాకుర్వత్. సం. శత్ర. నిరాకరించుచున్న.

నిరాకుర్వాణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నిరాకరించుచున్నవాఁడు.

నిరాకులము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పర్యాకులము, మిక్కిలి కలఁత నొందినది. ౨. మిగుల వ్యాప్తమైనది.

"అళికులసంకులకుసుమసమూహనిరాకులవకుల కలాపే." గీతగో. ౧. ౩.

౩. స్వస్థము, నిర్వ్యాకులము.

శ్లో. సుపాత్రనిక్షేపనిరాకులాత్మనా. శిశు. ౧. ౨౫.

నిరాకృతము. సం. విణ. (అ.ఆ.అ.) నిరాకరింపఁబడినది. వి. అ. న.=నిరాకరణము.

నిరాకృతి. సం. విణ. (ఇ.) ౧. ఆకారము లేనిది. ౨. వికృతరూపము కలది. వి. ఇ. స్త్రీ. = నిరాకరణము. ఇ. పుం. ౧. అధ్యయనము చక్కఁగా చేయనివాఁడు. ౨. పంచయజ్ఞములను త్యజించినవాఁడు.

నిరాక్రియ. సం. వి. ఆ. స్త్రీ.=నిరాకరణము.

నిరాక్రియమాణము. సం. విణ. (అ. ఆ. అ.) నిరాకరింపఁబడుచున్నది.

నిరాగమము. సం. విణ. (అ. ఆ.అ.) ఆగమప్రమాణము లేనిది. ౨. ఆగమము - రాక - లేనిది.

నిరాగు(గసు)ఁడు. సం. విణ. (స్.) ౧. పాపము లేనివాఁడు. ౨. అపరాధము లేనివాఁడు, అనపరాధుఁడు.

నిరాఘాటము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. మేర లేనిది, హద్దు లేనిది.

గీ. ఏఁటిధృతి యేఁటివితరణ మేఁటిశౌర్య, మేఁటి గాంభీర్య మని నిరాఘాటధైర్య, దానశక్తి గభీరతానూనుఁ డగుచు... కృ. శతం. పీఠి. ౭౩.

౨. అప్రతిహతము.

గీ. ప్రతిదినంబును బ్రాతరారంభవేళ, నిర్నిబంధననిరుపాధినిరవగాధ, నిర్నిరోధనిరాఘాట నిరుపమాన, భక్తి సంభజియింతు రీపద్మబంధు. కాశీ. ౩. ౧౪౪.

నిరాచారుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఆచారము లేనివాఁడు.

నిరాడంబరము. సం. విణ. (అ. ఆ. అ.) ఆడంబరము లేనిది.

నిరాణ. విణ. (క. నిరాళ.) స్వచ్ఛము, మాలిన్యరహితము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. హర నీభ క్తినిషేధక,చరితలు నో విడిచి
నిన్నె చనఁ గొలిచి నిరంతరభక్తుఁ డై శివై
క్యుఁడు, నిరాణ యగుపనిఁడివోలె నిలువఁ
గ వలయుఁ. శివ. సా. ౧౮౫.

నిరాతంకము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. జంకు లేనిది,భయము లేనిది. ౨. రోగము లేనిది. ౩. నొప్పింపనిది, అబాధకము. ౪. నిష్ప్రతిరోధము, ఆటంకము లేనిది, అడ్డు లేనిది.

శ్లో. నిరాతంకః పంకేష్వివ పిశితఖండేషు నిపత,
న్ననీ ర్గాత్రం గాత్రం సపది లవశ స్తేవికిర
తు. మాలతీ. ౫. ౩౪.

నిరాతప. సం. వి. ఆ. స్త్రీ. రాత్రి.

నిరాతపము. సం. విణ. (అ. ఆ. అ.) ఎండ లేనిది.

నిరాదిష్టము. సం. విణ. (అ. ఆ. అ.) చెల్లింపఁబడినది, తీర్పఁబడినది. (అప్పు మొ.)

నిరాదేశము. సం. వి. అ. పుం. ఋణమును పూర్తిగా తీర్చుట.

నిరాధారము. సం. విణ. (అ. ఆ. అ.) ఆధారము లేనిది, ప్రాపు లేనిది.

నిరాధి. సం. విణ. (ఇ.) మనోవ్యాధి లేనిది.

నిరానందము. సం. విణ. (అ. ఆ. అ.) ఆనందము లేనిది.

నిరాపనింద. సం. వి. ఆ. స్త్రీ. (మి. గ్రా. వి. అని శ. ర.) లేనిపోనినింద, నిరాధారమైననింద, అపదూఱు.

క. పినతల్లివి పెనుపఁగ నో,పినతల్లివి గాన వచ్చి
పిలిచిన నయ్యో, గనికరము లేక వానిం,గని
కరము నిరాపనింద గట్టం దగునే. సారంగ.
౩. ౫౧.

నిరాబాధము. సం.విణ. (అ. ఆ. అ.) ౧.బాధ లేనిది,నొవ్వు లేనిది. ౨. వ్యథ లేనిది. ౩. ప్రతిబంధము లేనిది, అడ్డు లేనిది.

నిరాబారి. వి. (సం. నిరాహారీ.) ముని.

క. తలఁచునిరాబారులచి,క్కులు దొలఁగఁగఁ
జేసి మనుచుగొనములగనికిఁ. నీలా. ౧. ౨౦.

సీ. గాలి యోగిరము గాఁగను నీటిలోనఁ దబ
ము లొనర్చెడునిరాబారిగములు. యయా.
౨. ౪౩.

పోరోగిరపునిరాబారి=కలహాశనముని,నారదుఁడు. (సరస్వతీవర్ణనము.) సీ. పోరోగిరపునిరాబారి
కూరిమిపట్టి మామమామ యనుంగుమామగా
రు. అచ్చ. రా. బాల. ౬.

నిరామయము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. రోగము లేనిది. ౨. నిర్దోషము. ౩. కపటము లేనిది,అమాయకము. వి. అ. పుం. న. రోగము లేమి, ఆరోగ్యము. పుం. ౧. అడవిమేఁక. ౨. పంది.

నిరామాలువు. సం. వి. ఉ. పుం. కపిత్థము, వెలఁగ *.

నిరాయతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. మిక్కిలిచాఁగినది, విరివి యైనది. ౨. ముడిఁగినది, సంకుచితము.

నిరాయము. సం. విణ. (అ. ఆ. అ.) ఆదాయము లేనిది, రాబడి లేనిది.

నిరాయాసము. సం. విణ. (అ. ఆ. అ.) ఆయాసము లేనిది; సుకరము,సులు వైనది.

నిరాయుధుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఆయుధము లేనివాఁడు.

నిరాలంబ. సం. వి. ఆ. స్త్రీ. ఆకాశమాంసి, చిన్నజటామాంసి*.

నిరాలంబము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అవ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లంబము లేనిది,ఆధారము లేనిది. ౨. స్వతంత్రము, పరతంత్రము కానిది.

నిరాలకము. సం. వి. అ. పుం. ఒకజాతిచేప. (విల్యమ్సు.)

నిరాలోకము. సం, విణ. (అ. ఆ. అ.) ౧. చూడనిది. ౨. దృష్టిపోయినది, గ్రుడ్డిది. ౩. వెలుతురు లేనిది, చీకటి కలది; కనఁబడనిది.

నిరాశంకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఆశంక -జంకు- లేనివాఁడు.

నిరాశుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఆశ లేనివాఁడు, ఆశ ఉడిగినవాఁడు.

నిరాశ్రయుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఆశ్రయము లేనివాఁడు, ఆధారము లేనివాఁడు; ఆలంబనరహితుఁడు, ఊఁత లేనివాఁడు.

నిరాసకము. సం. విణ. (అ. సి కా. అ.) నిరసించునది.

నిరాసము. సం=నిరసనము.

నిరాసీలు. వి. బ. వస్త్రవిశేషము.

రగడ. బురుశకాసీలు మహముదులు నిరాసీలు, సరి నేయరానిహంసావళులు లాకీలు. హంస. ౫. ౩౫౬.

నిరాస్వాదము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఆస్వాదము లేనిది, అనుభవము లేనిది. ౨. రుచ్యము కానిది, చవి లేనిది.

నిరాహారము. సం. విణ. (అ.ఆ.అ.) ఆహారము లేనిది. వి. అ. పుం. అనశనము, ఉపవాసము.

నిరింగిని. సం. వి. ఈ. స్త్రీ. తెఱ; ముసుఁగు. (విల్యమ్సు.)

నిరింద్రియుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నేత్రాదీంద్రియములు లేనివాఁడు. ౨. రేతస్సు లేనివాఁడు.

నిరిచ్ఛుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఇచ్ఛ లేనివాఁడు.

నిరీక్ష. సం. వి. ఆ. స్త్రీ.=నిరీక్షణము.

నిరీక్షకుఁడు. సం. విణ. (అ. క్షికా. అ.) వీక్షించువాఁడు.

నిరీక్షణము. సం. వి. అ. న. ౧. దృష్టి, చూపు. ౨. చూచుట, కనుఁగొనుట. ౩. ఎదురుచూచుట. ౪. భావించుట, తలఁచుట.

నిరీక్షించు. సం. స. క్రి. ౧. చూచు.

వ... ప్రసాదసుముఖి యై శాంభవి నిలింపుల నిరీక్షించి మీ కభిమతం బైనవరం బడుగుఁడిచ్చెద... మార్క. ౬. ౧౨౪.

౨. ప్రతీక్షించు, ఎదురుచూచు.

వ. ఇట్లేకతంబ యేకవస్త్ర యై యోడ నెక్కవచ్చువారి నిరీక్షించు చున్నసత్యవతిం జూచి యామునివరుండు. భార. ఆది. ౩.౩౬.

౩. భావించు, ఎంచు.

ఉ. చంచలనేత్ర సీత విడఁజాలుదునే శుకయేమి గా నిరీక్షించితి నన్ను సృష్టి యిటఁ జీకటి చేసెదఁ జూడు మంచు రాత్రించరపుంగవుం డలుక దిక్కులు మ్రోయఁ బ్రయాణభేరి వేయించె సమస్తరాక్షసుల కిం పొదవన్ బవరంపుఁదెంపునన్. రామా. ౪.౧౪౩.

నిరీక్షితము. సం. విణ. (అ. ఆ. అ.) నిరీక్షింపఁబడినది. వి. అ. న.=నిరీక్షణము.

నిరీతి. సం. విణ. (ఇ.) ఈతిబాధలు లేనిది.

నిరీశము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రభువు లేనిది. ౨. దేవుఁడు లేనిది.

నిరీశ్వరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దేవుఁడు లేఁ డనువాఁడు.

నిరీషము. సం. విణ. (అ.ఆ.అ.) లాంగలదండము లేనిది, ఏఁడికోల లేనిది. (నాఁగలి.) వి. అ. న. ఫాలము, నాఁగటికఱ్ఱు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**నిరీహ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చేష్టాశూన్యత్వము, పని చేయకుండుట. ౨. ఇచ్ఛాశూన్యత, ఇచ్ఛ లేమి. ౩. ప్రయత్నము లేమి.

**నిరీహుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. చేష్టాశూన్యుఁడు. ౨. ఇచ్ఛాశూన్యుఁడు. ౩. ప్రయత్నశూన్యుఁడు.

**నిరు.** అవ్య. గతార్థకము. (నిరుడు, నిన్న, నిప్పచ్చమొ.) (శ. ర.)
జః నిన్న, నిరుడు.

**నిరుంధత్.** సం. శత్రు. నిరోధించుచున్న.

**నిరుంధానము.** సం. విణ. (అ. ఆ. అ.) నిరోధించుచున్నది.

**నిరుకడము.** వి. ఒకానొకచెట్టు. (శ. ర.)

**నిరుకు.** వి. (క. నిరఖు.) ౧. నిర్ణయము. ౨. నిర్ణయించినవెల. (శ. ర.)

**నిరుకుళము.** విణ. (సం.నిరర్గళమ్.) దిగంబరము. (చి. ని.)
గీ. నిగమనూపురములు మ్రోయ నిరుకుళముగ, సిగ్గు వాసినకటి ప్రకాశింప నురము,కెంపు లేయెండ గ్రక్కఁ జెక్కిళ్ల నగవు, మొలవ నతీర్థమున నిల్చి పొల్చుఁ జక్రి. పాండు. ౨. ౨౨౯.

**నిరుక్తకారుఁడు.** సం. వి. అ. పుం. నిరుక్తమును చేసినవాఁడు, యాస్కుఁడు.

**నిరుక్తజుఁడు.** సం. వి. అ. పుం. నియుక్తజుఁడు, భర్తచే నియుక్తుఁడగువానివలన పుట్టినవాఁడు, క్షేత్రజుఁడు.

**నిరుక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. అర్థవివరణము చేసి చెప్పఁబడినది, నిర్వచింపఁబడినది. ౨. నియుక్తము, నియోగింపఁబడినది. వి.అ.న. ౧. నిర్వచనము, పదముల అవయవార్థములను వివరించుట. ౨. వేదాంగములలో నొకటి, వేద పదములకు అవయవార్థమును వివరించుచు యాస్కుఁడు రచించిన గ్రంథవిశేషము.

**నిరుక్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. నిర్వచనము, ఒక పదముయొక్క ప్రకృతిప్రత్యయాద్యవయవముల యర్థమును చెప్పి దానిసాముదాయికార్థమును దెలుపుట. ౨. (అలం.) ఒక అర్థాలంకారము.
శ్లో. నిరుక్తిర్యోగతో నామ్నా మన్యార్థత్వప్రకల్పనమ్, ఈదృశైశ్చరితైర్జానే సత్యం దోషాకరో భవాన్.
౩. యాస్కుఁడు రచించిన నిరుక్తము.

**నిరుచ్ఛ్వాసము.** సం. విణ. (అ. ఆ. అ.) ఊపిరి లేనిది.

**నిరుడు.** వి. దే. (నిరు + ఏఁడు) గతవత్సరము, కడచిన సంవత్సరము.
గీ. నిరుడు నాఁగఁ బరుత్సఁజ్ఞ పరగు చుండు. ఆం. భా. ౧. ౯౭.
ఆ. కన్నులందు మదము గప్పి కానరు గాని, నిరుడు ముందటేఁడు నిన్న మొన్న, దగ్ధులైనవారు దమకంటెఁ దక్కువా... వేమన. ౧. ౧౪౯.
చ. దొరసెమునందుఁ జుట్టుకొని తోరణకట్టెనురోవిభాగముగ్, నిరుడు పయోజకోశరమణీయతఁ దాల్చెను వర్తమానవత్సరమున నొప్పె; హేమకలశంబులబాగున ముందటేఁటికిం, గరినిభయానచన్నుఁగవ కౌఁగిలిపట్టులు గాక యుండునే. క్రీడా. ౨౮౪.

**నిరుతి.** వి. (సం.నిరృతిః. క.నిరుతి.) నైరృతుఁడు, నిరృతి.
క... ఆర్చెగ్, సురబలము లసురపుత్రులు, నిరుతికి వెన్నిచ్చి రెదిరి నిల్వక భీతిన్. కు.సం. ౧౨. ౮౨౭.
చ. నిరుతియు వారిమాయల కనిక్ బ్రతిమాయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లోనర్చి పేర్చుసం,గర మొనరింపః...కు.సం. ౧౨. ౮౨౨. ('నిరుబుతి' అపముద్రి.)

నిరుత్తరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రతివచనము లేనివాఁడు, జవాబు చెప్పనివాఁడు; జవాబు పొందనివాఁడు. ౨. ఎవనికంటె శ్రేష్ఠుఁడు లేఁడో వాఁడు, అనుత్తరుఁడు, మిక్కిలి శ్రేష్ఠుఁడు.

నిరుత్సవము. సం. విణ. (అ. ఆ. అ.) ఉత్సవములు లేనిది.

నిరుత్సాహము. సం. విణ. (అ. ఆ. అ.) ఉత్సాహము లేనిది.

నిరుత్సుకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి ఉత్సుకుఁడు, ఇష్టార్థమునకై మిగుల తహతహపడువాఁడు. ౨. అనుత్సుకుఁడు, తహతహ లేనివాఁడు.

నిరుదకము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్జలము, ఉదకము లేనిది.

నిరుద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అడ్డగింపఁబడినది. ౨. చెఱఁ బెట్టఁబడినది; రాకపోకలు లేకుండునట్లు అఁకపెట్టఁబడినది.

నిరుద్యముఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ప్రయత్నము లేనివాఁడు, సోమరి.

నిరుద్యోగుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఉద్యోగము లేనివాఁడు, ప్రయత్నము లేనివాఁడు; వ్యాపారము లేనివాఁడు.

నిరుద్వేగము. సం. విణ. (అ. ఆ. అ.) ఉద్వేగము లేనిది, శాంతము.

నిరుధ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిరోధింపఁబడుచున్నది.

నిరుపద్రవము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. విపత్తు లేనిది, ఉపప్లవము లేనిది. ౨. బాధ లేనిది.

నిరుపధి. సం. విణ. (ఇ.) కపటము లేనిది, మోసము లేనిది.

నిరుపపత్తి. సం. విణ. (ఇ.) ఉపపత్తి లేనిది.

నిరుపప్లవము. సం=నిరుపద్రవము.

నిరుపమము. సం. విణ.(అ.ఆ.అ.) అనుపమము, అసమానము, సాటి లేనిది.

నిరుపహతము. సం.విణ.(అ.ఆ.అ.)౧.కొట్టుపడనిది. ౨. ఉపద్రవము లేనిది. ౩. నాశములేనిది.

నిరుపహతి. సం. విణ. (ఇ.)=నిరుపహతము.

నిరుపాఖ్యము. సం. విణ. (అ.ఆ.అ.) అసత్పదార్థము. (వంధ్యాపుత్రాది.) వి. అ. న. - వర్ణింపశక్యము కానిది - బ్రహ్మము.

నిరుపాధి. సం. విణ. (ఇ.) ఉపాధి లేనివాఁడు.

నిరుపాధికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.)=నిరుపాధి.

నిరుపాయము. సం. విణ. (అ.ఆ. అ.) ఉపాయము లేనిది.

నిరుపేక్షము. సం. విణ. (అ. ఆ. అ.) ఉపేక్ష లేనిది.

నిరుహ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్వహింపఁబడుచున్నది.

నిరూఢము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. మిక్కిలి రూఢమైనది, ప్రసిద్ధి కెక్కినది. ౨. రూఢము, సంకేతసిద్ధము, జనవ్యవహారసిద్ధము. (అర్థము. వ్యతి. యౌగికము.) ౩. నిరూఢలక్షణచే అర్థమును బోధించునది.(శబ్దము.) ౪. నిర్వహింపఁబడినది. ౫. ఊఢముకానిది, పెండ్లియాడఁబడనిది.

నిరూఢలక్షణ. సం. వి. ఆ. స్త్రీ. వ్యాకరణకోశాదులయందు ప్రసిద్ధమగునర్థమును దెలుపు లక్షణ. (ఉదా:—లావణ్యము, అనుకూలము, ప్రతికూలము.)

నిరూఢి. సం. వి. ఇ. స్త్రీ. ౧. మిక్కిలి ప్రసిద్ధి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. (విద్యాదులయందు) ప్రవీణత, కౌశల్యము. ౩. నిరూఢలక్షణ. ౪. నిర్ధారణ, నిశ్చయము.

నిరూపకుఁడు. సం. విణ. (అ.పి.కా.అ.) నిరూపించువాఁడు, నిరూపణ చేయువాఁడు.

నిరూపణ. సం. వి. ఆ. స్త్రీ.=నిరూపణము.

నిరూపణము. సం. వి. అ. న. ౧. నిర్ధారణ చేయుట, నిర్ణయించుట. ౨. విచారణము, అరయిక. ౩. తార్కాణ, నిదర్శనము. ౪. చూపు;చూచుట.౫.యథార్థస్థితి తెలియునట్లు నిర్వచించుట.

నిరూపణీయము. సం. విణ. (అ.ఆ. అ.) నిరూపింపఁదగినది, నిరూపణ చేయఁదగినది.

నిరూపయత్. సం. శత్రు. నిరూపించుచున్న.

నిరూపయమాణము. సం. విణ. (అ. ఆ. అ.) నిరూపించుచున్నది.

నిరూపయితృ. సం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) నిరూపించువాఁడు, నిరూపణ చేయువాఁడు.

నిరూపయితవ్యము. సం=నిరూపణీయము.

నిరూపించు. సం. స. క్రి. ౧. నిర్ణయించు.

గీ. వినుము విప్రకామార్థభోజనము లోను,గాఁ గఁ గలుగు వేదోక్తప్రకారభోజనములు వ్రతహాని సేయవు నరవరేణ్య, యని నిరూపించి పలికి యిట్లనియె మఱియు. భార.శాం. ౪. ౩౯౮.

వ...మరణభయంబున కిది నిమిత్తం బని నిరూపింప రాదు. మార్కం. ౧. ౫౭.

౨. ఏర్పాటుచేయు.

వ...కురుక్షేత్రంబు దఱియం జొచ్చి యందొక్కరమణీయప్రదేశంబు విడిదల గా నిరూపించి నిలిచి... భార. ఉద్యో. ౪. ౧౭౪.

౩. గ్రహించు, తెలిసికొను.

గీ. ఇట్లు దమ్ము నిరూపింప నితరజనము,లకు నశక్యంబు గాఁగ సల్లాపరసము, ననుభవించుచు నల్లనల్లన లతాంగి, యరిగె నర్తనమండపోపాంతమునకు. భార. విరా. ౩. ౪౨.

శ్లో. తయోస్తద్వచనం శ్రుత్వా జజ్ఞిరే నేతరే జనాః. సం. భార. విరా. ౨౫. ౨౫.

౪. నిర్వచించు,స్వరూపమును నిర్ధారణచేయు. ౫. (నాట్య.) అభినయించు.

నిరూపితము. సం. విణ. (అ. ఆ. అ.) నిరూపింపఁబడినది, నిరూపణ చేయఁబడినది.

నిరూప్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) నిరూపింపఁబడుచున్నది, నిరూపణ చేయఁబడుచున్నది.

నిరూప్యము. సం=నిరూపణీయము.

నిరూహణము. సం. వి. అ. న.=నిరూహము.

నిరూహము. సం. విణ. (అ. ఆ. అ.) ఊహ లేనిది. వి. అ. పుం. (వైద్య.) గుదద్వారమున దోషములను వెడలించుటకై చేయువస్తిభేదము. (ఇందు క్షీరకషాయాదు లుపయోగింపఁబడును. తైల ముపయోగించువస్తి అనువాసన మనఁబడును.)

నిరృతి. సం. విణ. (ఇ.) ఉపద్రవము లేనిది. వి. ఇ. పుం. దక్షిణపశ్చిమదిక్పాలకుఁడు. స్త్రీ. ౧. అలక్ష్మి. ౨. అధర్మునిభార్య. ౩. అధర్ముని కూఁతురు. ౪. మృత్యువుభార్య. ౫. మూల నక్షత్రము.

నిరోధకుఁడు. సం. విణ. (అ. ధికా. అ.) నిరోధించువాఁడు.

నిరోధనము. సం. వి. అ. న.=నిరోధము.

నిరోధనీయము. సం=నిరోద్ధవ్యము.

నిరోధము. సం. వి. అ. పుం. ౧. బంధించుట, చెఱఁబెట్టుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో. వైశ్య స్సర్వస్వదండ స్స్యా త్సంవత్సరని రోధతః. మను. ౮. ౩౭౫.

౨. రాకపోకలు లేకుండునట్లు అడ్డుపెట్టుట. ౩. అడ్డగింత. ౪. నాశము. ౫. వశపఱుచుకొనుట. ('యోగశ్చిత్తవృత్తి నిరోధః.' పాతంజలయోగసూత్రము.)

నిరోధి. సం. విణ. (న్. నీ. న్.) నిరోధించువాఁడు.

నిరోధించు. సం. స. క్రి. నిరోధము చేయు; అడ్డగించు.

(యమభటులు.) మ...భీకరులై యొక్కటఁ జుట్టుముట్టుకొని మార్గంబుల్ నిరోధించినన్. భా. రా. ౩. ౩౩౧.

నిరోద్ధ. సం. విణ. (ఋ. ద్ధ్రీ. ఋ.) నిరోధించువాఁడు.

నిరోద్ధవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నిరోధింపఁదగినది.

నిరోధ్యము. సం=నిరోద్ధవ్యము.

నిర్గంధనము. సం. విణ. (అ. ఆ. అ.) గంధనము లేనిది. వి. అ. న. మిగుల హింసించుట; చంపుట, మారణము.

నిర్గంధపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. శాల్మలి, బూరుగుచె.

నిర్గంధము. సం. విణ. (అ. ఆ. అ.) గంధము లేనిది.

నిర్గచ్ఛత్. సం. శత్ర. నిర్గమించుచున్న.

నిర్గతము. సం. విణ. (అ.ఆ. అ.) ౧. నిష్క్రాంతము, వెడలినది. ౨. నశించినది. ౩. పైకి వచ్చినది. (రసము, రక్తము మొ.) ౪. ఉద్గతము, బయలుదేఱినది. (మొగ్గ, మొక్క మొ.)

నిర్గతి. సం.వి.ఇ. స్త్రీ. ౧. వెలువడుట. ౨.నిష్క్రమణము, వెడలిపోవుట.

నిర్గమనము. సం. వి. అ. న. ౧=నిర్గతి. ౨. ద్వారము.

నిర్గమనుఁడు. సం. వి. అ. పుం. ప్రతీహారి, ద్వారపాలకుఁడు.

నిర్గమము. సం. వి. అ. పుం=నిర్గమనము.

నిర్గమించు. సం. అ. క్రి. వెడలు, బయలుదేఱు; ఉద్భవించు.

గీ. అనినఁ దేజస్వి యేసి చంద్రార్ధమౌళి, శిశ్నమున నిర్గమించుటఁ జేసి యితఁడు, శుక్రుఁ డను పేర వర్తించు సుదతి నీకుఁ, బ్రియ మొనర్చితి ననియె సంప్రీతితోడ. భార. శాం. ౫. ౪౭౫.

వ. అవ్విరోచననందనుశరీరంబుననుండి సురూపయును సుగౌరయును నగునొక్కమగువ నిర్గమించినం గని కాశికుండు...భార. శాం. ౪. ౪౦౦.

వ...ఇట్లు రోషసంఘూర్ణితుం డగువిష్ణువక్త్రంబున మహాతేజం బుద్భవించె బ్రహ్మశంకరశక్రాదిసకలదేవశరీరములయందుఁ దీవ్రతేజంబులు నిర్గమించె...మార్క. ౬. ౭౪.

నిర్గము. సం. వి. అ. పుం. దేశము, విలాతి.

నిర్గర్వము. సం. విణ. (అ. ఆ. అ.) గర్వము లేనిది.

నిర్గళనము. సం. వి. అ. న. వెలికి జాఱుట.

నిర్గుండి. సం. వి. ఈ. స్త్రీ. ౧. సిందువారము, వావిలిచె. ౨. నల్లవావిలిచె. ౩. కరహాటము, మంగచె.

నిర్గుణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) గుణములు లేనివాడు.

నిర్గూఢము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. సంవృతము, కప్పఁబడినది. ౨. మిక్కిలిగూఢమైనది. వి. అ. పుం. వృక్షకోటరము, చెట్టులొట్ట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిర్గౌరవుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) గౌరవము లేనివాఁడు, మరియాద లేనివాఁడు.

నిర్గ్రంథకుఁడు. సం. విణ. (అ. థికా. అ.) ౧. నిస్సహాయుఁడు, ఒంటరి. ౨. వస్త్రరహితుఁడు. ౩. హృదయగ్రంథి వీడినవాఁడు, జ్ఞాని. ౪. ఫలశూన్యుఁడు, వ్యర్థుఁడు. వి. అ. పుం. ౧. క్షపణకుఁడు. ౨. దిగంబరసన్న్యాసి. ౩. జూదరి.

నిర్గ్రంథనము. సం. వి. అ. న. మారణము, చంపుట.

నిర్గ్రంథుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నిర్ధనుఁడు, బీదవాఁడు. ౨. నిస్సహాయుఁడు, ఒంటరి. ౩. హృదయగ్రంథి వీడినవాఁడు, జ్ఞాని. ౪. మూర్ఖుఁడు. ౫. జూదరి. వి. అ. పుం. ౧. క్షపణకుఁడు. ౨. దిగంబరసన్న్యాసి. ౩. ముని.

నిర్గ్రాహ్యము. సం. విణ. (అ. ఆ. అ.) తప్పక గ్రహింపఁదగినది.

నిర్ఘటము. సం. వి. అ. న. బహుజనసమ్మర్దము కలయంగడి. విణ. (అ. ఆ. అ.) ఘటము లేనిది. (కల్ప.)

నిర్ఘర్షణకము. సం. విణ. (అ. ణికా. అ.) రాచునది. వి. అ. న. దంతచూర్ణము, పండ్లు తోముపొడి.

నిర్ఘర్షణము. సం. విణ. (అ. ఈ. అ.) రాచుటకు సాధనమైనది. వి.అ.న. రాచుట, రాపు, ఓఅపిడి.

నిర్ఘాతనము. సం.వి.అ. న. (వైద్య.) యంత్రాదులచే అదిమి రసి మున్నగువానిని వెలికి తీయుట.

నిర్ఘాతము. సం. వి. అ. పుం. ౧. శాళము, చేటు. ౨. దెబ్బ, కొట్టు. ౩. సుడిగాలి, బోరుగాలి. ౪. వజ్రాయుధము.

నిర్ఘృణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దయలేనివాఁడు, క్రూరుఁడు. ౨. జుగుప్స లేనివాఁడు, రోయనివాఁడు.

నిర్ఘోషము. సం. విణ. (అ. ఆ. అ.) ఘోషము లేనిది, ధ్వని లేనిది. వి. అ. పుం. ౧. శబ్దము, మ్రోఁత. ౨. మహాధ్వని.

నిర్ఘోషించు. సం. అ. క్రి. ధ్వనిచేయు.
మ...వెంబడి బ్రహ్మహత్యయును నిర్ఘోషించుచుఁ భీమరూ, పనిరుద్ధాభ్రధరాతికంపన మెలర్పఁ వచ్చె వేగంబునన్. సేతు. ౩.౧౩౭ ప.

నిర్జనము. సం. విణ. (అ. ఆ. అ.) జనములేనిది. వి. అ. న. ఏకాంతము, జనము లేనిచోటు.

నిర్జయము. సం. వి. అ. పుం. పూర్ణవిజయము, నిండుగెలుపు.

నిర్జర. సం. వి. ఆ. స్త్రీ. ౧. గుడూచి, తిప్పతీఁగ. ౨. తాలపర్ణి, మురఅనుగంధద్రవ్యము.

నిర్జరము. సం. వి. అ. న. అమృతము.

నిర్జరసర్షపము. సం. వి. అ. పుం. దేవసర్షపము, తెల్లావ.

నిర్జరాయువు. సం. విణ. (ఉ.) జరాయువు-మావి-నుండి వచ్చునది. (మృగాది.)

నిర్జరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ముదిమి లేనివాఁడు. వి. అ. పుం. దేవత, వేలుపు.

నిర్జలము. సం. విణ. (అ. ఆ. అ.) జలము లేనిది.

నిర్జలైకాదశి. సం. వి. ఈ. స్త్రీ. (ఆచమనసమయమునఁ దప్ప నితరసమయమున నీరైనను త్రాగక ఉపవాసము చేయఁ దగినయేకాదశి.) జ్యేష్ఠశుక్లఏకాదశి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిర్జాతము. సం. విణ. (అ. ఆ. అ.) ఉద్భూతము, పుట్టినది; బయలుదేఱినది.

నిర్జించు. సం. స. క్రి. జయించు, వశపఱుచుకొను.
సీ. దుర్జయవీరుల నిర్జించితిమి నీవు శాస్త్రవయోధుల సమయఁజేయ. భార. అశ్వ. ౩. ౩.
గీ... ఇంద్రియముల నిర్జించి సత్త్వాదు లవులఁ ద్రోచి, యేను శాంతిసుఖంబున కెలయుటనఘ. భార. శాం. ౫. ౩౯౫.

నిర్జితి. సం. వి. ఇ. స్త్రీ. నిర్జయము, నిండు గెలుపు.

నిర్జితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పరాజితుఁడు, జయింపఁబడినవాఁడు; వశీకృతుఁడు, లోఁబఱుచుకొనఁబడినవాఁడు.

నిర్జిహ్వము. సం. విణ. (అ. ఆ. అ.) నోటినుండి వెలికి వచ్చిన నాలుక కలది. వి. అ. పుం. భేకము, కప్ప.

నిర్జీవము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. జీవము లేనిది, జీవాత్మ లేనిది; ప్రాణము లేనిది, చనిపోయినది. ౨. ప్రాణులు లేనిది.

నిర్ఝరము. సం. వి. అ. పుం. న. ఝరము, సెలయేఱు. పుం. ౧. తుషానలము, ఊఁకనిప్పు. ౨. ఏనుఁగు. ౩. సూర్యాశ్వము.

నిర్ఝరి. సం. వి. ఈ. స్త్రీ. నది, సెలయేఱు. వి. పుం. - సెలయేళ్లు కలది - పర్వతము.

నిర్ఝరిణి. సం. వి. ఈ. స్త్రీ. నది, సెలయేఱు.

నిర్ణయత్. సం. శత్ర. నిర్ణయించుచున్న.

నిర్ణయనము. సం. వి. అ. న. నిర్ణయించుట.

నిర్ణయనీయము. సం=నిర్ణేయము.

నిర్ణయపాదము. సం. వి. అ. పుం. చతుష్పాదాత్మక మగు వ్యవహారముయొక్క నిర్ణయాత్మక మగు సిద్ధిపాదము, తీర్పు.

నిర్ణయమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్ణయించుచున్నది.

నిర్ణయము. సం. వి. అ. పుం. ౧. నిశ్చయము, నిర్ధారణ. ౨. (మీమాంస.) అధికరణపంచావయవములలో నయిదవది; సిద్ధాంతము, నిష్కర్షము. ౩. (న్యాయ.) పక్షప్రతిపక్షములను విమర్శించి విషయము నిర్ధారణచేయుట. ౪. (వ్యవహార.) తీర్పు. (చూ. నిర్ణయపాదము.)

నిర్ణయించు. సం. స. క్రి. స్థిరపఱుచు, నిశ్చయించు.
సీ. జిహ్వాగ్రమునఁ బరీక్షింపఁగ లవణాధికలశార్ణవంబులు దెలియవచ్చె, వలపున భేదంబు గలుగంగ మృగనాభి హిమవాలుకల నిర్ణయింపవచ్చెఁ. గీ. గాని లేకున్న నేకప్రకారమైన సమ సమును సంతతభ్రాంతి నావహించు, ననఁగ నీశ్వరనారసింహాక్షమాధిపతియశశ్చంద్రికాకదంబములు నిగిడె. వరాహ. ౧. ౪౧.

నిర్ణాయకుఁడు. సం. విణ. (అ. యికా. అ.) ౧. నిర్ణయించువాఁడు. ౨. నిర్ణయింపఁజేయువాఁడు.

నిర్ణాయనము. సం. వి. అ. న. ౧. నిర్ణయింపఁజేయుట; నిర్ణయము చేయుట. ౨. మరణము. ౩. ఏనుఁగుయొక్క అపాంగప్రదేశము.

నిర్ణిక్తము. సం. విణ. (అ. ఆ. అ.) - శోధితము- ౧. కడుగఁబడినది, శుద్ధము చేయఁబడినది. ౨. పవిత్రము చేయఁబడినది.

నిర్ణిక్తి. సం. వి. ఇ. స్త్రీ. శుద్ధి ౧. కడుగుట. ౨. పాపము పోఁగొట్టుట.

నిర్ణిద్రము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నిద్రలేనిది, జాగరూకమైనది, జాగ్రత్త కలది. ౨. ముకుళితము కానిది, వికసించినది. (పుష్పాది.)

నిర్ణీతము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్ణయింపఁబడినది, నిర్ణయము చేయఁబడినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిర్ణీతి. సం. వి. ఇ. స్త్రీ. నిశ్చయము.
క. బాలాపాణిగ్రహణశుభ, వేళానిర్ణీతి కిపుడ విచ్చేయుము...వసు. ౩. ౮౯.

నిర్ణీయమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్ణయింపఁబడుచున్నది.

నిర్ణుదత్. సం. శత్రు. తొలఁగించుచున్న.

నిర్ణుదమానుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగించుచున్న వాఁడు.

నిర్ణుద్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగింపఁబడుచున్నది.

నిర్ణేకము. సం. వి. అ. పుం. ౧. మిక్కిలిశుద్ధి. ౨. పాదప్రక్షాళనాదికము. ౩. పాపపరిహారము. ౪. ప్రాయశ్చిత్తము.

నిర్ణేజకుఁడు. సం. విణ. (అ. జికా. అ.) శుద్ధి చేయువాఁడు. వి. అ. పుం. చాకలి.

నిర్ణేజనము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. పాపము పోఁగొట్టుసాధన మైనది. ౨. కడుగుటకు సాధనమైనది. ౩. ఉదుకుటకు సాధన మైనది. వి. అ. న. ౧. కడుగుట. ౨. పాపము పోఁగొట్టుట. ౩. ప్రాయశ్చిత్తము.

నిర్ణేత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ౧. నిర్ణయించువాఁడు. ౨. న్యాయాధ్యక్షుఁడు, వివాదనిర్ణయము చేయువాఁడు, తీర్పుచెప్పువాఁడు. ౪. నేత, నాయకుఁడు.

నిర్ణేతవ్యము. సం= నిర్ణేయము.

నిర్ణేయము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్ణయింపఁదగినది, నిర్ణయము చేయఁదగినది.

నిర్ణోదకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగించువాఁడు.

నిర్ణోదనీయము. సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగింపఁదగినది.

నిర్ణోదము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. తొలఁగించునది, పోఁగొట్టునది. ౨. నిరసించునది. వి. అ. పుం. ౧. తొలఁగించుట. ౨. త్రోసివేయుట, నిరసించుట.

నిర్ణోదీ. సం. విణ. (న్. నీ. న్.) తొలఁగించువాఁడు.

నిర్ణోద్యము. సం= నిర్ణోదనీయము.

నిర్దగ్ధము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చక్కఁగా కాలినది. ౨. కాలనిధి.

నిర్దటుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దయలేనివాఁడు. ౨. పరాపవాదరతుఁడు, పరులపై అపవాదములు వేయుటయందాసక్తి కలవాఁడు. ౩. వ్యర్థుఁడు, పనికిమాలినవాఁడు. ౪. మత్తిల్లినవాఁడు.

నిర్దదుఁడు. సం=నిర్దటుఁడు. (ఆ. ని.)

నిర్దయము. సం. విణ. (అ. ఆ. అ.) దయలేనిది, క్రూరము. క్రి. విణ. క్రూరముగా, దయ లేకుండగా.

నిర్దరము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కఠినము. ౨. సిగ్గు లేనిది. ౩. నిర్భయము, భయము లేనిది. ౪. నిర్ఘరము, సెలయేఱు. వి.అ.న. సారము.

నిర్దళనము. సం. వి. అ. న. పూర్తిగా చీల్చుట; భేదించుట.

నిర్దళితము. సం. విణ. (అ. ఆ. అ.) పూర్తిగా భేదింపఁబడినది; పూర్తిగా చీల్పఁబడినది.

నిర్దశనము. సం. విణ. (అ. ఆ. అ.) పండ్లు లేనిది, దంతములు లేనిది.

నిర్దశము. సం. విణ. (అ. ఆ. అ.) పదిదినములు కడచినది, పదిదినములు దాటినది.

నిర్దహనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పూర్తిగా కాల్చునది. ౨. అగ్ని లేనిది. ౩. కాలుట లేనిది; వేఁడిమిలేనిది. వి.అ.న. మిగులకాల్చుట.

నిర్దహించు సం. స. క్రి. బాగుగా కాలుచు, పూర్తిగా కాలుచు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆ. అమ్మహోత్తముఁ డఖుచు లైనవారల నవి, నిర్దహిం
చుఁ గాన నీవు పరమ, శుచివి గమ్ము నీకుఁ
జొప్పడు నఖిలము,హోత్రవీర్య మనియె నా
దరమున. భార. కర్ణ. ౧. ౨౯౫.

సీ ... ఇందిరా,వరుఁడు వరప్రదుం డఖిలవం
ద్యుఁడు గర్భమునంద యుండి య,చ్చెరువుగ
నిర్దహించె నవిజేయసురాహితతత్తు లన్ని
యుఁగ. హరి. ఉ. ౧౦. ౨౧౫.

నిర్దాత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ౧. మిక్కిలి భేదించువాఁడు; మిగుల చీల్చువాఁడు. ౨. గొప్పదాత, మిక్కిలి యిచ్చువాఁడు. ౩. శోధకుఁడు, శుద్ధిచేయువాఁడు. ౪. (పైరుమున్నగునవి) కోయువాఁడు.

నిర్దారణము. సం. వి.అ.న. చక్కఁగా చీల్చుట.

నిర్దారితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పూర్తిగా భేదింపఁబడినది; పూర్తిగా చీల్పఁబడినది. ౨. విప్పఁబడినది, తెఱవఁబడినది. (నేత్రాది.)

శ్లో. నాగః ... క్రోధాక్రాంతః క్రూర నిర్దారితాక్షః ప్రేక్షాంచక్రే నైవ కించి న్మదాంధః. శిశు. ౧౮. ౨౮.

నిర్దిగ్ధుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అనులిప్తుఁడు, పూయఁబడినవాఁడు. ౨. మాంసలుఁడు, కండబలుపు కలవాఁడు.

నిర్దిశత్. సం. శత్ర. నిర్దేశించుచున్న.

నిర్దిశ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్దేశింపఁబడుచున్నది.

నిర్దిష్టము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చూపఁబడినది. ౨. ఏర్పాటు చేయఁబడినది. ("నిర్దిష్టాం కులపతినా స పర్ణశాలా మధ్యాస్య." సం. రఘు. ౧.౯౫.) ౩. ఆజ్ఞాపింపఁబడినది. ౪. ఉపదేశింపఁబడినది. ౫. కథితము, నిర్ణయపూర్వకముగా చెప్పఁబడినది, నిరూపింపఁబడినది.

నిర్దిష్టి. సం. వి. ఇ. స్త్రీ. నిర్దేశించుట.

నిర్దేశకుఁడు. సం. విణ. (అ. ఇకా. అ.) నిర్దేశించువాఁడు.

నిర్దేశనము. సం. వి. అ. న. నిర్దేశించుట.

నిర్దేశనీయము. సం= నిర్దేష్టవ్యము.

నిర్దేశము. సం. వి. అ. పుం. ౧. చూపుట ౨. ఆజ్ఞ, పనుపు. ౩. ఉపదేశము. ౪. కథనము, నిర్ణయపూర్వకముగా చెప్పుట. ౫. ఏర్పాటు. ౬. నిశ్చయము. ౭. ప్రతిపాదకశబ్దము. ౮. ఉపాంతము,దాపు. ౯. భేతనము,జీతము. ("కాల మేవం ప్రతీక్షేత నిర్దేశం భృతకో యథా." వాచ.)

నిర్దేశి. సం. విణ. (న్. నీ. న్.) నిర్దేశించువాఁడు.

నిర్దేశించు. సం. స. క్రి. ౧. నిరూపించు,నిర్ణయపూర్వకముగా చెప్పు.

క. విను మజుఁడు శ్రద్ధ యతిపా,వని యది గల వాఁడు గౌరవశ్రేష్ఠుం డా,తనియన్నము భోజ్యతరం,బని నిర్దేశించె నెల్లయమరులు వినఁగన్. భార. శాం. ౫. ౨౮౮.

వ. అని నిర్దేశించి నీవు నిజేచ్ఛం బ్రవర్తింపుమని పలికి...భార. శాం. ౬. ౫౩౦.

వ. అయ్యాముందును సద్దురాత్ముల నుపలక్షించి గతి నిర్దేశించిన...మార్క. ౨. ౪౮.

౨. చూపు. ౩. ఆజ్ఞాపించు.

నిర్దేశ్యము. సం=నిర్దేష్టవ్యము.

నిర్దేష్ట. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నిర్దేశించువాఁడు.

నిర్దేష్టవ్యము.సం. విణ. (అ. ఆ. అ.) నిర్దేశింపఁదగినది.

నిర్దైన్యము. సం. విణ. (అ. ఆ. అ.) దైన్యము లేనిది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిర్దోషము. సం. విణ. (అ. ఆ. అ.) దోషము లేనిది.

నిర్ద్రోహుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ద్రోహము లేనివాఁడు.

నిర్ద్వంద్వుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ద్వంద్వములు లేనివాఁడు. (చూ. ద్వంద్వము.) ౨. శీతోష్ణములు సుఖదుఃఖములు మున్నగు ద్వంద్వములు లేనివాఁడు.

నిర్ధనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ధనములేనివాఁడు, దరిద్రుఁడు.

నిర్ధరించు. సం. స. క్రి. ౧. నిర్ధారణచేయు, నిశ్చయించు. కాశీ. ౫. ౮. (శ. ర.)

నిర్ధర్మము. సం. విణ. (అ. ఆ. అ.) ధర్మము లేనిది.

నిర్ధారకుఁడు. సం. విణ. (అ. రికా. అ.) నిర్ధారణ చేయువాఁడు.

నిర్ధారణ. సం. వి.ఆ. స్త్రీ=నిర్ధారణము.

నిర్ధారణము. సం. వి. అ. న. ౧. నిశ్చయము. ౨. నిర్ణయించుట, నిష్కర్షించుట, తీర్చుట. ౩. (జాతిగుణక్రియాసంజ్ఞల ననుసరించి) సముదాయమునుండి ఒకదానిని వేఱుచేయుట.

నిర్ధారణీయము. సం=నిర్ధార్యము.

నిర్ధారము. సం. వి. అ. పుం=నిర్ధారణము.

నిర్ధారయత్. సం.శత్ర. నిర్ధారణ చేయుచున్న.

నిర్ధారయమాణము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్ధారణ చేయుచున్నది.

నిర్ధారయితృ. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నిర్ధారణ చేయువాఁడు.

నిర్ధారయితవ్యము. సం=నిర్ధార్యము.

నిర్ధారి. సం. విణ. (న్.ణీ.న్.) నిర్ధారణ చేయువాఁడు.

నిర్ధారించు. సం. స. క్రి. నిశ్చయించు.

శా. ఈరీతిన్ వెనువెంట దేవళుని రా నిచ్ఛాగతిం
బోయి నీ, హారత్నోణిధరంబుచేరువల మే
యన్ గోగణంబున్ కుప, ర్వారాతుల్ గని
చెప్ప భార్గవుఁడు కార్యం బాత్మ నూహించి
ని, ర్ధారించెన్ బలమర్దనాధ్వరపశుగ్రాహం బ
వశ్యంబు గాన్. వరాహ. ౫. ౭౪.

నిర్ధారితము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్ధారణ చేయఁబడినది, నిర్ధారింపఁబడినది.

నిర్ధార్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్ధారణ చేయఁబడినది.

నిర్ధార్యము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్ధారింపఁదగినది, నిర్ధారణ చేయఁదగినది, నిశ్చయింపఁదగినది.

నిర్ధూతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నిరస్తము, విడుల్పఁబడినది. ౨. త్రోసివేయఁబడినది. ౩. తొలఁగింపఁబడినది. ౪. త్యక్తము, విడువఁబడినది. ౫. ఖండింపఁబడినది, నిరాకరింపఁబడినది. (వాదము మొ.)

నిర్ధూమము. సం. విణ. (అ. ఆ. అ.) ధూమము లేనిది.

నిర్ధౌతము. సం. విణ. (అ. ఆ. అ. ) ౧. బాగుగా కడుగఁబడినది. ౨. శుభ్రముగా చేయఁబడినది.

నిర్నాభి. సం. విణ. (ఇ) ౧. బొడ్డు లేనిది. ౨. నాభిని అతిక్రమించినది, బొడ్డుక్రిందికి దిగినది.

శ్లో. నిర్నాభి కౌశేయ ముపాత్తబాణ మభ్యంగ
నేపథ్య మలంచకార. సం.కు. సం. ౭. ౭.

నిర్నిమిత్తము. సం. విణ. (అ. ఆ. అ.) నిమిత్తము లేనిది, అకారణము.

నిర్నిమేషము. సం. విణ. (అ. ఆ. అ.) నిమేషము లేనిది, ఱెప్పపాటు లేనిది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిర్బంధ. సం. విణ. (బు, ద్రీ.బు.) నిర్బంధించువాఁడు.

నిర్బంధకుఁడు. సం. విణ. (అ.ధికా.అ.) నిర్బంధించువాఁడు.

నిర్బంధనీయము. సం. విణ. (అ.ఆ.అ.) నిర్బంధింపఁదగినది.

నిర్బంధము. సం. వి. అ. పుం. ౧. బలాత్కారము. ౨. ఆగ్రహము, పట్టుదల. ౩. గట్టిగా బంధించుట.

నిర్బంధి. సం. విణ. (న్. నీ. న్.) నిర్బంధించువాఁడు.

నిర్బంధించు. సం. స. క్రి. ౧. గట్టిగా బంధించు, మెదలకుండఁగా చేయు.

శా. భూలోకంబున దుష్టశాత్రవచయంబుం జంపి ధర్మజ్ఞులకా, బాలింపంగ జనించినాఁడవు మహీభారావతీర్ణక్రియాశీలత్వంబు వహించి నీ విపుడు లక్ష్మీనాధ యీపాముతోఁ, బాలక్రీడలు సల్ప నేమిటికి నిర్బంధించి మర్దింపవే. వి.పు.౪. ౧౪౮.

౨. బలాత్కరించు.

నిర్బంధ్యము. సం= నిర్బంధనీయము.

నిర్బద్ధము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. నిర్బంధింపఁబడినది. ౨. బలాత్కరింపఁబడినది.

నిర్బధ్నత్. సం. శత్ర. నిర్బంధించుచున్న.

నిర్బధ్యమానము. సం. విణ. (అ.ఆ.అ.) నిర్బంధింపఁబడుచున్నది.

నిర్బర్హణము. సం. వి. అ. న. నిబర్హణము, చంపుట.

నిర్బలము. సం. విణ. (అ.ఆ.అ.) బలము లేనిది.

నిర్బాధము. సం. విణ. (అ.ఆ.అ.)-బాధ లేనిది- ౧. అప్రతిబంధము, అడ్డు లేనిది. ౨. ఉపద్రవము లేనిది, పోవడి లేనిది. ౩.వివిక్తము, జనసమ్మర్దము లేనిది.

నిర్బీజ. సం. వి. ఆ. స్త్రీ. లఘుద్రాక్ష,కిసిమిసి.

నిర్బీజము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. విత్తనము లేనిది. ౨. కారణము లేనిది. వి.అ.పుం.సమాధిభేదము.

నిర్భక్తము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. అన్నము లేనిది. ౨. ఆహారము లేకుండ పుచ్చుకొనఁబడినది. (మందు.)

నిర్భగ్నము. సం. విణ. (అ. ఆ.అ.) ౧. విఱువఁబడినది, తునియలు చేయఁబడినది. ౨. వంపఁబడినది.

నిర్భటము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దృఢము, గట్టిది. ౨. భటులు లేనిది.

నిర్భయము. సం. విణ. (అ.ఆ.అ.) ౧.భయము నుండి తొలఁగినది, జంకు లేనిది. ౨. అపాయము నుండి తొలఁగినది, అపాయము లేనిది, సేమము కలది. వి. అ. న. భయాభావము, భయము లేమి.

ఉ. ఇందుల కిమ్మెయిక మనుజు లెన్నఁడు వత్తురె వచ్చిరేని యానందముఁ బొంది నిర్భయమునక శయనింతురె...భార. ఆది. ౬. ౧౨౩.

ద్వి. నావుడు విని సీత నరనాధుఁ జూచి, నీవుండఁగా నాకు నిర్భయం బధిప. రం.రా. అయో. ౧౦౪ పొ. ౨౩ పం.

నిర్భరము. సం. విణ. (అ. ఆ. అ.) - మిక్కిలి భారము కలది-౧.అతిమాత్రమైనది, అధికము. ౨. తీవ్రమైనది.(అతపాది.)౩. గాఢమైనది. (నిద్ర, ఆలింగనము మొ.) ౪. (సమాసాంతము నందు) పూర్ణమైనది, నిండినది. (ఆనందనిర్భరుఁడు మొ.) ౫. భారము లేనిది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. నీవలనన్ మహోత్త విను నిర్భరచిత్తుఁడ నై తి...భార. అశ్వ. ౧. ౧౪౬.

వి. అ. న. ౧. అతిశయము, ఆధిక్యము. ౨. భారములేమి.

క్రి. విణ. ౧. మిక్కుటముగా, అధికముగా. (శ. ర.) ౨. గాఢముగా.

నిర్భరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వేతనములేని వాఁడు. (భృత్యుఁడు మొ.)

నిర్భర్త్సకుఁడు. సం. విణ. (అ. త్సికా. అ.) నిర్భర్త్సించువాఁడు.

నిర్భర్త్సన. సం. వి. ఆ. స్త్రీ.=నిర్భర్త్సనము.

నిర్భర్త్సనము. సం. వి. అ.న. ౧. బెదరించుట, బెదరింపు. ౨. అభిభవము, తిరస్కారము. ౩. అలక్తము, లత్తుక. (కే. ని.)

నిర్భర్త్సనీయము. సం. విణ. (అ.ఆ.అ.) నిర్భర్త్సింపఁదగినది.

నిర్భర్త్స్యమానుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) నిర్భర్త్సించుచున్నవాఁడు.

నిర్భర్త్సయితృ. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నిర్భర్త్సించువాఁడు.

నిర్భర్త్సయితవ్యము. సం=నిర్భర్త్సనీయము.

నిర్భర్త్సి౯. సం. విణ. (న్. ణీ. న్.) నిర్భర్త్సించువాఁడు.

నిర్భర్త్సించు. సం. స. క్రి. ౧. అభిభవించు, తిరస్కరించు. ౨. అదలించు, బెదరించు.

వ...అనూయాకుటిలం బగు కటాక్షవీక్షణంబు నం దర్శించె నిట్లు నిర్భర్త్సింపఁబడి వైదర్భిం జూచి ... శుద్ధాంతచారిణి మహీకాంతుని తో నిట్లనియె. నైష. ౭. ౬౨.

నిర్భర్త్సితుఁడు. సం.విణ. (అ.ఆ.అ.) ౧. నిర్భర్త్సింపఁబడినవాఁడు, బెదరింపఁ బడినవాడు. ౨. అభిభూతుఁడు, తిరస్కరింపఁబడినవాఁడు.

నిర్భర్త్స్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్బంధింపఁబడుచున్నది.

నిర్భర్త్స్యము. సం=నిర్భర్త్సనీయము.

నిర్భాగ్యుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) భాగ్యము లేనివాఁడు, అదృష్టహీనుఁడు.

నిర్భిన్నము. సం. విణ. (అ. ఆ. అ.)- మిక్కిలి భేదింపఁబడినది-౧. పగులఁగొట్టఁబడినది;చీల్పఁబడినది. ౨. నాటఁబడినది. (ఆ. ని.)

నిర్భుగ్నము. సం. విణ. (అ.ఆ. అ.) ౧. వంకరైనది; వికృతాకారము కలది. ౨. వంకరకానిది, సరళము, తిన్ననిది. ౩.ఒకటితో నొకటి రాచుకొనునది.

శ్లో.ఏకీకృతత్వచి నిషిక్త ఇవావపీడ్య నిర్భుగ్నపీనకుచకుట్మలయానయా మే. మాలతీ.౬. ౧౨.

నిర్భృతి. సం.విణ. (ఇ) భృతి లేనివాఁడు, కూలి లేనివాఁడు.

నిర్భేదకుఁడు. సం. విణ. (అ. దికా. అ.) నిర్భేదించువాఁడు. (నిర్భేదనీయము మొ. భేదనీయము మొ. వానివలె గ్రహించునది.)

నిర్భేదము. సం. వి. అ. పుం. ౧. భేదించుట, చీల్చుట. ౨. చీలిక. ౩. (అభిప్రాయము,రహస్యము మొ.) బయలుపఱచుట, వెలువరించుట; ఉద్ఘాటించుట.

నిర్భేదించు. సం.స. క్రి. బ్రద్దలుచేయు,చీల్చు.

వ. ఈక్షణంబున నిన్ను నిర్భేదించి నీగర్భంబున నున్నయతలవితలాదిసప్తపాతాళలోకంబులు చీకాకుగావించి...ఉ.రా.౭.౧౧౨.

నిర్భేద్యము. సం. విణ. (అ. ఆ. అ.) భేదింపరానిది, చీల్ప రానిది.

నిర్మంథకుఁడు. సం. విణ. (అ. థికా. అ.) మథించువాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిర్మంథనము. సం. వి. అ. న. ౧. మథించుట, త్రచ్చుట. ౨. అరణి, త్రచ్చి నిప్పుపుట్టించు కఱ్ఱ. ౩. హింసనము, ధ్వంసము.

నిర్మంథనీయము. సం. విణ. (అ.ఆ.అ.) మథింపఁ దగినది.

నిర్మంథము. సం=నిర్మంథనము.

నిర్మంథ్యము. సం. విణ. (అ. ఆ. అ.) మథింపఁదగినది, త్రచ్చఁదగినది. వి. అ. న. అరణి, మథించి నిప్పు పుట్టించుకఱ్ఱ.

నిర్మక్షికము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. మక్షికలు లేనిది, ఈఁగలు లేనిది. ౨. నిర్జనము. (చోటు.) అవ్య. అ. న. మక్షికాభావము, ఈఁగలులేమి; జనములేమి.

వ. కృతం భవతేదానీం నిర్మక్షికమ్... శాకుం. ౨.

నిర్మత్సరము. సం. విణ. (అ. ఆ. అ.) మత్సరము లేనిది.

నిర్మథనము. సం=నిర్మంథనము.

నిర్మథము. సం. వి. అ. పుం=నిర్మంథనము.

నిర్మదము. సం. విణ. (అ. ఆ. అ.) మదము లేనిది.అవ్య.అ.న. మదాభావము, మదములేమి.

నిర్మనుష్యము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్జనము, మనుష్యులులేనిది.(ఇట్లే: నిర్మనుజము మొ.)

నిర్మముఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మమకారము లేనివాఁడు, నాది అనెడిఅభిమానము లేనివాఁడు.

నిర్మర్యాదము. సం. విణ. (అ. ఆ. అ.) మర్యాద లేనిది. అవ్య. అ. న. మర్యాదలేమి.

నిర్మలము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. మలికి లేనిది, శుద్ధము, శుభ్రము. ౨. తెల్లనిది. ౩. పాపము లేనిది. వి. అ. న. ౧. అభ్రకము. ౨. నిర్మాల్యము.

నిర్మలోపలము. సం. వి. అ. పుం. ౧. తెల్లని రాయి. ౨. స్ఫటికమణి.

నిర్మాంసము. సం. విణ. (అ. ఆ. అ.) మాంసము లేనిది; కండ లేనిది.

నిర్మాణము. సం. వి. అ. న. ౧. సృజించుట, సృష్టి. ౨. చేయుట. ౩. (గ్రంథాదుల) రచన. ౪. నిర్మించుటకు సాధనము. ౫.పన్నిక, కూర్పు. ౬. రూపము, ఆకృతి. ౭. గ్రంథము, కృతి. ౮. సారము. ౯. యోగ్యత, ఔచితి.

నిర్మాత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నిర్మించువాఁడు.

నిర్మాతవ్యము. సం. విణ. (అ.ఆ.అ.) నిర్మింపఁదగినది.

నిర్మానుషము. సం. విణ.(అ. ఆ. అ.)నిర్జనము, మనుష్యులు లేనిది. అవ్య. అ. న. మనుష్యాభావము, మనుష్యులులేమి.

నిర్మాయకుఁడు. సం. విణ. (అ.యికా.అ.) ౧. నిర్మించువాఁడు. ౨. మాయ లేనివాఁడు.

నిర్మాయి. సం.విణ. (న్.నీ.న్.) నిర్మించువాఁడు.

నిర్మార్జనము. సం. విణ. (అ. ఆ. అ.) మార్జనము లేనిది. వి. అ. న. క్షాళనము, కడుగుట; శుద్ధి చేయుట.

నిర్మాల్య. సం. వి. ఆ. స్త్రీ. పృక్క ?.

నిర్మాల్యము. సం.వి.అ.న. దేవతలను పూజించి పిమ్మట తీసివేసినపుష్పాదికము; ధరించి తీసివేసినపుష్పాదికము.

నిర్మించు. సం. స. క్రి. ౧. సృజించు.

(నారాయణుఁడు.)వ... చరాచరంబులఁ బురాతనసర్గంబులచందంబుననిర్మించి...వి.పు.౧.౭౧.

౨. చేయు. ౩. (గ్రంథాదులను) రచించు.

మ... ప్రబంధంబూని నిర్మించు చే, సరసత్వంబని ప్రాజ్ఞులార నిరసించం బోకుఁడీ ...

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. రా. పీఠి. ౧౪.

౪. (గృహాదులను) కట్టు.

వ...ఇట ధృతరాష్ట్రుండు దననిర్మింపం బంచిన సభ దుర్యోధనునకుం జూపి ... భార. సభా. ౨. ౧౩౪. భార. సభా. ౧. ౪.

నిర్మితము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మింపఁబడినది.

నిర్మితి. సం. వి. ఇ. స్త్రీ. నిర్మించుట.

నిర్మిత్సా. సం. వి. ఆ. స్త్రీ. నిర్మింప నిచ్ఛ.

నిర్మిత్సితము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మింప నిచ్ఛగింపఁబడినది.

నిర్మిత్సువు. సం.విశే. (ఉ) నిర్మింప నిచ్ఛగించువాఁడు.

నిర్మిమీషా. సం. వి. ఆ. స్త్రీ. నిర్మింప నిచ్ఛ.

నిర్ముక్తము. సం. వి. అ. పుం. కుబుసము విడిచిన పాము.

నిర్ముక్తి. సం. వి. ఇ. స్త్రీ. ముక్తి, బంధమునుండి విడివడుట.

నిర్ముక్తుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ౧. విడువఁబడినవాఁడు, విడిచిపెట్టఁబడినవాఁడు. ౨. సంసారాదిబంధవిముక్తి నొందినవాఁడు. వి. అ. పుం. సంగము విడిచినసన్న్యాసి.

నిర్మూలకుఁడు. సం. విశే. (అ. లిం. అ.) నిర్మూలించువాఁడు.

నిర్మూలనము. సం. వి. అ. న. ౧. ఉత్పాటనము, పెల్లగించుట. ౨. నాశముచేయుట.

నిర్మూలనీయము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మూలింపఁదగినది.

నిర్మూలపఱచు. మి. స. క్రి. నాశముచేయు.

గీ. పూల నేసినవాని నిర్మూలపఱచి, తూల నేసినవాని పేరాశ మైనఁ,లీలఁ గరుణించితివి దయాశీల నీవు, జాల నపరాధి నంచు నా కేల పెఱవ. నిరం. ౩. ౪౨.

నిర్మూలము. సం. విశే. (అ. ఆ. అ.) - మూలము లేనిది-౧. వేరు లేనిది. (చెట్టు.) ౨. ఆధారము లేనిది. (వచనము, నేరము మొ.) ౩. మూలము లేనిది, పూర్తిగా నశించినది. ౪. నిర్మూలము చేయునది, పూర్తిగా నశింపఁజేయునది.

నిర్మూలయత్. సం. శత్ర. నిర్మూలించుచున్న.

నిర్మూలయమానము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మూలించుచున్నది.

నిర్మూలయితృ. సం. విశే. (ఋ. త్రీ. ఋ.) నిర్మూలించువాఁడు.

నిర్మూలయితవ్యము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మూలింపఁదగినది.

నిర్మూలించు. సం. స. క్రి. -నిర్మూలముచేయు.- ౧. పెకలించు. ౨. ఊడఁబెఱుకు, ఊడఁదీయు.

క. ఏలింతు దివము సురలను, బాలింతు మహేంద్రదయువతిభాగ్యశ్రీలం,దూలింతు దానవులని, ర్మూలింతు రిపుప్రియాంగములభూషణముల్. భాగ. ౮. ౪౪౯.

౩. నాశనముచేయు.

వ...నీయందుఁ గలనిఖిలజంతువుల నిర్మూలించి ...ఈయేడులోకంబుల నీఱు కావించెద... ఉ. రా. ౮. ౧౧౨.

నిర్మూలితము సం. విశే. (అ. ఆ. అ.) నిర్మూలింపఁబడినది.

నిర్మూల్యమానము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మూలింపఁబడుచున్నది.

నిర్మూల్యము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. నిర్మూలింపఁదగినది. ౨. విలువ లేనిది.

నిర్మృష్టము. సం. విశే. (అ. ఆ. అ.) శుద్ధి చేయఁబడినది.

నిర్మేయము. సం=నిర్మాతవ్యము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిర్మోకము. సం. వి. అ. పుం. ౧. మోచనము, విడిచిపెట్టుట. ౨. పాముకుబుసము, కుబుసము. ౩. కవచము, ఉరశ్ఛదము. ౪. ఆకాశము. (మే. ని.)

నిర్మోక్షము. సం. వి. అ. పుం. నిశ్శేషమగు మోక్షము, సంపూర్ణవిముక్తి.

నిర్మోచనము. సం. వి. అ. న. ౧. నిశ్శేషముగా విడిచిపెట్టుట, పూర్ణవిముక్తి. ౨. పూర్తిగా విడిపించుట.

నిర్మోహుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మోహము లేనివాఁడు.

నిర్యంత్రణము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. యంత్రణ లేనిది; బాధ లేనిది. ౨. నిరర్గళము, అడ్డు లేనిది. ౩. ఉచ్ఛృంఖలము, బంధము లేనిది. వి. అ. న. నిష్పీడనము, పిడుచుట; నలఁచుట. అవ్య. అ. న. ౧. అడ్డులేమి. ౨. బంధములేమి, ఉచ్ఛృంఖలత. ౩. బాధలేమి.

నిర్యంత్రితము. సం. విణ. (అ. ఆ. అ.) అడ్డము లేనిదిగా చేయఁబడినది.

నిర్యత్నుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) యత్నము లేనివాఁడు, సోమరి.

నిర్యాణము. సం. వి. అ. న. ౧. నిస్సరణము, వెడలుట. ౨. ప్రాణవాయువు దేహమునుండి వెడలుట, మరణము. ౩. ముక్తి, మోక్షము. ౪. అధ్వనిర్గమము, పయనమగుట. ౫. గజాపాంగదేశము, ఏనుఁగుకడకన్ను. ౬. దామము, పశువులకాలికి కట్టుత్రాడు. (ఆ. ని.)

నిర్యాతకుఁడు. సం. విణ. (అ. తికా. అ.) ప్రేతవాహకుఁడు, పీనుఁగును మోచికొని పోవువాఁడు.

నిర్యాతనము. సం. వి. అ. న. ౧. ప్రతిదానము, మరల ఇచ్చుట; ఇచ్చినదానికి ప్రతిగా నిచ్చుట. ౨. ఈవి, దానము. ౩. ప్రతీకారము, చేసిన దానికి ప్రతిచేయుట. ౪. వైరశుద్ధి, పగతీర్చుకొనుట. ౫. మారణము, చంపుట. ౬. ఋణాదిశోధనము, అప్పు లోనగువానిని తీర్చుట. ౭. న్యాససమర్పణము, దాఁచఁబెట్టినసొమ్మును తిరిగి అప్పగించుట.

నిర్యాతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వెడలినది. ౨. గతించినది, చచ్చినది. వి. అ. న. ౧. వెడలుట. ౨. మరణము.

నిర్యాతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. నిస్సరణము, వెడలుట. ౨. ప్రయాణము. ౩. ప్రాణోత్క్రమణము, మరణము.

నిర్యాత్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. శోధనీయము, తీర్పఁదగినది. (ఋణాది.) ౨. ప్రతిదేయము, తిరుగ ఈయఁదగినది. (న్యాసాది.)

నిర్యాపణము. సం. వి. అ. న. తఱుమఁగొట్టుట, వెడలఁగొట్టుట.

నిర్యాముఁడు. సం. వి. అ. పుం. పోతవాహుఁడు, ఓడ నడపువాఁడు. (ఆ. ని.)

నిర్యాసము. సం. వి. అ. పుం. న. ౧. వృక్షాదిక్షీరము, మ్రానిబంక. ౨. కాఁచి దింపిన ద్రవము, కషాయము. ౩. ద్రవద్రవ్యము. (జలాది.)

నిర్యుక్తి. సం. విణ. (ఇ)=నిర్యుక్తికము. అవ్య. ఇ. న. ౧. కూడికలేమి. ౨. సంబంధములేమి. ౩. అర్హతలేమి, ఉచితముకామి.

నిర్యుక్తికము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. యుక్తి లేనిది, కూడిక లేనిది. ౨. పొసఁగనిది, న్యాయము లేనిది. ౩. తగనిది, అర్హము కానిది.

నిర్యూథము. సం. విణ. (అ. ఆ. అ.) గుంపునుండి వీడినది, కదుపును పాసినది.

నిర్యూషము. సం. వి. అ. పుం. నిర్యాసము, బంక.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిర్యూహము. సం. వి. అ. పుం. ౧. వెలుపలి ద్వారములు లోనగువానిమీఁద మదగజాకారముగా కట్టినశిఖరము. ౨. గోడనుండి వెలికి యేనుఁగుదంతమువలె నుండుమ్రానిచీల; చిలుకకొయ్య. ౩. గోడపైని కఱ్ఱతో కట్టినగువ్వగూఁడు. ౪. ఆపీడము, సిగబంతి. ౫. ద్వారము, వాకిలి. ౬. కషాయము, క్వాథము. ౭. నిర్యాసము, చెట్టుబంక.

నిర్లక్షణము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. శుభలక్షణములు లేనిది. ౨. ఏర్పడనిది, (లక్షణములచే) వేఱుపఱుపఁబడనిది. ౩. అముఖ్యము, ప్రధానము కానిది. ౪. కఱ లేనిది; డాగు పడనిది. ౫. పాండురపృష్ఠము, తెల్లనివీపు కలది. (వాచ.)

నిర్లజ్జుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సిగ్గు లేనివాఁడు.

మ. అని నీచేతఁ బరాజితుండ నయి నాయంగారపర్ణత్వ మింకను దాల్పక మది నంత నిర్లజ్జుఁడనే... భార. ఆది. ౭. ౪౯.

నిర్లజ్జుఁడు. సం=నిర్లజ్జుఁడు.

నిర్లింగము. సం. విణ. (అ. ఆ. అ.) గుఱుతు లేనిది, ఆనవాలు లేనిది.

నిర్లిప్తము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. లేపనరహితము, పూఁత లేనిది. ౨. నిస్సంగము, తగులు లేనిది.

నిర్లుంచనము. సం. వి. అ. న. ౧. ఒలుచుట, పొట్టు లోనగునవి తీయుట. ౨. త్రుంచుట.

నిర్లుంఠనము. సం. వి. అ. న. అపహరణము, ముచ్చిలించుట.

నిర్లూత. వి. జలజంతువిశేషము.

గీ. పెలుక నిర్లూత కోచు తాఁబేలు పిడుక, మొసలి శింశుమారము పెద్దమొసలి సీరు, పాప... హంస. ౪. ౧౭౬.

నిర్లేఖనము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. గోఁకుటకు సాధన మైనది. ౨. వ్రాయుటకు సాధన మైనది. (కలము మొ.) వి. అ. న. ౧. (ముఱికి లోనగువానిని) గోఁకుట. ౨. వ్రాయుట.

నిర్లేపము. సం=నిర్లిప్తము.

నిర్లోభుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) లోభము లేనివాఁడు, ఆశ లేనివాఁడు.

నిర్లోమము. సం. విణ. (న్. మ్నా, అ, న్. న్.) రోమములు లేనిది, బొచ్చు లేనిది.

నిర్ల్వయని. సం. వి. ఈ. స్త్రీ. -సర్పము దీనియందు లీనమై యుండును.- ౧. పాముకుబుసము. ౨. పుట్ట. (కల్ప.)

నిర్వక్తవ్యము. సం=నిర్వచనీయము.

నిర్వచనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. మాటాడనిది, మిన్నకుండునది. ౨. వచనము లేనిది, గద్యశూన్యము. (కావ్యము.) వి. అ. న. ౧. ఉచ్చరించుట. ౨. అవయవార్థమును చెప్పుట, అర్థవివరణముచేసి చెప్పుట. ౩. సామెత. ౪. ప్రసిద్ధి.

నిర్వచనీయము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్వచింపఁదగినది.

నిర్వచించు. సం. స. క్రి. నిర్వచనము చేసి చెప్పు, స్పష్టముగా చెప్పు.

గీ... భ్రూమధ్యమాస్థలంబు, వరణ సంసారదోషనివారణంబు, నాశి యింద్రియదోషవినాశనంబుఁ, జేయుచుండుట యిది నిర్వచింపఁ బడియె. కాశీ. ౨. ౧౧౯.

నిర్వణము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వనము నుండి వెలికి వచ్చినది; వనమునకు వెలుపల నున్నది. ౨. వనములు లేనిది; బయ లైనది.

నిర్వపణము. సం. వి. అ. న. ౧. పితృతర్పణము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విడఁచుట. ౨. దానము, ఈవి. ౩. యజ్ఞాదులందు దేవతలకు అన్నాదులను పంచుట. ౪. విత్తనములు చల్లుట.

నిర్వపని. సం. వి. ఈ. స్త్రీ. పాముకూసము. (ఆ. ని.)

నిర్వర్ణనము. సం. వి. అ. న. చూపు, ఆలోకనము; సూక్ష్మముగా పరికించుట.

నిర్వర్ణించు. సం.స. క్రి. ఆలోకించు, చూచు.
వ... పూర్ణచంద్రు దర్శించుకలశాంబుధి తెఱంగున సరోవరంబు నిర్వర్ణించుతఱి తునిమాడ్కి...నిరం. ౧. ౯౯.

నిర్వర్తకుఁడు. సం. విణ. (అ. ర్తికా. అ.) నిర్వర్తించువాఁడు, నెఱవేర్చువాఁడు.

నిర్వర్తనము. సం. వి. అ. న. నిష్పాదనము, నెఱవేర్చుట, సిద్ధింపఁజేయుట.

నిర్వర్తనీయము. సం=నిర్వర్తితవ్యము.

నిర్వర్తమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్వర్తించుచున్నది.

నిర్వర్తి. సం. విణ. (న్. నీ. న్.) నెఱవేర్చునది, నిర్వర్తించునది.

నిర్వర్తించు. సం. స. క్రి. ౧. నెఱవేర్చు, చేయు.
సీ... దేవపితృతిథిజ్ఞాతిమిత్రకార్యములు నిర్వర్తించుసువినయవంతులైన,తనయులఁ గన్నాఁడు...భార. శాం. ౬. ౫౪౭.
వ...దుర్యోధనుసందర్శనంబును నిర్వర్తించి... భార. ఉద్యో. ౧. ౨౩౦.
వ...నిఖిలకర్తకలాపంబు నిర్వర్తించి...మార్క. ౭. ౨౪. నిరం. ౧. ౯౯.
౨. సిద్ధముచేయు, ఒడఁగూర్చు.
వ. అని నిశ్చయించి యతనికి, నాహారసంఛాదనంబులు సమీచీనంబులుగా నిర్వర్తింపఁదగువారి నియోగించి... భార. శాం. ౩. ౪౯౩.

నిర్వర్తిత. సం. విణ. (బ. త్రి. బ.) నిర్వర్తించువాఁడు.

నిర్వర్తితము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్వర్తింపఁబడినది, నెఱవేర్పఁబడినది.

నిర్వర్తితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్వర్తింపఁదగినది.

నిర్వర్తిల్లు.సం. స. క్రి. నెఱవేఱు. (శ. ర.)

నిర్వర్త్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్వర్తింపఁబడుచున్నది.

నిర్వర్త్యము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్వర్తింపఁదగినది, ఒడఁగూర్పఁదగినది, నెఱవేర్పఁదగినది.

నిర్వహణము. సం. వి. అ. న. -నిర్వహించుట- ౧. నెఱవేర్చుట, ౨. జరుపుట, కొనసాగించుట. ౩. (నాటక.) ప్రస్తుతకథాసమాప్తిరూప మయిననాటకసంధి. (ఈయర్థమున ఆకారాంతస్త్రీలింగ మగు నని కొందఱు.)

నిర్వహణీయము. సం=నిర్వోఢవ్యము.

నిర్వహత్. సం. శత్రు. నిర్వహించుచున్న.

నిర్వహించు. సం. స. క్రి. ౧. నెఱవేఱుచు, పూర్తిచేయు.
వ...ధర్మదేవత...యాగవిశేషవిధానంబు వరప్రదానంబున నిర్వహించె...భార. శాం. ౫. ౩౬౨.
౨. అన్నాదులిడి పోషించు, భరించు.
చ. అడరఁగ ధర్మనందనుఁ డహర్పతిచేత వరంబు పేర్మితోఁ, బడసి మహీసురోత్తముల భవ్యులఁ బల్వుర నిర్వహించె నప్పుడు ద్రుపదాధిరాజసుత పొల్పుగ వండిన శాకమూలముల్, గడుఁచి నిష్టభోజనసుఖంబుకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దృప్తిఁ జేయుచుండఁగన్. భార. అర. ౧. ౪౪.

౩. నెఱపు, జరపు.

ఆ. వార్తయందె జగము వర్తిల్లుచున్నది, యది యు లేనినాఁడ యఖిలజనులు, నంధకార మగ్నులగుదురు గావున, వార్త నిర్వహింపవలయుఁ బతికి. భార. సభా. ౧. ౫౦.

౪. చేయు.

సీ. ప్రాణినుతులు సూత్రపఱచి లోకహితంబుగా నిర్వహించె నెవ్వానిబుద్ధి. వరాహ. ౧. ౯.

అ. క్రి. జీవించు, బ్రదుకు.

వ. నిన్నుం బాసి నిమిషంబయిన నిర్వహింపనేర మని ధర్మరాజెట్టకేనియు గరుడగమను గమనంబున కొడంబడియె నంత. భార. సభా. ౨. ౭౩.

గీ. కాన నిశ్శ్రీకమైననాకంబునందు, నిర్వహింపఁగలే నైతి నీరజాక్ష, కలిమి చాలనివారికి బలము గలదె. దశా. ౨. ౭౨.

ఉ. ప్రాఁకున నిద్రవోవ నరిమర్దనుపంపున వచ్చి ఘూకముల్, కాకముల వ్వధించె నిది కక్కసపుంబని నిర్వహించుటె, ట్లీకడ నీతికార్యపరు లిందఱుఁ బోలినభంగిఁ జెప్పఁడా, నాకిపుఁడంచు రాజడిగినన్... వేం. పంచ. ౩. ౧౧.

నిర్వహిల్లు. సం. అ. క్రి. ౧. జరుగు. ౨. నెఱవేఱు. (శ. ర.)

నిర్వాచ్యము. సం=నిర్వచనీయము.

నిర్వాణము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. శాంతము, ఆఱిపోయినది. (గర్వము, దీపము మొ.) ౨. శూన్యము, లేనిది. ౩. మృతము, చచ్చినది. ౪. నిశ్చలము, చలనము లేనిది. ౫. నీళ్ల మునిఁగినది. (ఏనుఁగు.) ౬. అస్తమించినది. (సూర్యాది.) వి. అ. న. ౧. అస్తమించుట. ౨. వినాశము, మరణము. ౩. శూన్యత్వము. ౪. అపవర్గము, మోక్షము. ౫. నిర్వృతి, ఆనందము. ౬. విశ్రాంతి, ఉడుకువ. ౭. సంగమము, కూడిక. ౮. గజమజ్జనము, ఏనుఁగు నీళ్లలో మునుఁగుట. ౯. విద్యోపదేశగ్రంథభేదము. (నిర్వాణతంత్రాది.) ౧౦. (నాభిదేశమందు జపింపఁదగిన) ప్రణవపుటితమాతృకాపుటిత మగు స్వాభీష్టమంత్రము.

నిర్వాణి. సం. విణ. (న్. ఈ. న్.) -నిర్వాణము కలవాఁడు- ౧. శాంతుఁడు.

ద్వి. బాపురే నిర్వాణి బాపురే తపసి. బస. పు. ౩. ౧౧౨౯ పం.

౨. ముక్తినొందినవాఁడు.

నిర్వాణుఁడు. సం. వి. అ. పుం. ౧. పనివాఁడు సేవకుఁడు. ౨. బరువు మోసెడివాఁడు. ౩. చరమాశ్రమమం దున్నవాఁడు, సన్న్యాసి. ౪. ముక్తినొందినవాఁడు.

నిర్వాతము. సం.విణ.(అ.ఆ.అ.) వాతము లేనిది, వాయువు లేనిది. (స్థలాది.) అవ్య. అ. న. వాతాభావము, గాలిలేమి.

నిర్వాదము. సం. విణ. (అ. ఆ. అ.) వాదము లేనిది. వి. అ. పుం. ౧. -నికృష్టవాదము- జనవాదము, నింద. ౨. -నిష్కృష్టవాదము- నిశ్చితవాదము. అవ్య. అ. న. వాదములేమి.

నిర్వాపకుఁడు. సం. విణ. (అ.పికా.అ.) నిర్వాపము చేయువాఁడు.

నిర్వాపణము. సం.వి.అ.న. ౧. దానము, ఈవి. ౨. తర్పణ మిచ్చుట. ౩. (దీపాదులను) ఆర్పుట. ౪. (విత్తనములను) చల్లుట, విత్తుట. ౫. ఉపశమింపఁ జేయుట, అడఁచుట. ౬. నాశము చేయుట. ౭. మారణము, చంపుట. ౮. చల్లఁబఱుచుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ...తస్యాః శరీరనిర్వాపణాయ. శాకుం. ౩.
౫. శిశిరోపచారద్రవ్యము, చలువచేయుటయందు లోనగునది.

నిర్వాపము. సం. వి. అ. పుం. ౧. దానము. ౨. తర్పణము ఇచ్చుట. ౩. (అగ్ని లోనగువానిని) ఆర్చుట, చల్లార్చుట.

నిర్వాపయితృ. సం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) ౧. ఆర్చునది, చల్లార్చునది. ౨. పోఁగొట్టునది.

నిర్వార్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నిర్ధార్యుఁడు, సత్త్వసంపత్తితో - సంపదాపదలందు వికారము నొందనిచిత్తముతో- పని చేయువాఁడు. ౨. అనివార్యుఁడు, అడ్డగింపరానివాఁడు.

నిర్వాసనము. సం. విణ. (అ. ఆ. అ.) వాసన లేనిది. వి. అ. న. ౧. నిస్సారణము, (ఊరు లోనగువానినుండి) వెళ్లఁగొట్టుట. ౨. మారణము, చంపుట. ౩. విసర్జనము, విడుచుట.

నిర్వాసము. సం.వి.అ.పుం. ప్రవాసము, ఇల్లు వెడలిపోవుట; పరదేశమున వసించుట. ౨. వెళ్లఁగొట్టుట. ౩. చంపుట.

నిర్వాసితము. సం. విణ. (అ.ఆ.అ.) వెళ్లఁగొట్టఁబడినది.

నిర్వాహకుఁడు. సం. విణ. (అ. హికా. అ.) నిర్వహించువాఁడు.

నిర్వాహము. సం. వి. అ. పుం. నిష్పాదనము, నెఱవేర్చుట, ఒనగూర్చుట.

నిర్వాహి. సం. విణ. (న్. నీ. న్.) ౧. నిర్వహించునది, నెఱవేర్చునది. ౨. వెలికిఁబుచ్చునది, వెలువరించునది. (చీము లోనగువానిని వెలికిఁ బుచ్చువ్రణము లోనగునది.)

నిర్వాహ్యము. సం=నిర్వోఢవ్యము.

నిర్వింధ్యా. సం. వి. ఆ. స్త్రీ. వింధ్యపర్వతము నుండి ప్రవహించునొకానొకనది.

శ్లో. నిర్వింధ్యాయాః పథి భవ రసాభ్యంతర స్సన్నిపత్య...మేఘ. ౧. ౨౮.

నిర్వికల్పము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వికల్పము లేనిది, పక్షాంతరము లేనిది. ౨. సంశయము లేనిది, నిస్సందేహము. ౩.(వేదాంత.) జ్ఞాతృజ్ఞేయాదివిభాగములు కాని విశేష్యవిశేషణతా సంబంధముకాని లేక అఖండమై యుండునది. (బ్రహ్మాత్మైకతాజ్ఞానము, సమాధి.) ౪.(న్యాయ.) ప్రకారతావిశేష్యతాశూన్యమై సంబంధావగాహి కాని అతీంద్రియజ్ఞానము. క్రి. విణ. నిస్సందేహముగా.

నిర్వికారము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వికారము లేనిది, మార్పు నొందనిది. ౨. కలఁగనిది, భయాదులచే కలఁతనొందనిది. (మనస్సు.) వి. అ. న. -పుట్టుట పెరుఁగుట లోనగుఆఱువికారములు లేనిది- బ్రహ్మము.

నిర్వికాసము. సం. విణ. (అ. ఆ. అ.) -వికాసము లేనిది-౧. వికసింపనిది, విరియనిది. (పూవు.) ౨. కాంతి లేనిది. (దీపము మొ.) ౩. సంతోషము లేనిది. (ముఖము మొ.)

నిర్విఘ్నము. సం. విణ. (అ. ఆ. అ.) విఘ్నము లేనిది, అడ్డు లేనిది. క్రి. విణ. విఘ్నము లేకుండఁగా, అడ్డు లేకుండఁగా.

నిర్విచారము. సం. విణ. (అ. ఆ. అ.) విచారము లేనిది, ఆలోచనము లేనిది. క్రి. విణ. విచారము లేకుండ, ముందువెనుకలు చూడకుండ.

నిర్విచికిత్సము. సం.విణ. (అ. ఆ. అ.) నిస్సందేహము, సందేహము లేనిది.

నిర్విచేష్టము. సం. విణ. (అ. ఆ. అ.) చేష్ట లుడిగినది, వ్యాపారము లేకుండునది. (శరీరము మొ.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిర్విణ్ణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) -నిర్వేదము పొందినవాఁడు- ౧. పూనినకార్యము నిష్ఫల మైన దని తెలిసికొని యనుతాపపడువాఁడు. ౨. ఖిన్నుఁడు; దుఃఖముచే కృశించినవాఁడు. ౩. తన్ను తాను తత్త్వజ్ఞానదుఃఖాదులచే హేయునిగా తలఁచుకొనువాఁడు. ౪. మిక్కిలి విరక్తుఁడు, మిక్కిలి వైరాగ్యము కలవాఁడు.

నిర్వితర్కము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వితర్కము లేనిది, ఆలోచనము లేనిది. ౨. (యోగ.) సమాధిభేదము.

నిర్వినోదము. సం. విణ. (అ. ఆ. అ.) వినోదము లేనిది, కాలయాపనోపాయ మైనక్రీడాదులు లేనిది.

నిర్విమర్శము. సం. విణ. (అ.ఆ.అ.) విమర్శము లేనిది, మంచిచెడ్డలు వివేచించుట లేనిది.

నిర్వివరము. సం. విణ. (అ. ఆ. అ.) -వివరము లేనిది- ౧. రంధ్రములు లేనిది. ౨. ఎడములేనిది, దట్టమైనది.

నిర్వివాదము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వాదము లేనిది; తగవు లేనిది. ౨. ఆక్షేపము లేనిది, సర్వసమ్మత మైనది.

నిర్వివేకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వివేకము లేనివాఁడు, గుణదోషము లరయుశక్తి లేనివాఁడు, మూఢుఁడు.

నిర్విశంకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) శంక లేనివాఁడు, జంకనివాఁడు, వెనుదీయనివాఁడు; సందేహము లేనివాఁడు.

నిర్విశేషము. సం. విణ. (అ. ఆ. అ.)-విశేషము-భేదము-లేనిది- ౧. భేదము చూపనిది. ౨. వేఱు కానిది, సమాన మైనది.
శ్లో. "ప్రవాతనీలోత్పలనిర్విశేషమ్" సం. కు. సం. ౧. ౪౬.
౩. విశేషము లేనిది, ఆధిక్యము లేనిది. ౪. అవయవములు లేనిది. అవ్య. అ.న. విశేషములేమి, భేదములేమి.

సిర్విష. సం. వి. ఆ. స్త్రీ. అతివసఁ.

నిర్విషము. సం. విణ. (అ.ఆ.అ.) విషము లేనిది. (పాము మొ.) అవ్య. అ. న. విషములేమి.
చ. అలయక యేన దేవయజనాధ్యయనవ్రత
పుణ్యకర్మముల్, సలుపుదునేని ... ఈప్ర
మద్వరకు నిర్విష మయ్యెడు నేఁడు మీద
యన్. భార. ఆది. ౧. ౧౪౫.

నిర్విషయము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. విషయము కానిది, గోచరము కానిది. ౨. విషయము-దేశము-లేనిది; దేశమునుండి తఱుమఁగొట్టఁబడినది. ౩. శబ్దాదివిషయసంగము లేనిది. (ఆత్మ.)

నిర్విష్టము. సం. విణ. (అ. ఆ. అ.) అనుభుక్తము, అనుభవింపఁబడినది. ౨. ప్రాప్తము, పొందఁబడినది. (కూలి మొ.) ౩. చొరఁబడినది, ప్రవేశించినది. (శ. ర.)

నిర్విష్టుఁడు. సం. వి. అ. పుం. కృతాగ్నిహోత్రుఁడు, అగ్నిహోత్రము చేసినవాఁడు.

నిర్వీర. సం. వి. ఆ. స్త్రీ. మగఁడును సంతానమును గతించినయాఁడుది.

నిర్వీరము. సం. విణ. (అ. ఆ. అ.) వీరులు లేనిది. (దేశము మొ.)

నిర్వీరుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) వీరుఁడు కానివాఁడు, పిఱికివాఁడు.

నిర్వీర్యము. సం. విణ. (అ. ఆ. అ.) -వీర్యము లేనిది- ౧. పుంస్త్వము లేనిది. ౨. పౌరుషము లేనిది.

నిర్వృతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. స్వస్థము, సుఖముగా నుండునది. ౨. నశించినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిర్వృతి. సం.వి.ఇ.స్త్రీ. ౧. స్వాస్థ్యము, సుఖముగా నుండుట. ౨. సుఖము. ౩. నాశము, మృత్యువు. ౪. మోక్షము.

శ్లో. ద్వారం నిర్వృతిసద్మనో విజయతే కృష్ణేతి వర్ణద్వయం. భామినీ. ౪. ౧౪.

నిర్వృత్తము. సం. విణ. (అ. ఆ. అ.) నెఱవేఱినది, సిద్ధించినది.

నిర్వృత్తి. సం. విణ. (ఇ) వృత్తి లేనివాఁడు' జీవికలేనివాఁడు. వి. ఇ. స్త్రీ. ౧. నెఱవేఱుట, సిద్ధి. ౨. మోక్షానందము. అవ్య. ఇ. న. వృత్తి లేమి, జీవికలేమి.

నిర్వేతనము. సం. విణ. (అ. ఆ. అ.) వేతనము లేనిది, జీతము లేనిది; గౌరవార్థమయినది. (ఉద్యోగము మొ.)

నిర్వేదము. సం.వి.అ.పుం. ౧. రోఁత. ౨. స్వావమానన, తన్నుతాను నిందిఁచుకొనుట. (ఇది ఒకానొకవ్యభిచారిభావము. తత్త్వజ్ఞానదుఃఖేర్ష్యాదులచే కలుగును.) ౩. పరమవైరాగ్యము.

నిర్వేదించు. సం. అ. క్రి. ౧. దుఃఖించు.

వ. కాశిరాజనురాజర్షికిం బుట్టి బెరుఁగుచుం గన్యాత్వమునఁ బెద్దకాలం బుండి తనదౌర్భాగ్యమునకు నిర్వేదించి పతిం గోరి పశుపతినుద్దేశించి...భార. ఆది. ౩. ౨౩౩.

వ. ఇవ్విధంబునఁ దల్లియుఁ దండ్రియుఁ దనకు హితోపదేశంబు చేసి తనసౌమనస్యసౌముఖ్యంబులతోఁ దగినప్రత్యుత్తరం బీయమి నిర్వేదించుట యెఱింగి. శివరా. ౨.౧౦౫.

౨. విసుగు,రోఁతపడు; విరక్తినొందు.

వ. తపోమహత్త్వంబున మాకు నాయువు గడుం బెద్దయైన నిర్వేదించి మనుష్యలోకంబున నుండ నొల్లక... అష్త్రియులతో వైరం బమర్చికొని తన్నిమిత్తంబున దేహంబులు విడిచితిమి...భార. ఆది. ౩. ౧౪౧.

వ. పుత్త్రుఁడు లేనివిభవంబు లన్నియు నేల యని నిర్వేదించి పత్నీద్వయసమేతుండై వనంబున కరిగి. భార. సభా. ౧. ౧౩౬.

నిర్వేదుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వేదాధికారము లేనివాఁడు. ౨. వేదప్రామాణ్యము లేనివాఁడు, నాస్తికుఁడు.

నిర్వేశము. సం. వి. అ. పుం. ౧. భోగము. ౨. (సుఖదుఃఖాదులను) అనుభవించుట. ౩. భృతి, కూలి; జీతము, వేతనము. ౪. మూర్ఛపోవుట, సొమ్మసిలుట. ౫. పెండ్లి. (కల్ప.)

నిర్వేష్టనము. సం. విణ. (అ. ఆ. అ.) వేష్టనము లేనిది. వి. అ. న. ౧. సూత్రవేష్టనశలిక, నూలుచుట్టెడిచిన్నకండె.

నిర్వైరము. సం. విణ. (అ. ఆ. అ.) వైరము లేనిది. అవ్య. అ. న. వైరములేమి.

నిర్వోఢ. సం. విణ. (ఋ. ఙీ. ఋ.) నిర్వహించువాఁడు.

నిర్వోఢవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్వహింపఁదగినది.

నిర్వ్యథనము. సం. వి. అ. న. ౧. అత్యంతవ్యథ,మిక్కిలినొప్పి. ౨. మిక్కిలిబాధించుట. ౩. ఛిద్రము,బెజ్జము. అవ్య. అ. న. వ్యథలేమి, బాధలేమి.

నిర్వ్యథము.సం. విణ. (అ. ఆ. అ.) ౧. వ్యథ లేనిది, బాధ లేనిది. ౨. చలనము లేనిది; శాంతమైనది. వి. అ. న. అత్యంతబాధ, మిక్కిలినొప్పి. అవ్య. అ. న. వ్యథలేమి, బాధలేమి.

నిర్వ్యపేక్షము. సం. విణ. (అ.ఆ.అ.) అపేక్ష లేనిది, కోరిక లేనిది.

నిర్వ్యళీకము. సం. విణ. (అ. ఆ. అ.) బాధ లేనిది, బాధింపనిది. ౨. అప్రియము కానిది. ౩. కపటము లేనిది, మాయ లేనిది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిర్వ్యాజము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. సహజము, స్వాభావికము. ౨. నిష్కపటము, మోసము లేనిది; శుద్ధము, నిర్దుష్టమైనది.

నిర్వ్యాపారము. సం. విణ. (అ. ఆ. అ.) వ్యాపారము లేనిది, పని లేనిది.

నిర్వ్యూఢము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. నెఱవేర్పఁబడినది, నిర్వహింపఁబడినది. ౨. సంపన్నము, సమృద్ధము. ౩. అప్రతిబంధము, అడ్డు లేనిది. ౪. త్యక్తము, విడువఁబడినది. (కల్ప.) ౫. యథేష్టవినియోగార్హము. (స్త్రీలకు పతిపుత్రధనములందు స్వత్వము నిర్వ్యూఢము కాదు; పురుషులకు నిర్వ్యూఢము.)

నిర్వ్యూఢి. సం. వి. ఇ. స్త్రీ. నిష్పత్తి; నెఱవేఱుట, సిద్ధి.

నిర్హరణము. సం. వి. అ. న. ౧. శవాదులకు తీసికొనిపోవుట. (శవనిర్హరణము.) ౨. నిస్సారణము, వెడలఁగొట్టుట. ౩. తొలఁగించుట, నివారించుట. ౪. రసాదులు పైకి తీయుట; శల్యాదులు పైకి లాగుట. ౫. నిశ్శేషముగా సంహరించుట, పూర్తిగా నాశముచేయుట.

నిర్హ్రాదము. సం. వి. అ. పుం. విష్ఠ విడుచుట, మల విసర్జనము.

నిర్హారకుఁడు. సం. విణ. (అ. రికా. అ.) నిర్హరణము చేయువాఁడు.

నిర్హారము. సం. వి. అ. పుం. ౧=నిర్హరణము. ౨. రహస్యముగా ధనాదులు కూడఁబెట్టుట. ౩. మలమూత్రాదులు విసర్జించుట.

నిర్హారి. సం. విణ. (న్. ణీ. న్.) ౧. నిర్హరణము చేయువాఁడు. ౨. దూరముగా వ్యాపించునట్టిది. (పరిమళాది.) ౩. మిక్కిలి మనోహరమైనది.

నిర్హ్రుతము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్హరణము చేయఁబడినది.

నిర్హ్రుతి. సం. వి. ఇ. స్త్రీ=నిర్హరణము.

నిర్హ్రాదము. సం. వి. అ. పుం. ధ్వని.

నిర్హ్రీకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సిగ్గు లేనివాఁడు; ధృష్టుఁడు, జంకనివాఁడు.

నిఱునిఱు. వి. నీల్గుటయందగుధ్వని కనుకరణము.

ద్వి. నిఱనిఱ నీల్గుచు నిక్కుచు వీపు, విఱిచికొను... పండితా. పురా. ౧౦౧ పా.

నిఱు. విణ. (క. నిఱు.) మిక్కిలి. (చూ. నిఱు పేద మొ.)

జ: నిప్పచ్చ, నిప్పచ్చరము, నిప్పస్తు, నిఱునీఁగు, నిఱుపేద, నిఱుప్రేమ.

నిఱునీఁగు. స. క్రి. (నిఱు + నీఁగు.) సంపూర్ణముగా పరిత్యజించు.

ఉ. నిన్నటినుండి యేము నిఱునీఁగియు నుఁటిమి నిట్టుపాసముల్. కాశీ. ౧. ౧౩౯. ('నిరునీఁగియు' ముద్రి. పా. 'నిరునింగియు' చి. ని. పా.)

నిఱుపే(ర్పే)ద. విణ. (నిఱు + పేద.) అతిదరిద్రుఁడు, కడుబీద.

క. నిఱుపేదయింటి కేటికిఁ, బఱతెంచు నిధానము... నైష. ౪. ౩౩.

మ...దయాబుద్ధిం బరాధీనవృత్తుల నిర్పేదల మమ్ముఁ గావఁదగు నీద్రోహంబు లేకుండఁ గఁ౯. నైష. ౩. ౭౯.

సీ. అప్రౌఢు ప్రాయి రాజనట్టినిర్పేదయు భోగించునైశ్వర్యము లెనిమిదియు. పాండు. ౧. ౧౦౧.

౨. అతికృశము, మిక్కిలి సన్ననిది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. ఘన మైనరారాపుచనుదోయిరాయిడి నిఱు
పేదనడిమికి వెఱపు చూప. కాశీ. ౧.౯౦.

గీ. అందియలు మ్రోయ మేనిసోయగపుఁదావి,
కళలు వెల్లిగ మ్రోఁగి ఝుమ్మని చెలంగ,
గురుపయోధరధమ్మిల్లభరముకతన, నడచువేళ
ల నిఱుపేదనడుము వడఁక. చిత్రభా. ౨.
౪౮.

గీ. నాకజలజాక్షినిఱుపేదనడుము బలిసి, యల్ల
నల్లన వళిసీమ నాక్రమించె. మనుచ. ౩.
౧౧౩.

నిఱుప్రేమ. వి.వి. (నిఱు + ప్రేమ.) పూర్ణమగు
ప్రేమ.

చ. కెలఁకుల నిట్టు వ్రాల నలకేలను మెల్లనఁ
బట్టి దువ్వి యా,నలినదళాక్షి పక్షి యను
నామము దీనికె చెల్లుఁ బిల్చియుం,బిలువక
మున్నె వచ్చె నిఱుప్రేమ దొలంకఁగ నింక
దీనిచేఁ, గలుగు నిజంబు గాఁ దనరుఁ గాంక్ష
లు దీఱ సుఖంబు చెందఁగన్. సారంగ.
౧. ౧౩౦.

నిఱ్ఱ(న)నీల్గు. అ. క్రి. (నిఱ్ఱు + నీల్గు.) గాత్ర
వినామముచేయు, ఒడలు విఱిచికొను. (నీల్గు +
నీల్గు-నిఱ్ఱనీల్గు=గర్వించు అని శ.ర.)

గీ. నీడుగాలికిఁ బసివట్టి నిఱ్ఱనీల్గి, పట్టెడల బిగఁ
బట్టిన మట్టువడక,నిలువ కేలెంచి వేఁట
కుక్కలు కుమార,చుట్టుక గునిసియాడంగఁ
జూడవేమి. కాశీ. ౩. ౪౫.

సీ. కనుఱెప్ప లెత్తి నిఱ్ఱనినీల్గి యూరుపు లా
విర్భవింపఁగా నావులించి.చెన్న.౪.౪౧౦.

నిఱ్ఱు. వి. నీల్గుట కనుకరణము. (చూ.నిఱ్ఱనీల్గు.)

నిలఁబడు=నిలువఁబడు. (√నిలుచు.)

క. ఇలు కాలి కూల నిట్టక,నిలిచిననిట్రాడు
వోలె నిజరథ మటులుం, బొలియ న్నిలఁబడి
రాకా, సుల కేఁడుండుటకు నగుచుఁ జూచి
రి వేల్పుల్. రామా. ౭. ౧౩౨.

నిలక. వి. (√నిలుచు.) నిలుపు. (చి.ని,శ.ర,బ్రౌ.)

నిలయనము. సం. వి. అ. న. ౧. నెలకొనుట,
గూండ్లు లోనగువానిలో ఉండుట. ౨. (పక్షు
లుమున్నగునవి) వ్రాలుట. ౩. కనుమూసిగంత
లు అను క్రీడావిశేషము. ౪. నిలయము, ఉనికి
పట్టు. ౫. లీనమగుట, అంతర్ధానమగుట.

నిలయము. సం. వి. అ. పుం. ౧. ఉనికిపట్టు,
వాసస్థానము. (మృగాదులగుహ, పక్ష్యాదుల
గూఁడు మొ.) ౨. గృహము, ఇల్లు. ౩. నిశ్శే
ష మగులయము, పూర్ణముగా నశించుట. ౪.
దాఁగుకొనుట, లీనమగుట. ౫. కనుమూసిగం
తలు అను క్రీడావిశేషము.

నిలింప. సం. వి. అ. స్త్రీ. ఆవు. (త్రి. ని.)

నిలింపుఁడు. సం. వి. అ. పుం. వేల్పు, దేవత.

నిలీనము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. నిశ్శేష
ముగా లీనమైనది, ౨. కరఁగినది. (బంగారు
మొ.) ౩. నశించినది. ౪. దాఁగియున్నది.

నిలుక(లు-)డ. వి.(√నిలుచు.) ౧. స్థితి, ఉనికి;
వాసస్థానము.

సీ. ఆకారములుఁ జూయ లంబరాభరణాదు లా
ప్పులు నిలుకడ లోకఁడు దప్ప. గీ. కుండ
సప్తరాత్రంబున నొనర వ్రాసి,తెచ్చి నెచ్చె
లిముందట విచ్చి చూపి. హరి. ఉ. ౪.
౧౧౪.

మ. నుకువుంజిల్కలకొల్కి ...నిల్కడ గా
వించె భవద్రసజ్ఞపయి నింకన్... కబ్బంబు
గావింపుమా. చం. రా. ౧. ౭౩.

వ. కావున నలుక నలఁకువలకు నిలుకడ యగుట
దాని విడువవలయు...యయా. ౩. ౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. ఉత్థానము, నిలువఁబడుట.

వ. పురారి...యొయ్యారంపునిలుకడ నిలిచి... హర. ౭. ౪౯.

గీ. మొలకసిగ్గులు వట్టికొందలును వలపు,చాటు నిలుకడ లలంతి వేసటలుఁ జూపు...కొమ్మ... శుక. ౨. ౪౩౩.

మ...అప్పరమాస్త్రంబు...శిరంబు లెల్లఁ దుని మెఱ ప్రౌఢి తదీయాంగ మ,చ్చెరువారం దనతొంటినిల్కడన నిల్చెం గొంతసే పద్ది విఱ. హరి. పూ. ౪. ౧౭౫.

౩. స్థిరత్వము, నిశ్చలత్వము.

క. మెలుపును గెంపును సుస్థితి, దలిరులయందేని లేదు తమ కుమవలనఁ, నిలుకడ యగు నని తత్పద,తలముల నెలసె ననఁ బాదతలములు వొల్చెఁ. కు. సం. ౩. ౨౧౫.

చ. గుఱుతుగ స్త్రీలకు న్మగలకుఁ మది నిల్కడ లెందు లేవు నీ,వెఱుఁగనినీతియుం గలదె... సారంగ. ౨. ౧౪. భార. అర. ౧. ౩౫౧.

౪. ధైర్యము.

గీ. దానవాధిపునిలుకడ దప్పినట్లు, పదసరోజ యుగము దొట్రుపడుచు నుండ. భా. రా. యు. ౧౭౬౪.

క...బలునిలుకడ,తటికొండ యమీనుఖాన తలఁ పులనెలనా. యయా. ౪. ౧.

ద్వి...వారలఁ గోరి రావించి, వారిరూపంబులు వారినిల్కడలు.రం.గా.బాల.౯పా. ౪ పం.

౫. సమాప్తి, ముగింపు.

సీ. అందంద కదిరెడుకొందలపాటుచేఁ దలఁ కుచు నునికికి నిలుకడయును. గీ. లేమి ... భార. విరా. ౨. ౩౧౫.

౬. అభినివేశము,పట్టుదల.

క. అలజడియ కాక నీ కీ,నిలుకడ నొకమేలు గలదె...హరి. పూ. ౪. ౧౦౬.

చ. అడరెడుచిచ్చుఁ జొచ్చుతఱి నాడటు నూరక చూచునాఁటినిల్కడయును గానఁ ద్రోచి చిరకాలము దాలిన బెట్టిదంబు నా,యెడఁ గని...ఉ. రా.౨. ౯౯.

౭. నాట్యస్థితివిశేషము.

చ. నిలిచిననిల్కడల్ల గణనీయము చూపిన చూపు లన్నియుం, దొలకరిమించులు... బహు. ౫. ౭౭.

మ. బళిరే మైసిరితీరు నిల్కడలు సేబాసు:.. చంద్రి. ౨. ౯౭.

విశ. స్థిరమైనది.

మ...సహజభ్రాజిష్ణుశౌర్యంబు ని,ల్కడభావంబున నుండుఁ గయ్యమునకుఁ గాల్దివ్వఁ డేపట్టునఁ. ఉ. రా. ౨. ౯.

**నిలుగు=నీలుగు.**

(ఒడలువిఱుచుకొను.)

క. బలదేవుమేను సోఁకిన,వెలిమిడిచే వేఁకి సఱిచి విటతాటముగా, నిలుగుటతో ములుగుటతో,నలమటతో నావులింత లంతంతకుఁ గాఁ. ఉ. హరి. ౬. ౭౭.

సీ. సవ్యాపసవ్యముల్ శరము లేయుటకు మాని నెఱఁకులు విఱుగంగ నిలుగువారు.వరాహ. ౧౧. ౧౨౬.

చ. నిలుగుచు నావులించుచు వనీవిహగోత్కర మెట్లు వల్కె నప్పలుకులె యట్లు లెత్తి విని పల్కెడు వింటివె కీరశారికల్. మనుచ. ౩. ౫౭.

(చచ్చు.)

చ...రోగముల మ్రంది గృహంబులయందు బంధు లేద్వ నిలుగుకట్టులు న్నరులె వారల తల్లులు తల్లులే మహిఁ. మార్క. ౩.౩౨.

క. నావృత్తాంత మెఱింగిన, యావిహగాగ్రణి జటాయు వటవి నిలిగెనే,మో విన్నవాఁడు కాఁ డట్టు, గావున నాయునికి నిచటఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గాఁడుత్థున్నండుఁ. చం. రా. ౭. ౪౬.

శ్లో... జటాయుషి గతాయుషి సం. చం. రా. సుం. ౨౨.

(గర్వించు.)

చ. జలరుహనేత్ర నన్నిపుడు సారెకు దూఱు చుఁ జేరి నిక్కుచుఁ, నిలుగుచు విఱ్ఱవీఁగు చును నిక్కము గాఁగను నాతఁ డేమియుఁ, దెలియఁడు సాదుబిడ్డఁ డని నేరుపుమాటలఁ దేలనాడి గా,దిలినుతు చేఁతఁ జక్కటులు దిద్దెద వెంతటినంగనాచి వే. సారంగ. ౩. ౫౫.

నిలుచు(ల్చు). = నిలుచుండు. అ. క్రి. ౧. ఉత్థితుఁడగు, నిలువఁబడు.

చ. కని యతిభక్తిపూర్వకముగా ధరఁ జాఁగి నమస్కరించి లేచి నిలిచి ఫాలభాగమునఁ జేతులు సేరిచి... విక్ర. ౨. ౨౨౧.

ఉ... పాండవమధ్యముఁ డొప్పి బద్ధతూ,ణీరుఁడు రంగమధ్యమున నిల్చె జనంబులు దన్నుఁ జూడఁగన్. భార. ఆది. ౬. ౧౬.

క. మును లచ్చెరు వంది కనుం,గొన శంభుఁడు నిల్చి వరముఁ గోరు మనుఁడు ... భార. ఉద్యో. ౪. ౩౬౬.

౨. ప్రతిష్ఠిత మగు. (శ. ర.) ౩. వర్తించు.

ఆ... అతనిపాల నండఱుఁ దగ,వైనపనుల నిలుచు టభిమతంబు. భార. విరా. ౧. ౬౪.

గీ... ధర్మంబు శూద్రులతలన నిలుచు,శాక్తబోధాదిదుర్మతశ్లాఘ లెసఁగు. హరి. ఉ. ౯. ౩౮. హార. ౬. ౬౮.

౪. నివసించు, కాఁపుర ముండు.

గీ. కాంచి యేలెడుజయసేనుఁ గాంచి యతఁడు, నన్ను మన్నింప నందుఁ గొన్నాళ్లు నిలిచి. విక్ర. ౫. ౧౬౯.

గీ. ఇప్పురంబునఁ గాఁపుండ కితర మైన,పురము

ముసం దేల నిల్చె నిర్జరవిభుఁడు. హర. ౭. ౧౭౭.

౫. కూర్చుండు.

ఉ... కాల్యసమంచితక్రియల్,దీటిచి పాండుపుత్రవసుదేవసుతుల్ ప్రమదంబు మోములం,దేఁగ వేడ్కతో నరుగుదెంచి సభాస్థలి నిల్చి రంతటన్. జై. భా. ౧. ౧౩౭.

ఉ. అందొక దివ్యరత్నశిఖరాగ్రతలంబున రాగమంజరీ,నందనుఁ డబ్జినీతటమునన్ సురభూజమునీడ నిల్చి లీ,లం దన నెమ్మనంబునఁ దలంచినమాత్ర నె పాత్రయందు నా,నందకరంబుగాఁ బొడమె నవ్యసుధామధురాన్నపానముల్. విక్ర. ౨. ౧౬.

౬. శేషించు, మిగులు.

గీ. ఇంట దొర్లెకుకుండలు నినుపకట్ల,మానిముంతలు నిలిచె నమ్మల్లపతికి,వార్ధికన్యాకటాక్షమవ్వలికిఁ జనిన. శుక. ౨. ౩౫౦.

ఉ... మహీసురు లపారసుదక్షిణ లంది తెప్పలం, దేలి యథేచ్ఛఁ గొం చరుగ నిల్చిన విత్తము వెక్కసంబుగా, మూలుగుచున్న దిప్పుడు... జై. భా. ౧. ౬౬. ఉ. హరి. ౧. ౧౧.

౭. ఆఁగు.

(క) మాను, ప్రకృతక్రియనుండి విరమించు; వచ్చుట మాను.

క. వీర లతిలలితమృదులా,కారలు గిరివిషమగహనగహ్వరముల రా,నేరరు గావున నిటచను,దేరక నిలువుండ యినియు దేవపథంబుల్. భార. ఆది. ౫. ౬౮.

చ. అనిశముఁ జెప్పఁ జెప్ప విని యాతఁ డెదన్ భయ మంది తాన నిల్చినఁ గడు మేలు... దశకు. ౩. ౭౧.

క... సురగాలి విసరె నిలుదక వెలుచన్. ఉ. హరి. ౨. ౨౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. వారలదెస మరలి చూచి మీ రింక నిలువుం డని పలికిన... భార. ఉద్యో. ౪. ౨.

(చ) వెడలుట మాను.

గీ. ఏఁగు నెడ దుర్నిమిత్తంబు లెన్నియేని, గని యు వినియు నిశ్శంకతఁ జనదు మనుచు, దొరలు నిల్పిన నిల్వక... విక్ర. ౩. ౪౩.

(ట) ఉండు.

గీ. అంధకారంబు నిలుచునే యర్కునెదుట. వి. పు. ౪. ౧౨౨.

వ...తత్ప్రదేశంబున నిలిచి వారలదెస మరలి చూచి...భార. ఉద్యో. ౪. ౨.

(త) అపలాయితుఁ డగు, పాఱిపోవక యుండు.

సీ. నిలునిలురా యింద్ర నేఁ డెందుఁ బోయెదు... దశా. ౨. ౪౨౪.

ఉ. వచ్చితి వింక నెందుఁ జనవచ్చు నొహో నిలు పారిజాతపా,టచ్చర... పారి. ౫. ౩.

౮. తాళు, ఓర్చు.

ఆ. అలిగి యాడుఁగఱచి యాఁకటి వెలుచన, నిలువలేక యసుర నింగిదాఁకఁ, బెరిఁగి...భార. ఆది. ౬. ౨౯౧.

ఆ. రాచకూఁతుమీఁద రాఁగంబు పుట్టుట, నాకుఁ జెప్పవైతి నీవు శాప,మిత్తు నమ్మృగాక్షి నీవు వరింపక, నిలువ లేవు మరుఁడు బలియుఁ డగుట.భార.శాం. ౧.౨౫౨.వి.పు.౨.౧౬.

౯. కలుగు,పుట్టు.

క. లోకేశ యిమ్మహీంద్రము, నీకృప నామీఁదఁ జాల నిలిచినకతనఁ, జేకొని దాఁపఁగ నెఱసిరి, నాకుఁ గలిగె నిట్లు కానినాఁ డోపుదునే. వి. పు. ౬. ౩౩౬.

గీ...దప్పికి నానీరు ద్రాగుటయును.

ఉ. గర్భము నిల్చి కుక్షియధికంబుగఁ గానఁగ వచ్చి...కవిక. ౧. ౪౫, ౪౬.

౧౦. పాముకొను, స్థిరముగానుండు.

క. కులరూపగుణద్రవ్యంబులు విక్రమవంతునందు భూవిదితము లై,నిలుచు నవిక్రమునకు నవి,గలిగియు లేనిక్రియ నప్రకాశంబు లగుఁ. భార. సభా. ౧. ౧౨౮.

ఆ. దివసము కాని యింక భువనంబునం దిట,పట్టి రాత్రి లేనియట్టు గాఁగఁ, జేసెనొక్కొ విధి విశేషించి నాకకా, నేఁడ దివసము సాఁగి నిలిచెనొక్కొ. భార. విరా. ౨. ౩౧౩.

గీ. నిశ్చయంబుగ మనసులో నిల్చె నేని,చాల దా మర్త్యు రక్షింప శంభుభక్తి. భీమ. ౫. ౧౪౩.

౧౧. తీఱు, పోవు.

గీ. నీరు గ్రోలిన దాహంబు నిలువ దేని,వాఁడు వేంచేయు నీరైదువాసరముల. జై. భా. ౮. ౧౦౧.

గీ. ఇన్ని నీళ్లైన వంటకం బించుకైనఁ,దొల్లి దానంబు చేయనిదుష్కృతమున, నిర్భరక్షుత్పిపాసలు నిలువ వనిన. వరాహ. ౧౨. ౬౬. నీలా. ౨. ౧౦౮.

౧౨. జీవించు, బ్రతుకు.

ఆ. నిద్ర లేక తమకు నిలుచునుపాయంబు, లొండు దక్క వెదకుచున్నవారు. భార. ఆది. ౬. ౨౩౮.

ఉ...యుగసంధుల నిల్చియుఁ గాలుచేతిబల్, త్రొక్కుల నమ్మనుప్రభృతులుం దుద రూపఱకుండ నేర్చిరే. ఆము. ౨. ౩౮.

ద్వి. అరగాల మున్ను గన్నఱపాదునకు,నెరయ నిచ్చినకర్త నిలిచెనే నేఁడు. పండితా. మహిమ. ౨౫౩ పా. వి. పు. ౩. ౧౭౯.

౧౩. (యుద్ధాదులయందు) నిలువఁబడు, వెనుదీయక యుండు.

ఉ. ఈవసుధాధినాథులజయించినయట్టిద కాదు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చక్కనై, పోవక నిల్వ నా కెదిరి ... భార. ఆది. ౪. ౨౦౪.

ద్వి. కల్ల లాడించినఁ గలదె పన్నిదము, నిక్క మింతయుఁ జాలి నిలిచెద నేను. ద్వి. హరిశ్చ. పూ. ౩౪౭ పం. నీలా. ౧. ౪౧.

౧౪. జీవముతో నుండు.

క. అన్నంబు నాయధీనం, బన్నము లేకున్న నిలుచునయ్య యొడళ్లు...హరి. పూ. ౧.౧౨౪.

మ. నిల దీయుంగము రంగనాథ వర మే నిన్వేఁడెదన్...వైజ. ౩. ౧౩౦.

౧౫. పొడుచు, ఉదయించు.

ద్వి. తఱుచు మెఱుంగులు తళతళ మనఁగ, నెత్తెఁ దూర్పుఁగొండపై నిలిచె నాదిత్యుఁ, డు...ద్వి. హరిశ్చ. పూ. ౫౫౪ పం.

౧౬. స్థితినొందు, వృద్ధినొందు.

సీ. స్థావరజంగమాత్మక మగుభౌతికం బెవ్వని చేఁ బుట్టు నెవ్వనికృప. గీ.నిలుచు నెవ్వని కినుకచే విలయ మొందు. పాండు. ౨. ౨౧౩.

౧౭. లగ్నమగు, సక్తమయి యుండు.

సీ. భూషామణివ్యాజమున నంగకంబుల జనుల చూపులు వినిశ్చలత నిలువ. నైష. ౫. ౭.

ఉ...ఈ, నెట్టికసీలపై మనసు నిల్చుట కేమన వచ్చు...ఆము. ౬. ౧౧౧.

౧౮. చెడకుండు, నశింపకుండు.

క. బలవంతులబలములు న,గ్గల మగుబల మెదురఁ గలుగఁగాఁ గీడ్వడు నే, కొలఁదులవారికి గర్వము, నిలుచు నె నయమార్గవృత్తి నిలిచిన భంగిన్. భార. ఉద్యో. ౩. ౩౦౩.

గీ. మృద్గృహము నిల్చు నెట్లుల్కు మృజ్జలాది, నట్లు భౌతికభోగాళి నాది భౌతి, కాంగములు నిల్చు భోగ మిం దాత్మ కెద్ది. ఆము. ౩. ౬౯.

౧౯. సమాహిత చిత్తుఁడగు; మాఱుచింత లేక యుండు.

క. అని యిష్టదేవతాప్రార్థనము సాదిసుకవివినుతమునుం గావించి నిలిచి పెల్లగునుల్లం, బునందు నే నొకపురాణముం జెప్పంగన్. జై. భా. ౧. ౭.

సీ. మనసు నిల్వమి నెమ్మి మాపుపై వయ్యాళి మన్నీఁడు తనుఁ జూచి మరలిపోవ. శుక. ౩. ౪౪౩.

౨౦. విశ్రమించు.

సీ. నిలనీనివంటువార్పుల నత్తమామలపోరును లేని కాఁపురము గలిగె. శుక. ౩. ౬౦౪.

సా: నిల్వ నీడ పట్టఁ గొమ్మ లేదు.

గీ. అధ్వగులు కోడిగములకై యూకు లెల్లఁ, ద్రెంచి శాఖావితానము లుద్రించివైవ, మోడుపడి యుండె నది నిల్వ నీడ పట్టఁ, గొమ్మ యును లేమి తనయందుఁ గుదురుకొనఁగ. శుక. ౩. ౪౩౯.

జ: నిలఁబడు, నిలక, నిలుకడ, నిలుచుండఁబెట్టు, నిలుచుండు, నిలుచుకొను, నిలుచూఱు, నిలుపు, నిలుపుకొను, నిలువు, నిల్చుండు, నిల్పు.

**నిలుచుండఁబెట్టు** స. క్రి. (√నిలుచే.) నిలువఁబెట్టు, ఉత్థితునిచేయు.

సీ. నిలుచుండఁబెట్టి యంగుళియూఁత నూపఁగాఁ బ్రీతిఁ దప్పడుగులు పెట్టిపెట్టి. హరి. పూ. ౫. ౧౯౦.

**నిలుచు(ల్చు)ండు**=నిలుచే. అ. క్రి. (నిలుచు + ఉండు. స్వార్థమున.) ఉత్థితుఁడగు, నిలువఁబడు.

గీ. అతఁడు పవడింప మును కౌరవాధినాథుఁ, డరిగి తలయంపి దెస నున్నతాసనమున, నుండెఁ బదపడి కాల్కడ నొద్ద కల్లఁ, జని వినమ్రుఁడై నిలుచుండె సవ్యసాచి. భార. ఉద్యో. ౧. ౬౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. ఈరీతిఁ దోఁచె నంతట, నైరావణదంతి నెక్కి యమరులతో జంభారి చనుదేర యాదవవీరులు నిలుచుండిరధికవిస్మయమతులై. ఉ. హరి. ౧. ౧౨౪. భీమ. ౨. ౫౨.

సీ...సాత్యకి కృతవర్మని వదనంబు గనుఁగొని మదమెలర్ప, నొద్ద నిల్చున్నప్రద్యుమ్నుచే సఱచుచు నవమాన మేర్పడునట్టిభంగిఁ, బెలుచ నవ్వి...భార. మౌ. ౪౨.

నిలుచుకొను=నిలుచు. (నిలుచు+కొను. స్వార్థమున. శ. ర.)

నిలుచూఱు. వి. (నిలువు+చూఱు.) నిలువుదోఁపు, భయముచే గాని భక్తిచే గాని దేహమందు ధరించువస్తువు లన్నియు దేవతాదుల కిచ్చుట.

ద్వి. నెమ్మదిఁ దనయేలునేలకుఁ దోడు, సొమ్ము లన్నియు నిలుచూఱగా నిచ్చి. ద్వి. హరిశ్చ. ఉ. ౪౧౧ పం.

నిలుపు(ల్పు). స. క్రి. (√నిలుచు.) ౧. నిలువఁబెట్టు.

క...కన్నియఁ దెచ్చి యతం డెదుట నిలిపి దీనికి నెనరై, మెచ్చు కను పెండ్లికొడుకును, నిచ్చలముగఁ దెల్పుము...నీలా. ౨. ౬.

౨. ప్రతిష్ఠించు, స్థాపించు.

క. రావించి తగవుమై సంభావింపక కాక నాఁడ పాండవు లలుకం, బో విడువక మిగులఁదురే, నీవచనంబులకుఁ బిలిచి నిలుపుము వారిన్. భార. ఉద్యో. ౨. ౨౦౬.

సీ. నిధులు సల్లిండ్లను నిలిపెఁ దోఁటలు సత్రములు చలివేందరల్ వెలయఁబెట్టె. హరి. పూ. ౧. ౧౯.

శా...కుబేరుండు లేఁడో సుత్రాముఁడు లేఁడో పద్మజుఁడు లేఁడో ధర్మపుంబ్రాపు లేదో సత్యంబును నిల్ప నింతన కడుం దుర్లభంగ నీ కేఁటికిన్. కళా. ౩. ౨౧౬.

౩. ఉంచు.

(క) పెట్టు.

గీ. కటకములు హస్తసరము లంగదము లంగుళీయకములును బాహునల్లికల వ్రేళ్ల, నిలిపి... ఆము. ౬. ౧౨౭.

క. ఇలుపరుసఁ జంద్రశేఖరు, నిలయంబున దీపకళిక నిలుపనివారిన్, దలఁ దెవ్వఁగ వ్రేయుండని, తలవరులం బంచె రాజు తనదేశమునన్. కాశీ. ౪. ౧౩౬.

గీ. అళికఫలంబుల పేర నామాక్షరములు, వరుసతో నిల్పె నన బొల్చు వానియందు. హర. ౩. ౫౮, (ఇట లిఖించె. నని భావము.) హర. ౩. ౬౫.

(చ) వసింపఁజేయు.

సీ. హరు లేడు నేడు కక్ష్యాతరంబులు గాఁగ నియమంబుమై నాజ్ఞ నిలుపువాఁడు. కాశీ. ౩. ౨౩౪.

క. అని చెప్పినఁ గలదు కలదు, నిను నట్ల వచించి యందు నిలిపితినని...కళా. ౨. ౧౬౮.

(ట) ధరించు, పెట్టుకొను.

(అన్నపూర్ణ.) సీ...కటిమీఁద వజ్రాలకమరు నిల్పి. కాశీ. ౮. ౧౪౮.

౪. ఆఁపు.

(క) మానుపు, ప్రకృతక్రియనుండి విరమింపఁజేయు.

సీ. క్రందుగా శేఁగినం గలఁగ కందఱఁ దీర్చి నిలిపి యమ్మొదలివానికి నె మగిడి. ఆము. ౩. ౬.

సీ. తనుఁ గల్పలతికఁ గాఁ దలఁచి ప్రాలెడుశాఖఁ గరము రత్నఫలాళి నెరపి నిలిపె. వసు. ౬. ౧౬.

గీ. ఏఁగునెడ దుర్నిమిత్తంబు లెన్నియేనిఁ, గనియు వినియు నిశ్శంకతఁ జనక మనుచు, దొరలు నిల్పిన నిల్వక దుర్నిమిత్తఫలము ముందటి కతిఁగికోవలయు ననుచు. విక్ర. ౩. ౮౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ... శ్లేషమురెయి మల్లికాళిరుతి చక్కఁగఁ
జేయక యుండ నిల్పు నా,యమ మఱునాఁ
టికిం గలుగ నాంతగళచ్ఛ్రితిగుంఫితాప్రు
వుల్. ఆము. ౫. ౧౫౦.

(చ) ఉంచు, పోకుండఁ జేయు.

క. అని యూరడిలఁగఁ బలుకుచు, మునినందను
నిల్పి మంత్రిముఖ్యులఁ బిలువం,బనిచి తదా
గమనస్థితి, వినిపించుచుఁ గార్యసరణి వెల
యుట కనియెన్. ఇందు. ౧. ౧౮౩.

శ్లో. ఏతావదుక్త్వా ప్రతియాతుకామం శిష్యం
మహర్షే ర్నృపతి ర్నిషిధ్య. సం. రఘు.
౫. ౧౮.

చ. పడమరవెట్ట నయ్యుడుకుఁబ్రాకిన మొల్లక
కూటిపేద లై, బడలిక నూడునచ్చిలువప్రగ్గ
ములన్ రవియాజ్ఞ మాటికిన్, ముడియిడఁ
బిచ్చగుఁటు రథము న్నిలుప న్బయనంబు
సాఁగమిన్, జడను వహించె నాఁగ దివసం
బులు దీర్ఘము లయ్యె నత్తటిన్. ఆము.
౨. ౪౯.

(ట) నిరోధించు, అడ్డగించు.

గీ. అడ్డగించెఁ దటాయించె నానె నాఁగె, నిలి
పె నరికట్టె ననఁగను వెలయుచుండు, వార
ణముఁ జేసె ననుటయు... ఆం. భా. ౩. ౧౨౦.

క. కలఁగిన సేనలఁ గాచెద, నిలిపెద నర్జునునిక
డఁక... భార. ద్రో. ౧. ౩౩.

క. అది యెఱిఁగి బాలికల ని,ల్పుద మని పఱ
తెంచి సచ్చెలులు రత్నవతీ,కదలికలు విన్న
వించిరి, మృదులోక్తుల మరులుగొన్న మెలఁ
తలతోడన్. వరాహ. ౩. ౧౨౮.

ఉ. ఆరమణీలలామ మది నంటినశోకభరంబు
నిల్పఁగా, నేరక... పారి. ౧. ౧౩౪.

౫. స్థిరముగఁజేయు, స్థిరపఱచు.

గీ. అలరువిలుదాల్పుతండ్రిపై వలపు నిలిపి.
నీలా. ౨. ౮౫.

శా. ఆరామాపణిమీఁది ప్రేమమున ని ట్లారా
మసీమాసరో,వారంబు ల్దిలకించి యందు
నతిదుర్వారంబులై మీఱుభృం,గారావం
బులచే నసంగరుజ వొంగారం గురంగాక్షి
శృం,గారాగారముఁ జేరి తాల్మి నిలుపంగా
రాక గారామునన్. వసు. ౩. ౮౩.

చ. పనివడి నాదుపంపునఁ బ్రభావతి భామిను
లరిఁ గొల్వఁ గుం,దనపుమెఱుంగుఁబల్లెర
మునన్ ఘనసారజదీపికావళుల్, గొని మను
భీముఁ గాంచి యనిలోఁ దనమంగళసూత్ర
మూడఁగా, నసువున నిల్పె నేసదయుఁ డాళి
నికిన్ జయమంగళం బనెన్. జై. భా. ౨. ౯౮.

౬. కలిగించు, పుట్టించు.

సీ. కాంచీపురోపాంతకంపాతరంగిణీ నాళీకవన
రాజి మేలుకనిపి, ద్రవిడసీమంతినీ స్తనమం
డలంబుల నవకంపుఁ జెమరుబిందువుల నిలిపి.
కాశీ. ౧. ౧౩౦.

మ... కంసఘ్న, స్తరుఁ డత్యుద్ధతిఁ బారిజాత
ధరణీజాతంబు గోవర్ధనో,ద్ధరణప్రస్తుత మైన
హస్తమున నుత్పాటించి లీలాగతిన్, గరుడ
స్కంధముమీఁద నిల్పి నిలిపెం గౌతూహ
లం బింతికిన్. పారి. ౪. ౫౩.

చ...త్,త్సతులకుఁ దొల్లి ధర్మవిధి సంతతి నిల్ప
రె భూసురోత్తముల్. భార. ఆది. ౪. ౨౨౫.

౭. లగ్నముచేయు, తగుల్కొనఁజేయు.

చ. అనుపమధర్మవేదివి మహాపురుషుండవు నీవు
వేదవా, క్యనియతి పాటిగా నిలిపి తాల్మి
భవ న్మతిచొ ప్పెఱుంగఁ గోరి నిరుపమంపుఁ
గేలుఁ బ్రసరించితి... హరి. పూ. ౨. ౮౬.

వ... భీమనందన యానరేంద్రబృందారకునియం
దు డెందంబు నిలుపుటయును ... నైష.
౧. ౬౯.

౮. స్వస్థపఱచు.

క. తదనంతరంబ మగుడం, త్రిదశాధిపకార్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మునకు ధృతి పాదుకొనక, మది నిలిపి
చెలులు దానుక, ముదిత మెలఁగెఁ దత్స
మీపమున వనకేళిక. కళా. ౩. ౧౪.
ఉ. పాడయినట్టిచిత్త మొకపాటున నిల్పఁగ
మాటిమాటి కస్త్రాడుచు నుండు ...హర.
౨. ౬౩. దశకు. ౫. ౩౬.
౯. నిశ్చలముగా చేసికొను, ఏకాగ్రముచేసికొను.
గీ. తండ్రి వినిపింతు వినుము చిత్తంబు నిలిపి.
దశా. ౪. ౧౫౪.
౧౦. నియమించు, నియోగించు.
వ... నలువు గలపులిందులఁ గొందఱ నిలిపి ...
మనుచ. ౪. ౩౭.
గీ.ఋత్విజులు గాఁగ ధౌమ్యాదిఋషుల నిలిపి.
పారి. ౫. ౭౦.
శా. తా బ్రహ్మాదుల మేర నిల్పియుఁ బ్రభు
త్వం బూఁదియుక్ ద్రోతు రేఁయీ బ్రక్కక
ద్విజుఁ జూడరయ్య ... ఆము. ౬. ౧౦౮.
౧౧. నెలకొల్పు, పాదుకొల్పు; పాఁతించు.
గీ. ఒక్కవాసుదేవుఁడ కాక యుర్వి మీఁద,
నెంద టిప్పుడు నిను వధియించి నాదు,పేరు
సుస్థిరగతి నెందుఁ బెంపు నొంద, నిలుపఁ
గలవాఁడ నొక్కింత నిలువు మిచట. హరి.
ఉ. ౧. ౧౬౧.
సీ.కట్టింప లేనైతిఁ గమలాకాసారంబు నిలుపంగ
లేనైతిఁ దులసివనము. కాశీ. ౩. ౭౧.
ఉ. నావుడు సత్యభామ నిజనాథున కిట్లను
నేల తామసం, బీనిబుధాధినాయకమహీరు
హము౦ బెకలించి లోకసంభావిత మైననీ
పలుకుఁబంతము సెల్ల మదీయగేహకే,ళీవన
వాటి నేడుక దలిర్పఁగ నిల్పుము జీవితేశ్వ
రా. పారి. ౪. ౧౧.
౧౨. నిర్మించు, కట్టించు; కట్టు.
సీ. ఆద్యంబు లైనదేవాలయంబులు ప్రాల నవని
నిరాశ మఠాళి నిలుపు. ఆము. ౪. ౪౩.

ఉ. అంబుజగర్భవంశమణి యై దయం బట్టువ
మెట్ట యగ్రహారంబుగ నిచ్చి యంద యు
డురాజశిఖామణికి స్మరున్నివాసం బెసగం
గ నిల్పి... నా. శా. ౧౦౬౧.
చ. గురుసవిధప్రదేశమునఁ గోమలకల్పకపుష్ప
ధూళిచే, ధరసుత బొమ్మరి ల్నిలిపి...వసు.
౩. ౩౦.
౧౩. కూర్చుండఁబెట్టు.
మ... మోదం బంది యానందసంధను వీవిం
చుచుఁ జెంగట న్నిలిపెఁ జింతారత్నపీఠం
బునక్. పారి. ౩. ౭౫.
క... మరుస్నాయముఁడు నిల్పె సుమనస్సా
యకు సరిగ ద్దిమీఁద సౌహార్దమునక. హర.
౩. ౪౦. కువల. ౫. ౯౧.
౧౪. కాపాడు.
క. నన్ను మును పీవు గాచితి, నిన్నుం జెఱ లేను
బాపి నిలిపితి నాకై, మున్ను గలకరుణ మ
ఱవక, మన్నింపుము...కేయూర.౪.౧౧౭.
సీ. నిలుపంగవలయును నెఱసు వాటిలకుండ
నాత్మధర్మస్వవర్ణాశ్రమముల. కాశీ. ౭.
౧౧౪.
౧౫. ఏర్పఱుచు.
ఉ.దేవరవంటిపుణ్యునిఁ గృతిప్రభుఁగా నిలుపం
గఁ గల్గుటం,బావన మైప్రసిద్ధిఁ గను మాకవి
తావిభవంబు దిక్కులక. వరాహ. ౧.౧౫.
సీ. అని ధర్మ్య మైనమర్యాద మానవులకుఁ ద
ద్దయు హితముగా ధర్మమూర్తి. ఆ. యబ్జభ
వసమానుఁ డగుశ్వేతకేతుండు, నిలిపె ...
భార. ఆది. ౫. ౭౫.
౧౬. చక్కఁబఱుచు, మంచిస్థితియం దుంచు.
మ. నిలుపన్వచ్చు స్వభావమూర్ఖుఁ డగువానిం
గొల్చి యత్యంతముక్, నిలుపన్వచ్చు విశేష
వేది యగువాని న్గొల్చి యెందేని జ్ఞానల
వాహంకృతి దుష్టుఁ డైనమనుజుక రంజింప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శక్యంబు గా, దల భాషాపతి కేనియుక్...
మల్ల. నీతి. ౩.

౧౭. చెడకుండఁజేయు.

సీ. బలువెల్లి కిల యెల్ల నిలిపినఘను నెంతనుడి
వెట్టె సతిదృగస్రుస్రవంతి. వసు. ౩. ౯౯.

౧౮. ప్రసరింపఁజేయు.

మ... గౌరిముఖాంభోజమునందు నిల్పె సరస
ప్రేమంబునం జూడ్కులన్. హర. ౩.౮౦.

వ...సహస్రాక్షుండు నిజచక్షుస్సహస్రంబుతన
ముఖంబున నిల్పి యూరకున్న నారదుఁ
డు...ఇట్లనియె. నైష. ౩. ౧౫.

౧౯. (చాపము.) పఱుచు.

ఉ. రాలినపండుటాకులు ధరం గనుపట్టెను దట్ట
మై మధు, శ్రీ లలనాధినాథునకుఁ జిత్రము
గా వనదేవతల్ హరిప్రవాలసమానవర్ణముల
రంజిలుపట్టుపటంబు జంబుఖానా లటు ని
ల్పిరో యన దినంబును సర్వవనాంతరంబు
లన్. ఇందు. ౨. ౩౬.

౨౦. నెఱవేర్చు, చెల్లించు.

క...అను వగుమగవాఁ, డీమాటకు నోడఁబడఁ
డ, కామినియెడ మాట నిల్పఁగాలే నైతిన్.
శుక. ౪. ౧౦.

విణ. అఁపు, ప్రతిబంధకము;కృశింపఁజేయునది.

చ. కుముదవనాళికిన్ బలుపు కోకములాటకు
నిల్పు...ఇందుకాంతములకు ద్రావకం బగు
చు దర్పకశాస్త్రనిరూపితౌషధ, క్రమములఁ
బంపువెన్నెలలు గాసె ధరాస్థలి మోహనం
బుగన్. కాళ. ౨. ౧౩౫. (ఇటు అపతర్ప
ణౌషధ మనియును భావము.)

వి. ౧. ఉత్థానము, నిలువఁబడుట.

గీ. ఒకఁడు కుంతానఁ బగవానియురము గ్రుమ్మ,
వెంటనే యాతఁ డీఁటెచే వ్రేల్ఁబొడువ, వాల
సె నిద్దరు నిల్చిననిలుపు కదన, కాళికై కావ
డించినకాను కననగ. కువల. ౨. ౧౩౬.

చ...ఉద్భ్రమిలత్ప్రసూనినయరదంబుపైఁ దనదు
నిల్పు యుగక్షయహేతుకేతువో, యనఁ జని
యెన్ సరత్నమకుటాంశులు ప్రజ్వలితాగ్ని
చాడ్పుగన్. హరి. ఉ. ౧౦. ౨౨.

మ...మందయానము లొయ్యారమునిల్పు నంగ
నలకున్ సర్వాంగశృంగారమై, యమరున్
శౌర్యము నై తగున్...మల్ల. శృం. ౩.

౨. స్థైర్యము, నిలుకడ.

గీ. బలము లిది యేమి నలుగడఁ బాఱఁజొచ్చెఁ,
గర్ణకృపముఖ్యు లేటికిఁ గలఁగి రేటు, మొగ
మువడి రేల నీవును మున్నువోలె, నిలువరిం
పఁగఁ దగియెడునిలుపు లేవ. భార. ద్రో.
౫. ౩౨౬.

చ. హరునకు నెద్ది పేర్మి దనుజారికి నెద్ది రమా
విభూతి భాస్కరునకు నెద్ది తేజము దిశా
పతిసంహతి కెద్ది నిల్పు చంద్రునకు నెద్ది
కాంతియుఁ జతుర్దశలోకవిభుత్వ మెద్ది నీ, కి
రవుగ నాకుమారుఁ డిల నిండొకయించుకనే
పు నిల్చినన్. కు. సం. ౧౦. ౪౨౫. నైష.
౨. ౮౬.

౩. బ్రతుకు, జీవనము.

క. ఇలఁ జిత్రము తారకుకర, తలసంగత మైన
ఘోరతరవారి సారన్, నిలు పగుఁ దనుఁ జొ
ర కడరినఁ, దలమునుక యగున్ విరోధితతి
కబ్జభవా. కు. సం. ౪. ౩౭౦.

౪. రక్షణము. (స్థైర్యము అని శ. ర.)

చ...క్రీడికి సారథిత్వముం, దలకొని నీ వనూన
శుభదం బగువర్తన మాచరింప నీ, నిలుపును
బార్థుచాలుటయు నేడు గదా భువనం బె
తింగెడున్. భార. ద్రో. ౨. ౩౫౫.

క. అనుచితశతము లొనర్చియుఁ, దనువులు ర
క్షించుకొనెరె దమశమతేజో, ధను లగుగా
ధిసుతాదులు, తనప్రాణమునిలుపుకన్న ధ
ర్మము గలదే. పాండు. ౪. ౧౬౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౫. ప్రాపు, ఆశ్రయము. (విణ. నిలుపునది అని శ.ర.)

క...నీరక్షణ వీని కెల్ల నిలు వై యుండఁగన్. భార. భీష్మ. ౨. ౨౬౬.

౬. స్థానము, చోటు.

గీ. కుజముకొనగొమ్మ డిగి క్రిందికొమ్మమీఁది, నిలుపు గైకొనుపులుఁగులరయెలుఁగు లెచ్చె. విక్ర. ౪. ౨౮.

నిలుపుమందు=వీర్యస్తంభనము చేయుమందు.

వ... మచ్చువీడెంబులును నిలుపుమందులకరాటంబులును... ప్రబంధ. ౮౭.

నిలుపుసేయు=ఆఁపు.

ద్వి. పయనమై యాత్రోవఁ బయనంబు నిలుపు, సేయక నలుని కాచెలిఁ గూర్చి తలఁపుఁ, ద్రోయక...ద్వి. నల. ౧. ౫౫౩.

నిలుపుకొను. స. క్రి. (√నిలుపు.) ౧. ఏర్పఱుచుకొను, నియమించుకొను.

వ...ఇట్లన్నియుం దమకు మహావేగుం డను నొకచక్కనిమఁడూకంబు రాజు గా నిలుపుకొని సుఖం బుండునంత...కేయూర. ౩. ౧౬.

ఆ. ప్రార్థనం బొనర్చి ప్రథమాగమాదుల, ధర్మవిధిఁ బురోహితత్వమునకు, నిలుపుకొనియె... కళా. ౬. ౧౮౦.

౨. నెలకొల్పుకొను, పాదుకొల్పుకొను.

క. తలఁగినధైర్యముఁ గ్రమ్మఱ,నిలుపుకొని దశాననుండు నిర్భయుఁ డగుచున్, బలిఁ దొడరఁగ వచ్చితి నని, పలికిన నప్పురుషవరుఁడు పకపక నగుచున్. ఉ. రా. ౪. ౧౩.

నిలుపో(ల్పో)పు=నిలువోపు. అ. క్రి. (నిలుపు+ఓపు.) సహించు; తాళు. (దీనికి వ్యతిరేకార్థమందును తుమున్నర్థమందును మాత్రమే ప్రయోగములు కనఁబడుచున్నవి.)

వ. ఇట్లు పాంచాలుబాణవృష్టికి నిలుపోపక కురుకుమారులు...భార. ఆది. ౬. ౮౫.

క. మే లాఁడివెట్టంగా, మేలా నిలుపోప లేఁజుమీ చల మేలా, మేలావరసుత తామస, మేలా రమియింపు మనుచు. మీఁదం బడినన్. సారంగ. ౨. ౯౪.

మ...ననుం బాటించి యొక్కింత నీ,నిడువాలుం గడగంటఁ జూడు మనుచున్ నిల్పోపమింబై చెఱం, గొడియం జేవిరిదమ్మి వేయుట కునై యుంకించి జంకించినన్. పారి. ౧. ౧౧౭. దశకు. ౫. ౨౩.

నిలువ(ల్వ.) వి. (√నిలువు.) ౧. నిలిచినవస్తువు, శేషము.

ఆ. వానివివర మెల్ల వర్గవు గాఁ గూర్చి, నెఱయఁ దెల్పులెక్క లెఱిఁగికొనుచు, వ్యయము పుచ్చి నిలువ వ్రాయించి కైకొంట, ప్రభువు కిదియ నీతివిభవ మండ్రు. ద్వా. ౧౧. ౯౫.

౨. ఋణము, అప్పు.

ద్వి. కొలిచినవారికిఁ గోరి జీతములు, నిలువ గాకుండ నిచ్చలు నొసంగుదు వె. రం. రా. అయో. ౧౩౭ పొ. ౨ పం.

ఉ. రాజధనంబునిల్వలు కరం బధికంబుగ మీఁద నుండఁ ద,ద్రాజని దేశవర్తుల కృథా దురహంకృతి నీడిపించు టా,హా జగతీస్థలిన్ మిగుల హాస్యము గాదె...పరమ. ౪. ౧౪౭.

నిలువంగి. వి. (నిలువు+అంగి.) పొడువైనచొక్కా.

క. నిలువంగి యోరమెలికల, తలపాగ... హంస. ౩. ౯౯.

నిలువ(ల్వ)ఁబట్టు. స. క్రి. (నిలువన్+పట్టు.) దాఁచు, రహస్యముగా నుంచు; ఉంచు.

ఉ. దివ్యఖగేంద్ర నమ్మవు మది న్నను నీయెడ నాకు విప్రలం,భవ్యవహారము న్నిలువఁబట్టఁగ నేమిఫలంబు...నైష. ౨. ౮౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. పతిని దనయాజ్ఞలో నిల్వఁబట్టుకాంత, దనరు స్వాధీనపతిక నా...సంధ. ౧. ౧౩౩.

నిలువ(ల్వ)ఁబడు. అ. క్రి. (నిలువన్ + పడు. స్వార్థమున.) ౧. ఉత్థితుఁడగు, నిలుచుండు.

గీ. సత్యవతికొడుక్కు కొడుకువిశాలమహిమ, దెలిసి యప్పర్వతముమీఁద నిలువఁబడియె. భార. శాం. ౭. ౩౩౫.

శా...మూర్ఛావశుం, డై నిల్వంబడి లోచనంబులర మూయం దోనచి త్రాంగదా,నూనుం డేను శరంబు లేయ నవియుం జూర్ణంబుగాఁ జేయుచుఁన్. జై. భా. ౪. ౧౪౩.

సీ. నడుముఁ బట్టుక నిల్వఁబడియుఁ గూర్చుండియుఁ దొంగి దోఁగియుఁ గొన్నిజంగ లరిగి. కాళ. ౩. ౧౯-౩. సీతారా. ౩. ౧౦౫.

౨. నిలిచిపోవు, ఆఁగిపోవు; నశించు.

చ. వలవదు పొం డనంగ నిలువంబడ కేపున నూర్యవర్మ య,బ్బలియునిమీఁదఁ గ్రూరశరపంక్తి నిగిడ్చెఁ ద్రుంచె...భార. అశ్వ. ౪. ౦.

(భీముఁడు కర్ణునితో నన్నమాటలు.) క. ఏమిర పసు లని యార్వవు, నీమాటలు నిలువఁబడియె నే పసరమ...భార. కర్ణ. ౩. ౨౨౧.

క. బహుకాలము నీతోడను, విహరించితి నిలువఁబడియె విషయసుఖైక, స్పృహ యిప్పుడు గడు ముదిసితి, నిహభోగము లింక నుడుగుటెంతయు నొప్పున్. మార్క. ౫. ౯౦.

గీ...అకటపితృపిండవిధులు,నిలువఁబడనోపు నిదిగడు వెగులు పుట్టె, నిట్లు గావుండఁ బ్రారంపవే కుమార, వరుని భార్యాపరిగ్రహపరుని గాను. మార్క. ౦. ౧౪౦.

౩. నిక్కు,నిక్కఁబొడుచు.

చ. వడఁకుచు రోమకోటి నిలువంబడి మేనులు దూలఁ గన్నులం,దుడుగక బాష్పముల్ వడియుచుండ... హరి. పూ. ౬. ౪౩.

నిలువనాడు. స. క్రి. (నిలువన్ + ఆడు.) స్థిరముగా పల్కు, దృఢముగా పలుకు.

గీ. ఇగఁడు చోరుఁడు గాఁ డని యెంత కైన,నిలువనాడంగ వచ్చు నీనీలవేణి,గోల యగుటయు నిక్కంబ యేల యిట్లు,వచ్చె వీరికి నీ యపవాద మిపుడు. విప్ర. ౫. ౩౯.

నిలువ(ల్వ)రము. విశ. (√నిలువు.) స్థిరము, యథార్థము.

క. నిలువర మయ్యెను మను నా,తలఁచినయదిమది విరాళిఁ దహతహపడి తా,నెలమిన్ బైకొన వచ్చెను, గలకంఠుల నమ్మ రాదుగా కలనైనన్. శకాం. ౩. ౫౬.

వి. మాంద్యము.

క. వరమా కరతల మిందీ,వరమా కనుదోయి హంసవరమా నడని,ల్వర మా చెలిఁ గన మరుదే,వరమాయగఁ దనరె లోకవరమా యనఁగన్. అహ. ౨. ౨౨.

నిలువ(ల్వ)రించు. స. క్రి. (√నిలువరము.)౧. నిరోధించు, ఆఁపు, అడ్డగించు.

గీ. ఇంద్రియంబుల నాటింటి నిట్లు విషయ,ములకు నొలయక యుండంగ నిలువరించి,తలఁపు లుడిగి... భార. శాం. ౫. ౧౫౧.

సీ. సుకరస మెల్లను జూఱలాడెకు తేంట్ల లలిబిత్తరపుఁజూడ్కి నిలువరించు. కృ. శకు. ౨. ౩౧. (ఇట ఔపమ్యద్యోతకము.)

౨. మానుపు, ఉడిగించు.

వ. ఇట్లంతకంతకుఁ బెరుఁగువిరహపరితాపంబు నిలువరింపం గోలంది గాక... కవిక. ౩. ౯౧.

చ...దివం, బును దిశలుం బగుల్ప దృఢముష్టిహతిం బటుహుంకృతిన్ హుతా,శనపవనార్కశీతకరసంచరణంబులు నిల్వరింతు...హరి. పూ. ౫. ౯౦.

౩. ఉంచు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(క) పెట్టు.

సీ. త్రిపదీగత త్రివేదీధర్మకలిత మస్తాక్షరమంత్రంబు హరిపరంబు. గీ. పిలిచి యాదల వలకేలు నిలువరించి, చదివె నాతనిదక్షిణశ్రవణవీథి, నపుడు తచ్చిత్త మానంద మనుభవించె. కవి. ౧. ౧౫౮.

(చ) సంధించు, కూర్చు.

చ... ఉగ్రదైత్యులు దలపడ్డ వారిసమరోద్ధతి కుత్సవ మంది శాఙ్గమం, దలవున నిల్వరించె నిశితాస్త్రము లూఁతయి వ్రాలునట్లుగన్. నిర్వ. ౩. ౧౦.

(ట) వహించు, నిలుపు.

సీ. ఉపవాసముల డస్సి యున్న యాకాఁడీఁగ నిలువరించెడుఁలావు కాలితిపడఁగ. భా. రా. యు. ౨౩౩౨.

అ. క్రి. తాళు, సహించు.

గీ. పలవరించుచు నాచంద్రభానుఁ డపుడు, నిలువరింపఁగ లేక కన్నియఁ దలంచి. చంద్ర. ౪. ౧౦౯.

నిలువ(ల్వ)సలువ(ల్వ)లు. వి. బ. (√నిలువు.) నిల్చియున్న సొమ్మును దానిపైపెచ్చును.

వ... ఋణశుద్ధి కావలసినవాఁడుంబోలె మన నిలువసలువలు మనకుం బ్రవేశించినట్లయై యుండె...పరమ. ౪. ౧౪౫.

ద్వి. చనుదెంచి మననిల్వసల్వలు మనకు, వాలాయ మొప్పించుచువాఁడునుంబోలె, జాలి నీగతి నింద్రజాలంబు సేసె. ద్వి. పరమ. ౬. ౪౮౨ పా.

నిలువు. వి. (√నిలుచు.) ౧. ఉత్థానము, నిలువఁబడుట.

క. ఎఱుమంట లెగయ నాతని, సెఱచూ పటు నిలువునఁద నీఱుగఁ దరువుం, జుఱవుచ్చు పిడుగు క్రియఁ గను, గిఱిపినయంతటన చేసె గిల్పిషుఁ బగతున్. హరి. ఉ. ౨. ౧౩౯. కవిక. ౨. ౧౯౪.

౨. చేయి పైకెత్తుకొని నిలుచున్న పురుషునిపరిమాణము; ప్రమాణము, కొలఁది.

(వ్యవ.) మానూతిలో రెండునిలువులనీరు ఉన్నది.

చ. తలనిలు వర్థ మిచ్చినను దాము కులీసులు కాని హీనులన్, బిలువ మటన్న నేమములు భేమజమున్ వెలయాండ్రు పిల్తు రే, కులజుల నైన ...వైజ. ౨. ౭౧.

౩. అంతస్తు. (మీఁదియంతస్తు అని శ. ర.)

క. ముద మొదవ రమ్యహర్మ్యము, తుదినిలువునఁ బ్రణయసఖులతోడ విహారా, స్పదమగు నెలవున మెలఁగెడు, సుదేష్ణ తజ్జాలకములఁ జూచెం బ్రీతిన్. భార. విరా. ౧. ౩౦౧.

క. మదిఁ దలఁచినంతమాత్రన, యుదయించు సహస్రరశ్మి కుపమానంబై, మదనక్రీడాసౌధము, తుదనిలువున నిలిచె రథము తోయదవీథిన్. నైష. ౭. ౨౫.

చ. చిలుకలకొల్కి కల్కి యొక చేడియ నాటకసాలమేడపై, నిలువున నాడుచుండి...మనుచ. ౫. ౬౩.

౪. శరీరము.

చ. నిలువు దయామయంబు మహనీయము లాన డకల్ తలంపఁగా. రామా. ౧. ౯౫.

క...ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ. సు. శ. ౫౪.

౫. స్థైర్యము, నిలుకడ.

చ. వదనము వ్రాసి తోన నరువఁబుఁ జుంబన కేళి సల్పుచున్, హృదయము వ్రాసి తోన నిలు వేదికవుంగిటఁ జిక్కఁ జేర్చుచున్, బదములు వ్రాసి తోన కరపద్మములం బ్రియమార నొత్తుచున్, సుదతి పటిన్ లిఖించు మతి చూడ నెఱుంగదు కోర్కి పెంపునన్. కవిక. ౩. ౭౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౬. పొడుగు, దైర్ఘ్యము; ఎత్తు, ఉన్నతి.

(వ్యవ.) గోడనిలు వెంత యున్నదో కొలువుము.

౭. చేనిలో కొంత కోసినతరువాత కోయఁగల భాగము. (శ. ర.)

౮. ద్వారపుగుజ్జుపుపీఁటలకు వెనుకటిభాగమున ఊఁతగా నుంచెడుకమ్ములు. (శ. ర.)

విణ. ఊర్ధ్వముగా నుండునది, నిటాఁది కుండునది.

సీ. కిఱ్ఱుచెప్పులు గొప్పగీఱునామంబులు మొలఁ జెక్కుకత్తులు నిలువుసిగలు. గీ. కలిగి గాటంబుగా నెల్లకడల నుండి. ... కన్నెఁ జేకొనెద మంచు, మొల్లముగఁ జేరి రచటికి గొల్లలెల్ల. నీలా. ౩. ౪౯.

నిలువునఁ గ్రాఁగు=నిలిచినది నిలిచినట్లుగనే పరితాపమొందు.

సీ. నావివేకమున కానందింపఁ గనిన యంగన యెట్లు నిలువునఁ గ్రాఁగకుండు. భార. విరా. ౨. ౩౩౫.

నిలువుచూపులు=నిమేషరహిత మగు చూపులు.

సీ. నెఱిబొమ్మ లెగయించి నిలువుచూపులఁ జూచి కోపించి యలు లంచుఁ గురుల జడియు. కవిక. ౪. ౧౬౩.

నిలువున నీరుగఁ గరఁగించు=పూర్ణముగా ఆనంద పరవశము గావించు.

క. ఈరేఖ నన్ను నిలువున, నీరుగఁ గరఁగింప వలయు నేఁ డున్నవి నీ, నేరుపు లన్నియు నని నయ, గారపువగలాఁడి యనుపఁగా నతఁ డరిగెన్. శుక. ౨. ౧౮౬.

నిలువునీరునఁ బండినట్లు=సమృద్ధ మైననీరు నిలిచినచేనిలో పండినపైరురీతిగా.

గీ. అడుగులబెడంగు నంచల నాసగొల్పఁ, జెలఁగి యమ్మక్క యొక్క యొచ్చెమ్ము లేక, నిలువునీరునఁ బండిన ట్లలరినాఁడు, వేయుఁగన్నులు వలయుఁబో వీనిఁ జూడ. సారంగ. ౨. ౪౨.

నిలువునీఱగు=మూప మెల్ల ధ్వస్త మగు, పూర్ణముగా నశించు.

చ. ..కుటిలాత్మ నా కని కాచినాఁడవే, నినుఁ గయికొందు నే నిలువునీ ఱయి కూలుదుఁ గాక దుర్మతీ. భా. రా. అర. ౨. ౭౬.

ఉ. అందము లైననీతొడలయాకృతిశోధ వహింపలేనియా, నిందకుఁ జాలమిన్ నిలువునీ ఱగు బొంత యనంటికంబముల్. కవిక. ౬. ౧౯౯. (శరీర మంతయు నీరు కల దగుచున్నది అని అర్థాంతరము.)

నిలువులపల్లిక=అంతస్తులుగా ఏర్పఱచి తీఁగలు మున్నగువానిచే అల్లినతట్ట.

ద్వి. ...అల, వట్టముల్ నిలువులపల్లికల్ ...పండితా. పర్వ. ౩౪౬ పు. (క్రొత్తప్రతిపా.)

నిలువు(ల్వు)కొల్వు. వి. (√నిలువు.) నిలుచుండి చేయుసేవ.

సీ. అలవాటు చేసికొ మ్మఖిలమరుత్వాలకులఁ గూడుకొనినిల్వుకొల్వునకును. కువల. ౪. ౬౮.

నిలువుగాళ్లు. వి. బ. (నిలువు + కాళ్లు.) తావకాళ్లకు వెనుక మాను మొదలగువాని కాధారముగ నాఁటిన స్తంభములు. (శ. ర.)

నిలువుజీతము. వి. (√నిలువు.) నిలుచుండి సేవ చేయుట కిచ్చెడిజీతము. (శ. ర.)

నిలువు(ల్వు)టద్దము. వి. (నిలువు + అద్దము.) నిలువు ప్రమాణము కలఅద్దము.

సీ. నిలువుటద్దములతోఁ దళదళల్ వెలిగ్రమ్ము ముమ్మూలతా మొత్తముల నెసంగు. ఉ. రా. ౬. ౧౨౭.

ద్వి. విలసితశృంగారవిభవంబుఁ జూడ, నిలువుటద్దంబులునిలిపెడువారు. ప్రభు. ౧. (చి. ని.)

సీ. అలసభావముతోడ నలవోక ప్రమ్లోచ నిల్వుటద్దంబులో నీడ చూచె. హర. ౭. ౧౩౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిలువుటీ(లుపీ)ఁత. వి. (నిలువు+ఈఁత.) నిలుచుండి ఈఁదెడియీఁత.

తరళ. నిలువుటీఁతల వచ్చుకొమ్మలనెమ్మొగమ్ములు పొల్పగుఁగా. యయా. 3. ౭౯.

గీ. ఒకతె నిలువీఁత లీఁదఁ జెన్నొందెఁ గురులు, తమ్మిఁ గ్రమ్మక విడనిభృంగమ్ము లనఁగ. ఘటికా. ౨. ౧౩౦.

నిలువులుప(వ)డు. అ. క్రి. (√నిలువు.) ౧. నిశ్చేష్టమగు.

చ. నిలువులుపడ్డయట్లు తననేత్రము లేమియుఁగానలేమి నగ్గలముగ బెగ్గలించుబలఘుస్తరునమ్ముల నోడు సేసి నిట్టల మగుడప్పి సోలుటయు...నిర్వ. ౬. ౧౪౪.

౨. నిమేషరహిత మగు, ఱెప్పపాటు లేకుండు.

ద్వి. నిలువులువడి శివునేత్రత్రయంబు, పొలుపుగా ఱెప్పలఁ బొంద కున్నయది. బస. పు. 3. ౫౬౩. పం.

నిలువోపు=నిలుపోపు. అ. క్రి. (నిలువు+ఓపు.) ఓర్చు, సహించు. (శ. ర.)

నివచనము. సం. వి. అ. న. నిరంతరవచనము.

నివపనము. సం. వి. అ. న. ౧. (నీళ్లులోనగువానిని) చల్లుట, పోయుట. ౨. పిత్రాదుల నుద్దేశించి నువ్వులు నీళ్లు విడుచుటలోనగుఁ గలకర్మము, తిలతర్పణాదికము. 3. విత్తనములు చల్లుట.

నివర. సం. వి. ఆ. స్త్రీ. కన్య, అవివాహిత యగుస్త్రీ.

నివరి=నివ్వరి, నీవరి. వి. సస్యవిశేషము. (శ. ర.)

నివర్తకము. సం. విణ. (అ. ర్తికా. అ.) ౧. నివర్తిల్లునది. ౨. నివర్తించునది.

నివర్తనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. మరల్చునది. ౨. మరలునది. 3. ఉడుగునది. వి. అ. న. ౧. మరలుట. ౨. ఉడుగుట, విరమించుట. ౩. ప్రవృత్తిలేమి, పనిలేమి. (వ్యతి. ప్రవర్తనము.) ౪. మరల్చుట. ౫. తొలఁగించుట, నివారణము. ౬. (క్షేత్రగ.) క్షేత్రమానవిశేషము, ఇరువదిదండములపరిమాణము, ఇన్నూరుహస్తములపరిమితి.

నివర్తనీయము. సం. విణ. (అ. ఆ. అ.) నివర్తింపఁదగినది, మరలింపఁదగినది.

నివర్తమానము. సం. విణ. (అ. ఆ. అ.) నివర్తిల్లుచున్నది, మరలుచున్నది.

నివర్తయమానము. సం. విణ. (అ. ఆ. అ.) నివర్తిల్లఁజేయుచున్నది.

నివర్తయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నివర్తిల్లఁజేయునది, మరలించునది.

నివర్తయితవ్యము. సం=నివర్తనీయము.

నివర్తి. సం. విణ. (న్. నీ. న్.) ౧. నివర్తిల్లునది. ౨. నివర్తించునది, నివర్తిల్లఁజేయునది.

నివర్తించు. సం. స. క్రి. ౧. నివర్తిల్లఁజేయు, మరలించు. ౨. తొలఁగించు, పోఁగొట్టు.

వ...బ్రహ్మహత్యాపాతకంబు నివర్తింప విచారించి...వరాహ. ౨. ౫౩.

నివర్తింపించు. సం. స. క్రి. నివర్తింపఁజేయు, మరలింపఁజేయు.

వ. భీష్ముండు దనరథంబు నివర్తింపించి సంవర్తసమయసమవర్తియుంబోలె నతిరౌద్రాకారుం డై నిలిచిన. భార. ఆది. ౪. ౨౦౫.

నివర్తిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) మరలునది.

నివర్తితము. సం. విణ. (అ. ఆ. అ.) మరలింపఁబడినది.

నివర్తిల్లు. సం. అ. క్రి. ౧. మరలు. ౨. ఉడుగు.

వ...అప్పుడుసత్యవతీనందనునకు వాగ్భుజాస్తంభంబులు నివర్తిల్లె...కాశీ. ౩. ౧౧౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నివర్త్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నివర్తింపఁబడుచున్నది, మరలింపఁబడుచున్నది.

నివర్త్యము. సం=నివర్తనీయము.

నివళము. వి. ఒకానొకస్వర్ణస్థాయి.

ద్వి. నిజవణి నివళంబు నీచవైధసము...ఆదిగా సొగయుతాయములు. బస. పు. 3. 73పం.

నివసత్. సం. శత్రు. నివసించుచున్న.

నివసతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. గృహము, ఇల్లు. ౨. నివసించుట.

నివసథము. సం. వి. అ. పుం. గ్రామము, ఊరు.

నివసనము. సం. వి. అ. న. ౧. గృహము, ఇల్లు. ౨. నివసించుట. 3. వస్త్రము.

నివసించు. సం. అ. క్రి. వసించు, ఉండు.

క. ఎందెల్లచుందులును గల,వెందుఁ గృషీవలులు ధనికు లెందు ధరణి చెన్నొందు బహుసస్యదాయిని,యందుఁ నివసింపఁదగు సుఖార్థులు పుత్రా. మార్క. 3. ౨౧౧.

నివహము. సం. వి. అ. పుం.౧. సముదాయము, సమూహము; రాశి. ౨. సప్తవాయువులలో నొకటి. 3. అగ్నిహోత్రునిసప్తజిహ్వలలో నొకటి. (ఆ. ని.)

నివాకు. సం. విణ. (ఉ.) మాటాడనిది, మిన్నకుండునది.

నివాతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నివృత్తవాతము, గాలి లేనిది. ౨. సురక్షితము. 3.శస్త్రములకు భేదింపరానిది. వి. అ. పుం. ౧. ఆశ్రయము, నివాసము. ౨. శస్త్రాదులకు భేదింపరాని కవచము. న. ౧. గాలి లేనిచోటు, గాలి తగులనిచోటు, నిర్వాతప్రదేశము. ౨. సురక్షితమైనచోటు. అవ్య. అ. న. గాలిలేమి.

నివాన్య. సం=నివాన్యవత్స.

నివాన్యవత్స. సం. వి. ఆ. స్త్రీ. తనదూడ చచ్చుటచే మఱియొకయావుదూడను కుడిపింపఁగా పాలిచ్చునట్టియావు.

నివాపకుఁడు. సం. విణ. (అ. పిశా. అ.) విత్తనములు చల్లువాఁడు.

నివాపము. సం. వి. అ. పుం. ౧. విత్తనములు చల్లుట. ౨. పితరుల నుద్దేశించి నువ్వులు నీళ్లు విడుచుట. (తిలతర్పణము మొ.) 3. మృతులను ఉద్దేశించి యిచ్చెడుదానము.

నివారణ. సం. వి. ఆ. స్త్రీ=నివారణము.

నివారణము సం. వి. అ. న. ౧. అడ్డగించుట. ౨. తొలఁగించుట.

నివారణీయము. సం. విణ. (అ. ఆ. అ.) అడ్డగింపఁదగినది.

నివారము. సం. వి. అ. పుం. ౧. నీవారము, నివ్వరిధాన్యము. ౨. నివారించుట.

నివారించు. సం. స. క్రి. ౧. తొలఁగించు, పోఁగొట్టు. ౨. అడ్డగించు, నివారణచేయు.

మ. కని తత్తీరవనాంతరంబునఁ గురంగశ్రేణి వెంటఁ గృతాం,తునిరీతిం బఱతెంచువిష్టరకు ధానుష్కుం గుణారోపితా,స్త్రుని రక్తాక్షుని ఝుంఝురుందలకిరాతుఁ మ్ముందరం జూచి చేతఁ నివారించుచుఁ బల్కెఁ బెద్దరాద నత్యంతానుకంపాత్ముఁ డై. వరాహ. ౨.౧౬.

నివారితము. సం. విణ. (అ. ఆ. అ.) అడ్డగింపఁబడినది.

నివా(వ్వా)ళి=నివాళిక. వి. (క. నివాళి.) ౧. నీరాజనము, ఆరతి.

సీ. నీరాజనాభిధ నెగడు నివాళి యారతి నాఁగ...ఆం. భా. ౨. ౧౬౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. కర్ణజునికీర్తి లోకవిఖ్యాత మగుచుఁ, బ్రబలుఁగా కని దీవించి పరమసాధ్వి, వారికత్యంతభక్తి నివాళు లొసఁగి. జై. భా. ౨. ౯౯.

క. తల లెత్తి సూర్యకాంతస్థలములపై గంధవాహసహచరకీలంబులు జలజవనీహితునకు, నిలావిలాసిని నివాళి యిచ్చె ననంగన్. వరాహ. ౪. ౧౮౧. ఉ. రా. ౮. ౩౦౮.

సీ. నిర్జరకాంతలు నివ్వాళు లిడఁ గల్పవృక్షంబు లొగిఁ బుష్పవృష్టిఁ గురియ. ద్వా. ౫. ౧౮౩. (క్రొత్తప్రతి పా.)

౨. దీపము.

సీ. కలధౌతపాత్రలఁ గాలాగురుచ్ఛేదబహుల ధూపంబులఁ బరిఢవించు. గీ. వేనవేలునివాళుల విస్తరించు, నమృతదివ్యాన్నములు నుపహార మిచ్చు. కాశీ. ౧. ౪౮.

క. కల్యాణపాత్రికల సాకల్యముగ నివాళులునిచి గతితలు గౌరీ, కల్యాణంబులు వాడిరి...రసిక. ౬. ౨౦౦.

జ : నివాళించు, నివాళిక, నివాళిపళ్లెము, నివాళి సేయు.

నివాళించు. అ. క్రి. (√నివాళి.) నీరాజన మొసఁగు, ఆరతియిచ్చు.

గీ. కలికికన్నులవారకాంతలు పసిండి, పళ్ళెరంబుల రత్నదీపములు నించి, నిండువేడ్కనివాళింప నిజపురంబు, మంచిశుభలగ్నమునఁ బ్రవేశించె నృపతి. హరిశ్చ. ౫. ౨౩౮.

గీ. బంధురామోదకలితధూపంబు లొసఁగి, మించుమణిదీపముల నివాళించి...భాగ. ౧౦ ఉ. ౯౭౩. హరి. పూ, ౮. ౧౫౧.

స. క్రి. ౧. నీరాజితముచేయు, నివాళి కలదానినిగా చేయు.

గీ. తూర్పుదిక్కునఁ బాండిమ దోఁచె నంత, లోనఁ దొడ్డోడ సహయాభిధానమాని, విష్ణుపదము నివాళింప వేడ్క నెత్తు, కర్పూరపు దివ్వె యన సుధాకరుఁడు వొడమె. ఉ. రా. ౪. ౧౬౦.

సీ. అమరంగ నింద్రాణి యాఖండలుని నివాళించెడుపసిఁడిపళ్ళెర మనంగ. ద్వా. ౪. ౧౦౮.

సీ. శివుని నివాళించు శేషాహి నడురేయి బహుఫణారత్నదీపములచేత. కాశీ. ౮. ౧౫౧.

౨. దిగఁదుడుచు.

గీ. ఒకఁడు తొలుతను జిక్కినమేకముఁ దెచ్చి, నెత్తి నీటను గడిగి చేకత్తిచేత, ముంచి కనుగ్రుడ్లు పెటికి తస్నంచి చేంచు, లంచుఁ దమ్మికంటికి నివాళించి చెలఁగె. ప్రబంధ. ౯౯. (తాళపత్త్రప్రతి పా.)

క. వనన్నృపతి మాధవునిఁ బొడఁ, గనుచు నివాళించ వైచుగమకపుజాళ్వా, పని చేయుం దగుతబుకుల, యనువున నెల్లెడలఁ బండుటాకులు డుల్లెన్. ల. వి. ౩. ౧౦౬.

నివాళిక = నివాళి. వి. (నివాళి + ఇక. స్వార్థమున.) (నీరాజనము, ఆరతి.)

ద్వి. వనజలోచనలు నివాళిక లొసఁగ. రం. రా. బాల. ౮౫ పా. (శ. ర. పా. 'నివాళులొసంగ.' ముద్రి. పా.)

నివాళితము. సం. విణ. (అ. ఆ. అ.) చుట్టఁబడినది. (శ. ర.)

వ... ప్రతిగృహాంగణప్రదేశనివాళితనీరాజనంబులు గైకొనుచు... బ్రహ్మో. ౪. ౧౩౯పా.

నివా(వ్వా)ళిపళ్ళెము. వి. (√నివాళి.) నీరాజనపాత్రము.

చ... మనోహరంబులై, తనరునివాళిపళ్లెములు తామరసాక్షు లొసంగ... భాను. ౪. ౬౧.

సీ. నివ్వాళిపళ్లెంబు నృపునకుఁ బట్టినకాంత మొప్పానె నిషేకంబునకును. రామలిం. ౮౬.

నివాళిసేయు. అ. క్రి. (√నివాళి.) ౧. ఆరతియిచ్చు, నీరాజన మొసఁగు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. తిరముగ జైత్రయాత్ర చనుదెంచిననిక్
గని యిూమభృత్తు ని,ర్ఝరములఁ బాద్య
మిచ్చి రవిసంజ్వలితార్క్యమణీవిభాపరం,ప
రల నివాళిసేసి వనభవ్యఫలాదిపహంగమో
క్తిపై, ఖరనుతి సల్పెఁ క్ రజతకాంతుల వె
ల్లదనంబుఁ జూపుచుక్. ఉ. రా. ౩. ౬౪.

క. ధవళాంశుమండలము విధి, నివాళిసేయును
లతాంగి నెమ్మొగమునకుక్. నైష. ౨.౧౪.

౨. ప్రసరించు, వ్యాపించు.

సీ. చెక్కులందు నివాళిసేయుఁ లేనగవులు తా
టంకరుచి కొల్ల కోటుసేయ. విక్ర. ౭.
౧౦౧.

నివాసకుఁడు. సం. విణ. (అ. సిశా. అ.) ౧. నివ
సించువాఁడు. ౨. నివసింపఁజేయువాఁడు.

నివాసనము. సం. వి. అ. న. నివసింపఁజేయుట.

నివాసము. సం. వి.అ.పుం. ౧. గృహము,ఇల్లు.
౨. వాసము, కాఁపురము. ౩. వస్త్రము, బట్ట.

నివాసి. సం. విణ. (న్. నీ. న్.) ౧. నివసించు
వాఁడు. ౨. (వస్త్రము) ధరించువాఁడు.

శ్లో. నవంనవక్షౌమనివాసినీ సా, భూయో బభౌ
దర్పణమాదధానా. సం. కు. సం. ౭.౨౬.

నివిడించు= నిగిడించు. స. క్రి. (√నివుడు.) వె
లికిఁ జాచు.

క. అవయవము లెల్లు కూర్మము, నివిడించును
లోని కడఁచు నెటినట్టుల భూ,తవితతి భూ
తాత్ముండును, బ్రవర్తననివర్తనములఁ బాల్పడఁ
జేయుక్. భార. శాం. ౫. ౧౩౨.

నివిష్టుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కూర్చు
న్నవాఁడు. ౨. దండు విడిసినవాఁడు.

శ్లో. నివిష్టముదధేః కూలే తం ప్రపేదే విభీష
ణః. సం. రఘు. ౧౨. ౬౮.

౩. పట్టుదల కలవాఁడు. ౪. ఏకాగ్రత కల
వాఁడు. ౫. ప్రవిష్టుఁడు, చొచ్చినవాఁడు.

నివీతము. సం. విణ. (అ.ఆ.అ.) ప్రావృతము,కప్ప
కొనఁబడినది. వి. అ. న. ౧. జన్నిదమును మె
డలో పేరుగా వేసికొనుట. ౨. పేరుగా వేసి
కొనినజన్నిదము.

నివీతి. సం. విణ. (న్. నీ. న్.) నివీతము కల
వాఁడు,జన్నిదము మెడలో పేరుగా వేసికొన్న
వాఁడు.

నివుడు=నిగుడు. అ. క్రి.

(చిప్పిలు, స్రవించు.)

ఆ. అని దురంతశోకమును బొంది సెజ్జపై,మేను
వైచి కన్నుఁగొనలందు, నివుడుసస్రువారి చె
వులకొలంకుల,నిండ నిట్టులను విభుండు మ
తియు. నిర్వ. ౯. ౯౦.

(కలుగు, పుట్టు.)

మ. అవనీనాథుఁడు బిట్టు మేలుకొని కోపాటో
పముల్ చూడ్కులక్, నివుడక్ దారుణవృ
త్తిఁ గాలయవనుక్ వీక్షించినక్...వి. పు.
౭. ౨౧.

(చాఁగు,దీర్ఘమగు.)

క. శివునంగయష్టి నిటియఁగ, నవిరళముగఁ బట్టి
ప్రాఁక సని కడునెమ్మిక్, నివుడుసవకల్పలతి
కల,పవిదిని మృదుబాహులతలు పార్వతి
కొప్పక్. కు. సం. ౩. ౪౯౯.

(ఒప్పు, తగు.)

క. ప్రవితతవక్త్రిఁ కత్తి, త్త్వవితానంబులకు ను
ద్భవస్థానం బై, నివుడురజోగుణసంగతి, భ
వుఁ డనునామంబు నీకుఁ బరఁగు మహేశా.
శివ. సా. ౭౧.

(పైకిలేచు, పైకుబుకు.)

చ. కవవటు డించి యే గుసుకఁగా సురేఁ
గొంకులఁ దార్చి కూలుచుక్, నివిడినబొజ్జపై
మిగులఁనిద్దపుదోవతిదట్టి డొల్లిరాఁ,దివిచి...
ఆము. ౬. ౭౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(అతిశయించు, అధికమగు.)

ద్వి. లీల సారణయుఁ దలిర్ప సంప్రీతి, నివుడంగ ... బస. పు. ౩. ౯౨౭ పం.

ద్వి. ప్రవితతయోగానుభవదివ్యసుఖము, నివుడంగ శివయోగి నిద్రవోవుడును. పండితా. దీక్షా. ౭౫ పా.

(ప్రసరించు, వ్యాపించు.)

క. దివి ముట్టి ధరణియంతట, నివిడి మెఱయుచుండు నెవ్వనియశోరమ యట్టివిశిష్టచరిత్రుఁడు యక్షవరా పురుషుండు నాఁ బ్రకాశత నొందుఁగా. భార. అర. ౭. ౪౫౩.

మ. శ్రవణశ్రీలు విశాలలోచనయుగచ్ఛద్మాత్మపాణిద్వయిన్, నివుడుం జొక్కపుటల్లిపట్టమర నెంతే గంజికాల్వట్టఁ ద, త్ప్రవృత భ్రూలతికాకరుండు విశ్రుతఘ్రాణైకపాదుండునై, నవకేళిం గనుబాలచంద్రుఁ డనఁ గన్పట్టె న్నొసల్ కాంతకున్. చంద్రా. ౪. ౧౧౨.

జ: నివిడించు, నివుడుచు.

**నివుడుచు(డ్చు)**= నిగుడుచు. (శ. ర.)

**నివురు**= నిమురు. స. క్రి. ౧. (ప్రేమచే) తడవు; (చేతితో) రాచు.

క. కర మనురక్తిని మోము ని,విరి తద్వృత్తాంత మెల్ల వెలఁదులు నంతః, పురవాసులు చెప్పిన విని... భాగ. ౪.౨౨౫.ఆం.భా. ౩.౧౩౩.

గీ... అవ్విభుండు, నివిరెఁ జలికేల నాన్నపు నవయవములు. భార. ఆశ్ర. ౧. ౪౨, ౪౩.

క. వెఱికితి నలుఁగులు మేనులు, నెఱఁబడ నెల్లెడలఁ గలయ నివిరితి... భార. ద్రో. ౩. ౧౬౦.

వ. ఇవ్విధంబున మందస్మితవదనారవిందుండై కరారవిందంబునం బతంగపుంగవునంగంబు నివురుచు మృదుభాషణంబుల నిట్లనియె. నైష. ౨. ౨౭.

౨. స్పృశించు, తాఁకు.

క. హరి నిచటికి రప్పించుట, కరయఁగ నేఁ బూఁటకాఁపు నైతి నటంచున్, సరసిజగర్భుఁడు శేషుని, శిరములపై నివిరి నమ్మఁ జెప్పెను గరుణన్. వేం. మా. ౪. ౬౬.

౩. సవరించు, దువ్వు.

శా... సాంద్రామోదంబునఁ బక్షముల్ నివురు హస్తాంభోజయుగ్మంబునన్. నైష. ౨. ౧౦౫.

సీ. నెఱిగొప్పు కొనగోర నివిరి చూచెద నన్నఁ జెలి నీ వది ఘనంబు చేసికొనెదు. సారంగ. ౨. ౨౨౫.

౪. తుడుచు.

ద్వి. నవఘర్మకణముల నఖరాంకురముల, నివురుచు ... ద్వి. హరిశ్చ. పూ. ౯౩౩ పం.

౫. మర్దించు, పిసుకు.

ద్వి. పెనుప్రేలిసంధులఁ బెనుప్రేలిసంధు, లెనయించి కేలిమై నింపుమై బిగిసి, నివురుచు సొగసుగా నెటికలు విఱిచి. ద్వి. పరమ. ౨౦౪ పా.

అ. క్రి. అతిశయించు.

ద్వి. ఆరాధ్యు లాదిగా నలరుజంగములు, దవిలి పండితవిభుఁ దర్శించు వేడ్క, నివురంగ సద్భక్తనికరంబుతోడ. పండితా. దీక్షా. ౫౬ పా.

**నివురుకొను**. స. క్రి. (√నివురు.) తడవుకొను, రాచికొను.

వ...అనంతరంబు బొడ్డు నివురుకొనుచుం బ్రాణాపానసమానోదానవ్యానంబులు తృప్తిం బొంది నాకు నానందం బొసంగుంగాత యని యాశీర్వదించుకొనునది... కాశీ. ౫. ౨౨౪.

**నివురు**=నిగురు, నీఱు. వి. భస్మము, బూఁడిద.

గీ. ఆఁడుచందంబుఁ బురుషసమాకృతియును, గలిగి యున్నవి యొప్పు నూష్మలతసొంపు, వికృతవేషావృతంబులై వెలయు నిలఁడు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నివుఱుంగవిసిన మెఱయనివ్వవోలె.భార. విరా. ౪. ౪౫.

గీ. నివుఱు బొగ్గుఁబ్రోవులు నిఖిలదిశల, నధికదు స్సహ వయ్యె నయ్యడవియందు.కేయూర. ౩. ౧౪.

నివృతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఆవృ తము, ఆవరింపఁబడినది. ౨. పైని కప్పఁబోవఁబడి నది, ధరింపఁబడినది. (వస్త్రము.) వి. అ. న. ఉత్తరీయము, పైబట్ట.

నివృతి. సం. వి. ఇ. స్త్రీ. ఆవృతి, ఆవరించుట.

నివృత్తము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. మరలి నది. ౨. పోయినది, తొలఁగినది. ౩. ఉపరత ము, ఉడిగినది. ౪. విషయములనుండి మరలి నది. వి. అ. న. ౧. మరలుట. ౨. నివృత్తి, చిత్తము విషయములనుండి మరలుట. ౩. అభా వము, లేమి.

నివృత్తాత్ముఁడు. సం. విణ. (న్.) విషయముల నుండి మరలినచిత్తము కలవాఁడు (ముని మొ.) ఇట్లే: నివృత్తహృదయుఁడు మొ.

నివృత్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. మరలుట. ౨. ఉడుగుట, విరమించుట. ౩. పోవుట, నశించుట. (దుఃఖనివృత్తి.) ౪. అప్రవృత్తి, ఐ హికకర్మములందు ప్రవర్తింపకుండుట. ౫.ముక్తి. ౬. (వ్యాక.)పదముకాని సూత్రముకాని ముందు సూత్రములోనికి రాకుండుట.(వ్యతి.అనువృత్తి.) అవ్య. ఇ. న. పనిలేమి, వ్యాపారములేమి. (వ్యతి. ప్రవృత్తి.)

నివేదకము. సం. విణ. (అ. దికా. అ.) ౧. తె లుపునది. ౨. విన్నవించునది. ౩. సమర్పించు నది, ఇచ్చునది. ౪. అప్పగించునది.

నివేదనము. సం. వి. అ. న. ౧. తెలుపుట,ఎఱిఁ గించుట; విన్నవించుట. ౨. సమర్పణము, దేవ తాదులకు పూజాద్రవ్యాదు లొసఁగుట. ౩. అప్పగించుట.

నివేదనీయము. సం. విణ. (అ. ఆ. అ.) నివేదిం పఁదగినది.

నివేదయత్. సం. శత్ర. నివేదించుచున్న.

నివేదయమానము. సం. విణ. (అ.ఆ.అ.) నివే దించుచున్నది.

నివేదించు. సం. స.క్రి ౧. ఎఱిఁగించు, తెలుపు; విన్నవించు.

వ...జానకీజాని పవనతనయు నవలోకించి...భ రతుం గాంచి మద్వృత్తాంతంబు నివేదించి రమ్ము పొమ్మనిన...భా. రా. యు. ౨౫౩౯.

౨. సమర్పించు.

క. పరమాన్నభైక్షభిస్సా, పరిపూర్ణతరంబులైన పాత్రము లయ్యె,వురు నిత్యంబు నివేదిం, తురు తల్లికిఁ గరము భక్తితో వినయమునన్. భార. ఆది. ౭. ౨౩౪.

(శ్రీరాముఁడు.) వ...గోలోకప్రచారులు నివే దించుకానుక లంగీకరింపుచు...ఉ. రా. ర. ౭౧౪.

౩. అప్పగించు, స్వాధీనము చేయు.

వ...ద్రోణుండు...ఏకలవ్యుకడ కేఁగిన నెఱిఁగి వాఁడు...ద్రోణునకు మ్రొక్కి తనశరీరంబు సర్వస్వంబును నివేదించి...కరంబులు మొగి చి యున్నం జూచి...భార.ఆది.౫. ౨౪౧.

నివేదిత. సం.విణ.(ఋ. త్రీ.ఋ.)నివేదించువాఁడు.

నివేదితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. జ్ఞాపి తము, ఎఱిఁగింపఁబడినది; విజ్ఞాపితము, విన్నవిం పఁబడినది. ౨. సమర్పింపఁబడినది, ఈయఁబడి నది. ౩. అప్పగింపఁబడినది.

నివేదితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నివే దింపఁదగినది.

నివేది. సం. విణ. (న్. నీ. న్.) నివేదించువాఁడు.

నివేద్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నివే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దింపఁబడుచున్నది.

నివేద్యమిచ్చు. మి.స.క్రి.(నివేద్యము+ఇచ్చు.) నైవేద్యముగా ఇచ్చు, సమర్పించు.

చ. ఉదధికి నంచితాతిశయమహోత్తరగంధవిశిష్ట పుష్పసంపదలు బహుప్రకారములఁ బ్రస్తుతి కెక్కఁగఁ బూజ సేసి పెంపొదవ నివేద్యమిచ్చిరి సముజ్జ్వలపాద్యపదార్థకోటులన్. భార. మౌ. ౩౮.

నివేద్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఎఱిఁగింపఁదగినది; విన్నవింపఁదగినది. ౨. సమర్పింపఁదగినది, ఈయఁదగినది. ౩. అప్పగింపఁదగినది. వి.అ.న. నైవేద్యము, దేవతలకు సమర్పింపఁదగినభోజనపదార్థము.

(నహుషుఁడు.) సీ. పుష్పంబులను ధూపముల దీపముల నివేద్యంబుల నమరుల కర్చలిచ్చు. భార. అను. ౪. ౩౪.

నివేశనము. సం. వి. అ. న. ౧. ప్రవేశము, చొచ్చుట. ౨. ప్రవేశపెట్టుట, చొప్పించుట. ౩. దండువిడియుట. ౪. గృహము, ఇల్లు. ౫. ఉనికిపట్టు. ౬. దండువిడియుపాళెము, స్కంధావారము, శిబిరము. ౭. నగరము, వీడు. ౮. ఉనికి, స్థితి. ౯. విన్యాసము, ఉంచుట. ౧౦. ఉపవేశనము, కూర్చుండుట; కూర్చుండఁబెట్టుట.

నివేశము. సం. వి. అ. పుం. ౧. ప్రవేశము, చొచ్చుట. ౨. దండువిడియుట; విడియుట. ౩. దండువిడియుపాళెము, స్కంధావారము, శిబిరము. ౪. ఉపవేశము, కూర్చుండుట. ౫. స్థానము.

శ్లో. "మహానివేశౌ పరిణాహపయోధరౌ." సం. కిరా. ౪. ౮.

౬. పెండ్లి. ౭. విన్యాసము, ఉంచుట.

శ్లో. "సాగారసిద్ధార్థనివేశవద్భిర్దూర్వాప్రవాళైః ప్రతిభిన్నశోభమ్." సం. కు. సం. ౭. ౭.

౮. గృహము.

శ్లో. "భృశం దదర్శాశ్రమమండపోపమాః సపుష్పహాసాః సనివేశవీరుధః." సం. కిరా. ౪. ౧౯.

నివేశిని. సం. వి. ఈ. స్త్రీ. భూమి.

నివేష్టనము. సం. వి. అ. న. చుట్టుకొనుట.

నివేష్టము. సం. వి. అ. పుం. ౧. కప్పుట. ౨. కప్పుగుడ్డ మొ. ౩. చుట్టుకొనుట.

నివ్వగిలు. అ.క్రి. వెలువడు, బహిర్గత మగు.

(పుష్పాపచయవర్ణనము.) సీ. కేలు సాఁచిన నివ్వగిలుకక్షకాంతులు జిగిచన్ను గ్రేవల జీరువాఱ. శ్రీరం. ౨. ౨౧౨. (దీనికి ప్రయోగాంతరము కానరాదు.)

నివ్వటించు. స. క్రి. నివ్వటిల్లఁజేయు, ఒప్పునట్లు చేయు.

సీ. దైత్యారివశమైనతనచిత్తమంతయు నినుచు గౌరవమున నివ్వటించి. పాండు. ౧. ౯.

జ: నివ్వటిల్లు.

నివ్వటిల్లు(లు). అ. క్రి. (√నివ్వటించు. సం. నిర్వహించు. ప్రా. నివ్వత్తఇ.) ౧. నెఱవేఱు, సిద్ధించు.

సీ. నినుఁ జేరి నిషధనాథునియింద్రియములకు నిజదేవభూయంబు నివ్వటిల్లు. నైష. ౨. ౧౬.

శ్లో...బహిరింద్రియాణాం... స్వదేవభూయం చరితార్థమస్తు. సం. నైష. ౩. ౧౦౧.

ద్వి. అనఘ నీచేతఁ గార్యము నివ్వటిల్లు. రం. రా. యు. (శ. ర.)

౨. అతిశయించు, అధికమగు.

చ. అన విని దుంగలంగుహృదయంబునఁ దాపము నివ్వటిల్ల నిట్లను... భార. విరా. ౫. ౨౩౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ...మోహనగుణశక్తి నివ్వటిలునవ్వలరాయ
నినేర్పుపెంపునన్. వసు. ౩. ౫౧.

౩. కలుగు, పుట్టు.

గీ. ఉదయపర్వతకటకగండోపలములఁ, బఱ్ఱు
మూలచ్ఛిదావ్రణప్రభవమైన, నెత్తురని
యెడువిచికిత్స నివ్వటిల్ల, భానుకిరణంబు
లొకకొన్ని ప్రాఁకె నధము. కాశీ. ౧. ౧౨౨.

క...ఇవ్విధమున నుత్పాతము, నివ్వటిలం దొడఁ
గుటయును... ఉ. హరి. ౬. ౧౪౯.

౪. వ్యాపించు, ప్రసరించు; పఱు.

మ. మును సౌరభ్యము నివ్వటిల్లఁగ మనోమో
దంబునం దేఁటు ల్లల్లన నొలిన్ వెడలంగ
రేఁపులు సముల్లాసంబునన్ బింక మెక్క...
పొల్పుం జెందెనంభోజముల్. భార. ఉద్యో.
౨. ౧౧౦.

గీ. కమలకింజల్కరేణుసంకాశ మగుచు, నింగి
నెఱసంజకెంజాయనివ్వటిల్లె. నైష. ౭. ౧౫౬.

క. త్రివ్విఁ బ్రభ లెల్లదెసల, నివ్వటిలఁగ వెలుఁ
గుచుండె నిధి... భార. అశ్వ. ౩. ౧౫౪.

క...పాండుపుత్రకులబాణంబుల్, నివ్వటిలనీక
నలువుర, నవ్వీరుఁడు నొవ్వనేసె నద్భుత
భంగిన్. భార. శల్య. ౧. ౨౨౯.

౫. విజృంభించు; పెరుఁగు, వర్ధిల్లు.

క. అవ్వీరుం డవ్విప్రుని, క్రొవ్వున నా సైన్య
సమితిక్రూరోద్ధతియున్, నివ్వటిలనీక ఖచ
రులు, నివ్వెఱపడ సమరకేళినిపుణత మెఱ
సెన్. భార. కర్ణ. ౨. ౩౦౫.

ఉ...ఎప్పుడు యజ్ఞవిఘ్నముల్, గ్రొవ్వునఁ
జేయ రక్కసులు గ్రుమ్మరుచుండుదు రద్దురా
త్ములన్, నివ్వటిలంగనీక శితనిష్ఠురబాణముల
న్వధించెదన్. భా. రా. బాల. ౨. ౬౬.

క. నివ్వటిలు జగము లన్నియు, నెవ్వనిచే నమ్మ
హిందు నెప్పుడుఁ గొలుతున్. భాగ. శాం.
౪. ౨౧౯.

గీ. చెడ్డయింటిచెదారమై శివునికరుణ, నివ్వటి
లు నిర్వదే నేండ్లన్నుఁ దలఁచి, పదియునా
ర్వత్సరంబులభార్యఁ దలఁచి, గోరతనములు
మానరా కొడుకుఁగుఱ్ఱ. కాశీ. ౪. ౭౧.

౬. ఒప్పు, ప్రకాశించు.

చ. సలలితగండమండలము సన్మదధారల నివ్వ
టిల్లఁగా, నలఘువినూత్నరత్నకనకాంచిత
భూషణదీప్తు లొప్పఁగా, వెలువడె నున్మద
ద్విరదబృందము... విక్ర. ౪. ౭౧.

ఉ. ఎవ్వని కెంతబుద్ధి పరమేశుఁడు దాఁగృపఁ
జేసె నట్టిదై, నివ్వటిలున్ గవిత్వరుచి...
కవిరా. ౧. ౧౦. రా. వి. ౩. ౮౫.

౭. నిండారు.

సీ. నివ్వటిల్లె నవంగ నిండారె ననఁ బూరటిల్లె
నా సమములై యుల్లసిల్లు. ఆం. భా. ౩. ౧౦౧.

నివ్వరిప్రాలు. వి. బ. (√నివ్వరులు.) నీవారతం
డులములు, నివ్వరిబియ్యము.

సీ. నివ్వరిప్రాలు తేనియపాలపండులు కాఱెను
ములపెఱ చాఱపప్పు. శుక. ౧. ౧౫౮.

ఇట్లే: నివ్వరిబియ్యము.

ద్వి. నివ్వరిబియ్యంబు నెఱినెఱిఁ దెచ్చి, యవ్వి
యన్నియుఁ బాకయత్నంబు చేసి. రం. రా.
బాల. ౬౧ పు. ౨౯ పం.

నివ్వరిముల్లు. వి. ఔ. (√నివ్వరులు.) నివ్వరిధా
న్యపుగింజచివర నుండుముల్లు, నీవారశూకము.

గీ. తలఁప నివ్వరిముంటిచందమున మిగులఁ,
గొంచెమై కప్పుమొగులులో మించుదీవ,
పోల్కి మెఱయుచుఁ బచ్చనై పొలుచు
తేజు, నీవ కద నిక్కముగ మేటినేల యేఁడ.
అచ్చ. రా. యు. ౧౬౦.

నివ్వరులు. వి. బ. తృణధాన్యవిశేషము, నీవార
ధాన్యము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. నివ్వరు ద్దెబ్బస ల్నీరుకావులు గాజుకెవ్వెర
ల్కారువడా ల్కంటసరులు... గీ...ఆది
యగుపేరు గల్గువ ల్లతఃయింట, నుండు...
హంస. ౪. ౧౨౭.

వ...పసపుగన్నేర్లు గుత్తిబలుగుత్తులు రావిపూ
రాజనాలు పొన్నశ్రీరాజనాలు నివ్వరులు
నీరుకావులు... ప్రబంధ. ౧౧౨.

సీ. నివ్వరిధాన్యముల్ నెమకంగఁ గేదారపరి
సరంబులయందుఁ దిరుగునపుడు. దశా. ౮.
౧౬౧.

జ: నివ్వరిప్రాలు, నివ్వరిముల్లు.

నివ్వెఱ=నివ్వెఱఁగు. వి. (నిండు + వెఱ.) ౧. నిర్భరాశ్చర్యము, మిక్కిలి ఆశ్చర్యము.

చ. కని యిది మీను కాదు... అంచు మది
సందియ మందుచు... ధూమకేతుసదృశం
బగువాలము చూచి నివ్వెఱన్. దశా. ౧.
౭౯౨.

సీ... పాలుపారుచుండును నిర్భరాశ్చర్యంబు
నివ్వె ఱనఁగ. ఆం. భా. ౧. ౧౩౨.

౨. (ఆశ్చర్యమోహాదులవలని) పారవశ్యము.

ఉ. నిక్కము యట్లు లేమిఁ గడునివ్వెఱ నివ్వెర
మేల వేఁడితిన్. విక్ర. ౩. ౧౦.

చ. పరవశదైన్య మాడుకొనుప్రౌఢలఁ గానదు
ఘూర్మవారిచేఁ, గరఁగి స్రవించుచిత్రకము
గానదనాదృతివీటిపాటలా,ధరమున నున్న
మంటినవిధంబును గానదు నవ్వుటాల కా,భ
రణము గొన్నఁ గాన దొకబాల నృపాలుని
జూచి నివ్వెఱన్. మనుచ. ౫. ౬౫.

౩. మిక్కిలిభయము.

చ. ఎఱుఁగక యెందుఁ బోవు మతి యీభువ
నంబుల నెందు డాఁగినన్, వెఱచఱవంగఁ
దెచ్చి తెగవ్రేయక పోదె హిరణ్యుఁ డం
చుఁ జెచ్చెర నలుమూలలం దుపరిసీమను
మంచము క్రిందఁ జూచి ని,వ్వెఱ వెలి
వెళ్లెనో యనుచు వెల్వడె నిందును నందుఁ
జూడఁగాన్. దశా. ౪. ౧౦౭.

చ. చెలువ మెసంగి సట్టి యలచిత్తభవార్పిత
సూనపాళికల్, బలుమఱు నారసా లనుచుఁ
బాయనినివ్వెఱ యాత్మ మించఁగన్. చంద్రి.
౪. ౭౯.

౪. (భయాదులవలని) నిశ్చేష్టత.

ఉ. మాలి గదాహతిన్ బిలుకుమాలి విహంగమ
మాళి ధైర్యమున్, దూలి పయోధి మున్
దిరుగుతోరపుగట్టువలెన్ జలించి య,వ్వేళఁ
బరాఙ్ముఖుం డయినవెన్నుఁడు నివ్వెఱ నొందె
నందునన్, మే లని యార్చి రాసురులు
మింట సుపర్వులు పిచ్చలింపఁగన్. ఉ. రా.
౨. ౮౬.

౫. భ్రాంతి. (శ. ర.)

నివ్వెఱఁగు=నివ్వెఱ. వి. (నిండు + వెఱఁగు.) ౧. అత్యాశ్చర్యము, మిక్కిలి ఆశ్చర్యము.

మ. అనినన్ నివ్వెఱఁ గంది భూవిభుఁడు నాహా
యిట్టిమీనంబులం, గనినామో విననామొ
యెం దయిన... అటంచు నించుక మదిన్
సందేహముం జెందుచున్. దశా. ౧. ౧౫౫.

గీ...ఒక్కకోనలోనఁ, బుష్పకవిమాన మటు
సాఁగి పోక నిలిచె.

చ. నిలిచినఁ బంక్తికంధరుఁడు నివ్వెఱఁ గంది
యి దేల యిచ్చటన్, నిలిచెను శత్రుఁడే
యొకఁడు నిల్పఁగ దీనికి దుర్గమస్థలం,బులు
గలవోటు చూడుఁ డటఁ బొం డని మం
త్రులఁ బంప... ఉ. రా. ౩. ౬౬, ౬౮.

౨. మిక్కిలి భయము.

చ. పులిఁ బొడఁగన్న లేళ్లగమివో లె సుయోధను
సగ్రసైనికుల్, దలఁకి కలంగి నివ్వెఱఁగుఁ
దన్కనఁ జేష్టలు దక్కి చిత్రరూ,పుల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్రియ నుండిరి... భార. భీష్మ. ౨. ౧౫౭.
(దక్షాధ్వరధ్వంసము.) ఉ. కొందఱు సృష్టి సంహారమొకో యని నివ్వెఱ గంది రార్తులై. వీర. ౪. ౯౦.

౩. (భయదుఃఖాదులచే కలిగెడి) నిశ్చేష్టత.

క. వెఱచఱచి వెఁగడువడి ని,వ్వెఱఁ గందుచుఁ గురుబలంబువీరు లతని డ,గ్గఱ కంతనంతఁ జూడఁగ, నుఱక నదీసుతుఁడు దాఁకె నుద్భటభంగిన్. భార. భీష్మ. ౨. ౨౨౩.

ఉ. ఆసమయంబునన్ గనకహంసము... అచ్చటి కేఁగుదెంచెఁ జిం,తాసముపేతులై వికత ధైర్యత నివ్వెఱఁ గంది యున్నయా,రాసుతు రాజకన్య ననురాగ మెలర్పఁగ నుద్ధరింపఁగన్. నైష. ౪. ౧౦౫.

ఉ...దురంతవిషాదవేదనా,ధీనత యీమహోత్తము నకుఁ దీర్పక యేగతి నుండఁగాఁ దగున్, దీనికి నెద్ది కార్య మని నివ్వెఱఁ గంద నతం డు క్రమ్మఱన్. రాజ. చ. ౨. ౩౮.

౪. భ్రాంతి.

ద్వి. నిలుకడ దప్పిన నివ్వెఱఁ గందె. విష్ణు.పు. ౩. (శ. ర.)

నివ్వెఱపడు. అ. క్రి. (నివ్వెఱ+పడు.) ౧. మిక్కిలి ఆశ్చర్యపడు.

క. ఆవీరుం డవ్విప్రుని,క్రొవ్వున నాసైన్యసమితిక్రూరోద్ధతియున్, నివ్వటిలనీక ఖచరులు, నివ్వెఱపడ సమరకేళినిపుణత మెఱసెన్. భార. కర్ణ. ౨. ౩౦౫.

చ. తెలివరు కాంత... నీవు ని,వ్వెఱపడఁ బక్షి వల్లభుని విష్ణునిఁ దెచ్చి యపత్య మిప్పుడే, నెఱయఁగఁ దెచ్చి యిచ్చెద ననింద్యచరిత్ర విచార మేఁటికిన్. నా. పంచ. ౧. ౪౩౩.

౨. మిక్కిలి భయపడు.

సీ. ఏవేదనయు నొంద కింపారఁ బుత్త్రునిఁ గని యింక నెట్లొకో కర్జ మనుచు, నివ్వెఱపడి యున్ననిజపత్ని కవ్విధం బల్లన నెఱిఁగించి... హరి. పూ. ౫. ౧౨౧.

౩. (భయాదులచే) నిశ్చేష్టతనొందు, చేష్టలు దక్కు.

వ...కౌరవసైనికులు గలంగినమనంబులతోడ నివ్వెఱపడి యుండ...భార. విరా. ౪. ౮౫.

గీ. నీవు మమ్ము బోధింపఁగా నేర్తుగాక, యిమ్మహానలస్ఫురణంబు నిట్టి దనఁగ, నేము నేర్తుమె యేమియో యెఱుఁగ కునికిఁ,గాదె నివ్వెఱపడితిమి కమలనాభ. భార. అను. ౪. ౪౦౩.

౪. భ్రాంతిపడు. (శ. ర.)

నివ్వెఱపఱుచు. స. క్రి. (నివ్వెఱ+పఱచు.) భయపడఁజేయు.

క. సకియఁ గను మెఱఁగి మధుకర,చికుర నిజారామవాటిఁ జేరి ప్రసూనాం,బకధాటీశుకఘోటీ, నికరాటీకనము మనము నివ్వెఱపఱుపన్. వసు. ౩. ౧౧౭.

నివ్వెఱపాటు. వి.(√నివ్వెఱపడు.) ౧. మిక్కిలి ఆశ్చర్యము.

వ...పొత్తులలో నున్న యొక్క చక్కనిబాలికనుం జూచి యొక్కింతతడవు నివ్వెఱపాటున నిశ్చలుం డగుచు...కళా. ౫. ౨.

ఉ. నిద్దురపోయి లేచుగతి నీరజలోచన లేచి నవ్వులే,ముద్దుమొగంబుతోఁ బతికి మ్రొక్కి పదానతులైనపుత్త్రులన్, దద్దయుఁ గౌఁగిలించి మునిదారలతోఁ దగుసుద్దు లాడుచున్, నిద్దపువేడ్క నందఱను నివ్వెఱపాటున ముంచె నత్తఱిన్. దశా. ౬. ౮౮.

౨. మిక్కిలి భయము.

(భీష్ముఁడు.) గీ. ...అక్కజంపుఁ, గడిమి కచ్చెరువడి యొక్కకడకు వచ్చి, పాండుసూనులు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నివ్వెఱపాటు నొంద. భార. భీష్మ. ౧. ౫౯.
౩. (భయదుఃఖాదులవలన) నిశ్చేష్టత.
సీ. చిత్రరూపంబునఁ జెలువున నేలోకో పతిమూర్తి నివ్వెఱపాటు నొందె. నిర్వ. ౭. ౧౧౧.
సీ. అనుచితకృత్యంబు లాచరించువిధాత్ప్రబలిమికి నివ్వెఱపాటు దోఁప. భార. విరా. ౨. ౩౩.
౪. భ్రాంతి.
సీ. తొట్రిలుభయమునఁ ద్రోవఁ గానఁగ లేక నివ్వెఱపాటుతో నిలుచునెలఁత. దశా. ౪. ౪౫.
చ. నిలిచిన భీతియు న్వడఁకు నివ్వెఱపాటును భూరిలజ్జయుఁ, గళవళముఁ జనింప నధికం బగుశోకముఁ బొంది...ఉన్నయా, నళినదళాక్షిఁ జూచి...హరిశ్చ. ౫. ౭౨.

నిశ. సం.వి.ఆ.స్త్రీ. ౧ - వ్యాపారమును మిగులఁ క్షీణింపఁ జేయునది - రాత్రి. ౨. పసుపు. ౩. (జ్యోతి.) మేషాదిరాశిషట్కము. ౪. స్వప్నము, కల. (విల్యమ్సు.)

నిశమనము. సం.వి.అ.న. ౧. శ్రవణము, వినుట. ౨. దర్శనము, చూచుట. ౩. దృష్టి, చూపు.

నిశరణము. సం. వి. అ. న. మారణము, చంపుట.

నిశాంకుశ. సం. వి. ఆ. స్త్రీ. జిబిలిక, ఒకదినుసు బీఱ.

నిశాంతనారి. సం. వి. ఈ. స్త్రీ. గృహిణి, గేస్తురాలు. (ఆ. ని.)

నిశాంతము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి శాంత మైనది. వి. అ. పుం. ఉషఃకాలము, ప్రభాతము. న. గృహము.

నిశాంధ. సం. వి. ఆ. స్త్రీ. జతుక యనుతీఁగ, తోరింద.

నిశాంధము. సం. విణ. (అ.ఆ.అ.) రాత్రియందు గ్రుడ్డిది, రేచీకటిరోగము కలది.

నిశాకరము. సం. వి. అ. పుం. ౧. కర్పూరము. ౨. కుక్కుటము, కోడి. (ఆ. ని.)

నిశాకరుఁడు. సం. వి. అ. పుం - రాత్రిని కలిగించువాఁడు-చంద్రుఁడు.

నిశాకేతుఁడు. సం. వి. ఉ. పుం - రాత్రియందు కాంతి కలవాఁడు-చంద్రుఁడు. (వై. ని.)

నిశాఖ్య. సం. వి. ఆ. స్త్రీ. పసుపు. (ఇట్లే: నిశాహ్వ, నిశాహ్వయ.)

నిశాగృహము. సం. వి. అ. న. రాత్రి పండుకొను గృహము, పడుకటిల్లు.

నిశాచరము. సం. వి. అ. పుం. ౧. నక్క. ౨. గ్రుడ్లగూబ. ౩. పాము. ౪. చక్రవాకము.

నిశాచరి. సం. వి. ఈ. స్త్రీ. ౧. రాక్షస స్త్రీ. ౨. కులట, ఱంకుటాలు. ౩. కేశిని అనుగంధద్రవ్యము. ౪. పైఁడికంటి అనుపక్షి. ౫. శంఖిని, కట్లతీఁగ. ౬. ఆఁడుగ్రుడ్లగూబ. ౭. ఆఁడునక్క.

నిశాచరుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) రాత్రులందు తిరుగువాఁడు. వి. అ. పుం. ౧. రాక్షసుఁడు. ౨. దొంగ.

నిశాచర్మము. సం. వి. న్. న. చీకటి, అంధకారము.

నిశాజలము. సం. వి. అ. న. మంచునీరు, హిమజలము.

నిశాటకము. సం. విణ. (అ. టికా. అ.) రాత్రియందు సంచరించునది. వి.అ.పుం. గుగ్గిలము.

నిశాటనము. సం. వి. అ. పుం. గ్రుడ్లగూబ. న. రాత్రియందు తిరుగుట, రాత్రిసంచారము.

నిశాటనుఁడు. సం=నిశాటుఁడు.

నిశాటము. సం. వి. అ. పుం. గ్రుడ్లగూబ.

నిశాటి. సం. వి. ఈ. స్త్రీ. ౧. రాక్షసస్త్రీ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. అంకుటాలు. ౩. ఆఁడుగ్రుడ్లగూబ.

నిశాటుఁడు. సం. విణ. (అ. టికా. అ.) రాత్రి యందు తిరుగువాఁడు వి.అ. పుం.రాక్షసుఁడు.

నిశాతము. సం. విణ. (అ. ఆ.అ.) మిక్కిలి వాఁడిచేయఁ బడినది, పదను పెట్టఁబడినది.

నిశాత్యయము. సం. వి. అ. పుం. వేకువ, ఉషః కాలము.

నిశాదర్శి. సం. వి. న్. పుం. -రాత్రులయందే చూచునది- గ్రుడ్లగూబ.

నిశాది. సం. విణ. (న్. నీ. న్.) రాత్రియందే భుజించువాఁడు. వి. ఇ. పుం. (నిశా + ఆది.) రజనీముఖము, సాయంసంధ్య.

నిశాదుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) రాత్రియే భుజించువాఁడు. వి. అ. పుం. నిషాదుఁడు, బోయవాఁడు.

నిశానము. సం. వి. అ. న. వాఁడిచేయుట, పదను పెట్టుట; తేజనము, మెఱుఁగు పెట్టుట.

నిశానాథము. సం. వి. అ. పుం. కర్పూరము.

నిశానాథుఁడు. సం.వి.అ. పుం-రాత్రికి దొర-చంద్రుఁడు.

ఇట్లే: నిశాకాంతుఁడు, నిశాధీశుఁడు, నిశేశుఁడు, మొ.

నిశానిశము. సం. అవ్య. ప్రతిరాత్రము.

నిశానీ(ని). వి. (హిం. నిశానీ.) ౧. చిహ్నము. (నిశాన్ అని మి. బ్రౌ, శ. ర.)

సీ. జిలుఁగుచీనాపట్టుచెంగావిచెఱఁగుల నిద్దాజరీనిశానీలకరులు. రంగా. ౧. ౧౫౬.

౨. ధ్వజము, జెండా.

క. అరాచవారి ?మమ్మున్, బారుసఖం దీర్చి ముక్కపసిమినిశానీ,వారలచేతికి నిచ్చిన, ఘోరాహవమోర్చి దానిఁ గొంటిమయేనిన్. రంగా. ౨. ౨౨౩.

చ. తొలుతటదిక్కుదీవు లటఁ దోడనె భూధవునాజ్ఞ చేకొనన్, మలయక నిల్పుతద్ధవళిమం బనుతెల్లనిశానిచేరునన్, వెలిఁగెడుపద్మరాగయుతవిశ్రుతకాంచనకుంభ మో యనన్, జలరుహబాంధవుం డుదయశైలముపైఁ గనుపట్టె నయ్యెడన్. ఉ. హరిశ్చ. ౧.౫౩.

౩. వ్రేలిముద్ర.

(వ్యవ.) వాఁడు చేవ్రాలు చేయలేఁడు కాన నిశానీ పెట్టింపుము.

జ: నిశానీదారు.

నిశానీదారు. వి. (√నిశానీ. హిం.నిశానీదార్.) రాజచిహ్నము ధరించి డప్పులుమొదలగువాని వాయించువాఁడు.

సీ. నెమ్మిఁ గోవెలనిశానీదారుగములు కర్నాచీడమారము ల్నాదు సేయ. అని. ౨. ౧౯.

౩. వ్రాలు చేయలేనివాఁడు, చేతివ్రేలిముద్ర వేయువాఁడు.

(వ్యవ.) వాఁడు నిశానీదారైనను లక్షలు గడించినాఁడు.

నిశాపతి. సం. వి. ఇ. పుం- రేరాజు-చంద్రుఁడు.

నిశాపుష్పము. సం. వి. అ. న. ౧. కలువ. ౨. హిమము, మంచు. (విల్యమ్సు.)

నిశాభంగ. సం. వి. ఆ. స్త్రీ. -పసుపుముక్కచిగుళ్లవంటిచిగుళ్లు కలది. - దుగ్ధపుచ్ఛి?.

నిశామణి. సం. వి. ఇ. పుం. ౧. చంద్రుఁడు. ౨. ఖద్యోతము, మిణుఁగురుఁబురువు. ౩.కర్పూరము. (వాచ.)

నిశామనము. సం. వి. అ. న. ౧. దర్శనము, చూచుట. ౨. చూపు, దృష్టి. ౩. వినుట, ఆకర్ణించుట. ౪. ఆలోచనము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిశామనము. సం. వి. అ. పుం. ౧. వినుట. ౨. చూచుట, కనుఁగొనుట.

నిశాముఖము. సం. వి. అ. న. ప్రదోషము, సాయంసంధ్య.

నిశారణము. సం. వి. అ. న. మారణము, చంపుట. పుం. రాత్రియుద్ధము.

నిశారత్నము. సం. వి. అ. న. ౧. చంద్రుఁడు. ౨. కర్పూరము.

నిశారము. సం=నీశారము.

నిశారుకము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి హింసించునది. వి.అ. పుం. (సంగీత.) సప్తవిధ రూపకతాళములలో నొకటి.

నిశావనము. సం.వి. అ. పుం. శణము, జనుము.

నిశావసానము. సం. వి. అ. న. వేకువ.

నిశావిహారుఁడు. సం. వి. అ. పుం -రాత్రించరుఁడు - రాక్షసుఁడు.

నిశావేది. సం. వి. న్. పుం - రాత్రిపరిమాణ మెఱుఁగునది- కోడి.

నిశాహాసము. సం. వి. అ. పుం-రాత్రులందు నవ్వునది-వికసించునది-కుముదము, కలువ.

నిశితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వాఁడి చేయఁబడినది. ౨. శాణితము, సానఁబట్టఁబడినది. ౩. తేజితము, మెఱుఁగు పెట్టఁబడినది.వి.అ.న. ఇనుము.

నిశితి. సం. వి. ఇ. స్త్రీ. ౧. వాఁడిచేయుట, సానఁబట్టుట. ౨. తేజనము, మెఱుఁగు పెట్టుట.

నిశిపాలకుఁడు. సం. వి. అ. పుం. యామికుఁడు, రాత్రులందు కావలి కాచువాఁడు.

నిశిపుష్పం. సం. వి. ఆ. స్త్రీ. శేఫాలిక, వావిలి.

నిశిపుష్పి. సం.వి.ఈ. స్త్రీ. శేఫాలిక, వావిలి.

నిశీథము. సం.వి.అ. పుం.—జనులు పరుండువేళ— ౧. నడురేయి, అర్ధరాత్రము. ౨. రాత్రి.

నిశీథిని. సం. వి. ఈ. స్త్రీ. రేయి, రాత్రి.

నిశీథ్య. సం. వి. ఆ. స్త్రీ. రేయి, రాత్రి.

నిశుంభనము. సం. వి. అ. న. వధము, చంపుట.

నిశుంభము. సం. వి. అ. పుం. ౧. వధము, చంపుట. ౨. హింసించుట. ౩. మర్దించుట. ౪. (విల్లు మొ. వంచుట.)

నిశుంభి. సం. విణ. (న్. నీ.న్.) చంపువాఁడు నాశకుఁడు.

నిశుంభుఁడు. సం. వి. అ. పుం. (దుర్గచే హతుఁడైన)ఒకానొకరాక్షసుఁడు.

నిశ్శైతము. సం. వి. అ. పుం. బకము, కొంగ. (వాచ.)

నిశోత్సర్గము. సం. వి. అ. పుం. -రాత్రివిడుచు వేళ- ప్రభాతము, వేకువ.

నిశ్చత్వారింశము. సం. విణ. (అ. ఆ. అ.)నలువదిని మించినది, నలువదికంటె పయిది.

నిశ్చయనీయము. సం. విణ. (అ. ఆ. అ.) నిశ్చయింపఁదగినది.

నిశ్చయము. సం. వి. అ. పుం. ౧. నిర్ణయము, నిర్ధారణ. ౨. సిద్ధాంతము. ౩. దృఢమైన యుద్దేశము, గట్టితలఁపు.

శ్లో. తస్యాభిషేకసంభారం కల్పితం క్రూరనిశ్చయా,దూషయామాస కైకేయీ...సం. రఘు. ౧౨. ౪.

౪. తప్పక కలుగుట, కలుగుట తప్పమి. ౫. అప్రకృతమును (ఉపమానమును) నిషేధించి ప్రకృతమును (ఉపమేయమును) స్థాపించునొక యర్థాలంకారము. (వాచ.)

నిశ్చయించు. సం. స. క్రి. నిర్ణయించు, స్థిరపఱచు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆ. అనఘ నిన్ను శిష్యుఁడును ధార్మికుండు స, త్యవ్రతుండు నని మహాదరమున, నడిగె నీవు ధర్మహానికి నోర్చిన, గురుఁడు నిశ్చయించెఁ గొడుకుచావు. భార. ద్రో. ౫. ౩౫౧.

వ. నీ వెట్టివాఁడ వైతేమి నీకుం బ్రతిశ్రుతంబు చేసినయశనం బవశ్యంబునుం బెట్టెద నని నిశ్చయించి. మార్క. ౧. ౪౧.

నిశ్చల॰ సం. వి. ఆ. స్త్రీ. ౧. భూమి. ౨. సాలపర్ణి, ముయ్యాకుపొన్న ?.

నిశ్చలము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. స్థిరమైనది,కదలనిది. ౨. ఏకరూప మైనది, మాఱనిది.

నిశ్చలాంగము. సం.విణ. (అ.ఆ,ఈ.అ.)-కదలనిశరీరము కలది - స్థిరమైనది,కదలనిది. (కొండ మొ.) వి. అ. పుం. బకము, కొంగ.

నిశ్చాయకుఁడు॰ సం. విణ. (అ. యికా. అ.) నిశ్చయించువాఁడు, నిర్ణేత.

నిశ్చాయి॰ సం. విణ. (న్. నీ. న్.) నిశ్చయించువాఁడు.

నిశ్చారకము॰ సం. విణ. (అ. రికా. అ.) ౧. స్వచ్ఛందము, స్వేచ్ఛ ననుసరించునది. ౨.చారులు లేనిది. వి. అ. న. మలవిసర్జనము చేయించువాయువు.

నిశ్చింతము. సం. విణ. (అ.ఆ.అ.) చింత లేనిది. అవ్య. అ.న. నిర్విచారము, చింతలేమి.

క. ఎంతఁ గృత కార్యుం డగు, నంతఁ డీసంతసను భయం బందక ని,శ్చింతమున నుండుఁ డాతం, డంతము నొందించుఁ దాఁటిమట్టుల నరులకా. భార. ఆది. ౪. ౨౬౬.

నిశ్చింతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) - చింత లేనివాఁడు - ౧. ఆలోచన లేనివాఁడు.౨. తలంపు లేనివాఁడు. ౩. దుఃఖము లేనివాఁడు.

నిశ్చితము॰ సం. విణ. (అ. ఆ. అ.) ౧. అవధారితము, నిశ్చయింపఁబడినది. ౨. కృతనిశ్చయము, నిశ్చయించినది.

(పౌలస్త్యః.) శ్లో. అరావణ మరామం వా జగదద్యేతి నిశ్చితః. సం. రఘు. ౧౨. ౮౩.

వి. అ.న. నిశ్చయము, నిర్ణయము. క్రి. విణ. ౧. తప్పక. ౨. గట్టిగా, రూఢిగా.

నిశ్చితి. సం. వి. ఇ. స్త్రీ. ౧. నిశ్చయము, నిర్ణయము. ౨. దృఢసంకల్పము.

నిశ్చిన్వత్. సం. శత్ర. నిశ్చయించుచున్న.

నిశ్చిన్వానము॰ సం. విణ. (అ. ఆ. అ.) నిశ్చయించుచున్నది.

నిశ్చీయమానము. సం. విణ. (అ.ఆ. అ.) నిశ్చయింపఁబడుచున్నది.

నిశ్చ్యుకర్ణము॰ సం. వి. అ. న. దంతశాణము, ఒకదినుసుపల్లుపొడి.

నిశ్చేత॰ సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నిశ్చయించువాఁడు.

నిశ్చేతనుఁడు॰ సం.విణ. (అ. ఆ. అ.) విసంజ్ఞుఁడు, తెలివి తప్పినవాఁడు, చైతన్యము తొలఁగినవాఁడు.

నిశ్చేతవ్యము. సం= నిశ్చయనీయము.

నిశ్చేయము॰ సం= నిశ్చయనీయము.

నిశ్చేష్టము. సం. విణ.(అ.ఆ.అ.) చేష్టలులేనిది, కాయికవ్యాపారములు లేనిది, కదలనిది.

నిశ్చేష్టాకరణము. సం. విణ. (అ. ఈ. అ.) చేష్టలు లేనిదిగా చేయునది, కాయికవ్యాపారములుడిగించునది. వి. అ. న. ౧. మన్మథబాణములలో నొకటి. (నీలోత్పలము.)౨.మణిసిలతోఁ జేయునొకఔషధము.

నిశ్చేష్టితుఁడు॰ సం. విణ. (అ. ఆ. అ.) చేష్టలు తక్కినవాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిశ్ఛందసుఁడు. సం. విశ. (ప్.) ఛందస్సును-వేదమును- చదువనివాఁడు.

నిశ్ఛందుఁడు. సం=నిశ్ఛందసుఁడు.

నిశ్ఛిద్రము. సం. విశ. (అ. ఆ. అ.) - ఛిద్రములు లేనిది- ౧. రంధ్రములు లేనిది. ౨. లోపములు లేనిది. ౩. ఎడము లేనిది, దట్టమైనది.

నిశ్రమము సం.వి.అ. పుం. అధికపరిశ్రమము.

నిశ్రయణి. సం. వి. ఈ. స్త్రీ. నిచ్చెన.

నిశ్రేణి. సం. వి.ఇ, ఈ. స్త్రీ. ౧. నిచ్చెన. ౨. ఖర్జూరవృక్షము, పేరీఁతచెట్టు.

నిశ్రేయసము. సం. విశ. (అ. ఆ. అ.) శ్రేష్ఠము, మేలైనది. వి. అ. న. ౧. ముక్తి, మోక్షము. ౨. మేలు, మంగళము.

ఇట్లే: నిశ్శ్రేయసము.

నిశ్వసనము. సం. వి. అ. న. నిట్టూర్చుట.

నిశ్వసించు. సం. అ. క్రి. ౧. నిట్టూర్పు విడుచు, నిట్టూర్చు. ౨. ఊర్పు లోపలికిఁ గొను. ౩. ఊపిరి వెలుపలికి విడుచు. (విల్యమ్సు.)

సీ. పద్మిని నిశ్వసింపఁగఁ బూచె వావిలి కమలాక్షి గనఁ దిలకంబు పూచె. వరాహ.౩.౭౦.

నిశ్వసితము. సం. విశ. (అ. ఆ. అ.) నిశ్వసించినది, నిట్టూర్పు పుచ్చినది. వి. అ. న. నిశ్వాసము.

నిశ్వాసము. సం. వి. అ. పుం. ౧. నిట్టూర్పు. ౨. ఊపిరి వెలికి విడుచుట. ౩. ఊపిరిని లోనికిఁ గొనుట. (విల్యమ్సు).

నిశ్వాసించు. సం. అ. క్రి=నిశ్వసించు. (ఊపిరి వెలికివిడుచు.)

మ. వనితల్ నవ్వఁగఁ గౌఁగిలింపఁ గన నిశ్వాసింప గానం బొనర్ప నదల్పన్ బలుకన్ ముఖాసవము గూర్పన్ దన్ను నంటన్ ననల్, మొనపన్ బొన్న కురంటకంబుఁ దిలకంబున్ సిందువారంబు బ్రేంకనమున్ సంకెగ గోఁగునన్ వకుళమున్ గంకేళియున్ మావియున్. రామా. ౧. ౧౯౦.

నిశ్శంకుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) - శంక లేనివాఁడు_ ౧. జంకు లేనివాఁడు; భయము లేనివాఁడు. ౨. సందేహము లేనివాఁడు.

నిశ్శబ్దము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. శబ్దము లేనిది, సద్దు లేనిది. ౨. మాటలు లేనిది, మిన్న కుండునది. వి. అ. పుం. (సంగీత.) తాలమాన లఘుచతుష్టయకాలము. అవ్య. అ.న. సద్దులేమి.

నిశ్శమము. సం. విశ. (అ.ఆ.అ.) శమము లేనిది, శాంతి లేనిది. అవ్య. అ.న. శమములేమి, శాంతి లేమి.

నిశ్శరణము. సం. విశ. (అ. ఆ. అ.) - శరణము లేనిది - ౧. రక్షకము లేనిది. ౨. ఇల్లు లేనిది.

నిశ్శలాకము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. శలాక లేనిది. ౨.నిర్జనము, ఏకాంతమైనది. (ప్రదేశము.) వి. అ. న. ఏకాంతస్థలము.

నిశ్శల్యము. సం. విశ. (అ. ఆ. అ.) శల్యము లేనిది.

నిశ్శేషపఱచు. మి. స. క్రి. శేషము లేకుండఁ జేయు, మిగులు లేకుండఁజేయు.

గీ. చిక్కు బాకీలు పిదప నిశ్శేషపఱచె, బ్రతిదినము దానిసంసారబాధలెల్ల, నెత్తుకెత్తుగ నడపె దుర్వృత్తి నతఁడు. నిరం. ౨. ౧౧౬.

నిశ్శేషము. సం. విశ. (అ. ఆ. అ.) మిగులు లేనిది. క్రి. విశ. సర్వము, అంతయు.

శ్లో. నిశ్శేషవిశ్రాణితకోశజాతమ్. సం. రఘు. ౫. ౧.

నిశ్శోధ్యము. సం. విశ.(అ. ఆ. అ.) శుద్ధిచేయఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బడినది. (వై. ని.)

నిశ్శ్రీకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) - శ్రీ లేనివాఁడు - ౧. సంపద లేనివాఁడు. ౨. కాంతి లేనివాఁడు.

నిషంగధి. సం. వి. ఇ. పుం. ౧. ఆలింగనము కౌఁగిలింత. ౨. ధన్వి, విలుకాఁడు. ౩. సారథి. ౪. రథము. ౫. తృణము, గడ్డి. ౬. స్కంధము, మూఁపు.

నిషంగము సం. వి. అ. పుం. ౧. అధికసంగము, మిక్కిలికూడిక; విషయానురాగము. ౨. తూణీరము, అమ్ములపొది. ౩. కత్తి.

నిషంగి. సం. విణ. (న్. ణీ. న్.) ౧. నితాంతసక్తుఁడు, మిక్కిలి సంగము కలవాఁడు. ౨. అమ్ములపొది కలవాఁడు, విలుకాఁడు. ౩. ఖడ్గధారి, కత్తి కలవాఁడు.

నిషణ్ణకము. సం. విణ. (అ. ణ్ణికా. అ.) కూర్చున్నవాఁడు.

నిషణ్ణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఉపవిష్టుఁడు, కూర్చున్నవాఁడు. ౨. స్థితుఁడు, ఉన్నవాఁడు.

నిషదము. సం. వి. అ. పుం. (సంగీత.) నిషాదస్వరము, 'ని' అనుస్వరము.

నిషద్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. క్షుద్రపర్యంకము, చిన్నమంచము. ౨. ఆపణము, అంగడి. ౩. హట్టము, అంగడివీథి. ౪. కూర్చుండుట.

నిషద్వర. సం. వి. ఆ. స్త్రీ. రేయి, రాత్రి. (వాచ.)

నిషద్వరము. సం. వి. అ. పుం. కర్దమము, బురద.

నిషద్వరి. సం. వి. ఈ. స్త్రీ. రాత్రి.

నిషద్వరుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు. (వై. ని.)

నిషధము. సం. విణ. (అ. ఆ. అ.) కఠినము. వి. అ. పుం. ౧. ఒకదేశము. ౨. ఒకపర్వతము. ౩. (సంగీత.) నిషాదస్వరము, 'ని' అనుస్వరము.

నిషాదనము. సం. వి. అ. న. కూర్చుండఁబెట్టుట.

నిషాదము. స. వి. అ. పుం. ౧. (సంగీత) సప్తస్వరములలో కడపటిస్వరము. ౨. దేశభేదము.

నిషాది. సం. విణ. (న్. నీ. న్.) ౧. కూర్చుండువాఁడు. ౨. ఉండువాఁడు. వి. న్. పుం. మావటీఁడు. ఈ. స్త్రీ. ౧. నిషాదస్త్రీ, బోయత. ౨. చండాలస్త్రీ, మాలెత. ౩. బ్రాహ్మణునకు శూద్రస్త్రీయందు పుట్టినది.

నిషాదితము. సం. విణ. (అ. ఆ. అ.) ఉపవేశితము, కూర్చుండఁబెట్టఁబడినది. వి. అ. న. నిషాదనము, కూర్చుండఁబెట్టుట.

నిషాదుఁడు. సం. వి. అ. పుం. ౧. బోయవాఁడు. ౨. చండాలుఁడు, మాలవాఁడు. ౩. బ్రాహ్మణునకు శూద్రస్త్రీయందు పుట్టినవాఁడు.

నిషిక్తము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నితాంతసిక్తము, మిక్కిలి తడుపఁబడినది; మిక్కిలి చల్లఁబడినది. ౨. గర్భాదులందు ఉంచఁబడినది. (శుక్రము మొ.) ౩. శుక్రాదులవలనఁ బుట్టినది. (గర్భము మొ.) ౪. గర్భాధానము చేయఁబడినది. (స్త్రీ.) (నిషేచనము నిషిచ్యమానము మొ. సేచనము సిచ్యమానము మొ. వానివలె గ్రహించునది.)

నిషిద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నిషేధింపఁబడినది. ౨. కొట్టివేయఁబడినది.

శ్లో. నిషిద్ధైరప్యేభి ర్లులితమకరందో మధుకరైః. వేణీ. ౧. ౧.

నిషిధ్యత్. సం. శతృ. నిషేధించుచున్న.

నిషిధ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిషేధింపఁబడుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిషీదత్. సం. శతృ. కూరుచున్న.

నిషూదనము. సం. విణ. (అ. ఆ. అ.) చంపునది. వి. అ. న. వధము, చంపుట.

నిషేకము. సం. వి. అ. పుం. ౧. మిక్కిలి తడుపుట; చల్లుట. ౨. స్రవించుట, కాఱుట. శ్లో... తైలనిషేకబిందునా. సం. రఘు. ౮. ౩౮. ౩. శుక్రస్రావము, రేతోవిసర్జనము; గర్భాధానము.

నిషేచనము. సం. వి. అ. న=నిషేకము.

నిషేద్ధ. సం. విణ. (ఋ. ద్రీ. ఋ.) నిషేధించువాఁడు.

నిషేద్ధవ్యము. సం=నిషేధనీయము.

నిషేధకము. సం. విణ. (అ. ధికా. అ.) నిషేధించునది.

నిషేధత్. సం. శతృ. నిషేధించుచున్న.

నిషేధనీయము. సం. విణ. (అ. ఆ. అ.) నిషేధింపఁదగినది.

నిషేధము. సం. వి. అ. పుం. ౧. నివారణము. ౨. నివర్తనము, మరలించుట. ౩. నిరాకరణము. ౪. ఈపని అనిష్టాపాదకము కనుక చేయఁగూడ దని తెలుపువేదాదివాక్యము.(వ్యతి.విధి.)

నిషేధించు. సం. స. క్రి. కూడ దని నిరాకరించు, త్రోసిపుచ్చు.

వ. అస్నానరీనివహంబు...హంసగమన హంసాభిముఖి యైనయాత్రఁ బెద్దలు నిషేధింతురు సుమీ యనుచు మందగతిం బిఱుందన యేతెంచె ... నైష. ౨. ౪౬.

నిషేధిత. సం=నిషేద్ధ.

నిషేధితము. సం. విణ. (అ. ఆ. అ.) నిషేధింపఁబడినది.

నిషేధితవ్యము. సం=నిషేధనీయము.

నిషేధ్యము. సం=నిషేధనీయము.

నిషేవ. సం. వి. ఆ. స్త్రీ=నిషేవణము.

నిషేవకుఁడు. సం. విణ. (అ. వికా. అ.) ౧. చక్కఁగా సేవించువాఁడు, చక్కఁగా భజించువాఁడు. (భృత్యుఁడు, భక్తుఁడు మొ.) ౨. (ఆహారాపధాదులను) చక్కఁగా ననుభవించువాఁడు. ౩. (వ్రతతీర్థయాత్రాదులను) చేయువాఁడు, అనుష్ఠించువాఁడు.

నిషేవణము. సం. వి.అ. న. ౧. కొలుపు, సేవ. ౨. (వ్రతాదులను) చేయుట. ౩. (ఆహారాదులను) అనుభవించుట. (నిషేవకుఁడు, నిషేవ్యమాణము మొ. సేవకుఁడు, సేవ్యమానము మొ. వానివలె గ్రహించునది.)

నిషేవితము. సం. విణ. (అ. ఆ. అ.)-౧. కొలువఁబడినది, భజింపఁబడినది. ౨. అనుభవింపఁబడినది. ౩. అనుష్ఠింపఁబడినది, ఆచరింపఁబడినది. (వ్రతాది.)

నిషేవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. సేవింపఁదగినది, భజింపఁదగినది. ౨. అనుభవింపఁదగినది. ౩. ఆచరింపఁదగినది.

నిష్కంటకము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ముండ్లు లేనిది. ౨. నిర్బాధకము, బాధకము లేనిది. (రాజ్యము మొ.)

నిష్కము. సం. వి. అ. పుం. న. ౧. పదునాఱు మాషములతూనిక కలబంగారునాణెము, మాడ. ౨. టంకము. ౩.దీనారము. ౪.పదునాఱు ద్రమ్మములయెత్తు. (౨౦వరాటంకములు=ఒకకాకిణి;౪ కాకిణులు=ఒక పణము; ౧౬ పణములు=ఒక ద్రమ్మము; ౧౬ ద్రమ్మములు=ఒకనిష్కము.) నూటయెనిమిది మాడలయెత్తు గలబంగారము. (౧౫౦ మాడలయెత్తు కలబంగార మని కొందఱు.) ౬. వక్షోభూషణము, పతకము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౪. బంగారు. ౫. బంగారుపాత్రము. ౬. పలము. (నాలుగుకర్షములయెత్తు.)

నిష్కర్తనము. సం. వి. అ. న. కత్తిరించుట, ఛేదించుట.

నిష్కర్షణము. సం. వి. అ. న. ౧. నిస్సారణము, వెలికి లాగుట; వెడలఁబుచ్చుట. ౨. నిశ్చయించుట.

నిష్కర్షము. సం. వి. అ. పుం. ౧. నిస్సారణము, ఊడఁబెఱుకుట. ౨. సారాంశము. ౩. నిశ్చయము. ౪. ఇది యిట్టిది యింత యని స్వరూపనిర్ధారణము చేయుట.

నిష్కర్షించు. సం. స. క్రి. ౧. నిశ్చయించు. ౨. లాగు, బలవంతముగా కైకొను. (శే.ర.)

నిష్కల్మషము. సం. విశ. (అ.ఆ.అ.) కల్మషము లేనిది.

నిష్కళ. సం.వి.ఆ. స్త్రీ. ముట్టుడిగినయాఁడుది.

నిష్కళము. సం. విశ. (అ.ఆ.అ.) ౧. కళాశూన్యము, కళలు లేనిది. (చంద్రబింబము మొ.) ౨. నిరవయవము, భాగములు లేనిది, సంపూర్ణము. (బ్రహ్మము.) ౩. వీర్యము లేనిది. ౪. నృత్తగీతాదికలాశూన్యము.

నిష్కషాయము. సం. విశ. (అ. ఆ. అ ) కషాయము -రాగద్వేషాదిదోషము- లేనిది. (మనసు మొ.)

నిష్కామము. సం. విశ. (అ.ఆ.అ.) ౧. కామము లేనిది, కోరిక లేనిది. ౨. కామము -కోరిక- తో చేయఁబడనిది. (కర్మము.)

నిష్కారణము. సం. విశ. (అ.ఆ.అ.) ౧. నిర్హేతుకము, కారణము లేనిది. ౨. ఒక కారణము చేత కలుగనిది, సహజము.

నిష్కాలకుఁడు. సం. విశ. (అ.లికా.అ.) ౧. కేశములు రోమములు గొఱిగించుకొన్నవాఁడు. ౨. నిర్గతసమయుఁడు, సమయము నతిక్రమించినవాఁడు.

నిష్కాలనము. సం. వి. అ. న. ౧. చాలనము, కదల్చుట; పసులు లోనగువానిని తోలుట. ౨. చంపుట.

నిష్కాలికుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) ౧. జీవితకాలము తీఱినవాఁడు. ౨. అజయ్యుఁడు, జయింప శక్యముకానివాఁడు.

నిష్కాసకుఁడు. సం. విశ. (అ.సికా.అ.) వెళ్లువాఁడు; వెడలఁగొట్టువాఁడు.

నిష్కాసము. సం. వి. అ. పుం. ౧. నిస్సారణము, వెడలించుట; వెడలుట, వెడలఁబాటు. ౨. ప్రాసాదాద్యుపరితలబహిర్భాగము, మేడ మొదలగు వానిమీఁదిబహిః ప్రదేశము.

నిష్కాసి. సం. విశ. (న్.సీ.న్.) వెళ్లువాఁడు; వెళ్లఁగొట్టువాఁడు.

నిష్కాసితము. సం. విశ. (అ.ఆ.అ.) ౧. తఱుమఁబడినది, వెడలఁగొట్టఁబడినది. ౨. ఆహితము, ఉంచఁబడినది. ౩. అధికృతము, అధికారమునందుంచఁబడినది.

నిష్కాసిని. సం. వి. ఈ. స్త్రీ. నిర్బంధము లేని దాసి. (ఆ. ని.)

నిష్కించనుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) ౧. ఏమియు లేనివాఁడు, అకించనుఁడు, దరిద్రుఁడు. ౨. ఆప్తకాముఁడు, పొందఁదగిన దేదియు లేనివాఁడు.

నిష్కుటము. సం. వి. అ. పుం. ౧. అంతఃపురము, అంతిపురము. ౨. గృహారామము, ఇంటితోఁట. ౩. కవాటము, తలుపు. ౪. కేదారము, మడి. (మే. ని.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిష్కుటి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. ఏలకి.

నిష్కులము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. కులము లేనిది. ౨. - నిర్గత మగుఅవయవసమూహము కలది-పొట్టు తీసినది.(ధాన్యాదికము.);తొక్క తీసినది. (ఫలాదికము.)

ఉదా : నిష్కులీకృతదాడిమము.

నిష్కులీనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అకు లీనుఁడు, నీచవంశమువాఁడు.

నిష్కులుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కులము లేనివాఁడు; బంధువులు లేనివాఁడు.

నిష్కుషితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఒలువఁబడినది (ఫలాదికము.);పొట్టుదీయఁబడినది. (ధాన్యాదికము.) ౨. తీసివేయఁబడినది. (ప్రాణాదికము.) ౩. చీల్పఁబడినది; ఖండితము, ముక్కలుచేయఁబడినది; పురుగులు మొదలగువాని చే తొలుకఁబడినది.

నిష్కుహము. సం.వి అ.పుం.కోటరము, తొఱ్ఱ.

నిష్కూజము. సం.విణ. (అ. ఆ. అ.) కూజన ము లేనిది,కూఁత లేనిది. (పక్షి మొ.)

నిష్కూటము. సం. విణ. (అ. ఆ. అ.) కూట ములేనిది, కపటములేనిది.

నిష్కృతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రాయశ్చిత్తము నొందినది. ౨. కృతము, చేయబడినది. ౩. (ఋణము పాపము మొదలగువాని నుండి) విముక్తినొందినది, శుద్ధము. ౪. (రోగాదులనుండి) తొలఁగింపఁబడినది. వి. అ. న. ౧. ప్రాయశ్చిత్తము. ౨. సంకేతస్థలము.

నిష్కృతి. సం. విణ. (ఇ.) కృతి లేనివాఁడు.వి. ఇ. స్త్రీ. ౧. (ఋణము పాపము మొదలగు వానినుండి) విముక్తి, శుద్ధి. ౨. ప్రాయశ్చిత్తము. ౩. (రోగాదులు) తొలఁగుట.

నిష్కృపుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కృప లేనివాఁడు, దయ లేనివాఁడు.

నిష్కృష్టము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. నిస్సారితము, వెలికిలాగఁబడినది. (శల్యాది.) ౨. (పర రాజులు మొదలగువారినుండి) పుచ్చుకొనఁబడినది, ఆహృతము.(ధనాదికము.) ౩.సారముగాఁ దీయఁబడినది. ౪. నిశ్చయింపఁబడినది. (ఉదా: నిష్కృష్టార్థము.)

నిష్కైవల్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నిశ్చిత మైనకేవలత్వము -ఒంటితనము- కలది, కేవలము.

శ్లో. నిష్కైవల్యేన పాపేన తిర్యగ్యోనిమవాప్నుయాత్,పుణ్యపాపేన మానుష్యం పుణ్యేనైకేన దేవతామ్.సం.భార. శాం. (వాచ.)

౨. మోక్షహీనము.

నిష్కోటికము. సం. వి. అ. పుం. న. ఎడమచేతివ్రేళ్లతో వీణతీఁగెలను మీఁటుట. (వై. ని.)

నిష్కోషణకము. సం.విణ. (అ.ఱికా.అ.) దంతమలమును వెలికి తీయునది. (పలుదొట్టుపుల్ల.)

శ్లో. దంతస్య నిష్కోషణకేన నిత్యం, కర్ణస్య కండూయనకేన వాపి, తృణేన కార్యం భవతీశ్వరాణాం, కిమంగ వాగ్ఘస్తవతా నరేణ. సం. పంచ. మిత్రభేద. ౭౪.

నిష్కోషణము. సం. వి. అ. న. ౧. (పండ్లు ధాన్యము మొ. వాని) తోలు ఒలుచుట, పొట్టుతీయుట. ౨. అంతర్గతము లైనవాని బహిర్నిస్సారణము, లోపల నున్నవానిని వెలికి తీయుట.

నిష్కోషము. సం. వి. అ. పుం=నిష్కోషణము

నిష్క్రమణము. సం. వి. అ. న. ౧. గృహము నుండి వెలికి పోవుట, వెడలబాటు. ౨. శిశువును నాల్గవమాసమునగాని మూఁడవమాసమునగాని మొదటిసారి యింటినుండి వెలికి తీసికొని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వచ్చి సూర్యచంద్రాగ్నుల దర్శనము చేయిం
చుట. (ఇది షోడశసంస్కారములలో నొకటి.)

నిష్క్రమణిక. సం. వి. ఆ. స్త్రీ. శిశువులకు
చేయఁదగిననిష్క్రమణ మనుసంస్కారము.

నిష్క్రమత్. సం. శతృ. నిష్క్రమించుచున్న.

నిష్క్రమము. సం. వి. అ. పుం. ౧. వెడలఁబా
టు, గృహాదులనుండి వెలుపలికి పోవుట. ౨.
శిశువును నాల్గవమాసమునఁగాని మూఁడవ మాస
మునఁగాని మొదటిసారి యింటినుండి వెలికి తీసి
కొనివచ్చి సూర్యచంద్రాగ్నుల దర్శనము చేయిం
చుట. (ఇది షోడశసంస్కారములలో నొకటి.)
౩. జాత్యాదులనుండి భ్రంశము. (చెడుటలము
అని శ.ర.) ౪. ధీశక్తి. (శుశ్రూష, శ్రవణము,
గ్రహణము, ధారణము, ఊహ, అపోహము,
అర్థవిజ్ఞానము, తత్త్వవిజ్ఞానము అను నెనిమిదిగుణ
ములు కలది.)

నిష్క్రమించు. సం. అ. క్రి. వెడలు, వెడలి
పోవు.

నిష్క్రమిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నిష్క్ర
మించువాఁడు.

నిష్క్రయణము. సం. వి. అ. న. ౧. సమాన
మైనవిలువ కలఒకవస్తువు నిచ్చి మఱియొకవస్తు
వును తీసికొనుట, వినిమయము. ౨. తాకట్టు
వస్తువు మున్నగుదానిని విడిపించుట.

నిష్క్రయము. సం. వి. అ. పుం. ౧. భృతి,
కూలి; వేతనము, జీతము. ౨. వినిమయద్రవ్య
ము, సమాన మైనవిలువ కలఒక ద్రవ్యము నిచ్చి
పుచ్చుకొన్న మఱియొక ద్రవ్యము. ౩. వినిమ
యము, వస్తువులమాఱుపు. ౪. మూల్యము, వెల.
శ్లో. అభ్యుత్సహే సంప్రతి నోపరోద్ధుమల్పే
తరత్వాచ్ఛ్రితనిష్క్రయస్య. సం. రఘు.
౫. ౨౨.
౫. క్రయము, వెలకుఁగొనుట. ౬. విక్రయము,
అమ్ముట. ౭. పరాధీన మగుదానిని ధనాదులిచ్చి
విడిపించుట. ౮. పరాధీన మగుదానిని విడిపిం
చుట కిచ్చుమూల్యము, విమోచనమూల్యము.
శ్లో. కుంభయోని రలంకారం తస్మై దివ్యపరిగ్ర
హం,దదౌ దత్తం సముద్రేణ పీతేనే వాత్మ
నిష్క్రయమ్. సం. రఘు. ౧౫. ౫౫.
శ్లో. ఔదాసీన్యం న యుక్తం ప్రియసుహృది
గతే మత్కృతే చాతిఘోరాం, వ్యాపత్తిం
జ్ఞాతమస్య స్వతనుమహమిమాం నిష్క్ర
యం కల్పయామి. ముద్రా. ౬. ౨౧.
౯. బుద్ధియోగము, బ్రహ్మానుసంధానము.౧౦.
సామర్థ్యము. ౧౧. నిర్గమనము, బయలు వెడ
లుట. ౧౨. ప్రత్యుపకారము.

నిష్క్రాంతము. సం. విణ. (అ.ఆ.అ.) నిష్క్ర
మించినది, బయలువెడలినది.

నిష్క్రాంతి. సం. వి. ఇ. స్త్రీ. నిష్క్రమించుట,
బయలువెడలుట.

నిష్క్రామకుఁడు. సం. విణ. (అ. మికా. అ.)
నిష్క్రమించువాఁడు, బయలువెడలువాఁడు.

నిష్క్రామితము. సం. విణ. (అ. ఆ. అ.) వెడ
లింపఁబడినది, నిష్క్రమింపఁజేయఁబడినది.

నిష్క్రామ్యత్. సం=నిష్క్రమత్.

నిష్క్రియుఁడు. సం.విణ. (అ.ఆ.అ.) ౧. వ్యా
పారశూన్యుఁడు, పని లేనివాఁడు. ౨. విహితక
ర్మము లాచరింపనివాఁడు.

నిష్క్వాథము. సం. వి. అ. పుం. ౧. మాంసా
దిక్వాథము, మాంసాదులు వైచి కాఁచిన కషా
యము; క్వాథము, కషాయము.

నిష్టంకము. సం. వి.అ. న. మధుపర్కము. (అతి
థులకు తేనె పెరుఁగు పండ్లు మొదలగునవి
యొసంగుట. వై. ని.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**నిష్టంకించు.** సం. అ. క్రి. తాఁకు, మార్కొను.

శా. నిష్టంకించి శశాంకశేఖరుఁడు గాండీవాయుధుండున్ భుజా, వష్టంభంబులు సిద్ధచారణులు సైవారంబుఁ గావింపఁగా, దిష్టాంతాంతకఘోరమూర్తు లయి సాదృశ్యం బదృశ్యంబుగా, ముష్టీముష్టి రణంబు చేసిరి యసన్మోహప్రకారంబులన్. హర. ౭.౮౬.

వ...కాలు మెట్టుటయుం గేలు దట్టుటయుం జీరచించుటయుం గేరడించుటయున్ నిష్టంకించి ముష్టీముష్టిఁ గచాకచిం గలహించువారల వహించుకొని చేపట్లయుం బూనుజానపదులును...పాంచా. ౨. ౬.

**నిష్టపనము.** సం. వి. అ. న. ౧. ఎక్కువగా కాలుట. ౨. మిక్కిలి కాల్చుట.

**నిష్టప్తము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మెఱుఁగుపెట్టఁబడినది, చికిలిచేయఁబడినది. ౨. చక్కఁగా వండఁబడినది, బాగుగా పక్వము చేయఁబడినది. ౩. బాగుగా కాలినది. ౪. బాగుగా కాల్పఁబడినది.

**నిష్టానకము.** సం. వి. అ. పుం. ఆర్తధ్వని, మొఱ.

**నిష్టాపము.** సం.వి.అ.పుం. ౧. కాల్చుట, వెచ్చచేయుట. ౨. పరితాపము, దుఃఖము.

క. దుష్టమనస్కుం డగునా, ధృష్టద్యుమ్నుండు దక్క దేవా సుజనో, త్కృష్టుఁ డగుగురుని తెగుటయు, నిష్టాపముఁ బొందె భూతనికరము లెల్లన్. భార. ద్రో. ౧. ౭౮.

**నిష్ఠ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. స్థితి, ఉనికి. ౨. ఆధారము. ౩. నిలుకడ, కుదురు.

శ్లో. మనో నిష్ఠాశూన్యం భ్రమతి చ కిమప్యాలిఖతి చ. మాలతీ. ౧. ౩౧.

౪. ఆస్థ, ఆసక్తి. ౫. పూనిక, అభినివేశము. ౬. ధర్మాదులయందలి శ్రద్ధ, నమ్మిక. (శాస్త్రనిష్ఠ, కర్మనిష్ఠ.) ౭. అంతము, సమాప్తి. ౮. (నాట్య.) ప్రస్తుతకథాసమాప్తిరూప మయినసంధివిశేషము. ౯. నాశము. ౧౦. నిష్పత్తి, నెఱవేఱుట. ౧౧. యాచన, వేఁడికోలు. ౧౨. (వ్యాక.) క్తక్తవతు ప్రత్యయములు. ౧౩. అవధారణము, నిశ్చయము.

గీ...సంశయితసంవేదనంబు, మనసుకృత్యంబయి కార్యమునను నొండ్లు, సారవు నిష్ఠ బుద్ధిన యగుఁ జొరఁగ నేర, వి త్తెఱంగున కపరంబు లెఱిఁగికొనుము. భార. అశ్వ. ౨. ౨౯.

**నిష్ఠము.** సం. విణ. (అ. ఆ. అ.) ఉన్నది. (ఉదా: తటాకనిష్ఠజలము.)

వ...నివృత్తిధర్మంబునందు నిష్ఠుండును విద్యాసహాయుండును నై...భార. శాం. ౬. ౪౧౩.

**నిష్ఠానము.** సం.వి.అ.న. ౧. తేమనము, తిమ్మనము, పాలు పిండి బెల్లముకలిపి వండెడుపదార్థము. ౨. గంధపుగిన్నె. (వై. ని.)

**నిష్ఠించు.** సం. అ. క్రి. నిష్ఠ కలిగియుండు, శ్రద్ధవహించు.

ద్వి. నెలకొని మముఁ బ్రోవ నిష్ఠించి కావఁ, దలఁచి...పండితా. పురా. ౧౩౭ పా.

ద్వి. కరతలాంగుళములఁ గను ఱెప్ప లెత్తి, నెరసున్నఁ గని హాఱ నిష్ఠించి యూఁదు. బస. పు. ౩. ౭౭౩ పం.

స. క్రి. నిశ్చయించు, నిర్ణయించు.

సీ...ఉదంకుండు సనుదెంచి విభు నభిజ్ఞానమడిగె, నాతఁ డీఁగతి సేమ మగు నని నిష్ఠింప రా దిది వెలి గాఁగ లేద వేఱ, గతియును. ఆ...అనిన...భార. అశ్వ. ౩. ౯౫.

క. అని నిష్ఠించి పలుక నృవినుతచరిత్రుండు...తపమునన మే లొందెన్. భార. అశ్వ. ౨. ౮౨.

సీ. నిష్ఠించి యిబ్భంగి నీ కేమ సెప్పినవాక్యంబు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లెల్లను వఱదఁ గలసి,పోయెనే...భార. అశ్వ. ౧. ౧౨.

నిష్ఠితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చక్కఁగా నెలకొనియున్నది; ఉన్నది. ౨. నిష్ఠ గలది, శ్రద్ధ గలది. ౩. స్థిరము, నిలుకడకలది. ౪. నిశ్చితము, నిశ్చయింపఁబడినది.

నిష్ఠీవనము. సం. వి. అ. న=నిష్ఠీవము.

నిష్ఠీవము. సం. వి. అ. పుం. న. ఉమియుట.

నిష్ఠీవితము. సం. వి. అ. న=నిష్ఠీవము.

నిష్ఠురము. సం.విణ. (అ.ఆ.అ.) ౧. కఠినమైనది, గట్టిది. (వస్తువు మొ.) ౨. పరుషము, పరుసనిది. (మాట.) ౩. అశ్లీలమైనది, అమంగళకరమైనది. (మాట.) వి.అ.న. ౧. పరుషవచనము. ౨. అశ్లీలవచనము, అమంగళకర మగుమాట.

నిష్ఠేవనము. సం=నిష్ఠీవము.

నిష్ఠేవము. సం=నిష్ఠీవము.

నిష్ఠ్యూతము. సం. విణ. (అ. ఆ. అ.) ఉమియఁబడినది. (ఉమ్మి మొ.) వి. అ. న. ఉమియుట.

నిష్ఠ్యూతి. సం. వి. ఇ. స్త్రీ. ఉమియుట.

నిష్ణాతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నేర్పరి, ప్రవీణుఁడు. ౨. పారంగతుఁడు, పూర్తిగా నేర్చినవాఁడు.

నిష్ణుఁడు. సం=నిష్ణాతుఁడు.

నిష్పంకము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. బురదలేనిది. ౨. కల్మషము లేనిది, పాపము లేనిది.

నిష్పక్వము. సం. విణ. (అ. ఆ. అ.) ౧.మిక్కిలి పక్వమైనది (కూర మొ.) ౨. క్వథితము, కషాయముగా కాఁపఁబడినది.

నిష్పతనము. సం. వి. అ. న. వెలుపలికి పరుగిడి వచ్చుట, వేగముగా నిర్గమించుట.

నిష్పతిష్ణువు. సం.విణ. (ఉ.) నితాంతపతనశీలుఁడు,మిక్కిలి పడెడుస్వభావము కలవాఁడు.

నిష్పత్తి. సం.వి. ఇ. స్త్రీ. ౧. ఉత్పత్తి,పుట్టుక. ౨. పరువము, పండుట. ౩. సిద్ధి, నెఱవేఱుట. ౪. (గణిత.) సంబంధము, రెండు సంఖ్యలలో చిన్నసంఖ్యవలన పెద్దసంఖ్య ఎన్నిపర్యాయములకు నిశ్శేషముగా పోవుచున్నదో ఆపర్యాయ సంఖ్య. (ఉదా: ౧౫, ౩ సంఖ్యలలో ౩ వలన ౧౫ సంఖ్య ౫ పర్యాయములకు నిశ్శేష మగునట్లు తీసివేయఁబడుచున్నది కావున ౫ సంఖ్య ౧౫, ౩ లకు నిష్పత్తి యగును.)

నిష్పత్త్రము. సం. విణ. (అ. ఆ. అ.)పత్త్రములు లేనిది.

నిష్పత్త్రాకరణము. సం. వి. అ. న.=నిష్పత్త్రాకృతి.

నిష్పత్త్రాకృతము. సం. విణ. (అ. ఆ. అ.)సపుంఖముగా ఆవలిప్రక్కకు దూసికొనిపోవునట్లు బాణముచే కొట్టఁబడినది, గఱులు దూసికొని యావలిప్రక్కకు వచ్చునట్లు బాణముచే కొట్టఁబడినది; మిక్కిలి బాధపెట్టఁబడినది. (మృగాదికము.)

నిష్పత్త్రాకృతి. సం. వి. ఇ. స్త్రీ. అతివ్యథనము, మిక్కిలి బాధపెట్టుట.

నిష్పదము. సం. విణ. (అ. ఆ. అ.) పాదహీనము, అడుగులులేనిది. వి. అ. న. చక్రములు లేనియానము. (నావ మొ.)

నిష్పద్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) కలుగుచున్నది.

నిష్పన్నము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఉత్పన్నము, కలిగినది. ౨. సిద్ధించినది, నెఱవేఱినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిష్పరిగ్రహుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. భార్యాదులు లేనివాఁడు. ౨. ప్రతిగ్రహము లేనివాఁడు, ఒకరినుండి ఏమియు పుచ్చుకొనని వాఁడు. ౩. పరిజనము లేనివాఁడు, పరివారము లేనివాఁడు. ౪. భోగ్యవస్తువులసంబంధము లేని వాఁడు.

నిష్పరిచ్ఛదుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పరిచ్ఛదము లేనివాఁడు.

నిష్పవనము. సం.విణ. (అ.ఆ.అ.) గాలి లేనిది. (స్థలము మొ.) వి. అ. న. చేట లోనగువానిచే చెరుగుట.

నిష్పాదకము. సం. విణ. (అ. దికా. అ.) నిష్పాదించునది, కలిగించునది.

నిష్పాదన. సం. వి. ఆ. స్త్రీ=నిష్పాదనము.

నిష్పాదనము. సం. వి. అ. న. ౧. ఉత్పత్తిఁ జేయుట, కలిగించుట. ౨. సిద్ధింపఁజేయుట, నెఱవేర్చుట.

నిష్పాదనీయము. సం=నిష్పాద్యము.

నిష్పాదయత్. సం. శత్రి. నిష్పాదించుచున్న.

నిష్పాదయమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిష్పాదించుచున్నది.

నిష్పాదయితృ. సం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) నిష్పాదించువాఁడు.

నిష్పాదయితవ్యము. సం=నిష్పాద్యము.

నిష్పాదించు. సం. స. క్రి. ౧. కలిగించు. ౨. సిద్ధింపఁజేయు, నెఱవేర్చు.

నిష్పాదితము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. కలిగింపఁబడినది. ౨. సిద్ధింపఁజేయఁబడినది, నెఱవేర్పఁబడినది.

నిష్పాద్యమానము. సం. విణ. (అ.ఆ.అ.) నిష్పాదింపఁబడుచున్నది, నెఱవేర్పఁబడుచున్నది.

నిష్పాద్యము. సం. విణ. (అ.ఆ.అ.) నిష్పాదింపఁదగినది, నెఱవేర్పఁదగినది.

నిష్పావము. సం. విణ. (అ.ఆ.అ.) వికల్పము లేనిది, నిశ్చితము. వి. అ. పుం. ౧. (ధాన్యాదులు) ఎగురఁబోయుట, తూర్పెత్తుట. ౨. వితుషీకరణము, చెరుగుట. ౩. చేట లోనగువాని గాలి; గాలి. ౪. పెసలు లోనగువానిపొట్టు. ౫. కడంగరము, మాషముద్గాదికాష్ఠము. ౬. శ్వేతశింబీధాన్యము, అనుములు శ్రీ. ౭. రాజమాషము, పెద్దబొబ్బరలు శ్రీ.

నిష్పావితము. సం. విణ. (అ.ఆ.అ.)౧. చెరుగఁబడినది. ౨.తూర్పెత్తఁబడినది.(ధాన్యాదికము.)

నిష్పిష్టము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. చక్కఁగా నూఱఁబడినది. ౨. మిక్కిలి నలఁగఁ గొట్టబడినది.

నిష్పీడనము. సం. వి. అ. న. ౧. పిసుకుట. ౨. పిండుట. ౩. మర్దించుట. ౪. పీడించుట, బాధించుట. (నిష్పీడనీయము, నిష్పీడితము మొ. పీడనీయము, పీడితము మొ. వానివలె గ్రహించునది.)

నిష్పురుషము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. నిర్జనము, జనము లేనిది. ౨. మగవాఁడు లేనిది. (వంశాదికము.)

నిష్పులాకము. సం. విణ. (అ.ఆ.అ.)౧. పొల్లు లేనిది, గట్టిది. (ధాన్యము మొ.) ౨. పెతుకు లేనిది.

నిష్పేషణము. సం. వి. అ. న=నిష్పేషము.

నిష్పేషము. సం. వి.అ.పుం. ౧. నిఘర్షణము, చక్కఁగా నూఱుట. ౨. నిష్పీడనము. ౩.చూర్ణనము, పొడిచేయుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిష్ప్రికారకము. సం. విణ. (అ. రకా. అ.) ౧. ప్రకారములు -భిన్నవిధములు- లేనిది, ఒక రీతిగనే యుండునది ౨. నిర్వికల్పము.

నిష్ప్రికాశము సం. విణ. (అ. ఆ. అ.) ౧. వెలుఁగు లేనిది. ౨. స్పష్టము కానిది.

నిష్ప్రిచారము. సం. విణ. (అ.ఆ.ఆ.) ౧. సంచరింపనిది, ఒకచోటనే యుండునది. ౨. ఏకాగ్రము, ఒకదానియందే లగ్నమయినది.

నిష్ప్రితిఘము. సం. విణ. (అ.ఆ.అ.) ప్రతిఘాతము లేనిది, అడ్డు లేనిది.

నిష్ప్రితిద్వంద్వుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అసమానుఁడు, సాటి లేనివాఁడు. ౨. ఎదిరి లేనివాఁడు, శత్రువు లేనివాఁడు.

నిష్ప్రితిభుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కాంతి లేనివాఁడు. ౨. ప్రజ్ఞాశూన్యుఁడు, జడుఁడు.

నిష్ప్రితీకారము, సం. విణ. (అ. ఆ. అ.) ప్రతికారము లేనిది. వి. అవ్య.అ.న. ప్రతిక్రియలేమి. ఇట్లే : నిష్ప్రితికారము, నిష్ప్రితిక్రియము.

నిష్ప్రిత్యూహము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్విఘ్నము, విఘ్నము లేనిది. వి.అవ్య. అ. న. విఘ్నములు లేమి.

నిష్ప్రిపంచము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రపంచము లేనిది. ౨. విస్తీర్ణత లేనిది, సంకుచిత మైనది. ౩. మోసము లేనిది.

నిష్ప్రిభము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కాంతి లేనిది, దీప్తి లేనిది. ౨. తేజస్సు లేనిది, ప్రతాపము లేనిది.

నిష్ప్రియోజనము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రయోజనము లేనిది. వి. అవ్య. అ. న. ప్రయోజనములేమి.

నిష్ప్రివాణము. సం. వి. అ. న. చలువచేయని క్రొత్తవస్త్రము, అనాహతము.

నిష్ప్రివాణి. సం. విణ. (ఇ) క్రొత్తది (వస్త్రము.)

నిష్ఫల. సం. వి. ఆ.స్త్రీ. ముట్లుడిగినయాఁడుది.

నిష్ఫలము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. ఫలము లేనిది, ప్రయోజనము లేనిది, వ్యర్థ మైనది. (యత్నము. మొ.) ౨. పండ్లు లేనిది. (చెట్టు మొ.) ౩. పండనిది (వరిమొక్క మొ.) ౪. గొడ్డుది, వీర్యము లేనిది.

నిష్యందము. సం. విణ. (అ. ఆ. అ.) స్రవించునది, కాఱునది. వి. అ. పుం. ౧. క్షరణము, స్రవించుట, కాఱుట. ౨. వృక్షాదులపట్టనుండి కాఱుద్రవము, రసము. ౩. ప్రవాహము, సెలయేఱు. (ఇట్లే: నిస్యందము.)

నిష్యంది. సం. విణ. (న్. నీ. న్.) ౧. స్రవించునది, కాఱునది. ౨. నిష్యందము కలది, రసము కలది. ౩. స్రవింపఁజేయునది, ఒలికించునది.

నిష్షమము. సం=దుష్షమము.

నిష్పందము. సం. విణ. (అ.ఆ.అ.) స్పందము లేనిది, కొంచెమైనను కదలిక లేనిది.

నిసంపాతము. సం. విణ. (అ.ఆ.అ.) సంచారశూన్యము, రాకపోకలు లేనిది (త్రోవ మొ.) వి. అ. పుం. (నివృత్తసంచారము) నిశీథము, నడిరేయి.

నిసర్గజము. సం. విణ. (అ.ఆ.అ.) స్వభావముచేఁ బుట్టునది, సహజము, స్వాభావికము.

నిసర్గము. సం. వి. అ. పుం. ౧. స్వభావము. ౨. స్వరూపము. ౩. సృష్టి, సృజించుట. ౪. విసర్గము, విడుచుట. ౫. ఇచ్చుట, అప్పగింత.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిసర్గసిద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) స్వభావ ముచేతనే కలిగినది, సహజము.

నిసాఱు. వి. మల్లవిద్యావిశేషము.

వ... పెనఁగులాటవితంబులును నిసాఱు... మొదలగుచౌరవనేర్పులును... మల్లుపు. ౩. ౬౯.

నిసి. వి. (సం. నిశా. ప్రా. నిసా. క. నిసి.) ౧. రాత్రి.

చ... పతిదివ్యభవ్యమణిపాదుక లంఘ్రుల సంఘటించి యక్కనకపురంబు చొచ్చి తమకంబున నన్నిసి పుచ్చి వేడుకన్. విక్ర. ౨. ౧౦౫.

౨. అర్ధరాత్రము. (శ. ర.)

జః నిసివెలుఁగు.

నిసింధువు. సం. వి. ఉ. పుం. సిందువారము, వావిలిచెట్టు.

నిసివెలుఁగు. వి. (√నిసి.) చంద్రుఁడు. (శ.ర.)

నిసుఁగు(వు). వి. (సం. శిశుః. త. నిసువు.) పక్షి మొ. వానిపిల్ల; శిశువు, బిడ్డ; అంకురము.

గీ. నిసు వనంగను బిల్లనా నిసుఁ గనంగఁ, గూన యనఁ గందు నాఁగను గొదమ యనఁగఁ, దిర్యగర్భకములుగాను దెలియవలయు. ఆం. భా. ౨. ౯౯.

క. ముచ్చాకపురూపులు పూ, స్వేచ్ఛనిజేజేయ నుంగునిసుఁగుం గని లో, లోచ్చాకియింతయు నొదవని, మచ్చిక నవ్వానిరాచమానిసి పలికెన్. అచ్చ. రా. కిష్కిం. ౨౩.

వ... గాధిపుత్రునిమీఁది మైత్రియుఁ దల్లి తో ఁ బంగునిసుంగుమీఁది కారుణ్యంబును బెనఁగొన ... పి. శకుం. ౨. ౧౪౯.

గీ. అందులకుఁ జాల సందియం బంది యేఁడు, వీనిఁ దెగటార్చి రం డని వేఁగ గజుఁడు, వృషభుఁ డంగదుఁ డీఁదయ ర్రిలినిసుంగు, నలుఁడు మొదలుగ బలియురఁ బిలిచి పనిచె. అచ్చ. రా. యు. ౧౪౨.

సీ. నిసువు పై పసుపునూనియజిడ్డు లంటినచిటికమ్మికుఱుమాపుచీరతోడ. శుక. ౪. ౩౭.

గీ. కటకటా యెట్లు తనబుద్ధి కాటఁ గలియ, నిసువుఁ జంపంగఁ దలఁచెనో నీమగండు. హర. ౨. ౯౯.

సీ. మొక్క మోక నిసువు మొలక మో సనఁగ నంకురమునకుఁ బేళ్లు... ఆం. సం. స్థా. ౬.

క్రొన్నిసువు=పసిబిడ్డ.

క. అసురుల మాయోపాయులఁ, గసిమసఁగఁగ నఁట మఖంబుఁ గావఁగ నఁట తాపసుఁడొకఁ డఁట పిసువులఁ గ్రొన్నిసువుల నడిగె నఁట మునులు నిర్మోహులుగా. రామా. ౪. ౭.

పసినిసువు=క్రొన్నిసువు.

క. అకటా పసినిసువులఁ గొంకక కాఁడవులకుఁ బంపఁగా వలె నని కోరికతోఁ బలికెద వెద నిం చుకయుఁ గనికరము నీకుఁ జొప్పడదు గదా. అచ్చ. రా. బాల. ౧౦౧.

నిసృత. సం. వి. ఆ. స్త్రీ. త్రివృత, తెగడచెట్టు.

నిసృతము. సం. విణ. (అ. ఆ. అ.) నితాంతగతము, మిక్కిలిపోయినది.

నిసృష్టము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. విసృష్టము, విడువఁబడినది. ౨. ఇయ్యఁబడినది, అప్పగింపఁబడినది. ౩. సృజింపఁబడినది. ౪. న్యస్తము, ఉంచఁబడినది. (కార్యభారాదికము.) ౫. దాఁచఁబడినది. (తాకట్టువస్తువు మొ.) ౬. మధ్యస్థము, ఒకపక్షమున అభిమానము లేక సమానముగా నుండునది.

నిసృష్టార్థదూతి. సం. వి. ఈ. స్త్రీ. నాయికానాయకులభావమును గ్రహించి తనబుద్ధిచే కార్యమును సాధించుదూతిక.

నిసృష్టార్థుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) న్యస్తకార్యభరుఁడు, అప్పగింపఁబడినకార్యము కలవాఁడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వి. అ.పుం. ౧. స్వామిచే ధనాయవ్యయ పాలనమందును కుసీద -వడ్డి- కృషివాణిజ్యము లందును నియుక్తుఁ డైనవాఁడు. ౨. ఉభయుల భావమును గ్రహించి తా నే యుత్తరము చెప్పి కార్యమును నెఱవేర్చుదూత. (నిసృష్టార్థుఁడు, మితార్థుఁడు, సందేశహారకుఁడు అని దూతలు ముబ్బురు.)

నిసోఢము. సం.విశ. (అ.ఆ.అ.) మిక్కిలి సహింపఁబడినది.

నిస్తంతువు. సం. విశ. (ఉ) ౧. దారము లేనిది, సూత్రము లేనిది. ౨. సంతానము లేనిది.

నిస్తంద్రము. సం. విశ. (అ. ఆ. అ.) తంద్ర లేనిది, కునికిపాట్లు లేనిది. ౨. అలసత లేనిది, మాంద్యము లేనిది.

నిస్తంద్రి. సం. విశ. (ఇ) = నిస్తంద్రము.

నిస్తత్త్వము. సం.విశ. (అ. ఆ. అ.) అసత్తయినది, వాస్తవము కానిది.

నిస్తబ్ధము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. స్రుప్పడినది, నిశ్చేష్టము. ౨. నిలిచినది, ఆఁగినది.

నిస్తమస్కము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. చీకటి లేనిది. ౨. తమోగుణము లేనిది.

నిస్తరణము. సం. వి. అ. న. ౧. నిర్గమము, వెలువడుట. ౨. తరణము, (సముద్రము మున్నగునవి) కడచుట, దాఁటుట. ౩. నిస్తారము, (ఆపదాదులనుండి) తప్పించుకొనుట. ౪. సంపూర్ణముగా తెలిసికొనుట. ౫. ఉపాయము.

నిస్తరించు. సం. స. క్రి. ౧. (నద్యాదులను, కష్టాదులను) దాఁటు, కడచు.

వ ... ధృత్యాలంబనంబునం గదా యయాతి యాపద నిస్తరించె. భార. శాం. ౩. ౭౭.

గీ. వారు సైరణ నేసి దుర్వార మైన, నిరతిశయ దుఃఖభారంబు నిస్తరించి, సౌఖ్య మొందరె ... భార. విరా. ౨. ౨౩౪.

౨. తరింపఁజేయు, దాఁటించు.

ఆ... మతి మదీయపిండోదక,నిధిఁ దనూజుఁ గులమునిస్తరించు,వానిఁ బితృగణంబువలని ఋణంబుఁ బా,చినమహోపకారిఁ జిఱుతవాని.

ఆ. ఎట్టు సూచి చూచి యిది పాప మనక య, య్యసురవాతఁ ద్రోతు సదయవృత్తి. భార. ఆది. ౬. ౨౪౭,౨౪౮.

శ్లో. తమహం జ్యేష్ఠపుత్రం మే కులనిస్తారకం విభుం. సం. భార. ఆది. ౧౭౧. ౫౭.(వావిళ్ల ప్రతి పా.)

(నిస్తరిత, నిస్తరత్ మొ: తరిత, తరత్ మొ. వానివలె గ్రహించునది.)

నిస్తర్క్యము. సం. విశ. (అ. ఆ. అ.)అతర్క్యము, తర్కింప శక్యము కానిది.

నిస్తర్హణము. సం.వి.అ.న. మారణము,చంపుట.

నిస్తలము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. తలశూన్యము, అడుగు లేనిది. ౨. వర్తులము, గుండ్రనిది. ౩. చంచలము, నిలుకడ లేనిది. వి. అవ్య. అ. న. తలాభావము, తలములేమి.

నిస్తలి. సం. వి. ఈ. స్త్రీ. వటిక, మాత్ర.

నిస్తారకము. సం.విశ. (అ. రికా. అ.) నిస్తరింపఁజేయునది,దాఁటించునది.

నిస్తారణము. సం. వి. అ. న. ౧. దాఁటించుట. ౨. (కష్టాదులనుండి)దాఁటించుట, ఉద్ధరించుట. ౩. పారగమనము, (విద్యాదులయందు) అవ్వలిదరి చేరుట.

నిస్తారము. సం. వి. అ. పుం. ౧. తరణము, దాఁటుట. ౨. (అపాయాదులనుండి) ఉద్ధారము, తప్పించుకొనుట. ౩. (ఋణాదులను) పూర్తిగా చెల్లించుట. ౪. పారగమనము, (విద్యాదులయందు)అవ్వలిదరిచేరుట. ౫. ఉపాయము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౭. మోక్షము.

నిస్తితీర్ష. సం. వి. ఆ. స్త్రీ. నిస్తరింప నిచ్ఛ, దాఁటవలయు ననుతలంపు.

నిస్తితీర్షువు. సం. వి. ఉ. పుం. నిస్తరింప నిచ్ఛ కలవాఁడు, దాఁటఁ దలంపు కలవాఁడు.

నిస్తీర్ణము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దాఁటఁబడినది, కడవఁబడినది (నది,పాపము మొ.) ౨. (కష్టాదులనుండి) ఉద్ధరింపఁబడినది, తప్పింపఁబడినది.

నిస్తుషక్షీరము. సం. వి. అ. పుం. గోదుమచెట్టు.

నిస్తుషము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వితుషీకృతము, పొట్టుతీసినది. (తండులాది.) ౨. నిర్మలము, మఱికి లేనిది. ౩. లఘువైనది, తేలికయైనది.

నిస్తుషరత్నము. సం. వి. అ. న. -నిర్మలమణి- స్ఫటికము.

నిస్తుషితము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. పొట్టులేనిదిగా చేయఁబడినది. (తండులాది.) ౨. లఘూకృతము, చులుకనిదిగా చేయఁబడినది. ౩. త్యక్తము, విడువఁబడినది.

నిస్తేజము. సం. విణ. (స్) ప్రతాపము లేనిది వీర్యము లేనిది. వి. అవ్య. స్.న.౧. తేజోభావము, తేజములేమి. ౨. పౌరుషము లేమి, ప్రతాపము లేకపోవుట.

మ. మగపంతంబున మానసారుఁ డనిలో మా కల్గి పై నెత్తినన్, బగ వాటింపక వాని నొంపక జగత్ప్రఖ్యాతిగా నోటమై, దగ వూహింపక దుర్గభూములకు నిందాసాత్రమై శోకబుద్ధిగఁ జెప్పందగునే నృపప్రకృతి నిస్తేజంబు సైరించునే. దశకు. ౨. ౩౧.

నిస్తోదనము. సం. వి. అ. న= నిస్తోదము.

నిస్తోదము. సం. వి. అ.పుం. మిక్కిలిపొడుచుట, మిక్కిలిగ్రుచ్చుట; మిక్కిలిబాధించుట.

నిస్త్రపుఁడు. సం.విణ. (అ. ఆ. అ.) త్రప లేనివాఁడు, సిగ్గు లేనివాఁడు.

నిస్త్రాణము. సం. విణ. (అ. ఆ. అ.) త్రాణ లేనిది, సత్తువ లేనిది.

మ. అన శాభ్రవ్యుఁడు నిట్ల తప్ప దన నాహా కూటిమాత్రంబునన్, మన మే మమ్మను పోతిమో యితనికిం శాపంబు గా దంచు దు, ర్జనవృత్తిం జనువార లై మునులు నిస్త్రాణం పుగోవున్ సృజించి నియోగించిరి గౌతమోత్తకలమత్క్షేత్రంబు భక్షింపఁగన్.వరాహ. ౧౦. ౩౪.

క. అభ్యాదికిఁ జేయేతం, బుబ్బుచుఁ దంబళి యొనర్చి యుత్సాహంబున్,గుబ్బతిలఁ గొన్ని చెట్లకు, నిబ్బరమున జలము లెత్తి నిస్త్రాణుం డై. హంస. ౧. ౧౭౭.

నిస్త్రింశపత్త్రికము.సం.వి. అ. పుం. -నిస్త్రింశము -ఖడ్గము- వంటిఆకులు కలది- సింహుండము, బొమ్మచెముడు.

నిస్త్రింశపత్త్రిక. సం. వి. ఆ. స్త్రీ=నిస్త్రింశపత్త్రకము.

నిస్త్రింశము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ముప్పదికి ఎక్కుడైనది. (వయస్సు మొ.) ౨. క్రూరము, కనికరము లేనిది. వి.అ. పుం. ఖడ్గము.

నిస్త్రైగుణ్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. సత్త్వరజస్తమోగుణములు లేనివాఁడు. ౨. సంసారము లేనివాఁడు.

నిస్త్రైణపుష్పిక.సం. వి. ఈ. స్త్రీ.-(స్త్రైణమును- స్త్రీవాంఛాదికమును-పోగొట్టుపుష్పములు కలది- రాజధుత్తూరము, ఒకజాతిఉమ్మెత్త.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిస్త్వచ. సం. వి. ఆ. స్త్రీ. పరూషి, ఖర్జూరము.

నిస్పందము. సం=నిస్స్పందము.

నిస్పృహ. సం. వి. ఆ. స్త్రీ. అగ్నిశిఖావృక్షము, తరిగొట్టు.

నిస్పృహము. సం. విణ. (అ.ఆ.అ.) ఆశ లేనిది.

నిస్యందము. సం. వి. అ. పుం. కాఱుట.

నిస్రవము. సం=నిస్రావము.

నిస్రావము. సం. వి. అ. పుం. ౧. భక్తమండము, గంజి; గంజిమీఁగడ. ౨. క్షరణము, స్రవించుట. ౩. వెల్లువ, ప్రవాహము.

నిస్వనము. సం. విణ. (అ. ఆ. అ.) ధ్వని లేనిది. వి. అ. పుం. ధ్వని, మ్రోఁత.

నిస్వానము. సం=నిస్వనము.

నిస్సంగుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. సంగము లేనివాఁడు; విషయాసక్తి లేనివాఁడు. ౨. (జనాదులతో) కూడిక లేనివాఁడు.

నిస్సంజ్ఞము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. తెలివి లేనిది, మూర్ఛిల్లినది. ౨. సైగలు లేనిది. ౩. పేరు లేనిది.

నిస్సంతు. విణ. (సం. నిస్సంతతిః.) సంతానశూన్యము. (శ. ర, బ్రా.)
(వ్యవ.) అతనిసంతు నిస్సంతై పోయినది.

నిస్సందేహము. సం. విణ. (అ.ఆ.అ.) సందియములేనిది. వి. అవ్య. అ. న. సందియములేమి.

నిస్సందిగ్ధము. సం=నిస్సందేహము.

నిస్సంధి. సం. విణ. (ఇ) సంధులు లేనిది, అతుకులు లేనిది; గుత్తమైనది, దృఢము.

నిస్సంపాతము. సం=నిసంపాతము.

నిస్సంబాధము. సం. విణ. (అ.ఆ.అ.) పరస్పర సంఘర్షము లేనిది, ఇఱుకటము కానిది. (చోటు.)

నిస్సంశయము. సం. విణ. (అ. ఆ. అ.) సందేహము లేనిది; నిశ్చిత మైనది. వి. అవ్య. అ. న. సంశయములేమి.

నిస్స్పందము. సం. విణ. (అ. ఆ. అ.) స్పందము లేనిది, కొంచెమైనను కదలనిది. వి. అ. పుం. అధికచలనము, మిక్కిలి కదలుట. వి. అవ్య. అ. న. కదలికలేమి.

నిస్సత్తువ. వి. (సం. నిస్సత్వం. ప్రా. నిస్సత్త.) శక్తిలేమి, అశక్తి. (శ. ర, బ్రా. నిస్సత్తువు. చి. ని.)

నిస్సత్త్వము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. సత్తువ లేనిది, బలము లేనిది. ౨. యోగ్యత లేనిది, నీచము. ౩. ఉనికి లేనిది, పారమార్థికసత్యత్వము లేనిది. ౪. జంతువులు లేనిది. వి. అవ్య. అ. న. ౧. అశక్తి, సత్తువలేమి. ౨. అభావము, ఉనికిలేమి.

నిస్సపత్నుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సపత్నులు లేనివాఁడు, శత్రువులు లేనివాఁడు.

నిస్సరణము. సం. వి. అ. న. ౧. నిర్గమము, వెడలఁబాటు. ౨. గృహాదిముఖము, ఇల్లు లోనగువానిముందరిభాగము. ౩. మరణము. ౪. నిర్వాణము, ముక్తి. ౫. ఉపాయము, వెరవు.

నిస్సహాణము. సం. వి. అ. పుం. చర్మవాద్యవిశేషము.

ఉ. వారను నవ్వసుంధర నవారణఁ జాటఁ దొణంగి రోలి న్యారూరను బల్లెపల్లె వగరోత్కరవీథులఁ బట్టణంబులన్, భేరులు తమటంబులును నిస్సాణంబులు శంఖకాహళుల్, బోరు కలంగ మ్రోయ నృపపుంగవునాజ్ఞ వినంగఁ జెప్పచున్. రుక్మా. ౧. ౧౧౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. ఉరవడి శంఖకాహళము లూఁదుచు దిక్కు
లు వ్రయ్య నార్చుచుఁ, బెరసి మృదంగ
నిస్సవాణభేరులు ఘోషిల వ్రేయుచుఁ...
భా. రా. సుం. ౪౬౧.

నిస్సహము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఓర్పు లేనిది, సహింపనిది. ౨. బలము లేనిది, పటుత్వము లేనిది.

నిస్సాణము. సం. వి. అ. పుం. చర్మవాద్యవిశేషము.

ఉ. బాణుని గారవించి పురభంజను వీడ్కొని
శంఖనాదని,స్సాణధణంధణల్ చెలఁగ...
అని. ౫. ౪౩.

నిస్సానము. వి. (సం. నిస్సాణః. క. నిస్సాళువు.) చర్మవాద్యవిశేషము.

మ. అని దీవించుచు శుక్రుఁ డంతటను నెయ్యం
బొప్పఁగాఁ గ్రమ్మఱెఁ, జనియెఁ రాజును
భేరులుఁ గడిఁదినిస్సానంబులుఁ లోను
గాఁ,గను బెక్కుల్ బలువాయిదంబులు
చెలంగఁ వీడు చేరంగ నం,తను దానం గల
వార లెల్లఁగడకల్ దైవాఱ నొక్కుమ్మడిఁ.
యయా. ౪. ౧౫౧.

నిస్సార. సం. వి. ఆ. స్త్రీ. -చేవ లేనిది- కదళి, అరఁటి†.

నిస్సారణము. సం. వి. అ. న. బహిష్కరణము, వెడలఁగొట్టుట. ౨. గృహాదిముఖము, ఇల్లు లోనగువానిముందరిభాగము.

నిస్సారము. సం. విణ. (అ. ఆ. అ.) సారము లేనిది. వి. అ. పుం. ౧. నిర్గమము, వైకి పోవుట. ౨. శాఖోటకము†. ౩. శ్యోనాకభేదము, ఒకజాతిదుండిగము†.

నిస్సారితము. సం. విణ. (అ.ఆ.అ.) బహిష్కృతము, వెడలఁగొట్టఁబడినది.

నిస్సీమము. సం.విణ.(న్. న్, మా, మ్నా. న్.) ౧. సీమ లేనిది, ఎల్ల లేనిది. ౨. మేర లేనిది.

నిస్స్నేహా. సం. వి. ఆ. స్త్రీ. అతసి, నల్లయగిసె†.

నిస్స్నేహఫల. సం. వి. ఆ. స్త్రీ. -చమురులేని పండ్లు కలది- శ్వేతకంటకారి, తెల్లవాఁకుడు†.

నిస్స్నేహము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రేమ లేనిది, చెలిమి లేనిది. ౨. చమురు లేనిది, జిడ్డు లేనిది. వి. అవ్య. అ. న. స్నేహాభావము, చెలిమిలేమి.

నిస్స్రవము. సం=నిస్స్రావము.

నిస్స్రావము. సం. వి. అ. పుం. ౧. వ్యయము, వెచ్చము. ౨. భక్తరసము, గంజి. ౩. వడిగల వెల్లువ, వేకవంత మగు ప్రవాహము.

నిస్స్వుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ధనములేనివాఁడు, దరిద్రుఁడు. ౨. జ్ఞాతులు లేని వాఁడు, బంధువులు లేనివాఁడు.

నిహంత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) చంపువాఁడు, నాశము చేయువాఁడు. (నిహంతవ్యుఁడు, నిహననీయుఁడు మొ. హంతవ్యుఁడు, హననీయుఁడు మొ. వానివలె గ్రహింపవలయును.)

నిహతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కొట్టఁబడినది. ౨. చంపఁబడినది. ౩.(గణిత.) గుణింపఁబడినది. వి. అ.పుం. అనుదాత్తస్వరము. న. (గణిత.) గుణకారము.

నిహతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. మరణము, చావు. ౨. కొట్టు, దెబ్బ.

నిహననము. సం. వి. అ. న. ౧. వధము, చంపుట. ౨. కొట్టుట.

నిహాక. సం.వి.ఆ. స్త్రీ. ఉడుము; నీటిఉడుము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిహారము. సం. వి. అ. పుం. నీహారము, మంచు.

నిహింసనము. సం. వి. అ. న. వధము, చంపుట.

నిహితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఆహితము, ఉంచఁబడినది. ౨. స్థాపితము, నెలకొల్పఁబడినది. ౩. నిక్షిప్తము, నిధిగా నుంచఁబడినది. (ధనాది.)

నిహీనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి హీనుఁడు, నీచుఁడు.

నిహ్నవనము. సం. వి. అ. న. ౧. అపలాపము, (సత్యాదులను) మఱుఁగుపఱిచి చెప్పుట. ౨. మిస, నెపము.

నిహ్నవము. సం. వి. అ. పుం. ౧. అపలాపము, కలరూపును కప్పిపుచ్చి చెప్పుట. ౨. గోపనము, రహస్యము. ౩. శాఠ్యము, కపటము. ౪. అపనమ్మిక, అవిశ్వాసము. ౫. నిరాకరణము, తిరస్కారము. ౬. మిష, నెపము.

నిహ్నవవాది. సం. విణ. (న్. నీ. న్.) సత్యము కప్పిపుచ్చి మాఱుగా మాటలాడువాఁడు, కపటవాది. (సాక్షి, ప్రతివాది మొ.)

నిహ్నవించు. సం. స. క్రి. మఱుఁగుపఱచు.

సీ. రాజకార్యపరంపరాశేషమిషమున నిట్టూర్పు గాడ్పుల నిహ్నవించు. నైష. ౧. ౭౪.

నిహ్నవోత్తరము. సం. వి. అ. న. యథార్థస్థితిని కప్పిపుచ్చి చెప్పెడుఉత్తరము, కపటముగా చెప్పు ప్రతివచనము.

నిహ్నుతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. మఱుఁగుపఱుపఁబడినది. ౨. నిరాకరింపఁబడినది.

నిహ్నుతి. సం. వి. ఇ. స్త్రీ=నిహ్నవము.

నిహ్రాదము. సం=నిర్హ్రాదము.

## నీ

నీ స. (క. త. నీ.) యుష్మదర్థకము. (దీనికి ప్రథమాదివిభక్త్యేకవచనములయందు నీవు, ఈవు, నిన్ను, నిను, నిన్, నీచేత, నీకు, ఈకు మొదలగు రూపములును బహువచనముల మీరు, ఈరు, మీరలు, ఈరలు, మిమ్ము, మిము, మీచేత, మీకు, ఈకు మొదలగురూపములును అగును.) చూ. ఈవు.

గీ. నీవు మాచుట్టమవ పోలె నెమ్మితోడ. భార. ఆది. ౨. ౧౪౪.

చ ... నీ వితనితోడ రణం బొనరించెదేని వి, స్తరముగ నీదువంశమును దల్లిని దండ్రిని జెప్పు ... భార. ఆది. ౬. ౪౪.

గీ. విదురుఁ డేతెంచి యొరులకు వినియు నెఱుఁగగఁ, గానియ ట్లుండఁ బలికి నిక్క గఱపె బుద్ధి. భార. ఆది. ౬. ౧౪౪.

చ. అనవుడు నల్ల నవ్వి మనుజాధిపుఁ డిట్లను మీర లర్థసా, ధనపరతంత్రకోవిదులు ... ఆము. ౩. ౫౭.

సీ...కనుఁగొందు నేను మి మ్మిరువుర...నైష. ౨. ౭౬.

క. ఇది యట్టిద నీ చెప్పిన, సదభిమతోదారఫణితి సర్వము వింటిక్, మదిలోనఁ గంటి దీనికి, నొదవంగ నుపాయ మొకటి యూహించి తగక్. హరి. ఉ. ౧. ౨౩.

మ. నిను నే. బాసి చనంగ నోప నిచటక్ నీతో డిదే లోక మై, మనువాఁడక్...కాళ. ౩. ౪౨.

నీఁగు=ఈఁగు¹. స. క్రి. (క. నీగు. త. నీంగు.) ౧. నివర్తిల్లఁజేయు; పోఁగొట్టుకొను.

గీ...అనుమతి లేక కోయుంగఁ దగు నెమ్ముచ్చిమి య కాదె యిది పాప మచ్చుపడియె, నృపతిచే దండితుండవై నీఁగికొనుము. భార. శాం. ౧. ౧౬౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. నినుఁ గని యాపరాధభవము నీఁగఁగ నీశర
ణంబుఁ జొచ్చితిక్. భార. ఉద్యో. ४.
౨౫౭.

ఉ. ఇక్కథ భక్తితో వినిన నెప్పుడుఁ గీర్తన
సేసినక్ జనుల్, నిక్కము సర్వదోష ముల
నీఁగి భజింతురు భవ్యభద్రముల్. భార.
ఆర. ౫. ౨౮౯.

౨. (ఋణము మొ.) తీర్చు.

మ. వను ముఖ్యాములఁ బెట్టువాలి వనిలోనన్
లీలఁ దున్మాడి నా, కనుమోదంబుగ సర్వ
సంపదలఁ బ్రాజ్యం బైనరాజ్యంబు ని, చ్చె
న్నృపాలాగ్రణి తత్ప్రసాదమున నీ శ్రీలొంది
యున్నాఁడఁ బెం,పెనయక్ నామది నామ
హాత్మునిఋణంబె నేమిట నీఁగఁగదక్. భా.
రా. కిష్కిం. ४౯౩.

గీ. దోసమును నపకీర్తియుఁ దొలఁగఁ బెట్టి వాఁడు
గురుఁ గాచుకొంటివి నేఁడు నన్ను, సుతుని
గాచితి త్రిస్థానశుద్ధిగాను, నీఋణం బింక
నేమిట నీఁగువాఁడ. విక్ర. ३. ౧౭౯.

నీఁడు. వి. కమ్మవారిబిరుదుపేరు. (శ. ర, బ్రౌ.)
(వ్యవ.) అఁకినీఁడు, అబ్బినీఁడు, బాపినీఁడు,
సామినీఁడు. (నాయఁడుఁ నరు మాఱురూప
మని శ. ర.)

నీక. సం. వి.అ.పుం. ఒకానొకవృక్షము. (వాచ.)

నీకారము. సం. వి. అ. పుం. న్యక్కారము, తిర
స్కారము; అవమానించుట.

నీకాశము. సం=నికాశము.

నీగ. వి. బాలక్రీడావిశేషము. (బ్రౌ.)

సీ. గోటదొర్లుడుకాయ గొబ్బిళ్ళు మోపిళ్ళు
నీగ పోగిస బంతి దూగిలాట. హంస. ३.
౧४౬.

నీచక. సం. వి. ఆ. స్త్రీ. ఉత్తమ మైనయావు.

నీచకి. సం. విణ. (న్. నీ. న్.) ౧. ఉచ్చము.
౨. ఉత్తమగోవు కలవాఁడు.

నీచగ. సం. వి. ఆ. స్త్రీ. ౧. నిమ్నగ, నది. ౨.
హీనజాతివానిని పొందుస్త్రీ.

నీచగము. సం. విణ. (అ.ఆ. అ.) ౧. పల్లమునకు
పోవునది. (నీరు మొ.) ౨. నీచముగా వర్తిం
చునది. ३. నీచుని పొఁదునది. వి. అ. న.
జలము, నీరు.

నీచభోజ్యము. సం. విణ. (అ.ఆ.అ.) నీచునిచే
భుజింపఁదగినది. వి. అ. పుం. ౧. పలాండువు,
నీరుల్లి. ౨. నీచ మగునాహారపదార్థము.

నీచము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. జాతిగుణ
క్రియాదులచే మిక్కిలి తక్కువైనది, అధమము.
౨. వామనము, పొట్టిది. ३. నిమ్నము, పల్ల
మైనది, క్రిందయినది. (చోటు.) ४. హీనము,
బిగ్గరగానిది. (స్వరము మొ.) వి. అ. పుం.
చోరమనుగంధద్రవ్యము. న. సూర్యాదిగ్రహ
ములనీచస్థితి.

నీచయోని. సం. విణ. (ఇ) హీన మగుజన్మస్థా
నము కలవాఁడు, నీచజాతివాఁడు. వి. ఇ. పుం.
స్త్రీ. హీన మగుయోని.

నీచవజ్రము. సం. వి. అ. పుం. న. వైక్రాంత
మణి.

నీచస్థానము. సం. వి. అ. న. ౧. నీచునిస్థానము.
౨. నీచ మైనస్థానము. ३.(జ్యోతి.) రవి మొ
దలగుగ్రహములనీచక్షేత్రము. (రవికి తుల,
చంద్రునకు వృషభము, కుజునికి కర్కటము,
బుధునికి మీనము, గురువునకు మకరము, శుక్రు
నకు కన్య, శనికి మేషము.)

నీచిక. సం=నీచక.

నీచికి. సం. వి. ఈ. స్త్రీ. ఉత్తమగోవు.

నీచు. వి. (సం. నీచః.) ౧. ధూర్తుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. చెడుగు గావరి నీచు చెరికి కేడ ములుచ
బేరజ మన ధూర్తపేరు వెలయు. ఆం.భా. ౩. ౭.

౨. మత్స్యవిశేషము.

ఉ... పెక్,జెల్లయు పక్కె పారయును నీచు
ను ముచ్చుగి బొమ్మడాయముల్...పర కాది
గఁ జేపలఁ బట్టి బెట్టుగన్. ప్రబంధ. ౧౯౫.

౩. మత్స్యమాంసాదికము.

(వ్యవ.) శూద్రులలో కొందఱు నీచు తినరు.
జః నీచుకంపు.

నీచు. సం=నీచుఁడు (చూ.బాలవ్యాకరణతత్సమ
పరిచ్ఛేదసూత్రము. ౫౭.)

క. అనుపప్పలురుల కయ్యం,గన కోపము గదిరి
నీచు గావున జంకిం,చినఁగాని మెత్తఁబడి
పోఁ, డని మనమునఁ దలఁచి యిట్టు లని
యెక్ బెలుచన్. భార. విరా. ౨. ౫౪.

గీ. మేలురా నీవు నేయింద్రజాలికుండు, నేర్పె
నీమాయ లన నోరి నీచుకాన, యైంద్రజా
లికుఁ డంటివె వారుని ననుచు. ప్రబోధ.
౩. ౩౫. భార. మా. ౧. ౪౭.

నీచుఁడు. సం. విణ. (అ.ఆ.ఆ.) ౧. మూర్ఖుఁడు,
పామరుఁడు. ౨. అధముఁడు. (చూ.నీచము.)

నీచుకంపు. వి. (√నీచు.) నీచుకంపువంటికంపు,
దుర్వాసన.

శా. ప్రువ్వుల్ గారుచు నీచుకంపులఱచుక్
రోఁతై తత్తిక్ ఖాసి పెక్,దువ్వక్ బ్రుం
గినగర్దభాస్యఁదినుచుక్...మల్లభూ.నీతి. ౯.
ఇట్లే: నీచువాసన మొ.

నీచైస్. సం. విణ. అవ్య. పల్లమైనది, నిమ్నము
వి. ఒకానొకపర్వతము. సం. మేఘ. ౧. ౨౫.

నీచైర్గతి. సం. విణ. (ఇ)నీచ మగుగతి కలవాఁడు.
వి. ఇ. స్త్రీ. ౧. మందగమనము. ౨. నిమ్నగ
మనము, పల్లమువైపుగా పోవుట. ౩. నీచదశ,
నీచావస్థ.

నీచైర్ముఖుఁడు. సం. విణ. (ఆ.ఆ,ఈ.ఆ.) అవా
ఙ్ముఖుఁడు, మొగము వంచినవాఁడు.

నీచోక్తి. సం. వి. ఇ. స్త్రీ. నీచ మగుమాట.
(బూతు మొ.)

నీట(ళ్ల)ఁగల(లి)యు. అ. క్రి. (√నీరు.) నశిం
చు, పోవు.

సీ. తనపార్శ్వభాగసంఘర్షణంబున ద్వీపకోటు
లు నుగ్గులై నీటఁగలియ. దశా. ౧. ౧౭౩.

సీ. కోపించి దక్షుండు శాపం బొసంగుచో నీ
శక్తి యప్పు డేనీటఁగలసె. తపతీ. ౩.౯౦.

సీ. మగఁడు నాపైఁ జాల మమత నించినవాఁడు
నీమార్గణము లేడ నీళ్లఁగలిసె. కలు.శ. ౪౩.

నీటరి. విణ. (నీటు+అరి౩.) -నీటు కలవాఁడు-
విలాసి.

మ. చెలువంబే వినువీటినీటరులకున్ జేజేలకున్
లెస్సయే. చం. రా. ౨. ౨౦. (వినువీటినీ
టరులు=అప్సరసలు.)

సీ. జాళువా నెత్తమ్మిసరి దాల్చునీటరి మలచెం
చురాచూలివలపువాని. చం. రా. ౩. ౮.

నీటారు. అ. క్రి. (√నీటు.) ఒప్పు కలుగు.

గీ. భానుదీప్తుల నీటారి ప్రన్నమైన, పృథుల
మందాకినీపద్మబీజమాల. హర. ౩. ౪౮.
(కాంతి కలుగు అని భావము.)

నీటికాఁగు. వి. (నీరు+కాఁగు.) నీళ్ళు కాఁచె
డుపాత్రము.

సీ. నెఱిమొయారము తోడ నీటికాఁగుల నీడ
చూచి కుంకుమబొట్టు సొంపుదీర్చు.హంస.
౨. ౧౪౭.

నీటికానుపు. వి.(√నీరు.)-కృపీటయోని-అగ్ని.

గీ. ఖారకై నీటికానుపుపాపయప్ప, పుడుటఁగ
ల్గలజెట్టికై పొడమినట్టి,మెట్టువాల్పిట్టరామేని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దిట్టవేల్పు. అచ్చ. రా. బాల. ౪.
ఇశ్లే: నీటిచూలి.

నీటితాత. వి. (నీరు + తాత.) వాయువు. (శ.ర.)

నీటిదయ్యము. వి. (√నీరు.) సెగడు, నీటి నా శ్రయించి యుండుభూతము.
గీ. నీటిదయ్యంబు సెఁగడు నా నిర్వటిల్లు. ఆం. భా. ౧. ౬౪.

నీటిదారి. వి. (√నీరు.) - జలధరము - మేఘము.
సీ. అలవచ్చిదెసలకొండలను నిల్కడ గ్గెనింగి నంటకయున్న నీటిదారి, కి ... ప్రబంధ. ౧౪౬.

నీటిపుట్టుగు= నీరుపుట్టువు. వి. (నీరు + పుట్టుగు.) అబ్జము, తామరపువ్వు. (చూ. నీటిపుట్టుగుపట్టి.)

నీటిపుట్టుగుపట్టి. వి. (నీరు + పుట్టుగు + పట్టి.) పద్మజుఁడు, బ్రహ్మ.
మత్తకోకిల. నీటిపుట్టుగుపట్టి యెన్నఁడు నెమ్మిఁ గానఁగ లేనిత్వ, మ్మేటి వేలుపురాయఁ డామరుమేపుకందొరమామ గా, నేటినీటుతిపంబు చేసెనొ యీవడంకుమ లంచుఁ దా, మాటికిన్ గొనియాడుచుం జని మన్ను తేఁడట ముంచటన్. యయా. ౨. ౪౧.

నీటిమానికము. వి. (నీరు + మానికము.) కౌస్తుభమణి.
సీ. అనుబింబమునఁ బద్మ కన్యకన్యాయుక్తిఁ బ్రకటించు నీటిమానికము మించు. దశా. ౪. ౧౭౦.

నీటియిక్క. వి. (నీరు + ఇక్క.) కౌస్తుభము, విష్ణువక్షస్థలమునందలిమణి.
సీ. తొలుకడకడలిలోఁ దులకించు సిరి గేస్తునక్కనఁ దగు నీటియిక్క యనఁగ. యయా. ౨. ౧౦౫. (ముద్రి. పా. 'తిలకించు'. అని శ.ర.)

నీటిమెకిమీఁడు=నీటిరాయఁడు. వి. (√నీరు.) ౧. అప్పతి, వరుణుఁడు. ౨. సముద్రుఁడు.
గీ. నీటిమెకిమీని మొలనూలుబోటిమిన్న, యొంటిపంటను గలకిటి యొకటివక్క, కలను నెమకిన మెకములపాలపు గాన, మేము జేజేలఁ గాచినసామి సంద. ప్రబంధ. ౧౬౩.

నీటియొడయఁడు=నీటిరాయఁడు. (వరుణుఁడు.)
సీ. పడమటిదొర నీటియొడయఁడు జడిసామి... సాం. ని. దేవ. ౧౩.

నీటి(ళ్ల)రాయఁడు=నీటిమెకిమీఁడు. (వరుణుఁడు.)
సీ. మాటమాటై యల్గి మఱుఁగుమై డాఁగిననీటిరాయనికూర్మి చెలఁత యనఁగ. యయా. ౩. ౪౧.
క. దేవర నీ విపు డలుగఁగ, నీవెలఁదుక జేసికంటిమెకిమీఁడొ జముం, డో వేల్పుఱేఁడొ నెత్తురు, ద్రావుపుగమి కాఁడొ నీళ్లరాయఁడొ చెపుమా. అచ్చ. రా. సుం. ౫౯.

నీటిరిక్క. వి. (నీరు + రిక్క.) పూర్వాషాఢానక్షత్రము. (శ.ర.)

నీటిఱేఁడు. వి. (నీరు + ఱేఁడు.) ౧. అపాంపతి, సముద్రుఁడు. (శ. ర.) ౨. వరుణుఁడు, అప్పతి.
సీ. కొలముపాఁగమున నప్పొలసు నిండిని నల్పి తెగి నీటిఱేనిపెం పిగురఁ జేసి. యయా. ౨. ౧౦౭.

నీటిఱేనిరిక్క. వి. (నీటిఱేఁడు + రిక్క.) శతభిషఙ్నక్షత్రము. (శ.ర.)

నీటు. వి. (క. నీటు. త. నీటమ్.) ౧. మురిపము, శృంగారగర్వము. (శ. ర.) ౨. విలాసము, హొయలు.
సీ. నిక్కుమిటారింపు నీటు మిటారము...హొయలనఁగ విలాస మొప్పుచుండు. ఆం. భా. ౧. ౧౩౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. సాక్షాత్కరించినజలదేవత యనంగ నీరా
టురేవున నీటు చూపు. శుక. ౨. ౪౧౦.

౩. లావణ్యము, నైగనిగ్యము.

సీ. చెలువునిమైచాయఁ దిలకించుఁ దిలకించి నీ
లోత్పలంబులనీటుఁ జూచు. ఉ.రా.౬.౯౩.

ఉ...నీ,జవ్వనము న్విలాసమును జక్కఁదనంబు
ను నీటుఁ జూచినన్, బువ్విలుకానికైన భ్ర
మ పుట్టుఁ గదే భువనైకమోహినీ. ఉ.రా.
౪. ౧౯౬.

౪. అందము, సొగసు.

సీ. కురులు నున్నఁగ దువ్వి కొప్పు పెట్టిననీటు
గనుఁగొన్న మోహాంధకార మొదవు. ఉ.
రా. ౪. ౧౯౭.

౫. విధము, రీతి.

వ... అంబుదంబు చందంబునఁ దిమురుచు ము
న్నీటినీటునఁ గసరుచు మత్తేభంబువడువునఁ
బుష్కరవాలంబు విసరుచు ... యుగంధ
రుండు...విజృంభించి...చంద్రా. ౬. ౯౩.

వ...అమ్మాయావిమానంబు...ఒక్కమాఱు గా
లిపటంబునీటున నసియాడుచు నొక్కయెడఁ
జుక్క తెగిపడ్డవిధంబున డిగ్గుచు...పోయి
...కువల. ౪. ౯౨.

౬. పోఁడిమి, సంపద.

క. పాటించి విడువ ముడువన్, నీ టబ్బకయు
న్నఁ బోవనీ కయ్యమునన్, బోటరిమగలకు
కాటికిఁ, గూటికి సీదరమె రాచకొలు వేమి
టికిన్. వేం. పంచ. ౧. ౫౧౮.

౭. అలంకారము, నగ.

ఉ. సానులకూటముల్ కలుగుజాణలు నీటులు
పెట్టుకుందురే. దశా. ౨. ౧౫౫.

విశ. ఒప్పయినది, అందమైనది.

ఉ. తుమ్మెదకొమ్మ లెమ్మెలను దూఁకొని నీటు
గఁ బాటఁ బాడఁగా. నీలా. ౧. ౪.

సీ. కస్తూరికాచర్చ నిన్ను గా దని నీటుగాఁ దా
వికుంకుమగంధ మలఁది. ఉ.రా.౪. ౧౭౬.

జ: నీటరి, నీటారు, నీటుకత్తె, నీటుకాఁడు, నీ
టుకోల, నీటుచేయు, నీటుపడు, నీటుపఱచు,
నీటువెట్టు.

నీటుకత్తె (త్తియ) వి.(√నీటు.) విలాసము కల
యాఁడుది; ఆఁడుది.

వ...మగలఁ గికురింపఁ గంకణంబులు గట్టిన
రీతి నత్తమిల్లుపుత్తడికంకణంబులు గలచాతని
జాతినీటుకత్తెలు...ప్రబంధ. ౭౮.

క. అలుగువగ చూపువేళం, దలతల మను నింత
సోఁకిన న్తగవానిం, గళ్దాకఁ బెనఁగు
నొకమొక్కలపుదొరకరాసినీటుకత్తియయ
గుటన్. కువల. ౨. ౧౩౯. (నీటుకత్తియ=
నీ టగుఖడ్గము అని రెండవయర్థము.)

సీ. దొరలు గద్దింపఁ గల్లరివార్త నిజముగా ని
ర్వహింపని దేటినీటుకత్తె. శుక. ౧. ౫౫.

విశ. విలాసము కలది. (శ. ర.)

నీటుకా(గా)ఁడు=నీటరి.విశ. (నీటు+కాఁడు.)

౧. అందగాఁడు.

ద్వి. చెలియా యనంగు మించినవాఁడు నలుఁడు,
కలికి మారుఁడు నీటుకాఁ డను టింతె. ద్వి.
నల. ౧. ౬౫౧.

సీ...సొగసు, కాఁ డనంగను వన్నెకాఁ డనం
గను నీటుకాఁ డనఁగా నలంకారి యొప్పు.
ఆం. భా. ౩. ౧౦. శుక. ౧. ౪౪౫.

౨. విలాసవంతుఁడు, శృంగారి.

సీ. నీటుకాఁ డనఁగ రాణించు శృంగారికి...
సాం. ని. మాన. ౮.

గీ. నిక్కి నిక్కి నిరీక్షించునీటుగాని, నందముల
కెల్ల నెల్ల యానందగాని. చంద్రా. ౨.౧౩౬.

నీటుకోల. వి.(నీటు+కోల.)విలాసార్థము చేతఁ
బట్టుకొనుకఱ్ఱ.

క. తిండాడు వైరివీరులఁ, జెండాడుట యేమి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దొడ్డు చెం డాడుగతిఁ, గొండపయిఁ గొం
డ గూలఁగఁ, గొండికపాయమున నీటుకోల
న్మీటుచుఁ. సుద. ౨. ౧౨౪.

నీటుపడు. అ. క్రి. (నీటు+పడు.) నీటుకలది
యగు. (చూ. నీటుపఱచు.)

నీటుపఱచు. స. క్రి. (√నీటుపడు.) నీటు కల
దానినిగా చేయు, అందముగా నుంచు.

సీ. పాపటఁ తేటసుపాణిముత్తెపుబొట్టు పాట
లాధర యొత్తు నీటుపఱచె. ఇందు.౫.౪౯.

నీటువెట్టు. అ. క్రి. (√నీటు.) విలాసము కలి
గించుకొను.

సీ. తనవిలాసము గనుంగొని నీటువెట్టెడుసూనా
స్తురతియును చుక్కరనఁగ.దశా.౧.౫౪.

నీటుసేయు. అ.క్రి.(√నీటు.) విలాసముచూపు.

సీ. నీటుసేయుదు తొక్కచోటఁ గేళిని మనో
హరుఁ డేడ వలచునో యని చలింప. ఉ.
రా. ౧.౧౪౦.

నీడ. వి. (క. నెళల్.) ౧. ప్రతిబింబము.

గీ. నిద్రమేల్కాంచి సెలయేట నీడఁ గాంచి.
ఆము. ౧. ౩౯.

క. చెలువలు సరసీజలముల,నిలిచిన లోఁగన్నఁ
గవలనీడలు దోఁచెం, దెలిచెక్కుఁజందు
రులకై, తలఁచుచు నదు గంటునచటికిమ్ముల
రీతిఁ. చంద్ర. ౪. ౩౨.

వ...గంగాధరుండు సమాసన్నగణోపనీతం బయి
నఖడ్గంబున నీడఁ జూచి...హర. ౪. ౭౯.

౨. ఛాయ, అనాతపము.

ఉ. నేమ మొనర్పఁగా గొడుగునీడ వహించు
వసుంధరాస్థలీ,సీమనె యెక్కి యాడెను
విచిత్రగతిం దురగోత్తమంబు నా,భూమి
విభుండు... నైష. ౧. ౭౭.

ఉ ... రాగమంజరీ,నందనుఁ దబ్జినీతటమునఁ
జురభూజమునీడ నిల్చి... విక్ర. ౨. ౧౬.

సీ. వనిఁ జీకు చిటు కన్న వడి లేచి చెవులు
తిక్కించి తా నట్టె యాలించి వినుచుఁ,బై
నీడ వాటిన బఱచి నిప్పులు రాలఁ జుఱుకుఁ
గొమ్మున నోరచూడ్కిఁ గనుచు. గీ. భీకరం
బగునొకదొడ్డసూకరంబు. చంద్రా.౨.౯౨.

౩. కాంతి, తళుకు.

ఉ... చెక్కులతళ్కు లద్దపుఁ,నీడల నేలు
గుబ్బగవనిగ్గు లనంగుని గుండుబంగరుఁ, మే
డలఁ బోలు ... మురుంద ౨. ౧౧౧.

౪. చాటు, మఱుఁగు.

క. తెచ్చుటయుఁ గేలిభవనముఁ, జొచ్చెనో
చొరదో యనంగ సుదతులనీడఁ, జొచ్చి
పయిఁ గొప్పు దోఁపఁగ, నచ్చేడియ తలుపు
దండ నల్లన నిలిచెఁ. మనుచ. ౬. ౬.

౫. ఆశ్రయము, ప్రాపు.

(వ్యవ.) వానినీడను వీఁడు బ్రతుకుచున్నాఁడు.
నిలువనీడ=విశ్రాంతిస్థానము.

సీ.సంసారసస్యబీజముల కూషరభూమి నిర్వా
ణలక్ష్మికి నిలువనీడ. కాశీ. ౫. ౧౩౫.

సీ. కొలిచినవారికిఁ గలనితంగటిజున్ను నలసిన
వారికి నిలువనీడ. చం. రా. ౧. ౪౧.

నీడకన్ను నెండకన్ను నెఱుఁగు=సుఖదుఃఖములను
గణించు.

గీ. ఎఱుఁగునే నీడకన్నును నెండకన్నుఁ, జెలఁగి
పూఁచు నేకర్మ మంచిన లతాంగి, యెట్టి
క్లేశంబులకు నైన నీడఁబోదు, తనమనంబున
నిగ్రుచుసంతానకాంక్ష. శివ. రా. ౨. ౩౯.

జ : నీడదోఁచు.

నీడకము. సం. వి. అ. పుం ౧. గూఁడు. ౨.
-గూఁటియందు ప్రకాశించునది- పక్షి.(వాచ.)

నీడజము. సం. విణ. (అ. ఆ. అ.) నీడమునందు
పుట్టినది. వి. అ. పుం. పక్షి.

నీడదోఁచు. అ. క్రి. (√నీడ.) ప్రతిబింబించు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. నిర్మలం బైనవనధిలో నీడదోఁచు, నిందుబిం
బంబులను బోలి ఋషిగణంబు. హర. ౪.
౫౨.

నీడము. సం. వి. అ. పుం. న. ౧. కులాయము, పక్షిగూఁడు. ౨. ఆశ్రయము, ఉనికిపట్టు.

నీడోద్భవము. సం=నీడజము.

నీతకము=నీతము. వి. నియమము. (శ. ర.)

నీతము=నీతకము. వి. (సం. నియతమ్. ప్రా. నిఅత.) నియమము.

క. జాతులు నాతుల కెందుఁగ,నీతము లే కున్కిఁ
గామినీలోకానాం,జాతిః ప్రకల్పితా యను,
నీతి పురాతనమె కాక నేఁటిదె యరయన్.
విక్ర. ౩. ౨౮.

నీతము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. కొనిపోఁబడినది. ౨. ప్రాపితము, పొందింపఁబడినది. ౩. నడపింపఁబడినది. ౪. యాపితము, జరుపఁబడినది. (కాలము.) ౫. వినీతము, గురువుచే శిక్షింపఁబడినది.వి. అ. న. ౧. ధనము. ౨. ధాన్యము. ౩. నీతి; నీతివాక్యము.

శా. కానీరా యిటువంటినీతము లనేకంబుల్
నినుంబోలివి,న్నానేనుక్...శశాం.౩.౬౮.

నీతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. కొనిపోవుట. ౨. ప్రాపణము, పొందించుట. ౩. పాడి, న్యాయము.౪. ఉపాయము. ౫. రాజాదులు ప్రవర్తింపవలసిన రీతిని తెలుపుశుక్రచాణక్యవిదురాదులచే రచింపఁబడినశాస్త్రము, రాజనీతి. ౬. (అశ్వాదులను గూర్చి తెలుపు) శాస్త్రము.

క. ఈతండు శాలిహోత్రుఁడొ, మాతలియో
నలుఁడొ యొరులు మానవులు జనో,పేతముగ
నిట్లు రథహయ,నీతి యెఱుంగుదురె ధారుణీ
వలయమునన్. భార. ఆర. ౨. ౧౩౧.

౭.సత్ప్రవర్తనము, ధర్మానుకూలముగ నడచుట. ౮. విధము, రీతి. (ఈ యర్థము తెలుఁగుననే కలదు.)

సీ...భరతు,నీతి నుహోత్రునిభాతి భార్గవుబలె
రాముపోలిక భగీరథునిపోలుపు. గీ. ధాత్రిఁ
బాలించు నవిభుండు దద్విభుండు. హంస.
౧. ౪౨.

శా. పౌనఃపున్యముచేతఁ గాని రిపులన్ భంజింప
లేఁడయ్యె భూ,దానం బొక్కటి గాని షోడ
శమహాదానంబులుం జేయఁడే,దేనీతిన్ జమ
దగ్నిరాముఁడు సముం డిద్ధప్రసిద్ధోన్నమ,
ద్దానక్షాత్రగుణంబులం బురవరాంతఃక్షత్రి
యశ్రేణికిన్. కవిక. ౧. ౧౦.

క. ఈనీతి సమాకర్షస్థానము లేర్పాటు గాఁగ
దైవాసుర సంతానంబు లైకమత్యము,గా
నమృతాబ్ధిన్ మథింపఁ గడఁగిరి కడిమిన్.
దశా. ౨. ౧౯౩.

నీతిఘోషము. సం. వి. అ. పుం. బృహస్పతి రథము. (త్రి. ని.)

నీతిజ్ఞుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) నీతినెఱిఁగినవాఁడు.

నీతిబీజము. సం. వి. అ. న. రాజకార్యతంత్రము నకుమూలము.

నీతిమంతుఁడు. సం. విశ. (త్.మతీ.త్.) నీతి కలవాఁడు.

నీతివిదుఁడు. సం.విశ. (ద్) నీతినెఱింగినవాఁడు.

నీతివిద్య. సం.వి.ఆ.స్త్రీ. ౧. రాజనీతిశాస్త్రము. ౨. నయవిద్య, సత్ప్రవర్తనము తెల్పువిద్య.

నీతివ్యతిక్రమము. సం. వి. అ. పుం. ౧. నీతిశాస్త్రవిధుల నుల్లంఘించుట. ౨. తప్పునడవడి.

నీతిశాస్త్రము. సం. వి. అ. న. నీతివిద్య.

నీతిసంధి. సం. వి. ఇ. పుం. ౧. నీతిపద్ధతులసారము. (విల్యమ్సు.) ౨. కార్యతంత్రముయొక్క పద్ధతి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో. సుకృత్యం విష్ణుగుప్తస్య మిత్రాప్తి ర్భార్గవస్యచ,బృహస్పతేరవిశ్వాసో నీతిసంధిస్త్రిధామతః. సం. పంచ. ౨. ४३.

నీధ్రము. సం. వి. అ. న. ౧. నీవ్రము, ఇంటిచూరు. ౨. వనము, అడవి. ౩. నేమి, చక్రముచుట్టుకమ్మి. ४. రేవతీనక్షత్రము.

నీధ్రుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

నీపము. సం. వి. అ. పుం. ౧. కొండయడుగు భాగము. ౨. కదంబము, కడిమిచెట్టు. ౩. బంధూకము, మంకెనచెట్టు. ४. ధారాకదంబము, నీరుకడిమిచెట్టు. ౫. నీలాశోకముచెట్టు. ౬. నల్లయిరుగుడుచెట్టు. ౭. దేశభేదము. న. కడిమిపువ్వు.

నీయమానము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కొనిపోవఁబడుచున్నది. ౨. నడిపింపఁబడుచున్నది. ౩. పొందింపఁబడుచున్నది.

నీరంధ్రము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. రంధ్రములు లేనిది, సందులు లేనిది; సాంద్రము, దట్టము.

నీరక్తము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. రంగు లేనిది, వన్నె మాసినది. ౨. నెత్తురు లేనిది.

నీరగు. అ.క్రి. (√నీరు.) ౧. ద్రవించు.

చ. చెవు లవిసెన్ దిశల్ దిరిగెఁ జిత్తము నీరయి పోయె నాదు నీ,రవమున...భార. విరా. ४. ౧౩౩.

౨. చెడు, నశించు.

చ. జరఠ యొకర్తు కుంజగృహచంద్రశిలం గనుకూర్కుచుండఁ గ్రొ,వ్విరికలు ద్రావ లేవ దటవే ముదిచిల్కలకొల్కి యంచుఁ జెచ్చెర నొకకల్కి పోయి పాదచించినఁ బాన్పుఁ గరంచె వెన్నెలల్, చొరఁబడి నిద్ర నీరగుట చోద్యమె దానికి నట్టిపట్టున. రామా. ౨. ౯౩.

నీరజము. సం. విణ. (అ. ఆ. అ.) జలమున పుట్టినది. (ప్) రజోగుణము లేనిది. ౨. దుమ్ము లేనిది. ౩. పుష్పాది లేనిది. (పుష్పాది) ४. ఆర్తవము లేనిది,ము ట్టుడిగినది. వి. అ. పుం. ౧. ఉద్రము, నీరుపిల్లి. ౨. ఉశీరము, వట్టివేరుచెట్టు. న. ౧. పద్మము, తామరపువ్వు. ౨. చెంగల్వకోష్టుచెట్టు. ౩. ముత్యము.

నీరజాతము. సం. విణ. (అ. ఆ. అ.) నీటఁ బుట్టినది. వి. అ. న. పద్మము, తామరపువ్వు.

నీరతము. సం. విణ. (అ. ఆ. అ.) రతము లేనిది, ఆసక్తి లేనిది.

నీరదము. సం. విణ. (అ. ఆ, ఈ. అ.) దంతములు లేనిది. వి. అ. పుం. -నీటిని ఇచ్చునది- మేఘము, మబ్బు.

నీరధరము. సం. వి. అ. పుం. ౧ - నీటిని ధరించునది- మేఘము, మబ్బు. ౨. తుంగచెట్టు.

నీరధి. సం. వి. ఇ. పుం -నీటికి ఉనికిపట్టు- జలధి, సముద్రము.

నీరనిధి. సం=నీరధి.

నీరప్రియము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నీరు ఇష్టముగా కలది. ౨. నీటికి ఇష్టమైనది. వి. అ. పుం. జలవేతసము, నీరుప్రబ్బలిచెట్టు.

నీరము. సం. వి. అ. న. ౧. జలము, నీరు. ౨. ద్రవపదార్థము, రసము.

నీరరుహము. సం. వి. అ. న -నీట మొలచునది- పద్మము, తామరపువ్వు.

నీరవము. సం. విణ. (అ. ఆ. అ.) రవము లేనిది, ధ్వని లేనిది.

నీరసనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నాలుక లేనిది. ౨. రశన లేనిది, మొలనూలు లేనిది.

నీరసము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. రసము లేనిది, రుచి లేనిది. ౨. శృంగారాదిరసము లేనిది,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సరసము కానిది. (పద్యాది.) ౩. ద్రవము లేనిది, సారము లేనిది, ఎండినది. (ఫలాది.) వి.అ. పుం. దానిమ్మచెట్టు. వి. అవ్య. అ.న. రసాభావము, బలములేమి.

నీరసనస్యక. సం. వి. ఆ. స్త్రీ. కార్పాసము, ప్రత్తి.

నీరసించు. సం. స. క్రి. నీరసపెట్టు, బలహీనము కావించు; కృశింపఁజేయు.

సీ. లేల పెన్నెలలు పండ్రెండుసూర్యులు చూపు లీ యెండ లై కాసి నీరసింప. కవిక. ౪.౧౩.

ఉ. నా విని మాయ యిట్లనియె నావళి మైతివ టంచు మిక్కిలిన్, భావములోన నమ్మితి నెపంబుల నెంతయు నీరసించి న, న్నీవిధి వీడనాడఁ దగవే...బ. ప్రభు. ౨. ౧౦౦.

అ. క్రి. నీరసపడు, బలహీన మగు. (బ్రా.) (వ్యవ.) మావాఁడు నీరసించుచున్నాఁడు.

నీరసుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) రసగ్రహణము లేనివాఁడు, అరసికుఁడు.

క...పెక్కు పరిహాసంబుల్, రూఢిగఁ బలికితి మెట్లుం, జూడఁడు మావలను నీరసుం డన నుండెన్. భార. ఆది. ౮. ౧౫౬.

నీరాకు. వి. (నీరు + ఆకు.) పాఁచి, వారిపర్ణి.

సీ. పాఁచి నీరాకు నా వారిపర్ణి చెలంగు... ఆం. భా. ౧. ౧౬౫.

నీరాజన. సం. వి. ఆ. స్త్రీ.=నీరాజనము.

నీరాజనము. సం. వి. అ. న. ౧. దీపాదులచే దేవతాప్రతిమాదులకు ఇచ్చుహారతి, ఆరాత్రికము. ౨. రాజులు యుద్ధమునకు బయలుదేఱుటకు పూర్వము చేయునొకానొక శాంతికర్మము.

నీరాట(ము). వి. (నీరు + ఆట.) ౧. స్నానము.

సీ. నీరాట నెపముగా నిర్ఘరంబుల కేఁగి నవిధవానీరకుంజముల నొందు. శివరా. ౩.౧౧౩.

క. ఈరీతిఁ గవిని చాలు లిం,పారఁగఁ గయినేసి నృపవరాత్మజ కంతో, నీరాట మొనర్చియు శ్రృం,గారించిరి వేడ్క పాదమ గ్రక్కున నంతన్. బిల్హ. ౩. ౨౧౪.

౨. జలక్రీడ.

గీ. చల్లు లాడంగ నప్పుకు చదల నెగసి, మగుడు కెలినీటితుంపరల్ దగిలెఁ జూడ, వారి నీరాటకును మెచ్చి వలపురాయఁ, డాని కురియించుపువ్వులవాన లనఁగ. యయా. ౩. ౭౩.

నీరాటము. సం. విణ. (అ. ఆ. అ.) నీటిలో సంచరించునది. (మొసలి మొ.)

క. నీరాటవనాటములకుఁ,బోరాటం బెట్లు గలిగెఁ బురుషోత్తముచే, నారాట మెట్లు మానెను...భాగ. ౮. ౧౯.

నీరాటరేవు. వి. (నీరాట + రేవు.) స్నానము చేయురేవు, స్నానఘట్టము.

సీ. సాక్షాత్కరించినజలదేవత యనంగ నీరాట రేవున నీటుచూపు. శుక. ౨. ౪౧౦. (నీలాటిరేవు అని అపముద్రి.)

సీ. ఆరాటమునఁ బొంగినీరాటరేవునఁ గాచి కన్నెల బల్మిఁ గవయఁ జూచు.నీలా.౧.౩౬.

నీరాడు=నీళ్లాడు.అ. క్రి. (నీరు + ఆడు.) జలకమాడు, స్నానముచేయు.

గీ...దిగంబరత శయనింప నీరాడఁ గాదు. మార్క. ౩. ౨౩౦.

శా. చూడంజూడ నృసింహకీర్తిచయ మాక్షోణీనభోమధ్యమం, దేడం జూచినఁ దాన యై నెగడఁగా నీక్షించి మిన్నేట నీ,రాడం బో యెడిచేసితాపసులు మే లౌ మ్రొల సిద్ధించెఁ గా, యాడం బోయిన తీర్థ మంచు మదిలో హర్షింతు రశ్రాంతముల్. నరస. ౫. ౫౪.

వి. ౧. అలంజగము, కాఁగు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. సెగడు నీరా డనంగను నీళ్లచివది,యన నలం
జరనామధేయమ్ము...ఆం. భా. ౨. ౨౭౫.

౨. పులియఁబెట్టినకడఁగులో పోసెడివేన్నీళ్ళు, కూరాటిలో పోసెడివేన్నీళ్లు. (శ. ర.)

కూరాడునీరాడు = పెండ్లిలో నాగవల్లిసమయమున జలపూర్ణకలశములందలివెండిబంగారు వస్తువులను వధూవరులచే వెదకించునుత్సవవిశేషము?

ద్వి. మామ యల్లున కిచ్చె మణికిరీటాది,సామ
గ్రి వస్తువుల్ చదివించి రప్పు,డామని గాఁ
గ బ్రహ్మణులు నంతఁ, గూర్చాడునీరాడు
గొబ్బునఁ దొణఁగి, యారూఢిఁ బాన్పెక్కి
యాసతీపురుషులు...వృ.వి. 3. ౬౧.

నీరాధులు. వి. వస్త్రవిశేషము.

వ... పీతాంబరములు నీరాదులు బురుసాలు వన్నెమణుంగులు చందురుకావులు ...ప్రబంధ. ౬౦౫.

నీరామని. వి. (నీరు + ఆమని.) వర్షఋతువు.

క. ధారణిఁ గలమే ల్లెనా, ధారాళకరాళవ
ర్ష ధారలచేతఁ, నీరామని కాఁగల దని,
పూ రాల్చినభంగి ముసురు పొరిఁబొరిఁ దొ
రఁగెన్. విక్ర. ౪. 3౦.

నీరా(ల్లా)ర్చు. స. క్రి. (√నీరాడు.) స్నానము చేయించు.

గీ. కాంచి యవగాహనము చేసి కనకపంజ,రాం
తకీరంబుఁ దివిచి నీరార్చి తెచ్చి,చాల డస్సి
తిగా పథశ్రాంతి నణచు, నృపతి కరమున
నెమ్మేను నిమిరి నిమిరి.రా.జ.చ. ౨.౧౨౨.

సీ. పాపకదంబజంబాలంబుఁ గడిగెడుపగిది నీ
ళ్ళార్చిరి పాపనికిని. కాశీ. 3. ౨౪.శుక.
3. ౪౦౭. ఆము. ౧. ౫3.

నీరాటు. అ క్రి. (√నీరు.) తడియాఱు, ఎండు.

గీ. చికురసంతతి నీరార్చి చెలువ తురిమె, నేస
కొప్పు...శివరా. 3. ౪౫.

నీరాళము. వి ఒకవిధ మగుగంగు. (స్వచ్ఛము అని బ్రా.)

మ. నెలతాతీగయసంతనంపుమగతానీరాళపుం
గొప్పటా,కులనిద్దంపుపసిఁడినున్నవికెనిగ్గుల్
దొట్టుకట్టాణిపూ, సలమేల్ బొబ్బమెకంబు
చెక్కడపుఁగీల్ జాగాజగాగద్దియల్, జెలు
వెచ్చం గొలువుండె గొల్లరును జేజే యఁచుఁ
దగ్గొల్వఁగన్. ప్రబంధ. ౧౨౬.

నీరాళ్లగొంది. వి. ఈశాన్యదిక్కు.

సీ. నీరాళ్లగొంది శంపారుచుల్ గనిపించె
నభ్ర మభ్రము నిండ నాక్రమించె. కవిరా.
౪. ౨౬.

పీ. థళుథళుక్కన నింగిఁ దాటించెఁ బలుమా
టు నీరాళ్లగొందిఁ గన్నియ మెఱుంగు. పాం
డు. ౪. ౨౧.

ద్వి. అరవిందనయనలయందంబు దోఁప, నెఱియ
మించులతోడ నీరాళ్లగొంది, మెఱచెఁ దళు
క్కన మేఘంబు చెంత. ద్వి. పరమ. ౪.
౨౯౦ పా.

నీరింకుమబ్బు. వి. (నీరు + ఇంకు + మబ్బు.) శరత్కాలమేఘము.

గీ. బొబ్బమెకమును నీరింకుమబ్బునుబ్బు, గె
బ్బు సంతతవిజయజేగీయమాన, మగుచుఁ జా
ళుక్యనారాయణాంకుఁ డైన,బుక్కరాజేం
ద్రురామభూభుజునియశము. రామ. ౨౧3.

నీరిజే. వి. ఒకానొకయడవిచెట్టు. (శ.ర,బ్రా.)

నీరిప్ప. వి. (నీరు + ఇప్ప.) మధూలకము.

గీ...నీరిప్పయన మధూలక మగు...ఆం.భా. ౨. ౪3.

నీరీఁగ. వి. (√నీరు.) జలజంతువిశేషము, నీటిలో నుండుఈఁగ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. నీరుకుమ్మరపుర్వు నీరీఁగ తలకప్ప...హంస. ౪. ౧౮౬.

నీరు. వి. ఔ. అనా. (సం. నీరం. ప్రా. నీరం.క.త. నీరు. బ. నీళులు, నీళ్లు, నీళ్లులు) ౧. ఉదకము.

ఆ. నీరిలోనఁ దోఁచు తారక ప్రతిబింబ, మొక్కొ యనఁగ...భార. ఆది. ౫. ౨౦౭.

క. ఒకవైష్ణవుఁ డర్ధనిశా, ధికవర్షముచేత నోదివి తీరనిచలిచే, నొకచోటఁ జేరఁగాఁ గా,నక వాకిటఁ బంచనీరునన్ వణఁకుతతిన్. శ్రీరం. మా. ౫. ౫౦.

సీ...జాలు నీటిపైఁ దేలించు నేర్పు సాక్షి. ఉ. రా. ౧. ౧౫౧.

చ. ఘనతరశోకవేగమునఁ గన్నుల నీళుల నించి ... భార. భీష్మ. ౩. ౧౫౬.

క. తాన తననీడ నీళ్లల,లో నేర్పడఁ జూచునట్లు లోకస్తుత త,త్సూనుఁ జనకుండు సూచి మ,హానందముఁ బొందు నతిశయప్రీతి మెయిన్. భార. ఆది. ౪. ౮౭.

౨. రసము.

సీ. ఇంచునీటిని గేకరించుచల్లనిమాట జాబిల్లితోఁ బొందుఁ జలుపు మోము. గంధ. ౧. ౧౯౯.

౩. (లోహాదుల) ద్రవము.

సీ... అమర నేనికదోయి నీరార్చునపరంజినీటి వ్రాఁత. ఆము. ౧. ౫౩.

౪. మూత్రము. (శ. ర.) ౫. శుక్రము. (చూ. జలము ౬. వయర్థము, నీరుమోయు.) ౭. క్రొవ్వు. (చూ. నీరుపోయు) ౮. కన్నీరు, బాష్పము.

మ... శూద్రులముల్ శాసింతు రంచున్ నిరం,తరశోకంబున నీరు గన్నుల నిడన్ ధర్మజ్ఞ వీక్షించితే. భాగ. ౧. ౪౩౦.

౯. పశురోగవిశేషము.

ద్వి. నరుదకన్నును నీరు నాలుకచేర్లు. నవ. ౧. ౩౦ పా.

విణ=ఈరు[3]. అల్పము. (చూ. నీరుకావి, నీరెండము.)

నీటవ్రాసినవ్రాలు= ౧. (నీటియందు వ్రాసినయక్షరములు) నిష్ప్రయోజనము, వ్యర్థము.

గీ. మాటిమాటికిఁ జేసినమందు లెల్లఁ, జెల్లెఁబోవెల్లిఁ గలిపినచింతపండు, నీటవ్రాసినవ్రాలు నైనెఱయ వఱదఁ,బోవుఁ గాకేమి నెత్తురు పుట్టనేల. కాళ. ౩. ౧౧౧.

౨. అశాశ్వతము, అస్థిరము.

(వ్యవ.) సజ్జనులమాటలు శిలాక్షరములు దుర్జనులమాటలు నీటవ్రాసినవ్రాలు.

నీటిరాపట్టపయ్య =వరుణుఁడు, అప్పతి.

ఉత్సాహ...క్రుంకు మెట్టనెత్తపుం,జట్టు మీఁదఁ బ్రొద్దుచేరె సంజతోడ నీటిరా, పట్టపయ్యకొంపుగోడపట్టు పైఁడిసాననాన్. యయా. ౩. ౧౨౩.

నీటిపైవ్రాఁత= నీటవ్రాసినవ్రాలు.

సీ. నీటిపై వ్రాఁతలా నీరజాసనువ్రాఁత లెటిఁగెనా తత్త్వంబు లింతలోన. నీతి. ౪౦.

నీళ్లనాడు=నీళ్లాడు, స్నానముచేయు.

ఉత్సాహ. మలుసమర్త నంటకుండి మాలదాన నగుట నేఁ, గలయ నీళ్లనాడి కడకుఁ గ్రంతయంటుకొనుటకై,కొలనఁ గ్రుంకి... శివరా. ౩. ౮౪.

నీళ్ల(ళుల)ముంచినను పాలముంచినను= పాడుచేసినను బాగుచేసినను.

మ. వినుమా యీయనుమాన మేల బెళుకు ల్వేయేల నీయాన జ,వ్వని నీచేతిది నాదుదేహము ను జీవంబు న్వృథా మాటలే,లని నీచిత్తము నాదుభాగ్య మిఁక నీళ్లన్ముంచినం బాలముం,చిన నీవే మఱి యొండెఱుంగ నిదియే సిద్ధంబు ముమ్మాటికిన్. దశా. ౨. ౩౪౦.

చ...ఆసతో,నిలుతు మురారి నన్నుచటు నీళుల ముంచినఁ బాల ముంచినన్. ఉ. హరి. ౨. ౩౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇష్టే: నీర న్ముంపుము పాల ముంపును.

శా. నీరన్ముంపుము పాల ముంపు మిఁక నిన్నే నమ్మినాఁడం జుమీ. కాళ. శ. ౧౯.

నీళ్లుద్రాగినట్లగు= సులభమగు, వశమగు.

ఆ. వీరభద్ర మన్న వీరభద్రమె తెచ్చు,శరభ మన్న నదియె సంగ్రహించు, మనుజనాథ కడమమంత్రములు లాబ్రహ్మ, రాక్షసునకు నీళ్లుద్రాగినట్లు నిరం. ౪. ౭౨.

నీళ్లునమలు=సందేహించు, సంశయించు.

ద్వి. అని యిట్లు దేవేంద్రుఁ డాడినమాట,విని యును వినసట్లు విస్మయం బంది, చ్యవనుఁ డూరకయుండె శార్గవుండు,నవుడుకొట్టెను నీళ్లునమలెఁ గశ్యపుఁడు. ద్వి. హరిశ్చ. పూ. ౫౧౯.

క. నీ వాపురికిని మొదలం, బోవం బని యేమి చెప్పుము యథార్థముగా,నావుడును నీళ్లు నమలుచు, నావిహగము చెప్పఁ గొంక నం చయు దానిన్. ప్రభా. ౪. ౭.

క. ధనవంతు నట్ల యడుగఁగ, దన కది తెలియ మికి నీళ్లు దాన మలిన నా,తని వెడల నడచి ప్రమదం,బున నాదంపకులఁ గూర్చి పొమ్మని యనిచెన్. శుక. ౨. ౭౨.

పాలెడునీళ్లకుఁ గట్టవేయుట = అసాధ్యమగు పనిచేయఁబూనుట.

ఉ. భూపతి మందరాద్రిఁ బువుఁబోఁడి వరించి టు లేకమున్నె యే,రూపునఁ బల్కినం దగు వరుండు బ్రియాంగనఁ బెండ్లియాడి కా,మో పనవీనభోగములఁ బొందెదు:వో సతులార మీర లీ,పాపపుమాట లాడుదురె పాలెడు నీళ్లకుఁ గట్టవేతురే. రుక్మా. ౪. ౨౪.

జః నీటఁగలయు,నీటికానుపు, నీటిచూలి, నీటితాత, నీటిదయ్యము, నీటిదారి, నీటిపుట్టుగు,నీటిపుట్టుగుపట్టి,నీటిమానికము, నీటియిక్క, నీటియెకిమీఁడు, నీటిరాయఁడు, నీటిరిక్క, నీరుకడిమి, నీరుకాకి, నీరుకాయ మొ.

నీరుకందువ. వి. (√నీరు.) జలాశయము.

ద్వి. నీరుకందువ నుండునీ కుమారకుఁడు, నీరు ముంపఁగఁ గుంభనినద మాలించి. రం. రా. అయో. ౧౨౫ పా. ౧౭ పం.

నీరుకట్టు. వి. (నీరు + కట్టు.) మూత్రబంధరోగము, మూత్రకృచ్ఛ్రము.

గీ ... అడరు నీరు,కట్టనఁగ మూత్రకృచ్ఛ్రము ... ఆం. భా. ౨. ౧౨౭.

నీరుకట్టె. వి. (√నీరు.) నీరుపాము, అలగర్దము.

క. వరుజుబడి రొంపిఁ ద్రొక్కం,జరణంబులఁ బెనఁగి పసిఁడిచాయకడుపులం, బొరి నీరుకట్టె లమరెను, బిరుదులు హాళికులు దున్నఁ బెట్టిరొ యనఁగన్. ఆము. ౪. ౧౨౫.

సీ. నీరుపా మనఁగను నీరుకట్టె యనంగ జలభుజంగము పేరు చెలఁగు...ఆం.భా.౧.౧౪౭.

నీరుకడిమి. వి. (నీరు + కడిమి.) ధారాకదంబము. (శ.ర.)

నీరుకాకి. వి.(√నీరు-క. నీరుకాగి.)జలకాకము.

సీ... నీరుకాకి నా జలకాకనామ మై చెలఁగుచుండు. ఆం. భా. ౨. ౯౩.

సీ. క్రౌఁజు బెగ్గురు నీరుకాకి కంకణమును గొంగ డాబయు గువ్వ వంగపండు. యయా. ౨. ౨౪. హంస. ౩. ౧౨.

నీరుకాకినెపము= లేనినేరము.

శా...అ,స్తోకప్రాథిని నీరుకాకినెపము ల్గోడించి పల్గా అయో, హాకీము ల్దమ రిట్లు పల్కుటకు నర్హంబే...రంగా. ౨. ౨౧౭.

నీరుకాయ. వి. (√నీరు.) బుద్బుదము,నీటిబుగ్గ. (శ. ర, బ్రౌ.)

నీరుకాయవాఁడు. వి. (√నీరు.) నీటిమనుష్యుఁడు. (శ. ర, బ్రౌ.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీరుకారు. వి. (√నీరు.) లేతయెఱుపు. (చి.ని.)

నీరుకాఱు. వి.(√నీరు.) కమసాలెవాని యొకవిధమగుకొఱముట్టు.

చ. కమటము కట్టసంచి యొరగల్లును గత్తెర సుత్తె చీర్ణముల్, ధమనియు శ్రావణంబు మొలత్రాసును బట్టెడ నీరుకాఱు కా, ఱము పటుకాఱు మూస బలునాణెపరీక్షలరుచ్చులాదిగా, నమరఁగ భద్రకారకసమాహ్వయుఁ డొండొకఁ డుండు నస్వరికా. హంస. ౨. ౧౭౧.

నీరుకాళ్లు. వి. బ. (√నీరు.) ౧. శోణహరితవర్ణములై సంధ్యాకాలములందు కానవచ్చు సూర్యకిరణములు.

సీ. ఈఁగ మిక్కుటమయ్యె సెలి నింగిఁ గడు మించె నిడుద లై తిలకించె నీరుకాళ్లు.హరి. పూ. ౭. ౧౬౦.

౨. వర్షధారలు. (చి. ని.)

నీరుకా(రా)వి. వి. (నీరు + కావి.) కొంచెమెఱుపు, లేతకావి.

ఆ. పరఁగ జలకమాడి పట్టెనామము దీర్చి,నీరుకావిపంచె సెరయఁ గట్టి.వేమన. ౩.౨౬౨.

సీ. కటిమధ్యమున నీరుకావిదోవతిపంచె భ్రూమధ్యమున నూర్ధ్వపుండ్రకంబు. జై. భా. ౭. ౧౯౭. (చి. ని.పా. 'కటిఁ బ్రాఁతమడుకనీర్కావిదోవతి'. ముద్రి.పా.)

సీ. గన్నేరుపూఁజాయ కర మొప్ప నీర్కావిమడుఁగుదోవతి పింజె విడిచి కట్టి. క్రీడా. ౭౩.

సీ. నిద్దమైనమడుంగునీర్కావిదోవతి కనకమేఖలతోడఁ గటి ఘటించి. కాశీ. ౧. ౩౯.

నీరుకావులు. వి. బ. (√నీరు.) ధాన్యవిశేషము.

సీ. నివ్వరు ద్దెబ్బసన్నీరుకావులు గాజుకస్సెరల్కారువడాల్కాంటుసరులు.హంస.౭.౧౨౮.

వ ... పసుపుగన్నేర్లు గుత్తిబలుగుత్తులు రాచిపూరాజనాలు పొన్నశ్రీరాజనాలు నివ్వరులు నీరుకావులు...ప్రబంధ. ౧౧౨.

నీరుకాసు. వి. (నీరు + కాసు.) స్నానముచేయునప్పుడు నీటియొద్దనమంత్రముచెప్పిన బ్రాహ్మణులకిచ్చెడుడబ్బు.

సీ. తిలలు దర్భలు పూని తీర్థసన్నిధి మంత్రములు సెప్పి నీరుకాసులు గడించి. హంస. ౨. ౧౫౨.

నీరుకుక్క. వి.(√నీరు.)జలశునకము. (శ.ర.)

నీరు(టి)కుప్ప. వి.(√నీరు.)జలరాశి, సముద్రము.

ఆ. ఓరి కోఁతిమూఁక యొక్కింతయును మదిఁ, గొంకు లేక నీరుకుప్ప దాఁటి,గడునుపాలసుదిండిగము లుండునిదీవి,కెట్లు చేరినాఁడవెఱుక మాలి. అచ్చ. రా. సుం. ౧౩౭.

సీ. తనరుందనపుఁజాయ వెనునీటికుప్పక స్పెనసినపసఁ బస రెక్కె ననఁగ. వసు. ౫.౩౬.

గీ...ఏనుఁగులు...నీటికుప్ప,నుండునడగొండలకుసాటి నొంది డిగ్గె. అచ్చ. భా. ౩.౩౮పా.

నీరుకుమ్మరపురువు. వి. (√నీరు.) నీటిలోనుండెడుకుమరపురువు.

సీ. నీరుకుమ్మరపురువు నీరీఁగ తలకప్ప...హంస. ౪. ౧౮౬.

నీరుకోఁతి. వి. (నీరు + కోఁతి.) జలమర్కటము, శింశుమారము. (శ. ర.)

నీరుకోడి.వి.(√నీరు.)పరిప్లవము,జలకుక్కుటము.

చ. అలరుఁ బురంబునం దొగల నంతరదామరఁ బ్రాఁచిఁ గప్ర పుక్,వలపులు మీఱ లో వలుఁదవాలుగ మొత్తమువోర నీరుకో,ళ్లొకలకొల మంచుఁ గ్రుంకుమెడగుంపులవంపులు దోఁప మావితోఁ,పులవిరుల న్నయిన్నడువఁబొల్చుఁ బురాతనతీర్థకుండముల్.ఆము. ౧. ౩౧.

గీ. సలిలకుక్కుటనామంబు వెలయు నీరుకోడి యన...ఆం. భా. ౨. ౯౨.

నీరుకు. సం. విణ. ౧=నీరుచము. (చ్) కాంతి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లేనిది. ౨.=నీరుజము. (జ్)రోగము లేనిది.

నీరుగండి. వి. (నీరు + గండి.) తూముకాలువ,వా వాసము. (శ.ర.)

నీరుగన్నేరు. వి. (√నీరు.) హిజ్జలముక్రీ. (శ.ర.)

నీరు(ళ్లు)గారు. అ.క్రి. (√నీరు.) ఉత్సాహము లేకుండు.

సీ. ఇంతికన్నులతోడ నీ డన వచ్చునే గండు మీ లవి నీళ్లుగారుచుండు. తపతీ. ౨.౧౪.

(వ్యవ.) వానిపని నీళ్లుగారుచున్నది.

నీరుగుట్టు. వి. (√నీరు.) జలజంతువిశేషము.

సీ. గులకరింతయు నీరుగుట్టు శంఖనఖంబు పులు కాసి నసిమిరి బుంగపురువు.హంస.౪.౧౭౬.

నీరుగో(గ్గొ)బ్బి. వి. (√నీరు.) నీరుగొలిమిడిక్రీ.

ఆ. నీరుగొబ్బివేళ్లు నీరుల్లిగడ్డలు, నేకనూతి యై నయెనుపవెన్న, నేకముగ నొనర్చి యేనహం బులు గొన్న,నిష్ఠురంపు మేహనివహ మడఁగు. (చికి. చి. ని.)

గీ. వెలఁగ వాఁకుడు పల్లేరు ములక వేము,నగిర నీర్గొబ్బి మొదలుగా జగతిఁ గల్గు,కంప లన్ని యు వేవేగఁ గడచి కడచి. హంస. ౪. ౬.

నీరుచము. సం. విణ. (అ.ఆ. అ.) కాంతి లేనిది.

నీరుచల్ల. వి. (నీరు + చల్ల.) మజ్జిగ తేట, నీటివలె తేటినమజ్జిగ.

చ...ఫలం, బులును సుగంధిశీతజలము ల్వడపిం డెలు నీరుచల్లయుక్, వెలయఁగఁ బెట్టు భోజనము వేసవిఁ జందనచర్చ మున్నగన్. ఆము. ౧. ౭౧.

గీ...నీరుచల్ల నీరు,మజ్జిగయు జలతక్ర నామము లు...సాం. ని. స్థా. ౬౭.

ఇట్లే: నీరుమజ్జిగ.

సాం. ని. స్థా. ౬౭.

నీరుచించెలము. వి. (√నీరు.) ఒకజాతి రొ వధిక్రీ. (జలచుక్రికక్రీ. అని చి. ని.)

సీ. విమకంటకాలామ్లవేతసంబును నీరుచించలం బును బులిచించలంబు. హంస. ౨. ౨౨౭.

నీరుచి(ర్చి)చ్చు. వి. (నీరు + చిచ్చు.) ౧. బడ బాగ్ని, ఔర్వము.

గీ...నీరుచిచ్చునంగఁ బోలుచు బడబాగ్ని... ఆం. భా. ౧. ౪౭.

౨. నీరు ఎక్కువగుటచే వృక్షములకుఁ గలుగు రోగవిశేషము.

వ... సుధాకరుండు చెంగలువకేదారంబులకుఁ దీర్చిన తేటపన్నీటికాలువలజాలువలె ధళధ ళనివెలివెలుంగుచలుపల జలజలనఁ దొలఁగు సలిలములు దొట్టి నీరుచిచ్చుఁ గొని యం చుల సంచరించురాయంచబోదలు వాకు గా మక్కునం బక్కుపక్కునఁ బొడువ నొక్కించుక విచ్చుమెట్టనెత్తమ్మిమొగడల వెడలుకట్టావి వెట్టగిలి...చంద్రా. ౫. ౬౩. (జలరూప మగునగ్ని. ఈయగ్ని యడవుల యందు నేలలో వ్యాపించుటవలన నడివిచె ట్లెల్ల మడియును అని చి. ని.)

నీరుచిట్టి. వి.(నీరు + చిట్టి.) అప్తండులీయముక్రీ.

సీ. అగు నీరుచిట్టి నా నప్తండులీయంబు...ఆం. భా. ౨. ౬౪.

నీరుచుఱుకు. వి. (√నీరు.) మూత్రము విడుచు నపుడు మంట కలిగెడురోగవిశేషము. (శ. ర.)

నీరుచెంచలి. వి.(√నీరు.)వితున్నముక్రీ. (శ.ర.)

నీరుజము. సం. విణ. (అ. ఆ. అ.) రోగము లేనిది. వి. అ. న. చెంగల్వకోష్టు.

నీరుటెంకి. వి. (నీరు + టెంకి.) జలాశయము.

సీ. నీరుటెంకి యనంగ మీఱు జలాశయంబు... ఆం.భా. ౧. ౧౬౨.

నీరుడి[1]. వి.(√నీరు.)౧.మూత్రము.(చి. ని. ప్రో.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. అతిమూత్రము.

శా. పంచద్రవ్యతమాలతాళిసములన్ పానీయ యుగ్మంబులన్, మించ న్నొక్కపలంబు కల్కముగ సమ్మేళించి తైలంబు రాణించన్ రీతి యొఱింగి వండి యది దా నిత్యంబు సేవింపఁగాఁ, గంచిన్ వేగఁగఁ బాతిపోవు బహులోగ్రాకారమా నీరుడుల్. (చికి. చి. ని.)

నీరుడి². వి. ఒకానొక చెట్టు. (చి. ని.)

నీరుడుము. వి. (√నీరు.) నీటియుడుము, జలగోధిక. (శ. ర.)

నీరుతిట్ట. వి. (√నీరు.) జలరాశి, సముద్రము.

సీ. అత్తఱిఁ గైక క్రచ్చుఱ నీరుతిట్టబత్తళికవజీరుబల్విలుదునిమిన, వెరవరినొసలబంగరుశేరు గట్టుతెఱంగు మంథర యనుటాఁగపాలఁతి, వలన నెఱింగి...అచ్చ. రా. అయో. ౨౧. (నీరుతిట్టబత్తళికవజీరు అనఁగా జలధితూణీరుఁడు, శివుఁడు.)

నీరుతిత్తి. వి. (√నీరు.) నీటితిత్తి.

వ...పన్నీరు నించినయన్నీరుతిత్తులొత్తవియత్తలంబునం బాతి కయివ్రాలుధారల వాద్యంబులు దడిసిన...ఆము. ౪. ౩౬.

నీరుతుట్ట. వి. (నీరు + తుట్ట.) నీరుకట్టె, అలగర్దము. (శ. ర.)

నీరు(టి)దాలుపు(ల్పు). వి. (√నీరు.) జలధరము, మేఘము.

శా. ఏఁడీ రక్కసినీరుదాలుపులగా ద్వేఁడీ జగంబేలు తేఁ,డు...అచ్చ. రా. అయో. ౨౨.

క. సిరి రాచవేల్ప కడు నీ,వరితనమున నీటిదాల్పవలమురినుడివా ల్దారవంటియొప్పు గలదే,వర...యయా. ౫. ౧.

నీరుదొత్తి. వి. (√నీరు.) నీరుకట్టె, అలగర్దము.

గీ. నిక్క మొకయాఁడుదియు నొక నీరుదొత్తియొక్కగాడిద యొకకోడె యొక్కగుఱ్ఱమని తలంపకు నను విలుప్తారిగంధుఁడగు జరాసంధుఁడుగ నింక నరసికొనుము. హరి. ఉ. ౧. ౧౦.

నీరుదోమ. వి. (√నీరు.) జలమశకము. (శ. ర.)

నీరుద్రిమ్మరి. వి. (నీరు + త్రిమ్మరి.) జలచరము, జలజంతువు.

గీ. నీరుద్రిమ్మరిపదువులు నెఱయ జేరయఁ, బానరుమ న్నీరు నేరి యబ్బురము మీఱ. అచ్చ. రా. యు. ౩.

నీరునే(ర్నే)ల. వి. (నీరు + నేల.) నీరు పాఱెడు నేల, ఊడుపునేల.

వ. కల్యాణకేళవ దేవర అర్చ (స. అ) మదుపడులకు ఖ ౩ ఎఱ్ఱంజెఱువు వెనక నీరునేలమ అతురులు ౪...ద. శా. ౪. ౨౦౪.

వ...ఒంపిచెల్ల శ్రీ అనంత గోపినాథదేవరకు అమావాస్యకొలుపులకు ఒంపిచెల్ల అంనద చెఱువు వెనకను నీర్నేలమత్తురు ౧. గు. జి. ఒంపిచెల్లశాసనము. ౧౨౪౨. దుర్గిశాసనము. ౧౧౩౩.

నీరుపంది. వి. (నీరు + పంది.) జలసూకరము. (శ. ర.)

నీరుపట్టు. అ. క్రి. (√నీరు.) ఉబ్బు.

(వ్యవ.) వానిఒడలు నీరుపట్టినది.

నీరుపదను. వి. (√నీరు.) కొంచెపుఁబదను.

సీ. ఘుమఘుమాధికరుతాకుంఠితాంభోరాశి నిజసాయకమునకు నీరుపదను. చంద్రా. ౧. ౭౧.

నీరుపాఁపర. వి. (√నీరు.) మత్స్యవిశేషము, ఒకవిధమైన చేప.

సీ. పక్కెచిత్తర నీరుపాఁపర మలుఁగుమీనరుజు నిల్లెపుఁజేప యారుజెల్ల. హంస. ౪. ౧౭౩. నీరుపాపెర. ముద్రి.

నీరుపాది. వి. ఒకానొక చెట్టు. (శ. ర.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీరు(టి)పాప. వి. (√నీరు.) ౧. కృపీటయోని, నిప్పు.
ఆ. నీరుపాప గాలినెచ్చెలి యన్నంటి, తిండి
కాఁడు...అగ్గి యనఁగ నొప్పు ననలుఁ డీశ.
ఆం. సం. దేవ. ౧౭.
౨. జలజంతువిశేషము.
గీ...నీరు, పాప నీశేన్గు నీర్పిల్లి ప్రాఁచిపురు
వు, లాది కొఱగానిజంతువు లన్ని విడిచి.
హంస. ౪. ౧౨౬.
౩. జలమనుష్యుఁడు; జలమనుష్యాంగన.
శా. మారీచక్షణదాచరుం డపుడు రామస్వా
మితోఁ బోరికై, యారంభించి తదీయమారు
తశరవ్యాపారతూలీకృతా, కారుండై మృతి
దప్పి యుప్పుకడలిం గాఁ పయ్యె వార్ధీశ
కాం; తారత్నంబులు నీటిపాప యనుచుం ద
న్నట్టి యాడింపఁగన్. చం. రా. ౨. ౯౧.
శ్లో. వేషం పుపోష జలమానుషనిర్విశేషం. సం.
చం. రా. బాల. ౫౦.
(దివిజభామలవర్ణనము.) సీ. కొలఁకులలోపలనుండి
కెలఁకుల విహరింప బయట నిల్చిననీరుపాప
లొక్కొ. తపతీ. ౪. ౭౪.

నీరుపాము=నీరుకట్టె. వి. (√నీరు.) జలసర్పము.
సీ. నీరుపా మనఁగను నీరుకట్టె యనంగ జల
భుజంగము పేరు చెలఁగును...ఆం. భా. ౧.
౧౪౩. సాం. ని. తిర్య. ౭౧.

నీరుపాయము. వి. (నీరు+పాయము.) నీటివలె
చంచల మగుప్రాయము, యౌవనము. (శ. ర.)

నీరుపిప్పలి. వి. (√నీరు.) పిప్పలివిశేషము, తో
యపిప్పలి.
సీ. నీరుపిప్పలి యం చనిన బొక్కెన యనంగఁ
దోయపిప్పలిసంజ్ఞ తోఁచుచుండు. ఆం. భా.
౨. ౫౭.

నీరు(ర్పి)పిల్లి. వి. (నీరు+పిల్లి.) జలమార్జాలము,
ఉద్రము. (శ. ర.)
గీ...నీరు, పాప నీశేన్గు నీర్పిల్లి ప్రాఁచిపురువు,
లాదికొఱగానిజంతువు లన్ని విడిచి. హంస.
౪. ౧౨౬. ('నీర్పలి' ముద్రి.)

నీరు(టి)పుట్టువు(వ)=నీటిపట్టుగు. (నీరు+పు
ట్టువు.). ౧. శంఖము.
సీ. నీరుపుట్టువయును నీరుపుట్టువయును బూర
యుఁ దొడవునై పాలుపు నెఱప. అచ్చ.
రా. బాల. ౩.
౨. కౌస్తుభము. అచ్చ. రా. బాల. ౩.
౩. తామరపువ్వు.
ద్వి. తెలినీటిపుట్టువు తేట యై కరుణ, లోలుఁడు
చుండెడు నేత్రయుగళంబువాని. అ. మ. క.
౧. ౧౩పా. ౨౩ పం.
(ఇట్లే ఈ పదమునకు చంద్రుఁడు అగ్ని మొద
లగునర్థములును గలవు.)

నీరుపోఁత. వి. (నీరు+పోఁత.) జలక్రీడ.
ఆ. ప్రణయభావ మెసఁగఁ జారు లుత్సవమునఁ,
గూడి నీరుపోఁత లాడి రొప్ప. కు. సం. ౭.
౨౫౦.

నీరుపోయు. అ. క్రి. (√నీరు.) నీరుపట్టు, క్రొ
వ్వెక్కు, మదించు.
గీ. ఇవ్విధంబున మెలఁగునయ్యింతి యొంటి,
తిండికతమున నినుమడికండ పట్టి, నీరుపోసిన
మేనిలో నిలుపరాని, మదనుచే జారభోగ
మేమఱక తిరుగు. శుక. ౩. ౩౫౧.

నీరుప్పి. వి. (√నీరు.) వృక్షవిశేషము.
సీ. తెల్లకాంచనము తుందిల మెఱ్ఱకాంచన ము
ప్పి తెల్లుప్పి నీరుప్పి యిప్ప. హంస. ౪. ౧౧.

నీరుప్రబ్బలి. వి. (నీరు+ప్రబ్బ.) జలవేతస
ము, విదులము. (శ. ర.)

నీరుబచ్చలి. వి. (√నీరు.) ఒకవిధ మగుకూరాకు
మొక్క.
సీ. నెమటాయి గొలిమిడి నీరుబచ్చలి ప్రబ్బ...
హంస. ౪. ౧౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీరు(టి)బిడ్డఁడు. వి. (√నీరు.) అగ్గి, వహ్ని.
సీ. నీటిబిడ్డఁడు కిత్తు నిప్పు ముట్టఁగరానిబలి యుఁడు...అనఁ జెలఁగు వహ్ని. సాం. ని. దేవ. ౧౨.

నీరుబొద్ది. వి. (నీరు+బొద్ది.) వృద్ధదారకవిశేషము. (శ. ర.)

నీరుమట్టము. వి. (√నీరు.) జలవ్యాప్తి కలభూభాగము. (శ. ర.)

నీరుమానిసి. వి. (√నీరు. సం. నీరమానుషః.) నీటిమనుష్యుఁడు.
క. ఏనుంగులాగు పందికి, మానిసిచందంబు నీరుమానిసికి నగుం,గాని గుణంబులు గలుగవు ...ఉ. హరి. ౩. ౧౬.

నీరుముంపు. విణ.(√నీరు.) జలప్రాయము, అనూపము, క్రీనీరునేల.
గీ. నీరుముం పనఁ గ్రీనీరునేల యనఁగ, ఖ్యాతిగాంచు ననూపంబు...ఆం. భా. ౨. ౪.

నీరుము(ర్ము)ట్టు. అ. క్రి. (√నీరు.) ౧. మలమూత్రోత్సర్జనముచేయు. (జలస్పర్శమునకు నిమిత్తమగుటచే దీనికీపేరు వచ్చినది.)
గీ. రచ్చఁ దెరువున గృహవాటి మచ్చుమీఁద, నీటిచేరువఁ గొఱగాదు నీరుముట్ట,వసుధమీఁదనుదళముగాఁ గసవుఁ బఱపి,వేగ మూత్రపురీషము ల్విడువవలయు. వి.పు. ౮.౧౮౨.
౨. జలస్పర్శనముచేయు, ఆచమనముచేయు.
గీ. తనదునీడపురీషమూత్రములుతాను,గనుఁ గొనఁగఁబోకనీర్ముట్టఁగావలయును. శివధ. ౭.౪.

నీరు(టి)మోపరి. వి. (√నీరు.) ౧. కలశము.
సీ.ముదితగుబ్బలు నీరుమోపరుల గణింప వప్పుఁబుట్టువుఁ గాచు నతివకేలు.హ. న.౮.౪౩.
౨. మేఘము.
సీ...జేజేరేనియందలము నీటిమోపరి మబ్బు మొయి లనఁ బరఁగు ఘనము. సాం.ని.దేవ.౨౧.

విణ. నీరు మోచునది. (శ. ర.)

నీరుమోయు. అ. క్రి. (√నీరు.) ౧. నీరుపట్టు.
౨. గర్భిణియగు.
క. ఆపన్నసత్త్వ యాపగ, యాపగిది న్నీరు మోసి యధిగతసేవా,వ్యాపారద్విజమహిళ, ల్గాపాడఁగ నొక్కపుణ్యలగ్నమునందుక్. వసు. ౩.౨౧. (రెండర్థములకు నిదియే యుదాహరణము.)

నీరుల్లి. వి. (నీరు+ఉల్లి.) ఎఱ్ఱగడ్డ, పలాండువు.
సీ...ఎఱ్ఱ,వుల్లి యం చనఁగ నీరుల్లి నాఁగఁ బలాండు వొప్పు...ఆం. భా. ౨. ౬౯.
ఆ...నీ్రుల్లిపాయచాయ...చంద్ర.వి.౨.౫౪.

నీరువంగ=నీరెత్తువంగ. వి. (√నీరు.) వార్తాకవిశేషము, వృంతాకము.
సీ...నీరెత్తువంగ నా నీరువంగ,యనఁగను వృంతాక మలరు...ఆం.భా. ౨. ౫౯.

నీరువట్టివేరు. వి. (√నీరు.) ఉశీరవిశేషము, లామజ్జకము. (శ. ర.)

నీరువ(ర్వ)ట్టు. అ. క్రి. నీరు+పట్టు.)దప్పిగొను.
ఆ. రాత్రి జాగరణభరశ్రాంతులై వారు,నిద్రఁ బొందియుండ నీరువట్టి, ధారుణీశ్వరుండు తన్నంత్రకలశోద,కంబు లెల్లఁ ద్రావెఁ గడుపు నిండ. భార. అర. ౩. ౨౦౨.
వ...వెచ్చువెరుఁగుఖరకరకరనిపాతంబుల నాతప్తంబు లగునెలవులం దొరఁగి పరఁగువెలఁది వెన్నెల నీర్వట్టువెన్నెలపిట్టలు పొట్టలు నిండ నాస్వాదించె. పాండు. ౪. ౧౬.
వి. ౧. దప్పి, పిపాస.
వ...ఆకొన్నలనినీళ్ళు ద్రావినవారికి నెన్నండును నాఁకలియును నీరువట్టును లేవు. భార. ఆది. ౬. ౨౧౯.
సీ. ఆఁకలి నీరువ ట్టలఁత జరారోగములు కాలగుణములు మొదలుగాఁగ, దోషంబు లెవ్వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యుఁ దోయజభవులోకమునఁ బ్రభవింపవు
...హరి. పూ. ౨. ౧౪.

క. భూకాంత నీరువట్టుకుఁ,గాక వదన మిలుక
రింపఁ గాన్పించినపం,డ్లోకా కన వెలిపుచ్చ
లు, లోకములోఁ గాచె నిట్లు లోఁబడె
జనముల్. వరాహ. ౧౦. ౩౦.

క. భువనావరణోదకమున, భవు నభిషేకంబు
సేయఁ బాసెను లయతాం,డవకేళీసమయ
సము,ద్భవ మగునీర్వట్టు కపటపాశుపతు
నకుఁ. కాశీ. ౫. ౧౪౦.

౨. నీటిచాతిక.

మ...ని,ర్మలతోయస్నపనం బొనర్చి నశరీరం బే
టికి న్నీరువ,ట్టులు గట్టెం భవదాత్మశుద్ధి కిది
గూడుం గా మహాహేయముల్. కాశీ. ౩.
౯౬.

నీరువత్తిగలు. వి. (√నీరు.) భక్ష్యవిశేషము.

వ...మణుఁగుఁబువ్వులుం బేణీలు నీరువత్తిగలు
మడతలుఁబప్పుబూరెలు...హంస.౧.౧౦౫
(శ.ర. పా. 'నీరువత్తిగెలు' ముద్రి.పా.)

నీరువరి. వి. (√నీరు.) నీవారతృణము. (శ. ర.)

నీరువె(పె)ట్టు. అ. క్రి. (నీరు+పెట్టు.) పాల
ములోనగువానికి నీరు ప్రవహింపఁజేయు.

చ...అసురఘుస్రవైరిభుజాంతరాళజాం,గలమ
హి జాలువట్టి పయిఁ గ్రమ్మెడునెత్తురు నీరు
పెట్టి యం,దలుకవె కీర్తిభూరికలమాంకుర
మింద్రరమాఫలార్థి వై. పాండు. ౨. ౫౯.

నీరూపము. సం. విణ. (అ. ఆ. అ.) రూపము
లేనిది. (కాలము మొ.) వి. అ. పుం. గాలి.
న. ఆకాశము.

నీరెండ=ఈరెండ. వి. (నీరు+ఎండ.) కొంచెసా
టియెండ, లేఁతయెండ.

గీ...నీరెండ యీరెండ యనఁగఁ గించి,దాతపం
బగు...ఆం. భా. ౧. ౭౨.

గీ. ఎగసె నుదయాద్రియవుల నీరెండకొనలు.
నైష. ౭. ౧౧.

నీరెత్తువంగ=నీరువంగ. వి. (√నీరు.) ఆం. భా.
౨. ౫౯.

నీరేనుఁగు(గ్గు). వి.(నీరు+ఏనుఁగు.) నీటిగజము.

గీ...నీరు,పాప నీరేన్గు నీర్పిల్లి ప్రాఁచిపురువు,లా
దికొఱగానిజంతువు లన్ని విడిచి. హంస.
౪. ౧౭౬.

నీరొట్టు. వి. (√నీరు.) భక్ష్యవిశేషము.

గీ. రొట్టె నీరొట్టు నిప్పటి యట్టు దోసె,యిడ్డెన
యనంగ నిటు కొన్ని యొసఁగుచుండు,భక్ష్య
భేదాహ్వయంబులు...ఆం. భా. ౨.౨౫౬.

నీరోగము. సం.విణ. (అ.ఆ.అ.)రోగము లేనిది.
వి. అవ్య. అ.న. రోగాభావము, రోగములేమి.

నీర్చిచ్చుకాఁడు. వి. (√నీరు.) ఒకవిధమైనల
కుముకిపిట్ట, టిట్టిభభేదము.

సీ...టిట్టిభము లకుముకి యనఁ బరగుఁ దద్భే
దంబునీర్చిచ్చుకాఁ డన నెగడుచుండు. ఆం.
భా. ౨. ౯౪.

నీర్వా(టివా)మి. వి. (నీరు+వామి.) జలరాశి,
సముద్రము.

గీ. మ్రుచ్చుఁదనమున రాకొమ్మఁ దెచ్చినట్టి,యు
ఱియరక్కసుఁ డిదె డాఁగి యున్నవాఁడు,
రం డనుచుఁ దమ్ము నెలమిఁ జేరంగఁ బిలుచు,
కరణిఁ గడు మ్రోయునీర్వామి గాంచి రెదు
ట. అచ్చ. రా. కిష్కిం. ౯౦.

చ... పఱచెఁ దెల్లఁగ గేఱులు నీటివామికిఁ.
అచ్చ. రా. కిష్కిం. ౬౪.

నీఱు. వి. (క. త. నీఱు.) భస్మము, బూది.

ఆ.మాఱుకొన్నవారి నీఱు సేయుచు ప్రజ,నరసి
మనుపు ధరణిసురులఁ బ్రోవు. భార. శాం.
౧. ౩౪౦.

ద్వి. ఆనీలకంధరుం డనియె నవ్వుచును,సొదల
నీ ఱలఁది యచ్చుగఁ దోలు గప్పి,పొదివి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిచ్చలు బహుఘాతముల్ గొలువ. ద్వి. హరిశ్చ. ఉ. ౨౬౫ పం.

గీ. ఇట్లు చను దెంచి మా సైన్య మెల్లఁ గూల్చె, బెక్కుగూపము లై విష్ణుఁ డొక్కరుండ, వట్టిమ్రాఁకుల నొకదవజ్వాల దగిలి, వివిధ ముఖముల నీఱు గావించునట్లు. వరాహ. ౮. ౫౬.

నీఱుగవిసిననిప్పు=బూడిద చేఁ గప్పఁబడినని ప్పు. (మఱుఁగు వడినమహిమ కలవాఁడు అని తాత్పర్యము. ఇది ఇతరపదవ్యవధానముతో కూడఁ గన్పట్టుచున్నది.)

చ. సవినయవృత్తిఁ గొల్వ మిట చన్నదినంబులు వీరు నీఱుపైఁ, గవిసిననిప్పులట్ల యధికం బగు తేజము దోఁపకున్కి ... భార. విరా. ౫. ౩౫౧.

ఆ. మంచు మఱుఁగువడినమార్తాండుఁ డనుబోలె, నీఱు గవిసియున్న నిప్పుఁబోలె, వేష ధారి యైనవిష్ణుండుఁబోలె న, వ్విరటుకొలువు సేర నరుఁడు వచ్చె. భార. విరా. ౧. ౨౨౮.

క... కడిఁదిమూర్ఛ మెయి నిట్లున్నా, రాఱని తేజంబులతో, నీఱు పయింగవిసియున్న నిప్పులుఁబోలెన్. భా. రా. యు. ౫౯౧.

ఇట్లే: నీఱగప్పిననిప్పు.

ఉ. అప్పుడు విప్రసూనుఁడు రయంబునఁ బానుపు డిగ్గి వేడ్కతోఁ, జెప్పఁడు మింక నొక్కదరిఁ జేరెద నంచుఁ దలంచువేళ లా, గొప్పఁగ ధౌతచేలము సమున్నతలీల ముసుంగు వెట్టి నీ,ఱగప్పిననిప్పు చందమున రాజనిభానన నిద్రవోవఁగన్. నిరం. ౨. ౧౦౫.

నీల. సం. వి. ఆ. స్త్రీ. ౧. నీలిచెట్టు. ౨. నల్లగలిజేరు.

నీలంగువు. సం. వి. ఉ. పుం. ౧. కృమి, పురుగు; కట్టెలలో నుండుపురుగు. ౨. ఇంద్రనీలమణి. ౩. నక్క. స్త్రీ. ౧. తుమ్మెదలపంక్తి. ౨. ఈఁగ.

నీలఁడు. వి. అశ్వవిశేషము.

క. ఒనరించిననీలని నడ, గని బొల్లనిఁ గత్తలాని గైరని సారం, గని జారని జన్నని నిమ, వని మొదలుగఁ దెచ్చి నిలిపె వాహనుఁ డెదురన్. ద్వా. ౩. ౧౮౧.

నీలకంఠము. సం. విణ. (అ. ఆ, ఈ. అ.) నల్లని కంఠము కలది. వి. అ. పుం. ౧. నెమిలి. ౨. గ్రామచటకము, ఊరపిచ్చుక. ౩. ఖంజనము, కాటుకపిట్ట. ౪. దాత్యూహము, కూకుడుగుండెఁగి. ౫. బంగారుపిచ్చుక, పీతముండము. ౬. పాము. ౭. తుమ్మెద. ౮. పీతసారము, హరిచందనము. ౯. ముల్లంగి, మూలకము.

నీలకంఠుఁడు. సం. వి. అ. పుం. ౧. కఱకంఠుఁడు, శివుఁడు. ౨. సంస్కృతభారతవ్యాఖ్యాతలలో నొకఁడు.

నీలకందము. సం. వి. అ. పుం. విషకందము, ఒకవిధ మగుకందము.

నీలకమలము. సం. వి. అ. పుం. ౧. నల్లకలువ. ౨. నల్లతామర. ౩. నల్లనీరు.

నీలకము. సం. విణ. (అ. లికా. అ.) నల్లనిది. వి. అ. న. ౧. కాచలవణము, గాజుప్పు, నల్లయుప్పు. ౨. వర్తలోహము, నల్లయుక్కు. ౩. మయూరతుత్థము, మైలుతుత్తము. ౪. అసనము, వేఁగిస. పుం. ౧. నల్లగుఱ్ఱము. ౨. తుమ్మెద. ౩. నల్లకోఁతి. ౪. మహాజ్వాల. (వై. ని.)

నీలకురంటకము. సం. వి. అ. పుం. నల్లగోరంట.

నీలకుసుమ. సం. వి. ఆ. స్త్రీ. నీలఝింటి, నల్లగోరంట.

నీలకేశి. సం. వి. ఈ. స్త్రీ. ౧. నీలిచెట్టు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నల్లవెండ్రుకలు కలస్త్రీ.

నీలక్రాంత. సం. వి. ఆ. స్త్రీ. కృష్ణాపరాజిత, నల్లవిష్ణుక్రాంతిచె.

నీలగంధి. సం. వి. ఇ. పుం. రత్నవిశేషము. ఆ. నలుపు నెత్తురుదనము మిళితమై నెగడెడు, డాలు గలిగినదియు నీలగంధి. రత్నపరీక్ష. ౧౨ ప.

నీలగ్రీవుఁడు. సం. వి. అ. పుం. నీలకంఠుఁడు, శివుఁడు.

నీలచర్మము. సం. వి. న్. పుం. ౧. నల్లతోలు; నల్లతొక్క. ౨. పరూషకము, ఖర్జూరముచె.

నీలచ్ఛదము. సం. విశ. (అ. ఆ. అ.) నల్లని ఛదములు-ఆకులు-కలవి. వి. అ. పుం. పేరీఁత, ఖర్జూరముచె.

నీలజము. సం. వి. అ. న-నీలపర్వతమునందు పుట్టినది-వర్తలోహము, నల్లయుక్కు.

నీలఝింటి. సం. వి. ఈ. స్త్రీ. నల్లగోరంటచె.

నీలతరువు. సం.వి.ఉ.పుం.కొబ్బెరచెట్టు.(వాచ.)

నీలతాలము. సం. వి. అ. పుం. ౧. తమాలము, చీకటిమ్రానుచె. ౨. హింతాలము, గిఱకతాడుచె.

నీలదూర్వ. సం.వి.ఆ.స్త్రీ. ౧. నల్లగోలిమిడిచె. ౨. నల్లగఱికచె.

నీలద్రుమము. సం. వి. అ. పుం. అసనము, నల్ల వేఁగిసచె.

నీలధ్వజము. సం. వి. అ. పుం. ౧. తమాలము, చీకటిచెట్టు. ౨. -నల్లనిజండావలె నుండునది-తాటిచెట్టు.

నీలనిర్యాసకము. సం. విశ. (అ. సి.కా. అ.) నల్లనిబంక కలది. వి. అ. పుం. ౧. నీలాసనము, నల్లవేఁగిసచె. ౨. నల్లనిబంక.

నీలపంకము. సం. వి. అ. పుం. న. ౧. చీకటి. ౨. నల్లబురద.

నీలపటలము. సం. వి. అ. న. ౧. నేత్రరోగవిశేషము, కంటిలో బయలుదేఱునల్లనిపొర. ౨. నల్లనియింటికప్పు.

నీలపత్త్రము. సం. విశ. (అ. ఆ. అ.) నల్లని పత్రములు కలది. వి. అ. పుం. ౧. దానిమ్మచె. ౨. గుండ మనుతృణముచె. ౩. అశ్మంతకముచె. ౪. నీలాసనము, నల్లవేఁగిసచె. ౫. నీలపద్మము, నల్లతామరచె. న. ౧. ఇందీవరము, నల్లకలువచె. ౨. నల్లనిఆకు.

నీలపద్మము. సం. వి. అ. న. నల్లతామరచె.

నీలపుచ్ఛము. సం. వి. అ. పుం. -నల్లనితోఁక కలది- డేగ.

నీలపునర్నవ. సం. వి. ఆ. స్త్రీ. నల్లగలిజేరుచె.

నీలపుష్ప. సం. వి. ఆ. స్త్రీ. ౧. నీలాపరాజిత, నల్లవిష్ణుక్రాంతిచె. ౨. అతసి, అగిసెచె.

నీలపుష్పము. సం.విశ. (అ.ఆ.అ.) నల్లనిపువ్వులు కలది. వి.అ.పుం. నీలభృంగరాజము, నల్లగుంటగలగరచె. న. ౧. గ్రంథిపర్ణము, గండివనము, మాచిపత్తిరిచె. ౨. నల్లనిపువ్వు.

నీలపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. నల్లదింటెనచె.

నీలపుష్పిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. నీలిచె. ౨. అతసి, అగిసెచె. ౩. నల్లదింటెనచె.

నీలపృష్ఠము. సం. వి. అ. పుం. రోహిత మను మత్స్యము, ఎఱ్ఱచేప.

నీలపోరము. సం. వి. అ. పుం. ఇక్షుభేదము, ఒకజాతి చెఱకుచె.

నీలఫల. సం. వి. ఆ. స్త్రీ. జంబువు, నేరేడుచె.

నీలబీజము. సం. విశ. (అ. ఆ. అ.) నల్లనివిత్తులు కలది. వి. అ. పుం. నీలాసనము, నల్లవేఁగిసచె.

నీలభము. సం. విశ. (అ. ఆ. అ.) నల్లని కాంతి కలది. వి. అ. పుం. ౧. తుమ్మెద. ౨. మబ్బు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీలభృంగరాజము. సం. వి. అ. పుం. నల్లగుంట కలగర.

నీలమణి. సం. వి. ఇ. పుం. ౧. ఇంద్రనీలమణి. ౨. -నీలమణివంటివాఁడు- కృష్ణుఁడు. (వాచ.)

నీలమల్లిక. సం.వి. ఆ. స్త్రీ. మారేడు, బిల్వము.

నీలమాషము. సం. వి. అ. పుం. రాజమాషము, బొబ్బర.

నీలమీాలికము. సం. వి. అ. పుం. -ముడుఁచుకొనినపుడు నల్లగా నుండునది- మిడుఁగురుఁబుర్వు.

నీలము. సం. విణ. (అ. ఆ. అ. ప్రాణివాచక మగునపుడు స్త్రీలింగమున ఈకారాంత మగును.) కృష్ణము, నల్లనిది. వి.అ. పుం. ౧. కృష్ణవర్ణము, నలుపు. ౨. నీలమణి, నీలపురాయి. ౩. వటము, మఱ్ఱి. ౪. ఒకానొకకొండ. ౫. కుబేరునినవనిధులలో నొకటి. ౬. కళంకము, మచ్చ. ౭. నల్లనియెద్దు. ౮. పాండురవర్ణము కలముఖపుచ్ఛములును శ్వేతవర్ణము కలడెక్కలు కొమ్ములును కలఎఱ్ఱయెద్దు.

శ్లో. లోహితో యస్తు వర్ణేన ముఖే పుచ్ఛే చ పాండురః, శ్వేతః ఖురవిషాణాభ్యాం స వృషో నీల ఉచ్యతే. (కల్ప.)

న. ౧. కాచలవణము, గాజుప్పు. ౨. తాలీశపత్త్రము, తాళిసపత్తిరి. ౩. విషము. ౪. సౌవీరాంజనము. ౫. మైలుతుత్తము. ౬. నీలిమందు. ౭. చీకటి.

శ్లో. నిశాశ్శశాంకక్షతనీలరాజయః. ఋతుసంహారము. ౧. ౨.

నీలమృత్తిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. నల్లమన్ను. ౨. పుష్పకాసీసము, కొంచెము పసుపువన్నె కలఅన్నభేది.

నీలమేహము. సం. వి. అ. పుం. మేహరోగవిశేషము. (ఇది శుక్రమును నలుపువర్ణముగా చేసి స్రవింపఁజేయును.)

నీలలోహము. సం. వి. అ. న. వర్తలోహము.

నీలలోహిత. సం. వి. ఆ. స్త్రీ. ౧. భూమిజంబువు, నేలనేరేడు. ౨. పార్వతి. (కల్ప.)

నీలలోహితము. సం. విణ. (అ. ఆ. అ.) నలుపును ఎఱుపును కలది. వి. అ. పుం. నలుపు కలసినయెఱుపు.

నీలలోహితుఁడు. సం. వి. అ. పుం. -కంఠమందు నలుపును కేశములందు ఎఱుపును కలవాఁడు- శివుఁడు.

నీలవర్షాభువు. సం. వి. ఊ. పుం. నల్లకప్ప. స్త్రీ. ౧. నీలపునగ్నువ, నల్లగలిజేరు. ౨. నల్లచాఁగ.

నీలవల్లి. సం. వి. ఈ. స్త్రీ. వంద, బదనిక.

నీలవసనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నల్లనివస్త్రము కలవాఁడు. వి. అ. పుం. ౧. బలరాముఁడు, నీలాంబరుఁడు. ౨. శని. ౩. నిరృతి.

నీలవృన్తా. సం. వి. ఆ. స్త్రీ. అజాంత్రి, నల్లసముద్రపాల.(గాడిదగడపర. అని కొందఱు.)

నీలవృంతము. సం. వి. అ.న-నల్లనితొడిమకలది- తూలము, ప్రత్తి.

నీలవృష. సం. వి. ఆ. స్త్రీ. వార్తాకీభేదము, పువ్వులును కాయలును ఆకులును నల్లగానుండు వంగచెట్టు.

నీలశీర్షము. సం. వి. అ. పుం. నల్లనిముఖము కల క్రోంతి, కొండముచ్చు.

నీలసంధ్య. సం. వి. ఆ. స్త్రీ. కృష్ణాపరాజిత, విష్ణుక్రాంత.

నీలసారము. సం. విణ. (అ. ఆ. అ.) నల్లనిచేవ కలది. వి. అ. పుం. ౧. తిందుకము, తుమికి. ౨. నల్లమద్ది. ౩. నల్లజేఁగిస.

నీలస్కంధ. సం. వి. ఆ. స్త్రీ. గోకర్ణి, చాఁగ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీలాంగము. సం.విణ. (అ. ఆ, ఈ. అ.) నల్లని శరీరము కలది; నల్లనిఅవయవములు కలది. వి.అ. పుం. సారసపక్షి.

నీలాంజన. సం. వి. ఆ. స్త్రీ. విద్యుత్తు, మెఱుపుఁదీఁగ.

నీలాంజనము. సం. వి. అ. న. 'సౌవీరాంజనము' ఒకవిధమైనకాటుక.

నీలాంజని. సం. వి. ఈ. స్త్రీ. కాలాంజనీక్షుపము.

నీలాంజస. సం. వి. ఆ. స్త్రీ - నల్లమేఘమును అంటియుండునది- ౧. మెఱుపుఁదీఁగ. ౨. ఒకానొకనది. ౩. ఒకానొకఅప్సరస్త్రీ.

నీలాంబరము. సం. వి. అ. పుం. ౧. తాళిసపత్రి. ౨. నల్లనిబట్ట.

నీలాంబరి. సం. వి. ఈ. స్త్రీ. ముప్పదిరెండునపుంసకరాగములలో నొకటి.

గీ. చెంచుమలహరి...నీలాంబరియు ననంగ. గీ. బొసఁగు ముప్పదిరెండునపుంసకములు. హంస. ౫. ౧౨౪, ౧౨౫.

గీ. రీతిగౌళయు నీలాంబరియును ఘనము,దనరు హంవీర నాటయు నని నపుంసకములు ముప్పదిరెండురాగములు మఱియు, దేవమల హరి సాహరి రేవగుప్తి. ప్రబంధ. ౯౪.

నీలాంబరుఁడు. సం= నీలవసనుఁడు.

నీలాక్షము. సం. విణ. (అ.ఈ.అ.) నల్లనికన్నులు కలది. వి. అ. పుం. బాతు.

నీలామ్లా. సం. వి. ఆ. స్త్రీ. నీలఝుంటి, నల్లగోరంట.

నీలాలి. వి. ద్విముఖదీపిక.

సీ. ద్విముఖదీపిక గడిదేరు నీలాలి నా... ఆం. భా. ౨. ౧౬౫.

నీలాలువు. సం. వి. ఉ. పుం. నల్లనికంద, ఒకదినుసుదుంప.

నీలాశ్మము. సం. వి. న్. పుం. ఇంద్రనీలమణి, నీలపుఱాయి.

నీలి[1]. వి. మల్లవిద్యాసాధనవిశేషము.

సీ. మనును జెట్టి యనంగ మల్లాభిధానంబు తద్విద్య సాము నాఁ దనరుచుండు, దత్సాధనంబులై తగుఁ గంబము కొణత కటికన లోడి సంగడము బాల. గీ. సంగడము నీలి గోతా మనంగఁ గొన్ని. ఆం. భా. ౨. ౨౦౪.

నీలి[2]. వి.(సం. నీలం.ప్రా. నీలీ.) ౧. నీలవస్త్రము.

సీ... నీలవస్త్రం బగు నీలి యనఁగ. ఆం. భా. ౨. ౧౫౪.

౨. నలుపు, నీలిమ.

గీ...సకలజగద్భవణాయమాన, నీలవన్నియలను నొక్క-నీలి మ్రింగ, ననుట నిజమై యశేష వర్ణాంతరములఁ, గప్పుకొని యొప్పు చిమ్మచీకటులు నెఱయ. శుక. ౧. ౧౫౪.

గీ. చీరి నేతితోఁ గాటుక చిక్క-మెదిచి,నెఱయ బ్రహ్మాండవుహారంబు తెఱపిఁ గదియ, వరుసతో ముద్దవరువడి వైచి కలయ,నీలిఁ గుడిపినక్రియఁ జీఁకువాలు గదిసె. కు. సం. ౮. ౯౯. (నీలిఁగుడిపినక్రియక్=నైల్యమును వ్యాపింపఁజేసినరీతిని.)

౩. నల్లనూలు. (శ. ర.) ౪. ఇంద్రనీలము. (చూ. నీలితిన్నె.)

విణ. ౧. నల్లనిది. (ఒకానొకచో వీని యిత్వము నకులోపము కన్పట్టుచున్నది.)

గీ. కొస దిగఁగ నీలిపుట్టంబు ముసుఁగువెట్టి, గాజు లెగఁద్రోసి చప్పుడుగాకయుండ,వచ్చె నూర్వశి యర్జునావాసమునకు. హర. ౪. ౧౧౯. మనుచ. ౪. ౩౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. నిండఁగాటపునీలిదిండు గా దని కటిఁ బలు
చనినారచీరలు ధరించె. వాల్మీ. ౨. ౧౧౫.
మ. తలచుట్టు నడచొళ్లియంబులును నీలట్టీలు...
హరిశ్చ. ౨. ర.
౨. (త. నీలి.) దుష్టురాలు, ధూర్తురాలు.
ఉ. అద్దమరేయిదాఁక పొల మారసి మారశిలీ
ముఖాహతి, న్నిద్దురఁ గాచి యున్న మగనిక్
జగనీలిపిసాళిజంత య, ముద్దియ సేవచేయదు
...పాండు. ౩. ౮౧.
ఉ. ఏసడిసన్నమానిసివొ యేమి రొటుంగవు
పాటుపట్టివే, వేసర కన్ను నేరిచితివే మటు
మాయలనీలికాన యో, మూసినముత్తె మైమె
లఁగుముద్దుఁగుమారునిమీఁద నెట్టుగాఁ, జే
సితి వింతమచ్చరము చెల్లునఁటే మటి యాఁ
డుదానికిక్. సారంగ. ౩. ౫౩.
సా: నీలినీళ్లకు పోయిన బావి లోఁతునకు పో
యినది. (బ్రౌ.)
జః నీలిచీర, నీలితనము, నీలితిన్నె, నీలిదట్టి,
నీలిమందు, నీలిమబ్బు.

నీలి. సం. వి. ఈ. స్త్రీ. ౧. నీలిచెట్టు. ౨. నల్ల
గలిజేరు*. ౩. నల్లగోరంట*. ౪. నల్లయీఁగ.
౫. రోగభేదము, చర్మముమీఁద బయలుదేఱు
నల్లమచ్చ.

నీలిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. నీలసిందువారము,
నల్లవావిలి*. ౨. నీలిచెట్టు. ౩. నేత్రరోగభేద
ము, కంటిలో బయలుదేఱునల్లపొర. ౪. ముఖ
ముమీఁదను దేహముమీఁదను బయలుదేఱునల్ల
మచ్చలు కలక్షుద్రరోగభేదము. ౫. జలమును
చెఱుపుదోషవిశేషము. (భూమికి ఊషరము,
వృక్షమునకు కోటరము, జలమునకు నీలికయును
దోషములు.)

నీలిచీర. వి. (√నీలి$^2$.) నల్లనివస్త్రము; చోరసా
ధనవిశేషము.
ఉ. కత్తియు నీలిచీరయును గంకటి రజ్జువు నా
రసంబు...క. మొద లగుసాధనములు గొని
...చెన్న. ౩. ౨౯౪, ౨౯౫.

నీలితనము. వి. (√నీలి$^2$.) ౧. దుష్టత్వము.
గీ...నరపాలమౌళి దా నసత్యభయశీలి గావున
జాలిఁ గొలుపు, నాలినీలితనాన కానఁగఁ
జాలి, సోలి సుతుమాలిమికి నాగయాలిఁ
జూచి. చం. రా. ౪. ౨౨.
౨. మాయయేస్పు. (శ్రా.)

నీలితిన్నె. వి. (నీలి$^2$ + తిన్నె) ఇంద్రనీలవేదిక.
సీ. అచ పెల్లఁ దమచాయ నంటి పట్టుగ నుండఁ
దిరుగులాడెడి నీలితిన్నెలనఁగ. యయా.
౨. ౧౨.

నీలిదట్టి. వి. (√నీలి$^2$.) నల్లనికాసెకోక; చోర
సాధనవిశేషము.
క. బలపముఁ గన్నపుకత్తియుఁ, దలముళ్లును కొ
క్కు నీలిదట్టి యినుముఁ జీ, మలకోలు గ్రద్ద
గోరును, ములుబంతియుఁ గత్తెరయును మొ
దలగువానిక్. పరమ. ౪. ౧౦౪.

నీలిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. నీలి*. ౨. శ్యామ
త్రిపుట, నల్లతెగడ*.

నీలిమ(ము). సం. వి. న్. పుం. నలుపు.

నీలిమందు. వి. (√నీలి$^2$.) నీలియాకుల నుండి
తీసినరంజకద్రవ్యము.
(వ్యవ.) ఆబట్టలకు నీలిమందు పెట్టినారు.

నీలిమబ్బు. వి. (√నీలి$^2$.) వేఁటసాధనవిశేషము.
ద్వి. జిగురుకోలలు మేటిచిక్కము లురులు, తెగ
నీలిమబ్బులు ద్రిప్పుడుత్రాళ్లు, పిగిలిచెం డ్లమ
రిన పెద్దయీఁటెలును. ద్వి. నల. ౩. ౨౩౪ పం.

నీలీరాగము. సం. వి. అ. పుం. ౧. నీలిమందు
రంగు. ౨. నీలిమందురంగువలె వీడనినాయికా
నాయకులయనురాగము, (చూ. కుసుంభరాగ
ము.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీలుఁడు. సం. వి. అ. పుం. ఒకానొకవానరుఁడు, సుగ్రీవసేనాధిపతి.

నీలుగు(ల్గు)=ఈలుగు. అ. క్రి. ౧. చచ్చు.

గీ. అట్టు లొక్కొక్కపోటున నాఁపోతు, లన్నియును వాత మున్కనఁ గన్నుఁగవల, నెత్తురులు గాఱ నీలిగి నేలఁ బడిన, నెల్ల వారలు వెఱఁగంది రుల్లములను. నీలా. ౩. ౫౬.

క. మన కేమికారణం బీపనులు విచారింపఁ దగనిపనికిం జనినన్, మనుజుండు నొచ్చు ము న్నొక వనచర మొకతగనిపనినెపంబున నీల్గెన్. నా. పంచ. ౧. ౭౫.

సీ. సమయుట యీల్గుట... నీల్గుట...నామిూ ఱును మరణము...ఆం. భా. ౨. ౨౨౫.

౨. గాత్రవినామము చేయు, ఒడలువిఱుచుకొను; వెనుకకు ఒడలు విఱుచుకొను.

క. అనిలసుతుం డంతన మేల్కని నీల్గుడు నతనివజ్రఘనకాయముఁ బొందినలతికాజాలము లెల్లను ద్రెస్సె మృణాలబాలలతికల పోలెన్. భార. ఆది. ౫. ౧౮౨.

సీ. లేచి నీల్గుచు బార సాఁచె నేనియుఁ జక్రవాళాచలేంద్ర మవ్వలికి వీఁగు. ఉ. రా. ౨. ౧౭౯.

ఉ. వెచ్చనియూర్పు నించుచును వేదనఁ బొందుచుఁ గన్నుమోడ్చుచున్, వెచ్చుచు సెజ్జపైఁ దనువు వెమ్మఁగ వేఁచుచు నీల్గి లేచుచున్. కేయూర. ౩. ౩౪౩.

క. వడి నాడుగఱచి వలకేల్, నిడుచన గనయమునఁ బెనఁచి నీల్గి బలం బేర్పడ విల్లు వంప నోపక, యుడిగిరి నృపసుతులు గొంద ఱొయ్యన లజ్జన్. భార. ఆది. ౮. ౧౮౫.

మ. నెఱి నెల్లప్పుడు నిల్చి ప్రాణిచయముల్ నిర్మించి నిర్మించి వీఁపిటియ న్నీల్గుచు నావులించుచు నజుం డేసృష్టియు స్మాని... భాగ. ౭. ౮౧౩.

౩. ఒడలు నిగుడించు, ఒడలు సాఁచు.

గీ. అవయవంబులు గదలించి యావులించి, నిదురఁ దెప్పిలి మేల్కాంచి నీల్గి మలఁగి, యొడలు విఱుచుచుఁ గనుఁగవ లునుముకొనుచు, ధాత గూర్చుండె సృష్టిసంధాత యగుచు. భాగ. ౭. ౮౩౪.

వ. ...కట్టెదుటివాజిశాలలం గట్టినపొట్టేళ్ళకై యాదిగొని నీల్గి కాలుద్రవ్వి...మనుచ. ౪. ౨౭.

౪. సాఁగు. ౫. గర్వించు.

చ. అతివరుచంబులు నెమ్మెఱుఁగుటారును వేసలి యున్ ధరాధిపోన్నతియు నహీనభూతికలనంబు ఘనాభ్యుదయంబు నిప్డొం, దితి మని మాటిమాటికిని నిక్కెడు నీల్గెడు విఱ్ఱవీఁగెడున్, క్షితి నటుగాదె యొక్కొకరికి న్నడుమంత్రపుఁగల్మి గల్గినన్. విజ. ౨. ౧. ౩౪. (పై రెండర్థముల కిదియే యుదాహరణము.)

౬. దేహ ముబ్బించు, ఒడలు పెంచు.

క. బలితపుటురిగ్రామంబున, నిలుచుటు యారజ్జు ద్రెవ్వ నీలిగి సుమతుల్, వెలువడి చని సుఖు లగుదురు...భార. శాం. ౬. ౨౩౨.

శా. అతం డమ్మెయి నాత్మతత్త్వవిదుఁడై యప్పాఁపచుట్ట ల్వీని, ర్ధూతిం బొందఁగ నీల్గి బిట్టు నెగసెం దోయాఘమధ్యంబునన్. హరి. పూ. ౮. ౪౯.

సీ. జమిలిమద్దులతోడ సంరంభమునఁ దగిలించి తాఁ దగులక లీల రెంటి. గీ. నడుము గడచి నీల్గుటయును బుడమివగులఁ, బెల్లగిలి కూలెఁ దరువులు...హరి. పూ. ౫. ౨౪౩.

నీలోత్పలము. సం. వి. అ. న. నల్లకలువ. (ఇది మన్మథునిపంచబాణములలో నొకటి.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇశ్లే: నీలాబ్జము, నీలాంబుజము మొ.

నీలోత్పలము. సం.వి. అ. పుం. ఇంద్ర నీల మణి, నీలపుఱాయి.

నీళ్లచివది. వి.(నీళ్లు + చివది.) అలంజరము, కాఁగు.

గీ. నెగడు నీరా డనంగను నీళ్లచివది, యన నలంజరనామధేయమ్ము...ఆం. భా. ౨. ౨౪౫.

నీళ్లదొర=నీటియొకిమీఁడు.

(వరుణుఁడు.)

చ...నీళ్లదొర గాడుపు జక్కులఱేఁడు చిల్వస్వామ్ములయొకిమీఁడు నాల్గుబుజముల్ గలవేలుపు దమ్మిచూలియుక్, గొలువఁగ వెండికొండపయిఁ గూర్చిఁ జెలంగుకడిందిదయ్యమా. అచ్చ. రా. అర. ౧౨౭.

ఇశ్లే: నీళ్లరాయఁడు, నీళ్లఱేఁడు.

ఆ. మేటినీరుచూలి మెయితాలుపులసామి, వల్లెత్రాడుదాల్పు నీళ్లరాయఁడు...అనంగ నొప్పు వరుణుఁ డీశ. ఆం. సం. దేవ. ౨౧.

సీ. వలఁగొని నీళ్లక్రేవల నుండు నీళ్లఱేఁ డరయ బయల్పట్టి తిరుగు గాడ్పు. అచ్చ.రా.బాల. ౭౫.

నీళ్లవరుగు. వి.(√నీరు.) ఉప్పు,లవణము. (శ.ర.)

నీళ్లా(ళులా)డు=నీరాడు.అ.క్రి.(నీళ్లు + ఆడు.)

౧. స్నానముచేయు.

సీ. అతఁడు సరస్వతి నవగాహనము సేయుచుండి యాచేరువ నొర్తు తనుఘ,నట్టక నీళ్లాడఁగాఁ జూడఁ దనమునుక్రము నిర్గమించిన...భార. శల్య. ౨. ౧౭౦.

క. కుడిచిన నీళ్లాడిన మఱి,గుడిలోపల నలుఁగు వెట్టుకొన్న నభీష్టం, బడుగఁగ నవ్వీన దుర్గతిఁ,బడుదురు బాధలను నధికపాపాత్ములజా. శివ. సా. ౭౫౨.

ఉ...యశోద వేడుకక్, గోపసతీసమేతముగఁ గోరి సమీపగ యై తనరుచ్చ,యాపగ నీళులాడుటకు నై చనియెం ద్వరమాణచిత్తయై. హరి. పూ. ౫. ౧౪౫.

౨. ప్రసవించు.

సీ. తెలిసి చక్కన వచ్చి దేవకి నీళ్లాడె రమ్మ ర మ్మని భోజరాజుతోడఁ,జెప్పిన...భాగ. ౧౦. పూ. ౧౪౫.

గీ...వేల్పుపెద్ద, పాలఁతి కంళట నీళ్లాడుప్రొద్దు లయ్యె. భాగ. ౭. ౫౦.

నీవరి=నివరి. (శ. ర.)

నీవరుఁడు. సం. వి. అ. పుం. ౧. పరివ్రాట్టు, సన్న్యాసి. ౨. వణిజుఁడు, బేహారి. ౩. వాస్తవ్యుఁడు, నివసించువాఁడు.

నీవాకము. సం. వి. అ. పుం. ౧. అర్ఘోత్కర్షమువలన కలుగుజనాదరము, వెల మిక్కిలి హెచ్చినదానియందు జనుల కుండుమక్కువ. ౨. ధాన్యాదులు నిలువచేయుట.

నీవారము. సం. వి. అ. పుం. సస్యవిశేషము, నివ్వరిశ్రీ.

నీవి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఉచ్చయము, స్త్రీల పోఁకముడి. ౨. మూలధనము, సంచిమొదలు. ౩. పరిపణము, పందెపుసామ్ము. ౪. బంధనాలయము, చెఱసాల.

నీవు=ఈవు. స. యుష్మదర్థకము. (చూ.నీ.) భార. ఆది. ౨. ౧౪౪.

నీవృతము. సం=నీవృత్తు.

నీవృత్తు. సం. వి. త్. పుం. ౧. దేశము, గ్రామసమూహము. ౨. గ్రామము.

నీవ్రము. సం=నీధ్రము.

నీశారము. సం. వి. అ. పుం. (మంచును గాలిని వారించుటకైన) కప్పుడుదుప్పటి(గొంగడి మొ.); సర్వాంగప్రావరణము, ఒడలెల్లఁ గప్పుదుప్పటి; తెరకాండ, పటము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీహారము. సం. వి. అ. పుం. ౧. పేరినమంచు, గడ్డమంచు; మంచు. ౨. త్రయోవింశతిరగణాత్మక మగుదండకభేదము.

## ను

ను[1]=న్[1]. ప్ర. (కొన్నియెడల దీనియుత్వమునకు లోపము కలుగును. చూ. ద్రుతము.) ౧. నాశబ్దమునకును తనశబ్దమునకును వచ్చు ప్రథమైకవచనము. (ఉదా: నేను, తాను.)

చ...సర్వమునను నేన నిల్తు సుఖవాసత నట్టి దగఁ జెంది నిల్చుస, ర్వము...భార, ఆశ్వ. ౩. ౩౮.

గీ. ఏను నీయంతియును గాని యెఱుఁగ రన్యులు...భార. ఆది. ౪. ౧౦౬.

మ. ఇది భోజాత్మజ కిచ్చినం గినుకతో నే మంచు నూహించునో, మది సాత్రాజితి దానికే నిపుడు ప్రేమం బంపినం దీని నె,ల్లిదముం జేసినజాడ దోఁచునొకో యాలెమ్మిందు నే నున్కిఁ జె,ల్లదువో యేరికిఁ బంపఁగా ననుచు... పారి. ౧. ౫౪.

ఉ. శ్రీకమనీయహారమణిఁ జెన్నుగఁ దానును గౌస్తుభంబునం, దాకమలావధూటియు ను దారతఁ దోఁప... ఆము. ౧. ౧.

గీ. తాను దెగు నేని బాంధవదారపుత్ర,మిత్త్రులను సజ్జనంబు లేమిటికి విగత,చింతుఁడై గుహ సొచ్చి యశ్రాంతబుద్ధిఁ, దడవి కానంగ వలవదె తన్నుఁ దాన. భార. శాం. ౬. ౨౩౩.

౨. ద్వితీయైకవచనము. (పట్టి అను పద మనుప్రయుక్తమగునపుడు హేత్వర్థమును దెలుపును. చూ. పట్టి[3].)

క. విను నిధికుక్షి నసంఖ్యము, నిషాదగణ ముండి ధారుణీప్రజలఁ గడఁకన్, వినుమమును జేయు దాని ని,ను మునను భక్షించి చను మమిత్త్రవిఘాతీ. భార. ఆది. ౨. ౫౮.

గీ. సత్కవిశ్రేష్ఠుఁ దిక్కయజ్వను భజించి. కాశీ. ౧. ౧౯.

చ...ఈ, చలిమలవల్ల నుల్లసిలుచల్లఁదనంబును నూనకుండినన్. మనుచ. ౨. ౧౦.

౩. తద్ధర్మాద్యర్థక ప్రథమపురుషైకవచనము.

క. విను గార్హపత్య మనున,య్యనలము విహరింపఁబడి తదాహవనీయం, బన వెలుఁగు నట్లు వెలుఁగును, జనకుఁడు దాఁ బుత్త్రుఁడై నిజద్యుతితోడన్. భార. ఆది. ౪. ౭౬.

మ...పాంచజన్య మొసఁగున్ గల్యాణసాకల్యమున్. ఆము. ౧. ౫.

౪. ఉత్తమపురుషైకవచనము.

ఉదా: వండుచున్నాను, వండఁగలను.

ఉ...వేంకటభర్తఁ గొల్చెదన్. ఆము. ౧. ౧.

౫. తుమర్థభావలక్షణాద్యర్థములయందు వచ్చును. (చూ. అ[1].)

ఉదా: వండనుబోయెను. వాఁడు వండ నతిథి వచ్చెను. చూడ వలయు, చూడఁగా వలయు.

ను[2]=న్[2]. అప. (కొన్నియెడల దీనియుత్వమునకు లోపము కలుగును. చూ. ద్రుతము.) ౧. ప్రథమాంతము లగునస్త ద్విశేషణములకు ప్రాయికముగా నగునంతాగమము. ఈయాగమము పరమగునపు డుత్వమున కత్వ మగు. (చూ. అ[1].) ఇ ఈ ఐ లన్తై దీనికి 'ని' వచ్చును. (చూ. ఇ[1].)

ఉదా: నేను ధన్యుఁడను. నేను చిన్నదానను. నేను సుకృతిని. నేను స్త్రీని.

౨. కొన్నిప్రత్యయములకును కొన్ని అవ్యయములకును అంతాగమముగా వచ్చునది.

ఉదా: రామునిచేతను. వనమందును. వలెను. పోలెను మొ. (౧, ౨ అర్థములలో దీని ఉత్వము వికల్పముగా లోపించును.)

౩. వృత్తియందు కొన్నియెడల ఆగమముగా వచ్చునది. (ఇందలి ఉత్వము నిత్యముగా లోపించును.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉదా : తఘుకుంజెక్కులు, తెల్లందనము మొ.

౪. కల అనుబంధము పరమగునపుడును పడు అనుబంధము పరమగునపుడును ధాతువునకు వచ్చుఆగమము. (చూ. అ[1].)

ఉదా:-చేయఁగలఁడు. కొట్టఁబడెను.

**నుంకు.** వి. పస్తు, ఉపవాసము.

సీ. ప స్తిల్లి నుంకు నిప్పస్తు ని ట్రనఁగను నుప వాససంజ్ఞ యై యొప్పు మండు. ఆం. భా. ౨. ౧౩౫.

**నుంజె.** వి. సొగటాలపలక.

సీ. పనిగిండి చిటికెనపావురాల్ సొగటాలు నుంజలు గొరవంకపంజరంబు. ప్రబంధ. ౯౨౩.

**నుంపారు**=నునుపారు. అ. క్రి. (√నుంపు) నున్ననగు, మృదువగు, మెత్తనగు.

ద్వి. నుంపారి సొంపారి కంపు నింపారి, పెంపారి చాల నొప్పెడిబిల్వపత్త్రి. బస. పు. ౩. ౭౯౬ పం. (చి. ని. ప్రాఁతప్రతిపా. 'ఇంపారి నునుపారి' క్రొత్తప్రతిపా.)

**నుంపు**=నునుపు. (క. నుమ్పు. చూ. నుంపారు.)

జః నుంపారు.

**నుక్కటం.** వి. ౧. అసియాడుట, జవ్వాడుట. (చలనము అని శ. ర.)

ద్వి. చెక్కుల సన్నంపుఁజెమ రొక్క నడుము, నుక్కట నొక్కింత నూగారు దోఁప, నలరు పయ్యెద జాఱ నలకలు చెదర...ద్వి. హరిశ్చ. ఉ. ౯౧౦ పం.

౨. బాధ.

ఉ. ఘోరతరాననస్ఫురితకోపులు నై యమదూతలానరుం, జేరినఁ గాంచి మై వడకఁ జేష్టలు వైకృత మందఁ బల్మఱు, నోర్నరుఁ గన్నులుం దెఱచు నుక్కట యై వెగ డగ్గలింపఁగన్. మార్క. ౨. ౫౭.

**నుగ్గడుచు**=నుగ్గాడు. స. క్రి. (నుగ్గు+అడఁచు.) నుగ్గగునట్లు కొట్టు, నలఁగఁగొట్టు.

సీ. ఎక్కుఁడు వల నైనయెడ లడ్డగించినచఱుల నుగ్గడుపుఁడు సక్కఁ బ్రాఁక, రానితిప్పలు చొరఁ ద్రవ్వఁ డీఱము లైనమ్రాఁకులఁ బొదలను మ్రగ్గఁ బొడువుఁ,డు...హరి. ఉ. ౧. ౮౩.

**నుగ్గాడు**=నుగ్గడుచు, నుగ్గుచేయు,నుర్గాడు. స. క్రి. (నుగ్గు+ఆడు.) ౧. గుండచేయు, పొడిచేయు.

మ. భటులన్ గీటడఁగించి ఘోటకములన్ భఞ్జించి భద్రేభరాడ్ఘటలం జెక్కులు సేసి సైనికశతాంగశ్రేణి నుగ్గాడి...రా. వి. ౫. ౧౪.

౨. పాడుచేయు, ధ్వంసముచేయు.

సీ. వనలులాయము లిఱువనను నుగ్గాడినపగిదిఁ గాల్వుర నేలపాలుచేసి. కు. సం. ౧౧. ౪౦౩.

మ. పెసరుంగాయను మెత్తకన్నులకునై పేటాడుమన్ గొట్టెలన్, నుసలం జూచుచు దోసచేల్ చెఱకుచాల్ నుగ్గాడుచున్ సజ్జఁగోఁయ సుమాళింపుచు... రా. వి. ౨. ౭౫.

౩. వధించు.

సీ. నుగ్గాడెఁ బరిమార్చె నులివెను దెగటార్చెఁ జదిపెఁ జంపెను సదమద మొనర్చె. గీ. అడఁచెఁ జెండె ననంగఁ బొందగు వధించె, ననుటకు సమాఖ్య లై... ఆం. భా. ౩. ౧౨౩.

మ. వరుసన్ యక్షపిశాచరాక్షసచమూవర్గంబు నుగ్గాడెదం, బోరి గంధర్వుల సంహరించెద ... భా. రా. అర. ౨. ౩౩౩.

౪. ఖండించు.

ద్వి. నీతల లున్నగ్గాడి నిను సంహరించి, సీతఁ దోడ్కొనిపోవు సిద్ధ మీపలుకు. రం. రా. సుం. ౨౬౯ పా. ౪ పం.

అ. క్రి. నుగ్గగు. (చూ. నుర్గాడు. అ. క్రి.)

**నుగ్గించు.** స. క్రి. తిట్టు, శపించు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ. తన సింగారపుఁ జెక్కుటద్దములమీఁదం జాఱు కన్నీరు కేళీనఖాగ్రంబులఁ బాఱమీఁటుచును దల్లి స్నానల్లు నుగ్గించి పో, మునుపుం బైస్యము గొంత తెచ్చికొని డంబుల్ నూపి యన్యాప్రనోఁ,య్యన డాయం జని యిట్లు వల్కెను రహస్యాలాపరూపంబునన్. విప్ర. ౪. ౫౬.

నుగ్గు=నుర్గు. అ. క్రి. (క. నుగ్గు.) నలఁగు.

చ...మా, కఱచినకాట్లనన్ శిశువుకాయము త్రోలను నుగ్గ జేమియున్. నృసిం. ౪. ౪౩.
(శ. ర. పా. 'సుగ్గదయ్యె'. ముద్రిపా.)

వి. ౧. చూర్ణము, పొడి. (ఇది 'అగు, ఆడు, చేయు, పాఱు' ధాతువులతో కలసియే తఱుచుగా ప్రయోగములఁ గానవచ్చుచున్నది.)

ఉ. ఆయతపక్షతుండహతి నక్కులశైలము లెల్ల నుగ్గుగాఁ, జేయుమహాబలంబును బ్రసిద్ధియు నుం గలవాఁడు నీపనిం, బాయక బ్రొమ్మనం దవడఁబాముల మోవను వారికిం బనుల్, సేయను నేమికారణము సెప్పుము దీనిఁ బరోరుహాననా. భార. ఆది. ౨. ౪౭.

గీ. నురుము నుగ్గు పొడుము పొడి నురుము నున్ని, చూరనంగను విలసిల్లుఁ జూర్ణ మభవ. ఆం. భా. ౨. ౨౨౦.

౨. ముక్క, ఖండము.

చ... తేరిపై, నొగ నొగ దాఁకఁగాఁ బఱపి నుగ్గుగఁ గారవనూతు నేసి... భార. భీష్మ. ౨. ౩౩౧.

క. నగ్గుబడి విరియఁబాఱిరి, బగ్గనఁ బొరివుచ్చు వీరభద్రునిధాటిన్, నుగ్గ లయి యవురుసవురయి, గగ్గులకాఁపై వికావిక లయి యమర్త్యుల్. కాశీ. ౫. ౭౫.

సీ. తనపార్శ్వభాగసంఘర్షణంబున ద్వీపకోటులు నుగ్గులై నీటఁగలియ. దశా. ౧. ౧౯౬.

౩. సమూహము, గుంపు.

ఆ. ఉగ్రభానుసుతుఁడు నగ్రభాగంబున, బలిముఖాధిపతులు పన్ని నడువ, వెనుకఁ దాను గదలె వెన్నుబలం బయి, నూఱుకోట్లకపులనుగ్గులలమ. రామా. ౫. ౨౫౫.

(దీనియామ్రేడితరూపము నుగ్గునుగ్గు.)

చ. ఖురపదఘట్టనం ధరణి గ్రుంగ ఫణీంద్రుఁడు నుగ్గునుగ్గుగాఁ, బరువడి... మహేశ్వరువృషభంబు నాక్షణమ వచ్చె... కు. సం. ౨. ౧౭౬.

బ. పిడుకలు (శ. ర. బ్రౌ.)

సా: ఉగ్గుతో నేర్చినగుణము నుగ్గులతోఁగాని పోదు.

జ: నుగ్గడుచు, నుగ్గాడు, నుగ్గించు, నుగ్గుచేయు, నుగ్గులువాఱు.

నుగ్గు(లు)చే(సే)యు. స. క్రి. (నుగ్గు+చేయు.)

౧. ముక్కలుచేయు; పొడిచేయు.

గీ. యోధసారథియుగ్యసంయుతము గాఁగ, నూఱురథములు వ్రేల్మిడి నుగ్గుచేసె. భార. విరా. ౩. ౧౫౨.

సీ. దళనశంబముల దుర్ధరమహీధరకూటకోటి నుగ్గులుసేయు కుంజరములు. వసు. ౨. ౧౫౨. భార. ద్రో. ౧. ౨౯౧.

౨. వధించు, చంపు.

చ... తేరికి సారథి గమ్మునాఁ బఁజిచ్చుఱపిడు గెట్టు లట్టడరి కూరుల మొత్తము నుగ్గుసేసె దన్. భార. విరా. ౫. ౭౩.

శా. ఈరీతిం జగదేకవల్లభుఁడు భూయిష్ఠప్రతాపంబునఁ జేఁ, గ్రూరాదిత్యవిరోధివర్గముల నుగ్గుల్ సేయు... దశా. ౨. ౪౦౬.

నుగ్గులువాఱు. అ. క్రి. (నుగ్గులు+పాఱు.) పొడియగు.

ద్వి. కలయఁ బర్వెడుభవద్గరళ కాలాగ్నిఁ; గులగిరు లైన నుగ్గులువాఱఁ గాలు. ద్వి. పారిజా. ఉ. ౧౫౬౬. పం. ఇట 'బూది యగు' నని భావము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**నుచ్చిలి.** వి. నురుఁగు, ఫేనము.

శా. ఘోర స్నుచ్చిలి గ్రమ్మ మై వడఁకఁ గన్నుల్తారకాబింబసంచారవ్యాప్తిఁ దఃకరింప హృదయస్థానంబు గంపింప...హర. ౨. ౭౩.

సీ. శ్లేష్మము ద్రేకించి సెలవి రంధ్రము వాయ మెరసి నుచ్చిళ్లు గ్రమ్మింపకుండ. శివరా. ౪. ౭౭.

**నుచ్చు¹.** స. క్రి. నుచ్చుపొఁతలుచొట్టు. (శ. ర.) వి. గొఱ్ఱెలయొక్కయు మేఁకలయొక్కయు పెంటిక. (మేఁక పెంట్రుక అని బ్రా.)

వ... నెల్లికొయ్యలు ద్రచ్చి నుచ్చు లంటించినఁ బెచ్చు పెరుఁగుచిచ్చు లాత్రంపులందవిలించి ...మను చ. ౪. ౬౦.

ద్వి. పచ్చవంటకమును బడియించి మేఁక,నుచ్చు కరీషంబు నొసల నంటించి. ద్వి. భా. ౧౦. (చి. ని.)

జః నుచ్చుకోక, నుచ్చుప్రాఁత.

**నుచ్చు².** వి. ఫేనము, నురుఁగు.

(వ్యవ.)వానినోటినుండినుచ్చులువచ్చుచున్నవి.

,, ఉంటుడుకాయ నుచ్చు వచ్చుటలేదు.

**నుచ్చుకోక**= నుచ్చుప్రాఁత. వి. (నుచ్చు¹ + కోక.) గొఱ్ఱెలయు మేఁకలయు చన్నులకు చుట్టెడుగుడ్డ.

ద్వి. ములుగత్తి నుచ్చుకోకలుఁ జూఁడుఁగోడుపు, మొలతిత్తి నిడి దొడ్డ మొలకచ్చ గట్టి. బస. పు. ౩. ౧౧౧౭ పం.

**నుచ్చుప్రాఁత**=నుచ్చుకోక. వి. (నుచ్చు¹ + ప్రాఁత) గొఱ్ఱెలయు మేఁకలయు చన్నులకు చుట్టెడు గుడ్డ.

సీ. ఒడిసెల పాలకావడి నుచ్చుప్రాఁతలగుది మూఁపుపై వ్రేలుగోర్పడంబు. వేం. పంచ. ౧. ౫౯౭.

**నుజ్జు**=నజ్జు. (శ. ర.) విణ. ఖతి నొందినది, మిక్కిలి నలఁగినది.

ఉ. అంటినఁ గందునో యనక యంగము నిర్దయవృత్తి మీఱఁ గౌఁగిటికిఁ దార్చి నుజ్జుగనో కెంజిగురట్టిది నాక మోవిఁ బల్గంటు లొనర్చి...వాల్గంటి రమించె నాథుఁడు స్వకార్యపరుల్ మగవార లెంచఁగన్. ఉ. రా. ౩. ౪౩౩.

**నుడి**=నుడుగు, నొడుగు. వి. (క. నుడి.) మాట, పలుకు; వాక్యము.

చ...వింట లేదె యింట గెలిచి రచ్చ గెల్వ మను నానుడి నానుడి నానుఁడీ చెవిన్. సారంగ. ౨. ౨౫౯.

సీ. గుడుసు కైదువుజోదునుడివాన గురియక కడు విరాలపుటగ్గి యడఁగఁ గలదె. నీలా. ౧. ౧౦౩.

క...వల్లకీలతు లొనకపై, వ్రాసినగతి నెలఁగఁ గదరన్, భూసతికడనుండి యొక్కనుడి వినఁ బడియెన్. ఉ. రా. ౭. ౧౨౬.

జః నుడికారము, నుడివిల్లు.

**నుడికారము.** వి. (క. నుడికాఱ- నుడి + కారము³- స్వార్థమునం.) ౧. పలుకు, మాట; (మాట మొదలగువానియందలి) చమత్కారము, సరసత.

సీ. నుడుగు నుడుపు నుడి నుడికారము నొడుపు నొడి నొడికారము నొడుగు నాఁగఁ బద మొప్పు...అం. భా. ౧. ౧౧౧.

ఉ. ఎట్టు పురాణము ల్పదియు నెన్మిదిఁ జెప్పితి వెట్టు వేదముల్, గట్టితి వేర్పఱించి నుడికారముసొం పెసలార భారతం, బెట్టు రచించితీవు ఋషి వెట్టయి లొక్కదివంబుమాత్రలోఁ, బొట్టకు లేక తిట్టెదవు పుణ్యగుణంబులరాశిఁ గాశికన్. కాశీ. ౩. ౧౫౨.

గీ. ప్రౌఢిఁ బరికింప సంస్కృతభాష యండ్రు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పలుకునుడికారమున నాంధ్రభాష యందు, లెవ్వ లేమన్న నంధ్రుగా కేల కొఱఁతి, నా కవిత్వంబు నిజము కర్ణాటభాష. భీమ. ౧. ౧౫.

౨. పలుకుబడి.

గీ. ఆపురాణంబు గనఁ దెనుఁ గయ్యె నేని, జెప్ప నేర్చినకవియుఁ బ్రసిద్ధుఁడేనిఁ, దెనుఁగునుడి కారమున మించు గనియె నేనిఁ, గుందనము కమ్మ వలచినచంద మగును. జై. భా. ౧. ౧౭.

విణ. సరసమైనది.

చ...ఆ, తనిమదికి న్నభవద్బలవితానము చీమల చాలుఁబోలె నై, కనఁబడు నీవు పల్కునుడి కారపుమాటల కెల్ల నాతఁ డా, డును విరసంపుఁబల్కులు గడు న్నతి మోసము వచ్చు న త్తతిన్. శుక. ౩. ౩౯౦.

నుడివిల్లు. వి. (నుడి + విల్లు.) - మాటవరుసకు విల్లు, వింటితో పోల్పఁబడునది - కనుబొమ.

సీ. నుదుట గ్రక్కడరిన నుడివిల్లు గదియించు సుడిసి ముత్తరఁగలు గడలుకొనఁగ. కు. సం. ౫. ౫౨౦. 'నుడువిల్లు' ముద్రి.

నుడుగు(వు)=నొడుగు. స. క్రి. (క. నుడిసు.) ౧. వచించు, చెప్పు.

క. నుడిగి రహస్యోక్తులు దా, నుడిగి ద్రుగంచల నిబద్ధయువమణిమంజ, ర్యనురాణ్ముఖిగుణవై ఖరి, పడధిపశేఖరునితోఁ బ్రవీణతఁబలికెన్. బహు. ౫. ౯౯.

గీ. వానిసౌశీల్యగతి నుడువంగ నాసె, కవుల కైనను మానిపుంగవులకైన. ఇందు. ౪. ౧౪.

ద్వి. చేరి నీ కొకమాటఁ జెప్ప వచ్చితిని, నోరు గా చెవ నన్ను నుడువుదు నీవు. ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౩౨ పం. నీలా. ౧. ౧౪.

౨. సంభాషించు, మాటలాడు.

చ...మూర్ఖున వాపిలి దన్ను పఁజుళిం, బు నుడువ గోఁగునై తరుణి పూచు సురద్రుమ మన్నిపూవులన్. పారి. ౪. ౧౦.

సీ. చెలికానిధర్మంబుఁ జెలుపఁ గాపట్టుఁ దేగ తిఁ బూనె నని శైవగణము నుడువ. ఉ. రా. ౧. ౭౭.

౩. జపించు, జపముచేయు.

సీ. మదనాహితునినామమంత్రంబు నుడుగువాఁ డొడికంపుఁబాముఁలఁ దొడుగువాఁడు. భల్లా. ౨. (శ. ర.)

౪. నేర్పు, బోధించు.

గీ. కూలిఁ గొనునొజ్జ కాఁబోలు కొదమచిలుక, తపసిబుడుతలగమికి వేదంబు నుడువు. కువ ల. ౨. ౬౩.

౫. చదువు, పఠించు.

క. మేలుగ సాయంప్రాతః, కాలంబుల హోమ విధులఁ గావించుచు నే, వేళన్ వేదము నుడువున, లోలాత్ముం డుండు బ్రహ్మలోకము నందున్. జాహ్నవీ. ౩. ౬౦.

వి.=నుడి. ౧. మాట, పలుకు.

క. ఉడుపతిమకుటుండు చెవుల నొసరనినుడు గుల్, నొడివిన...భీమ. ౨. ౧౫౪.

వ...ఒక్కొక్కకడం గడవరానితమచేడియల చెడంగునుడుగుల నడుగు లామడలు గా వచ్చి...వసు. ౪. ౨౩.

మధ్యాక్కర. నుడువులు వేయు నింకేల యి ప్పాటినోములు తొల్లి, కడఁగి నోఁచితిని గాకేమి యనుచును గందె డెందమున. భా ర. ఆది. ౪. ౧౦౨.

౨. లోకోక్తి, నానుడి.

క...కామకస్య కుతో లజ్జా యనెడునుడువు తుది నిజ మయ్యెన్. రసిక. ౩. ౧౧౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జః నుడుగుఱేఁడు, నుడుగులచెలి, నుడుగువాలు, నుడువరి, నుడువరితనము, నుడువులననఁబోఁడి, నుడువులపడఁతుక, నుడువులఱేఁడు.

నుడుగుఱేఁడు=నుడువులఱేఁడు. వి.(√నుడుగు.) బృహస్పతి, గీర్పతి.

సీ. అరయ వేల్పుల కెల్ల నయగారనం దగును డుగుఱేనికిఁ గూర్తి కొడుకుఁగుఱ్ఱ. యయా. ౩. ౩౧.

నుడుగులచెలి. వి. (√నుడుగు.) సరస్వతి.

సీ.జగముల మాఁటిపై జంగఁ జాచినతాఁగ నుడుగులచెలిమామయడుగుఁ జెమరు. యయా. ౨. ౪౪.

నుడుగువాలు. వి.(√నుడుగు.) -గీర్వాణుఁడు-దేవత.

సీ. నుడుగువాల్గమి మైల గడుగువారి మెఱుంగు లుడుగువాఱని వ్రేలిమడుఁగువాఁడ. ప్రబంధ. ౨౧౪.

నుడువరి. విణ. (నుడువు+అరి3.) మాటలమారి, వాచాలుఁడు. (చూ. నుడువరితనము.)

నుడువరితనము. వి. (నుడువరి+తనము.)వాచాలత.

ద్వి. వడుగు చేసిన భక్తి వట్టిపాటగునె, నుడువరితనమునఁ గడవ నా డెదవు. బస.పు. ౧. ౪౫౪ పం. (శ. ర. పా. "నొడువరితనము" ముద్రి. పా.)

నుడువులననఁబోఁడి. వి.(√నుడువు.)సరస్వతి, వాగ్దేవి.

సీ. నుడువులననఁబోఁడి జడియకు మని వెన్ను సఱచుప్రాణేశు బిచ్చవడి చూచె. దశా. ౨. ౫౫.

నుడువులపడఁతుక. వి. (√నుడువు.) వాగ్దేవి, సరస్వతి.

క. పడియెడుతలలుం జేతులు, సడరించులకోరిగ ములు సన్నన్న నెఱిక్, నుడువులపడఁతుక కైనజ్, దడవులనిడుపనిక్కైనఁ దరమే యెన్నక్. అచ్చ. రా. యు. ౫౫౦.

నుడువులఱేఁడు=నుడుగుఱేఁడు.

గీ. వానిచెలువంబు నుడువులఱేనికైనఁ, బూని దిటముగ వాక్రువ్వఁబోల దెందు. నీలా. ౨. ౭౨.

నుతము. సం. విణ. (అ.ఆ.అ.) నుతింపఁబడినది, పొగడఁబడినది.

నుతి. సం. వి. ఇ. స్త్రీ. స్తోత్రము, పొగడిక.

నుతి(యి)ంచు. సం. స. క్రి. పొగడు, కొనియాడు.

సీ. పరమేష్ఠియంచ యీగిరికొలంకులయంచపిండులోఁ దప్పినపిల్ల యొక్కొ. గీ. యని నుతించుచు...మార్క. ౧. ౯౪.

ద్వి. ఆ దంపతులు సొంపు లాత్మ రెట్టింప,మోదించి కరములు మోడ్చి నుతించి. ద్వి. పరమ. ౩. ౧౬౨ పా.

సీ. రతినైపుణము చూచి నుతియించువిధమున మణిమయకాంచికింకిణులు మొరయ. వరాహ. ౪. ౧౬౨.

నుతిక(కె). వి. ౧. తెగ, మొత్తము. (శ.ర.) ౨. దళము, దండు. (బ్రౌ.)

ద్వి. నూఱేసిగుజ్జాలనుతికెల రెండు,పాఁజులుగాఁ జేసి పదిలంబు చేసి. పల్నాటివీరచరిత్ర. ౬౦. (బ్రౌ.)

నుత్తము. సం=నున్నము.

నుత్యము. సం.విణ. (అ.ఆ.అ.) నుతింపఁదగినది.

నుదత్. సం. శత్ర. ౧. ప్రేరించుచున్న. ౨. తొలఁగించుచున్న.

నుదమానము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. ప్రే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రించుచున్నది. ౨. తొలఁగించుచున్నది.

**నుదము.** సం. విణ. (అ. ఆ.అ_సమాసాంతము సందే-ఉదా:-కామానుదము మొ.) ౧. తొలఁగించునది, పోఁగొట్టునది. ౨. ప్రేరించునది.

**నుదుటికన్ను.** వి. (√నుదురు.) ఫాలాక్షము, శివునిలలాటనేత్రము.

ఆ. నుదుటికంటిమంట చదలంటి పర్వెచుఁ, గల సితరతరంబ కప్పికొనఁగ. శు. సం. ౧౦. ౩౪౧.

**నుదురు.** వి. దే. నొసలు, ఫాలము.

ద్వి. రాఘవుబంటు శౌర్యంబింత చెడక, గదఁ బుచ్చుకొని మహాకాయుని వ్రేసె, నుదురు భగ్నము గాఁగ...రం.రా.యు. ౩౪౪పా. ౨౫ పం.

సీ. వదనంబుకొమరు భావనఁజేసి వేఱుగా నుదుటివెం పలకలఁ బొదువఁబడఁగ. భార. విరా. ౧. ౨౭.

క. చదురునకు బ్రహ్మ వ్రాసిన,నుదుటిలిపులు దుడువఁ గలవె నూల్కొనువెరపుల్.హరి.ఉ. ౯. ౭౯. (బ్రహ్మవ్రాసిననుదుటిలిపి=కర్మఫలము.)

చ. హరిదవధిక్షమారమణు లాతురగాలినుదుళ్లపట్టముల్, తురువులరాయసంబులవిధంబునఁ గన్గొని శ్వేతమానవేశ్వరునకుఁ దెచ్చియిచ్చిన సువస్తుపరంపర లెక్కఁ గూడునె, స్వైరసులరీతిఁ దత్సవనవీతిఖురాంకము లుండు నుర్వరన్. వరాహ. ౧౨. ౬౦.

నుదుట వ్రాసినవ్రాఁత=కర్మఫలము.

(వ్యవ.)నుదుట వ్రాసినవ్రాఁత నూరేళ్లు చింతించినను తప్పదు.

నుదురంటు=నమస్కరించు.

ఉ. తప్పు లెఱుంగలేక దురితంబులు సేసితి నంటి నీవు మాఁ,యప్పవు గావు మంటి నిఁక నన్యులకున్ నుదురంట నంటి...దాశ.౫౮.

జః నుదుటికన్ను.

**నుద్యమానము.** సం. విణ. (అ.ఆ.అ.) ౧. ప్రేరింపఁబడుచున్నది. ౨.తొలఁగింపఁబడుచున్నది.

**నును.** విణ. (తె. నుణి- నునుపుశబ్దము కడవర్ణము లోపింపఁగా మిగిలినరూపము. వృత్తియందు హల్లు పరమగునపుడు దీనికడపటియచ్చు వికల్పముగ లోపించును.)

౧. నున్ననిది, స్నిగ్ధము.

ఉ...నీరజనాభుఁడు నిండుఁగౌఁగిటం, జేరిచి బుజ్జగించి నునుఁజెక్కుల జాలుకొనంగ జాఱుకన్నీరు కరంబునం దుడిచి... పారి. ౧. ౧౩౮.

క. నునుగఱులు తళుకుమీసలు, మినుమిను కనుకన్నుదోయి మిహిమందవపుం, దనువుం గల యొకమీనము,తనయంజలిఁ దవుల నృపుఁ డుదకము న్విడిచెన్. దశా. ౧. ౧౩౧.

ఉ...ఫుల్లకేసరమునందువసింపఁగ నెక్కనూలినున్, ప్రగ్గమునం దనారతమరందసరస్వరవిందగోష్ఠికిన్, వెగ్గలమాడు తేంట్లు మరువింటికిఁ బూనె గుణద్వయత్వమున్. ఆము. ౫. ౧౨౨.

౨. మెత్తనిది, మృదులము.

చ...కెంపు మీఁ,టిననునుఁబట్టుఁజేలఁ గటి టింగులువాఱఁగఁ గట్టి...హర. ౩. ౬౯.

వ... రంభాదిమరుద్రంభోరువుల కలికినునుసోఁగపలుకులకలకలంబునఁ గొలకొలమనుకాముకాగారంబు సొత్తెంచి. మనుచ. ౫. ౪౫. హర. ౮. ౧౨.

౩. లేఁత.

సీ. నునుఁదీవె సురపొన్నఁ బెనఁగొన్నఁ గనుఁగొని ప్రాణేశుఁ గౌఁగిలింపఁగఁ దలంచు. దశా. ౩. ౧౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. తనుఁ గొండ యని వచ్చునునుజింకఁ గుచ
ముగా రుడశిలాసరదూర్వ లిడి మరల్చె.
వసు. ౬. ౧౬. (నునుజింక = బాలకురం
గము.)

చ. నునుఁజిగురాకు మేయుకేటి నోరికెలంకులఁ
దేఁటి గుట్టినన్. మనుచ. ౩. ౭౨.

౪. అల్పమైనది.

సీ. నునునవ్వు నవ్వ నోపనిమ్మ్రుదుస్వన లిటువ
లె నట్టహాసముల్ సలుపు టెట్లు. వరాహ.
౧౧. ౯౬.

క. తలిరులతుదఁ జినుకులు జల, జల వడియఁగఁ
దడిసి మెలఁగు చలికరువలిను,న్నొవ్వలపమున వి
రియుపరువపుఁ, దొలుమొగడలవలపుదెలుపు
తోఁటలలోనన్. పారి. ౫. ౧౦౩.

౬. స్నిగ్ధము, గాటము.

ఉ. ఎక్కడనుండి వచ్చెఁ దరళేక్షణకు న్నును
సిగ్గుదొంతరల్. విజ. ౨. ౧. ౧౦౪.

౫. మనోహరమైనది, చక్కనిది.

ఉ. గోవపికవ్రజంబునునుఁగూఁతకుఁ దుమ్మెద
పిండుమ్రోఁతకున్. దళప. ౬. ౩౩.

గీ. అలకతిమిరంబు తనుఁ గప్ప నసుభయమున,
ముఖసుధానూతి నునుపెల్లుములికిఁ గూర్చి,
సవదరించినసింగిణిచాయ నొసలి,వంకచూ
పునఁ దగఁ గతివంకబొమలు. పాండు. ౨.
౪౫.

చ... చం,దురునునుసోఁగవెన్నెలలతోఁ దుల
దూఁగెడుతద్గుణంబులన్. నైష. ౧. ౪౭.

నునుఁదల=నున్ననితల,వెండ్రుకలూడిపోయినతల.

సీ. తులసీదళాంకితతుచ్ఛశిఖాపుచ్ఛ మలవడ
నునుఁదలనంబమొంద.భా.రా.ఆర.౨.౭౨.

నునుమీనుమనుమఁడు=వ్యాసుఁడు.

సీ. నునుమీనుమనుమనినుడిపంట వ్రాయుమేల్
దంటఁగన్నతుపాసిబంటువాఁడ. ప్రబంధ.
౨౧౪. ప్రబంధ. ౪.

నునువాఁడి=మెత్తనిపదను.

సీ. బలితంపుగుబ్బలఁ బట్టి చూడనెకాని నును
వాఁడిగోరున నొక్కరాదు.దశా.౨.౩౧౧.

నునుపరి. విణ. (నునుపు+అరి³.) నునుపు కలది.
(శ. ర. బ్రౌ.)

నునుపారు=నుంపారు. (√నునుపు.) (చూ. నుం
పారు.)

నునుపు(న్పు)=నుంపు.విణ. (క.నుణుపు,నుణ్పు.
త. నునుణ్పు.) ౧. నున్ననిది, స్నిగ్ధమైనది.

చ. నును పగుపచ్చపట్టునఁ గనుంగొన నొప్పుగ
దిండు గట్టి ... హరి. పూ. ౬. ౧౪౯.

చ. నునుపుగఁ జందనం బలఁది...ఒకకోమలి
వచ్చె గిరీశుఁ గన్గొనన్. కు. సం.౭. ౫౯.

ఉ. వాలికె లంబుజాక్షములు వంకలు భ్రూలత
లంద డెందముల్,చాలఁగ నున్పు లంద...
పాంచాలునకైనఁ గాంతల నిజం బిది యిట్టిది
నాఁగఁ జాలునే.కు. సం. ౭. ౧౭౯. ఆం.
భా. ౨. ౨౫౨.

౨. మనోహరము.

క. నును పగునలిగానము విని, వనదేవత గరము
మెచ్చి... కు. సం. ౪. ౪౫౨.

వి. ౧. నున్నన, స్నిగ్ధత్వము.

వ ... నారికేళపూగావళీకోమలపలాశద్రోణికల
నునుపు గలపారలయోరల శరధితరఁగలమీఁ
దనుంబోలె గిఱికొని ... మనుచ. ౩.౨౭.

౨. సొగసు, మనోహరత.

క. యత్నమునఁ దెలియ నన్నియు,రత్నాకరు
భాతి దుస్తరం బగు విద్య,రత్నము గవితా
తత్త్వము, నూత్నముగా నందుఁ గలుగునును
పాతఁగిలివే. ద్వా. ౪. ౧౭౫.

గీ. నునుపు దళుకొత్తఁ బలుకులు నుడుపవేమి.
నీలా. ౨. ౭౭.

జ: నునుపరి, నునుపారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నునువు. వి. కుమ్మరి కుండలపై వ్రాసెడిచిత్రవిశే షము.

గీ. తీర్రిపూదెలు కులుకులు త్రేటగట్లు,బొద్దుటీన లు నునువులుమొదలు గాఁగఁ,బనులు నిర్మిం చుఁగుండలవైనతండు. హంస. ౫. ౧౩. (ప్రాఁత తాళపత్త్రప్రతుల పా. 'నునుపులు'. క్రొత్త ప్రతి, బ్రౌ. పా.)

నున్న = నున్నన. విణ. (త. నున్నై. దీనికి కర్మ ధారయంబున నిగాగమము బహుళము.) ౧. నునువైనది, స్నిగ్ధము; ఎచ్చుతగ్గులు లేనిది.

సీ. కురులు నున్నగఁ దువ్వి కొప్పుఁ బెట్టిననీటు గనుఁగొన్న మోహాంధకార మొదవు. ఉ. రా. ౪. ౧౯౪. దశా. ౪. ౫౮.

చ ... చెందిరకావికోఁటిలుం, దుమికిఫలంబు చందమున నున్ననియాదలమీఁదిపచ్చిగం, దము ... హర. ౧. ౧౫. (వెంద్రుకలు లేని ది అని భావము.)

గీ. రాలి యున్న పువ్వుప్రకరము విదిర్చి,చెన్ను గా నున్న సేసినసెజ్జ యనఁగ, వేగుటయుఁ జుక్క లన్నియు విరిసి విశద,భాతిఁ జెలు వొందెఁ జూడ నంబరతలంబు. భార. విరా. ౨. ౨౩౯.

౨. మృదువైనది, మెత్తనిది.

రగడ. పడఁతి వెనుకకొమ్మ చించెఁ బట్టుపట్టు నున్న చేల,మడఁతి పొగడ పొన్నతో సమా నమా నగంగ నేల. వరాహ. ౩. ౯౨.

గీ. కిట్టుఁజెప్పులు దొడి నున్నగట్టుతడుపు,లెల మితోఁ గట్టి ... హరి. పూ. ౫. ౨౫౨.

వ ... అమ్మదాంధగంధసింధురంబు ... తుం డం బెత్తి నున్ననియప్పువ్వుదండ గ్రమ్మనఁ గ్రమ్మరించి విసరి ... హర. ౬. ౧౬.

౩. సన్నము.

సీ. కమలషండము నున్న గాఁ జేసి యిరుసుగాఁ గావించి...వీర. ౨. ౯౪.

౪. అల్పము. (చూ. నున్నగాలి.)

౫. చక్కనిది, మనోహరమైనది.

సీ. మలదాయ టానున్న మలపుకీల్పులు దిండి పెటి రాపతిమకాలిపెండె మమర. చంద్రా. ౨. ౩౬.

౬. సుఖకరమైనది.

ఉ. లాలితనీలనీలకచ లాలి యటంచు సువర్ణ డోలికాం,దోళనఖేలనంబులను నున్ననినిద్దుర సోలగింప నా,బాలికఁ బాడఁ చుండుదురు పాటలగంధులు జోలపాటలన్. విప్ర. ౨. ౩౮.

వి. ౧. నున్ననిఉముక. (శ. ర.) ౨. నున్నఁద నము, స్నిగ్ధత.

సీ... తేట నున్నన నున్న తెలివి నునుపు. గీ. నిద్ద మన స్నిగ్ధత కెసంగు... పాం. ని. స్థా. ౬౦.

జః నున్నఁదనము, నున్నగాలి, నున్నన.

నున్నఁదనము. వి. (√నున్న.) మెత్తన.

ఉ. నున్నఁదనంబు గా నలుఁగు నూఁటియుఁ జంద న మట్లు రాచియుం,బన్నుగఁ గ్రొత్తలైన కలపంబులు గూర్చియు ... భార. విరా. ౨. ౨౨౧.

నున్నగాలి. వి. (నున్న + గాలి.) మందమారుతము.

చ... నున్న గా,లికి నెల వైనపువ్వుఁబొదలే పొద లే పులకింప నేల మి,న్నక యెలనాగ నాగరజన ప్రియుఁ డయ్యెడువిశ్వనాథుల, య్యకుఁ జనవచ్చు వచ్చుమరునమ్ములు వమ్ములు చేసె దంతటన్. కావ్యా. ౨. ౬౪.

నున్నన = నున్న. విణ. నున్ననిది, స్నిగ్ధము.

గీ. నునుపు నున్నన నిద్దము నున్నని దన, స్నిగ్ధ నామంబు జెలఁగును జితస్వరూప. ఆం. భా. ౨. ౨౫౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ. ఉడుమార్గం బఖిలంబు నున్న నయి శాణో
త్తేజనం బొంది పు, ల్కాడుగం బడ్డనిశాతఖడ్గ
ముక్రియం గన్పట్టె నప్పట్టునన్. హర. ౨.
౨౫.

మ...ఉద్భటా, చలకూటోపలకోటి రూపు చెడ
నిచ్చల్ రాయఁగా నైన మొక్కలు భూ
కాంతరు నున్ననయ్యె...మనుచ. ౧. ౩౫.
ఉ. రా. ౫. ౨౮౭.

వి. నున్నఁదనము, స్నిగ్ధత.

సీ... తేట నున్నన నున్న తెలివి సనుపు. గీ.నిద్ద
మన స్నిగ్ధత కెసంగు...సాం.ని. స్థా.౬౦.

నున్నము. సం. విణ. (అ.ఆ. అ.) ౧. త్రోయఁ
బడినది, తొలఁగింపఁబడినది. ౨. ప్రేరింపఁబడి
నది, ప్రేరితము.

నుయ్యి(యి)= నూయి. వి. కూపము,బావి.(దీనికి
ప్రథమైకవచన మందే ప్రయోగము.)

ఆ. ఒకనివాలములోన నొకఁడు ధర్మార్థంబు, కొ
లను బావి నుయ్యి త్రొచ్చుచోట, నడిగి చే
యవలయు నొడయండుఁ జేనికి హాని దేక
యున్న నాఁగఁ దగదు.విజ్ఞా. వ్యవ. ౧౫౧.

శా. అంతర్వాణిరు శేశయద్యుమణిఁ బద్ధాయుక్
మది న్నిల్పి దు,ర్దాంతానంతభ వాంధకూప
తరణప్రౌఢిక్ దృఢస్థేమఁ బ్రాటించు ర్పెద్దలు
తద్ద నమ్మి నుయి దాఁటేవానికిక్ జింతయా,
కంఠైనం గడ మేనియుం గడమ కాదా
యంచు నూహించుచుక్. పాండు. ౮.
౨౭౫.

సా:- ముందట నుయ్యి వెనుక గొయ్యి. (ఎటు
చూచినను ఆపదయే అనిభావము.)

చ...అతఁ డప్పుడు ముందట నుయ్యి వెన్క
లోఁ,తగుగొయి యున్నలా గయినఁ దల్లడ
మందె వణంకు మేనితోఁక్. విక్ర. ౩.౭౧.

నురనుర. వి. నురుఁగుల ధ్వని కనుకరణము.

సీ. నురుఁగులు నురనుర దొరఁగి బోరున జాఱి
గుడికొంచుఁ గిట్టిన పడుసుకులు. ఉ.
హరిశ్చ. ౨. ౧౨౬.

నురుఁగు=నురువు. వి. (త. నురై. దీనిని చి. ని.
నిరనుస్వారముగా గ్రహించెను. నిర్ధారక ప్ర
యోగములు గానరావు. ఇంకను విచార్యము.)
ఫేనము.

సీ. కలకంఠిలోచనంబులు గండుమీలు కుసు
మగంధివిమలహాసము నురుంగు. రా.జ.వి.
౧. ౭౮. (శ.ర. పా. 'హాసములునురుఁగు,
లు'... అని ముద్రి.పా.)

సీ...పరఁగు ఫేనము నుర్వు నురుఁగనంగ.ఆం.
భా. ౧. ౧౫౮.

సీ.కొడుకు రాఁగలఁ డంచుఁ గడుఁ బొంగువా
హినీవరునియూర్ముల మించునురుఁ గనంగ.
ఉ. రా. ౮. ౧౬౦.

జః నురుఁగుకొను, నురుఁగుదబ్బ.

నురుఁగుకొను. అ. క్రి. (√నురుఁగు.) నురుఁగు
కట్టు.

వ...లాలావినిర్యాసంబులు సెలవుల నురుఁగు
కొన...కవిక. ౫. ౧౧౦.

నురుఁగుదబ్బ. వి. (√నురుఁగు.) కడుపులో కు
డిప్రక్క నుండు మాంసఖండవిశేషము, కారి
జము, కాలఖండము. (శ. ర.)

నురువు(ర్వు)=నురుఁగు. వి. సముద్రాదులఫేన
ము, డిండీరము.

క. నురువున నొనరించినపం,జరంబులో నున్న
పులుఁగుచాడ్పున మేనం, బురుసవర జీవ
ముండుట, పరికింపక యేచుటంగఁ బాడియె
నీకుక్. భార. శాం. ౬. ౨౨౩.

అ. పెక్కు లయ్యు నీబిభీషికల్ నురువులు,
విరియునట్లు విందు విరియఁ జాలె. భార.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆది. ౭. ౪౩.

శ్లో. బిభీషికా నైగంధర్వ నాస్త్రశ్లేషు ప్రయు
జ్యతే,అస్త్రశ్లేషు ప్రయుక్తేయం ఫేనవత్ర్ప
విలీయతే. సం. భార. ఆది. ౧౭౬. ౨౭.

౨. పశ్వాదులనోటినుండి వెడలు ఫేనము.

వ...మొదవులనోరినుఱువులుం బెయ్యలరేణం
బులును...హరి. పూ. ౫. ౧౪౨.

౩. కొన్ని ఫలములనుండి వచ్చు ఫేనసదృశ మగు
ద్రవము.

గీ...ఝంకుడుపండులనురు వసంగ,బలపలనిపాం
డురాంబుదపంక్తు లమరె. ఆము. ౪. ౧౫౭

క. అనురువుఁ జూచి కృష్ణుం, డానఁగరానట్టి
కినుక నక్షిద్వయి కెం,పూన మదంజలిలోప
లి, కేనెపమున వచ్చెనిట్టియెంగిలి దలఁపన్.
చిత్రభా. ౫. ౧౯. కేయూర. ౪. ౭౫.

సీ. కొమరొందు తెలినుర్వు లుమియుక ళ్లెలు
గాఁగ నెఱియసల్ జీరాడునెఱులు గాఁగ.
అచ్చ. రా. కిష్కిం. ౬౬.

నుర్గాడు=నుగ్గాడు. అ. క్రి. (నుర్గు+ఆడు.) న
గ్గగు.

శా. భర్గుం డంతకవాహినుల్ శరహతిన్ భం
జించున ట్లెమ్మెయిన్, దర్గంగా రథపత్త్ర
ముల్ విఱుగ వేదండాండరానీకముల్,నుర్గా
డన్ భటకోరకంబు లడరన్ నూత్నాశ్వపు
ష్పాఘముల్, మర్గింతున్ బరసైన్యపద్మవ
నముం మద్బాణవర్షంబునన్. ఉ. సం.౧౧.
౬౦౪.

స. క్రి. నుగ్గుచేయు. (చూ. నుగ్గాడు.)

నుర్గు(ఉగు)=నుగ్గు. (క. నుర్గు. త. నుఱుఙ్గు.)
(చూర్ణము, పొడి.)

క. నుర్గై విశ్వేశ్వరుదో,ర్గర్గళహతిఁ జన్నరిపుల
నగు వినుతింపన్, స్వర్గవధూకుచకుంభవి,
నిర్గళదంబువులచేత నిర్గలు లగుటన్. కా
వ్యా. ౭. ౩౯.

జః నుర్గాడు.

నుఱిచియాడు=నుఱుచు. స. క్రి. (√నుఱుచు.)
సంహరించు.

సీ. ఆమేటి తనదుసైన్యమును బద్మవ్యూహభం
గిఁ జూపట్టంగఁ బన్ని హతిక,రప్రహారప్రవ
ర్తనలచేఁ జీకాకుపఱచుచుఁ గడుఁ జొచ్చి
నుఱిచియాడు,వీరకుంజరు ఁగద్విమతవిక్ర
ము... రాఘవ. ౪. ౧౪౨.

నుఱిపిడి=నూఱిపిడి, నూర్పు, నూర్పిడి, నూఱు
పుడు. వి. (√నుఱుపు.) ధాన్యము మొ. వానిని
కాళ్లు మొదలగువానితోఁ ద్రొక్కి నలఁపుట.

వ...నుఱిపిడికిం జొచ్చినప్రబలహాలికునిలీల నే
లం బెట్టి కాలం జమరి చంపి పొంపిరివో
పుమగంటిమిం బేర్చి యార్చిన... భార.
ద్రో. ౩. ౬౬౯.

నుఱుచు=నుఱుపు, నూఱుచు. స. క్రి. (త. నూ
ఱు, నెరుక్కు.) ౧. (ధాన్యాదికమును కాళ్లు
మొ.వానితో) త్రొక్కి నలుపు, నలఁగఁగొట్టు.

గీ. తాఁచి యొక్కనిఁ దేరితో వైచి యొకని,
గ్రుద్ది యొక్కని వెఱఁచేతఁ గ్రుమ్మి యొకని,
నుఱిచి యొక్కని మెడ నొక్కి విఱిచి
యొకని, సాత్మణంబునఁ దెగటార్చె నాఱు
గురను. రామా. ౬. ౨౧౨.

గీ...లోభి యైనసకల,సుకృతవిక్రయు నుఱిచె
దరూన్సుడు మధిప. మార్కం. ౨. ౧౦౦.

(తారకాసురుఁడు.) సీ. గరుడోరగామరతరు
ణుల నందఱఁ జేకొనితనవిలాసినులఁ జేసె.
ఆ. వేదవిహితవృత్తి విప్రుల నుఱిచె ...ఉ.
సం. ౪. ౩౬౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. నశింపఁజేయు.

సీ. కరసింహశార్దూలశరభాదిమృగముల నుగ్గు నూచంబుగా నుఱుచునవియు. కళా. ౬. ౭.

సీ. పఱుప కే లున్నవి పరభృత శ్రేణులు శ్రుతు లలోఁ దమపల్కు-నూదు లెల్ల, నుఱుప కే లున్నవి నెఱియ ధైర్యంబును గందంపుమల కోడె గాడ్పుగములు. ప్రభా. ౫. ౧౩౪.

జ: నుఱిచియాడు, నుఱిపిడి, నుఱుపు.

నుఱుపు=నుఱుచు. (√నుఱుచు) ౧. (ధాన్యాదికముసు కాళ్లు మొ. వానితో త్రొక్కి) నలుపు, నలఁగఁజేయు.

గీ. నుఱిపి తూర్పెత్తి కదలరు బిఱుసు దిగిచి, గండ్రలుగఁ జేసి రాశి పొంకముగ నిలిపి. శివధ. ౫. ౯.

౨. ధ్వంసముచేయు.

సీ. శస్త్రభూషణసముచ్చయములు నుఱుపంగఁ గడలొత్తువలఁదక్రేంకారములును. హరి. ఉ. ౪. ౨౦౯.

వ... గజంబులఁ బఱిపియు గాత్రంబు నుఱిపియు ... భాగ. ౬. ౩౪౦.

౩. ఖండించు, నఱకు.

లయవిభాతి. తఱిమి వెస రక్కసుల వెఱచఱవఁ బట్టుకొని, పఱిపఱిగ వ్రేశలలు నుఱిపి యువలీలన్. భా. రా. యు. ౧౪౩౪.

౪. చంపు, వధించు.

సీ. నీళ్లల కేటిలోనికి డిగ్గఁగాఁ బెద్దతఱపి పెయ్యలఁ బట్టి నుఱిపె నేఁడు. హరి. పూ. ౬. ౯.

నుఱుమాడు=నఱుమాడు. స. క్రి. (నుఱుము+ఆడు.) ౧. పొడిచేయు; త్రవ్వు.

ఉ. కొన్నిటి నప్పళించుకొని కోలెముకల్ నుఱుమాడు నిట్టులం, యన్నిటి నయ్యులూకము రయం బెసఁగన్ వధియించె భూవరా. భార. సౌ. ౧. ౧౭.

సీ. దేవపూజావితర్దికలకై లంఘించి గోరిజల నుఱుమాడుఁ గొంతతడవు. వరాహ. ౧౧. ౪౬. (ధ్వంసముచేయు అని భావము.)

౨. సంహరించు, చంపు.

ఉ. వారనియల్కతోఁ గినిసి వారిజనాభుఁడు వారిసైన్యముల్, మారిమసంగినట్లు నుఱుమాడినఁ భీమఁగుఁబెంటలై వెసం, దేరులు వ్రాలె నశ్వములు ద్రెళ్లె... భాగ. ౧౦ ఉ. ౫౧౯.

సీ. చక్కాడె నుఱుమాడెఁ జాఁగఁబలాడెను ...గీ. అడఁచెఁ జెండె ననంగఁ బొందగు వధించె, ననుటకు సమాఖ్యలై ... ఆం. భా. ౩. ౧౨౩.

౩. ఖండించు, ముక్కలుచేయు.

సీ. వెస అంపమున నిడ్డవసిగఁ గొన్నిటి నిను మంతలుగా నుఱుమాడి యాడి. భార. విరా. ౫. ౩౫.

చ... న, న్ననుపుఁడు వానిఁ బట్టి నుఱుమాడెద నొద్దికఁ జెల్లఁజేసెదన్. కుచల. ౨. ౭౧.

చ... కొమ్ములు నుఱుమాడి కుంజము లమందగతిన్ వెసఁ ద్రెంచి పాదపంబుల వెస వేళ్లతోఁ బెకల్చి ... భా. రా. సుం. ౩౩౩.

నుఱుము=నఱుము. స. క్రి. ౧. పొడిచేయు.

మ. కడికండంబులు చేసెదన్ నుఱిమెదన్ ఖండించెదన్ మించెదన్. వీర. ౪. ౬౫.

౨. బాధించు.

కళిక. నఱిమి తఱిమి చఱిమి నుఱుమునకు గల్పినవితకరికి. అప్ప. ౪. ౩౨౪.

౩. చంపు.

సీ. దక్షుఁడు దూషింపఁ దత్క్షణంబునఁ గొట్టి నుఱుముటు దలఁచిన వెఱపు రాదొ. పార్వ. ౪. ౧౦౯.

వి. పొడి; నలి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ...తన్నికటద్రుమవల్లు లెల్ల జర్జరితము లయ్యె
నిష్ఠురవిశాలశిలల్ నుఱు మయ్యె నయ్యె
డన్. భార. ఆది. ౬. ౪౯౬.

గీ. నుఱుము నుగ్గు పొడుము పొడి నురుము సు
న్ని,చూ రనంగను విలసిల్లుఁ జూర్ణ మభవ.
ఆం. భా. ౨. ౨౨౦.

క. అతిముఱి సంగము లెల్లను, నుఱుముగ ని
ట్లడరునరజుసునియమ్ములనున్, వెఱచఱచి నూ
తపుత్ర్రుడు,పఱచె...భార.విరా.౫.౧౦౮.
అచ్చ. రా. యు. ౧౩౧.

జ: నుఱుమాడు, నుఱుముచేయు.

నుఱుముచే(సే)యు=నఱుముచేయు. స. క్రి. (నుఱుము + చేయు.) ౧.సంహరించు,చంపు.

సీ...నుఱుముచేసె. గీ. నడఁచెఁ జెండె ననంగఁ
బొందగు వధించె ననుటకు సమాఖ్యలై...
ఆం. భా. ౩. ౧౨౩.

ఉ. వాతసుతుండు ముట్టికొని వారి బడల్పడ
వ్రేసి యందఱం, జేతులతీఁట వో నుఱుము
సేసె విశృంఖలవిక్రమంబునన్.భార.విరా.
౩. ౨౯.

గీ. మఱియుఁ బే రగుతులురల నుఱుముసేసి.
నీలా. ౧. ౩.

౨. పొడిచేయు, పిండిచేయు.

క. మును గైదువులం బొరిగొని, చని జోళ్లను
నుఱుముసేసి సర్వాంగములం, గొని వ్రచ్చు
రాముశరము ... భా. రా. అర. ౧.౨౦౩.

సీ. ఉర్వీధరంబు లొండొంటితోఁ దాఁకించి
నుఱుముసేకు నుమామనోవసంత. చెన్న.
౫. ౧౮౦.

నులక(ల్క). వి.(√నులుచు-క. నులికె.)త్వక్సూత్రము, నారతో పేనినదారము.

సీ...చెలఁగుఁ ద్వక్సూత్రంబు నులక యనఁగ.
ఆం. భా. ౨. ౪౯౫.

ద్వి. ప్రకటింప వేయునులకత్రాళ్లు గూడి, యొ
కమ్రోకు నరె సభ్యుఁ డొకఁ డైన వలదె.
పండితా. వాద. ౧౩౬ పా.

సీ. పరఁగ నుల్కలు నూఱు బండిమోకు లిలఁ
గాదు ... నీతి. ౭౦.

ఉ...భద్రగజేంద్రము నుల్కత్రాళ్లచే, నోముని
నాథ కట్టువడి యుండునె...భోజరా. ౪.
౨౦౩.

జ: నులకమంచము.

నులక(ల్క)మంచము. వి. (√నులక. క. నులి మంచ.) నులకతో నేసిన మంచము.

ఆ. మలిన మైన నేఁత పలువ నైనను నల్లు,ఉన్న
నుల్కమంచ మొప్ప దండ్రు.ని.పు.౪.౨౧౫.

నులకశయ్య. మి. వి. నులకమంచము.

మ. అహహా బ్రహ్మము వారయే నులకశయ్యం
డ్రెళ్లి నిద్రింతురో. శివరా. ౩. ౯.

నులి. వి. (√నులియు-క. నులి.) చిక్కు, మెలిక.

గీ. నెరులు గలవురునీలంపుటురులసిరుల,నరులు
గొనఁ జాలి నరులను మరులు గొలిపి, యిరు
లు గెలిచిన తుమ్మెదగఱులఁ దెగడు, కురుల
నులి దీర్చి విరులిడి కొప్పు వెట్టె.భాగ.౧౦.
ఉ. ౨౪౨.

సీ. కౌస్తుభోజ్జ్వలపదకంబునఁ బెనఁగొన్న చారు
హారమునులి చక్కఁజేసి. హరి. పూ. ౫.౯.

శా. తారాప్రోషులఁ గాలనూతుఁడు వియద్వా
రాశి వేటాడి ప్రాహ్ణారంభం బనుబుట్టఁ బె
ట్టి నులి వాయం గుంజి యీఁ దాఁటఁ జె,
న్నారన్ వైచినజాలమో యనఁగ శోభాకిం
చనత్వంబునన్, దారానాయకమండలం బ
మరు నస్తగ్రావకూటంబునన్. కాళ. ౪.౯౬.
ప్రభా. ౨. ౯౨.

విణ=ఉలి౨. ౧. అల్పము, చిన్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. బలుగోడలఁ బొసంగునులిపచ్చపగడంపుబా
రుదూలంబులవార మాను, పులుదిండితాకం
బమఁలగరిమంబు ... ఉ. రా. ౬. ౧౨౩.

౨. మెలి పడినది, మెలికలు కలది.

ద్వి. పులిగోరు నేవళంబులు నంద మైన, నులి
కడియంబులు నూపురంబులును. నవ. ౪.
౧౮౬ పా. ౩౨ పం.

**నులించు** = నులుచు, నులుపు. స. క్రి. (√నులియు. శ. ర. చి. ని.) నులియఁజేయు, నులుపు.

ఉ. తానును దైత్యులావునకుఁ దద్దయు నొచ్చు
చుఁ బేర్చి దేవకీనూనుఁడు కొమ్ము లూఁది
మెడ ప్రక్కలఁగ నెత్తి నులించి త్రిప్పి వ్రే, వ్రే
నెఱిఁ దప్పఁ ద్రోచుటయు... హరి. పూ.
౮. ౫౦.

**నులికొ(గొ)మ్ము(ల)మేకము.** వి. (√నులి.) ఇఱ్ఱి, మగజింక.

సీ. నులికొమ్ముమేక మన వెలయుఁ గృష్ణమృ
గంబు... సాం. ని. తిర్య. ౩౪.

క. నులిగొమ్ములమేక మిఱ్ఱన నిలమృగమున కొ
ప్పఁ బేళ్లు... ఆం. సం. తిర్య. ౬.

**నులిగాయ.** వి. (నులి + కాయ.) దృష్టిదోషము గాలిసోకు మొదలగునవి కలుగకుండుటకు చంటిపిల్లలకును పురుటాండ్రకును గట్టెడి కాయ, దిష్టిపూస.

గీ. త్రాట నులిగాయఁ గూర్చి పాదములఁ గట్టు,
నుప్పు వేఁపాకు పైఁ జల్లు నిప్పు లతివ, ద్రిప్పి
యిడు దృష్టిదోషంబు దీఱ వీథిఁ, బ్రేమ మీ
ఱఁగ బిడ్డఁ బెంచునపుడు. కాశీ. ౪. ౧౧.

ద్వి. పసిఁడి పేఁకుబ్బెత్తుపగిది వీడెమునఁ, బొసఁగి
నిగ్గులు దేఱుపుక్కిటితోడ, నులిగాయ లెడ
ను గానఁగఁ గింజమోవి, నులిచిన పేరు చన్న
లఁమీఁద బెళకఁ. అ. మ. క. ౧. ౨౬ పా.
౨౦ పం.

**నులిగొను.** అ. క్రి. (నులి + కొను.) ౧. చిక్కుపడు, మెలికపడు.

సీ. నులిగొన్న చెలఁదిపురువ్వులనూలివల్లునా నమ
రెడుముడుతకన్బొమలవలన. గీ. భావజుఁడు
వెల్లిపోయినపాడు మేడ, పగిదిఁ గాన్పించు మను
దుసలిపడఁతి యొకతె. కళా. ౩. ౮౩.

సీ. దట్టమై నులిగొన్నయట్టిపందిరిద్రాక్షతీవ లిం
దెవ్వరో త్రెంచినారు. శుక. ౧. ౨౭౩.

౨. వలయితమగు, చుట్టుకొనఁబడినదగు.

క. పెనగొనె గిఱికొనియెను... నులిగొనె నన
నాఖ్య లగును వలయితమయ్యె ననుట
కును... ఆం. శే. ౬౩.

**నులిగొల్పు.** స. క్రి. (√నులిగొను.) మెలివెట్టు.

ద్వి. ముదురుజుంజుఱుమీసముల నులిగొల్పి. ద్వి.
హరిశ్చ. పూ. ౨౦౬౨ పం.

సీ. నులిగొల్పి పావడఁ దలజుట్టె నొకయింతి
నెమ్మేనితడి యొత్తె కొమ్మ యొకతె. చంద్రా.
౬. ౮.

**నులిజెముడు.** వి. (√నులి.) వృక్షవిశేషము, చిన్న జెముడు?.

సీ... నల్లేరు నులిజెము డాకుజెముడు. హంస. ౪.
౧౦.

**నులితడ.** వి. మహాబల?.

గీ... గూబతడ నులితడ, యన మహాబల దసరు
వృషాధిరూఢ. ఆం. భా. ౨. ౫౬.

**నులిపచ్చి.** విణ. (√నులి.) కొంచెముతడిసినది.

ద్వి. పసుపడ నులిపచ్చిపయ్యెదకొంగు, మొనల
నానినకుచముల నొప్పు దాని. ద్వి. పరమ.
౪. ౮౫౨ పా.

**నులిప(వ)డు.** అ. క్రి. (√నులి.) ౧. దోఁపుడువడు.

ఆ. దోఁపువోయె ననుట దోఁచు నులిపడె న,
నంగ... ఆం. భా. ౩. ౧౧౬.

౨. మెలికపడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రగడ. మగువ పలుమఱు దిగిచి చూచుట మా
నుమా నలికడియె దండలు. పారి. ౪. ౧౬.

గీ. సొలపునడపులఁ గొనలు నులివడంగ,...కత్తు
రు వెలజాతికొమిరె లెపుడు. ప్రబంధ.౧౯.
కళా. ౫. ౧౮౦.

**నులిపురుగు.** వి. (నులి + పురుగు.) కడుపులో
పుట్టుచిన్నపురుగు. (బ్రౌ.)
(వ్యవ.) వాయువిళంగముఁలరసము త్రాగినచో
కడుపులోనినులిపురుగులు పోవును.

**నులిబిల్ల.** వి. (√నులి.) చిన్న దయినయొకజాతి
నీటిపురుగు, జలచరవిశేషము.

సీ. నులిబిల్ల యెఱబిల్లపురుగు గోఁదురుకప్ప...
యెండ్రకాయ జలగ. హంస. ౪. ౧౮౬.
('నులిగుల్ల' ప్రాఁతప్రతిపా.)

**నులియచేంకె.** వి. వృక్షవిశేషము.

సీ... తలపిడు చబ్బెంద నులియచంకె. హంస.
౪. ౧౦. (ప్రాఁత ప్రతిపా.)

**నులియు**= నలియు. అ. క్రి. ౧. పొడియగు.

వ... మిడియుప్రేళ్లును నలియుకన్నులును నులి
యు వెన్నులును జడియుచెక్కులును ...
చంద్రా. ౬. ౯౩.

౨. (అలయిక మొ. వానిచే) చలించు, అల్లా
డు; వడఁకు.

క. అంగంబులు నులియంగను,నుంగే నుంగే య
టంచు నొకనిమిషము నోౕరం గాయ వేయ
కేడ్చుచు, నంగీకృతబాల్యచేష్ట నతఁ డట్లుం
డన్. పరమ. ౧. ౧౨౫.

చ. కులుకు లెసంగ నబ్బురపుగుబ్బలు గుబ్బతి
లంగ మేనిచాయలు చిలుకంగఁ గొను నులి
యంగ మొగ్గమునఁ గ్రమ్మి చెమ్మటల్,జిలిబిలి
పొంగఁ బొందళుకుఁజేలమెఱుం గడరంగఁ
గంకణావళి గలుగ ల్లనంగఁ బఱవం గమకిం
చె లతాంగి సిగ్గునన్. కృ. శతం. ౩. ౪౫.

జ: నులక, నులి; నులిఁచు, నులిగాయ, నులిగొను,
నులిగొల్పు, నులిజెముడ, నలిపచ్చి, నులి
పడు, నులిపురుగు, నులిబిల్ల, నులివంక, నులి
వాడు, నులివు, నులివెచ్చ, నులివెట్టు, నులి
వేఁడి, నులుపు, నులుము, నులుసు.

**నులివంక.** వి.(నులి + వంక.) ౧.కొంచెము వంకర.

సీ. కళలయిక్కువ లంటి గళముల సందిళ్లఁ గ్రొ
వ్వాడినులివంకగోరు లుంచి. ఘటికా. ౨.
౧౧౬.

౨. పల్లకిబొంగుయొక్క దోషవిశేషము.

వ... నులివంక యగ్గిసోఁకుడు ... నీలధవళర
క్తహరిద్వర్ణంబులు మొదలుగాఁ గలదుర్గుణం
బులు లేక ... ప్రబంధ. ౬౦౫.

**నులివాడు**=ఉలివాడు[1].అ. క్రి. (నులి + వాడు.)
కొంచెముగా వాడు.

సీ. నులివాడునాఁచువల్లుల గొం తొగర్చి లేఁబొ
లకల్చిగాలి వే పోక యొదిగి.ఆము.౨.౫౩.

నులివాళ్లువాఁడు=కొంచెమువాడు.

క. నులివాళ్లువాడుచున్నవి, లలిత మహాతరుణ
దేహలతికలు మనకున్,జలకేళి యుచిత మన
వుడు, నెలఁతుక కి ట్లనిరి చెలులు నిపుణత
మెఱయన్. విక్ర. ౫. ౩౮.

**నులివు**[1]. వి. (√నులియు.) ౧. నులియుట. (శ.
ర.) ౨. ఆభరణవిశేషము.

ద్వి...చంద్రాస్య యొర్తు, తనకేలినులిమధ్యము
నఁ బొంకించి, యరుదెంచి... ద్వి. పరమ.
౫. ౪౪౧ పా.

**నులివు**[2]. వి. విధము, రీతి.

ద్వి ... వాఁడు నారీతి నొందు, నుడువనేరక
యూఁగనులివున నున్న. ద్వి. పరమ. ౨.
౧౨౪ పా.

**నులివెచ్చ.** విణ. (√నులి.) కదుష్ణము, కొంచెము
వెచ్చనిది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. తెలినులివెచ్చయోగిరముఁ దియ్యనిచారులుఁ దిమ్మనంబులున్. ఆము. ౧. ౭౧.

సీ. విరహులలమె సోఁకి వేఁడి యావెన్నెలఁ బచ్చివెన్నెల నులివెచ్చఁ జేసె.పారి. ౨.౪౭.

ఆ... కదుష్ణనామ, మలరు గోరువెచ్చ నులివెచ్చ తనివెచ్చ, యన...ఆం. భా.౧.౭౩. చంద్రా. ౨. ౩.

**నులివెట్టు.** స. క్రి. (√నులి.) ౧. మెలివెట్టు.

చ. అన విని నవ్వి యవ్వికసితాంబుజలోచన పైఁటకొంగు కేలున నులివెట్టుచుం దళుకళుక్కనఁ జూపులఁ జూచి...శుక.౨. ౪౯౯.

సీ. తోఁక నూరక మేను సోఁకఁగ నులివెట్టు వెడవెడ నాలుక వెడలఁ బెట్టు. భాగ. ౧౦. ఉ. ౫౪౪.

౨. గ్రుచ్చు.

మ. ధర గంపింప మహాసభాభవనరత్నస్తంభసంభూతుఁ డై, కరజంబుల్ నులివెట్టి రక్తకణము ల్గాఱఁగ వీక్షించి క్రా,ద్రరసద్రోణికలో యటంచు విబుధవ్రాతంబు వర్ణింప శ్రీ, హరి రక్షోభుజమధ్యమండలము చెండాడెన్ నృసింహాకృతిన్. వరాహ. ౭. ౭౯.

**నులివేఁడి.** విణ. (√నులి.) కొంచెము వెచ్చనిది.

ద్వి. గుడిగుడిఁ గన్నీరు గ్రుక్కుచు నొండు, నుడువ నాలుక రాక నులివేఁడియూర్పు,లందంద నిగుడ...ద్వి. హరిశ్చ. ఉ.౧౪౭పం.

చ...ఓరి మనుజాధమ నిచ్చలుఁ దెచ్చువంటకం, బును నులివేఁడికూరలు నపూపములున్ గొని రా కహంకృతిన్. విక్ర. ౫. ౨౧౯.

నులివేఁడియెండన్=సంధ్యాసమయమున.

సీ. ఎచ్చోట నులివేఁడియెండఁ బండులు రాలి పూపొఱ్ఱ్కవదనంబు బోసివడియె. భీమ. ౩. ౩౪.

**నులుచు(ల్చు)**=నులించు,నులుపు. (√నులియు.) స. క్రి. నులియఁజేయు.

౧. నలుపు, పిసుకు.

సీ.భవసంగతి నటంచుఁ దలదువ్వి ముడిచిన మురువులా యని ముడ్డి మూతి నులుచు. శుక. ౨. ౧౧౫.

సీ. ఉపదర్శి పెడ నుల్చి యూపంబుతోఁ గట్టి ...కు. సం. ౨. ౨౦౦.

౨. సంహరించు, నశింపఁజేయు.

సీ. గగ్గులకాడులుకావించె ముగియించె నులిచెను...గీ. వధించె, ననుటకు సమాఖ్యలు ...ఆం. భా. ౩. ౧౨౩.

గీ. వామనుఁడ వై బలీంద్రుగర్వంబు చెఱిచి, భార్గవుఁడ వై సమస్తభూపతుల నులిచి,రాఘవుఁడ వై దశాస్యువక్త్రములు డులిచి,నిలిచినాఁడవు నీమాయఁ దెలియ వశమె. వరాహ. ౧. ౫౨.

౩. మెలివేయు, మెలివెట్టు.

క.వైరమున నులిచి త్రెంపక,కారాకులు డుల్లినట్లు కర్షము లెల్లం,దార పెడఁబాయవలయుట, సారకృపం దెలియఁ జెప్పె శౌరి యతనికిన్. భార. భీష్మ. ౧. ౨౦౪.

చ...మేరువు న్వ్రాలుగఁ ద్రొచ్చెద శేషుని బట్టి నుల్చెదన్,వనజభవాండముల్ వగుల వైచెద దాఁటెద నేఁడు దీవులన్.భా. రా.కిష్కిం. ౭౧౯.

సీ. మొలకచ్చకట్టుపై మలఁగినపచ్చనినును కొంగు దిండుగా నులిచి చుట్టి. హరి. పూ. ౪. ౧౩. దశకు. ౨. ౪౩.

**నులుపు(ల్పు)**=నులించు, నులుచు. స.క్రి. (√నులుచు.) నలుపు, నలఁగఁగొట్టు.

వ...అక్కుండలికయనుండు...రాక్షసుల గుండెలన్ బగిలించుచు...శిరంబుల విదలించుచు భూషణంబుల నులుపుచు దూషణంబుల సలుపుచు...ఉ. రా. ౨. ౩౧.

౨. పన్నాగము, పన్నుగడ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కా... నేర్పుల్ పచరించి బొంకిన నెఱుఁగక రాద యీనులుప్ప వీఁ,డే నిక్కంబ బగు కన్న గాఁడని ధరిత్రీశాగ్రగణ్యుం డనక.విప్ర. ౫. ౭౨.

**నులుము.** స. క్రి. (√నలుచు.) ౧. మెలిపెట్టు, కండను రెండువ్రేళ్లతోఁ బట్టి యిటునటు త్రిప్పు.

వ... ఉరవడిఁ గొమ్ముల మెడల నులిమియుఁ దొడలు విఱిచియు... నీలా. ౩. ౪౪.

సీ. ధూర్జటి నే మని దూషించితి వటంచుఁ బువ్వుఁబోణి యొకర్తు బుగ్గ నులిమె.పార్వ. ౪. ౧౨౧. కళా. ౪. ౪౧.

౨. నలుపుకొను.

సీ. కాటుక నెఱయంగఁ గన్నులు నులుముచు వెడలుకన్నీటితో వెగచువాని. భాగ. ౧౦. పూ. ౩౪౨.

౩. గట్టిగా నొక్కు, పిసుకు.

(వ్యవ.) దొంగలు దారిలో వానిని గొంతు నులిమి చంపినారు.

౪. (ఇతరులనుండి) బలవంతముగ లాగు, ఒడిసి పుచ్చుకొను.

క. అని మరుబాములఁ బడలే,నని కైదువు దుస్సిగాఁటునాయితముబలెక, బెనఁగునలయుతి యచే నుర్వి,య నులిమి బలిమి విడిపించి యను నసురశక్తిక. సారంగ. ౨. ౨౩౫.

వ... ప్రమథగణంబులచేత నచ్చక్రంబు నులిమి తెప్పించి తదనంతరంబ... వీర. ౪. ౧౪౭.

౫. ఉన్మూలించు, పెల్లగించు; నాశముచేయు.

సీ. బలిమి వాసవుచెట్టు నులిమి వాకిటఁ బెట్టుక లిమివాలుగకంటిచెలిమివాని. చంద్రా.౧.౧౪

సీ. బంధనంబులఁ జటాపంచలు గావించు నొల యునాపదఁను నులిమి వైచు.సీతారా. ౧. ౭౩.

౬. విడుచు.

సీ.ఆన నప్పు డెన్నిక నమరశత్రు విభీషణుఁడు భీష్ముఁ డనుశంక నులిమి కాచి, పలుకుఁబం తము మీఱి... రాఘవ. ౪. ౫౩.

౭. వధించు, చంపు.

సీ... నుగ్గాడె, బరిమార్చె నులిమెను దెగటార్చె జదిపెఁ జంపెను సదమద మొనర్చె... గీ. అడఁచెఁ జెండె నసంగఁ బొందగు వధించె, ననుటకు సమాఖ్య లై... ఆం.భా. ౩.౧౭౩.

**నులుసు.** వి. (√నులియు.) శేషము, మిగులు. (న్యూనత అని శ. ర. నిష్ఫలము అని బ్రా.)

తరలము. నలినలోచన... మమ్ముఁ గావుము భీతులక,నులుసు లేక ఫలించె నోఁచిననోము లెల్లను నీవ యై. భాగ. ౧౦. పూ. ౧౩౦.

**నుల్లింద.** వి. ఒకానొకచెట్టు.

వ... మఱియునుం బెదపిచ్చి చినపిచ్చి నల్లిందను ల్లింద యిప్ప కప్పురమద్ది... పి.శకుం.౨.౧౪.

**నువత్.** సం. శత్రు. నుతించుచున్న.

**నువ్వు(వు)**=నూవు.వి.సస్యవిశేషము,తిలసస్యము (దీని భేదములు అడవినువ్వు, కొత్తినువ్వు. అని శ. ర.)

ఆ. నువ్వుఁబువ్వు నవ్వు జవ్వనినాసిక... విజ. వి. ౧. ౭౪.

వ... నువ్వుమవ్వంబును... భీమ. ౩. ౫౭.

సీ. ఎడ లేదు నువుగింజ యిడఁగ సప్తద్వీపములయందు యూపముల్ పొదలుకతన. నీలా. ౨. ౧౬.

బ. ధాన్యవిశేషము.

ఆ. నూనె లేనిదివ్వె నువ్వుల మందునా,విశ్వదాభిరామ... వేమన. ౧. ౩౭౦.

ఆ. ఘటము గాగఁ జేసి కరణ మెద్దుగఁ జేసి,త విలి కర్మములను నువులఁ జేసి, తెలిసి గాను గాఁడు తిలకారుఁడాత్మయు,విశ్వ... వేమన. ౨. ౨౪౫.

సా: నాల్కపై నువ్వుగింజ నానదు. (మాట దాఁగ దని భావము.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. నాల్కపై నువ్వు గింజైన నాననట్టి,యారివే
రంపుఁదపసి కయ్యంపుఁగడుపుఁ, గూడుగాఁ
జేసి మెలఁగడుకొడిగీఁడు, ముదురు చదువుల
బాపనముద్దుపట్టి. చిత్ర భా. ౫. ౮౫.
జః నువ్వుచేను.

నువ్వుచేను. వి. (నువ్వు + చేను.) తిల్యము,నువ్వు
లుపండుచేను.

గీ...నువ్వుచే ననఁగఁ దిల్య,మలరు...ఆం.భా.
౨. ౨౭.

నుసము. వి. కనరు.

ద్వి. బలవంత మగుసిధి ప్రాణేశుఁ శాప,వలవం
తఁ జెందినపరవధూమణికి...పూఁబొదరిండ్ల,
క్రంతలు వంతలు కమనీ యసరసి, బిసములు
నుసములు పృథుమకరంద,రసములు విసము
లు...ద్వి. హరిశ్చ. పూ. ౨౫౨౩ పం.

నుసలు. అ. క్రి. ౧. కదలు, మెదలు.

ద్వి. చాల నీతని కుల్కి సత్యంబుకొఱకు, నూ
లిపోఁగునఁ జిక్కి నుసల కున్నాఁడ. ద్వి.
హరిశ్చ. ఉ. ౧౫౨౬ పం.

౨. ఏమఱు, ప్రమాదమొందు.

ద్వి. నుడితప్పు వాతప్పు నుసలక సత్య,మెడ
లింపఁ గనిపట్టు నెపుడుఁ గౌశికుఁడు. ద్వి.
హరిశ్చ. ఉ. ౧౯౭ పం.

ద్వి. విసిగినఁ గసిగిన వెడ నిద్ర నొంది,నుసలిన
మసలిన నొప్పిఁ జెప్పినను. ద్వి. హరిశ్చ. ఉ.
౧౫౮౨ పం.

౩. పూను, యత్నించు.

క. మగువలు మగ లని యెఱుఁగఁడు,మృగముల
కోరసిలఁ డేమి మిడిమేల మితం, డగపడు
నని తలఁచితి మేఁనుఁగుఁ గంబంబునకుఁ దివి
య నుసలితిమి సుమీ. రామా. ౨. ౧౧౩.
(శ. ర. చి. ని. పా. 'నుసిలితిమి' ముద్రి.)

౪. ఆడితప్పు.

ఆ. నొడివినంతవట్టు నుసలక యిచ్చుచో,నేల
కట్టు విష్ణుఁ డేఁటిమాట. భాగ. ౮. ౫౯౪.

స. క్రి. పట్టుకొను, గ్రహించు.

మ. పెసరుంగాయకు మెత్తకన్నులకునై పేటా
డుమ మన్గొట్టెలక్,నుసలం జూచుచు దోస
చేల్ చెఱకుచాల్ నుగ్గాడుచుక్ ... రా.
వి. ౨. ౩౫.

నుసి. వి. (క. నొచి.) ౧. పుఱుగులు తొలువఁగా
రాలుమ్రానిపొడి.

చ...అప్పడఁతుకభ్రూలతాధనువు పట్టి మనోభ
వుఁ డింతనుండియుక్, విడుచునకాని మానఁ
డిది నిక్కము పట్టుదకీటజుష్టమై,యుడుగక
కమ్మఘూళినుసి యొల్కుచునున్న పురాణచా
పముక్. నైష. ౫. ౧౨.

క. ఘనగణవివరణఁ జివికిన,మణిధనువునఁ దొ
రఁగునుసిసమానము లై ద,ర్పణ నిభ నభము
నఁ బరిణతి,శణకణహరిణములు పాండుజలద
ము లొలసెక్. ఆము. ౪. ౧౪౧.

౨. నిగుడు, కట్టెలు మొదలగునవి కాల్చుటచే
కలిగినబూడిద.

(వ్యవ.) కట్టెలు కాలి నుసి అయిపోయినవి.
విణ. నుసి పట్టినది, ప్రాఁతది.

ఉ. చూచి రఘూద్వహుండు నెఱజోదులు వేల
కొలంది యెత్తలే, లేచి బలాఢ్యు లయ్యు
నిపు డీనుసివి ల్లాకపెద్దకొండగాఁ, జూచెద
రెల్లవారు నది కూలిచిఁ గాకిటు నాకు లక్ష్య
మే. రామా. ౪. ౭౭.

నుసిపురుగు. వి. (√నుసిక.క.నుసిహుఉ.మ.నుచ్చు
పుఱు.) ఘుణము, మ్రాను తొలిచి నుసి రాల్చె
డిపురుగు. (శ. ర, బ్రా.)

నుసుఁగు. అ. క్రి. తొలఁగు, అపసరిల్లు.

గీ. ఆనృశంసుఁడు నుసుఁగు వైఖానసులకు,నా
దురాత్ముఁడు శ్రోత్రియు నపహసించు, నాఖ
లుఁడు సోమయాజి నిరాకరించు, నక్కరా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తుఁ డనుష్ఠాత ధిక్కరించు. నైష. ౭. ౧౩౦.

ఉ. పంది నుసింగిపోయిన నృపాలకనూజుఁడు సిన్నవోయి ... విక్ర. ౩. ౭౭. (చి. ని. పా. 'మొఱంగిపోయిన'. ముద్రి. పా.)

**నుసుమ.** వి. ఎండకాలమున కన్నులందు ముసరెడు చిన్నదోమ. (శ. ర., బ్రౌ.)

**నుసుము.** స. క్రి. ఆకర్షించు, లాగు.

వ...చరణాంగుళిదంశికలం బట్టి నుసిమిన మిట్టిపడి యిట్టట్టు గదలనేరక...వసు. ౪. ౨౩.

**నుసులు.** అ. క్రి. (త. నొసివు.) ౧ కదలు, చలించు.

గీ. మధుఁడు సారంగధరుఁడు మన్మథుఁడు విధుఁడు, వనులపాలిర లై వీరు నుసులనీయ,రె టుల నిటు తాళఁగల దని యెఱుఁగ వైతి. సారంగ. ౨. ౧౨౬.

ద్వి. రసికుండ వేనియు వసదక్కి యాత్మనుసిలిన మతి మీఁద నోరెత్తఁగలవె. పండితా. పురా. ౧౧౪ పా.

౨. (ఒడలు) విఱుచుకొను.

చ...నిద్ర చేఁ గసరినయట్లు మత్కరము గబ్బిచనుంగవపైకిఁ దార్చి మై, నుసులుచు నీవిజార్చినమనోహరలీలల నెన్న శక్యమే. శశాం. ౪. ౬౨.

౩. ఒదుఁగు, ముడిఁగియుండు.

చ. వెరపున సంగముల్ నుసుల వ్రేటులు వమ్ముగఁ దాఁకినపు దిక్కరిరదనప్రహారములఁ గంపము నొందక యుండుమేదినీధరములఁ బోల్పఁ బట్టగునుదగ్రపుమార్తుల...భార. శల్య. ౧. ౧౭౬.

మ. గద లన్యోన్యసమాహతిన్ మిడుఁగుఱుల్ గ్రక్కంగ సారించుచుం,గదియం బాయఁగ వ్రేటు దప్ప నుసులంగా నేర్పు లంగఁబులం,దొదవన్ ఘోరపరస్పరప్రహతు లత్యుగ్రంబుగా నెత్తురుల్, పెదరింపం బదశబ్దహుంకృతులు దిక్సీమంబులం దాఁటఁగన్. భార. ద్రో. ౧. ౧౬౫.

స. క్రి. నులుము, నలుపు.

గీ. చంద్రరేఖయుం ముఖకాంతి సడలి కనులు, నుసులుకొంచును మేల్కాంచి నుసలఁ జొచ్చె. చంద్ర. వి. ౩. ౧౩౫.

వి. ౧. చలించుట, వెనుదీయుట. (లాఘవము. అని శ. ర.)

వ...నుసులు లేక మానంబు మనంబునకు ధనంబుగా వనంబునం గార్చిచ్చునం గమిరిన యట్లు రూపు సెడి పీనుంగుపెంట లగుచోట్ల శరంబులు గాలినను శిరంబులు వంపక...ఉ. హరి. ౩. ౮౦.

౨. (త. నుసుళ్.) ఒదుఁగుట, ముడుచుకొనుట.

వ...అవ్వడముడి పుడమి నొనివెడఁదయురంబు పలక్షించి లాఘవఘోరంబుగ గదాదండంబుఁ ద్రిప్పి వైవ నాతం డది మేనినుసులునం దప్పింప నది యిల చలింపంబడిన నన్నుసులఁ దెలిపిన యాటికి యద్భుతవేగుండగు నవ్వాయుపుత్త్రుండు గద పుచ్చుకొని తిరుగుసందున దుర్యోధనుండు...భార. శల్య. ౨. ౨౬౭.

జః నుసులుకొను.

**నుసులుకొ(లొం-)ను.** అ. క్రి. (నుసులు + కొను. స్వార్థమున.) మెదలు, దొరలు.

సీ. కుహనాకిటికి లక్ష్మికుచకుంభములమీఁదికుంకుమంబున నుసుల్కొనఁగఁ గూడె. భీమ. ౧. ౩౪.

## నూ

**నూ.** వృత్తియందు నూవుశబ్దముయొక్కలుప్తశేషము. (చూ. నూఁబువ్వు, నూఁబప్పు.)

**నూఁక.** వి. త. నూక్కం. వృక్షవిశేషము. (శ. ర.)

**నూఁకు=ఊఁకు.** వి. పూనిక, యత్నము.

సీ. చిఱుతనూఁకుల నింగి జీర్వాఱు గేహవప్రముల నిచ్చెన లేక ప్రాకిప్రాకి. కళ. ౧. ౧౨౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నూఁగా(గుటా)రు. వి. (√నూఁగు.)రోమావళి.
ఉ. అరమణీలలామ నవయౌవనసంపద నివ్వటిల్ల
శృం,గారరసంపుబొమ్మ యనఁగా వలిచన్ను
లుఁ జిన్ని మోము నూఁ,గారుఁ గృశోదరంబు
నలకావలియుం బొలుపొందఁగా దర,స్మేర
కటాక్షము ల్వాలయఁ జెచ్చెర వచ్చె నిజే
శుపాలికిన్. వా. రా. ౫. ౧౨౭.
సీ... నూఁగారు నా నలరు రోమ, రాజి ...
ఆం. భా. ౨. ౧౪౬.
సీ. కరికుంభమధ్యసంఘటితనీలాంకుశం బనఁ
గు చంబుల నూఁగుటారు మెఱయ. బళిర
కటివేల్పుశతకము. (చి. ని.)
సీ. కమలోద్భవస్ఫూర్తి సుముఖఁబు భరియింప
హారిలీల నూఁగుటా రతిశయింప. ఇందు. ౨. ౧౯౧.

నూఁగు=నూఁగుడు. వి. ౧. ఆకులు కాయలు తీఁ
గలు వట్లు మొదలగువానిమీఁద బయలుదేఱు
చిన్నచిన్న ముండ్లవలె నుండు సూక్ష్మావయవస
మూహము. (దీనియామ్రేడితరూపము నూనూఁ
గు,నూఁగునూఁగు.)
ఉదా: దూలగొండినూఁగు, దోసనూఁగు, ధా
న్యపునూఁగు, బెండనూఁగు మొ.
సీ. తాఁగరాయంచలు నూఁగారఁ బెరిఁగినబిస
ములు తమపాలఁ బెట్టికొనఁగ.కకు. ౨.౮౦.
ఉ. సమ్మదవారి గన్నడల జాలుగ మైగరుపాఱ
నిందుబిం,బమ్మున దృష్టి నిల్పి పయిఁ బ్రాఁకు
మరీచుల నూఁగునూఁగులేఁ,గొమ్మలు వట్టఁ
జంచుపుటకోటిఁ గదల్చి తెమల్చికొంచు
స్వా,ఖ్యమ్ము విహంగమ మ్మయినయాకృతి నొం
దెఁ జకోర మొక్కెడన్. నిర్వ. ౬. ౫౧.
౨. అప్పుడే క్రొత్తగా బయలుదేఱురోమము,
రోమాంకురము.
సీ. వెడవెడ నూఁగారివింతయై యేర్పడుదేరనివ
ళులలో నారునిగుడ.భార.విరా.౧.౨౪౫.

విణ. శేతది.
సీ. నూనూఁగుమీసాలనూత్నయౌవనమున శాలి
వాహనసప్తశతి నొడివితి. కాశీ. ౧. ౭.
సీ.కలికిసింగారంపుమొలకలోయన ముఖాబ్జమున
నూనూఁగుమీసములు లేనర.దశా.౮.౨౧౨.
నూఁగునూఁగుఁబ్రాయము=నూత్నయౌవనము.
క. తొడరియుఁ దొడరనిసిగ్గునఁ, బొడమియుఁ
బొడమనియురోజములఁ జాపలముకన్, విడి
చియు విడువనినడపులఁ,బడఁతుకపై నూఁగు
నూఁగుఁబ్రాయం బయ్యెన్. కవిక. ౩.౧౦.
జ: నూఁగారు,నూఁగుడు,నూఁగుదోస,నూదోస.

నూఁగుడు=నూఁగు.వి. (√నూఁగు.)
(ఆకులు, కాయలు వట్లు మున్నగువానికి అంటి
యుండు సూక్ష్మావయవసమూహము.)
క. బ్రదికెడునంతకుఁ బురుషుఁడు, బ్రిదులక
నిలువెల్ల వగలఁ బెనఁగొని యుండుకన్,గుదు
రుకొని దూదినూఁగుడు,పొదివిన కార్పాసబీ
జమునకుం బ్రతియై.కవిక.౫.౧౧౭. (శే.ర.
పా. 'దూదిమాఁగుడు' అని ముద్రి. పా.)

నూఁగుదోస=నూదోస. వి. (√నూఁగు.) కూఁతు
రుబుడమకీ.
ఆ. నెల్లిపప్పు పొట్ల చిల్ల మూలము నూఁగు,
దోస ముద్దయుఁగ మధూకజాతి, జీరకములు
గాఁచి నీరంబు లియ్యఁగా,నెట్టి పైత్యము
లును మట్టువడును. (చికి. చి. ని.)

నూఁబిండి. వి. నూవు+పిండి. నువ్వులపొడి.
సీ. ఉండ్రాళ్ళు నూఁబిండి పుండ్రేక్షులుం దేనె
యనఁటిపండ్లు...హర. ౬. ౫౫.

నూఁబూవు. వి. (నూవు+పూవు.) తిలపుష్పము,
నువ్వుఁబువ్వు.
క...నూఁబూవువంటినాసికయు ... హర. ౩. ౨౩.

నూకలు. వి. (త. నుక్కు.) తండులకణములు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. ధాన్యశకలములు దనరు నూక లనంగ ...
ఆం. భా. ౨. ౨౩౯. ద్వా. ౨. ౧౭౩.
(వ్యవహారమందు ఏకవచనము కానవచ్చుచున్నది. ఉదా:-గోధుమనూక మె.)

నూకించు. ౣస. క్రి. (√నూకు. క. నూకిసు.) త్రోయించు.

గీ. ఆట్టిబల్లిని సోఁకురాయుండు నీవఁడంతిఁ జెఱ గొని యునిచె నే నెంతమంచి,బుద్ధిఁ జెప్పిన వినక యబ్బురపుఁగినుకఁ, గెరలి వడిఁ దన్ని వెడల నూకించె నిందు.అచ్చ.రా.యు.౪౨.

నూకు. స. క్రి. (క. నూకు.) ౧. త్రోలు.

మ. హరిణం బొక్కటి యుక్కడిండమ్ముఁ బులిం దానీకమ్ముల ద్రోచి యుఱ్ఱర్వరఁ గా లూఁదక దాఁట నేటలవికిల్ వాహంబు నడ్డంబు నూ, కి రసావల్లభుఁ డేసె భల్లమున...మనుచ.౪.౪౪.

గీ. అప్పు డతికాయుఁ డారార యద్రిచరులు, జమిలిచంపులు చంపి రిచ్చట నటంచుఁ, దచ్చమూమధ్యమునకు రథంబు దూఱి,నూకి పాపట పుచ్చి...రామా. ౭. ౧౬౫.

౨. త్రోయు, గెంటు.

ద్వి. చెప్పుఁగాలను దొంటిశివుమీఁదిపూజ, పో నూకి తెచ్చినపుక్కిటినీటు,మానుగా శివునకు మజ్జనం బార్చి. బస. పు. ౩. ౭౦౧ పం.

చ. చెలియవయోనులబ్ధ యగుచుసిబ్బెపుగుబ్బల కల్మితొంటిలేఁ,ముల డిగ నూకఁగా నవి సము త్కటభీతినిఁ బాఱుచో...కవిజ. ౧./౫౪.

వ ... ఈ బ్రహ్మచారి శంకరునిగుఱించి యిం కను వంకరకొంకరమాట లాడ నుంకించుచు న్నవాఁడు ఇతని మెడ పట్టి నూకుం డని పలికి కోపావేశంబున. హర. ౪. ౩౩.

౩. పడఁద్రోయు, పడఁగొట్టు.

మ. పురముల్ గూలఁగఁ ద్రోచి సౌధభవనం బుల్ నూకి ప్రాకారముల్,ధరణిం గూల్చి ...భాగ. ౧౦ ఉ. ౩౯౭.

సీ. నుగ్గునూచంబు గా నూకుడుచే మేపుధరణీ ధరంబు దోర్దండశక్తి. సుద. ౫. ౭౦. ద్వి. పరమ. ౫. ౪౨౨ పా.

విణ. త్రోయునది.

వ... చిగురాకుతోఁగరుజిగివగపొగరు నూకుట డుగులజోడించినపాల వెండిపాగడమ్ములు... ప్రబంధ. ౭౭. (ఇట ఔపమ్యద్యోతకము.)

జ: నూకించు, నూకుడు.

నూకుడు వి. (√నూకు.) నూకుట, త్రోపుడు.

చ. లకుముకులట్ల సర్పములలాగుచుఁ గుక్కుట జాతిచాక్పునం, బికములలీలఁ బావురపుఁబి ట్టలతీరున జెట్లమీఁక థే,నుకముల వైఖరిం గపు లనూకుడుభంగిని భైరవాళ్వయు,గ్రకముల రీతి సింహములకైవడిఁ బోరి రనూనచాతు రిల్. హంస. ౩. ౨౩౨.

సీ. కడు మోరతోఁ బునూకుడుఁ జేసి కోరాడి కొమ్ముఁ నెగదట్టుఁ జిమ్మిచిమ్మి.రామ.౭౭౪.

త్రోపునూకుడు=అలత్యము.

ద్వి. గోపాలకునిఁ దనగురునివాక్యమును, ద్రోపు నూకుడు చేసి తొల్లిమత్స్యేంద్రుఁ, డరిగిన త్రోవ...నవనాధ. ౨. ౧౦౦ పా. ౨ పం.

నూగు=నూవు. (శ. ర. 'నూగులు' ధాన్య విశేష ము అని బ్రా.)

నూచే(ము). వి. పొడి, చూర్ణము; ముక్క, శక లము. (ఇది నుగ్గుపదముతోఁ గలసియే ప్రయోగ ములందు కానవచ్చుచున్నది.)

ఉ. కొన్నిటి హస్తముల్ సదియఁ గొన్నిటిఁ గొ మ్ములు దుమ్ముదూళిగాఁ, గొన్నిటిఁ గుంభ ముల్ పగులఁ గొన్నిటిఁ గాళులు నుగ్గునూ చగా ... అన్నిటి భీముఁ డుద్భటగదాహతి నేనికవేఁటలాడఁగల్.భార.భీష్మ.౨.౨౧౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(నుగ్గు నూచగా= పొడిపొడిగా, మిక్కిలి పొడిగా అనిభావము.)

స్రగ్ధర. కూలుం గుజ్జులు లేనుంగులు ధరఁ గెడయుఁ గుప్పలై నుగ్గునూచై, వ్రాలుఁ దేరుల్ ... భాగ. ౧౦ ఉ. ౨౨౦.

మ. సమయాంభోనిధిఁ జొచ్చి చండతరచంచద్వాల మల్లార్చుచుఁ, సమరోజ్జృంభితజంభశాసనభుజాస్తంభాగ్రదంభోళిదుర్దమశృంగంబున వేదచోరపురవప్రశ్రేణికల్ నుగ్గునూచము గాఁ దాఁకె సుధాశనాసహనరోషాగర్భనిర్భేదియై. దశా. ౧. ౨౩౩.

(భీముఁడు.) చ ... ఒక్కచే నొగల్, వెరవునఁ బట్టి తేరు ప్రజవిస్మయ మందఁగ వీచి వైచినఁ. ఆ. నుగ్గునూచ మైన నగురుఁ డొండొక,యరద మెక్కి యల్ల నరిగె సేన, మొగమునకు...భార. ద్రో. ౪. ౧౫౪, ౧౫౫.

క. అబ్బిత్తరికిం గన్నుల,పబ్బమ్ముగఁ జూచునపుడు ప్రమదంబునఁ బె, ల్లుబ్బెడుగబ్బిమెఱుఁగుచ, న్గుబ్బలచే రవికె నుగ్గునూచములయ్యెఁ. రా. వి. ౭. ౧౭౦. (నుగ్గునూచములగు=ముక్కముక్కలగు నని భావము.)

నూటయెనిమిది. స. (నూఱు[2]+ఎనిమిది.) నూఱును ఎనిమిదియు, అష్టోత్తరశతము.

గీ. దివ్యములు నూటయెనిమిదితిరుపతులకుఁ,బరమపద మైనశ్రీసర్పపురమునందు. భీమ. ౨. ౬౬.

నూటిడి. వి. (√నూవు.) నూవులతో చేసినభక్ష్యవిశేషము.

మ. ఉడువీథీహరినీలరత్నమయపాత్రోత్సంగభాగంబునం, గడుగారాముస శేషుపాండునరునంకచ్ఛాయ యన్ కమ్మనూ,టిడితోఁ గూడ సుధాంశుబింబ మను నేయిం బాయసాహారముం,గుడువం బెట్టెనొ బంతికూళ్లకును జాకోరంబు లేపారఁగన్. నైష. ౨. ౧౯౨.

నూతనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నవీనము, క్రొత్తది. ౨. వింత యైనది.

నూతము. సం=నుతము.

నూత్నము. సం= నూతనము.

నూదము. సం. వి. అ. పుం. తూదము, బ్రహ్మదారువు, గంగరావిచెట్టు.

నూదోస=నూఁగుదోస. ౧. నూఁగుదోసచెట్టు. (శ. ర.) ౨. రేణుకలుచెట్టు.

సీ... తెలియంగఁ దగును నూదోస రేణుకలు ... ఆం. భా. ౨. ౬౧.

క. నూదోసన రేణుక లగు...ఆం.పద.అచర. ౩౭.

నూనె(నియ). వి. (నూవు+నెయ్యి.త.నూవుగె.)

౧. నువ్వులచమురు, తైలము.

సీ. తైలాభిధానంబు దనరు నూనె యనంగ... ఆం. భా. ౨. ౨౫౨.

వ...అడులమోపున ౫౦ అడులు నూనెపె(ఱుక) వీసాలు ౨...ద. శా. ౪. ౯౭౫.

ఉ. సంపెఁగనూనె యంటె నొకచంద్రనిభానన కంసవైరికిన్. పారి. ౨. ౨.

సీ. కమనీయగతిఁ దిలోత్తమ నేర్చఁగాక నూనియ యంట నెవ్వారు నేర్తు రనుచు. వసు. ౫. ౩౪.

సీ. అతఁడు తైలాభ్యంగ మడిగినఁ బతి గమ్మనూనియ దెప్పించి మేను శిరము, నభ్యక్తము లు సేయ...భార. అను. ౨. ౭౦౨.

౨. చమురుకలుగఁ జేసెడువిత్తులు కలచెట్టునకు పిదపవచ్చినపుష్పచముడు అనుసర్ధ మిచ్చును.

ఉదా: కొబ్బరినూనె,ఆవనూనె, వేఁపనూనె మొ.

నూనెముంత. వి. (√నూనె.) గుచ్ఛబలచెట్టు.

గీ. నూనెముంత యనంగను నొప్పు గుచ్ఛ, బలయు. ఆం. భా. ౨. ౫౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నూనెముడి. వి. (√నూనె.) కీలుగంటు, జాఱుముడి.
సీ. నిడుదవేనలి నూనెముడి వీడఁ జిగురాకుఁబో
దఁ దూఱుఁ గార్చిచ్చుఁ గడియుకరణి. మ
నుచ. ౩. ౩౧.
సీ. బెడఁగుఁ జూపెడు నూనెముడి లోనుగా నం
టఁగట్టినవాసెనకట్టుతోడ. శుక. ౪. ౩౭.
గీ. కేశబంధవిశేషాఖ్య కేరుఁ గ్రొమ్ముడి యన
వెద యన నూనెముడి యన... ఆం. భా. ౨.
౧౪౫.

నూనెయగిసె. వి. (√నూనె.) నల్లగిసె, అతసీ. (శే. ర.)

నూపురము. సం. వి. అ. పుం. న. మంజీరము, అందె.

నూయమానము. సం. విణ. (అ. ఆ. అ.) నుతింపఁబడుచున్నది.

నూయి=నుయ్యి, నుయి. వి. దే. చేఁదుడుబావి, కూపము. (బ. నూతులు.)
క. అనఘ యధర్మము ధర్మం, బనుమతిఁ బుట్టిం
చుఁ దృణసమావృతమై ప్రచ్ఛన్నతలముచం
దమునఁ దోఁచిననూయింబోలె నూత్నచిత్త
తలేమిన్. భార. అను. ౫. ౪౧౯.
చ. నుతజలపూరితంబు లగునూతులు నూఱిటి
కంటె సూనృతవ్రత యొకబావి మేలు...
భార. ఆది. ౪. ౯౩.
నూతఁబడెదో పాతఁబడెదో=కష్టపడుదువా సుఖపడుదువా.
క. జడ లల్లుచుఁ జిన్నప్పుడె, పడఁతులు తను
నూతఁబడెదొ పాతఁబడెదో, నుడువు మ
నుమాట నిజమై, పడె నూతనె యార నూఱు
బార లనంగన్. సారంగ. ౩. ౨౨౨.
నూతికప్ప=కూపస్థమండూకము.
క. విను నూతికప్పవిధమున, నిను నీవ యెఱుం
గు దెఱుఁగ నేరవు గర్వం, బున నావలి కోలఁ
ది రణం, బున నొకమతి పెట్టువడక పోనేర్చె
దవే. భార. ఉద్యో. ౪. ౧౯౩.
నూర్చినూతఁబోయు=నశింపఁజేయు.
ఆ. జ్ఞాతిపలము నూర్చినూతఁబోయక నాడు,
డెంద మించుకైన డిందుపడదు. ప్రబోధ.
౨. ౯౭.

నూర్తొనలపట్టెము. వి. (√నూఱు².) నూఱంచులకైదువు, వజ్రాయుధము.
వ... నూర్తొనలపట్టెంబు పట్టు పేల్వఁ జలుపలన్
గట్టినగోపురంబు డాసి... ఉ. రా. ౩. ౨౨.

నూర్వ(ఱువు)రు=నూఱుగురు. స. (√నూఱు¹.) (నూఱునకుమహత్త్వార్థకరూపము.) శతసంఖ్య కలవారు.
సీ. అతనికి నూర్వురు సుతులు బుచీకాదు లు
దయించి రఖిలభూవిదితతేజు, లు... భార.
ఆది. ౩. ౬౦.
ఉ. నూఱుక త్రావు నీతఁడు కనుం గొనునంతటి
లో మనుష్యులన్, నూఱువు రైనఁ గాని
తిన నోటికి నాఁట దటంచుఁ గూర్పఁగా,
నూఱువు రైరి నేఁటికి మనుష్యులు నీవునుఁ
గూడ నింతటన్, నూఱను నిండె నిందఱు క
నుగ్రహ మీశ్వరుఁడేమి సేయునో. కాళ.
౩. ౨౦౫.

నూర్వే(ఱువే)లు. స. (√నూఱు.) లక్ష.
క. పాడఁగన్నంతనె వేయును, నుడివినఁ బదివే
లు నగిన నూర్వేలు మనం, బొడఁబడి మె
చ్చినఁ గోటియు, నడిగెడువారలకు నిచ్చు
హాటకచయముల్. ద్వా. ౨. ౫౩.

నూఱంచులకైదువు. వి. (√నూఱు².) శతకోటి, వజ్రాయుధము.
ఉ. మించినపేర్మి నేయెడల మిన్నులుముట్టి తె
లుంగునట్టినా, అంచులకైదువున్ దృణకణా
కృతియై వెడబాయఁ జేర్చి దర్పించినధీర
చిత్తములు పెల్లుఱ నాఁటి కలంప నాకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ్మాయంచితచారుచంచలకటాక్షము నమ్మిన
యస్త్ర మిమ్మెయిన్. నృసిం. ౨. ౪౬.

ఇళ్లే: నూఱుంచులవాలు. ఆం. సం. దేవ. ౧౭.

నూఱాఱు(లు, ర్లు). స. (నూఱు² + ఆఱు².) అనేకము.

సీ. సంతలోఁ బ్రతి బిచ్చము లెత్తి నూఱాఱు వగలజన్నిదములు వడికి వడికి. శుక. ౪. ౧౦౯.

క. హెచ్చినరామునిశరముల, నొచ్చినశిరువారి గిరులు నూఱార్లు వడన్, వచ్చునె జలచరము లపై, వచ్చుం బైపైన చెడ్డవారికిఁ జేటుల్. రామా. ౭. ౧౭౯.

నూఱిపి(ర్పి)డి=నఱిపిడి. (శ. ర. √నూఱుచే.)

నూఱిపోయు. స. క్రి. (నూఱు¹ + పోయు.) పాఠము మొ. నాటునట్లు చెప్పు, బాగుగా బోధించు.

క. తనయులకును మనుమలకును, దన నేరుపు నూఱిపోసి తాల్చినసర్గం, బునభరము వారిఁ బూనిచి, పని దీఱె విధాత యాసభం గొలువుండున్. కవి. ౩. ౧౨.

నూఱు¹. స. క్రి. ౧. సన్నని కంటిపై మర్దించు.

ఉ. నూఱక త్రావు నీఁడు కనుంగొను నంతటి లో మనుష్యులన్. కాళ. ౩. ౨౦౫. ౪. ౧౩౭.

ఉ. ఇప్పుడు విశ్వభారమును నేలని నేల నిజా ప్తకోటితో, నొప్పన సేసె దన్యునకు నూరక నూఱక త్రావువానికే. హ. వ. ౩. ౧౪.

౨. రాచు, నలఁచు.

ఉ. నున్నఁదనంబుగా నలుఁగు నూఱియుఁ జం దన మట్లు రాచియున్. భార. విరా. ౨. ౨౨౧.

౩. ఆయుధము మొ. వాడి యగుటకు ఱాతి మీఁద ఒరపెట్టు.

గీ. మదనుఁ డమ్ముల నూఱె హిమంబు పేరె. మనుచ. ౩. ౨౩.

చ... వేఁటకున్, దురసుగ మారుఁ డస్త్రముల నూఱెఁ దమంబును వేరె దిక్కులన్. ఉ. రా. ౫. ౨౩౯.

సీ. అలమి గీపెట్టింతు మలుకఁ గోఱలు నూఱి పైవచ్చుభూదారపతులనైన. హ. న. ౨. ౧౯.

జ: నూఱిపోయు.

నూఱు². స. ఔ. (క. నూఱు.) శతము, వంద.

చ. నతజలపూరితంబు లగు నూతులు నూఱిటికం టె సూనృత, వ్రత యొకబావి మేలు ... భార. ఆది. ౪. ౯౩.

సీ. మనకులం బాదిగా వనగోచరంబుల వేఁట చాటున నొక్క నూటిఁ జంపె. ద్వా. ౧. ౨౫౮.

ఉ... బాహువుల్, నూఱును జాఁచి మై వెనిచి నూఱుశిరంబులు నూర్ధ్వదిక్తటుల్, దూఱఁ గఁ గాలనేమి రణదోహలి యై కడఁగన్ సముద్ధతిన్. హరి. పూ. ౪. ౧౪౪.

నూఱును నిండు=ఆయువుచెల్లు.

ఉ. నూఱును నిండె నిందఱ కను గ్రహ మీళ్వ రుఁ డేమి సేయునో. కాళ. ౩. ౨౦౫.

జ: నూటయెనిమిది, నూర్నొనలపట్టెము, నూర్వు రు, నూర్వేలు, నూఱుంచులకైదువు, నూఱా ఱు, నూఱుగురు.

నూఱుగు(గ్గు)రు. స. (√నూఱు².) నూఱుమంది, వందమంది.

వ... గంధర్వదేవమానువకన్యకలం బదాఱువేలు న్నూఱుగుర నప్సరోగణంబు లేడింటిం జెఱ లువట్టి... ఉ. హరి. ౧. ౮౪.

వ... పదుండ్రు నూర్గురు వేగురు లక్షకోటిసం ఖ్యాకులుం గూడుకొని... దశా. ౨. ౧౬౨.

నూఱుచు(ర్చు)=నుఱుచు.

(వ్యవ.) ఈవేళ మాపొలములో కుప్ప నూఱుచు చున్నాము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(నలుఁగుఁగొట్టు.)
ప్రబోధ. ౨. ౯౮.
జః నూఱుంపు, నూటిపిడి.

**నూఱుపు(ర్పు)**=నుటిపిడి. (శ.ర. √నూఱుచే.)

**నూలిగరసు.** వి. ఇంద్రలుప్తకము, బట్టతల.
సీ...ఇంద్రలుప్తకం బగు నూలిగరసం చనఁ గను ... ఆం. భా. ౨. ౧౭౯.

**నూలు.** వి. దే. అసా. (క. నూలు. త. నూల్.)
౧. తంతువు, ప్రత్తివడికినపోఁగు, దారము.
ఆ. ఆజ్ఞవలయు నృపతి కాభీరభిల్లాది,కంపకోల నూల నాజ్ఞ చెల్లు, సంటు సార్వభౌముఁడైన భూపతియాజ్ఞ, కల్లవారుఁ దల్లడిల్లవలదె. ఆము. ౪. ౨౦౬.
చ. సరసులమర్త మింపుల నొసంగఁ గదంబపు దండఁ గట్టుచోఁ, గరఁగుటఁ దెల్పుద్పృక్తర శకాంతులు సుత్తర మిచ్చునంతరాం, తర ములనవ్వులు న్గలువతండము మొల్లలు నంచు మిన్నుగ్రుచ్చి రహిని రిత్తనూ లొసఁగిసిగ్గు వహింతురు పువ్వులాఁడికల్. ఆము. ౨.౨౦.
సీ. తనరు నూత్రము నూలు దార మనఁగ.ఆం. భా. ౨. ౨౯౫.
౨. (తామర మొ. వానిలోని) దారము.
చ. గొనయము తమ్మినూల్ చెఱకుకోల ధను ర్లత...క్రీడా. ౨.
గీ. కోరి తామరనూలునఁ గొండ లెల్లఁ, గట్టువడి నట్లు విశ్వేఁబు గట్టువడియె. వా. రా. ౨. ౨౪౮.
౩. మొలనూలు.
సీ. వజ్రాలనూలు నొర్గ్వనికటీతటి యెట్లు తాళె నో పటుదర్భదామకాంచి. పాండు. ౪.౩.
సీ. చాలలరెంటెంబు సన్నంపుగింటెంబు భాను పండులచాలు పసిఁడినూలు.వరాహ.౯.౭౭.
జః నూలుకొను, నూలుకోలుపు, నూలుకోలు, నూలుపట్టు.

**నూలుకొ(ల్కొ)ను.** అ. క్రి. (√నూలు.)
౧. పురికొను.
గీ. బీఱువోయి రథ్యంబులు మాఱుమొగము, వడినఁ దానొచ్చి యుండియుఁ దడవి శౌరి, నూలుకొనఁ జేసి తటిమిన వ్రాలి తీవ్రభల్ల మునఁ గ్రీడి భీష్మునివిల్లు దునిమె. భార. భీష్మ. ౩. ౨౫౪, ౧. ౨౩౨.
గీ. వెడలి తమతమ చతురంగవితతు లెల్ల, సుచిత గతి నూల్కొనఁ జేయుచుఁ గడంగి,సం గరోత్సవసంభృతోత్సాహు లగుచు.భార. భీష్మ. ౧. ౭౪.
౨. చక్కఁబడు.
చ. కనుఁగొని ఫల్గునుండు దురగంబుల వాగెలు వట్టి యెత్తి తత్తనువులు నూల్కొనఁగ నివిరి...భార. విరా. ౪. ౧౪౪.
౩. పూనుకొను.
వ...యజ్ఞాదికృత్యంబులు ధనసామగ్రి లేక నడ పరాదు ధనంబు గలిగెనేనియు లోభంబున సంసారులు తత్కృత్యంబులకు నూలుకొన రు గావున నల్పప్రయాసంబున సకలవర్ణము లకు మోక్షంబు గల్గుమార్గం బానతిమ్ము... వరాహ. ౮. ౨.
౪. ఒప్పుకొను.
క. అనుటయు నాతఁడు తగ నూ, ల్కొనినం దా నుదితనినదకోదండుం డై,యనితరసుల భోద్యమమున, ధనంజయుం డిట్టు లను నతని తో మఱియుఁ భార. విరా. ౫. ౧౧౫.
చ...నాకతం,బునఁ బటురోగదుఃఖములఁ బొం దుచు నెచ్చెలు లిట్టు లుండఁగా,మనసిజభో గలీలలకు మానస మెత్తెయి నాకునూల్కొ నుఁ. మార్క. ౫. ౫౦.
౫. సమ్మతమగు.
చ...ఏను కామధేనువ నిను మెచ్చితిఁ మది కి నూల్కొనునిష్టము వేఁడు సావుడుఁ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్వా. ౧౦. ౫౮.

ఇ. స్థిరపడు.

క. మనను సరస్వతిఁ గనుఁగొని, జననీ నామన
ను శోకసంతాపమునన్, బొనుఁగుపడి వివే
కమునకుఁ, గొనఁ గొఱయై చాల నూలుకొన
దని పలుకన్. ప్రబోధ. ౫. ౧౮.

చ...నీమది కార్యవృత్తి నూల్కొనియె ను
ద్యోధనుం గని యకుంఠిత నిశ్చయ మై...
భార. ఉద్యో. ౨. ౯౪.

౪. వ్యాపించు.

ద్వి. ఓరువరాక బిట్టోకిలిం తొదవ, నోర మ
ద్యపుఁగంపు నూల్కొనఁబలికె.ద్వి.హారిశ్చ.
ఉ. ౧౪౦౨ పం.

౫. కలుగు.

ద్వి. ఇల తలేఁగా లేనియారామలక్ష్మణులచేత
నేకీడు నూల్కొను నింక. రం. రా. యు.
౩౭౩ పా. ౭౧ పం.

స. క్రి. ౧. సమ్మతించు.

మ. ధన ముద్యన్నిధనంబు దేహము విపత్సం
తానగేహంబు భామ నితాంతంబు ననర్థసీమ
విషయాస్వాదంబు ఖేదంబు గన్గొన లోకం
బున శోక మిట్లెటింగి నూల్కొలేరు ప్రాణు
ల్ కటా, యనవద్యాత్మస మేధ మానసుఖప
ద్యాప్యాద్యసంచారముల్ . ప్రబోధ. ౫. ౩౪

౨. స్థిరపఱుచు.

చ. పలికిన నేమి యన్నియును బల్కనగున్
మనరాజునొద్ద మార్పలికెడువారు లేరు విను
పాండవమధ్యముగాండివంబుదీ, ప్తుల మిఱు
మిట్లు గొన్నకనుదోయి గుణధ్వని వ్రయ్య
లైనవీనులు నయినన్ బలే పలుకు నూల్కొ
నకుండుదు నూతనందనా. భార. ఉద్యో.
౪. ౪౧౮.

నూలుకొ(ల్కొ)లుపు(ల్పు.) స. క్రి. (√నూ
లుకొను.) ౧. చక్కఁబఱుచు, సరిచేయు.

వ...అలికదేశంబునం గలయఁబడినయలకంబులు
నూలుకొలిపి ..ఉ. హరి. ౫. ౧౪౦.

చ. ఎదురుగఁ బోవనిమ్ము రథ మీతని తేరికి
నన్న నాతఁడున్,బదిలముతోడ రథ్యముల
పగ్గము లేడ్తెఱ నూలుకొల్పి యున్నదగతి
నట్ల చేసిన...భార. విరా. ౫. ౧౭౧.

మ. లలనారత్నము నొయ్యనొయ్య మొనత్రే
లన్ నేల వ్రాయించి నిశ్చలవృత్తిన్ వరవర్ణ
పూర్ణఫలకాసంగంబు నొందించి మిన్కులు
వేమాఱుఁ దదర్థచింతనలతో నూల్కొల్పి
నెయ్యంపుటొజ్జలు పైపై నెనయింపసాఁగెఁ
బటుశాస్త్రశ్రేణికాభ్యాసముల్. వసు. ౩.
౧౮౦. (ఇట 'పొందుపఱుచు' అని భా
వము.)

౨. పురికొల్పు, ప్రేరించు.

ఉ...ఈనృపుఁడు దమ్ములు నేనును బుట్టినాఁ జ
మూమండలి నూలుకొల్పికొని మార్తుర నో
ర్చినఁగాక యొప్పునే. భార. భీష్మ.౨.౧౫.

క.కొనిపాండు పసుల నోడక, యని తా నెలుఁ
గించి వీటికి నూల్కొలిపెన్. భార.విరా.
౪. ౨౩౭.

౩. ప్రసరింపఁజేయు, వ్యాపింపఁజేయు.

సీ. హరిణాక్షిలసదపాంగాలోకనము నూలుకొ
లుపుడు న మ్మరిఁ గొలిపె మరుఁడు. కు.సం
౫. ౫౧౫.

సీ. బంధత్రయంబునఁ బవనంబు మధ్యమనాళి
మార్గమునకు నూలుకొలిపి.వరాహ.౧౦.౫౪.
(ఇట 'పూరించు' అని భావము.)

సీ. భ్రమరకంబులఁ జుట్టు ప్రస్వేదకణములు
నొసలికస్తురిబొట్టు నూలుకొలుప. హర. ౫.
౭౯. (ఇట 'అలముకొనఁజేయు' అని భావము.)

౪. కుదురుపఱుచు , నెలకొలుపు.

చ. మనముల నూలుకొల్పి యనుమానము లెల్లను
బాచి...భార. విరా. ౪. ౧౭౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ... సత్కృతియ్యా,దతశత నాదు నూల్కొలి
పి...దశకు. ౩. ౨౦.

గీ. చెంత నందఱ నిడుకొని చేరఁదేసి,కన్నులను
గ్రమ్ముకన్నీరు కరతలమున, నప్పళించుచు
గాద్గద్య మడఁచి యెప్ప,దెలుఁగు నూల్కొ
ల్పి వారల కిట్టు లనియె. ఉ.రా.౬.౨౦౪.

౫. కలిగించు.

గీ. ఎట్టకేలకు ధైర్యంబు హృదయమునకు, నూ
లుకొలుపుచు నారాయణుండు రాముఁ,డనఁ
గ నున్నాఁడు చిత్రకూటాద్రిమీఁద,రామ
సంజ్ఞను వినుతింతు నామహాత్ము. వరాహ.
౫. ౪౪.

నూలుకోలు. వి.(√నూలుకొను.)నూలుకొనుట.
(శ. ర.)

నూలుపట్టు. అ. క్రి. (√నూలు.) దారము వేసి
నూటిగా నుండునట్లు చేయు.

గీ. కర్ణికారాంబికామహాకాళిగుడికి, నందముగ
నూలుపట్టినయట్టిచాయ, సూర్యవీథికిఁ జనిరి
సంశుద్ధమతులఁ, బశ్చిమద్వారమునకు నై
పరమమునులు. భీమ. ౩. ౫౯.

నూవు=నువ్వు, నూగు. వి. సస్యవిశేషము, తిలస
స్యము.

క. నూవుంబువ్వును సంపెఁగ,పూవు గెలిచి బి
రుదుముత్తెపుంజల్లి తగటె, దా నైచె నసఁగ
ముంగర,తో వనరుహనేత్రనాస తుల లే
కొప్పటె. శశిబిందుచరిత్రము. (శ. ర.)

సీ...తిలసంజ్ఞ నూ వనఁ దేజరిల్లు. ఆం. భా. ౨.
౨౩౬.

ఇ: నూఁదిండి,నూఁబూవు, నూటిడి, నూనె,నూనె
ముంత, నూనెమడి, నూనెయగిసె.

## నృ

నృ. సం. వి. ఋ. పుం. నరుఁడు, మనుష్యుఁడు.
(దీనికి తెలుఁగున వ్యస్తప్రయోగము లేదు. నృ
హరి, నృసింహము మొ.)

నృకేసరి. సం. వి. న్. పుం. నరసింహమూర్తి
యగువిష్ణువు.

నృగుఁడు. సం.వి. అ. పుం. ఒకరాజు. (వైవస్వ
తమనువుపుత్త్రుఁడు కారణాంతరమున ఊసరవె
ల్లియై శ్రీకృష్ణునిచే నుద్ధరింపఁబడినవాఁడు.)

నృజలము. సం. వి. అ. న. ౧. మనుష్యునిమూ
త్రము. ౨. మనుష్యునినేత్రజలము, మనుష్యు
నికన్నీరు. (వాచ.)

నృతి. సం. వి. ఇ. స్త్రీ. నర్తనము, నాట్యము.

నృత్తప్రియము. సం=నృత్యప్రియము.

నృత్తప్రియుఁడు. సం=నృత్యప్రియుఁడు.

నృత్తము. సం. వి. అ. న. తాళముతోను లయ
తోడను కూడినయాట, అంగప్రత్యంగములచే
భావమును తెలుపుచు ఆడెడిఆట. (నృత్తనా
ట్యలాస్యతాండవ శబ్దములకుభరత శాస్త్రప్ర
కారము ఈషద్భేద మున్నను అవి కావ్యముల
యందు పర్యాయములుగానే ప్రయోగింపఁబడి
నవి. పదార్థాభినయము నృత్యము, వాక్యార్థా
భినయము నాట్యము, అంగవిక్షేపమాత్రము నృ
త్తము అని సిద్ధాంతకౌముది.)

నృత్తశాల. సం=నృత్యశాల.

నృత్తస్థానము. సం=నృత్యస్థానము.

నృత్యప్రియము. సం. వి. అ. పుం. నెమలి.

నృత్యప్రియుఁడు. సం. విశ. (అ. ఆ. అ.)
తాండమునందు ఇష్టము కలవాఁడు. వి.అ.పుం.
శివుఁడు.

నృత్యము. సం= నృత్తము.

నృత్యశాల. సం. వి. ఆ. స్త్రీ. నాట్యగృహము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నృత్యస్థానము. సం. వి. అ. న. నాట్యరంగము, నర్తనము చేయుచోటు.

నృదేవుఁడు. సం. వి. అ. పుం. రాజు.

నృధర్ముఁడు. సం. వి. న్. పుం. -మనుష్యధర్ముఁడు- కుబేరుఁడు.

నృపకందము. సం. వి. అ. పుం- కందరాజము- రాజపలాండువు, పెద్దనీరుల్లి.

నృపతి. సం. వి. ఇ. పుం. ౧. రాజు, ప్రభువు. ౨. క్షత్రియుఁడు. ౩. కుబేరుఁడు.

నృపతిపథము. సం. వి. అ. పుం. - రాజు పోవు త్రోవ - రాజవీథి.

నృపతివల్లభము. సం. విణ. (అ. ఆ. అ.) రాజున కిష్టమైనది. వి. అ. పుం. గగననాథునిచే కనుపెట్టఁబడినసర్వరోగనివారక మగు ఔషధభేదము.

నృపత్ని. సం. వి. ఈ. స్త్రీ. ౧. నరులను పాలించుస్త్రీ, రాణి. ౨. మనుష్యునిభార్య.

నృపద్రుమము. సం. వి. అ. పుం. ౧. రాజాదనము, పాలచెట్టు. ౨. ఆరగ్వధము, ఱేలచెట్టు.

నృపప్రియ. సం. వి. ఆ. స్త్రీ. ౧. కేతకి, మొగలి. ౨. రాజఖర్జూరి.

నృపప్రియఫల. సం. వి. ఆ. స్త్రీ. వార్తాకి, వంగచెట్టు.

నృపప్రియము. సం. విణ. (అ. ఆ. అ.) రాజుల కిష్ట మగునది. వి. అ. పుం. ౧. రాజామ్రము, రాచమామిడి. ౨-కోటచుట్టును ఆవరించి దుర్గమును కాపాడుటచే రాజున కిష్టమయినది- ఒకజాతివెదురు. ౩. రాజపలాండువు, పెద్దనీరుల్లి. ౪. శాలిసస్యము, వరి. ౫. అపల్యము, నేలతంగాడు.

నృపబదరము. సం. వి. అ. పుం. రాజబదరము, గంగరేఁగు.

నృపమానము. సం= నృపాభీరము.

నృపలక్ష్మము. సం. వి. న్. న. రాజులకు పట్టెడుతెల్లగొడుగు.

నృపవల్లభ. సం. వి. ఆ. స్త్రీ. ౧. రాజపత్ని, రాజ్ఞి. ౨. ఒకజాతిమొగలి. (రా.ని.)

నృపవల్లభము. సం. విణ. (అ.ఆ.అ.) రాజుల కిష్టమగునది. వి. అ. పుం. రాజామ్రము, రాచమామిడి. న. (వైద్య.) ౧. తైలభేదము. ౨. ఘృతభేదము.

నృపసభము. సం.వి. అ. న. ౧. రాజులగుంపు. ౨. రాజసభ, రాజుకొలువుకూటము.

నృపసుత. సం. వి. ఆ. స్త్రీ. ౧. గంధమూషిక, చుంచెలుక. ౨. రాజుకూఁతురు.

నృపాంశుఁడు. సం.వి. అ. పుం. రాజపుత్త్రుఁడు, రాజుకొడుకు.

నృపాత్మజ. సం. వి. ఆ. స్త్రీ. ౧. కటుతుంబి, చేఁదానుగు. ౨. రాజుకూఁతురు.

నృపాధ్వరము. సం.వి. అ. పుం. -రాజు చేయఁదగినయాగము- రాజసూయయాగము.

నృపాన్నము. సం. వి. అ. న. ౧. రాజుయొక్క అన్నము. ౨. రాజనములు, ధాన్యవిశేషము.

నృపాభీరము. సం. వి. అ. న. ౧. భక్తతూర్యము, రాజుయొక్క భోజనకాలమును తెలుపువాద్యభేదము. (వాచ.)

నృపామయము. సం.వి.అ.పుం.౧.రోగరాజము, క్షయ. ౨. రాజుయొక్క రోగము.

నృపాలుఁడు. సం. వి. అ. పుం=నృపతి.

నృపాహ్వయము. సం. వి. అ. పుం. ౧.-గంధముచేత రాజును ఆహ్వానించునది- రాజపలాండువు, పెద్దనీరుల్లి. ౨. రాజుయొక్క పేరు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నృపుఁడు. సం.వి.అ. పుం. ౧.-మనుష్యులను పా లించువాఁడు- రాజు, ప్రభువు. ౨. నాలుగు ఆమడలపరిమితి కలదేశమునకు అధికారి.

నృపోచితము. సం. విణ. (అ. ఆ. అ.) రాజున కుఁ దగినది.వి.అ.పుం.రాజమాషము, బొబ్బరలు.

నృమేధము. సం. వి. అ. పుం. మనుష్యుని పశు వుగా ఏర్పఱిచి చేయుయాగము, నరమేధ యాగము.

నృయజ్ఞము. సం.వి. అ. పుం. మనుష్యయజ్ఞము, అతిథిసత్కారము. (ఇది పంచయజ్ఞములలో నొకటి.)

నృలోకము. సం. వి. అ. పుం. నరలోకము, భూలోకము.

నృవరాహుఁడు. సం. వి.అ. పుం. నరాంశమును వరాహాంశమును కలవాఁడు,వరాహమూర్తి యగు విష్ణువు.

నృవాహనుఁడు. సం=నరవాహనుఁడు.

నృశంసుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మనుష్య లను హింసించువాఁడు, ఘాతుకుఁడు.

నృసింహజయంతి. సం. వి. ఈ. స్త్రీ. నృసిం హమూర్తిజన్మోత్సవదినము. (ఇది వైశాఖశుద్ధ చతుర్దశినాఁడు వచ్చును.)

నృసింహము. సం. వి. అ. న. ౧. రతిబంధవిశే షము. ౨. ముప్పదిరెండువిన్నాణములలో నొకటి.

వ...గళికత్తెరయుఁ గాసెనిల్కడయు నృసిం హంబును నాది యగుముప్పదిరెండువిన్నాణ ముల సాటెంబు పరీక్షించి...హంస. ౧. ౧౦౬.

వ...గళికత్తెరయు నృసింహంబును గాసెనిలుక డయు ననుముప్పదిరెండువిన్నాణంబులను ...ప్రబంధ. ౪౭.

నృసేనము. సం. వి. అ.న. మనుష్యసేన,పదాతి.

నృహరి. సం. వి. ఇ. పుం. నృసింహమూర్తి.

మ. నృహరీ వాదము లేల లేర యితరుల్ నీలీ లకుఁ బాత్రముల్. ఆము. ౨. ౭౧.

## నె

నె[1]. విణ. నెఱ నెఱిశబ్దములకు కొన్నిహల్లులు పర మగునపుడు వృత్తియం దంత్యవర్ణము లోపింపఁ గా మిగిలినరూపము. (దీనికి కొన్నియెడల ను గాగమమును, కొన్నియెడల దీనిమీఁదిహల్లునకు ద్విత్వమును వచ్చును. ఉదా: నెఱశబ్దమునకు నెందోలు, నెచ్చెలి, నెత్తమ్మి, నెమ్మని, నెవ్వగ మొ. నెఱి శబ్దమునకు నెన్నడ, నెన్నడుము, నెమ్మేను నెమ్మొగము మొ.)

నె[2]. వి. నెలవుశబ్దమునకు లుప్తశేషము. దీని మీఁదిహల్లునకు ద్విత్వము వచ్చును. (చూ. నె క్కొను, నెక్కొల్పు మొ.)

నెంజిలి. వి.(త. నెఁజిటిట్టల్.) మనోవ్యథ, ఆధి; ఖేదము.

సీ. నెంజిలి యనఁగ మనికితం బనఁగఁ దుందు డు కనం దగు మనోవ్యథకు సమాఖ్య. ఆం. భా. ౧. ౧౩౪.

ఉ. మంజులపీఠమధ్యమున మన్మణిభూషణపం క్తిఁ బెట్టి య,భ్యంజనతత్పరుండ నగునప్పుడు దాని హరించె నెవ్వఁడో, కుంజగుహాంతరం బుల నిగూఢము చేయునొ వానిఁ దెచ్చి యీ,నెంజిలి బాయఁ జేయుటకు నేర్పరు లారయ మీరలే కదా. కులశేఖరమహీపాల చరిత్రము. ౪ ఆ. (చి. ని.)

క. సూనుఁ డని చాల నెంజిలి,యానెదుగా తల్లి దోస మన కిటు బలిమిన్, బోనీక పట్టి పెనఁ గిన, వానికి మఱి యేమి సేయ వలయుం జెపుమా. సారంగ. ౩. ౫౯. పాండు. ౪. ౧౪౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అలజడి నెఁజిలి పిమ్మట, సిలు గు త్తలపాటు వంత సేగి నెగుల్ గొం,దల మలమ టడరు గో డు,మ్మలిక వనట కుందు వా నమరు దుః ఖాఖ్యల్. ఆం. శే. ౧౦.

నెంఁడ్ర. వి. గిరిజతృణభేదము. (బోదవంటిగంటు క లిగి బోదకన్న సన్నమయినపరకలు కలది. పశు వులు మేయునది. అని. చి. ని.)

నెందోలు. వి. (నెఱ+తోలు.) పెద్దతోలు.

ద్వి. కాయ గాచినయఱచేయి నెందోళ్లుగోయఁ దాఁకినయసిగోఁతడాచేయి. పండితా. దీక్షా. ౪౦ పా. (క్రొత్తప్రతి పా.)

నెకబిక. వి. పట్టుదల.

క. ఒకని నొకించుకయును సోఁకక యుండెఁ గటారిమొనలు కడు బెట్టు వడిన్, నెకబిక లు గఁ బోట్లాడుచు, వికసిల్లెదునాకడిందివీరు లయందున్. కళా. ౭. ౧౦౨.

నెక్కరం. వి. ఒకానొకచెట్టు. (శ. ర, ప్రా.)

నెకొ్ను= నెలకొను, నెలవుకొను. అ. క్రి. (నెలవు+కొను.) ౧. వసించు; ఉండు.

క. విను మవ్యక్తం బనఁగాఁ, జను మూలప్రకృతి పురుషచైతన్యము నెకొ్నినం జేతన య గుచు భు,వనతంత్రం బెల్ల నడపు వైభవ మె సఁగన్. భార. అను. ౧. ౩౩౩.

(ఏవం చేతనత్వే భగవాన్ పంచవింశత్వుచి స్తేనాధిష్ఠితా ప్రకృతి శ్చేతయతి నిత్యం సహధర్మా చ... సం. భార. అను. ౩౯. ౩౭.)

సీ. నీకొలంకులఁ జేరి నెకొ్నన్నకోకంబు కోక మాఁజుమ్ము చకోరనయన. రసిక. ౩. ౯౨.

క. ఒక్కటె భయశోకంబుల, వెక్కుచు మెయిఁ గలవిలాసవిభ్రమలక్ష్మల్, దక్కటయును నొకయొుఱ పై, నెకొ్నన ధరణీశు నెదుర నిలిచి వినీతిన్. మను చ. ౪. ౬౯.

౨. పాదుకొను, సిరపడు.

ఉ. అక్కజ మైనచెల్వమున నాత్మకు ప్రే గయి పొల్చుపొ ల్తిమై, నెకొ్నుచూడ్కిఁ గ్రమ్మఱుపనేరక యూరక నిల్చె... భార. విరా. ౨. ౨౩.

ఉ. నీదెస నాదుచిత్తమున నెకొ్ని యుండెడు భక్తి భద్రసం,పాదిని గావు టచ్చెరువె ... భార. శల్య. ౧. ౨౩౫. మార్క. ౨. ౩౦౯.

౩. తగులు, నాఁటు.

మ. ఇనుఁ డన్ రాముఁడు ప్రేమ సారసవనం బీడే ర్పఁగాఁ జొచ్చి మిం,చినసంధ్యారుచి రక్త ధారలు ప్రవరింపంగ వింటం గరం, బను వొంద న్నిగిడించుచో సమయవాయవ్యా స్త్రమువ్వృత్తి నెకొ్నన మారీచనిశాచ రుం డనమృగాంకుం డంబురాశిం బడెన్. సారంగ. ౨. ౧౭౬.

౪. ప్రసరించు, వ్యాపించు.

చ...వాఁడును వడి వైచె నార్పుచుఁ గడున్ బెనుమంటలు మింట నెకొ్నునం, గనదురు విస్ఫులింగములు గ్రస్క్కమహోల్కనిఁ బోలు కూలమున్. భా. రా. ఆర. ౧. ౨౪.

౫. పుట్టు, కలుగు.

వ...అఖిలజనంబులకుఁ బ్రీతి నెకొ్నన నతఁ డమ్మోహరంబు దీర్చునెడ... భార. భీష్మ. ౨. ౩౪౪.

ఉ...కనుగవబాష్పపూరముల్, నెకొ్ని క్ర మ్మదేర... భోజరా. ౩. ౧౪౨.

గీ. వేఁడివెలుఁగెండఁ గ్రాఁగినవిన్ను మేన, నెకొ్ను చెమటబొట్లునాఁ జుక్క లమరె. పారి. ౨. ౩౯.

౬. ఫలించు, సిద్ధించు.

ఉ...ఎవ్విధంబులన్, నెకొ్నవున్న మర్త్యు లకు నిక్కము ప్రాక్తనభోగ్యకర్మముల్. హరి. ఉ. ౪. ౬౬.

౭. అతిశయించు, అధికమగు; ఉబ్బు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. చచ్చె ఘటోత్కచుండు మనసైన్యము
లెల్లఁ గలంగి నల్గడ, నివ్వచ్చటఁజూచి యేము
వగ నెక్కొన వందెదము...భార.ద్రో. ౫.
౨౩౭.

ద్వి. చేరి యాదేవుని శ్రీలింగమూర్తిఁ, గౌరి
సద్భక్తి నెక్కొనఁగ దర్శించి. ద్వి.హరిశ్చ.
ఉ. ౧౦౭ పం.

ద్వి. నెక్కొన్న చన్నులు నిరుపేదనడుము, పిక్క
టిల్లెడువల్లపిఱుఁదు...రం.రా.ఉ.౧౦౦ పా.
౧ పం.

(ఈయర్థమున నిది కొన్నిపట్ల వాక్యాలంకారము
గా నుపయోగింపఁబడుచున్నది.)

క. ముక్కంటివరమునను మన, కెక్కుడుభయ
మావహింప హేతు వవధ్యుం, డక్కజుఁడు
పగతుఁ డద్దెస,నెక్కొని సిద్ధింప వెట్టినెఱికర్జ
ములుఁ. హరి. ఉ. ౨. ౨౨౧.

క. లెక్కఁ గొనక నరుఁ గృష్ణుని,ను క్కణఁగ
బిగించి మూర్ఛనొందించి ధరఁ,గ్రక్క
దల వైచి హయము, న్నెక్కొనఁ గొనిపో
యి జనకునిం గని మ్రొక్కెఁ. జై. భా.౯.
౧౬౦.

స. క్రి. పొందు, పడయు.

క. అక్కట సద్ద్విజజన్మము, నెక్కొనియును
జేసికొనిన నేరమి నిన్నుం,ద్రెక్కొనఁ గష్టపు
బాములఁ,బొక్కుచు నిన్నేండ్లు లెట్లు పొర
లితి తండ్రీ. పద్మ. ౩. ౯౨.

జః నెక్కొల్పు, నెక్కోలు.

నెక్కొలుపు(ల్పు). స. క్రి. (√నెక్కొను.)
౧. పెట్టు, ఉంచు; పాదుకొల్పు.

వ...పాండవాగ్రజా నీమనంబున నెక్కొలుపు
మిక్కుభయభిప్రాయంబు. భార.అను.౧.౭౩.

సీ. వనమాలికలు పాఱవైచి రుద్రాక్షపూసలపే
రు లఱుత నెక్కొలుప వచ్చు. శుక. ౩.
౯౯. ('ధరించు' అని భావము.)

చ. పొలుపగుమావిశేఁజిగురుపొందికపోఁతపిరం
గిలోన నె,క్కొలిపినపువ్వుగుచ్ఛ మనుగుం
డు పరాగపుమందు నించి...హంస. ౧.
౨౩౦.

మ. విను నీరూపము చూచి మానృపతి యువ్వి
ళ్లూరు నే నెమ్మెయిం, బనిగొందుం దగ నిం
తులుం దగిలి నీపైఁ జూడ్కి నెక్కొల్పి
నె,మ్మనముల్ విస్మయ మందఁ జూచెదరు
భామా పల్క లిం కేటికిఁ. భార. విరా.
౧. ౩౨౧.

౨. సంఘటించు, కూర్చు.

క. అక్కట దైవము రాజ్యము,ద్రెక్కొని యా
లిం దనూజుఁ దెగ నమ్మంగా, నెక్కొలిపి హ
రిశ్చంద్రుని, నిక్కడఁ గాడ్పతిచె నింక నేగ
తిఁ బోదుఁ. మార్క. ౧. ౨౪౭.

నెక్కోలు. వి. (√నెక్కొను.) నెక్కొనుట.
(శ. ర.)

నెగడి. వి. (త. నెగిటి.) ౧. దుష్టమృగములు
రాకుండ కాపాడుకొనుటకును చలికాఁచుకొ
నుటకును వేసెడుమంట.

గీ... నెగడికిఁ బాచనమున, కింధనము లిచ్చి ధన
ముల నెసకమెసఁగు. భార. అను. ౨.
౩౭౭.

సీ. శీతంబునకు నరశ్రేణు లొనర్చిన నెగడులు
తఱచుగా నెగడి మెఱసె. చిత్రభా. ౨.
౩౪.

౨. అగ్నికుండము.

గీ. ఎపుడు నీవు నమం బాసి యేఁగి తపుడె,
నీరసైనను నురిసైన నెగడిసైన, విడుతుఁ బ్రా
ణంబు...శివరా. ౩. ౧౩౦.

౩. కొఱవిదయ్యము, పిశాచము.

సీ...గాలి గాము నెగడి. గీ. కొఱవిరాలుపు
బూచి సోఁకుడు పిసాసి, దయ్య మనఁగఁ
ఢిశాచాభిధానము లగు. సాం. ని. దేవ.౧౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నెగడించు. స. క్రి. (√నెగడు 1.) నెగడఁజేయు. ప్రవర్తింపఁజేయు.

ఆ. నింగి ముట్టియున్న జంగమమల్లయ, కరము సందుఁ గనినవసుకవిత, దగిలి వారియందు నెగడింతు రవికి దీపమున నర్చ లిచ్చుపగిది వోలె. కు. సం. ౧. ౪౯.

౨. వర్ధిల్లఁజేయు.

ద్వి. మగువఁ బుంసవనసీమంతోత్సవమున, నెగడింపఁ దొమ్మిదినెలలు నిండుటయు. ద్వి. భాగ. ౪. ౭౪ పా.

నెగడు[I] = నెఱవు. అ. క్రి. (త. నిహళ్. క. నెగళ్.) ౧. బయలుపడు, ప్రకటితమగు.

ఆ. అనిన ధామ్యుఁ డిట్టు లనియె నీవత్సర, మొక్కఁడు నెట్టులయిన నడిగి మడిఁగి, సంకటముల కోర్చి చరియించి యాపద, నిస్తరించి పిదప నెగడ వలయు. భార. విరా. ౧. ౧౪౩.

క. గగనంబున కట్టెగసిన, ఖగపతి నంగదుఁడు చూచి కపుల మనుప నీ, ఖగపతి కీ తావృత్తము, నెగడఁగ వినిపించి చనియె నిజగృహంబునకున్. భా. రా. కిష్కిం. ౭౫౯.

౨. ప్రసిద్ధికెక్కు, ఖ్యాతమగు.

చ. తగినసుపుత్త్రులన్ బడసి...పొందుగతుల్ ...దక్షిణ లిమ్ముగ నిచ్చి యజ్ఞముల్, నెగడఁగఁ జేసియుం బడయనేర రపుత్త్రకు లైన దురతుల్. భార. ఆది. ౨. ౧౪౯.

క. ఏను బకానురుననుజుఁడఁ, గీనాశుఁడ మానవులకుఁ గిమ్మీరుఁ డనం, గా నెగడుదు నీకామ్యక, కాననమున సర్వసత్త్వఖాదనబుద్ధిన్. భార. ఆర. ౧. ౧౧౨.

ఆ. తనరు ఖ్యాత మయ్యె ననుటకుఁ బేరుగా, నెగడె ననఁగ... ఆం. భా. ౩. ౯౦.

౩. ఒప్పు, తగు.

(నారదుఁడు.) చ...వీణ మీఁటుచును నేఁడు పడంతులయొద్దనుం గడున్, నెగడెడువిందు గల్గె నని నెమ్మది మెచ్చుచు వచ్చెఁ జెచ్చెరన్. కళా. ౩. ౧౬౭.

౪. వర్ధిల్లు, వృద్ధిపొందు.

చ ...నీ, మనమున ధర్మమున్ హితము మంచిగఁ జూచి విధించినట్లు చేసి నెగడువారు గాక నినుఁ జేరిన నాపద లొంద నేర్చునే. భార. ఉద్యో. ౩. ౨౦౭.

రగడ. నీకను దెఱచిన నెగడును జగములు, నీకను మూసిన నిలువవు జగములు. ఉ. రా. ౪. ౯౨.

గీ. పెంపుచెందెను దామరతంపరయ్యెఁ, బ్రబలె నెగడెను...అనఁగఁ బేర్లయ్యె వృద్ధిఁ బొందె ననుటకు...ఆం. శే. ౫.

౫. అతిశయించు, మిక్కుటమగు.

సీ. చెలువంబు నెగడఁ దీర్చినక్రొత్తకస్తూరిపట్టెలమేల్తావి మట్టుమీఱ. చంద్రి. ౧. ౧౦౭.

సీ. శీతంబునకు నర్తశ్రేణు లొనర్చిననెగడులు తఱచుగా నెగడి మెఱసె. చిత్రభా. ౨. ౩౪.

౬. గర్వించు, గర్వపడు.

క. తనయింట దివియ యుండఁగ, నను డాయుమనందు నెగడి నాతోఁ గొఱమాలినమాటల నిసుమంతయుఁ, గొనకుండఁగ నాడె నిట్టికుటిలుఁడు కలఁడే. కేయూర. ౩. ౨౭౯.

౭. యత్నించు, పూను.

సీ. పొందమ్మితూండ్లతోఁ బొందు లీనెడుకాను దిగుడుభావి హసింప నెగడునాభి. గంధ. ౧౯౯.

౮. నడచు, ప్రవర్తించు.

ఆ. విదురుమతము పాండవేయహితార్థంబు, వానిబుద్ధి నెగడ వలవ దన్య, పక్షపాతబుద్ధిఁ బరఁగుచు నుండెడు, నట్టివాని నాప్తుఁ డనఁగ నగునె. భార. సభా. ౨. ౧౫౦.

ఆ. అనుడు నరులఁ డిట్టు లను దేవ తమతమ, నేర్చుపనులవెంట నెగడి బ్రదుక, వలయుఁ గాక నగరఁ దలము దప్పినమెలం, కువల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కలుపు లియ్యకొనుట దగునె. భార. విరా.
౧. ౨౬౭.

౯. కలుఁగు, సంభవించు; ఉంకు, ప్రవర్తిల్లు.

గీ. బహువిధంబులఁ బగతుర బరవసమున, నిత్తె
ఱంగునఁ గలుగు క్రం దెల్ల నొర్చి, నిల్చి గొ
ల్చిన సత్కీర్తి నెగడుఁగాక, దవ్వుదవ్వుల
ని ప్లైన నవ్వ రెట్లు. భార. విరా. ౪. ౬౨.

చ... పెం,చ్చినఘృతపాయసాన్నముభుజించెడి
వారలకుఁ మనోజయం,బు నెగడునేని విం
ధ్యము సముద్రజలంబులఁ దేలియాడదే.
భర్తృ. ౧. ౭౦.

గీ. అల్పులకు మ్రింగఁ జేఁ దైనహాలహలము,
భంగిఁ బొంగెడుకోపంబు మ్రింగికొనఁగ, నీ
లగళు నెన్ని నిన్నెన్నఁ బోలు నట్టి, నీవు
సాలినఁగా కేల నెగడుఁ జేరు. భార.
ఉద్యో. ౧. ౩౩౩.

గీ...మహేంద్ర సాయట్టిహితుఁడు, నీకుఁ గ
లుగ నసాధ్యంబు నెగడు నెందు. హరి.
౩. ౪౪.

౧౦. వ్యాప్తమగు, వ్యాపించు.

గీ. నిండె నెగడె వెలసెఁ బర్వె నిగిడె ననఁగ
వ్యాప్త మయ్యె ననెడి ప్రల్లె కలవు సాంబ.
సాం. ని. మాన. ౫౦.

జః నెగడించు, నెగడ్త.

నెగడు[2]. వి. క్రూరజలజంతువిశేషము, తంతునా
గము.

గీ. ఊఁతయలజల్లఁ జెఱువుల నుండ రాక,కా
ల్వాసల్లు నెగళ్లును గవులు విడిచి,తరలి చెం
తల నూతిగుంతల వసించె. కేం. పంచ. ౧.
౨౬౪.

గీ. మీలు గప్పలు దాఁబేళ్ళు గాలిదిండ్లు,మొ
సలు తెండ్రలు నెగడులు మొదలు గలుగు,
నీరుద్రిమ్మరిపదుపులు నెఱయ బెఱయఁ, బొ
నరుమున్నీరు సేరి యబ్బురము మీఱ.అచ్చ.
రా. యు. ౩.

నెగడ్త. వి. (√ నెగడు[1].) ప్రసిద్ధి, ఖ్యాతి.

క. జలజార్యంతకకశ్యప,కులభామిను లై నెగ
డ్తకుం జని బహుపుత్రులఁ బడసి పేరుకొను
కూఁ, తులఁ జూడఁగ నరిగె నతికుతూహల
బుద్ధిక్. కా. సం. ౧. ౧౧౧.

క. శ్రీకంధరపరతత్వా,లోకనతత్పరుఁడు ని
శ్చలుం డఖిలసుధీ,లోకానందితకల్పా, నో
కహుఁ డగుమల్లికార్జునుండు నెగడ్తక్. కు.
సం. ౩. ౨౪౪.

నెగపు = ఎగపు. వి. (√ నెగయు. క. నెగపు.)
౧. ఎగురుట, ఉడ్డీనము.

సీ. నిఖిలాండములు నొక్క నెగపున దాఁటంగఁ
గలయద్భుతోగ్రవేగంబువాని. హరి. పూ.
౪. ౭౫. (చి. ని. తాళపత్రప్రతిపా. 'నె
గవు'. ముద్రి.శ.ర.పా.)

౨. ఎగసిపాటు, గర్వము. (శ. ర.) ౩. మండి
పడుట. (శ. ర.)

నెగయు = ఎగయు. అ. క్రి. ౧. (పక్ష్యాదులు)
ఎగురు; పైకి లేచు.

ఉ... తార్క్ష్యుఁడు తల్లికిన్ మనః,ప్రీతియొనర్చు
చున్ నెగసె భీమజవంబున నభ్రవీథికిన్.
భార. ఆది. ౨. ౩౯.

ఆ ... శాశ్వతంపు,నెలవు గలిగె రండు నెగ
యుండు పుణ్యలోకముల కని సమాదరము
నఁ బలికె. భార. ఆను. ౩. ౨౪౭.

సీ. నెగసిగకొన లేచి నింగి యంతంతకు నవుల
ద్రొక్కఁగఁ దనరారుదాని. భార. విరా. ౧.
౧౬౨.

చ. పొగయక రాజ కొక్క మొగి భోరన మం
టలు విస్ఫులింగముల్, నెగసి ... పురారి
నేత్రశిఖి మల్చె మహోళనిపాతభీమ మై.
కు. సం. ౫. ౫౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. ఉద్గమించు, బయలువెడలు.

క. వగచినచిత్తము నలఁదురి, మొగిచినకనుఁగవయు నుదుట మోపినకేలుఁన్, నెగిచినకంఠము నుడుగక, నెగసిననిశ్వాసతతియు నీరజముఖికిన్. కు. సం. ౭. ౭౯.

ఉ. నావుడు నవ్వు నెమ్మొగమున న్నెగయంగ జనార్దనుండు...ఉ. హరి. ౩. ౬౯. వైష. ౪. ౧౩౨.

౩. (జలాదులనుండి) పైకిలేచు, తేలు.

గీ. నీర ముంచినసొఱకాయనెగసినట్లు, పేరుకొని పైచుతెల్లంటిచీరవోలె, నుంకుచెండః విధంబున నుత్తరించు,తములపాకు నిక్కొడు క్రియ దాఁటె నిష్టి. ఉ. హరి. ౪. ౨౮.

గీ. కాద్రవేయులు భూమియుఁ గైకొనంగ,నురగలోకంబు వెడలి తత్పరిఖనీట, నెగసి తోడనె కుప్రంకుదు ర్నిలువ లేక,తత్తటాబద్ధగారుత్తతముల కులికె. ఆము. ౨. ౯.

జః నెగపు, నెగయుదెంచు, నెగవు.

నెగయుదెంచు. అ. క్రి. (నెగయు + తెంచు. స్వార్థమున.) -జలాదులనుండి- పైకిలేచు, తేలు.

ఆ. బంధనంబు లెల్లఁ బాయుడు భీముండు,నీరిలోననుండి నెగయుదెంచె. భార. ఆది. ౭. ౧౯౩.

నెగలము. వి. దండము.

వ... అఖండవర్తిన్ నెగలమున దివియ... ద. శా. ౪. ౧౨౮౩.

నెగపు=ఎగవు. వి.(√నెగయు.)ఉత్పతనము,ఉడ్డీనము. (శ. ర.)

నెగుచు=ఎగుచు. స. క్రి. తఱుము, వెన్నాడి పయి గత్తించు.

ఆ. వనగజంబు నెగుచువనచారిఁ బొడఁగని, వనగజంబ కాన వజ్రిగజము, వెల్లనై సురేంద్రు పైచి సుధాంధులు, పట్టఁ బట్టనీక బయలు వ్రాఁకె. భాగ. ౮. ౬౬.

నెగులు=నొగులు. వి. బాధ, కష్టము.

ఆ...నరులు జుంటి,చవియ కాని నెగులుఁ జటిరయంబున నెక్కి, తారు విఱుగఁ బడుటఁ దలఁపలేరు. భార. శాం. ౬. ౪౩.

గీ. నిజము చెప్పిన నీకు నే నెగులు లేదు. కాశీ. ౪. ౨౨౪.

క. ఇన్నెగులు మాన్ప వలదా, కన్నారం గనిన బంటు గలఫల మనుచున్. కాశీ. ౩. ౮౭. వసు. ౩. ౮౪.

౨. దుఃఖము, విచారము.

ఉ...అవ్వనితం దోడ్కొని వచ్చి యందటి నెగు ల్వారించి తంచున్ బ్రియంబున నాచారణు వీడుకొల్పి తనగేముం జేరె...శుక. ౩. ౧౭౩.

సీ. తనవాగమృతధార ధరణిజప్రాణముల్ నిలిపి నామదిలోని నెగులు దీర్చె. ఉ. రా. ౭. ౪౯. సారంగ. ౩. ౯౮.

౩. కీడు, హాని; ఇడుమ, ఆపత్తు.

క...ధృతరాష్ట్రసుతు లసద్వృత్తులు ని,ష్కారణవైరులువీరల,కారణమున నెగులు పుట్టుఁ గౌరవ్యులకున్. భార. ఆది. ౭. ౧౬౦.

ద్వి. నెగు లొందినప్పుడు నెఱిఁ దూలపోక. ద్వి. హరిశ్చ. పూ. ౧౨౬౭.

ద్వి. నెగు లింతయును నేమినెపమున వచ్చె, మగువ నీపే లేమి మగనిపే లేమి. ద్వి. హరిశ్చ. ఉ. ౨౧౦౪.

౪. కోపము; విరోధము, పగ.

చ. మనమునయందు నీనెగులు మానుము పర్వతపుత్రి... కాశీ. ౪. ౧౭౪.

ఉ. ఓన్నృప నాకుఁ జూడ నలయుగ్మలి నీకుతు నిక్ మనోహరా,నూనవిలాసుఁ జూచి నిలుపోపక పట్టిన లోను గామి నెం,తే నెగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లూని వానిఁ బొలియింపఁగ మాయలు వన్నె నిట్లు...సారంగ. ౨. ౪౩.

జ: నెగులుకొను, నెగులువెట్టు.

**నెగులుకొను.** అ. క్రి. (√నెగులు.) బాధపడు.

గీ...పాణిపంకజమును శోకశుష్కకంఠనా ళాంతరమున గద్గదిక నెగులుకొనునెలుం గును నెత్తి యజ్జనకతనయ. భా. రా. యు. ౫౪౯. (ఇట 'కంపించు' అని భావము.)

**నెగులువెట్టు.** స. క్రి. (నెగులు + పెట్టు.) బాధపెట్టు.

సీ. చారుమధ్యముఁ గని శరభముల్ మననీవు నెమ్మోముఁ గని యాఫుల్ నెగులువెట్టు. భా. రా. అర. ౨. ౩౦౩.

**నెగ్గడము.** వి. (సం. నికటమ్. ప్రా. నిఘట్టనమ్. త. నెరుక్కం.) తొక్కటము, సమ్మర్దము. (శ.ర.)

విణ. సాంద్రము, దట్టము.

గీ...అలరు సాంద్రంబు నెగ్గడ మనఁగ...అం భా. ౩. ౧౩.

**నెగ్గించు.** స. క్రి. (√నెగ్గు[1].) ౧. నెఱవేర్చు, సిద్ధింపఁజేయు.

(వ్యవ.) ఏలాగుననో వాఁడీకార్యము నెగ్గించినాఁడు.

౨. జయమునొందించు, గెలిపించు.

(వ్యవ.) శ్రీకృష్ణుఁడు భారతయుద్ధములో పాండవులను నెగ్గించినాఁడు.

**నెగ్గు[1].** అ. క్రి. ౧. నెఱవేఱు, సిద్ధించు.

గీ. మీదుకార్యంబు నెగ్గదు మీర లరిగి, వేగ సుగ్రీవుచెల్మి గావింపుఁ డనిన, వచ్చినారము ...మొ. రా. కిష్కిం. ౫.

౨. మను, బ్రతుకు.

క...చంద్రిక, మగ్గము వెట్టిన మొదలే, నెగ్గవరో సింగభూప నృపసుమచాపా. చంద్ర. వి. ౩. ౪౩.

౩. కార్యసిద్ధినొందు, జయమునొందు.

(వ్యవ.) వానితో కక్షగట్టి యెన్నఁటికి నీవు నెగ్గలేవు.

జ: నెగ్గించు.

**నెగ్గు[2].** అ. క్రి. (త. నెగ్గు.) బెండువడు, నిస్సత్త్వమగు.

వ...హరి చతురంగబలంబున కూరకయె దారుణ బెగ్గడిల నెగ్గి వేఁటకాండ్రు చోపుడువెట్టఁ బొదలు వెల్వడి పిట్ట తెగిరిపోవుచాడ్పున. ప్రబంధ. ౪౭౭.

క. అతిపబాహువులతోఁ బ్రతి గాక సిగ్గున నెగ్గి మృణాళముల్ నీటఁ బడియె. సానందో. ౧. ౭. పా.

**నెగ్గు[3].** వి. గుండె యదరుటయందలియనుకరణము. (దీనికి అనుధాతృత్వను ప్రయోగమున నెగ్గురను రూప మగును.)

ఉ. ఆరసికాగ్రగణ్యుఁ డపు డయ్యవరోధవిచిత్రకేళికాగారము సొచ్చి చొక్కటపుఁ గంకటిపై నొకమోహనాంగశృంగారునితో డ దీపకళిక ల్వెలుఁగ న్నిదురించుచున్నయ, న్నీరజగంధిఁ జూచి యెద నెగ్గురనం గడు విస్మితాత్ముఁడై. శుక. ౧. ౧౧౫.

**నెచ్చి.** వి. మెత్తనిబియ్యపు పిండి. (బ్రౌ. మిక్కిలి సన్నమైన నూకలసమూహము అని శ.ర.)

**నెచ్చెలి.** వి. (నెఱ + చెలి.) ప్రియపుత్రి, గాదిలిబిడ్డ.

ద్వి. వలపలికడఁ బంటువలఁతి నెచ్చెలి, వల నొప్పఁ దమ్ముఁ డవ్వల నొప్ప ... ద్వి. పద మ. ౩. ౭౧౭ పా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**నెచ్చెలి.** వి. (నెఱ+చెలి.) ౧. ప్రాణస్నేహితురాలు; ప్రాణస్నేహితుఁడు.

ఆ. వచ్చి కొలువు సొచ్చి నెచ్చెలిపిండు నం, తంత నిలువఁ బనిచి యల్లనల్లఁ, గదిసి ప్రౌఢ వనితకైవడి ముద్దియ, ముద్దు వుట్టఁ దనకు మ్రొక్కుటయును. భార. విరా. ౧. ౨౮౬.

సీ. తెలిగన్నుఁగవకు నెచ్చెలి యైనశేఁతన వ్వోలయంగ సరసంపుఁబలుకు వలికి. భార. విరా. ౨. ౬౪. (ఇట ఔపమ్యద్యోతకము.) భార. ఆర. ౪. ౧౪౪.

ఉ. కాంచిరి నిర్జరేశ్వరులు...ధీరతం, గాంచన భూధరంబునకు గాదిలినెచ్చెలి యైనవాని ని,ర్వంచితదానశక్తి సురరత్నముఁ బోలెడు వాని నైషధుఁ. నైష. ౩. ౪౦.

౨. స్త్రీ, ఆఁడుది.

ద్వి... వేల్పునెచ్చెలులపాలిండ్లఁ, గలకలనవ్వు బంగారు కుండలను. ద్వి. పరమ. ౩. ౧౪౬ పా.

సిరితోడునీడనెచ్చెలి=భూదేవి.

ద్వి. సిరితోడునీడనెచ్చెలి తనయింటి, కరుదెంచినప్పుడే యఖిలసంపదలు. ద్వి. పరమ. ౫. ౩౪౫ పా.

**నెచ్చెలికత్తె.** వి. (నెచ్చెలి+కత్తె- స్వార్థమున.) ప్రాణస్నేహితురాలు.

ఉ. మ్రుచ్చిలి గంధవారణసమూహముకుంభవిలాససంపదల్, మ్రుచ్చిలి మించుపయ్యెదలలోపల డాఁగుచు నుండు నెప్డు మీ, నెచ్చెలికత్తెచన్నుఁగవ నీవు విచారము సేయుమా మదిఁ, మ్రుచ్చులఁ గిట్టి పట్టుదురు నొంపుదురే మనవచ్చు రాజులఁ. నైష. ౭. ౬౯.

ఉ. ఆడెదునమ్మ గన్గొనకు మమ్మ...తలిర్చుమావి క్రీ,నీడకుఁ బోకు మమ్మ యని నెచ్చెలికత్తెకుఁ జెప్పె సమ్మతిఁ. కు. సం. ౫. ౬౧౦. భీమ. ౧. ౪.

**నెచ్చెలికాఁడు.** వి. (నెచ్చెలి+కాఁడు- స్వార్థమున.) ప్రాణస్నేహితుఁడు.

సీ. ముంగొంగుపసిఁడి సప్తాంగరక్షకుఁడు చేదోడు నెచ్చెలికాఁడు తోడునీడ. పి. శకుం. ౪. ౧౪౪.

చ. అని వర మిచ్చి శూలి రజతాద్రికి నెచ్చెలి కాని వెంటఁ దోడ్కొని చనుదెంచె... ఉ. రా. ౨. ౩౧౭. ఘటికా. ౧. ౭౩.

**నెచ్చెలువ.** వి. (నెఱ+చెలువ.) మిక్కిలి మనోహరురాలైనయాఁడుది.

సీ. తనజాతికొమ్మ నెందినమరుద్గతి బంధుజీవంబు వడఁకె నెచ్చెలువ చూడు. ఉ. రా. ౧. ౧౩౧.

**నెటిక(కె)=నెట్టిక.** వి. (క. నెటికె. త. నెట్టి.) అంగుళిపర్వము, వ్రేలిగనుపు.

చ. నెటికలు దీసి యిచ్చకము నేర్చి ప్రసంగము దీసి...విటులఁ గలంచి తీయఁ దగు విత్తము లుత్తమవారకాంతకుఁ. విప్ర. ౪. ౨౩.

చ. నెటికలు దీసి చే విసికి సిక్కు దొకించుక యావులించినం, జిటికెలు వేసి...వాసి గను పొత్తులతొత్తుల కేవ సత్తెముల్. బహు. ౫. ౧౬౬. ద్వి. పరమ. ౩. ౨౦౪ పా.

నెటికలు విఱుచు=౧. వ్రేళ్లసంధులను విఱుచు.

ద్వి. అసలార నాయమ్మ హస్తతలంబు, నటు సాగఁ దిగుచుచు నప్పటివ్రేళ్ల, నెటికలు విఱుచుచు నెమ్మి నొత్తుచును. పండితా. పురా. ౧౦౪ పా.

౨. ఏవగించుకొను.

సీ. తనకు లేమిని నొడ్లధనము వెంపును జూచి విధిమీఁద నెటికలువిఱిచి విఱిచి. పద్మ. ౨. ౨౩౯.

ఇట్లే: నెటిక విఱుచు.

సీ. మమతతో నాథుండు మాటాడి యుంచుక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యటు మొగం బైనచో నెటికవిఱుచు శశాం. ౪. ౩౨.

నెటికెతెట్లు. వి. బ. బాలక్రీడావిశేషము, పిల్లల యాటలలో నొకటి.

సీ. తిరుగుడుబిళ్లల త్రిప్పాళ్లు జరుగుళ్లు చిటితాళవిూళలు నెటికెతెట్లు. హంస. ౩. ౧౪౬.

నెటుకురు. వి. వీపు మొదలగువానికీళ్ళకదలికవలన కలుగుధ్వని కనుకరణము.

సీ. అష్టోత్తరశతవ్రణాఢ్యుఁ డగురాజపిటకునకును వీపు నెటుకు రనియె. వై.భా.౭.౧౪.

నెటుక్కు. వి. (ఎముకలు మున్నగునవి) ఖండించుటయం దగుధ్వని కనుకరణము.

దండకము...వజ్రసారాసిధారాళిన్ నెటుక్కుంచు ఖండించుచున్... దశా. ౪. ౨౩౨.

నెట్టు. క్రి.విశ. (త. నెట్టై.) మిక్కిలి, అధికముగా.

గీ. విరహకాలంబు మరుబాణవితతిఁ గొన్న, గంటు లన్నియుఁ బ్రియుఁ గూడి కైపు మిగిలి, పెనఁగు నెడ నెట్టు విరిసె నా వనిత మేనఁ, గలయ నవనఖదంతవిక్షతము లడరె. కు.సం. ౭. ౧౪౭.

సుగంధి. చాలుఁ జాలు నెంత కైనఁ జాలు నున్న గన్నెరుల్, రేలపూల కేల గోల రేఁచు నిందులోనఁ బో, నేల తాళు మన్న నన్ను నెట్టు దిట్టె నక్కటా, మేలు మేలు ముద్దరాల మెచ్చు వచ్చె నామదిన్. యయా. ౪. ౨౦.

నెట్టన. క్రి. విశ. (క. నెట్టన. త. నెట్టం.) ౧. మిక్కిలి, అధికముగా; నిండుగా, సమృద్ధముగా.

సీ...నెట్టన యెంతేని నెత్రి గరంబు...అత్యంతముగ ననుట కాఖ్య లయ్యె. ఆం. శే. ౫౪.

ఉ. నెట్టన ధర్మనందనుఁడు నిన్నచలంబు సేసి యోడతోఁ, గట్టినయోడవోలె గతిగౌరవుఁ జైకడుఁ దూలె... భార. సభా. ౨.౪౦.

క. ఇట్టివిధంబులు నిఖిలము, నెట్టన ప్రత్యక్షముగను నీవలనను జూ, పట్టఁగ శిబికాభారం, బెట్టో లే దంచుఁ బలికి తిప్పాసు నాతోన్. వి. పు. ౩. ౨౯౯.

మ...నేతులున్, బెరుగుల్ చేరులు పప్పు లప్పడములున్ దాలింపులుం బూపముల్, పరమాన్నంబులుఁ బెట్టు నెట్టన భుజింపన్ దల్లికిన్ దండ్రికిన్. పాండు. ౨. ౨౪.

౨. అవశ్యము, తప్పక.

క...మున్, గట్టినకర్మఫలంబులు, నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్. భార. ఆది. ౫. ౫౭.

క. పెట్టితిరి చిచ్చు గృహమునఁ, బట్టితిరి తదీయభార్యఁ బాడడవులకుం, గొట్టితిర వారు మనుపఁగ, నెట్టన భరియింపవలెనె నీ ప్రాణంబుల్. భాగ. ౧. ౩౧౨.

ద్వి. వినుము హరిశ్చంద్రవిభుఁడు వసిష్ఠముని మాట చెల్లింప మోరత్రోపునను, నెట్టన సత్యంబు నెఱపెద ననుచు. ద్వి. హరిశ్చ. ఉ. ౧౪౫౯. పం.

౩. న్యాయముగా, పాడితప్పక.

సీ. కవచధారణ మనుఘనవిద్య గవ్వడి కే నెఱింగించితి నితఁడు దాని, నేర్చుట నీతని నెట్టన నొప్పింప శక్యంబు గాదు...భార.ద్రో. ౨. ౧౦౫.

౪. నిజముగా, యథార్థముగా.

ఉ. నెట్టన యాపగాసుతుఁడు నేలకుప్రాలెననంగ విన్న నా, కట్టెఁడివీను లేమి వినుకాటియ కోర్వవు...భార. భీష్మ. ౧. ౬౫.

ఉ...ఏ, పట్టున నెల్లవారు గనుపట్టక హీనదశం జరించుచో, నెట్టన సర్వశూన్యుఁ డని నింబితుఁ డయ్యె దరిద్రుఁ డెంతయున్. నా. పంచ. ౨. ౧౧౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౫. చక్కఁగా, ఒప్పుగా.

ఉ. నెట్టన యల్ల లచ్చియును నీళయు భూసతి యుండ నీకు నీ, నెట్టికి సీలపై మనసు నిల్పుట కే మన వచ్చు... ఆము. ౬. ౧౧౧.

౬. తెగించి,సాహసించి.

క. నెట్టన సభలో నేవురకట్టెదుర నరాతిలవ ముగా కాంతయు వా,రెట్టిలులువలో ద్రౌపది, నట్టులు పటిచెడెదె జూట మాడరె యెం దుఁ. భార. ఉద్యో. ౧. ౩౮౪.

క. ఎట్టట్లు పలికి తీ విది, యెట్టానరింపంగ వచ్చు నీపని దేహం, బెట్టాకని దేహమున కై, నెట్టన యీవచ్చుఁ దండ్రి నిక్కము చెపుమా. మార్క. ౧. ౭౬.

౭. అనాలోచితముగా, తొందరపడి.

ఉ. నీతి దొఱంగి కార్యముల నెట్టన యాగ్రహ వృత్తిఁ జేసినఁ, బ్రీతిగ సిద్ధిఁ బొందినను భీతియుఁ గుత్సయుఁ బుట్టు... భార. సా. ౧. ౩౫.

చ... ఉదకంబుల నీ విటు ఉండ ముంప నా, నినదము హస్తినాద మని నెట్టన యేసితిఁ దప్పు సేసితిఁ. భా. రా. అయో. ౧౨౬.

౮. చెచ్చెర, శీఘ్రముగా.

(కీచకుఁడు.) చ... పైకొనులేలఁ పోరగించు మదిఁ గోర్కులు పేర్చిన నప్పలించు నెట్టన తెగ నగ్గలించు నచటఁ జనులం బరికించు ...భార. విరా. ౨. ౩౧.

క. అట్టియెడ సకలసురులును, నెట్టన కొలుపంగ వచ్చి నీరజభవుఁ డా, జెట్టిని భూలోకమున కుఁ, బట్టము తగఁ గట్టి సార్వభౌమునిఁ జే సెఁ. వి. పు. ౨. ౧౭౩.

ద్వి. పట్టి వధించు చే పౌరుషం బనుచు, నెట్టన మొల నున్న నెతికత్తిఁ దివిచి. ద్వి. హరిశ్చ. పూ. ౨౦౩౬ పం.

౯. కొంచెమైనను, అల్పమైనను.

చ. అనవుడుఁ బిన్నవవ్వ నగి యన్నరుఁ దన్న మొగంబుఁ జూచి నెట్టన బలుమాటలా డఁగఁ గడంగఁగ నొల్లక యుత్తరోత్తరఁ. భార. భీష్మ. ౧. ౧౭౫.

నెట్టన(ణ)ము. వి. (త. నెట్టంకమ్.) ౧. అతి శయము, పెంపు.

గీ. అనిన నాపువ్వుఁబోఁడి నెయ్యమునఁ బలి కెఁ, జిలుకకై వడి గండుఁగోయిలవిధమున,వీ ణె వాగునఁ జెవులకు విందు గాఁగ, నెట్టనం బునఁ దేఁటియ లుట్టిపడఁగ. చిత్రభా. ౫. ౩౪.

విశ. ౧. అనివార్యము, కాకతప్పనిది.

గీ. పాత్ర మెఱుఁ... నిచెనఁటిభూపతులయిండ్ల, కట్టినియతాత్ములనైన నేఁగఁ జేయు, ద్వారనిలయులు వారింప వారినచట, నిలు వఁబెట్టును గామంబు నెట్టనముగ. శివయో గసారము. ౨. ౨౧.

౨. పూర్ణము, సమగ్రము.

గీ. దరిసెనం... బిచ్చెఁ దాతలతరమునాఁటి,కట్టు బండి యొకటైరు నెట్టనముగఁ, బరుపులోఁ గూడ నుర్యొలపట్టెమంచ, మర్పణముఁజేసె నొక్కశీతాంశుముఖికి. రుక్మా. ౪. ౧౦౪.

౩. యథార్థము, నిక్కము.

సీ. ఎట్టివాఁడు గురుండు నెట్టణంబుగ శిష్యు లెవ్వరు సోదరు లెట్టివారు. శివయోగసా రము. ౨. ౧౯౦.

నెట్టపంట. క్రి. విశ. నిష్కారణముగా.

సీ. నెట్టపంట యనంగ నిష్కారణం బంట... ఆం. శే. ౫౬.

నెట్టము=నెట్టెము. వి. ౧. శిరస్త్రాణము, గుండ్ర పాగ.

వ. ఇట్లు సురాసురయూథంబులు హరిసనా థంబులై కవచంబులు నెట్టంబులుఁబెట్టుకొని ...(ముద్రితప్రతులపా.'నెట్టనంబులు' చి. ని.పా.'నెట్టెంబులు' తాళపత్త్రప్రతిపా.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. నెమిలియీఁకలతోఁ పేనినదారముల పాగ.

గీ. నెమలియీఁకలఁ బేనుదారములపాగ, నెట్ట
మని పల్కఁగాఁ దగు...ఆం.భా. ౩.౩౪.
(క్రొత్తప్రతి,తాటాకుప్రతి ప్రా. పా. చి.ని.
'నెట్టెము' ప్రాఁతప్రతి పా.)

**నెట్టించు.** స.క్రి. (నెట్టు+ఇంచు. స్వార్థమున.)
౧. జయించు, గెలుచు.

శా. నీలుక్ శౌర్యగుణాలవాలు ననిలో నెట్టిం
చువారే రిలన్. సీతావి. ౧. ౧౦౯.

౨. అతిశయింపఁజేయు, పెంపొందించు.

క. గట్టిగ రాలను మంటను, గట్టినదేవాలయ
మును గలిగినవారల్, నెట్టించి రాలచేతను,
గట్టించినయిల్లు నొక్కగతి పుణ్య మగున్.
శేవ. ౨. ౯౨.

**నెట్టిక**= నెటిక. వి. (త. నెట్టై.) అంగుళిపర్వము,
వ్రేలిగనుపు. (చూ. నెటికసీల.)
జః నెట్టిక సీల.

**నెట్టికసీల[1].** వి. (√నెట్టిక.) వ్రేలిగనుపులోనిసీల.

గీ...గొరగపడుచు, నాడుచున్నది చూడు మా
రాభినయము, తాను నెట్టికసీలంతగాని లేదు.
క్రీడా. ౧౪౩. ('చాలచిన్నది' అనిభావము.)

**నెట్టికసీల[2].** విశే. (సం. నైష్ఠికశీలః. ప్రా. నెట్ఠి
అసీల.) ౧. బ్రహ్మచారి; బ్రహ్మచారిణి.

వ...ఆపాటి నెట్టికసీలదిట్టపడుచు కడుపు నిండ
మి యొత్తింగి తరంగితాంతరంగ యై యాకు
రంగనయన యి ట్లని వితర్కించు. పాండు.
౪. ౧౪౯.

క. పట్టినచలమున నీగతి, మట్టముగా సేనఁ బిలు
కుమార్చి గదలిరా, నెట్టికసీలలు మదిలోఁ,
బుట్టినహర్ష మునఁ దమతపోవనమునకున్. జై.
భా. ౬. ౧౯౦. ('నట్టికసీలలు'. చి.ని.పా.)

ఉ. నెట్టన యల్ల లచ్చి యల నీళయు భూసతి
యుండ నీవు నీ, నెట్టికసీలపై మనసు నిల్పుట
కే మనవచ్చు...ఆము. ౬. ౧౧౧.

**నెట్టు.** స.క్రి. (త. నెట్టు.) ౧. గెంటు, త్రోయు;
పడఁద్రోయు.

క. వీనిమెడఁ బట్టి నెట్టుఁడు, పోనీకుం డనిన...
ఉ. హరిశ్చ. ౪. ౧౬౭.

ఉ. వారక వైపయిం బొరలివచ్చు మహావిరహాం
బురాశి నే, నేరహిఁ నీఁదుదానఁ దుది
నెన్నఁడు క్రూరుఁడు మారుఁడేనియుం, భీర
ము మీఱ నేయఁ డొకపెట్టున నెట్టినఁ బోవ
నట్టియా, వీతీఁడిజీవ మేఁటి కని వేమఱు వే
మరు లేఁచుచుండఁగన్. కృ. శకుం. ౨.
౨౧౧. ద్వి. నల. ౪. ౩౧౦.

క. నెట్టిరి విపన్న మంటం, గట్టిరి ఘనపాశము
లను గంగానదిలో, నెట్టిరి రాజ్యము వెడలం,
గొట్టిరి ధర్మంబు విడిచి కుటిలాత్ము లై.
భాగ. ౩. ౧౩.

౨. నిరాకరించు, నిరసించు.

ఉ...వేఁడుచో, నప్పన నెట్టి పోఁ డడిగినన్ని వరా
లిడుఁ గొండమీఁదితి, మ్మప్పనివంటి కావ్యపతి
యబ్బుట యబ్బుర మిబ్బు ధాళికిన్. రా.వి.
౧. ౨౬.

అ. క్రి. ౧. అతిశయించు, మిక్కుటమగు.

క. అనుటయు భగభగ మండెడు, కనుఁగవతో
నొడల నడరుకంపముతో నెట్టిననిట్టూర్పుల
తో మొగ, మునఁ దనికినకెంపుతోడ ముని
పతి యుండెన్. ఉ. హరి. ౪. ౭౯.

వి. ౧. గెంటు, త్రోపు.

గీ. కుఱుచ నెట్టున నందియల్ చఱచి మొరయ.
కవిక. ౩. ౧౫౧.

ద్వి. నిడు సాగిలఁగ నెట్లు నెట్లు వడంగ, మెడ
పట్టి ద్రొబ్బి గామిడితొండ యనుచు. ద్వి.
పరమ. ౪. ౩౦౨ పా.

౨. ఉపహతి, నాశము.

గీ. ఉపహతియుఁ దావు నెట్టన నొప్పుచుండు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆం. భా. ౩. ౫౦.

౩. విషయము, పట్టు.

క. ఐన న్నే నటుకలెఁ గా, నీననుకోరాదు గా
క యెల్లసుగుణముల్, నే నీయక లేదు సు
మీ,యీనెట్టున నీవె మీఁద నెఱిఁగెద విం
కన్. దశా. ౨. ౩౩౪.

౪. తావు, ఉనికిపట్టు,

ఉ. అక్కడి నాత్తరుండు కస వారసి తె మ్మని
కూఁతుచేతికిం,బెక్కుడుఁబాఱ యీయ బడి
నెట్టది తెల్వడి చేనిమంచెపై, నెక్కినబాలుఁ
గూడి రమియించి దిశాంతమునఁదు వచ్చి
బల్లొత్తుక్కలు నా మొగంబున విదుర్చును గో
న్నిత్యశాగ్రఖండముల్. శుక. ౩. ౪౧౦.

ఉ. మట్టిన బిట్టు మిట్టిపడి మాని సముత్తితుఁ డ
య్యె మేనిపై, బెట్టినపుట్ట నె ట్టవిసి బీఁటులు
వాఱ...పాండు. ౫. ౨౪౯.

గీ. ఉపహతియుఁ దావు నెట్టన నొప్పుచుండు.
ఆం. భా. ౩. ౫౦.

౫. (బ) బాలక్రీడావిశేషము.

సీ. చీకటిమొటికిళ్ళు చిమ్ముబిల్లలు నెట్లు బొట్టన
గ్రోలలు బొమ్మరాలు. గీ. ఆదిగా శైశవక్రీ
డలాడి రచట,రామకృష్ణులు గోపదారకు
లఁ గూడి. వి.పు. ౮. ౨౦౨.

౬. పూనిక.

గీ. అంజక యశేషసుమనోవనాగ్రదేశ, ముఖర
భూరిద్విజావళిమ్రోల నెట్టు,గా నిలువ నేర్తు
నాత్మయోగంబుఁ దొఱఁగి, సనుదు గా కని
తాల్చె రూఢప్రతిజ్ఞ. హా.న. ౧. ౨౯.

జ: నెట్టించు,నెట్టుకొను, నెట్టుకొల్పు, నెట్టుకు
గాయ, నెట్టుపడు, నెట్టోడు.

నెట్టుకొను= నట్టుకొను. అ. క్రి.(నెట్టు+కొను.)

౧. నెలకొను, నివసించు; కుదురుకొను,స్థిరపడు.

క.నెట్టుకొని యుండు నావర,పట్టపమున సకల
దితిజపతులమకుటసం, ఘట్టితపదపీఠుఁ డగు,
నట్టిజగన్నాయకుండు హరి యెల్లపుడున్.
పరమ. ౨. ౧౭౦.

ఉ...భక్తిరసంబు గడలన్ బసఁబులన్, నెట్టు
కొనఁగ రంగవిభుఁన్ భజియించె...పరమ.
౫. ౩౬౯.

వ...గానలోభంబున వచ్చు టెంతియ కాని మతి
వీరు వారనుం బలెఁ బట్నంబుల నెట్టుకొని
యిట్టునట్టు వహిమ లుపచరించువారము
గాము...కళా. ౩. ౪౦.

౨. కలుగు, సంభవించు.

గీ. గురునివెంబడిఁ గా నొకకొంతదూర, మరిగి
యాతనియనుమతి నంబుజారి,క్రమ్మఱఁగ వ
చ్చువాలోనఁ గంబుకంఠి, పట్టఁ గూడనితమ
కంబు నెట్టుకొనఁగ. శశాం. ౩. ౪.

౩. అతిశయించు; చెలరేఁగు, విజృంభించు.

వ. ఇ ట్లెందు నెదురు లేక యతండు లెక్కకు
మిక్కిలి యగురక్కసిమూఁకల ప్రేఁకంబుల
తో జగంబులు వగలం బొగల నెట్టుకొని
కుతిలపెట్టుచు నొక్కనాఁడు. యయా.
౨. ౭౪.

గీ...పట్టపగలె, నెట్టుకొని యెల్లప్రేతలనట్టులం
దుగుట్టు లఁయుచు మెలఁగునప్పట్టి మతి
యు. నీలా. ౧. ౩౫.

వ...నాకు నిగ్గిరికి నిప్పుడు గొన్నివాసరంబుల
నుండి యీరసంబు వెరుగం గఱకెతి నెట్టు
కొని సాఁగుచున్నది...కాశీ. ౧. ౧౦౦.

౪. కడఁగు,పూను; పూనుకొను.

సీ. కుదియించునది నెట్టుకొని యింద్రియవ్యా
ప్తి మనసుచాంచల్యంబు మాన్పునదియు.
కాశీ. ౭. ౧౧౯.

వ. కావున నీమనంబున ఘనం బైనవంత యావం
తయుం బెట్టుకొనక నెట్టుకొని యమ్మహాధ్వ
రంబు సాఁగింప నుద్యోగింపుము...జై.భా.
౧. ౭౪.

క. నెట్టుకొని కొలుతు నన్నయ,భట్టోపాధ్యా
యసార్వభౌమునిఁ గవితా,పట్టాభిషిక్తు భా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రత, ఘట్టోల్లంఘనపటిష్ఠగాఢప్రతిభుజా. భీమ. ౧. ౬.

౫. పట్టుపట్టు, అభినివేశము కలిగియుండు.

ఆ. నృపకులాబ్ధిచంద్ర నీ వింత నెట్టుకొ, నంగఁ ద్రోచి పోవ నాకుఁ దగదు. భోజరా. ౪. ౨౩౬.

గీ. భరతశత్రుఘ్ను లిరువురు పాదయుగము, పట్టుకొని రాక విడ మంచు నెట్టుకొనఁగ, దొరయు నగవునఁ దనదుపాదుక లొసంగి, పనిచె రఘుభర్త పురికి శుభరతుభరతు. దశా. ౭. ౨. ౨౫.

౬. ఏమిటికి నెట్టుకొనియెదు, నీమాటల నాకుఁ గడుపు నిండునె పుత్త్ర, వ్యామోహ మేల విడువవు, నాముండటఁ బ్రదులవచ్చునా నీ కింకరా. భోజరా. ౮. ౫.

స. క్రి. త్రోసికొను, గెంటుకొను.

క. నెట్టుకొని సరుని గనుచోఁ, బట్టనమునఁ గల సమస్తభామల కహహా, యెట్టివిచిత్రమొ మనసునఁ, బుట్టినవాఁ డపుడు మనసుఁ బుట్టించెఁ జుమీ. విజ. వి. ౧. ౧౫౪.

నెట్టుకొలుపు(ల్పు). స. క్రి. (√ నెట్టుకొను.) కావించు, కలిగించు.

వ... తమలపాకుఁదీఁగెయల్లికలమీఁద మించి వెల్లితలచుట్టుకట్టడలు నెట్టుకొలుపుతోలు బట్టలపాదుగుళ్ళ వెఁగ్రొమ్మడుఁగు నెజెబిలును చుంగులనిక్కు టెక్కును... కళా. ౮. ౨౨౬.

మ. అమతిం గన్నులు త్రిప్పఁ జేయుఁ గడు వింతౌ గాత్త్రభంగంబు విభ్రమవాక్యంబులు నెట్టుకొల్పు మదనాపస్మారము... మల్లభూ. శృం. ౫౪.

౨. ఉండఁజేయు, ఉంచు.

వ ... అజ్జలజభవుండు తద్విరహదశావికలితధైర్యుం డయ్యు నుల్లంబునం గల్గుట్టు నెట్టుకొలిపి యుట్టటు దెల్పుటకుం జొరకుఁడి... కళా. ౫. ౧౪.

నెట్టుకుగాయ. వి. (√ నెట్టు.) బాలక్రీడావిశేషము.

పీ... ఒడ్డు, విసుపు నెట్టుకుగాయ పిండమ్ములాటలు పులిజూదములు... ఆడుకొంటిఁ, జదువుపై సంధ్యపై నాస్థ చాల లేక. హంస. ౩. ౧౬౮.

నెట్టుపడు. అ. క్రి. (నెట్టు + పడు) గెంటఁబడు, త్రోయఁబడు.

సీ. తోలుదొల్తు గుస్పెఁ గోలలు కొన్ని పైనేసి యవి నెట్టుపడి పోవ నాడుఁగఱచి. వాల్మీ. ౨. ౯౫.

నెట్టె. వి. (క. నెట్ట.) ఉద్ది, జత.

ద్వి. నిండారుప్రేమతో నెట్టెలు గట్టి, చెండును దండంబుఁ జెలువొప్పఁ బట్టి. రం. రా. బాల. ౨౧ పా. ౯ పం.

నెట్టె(ట్టియ)ము[1] = నెట్టము. వి. ౧. టకిరీపు.

సీ. తనయుడుగుండమ్ములను రాచనెట్టెంపుఁబులు దిండితాతుమ్మెదలు మెలంగ. యయా. ౧. ౫౪.

౨. చుట్టకుదురు. (శ. ర, బ్రా.)

౩. శిరస్త్రాణము గుండ్రపాగ.

చ. నును పగుపచ్చపట్టునఁ గనుంగొన నొప్పుగ దిండుగట్టి నూ, తన మగుబర్హిబర్హకృతదామము నెట్టెము గుట్టి కమ్రకా, ననతరు పుష్పమాలిక దనర్చు నురస్థ్సలి నుద్వహించియుం, పొసరఁగ వేణునాదసరసోత్సుకుఁడై హరి యొప్పె హరి. పూ. ౮. ౧౪౯.

సీ. పసుమానములు గాఁగ వసతోడఁ బెనకట్టి నెట్టెంబు గాఁ బ్రేవు చుట్టినాఁడు. మనుచ. ౬. ౭౩. ఉ. హరి. ౨. ౧౨౬.

వ... కెంజడముడి బిగియించి నెట్టియంబు చుట్టిన జగజెట్టిపాఁపఱేనియాదలమాణిక్యంబులతు ఱంగలిమెఱుంగులు వెనుకొంట మింట దాఁకను జరిగి... భీమ. ౫. ౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నెట్టెము², వి. ధ్వని, అఱపు.

క. అని తలఁచి నిలిచి కీచిం, బనివడి చిరజీవి యేరుపడ నొక నెట్టెం, బొనరించినఁ గ్రమ్మఱి పరి, మునుమై యత్తొలులఁ జుట్టుముట్టె స్వట్టెక్. వేం. పంచ. ౩. ౧౫౪.

('మందం మందం శబ్ద మకరోత్'. అని మూలము. ౧౫౫ పొ. 'ఆకాకము కావు కావు రని రొలిఁగింపక్' నా. పంచ. ౩. ౧౬౯.)

నెట్టోడు. అ. క్రి. (నెట్టు + ఓడు.) చేష్టలుదక్కు.

ద్వి. బిట్టుల్కి మూర్ఛిలి బిమ్మిటిఁ బొంది, నెట్టోడి లింగసన్నిహితులు దక్కు. బస. పు. ౫. ౧౩౦ పం.

నెడిమె. వి. ద్వీపము. (శ. ర, బ్రా.)

నెత్త. వి. మత్స్యవిశేషము. (బ్రా.)

నెత్తకమ్మ. వి. (నెత్తము¹ + కమ్మ.) పాచికల పందెము.

సీ. నిలు మహో బొంకకు నెత్తకమ్మ యటంచుఁ బకు లుల్కెడు నొయ్యఁ బల్కు మనుచు. కళా. ౬. ౧౨౦.

నెత్తటిల్లు. అ. క్రి. (√ నెత్తము².) శ్రమదీర్చుకొను.

గీ. వేడుకలు మీఱ సురతాంతవేళ యందు, నెఱయఁగాఁ బూవుఁబాన్పున నిద్రఁ జెంది, నెత్తటిల్లి మలయాద్రినిలయపవన, గతుల నూర్పులు విలసిల్లఁ బతియుసతియు. భాను. ౪. ౯౮.

నెత్తపలక = నెత్తపుఁబలక. వి. (నెత్తము¹ + పలక. క. నెత్తవలగె, నెత్తదపలిగె.) జూదపు బల్ల, శారిఫలకము.

సీ. భావజన్మునినెత్తపలకలఁ బురుడించు పాలుపారువెన్నులు బొఱదు లయ్యె. పద్మ. ౩. ౧౪౯.

ఉ...క్రొత్తనెత్తపలకల్ తెరలుంబకదారి పారు వా, పిట్టల గూండ్లుఁ గ్రొమ్మెఱుఁగు బిందెలుఁ గొందఱు తెచ్చి రయ్యెడన్. వాల్మీ. కి. ౭౪.

నెత్తపుఁబలక = నెత్తపలక.

సీ. అష్టాపదాభిన లగుఁ జదరంగపుఁబలక నా నెత్తపుఁబలక నాఁగ. ఆం. భా. ౨. ౩౦౫.

నెత్తము¹. వి. (క. నెత్త = నేత్రశబ్దభవము. కన్నులవంటి గుఱుతులుకలది. దీనికి వృత్తియందు కొన్నిపట్లవైకల్పికముగా మువర్ణలోపము. చూ. నెత్తపల.) ౧. పాచికలాట, జూదము; ద్యూతవిశేషము.

గీ. అన్నదమ్ములు నెత్తమ్ము లాడి సతుల, తలలు పట్టి సభాస్థలంబులకు నీడ్చి, చీర లొలిపింతురే... భార. ఉద్యో. ౩. ౩౬౮.

ఉ. నెత్తముమీఁదఁ గౌతుకము నిర్భరమై జనియించె నిప్డు మా, చిత్తములందు నీవు గడుఁ జిత్రపుజూదరివి... హరి. ఉ. ౩. ౨౨౮.

శా. సోఢాదొప్పియు నెత్తముల్ మొదలుగా జూదంబు లీవాడున, వ్వేళన్... జై. భా. ౩. ౪౨. ఆం. భా. ౩. ౬౨.

౨. పందెము.

సీ. తనకు లాగైననెత్తంబు గైకొని పన్ని పాసికల్ తాళించి పా టెటింగి. ఉ. హరి. ౩. ౧౨౦.

జః నెత్తకమ్మ, నెత్తపలక, నెత్తపుఁబలక.

నెత్తము². వి. ౧. (కొండమీఁది) విశాలసమప్రదేశము, సానువు; (మేడమీఁది) చదునుప్రదేశము.

సీ. ఉరుతరపూర్వభూధరము నెత్తమునఁ బోలుచు గైరికగండశిల యనంగ. దశకు. ౫. ౧౨౭. ఆం. భా. ౩. ౬౨.

గీ. కదలి పోదము రం డని కలుమకదళి, కాసమదభద్రకరికిఁ గైలాసగిరికి, దత్తఱంబున

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నేఁగి నెత్తమున నిలిచి, చఱులఁ బ్రతికోబ్ద ములు పుట్ట మెఱలు నెట్టి. వరాహ. ౬. ౧౦౩.

సీ. నెత్తమ్ము లేకొండ నెత్తమ్ములం దాడు విద్యా ధరీకోటి విటులతోడ. మనుచ. ౪. ౩౮.

ఉ. మేడలమీఁది నెత్తముల మే లగుచంద్రకి సాంద్రపింఛముల్, జోడుగ విశ్వవారఁ గొని సొంపుగ నాడెడి నెమ్మిపిండువుం, జూడఁగ వచ్చి యందుఁ బురసుందరుల న్వెసఁ జూచి యచ్చరల్, వ్రీడ ఘటింప మోము లరవె ట్టుదు రీశులకట్ట మఱుంగునక. కుల శేఖర మహీపాలచరిత్రము. ఆ. ౧. (చి. ని.)

౨. ఊరివారందఱును పశువులను మేపుకొను టకై విడిచిపెట్టినగయాళుభూమి, బీడు.

వ...కా ల్గట్టి విడువ నెత్తంబున మెత్తనిగతిక మేసి...అము. ౪. ౩౪.

నెత్తమ్మి. వి. (నెఱ + తమ్మి.) ఫుల్లాబ్జము, విరిసిన తామర; తామర.

సీ. నెత్తమ్మిరేకుల మెత్తఁదనముదెచ్చి యచ్చునఁ బెట్టి న ట్లంద మంది. భార. విరా. ౨.౫౨.

గీ. తప్పు లేకుండ నేల నెత్తమ్మి మొగడ, విశరి వక్షః ప్రదేశంబు వ్రేటుగొఁటి. హర. ౧.౨౩.

సీ...తమ్ములు వెలయు నెత్తమ్ము లనఁగ. ఆం. భా. ౩. ౬౨.

నెత్తమ్మివిరివిందు = సూర్యుఁడు.

గీ. తోఁచె నెత్తమ్మివిరివిందు తూర్పునందు. రాజ. చ. ౩. ౭౯.

నెత్తఱి. వి. (నెఱి + తఱి.) ౧. చక్కనివలి; కడు పుమీఁదిముడుత.

సీ. నాళీకముఖికి నెన్నడుము కాఁగనయ్యెఁ దనరు నెత్తఱులబిత్తరము దరలె. వసు. ౩. ౨౦.

సీ. తఱులు నెత్తఱులు నాఁ దగును వళిసంజ్ఞ ...ఆం. భా. ౨. ౧౩౩.

౨. పెద్దయల, కల్లోలము.

చ. చిఱునునుఁజెందొవల్ చికిలిచంద్రికపై పఱ పు ల్పరాగముల్, పఱచినపైఁడివ్రాఁతవలిపం బులు పాయనిజంటజక్కవల్, కుఱుచతిలాఁ డబిల్లలుగఁ గోమలి యిచ్చటఁ గాననయ్యె నె, త్తఱు లలరాజహంసవని తాతతి దూఁగెడు డోలలో యనక. చంద్ర. ౪. ౨౫.

౩. అదుముటచే స్ఫుటముగా నేర్పడినరేఖలు, నొక్కులు. కాశీ.౫. ౨౮౪.

నెత్తావి. వి.(నెఱి + తావి.) నిండుపరిమళము, సు వాసన.

సీ. అరవిరినెత్తావి సడరిఁచునున్న ద్రవిటవీటి సౌరభవితతి వొదల. భార. ఉద్యో. ౨. ౧౧౨.

సీ. కోమలిగట్టూర్పు క్రొవ్వేఁడినెత్తావి మెంకరి తేఁట్లును మూతిముట్ట వెఱచె. నైష. ౨. ౧౧౩. హర.౨.౭౦. విక్ర. ౧. ౯౫.

నెత్తి. వి. (క. నెత్తి.) ౧. తల, శిరము.

గీ. నెత్తిచక్కటి ధూమంబు నెగయునపుడ, మరణదశ యావహిల్లెడు మానవునకు. భార. శాం. ౬. ౧౭౯.

చ...కెంపు లఁగత్తలోఁ బడం, జతనముమీఱ నెత్తి కడు సంతస మొప్పఁగ నెత్తిఁ బన్నగ, ప్రతతులు దాల్చుఁగాక మఱి పాముల కే డివి జాతిరత్నముల్. దశా. ౧. ౭౬.

౨. శిరోజములు, వెండ్రుకలు.

ఉ. ముంగట నిల్చి రోపొరుగుముద్దియ నాప తినెత్తి మాసె నే, నంగడి కేఁగ లే నిపుడహ ర్ముఖ మాతఁడఁ దెచ్చి యిచ్చెదం, జెంగటిగో డఁజేరి యొకచిట్టెఁడునూనె యొసంగ లేవె ...శుక. ౨. ౩౭౧.

౩. దూషణవిశేషము, ఓకానొకతిట్టు.

(వ్యవ.) అక్కడ నేమున్నది? నీనెత్తి. ఇటు చూడుము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నెత్తిఁ గట్టుకొనిపోవు=(చచ్చునపుడు) విడువక కూడ తీసికొనిపోవు.

క. ఇలు నెత్తిఁ గట్టుకొనిపోఁ, గలుగుదురే దివికిఁ దామ గడపటఁ బోరుగూ,రులవెంటఁ జనరె యపు డీ,యలమట వాట్లదే దయాస్థితి వలదే. శుక. 3. ౧౭౩.

నెత్తిఁ జేతులువెట్టుట=ప్రమాణముచేయుట.

ద్వి. రిత్తమ్రొక్కులు మ్రొక్కి ప్రియములు వలికి, నెత్తిఁ జేతులువెట్టి నిక్కముల్ నొడివి. ద్వి. హరిశ్చ. ఉ. ౬౧౪ పం.

నెత్తివ్రాఁత=లలాటలిఖితము, నుదుటివ్రాఁత.

గీ. అరసికుం డైననరపతి నాశ్రయించి,కృతు లొనర్చెడికవి నెత్తివ్రాఁత రోఁత. వేణు. ౧౭.

శ్లో. అరసికాయ కవిత్వనివేదనం శిరసి మాలిఖ మాలిఖ మాలిఖ. (చాటువు.)

నెత్తిపిడుగు=హానిచేయువాఁడు,వినాశకారి.

చ. ఖలదచరిత్ర కన్గొనుము వీ రసమానబలుల్ సమిన్నిరం,కుశులు దశాస్యునెత్తిపిడుగుల్ దనుజాటవికాదవానలుల్.రామా. ౬. ౫౨.

జ: నెత్తికాయ.

**నెత్తికాయ.** వి. (నెత్తి+కాయ.) తలకాయ, శిరము. (శ. ర, బ్రౌ.)

**నెత్తురు(త్రు).** వి.ఔ. (క. నెత్తరు. త. నెత్తోర్.)రక్తము.

క. అత్తఱిఁ జాపాణంబులు,నెత్తురు నెమ్ములును గురిసె నిష్ఠురనినదా,యత్తమయి నభము పిడుగుల,మొత్తంబులు వడియె ...భార. ఉద్యో. ౪. ౧౬౦.

ఉ...దు,ర్నీతి వధించి యేఁ బడయునెత్తుటఁ దోఁగినరాజ్యభోగముల్, ప్రీతి యొనర్చునే ...భార. భీష్మ. ౧. ౧౭౩.

సీ. నిండి ఘోరనఁ జాఱునెత్తురుటేఱులఁ గరఁగిసినమాంసకర్దమమున. కు.సం.౧౧.౩౬౧.

గీ. రథములను సామజములఁ దురంగమముల, నుఱక నెత్తుటేఱుల నీఁది తఱియ నడచి, పోరి రేటును వ్రేటును బోటు నొక్క,య లవిఁజెలఁగంగ నుభయసైన్యములవారు. భార. భీష్మ. 3. ౨౫౫.

చ. తలలు సరోజముల్ మెదడుతండము క్రొన్నురువం త్రజాలముల్, జలఘణు లక్షిఖండములు శంఖములై తగునెత్తుటేర్లలోఁ, గలభకపాలనావయము గ్రక్కన నెక్కి చరించు సంగర,స్థలుల నృసింహనిర్దళితశత్రువసారసమత్తభూతముల్. వరస. 3. ౨౦.

జ: నెత్తురుఁగందు, నెత్తురుఁగళ, నెత్తురుఁద్రావుడు, నెత్తురుఁబొత్తు, నెత్తురుఁబ్రొద్దు, నెత్తురుగడ్డ, నెత్తురుబంక.

**నెత్తురు(త్రు)ఁగందు.** వి.(√నెత్తురు.) ఒంటిపై రక్తము తేలుచున్నలేఁతబిడ్డ, జొత్తుపాప.

గీ. ఇట్లు శైశవక్రీడల నెసఁగుచున్న,కొడుకు దెసఁ జూచి కన్నీరు గ్రుక్కుకొనుచుఁ, గటకటా యిట్టినెత్తురుఁగందు నిచట, వైచి పోవంగ వలసెనె నీచగతిని. భోజరా. ౬. ౨౫.

క. అత్తటిని శకుంతంబులు, తత్తనువున కండె గాలి దాఁకక యుండక్, మెత్తనియాఁకలఁ బొదువుచు, నెత్తురుఁగందుపయి నిల్పె నెయ్యపుఁగృపయుక్. పి. శకుం. ౨. ౧౯౪.

గీ. మంచిలక్షణములపుట్టుమచ్చవాఁడు, నేత్రములు విప్పనట్టియీనెత్రుఁగందు, వఱల నెత్తెచె నెవ్వారివాఁడొ యనుచు, విలయ హరిఁ దెచ్చి వనుతు లప్పటిసతులు. పాండు. 3. ౧౫౬.

**నెత్తురుఁగళ.** వి. (నెత్తురు+కళ.) నెత్తురు చూచుటవలన కలుగుమూర్ఛ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ... తెట్టువలు గట్టి యున్న క్రొన్నెత్తురులు గ
నుంగొని నెత్తురుఁగళె పట్టి తమకు దామ
వ్రాలువారును... కువల. ౨. ౧౪౮.

**నెత్తురుఁద్రావుడు.** వి. (నెత్తురు + త్రావుడు.)
రక్తపాయి, రాక్షసుఁడు.

క. అత్తతి నీలక చిక్కిన, నెత్తురుఁద్రావుడుల
వలన నెవ్వఁడిఁ జాల్పక, గుత్తుకలరక్క
సుఁడు విని, మెత్తంబా టూని లోన మిగు
ల నడలుచుక. అచ్చ. రా. యు. ౧౯౬.

క. కావున మీ రా నెత్తురు,ద్రావుడువంగడపుఁ
గడలితామరదాయ, న్వేవేగ తెంపు నేఁడ,
ద్దీవికి దొరఁ జేసి యునుతుఁ దిర మొప్పా
రక. అచ్చ. రా. యు. ౬౦.

**నెత్తురుఁబోడ.** వి. (నెత్తురు+పాడ.) ఎఱ్ఱపొడ
లు కలఁగి జాతిపాము, ఉమ్మెత్తలోనిముఱ్ఱుపాము,
మాతులాహి. (శ. ర, బ్రౌ.)

**నెత్తురుఁబొత్తు.** విశ. (నెత్తురు+పొత్తు.) ప్రాణ
స్నేహితుఁడు.

క. ఇత్తెఱఁగునఁ దొయ్యలికిక, నెత్తురుఁబొత్త
గుచు నతఁడు నిచ్చలు మదిలో, హత్తినప్రే
ముడిఁ జదివెమునత్తెఱి నొకనాఁడు తేప
టంతఁ గడంకక. యయా. ౩. ౧౧౫.

**నెత్తురుఁబ్రొద్దు.** వి. (నెత్తురు+ప్రొద్దు.) మధ్యా
హ్నము.

వ...అత్తఱిఁ గడింది నెత్తురుబ్రొద్దగుట ...
మనుచ. ౪. ౬౦. (సంధ్యాకాలము అని శ. ర.)

**నెత్తురుగడ్డ.** వి. (నెత్తురు+గడ్డ.) ఒకవిధమైన
ఱుఱుపు, సెగగడ్డ. (బ్రౌ, వా.)

**నెత్తురుబంక.** వి. (నెత్తురు+బంక.) మలముతో
నెత్తురును జిగురును పశువ్యాధివిశేషము. (శ.
ర, బ్రౌ.)

**నెనడు.** వి. (క. నెణ.) ఎముకలలోనిక్రొవ్వు, మజ్జ.

ఉ... నెత్తురుకా, నెనడును గ్రోలి భూతములు
నిక్కుచు నీల్గుచుఁ జొక్కుచుండఁగక.
భార. ద్రో. ౨. ౩౧౨.

ఆ. నెనడు మెదడు పలలు నెత్తురు శుక్రంబు,
మూత్ర మనెడు నివియు మొదలుగాఁగ,
గుబిలి చెమట పుసులు గోరు శ్లేష్మంబ స్రు,
జలము లివి శరీరమలము లయ్యె. విజ్ఞా.
ఆచా. ౪౨.

సీ... నెత్తురు నెనడును నెమ్ములు నెఱచియుఁ
గండలు నెనసి సమర. గీ. తలము ఘోరం
బు గా... భార. ఉద్యో. ౨. ౧౪౪.

**నెనయు**=ఎనయు. అ. క్రి. ఒప్పు.

ద్వి. జనకనందనతోడ సకలరాజ్యంబు, నెనయ
రామున కిమ్ము నీదిమ్మ తెలిసి. రం. రా. యు.
౫౧౭ పు. ౧౧ పం. (చి.ని.పా.)

**నెనరు.** వి. ౧. ప్రేమము, స్నేహము.

(కద్రువ.) క... అధంగిక, జనితతనూజులఁ బేర్కొ
ని, నెనరు విడిచి యానెలంత నిష్ఠురమతి
యై, భార. అను. ౧. ౧౯౬.

చ. నెనరునఁ జెయ్యి పట్టి తరుణీ ధరణీసరణీపు
రందరుఁ, డనుపక పోవు టెట్లు ... వసు.
౩. ౭౪. దశా. ౧. ౧౪౧.

౨. (స్త్రీపురుషుల) వలపు, మోహము.

క. ననుఁ జూడ రాఁ డదేమో, యని నిను దూతి
కొనుచుందు ననయము నాపై, నెనరు గలం
దుకు గుఱు తిదె, కనిపించెను మనము వేసు
కలు గనఁ గలెక. సారంగ. ౨. ౬౧.

గీ. నిన్నుఁ జూచు నవాల్యకు నెనరు లేదె, హృ
దయ మియ్యదు పతిభీతి నింతె కాక. దశా.
౭. ౧౦౨.

ఆ. హిమకరసైకసైకతమునందు విహరించు, కైర
వేషు వేషు ఘనని భాంగు, నెనరు దవుల దవుల
నే చూని క్రీడిగా, నెటేఁగి యూర యూర
గెందువదన. విజ. వి. ౧. ౫౯.

౩. మచ్చిక, చనవు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అని కనకకశిపునసుమతి,మున బాలునిఁ దోడు
కొనుచుఁ బోయిరి గేహం,బునకుఁ జుక్ర
కుమారులు,నెనరునఁ దద్దేహముననుఁ నెలకొని
యతఁడుఁ. దశ. ౭. ౧౯౧.

ఉ...తానునుం, దానును నేఁటిదాఁక మమతం
దగ నర్మిలిఁ గూడి యున్నవా, రానెనరైన
ను౦ దలఁపఁడయ్యెను దీని గణించియేని
యుఁ. విప్ర. ౪. ౩౨.

౪. దయ, కనికరము.

గీ. అనుబేరుఁడు నవ్వి బళా మ ఱేమి, దళము
ఖుఁడు మంచిపని సేయఁ దలఁచె హితవు,
దలఁచినఁ మతి ముఖ్యకోఁత లనుమాట,
నేఁడు నిజ మయ్యె నిఁక నేల నెనరు దలఁప.
ఉ. రా. ౩. ౬.

విణ. ౧. ప్రియము, ప్రేమాస్పదము.

గీ.వనిత నాకన్న నెన రైనవారు నీకుఁ, గలుగ
నేర్తురె... భాగ. ౧౦ ఉ. ౩౪౦.

సీ. వెనుక ముందఱెరు నెన రైపచుట్టాలు...
నైష. ౧. ౧౦౩. ఆం. శే. ౬.

౨. కృతజ్ఞుఁడు, విశ్వాసముకలవాఁడు.

సీ. దీవెనల్ వినయవిధేయతతోడఁ జేకొనుచు
ను వెండియు నెనరుదొరలు. ఆ. గౌరవము
లొనర్పఁ గైకొంచుఁ గ్రమమున...రాఘవ.
౨. ౧౮.

నెనవు. వి. (క. నెనవు.) సంస్మృతి.

క. వనజనిభాకారుం డై, వననిధిలోఁ దేలుచు
న్నవటపత్త్రిముపైఁ, దనుఁదాన చూచి
చొక్కుచు, నెనవుగ నానందయోగనిద్రం
జెందుఁ. వేం. మా. ౬. ౨౪౬.

నెన్నడ(పు). వి. (నెఱి+నడ.) చక్కనినడక, సవిలాసగమనము.

సీ. నెఱనీటు గులుకులే నెన్నడల్ పరికించి క
డుమందగతి గాంచె గంధకరటి. దశ. ౨.
౩౦౨.

ఉ. హెచ్చుపిఱుఁదుభారము సహింపక నెన్నడ
లింత కొంచఁగా. ఉ. రా. ౪. ౧౯౨.

సీ. పూఁదీఁగఁబోఁడిచూపులు చంచలము లని
మెలపు నెన్నడపున మేళవించె. విక్ర. ౪.
౧౩.

నెన్నడుము. వి. ఔ. ౧. (నెఱ+నడుము.) నట్ట
నడిమిప్రదేశము, సరియైనమధ్యభాగము.

గీ. తరుణి యెలుఁగవె వీటికాదానవేళ, గురు
జనప్రాంతమునయందు గూఢవృత్తి,నాగవల్లీద
ళంబు నెన్నడుమఁ జీఁటి,మడిచి యందిచ్చి
నపుడు గోరిదుఁ దుఁ గేల. నైష. ౭. ౭౪.

సీ. చెరువంగ నేర్చిరి శిఖల నెన్నడుములఁ గమ్మ
నిక్రొత్తచెంగలువవిరులు. కాశీ. ౧. ౩౩.

సీ. పుణ్యాత్మ యేదేశములను నెన్నడుముగాఁ
బ్రవహించుఁ బుణ్యతరంగ గంగ.జాహ్నవీ.
౧. ౧౫.

౨. (నెఱి+నడుము.) చక్కనికౌను, సుందరావలగ్నము.

సీ. తూలుతీఁగెలవెంటఁ దూఁగు తేఁటులువోలె
నసదు నెన్నడుముల నారు లొలయ. ఉ.
హరి. ౫. ౨౩౬.

సీ. గాటంపునిడుదకీల్గంటు వెక్కసేఁగున నసదు
నెన్నడుము జవ్వాడి వడఁక. రసిక.౩.౪౩.

సీ...పిడికిట నడఁగు నెన్నడుముదాని. గీ. సాగ
సునడదాని నక్కన్నెఁ జూచె నతఁడు.ఉ.
రా. ౨. ౧౨౭.

నెన్నుదురు=నెన్నొసలు. వి. ఔ. ౧. (నెఱ
+నుదురు.) విశాలఫాలము; ఫాలము.

క...ఈతటినిం, గనుఁగొను పుణ్యుఁడు మిక్కిలి,
కనుఁ గొను నెన్నుదుట నెన్నఁగాఁ దర
మగునే. దశ. ౧. ౧౨౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ...ఁ ద్భూత కేల్దోయి నెన్నుదుటన్ జేరిచి పల్కెఁ గ్రమ్మఱ మదాంధుం డాదశగ్రీవు తోన్. ఉ. రా. ౨. ౩౧౧.

౨. (నెఱి+నుదురు.) చక్కని నుదురు, సుందరఫాలము.

మ. పరియార్వన్నెపసిండిపట్టు మవనీపాలావతంసంబు నెన్నుదుటం గట్టె లతాంగి యొర్తు ...నైష. ౬. ౫౩.

నెన్నెఱులు. వి. బ. (నెఱి+నెఱులు.) నిడుద వెండ్రుకలు, దీర్ఘకేశములు.

సీ...నగారి కైతవంబునఁ బరిచర్య సల్పుచు వినీతుఁడై యుండి యొక్కనాఁ డంఘ్రి నెన్నెఱు లంట నశుచి యై యూర్కు నయ్యతివపుత్రు. గీ. దూతి...చం. రా. ౩. ౨౮.

నెన్నొసలు=నెన్నుదురు. వి. ఔ. ౧. (నెఱి+నొసలు.) విశాలఫాలము; ఫాలము.

చ. వనజభవుండు నెన్నొసట వ్రాసినసొమ్ము ఘనంబొ కొంచెమో, విను మరుభూమి కేఁగిన లభించును మేరువుఁ జేరఁ బోయినన్, ధన మధికంబు రాదు...భర్తృ. ౧. ౪౧.

౨. (నెఱి+నొసలు.) చక్కనినుదురు, సుందరఫాలము.

మ. అసదుంగొను జలింప గుబ్బలపయిన్ హారాళి గుల్కంగ నెన్నొసటన్ ముంగురులాడ...నే, ర్పొసఁగన్ నూనియ యంటె నొక్కచెలి యయ్యుష్ణాంశురాణ్మౌళికిన్. ఇందు ౬. ౧౮.

సీ. చిన్నిక్రొన్నెల నెన్ను నెన్నొసల్లి నొయారి యులఁతికస్తురిరేక లనువు మీఱ. అచ్చ. రా. బాల. ౪౮.

నెపపడు. అ. క్రి. (నెపము+పడు.) నెపమునొందు, దోషియగు.

క. కృప గట్టిపెట్టి మీపాపపుబుద్ధులఁ బట్టిపట్టి పఁగవుట్టి విని, వక్కాణటుఁ గథనకునిఁ బోరిగొని, నెపపడి పడియుండువాఁడనే నేనకటా. వేం. పంచ. ౧. ౫౧౪.

నెపపెట్టు. స. క్రి. (నెపము+పెట్టు.) దోషియను. (వ్యవ.) నే నిప్పుడే చెప్పుచున్నాను; తర్వాత నన్ను నెపపెట్టవలదు.

నెపము=నెవము. వి. (సం. నిభః, ప్రా. ణివ్వ. క. నెవ, నెవను. త. నిపమ్.) వ్యాజము, మిష; మిథ్యాహేతువు.

క. గంధర్వు లను నెపంబున, నంధతమసగూఢవృత్తి ననిలసుతుఁడు గర్వాంధమతి యైన సూతు సబాంధవముగఁ జంపెఁ గాక పరులకు వశమే. భార. విరా. ౩. ౧౧౯.

క. ద్రుపదతనూజం బణముగఁ, గపటద్యూతమునఁ జేయఁగాఁ దగునె జనాధిప యిది దుష్టద్యూతము, నెపమునఁ బరిభూత యయ్యె నిక్కరుణులచేతన్. భార. సభా. ౨. ౨౨౨.

ఉ. నానఁ దొఱంగి చుంబన మొనర్చె టగాదొకఁ డొక్క చంద్రబింబానన మోముఁ జంద్రుఁ జషకాంతర బింబితునిన్ పునః పునః, పానకపానకర్మము నెపంబునఁ జేసి తదోష్ఠపల్లవం, బానుచు నాచరించెను సమంచితసీత్కృతచూత్కృతంబులన్. నైష. ౬. ౧౩౪. భార. అను. ౪. ౧౬౨.

ఉ... ఏకాంతమునందు నున్నజవరాండ్ర నెపం బిడి బల్కరించులా, గింతియు కాక నీ వెఱుఁగవే మును వచ్చినత్రోవచొప్పు... మనుచ. ౨. ౪౧.

౨. కారణము, కతము.

క. విపరీతమతిని సుందుఁడు, నుపసుందుఁడుఁ దాఁకి పొడిచి రొండొరుతోడన్, గుపితాత్ములయి తిలోత్తమ, నెపమున దృఢముష్టి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఘాతనిర్ఘాతములన్. భార. ఆది. ౭. ౧౧౩.

ద్వి. భక్తజనులౌ దైవపంకజోదరుని, భక్తి భావంబున భక్తిగాఁ గోరి తపసుఁ డైకొంటి నాతపమున కిదియె, నెప మీతపశ్శక్తి నిఖిలంబు గాఁచు. రం. రా. ఉ. ౩౪ పా. ౧౧ పం. ఉ. రా. ౩. ౧౨౪.

౩. తప్పు, దోషము.

చ. కువలయనేత్ర నీమనసు గూడినవారికి నెవ్వ నెప్పుఁ జెప్పవలదు దాన నొండొకనెపంబు ఘటించు రెజంగి రేని నీ. సవతులు... భార. అర. ౫. ౩౧౭.

క. నెప మొకటి గలదె నా పైఁ నుపవాసము తోడ బడలి యుండఁగ నీ కే యపరాధము చేయంగదె, కృపతోఁ గటకట్టు లారగింపంగదవే. కాళ. ౩. ౯౦.

౪. విధము, రీతి.

క. ఆనెపమున ద్రోహముగదు, వానిని కాదర పి యతనివంశం బెల్లన్, గానుపునఁ బెట్టి యార్చిన, నేనియుఁ జాల దిది నెట్టియే దగు నగున్. కు. సం. ౨. ౭౪.

గీ. ఎంతకాలంబునకు నాకు నీనెపమున, శాప మోక్షంబు గల్గెడు సజ్జనాగ్రగణ్య... చిత్రభా. ౩. ౯౪.

క. మానిసిపై తోల్ గప్పిన, యీ నెపమున నున్న రుద్రు లీశ్వరభక్తుల్, మానుసులె వారు... శివ. సా. ౧౪౭.

జః నెపపడు, నెపపెట్టు.

నెప్పర(ళ)ము. వి. వేగము, త్వర.

వ. అత్తఱి దత్తఱంబునం దత్తరులం బల్లింపక య నెప్పరంబున నెక్కొంబోవువారును... పారి. ౪. ౬౬.

క. అప్పుడు నాగదసంయమి, చెప్పిన విని కళవళంబు చిత్తాబ్జములో, నుప్పతిల నంత లేచి, నెప్పళమున నెక్కి నలువ నిలువక వచ్చెన్. వరాహ. ౪. ౩౩.

వ... దురంతదంతురంతంబుల నింతంతలు దునియలయి నెప్పళంబునం బునుకచిప్పలు గుదుల్లు దప్పి రక్తంబులు గ్రమ్ముదేర ... భాగ. ౯. ౫౫.

నెప్పరి. విణ. (నెప్పు + అరి[3].) నేర్పుకలది; నేర్పు కలవాఁడు.

క. అప్పరి గలయుప్పరిగల, నెప్పరు లగుమగువ లెక్కి నిక్కి తమనెఱిం గొప్పుల కలకల్పకముల, గొప్పనుమము లేరి కోరి కోయుదు రదనన్. ముకుంద. ౧. ౨౬ పా. ౫ పం.

నెప్పరించు. స. క్రి. (నెప్పరి + ఇంచు.) పూదలించు, నిరూపించు. (శ. ర, ప్రా.)

నెప్పుఱు. అ. క్రి. (నెప్పు + అఱు[1].) స్థానభ్రంశము నొందు, నిలుకడ తప్పు.

ఉ. అప్పుడు దానవాధము భయంకరరూపముఁ జూచి సాధ్వసం, బుప్పతిలన్ మహీతనయ యుర్వర వ్రాలె హరిత్కరీంద్రముల్, నెప్పఱి కూలి కూలె రజనీచరభాస్కర బింబముల్ రచుల్, దప్పె సమస్తతారక వితానము రాలె నరాళభంగులన్. రామా. ౫. ౧౭౪.

ఉ. అప్పుడు యప్పయోనిధిశయానుఁడు మేల్కొనెగర్భయంక్రమై, యొప్పుజగత్త్రియంబు తనయొప్పమి గానఁ బరస్పరవ్యథన్, నెప్పఱి పద్మపత్త్రియుతనీరగతిం జలనంబు నొంద నా, నప్పుడు లోన నెవ్వరిక నల్పప్రబోధము నొందెనో యనన్. రామా. ౩. ౩౧.

నెప్పు. స. క్రి. త్రోయు, గెంటు.

మ. భువనస్తుత్యగుణానరూప మగుజంబూద్వీపమం దాత్మక, స్తవితాంబు గుణంబు గాఁ దవిలి గర్భప్రాప్తుఁడై జీవుఁ డు,ద్భవకాలం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బున మూతిమా రుతము నెప్పక యోనిమా
ర్గంబునఁ, భువికిఁ వెల్వడి మోహ పాశనిక
రంబుల్ దన్ను బంధించినఁ. హ. వరాహ.
౩. ౫౦.

వి. ౧. స్థానము, నెలవు.

సీ. ఇరవు పట్టము చోటిక్కువ నెల విక్క
నెప్పు కంగవ టెంకి నిట్ట యనఁగఁ. గీ. స్థాన
మగు... ఆం. భా. ౨. ౧౩.

సీ. ఎఱుకలు ఏడ నీ వీనెప్పు నూడఁమ ...
ప్రబంధ. ౧౯౩.

వ... ప్రొద్దు గానిప్రొద్దున నీయూరిం జేరి నె
ప్పెఱుంగమిం జేసి యన్నవిక్రయణపరాయ
ణాయతనంబులుం గానక యాఁకటఁ గటక
టం బడి... శుక. ౩. ౧౭౪.

౨. నేర్పు, ఉపాయము. (చూ. నెప్పరి.)

జః నెప్పరి, నెప్పరించు, నెప్పఱు, నెప్పుకొను.

నెప్పుకొను. అ. క్రి. (నెప్పు + కొను.) నెల
కొను, పాదుకొను.

క. చెప్పెడి దే మిఁక నొకచో, దెప్పర మగు
నుక్కుజీను దిగవైచిన నే, నెప్పుకొని కదల
కుండెడు, కప్పలితీరునను దేరు గదలక నిలి
చెఁ. శుక. ౨. ౧౧. (ముద్రి. పా. "...
వెఁ, నెప్పునఁ గదలకయుండెడి... శ. ర.
పా.)

సీ. నెల నెప్పుకొని రొప్పుపులినైనఁ జీడించి
పడవైతుఁ జొచ్చి నీపాద మాన. మనుచ.
౪. ౩౪.

నెమకు. స. క్రి. వెదకు, అన్వేషించు.

క. నెమకుపరివార మమ్మాం, సము గను లెఱుఁగును
ఘటింప శార్దూలముచి, త్తము నక్కవలన
విరసత్వము నొందిన నెఱిఁగి భృత్యతతి
యి ట్లనిరెఁ. భార. శాం. ౩. ౬౪.

ద్వి. ఈరీతి వచ్చుట కేమి కారణము, నేఁము
నావల్ల నెమకిన లేదు. రం. రా. కిష్కిం.
౨౧౧ పా. ౨౨౫ పం.

సీ. చుఱుకు మీఱఁగఁ బండ్లు గొఱుకులెక్క
లజక్కి నీళ్లలో జాడలు నెమకుసిడము.
రసిక. ౪. ౭౪.

జః నెమకుడు.

నెమకుడు. వి. (√నెమకు.) అన్వేషణము, వెదకుట.

సీ. వెదకుడు తడవుడు వెనకుడు రోయుడు
నెమకు డనంగ నన్వేషణ మగు. ఆం.
భా. ౨. ౧౪౩.

నెమటాయి. వి. ఒకానొకచిన్న మొక్క.

సీ. నెమటాయి గొలిమిడి నీరుబచ్చలి ప్రబ్బ
లీఱ... గీ... మొదలు, గాఁగలుగునట్టి చి
ఱుచెట్లఁ గాంచి యంత. హంస. ౪. ౧౦.
(క్రొత్త వ్రాతప్రతి. బ్రా. పా.)

నెమరు. వి. (క. నెవరు.) ౧. రోమంథము, పశు
వులు మ్రింగిన యాహారమును మరల నోటికిఁ దె
చ్చికొని చక్కఁగా నములుట.

గీ. నెమరు నాఁగను రోమంథ మమరు... ఆం.
భా. ౨. ౨౬౨.

౨. స్మృతి, జ్ఞప్తి.

(వ్యవ.) అమరము నెమరునకు వచ్చుచో కావ్య
మేల కాల్పనా!

,, నాఁటిమాట కొంచెము నెమరునకుఁ దెచ్చు
కొనుము.

జః నెమరువెట్టు, నెమరువేయు, నెమర్చు.

నెమరువెట్టు=నెమరువేయు. అ. క్రి. (√నెమ
రు.) పశువులు మ్రింగినయాహారమును మరల
నోటికిఁ దెచ్చికొని చక్కఁగా నములు, రోమం
థము చేయు.

సీ. కడుఁపార మేసి ప్రాఁగను జేసి నీడల నెమరు
వెట్టుచు నుండనీ మృగములు. పి. శకుం. ౩. ౪.

ఉ... నెమరువెట్టుచు నందినియట్లు నాదుచుఁ,
బచ్చికఁ దెండి యున్నయది భామిని వేలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పుటాపుఁ జూచితే. పారి. ౨. ౯౫.

నెమరువేయు=నెమరుపెట్టు. అ. క్రి. (√నెమరు.) పసువులు మ్రింగినయాహారమును మరఁల నోటికిఁ దెచ్చికొని చక్కఁగా నములు, రోమంథము చేయు.

(వ్యవ.) ఆయావు పండుకొని నెమరువేయుచున్నది.

నెమర్చు(రుచు.) అ. క్రి. (√నెమరు.) నెమరు వేయు.

చ. ప్రమథను లుల్లసిల్లఁ దనుపారఁగ నిద్రలు వోయి పల్లటిం, గమిమ నెమర్చి మేప ఱంగఁగాఁ బొరిఁ బెండలు పెట్టి లేచి వృశ్నములఁ దలంచి పంచితలి ..హరి. పూ. ౭. ౧౬౫.

నెమలి¹=నమిలి, నెమిలి. వి. (త. మయిలి. క. నెమలి.) మయూరము.

సీ. నెమలిసోఁగలఁ గేరునెఱిపురుల్ గలవారిఁ గలహంసములఁ గెల్చుగతులవారి. భాను. ౪. ౭౫.

క. మాఁగిలి మాఁగిలి వృక్షము, పూఁగొమ్మన నుండి మద్దము ప్రకాశింపన్, లేఁగొదచు నెమలి పల్కెఁడు, గేఁ గో యని వైశ్య మనరు గెలు పఃసఁ జుమ్మీ. క్రీడా. ౫౧.

నెమలి²= నెమిలియడుగు. వి. పూతికరంజము*.

సీ. నెమిలియడుగుమ్రాను నెమలియాచనఁ గను బూతికరంజంబు పొల్చు...ఆం. భా. ౨. ౪౭.

నెమిలి=నమిలి, నెమలి¹.

గీ. పక్షములు గప్పి పసిపాపపాములకును, మేపు లొసఁగి రక్షించు నెమిళ్లు... జై. భా. ౪. ౪౯.

సీ. నెమిలిపించెయువాఁడు నెఱిమించు సరిమించు కిరమించుకాంచనాంబరమువాఁడు. దశా. ౭. ౩౦౭.

నెమిలిపించెపుఁబుట్టము=నెమలియీఁకలతో నేర్పఱిచినవస్త్రము.

సీ. గురువిందపేరులు గుబ్బచన్నులఁ దాల్చి నెమిలిపించెంపుఁబుట్టములు గట్టి. హర. ౫. ౩౪.

జః నెమిలియడుగు.

నెమిలియడుగు=నెమలి². (√నెమిలి.) ౧. నెమిలిపృక్షము, పూతికరంజము*.

సీ. నాదవ సురపొన్న వారిజమును బొన్న నెల్లి మూఁబుగబిల్లు నెమిలియడుగు. హంస. ౪. ౧౧. ఆం. భా. ౨.౪౭.

౨. కుచనఖక్షతములు. (శ. ర.)

నెముక=ఎముక. వి. అస్థి, శల్యము.

ద్వి. కత్తిశంబులు చించి కంఠముల్ నఱికి, నెత్తురు లడరించి నెముకలు విఱిచి. సిం. భాగ. ౨. ౬౨ పా.

నెమ్మది=నెమ్మనము. వి. (నెఱ + మది.) ౧. నిండుమనస్సు; మనస్సు.

ఉ...ఒకయప్పుడు జన్మము లేక యుంటకై, యారయ శ్రీనగంబుశిఖరాగ్రము చూచినఁజాలు నెమ్మదిన్. విక్ర. ౧. ౨౦౦.

ఉ. నమ్మిక మీఱ నెత్తు వదన మ్మిఁక నెమ్మదికోర్కి నెమ్మితో,నిమ్ము...వసు. ౩. ౧౩౦.

౨. నిశ్చింతత, శాంతి.

క.మమ్ము నరయుభరమున నీ,విమ్మెయిఁ దలపోసి తింక నిచ్చట నేలా,నెమ్మది నిద్రింపంగా, బొమ్ము ప్రభాతమున రథముఁ బూన్పఁగవలయున్. భార. ద్రో. ౨. ౩౧౪.

క. వామాక్షి నీకుఁ గుశలమె,నీమన సెవ్వారియందు నిత్యప్రేమం,బై మెఱయు నట్టిసాబగులు, నీమగ లేపురుషు నిపుడు నెమ్మదియెపుడిన్. భార. ఆర. ౬.౧౬౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ. విదితం బైనతపంబు సేయుచోడ నేవిఘ్నం
బులఁగ లేక నెమ్మది వర్తింతురే యెల్లధర్మ
ములు సంపన్నంబులే నిచ్చలుఁగా. పద్మ.౭.
౧౨౭.

౩. సుహృదయము, విశాలహృదయము.

క. శావలు మఱఁదులు ననుచును, నీవు కృపాతి
శయ మెసఁగ నెమ్మది మమ్ముం, గావను బోవను
దలఁచి రమావర కలిసికొని తిరిగి మన్నిం
చుటకుఁగా. భార. శాం. ౧. ౩౯౭.

ఆ...సుహృదయము నెమ్మది యనఁ దగు మ
హేశ. ఆం. భా. ౧. ౧౦౦.

నెమ్మనము=నెమ్మది. వి. (నెఱ + మనము.) నిండు
మనస్సు; మనస్సు.

క.కమ్ములఁ దవిలెడు సేసిక, కొమ్ములు నెమ్ములును
సుభటకోటులయమ్ముల్, నెమ్మనమునూనఁ జె
ఱుపఁగ...ఉ. హరి. ౧. ౧౪౬.

సీ.యుష్మత్కృపాసముభ్యుదితసంతోషంబునిం
డి దైవాఱె నానెమ్మనమున. హర. ౪.౫౭.

క.నానెమ్మన మినుమా నీ, మానని మానమున మన
సు మన్ననను నోన్నె, మానిని నీమనమున నను,
మానము మానమును మాని మను మను నె
మ్మిఁగా. కళా. ౮. ౨౨౦.

నెమ్మలి=నెమిలి. (చూ. నెమ్మలిపరుఁజు.)
జ: నెమ్మలిపరుఁజు.

నెమ్మలిపరుఁజే. వి. (√నెమ్మలి.) ఖడ్గాది ముష్టి
సంగ్రాహ్యతలము, కత్తిపిడి.

సీ...ఖడ్గాదిముష్టిసంగ్రాహ్యతలము. గీ. పరుఁజ
నఁ బరుం జనంగను బరఁగు నదియె, చనును
నెమ్మలిపరుఁజు గాజాపరుఁ జన.ఆం.భా.౨.
౨౧౫. (బ్రా. చి. ని. పొ, "నెమ్మిలిపరుఁజు"
శ. ర.)

నెమ్మి[1]=నెమిలి.

సీ. ఈదరీతటీదరి నిభరాజగామిని నెమ్మికి నా
టలు నేర్పుచుండె. రసిక. ౩. ౧౧౮.

మ. తలిరుంబోఁడి నితంబబింబవిలసద్ధమ్మిల్లబం
ధంబుతో, జలధినీలము పోరి పూరిఁగఱ
చుఁ బాథోధరశ్రేణి వెల్వెలఁబాఱుఁ
గుసుమ రైమద భ్రమరముల్ నెత్తమ్ములఁ జేరు
నెమ్ములపింఛమ్ములు జాఱు నంధతమసంబుల్
బల్గుహల్ దూఱెడుఁ. కృ. శకుం. ౨.
౧౧.

సీ. కన్నులీఁకలచంద్రకములుగా ఘనవేణి నె
మ్మిగా బలపైరి నెమ్మి కోసఁగె. ఉ.రా.౩.
౧౫౭. ఆం. సం. తిర్య. ౧౨.

జ: నెమ్మిజుట్టు, నెమ్మిరాతు, నెమ్మితేఁడు.

నెమ్మి[2]. వి. (సం. నేమిః.) తినాసము, వంజుల
ముకీ.

వ...నెమ్ముల జమ్ముల నేరేళ్ల మారేళ్ల కలువుల
బలువులఁ గొడిసెల నొడిసెల...పి. శకుం.
౨. ౧౪.

సీ. పాలపండులు నెమ్మిపండులు బరివంకపండులు
జిటిముటిపండ్లు...కాళ. ౩. ౬౯.

సీ...నెమ్మి యన నేమిసంజ్ఞ యా...ఆం. భా.
౨. ౪౩. ఆం. సం.నా.నా. ౯.

నెమ్మి[3]=నెమ్మిక. వి. ౧. ప్రేమము, అనురాగము.

గీ...కరము, నెమ్మిఁ జేసితి దీనిఁ బాణిగ్రహణ
ము. భార. ఆది. ౪. ౧౦౫.

క. నెమ్మి గలవాని నాచిత్త మ్మెఱిఁగెడువాని
విదురు ధర్మప్రియు నాత్మమ్ము నిట వేగఁ
దోడ్కొని, ర మ్మరుగుము కామ్యకాఖ్యార
ణ్యాటవికిఁ. భార. అర. ౧.౬౩.

క.నెమ్మి గలవారి నొల్లరు, తమ్మొల్లనివారి వెనుకఁ
దగులుదు రధిక, త్వ మ్మెఱిఁగి యెఱిఁగితో
డరుదు, రిమ్మెఱుఁగనియట్టివార లిభపుర
నాథా. భార. ఉద్యో. ౨. ౩౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. స్నేహము, మిత్త్రభావము.

క. మిత్త్రనరపతుల శాత్త్రవ, ధాత్త్రీశుల నెమ్మిఁ బరుసఁదనమున వశతా, పాత్త్రములుగఁ జేయుదె సుచరిత్త్ర యుదాసీననృపపరీక్ష నడచునే. భార. ఆశ్ర. ౨. ౪౭.

సీ... చెలిమి చుట్టఱికంబు చెల్మి నెమ్మి, నెయ్యము నేస్తము నెయ్యమి సంగడి...గీ... అనఁ, బరఁగుచుండును మిత్త్రభావంబు ... ఆం. భా. ౨. ౧౭౬.

ఉ. ఇమ్మెయి నర్థమెల్లను వ్యయింపఁ బురిం గల వైశ్యులందఱున్, నెమ్మిఁ బురందరున్ గదిసి...విక్ర. ౨. ౧౬౬.

౩. ఆసక్తి, తత్పరత.

ఉ. నెట్టన నశ్వమేధములు నెమ్మి ననేకము చేసి వైరులం, గిట్టి వధించి లోకములఁ గీర్తి దళంబుగ నించె మించఁగా. వి. పు. ౫, ౮౫.

గీ. మఱియు నర్థమూలము లైనమహితపుణ్య, కర్మములు నెమ్మి నొనరించు ధర్మనిరతి. విక్ర. ౨. ౧౬౫.

౪. ప్రసాదము, అనుగ్రహము.

ఆ... పెక్కులేండ్లు నిష్ఠ, గురుని గురుతనూజుఁ గొలిచి యయ్యిరువుర, నెమ్మి వడసెఁ దనదు నేర్పుపేర్మి. భార. ఆది. ౩. ౧౧౦.

౫. సుఖము; సుఖస్థితి.

క. అనఘా నీ ప్రస్తవమున, నని నీల్గినవీరభటుల యనుపోష్యుల నెల్లను బ్రోతె భోజనాచ్ఛా, దనముల వారలకు నెమ్మి దఱుఁగక యుండన్. భార. సభా. ౧. ౩౯.

శా... ఈవసుమతీచక్రేశపుష్పాయుధుండు... శై, మీ దాఁపత్యమునం జిరాయువయి నెమ్మిం బొందుఁగా కెంతయున్. నైష. ౬. ౮౬.

క. మమ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుదు, నెమ్మి నెఱుఁగు దర్థసిద్ధి నెఱి నెఱుఁగుదు వాక్యములపద్ధతి నెఱుఁగుదు, వా మెచ్చఁడ నేను నీకు బుద్ధులు సెప్పన్. భార. ఉద్యో. ౩. ౩౪.

౬. క్షేమము, కుశలవార్త.

గీ. అన్న గాదిలిచుట్టము వగుచు తేని, నెమ్మి యెఱిఁగించి యసురులు నిలిపినట్టి నన్ను కింతయు నగ్గింప నేరను ... అచ్చ. రా. సుం. ౭౬.

౮. సంతోషము, ప్రీతి.

ఆ... ఇమ్మహీభారంబు, నీవ తాల్పఁ గలయు నెమ్మి తోడ. భార. ఆది. ౨. ౧౨౫.

క. నెమ్మిని నీదక్షిణహ, స్తమ్మున పెనువ్రేలు దునిమి దక్షిణ యిమ్మిష్ట మ్మిది...భార. ఆది. ౫. ౨౪౩.

క. అమ్మేటిగేస్తునకుఁ గడు, నెమ్మి యొనర్చుచును ...నీలా. ౧. ౫౧.

౭. నిర్భయత్వము, నెమ్మది.

క. ఇమ్మణిమతీపురంబునఁ, దమ్ముండును దాను నతిముదంబున నుండన్, నెమ్మిని నిల్వలుఁ డనువాఁ, డిమ్మహి ధనవంతుఁ డతఁడ యెవ్వరి కంటెన్. భార. అర. ౨. ౩౩౭.

చ. అనవుడు బ్రహ్మదత్తుఁ డది యట్టిద నీదెసఁ గీడు లేదు నీ, చనుటకు నామనం బతివిషాదముఁ బొందెడుఁ దొంటియట్ల నెమ్మిని నిలుమన్న...భార. శాం. ౩. ౨౫౨.

గీ. నిమ్మళంబన నెమ్మి నా నెమ్మది యనఁ, దవరు పేళ్లు నిరాతంకమునకు నీశ. ఆం. సం. నూన. ౬౯.

జః నెమ్మిక, నెమ్మిసేయు.

నెమ్మి[4]. వి. (సం. నేమిః.) నేమి, బండిచక్రమునకు చుట్టునుండుకమ్మి.

గీ. నేమి దనరారుచుండును నెమ్ము నెమ్మి, కమ్మి యనఁగను...ఆం. భా. ౨. ౨౦౨.

ఆ. అంచు లైదు నెమ్ము లాఱు నాభులు మూఁడు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గలిగి నూత్నగమనకలిత మగుచు, సంయ
మీంద్ర వినుము సంవత్సరాకృతిఁ, గాలచ
క్ర మందుఁ గ్రాలుచుండు. వి. పు. ౩.
౧౫౮.

నెమ్మించు. స. క్రి. (నెఱ + మించు.) అతిశ
యించు.

వ...లేఁతవెన్నెలల నెమ్మించుక్రొమ్మించులుం గల
మేడలును...పి. శకుం. ౧. ౮౬.

నెమ్మిక=నెమ్మి³. వి. (నెమ్మి³ + ఇక-స్వార్థమున.)
ప్రేమము,అనురాగము.

ఉ. నేయము లజ్జయుం గరుణ నెమ్మిక కోపభ
యైకలేశ మే,నేయెడఁ జూచినఁగా మదికి
నించుక యించుక...రస. ౩. గుచ్ఛము.
(శ. ర. పా.)

నెమ్మిజేట్టు. వి. (√నెమ్మి¹.) బర్హిచూడముకే.
(శ. ర.)

నెమ్మిరవుతు. వి. (నెమ్మి¹+రవుతు.) మయూర
వాహనుఁడు, కుమారస్వామి. (శ. ర.)

నెమ్మితేఁడు. వి. (నెమ్మి¹ + ఱేఁడు.) మయూర
వాహనుఁడు, కుమారస్వామి. (శ. ర.)

నెమ్మిలి=నెమిలి. (శ.ర.)

నెమ్మిసేయు. అ. క్రి. (నెమ్మి³ + చేయు.)సంతో
షపడు, ప్రీతినందు.

గీ. ఊరుసంవాహనమునకు నుత్సహించు, ఘన
నితంబంబుపై నుండ మనసువెట్టు, నిమ్న
నాభికి డిగ్గంగ నెమ్మిసేయుఁ, బద్మలోచన
మరగి భూపాలుకరము. నైష. ౪. ౧౪౨.

నెమ్ము¹. వి. తడి, తేమ. (శ. ర. బ్రా.)
జః నెమ్ముకొను.

నెమ్ము². వి. (త. నెమ్బు - 'బ' అని శ. ర.) ౧.
రెండువైపులను మొన గలిగి బల్లలు మొదలగు
వానిని అంటఁగూర్చుట కుపయోగించు మేకు.

ద్వి. తలుపునెమ్ములు గ్రక్కదలఁ దన్నుఁ డను
చు. పండితా. దీక్షా. ౪౩ పా.

౨. బండిచక్రమునకు చుట్టు నుండుకమ్మి, నేమి.
ఆం. భా. ౨. ౨౦౨.

౩. (=ఎమ్ము.) ఎముక, అస్థి.

సీ. అస్థిమయూరాఖ్య లలరు నెమ్ము లనంగ...
ఆం. భా. ౩. ౪౩.

క. వెల్లుగ మఱియును డెందము, చిల్లులు వో
నేసె నతఁడు చిదురుపనెమ్ముల్, మెల్లనె
ధైర్యరమాసతి, జల్లింపఁగఁ బట్టువెద్దజల్లెడ
యనఁగన్. చంద్రా. ౬. ౮౫.

నెమ్ముకొను. అ. క్రి. (నెమ్ము¹ + కొను.) చెమ్మ
గిల్లు.

(వ్యవ.) అగ్గిపుల్లలు నెమ్ముకొన్నవి.

నెమ్మేను. వి. (నెఱి + మేను.) చక్కనిశరీరము;
శరీరము.

గీ. అతులమాణిక్యదీపము లార్పరామిఁ, దనదు
నెమ్మేనిచాయ నత్తఱి శయించి, యున్నయు
డిగంపుఁ బూఁబోఁడ్ల...దశా. ౧. ౨౪౦.

క...నను, గనుఁగొని నెమ్మేను మిగుల గడగడ
వడఁకన్. కాశా. ౩. ౧౪౫.

గీ. మేను నెమ్మేను మై మయి మే మెయి
యొడ, లన శరీరంబు దనరు... ఆం. భా.
౨. ౧౩౪. ఉ. రా. ౬. ౨౪౬.

నెమ్మొగము=నెమ్మోము. వి.
(నిండుమొగము; మొగము.)

చ. నగరిసమీప మైన నరనాథునిసన్నిధి కోవ
టించిన, మ్మొగము వివర్ణతం బొరయ యేఁగె
...లక్ష్మణకుమారకుఁ డానృపుఁ డున్నచోటి
కిన్. నిర్వ. ౯. ౬౯.

సీ...ఆదర్శంబు నెమ్మొగం బగుట సందియము
గలదె... ఆము. ౨. ౩౦.
(చక్కనిముఖము.)

చ. పుడమిధనంబు నాకమువిభూతియుఁ జేర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నరేని నల్ల న, వ్వెడనభినన్యనెమ్మొగము వేయఁగుపాలను బోలనేర్చునే. భార. ద్రో. ౨. ౧౪౫.

నెమ్మోము. వి. ౧. (నెఱ + మోము.) నిండుమొగము; మొగము.

సీ. చెలువంపునెమ్మోము నెఱనిసొం పినుమడిగా నల్ల నవ్వినఁ గాదె యింతి. భార. విరా. ౨. ౪౫.

౨. (నెత్రి + మోము.) చక్కనిముఖము.

సీ. దౌహృదశ్రీ నిల్చుధవళాంబుజముపోల్కిఁ దెలిగఁటినెమ్మోము దెల్లనయ్యె. ఉ. రా. ౨. ౧౩౪.

నెయి=నెయ్యి. వి. ఆజ్యము. (దీనికి ప్రథమైక వచనమునందే ప్రయోగములు కానవచ్చుచున్నవి.)

చ. మగలమనోనివాసముల మానిని దృజ్మదనాస్త్రపావకుల్, దగులుకొనల రగిల్చి చిరన వ్వనుగందపుఁగొండగాడ్పుచేఁ, బొగలెగయించి పల్కునెయి వోయుచు మండఁగ మాయకట్టెచే, నెగసనఁ ద్రోచి యార్పఁ దగునించుకయించుక కూర్తిఁదుంపరల్. కాశీ. ౪. ౩౪.

గీ. బూడిలో వేల్చునెయివోలె పొల్లువోవు. శేష. ౫. ౨౫౧.

వ... నిత్యమానెండునెయి... దశా. ౪. ౭౮౮.

నెయ్యపుఱేఁడు. వి. (నెయ్యము + ఱేఁడు.) వలరాజు, మన్మథుఁడు.

ఉ. తొయ్యలి ముద్దరాలు కుచదుర్గము లాత్మకైకవసంచనల్, నెయ్యపుఱేనిపాల్పఱచి నీవియఁ గోల్పడఁగాఁ దలంచెఁగా, కయ్యెడ సేలకో యునిచె నాత్మకయద్వితయంబు మున్నె లో, నయ్యె సరాగమై నృపకగార్వణ కింకఁ బెనంగ నేర్చునే. వసు. ౭. ౮౮.

నెయ్యమాడు. అ. క్రి. (నెయ్యము + ఆడు.) చెలిమిచేయు, స్నేహించు.

సీ... నూఁగారుసోరు శంబరవైరినిడువాలువాలుతో నెయ్యమాడ. వి. పు. ౨. ౨౦౯. (ఇది ఔపమ్యద్యోతకము.)

నెయ్యమి=నెయ్యము. వి. ౧. స్నేహము, మైత్రి.

సీ. నెయ్యము నేస్తము నెయ్యమి సంగడి...

గీ... పొందిక యనఁ, బరఁగుచుండును మిత్రభావంబు... ఆం. భా. ౨. ౧౮౭.

౨. ప్రేమ, అనురాగము.

సీ. నెయ్యము నెయ్యమి నెమ్మి నేస్తము నెనరలమి మేలు ల్కారిమి చెలిమి యరితి. గీ... మక్కువ యనఁ, బ్రేమ దోఁచును... ఆం. భా. ౧. ౧౩౭.

౩. ప్రీతి, సంతోషము.

క. అయ్యా కల దొకయుపకన, మియ్యుపవనసీమ నిప్పు డే నేర్చుగతిల్, నెయ్యమి నొకపూఁజప్పర, మొయ్యన రచియించితిని సముజ్జ్వలభంగిల్. చమ. ౧. ౯౦.

నెయ్యము=నెయ్యమి. వి. (సం. స్నేహః. క. నెయ్. త. నేయం.) ౧. స్నేహము, మైత్రి.

ఉ. నెయ్యము దప్ప నొండొకటి నీయెడఁ దోఁచెనె నాదుపల్కులం, దెయ్యెడ సంజయా... భార. ఉద్యో. ౧. ౩౦౪.

క. కయ్యము గాని తెఱంగున, నెయ్యం బగునట్లుగాఁగ నెత్రేఁ బలికితి... భార. ఉద్యో. ౪. ౪౫. ఆం. భా. ౨. ౧౮౭.

౨. ప్రేమ, అనురాగము; వలపు.

ఉ. నీవు సుభద్రకంటెఁ గడునెయ్యము గారవముం దలిర్ప సం, భావనసేయుఁ బట్టినను బంకజనాభ... సభకు నీడ్చెఁ గులాంగన నిట్లొనర్తురే. భార. ఉద్యో. ౩. ౧౧౦.

ఉ. నెయ్యము లేనిసంగతియు నిక్కము లేనివచోవిలాసముల్..., కయ్యము లేనిశూర

తయుఁ గైకొని యూరక మెచ్చ వచ్చునే. ఉ. హరి. ౫. ౩౭. నైష. ౨. ౪౪.

ఆ...వనాంతరమున రేతపస్కుండ,మయ్యె నవ నిపతికి నెయ్య మొనర. భార.ఆది.౩.౨౪.

చ...నెయ్యము హృదయేశు దూఱ వల దంచు నిరోధ మొనర్చెనో యనక్. నరస.౩.౪౨.

౩. ప్రీతి, సంతోషము.

వ...కలన నెక్కటీకయ్యంపు నెయ్యంబునం బె నంగువారును...విక్ర. ౪. ౯౭.

గీ. ఆట్టిగోలోకమునయందు నధివసింతు, రభవు చేఁ బ్రొద్దుప్రొద్దు నెయ్యంబుఁ గనుచు.కాశీ. ౨. ౭౭.

౪. తమి, ఆసక్తి.

సీ. అమ్మహోత్సవము నెయ్యమ్మున జూడంగఁ దివిరి...భార.ఆది. ౬. ౧౯౨. (ఇంపు అని శ.ర.)

౫. ఒప్పిదము, మనోహరత.

సీ. నాఁటినాఁటికిఁ బ్రోదినవకంపుఁదీవలనుబో దనెయ్యంబు నూలుకొలిపి. భాగ.౧.౭౨౬.

౬. బాంధవ్యము, చుట్టఱికము.

గీ. అగవుతగవు లటంచు నెయ్యంబు లనుచు, నంపకము లంచు మఱి యెన్నియైనఁ గలవు, కాంతలు...రువల. ౩. ౬౫.

విణ. ప్రియము, ఇష్టము; అనుకూలము.

సీ. నీకుఁ బ్రెగ్గడయును నెయ్యంపుఁజెలియు నై కయ్యంబునకు నెప్డు కాలుద్రువ్వ. భార. ఉద్యో. ౪. ౨౩౪.

సీ. పేమఱిహనుమంత బిరుదాంకు లగురాచవా రికి నెయ్యంపువరనుతుండు. నైష.౧.౩౨.

క. ఈనయమునఁ గడునెయ్యము,గా నడువఁగఁ విశ్వసించె ఖచరాధీశుక్, దానవసాధుఁడు ...దశా. ౨. ౧౩౦.

నెయ్యపుఁగలను=సురతము.

మ. తపుకుంజప్పరకోళ్లమంచమున నిద్రాజాజి పూసెజ్జపైఁ, బలుకుంజిల్కలకోల్కిరాచిలు కబాబాసాహిబూనెయ్యపుం, గలనక్ సౌ ఖ్యము గాంచి మై బడలఁగా గాటంపు నిట్టూరుపు, ల్వ్రాలయక్ నిద్రితుఁ డైనపద్మ భవు నాలోకించి యాలోపలక్. దశా. ౧. ౨౬౭.

నెయ్యపుఁగినుక=ప్రణయకోపము.

చ. నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁ గిన్కఁ బూని తాఁ,చినయది నాకు మన్న నయ...పారి. ౧. ౧౨౩.

నెయ్యపుటలుక=ప్రణయకలహము.

క. పొలయలుక యనఁగ నెయ్యపుటలుక యనక్ బ్రణయకలహ మలరారు...అం.శే. ౬౨.

జః నెయ్యపుఁ కేఁడు, నెయ్యమాడు, నెయ్యరి, నెయ్యుఁడు, నెయ్యురాలు.

నెయ్యరి. విణ. (నెయ్యము+అరి౩.) స్నేహితు రాలు; స్నేహితుఁడు.

సీ. నేర్పులేక చెడంగ నెండవేగురు నుండి యన నోడువారు నెయ్యరులు గారు. రామా.౪. ౪౪. (చి. ని. శ. ర. పా.)

నెయ్యి=నెయి,నేయి. (దీనికి ప్రథమైకవచనమం దే ప్రయోగములు గానవచ్చుచున్నవి.) ౧. ఆ జ్యము.

క. నేయి నెయి నెయ్యి నే యనఁ,బాయక కబ్బ ముల నిలుచుఁ బర్వతనిలయా. సర్వ. సా. ౧౧౪.

సీ. ప్రక్షాళితం బైనపసిఁడిచట్టువమున నన్నంబు నునిచి నెయ్యభిఘరించి. కాశీ. ౬.౧౪౧.

గీ. అనిన నెయ్యి వోసినయగ్గియట్ల మండి.విక్ర. ౩. ౬౪.

౨. చమురు, క్రొవ్వు.

క. చెడుగట్టల గ్రుచ్చినసం,జుడు మంటలఁ దగి లి నెయ్యి జొటజొట వడియుక్.మనుచ. ౪. ౧౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పా: పాయసముపై నెయ్యలికినట్లు. (కలవని తలంపుగ శుభ మైన గూడుట.)

ద్వి. నెరయఁ బాయసముపై నెయ్యల్కినట్టి, యొగవు నా కియ్యె నాయొడయ సోమేశ. పండితా. పుర. ౧౩౧ పా.

నెయ్యుఁడు. విణ. (బ. నెయ్యురు, నెయ్యురులు.) ౧. మిత్త్రుఁడు, స్నేహితుఁడు.

ఉ. వానికి నెయ్యుఁడై యమరవంద్యపదాంబుజుఁ డంబికాబ్బృహ, త్పీనపయోధరాగ్రపరిపీడితవక్షుఁడు... భార. సభా. ౧. ౪౪.

క. భవదీయస్నేహమునా, కవిరళతేజోవిధాయి యగు నెయ్యుఁడ వైరవరవలేక మనీషి, ప్రవరా వర్తింపు మన హిరణ్యకుఁ డనియెన్. వేం. పంచ. ౨. ౮౧.

క. పురపురఁ బొక్కుచు బకపతి, కరంకముం దేరఁ బనిచి గారవమున నెయ్యురఁ దాను నగ్ని యిచ్చి య,సురపతి యున్నంత వచ్చె సురపతి నెమ్మిన్. భార. శాం. ౩. ౫౧౨.

ద్వి... చెలియు నెయ్యురు లైనయట్టి,కన్నియల్ గొలువ... ద్వి. పరమ. ౫. ౮౧౧. నిర్వ. ౩. ౧౧.

౨. ప్రేమాస్పదుఁడు, ఇష్టుఁడు.

చ. అనుమతి నెయ్యుఁడున్ హితుఁడు నైనవయస్యుఁడు సేయుకృత్యము, ల్పొనరఁగఁ జేసి తీవు... భా. రా. కిష్కి. ౨. ౪౮.

ఆ. నెయ్యుఁ డట్టిపనికి నియతుఁడ తగుఁ గాక, గృహితకంబె వేఱె కీడు గలదె, గురుహితంబు నూఁది యురిఁ బడ నే నోప, ననుచు బ్రహ్మచర్య మరయుతుఁ డొంది. పాండు. ౫. ౧౮౫.

క. హనుమంతుఁ డనెడిపేరం, దనరారెడువాఁడఁ దొవలదాయయనుఁగుబిడ్డనికిం గడునెయ్యుఁడ నీ, పెనిమిటికిం గూర్చునట్టి బిరుదుమగండన్. అచ్చ. రా. సుం. ౪౫.

నెయ్యురాలు. విణ. ౧. స్నేహితురాలు, నేస్తకత్తె. (శ. ర.) ౨. ప్రియురాలు, ఇష్టురాలు.

గీ. చొచ్చి తన నెయ్యురాలికిఁ జూపి దాని,తల్లి పాలిరలాడ సామ్మెల్ల నొసఁగె. ప్రబంధ. ౭౭౮.

నెర=నెఱ, నెఱా, నేఱా. విణ. (√ నెరయు.)

౧. పూర్ణము, గొప్పది.

మ. నెఁవిల్కాఁడవు నీవె రామ... రామా. ౪. ౭. (శ. ర.)

౨. నేర్పరి, ఉపాయశాలి.

గీ. మత్తికరిదండ నెర యైనమావటీఁడు, బుద్ధియెఱుఁగనికొమరునిపొంత దాది, యతులగర్వాంధుఁ డగురాజునండ నాప్తమంత్రి యొకవేళ నైన నేమఱఁ దరంబె. శుక. ౧. ౨౮౪.

క్రి. విణ. ద్రు. మిక్కిలి, అధికముగా; పూర్ణముగా.

మ. పురియు భ్రంకషసౌధపంక్తిఁ గని వేల్పుం దంతి శైలాళి యం,చు రహిం గొమ్ములఁ ద్రవ్వి యాడుటకు నచ్చోఁ జేరి యందు గ్రావై,ఖరిఁ గన్పట్టెడుకృత్రిమేభరిపుసంఘంబుల్ నిరీక్షింప వే, నెరఁ బాఱున్ వెలవెల్లనై యనిమిషుల్ నిర్విణ్ణులై చూడఁగన్. ఘటికా. ౨. ౨౦౦.

క. భగవనకభోగ్యమును నిహ,పరదూరము నైన తను వుపాదేయముగా, నెర నమ్మి వస్త్రమాల్యా, భరణంబు లలంకరించు పామరజనులున్. భాగ. ౩. ౮౭౭. (చి. ని. పా. 'తనువుఁ బాథేయముగా నెఱి నమ్మి' అని ముద్రి. పా.)

నెరడు. విణ. విషమము, ఎచ్చుతగ్గులు కలది.

సీ. మౌక్తికం బొప్పను ముత్తియ మన...గీ. అదియు నెర డైన గొగ్గి యం చనఁగ వెలయు. ఆం. భా. ౨. ౨౩౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నెరపు=నెఱపు. స. క్రి. (√నెరయు.) ౧. నించు; అతిశయింపఁజేయు. (శ. ర.) ౨. వెలయించు, ప్రకటించు; చూపు.

గీ. బ్రాహ్మణులయందు గురులందు బంధులందు,
భక్తివిశ్వాససౌహార్దపరత నెరపు. నైష. ౪. ౯.

సీ. బంధురమురజాదిధిమిధ్వానంబు బహుళ
గర్జావిజృంభణము నెరప. దశా. ౧. ౩౫౭.

గీ... సౌరు, నెరపునెఱవేల్ప నాపది నిలుచుఁ
గాత. అచ్చ. రా. బాల. ౪.

౩. ప్రసరింపఁజేయు, వ్యాపింపఁజేయు.

సీ. సురభిళశ్వసనంబు నెరపె సింధుకవల్లి గ్రు
చ్చెఁ దావులు సోఁకఁ గ్రోవిరెమ్మ. వసు. ౧. ౧౫౯.

౪. చిమ్ము, వెదఁజల్లు.

చ. పరిగొని వచ్చి వేదికలపై రుధిరంబులు సల్లి
మాంసముల్, నెరపుచు యజ్ఞవిఘ్న మవలీల
నొనర్తురు... భా. రా. బాల. ౧౪౩.

సీ. తనుఁగల్పలతికగాఁ దలఁచి ప్రాలెడుశారిఁ
గరము రత్నఫలాళి నెరపి నిలిపె. వసు.
౬. ౧౬.

౫. పఱచు, విరివిచేయు.

చ... విక్రయార్థమై, నెరపినమౌక్తికంబు లన...
భల్లాణ. ౫ ఆ. (శ. ర.)

సీ. ఒడికంబుగా ప్రేసి యొక్కింత నేలపై నిరు
సవడ్లునుబోసి యెడ నెరపి. దశమ. ౧౦.
౧౦౫.

౬. నెఱవేర్చు, జరపు.

వ... అట్టివసంతసమయమునం బురందరాదేశం
బు నెరపం బూని చనుదెంచినవనజలోచ
నలు... నృసిం. ౨. ౪౬.

౭. కావించు, చేయు.

గీ. తరళవైదూర్యవలభికల్ తెరలు నెరప. వసు.
౨. ౨౩.

గీ. నెరప నొప్పదు జూదంబు నృపకుమార.
పి. శకుం. ౪. ౧౬౪. (ఇట 'ఆడు' అని భావము.)

విణ. అధికము, వ్యాప్తము.

గీ. నెరపుధూళులు మేనులఁ బొరసి... హరి
పూ. ౮. ౭౩.

మ. నెర పయ్యెన్ మదనానలంబు వరుస న్నీ
రయ్యె నాలేపముల్, సార పయ్యెం దనువల్లి
బాణసుతకున్ సోలింతలం దూలుటన్. ఉ.
హరి. ౫. ౧౦౦.

సీ. నెరపు గా నూరి గిన్నెలు నించినయట్టి
యరికిశుంకుమ నించినట్లు యుండె. శుక.
౫. ౩౭.

నెరయించు. స. క్రి. (√నెరయు.) వ్యాపింపఁజేయు, ప్రసరింపఁజేయు.

మ... ధూళీజాలముల్ నేల బిట్టువియంగా నెర
యించి పేర్చిరి రణవ్యాపారపారీణులై.
భా. రా. యు. ౧౪౭.

సీ. నెరయించు నెవ్వఁడు నిజసనాతనమాయ
సకలప్రపంచంబుసంతతముగ. కాశీ. ౫. ౯౦.

నెరయిక. వి. (√నెరయు.) నెరయుట. (శ. ర.)

నెరయు=నెఱయు. అ. క్రి. (క. నెరపు.) (దీని తుమున్నంతరూపము "పూర్ణముగా, అధికముగా" అనునర్థమును వ్యతిరేకక్రియలతోఁ గూడి కొన్నిచోట్ల "ఎంతమాత్రము, బొత్తిగ" అను నర్థము నిచ్చును.) ౧. నిండు, పూర్ణమగు; అతిశయించు.

క. తరళనయనాబ్జదళములు, నెరయఁగ బై ము
న్నుచల్లి నృపసుతుఁ బూజించిరి... భార.
ఆది. ౩. ౧౫౭.

మ. కరిదంతంబులు మూఁపులందు మెఱయన్
ఘర్మాంబువుల్ మోములన్, నెరయన్ గో
పవు లంతనంత మలయన్... భాగ. ౧౦
పూ. ౧౩౨౧.

ద్వి. అతతసామభేదాదుల నొప్పు, నీతిక్రమం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బుల నెరసినవాఁడు. రం. రా. బాల. ౩
పా. ౨౬ పం.

సీ. భూనాయకుండును...కైసేయంగ భూష
ణంబులతలంపునను బారి,యవి మున్నె దాఁ
చెట్టినట్టివో టరయించి ...గీ. నెరయ లే
కున్కి విని యారసేఁడు వింత,చందములు
పుట్టె...పరమ. ౩. ౫౭.

ఆ. ధనము నెరయ లేదు తల మున్నె గొఱిగిం
చు,కొన్నవాఁడు గాన నున్నతలఁపు,లుఁడిగి
సీమ వెడల నడచుటే శాస్త్రోక్త,శిక్ష యితని
కట్లు సేయుఁ డనుచు. వైజ. ౪. ౧౧౩.

౨. వ్యాపించు, ప్రసరించు.

మాలిని...ఇంద్రుం,డరిగె దివికి దివ్యానంతర
త్నాంశుజాల,స్ఫురితసురవిమానంబుల్ నభో
భాగ మెల్లన్, నెరసి వెలుఁగుచుండన్
నిర్జరశ్రేణితోడన్. భార. ఆది. ౭.౧౯౭.

సీ. ఇందుబింబము మీఁదికందు చందంబునఁ గురు
లు నెమ్మొగమున నెరసి యుండ. భార.
విరా. ౨. ౧౩౭.

మ. ధరణీమండలి నెందునుం బరగి పాతాళం
బునం బర్వి ని,ర్జరనాథప్రముఖామరాఖిల
నివాసశ్రేణులం దోలి మై,నెరసెన్ బంకజ
సంభవాలయమునన్ నిండారె నవ్వేళ శ్రీ,
కరదైతేయతనూభవోద్భవకథాకల్యాణ ము
ద్ఘోష మై. నృసిం. ౩. ౧౪౧.

౩. చెదరు; చెదరిపడు; పడు.

ద్వి. ఆదటఁ గనుఁగొనునప్పు డయ్యింతి,నెరసి
నకురులును నెఱి ధూళిఁ దూలి, విరిసినసీమం
తవీథియు...ద్వి. హరిశ్చ. ఉ. ౨౦౬౫.

గీ. భూమిసుతశిరంబున నున్నపుష్పమాల, నేలఁ
బడి యున్న యది దీనిఁ బోలఁ జూడు, మ
నుజ విరులివె నెరసిన వసనిపుత్రి,యుండ
నోపు నీఘన మగుకొండమీఁద. భా. రా.
అర. ౨. ౩౧౨.

చ...కేలుదోయి నొం,డొరుపయి సమ్మదంబు
లిగుర్కొత్తఁగ మాటికిఁ జల్లుసేసఁబ్రా,ల్నెరసె
ననంగ వ్రాలెఁ గుహళీవిగళన్నవకోరకావ
ళుల్. పారి. ౩. ౫౩. ద్వి. హరిశ్చ. ఉ.
౨౪౧౯.

౪. నెఱవేఱు, సిద్ధించు. (శ. ర, బ్రా.)

౫. విడివడు,తప్పించుకొను.

రగడ. నెరసి పోఁజూచెదవు నిలు నిలువుమా
కనము,గురియు తేనెలజేబుకొన్న దంతట వ
నము. మనుచ. ౩. ౭౪.

జః నెర,నెరపు, నెరయించు, నెరయిక, నెరవ
చ్చు, నెరవరి, నెరవు[1].

నెరవంజి=నెరవెంద. వి. తీక్ష్ణగంధము, మునగ.
(శ. ర, బ్రా. నెలవంజి. అని చి. ని.)

నెరవచ్చు. అ. క్రి. (నెర+వచ్చు.) అధికమ
గు, ఎక్కువయగు.

సీ. కాంతిసంపద నిశాకరుతోడ నొరసిన మె
చ్చు మీఱఁగ నెరవచ్చువాఁడు. ఆ...మం
త్రిభాస్కరుఁడు. దశకు. ౧. ౬౫.

నెరవరి. విణ. (నెరవు+అరి[3].) నేర్పరి,కుశలుఁడు.

చ...అట్టిదుగ్నయపుటోరడి కెంతయు నిమ్య
కొల్పుటల్, నెరవరి గాఁడు రా జనుచు
నిష్ఠురవాక్యము లుగ్గడించుచున్. రంగా.
౨. ౧౦౯.

నెరవిడి. వి. (క. నెఱవణిగె.) అతిశయము, ఆధి
క్యము.

సీ. రథ్యాప్రతీకోత్థరవముచే గిరికోటి పిడుగుల
నెరవిడిఁ బెంఁదుకొనఁగ,ఉ. హరి. ౩.౨౪.
(శ.ర.పా,చి.ని.పా. నెఱవిడి. ముద్రి.పా.)

క్రి. విణ. నిండుగా,పూర్ణముగా.

క. మెఱుఁగు లగువాఁడిచూడ్కులు, నెఱుఁకు
లుగాఁడఁగొన నగజ నెరవిడిఁ జూడన్,దె
ఱపిఁగొనుకతనఁ గా కెటు,బెఱనాఁడమ్మరు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శరంబు భేదించు హరుణ్. ఉ.సం.౫.౫౧౮.

నెరవు.[1]= నెఱవు. వి. (√నెరయు.) ౧. పూర్తి, సమృద్ధి. (శ. ర.) ౨. వ్యాపనము. (శ.ర.)

౩. మార్గము.

ద్వి. ఆనెరవును మీఱి హంసము లరుగు, నాపైని గారుడం బైనమార్గంబు. రం. రా. కిష్కి. (శ.ర.)

౪. (=నెలవు.) స్థానము, పట్టు; చుట్టుపట్టు.

క... పగ లెఱుంగకయే, మృగములఁ బరిపాలించుచు, నెగడెడుసింగములగముల నెర వగు దానిక్. ఘటికా. ౨.౨౭౪.

వ... ఇట్లు పెల్లయినప్రోఁతను దరంగితంబు లైననెరవుల పెంపునఁ బురంబు చంద్రోదయ ఘూర్ణమానం బైనమహార్ణవంబు ననుకరించె ...భార. శాం. ౧. ౩౬౦.

సీ. నిట్టులు ద్రోచుచు నెరవులకలమేర లెల్లను బిగి యెక్కి యేర్పడంగ. ఆ...చన్నులు... నివ్వటిల్లు, చునికిఁ దెలుపుచునుండ నుత్తర సను దెంచె...భార.విరా.౧.౨౪౫.

౫. పరివారము, అనుచరవర్గము.

సీ. అగపతి విల్లు పన్నగపతి గొనయంబు హరి గోల గతి గరు డనల మమ్ము, పవనుండు వేగంబు దివిజగణంబులు నెరవు లై యీశుండు పురము లేయఁ. గీ. దలఁచినంతన...హ. సం. ౨. ౧౬౦. (వ్రాఁతప్రతి పా.)

చ...డివా, కరనుతు తెంపు రాఘవులగర్వము నొక్కొకవానిఁ గొల్చు పె, న్నెరవులసంఖ్య లం గలయ నేర్పున నేర్పడఁ జూచి రండొగిక్. భా. రా. యు. ౩౦౫.

క. తరు వొకటి పెఱికి లాంగల,ధరుఁ డుద్ధతిఁ బూంచి హయరథద్విపసుభటో, త్కరముల ప్రగింపఁగ న, న్నెరవులు విచ్చుటయు మేదినీధరుఁ డలరెక్. హరి. ఉ. ౩. ౯౩.
భార. విరా. ౩. ౨౬.

విణ. ౧. పూర్ణము,సమృద్ధము; అధికము.

చ. భిదురధరుండుఁ జక్రియును బెట్టుగ దీర్ఘవిచార మింత చే, యుదు రఁట దైత్యుఁ డెంతబలియుండొ కదా యని కోఁచవాలికి, ట్లుదుటున వానిఁ ద్రుంతు నను నొక్కనిఁ బంపిన నంటి చాలదే, యిది నెర వైనబంటుతన మిట్టిది నీక తగుం గుమారకా. ప్రభా. ౨. ౫౮.

గీ. తీర్థములు పోవువారికి దివసదివస,మటు విశేషించి కాశికి నరుగునట్టి, పుణ్యులకుఁ జేయు సత్కారములు నెరపు గఁ, బింగళాఖ్యుండు శబరరాట్పుంగవుండు. కాశీ. ౪. ౬౧.

క. తలఁపులు సమకూరెం గద, చలి తేమియు లేక యింక పేంచేయఁ దగుక్, దెల తెలవాఱె నటంచును, నెలతుక లెత్తేఁగింప లేచి నెర వగు వేడ్కక్. యయా. ౫. ౧౪౮.

౨. (క. నెరవు.) బాసట, సాహాయ్యము.

చ. ధరణిపుఁ డెందునేఁ దగదు తాఁ జన నూఱట కొక్కనిం దగుం, దొర నొనరించి పంప నరి దుష్టులుచేఁ జెనఁ డాతఁ డర్థభూ, కరితురగర్ధి లేక కొఱగాఁ డటు సేయ ద్విజాన్యుఁ డల్క కా, నెర వతఁ డుండడుక్ వలయు నిండినదుర్గబలోర్వి యీఁ దగుక్. ఆము. ౪. ౨౫౫. (శ. ర. పా.)

౩. వ్యాప్తము, వ్యాపించినది.

(యశోవర్ణనము.) మహాప్రర్ధర. మురజిన్నాభీప్రణాళీముఖమున ధవళాంభోజ మక్ పేరుగాఁ దా, నెర వై తత్పూర మంతర్నిబిడ మయి...వైష. ౫. ౧౬౧.

౪. విశాలము. (శ.ర.బ్రౌ.) ౫. యుక్తము. (శ. ర. బ్రౌ.) ౬. శక్యము, సాధ్యము.

వ...ఎదిరిమతం బెఱుంగక యెట్టి కార్యంబు నిశ్చయింప నెర వగునే... భార. ఉద్యో. ౧. ౧౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నెరవు². అ. క్రి. (క. నెరవు.) గుమిగూడు.

ద్వి. అంత విప్రజను లంతంత నెరవి, చింతమైఁ జేతులు సెక్కిళ్ల నూఁది. పండితా. మహి మ. ౨౪౪ పా.

ద్వి. పొరిఁబొరి నీక్రియఁ బురుషులు దారు, నెర వి పుణ్యాంగనానికర మేతేర. పండితా. పర్వ. ౩౪౩ పా.

నెరవు³. వి. ఒకానొకచెట్టు.

ద్వి. కొరవులు నెరవులు గురువిందపొదలు, నరు దుగాఁ బొదలినయంబాళములును. రం. రా. ఉ. ౧౧౯ పా. ౧౫ పం.

నెరవెంద=నెరవంజి. వి. తీక్ష్ణగంధము, మునగకీ. (శ. ర.)

నెరసు. వి. ౧. సికతావిశేషము, ఒకవిధమైన యిసుక.

సీ... సికతాఖ్య యిసు మన నిసుక నా నెసఁ గుచుండుఁ. గీ. దద్విశేషంబు నెరసు నాఁ దనరు...ఆం. భా. ౧. ౧౫౫.

౨. నలుసు, రేణువు.

ద్వి. కరతలాంగుళములఁ గను ఱెప్పలెత్తి, నెర సున్న దని పాఱ నిష్ఠించి యూఁదు. బస. పు. ౩. ౭౭౩ పం.

గీ. అనిమిషులగుండెలో గాల మఖిలలోక, నే త్రమున నాఁటి వేధించు నెరసు గాలి, కాలి ముల్లు కుభృత్పాలిపాలిపిడుగు, రావణుఁడు డిందె భువనముల్ రక్తిఁ జెందె. ఉ. రా. ౧. ౧౪౯.

రగడ. నింతు నింతులకంటెఁ బుప్పాడి, నెరసు నెరసులు పల్క నింతయు. వసు. ౩. ౧౪౬.

సీ. అతివచూపులకును బ్రతి యనవచ్చునే మ రునిబాణములకు నెరసు దలుచు. తపతీ. ౧. ౧౬. ('దోషము.' అని ధ్వన్యర్థము.)

౩. గవుండ్లవాఁడు కత్తులునూఱెడుపాడి. (శ. ర.)

౪. చిన్నతప్పు; లోపము; దోషము.

గీ. నెరసు పొడగానలేఁ డయ్యె నెమకి నెమ కి, సాంబుపైఁ బాంచజన్యరథాంగపాణి. కాశీ. ౬. ౭.

ద్వి. నెరసులఁ దప్పులు నెమకుచు నొక్క, వెరవు చిత్తంబున వెదకి...ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౮౩.

ఆ. కరభములకుఁ బుష్పితరసాలవాటికఁ, దిరు గఁ గంటకంబు దొరకనట్లు, కుకవికీటములకు సుకవికావ్యములోన, నెమక వీసమంత నె రసు లేదు. ప్రబోధ. ౧. ౩౦.

మ...అద్దేవుని నాశ్రయింప వలని న్వీక్షించి యామాడ్కి యే, నెరసుం బొందక యుండ వచ్చి మముఁ బా నెమ్మిన్ మహాభాగ్యసుం, దరుఁ డక్రూరుఁడు చూచుఁగాత...హరి. పూ. ౮. ౬౫.

౫. కళంకము, మఱక.

సీ. నిండారు చందురు నెరసు తక్కువపడఁ దిల కించుముద్దుమోముల బెడంగు. హరి. ఉ. ౭, ౪౭.

౬. అసత్యవచనము, కల్లమాట.

రగడ...నింతు నింతులకంటెఁ బుప్పాడి, నెరసు నెరసులు పల్క నింతయు. వసు. ౩. ౧౪౮.

విణ. నలుసు, చిన్నది.

సీ. నెరసుఁజూపులతోనె నెయ్యంబు కూర్మికి నెర వైపరీత్యంబు నిగుడుచుండ. విక్ర. ౪. ౨౦౩. (క్రేఁగంటిచూపులు అని భావము.)

నెరసుదెగడు=తప్పులెన్ను, నిందించు.

సీ. కను ఱెప్ప వెట్టనితన చేయికన్నులు నెటివిరి దమ్ముల నెరసు దెగడ. భా. రా. అర. ౧. ౪౩. (ఇట ఔపమ్యద్యోతకము.)

నెరసువెట్టు=దోషినిఁజేయు.

సీ. నెరసువెట్టితి పరాళిరులంతవాని నట్టేటఁ బామరకన్యగాఁడు మరపి. పి. శకుం. ౩. ౧౪౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నెరి=నెఱి. వి. వక్రత, కాటిల్యము.

సీ. నెరిఁ జుట్టుసిగ నొంటిపారగుడ్డ పనివడిఁ దీర్చుకో వెలసుంటతిరుమణులును. రా. వి. ౨. ౫౪.

సీ. మొలకచీకటి జలజల రాల్పఁగా రాదె నెరులు మించినవీరికురులయందు. పాండు.౧. ౧౧౪. (శ. ర. పా. 'నెఱులు' ముద్రి.)

విశ. వంకరయైనది, కుటిలమైనది.

సీ. నెరికురు ల్చెదరి క్రొవ్విరిసరుల్ వసివాడ నొప్పుదప్పినగొప్పకొప్పుఁ జూచి. శుక. ౧. ౨౨౬.

నెరుకు. విశ. (త. నెరుక్కు.) ముదుకయైన,దట్టమైన.

ద్వి. పిరిగొన్నపూసలపేరు లొక్కింత, నెరుకుఁగానియలపై నిగనిగ మనఁగ. అ. మ. క. ౧. ౫౦ పా. ౧౭ పం.

నెరుము. స. క్రి. రాచు; గ్రుచ్చు, పొడుచు.

ద్వి. నెరిమి డాకాలఁ బెండేరంబుఁ బెట్టి. ద్వి. సారంగ. ౨. భా. (శ.ర.)

చ. గురుకుచ వానిటొమ్మఁ జనుగుబ్బ మొన న్నెరుమంగ వాఁడు న,య్యరవిరిబోఁడిమోవిచిగు రానఁగ నెం చిసుమంత కొంకినన్. కళాం. ౩. ౯౦.

నెఱి= నెర, నెఱా, నేఱా. విశ. (త. నిఱై.)

౧. నిండు, పూర్ణము.

సీ. నెఱిచందురుని సిగ్గువఱుపంగఁ జాలునీనెమ్మోము తాలిమి వమ్ము సేసె. భార. అను. ౧. ౫౧.

చ...క,వ్వడినెఱిగిన్క కట్టిమగవారును నోర్తురె యిజ్జగంబులన్. భార.ఉద్యో.౧.౨౮౪.

సీ. ఫణివిషవహ్నిఁ జేద్పడియున్నశశిరేఖ నెఱివిసుపునఁ గాంతి వఱలునట్లు. కు. సం. ౪. ౯౯౪. దశా. ౨. ౨౮౧.

౨. పెద్దది, గొప్పది.

క. నెఱిగొండలు గువ్వలచే, నఱుగునె యీమంటిదిబ్బ యిది నాచేతం, దఱుగునె నానాఁటికిఁ గ్రొ,మ్మెఱఁ బెరుఁగుచునున్న దెట్టిమాయయొ యెఱుఁగన్, భోజరా. ౩. ౭౯.

సీ. కలహంసపై కూడుగా నెలఁగెడుగయ్యాళి నిష్ఠురత్వము సూపునెఱకరాలి. శుక. ౩.౧౭.

చ... మత్కరవినూతనహారముఁ జేరఁ బోయి యా,నెఱిదొరకంఠపీఠమున నిల్పితి నిల్పఁ బ్రఫుల్లనేత్రుఁడై. వసు. ౪. ౯౫.

౩. ఉత్తమము, ప్రశస్తము.

ద్వి. నెఱిరంగునీలాలనెలకట్టుమీఁద, గిఱికొనగాజు నిగిడ్చి పై నింపి. ద్వి. పారిజా. పూ. ౨౧౩.౨.

ఉ. ప్రాఁగుపెత్తువంటి నెఱిపాఱుకొలంబునఁ బుట్టి...పాండు. ౩. ౩. పారి ఉ. ౬.౧౬.౨.

౪. వాఁడి, నిశితము.

వ...వనంబు గనపగొడ్డండ్ల నెఱగత్తుల నఱికి పడసైచుచుం దెరువు గావించికొని... హరి. పూ. ౬. ౭౯.

క. ఒక్కొకనెఱినారసమున, నెక్కుడువడి వారియురము నేసి నిలుపుచున్. భా. రా. యు. ౧౦౨౬.

ఉ. కమ్మనివింటిజోదు నెఱకైదువు లైనమిటారితమ్ము లీ,తమ్ముల నెట్లు వోలు... వసు. ౫. ౧౦.౧.

౫. సమర్థుఁడు, కుశలుఁడు.

గీ. పరఁగు నమ్మేటి నెఱిరాతుప్రాఢిదికన. ప్రభా. ౨. ౩౩.

సీ. గోడ దొల్చెడుఁబాఁగ గుట్టింపునెఱిజోదు గాటంపుటక్కటికములపాదు. అచ్చ. రా. బాల. ౪. రామా. ౪. ౭౭.

నెఱిఁకులాడు. అ. క్రి. (నెఱిఁకులు+ఆడు.) ఆయువుపట్టున గ్రుచ్చుకొను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆ. ఎఱుఁగ నన్ను నఱక యేసినశరములు, నెఱఁ
కులాడి నాదు నిశితదివ్య, విశిఖతతులయట్లు
వేదన గావించు,టిది యపూర్వ మీతఁ డె
వ్వఁ డొక్కొ. భార. అర. ౧. ౩౧౪.

క. ఇనుఁ డస్తమించెఁ జీకటి,యును మొగులును
వడ్డగించె నుగ్గలి నాకుం,జన శక్తి లేదు దర్ప
కు,నసగ్గశాస్త్రములు నెఱఁకులాడెడుఁ దో
డ్తోన్. మార్క. ౨. ౧౬౩.

గీ...విశల్యకరణికలన, నెఱఁకులాడినయలుఁగులు
వెడలి పోయి. భా. రా. యు. ౧౧౨౦.

నెఱఁకులేయు. స. క్రి. (నెఱఁకులు+ఏయు.)
మర్మభేదనము చేయు.

గీ. తరుణి నతనాభికుండలోదంచనాభి,రామ
రోమావళీజ్యావిరాజమాన, నీదుతను వుండ
విలు సేసి నెఱఁకులేయు, రతివరుఁడు హారగు
ళికల రాజహంసు. నైష. ౨. ౯౭.

ఇల్లే: నెఱఁకులుమీటు.

చ. కఱతలు పెద్ద వీని కిటు కాతియఁ బెట్టెడు
మాన కేమిటన్, నెఱఁకులుమీటుచుండుఁ
దననీచపుమాటలు...నృసిం. ౪. ౧౩౫.

నెఱక. వి. (త. నెరికుళం.) వెండ్రుక, కేశము.

సీ. మత్స్యోదరకృయు మావువెన్నెఱకఁ గుట్టిన
రూటితిపిరిదండెయను మెఱయ. ఆము.
౬. ౬.

ద్వి. తుఱఁగలింపఁగ భక్తి నెఱక లుప్పొంగ.
పండితా. పురా. ౯౦. పా.

సీ...వెండ్రుక నెత్తి నెఱక నాఁగఁ దనరుఁ గే
శ,ము...ఆం. భా. ౨. ౧౪౫.

గీ. నెఱులు కురులు వెండ్రుకలు నా నెఱకలు...
ఆం. నం. మాన. ౧౯.

నెఱకాఁడు. విణ.(నెఱవు+కాఁడు. త. నిఱైయ
న్.) ౧. పూర్ణుఁడు. (శ.ర.బ్రా.) ౨. ప్రియుఁ
డు, ఇష్టుఁడు.

వ...బెడంగుతరఁగలతో దొరయు నెఱకాని నె
నరుఁబలుకుల వెనుదవిలి యలరించు జక్కవ
పెంటులును... అచ్చ. భా. ౨. ౧౬. పా.
(సహచరం=ప్రియమ్ అని. సం. కిరాత.౬.
౮ శ్లో. వ్యాఖ్య.)

నెఱతనకాఁడు. విణ. (నెఱతనము + కాఁడు.)
పూర్ణుఁడు, నెఱతనముకలవాఁడు.

(స్వారోచి.) చ. నెఱతనకాఁడునై మెఱసె నిర్మ
లకాంతి విలాసరేఖలన్. మనుచ. ౪. ౭.

నెఱతనము. వి.(నెఱ+తనము.) ౧. వైశాల్యము,
పూర్ణత.

సీ ...నెఱతన మన నాభోగసంజ్ఞయై యడ
రును...ఆం. భా. ౨. ౧౬౩.

౨. కుశలత, జాణతనము.

సీ. వినయవిధేయవివేకశీలతలచే ననుకూలతయు
నెఱతనము నేర్చి. వి. పు. ౪. ౨౨౦.

క. ఆవింటిత్రోన యూతని,లావును నెఱతనము
తేజు లాగుకొని...అచ్చ. రా.బాల.౨౧౮

సీ. తారుణ్యములె చాలఁ దలఁపులు గరఁగింప
నెఱతనం బేలొకో నేర్చి రిట్టు. కవిక. ౧.
౨౦.

౩. శక్తి, సామర్థ్యము.

సీ. వాతాపి జఠరాగ్ని వైచి పొక్కిటక్రిందు
నిమ్మరటిగించిన నెఱతనంబు. తారకబ్రహ్మ
రాజము. ౧. ఆ.

౪. ధర్మము, న్యాయము.

ఆ. పొలసుదిండికొలపుతలకట్టవై పెఱ,తెఱవఁ
గొనుట నీకు నెఱతనంబె. అచ్చ. రా.యు.
౩౦.

నెఱను. వి. ఔ. (దీనినువర్ణమునకు ఏకవచనమున
వికల్పముగాను బహువచనమునందు నిత్యముగా
ను బిందుపూర్వక మగు 'కు'వర్ణ మాదేశముగా
వచ్చును. ఉదా: నెఱఁకన్, నెఱఁకులు మొ.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧. మర్మస్థానము, ఆయువుపట్టు.

గీ. లోఁబడు నెత్తుటి నోడ లెల్ల దోఁగ నట్లు, నెఱిన నోఁగొన్న యక్కోలఁ జెక్కి వైచి. భా. రా. యు. ౧౦౮౭.

క... వైరివీరుల, నెఱఁకులు దూఱంగ నేయు నృపపుంగవు నం,పఱ కోర్వక... భార. ఆది. ౮. ౨౦౨.

ఉ. నూతు నెఱింకు లంటె నృపనూనుశరీరము గాఁడె... దశకు. ౨. ౩౬.

చ. పఱపెదఁ దత్పిశాచముల భగ్నము సేసెద దేరు సారథిన్, నెఱఁకులు నొంచెదన్... భార. విరా. ౮. ౨౦౧.

౨. కీలు, అవయవసంధి.

సీ. సవ్యాపసవ్యముల్ శరము లేయుట మాని నెఱఁకులు విఱుగంగ నిలుగువారు. వరాహ. ౧౧. ౧౨౬.

౩. మర్మము, గుట్టు.

క. మఱచితిగాక లతాంగీ, కఱకంఠునితోడ నాడు కాత్యాయని నీ, నెఱి నెఱిఁగి నాఁడు చెప్పిన, తెఱఁగిదె సమకూరె... ఉ. హరి. ౪. ౯౭. (శ.ర, వీరేశ. పా.)

ఆ. తరుణి వలరసంబు దఱిమి పైఁ బడనున్న, నెఱి నెఱింగి కూడ నేర కేల, చేల నైతి ననుచు బాలేందుధరుఁ డాత్మ, చింత విడిచి విరహ చింతఁ దగిలె. కు. సం. ౬. ౭౧౯.

జః నెఱఁకులాడు, నెఱఁకులేయు.

**నెఱపు**=నెరపు. స. క్రి. (√నెఱయు. త. నిఱైప్పు.) ౧. అతిశయింపఁజేయు, సంపాదించు.

సీ. మంచిపున్నమచందమామవెన్నెలచంద మొందు కప్పురగంధ మొఱపు నెఱప. ఉ. రా. ౬. ౨౪౮.

సీ. నీరుపట్టుకయును నీరుపట్టువయును బూరయుఁ దోడవు నై బోలుపు నెఱప. అన్న. రా. బాల. ౩.

౨. ప్రకటించు, వెలయించు; కనఁబఱచు, చూపు.

గీ. నీవివేకంబు నా ప్రీతియు నెఱపి తీవు, తల్లి దండ్రులమాడ్కి హితంబు సెప్పితి... భార. ఉద్యో. ౩. ౨౩౬.

సీ. తనువుపైఁ జిట్టుగంధము సౌరభంబులు సరి లేనిరతివిలాసములు నెఱప. వరాహ. ౧౧. ౭.

సీ. పోరెఁ బో నను బిల్వఁ జేయక తా నొక నెఱగాణ యై విద్య నెఱపు టెట్లు. కళా. ౨. ౯౬.

గీ. దేవదేవుఁడు పలుకు నత్తైవులు వినిఁ, దఱిమి నీ శక్తి యెంత యంతయును నేఁడు, నెఱపుమీ యని గర్వంబు నింగి ముట్ట. ఉ. హరి. ౬. ౭౪.

౩. వ్యాపింపఁజేయు, ప్రసరింపఁజేయు.

సీ. చదలు ముర్మ్రగఁ బర్వశక్తిశూలాదులఁ బఱపి పీనుఁగు లుర్వి నెఱపి నెఱపి. హరి. ఉ. ౪. ౧౬.

సీ... కమ్మజవ్వాజివలపు, నెఱపెడి సురటీలగాలుల గాడ్పులు సోఁకి పలుకుకిన్నెరతంతి యనుకు పలుక. శశాం. ౩. ౧౦౩.

౪. నెఱవేర్చు, నిర్వహించు.

సీ. నిత్యవ్రతంబుగా సత్యంబు పాలించు నిష్ఠ యస్ఖలితగా నెఱపె నతఁడు. భార. శాం. ౧. ౩౪౨.

గీ. తల్లి వ్రతము చెల్లింపఁగఁ దలఁపు పుట్టి, యేమి యడిగిన నిచ్చెద నే న టంటి, యిచ్చు నా కొండు నందు లే దిందుఁ గాని, ప్రతిన నెఱపు మవశ్యంబుఁ బొత్తు నోసఁగి. మార్క. ౬. ౧౪౩.

క... అత్తతిఁ జిత్తం, బూనినకపటము నెఱపం, బూనిన దై యోగయోగి బూమెలు నెఱయఁగ్. సారంగ. ౨. ౨౧౮.

౫. చేయు, కావించు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యఁగఁ బడదే. హరి. ఉ. ౧౦. ౨౦౮.

క. రథ మవిరథ మైనను సా,రథిపని నెఱసిన మహాస్త్రరాజి విధికృతిఁ, బృథ గాఱు న్నను గర్ణుని, బ్రథనంబున గెల్వ దేవపతి కిఁ బళమే. భార. కర్ణ. ౧. ౪౩.

౫. వెలయు, ప్రకటితమగు; ప్రకాశించు.

సీ...పదఘట్టనంబులఁ జదిసి తాలు. ఆ. నఱు ము గాఁగ నిట్లు నెఱయంగ సత్త్వంబు, మె ఱసి రాతి రెల్ల నుఱక పవన,తనయుఁ డరి గె... భార. ఆది. ౬. ౧౬౦.

గీ. అనిన విని వార లందఱు నగ్గలికలు, నెఱ యుమాటలఁ దనతనతెఱఁగు మెఱయ, బ హువిధంబుల నతనికి బాస యిచ్చి, యేచి నిజసైన్యములలోని కేఁగి రధిప. భార. భీష్మ. ౧. ౧౦౦. భోజరా. ౬. ౩౧౮.

మ. కఱయుఁ మాఁగును లేక పుట్టినకుభాం గం బద్భుతాపాది యై, నెఱయం గన్నులు విచ్చి చూచుతనయుఁ వీక్షించి మోదంబు నఁ. హరి. పూ. ౫. ౧౧౯.

జః నె,నెందోలు, నెచ్చెలి, నెచ్చెలి, నెచ్చె లికత్తె, నెచ్చెలికాఁడు, నెచ్చెలువ, నెచ్చె లువము, మొ.

నెఱవణి(డి). వి. (√నెఱ-క. నెఱకణి-గె.) ౧. పరిపూర్ణత.

ద్వి. మఱి యట్లు కాక యచ్చిఱుతొండఁ డర య, నెఱవణి కలభక్తినిరతుఁ డేనియును. బస. పు. ౪. ౧౨౪ పా.

౨. యుక్తి, చమత్కారము.

(వ్యవ.)వాఁడు నెఱవడిగా వ్రాసినాఁడు. (శ్రా.)

నెఱవాది. విణ. (నెఱ+వాది-శ. నిపైవాది. 'నెఱవు+ఆది' అని శ. ర.)

౧.పరిపూర్ణుఁడు.

క, అఱువదినాలుగువిద్యల, నెఱవాది త్రికాల వేది నీ వీచిలుకకఁ, నెఱవుగఁ జేపట్టిన నది, చెఱపనఁ బం డొదవినట్లు చిరకీర్తినిధీ. విక్ర. ౭. ౨౦.

సీ. నెఱవాది నని వచ్చి నీకొఱంగట నిల్చి యే చెలి వీణ వాయింప నేర్చు. విప్ర. ౪ ౧౧.

౨. జాణ, నేర్పరి.

క. అఱువదినాలుగువిద్యలు, నఱువదినాలుగుది నంబులంతన వారల్, నెఱవాదు లైనకత మున, నెఱి నొక్కొ-క నాఁటివినికి నేర్చి రి తేశా. భాగ. ౧౦ పూ. ౧౪౧౦.

సీ. బాలుఁడ నే నిప్డు బాలోచితక్రీడ లనుభ వించెద మఱి యౌవనమున, నెఱవాది నై ధర్మ మెఱిఁగి చేసెదఁ గాక యని పోవు... నృసిం. ౪. ౭౬.

క.ఎఱుఁగనివారియెదుర బల్కె,నఱిముఱి మెఱమె చ్చుమాట లాడఁగ నేలా,నెఱవాది వగుదు నీలా, గెఱుఁగవె మునిముచ్చఁదనము లేమి టి కింకఁ. భోజరా. ౪. ౩౧౪.

౩.వాచాలుఁడు,అధికముగా మాటలాడువాఁడు.

క. జూదరివి సుమాళివి నెఱ,వాదివి తమకరివి గెలువవచ్చునఁటే దా,మోదర నిను మాకు ...ఉ. హరి. ౩. ౧౧౩.

౪. సమర్థుఁడు, శక్తిమంతుఁడు.

చ. మెకములఁ బట్టి కట్టువల మీఁటి చనం జన నీక యాఁగి తెం,కికిఁ జనఁ జేయ బోనునటఁ గీల్కొలుపం బయి వచ్చె నేనిఁ ద,ప్పక పొడువంగ నేర్పు ఘనబాహుబలంబును గల్గి మేఁటివే,టరు నెఱవాదు లైనసుభటప్రక రంబులు మ్రోల నేఁగఁగ. పి.శకుం. ౭.౩. బస. పు. ౫. ౧౪౮ పా.

చ. తొలితొలి రుక్మిణీరమణితో నెఱవాదివి నై త్తమాడుమా, గెలిచెద వేని మేలు...ఉ. హరి. ౩. ౧౧౭.బస. పు. ౫. ౧౪౭. పా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నెఱవాదితనము. వి.(నెఱవాది+తనము) జాణ
తనము, నేర్పరితనము.

చ. అతిమిఱి లోకజాలము భయంబునఁ జెంద
హరిం గుఱించి ని,ష్ఠురతప మాచరించెను
వసుంధరఁ దుల్యుఁ డనంగ సమ్మునీ,శ్వరుఁ డొ
కఁ డాతపంబు నెఱవాదితనంబునమాన్పుచుం
చు స్వ,ర్గరమణుఁ డంపె నన్ను... చిత్ర
భా. ౫. ౩౬.

ఉ. లేఱె ధనుర్ధరుల్ పుడమి లెక్కకు మిక్కిలి
యొండు రెండుగా,వా రడరింతు రేటినెఱ
వాదితనం బది రెండు నొందుగా, నారసి
నేయ నేరవలదా మఱి నీవలె నెంత వింత
...మన్మథా. వేం. పంచ. ౩. ౧౯౩.

నెఱవిద్దె. వి. (నెఱ+విద్దె.) హస్తలాఘవము కల
జాలవిద్య. (శ. ర, బ్రా.)

నెఱవు=నెరవు[1].వి. (√ నెఱయు.) ౧. పూర్తి, నిం
డుతనము.

ద్వి...అది రుద్రుని తెఱంగునను, మెఱసెఁ బొ
మ్మనుమాట మిక్కిలి గాఁగ, నెఱ వార నం
దఱ నిర్జించెఁ గాన. రం. రా. యు. ౪౦౯.
పా. ౩౧ పం.

సీ. పుణ్యపంచక్రోశభూతీర్థమహిమంబు నెఱవు
గా సర్వంబు నెఱిఁగ నేని. కాశీ. ౭. ౧౧౦.
('నెరవు.' అప ముద్రి.)

౨. వ్యాపనము. (శ. ర.) ౩. మార్గము. (శ.ర.)

విశే. ౧. పూర్ణము, సమృద్ధము.

ద్వి. కఱకైనయాకుంభకర్ణునియందు, నెఱవైన
కడిమికి నిలువక కపులు. రం. రా. యు.
౪౦౭ పా. ౧ పం.

క. నెఱవగుసంపద గలిగిన, నెఱి దానం గుడు
వఁ గట్ట నేరనిమనుజుం, డఱిముఱిఁ జేనికిఁ గ
ట్టిన, వెఱబొమ్మయె కాఁడె యెన్నివిధములఁ
జూడఁగ. విక్ర. ౨. ౧౬౯.

౨. వ్యాప్తము.(శ.ర.) ౩. వ్యాపకము. (శ.ర.)
౪. విశాలము.

క. మిఱిమిఱిచీకటితో నం, దఱు రాజులు స
మర మడిగి తఁ నెల్లిటికిం,గొఱ గలకల నగు
నడువ్రుఁడు, నెఱవగుగోవర్ధనాద్రి నేలకు నను
చుక్. ఉ. హరి. ౪. ౨౭౨. (వీరేశ.పా.)

౫. అధికుఁడు, ఎక్కువవాఁడు.

ఆ. పుడమి కనితోడఁ దొడర నీలా వేమి, ఖ
రునికంటె నల్లగట్లనూను, కొడుకుకంటె గం
డ్రగొడ్డలితాలుపు, నేలవేల్పుకంటె నెఱజె
ప్పుమ. అచ్చ. రా. యు. ౩౩. (శ.ర.పా.
'నెఱయె.' ముద్రి.)

౬. యుక్తము, తగినది.

వ...అందు నందును వేఁటకు నెఱవైనవాండ్ర
నేర్పఱించి తెచ్చుటకు ననుచరుల నీవు నీ
వని నియమించి ... మనుచ. ౪. ౨౭. (శ.
ర. పా.)

౭. చతురుఁడు, నిపుణుఁడు.

ద్వి. నెఱవైనపెద్దలు నేరనియట్టి, కఱపులు గఱ
చె నీకతకారిబిడ్డ. అ. మ. క. ౧. ౩౪ పా.
౨౨ పం.

నెఱవేఱు. అ. క్రి. (నెఱవు+ఏఱు[1]. త. నిఱై
వేఱు.) ౧. సిద్ధించు, ఈడేఱు.

గీ. దివ్యకోటీర మాహారతీవ్రశక్తి, యుద్ధసహా
యకు నాకీశుఁ డొసఁగ నీవ,రుండు మద్భం
ధువై రమారూఢి నిర్వ,హించె నెఱవేఱెఁ
జెప్పెడి దేమి...రాఘవ. ౩. ౭౪. ('నెఱ
వేరు'. అపముద్రి.)

సీ. ఈడుమీఱె ననంగ నీడేఱె ననఁగను వయ
సు వచ్చె ననుట వరలు నందు, వంత్యంబు
నెఱవేఱె ననుటయుఁదోఁచును...ఆం.భా.
౩. ౯౪.

౨. ముగియు, పరిసమాప్తమగు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(వ్యాప.) దైవకృపవలన నేఁటితో నేతలఁచిన కార్యము నెఱవేఱినది.

నెఱవేఱుచు(ర్చు). స. క్రి. (√నెఱవేఱు) ౧. ఈడేర్చు, సిద్ధింపఁజేయు.

ఆ... అజవంజవసుఖా,సక్తియుక్తి నోలిసాహస మున, నీమనోరథంబు నెఱవేర్తు నేనియు, నవుల నెట్లు నైతు రార్యజనులు. కృ.శత. ౩. ౪౩.

క. కృతయుగమున వేదవతీ,సతి యై తప మొంది త్రేత జనకజ యై తా, పతిఁ దలఁచినటుల పట్టిన, ప్రతినయు నెఱవేర్చెఁ దత్ప్రభావం బసదే. ఉ. రా. ౩. ౧౩౩.

౨. ముగియఁజేయు, పూర్తినొందించు.

చ. జనకున కాహితాగ్ని వ్యచితసంక్రియల న్నెఱవేర్చె నన్నిటన్. చం. రా. ౪.౯౭.

ఉ. ఆచెలి యిచ్చ మెచ్చుకొని యాతని మ్రొ ల...వేచినయంత హోమవిధి విశ్రవుఁడున్ నెఱవేర్చి ముందటన్. ఉ. రా. ౨.౧౨౪.

నెఱసరి. వి. (నెఱ+సరి. త. నిఱైసరి.)- ౧. శౌర్యమునకు పూర్ణోపమాన మైనది-సింహము.

క. నెఱసరియు దానిపైఁ బడి, కఱవక లాఘవము లేమిఁ గాల్ద్రొబ్బుచు నద్విపఱువం గదిసిన నత్తెఱఁ గెఱిఁగి ఖరం బదరి తిరిగి యేఁగుచు నుండెన్. వేం. పంచ. ౪. ౫౭౦. (చి.ని. పా. 'నెఱిసరిగ' ముద్రి. పా.)

గీ. నెఱసరిని మించు మించుకే లాఱపు పాడము, నెఱసరిని బెంపుఁ జంపుఁగా నెఱఁతన డుము. ప్రబంధ. ౬౬౭.

ద్వి. నెఱసరి కరిఁ జూచి నిగిడి కోపించు, తెఱఁగునఁ గనలి గద్దియ డిగ్గ నుఱికి. ద్వి. పరమ. ౨. ౧౧౦. పా. ఆం. భా. ౩. ౫౬.

౨. నిండుసామ్యము, పూర్ణోపమానము.

గీ. సింహ పూర్ణోపమానముల్ నెలఁగును నెఱ, సరి యటం చని పలు కాడ ... ఆం. భా. ౩. ౫౬.

విశే. శౌర్యవంతము.

క. చఱినుండి తొలఁగ నుఱికెదు, నెఱసరిసిం గంబుఁ బోలె నిబ్బరముగఁ గ్రేళ్ళుఱికెం దొలఁగన్ బగతుని, యఱకటనుండి భువి మీఁది కబ్బలియుండున్. హరి. పూ. ౭. ౧౦౫. (శ.ర.పా. 'నెఱసింగపుఁ గొదమఁ బోలె.' ముద్రి.)

నెఱసు. వి. అశ్వశిక్షాభేదము.

సీ. పరసంబు నొందించి పల్లంబు కల్పించి నిగుడంబు సమకొల్పి నెఱసు నెఱపి. పి.శత. ౧. ౧౧౨.

నెఱా=నెఱ. విశే. (త. నిఱై.) నిండు,అధికము.

చ. కలమువనావనారపరికల్పితమంచకులమ్ములం దు వ, త్తిలుచెలువల్ నెఱాపసరు జేరెను పై రుల మీఱుకీరపం,క్తులముకుచాయలం దెలిసి తోలినఁ దక్కణిశాలిశాలిచం,చులఁ గను చొప్పు దిక్కతులచొక్కపుపచ్చల హెమ్చులో యనన్. అచలా. ౨. ౧౬. ('నెరా.' అప ముద్రి.)

క. రతనాలదొంతి వింతగు, రతినాయకుకంతి కడునెఱాపంటనపుం, బ్రతిమే కద కాంతి బళీ, యతివల పేర్ బంతి యింతి యభివర్ణింపన్. ముకుంద. ౧. ౨౩౦.

ఉ. కొమ్ములు వీరణాలు జిగిఁ గుల్కుసువ్రాఁతల కృష్ణలీలలం,గ్రమ్ము సుడాల్లు వీఁడగు కాటమరాజుకథానులాపముల్, బమ్మినపుస్తకాలు ముఖపట్టిక కట్టుపమాలులు న్నెఱా,సొమ్ములు నామముల్ వెలయుసుద్దులగొల్లలు వచ్చి రెంతయున్. హంస. ౨. ౯౭.

నెఱి. వి. (త. నెఱి.) ౧. అందము, ఒప్పిదము.

క. నెఱి గలుగు నాఁడునాఁటికి, గుఱి గడవఁగఁ బెరుఁగు జఘనకుచకచభరముల్. కు. సం. ౭. ౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. పాడి, ధర్మము.

క. ఈనీతిదప్పినమాటలు, నీనోర్గ్ వెడలఁ
దగునె నిండినసభలోన్. భార. ఉద్యో.
౨. ౧౪౯.

ఆ. నీవు సనకమున్న నీతితోడ మనకార్యము
నకుఁ దగినయత్నములు ఘటించి,యుండె నేని
వాని నొం డేమియుం జేయఁ,గలదు తోడి తె
మ్మవార్యశౌర్య. భార. అర. ౭. ౮.

౩. సౌశీల్యము, సుస్వభావము.

క. ఎఱుఁగవె యజాతశత్రుని,నీతియును ధర్మం
బు సత్యనిష్ఠయు...భార.ఉద్యో.౩.౨౭౮.

గీ. ఇట్లు తమతమవర్తించు నెడలఁ సకల,జనముల
కు హృదయానురంజన మొనర్చి,తాల్మి పు
యిలోటు యడఁకువ లేగవు మెలపు, నీతి తె
ఱంగును బాటింప నేర్పు గలిగి.భార.విరా.
౨. ౩.

౮. క్రమము ; ఉచితస్థితి.

క. మ మ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుదు,నెమ్మి యె
ఱుఁగు దరసిద్ధి నీతి యెఱుఁగుదు వా,క్యమ్ము
లపద్ధతి నెఱుఁగుదు... భార. ఉద్యో. ౩.
౩౮.

చ. అని తనమాట క్రియ్యకొనునన్నరుపల్కుల
కిచ్చ మెచ్చి యజ్జనపతి భీమునిం గవలఁ
జయ్యనఁ బిల్వఁగఁ బంచి యతెఱంగు నెఱ
నెఱుంగఁ జెప్ప...భార. మహా. ౧. ౭.

క. అఱవఱ లైనరథంబులు,నీతి దప్పఁగఁ బడి
నయశ్వనికరంబులు...భార.భీష్మ.౨.౧౩౬.

క...నీతి చెడి సురగాలి విసరి నిలువక పెలు
చన్. ఉ. హరి. ౨. ౨౮.

౫. సదాచారము.

క. నీతి గలవిప్రుం డయినను,గుఱుకొని యజ్ఞో
పవీతగురుదేవతఁ బ్రా, నీతిఁగి ధరియించు
టుచితం, బెఱుఁగక ధరియించె నేని నిలఁ
దగ దెందున్. విజ్ఞా. ఆచా. ౩౦.

క. ఈనీతిఁ గని కొని శూద్రుం, డైనను గ్రమ
వృత్తి నవ్యయం బగుపదముం,గానంబడ
యుట గల్గును...భార. అను. ౩. ౩౦౨.

౬. ఉత్సాహము, కుతూహలము.

క. అని పల్కునతనితాల్మికి, మనమున నీతి
యెఱిగి చాల మఱియును గలఁ బో,సినవెనుక
నట్లకడఁ జూ,చినగతి నను నతివ యాస
చెడ్డది గాదే. సారం. ౨. ౧౨౨.

౭. స్థైర్యము, నిశ్చలత్వము.

క. ప్రాయపువాఁ డట సదృశ, శ్రీయుక్తిఁ
దలిర్చుచిత్తరి నిశ్చె నఁట యా, హా యాతని
యాత్మ యును మెు, దాయో కులిశంబొ నీతి
దొఱంగక యుండన్. ప్రభా. ౮. ౪౮.

౮. పరాక్రమము, పౌరుషము.

క. నీతి నుఱక వైరివీరుల,నెఱఁదులు దూఱంగ
నేయునృపపుంగవునం,పఱ కోర్వక... భార.
ఆది. ౮. ౨౦౨.

గీ. అంత శౌర్యాశ్రయం బైనయట్టిమేటి, వీడు
నాకామావస్థ్రహోన్వీతధామ, కాంతిఁజూచి
పోయెద నని కదలి వచ్చె,నాఁడ నిట నూపు
మదనుగుణక్రమమున. రాఘవ. ౨. ౯౮.

క... నీతి దప్పక పోరె యామినీచరుఁడలుకన్.
భా. రా. యు. ౨౦౯౮.

౯. సాహసము, తెగువ.

గీ. ఇవ్విధంబునఁ దనపోక లెఱుఁగనీక, మగని
జోకొట్టి నీతి వచ్చి సోగసు జెట్టి, వాడలోఁ
గూడు జారుల...శుక. ౩. ౧౬౩.

ఆ. మానినాథ పఖుఁడు మానధనాఢ్యుఁడు, ని
న్ను నన్నుఁ గన్న నీతి వధించు.సు రా.౨౮.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧౦. విధము, రీతి.

క. అకట భవచ్చిత్తము నిర్వికార మై భరితధృతివివేకవినయశాంతిక మగుచు వెలింగెడు దీనికిఁ గారణ మైన నిష్ఠ నెఱి యెట్టిదియో. భార. శాం. ౪. ౪౬౯.

క. ఏ నిచ్చట నిద్రితనై, యీ నెఱి నుండంగఁ బురుషుఁ డెవ్వఁడొ యుపగూహానుభవంబున వికృతంగా నొనరించె నది కలయొ కాదో యెఱుఁగన్. హరి. ఉ. ౭. ౯౦, ౬. ౫౧.

౧౧. (=నెరి.) వక్రత, వంకర.

గీ. ఇంతికచములు నెఱి గలయింద్రశిలలు. చంద్రా. ౬. ౧౨౯.

క. నెఱి మిగులఁ గలిగి నలు పై, తఱచై మదనప్రతాపదావాగ్నిశిఖల్, మెఱయుననవధూమమనఁగాఁ, దెఱవరుఁ గచభరము వచ్చె దేవుని కరుణన్. కాళ. ౧. ౫౩. ద్వి.పారిశ్చ.పూ. ౧౨౨౬ పం.

౧౨. (పక్షియీఁకలు మొ.వాని) చిక్కు, మెలి.

సీ. అలఁతిఁ జీరినయొఱకలనెఱిఁ దీర్చు జక్కవలు చెందొవల కేఁకట యొనర్ప. భార. ఉద్యో. ౨. ౧౧౨. (కరాళిప్రతి. పా.)

ద్వి. నీలాలకంబుల నెఱులు దీర్చుచును ద్వి. పారిశ్చ. పూ. ౧౦౫౪ పం.

౧౩. పక్షము, వైపు.

ఉ... నేను నా, సేనయు దాడివెట్టెద విశృంఖలతం బ్రతిపక్షువెంట మీ, రీ నెఱికిన్ సహాయపడు టొప్పని మేనిఁ గడంగుఁ డుక్కునన్. హరి. ఉ. ౩. ౯౯.

క. తా నిది గెలిచితి ననియెడు, నేను గెలిచియుండ నీతఁ డిది యేఁటికి మీ, రే నెఱికి నిజము చెప్పుఁడా, నా నొకరును బలుక రై రి నమితానను లై. హరి. ఉ. ౩. ౨౩౬.

౧౪. ఱెక్క, పక్షము.

క. ఎఱకలు విచ్చుచుఁ దుండము, దెఱచుచు ఫ్రేఁగడరి సొగసి త్రెళ్లి వివశుఁడై, యఱచిన నోడకు మని హరి, నెఱి చక్కఁగఁ ద్రోచి యెత్తెను గయుంగఁ గృపన్. భార. ఉద్యో. ౩. ౩౦౧.

గీ. కఱకుటంఘ్రుల నిఱికించి గజ్జె గదలఁ, గఱికి నెఱి నెఱికోలెమ్ముకయును నిఱుఁగ,; నిఱిచె వడిఁ గైజా నొక పెద్దవేసడంబు. హనుమ. ౪. ౫౮.

౧౫. నిగ్గు, కాంతి.

గీ. నిగ్గు చిరుగడ్డ కుటిల బు నెఱి యనఁదగు. ఆం. భా. ౩. ౬౧.

౧౬. వస్త్రపుకుచ్చె, పింజె.

సీ... కచ్ఛభేదాభిధాన మెసంగుఁ గాసె కుచ్చెల కుచ్చె కచ్చె పింజె, ముంగు రింగు నెఱిక చింగు నెఱి యనంగ... ఆం. భా. ౨ ౧౫౩.

సీ. నెఱి పెటి కట్టినకెందుచెంగావి పైఁ గాంచికాఘంటికల్ కళవళింప. పాంచా. ౨. ౧౪.

సీ. మెఱుఁగుదట్టియుఁ గొంతకుఱుచగా నెఱి వట్టి సురఁటిలాగున గాలి సోఁక విసరి. జై. భా. ౨. ౮౯.

౧౭. చిరుగడ్డ. ఆం. భా. ౩. ౬౧.

౧౮. వెండ్రుక, కేశము; మెలివెండ్రుకలు; అలకలు, ముంగురులు. (ఈయర్థమున తఱచుగా బహువచనమునందే ప్రయోగములు కన్పట్టుచున్నవి.)

సీ. వికటపాటలజటాముకుటికాభారంబు కఱకైనజుంజురునెఱులు గాఁగ. హర. ౭. ౪౧.

మ. చిగురుంజిమ్మనక్రొవిలో నొకతె రాజీవాసవం బుంచి పై, నిగిడింపన్ గమకింప నొక్కనవలా నెమ్మోము వేఁ ద్రిప్పినన్, జగజంపై నెఱి గుంపు గప్పుకొనియెన్... వసు. ౩. ౧౫౮.

సీ... వెండ్రుక నెఱి నెఱక నాఁగఁ దనరుఁ గేశము... ఆం. భా. ౨. ౧౪౫.

సీ. నెఱులనున్ననికప్పు దుఱుఁగలిగొనఁ గూడి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పాదలు వెండ్రుకలు కొప్పునకు కెయిద. హరి. పూ. ౬. ౧౭౭.
సీ. నెఱివేణిఁ గూడని నెఱులు నెన్నుదుటిపైఁ గమ్మకస్తురితిలకమున నెఱయ. దశా. ౬. ౧౫.
౧౯. శక్తి, సామర్థ్యము.
సీ... నెఱి గల్గి పలుకక యుండంగఁ దగుటయూహించుటు త్రమవిధంబు. భార. అశ్వ. ౧. ౭౩.
చ... వినవే నను సంగదు సర్వగర్వముల్, నెఱి సెడ నాల్గువారిధుల నిన్నటు ముంచినవాలి పుత్రుఁడన్. భా. రా. యు. ౫౦౪.
చ... ద్వారపాలురన్, నెఱి చెడ పట్టికొంచుఁ జొర... ప్రభా. ౧. ౭౧.
విశ. ౧. (=నెరి.) కుటిలము, వంకరయైనది.
చ. నెఱికురులున్ విలోలసితనేత్రయుగంబును నొప్పు... భార. ఆది. ౭. ౭౩.
మ. నెఱులై యొప్పువినీలకేశములు సున్నిద్రానసాబ్జంబు నే, డ్తెఱ నూత్నాంబుదతుల్యకాంతి యును నై... హరి. పూ. ౫. ౧౧౯.
౨. చక్కనిది, సుందరము.
వ... నెఱితుఱుమునం జెంగలువలు తురిమె... నైష. ౬. ౪౪.
చ... భోజనందనయు... అవ్విరిం, దన నెఱిగొప్పునం జెరివినన్... పారి. ౧. ౫౫.
౩. న్యాయ్యము, యుక్తము.
ద్వి. నీకు నిచ్చినయట్టినృగుఁడు దా నుండ, నీకు నాకును నేల నెఱి గానివాడు. రం. రా. ఉ. ౧౨౭ పా. ౭ పం.
౪. శౌర్యముకలది.
క. ముక్కంటివరమునను మన, కెక్కుడు భయమావహింప హేతు వవధ్యం, డక్కజుఁడు పగతుఁడద్దెస, నెక్కొని సిద్ధింప వెటి నెఱికర్జములున్. హరి. ఉ. ౨. ౧౭౧.
౫. వాఁడియైనది, తీక్ష్ణము.

చ... మొగంబున లేఁజెమ రంకురింప జం, కెన నెఱిమాపు చూచి పలికెం జలితాధరపల్లవాగ్రయై. పారి. ౧. ౧౨౪.
ద్వి. నెట్టన మెలసున్న నెఱికత్తిఁ దివిచి. ద్వి. హరిశ్చ. పూ. ౨౦౫౬ పం.
క్రి. విశ. ద్రు. ౧. పూర్ణముగా, నిండుగా.
క... గూఢమతి నుండుద మిం, దఱుముఁ బురోచనుకృతకము, నెఱి నేర్పడునంతకును వినీతాత్ముల మై. భార. ఆది. ౬. ౧౫౪.
క. కటకంతా కుమియింపుము, నెఱి నెవ్వరికెఱుఁగ నగునె నీచరితంబుల్. భార. ఆర. ౧. ౩౭౭.
చ.. పురుషోత్తముఁ డింత యొప్పఁ బల్కనెమఱుమాట లాడ నయకోవిదుఁ డెవ్వఁడు ధీరుఁ డెవ్వఁ డిం, దనువరి యెవ్వఁ డంచు నచలాకృతు లై నెఱి నూరకుండఁగన్. భార. ఉద్యో. ౩. ౨౭౫. అము. ౫. ౧౯.
౨. గట్టిగా, దృఢముగా.
వ... నెఱిఁ జఱచియు నేలపా లొనర్చియు... వీర. ౪. ౧౦౭.
౩. మిక్కిలి, అత్యంతము.
సీ... నెట్టనయెంతేని నెఱిఁ, గరంబు, లలివారకేడ్తెఱ... అత్యంతముగ ననుట కాఖ్య లయ్యె ఆం. శే. ౫౭.
సి. నెఱి జీవనము లేక నింగిపై భ్రమియించు మత్స్యంబు దునుము చేమాటవాసి. నరస. ౫. ౧౭౨. (ఇట 'ఎంతమాత్రము' అనిభావము.)
౪. చక్కఁగా, లెస్సఁగా.
ఉ... నీవు కంటికిన్, చెప్పయుఁబోలె మాటయి నెఱిం జను లారసి యొజ్జచాడ్పునం, జెప్పుచు... భార. ఉద్యో. ౪. ౧౧౪.
క. అవయవము లెట్లు ధర్మము, నివిడించును లోని కడఁచు నెఱి నట్టుల భూ, తాత్ముఁడును, బ్రవర్తననివర్తనముల పాల్పడఁ జేయున్. భార. శాం. ౫. ౧౬౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౫. నిజముగా, వాస్తవముగా.

సీ. నెటి నిట్టి దని యింతి నీనెమ్మనం బెన్నిభం గుల నరసినఁ బట్టువడదు. భార. విరా. ౨. ౪౭.

నెటేఁబడు. అ. క్రి. (నెటేక్ + పడు.) ౧. యథాస్థితికి వచ్చు,కుదురుపడు.

చ. నెటేఁబడి యాజి నీకెుఁనలు నేరవు గూడి తగం జరింప నిం,దటుమన సాక్కఁ డై చనక తప్పఁ గదా... భార. ఉద్యో. ౪. ౧౪౩.

క. వెటికితి నలుఁగులు మేనులు,నెటేఁబడ నెల్లెడలఁ గలయ నివిరితి హారు లి,త్తటే సీథులు ద్రావక తె,ప్పిఁజవు... భార. ద్రో. ౩. ౧౬౦.

౨. సిద్ధించు,నెఱవేఱు.

క. కానియటు లుండి నెటేఁబడు,నైన తెఱఁగుఁ దోఁచి మాయ మగు నిజ్ఞంగిక్,మానసమున కుబ్బు వగయుఁ,దే నోపుం బనులు బుధుఁడు దేలఁడు రెంటక్. భార. శాం. ౩. ౨౮.

నెటి(రి)క. వి. (త. నెరి. క. నెటి.) ౧. వస్త్రపు కుచ్చెల, పింజె.

సీ. బంగారుసరిగలపట్టంచువలిపంపునెటిక మీఁగాళ్లపై నెఱసి యాడ. సురా. ౩౪.

సీ. నెటికఁగాఁ బెట్టి దండెముమీఁద వైచిన యంగదట్టము వైచినట్ల యుండె. కువల. ౫. ౩౭.

క. బురుసాకాసెరువారపు,నెరికలు కొనగోరఁ దీర్చి నీలాంబుదభా,సురచంచల యనఁ దనరుచుఁ, దెరలోనక్ న ర్తనాదిదేవతలీలక్. ప్రబంధ. ౧౦౩. ఆం. భా. ౨. ౧౫౩.

౨. పైటపావడ; గాగరా,తాబందు.

సీ. అచ్చవెన్నెలచాయ నవఘుళింపఁగఁ జాలు నిద్దంపువెలిపట్టునెటిక గట్టి. నైష. ౭. ౨౨.

సీ. నిండుచందురుకావినెటికచే రంగారుకడవన్నెబంగారుకాసె యొసఁగ. వాల్మీ. ౩. ౧౩.

గీ. విలువ యిడరానిచెంగావిచెలఁపునెటిక,నాభి విభవఁబు పొన్నెక్రొన్ననలు నింప. రా. వి. ౩. ౧౨౪.

౩. చల్లడము,స్త్రీలు తొడఁగుకొను తొడలాగు.

చ. గిటికొను గాలి వల్వ దొరఁగింపఁగ కెలుపు టింతిలోఁదొడల్, గౌటికను వోలెఁ గెంపుగమి నిద్దపుఁగ్రొమ్ములనూలిడాల్గ నెక్. అచ్చ. భా. ౩. ౧౦.

శ్లో. యుతక మివాంతరీయా మూర్వోః. సం. కిరా. ౭. ౧౪.

జః నెటికగట్టు, నెటికవట్టు.

నెటికగట్టు. స. క్రి. (నెటిక + కట్టు.) ౧. కుచ్చెళ్లు పోసి కట్టు.

సీ. అంచవన్నియతోడ నంద మైనకుఁడుంగుని దంపుఁబుట్టంబు నెటికగట్టి. కాశీ. ౩. ౨౧౨.

సీ. గొనబుగా నెటికగట్టినక్రొత్తచెంగావిచేలప య్యెదకొంగు తూలి యాడ. రాజ. చ. ౨. ౧౬౯.

సీ. అభిషేకవిధియోగ్య మగుమడుఁగొల్లియ నిర్జాభిబిలముగా నెటికగట్టి. హర. ౪. ౭౮.

నెటికవట్టు. అ. క్రి. (నెటిక + పట్టు.) కుచ్చెళ్లు పోయు, కుచ్చెళ్లు పెట్టు.

సీ. నెత్రికవట్టి పసిండిసీటివ్రాతచెఱంగు వెలిపట్టు రహిఁ గట్టె కౌలఁది యొత్తు. ఆము. ౬. ౧౨౮.

నెటికొలుపు(ల్పు). స. క్రి. (నెటి + కొలుపు.) చక్కఁగాఁ దాల్చు, ధరించు.

(దేవదేవి.) ఉ ... విభూషణసముత్కరమక్ ధరియించి హారముల్, గొప్పచనుంగవందు నెటికొల్పి తనర్చి విలాసవైఖరిక్. విప్ర. ౩. ౭౯.

నెటిడె. వి. పశురోగవిశేషము.

క. నెటిడెలు బుట్టినపసరము, నెటి విటిగియు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మేఁత యుడిగి...అరయఁగ లేకున్న యుఱము నడ్డము బెరుఁగున్. (చికి. చి. ని.)

నెఱిపట్టు. వి. పట్టువస్త్రవిశేషము.

ద్వి. నెఱిపట్టు వెలిపట్టు నేత్రంబుపట్టు. బస. పు. ౩. ౫౬ పం.

నెఱియ(ఱె)=నెఱ్ఱె. వి. ౧. (భూమ్యాదుల) బీఁట, పగులు; వివరము. కన్నము.

క. మండెడుమార్తాండద్యుతి, నెండుచు గొం డొండ నెఱియ లేర్పడఁగా భూమండలము పూర్వమున నవఖండము లయ్యెను నసేకఖండము లయ్యెన్. ద్వా. ౯. ౮.

ద్వి. ధరఁ దాఁకి పడిన నెత్తఁగ రాక ప్రాలు, నెఱియలపాలైనఁ బుడుహార నీకుఁ, గర[illegible] నర్పింపఁగా నేఁగుదెంచి. బస. పు. ౪. ౯౦౨ పం. ('నెరియలు' అని ముద్రి.)

చ. సవిత్రుమయూఖములన్ నెఱెలసందులఁ దూఱుట యొప్పె...చంద్ర. ౧. ౧౫౪.

౨. చీలిక, పాయ.

మ. స్వనదానోగ్రనిదాఘవైఖరిన యూషన్మలికల్ కామినీ,కనదానీలకచాగ్రపంక్తి నెఱియల్ గాఁ బాపఁగా...ఆము. ౨. ౬౩.

జ: నెఱియలువాఱు, నెఱెవెట్టు.

నెఱియలు(ఱె)వాఱు. అ. క్రి. (నెఱియలు+పాఱు.) బీఁటలువాఱు, పగులు.

వ...ఏఁదు పెనుమండ్లఁ బండ్లసరియలు నెఱియలువాఱె...మనుచ. ౪. ౬౦.

శా...మందరాద్రి నెఱెవాఱఁ జీఁకమె నెత్తియయ్యంభోజాకుండు పట్టి వైచె...వీర. ౩. ౨౦౬.

నెఱెవెట్టు. అ. క్రి. (నెఱె+పెట్టు.) తొలుచు, రంధ్రముచేయు.

సీ. నెలవుల వనదంశములు మూఁగి నెఱెవెట్ట...మనుచ. ౨. ౩.

నెఱ్ఱె=నెఱియ. వి. వివరము, కన్నము.

వ...వీరభద్రుశిరణంబు చూచి భీతచిత్తులై...నెఱ్ఱెలు చొరఁబాఱువారును... వీర. ౪. ౧౬౨.

నెల[1]. వి. (త. నిలా.) ౧. చంద్రుఁడు.

క. నెల లన్నియు నిండఁగ నన్నెలఁతకు జనియించె నిండునెల పున్నమరన్, నెఱకొని యుదయించుపవిది, నెఱమిఁ గొడుకు సకలకువలయేచ్ఛాకరుఁడై. హరి. పూ. ౫. ౧౦౯.

సీ. మృదునెద్దుఁ గొని గాడ్పువృషము బండిగఁ జేసి యెలయించి నెలలోనియిఱ్ఱి నేయు. కు. సం. ౪. ౩౭౯.

క. నెల వొడిచెం జెంగలువలు, నలి విడిచెన్ ...రంగా. ౩. ౧౮౩. హర. ౨. ౧౬.

౨. వెన్నెల. (చూ. నెలత్రావడము.)

౩. మాసము, చంద్రగతివలన నేర్పడుకాలమానము. (దీని బహువచనరూపము 'నెల్లు' అనికూడ కాన్పించుచున్నది.)

సీ. శౌండ్రి వధించి యెంతయు నల్కమై వీని నిం కిట నెల సమయించువాఁడ. భార. ఉద్యో. ౩. ౨౯౧.

క. నెలనెల తప్పకయుండఁగ, నెల భాస్కరుఁ జొచ్చు పెల్ల నియమముతోడన్, గలహంస పేఁడివెన్నెల, సొలయక నాయంగకములు నూఁడులకుఁ జుమీ. నైష. ౨. ౩౩.

సీ. ఏఁడేఁట నొనరింపు మితరదేశవిహార మాఱునెలలు రాజ్య మాఱునెలలు. విక్ర. ౪. ౪౩.

క. రెన్నెల్లలోన నాకుం, జెన్నొంద నధీన గాఁగఁ జేయుఁడు... భా. రా. సుం. ౭౦౪.

చ. నడలు దడఁబడం దొణఁగె నాతికిఁ దొమ్మిది నెల్లు నిండఁగన్. యయా. ౫. ౩౭. ఆం. భా. ౩. ౫౫.

౪. పూర్ణిమ, పున్నమ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. నెలచందురునికాంతి నెమ్మోము సృజియించి యకలంకవిలసనం బలవరించి. షోడ. ౬. ౩౦.

౫. కర్పూరము. (సంస్కృతమున చంద్రవాచకశబ్దము లన్నిటికిని కర్పూరము అను నర్థము కలదు. చూ. నెలవత్తి.)

౬. స్త్రీశిరోభూషావిశేషము. (శ. ర.)

౭. ఋతుకాలము, గర్భధారణమునకు యోగ్యమగుకాలము.

చ... మగఁడు గల్గియు లేనివిధంబు చేసి తా, నెలఁ గల నైన నన్నుఁ గరుణింపఁడు భోగమువారిపొందునన్. శుక. ౨. ౧౧౨.

జ: నెలకట్టియ, నెలకూన, నెలచట్టు, నెలతాలుపు, నెలత్రావుడము, నెలదారి, నెలదిండి, నెలపట్టి, నెలపాలు, నెలపురుడు, నెలపులుఁగుము.

నెల$^{2}$ = నెలవు. (క. నెలె. √నెలయు.) స్థానము, ఉనికిపట్టు.

క. అని పలుకుకలశభవముఖ, మునిజనముల ప్రశ్నవాక్యములు విని పురభి, త్తనయుఁడు తత్త్రి విధము నొక్కనెలం గుమిగూడి యునికిఁ గనఁజాలమికిన్. పాండు. ౧. ౧౫౩.

నెలఁత = నెలఁతుక. వి. ౧. స్త్రీ, ఆఁడుది.

క. ఈనెలఁతఁ గన్న మన్మథుఁ, డైనఁ జిగురుగొడుగుఁ బువ్వుటమ్ముఁ బొదులున్, లోనుగ నెజ్జలు సేయం, దా నియమింపండె శరహతాపము పేర్మిన్. భార. విరా. ౨. ౨౭.

ఉ... ఆరయఁ గశ్యపునాండ్రు దైత్యులున్, గన్న నెలంత వేలుపులఁ గన్న నెలంతయుఁ దత్సుత వ్రజం, బున్న తెఱంగు వారలసహోదర పైత్రిజగం బెఱుంగదే. ఉ. రా. ౨. ౨౨౯.

ద్వి. నెలఁత నీ వెవ్వరు నీ వేల యింత, నలఁగద విన్కానసములోన నిలిచి. రం. రా. అర. ౧౭౭ పా. ౧౯ పం.

౨. ప్రియురాలు, భార్య.

గీ. ఇంటిమిద్దెలవారికి మరుపనులకో, నెలఁత వాసినవారికి నిదుర చెడియె. ఆము. ౪. ౧౨౩.

మ. తమప్రాణేశులు గారవింపఁగ నెలంతల్ నిండుకౌఁగిళ్ల సంగదముగా నుండియు నప్పూరువునిసౌందర్యంబు భావింతురు ...కవిరా. ౧. ౯౬.

జ: నెలఁతుక.

నెలఁతుక = నెలఁత. వి. (నెలఁత + ఉక - స్వార్థమున.) ౧. స్త్రీ. ఆఁడుది.

సీ. గంధర్వ లేవురు గల రని చెప్పె నన్నెలఁతుకమాటలు నిక్క మొక్కొ. భార. విరా. ౨. ౨౧౫.

గీ. కన్నుఁగవ నశ్రుధారలు గ్రమ్ముకొనఁగఁ, నన్నెలఁతుక దీన యై యడలుచున్న. ఉ. రా. ౬. ౨౯౩.

౨. ప్రియురాలు, భార్య.

క. ఈమాడ్కిఁ జూడ నను న, క్కామినిఁ గదుఁ దిరిగి తిరిగి కనుఁగొని యెదు నీ, వేమి యిది నాకుఁ జెపుమా, నీమది యని యతని సతి నెలఁతుక పలికెన్. కళా. ౩. ౧౭౪.

నెలకట్టియ(ట్టె). వి. (నెల$^{1}$ + కట్టియ.) అర్థచంద్రాకారముగ నున్నబాణము.

(యక్షరాక్షసదానవగణములు.) వ... బల్లెములు బల్లెముల విఱువ నపర్చియుఁ జెమర్చియు నెలకట్టియలు నెలకట్టియలపై నిలిపియుఁ దెలిపియు... నారాయణుం డాఁకె... ఉ. హరి. ౬. ౫౦.

నెలకట్టు. వి. (క. నెలెగట్టు. నెల$^{2}$ + కట్టు.) శిలారత్నాదినిబద్ధభూమి, కుట్టిమము.

సీ. ...డాగులనునుఁగాంతి నయ్యెడ పద్మరాగంబుల నెలకట్టుకరణి నొప్ప. భార. విరా. ౪. ౨౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్వి. నెలకట్టు కట్టించి నిమిషమాత్రమున,వరర
త్నఖచితసువర్ణాలయంబు,విరచించి...బస.
పు. ౬. ౬౮౭ పం.

గీ. క్రేళ్లు దాఁటెడుచూపులు క్రింద నిండఁ,
గ్రమ్మి నీలాలనెలకట్టుకరణి మెరయ. రాజ.
చ. ౩. ౧౮౧.

నెలకువ. వి. (త. నిలై. √నెలయు.) స్థానము,
ప్రదేశము.

క. వినను రావణుఁ డఁట రిపుఁ, డానెలకువఁ
జొచ్చి పొదవితఁట పోరను నీ, చే నెత్తురు
గాకుండఁగ, వానిం జంపితఁట తగదె వర్ణ
సేయన్. నిర్వ. ౨. ౧౧.

నెలకూన. వి. (నెల[1] + కూన.) ౧. బాలచంద్రుఁడు.

సీ. చెలు వైనకళ లీనఁగలచిన్నినెలకూన పృథు
లవజ్రపుసరిఫేషగాఁగ. వ్యా. వి. ౩.౨౦.

గీ. ఏది మినుజాలు కనువాలు నిక్కి కేలు,నేది
శోల్చిర మెడచార యెనుకకోర, యేది
నెలకూన సామేన నిడినచాన, యితఁడు జేజే
లదొర యని యెటుల నందు.చెన్న.౩.౫౨.

౨- అర్ధచంద్రాకృతిగ నుండునది- నఖక్షతము,
నెలవంక.

సీ. నెలఁతగుత్తపుగుబ్బనెత్తమ్మిమొగడల నెల
కూనసోఁకులు నిగుడకుండ. వసు. ౬.౯౧.

గీ. తళుకునెలకూన లునుపక తనివితీఱఁ, గౌఁగి
లింపక...చంద్ర. ౫. ౭౫.

నెలకొను=నెలవుకొను,నెక్కొను.అ. క్రి. (త.
నెలెగూళ్. నెల[2] + కొను.) ౧. పాదుకొను,
కుదురుపడు.

క.కలగొన రాజసతామస,ము లయినభావములు
వికృతిఁ బొందింపఁగ మర్త్యుల కేకాంతిక
వృత్తిని,నెలకొనఁగా నెట్లు వచ్చు నిర్మలధి
షణా. భార. శాం. ౬. ౫౦౮.

ద్వి. నెలకొని యిటమీఁదనీవునీసుతుఁడు, నిల
యెల్లఁ గైకొని యిపుడు భోగింపుఁడు...
రం. రా. అయో. ౧౨౮ పా. ౨౮ పం.

క. నెలకొన్నభక్తి సద్గురు,కులమాడారత్నమగు
నఘోరశివాచార్యుల దివ్యపాదపద్మం,బుల
కు నమస్కృతి ఘటించి పూతాత్ములమై.
వరాహ. ౧. ౧౯. విక్ర. ౫. ౧౭౨.

౨. నిలుచుండు; ఉండు.

గీ. నేరుపున నిట్టు లుద్దులు నేరుపఱచి,రామకృ
ష్ణాదు లొకట శ్రీదామముఖ్యు,లొకట నెల
కొని తమతమయురుబలంబు,వెలయ లంఘిం
చుచుండిరి వేడ్కమీఱ. దశా. ౭. ౧౧.

సీ. వింగడం బైనట్టిముంగిట నెలకొన్నబృందా
వనికి మ్రుగ్గు పెట్టుఁ దాన. ఆము. ౪. ౫౦.

క.ఫలములుగోరక కర్మం,బులు నడపుచు వాని వి
మలబోధాగ్నిహుతిం,బొలియించుచు నిర్ద్వం
ద్వత,నెలకొను నేకాంతిజనులు నినుఁ గంద్రు
హరీ. భార. శాం. ౪. ౨౩౯. ఉ. రా.
౫, ౨౪౭.

౩. కలుగు, సంభవించు.

ఆ. తలఁపునఁ బ్రియంబు దనబుద్ధి నెలకొన,
నాక్షణంబ పంకజాక్షుపాలి, కరుగుదెంచి
వినయ మలరార నిట్లని, దివిజశిల్పి పలికెఁ
దియ్య మెసఁగ. హరి. ఉ. ౨. ౧౫౪.

క. చెలఁగరు కలఁగరు సాధులు,మిళితము లయి
పరులవలన మేలుం గీడున్,నెలకొనిన నైవ
నాత్మకు, నొలయుపు సుఖదుఃఖచయము యు
గ్మము లగుచున్. భాగ. ౧.౪౭౮.పాండు.
౨. ౮౪.

౩. కడఁగు, యత్నించు. (ఈయర్థమున నిది కొ
న్నిపట్ల పాదపూరకముగా కానవచ్చుచున్నది.)

క. ఆరీతి మహోపాయము,నేరిచినన్ జాఱఁ
గవయ నెలకొను మన స్సారార జగజంత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యని తెలవాఱుటఁ గని భామ కేళీవసతికిఁ
జనియెన్. హంస. ౩. ౨౪౩.

చ. నెలకొని కృష్ణరాయధరణీభుజుఁ డుత్కల
భూమిపాలుతోఁ, గలన నెనర్చి...పారి.
పీఠి. ౨౨.

ద్వి. నెలకొని తొమ్మిదినిధులును ధనదు,వలఁతు
లై నందనవనములోపలికిఁ, గ్రమ్మఁగఁ గొనిపో
వ...రం. రా. ఉ. ౩౪ పా. ౧౩ పం.

**నెలకొలుపు(ల్పు)**=నెక్కొల్పు,నెలవుకొలుపు.
స. క్రి. (√నెలకొను.)

(పాదుకొల్పు, నిలుపు.)

వ...భావంబునభూతనాథు నెలకొలిపియక్కుం
భభవసంభవుండు...భార.సౌ. ౧. ౧౧౦.

(పెట్టు, ఉంచు.)

చ...చుక్కలదొర యెండవాడి విని గ్రక్కు
నఁ దానును గాంతి వీనిలోఁ,పల నెలకొల్పె
నాఁబలుకఁ బాఱె నిశాంతనిశాంతదీపికల్.
పారి. ౨.౧౬.

**నెలగ.** వి. ధనము.

క. కలిమికిని దగినకొలఁదిని,నెలగల వెలి విడు
వకున్న నిలు వెక్కుడి దొఁ,గలయఁగ నిండి
నచెలువున, కలఁ గించుక విడువకున్న నాఁ
గనిభంగిన్. ద్వా. ౨. ౧౨౪.

**నెలచేట్టు.** వి.(నెల1+చట్టు.)చంద్రకాంతమణి.

రగడ. నెలచట్టుగెంపయొప్పు నీపాదములలక్కఁ.
ఉ. రా. ౬. ౬౧.

సీ. చిలుకునీరు దొలంకఁ దెలివొందు నెలచట్టు
పల్లెరంబులమ్రోల జంతిసాఁగి. చంద్రి. ౪.
౪౪.

ద్వి. నెలచట్టుకోటల నిద్దంపుచుణుల, నలరెను
నగరంబునందుఁ జూపట్టు. ద్వి. పరమ. ౩.
౧౪౬ పా.

**నెలతాలుపు(ల్పు).** వి.(నెల1+తాలుపు.)చం
ద్రశేఖరుఁడు, శివుఁడు.

క.అయ్యనవద్యగుణావని, యయ్యనమంత్రిమణి
నరసమాంబ వివాహం,బయ్యె సహార్యమమా
రిని,నెయ్యంబునఁ బెండ్లి యైననెలతాల్పు
రహిన్. ఉ. రా. ౧. ౩౩.

సీ. నెలతాల్పుదేవర యలిగినఁ బని గాదు వెం
డిగుబ్బలి దేక యుండనిండు. యయా. ౩.
౩౪, ౪. ౯౪.

**నెలత్రావడము.** వి. (నెల1+త్రావడము) చకో
రపక్షి, వెన్నెలపులుఁగు.

సీ. తరుణిచూపులు నెలత్రావడంబులఁ బ్రోచు
నివురుచాయల నెన్న జంతి మోవి. హ. న.
౪. ౪౩.

**నెలదారి.** వి. (నెల1+దారి.) చంద్రశేఖరుఁడు,
ఈశ్వరుఁడు.

క. బంగారుబిందె లిడి యుప్పొంగుచు ము
క్కంటిపీటఁ బొలుచును రతనం,పుంగడవలు
గడువేడ్క నొ,సంగిన నెలదారిచెంతఁ జ
క్కఁగ నిలుచుకన్. రామే. ౨. ౯౧.

సీ. అమరేంద్ర నీ వంప ననుకంప జనియింపఁ
బొలడిండినెలదారిపురముఁ జేరి. దశా. ౨.
౯౪. (ఇట శ్లేష్మవాచకము.)

**నెలదిండి.** వి. (నెల1+తిండి.) విధుంతుదుఁడు,
రాహువు.

క. అగిసెనిరుల్ కరుదలిచె, నెగయందొఁడేటి
చాల్పు లేఁగుఱ్ఱ దఱుచైె, తొఁగరాచపటువు
లన్ వెసు,వగులుచు నెలదిండిపిండుదాల్కొ
నుపగిదిన్. యయా. ౪. ౧౧.

గీ. తొలుత మ్రింగినకొఱనెల లెన్నెలవులందుఁ,
గడఁగి వెడలించు నెలదిండిగాము లనఁగఁ,
గొమ్ముఁబందులు వెడలె ఘుర్ఘురము లడరఁ,
బొదలలో నుండి...యయా.౨. ౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నెలపట్టి. వి. (నెల¹ + పట్టి.) సౌమ్యుఁడు, బుధుఁడు.

క. నెలపట్టి యిటుల నలరఁగ, నిలరై యొక నెలయు మరల నిలుఁడై నెలయున్, మెలఁగుచుఁ గ్రమమునఁ దొమ్మిది, నెలలు సనఁ బురూరవుఁ గనియె నది యంతన్. ఉ. రా. ౭. ౪౯౨.

ఇట్లే: నెలచూలి మొ.

నెలపాలు=నెలవీసము. వి. (నెల¹ + పాలు.) చంద్రకళ. (శ. ర.)

నెలపురుడు. వి. (√నెల¹.) మగశిశువు పుట్టినది మొద లొక నెలవఱకును స్త్రీశిశువు పుట్టినది మొదలు నలువదిదివసములవఱకును తల్లికి ఉండు జాతాశౌచము.

(వ్యవ.) ఆమె యింకను నెలపురిటిలోనే యున్నది.

నెలపులుఁగు(గ్గు) వి. (నెల¹ + పులుఁగు.) చకోరపక్షి.

సీ. చనుజక్కవలకు మెప్పున క్రీడబిసఖండముల లీల హారముల్ ముద్దు గులుకఁగనుఁదోయి నెలపుల్గుగవ కుంచుతళుకువెన్నెలవీఁకఁ గపురంపుఁదిలక మమర. చంద్రా. ౩. ౯౨.

నెలపొడుపు. వి. (నెల¹ + పొడుపు.) చంద్రోదయము.

చ. లలితము లైనయాపరిఖలం దగుమేడల వారభామినుల్, నెలపొడుపు ల్గనుంగొనుచు నిల్చునొయారము చూచి...కరు. ౧. ౧౧.

నెలబాల. వి. (నెల¹ + బాల.) ఋతుమతి. (చి. ని.)

నెలమసలు. అ. క్రి. (నెల¹ + మసలు.) నెల దప్పు, గర్భోత్పత్తియగు; గర్భవతియగు.

క. హరివనమాలికయంశము, ధరలోపల నవతరింపఁ దలఁచిన దైయప్పూరి నొక్కవిప్రకాంతయు, దరముఁ బ్రవేశింప సతికిఁ దగ నెలమసలెన్. వి. ప్ర. ౧. ౭౧.

క...భవత్ప్రయాణకాలంబున నీకులకాంతాతిలకం బీయలికచ నెలమసలియుండు టది యెఱుఁగ వొకో. శుక. ౧. ౧౪౦.

నెలమేపరి. వి. (√నెల¹.) రాహువు, విధుంతుదుఁడు. (శ. ర.)

నెలమొలక(లక). వి. (నెల¹ + మొలక.) బాలచంద్రుఁడు, నెలకూన.

సీ. తనతలనెలమొల్క తళతళజిగి గుల్కవెలయుము త్తెపుతురాబెళుకు గాఁగ. ఇందు. ౧. ౭.

నెలయల్లుఁడు. వి. (నెల¹ + అల్లుఁడు.) మన్మథుఁడు.

గీ...నెలయల్లుఁడు వెడవిలుతుఁడు, నాఁగ మరు నాఖ్య లగు...ఆం. భా. ౧. ౪౫.

నెలయు. అ. క్రి. (క. నెలసు.) ఉండు.

సీ. పరితాపవేదనాపరవశంబునఁ దూలి నెలసిన చిత్తంబు నెలవుకొనఁగ. కు. సం. ౫. ౬౩౪.

జః నెక్కొను, నెక్కొల్పు, నెక్కోలు, నెలకు, నెలకట్టు, నెలకువ, నెలకొను, నెలకొలుపు, నెలవరి, నెలవీసు, నెలవు, నెలవుకొను, నెలవుకొలుపు, నెలవుపడు, నెలవుపఱచు, నెలవొందు.

నెలయూటి. వి. (నెల¹ + ఊటి.) అడవిలో నుండెడిఒకజాతిఫలవృక్షము, ఒకజాతిఊటిచెట్టు.

సీ. నేరేడుపండులు నెలయూటిపండులుఁ గొండమామిడిపండ్లు దొండపండ్లు. కాళ. ౩. ౬౯.

నెలరేక. వి. (నెల¹ + రేక.) చంద్రరేఖ.

సీ. నెలరేకనుదుటిపై నీ పైనకమ్మకస్తూరిగీర్నామంబు సౌరు మీఱ. ఇందు. ౧. ౨౦.

నెలఱాయి. వి. దే. (నెల¹ + ఱాయి.) చంద్రకాంతశిల, చలువఱాయి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. నెలతాఁతిచాలునిగ్గులలోనిమిన్నేటి రాయం
చగముల నార్భటులవలన. రామా. ౧. ౧౨౪.

ద్వి. తళతళ మను పైఁడితలుపులు మించు, నెల
తాలతిన్నెలు నీడలు దోఁచు, నీలాలకంబా
లు...ద్వి. హరిశ్చ. పూ. ౧౩౨ పం.

మ. నెలతాచొక్కపుమేడలోన మగతానిద్దం
పుఁగీల్బూఁగుటు, ఱ్యెలలో బాలరు నుంచి...
ఆలరుంబోఁడులు జోలఁ బాడుదు రమందా
నందసంధాన లై. చంద్రా. ౨. ౩.

**నెలవంక.** వి. (నెల¹ + వంక.) ౧. నెలతూన, బాలచంద్రుఁడు.

సీ...పసమించు నెలవంకనొసలిదాని... గీ. సా
గనునడదాని నక్కన్నెఁ జూచె నతఁడు.
ఉ. రా. ౨. ౧౭౭.

సీ. నెలవంకనామంబు సలలితంబుగ నుంచి తిరు
చూర్ణ మామీఁదఁ దీర్పఁ జేసి. వీథి. ౧౩.
(నెలవంకనామము= బాలచంద్రాకార మగు బొట్టు.)

౨. నఖక్షతము.

సీ. బింకంపుసానులవంక రాపడి నెలవంక పైఁ
బూనినవాని మాని. వసు. ౧. ౩౬.

చ...నెలవంక లుంచి చక్కనివలిగుబ్బ చన్నుఁ
గవఁ గౌఁగిటఁ జేర్ప నిఁ కెప్డు గల్గునో. దశా.
౨. ౩౦౭. నరస. ౪. ౯౭.

**నెలవంకకత్తి.** వి. (√నెల¹.) అర్ధచంద్రాకారము గలకత్తి.

సీ. నీలిసాలువమీఁదఁ గీలుకొల్పినయట్టి నెలవం
కకత్తులతళుకు లెసఁగ. చిత్రభా. ౩. ౧౨౫.

**నెలవంకకోల.** వి. (√నెల¹.) అర్ధచంద్రబాణము.

సీ. కనుఁగొని యాతండు గరుడతుండాహతిఁ
బడగలు తెగిపడ్డపన్నగముల, గతిఁ గానఁబడ
నవి ఖండంబులు గఁ నెలవంకకోలల ద్రుంచి
పైచి మఱియు. భా. రా. యు. ౭౩౬.

ఇఙ్లీ: నెలవంకతూపు.

ద్వి...తలిరంప కాఁడు...తోలఁక నెలవంకతూపు
సంధించి, యాశధూమణి డెంద మదర రంట
నేసి. ద్వి. పరమ. ౩. ౨౮౬ పా.

**నెలవత్తి(త్తి).** వి. (నెల¹ + వత్తి.) ౧. పూగఖండము, పోఁకపలుకు.

సీ. పూగభాగములు పోలుచు బాగా లన నెల
వత్తి యనఁగను ... ఆం. భా. ౨. ౧౬౩.

క. ఎవ్వరు తెచ్చిరో కస్తురి, దువ్వట మీఁఱి
వికి నెలవత్తులు సవరం బీ, జవ్వాది యన్న
నవ్వెల, జవ్వనియూరవ్వు నయనసుంజం జూ
పెక్. బహు. ౫. ౧౧౧.

౨. పచ్చకప్పురపుఁబలుకు.

సీ. మంచివాసనల వాసించిన నెలవత్తిబా గాలు
రానులు పడఁగఁ బోసి. కళా. ౭. ౬౦.
(నెలవత్తిబాగాలు= కప్పురబాగాలు.)

**నెలవరి.** విణ. (నెలవు + అరి³.) ౧. కాఁపురముండువాఁడు.

క. ముజ్జగనులనెలవరి నిజ, మజ్జనసంశీలబుధిని
జనసముద్రా, యోజ్జీవనజీవన యగు, నజ్జాహ్న
విఁ జేరె...రామా. ౫. ౨౦.

వ...జడదారి డెందంబు నెలవరి పదినూఱు పేరులఁ
దిరుగు జేజే... ప్రబంధ. ౨౧౬.

౨= నెళవరి. పరిచితుఁడు, పరిచయము కల వాఁడు.

సీ. లేమగుంపుల లివలివలాడుతేఁ గౌనువంటివో
టికి నెలవరి యటంచు. కువల. ౧. ౨౦.

౩. స్థలజ్ఞుఁడు, స్థలపరిచయము కలవాఁడు.

క. తలవరులుకా నెలవరులుకా, బోలపరులుకా
వచ్చి యంతభూపాలునితో, మలలందుకా
నెలలందుకా, శిలలందును నెల్ల సారసితి
మే మందుకా. సారంగ. ౩. ౨౩౯.

ద్వి. తలవరుల్ నెలవరుల్ తా మె య్యై యచ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టఁ, జెలఁగుచుండిరి రాజశేఖర యతి. అ. మ. క. ౧. ౪౯ పా. ౧౧ పం. శుక. ౧. ౧౫౭.

నెలవీడు. వి. (నెల² + వీడు.) ఉనికిపట్టగుపురము.
చ. తలఁపులతిట్ట భావములతానక మాసలపుట్టి
నిల్లు గోర్కులనెలవీడు వల్వగలకూటము
...శు. సం. ౨. ౫౭౪.

నెలవీసము=నెలపాలు. వి. (నెల¹ + వీసము.) చంద్రకళ. (శ. ర.)

నెలవు. వి. (√నెలయు. సం. నిలయః. ప్రా. నిల ఓ. త. నిలై. క. నెలె. మ. నిలా.) ౧. ఉనికి, స్థితి.
క. కొలువున నెలవు వహించిన, నలువరు సాష్టాం
గ మెరఁగి...విక్ర. ౨. ౭౮.
సీ. అనుజాసీరునహంకారగరిమను నిషధాచల
ము మీఁదినెలవు సాక్షి. హర. ౭. ౨౨.
౨. వాసస్థానము, ఉనికిపట్టు.
గీ. చలువనెల వైనముత్యాలచవికలోన. హర.
౪. ౭౮.
క. ఎయ్యది కుల మెయ్యదినెల, వెయ్యది నీనా
మధేయ మిచ్చోటికి రా, నెయ్యది ప్రస్తుత
మనినం, దొయ్యలి యాబ్రహ్మచారితో నిట్లని
యెన్. వైజ. ౨. ౫౯.
౩. స్థానము, చోటు.
క. జీవుఁడు శుక్రచ్ఛాయా, భావితుఁ డైనపుడు
విష్ణు భావించుటకుం, దా వెరవరి యగుఁ
దద్గత, భావ మొసఁగు గుణము లేనిపండగు
నెలవున్. భార. శాం. ౫. ౪౨౧.
క. ఎయ్యది నీ వుండెడునెలవు...విక్ర. ౨.
౨౪౪.
గీ. నాభికందంబు క్రిందట నలినగంధి, కుండలీశక్తి
దేవత యుండునెలవు. కాశీ. ౨. ౨౨౫.
ఆం. భా. ౨. ౧౩.
౪. భాగము, ప్రదేశము.
గీ. నేమి విరిసినకతన నన్నేలనెలవు, నేమిశం
బయ్యె నదియ తా నైమిశంబు. కాశీ.
౧. ౭౭.
౫=నెళవు. పరిచయము, స్నేహము.
చ. నెలవున రాగసంపద వనీరమ చారుపికార
వంబునన్, దెలిసి వసంతురాక ఘుమనీరమ
హోత్రికిఁ దాన మూన్చి...చంద్రి. ౪. ౪౨.
౬. పట్టు, ఊఁత.
ఆ. నీకుఁ జూడ ముష్టినెలవు నాకర్షణ, గాఢత
యును బాణగతియుఁ దొంటి, యట్లొ యొం
డు భంగి యై తోఁచెనో నాకు, నున్నరూపు
సెప్పవన్న పార్థ. భార. ద్రో. ౩. ౧౯౮.
శ్లో. కచ్చిద్గాండీవజః ప్రాణ స్తథైవ భరతర్షభ,
ముష్టిశ్చ తే యథాపూర్వం భుజయోశ్చ బ
లం తవ, న వా కచ్చిదయం కాలః...సం.
భార. ద్రో. ౧౦౩. ౭.
౭. నెలవు, వ్యాపనము.
సీ. అవని యెల్లను దాన యైనది యనఁ దననీడ
నొప్పారెడు నెలవు గలిగి. గీ. తనరునొక్క
మహావటతరువుఁ గాంచి. హరి. ఉ. ౧. ౩౩.
విశే. (త. నిలవు.) ౧. నలువు, సుందరము.
గీ. ఫాలమునఁ గుంతలంబు లేర్పఱచినపుడు,
నెలవుగాఁ దోఁచె గిరికన్యనెమ్మొగంబు.
హర. ౪. ౮౨.
౨. పరిచితము, అలవాటైనది.
చ. నెల వగువాయువేగి బలునేర్పరి గద్దరి
యుక్కుగుండు ... తుపాకి నాఁగఁ జే,
ర్లలరెడిసారమేయముల నత్తఱిఁ దెచ్చిరి
కొంప ఉద్ధతిన్. ఇందు. ౨. ౫౯.

నెలవేదు=స్థానభ్రష్టమగు.
మ. కలగుండై నెలవేది యిట్లు వరటాకారండ
వాదిద్విజా, వలిఘూషించుటకన్నమున్న...
వసు. ౨. ౧౪౨. కవిక. ౯, ౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**నెలవుకొను.** అ. క్రి. (√నెలవు.) ౧. పాదుకొను, స్థిరపడు.

వ...నలునియందు... అక్కురంగలోచనచూపు నెలవుకొనియె... నైష. ౫. ౧౪౩.

సీ. పరితాపవేదనాపరవశంబునఁ దూలి నెలసిన చిత్తంబు నెలవుకొనఁగ. కు. సం. ౫. ౬౩౪.

౨. వర్తిల్లు, ఉండు.

గీ. బంధులకు నెల్లఁ గన్నులపండు వగుచు, నీవుఁ దమ్ములు సుఖవృత్తి నెలవుకొనుఁడు. భార. శల్య. ౨. ౧౨౪.

౩. కలుగు, జనించు.

సీ. దైవయోగంబునఁ దగినయుద్యోగంబు నీమానసంబున నెలవుకొనియె. భార. సౌ. ౧. ౬౦.

సీ. అనిన నాయింతి నాయందు నిగ్గిరియందు నీకుఁ బ్రియం బేల నెలవుకొనదు. మార్క. ౪. ౨౪౪.

గీ. నిర్భరశ్రాంతి నడకల నెలవుకొనియె, నక్కురంగేక్షణకుఁ జీరచిక్కుటయును. వేం. పంచ. ౫. ౬.

౪. వ్యాపించు, ప్రసరించు.

గీ. జననమరణాదులైనసంసారదురితములకు నగపడకుండంగఁ దొలఁగుతెరువు, కనువెలుంగు నీ కిచ్చితి ననిన లేచి, నిలిచి సంతోష మెద నిండ నెలవుకొనఁగ. భార. విరా. ౧. ౨౩.

**నెలవుకొలుపు(ల్పు)**=నెక్కొల్పు, నెలకొల్పు. స. క్రి. (√నెలవుకొను.) ౧. పాదుకొలుపు, నిలుపు.

క. నీవును నివ్వాక్యంబులు, భావంబున నెలవుకొలిపి పరమసమాధి, శ్రీ వాటింపుము ... భార. ఆశ్వ. ౨. ౨౧౯.

క. కావున భూమియుఁ గనకము, గోవును దానార్హవస్తుకోటికి నెల్లం, ధీవినుతా యెక్కుడగుట, నీవిమలోదాత్తబుద్ధి నెలవుకొలుపుము. భార. అను. ౩. ౧౧౧.

౨. ఉంచు.

సీ. చరణపీఠంబుల గరుడాంకమణిఖండతులసీదళంబులు నెలవుకొలిపి. నైష. ౭. ౧౧౨.

౩. అమర్చు.

సీ. మెఱుఁగులఁ గ్రిక్కొనుకొఱనెఁ గేతకిదళములతో వేణి నెలవుకొలుప. కు. సం. ౩. ౨౬౯.

**నెలవుపడు.** అ. క్రి. (నెలవు+పడు.) నెలకొను, నిలుచు. (చూ. నెలవుపఱుచు).

**నెలవుపఱుచు.** స. క్రి. (√నెలవు.) నెలకొల్పు, నిల్పు.

సీ. భానుతనూభవప్రముఖుల నెల్లను నిజనిజపదముల నెలవుపఱిచి. చం. రా. ౭. ౧౬౪.

**నెలవెలుఁగు.** వి. (నెల[1]+వెలుఁగు.) చంద్రకాంతి, వెన్నెల.

క. నెలఁతుకకన్నులనంగాఁ, బొలుపగు నెలవెలుఁగుమేపుఁబులుఁగులు దమిచేఁ, గొలఁదియెఱుంగక తిని వెన్నెలఁ గ్రక్కెడు ననఁగ నెసఁగు నెలకొనునగవుల్. యయా. ౪. ౩౫.

(నెలవెలుఁగుమేపుఁబులుఁగు=చకోరము.)

**నెలవొందు.** అ. క్రి. (నెలవు+ఒందు.) నెలకొను, వ్యాపించు.

సీ. లేనవ్వువెన్నెలల్ నెఱవొందెఁ దెఱఁగంటి తెలిగంటిగమిమోవితలిరులందు. సమీర. ౧. ౬౪.

**నెలి(ల్లి).** వి. అగ్నిమంథము, ఒకవిధమైనకూరాకుచెట్టు.

చ. గురుగొఱబొద్ది చెంచలియు గుర్చలి చిట్టితగిర్స తుమ్మి దుస్సరి బలుగూటిబొద్ది నెలి చల్మిడి పల్లెరు... హంస. ౪. ౧౩౨.

వ... నెల్లికొయ్యలు ద్రచ్చి... మనుచ. ౪. ౬౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. వారుప సురపొన్న వారిజమును బొన్న వె
ల్లి మూలుగ బిల్లు నెమిలియడుగు. హంస.
౪. ౧౧.

నెళనెళ=నెళినెళి. వి. విఱుగుటు మున్నగువాని
యందలిధ్వని కనుకరణము.

సీ. నెళనెళధ్వనులతో ఫెళఫెళ మనుగర్జి
ములు కర్ణక్షోభిధాటి మెఱయ. హంస. ౪.
౨౨౧.

నెళవరి. విణ. (నెళవు+అరి³.) ౧. పరిచితుఁడు.

క. అళుకుచు మార్జాలి తెలుసుక, కళవళపడి
లేచి మనసు గాసిల్లంగా, భళిరా యని వెలు
వడి తన, నెళవరులను చూచికొనుచు నిలు
చున్నంతన్. హంస. ౧. ౨౩౧.

౨. మర్మజ్ఞుఁడు, గుట్టు తెలిసినవాఁడు. (శ. ర.)

నెళవు. వి. రహస్యము, గుట్టు.

చ...అమ్మదవతీమణి గర్భభరంబుఁ దాల్చె ని,
న్నెళవు గృహంబులోపలను నిక్కముగా
వివరింపఁగాఁ దగున్. అని. ౩. ౧౦౫.

ఆ. నీవు గలుగుచోటునెళవు దెలియువాఁడు,
వసుధయందుఁ ద్రోవ వదలఁ డెందు. వేమ.
౩. ౭౭. వేం. పంచ. ౧. ౨౮౭.

౨. మర్మస్థానము, ఆయువుపట్టు.

సీ. మఱపించి యొల్లనిమర్మంబు లంటుచోఁ బు
ణికిళ్ల నెళవులు పుణికివైచి. కవిక. ౩.
౨౨౨.

౩. అభ్యాసము, అలవాటు.

సీ. కాలములం దప్పక త్రిసంధ్యలందు నుమా
ధీశుఁ బూజించునట్టినెళవు. చెన్న. పీఠి. ౯౭.

౪. (=నెలవు.) పరిచయము. (చూ. నెళవరి.)

విణ. యుక్తము, సమంజసము.

సీ. నెళవుగ మాటాడ నేర్చునో నేరదో పురు
షుల పను లౌనె పొలఁతిచేత. వేం. మా
౫. ౪.

జః నెళవరి.

నెళి నెళి=నెళ నెళ.

క. అట్టియెడఁ బుండ్రనందను, దట్టించి యదూ
ద్వహుండు దళముష్టిహతిన్, బిట్టడుమ న
యిదుముష్టుల, నెట్టు వొడిచె నతఁడు నొడ
లు నెళినెళి యనఁగన్. ఉ. హరి. ౩. ౪౨.

నెవడు=నెగడు. అ. క్రి. వెలయు, ప్రసిద్ధికెక్కు.

గీ. కువలయప్రీతికాముఁడై నెవడురాజు, గాఢ
రూఢప్రసన్నతఁ గాంచి తిరుగ, సాధుబు
ద్ధిని గా వైతికలంబరారి. వేం. పంచ. ౪. ౧౫౭.

నెవము=నెపము. వి. (సం. నిభః. త. నిపం.)

౧. మిష, వ్యాజము.

క...ఆతండును దత్వేనదనతాత్పర్యంబు తగ
నెవం బిడి యేప్రొద్దును నెడయుడు గగుచుది
తో, ననువర్తింపంగఁ గించిదవశిష్టము గాన్.
హరి. పూ. ౧. ౭౩.

గీ. చివురుఁ గెమ్మోవిచిఱుగాటు నెవము గాఁగ,
తామరసనేత్ర కోపింపఁ దగదు నమ్ము.
నైష. ౭. ౪౭. అచ్చ. రా. బాల. ౧౧౦.

౨. తప్పు, నేరము.

ఉ...మహీవల్లభ తత్క్షుధాబాధము నెవంబున సర్వ
ము లెల్ల నగ్నిలోఁ, ద్రెళ్లఁగ ... భార.
ఆది. ౧. ౧౨౫.

నెవయఁబడు. అ. క్రి. (నెవయన్+పడు -
స్వార్థమున.) ఎగయు, ఎగురు.

క. దివిజులు తొలుదాఁకునఁ దన్మోచిన దను
జులను మనుపులేశ్వరశరముల్, పావయని
మంటలు మింటికి, నెవయంబడి కెడప మొం
నని నిలిచిరి వారున్. కళ. ౫. ౩౪.

నెవయు=నెగయు. అ. క్రి.
(ఎగయు, ఎగురు.)

క. పవనసఖుఁ డుగ్రకణములు, నెవయఁగఁ దన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పాడవునూపెనిన ధునిమ్రోలన్. భార. సభా. ౧. ౨౫౪.

జః నెవయఁబడు.

**నెవులు=నెగులు.** అ. క్రి. (బాధనొందు.)

సీ. క్రొవ్విరు లెసఁగి పూగొలలమో పోపక నవ కంపుఁరేఁదీఁగె నెవులునట్లు కు. సం. ౮. ౯.

వి. (నొగులు, బాధ.)

క. కనుఁగొని కృష్ణుఁడు బలదేవున కిట్లను హయములకు నెవులు గడు వెసనైఁ, జననిచ్చు టగావున నీ, వనఘా కొనిరమ్ము రథము నల్లన వెనుకన్. హరి. పూ. ౩. ౨౨౦. (చి. ని. పా. 'తెవులు' ముద్రి. పా.)

**నెవ్వ.** వి. ౧. అభావము, లేమి; దారిద్ర్యము.

శా...వర్షంపునెవ్వన్ రుజన్, హావళ్లం దిగుసన్య భూప్రజల రా జాయాయిజాత్యాచితిన్, బ్రోవంగాఁ దగు... ఆము. ౪. ౨౪౫.

గీ. నెవ్వ యెద్దడి లేమి నా నివ్వటిల్లు, రిక్తతకు నామధేయముల్... ఆం. భా. ౨. ౨౧౦.

ఉ. చేరి యొకండు నెవ్వఁబడి చిక్కుచుఁ జేరెఁడుశాలిధాన్యమే, కోరు నతండు పిమ్మట నకుంఠధనోన్నతుఁడై వసుంధరం, బూరికి సాటి గాఁ దలఁచు... భర్తృ. ౧. ౩౭.

గీ. చుట్టువాలును నెవ్వ పోఁగొట్టునాలు, బిట్టుగ్రాలుపసిండిక్రొంబట్టుసేలు, మెట్టుజాలుమొగిల్పస మెట్టఁజాలు, నట్టిడాలును గలజగజెట్టిఁ దలఁతు. అచ్చ. రా. బాల. ౩.

౨. శ్రమ, ఆయాసము.

గీ. తెల్లవారినగుండెఁగిళ్లోళ్లలీఁ, నీళ్లమునుఁగుచు నొడ లెల్లఁ దెల్లఁబాఱి, నిట్టుపాసంబులను గూడి నెవ్వఁదొడరు, వెడఁగుబాఁపనతగులునఁ బడితి వేల. వాల్మీ. ౨. ౧౩౦.

గీ. నెవ్వఁ దెరువరి చల్లనినీడమ్రాఁకు, రోగి వెజ్జు సుబోలు మరుద్గణంబు, కోరి తాపత్రయవిదూరకారి శౌరి, సాద్యు భవరోగవైద్యుఁడాయంగఁ జనిరి. రామా. ౩. ౩౨.

౩. దుఃఖము, వ్యథ.

గీ. నీమనంబునఁ దగిలిననెవ్వ యెల్లఁ, బలుకు నాతోడ నాతోడు పద్మనేత్ర, దాఁచ నేఁటికి... చిత్రభా. ౭. ౧౨౦.

శా. అన్నా తల్లులు దండ్రులున్ భగినులున్ స్నల్లుండ్రు మద్భ్రాతలున్, నిన్నుం బొమ్మను వేళ నేమనిరి మా నెవ్వ ల్విచారింతురే. భాగ. ౧౦పూ. ౧౭౧౧. (ఆపద. అని శ. ర.)

క. ఇవ్విధమున దివిజాధిపుఁ, డవ్వేలఁదుకఁబొందఁగాన కాఱటపడఁగా, నెవ్వలు దొలంగిపోయిన, యవ్వడువున నినుఁడు పశ్చిమాంబుధిఁ గ్రుంకెన్. పద్మ. ౩. ౨౨. (చి. ని. పా.)

**నెవ్వగ.** వి. (నెఱ+వగ.) ౧. అధికదుఃఖము, మిక్కిలిచింత.

ఉ. నెవ్వగ యింత యేల విను నీ కెదు రెవ్వరు నీదుతమ్ములం, దెవ్వరు నూచినన్ జగములిన్నియు గెల్వఁగలారు... భార. భీష్మ. ౨. ౧౧.

ఉ...ఇపు డెవ్వరు నెవ్వగఁ దీర్చువారలు... నీలా. ౨. ౪౨.

౨. సాంతవిచారణ, పూర్ణాలోచన.

క. ఇవ్వైవాహయసలక్ష్యం, బివ్విలు మోపెట్టి నెట్టనేసినవీరుం, డివ్వనితకు వరుఁ డగు నని, నెవ్వగమీరాజు నులుకనియమము సేసెన్. భార. ఆది. ౪. ౨౩౦.

సీ. అతివిచారణసంజ్ఞయులరు నెవ్వగ యన... ఆం. భా. ౧. ౧౦౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నెవ్వడ. వి. (నెఱ + వడ.) మిక్కిలి వేఁడిమి, అధికతాపము.

సీ. పొలయునిట్టూర్పుల... వెడ బీఁటవాతి నెవ్వడ వడుమోవితో ముడిఁగి వాడిన యెల్లు వడఁకుచూప. కు. సం. ౫. ౫౪౯.

సీ. వానలు లేక నెవ్వడఁ బైరు లన్నియు వాడఁగఁ దొడఁగిన నోడి ప్రజలు. అచ్చ. రా. బాల. ౫౪. ('నెవ్వడి.' అపముద్రి.)

నెవ్వడి. వి. (నెఱ + వడి.) నిండువడి, అధికవేగము.

క. వడిముడి యారక్కసు నయ్యెడ కష్టధనుః ప్రమాణ మెడ గలుగఁగ నెవ్వడి నీడ్చె... భార. ఆది. ౬. ౨౦౬.

క. కడఁగి ద్రుపదానుజుఁడు నెవ్వడిఁ గవ్వడి నేసె నూఱువాఁడిశరములం, గడు నలిగి వాని నన్నియు, నడుమన తునియంగ నేసె నరుఁ డస్త్రములన్. భార. ఆది. ౫.౭౧.

క. అత్తఱి నీర్గక చిక్కిన,నెత్తురుఁ ద్రావుకుల వలన నెవ్వడిఁ జాల్వన్, గుత్తుకలరక్కసుఁడు విని, మెత్తంబా టూని లోన మిగుల నడలుచున్. అచ్చ. రా. యు. ౧౯౬.

నెవ్వలి. విశ. (నెఱ + వలి.) మిక్కిలి వట్రువైనది; మిక్కిలి పెద్దది.

క. నెవ్వలిసన్నులవ్రేఁగునఁ, జివ్వంకలు వంగఁగాను ... లే, మవ్వంపుఁ బొఱలనూమిడి, క్రొవ్విరులం దొక్కఁడుసుకుకోమలకో నెన్. కు. సం. ౯. ౩౧౨, ౭. ౧౨.

నెవ్వీఁగు. విశ. (నెఱ + వీఁగు.) మిక్కిలి నిక్కినది, ఉన్నతము.

క. వలపలిదిక్కున కించుక, మలఁగంగాఁ దుఱుమిడి కుఱుంమాపుసుఁబుట్టం, బలవడఁ గట్టి జరఠవల్కలమున నెవ్వీఁగుఁజన్నుఁగవఁ గప్పి తగన్. భార. విరా. ౧. ౨౯౧.

తరువోజ. వెలకు నిట్టూర్పులవెస నుచ్చలించు వెలుపునఁ గలుగు నెవ్వీఁగు వందోయి. కు. సం. ౫. ౫౭౭.

సీ. పయ్యెదకొంగులోపలఁ బిక్కటిల్లెడు నెవ్వీఁగుఁజన్నులనింపుసొంపు. కావ్యా. ౩. ౪౧.

నెసుళ్లు. వి. బ. ఒకజాతికీటకములు, ఈసుళ్లు.

చ. చివికినవిల్లుఁ ద్రుంచుటయుఁ జేసియు నొంచుటయున్ నెసుళ్ల నెఱ్ఱు చలమారఁ జంపుటయుఁ గోఁతిని జింకను గీటడంచుటల్. అచ్చ. రా. యు. ౧౯౯. (ఇట 'చుర్బలులు' అని భావము.)

# నే

నే=నెయ్యి, నేయి. (ఇది ప్రథమైకవచనమందును సమాసమునందును గాన్పించుచున్నది.)

వి. (ఘృతము.)

క. నావుకు సంజయుఁ డిట్లను దేవా పాండవులయలుక దృష్టద్యుమ్నుం, డేవెరవుమాట నైనను, నే వోసినయగ్నిభంగి నిగుడం జేయున్. భార. ఉద్యో. ౨. ౨౪౩.

సీ. నేయు నూనియయును నాయుధమ్ములునావ ధము౫... భార. శాం. ౨. ౨౭౪.

ఉ. గుప్పెఁడు పంచదారయును గ్రొత్తఁగఁ గాఁచిన యాలనే వెసఁర్వప్పును ...క్రీడా. ౧౬౬. సాం. ని. మాన. ౪౬.

నేదొప్ప=నేతిదొప్ప, నేయిపోసిన పత్త్రచషకము.

శా. ఓరం బెట్టినయప్పశాలు కడలం దొప్పార నేదొప్పలున్. పాంచాలీ. ౪. ౫౭.

నేఁజెల్ల=ఏఁజెల్ల. అవ్య. (నేన్ + చెల్లన్=నేను చెల్లునట్లుగా=నేఁ జచ్చిపోను. (నేను + చెల్లె. సంతాపమును దెల్పును. అని. శ. ర.)

తే. అకట నేఁజెల్ల నేఁజెల్ల హాకుమార, హాత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నూభవ హోవత్స యనుచు నార్తి. హరి. పూ. ౫. ౧౫౪.

నేఁడు. వి. ఔ. ౧. ఈదినము, జరుగుచున్నదినము.

క. నేఁడీబ్రాహ్మణుచేతం, బోఁడిమి సెడి రేఁను జిక్కుపోవకయుండెన్, వేఁడిమి మెఱయుశరంబుల, వాఁడిమి సొంపెల్లఁ జూపవలయుం జుమ్మీ. భార. ద్రో. ౧. ౨౩౨.

క. అచ్చట నంతర్హితుఁడై, యిచ్చఁ జనియెం దోఁచు నేఁట యెల్లిటిలోనన్. భార. విరా. ౫. ౩౦౧.

౨. ఇప్పుడు, వర్తమానకాలము.

క. నేఁడింక సెఱఁగి యొరువుల, వాఁడఁగదా యనుచు నేను వారిఁ దొఱఁగినం, బోఁడిమి సెడదే... భార. ఉద్యో. ౪. ౩౫.

సీ. చక్రవర్తిమహాప్రశస్తి నాఁడును నేఁడుఁ జెలఁగి ధర్మక్రమస్థితి ఘటించె. పారి. పీఠి. ౧౭.

నేఁత. వి. (√ నేయు.) ౧. బట్టలు నేయుట.

సీ. సరి లేని మంచిగుజ్జరినేఁత పట్టయుఁ బఱవైనరాయంచగఱులపఱుపు. ఉ. రా. ౬. ౧౬౦.

చ. పగడపుఁగోళ్లు కుందనపుఁబట్టెలు కళ్కుల నేఁతపట్టయం, చగఱులపాన్పు ముత్తెపుజాలి... కడు సొంపు వహింపఁగ నింపు పెంపుసం, పఁగివిరితావిదోమతెరమంచముపై హరి నిండువేడుకన్. ల. వి. ౫. ౧౦౭. ('నేతిపెట్టి' అపముద్రి.)

౨. ఇండ్లు నేయుట.

సీ. కఱవు గేస్తులయిండ్ల కప్పు నేఁతలయంద సుడివడి కలఁగుటల్ మడుఁగులంద. అచ్చ. రా. బాల. ౫౯.

౩. సన్నబారచాఁపులు. కవిక. ౩ఆ. (శ.ర.)

నేఁతకాఁడు. వి. (నేఁత + కాఁడు.) తంతువాయుఁడు, బట్టలు నేయువాఁడు.

సీ. తంతువాయాభిధఁ దనరు మగ్గరి యన నేఁతకాఁడనఁగను నేఁతరి యనఁ, దోఁచుఁ దద్భేదముల్... ఆం. భా. ౨. ౨౭౩.

ఉ... తొల్లిచే, సేతఁ బరిగ్రహించి యతిశిష్యునిచే నొకనేఁతకానిచే, దూతిక నొచ్చె నాత్మకృతదోషమునం గద... వే. పంచ. ౧. ౨౧౪.

నేఁతపలక. వి. (√ నేఁత.) నేఁతకాఁడు నేయునపుడు పడుగుపేకలను ఉగ్గించునట్టిపలక, వాయిదండము.

సీ... వాయదండము నేఁతపలక నఁ దగు. ఆం. భా. ౨. ౨౭౬.

నేఁతపురు(గు)వు. వి. (√ నేఁత.) స్త్రీ, సాలెపురుఁగు.

క. నేసి మఱి తాన క్రమ్మఱ, గ్రాసము గొను నేఁతపురువుగతి నీకలుగం, జేసిన యీవిశ్వము నురమాసఖ మ్రింగుదువు నీవ మరలన్ లీలన్. కవిక. ౬. ౧౪౨.

నేఁతపూఁబోఁడి. వి. (√ నేఁత.) సాలెపడుచు.

ఉ. ఆడుబుడక్కువానికి రయంబున భిక్ష యొసంగ నేఁతపూఁ, బోఁడి ప్రకోష్ఠకస్థలికిఁ బోయి... హంస. ౨. ౨౭.

నేఁతయంత్రము. మి. వి. మగ్గము.

సీ... నేఁతయంత్రము మగ్గ మనఁగను దనరుచుండు. ఆం. భా. ౧. ౬౭౬.

నేఁతరి. వి. (నేఁత + అరి[3].) నేఁతకాఁడు.

సీ. దంతువాయాభిధఁ దనరు మగ్గరి యన నేఁతకాఁడనఁగను నేఁతరి యనఁ, దోఁచుఁ దద్భేదముల్... ఆం. భా. ౨. ౨౭౩.

నేక్త. సం. విణ. (ఋ. క్రి. ఋ.)=నేజకుఁడు.

నేక్తవ్యము. సం.=నేజనీయము.

నేజ(ము)=నేజా. వి. చిల్లకోల, తోమరము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. ఆజవరాలిఁ జూచి యసురాళి సురాళి విరాళి గొన్నచో...కల్వపూ, నేజను వైచె నద్దనుజనేతలచిత్తము లుచ్చి పాఱఁగన్. దశా. ౨. ౩౦౦.

సీ...నేజ బరిచి యీఁటె యనంగఁ బరఁగుఁ గుంతము...ఆం. భా. ౨. ౨౧౪.

మ...ఆకంతుండు కేలుదోయిఁ గొని నేర్పుల్మీఱఁ బూమొగ్గనే, జను దద్వక్షము గుప్పునం బొడిచె నోజన్ క్షైత్రుఁ డౌనా ననన్. చంద్రి. ౨. ౮౩.

క. నేజముఁ గొని యిప్పాటున, నే జమునిం జేర్తననుచు నిశిచరవీరుల్, జేజే లిడ సాహసమున, జేజేలగజంబుకుంభసీమం గ్రుమ్మెన్. శశాం. ౫. ౨౫.

చ. నిగనిగ మించుచెంగలువనేజముతో వడిఁ జిల్కతేజిపై, మగఁటిమి నెక్కి శూరుఁ డయి మారుఁడు...నరస. ౩. ౩౩.

నేజకుఁడు. సం. విణ. (అ. జి. శా. అ.) ౧. శుద్ధిచేయువాఁడు. ౨. బట్టలు ఉదుకువాఁడు. వి. అ. పుం. రజకుఁడు, చాకలి.

నేజనము. సం. వి. అ. న. ౧. శుద్ధిచేయుట. ౨. చాకిపని, బట్టలు ఉదుకుట, ౩. నేజనస్థానము, చాకిరేవు. ౪. బట్టలు ఉదుకుపలక.

నేజనీయము. సం. విణ. (అ. ఆ. అ.) శుద్ధి చేయఁదగినది, ఉదుకఁదగినది.

నేజో=నేజే.

ఉ...కల్వమొగ్గనే, జా నటు చిమ్మి...మానినీ జీరిచీరి...భాను. ౩. ౨౩.

సీ. కడవన్నెజిగిపట్టునడికట్టుపడుదలఁ బట్టెంబు నేజాయు బాగుమీఱ. దశా. ౧౦. ౧౧౨. నరస. ౫. ౮౦.

తమ్మినేజావజీరుదురము=మదనకదనము, సురతము.

గీ...పొదలోని కరిగి యమ్మించుఁబోఁడి, జారుతోఁ గూడి తమ్మినేజావజీరు, దురమునను దన్నయావస్థతో రమించె. శుక. ౨. ౫౬౮.

నేజి. సం. విణ. (న్. నీ. న్.) ౧. శుద్ధిచేయువాఁడు. ౨. ఉదుకువాఁడు.

నేజ్యము. సం=నేజనీయము.

నేటించు. స. క్రి. (√ నేటు.) సత్యముచెప్పు.

క. కూటము లెఱుఁగవు మాతో, సాటికిఁ బద్యములు చెప్పి చదివెద విదిబల్, చేటు సుమీ యని పెద్దలు, నేటించినఁ గుకవి కడుఁ గినిసి జగడించున్. అప్ప. ౨. ౩౫౧.

అ. క్రి. చాఁగిలఁబడు.

అ. నిన్ను సన్నుతించి నేటించి మ్రొక్కెదు, హరి మురారి శౌరి యవధరింపు. భద్రరాజపుత్ర చరిత్రము. ౩. ఆ. (శ. ర. దృఢపడు అని శ. ర.)

నేటు. వి. (క. నేటు.) ౧. సత్యము, నిజము.

గీ. నిజ మనఁగ నిక్కువం బన నిక్క మనఁగ, నేటు నాఁగను సత్యంబు నెగడుచుండు. ఆం. భా. ౧. ౧౧౮.

౨. నిశ్చయము, నిర్ధారణము.

ద్వి. నేటుగా నీకల్లనిజములు రెండుఁ, దేటగా నిప్పుడు తెలుపకయున్న. ద్వి. సారంగ. ౨. భా. (శ. ర.)

దండకము...నీబూటకం బెవ్వరు న్నేటుగా నారయ న్లేరుగా...నీలా. ౨. ౪౧.

౩. లెక్క, గణన.

ఉ. ఆటలఁ బాటలన్ మరఁగి యమ్మునిసూనులఁ గూడి యుండుటల్, నేటురు వచ్చునే సభల...శుక చ. ౨. ౧౪౩.

విణ. ౧. దృఢము, గట్టిది.

ఆ. కలఁగి తేటవోదు గడి దప్ప వెఱచును, నీటి కుప్పనీరు నేటుమః సు. అచ్చ. భా. ౪. ౨౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ... మహోదరుతోడ నేటుగ సుషేణుఁ,డును
విరూపాక్షుతోడ రాముని యనుంగు, తోడఁ
బుట్టువు నేడ్తెఱఁ దొడర మఱియు. అచ్చ.
రా. యు. ౧౨౯.

౨. తిన్ననిది, ఋజువైనది.

సీ. నీటిపై నుఱుకుచు నేటు గా నీఁదుచుఁ
గ్రమ్మఱ నడవక దొమ్మిఁ జనుచు. అచ్చ. రా.
యు. ౭౦.

క... తెలివి నొగి నన్నింటన్, బాటిలి తొలినుడి
మిగులుచు, నే టగుచదువులకు నెల్ల నిక్క
మిది యనన్. అచ్చ. భా. ౪. ౧౩.

౩. నర్మగర్భము, మేలముతోఁ గూడినది.

చ... వాలుఁజూపులన్, గిలకిలనవ్వులు న్మిగుల
నే టగుగాటపునూటిమాటలున్, గలిగివిటా
వళిం దిరముగా వలపింతురు వేశ్య లత్తఱిన్.
రాజ. వి. ౧.౧౩౫.

జః నేటించు, నేటుకొను, నేటుచేయు.

నేటుకొను. అ. క్రి. (√నేటు.) అతిశయించు,
విజృంభించు.

క. నేటుకొని పండ్లు గొఱుకుచుఁ, జీటికిమాటి
కిని గసరు చిలుకం జిలుకా, బోటుల నల
యించెదు నీ, గోటాపన యెన్నఁడింక గూఁ
టం బడునో. నీలా. ౩. ౨౬.

నేటుచే(సే)యు. (√నేటు.) స. క్రి. ౧. నిశ్చ
యించు, దృఢపఱుచు; (నిజరూపమున) నిర్ణ
యించు.

ఆ. పొన్నపువ్వుదీటు పోల్చులోకులమాట, నో
టుచేసి పేల్పుబోఁటినాభి, విస్తరిల్లె నపుడు
వెడఁదబావిని బోల్చు, నేర్పు కాంద్రమాట
నేటుచేసి. రసిక. ౬. ౧౦౦.

ద్వి. పాటి దప్పితివయ్య పాపపుణ్యములు, నేటు
సేయఁగ లేక నిష్కారణముగ. ద్వి. శ.
సా. ౩. ౧౦౦ పా. ౧౬ పం.

౨. పాటిచేయు, గణించు.

ఆ. ముసలివానిమాట ముద్దియమాటయు, నేటు
చేసి, యేలు నేల వదలి కటకటా కడిందికార్త
కంబులు గల పాలము సొరఁగఁ దగునె
పాలఁతిఁ గూడి. అచ్చ. రా. అయో. ౧౦౯.

నేత. సం. విణ. (ఋ. త్రి. ఋ.) ౧. ప్రాపకుఁ
డు, పొందించువాఁడు. ౨. తీసికొనిపోవువాఁడు.
౩. ప్రవర్తకుఁడు, జరపువాఁడు. ౪. నాయ
కుఁడు, నడపువాఁడు. ౫. నిర్వాహకుఁడు, నెఱ
వేర్చువాఁడు. ౬. ఒడయఁడు, అధిపతి. ౭.
కథానాయకుఁడు. ౮. (దండనాములను) విధిం
చువాఁడు. వి. ఋ. పుం. ౧. రాజు. ౨. విష్ణు
వు. ౩. నింబము, వేముచెట్టు.

నేతవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పొం
దింపఁదగినది. ౨. కొనిపోఁదగినది. ౩. నడపఁ
దగినది. ౪. నెఱవేర్పఁదగినది. ౫. జరపఁదగినది.

నేతిబీఱ. వి. (√నేయి.) ౧. ఘృతకోశాతకి.

ఆ... గుమ్మడి, కాయ నేతిబీఱకాయ పుచ్చ, కాయ
నక్కదోసకాయ పట్రువసాఱ, కాయ గాదు
శ్రాద్ధకర్మములకు. వి. పు. ౪. ౨౭౪.

సీ. బీకర బీఱ నా వెలయుఁ గోశాతకి నేతి
బీఱ యనంగ నెగడుచుండుఁ, దద్భేదనా
మంబు... ఆం. భా. ౨. ౬౦.

నేతిబీఱకాయ=అన్వర్థము కానిది. (సార్థకనామ
ము కానిదాని కుదాహరణముగా దీనిని
వాడుదురు.)

గీ. నిగమశర్మాభిధానంబు నేతిబీఱ, కాయయును
బోలె నయథార్థగాథఁ దాల్చు, వైదికాచార
దూర ప్రవర్తనముల, వీటు విహరించుచుండు
నవ్వీటిప్రోగు. పాండు. ౩. ౧౩.

నేతిబీఱపస=నేతిబీఱకాయయొక్క పసవంటిపస
గలది.

శా... తోడంబుట్టువునింటిపైఁ దెగవో నిన్

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దోషాకరుం డంట కీ,జాడల్ సాధులు నే తిభీఋపస వో చంద్రాదిపామర్థముల్.కవిరా. ౩. ౧౩౧.

నేతివసంతము. వి. (√ నేయి.) నేతితో ఆడువ సంతము.

క. ఓతల్లి మాకుఁ గృష్ణుఁడు,చేతోవిభుఁ డైన వాఁడు చెలువల మెల్లన్, నేతివసంతము లాడుచు,జాతర నేసెనము భక్తిచాతురితో డన్. భాగ. ౧౦ పూ. ౮౦౯.

నేత్రచ్ఛదము. సం. వి. అ. పుం. కను ఱెప్ప.

నేత్రజలము. సం. వి. అ.న.బాష్పము, కన్నీరు.

నేత్ర(ము)పట్టు. వి. పట్టువస్త్రభేదము.

వ...ఉదయరాగపట్టులును నేత్రపట్టులునువజ్ర పట్టులును నను పేళ్లుగలపుట్టంబులు...ద్వా. ౩. ౧౮౮.

ద్వి. నెటిపట్టు వెలిపట్టు నేత్రంబుపట్టు. బస. పు. ౩. ౫౬ పా.

నేత్రపర్యంతము. సం. విణ. (అ. ఆ. అ) కంటి కడకును ఉండునది, నేత్రావధికము. వి.అ.పుం. అపాంగము, కడకన్ను.

నేత్రపర్వము. సం. వి. న్. న. కనుపండువు; కనుపండువుచేయువస్తువు.

ఆ...సిరి వరింప నభినవోజ్జ్వ, లత్వ మొంది దివిజులకు నేత్రపర్వ మై, పాలిచి యింద్రుఁ డాత్మపురికి నరిగె. భార. శాం. ౫. ౧౫.

నేత్రపాకము. సం. వి. అ. పుం. నేత్రరోగవి శేషము.

నేత్రపిండము. సం. వి. అ. పుం. ౧. నేత్రగో ళకము, కనుగ్రుడ్డు.౨. పిల్లి,బిడాలము. (వాచ.)

నేత్రపుష్కర. సం. వి. ఆ. స్త్రీ. -కంటినుండి దుష్టజలమును స్రవింపఁజేయునది - రుద్రజటి.

నేత్రబంధము. సం. వి. అ. పుం. బాలక్రీడా విశేషము, దాఁగిలిమూఁతలు. (వాచ.)

నేత్రమలము. సం. వి. అ. న. దూషిక, కంటి పుసి.

నేత్రము. సం. వి. అ. న. ౧. నయనము, కన్ను. ౨. తరిత్రాఁడు, కవ్వపుత్రాఁడు. ౩. వస్త్రము; వలిపము, వస్త్రవిశేషము.

గీ. గరుడపచ్చలు నేత్రముల్ తురగవళ్ళు, హంసవళ్లును పద్మాలు హరిణవళ్లు, మొద లుగా వల్వలు ధరించి ముదితే లపుడు. ప్రబంధ. ౨౭౨.

౪. వృక్షమూలము, వేరు. ౫. వస్తిశలాక, వస్తి చేయుటకుసాధన మగుకడ్డీ. ౬. రథము, తేరు. ౭. ఏఱు,నది. ౮. జటు, జడ. ౯. నాడి. ౧౦. (గణిత.) రెండు అనుసంఖ్య.

నేత్రముషము. సం. విణ. ౧. చూపు నాకర్షించునది. ౨. నేత్రములు మిఱుమిట్లు గొనఁ జేయునది, దృష్టి చెదరఁ గొట్టునది.

నేత్రయోని. సం. వి. ఇ. పుం. ౧. -యోనుల వంటికన్నులు కలవాఁడు- ఇంద్రుఁడు, వేగన్నుల వేలుపు. ౨. -అత్రినేత్రము జన్మస్థానముగా కలవాఁడు- చంద్రుఁడు.

నేత్రరంజనము. సం.వి.అ. న-కన్నులను రంజి ల్లఁజేయునది-కాటుక.

నేత్రరోగహము. సం. విణ. (న్.) నేత్రరో గములను పోఁగొట్టునది. వి. న్. పుం. వృశ్చి కాళి, తేలుకొండిచెట్టు.

నేత్రరోమము. సం. వి. న్. న. పక్ష్మము, కను ఱెప్పవెండ్రుక.

నేత్రవస్త్రము. సం. వి. అ. న. నేత్రచ్ఛదము, కను ఱెప్ప.

నేత్రవిట్టు. సం. వి. ష్. స్త్రీ. నేత్రమలము, కంటిపుసి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నేత్రాంతము. సం. వి.అ.పుం. అపాంగము, కడకన్ను.

నేత్రాంబువు. సం. వి. ఉ. న. బాష్పము, కన్నీరు.

నేత్రాభిష్యందము. సం. వి. అ. పుం. కంట నీరు కాఱుట, నేత్రరోగభేదము.

నేత్రారి. సం. వి. ఇ. పుం. -కంటికి శత్రువు- సింహుండము, జెముడుః.

నేత్రి. సం. వి. ఈ. స్త్రీ. ౧. నాయకురాలు. ౨. నది. ౩. లక్ష్మి. ౪. నాడి.

నేత్రోత్సవము. సం. వి. అ. పుం, కన్నులపండువు; కన్నులకు పండువుచేయుపదార్థము.

నేత్రోపమఫలము. సం. వి. అ. పుం- కన్నులవలె నుండుఫలము కలది- బాదముః. (వాచ.)

నేత్రౌషధము. సం. వి. అ. న. ౧. పుష్పకాశీసము, అన్నభేది. ౨. కంటిమందు.

నేత్రౌషధి. సం.వి.ఈ.స్త్రీ. అజశృంగి, జుట్టుపుః.

నేదిష్ఠము. సం. విశ. (అ. ఆ. అ.) అంతికతమము, మిక్కిలిసమీపమునం దున్నది. ౨. నిపుణము, నేర్పుకలది. వి. అ. పుం. అంకోలము, ఊడుగుః.

నేదీయము. సం. విశ. (స్. యసీ. స్.) అంతికతరము, ఎక్కువసమీపమునం దున్నది.

నేని= ఏని.

(అప్యర్థకము.)

మత్తకోకిల...మదీయభాషిత మెన్నఁడు, న్నేని మోఘము కాదు దిగ్ధరణీరపీందు లెఱుంగఁ గాక. భార. ఆది. ౭. ౧౪౧.

ఉ. నీవును జూచి తట్టిసభనేని వినంబడ దేయు గంబులక. భార. సభా. ౨. ౧౫.

చ. సలలితసాంద్రకుంకుమము చన్నులపై మెయిఁ బ్రీతి నీవు నా, కలఁదినచందనంబు తడియార దు నేఁయు సంగజన్న నీ, విలసితచారురూపతను విభ్రమసంపద లీక్షణంబులోఁ, బొలుపఱఁ గాలి యాఱె...కు. సం.౫. ౫౫౧.

సీ. అఁగ కృశ్వరి వఁట్టఁ గందెదు నెలకన్న అంగవునేని... కు. సం. ౩. ౩౩౦.

క. మెట్టఁడు నారకమార్గం, బెట్టిమహాక్రూరకర్ముఁడేనియుఁ దుద నిట్టట్టనక నెమ్మనంబున, నెట్టన హరితలఁపు గలిగనేని మహాత్మా. అప్ప. ౩. ౨౧౪. (ఈపద్యమును అప్పకవి ఉభయవళులలోనినిత్యయతికి ఉదాహరణముగా నిచ్చినాఁడు. కాని పైప్రయోగములఁ బట్టి చూడఁగా దాని కాధారము చింత్యము.)

నేనిజత్. సం. శత్ర. ౧. శుద్ధిచేయుచున్న, ఉదుటుచున్న. ౨. మిక్కిలి శుద్ధిచేయుచున్న.

నేనిజమానము. సం.విశ.(అ.ఆ.అ.)=నేనిజత్.

నేను= ఏను. స.(క.నాను. త. నాన్.) నాళబ్దప్రథమైకవచనము. (దీనిబహువచనరూపము నేము. చూ. నా.)

జః నేఁ జెల్ల.

నేపథ్యము. సం. వి. అ. న. ౧. భూషణము, అలంకారము. ౨. వేషము; నాటకపాత్రములవేషము. ౩. (నాటక.) వేషస్థానము, తెరకులోపలిభాగము.

నేపము. సం. వి. అ. న. జలము. (వాచ.)

నేపాలమూలకము. సం. వి. అ. న. హస్తికందమువంటిమూలభేదము, ఒకదినుసుముల్లంగిదుంప.

నేపాళకము. సం. వి. అ. న. తామ్రము, రాగి.

నేపాళజ. సం. వి. ఆ. స్త్రీ. మనశ్శిల, మణిసిల. ఇట్లే: నేపాళజాత.

నేపాళము. సం. వి. అ. పుం. ౧. ఒకదేశము. ౨. ఒకదినుసుచెఱకు. ౩. ఒకజాతిమొక్క, వృక్షభేదము. న. తామ్రము, రాగి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నేపాళి. సం. వి. ఈ. స్త్రీ. మనశ్శిల, మణిసిల.

నేపాళిక. సం.వి.ఆ. స్త్రీ. ౧. నేపాళపుచెట్టు. ౨. మనశ్శిల, మణిసిల.

నేపుఁడు. సం. వి. అ. పుం. పురోహితుఁడు. (వాచ.)

నేబీఱ=నేతిబీఱ. వి. (√నే.) ఘృతకోశాతకీ.

ఆ. ఉల్లి తెలికపిండి ముల్లంగి నేబీఱ, పున్న దొండకాయ పుట్టకొక్కు, లూరుఁబిండి మునఁగ మారేడుగాయ లట్లనుభవించువారి ననఁగి పెనఁగు. పద్మ. ౬. ౧౧౪.

నేబు. వి. పండ్రెండుకాసులనాణెము.

చ. పలువలు చెంతఁ జేరి యొకపాతికి నేబులు చేతి కిచ్చినన్. చంద్ర. వి. ౨. ౩౮.

నేమకము. వి. నేమము, నియమము. (శ. ర.)

నేమగాఁడు. విణ. (నేమము+కాఁడు.) నియమవంతుఁడు.

(వేంకటేశ్వరవర్ణనము.) సీ. తల నిల్లు గట్టు వ్రతంబులరాయని తోమనిపళ్యాలనేమగాని. ఘటికా. ౨.౧౩౬.(తోమనిపళ్యాలనేమగాని=సుక్షుక్షనములతోహోమములు చేయునియమవంతుని)

నేమము. వి. (సం. నియమః. క. నేమవు.) వ్రతము, విధిగాఁ జేయవలసినపని; నియమము, కట్టుపాటు.

ఉ...గట్టిగ నిశ్చయించె నా,భామల జట్టియిచ్చి తనపట్టినయట్టి కడిందినేమమును,దా మదిఁ గొన్నినాళ్లు విహితంబుగ నిల్పుకొనన్ మనంబులోన్. కళా. ౬. ౯౬.

శా. ఏమీ కొంకక పెట్టు జంగములకున్ హేరాళమృష్టాన్నముల్, నేమం బొప్పఁగ రేలు నుం బగలును నిశ్వాసపూర్వంబుగన్. హార. ౨. ౭౪.

ఉ. నేమ మెలర్పఁగా గొడుగునీడ సహించు వసుంధరాస్థలీ,కీమని యెక్కి యాడెను విచిత్రగతిం దురగోత్తమంబు నా,భూమివిభుండు...నైష. ౧. ౮౮. ౭౦. భా. ౨. ౧౩౪.

జః నేమగాఁడు, నేమించు.

నేమము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. తుల్యము, సదృశము. ౨. సమీపము,నికటము. వి.అ.పుం. ౧. ఖండము, భాగము. ౨. కాలము. ౩. మేర. ౪. ప్రాకారము; కంచె. ౫. వ్యాజము, మిష. ౬. అర్ధము, సగము. ౭. సాయంకాలము. ౮. మూలము, వేరు. ౯. ఊర్ధ్వభాగము, మీఁది భాగము. ౧౦. అన్నము. ౧౧. గర్తము,గోయి, ౧౨. వజ్రము. ౧౩. పురోహితుఁడు. (వాచ. కే. ని.)

నేమి. సం. వి. ఇ, న్. పుం. నెమ్మి, తినాసము.

ఇ. పుం. ౧. వజ్రాయుధము. ౨. గాడిద.పుం. స్త్రీ. ౧. ఘటీయంత్రము, నూతిగిరక. ఇ.ఈ. స్త్రీ. బండిచక్రము చుట్టుకమ్మి, ప్రధి.

నేమించు. స. క్రి. (√నేమము.) నియమించు.

గీ. మత్రియుఁ గనుఁ జేసు గలిగినమలల నరసి, యున్న తావులఁ గదలింప కునిచి రండు, మీర లంచును బిలిచి నేమించి పనుప. యయా. ౩. ౩౮.

మ...చుట్టును ధానుష్కులు కుంతధారు లగు బంటుల్ నిల్వ నేమించి శం,ఖనినాదంబులు దుందుభిధ్వనులు ఢక్కానాదముల్ మించఁగన్. ఉ. రా. ౭. ౪౦౭.

నేము. స. క్రి. (ధాన్యము మొ.) చేటలో పోసి యిటునటు త్రిప్పు. (శ.ర.)

నేముఁడు. సఁ=నేపుఁడు. (వై. ని.)

నేయము=నెయ్యము. వి. (సం. స్నేహః.) ౧. స్నేహము, మైత్రి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. నేయము లజ్జయుం గరుణ సమ్మతి కోపభ
యైకలేశ మే, నేయెడ, జూచిన స్వదికి నిం
చుక యించక...రస. ౩. (శ. ర.)

ద్వి. నేయంబు తోడ నాన్నపుడ దప్పు డతని,
చేయూదికొని వార్ధి జేరంగ వచ్చి. రం.
రా.యు.౯౦౫పా. ౨౦ పం. (చి.ని.పా.)

నేయము. సం.=నేశవ్యము.

నేయార్థము. సం. విణ. (అ. ఆ. అ.) పొందిం
పఁదగినఅర్థము కలది. వి. అ. న. కావ్యదోష
ములలో నొకటి, స్వసంకేతిత మగుఅర్థము గల
పదము.

క. ఇలఁ దనసంకేతంబున, నిలిపినపద మెంచి
చూడ నేయార్థం బా,బలు తేనెదిండిగ మినగు,
వలసాగర కర్ణయానయలక లవంగక్.నరస.
౪. ౪. (సాగరకర్ణ = సాగర మనుమదము
చెవులయందుకలది, ఏనుఁగు.) ౨. న్యాయ
ము. (శ. ర.)

శ్లో. విహాయ చ గృహాంస్తాన్వై కృత్యా స్తనవప్ర
త్తయః,కదా భవిష్యతే వాసః కటకేషు
మహీభృతాం." ప్రతాపరుద్రీయము.దోష
ప్రకరణము. (ఇట కృత్యాస్తనవవృత్తులు=
వనవృత్తులు అని యర్థము.)

నేయి=నెయి, నెయ్యి, నే. (సం. స్నేహః. క.
త. నెయ్.) వి. ఔ, ఆనా. ౧. ఘృతము, ఆ
జ్యము.

క. కామములు భోగములఁ దెగు,నే మెటఁతుక
నేత నాలు నే చిచ్చు...భార. అను. ౫.
౨౩౩.

సీ. కమ్మఁగాఁ గాచినకతియాలనేతితోఁ గమ
నీయపంచభక్ష్యములతోడ. భీమ. ౧.౪౦.

క. ఈయర్థము నిశ్చయముగ, జేయక వే టూ
క్కమతము నేయఁట యెల్లక్, వే యేల
బూని వేల్చిన, నేయినిఁ బోలియును మీఁద
నిష్ఫల మందురో. వా. రా. ౪. ౬౬.

ద్వి. ధరణిఁ బంతియ సముద్రంబుల నేతి, సరు
ణు దీపముఁ జేసి...నీరజాక్షున కిచ్చె నీ
రాజనంబు. ద్వి. పరమ. ౧. ౪౫ పా.

సా:– రొట్టె నేతిలో పడినట్లు (కార్యము సఫల
మైన దని భావము.)

౨. తైలము, చమురు.

క. నేయి పొలుపఱిన దీపియ,మాయకరణిఁ
గ గసిద్ధి మళిగిన హీన,త్వాయత్తం బై
తానును, మాయును దైవానుకూల్యమహిమ
మహీశా. భార. అను. ౧. ౧౩౭.

శ్లో. యథా తైలక్షయాద్దీపః ప్రమ్లాని ముపగ
చ్ఛతి, తథా కర్మక్షయాద్దైవం ప్రమ్లాని ము
పగచ్ఛతి. సం. భార. అను. ౬. ౪౬.

౩. క్రొవ్వు, మజ్జ.

గీ... కేరజములు, గువ్వలఁను మొదలుగ లెక్క
కొలఁది మీఁఱ, గలవు పులుఁగులు నేతులు
ద్రక్కఁ గ్రోవ్వ. చిత్రభా. ౩. ౧౨౨.

నేయిపూచినకత్తి=పయఁకి అకర్షకముగా నుండి
ద్రోహముచేయునది.(ఇది తేనెపూసినకత్తివంటిది.)

వ...కొండొకకాలంబు నమ్మ దిరిగిన నెలి
వెఱుంగక నేయిపూసినకత్తి యగుట దెలి
యక గోముఖవ్యాఘ్రం బగుట వివరింప నే
రక యత్తులువం బరిగ్రహించి...చేం.పంచ.
౧. ౨౪౯.

జః నేతిబీర, నేతివసంతము.

నేయు. స. క్రి. (క. నేయ్.) నేతచేయు, నయ
నముచేయు.

చ...తద్భటకోటి చాతురీతురి...యశోం, బర
ములు నేయుచుండు బహుభంగులఁ బున్న
మనాఁ టినిండుచం, దురుననుసోగవెన్నెల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లతోఁ దులఁదూఁగెడుతద్గుణంబులన్. నైష. ౧. ౪౭.

జః నేఁత, నేఁతకాఁడు, నేఁతపలక, నేఁతపురువు నేఁతపూఁబోఁడి, నేఁతరి.

నేరఁబోతు. విణ. (నేరమి+పోతు.) తెలియనివాఁడు, అనభిజ్ఞుఁడు. (చి. ని. శ. ర.)

నేరపెట్టు. స. క్రి. (నేరము+పెట్టు.) నెపపెట్టు, దోషియని చెప్పు.

క. కలితనమునఁ జని యలనా,పలుకుంబంతంబుఁ జెల్లుబడి గా రెడ్డిన్, గలసి యొకముడువు గైకొని, పిలిచిన నీ కిత్తు నేరపెట్టుదు మగనిన్. వేం. పంచ. ౪. ౪౯౪.

నేరమి. వి. (నేరుచు.) ౧. తెలియమి, అజ్ఞానము.

క. ఏ నెఱుఁగమి నిట్లడిగితి, నా నేరమి సైఁపవలయు...భార. అర. ౫. ౭౧౧.

ద్వి. ఘోరప్రతిజ్ఞఁ గైకొని బేల నైతి, నేరమిఁ జెడిపోయె నేఁడు నాతపము. ద్వి. హరిశ్చ. పూ. ౨౧౭౦ పం.

క. ధనరాజ్యరమామదమునఁ, గనుఁ గాననినిన్ను శిష్యుఁ గాఁ గైకొనుకం,టెను నేరమి కలదే ...మనుచ. ౫. ౧౧.

౨. దోషము, తప్పు.

గీ. తగిలి సుహృద్ద్యూతధర్మయుద్ధములకుఁ బరులచేఁ బిలువంగఁబడి విభుఁడు, గడఁగక విముఖుండు గాఁ జన దని శుభశాస్త్రధర్మంబు లోకంబులందు, నిలిపెఁ దా నిది పతి నేరమియే దైవవైపరీత్యం బైన వసరఁ దగునె. భార. సభా. ౨. ౨౬౪.

సీ. నేరమి లేకయు నెప మిడి యర్థంబు గొను రాజుఁ బ్రజరత్న వినికిగలిగి. గీ. యాచరింపని విభుఁడును...అధోగతి కరుగువారు. భార. అను. ౨. ౩౨.

ఉ. నావుకు దానవేశ్వరుఁడు నవ్వుచు నూర్వశితోడ నిట్లనున్, నీ విటు దూఱి నేర్తునని నేరమి వెట్టితి గాక...ఉ. హరి. ౧. ౬౭. ఆం. భా. ౨. ౧౯౧.

నేరము. వి. (త. నేరం.) తప్పు, అపరాధము.

క. రేయును బగలును విదురుఁడు, నీ యొద్దన యునికిఁ జేసి నేరము పలుకన్, మాయిష్టం బెఱిఁగింపఁగ, ధీయుత యొడ గంటి మిన్ని దివసంబులకున్. భార. ఆది. ౭. ౧౮౭.

గీ. అర్థి నార్జింప వర్జింప నలవి గాని, ధర్మము నధర్మమునుఁ జెప్పఁదగిలి మనువు, నేరములు వెట్టి దండువు నిశ్చయించి, ధరణిఁ గలచోట నర్థ మెత్తంగఁ దలఁచి. నైష. ౪. ౪౭.

ఉ...తొంటికాళిదాసాదిమహాకవీశ్వరుల కైనను నేరము లేక యుండునే. వి. పు. ౧. ౧౪. ఆం. భా. ౨. ౧౯౧.

జః నేరపెట్టు, నేరముకొను.

నేరముకొను. అ. క్రి. (నేరము+కొను.) తప్పుపట్టు.

క. ఓరి దురాత్మక విని పలు,మాఱిటు రావలదు హెచ్చి మఱి వచ్చితివా, నేరముకొందు గ్రహించుక, యూరక యాపని ఘటింపు మెప్పుడు మాకున్. బిల్హ. ౩. ౧౫౭.

నేరాజా. విణ. సరిగతో నేసినది, జరబాజు. (వస్త్రము మొ. శ. ర.)

నేరిమి (ర్మి.) వి. (నేరుచు+ఇమి.) సామర్థ్యము, శక్తి; ప్రావీణ్యము, చతురత.

ఉ....అంబకజాలవీచికాస్ఫారము నైనభీష్మఁడను సాగరముం గడవంగ నీఁదఁగా, నేరిమి యెట్లొకో కలుగ నేర్చె శిఖండికి నేమి నేయుదున్. భార. భీష్మ. ౧. ౫౪.

క. ఈఁటెవికి నీన్నేర్మికి, మేటితనంబునకుఁ జాల మేలిగొనం బే,ర్చాటుకొనియున్న నీతఁడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భర్త పలికిన నోరిమాటు, నోర నేయుండ దక్సి భాగారమునను. వరాహ. ౧.౧౮౫.

నోరఁగొలఁది=మర్యాభాషణము. కు.సం.౧.౩౭.

నోరు కాయు=నోటి కిష్టమైన దెల్లఁ దినకుండుప థ్యము చేయు.

(వ్యవ.) మాపిల్లవాఁడు జ్వరపడి నోరుకాయ లేఁడు.

నోరు కాయలుగాచు=పలుమాఱు పిలుచుటచే నోరునొప్పిచెందు.

(వ్యవ.) నిన్ను పిలిచి పిలిచి నోరుకాయలు గాచినది.

నోరుచేయు=మాటలాడు. (ఇది ఇతరపదవ్యక ధానముగాను గన్పట్టుచున్నది.)

సీ. కూడనిత్తునె మాఱుకొని మోఱ యెత్తినఁ గదిమెద నో రింతకంటెఁ జేయ. బహు. ౨. ౫౧.

నోరుమాలినది=౧. నోరు లేనిది, మాట లాడ లేనిది. (తిర్యగ్జంతువు.)

గీ. శర్వ యీ నోరుమాలినజంతువునకు, మొదల వర మిమ్ము వర మిమ్ము పిదప నాకు. కాశీ.౫. ౩౩౫.

౨. నోరు లేనివాఁడు, గడుసుఁదనముతో మాట లాడ నేరనివాఁడు.

(వ్యవ.) ఆనోరుమాలిన వాని నెగతాళి చేయ కుము.

నోరుమెదపు=మాటాడు.

(వ్యవ.) వాఁ డీమధ్య కొంచెము నోరుమెదపు చున్నాఁడు.

నోరుమెదల్చు=నో రెత్తి మాటాడు, చెప్పు.

ఉ. ఎన్నఁగ నింత రత్నచయ మింత గభీరిమ యింత దానసం,పన్నత యింత శుద్ధి యని బ్రహ్మయు నోరుమెదల్ప లేనియ,త్యున్నతిఁ గన్న పెన్నదలి నుతిత మై వెలిదీవి చెన్న గుణ. పాండు. ౩. ౧౫౧.

నోరు లేనివాఁడు = పొంకికగా మాటలాడలేని వాఁడు.

(వ్యవ.) వాఁడు బొత్తిగ నోరులేనివాఁడు.

నోరు వాయెత్తు=నోరెత్తు.

గీ. తపసిజనములు నుతిమంత్రజపము లుడిగి, వచ్చి యుండక పికశిఖావళము లాది,గా వనంబునఁ గలవిహంగమకులంబు, తత్తరము నొంది నోరు వాయెత్త వెఱచు. పి. శకుం. ౨. ౮౫.

నోరువాయిలేనిది= అధికముగా మాటలాడ నే అనిది.

(వ్యవ.) ఆమెనోరు వాయి లేనిది.

నో రువ్విళ్లూరు=నో రూరు, తినవలె నను నాస కలుగు.

క. గువ్వలు కొఁజులు కూఁకటి,మువ్వలు లావుకలు కోళ్లుపూరేళ్లు మొదల్,క్రొవ్వినపులుఁగులగమి నో,ళ్లువ్విళ్లూరంగ నవ్వు డుర్విశ వ్రాలెన్. ఇందు. ౨. ౪౦.

నోరూరు=౧. అపేక్ష కలుగు.

గీ. గబ్బిగుబ్బలఁ బతియెదఁ గ్రుమ్మి క్రుమ్మి,యున్న సకియలఁ జూచి నోరూరసాగె. కలు. ४. ౨౨.

౨. పులుపుగాని కారముగాని గలవస్తువులను చూచినపుడును తలఁచినపుడును నోట ద్రవము పుట్టు.

క. శ్రీరామునిదయచేతను, నారూఢిగ సకలజనులు నౌరా యనఁగా,ధారాళ మైననీతులు, నోరూరఁగఁ జవులు పుట్ట నుడివెద సుమతీ. సు. శ. ౨. (రెండర్థములకు నిది యుదాహరణము.)

నోర్నోరన్=నోటిలోనుండి నోటిలోనికి.

సీ. హంస పెక్కువ నిచ్చె హంసికి నోర్నోర నెలదూఁడు... కు. సం. ४. ४౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. సంజెంగపాదరింటిచక్కి గోరఁటఁగాంచి
యుసు రంచు మగిడి నోరూరవనియు.ఆ.
అగుచుఁ దేఁటికదుపు లామనిఁ దలసూపె.
పారి. ౩. ౫౨.

నోళ్లఁబడు=పదుగురు చెప్పుకొను, నిందాపాత్రమగు.

సీ. నీమాట వినలేక నిర్ఘోషపాళి యై ప్రాణికోటులనోళ్లఁబడియె వసిసె. కలు. ౪. ౭౪.

సా:-నోరున్న తల గాచును.(మాటలనేర్పున్న చో మరణదండనము నైనతప్పించుకొనవచ్చు.)

సా: నోరుమంచిదైన నూరు మంచిదగును.(మంచిమాటలాడిన నందఱు ప్రేమింతురు.)

జ: నోటిగయ్యాళి,నోటిబీగము,నోరఁబట్టు, నోరితాళము,నోరిసని,నోరుగొట్టు, నోరుదెఱచు, నోరునొక్కు, నోరుమూయు, నోరుమెంగ, నోరెత్తు.

నోరుగొట్టు. స. క్రి. (నోరు+కొట్టు.) అనుభవింపకుండఁ జేయు, తినకుండఁ జేయు.

సీ. కొలుచువారల నోరుగొట్టి లెక్కలు వ్రాసి హారువుమీఁఱఁగ మణియములుచేసి. శుక. ౩. ౩౪౫, ౩౫౩.

నోరుదెఱచు. అ. క్రి. (నోరు+తెఱచు.) ౧. మాటలాడు.

ఆ. శిఖలు చూపకుండ శిక్షించి హుతికినై, నోరు దెఱవకుండ మేరవెట్టి, పేఁడి యెల్ల నుడిపి విబుధారి కినుకపై, భీతిపాత్రుఁ జేసె వీతిహోత్రు. నృసిం. ౨. ౧౧౭.

౨. అత్యాశపడు, ఆశపెట్టుకొను.

క. గతమునకును వగవకన్,గతమునకును నోరు దెఱచి కడుఁ గోరక దీనతఁ బొందక దైవం బేగతిఁ బుచ్చిన దానఁ బోదుఁగా కవవల యుఁక్. భార. శాం. ౩. ౩౦.

౩. బదులుచెప్ప కుండు, నిరుత్తరుఁ డగు.

(వ్యవ.) నేనట్లనుఁగఁగా సమాధానము చెప్పలేక వాఁడు నోరుదెఱచెను.

నోరునొక్కు. స. క్రి. (నోరు+నొక్కు.) మాటాడకుండఁజేయు.

గీ. ఎవ్వ డిది యని పల్కిన నవ్వధూటి, నోరు నొక్కుచుఁ గౌఁగిటఁ జేరఁ దిగిచి,మగువ చెవిలోన నలుకుసు మాను మేను,వాసవుఁడ నిన్నుఁ గని కూర్మి వచ్చినాఁడ. జాహ్నవీ. ౪. ౭౭.

నోరుమూయు. అ. క్రి. (నోరు+మూయు.) మాటాడకుండు.

ఆ. అనిన నాఁడుగఱచి యసురద్విషం డోరి, పడుచ నాకుఁ బుట్టి చెడుగ వైతి,పేర్చి నోరుమూయు పెడతల వాపోయె, దిట్టవదర గలఁడె యెచటనైన. నృసిం. ౪. ౩౪.

నోరుమెంగ.విశ. (√నోరు.) మూఁగ.

క. తన్నట్లు పలికి ద్రొబ్బఁగ, మిన్నక చన నంతనోరుమెంగయె యది యా, మున్నాడిన మాటలబిరు,సెన్నఁగ నిది గనియె యతఁడుపేక్ష యొనర్చెక్. కళా. ౩. ౨౩౯.

నోరెత్తు. అ. క్రి. (√నోరు.) మాటాడు.

ఉ. అత్తఱి భీష్మముఖ్యు లగు నచ్చటివృద్ధజనంబు లెల్ల నో,రెత్తక యూరకుండిరి మహీశ్వరుచిత్తమెఱుంగకున్కి... భార.ఉద్యో. ౧. ౩౮౯.

ఉ. అత్తఱి నేఁడు మార్పలుక మాయమచిత్తములోనివార మ్మెవత్తుము పెద్దవారు గలవారికి నన్నియుఁ జెల్లుఁగాక నేఁ, డిత్తఱి మమ్ముఁ బుచ్చి పని యెవ్వరు గొందురు మిమ్ముఁ జూచి నో,రెత్తఁగ నోడి యేపలుకు లెన్నఁడుఁ జెప్ప మెఱింగి యుండియుఁక్. భోజరా. ౩. ౧౨౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నోవరి విణ. (నోవు + అరి³.) వ్యాధి కలవాఁడు. (శ. ర.)

నోవి=నొవ్వి. వి. (√నొచ్చు.) బాధ, నొప్పి. (శ. ర, చి. ని.)

నోవిక. వి. ఉసులు, అనుకూల్యము.

సీ. జీరాల జంటించి సికతాళి నెమ్మేన వైచుక నోవికల్ చూచువారు. మల్లుపు. ౨. ౪.

నోవు=నొవ్వు. (క. త. నోవు.)

(వ్యాధి.)

ఉ... జింకలు నక్కలు గొంకనక్కలు, న్దోమలు మ్రాఁకులుం బొదలు నోవులఁ బీడలఁ బొందు వారముక్, తామసభాగు లట్ల మతి తద్విధ జంతువు లెన్ని యన్నియుక్. భార. అశ్వ. ౨. ౧౧౪.

(బాధ.)

క. చావును నోవును మనయో,ధావలికిక్ గెలుపు నుబ్బు నావలికిని నీ,చే వినియెదఁ దుదినెట్టుబు, శ్రీవిభవము పాండవులకుఁ జేపడునకదే. భార. భీష్మ. ౨. ౧౯౯.

జః నోవరి.

## నౌ.

నౌ=నవు, నవ్వు. (శ. ర.)

నౌక. సం. వి. ఆ. స్త్రీ. ౧. నావ, ఓడ. ౨. చిన్నపడవ.

నౌకర్ణధారుఁడు. సం. వి. అ. పుం. మాలిమి కాఁడు, ఓడ నడుపువాఁడు.

నౌకర్మము. సం. వి. న్. న. నావికవృత్తి, పడవ నడపువ్యాపారము.

నౌకాదండము. సం. వి. అ. పుం. క్షేపణి, నావను నడపు తెడ్డు; ఓడ నడపుగడ.

నౌకు=నవుకు.

ద్వి. నల్లమబ్బునకుఁ గ్రింద నౌకుదాపునను, డెల్లనివాల్చుక్క తెగి పడురీతిఁ, గనిపించె... ద్వి. శ. సా. ౧. ౨౩౬౪, ౩౭ పం. ('నౌకు.' ముద్రి.)

నౌచరుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) -పడవతో తిరుగువాఁడు- నావికుఁడు, పడవవాఁడు.

నౌజీవికుఁడు. సం. వి. అ. పుం. ఓడ నడపు వృత్తిచే జీవించువాఁడు.

నౌజే. వి. భక్ష్యవిశేషము.

(వ్యవ.) కొబ్బెరనౌజు పిల్లలకు ఇష్టము.

నౌడుకొట్టు=నవుడుకొట్టు. (శ. ర.)

నౌతార్యము. సం. విణ. (అ. ఆ. అ.) నావ్యము, ఓడచే దాటఁదగినది. (నది మొ.)

నౌదండము. సం=నౌకాదండము.

నౌబత్తు=నవుబత్తు. వి. (హిం. నౌబల్.) చర్మవాద్యవిశేషము.

సీ. నక్తందివంబును నాడు పాడుకొనంగ సాహేబు నౌబత్తు చఱవఁ బనిచి. రంగా. ౨. ౧౯౭.

నౌయానము. సం. వి. అ. న. నౌకాయాత్ర, ఓడలో పయనము చేయుట.

నౌయాయి. సం. విణ. (న్. నీ. న్.) ఓడలో పోవువాఁడు, నావలో ప్రయాణము చేయువాఁడు.

నౌరు=నవురు. విణ. మృదువు. (శ. ర.)

నౌవాహుఁడు సం. వి. అ. పుం. ఓడనడపువాఁడు.

## న్య.

న్యంకుభూరుహము. సం. వి. అ. పుం. -ఇత్తి కొమ్ములవంటి పెక్కు శాఖలు కలది- శ్యోనాకము, దుండిగముష్టి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్యంకువు. సం. వి. ఉ. పుం. ౧. ఇఱ్ఱి. ౨. ఒకానొకముని.

న్యంచనము. సం. వి. అ. న. ౧. న్యగ్భావము, తక్కువపాటు. ౨. వంపు, వంకర. ౩. పల్లము.

న్యంచితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అధఃక్షిప్తము, క్రిందికి త్రోయఁబడినది. ౨. వంపఁబడినది.

న్యంతము. సం. వి. అ. పుం. చరమభాగము, చిట్టచివరభాగము.

న్యక్కరణము. సం. వి. అ. న. తిరస్కారము, అవమానము.

న్యక్కారము. సం. వి. అ. పుం=న్యక్కరణము.

న్యక్కు. సం. విణ. (చ్. నీచీ. చ్.) ౧. క్రిందికి పోవునది; క్రిందికి వంగునది. ౨. నిమ్నము, పల్లము. ౩. నీచము.

న్యక్కృతము. సం. విణ. (అ. ఆ. అ.) తిరస్కృతము, అవమానింపఁబడినది.

న్యక్కృతి. సం. వి. ఇ. స్త్రీ=న్యక్కరణము.

న్యక్తము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి చరిఁబడినది, మిక్కిలి పూయఁబడినది.

న్యక్షము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నీచము, తక్కువైనది. ౨. అంతయు, సమస్తము. వి. అ. పుం. మహిషము, దున్నపోతు. న. ౧. సాకల్యము, పూర్ణత. ౨. మహిషతృణములు.

న్యక్షుఁడు. సం. వి. అ. పుం. పరశురాముఁడు. (వాచ.)

న్యగ్భావము. సం. వి. అ. పుం. ౧. నీచత్వము, తక్కువపాటు; అవమానము, తిరస్కారము. ౨. నీచముగా చేయుట, క్రిందుపఱుచుట.

న్యగ్భావితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నీచముగా చేయఁబడినది, క్రిందుపఱుపఁబడినది. ౨. గుణీకృతము, అప్రధానముగా చేయఁబడినది.

న్యగ్భూతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నీచమైనది ౨. అవమానము నొందినది, తిరస్కారము నొందినది.

న్యగ్రోధపరిమండల. సం. వి. ఆ. స్త్రీ. కఠినస్తనములును విశాలనితంబమును సూక్ష్మమధ్యమును కలస్త్రీ.

శ్లో. స్తనౌ సుకఠినౌ యస్యా నితంబే చ విశాలతా, మధ్యే క్షీణా భవేద్యా సా న్యగ్రోధపరిమండలా. (వాచ.)

న్యగ్రోధపరిమండలుఁడు. సం. వి. అ. పుం. వ్యామపరిమితమైనయుచ్ఛ్రాయమును పరిణాహమును కలపురుషుఁడు, బారెఁడు ఒడ్డును పొడవును కలవాఁడు, బారచుట్టుకొలత కలదేహము కలవాఁడు.

శ్లో. న్యగ్రోధౌతు స్మృతౌ బాహూ వ్యామో న్యగ్రోధ ఉచ్యతే, వ్యామేన ఉచ్ఛ్రయో యస్య అథ ఊర్ధ్వం చ దేహినః, సమోచ్ఛ్రయపరీణాహో న్యగ్రోధపరిమండలః, మత్స్యపురాణము. (వాచ.)

న్యగ్రోధము. సం. వి. అ. పుం. ౧. మఱ్ఱి. ౨. శమి, జమ్మి. ౩. వ్యామము, బార.

న్యగ్రోధి. సం. వి. ఈ. స్త్రీ. మూషికపర్ణి, ఎలుకజీడి.

న్యచ్ఛము. సం. వి. అ. న. దేహముమీఁది పుట్టుమచ్చ.

న్యయము. సం. వి. అ. పుం. ౧. నాశము. ౨. అపచయము, తఱుగుట.

న్యర్బుదము. సం. విణ. (అ. ఆ. అ.) పదియర్బుదములయందుండు సంఖ్య కలది. వి. అ. న. పదియర్బుదములు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్యసనము. సం. వి. అ. న. ౧. ఉంచుట. ౨. అప్పగించుట, ౩. ఇల్లడపెట్టుట. ౪. విడిచిపెట్టుట.

న్యసనీయము. సం. విణ. (అ. ఆ. అ.) న్యసింపఁదగినది, ఉంచఁదగినది.

న్యసించు. సం. స. క్రి. ౧. ఉంచు. ౨. ఇల్లడపెట్టు. ౩. జపాదిసమయమున దేహావయవములయందు మంత్రబీజాక్షరము లుంచు, న్యాసముచేయు. ౪. స్పృశించు, తాఁకు.

వ... కేళవాదినామంబులతోడ గోకర్ణహస్తంబున మాషమజ్జనపరిమితశుద్ధోదకంబుల ముమ్మాఱు లోనికింగొని యినుమాఱు పరిమార్జనంబుచేసి దక్షిణపూర్వకంబుగా నేత్రనాసాశ్రోత్రద్వయశిరోబాహుద్వయనాభి హృదయంబుల న్యసించి యాచమనంబు చేసి... వి. పు. ౪. ౧౯౬.

న్యసిత. సం.విణ. (ఋ. త్రీ. ఋ.) న్యాసకుఁడు.

న్యసితవ్యము. సం=న్యసనీయము.

న్యస్తదేహుఁడు. సం.విణ. (అ. ఆ. అ.) దేహమును విడిచినవాఁడు, మృతుఁడు.

న్యస్తము. సం.విణ. (అ.ఆ. అ.) ౧. నిహితము, ఉంచఁబడినది. ౨. క్షిప్తము, త్రోయఁబడినది. ౩. త్యక్తము, విడువఁబడినది. ౪. అప్పగింపఁబడినది. ౫. ఇల్లడపెట్టఁబడినది. ౬. మంత్రోచ్చారణముతో అంటఁబడినది. (నేత్రాది.)

న్యస్తశస్త్రుఁడు. సం.విణ. (అ.ఆ. అ.) సన్న్యస్తశస్త్రుఁడు, శస్త్రములను విడిచినవాఁడు, అస్త్రసన్న్యాసము చేసినవాఁడు.

న్యస్యత్. సం. శత్ర. న్యసించుచున్న.

న్యస్యమానము. సం.విణ. (అ. ఆ. అ.) న్యసింపఁబడుచున్నది.

న్యస్యము. సం. = న్యసనీయము.

# న్యా.

న్యాక్యము. సం. వి. అ. న. భృష్టతండులము, వేఁపుడుబియ్యము. (వాచ.)

న్యాదము. సం. వి. అ. పుం. ౧. భోజనము తినుట. ౨. ఆహారము.

న్యాయపథము. సం. వి. అ. పుం. ౧. ధర్మమార్గము; నీతిమార్గము. ౨. మీమాంసాశాస్త్రము.

న్యాయము. సం. వి. అ. పుం. -దీని ననుసరించి ప్రవర్తింతురు.- ౧. పద్ధతి. ౨. పాడి, ధర్మము. ౩. వ్యవహారము, తగవు; దాయభాగాదివ్యవహారము. ౪. వేదార్థనిర్ణయసాధన మగు అధికరణము. ౫. గౌతమమునిప్రణీత మగుతర్క-న్యాయ-శాస్త్రము. ౬. (న్యాయ.) ప్రతిజ్ఞాహేతూదాహరణోపనయననిగమము లనుపంచావయవములు కలవాక్యసముదాయము. ౭. లోకమందును శాస్త్రమందును ప్రసిద్ధమగుదృష్టాంతవిశేషము. ఉదా:-

అండకుక్కుటీన్యాయము:- గ్రుడ్డు ముందా? కోడి ముందా? (చూ. బీజాంకురన్యాయము.)

అంధకూపపతనన్యాయము:- ౧. నూఱుగురు అంధులు కలసి పోవుచుండఁగా వారిలో మొదటియంధుఁడు ఒక నూతిలోఁ బడెను. వాఁ డట్లు నూతిలోఁ బడినట్లు ఎఱుఁగని మిగిలినయంధు లందఱు నొకరివెంట నొకరు నూతిలోఁ బడిరి. ఒక అజ్ఞుని అనుసరించి పోవుమిగిలినఅజ్ఞులుకూడ మొదటివానివలెనే హానిఁ బొందుదురు.

౨. మార్గదర్శి చెప్పినత్రోవ వదలి గ్రుడ్డివాఁడు నూతిలోఁ గూలినట్లు వేదాదిసదుపదేశములను వదలి అజ్ఞుఁడు నరకమునఁ బడును. (వాచ.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అంధగజన్యాయము:-అంధులు ఏనుఁగును స్పృశించి వారివారిబుద్ధ్యనుభవములనుబట్టి దాని రూపమును నిర్ణయించుకొనునట్లు అజ్ఞానులు వారివారిబుద్ధ్యనుభవముల ననుసరించి భగవద్రూపములను గల్పించుకొందురు.

అంధగోక్షేత్రన్యాయము:—(గ్రుడ్డియెద్దు చేనిలోఁ బడ్డట్లు.) చేనిలోఁ బడ్డగ్రుడ్డియెద్దు గడ్డిగాదము ఎన్నులు అనువిభాగము తెలియక నోటి కందిన దెల్ల తినునట్లు వివేచనము లేనివాఁడు సారాసారములు ఎఱుఁగక తోఁచినట్లు పని చేయును.

అంధగోలాంగూలన్యాయము:-ఒక గ్రుడ్డివాఁడు దారితప్పి యొకయడవిని బడెను. "ఈగిత్త తోఁక పట్టుకొని నీవు పోవునెడల నిన్నది దారికిఁ దీసికొనివచ్చు" నని వానితో నొకకొంటెవాఁడు చెప్పెను. అట్లుచేయఁగా నతఁడు తిన్ననిత్రోవను బడకపోవుటయే కాక దానిచేఁ దన్నులు తినుచు కంటకమార్గములఁ బడి యార్తిచెందెను. అట్లే చెడ్డమార్గముపదేశించినచో దాని నవలంబించి పోవు అజ్ఞునకు లాభములేకపోవుటేకాక కష్టములును సంభవించును.

అంధచటకన్యాయము:—దైవవశమున పిచ్చుక గ్రుడ్డివానిచేతఁ జిక్కఁగా అంధుఁడు దానిని పట్టుకొనె నని పామరు లెంచెదరు. అట్లే జనులు దైవికముగా జరిగినపనికి కారణము కానిదానియందుఁ గారణత్వము కల్పించెదరు. (చూ. ఘుణాక్షరన్యాయము.)

అంధదర్పణన్యాయము:—గ్రుడ్డివానికి అద్దము చూపుట నిష్ప్రయోజనమైనట్లు చెప్పినదానిని గ్రహింపనేరనివాని కుపదేశము చేయుట వ్యర్థము.

అంధదీపికాన్యాయము:—అంధునకు దీపము ఉన్నను లేకపోయినను ఫలము సమానమగునట్లు శక్తిలేనివానికి సాధనసామగ్రివలనఁ బ్రయోజనము శూన్యము.

అంధపంగున్యాయము:—నడవలేనికుంటివాఁడును త్రోవ కానలేనిగ్రుడ్డివాఁడును ప్రయాణము చేయవలసినపుడు కుంటివాఁడు గ్రుడ్డివానిబుజములపై నెక్కి త్రోవ చెప్పుచుండ గ్రుడ్డివాఁడును కుంటివాఁడును గూడ గమ్యస్థానమునకుఁ బోయిరి. అట్లే శక్తిలోపము కలవారు పరస్పరసాహాయ్యమువలన కార్యము నెఱవేర్చుకొనఁ గలరు.

అంధపరంపరాన్యాయము:-ఒకయంధునిచే నుపదిష్టమైనదానిని మిగిలినయంధులు పరంపరగా నమ్మి పాడగునట్లొక యజ్ఞాని చెప్పినదానిని వివేచనములేనిఇతరులు నమ్మి భ్రష్టులగుదురు.

అంధాంజనన్యాయము:—గ్రుడ్డివాని కంటికి కాటుకపెట్టుట వ్యర్థమైనట్లు ప్రయోజనము మాలిన పనికై కృషిచేయుట వ్యర్థమగును.

అంధాంధన్యాయము:—ఒకగ్రుడ్డివాఁడు మఱియొకగ్రుడ్డివానికి త్రోవ చూపినట్లు ఒకమూర్ఖుఁడు మఱియొకమూర్ఖునకు ఉపదేశము చేయుట నిష్ఫలమగును.

అంధాక్షిమీలనన్యాయము:—గ్రుడ్డికన్ను మూసినను తెఱచినను ఒకటే. అట్లే అసమర్థుఁడు కార్యప్రయత్నము చేసినను చేయకున్నను ఫలము ఒక్కటే యగును.

అంధాశ్వపాళిన్యాయము:—గుఱ్ఱము గ్రుడ్డిదైనను గుగ్గిళ్లకు కొఱఁత లేదు. (గుఱ్ఱము గ్రుడ్డిదైనను దాణకు తక్కువ లేదు.) సోమరికి కార్యసామర్థ్యము లేకున్నను కడుపునిండ తిండి తప్పదు.

అత్యుండభేషజన్యాయము:—కంటికి పెట్టఁదగినమందు అండములకుఁ బెట్టినట్లు ఒకదానికి చేయవలసినపనిని మఱొకదానికి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేసినచో అది వికటించును. (కంటికి పెట్టుకొ
టుక తుంటికి పెట్టినట్లు.)

అగ్నివమ్రిన్యాయము:—నిప్పునకు చెదలు పట్ట
నట్లు ధర్మాత్మునకు పాప మంటదు.

అచలచలన్యాయము:—పడవ మున్నగువాని
మీఁద ప్రయాణము చేయువారికి ఒడ్డున
నున్న చెట్లు నడచుచున్నట్లు కనఁబడురీతిని
అజ్ఞానికి భ్రాంతిచేత లేనిది ఉన్నట్లు తోఁ
చును.

అజగరన్యాయము:—కొండచిలువ ప్రయత్నిం
పక దగ్గఱకు వచ్చిన జంతువులనే తిని బ్ర
తుకు నట్లు ప్రయత్నములేక లభించిన దా
నితో తుష్టి నొంది యుండుట శ్రేయస్క
రము.

అజాకృపాణీయన్యాయము:—మేఁక కండూతి
పోఁగొట్టు కొనుటకై వచ్చుటయు కత్తిపడి
దాని ప్రాణముపోవుటయు నొకసారి సంభ
వించినట్లు దురదృష్టవంతులకు ఆకస్మికానిష్ట
ప్రాప్తి యగును. (చూ. కాకతాళీయన్యా
యము.)

అజాగళస్తనన్యాయము:—మేఁక మెడ క్రింద
వ్రేలాడుచున్నను పాలు స్రవింపక నిష్ప్ర
యోజనమగు నట్లే మిథ్యాపురుషుల వలనఁ
బ్రయోజనము లేదు.

అజాతపుత్రనామోత్కీర్తనన్యాయము:—పుట్ట
నికొడుకునకు పేరు పెట్టునట్లు ఎప్పుడో
రాబోవుదానిని గూర్చిన కన్నుగడలతో కా
లము కడపుట వ్యర్థము. ('ఆలులేదు చూలు
లేదు కొడుకుపేరు సోమలింగము.')

అణుకులాచలన్యాయము:—సూక్ష్మాణువునకును
కులపర్వతమునకును ఎంత తారతమ్యముండు
నో అంతయెక్కువ తారతమ్య ముండుటను
తెలుపును. (ఇది హస్తిమశకాంతరము వం
టిది.)

అతిపరిచయన్యాయము:— అతిపరిచయము అవజ్ఞా
హేతు వగును.

అనిషిద్ధానుమతన్యాయము:- నిషేధింపఁబడనిది
అనుమతింపఁ బడినదే యగును.

అపరాహ్ణచ్ఛాయాన్యాయము:— అపరాహ్ణకా
లమందలినీడ మొదట పొట్టిగా నుండి క్రమ
ముగా హెచ్చునట్లే సజ్జన స్నేహాదికము
మొదట కొంచెముగా నుండి క్రమక్రమ
ముగా హెచ్చును. (వ్యతి. పూర్వాహ్ణచ్ఛా
యాన్యాయము.)

అభావవిరక్తిన్యాయము:—మానవుడు ఎంత య
త్నించినను దొరకనిదానియందు వైరాగ్యము
నొందును. ఇది "నక్క ద్రాక్షపండ్లు"అను సా
మెత వంటిది.

అయస్కాంతసూచీన్యాయము:— సూదంటు
రాయి సూదిని ఆకర్షించునట్లు పరస్పరాకర్ష
కముగుఒకవస్తువును మఱియొకటి ఆకర్షిం
చును.

అరణ్యరుదితన్యాయము:—అరణ్యమందలిఏడ్పు
వలె ఆదరించువారు లేనిచోట మొఱపెట్టుట
నిష్ప్రయోజనమగును.

అరుంధతీదర్శనన్యాయము :—సూక్ష్మమగునట్టి
యరుంధతీనక్షత్రమును చూపఁదలఁచి దాని
ప్రక్కనున్న స్థూలనక్షత్రమును చూపునట్లు
సూక్ష్మవిషయమును దెలుపఁదలఁచి దానిని
సులభముగా గ్రహింపఁజేయుటకై దానికి
సంబంధించిన స్థూలవిషయమునుముందు బో
ధింతురు. (దీనికి స్థూలారుంధతీన్యాయ మని
యు వాడుక కలదు.)

అర్ధజరతీయన్యాయము:—సగము దేహమునపడు
చుఁదనము సగముదేహమున ముసలితన
తనమును కలస్త్రీ యుండనట్లు ఒకభాగమున
ఒక ప్రయోజనమును మఱియొక భాగమున
మఱొక ప్రయోజనమును కలపదార్థము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంభవింపదు.

అర్ధవైశసన్యాయము:— దేహమున సగముభాగము చంపఁబడినప్పుడు మిగిలినభాగమును చంపఁబడినట్లే యగును.

శ్లో. విధినాకృతమర్ధవైశసమ్. సం. కు. సం. ౪. ౩౧.

అలంకృతశిరశ్ఛేదన్యాయము:— శరీరము నలంకరించి తర్వాత తల తెగఁగొట్టుట యెట్టిదో ఒక విషయమును మిక్కిలి ప్రశంసించి తుదకు నిరాకరించుట యట్టిదగును.

అశోకవనికాన్యాయము:— ౧. ఛాయాసౌరభ్యములు కలఅశోకవనమున నున్నవారికి ఇతరస్థలమునకుఁ బోవ బుద్ధిపుట్టనట్లు ఎవరికిని ఇష్టస్థలమును వీడి పోవ బుద్ధి కలుగదు.

౨. అనేకము లైనచూతాదివనము లుండఁగా రావణుఁడు అశోకవనమునందే సీత నుంచుటకు కారణమును చెప్పలేనట్లు ఒకకార్యమును నిర్వహించుటకు సమానబలము కల పెక్కుసాధనము లుండఁగా వానిలో నొకసాధనమునవలంబించుటకుఁ గలకారణమును చెప్పుట కష్టము.

అశ్మలోష్టన్యాయము:— మంటిగడ్డ రాతితోఁ బోల్చినపుడు కఠినపదార్థ మగును. అట్లే గుణములు సాపేక్షములు గాని నిరపేక్షములు గావు. (పాషాణేష్టకన్యాయము ఇట్టిదే.)

అశ్వతరీగర్భన్యాయము:— మగగాడిదవలన ఆఁడుగుఱ్ఱమునందు పుట్టినయాఁడుపిల్ల అశ్వతరి. ఈగాడిద ఈనునపుడు దానిగర్భమును జీల్చుకొని పిల్లపుట్టు నని ప్రసిద్ధి. అపిల్ల తనజననహేతు వగుతల్లియొక్క నాశమునకుఁ గారణ మగునట్లు దుష్టులు తమపుట్టుకవలన తమజనస్థానమును నశింపఁ జేయుదురు. "వృశ్చికీగర్భన్యాయము, కర్కటీ గర్భన్యాయము" ఇట్టివే.

అసిధారామధులేహనన్యాయము:— కత్తివాదర మీఁది తేనె నాకునపుడు మధుమాధుర్యమువలన సుఖమును కత్తివాదర తగిలి నాలుక తెగుటవలన దుఃఖమును తటస్థించు నట్లు కొన్నిటియందు సుఖదుఃఖములు మిశ్రములై యుండును.

అస్నేహదీపన్యాయము:- చమురు లేనిచో దీపమాఱిపోవునట్లు కారణసామగ్రి క్షీణించినచో కార్యముకూడ క్షయము నొందును.

అహికుండలన్యాయము:— అహిశబ్దము సర్పమునంతను తెలుపును. కుండలశబ్దము చుట్టలు చుట్టుకొనుట అనెడి వికారరూపభేదమును తెలుపును. ఒకవస్తువే వికృతి చెందుటచే భిన్నముగా వ్యవహరింపఁబడును. అని శాంకరబ్రహ్మసూత్రభాష్యము. సర్పములకు చుట్టలు చుట్టుకొనుటస్వాభావిక మగు నట్లు ఒక్కొక దానికి ఒక్కొక స్వభావముండు నని తెలుపును. (వాచ.)

అహిభుక్కైవర్తన్యాయము:— (అహి= అహిఫేనము, నల్లమందు) నల్లమందు తిని మత్తుగొన్నవాఁ డొకఁడు ఓడ నెక్కి తాను మాఱిపోకుండుటకై గుర్తుగా కాలి కొకత్రాడును కట్టుకొని నిద్రపోయెను. పడవవాఁడు పరిహాసార్థము అత్రాడు విప్పి తన కాలికి కట్టుకొనెను. ఓడ రేవునకు వచ్చినపుడు అహిభుక్కు (నల్లమందు తిన్నవాడు) పడవవానికాలికి కట్టియున్నత్రాడును జూచి అదిగో! అత్రాడు కట్టుకొన్నవాఁడను నేను. నేను వాఁడు అని వాదింప సాఁగెను. అట్లే జీవుఁడు అవిద్యావశమున స్వస్వరూపమును మఱచుటయే కాక తాను కానిదానియందు తా ననుభ్రాంతి చెందును.

ఆకాశముష్టిహననన్యాయము:-ఆకాశమును పిడికిటతో పొడుచుటవలె అసాధ్యకార్యమునకై

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేయు ప్రయత్నము వ్యర్థము.

ఆమ్రవణన్యాయము:— మామిడితోఁటలో ఇతరవృక్షము లున్నను మామిడిచెట్లు అధికముగా నుండుటచే ఆమ్రవణ మని వ్యవహరించినట్లు వివిధధర్మము లున్నను ఎక్కువగా నున్నధర్మములను బట్టియే ఆపేరు వచ్చును.

ఆమ్రసేకపితృతర్పణన్యాయము:— పితృదేవతల నుద్దేశించి మామిడిచెట్టు మొదట జలతర్పణము చేసినచో పితృదేవతల తృప్తియు మామిడిచెట్టునకు నీళ్లుపోయుటయుఁ గూడ జరుగునట్లుఒకపనిచే రెండు ప్రయోజనములు నెఱవేర్చుకొనుట యగును. ఇది "ఏకా క్రియాద్వ్యర్థకరీ" అనునట్టిది.

ఇషువేగన్యాయము:— ప్రయోగింపఁబడిన బాణము వేగము తగ్గినఁ గాని పడిపోనట్లు ప్రారబ్ధకర్మము అనుభవించినఁ గాని నశింపదు.

ఉభయతస్పాశరజ్జున్యాయము:— త్రాటియొక్క రెండుకొనలలో ఏకొనచేతనైనను బంధనము కలుగు నట్లు ఉభయదుష్టపక్షములలో ఏ పక్షము ననుసరించినను బాధకలుగును. (ఇది వెనుకగోయ్యి ముందునుయ్యివంటిది.)

ఉలూఖలమర్దళన్యాయము:— (రోలు మద్దెలతో మొఱపెట్టుకొన్నట్లు.) ఒకవైపునమాత్రమే దెబ్బలు తినురోలు రెండువైపులను దెబ్బలు తినుమద్దెలతో తనకష్టము చెప్పుకొను నట్లు సామాన్యబాధ నొందువాఁడు తనకంటె ఎక్కువబాధ చెందువానితో తన కష్టమును గుఱించి మొఱపెట్టుకొనును.

ఉష్ట్రకంటకభక్షణన్యాయము:— ౧. ఇతరబాధకము లగుముండ్లు ఒంటెకు ఇష్టాహారమగు నట్లు కొందఱకు దుఃఖహేతువు లగు పదార్థములు మఱికొందఱకు సుఖహేతువు లగును. సుఖదుఃఖములు పదార్థస్వభావములు కాక జాతికాలావస్థాదులనుబట్టి యుండును. బ్రహ్మసూత్ర భాష్యము. ౨. ౨. ౧.

౨. ఒంటె ముండ్లుగలచెట్టుయొక్క ఆకులు తినునప్పుడు ముండ్లు గ్రుచ్చుకొనుటవలన బాధకలుగుచున్నను ఆకులు తినుటవలనఁ గలుగు అల్పసుఖము ననుభవించునట్లు లోకులు విషయోపార్జనమునందు పెక్కుబాధలను సహించి యైనను కించిత్సుఖమును అనుభవింతురు. (వాచ.)

ఉష్ట్రలగుడన్యాయము:— ఒంటె మోసెడుకఱ్ఱతోనే ఒంటెను కొట్టినట్లు ఒకఁడు చెప్పినయుక్తులతోనే వానివాదమును ఖండింపవచ్చును.

ఊషరబీజన్యాయము:— చవిటినేలను చల్లినవిత్తనములవలె అనర్హస్థలమున నుంచినమంచిపదార్థము వ్యర్థమగును.

ఊషరవృష్టిన్యాయము:— చవిటినేలను కురిసినవర్షమువలె అనర్హునికిఁ జేసిన మేలు వ్యర్థము.

ఏకదేశవికృతన్యాయము:— ఒకవస్తువు ఏకదేశమున -ఒకభాగమున- కొంతమార్పు చెందినను ఆవస్తువుగానే వ్యవహరింపఁబడును. (తోఁకతెగిన కుక్కకూడ కుక్కయనియే వ్యవహరింపఁబడును.)

ఏకనాళావలంబిఫలద్వయన్యాయము:— ఒకకాఁడను రెండుపండ్లు అంటిపట్టుకొని యుండునట్లు ఒకపదమునకు రెండర్థము లుండవచ్చును. (దీనినే ఏకవృంతగతఫలద్వయన్యాయము అని కొందఱు.)

కంఠచామీకరన్యాయము:— అజ్ఞుఁడు తనమెడలో బంగారునగ పెట్టుకొని మెడలోనున్నదని జ్ఞప్తి లేక దానికై వెదకుచుండగాఁ ఎదుటివాఁడు అదిగో! నీమెడలోనే యున్నదని చూపఁగా గ్రహించినట్లు అజ్ఞాని పరుఁడుపదేశించినఁ గాని స్వస్వరూపము గ్రహింపనేరఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కంబళీనిర్ణేజనన్యాయము:-కంబళి ఉదుకుటవలన కంబళియు కాళ్లును గూడ శుభ్రపడు నట్లు ఒకపనివలన రెండులాభములు కలుగును.

కదంబకోరకన్యాయము:— కదంబవృక్షము -కడిమిచెట్టు- యొక్క మొగ్గలు అన్నియు ఏకకాలముననే వికసించునట్లు ఏకకాలముననే అంతట ఒకటి వ్యాపించును. దీనినే కదంబగోళకన్యాయమనియు, కదంబముకుళన్యాయ మనియు వాడుదురు. (వ్యతి: వీచీతరంగన్యాయము.)

కదళీఫలన్యాయము:—అరఁటిగెల పుట్టి అరఁటిచెట్టును చంపు నట్లు కొన్నిపుట్టి తమతల్లులనే నశింపఁజేయును. (చూ. అశ్వతరీగర్భన్యాయము.)

కపింజలన్యాయము:—బహుత్వము త్రిత్వమునందుఁ బర్యవసించుటను దెలుపు న్యాయభేదము—క్రతువున కపింజలములను హింసిపవలయు ననువాక్యమున ఇన్ని యని సంఖ్యానియమము చెప్పనందున బహువచనమున ముందు త్రిత్వసంఖ్య స్ఫురించును గాన మూఁడుకపింజలము లని నిర్ణయింపఁబడినది—ఇట్లే ఇన్ని యని తెలుపక కేవల బహువచనముతోఁ జెప్పినచోట మూఁడు అని గ్రహింపవలయును.

కఫోణిగుడన్యాయము:- ౧. నాలుకకు అందని మోఁచేతిమీఁదిబెల్లమును నాఁకుటకు యత్నించినట్లు అలభ్య మగుపదార్థముకొఱకు యత్నించుట వ్యర్థము.

౨. మోఁచేతిమీఁద బెల్లము లేకున్నను ఉన్న దనుభ్రాంతిచే దానిని నాఁకుటకు యత్నించునట్లు లేనిపదార్థమును ఆశచే సంపాదింపయత్నించుట నిష్ఫలము. (వాచ.)

కరకంకణన్యాయము :—కరకంకణ మనుచోట కంకణశబ్దము కరభూషణమును తెలుపుచున్నను కరశబ్దము భిన్నముగాఁ బ్రయోగించుటవలన ఆకంకణము తత్కాలమున కరలగ్న మైయున్న దని సూచింపఁబడుచున్నది. అట్లే ఇతరస్థలముల గ్రాహ్యమని తెలియవలెను.

కరతలామలకన్యాయము:—అఱచేతిలోని యుసిరికకాయ స్పష్టముగాఁ గనఁబడునట్లు ఒకవిషయమును ఇతరులు చెప్పనక్కఱలేకయే స్పష్టముగా కానవచ్చును.

కరదీపికాన్యాయము:—తన చేతిలోని దీపము తన కుపయోగింపక ఇతరుల కుపయోగించునట్లు తనవస్తువయ్యు తన కుపయోగింపక పరుల కుపయోగించును.

కరవిన్యస్తబిల్వన్యాయము:—(ఇది కరతలామలకన్యాయమువంటిది.)

కరికపిత్థన్యాయము:—ఏనుఁగు మ్రింగినవెలఁగపండు పైకి పండువలె కనఁబడినను లోపలి సార మంతయు నశించు నని ప్రసిద్ధి. అట్లే పైకి వస్తుస్వరూపము కనఁబడుచున్నను లోపల సారములేనిదానిని తెల్పును.

కాకతాళీయన్యాయము:- ౧. కాకి వ్రాలుటయు అకస్మికముగ తత్కాలముననే తాటిపండు పడుటయు కాకి ఆఫలమును తినుటయు ఎట్లు తటస్థించినవో అట్లే అవితర్కితముగా రెండింటిసమావేశమును దానివలన ఇష్టప్రాప్తియు కలుగును.

౨. కాకి వ్రాలుటయు అకస్మికముగా అప్పుడే తాటిపండు కాకితలపై పడుటయు దానివలన కాకి చచ్చుటయు తటస్థించినట్లు దైవికముగా రెండింటిసమావేశమును దానివలన అనిష్టప్రాప్తియును కలుగును. (ఇది అజాకృపాణీయన్యాయమువంటిది.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**కాకదంతగవేషణన్యాయము:**— కాకికి దంతములు కలవా? లేవా? ఉన్నచో అవి తెల్లగా నుండునా? నల్లగా నుండునా? అవి యెన్ని ఉండును? అని వానికై వెదకునట్లు అసంభవపదార్థములకొఱకు వ్యర్థముగా ప్రయాసపడుటను దెలుపును. కాకదంతగవేషణన్యాయము, కాకదంతపరీక్షా న్యాయము, వాయసదంతవిమర్శ న్యాయము అనియుదీనికి వాడుక కలదు.

**కాకదధిఘాతుకన్యాయము:**— కాకులు పెరుఁగు చెడఁగొట్టకుండఁగఁ జూచుచుండు మని చెప్పినపుడు కాకియే కాక ఇతరములగు జంతువులు కూడ పెరుఁగును చెఱుపకుండఁగ చూడు మనుట చెప్పువానియభిప్రాయమయినట్లు, ఒకదానిని వక్కాణించినపుడు అసందర్భమున అట్టిగుణములు కలమఱియొకదానిని గూడ చెప్పుట చెప్పువానియుద్దేశమగును.

**కాకాక్షిగోళకన్యాయము:**— కాకికి ఒకవైపుననే దృష్టి యానును. దాని నేత్రేంద్రియము ఏవైపునఁ జూడఁదలఁచిన ఆవైపున నున్న నేత్రగోళమున ప్రవేశించును. కాకి నేత్రేంద్రియము ఏవైపున కావలసిన ఆవైపున నున్న నేత్రగోళమున ప్రవేశించు నట్లు ప్రయోజనము ననుసరించి ఉభయపక్షములలో కావలసినపక్షమున ప్రవర్తించును.

**కాకోలూకనిశాన్యాయము:**— కాకులకు రాత్రి యగుకాలము గ్రుడ్లగూబలకు పగ లగును. గ్రుడ్లగూబలకు రాత్రి యగుకాలము కాకులకు పగ లగును. అట్లే అజ్ఞానులకు అసత్యమగు బ్రహ్మము జ్ఞానులకు సత్యమును జ్ఞానులకు అసత్యమగు ప్రపంచము అజ్ఞానులకు సత్యమును అగును.

**కారణగుణప్రక్రమ న్యాయము:**— ఎఱ్ఱనూలితో నేసినబట్ట ఎఱ్ఱగానుండు నట్లు కార్యముయొక్క గుణములు ఉపాదానకారణగుణమును అనుసరించి యుండును.

**కాశకుశావలంబనన్యాయము:**— ఏటిలో కొట్టుకొనిపోవువాఁడు రెల్లుపుల్లనో దర్భనో పట్టుకొనుట నిరర్థక మగునట్లు ప్రధానయుక్తులన్నియు వాదమున ఖండితములగుచుండఁగా దుర్బలయుక్తులు చెప్పుట నిరర్థకమగును. దీనిని కుశకాశావలంబనన్యాయము అనియు వాడుదురు.

**కీటభృంగన్యాయము:**— తుమ్మెదచే పట్టుకొనఁబడినపురుగు భయముచేత ఆతుమ్మెదనే నిరంతరము ధ్యానించుటవలన తానుకూడ తుమ్మెద అయినట్లు ఒకదానిని నిరంతరము ధ్యానము చేయువాఁడు తానుగూడ ధ్యానింపఁబడువస్తువుయొక్కస్వరూపమునొందును. దీనినే భ్రమరకీటన్యాయ మందురు.

**కుక్కుటధ్వనిన్యాయము:**— కోడికూఁత మొదట హ్రస్వముగా నుండి క్రమముగా దీర్ఘమగు నట్లు మొదట అల్పముగా నుండి క్రమముగా అధికమగుదానిని తెలుపును. (చూ. అపరాహ్ణచ్ఛాయాన్యాయము.)

**కుక్షిసమక్షికాన్యాయము:**— కడుపు లోనికిఁ బోయినఈఁగ తిన్నయన్నము నంతయును వెడలఁగ్రక్కించు నట్లు దోష మల్పమైనను పెక్కుసుగుణములను పోఁగొట్టును.

**కులాలకీటన్యాయము:**— కుమ్మరపురుగు కుట్టిలో తిరుగుచున్నను ఆమట్టి దానిశరీరమున నంటనట్లు సంసారాదికములందు అనుబంధము లేకుండఁగ ప్రవర్తించువానికి తత్సంపర్కదోషము లంటవు.

**కూపకూర్మన్యాయము:**— నూతిలోనున్న తాఁబేలు ఆనూతియే సమస్తప్రపంచ మని యూ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హించునట్లు లోకానుభవశూన్యుఁడైనమూఢుఁడు తనకు తెలిసినది కొలఁదియే సమస్తమని యూహించుకొనును.

కూపఖానకన్యాయము:— నూయి త్రవ్వువాని దేహమున అంటుకొన్న అంటలిబురద అందలి జలముచేతనే పోవునట్లు ధర్మాచరణాదులందు ఏదేనిదోషము సంభవించునేని అది దాని వలనఁ గలుగుపుణ్యముచేతనే నశించును. (ఇట్లే: కూపఖననన్యాయము.)

కూపమంత్రఘటికాన్యాయము:— ౧. పెక్కులు కుండలు గాని బొక్కెనలు గాని కట్టినయేతముతో నీరుతోడునపుడు కొన్ని నిండుటయు కొన్ని వట్టివగుటయు కొన్ని క్రిందికి వచ్చుటయు కొన్ని పైకెగయుటయు తటస్థించునట్లు లోకమున భిన్నజనులు భిన్నావస్థల పొందుచుందురు. సం. వృచ్ఛ. ౧౦. ౬౦.

౨. అగాధమగునూతినుండి ఏతాము గిరక లోనగుసాధనములచేత సుకరముగా దాని యందలిజలమును పైకి లాగునట్లు అగాధమగుశాస్త్రమునుండి ఉపదేశాదిరూపసాధనమున సారము నెత్తి గ్రహింపఁజేయుట మొదలగు విషయములను బోధించును.

కూపస్థమండూకన్యాయము:— నూతిలో నుండు కప్ప తాను నివసించునూయి తప్ప ఇతర ప్రపంచము నెఱుఁగనిదై సముద్రమండూకముతో నీసముద్రము ఈనూయి యంత యుండదని వాదించునట్లు పరసిద్ధాంతముల నెఱుఁగక వారిని దూషించువాఁడు పరిహాసపాత్రుఁడగును. (చూ. కూపమండూకన్యాయము.)

కూర్మాంగన్యాయము:— తాఁబేలు తనయవయవములను ఇష్టానుసారముగా ఒకప్పుడు లోపలికి ముడుచుకొన్ని ఒకప్పుడు పైకి చాఁచుకొనునట్లు జ్ఞాని ఇష్టానుసారముగా తనయింద్రియములను బాహ్యవిషయములందుఁ బ్రవర్తింపఁజేయుచు వానినుండి నివర్తింపఁజేయుచు నుండును.

కైముతికన్యాయము:- (చెప్పినదానికంటె అల్పమగువిషయమున—కిముత—ఏమి చెప్పవలసినది? అని చెప్పుట.) అధికాయాససాధ్యమగుపని చేయు సమర్థుఁడగువానికి అల్పాయాససాధ్యమగుపనియందు సామర్థ్యము కలదని చెప్పవక్కఱలేదు. (ఇట్లే: కైముత్యన్యాయము.)

కౌంతేయరాధేయన్యాయము:— కర్ణుఁడు కుంతికి కొడుకయ్యు తాను కుంతీపుత్రుఁడని తెలియక తనను పెంచినరాధకు కొడుకనియే తలఁచుచుండఁగా ఆప్తులు నీవు కుంతీపుత్రుఁడవని చెప్ప తాను కౌంతేయుఁడనని గ్రహించినట్లు తనయథార్థస్వరూపమెఱుఁగక తనను అన్యునిగా భావించుకొనువాఁడు ఆప్తులవాక్యమువలన స్వస్వరూపమెఱుఁగును.

క్షీరనింబన్యాయము:— వేఁపచెట్టునకు పాలు పోసి పెంచినను చేఁదు పోనట్లు ఎన్నివిధముల మార్పుఁ గలఁచినను దుష్టునిస్వభావము మారదు.

క్షీరనీరన్యాయము:— కలసినపాలను నీటిని ఒకదానినుండి యొకదానిని విడఁదీయుటశక్యము కానియట్లు ఇది విడఁదీయరానికలయికను తెలుపును ఇట్లే: క్షీరోదకన్యాయము, నీరక్షీరన్యాయము (వ్యతి. తిలతండులన్యాయము.)

ఖలమైత్రీన్యాయము:— దుర్జనులమైత్రి మొదట హెచ్చుగా నుండి క్రమముగా క్షీణించును. అట్లే మొదట హెచ్చుగా నుండి క్రమముగా క్షీణించుదాని నిది తెలుపును. (చూ. పూర్వాహ్ణచ్ఛాయాన్యాయము.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఖలేకపోతన్యాయము:-ఒకపావురము గింజలుఏతి కొనుటకు కళ్లమందు వ్రాలునపుడు దానితోఁ గూడ నుండినమిగిలినపావురములు కూడ వ్రాలునట్లు ఒకగుంపులో నొకఁడు ఒకకార్యమందు ప్రవర్తింమునపుడు తోడివారందఱు దానియందే ప్రవర్తింతురు.

ఖల్వాటబిల్వీయన్యాయము:—నీడ నపేక్షించి బట్టతలవాఁడు మారేడుచెట్టుక్రిందికి పోఁగా మారేడుపండు పడి తల పగిలినట్లు అదృష్టహీనుఁడు కష్టములు తొలఁగించుకొని సుఖపడుటకు ఎక్కడికి పోయినను కష్టములే సంభవించును. (భర్తృహరినీతిశతకము ననుసరించి ఖల్వాటతాళీయ న్యాయమనియు ననచ్చును.)

గగనకుసుమన్యాయము:-ఆకాశమున పూవుండుట అసంభవ మగునట్లు ఇది అసంభవ మగు దానిని తెలుపును.

గజాశర్ధన్యాయము:-ఏనుఁగు పెద్దదైనను అపానవాయుధ్వని అల్పమే అయినట్లు ఆడంబర మధికమయినను ఆచరణమల్పమని తెలుపును. (దీని నేగజపర్ద న్యాయమని కూడ అందురు.)

గడ్డరికాప్రవాహన్యాయము:— గొఱ్ఱెలవరుసలో ఒకగొఱ్ఱె ప్రవాహములో దూఁకినపుడు మిగిలినవికూడ ఎంతమరలించినను మరలక ప్రవాహములో దూఁకును అని లోకప్రసిద్ధి. అట్లే తమసంఘములో అనిష్టమార్గమందు ప్రవర్తింమనొకనిని జూచి మిగిలినవారును అప్పు లెంతవారించినను మానక అనిష్టమార్గమందే ప్రవర్తింతురు.

గతజలసేతుబంధన్యాయము:—నీరు పోయినతర్వాత గట్టువేసినట్లు కార్యము మించిపోయినతర్వాత చేయు నివారణ ప్రయత్నము వ్యర్థము.

గర్తపతిగోధామాంసవిభజనన్యాయము:— ఉడుము కన్నములో నుండఁగానే దానిమాంసమును పంచుకొనుట అశక్యమగునట్లు తెలియనివిషయమున ప్రవర్తించి ఫలితమందుట అసాధ్యము.

గర్దభచందనన్యాయము:—గాడిద తాను చందనకాష్ఠభారమును మోయుచున్నను చందన పరిమళము దానికి తెలియనట్లు అనుభవహీనునకు కలవిద్యాధనాదిసంపత్తియొక్క లాభము వానికి కలుగదు.

గుంజాగ్నిన్యాయము:—ఎఱ్ఱగురివెందగింజ పైన నిప్పువలె కనఁబడినను దానివలె దహింపనేరనట్లు అకృతిసామ్య మున్నంతమాత్రమున గుణసామ్య ముండదు.

గుడజిహ్వికాన్యాయము:—నాలుకకు బెల్లము రాచి పిల్లలచే చేఁదుమందు తినిపించునట్లు అప్రియము లగుహితోపదేశములను ప్రియవచనములతో చేయుటను తెలుపును.

గోముఖవ్యాఘ్రన్యాయము:-పైకి సాధువుగానుండి అంతఃకరణమందు క్రౌర్యము కలవాఁడు గోముఖము కలపులివంటివాఁడు. ఆవుముఖము కలపులినిజూచి ఆవనుకొని ఇతరజంతువులు దగ్గఱకు రాఁగా అది వానిని చంపి వేయునట్లు పైకిసాధువుగా నుండు క్రూరుఁడు దరిఁ జేరువానిని మోసపుచ్చి బాధించును.

ఘటీయంత్రన్యాయము :—౧. ఘటీయంత్రము -గడియారము- విశ్రాంతిలేకుండ తిరుగుచుండునట్లు అజ్ఞానిసంసారాదులందు నిత్యమును పరిభ్రమించును.

౨. ఘటీయంత్రము -ఏతము-తో నీళ్లు తోడునపుడు వట్టిబొక్కెన నీళ్లతో నిండుటయు, నీటితో నిండినబొక్కెన వట్టిదగుటయు సంభవించునట్లు లోకమున రిక్తులు సంపన్నులగుటయు సంపన్నులు రిక్తు లగుటయు సంభవించును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**ఘట్టకుటీప్రభాతన్యాయము:**— సుంకపు కొట్టు దగ్గఱ తెల్లవాఱుట.— ఒక దొంగ వర్తకుఁడు సుంక మియ్యవలసి వచ్చునని వెఱచి రాత్రి తప్పుదారిని బోవ తెల్లవాఱునప్పటికి వాఁడు సుంకపుకొట్టుకడకే వచ్చినట్లు ఒకచిక్కును తప్పించుకొనుటకై ఎన్ని పెడత్రోవలు త్రొక్కినను తుదకాచిక్కు తప్పకుండును.

**ఘుణాక్షరన్యాయము:**— ను[illegible]పురుగులు అక్షరాకారముగఁ దొలువను ఉద్దేశము లేకున్నను అవి తొలిచిన భాగము అక్షరరూపముగాఁ గనఁబడునట్లు చేసినయొకపని తలవనితలంపుగా నొక యనుద్దిష్టకార్యముగా పరిణమించును.

**ఘృతకోశాతకీన్యాయము:**— నేతిబీరకాయలో నేయి లేనియట్లు సార్థకము గానిపేరు ఇది తెలుపును.

**చందనన్యాయము:**— శరీరైకదేశమున నుంచిన చందనతైలము దేహమంతటను గూడ శైత్యమును కలిగించునట్లు ఆత్మయు ఏకదేశమునందుండి జ్ఞాన ప్రకాశముచే శరీర మంతయు వ్యాపించును.

**చంద్రచంద్రికాన్యాయము:**— చంద్రుని విడిచి చంద్రికయు చంద్రికను విడిచి చంద్రుఁడును ఉండనట్లు నిత్యసంబంధముకలవి ఎన్నఁడు విడి యుండవు. (అవినాభావ సంబంధము.)

**చక్రభ్రమణన్యాయము:**— కుమ్మరి కుండ చేయునపుడు దండముతో చక్రము త్రిప్పి విడిచినపిదప కొంతసేపు చక్రము తిరుగుచునే యున్నట్లు దేహి కొంతకర్మము నాచరించి జ్ఞానోదయోత్తరక్షణమున కర్మమును విడిచినను ప్రారబ్ధకర్మవేగమున కొంతకర్మఫల మనుభవించుచునే యుండును.

**చతుర్వేదవిన్న్యాయము:**— చతుర్వేదవేత్తలకు మహాదానము చేసెద నని ఒకరాజు ప్రకటింపఁగా ఒక మూర్ఖుఁడు అది విని "వేదములు నాలుగు" అన్నమాట నాకు తెలియును. కనుక ఆదానము నాకిండని యడుగఁగా అతఁడు దానమును పొందలేక పోవుటయే కాక అందఱకు పరిహాసపాత్రుఁడయ్యెను. అట్లే "బ్రహ్మము సచ్చిదానందరూపము జీవాత్మపరమాత్మలకు భేదము లేదు" మున్నగు తత్త్వవాక్యములు చిలుకపలుకులవలెఁ బలుకుచు వానియర్థానుభవము లేనివాఁడు వాని లాభమును పొందక పోవుటయే కాక ఎల్లరకు పరిహాసపాత్రుఁ డగును.

**చర్వితచర్వణన్యాయము:**— నమలినదే నమలినట్లు చేసినదే మరల చేయుటను తెలుపును. (ఇట్లే: పిష్టపేషణన్యాయము.)

**చిత్రాంగనాన్యాయము:**— చిత్తరువులోని స్త్రీ చుంబనాలింగనాదులు చేయలేనట్లు జ్ఞాని చేయుకర్మములు కర్మములయ్యు వానినంటనేరవు. చిత్రామృతన్యాయమును చిత్రానలన్యాయమును ఇట్టివే.

**ఛత్రిన్యాయము:**- గొడుగులు వేసికొనినవారు పెక్కండ్రును గొడుగులు లేనివారు కొందఱును పోవుచుండఁగా ఛత్రులు (గొడుగులవారు) పోవుచున్నవారు అనునట్లు పెక్కండ్రు ఆచరించుదానిని వారితో నున్నయితరులుగూడ ఆచరించుచున్నా రని తలఁపఁబడును.

**జతుకాష్ఠన్యాయము:**— లక్కముక్క విఱుగునట్లు ఎక్కడను కావలసిన నక్కడను విఱిగిపోవుదానిని తెలుపును (శబ్దశ్లేషములందు పయుక్తము.)

**జపాస్ఫటికన్యాయము:**— దాసనపువ్వు తెల్లనిస్ఫటికముదగ్గఱ పెట్టిన స్ఫటిక మంతయు ఎఱ్ఱగాఁ గనఁబడునట్లు స్వచ్ఛవస్తువు దగ్గఱ నున్న దానిగుణమును పొందును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జలకతకరేణున్యాయము:—చిల్లగింజ అను దీసి ఆగంధము నీటిలో కలిపినపుడు దాని లోనిబురదను విడదీసి దానితో తానును అడుగునకుఁ బోవునట్లు శాస్త్రజన్య జ్ఞానము అజ్ఞానమును నశింపఁజేసి తానును నశించును.

జలతుంబికాన్యాయము:—౧. మట్టి యంటుకొన్న ఆనుఁగుకాయ నీటిలో పడినపుడు మొదట మునిఁగి క్రమముగా దాని నంటుకొన్న మట్టి నీటిచే కరఁగిపోవుటవలన పైకి తేలునట్లు అవిద్యాసంపర్కముచేత సంసారసముద్రమున మునుఁగుచున్న జీవుఁడు అజ్ఞానము నశించుటచేత సంసారమునుండి విముక్తుఁడగును.

౨. ఆనుఁగుబుఱ్ఱను జలములో నెంత ప్రయత్నము చేసి లోని కణఁచెదరో అంత పైకెగయును. అట్లే మనస్సును ఓకేపర్యాయమున ఎంతగ నిరోధింపఁ బ్రయత్నించునో యంత చాంచల్యము కలది యగును.

జలతైలబిందున్యాయము:— నీటిమీఁద వేసిన నూనెచుక్క నీటిపైని అంతటను వ్యాపించునట్లు తాను కొంచె మయ్యును అంతటను వ్యాపించుదాని నిది తెలుపును.

జలమంథనన్యాయము:— పెరుఁగు తరచినట్లు నీరు తరుచుటవలన ప్రయోజనము లేదు. ఇది ప్రయోజనము మాలినపనిని తెలుపును. (కాకదంతగవేషణన్యాయమువంటిది.)

జలాగ్నిన్యాయము:—నీరును నిప్పును కలసినప్పుడు ఏది ఎక్కువగా నుండునో అది రెండవదానిని క్షీణింపఁజేయును. అట్లే బలాధికుఁ డగుశత్రువు బలహీనుని ఓడించును.

టిట్టిభన్యాయము:—టిట్టిభము తనరెండుకాళ్లను పైకి పెట్టి నాకాళ్లతో ఆకాశమును లోకములపైఁ బడకుండ నాఁపుచున్నా నని తలంచును. అట్లే తనవలననే లోకము లుద్ధరింపఁబడుచున్నవి. తాను లేకున్న నేమియు లే దని యనుకొనువానివిషయము దెలుపును.

డమరుకమణిన్యాయము:-డమరుకమున కునడుమ కట్టిన త్రాటిచివర నుండుపూసరెండువైపులను వాయించుటకు సాధనమగునట్లునడుమనున్న వస్తువు రెండువైపులకు నుపయోగించు నని తెలుపును. (ఇది దేహళీదీపన్యాయమువంటిది.)

తప్తతైలాంబున్యాయము:— క్రాఁగిననూనెపై నీరు చల్లిన బగ్గున మండునట్లు కోపాక్రాంతునితో శాంతింపు మని పలికిన కోపము మఱింత హెచ్చును.

తమోదీపన్యాయము:—దీపముండుచోట చీకటి ఉండనట్లు విరుద్ధధర్మములు కలరెండువస్తువు లొకచోట నుండవు.

తరంగప్రతిబింబన్యాయము:-తరంగములయందు ప్రతిబింబించు సూర్యుఁ డొక్కఁడైనను ప్రతిబింబములు అనేకముగా కనఁబడునట్లు ఆత్మ యొక్కఁడే అనేకోపాధులయందు ప్రతిబింబించి అనేకాత్మలుగా తోఁచుచున్నాఁడు.

తిలతండులన్యాయము:- కలసియున్నను నువ్వులను బియ్యమును విడఁదీయుటకు వీలగునట్లు ఇదివేఱుపఱుచుటకు వీలగుకలయికను తెలుపును. (వ్యతి. క్షీరనీరన్యాయము.)

తుషఖండనన్యాయము:—ఊఁకను ఎన్నిమార్లు దంపినను బియ్యము రానియట్లు ఎంతప్రయాస పడినను నిష్ప్రయోజన మగుప్రయత్నమును ఇది తెలుపును.

తుష్యతుదుర్జనన్యాయము:—దుర్మార్గుఁడు సంతోషించుఁగాక యని ప్రతివాదియొక్క వాదము యుక్తిసహము కాకున్నను దానిని వాది గ్రహించుటను తెలుపును.

తృణజలూకాన్యాయము:- పురుగు స్వశరీరపూర్వభాగముతో ముం దుండుతృణాదికమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పట్టుకొనిన తర్వాత కానుకటిభాగముతో పట్టుకొన్నట్టు విడుచునట్లు ముందుపట్టు దొరకినఁగాని కానుకపట్టు విడువ కుండుటను తెలుపును.

తృణరజ్జున్యాయము:— గడ్డిపోఁచలు కూడి త్రాడై ఏనుఁగున్నైన బంధింపఁగలిగినట్లు దుర్బలు లైనను ఏకీభావముకలన మహత్తర మగుకార్యము నిర్వహింపఁగలుగుదురు.

తేజస్తిమిరన్యాయము:— వెలుఁగుండుచోట చీకటి యుండనట్లు విరుద్ధధర్మము లొక చోట ఉండవు.

దండాపూపన్యాయము:— దండమును కొఱికిన యెలుక దానియందు గ్రుచ్చినయప్పమును గూడ కొఱుకు ననుట చెప్ప నక్కఱలే నట్లు ఒకటి చెప్పఁగా దానిసాహచర్యము వలన సులభముగా సిద్ధించు మఱియొకవిషయము మరలచెప్పనక్కఱలేదు. దీనిని దండాపూపికాన్యాయమనియు అందురు.

దగ్ధబీజన్యాయము:— వేఁచినగింజలు మరల మొలక లెత్తనట్లు జ్ఞానియొక్క కర్మములు జన్మాంతరమునకు హేతువులు కావు.

దగ్ధరజ్జున్యాయము:— కాలిపోయినత్రాడు పైకి త్రాడువలె అగపడినను స్పృశించిన భస్మమగును. అట్లే జగత్తు పైకి సత్యముగా కనఁబడినను యాథార్థ్యము విచారింప అసత్యముఅగును. (దగ్ధపటన్యాయము,దగ్ధపత్రి న్యాయమును ఇట్టివే.)

దగ్ధేంధనవహ్నిన్యాయము:— నిప్పు కట్టెలను గాల్చి తుదకు తానుగూడ నశించునట్లు తత్త్వజ్ఞానము అజ్ఞానమును నశింపఁజేసి చివరకు తానుగూడ నశించును.

దర్వీపాకరసన్యాయము:— గరిఁటె కూరమున్నగువానిని కలియఁబెట్టుచున్నను అది వానిరుచి నెఱుఁగనట్లు అజ్ఞాని యెన్నిశాస్త్రములు చదివినను వానియనుభవము నెఱుఁగలేఁడు.

దూరస్థపర్వతన్యాయము:— దూరపు కొండలు నునుపు- కొండలు దూరమునుండి చూచిన నునుపుగా కనఁబడి దగ్గఱకుఁ బోయి చూడఁగా కృత్యస్తముగా నుండునట్లు కొందఱు దూరముగా నున్నపుడు మంచివారుగాఁ గనఁబడి దగ్గఱకు వచ్చినపుడు చెడ్డవారుగా నుందురు. (దీనినేదూరగిరిన్యాయమందురు.)

దేవదత్తహంతృహతన్యాయము:— దేవదత్తుని చంపినవాఁడు చంపఁబడినను దేవదత్తుఁడు మరల బ్రదుకనట్లు అజ్ఞానమును నశింపఁజేసిన జ్ఞానము పోయినను మరల అజ్ఞానముపుట్టదు.

దేహళీదీపన్యాయము:— గడపమీఁద నుంచినదీపము రెండుపైపులకుఁ -లోనివారికిఁ బైవారికి-గూడ వెలుతురు నిచ్చునట్లు ఏకకార్యము ప్రయోజనద్వయమును నెఱవేర్చును.

ద్రావిడప్రాణాయామన్యాయము:— ద్రవిడదేశస్థులు ప్రాణాయామము చేయునపుడు సూటిగా ముక్కు పట్టుకొనక చేయి తలకానుక నుండి త్రిప్పి దానితో ముక్కు పట్టుకొనెదరని ప్రసిద్ధి. అట్లే ఋజుమార్గమున కార్యము సిద్ధించుచుండఁగా దానిని వక్రమార్గమున నెఱవేర్పఁ జూచుటను ఇది తెలుపును.

ధాన్యపలాలన్యాయము:— ధాన్యములోనిపొల్లు పరిహరించి ధాన్యము స్వీకరించినట్లు సారవంత మగుపదార్థముతో నున్న నిస్సారపదార్థమును పరిత్యజించి సారవంత మగుదానిని గ్రహింపఁదగును. (మత్స్యకంటకన్యాయము నిట్టిదే.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నష్టాశ్వదగ్ధరథన్యాయము.—రథికులిద్దఱు తమ రెండురథములతో గ్రామాంతరమునకుఁ బోవుచు నడుమ నొకగ్రామములో నాఁగిరి. ఆ రాత్రి ఆగ్రామము కాలిపోవునపుడు రథికులిద్దఱిలో నొకఁడు ముందు తనరథమును కాలకుండఁగ జాగ్రత్తపెట్టునంతలో వానిగుఱ్ఱములు కాలిపోయినవి. రెండవరథికుఁడు ముందు గుఱ్ఱములు కాలిపోకుండ జాగ్రత్తపెట్టునంతలో వానిరథము కాలిపోయినది. వారిద్దఱును గలసి మిగిలినగుఱ్ఱములను మిగిలినరథమునకుఁ గట్టి పైగ్రామమునకుఁ బ్రయాణముఁ జేసిరి అని గాథ కలదు. అట్లే పరస్పరసాహాయ్యమున ఒండొరులలోపములు పూర్తిచేసికొని కార్యము నెఱవేర్చుకొనవచ్చును.

నారికేళఫలాంబున్యాయము:— కొబ్బెరకాయలోనికి నీ రెట్లు వచ్చెనో తెలియనట్లు సచ్చిదానందస్వరూప మగు బ్రహ్మమునుండి అనృతజడదుఃఖాత్మక మగుజగత్తు ఎట్లు వచ్చునో తెలియరాదు.

ఇట్లే: నారికేళనీరన్యాయము.

పంకప్రక్షాళనన్యాయము:—"అడుసుత్రొక్క నేల? కాలు కడుగ నేల?"—అడుసు త్రొక్కి కాలు కడుగుకొనుటకంటె అడుసు త్రొక్కకుండుటయే మంచి దగునట్లు అనర్థము తెచ్చికొని తర్వాత దానిని తొలఁగించుకొనుటకంటె అనర్థము తెచ్చికొనకుండుటయే మంచిది.

పద్మినీపత్రజలబిందున్యాయము:- తామరాకును నీటిబిందువు లంటుకొనని నట్లు జ్ఞానిని సంసారాదులు అంటుకొనవు.

పయోముఖవిషకుంభన్యాయము:—లోపల విషమును పైన మూతియొద్ద పాలును గలకుండవలె తియ్యని పైపైమాటలును హృదయమున దుష్టత్వమును గలవానిని తెలుపును.

పరిశేషన్యాయము:—ఉన్నవారిలో కొందఱి గుణములు తెలిపి యూరకున్న మిగిలినవారి గుణములు పైవానికి వ్యతిరేకముగా నుండును.

పాషాణేష్టకన్యాయము:—దూదికంటె ఇటుక కఠిన మైనదైనను పాషాణముకన్న మృదువైనట్లు తనకంటె నెక్కువవానిని గాంచి బాధపడక తక్కువవానిని జూచి వానికన్న తానే మెఱుఁగని తృప్తి పడుచుండవలె నను విషయమును దెలుపును.

పిష్టపేషణన్యాయము:- ఇది చర్వితచర్వణన్యాయమువంటిది. (నూఁటినదే నూఁటినట్లు.)

పూర్వాహ్ణచ్ఛాయాన్యాయము:—ప్రొద్దుటినీడ మొదట పొడుగుగా నుండి క్రమముగా తగ్గిపోవు నట్లు మొదట హెచ్చుగా నుండి క్రమముగా క్షీణించుదాని నిది తెలుపును. (వ్యతి. అపరాహ్ణచ్ఛాయాన్యాయము.)

ప్రదీపన్యాయము:—౧. దీప మొకచోటనే వెలుఁగుచు గృహమంతను ప్రకాశింపఁజేయునట్లు ఒకస్థలమున నుండి అంతటను స్వకార్యము నెఱవేర్చువాని నిది తెలుపును.

౨. చమురును వత్తియు విడివిడిగా నిప్పును కొంత చల్లార్చునవి యైనను మూఁడును గలసి దీపముగా వెలుఁగునట్లు పరస్పరవిరుద్ధవస్తువులు గూడి ఒకకార్యము కలిగించును.

ప్రధానమల్లనిబర్హణన్యాయము:—ప్రధానమల్లుఁడు జయింపఁబడినచో మిగిలినమల్లురు గూడ పరాజితులుగా గ్రహింపఁబడునట్లు ప్రధానవాదము ఖండింపఁబడినచో మిగిలిన యప్రధానవాదములుగూడ ఖండింపఁబడినట్లు గ్రహింపఁబడును.

ప్రపానకరసన్యాయము:—పంచదార మిరియములు మొదలగువానిసమ్మేళనమువలన విల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

షణ మగురుచి కలపానకము ఏర్పడు నట్లు భిన్న పదార్థములసమ్మేళనమువలన చిత్రరూప పదార్థము పుట్టును.

ఫలవత్సహకారన్యాయము:—పండ్లతో నిండిన తియ్యమామిడిచెట్టు నీడకై వచ్చినవారికి పండ్లను పరిమళమును గూడ ఇచ్చునట్లు ఏదో యొకఫలమును గోరి వెళ్లినవారికి ఫలాంతరములుగూడ లభించును.

బకబంధనన్యాయము:—కొంగను పట్టుకొనఁబూనినవాఁడు కొంగదగ్గఱకుఁ బోయి అప్పుడే పట్టుకొనకుండ దానినెత్తిమీఁద వెన్నముద్ద పెట్టి ఎండచే కరఁగిన వెన్న కన్నులలోఁ బడి కన్నులు కనఁబడకుండునపుడు దానిని పట్టుకొనఁబూనినట్లు అనాయాసముగా సాక్షాత్సిద్ధ మగుకార్యము ఉపేక్షించి అధికప్రయాసముతో ఆపనినే కొంతవిలంబముమీఁద నెఱవేర్పఁబూనుటను తెల్పును.

బధిరకర్ణజప (జాప) న్యాయము.—(చెవిటివాని చెవిలో సంకూఁదునట్లు-) చెవిటివాని చెవిలో రహస్యము చెప్పుటవలె నిష్ప్రయోజన మగుపని చేయుటను తెలుపును. (చూ. అరణ్య రుదితన్యాయము.)

బహుచ్ఛిద్రప్రదీపన్యాయము:— బహురంధ్రములుగలకుండలో నుంచినదీపము రంధ్రములలోనుండి పైకి వ్యాపించునట్లు జీవునకుపాధియైనబుద్ధి శరీరముయొక్క నవరంధ్రద్వారమున బాహ్యవిషయములయందు వ్యాపించును.

బీజాంకురన్యాయము:—(చెట్టు ముందా? విత్తు ముందా?) గింజనుండి మొక్కయు మొక్కనుండి గింజయు పుట్టునటు ఒకదాని కొకటి పరస్పరజన్మకారణములై అన్యోన్యాశ్రయము కలపదార్థములను తెలుపును. (అండకుక్కుటీన్యాయము ఇట్టిదే.)

బ్రాహ్మణగ్రామన్యాయము.—ఒకగ్రామమున బ్రాహ్మణేతరులుకూడ ఉన్నను బ్రాహ్మణులు పెక్కండ్రు ఉంకుటచేత ఆగ్రామమును బ్రాహ్మణగ్రామ మనునట్లు అంశాధిక్యమునుబట్టి పేరు వచ్చును. (మల్లగ్రామన్యాయమును ఆమ్రవణన్యాయమును ఇట్టివే.)

భిక్షుపాదప్రసారణన్యాయము.—భిక్షుకుఁడొకఁడు ఒకధనవంతునియింట మృష్టాన్నభోజనసుఖనివాసములు పొందఁ గోరి మొదట వానియింట అడుగుపెట్టనిచ్చినఁ జాలు నని ప్రవేశించి తుదకు సమస్తభోగములు సంపాదించినట్లు, ఘనకార్యము నెఱవేర్చుకొనఁ దలఁచినవాఁడు మొదట అల్పఫలాపేక్షవలె నటించి ప్రవేశము సంపాదించి తుదకు తనఘనకార్యము నెఱవేర్చుకొనును. వేదమాత బ్రహ్మ పదార్థమును బోధింపఁదలఁచి శ్రోతృజనానుకూలముగ అన్నమయాదికోశములే బ్రహ్మమని మొదట బోధించి తుదకు బ్రహ్మముయొక్క యాథార్థ్యమును బోధించునని చెప్పుట యందు ఈ న్యాయము ప్రవర్తించును.

భూమిరథికన్యాయము.— (భూమిరథికుఁడు=నేలపై రథాకారములు గీయువాఁడు.) యుద్ధకౌశల్యము సంపాదింపఁదలఁచినవాఁడు నేలపై రథాకారములు గీసి యుద్ధవిషయములను నేర్చుకొను నట్లు, ఒకదానియందు నేర్పు సంపాదింపఁదలఁచువాఁడు కృత్రిమసాధనములతో దాని నభ్యసించును. (చూ. ఇుష్వేష్టిన్యాయము.)

భూలింగన్యాయము.— భూలింగ మనుపక్షి "మా సాహసం కురు=సాహసము చేయవలదు" అని ఎప్పుడును కూయుచుండి తాను సింహదంష్ట్రల నడుమ నున్నమాంసమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లాగి తిను నని ప్రసిద్ధి. అట్లే తాను పరోప
దేశపాండిత్యము చూపుచు దానికి వ్యతిరేక
ముగా సంచరించు దాంభికుని చర్యను తె
లుపును. (దీనికి మాసాహసశకునిన్యాయ మ
నియు వాడుక కలదు.)

భ్రమరకీటన్యాయము=కీటభృంగన్యాయము.

భ్రమరన్యాయము:—భ్రమరము కంటకాదుల
ను విడిచి పుష్పమందలిమకరందమునే గ్ర
హించునట్లు గుణదోషములలో దోషమును
విడిచి సుజనుఁడు గుణమును గ్రహించును.
(చూ. శూర్పన్యాయము.)

మండూకతోలనన్యాయము:— (కప్పలతక్కెడ)
తక్కెడచిప్పలో కప్పలను బెట్టి తూఁచు
నపుడు ఒకకప్పను వేయునప్పటికి అందున్న
కప్పలు దూఁకి పోవునట్లు స్థిరచిత్తులు కాని
వారితోఁ జేయుపని నెఱవేఱదు. (దీనినే
మండూకతులాన్యాయమనియు వాడుదురు.)

మండూకప్లుతిన్యాయము:—(కప్పదాఁట్లు.) క
ప్ప దాఁటునట్లు ఒకవిషయమును చెప్పుచు
దానిలోఁ గొంతభాగము విడిచిపుచ్చి పైభా
గమును చెప్పుట నిది తెలుపును.

మండూకమక్షికాన్యాయము:—సర్పముచే మ్రిం
గఁబడుచున్నకప్ప యీఁగలను తినుటకు
యత్నించు నట్లు తాను మృత్యుముఖమునఁ
బడుచున్నను మనుష్యుఁడు భోగములను
అపేక్షించుచునే యుండును.

మక్షికాన్యాయము:—౧. ఈఁగ శరీరమందు
మంచిభాగమును విడిచి పుండుమీఁద వ్రాలు
నట్లు దుష్టుఁడు సుగుణములను విడిచి దుర్గు
ణములనే గ్రహించును.

౨. మధుమక్షికలు -తేనెయీఁగలు- మధుకర
రాజును అనుసరించి పోవునట్లు చిత్తము
ననుసరించి యింద్రియములు ప్రవర్తించును.

మణిసూత్రన్యాయము:— పూసలలోనిదార
మువలె అన్నిటిలోను కలసియుండుటను
ఇది తెలుపును.

మత్స్యకంటకన్యాయము:-చేఁపలను తినువాఁడు
ముండ్లతో నున్నచేఁపను దీసికొని వెళ్లిముం
డ్లు తీసి పాఱవైచి మిగిలినచేఁపను గ్రహిం
చునట్లు కార్యవాది అభీష్టపదార్థములో
పాటు గ్రహించిన నిరుపయోగపదార్థమును
పాఱవైచి తుదకు అభీష్ట పదార్థమును గ్ర
హించును.

మధుమక్షికాన్యాయము:— తేనెయీఁగలు ప్రో
గుచేసినతేనె పరులపా లగునట్లు ఒకఁడు
గడించినది మఱియొకఁ డనుభవించును.

మరుమరీచికా న్యాయము:— ఎండమావులను
జూచి నీళ్లనుకొనునట్లు అజ్ఞాని అసత్యపదా
ర్థము భ్రాంతిచేత సత్యపదార్థముగా గ్రహిం
చును.

మర్కటకిశోరన్యాయము :—తీసికొని పోవున
పుడు కోఁతిపిల్లలు తమతల్లిని అంటిపట్టుకొను
నట్లు ఆశ్రితులు ఆశ్రయమును అంటిపట్టు
కొని యుందురు. (వ్యతి. మార్జాలకిశోర
న్యాయము.)

మల్లగ్రామన్యాయము:—మల్లురు పెక్కండ్రు
ఉండుటచేత మల్లగ్రామ మని వ్యవహారముక
లుగును. (చూ. బ్రాహ్మణగ్రామన్యాయము.)

మాత్స్యన్యాయము:— పెద్దచేఁపలు చిన్నచేఁప
లను తినునట్లు అరాజకదేశమున బలవంతు
లు దుర్బలులను పీడింతురు.

మార్జాలకిశోరన్యాయము:— పిల్లి తనపిల్లలను
ఎటుకేని తీసికొని పోవునపుడు పిల్లలను భద్ర
ముగా కఱచి పట్టుకొను నట్లు భగవంతుఁడే
భక్తులభారమును పూర్ణముగా వహించును.
(వ్యతి. మర్కటకిశోరన్యాయము.)

మాషరాశిప్రవిష్టమషీన్యాయము:—మినుముల
రాశిలోఁ బడ్డమసివలె సమానవర్ణముగలపెద్ద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాశిలోఁ గలసినచిన్నవస్తువు కనఁబడదు.

ముంజేషీకోద్ధరణన్యాయము :— ముంజగడ్డిలో నుండి దాని మొవ్వును లాగినట్లు స్థూలసూక్ష్మ కారణశరీరములనుండి తదంతస్స్థ బ్రహ్మపదార్థమును విడఁదీసి గ్రహింపవలయును.

మూషాసిక్తతామ్రన్యాయము:— మూసలో కరఁగినరాగి మూసతో సమాన మగుఆకారమును పొందు నట్లు చిత్తము విషయములయందు వ్యాపించి తత్సమానాకారమును పొందును.

మూషికసర్పపేటికాన్యాయము:—(ఎలుక-పాములపెట్టె.) పాములపెట్టెలో ఒకపాము నలఁగి ఆఁకలిబాధచే ప్రాణావశిష్టమై యుండఁగా ఒక ఎలుక ఆపెట్టెను చూచి యందు భక్ష్యపదార్థము లుండు ననుకొని దానికి బిలము చేసి ఆపెట్టెలోఁ బ్రవేశింపఁగా పాము దానిని భక్షించి ఎలుక చేసినరంధ్రమునుండి స్వేచ్ఛగా పైకిఁ బోయెను. అట్లే సుఖపడ యత్నించువాఁడు దుఃఖము నొందును. దుఃఖములోనున్నవాఁడు అప్రయత్నముగ సుఖము నొందును. ప్రాణులహానివృద్ధులకు దైవమే కారణమగును. (దీని నే మూషికాహిమంజూషాన్యాయమనియు నందురు.)

యథాసంఖ్యన్యాయము:-ఇది క్రమాన్వయమును దెలుపును. ఉదా: నీవు శత్రువును మిత్రుని ఆపదను జయింపుము రంజింపుము భంజింపుము అనుచోట శత్రువును జయింపుము. మిత్రుని రంజింపుము, ఆపదను భంజింపుము అని అర్థము.

యావత్తైలంతావద్వ్యాఖ్యానమను న్యాయము:- ఒకవ్యాఖ్యాత వ్యాఖ్యానము వ్రాయుచు దీపములో చమురున్నంతవఱకు వ్యాఖ్యానము వ్రాసెదనని చెప్పినాఁడఁట. అట్లే సాధన సామగ్రి ఉండునంతవఱకు కార్యము జరుప వలయును.

రజ్జుసర్పన్యాయము:— త్రాడు చూచి భ్రాంతిచే పా మనుకొనునట్లు అజ్ఞుఁడు ఒకవస్తువును జూచి తత్సమాన మగుమఱియొకవస్తువుగా భావించును.

రాజపుత్రవ్యాధన్యాయము:— రాజపుత్త్రుఁ డొకఁడు శైశవముననే తలిదండ్రులకు దూరమై యొకవ్యాధునింటఁ బెరుఁగుచు తన్ను వ్యాధపుత్త్రునిగా భావించి వ్యాధకులమునకుఁ దగినభావములతోను కర్మములతోను బ్రవర్తించుచుండఁగా పరమకారుణికుఁ డగు నొకయాప్తుఁడు నీవు వ్యాధపుత్త్రుఁడవు కావు. రాజపుత్త్రుఁడవని ప్రబోధింప నతఁడు తన్ను రాజపుత్త్రునిగా భావించికొని క్రమముగా రాజపుత్త్రధర్మములను తదనుకూలభావములను పొంది తుదకు రాజ్యపదవి నొందెనఁట. అట్లే జీవుఁడు ఆత్మస్వస్వరూపము మఱచి జీవభావములో నుండఁగా సద్గురూపదేశము వలన జీవభావము విడిచి యథార్థమగు బ్రహ్మభావము నొందును.

రాసభరటితన్యాయము :— గాడిదకంఠధ్వని మొదట హెచ్చుగా నుండి క్రమముగా తుదకు తగ్గునట్లు మొదట హెచ్చుగా నుండి క్రమముగా క్షీణించుదాని నిది తెల్పును. (చూ. పూర్వాహ్ణచ్ఛాయా న్యాయము, ఖలమైత్రీన్యాయము.)

లూతాతంతున్యాయము:—౧. సాలెపురుగు తన దేహమునుండి దారము నిర్మించి మరల తన దేహమునందే లయింపఁజేయు నట్లు పరమేశ్వరుఁడు తననుండియేసర్వజగత్తును సృజించి మరల తనయందే లయముచేసికొనును.

౨. సాలెపురుగు తంతువుల నిర్మించుటచే నిమిత్తకారణమును ఆతంతువులు దాని దేహము నుండియే వచ్చుటచేత ఉపాదానకారణమును అగునట్లు పరమేశ్వరుఁడు జగత్సృష్టి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సృజించుటచేత నిమిత్తకారణమును జగత్తు తనశక్తి యగుమాయనుండి కలుగుటచేత ఉపాదానకారణమును అగుచున్నాఁడు.

లోహచుంబకన్యాయము:— సూదంటురాయి తాను చలింపకున్నను సన్నిధియందున్న లోహమునకు చలనము కలిగించునట్లు నిష్క్రియమగు బ్రహ్మము స్వసాన్నిధ్యమాత్రమున మాయచే సృష్ట్యాదికర్మములు చేయించును.

వంధ్యాపుత్రన్యాయము :— గొడ్రాలికి కొడుకు పుట్టుట ఎట్లసంభవమో అట్లే ఇదియు అసంభవమగు విషయమును తెలుపును.

(చూ. గగనకుసుమన్యాయము, శశవిషాణన్యాయము.)

వటబీజన్యాయము :— చిన్నమఱ్ఱిగింజలో పెద్దచెట్టగుమహాశక్తి ఇమిడియున్నట్లు ఒక్కొక చిన్నవస్తువులో మహాకార్యశక్తి లీనమైయుండును.

వనచంద్రికాన్యాయము:- అడవిని కాయు వెన్నెలవలె నిరుపయోగమగుదాని నిది తెల్పును.

వనవ్యాఘ్రన్యాయము:- వేటకాండ్రు చంపకుండ పులిని వనము రక్షించునట్లును చెట్లుకొట్టిపొడుచేయకుండ పులి వనమునురక్షించునట్లును అన్యోన్యరక్షకము లగువానినిది తెలుపును.

(ఇట్లే: వనసింహన్యాయము, ప్రావనక్రన్యాయము.)

వలీముఖనారికేళన్యాయము:— (కోఁతికి కొబ్బరకాయ దొరికినట్లు.) కోఁతి కొబ్బరచెట్టునుండి కొబ్బరకాయ పడవేయుటయే కాని దానిని తినలేనట్లు అల్పుఁడు సంపాదించుకొన్నదానిని అనుభవింపలేఁడు.

వహ్నిధూమన్యాయము:- ధూమముకలన దానికి కారణమగువహ్ని యున్నదని యూహించునట్లు కార్యముచే కారణము ఊహ్యము.

విషక్రిమిన్యాయము:— విషములోఁ బుట్టినపురుగునకు విషము బాధకము కానట్లు కష్టములలోఁ బుట్టి పెరిఁగినవారికి కష్టములు కష్టములుగాఁ గనఁబడవు.

విషవృక్షన్యాయము:— తానుపెట్టి పెంచినది విషవృక్షమైనను ఛేదింపఁ గూడనియట్లు తాను పోషించినవాఁడు దుష్టుఁడైనను వానికి హాని చేయఁగూడదు.

విహంగమగతిన్యాయము:— పక్షి ఎక్కడలేని ఒక్కమాఱుగా ఉన్నతప్రదేశమునకు ఎగురునట్లు క్రమక్రమముగాఁగాక ఒక్కమాఱే ఉన్నతస్థితిని బొందుట నిది తెల్పును.

(వ్యతి. సోపానారోహణన్యాయము.)

వీచీతరంగన్యాయము :— సముద్రమధ్యమున మొదట నొకతరంగము పుట్టును. దానినుండి మఱియొకతరంగము పుట్టును. దానినుండి మఱియొకతరంగము పుట్టును. అట్లు ఒకమాఱు కలుగక ఒకదానినుండి మఱియొకటి క్రమముగాఁ గలుగుట నిది తెల్పును.

(వ్యతి. కదంబకోరకన్యాయము.)

వృద్ధకుమారీవరన్యాయము:— అవివాహిత యగు నొకవృద్ధస్త్రీ వరమిచ్చుటకై ప్రసన్నుఁడైనఇంద్రునిఁ జూచి నాకుమారులు కాంచనపాత్రలో పాలును అన్నమును తినుచుండ చూచునట్లు వర మిమ్మని కోరెనఁట. ఆవరములో తనకువివాహము భర్తృసమాగమము సంతతికలుగుటయు వారైశ్వర్యవంతులై సుఖ మనుభవించుటయు ఇమిడి యున్నవి. అట్లే ప్రాజ్ఞునిఒక్కకోరికలో పెక్కుఫలము లిమిడియుండును. దీనినే వృద్ధకుమారీవాక్యన్యాయము అనియు అందురు.

(ఇట్లే. వృద్ధబ్రాహ్మణవరన్యాయము.)

వృద్ధబ్రాహ్మణవరన్యాయము:— అంధుఁడగు నొకవృద్ధబ్రాహ్మణుఁడు తనపౌత్రుఁడు రాజ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సింహాసనమునధిష్ఠించియుండ తాను చూచు
నట్లు వర మడిగెను. వానివరములో తన
పౌత్రునికి రాజసింహాసన ప్రాప్తియు తనకు
కన్నులు వచ్చుటయు పౌత్రునికి రాజ్యము
వచ్చువఱకుఁ దాను జీవించి యుండుటయు
ఇమిడి యున్నవి. అట్లే ప్రాజ్ఞునిఒకవర
ములో పెక్కువరములు ఇమిడియుండును.
(ఇది వృద్ధకుమారీవర న్యాయమువంటిది.)

**వృశ్చికీగర్భ న్యాయము:**— ఇది అశ్వతరీగర్భ
న్యాయమువంటిది.

**శతపత్రపత్రశతభేదన్యాయము:**— నూఱుతా
మర ఱేకులు గ్రుచ్చుటకు కొంతకాలవ్యవధా
న మున్ననునూఱు ఱేకులును ఒకమాఱే గ్రు
చ్చెనని చెప్పుట భ్రాంతి యగు నట్లు అల్ప
వ్యవధానముతోజరుగుపనులువికకాలముననే
జరిగిన వని చెప్పుట భ్రాంతియగును.(ఇట్లే:-
ఉత్పలపత్రశతవ్యతిభేద న్యాయము, ఉత్ప
లదళశతవ్యతిభేదన్యాయము, శతపత్రశాతన
న్యాయము, పలాశశతవ్యతిభేదన్యాయము.)

**శవోద్వర్తనన్యాయము:**— శవమునకు పరిమళ
ద్రవ్యములలో నలుఁగుపెట్టుట ఎంతజ్ఞాన
హీనతయో అట్లే నిరర్థకమగుకార్యము నా
చరించుటయు నట్టిదే.(చూ.అరణ్యరుదిత
న్యాయము.)

**శశవిషాణన్యాయము:**— ఇది వంధ్యాపుత్రన్యా
యమువంటిది.

**శాఖాచంక్రమణన్యాయము:**— ఒకకొమ్మనుండి
మఱియొకకొమ్మమీఁదికి దూఁకినట్లు అవివేకి
కావలసినవిషయమును వదలి ఇతరవిషయ
ములనుగూర్చి సంభాషించును.

**శాఖాచంద్రన్యాయము:**— చంద్రుఁడు శాఖ
మీఁద లేకపోయినను చూచువానికి సులభ
దృశ్యమగుటచే మొదట శాఖను జూపి
పిదప దానిపైనుండుచంద్రునిఁ జూడు మని
చంద్రునిఁ జూపునట్లు గురువు పరబ్రహ్మ
మును బోధింపఁదలఁచి తద్భిన్నము లయినను
శిష్యునికి సులభగమ్యము లగుఅన్నమయాది
కోశములను తొలుత బోధించి పిదప తన్మూ
లమున బ్రహ్మమును బోధించును.

**శుక్త్యంబుబిందున్యాయము:**— ముత్తెపుఁజిప్పలోఁ
బడిననీటిబిందువు ముత్తెమైనట్లు మంచియా
శ్రయము నొందినవాఁడు మిగుల శోభిల్లును.

**శుష్కేష్టిన్యాయము:**— (నిజ మగుహోమా
దులు లేనికృత్రిమయాగమువంటిది) యాగ
ప్రయోగమునందు నైపుణ్యము సంపాదింపఁ
దలఁచినశిష్యుఁడు నిజ మగుహోమాదులు
లేకుండఁగ కృత్రిమసాధనములతో యాగ
ప్రయోగము చేయునట్లు ఒకవిషయమున
నేర్పు సంపాదింపఁ దలఁచినవాఁడు కృత్రి
మసాధనములతో దానిని అభ్యాసము చేయు
ను. (చూ. భూమిరథికన్యాయము.)

**శూర్పన్యాయము:**— చెరుగుట కుపయోగించు
చేఁట రాలుమున్నగు పనికిమాలినపదార్థముల
ను క్రిందికిఁ బడవైచి మంచిధాన్యాదులను
తనయందు నిలుపుకొనునట్లు విజ్ఞుఁడు దోష
ములను విసర్జించి గుణములను గ్రహించు
ను. (వ్యతి. చాలనీన్యాయము.)

**శృంగగ్రాహికాన్యాయము:**— ౧. ఇది ఈ యా
వని కొమ్ము పట్టి చూపునట్లు ఒకవస్తువును
ఇది యని నిర్దేశించును. ౨. కొమ్ముపట్టుకొనిన
యావు వశమగునట్లు ప్రధానాంశము గ్ర
హించినచో విషయమంతయులొంగితీఱును.

**శ్వపుచ్ఛన్యాయము:**— కుక్కతోఁక తిన్నఁగా
జేయఁబూనుట యెంతనిరుపయోగమో వ్యర్థ
విషయమున ప్రయత్నము చేయుట యం
త నిరుపయోగము. (చూ. అరణ్యరుదిత
న్యాయము.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

